శ్రీరామరాయగ్రంథమాల

ఓం

శ్రీ హ య గ్రీ వా య న మః

# శ్రీ భగవద్గీతా

# భాష్యార్క ప్రకాశికానువాదము

( మొదటి సంపుటము - ప్రథమ ద్వితీయషట్కములు)

ఇ ది

శ్రీ గుంటూరుమండల, నరసరావుపేట సమీపస్థ

పమిడిపాడు అగ్రహార నివాసులగు

## శ్రీ బెల్లంకొండ రామరాయకవి విరచిత

భాష్యార్క-ప్రకాశిక యను వ్యాఖ్యకు తెనుగు అనువాదము.

అ ను వా ద కు లు :


అద్వైత వేదాన్తశిరోమణి

## శ్రీ మల్లావజ్ఝల సుబ్బరామశాస్త్రిగారు

వైస్ ప్రిన్సిపాల్, విశ్వేశ్వర సంస్కృతకళాశాల,

వ రం గ ల్ (దక్కన్)


సం పా ద కు లు :


## కీ॥ శే॥ శ్రీ కవితా వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి

న ర స రా వు పే ట (గుంటూరు జిల్లా)





[వెల రు 40-00

శ్రీరామరాయగ్రంథమాల

ఓం

శ్రీ హయగ్రీవాయ నమః

# శ్రీ భగవద్గీతా

# భాష్యార్కప్రకాశికానువాదము

(మొదటి సంపుటము—ప్రథమ ద్వితీయషట్కములు)

ఇది

శ్రీ గుంటూరుమండల, నరసరావుపేట సమీపస్థ

పమిడిపాడు అగ్రహార నివాసులగు

శ్రీ బెల్లంకొండ రామరాయకవి విరచిత

భాష్యార్కప్రకాశిక యను వ్యాఖ్యకు తెనుగు అనువాదము.

అనువాదకులు:

అద్వైత వేదాన్తశిరోమణి

శ్రీ మల్లావఝల సుబ్బరామశాస్త్రిగారు

వైస్ ప్రిన్సిపాల్, విశ్వేశ్వర సంస్కృతకళాశాల,

వరంగల్ (దక్కన్)

సంపాదకులు:

కీ॥ శే॥ శ్రీ కవితా వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

నరసరావుపేట (గుంటూరు జిల్లా)

 [వెల రు 40-00



గ్రంథములు లభించువారు :

1. కవితా వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు,
నరసారావుపేట – గుంటూరు జిల్లా.

2. కె. యల్. నరసయ్యగారు,
గాంధీనగరం – విజయవాడ – 2.

3. వేంకట్రామ అండ్ కో., విజయవాడ,
అని వ్రాసిన బడయగలరు.



లీలా ప్రెస్, గవర్నరుపేట, విజయవాడ-2.
1956

శ్రీ

# ఉపోద్ఘాతము

మహాశయులారా!

మహామాయా విలాసమగు నీ ప్రపంచములో నెల్లమానవులు నిస్సార మగు సంసారమున మునిగి, నిఖిలానర్థముల నొందుటకు శోకమోహములు కారణములు. ఇందు మోహము 'సాధారణము, అసాధారణము' అని రెండు విధములు. దేహేంద్రియాదిసంసారము సత్యమనియు, ఆత్మధర్మమనియు దలంచుట సర్వప్రాణి సాధారణమయిన మోహము. తాను జేయఁదగిన పని చెడుగాకున్నను చెడు అని తలంచుట తనకుమాత్రము అసాధారణమయిన మోహము. ఇది యొక్కొక వ్యక్తియం దొక్కొక రకముగ నుండును. ఒకానొక బ్రాహ్మణునకు బ్రాహ్మణధర్మము నింద్యమనియు, పరధర్మము మంచిదనియుఁ దోచవచ్చును. శూద్రునకు స్వధర్మము చెడ్డదనియుఁ, దనకు బ్రాహ్మణధర్మము పరిగ్రాహ్యమనియును దోచవచ్చును. ఇది యొకవ్యక్తికు నసాధారణమయిన మోహము. ఈ రెండువిధములయిన మోహమును అవివేకమని యందురు. ఇదియే శోకమునకుఁ గారణమగుచున్నది. అర్జునుడంతటివాడు నీ ద్వివిధమోహమునకు పరతంత్రుఁడై, స్వధర్మమగు యుద్ధమునందు ప్రవర్తించియు విముఖుఁడయ్యెను. క్షత్రియజాతికి విహితమయిన యుద్ధము స్వధర్మమయినందున నధర్మముగాకున్నను అది యధర్మమను మోహము (అవివేకము) అర్జునునకుఁ గలిగెననుటలో సందియములేదు. కనుకనే శ్రీకృష్ణభగవానుఁడు పార్థుని నిమిత్తముగ జేసికొని సకల ప్రాణులకుగల యవివేకమును రూపుమాపనెంచి యర్జునునకు గీతాశాస్త్ర ముపదేశించెను. దీని శ్రీశంకరులు అద్వైతపరముగను, రామానుజులు విశిష్టాద్వైతపరముగను, మధ్వాచార్యులు ద్వైతపరముగను భాష్యముల రచియించిరి. ఇందు శంకరభాష్యమున కనుకూలముగ, ఆనందగిరి పండితులు-భాష్యకర్తల భావ మతిసుబోధము, సుస్పష్టము నగునటుల నమూల్యమయిన వ్యాఖ్యను రచించిరి.

మఱియు నీ గీతాశాస్త్రమునకు

నీలకంఠ దీక్షితులు "గీతాప్రకాశ" మనువ్యాఖ్యయు,
మధుసూదన సరస్వతి "గూఢార్థ దీపిక" యనువ్యాఖ్యయు,
ధనపతికుమారులు "భాష్యోత్కర్ష దీపిక" యనువ్యాఖ్యయు,
శ్రీధరస్వామి "గీతాసుబోధిని" అనువ్యాఖ్యయు,
అభినవ గుప్తాచార్యులు "గీతార్థ సంగ్రహ" మనువ్యాఖ్యయు,

ఇట్లే యనేకులగు మహాత్ము లనేక వ్యాఖ్యలను వేర్వేరుగ రచించిరి. ఇందు మధుసూదనసరస్వతీవిరచితమయిన గూఢార్థదీపిక యనువ్యాఖ్య ఆయా స్థలముల

యందు స్వతంత్ర వ్యాఖ్యగఁ గన్పట్టుచున్నను అద్వైత సిద్ధాంతమున కనుకూల మను టకు సందియములేదు. ధనపతిసూరివిరచితమయిన భాష్యోత్కర్ష దీపిక యనువ్యాఖ్య యితర వ్యాఖ్యాత లేమాత్రమయినను శంకరుల భావమును దప్పి నడచినచో వారల విమర్శించుటయే వ్రతముగ నవలంబించినదని పాఠకులకు సువిదితము. మిగిలిన వ్యాఖ్య లన్నియు, యథోచితముగ వారి వారి భావముల వివరించుచు, శాంకరసిద్ధాంతము ననుసరించినవి.

ఇవి యిట్లుండ, నీ గీతాశాస్త్రమునకు గర్తపురీ (గుంటూరు) మండలము నందలి "పమిడిపాడు" అను నగ్రహారము నలంకరించిన శ్రీ "బెల్లంకొండో" పనామక రామరాయ కవీంద్రులు ఇప్పటికి నలుబది సంవత్సరములకు బై కాలమున భాష్యార్క ప్రకాశిక యనుపేరిట నొక యమూల్యమయిన వ్యాఖ్యను గీర్వాణమున రచించిరి. ఈయది భాషయందతిసరళము. యుక్తి ప్రయుక్తుల కాకరము. విమర్శనల కాటపట్టు. అద్వైత సిద్ధాంతస్థాపన కాలవాలము. భేదవాదమునకు వజ్రాయుధము. ప్రాచీన వ్యాఖ్యల కసాధారణము; విశిష్టాద్వైతమునకు ఖండనము.

గీతలంో తత్త్వోపదేశ సమయమున లోకవ్యవహారము ననుసరించి శ్రీకృష్ణులు చెప్పిన గొన్ని శ్లోకములను పారమార్థిక భేదబుద్ధితో జెప్పినట్లు గ్రహించి రామానుజులు తమ వాదమును బోషించుకొనసాగిరి.

ఉదాహరణము :—

"నత్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః
నచైవ న భవిష్యామ స్సర్వే వయ మతః పరమ్"

అనునది రెండవ యధ్యాయమున పదిరెండవ శ్లోకము. ఇందు "ఓయి అర్జునా! నీవు, ఈ భీష్మద్రోణాదిరాజులు, నేను, మన మందరము వెనుకటికాల ములో నున్నాము. ఇపు డుంటిమి. ఇక ముం దుండగలము" అని శ్రీకృష్ణు డర్జునునకు ఆత్మ నిత్యుడని యుపదేశించదలచి చెప్పెను. భీష్మద్రోణాదు లనిత్యులని యెంచి దుఃఖింపసాగిన పార్థుని దుఃఖమును వాపుటకు వారు నిత్యులని చెప్పుటయే శ్రీకృష్ణున కుచితముగాని, యాత్మభేదము నుపదేశించు టుచితముగాదు. సందర్భమున కను కూలింపదుకూడ. అర్జునునకు మాత్రము ఆత్మ లనేకు లను జ్ఞానముండవచ్చును. అతని దృష్టి ననుసరించి యాత్మభేదము ననువదించి వారు నిత్యులని శ్రీకృష్ణుడు చెప్పెను. నిజముగ ఆత్మ లనేకులని చెప్పుటలో శ్రీకృష్ణున కిచట దాత్పర్యములేదు. శ్రీకృష్ణుడు ముందు "అవినాశితు తద్విద్ధి" అను పదునేడవ శ్లోకముచే ఆత్మాభేదము నుప దేశింపబోవుచున్నాడు.

ఇది యిట్లుండ అజ్ఞానావృతుడయిన పార్థునకు మోహమును దొలగింప సమకట్టి, పారమార్థికాత్మతత్త్వము నుపదేశించుసమయమున శ్రీకృష్ణుడు "నీవు" "వీరందరు" "నేను" అని యాత్మభేదము నుపదేశించుటచే జీవాత్మపరమాత్మలకు

భేదము నిజమనుటకు భగవంతుడే ప్రబలసాక్ష్యమని రామానుజులు నిర్ణయించి తమ భేదవాదమును సాధించుకొనుట కిది మొదలుగ నారంభించిరి. పైపెచ్చు తత్త్వోపదేశసమయమున, అతాత్త్వికమగు నౌపాధికభేదము నుపదేశించుట తగదనిగూడ నాక్షేపించిరి. ఇందలి సంగతి నాలోచింతము. అజ్ఞానికి దత్త్వోపదేశమును జేయుటలో క్రమక్రమముగ వానిబుద్ధి మరల్చుట యుచితమా? లేక యొకేమాటలో నున్న విషయమంతయు జెప్పివిడచుట యుచితమా? మోహనివృత్తిని చేయుటకదా, తత్త్వోపదేశమునకు బరమతాత్పర్యము. దాని కనువుగ నుపదేశించుటయే ప్రకృతసందర్భమునకు కుచితమగును. కనుకనే శ్రీకృష్ణుడిచట ఆత్మనిత్యత్వమును బ్రతిజ్ఞచేసి పైశ్లోకమున "బాల్య, యౌవన, కౌమారాద్యవస్థలు మారినను ఆత్మ మారనట్లు దేహము లెన్ని మారినను, ఆత్మమారదని వివరించి యటుపైని 'సత్పదార్థ'మైన యాత్మకనిత్యత్వము అసత్పదార్థములయిన భూత భౌతికములకు నిత్యత్వము నుండదని నిరూపించి, ఆపైన "అవినాశితు తద్విద్ధి" అను శ్లోకమున ఆత్మనిత్యత్వము నుపసంహరించుచు ఆత్మైకత్వమును సిద్ధాంతము చేసెను. ఋజుభావముతో నాలోచించి చూడ నీ ప్రకరణమంతయు సులభముగ నుండ, రామానుజులు స్వమతాభిమానమున దీనిని వక్రభావముతో వ్యాఖ్యానించి తమ వాదమును బోషించుకొన సాగిరని పాఠకులకు విదితము కాగలదు.

[illegible] "నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః" అను శ్లోకమున శ్రీకృష్ణుడు త్రికాలాబాధితమయిన వస్తువు సద్వస్తువనియు, తదితరము లసద్వస్తువులనియును బోధించెను. ఆచార్యస్వామియు నట్లే వ్యాఖ్యానించుచు, ఆత్మయొక్కడే సత్పదార్థమనియు, మిగిలిన వికారజాతమంతయు నసత్పదార్థము లనియు నిరూపించిరి. "ప్రపంచము సత్యము అయినను నిత్యముగాదు" అని రామానుజుల మతము. వీరి మతమున ప్రపంచాంతర్గతములయిన దేహములుగూడ సత్యములే యగును. సత్యవస్తువులు సద్రూపము లనుట యుచితము. ఇట్టితఱి వీరి మతమున దేహము సద్రూపమని యనవలసియుండ, వారు తమ మతప్రక్రియగూడ గమనింపక దేహము అసద్రూపమని నిర్ణయించి దానికి సద్భావము లేదనియు, సద్రూపుడయిన ఆత్మకు నసద్భావము లేదనియును వ్యాఖ్యానించి, యీ శ్లోకము అనుభూయమానములయిన దేహాత్మలయొక్క నిత్యత్వానిత్యత్వములను మాత్రమే నిరూపించుచున్నట్లు రామానుజులు నిర్ణయించిరి. దేహముతోబాటు ప్రపంచములోని మిగిలిన వస్తువులన్నియు, అసద్రూపము లగుచుండ, వానియెడల నీ శ్లోకము సద్భావమును గాని, యసద్భావమునుగాని నిరూపింపకుండుటకు గారణమును వారు చూపరు; చదువరులకుం దోచదు.

రామానుజులు "అవినాశితు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్" అను శ్లోకమునందు ఆత్మైకత్వమును జెప్పునట్టి 'యేన' అను యచ్ఛబ్దమును, జాత్యేకవచనాంతముగ నిర్ణయించిరి. లేనిచో తమ భేదవాదమునకు దెబ్బయని వీరి భయము.

"నత్వేవాహం జాతు నాసమ్" అను శ్లోకమున శ్రీకృష్ణుడు "వయం" అను పదమును నిజముగ భేదదృష్టితో ప్రయోగించెనని రామానుజులనిరి. ఇచటమాత్రము 'యేన' అనుపదము నిజముగ ఆత్మైకత్వబుద్ధితో ప్రయోగించెనని యనరు. జాత్యేక వచనమును బుద్ధితో ప్రయోగించెనందురు. మతమును బోధించుకొనుట కీయవి త్రోవలు. ఇట్టిఘట్టములయందు "భాష్యార్థ-ప్రకాశికా"కారులగు శ్రీరామరాయలు విశదముగ విమర్శించి యుక్తివాదముతో, ప్రమాణవాదముతో, విషయనిరూపణను జేసిరి.

మతముల సారాసారములను గ్రహించుటకును, విమర్శకుల బుద్ధిప్రతిభను జూచిగొని యానందించుటకును నిట్టి విమర్శనారూపములయిన గ్రంథములఁ దిలకించుట యత్యావశ్యకము.

మఱియు త్రయోదశాధ్యాయమున "క్షేత్రజ్ఞంచాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత" అను శ్లోకమునందు "శరీరమును దెలిసికొనునట్టి జీవునికూడ సంసార సంబంధములేని పరమేశ్వరునిగఁ దెలియుము" అని జీవపరమాత్మల కభేదమును జెప్పినట్లర్థమగుచున్నది. ఇచట రామానుజులు "మామ్" అను పదమును "మదాత్మకమ్" (నా శరీరమయినవానినిగ) అని వ్యాఖ్యానించి, "అపి" శబ్దమునకు క్షేత్రమునుగూడ అని యర్థము జెప్పి, "క్షేత్రజ్ఞం మాం మదాత్మకం విద్ధి, క్షేత్రమపి మదాత్మకం విద్ధి" (జీవుని నాదురూపముగ దెలిసికొనుము. శరీరమునుగూడ నారూపముగ దెలియుము.) అని వ్యాఖ్యానించిరి. వీరి మతమున ప్రపంచము భగవంతునకు జడరూపమయిన శరీరమనియు, జీవులు చిద్రూపమయిన శరీరమనియు నంగీకరింతురు. ఈయది జీవబ్రహ్మల భేదాభేదవాదములకు పట్టయిన ఘట్టము. శ్రీ రామరాయ లీ శ్లోకమున నతి విస్తృతముగఁ దమ విమర్శనాశక్తిని జూపిరి. ఇంతటి విపులమైన వ్యాఖ్య గీతావ్యాఖ్యలలో నేదియు గనిపించదు. ఈ ప్రకరణమున భేదవాదులు సాధారణముగ జూపెడి శ్రుతి, స్మృతి, యుక్తుల నన్నింటిని నొక్కొకటిగ లెక్కించి, విమర్శించి నిరాకరించిరి. ఇందు విషయోపపాదనము మిగుల సరసముగను, ప్రమాణబద్ధముగను, యుక్తియుక్తముగను నున్నదనుటకు సందియము లేదు. ఆ ఘట్టమునంతయును మేము తెనిగించి చూపితిమి. భేదవాదఖండన మింత విపులముగఁ దక్కిన వ్యాఖ్యలయం దెచ్చటను గనుపింపదు, కాని విషయము నుపపాదించుటలో నచ్చటచ్చట పునరుక్తి దోష ముండవచ్చును. అది కావ్యములకు దోషమగునుగాని, దురవగాహమయిన ఆత్మతత్త్వోపదేశము విషయమున దోషము కానేరదు. కాన నీ "భాష్యార్థ ప్రకాశిక" యనువ్యాఖ్య భేదవాదమును ఖండించుచు, నద్వైతవాదమును నిరూపించినందున కేవల మద్వైతవాదము ననుసరించుచు నడచిన యితర వ్యాఖ్యలకంటె భిన్న యనియు, విలక్షణమనియు నెన్నదగును.

రామరాయ లొక్కొకచోట పూర్వవ్యాఖ్యాతలగూడ నుల్లంఘించి, విషయనిరూపణము జేసిరి. అయ్యది శాస్త్రసిద్ధాంతమునకు విరుద్ధము గానందున,

[illegible] ననుసరించితిమి. అనువాదగ్రంథమున మూలకర్తల [illegible] యుచితము కాదను నియమమునకు గట్టుపడితిమి. అంత మా [illegible] నుల్లంఘించిన స్థలములయందు పూర్వవ్యాఖ్యాతల భావమును [illegible] నుల్లంఘింప సాహసించము. సాహసించినట్లు భావింపవలదు.

ఉదాహరణము:- ద్వితీయాధ్యాయము నందలి "నాసతో విద్యతే భావః" అను శ్లోకభాష్యమునందు "సర్వత్ర ద్వే బుద్ధీ సర్వై రుపలభ్యేతే, సామానాధికరణ్యేన నీలోత్పలాదివత్" అను పంక్తి కనిపించుచున్నది. ఆనందగిరి పండితు లీ పంక్తిని "సమానాధికరణ్యేన నీలోత్పలాదివత్" అని మార్చి వ్యాఖ్యానించిరి.

రామరాయలు "సామానాధికరణ్యేన" అనుపాఠమును సాధింపదలచి యానందగిరిపండితుల విమర్శించిరి. భాష్యకర్తలభావమును గుర్తెరుంగుటలో నానందగిరి పండితులు ప్రప్రథములనియు, భాష్యమునందు ప్రవేశమునకు వారుచూపిన త్రోవయే మన కీనాటివఱ కాదర్శప్రాయమయినదనియును మా నమ్మకము. అది భాష్యకర్తల భావమో, అచ్చు పొరపాటేమో నిర్ణయింప వారికే చెల్లును. అద్వైతసిద్ధాంతమునకు భంగము లేనపుడు, వారు సూచిన పాఠమును త్రోసిపుచ్చుటకు సాహసించము. కాని "రామరాయలు" "సామానాధికరణ్యేన" అను మొదటిపాఠమును సాధించుటకు జూపిన యుక్తులనుబట్టి వారి బుద్ధిప్రతిభ నానందింతుము. రామరాయలును, పాఠకుల బుద్ధిని వికసింపజేయుటకు యుక్తిజాలమును నిరూపింపదలచి పూర్వపాఠమును సాధింప విమర్శించిరిగాని, యానందగిరి పండితులయం దాదరాభిమానములు లేక కాదని మా యాశయము.

ఇట్లే తృతీయాధ్యాయమునందు "జ్యాయసీచే త్కర్మణస్తే మతా బుద్ధిః" అను శ్లోకమునను "తథాచ కారకం శాస్త్రం న జ్ఞాపకమి త్యనుపపన్నార్థం స్యాత్" అను భాష్యపంక్తిని వ్యాఖ్యానించుటలో గూడ శ్రీ రామరాయలు, ఆనందగిరి పండితులకు భిన్నముగ నన్వయక్రమమును జూపిరి. అదియును సిద్ధాంతమునకు విరుద్ధము కాదుగాని, కొద్ది యర్థభేదమును సూచించును. కాన నం దెవ్విధమగు నన్వయము నంగీకరించినను గ్రంథార్థమునకు భంగములేదు. సాధారణముగ ప్రతిభాశాలురగు పండితులు తగుచోటుల తమప్రతిభను జూపుచుందురుగాని, "శ్లోకంట నారాయణ" అను న్యాయ మవలంబించరు. రామరాయలును, నదేవిధముగ నట్టిచోట్ల తమ ప్రతిభను జూపి రనవలెగాని, ప్రాచీనవ్యాఖ్యాతల దృణీకరించి రని యనదగదు.

గీర్వాణభాషయందున్న నీ వ్యాఖ్య యింతకు మున్నొకతూరి శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారిచే ముద్రింపబడి పండితలోకమున కందజేయబడినది. [illegible] ప్రస్తుతము లలభ్యమగుటచే మరల నరసరావుపేట వాస్తవ్యులయిన "శ్రీ [illegible] వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే నాంధ్రదేశమునందలి ద్రవ్యదాతల సాయమున తూర్పుగోదావరి మండల వాస్తవ్యులయిన బ్రహ్మశ్రీ బులుసు అప్పన్న

శాస్త్రులవారి శారదా ముద్రాక్షరశాలయందు ముద్రాపితమై పండితలోకమున కంద జేయ సిద్ధముగనున్నది. కాని ప్రకృతము దేశమంతయు, హూణభాషచేనిండి నిబిడీకృతమై, గీర్వాణభాషాభిజ్ఞు లతివిరళమగుటచే శ్రీ రామరాయల వ్యాఖ్యయందలి విశేషాంశముల నాంధ్రలోకమునకు సుబోధము గావింపనెంచి శ్రీ కవితా వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు యీ వ్యాఖ్యను దెనుగున ననువదింప నన్ను బ్రోత్సహించిరి. ఈయది దుర్ఘటమయినను యథాశక్తి ననువదింప సాహసించితిని. ఇప్పటికి పదిరెండధ్యాయములు గ్రంథ మనువదింపబడి ముద్రితమైనది. పద్దెమును రసానుగుణమయిన రాగముతో బాడి యొప్పింపదగిన రసమును, పొడిమాటలతో జెప్పి యొప్పించుట దుస్సాధము. అట్లే గీర్వాణభాషలో గ్రహింపదగిన శాస్త్రార్థమును తెలుగుమాటలలో నింపుటవలన నంతటి మాధుర్య ముండకున్నను, విషయమును గ్రహించుట కుపయోగ పడుననుటలో సందియముండదు. గీర్వాణభాషాపరిచయము సన్నగిలిన యీ రోజులలో గ్రంథార్థమును మానవలోకమున కందజేయుటయే యనువాదగ్రంథములకు పరమతాత్పర్యము. అనువాదగ్రంథములు విషయప్రధానములు. భాషాప్రధానములు కావు. కాన సహృదయులు భాషాసంబంధమయిన పొరపొచ్చెము లిట నెన్నరని మా నమ్మకము. విషయముగూడ నతిదురవగాహమగుటచే నెచ్చటనయినను "గచ్ఛత స్ఖలనం క్వాపి" అను న్యాయమున పొరబాటు లుండవచ్చును. వానిని పండితలోకము సౌహార్దముతో సరిచూచుకొనుట వారి సౌశీల్యమునకు వన్నె. విమర్శింపసాగుట యసూయ కాటపట్టు. దీనిని నేను వ్రాసిపంపిన తరువాత శ్రీ కుందా లక్ష్మీనరసయ్యగారు కొన్నిసారులుచూచి యక్షర స్ఖాలిత్యముల దిద్ది ముద్రణమున కందించిరి. అయినను కూర్పరుల కీ విషయ మలవాటులోనిది కాకుండుటచే నింకను అక్షరదోషము లచ్చటచ్చట గలవు. వీలయినంతవఱకు వానిని శుద్ధాశుద్ధపత్రికయందు జూపుదును. కాన చదువరు లక్షర స్ఖాలిత్యముల సరిదిద్దుకొని విషయమును గ్రహింపగోరెదను.

ఈ యనువాదమునకు నన్ను బ్రోత్సహించిన బ్ర. శ్రీ. కవితా వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారికిని, శ్రమకోర్చి ప్రూఫుల సరిజూచి ముద్రణమునకు గడు శ్రద్ధతో మనసార సాయపడిన బ్ర. శ్రీ. కుందా లక్ష్మీనరసయ్యగారికిని, నా కృతజ్ఞతను దెలుపుచు, వారల శ్రీకృష్ణభగవానుఁడు చిరాయు రారోగ్యైశ్వర్యములతోఁ దులఁదూగఁ జేయుగాత యని భగవంతుని ప్రార్థించుచున్నాను.

ఇట్లు

అనువాదకుఁడు,

అద్వైత వేదాన్త శిరోమణి,

మల్లావఝ్ఝల వేంకట సుబ్బరామ శాస్త్రి.

శ్రీ విశ్వేశ్వర సంస్కృత కళాశాలా వైస్ ప్రిన్సిపాల్.

వరంగల్,
21-9-56.

శ్రీ హయగ్రీవాయ నమః

# శ్రీ బెల్లంకొండ రామరాయ కవీంద్రుల జీవితసంగ్రహము

ఆంధ్రదేశమున మిక్కిలి ప్రసిద్ధిజెందిన వదాన్యసంపత్కుటుంబములలో బెల్లంకొండవారి వంశ మొకటి. వీరు ఆరువేల నియోగితెగకు జెందినవారు. అనాది కాలమునుండి గుంటూరుజిల్లాలోని నరసరావుపేటకు సమీపముననున్న పమిడిపాడు అగ్రహారము ఈ వంశమువారందఱకు నివాసస్థానము. ఈ వంశములోనివా రందఱు లౌకిక వైదిక విద్యాపారంగతులు - సంపన్నులు - దైవభక్తి శోభితులు- ఉదార బుద్ధులును. ఈ వంశమువారు అనేక గ్రామముల(అగ్రహారముల) తిక్కనలో నన్నట్లు తమ విద్యావిఖ్యాతిరేకముల ప్రభువుల మన్ననల నందికొని నిరతాన్నదానాది నిరతిమై దొరలనిపించుకొనుచు నుండుటయేగాక విద్యాన్నదానాదులతో సుతనిర్విశేషముగ విద్యార్థుల నధికసంఖ్యాకుల బోషించుచు కులపతులుగ నెన్నబడుచు భూమండలమున తమ వంశవిఖ్యాతిని ప్రధానస్థానమున నిల్పికొనిరి.

శ్రీ మోహనరావుగారు ఈ గ్రంథకర్తయగు శ్రీ రామరాయ కవిచంద్రుల తండ్రిగారు. వీ రతిమేధావులు. అనేకమంది విద్యార్థులకు వీరు విద్యను బోధించిరి. వీరిబోధనాకౌశలమునకును, సంస్కృతభాషాసాహితీప్రౌఢిమకును ఆనాటివారందఱు చాల అచ్చెరు వందుచుండెడివారు. పాపము ఈయనగా రతిస్వల్పవయసుననే తమ 25 వ ఏట కాలగతి నొందిరి.

శ్రీ రామరాయ కవిచంద్రులు శాలివాహన శకము ౧౭౯౭ కు సరియగు యువనామ సం॥ మాఘ బహుళామావాస్యా సోమవారము (27-12-1875) రాత్రి కర్కాటక లగ్నమున జన్మించిరి. వీరి తల్లిగారు హనుమాంబగారు. వీరిది ఋక్శాఖ. భారద్వాజసగోత్రము. వీరికి ఐదారువత్సరముల ప్రాయము రాగానే పితృపాదులనియోగము ప్రాప్తించెను.

"గర్భాష్టమేషు బ్రాహ్మణ ముపనయీత" అను శాస్త్రానుసారము శ్రీ కవిచంద్రులకు యథాశాస్త్రముగ నుచితకాలమున నుపనయనసంస్కారము జరిగెను. బడిచదువు ఆరంభమైనది మొదలు రామరావుగారి లక్షణము అసాధారణముగ గన్పట్టుచు వచ్చెను. గురువు లెంతెంత చెప్పగల్గిన నతంత గ్రహించుచు నత్యల్పకాలములోనే బడిచదువు పూర్తిగావించెను. బంధుగులందఱు సంతసించి యీ పిల్లవానిని గొప్పవానిని చేయనెంచి అప్పుడే నూతనముగ కలిదేవతాప్రేరణమున మన భరత భూమి నాక్రమించుకొన్న హూణవిద్యాసక్తి తద్బంధువులు శ్రీరామరావుగారిని బస్తీయగు గుంటూరులోని యాంగ్లవిద్యాశాలలో ప్రవేశపెట్టి ఇంగ్లీషు చదివింపబూనిరి. మానవుల ఇచ్ఛలును తదనుకూలప్రయత్నములును కాలవశమున సమానముగనే యున్నను పూర్వాపూర్వవిశేషములు మాత్రము జీవాదృష్టాయత్తములై జీవానాదిత్వమును

లోకయాత్రయొక్క కర్మనియంత్రితత్వమును స్పష్టపరచుచుండును. రామరావుగారు ఏరోజు స్కూలునకు వెళ్ళినను జబ్బుచేసి అస్వాస్థ్యముతో నింటికి జేరుటయు, స్కూలుకు వెళ్ళనిరోజులలో స్వాస్థ్యము కల్గియుండుటయు తటస్థించుచువచ్చెను. ఎట్లనో మూడవ ఫారమువరకు ఇంగ్లీషుచదువు సాగెను. శరీరారోగ్యము మాత్రము కుదుటపడలేదు. ఇక చేయునది లేక బంధువులు రామరావుగారిని ఇంటికి జేర్చిరి. దైవాయత్తము గదా, జీవయాత్ర!

ఇప్పటికి మెల్లగ వీరికి 14 సంవత్సరముల ప్రాయము వచ్చెను. ఇంటియొద్దనే నివసించుచు శ్రీ రామరావుగారు తమజ్ఞాతులగు శ్రీ బెల్లంకొండ సీతారామయ్య గారివద్ద సంస్కృతము చదువుచు, ఆ గ్రామముననేయున్న మరియొక వేదవిద్యానిధి యొద్ద కొంత కొంత వేదభాగము నధ్యయనముచేయుచు అనాదికాలమునుండి తమ వంశమువారిచే నారాధింపబడుచు నింటనున్న హయగ్రీవసాలగ్రామమును ప్రత్యహ మును భక్తిశ్రద్ధ నర్చించుచు కాలము గడుపుచుండెను. ఒకనాటిరాత్రి శ్రీరామ రావుగారు శయనించియుండ స్వప్నమున నొక వృద్ధబ్రాహ్మణుడు గోచరించి శ్రీ హయగ్రీవమంత్రమును సాంగముగనుపదేశించి తన్మంత్ర సంబంధి పంచాంగకలాపముల గ్రంథము నొకమహాసీయునింట నున్నట్లు బోధించి యదృశ్యు డయ్యెను. అంత మేల్కాంచి పరమానందభరితు డై యాయన తద్వాక్యానుసార మా మహాసీయు నింటి కరిగి విషయ మెరిగించి యడుగ నక్కజమంది వారు తమయింట నన్యు లెరుగకుండ రహస్యముగ దాచియుంచిన ఆ గ్రంథమును రామరావుగారి కొసంగిరి. అంత శ్రీ రామరావుగారు శ్రీ హయగ్రీవ మంత్రరాజమును పంచాంగసహితముగ ననన్య సాధారణదీక్షతో పురశ్చరణము నొనరింపసాగిరి. "న్లో దేవతాసు జడిమా జడిమా మనుష్యే" యన్నట్లు వెంటనే సత్ఫలప్రదాతయగు శ్రీ హయగ్రీవభగవానుని యనుగ్రహము శ్రీ రామరావుగారియందు ప్రసరింపసాగెను. గంగాలహరింబోలు అప్రతిహతమగు స్వచ్ఛాతిస్వచ్ఛకవితాపరిపాటి తనంత దా నాతని కబ్బెను. అప్పటికి కాళిదాసత్రయము పూర్తికాలేదు. కవిచంద్రులు ప్రప్రథమమున తమగ్రామము నధివసించిన రమాపల్లభరాజస్వామి నుద్దేశించి యొకశతకమును సంస్కృతభాష యందు రచించెను. స్వీయప్రతిభ నాధారముచేసికొని స్వయముగ నాటక అలం కారగ్రంథసంతతినంతను గ్రహించి ధారణచేసికొని రుక్మిణీపరిణయచంపు – రమా పరిణయచంపు – కందర్పదర్పవిలాసభాణము మున్నగు గ్రంథముల రచించుటయేగాక శ్రీ రామరావుగారు స్కంధత్రయాత్మకజ్యోతిశ్శాస్త్రమును కరతలామలకము జేసికొనగల్గిరి. వారు తమ జ్యోతిర్విద్యాప్రతిభచే నా చిన్న వయసున నెన్నియో జాతకముల పరిశీలించి నూలువాసియు దప్పనివిధమున ఫలితాంశముల జెప్పసాగిరి.

శ్రీ రామరావుగారు 16 సంవత్సరముల ప్రాయమువారైరి. వయసున పిన్న వాడైనను కవిత్వప్రౌఢిని, ప్రజ్ఞావిశేషమునను, సకల విద్యాప్రసక్తిని రామరావుగారి

ఖ్యాతి నలుదిశల విశేషవ్యాప్తిగాంచెను. ఇంతలో శ్రీ రామరావుగారికి వివాహ మంగళము మహావైభవముతో జరిగెను. నెల్లూరు వాస్తవ్యులు సింగరాజు వెంకట రమణయ్య పంతులుగారి కుమార్తె ఆదిలక్ష్మీదేవి మన కవిచంద్రుల ధర్మపత్ని యయ్యెను. తరువాత రామరావుగారు తర్క-వ్యాకరణాది శాస్త్రముల పరిచయము సంపాదింపవలయునన్న సంకల్పము కల్గి శ్రీ పురిఘళ్ళ రామశాస్త్రి, సుబ్రహ్మణ్య శాస్త్రియను సోదరపండితులనొద్ద వ్యాకరణశాస్త్రమును-తర్కశాస్త్రమును ఎడనెడ ఇతర సర్వశాస్త్రమర్యాదలను గ్రహించుచు స్మృతీతిహాసపురాణాది సర్వగ్రంథ పరిశీలనములతో కొన్ని నెలలుమాత్ర మధ్యయనమొనరించి సర్వవ్యాఖ్యానసహిత సర్వగ్రంథసారముల ధారణజేసికొనిరి. ఇప్పుడు తర్క-వ్యాకరణాదిసర్వశాస్త్రజ్ఞాన సమన్వితమై శ్రీరామరావుగారిసరస్వతిసర్వాలంకారశోభితయగు శ్రీ మహాలక్ష్మియో యన్నట్లు భాసింపజొచ్చెను. అంతట శ్రీ రామరావుగారికవితాప్రతిభ శాస్త్రగ్రంథ ములవైపునకు సాగెను. గురువుల కాశ్చర్యానందములు కల్గునట్లు వ్యాకరణసిద్ధాన్త కౌముదీగ్రంథమునకు శరద్రాత్రి యను వ్యాఖ్యానమును వ్రాసిరి. భాగవతచంపూ గ్రంథమునకు వ్యాఖ్యానముగావించిరి. గురుకులక్లిష్టుడగు మురారిభట్టుని నాటకమునకు వ్యాఖ్య రచించిరి. ఇంక నెన్నియో సముద్రమథన-కృష్ణలీలాతరంగిణి మొదలగు గ్రంథ ముల స్వతంత్రముగ రచించి, యనేకుల విద్యార్థుల అలంకార-తర్క - వ్యాకరణాది శాస్త్రములయందు అప్రతిమమగు తమ బోధనాపాటవమున బండితులజేయుచు కులపతియో యన్నట్లు నిరంతర హయగ్రీవపరమగు నంతరంగమున మెలగుచుండిరి.

శ్రీ హయగ్రీవు కరుణావశమున నప్పుడప్పుడు సంభవించు విద్వద్గోష్ఠుల సాహాయ్యమున అద్వైత విశిష్టాద్వైత గ్రంథపరిశీలనకు గడంగినది శ్రీ రామరావుగారి ధిషణ. ప్రజ్ఞాబలమున బృహస్పతికి నుద్దియా రామరాయకవిచంద్రులబుద్ధికి సత్య తత్త్వములు భాసించినవి. మొట్టమొదట అద్వైతమతప్రతిపాదకమగు పంచదశిని శ్రీ రామరావుగారు చూచుట తటస్థించెను. ఇంతకుపూర్వమే తమ వంశక్రమాగత మైన విశిష్టాద్వైతమతగ్రంథములను శ్రద్ధగ పరిశీలించిన కవిచంద్రులమనసు పంచ దశిజూచిన తరువాత కలవరపడెను. యుక్తిగాఢత్వము, శ్రుతిసమ్మతి విశిష్టాద్వైత మతముపట్ల నాతనికి గోచరించలేదు. అంతట తృప్తిచెందనేరక శ్రీమద్భగవద్గీతా గ్రంథముతోలూకు శ్రీ భాష్య - శంకరభాష్యముల నవలోకించెను. తనకు గల్గిన భావములు స్థిరపడెను. ఉభయమతములయందలి సమస్తవేదాన్తగ్రంథముల నచిర కాలములో నవలోకించి యవగాహన మొనర్చికొని శాంకరాశాంకరభాష్యవిమర్శ నము మొదలగు గ్రంథముల రచించెను. శ్రీహయగ్రీవానుగ్రహమున అద్వైతమతము నందు గాఢమగు నభిరుచి గల్గెను. విశిష్టాద్వైతమతమునందలి నిస్సారత సుస్పష్టముగ నాయనకు వ్యక్తమయ్యెను.

ఇంతలో వారి కులగురువులగు శ్రీ విశిష్టాద్వైతశాస్త్రనిష్ణాతులు, శ్రీ తిరుమల క్షేత్రనివాసులు శ్రీ ప్రతివాదిభయంకర రంగాచార్యులవారా గ్రామమునకు దయ చేసి తమ శిష్యులగు బెల్లంకొండవంశమువారందఱిని తప్తచక్రాంకన సంస్కారమున పునీతులజేసి శ్రీమన్నారాయణాష్టాక్షరీ మంత్రమునుపదేశింపనెంచినపట్టున మన కవిచంద్రులు తప్తచక్రాంకనము శూద్రధర్మముగాని వైదికసంస్కారసంస్కృతులగు ద్విజుల కవసరములేదని సప్రమాణముగ నిరూపించి, యాచార్యులవారిని నిరుత్తరుల జేసి, శూద్రధర్మదర్పణమను ధర్మశాస్త్రక్రోడీకరణగ్రంథము నొకదానిని రచించిరి. శ్రీ రామరాయ కవీంద్రుల వేదాన్తశాస్త్రపరిచయమునకు ప్రథమమున తమ శిష్యులై కావ్యనాటకాది గ్రంథాధ్యయనమున సుశిక్షితులై శ్రీ పండిత మల్లాది రామకృష్ణ మహాగ్నిచిద్యజ్వగారి సన్నిధిని పంచదశి మొదలగు నద్వైత వేదాన్త సద్గ్రంథాధ్యయనముచేసిన శ్రీ రాళ్ళభండి నరసింహశాస్త్రిగారి సాహచర్యము సహకారి యయ్యెను. విశిష్టాద్వైత గురువులతో గలిగిన వాదప్రసక్తితో రామరావు గారి అద్వైతవాసనలు మరింత దృఢభూమి నొందినవి. మరల శ్రీ రాళ్ళభండివారు, పేను కలసి మూడుమాసములు గీతాభాష్యములను శ్రీ శంకరకృతమును విశిష్టాద్వైతభాష్యమును ప్రతిపదవిమర్శ గావించి శ్రీ శంకరుల కైలాసగమనానంతరము వెలువడిన ఈ రామానుజమతమును సహేతుకముగ విమర్శించి ఖండించుట యవసరమనితోచి శ్రీ గీతాభాష్యార్కప్రకాశిక యను నీ మహాగ్రంథమును బహుళ [illegible]న్యాయసమన్వితముగ ననన్యసాధారణముగ రచించిరి. "హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధిః శ్యామికాపివా" అను సూక్తిని మనసున నిడికొని తమ గ్రంథము [illegible] శాస్త్రమున విద్వద్గోష్ఠులముందట గదా తేలవలయును అని యెంచి, [illegible] స్వతంత్ర [illegible]ప్రపంచ అపరగౌతము లని ఖ్యాతిజెందిన మూర్తీభవ [illegible]శాస్త్ర [illegible] శ్రీమద్ దాదిభట్ల రామమూర్తిశాస్త్రిపాదుల సన్నిధిని [illegible] స్వయముగ వినిపించిరి. శ్రీ శాస్త్రులవారాగ్రంథమును విని [illegible] శ్రుతిస్మృతి ప్రమాణ ప్రదర్శన పూర్వక వ్యాఖ్యా[illegible] బహువిధముల గ్రంథమును, గ్రంధకర్తలను బ్రశంసించిరి. తదనంతర శ్రీ శాస్త్రులవారి యాశీస్సుల నంది శ్రీ రామరావుగారు స్వగృహమున కేతెంచి శాకి[illegible]చతుస్సూత్రి మొదలగు ననేక గ్రంథముల వ్రాసిరి. శ్రీ కవిచంద్రుల ప్రతిభ యమేయము, అమానుషము. శ్రీ హయగ్రీవ భగవానుని యనుగ్రహము మూర్తీభవించినమూర్తి శ్రీ రామరాయ కవిచంద్రులు. వేదాంతముక్తావళి యను గ్రంథమునుకూడ రచించిరి. శ్రీభగవత్పాదులు భాష్యము [illegible] ఈశకేనాద్యాది ద్వాదశోపనిషత్తులను మృదుమధురమగు సుదాత్తకవితా [illegible] ప్రాకారమున చక్కనివృత్తములతో శ్లోకరూపమున వెలయింపజేసిరి. ఇందు 783 శ్లోకములు గలవు. ఇయ్యది ఆరంభింపబడిన 29 రోజులకే పూర్తిగావింప

బడినది. దీన శ్రీ రామరాయ కవిచంద్రుల యనూనప్రజ్ఞాశాలిత్వము సువ్యక్తము కాగలదు. ఇట్లు చిన్నవిగాని పెద్దవిగాని వీరిచే రచింపబడిన గ్రంథముల మొత్తము 148.

శ్రీ పండితకవిచక్రవర్తియగు శ్రీ రామరాయ కవీంద్రులు ఆనందనామ సంవత్సర కార్తిక శుక్ల ౯ (27-10-1914) రోజున రాచకురుపు అను నెపముతో ప్రారబ్ధకర్మము నిశ్శేషముకాగా నారబ్ధాయత్తమగు దేహమును వీడి యానంద మూర్తియై వెలసిరి. వారిజీవద్దశయం దెందరో మిత్రులు శిష్యులు మొదలగువారు కవిచంద్రులతో గ్రంథముద్రణమునుగూర్చి ప్రస్తావించగా కాళిదాసుడు తమ గ్రంథముల ముద్రణ కేమి యత్నించెను? శ్రీహర్షు డేమి యత్నించెను? గ్రంథముల జీవమున్న నవియే చిరకాలము మనగలవు. అట సారమున్న నవియే బహుముఖవ్యాప్తి నొందగలవని యనుచుండెడివారు.

వారి కృతులలో మొదటగ ముద్రణము నొందిన పెద్దగ్రంథము ఈ శ్రీ గీతా భాష్యార్కప్రకాశిక. ఎందరెందరో శ్రీ విశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావుగారు, శ్రీ ఏకా దండయ్య పంతులుగారు మొదలగు వదాన్యశేఖరులకు శ్రీ రామరాయ కవిచంద్రులగ్రంథముల ప్రకటించుటయం దత్యంతాదరము కలిగినది. కొలదికాలములో శ్రీవారి గ్రంథములన్నియు ప్రకటితములై వెలువడగలవు. శ్రీ హయగ్రీవ కరుణా ఫలరూపములగు నా గ్రంథములయందు జీవ మున్నది. అవి సారవంతములు.

శ్రీ కవితా సుబ్రహ్మణ్యశాస్త్రులవారు యుక్తతములు. శ్రీవారిగ్రంథముల ప్రకటనముపట్ల వీరు చేయుకృషి యెన్నదగినది. శ్రీ హయవదనుని ప్రసాదమున వదాన్య శేఖరులసహాయమున నత్యల్పకాలముననే వీరికృషి సంపూర్ణఫలవంతము కాగలదు.

శ్రీ శంకరుల యనంతరము తత్కృతభాష్యవిరుద్ధముగ శ్రీ రామానుజులు గావించిన శ్రీమ ద్భగవద్గీతా వ్యాఖ్యానమును ఖండించుచు శ్రుతిసమ్మతమైన తత్త్వార్థముల వెల్లడించుచు శ్రీ రామరాయ కవిచంద్రులు నిర్మించిన యీ భాష్యార్కప్రకాశికను సుస్పష్టముగ మనయాంధ్రులకు బోధపడుటకునై శ్రీ కవితా వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారి ప్రేరణమున శ్రీ మల్లావజ్ఝల సుబ్బరామశాస్త్రిగా రాంధ్రీకరించిరి. శాస్త్రగ్రంథముల నాంధ్రీకరించుట సామాన్యమైన పని గాదు, శ్రీ శాస్త్రిగారు పూర్వోత్తర మీమాంసలయందేగాక ననేకశాస్త్రములయందందెవేసిన చేయి యగుటచే నీ యాంధ్రీకరణము స్వతంత్రగ్రంథమో యన్నట్లు సర్వాంగ సుందరముగ విరాజిల్లుచున్నది.

ఇట్లు,

కుప్పా లక్ష్మావధాని

# అచ్చు పూర్తిఅయిన గ్రంథములు

## —♦ దేవనాగరలిపిలో ♦—

| | |
|---|---|
| భగవద్గీతాభాష్యార్క ప్రకాశికా | 100-0-0 |
| వేదాంత ముక్తావళీ | 40-0-0 |
| శంకరాశాంకర భాష్యవిమర్శః | 40-0-0 |
| లోకాయతాదిమతఖండనమ్ | 4-0-0 |
| శారీరకచతుస్సూత్రీవిచారః | 3-0-0 |
| అద్వైతాన్యమతఖండనమ్ - అద్వైతామృతమ్ | 3-0-0 |
| అద్వైతవిజయః | 3-0-0 |
| వేదాంత తత్త్వామృతమ్ | 2-8-0 |
| వేదాంతకౌస్తుభం - భాగవత చతుఃశ్లోకీ | 1-4-0 |
| వేదాంత సంగ్రహమ్ | 0-8-0 |
| హయవదనశతకమ్ | 1-0-0 |

## —♦ తెలుగు లిపిలో ♦—

| | |
|---|---|
| భగవద్గీతాభాష్యార్క ప్రకాశికా (తెలుగు అనువాదము) | |
| ప్రథమ ద్వితీయషట్కములు (600 పేజీలు) 40.00 | 10-0-0 |
| డిటో తృతీయ షట్కము ,, | 10-0-0 |
| హకారాదిహయగ్రీవసహస్రమ్ (వ్యాఖ్యతో) | 2-0-0 |
| విశారాదివిష్ణుసహస్రనామమ్ (వ్యాఖ్యతో) | 3-0-0 |
| దశావతారాష్టోత్తరమ్ | 3-0-0 |
| పరమాత్మసహస్రనామావళిః | 0-12-0 |
| ధర్మమంజరి (ఆంధ్రానువాదముతో) | |
| 1 వ భాగము | 1-0-0 |
| 2 వ భాగము | 1-0-0 |
| జీవితసంగ్రహమ్ | 1-0-0 |
| మోక్షప్రాసాదః | 2-8-0 |
| వేదాంతసంగ్రహమ్ (తెలుగు) | 0-8-0 |

ఈ గ్రంథములన్నియు వేంకట్రామ అండ్ కో., విజయవాడలో దొరకును.

# శ్రీ మచ్ఛఙ్కరాచార్య విరచిత

# శ్రీ దక్షిణామూర్తి స్తోత్రమ్

—o—

శ్లో॥ మౌనవ్యాఖ్యాప్రకటిత పరబ్రహ్మతత్త్వం యువానం
వర్షిష్ఠాంతేవసదృషిగణై రావృతం బ్రహ్మనిష్ఠైః
ఆచార్యేంద్రం కరకలిత చిన్ముద్ర మానందమూర్తిం
స్వాత్మారామం ముదితవదనం దక్షిణామూర్తి మీడే.

శ్లో॥ విశ్వం దర్పణదృశ్యమాన నగరీతుల్యం నిజాంతర్గతం
పశ్యన్నాత్మని మాయయా బహిరివోద్భూతం యథా నిద్రయా
యః సాక్షాత్కురుతే ప్రబోధసమయే స్వాత్మాన మేవాద్వయం
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే.

శ్లో॥ బీజస్యాంతరివాఙ్కురో జగదిదం ప్రాఙ్నిర్వికల్పం పున
ర్మాయాకల్పితదేశకాలకలనా వైచిత్ర్యచిత్రీకృతం
మాయావీవ విజృంభయత్యపి మహాయోగీవ యః స్వేచ్ఛయా
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే.

శ్లో॥ యస్యైవ స్ఫురణం సదాత్మక మసత్కల్పార్థగం భాసతే
సాక్షాత్తత్త్వమసీతి వేదవచసా యో బోధయ త్యాశ్రితాన్
యత్సాక్షాత్కరణా ద్భవే న్నపునరావృత్తి ర్భవాంభోనిధౌ
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే.

శ్లో॥ నానాచ్ఛిద్రఘటోదరస్థిత మహాదీప ప్రభాభాస్వరం
జ్ఞానం యస్యతు చక్షురాదికరణద్వారా బహిస్స్పందతే
జానామీతి తమేవ భాంత మనుభా త్యేతత్సమస్తం జగత్
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే.

శ్లో॥ దేహం ప్రాణమపీంద్రియాణ్యపి చలాం బుద్ధించ శూన్యం విదుః
స్త్రీబాలాంధజడోపమా స్త్వహ మితి భ్రాంతా భృశం వాదినః
మాయాశక్తివిలాసకల్పితమహావ్యామోహసంహారిణే
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే.

శ్లో॥ రాహుగ్రస్తదివాకరేందుసదృశో మాయా సమాచ్ఛాదనా
త్సన్మాత్రః కరణోపసంహరణతో యో భూ త్సుషు ప్తః పుమాన్
ప్రాగస్వాప్సమితి ప్రబోధసమయే యః ప్రత్యభిజ్ఞాయతే
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే.

శ్లో॥ బాల్యాదిష్వపి జాగ్రదాదిషు తథా సర్వా స్వవస్థా స్వపి
వ్యావృత్తా స్వనువర్తమాన మహ మిత్యంతస్స్ఫురంతం సదా
స్వాత్మానం ప్రకటీకరోతి భజతాం యో ముద్రయా భద్రయా
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే.

శ్లో॥ విశ్వం పశ్యతి కార్యకారణతయా స్వస్వామిసంబంధత
శ్శిష్యాచార్యతయా తథైవ పితృపుత్రాద్యాత్మనా భేదతః
స్వప్నే జాగ్రతి వా య ఏష పురుషో మాయాపరిభ్రామితః
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే.

శ్లో॥ భూరంభాంస్యనలోఽనిలోఽంబర మహర్నాథో హిమాంశుః పుమా
నిత్యాభాతి చరాచరాత్మక మిదం యస్యైవ మూర్త్యష్టకం
నాన్యత్కించన విద్యతే విమృశతాం యస్మా త్పరస్మా ద్విభో
స్తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే.

శ్లో॥ సర్వాత్మత్వ మితి స్ఫుటీకృత మిదం యస్మా దముష్మిం స్తవే
తేనాస్య శ్రవణా త్తదర్థమననా ద్ధ్యానాచ్చ సంకీర్తనాత్
సర్వాత్మత్వ మహావిభూతిసహితం స్యా దీశ్వరత్వం స్వత
స్సిద్ధ్యే త్తత్పునరష్టధా పరిణతం చైశ్వర్య మవ్యాహతమ్.

—o—

శ్రీ గురుభ్యో నమః.

# శ్రీ భగవద్గీతా భాష్యార్క ప్రకాశికానువాదము.

## ప్రథమాధ్యాయము.

ధృతరాష్ట్ర ఉవాచ:

శ్లో. ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః
మామకాః పాణ్డవాశ్చైవ కిమకుర్వత సంజయ ॥౧॥

అ. గ్రుడ్డివాఁడగు ధృతరాష్ట్రుఁడు, తనకు భారతయుద్ధ చరితముఁ జెప్పుటకు వ్యాసమహర్షిచే నాజ్ఞాపింపబడి వారిచే నొసగబడిన శక్తిగలసంజయునితో ప్రశ్నోత్తర రూపముగా వ్యవహరించెనని వ్యాసులు చెప్పుచున్నారు. "ధృతరాష్ట్ర ఉవాచ" అని. ఇచట ధృతరాష్ట్ర పదమువలన నేరిచే జగద్రూపమగు రాజ్యము ధరింపబడినదో, అట్టి యీశ్వరుడు అని భగవత్స్మరణ రూపమగు మంగళమును, బాదరాయణులు వ్యాజనావృత్తిచే గ్రన్థాదియందుఁ గూర్చిరని గ్రహింపవలయును. లేనిచో, గీతాశాస్త్రము భారత గ్రంథమునందుఁ జేరినదగుటచే, భారత గ్రన్థాదియం దొనర్చిన మంగళమే, గీతాశాస్త్రమునకుగూడ మంగళాచరణ మగును కాన నిచట మంగళాచరణముతోఁ బనిలేదని యూహింపవలయును. వస్తుతః గీతాశాస్త్రము ద్వితీయాధ్యాయమునందలి "అశోచ్యానన్వశోచస్త్వమ్" అను శ్లోకముతో నారంభమగుచున్నందున నచట "భగవా నువాచ" అని భగవత్స్మరణాత్మకమగు మంగళాచరణము కలదని గ్రహించుట యుక్తము. ఇచట "ఉవాచ" యనగా అడిగెనని యర్థము. సంజయునిగూర్చి యడిగెనని యధ్యాహారముఁ జేసికొనవలయును.

ఓయి సంజయుడా! పుణ్యభూమియగు కురుక్షేత్రమునందు యుద్ధముఁజేయఁ దలంపుతోఁ గూడిన మావారు, పాణ్డురాజువారలును యేమి యొనర్చిరి? (అని యన్వయము) శ్రుతి స్మృతులచే విధింపబడి, స్వర్గాది పుణ్యలోకములకుఁ గారణమగు యజ్ఞము, యుద్ధము, మున్నగునది ధర్మమనంబడు. అద్దాని ననుష్ఠించుటకు విహితమగు స్థలమును ధర్మక్షేత్ర మందురు. పుణ్యభూమి యగుటచే నీకురుక్షేత్రమునం దనుష్ఠించిన కొలది ధర్మము, గొప్పఫలము నొసంగునని యీ విశేషణమువలన స్పష్టమగుచున్నది. కావున కురురాజులచేఁ బాలింపఁబడు నీ పుణ్యభూమియందు యుద్ధముఁజేయఁ దలంపుతోఁ గూడిన నాకుమారులగు దుర్యోధనాదులు, పాణ్డురాజ సంతానమగు ధర్మరాజాదులు, చకారమువలన వారి సహాయులు, ఏవకారమువలన నుభయుల చతురఙ్గ సైన్యములు యేమి యొనర్చిరి? యుద్ధమును సలిపిరా?

లేక సంధి యొనర్చిరా? అని ధృతరాష్ట్రుని ప్రశ్నకు అర్థము. ఇచట యుద్ధకర్మము యొక్క ఫలమగు జయము ఆత్మగామి యగుటవలన, (తనకు చెందుటవలన) నాత్మనేపదము ప్రయోగింప బడినది. ౧

సంజయ ఉవాచ :

శ్లో. దృష్ట్వాతు పాండవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్ ॥౨॥

అ. సంజయుడు ధృతరాష్ట్రునితో నిట్లు బదులు చెప్పెను.

దుర్యోధన మహారాజు అప్పుడు వ్యూహాకారముగానున్న పాండవసేననుఁ జూచి, గురువగు ద్రోణునిఁ సమీపించి, యిట్లు ముందుఁజెప్పబోవు వాక్యమును చెప్పెను. ఇచట "వచనము" అనుపదము జాతివివక్షచే నేకవచనాన్తముగా బ్రయోగింపబడినది కాన వచనములని యర్థము, (వచన మబ్రవీత్) అను ప్రయోగము పాకంపచతి. (వంటను వండుచున్నాడు) అను ప్రయోగములవంటిది. ఇట్టి ప్రయోగములను పెక్కుమంది కవులు వాడుచుండుటచే బునరుక్తదోషము లేదు. ౨

శ్లో. పశ్యైతాం పాండుపుత్రాణా మాచార్య మహతీం చమూం
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా. ॥3॥

అ. ఓయి ఆచార్యుడా? బుద్ధిమంతుడు, శిష్యుడు, సేనానాయకుడును అగు ధృష్టద్యుమ్నునిచే వ్యూహాకారముగా నేర్పరుపబడిన, పాణ్డుపుత్రుల సేనను చూడుము. 3

శ్లో. అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః ॥౪॥

అ. ఈ పాణ్డవసేనయందు యుద్ధములో భీమార్జునులతో సమానులగు శూరులు కలరు. వా రెవ్వ రన? సాత్యకి, విరాటరాజు, ద్రుపదుడు, మున్నగు మహారథులు. తనను, తనసారథిని, దనయశ్వములను, కాపాడుకొనుచు యుద్ధముజేయు వీరుడు మహారథుఁ డనంబడు. ౪

శ్లో. ధృష్టకేతు శ్చేకితానః కాశిరాజశ్చ వీర్యవాన్ ।
పురుజి త్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః ॥౫॥

అ. మఱియు- ధృష్టకేతువు, చేకితానుడు, పరాక్రమవంతుడగు కాశిరాజు, పురుజిత్తు, కుంతిభోజుడు, నరపుఙ్గవుడగు శైబ్యుడు. ౫

శ్లో. యుధామన్యుశ్చ విక్రాన్త ఉత్తమౌజాశ్చ వీర్యవాన్
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః ॥౬॥

అ. మఱియు, పరాక్రమవంతుడగు యుధామన్యుడును, పరాక్రమశాలియగు ఉత్తమౌజుడును, అభిమన్యుడును, ద్రౌపదిసంతానమగు నుపపాండవులును వీరందఱును మహారథులే. ౬

శ్లో. అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే ॥౭॥

అ. మనసేనయందు గొప్పవారును, మహారథులుగఁ బరిగణింపదగినవారును, మనసేనకు నాయకులగువారిని నీకు గుర్తుకొఱకుఁ జెప్పుచున్నాను. ఓ బ్రాహ్మణోత్తముఁడా! వారలఁ దెలిసికొనుము. ౭

శ్లో. భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తిర్జయద్రథః ॥౮॥

అ. మీరును, (ద్రోణాచార్యులు) భీష్ములును, కర్ణుడును, యుద్ధమున జయించునట్టి కృపాచార్యులును, అశ్వత్థామయు, వికర్ణుడును, సోమదత్తుని సంతానమగు జయద్రథుడును, ౮

శ్లో. అన్యే చ బహవశ్శూరాః మదర్థే త్యక్తజీవితాః
నానాశస్త్రప్రహరణా స్సర్వే యుద్ధవిశారదాః ॥౯॥

అ. మఱియు ననేకులు నాకొఱకు ప్రాణముల నర్పింప సమకట్టిన శూరులు కలరు. అనగా ప్రాణముల చేతనైనను నాకుపకార మొనర్చుటలో స్థిరమతులని యభిప్రాయము. దీనిచే దైవయోగమువలన దుర్యోధనునకు అపజయము కలదని సూచింపబడినది. అంతమాత్రమునుచే నపజయమునందు దుర్యోధనునకుఁ దాత్పర్యము కలదని కల్పింపదగదు. వీరందరు అనేక విధములయిన శస్త్రాస్త్ర సంపత్తి కలవారు. యుద్ధమునందు నేర్పరులు. ౯

శ్లో. అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితం
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితం ॥౧౦॥

అ. ఆ కారణమున ముదుసలియగు భీష్మునిచేఁ గాపాడబడు మనసేన శత్రుసేనను జయింప నసమర్థమయినది. ఈవాక్యము భీష్ముని సామర్థ్యమును గుర్తెఱుంగక దుర్యోధనునిచేఁ జెప్పబడినది. లేక ధర్మబద్ధుడగు భీష్ముడు పాండవపక్షపాతి యగుటవలనను చెప్పబడియుండవచ్చును. ఎదుట గనుపడుచున్నట్టి, భీమునిచేఁ గాపాడబడు నీపాండవసేన శత్రుసేనను సంహరింప సమర్థమయినది. ఏలయన భీముడు యువకుడగుటవలనను, సకల ధార్తరాష్ట్రులను వధింప దీక్ష బూనినవాడగుట వలనను, బాల్యమునుండి దుర్యోధనుడు తన తమ్ములతోఁగూడ భీము-

నిచే ననేకమారులు అవమానింప బడుటవలనను దుర్యోధనునకు భీము డత్యంత భయకారణ మగుచున్నాడని భావము. ౧౦

శ్లో. అయనేషు చ సర్వేషు యథాభాగ మవస్థితాః
భీష్మ మేవాభిరక్షంతు భవన్త స్సర్వ ఏవ హి ॥౧౧॥

అ. కనుక మీరందరు మీ మీస్థానముల యథోచితముగనుండి భీష్ముని గాచుకొనుడు. సేనాపతియగు నాతడు గాపాడబడినచో సేనయంతయు సురక్షితముగా నుండును. ౧౧

శ్లో. తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః
సింహనాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్ ॥౧౨॥

అ. కురురాజులలోఁ బెద్దవాడగు భీష్ముడు దుర్యోధనునకు సంతోషమును బుట్టించుచు బిగ్గరగా సింహగర్జనముచేసి శంఖమును పూరించెను. ఇయ్యది అందరిలోఁ దమకుగల సామర్థ్యాతిశయమును చూపగలందుల కని భావము. ౧౨

శ్లో. తతః శంఖాశ్చ భేర్యశ్చ పణవానక గోముఖాః ।
సహ సైవాభ్యహన్యంత స శబ్ద స్తుములోఽభవత్ ॥౧౩॥

అ. అంతట సైనికులచే శంఖము మున్నగు వాద్యవిశేషములు వెంటనే ప్రయోగింపబడినవి. ఆధ్వని యతి సంకులమాయెను. ౧౩

శ్లో. తత శ్శ్వేతై ర్హయై ర్యుక్తే మహతి స్యందనే స్థితౌ ।
మాధవః పాణ్డవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః ॥౧౪॥

అ. అంతటఁ దెల్లగుఱ్ఱములతోఁ గూడిన గొప్పరథమందున్న కృష్ణార్జునులు దివ్యశంఖములను పూరించిరి. ౧౪

శ్లో. పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః ।
పౌణ్డ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః ॥౧౫॥

అ. శ్రీకృష్ణుడు పాంచజన్యమను శంఖమును, అర్జునుడు దేవదత్తమను శంఖమును, భీముడు పౌణ్డ్రమను మహాశంఖమును పూరించిరి. ౧౫

శ్లో. అనన్తవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః ।
నకుల స్సహదేవశ్చ సుఘోష మణిపుష్పకౌ ॥౧౬॥

అ. జనరంజకుడు, కుంతికుమారుడు నగు ధర్మరాజు అనన్త విజయమను శంఖమును, నకులుడు సుఘోషమను శంఖమును, సహదేవుడు మణిపుష్పకమను శంఖమును పూరించిరి. ౧౬

శ్లో. కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీచ మహారథః
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజితః ॥౧౭॥
ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే,
సౌభద్రశ్చ మహాబాహు శ్శంఖాన్ దధ్ముః పృథక్ పృథక్ ॥౧౮॥

అ. గొప్ప ధనుర్ధరుడగు కాశిరాజు, మహారథుడగు శిఖణ్డి, ధృష్టద్యుమ్నుడు, విరాటరాజు, సాత్యకి, ద్రుపదుడు, ఉపపాండవులు, గొప్ప భుజబలముగల అభిమన్యుడు, వీరందరును నలుగెడల వేర్వేరుగ శంఖములఁ బూరించిరి.౧౮

శ్లో. స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్
నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్ ॥౧౯॥

అ. మిక్కిలి పెద్దదగు నాధ్వని భూమ్యాకాశములఁ బ్రతిధ్వనింపజేయుచు దుర్యోధనాదుల హృదయములను బ్రద్దలు చేసెను. ౧౯

శ్లో. అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః
ప్రవృత్తే శస్త్రసంపాతే ధను రుద్యమ్య పాణ్డవః ॥౨౦॥
హృషీకేశం తదా వాక్య మిద మాహ మహీపతే

అర్జున ఉవాచ:

సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత ॥౨౧॥

అ. హనుమంతుడు టెక్కెముగాగల యర్జునుడు యుద్ధసన్నద్ధులగు దుర్యోధనాదుల జూచి బాణప్రయోగము జరుగనుండగా ధృతరాష్ట్రమహారాజ! ఈ రెండుసేనల మధ్య రథమును నిలుపు మని కృష్ణునితో ననెను. ౨౧

శ్లో. యావ దేతా న్నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్
కైర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే ॥౨౨॥

అ. ఈ యుద్ధ కృత్యమునందు నే నెవరితో యుద్ధము జేయవలయునో వారల నేను చూచునంతవరకు రథమును నిలుపుమని యర్జునుని యాశయము. ౨౨

శ్లో. యోత్స్యమానా నవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచికీర్షవః ॥౨౩॥

అ. దుర్బుద్ధిగల దుర్యోధనుని కోరిక నెరవేర్పఁదలంపుతో నెవరిచట కూడిరో వారల నేను చూతును. ౨౩

శ్లో. ఏవ ముక్తో హృషీకేశో గుడాకేశేన భారత
సేనయో రుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్ ॥౨౪॥

భీష్మద్రోణప్రముఖత స్సర్వేషాం చ మహీక్షితామ్
ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూ నితి ॥౨౫॥

అ. ఓయి ధృతరాష్ట్ర! పిదప కృష్ణుడిరుసేనలనడుమ, భీష్మద్రోణుల యెదుట సమస్తరాజుల సమక్షమున రథమును నిలిపి, ఓయి యర్జునుడా! యుద్ధసన్నద్ధులగు నీ కురురాజులఁ జూడుమని పలికెను. ౨౫

శ్లో. తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄ నథ పితామహాన్
ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీం స్తథా,
శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయో రుభయో రపి ॥౨౬॥

అ. పిదప అర్జునుడు రణరంగమున రెండుసేనలయందును నిలచియున్న తండ్రులను, తాతలను, గురువులను, మేనమామలను, అన్నలను, కుమారులను, మనుమలను, చెలికాండ్రగు అశ్వత్థామ మున్నగువారలను, మామలను, మిత్రులగు కృతవర్మ మొదలగు వారలను చూచెను. ౨౬

శ్లో. తాన్ సమీక్ష్య స కౌంతేయ స్సర్వా న్బంధూ నవస్థితాన్
కృపయా పరయాఽఽవిష్టో విషీద న్నిద మబ్రవీత్ ॥౨౭॥

అ. అర్జునుడు యుద్ధసన్నద్ధులగు బంధువుల నందరను చూచి అత్యధికమగు దయతో నేడ్చుచు నీవాక్యమును చెప్పెను. ౨౭

అర్జున ఉవాచ :

శ్లో. దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితం
సీదన్తి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే ॥౨౮॥

అ. ఓయి కృష్ణ! యుద్ధముఁజేయ నిచ్ఛతో వచ్చియున్న నీ బంధుజాలమును జూచిన, నా యవయవములు బాధ చెందుచున్నవి. నోరెండుచున్నది. శరీరము వణకుచున్నది. గగుర్పాటు కలుగుచున్నది. ౨౮

శ్లో. గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే।
న చ శక్నో మ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః ॥౩౦॥

అ. నాచేతినుండి గాండీవము జారిపోవుచున్నది. ఒడలు మండుచున్నది. నేను నిలువలేకున్నాను. నా మతి తిరిగిపోవుచున్నది. ౩౦

శ్లో. నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ
న చ శ్రేయోనుపశ్యామి హత్వా స్వజన మాహవే ॥౩౧॥

అ. ఓయి కృష్ణ! నేను దుశ్శకునములఁ జూచుచున్నాను. యుద్ధమునందు బంధువర్గమును చంపిన శ్రేయస్సు కలదని నేను తలచను. ౩౧

శ్లో. న కాంక్షే విజయం కృష్ణ! న చ రాజ్యం సుఖాని చ
కిం నో రాజ్యేన గోవింద! కిం భోగై ర్జీవితేన వా ॥౩౨॥

అ. ఓయి కృష్ణ! నేను యుద్ధమునందు జయమును కోరను, రాజ్యమును కోరను, సుఖముల నిచ్ఛయింపను. ఓయి గోవింద! మాకు రాజ్యముతోగాని యీ భోగములతోగాని, జీవితముతోగాని యేమి ప్రయోజనము? ౩౨

శ్లో. ఏషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగా స్సుఖాని చ
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ ॥౩౩॥

అ. ఓయి కృష్ణ! మేము ఈ రాజ్యమును, భోగములను, సుఖములను, యెవరి కొరకుఁ గావలయు ననుకొంటిమో అట్టి యాప్తబంధువులు ప్రాణధనములను వీడి యుద్ధభూమియందు నిలువబడిరి. ౩౩

శ్లో. ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః
మాతులా శ్శ్వశురాః పౌత్రా శ్శ్యాలా స్సంబంధిన స్తథా ॥౩౪॥

అ. గురువులు, తండ్రులు, కుమారులు, తాతలు, మేనమామలు, మామలు మనుమలు, బావమరదులు, మరి యితరబంధువులు వీరందరును ప్రాణములను వీడ సిద్ధపడిరి. ౩౪

శ్లో. ఏతా న్న హంతు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన
అపి త్రైలోక్య రాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే ॥౩౫॥

అ. ఓయి కృష్ణ! నన్ను వీరు చంపినను నే నీబంధువులఁ జంపఁ దలంపను. నాకు ముల్లోకములఁ బాలింపునధికార మొసగెద నన్నను యీపనిని నేను చేయఁజాలను. కేవలము ఈ మహీమండలము నేలుట కింతటి యకార్యమొనర్తునా ? ౩౫

శ్లో. నిహత్య ధార్తరాష్ట్రా న్నః కా ప్రీతి స్స్యా జ్జనార్దన
పాప మేవాశ్రయే దస్మా న్హత్వైతా నాతతాయినః ॥౩౬॥

అ. ఓయి జనార్దన! దుర్యోధనాదులఁ జంపి నిలిచియున్న మాకు యేమి సంతోషమగును? ఇచట మధుసూదన జనార్దన అను రెండు సంబోధనలచేఁ గృష్ణునకుగూడ దుష్టులఁ జంపుటయే సమ్మతముగాని గురువులు మున్నగు బంధుజనులఁ జంపుట సమ్మతముగాదని సూచింప బడుచున్నది. ఈ యాతతాయులఁ జంపిన మాకు పాపమే చుట్టుకొనును. 1. కొంపకు నిప్పుబెట్టువాడు, 2. అన్నమున

విషము బెట్టువాడు, 3. చేతగత్తిబూని చంపువాడు, 4.పరధనము నపహరించువాడు, 5. పరక్షేత్రము నపహరించువాడు 6. పరదారల నపహరించువాడు, వీరలు ఆతతాయు లనబడుదురు.

“ ఆతతాయిన మాయాంతం హన్యా దేవాఽవిచారయన్ ” ఆతతాయులు యెదురు వచ్చుచో విచారింపకయే చంపవలయు ననుధర్మ శాస్త్రముచే నాతతాయి వధ ధర్మరూపమయినను, ధర్మమునందుగూడ నధర్మ భ్రమవలననే అర్జును డిట్లు చెప్పెనని గ్రహింపవలయును. ౩౬

శ్లో. తస్మా న్నార్హా వయం హంతుం ధార్తరాష్ట్రాన్ సబాన్ధవాన్
స్వజనం హి కథం హత్వా సుఖిన స్స్యామ మాధవ ॥౩౭॥

అ. అందువలన బంధువర్గముతోఁ గూడియున్న దుర్యోధనాదులఁ జంప మేము సమకట్టము. ఓయికృష్ణ! బంధువుల జంపుకొని మే మెట్లు సుఖింతుము? ౩౭

శ్లో. యద్య ప్యేతే న పశ్యంతి లోభోపహతచేతసః
కులక్షయకృతం దోషం మిత్రద్రోహేచ పాతకం ॥౩౮.

అ. కాని లుబ్ధులగు నీ దుర్యోధనాదులు వంశనాశమువలనఁ కలుగు దోషమును, మిత్రద్రోహమువలన వచ్చు పాతకమును గుర్తెఱుంగరు.౩౮

శ్లో. కథం న జ్ఞేయ మస్మాభిః పాపా దస్మా న్నివర్తితుం
కులక్షయ కృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన॥౩౯॥

అ. అయినను వంశనాశ మొనర్చినందున గలుగు దోషమును గుర్తెఱింగిన మేము యీ పాతకమునుండి యేల నివర్తింప దగదు? ౩౯

శ్లో. కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మా స్సనాతనాః
ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోఽభిభవత్యుత ॥౪౦॥

అ. కులము క్షీణించినచోఁ బ్రాచీనములగు వంశాచారములు నశించును. ధర్మము నశించినచో నధర్మము కులమునంతయును తిరస్కరించును. ౪౦

శ్లో. అధర్మాభిభవా త్కృష్ణ ప్రదుష్యన్తి కులస్త్రియః।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః ॥౪౧॥

అ. ఓయి కృష్ణ! అధర్మ మాక్రమించినందున కులాంగనలు చెడుదురు. ఓయి యదుకులోద్భవ! స్త్రీలు చెడినచో వర్ణసాంకర్య మేర్పడును. ౪౧

శ్లో. సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ
పతన్తి పితరో హ్యేషాం లుప్తపిణ్డోదక క్రియాః ॥౪౨॥

అ. వర్ణసాంకర్యము, వంశనాశకులకు వంశమునకును నరకము నిచ్చును. వీరల పితృదేవతలు పిండోదకములు లేనివారయి నరకకూపమున బడుదురు. ४२

శ్లో. దోషై రేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః ॥४३॥

అ. వర్ణసాంకర్యమును చేయు నీదోషములచే వంశనాశకులయొక్క శాశ్వతమగు జాతి కుల ధర్మములు నశించును. ४३

శ్లో. అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయం
యద్రాజ్యసుఖలోభేన హన్తుం స్వజనముద్యతాః ॥४४॥

అ. ఎంతకష్టము. రాజ్యసుఖమునందలి యాశచే బంధుజాలమును హింసింప సమకట్టిన మేము గొప్ప పాపకృత్యమును జేయ నిశ్చయించితిమికదా ? ४४

శ్లో. యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః
ధార్తరాష్ట్రా రణే హన్యుః తన్మే క్షేమతరం భవేత్ ॥४५॥

అ. చేత శస్త్రము పూనక, శత్రువుల బాణప్రహారమునకు ప్రతిక్రియ యొనర్పక నున్న నన్ను దుర్యోధనాదులు ధనుస్సు చేతఁబూని యుద్ధమునందుఁ జంపినచో జంపనిమ్ము, అదియే నాకు క్షేమకరమగును.

సంజయుడు చెప్పెను.

శ్లో. ఏవముక్త్వార్జునస్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః ॥४६॥

అ. రణరంగమున కౌంతేయు డిట్లు చెప్పి, ధనుర్బాణముల విడచి, శోకవ్యాకుల చిత్తుడగుచు, రథమధ్యమున గూర్చుండెను. ४६

(ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు; బ్రహ్మవిద్యాయాం; యోగశాస్త్రే, శ్రీ కృష్ణార్జునసంవాదే అర్జునవిషాదయోగో నామ ప్రథమోఽధ్యాయ స్సమాప్తః ॥-)

అ. ఇందు ఇతి శబ్దము సమాప్తిని బోధించును. షడ్గుణైశ్వర్యములు కలవాడు భగవన్తుడు. అట్టి భగవన్తుడు లక్ష్మీయుక్తుడగుటచే శ్రీభగవన్తు డనబడును. లక్ష్మి యనునది భగశబ్దార్థములలో చేరియే యున్నది. అయినను అందు (భగశబ్దార్థములలో) లక్ష్మి యనునది ప్రధానమని తెలియుటకు శ్రీభగవన్తుడని మరల చెప్పబడినది. శ్రీ భగవన్తునిచేఁ జెప్పబడినందున నీయవి శ్రీ భగవద్గీత లనబడుచున్నవి. (వీటిని శ్రీ భగవన్తునిచేఁ జెప్పబడినందునగాని, లక్ష్మీయుక్తము లగుట వలనగాని శ్రీ భగవద్గీత లని యనవచ్చును). వేదాన్తార్థమును ప్రతిపాదించుట వలనను, సంసారబంధమును విడగొట్టునట్టి గుణములుండుటవలనను, ఈయవి

యుపనిషత్తులని యనఁదగును. మరియు నుపనిషత్తులు జీవబ్రహ్మైకత్వమును బోధించుచున్నవి. గీతలుకూడ జీవబ్రహ్మలక భేదమును బోధించుటచే నుపనిషత్తు లనఁదగును. ఈ పక్షమున నుపనిషచ్ఛబ్దము యోగరూఢిచే వేదాన్తపరమనియు, నవయవార్థముచే గీతాపరమనియు గ్రహింపవలయును. దీనిచే నిచట నుపనిషత్తులనగా బ్రహ్మవిద్యను బోధించున వని స్పష్టమగుచున్నది. బ్రహ్మజ్ఞానము నొసగుటచే బ్రహ్మవిద్యయనియు, కర్మ, జ్ఞాన, భక్తి, యోగములను శాసించుటచే యోగశాస్త్రమనియు నీయవి చెప్పబడుచున్నవి. మరియు నిందు (కృష్ణార్జునులయొక్క ఉక్తిప్రత్యుక్తి రూపమగు (అడుగుట చెప్పుట రూపమగు) సంవాదముండుటచే నీయది కృష్ణార్జున సంవాద మనందగు. అందు మొదటి దగు నీ యధ్యాయమున నర్జునునియొక్క దుఃఖ సాంగత్య ముండుటచే నీ యధ్యాయము అర్జున విషాదయోగ మను పేరును బడసెను.

నిజముగ విచారించినచో "అశోచ్యానన్వశోచస్త్వమ్" అను ద్వితీయాధ్యాయమునందలి పదునొకండవ శ్లోకము మొదలుకొనియుండు గ్రంథమునకే యోగశాస్త్రమను వ్యవహారము ముఖ్యమగును. అయినను యోగశాస్త్రమున కుపోద్ఘాత రూపమగుటవలన నీ యధ్యాయమును గూడ యోగశాస్త్రమునందు జేర్చిరి.

దీనిచే సంసారమునందలి దోషములను దెలిసికొని విషాదము నొందినవానికి యోగశాస్త్రమునందు బ్రవృత్తి కలుగును గాన ముముక్షువు తప్పక సాంసారిక విషయములయందలి దోషములను విమర్శింపవలయునని శాసింపబడుచున్నది. ఇట్లు శాసించుటవలననే, యీ యధ్యాయము యోగశాస్త్ర మనదగుచున్నది.

ఇట్లు వేదాన్తార్థ ప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యాత్మకంబును,
యోగశాస్త్రంబును, శ్రీకృష్ణార్జున సంవాదంబును
నగు శ్రీ భగద్గీతలయం దర్జునవిషాద నిరూపకంబగు,
మొదటి యధ్యాయము ముగిసెను.

ప్రథమాధ్యాయము – సమాప్తము.



# ద్వితీయాధ్యాయము

సంజయ ఉవాచ:

శ్లో. తం తథా కృపయావిష్ట మశ్రుపూర్ణాకులేక్షణం
విషీదన్త మిదం వాక్య మువాచ మధుసూదనః ॥౧॥

అ. సంజయుడు చెప్పుచున్నాడు: దయాపూరితాన్తరంగుడగుచు, కన్నీటితో నిండి, నేత్రములు తిరిగిపోవుచు, దుఃఖింపుచున్న నర్జుననిగూర్చి శ్రీకృష్ణుడు యీ చెప్పబోవు వాక్యమును చెప్పెను. ౧

శ్రీ భగవానువాచ:

శ్లో. కుతస్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితం
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున ॥౨॥

అ. కృష్ణుడు చెప్పుచున్నాడు: ఓయి యర్జున! నీచుల నాశ్రయించి, స్వర్గసుఖము నడ్డుపరచుచు, అపకీర్తిని వ్యాపింపజేయు, నీచిత్తవ్యాకులత నిపు డేల నీకు సంప్రాప్తమయ్యె? ౨

శ్లో. క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప ! ॥3॥

అ. ఓయి పృథాతనయ! నీవు పిఱికితనమును బొందకుము. ఖాండవ దహనము మున్నగు పౌరుష కృత్యముల నెరవేర్చిన నీకిట్టి పిరికిదనము తగదు. ఓయి శత్రుసంతాపకుడా! నీచమగు పిఱికితనమును విడచి లెమ్ము, యుద్ధమునకుఁ గడంగుము.

అర్జున ఉవాచ:

శ్లో. కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణంచ మధుసూదన
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన !॥౪ ॥

అ. అర్జును డడుగుచున్నాడు: ఓయి మధుసూదనుడా! శత్రుమారకుడా! పూజింపఁదగిన భీష్మద్రోణులను యుద్ధమునందు బాణములచే నేనెట్లు కొట్టగలను? ఇచటఁ గృష్ణుని సంబోధించిన విశేషణద్వయముచే, గృష్ణుడుకూడ, గురువులగాని బంధువులఁగాని చంపినవాడు కాడని సూచింపబడుచున్నది. ౪

శ్లో. గురూనహత్వా హి మహానుభావాన్ శ్రేయో భోక్తుం భైక్షమపీహ లోకే
హత్వార్థకామాం స్తు గురూ నిహైవ భుంజీయ భోగాన్ రుధిర ప్రదిగ్ధాన్ ॥

అ. మహానుభావులగు గురువులఁ జంపక నీలోకమున భిక్షాన్నమునైనను భుజించి జీవించుట యుక్తమా? లేక ధనాభిలాషులగు గురువులఁ జంపి రక్తపూరిత

ములగు సంసారభోగముల ననుభవించుట యుక్తమా? గురువులఁజంపి నెత్తురుతోఁ గూడిన అర్థ కామరూపములయిన భోగముల ననుభవించుట యుక్తమా? అనియును చెప్పవచ్చును. ౫

శ్లో. నచైత ద్విద్మః కతరన్నో గరీయో యద్వా జయేమ యదివా నో జయేయుః
యా నేవ హత్వా న జిజీవిషామః తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః ॥౬॥

అ. ఈ రెంటిలో నేది మాకు శ్రేష్ఠమో మేము తెలియకున్నాము. మేము శత్రువులను జయింతుమో! మమ్ము శత్రువులు జయింతురో, మేము నెవరినిజంపి జీవింప లేకుంటిమో, యట్టి ధార్తరాష్ట్రులు రణరంగమున మా యెదుట నిలబడిరి.

శ్లో. కార్పణ్య దోషోపహత స్వభావః పృచ్ఛామి త్వాం ధర్మ సంమూఢ చేతాః,
యచ్ఛ్రేయ స్స్యాన్నిశ్చితం బ్రూహి త న్మే శిష్య స్తేఽహం శాధి మాం
త్వాం ప్రపన్నం ॥౭॥

అ. వివేక రహితుడనగు నేను ధర్మాధర్మముల నిర్ణయింపఁ జాలక నిన్నడుగుచున్నాను. మాకెద్ది శ్రేయస్కరమని నీకు దోచునో దానిని మాకుజెప్పుము. నీకంటె మాకు వేరు ధర్మనిర్ణాయకులు లేరు. నేను నీ శిష్యుడను. నిన్ను శరణుజొచ్చితిని. నన్ను శిక్షింపుము. దీనిచే శిష్యుడు గురువు నొద్దకు వెళ్ళు పద్ధతి యుపదేశింపబడినది.

శ్లో. న హి ప్రపశ్యామి మమాపనుద్యా ద్యచ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణాం
అవాప్య భూమా వసపత్న మృద్ధం రాజ్యం సురాణామపి చాధిపత్యం ॥౮॥

అ. యుద్ధము జేయుటయే శ్రేయస్కరమని నీకు దోచినచో దుఃఖసముద్రమున మునిగియున్న నేను యుద్ధముఁ జేయుట సంభవింపదు. కావున దుఃఖమును పోగొట్టు నుపాయము నాకు చెప్పుమని యర్జునుడు కోరుచున్నాడు. ఓయి కృష్ణా! నా యింద్రియములను శుష్కింప జేయు నీదుఃఖసాగరమునుఁ దరింప నుపాయము గుర్తెరుగకున్నాను. యుద్ధమున జయమునొంది రాజ్యము నేలినను యీదుఃఖము పోవునని యూహింప నలవి కాకున్నది. నాకు నిష్కంటకమగు రాజ్యము సంప్రాప్తమయినను, ఇంద్రపదవి లభించినను యీ దుఃఖమును తరింపలేను. ౮

సంజయ ఉవాచ :

శ్లో. ఏవ ముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః
నయోత్స్య ఇతి గోవింద ముక్త్వా తూష్ణీం బభూవ హ ॥౯॥

అ. శత్రు సంతాపకుడగు నర్జునుడు కృష్ణునితో నిట్లు చెప్పి నేను యుద్ధమును జేయనని యూరకుండెను.

ఇందు హ అనునవ్యయము ఆశ్చర్యార్థకము. దీనిచే "అహింసా పరమో ధర్మః" అను శాస్త్రము వలన గురువులు మున్నగు బ్రాహ్మణోత్తముల వధించుట బ్రహ్మహత్యాపాతకమునకు హేతువనియు, క్షణికసుఖము నాసించి, యిట్టి ఘోరయుద్ధమాచరించుట మిక్కిలి యధర్మమేననియు సన్యాసివలె భిక్షాన్నమును భుజించి బ్రతుకుటయే ధర్మమనియును పార్థుని యాశయము స్పష్టమగుచున్నది. ౯

శ్లో. త మువాచ హృషీకేశః ప్రహస న్నివ భారత
సేనయో రుభయో ర్మధ్యే విషీద న్త మిదం వచః ॥౧౦॥

అ. ఓయి ధృతరాష్ట్ర! ఈ రెండుసేనలమధ్య దుఃఖించుచున్న నర్జుననిగూర్చి శ్రీకృష్ణపరమాత్మ నవ్వుచున్నవాడువలె ( పరిహసింపువాడువలె ) ముందుచెప్పబోవు వాక్యమును జెప్పెను. అనగా "అశోచ్యా నన్వశోచ స్త్వమ్" అనుశ్లోకము మొదలు "అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః" అను శ్లోకమువరకు నందు గీతాశాస్త్రమును జెప్పెనని భావము. ౧౦

ఇట్లు ద్వితీయాధ్యాయమందు ఉపోద్ఘాత ప్రకరణము ముగిసెను.

* అథ భాష్యార్థ ప్రకాశికానువాదము *

శ్లో. నత్వా లక్ష్మీహయగ్రీవౌ, వాసుదేవపృథాసుతౌ
వ్యాసార్య శంకరాచార్యౌ, భాష్యార్థం వివృణోమ్యహం ॥

అ. లక్ష్మీహయగ్రీవులను, శ్రీకృష్ణార్జునులను, వ్యాస శంకరులను నమస్కరించి భాష్యార్థమును వివరింపుచుంటి నని గ్రంథకారులు ప్రతిజ్ఞఁ జేయుచున్నారు.

భాష్యమ్ : శ్లో. నారాయణః పరోఽవ్యక్తా దణ్డమవ్యక్త సమ్భవమ్
అణ్డస్యాన్త స్త్విమే లోకాస్స ప్తద్వీపాచ మేదినీ ॥

అ. దీనియర్థము వేదాన్తశాస్త్రమునందు దృక్, దృశ్యము, అను రెండు పదార్థములు. వీనినే శ్రీ శంకరాచార్యులవారు, దృగ్దృశ్య వివేకమను గ్రన్థమునందు, దృక్పదార్థము బ్రహ్మమనియు, దృశ్యము మాయయనియును నిర్వచించిరి. ఈ రెండును పరస్పర విలక్షణములు. లోకమునందుగూడ ఘటమునకు, ఘటమునుఁ జూచువానికిని భేదము ప్రసిద్ధమైయున్నది. ఈ విషయమునే పై శ్లోకముచే వివరించుచున్నారు.

అవ్యాకృతము, ప్రకృతి, శక్తి, మాయ మున్నగు నామములుగల యీశ్వరోపాధియే అవ్యక్త మనబడును. దానికి విలక్షణుఁడు నారాయణుడు. 'న రీయతే' నశించువాడుకాడు కావున నరు డనబడును. అనగా బరమాత్మయని యర్థము. వాని సంబంధమయినది నారము. అనగా ప్రపంచము. దానిని (ఏతి జానాతీతి) తెలిసి

కొనుచున్నారు గాన నారాయణుడు అనగా దృగ్రూపుడనియు ప్రత్యగభిన్నమగుఁ
బరమాత్మయనియు నర్థము. ప్రత్యగాత్మకుసాక్షిత్వమును ద్వైతులుకూడ నంగీకరిం
చిరి. "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" అను శ్రుతియు ప్రత్యగాత్మకంటె వేరుద్రష్ట లేడని నిషే
ధింపుచుఁ బ్రత్యగాత్మ పరమాత్మల కభేదమును బోధింపుచున్నది.

జగత్తున దృగ్దృశ్యములు రెండే పదార్థములయి దృశ్యమంతయు నవ్య
క్తమగుచో స్పష్టముగా గన్పట్టు నీ ప్రపంచ మెందుఁ జేరుననగాఁ జెప్పుచున్నారు:
"అణ్డ మవ్యక్తా సంభవం" అని అవ్యక్తమువలన బుట్టిన నీప్రపంచము అవ్యక్తాసంభవ
మనబడుచున్నది. మృత్తువలన బుట్టిన ఘటము మృద్రూపమయినట్లు అవ్యక్తము
వలన బుట్టిన నీ బ్రహ్మాండము అవ్యక్తరూపమే యగును గాన నీ బ్రహ్మాండము
అవ్యక్తమునందే చేరును.

అవ్యక్తమువలన బ్రహ్మాండము పుట్టునని చెప్పినచో నచేతనమగు
ప్రధానము ప్రపంచమునకుఁ గారణమని చెప్పు సాంఖ్యులవాద మంగీకరించినట్లు
కదా ? కాదు. ఈశ్వరుడు, అదృష్టము - మున్నగు సహకారి కారణసామగ్రితోఁ
గూడిన యవ్యక్తముగాని, అవ్యక్తముతోఁగూడిన నీశ్వరుడుకాని ప్రపంచకారణమని
యద్వైత వాదము స్వాతంత్రమయిన నవ్యక్తము జగత్కారణమని సాంఖ్యుల
వాదము. కావున నిందు సాంఖ్యవాద ప్రసక్తి లేదు. ఇందు ఈ రహస్యమును గ్రహిం
పవలయును. దృశ్యమగు నీయవ్యక్తము దృక్పదార్థమువలె స్వతంత్రముకాదు. మరే
మనిన దృక్పదార్థమునందుఁ గల్పింపబడినది. అట్లుకానిచో నయ్యది నిత్యమగును.
అట్లే దృశ్యమునందు దృక్పదార్థమునకుఁగూడ ననిర్వచనీయమగు నధ్యాస కలదు.
ఇట్లు దృగ్దృశ్యములకుఁ బరస్పరాధ్యాసవలన దృశ్యము చేతనమును, దృక్పదార్థము
ప్రపంచ కారణమును అగుచున్నవి. లోకమునందుగూడ జీవ దేహములకుఁ బరస్ప
రాధ్యాసవలననే దేహమునకు చేతనత్వము, జీవునకు మనుష్యత్వాదికమును కలుగు
చున్నది. కనుకనే "యతో వా ఇమానిభూతాని జాయంతే" అను శ్రుతి బ్రహ్మకు
జగత్కారణత్వమునుఁ జెప్పుచున్నది మాయతోఁ గూడిన బ్రహ్మయే జగత్కారణ
మగుచున్నాడు, అయినను బ్రహ్మము ప్రపంచమున కుపాదాన కారణముగాదు.
చిద్రూపుడగు నిర్గుణ పరమాత్మ కుపాదాన కారణత్వము సంభవింపదు. పరమా
త్మకు నుపాధియగు మాయయే అసత్యమును, జడరూపమును, దుఃఖాత్మకమును
అగు ప్రపంచమున కుపాదాన కారణమగుచున్నది. కనుకనే కొందరు జగదాకార
ముగఁ బరిణమించిన మాయకు నధిష్ఠాన మగుటవలన బ్రహ్మము జగత్కారణ
మని యనుచున్నారు. కావున నీశ్వరుడు జగత్కారణమను పక్షమునగాని, బ్రహ్మము
జగత్కారణ మను పక్షమునగాని, మాయాంశయే జగత్తున కుపాదానమగు
చున్నందున "అణ్డమవ్యక్త సమ్భవమ్" అను మూలకార వచనము బొసగుచున్నది.

ఇచట నవ్యక్త శబ్దమున కీశ్వరాధిష్ఠితమగు బ్రకృతియే యర్థము కావున సాంఖ్య వాదాపత్తి యను దోషము లేదు.

ఓయి! బ్రహ్మాండము అవ్యక్తమువలన బుట్టినందున నవ్యక్త రూపముగుగాక. లోకముల స్థితియేమి ? యనగాఁ జెప్పుచున్నారు. "అండస్యాన్త స్త్విమే లోకాః" అని భూరాది సప్తలోకములును, జంబూ, ప్లక్ష, కుశ, క్రౌంచ, శాక, శాల్మలీ, పుష్కలములను నేడు ద్వీపములుగల భూమియును నీ బ్రహ్మాండమునందే కలవు. లోకములు, భూమియు, బ్రహ్మాండములోనివగుట వలన బ్రహ్మాండమువలె నీయవి కూడ నవ్యక్తములే యని భావము. దీనివలన నాకాశము మున్నగు నమూర్త పదార్థము, పృథివి మొదలగు మూర్త పదార్థము, యీ మూర్తామూర్తములకుఁ గారణమగు నవ్యక్తము యీమూడును దృశ్యములని స్పష్టమయినది.

ఇచట నీరహస్యము గ్రహింపవలయును. సచ్చిదానంద రూపుడు సర్వదృశ్య విలక్షణుడు, అద్వితీయుడు, నగుఁ బరమాత్మ యొక్కడే మాయ యుపాధిగా కల వాడయి నీశ్వరుడనియు, బ్రహ్మాండము ఉపాధిగా కలవాడయి హిరణ్యగర్భు డనియు, లోకము లుపాధిగా కలవాడగుచు విరాట్టనియు, జెప్పబడు చున్నాడు. అందు మాయ అనాది యగుటచే నీశ్వరున కుపాధిసంబంధమయిన పుట్టుకగూడ లేనందున నీశ్వరుడు అజుడని చెప్పబడుచున్నాడు. విరాట్ హిరణ్యగర్భు లిరువురు ఉపాధిప్రయుక్తమగు జన్మము కలవారగుట వలన నజులనికాని, యీశ్వరులనికాని చెప్పబడుదురు. వారు పుట్టుకగల జీవులనియే వ్యవహరింప బడుచున్నారు. వార లలో హిరణ్యగర్భుడు మొదటి జీవుడు. విరాట్పురుషుడు తరువాత జీవుడు. ఇట్టి జీవే శ్వర విభాగమునే "కార్యోపాధిరయం జీవః కారణోపాధి రీశ్వరః" అను శ్రుతికూడఁ జెప్పుచున్నది. కావున కార్యకారణోపాధి ద్వయరహితుడగు చిద్రూపుడే పరమాత్మ యని శ్లోకమునకుఁ బరమార్థము. దీనివలన బ్రహ్మభిన్నమగు ప్రపంచమంతయు మాయామయమగుటవలన మిథ్యయనియు, ఇట్లు మాయకూడ సత్తనికాని యసత్తని కాని నిర్వచింప సాధ్యముకానందునను, తత్వజ్ఞానముచే బాధ్యమగుటవలనను, మిథ్య యనియు, అద్వితీయమగు బ్రహ్మపదార్థము మాయామయము కానందున సత్య మనియు స్పష్టమగుచున్నందున నద్వైతము సిద్ధించుచున్నది. ఇట్టి యద్వైతమే గీతాశాస్త్రమున ప్రధానముగా ప్రతిపాదింప దగిన విషయము.

ఇట్లు తత్వమును వివరించి ప్రకృతవిషయమును చెప్పుటకు మాయావైభ వమును జెప్పుచున్నారు. "భగవాన్" అని. సంపూర్ణములగు ఐశ్వర్య, పరాక్రమ, కీర్తి, ధన, జ్ఞాన, వైరాగ్యము లారును భగశబ్దార్థములు. ఇవి కలవాడు భగవం తుడు. లేక, భూతములయొక్క చావుపుట్టుకలను, రాకపోకలను, జ్ఞానాజ్ఞానములను తెలుసుకొనినవాడు భగవంతుడు. భగములుకలవాడు కాన భగవంతుడు. (మరియు శ్రీవిష్ణ్వయము) వీనియందు జగములుకలవు కాన "వాసుః" అనబడును. లేక ప్రపం

చముననందుండువాడు కావున వాసు వనబడును. (దీవ్యతి) భూతములను బాలించుట మున్నగు క్రియలతో గ్రీడించువాడు కావున దేవు డనబడును. లేక, స్వయముగా ప్రకాశించువాడుగాన దేవు డనబడును. పరమాత్మ, వాసువు, దేవుడునుగాన వాసుదేవు డనబడుచున్నాడు. కావున పరమాత్మయే (నారాయణుడే) తన కుపాధియగు మాయచే భగవంతుడును, వాసుదేవుడును అగుచున్నాడని భావము. ఇట్టి భగవంతు డగు వాసుదేవుడు తన సంకల్పమాత్రమున ప్రపంచమును సృష్టించెను. దీనివలన ప్రధాన జగత్కారణవాదము, పరమాణు జగత్కారణవాదము మున్నగు వాదములు నిరాకరింపబడుచున్నవి. ఏలయన "త దైక్షత" అను శ్రుతివలన సంకల్ప పూర్వక ముగా సృష్టి జరిగెనని తెలియబడుచున్నది. లోకమునందు గూడ కుమ్మరి సంకల్ప పూర్వకముగనే ఘటశరావాది పదార్థములను నిర్మించుచున్నాడు. అచేతనములగు ప్రధాన పరమాణ్వాదులకు సంకల్పము సంభవింపదు. కనుక సంకల్ప పూర్వకసృష్టి ప్రధాన పరమాణు జగత్కారణ వాదములయందు పొసగనేరదు.

భగవంతుడు సంకల్ప పూర్వకముగ ప్రపంచమును సృష్టించి యద్దానిని పరిపాలింప గోరువాడయి, హిరణ్యగర్భుని రూపముద్వారా మరీచి మున్నగు ప్రజాపతులను మొదటసృష్టించి వారలకు వేదోక్తమగు ప్రవృత్తిధర్మమును దెలిపెను. పిదప సనకసనందనాదుల సృష్టించి వారికి నివృత్తిధర్మమును బోధించెను. ఇచట ప్రపంచమును పరిపాలింపగోరిన యీశ్వరుడు మరీచ్యాది ప్రజాపతులకు ప్రవృత్తి ధర్మమును, సనకాదులకు నివృత్తిధర్మమును బోధించుటలో కారణమేమి ? యని ప్రశ్న యుదయించుచున్నది. వేదోక్తములగు నా రెండు ధర్మములు ప్రపంచ రక్షణ మునకు గారణములు కాన భగవంతుడు ప్రపంచరక్షణమునకు సృష్టించిన నా యిరు వురకు నా రెండు ధర్మములను యథాక్రమముగ బోధించెనని సమాధానము.

ఇచట "ప్రాణినా" మిత్యాది వాక్యముచే ధర్మలక్షణమును చెప్పుచున్నారు. బ్రాహ్మణాది వర్ణములవారిచేతను, బ్రహ్మచారిమున్నగు ఆశ్రములచేతను అను ష్ఠింపబడుచు, స్వర్గమోక్షములకు సాధనమయినది ధర్మ మనంబడును. ఆది పదము వలన క్షత్రియ, వైశ్య, శూద్రులు గూడ గ్రహింపబడుదురు. వర్ణముగలవారు వర్ణులు. అనగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు. ఆశ్రమముగలవారు ఆశ్రములు. అనగా బ్రహ్మచారి, గృహస్థ, వానప్రస్థ, సన్యాసులు. కావున బ్రహ్మచారి మున్నగు వారిచే ననుష్ఠింపబడుచు స్వర్గమోక్షములలో నేదియో యొక దానికి గారణమయినది ధర్మమని ముఖ్యలక్షణము. ఒకే ధర్మము స్వర్గ మోక్షముల రెంటికి గారణము కానేరదు. అందువల్ల ధర్మలక్షణమందు (యేదియో యొక దానికి) అని తప్పక జేర్పవలయును. స్వర్గమోక్షములకు గారణమయినది ధర్మ మన్నచో ఈశ్వరుడు గూడ స్వర్గమోక్షములకు కారణమగుచున్నందున ధర్మలక్ష ణము ఈశ్వరుని యందతివ్యాప్తమగును. అందువలన బ్రహ్మచారి మొదలగువారిచే

ననుష్ఠింపబడునది; అని ధర్మలక్షణమును జేర్పవలయును. అట్లు చేర్చినచో సంధ్యావందనము బ్రాహ్మణాదివర్ణములవారిచే ననుష్ఠింపబడునది కాదు గాన ధర్మలక్షణావ్యాప్తిదోషము సంభవించును. ఇక బ్రాహ్మణాది వర్ణములవారిచే ననుష్ఠింపబడునది ధర్మము, అని మాత్రము ధర్మమునకు లక్షణమును చెప్పినచో బ్రాహ్మణాది వర్ణములవారిచే నధర్మముకూడ ననుష్ఠింప బడుచున్నందున ధర్మలక్షణము అధర్మమునందతివ్యాప్తమగును. కావున స్వర్గమోక్షములలో నేదియో నొకదానికి కారణమగునది అనికూడ చెప్పవలయును, అట్లు చెప్పినచో అధర్మము స్వర్గమునకుగాని, మోక్షమునకుగాని కారణము కానందున ధర్మలక్షణము అధర్మమునందు సంక్రమింపదు (అతివ్యాప్తముకాదు). ధర్మనిష్ఠా శబ్దముచేఁ జెప్పబడు ప్రవృత్తిధర్మము స్వర్గాదిరూపమగు అభ్యుదయమునకుగాని, చిత్తశుద్ధి రూపమగు అభ్యుదయమునకుగాని కారణమగును. జ్ఞాననిష్ఠా శబ్దముచేఁ జెప్పబోవు నివృత్తి ధర్మము మోక్షమునకు కారణమగును అని తెలియవలయును. ఈ రెండు తెఱంగులగు ధర్మము ననుష్ఠించు బ్రాహ్మణాది వర్ణములవారికి క్రమక్రమముగా కామోద్రేకత పెరిగి, యందువలన విజ్ఞానసంపద నశించి, దాన నధర్మ మభివృద్ధిఁజెంది, యద్దానివలన ధర్మము తిరస్కృతముకాగా ప్రపంచపరిపాలనమును గోరు ఆదికర్తయగు శ్రీమన్నారాయణమూర్తి భూలోకమునందలి వేదమును, బ్రాహ్మణధర్మమును రక్షించుటకొరకు దేవకీదేవియందు వసుదేవునివలన నంశచే బుట్టెను.

( హీయమానేతి=హీయమాన విజ్ఞానహేతుకే నాధర్మేణ ) నశించుచున్న విజ్ఞానమే కారణముగా కలదికావున అధర్మము హీయమాన విజ్ఞానహేతుక మన బడును. "శేషాద్విభాషా" అను సూత్రమువలన కప్రత్యయము. అధర్మమునకు విజ్ఞాన నాశమేకారణమని అర్థము. లేక హేతుశబ్దమునకే హేతుకమని స్వార్థమునందు కప్రత్యయము. నశించుచున్న విజ్ఞాన మను కారణమున అనగా విజ్ఞాననాశమను కారణము వలన అనిభావము. (పరిపిపాలయిషుః ఆదికర్తా) పరిపాలింపగోరు ఆదికర్త యనగా ప్రపంచమున కుపాదానకారణమును, నిమిత్తకారణమును అగువాడు అని యర్థము. లేక ఆదికర్త యనగా ప్రధానకర్తయని యర్థము. అప్రధానకర్త యగు హిరణ్యగర్భుడు వేరుగా నుండుట వలన నిట్లుచెప్పెను. ఈ యభిన్ననిమిత్తోపాదాన కారణ వాదముచే అనగా బ్రహ్మయొక్కఁడే ప్రపంచమునకు ఉపాదానకారణమును నిమిత్త కారణమును అను వాదముచే ప్రధానకారణవాదులగు సాంఖ్యులు, ఈశ్వరుడు నిమిత్తకారణమని చెప్పెడు తార్కికులు నిరాకరింపబడుచున్నారు.

ఒకేకారణపదార్థము నిమిత్తకారణమును ఉపాదానకారణమును ఉభయము నెట్లగునని ప్రశ్నింపరాదు. అఘటనఘటనాపటీయమగు మాయ (ఘటింపని వస్తువులను ఘటింపజేయు సామర్థ్యముగల మాయ) వలన సర్వము సంభవించును.

"యతోవా ఇమాని భూతాని జాయంతే" "తత్ సృష్ట్వా। తదేవానుప్రావిశత్" ఈ మొదలగు శ్రుతులు పరమేశ్వరుడొక్కడే ప్రపంచమున కభిన్ననిమిత్తోపాదాన కారణమని చెప్పుచున్నవి. ప్రబలప్రమాణమగు శ్రుతిచేఁ జెప్పబడిన యర్థమును దుర్బల ప్రమాణమగు యుక్తి బాధింపనేరదు.

లోకమునందుగూడ సాలెపురుగు తానల్లు దారమునకుఁ దానొక్కటియే యుపాదానకారణమును, నిమిత్తకారణమును అగుటఁ జూచుచుంటిమి. కావున పరమేశ్వరుడొక్కడే మాయచే ప్రపంచమునకుపాదానకారణమును, నిమిత్తకారణమును నగుచున్నాడు. విష్ణువన వ్యాపకుడగు పరమాత్మ. అనగా సత్వగుణ ప్రధానమగు మాయతోఁగూడిన చైతన్యమని యర్థము.

అట్టి విష్ణువు భూలోకమందున్న వేదమును, బ్రాహ్మణత్వమును రక్షించుట కొరకు దేవకియందు వసుదేవునివలన అంశచే జన్మించెనట.

ఇచట అంశయనగా మాయయని యర్థము. కావున మాయచే జన్మించెనని గ్రహింపవలయును. లేనిచో నిరవయవుడగు పరమాత్మకు అవయవభేదము సంభవింపదు. కావున అంశయనుపదమునకు అవయవమని యర్థమును చెప్పదగదు. ఇచట కిల అను పదమునకు అబద్ధము అనిగాని వాడుక అని కాని యర్థమును చెప్పవలయును. ఎటులయినను కృష్ణావతారము మిథ్యాభూతమని ఫలితార్థము.

ఇచట "యదా యదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత"
అభ్యుత్థాన మ ధర్మస్య తదా త్మానం సృజామ్యహం."

అను గీతా వచనమును అనుసంధానము చేసికొనవలెను. ఇయ్యది ప్రపంచమున ధర్మము నశించినప్పుడును, అధర్మ మభివృద్ధి జెందినపుడును, భగవంతు డవతరించునని చెప్పుచున్నది. కావున నశించిన ధర్మమే భగవంతునిచే రక్షింపదగియున్నది. అట్టితరి ధర్మమును రక్షించుటకొరకు భగవంతు డవతరించెనని భాష్యకారులు చెప్పుట యుచితము. ఏల బ్రాహ్మణత్వమును రక్షించుకొరకు భగవంతు డవతరించెనని చెప్పిరి? అను ప్రశ్న యుదయించును.

వర్ణాశ్రమ ధర్మములన్నియు బ్రాహ్మణ ధర్మముమీద నాధారపడి యున్నందున నట్టి బ్రాహ్మణధర్మమును రక్షించినచో వైదికధర్మమంతయు రక్షింపబడిన దగును. అందువలన భాష్యకారులు బ్రాహ్మణత్వమును రక్షించుటకొరకు భగవంతు డవతరించెనని చెప్పియుండిరి.

బ్రాహ్మణధర్మమును రక్షించుట యన బ్రాహ్మణులు బ్రాహ్మణధర్మములను విడచి, బ్రాహ్మణేతర ధర్మములను స్వీకరించుట మున్నగు నుపద్రవములనుండి కాపాడుట. అట్లు వారు స్వధర్మమున నిలచినచేగాని, వర్ణాశ్రమ ధర్మములు ప్రపంచమున

నిలువ నేరవు. ఏవర్ణస్థునిచే నేయాశ్రమస్థునిచే నేయేకర్మ యెట్లాచరింపవలెనో స్వధర్మనిష్ఠుడును, విద్వాంసుడును అగు బ్రాహ్మణుడు వారివారిచే నట్లాచరింప జేయును. అందువలన నిఖిల వైదిక ధర్మరక్షణమునకు బ్రాహ్మణ ధర్మరక్షణ మావశ్యకమని యాశయము.

ఓయి! పుట్టుకలేని భగవంతుడు ధర్మసంస్థాపన రూపమగు లోకానుగ్రహము కొరకయినను యేల జనించె ననగా జెప్పుచున్నారు, "సచ భగవాన్" ఇత్యాది గ్రంథముచే భగవంతుడు జ్ఞానైశ్వర్య శక్తి బల వీర్య తేజస్సులతో నెల్లపుడు నిండినవాడని భాష్యకారులు నిర్వచించిరి. వసిష్ఠుడు మున్నగు వారికిగూడ జ్ఞానబలాదిశక్తులుకలవు. కాని వారల కయ్యవి యీశ్వరానుగ్రహాయత్తములు. ఈశ్వరునకు మాత్రము స్వతస్సిద్ధములు. ఇందుకు "పరాస్యశక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియాచ" యను శ్రుతి ప్రమాణమగుచున్నది. ఈశ్వరునకు భగశబ్ద వాచ్యములగు నీయారు శక్తులును ప్రకృతియగు మాయను స్వాధీన పరచుకొని యున్నందున సహజములగుచున్నవి. జీవులు ప్రకృతి పరతన్త్రులు. కనుకనే "మాయినం తు మహేశ్వరం" అను శ్రుతి యీశ్వరుడు మాయ కలవాడని చెప్పుచున్నది. లోకములోని వస్తుజాలమంతయు సత్వ రజ స్తమోగుణముల నాశ్రయించినదే కాని వేరుకాదు. అందువలన సత్వ రజ స్తమోగుణాత్మకమగు నా ప్రకృతి సర్వవ్యాపకుడగు పరమేశ్వరునకుపాధి యగుచున్నది.

ఇందువలన సత్వాదిగుణము లుపాధిగాగల విష్ణు బ్రహ్మ రుద్రులకు పరస్పరము భేదము లేదని తేలుచున్నది. ఈ మూడుగుణములు మాయారూపము లయినందున యిందేగుణము ఉపాధిగా గలవాడయినను, మాయ యుపాధిగా గలవాడే యగుచున్నాడు. కావున మాయోపాధికులగు నీముువ్వురకు భేదములేదు. ఈశ్వరుడు ప్రకృతి పరతంత్రుడు కానందున వానికి కర్మసంబంధ ప్రయుక్త జన్మములేదు. జన్మ లేనందున నాశనమును లేదు.

శ్లో. జాయతే మరణాద్యైవ మ్రియతే జన్మనే పునః
జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మమృతస్యచ॥

పుట్టినవాడు మరణించుచున్నాడు. మరణించినవాడు పుట్టుచున్నాడు. పుట్టినవానికి మరణము, మరణించినవానికి పుట్టుక నీరెండును నియతములనిచెప్పు పైస్మృతి వాక్యములవలన జన్మ మరణములలో నొకటియున్నతావున మరియొకటి తప్పక యుండు నని స్పష్టమగుచున్నది.

ఈశ్వరుడు డన నియమించు స్వభావము కలవాడు; ఆతడు సత్యస్వరూపుడు, ఉపాధి సంబంధము లేనందున పరిశుద్ధుడు, జ్ఞానరూపుడును నగుచున్నాడు. ఇందుకు

"నిత్యోనిత్యానాం" "తత్సత్యం స ఆత్మా" "సచ్చిదానన్దమ్ బ్రహ్మ" అను శ్రుతులు ప్రమాణము లగుచున్నవి. నిత్యుడనగా సత్యస్వరూపుడని యర్థము. ఈశ్వరుడు పరిశుద్ధుడయినందున నిత్యుడగుచున్నాడు. ఉపాధిసంబంధమున మలినుడగు జీవుడు ఉపాధివశమున ననిత్యుడగుచున్నాడు. ఈశ్వరుని యొక్క నిజరూపము జ్ఞానము. కావున బుద్ధుడనగా జ్ఞానస్వరూపుడని యర్థము. తెలుసుకొనువానియొక్క స్వరూపము తెలివి. తెలిసికొనుట యనునది ఈశ్వరునకు "య స్సర్వజ్ఞస్సర్వవిత్" అను శ్రుతి వలన సిద్ధమగుచున్నది. సర్వజ్ఞత్వమనగా సర్వవస్తువులను ప్రకాశింపజేయుట. అయ్యది మాయయొక్క ధర్మముకానేరదు. మాయ స్వతః జడమయి తానే యీశ్వరునిచే భాసింపజేయదగియుండ నట్టి మాయకు నితరపదార్థములను ప్రకాశింపజేయుట సంభవింపదు. కనుకనే ఈశ్వరుడెల్లపుడు ముక్తుడుకాని జీవునివలె బద్ధుడు కానేరడు. అజ్ఞానముచే తిరస్కరింపబడినవానికే బంధము. ఈశ్వరుడు అజ్ఞానమును వశపరచుకొనినవాడుగాని యజ్ఞానాభిభూతుడుగాడు.

పరమేశ్వరుడు నిజముగా. శరీరముగలవాడుకాని, పుట్టుకకలవాడుకాని, లోకోపకారముచేయువాడుగాని గాడు. మాయవలన నీమూడును గలవానువలె భాసించును. నిష్కాముడగు పరమేశ్వరునకు యదార్థముగా లోకానుగ్రహవాంఛ కూడ కలుగదు. (లేక) పరమార్థముగా పరమాత్మను కోరికలేకున్నను వ్యవహార దశవలన నీశ్వరునకు లోకానుగ్రహేచ్ఛ సంభవింపవచ్చును. కాని జన్మదేహములు మాత్రము వ్యవహారమువలన గూడ పరమేశ్వరునకు సంభవింపవు. కావుననే భాష్యకారులు ఇవకారమును "కుర్వన్" అను పదముతో నన్వయింపలేదు.

ఈశ్వరుడు వ్యవహారదశయందుగూడ కారణోపాధిగలవాడు కావున నాతనికి కార్యోపాధియగు జీవునకువలె జన్మ శరీరములు సంభవింపవు. మూఢులు మాత్రము ఈశ్వరుడు పుట్టుక కలవాడనియు, దేహముకలవాడనియు భావించెదరు. వివేకులు ఈశ్వరుని బుట్టినవానినిగా దెలుసుకొనరు. తనకు ఫలములేకున్నను భూతకోటి ననుగ్రహింపగోరికచే భగవంతు డర్జునుని కొరకు వేదోక్తమగు ధర్మద్వయము నుపదేశించెనని భావము.

పూర్ణకాముడగు భగవన్తుడు శిష్యుడగు అర్జునునకు ధర్మమునుపదేశించుటలో భూతానుగ్రహవాంఛయే కారణము.

[illegible]

వృద్ధిజెందునని భగవంతుని యాశయము. అనగా అర్జునుడు నావలన ధర్మమును తెలి
సికొని యనుష్ఠించినచో "యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః" (పెద్దలు దేని
నాచరింతురో పిన్నలుకూడ దానినే యాచరింతురు) అను న్యాయమున నితరులుగూడ
దాని ననుష్ఠింతురు. వారిని జూచి మరికొందర ననుష్ఠింతురు. క్రమముగ నిట్లు నేను
జెప్పిన ధర్మమార్గము అభివృద్ధిజెందునని భగవంతుడు అర్జునిని కొరకు ధర్మద్వయము
నుపదేశించెనని భావము ఇందువలన వివేకియగు గురువు యోగ్యుడగు శిష్యుని
కొరకు ధర్మమును బోధింపవలెనని సూచింపబడుచున్నది. ఇట్లుగాక కృతకృత్యుడగు
గురువు లోకానుగ్రహఫలమును తానపేక్షింపనిచో క్రమక్రమముగ ధర్మాచరణ
సంప్రదాయము నశించునని భావము.

"యథోపదిష్టం" ఉపదిష్టమనగా ఉపదేశము. ధాత్వర్థమాత్రమున క్తప్రత్య
యము. ఉపదేశము నతిక్రమింపక యని భావము. లేక ప్రవృత్తి నివృత్తిరూపమగు
ధర్మద్వయమును, భగవంతుడగు శ్రీకృష్ణు డెట్లుపదేశించెనో సర్వజ్ఞులగు వేదవ్యా
సులుగూడ నేడునూరుల శ్లోకములచే నాధర్మద్వయము నట్లే కూర్చిరనియు గ్రహింప
నగు. సంగ్రహాత్మకమగు నీగీతాశాస్త్ర మెల్లరకు సులభముగా దెలియనందున,
వృత్తికారులు మున్నగు ననేకమంది విద్వాంసులు పద పదార్థ వాక్య వాక్యార్థ న్యాయ
ములచే నిద్దాని వివరించినను లౌకికులు విరుద్ధముగా గ్రహించినందున శ్రీశంకరులు
భాష్యగ్రంథముచే సుస్పష్టముగా వివరింపదలచి ప్రతిజ్ఞ యొనర్చిరి. శంకరుల భాష్య
రచనా ప్రవృత్తి లోకానుగ్రహార్థమగుటచే నద్దాని ఫలం బాతనికి లేమింజేసి పరస్మై
పదమును ప్రయోగించెను. అట్లుగాక నాత్మనేపదం బుపయోగించినచో భాష్య
రచనా ప్రవృత్తిఫలంబగు సుకృతంబున దానుంగూడ బద్ధుండగు నని భావము.

సంసారోపరతి రూపమగు మోక్షసుఖము గీతాశాస్త్రమునకు పరమ ప్రయో
జనము. కర్మజ్ఞానాదు లవాంతరఫలములు. అట్టిపరమఫలము సర్వకర్మ సన్న్యాసరూప
మగు జ్ఞాననిష్ఠవలన కలుగును. "సహిధర్మ స్సుపర్యాప్తః బ్రహ్మణః పదవేదనే"
అను ప్రమాణము ఆత్మజ్ఞాన నిష్ఠారూపమగు నివృత్తిధర్మము పరమాత్మసాక్షా
త్కారమునకు నుత్తమ సాధనమని జెప్పుచున్నది. "హిశబ్దము" ఇందలి శాస్త్రప్రసిద్ధిని
పండిత ప్రవాద ప్రసిద్ధిని సూచించుచున్నది.

ఓయీ! "చోదనాలక్షణోఽర్థో ధర్మః" అను జైమిని సూత్రమువలన
కర్మానుష్ఠాన ప్రవృత్తి ధర్మరూపమగునను అనుష్ఠానరూపముగాని నివృత్తిధర్మ
[illegible] ? అని [illegible]
[illegible]
[illegible]
[illegible]

గాని, యధార్మికుడనిగాని, సుకృతియనిగాని, దుష్కృతియనిగాని యనబడడు. అను నీ ప్రమాణమువలన నివృత్తిమార్గమునకు ధర్మత్వము గౌణముగాని ముఖ్యము గాదని గ్రహింపనగును. నివృత్తినిష్ఠ ధర్మరూపము గాకున్నను, అయ్యది జ్ఞానరూప మని యంగీకరింపక దప్పదు. "జ్ఞానం సన్న్యాస లక్షణం" అను ప్రమాణము సర్వకర్మ సన్న్యాసరూపమగు నివృత్తియే ఆత్మజ్ఞాననిష్ఠ యని నిర్వచించుచున్నది. గీతాశాస్త్ర మునగూడ "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" అను ప్రమాణము ప్రవృత్తిరూపమగు సర్వధర్మములను విడచి, ప్రత్యగభిన్నబ్రహ్మమును శరణమునొం దుమని నుడువుచు నివృత్తిధర్మమే జ్ఞాననిష్ఠ యనియు, నయ్యది యవశ్య కర్తవ్య మనియు నుపదేశించుచున్నది. ఇచట సర్వధర్మపదము ప్రవృత్తి ధర్మపరముగాని నివృత్తి ధర్మపరముగాదు. ఏలయన ప్రవృత్తిధర్మమే యనుష్ఠించుటకుగాని, త్యజించు టకుగాని వీలగును. నివృత్తిధర్మమునకు పరిత్యాగము సంభవింపదు. కనుక ఆత్మ జ్ఞాననిష్ఠయే నివృత్తిధర్మము. భాష్యకారులు మోక్షసాధనమగు నివృత్తిధర్మము నుపదేశించి ప్రవృత్తిధర్మమును ప్రతిపాదించుచున్నారు.

విధివాక్యములవలన సిద్ధమగుచు స్వర్గాదిసుఖములకు సాధనమగు జ్యోతిష్టో మాదికము ధర్మమనంబడు. అయ్యది నిత్యము, నైమిత్తికము, కామ్యము, ప్రాయశ్చి త్తము అను భేదముచే నాల్గు తెఱంగులు. ఇయ్యది వర్ణాశ్రమాద్యభిమానుల నుద్దే శించివిధింపబడి ఇన్ద్రాదిపదవుల నొందుటకుఁ గారణమయినను, ఈశ్వరార్పణ బుద్ధిచే ననుష్ఠింపబడుచు చిత్తశుద్ధి వైరాగ్యములకు హేతువగును. ఫలాభిసంధి రహితమగు నిష్కామధర్మము శుద్ధచిత్తునకు జ్ఞాననిష్ఠయం దర్హతను కలుగజేయుచు జ్ఞానో త్పత్తికి గారణమగుటచే మోక్షహేతువుగూడ నగుచున్నది. "యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాఽత్మ శుద్ధయే" అను గీతావాక్య మిందుకు ప్రమాణమగు చున్నది. ఆత్మశుద్ధియన చిత్తశుద్ధియని యర్థము

శాస్త్రమునకు విషయము, సంబంధము, అధికారి, ప్రయోజనము అను యనుబంధ చతుష్టయ మావశ్యకము. అందు మోక్షశాస్త్రమున ముముక్షు వధికారియని స్పష్టమగుటచే మిగిలిన మూడింటిని జెప్పుచున్నారు. గీతాశాస్త్రము నకు ప్రయోజనము మోక్షము. ప్రవృత్తి నివృత్తిధర్మములు రెండు, వాసుదేవ తత్త్వము యీమూడును విషయములు. వ్యంగ్యవ్యంజక భావము (తెలియుట తెలియ పరచుట) సంబంధము. అధికారి ముముక్షువని యింతకుమున్నె సూచింపబడినది. ఇట్లు సర్వోత్కృష్టమగు ననుబంధ చతుష్టయముతో నొప్పు గీతాశాస్త్రమునఁ బ్రతిపాదింపబడు ప్రవృత్తి, నివృత్తి ధర్మద్వయమును, వాసుదేవతత్త్వమును తెలిసి కొనినచో సకల పురుషార్థములు సిద్ధించును. కావున భాష్యకారులు గీతాశాస్త్రార్థ మును వివరించుటకు ప్రయత్నించుచున్నారు.

గీతాశాస్త్రమునందు "దృష్ట్వాతు పాండవానీకమ్" అను శ్లోకము మొదలు "నయోత్స్య ఇతి గోవిన్దముక్త్వా" అను వరకునుండు గ్రంథము ప్రాణులయొక్క సంసార బంధమునకు హేతువగు శోకమోహాదులు కలుగుటకు గారణములను జూపుచున్నది. భీష్మ ద్రోణాదుల నేనెట్లు జంపుదు ననుటచే దనకుగల శోకమోహము లర్జునునిచే బ్రకటింపబడినది. నేను వీరివాడను, వీరు నావారు అనుజ్ఞానము స్నేహమునకు గారణము. అట్టి స్నేహము చెడిపోవుట శోకమోహములకు గారణము. తనవికాని వాటి యందు తనవి యను భ్రాంతియు ఇతరులవాడుకాని తనయందు తా నితరులవాడ నను భ్రాంతియు, నీ రెండును పుత్రమిత్రాదులయందు స్నేహమును బుట్టించి, యవి నశించుటచే శోకమోహములను కలుగజేయుచున్నది. ఈ రెండుభ్రాంతులే ప్రపంచమున సర్వప్రాణులను శోక మోహములను బుట్టించి సంసారబద్ధుల గావించుచున్నవి. అర్జునుడుగూడ నిట్టి శోకమోహములచే వివేకజ్ఞానమును బోగొట్టుకొని స్వయముగ క్షత్రధర్మమగు యుద్ధమునందు బ్రవర్తించినవాడయ్యును యుద్ధము నుండి విరమించెను. బ్రాహ్మణధర్మమగు భిక్షాటనము మొదలగు వానిచే జీవింప నెంచెను. కావున సర్వప్రాణులు స్వధర్మమును బరిత్యజించుటకు, నిషిద్ధములగు బరధర్మముల నాచరించుటకు, నీ శోకమోహములే కారణములని గ్రహింపవలయును. స్వధర్మమునందు బ్రవర్తించినను, అట్టివారల శరీరవాఙ్మనశ్చేష్టలు ఫలాభిసంధితోను, అహంకారముతోను గూడియుండును. అది యట్లుండ పుణ్యకర్మానుష్ఠానమున దేవతలుగ బుట్టి సుఖము ననుభవించుట, పాపకర్మముల నాచరించి పశుపక్ష్యాదులయందు బుట్టి దుఃఖముల ననుభవించుట, పుణ్యపాపముల నాచరించి మానవులయి బుట్టి సుఖదుఃఖముల నొందుట, ఇట్లు కర్మసమృద్ధిచే సంసారబంధ మెన్నటికిని పెరుగుచుండును గాని సమసింపనేరదు. సంసారబీజములగు శోకమోహములు సర్వకర్మ సన్న్యాసపూర్వకమగు నాత్మజ్ఞానమువలననే నివర్తించునుగాని, యన్యమున నశింపనేరవు. కావున నట్టి యాత్మజ్ఞానము నుపదేశింపగోరి శ్రీకృష్ణపరమాత్మ సర్వప్రాణుల ననుగ్రహింపనెంచి యర్జునిని యాధారముగా జేసికొని "అశోచ్యా నన్వశోచ స్త్వమ్" అనుశ్లోకము మొదలుగాగల గీతాశాస్త్రము నుపదేశించుచున్నాడు.

ఇచట గొందరు కర్మజ్ఞానసముచ్చయవాదులు సర్వకర్మ సన్న్యాసపూర్వకమగు కేవలాత్మ జ్ఞాననిష్ఠవలన మోక్షము సంభవింపదనియు, అయ్యది యగ్నిహోత్రాది శ్రౌతస్మార్తకర్మ సముచ్చిత జ్ఞానమువలననే లభించుననియు, గీతలయందంతట నిట్లే నిర్ణయింపబడినదనియును జెప్పుచు నిందుల కాధారముగ "అథ చేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం నకరిష్యసి। తత స్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాపమవాప్స్యసి" "కర్మణ్యే వాధికార స్తే" "కురు కర్మైవ తస్మాత్త్వమ్" ఈ మొదలగు ప్రమాణములను జూపుచున్నారు.

మరియు క్షత్రజాతి విహితమగు యుద్ధము భ్రాతృపుత్రాది హింసారూపము సంభవ సత్వమతి క్రూరమయినను స్వధర్మమగుటచే నధర్మము కానేరదని, యుద్ధాని నాచరింపకున్నచో పాపమును పొందుదువని కృష్ణు డుపదేశించుటచే, ప్రతి విహిత లగు పరహింసారూపకర్మ లన్నియు ధర్మరూపములని శ్రీకృష్ణునిచే నిర్ణయింపబడి నట్లును చెప్పుచున్నారు. "యథాన్నం మధు సంయుక్తం మధు చాన్నేన సంయుతం। ఏవం తపశ్చ విద్యాచ సంయుక్తం భేషజం మహత్॥" అను హారీతస్మృతి యందు జెప్పినట్లు, తపోవిద్యలు రెండును కలసియుండిననే ఫలసాధకములగునని వీరి యాశయము. కర్మసముచ్చిత జ్ఞానము మోక్షసాధన మను వాదము పొసగదు. కర్మ జ్ఞానములకు పరస్పర భేదమును గీతాగ్రంథము నిరూపించియున్నది. సాంఖ్యబుద్ధి విషయక మగు నిష్ఠ జ్ఞాననిష్ఠయనియు, యోగబుద్ధి విషయకమగు నిష్ఠ కర్మనిష్ఠయనియు గీతా నిర్వచనము. గీతయందలి ద్వితీయాధ్యాయమున "అశోచ్యా నన్వశోచ స్త్వమ్" అను పదునొకండవ శ్లోకము మొదలు "దేహీ నిత్య మవధ్యోఽయం" అను ముప్పదవ శ్లోకాంతమునరకు నుండు నిరువది శ్లోకములచే జ్ఞాననిష్ఠ కాధారమగు సాంఖ్యబుద్ధి నిరూపింపబడినది. (సమ్యక్ ఖ్యాయతే ప్రకాశ్యతే తత్త్వ మనయా) అను వ్యుత్పత్తిచే నాత్మతత్త్వమును ప్రకాశింప జేయునది సాంఖ్య మని యర్థము. అనగా వైదికమగు సమ్యగ్బుద్ధియని భావము. ఇట్టి బుద్ధిచే ప్రకాశింపబడు నాత్మతత్త్వము సాంఖ్యమగును. ఇట్టి యాత్మవిషయమగు బుద్ధిగూడ నౌపచారికముగ సాంఖ్యమనబడుచున్నది. సంఖ్యాబుద్ధి యన నంతఃకరణమనియు, సాంఖ్యబుద్ధియన నంతఃకరణ వృత్తియనియు భేద మంగీకరింపవలెను. ఇట్టి భేద నిర్వచనమున కాచార్యస్వాములవారి భాష్యమునందలి "జాయతే" అనుపదము సూచక మగుచున్నది. అంతఃకరణ వృత్తియే ప్రకరణార్థ నిరూపణమున బుట్టునుగాని, పంచ భూతముల సత్త్వాంశ సమష్టి రూపమగు బుద్ధి (అంతఃకరణము) యింతకుమున్నే పుట్టియున్నందున నిపుడు నూతనముగా బుట్టనేరదు. ఆత్మ జన్మాది షడ్భావ వికార రహితము, కర్తృత్వ భోక్తృత్వశూన్యము, అనుజ్ఞానము సాంఖ్యబుద్ధి. ఇట్టిబుద్ధిని యాధారముగాగొన్న నిష్ఠ జ్ఞాననిష్ఠ. దీనియందు దాటితేజేనవారు సాంఖ్యులు. జ్ఞాన నిష్ఠ యబ్బకపూర్వము, శరీరాదులకంటె నాత్మభిన్నుడనియు, కర్తృత్వ భోక్తృత్వా దులు కలవాడనియు జ్ఞానముండి ధర్మాధర్మ వివేక పూర్వకముగ జ్ఞానసాధనము లగు నిష్కామకర్మల ననుష్ఠించుట యోగమనబడును. తద్విషయకబుద్ధి యోగ బుద్ధి. ఇయ్యది యెవరికి ధృఢమగునో వారు యోగు లనబడుదురు. ఈ రెండుబుద్ధులు భిన్నమని "ఏషా తేభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగేత్విమాం శృణు" అను గీతాస్మృతి ఋజువు చేయుచున్నది. కర్మమార్గము అనేకత్వ కర్తృత్వాది బుద్ధుల నాశ్రయించి యుండును. జ్ఞానయోగము ఏకత్వ, అకర్తృత్వాది బుద్ధుల నాశ్రయించి యుండును. ఈ రెంటికి నేక పురుషాశ్రయత్వము సంభవింపదు. కనుకనే భగవంతుడగు శ్రీకృష్ణుడు సాంఖ్యబుద్ధిని యాశ్రయించి సాంఖ్యులకు జ్ఞాననిష్ఠయు, యోగబుద్ధిని

యాశ్రయించి యోగులకు కర్మనిష్ఠయు నిరూపించెను. "ఏతమేవ లోక మిచ్ఛంతః ప్రవ్రాజినః ప్రవ్రజంతి" అను బ్రాహ్మణముకూడ ఆత్మలోకమునుగోరియే సన్న్యాసులు సన్న్యసించుచున్నారనిచెప్పి "కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయ మాత్మాఽయం లోకః" ఏమాకు ఆత్మలోకముకంటె భిన్నలోకములేదో అట్టి మేము సంతానార్థమగు గృహస్థాశ్రమముతో నేమిచేయుదుము? అని శిష్టగ్రంథముచే జెప్పుచు ఆత్మకాములకు సన్న్యాసమనియు, సన్తానకాములకు గృహస్థాశ్రమస్వీకారద్వారా కర్మానుష్ఠాన మనియును జ్ఞానకర్మలను వేరుపరచియున్నది.

మరియు "సోఽకామయత జాయా మే స్యాత్" అను శ్రుతి గృహస్థాశ్రమస్వీకారమునకు పూర్వము తత్త్వజ్ఞానము లేని బ్రహ్మచారి గురువునొద్ద వేదవేదాంగములం జదివి, తదర్థవిచారణను జేసి, యటుపిమ్మట యవిద్యా కామముల వలన మానుషలోక ప్రాప్తిసాధన మగు పుత్రసంపదను, పితృలోకప్రాప్తి హేతువగు కర్మరూపమయిన మానుషవిత్తమును, దేవలోకప్రాప్తి హేతువగు విద్యారూపమయిన దైవవిత్తమును కోరెనని చెప్పుచున్నది. "తేభ్యో వ్యుత్థాయ ప్రవ్రజంతి" అను శ్రుతి కళత్ర పుత్ర విత్తాదుల నుండి విరక్తి జెందినవారు సన్న్యసించెదరని నుడువుచు నవిద్యా కామములు లేనివానికి నాత్మలోకమును విధించినది. కావున కర్మ జ్ఞానములకు సముచ్చయమే శ్రుతి సమ్మతమయినచో నిట్లు కర్మలయందు సకాము డధికారి యనియు, జ్ఞానమునందు నిష్కాముడధికారి యనియు విభాగమును జెప్పుట పొసగ నేరదు. కావున సముచ్చయ వాదము శ్రుతి సమ్మతము కానేరదు.

కర్మ జ్ఞాన సముచ్చయము శ్రీకృష్ణున కిష్టమయినచో తృతీయాధ్యాయమున "జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధి ర్జనార్దన" అను శ్లోకముచే జ్ఞానము యొక్క గొప్పతనమును గురించి యర్జునుడు ప్రశ్నించుట పొసగనేరదు. కర్మజ్ఞానములు రెండు కలసి మోక్షమును సాధించుచుండ నందు కర్మకంటె జ్ఞానము యొక్క గొప్పదన మేమి? కర్మజ్ఞానములు రెండును ఏకాధికారిచే నేక కాలమున ననుష్ఠింప దగిన వగుచుండ కృష్ణు డేల కేవల కర్మమునం దర్జునుని నియమించును? సముచ్చయవాదిమతమున కేవలజ్ఞానమువలన మోక్ష మెట్లు లేదో అట్లే కేవల కర్మల వలనగూడ మోక్షము సంభవింపదు కదా? జ్ఞానకర్మల రెంటిని కలపి యనుష్ఠింపు మని భగవంతుడు ప్రేరేపించినచో "తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ" అను శ్లోకముచే అర్జునుడు హింసారూపమగు నీ ఘోరయుద్ధమునందు నన్నేల నియోగింపుచుంటి వని కృష్ణుని నిందించు టెట్లు పొసగును? మరియు జ్ఞానకర్మలు రెండు ఏక కాలమున నేకాధికారిచే ననుష్ఠింప దగవని కాని, అందు కర్మయోగముకంటె జ్ఞానయోగము గొప్పదనికాని శ్రీకృష్ణుడు చెప్పనపుడు యా

రెండు విషయములను అర్జునుడు శ్రీకృష్ణునియం దేల మిథ్యగా నారోపించును ? మరియు జ్ఞానకర్మల సముచ్చయమును శ్రీకృష్ణు డందరకు జెప్పియున్నచో నయ్యది పార్థునకుఁ గూడ జెప్పినట్లే కావున నద్దానిని విని యర్జునుడు "యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మేఽబ్రూహి సునిశ్చితం" అను శ్లోకముచే జ్ఞానకర్మల రెంటిలో నాకు నెయ్యది శ్రేయస్కరమో దానిని నిశ్చయించి చెప్పుమని ప్రశ్నించుట పొసగ నేరదు. వైద్యుడు పిత్తశాంతికి తియ్యని వస్తువును, చల్లని వస్తువును భుజింపమని చెప్పగా విని, రోగి యీరెంటిలో పిత్తశాంతికి కారణమగు నొకదానిని నిర్ణయించి చెప్పుమని యడుగుట యసంభవము. ఇక నర్జునుడు స్పష్టముగా గ్రహింపలేక నిట్లడిగెనని యనుకొన్నను భగవంతు డయినను నేను జ్ఞానకర్మల సముచ్చయమును చెప్పియుండగా నీవు యిట్లేల భ్రాంతిజెందితివి ? అని బదులు చెప్పవలయును. కృష్ణుడట్లు చెప్పియుండలేదు. పైగా నేను పూర్వము జ్ఞాననిష్ఠ, కర్మనిష్ఠ అను రెండునిష్ఠలను చెప్పితినని పార్థుని ప్రశ్నకు ప్రతికూలముగా బదులు చెప్పెను. కావున కృష్ణుడు జ్ఞానకర్మలసముచ్చయమును చెప్పియున్నా డనునది యసంభవము

కర్మజ్ఞానములు రెండును ఒకరిచే నొకేసమయమున ననుష్ఠింపదగినవి కానందున వాటికి సముచ్చయము లేనిచో నపుడు ఆత్మ కర్తృత్వ భోక్తృత్వాది ధర్మములు కలవాడను విపరీతజ్ఞానముగలవానికే కర్మలయందు ప్రవృత్తి కలుగ వలసి వచ్చును. ఆత్మ కర్తృత్వ భోక్తృత్వాది ధర్మములు లేనివాడను సమ్యగ్జ్ఞానము కల వానికి కర్మమార్గమున ప్రవృత్తి కలుగకుండును. లోకమున నట్టి నియమము కని విని యెరుంగము, సమ్యగ్జ్ఞానము కల జనకాదులకు గూడ కర్మలయందు ప్రవృత్తి గన్పట్టుచున్నది. కావున జనకాదులయందు జ్ఞానకర్మ సముచ్చయము గన్పట్టుటచే జ్ఞానకర్మ సముచ్చయముననే మోక్షముకాని కేవల జ్ఞానమువలన ముక్తి సంభవింప నేరదని ప్రశ్నింపరాదు.

మానవు డవిద్యాకామములవలన మొదట కర్మలయందు ప్రవర్తించి పిదప గొంతకాలమునకు ఫలాభిసంధిరహితముగ యజ్ఞాదుల నాచరించి చిత్తశుద్ధిని బొందును. తదుపరి బ్రహ్మ కర్తృత్వ భోక్తృత్వాది ధర్మములు లేనిదనియు, నద్వితీయమనియును సమ్యగ్జ్ఞానము నొందును. సమ్యగ్జ్ఞానము కలిగినపిదపగూడ నేరికయినను జనకాదులకువలె యజ్ఞాది కర్మలయందు ప్రవృత్తికలిగినను అయ్యది వారలకు కర్మరూపము కానేరదు. సమ్యగ్జ్ఞానముకల శ్రీకృష్ణుడు కేవల జ్ఞానమువలన పురుషార్థ సిద్ధి లేదని తలచి, పురుషార్థసిద్ధికొరకు క్షత్రధర్మము నాచరించుచుండెనా ? లేదు. లోకసంగ్రహముకొరకే శ్రీకృష్ణుడు క్షత్రధర్మము నాచరించుచున్నాడు. అట్లే సమ్యగ్జ్ఞానముగల జనకాదులుకూడ లోకసంగ్రహార్థమే కర్మల నాచరించిరి. కాని కేవల సమ్యగ్జ్ఞానమువలన పురుషార్థసిద్ధి లేదనిగాదు. ఫలాభిసంధితోను, కర్తృ

త్వాభిమానముతోను జేసిన కర్మయే కర్మయగును. భగవంతుడగు శ్రీకృష్ణునకు కర్తృత్వాభిమాన ఫలాభిసంధు లెట్లు లేవో జ్ఞానులగు జనకాదులకుగూడ నట్లే ఫలాభిసంధి కర్తృత్వాభిమానములు లేవు. అందువలన వారాచరించినకర్మ కర్మరూపము కానేరదు. స్వర్గాదిఫలములయందు గోరికచే కామ్యాగ్నిహోత్రముల ననుష్ఠించు మానవుడు హఠాత్తుగా నడుమ జ్ఞానమునందు కోరికకలిగి స్వర్గకామనను విడచి యాకామ్యాగ్నిహోత్రమును ముగింపుచున్నను, అందు నెంతవరకు స్వర్గకామన కలదో అంతవరకే నా కర్మయందు కామ్యత్వ ముండునుగాని ఫలకామన నశించినపిదప తత్సాధనమగు కర్మయందు కామ్యత్వ ముండనేరదు. కావున కామ్యకర్మ యనుష్ఠింపబడుచున్నను ఫలకామన నశించినందున కర్మయందలి కామ్యత్వ మెట్లు నశించునో అట్లే జ్ఞానిచే గర్మ యాచరింపబడుచున్నను ఆతనికి కర్మఫలమం దాసక్తి కర్తృత్వాభిమానము లేనందున కర్మయందలి కర్మత్వముగూడ నశించును. కనుకనే ‘కుర్వన్నపి న కరోతి’ చేయుచున్నను చేయుటలేదు. అను వృద్ధప్రవాదము పొసగుచున్నది. లేనిచో చేయువానికి చేయకుండుట సంభవింపదు. ఈ రెండుధర్మములు పరస్పర విరుద్ధములు గనుక కర్తృత్వము సాధారణముగా అహంకార పూరితమయి నందున అహంకార రహితుడగు పురుషుడు చేయుచున్నను చేయనివాడనియే జెప్పవలయును.

కావున జనకాదులు ప్రవృత్తిమార్గము నందున్నను. వేదాన్తశ్రవణాదులచే పరమార్థ తత్వజ్ఞానమును సంపాదించి, నివృత్తిమార్గమగు సన్యాసమును స్వీకరింపకయే అహంకార రహితముగ కర్మల నాచరించుచునే ముక్తి నొందిరనియు, నివృత్తిమార్గమందున్న సనకాదులు సన్యాసాశ్రమమును స్వీకరించి వేదాన్తశ్రవణాదులచే నాత్మతత్వజ్ఞానమును సంపాదించి కర్మల నాచరింపకయే కేవల జ్ఞానమున ముక్తి నొందిరనియును భేదమును గ్రహింపవలయును. కనుక మోక్షము కేవల జ్ఞానము వలననేగాని, కర్మసముచ్చిత జ్ఞానమువలన కలుగదనియే గీతాశాస్త్ర నిర్ణయము.

కావున ధర్మాధర్మ వివేకము లేక దుఃఖసముద్రమున మునిగియున్న పార్థుని యుద్ధరింప నాత్మజ్ఞానముకంటే వేరుపాయము లేదని తలంచి శ్రీకృష్ణుడాతని యుద్ధరింప దలచి “అశోచ్యా నన్వ శోచస్త్వమ్” ఇత్యాది గ్రన్థముచే నాత్మజ్ఞానము నుపదేశించు చున్నాడు.

ఇచట రామానుజులు గీతాశాస్త్రారంభ శ్లోకమును “నత్వేవాహం జాతు నాసమ్” అను దానినిగా నిర్ణయించి “అశోచ్యా నన్వశోచ స్త్వమ్” అను శ్లోకమును గీతాశాస్త్రముకంటె వేరు పరచిరి. అదియుక్తము గాదు. ప్రసిద్ధులగు భీష్మాదులు పరమార్థముగా నిత్యులనియు, వారలగురించి దుఃఖింప దగదనియు, పండితులు

మరణించినవారల గురించిగాని, జీవించినవారల గురించిగాని దుఃఖింప రనియు, అర్జునా! నీవును పండితుడవు కావున వీరల గురించి దుఃఖింపకు మనియును హితోప దేశమును చేయు నీ శ్లోకమును గీతాశాస్త్రమునకు వేరుజేయుట యుచితముగాదు.

మరియు వేదాన్తదేశికులు "అశోచ్యా నన్వశోచ స్త్వమ్" అను శ్లోకము గీతాశాస్త్రము నుపదేశింపబోవు శ్రీకృష్ణునిచే నుపదేశింప నున్న విషయమును పార్థుడు సావధానముగా వినగలందులకు పరిహాస భావముతో చెప్పబడినది గాని, ఉపదేశ రూపము గాదనియు, నందువలన నయ్యది గీతాశాస్త్రమున కవతారిక యగునుగాని సాక్షాచ్ఛాస్త్రరూపము గాదనిరి. అయ్యది సమంజసముగ లేదు. అపార దుఃఖసాగర మున మునిగియుండి భగవంతుని చరణముల శరణుజొచ్చిన పార్థునియందు కృష్ణపర మాత్మకు పరిహాసభావ ముదయించుట యెంతమాత్రము సంగతముకాదు.

మరియు వేదాన్తదేశికు లిట్లనుచున్నారు. "అశోచ్యా నన్వశోచ స్త్వమ్" అను శ్లోకమునకు పూర్వము "త మువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత । సేనయో రుభయో ర్మధ్యే విషీదన్త మిదం వచః॥" అను శ్లోకము కలదు. అందు రెండు సేనల నడుమ దుఃఖించుచున్న పార్థుని పరిహసించు వాడువలె శ్రీకృష్ణుడు ముందు జెప్ప బోవు మాటను చెప్పెనని యర్థమగుచున్నది. దీనిపైన కృష్ణుడు చేసిన పరిహాస మేమియను ప్రశ్నరాగా అందుకు "అశోచ్యా నన్వశోచ స్త్వమ్" అను శ్లోకమునే సమాధానముగాఁ జెప్పవలయును. కావున అర్జునా! నీవు దుఃఖింప దగని భీష్మాదుల గురించి దుఃఖించుచు, వివేకవంతుల ప్రగల్భవాక్యముల బల్కుచుంటివి. పండితులెవ్వరు యిట్లు దుఃఖింపరు అని చెప్పుటయే కృష్ణుని పరిహాస మని నిర్ణయ మగుచున్నది. కనుక "అశోచ్యా నన్వశోచ స్త్వమ్" అను శ్లోకము పూర్వశ్లోకము నందు సూచింపబడిన పరి హాసమును వివరించుచున్నది."నత్వే వాహమ్" అను శ్లోకము ఇదం శబ్దమునకు విషయ మగుచు శాస్త్రారంభరూప మగుచున్నది అనిన ఇదియును పొసగనేరదు. ఏల యన ఇదం శబ్దము వెంటనే చెప్పబోవు విషయమును పరామృశించుటచే వెంటనే జెప్పిన "అశోచా నన్వశోచ స్త్వమ్" అను శ్లోకార్థమే ఇదం పదార్థమగుచుండ, తదనన్తర శ్లోకమగు "నత్వే వాహమ్" అను శ్లోకార్థమును ఇదం శబ్దవిషయమునుగా కల్పించుట న్యాయము కాదు. కాక "అశోచ్యా—" అను శ్లోకమునకు 'ప్రహసన్నివ' అను శ్లోకముతో నన్వయముకూడ కుదరనేరదు. ఇతి శబ్దమును అధ్యాహారము జేసి "ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ఇతి, ప్రహసన్నివ" (వివేకవంతుల ప్రగల్భ వచనముల బలుకుచుంటి వని పరిహసించువాడువలె) అని యన్వయించినచో సమాప్తమయిన "ప్రహసన్" అను పదమును మరల గ్రహింపవలసి వచ్చును. కాన సమాప్త పునరాదాన దోషము సంభవించును. ఇతి శబ్దాధ్యాహార దోషముకూడ గలుగును. మరియు "గతాసూ నగతాసూంశ్చ నానుశోచంతి" అను ఉత్తరార్థము పరిహాస

వాక్యమునందును, శాస్త్రారంభమునందును జేరకుండుటచే వ్యర్థవాక్య మగును. పూర్వశ్లోకమునందు "ప్రహసన్నివ" అని యుండుటచే ఇవ శబ్దముచేత కృష్ణుడు నిజముగా పరిహాసింపలేదని తేలుచున్నది. అందువలన భగవంతుడు పరిహాసము చేయనందున పరిహాసరూపమగు "అశోచ్యా నన్వశోచ స్త్వమ్" అను శ్లోకము భగవంతునిచే జెప్పబడినదే గాకపోవలసి వచ్చును. కావున గీతాశాస్త్రమునకు "అశోచ్యాన్" అను శ్లోకమే ప్రారంభముగాని "నత్వేవాహమ్" అను శ్లోకము గానేరదు.

శ్రీ భగవాన్:

> శ్లో. అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే
> గతాసూ నగతాసూంశ్చ నానుశోచంతి పండితాః॥ ॥౧౧॥

అ. భీష్మద్రోణాదులు మంచినడత గలవారు. పరమార్థముగా నిత్యులు. కనుక వారలగురించి దుఃఖింప దగదు. లోకములో చెడ్డనడత గల పుత్రాదుల గురించి తలిదండ్రులు దుఃఖింతురు. అట్లే యనిత్యములయిన గృహసంపదల గురించియు దుఃఖింతురు. అంతియకాని నిత్యులయిన ఆత్మల గురించి దుఃఖింపరు. ఓయి యర్జునా! నీవు నిత్యులయిన భీష్మాదుల గురించి, "నాకొరకు వీరు మరణింపనున్నారు. వీరల విడచి నే నీ రాజ్యసంపదతో నేమిచేయుదును?" అని దుఃఖింపుచుంటివి. పైగా ప్రాజ్ఞుల పలుకుల బలుకుచుంటివి. పండితులు మృతులనుగురించి గాని, జీవించి యున్నవారల గురించిగాని దుఃఖింపరు. జీవించి యున్నవారుగూడ దుర్నడత కలవారుగాని, దుష్టవ్యాధి గలవారుగాని యయినచో దుఃఖప్రసక్తి యుండును. ॥౧౧॥

ఓయి! పండితులయిన తార్కికాదులు మృతులయిన బంధుజనమునుగూర్చి దుఃఖించుటలేదా? యని యనరాదు. పండాయన ఆత్మజ్ఞానము. ఆత్మజ్ఞానము కలవారే పండితులు. తార్కికులు పండితులు కారు. ఇందు కు. "పాండిత్యం నిర్విద్య" (ఆత్మజ్ఞానమును సంపాదించి) అను శ్రుతి ప్రమాణ మగుచున్నది. కావున ఆత్మజ్ఞానము గల పండితులు పరమార్థముగా నిత్యులయిన ఆత్మలగురించి దుఃఖింపరని తెలిసికొనుము.

ఇచట గతాసువులన దేహములనియు, అగతాసువులన ఆత్మలనియును రామానుజు లనుచున్నారు. ఇయ్యది యుక్తముగాదు:మరణించినవారల దేహములు గతాసువులయినను, జీవించియున్నవారల దేహములు అగతాసువు లగుటచే అగతాసు పదమువలన జీవించియున్నవారి దేహములని యర్థము లభించునుగాని యాత్మలను నర్థము లభింపదు. లోకములో గతాసు శబ్దము మృతులయినవారిని బోధించు

టయందును, అగతాసు శబ్దము జీవించియున్నవారిని బోధించుటయందును శక్త మయి యున్నది. ఓ స్నేహితుడా! మన యూరిలో మన స్నేహితులగు దేవదత్త యజ్ఞదత్తులు సుఖముగనుండిరా? యని విష్ణుమిత్రు డడుగ కృష్ణశర్మ దేవదత్తుడు గతాసువనియు, యజ్ఞదత్తుడు మాత్రము అగతాసు వనియు బదులుచెప్పెను. ఇచట విష్ణుమిత్రుడు దేవదత్త దేహము గతాసువనియు, యజ్ఞదత్తజీవుడు అగతాసువనియు గ్రహించుటలేదు. దేవదత్తుడు మృతిజెందెననియు, యజ్ఞదత్తుడు జీవించియుండె ననియు గ్రహించుచున్నాడు. మరియు శరీరములవలె ప్రాణములు కోశరూపములున్న, ఆత్మకు ఉపాధులున్న అగుచున్నవి. ఆత్మ యథార్థముగా కోశసంబంధ రహితుడగు టచే గతాసువే యగునుకాని యగతాసువు కానేరదు.

మరియు నెవరు సచ్చిదానందరూపమగు నాత్మను, అన్నమయకోశముతో గూడియుండుటచే మనుష్యునిగాను, వృద్ధునిగాను, కృశించినవానినిగాను, ప్రాణమయ కోశముతో గూడియుండుటచే నాకలిదప్పికలు కలవానినిగాను దలచుచున్నారో అట్టిమూఢులు దుఃఖింప తగినవారే కావున నగతాసువులగు ఆత్మలు దుఃఖింప దగనివారు కానేరరు.

మరియు పండితులు గతాసువులగు దేహములగూర్చి దుఃఖింపరనగా మూర్ఖులు వాటిని గూర్చి దుఃఖింతురని తేలును. ఇయ్యది లోకవిరుద్ధము. ఎంత మూఢులయి నను గతాసువులగు దేహములగూర్చి దేహములు తగులబెట్టబడినవనిగాని, శున కాదులచే భక్షింపబడినవనిగాని దుఃఖింపరు. దేహధారులగు పుత్రాదులు మృతి చెందిరని మాత్రము దుఃఖింపుచున్నారు. కావున రామానుజుల యర్థము పొసగ నేరదు.

శ్లో. న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః
న చైవ న భవిష్యామః సర్వే వయ మతః పరమ్ ॥ ॥ ౧౨ ॥

అ. భీష్మ ద్రోణాదు లేల దుఃఖింప దగనివా రనుప్రశ్నకు నిత్యులుకావున దుఃఖింప దగగని పూర్వశ్లోకమున సమాధాన మొసగబడినది. ఇపుడు వారేల నిత్యు లను ప్రశ్నకు సమాధాన మొసగబడుచున్నది. "నత్వేవాహం" అను శ్లోకముచే భీష్మ ద్రోణాదులు నిత్యులగుచో దుఃఖింప దగరు. వారును మరణించుచున్నందున నిత్యులుకారు. కావున ననిత్యులగు భీష్మ ద్రోణాదులగూర్చి నేను దుఃఖింపు చున్నాను. అను పార్థుని యాశయమును గుర్తించి భగవన్తుడు సమాధానమును చెప్పుచున్నాడు. అర్జునా! నేను, నీవు, ఈ రాజులు మనమందరము యెప్పుడును లేకపోలేదు. ఎల్లపుడు నుంటిమి. అనేకములగు దేహములు గడచిన కాలమునందు బుట్టి నశించినను ఆత్మమాత్రము ఉత్పత్తి నాశములు లేక నిత్యుడుగా నుండెను.

ఆత్మ యద్వితీయమయినను త దుపాధులగు దేహము లనేకములగుటచే దేహ భేదము నుద్దేశించి శ్రీకృష్ణునిచే "వయమ్" అని నిర్దేశింప బడినది. కాని యాత్మ భేదము నుద్దేశించిగాదని గ్రహింపవలయును. ఇయ్యది యు క్తము. వాసుదేవత్వ, అర్జునత్వ, జనాధిపత్వాదులు దేహ ధర్మములుగాని యాత్మధర్మములుగావు. అవ చ్ఛేదకములగు ( భేదకములగు ) ఘట, మఠ, కరకాదులు భిన్నము లగుటచే ఘటా కాశము, మఠాకాశము, కరకాకాశము అను భేదవ్యవహారము కలుగుచున్నను, ఆకాశ మొక్కటియే యని యెట్లంగీకరింపబడెనో యట్లే భేదకములగు దేహా ద్యుపాధులు భిన్నములయినందున వాసుదేవుడు, అర్జునుడు, నరాధిపులు అను భేద వ్యవహారము కలుగుచున్నను ఆత్మ యొక్కడనియే యంగీకరింపవలయును. ౧౨.

ఈ శ్లోకమున సర్వేశ్వరుడగు శ్రీకృష్ణుడు నిత్యుడని స్పష్టపడినట్లు రామాను జులు వ్రాసిరి. అది యుక్తముగానేరదు. పార్థుడు శ్రీకృష్ణుని సర్వేశ్వరు డనిగాని, నిత్యాత్మరూపు డనిగాని తలచుట లేదు. అట్లు తలచినచో "అపరం భవతో జన్మ పరంజన్మ వివస్వతః। కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవా నితి "కృష్ణా! నీవిటీవల బుట్టితివి. సూర్యు డెన్నడో పుట్టెను. ఇట్టితరి నీవెట్లు యోగమును సూర్యున కుపదేశించితివి ?" అని జెప్పియే యుండడు. కుంతివలన బుట్టిన అర్జునునకు తా ననిత్యుడనను భావ మెట్లు కలదో, దేవకివలన బుట్టిన కృష్ణుడుకూడ నట్లే యనిత్యు డనియే తలంచునుగాని నిత్యుడని దలపడు. తనకు దనయం దెట్లు జన్మ బాల్య యౌవన కౌమారాది ధర్మములు కన్పట్టుచున్నవో, కృష్ణునియందుగూడ నట్లే యా ధర్మములు కన్పట్టుచుండెను. కావున కృష్ణుడు సర్వేశ్వరు డని యర్జును డను కొనుట యసంగతము.

ఇక కృష్ణునకుగూడ నీ శ్లోకమువలన దాను సర్వేశ్వరుడని బ్రకటింప తాత్ప ర్యము లేదు. అట్టి తాత్పర్యము ప్రకృతమున కసంగతము కాని తాను నిత్యుడనని ప్రకటింప తాత్పర్యము కలదు. అంతమాత్రమున నిత్యత్వమును ప్రకటించుటను నీశ్వ రత్వమునుకూడ ప్రకటింపవలె నను నియమము లేదు. రామానుజమతమున ప్రకృతి, పురుషుడు, ఈశ్వరుడు మువ్వురు నిత్యు లయినను, అందు నీశ్వరునకుమాత్రమే ఈశ్వ రత్వ మంగీకరించిరికాని; నిత్యులయినను ప్రకృతి, పురుషుల కీశ్వరత్వము నంగీక రింప లేదు. మరియు శ్లోకమునందలి "అహమ్" అను పదమునకు వక్తృత్వాది ధర్మవిశిష్టమయిన వ్యక్తిమాత్రమును బోధింప శక్తికలదు కాని సర్వేశ్వరత్వాది ధర్మవిశిష్టవ్యక్తిని బోధించు శక్తి లేదు. కనుక నిచట కృష్ణునకు సర్వేశ్వరత్వ ధర్మ మును చెప్పుట యసంగతము. కవి కా తాత్పర్యమును లేదు.

మరియు రామానుజులు "సర్వేశ్వరుడును, పరమాత్మరూపుడును అగు నేను నిత్యుడననుట కెట్లు సందేహములేదో, అట్లే జీవాత్మలగు మీరును నిత్యులనుటలో సందేహములేదని యూహింపుడు" అని శ్లోకార్థమును వివరించిరి. అదియు యుక్తము కాదు. అట్టితరి శ్లోకమునందలి "న త్వేవాహం జాతు నాసమ్" అను భాగము దృష్టాంత మనియు, మిగిలిన భాగమంతయు దార్ష్టాంతికమనియు విభజింపవలయును. శ్లోకమునందు దృష్టాంతవాచకమగుయథాతథాశబ్దములు లేనందున అట్టి విభాగకల్పన మప్రమాణ మగును, కాక పార్థునకు కృష్ణునియందు నిత్యత్వ నిశ్చయమే లేనందున "న త్వే వాహం జాతు నాసం" అను భాగము దృష్టాంత మగుటయే సంభవింపదు.

మరియు ఆస్తిక్యబుద్ధిగల యర్జునుడు నిత్యుడయిన నీశ్వరు డొకడు కలడని తలచినచో దలచుగాక కృష్ణుని మాత్రము నిత్యేశ్వరునిగా దలంచలేదు. అట్లు తలచినచో కృష్ణుని రథమునుతోలు పనియందు నియమించుటయే సంభవించదు.

మరియు రామానుజులు చెప్పిన యర్థమునందే కృష్ణునకు దాత్పర్యమున్నచో "ఈశ్వరోఽహం యథా నిత్యః జీవాయూయం తథైవహి" అనియే చెప్పియుండును. "ఈశ్వరుడగు నే నెట్లు నిత్యుడనో అట్లే మీరును నిత్యులు" అని దీని యర్థము. "న త్వేవాహం జాతు నాసమ్"అని చెప్పియుండడు. కాక ఈశ్వరుడు పరమాత్మ యనియు, జీవులు ఆత్మలనియు, చెప్పుట తగదు. "య ఆత్మా అపహతపాప్మా" "సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా" "ఐతదాత్మ్య మిదం సర్వం" "స ఆత్మా తత్త్వమసి" "అయమాత్మా బ్రహ్మ" ఇత్యాది శ్రుతులయం దీశ్వరుడు ఆత్మశబ్దముచేతనే గ్రహింపబడెను గాని పరమాత్మపదముచే గ్రహింపబడలేదు. ఇదియును గాక జీవేశ్వరులకు శ్రుతులయం దభేద ముపదేశింపబడినది.

మరియు అజ్ఞానమోహితుడగు పార్థునకు మోహనివృత్తి చేయదలచి శ్రీకృష్ణుడు పారమార్థిక నిత్యాత్మ తత్త్వము నుపదేశించు సమయమున నేను, నీవు, వీరందరు అని యాత్మభేదము నుపదేశించుటచే భగవంతుడే జీవాత్మ పరమాత్మలకు భేదము పారమార్థికమని చెప్పినట్లు తేలుచున్నది, ఉపాధి సిద్ధమగు నాత్మభేదము నుపదేశించె నన్నచో నయ్యది మిథ్యకావున తత్త్వోపదేశ సమయమున అతాత్త్వికమగు నౌపాధిక భేదము నుపదేశించుట యనుచిత మగును. కావున నిచట జీవేశ్వరులకు పారమార్థిక భేదమునే కృష్ణు డుపదేశించెనని రామానుజు లనుచున్నారు.

ఇయ్యది యసదర్థము. భీష్మ ద్రోణాదులు అనిత్యులని తలచి దుఃఖింపుచున్న యర్జునునకు వారు నిత్యులుగావున వారలగూర్చి దుఃఖింప వలదని యుపదేశించుటయే కృష్ణున కుచితముకాని ఆత్మభేదము నుపదేశించుట ప్రసక్తముకాదు.

"అవినాశి తు త ద్విద్ధి యేన సర్వ మిదం తతం" అను శ్లోకముచే ముందు ఆత్మా భేదమును శ్రీకృష్ణు డుపదేశింపబోవుచున్నాడు. అచ్చట రామానుజులు గతిలేక "యేన" అను పదము జాత్యేకవచనమని తృప్తి జెందిరి. కృష్ణపరమాత్మకు వాస్తవముగా ఆత్మభేదమును చెప్పుటయందే తాత్పర్యమున్నచో "అనాశినస్తు తా న్విద్ధి యై స్సర్వ మిద మావృతం" అని చెప్పియుండును.

మరియు ఆత్మభేద మంగీకరించినచో వారు ఆ యా దేహములతోఁ గూడి యుండుటచే సర్వవ్యాపకులు కానేరరు. చైత్రాత్మ మైత్రాత్మయొక్క దేహమును వ్యాపింప నేరదు. అట్లయినచో మైత్రాత్మయొక్క దేహమునందలి సుఖదుఃఖములు చైత్రాత్మ కనుభవ గోచరములు కావలసివచ్చును. లోకమునం దట్లగుటలేదు. ఆ యా దేహములతోఁ గూడని యాత్మ యద్వితీయుడు కావున సర్వవ్యాపకు డగును. ఇంక "అవినాశితు తద్విద్ధి "అను శ్లోకము పరమాత్మను చెప్పుచున్నదని రామానుజు లంగీకరించినచో పరమాత్మయే నాశరహితుడగును. జీవాత్మలు పరిచ్ఛిన్నులగుటచే ఘటాదులవలె ననిత్యులగుదురు. ఇయ్యది రామానుజుల కనిష్టము. కావున "నత్వేవాహం "అను శ్లోకమునందు ఆత్మభేదమును "అవినాశితు తద్విద్ధి" అను శ్లోకమునం దాత్మాభేదమును ప్రతిపాదించుటలో భేదము ఔపాధిక మనియు,అభేదము పారమార్థికమనియు శ్రీకృష్ణుని యాశయ మయినట్లు పండితులకు సుస్పష్టము.

తత్త్వము నుపదేశించు సమయమునగూడ నుపాధిసిద్ధభేద మనువదించియే పారమార్థికా భేదమును బోధింపవలెనుగాన భేదము ననువదించినంతమాత్రమున నయ్యది పారమార్థికము కానేరదు. కృష్ణుడు, అర్జునుడు, భూపతులు అను మనమందరము సర్వప్రపంచవ్యాపియై నాశ రహితమగు బ్రహ్మస్వరూపులమే అని "నత్వేవాహం, అవినాశితు తద్విద్ధి" అను రెండు శ్లోకముల కేకవాక్యత జెప్పవలయును. సర్వవ్యాపకమగు పరబ్రహ్మమును భేదింపజేయునట్టి శరీరాది సంబన్ధములు వాస్తవముగ లేనందున నాత్మభేదము పారమార్థికము కాదు. ఆత్మను వేరుబరచునట్టి శరీరాదు లాత్మస్వరూపముచేతనే వ్యాప్తములైనవి. ఆకాశాదులకువలె నాత్మకుగూడ వ్యవహారదశలో గల్పింపబడిన భేదము కలదు.

రామానుజాశంక :- మరియు రామానుజులు శంకర సిద్ధాన్తమునందు శాస్త్రారంభమే సంభవించ దనియు, పరమార్థ దృష్టిగల కృష్ణపరమాత్మ నిర్గుణకూటస్థ నిత్య చైతన్యాత్మ సాక్షాత్కారమువలన నజ్ఞాన తత్కార్యములను విడియు, నజ్ఞాన కల్పితమగు నాత్మభేదమును గనుట, తన్నిమిత్తకమగు శిష్యోపదేశాది వ్యవహారములు జరుగుట యున్నగునవి పొసగనేర వని యాక్షేపించిరి.

వారి యాక్షేపణ నిస్సారమైనది. వారి మతమున మాత్రము అవాప్త సర్వకాముడును, పరిపూర్ణుడును, ఆనందమయుడును, పరమపురుషుడు నగు కృష్ణపరమాత్మ యర్జునునియొక్క దుఃఖమును నిరీక్షించుట కాని, వానికి హిత ముపదేశించుట కాని యెట్లు పొసగును? వారు లీలచే నా వ్యవహారమంతయు బొసగునన్నచో శాంకరమతమున మాయచే నా వ్యవహారము పొసగు నని యేల జెప్పరాదు? జన్మనాశములు లేక భూతములకు నీశ్వరుడగు భగవంతుడు మాయావశమున బుట్టినవానివలె, నశించినవానివలె, నుగ్రసేనునిచే బరిపాలింపదగినవానివలె గనుబడుచున్నట్లు అర్జునున కుపదేశించుచున్నవాడువలె నేల కనుపడకూడదు? పరమార్థదృష్టిచే విచారించినచో గృష్ణుడు లేడు, అర్జునుడు లేడు, ఉపదేశము లేదు. అద్వితీయమగు బ్రహ్మమొక్కటియే కలదు. వ్యవహారమునందు సర్వద్వైతము సంభవించుచున్నది. శాంకరమతమున గురుశిష్యోపదేశము పొసగుట కెట్టి యాక్షేపమును లేదు. లోకములో బాలుడు అజ్ఞానియు, సకాముడును కనుక నాతనికి లీలాచేష్ట లుదయింపవచ్చు. కాని పరిపూర్ణుడు, నిష్కాముడు నగు గృష్ణునియందు లీలాచేష్ట లుదయించు టెట్లు? ప్రభువు బంతితో నాటలాడు చందమున భగవంతుడు ప్రపంచముతోఁ గ్రీడించుచున్నా డన్నచో నదియు సమంజసము గాదు. రాజుకు గందుకవిహారమునందు సుఖేచ్ఛ కలదు. కావున నందు బ్రవృత్తి సంభవింపవచ్చు. నిష్కాముడగు గృష్ణునకు ప్రపంచవ్యవహారమునం దిచ్ఛ యసంభవ మగుటచే బ్రపంచవ్యవహారమునందు ప్రవృత్తి సంభవింపదు. నిష్కాముడగు భగవంతుడుకూడ లోకానుగ్రహముకొరకు వ్యవహరించుచున్నా డన్నచో లోకానుగ్రహరూపమగు ఫలము మిగిలియుండ భగవంతుడు పూర్ణకాము డెట్లగును? కావున భగవంతుడు ప్రపంచవ్యవహారమునందు నిమగ్నుడగుటకుఁ గారణము మాయయే యని రామానుజులుకూడ ననివార్యముగ నంగీకరింపవలయును. మాయచేమాత్రము కుదరని విషయమెట్లు కుదురునని ప్రశ్నింపరాదు. మాయచే సర్వము సంభవించును.

ఓయి! పరమపురుషుడగు గృష్ణపరమాత్మ మాయచే బార్థునకు శాస్త్రము నుపదేశించుగాక. ఇప్పటి యాచార్య పరంపర శిష్యపరంపరకు శాస్త్రోపదేశ మొనర్చు టెట్లు? గురుపరంపరకు ద్వైతభావమున్నచో సమ్యగ్జ్ఞానము నశించును. ద్వైతదృష్టిలేనిచో వాగ్వ్యవహారము సంభవింపదు కదా అనినచో నట్లుకాదు.

ఆత్మ తత్త్వసాక్షాత్కారమొందిన గురువులకుఁ గూడ బాధితాను వృత్తిచే వ్యవహారప్రవృత్తియుండును. ఆత్మ దేహముకంటె వేరను జ్ఞానమున్న రామానుజులుకూడ నేను మనుష్యుడను, వైష్ణవుడను, రామానుజుడను అని చెప్పుచునే యున్నారు. అట్లే శాంకరమతమున నద్వైతదృష్టి యున్నను బాధితాను వృత్తిచే ద్వైతవ్యవహారము సంభవించును.

ఆత్మజ్ఞానముచే బాధింపబడి మరల యనువర్తమానమగు దేహాత్మభ్రాంతి భోజనాది ప్రవృత్తికి గారణమయినట్లు, బాధితానువృత్తమగు భేదజ్ఞానముకూడ గురుశిష్యోపదేశాది భేదవ్యవహారమునకు గారణమగును. దేహముకంటె నాత్మ వేరను జ్ఞానముగల రామానుజీయు లెవరును భోజనాది వ్యాపార రహితులుగ నుండుట లేదు. భోజనాది వ్యాపారము దేహాత్మభ్రాంతిమూలకముకాని, యాత్మజ్ఞానము గాదు. నేను దేహముకాదను యథార్థజ్ఞానము కలవాడెవ్వడును నోటితో నే పదార్థమును భుజింపదలచడు.

మరియు రామానుజులు బిమ్బరూపుడగు నీశ్వరుడు ప్రతిబిమ్బ స్వరూపుడగు బార్థునకు తత్త్వ మెట్లుపదేశించును? లోకములో నున్మత్తుడు కానివా డెవ్వడు అద్దమునందలి తనప్రతిబింబముతో మాటాడదలంచడు కదా? అని యనుచున్నారు.

ఇయ్యది యుక్తము కాదు. లోకమునం దేపురుషుడు తన ప్రతిబింబముతో నేమియు జెప్పడని యాక్షేపించు రామానుజుల యాశయ మేమి? బింబ ప్రతిబింబములు రెండు నత్యంతాభిన్నములనియా? ప్రతిబింబము మిథ్యాభూతమనియా? లేక ప్రతిబిమ్బమునకు చైతన్యము లేదనియా? ఇందు మొదటి పక్షము నిలువనేరదు. బిమ్బ ప్రతిబిమ్బముల కత్యంతాభేదమొప్పినచో బిమ్బ ప్రతిబింబ వ్యవహారమే నశించును. ఇది బిమ్బము, ఇతి ప్రతిబింబము అను వ్యవహారమునకు నారెంటియొక్క భేదము ప్రధాన కారణము. ఇది ఘటము, ఇయ్యది పటము అను వ్యవహారమునకు ఘట పటములకుగల భేదమే మూలకారణము.

మరియు నత్యంత భిన్నమగు దర్పణమునందలి పరప్రతిబింబమునకు నేపురుషుడు నేమియు నుపదేశింపడు.

ఇంక రెండవ పక్షముకూడ పొసగదు. రజ్జుసర్పము రజ్జుజ్ఞానముచే బాధింపబడినట్లు దర్పణమునందలి ప్రతిబింబము యేజ్ఞానముచేతను బాధింపపడదు. జ్ఞానముచే బాధింపబడని పదార్థమునకు మిథ్యాత్వము పొసగదు. లోకమునం దేపురుషుడును అద్దమునందలి తన ప్రతిబింబమును మిథ్యయని తలంచడు. కనుక మూడవ పక్షమే గ్రహింపదగియున్నది. అజ్ఞానమునందలి చిత్ప్రతిబింబములు చిద్రూపములు కావున నద్దమునందలి జడ ప్రతిబింబతుల్యములు గావు. కనుక దన ప్రతిబింబములు తనకంటె భిన్నమగుటచేతను, అయ్యవి చిత్ప్రతిబింబములగుటచే చైతన్యముకలవి యగుటవల్లనను బింబరూపుడగు శ్రీకృష్ణుడు ప్రతిబింబరూపుడగు నర్జునున కుపదేశించుట యుక్తమే యగుచున్నది.

ఇంతమాత్రమున బింబ ప్రతిబింబములగు జీవేశ్వరులకు భేద మంగీకరించినచో నద్వైత మెట్లు సిద్ధించు నని యనరాదు. అవిద్య యుండునంతవరకు బింబప్రతిబింబాది భేదము గోచరించుచున్నను, పరమార్థదశలో నవిద్యయే లేదుగావున బింబ ప్రతిబింబాది భేదదృష్టి యుండ నేరదు. అందువలన నద్వైతహాని లేదు. దీనిచే "నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానాం" అను మంత్రమువలన జీవేశ్వరభేదము సిద్ధించుచున్న దను రామానుజ వాదమునకు సమాధాన మొసగబడినది. "ఏకో బహూనాం యో విదధాతి కామాన్" అను మంత్రము వ్యావహారిక జీవేశ్వర భేదమును, వ్యావహారిక రక్ష్య రక్షక భావమును పురస్కరించుకొని ప్రవర్తించినది గాని, పారమార్థిక భేదమును బోధించునది గాదు.

మరియు నిచట చైతన్యమాత్ర ముపదేశించుట లేదు. చైతన్యమాత్రము వినుటయు లేదు. మరేమనిన కృష్ణునియొక్క శరీరేంద్రియాకారముగా బరిణమించిన మాయావచ్ఛిన్న చైతన్య ముపదేశించుచున్నది. పార్థునియొక్క శరీరేంద్రియాకారముగా బరిణమించిన మాయావచ్ఛిన్న చైతన్యము వినుచున్నది. ఇచట విశేష్యాంశములగు చైతన్యములకు భేదము లేకున్నను, విశేషణాంశములగు శరీరేంద్రియాదులకు పరస్పరము భేదము కలదు. కనుకనే "తత్త్వమసి" అను వాక్యమునందు విరుద్ధమగు విశేషణాంశమును విడచి యవిరుద్ధమగు విశేష్యాంశమునందే లక్షణ యంగీకరింపబడినది. కావున శరీరేంద్రియాదులతో గూడియున్న కృష్ణార్జునులకు భేదముండుటచే నుపదేశము కుదురుచున్నది.

మరియు రామానుజులు గురువులకుగల యద్వితీయాత్మ విజ్ఞానమువలననే యజ్ఞాన తత్కార్యములు నశించియుండ నజ్ఞానతత్కార్య నాశముకొరకు శిష్యులకాత్మోపదేశ మొనర్చుట నిష్ప్రయోజన మని యాక్షేపించిరి.

ఇదియు నయుక్తమే యగుచున్నది. దేహముండునంతవరకు నాత్మజ్ఞానముగల గురువులకుగూడ దేహేన్ద్రియాది ప్రపంచ ప్రతీతికలుగు నని నింతకుమున్నే చెప్పబడినది. ఐన్ద్రజాలికు డాకసమున గంధర్వనగరమును నిర్మించియుండ నిది యాకసముగాని గంధర్వనగరము గాదని దెలిసినవారలకుగూడ ఇన్ద్రజాలము భాసించునంతవరకు గంధర్వనగరము తోచుచునే యుండును.

పరిదృశ్యమానమగు ప్రపంచము యే మహనీయుని యద్వితీయాత్మజ్ఞానముచే బాధింపబడుచున్నదో ఆ మహనీయునికే నయ్యది దగ్ధపటమువలె (కాలిన వస్త్రమువలె) నుండుచు బంధప్రాపకము కాదు. ఇతరులకుమాత్రము బంధప్రాపకమగును. గురువుల యద్వితీయాత్మజ్ఞానముచే శిష్యుల యజ్ఞానము నశింప నేరదు.

అజ్ఞానము, అజ్ఞానకార్యమగు ప్రపంచము పురుషభేదముచే భిన్నము. కంటికి సమీపమున చేతి నడ్డముగా జేసికొని గగనమండలమును జూచువా రద్వితీయమగు సూర్యుని జూడరు. కంటిమెదుట చేతి నడ్డముగా జేసికొనని నేర్పరు లా సూర్యుని జూతురు. ఇట్టితరి నేర్పరులయందలి యద్వితీయ సూర్యజ్ఞానము మూఢులయందు గల యద్వితీయ సూర్యాజ్ఞానమును బోగొట్టుచున్నదా? లేదు. అట్లే గురువుల యొక్క యాత్మజ్ఞానము శిష్యుల యజ్ఞానమును బోగొట్టనేరదు. ఒకరి జ్ఞానమున మఱియొకరి యజ్ఞానము నశించుట లోకవిరుద్ధము. చైత్రునియొక్క రజ్జు యథార్థజ్ఞానమువలన మైత్రునియందలి రజ్జు సర్పభ్రాంతి నివర్తించుట లోకమున కని విని యెఱుంగము.

నిజముగ విచారించినచో రామానుజమతమునందే గురుశిష్యభావము, ఉపదేశమును కుదురదు. పైగా వారి మతమున నుపదేశము వ్యర్థముకూడ నగుచున్నది. పరమాత్మ చిదచిచ్ఛరీరకు డని రామానుజమతము. కావున చిదచిత్పదార్థములలో నుండు పరమాత్మరూపుడగు శ్రీకృష్ణుడు చిద్రూపుడగు పార్థుని యెదుట నుపదేశ మొనర్చుటకు గురువుగ వెలుపల నెట్లుండును. ఎల్లపుడు లోపలనుండు వస్తువునకు వెలుపల నునికి యసంభవముగదా? చిదచిత్పదార్థములకు వెలుపలగూడ కృష్ణపరమాత్మ యుండుచో నపుడు కృష్ణుడే చిదచిత్తులకు శరీరమగును. చిదచిత్పదార్థములచే వ్యాపింపబడినవాడును అగును. వ్యాపకములగు శస్త్రాదులచే వ్యాప్యములగు దేహములు నాశమొందినట్లు వ్యాపకములగు చిదచిత్తులచే కృష్ణునకు నాశమును కలుగును.

మరియు చిదచిత్తులు రెండును యీశ్వరునకు అపృథక్సిద్ధ విశేషణములు విడచియుండని ధర్మములగుటచే పృథివిని విడిచియుండని ధర్మమగు గంధమును విడిచి పృథివి యుండనట్లు చిదచిత్తులను విడిచి యీశ్వరునకుగూడ పృథగవస్థానము సంభవింపదు. కావున వేఱ్వేరు వస్తువులయందుండు గురు శిష్యభావము వేరుగా నుండని చిదీశ్వరులగు కృష్ణార్జునుల కెట్లు పొసగును? అపృథక్సిద్ధ విశేషణముల కెట్లు పృథగవస్థాన ముండదో, విశేష్యములకుగూడ నట్లే వేరుగా నునికి సంభవింపదు గదా?

మరియు నర్జునపదార్థముగూడ చిదచిద్విశిష్టమగు నీశ్వరుడే కావున కృష్ణుడు పార్థున కుపదేశించుటయు కుదరదు, సర్వవ్యాపియు, సర్వశరీరుడును, సర్వాంతర్యామియు నగు నీశ్వరునకు కృష్ణునియొక్క శరీరేంద్రియాదులయందు అహంమమాభిమాన ముదయించినట్లు పార్థుని దేహేన్ద్రియాదులయందు గూడ నయ్యది యుచితముకావున, నేను కృష్ణుడను, నీ వర్జునుడవు, వీరు భూపతులు అని 'త్వ మిదం'

పద నిర్దేశము ఉపపన్నము కాదు. నేను కృష్ణుడను, నే నర్జునుడను, నే నీ రాజులు అనియే చెప్పవలయును. లేక కృష్ణుడు నావాడు, అర్జునుడు నావాడు, యీ రాజులు నావారు అని యయినను చెప్పవలయును.

మరియు చిజ్జడాత్మకమగు నిఖిల ప్రపంచమునకు పరమకారణుడును, యీశ్వరుడును, అగు శ్రీకృష్ణుడు తనవలన బుట్టి తనతో నభిన్నమగు అర్జునాదులయం దెట్లు భేదబుద్ధిని పొందును? మృత్తువలన బుట్టిన ఘటము మృత్తుకంటె భిన్నముకాదు గదా? తనతో నభిన్నమగు అర్జునునకు తాను శాస్త్రము నెట్లుపదేశించును? ఉపదేశము భేదమూలకము కదా? కృష్ణుని తరువాతవారగు గురువులుగూడ తమవలె నితర జీవులుగూడ పరమేశ్వరా భిన్నులని తెలిసియు భేదమూలకమగు గురుశిష్యోపదేశవ్యవహారమునం దెట్లు ప్రవర్తించిరి.

ఇంక పరమేశ్వరునివలన జీవులు పుట్టుచున్నారనగా, నచ్చోట జీవుల కుపాధి సంబంధమయిన జన్మయే యంగీకరింపబడుచున్నదనియు, జ్ఞానస్వరూపులు, నిత్యులు నగు జీవులకు స్వరూపతః జన్మ సంభవింపనేరదనియు జెప్పినచో నపుడు రామానుజ మతమున జ్ఞానాకారమగు నాత్మపదార్థమును భేదింపజేయు పదార్థమే లేనందున యద్వైతమే సిద్ధించుచున్నది. కావున నిందు స్వమత ప్రచ్యుతి, పరమత ప్రవేశము అను రెండు దోషములు రామానుజులకు ప్రసక్తించును.

ఆత్మకు స్వరూపతః భేదములేకపోయినను, ధర్మమువలన మాత్రము భేదము కలదని యనరాదు. ఆధర్మముకూడ నుపాధి సంబంధమయినదికాని స్వరూపగతము కాదు. ఆత్మ స్వరూపతః నిత్యుడని శాస్త్రము చెప్పినదికాని ఉపాధివశమునగూడ నిత్యుడని చెప్పియుండలేదు.

మరియు నిట్లు జ్ఞానకారుడగు నాత్మయందు గురూపదేశమువలన సంపాదింపదగిన గుణములుకాని, దాన నివారింపదగిన దోషములుకాని లేనందున నుపదేశము నిరర్థకమగును. హీనోపాధిని పరిత్యజించి యుత్కృష్టోపాధిని పొందుటయే యుపదేశమునకు ఫలమన్నచో, మృద్రూపమగు ఘటోపాధియందున్న యాకాశము, దానిం బరిత్యజించి బంగారువికారమగు ఘటోపాధియందు ప్రవేశించుటచే నెట్టధిక లాభమును బొందలేదో, అట్లే నిర్వికారుడగు నాత్మగూడ మనుష్యోపాధిని పరిత్యజించి దేవతోపాధిని స్వీకరించినందున నధిక లాభమును బొందనేరడు. దేహాత్మభ్రాంతి యున్నపుడే నేను దేవుడను నేను యక్షుడను, అని పురుషుడు సంతోషించును. ప్రకృతమున గురూపదేశముచే దేహాత్మభ్రాంతి నశించి దేహాతిరిక్తాత్మజ్ఞానము కలిగినందున నట్టివానికి దేవతాదేహముతో నేమి ప్రయోజనము?

దేవదేహము తనదను జ్ఞానమున పురుషుడు సంతోషించుచున్నాడన్నచో నదియు పొసగదు. " అసంగో హ్యయం పురుషః " అను శ్రుతి యాత్మకు దేనితోను సంబంధములేదని చెప్పుచుండ శ్రుత్యర్థమును తెలిసినపురుషుడు దేవదేహమును తన దని (అత్మీయ మని) యెట్లు తలచును.

ఓయి! " అసంగో హ్యయం పురుషః " అను శ్రుతికి యర్థము నేరు. పురుషు డెల్లపుడు సూక్ష్మదేహముతో గూడినవాడగుటచే ససంగుడే యగుచున్నాడు. పురుషుడు జ్ఞానమాత్రాకారుడయినను, సూక్ష్మదేహము లనెడి యుపాధి భేదముచే భిన్నుడే యగుచున్నాడు. ఈ యుపాధి ప్రళయమునందును, ముక్తియందును గూడ నశింపదు. కనుక జీవులెల్లపుడు భిన్నులే. గురూపదేశమునను, యీశ్వరోపాసన వలనను జీవులకు జ్ఞానైశ్వర్యాదులు, యప్రాకృత దివ్యమంగళ విగ్రహాదులు సిద్ధించుచున్నవి అనినచో నయ్యది యుపపన్నముకాదు. ఎల్లప్పుడు లింగదేహముతో గూడిన పురుషుడు లింగాకారుడగునుగాని జ్ఞానైకాకారుడు గాడు. అపంచీకృత పంచ మహాభూతకార్యమగు లిఙ్గశరీరము అనాదిసిద్ధుడగు పురుషునకు నిత్యోపాధి కానేరదు. రామానుజ మతమున ప్రకృతిపురుషేశ్వరుల మువ్వురకు అనాదిత్వ మంగీకరింపబడినది. లింగదేహము ప్రకృతికార్యమగుటచే సాదిపదార్థముకాని, యనాదికాదు.

మరియు ముక్తియందుగూడ సూక్ష్మశరీర ముండునని యంగీకరించినచో తదంతర్గతమగు మనస్సుగూడ నపు డుండవలసివచ్చును. అట్టితరి సంసార దశయందు తా ననుభవించిన సుఖదుఃఖములను ముక్తిదశయందుగూడ మనసుచే స్మరించుట ప్రసక్తించును. కాన నొకానొకపుడు ముక్తిదశలో దుఃఖప్రాప్తిగూడ కలుగును. కావున లింగశరీర భంగమే మోక్షమని యంగీకరింపవలయును. రామానుజ మతమున నుపాసనచే సగుణముక్తిస్థానము లభించుచో కేవల తత్త్వోపదేశమున నయ్యది లభించ నందున రామానుజమతమున తత్త్వోపదేశము వ్యర్థమగును.

మరియు లోకమునం దాస్తికులగు లౌకికులును, శాస్త్రజ్ఞులలో తార్కికులును వేదముచేతను, అనుమానప్రమాణముచేతను ఈశ్వరుని తనకంటె భిన్నునిగా తెలిసికొనుచు భయపడుచున్నారు. " భీషాఽస్మా ద్వాతః పవతే " ఇత్యాది శ్రుతులుగూడ వాయు సూర్యాదు లీశ్వరునివలన భయపడుచున్నట్లు చెప్పుచున్నవి. [illegible] భయరాహిత్యము నొందుటకు శరణుజొచ్చిన శిష్యునికొరకు గురువు భయ జనకమగు జీవేశ్వరభేదము నుపదేశించినచో శిష్యుడేమి ఫలము నొందును. భయ రహితుడు కాకపోగా భయాధిక్యమును పొందును. " య ఉదరమంతరం కురుతే । అథ తస్య భయం భవతి " అను శ్రుతి యాత్మస్వరూపమునందు లేశమాత్రమయి

నను భేదదృష్టిగలవానికి సంసార భీతి తప్పదని చెప్పుచున్నది. కనుక శిష్యుడు తత్త్వోప దేశముకొరకు భేదవాదియగు గురువు దగ్గరికి జేరుట వ్యర్థమే యగును.

శ్లో. దేహినోఽస్మిన్యథా దేహే కౌమారం యౌవనం జరా।
తథా దేహాన్తర ప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి ॥౧౩॥

అ. అవిక్రియుడును, అద్వితీయుడును నగు ఆత్మకు వర్తమానదేహమునందు బాల్య యౌవన జరావస్థ లెవ్విధమగు వికారము లేకుండగనే కలుగుచున్నవి. అందు మొదటి యవస్థ నశించినను ఆత్మ నశించుటలేదు. రెండవ యవస్థ కలిగినందున రెండవయాత్మ పుట్టుటలేదు. అట్లే వర్తమానదేహమును విడచి దేహాన్తరము నొందుటకూడ వికారరహితుడగు నాత్మకే సంభవించుచున్నది. ఈ పరిస్థితిలో బుద్ధి మంతుడగువాడు మోహమును జెందడు. ౧౩

శ్లో. మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణ సుఖ దుఃఖదాః।
ఆగమాపాయినోఽనిత్యా స్తాం స్తితిక్షస్వ భారత ॥౧౪॥

అ. (మీయన్తే గృహ్యన్త ఇతి.) గ్రహింపబడుచున్నవిగాన మాత్ర లనబడును. అనగా జ్ఞానేన్ద్రియ పంచకమునకు విషయములగు శబ్ద స్పర్శ రూప రస గంధములని యభిప్రాయము. ఈయవి ఇష్టవిషయములనియు, అనిష్టవిషయములనియును రెండు తెఱంగులు. అందు ఆత్మకు సుఖదాయకములగునవిఇష్టవిషయములు.దుఃఖకరములగు నవి యనిష్టవిషయములు. గ్రీష్మకాలమునందు శీతస్పర్శ సుఖము నిచ్చునట్టిది గాన ఇష్టము. అదియే శిశిరకాలమునందు దుఃఖము నిచ్చుచున్నందున అనిష్టమగును. శిశిర కాలమునందు ఉష్ణస్పర్శసుఖము నిచ్చునుగాన ఇష్టమగును.అదియేగ్రీష్మకాలమునందు దుఃఖము నిచ్చుచు ననిష్టమగును. ఇట్లే సురభిగంధము సంయోగదశయందు ఇష్టము. అదియే విరహ దశయందు అనిష్టమగును. జ్వరపడినవానికి మధురరసము అనిష్టము. అదియే స్వస్థునకు సుఖకరమగుచు నిష్టమగును. ఈప్రకారము శ్రావ్యమగు శబ్దాదులు గూడ సుఖకరము లగునపుడు ఇష్టము లనియు, దుఃఖము నిచ్చునపుడు అనిష్టము లనియుగ్రహింపవలయును. ఇట్లుండమాత్రాస్పర్శలు సుఖ దుఃఖములనిచ్చుచున్న వను విషయమే ఇచట వివక్షితము. శీతోష్ణపదము దృష్టాంతముకొరకు గ్రహింపబడినది. ఎట్లు శీతస్పర్శ సుఖదము, ఉష్ణస్పర్శ దుఃఖదము అగుచున్నదో అట్లే మాత్రా స్పర్శలు కాలానుగుణముగ సుఖదుఃఖముల నిచ్చునవియని యాశయము. అట్లు గానిచో శీతోష్ణపదములు శ్రోత్రాది విషయములగు శబ్దాదులతోటిగూడ సంబంధిం చును. అయ్యది యనిష్టము. శీతశబ్దము, ఉష్ణశబ్దము, శీతగంధము, ఉష్ణగంధము, శీతరూపము, ఉష్ణరూపము అనునవి యప్రసిద్ధములు. ఈయర్థమునందు 'శీతోష్ణ

ఇవ సుఖదుఃఖదాః శీతోష్ణ సుఖదుఃఖదాః" శీతోష్ణములవలె సుఖదుఃఖములుగాన శీతోష్ణ సుఖదుఃఖదములు అని సమాసము చెప్పవలయును. లేనిచో మాత్రా స్పర్శలు సుఖదుఃఖముల నిచ్చుచున్నవనియు, స్పర్శవద్ద్రవ్యముతో సంబంధించిన త్వగిన్ద్రియము శీతోష్ణస్పర్శల నిచ్చుననియు జెప్పవలయును.

ఇచట మాత్రా పదమునకు ఇన్ద్రియములని యర్థమును జెప్పి స్పర్శపదమునకు సంయోగమని యర్థమును జెప్పినచో (శబ్దాదిభిః) "శబ్దాదులతో" అను పదమును అధ్యాహారమును జేసికొనవలయును. అందు అరుచిచే పక్షాన్తర మవలంబింపబడినది.

శీత మొకానొకపుడు సుఖదము మరియొకపుడు దుఃఖదము. ఉష్ణ మొకానొకపుడు సుఖదము, మరియొకపుడు దుఃఖదము అగుచున్నవి అందువలన శీతోష్ణములు నియతరూపములుకావు. సుఖదుఃఖములు మాత్రము యెల్లపుడు నియతరూపములు. సుఖ మొకానొకపుడు సుఖరూపము మరియొకపుడు దుఃఖరూపము గానేరదు. కనుక విషయేన్ద్రియ సంబంధమువలన కలుగు శీతోష్ణరూప ద్వంద్వము సుఖదుఃఖరూప ద్వంద్వమున్ను అవర్జనీయమగుటవలనను, రాకపోకలు గలదగుటవలనను అనిత్యమగుటవలనను, సహింపదగినదని శ్లోకమునకు ఫలితార్థము. ఈ శ్లోకమునందు తితిక్షయను అధికారిధర్మ ముపదేశింపబడినది.

రామానుజ మతము:- ఇచట రామానుజులు శబ్దస్పర్శాదులు తన్మాత్రలు గావనియు, అయ్యవి సాశ్రయములయి తన్మాత్రాకార్యము లగుటవలన తన్మాత్ర లనబడుచున్నవనియు సూక్ష్మభూతములే తన్మాత్రలనియును జెప్పిరి.

అయ్యది అయుక్తము. శబ్దస్పర్శాదులే తన్మాత్రలు. సూక్ష్మభూతములు తన్మాత్ర లన్నను, తన్మాత్రలగు సూక్ష్మభూతములు సాశ్రయ శబ్దస్పర్శాదులే గాని వానికంటె వేరుగాదు. సాశ్రయ శబ్దాదులన మృదఙ్గ కుసుమాదులని యనవదగదు మృదఙ్గ కుసుమాదులు మహాభూతకార్యములుగాని తన్మాత్రాకార్యములు గావు. ఇక మహాభూతములే సాశ్రయ శబ్దాదులని యభిప్రాయ మయినచో నపుడు మహాభూతములనియే జెప్పవలెను. గాని సాశ్రయ శబ్దస్పర్శాదులని జెప్పుట వక్రోక్తియు, వ్యర్థవచనమును యగును. ఇన్ద్రియాదులుగూడ తన్మాత్రాకార్యము లగుచుండ తన్మాత్రాకార్యములను గ్రహించుటలో భూతములను మాత్రమే గ్రహించుటకు నియామక ముండనేరదు.

మరియు శబ్దస్పర్శాదులను గ్రహించునట్టి యిన్ద్రియములే శబ్దాదుల కాశ్రయము లన్నచో నపుడు (మీయన్త ఇతి) గ్రహింపబడుచున్నవి గాన మాత్రలు అని

ముఖ్యవృత్తియగు నభిధచేతనే నీయర్థమును జెప్పవచ్చును. లక్షణాశ్రయణము వ్యర్థమగును. (తన్మాత్రాకార్యములుగాన తన్మాత్రలు) అని.

మరియు 'శీతోష్ణ సుఖదుఃఖదాః' అనుచోట శీతోష్ణరూపమయిన సుఖదుఃఖములను యిచ్చునట్టివి యని రామానుజులు అర్థమును జెప్పిరి. అదియును పొసగదు. శీతోష్ణములయొక్క కార్యములగు సుఖదుఃఖములు శీతోష్ణరూపములగుట యసంభవము. గాక యథాక్రమంబుగ శీతోష్ణములు సుఖదుఃఖములకు హేతువగుటకూడ పొసగనేరదు. శీతము హేమన్తకాలమున దుఃఖహేతువును, ఉష్ణము సుఖహేతువును అగుచున్నవి.

శ్లో. యం హి న వ్యథయ న్త్యేతే పురుషం పురుషర్షభ।
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే ॥౧౫॥

అ. సుఖ దుఃఖముల యందు సమబుద్ధిగల యేపురుషుని, శీతోష్ణాది ద్వంద్వపదార్థములు నిత్యాత్మజ్ఞానమునుండి చలింపజేయవో, ఆ పురుషుడు (అనగా నిత్యాత్మదర్శననిష్ఠుడు ద్వంద్వసహిష్ణువు) ముక్తి నొందుటకు సమర్థుడగును. ఇచట వ్యథధాతువు చలనార్థకము. చలనమునకు అపాదానము నిత్యాత్మదర్శనము. ఇందుచే శీతోష్ణాది ద్వంద్వములను సహించినంతమాత్రమున మోక్షము లేదనియు, నిత్యాత్మదర్శనముకూడ నుండిననే ముక్తి లభించుననియు దేలుచున్నది. అట్లుగానిచో శీతోష్ణాది ద్వంద్వములను సహించునట్టి మూఢులగు శూద్రాదులుగూడ ముక్తులుగావలసివచ్చును. ఆత్మజ్ఞానమునందు స్థైర్యముగలవాడే నిత్యాత్మదర్శన నిష్ఠుడగును. ద్వంద్వములను సహించలేక, సుఖదుఃఖములచే బుద్ధి విక్షిప్తమగుచుండ, నాత్మసాక్షాత్కారమునందు (ఆత్మజ్ఞానమునందు) నిష్ఠ నితరాంస్థితి, పురుషునకు దుర్లభమగును. పురుషర్షభ యను సంబోధనమువలన పురుష శ్రేష్ఠుడనగు నీకు పురుషాధమునకు వలె నిత్యాత్మదర్శననిష్ఠ నుండి భ్రంశముగాని, ద్వన్ద్వ సహనములేకుండుట గాని యుచితముగాదని వ్యంగ్యమగుచున్నది.

రామానుజ మతము: ఈ శ్లోకమునకు రామానుజు లిట్లర్థమును జెప్పిరి. ధైర్యముగలిగియుండి, పొగొట్టుకొన శక్యముగాని దుఃఖమును సుఖమునుగా దలచుచు తమ జాతి కుచితమగు యుద్ధాది కర్మలయందు ఫలేచ్ఛతోనుండక యున్న నేపురుషుని యుద్ధమధ్యమున (యుద్ధమునందు) జరుగు బాణప్రహారాదులు బాధనొందింపవో అట్టిపురుషుడుడే అమృతత్వమును (మోక్షమును) సాధించును. దుఃఖమును సహింపలేని నీబోటివాడు మోక్షమును సాధింపలేడు. అని.

అయ్యది అసమంజసము. అట్టి పురుషుడు (రామానుజుల వ్యాఖ్యానమున జేర్కొనబడిన విశేషణములు గల పురుషుడు) యుద్ధమునందు మృతి జెందినచో వీరస్వర్గమును సాధించును. జయము నొందినచో పరరాజ్యమును సంపాదించును. లేనిచో నిత్యకర్మ ననుష్ఠించినందున చిత్తశుద్ధిని బొందును. ఇంతియకాని మోక్షమును మాత్రము బొందనేరడు. మోక్షము జ్ఞానముచే లభించునుగాని కర్మలచే లభింపనేరదు. మరియు సాంఖ్యప్రకరణమగు నిద్దానియందు కర్మస్వరూపమును జెప్పుట యనుచితము. గాక "పురుషర్షభ" యను పదము కాకుస్వరముచే పురుషాధమ యను నర్థమునందు ప్రయోగింపబడినట్లు కల్పింపవలయును. పరమార్థము నుపదేశింప దలంచిన భగవంతుడగు శ్రీకృష్ణునకు కాకుస్వరసహితమగు సంబోధనమును జేయుట యెంతమాత్రము యుచితముకాదు. అర్జునుడు నిజముగ పురుషాధముడే యయినచో వానిని గురించి శాస్త్రోపదేశమే యుక్తముగాదు. గనుక రామానుజుల యర్థము అసంజసమగుచున్నది.

శ్లో. నాసతో విద్యతేభావో నాఽభావో విద్యతే సతః
ఉభయోరపి దృష్టోన్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః ॥౧౬

అ. "అస" భువి, "భూ" సత్తాయాం, అను ధాతువులు రెండును సమానార్థకములు. అందు "అస" ధాతువుకంటె శతృప్రత్యయమును జేయగా సన్ అని రూపము. భూ ధాతువుకంటె ఘఞ్ ప్రత్యయమును జేర్చగా భావః అని రూపము. సన్ అను పులింగ రూపమును నపుంసకలింగమును జేయగా సత్ అను రూపమగును. సత్ కానిది అసత్ అనబడును. (సతః) సత్తు యొక్క ధర్మము సత్తా (సత్వము) భావముకానిది అభావము. గనుక భావమనగా సత్తయనియు (సత్వమనియు) అభావమన అసత్త యనియు (అసత్వమనియు) భేదము. ఇట్లుండ సత్ పదార్థమునందు సత్వ మను ధర్మముండును. ఏపదార్థముయొక్క ధర్మము ఆ పదార్థము నందుండుట సహజము సత్వమను ధర్మముకలదియే సత్ పదార్థముకావున, అసత్ పదార్థమునందుమాత్రము సత్వముండనేరదు, అసత్వమే యుండును. సత్తారహితమగు పదార్థమే అసత్ పదార్థమని లోకప్రసిద్ధి. ఇది యంతయును లోకమునకు సులభముగా దెలియు విషయము. కావున అసత్ పదార్థమునందు సత్వములేదనియు, సత్ పదార్థమునందు అసత్వములేదనియును కృష్ణు డుపదేశించుట వ్యర్థము. లోకమునం దెవ్వడును సత్ పదార్థమునందు అసత్వమను ధర్మముండుననిగాని అసత్ పదార్థమునందు సత్వమను ధర్మముండుననిగాని దలచుటలేదు. అట్లుదలంచువారల పట్ల కృష్ణుని యుపదేశము సఫలమయ్యెడిని. ఏ పురుషుడును లేని కుందేటి కొమ్మును ఉన్నటులను, ఉన్న ఆవుకొమ్మును లేనటులను దలచుటలేదు. కావున నీశ్లోకమున నర్జునునకు జేసిన కృష్ణోపదేశము వ్యర్థమనుశంక రాగా భాష్యకారులు సమాధాన

మును జెప్పుచున్నారు. "అసతః అవిద్యమానస్య" అను గ్రంథముచే, లేనటువంటి శీతోష్ణాది ద్వంద్వ పదార్థములకు సత్వము మూడుకాలములయందును లేదు. యేపదార్థమునకు కాలత్రయమునందును అసత్వముండదో అదియే సత్ పదార్థ మనిపించుకొనును. యే పదార్థమునకు ప్రతీతిసమయమునందు (గ్రహించుసమయమునందు) మాత్రము సత్వముండి యట్టి సత్వము కాలత్రయమునం దుండదో అయ్యది యసత్ పదార్థ మనబడును. సద్వస్తువునం దెన్నడును అసత్వముండుట యుచితముగాదు. అట్లుగాక ప్రతీతి సమయమునందు గనుపడు పదార్థముగూడ సద్రూపమనినచో ప్రతీతి సమయమునందుండు రజ్జు సర్పముగూడ సద్రూపము గావలసివచ్చును. కావున కాలత్రయమునందున్న పదార్థమే సత్పదార్థమనియు, కాలత్రయమునందు లేని పదార్థము అసత్పదార్థమనియును గ్రహింపవలయును. లోకమిట్లు తెలిసికొనుటలేదు. ప్రతీతమగు వస్తువును సద్రూపముగాను, ప్రతీతముగాని వస్తువును అసద్రూపముగాను లోకము తెలిసికొనుచున్నది, కావున కృష్ణుని యుపదేశము సఫలముగాని విఫలముగా నేరదు.

అసతః = అవిద్యమానమగు, శీతోష్ణాది ద్వంద్వపదార్థములకు, భావః = సత్వము, న = లేదు అని సమన్వయము.

కారణములగు జలాగ్న్యాదు లుండగా తత్కార్యములగు శీతోష్ణాది ద్వంద్వములు లేకుండు టెట్లు? అని యనరాదు. శీతోష్ణాది ద్వంద్వములకు కారణములగు జలాగ్న్యాదులుగూడ అవిద్యమానములు (అసత్తులు) గాని సద్రూపములుగావు. ఇట్లే సుఖదుఃఖాదులుగూడ అవిద్యమానములని గ్రహింపవలయును.

అసద్రూపము (అవిద్యమానము)లగు శశశృంగాదులు ప్రతీతిగోచరములగుట లేదు. శీతోష్ణాది ద్వంద్వములుకాని తత్కారకములగు జలాగ్న్యాదులుగాని, ప్రతీతివిషయములగుచున్నవి. అందువలన నయ్యవి సద్రూపములుగాని యసద్రూపములు గానేరవు అనినచో నది యుక్తముగాదు. కారణసహితమగు శీతోష్ణాది పదార్థజాతము శ్రుతిప్రమాణములచేతను, శ్రుత్యనుగృహీతములయిన తర్కములచేతను విచారింపగా సత్యమయినదిగాదని సిద్ధించుచున్నది. (లేక) త్వగాదీంద్రియప్రమాణములచే నిరూపింప బడుచున్న (గ్రహింపబడుచున్న) శీతోష్ణాదికము యదార్థముగాదని తేలుచున్నది.

ఏలయన శీతోష్ణాది పదార్థజాతము కార్యరూపమయినది. అనగా వికారమును జెందునది కార్యపదార్థ మెప్పుడును వ్యభిచరించునది. ఇచట వ్యభిచారమనగా కార్యము కారణస్వరూపముకంటె భిన్నముగా లేకుండుట

అ. చక్షురాదీంద్రియములచే గ్రహింపబడుచున్న ఘటశరావాద్యాకార సన్నివేశమును మనము సూక్ష్మబుద్ధిచే పరిశీలించినచో గారణమగు మృత్స్వరూపము కంటె భిన్నరూపముతో గనుపించకుండుటవలన ఘటశరావాది వికారములు కార్యరూపముతో నవిద్యమానము (నసద్రూపము) లనియే జెప్పవలయును. ఇట్లే వికారములన్నియు కారణరూపముతో గన్పట్టుచున్నవే గాని తద్భిన్నరూపముతో గనుపడనందున కార్యరూపముచే నయ్యవి యసద్రూపములే యగుచున్నవి. శీతోష్ణాది కార్యపదార్థము ఉత్పత్తికి పూర్వకాలమునందు నాశోత్తరకాలమునందును గనుపడనందున నా రెండుకాలముల యందును. అసద్రూపము లయినను వర్తమానకాలమునందు మాత్రము గనుపడుచుండుట వలన సద్రూపములనియే యంగీకరింపవలయునని యనదగదు. కార్యము వర్తమానకాలమునందుగూడ కారణ స్వరూపముతో గనుపడుచున్నది గాని తద్భిన్నరూపముతో గనుపడుటలేదు అందువలన నయ్యది వర్తమానకాలమందును అసద్రూపమే యగుచున్నది. అట్లే ఘటాదులను కారణమగు మృదాదికము, తత్కారణముగూడ స్వకారణమగు జలాదులకంటె భిన్నరూపముతో వర్తమానకాలమునందు గనుపడకుండుటవలనను, ఉత్పత్తికి పూర్వకాలమునందు, నాశోత్తరకాలమునందును లేకుండుట వలనను అవియును అసద్రూపములనియే నిర్ణయము.

ఇట్లు పృథివ్యాది భూతపంచకము వికారమగుటచే (కార్యమగుటచే) అసద్రూప మనినచో లోకమునందు సద్రూపమగు వస్తువే లేనందున శూన్యవాదము ప్రసక్తించు నను ఆక్షేపము రాగా భాష్యకారులు సమాధానమును జెప్పుచున్నారు. 'సర్వత్రబుద్ధి ద్వయో పలబ్ధేః' అను గ్రంథముచే కార్యసహితమగు మృదాది కారణసామగ్రి యసద్రూపమయినను ఘటపటాది సర్వవ్యవహారములయందును సద్బుద్ధి యసద్బుద్ధి యను రెండు బుద్ధులు ఉపలభ్యమానములగుటవలన శూన్యవాదము ప్రసక్తించదు. సత్ పదార్థము విషయముగాగలబుద్ధి సద్బుద్ధి అసత్ పదార్థము విషయముగాగల బుద్ధి అసద్బుద్ధి బుద్ధి యనగా అంతఃకరణ వృత్త్యాత్మకమగు జ్ఞానము. విషయములేనిదే విషయియే యుండదు. కావున విషయి యగు సద్బుద్ధిచే విషయమగు సత్పదార్థ మున్నటుల ఊహించబడుచున్నందున శూన్యవాద ప్రసక్తి లేదు. ఏ పదార్థము విషయమగు బుద్ధి యెన్నటికిని మార్పును చెందదో అ పదార్థము సత్పదార్థము. యే పదార్థము విషయమగుబుద్ధి యొకా నొకపుడు నశించునో (మార్పును చెందునో) ఆ పదార్థము అసత్పదార్థము. యెట్లన ఘటమునందు ఘటబుద్ధి కలుగుచున్నది. అయ్యది ఘటము నశించినతోడనే నశించి అందు కపాలబుద్ధి యుదయించుచున్నది కావున ఘటవిషయమగు బుద్ధి నశించినందున ఘటము అసత్పదార్థ మనబడుచున్నది. ఇట్లు అదే ఘటమునందు ఘటస్సన్ అను వ్యవహారమువలన కలుగు సద్బుద్ధి యెన్నటికిని నశించుటలేదు. ఘటము

నశించినను పటమునాశ్రయించి సద్బుద్ధి యుదయించుచునే యున్నది. కావున సద్బుద్ధి నశించనందున తద్గోచరమగు సత్పదార్థము సద్రూపముగాని యసద్రూపముగాదు. కావున బుద్ధులు మార్పును జెందుట. మార్పును జెందకుండుటను బట్టి పదార్థములయొక్క సద్రూపత్వాసద్రూపత్వములు నిర్ణయమగుచున్నందున సదసద్విభాగము బుద్ధి తన్త్రమని యాచార్య పాదులు నిర్వచించిరి. "నీల ముత్పలమ్" అను వ్యవహారమువలన ఒకే పదార్థమునందు నీలబుద్ధి, యుత్పల బుద్ధి కలిగినట్లు "సన్ ఘటః, సన్ పటః" ఇత్యాది వ్యవహారమువలన ఒకే ఘటపటాది పదార్థములయందు సద్బుద్ధి, ఘటబుద్ధి అను రెండుబుద్ధులు కలుగుచున్నవి "నీలముత్పలం" అను ప్రయోగమువలె సామానాధికరణ్య సంబంధముచే సన్ ఘటః, సన్ పటః, సన్ హస్తీ ఇత్యాది వ్యవహారములయందంతటను రెండుబుద్ధులు తెలియబడుచున్నవని భాష్యాన్వయము. సామానాధికారణ్యమన అభేద సమ్బన్ధమని యర్థము నీలముత్పల మను చోట నీలత్వోత్పలత్వములకు సామానాధికరణ్యమువలన నీలాభిన్నమగు ఉత్పల మనిశాబ్దబోధ చెప్పినట్లు 'సన్ ట' ఇత్యాదులయందుగూడ సత్త్వఘటత్వములకు సామానాధికరణ్య ముండుటవలన సదభిన్నమగు ఘటము అని శాబ్దబోధ చెప్పవలయును. నీలోత్పలములకువలె సద్ఘటములకు సామానాధికరణ్యము కలుగుచుండగా తద్బుద్ధులకుగూడ సామానాధికరణ్యము సంభవించును. ఒకే నిలోత్పలపదార్థమునందు నీలబుద్ధియు, ఉత్పలబుద్ధియు పుట్టినట్లు, ఒకేఘటమునందు సద్బుద్ధి ఘటబుద్ధులు కలిగినందున నీ బుద్ధులకుగూడ సామానాధికరణ్యము యుక్తము.

అ. ఇట్లుండ సద్బుద్ధి, ఘటబుద్ధులలో ఘటబుద్ధి వ్యభిచరించుచున్నది. సద్బుద్ధి పటబుద్ధులలో పటబుద్ధి వ్యభిచరించుచున్నది.

సద్బుద్ధి హస్తిబుద్ధులలో హస్తిబుద్ధి వ్యభిచరించుచున్నది. (వ్యభిచరించుట యనగా నాశమునుచెందుట లేక మార్పును జెందుట అని యర్థము) ఈ బుద్ధుల యందు విషయములగు ఘట పటాదులు వ్యభిచరించినందున బుద్ధులుగూడ వ్యభిచరించినవని తత్త్వము. ఘట పటాదులు కాలత్రయమునందు లేనందున తద్విషయకమగు బుద్ధులుగూడ కాలత్రయమున లేవు. అందువలన బుద్ధులకు వ్యభిచారమని యాశయము.

ఘటము ఉత్పత్తికంటె పూర్వము మృద్రూప మగుటవలన మృద్బుద్ధి విషయమును నాశానన్తరము చూర్ణరూపమగుటవలన చూర్ణబుద్ధివిషయమును అగుచున్నది. వర్తమానకాలమునందు ఘటరూపముగా (కంబుగ్రీవాద్యాకారము కలదిగా) నుండుటవలన ఘటబుద్ధివిషయ మగుచున్నది. ఇట్లు ఘట తద్బుద్ధులు అనియత

విషయములయి అనియత రూపములుగా నున్నందున వ్యభిచరించుచున్నవని యాశయము.

ఏ వస్తువు యెల్లప్పుడును యేకరూపముగా నుండునో నయ్యది వ్యభిచారము లేనిది (నాశము లేనిది). ఎయ్యది అనియతరూపముగా నుండునో అది వ్యభిచరించును అని సిద్ధాంతము.

సద్బుద్ధి యెల్లపుడును నియతమగు సత్పదార్థమే విషయముగా గలదగుట వలన నియతరూప మయినది గనుక వ్యభిచారిగాదు.

ఘటపటాది బుద్ధులు వ్యభిచరించుచున్నందున తద్విషయములగు ఘటపటా దులు అసద్రూపములు. సద్బుద్ధి వ్యభిచరించనందున తద్విషయమగు సత్పదార్థము అసత్ గాదు సద్రూపమే యగును.

కావున అసద్బుద్ధివిషయమగు ఘటాదికార్యజాతము, మృదాదికారణజాతము అసద్రూపములయినను, సద్బుద్ధివిషయమగు పరమకారణమయిన బ్రహ్మపదార్థము సద్రూపమగుటవలన శూన్యవాదము ప్రసక్తించ దని తేలినది. ఇచట నీయది గ్రహిం పవలయును. కారణధర్మములు కార్యమునందు సంక్రమించును. మృద్ధర్మ మగు కాఠిన్యనైల్యాదికము ఘటమునందు సంక్రమించుచున్నది. "ఇట్లేఆత్మ న ఆకాశస్స మ్భూతః" ఇత్యాది శ్రుతి ప్రమాణమువలన సర్వజగత్కారణమును సచ్చిదానంద రూపుడును అగు ఆత్మయొక్క ధర్మములగు సత్తాచైతన్యానందములు కార్యమగు జగత్తు యందుగూడ సంక్రమించుచున్నవి. గనుకనే ఘటముకలదు. ఘటము ప్రకా శించుచున్నది. ఘటము ప్రియమయినది. అను వ్యవహారము పొసగుచున్నది. ఈ వ్యవ హార బలమువలన ఘటాది కార్యజాతమునందు వినబడుచున్న సత్తాభానానందము లను ఆత్మధర్మములు ఆత్మభిన్నమగు కార్యజాతమునందు ఉన్నవివలె తోచుచున్నవి కాని నిజముగ విచారించినచో కార్యజాతమునందు లేవు. మృద్ధర్మములగు కాఠిన్యాదులు ఘటాకారముగ పరిణమించిన మృత్తుయందే యున్నవిగాని కంబు గ్రీవత్వాద్యాకారమునందు లేవు. అట్లే ఘటాదులయందు ప్రతీయమానము లగు చున్న సత్తాచైతన్యానందములు, ఘటాద్యవచ్ఛిన్నచైతన్యమగు నాత్మయందే కలవు. కావున ఘటస్సన్ అని ఘటమునందు తెలియబడుచున్న సత్త ఆత్మసత్తయేగాని ఘటసత్తగాదు. ఆ సత్తకంటె ఘటమును వేరుపరచినచో నసద్రూపమగు ఘటమే మిగిలియుండును. ఇట్లే జగత్తంతయును కారణమగు చైతన్యసత్తచేతనే సత్ అని చెప్పబడుచున్నది. చైతన్యసత్తలేనిచో జగత్తు అసద్రూపమే యగును. మరియు మృద్ఘటః అనుప్రయోగము వలె "స్వర్ణఘటః" అను ప్రయోగముకూడ కార్య కారణముల యొక్క అభేద ప్రయుక్తమయినది. గనుకనే నిచట సచ్ఛబ్దము ఘటా

భిన్నమగు ఆత్మనే బోధించుచున్నది. 'మృద్ఘటః' అనుచోట మృచ్ఛబ్దము ఘట భిన్నమగు మృత్తునే యెట్లుబోధించుచున్నదో అట్లే, తత్త్వదృష్టి లేనివారలు మాత్రము ఇచట భ్రాంతిజెంది ఘటమునే సద్రూపమయినదానినిగా తలచుచున్నారు.

అ. విద్యమానమగు ఘటమునందు సద్ఘట అను వ్యవహారమువలన సద్బుద్ధి ఘటబుద్ధి యను బుద్ధిద్వయము కలుగుచున్నది. అందు ఘటమునశించినతోడనే ఘటబుద్ధి నశించినట్లు ఘటమునందుకలిగిన సద్బుద్ధి కూడ నశించుచునే యున్నది. ఘట నాశానన్తరము ఘటస్సన్ అనుబుద్ధి యేరికిని యుదయింపదు. కావున ఘట బుద్ధివలె సద్బుద్ధికూడ వ్యభిచరించుచున్నందున ఘటబుద్ధివిషయమగు ఘటము అస ద్రూపమనినట్లు సద్బుద్ధివిషయమగు సత్ పదార్థముకూడ అసద్రూపమే కావలసి యుండును అని శంకరాగా భాష్యకారులు "న పటాదావపి సద్బుద్ధి దర్శనాత్" అని సమాధానమును జెప్పుచున్నారు. పటాదులయందుగూడ సద్బుద్ధి కనుపించు చుండుటవలన సద్బుద్ధి వ్యభిచరింపదు అని యన్వయము. ఘటనాశమువలననే ఘటబుద్ధి నశించినట్లు ఘటమునందు కలిగిన సద్బుద్ధికూడ నశించినచో "పటస్సన్". అని పటబుద్ధి సామానాధికరణ్యముచే సద్బుద్ధి యుదయింపనేరదు. "పటాదా"వను భాష్యపంక్తికి పటబుద్ధి సామానాధికరణ్యముచే నని యర్థము జెప్పవలయును. యథాశ్రుతార్థమును అంగీకరించినచో పటము సద్బుద్ధియందువిషయము కావలసి వచ్చును. అయ్యది యనిష్టమగును. ఘటనాశమువలన సద్బుద్ధి నశించకుండుటలో కారణాంతరముగూడ గలదు. "సద్ఘట" ఇత్యాది ప్రయోగములయందు సచ్ఛబ్దార్థము విశేషణము ఘటాదులు విశేష్యములు కావున సద్బుద్ధి విశేషణ విషయమని యంగీకరింపవలయును. "నీలోత్పలం" "నీలాంబరం" మున్నగు ప్రయోగములయందు విశేష్యవిషయమగు ఉత్పలాదిబుద్ధి నశించినను, విశేషణ విషయమగు నీలాదిబుద్ధులు యెట్లు నశించుటలేదో అట్లే "సద్ఘట" ఇత్యాదులయందు విశేష్యవిషయకమగు ఘటాదిబుద్ధులు నశించినను విశేషణవిషయకమగు సద్బుద్ధి మాత్రము నశింపదు.

ఘటనాశానన్తరము సద్బుద్ధి పటాదులయందు గనుపడినట్లు ఘటబుద్ధికూడ ఘటాన్తరమునందు గనుపించుచున్నందున ఘటబుద్ధి మాత్రము వ్యభిచరించినట్లేల యని శంకింపరాదు. ఘటబుద్ధి ఘటాంతరములందు గలుగుచున్నను సద్బుద్ధివలె పటాదులయందు కనుపడుటలేదు. సద్బుద్ధిమాత్రము ఘటాన్తరముల యందును పటాదుల యందునుగూడ నుపలభ్యమానమగుచున్నది. అందువలన ఘటబుద్ధికి సద్బుద్ధి సామ్యములేదు. అందువలన ఘటబుద్ధి వ్యభిచరించినదనియే నిర్ణయమని భావము.

అ. ఓయి! విద్యమానఘటమునందు "సన్ ఘటః" అని సద్బుద్ధి ఘటబుద్ధులు కలుగుచున్నవి. ఘటనాశానన్తరము "నష్టో ఘటః" అని నష్టఘటబుద్ధి మాత్రమే కలుగుచున్నది, గాని యచట సద్బుద్ధి కలుగుటలేదు. అట్లు కలుగుచో "సన్నష్టః ఘటః" అని వ్యవహారముండవలెను. అట్టి వ్యవహార మెచ్చటను లేదు. కావున సద్బుద్ధికి నష్టఘటబుద్ధి సామానాధికరణ్యము లేనందున సద్బుద్ధికూడ నష్టఘట బుద్ధితో వ్యభిచరించినట్లేకదా యని యాక్షేపము సమాధానము. సద్బుద్ధి విశేషణ విషయకమని యింతకుమున్నే చెప్పబడినది. విశేషణము యెప్పుడును విశేష్య మున్నపుడుగాని ప్రసక్తించదు. నష్టఘటస్థలమున విశేష్యమగు ఘటమే నశించినందున విశేషణమునకు ప్రసక్తియే లేదు. కావున నచట విశేషణవిషయకమగు సద్బుద్ధి పుట్టుటలేదు. ఇంతియె గాని విశేష్యమగు ఘటమువలె విశేషణమగు సత్పదార్థము కూడ నశించినందునమాత్రము గాదు. సద్బుద్ధికి విషయమగు సద్వస్తువు బ్రహ్మమే. అయ్యది నిత్యము, యెప్పుడును నశించునదిగాదు. గనుక సద్బుద్ధికి వ్యభిచారమును శంకించుట యుచితముగాదు. నిత్యమగు సద్వస్తు మస్వతన్త్రమయినను అజ్ఞాన ప్రయుక్తమగు లోకవ్యవహారమువలన ఘటపటాదులకు విశేషణ మగుచున్నది.

అ. ఓయి! "నాసతో విద్యతే భావః" అను న్యాయమువలన అసద్రూపము లగు ఘటాదులకు సత్వములేనిచో నట్టి యసద్రూపములగు ఘటాదులతో సద్రూపుడగు బ్రహ్మకు "సన్ఘటః, సన్పటః, సన్హస్తి" ఇత్యాది ప్రయోగములవలనదెలియ బడు సామానాధికరణ్యము యె ట్లుపపన్నమగును? అని యనరాదు. (అనగా విశేష్యములగు ఘటాదులు లేనపుడు విశేషణ విశేష్యములగు సద్ఘటములకు సామానాధికరణ్య మయుక్తమని శంకాశయము) "ఇద ముదకం, ఇదం రజతం, అయం సర్పః" ఇత్యాదులయందు అన్యతరమగు ఉదక రజత సర్పాదులు లేకున్నను అధిష్ఠానమగు ఇదమంశముతో సామానాధికరణ్యము దృష్టమగుచున్నది. అనగా "మరీచికోదకం" "శుక్తిరజతం", "రజ్జుసర్పః" అను ప్రతీతి యెచ్చటను లేదు. అధిష్ఠానవిశేష జ్ఞానముచే ఆరోప్యవిశేషజ్ఞానము బాధింపబడును. మరేమనిన "ఇదం రజతం," "ఇద ముదకం", "అయంసర్పః" అనియే ప్రతీతి కలదు, అధిష్ఠానసామాన్యజ్ఞానము ఆరోప్యవిశేషజ్ఞానమును బాధింపజాలదు. గనుక పైప్రతీతులయందు అధిష్ఠానమగు ఇద మంశమేమాత్రమే కలదు. ఆరోప్యములగు ఉదకాద్యంశములులేవు. సర్పాదిప్రతీతికి పూర్వము సర్పాదిబాధానన్తరమున్ను రజ్జ్వాదులే యుండుటవలన, సర్పాది ప్రతీతి కాలమునందు గూడ యథార్థముగ రజ్జ్వాదులే యున్నందున కాలత్రయమునందును సర్పాదులు లేనందునను, సర్పాదులు వ్యభిచరితములు. రజ్జ్వాదులు కాలత్రయము నం దుండుటవలన అవ్యభిచరితములు. కావున వ్యభిచరించునట్టి సర్పాదులతో వ్యభిచరించనట్టి ఇదమంశమగు అధిష్ఠాన సామాన్యాంశమునకు సామానాధికరణ్యము

"అయం సర్పః" ఇత్యాది ప్రతీతులవలన తెలియబడుచున్నది. అట్లే "బ్రహ్మఘటః", "బ్రహ్మపటః", "బ్రహ్మహస్తి" అను ప్రతీతి యెచ్చటను లేదు. "సద్ఘటః", "సన్ పటః," "సన్ హస్తి" అనియే ప్రతీతి కలదు. ఇందు విశేషణమగు సదంశము మాత్రమే సద్రూపము. విశేష్యములగు ఘటాద్యంశములు అసద్రూపములు. విశేషణమగు సద్రూపపదార్థమునందు విశేష్యములగు ఘటపటాదులు కల్పింపబడినందున అధిష్ఠానమగు సద్రూపవిశేషణాంశము ఘటాదివిశేష్యాంశములను బాధింపజాలదు. గనుక నారెంటికిని సామానాధికరణ్య ముపపన్నమగును. శ్లోకముయొక్క ప్రథమ పాదార్థమును ముగింపుచున్నారు. "తస్మాద్దేహాదేః" అను వాక్యమువలన కార్యజాత మంతయు అసద్బుద్ధివిషయమగుచు వ్యభిచరించుటవలన, కారణసహితమగు శీతోష్ణాది ద్వంద్వ పదార్థమునకు, కారణసహితమగు దేహేంద్రియ మన ఆదికమునకును సత్త్వములేదని భావము. ఘటాదికము ఉత్పత్తికి పూర్వము నాశానన్తరమున్ను, అసద్రూపమగుచు మధ్యకాలమునందుగూడ కారణమగు మృదాదులకంటె భిన్న రూపముతో లేనందున యెట్లు అసద్రూపమగుచున్నదో, అట్లే దేహాదికము గూడ, జన్మకంటె పూర్వము, మరణానన్తరమున్ను అసద్రూపమగుచు, మధ్యకాలమునందు గూడ కారణభూతమగు పృథివ్యాదులకంటె భిన్నరూపముతో లేనందున దేహాదులు గూడ వ్యభిచరించునవి, యని గ్రహింపవలయును.

అ. శ్లోకముయొక్క ద్వితీయపాదమునకు అర్థమును చెప్పుచున్నారు. తథేత్యాది గ్రంథముచే తథా శబ్దము పూర్వవాక్యార్థసమాప్తిని తెలుపును. అథవా అసత్పదార్థమునకు సత్త్వము యెట్లులేదో అట్లు అస దృష్టాంతమును బోధించును. ఆత్మ సచ్చిదానందరూపు డగుటవలన సత్పదార్థ మని భావము. సర్వత్ర అవ్యభిచార మనగా సర్వకాలములయందు, సర్వదేశములయందు, సర్వవస్తువులయందు ఉండుట యని యర్థము. ఇట్టి యాత్మకు అభావము లేదని "యద్విషయాబుద్ధి ర్న వ్యభిచరతి తత్సత్" అను వాక్యముచే భాష్యకారు లింతకు మున్నే చెప్పియుండిరని భావము.

అ. శ్లోకముయొక్క తృతీయ చతుర్థ పాదముల కర్థమును జెప్పుచున్నారు. "ఏవ మాత్మా నాత్మానోః" అను భాష్యగ్రంథముచే యిట్లు సదసద్రూపములగు ఆత్మానాత్మ పదార్థముల రెండింటియొక్కయు నిర్ణయము తత్త్వవేత్తలచే దెలియబడినది, అని నిశ్చయార్థము సత్పదార్థమేననియు, అసత్పదార్థము అసత్పదార్థమే ననియును, తత్త్వవేత్తలు తెలిసికొనిరి. సదసత్పదార్థములకు సామానాధికరణ్య జ్ఞానము మాత్రము అజ్ఞానవిలసితమని భావము. "సద్ఘటః, సత్పటః, సద్ధస్తి." ఇత్యాదికము సామానాధికరణ్య జ్ఞానాకారమని గ్రహింపవలయును.

శ్లోకమునందలి "అనయోః" అను శబ్దమునకు భాష్యకారులు "యథోక్తయోః" అను పదముచే నర్థమును చెప్పిరి. అనగా అభావరహితమయిన దనియు, భావరహితమయిన దనియు, శ్లోకముయొక్క ద్వితీయ ప్రథమ పాదములచే ప్రతిపాదింపబడిన సదసత్పదార్థములయొక్క "అని యర్థము" "తత్త్వదర్శి" శబ్దమున కర్థమును చెప్పుచున్నారు. "తదితి సర్వనామ" ఇత్యాది గ్రంథముచే తచ్ఛబ్దముచే పరామర్శింపదగిన యోగ్యతగల ప్రకృతమగు నియతవస్తువు లేనందున తచ్ఛబ్దము సర్వనామ యని చెప్పబడినది. సర్వనామ శబ్దమున కర్థమును జెప్పుచున్నారు. "సర్వంచ బ్రహ్మ" ఇత్యాది వాక్యముచే = (సర్వస్య+నామ) సర్వము యొక్క నామము గాన సర్వనామ అని షష్ఠీ సమాసము. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను శ్రుతివలన సర్వము బ్రహ్మకార్యమగుటచే కారణమగు బ్రహ్మతో నభిన్నమగుటవలన సర్వము బ్రహ్మమే. అథవా సర్వము బ్రహ్మయందు కల్పింపబడుటచే కల్పితమగు జగత్తు అధిష్ఠానమగు బ్రహ్మతో నభిన్నమగుటవలన సర్వము బ్రహ్మమే.

ఇట్లైనచో తచ్ఛబ్దము సర్వనామమగుటచే బ్రహ్మనామమయిన యెడల (బ్రహ్మను చెప్పనెడల) ఉభ, ఉభయ, కతర, కతమాది శబ్దములు గూడ సర్వనామములగుటచే బ్రహ్మవాచకము లేల గాకూడదు? ఇష్టాపత్తి యనినచో ఉభ, ఉభయాది శబ్దములను మెచ్చటను బ్రహ్మయందు బ్రయోగింప నందున నది యుచితము గాదు, అని యాక్షేపమురాగా సమాధానము జెప్పబడుచున్నది. "సర్వాదీని సర్వనామాని" అను వ్యాకరణపరిభాష నాశ్రయించి తచ్ఛబ్దమునకు యిచట సర్వనామత్వమును నొప్పి యందువలన తచ్ఛబ్దమునకు బ్రహ్మవాచకత్వమును జెప్పినచో నపుడు పై దోష మాపాదించవచ్చును. కాని యిచట సామాన్యముగా సర్వవస్తువులను జెప్పునట్టి దగుటవలననే నేర్పడిన సర్వనామత్వమును పురస్కరించుకొని తచ్ఛబ్దమునకు బ్రహ్మవాచకత్వము చెప్పబడినందున పైదోష మాపాదింపదు. "తస్యభావః తత్త్వం" అని భాష్యపంక్తి = ఓయి! బ్రహ్మ నిర్ధర్మకమగుచుండగా బ్రహ్మవాచకమగు తచ్ఛబ్దముకంటె ధర్మార్థమునందు (భావార్థమునందు) త్వప్రత్యయము నెట్లు నొప్పిరి. అను ప్రశ్నకు సమాధానము "బ్రహ్మణో యాథాత్మ్యం" అని, ఇచట భావార్థకమగు త్వప్రత్యయముచే బ్రహ్మయొక్క యథార్థ స్వరూపముచెప్పబడుచున్నది. అయ్యది బ్రహ్మాతిరిక్తమగు ధర్మము గాదు. యాథాత్మ్య మనగా యథార్థస్వరూపము. అయ్యది బ్రహ్మయొక్క సచ్చిదానందరూపము. నిర్ధర్మకమగు బ్రహ్మయందు సచ్చిదానంద రూపత్వమను ధర్మము మాత్రము యెట్లుండును? అని యనరాదు. "ఆనందో విషయానుభవో నిత్యత్వంచేతి తద్ధర్మాః అపృథక్త్వేఽపి చైతన్యాత్ పృథగివా ఆభాన్తి" అను ప్రమాణమువలన "ఆనందము, విషయముల ననుభవించుట నిత్యత్వము" అను ధర్మములు ఆత్మయందు గలవు. కాని యయ్యవి

చైతన్యముతో నభిన్నము లయినను భిన్నములవలె గోచరించును అని చెప్పబడు చున్నది. కావున సత్, చిత్ ఆనందము లను ధర్మత్రయము బ్రహ్మకంటె వేరుగా కున్నను మాయవలన వేరుగా భాసించును. గనుక నిర్ధర్మకత్వమునకు భంగములేదు.

ఓయి! బ్రహ్మ సచ్చిదానందరూప మగు గాక. బ్రహ్మధర్మములగు సత్త, చిత్త, ఆనందములు బ్రహ్మాఽభిన్నములగుగాక. కాని సచ్చిదానందరూపుడగు బ్రహ్మమునందు సచ్చిదానందరూపత్వ మను ధర్మముండగా బ్రహ్మ నిర్ధర్మక మెట్లగునని? మేమడుగుచుంటిమి- అనినచో అట్లుగాదు. బ్రహ్మధర్మములగు సత్తాచిత్త్వానందములెట్లు బ్రహ్మాఽభిన్నములో, సచ్చిదానందరూపత్వధర్మము గూడ నట్లె బ్రహ్మాభిన్న మగుచున్నది. సచ్చిదానందరూపత్వమను ధర్మము సత్తాచిత్త్వానందములకంటె వేరు గాదు. కావున సచ్చిదానందరూపత్వమున్నను నిర్ధర్మకత్వమునకు భంగములేదు. ఈ శ్లోకమునందు బ్రహ్మయొక్క సద్రూపత్వమే విస్తరింపబడినది. (విపులముగా జెప్పబడినది.) చిద్రూపత్వానందరూపత్వము లిందు జెప్పబడలేదు. ఆ రెండును ముందు గ్రంథమునందు విపులముగా చెప్పబడగలవని గ్రహింపవలయును. "తత్త్వ దర్శినాం దృష్టి మ్మాశ్రిత్య" భా॥పం॥ యిచట దృష్టియన మతమని యర్థము. అనగా జ్ఞానమని నిశ్చయార్థము. బ్రహ్మాతిరిక్తమగు ప్రపంచమంతయు ప్రత్యగభిన్నమనియు బ్రహ్మయొక్కడే సద్రూపమనియును జ్ఞానమును దెచ్చుకొని శోకమోహములను విడువుమని భావము.

ఆనందగిరిమతము: ఈ శ్లోకముయొక్క ప్రథమ పాదార్థవివరణప్రకరణమున శ్రీశాఙ్కరభాష్యమునందు "సర్వత్ర ద్వే బుద్ధీ సర్వైరుపలభ్యేతే సామానాధికరణ్యేన నీలోత్పలవత్" అను పంక్తి కలదు. అందు ఆనందగిరిపండితులు "సామానాధికరణ్యేన" అను చోట 'సమానాధికరణేన' అను పాఠము నాశ్రయించి "సమానాధికరణేన" అని పదవిభాగమునుజేసి అందు సమానాధికరణే అను పదమును "బుద్ధీ" అను ద్వివచనాంతపదమునకు విశేషణ మొనర్చి "సన్ఘటః సన్పటః సన్హస్తీ" అని ఈ ప్రకారము వ్యవహారభూమియందంతటను సమానాధికరణములగు ఏకవస్తు బోధకములగు రెండు బుద్ధులు అందరిచేతను దెలియబడు చున్నవి. "ననీలోత్పలాదివత్" నీలోత్పలాది బుద్ధులవలె గాదు, అని యన్వయమును కల్పించిరి. మరియు పదములయందలి సామానాధికరణ్యము బుద్ధులయం దారోపింపబడుచున్నది. "సోఽయం దేవదత్త" ఇత్యాది సామానాధికరణ్యము వలె 'ఘటస్సన్' ఇత్యాది సామానాధికరణ్యము ఏకవస్తు బోధకము. వస్తుభేద మున్నపుడు సామానాధికరణ్యము పొసగదు. పరస్పరము భిన్నవస్తువులగు ఘటపటములకు సామానాధికరణ్యము సంభవించుట లేదు. మరియు "నీలముత్పల" మను సామానాధికరణ్యము నీలోత్పలములకు గల ధర్మ ధర్మిభావమును బోధించు

నట్లు "సర్వఘటః" ఇత్యాది సామానాధికరణ్యములుగూడ ధర్మధర్మి భావబోధకములుగ చరితార్థములగుచుండ, "సోయం దేవదత్తః" ఇత్యాదులవలె ఏకవస్తు బోధకములని యననేల? యని శంకింపరాదు. సామాన్యవిశేషముల కత్యంత భేదమున్నను, అత్యంతాభేదమున్నను, సామాన్యవిశేషభావము పొసగదు. విరుద్ధములగు భేదాభేదము లొకచోట నుండనేరవు. కావున జాతివ్యక్తులకు సామానాధికరణ్యము నీలోత్పలములకువలె గౌణము కాదు. మరేమనిన వ్యావృత్తములు అనువృత్తపదార్థమునందు కల్పింపబడినవను న్యాయముచే నిచ్చోట సామానాధికరణ్యము ఏకవస్తు నిష్ఠమే యగును. సామాన్యవిశేషములకు జెప్పిన న్యాయమును గుణగుణ్యాదులయందు గూడ భాష్యకర్త లుపదేశించుచున్నారు. 'ఏవ' మనుపదము వలన అని యానందగిరిపండితులు వ్యాఖ్యానమును జేసిరి. ఈ వ్యాఖ్యానమునందలి యుక్తాయుక్తములు విచారింపబడుచున్నవి.

"సమానం అధికరణం యయోః తయోర్భావః సామానాధికరణ్యమ్" అను వ్యుత్పత్తి వలన ఏపదార్థములకు అధికరణము ఒక్కటియో ఆ పదార్థములు సమానాధికరణము లనబడుచున్నవి వాటియొక్క ధర్మము సామానాధికరణ్యము. ఈ వ్యుత్పత్తివలన సామానాధికరణ్యము యెప్పుడును వస్తుద్వయమునందే యుండును. అయ్యది రెండుపదములకు గల విశేషణ విశేష్యభావసంబంధముచే అభేదాన్వయమునకు గారణ మగుచున్నది. "నీలముత్పల" మను చోట 'నీలాభిన్నమ్ ఉత్పలమ్' అను శాబ్దబోధ కలుగుటవలన, నీలత్వ ఉత్పలత్వములు ఏకాధికరణమునందుండుటచే వాటి సామానాధికరణ్యము నీలోత్పల పదార్థద్వయమునం దుండినట్లు. పదార్థములకు నేకాశ్రయత్వ మున్నపుడు గాని పదములకు యేకాశ్రయత్వము సంభవింపదు. పదములకు సామానాధికరణ్యము పదార్థము లత్యంత భిన్నములయినను అత్యంతాభిన్నములయినను సంభవింపదు. కనుకనే "ఘటః పటః" అని గాని "ఘటో ఘటః" అని గాని లోకమునం దెచ్చటను ప్రయోగము లేదు. అట్లైనచో గుణగుణులగు నీలోత్పలములకు పరస్పర భేదముండుటవలన "నీలముత్పలమ్" అని సామానాధికరణ్య ప్రయోగమెట్లు కలిగినది? అని ప్రశ్నింపరాదు. ఇచట నీల పదము నీలగుణముగల ద్రవ్యమును బోధించుచున్నది. "అధ త్రిషు ద్రవ్యే" అను నమరకోశము గూడ నీలాదిపదములు ద్రవ్యవాచకము లయినపుడు మూడు లింగములయందుండు నని శాసించుచు గుణవాచకమగు నీలాది పదములకు ద్రవ్యవాచిత్వమును గూడ నొప్పినది. లేక లక్షణావృత్తిచే నయినను నీల పదము నీల గుణము గల ద్రవ్యమును బోధింపవచ్చును. అందువలన నీలగుణముగల ద్రవ్యముతో నభిన్నమయినది యుత్పలము అను శాబ్దబోధ సిద్ధించుచున్నది. కావున పదార్థముల

యొక్క సామానాధికరణ్యము అంతటను సామాన్యవిశేషభావాధీనమేగాని వస్తువు యొక్క అభేదాధీనము గాదని స్పష్టము.

అదెట్లన "నీలముత్పల" మను చోట నీలపదము నీలగుణముగల ద్రవ్యసామాన్యమును జెప్పును. ఉత్పలపదము ద్రవ్యవిశేషమును జెప్పును. ఈ రెంటికిని సామానాధికరణ్యము "గౌర్ముణ్డః" అనుచోట గోపదము గోత్వమను సామాన్యధర్మము గల వ్యక్తి మాత్రమును జెప్పును. ముణ్డపదము వ్యక్తి విశేషమును జెప్పుచున్నది. ఇట్లే "మృద్ఘటః" అనుచోట మృత్పదము మృత్సామాన్యమును జెప్పును. ఘట పదము కంబుగ్రీవాద్యాకారవిశేషముగల మృద్విశేషమును జెప్పుచున్నది. "అయం సర్పః" అను చోట ఇదమ్‌శబ్దము యెదుటనున్న వస్తుసామాన్యమును జెప్పును. సర్పశబ్దము వస్తువిశేషమును జెప్పుచున్నది. "సన్ ఘటః" అనుచోట సచ్ఛబ్దము సత్తా గల వస్తుమాత్రమును జెప్పును. ఘటశబ్దము తద్విశేషమును జెప్పుచున్నది.

అథవా "మృద్ఘటః" ఇత్యాదులయందు మృత్తు కారణము, ఘటము, కార్యము గాన నీ రెంటికిని కార్యకారణభావము వలన సామానాధికరణ్యమనియు, ఇతర స్థలములయందు మాత్రము సామాన్య విశేషభావమువలననే సామానాధికరణ్యమనియును యనినచో గావచ్చు కాని ధర్మధర్మిభావమువలనగాని గుణగుణిభావము వలన గాని సామానాధికరణ మెచ్చటను యుండదు. గుణగుణులు ధర్మధర్ములు అత్యంతము పరస్పర భిన్నము లగుటవలన. అట్లైనచో కార్యకారణములకుగాని సామాన్యవిశేషములకు గాని మిక్కిలి భేదమేనని యనరాదు. మృదాదులతో ఘటాదుల కత్యంతభేదము గన్పట్టుటలేదు. అత్యన్తాభేదమును గనుపించుటలేదు. అట్లత్యన్తాభేదమున్నచో కార్యము కారణము అను భేదవ్యవహారమే నశించును. గనుక భిన్నములని గాని యభిన్నములని గాని నిరూపింప నలవిగాని పదార్థములకే సామానాధికరణ్యము. ఇట్టి సామానాధికరణ్యము "సన్ ఘటః" అను చోటవలె నీల ముత్పల మనుచోట గూడ సమానమే గావున నానందగిరిపండితులు "ననీలోత్పల వత్" అని నీలోత్పల సామానాధికరణ్యమును వ్యతిరేకదృష్టాన్తమునుగా నెట్లు జెప్పిరో తెలియకున్నది.

"సోఽయం దేవదత్తః" అను సామానాధికరణ్య మెట్లు సామాన్య విశేష భావ మును బోధింపక వస్త్వభేదమును బోధించుచున్నదో అట్లే "సన్ ఘటః" అను సామానాధికరణ్యముగూడ సామాన్యవిశేషభావమును బోధింపక వస్త్వభేదమును బోధించున దేల గాకూడదని యనరాదు. 'సోఽయందేవదత్తః' అనుచోట సామానాధికరణ్యమే సంభవింపదు. అందువలననే అచ్చోట భాగత్యాగలక్షణ యంగీక రింపబడినది. "సోఽయం దేవదత్తః" అనుచోట "ఆ దేవదత్తునితో నభిన్నుడు

"దేవదత్తుడు" అని వాక్యార్థమును జెప్పుటలేదు. మరేమనిన దేవదత్తుడనియే వాక్యార్థము జెప్పబడుచున్నది. "సన్ఘట" అనుచోట నట్లు సన్మాత్రమని వాక్యార్థ మంగీకరింపబడుటలేదు. మరేమనిన "సదభిన్నముఘట"మనియే వాక్యార్థ మంగీకరింపబడుచున్నది. తచ్ఛబ్దార్థ ఇదమ్ శబ్దార్థములకువలె సత్త్వఘటత్వములకు పరస్పరవిరోధము లేదు. విరోధమున్నపుడు గదా లక్షణ నాశ్రయించుట ? బ్రహ్మఘటమని జెప్పినచో విరోధము స్ఫురించును. కావున "నీలముత్పలమ్" అను స్థలమునందు వలెనే "సన్ఘట"అను చోటగూడ సామానాధికరణ్య మంగీకరింపవలయును. అంతియెగాని "సోయం దేవదత్తః" అను స్థలమునందువలె సామానాధికరణ్య మంగీకరింపదగదు. "సోఽయం దేవదత్తః" అనుచోట సామానాధికరణ్యమే బాధింపబడినది.

ఓయి! అనువృత్తమగు సత్పదార్థమునందు వ్యావృత్తమగు ఘటము కల్పింపబడుటచే "సన్ఘటః" అనుచోట అనువృత్త వ్యావృత్త భావము నాశ్రయించి సామానాధికరణ్య మంగీకరింపబడినది. "నీలోత్పల"మనుచోట నట్లు అనువృత్త వ్యావృత్త భావము గోచరించుటలేదు గదా. అట్టితరి "సన్ఘటః" అను స్థలమునందలి సామానాధికరణ్యము "నీలోత్పల" మను స్థలమునందలి సామానాధికరణ్యము వంటిదని జెప్పుట యేల పొసగునని ప్రశ్నింపరాదు. లోకమునం దెవడును సత్పదార్థమునందు ఘటము కల్పింపబడినదను నభిప్రాయముతో "సన్ఘటః" అని ప్రయోగించుటలేదు. అట్లైనచో నాఘటము చిత్పదార్థమునందుగూడ కల్పింపబడినదే కావున 'చిద్ఘటః' అనికూడ ప్రయోగింపవలసివచ్చును. శబ్దప్రవృత్తి యెప్పుడును తాత్పర్యాధీనమయినది. మరేమనిన ఘటము విద్యమానమగుటచే "ఘటస్సన్" అని యందరు వ్యవహరించుచున్నారు. అట్టి విద్యమానత్వము ( ఉనికి ) పటాదులయందు గూడ నున్నందున నీ సత్త్వము పటాదులయందు గూడ ననుగత మగుచున్నది. అట్లే నీలత్వము రత్నాదుల యందుగూడ కలదుగాన రత్నాదులయందుగూడ ననుగత మగుచున్నది. కావున నిట్లనువృత్త వ్యావృత్త భావము నీలోత్పలాది స్థలమునందుగూడ నుండగా "సన్ఘటః" ఇత్యాది స్థలమునందలి సామానాధికరణ్యము నీలోత్పలాది స్థలమునందలి సామానాధికరణ్యమువంటిదిగాదని యానందగిరి యేలజెప్పిరో దెలియకున్నది.

"గౌర్ముణ్డః = సన్ఘటః = మృద్ఘటః" ఇత్యాది స్థలములయందు గోరూపమగు వస్తువుగాని, సద్రూపమగు వస్తువుగాని, మృద్రూపమగు వస్తువుగాని ఏకరూపమగుట వలన నచ్చోట సామానాధికరణ్యమే కనిష్ఠమగుగాక. నీలోత్పలాది స్థలముల యందు నీలరూపమగు వస్తువు ఏకరూపముగానందున నచ్చోట సామానాధికరణ్యము ఏకనిష్ఠముగాదని యనరాదు. నీలోత్పల స్థలమునందుగూడ నీలగుణముగల ద్రవ్యము ఏకరూపమని సిద్ధాంతపరచుటవలన బైదోషమున కవకాశమేలేదు.

మరియు "సన్ఘటః" అనుచోట సామానాధికరణ్యము సత్యమిథ్యారూపమగు వస్తుద్వయగతమనియు, నీలోత్పలమను స్థలమునందలి సామానాధికరణ్యము మిథ్యాభూతమగు వస్తుద్వయగత మనియు, గావున నీ రెంటికి భేదమున్నందున "సన్ఘటః" అను స్థలమునందలి సామానాధికరణ్యము "నీలోత్పలాది స్థలమునందలి సామానాధికరణ్యమువంటిదిగాదని ప్రశ్నింపరాదు. "బ్రహ్మఘటః" అనుచోట సామానాధికరణ్యము సత్యమిథ్యావస్తునిష్ఠమయినను, "సన్ఘటః" అను స్థలమునందలి సామానాధికరణ్యము మాత్రము సత్య మిథ్యావస్తునిష్ఠముగాదు. మరియు లోకము నందేపురుషుడైనను "సన్ఘటః" అను స్థలమునందు సచ్ఛబ్దము సత్యమగు బ్రహ్మమును బోధించుననియు, ఘటశబ్దము మిథ్యాభూతమగు ఘటమును బోధించుననియును దెలిసికొనినయెడల, సత్యమిథ్యావస్తువులకు సామానాధికరణ్యము సంభవించ నందున "సన్ఘటః" అని సామానాధికరణ శబ్దమును బ్రయోగింపడు. సత్య మిథ్యా వస్తువులగు నీలనభస్సులకు సామానాధికరణ్యము నభిప్రాయపడి " నీలం నభః " అని సమానాధికరణ శబ్దమును ప్రయోగించినట్లు "సన్ఘటః" అనుచోట కూడ నట్లే సామానాధికరణ్య ప్రయోగ ముపపన్నమగుగాక యని శంకింపరాదు. "నీలం నభః" అను ప్రతీతి భ్రమాత్మకము. "సన్ఘటః" అను ప్రతీతి వ్యవహారమునందు నంతవరకు ప్రమాత్మకము. అందువలన నీ రెంటికిని సామ్యము పొసగదు. లోకమునం దెవ్వ రును సర్పమునందు సర్పబుద్ధియు, రజ్జువునందు సర్పబుద్ధియు నీ రెండును తుల్యములని దలంచరు. కావున "సామానాధికరణ్యేన" అను పాఠమే సాధువును అన్వయక్లేశ రహితమును అయియున్నది. గాని, ఆనందగిరి పండితు లభిప్రాయపడిన "సమానాధి కరణేన" అను పాఠము సమీచీనముగాదు.

రామానుజమతము :- ఈశ్లోకమునకు రామానుజులీ క్రింది విధముగ నర్థ మును జెప్పిరి అసద్రూపమగు దేహమునకు సద్భావములేదు. సద్రూపుడగు నాత్మకు అసద్భావము (అభావము)న్నూ లేదు. అనుభవింపబడుచున్న దేహాత్మల రెండింటియొక్క నిర్ణయము తత్త్వవేత్తలచే అనుభవానుసారముగ గ్రహింపబడినది. నిరూపణమునకు నిర్ణయము పర్యవసాన మగుటవలన నిచట అన్తశబ్దము నిర్ణయా ర్థక మని గ్రహింపవలయును. అచిద్వస్తువగు దేహమునకు అభావమే (అసత్త్వమే) స్వరూపమనియు, చేతనుడగు ఆత్మకు సత్త్వమే స్వరూపమనియును, తత్త్వవేత్తలచే నిర్ణయింప బడినదని భావము. నశించుస్వభావము అసత్త్వమనియు, నశించనిస్వభావము సత్త్వమనియును వివేకము. అని ఇందలి దోషాదోషములను విచారింతము. సద్రూపుడగు నీశ్వరుని వలన బుట్టిన నీపరిదృశ్యమాన మగు ప్రపంచము సద్రూపమే యను సత్కార్యవాది యగు రామానుజులు "అసద్రూప మగు దేహమునకు సద్భావముండ నేరదని యర్థమును వర్ణించుట", తమ మతమును

దాము వీడుటయు పరమతమునందు ప్రవేశించుటయు నను దోషములను బొందు చున్నారు. మరియు అసద్రూపములగు శీతోష్ణాది ద్వంద్వ పదార్థములుండగ, దేహమును మాత్రమే అసద్రూపముగ పరిగణించుట రామానుజుల కయుక్తమగుచున్నది. మూలమునందు "నాసతో విద్యతే భావః" అని వినబడుచున్న భావపదమునకు సద్భావమని యర్థమును వర్ణించుటయు అయుక్తము. అట్లే "అభావః" అను పదమునకు అసద్భావమని యర్థవర్ణనము జేయుటకూడ ననుచితమే యగును. మరియు భావాభావపదములకు సద్భావాసద్భావములని యర్థమును జెప్పినచో యోగ్యత్వ అయోగ్యత్వములను అర్థాన్తరము గూడ ప్రతీయమాన మగును. అయ్యది యప్రకృతము గాన నసంగతమగును. సద్భావ మనగా సత్తయనియు, అసద్భావ మనగా అసత్తయనియు అర్థమును గ్రహించుట అతిక్లేశము. మరియు రామానుజ మతమునందు ప్రకృతిపురుషేశ్వరులు మువ్వురు సత్యస్వరూపు, నిత్యులు నగుచుండ "సతః" అను పదమునకు ఆత్మ యనియర్థమును జెప్పుట అసమీచీన మగును- మరియు వారి మతమునం దాత్మలనేకులని సిద్ధాంతముండ ఆత్మకు నేకత్వమును జెప్పుటయు నసంగతము. మరియు "దేహాత్మనో రుపలభ్యమానయోః" అని దేహాత్మలు రెండును అనుభవింపబడుచున్న వని జెప్పుట కూడ అనుచితము. దేహ ముపలభ్యమాన మయినను (అనుభవింపబడుచున్నను) ఆత్మ ప్రమాత యయినందున నుపలబ్ధ గాని యుపలభ్యమానుడు గానేరడు. ఆత్మగూడ నుపలభ్యమానుడే యయినచో దేహాదులవలె నాత్మగూడ జడపదార్థమే యగును. "తత్త్వదర్శిభిః" అను పదమునకు "యథోపలబ్ధి" అను పదమును శేషపూర్ణము జేయుట అయుక్తము. అట్టి శేషపూర్ణము లేకుండగనే ప్రకృతార్థము లభించుచున్నది. ప్రత్యుత శేషపూర్ణము మూలకారులకు సమ్మతము గాదు. అచిద్వస్తువగు దేహమునకు అసత్వమే స్వరూపమనుటయు దగదు. అసత్వమెప్పుడును గుణముగాని స్వరూపము గానేరదు. "అసత్వమేవ" అను ఏ వకారము వలన స్వరూపాన్తర నిషేధము గూడ దోచుచున్నది, అయ్యది యనిష్టము. అచిద్వస్తువులను అచిత్స్వరూపత్వము గూడ నుండును. అయ్యది నిషేధింప నలవిగాదు. అట్లే ఆత్మకు సత్వమే స్వరూపమనుటయు దగదు. ఆత్మజ్ఞానైకాకారుడగుట వలన వినాశస్వభావము అసత్వమని జెప్పుటయు నుచితముగాదు.

రామానుజమతము: నందు సత్యత్వ నిత్యత్వములు రెండు భిన్నములని యంగీకరింపబడినవి పరిదృశ్యమాన మగు నీ ప్రపంచము సత్యమనియు, అనిత్యమనియు వారి సిద్ధాంతము. గనుకనే నశించని స్వభావము సత్వమనుటయు సమంజసముకాదు. కావున రామానుజుల వ్యాఖ్యాన మనేక దోషదూషిత మగుటచే పరిగ్రాహ్యము గాదని యాశయము.

శ్లో. అవినాశితు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్
వినాశ మవ్యయస్యాస్య న కశ్చి త్కర్తు మర్హతి ॥౧౭॥

అ. భాష్యకారులు శ్లోకమునకు ప్రసక్తిని కల్పించు చున్నారు "కిమ్పునః" అను గ్రంథముచే యేపదార్థ విషయక మగు బుద్ధి యెప్పటికిని వ్యభిచరింపదో ఆపదార్థము సత్పదార్థమని భావము. "అవినాశి వినష్టుం శీలంఅస్య" అనువ్యుత్పత్తిచే తచ్ఛీలార్థమునందు వచ్చిన ణిని ప్రత్యయాన్తము తు శబ్దము సత్పదార్థమునకు విశేషణార్థము- అనగా భేదార్థమని భావము. అనగా అసత్పదార్థముకంటె సత్పదార్థమును భేదింప జేయు విశేషణ మని నిశ్చయార్థము. అసత్పదార్థము లగు ఘటాదులకంటె భిన్నమయినది యీ సత్పదార్థము. ఇయ్యది నాశరహితమని తెలియుము అని పదాన్వయము. అసత్పదార్థములకంటె భిన్నమయిన వస్తువు నాశరహితమయిన దని యర్థము. "విష్ణావ్యాప్త్యైన" విశ్వమును వ్యాపించువాడని విష్ణుశబ్దమునకు నిర్వచనము. "సాకాశ" మను పదము జగత్పదమునకు విశేషణము. కావున ఆకాశముతో గూడిన ప్రపంచము బ్రహ్మచే వ్యాపింపబడినదని యర్థము. బ్రహ్మ జగత్తును వ్యాపించుటలో దృష్టాన్తము ఆకాశము ఘటాదులను వ్యాపించినట్లు అని. "అన్త ర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణఃస్థితః" అను శ్రుతి ప్రమాణము వలన పై యర్థము నిర్ధారణ మగుచున్నది. కావున సర్వవ్యాపకుడును, నారాయణుడును ఆత్మస్వరూపుడును, అగు బ్రహ్మ యెప్పటికిని నశింపని వాడగుట వలన సత్పదార్థమని తెలిసికొనుము. అని ఫలితార్థము. లేనిచో "అవినాశి" యను పదము సచ్ఛబ్దమునకు పర్యాయ పదము కావున సర్వవ్యాపక మగుట వలన బ్రహ్మసత్పదార్థమని తెలియుము- అని యర్థము. అథవా బ్రహ్మపదార్థము నాశరహితమగుటకు నిచట కారణము నిర్దేశింప బడలేదు. ఏది సర్వవ్యాపకమో ఆ బ్రహ్మపదార్థమును నీవు నాశము లేని దానినిగా తెలియుము. బ్రహ్మపదార్థమునకు నాశము లేకపోవుట యెందువలన ననగా భాష్యకారులు సమాధానమును జెప్పుచున్నారు. "వినాశమ్" అను గ్రంథముచే వినాశమనగా కనుపింపకుండుట అనగా (లేకుండుట) అని నిశ్చయార్థము. బ్రహ్మపదార్థమునకు అవ్యయత్వమును నిరూపించుచున్నారు. "నైత దిత్యాది గ్రంథముచే" నవ్యేతి మార్పును జెందనిది గాన నవ్యయము అని, యవ్యయ శబ్దమునకు నిర్వచనము ప్రసిద్ధమయినది. "సదృశం త్రిషు లిఙ్గేషు సర్వాసుచ విభక్తిషు వచనేషుచ సర్వేషు యన్న వ్యేతి తదవ్యయం" అను అమరకోశమువలన అన్ని లిఙ్గములయందు, అన్ని విభక్తులయందు, అన్ని వచనములయందును మార్పుజెందనిది యవ్యయము అని దీని యర్థము "వ్యేతి" అనగా వికారమును చెందునది అనియర్థము. ఈ సచ్ఛబ్దవాచ్య మగు బ్రహ్మ తనరూపముచే వికారమును జెందదు. ఏలయన, నిరవయవ మగుట వలన వ్యతిరేక దృష్టాన్తమును చూపుచున్నారు. "దేహాదులవలె" అని దేహాదులెట్లు తమ యవయవముల యొక్క వృద్ధి, క్షయముల వలన స్వరూప వికారమును బొందుచున్నవో, అట్లు బ్రహ్మపదార్థము నిరవయవు డగుటచే స్వరూప వికారమును

కలుగజేయు సామగ్రి లేకుండుట వలన వికారమును జెందదు. స్వరూప వికార మనగా రూపభేదము, అనగా మరియొక రూపము. ఎట్లు దేహసంబంధములయిన స్థౌల్య కార్శ్యాదులు వికారమును జెందుచున్నవో అట్లు బ్రహ్మసంబంధములయిన పదార్థములు గూడ మార్పును జెందవు. అసఙ్గుడగు ఆత్మకు సంబంధించిన పదార్థమే లేనందున, వ్యతిరేక దృష్టాంతమును జెప్పుచున్నారు. "దేవదత్తో ధనహా న్యా" అని దేవదత్తునకు ధనమునందు మమతాబుద్ధి యుండుట వలన నాధనము దేవదత్తున కాత్మీయ మగును. ఇట్లాత్మీయ మగు ధనము దైవయోగమున నశింపగా ధనస్వామి యగు నా దేవదత్తుడు దుఃఖరూప మగు వికారమును జెందుచున్నాడు. విషయము దృఢపడ గలందులకు దార్ష్టాన్తికమును మరల చెప్పుచున్నారు. "నత్వేవం బ్రహ్మ వ్యేతి" బ్రహ్మమాత్ర మిట్లు వికారమును జెందదు. బ్రహ్మకంటె వేరువస్తువే లేనందువలన ఒకవేళ మాయామయమగు వస్తువున్నను నిష్కాముడగు బ్రహ్మకు మాయామయమగు వస్తువునందు (నాదియనుబుద్ధి) మమతాబుద్ధియే లేనందువలనను, బ్రహ్మకు స్వీయమగు వస్తువేదియు లోకమున లేదు. అట్లున్నచో నావస్తువు నశించి నందున బ్రహ్మవికారమును జెందును. కావున బ్రహ్మ నిర్వికార మని యర్థము. "అవ్యయస్య" అనగా వికార రహితునకు అని యర్థము. కావున బ్రహ్మ అవినాశి యగుటలో నిర్వికారత్వము హేతువని జెప్పబడినదగు చున్నది. మరియొక హేతు వును చెప్పుచున్నారు. "నకశ్చిత్" అని బ్రహ్మను నశింపజేయునట్టివాడు మరియొకడు లేనందున బ్రహ్మ అవినాశి యని యర్థము.

ఓయి! బ్రహ్మకంటె భిన్నమగు అచేతన పదార్థము బ్రహ్మను నశింప జేయు టకు సమర్థమయినది గాకుండు గాక. చేతనుడగు ఆత్మమాత్రము బ్రహ్మను నశింప జేయ సమర్థుడే యగును. అనినచో నట్లుగాదు. చేతనుడగు ఆత్మయే బ్రహ్మ యగుట వలన నట్టి యాత్మ స్వనాశమును తానెట్లు చేసికొనును? తాను (ఆత్మ) అగ్నిహో త్రమున ప్రవేశించిగాని, జలమున మునిగిగాని తనను నశింప జేసికొనుట సులభ సాధ్యమని తలచినచో నదియును పొసగదు. ఆత్మ అగ్నిపతనముచే గాని, జలప్రవే శముచేగాని, దేహమునే నశింప జేసికొనుచున్నాడు. గాని ఆత్మను నశింపజేయుట లేదు. గనుక నాశ్యనాశక భావములు రెండు నొకచోట నుండుట యసంభవము. నాశ్యము నాశక మగుట గాని, నాశకము నాశ్యమగుట గాని యెన్నటికిని సంభ వింపదు.

ఓయి! ఆత్మ బ్రహ్మను నశింపజేయ లేకపోవుగాక, ఈశ్వరుడు మాత్రము సర్వేశ్వరు డగుటవలన బ్రహ్మను నశింపజేయుననినచో నదియును పొసగదు. ఏల యన బ్రహ్మము ఈశ్వరునకు గూడ ఆత్మస్వరూపుడే యగుట వలన (యద్వా)

లేనిచో నెందువలన ఈశ్వరుడు బ్రహ్మ మగుచున్నాడో అందువలన ఈశ్వరుడు ఆత్మయే యగుచున్నాడు. కావున ఈశ్వరుడు ఆత్మాఽభిన్నమగు బ్రహ్మము. ఆత్మ ఈశ్వరాభిన్నమగు బ్రహ్మయే. బ్రహ్మయు ఈశ్వరాభిన్నమగు ఆత్మయే గనుక నీశ్వరబ్రహ్మాత్మలు మువ్వురకు శబ్దములలో పరస్పర భేదమే దప్ప అర్థభేదము లేదు. అట్టి ఈశ్వర,బ్రహ్మాత్మ శబ్దముల కర్థమగు చైతన్యము మాత్రమొక్కటియే గావున బ్రహ్మ నాశకమగు వస్త్వన్తరము లేదని భావము లేక అసమర్థుడగువాడు బ్రహ్మను నశింపజేయలేక పోవుగాక. సమర్థుడు మాత్రము నశింపజేయును అని శంకించినచో సమాధానమును జెప్పుచున్నారు. "సహి" అని ఈశ్వరుడు సమర్థుడయినను బ్రహ్మను నశింపచేయ జాలడని యన్వయము. అందులకు కారణమును జెప్పుచున్నారు. "ఆత్మాహి" అని యెందువలన నీశ్వరునకు గూడ బ్రహ్మయే ఆత్మ స్వరూపుడో అందువలన నీశ్వరుడు గూడ బ్రహ్మను నశింప జేయజాలడు. ఈశ్వరుడే బ్రహ్మయగుటవలన అని భావము.

"ఓయి! ఆత్మ తనను తాను జంపుగొను గాక, అందు దోషమేమి అని యనరాదు. తనయందు తనకు వ్యాపారముండ నేరదు. అయ్యది విరుద్ధము, అసంభవము నగుచున్నది. అందు దృష్టాన్త మేమనగా కంటి సంబంధమగు చూచుట అనుక్రియ కంటికంటె భిన్నమగు ఘటాదులయం దుపయోగించును గాని కంటియందు మాత్ర ముపయోగింపదు. కంటియందలి నలుపు, యెరుపు, తెలుపు రేఖలను కన్ను చూడలేదు. ఇట్లు స్వస్వరూపమునందు స్వవ్యాపారము విరుద్ధమగుచో "ఆత్మవా అరేద్రష్టవ్యః" అనుశ్రుతి ఆత్మయందు దర్శనక్రియను యెట్లు విధించినది? అనినచో నయ్యది దోషముకాదు. దర్శన మనునది జ్ఞానముగాని క్రియగాదు. ఒకవేళ క్రియయయినను మానసికమగు క్రియగాని ఆత్మసంబంధమయిన క్రియగాదు. ఇక మనస్సు తనయందలి కామాదివికారములను తాను దెలిసికొనుచునే యున్నది అనినచో నట్లుగాదు. అచ్చటను మనోగతములగు కామాదివికారములను విజ్ఞానాత్మయే చూచుచున్నాడు గాని మనస్సు జూచుటలేదు. కావున నాత్మ నిర్వికారమగుటవలనను, ఆత్మను నశింపజేయునట్టి పదార్థాన్తరములేనందువలనను సర్వవ్యాపకమగు బ్రహ్మ చైతన్యమొక్కటియే నాశరహితమును, సత్పదవాచ్యమును అగు వస్తువని తెలిసికొనుము. అని నిష్కృష్టమగు అర్థము.

రామానుజ మతము: ఈ శ్లోకమునకు రామానుజు లిట్లర్థమును జెప్పుచున్నారు. చేతనమగు నే యాత్మతత్త్వముచే తద్భిన్నమగు నీ యచేతన మంతయు వ్యాప్తమయినదో, అట్టి యాత్మతత్త్వమును నాశరహిత మయిన దానినిగా దెలిసికొనుము. ఎవ్విధమగు వికారములు లేని యాత్మతత్త్వము, సర్వవ్యాపకము, అత్యన్త

సూక్ష్మము నగుటచే తద్భిన్నమగు నేపదార్థము అట్టి యాత్మతత్త్వమును నశింపఁ
జేయజాలదు. ఆత్మభిన్నమగు పదార్థజాత మంతయు నాత్మతత్త్వముచే వ్యాపింప
దగినదగుటచే నాత్మతత్త్వముకంటె నతిస్థూలమగుచున్నది. అందువలన నయ్యది
యతి సూక్ష్మమగు నాత్మతత్త్వమును నశింపజేయ జాలదు. కావున ఆత్మతత్త్వము
"అవినాశి" అని రామానుజులున్ను ఆత్మకంటె గూడ నతిసూక్ష్మమగు పదార్థము
మరియొకటి యున్నచో నయ్యది యాత్మను నశింపజేయు శక్తిగలది యయ్యెడిది.
అట్టి పదార్థమే లోకమునందు లేనందునను ఈశ్వరునకు ఆత్మను నశింపజేయు సంక
ల్పము లేనందునను ఆత్మకు నాశములేదని వేదాన్తదేశికులున్ను జెప్పుచున్నారు.

ఇయ్యది విచారింతము "అవినాశి తు తద్విద్ధి" అని మూలమునందు నపుంసక
లింగముగా గనుపడుచున్న తచ్ఛబ్దము సద్రూపమగు బ్రహ్మ అర్థమునందు స్పష్ట
మగుచుండ దానిని విడచి అస్పష్టమగు నాత్మతత్త్వమను అర్థమును గల్పించుట
అప్రమాణ మగుచున్నది. ఆత్మను అని యర్థమును జెప్పినందుననే రామానుజుల
యభీష్టము నెరవేరుచుండ నద్దానికి తత్త్వపదమును జేర్చుట వ్యర్థము. మరియు "యేన
సర్వ మిదం తతం" అను ద్వితీయపాదమునందలి "ఇదం" అను పదమునకు "అచేతన
తత్త్వం సర్వం" (అచేతన పదార్థజాత మంతయును) అని యర్థమును జెప్పిరి రామా
నుజులు ఇచట "సర్వం" అనుపదమునకు జీవేశ్వర వ్యతిరిక్త మగు పదార్థ జాత
మంతయు ననిగదా రామానుజాభిమతార్థము. అట్టి జగత్తును వ్యాపించుట సూక్ష్మ
మగుటచే పరిచ్ఛిన్నుడగు జీవున కెట్లు పొసగును? లోకమునం దెచ్చటను పరిచ్ఛిన్న
మగు పదార్థమునకు వ్యాప్తికనుబడుట లేదుగదా? పరిచ్ఛిన్నములగు ఘటపటాదులు
లోకమునందు వ్యాపకములగుట లేదుగదా? సర్వవ్యాపకత్వ మనగా అంతటనుం
డుటగదా? పరిచ్ఛిన్నుడగు జీవుడు అంతట నెట్లుండును? పరిచ్ఛిన్నుడగు జీవుడు
కొయ్య, రాయి, మట్టి మొదలగు నచేతన పదార్థయులయం దున్నటుల గనుపడదు
గదా? అట్లున్నచో నయ్యవిగూడ సచేతనములే యగును. అచేతనములు కానేరవు.
బుద్ధిపరిచ్ఛిన్నుడయి మనోమయ కోశముకంటె లోపలివాడగు విజ్ఞానమయాత్మ
యను జీవుడు మనోమయకోశమును వ్యాపించినచో. వ్యాపించుగాక, అంతియేగాని
తనదేహము నంతయును యెట్లు వ్యాపించును? తనదేహమునే వ్యాపింపజాలనివాడు
అన్యదేహముల నెట్లు వ్యాపించును? ఒకవేళ సర్వదేహములను వ్యాపించునన్నచో
జీవుడొక్కడే సర్వదేహములను వ్యాపించియున్నందున, (నొకడే జీవు డనువాదము)
ప్రసక్తించును.

అట్లుగాక ఆత్మ లనేకులని యొప్పినచో ఆత్మ యంతట నిండియున్నాడను
వాదమునకు భంగము కలుగును. ఆ దోషమును బోగొట్టుకొనుటకు ఆత్మలకు

జాత్యైకత్వమును అంగీకరించి ఆత్మసముదాయముచే కనుపడుచున్న నీ యచేతన పదార్థజాతమంతయు వ్యాప్తమయినదని జెప్పినను అపుడు మూలము నందలి సర్వపదమునకు అర్థము కుదరదు. ఆత్మసముదాయ మంతయు పాషాణము మొదలగు నచేతన పదార్థముల నన్నిటిని వ్యాపింపజాలదు. మనుష్యాది దేహములను మాత్రమె వ్యాపింప సమర్థమగును. అందువలన సర్వపదమునకు మనుష్యాది దేహము లన్నియు అని యర్థ సంకోచమును జేసినచో మూలకారుల యాశయమునకు నిరోధము వాటిల్లును. మరియు జాత్యైకత్వమును జెందిన యాత్మలలో ఒకొ్కక ఆత్మ ఒకొ్కక దేహమును వ్యాపించి యున్నందున ఆత్మకు వ్యాపకత్వము సిద్ధించునని తలంచుట గూడ సమంజసము గాదు. ఒకొ్కక దేహమునకు లోపల నున్న ఆత్మ పెట్టెలో నున్న గుడ్డవలె, వ్యాపకమగుట యసంభవము. ఆకాశము వలె లోపల వెలుపల నున్న వస్తువే వ్యాపక మనబడును. ధూమములేని అయోగోళకమునందు వహ్ని యుండుటచే వహ్ని ధూమము కంటె, వ్యాపక మగుచున్నది. అట్లు దేహములేని గగనాదులయందు చేతనమగు నాత్మ లేకుండుటవలన ఆత్మ దేహముకంటె వ్యాపకు డెట్లగును? పైగా జీవుడులేని శయ్యాదులయందు దేహముండుట వలన దేహమే జీవునికంటె వ్యాపకమగును. మరియు యేది లోపలనుండునో అది వ్యాపకమని జెప్పశక్యముగాదు. అట్లు జెప్పినచో యింటిలోపలనుండు ఘటము గూడ వ్యాపకము గావలసివచ్చును. మరియు జీవుడు అణువయినను స్వధర్మమగు జ్ఞానముచే వ్యాపకు డగుచున్నాడనినచో నదియును యుక్తముగాదు. ధర్మభూతమగు జ్ఞానముగూడ నచేతన పదార్థములయందు లేదు. ఇక సిద్ధాంతమున జ్ఞానస్వరూపుడగు జీవునియందు ధర్మభూతమగు జ్ఞానమే లేదు. జ్ఞానమునందు జ్ఞానముండుట యసంభవము. జీవునియందు ధర్మభూతమగు జ్ఞానమున్నచో జీవుడు జ్ఞానియగును గాని జ్ఞానస్వరూపుడు గానేరడు. తార్కిక మతమున జీవుడు ద్రవ్యముగాన ద్రవ్యమునందు గుణములుండుట యుచితముగాన జీవుడు ధర్మభూతమగు జ్ఞానగుణముగలవాడగుట యుపపన్నమగుచున్నది.

రామానుజమతమునందు జీవుడు జ్ఞానాకారుడని యొప్పియున్నందున అట్టి జీవుడు జ్ఞానగుణముగలవా డెట్లగును? ఒకే జ్ఞానము ఒకేయాశ్రయమునందు స్వరూపభూతము, ధర్మభూతము కానేరదుగదా! ఒకవేళ జీవునియందలి ధర్మభూతమగు జ్ఞానము వృత్తిజ్ఞానమని యంగీకరించినచో నపుడు ఆ వృత్తిజ్ఞానము అంతఃకరణము యొక్క ధర్మముమునుగాని ఆత్మధర్మముగాదని తెలిసికొనవలయును. కావున సూక్ష్మమగు నాత్మ వ్యాపకముగానందున ఆత్మతత్త్వముచే అచేతనపదార్థజాత మంతయు వ్యాపింప బడినదనుట అయుక్తము.

మరియు, అచేతన పదార్థము ఆత్మభిన్నమని జెప్పనలవిగాదు. "ఆత్మన ఆకాశస్సంభూతః" అను శ్రుతి ఆకాశాది ప్రపంచము, ఆత్మకార్యమని చెప్పు చున్నది. కార్యకారణములకు అభేదము (అనన్యత్వము) లోకసిద్ధము. కావున ఆత్మకార్యమగు అచేతన పదార్థము ఆత్మభిన్నము కానేరదు. ఆత్మకు నిరతిశయ సూక్ష్మత్వముగూడ పొసగదు. నిరతిశయ సూక్ష్మపదార్థము వ్యాపకము గానేరదు. ఆత్మ శరీరములోపల నంతట వ్యాపించియుండనిచో దేహమునంతను వ్యాపించి యుండు చల్లదనము మున్నగువాని వలన కలుగు సుఖదుఃఖాదులు అనుభవ గోచరములు కావు. అట్టి సుఖదుఃఖాదులు ఆత్మవలన అనుభవగోచరములు గాకు న్నను, త్వగాది యింద్రియములచే అనుభవగోచరములగునని యనరాదు. అతి సూక్ష్మమగు ఆత్మకు త్వగాది యింద్రియములతో సంబంధముకూడ సంభవింపదు. "అణోరణీయాన్ మహతో మహీయాన్" అను శ్రుతి ఆత్మకు మహత్పదార్థముల కంటె గూడ మహత్వమును ప్రతిపాదించుచున్నది. ఇందు ఆత్మ అణువుకంటె గూడ నణువని చెప్పుటకు మిక్కిలి దెలియశక్యము గాదని భావము. కావున ఆత్మ అణు స్వరూపుడనుట యుక్తముగాదు.

ఆత్మ వ్యాపకుడనియు, సూక్ష్మరూపుడనియు, ఆత్మకంటె భిన్నములగు ప్రాపంచిక పదార్థములన్నియు వ్యాప్యములు స్థూలములనియు అంగీకరించి, స్థూలము లగు నచేతన పదార్థములు సూక్ష్మమగు ఆత్మను నశింపజేయవనుటగూడ యుక్తము గాదు. అణువగు నాత్మపదార్థము వ్యాపకమని సిద్ధించినచో అచేతనపధార్థములకు తద్వ్యాప్యత్వము సిద్ధించును. ఆత్మకు వ్యాపకత్వమే సిద్ధింపదని నింతకుమున్ను నిరూపింపబడినది. "తుష్యతు దుర్జనః" అను న్యాయముచే వ్యాపకత్వ మనగా నన్ని పదార్థములలో నుండుట యని యంగీకరించి యాత్మకు వ్యాపకత్వము (అంతట నుండుట) దేహమునకు వ్యాప్యత్వమున్ను, (కొంతప్రదేశమునందుమాత్రమే యుం డుట) అంగీకరించినను స్థూలమగు వ్యాప్యవస్తువు సూక్ష్మమగు తనలోపలి వస్తువును నశింప జేయజాలదుగాన నభీష్టము నెరవేరదు. ఈ యంశమునందు వ్యతిరేక దృష్టాం తములను జూడుడు. స్థూలమగు అజగరము సూక్ష్మమగు మేకను జంపుచున్నది. స్థూలమగు గట్టిపిడికిలి ఆ పిడికిలిలో నున్న చిన్నపురుగులను నశింపజేయుచున్నది. తగులబడుచున్న పెద్దయిల్లు ఆయింటిలోనున్న కొద్దిజంతువులను నశింపజేయుచున్నది.

సూక్ష్మమగు (చిన్నదగు) నల్లి దానికంటె స్థూలమగు మనుష్యుని జంపుట లేదు. అట్లే సూక్ష్మమగు ఉదకము స్థూలమగు అగ్నిని చల్లార్చుటలేదు. కావున స్థౌల్యముగాని, సౌక్ష్మ్యముగాని నాశహేతువని నిర్ణయించుట పొసగదు.

ఆత్మ సూక్ష్మపదార్థమనియు ఈశ్వరుడు సూక్ష్మతర (మిక్కిలిసూక్ష్మ) పదార్థమనియు ననుటగూడ నుచితముగాదు. ఈశ్వరు డాత్మకంటె సూక్ష్మమయినచో నొకయాత్మయందున్న ఈశ్వరుడు మరియొక ఆత్మయందుండుట సంభవింపదు. ఈశ్వరుడు సర్వభూతాన్తర్యామియని మీరును అంగీకరించుచునేయున్నారు. ఎన్ని దేహములలో అందరాత్మలు అనినట్లు, యెందరాత్మలో అంతమంది యీశ్వరులు అని జెప్పనలవిగాదు. ఈశ్వరైకత్వమును మీరుగూడ అంగీకరించుటవలన, కావున చేతనాచేతనాత్మకమగు ప్రపంచమునంతయు లోపల వెలుపల వ్యాపించియున్న ఈశ్వరుడు సూక్ష్మతమ పదార్థమని స్వప్నమునందుగూడ నూహింప శక్యముగాదు. "మహాన్తం విభుమాత్మానం మత్వాధీరో నశోచతి" ఇత్యాది శ్రుతులనేకములు ఆత్మ మహత్పదార్థమనియు సర్వవ్యాపకపదార్థమనియును చెప్పుచున్నవి. కాని శ్రుతులయందచ్చటచ్చట ఆత్మసూక్ష్మతను (మిక్కిలిసూక్ష్మ) పదార్థమని చెప్పబడుచున్నది. దానికర్థము దుర్విజ్ఞేయుడనిగాని (తెలియదగినవాడుకాడనిగాని) సూక్ష్మమని గాదు. ఇయ్యది యింతకుమున్నే చెప్పబడినది.

మరియు జీవుడు ఈశ్వరునికంటె భిన్నుడగుచో నీశ్వరునివలన జీవునియొక్క ఉత్పత్తిస్థితిలయములు కలుగును. "యతోవా ఇమాని భూతాని జాయన్తే" అను ప్రమాణమువలన అభిన్నుడయిన యెడల అయ్యవి సంభవింపవు. కావున ఈశ్వరాభిన్నుడగుటవలననే జీవునకు జన్మనాశములు లేకపోవుట సంభవించుచున్నవి. అంతియకాని యీశ్వరునికి సంకల్పము లేకుండుట వలనగాదు. జీవుడు ఈశ్వరునికంటె భిన్నుడయినచో "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అని యద్వితీయమగు బ్రహ్మను ఉపక్రమించి "తదైక్షత బహుస్యాం ప్రజాయేయ" అని యాబ్రహ్మయే అనేకపదార్థములుగా అగుటకు సంకల్పించెనని జెప్పి "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్, తదనుప్రవిశ్య సచ్చత్యచ్చాభవత్" అని జగన్నిర్మాణమును బ్రహ్మను దానియందనుప్రవేశమును శ్రుతిచెప్పుచున్నదిగదా! అందు ఈశ్వరసంకల్పమువలన జీవుడు పుట్టెనందురా? పుట్టలేదని యనెదరా? మొదటి పక్ష మవలంబించినచో "జాతస్య హి ధ్రువోర్మృత్యుః" అను గీతావచనమువలన వానికి నాశము స్వతస్సిద్ధము. రెండవపక్షమున ఈశ్వరునికంటె భిన్నుడగు జీవు డెట్లు సిద్ధించును? "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అను శ్రుతినిబట్టిచూడ సృష్టికంటె బూర్వము జీవుడు లేడుగదా? కావున ఈశ్వరాభిన్నుడే జీవుడు; గనుక ఈశ్వరుడు తనను నశింపజేసికొనుట కెట్లు సంకల్పించును? ఈశ్వరున కట్టి సంకల్పమే సంభవింపదని గ్రహింపవలయును. మరియు సృష్టికంటె పూర్వము చిదచిద్విశిష్టమగు బ్రహ్మయే కలదు. శుద్ధబ్రహ్మ లేదు, అనినచో ఈశ్వరునివలె చిత్తుగూడ స్వతస్సిద్ధముగా నిత్యమగుచుండ ఈశ్వర సంకల్పము లేనందున జీవుడు నిత్యుడగుచున్నాడని మీచే నెట్లు చెప్పబడినది.

నిజమును విచారించినచో బ్రహ్మ చిదచిద్విశిష్టుడయినయెడల సవికారుడగును. విశేషణములగు చిదచిత్తులయందలి స్థూలసూక్ష్మవికారములు విశిష్టమగు బ్రహ్మకు నంటక మానవు. చిదచిత్తులు రెండును బ్రహ్మతోటికూడ సిద్ధమయిన ధర్మములు గదా! ఆధర్మముల సంబంధమయిన వికారములు ధర్మియగు బ్రహ్మకు చెందుట సహజము. కావున నిట్లు బ్రహ్మము సవికారముకాగా బ్రహ్మయే అనిత్యమగును. అయ్యది రామానుజమతమునకు గొప్ప అనిష్టము. కావున రామానుజులు చెప్పిన యర్థము అసమంజస మగుచున్నది.

శ్లో. అన్తవన్త ఇమే దేహాః నిత్యస్యోక్తా శ్శరీరిణః
అనాశినోఽప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత ॥౧౮॥

అ. పూర్వశ్లోకముచే సద్వస్తువగు ఆత్మను నిరూపించి అసద్వస్తువులను నిరూపించుచున్నారు. "అన్తవన్తః" అను శ్లోకముచే అన్తమనగా స్వసత్తానాశము. తనయొక్క యునికి నశించుట అనియర్థము. తనయొక్క యునికి మారిపోవుటయే స్వసత్తానాశమని నిర్ణయము. ఏవస్తువునకు నెల్లపుడు నునికిలేదో ప్రతీతికాలమందు మాత్రమే యునికి యుండునో ఆవస్తువు అసద్వస్తువనబడును. అసద్వస్తువులు ప్రతీతికాలమునందు గూడ కారణస్వరూపముకంటె వేరురూపముతో నుండనందున ప్రతీతికాలమునందు గూడ వానియునికికి మార్పుగలదని నింతకుమున్నె జెప్పబడినది. నాశములేనివాడును, నిత్యుడును, అప్రమేయుడును, శరీరధారియు నగు ఆత్మను సంబంధించిన నీదేహములు నాశము గలవని వివేకవంతులచే జెప్పబడినది- అని పదాన్వయము. ప్రపంచ సంబంధములేని ఆత్మకు శరీరముతో ఆధారాధేయ భావరూపమగు కల్పితసంబంధము కలదు గాన "శరీరిణః" అనుచోట సంబంధ సామాన్యమునందలి షష్ఠీవిభక్తి యుపపన్న మగుచున్నది. ఈ గ్రంథముచే నాశముగల దేహములు అసత్పదార్థములని స్పష్టమయినది.

దేహములకు నాశమనగా దేహములయందు గల సద్బుద్ధి నశించుట. అయ్యది ప్రమాణ నిరూపణమువలన కలుగును. దీనిచే దేహములు ప్రాణములు పోయినందున నశించుట సర్వజనులకు సుస్పష్ట మగుచుండ భగవంతుడగు శ్రీకృష్ణుడు "అన్తవన్త ఇమేదేహాః" (ఈ దేహములు నాశముగలవి) అని నూతముగ నుపదేశించుట వ్యర్థమను ప్రశ్న సమాహితమగుచున్నది. ఓయి! యిట్టి సద్బుద్ధి విచ్ఛేదరూపమగు నాశము ఎచట జూడబడుచున్నది? అనగా మరీచ్యుదకమునందు జూడబడుచున్నది. అదెట్లనిన మరుమరీచికలను (ఎండమావులను) జూచి యొకానొకడు భ్రాంతివలన ఇచట నుదకము కలదని మరీచ్యుదకమునందు సద్బుద్ధిని జెందుచున్నాడు. పిదప నచటకు జేరి ప్రత్యక్షప్రమాణముచే జూచి

యుదకమును గానక నియ్యది యుదకముగాదు, మరీచికలే (ఎండమావులే) గాన నిచట నుదకము లేదని తెలిసికొనుచున్నాడు. ఇచట మరీచ్యుదకమునకు నాశ మనగా మొదట మరీచ్యుదకమునందు కలిగిన సద్బుద్ధి ప్రమాణ నిరూపణము వలన (కంటితో స్వయముగ జూచి పరిశీలించుటవలన) విచ్ఛేదమును జెందుటయే గాని వేరొండు గాదు. మరీచికోదకము కలదనుకొనుటయే ఉదకముండుట. మరీచ్యు దకము లేదనుకొనుటయే ఉదకము లేకుండుట. గాని ఉదకమున కచట వేరుగా సత్త్వాసత్త్వములు లేవు. అట్లే ఈదేహములు గూడ నాశముగలవి. అదెట్లనిన, "దేహాస్సన్తి" దేహములు కలవు- అని దేహములయందు మొదట సద్బుద్ధి కలుగు చున్నది. తరువాత ప్రమాణ నిరూపణము వలన ఈయవి దేహములు గావు, పృథివి మొదలగు భూతములే. వీటియందు భూతపంచకముకంటె భిన్నమగు నంశము కను పించుటలేదు అనిగాని, ఇవి దేహములుగాదు. మరేమనిన నీయవి బ్రహ్మస్వరూ పమే. బ్రహ్మస్వరూపముకంటె భిన్నమగు నంశము వీటియందు గనుపించుటలేదు అనిగాని, బుద్ధిగలుగుచు, మొదట కలిగిన దేహముల యందలి సద్బుద్ధి విచ్ఛిన్న మగుచున్నది. కావున నీ సద్బుద్ధి నాశమే దేహనాశము.

ఓయి! నీటిని త్రాగుట మొదలగు ప్రయోజనము లేని మరీచికోదకము అస ద్రూపమగు గాక, గమనాగమనాది క్రియలతో నొప్పుచున్న నీదేహము లెట్లసద్రూ పము లగునని శంకింపరాదు. స్వప్నమునందు నిద్రయను మాయచే గల్పింపబడిన దేహ రథాది పదార్థములు పనులను నెరవేర్చుచున్నను, అసత్పదార్థములని యెట్లు అందరిచేతను అంగీకరింప బడుచున్నవో అట్లే ఈ దేహాదులు గూడ కార్యకారు లయినను అసత్పదార్థములనియే యంగీకరింపవలయును. స్వాప్నికపదార్థముల వలన ప్రయోజనములేదని శంకింపరాదు, స్వప్నమునందుగూడ రథారోహణము, దేశా న్తరగమనము, సంభాషణము మొదలగు పనులు నెరవేరుచునే యున్నవి. దేహ మును ధరించువాడు ఆత్మ ఆత్మచే ధరింపదగినది దేహము. కావున దేహాత్మల రెంటికిని ధార్యధారకభావ సమ్బన్ధము కలదని మూలమునందలి "శరీరిణః" అను పదమువలన తెలియుచున్నది. "శరీరిణః" శరీరము వీనికి కలదు గాన శరీరీ అను వ్యుత్పత్తిచే శరీరశబ్దముకంటె మతుప్ ప్రత్యయము యొక్క అర్థమునందు "అతఇనిఠనౌ" అను సూత్రమువలన ఇని ప్రత్యయము రాగా, శరీరి అని యయినది. దానికి షష్ఠీవిభక్తిని జేర్చగా "శరీరిణః" అని యయినది. మతుప్ప్రత్యయమే జేర్చినచో "శరీరవాన్" అని ప్రథమాంతమున నుండి షష్ఠ్యన్తమున "శరీరవతః" అని యయ్యెడిది. "శరీరీ" అనగా లోపల ప్రవేశించి శరీరమును ధరించువాడని యర్థము.

లోకమునందు నాశమనునది రెండువిధములు. అందువలన తదభావరూపమగు నిత్యత్వము గూడ రెండువిధము లగుచున్నది. పుట్టిన పదార్థము స్వరూపశూన్య

మయి కనుపింపక పోవుట ఒకవిధమగు నాశము. పదార్థము స్వరూపముతోనున్నను ఉపయోగము లేకుండుట మరియొక విధమగు నాశము. అదెట్లనిన దేహాదులు దహన సంస్కారముచే భస్మమయి కనుపింపక పోగా నశించినవని జెప్పబడుచున్నవి. అట్లే దేహమున్నను వయస్సుచే పరిణామ అపక్షయాది వికారముల జెంది దానివలన కలుగు వ్యాధ్యాదులతో గూడియుండగా దేహము నష్టమయిన దని జెప్ప బడు చున్నది. ఇచట రక్తము క్షీణించినందున కలిగిన శరీరముయొక్క కృశత్వమే నాశ శబ్దమున కర్థము. గనుక నీరెండు విధములయిన నాశములు ఆత్మకు లేవని జెప్పుటకు గాను మూలశ్లోకమునందు "నిత్యస్య, అనాశినః" అని చెప్పబడినది. కావున నిచట పౌనరుక్త్య దోషము లేదు. అట్లు గానిచో (యద్వా) ప్రళయకాలమున నశించు పృథి వ్యాది భూతములు గూడ ప్రళయపర్యన్తము నిత్యములు గాన నట్లే ఆత్మగూడ ప్రళయ పర్యన్తము మాత్రమే నిత్యుడని యనుకొనెదరేమో యని మూలమున "అనాశినః" అని చెప్పబడినది. అనగా ఘటాదులకు వలె నాత్మకు గూడ ప్రసక్తించు అనిత్యత్వ మును వారించుటకు "అనాశినః" (నాశములేనివానికి) అని చెప్పబడిన దని నిర్ణయము.

"అప్రమేయస్య" అనుచోట నప్రమేయస్య అని నఞ్ తత్పురుషసమాసము గాని "నవిద్యతే ప్రమేయం యస్య" అని బహువ్రీహి సమాసము గాదు. తెలిసికొను టకు శక్యమయినవాడుగాని, యోగ్యమయినవాడుగాని ప్రమేయుడగును. తద్భి న్నుడు అప్రమేయుడు. ఇట్టివాడని ప్రత్యక్షాదిప్రమాణములచే నిరూపించుటకు శక్యముగానివాడని యర్థము.

ఓయి! "శాస్త్రయోనిత్వాత్" అను వ్యాససూత్రము ఆత్మను దెలిసికొను టకు శాస్త్రము ప్రమాణమని జెప్పుచున్నది. "సర్వే వేదా యత్పద మామనంతి" అను వేదవాక్యమున్ను "వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః" అను భగవద్గీతయు ఆత్మ వేదముచే తెలియదగినవాడని జెప్పుచున్నది.

మరియు సుఖదుఃఖాదులు మనోవేద్యములయినట్లు ఆత్మగూడ మనస్సుచే దెలియదగినవాడని "మనసైవానుద్రష్టవ్యమ్" అను శ్రుతి జెప్పుచున్నది. అట్లే ఆత్మ ప్రపంచముయొక్క ఉత్పత్తిస్థితిలయములకు గారణమగుటచే నాహేతువువలన నాత్మ యనుమానగమ్యుడని దెలియుచున్నది. ఇట్లు శ్రుతి, స్మృతి, సూత్రములు ఆత్మ ప్రత్య క్షాదిప్రమాణములచే పరిచ్ఛేద్యుడని జెప్పుచుండ "అప్రమేయస్య"అని యాత్మ ప్రత్య క్షాది ప్రమాణములకు పరిచ్ఛేద్యుడుగాడని జెప్పుటయెట్లు? అని యాక్షేపింపరాదు. ప్రత్యక్షాగమాది వ్యవహారములకు పూర్వమే ఆత్మ స్వతస్సిద్ధముగా నున్నందున ప్రత్యక్షాది ప్రమాణములచే పరిచ్ఛేద్యుడుగాడు. ఘట పటాది పదార్థములు చక్షు రాది ప్రమాణములు ప్రవర్తించిన పిదప "ఘటము కలదు" "పటము కలదు" అను

వ్యవహారమువలన సిద్ధించుచున్నవి. ప్రమాతయగు నాత్మ ఆగమాది ప్రమాణములు ప్రవర్తింపక పూర్వమే సిద్ధించియున్నాడు. ప్రమాతయనగా కర్త. ప్రమాణములన కరణములు (సాధనములు). కత్తి, గొడ్డలి మొదలగు సాధనములయొక్క వ్యాపారములగు భేదనాదులు కర్త్రధీనములయినట్లు ఆగమాది ప్రమాణ వ్యాపారములు గూడ ఆత్మాధీనము లయినందున, ప్రమాణవ్యాపారముల కంటె పూర్వమే ప్రమాతయగు నాత్మ సిద్ధమయి యుండవలయును. అందువలన ఆత్మ ప్రత్యక్షాది ప్రమాణపరిచ్ఛేద్యు డగుట సంభవింపదు. తెలిసికొనువాడు ముందుండిననే వానికి తెలిసికొన కోరిక గలిగి తెలిసికొనుటకు సాధనములగు నింద్రియాదులను వెదకికొనును. ప్రమాత యనగా తెలిసికొనువాడు. ప్రమేయమనగా తెలిసికొనదగిన విషయము. ప్రమిత్స యనగా తెలిసికొనగోరిక. ఈ మూడింటియందును ప్రమాత యనువాడు మొదట సిద్ధమయి యుండిననే మిగతరెండును సిద్ధించును. ప్రమాతయనువాడు రూపమును దెలిసికొనగోరి తత్సాధనమగు చక్షురింద్రియమును ప్రవర్తింపజేయుచున్నాడు. అట్లే శబ్దమును తెలిసికొనగోరి తత్సాధనమగు శ్రోత్రేన్ద్రియమును వెదకుచున్నాడు. గంధమును తెలిసికొనగోరి తత్సాధనమగు ఘ్రాణేన్ద్రియమును వెదకుచున్నాడు. కావున ప్రమాతయగు నాత్మ ప్రమాణవ్యాపారము వలన సిద్ధించుట యసంభవము. గాన ప్రమాత ప్రమాణపరిచ్ఛేద్యుడు గానేరడు.

ఓయి! తెలిసికొనగోరువాడు ముందు ఆత్మను తెలిసికొని, పిదప రూపాదులను తెలిసికొనుచున్నా డనుకొని యాత్మకూడ ప్రమేయమే యని యేల యనగూడదు? అని శంకింపరాదు. ఘటాది ప్రమేయములను తెలిసికొనగోరిన పురుషుడు మొదట తాను వికారరహితుడగు నిత్యాత్మస్వరూపుడనని తెలిసికొని పిదప ఘటాది ప్రమేయములను తెలిసికొనుటకు ప్రవర్తించుటలేదు. తానే ఆత్మయగుట వలన తనకు దానే ఎట్లు అప్రసిద్ధుడగును? లోకములో అసిద్ధములగు పదార్థములను తెలిసికొనుట కొరకుగదా ప్రమాణవ్యాపారము కోరబడుచున్నది.

కంటితో జూడక పూర్వమే ప్రమాతయింటిలో ఘటమును దెలిసికొనినచో నింటియందు ఘటమున్నదా, లేదా? యని యేల సందేహించును? సందేహమే లేనపుడు సందేహమును బోగొట్టుకొనుటకు కంటితో ఘటమును జూచుటకెట్లు ప్రవర్తించును? ప్రవర్తించడు. గనుక ప్రమాణవ్యాపారముకంటె పూర్వమే ప్రమాత సిద్ధమయి యుండవలయును. అట్లే ఆత్మవిషయమై యెవరును నేనుంటినా? లేనా? యని సందేహింపరు. అట్టి సందేహమున్నచో తన్నివృత్తికొరకు ఆత్మయందు గూడ ప్రమాణవ్యాపార మావశ్యక మయ్యెడిది. సందేహమే లేనందున ఆత్మయందు ప్రమాణ వ్యాపారము అసంభవము గనుక ఆత్మ ప్రమేయముకాజాలడు. మరేమనిన ప్రమా-

తయే వానియందు ప్రమాణవ్యాపారము సంభవించదు. గనుక ఆత్మ ప్రమాణ పరిచ్ఛేద్యుడుగాడు.

ఓయి! ఇట్లయినచో వేదాన్తశాస్త్రము వ్యర్థముగాన అప్రమాణమగును. ఆత్మజ్ఞానముగదా వేదాన్తశాస్త్రమునకు ఫలము. ఆత్మ శాస్త్రప్రమాణము ప్రవర్తించక పూర్వమే స్వయముగ సిద్ధించియున్నందున, ఆత్మజ్ఞానముగూడ ఆగమ ప్రమాణ వ్యాపారమునకు పూర్వమే సిద్ధించును. ఇక వేదాన్తశాస్త్రము జేయునదేమి? గనుక వ్యర్థమగును. అని యాక్షేపము. ఇందుకు సమాధానము వేదాన్తశాస్త్రము అప్రమాణముగాదు. అయ్యది యత్యన్తము ప్రమాణము. అదెట్లనిన ప్రమాణఫలము రెండువిధములు అజ్ఞాతార్థజ్ఞాపకత్వరూపమనియు, అధ్యారోపనివర్తకత్వరూపమనియును, అందు అజ్ఞాతార్థజ్ఞాపకత్వమనగా తెలియని వస్తువును తెలియపరచుట. అధ్యారోపనివర్తకత్వమనగా ఆరోపింపబడిన ధర్మములను నిషేధింపుచు నివర్తింపజేయుట. ఇందు వేదాన్తశాస్త్రమునకు తెలియని వస్తువును తెలియపరచుట (అజ్ఞాతార్థజ్ఞాపకత్వము) అను ప్రయోజనములేకున్నను ఆరోపింపబడిన ధర్మములను నివర్తింపజేయుట (అధ్యారోపనివర్తకత్వము) అను ప్రయోజనము మాత్రము గలదు. అదెట్లనగా లోకములో అజ్ఞానమువలన నాత్మయందు మనుష్యత్వ, స్థూలత్వ, కాణత్వాది ధర్మములారోపింపబడుచున్నట్లు నేను మనుష్యుడను, నేను లావైనవాడను, నేను గ్రుడ్డివాడను, (మనుష్యోఽహం, స్థూలోఽహం, కాణోఽహం) అను ప్రతీతివలన స్పష్టమగుచున్నది. అట్టితరి వేదాన్తశాస్త్రము ఆత్మయందు మనుష్యత్వాదిధర్మములు లేవని నిషేధించుచు అవిద్యారోపితములగు ధర్మములను నివర్తింపజేయుచున్నది గాన సఫలమగుచున్నది. తానే ఆత్మయగుటచే నాత్మపదార్థము అందరికిని దెలిసినదిగాని దెలియనిదిగాదు. అందువలన వేదాన్తశాస్త్రమునకు తెలియని వస్తువును దెలియపరచుట అను ప్రయోజనము మాత్రములేదు. ఆత్మస్వతస్సిద్ధముగా దెలిసినవస్తువనుటలో "యత్సాక్షాదపరోక్షం బ్రహ్మ" "య ఆత్మాసర్వాన్తరః" అను శ్రుతులు ప్రమాణమగుచున్నవి. అపరోక్షాత్ అనగా అపరోక్షం అని యర్థము. ఎవడు సర్వాన్తర్యామియగు నాత్మయో, ఏది స్వయముగ ప్రత్యక్షమయినదియో నదియే బ్రహ్మమని శ్రుత్యర్థము. ఈ శ్రుతిచే ప్రత్యగభిన్నమగు బ్రహ్మము ప్రమాణవ్యాపారము లేకుండగనే ప్రత్యక్షమగుచున్నాడని జెప్పబడుటచే నాత్మ తెలిసిన పదార్థమనియు (జ్ఞాతార్థమనియు) స్వతస్సిద్ధుడనియును భావము.

ఎందువలన ఆత్మ నిత్యుడును, వికారరహితుడును అగుచున్నాడో అందువలన యుద్ధమును మానకుము ప్రమేయములగు ఘటాదులు వికారముగలవగుటవలన నప్రమేయుడగు ఆత్మ నిర్వికారుడని యర్థము. "యుధ్యస్వ" యుద్ధమునుంచి మానకు

మని యర్థము. అర్జునుడు చేయబూనుకొనిన యుద్ధమును కృష్ణు డనువదించి జెప్పుటయే గాని యిచట క్రొత్తగా యుద్ధమును చేయుమని విధించుట లేదు. సంసారకారణములగు శోకమోహములను నివర్తింప జేయుటయే గీతాశాస్త్రమునకు ప్రయోజనముగాని యొకానొక దానియందు ప్రవృత్తిని కలుగజేయుట గీతాశాస్త్రముయొక్క తాత్పర్యము గాదు. కావున మూలమునందలి "యుధ్యస్వ" అనునది అనువాదమాత్రము గాని విధి గా నేరదు.

రామానుజమతము : ఈ శ్లోకమునకు రామానుజులు యిట్లు అర్థమును జెప్పిరి "దిహ = ఉపచయే" అనుధాతువువలన వృద్ధిని జెందునట్టి యాదేహములు నాశస్వభావము కలవి. ఉపచయరూపములగు ఘటాదులు నాశముగలవిగా లోకమున చూడబడుచున్నవి. నిత్యుడును శరీరధారియు నగు నాత్మను కర్మఫలమును అనుభవింపగలందులకు భూతసముదాయరూపములగు దేహములు "పుణ్యః పుణ్యేన కర్మణో భవతి పాపః పాపేన" అను శాస్త్రముచే జెప్పబడినవి. ఈయవి కర్మావసానమునందు నశించుస్వభావము గలవి అని. ఇయ్యది యుక్తముగాదు. ఏలయున "దిహ = ఉపచయే" అనుధాతువువలన దేహములకు కలుగు ఉపచయరూపత్వము దేహములయొక్క వృద్ధికి కారణముగాని నాశమునకు గారణము కాదు. ఉపచయ మనగా వృద్ధి. అయ్యది ఘటాదులయందు గనుపింపదు కుమ్మరి యెంతపరిమాణము గల ఘటమును నిర్మించెనో నంతపరిమాణము గలఘటమే మనగృహములయందు గనుపడుచున్నది గాని యంతకంటె వృద్ధినొందుట లేదు.

ఈ దోషమును బోగొట్టుకొనుటకే వేదాన్తదేశికులు "ఉపచయరూపాః" అను రామానుజ భాష్యము నందలి పదమునకు (సావయవాః) అవయవములతో గూడినవి అని యర్థమును జెప్పిరనినచో నదియును పొసగదు. దేహశబ్దమువలన అవయవములు గలదను అర్థము లభింపదు. లోకములో అవయవములు గలదానికే వృద్ధి గన్పట్టుచున్నదనియు, నిరవయవమగు పదార్థమునకు వృద్ధి గన్పట్టుట లేదనియు, నందువలన, దేహములు నిరవయవములన్నచో వానికి వృద్ధియే సంభవింపదు. గావున దేహశబ్దమువలన సావయవములను నర్థము లభించునన్నచో నదియును యుక్తము గాదు. ఘటపటాదులు సావయవము లయినను వృద్ధిని జెందనందున అవయవము లుండిననే వృద్ధియుండు నను నియమము గనుపించుట లేదు. అందువలన దేహశబ్దము వలన సావయవములను అర్థము లభింపదు. మరియు రామానుజమతమున నిరవయవమగు మఠాకాశమునకు గూడ మఠముయొక్క వైశాల్యముచే వృద్ధి గలుగుచున్నందున నిరవయవ పదార్థమునకు వృద్ధిలేదని నియమింపశక్యముగాదు.

అదియును గాక దేహమునకు ఉపచయముగూడ నిరూపింపశక్యము గాదు. ఎన్నియవయవములచే దేహమారంభింపబడినదో అంతకంటె పెచ్చు అవయవములు దేహమునం దొకానొకప్పుడును గనుపించుటలేదు. అట్లు గనుపించినచో దేహము వృద్ధిజెందిన దని యనవచ్చు. ఇక దేహము బాల్యమునందు కంటె యౌవనమునందు వృద్ధిగా కనుపించుటవలన యౌవనదశయందు మరికొన్ని యవయవములు సంక్రమించినవని కల్పించెద మనినచో నట్టి కల్పన యప్రమాణమగును. ( ప్రామాణికము గానేరదు.) మనకు యౌవనమునందు గనుపించు దేహాభివృద్ధి మాయామయమయి నదియే గాని వాస్తవికముగాదు.

మరియు లోకములో ఘటపటాదులెట్లు నాశము గలవిగా కనుపడుచున్నవో, అట్లే దేహములు గూడ నాశముకలవిగా గనుపడుచున్నందున దేహముల యందు సిద్ధమయిన నాశమును సావయవత్వాదిహేతువులచే రామానుజులు సాధింపనెంచుట సిద్ధసాధనము కావున వ్యర్థమగును.

మరియు శరీరియగు నాత్మకు దేహములు కర్మఫలానుభవముకొరకని శాస్త్రముచేఁ జెప్పబడినవనుట గూడ నుచితము గాదు. కర్మఫలానుభవముకొరకు అను పదము మూలశ్లోకమునందు లేనందున-

మరియు ప్రమాణములన్నిటిలో ప్రత్యక్షప్రమాణము బలవత్తర మయినది. దేహములుగాని దేహములయందలి వినాశ స్వభావముగాని ప్రబల ప్రమాణమగు ప్రత్యక్షముచే సిద్ధమగుచుండ నీవిషయము శాస్త్రముచేఁ జెప్పబడిన దని రామానుజులు వ్రాసికొనుట వ్యర్థముగాన నసమంజసము.

శ్లో. య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతమ్
ఉభౌ తౌ నవిజానీతః నాయం హన్తి నహన్యతే ॥౧౯॥

ఆత్మ నిర్వికారుడు, నిత్యుడు అను నర్థమునందు ప్రమాణములగు.
"హన్తాచే న్మన్యతే హన్తుం హతశ్చే న్మన్యతే హతం"

"నజాయతే మ్రియతేవా విపశ్చిత్ నాయం కుతశ్చి న్నబభూవ కశ్చిత్" అను ఋఙ్మన్త్రములయొక్క అర్థమును భగవంతుడగు శ్రీకృష్ణుడు అర్జునున కుపదేశించుచున్నాడు. అందు "య ఏనం వేత్తి"అను శ్లోకముచే ప్రథమమంత్రార్థము వివరింపబడుచున్నది. ఎవడు ఈ యాత్మను జంపువానినిగా దెలిసికొనుచున్నాడో యెవడీయాత్మను చంపబడువానినిగా తెలిసికొనుచున్నాడో వారిద్దఱు తెలియని వారలే. ఆత్మ యొకరిని జంపదు, మరియొకరిచే దాను చంపబడదు. అని శ్లోకమున కన్వయము. ఇచట మృత్యువిషయమగు దేహమునకు చావు (నాశము) కలుగగా

దేహాత్మలకు భేదము తెలియకుండుటచే అహమ్ప్రత్యయ విషయమగు నాత్మను గురించి ఆత్మ చంపువాడనియు, ఆత్మ చంపబడువాడనియును యెవరు దెలిసికొను చున్నారో వారిద్దరు యేమియు తెలియనివార లని యర్థము. ఆత్మ హననక్రియకు కర్తగాని, కర్మగాని కాదు. ( ఆత్మ చంపుటకు కర్తగాని, కర్మగాని కాదు ) తా నొకరిని చంపుట, మరియొకరిచే దాను చంపబడుట అను వికారములు నిర్వికారు డగు నాత్మయం దుండ నేరవు. చేత గత్తి బూనిన బలముగల దేహమే దుర్బలమగు మరియొక దేహమును జంపుచున్నది. దుర్బలమగు నాదేహమె బలముగల మరియొక దేహముచేఁ జంపబడుచున్నది. కావున చంపుట చంపబడుట యనునవి దేహ ధర్మములుగాని, యాత్మధర్మములు గావు. అజ్ఞానులు దేహధర్మములను ఆత్మయం దారోపించి వ్యవహరించుచున్నారు. అదెట్లనగా వ్యాధిగ్రస్తుడగు పురుషుడు తన శరీరముయొక్క ధర్మమగు కృశత్వమును (చిక్కిపోవుటను) ఆత్మయం దారోపించుకొని (అహం కృశః) నేను చిక్కిపోతి నని వ్యవహరించుచున్నాడు. అటువలెనే యని భావము.

రామానుజ మతము:—ఇచట రామానుజు లిట్లనిరి. నిత్యుడు నిర్వికారుడు నగు నాత్మను గురించి హననహేతువగు ( చంపుటకు కారణమగు ) మరియొకనిని యెవడు తెలిసికొనుచున్నాడో, యెవడు యేదియో యొక కారణముచే నీ యాత్మను హతుడయినవానినిగా దెలిసికొనుచున్నాడో వారిరువురు దెలియని వారలు అని.

ఇయ్యది అసమంజసము. మూలశ్లోకమునందు "ప్రతి, కమ్, అపి" అను మూడు పదములు లేవు. రామానుజులు జెప్పిన యర్థమునందు యీ మూడుపదములును అధ్యాహారము జేసికొనవలయును. ఇది యొక దోషము. "ఏనం హన్తారం" అని స్వరసముగా గనబడుచున్న సామానాధికరణ్యమునకు "ఏన మ్ప్రతిహన్తారం" అని జెప్పినచో భంగము గలుగును. ఇది యొక దోషము. మరియు రామానుజులు "హన్తారం" అనగా "హననహేతుం" ( చంపుటకు కారణము ) అని జెప్పిరి. ఇయ్యది యత్యన్తాసంగతము. హనధాతువుకంటె కర్త్రర్థమునందు విధింపబడిన తృప్రత్యయము వలన హననహేతు వను అర్థము లభింపదు. హననహేతువను పదమునకు హనన కర్త యని యర్థమును జెప్పినచో నయ్యది వక్రమార్గమగును. అట్లే "కేనాపి హేతునా హతం" యేదియో యొక కారణముచేహతుడు అని జెప్పుట గూడ నుచితముగాదు. హనధాతువుకంటె కర్మార్థమునందు విధింపబడిన క్తప్రత్యయమునకు కర్త్రాకాంక్షయే గలుగుచుండగా తన్నివృత్తికొరకు "కేనాపి కర్త్రా" ( ఒకానొక కర్తచే ) ననియే జెప్పవలయును గాని "కేనాపి హేతునా" (ఏదియో యొకకారణముచే) అని జెప్పుట సమంజసము గాదు. కారణరూపార్థమును, ఫలరూ

పార్థమును జెప్పునటువంటి హేతు శబ్దమునకు కర్త్రర్థమును జెప్పుట అప్ర మాణమగును.

మరియును అక్లే రామానుజులు మూలశ్లోకము యొక్క తురీయ పాదము నందలి "నాయంహన్తి" అను వాక్యమునకు- "అయ మాత్మా హ ననహేతు ర్నభవతి" ఈ యాత్మ చంపుటకు కారణముగాడు అని యర్థమును జెప్పిరి. ఇదియును అసంగతమే యగుచున్నది. తిబన్తమగు "హన్తి" యను పదము హననక్రియా కర్తనుఁ జెప్పునుగాని హననహేతువును జెప్పదు. హననకర్త యనగా హననక్రియా శ్రయు డని యర్థము. ఆఖ్యాతము ఆశ్రయత్వ మర్థమని సిద్ధాన్తము. "రామో బాణేన రావణం జఘాన భార్యాపహారిత్వాత్" (రాముడు భార్య నపహరించి నందువలన రావణుని బాణముతోఁ జంపెను) అను వాక్యము కలదు. హనన మను నది (చంపుట యనునది) క్రియ, రాముడు కర్త, బాణము కరణము (సాధ నము), భార్యాపహరణము హేతువు. రావణుడు కర్మ యనునది లోకప్రసిద్ధము. ఇట్టి వాక్యములయందు కర్త వేరు, హేతువు (కారణము) వేరనునది సుస్పష్టము. గనుక "హన్తి" యను పదమునకు హనన కర్త యనియే జెప్పవలయును గాని, హనన హేతువని జెప్పుట యుచితము గాదు. అందువలన "నాయం హన్తి" యను వాక్యము కర్త్రర్థమునందు విధింపబడిన తిప్ప్రత్యయము వలన ఆత్మకు హననకర్తృ త్వమునే నిషేధించును గాని హననహేతుత్వమును నిషేధింపదు. ఇట్టితరి "నాయం హన్తి" అను వాక్యముచే రామానుజులు ఆత్మకు హననహేతుత్వమును ఎట్లు నిషే ధించిరో తెలియకున్నది.

మరియు రామానుజ భాష్యమునకు వ్యాఖ్యానమును రచించుటలో వేదాన్త దేశికులు ఇచ్చోట "అత్ర ప్రత్యయస్య హేతుమాత్ర వివక్షా" తిప్ప్రత్యయము హేతు త్వార్థమును జెప్పదలంపుతో ప్రయోగింపబడినది. అని వ్రాసిరి. అదియును అయు క్తము. ఏల యన న్యాసున కట్టి వివక్ష గల దని కల్పించుటలో ప్రమాణము లేనందు వలనను, తిప్ప్రత్యయమునకు ప్రసిద్ధమగు కర్త్రర్థమును విడచి, అప్రసిద్ధా ర్థమును కల్పించుటలో ప్రమాణము లేకుండుట వలనను, లోకమునం దేమూఢు డును తాను హనన హేతువని తలచడు. తాను హననక్రియకు (అనగా చంపుటకు) కర్త యనియే తలచును. గనుకనే, 'నేను శత్రువును జంపితిని' అని లోక వ్యవహా రము. హననహేతువులు మాత్రము ధనరాజ్యాదులు. ధనకాంక్షచేతనో, రాజ్యా కాంక్షచేతనో లోకమునం దొకరి నొకరు జంపుకొనుట ప్రసిద్ధము. గనుక ఆత్మ హననహేతువు గాడని యుపదేశించుటగూడ వ్యర్థము.

ఓయి! "ఆత్మార్థం రిపూన్ హన్తి" అని లోకములో ప్రయోగము కలదు. అచట రిపుహననమునకు, అనగా శత్రునాశమునకు ఆత్మ కారణమని తెలియుచున్నది. గనుక ఆత్మ హననహేతువు గావచ్చునన్నచో నది యుక్తముగాదు. అచట ఆత్మార్థ మనగా తనయొక్క సుఖాదిప్రాప్తికొరకని యర్థము. అట్లు గానిచో హనన క్రియాశ్రయ మగు ఆత్మయందు హననహేతుత్వమే సంభవింపదు. ఒకవేళ "ఆత్మార్థే పృథివీం త్యజేత్" (తనకొరకు పృథివినయినను విడువవలయును) అను ప్రయోగములవలన ఫలత్వరూపమగు హేతుత్వము (కారణత్వము) ఆత్మకు నతికష్టముచే లభించినను, కారణత్వరూపమగు హేతుత్వము మాత్రము ఆత్మకు యెచ్చటను సంభవింపదు. మీరు (రామానుజులు) "నాయం హన్తి" అను వాక్యముచే కారణత్వరూపమగు హేతుత్వమునే నిషేధించుచున్నారు. నిషేధ మెప్పుడును ప్రసక్తిపూర్వకము. కర్తృత్వాశ్రయ మగు నాత్మయందు హేతుత్వ మెన్నటికి ప్రసక్తించదు గాన నిషేధము వ్యర్థమగును. "ఆత్మనా పుత్ర ముత్పాద యతి" (తనచే కుమారుని పుట్టించుచున్నాడు) ఇత్యాది ప్రయోగముల యందు పుత్రోత్పాదన హేతుత్వము ఆత్మకు గనుపడుచున్నందున ఆత్మకు కారణత్వ రూపమగు హేతుత్వము సంభవింపవచ్చునని యనరాదు. అచట ఆత్మశబ్దమునకు దేహము అర్థము గాని యాత్మగాదు. తృతీయావిభక్తికి కరణత్వ మర్థము గాని, హేతుత్వము అర్థము గాదు. గనుక కర్తయగు ఆత్మకు హేతుత్వము యెంత మాత్రము పొసగ నేరదు.

మరియు "హన్తాచే న్మన్యతే హన్తుం హతశ్చే న్మన్యతే హతమ్" అను కఠవల్లీవాక్యము యీ శ్లోకముతో నన్వయించిన దని రామానుజులుగూడ నంగీకరించిరి. ఆ యుపనిషద్వాక్యమునందలి "హన్తా" అను పదమునకు హనన కర్త యని యర్థమా? లేక హనన హేతువని యర్థమా? (హనన కర్త యనగా చంపువాడని యర్థము. హనన హేతువనగా చంపుటకు గారణ మని యర్థము.) అందు రెండవ పక్షము పొసగదు. ఏల యన, లోకములో చంపువానికి చంపుద మను బుద్ధి యుద యించును గాని చంపుటకు కారణమగు దానికి చంపుదమను బుద్ధి పుట్ట ప్రసక్తియే యుండదు. (అనగా హననకర్తకు హననబుద్ధి యుదయించును. గాని హనన హేతువునకు హననబుద్ధి పుట్ట ప్రసంగమే లేదు.) ఉపనిషత్తునందు "హంతుం మన్యతే" అని హననబుద్ధి పుట్టునట్లు చెప్పబడినది. ఆ హననబుద్ధి నేను వీనిని జంపుదునని హననకర్తకు బుట్టుట యుచితముగాని, హననహేతువునకు బుట్టుట ఉచితముగాదు. గనుక మొదటి పక్షమే యాశ్రయింపవలయును. అనగా శ్రుతిగతమగు "హన్తా" అను పదమునకు హనన కర్త యనియే యర్థమును జెప్పవలయును. గనుక మూలభూతమగు శ్రుతి యందలి హన్తృశబ్దమున కేది యర్థమో ఆ యర్థమే గీతాశ్లోకము

నందలి హన్తృశబ్దమునకు గూడ జెప్పవలయును గాని వేరు అర్థమును జెప్ప వీలు లేదు. ఆ శ్రుత్యర్థమే యీ గీతాశ్లోకమునందు కూర్చ బడుటవలన గనుక హన్త యను పదమునకు హనన హేతువని యర్థమును జెప్పుట శ్రుతివిరుద్ధ మగుచున్నది.

మరియు, రామానుజులు "హన్తి" యను పదమునకు జెప్పిన హననహేతు వను అర్థము పాణిన్యనుశాసనమునకు విరుద్ధమగుచున్నది. "లః కర్మణిచ భావేచా కర్మకేభ్యః" అని పాణిన్యనుశాసనము. సకర్మకధాతువులకంటె కర్మార్థమునందు, కర్త్రర్థమునందును, అకర్మకధాతువులకంటె కర్మార్థమునందు, భావార్థమునందును లకార ప్రత్యయములు వచ్చునని దీని యర్థము. గనుక లాదేశములగు తిబాది ప్రత్యయములు, కర్త్రర్థమును, కర్మార్థమును, భావార్థమును బోధించుటయందు విధింప బడినవిగాని హేత్వర్థమునందు విధింపబడుటలేదు. గనుక "హన్తి" యను పదము నందు తిప్ప్రత్యయము వలన హననహేతు వను అర్థము లభించుచున్న దనుట యసం గతము. అట్లే 'తృన్, తృచ్' ప్రత్యయములు కర్త్రర్థమునందు విధింపబడినవి గాని హేత్వర్థమునందు విధింపబడలేదు. అందువలన "హన్తారం" అను పదమునకు తృచ్ ప్రత్యయమువలన హననహేతువని యర్థమును జెప్పుటగూడ పొసగదు. మరియు వ్యుత్పత్తివాదమునందు ఆఖ్యాతకు ఆశ్రయత్వము అర్థమని నిర్ణయింపబడినది గాని హేతుత్వము అర్థమని జెప్పలేదు. గనుక ఆత్మ హననహేతువని యర్థమును జెప్పుట వ్యుత్పత్తివాద సిద్ధాన్తమునకు విరుద్ధమగును. గాక ప్రస్తుత సందర్భమున ఆత్మ హననకర్త గాడని కృష్ణుడు ఉపదేశించుట యుచితముగాని హననహేతువు గాడని యుపదేశించుట యుచితముగాదు, ప్రత్యుతవ్యర్థము. కావున నీ పైహేతువులచే నిచట రామానుజ భాష్య మత్యంతాసమంజసము. దాని తోక నంటి నడచిన వేదాన్త దేశికుల తాత్పర్య చన్ద్రికావ్యాఖ్యానము నట్లే. ౧౯

శ్లో. న జాయతే మ్రియతేవా కదాచి న్నాయం భూత్వా భవితావా న భూయః।
అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే॥౨౦॥

అ. ఆత్మ యెవ్విధముగా నిర్వికారుడు? అను శంక కలుగగా అందుకు సమాధానముగ ద్వితీయ మన్త్రమును ఉపన్యసించుచున్నారు. "నజాయతే మ్రియతేవా" అను శ్లోకముచే—

(జాయతే, అస్తి, వర్ధతే, విపరిణమతే, అపక్షీయతే, నశ్యతి) పుట్టుట, ఉండుట, వృద్ధిపొందుట, విపరిణామమును జెందుట, కృశించుట, నశించుట అను నారును భావపదార్థములయొక్క వికారములు. దృష్టాంతము:— దేహము పుట్టు చున్నది. పుట్టినతరువాత అస్తితి కలదని సత్తను పొందుచున్నది. పిదప వృద్ధి

నొందుచున్నది. తరువాత నొడలు ముడుతలు పడుట, వెండ్రుకలు నెరయుట, అను పరిణామ దశను బొందుచున్నది. తరువాత కృశించుచున్నది. తదుపరి కనుపింపకుండ బోవుచున్నది (నశించుచున్నది). ఈ వికారములు ఆరున్ను ఆత్మయందు లేవు. గాన ఆత్మ వికారరహితుడని ఫలితార్థము.

"న జాయతే" అను పదమువలన జన్మలక్షణమగు మొదటి వికారము ఆత్మకు లేదని నిషేధింపబడినది. "న మ్రియతే" అను పదముచే నాశ మను ఆరవ వికారము ఆత్మ యందు లేదని నిషేధింపబడినది. ఈ యాత్మ కొంతకాలముండి తరువాత కొంతకాలమునకు తిరిగి ఉండకపోవువాడు గానందున ఆత్మయందు నాశవికారము లేదని యర్థము. పుట్టి కొంతకాలమునకు నాశమును జెందువాడు గాడని భావము. లోకములో దేహాది పదార్థములు పుట్టి కొంతకాలమునకు నాశమును జెందుచున్నవి. అందువలన అవ్వాని మరణించుచున్నవని లోకులచే జెప్పబడుచున్నవి. శశశృఙ్గము (కుందేటి కొమ్ము), ఆకాశ పుష్పము మొదలగునవి మొదట పుట్టి తరువాత కొంతకాలమునకు కనుపింపకుండ బోవునవి (నాశమును జెందునవి) గావు. గాన వాటికి నశించినవను వ్యవహారము లేదు. (గగనకుసుమాదులు చనిపోయినవి అను వాడుక లోకములో లేదని భావము).

ఓయి! "న జాయతే మ్రియతేవా కదాచిత్" అను మొదటి పాదమునందు వినబడుచున్న ఒకే నఞ్ ను...జాయతే, మ్రియతే అను రెండు క్రియలతో ప్రత్యేకముగా అన్వయించినచో వివక్షితార్థము సిద్ధించుచున్నది. "నాయం భూత్వా భవితా భూయః" అను వాక్యమంత్రముచే ద్వితీయపాదమున యొక్క వివక్షితార్థము లభించుచున్నది. ఇట్లుండ రెండవపాదమునందు "వా, న" అను రెండు శబ్దములు వ్యర్థములు గదా యని యాక్షేపము. ఇందుకు సమాధానము రెండవ పాదమునందలి "వా, న" అను శబ్దద్వయముచే "అయమ్ న భూత్వా భూయః భవితాచ న" ఈ యాత్మ ముందు ఉండక, తిరిగి కొంతకాలమునకు ఉండగలవాడు కాడు అని మరియొక అన్వయము లభించును. ఈ శబ్దద్వయము లేనిచో నీ రెండవ అన్వయము లభింపదు. గనుక ద్వితీయపాదమునకు రెండువిధముల అన్వయము. "అయమాత్మా భూత్వా భూయః అభవితా న" అనియు, "అయమాత్మా అభూత్వా భూయః భవితాచన" అనియును. ఈ యాత్మ ఉండి తిరిగి కొంతకాలమునకుండనివాడు గాడు అని మొదటి యన్వయమునకు అర్థము. ఈ యాత్మ ముందు ఉండక కొంతకాలమునకు ఉండగలవాడు గాడు అని రెండవ యన్వయమునకు అర్థము. ఈ రెండువిధములగు అన్వయములకు దేహాదులే వ్యతిరేక దృష్టాన్తములు. అందు మొదటి యన్వయమునకు దృష్టాన్తము యింతకు మున్ను వివరింపబడినది. రెండవ యన్వయమునకు దృష్టాన్తము చూపబడుచున్నది. ఘటాది పదార్థములు

ముందు ఉండక తిరిగి కొంతకాలమునకు ఉనికిని పొందుచున్నవి. గనుక ఘటాదులకు ప్రాగభావము గలదు. అందువలన ఘటాదులు పుట్టుచున్న వని చెప్పబడుచున్నవి. ఆత్మకు ప్రాగభావము లేదు. కావున ఆత్మ పుట్టుట లేదు. పుట్టనందున ఆత్మ అజు డనబడుచున్నాడు. మరణము లేనందున ఆత్మ నిత్యు డనబడుచున్నాడు.

ఇట్లు ఆద్యన్తములగు జన్మ నాశ వికారములు రెండు నిషేధింపబడినందున మధ్యస్థములగు నాల్గు వికారములుగూడ నిషేధింపబడినట్లే. అయినను వాటినిగూడ శబ్దతః నిషేధింపవలె నను తాత్పర్యముతో జెప్పుచున్నాడు. శాశ్వతోఽయం పురాణః" అని "యద్వా" షడ్భావ వికారములకంటె భిన్నములగు యావనాది వికారములు గూడ ఆత్మకు లేవని నిషేధించుచున్నారు. "శాశ్వతోఽయం పురాణః" అని.

మధ్యనుండు నాలుగు వికారములలో శాశ్వత పదముచే, నే వికారము నిషేధింపబడు చున్నదనగా, చెప్పుచున్నారు "శాశ్వతః" అని. శశ్వత్ భవః శాశ్వతః అనువ్యుత్పత్తిచే నెల్లపుడు ఒకే రూపముతో నుండువాడు శాశ్వతుడు. ఆత్మ శాశ్వతుడుగాన (యెల్లపుడు నేకరూపముతో నుండువాడు గాన) అపక్షయ వికారము లేదు. లోకములో అపక్షయము రెండువిధములు. స్వరూప ప్రయుక్తము, గుణ ప్రయుక్తము అని. అందు శరీరమునకు ముసలితనమువలన గలుగు నపక్షయము స్వరూప ప్రయుక్తము. అనేక రంగులుగల వస్త్రమునకు సంభవించు నపక్షయము నీల పీతాది గుణక్షయము వలన కలుగును గాన గుణప్రయుక్తము. ఆ రెండు విధములగు నపక్షయమున్ను ఆత్మయందు లేదు. ఆత్మ నిరవయవు డగుటవలన స్వరూప ప్రయుక్తమగు, నపక్షయము లేదు. నిర్గుణుడగుటవలన గుణక్షయమువలన కలుగు అపక్షయము లేదు. అపక్షయముకంటె విపరీతమగు వృద్ధి రూపమయిన వికారము నిషేధింప బడుచున్నది. "పురాణః" అను పదమువలన మొదటనున్న అవయవములకంటె క్రొత్త యవయవములు చేరినందున ఎవడు ఉపచితుడగుచున్నాడో వాడు వృద్ధి నొందుచున్నాడనియు క్రొత్తవాడనియు, లోకులచే జెప్పబడుచున్నాడు. ఇట్టివాడు వృద్ధినొందుచున్నాడని చెప్పబడును గాని క్రొత్తవాడని చెప్పబడకని యందురేమో? అట్లుగాదు. దేవదత్తుడు చిన్నతనమున జూచిన యజ్ఞదత్తుని యావన దశయందు మరల జూచి యెవడు వీడు? క్రొత్తగా నున్నాడే? అని యనుకొనుట లోకప్రసిద్ధము. గనుక ఈ ఆత్మ "పురాపి+నవ ఏవ" – పూర్వముగూడ క్రొత్తవాడే. పూర్వము కంటె యిప్పుడు ఆత్మకు నూతనత్వము లేనందున, ఆత్మకు వృద్ధి వికారము లేదని భావము. ఇందుకుగూడ నిరవయవత్వమే హేతువు. అవయవములు లేని యాత్మకు, మరికొన్ని యవయవములు చేరినందున గలుగు వృద్ధి యసంభవమని భావము.

ఇట్లు మూడు పాదములను వివరించి నాల్గవ పాదము వ్యాఖ్యానము జేయ బడుచున్నది. "నహన్యతే" అని ఇచట "హన్యతే" అను పదమునకు "మ్రియతే" (మరణించుచున్నాడు) అని యర్థమును జెప్పినచో, మొదటి పాదమునందలి "మ్రియతే" అను పదముతో పునరుక్తమగును. తద్దోష పరిహారము కొరకు నిచట హనధాతువు విపరిణామార్థమని గ్రహింపవలయును. ధాతువుల కనేకార్థము లుండు టచే నయ్యది యుక్తము. కావున "న హన్యతే" అనగా "న విపరిణమ్యతే" అని యర్థము. అనగా "న విపరిణమతే" అని నిశ్చయార్థము. (చావడు అనగా విపరిణామమును జెందడని భావము.) "న హన్యతే" అనుచోట గాని "న విపరిణమ్యతే" అనుచోటగాని యక్ప్రత్యయము కర్త్రర్థకము గాని కర్మార్థకము గాదు. కర్మార్థము యిచట నిష్ఫలము, ప్రకృతాసంగతమును. అందువలన కర్త్రర్థమునందే యక్ప్రత్యయము ఆర్షప్రయోగ మగుటవలన సాధువగుచున్నది.

ఓయి! "న జాయతే" "న మ్రియతే" "శాశ్వతః" "పురాణః" "న హన్యతే" అను పదములవలన జన్మము, నాశము, అపక్షయము, వృద్ధి, విపరిణామము లను అయిదు వికారములే నిషేధింప బడినవి. గాని "అస్తిత్వ" మను ఆరవ వికారము నిషేధింపబడలేదు గదా. షడ్భావ వికారములు ఆత్మకు లేవని యీ శ్లోకము నిషేధించుచున్న దని జెప్పు టెట్లు?" అని యాక్షేపము.

సమాధానము: "అయమాత్మా భూత్వా అభవితా న" అను వాక్యముచే గాని, "అభూత్వా భవితాన" అను వాక్యముచే గాని అస్తిత్వ వికారము నిషేధింపబడుచున్నది. భవన మనగా సత్త - అనగా అస్తిత్వము. గనుక షడ్భావవికారము లని లోకములో ప్రసిద్ధి జెందిన వస్తువికారము లెవ్వియు ఆత్మకు లేవు. గాన ఆత్మ అవిక్రియు డని యర్థము. ౨౦

శ్లో. వేదాఽవినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్!
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హన్తి కమ్ ॥ ౨౧

అ. "య ఏనం వేత్తి హన్తారమ్" అను శ్లోకముచే ఆత్మ నిర్వికారు డని ప్రతిజ్ఞ జేసి, "న జాయతే మ్రియతేవా" అను శ్లోకముచే నాత్మ నిర్వికారు డగుటకు జన్మాది షడ్భావ వికారములు లేకుండుట కారణమని వివరించి ప్రకృత విషయమును ముగింపుచున్నారు. "వేదాఽవినాశినమ్" అను శ్లోకముచే-

ఇందు అవినాశి డనగా నాశ మను వికారము లేనివాడని యర్థము. నిత్యు డన విపరిణామ వికారము లేనివాడని యర్థము. గనుక అవినాశి నిత్య పదములకు పౌనరుక్త్యము లేదు. అజు డన జన్మవికారము లేనివాడు. అవ్యయు డన నపక్షయ

వికార రహితుడు. కావున నీ శ్లోకమున "అవినాశి, నిత్య, అజ, అవ్యయ, శబ్దములచే నాశ, విపరిణామ, జన్మ, పక్షయము లను నాలుగు వికారములు నిషేధింపబడుచున్నవి. దీనిచే జన్మపూర్వకమగు అస్తిత్వ వికారము, నాశమే ఫలముగా గల వృద్ధివికారమున్ను నిషేధింపబడి నట్లగుచున్నది. కావున నిట్లాత్మ షడ్భావ వికారములు లేనివాడని దెలిసికొనిన పురుషుడు యెవనిని జంపును? యెవనిని జంప ప్రేరేపింపును? ఎవనినిఁ జంపడు ఎవనిని జంప ప్రేరేపింపడు. "హన్తి" యనుచోట హనధాతువునను హననక్రియ యర్థము. దానిపైనుండు తిప్ప్రత్యయమనకు కర్తృత్వ మర్థము. కావున "హన్తి" యనగా హననకర్త (చంపువాడు) యని యర్థము. "ఘాతయతి" హనధాతువుకంటె ప్రేరణార్థమునందు ణిచ్ ప్రత్యయము చంపువానిని ప్రేరేపింపువాడు అని యర్థము. "కం హన్తి" "కం ఘాతయతి" అను రెండువాక్యముల యందును కిం శబ్దము ఆక్షేపార్థకము. అందువలన నెవ్వనిఁ జంపడు. యెవనినిఁ జంప ప్రేరేపింపడు అని యర్థము లభించును. ఈ రెండు వాక్యములయందును కిం శబ్దము ప్రశ్నార్థకము గాని హేత్వర్థకము గాని; యేల గాకూడదు? ఆక్షేపార్థక మని యేలఁ జెప్పవలెను- అని యనరాదు. ఆత్మజ్ఞాని యే ప్రాణినిఁ జంపుట సంభవింపదు - గాన ప్రశ్నార్థకము గాదు. ఏ హేతువుచే జంపుచున్నాడు "కేన హేతునా హన్తి" అని హేత్వర్థము నాశ్రయించినను హేతువును గురించి ప్రశ్నించినట్లయినందున ప్రశ్నార్థకముతో సమానమగును గాన నదియును పొసగదు. "కం హన్తి, కం ఘాతయతి" యను వాక్యములచే హననక్రియ ప్రేరణక్రియలు మాత్రమే నిషేధింపబడినందున నాత్మజ్ఞానికి తదరిక్తములగు స్తుతి నిన్దాది క్రియలన్నియు గలవని యనుకొనరాదు. హనన, ప్రేరణ క్రియానిషేధము దృష్టాన్తముకొరకు జెప్పబడినది. కావున నీ రెండు క్రియలు లేనట్లు ఆత్మజ్ఞానియందు సర్వకర్మములు లేవనియే ప్రకరణార్థము.

ఓయి! విద్వాంసునకు సర్వకర్మములు లేవని నిషేధింపుటలో కృష్ణుడభిప్రాయపడిన కారణ మేమి? ఆత్మ అవిక్రియు డను కారణమువలన నాత్మజ్ఞానికి సర్వకర్మములు నిషేధించె ననినచో నయ్యది పొసగదు. అవిక్రియత్వ మనునది యాత్మధర్మము, విద్వాంసుని ధర్మము గాదు. ఆత్మ వేరు, ఆత్మజ్ఞాని వేరు. అవిక్రియమగు స్థాణువును దెలిసికొనిన వానికి యేకర్మము సంభవింపక నుండుటలేదు. కావున నాత్మజ్ఞానికి సర్వకర్మ నిషేధము యుక్తమని యాక్షేపము- సమాధానము:- ఆత్మను దెలిసికొనినవాడు ఆత్మస్వరూపుడే కాని స్థాణువును దెలిసికొనినవాడు స్థాణురూపుడు గాడు. కావున నాత్మ నిర్వికారు డయినందున నాత్మజ్ఞానిగూడ నిర్వికారుడే యగును. గనుక దృష్టాన్త దార్ష్టాన్తికములకు సామ్యము లేదు. లోకమునందు ఆత్మానాత్మ లను పదార్థములు రెండు. అందు అనాత్మపదార్థము జడమగుట వలన,

దాని కెవ్విధమగు జ్ఞానమున్ను లేదు. ఇక పరిశేషన్యాయమున ఆత్మపదార్థ మొక్క-టియే చేతనమగుటవలన జ్ఞానము కలదగుచున్నది. కావున నాత్మకు నాత్మజ్ఞానికిని భేదము లేదు. ఆత్మస్వరూపుడగు నాత్మజ్ఞాని నిర్వికారు డగుటవలన నతనికి సర్వ కర్మాసంభవము యుక్తము ; గనుకనే శ్రీ కృష్ణుడు "కథం స పురుషః పార్థ" యని సర్వకర్మములను ఆక్షేపించి యున్నాడు.

నిర్వికారు డగు నాత్మయందు విద్వత్తారూప మగు వికారమెట్లు సంభవించు నని యనరాదు. శబ్దస్పర్శ రూపరసగన్ధము లను విషయములను తదాశ్రయము లగు ఘటాది పదార్థములను, చక్షురాది బాహ్యేన్ద్రియములద్వారా బహిర్గతమగు నంతః కరణవృత్తిచే దెలిసికొని నిర్వికారు డగు ఆత్మ (దాను వేరు, బుద్ధివృత్తి వేరు) అను జ్ఞానము లేకున్నను, అజ్ఞానముచే (దానే దెలిసికొనినవాడని ప్రమాతయని లోకులచే నెట్లు గల్పింపబడుచున్నాడో నట్లే అసత్యరూపమయినట్టియు, విద్యాత్మకమగు "నేను బ్రహ్మను" అను బుద్ధివృత్తిచే పరమార్థముగ నిర్వికారుడగు నాత్మ బ్రహ్మాకారముగా పరిణమించిన బుద్ధివృత్తి వేరు తాను వేరు అను జ్ఞానము లేనందువలన విద్వాంసు డని గల్పింప బడుచున్నాడు. శబ్దస్పర్శాది విషయములను గ్రహించు బుద్ధివృత్తితో తాదాత్మ్యాఽధ్యాసము వలన నాత్మకు విషయములను గ్రహించుట యను ప్రమాతృత్వ మెట్లు సంప్రాప్త మయ్యెనో నట్లే 'నేను బ్రహ్మను' అను విద్యారూప మగు బుద్ధి వృత్తితో తాదాత్మ్యాధ్యాసముచే నాత్మకు విద్వత్వము ప్రాప్తించె నని ఫలితార్థము. ఆధ్యాసిక మగు నిట్టి బుద్ధివృత్తిసంబంధముచే నాత్మకు నెట్టి వికారమున్ను కలుగదు.

విద్వాంసునకు సర్వకర్మలు సంభవింప వని జెప్పినందున "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" ఇత్యాది శాస్త్రవిహితములగు కర్మలు విద్వాంసునకే నని కృష్ణుని యభిప్రాయ మయినట్లు స్పష్ట మగుచున్నది. అట్లే "ఆత్మావాఽరే ద్రష్టవ్యః" ఇత్యాది శాస్త్రముచే విధింపబడిన విద్యగూడ కర్మలవలె నవిద్వాంసునకే విధింపబడిన దని యనరాదు. అవిద్వాంసునకు అనుష్ఠింప దగిన కర్మ లుండుట వలన శాస్త్రము అవిద్వాంసునకు కర్మలను విధించినది. విద్వాంసునకు అనుష్ఠింప దగిన కర్మలు లేనందున శాస్త్రము విద్వాంసునకు విద్యను విధించినది. కావున శాస్త్ర విహితములగు కర్మలన్నియు నవిద్వాంసున కనియు, శాస్త్రవిహితమగు విద్య విద్వాంసున కనియును నియమ మంగీకరింప వలయును. గనుకనే భగవంతుడగు శ్రీకృష్ణుడు "జ్ఞానయోగేన సాంఖ్యానాం" అని విద్వాంసునకు విద్యను విధించియున్నాడు.

నేను కర్తను, నేను భోక్తను, నాకీపని చేయదగినది, అను జ్ఞానము గల యవిద్వాంసునకు "అగ్నిహోత్రం జుహోతి" ఇత్యాది వాక్యార్థ జ్ఞానము గలిగిన

వెంటనే అనేక పరికరములను సంపాదించుకొని యనుష్ఠింప దగిన అగ్నిహోత్రము మొదలగు కర్మ గలదను జ్ఞానము కలుగుచున్నది. అట్టి జ్ఞానముచే నవిద్వాంసుడా కర్మలయందు ప్రవర్తించుచున్నాడు. ఆత్మస్వరూప ప్రతిపాదకములగు "నజాయతే మ్రియతేవా" ఇత్యాది వాక్యముల యొక్క యర్థమును దెలిసికొనిన విద్వాంసునకు అకర్తృత్వ అభోక్తృత్వజ్ఞానముమాత్రము కలుగుచున్నది కాని యంతకంటె వేరు జ్ఞానము కలుగుట లేదు. కనుక విద్వాంసునకు అనుష్ఠింప దగిన కర్మలు లేవు. కర్మలయం దధికారమున్న లేదు. ఆత్మస్వరూపదర్శమునందు మాత్రమే అధికారము కలదు. ఆత్మస్వరూపజ్ఞానము గల విద్వాంసునకు "ఆత్మావా౽రేద్రష్టవ్యః" ఇత్యాది వాక్యములచే ఆత్మజ్ఞానమును విధింపనేల? యని ప్రశ్నింపరాదు. నేను ఆత్మను. దేహాదు లనాత్మపదార్థములు అను వివేక విజ్ఞానమే ఆత్మవిద్య. దీనియందు నేను కర్త ననుకొను యవిద్వాంసు డధికారి గానేరడు. మరేమనిన «నజాయతే» ఇత్యాది శ్రుతులచే జెప్పబడిన ఆత్మస్వరూపమును దెలిసికొనిన విద్వాంసుడే యధికారి. కావున ఆత్మస్వరూపజ్ఞానము గలవానికే ఆత్మానాత్మ వివేకవిజ్ఞానరూప మగు విద్యయం దధికారము గాన విద్వాంసునకు విద్యను విధించుట పిష్టపేషణ మని యనరాదు.

ఎవడు నేను కర్త నని యనుకొనుచున్నాడో వానికి, నాకు యీ పని చేయ దగినది యను బుద్ధి తప్పక గలుగును. వాడా బుద్ధిచే గర్మలయం దధికృతు డగుచున్నాడు. ఆత్మ యెవ్విధమగు వికారములు లేనివా డను జ్ఞానముగల విద్వాంసునకు « కథం స పురుషః పార్థ కం ఘాతయతి హన్తికమ్ » అని సర్వకర్మలు నిషేధింపబడినందున యే కర్మయు సంభవింపదు. కావున విద్వాంసునకు, ముముక్షువునకును, సర్వకర్మసన్యాసము నందే యధికారము. విద్వాంసునకు గూడ ప్రారబ్ధవశమునగాని, లోకానుగ్రహముకొరకు గాని జనక వామదేవాదులకువలె కర్మలయందు ప్రవృత్తి కలుగునని శంకింపరాదు. జనకాదులు ముక్తులగుటవలన వానికి దేనియందును అధికారము లేదు. అథవా (లేక) అవిద్వాంసుడయినను ముముక్షువగువానికి కర్మసన్యాసమునందే యధికారము. సన్యాసము విద్వాసన్యాసమనియు, వివిదిషా సన్యాసమనియు రెండు విధము లని శాస్త్రము చెప్పుచున్నది. గృహస్థుడయి కర్మయందు ప్రవర్తించి, దారాపుత్రాదులం బోషించుటతో బాధనొందుచున్న వానికి వేదాన్త శ్రవణమననాదులు సంభవింపవు. వేదాన్త శ్రవణము లేనిదే ఆత్మజ్ఞానము లభింపదు. కనుక ఆత్మను దెలిసికొనగోరిన పురుషుడు సంసారమునుంచి భీతిం జెందినవాడగుచు తీవ్రమగు మోక్షేచ్ఛగలవాడయినవో, వెంటనే సన్యసింపవలయును. "యదహరేవ విరజే త్తదహరేవ ప్రవ్రజేత్" అను శ్రుతి యేరోజున విరక్తి గలుగునో నారోజుననే సన్యసింపవలెనని చెప్పుచున్నది.

ఈయర్థమును ప్రకటింప దలచియే భాష్యకర్తలు ముముక్షువునకు కర్మసన్యాసమునందే యధికారమని జెప్పిరి. కావున దీనిచే, నవిద్వాంసుడయినను ముముక్షువు గానివానికే కర్మలయం దధికారమని సిద్ధించుచున్నది.

పై యర్థమునందు "లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ। జ్ఞానయోగేన సాఙ్ఖ్యానాం కర్మయోగేన యోగినామ్॥" అను శ్లోకముచే విద్వాంసులకు జ్ఞానయోగమనియు, అవిద్వాంసులకు కర్మయోగమనియును విభజించి జెప్పిన భగవంతుడగు శ్రీకృష్ణుడే ప్రమాణ మగుచున్నాడు. ఇట్లే తృతీయాధ్యాయమునందు గూడ శ్రీకృష్ణుడు "ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః। అహంకార విమూఢాత్మా కర్తాఽహ మితి మన్యతే॥" అను శ్లోకము వలన అతత్వవేత్తలకు కర్మయోగమనియు,॥ "తత్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగ యోః, గుణాగుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే" అను శ్లోకమువలన తత్వవేత్తలకు జ్ఞానయోగమనియును పై విభాగమునే స్పష్టపరచి యున్నాడు. ఇందు రెండవశ్లోకమునందలి "తత్వవిత్తు" అను తుకారమువలన పూర్వశ్లోకమగు "ప్రకృతేః క్రియమాణాని" యనునది, యతత్వవేత్త విషయమని స్పష్టమగుచున్నది. "అహంకార విమూఢాత్మా కర్తాహ మితిమన్యతే" అని యనుట వలన తత్వవేత్త, నేను కర్తనని యనుకొనడని సిద్ధించుచున్నది. అట్లే పంచమాధ్యాయమునందు గూడ "సర్వకర్మాణి మనసా సన్యస్యాస్తే సుఖం వశీ। నవద్వారే పురే దేహీ నైవకుర్వన్ నకారయన్" అను శ్లోకముచే శ్రీకృష్ణులు విద్వాంసునకు కర్మాధికారము లేదనియే జెప్పిరి.

విద్వాంసునకు కర్మాధికారము లేదను విషయమున గొందరు పణ్డితమ్మన్యు లిట్లు చెప్పుచున్నారు. "లోకమునం దెవ్వరికిని, నేను జన్మాది వికార రహితుడను, నిర్వికారుడను, కర్తృత్వము లేనివాడను, అద్వితీయుడను, అను జ్ఞానమే కలుగదు. ఇట్టి జ్ఞానము కలుగుచో సర్వకర్మసన్యాస ముపపన్న మగును. జ్ఞానమే కలుగదు గాన కర్మసన్యాసము కుదరనేరదు" అని. పండితంమన్యు లనగా తమను తాము పండితుల మని యనుకొనువారు. వారిని లోకులు పండితులని యనరని భావము. అపండితులని నిశ్చయార్థము.

సమాధానము. అది యుక్తము గాదు. "నజాయతే మ్రియతేవా" అను శాస్త్రమువలన ఆత్మ నిర్వికారుడు, కర్తృత్వరహితుడు ; అను జ్ఞానమే కలుగనిచో నింక శాస్త్రమువలన ప్రయోజన మేమి? శాస్త్రము వ్యర్థము గావలసి వచ్చును. పారలౌకిక కర్మలను బోధించు శాస్త్రమువలన, ధర్మాధర్మములు కలవను జ్ఞానము,

కర్మానుష్ఠాతకు దేహాన్తర సంబంధము గలదను జ్ఞానమున్ను యెట్లు కలుగుచున్నదో, అట్లే జ్ఞానకాండవలనగూడ ఆత్మ నిర్వికారుడు, కర్తృత్వరహితుడు, అద్వితీయుడు అను జ్ఞాన మేల కలుగగూడదు? కనుక లోకములో నెరికిని వేదాంతశాస్త్రము వలన నాత్మతత్వజ్ఞానము కలుగ దను వాదము నిస్సారము.

ఓయి! సర్వకర్మసన్యాసముకంటె పూర్వము యెరికిని వేదాంతశాస్త్రశ్రవణ మునం దధికారము లేదు. ఏలనన శాస్త్రశ్రవణమునకు సాధనచతుష్టయసంపత్తి యావశ్యకము. సాధనచతుష్టయ మనగా నిత్యానిత్యవస్తువివేకము, ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము, శమాదిషట్కసంపత్తి, ముముక్షుత్వమును. ఇందు శమాదిషట్క మునందు 'శాంతోదాంత ఉపరతః' అను శ్రుతివలన 'ఉపరత' మనునది యొకటి వినబడుచున్నది. ఉపరత శబ్దమునకు సన్యాస మని యర్థము. గీతలయందు ప్రతి యధ్యాయాంతమునందును 'భగవద్గీతాసూపనిషత్సు' అని యుండుటచే గీతాశా స్త్రము వేదాంతశాస్త్ర మనియే జెప్పవలయును. కావున వేదాంతశాస్త్రమగు గీతాశాస్త్రము శ్రవణము జేయుటకు, ఆవశ్యకమగు సాధనచతుష్టయ ములో సన్యాసముగూడ సాధనముగా జెప్పబడి యున్నందున సన్యాసము కంటె పూర్వము గీతాశాస్త్రశ్రవణమున నధికారములేదని తేలుచున్నది. ఇక గీతల యందు 'నజాయతే మ్రియతేవా' ఇత్యాదులచే ఆత్మతత్వమును దెలిసికొనినవానికే కర్మసన్యాసము నం దధికారము జెప్పుచున్నాడు భగవంతుడు. కావున నిచట సన్యా సానన్తరము శాస్త్రోపదేశ మనియు, శాస్త్రోపదేశానంతరము సన్యాసమనియును పరస్పరాశ్రయదోషము సంభవించుచున్నది. అనినచో నది యుక్తము గాదు. గృహస్థులగు జనకాదులయందు గూడ వేదాంతశ్రవణము కనుపించుచుండుటవలన శ్రుతి వేదాంతశ్రవణమునందు సన్యాసులకు ముఖ్యాధికారమును జెప్పుచున్నది. అందుచే ఆశ్రమాంతరములయం దున్నవారికి గౌణాధికారము కలదు. యద్వా (లేనిచో) సన్యాసులకు వేదాంతశ్రవణాదులయందే యధికారము గాని, మరి యితర ములయం దధికారము లేదని నియమించుటకు సాధనచతుష్టయములో 'ఉపరత' పదము చేర్చబడినది. అథవా (లేనిచో) ఉపరతి పదమునకు సన్యాస మర్థము గాదు. మరేమనిన చిత్తవిక్షేపము లేకుండుట. అయ్యది జనకాదులకువలె గృహస్థులకు గూడ సంభవించును. నిజముగ విచారించినచో సాఙ్గాధ్యయనమును జేసి శమద మాదిసంస్కారములు గలవానికి వేదాంతశాస్త్రమునం దధికారమని. 'అథాతో ధర్మజిజ్ఞాసా' అను సూత్రముచే ప్రతిపాదింపబడినది. స్వాధ్యాయ మనగా వేదము. ఉపనిషత్తులుగూడ వేదమునందే గలవు గాన బ్రాహ్మణునకు బ్రహ్మచర్యాశ్రమము నందే వేదాంతశ్రవణము సంపన్న మగుచున్నది.

వ్యాకరణాదులవలన వేదాన్తములయొక్క యర్థమును ఆపాతతః తెలిసికొనుచున్నాడు. తరువాత ఆత్మ అవిక్రియుడను జ్ఞానము వానికి గలుగుచున్నది అట్టి యాపాత బ్రహ్మాత్మ జ్ఞానమును దృఢపరచుకొనుటకు; బ్రహ్మాత్మ సాక్షాత్కార పర్యన్తము వేదాన్తశ్రవణమననాదికము కర్తవ్య మగుటవలనను, ఆశ్రమాన్తరముల యందు కర్మబాహుల్యముచే శ్రవణాదులు సంభవించనందునను, ముముక్షువగు విద్వాంసుడు సన్యసించి బ్రహ్మనిష్ఠుడగు గురువును దరిజేరి, వేదాన్తశ్రవణమననాదికమునుం జేయుచున్నాడనునది ఘంటాపథము. కనుక సన్యాస, వేదాన్తశ్రవణములకు అన్యోన్యాశ్రయదోషము లేదు. సామాన్యముగా వేదాన్తశ్రవణము జేసిన తరువాత ప్రధానముగా వేదాన్తశ్రవణమును జేయవలయునని జెప్పియుండుటవలన వేదాన్త శ్రవణము నందు గృహస్థులకు గూడ నధికారమనియు, సన్యాసులకే యధికార మనియును రెండుపక్షములు గలవు. ఈయవి వేదాన్తశ్రవణముయొక్క సామాన్య విశేష రూపములచేతనే ప్రవర్తించినవి. ఏ మహానుభావులు ప్రారబ్ధపుణ్యపుంజమువలన ఒక్కమారు వేదాన్తశ్రవణమువలననే బ్రహ్మసాక్షాత్కారమును పొందుచున్నారో శుక జనక వామదేవాదులవలె; అట్టివారల కెందును అధికారము లేదు. ఆత్మయం దధికారము సంభవింపనందున అని గ్రహింపవలయును.

శాస్త్రమువలనమాత్ర మప్రసిద్ధార్థ మెట్లంగీకరింపనగునని ప్రశ్నింపరాదు. ప్రత్యక్షాది ప్రమాణములకు ప్రసిద్ధముగాని ధర్మాధర్మాదికము,తత్ప్రయుక్తమగు శరీర విశేషపరిగ్రహము మున్నగునవి యెట్లాగమప్రామాణ్యము వలన ఆస్తికులచే నంగీకరింపబడుచున్నవో అట్లే శాస్త్రప్రామాణ్యమువలన ఆత్మగతమగు అవిక్రియత్వాదికముగూడ నంగీకరింపనగునని యింతకుమున్నే వివరింపబడినది.

ఓయి! ధర్మాధర్మస్వర్గనరకాదులు ప్రత్యక్షప్రమాణమునకు విషయములు గాకున్నను మనస్సుచే సంకల్పించుటకు, వాక్కుచే జెప్పుటకు సాధ్యమగుచుండుట వలన మనోవిషయములును, వాగ్విషయములున్ను అగుచున్నవి. అందువలన వాటి యందు శాస్త్రము ప్రమాణమగు గాక. "యతో వాచో నివర్తన్తే । అప్రాప్య మనసా సహ" అను శ్రుతిచే వాఙ్మనస్సులకు గోచరుడుగాని బ్రహ్మమునందు శాస్త్ర మెట్లు ప్రమాణమగును? అని శంక గలుగుచున్నది అనగా విషయములను గ్రహించుటకు సాధనములగు మనస్సు మొదలగు ఇన్ద్రియములకు ఆత్మ గోచరుడు గాని కారణమున శాస్త్రోపదేశముచే ఆత్మ కర్తృత్వాది రహితుడను జ్ఞానము కలుగ దని పూర్వపక్షమున కర్థము.

సమాధానము "మనసైవానుద్రష్టవ్యమ్" అను శ్రుతి ఆత్మదర్శనమునందు మనస్సు సాధనమనిం జెప్పుచున్నది. కనుక శాస్త్రోపదేశమువలన అవిక్రియత్వాద్వితీ

యత్వాక ర్తృత్వాది జ్ఞానము కలుగవచ్చును "అప్రాప్య మనసాసహ" అను శ్రుతి శమ దమాది సంస్కార రహితమగు మనస్సున కాత్మ గోచరుడు గాడని జెప్పుచున్నది. మన సైవానుద్రష్టవ్యమ్" అను శ్రుతి శాస్త్రాచార్యోపదేశ శమదమాది సంస్కార సహితమగు మనస్సునకాత్మగోచరు డగునని చెప్పుచున్నది. కనుక నీ రెండు శ్రుతులకును విషయభేదమున్నందున పరస్పర విరోధము లేదు. ఆత్మ సంస్కారవిశిష్ట మగు మన స్సుచే దెలియదగినవాడని యంగీకరించినచో ఆత్మ స్వతస్సిద్ధుడు, నిత్యాపరోక్షుడు (యెల్లపుడు ప్రత్యక్షమగువాడు) అను సిద్ధాంతమునకు భంగము గలుగునని శంకింప దగదు. ఆత్మ నిత్యాపరోక్షుడు, స్వతస్సిద్ధుడు నయినను అవిద్యచే పరోక్షుడు వలె (ఎచ్చటనో నుండువాడువలె) సాధ్యుడువలెను (ఇంద్రియవ్యాపారముచే సాధింపదగిన వాడువలెను) ప్రతిభాసించుచున్నాడు. అట్టి యవిద్యను బోగొట్టుటయందు సంస్కార విశిష్టమగు మనస్సు సాధనము. 'అహంబ్రహ్మ' అను ఆకారము గల విద్యా త్మకమగు సంస్కారవిశిష్టమనోవృత్తిచే అవిద్య నశించగా నవిక్రియుడగు ఆత్మ స్వయంప్రకాశమాను డగుచున్నాడు.

ఓయి! ఆత్మకు యెందును కర్తృత్వము లేదుగదా, మనస్సు సాధనముగాని కర్త గానేరదుగదా! అట్టితరి సాధనమగు మనస్సునకు వ్యాపార మెట్లు సిద్ధించును? కర్తయుండిననే సాధనములు వ్యాపారముగలవగును గాని కర్త లేనిచో కరణములకు వ్యాపారము సిద్ధింపనేరదుగదా! యనినచో జెప్పబడుచున్నది. మనోవ్యాపారములకు బుధ్యవచ్ఛిన్నచైతన్యలక్షణుడును, అవిద్యాకల్పితుడును అగు ప్రమాత కర్తయగు చున్నాడు. అట్టి ప్రమాతయగు కర్తయే మనస్సుచే నేను బుద్ధ్యాదులతో గూడిన వాడను కాను, పరిపూర్ణుడను, నిర్వికారుడను అని తనను తెలిసికొనుచున్నాడు. జ్ఞానఘనుడనయి, అసంగుడ నగు నాయందు అవిద్యగాని, అవిద్యాకార్యములగు బుద్ధ్యాదులు గాని యుండనేరవు. కనుక ఆత్మ అవిక్రియుడు, అద్వితీయుడు అని తెలిసికొనగలందులకు "ఆత్మ అవిక్రియుడు- నిరవయవు డగుటవలన - వ్యతిరేకముచే ఘటాదులవలె" అను ననుమాన ప్రమాణమున్ను "నజాయతే మ్రియతేవా" అను శాస్త్రప్రమాణమున్ను ఉండగా అవిక్రియత్వాది జ్ఞానము కలుగదనుట యతి సాహస మగుచున్నది. కారణముండగా కార్యము పుట్టకుండు టెట్లు? అని భావము.

నేను అవిక్రియుడను, అద్వితీయుడను, కర్తృత్వము లేనివాడను అనునది జ్ఞానము. నేను కర్తను, భిన్నుడను, భోక్తను అని యనుకొనుట యజ్ఞానము. ఇట్టి యజ్ఞానము "య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతం, ఉభౌ తౌ న విజానీతః" అను శ్లోకముచే ప్రదర్శింపబడినది. ఆత్మకు హననక్రియా కర్తృత్వము అవిద్యాకల్పితము. ఆత్మకు కర్తృత్వము అవిద్యాకల్పిత మనునది గమనాగమనాది సర్వక్రియల యందును సమానమగుచున్నది. అందుకు కారణము నిర్వికారుడగు

టయే. ఆత్మ నిర్వికారుడగుటవలన సర్వక్రియానిరూపితవికారమును అతనికి లేదని యర్థము. కనుకనే భగవంతుడగు వాసుదేవుడు విద్వాంసునకు సర్వక్రియలయందును ప్రయోజ్య కర్తృత్వమును, ప్రయోజక కర్తృత్వమును నిషేధించి యున్నాడు. "కథం సపురుషః పార్థ, కం ఘాతయతి హన్తి కమ్" అని. ఇందువలన విద్వాంసునకు కర్మాధికారము లేదని స్పష్టమగుచున్నది. కనుకనే విద్వాంసునకు సర్వకర్మసన్న్యాసమును భగవంతుడు జెప్పియున్నాడు. "సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ" ఇత్యాది శ్లోకములచే.

ఓయి! పై శ్లోకమునందు "మనసా సన్న్యస్య" అని యుండుటచే మానసిక కర్మలకు మాత్రమే సన్న్యాస మావశ్యకమని తెలియుచున్నది. కాయిక వాచిక కర్మలను సన్న్యసించుటలో ప్రమాణము లేదు. అనినచో నట్లుకాదు. "సర్వకర్మాణి" యని కర్మశబ్దమునకు సర్వశబ్దము విశేషణ మయినందున కాయిక వాచికములగు కర్మలకు గూడ నిషేధము (సన్న్యాసము) ప్రాప్తమగును. అట్లయినను, మానసికములగు సర్వకర్మలకే నిషేధము ప్రాప్తించునుగాని, కాయికవాచికములకు ప్రతిషేధము ప్రాప్తించదని యన దగదు. వాక్కాయ వ్యాపారము లన్నియు, మనోవ్యాపారపూర్వకము లయినందున మనోవ్యాపారములేనిదే యేపనియు నెరవేరదు గనుక "సర్వకర్మాణి మనసా సన్న్యస్య" యనగా మనోవ్యాపారపూర్వకములగు సర్వకర్మములను సన్న్యసించి యనియే, యర్థము లభించును. మానసికకర్మలనగా సంకల్పరూపములగు మనోవ్యాపారములు. లోకములో అందరును నేను వెళ్లుదును, నేను మాటాడుదును, నేను చంపుదును, అను నపుడు మనస్సుతో సంకల్పించియే కాయిక వాచికములగు గమన, భాషణ, హననాదిక్రియలను జేయుచున్నారు గాని సంకల్పములేనిదే జేయుట లేదు. "తదైక్షత। బహుస్యామ్ ప్రజాయేయేతి" అను శ్రుత్యుక్తమగు ఈశ్వరుని యొక్క జగత్సృష్ట్యాదివ్యాపారము గూడ సంకల్పపూర్వక మనియే తెలియబడుచున్నది. కావున "సర్వకర్మాణి" యనగా కాయిక వాచికములగు కర్మలన్నియు ననియే గ్రహింపవలయును.

పూర్వవాది మరల శంకించుచున్నాడు - శాస్త్రీయములగు వేదపాఠ జ్యోతిష్టోమాదికర్మలకు కారణములగు మనోవ్యాపారములను విడచి మిగిలిన అశాస్త్రీయములగు మానసికకర్మ లన్నింటిని సన్న్యసించి యుంటున్నాడని యేలఁ జెప్పకూడదు?

సమాధానము – ఇట్లు అశాస్త్రీయములగు సమస్త మానసికకర్మలను విడచి యుంటున్నాడని జెప్పినచో "నైవకుర్వన్న కారయన్" అను నది వ్యర్థమగును. "మనసా సన్న్యస్య" (మనస్సుతో సన్న్యసించి) యని జెప్పుటచేతనే మనోవ్యాపారపూర్వకములగు వాచిక కాయిక కర్మలనుఁ జేయకుండుట సిద్ధించుచుండగా "నైవకుర్వన్న కారయన్" ఏమియుఁ జేయకయు చేయింపకయు, నుంటున్నాడని మరలచెప్పుట వ్యర్థ

మగునని యర్థము సిద్ధాన్తపక్షమునందయితే 'మనసా' వివేకబుద్ధిచే అనగా కర్మాదులయందకర్మజ్ఞానముచే సన్యసించి యని యర్థము.

'నైవ కుర్వన్న కారయన్' అనునది కర్తృత్వ కారయితృత్వములు ఆత్మ సమవేతములు గావని జెప్పుటకని ముందు భగవంతుడే చెప్పబోవుచున్నాడు. భగవంతుడు చెప్పిన సర్వకర్మసన్యాసము మరణమాసన్నమయినవానికిగాని జీవించియున్నవానికిగాదు. జీవించియున్నవానికి భోజనాది క్రియలు అపరిహార్యములు అని యనరాదు. ఈశ్లోకముయొక్క ఉత్తరార్థమునందు 'నవద్వారే పురే దేహే' 'ఆస్తే' అని కలదు. అనగా తొమ్మిది ద్వారములు గల దేహమునందుండుచున్నాడని యర్థము. ఆస్తే యనగా "ఆస ఉపవేశనే" అను ధాతువుకంటె వర్తమానార్థమునందు లట్ లకారము. ఇట్టి ధాత్వర్థము జీంచియున్నవానికి యన్వయించునుగాని మరణింపబోవువానికి సిద్ధించదు.

అనగా మరణించినవాడు సర్వకర్మలను సన్యసించి దేహమునందెట్లుండును? ఉండడని యర్థము. ఓయి! (సర్వకర్మాణి మనసా నవద్వారపురే దేహే సన్యస్య నిక్షిప్య నైవకుర్వన్నకారయన్ వశీ సుఖమాస్తే) సర్వకర్మములను మనస్సుచే నవద్వారములుగల దేహమునందుంచి, తానేమియు చేయకయు, జేయింపకయు సుఖముగా నుంటున్నాడు అని శ్లోకమునకు అన్వయము. అనగా ఆత్మకు సర్వకర్మలను దేహమునందుంచుటతో సంబంధముగాని దేహమునందుండుటతో సంబంధముకాదు. దేహము సర్వకర్మసన్యాసక్రియకు అధికరణముగాని, ఆత్మకర్తృకమగు నుపవేశక్రియకు నధికరణము గాదని పరమార్థము. దేహముచే సర్వకర్మలు చేయబడుచున్నవి, చేయించబడుచున్నవి గాని, నాచేత జేయబడుట లేదు, చేయించబడుటలేదు అను ననుసంధానముతో విద్వాంసుడు సర్వకర్మల నాచరింపవలయునని శంకాతాత్పర్యము. పరిహారము - నిర్వికారుడయి యెవ్విధమగు క్రియలయందును కర్తృత్వములేని యాత్మకు దేహమునందు సర్వకర్మలను ఉంచుటయను క్రియకు కర్తృత్వముగూడ నుపపన్నముగాదని సమాధానము. అయితే ఆత్మకు సర్వకర్మ సన్యాసరూపమగు క్రియకు మాత్రము కర్తృత్వమెట్లుండును? అని యనరాదు. సర్వకర్మసన్యాస మనునది నివృత్తిరూప మగుటవలన నయ్యది క్రియయే గానేరదు. అందువలన నద్దానికి కర్త్రపేక్షయే లేదు. సర్వకర్మలను దేహమునందుంచుట యనునది క్రియగాన దానికి కర్త్రపేక్ష గలదు.

మరియు 'ఆస్తే' అను ధాతువు వలన ఆసనక్రియ వ్యక్తమగుచున్నది. అయ్యది ఆధేయమునందుండునది యగుటవలన దన కధికరణమగు నాధారమున్న

గోరుచున్నది ( ఆస్తే = ఉన్నాడు) అని చెప్పగా యెక్కడ నున్నాడు అను ప్రశ్న పుట్టుచుండుటవలన 'దేహే, ఆస్తే' అను పదములకు పరస్పరాకాంక్ష గలదుగాని 'దేహే సన్యస్య' అను పదములకు పరస్పరాకాంక్ష లేదు. 'ఘటం భువి నిక్షిప్య' ఘటమును భూమియందుంచి అనుప్రయోగమునందు 'నిక్షేప' (ఉంచుట) అను క్రియకుగూడ అధికరణాపేక్ష యున్నటుల స్పష్టమగుచున్నది గదా? యనినచో నిజమే ; రూపవంతములగు ఘటాదుల నుంచుటకు ఆధారము ఆవశ్యకమయినందున అధికరణాపేక్షయున్నను, రూపరహితములగు కర్మల నుంచుటకు నాధారము ఆవశ్యకము గానందున నధికరణాపేక్ష పొసగదు. 'గగనం నిక్షిప్య' (ఆకాశమును ఉంచి) యనగా యెచటనుంచి యను యాకాంక్ష కలుగుటలేదు. గనుక 'దేహే' అను పదమునకు 'ఆస్తే' యను నాసనక్రియతో నన్వయమే యుచితముగాని 'సన్యస్య' యను క్రియతో నన్వయము ఉచితముగాదు.

మరియు న్యాసశబ్దము నిక్షేపార్థకమయినను సన్యాసశబ్దము మాత్రము త్యాగార్థకముగాని నిక్షేపార్థకముగాదు. ఉపసర్గలవలన ధాతువుల కర్థము భేదించును. "అత స్సన్యస్య కర్మాణి సర్వాణ్యాత్మావబోధతః" అను ప్రయోగములయందు సన్యాసశబ్దమునకు త్యాగమర్థముగాని నిక్షేపమర్థముగాదు. గనుకనే 'సర్వకర్మాణి మనసా' ఇత్యాది శ్లోకములచే నాత్మజ్ఞానము గలవారలకు సర్వకర్మ సన్యాసమునందే యధికారముగాని కర్మలయం దధికారము లేదని భగవంతుడగు శ్రీకృష్ణుడు ముందుఁ జెప్పబోవుచున్నాడు. ఆత్మజ్ఞానికి బ్రతికియుండగా భోజనాదికర్మలు అపరిహార్యము లయినందున సర్వకర్మసన్యాసము పొసగనేర దనినచో నట్లుగాదు. శాస్త్రముచే నేకర్మలు విధింపబడినవో, యేకర్మలు నిషేధింపబడినవో వాటియందు అవిద్వాంసుడే యధికారిగాని విద్వాంసుడు అధికారి గాడు అనియే నిచట భగవంతుడు జెప్పదలచెను. భోజనాదికర్మలు విహితములు గావు, నిషిద్ధములును గావు. అవిద్వాంసుడు భోజనాది క్రియలయందు శాస్త్రము వలన నియోగింపబడినచో నందు విద్వాంసున కధికార ముండెడిది కాదు. అట్లు అవిద్వాంసుడు భోజనాదులయందు శాస్త్రమువలన నియోగింపబడుట లేదు. అందు వలన నయ్యవి కర్మలుగావు. వాటియందు ప్రవర్తింపువాడు అధికృతుడును గాడు అని సంక్షేపము.

ఇచట రామానుజు లిట్లనిరి. ఆత్మ నిత్యుడని దెలిసికొనిన పురుషుడు దేవ మనుష్య తిర్యక్థావర శరీరములయందు గల యాత్మలలో (నెవనినో యొకనిని) నే యాత్మనయినను యెట్లు చంపించును? యెట్లు చంపును? అని.

ఇయ్యది అయుక్తము. శ్లో॥ అవినాశితు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్- య వేత్తి హంతారం - అజో నిత్య శ్శాశ్వతోయం పురాణః - వేదావినాశినం

"నిత్యం య ఏన మజ మవ్యయమ్" "అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః" "నవానిదేహీ" "నైనం ఛిందంతి శస్త్రాణి" "అచ్ఛేద్యోయమ్" "ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చి దేనమ్" ఇత్యాది శ్లోకములయం దంతటను ఆత్మ యొక్కడే నని నిర్దేశించుట వలనను ఆత్మలు అనేకు లయినచో పరిచ్ఛిన్నత్వము, అందువలన ననిత్యమును ప్రసక్తించుట వలనను ఆత్మ లనేకులని చెప్పరాదు.

అవయవములు లేకుండుటవలన పరమాణుపుంజమువలె, నాత్మసముదాయము అనిత్యముగాదని యనరాదు. అవయవరహితమగు పరమాణుసముదాయమే యంగీకరింప దగదు. అవయవములు లేని ప ర మా ణు వు ల కు సముదాయత్వము కలుగదు. అవయవములు గల వస్తువులకు అవయవసంయోగమువలన సముదాయత్వము సంభవించును. అవయవములు గల వస్తువునకే వృద్ధిగాని, నిరవయవవస్తువునకు వృద్ధిలేదని రామానుజులే యంగీకరించియుండిరి. సముదాయత్వము లేకున్నను నిరవయవములగు పరమాణువులు నిత్యములుగా నున్నటుల ఆత్మలుగూడ నుండుగాక యని ప్రశ్నింపరాదు. అవయవములు లేని పరమాణువులే యప్రమాణములు. మృద్రేణువులసముదాయమే ఘటాదికార్యములకుఁ గారణ మగుచున్నది. మరియు పరమాణుకారణవాదమే వేదాన్త మీమాంసాశాస్త్రమునందు నిరాకరింపబడినది.

అవయవములు లేని పరమాణువులతో సమానమగు నాత్మకు సర్వవస్తువులతో సంబంధము లేనందున సర్వమును ప్రకాశింపఁజేయుటయే సంభవింపదు. "తస్యభాసా సర్వమిదం విభాతి" అను శ్రుతిచే నాత్మకు సర్వావభాసకత్వము జెప్పబడినది. శ్రుతి యందలి యాత్మ పదమునకు ఈశ్వరు డని యర్థ మంగీకరించినను ఈశ్వరుడుగూడ జీవునికంటె సూక్ష్ము డని మీ రంగీకరించినందున సుతరాం సర్వావభాసకత్వము సంభవింపదు.

మరియు దేవమనుష్య తిర్యక్స్థావర శరీరములయం దున్న ఆత్మలలో అని మూలముకంటె వేరుగా పదపరంపరను గల్పించుట యప్రమాణ మగుచున్నది. "య ఆత్మానం నిత్యం వేద స కథ మాత్మానం హన్తి" ఎవడు ఆత్మను నిత్యుడని తెలిసికొనుచున్నాడో వాడాత్మను యెట్లుచంపును? అని జెప్పినచో నెవడు ఆత్మ యనిత్యుడని తెలిసికొనుచున్నాడో వాడాత్మనుఁ జంపుచున్నాడు అని యర్థము ఆపాదించును అయ్యది యనిష్టము. తెలిసికొనినవానికిగాని తెలియనివానికిగాని యాత్మ నిత్యుడే యగును; తెలిసికొనినంతమాత్రముచే నాత్మకు పూర్వము లేని నిత్యత్వము సంభవించ నేరదు. గనుక నెవడు తెలిసికొనుచున్నాడో వాడు జంపడని జెప్పుటయపార్థము. **మూలకర్త కిట్టి వివక్షయే యున్నచో నపుడు, "కః కథం నిత్య మాత్మానం హన్తి కం ఘాతయత్యపి" అనియే జెప్పియుండును.**

మరియు జ్ఞానాకారుడగు నాత్మ యొక్కడేనని రామానుజులుగూడ నంగీకరించి నందున మూలమునందు "కం" అని జెప్పుటగూడ వ్యర్థమగును. «కః కథం నిత్య మాత్మానం హన్తివా ఘాతయత్యపి" అనియే జెప్పియుండవలెను,

మరియు నిత్యాత్మజ్ఞానికి నిత్యాత్మహననమును ఆక్షేపించినచో అనిత్యానాత్మ హననము నిరాక్షేపమని ప్రాప్తించును. మరియు నిత్యాత్మకు హననేతరక్రియా శ్రియత్వమున్ను సంప్రాప్తమగును. "మాహింస్యా త్సర్వాభూతాని" అను స్మృతిచే విద్వాంసునకు, అవిద్వాంసునకును సాధారణముగా నిషేధింపబడిన హింస ఆత్మజ్ఞాన ముగల విద్వాంసునియందు ప్రసక్తించుటవలన నీ రెండును అనిష్టములు. పశ్వాది ప్రాణిహింసయందు గూడ (నాత్మకు హింసలేదు) అనాత్మయగు దేహమునకే హింస కావున అనాత్మహననము విద్వాంసునకు నిరాక్షేపమగును. అట్లే నిత్యాత్మను దెలిసి కొనిన విద్వాంసుడు చంపడు, "చంపింపడు, కాని స్తుతింపుచున్నాడు, నిందించు చున్నాడు, తిరస్కరించుచున్నాడు" అని యిట్లు విద్వాంసునకు ఆత్మదూషణాదికము నరకము నిచ్చును. కావున నాత్మజ్ఞానికి సర్వకర్మాధికారాసంభవమునే యీ శ్లోకము జెప్పుచున్నది. ౨౧

శ్లో॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి
తథాశరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ. ౨౨

అ॥ జీర్ణములగు వస్త్రములను విడచుటవలనను, నూతనవస్త్రములను ధరించుట వలనను దేహమునకు వృద్ధి క్షయాదిరూపమగు వికారముగాని, జన్మనాశరూప మగు వికారముగాని, లేదో అట్లే జీర్ణశరీరములను విడచుటవలనను, నూతనశరీరము లను స్వీకరించుటవలనను ఆత్మకు నెవ్విధమగు వికారమున్ను లేదని యర్థము. ౨౨

శ్లో॥ నైనం ఛిన్దంతి శస్త్రాణి నైనం దహతి పావకః
నచైనం క్లేదయంత్యాపో నశోషయతి మారుతః. ౨౩

శ్లో॥ అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచ।
నిత్యస్సర్వగతస్థాణు రచలోఽయం సనాతనః.

అ॥ ఆత్మ అచ్ఛేద్యుడును, అదాహ్యుడును, అక్లేద్యుడును, అశోష్యుడును, నిత్యుడును, సర్వవ్యాపకుడును, స్థాణువు, అచలుడు, సనాతనుడున్ను అగుచున్నాడు.

ఆత్మ నిత్యుడగుటవలన సర్వగతుడగుచున్నాడు. (అంతటను ఉంటున్నాడు) అనిత్య ములగు ఘటపటాదులు సర్వగతములు(అంతటనుండునవి) గావని భావము. సర్వగతత్వ మనగా సర్వదేశములయందును, సర్వకాలములయందును, సర్వవస్తువులయందును ఉండుట-అట్టిది పరిచ్ఛిన్నము, అనిత్యమునగు పదార్థమునకు సంభవింపదని తెలియ్ను

వలెను. అచలుడనగా చలనరహితుడు. అనగా పరిపూర్ణుడని యర్థము. (సనాతనః) సనా అనునది- సదా (యెల్లప్పుడు) అను నర్థమునందు అవ్యయము. కొందరు చిదార్థమునందు (చాలకాలమను నర్థమునందు) అవ్యయమని యనుచున్నారు. "సాయఞ్చిర" మను సూత్రమునందు అవ్యయమును గ్రహించుటవలన, సనాశబ్దముకంటె భవార్థమునందు ట్యుప్రత్యయముగాని ట్యుల్ప్రత్యయముగాని జేర్చి, తుడాగమమున్ను జేర్చినచో సనాతనః అను రూపమేర్పడును. "నజాయతే మ్రియతేవా" అను శ్లోకముచే నాత్మ నిర్వికారుడని జెప్పబడినది. మరల యీ శ్లోకములచే నావిషయమే జెప్పబడుచున్నది. గాన పౌనరుక్త్యాదోషముగలదని శంకింపరాదు. ఆత్మవస్తువు దుర్బోధముగుటవలన మాటిమాటికి ప్రసక్తిని కల్పించుకొని సాంసారికులకు బుద్ధిగోచరమగుటకు నట్లు చెప్పబడుచున్నందున పౌనరుక్త్యాదోషము లేదు. ౨౪

శ్లో॥ అవ్యక్తోఽయ మచిన్త్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి॥ ౨౫

ప్ర॥ అయమ్ - ఈయాత్మ అవ్యక్తః - ఇంద్రియములచే వ్యక్తమగువాడు కాడు. అయమ్ - ఈ యాత్మ - అచిన్త్యః ఊహింపదగినవాడు కాడు. అయమ్ - ఈయాత్మ అవికార్యః - వికారమును జెందువాడు కాడు. అని శాస్త్రముచే జెప్పబడుచున్నది. తస్మాత్ అందువలన ఏనామ్ - ఈయాత్మను ఏనమ్ - ఈప్రకారము విదిత్వా = తెలిసికొని, త్వమ్ నీవు, అనుశోచితుం = దుఃఖించుటకొరకు నార్హసితగవు.

అ॥ ఆత్మ వ్యక్తముగా దెలియబడువాడుగాడు గాన, అవ్యక్తు డనబడుచున్నాడు. ఓయి, ఆత్మ సర్వేంద్రియములకు గోచరుడు గాడనుట పొసగదు. "మనసైవానుద్రష్టవ్యమ్" అను శ్రుతి శమదమాది సంస్కార సహితమగు మనస్సు. ఆత్మసాక్షాత్కారమునందు సాధనమని జెప్పుచున్నది. అనినచో - నిజమే. అట్టి సంస్కారసహితమగు మనస్సుకంటె వ్యతిరిక్తమగు నింద్రియములకు ఆత్మ గోచరుడు గాడనియే యిచ్చట శ్రుతి జెప్పదలచినది.

మనస్సు మొదలగు సర్వేంద్రియములకు ఆత్మవిషయము గాకుండుటవలన సర్వపదమునకు సంకోచముగూడ లేదు.

యద్వా. ఆత్మ స్వయంప్రకాశమానుడగుటవలన నింద్రియ గోచరుడుగాడు. యన్మనసా సమనుతే, "యేనాహుర్మనోమతమ్" అను శ్రుతి మనస్సునే ఆత్మ తెలిసికొనుచున్నాడని జెప్పుచున్నది. మరియు "సాక్షీచేతా నిర్గుణః" అను శ్రుతిగూడ నాత్మకు సర్వసాక్షిత్వమును జెప్పుచున్నది. సాక్షిత్వమనగా స్వయముగా దెలిసికొనుట. ఇంద్రియములయొక్క అపేక్ష లేకుండగనే స్వతహాగా తెలిసికొనుట యని

యర్థము. గనుకనే "అపాణి పాదోజవనోగ్రహీతాః" అను శ్రుతి సంగత మగుచున్నది. ఆత్మ తనను, తనకంటె భిన్నమగు నన్నిపదార్థములను స్వయముగా ప్రకాశింపజేయుటయే ఆత్మకు స్వయంప్రకాశమానత్వము. గనుక శమాదిసంస్కార సహితమగు మనస్సు ఆత్మస్వరూపమును గప్పివేయునట్టి యవిద్యను బోగొట్టుట యందే సాధనమని తెలియవలెను. సూర్యుని యంధకారమువలె; ఆత్మను అవిద్య యెట్లు కప్పివేయును? అని ప్రశ్నింపరాదు. సూర్యునకు చీకటికివలె ఆత్మావిద్యలకు బాధ్యబాధకభావము లేదు. పైగా ఆత్మయే యవిద్యను భాసింపజేయును. అవిద్య జడమయినందున స్వయముగా ప్రకాశింప సమర్థముగాదు. గనుక "అహంబ్రహ్మ" అని యాకారముగల సంస్కారవిశిష్టమగు మనోవృత్తిరూపమగు జ్ఞానమే అవిద్యకు విరోధి. గాన నట్టి మనోవృత్తియే యవిద్యను బోగొట్టును. గనుక ఆత్మకు సర్వేంద్రియాఽవిషయత్వము యుక్తము.

వికార్యుడనగా వికారమును బొందుటకు అర్హుడు. తద్భిన్నుడు, అవికార్యుడు వికారమనగా పరిణామము. ఆత్మనిరవయవుడగుటవలన అవిక్రియుడు. వికారమనగా కార్యము సావయవపదార్థమే కార్యమగును. కార్యపదార్థమే వికారముగలది యగునని భావము. ఆత్మకు హననక్రియాకర్తృత్వముగాని కర్మత్వముగాని యెవ్విధమగు వికారములు లేనందున దుఃఖింపవలదని భావము॥ —25

శ్లో॥ అథచైనం నిత్యజాతం నిత్యంవా మన్యసే మృతమ్.
తథాపి త్వం మహాబాహో నైవం శోచితు మర్హసి॥ —26

అ॥ మూలమునందలి అథచ అను పదమునకు ఆత్మకు అనిత్యత్వము అంగీకరించినను అని యర్థము. లోకప్రసిద్ధిచే ఆత్మనుగురించి క్రుద్ధుడయినాడు. తృప్తుడయినాడు. హృష్టుడయినాడు – అని యంతఃకరణ వికారము ననుసరించి యాత్మ వికారమును జెందుచున్నటుల తలచినచో, అని యన్వయము.

యద్వా – క్రుద్ధుడయినాడు, తృప్తుడయినాడు, హృష్టుడయినాడు, అను లోకప్రసిద్ధిచే అని యన్వయము. మిగిలినదంతయు సమానము. అనేక శరీరములయొక్క ఉత్పత్తి ననుసరించి ఆత్మ పుట్టినవాడని తలచినట్లు అనేక శరీరముల మృతి ననుసరించి యాత్మ మృతుడు మృతుడు, అని తలచినచో నని యన్వయము.

నిత్యుడయినను పుట్టుచున్నాడు గాన నిత్యజాతుడు. నిత్యుడయినను మరణించుచున్నాడు గాన నిత్యమృతు డనియును అర్థము. ఇచట నియ్యాది గ్రహింప వలయును. క్రోధము, తృప్తి, హర్షము, మున్నగునవి యన్తఃకరణధర్మము లగుటవలన, నన్తఃకరణవికారము లనబడుచున్నవి. లోకము ఆత్మాన్తఃకరణముల కభేదమును ఆరోపించుకొని, అన్తఃకరణము క్రోధమును జెందుచుండగా, ఆత్మ క్రుద్ధుడయినా

డనియు, అన్తఃకరణము తృప్తిని జెందుచుండగా ఆత్మ తృప్తిని జెందినాడనియు, అన్తఃకరణము హర్షమునొంద ఆత్మ హర్షము నొందెననియును, ఆత్మనే వికారము నొందినవానినిగా తలచుచున్నది. అట్లే క్రోధ, తృప్తి, హర్షాది ప్రత్యయములు నశింపగా, క్రుద్ధాత్మ నశించెననియు, హృష్టాత్మ నశించెననియు, తృప్తాత్మ నశించెననియును, ఆత్మనే నశించినవానినిగా లోకము తలంచుచున్నది. దీనిచే నన్తఃకరణవికారములగు క్రోధ, తృప్తి, హర్షముల యొక్క ఉత్పత్తినాశముల వలన ఆత్మయొక్క ఉత్పత్తి వినాశములు లౌకికులచే సంగీకరింపబడుచున్నట్లు స్పష్టమగుచున్నది. అట్లే శరీరధర్మములగు జన్మనాశములు లౌకికులచే నాత్మయందు ఆరోపింపబడుచున్నట్లు గనుబడుచున్నది. శరీరములు పుట్టుచుండ నాత్మ పుట్టెననియు, శరీరములు మరణించుచుండ నాత్మ మరణించెననియును లోకమునందు గల ప్రసిద్ధియే నిందులకు దార్కాణమగుచున్నది.

ఓయి! అన్తఃకరణధర్మము లగు క్రోధాదులయొక్క ఉత్పత్తి వినాశములవలన, అన్తఃకరణమునకే ఉత్పత్తి వినాశవ్యవహారము లేదు. లోకమునం దెవ్వడును అన్తఃకరణము క్రోధమును జెందుచుండగా. అన్తఃకరణము పుట్టినదనియు, యన్తఃకరణము శాంతమగుచుండగా అన్తఃకరణము నశించినదనియును దలంచుటలేదు. అట్టితరి ఆత్మకు నట్టి వ్యవహార మెట్లు సంభవించును? కావున దృష్టాన్తము పొసగ నేరదనినచో సమాధాన మొసంగబడుచున్నది. క్రోధము చల్లారిన దేవదత్తుని గురించి, 'యింతకు ముందు కోపించిన దేవదత్తు డిప్పుడెచ్చట?' అని యజ్ఞదత్తుడడుగగా – వానికి నా దేవదత్తుడు, 'కోపించిన దేవదత్తుడు పోయినాడు' 'శాంతుడగు దేవదత్తుడు పుట్టినాడు' అని సమాధానమును చెప్పుచున్నాడు. అట్లే యతియు – గృహస్థుడు పోయినాడు. 'యతి పుట్టినాడు' అని జెప్పుచున్నాడు. కావున ధర్మముయొక్క ఉత్పత్తినాశముల వలన ధర్మికి ఉత్పత్తినాశములు ఉపచరితములగుచున్నవి. గనుక లోకప్రసిద్ధికి బాధలేదు.

తథ్యవాద మవలంబించినచో భాష్యకారులు ప్రౌఢివాదముచే నీయర్థమును జెప్పిరిగాని, దీనియందు భాష్యకారుల కభినివేశములేదు, పట్టుదలలేదు. మరేమనిన అన్తఃకరణ ధర్మములగు క్రోధాదులనువలె దేహధర్మములగు జన్మనాశములను ఆత్మయం దధ్యసించుటవలన లోకమునందు–'ఆత్మ క్రుద్ధుడు, ఆత్మ హృష్టుడు' అనినట్లు 'ఆత్మ పుట్టినవాడు' 'ఆత్మ మరణించినవాడు' అను వ్యవహారమనియు, అట్టి లోకవ్యవహార బలమువలననే అర్జునునకుగూడ ఆత్మ నిత్యజాతుడు, నిత్యమృతు డను మతి కలిగినదనియును జెప్పుటయందే భాష్యకర్తలకు అభినివేశము.

ఆత్మని అను పదము విషయసప్తమ్యంతము "మహాబాహో" అను సంబోధనము ధైర్యమును ప్రకటించుట కొరకు ప్రయోగింపబడినది. కావున ధీరుడవగు నీ కీ శోక ముచితము గాదని భావము.

ఇచట రామానుజు లిట్లర్థమును జెప్పిరి, "అథ నిత్యజాతం నిత్య మృతం దేహ మే వైన మాత్మానం మనుషే ఇతి" అట్లుగాక యెల్లపుడు పుట్టుచు, యెల్లపుడు నశించు చున్న దేహమునే ఆత్మ యని తలచుచో అని - అది అయుక్తము. మూలమునందు దేహపదము లేకుండుటవలనను, ఆస్తికు డగు నర్జునునకు, నాస్తికు లగు బౌద్ధాదులకు వలె దేహమునం దాత్మబుద్ధి సంభవించకుండుటవలనను, మరేమనిన-ఆత్మ దేహాతి రిక్తుడై కాని, వాడు దేహోత్పత్తి ననుసరించి పుట్టుచుండుటవలనను, దేహనాశము ననుసరించి నశించుటవలనను, జన్మాది వికారరహితుడు గాడు. అనియే అర్జునుని యాశయము. 'పుత్రుడు పుట్టెను, పుత్రుడు నశించెను' అని లోకవ్యవహారము కలదు. పుత్రశరీరము నశించుట జూచుచును తలిదండ్రులు 'పుత్రుడు నశించెనని' దుఃఖింపు చున్నారు. కావున, నర్జునుడు గూడ దేహమును ఆత్మ యని దలచుటలేదు. మరే మనిన దేహమువలె నాత్మ గూడ జన్మనాశములు గలవాడనియె తలచుచున్నాడు. గనుక రామానుజభాష్య మయుక్తము.

శ్లో॥ జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మమృతస్య చ
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి. ౨౭

అ॥ జనిక్రియాశ్రయునకు మరణము తప్పదు. యెవడు పుట్టునో వాడు మృతిం జెందునను వ్యాప్తి (నియమమున) కెందును భంగము లేదు. విభీషణుడు, హనుమంతుడు, మార్కండేయుడు, మున్నగువారియందు యీ నియమమునకు భంగము కలదని శంకింపరాదు. ప్రళయకాలమునందు వారలకుగూడ నాశము గలదు.

అగ్నికి వేడిమి, నీటికి చల్లదనము - యెట్లు స్వతస్సిద్ధమగు ధర్మమో, అట్లే పుట్టినవానికి మరణము, మరణించినవానికి పుట్టుక - నీ రెండును స్వాభావికము లని తాత్పర్యము.

ఓయి ! పుట్టినవానికి నాశనమనునది యందరికి దెలిసిన విషయమే. పుట్టిన తలిదండ్రులు మరణించుట సర్వజనప్రత్యక్ష మగు విషయముగదా, మరణించినవానికి పునర్జన్మ (మరల పుట్టుటే) కలదను విషయము మాత్రము అప్రత్యక్షము. కావున నయ్యది నంగీకరించు టెట్లు? అనినచో సమాధానము జెప్పబడుచున్నది. భూమియందు మొలవబెట్టిన విత్తనము నశించియే మొలకను పుట్టించుచున్నది. విత్తనము యొక్క స్వరూపము నశించనిదే మొలక పుట్టుటలేదు. నీయంశమున శాస్త్రప్రమాణము గూడ గలదు. కావున నశించినదానికి మరల పుట్టుక గలదని యంగీకరింపనగును.

ఇచట రామానుజులు నశించినదానికి మరల పుట్టుక నెట్లు కలుగునని యాక్షేపించి సత్కార్యవాదమును ప్రవేశపెట్టిరి. దీనిని విచారింతము. సద్రూపమగు

మృద్ద్రవ్యము (మట్టి) ఘటాదిరూపమున వికారము నొందుచున్నది గనుక సద్రూపమగు మృద్ద్రవ్యముయొక్క అవస్థావిశేషములే ఘటసర్పాదుల యొక్క జన్మనాశములు- అని వీరల ప్రఘోషము (గోల). ఇయ్యది యాపాతరమణీయము. అదెట్లనిన ఏది వికారమును జెందునో నయ్యది సద్రూపము గాదు. ఘటాదులవలె ఏది వికారమును జెందదో అయ్యది సద్రూపము. ఇందుకును ఘటాదులే వ్యతిరేక దృష్టాంతము. కావున వికారమును జెందుచున్న మృద్ద్రవ్యము సద్రూపమగు టెట్లు పొసగును? 'నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః' అను ప్రమాణమువలన కాలత్రయమునందును లేకుండుట నసత్పదార్థముల లక్షణ మగుటవలనను మృద్ద్రవ్యము భూతములు పుట్టకపూర్వము భూతప్రళయానంతరము. లేకుండుటచే నసద్రూపమగుటవలనను 'మృత్తికేత్యేవ సత్యమ్' అను శ్రుతి ప్రపంచముండు నంతవరకే మృత్తికకు సత్యత్వమును చెప్పుచుండుటవలనను మృత్తికకు సద్రూపత్వము సంభవింపనేరదు.

మరియు ననిత్యమయినను మృద్ద్రవ్యము రజ్జుసర్పాదులవలె నసద్రూపము గాదు. మరేమనిన సద్రూపమే యగునని యనదగదు. నశించుస్వభావము అసత్యమనియు, నశించిన స్వభావము సత్యమనియును రామానుజులే సత్యమనగా నిత్యత్వమని వర్ణించియుండిరి. నిత్యవస్తువునందు అసత్యమున్ను అనిత్యవస్తువునందు సత్యమున్ను యెచ్చటను గనుపింపదు. "అవినాశితు తద్విద్ధి" అను గీతాస్మృతి; తుశబ్దముచే నాత్మభిన్నమగు పదార్థజాతమంతయు నశించు స్వభావము గలదని ప్రతిపాదించియున్నది. మృదాదులు నశించునవగుచో మృదాదివైలక్షణ్యమును ప్రతిపాదించునట్టి తుశబ్దప్రయోగ ముపపన్నమగును. 'ఆత్మన ఆకాశస్సంభూతః' అనుశ్రుతిచే నాత్మవలన నాకాశాదులకు నుత్పత్తి వినవచ్చుటవలనను «పృథివ్యప్సు ప్రవిలీయతే» అనుదానిచే పృథివ్యాదులకు లయము వినబడుటవలనను, పృథివ్యాది భూతములు సద్ద్రవ్యములగు టెట్లు? పృథివ్యాదులు సద్ద్రవ్యము లయినపుడుగదా, తత్కార్యములగు ఘటాదులు సత్కార్యములగును.

మరియు ప్రకృతి సద్రూపము, ప్రకృతియొక్కవికారము లగు పృథివ్యాదులు ప్రకృతికార్యము లగుటవలన సద్రూపము లగుచున్నవి. ఘటాదుల అట్టి పృథివ్యాదులయొక్క వికారము లగుటవలన పరంపరగా సత్కార్యములగుచున్నవని యనరాదు. ప్రకృతి ఈశ్వరునికంటె వేరుగా లేనందున నద్దానికి స్వతంత్రమగు సత్తాయే లేదు. కావున ప్రకృతి సద్రూపమనిగాని యసద్రూపమని గాని నిర్వచింపవీలులేదు.

ప్రకృతి యనగా సాఙ్ఖ్యాభిమతమగు ప్రధానముగాదు. అట్టి ప్రధానము కలదనుటలో శబ్దప్రమాణము లేదు. ప్రకృతియనగా మాయయే. మాయయన నీశ్వర

శక్తియే. అయ్యది యగ్నిశక్తివంటిది. అగ్నియొక్క శక్తి యగ్నికంటె యెట్లు వేరుగాదో, అట్లే ఈశ్వరశక్తియగు మాయకూడ నీశ్వరునికంటె వేరుగాదు. ఇయ్యది కార్యమువలన దెలియదగినదియే. ప్రకృతియొక్క కార్యము ప్రపంచము. అయ్యది ప్రళయమునందు నశించుచున్నందున మహాభూత ప్రళయమునందు ప్రకృతి యున్నదని యెట్లూహింపనగును? "పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి" అను శ్రుతివలన ముక్తులు చేరునట్టి బ్రహ్మమునందు, మాయగాని తత్కార్యములు గాని లేవని దెలియబడుచున్నందున, ముక్తియందు ప్రకృతి లేదనుటను స్పష్టము. కావున ప్రకృతిగూడ సద్ద్రవ్యము గానేరదు.

దీనిచే జీవుడు ఈశ్వరునకు అపృథక్సిద్ధవిశేషణమను వాదముగూడ నిరాకరింపబడినది. (అపృథక్సిద్ధ విశేషణమనగా వేరుగా నుండని ధర్మమని యర్థము). అట్టిచో జీవుడుగూడ నీశ్వరసత్తాధీనసత్తాగలవా డగుటచే, స్వతంత్రమగు సత్యము లేనందున జీవునకు అసత్యము ప్రాప్తించును. అయ్యది యనిష్టము. జీవునకు సత్యత్వము రామానుజులచే గూడ నంగీకరింపబడినది. కావున నాత్మభిన్నమగు పదార్థము అసద్రూప మగుటవలనను, సద్రూపమగు నాత్మ అవిక్రియుడగుటవలనను సత్కార్య వాదము సిద్ధించనేరదు.

మరియు, సద్రూపమగు ద్రవ్యము, అవస్థాన్తరము నొందుటయే ఉత్పత్తియని యంగీకరించినను, అట్టి యవస్థాంతరము పూర్వము లేనిదయియే కారకవ్యాపారానంతరము పుట్టుచున్నదిగాని, సద్రూపముగా నుండి పుట్టుటలేదు. ఉన్నదానికి పుట్టుక యనునది యసంభవము. గనుక నసత్కార్యవాదమే సిద్ధించుచున్నది. మీరును మృత్తియందు పూర్వములేనట్టి యే ఘటాద్యాకారమునకు కారకవ్యాపారము వలన నుత్పత్తి నంగీకరించుచున్నారు. కారకవ్యాపారమునకుం బూర్వము ఘటాద్యాకారము లేకుండుట వలననే ఘటాద్యాకారమును తయారుచేయునట్టి కారకవ్యాపారమునకు పై యర్థ్యదోషము సంభవించుటలేదు. అట్లుగానిచో గారక వ్యాపారము వ్యర్థమయ్యెడిది.

కావున సత్కార్యవాదము పొసగదు. అసత్కార్యవాదమున్ను పొసగదు. మిథ్యాకార్యవాదమే నిర్దుష్టమయినది. ఉన్నదానికి ఉత్పత్త్యాత్యాది వికారములు అసంభవము గనుకను లేనటువంటిదానికి శశశృంగాదులవలె ప్రతీతి సంభవింపకుండుటవలనను తెలియబడుచు వికారమును జెందుచున్న నీ కార్యజాత మంతయు మిథ్యయే. శుక్తికయందు గనుపడుచు నాశరూపమగు వికారమును జెందుచున్న రజతమెట్లు మిథ్యయో, నట్లే ప్రత్యక్షముగా దెలియబడుచు నాశమును జెందుచున్న నీ ప్రపంచముగూడ మిథ్యయే యగుచున్నది.

శ్లో॥ అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత!
అవ్యక్త నిధనాన్యేవ తత్రి కా పరిదేవనా॥ ౨౮

అ॥ భూతములు దేహేంద్రియ సముదాయరూపములు. అనగా ఆత్మాతిరిక్తమగు చతుర్వింశతి తత్త్వరూపము లని యర్థము. అట్టి భూతములు అవ్యక్తాదులును, వ్యక్తమధ్యములును, అవ్యక్తనిధనములును అగుచున్నవి. ఓయి యర్జునా! అందు విలపింపనేల? అవ్యక్తమనగా కనుపించకుండుట – అనగా లేకుండుట అని నిశ్చయము. పుత్రమిత్రాది భూతములు పుట్టుకకు పూర్వము కనుపించకుండుటవలన నవ్యక్తాదు లగుచున్నవి. ఇట్టి యవ్యక్తమునే నైయాయికులు ప్రాగభావమని జెప్పిరి. మధ్యకాలమున కనుపించునవి. వ్యక్తమధ్యములు. జన్మనాశముల యొక్క మధ్యకాలమునందు కనుపించునవి. అని యర్థము. అవ్యక్త నిధనాని, నిధనమనగా నాశము – లేకపోవుటయే నాశముగా గలవి యని యర్థము. ఇట్టి యవ్యక్తమునే నైయాయికులు ప్రధ్వంసాభావమని జెప్పుచున్నారు. అవ్యక్తమరణములకు సమానార్థకత్వమును శంకింపదగదు. మరణానంతరము కలుగునదే యవ్యక్తదశ కావున ఏకార్థకత్వ దోషము లేదు,

ఓయి! ఏ ఇంద్రియమునకు గోచరింపకుండుట రూపమగు నవ్యక్తత్వము ఆత్మధర్మ మగుటవలనను, "అవ్యక్తోఽయ మచిన్త్యోఽయ" మని గీతలయందుగూడ నట్లే జెప్పబడుటవలనను, ఏది దేనివలన పుట్టునో నది దానికి యాదియను సిద్ధాంతమువలనను, "యతోవా ఇమాని భూతాని జాయన్తే" అను శ్రుతిచే బ్రహ్మకు సర్వభూతకారణత్వము చెప్పబడుటవలనను అవ్యక్తమగు ఆత్మయే భూతములకు ఆదియో, నాభూతములు అవ్యక్తాదులనియు అట్లే కార్యము కారణమునందు లయించుటవలనను "యత్ప్రయన్త్యభిసంవిశంతి" అను శ్రుతి భూతములకు బ్రహ్మయందు లయమును జెప్పుటవలనను, అవ్యక్తమగు బ్రహ్మయే భూతముల యొక్క నాశస్వరూపమో నయ్యవి అవ్యక్తనిధనము లనియును అర్థమును జెప్పవలయును. లేనిచో ప్రపంచము మాయాకార్యమగుటవలన ప్రపంచాంతర్గతములగు భూతములు మాయయే ఆదిగాగలవియు, మాయయే అంతముగాగలవియు నగుచున్నవి. అనియయినను అర్థమును జెప్పవలయును యాదవ ప్రకాశాదులు గూడ నిట్లే వ్యాఖ్యానమును జేసిరి. అనినచో–

సత్యమే; ఇచట ఆది శబ్దమునకు కారణమనియు, నిధనశబ్దమునకు నాశావధి యనియును అర్థమగుచో నవ్యక్తశబ్దమునకు బ్రహ్మమే అర్థమయ్యెడిది. మరేమనిన ఆదిశబ్దమునకు జన్మయనియు నిధనశబ్దమునకు మరణమనియును అర్థము. బ్రహ్మము గాని, మాయగాని, భూతములయొక్క జన్మ మరణములు కానేరవు.

ఇట్లైనచో అవ్యక్తశబ్దమునకు అదర్శనమను (కనుపింపకుండుట యను) అర్థమును అంగీకరించినను యీ దోషము సమానమే యగును. కనుపింపకుండుట జన్మగానేరదుగదా యని యనరాదు. భూతములయొక్క పుట్టుకకుపూర్వము మరణానంతరమును భూతములు కనుపింపకుండుటవలన అదర్శనమునకు అన్తత్వము, ఆదిత్వము చెప్పుట సమంజసమే యగుచున్నది.

ఓయి! ఇట్లు 'అదర్శనా దాపతితాః పునశ్చాదర్శనంగతాః' అను శ్లోక సంవాదము వలన గూడ ఆది నిధనశబ్దములకు కారణ, నాశావధి, రూపములగు అర్థములే సంప్రాప్తము లగుచున్నవి. జన్మకంటె పూర్వము, మరణముకంటె అనంతరమున్ను అదర్శనమే (భూతములు కనుపించకుండుటయే) కలదనుటచేతను అదే అర్థము సిద్ధమగుచున్నది గనుక అసత్కార్యవాదమున్ను ప్రపంచనాశానంతరము శూన్యవాద ప్రసంగమున్ను కలుగు ననినచో—

అట్లుగాదు. భూతములు తాము పుట్టకపూర్వము నశించినతరువాతను భూతస్వరూపముతో గనుపడుట లేదు. గనుక లోకదృష్టి ననుసరించి భూతములకు అవ్యక్తాదిత్వము, అవ్యక్తనిధనత్వము జెప్పబడినది. శాస్త్రదృష్టితోనయితే భూతములు స్వోత్పత్తికి పూర్వము స్వనాశానంతరమున్ను బ్రహ్మస్వరూపముతో కనుపడుచున్నవి. గనుక బ్రహ్మాదిత్వము, బ్రహ్మనిధనత్వమును భూతములకు యుక్తమగుచున్నది.

ఓయి! ఈ గీతాశాస్త్రమునందు శాస్త్రదృష్టియే ఆశ్రయింపవలెయుండగా లోకదృష్టి నాశ్రయించి యవ్యక్త శబ్దమునకు అదర్శనమను అర్థమును వర్ణించుటెట్లు? అనినచో సమాధానము – 'వ్యక్తమధ్యాని' అను హేతువువలన ఇచట శాస్త్రదృష్టి పరిగ్రహింప వీలులేదు.

శాస్త్రదృష్టిచే మధ్యకాలమునందు గూడ భూతములు బ్రహ్మస్వరూపములు గాకపోవు. మధ్యకాలమున బ్రహ్మస్వరూపములు గాకున్నచో భూతములు వ్యక్తమధ్యము లయ్యెడివి. అవ్యక్తము బ్రహ్మ; వ్యక్త మనగా ఇంద్రియవిషయమగు బ్రహ్మభిన్న పదార్థము. ఘటముయొక్క తత్త్వమును దెలిసికొను పురుషుడు ఘట ప్రతీతి కాలమునందు గూడ ఘటమును మృద్రూపమునుగానే తెలిసికొనుచున్నాడు.

దీనిచే "అవ్యక్తాదీని, వ్యక్తమధ్యాని, అవ్యక్తనిధనాని, అను పదములకు భూతములు జన్మకు పూర్వము కనబడుటలేదనియు, మధ్యకాలమున కనుపడుచున్నవనియు, మరణానంతరము కనుపడుటలేదనియును అర్థము సిద్ధించినది. ఇంతమాత్రముచే అసత్కార్యవాద శూన్యవాదములకు ప్రసక్తిలేదు. భూతములు అభావమువలన పుట్టుచున్నవనియు, అభావమునందు లయించుచున్నవనియును జెప్పనందువలన –

ఓంబు ! "అదర్శనా దాపతితాః పునశ్చాదర్శనంగతాః" అను ప్రమాణ శ్లోకము నందు గూడ నిట్లె చెప్పబడినది. అచట అసత్కార్యవాద శూన్యవాదములు ప్రసక్తించగా నిచట మాత్ర మేల నావాదములు ప్రసక్తించవు ? - సమాధానము : - భూతములు ఉత్పత్తికి పూర్వము కనుపించకుండుటవలన «అదర్శనా దాపతితాః" అని చెప్పబడినది గాని, అదర్శనమువలన, పుట్టుటవలన గాదు. ఇట్లే మరణానంతరము కనుపడకుండుటవలన «అదర్శనంగతాః" అని చెప్పబడినది గాని అదర్శనమునందస్తమించుటవలన గాదు. «అదర్శనాత్" అనుచోట అవధిత్వరూపమును జూపుటయందు పంచమీ విభక్తిగాని, జనికర్తయొక్క ప్రకృతిత్వరూపమును ఆపాదించుటయందుగాదు, అని తెలియవలయును.

"అదృష్టదృష్ట నష్టభ్రాంతి భూతేషుభూతేషు కోవ్యాప్రలాపః" అని భాష్యపంక్తి - మొదట కనుపింపనట్టియు, మధ్య కనుపించునట్టియు, తుదకు నశించునట్టియు. ఇట్లు భ్రాంతిరూపములగు భూతములగురించి విలపింపనేల యని యర్థము -

ఇచట రామానుజు లిట్లు చెప్పుచున్నారు. « మనుష్యాది భూతములు సద్రూపములగు ద్రవ్యములే. వాటియొక్క పూర్వావస్థ కనుపించదు. మనుష్యత్వాది రూపమగు మధ్యమావస్థ కనుపించును. మరణానంతరము "ఉత్తరావస్థ కనుపించదు " అని. ఇయ్యది తుచ్ఛము. జన్మనాశాది వికారములుగల మనుష్యాది భూతములకు సద్రూపత్వము అసంభవము. నిర్వికారమగు వస్తువుగాని సద్రూపము గానేరదు; అట్టి నిర్వికారమగు వస్తువు బ్రహ్మ యొక్కటియేయని «అవినాశితు తద్విద్ధి" అను శ్లోకముచే నింతకుమున్నే నిరూపింపబడినది. మనుష్యాది భూతములు, తెలియబడని పూర్వావస్థ గలవియని చెప్పుటగూడ సమంజసము గాదు. వీర్యరక్తాన్నాది రూపమగు పూర్వావస్థ కనుపించుచునే యున్నది. అట్లే తెలియబడని యుత్తరావస్థగలవని యనుట కూడ పొసగదు. భస్మమృత్తికాది రూపమగు ఉత్తరావస్థ తెలియుచునేయున్నది. గనుక రామానుజీయ మసమంజసమగుచున్నది. -౨౮-

శ్లో॥ ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చిదేనం ఆశ్చర్యవ ద్వదతి తథైవచాన్యః
ఆశ్చర్యవచ్చైన మన్యశ్శృణోతి శ్రుత్వాప్యేనం వేద నచైవ కశ్చిత్. -౨౯-

అ॥ ప్రకృతమగు నాత్మ యెల్లరకు దుర్విజ్ఞేయుడు. భ్రాన్తినిమిత్తమగు అజ్ఞానము సర్వలోక సాధారణమగుచుండగా నిన్నొకనినే నిందింపనేల ?-; భూతములు మొదట కనిపింపకుండుట, మధ్య కనుపించుట, తుదకు నశించుట - ఇది యంతయు భ్రాంతి. దీనికి కారణము అజ్ఞానము. అయ్యది యందరకును గలదు. దానిమహిమ వలన నేరికిని ఆత్మ తెలియబడుటలేదు. అందు నీ వొక్కడవే నిందింపదగవు. అయ్యొ

వీరలకు కొంచెమయినను ఆత్మజ్ఞానము లేదే యని యందరును నిందింపదగినవారే; అందరనుగురించియు దుఃఖింపదగినదియే. ఆశ్చర్యముతో సమానముగాన ఆశ్చర్యవత్, "తేన తుల్యంకి యాచేద్వతిః" అను సూత్రమువలన ఆశ్చర్యశబ్దముకంటె వతి ప్రత్యయము చేయగా ఆశ్చర్యవత్ అనురూప మేర్పడును. అనేకజన్మలయందు తాను జేసిన నిష్కామకర్మాదులచే నిర్మలమయిన నంతఃకరణముగల యొకానొక ధన్య పురుషుడు ఆత్మను సాక్షాత్కరింప జేసికొనుచున్నాడు. ఆత్మయందు చక్షురింద్రియ వ్యాపారము సంభవించదు. గాన నిచట "పశ్యతి" అను ధాతువు ప్రేక్షణార్థకము గాదు. "దృశోఽనాలోచనే" అను లింగమువలన జ్ఞానార్థకము. మరియొకడు తాను దెలిసికొనిన "నజాయత" ఇత్యాది శ్రుత్యుక్తమగు నాత్మస్వరూపమును ఇతరులకు జెప్పుచున్నాడు. మరియొకడు తెలిసికొనియును జెప్పడు. మరియొక వ్యాఖ్యానమునందు ఆశ్చర్యవత్ అను పదమునకు ఆశ్చర్యతుల్యు డని యర్థము. కావున ఆశ్చర్యతుల్యుడగు నొకానొకడు ఈ యాత్మను దెలిసికొనుచున్నాడు. అట్లే ఆశ్చర్యతుల్యుడగు మరియొకడు ఈ యాత్మను చెప్పుచున్నాడు. ఆశ్చర్యతుల్యు డగు మరియొకడు ఈ యాత్మను వినుచున్నాడు అని యన్వయము. "మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతిసిద్ధయే, యతతామపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః" అను ప్రమాణమువలన ననేక వేల మానవులలో నొకడే తెలిసికొనుచున్నా డని చెప్పబడినది. ఆత్మను తెలిసికొనువాడు, ఆత్మనుగురించి చెప్పువాడు, ఆత్మను వినువాడు – ఈ ముగ్గురును దుర్లభు లగుటవలన నాత్మ దుర్విజ్ఞేయు డని యర్థము. ఇచట "శ్రవణాయాపి బహుభి ర్యో నలభ్యః శృణ్వన్తోపి బహవో యం న విద్యుః। ఆశ్చర్యో వక్తా కుశలోఽస్యలబ్ధా ఆశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః" అను మంత్రము ననుసంధానము చేసికొనవలయును.

శ్లో॥ దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత
తస్మా త్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి. ౩౦

అ॥ ఆత్మయందు అవధ్యత్వము యెన్నటికిని మారదు, ఇయ్యది నిజము. కార్యకారణసంఘాత రూపమగు శరీరము అనిత్యమయినను తదంతర్గత మగు ఆత్మ నిత్యుడు కావున నీవు సర్వభూతముల నుద్దేశించి దుఃఖింప తగవు. భీష్మాది శరీరముల యందలి యనిత్యత్వము తప్పింప శక్యముగాకుండుటవలనను, భీష్మాద్యాత్మల యందలి నిత్యత్వము శోకమునకు విరోధియగుటవలనను, అని భావము.

శ్లో॥ స్వధర్మ మపి చావేక్ష్య నవికమ్పితు మర్హసి
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య నవిద్యతే. ౩౧

అ॥ ధర్మపథి "అర్థన్యాయాదనపేతే" అను సూత్రమువలన యత్ ప్రత్యయమును చేయగా 'ధర్మ్యమ్' అని యగును. శ్రేయః అను పదము శ్రేయస్సునకు కారణమగు దానియందు ఔపచారిక ప్రయోగము శ్రేయస్కర మని యర్థము. 'స్వధర్మం' స్వః - అనగా స్వీయము. అనగా క్షత్రియజాతికి విహితమగు యుద్ధమని యర్థము. 'యుద్ధమును జూచికూడ నీవు భయపడదగదు' అని శ్లోకముయొక్క పూర్వార్థమునకు అర్థము. క్షత్రియుడవగు నీకు యుద్ధము స్వధర్మమగుటయే అందులకు కారణము. "క్షత్రియస్య విజితం" అని శాస్త్రప్రమాణ ముండుటవలన అని భావము.

ఇచట రామానుజులు "ఇదం యుద్ధం" అను రెండు పదములను మూలముకంటె బహిర్భూతముగా కల్పించి "ఈ యుద్ధమును స్వధర్మమని తలచియు" అని వ్యాఖ్యానమును చేసిరి. అయ్యది మందము. మూలముకంటె వేరుగా కల్పించుటలో ప్ర[illegible]నము లేదు. 31

శ్లో॥ యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్
సుఖినః క్షత్రియాః పార్థ ! లభన్తే యుద్ధ మీదృశమ్ ॥ 32

అ॥ ఓయి అర్జునా ! సుఖవంతులగు క్షత్రియులు, దైవికముగా సంప్రాప్తమయినట్టియు, తెరవబడిన ద్వారములు గల స్వర్గమగు నిట్టి యుద్ధమును పొందుచున్నారు.

శ్లో॥ అథచేత్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం నకరిష్యసి।
తతస్స్వధర్మం కీర్తించ హిత్వా పాప మవాప్స్యసి ॥ 33

అ॥ అట్లుగాక, ధర్మబద్ధమగు నీ యుద్ధమును, నీవు చేయకున్నచో నీవు యీశ్వరాదులతో పోరాడి తెచ్చుకున్న కీర్తిని, నీ స్వధర్మమును పోగొట్టుకొని పాపము నొందెదవు. 33

శ్లో॥ అకీర్తించాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయామ్
సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే ॥ 34

అ॥ అర్జునుడు యుద్ధమునుండి భయపడెను - అను ఆకారము గల అపకీర్తిని ప్రాణులు చెప్పెదరు. చెప్పుకొనుగాక. దాన నాకేమి యని యనరాదు. ధర్మాత్మత్వము, శౌర్యము, ధైర్యము నున్నగు గుణములచే గొప్పవాడవగు నీకు అయ్యది మరణముకంటె గొప్పది యగును. 34

శ్లో॥ భయాద్రణా దుపరతం మంస్యన్తే త్వాం మహారథాః
యేషాంచ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్॥ 35

అ॥ ఓయి, బంధుజనమునందు స్నేహముచే గాని దయచే గాని యుద్ధమునుంచి మరలినటువంటి నాకు అపకీర్తి యేమి? అనగా చెప్పుచున్నాడు. "భయాద్రణాత్" అని శ్లోకమునను, ఉలూకమునకు (గుడ్లగూబకు) వలె కర్ణాద్యులకు స్వతస్సిద్ధమగు విరోధ ముండుటవలన, కర్ణ శబ్దశ్రవణముచే నర్జునకు కోపమును వృద్ధిచేయదలచి భాష్యమునందు కర్ణశబ్దము గ్రహింపబడినది. మహారథులగు ఆ కర్ణాదులు తమవలన భయపడి యుద్ధమునుంచి వెనుదీసినవానినిగా నిన్ను తలచుదురు అని యన్వయము 3౬

శ్లో॥ అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యన్తి తవాహితాః
నిన్దన్త స్తవసామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్॥ 3౬

శ్లో॥ హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్
తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ యుద్ధాయ కృతనిశ్చయః॥ 3౭

అ॥ హతః అనునది హనధాతువు కంటె కర్మార్థమునం దుక్త ప్రత్యయము "భోక్ష్యసే" అనుభవించగలవు. 3౭

శ్లో॥ సుఖదుఃఖే సమేకృత్వా లాభాలాభౌ జయాజయౌ
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి. 3౮

అ॥ సుఖదుఃఖములను సమానముగా జేయుట యనగా, సుఖమునందు రాగము నుంచకుండుట, దుఃఖమునందు ద్వేషము నుంచకుండుట, ఇట్లే లాభాలాభములయందును, జయాపజయములయందును ఊహించవలయును. ఇట్లు యుద్ధమును జేయు నీవు పాపమును బొందవు. 3౮

అవతారికాభాష్యమ్.

అ॥ "స్వధర్మ మపి చావేక్ష్య" అను శ్లోకము మొదలు ఏడు శ్లోకములచే శోకమోహములను బోగొట్టుటకు లౌకికన్యాయము చెప్పబడినది. ఇయ్యది ప్రసంగ వశమున జేసిన యుపదేశము. ఇందు కృష్ణునకు తాత్పర్యము లేదు. ఇచట పరమార్థ జ్ఞానమే చెప్పదలచబడినది గాని, లౌకికన్యాయము చెప్పదలచబడలేదు. అట్టి పరమార్థజ్ఞానము "అశోచ్యా నన్వశోచ స్త్వమ్" అను శ్లోకము మొదలు "న త్వం శోచితు మర్హసి" అనునంతవరకు నుండు గ్రంథముచే చెప్పబడియే యున్నది. అని భావము.

శ్లో॥ ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు
బుద్ధ్యాయుక్తో యయాపార్థ! కర్మబంధం ప్రహాస్యసి॥ 3౯

అ॥ నీకు చెప్పబడిన ఈ జ్ఞానము సాంఖ్యవిషయమయినది అని యర్థము. లేనిచో నీ సాంఖ్యవిషయమగు జ్ఞానము నీకు చెప్పబడినది; అని యయినను అన్వయింప

వలయును. ఇంతవరకు నుండు గ్రంథసందర్భముచే నీకు సాఙ్ఖ్యబుద్ధి యుపదేశింపఁబడినది. అని నిష్కృష్టార్థము. (సాఙ్ఖ్యబుద్ధిః) సాఙ్ఖ్యవిషయమగు బుద్ధి యనగా, పరమార్థ వస్తువివేకజ్ఞానము. ఇట్టి జ్ఞానము సంసారహేతువగు శోకమోహాదిరూప దోషమును బోగొట్టుటకు కారణమని యర్థము. జ్ఞానముచే అజ్ఞానము నశించిననే అజ్ఞానకార్యములను శోకమోహాదులు నశించునని భావము. యోగశబ్దార్థమును చెప్పుచున్నారు. (యోగేతు ; తత్ప్రాప్త్యుపాయే) అని భాష్యకారులు. సాఙ్ఖ్యబుద్ధి నొందుటకు సాధనము యోగమని యభిప్రాయము. యోగమనగా ఫలాభిసంధిని విడిచి, శీతోష్ణాది ద్వంద్వములను సహించి ఈశ్వర ప్రీత్యర్థమను సంకల్పముతో, ఈశ్వరానుగ్రహము కొరకు అనుష్ఠించు కర్మ మార్గము, యమనియమాది అష్టాంగ యోగమును, అని యర్థము. వీనిచే "యోగేతు" అను మూలశ్లోకము నందలి పదమునకు కర్మానుష్ఠాన యోగానుష్ఠాన రూపమగు కర్మ యోగవిషయమగు బుద్ధియని యర్థము సిద్ధమగుచున్నది. భాష్యమునందలి యోగపదమునకు విశేషణమగు "తత్ప్రాప్త్యుపాయే" అనుదానిచే ఉత్తమాధికారి విషయమగు సాఙ్ఖ్య యోగముకంటె కర్మయోగమునకు అపకర్షము సూచింపబడుచున్నది. సంసార హేతువగు అజ్ఞానమును పోగొట్టుటకు ముఖ్యసాధనమగు సాఙ్ఖ్య యోగముతో పరమ్పరా సాధనమగు కర్మయోగము సమాన మెప్పటికిని కానేరదు. ఇంతమాత్రముచే కర్మయోగము వ్యర్థమునరాదు. సాఙ్ఖ్యయోగమునకు కర్మయోగము కొంత దూర మాధారపడును. గనుకనే మూలశ్లోకమునందలి యుత్తరార్థము ముముక్షువునకు కర్మమార్గమునందలి రుచిని పుట్టించుటకు (యవాగూం పిబ శిఖా తే వర్ధిష్యతే) గంజి త్రాగుము, నీ జెండ్రుకలు పెరుగగలవు) అను వాక్యమువలె ప్రవర్తించినదని గ్రహింపవలయును. కర్మయోగమువలన కర్మబన్ధము విడిపోవుననగా కర్మానుష్ఠానము వలన ఈశ్వరానుగ్రహము, చిత్తశుద్ధి మున్నగునవి కలుగుననియు, వాటి వలన జ్ఞానము లభించుననియు తద్ద్వారా కర్మబంధమగు సంసారము నివర్తించునని యునుగ్రహింపవలయును. ఇంతియే కాని కర్మయోగమువలన సాక్షాత్ సంసార నివృత్తి యసంభవము.

ఇచట రామానుజు లిట్లు చెప్పుచున్నారు. సంఖ్యయనగా బుద్ధి, దానిచే నిర్ధారణ చేయదగిన ఆత్మతత్త్వము, సాఙ్ఖ్య మనబడును. తెలిసికొనదగిన ఆత్మ తత్త్వమును దెలిసికొనుట కొరకు యే బుద్ధిచెప్పదగినదియో అట్టి బుద్ధి "న త్వేవాఽహం" అను శ్లోకము మొదలుకొని, "తస్మాత్సర్వాణి భూతాని నత్వం శోచితుమర్హసి" అను శ్లోకముపరకు నుండు గ్రంథముచే నీకు చెప్పబడినది. ఆత్మజ్ఞాన పూర్వకముగా మోక్షసాధనమగు కర్మానుష్ఠానమునందు యే బుద్ధియోగ మావశ్యకమో, అట్టి బుద్ధియోగము ఇచట యోగశబ్దముచే జెప్పబడ చున్నది. అని

ఇయ్యాది యయుక్తము, యా - అభిధేయా, సా = అను మూడుపదములు, మూలముకంటె వెలుపల కల్పించుటలో ప్రమాణములేదు. మూలకర్త కట్టి వివక్ష యున్నచో "నైషా ప్రీతేఖిహితా" అనియే చెప్పియుండవలయును. మరియు "తజ్జ్ఞానాయ యాబుద్ధిః"అను రామానుజ భాష్యపంక్తియు అసంబద్ధార్థకమగుచున్నది. జ్ఞానమే బుద్ధి యగుచుండగా, బుద్ధి శబ్దమునకు జ్ఞానమర్థమని చెప్పుట అసంభవమగుచున్నది. లోకమునం దేదియు తనకు తా నర్థముకా నేరదు.

అట్లే కర్మలకు మోక్షసాధనత్వము శ్రుతివిరుద్ధము "నాస్త్యకృతః కృతేన" "నాన్యః పన్థా విద్యతేఽయనాయ" ఇత్యాది శ్రుతులు కర్మలవలన మోక్షము లభింప దని జెప్పుచున్నవి. "తరతి శోకమాత్మవిత్" "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" ఇత్యాది శ్రుతులు ఆత్మజ్ఞానమే మోక్షహేతువని చెప్పుచున్నవి.

మరియు ఆత్మజ్ఞానము గలవారికి కర్మలయందు ప్రవృత్తియే సంభవించదు. "నిష్కలం నిష్క్రియం శాంతం" "సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" అను శ్రుతులచే ఆత్మ అకర్తయనియు, అభోక్తయనియు, అవిక్రియుడనియు సర్వసాక్షియనియు, చిద్రూపుడనియు, తెలిసికొనిన విద్వాంసునకు కర్మలయందు ప్రవృత్తి యెట్లు కలుగును? కర్మలు, కర్త్రాది వ్యాపారమువలన సాధింపదగినవికదా!

అట్లే "కర్మానుష్ఠానమునందు యేబుద్ధి చెప్పదగినదియో, ఆ యీ బుద్ధిని వినుము" అని చెప్పినచో వివక్షితార్థము లభించుచుండ కర్మానుష్ఠానమునందు యే బుద్ధియోగము చెప్పదగినదియో ఆబుద్ధియోగమువిషయమై యేబుద్ధి యావశ్యకమో, అందు యేబుద్ధి చెప్పనావశ్యకమో ఆ యీ బుద్ధిని వినుము. అని యీవక్ర మార్గమేమి? కర్మానుష్ఠాన విషయమగు బుద్ధికి, కర్మానుష్ఠానవిషయ, బుద్ధియోగ విషయమగు బుద్ధికి భేదముచెప్ప నశక్యముగదా? కావున నిందు రామానుజభాష్యము అసంగతార్థమగుచున్నది. ౩౯

శ్లో॥ నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే ।
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥ ౪౦

అ॥ కర్మయోగము కూడ పరమ్పరామోక్షహేతువగుట వలన మోక్ష మార్గ మనబడుచున్నది. వ్యవసాయము మున్నగు పనులయొక్క ప్రారంభమునకు యెట్లు నాశనములేదో అట్లే కర్మానుష్ఠానము యొక్క ప్రారంభమునకు కూడ నాశములేదు. ఓయి! ప్రారంభమునకు నాశ మెట్లు కలుగును? ప్రారంభించిన పనికి గదా నాశము సంభవించును. అనినచో చెప్పబడుచున్నది. ప్రారంభమునకు ఫలవ్యాభి

చారిత్వమే నాశము. ఫలవ్యభిచారిత్వ మనగా ఫలము ఒకప్పు డుండుట, ఒకప్పుడు లేకుండుట. వ్యవసాయాది ప్రారంభమునకు ఫలము నియతము కాదు. వర్షాభావము వలన గాని, వర్షాధిక్యమువలన గాని, వ్యవసాయము నిష్ఫలమగుచున్నది. కర్మయోగ విషయమగు ప్రారంభ మట్లుగాదు. అర్థానికి ఫలము నియతము.

ఓయి! కర్మయోగమును ప్రారంభించి సమాప్తమును చేయనిచో నద్దానికి ఫలము యెట్లు తప్పక కలుగును? అనినచో అట్లుగాదు. కర్మయోగమును ఆరంభించినంతమాత్రముననే సంసారభయము నివర్తించును. అట్టి యోగమును పూర్తి చేసినచో యేమి చెప్పవలయును అని ద్యోతనచేయుటకు స్వల్పమపి అను పదము మూలమునందు ప్రయోగింపబడినది.

ఓయి! రోగనివృత్తికొరకు చేయబడుచున్న చికిత్సారూపమగు కర్మానుష్ఠానము సమాప్తముగానిచో పూర్వముకంటె వ్యాధి అధికమగుటవలన ప్రత్యవాయము కనుపించుచున్నది. అట్లే సంసారనివృత్తికొరకు చేయబడుచున్న కర్మయోగము సమాప్తము గానియెడల, పూర్వముకంటె అధికముగా సంసారభయవిజృంభణరూపమగు ప్రత్యవాయము కలుగు ననినచో చెప్పబడుచున్నది "ప్రత్యవాయో న విద్యతే" అని. అనగా కర్మయోగము సమాప్తముగానిచో దోషము లేదు. మరేమనిన సంసారము వెనుకటివలె నుండును అని యర్థము.

యద్వా? లేక చికిత్సచేయనిచో రోగమునకు వృద్ధిరూపమగు ప్రత్యవాయ మెట్లు కలుగునో అట్లే కర్మయోగమును అనుష్ఠింపనిచో దోషము కలదా యేమి? అనగా చెప్పుచున్నారు "ప్రత్యవాయో నవిద్యతే" అని. ఏపనియైనను చేయవలసినదానిని చేయకున్నచో కలుగుదోషము ప్రత్యవాయమని శాస్త్రజ్ఞులసిద్ధాంతము. సంధ్యావందనాదులవలె నట్టి కర్మయోగమును అనుష్ఠింపనిచో ప్రత్యవాయము లేదని యర్థము.

సంధ్యావందనాది నిత్యకర్మ విధానమే కర్మయోగ మగుచుండగా, సంధ్యావందనాదులవలె అని కర్మయోగమునకు సంధ్యావందనాదికమును దృష్టాంత పరచుట యెట్లు పొసగును? అని యనరాదు. ఈశ్వరారాధనబుద్ధితో కర్మల ననుష్ఠించుటయే కర్మయోగ మనబడుచున్నది. నిత్యకర్మానుష్ఠానము ఫలాభిసంధిపూర్వకము. అనగా నిత్యకర్మలు ఫలేచ్ఛతో ననుష్ఠింప బడుచున్నవి. ఫలాభిసంధిరహితమగు నిత్యకర్మానుష్ఠానమే కర్మయోగమని చెప్పబడుచున్నది. అని భావము

అథవా; రోగనివృత్తి కొరకు చేయబడుచున్న చికిత్సయందు రసవస్తువులను, ఓషధులను చంపుట రూపమయిన జీవహింస యుండుటచే నరకపాత రూపమగు ప్రత్యవాయ మెట్లు కలదో అనుష్ఠాతకు, అట్లు కర్మయోగమునందు హింస లేకుండుట వలన కర్మయోగము ననుష్ఠించువానికి ప్రత్యవాయము లేదు.

కర్మయోగమునందుగూడ పశుహింస మొదలగు దోషము కలదని యన రాదు. "అగ్నీషోమీయం పశు మాలభేత" అను శాస్త్రము వలన విధింపబడిన పశ్వాలంభనాదికము హింస గానేరదు. "మాహింస్యాత్సర్వాభూతాని" అను స్మృతి వలన హింస నిషేధింపబడినదని యనరాదు. ఇయ్యది సామాన్య విధియగుటచే. "అగ్నీషోమీయం పశుమాలభేత" అను విశేషవిధిచే బాధింపబడుచున్నది. పశ్వాలంభనము పశుదుఃఖమునకు హేతువగుచుండగా యెట్లు హింస కానేరదు? అని యనరాదు. యజ్ఞాదులయందు హింసింపబడిన పశువు స్వర్గము నొందుటవలన నియ్యది హింస గానేరదు.

యద్వా; చికిత్స చేసినచో వ్యాధి తప్పక, నివర్తించునని జెప్ప వీలులేదు. ప్రాణులయొక్క కర్మవిపాకము విచిత్రరూపమగుచున్నది; పైగా వ్యాధి పెరుగుట గాని, మరణము గాని కలుగవచ్చును. కాన చికిత్సను చేయుటలో దోషము కలదు. ఇట్లు కర్మయోగము ననుష్ఠించుటలో యెవ్విధమగు దోషమున్ను లేదు. కర్మయోగము నియతఫలమగుటవలన చికిత్సను చేయకున్నచో వ్యాధి పెరుగుటగాని, మృతి జెందుటగాని, యీరెండును కలుగవచ్చును. చికిత్సచేసినను యీరెండు కలుగు చున్నందున, చికిత్సాకరణము (చికిత్సను చేయుట) దోషయుక్తమని తెలియవలయును.

యథార్థముగా విచారించినచో రోగికి చికిత్స చేయుటవలన గలుగు ప్రత్యవాయము వైద్యునిదే. తానుచేసిన చికిత్సవలన రోగికి రోగము వృద్ధిజెందుగాక, లేక మరణించుగాక; యెటులయినను వైద్యునకు నరకపాతలక్షణమగు ప్రత్యవాయమే కలుగును. వైద్యులకు వారివృత్తియందు దిట్టి ప్రత్యవాయ ముండుటవలననే వైద్యులు అపాఙ్క్తేయులని స్మృతులు చెప్పుచున్నవి.

రోగమును పోగొట్టుటవలన వైద్యునకు పుణ్యముగూడ కలుగునని యనరాదు. అట్టి సుకృతప్రాప్తి వైద్యునకు ప్రాక్షికముగాని, నియతము గానేరదు. మరియు వైద్యునకు ప్రాక్షికముగా కూడ సుకృతము యెంతమాత్రములేదు వైద్యుడు ధనాశచే వైద్యమును (చికిత్సను) చేయుచుండుటవలన వానికి సుకృతము (పుణ్యము) కలుగనేరదు. పైగా మందు తయారగుటకు రసఓషధులను వైద్యుడు హింసించుటవలన నరకపాతము సంభవించును.

ఇట్లయినచో వైద్యులే లేకున్నచో చికిత్సగూడ నుండదు, కావున రోగులకు రోగనివృత్తి యెట్లు కలుగును? అని ప్రశ్నింపరాదు. ప్రారబ్ధమగు పాపకర్మమునకు ఫలమగు వ్యాధి ప్రారబ్ధము నశించినప్పుడనే తప్పక నశించుటవలన నట్టి ప్రశ్నయే పొసగదు.

మరియు వైద్యుడు తాను చేయు చికిత్సవలన వ్యాధిని అడ్డగించినచో రోగి జన్మాంతరమందైనను తిరిగి యావ్యాధిని అనుభవించియే తీరును. అనుభవములేనిదే చేసిన కర్మము నశించుట యసంభవము.

కావున చికిత్స అన్వయవ్యతిరేకముల వలన రోగనివృత్తికి కారణము గాకుండుట వలనను, ప్రతికూలచికిత్స రోగవృద్ధికి, మరణమునకు హేతువగుటవలనను, రసఓషధులను నశింపచేయుట రూపమగు హింసకలదగుట వలనను, వైద్యునకు ప్రత్యవాయము కలదని స్పష్టమగుచున్నది.

చికిత్సచేయు వైద్యునకువలె, కర్మయోగము ననుష్ఠించువానికి యెవ్విధమగు ప్రత్యవాయము లేదు. కర్మయోగమునం దెవ్విధమగు హింస లేకుండుటవలన. "చికిత్సావత్" అను పదమునందు "తత్ర తస్యైవ" అనుసూత్రముచే వతిప్రత్యయము. కావున, చికిత్సయందువలె. అని యర్థము.

చికిత్సయం దెట్లు ప్రత్యవాయము కలదో అట్లు కర్మయోగమునందును, ప్రత్యవాయము లేదని వ్యతిరేకదృష్టాంతము. ౪౦

శ్లో॥ వ్యవసాయాత్మికా బుద్ధిరేకేఽహ కురునందన
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్ ॥ ౪౧

అ॥ ఓ యి యర్జునా! ఇందు నిశ్చయాత్మకమగు బుద్ధి యొకటె కలదు. ప్రమాణజన్యమగు వివేకజ్ఞానహీనులకు అనేకభేదములు గల బుద్ధులు కలుగుచున్నవి.

సాఙ్ఖ్యవిషయము, యోగవిషయము లగు బుద్ధియే వ్యవసాయాత్మకమగు (నిశ్చయాత్మకమగు) బుద్ధి.

ఓయి! సాఙ్ఖ్యబుద్ధి యోగబుద్ధియు పరస్పరము భిన్నమగుటవలన నీ రెండును కలసి యొకేబుద్ధి యగుటెట్లు? అనినచో చెప్పబడుచున్నది.

ఇచట రెండు బుద్ధులకు ఏకత్వమును చెప్పలేదు. మరేమనిన, సాఙ్ఖ్యమునందు అనేకబుద్ధులు లేవనియు, అట్లే యోగమునందును అనేకబుద్ధులు లేవనియు, సాఙ్ఖ్యమునందును, యోగమునందును ప్రత్యేకము నిశ్చయాత్మకమగు బుద్ధియొకటే యనియు చెప్పబడినది.

ఇట్టి వ్యవసాయాత్మకమగు బుద్ధి, నిర్దుష్టమగు శాస్త్రప్రమాణమువలన పుట్టుటచే, అనేక శాఖలచే భిన్నములగు ఇతర విపరీతబుద్ధులకు నాశకమగుచున్నది. మూలమునందలి ఇహ అను పదమునకు సాఙ్ఖ్యయోగ కర్మయోగములయొక్క సాధారణముకొరకు శ్రేయోమార్గమను అర్థమును నిర్వచించిరి.

ఆత్మ నిర్వికారుడు, సర్వవ్యాపకుడు, నిత్యుడు, అద్వితీయుడు, స్వయంప్రకాశస్వరూపుడు, అప్రమేయుడు, అనునట్టి నిశ్చయజ్ఞానమే సాఙ్ఖ్యబుద్ధి. ఫలేచ్ఛను వీడి,

ఈశ్వరారాధనకొరకు ఫలసిద్ధ్య సిద్ధులయందు సమానభావముతో శాస్త్రవిహితము లగు కర్మలను చేయవలెనను నిశ్చయస్వభావము యోగబుద్ధి.

ఆత్మ కర్త, భోక్త; ఆత్మచే ధర్మము, అర్థము మున్నగు పురుషార్థములు సంపాదింపదగినవి; జ్యోతిష్టోమముచే స్వర్గము సంపాదింపవలయును; కారీర్యిష్టిచే పశుసంపదను పొందవలయును – ఈ మొదలగునవి విపరీతబుద్ధు లని వివేకము.

ఇచట రామానుజు లిట్లు చెప్పుచున్నారు. "ఆత్మ యాథాత్మ్య నిశ్చయపూర్వక మగు నీ వ్యవసాయాత్మకమగు బుద్ధి. ఒకే ఫలము, ఒకేసాధనను విషయముగా గలదగు టచే ఏకరూపమే యగుచున్నది. ఒక్క మోక్షఫలముకొరకే కర్మలు విధింపబడు చున్నవి." అని.

ఇయ్యది యసమంజసము « నిత్యత్వ, స్వయంప్రకాశత్వ, ఆనన్దత్వ, అపహతపాప్మ త్వాదికము ఆత్మయొక్క యథార్థస్వరూప మనునది యుభయపక్ష సమ్మతము." కాని ఇట్టి నిశ్చయముగలవానికి కర్మలయం దెట్లు ప్రవృత్తి కలుగును? కర్మలవలన సంపాదింపదగిన యుత్కర్ష గాని, కర్మలవలన నివారింపదగిన యపకర్ష గాని, యీజ్ఞానము కలవానికి లేనందున నిట్టివానికి, కర్మలయందు ప్రవృత్తి సుతరాం కలుగనేరదు. మరియు ఆనందరూపుడగు ఆత్మయందు అనేక కారక సామగ్రితో నెరవేర్పదగిన కర్మానుష్ఠానమువలన కలుగు దుఃఖము యెంతమాత్రము సంభవింపదు; గాక మోక్షము కర్మసాధ్యమగుచో ఘటాదులవలె ననిత్యమగును. మరియు కోరికగలవారలకు స్వర్గాది ఫలసిద్ధికొరకున్ను, కోరికలేనివారలకు చిత్తశుద్ధికొరకున్ను కర్మలు విధింపబడినవి గాని, మోక్షముకొరకు కర్మలు విధింపబడియుండ లేదు. ఎచటనయినను, "జ్యోతిష్టో మేన స్వర్గకామో యజేత" "తమేతం వేదానువచనేన బ్రాహ్మణావివిదిషన్తి యజ్ఞేన దానేన తపసాఽనాశకేన" స్వర్గముకొరకు జ్యోతిష్టోమమును చేయుడు, వివిదిషా సిద్ధికొరకు యజ్ఞాదుల ననుష్ఠింపుడు; అని శ్రుతులు చెప్పుచున్నవి కాని, "మోక్ష కామ ఇదం కుర్యాత్" "మోక్షమును గోరువాడు ఈకర్మను చేయవలెను" అని యేశ్రుతియు చెప్పుటలేదు. మరియు నిత్యుడగు ఆత్మయందు క్రియయను వికారము సంభవింపదు. మరియు, 'వ్యవసాయాత్మికా' అను పదమువలన "నిశ్చయపూర్వికా" అను అర్థముకూడ లభింపదు. కావున రామానుజభాష్యము అసంగతార్థమగుచున్నది.

శ్లో॥ యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్యవిపశ్చితః ।
వేదవాదరతాః పార్థ! నాన్యదస్తీతివాదినః ॥ ౪౨

కామాత్మానః స్వర్గపరాః జన్మకర్మఫలప్రదాం ।
క్రియావిశేషబహులాం భోగైశ్వర్యగతింప్రతి ॥ ౪౩

అ॥ పుష్పములు దీనికి కలవుగాన పుష్పిత యనబడును. "తదస్య సఞ్జాత" అను సూత్రమువలన తారకాదిగణమునందు చేరుటచే, "ఇతచ్" ప్రత్యయము. వృక్షధర్మ

మగు పుష్పవత్త్వము వాక్కుల కెట్లు లభించు ననియనగా భాష్యకారులు సమాధాన మును చెప్పిరి. "పుష్పించిన వృక్షమువలె" అని. గనుక ఔపచారిక ప్రయోగమని భావము. అందువలన ఫలితార్థ మేమన పుష్పించిన వృక్షము చూచుట కెట్లు రమణీయముగా నుండునో అట్లే అవివేకులచే జెప్పబడు నీ వాక్యముగూడ వినుటకు రమణీయముగానుండును. అవసానమునందు సంసారదుఃఖము అనివార్యమని భావము. వాక్యము లక్షణముగాగలది గాన "వాక్యలక్షణ" అని యనబడును. వాక్యరూపమయినదని యర్థము. వాక్యమని నిశ్చయార్థము. ఆకాంక్షాయోగ్యతాసన్నిధులు గల పదసముదాయము వాక్య మని తెలియవలయును. "విశేషేణ పశ్యన్తి జానన్తి" (విశేషముగా తెలిసినవారు గాన) విపశ్చితః విద్వాంసు లనబడుదురు. వారుకానివారు అవిపశ్చితః అవిద్వాంసులు, అని యర్థము.

యజ్ఞము మొదలగు విహితకర్మలకు ఫలము స్వర్గానుభవము. అయ్యది దేవతగా బుట్టిన వానిచే అనుభవింపదగిన దగుచున్నది. హింస మొదలగు నిషిద్ధకర్మలకు నరకము ఫలము. అయ్యది నారకి పురుషుడుగా పుట్టినవానిచే అనుభవింపదగినది. మిశ్రకర్మలకు ఫలము మనుష్యలోకము. అద్దానిని మనుష్యజాతి యందు పుట్టినవాడనుభవింపవలయును. ఈ ప్రకారము దేవాది జన్మల నెత్తియే కర్మఫల మనుభవింపవలయును గాన కర్మలకు ఫలము జన్మమని చెప్పబడినది. జన్మవలన మరణము, మరణమువలన జన్మము యీ ప్రకారము మూఢులగు జీవులు అవిచ్ఛిన్నముగా సంసారము నొందుచున్నా రని యర్థము. ౪౪

శ్లో॥ భోగైశ్వర్యప్రసక్తానాం తయాపహృతచేతసాం
వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ నవిధీయతే॥ ౪౫

అ॥ "భోగైశ్వర్య ప్రసక్తానాం" భోగైశ్వర్యములయం దభినివిష్టమగు అంతఃకరణముతో తాదాత్మ్యాధ్యాసగల బహిర్ముఖుల కని యర్థము. (సమాధీయతే నిక్షిప్యతే ఈశ్వరేణ అస్మిన్ పురుషోపభోగాయ సర్వ మితి సమాధిః – అంతఃకరణం పురుషులయొక్క సుఖదుఃఖానుభావముకొరకు నీశ్వరునిచే దీనియందు సర్వము ఉంచబడినది గాన సమాధి యనగా అంతఃకరణ మనబడుచున్నది. పురుషుడు అభోక్త యగుటచే స్వతః సుఖదుఃఖానుభవము లేదు. విజ్ఞానము, బుద్ధి – అను పర్యాయపదములు గల భోక్తయగు అన్తఃకరణముయొక్క తాదాత్మ్యాధ్యాసము చేతనే పురుషునకు భోగము సిద్ధించుచున్నది. గనుకనే మాఘకవి తనకావ్యమునం దిట్లు చెప్పియున్నాడు. – "సమీక్ష్యోక్తే బుద్ధేర్భోగ ఇవాత్మని" సాఙ్ఖ్యశాస్త్రము నందు చెప్పబడిన ఆత్మయందు బుద్ధివలన సుఖదుఃఖానుభవమువలె. అని యర్థము. కావున పురుషుల సుఖదుఃఖానుభవము కొరకు, అంతఃకరణమునం దీశ్వరునిచే కామాది పదార్థజాతమంతయు సృష్టింపబడినదిగాన సమాధియనగా అంతఃకరణ మగుచున్నది.

ఓయి ! సమాధిశబ్దమునకు, అంతఃకరణమని యర్థము చెప్పినచో అంతః కరణమునందు, సాంఖ్యబుద్ధిగాని, యోగబుద్ధిగాని కలుగదని శ్లోకమున కర్థము సిద్ధమగుచున్నది. అట్టితరి బుద్ధియందు బుద్ధి కలుగుటెట్లు ? అని ప్రశ్నింపరాదు. సమాధిశబ్దమునకు అంతఃకరణ మర్థము, బుద్ధిశబ్దమునకు జ్ఞానమర్థము. గనుక అంతఃకరణమునందు జ్ఞానము కలుగుటలో దోషములేదు. ఇచట "న విధీయతే" అనునది కర్మకర్త్రర్థమునందు లకారము. గనుక నే (నభవతి) కలుగుటలేదా ? అని యర్థము. అనగా పుట్టుటలేదు అని నిశ్చయార్థము.

నిజముగ విచారించినచో (నవిధీయతే ఈశ్వరేణ) అని యధ్యాహారము. ఈశ్వరునిచే కలుగజేయబడుటలేదు అని యర్థము.

"మత్తః స్మృతిః జ్ఞానమ్ అపోహనఞ్చ" అని ముందు చెప్పబోవుటవలన నా వలననే స్మృతి, జ్ఞానము మొదలగునవి కలుగుచున్నవి. ౪౪

శ్లో॥ త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున,
నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగ క్షేమ ఆత్మవాన్॥ ౪౫

అ॥ సుఖదుఃఖాదిరూపమగు సంసారము, సత్త్వరజస్తమోగుణములవలన పుట్టుటచే త్రైగుణ్యమని చెప్పబడుచున్నది. ఇట్టి సంసారబంధము, కామాత్ములకు కలుగుచున్నది. గనుక ఓయి యర్జునా ! నీవుమాత్రము సంసారరాహిత్యము నొందుటకు నిష్కాముడ వగుము. మరియు నీవు నిర్ద్వన్ద్వుడవగుము. శీతోష్ణములు సుఖదుఃఖములు రాగద్వేషములు మున్నగునవి, ద్వంద్వశబ్దవాచ్యములు. ఈయవి అన్యోన్యవిరుద్ధములు. నీవు వీటినుండి నిర్గతుడవగుము (వీటిని అతిక్రమింపుము). "నిరాదయః క్రాన్తాద్యర్థే పంచమ్యా" అను సూత్రముచే సమాసము. ద్వంద్వములను సహించుమని యర్థము. మరియు నీవు యోగక్షేమములయం దాసక్తుడవు కాకుము. సంప్రాప్తముగాని ధనధాన్యాదులను సంపాదించుటయందును, సంప్రాప్తములయిన వాటిని కాపాడుకొనుటయందును, అత్యంతాసక్తిగలవానికి మోక్షమార్గమునందు ప్రవృత్తి యసంభవము. కావున నీ వీ రెంటియందును వ్యగ్రత జెందకుము.

మూలమునందలి "ఆత్మవాన్" అను వాక్యమునందలి ఆత్మశబ్దమునకు దేహము, మనస్సు, బుద్ధి పురుషుడు అను అర్థములలో నేదియో యొక అర్థమును చెప్పుట సంభవింపదు. ఆత్మరాహిత్యము ప్రసక్తమయినచో ఆత్మగలవాడ వగుమని విధించుట యుక్తమగును. అదియె సంభవించదు. దేహాదిరూపమగు ఆత్మలు విధింపకపూర్వమే సిద్ధమయి యుండుటవలన. కనుక "ఆత్మవాన్" అను పదమునకు భాష్యకారులు (అప్రమత్తః) అవధానుడ వగుము. అని యర్థమునుచెప్పిరి. మనస్సును, బుద్ధిని చెప్పునట్టి యాత్మశబ్దమునకు తద్ధర్మమగు అవధానమునందు లక్షణ యనిభావము. స్వధర్మము

ననుష్ఠించుచున్న నీకు "నిస్త్రైగుణ్యః" "నిర్ద్వన్ద్వః" అని మొదలగునవి యుపదేశ మని భావము. ౪౫

శ్లో॥ యావానర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥ ౪౬

అ॥ "సర్వేషు వేదోక్తేషు" అను అవతారికాభాష్యముచే యావానర్థః అను శ్లోకము ను ప్రవేశ పెట్టుచున్నారు భాష్యకారులు. ఫలము లేనందువలన నిష్కామ కర్మయోగము వ్యర్థమని పృచ్ఛకుని యాశయము. భాష్యకారులు ఆక్షేపమునకు సమాధానమును ప్రతిజ్ఞ చేయుచున్నారు "ఉచ్యతే తత్" అను పంక్తిచే. ఇచట "తత్" అను శబ్దమునకు నిష్కామకర్మానుష్ఠానముయొక్క ఫలము యని యర్థము. పృచ్ఛకునిచే కర్మయోగముయొక్క ఫలము ఆక్షేపింపబడుటవలన భాష్యకారులచే కర్మయోగము యొక్క ఫలము చెప్పబడుచున్నదని ప్రతిజ్ఞ చేయబడినది అని భావము. వినువారలను సావధానపరచుచున్నారు "శృణు" అను పదముచే. ఈశృ ధాత్వర్థ మునకు ముందు చెప్పబోవువాక్యార్థము కర్మ.

(యావానితి) ఈ శ్లోకమునందు యావచ్ఛబ్దము, తావచ్ఛబ్దము, అర్థ శబ్దము లను ఆవృత్తి చేయవలెను. అట్లు చేసినచో (కొలది నీరుగల బావి, చెరువు, మొదలగు వాటియందు ఎంతటి స్నానపానరూపమగు ప్రయోజనమో, అంతట ప్రవహించు నీరు గల నద్యాదుల యందును, అంతే స్నాన పాన రూపమగు ప్రయోజనము. వేదోక్త సర్వకర్మల యందు ఎంత ఫలమో ఆత్మజ్ఞానముగల బ్రాహ్మణునకు ఆత్మజ్ఞానము వలన అంతయే ఫలము! అని యన్వయ ముపపన్నము.

ఇందు పూర్వార్థము దృష్టాంతము గనుకనే భాష్యకారులు పూర్వార్థమును యథాశబ్దముతో వివరింప నారంభించిరి. దృష్టాంతార్థము లోకసిద్ధ మగుటవలన భాష్యకారులు వివరణ ప్రారంభములో (లోకే) లోకమునందు అనివ్రాసిరి. (ఉదపానే) ఉదకము దీనియందు త్రాగబడుచున్నదను వ్యుత్పత్తిచేగాని, ఉదకమును త్రాగుట దీనియందు కలదను వ్యుత్పత్తిచేగాని "ఉదకస్య ఉదస్సంజ్ఞాయామ్" అను సూత్రము వలన "ఉద" అను ఆదేశము రాగా ఉదపానం అను రూపము సిద్ధించుచున్నది. ఉదపానమనగా బావి, చెరువు, దిగుడుబావి మున్నగునవి. ఉదపానము అనేకములుగా నున్నందున భాష్యకర్తలు – అనేకస్మిన్నుదపానే – అని చెప్పిరి. ఉదపానములన్నియు పరిచ్ఛిన్నమగు ఉదకముగల వగుటవలనను (కొలదినీరు కలవగుటవలన) పరిచ్ఛిన్న త్వము భేదమునకు కారణమగుటవలనను ఉదపానము లనేకము లని భాష్యకారులు నిర్వచించిరి.

యావాన్ = యచ్ఛబ్దముకంటె పరిమాణార్థమునందు డవతు ప్రత్యయమును చేయగా, "యావాన్" అను రూప మేర్పడును. 'ఎంత పరిమాణము కల' అని

యర్థము. స్నాన పాన రూపమగు ఫలము అర్థశబ్దమున కర్థము. ప్రయోజన మని నిష్కృష్టార్థము కావున ఉదపానము లగు వాపీకూపతటాకాదులయందు ఎంత పరిమాణముగల స్నానపానరూపమగు ప్రయోజనము కలుగునో ఆప్రయోజనమంతయు నదులయందు కలుగుచున్నది అని యర్థము. తచ్ఛబ్ద యచ్ఛబ్దాధ్యాహారముల వలన సిద్ధించుచున్నదని గ్రహింపవలయును.

“సర్వతస్సంప్లుతోదకే” సర్వతః సంప్లుతం (వ్యాప్తం ఉదకం యస్య తస్మిన్) అంతట వ్యాపించియున్న ఉదకము దేనికో అయ్యది సర్వతస్సంప్లుతోదక మనబడును. అపరిచ్ఛిన్నమగు ఉదకముగల సముద్రమునందు అని యర్థము. మూలమునందు క్రియాపదము లేనందువలన భాష్యకారులు “సమ్పద్యతే” అను క్రియాపదమును అధ్యాహారమును చేసి యన్వయించిరి. “సమ్పద్యతే” అనగా (జాయతే) కలుగుచున్నది. అని యర్థము.

ఓయి! కొలది నీరుగల వాపీకూప తటాకాదులయం దెంతటి యుపయోగమో, యెక్కువ నీరుగల సముద్రాదులయందు గూడ నంతే ఉపయోగ మని చెప్పు టెట్లు? అనగా చెప్పబడుచున్నది: పరిచ్ఛిన్నోదకము గల కూపతటాకాదుల యందుగల ప్రయోజనము అపరిచ్ఛిన్నోదకముగల సముద్రాదులయందలి ప్రయోజనమం దిముడుచున్నవని యర్థము. ఘటాకాశములు మహాకాశముయొక్క అంశము లయినట్లు పరిచ్ఛిన్నోదకములు గల కూపాదులు అపరిచ్ఛిన్నోదకము గల సముద్రాదుల యొక్క అంశములగుచున్నవి. అందువలన కూపాదులయందలి ఫలము సముద్రాదులయందలి ఫలమునం దిముడుట ఉపపన్నమగుచున్నదని భావము.

సముద్రమున కెంతయో దూరమున నుండు కూపాదులు, సముద్రాంశములగు టెట్లని యనరాదు. సముద్రమధ్యనుండు భూమి యీశ్వరునిచే స్థాపింపబడుటవలనను, సముద్రోదకమే భూతలమునందలి వాపీకూపములయందును గతమగుటవలనను, నదీతటాకాదులయందు మేఘవర్షము ద్వారా సముద్రజలమే యుండుటవలనను కూపాదులు సముద్రాంశము లగుచున్నవి. కావున లోకమునం దెవరు మేము కూపతటాకాదులయందు స్నానము చేసితిమనిగాని, అందలి నీరును త్రాగితిమనిగాని తలంచుచున్నారో, వారు నిజముగ సముద్రజలమునందు స్నానము చేసినవారున్ను సముద్రజలమును త్రాగినవారున్ను అగుచున్నారని భావము.

ఉత్తరార్థము దార్ష్టాన్తికమగుటవలన భాష్యకారులు ఉత్తరార్థమును వివరించుటలో “ఏవం తావాన్ తావత్పరిమాణఏవ సమ్పద్యతే” అన్చే అంతట పరిమాణము గల ప్రయోజనమే కలుగుచున్నది అని వ్రాసిరి.

మూలశ్లోకమునందు "వేదేషు" అని యున్నను కేవల వేదములయందు ఫలము లేనందున వేదోక్తములగు యజ్ఞాది కర్మలయందలి యర్థము గ్రహింప వలయును. పూర్వార్ధమునందలి "యావాన్" అను పదమును ఉత్తరార్ధమునందు గూడ అన్వయించుకొనవలయును. ఇచట కర్మఫలము స్వర్గాదికము. ఉత్తరార్ధము నందు గూడ అన్వయ సౌష్టవముకొరకు పూర్వార్ధమునందువలె యత్తచ్ఛబ్దము లధ్యాహారము చేయబడినవి భాష్యకర్తలచే.

మూలమునందు "బ్రాహ్మణస్య" అను పదము కలదు. అందుకు భాష్య కారులు "బ్రాహ్మణస్య – సన్యాసినః" అని వివరణమును చేసిరి. అందువలన మూలమునందలి బ్రాహ్మణశబ్దము జాతిమాత్రమును చెప్పునట్టి అముఖ్య (గౌణ) శబ్దము గాదనియు, ముఖ్యబ్రాహ్మణులని చెప్పునట్టి శబ్దమే యనియు గ్రహింప వల యును. "జన్మనా జాయతే శూద్రః, కర్మణా జాయతే ద్విజః, వేదపాఠేన విప్రస్యాత్, బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణః" అని వచనముండుటవలనను, బ్రహ్మజ్ఞానము వేదాంత శ్రవణమననాది సాధ్యమగుట వలనను, "శాన్తోదాన్త ఉపరతః" అను ప్రమా ణముచే వేదాంతశ్రవణాదులయందు సన్యాసమునొందినవానికే అధికారముండుట వలనను, "బ్రాహ్మణో నిర్వేదమాయాత్" అను శ్రుతివలన బ్రాహ్మణజాతియం దుత్పన్నమయినవానికే సన్యాసమునం దధికారముండుటవలనను, బ్రహ్మజ్ఞానముగల బ్రాహ్మణసన్యాసిపరమగు ముఖ్యశబ్దమే గాని జాతిబ్రాహ్మణుని చెప్పునట్టి అముఖ్య శబ్దము మాత్రము గాదని భావము. "బ్రాహ్మణోఽయం బ్రాహ్మణః" అని సమా సము. ఇందు షష్ఠీవిభక్తికి వేద్యవేదిత్వరూప సంబంధమర్థము "తస్యేదం" అను సూత్రమువలన అణ్ప్రత్యయము చేయగా 'బ్రాహ్మణః' అను రూపము సిద్ధమగు చున్నది. బ్రహ్మజ్ఞాని యని యర్థము.

"బ్రాహ్మోఽజాతౌ" అను పాణిని సూత్రమువలన జాతివాచకము గానపుడు బ్రాహ్మః అని యుండవలయునని యనరాదు. పాణిని సూత్రమునందు హిరణ్య గర్భార్థకమగు పుంలింగ బ్రహ్మశబ్దము గ్రహింపబడినది. ప్రకృతమునందు బ్రహ్మ శబ్దము పరబ్రహ్మమును చెప్పుచున్నది. గనుకనే అచట "అజాతౌ కిమ్" అని శంకించుకొని 'బ్రాహ్మోనారదః' అని ప్రత్యుదాహరణము నిచ్చిరి. "ఉత్సఙ్గాన్నారదో జజ్ఞే" అను ప్రమాణమువలన నారదుడు హిరణ్యగర్భునియొక్క అవయవమువలన పుట్టుటచే ప్రత్యుదాహరణ మువపన్నమగుచున్నది. మరియు "బ్రాహ్మణోఽస్యము ముఖమాసీత్" అను శ్రుతిగూడ బ్రాహ్మణాది జాతియందు పుట్టిన ఆకార విశిష్ట మగు పురుషునే నిర్దేశించుచున్నది. కాని నిరాకారమగు బ్రహ్మమని నిర్దేశించుట లేదు. నిరాకారమగు బ్రహ్మకు ముఖాద్యవయవములు లేనందున అట్టిది యుపపన్నమును గానేరదు.

బ్రాహ్మణశబ్దము బ్రహ్మజ్ఞానిని చెప్పు గాక కాని సన్యాసినిమాత్రము చెప్పదు అని యనరాదు. సన్యాసిగానివాడు బ్రహ్మజ్ఞానియే గానేరడు, గృహస్థులగు జనకాదులు బ్రహ్మజ్ఞానులుగాలేదా అని ప్రశ్నింపరాదు. జనకాదులు బ్రహ్మజ్ఞానము కలవారగుటచే బ్రాహ్మణులయినచో, అపుడు కర్మలయందలి ఫలేచ్ఛను కర్తృత్వమును విడచుటచే సన్యాసులుకూడ నగుదురు. జనకాదులు చేసిన కర్మ కర్మయే కాదని చెప్పి యుండుటవలనను "కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః" బ్రహ్మజ్ఞాని కర్మల యందు ప్రవర్తించినను కర్మల నాచరించినట్లు కాదని ముందు శ్రీకృష్ణుచే చెప్పబోవుట వలనను కర్మలయందు కర్తృత్వము లేకుండుటయే సన్యాసము. కావున బ్రహ్మజ్ఞానము గలవాడే బ్రాహ్మణుడు. అట్టి బ్రాహ్మణుడే సన్యాసి యనబడుచున్నాడు.

లేనిచో పాణిని సూత్రమునందలి బ్రహ్మశబ్దము పరబ్రహ్మమును చెప్పుగాక. అయినను ఇచట అనుపపత్తిలేదు. బ్రాహ్మణజాతియందు పుట్టినవానికే సన్యాసమని చెప్పబడినది ఇట్లైనచో " బ్రాహ్మణస్య " అను పదమువలన బ్రాహ్మణజాతియందు పుట్టిన గృహస్థాదులు గూడ అని యర్థమగునని యనరాదు. " విజానతః " అను విశేషణమువలన సన్యాసి యనియే అర్థము లభించును. విజానత్వ మనగా బ్రహ్మ నిత్యము. బ్రహ్మమును తెలిసికొనుట. ఇది సన్యాసికే సంభవించునుగాని యితరులకు సంభవింపనేరదు.

ఇచట రామానుజులు " బ్రాహ్మణస్య " అనగా వైదికుడగు బ్రాహ్మణునకు అని యర్థమును జేసిరి. అయ్యది పరాస్తమగుచున్నది. వైదికుడగు బ్రాహ్మణుడు తత్వజ్ఞానము కలవాడు గాకుండుటచే " విజానతః " అను విశేషణము రామానుజులు చెప్పిన యర్థమునందు సంగతము కానేరదు. వేదవేత్తలగు వైదికులే బ్రహ్మవేత్తలని యనరాదు. "వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతివాదినః" "త్రైగుణ్యవిషయా వేదాః" అను ప్రమాణములచే వేదవేత్తలు బ్రహ్మజ్ఞానులు కారనియు, వేదములు త్రైగుణ్య విషయములనియు భగవంతుడే చెప్పియున్నాడు.

మరియు వేదాన్తదేశికులు "బ్రహ్మ అనితి" అను నిరుక్తిచే బ్రాహ్మణ శబ్దము నిష్పన్నమయినదనియు, "శకన్ధ్వాదిషు పరరూపవక్తవ్యమ్" అను వార్తిక ముచే పరరూపమును, ప్రజ్ఞాదిగణమునందు చేరుటవలన, అణ్ ప్రత్యయమును చేయగా " బ్రాహ్మణ " అను రూప మగుచున్నదనియు, బ్రహ్మశబ్దమున కిచట వేద మర్థమనియును జెప్పిరి.

అయ్యది తుచ్ఛమగుచున్నది. ఏలయన (1) ప్రజ్ఞాదులయందు బ్రహ్మణః అను పదము లేకుండుటవలనను, (2) " బ్రహ్మణః " అని యెచటను ప్రథమాన్త ప్రథమాన్తమగు పదమునకు ప్రయోగములేకుండుటచే ప్రజ్ఞాదులయందుగాని, శక న్ధ్వాదులయందుగాని ఆకృతిగణము గ్రహించుట యసంభవ మగుటవలనను, ప్రసిద్ధ

మగు పదముయొక్క ప్రయోగమును కుదుర్చుటకుగాను, ఆకృతిగణము స్వీకరింప బడినది. అప్రసిద్ధ పద ప్రయోగమును సాధించుటకుగాదు. మరియు బ్రహ్మ + అనితి అను వ్యుత్పత్తియందు - కర్మార్థమునందు అణ్ ప్రత్యయము వచ్చును. తరువాత వృద్ధిని చేయగా "బ్రాహ్మణః" అని యగునుగాని "బాహ్మణః" అని గానేరదు.

మూలముయొక్క నాల్గవపాదమునందు "బ్రాహ్మణస్య విజానతః" అని కలదు. అనగా తెలిసికొనిన బ్రాహ్మణునకని యర్థము. అందుపై ఏమి తెలిసికొనిన బ్రాహ్మణునకని ప్రశ్నరాగా - వివరించుచున్నారు భాష్యకారులు: పరమార్థ తత్త్వమును తెలిసికొనిన బ్రాహ్మణునకని. అనగా బ్రహ్మను తెలిసికొనిన వానికని యర్థము. ఇట్టివానికి (యోర్థః) ఏమిఫలమో విజ్ఞానఫల మని భావము. ఈ విజ్ఞానఫలమునకు పూర్వార్థమునందలి సర్వతస్సంప్లుతోదక ఫలము దృష్టాన్తము. ఏలనన విజ్ఞానము సర్వతస్సంప్లుతోదక తుల్యమగుటవలన నని భావము. పరిచ్ఛిన్నమగు స్వర్గాదివిషయానుభవజన్యములగు ఆనన్దములన్నియు అపరిచ్ఛిన్నమగు బ్రహ్మానన్దముయొక్క అంశము లగుటవలన, విజ్ఞానఫలమగు అపరిచ్ఛిన్న బ్రహ్మానన్దమునందు, కర్మఫలానన్దములు అన్తర్భావము నొందుచున్నవని భావము.

ఓయి! కర్మఫలము జ్ఞానఫలమునందంతర్భావమును చెందుననుటలో ప్రమాణమేమి యనగా చెప్పబడుచున్నది. "సర్వంతదభిసమేతి యత్కించ ప్రజాస్సాధు కుర్వన్తి - యస్తద్వేద, యత్స వేద" అను శ్రుతివలన.

"ప్రజాః యత్కించ సాధుకర్మ కుర్వన్తి." ప్రజలు యేకొద్ది సత్కర్మమును అనుష్ఠించుచున్నారో "తత్సర్వం" దానినంతయును "సః" అని యధ్యాహారము. "వాడు" అభిసమేతి పొందుచున్నాడు. వాడెవడనగా "యస్తద్వేద" యత్స వేద "సః" ఆర్షకృత్వము - "యత్" ఏ బ్రహ్మను "వేద" తెలిసికొనుచున్నాడో, "తత్" ఆ బ్రహ్మను "యః" ఎవడు "వేద" తెలిసికొనుచున్నాడో, వాడని యర్థము. అనగా ప్రజలాచరించిన సమస్త సత్కర్మల ఫలమును, తత్త్వవేత్త పొందుచున్నాడని యర్థము. ఏలయన, ప్రజలయొక్క సత్కర్మఫలమగు ఆనన్దము. తత్త్వవేత్తచే పొందబడిన బ్రహ్మానందముయొక్క అంశయగుటవలననని భావము.

ఈ యర్థమునందు "సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే" అను గీతా శ్లోకముకూడ ప్రమాణ మగుచున్నది. జ్ఞానఫలమునందు కర్మఫలమన్తర్భావమును చెందుటవలన జ్ఞానమునందు కర్మపరిసమాప్తిని చెందుచున్నదని యర్థము.

ఇచట భాష్యపదములను ఇట్లు సమన్వయము చేసికొనవలయును. వాపీకూప తటాకాదులయందు, ఏ ఫలము యెంతటిదో, ఆ ఫలమంతయు, అంతట వ్యాపించి యున్న నీరుగల సముద్రాదులయందు ఏ ఫలమో, అంతటిదే యెట్లగుచున్నదో,

అట్లే సమస్త వేదోక్త కర్మలయందు ఏ ఫలము యెంతటిదో, బ్రహ్మజ్ఞానముగల బ్రాహ్మణునకు యే ఫలమో, అంతటిదే యగుచున్నది. అని.

కావున కూపతటాకాదుల ఫలము సముద్రఫలమునందువలె, కర్మఫలము, విజ్ఞానఫలమునం దంతర్భావము చెందుటవలన కర్మలయం దధికృతుడగు వానిచే, జ్ఞాననిష్ఠాప్రాప్తి పర్యన్తము. వాపీకూపతటాకాదివస్తు స్థానీయమగు కర్మ ఆచరించియే తీరవలయును. జ్ఞాననిష్ఠయం దధికారము కలిగిన పిదప మాత్రము కర్మచేయదగిన పనిలేదని భావము. ఇచట భాష్యమునందు (కూపతటాకాద్యర్థ స్థానీయమపి కర్మ) అని కలదు. ఇందు అపిశబ్దమునకు సారస్యమేమనగా విజ్ఞానముకంటె తక్కువదగుటచే యుక్తముగాని దయినను, కర్మ, విజ్ఞానమునం దధికారము లేనందున ఆచరించియే తీరవలయును. అని.

ఓయి! ఈ కర్మయోగానుష్ఠాన మెందులకు? ఇయ్యది మొదటనే యాక్షేపింపబడినదికదా. అందుకు సమాధానమేమి వచ్చినది. అనినచో చెప్పబడుచున్నది. మోక్షమునిచ్చునట్టి జ్ఞాననిష్ఠయం దధికారములేనందున అట్టి యధికారము సిద్ధించుటకొరకు కర్మ యోగానుష్ఠానము అని ఇట్టి సమాధానము నిచ్చునట్టి యర్థము మూలము వలన సిద్ధించుటలేదని యనరాదు. అర్థమువలన సమాధానము సిద్ధించుచున్నది.

ఇయ్యది యుపపాదింపబడుచున్నది. అందరిచేతను సంపాదింపదగినది ఆత్మజ్ఞానమే. సముద్రఫలమునందు కూపఫలమువలె విజ్ఞానఫలమగు బ్రహ్మానందమునందే సర్వకర్మఫలములగు విషయానందము అంతర్భావమును చెందుటవలన, అట్టి విజ్ఞానము కర్మయోగానుష్ఠానము లేనిదే సంపాదింప నలవిగానందున ముముక్షువులకు విజ్ఞానసిద్ధికొరకు కర్మయోగ మనుష్ఠింప దగినదగుచున్నది. కావున ఇట్లు కర్మయోగానుష్ఠానము జ్ఞానప్రాప్తిద్వారా అపరిచ్ఛిన్నమగు బ్రహ్మానన్దమునకు కారణముగుట వలన, ఆయా క్షుద్ర (నీచ) ఫలముల నపేక్షింపక, అధికృతునిచే విహితములగు కర్మలు చేయదగినవని పరమార్థము.

ఇచట భాష్యమునందలి కర్మఫలమను పదమునకు ఫలేచ్ఛను విడచి యనుష్ఠించు కర్మలయొక్క ఫలము. అనగా చిత్తశుద్ధియని యర్థము – అట్లే, "కూపతటాకాద్యర్థ స్థానీయం" అను పదమునకు కూపతటాకాదులయందు స్నానపానాది క్రియారూపమగు నేయుపయోగమో తత్తుల్యమని యర్థము. కావున, సముద్రమునందు స్నానము చేయగోరిన పురుషుడు, సముద్రస్నానమునం దధికారము సిద్ధించుటకు, సముద్రస్నానమునకు పూర్వము, కూపతటాకాదులయందు, స్నానాచమనాది క్రియలను యెట్లు చేయుచున్నాడో, అట్లే ముముక్షువగు పురుషుడుకూడ, మోక్షసాధనమగు జ్ఞాననిష్ఠయం దధికారము కలుగుటకొరకు, జ్ఞాననిష్ఠాప్రాప్తికి పూర్వము ఫలేచ్ఛను విడచి, విహితములగు కర్మలను చేయవలయును. ఎట్లు సముద్రమునందు స్నానము చేయ్య

గోరినవాడు, కూపాదులయందు స్నానాచమనాది క్రియల నొనర్చినపిదప, దేహము శుద్ధమగుటచే సముద్రమునందు స్నానముచేయుచున్నాడో, అట్లే ముముక్షువుకూడ కర్మయోగానుష్ఠానానన్తరము చిత్తము పరిశుద్ధమగుటవలన జ్ఞాననిష్ఠను పొందును.

ఎట్లు : వానికి కూపాదిస్నానమువలన కలుగుఫలము, సముద్రస్నాన ఫలమునందిముడుచున్నదో, సముద్రస్నానముకంటె అతిరిక్తమను కూపాదిస్నానజన్యమగు ఫలము లేనందువలన, అట్లే ముముక్షువుయొక్క కర్మఫలముకూడ విజ్ఞానఫలమునందంతర్భావమును చెందుచున్నది. కనుక కూపస్నాన సముద్రస్నానములకువలె కర్మయోగ జ్ఞానయోగములకు ఉపజీవ్య ఉపజీవక భావసంబన్ధముగలదు. సముద్రస్నానము కూపస్నాన సాధ్యమగుటవలనను, జ్ఞానయోగము, కర్మయోగ సాధ్యమగుటవలనను, ఈరెంటికి ఫలవిషయమునందు హస్తిమశకాన్తరము కలదు. (ఏనుగకు దోమకున్నంత భేదముకలదు) కూపస్నానము దేహమలమును పోగొట్టుటమాత్రమే ఫలము కలదగుట వలనను, సముద్రస్నానము సమస్తనదీనదములయందలి స్నానమువలన కలుగు ఫలము నిచ్చుటవలనను, అట్లే కర్మయోగమువలన చిత్తశుద్ధి మాత్రమే ఫలము కలుగుటవల నను, విజ్ఞానము నిరతిశయానన్దరూపమగు పరమ పురుషార్థమను ఫలము గలదగుటవల నను, అని కొందరు వర్ణించుచున్నారు. ఈపక్షమునందు సముద్రస్నానాధికార సిద్ధి కొరకు, కూపాదిస్నానమువలె, జ్ఞాననిష్ఠయందధికార సిద్ధికొరకు కర్మయోగానుష్ఠానమని సమాధానము కంఠోక్తమే యగుచున్నది.

ఓయి ! "కూపే వర్ష్యపయోనిధావపి ఘటో గృహ్ణాతి తుల్యం జలం" (బావియందును సముద్రమునందును కుండ సమానముగానే ఉదకమును గ్రహించుచున్నది) అను న్యాయముచే, దాహముగలవాడు బావియందు యెంతపరిమాణముగల నీరును త్రాగుచున్నాడో, సముద్రాదులయందుకూడ నంతటి పరిమాణముగల నీటినే త్రాగుచున్నాడు. సముద్రజలము పానీయముకాదని యనరాదు. బావిరూపమగు సముద్రోదకము పానీయమే యగుచున్నది. అనియేయీ శ్లోకముచే చెప్పబడుచున్న దనినచో అట్లుకాదు : ఇట్టి యర్థము దార్ష్టాన్తికమున కనుకూలించదు. దార్ష్టాంతికమునందుగూడ సమస్త వేదోక్త కర్మలయందు యెంతటి ఫలమును కర్మి పొందుచున్నాడో, సన్యాసి విజ్ఞానమునందంతటి ఫలమునే పొందుచున్నాడని యర్థము చెప్పవలయునని యనరాదు. కర్మఫలములగు అనిత్యస్వర్గాదులకంటె విజ్ఞానఫలమగు నిత్యమోక్షము పరమోత్కృష్టమగుచున్నందున నట్టి యర్థమును చెప్పుట పొసగదు.

గనుకనే "యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్" అనుశ్రుతి కర్మఫలములగు స్వర్గపశుపుత్రాదులు, నశించునవి, న్యూనాధిక భావరూపమగు (ఎచ్చుతగ్గు) దోషము కలవియు, నగుటచే నేపురుషునకు యేరోజున వాటియందు విరాగము కలుగుచున్నదో, ఆరోజుననే సన్యసింపవలయు నని చెప్పుచున్నది. అటుగాక విజ్ఞాన

ఫలము కర్మఫలతుల్యమగుచో, కర్మానుష్ఠానమువలననే స్వర్గాదిఫలములు లభించు చుండ కర్మశాస్త్రముకంటె వేరుగా "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అని వేదాంత శాస్త్రము నారంభించుట వ్యర్థమగును.

వ్యర్థమగుగాక - దోషమేమి యనినచో "తరతి శోక మాత్మవిత్" బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి "ఆత్మావా అరేద్రష్టవ్యః" అని జ్ఞానమును, జ్ఞానఫలమును విధించునట్టి యనేక శ్రుతులు విరోధించును.

అట్టి శ్రుతి విరోధమును గూడ సంగీకరించుటకు, బలవత్తరమగు సంసార విరోధము ప్రతిబంధక మగుచున్నది. ఏలయన కర్మలకు ఒకనాటికిని దుఃఖాత్మక మగు సంసారము ఉపరతి చెందకుండుటవలనను, విజ్ఞానము గల సన్న్యాసులకు సంసార దుఃఖములు సడలి నిరతిశయమగు ఆత్మానందము అనుభవ గోచరమగుటవలనను,

కావున జ్ఞానఫల, కర్మఫలములకు, ఏనుగునకు దోమకు ఉన్నంత తేడా కలదు. ఫలేచ్ఛను కోరక అనుష్ఠించు కర్మలకు మోక్షము ఫలమని యనరాదు. అట్టికర్మలకు చిత్తశుద్ధియే ఫలము గాని మోక్షము ఫలముగాదు.

ఇచట గొందరు గంగ, యమున మొదలగు ఆయా నదీ స్నానములవలన గలుగు ఆయాఫలములు ఒక్క సముద్రస్నానము వలననే పురుషున కెట్లు కలుగు చున్నవో, అట్లే ఆయాకర్మలవలన కలుగు హిరణ్యాగర్భలోకప్రాప్తి రూపమగు ఆనందములు ఒక బ్రహ్మజ్ఞానమువలననే విద్వాంసునకు కలుగుచున్నవి. అని వర్ణించు చున్నారు.

ఇచట రామానుజు లిట్లనుచున్నారు. వేదమునందు చెప్పబడిన కర్మలన్నియు, అందరికి ననుష్ఠేయములు గావు. మరేమనిన, ఎట్లు దాహముగలవాడు (పిపాసువు) అన్నివిధములగు ప్రయోజనములకు ఆకరమగు కూపాదులయందు యెంతట పానీయ రూపమగు ప్రయోజనము మాత్రము నభిలషించుచున్నాడో అట్లే ముముక్షువగు బ్రాహ్మణుడు కూడా వేదోక్తమగు నుపాయముల లన్నిటిలోను మోక్షసాధనమగు నుపాయమునే స్వీకరింపవలయును గాని వేరొండు నుపాయము స్వీకరింపదగదు." అని.

అయ్యది యుక్తిసహముగాదు. ఏలయన (1) "సర్వతస్సంప్లుతోదకే" అను మూలమునందలి పదమునకు "సర్వార్థ పరికల్పితే" అన్ని విధములగు ప్రయోజనముల కూడియున్న అను అర్థము లభించనందువలనను (2) స్నానము, పానము మున్నగు కొద్ది ప్రయోజనములతో కూడియున్న కూపాదులు సర్వార్థపరికల్పితములు (అన్ని ప్రయోజనములతో కూడినవి) కానందువలనను, స్త్రీపశ్వాదులను కోరినవానికి కూపాదులవలన కలుగు నుపయోగ మిసుమంతయును లేదు.

మరియు, "ఎంతటిఫలమో, అంతటి ఫలమే వానిచే స్వీకరింపబడుచున్నది. (యావత్ప్రయోజనం తావత్తేనోపాదీయతే) అని రామానుజులు వ్రాసిరి. అది

చేయ యుక్తము. జలము స్వీకరింపబడుచున్నది గాని ఫలము స్వీకరింపబడుట లేదు. ప్రత్యుత ఫలము స్వీకరింప శక్యమున్ను గాదు. ప్రయోజన వాచియగు అర్థశబ్దమునకు జలమని యర్థమును జెప్పుట పొసగదు.

అట్టితరి యెంతటి జలముతో ప్రయోజనమో, అంతటి జలమునే స్వీకరించుచున్నాడు. అని చెప్పదగియుండును. మూలమునందు "యావాన్" అని ప్రథమాంతమగు పదముండుటవలన, నిపుడట్లే చెప్పెదమని యనుటకును వీలులేదు. మరియు నీ యర్థమునందు "తేన" అను కర్తృవాచకపదమున్ను, "ఉపాదీయతే" అను క్రియాపదమున్ను, మూలమునందు లేనందున కల్పింపబడవలసి వచ్చును.

మరియు, రామానుజులు, (పిపాసోః) పానేచ్ఛగలవానికి అని నియమించుట కూడ యుక్తముగాదు. కూపాదులయందు స్నానముచేయ కోరిక గలవారు కూడ కలరు. పానేచ్ఛగలవారను పదము ఉదాహరణముకొరకు స్వీకరింపబడిన దనినచో అపుడు తోటను తడుప కోరికగలవారు కూడ గ్రహింపవలసియుండును. అందు క్లిష్టాపత్తి యనరాదు (ఆరామసేచనేచ్ఛునకు) తోటలను తడుప కోరికగలవానికి కూపమునందలి జలమంతటితోను ప్రయోజనముండుటవలన, కొలది జలమే వానిచే స్వీకరింపబడుచున్నది గాని, సర్వము స్వీకరింపబడుటలేదని చెప్పుట సంభవింపదు.

అట్లే బ్రాహ్మణ శబ్దమునకు వైదికుడగు బ్రాహ్మణునికని యర్థము చెప్పుట పొసగనేరదని యింతకుమున్నే నిరాకరింపబడినది. "విజానతః" అను పదమునకు ముముక్షువని యర్థము చెప్పుట కూడ పొసగదు. వేదవాదరతులగు అనేకమంది వైదిక బ్రాహ్మణులు, ఫలాసక్తిగలవారలే యగుచున్నారు. వైదికుడగువాడు "అథాతో ధర్మజిజ్ఞాసా" అను సూత్రమువలన కర్మలయందే ప్రవర్తించునుగాని, ముముక్షువు గానేరడు. "త్రైగుణ్యవిషయా వేదాః నిస్త్రైగుణ్యోభవార్జున" అని భగవంతుడగు శ్రీకృష్ణుడే కామదూషితుడని నిందించియున్నాడు. ముముక్షువనగా నిష్కాముడు, నిష్కాముడు వైదికుడు గానేరడు, వేదాన్తి యగుచున్నాడు. ఇయ్యది సిద్ధాంతము.

మరియు ఎవడు విశేషించి యాత్మతత్త్వమును దెలిసికొనుచున్నాడో వాడు "విజానన్" అని చెప్పబడుచున్నాడు. అట్టివాడు ముక్తుడుకాని, ముముక్షువుగాడు. రామానుజులుకూడ నిత్యముక్తులగు అనన్తుడు, గరుడుడు మున్నగువారును ఈశ్వరుడున్ను, విజ్ఞానముకలవారని యంగీకరించియున్నారు. మరియు ముముక్షువునకే జ్ఞానమునందధికారము. ముముక్షువు వేదాన్తశ్రవణాదికమునుచేసి యాత్మతత్త్వమును విశేషముగా తెలిసికొనుచున్నాడు. అట్టితరి విజ్ఞానత్వమే ముముక్షుత్వ మెట్లగును? మోక్షేచ్ఛగలిగినపిదపగదా విజ్ఞానము కలుగును. ఈస్థితిలో విజ్ఞానమే మోక్షేచ్ఛ యెట్లగును?

మరియు "యదేవ మోక్షసాధనం తదేవోపాదేయం" (ఏది మోక్షసాధనమో అదియే స్వీకరింపదగినది) అను నీవాక్యమంతయు మూలముకంటె వేరుగా కల్పింపబడినందున అప్రమాణమగుచున్నది.

మరియు వేదాన్తములయందే మోక్షసాధనమగు జ్ఞానము వినబడుచున్నందున వేదములయందు మోక్షసాధనమగుదానినే గ్రహింపవలయునని చెప్పుటకూడ యుక్తముగాదు.

వేదములయందు ధర్మమునకు సాధనములగు యజ్ఞాదులవలె మోక్షసాధనములుగూడ శ్రుతమగుచో వేదాన్తశ్రవణాదులు వ్యర్థములగును. మరియు పూర్వమీమాంసా, ఉత్తరమీమాంసా యను భేదకల్పనముకూడ అయుక్తమగును.

"సర్వే వేదా యత్పదమామనన్తి" అను శ్రుతియందలి సర్వశబ్దస్వారస్యము వలన ఉపనిషత్తులుగూడ వేదములేయని యనరాదు. "త్రైగుణ్యవిషయా వేదాః" అని భగవంతుడగు శ్రీకృష్ణుడే వేదములు గుణత్రయబద్ధమగు సంసారవిషయములని వక్కాణించి యుండుటవలనను, ఉపనిషత్తులు గుణత్రయాతీతమగు బ్రహ్మాత్మతత్త్వమును ప్రతిపాదించుచుండుట వలనను - ౪౬

శ్లో॥ కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన
మాకర్మఫలహేతుర్భూర్మాతే సఙ్గోస్త్వకర్మణి॥ ౪౭

అ॥ "బ్రాహ్మణో నిర్వేదమాయాత్" "బ్రాహ్మణః ప్రవ్రజేత్" అను శ్రుతిప్రమాణముల వలన బ్రాహ్మణునకే సన్న్యాసాశ్రమమునం దధికారముండుటచే, "కర్మణ్యేవ" అను ఏవకారమువలన క్షత్రియుడగు అర్జునునకు జ్ఞాననిష్ఠయం దధికారము లేదని యర్థమగుచున్నది. యద్వా మూలమునందలి "తే" అను పదమునకు వివేకవైరాగ్యాది గుణములు లేని నీకు అని యర్థము. కావున వివేకాది రహితుడవగు నీకు సన్న్యాసమునం దధికారము లేనందున, సర్వకర్మ సన్న్యాసపూర్వకమగు జ్ఞాననిష్ఠయం దధికారము లేదని భావము.

కర్మఫలములయందు కోరిక స్వప్నాద్యవస్థలయందును నీకు లేకుండుగాక అని ద్వితీయపాదమున కర్థము.

మాఫలేషు కదాచన అను "ద్వితీయపాదముచే" మాకర్మఫలహేతుర్భూః అను తృతీయ పాదమునకు పౌనరుక్త్యదోషమును శంకింపరాదు "ఫలేషు" అనునపుడు స్వర్గాదిఫలములయం దని యర్థము. "కర్మఫలహేతుః" అనునపుడు కర్మఫలమగు జన్మమునకు కారణుడని యర్థము. (అనగా కర్మఫలశబ్దమునకు జన్మయని యర్థము) కావున నీకు స్వర్గాదిఫలములయందు కోరికయున్నచో స్వర్గఫలమును అనుభవించుటకు నీకు జన్మయుండును. గనుక నీవు ఫలహేతువు, జన్మహేతువున్న

కాకుము. అని చెప్పుటకు రెండు వాక్యములు ఆవశ్యకమయినందున పౌనరుక్త్యము లేదు.

కర్మఫల హేతుత్వమనగా కర్మఫలరూపమగు జన్మము ననుభవించుట. ఫలములయం దధికార మనగా ఫలవిషయకమగు స్పృహ యని భేదము.

కర్మఫలమునందు కోరిక లేనిచో దుఃఖరూపమగు కర్మతో నేమి ప్రయోజన మను శంకకు సమాధానమును చెప్పుచున్నారు. "మా తేసంగో స్త్వకర్మణి" అను నాల్గవపాదముచే కర్మశబ్దము క్రియయందును (అనగా చేయుట అను నర్థమునందును) యజ్ఞాది కర్మలయందును ప్రసిద్ధమగుటచే నిచట "అకర్మణి" అనగా చేయకుండుట అను నర్థమును గ్రహింపవలయును.

ఫలేచ్ఛను విడచి నీవు కర్మలనే యాచరింపవలయును గాని కర్మసన్యాసమును జేయు నధికారము నీకు లేదని శ్లోకమునకు ఫలితార్థము.

ఇచట రామానుజులు కర్మఫల పదమునకు క్షున్నివృత్త్యాదికము ( ఆకలి దప్పికలను దీర్చుకొనుట ) అని యర్థమును జెప్పి అందుకు నీవు కారణుడవు గా వను అనుసంధానముతో నుండవలయునని చెప్పిరి.

ఇయ్యది తుచ్ఛము. భోజనాది కర్మలు కర్మలుగావు. ఆకలి దప్పికలను దీర్చు కొనుట కర్మఫలమున్ను గాదు.

ఏ శాస్త్రమున్నూ భోజనాదికర్మలయం దెవనిని నియమించుటలేదు. అట్లున్నచో నిచట శ్రీకృష్ణుడు గూడ నర్జునుని 'నీకు భోజనాది కర్మలయందే అధికార' మని నియ మించి యుండెడివాడు.

రాత్రిపూట భుజించుట, ఉపవాసమును జేయుట, మున్నగునవి నిత్యనైమిత్తి కాది కర్మల కంగములేగాని వాటియందు వేరుగా విధిలేదు.

మరియు క్షున్నివృత్త్యాదికము ( ఆకలి దప్పికలను దీర్చుకొనుట) కర్మఫల మగుచో భోక్తకు దానియందు సంగమెట్లు లేకుండును? యజ్ఞాదికర్మలకు ఫలమగు స్వర్గాదికము కాలాంతరమునందు కలుగునది గాన, దానియందలి సంగము పురు షునిచే విడువశక్య మగును. మరియు స్వర్గాదిఫలములను కోరక యజ్ఞాదికర్మలు చేయ వలవియగునుగాని, క్షున్నివృత్తిని కోరక క్షుద్బాధ గలవాడు భోజనాదులయందు ప్రవర్తించు టెట్లు? అయ్యది సంభవమగుచో ఆకలి లేనివానికి గూడ భోజనమునందు ప్రవృత్తి కలుగునుకదా?

మరియు ఆకలిదప్పికలు ప్రాణధర్మము లనియు, భోజనాదులు శరీరధర్మము లనియు, అనుసంధానమును జేయుట జ్ఞాననిష్ఠయే యగును. ఇట్టి యనుసంధానము అవిక్రియాత్మ జ్ఞానమునకు కారణమగుటవలన.

మరియు రామానుజులు 'కర్మఫలహేతుర్మాభూః' నీవు కర్మలయందును, ఫలములయందును కారణుడవు కాకుమని చెప్పుటకూడ నుచితముగాదు, 'కర్మణ్యేవాధికారః' అని కర్మహేతుత్వము చెప్పబడినందువలన.

ఇక వేదాంతదేశికులు కర్తృత్వాభిమానము లేకుండుటయే కర్మహేతుత్వమని వ్యాఖ్యాన మొనర్చిరి. అదియును అయుక్తమే యగుచున్నది. కర్తృత్వాభిమానము లేనిచో ఫలహేతువు గానేరడు. ఎవడు నేను కర్తనని యనుసంధానమును చేయుచున్నాడో వాడే ఫలమును అనుసంధానము చేయుచున్నాడు. కర్మకు కారణము కాకున్నచో కర్మయే నుండనేరదు. ఫలహేతువు కానపుడు, ఫలముయొక్క స్వరూపమెట్లు నిష్పన్నముకాదో అట్లే కర్మహేతువు కానిచో కర్మస్వరూపముకూడ నిష్పన్నము కానేరదు. ౪౭

శ్లో॥ యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనఞ్జయ
సిద్ధ్యసిద్ధ్యోస్సమోభూత్వా సమత్వం యోగ ఉచ్యతే.

అ॥ ఓయి యర్జునా! ఫలేచ్ఛను విడచి సిద్ధ్యసిద్ధులయందు సమానుడవుగా నుండి యోగమునందున్నవాడ వగుచూ కర్మల ననుష్ఠింపుము అని యన్వయము. "ఫలప్రియుక్తేన" అని భాష్యపదము. ఫలాభిసంధిలేనివానిచే నని యర్థము. అథవా ప్రియుక్తశబ్దమునకు ప్రయోగము అర్థము. భావార్థమునందు క్తప్రత్యయము ప్రసజ్జమని నిశ్చయార్థము. ఇచట "పుంసా" అని యధ్యాహారము చేసికొనవలయును. పురుషునిచే ఫలప్రసంగముతో కర్మ చేయదగదు. అనగా వివేకముగలవాడు ఫలమును కోరి కర్మ చేయకూడదని నిశ్చయార్థము.

"కర్మాణికురు" (కర్మలను చేయుము) అనుచోట యెందుకొరకు కర్మలను చేయవలయు నను శంక రాగా ఈశ్వరారాధనకొరకు కర్మలను చేయవలెనని సమాధాన మొసగబడినది. ఈశ్వరప్రీతియందును గూడ ఆశ యుండదగదు. అందు ఆశ యున్నను ఈశ్వరానుగ్రహము సిద్ధించునా? సిద్ధింపదా? అను సందేహముచే చిత్తచాంచల్యము కలుగును.

"సిద్ధ్యసిద్ధ్యోస్సమోభూత్వా" సిద్ధి యనగా జ్ఞానప్రాప్తి, అసిద్ధి యనగా తదప్రాప్తి - యీ రెంటియందును సమానముగా నుండవలెనన్నచో జ్ఞానము ప్రాప్తించినచో అనురాగముగాని జ్ఞానము ప్రాప్తించనిచో ద్వేషముగాని యుండదగ దని భావము.

యోగశబ్దార్థమును భగవంతుడగు శ్రీకృష్ణుడే వివరించియున్నాడు. నాల్గవ పాదముచే "సమత్వం యోగఉచ్యతే" అని ఇచట శాస్త్రజ్ఞైః అను పదమును అధ్యాహారమును చేసికొని శాస్త్రజ్ఞులచే చెప్పబడుచున్నదని యన్వయించుకొనవలయును.

ఇచట రామానుజులు: ' రాజ్యము, బంధుగులు, మున్నగువాటియందు ఆశను విడచి విజయముయొక్క సిద్ధ్య సిద్ధులయందు సమానుడవుగా నుండి కర్మలను ఆచరింపుము ' అని చెప్పిరి.

అయ్యది తుచ్ఛము. " మా ఫలేషు కదాచన " అను దానిచేతనే రాజ్యాదిఫలములయం దాశయుండరాదని చెప్పబడుటవలనను, బంధువులు మున్నగువానియందు ( స్నేహము ) సంగము పనికిరాదని " అశోచ్యాన్ " అను శ్లోకము మొదలు " నత్వం శోచితుమర్హసి " అనునంతవరకు నుండు గ్రంథముచే ప్రతిపాదింపబడుట వలనను, ప్రధాన ఫలముయొక్క సిద్ధ్య సిద్ధులయందు సమత్వము నుపేక్షించి, దానిలో నంతర్భూతమగు విజయముయొక్క సిద్ధ్య సిద్ధులయందు సమత్వమును చెప్పుట అనుచిత మగుట వలనను, ఇంతకు పూర్వ మెచటను ప్రధానఫలముయొక్క సిద్ధ్య సిద్ధులయందు సమత్వమును చెప్పియుండనందువలనను, " సుఖదుఃఖే సమే కృత్వా " అను శ్లోకమునందు జయాజయ సమత్వము చెప్పియుండుట వలనను రామానుజుల భాష్యము అసంగత మగుచున్నది. ౪౮

శ్లో॥ దూరేణహ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః ॥ ౪౯

అ॥ ఫలాపేక్షతో చేయబడు కర్మ, జన్మమరణాదులకు కారణమగుటవలన సమత్వబుద్ధితో చేయబడు కర్మకంటె చాల తక్కువదగుచున్నది. గనుక సమత్వ బుద్ధియోగమునందుగాని, దాని పరిపాకమువలన కలుగు సాంఖ్యబుద్ధియందుగాని రక్షకత్వము నొందుము. అనగా పరమార్థజ్ఞానమే రక్షకమని తలంచుము. ఫలహేతువు లగుచు నికృష్టమగు కర్మను చేయువారలు నీచులగుచున్నారు. ఏకరూపమగు కర్మకు, అనుష్ఠించువాని యొక్క బుద్ధియందలి ఫలసంగ, తదభావములచే ఉత్కర్షాప కర్షములు కలుగుచున్నవి. ఇంతియెగాని స్వాభావికములు గావు. దీనిచే అవివేకులగు రాగులచే చేయబడు కర్మలకే అపకర్ష వచ్చినది గాన వారలయొక్క నిందగూడ సూచింపబడుచున్నది.

ఫలహేతువులు నీచులగుటలో శ్రుతిని ప్రమాణపరచుచున్నాడు. ' యోవా ఏత దక్షరం గార్గి అవిదిత్వాఽస్మాల్లోకాత్ ప్రైతి సకృపణః ' అని. అనగా ఏ పురుషుడు నాశరహితమగు నీ బ్రహ్మమును దెలిసికొనక యీ మనుష్యలోకమును విడచి తాను ఫలాభిసంధితో చేసిన కర్మలఫలము ననుభవించుట కొరకు, స్వర్గాదిలోకములను పొందుచున్నాడో, ఆ పురుషుడు దుఃఖింపదగినవాడు. ' అస్మాల్లోకాత్ ' అను చోట ' ల్యబ్లోపే పంచమీ ' అను సూత్రమువలన పంచమీవిభక్తిః ' యద్వా ' లోకశబ్దమునకు దేహమని యర్థమును చెప్పుకొని, ఈ దేహమునుండి మృతిజెందు చున్నాడో అని యన్వయించుకొనవచ్చును.

తత్త్వజ్ఞానికి దేహమునుండి యుత్క్రాన్తి యనునది లేదు గావున యీ యర్థమునందు దోషము లేదు.

ఇచట రామానుజులు 'బుద్ధియోగాత్' అను పదమునకు బుద్ధియోగముతో కూడికొనిన కర్మకంటె - అని యర్థమును జెప్పిరి. వేదాంతదేశికులు, జహల్లక్షణచే నీ యర్థము సిద్ధించుచున్నదని యుక్తిని చూపిరి. ఈ రెండును తుచ్ఛమగుచున్నవి. ఏలయన (1) లక్షణాశ్రయణము దుష్టమగుటవలనను, (2) 'బుద్ధి యుక్తాత్' (బుద్ధి యుక్తమగు కర్మకంటె) అని చెప్పిననే ఇష్టసిద్ధి కలుగుచుండగా 'బుద్ధి యోగ యుక్తాత్' బుద్ధి యోగముతోగూడిన కర్మకంటె అని చెప్పుట వ్యర్థమగుటవలనను.

శ్లో॥ బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృత దుష్కృతే
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్॥ ౫౦

ఆ॥ కర్మలయందు సమత్వమనగా, కర్మలవలన కలుగు ఫలాఫలములయందు సమతాబుద్ధి; అదియే ఇచట ప్రకృతము. అథవా ఫలమును పరిత్యజించుటవలన నిత్య నైమిత్తిక కామ్యములయందు సమతాబుద్ధియని చెప్పవచ్చును. ఫలేచ్ఛను విడచి చేయునట్టి యీ మూడు కర్మలున్ను చిత్తశుద్ధి రూపమగు నొకే ఫలము నిచ్చుటచే సమానము లగుటవలన.

ఓయీ ! 'తద్విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరఞ్జనం పరమం సామ్యము పైతి' (ఆత్మను తెలిసికొనినవాడు పుణ్యపాపములను విడచి నిర్లిప్తుడగుచు పరమపదము నొందుచున్నాడు) అను శ్రుతి ఆత్మజ్ఞాని పుణ్యపాపములను విడచునని చెప్పుచుండ కర్మయోగి పుణ్యపాపములను విడచు టెట్లు పొసగును ? అనగా సమాధానము సత్వ శుద్ధి జ్ఞానప్రాప్తిద్వారా, యని. అనగా కర్మలవలన మొదట చిత్తశుద్ధి కలుగును, పిదప జ్ఞాన ముదయించును ; తదుపరి పుణ్యపాపములను విడచును. అని భావము.

కర్మలు సహజముగా బంధప్రాపకములయినను సమతాబుద్ధివలన స్వభావ మును విడచుచున్నవి. అనగా సంసారబన్ధము నీయక, చిత్తశుద్ధిద్వారా జ్ఞానము నిచ్చి ముక్తి నొసగుచున్నవని భావము.

ఇచట రామానుజులు మూలమునందలి కొన్ని పదములకు ఇట్లర్థమును చెప్పిరి. "బుద్ధియుక్తః" బుద్ధియోగముతో కూడినవాడు. యోగః బుద్ధియోగము "కౌశలం" అతి సామర్థ్యము" అనగా మిక్కిలి సామర్థ్యముచే సాధింపదగినది బుద్ధి యోగమని.

ఇయ్యది తుచ్ఛము యేలనన (1) బుద్ధిశబ్దమువలన బుద్ధియోగమను అర్థము లభించకుండుటవలనను, (2) ప్రకృతయోగము కర్మయోగమగుటచే నయ్యది బుద్ధి యోగ శబ్దముచే వచింప వీలులేనందువలనను (3) బుద్ధి, జ్ఞాన, పదములు పర్యాయ పదము లగుటచే బుద్ధియోగ మనగా జ్ఞానయోగమను అర్థము అనివార్యమగుట

వలనను, శ్లోకమునందలి " బుద్ధియోగాద్ధనంజయ " అను బుద్ధియోగ పదమువలన నిచట బుద్ధి శబ్దమునకు బుద్ధి యోగమని యర్థము చెప్పబడుచున్నను పూర్వశ్లోకము నందలి " బుద్ధి యోగాత్ ' అను పదమునకు కూడ సమత్వబుద్ధితో కూడిన కర్మ యోగమనియే అర్థమును నిర్ణయించుటవలన నదియును పొసగనందునను, ' యోగః కౌశలం ' అను స్వారసికమగు సామానాధికరణ్యమును చెరచి కౌశలసాధ్యము అని లాక్షణికార్థమును స్వీకరించుటలో ప్రమాణము లేకుండుటవలనను రామానుజోక్తమగు అర్థము దుష్టమగుచున్నది. ౫౦

ఇయ్యది తుచ్ఛము, బుద్ధి శబ్దమువలన బుద్ధియోగమను అర్థము లభింపదు. ప్రకృతము కర్మయోగము గనుక నద్దానిని బుద్ధియోగశబ్దముచే వచింప వీలులేదు. బుద్ధిజ్ఞానపదములు పర్యాయపదము లయినందున బుద్ధియోగమనగా జ్ఞానయోగమని తప్పక యర్థమగును. ' బుద్ధియోగా ద్ధనంజయ ' అను పూర్వశ్లోకము నందలి బుద్ధి యోగపదము వలన బుద్ధిశబ్దమునకు బుద్ధియోగమని యర్థమును చెప్పుటకూడ పొసగ నేరదు. అచట బుద్ధియోగపదమునకు కూడ సమత్వబుద్ధితో కూడిన కర్మయోగ మనియే నిర్ణయింపబడినది. యోగః కౌశలం అను స్వారసిక మగు సామానాధికరణ్యమును చెడగొట్టి ' కౌశలసాధ్యము ' అని లాక్షణికార్థమును స్వీకరించుటలో ప్రమాణము కనుపింపదు. గనుక రామానుజోక్తమగు అర్థము దుష్టమగుచున్నది.

' శ్లో॥ కర్మజం బుద్ధి యుక్తాహి ఫలం త్యక్త్వా మనీషిణః
జన్మబంధ వినిర్ముక్తాః పదం గచ్ఛ న్త్యనామయం.

అ॥ సమత్వబుద్ధితో గూడిన పురుషులు, కర్మజన్యమగు ఫలమును విడచి, జ్ఞానమును పొందినవా రగుచు, జన్మ యను సంసారబంధమును విడచి యుపద్రవ రహితమగు మోక్షపదవిని పొందుచున్నారని యన్వయము. కర్మఫలత్యాగులు జ్ఞానము నొందిరనగా చిత్తశుద్ధిద్వారా జ్ఞాననిష్ఠను పొందిరని యర్థము. ఇట్టివారు ముక్తి స్థానమును, ' గచ్ఛన్తి ' పొందుచున్నారు. అని వర్తమాన లకారమును నిర్దేశించి నందువలన జీవించియున్నవా రగుచునే ముక్తినొందుచున్నారని యర్థమగుచున్నది. అట్లు గానిచో ' గమిష్యన్తి ' పొందగలరు – అని చెప్పియుండవలసినది. ముక్తిస్థానము సచ్చిదానందరూప మయినదని గ్రహింపవలయును. ఆత్మయందు అనాత్మపదార్థము లను ఆరోపించుటకు కారణమగు నవిద్య, విద్యచే – వెలుతురుచే చీకటి నశించినట్లు నశించగా సచ్చిదానంద బ్రహ్మాత్మసాక్షాత్కారము కలుగును. అదియే మోక్షమని చెప్పబడుచున్నది. అయ్యది జీవించియున్న యవస్థయందే సులభమగును. జ్ఞానము శమదమాది సంస్కారవిశిష్టమగు మనస్సుచే సాధింపదగినది యగుటవలనను, 'బ్రహ్మవి ద్బ్రహ్మైవ భవతి' అను ప్రమాణమువలన విద్య(జ్ఞానము) వెంటనే మోక్షమునిచ్చుట

వలనను విదేహకైవల్య మగు మోక్షము జీవద్దశయం దెట్లు లభించునని యనరాదు. "నిష్కలం నిష్క్రియం శాన్తం" "అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం" ఇత్యాది ప్రమాణములచే నాత్మ యెల్లపుడు విదేహు డనియే చెప్పబడుచున్నాడు. ఆత్మ యొకానొక దేహముతో కూడియుండుట అజ్ఞానమువలన కలుగుచున్నది. ఆత్మకు నేను దేహసంబధముగలవాడ నను భ్రాంతి విద్యచే నివర్తించిన చాలును. ఆప్తునియొక్క యుపదేశము వలన రజ్జుసర్పభ్రాన్తి నివర్తించినట్లు కావున నిర్వికారు డును స్వయంప్రకాశమానుడగు ఆత్మయందు సంసారబంధముగాని, అవిద్యాసంసర్గము గాని లేనందున నాత్మజ్ఞానముగలవానికి జీవన్ముక్తి సిద్ధమగుచున్నది.

ఓయి! బుద్ధియోగముగలవాడు పుణ్యపాపములను విడచుచున్నాడు. నిరుపద్రవ మగు ముక్తిస్థానమును పొందుచున్నాడు, అని జ్ఞానఫలమగు పుణ్యపాపములను విడచుట పరమపదమును పొందుట, అనునవి చెప్పబడుటచే నిందు కర్మయోగమునకు ప్రసక్తి యెంతమాత్రము ఉచితముగాదని శంక కలుగగా భాష్యకారులు "అథవా" అని మొదలగు భాష్యగ్రంథముచే సమాధానమును చెప్పుచున్నారు.

దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ' అను శ్లోకము మొదలు నింత వరకు నుండు మూడు శ్లోకములయందును పరతత్వజ్ఞానమే స్వరూపముగా గలిగినట్టియు కర్మయోగమువలన కలుగు చిత్తశుద్ధిచే బుట్టినట్టియు సాంఖ్యబుద్ధియే భగవంతుడగు శ్రీకృష్ణునిచే నిరూపింపబడినది. ఏలననగా కారణమును చూపిరి ; యేమన, కర్మ యోగము పుణ్యపాపములను క్రమముగా పోగొట్టును. జ్ఞానయోగము స్వయముగా ఇతరాపేక్ష లేకుండగా పుణ్యపాపములను పోగొట్టును. పై మూడుశ్లోకములయందును పుణ్యపాప ప్రమాణమునకు సాక్షాద్ధేతుత్వమే వినబడుచున్నది. అట్టి సాక్షాత్కార ణత్వము సాంఖ్యయోగమునందే కలదని యిందుగూడ చెప్పబడియున్నది. గనుక పై మూడుశ్లోకములయందును శ్రీకృష్ణునిచే నిరూపింపబడినది జ్ఞానయోగమే గాని కర్మ యోగము గాదు. ఈ యర్థమునందు పై మూడుశ్లోకముల నిట్లు సమన్వయించుకొన వలయును.

'శ్లో॥ దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ
బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః ॥

అ॥ ఓయి యర్జునా! (బుద్ధి యోగాత్) జ్ఞానయోగముకంటె కర్మయోగము చాల తక్కువది. కిం-ఆకారణము వలన, బుద్ధౌ-సాంఖ్యయోగమునందు రక్షణమును పొందుము. కర్మఫలహేతువులు మిక్కిలి నీచులు. కర్మయోగనిష్ఠులు ఫలమును కోర నందున అంతటి నీచులు గారు.

శ్లో॥ 'బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలం॥'

సాంఖ్యబుద్ధిగలవాడు (జ్ఞానము గలవాడు) పుణ్యపాపముల నిచటనే విడచును. 'తద్విద్వాన్ పుణ్యపాపే విధూయ' అను శ్రుతిప్రమాణము కలదు. (ఆత్మను దెలిసికొనినవాడు పుణ్యపాపములను విడచి ముక్తి నొందునని దీని యర్థము) కావున నీవు సాంఖ్యబుద్ధిని పుట్టించు కర్మయోగముకొరకు ప్రయత్నించుము. తురీయపాదము నందు అర్థభేదము లేదు. ౪౯

శ్లో॥ కర్మజం బుద్ధి యుక్తావా ఫలంత్యక్త్వా మనీషిణః
జన్మబంధ వినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయం. ౫౦

సాంఖ్యజ్ఞానము గల విద్వాంసులు కర్మలను తత్ఫలమును విడచి సంసారబంధ వినిర్ముక్తులగుచు, నిరుపద్రవమగు మోక్షస్థానమును పొందుచున్నారు. ౫౧

శ్లో॥ యదా తే మోహకలిలం బుద్ధి వ్యతి తరిష్యతి
తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ. ౫౨

అ॥ నీ బుద్ధియందలి యవివేక మెపుడు దొలగిపోవునో, నీ వపుడు కని విని యెరింగిన పదార్థములయందు విరాగము నొందుదువు

ఆత్మానాత్మ వివేకరూపమగు జ్ఞానమును బోగొట్టి శబ్దస్పర్శాదివిషయజాత మును గురించి, యన్తఃకరణ మెద్దానిచే బంపబడుచున్నదో నయ్యది కాలుష్య మనబడుచున్నది. వివేక మను జలమును, మలినపరచుటవలన నవివేకము పరాగము వలె కలిలశబ్దముచే వ్యవహరింపబడుచున్నదని భావము.

వినినదానితో నేమి ఫలము? వినదగినదానితో నేమి ప్రయోజనము? అని విరాగము నొందుదువని యర్థము. ఆత్మకంటె భిన్నమగు ధర్మశాస్త్రేతిహాసపురాణాది కము శ్రుతము (వినినది), శ్రోతవ్యము (వినదగినది) నగుచున్నది.

ఆత్మమాత్రము సాక్షాత్కారపర్యంత మెల్లపుడు, శ్రోతవ్యుడే (వినదగిన వాడే) యగుచున్నాడు. అందువలన నాత్మయందు విరాగము (నిర్వేదము) ఉచితము గాదు, 'ఆత్మావాఽరే ద్రష్టవ్యః శ్రోతవ్యః' అను శ్రుతియు, 'ఆసుప్తేరామృతేః కాలం నయే ద్వేదాంతచింతయా' అను స్మృతియు నిందు బ్రమాణము లగు చున్నవి. (ఆత్మ వినదగినవాడు, దెలిసికొనదగినవాడు అని పై శ్రుతికి యర్థము) (నిదురబోవు నంతవరకు, మృతినొందు నంతవరకు వేదాంతవ్యాసంగముతో కాలము గడుపుమని పై స్మృతికి యర్థము.)

శ్లో॥ శ్రుతి విప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా
సమాధా వచలాబుద్ధి స్తదా యోగమవాప్స్యసి. ౫౩

అ॥ ఆత్మానాత్మ వివేకమును గప్పివేయునట్టి యజ్ఞానమును గల్మమద్రవ్యము క్షిలింప నాత్మానాత్మ వివేకరూపమగు జ్ఞానము పురుషునకు లభించును. అట్టి పురు

షుడు కర్మయోగమువలన గలుగు సాంఖ్యయోగము (జ్ఞానయోగము) నెప్పుడు బొందునో జెప్పెద వినుము.

ప్రవృత్తి నివృత్తి రూపములగు కర్మలను బోధించు వేదవాక్యములచే భేద భావము నొందిన నీ బుద్ధి యెపుడు నిశ్చలతను జెంది సమాధియందు స్థిరపడునో, నపుడు నీవు సాంఖ్యయోగమును (జ్ఞానమును) పొందగలవు. అని యన్వయము. (శ్రుతి విప్రతిపన్నా) అనేకములగు సాధ్యములను (ఫలములను) ఫలసాధకములను; నా రెంటికి గల సంబంధములను, బ్రకాశింపజేయునట్టి వేదవాక్యములచే పలువిధము లగు భేదభావమును బొందినదని యర్థము. ప్రవృత్తి ధర్మములను, నివృత్తి ధర్మము లను, ప్రతిపాదించునట్టి వేదవాక్యములను వినుటంబట్టి కర్మల ననుష్ఠింతునా? సన్య సింతునా! వనమును జేరుదునా? లేక కామ్యకర్మలయందైనను, నిత్యకర్మల నాచరిం తునా? కామ్యకర్మల నాచరింతునా? అను పలువిధములగు సంకల్పములను బొందిన బుద్ధి యని భావము.

బుద్ధి విశేషణములగు నిశ్చలాచలపదములకు పౌనరుక్త్యమును శంకింపవలదు, నిశ్చలత్వమనగా బుద్ధికి విక్షేపము లేకుండుట. విక్షేపమన బుద్ధి యాత్మస్వరూపము నుండి తొలగుట, అనగా విషయచిన్తనతో నుండుట, అని నిశ్చయార్థము. కావున విషయచింతన లేకుండుటయే బుద్ధికి నిశ్చలత్వ మని గ్రహింపవలయును.

అచలత్వ మన బుద్ధికి వికల్పములు లేకుండుట. వికల్పమనగా వీడు ఆత్మ, ఈయవి యనాత్మపదార్థములు. అను వివేకజ్ఞానరూపమగు బుద్ధి వృత్తి, అట్టి వృత్తి బుద్ధికి లేకుండుట, అచలత్వ మనబడును. అనగా నిర్వికల్పసమాధి యని నిశ్చయార్థము.

అంతఃకరణము, సుషుప్తిదశయందువలె లయమును జెందక జాగ్రత్స్వప్నముల యందువలె, విక్షేపమును (వృత్తిబాహుళ్యమును) జెందక, నేను బ్రహ్మ నను నాకారముగల వృత్తి లేనిదగుచు, కేవల మాత్మస్వరూపానుసంధానమును జేయుచు నుండునదియే నిర్వికల్పసమాధియని తెలినది.

గనుక నో యర్జునా! నీ యంతఃకరణ మెపుడు వికల్పములు, విక్షేపములు లేనిదగుచు నాత్మయందు స్థిరపడునో, అపుడు నేను నిర్వికల్పసమాధి నిష్ఠుడనని యనుకొనుమని శ్లోకమునకు నిష్కృష్టార్థము.

నిర్వికల్పసమాధియం దాత్మస్వరూపము సాక్షాత్కారమగుచుండ, వీడాత్మ, నీయవి యనాత్మ లను వివేకము, మానవునకు సుఖముగ గలుగునని భావము. దీనిచే జ్ఞానయోగమునకు సమాధియే పరమావధి యని సూచింపబడినది.

యమము నియమము మున్నగు నెనిమిది యుగములతో గూడిన యోగమునకే సమాధి పరమావధి యని యనరాదు. మనోనిగ్రహముచే సాధింపదగిన సమాధి సాంఖ్యయోగముల రెంటికిని పరమావధియే యగుచున్నది.

మనోనిగ్రహము గొందరకు ప్రాణాయామాది యోగసాధ్యమగును. కొందరకు నాత్మానాత్మ వివేచనరూపమగు జ్ఞానసాధ్యమగునని భేదము. గనుకనే, "ఏకం సాఙ్ఖ్యంచ యోగంచ యఃపశ్యతి సపశ్యతి" (సాఙ్ఖ్యయోగముల రెంటిని నొకటిగా దెలిసికొనినవాడే దెలిసినవాడు) అని శ్రీకృష్ణుడు ముందు చెప్పబోవుచున్నాడు.

ఓయి! అంతఃకరణ మెపుడు సమాధియందు వికల్పరహితముగా నుండునో (సమాధావచలాబుద్ధి స్తాసస్యతి) అని చెప్పినంతనే నిర్వికల్పసమాధి చెప్పబడుచుండ మరల (సమాధి ప్రాప్స్యసి) సమాధిని పొందగలవని చెప్పుట యనుచితముగదా? సమాధిగలవానికి సమాధి గలుగునని జెప్పుట పునరుక్తమగునుగదా? యనినచో, గనుకనే శ్లోకమునకు నిమ్కృష్టార్థ మిట్లు నిర్వచింపబడిన దని సమాధానపరచుకొనవలెను.

యద్వా - 'కర్మానుష్ఠానమువలన చిత్తశుద్ధి' చిత్తశుద్ధి కలుగగా, నిర్వికల్ప సమాధి ప్రాప్తి. తదుపరి ఆత్మానాత్మ వివేకరూపమగు జ్ఞానయోగమను సమాధిసిద్ధి యని వివేకము. చిత్తశుద్ధికి కర్మానుష్ఠానము కారణమయినట్లు, యమనియమాదులు గూడ కారణములగుచున్నవి; గనుకనే, నిర్వికల్పసమాధి యోగమునకు పరమావధి యని జెప్పబడినది. ఇందుచే యోగములన్నియు జ్ఞానయోగమునకు సాధకములనియు, జ్ఞానయోగముచే సాధింపదగిన యోగము మరియొకటి లేదనియు జ్ఞానయోగము సర్వ యోగములకు ప ర మా వధి యనియు సూచింపబడుచున్నది (సూచిత మగుచున్నది).

జ్ఞానయోగమునకు బ్రహ్మాత్మ సాక్షాత్కారము పరమావధి. అదియే నిర్వికల్ప సమాధి యనబడుచున్నది గనుక నా రెంటికిని భేదములేదు. కాని నిర్వికల్ప సమాధియందాత్మానుభవము నొందుచున్నను యోగులు ఆత్మను బ్రహ్మాభిన్నమగు వానినిగా దెలిసికొనజాలరు. జ్ఞానయోగ నిష్ఠులుమాత్ర మట్లాత్మను బ్రహ్మాభిన్నమగు వానినిగా దెలిసికొనుచున్నారు. ఈ కారణమువలననే యోగసాధ్యమగు నిర్వికల్ప సమాధికంటె, జ్ఞానయోగ ముత్కృష్టమని చెప్పబడుచున్నది.

ఏదియో నొక యుపాయముచే నీ యంతఃకరణ మెపుడు నిర్వికల్పసమాధిని బొందునో, అపుడే నీకు 'వీడాత్మ, ఇయ్యది యనాత్మ' యను వివేక ముదయించును. నిర్వికల్పసమాధియందాత్మస్వరూపసాక్షాత్కారము కలుగుటవలన నియ్యది సముచిత మగుచున్న దని శ్లోకతాత్పర్యము.

ఇట్లయినచో నిర్వికల్పసమాధివలననే ఆత్మస్వరూపసాక్షాత్కారము కలుగుచున్నందున నిర్వికల్పసమాధియే చాలును. అయ్యది ప్రాణాయామాదులచే నభ్యసింప నలవియగును. ఇంక నాత్మజ్ఞానముతో నేమిప్రయోజన మని యనరాదు.

ఆత్మ సచ్చిదానందరూపుడు, సర్వాంతర్యామి, స్వయంప్రకాశరూపుడు - అను జ్ఞాన ముండిననే నిర్వికల్పసమాధియం దనుభవింపబడుచున్న వస్తువునందు బ్రహ్మాత్మ జ్ఞానము కలుగును. లేనిచో నిట్టి జ్ఞానము సమాధియందు మానవునకు కలుగనేరదు. గనుక నీ జ్ఞానము సిద్ధించుటకు జ్ఞానయోగ మావశ్యకము. సుషుప్తికాలమునం దనుభవింపబడు నాత్మానందము మోక్షస్వరూపము గానేరదు. ఆత్మజ్ఞానము లేకుండుట వలననే సుషుప్తియందలి యానందానుభవము మోక్షమగుటలేదు. గనుక నాత్మజ్ఞానసిద్ధి కొరకు జ్ఞానయోగ మావశ్యకమగును.

అథవా విక్షేపమనగా విపర్యయజ్ఞాన మనియు, వికల్పమన సంశయజ్ఞాన మనియు నర్థము నంగీకరించినచో నీ శ్లోకమునందలి పూర్వవాక్యముచే నిర్వికల్ప సమాధి చెప్పబడదు గావున బూర్వోక్తము లగు దోషము లెవ్వియు బ్రసక్తించవు. నీ బుద్ధి యెప్పుడు 'వీడాత్మగాడు. వీడాత్మయగునా ? కాడా ?' యను విక్షేప, వికల్పములు లేనిదగుచు నాత్మయందు స్థిరముగనుండగలదో 'వీడేయాత్మ' యని అపుడు నీవు యోగమును బొందగలవని భావము. ఇచట యోగమనగా నాత్మసాక్షాత్కార మని మధుసూదనుల యాశయము.

ఇచట రామానుజులు సమాధిశబ్దమునకు మనస్సు అని యర్థమును జెప్పి మనస్సునందు బుద్ధి యెప్పుడు నిశ్చలముగా నుండగలదో యని యన్వయించిరి. అది యయుక్తము. మనోబుద్ధులు రెండు నొకటే యయినందున నా రెంటిలో నొకదాని యం దొకటి యుండుట తటస్థించదు. ఒకే యంతఃకరణము, సంకల్ప వికల్ప దశలో మనస్సనియు, నిశ్చయావస్థలో బుద్ధియనియు వ్యవహరింపబడుచున్నది.

మరియు 'విప్రతిపన్నా' అను పదమునకు (విశేషతః ప్రతిపన్నా) విశేషముగా ప్రతిపత్తి (భక్త్యాతిశయము) గలది యని యర్థమును జెప్పిరి. అదియును నయుక్తమగుచున్నది. ఏలనన, విప్రతిపత్తి శబ్దమునకు, విరుద్ధజ్ఞాన మని యర్థముండుటచే విప్రతిపన్న శబ్దమునకు గూడ నా యర్థమును జెప్పుటయే యుచితము. అప్రసిద్ధమగు నర్థమును గల్పించుట యనుచితము గాన రామానుజుల యాశయ మసంగత మగుచున్నది.

అర్జునః -

శ్లో॥ స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ ।
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్ ? ౫౪

అ॥ సమాధియందు నీ బుద్ధి వికల్పరహితముగా నెప్పుడు స్థిరపడునో నీవు జ్ఞానయోగమునందు పొందగలవను కృష్ణుని వాక్యమును వినినతోడనే యర్జునునకు

ప్రశ్నావకాశము లభించి యడుగుచున్నాడు. గనుకనే యర్జునుడు తన ప్రశ్న వచనమునందు మొదట 'సమాధిస్థస్య' అని చెప్పెను. భాష్యకారులు గూడ నిర్వికల్ప సమాధినివేకములను బొందినవానియొక్క లక్షణమును తెలియగోరి యర్జును డడుగుచున్నా డని వివరించిరి.

ఓయి యర్జునా! నిర్వికల్పసమాధియందు గాని, యాత్మయందు గాని, నేను పరబ్రహ్మము నను బుద్ధివృత్తిరూపమగు జ్ఞాన మెవనికి దృఢపడునో యట్టి స్థితప్రజ్ఞుని గురించిన భాషణ మేమి? అనగా వీడు స్థితప్రజ్ఞుడని పరులచే నెట్లు చెప్పబడుచున్నది? ఏయే లక్షణములవలన వీడు స్థితప్రజ్ఞుడని యొరులు నిర్ణయించుదురు? అని నిష్కృష్టార్థము. ఓయి కేశవా! ఇట్టి స్థితప్రజ్ఞుడు స్వయముగ నెట్లు సంభాషించును? నెట్లుండును? ఎట్లు కూర్చుండును? (ఎట్లు నడచును?) ఇందు కిం శబ్దముల కంతటను కథంశబ్దార్థమును గ్రహింపవలెను. దీనివలన బ్రహ్మాత్మనిష్ఠయందున్న స్థితప్రజ్ఞునకు భాషణాదు లసంభవములని యర్జునుని యాశయము గాదు. మరేమనిన ఆరూఢజ్ఞాను డగు స్థితప్రజ్ఞుని యొక్క భాషణాదుల రూపమేమి? యని యడిగి దెలిసికొనగోరుటయే యర్జునునియొక్క యాశయము. కావున బ్రహ్మచర్యమునుండియే సర్వకర్మలను సన్యసించి జ్ఞానయోగముచే నాత్మ సాక్షాత్కార నిష్ఠయందున్న స్థితప్రజ్ఞుని యొక్కయు. కర్మయోగముచే గ్రమముగ జ్ఞానయోగము నొంది, యెద్దానివలన నాత్మ సాక్షాత్కారము నొందియున్న స్థితప్రజ్ఞునియొక్కయు, లక్షణ మేమి యని నీ శ్లోకముచే నర్జును డడిగె ననుచున్నాడు. స్థితప్రజ్ఞ శబ్ద వాచ్యులగు నిద్దరియొక్క లక్షణము నడచుచున్నాడని గ్రహింపవలయును.

ఓయి! శ్లోకమునందు 'స్థితప్రజ్ఞస్య' (స్థితప్రజ్ఞునియొక్క) అని ఏకవచన మున్నది గాని, స్థితప్రజ్ఞయోః) అని ద్వివచనము లేదు. ఇట్టితరి యర్జునుడు స్థితప్రజ్ఞులగు నిద్దరి యొక్క లక్షణము నడిగెనని గ్రహించు టెట్లు? అని ప్రశ్నింపరాదు.

జ్ఞాననిష్ఠను పొందుటకు పూర్వము ఉభయులకు భేదమున్నను, జ్ఞాననిష్ఠను బొందిన పిదప నా యిరువుర కెంతమాత్రమును భేదములేదు. అందువలననే శ్లోకమునందలి యేకవచన మువపన్నమగుచున్నది. గనుక నా యిరువుర లక్షణమును నేకవచనానంత పదముతో నర్జును డడిగెనని గ్రహింపవలెను.

కావున సన్న్యాసముద్వారా గాని, కర్మయోగముద్వారా గాని, నిర్వికల్ప సమాధిని బొంది నేను బ్రహ్మము నను దృఢమగు జ్ఞానము నెవడు పొందునో వాడు స్థితప్రజ్ఞు డని పరమార్థము.

ఎట్టివానిని లోకులు స్థితప్రజ్ఞు డని తలంచుచున్నారు? ఎట్టివాడు స్వయముగ దాను స్థితప్రజ్ఞుడ నని తెలిసికొనుచున్నాడు?

స్థితప్రజ్ఞునియొక్క మనోవ్యాపార మెట్లుండును? వాని శరీరవ్యాపార మెలాగంటిది? వాగ్వ్యాపార మెట్టిది? యని యర్జునుడు స్థితప్రజ్ఞ లక్షణము నడిగెనని పరమార్థము.

ఇచట రామానుజులు: స్థితప్రజ్ఞుని చెప్పునట్టి పదమేది? వాని మాట యెట్లుండును? అని యర్థమును జెప్పిరి. అయ్యది పొసగదు. 'స్థితప్రజ్ఞః' అను పదమే స్థితప్రజ్ఞుని జెప్పునట్టి పదమగుటచే తిరిగి మరియొక వాచకపదమును గురించి ప్రశ్న యుదయించుట అసంభవము. గనుక రామానుజుల నిర్వచన మనుచితమని గ్రహింప నగును.

అ॥ 'ప్రజహాతి యదా కామాన్' అను శ్లోకము మొదలుకొని అధ్యాయము చివరవరకు స్థితప్రజ్ఞుని లక్షణము, సాధనమున్ను చెప్పబడుచున్నది. ఓయి! అర్జునుడు స్థితప్రజ్ఞుని లక్షణమును మాత్రమే యడిగియుండగా శ్రీకృష్ణుడు సాధనముల గూడ నుపదేశించు టెందుల కని ప్రశ్నింపరాదు. వేదాంతశాస్త్రమునందు గృతకృత్యు డగు స్థితప్రజ్ఞుని లక్షణములే కృతకృత్యతకు సాధనములు గూడ నగుచున్నవి. గనుక నర్జునుడు ప్రశ్నింపకున్నను లక్షణములే సాధనము లని యుపదేశింపబడుచున్నది. కృతకృత్యు డగు పురుషునియందు గృతకృత్యతకు సూచకములుగా గనుపించునట్టి కోరికలను విడచుట, ఆత్మతృప్తి, సుఖస్వభావము మున్నగు చిహ్నములు గలవో నవియే మనోనియమన రూపమగు ప్రయత్నముచే సాధింపదగిన కృతకృత్యతా సాధనము లని యర్థము.

ఓయి! సాధనములు, లక్షణములు నొకటేయగుట యుక్తము గాదు. లక్షణములు సాధనముచే సాధింపదగినవి యనినచో నిజమే. ఇతరత్ర అట్లయినను వేదాన్తశాస్త్రమునందుమాత్రి మట్లుగాదు. ఇచట సాధనములకు లక్షణములకు నభేదమే స్పష్టమగుచున్నది. ఏలనన కామనాపరిత్యాగము (కోరికలను విడచుట) మొదలగు సాధనములచే గృతకృత్యత సిద్ధించుచున్నది. కృతకృత్యు డగు పురుషునియందు కోరికలు లేకుండుట మొదలగునవి లక్షణములుగా గన్పట్టుచున్నవి. (లక్షయంతి) గుర్తింప జేయుచున్నందున లక్షణములన్నియు, (సాధయన్తి) సాధించుచున్నందున సాధనములనియు నీ రెండు పదములకు నిర్వచనము. కనుక నెయ్యవి కృతకృత్యతను గుర్తింపజేయుచున్నవో నవియే కృతకృత్యతను సాధించుచున్నవి అట్లుగానిచో గృతకృత్యతాసాధకములకు కృతకృత్యత్వమును గుర్తింపజేయు టెట్లు

పొసగును ? ధూమముచే వహ్ని దెలియబడినట్లు సాధనముచే సాధ్యము దెలియ బడునుగదా ? ఇచట కృతకృత్యత్వము సాధ్యము. దీని సాధనమునకు కృతకృత్యత్వ సూచకత్వము (కృతకృత్యత్వమును గుర్తింపజేయుట) గూడ గలదు. కావున నిచట సాధన లక్షణములకు భేదము కలదని భావము.

కృష్ణుడు చెప చున్నాడు :

శ్లో॥ ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే॥ 55

అ॥ ఓయి ! యర్జునా మానవు డెపుడు మనస్సునందలి సమస్త కోరికలను పూర్తిగ విడచునో, ఆత్మస్వరూపమునందే ఆత్మస్వరూపముచే తుష్టి జెందునో, నపుడు స్థితప్రజ్ఞుడని జెప్పబడుచున్నాడు.

పుత్రాదులయందు గోరికయున్నపుడు పుత్రాదులు లభించినచో బురుషునకు సంతోషము కలుగును. బొత్తుగా కోరికయే లేనపుడు సంతోషమే యుండనేరదు. సంతోష కారణమగు సంతోషమునకు కారణము – కోరిన వస్తువు లభించుట. కోరికయే లేనిచో కోరిన వస్తువు లభించుట అనునది లేదు కావున సంతోషమే యుండనేరదు. కామితార్థప్రాప్తి లేనందువలన మరియు సర్వకోరికలను విడచినచో భోజనమునందలి కోరికను గూడ విడచిన ట్లగును. భోజనమునందు కోరిక లేకున్నచో భోజనముకూడ లేదు. కావున నాత్మజ్ఞానికి యాకస్మికముగా బలాత్కారమరణము వాటిల్లును. అందు దోషముండుటచే నయ్యది యయుక్తమగుచున్నది.

ఆకస్మిక మరణభీతివలన విద్వాంసునకుగూడ శరీరమును నిలుపుకొనుటకు కారణమగు భోజనాదులయందు గోరిక యుండునని యనదగదు. విద్వాంసునకు భోజనాదులయందు ప్రవృత్తి యున్మత్త ప్రమత్తులకు వలె సంభవించును; పిచ్చివా డున్మత్తుడు. కల్లుదాగి మత్తెక్కినవాడు ప్రమత్తుడు; ఉన్మత్తు డే పదార్థమును గోరడు. దేనికొరకును ప్రయత్నింపడు. ఆకలిదప్పికల గొనినపుడు వాటిని బోగొట్టు కొనుటకు యేదియో కొంచెము నిందితాన్నమును గాని, నిందితజలమును గాని తాత్కాలికముగ ననుభవించును. అట్లే విద్వాంసుడుగూడ ప్రవర్తించును. ఇంతియె గాని విద్వాంసుడు శరీరమును నిలుపుకొనుటకు కామనాపూర్వకముగ ప్రవర్తించు నని యారోపింప దగదని యనినచో సమాధాన మొసగుచున్నాడు యుత్తరార్థమున.

విద్వాంసుడు ఆత్మస్వరూపానందము చేతనే తృప్తిజెందును. బాహ్యవస్తు లాభము నపేక్షింపడు. అమృతము నొందినవానికి యన్నాదులయందెట్లలంబుద్ధి

యుండునో (చాలునను బుద్ధి) అట్లే ఆత్మస్వరూపానందము ననుభవించు విద్వాంసున కితర బాహ్యపదార్థములయం దలంబుద్ధి యుండునని యర్థము.

ఇందువలన విద్వాంసునకు శరీరమును నిలుపుకొనుద మను గోరిక యుండదు. అట్టి కోరికయుండుచో విద్వాంసు డున్మత్తప్రమత్తాదుల వలె భోజనాది కర్మల యందు ప్రవర్తించెడివాడు. ఆత్మానందానుభవమున మునిగియుండుటచే ఆకలి దప్పికల బాధగూడ నుండదు. ప్రారబ్ధముండునంతవరకు శరీరము పడిపోవుట యసంభవము. గనుక విద్వాంసుడు భోజనాదులయందు ప్రవర్తించనంతమాత్రమున శరీరము పతనము నొందదు, అని స్పష్టమగుచున్నది.

దారాపుత్రాదుల యందు, ధనద్రవ్యాదుల యందు, స్వర్గాదిలోకములయందును గోరికలను విడచి, సర్వకర్మలను సన్యసించి, ఆత్మస్వరూపమునందు విహరించుచు, ఆత్మస్వరూపమునందే ప్రేమనొందిన పురుషుడు స్థితప్రజ్ఞు డనబడుచున్నా డని శ్లోకమునకు ఫలితార్థము.

ఓయి ! ఈ శ్లోకము యొక్క పూర్వభాగము వలన నిష్క్రియ రహితుడను నర్థము లభించుచున్నది. ఉత్తరార్థమువలన నాత్మారాముడు, ఆత్మతృప్తుడు అను నర్థము ప్రాప్తించుచున్నది. ఇం దేపదమువలనను సర్వకర్మసన్యాసి యను నర్థము లభించుట లేదు ఇట్టితరి భాష్యకర్తలు స్థితప్రజ్ఞలక్షణమును నిర్వర్తించి చెప్పుటలో సర్వకర్మసన్యాసము నెట్లు చేర్చిరి - అని ప్రశ్నింపరాదు. సర్మకర్మసన్యాసము లేని దే ఆత్మనిష్ఠగాని, ఆత్మస్వరూపమునందు ప్రేమగాని యుండనేరదు. కావున భాష్యకర్త యర్థతః సిద్ధమగు నర్థమును చెప్పదలంచి స్థితప్రజ్ఞలక్షణమునందు సర్మకర్మసన్యాసమును జేర్చిరి. అందువలన నయ్యది యప్రమాణము గానేరదు.

ఇంతమాత్రమున సన్యాసమును స్వీకరింపని జనక వసిష్ఠాదులు స్థితప్రజ్ఞులు గారని శంకింపవలదు. వారి చరితము లోకాతిక్రాంతము. అట్టివారు చేసిన కర్మలు కర్మలు గావు ఆ కర్మలను సన్యసించుట సన్యాసమును గాదు. ఇద్దానిని శ్రీ శంకరుడు తొలుత గ్రంథారంభమునందే జెప్పిరి. కాక నిప్పటివారు వాసుదేవాదులను దృష్టాంతపరచుకొని సన్యాసము స్వీకరింపమన్నచో వారు శంకరాదులను పోల్చుకొని గృహస్థాశ్రమము నేల విడువరు ? మీకేమి సన్యాసమునం దింతటి పక్షపాత మనియెద లేమి, మీకు మాత్రము సన్యాసమునం దింతటి ద్వేష మెందులకు ? గృహస్థాశ్రమమునందలి యనురాగమేకదా మీ ద్వేషమునకు కారణము. మీకీ యనురాగ మున్నంతవరకు నాత్మస్వరూపమునందు ప్రేమ కుదరదు. గనుక గృహస్థాశ్రమమునం

దనురాగమును తగ్గించుకొనుట కొరకు గార్హస్థ్యమునం దున్న ముముక్షువులు తప్పక సన్యాస మవలంబింపవలయును అప్పుడుగాని స్థితప్రజ్ఞ లక్షణము వారల కలవడ నేరదు.

సన్యాసముకూడ భిక్షావందనాదులయం దనురాగమువలననే స్వీకరింపబడు చున్నదని యనరాదు. 'యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్' అను శ్రుతి సన్యాసము వైరాగ్యపూర్వకమనియే జెప్పుచున్నది. మోక్షకాముడు సకాముడగుచో సన్యాసమునం దనురాగము గలవాడు రాగి యగును.

ఓయి! జన్మాంతరమునందు జేసికొనిన సన్యాసస్వీకారము మున్నగు పుణ్య విశేషము వలన నొక నొకడు బ్రహ్మచర్యముకంటె పూర్వముగాని, బ్రహ్మచర్యము నందుగాని, గార్హస్థ్యమునందుగాని జడభరతాదులవలె స్థితప్రజ్ఞు డగుచున్నాడు. గనుక సన్యాసమునకు తగినంత యావశ్యకత లేదని యనరాదు.

అట్టివాడు జనకాదులవలె లోకాతీతమగు చరిత్రగలవారలలో నొకడుగ లెక్కింప (నెన్న) దగినవాడు గాని సామాన్య మానవులలో నొకడుగ నెన్నదగిన వాడు కాడు. ఆదశ సర్వమానవులకు సాధ్యము గాదు (సంభవము గాదు).

యద్వా - (లేక) వర్తమాన జన్మమునందలి సన్యాస మట్లువలె, జన్మాంతరము నందలి సన్యాసము గూడ స్థితప్రజ్ఞు డగుటకు గారణమగుననియు జనకుడు, భరతుడు మున్నగువారు వెనుకటి జన్మములయందు సన్యాసము నవలంబించినందువలననే నీ జన్మమున స్థితప్రజ్ఞులయి రనియు గ్రహింపవలయును. ౫౫

శ్లో॥ దుఃఖే ష్వనుద్విగ్నమనా స్సుఖేషు విగతస్పృహః
వీతరాగ భయక్రోధః స్థితధీ ర్మునిరుచ్యతే. ౫౬

అ॥ దుఃఖేషు అను మూలమునందలి పదమునకు దుఃఖహేతువు లగు తాపము లని యర్థము జెప్పుకొనవలయును. అయ్యవి యాధ్యాత్మికతాపము లనియు, నాధి దైవికతాపము లనియు, నాధిభౌతికతాపము లనియు మూడు విధములు.

అందు జ్వరాదివ్యాధులవలన గలుగు తాపము లాధ్యాత్మికములు, వ్యాఘ్ర సర్పాది క్రూరమృగముల వలన గలుగు తాపము లాధిభౌతికములు. చలి, యెండ, గాలి మున్నగు వాటివలన గలుగు తాపము లాధిదైవికములు. ఇట్టి తాపములవలన గలుగు దుఃఖము ప్రాప్తించినపుడు మనస్సంక్షోభము లేనివాడు స్థితప్రజ్ఞు డని యర్థము.

ఓయి! మూలమునందలి దుఃఖేషు అను పదమునకు దుఃఖములను నర్థము జెప్పక, నాధ్యాత్మికాది తాపము లను నర్థమును జెప్పి. మరల యట్టి తాపమువలన దుఃఖము ప్రాప్తించినపుడు అను నన్వయము క్లిష్టయోజనగదా యని శంకింపవలదు.

మూలమునందలి దుఃఖ పదము "దుఃఖేషు" అని బహువచనాంతముగా నుండుటచే సాక్షాత్ దుఃఖార్థక మని గ్రహింప వీలులేదు. అందువలన దుఃఖహేతువు లగు తాపము లను నర్థమును జెప్పుటయే యుక్తము.

అట్లే సుఖములు సంప్రాప్తము లయినపుడు వాటియం దాస లేనివాడు స్థిత ప్రజ్ఞుడని యర్థము.

ఓయి ! ప్రాప్యములయిన (పొందదగిన) సుఖములయందు బురుషున కిచ్ఛ యుదయించును గాని, ప్రాప్తములయిన (పొందబడిన) సుఖములయందే మానవునకు నాస బుట్టనేరదు గదా. కోరికకు (ఇచ్ఛకు) ఫలప్రాప్తి పర్యవసాన మనునది లోకసిద్ధము గదా ? యని శంకింపవచ్చు. సమాధానము: అగ్నిహోత్రమునందు కట్టెల నునిచినపుడు గాని, యాజ్యము నునిచినపుడు గాని, యగ్ని జ్వాలలతో వృద్ధినొందునట్లు ప్రాప్తించిన సుఖము ననుసరించి యెవరికి సుఖములు వృద్ధిజెందవో వారు విగతస్పృహులని యర్థము.

పురుషున కన్నము సంప్రాప్త మగుచో నన్నమునందలి గోరిక యెట్లు నివర్తించునో, ధనము సంప్రాప్తమయినపుడు ధనేచ్ఛ యట్లు నివర్తింపదు. అట్లే సుఖము లభించినను, సుఖేచ్ఛ నివర్తింపదు. పైగా నింతకంటె 'యెక్కువ సుఖము నాకగుగాక' యని సుఖేచ్ఛ వృద్ధియే జెందును. అగ్నిహోత్రమునం దెన్ని కట్టెల నుంచినను యెంత నేయి బోసినను వీతిహోత్రునకు కాష్ఠాదులయం దాస తీరదు. మరియు నా యాశ వృద్ధియే జెందును. "నాగ్ని స్తృప్యతి కాష్ఠానాం" కట్టెలవలన నగ్ని దృప్తిజెందదని లోకన్యాయము గాక కట్టెలవలన నగ్నిహోత్రుడు దృప్తిజెందుచో నందునిచిన గట్టెల నా యగ్నిహోత్రుడు దహింపజేయకనే యుండును. లోకమునం దట్లు గనుపించుట లేదు మరియు నత్యధికమగు జ్వాలలతో నా కట్టెలను గోరుచునే యుండును. కావున సుఖప్రాప్తివలన సుఖేచ్ఛ నివర్తింపక వృద్ధిజెందుట సహజము.

గాన (సుఖేషు ప్రాప్తేషు) సంప్రాప్తములయిన సుఖములయందు గోరిక లేనివాడు స్థితప్రజ్ఞుడని భాష్యకర్తలు చేసిన నిర్వచనము యుక్తమగును.

పూర్వశ్లోకమునుండి యదా, తదా, అను శబ్దముల రెంటిని నీ శ్లోకమునం దనువృత్తి జేసికొనవలయును అపుడు ఆత్మజ్ఞానమును మననము జేసికొనువా డెపుడిట్టివాడగునో నపుడు స్థితప్రజ్ఞు డనబడుచున్నాడని యన్వయము.

యద్వా 'పురుషః' అను పదమును అధ్యాహారము జేసికొనవలయును. అందువలన ఎపుడు పురుషు డిట్టి మునియగునో నపుడు స్థితప్రజ్ఞు డనబడుచున్నాడని యన్వయము లభించును.

ఇచట మునిశబ్దము సన్యాసి యను నర్థమును బోధించునా? బోధింపదా? యని శంకింపవలదు. ముని యనగా నెల్లపుడు మననముజేసికొను స్వభావముగలవా డని యర్థము. ఇట్టి మననశీలత (మననముజేసికొను స్వభావము). సర్వకర్మసన్యాసు నకే నేపనియు లేనందున సంభవించును గాని గృహస్థునకు సంభవింపనేరదు, కావున ముని శబ్దము సన్యాస్యర్థకమనియే గ్రహింపవలయును.

ఇట్లయినచో సన్యాసమును స్వీకరింపని వసిష్ఠాదులు మునులెట్లయిరి? అని ప్రశ్నింపరాదు. వసిష్ఠాదులు గృహిణులతోగూడిన వారయినను, సర్వకర్మలను త్యజించి, వనమునుజేరి, యెల్లపు డాత్మమననమును జేయుచునే యున్నారు, గావున నట్టివారు సర్వకర్మలను సన్యసించిన మునులే యగుదురు.

శ్లో. య స్సర్వత్రానభిస్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్
నాభినన్దతి నద్వేష్టి తస్యప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥౫౭॥

అ. ఏ మానవుడు దేహమునందును, జీవితమునందును స్నేహమునువదలి, శుభము (మంచిఫలము) సంప్రాప్తమయినపు డానందింపక, అశుభము (చెడు ఫలము) సంప్రాప్తమయినపుడు ద్వేషింపక స్థిరమనస్కుడుగానుండునో వాడు స్థితప్రజ్ఞు డనబడును. ౫౭

శ్లో. యదా సంహరతే చాయం కూర్మోఽంగానీవ సర్వశః ।
ఇన్ద్రియా ణీన్ద్రియార్థేభ్య స్తస్యప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥౫౮॥

అ. తాబేలు, తన అవయవములను తన శరీరములోనికి భయపడి లాగికొను నట్లు ముముక్షువు తన యింద్రియములను విషయములనుంచి సర్వవిధముల, నెపుడు మరల్చుకొనునో అపుడు స్థితప్రజ్ఞు డనబడుచున్నాడు. ౫౮

శ్లో. విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః ।
రసవర్జం రసోప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ॥౫౯॥

అ. విషయములను గ్రహింపనివాని ఇన్ద్రియములు విషయములనుండి మర లును; తపసుచే గృశించినవాని యొక్క ఇన్ద్రియములును విషయములనుండి మర లును. ఇట్టితెరి స్థితప్రజ్ఞుడగు యతియొక్క ఇన్ద్రియములే విషయములనుండి నివర్తిం చుచున్నవని జెప్పు టెట్లు? అని ప్రశ్నించగా సమాధానము జెప్పబడుచున్నది.

మూలమునందలి ‘విషయాః’ అను పదమునకు లక్షణావృత్తిచే నిన్ద్రియ ములని యర్థము. ఆహారమనగా స్వీకరించుట. నిరాహారమనగా స్వీకరింపకుండుట, కావున ‘నిరాహారస్య’ అనగా విషయములను స్వీకరింపకున్నవానియొక్క అని

యర్థము. అనగా కాష్ఠతపమునందున్నవాని కని భావము. ఏ పురుషుడు కట్టెవలెః చలింపక తపమునందుండునో వాడు కాష్ఠతపసి- కండ్లు, చెవులు మున్నగువాటిని మూసికొని, కట్టెవలె చలింపక నున్నవానికి విషయములను గ్రహించుట సంభవించదని భావము.

ఇచట (నిరాహారస్య) నిరాహారుడనగా, భోజనము లేనివాడు, అనగా లంఘనములను జేసినాడని శంకింపవలదు. ఆహారము లేనంత మాత్రమున నన్ని యిన్ద్రియములు పనిచేయకపోవు. ఆహారములేకున్నను చక్షురాదీన్ద్రియములు రూపస్పర్శాదుల గ్రహింపవచ్చు. కావున నిచట నాహారశబ్దమునకు భోజన మను నర్థమును జెప్ప వీలులేదు.

కావున దేహాది సఙ్ఘాతమునం దహం మమాభిమానముగల జ్ఞానహీనుడయినను, కాష్ఠతపమునందుండి విషయములను గ్రహింపకున్నపుడు వాని యిన్ద్రియములు విషయములనుండి నివర్తించియే తీరును. కాని యట్టి మూర్ఖునియొక్క (యజ్ఞానియొక్క) నంతఃకరణమునందలి యనురాగము మాత్రము నివర్తింపదు.

ఇచట రస శబ్దమునకు చేదు, ఉప్పు, పులుసు మొదలగు రసములుగాని, శృఙ్గారాది రసములుగాని యర్థముగాదు. "రసికః" "రసజ్ఞః" ఇత్యాది ప్రయోగములను బట్టి రస శబ్దమునకు రాగమనియే యర్థమును జెప్పవలయును.

స్థితప్రజ్ఞుడగు యతికి నారాగముగూడ, నేనే పరమార్థతత్త్వమగు బ్రహ్మమనని యాత్మతత్త్వమును సాక్షాత్కారమును జేసికొనినందున నివర్తించుచున్నది. అనగా విషయవిజ్ఞానము నిర్బీజ మగుచున్నదని యర్థము. ఏలనన విషయములను దెలిసికొనుటకు రాగమే ముఖ్యకారణము. రాగరహితునకు విషయములయందు ప్రవృత్తియే లేదు. కావున రాగముకూడ నివర్తించుటవలన, విషయజ్ఞానము నిర్బీజ మగుచున్నదని భావము. కాష్ఠతపమునందున్న మూర్ఖున కాత్మసాక్షాత్కారము లేనందున రాగము నివర్తింపదు. గనుక నట్టివాని విషయమున విషయపరిజ్ఞానమునకు బీజము నశింపదు. గనుకనే కాష్ఠతపసికి తపోనివృత్త్యనన్తరము బీజముండుట వలన మరలి విషయవిజ్ఞానము ప్రసక్తించుచున్నది. కావున బరమార్థ జ్ఞానములేని శుష్కతపస్సుచే నెవడును స్థితప్రజ్ఞుని దశనుపొందనేరడని భావము.

పరమార్థతత్త్వజ్ఞానములేనిదే రాగము నశించదు గాన రాగోచ్ఛేదము కొరకు యతి సమ్యగ్దర్శనరూపమగు ప్రజ్ఞను స్థిరపరచుకొనవలయు నని భావము. శ్రీ

శ్లో. యతతో హ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః ।
ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః ॥౬౦॥

అ. ఓయి అర్జునా? వివేకప్రజ్ఞాస్థైర్యముకొరకు ప్రయత్నించుచున్న విద్వాంసుడగు బురుషునియొక్క, మనస్సును గూడ, కలవరపరచు స్వభావముగల ఇన్ద్రియములు బలాత్కారముగా లాగుచున్నవి. ఇక మూర్ఖుని యొక్క మనస్సును చెరచుటలో నాశ్చర్యమేమి? విషయాభిముఖునగు మనస్సుగల పురుషుని క్షోభపెట్టు స్వభావము గలవి గనుకనే, ఇన్ద్రియములు, ప్రమాథులని, యనబడుచున్నవి. గనుక నాత్మయొకడే దోషరహితుడనియు, విషయములన్నియు, దోషయుక్తములే ననియు దెలిసికొనిన బురుషునియొక్క మనస్సును గూడ నిన్ద్రియములు విషయములకభిముఖమగు దానినిగా జేసి వ్యాకులపరచి వివేకరహితమయినదానినిగా జేయుచున్నవని యర్థము. ౬౦

శ్లో. తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః।
వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥౬౧॥

అ. ఎందువలన నీ యిన్ద్రియములు, విద్వాంసుని మనస్సునుగూడ క్షోభపెట్టి బలాత్కారముగా చెడగొట్టుచున్నవో అందువలన సర్వేన్ద్రియములను వశపరచుకొని చిత్తైకాగ్ర్యము నొందినవాడగుచు, సమస్తభూతముల యొక్క హృదయముల యందు, చిద్రూపముతో నున్న పరమాత్మరూపుడగు నేనే పొందదగినవాడనను అనుసన్ధానముతో నుండవలయును. నీ యనుసన్ధానమును దప్ప మరేమియు నాచరింపకూడదు. ఎల్లప్పుడు నిట్టి యనుసన్ధానమునం దాసక్తుడగు యతికి నిన్ద్రియములు స్వాధీనమునందుండును. వానియొక్క ప్రజ్ఞయే స్థిరపడును. ఇట్టిదశ అభ్యాసబలమున నేర్పడును. అదెట్లన: ఇన్ద్రియములకు స్వభావసిద్ధమగు విషయాభిముఖ్యమును మరల్చి, మనస్సును ఆత్మయం దేకాగ్రపరచి నేనే బ్రహ్మము నని యెల్లప్పుడెవ్వ డనుసన్ధానము జేయునో అట్టి యతికి, క్రమముగ నిన్ద్రియజయము కలుగును. ఇన్ద్రియజయము కలుగ నావల స్థితప్రజ్ఞుడగును.

ఇందు అధికారి విశేషణములగు శమ, దమ, ఉపరతి సమాధానములు జెప్పబడినవి.

ఇచట రామానుజులు "ఆసీతమత్పరః" అను నపుడు చిత్తమునకు శుభాశ్రయమగు నాయందు మనస్సు నిలుపదగినది.అనియన్వయించిరి. అయ్యది యుక్తము గాదు. ఏలయన స్థితప్రజ్ఞుడగు సాఙ్ఖ్యునకు యోగికివలె ధ్యానధారణములతో బనిలేదు. సచ్చిదానన్ద-బ్రహ్మాత్మ తత్త్వమును దెలిసికొనిన స్థితప్రజ్ఞుడు తన యన్తఃకరణమునం దొకానొక నాకారమును గల్పించుకొని ధ్యానింపడు.కల్పితపదార్థ మెప్పుడును మిథ్యయగును. మిథ్యాపదార్థము చిరకాల ముండనేరదు. క్షణములో నశించును. అందువలన నయ్యది కడు దుఃఖమునకు గారణమగును. కావున నీ కల్పన స్థితప్రజ్ఞునకు

కష్టము నిచ్చును గాని సుఖ మొసంగ నేరదు. మరియు స్థితప్రజ్ఞుడగు సాంఖ్యుడు పరమాత్మను తనకంటె నన్యునిగా దలంచడు. అట్టి తలంపు పతనికి భయహేతువగును. "ద్వితీయాద్వై భయం భవతి" అను శ్రుతి రెండవపదార్థము కలదనుకొనువానికి భయముగునని జెప్పుచున్నది.

"తత్త్వమస్యాది శ్రుతులు జీవబ్రహ్మల కభేదమును బ్రతిపాదించుచున్నవి. ఏకాగ్రత నొందిన మనస్సునందు, సచ్చిదానన్దరూపమగు నాత్మస్వరూపముకంటె భిన్నమగు పరమాత్మస్వరూపము స్ఫురింపనేరదు. పరమాత్మగూడ సచ్చిదానన్ద రూపుడగుటచే, నాత్మస్వరూపుడేగాని యంతకంటె వేరుగాదు. కావున రామానుజులు చెప్పిన యర్థము యుక్తముగాదు. ౬౧

శ్లో. ధ్యాయతో విషయాన్ పుంస స్సఙ్గస్తేషూపజాయతే।
సఙ్గాత్సఞ్జాయతే కామః కామాత్ క్రోధోభిజాయతే ॥ ౬౨ ॥

అ. బాహ్యేన్ద్రియముల నిగ్రహించుచున్నను మనోనిగ్రహము లేనిచో సర్వానర్థములు సంభవించుననియు, నట్టి యనర్థములకు విషయచిన్తనమే ముఖ్యకారణమనియును జెప్పబడుచున్నది. మనసుతో నెల్లపుడు విషయముల నాలోచించువానికి నావిషయములయందు బ్రీతి కలుగును, అద్దానివలన నాస మెండగును. అయ్యది ప్రతిహతమగుచో గ్రోధమేర్పడును. ౬౨

శ్లో. క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః।
స్మృతి భ్రంశా ద్బుద్ధినాశః బుద్ధినాశా త్ప్రణశ్యతి ॥ ౬౩ ॥

అ. క్రోధముగలవానికి నీ కర్మ చేయదగును, ఈ కర్మ జేయదగదు అను వివేకముండదు. క్రోధము గలవాడు గురువునుగూడ నిందించును. ఇట్టి యవివేకమే సంమోహమనబడును. దీనివలన స్మృతిచెడును. అదెట్లన అనుభవమువలన గలుగునది సంస్కారము. సంస్కారమువలన కలుగునది స్మృతి. కావున శాస్త్రాధ్యయనము వలనను, గురూపదేశమువలనను కలుగు నాత్మజ్ఞానవాసన (సంస్కారము) వలన బుట్టు నాత్మ సచ్చిదానన్దరూపుడను స్మృతి యవివేకమువలన జెడునని భావము. అనగా నిట్టి స్మృతి పుట్టుటకు గారణమున్నను పుట్టకుండుటయే స్మృతి భ్రంశమని యర్థము. (స్మృతి చెడుటయని యర్థము). స్మృతి చెడినపిదప బుద్ధి నశించును. అనగా కార్యాకార్యవిషయమగు వివేకము లేకుండుటయే బుద్ధినాశము. ఇంతియె గాని బుద్ధికి స్వరూపనాశము సంభవింపదు. ముక్తినొందువరకు నన్తఃకరణము స్వరూపముతోనుండునుగాని నశింపనేరదని భావము.

బుద్ధినాశమువలన బురుషుడు నశించును. అనగా నేపురుషుని యన్తఃకరణము నందు, మంచి చెడ్డలను వివరించి దెలిసికొను యోగ్యత నెంతవరకుండునో అంతవరకే వా బురుషుడు పురుషు డనబడుచున్నాడు. ఆయోగ్యత నశించినచో వాడు పురుషుడే కానేరడు. మరేమనిన, పిచ్చివాడో, స్థాణువో, పశువో యగుచున్నాడు. కావున పురుషునకు నాశమనగా మంచిచెడ్డలను వివరించి తెలుసుకొను యోగ్యత యన్తఃకరణమునందు లేకుండుటయేగాని వేరుగాదు. అట్టియోగ్యతలేని యన్తఃకరణముగల పురుషుడు నశించినవా డగుచున్నాడు. ఆ పురుషునియందు పురుషకారమగు వివేకము లేనందున బురుషుడు గాడనియు పశ్వాదులవలె నేవిధమగు బురుషార్థమును సంపాదించుటకు యోగ్యుడు గాడనియును భావము. ౬౩

శ్లో. రాగద్వేషవియుక్తైస్తు విషయా నిన్ద్రియై శ్చరన్ ।
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి ॥౬౪॥

అ. రాగద్వేషములు లేని యిన్ద్రియములతో దేహము, నిలచుటకు గారణములగు నన్నపానీయముల ననుభవించుచూ తన స్వాధీనములో నున్న నిన్ద్రియములచే, దన యిచ్ఛానుసారముగా నన్తఃకరణమును నడపుకొను ముముక్షువు మనశ్శాన్తి నొందునని భావము.

సహజముగా నిన్ద్రియములకు ప్రవృత్తి రాగద్వేషములవలన కలుగును గాన, ముముక్షువు తప్పక రాగద్వేషముల జంపుకొనవలయును. "చరగతిభక్షణయోః" అను పాణిన్యనుశాసనమువలన చరధాతువునకు గమనము, భక్షణమున్ను అర్థము. ఏవి గత్యర్థములగు ధాతువులో అయ్యవి జ్ఞానార్థము లను న్యాయమువలన, నిచట చరధాతువు జ్ఞానార్థక మగుచున్నది. కావున "చరన్" అనగా అనుభవించుచు నని యర్థము. రామానుజులు "చరన్" అను పదమునకు ( తిరస్కృత్య వర్తమానః ) తిరస్కరించి యుండువాడని యర్థమును జెప్పిరి. చరధాతువునకు తిరస్కారరూపమగు నర్థము లభింపదు గాన నయ్యది పొసగనేరదు.

మరియు వేదాన్తదేశికులు చరధాతువునకు ఆక్రమణరూపమగు గమనము గాని, భక్షణరూపమగు సంహారముగాని యర్థమగుటచే, నందువలన తిరస్కారార్థము లభించునని వ్యాఖ్యాన మొనర్చిరి.

అదియును పొసగనేరదు. ఏలనన-ప్రాప్తి, యాక్రమణము నీరెండు నొకటిగా వచ్చును గాని గమన, ఆక్రమణములు రెండు నొకటి గానేరవు. గమన ఆక్రమణముల కత్యన్త భేదముకలదు. అయినను ఆక్రమణార్థమువలన దిరస్కారమను నర్థము లభింపదు.

అట్లే భక్షణ సంహారములు గూడ పరస్పరము వేరగుచున్నవి. సంహారము హింసాత్మకము; భక్షణము హింసాత్మకముగా నేరదు. (వ్యాఘ్రః పురుషం భక్షయతి) అను ప్రయోగములయందు భక్షణము హింసారూపమయినను తిరస్కారరూపము మాత్రము గా నేరదు. భక్షణమనగా ననుభవించుట. తిరస్కారమన నొకదానియం దనాదరము. అయ్యది యనుభవింపకున్నను సంభవించుచున్నది.

( అన్నం తిరస్కృత్య భక్ష్యాన్ భక్షయతి ) యనుచోట నన్నము ననుభవింప కున్నను నద్దానియం దనాదరము ప్రసిద్ధమగుచున్నది. కావున చరధాతువునకు తిరస్కారమను నర్థమును జెప్పుట కేవల మప్రమాణమగును.

శ్లో. ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే।
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి ॥ ౬౫ ॥

అ. ముముక్షువగు యతికి చిత్తము నిర్మలమగుచో, నెల్ల దుఃఖములు దొలగిపోవుచు. నిర్మలాన్తఃకరణుయొక్క బుద్ధి వెంటనే ఆత్మాకారముగా నిలచి పోవును. కావున చిత్తశుద్ధిద్వారా, జ్ఞాననిష్ఠ నభ్యసింపవలెనని యర్థము.

( బుద్ధిఃపర్యవతిష్ఠతి ) అనుచోట బుద్ధిశబ్దమునకు జ్ఞానార్థము నాశ్రయించి నచో, "తస్యప్రజ్ఞా ప్రతిష్ఠితా" అను దానితో నేకవాక్యతగూడ ధ్వనించును.

ఓయి! చిత్తనైర్మల్యముగలవానియొక్కబుద్ధి యాత్మరూపముతో నిశ్చల ముగా నుండుట యుపపన్నము గానేరదు. అంతకరణమను బుద్ధికి గాని, "అహం బ్రహ్మ" అను బుద్ధివృత్తికి గాని సచ్చిదానందరూపత్వము సంభవింపనందువలన, సమాధానము: నిరన్తరము విష్ణుమూర్తిధ్యానమువలన మనసునకు విష్ణురూపత్వము ప్రాప్తించినట్లు, సచ్చిదానందరూపుడగు నాత్మయొక్కతాదాత్మ్యధ్యానవలన నన్తః కరణమునకు నాత్మస్వరూపము లభించును. బుద్ధివృత్తికిమాత్ర మాత్మరూపత్వము లభింపదు. బుద్ధివృత్తికి నాత్మస్వరూపము విషయమగుచుండును. కావున నాత్మ స్వరూపము విషయముగాగల బుద్ధివృత్తి నిశ్చలముగా ( స్థిరముగా ) నుండుటయే నిచ్చోట వివక్షింపబడినది. కావున నిందు దోషములేదు. ౬౫

శ్లో. నాస్తి బుద్ధి రయుక్తస్య నచాయుక్తస్య భావనా।
నచాభావయత శ్శాన్తి రశాన్తస్య కుత స్సుఖమ్ ॥౬౬॥

అ. ఇన్ద్రియములు శబ్దస్పర్శాది విషయములను సేవించుటయం దాసవిడచి మరలుటయే సుఖము. విషయలోలత యేమాత్రము సుఖముగానేరదు. విషయముల యం దాశ యంతయు దుఃఖరూపమేయగును. విషయములయం దాశ యున్నంతవరకు సుఖము లవమాత్రమయినను కలుగదు.

ఓయి! విషయతృష్ణవలన విషయము లభించినచో నయ్యది సుఖమే యగును. అనగా కోరినవస్తువు లభింపనపుడు ఆ కోరిక దుఃఖరూపమయినను వస్తువు లభించి నపుడు మాత్రము ఆవస్తువునందలి ఆకోరిక సుఖమే యగు ననిచో నట్లుకాదు. వస్తువు లభించినంతమాత్రమున నా వస్తువునందలి కోరిక నివర్తించుచో నయ్యది సుఖమే యగును. అట్లు కోరిక నివర్తించుట (మరలుట) లేదు. పైగా తృష్ణ వృద్ధినొందు చున్నది. లోకమునందు ధనము లభించినవానికి ధనాశ మరలినట్లు చూచిగాని, వినిగాని యెరుగము. అట్లే స్త్రీతో సంభోగసుఖము నొందినవానికి స్త్రీవాంఛ దొలగినట్లు కని విని యెరుంగము. తృష్ణ మరలి మనస్సు బాహ్యప్రవృత్తిని విడచి యన్తర్ముఖమగుచో నట్టి యన్తఃకరణమునందు ఆత్మసుఖము ప్రతిబింబించుటవలన సుఖప్రాప్తి కలుగును. కావున తృష్ణ (ఆశ) సుఖమునకు ప్రతికూలమగుటవలనను, దుఃఖమునకు కారణమగుటవలనను దుఃఖమే యగుచున్నది. ౬౬

శ్లో. ఇన్ద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే।
త దస్య హరతి ప్రజ్ఞాం వాయు ర్నావ మివాంభసి ॥ ౬౭ ॥

శ్లో॥ తస్మా ద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః।
ఇన్ద్రియా ణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ ౬౮ ॥

అ. భుజబలముగల ఓ యర్జునా! ఇన్ద్రియములకు విషయప్రవృత్తి దోష పూరితమగుటవలన ఎవ్వని యిన్ద్రియములు సమస్త విషయములనుండి నిగ్రహింప బడుచున్నవో వాని ప్రజ్ఞ స్థిరపడినదని యన్వయము. జితేంద్రియుడు స్థితప్రజ్ఞుడని యర్థము. ౬౯

శ్లో. యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥ ౬౯ ॥

అ. మనోవాక్కాయములచే నెరవేరదగిన లౌకికములగు భోజనాది క్రియ లుగాని వైదికములగు యజ్ఞాది క్రియలుగాని యవిద్యాకార్యము లగుటచే, వివేక విజ్ఞానముగల స్థితప్రజ్ఞున కవిద్యానివృత్తిద్వారా నివర్తించుచున్నవి. అవిద్యయనగా "అహమజ్ఞః" (నే నజ్ఞానిని)యను అనుభవమువలన నేర్పడునదియు, జ్ఞానముచే నివర్తించునదియు, అజ్ఞానము, శక్తి, యవిద్య, మాయ యను మారుపేరులుగల దియు నగు ననాదిభావపదార్థము. ఇయ్యది విద్యవలననే నివర్తించునుగాని మరి యితరమువలన నివర్తింపదని జెప్పుచున్నారు. "యానిశా" అను శ్లోకముచే స్థిత ప్రజ్ఞునకు జ్ఞానముచే నజ్ఞానము నివర్తింపగా, తత్కార్యములగు లౌకిక వైదిక వ్యవహారము లన్నియు నివర్తించుచున్నవని యర్థము.

ఘటపటాది పదార్థములను వేర్వేరుగ దెలియకుండజేయునది, నిశ (రాత్రి) యనబడుచున్నది. రాత్రికాలమునందు దీపాదులయొక్క వెలుతురు లేనపుడు ఇది ఘటము, ఇది పటము అను భేదజ్ఞాన మెవ్వరికిని కలుగదు. రాత్రి తమస్స్వభావమగుటయే (యంధకారమయమగుటయే) నందుకు కారణము.

ఆత్మజ్ఞానమును బోధించు నీ ప్రకరణమున, రాత్రికాలమును వర్ణించుట యప్రకృతముగదా యని ప్రశ్నింపరాదు. ఇచట నిశాశబ్దమునకు, రాత్రికాలమను నర్థముగాదు. మరేమనిన పరమార్థ సత్యమగు నాత్మతత్త్వ మర్థము. ఇయ్యది యజ్ఞానులకు రాత్రికాల ప్రాయముగాన నౌపచారికముగ నిశాశబ్దముచే జెప్పబడినది; ఇట్టి యాత్మతత్త్వము స్థితప్రజ్ఞుల యొక్క బుద్ధికి గోచరమగును.

ఓయి! సమస్త ప్రాణులకు నవివేకమును కలుగజేయు రాత్రి స్థితప్రజ్ఞునకు గూడ నవివేకమును కలుగజేయు రాత్రియే యగును. కావున నారాత్రి స్థితప్రజ్ఞునియొక్క బుద్ధికి గోచరమగునని జెప్పుటెట్లు? సమాధానమును వినుము. మనబోటివారలకు పగలుగానున్న కాలము నక్తంచరులకు రాత్రికాలమెట్లగుచున్నదో అట్లే అజ్ఞానులగు సర్వప్రాణులకు రాత్రియయినను స్థితప్రజ్ఞునకు మాత్రము పరమార్థతత్త్వము బుద్ధిగోచరమగుచునే యుండును. రాత్రికాలమునందు దిరుగునట్టి భూతపిశాచోలూకాదులు నక్తంచరము లనబడుచున్నవి.

ఓయి! ఇట్టిపరమార్థతత్త్వమగు నాత్మతత్త్వమును నిశాశబ్దముతో జెప్పుటెట్లని శంకింపరాదు. (నిశేవనిశా) రాత్రివంటిదిగాన రాత్రియని పరమార్థతత్త్వమునందు నిశాశబ్దము ఔపచారికముగ బ్రయోగింపబడినది. రాత్రికాలము మనబోటివారల చక్షురిన్ద్రియవ్యాపారమునకు గోచరము గానట్లు, ఆత్మతత్త్వము అజ్ఞానులయొక్క బుద్ధివృత్తికి గోచరముగాదు గావున నిన్ద్రియవ్యాపారమునకు గోచరముగాకుండుట యను సామ్యముండుటచే గౌణప్రయోగ మువపన్న మగుచున్నది.

రాత్రికాలము కంటికి కనుపింపదనుట పొసగదు. రాత్రి సంబంధమగు చీకటి కంటితో గ్రహింపబడుచున్నదిగదా? యని యనరాదు: చక్షురిన్ద్రియముయొక్క వ్యాపారము నడుపరచుటయే-చీకటియొక్క స్వభావము. నేత్రగోళకమునకు సంబంధించిన అంధకారమునందు చక్షురిన్ద్రియవ్యాపార మవసరములేదు. (నేత్రగోళకమునకు సంబంధించిన చీకటి చక్షురిన్ద్రియవ్యాపారము నపేక్షింపదు.) అట్టిచీకటిని గ్రహించుటకు చక్షురిన్ద్రియ వ్యాపారము బయలువెడలనేరదు. కండ్లుమూసికొన్నను లోపలచీకటి గ్రహింపబడుచునేయున్నది. కావున చక్షురిన్ద్రియవ్యాపారము నడుపరచునట్టి యన్ధకారము మనస్సుచేతనే తెలియబడుచున్నదని గ్రహింపవలయును.

పరమార్థ తత్త్వమగు (ఆత్మతత్త్వమగు) నిశ జాగ్రదాద్యవస్థలలో చేరదు. ఇందు జాగ్రత్స్వప్నములయందు వలె వ్యావహారిక ప్రాతిభాసికజ్ఞానములు లేవు. సుషుప్తియందువలె నిద్రారూపమగు తమస్సులేదు. కావున, నియ్యది (ఈ నిశ) జాగ్రదాద్యవస్థాత్రయమున నన్తర్భావము జెందదు. (అజ్ఞానా నిద్రాయామ్ నిశా యామ్) అను భాష్యపాఠ మవలంబించినచో సచ్చిదానందరూపుడగు నాత్మయం దంతఃకరణము లేనందున వృత్తిజ్ఞానములు లేవనియు, అజ్ఞానము లేనందున, నిద్రలే దనియు నర్థము గ్రహింపవలయును.

అజ్ఞానము ఉపాధిగాగల ఆత్మయం దజ్ఞానము లేదని జెప్పు టెట్లని శంకింప రాదు. ఉపాధిరహితుడగు నాత్మయం దజ్ఞాన మను నుపాధి కల్పింపబడినది. కల్పిత మెన్నటికిని తాత్త్వికము గానేరదు. పరమార్థదశలో నాత్మయం దజ్ఞానములేదు. వ్యవ హారదశ యుండునంతవరకు నజ్ఞానములేనిదే లోకవ్యవహారము కుదరదు. కావున నాత్మయం దజ్ఞానము కల్పింపబడినది.

మరియు "నాహం ఘటం జానామి" (నేను ఘటమును దెలియకున్నాను) అను ప్రతీతిచే నెంతవరకు ఘటాజ్ఞానము అనుభవములో నుండునో, అంతవరకు నజ్ఞానముండును. చక్షురిన్ద్రియ వ్యాపారముచే ఘటాజ్ఞానము నశించగా, ఘటము ప్రత్యక్షమగును. ఘటము ప్రత్యక్షముకాగా ఘటాజ్ఞానము నివర్తించును.

అట్లే "నాహం బ్రహ్మ జానామి" (నేను బ్రహ్మము నెరుగను) అనుప్రతీతిచే నెంతవరకు నాత్మాజ్ఞాన మనుభవములో నుండునో అంతవరకు నాత్మాజ్ఞానముం డును. "అహంబ్రహ్మ" (నేను బ్రహ్మను) అను బుద్ధివృత్తిచే నాత్మాజ్ఞానము నశిం చగా, ఆత్మసాక్షాత్కారము కలుగును. ఆత్మసాక్షాత్కారము కలిగినపిదప నాత్మాజ్ఞానానుభవ ముండనేరదు. అనుభవమునుబట్టిగదా ఆత్మయం దజ్ఞానము కల్పింపబడినది? అనుభవమే లేనపుడు అజ్ఞానకల్పన మెట్లు పొసగును. పారమార్థిక ముగా ప్రపంచములేనందున కార్యలింగకానుమానముచే నజ్ఞానమును గల్పించుట కూడ నుపపన్నముగాదు. కావున పరమార్థతత్త్వమగు నాత్మపదార్థమునందు అజ్ఞాన ముగాని, బుద్ధివృత్త్యాత్మకమగు వ్యావహారిక ప్రాతిభాసిక జ్ఞానద్వంద్వముగాని లేదని స్పష్టము.

ఇట్టి నిశయందు (అజ్ఞాన నిద్ర యందు) జితేంద్రియుడగు స్థితప్రజ్ఞుడు మేలు కొనుచున్నాడు. దీనిచే సర్వప్రాణులకు గోచరముగాని యాత్మతత్త్వమును స్థితప్రజ్ఞ డొకడే నెల్లపు డనుసన్ధానము జేయుచుండునని స్పష్టమయినది.

ఆత్మస్వరూపము ననుభవించుటయే విద్వాంసున కాత్మతత్త్వమునందు జాగర ణము. ఆత్మస్వరూపసాక్షాత్కారము లేకుండుటయే అజ్ఞానులకు ఆత్మతత్త్వమునందు నిద్ర- యని భావము. ఇంక నుత్తరార్థము వివరింపబడుచున్నది.

విషయేంద్రియములయొక్క భేదమే స్వరూపముగాగల అజ్ఞానాత్మకమగు నిద్రయందు నిదురించియున్న సర్వప్రాణులు నిదురించియుండి కలగాంచుచున్న వారలవలె నవివేకులచే మేలుకొనినవారని జెప్పబడుచున్నారు.

ఇచట నిశాకార్యమగు నిద్రయందు నిశాత్వ మౌపచారికము. నిద్రయందున్నవారలు కలగాంచుటను బట్టి యవివేకులు మేలుకొన్నవారని భావించినట్లు అవిద్యాకార్యమగు విషయప్రపంచమునందు మునిగియున్న మూఢులను గురించి యవివేకులు వివేకవంతు లని భావించెదరని భావము.

యద్వా : ఇయ్యది వ్యతిరేక దృష్టాన్తముగాగూడ నన్వయింపవచ్చును. నిద్రయందు కలగాంచువారలు, మేలుకొనిన ట్లుండినను నిదురించియున్నవారలనియే నెట్లు జెప్పబడుచున్నారో అట్లే అవిద్యాకార్యమగు విషయజాలమును వేర్వేరుగ ననుభవించుచు వివేకులవలె గనుపించు చున్నను ఆత్మతత్త్వమును దెలియనందున నజ్ఞానమను నిద్రయందు నిదురించినవారనియే జెప్పవలయును. అని అజ్ఞానులగు సర్వప్రాణులు అవిద్యాకార్యమగు లౌకిక వైదిక వ్యవహారమునం దెల్లపుడు ప్రవర్తించి యుందురు.

నిత్యము ఆత్మానుసన్ధానముతోనుండు స్థితప్రజ్ఞుడు లౌకిక వైదిక వ్యవహారములయందు ప్రవర్తింపడు. వీనికి నాత్మజ్ఞానముచే నజ్ఞానము అజ్ఞానప్రయుక్తమగు కార్యప్రపంచము నశించినందున విషయప్రవృత్తి యసంభవమని తాత్పర్యము.

ఇయ్యది నిషకృష్టార్థము. సర్వభూతములకు నాత్మ యనుభవగోచరుడు కానందువలన నిశారూపుడు. అట్టి యాత్మస్థితప్రజ్ఞున కనుభవములో నున్నందున దివారూపుడు ( పగటిరూపుడు ). అవిద్యాకల్పితమగు ప్రాపంచిక వ్యవహారము సమస్త ప్రాణుల కనుభవములో నున్నందున ( అనుభవ విషయమగుటవలన ) దివారూపము ( పగటిరూపము ). అట్టి ప్రాపంచిక వ్యవహారము స్థితప్రజ్ఞున కనుభవములో లేనందున నిశారూపము. నక్తంచరులయొక్క రాత్రి మనబోటివారలకు, పగలు మనబోటివారలయొక్క రాత్రి నక్తంచరులకు పగలు, విద్వదవిద్వాంసుల వ్యవహారముగూడ నిట్లేయని గ్రహింపవలయును.

యద్వా ( లేక ) ఏ బ్రహ్మస్వరూపమునందు సమస్త భూతములు సుషుప్తియందు లయమును జెందుచున్నవో, ఆ బ్రహ్మము సర్వభూతములకు రాత్రియగుచున్నాడు. ఆ బ్రహ్మస్వరూపమగు రాత్రియందు బ్రహ్మస్వరూపము ననుభవించుచున్న స్థితప్రజ్ఞుడు మేలుకొనుచున్నాడు. ఏ యవిద్యాత్మకమగు రాత్రియందు సమస్తభూతములు వ్యవహరించుచున్నవో ఆ యవిద్యాత్మకమగు రాత్రి సర్వభూతములకు పగ లనబడుచున్నది. అవిద్యాకల్పితమగు వ్యవహారము

స్థితప్రజ్ఞున కనుభవములో లేనందున అవిద్యాత్మకమగు రాత్రియందు స్థితప్రజ్ఞుడు మేలుకొనడు. అదెట్లన మనకు పగలగు రాత్రియందు నక్తంచరులు మేలుకొనుట లేదు. మనము మేలుకొనుచున్నాము. మనకు రాత్రిరూపమగు పగటియందు నక్తంచరులు మేలుకొనుచున్నారు. మనముమాత్రము మేలుకొనము. అట్లే యని గ్రహింపవలయును.

భూతములకు బ్రహ్మయే రాత్రి, అవిద్యయే పగలు. స్థితప్రజ్ఞునకు బ్రహ్మమే పగలు, అవిద్యయే రాత్రి యని సంక్షేపము.

వ్యవహారకాండను వదలి యెల్లపు డాత్మానుసన్ధానమునం దుండువాడు స్థితప్రజ్ఞుడనియు, వ్యవహారకాండయందు మునిగియుండి, యాత్మజ్ఞాన మించుకంతయు లేనివారలు సర్వప్రాణులనియును భావార్థము.

ఇట్లు శ్లోకమును వ్యాఖ్యానమొనర్చి భాష్యకర్తలు ఫలితార్థమును జెప్పుచున్నారు. అవిద్వాంసులకు బ్రహ్మజ్ఞానము లేనందునను, విద్వాంసులకు లోక వ్యవహారము లేనందునను శ్రౌతస్మార్తములగు కర్మలన్నియు నవిద్యావస్థయందే శాస్త్రముచే విధింపబడుచున్నవి గాని, విద్యావస్థయందు విధింపబడుటలేదు. సూర్యు డుదయించినతోడనే రాత్రిసంబంధమగు చీకటి నశించినట్లు జ్ఞానము గలిగిన వెంటనే అజ్ఞానము నశించును. "అహం బ్రహ్మాస్మి" ( నేను బ్రహ్మను ) "తత్సత్యం" (ఆ బ్రహ్మము సత్యము ) "సఆత్మా" ( బ్రహ్మమే ఆత్మ ) "సభూమా" ( బ్రహ్మ సర్వవ్యాపకము ) "అతోన్యదార్తం" ( బ్రహ్మకంటె భిన్నమగు ప్రపంచమంతయు నశించునట్టిది ) ఇత్యాదికము జ్ఞానము. నేనజ్ఞానిని, నేను కర్తను, భోక్తను, బ్రాహ్మణుడను, యజ్ఞము చేయదగినవాడను, దానముచేయదగినవాడను అని యనుకొనుట యవిద్య. అవిద్యాపరిణామమగుటవలన ప్రపంచమంతయు నవిద్య యనబడుచున్నది.

ఇట్టి యవిద్య విద్యకలుగక పూర్వము ప్రమాణముగా తోచును. తత్వమును దెలియని ఆస్తికపురుషులందరు వేదశాస్త్ర పురాణాదులను, యజ్ఞయాగాది క్రియలను, తత్క్రియాసాధనములను, స్వర్గాది ఫలములను, బ్రాహ్మణాది జాతులను, బ్రహ్మచర్యము మొదలగు నాశ్రమములను, ఇంద్రాది దేవతలను, గనుపించునట్టి ప్రపంచమునంతయు సత్యమని తలంచుచున్నారు.

బ్రహ్మపదార్థము సత్యము, ప్రపంచము మిథ్య యను జ్ఞానము గలిగిన తోడనే ప్రపంచమంతయు నసత్యము గాన, అప్రమాణ మనియే తలంచుచున్నారు.

ఆత్మజ్ఞానము కలుగక పూర్వము, క్రియాకారకఫలభేదరూపమగు నవిద్య ప్రమాణబుద్ధితో గ్రహింపబడుచు కర్మహేతు వగుచున్నది. అప్రమాణబుద్ధితో గ్రహింపబడు నవిద్య కర్మహేతువు గానేరదు. కర్మలనాచరించు పురుషుడు ప్రమాణ

భూతమగు వేదముచే విధింపబడిన కర్మనే ఆచరింపవలె నని దలంచి కర్మల యందు ప్రవర్తించుచున్నాడు. ప్రపంచ మంతయు రాత్రి వలె, అవిద్యామాత్రమే నని దెలిసికొనిన విద్వాంసుడు కర్మలయందు ప్రవర్తించడు. విద్యాదశయందు వేదమే ప్రమాణము కానందున, నట్టి వేదముచే విధింపబడిన కర్మలు ప్రమాణములగుట నెంతమాత్రము పొసగదు. (ఇచట భాష్యమునందలి నిశాపదమునకు నిద్ర యని యర్థము). కావున నెవ్వని కీపరిదృశ్యమానమగు భేదప్రపంచ మంతయు (నిశేవ) నిద్రవలె నవిద్యామాత్రమే యను బుద్ధి యుదయించునో అట్టి జ్ఞానికి సర్వకర్మ సన్న్యాసమునందే యధికారమని భగవంతుడగు శ్రీకృష్ణుడు పంచమాధ్యాయము నందలి "తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః। గచ్ఛన్త్య పునరావృత్తిం జ్ఞాననిర్ధూత కల్మషాః" అను శ్లోకముచే నిరూపించి యున్నారు.

ఓయి! ఆత్మజ్ఞానము కలిగినతరువాత, వేదమే యప్రమాణ మగుటచే, వేదచోదితమగు ప్రవృత్తి ధర్మముగూడ నప్రమాణ మయినట్లు వేదచోదితమగు నివృత్తి ధర్మముగూడ నప్రమాణమే యగును గాన, విద్వాంసునకు నివృత్తి ధర్మమగు సన్న్యాసమునం (జ్ఞాననిష్ఠయం) దధికారము కలుగు టెట్లని శంకింపరాదు.

జ్ఞాననిష్ఠయనగా నాత్మజ్ఞానము, ఆత్మజ్ఞానమునం దాత్మయే విషయమగును కావున దనకు తనయందు ప్రవృత్తికలుగుటకు మరియొక ప్రమాణము నపేక్షింప బనిలేదు.

ఉదాహరణము : దేహమునం దాత్మాభిమానము గల పురుషునకు దనదేహమును జూచుకొనుటకు బ్రవర్తకమగు మరియొక ప్రమాణములేదు. అట్టి ప్రమాణము లేకున్నను దేహాభిమాని తనదేహమును జూచుకొనుటయందు ప్రవర్తించుచునేయున్నాడు అట్లే. అని భావము.

ఆత్మ సాక్షాత్కారము కలుగునంతవరకు, శాస్త్రాదులు ప్రమాణములగును. ఆత్మసాక్షాత్కారము కలిగిన వెంటనే, ప్రపంచ సంబంధరహితుడును స్వయం ప్రకాశ రూపుడును, నిర్వికారుడును, అద్వితీయుడును, సచ్చిదానంద రూపుడును, అగు బ్రహ్మమునందు ద్వైతపదార్థము కనుపించనందువలనను, నవిద్యా కల్పితమగు ద్వైత జాలము మిథ్యయగుట వలనను, అప్రమాణమే యను నిశ్చయము విద్వాంసునకు కలుగును. ఇట్టి నిశ్చయము కల విద్వాంసునకు ప్రమాణ ప్రమేయాది వ్యవహారము సుతరాం సంభవింపదు

ఓయి! ప్రమా[illegible] నాత్మయుండగా ప్రమాణప్రమేయాది వ్యవహారము సంభవించకుండ [illegible]రాదు. తుట్టతుది ప్రమాణమగు శాస్త్రము 'నేను బ్రహ్మ[illegible] అ[illegible]త్తుని బుట్టించుచు, నాత్మను ప్రమాతృత్వమును

బోగొట్టుచున్నది. ప్రమాతృత్వ మనునది ప్రమేయాధీనమయి యుండును. అప్రమేయుడగు నాత్మయందు ప్రమేయమగు ద్వైతమే లేనందున ఆత్మకు ప్రమాతృత్వము పారమార్థికము గాదని భావము. ఈ యర్థమునందు "ఏకమేవాద్వితీయ" మను శాస్త్రము, విద్వాంసుల యనుభవమున్ను ప్రమాణ మని తెలియవలయును.

ఓయి! ఆత్మ భిన్నమగు ప్రపంచమంతయు నవిద్యాకల్పితమని గదా సిద్ధాన్తము. శాస్త్రముగూడ నందు జేరుటచే నవిద్యాకల్పితమే యగుచున్నది. అవిద్యాకల్పితములు విద్వాంసున కప్రమాణములగునని యింతకుమున్నే జెప్పబడినది. కావున నప్రమాణమగు శాస్త్రము ఆత్మకు ప్రమాతృత్వమును బోగొట్టుటయందుమాత్రము ప్రమాణ మెట్లగును?

వినుము సమాధానమును. ఆత్మకు ప్రమాతృత్వ మెంతవరకుండునో అంతవరకు శాస్త్రము ప్రమాణమగును. శాస్త్రము, ఆత్మకు ప్రమాతృత్వము నెపుడు నివర్తింపజేయునో అపుడే శాస్త్ర మప్రమాణమగును. కతక రజస్సు (ఇండుప గింజయొక్క పొడి) ఉదకమునం దుంచబడుచు, నుదకమునందలి మాలిన్యమును బోగొట్టుచు దానుగూడ నశించున ట్లని భావము. కావున నాత్మకు ప్రమాతృత్వమును బోగొట్టుచునే శాస్త్ర మప్రమాణమగుచున్నది గాన, నిందేమియు దోషము లేదు. ఈ సంశయమునందు స్వప్నకాలప్రమాణము దృష్టాన్తమగును. స్వప్నద్రష్ట (కలగాంచునట్టి పురుషుడు) స్వప్నకాలమునందు, విషయమును (పట్టణమును) దీనిని జూచుటకు సాధనమగు చక్షురిన్ద్రియరూప ప్రమాణమును రెంటిని కల్పించుకొని స్వప్నము ననుభవించును. కాని జాగ్రదవస్థలోకి రాగానే విషయముతో పాటు ప్రమాణమగు నిన్ద్రియము గూడ నప్రమాణమే యగును. కలలో కాశీపత్తనమును జూచువాడు, కాశీపత్తనమును జూచుటకు సాధనముగా నిద్రచే గల్పించుకొనబడిన మిథ్యాభూతమగు చక్షురిన్ద్రియమునే ప్రమాణముగా దలచుచున్నాడు. మేలుకొనినవెంటనే, నేను కలలో కాశీపత్తనమును జూచుట మిథ్యయే యని యనుకొనుచు అప్పటి చక్షురిన్ద్రియముగూడ నప్రమాణమనియే నిశ్చయించుకొనుచున్నాడు. ఇట్లే అవిద్యావస్థయందు ప్రమాణమగు శాస్త్రము, విద్యావస్థయం దప్రమాణమేయగును.

ఇంతమాత్రముచే, ప్రవృత్తిధర్మమును బోధించుట కప్రమాణమగు శాస్త్రము నివృత్తి ధర్మమును బోధించుటకుమాత్రము ప్రమాణ మెట్లగు నను ప్రశ్నకు సమాధాన మేమి లభించిన దనినచో వినుము.

ఆత్మసాక్షాత్కారము కలుగునంతవరకు శాస్త్రము ప్రమాణమే గనుక పరోక్షముగా నాత్మతత్వమును దెలిసికొనిన విద్వాంసుని శాస్త్రము జ్ఞాననిష్ఠయందు

ప్రవర్తింపజేయుచున్నది అని. అయితే, ప్రవర్తకమగు శాస్త్రాది ప్రమాణములతో పనిలేకుండగనే విద్వాంసుడు, తనంతట తానే జ్ఞాననిష్ఠయందు ప్రవర్తించుననినింతకుముందు జెప్పిన విషయము ప్రౌఢోక్తియని గ్రహింపవలయును.

మరియు ప్రవర్తకమగు ప్రమాణము లేకున్నను ప్రవృత్తి కలుగుట కేవల మాత్మయందు మాత్రమే గాదు. అయ్యది లోకమునందు గూడ సంభవమగు చున్నది. లోకములో ఘటాదివస్తువులను దెలిసికొనుటయందు పురుషుని, చక్షురాది ప్రమాణము, ప్రవర్తింపజేయుటలేదు. (లోకములో ఘటాది వస్తువులను దెలిసికొనుటకు పురుషునకు గలుగు ప్రవృత్తి చక్షురాదీంద్రియ ప్రమాణమువలన గాదు.) ఘటాది వస్తువుల యందలి యిచ్ఛయే ప్రవృత్తిని కలుగజేయుచున్నది. కాని ఘటమును దెలిసికొనుటకు ప్రవర్తించిన పురుషుడు అందుకు సాధనమగు చక్షురాది ప్రమాణమును మాత్ర మపేక్షించుచున్నాడు. కావున ప్రమాణము, ప్రమాతకు ప్రమేయమును దెలిసికొనుటకు సాధనమాత్రమే గాని ప్రవర్తకము గాదని యర్థము.

దీనిచే ఘటమును చూడగోరిన పురుషుడు, ఘటమునుచూచుట యందలి కోరికచే, ఘటమును చూచుటయందు ప్రమాణమగు చక్షురింద్రియమును ఘటసాక్షాత్కారపర్యన్తము నెట్లపేక్షించుచున్నాడో, అట్లే ఆత్మజిజ్ఞాసువగు పురుషుడు, ఆత్మను దెలిసికొనుట యందలి కోరికచే, నాత్మజ్ఞానమునందు ప్రమాణమగు వేదాన్తశాస్త్రమును ఆత్మసాక్షాత్కార పర్యన్త మపేక్షించుచున్నాడనియు, ఆత్మసాక్షాత్కారానన్తరము వానికి శాస్త్రప్రమాణముతో బనియే లేనందున వేదాన్త శాస్త్రమపుడు వానికి వ్యర్థమగుటవలన నప్రమాణమే యగుననియు దేలినది.

లోకములో బావిని త్రవ్వించునట్టి పురుషుడు బావియందు సమర్థమగు జలము ప్రాప్తించినపిదప త్రవ్వుటకు సాధనమగు ఖనిత్రాదికమును (పలుగు పార మొదలగువాటిని) నెట్లు పరిత్యజించుచున్నాడో, అట్లె ముముక్షువగువాడు ఆత్మసాక్షాత్కారము కలిగినపిదప, తత్సాధనమగు వేదాంతశాస్త్రమును విడచును. గనుక నాత్మతత్త్వమును దెలిసికొనినపిదప పండితునకు ప్రమాణములతో బనిలేదు. అపుడు శాస్త్రమునకు ప్రామాణ్యమును యుండదు. అని తెలియవలయును.

కావున, శాస్త్రములచే కర్మలు అవిద్యావస్థయందే విధింపబడుటవలనను, విద్యావస్థయందు కర్మలతో బనిలేకుండుటవలనను, ఆత్మజ్ఞానికి కర్మలయం దధికారము లేదు, జ్ఞాననిష్ఠయందే యధికారము. అదియును ఆత్మ సాక్షాత్కారముకలుగునంతవరకే. అవల నధికార్యముగాని, యధికారముగాని లేనందున నధికారమేయుండదు. నిర్వికారుడును, సర్వశేషియునగు (సర్వమునకు ప్రధానమగు) నాత్మ యొకనిచే

నొకానొక పనియందు నియోగింపబడడు. అధికారకమగు (నియోగించునట్టి) శాస్త్రమున్ను అద్వితీయుడగు నాత్మయందు లేనేలేదు. కావున విద్వాంసున కింక నధికారమెట్లు సిద్ధించును? ఎట్లును సిద్ధింపదని భావము. ౬౯

శ్లో. ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్ ।
తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే సశాన్తి మాప్నోతి నకామకామీ॥

అ. (ఆపూర్యమాణం "ఆ" సమంతాత్ పూర్యమాణం) అంతట ఉదకములచే నిండింపచేయబడుచున్నదిగాన ఆపూర్యమాణ మనబడును. లేక భగవంతుడగు కర్తచే నుదకములను సాధనములచే నిండింపచేయబడినదిగాన ఆపూర్యమాణ మనబడును. ("అచలప్రతిష్ఠం") ఆవలియొడ్డు లేనందువలన చలనములేనిదిగాన అచలము, శాశ్వతమగు నునికి కలదిగాన ప్రతిష్ఠము. ఇయ్యది అర్శ ఆదిగణమునకు జెప్పిన నచ్ప్రత్యయ మంతమందుగల పదము. ప్రతిష్ఠ = శాశ్వతమగునునికి, అస్యాః = దీనికి కలదుగాన, ప్రతిష్ఠః = అని విగ్రహము. అథవా "ప్రతిష్ఠతి" "ప్రకర్షేణశాశ్వతంతిష్ఠతి" గొప్పగా స్థిరముగానుండునదిగాన "ప్రతిష్ఠ" యని పచాదిగణమునకు విధించిన అజంతముగా నయినను జెప్పవచ్చును.

(అచలశ్చాసౌప్రతిష్ఠశ్చ అచలప్రతిష్ఠః) అని కర్మధారయ సమాసము. ఇందు అచలపదము హేతుగర్భ విశేషణము. ఎందువలన చలనరహితమో అందువలన శాశ్వతమగు నునికి గలదని యర్థము "అచలా ప్రతిష్ఠా యస్య" అని వ్యాఖ్యానము జేసినచో మూలముకంటె వేరుగా "అపారత్వాత్" అను హేతుపదము కల్పింపవలసివచ్చును. ఇపుడయితే అచలశబ్దము వలన నపారత్వమను నర్థము అర్థతః సిద్ధించును.

నలుదిశలనుండి ప్రాప్తములయిన గంగాది నదీజలములు స్వస్వరూపములో నుండి యేమాత్రము వికారమును జెందకనున్న సముద్రమును ప్రవేశించుచున్నవి. అనగా నదీజల ప్రవేశమువలన సముద్రమునకు వృద్ధిగాని, నదీజలప్రవేశము లేనందున సముద్రమునకు హ్రాసము (కొఱత) గాని యుండదని భావము.

అట్లే సమస్తకోరికలు ఏ యతిని విషయసన్నిధానమునందుగూడ నేమాత్రము వికారపరుపక ప్రవేశించుచున్నవో వాడు ముక్తినొందును. అనగా కొందరు ధీరులు యువతులు సన్నిధానమునందు లేనపుడు కామవికారము లేనివారుగ నుందురు. అంగనాసాన్నిధ్యమునందుఁ గామ వికారము నొందుదురు. అట్లుగాక విషయసాన్నిధ్యమునందుగూడ మనోవికారమును బొందనివాడే ముక్తినొందునని భావము.

కామములు యతిని బొందుటయనగా- కామములు, మనస్సుయందుగాని కూటస్థుడగు నాత్మయందుగాని లయమునుజెందుట. అనగా కామములకు యతి

పరతన్త్రుడు గాకుండుట; కామపరతన్త్రుడు గాని యతియే మోక్షమును బొందునని నిశ్చయార్థము.

ఇచట శాన్తి శబ్దమునకు బ్రహ్మమనిగాని, అజ్ఞాన నివృత్తియని గాని యర్థము. బ్రహ్మస్వరూపము నొందినవానికి సర్వప్రపంచము ఉపశమించును. కార్యసహితాజ్ఞాన నివృత్తి గలవానికి సర్వదుఃఖములు నివర్తించును. సర్వదుఃఖ నివృత్తియే మోక్షము. కాన నీ రెండర్థము లుపపన్నము లగుచున్నవి.

శ్లో. విహాయకామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః ।
నిర్మమో నిరహంకార స్స శాన్తి మధిగచ్ఛతి ॥ ౭౧ ॥

అ. ఎందువలన నిష్కాముడే మోక్షము నొందునో విషయేచ్ఛువునకు మోక్షము లేదో, అందువలన సర్వకామములను విడచిన సన్న్యాసి, బ్రతికియుండుట కాధారమగు క్రియలు మాత్రమే గలవాడగుచూ, అనగా ప్రాణధారణ కనువగు భిక్షాటనాది వ్యాపారములుమాత్రము గలవాడగుచు, నేదియో నొక యుపాయ ముచే దప్పక శరీరమును బ్రతికించుకొనవలెనని గోరికలేక, మాధుకరాన్నముచే గాని, నదీజలపానముచేగాని యాకలి దప్పికలను మాత్రము దీర్చుకొనవలెనని దలంచుచు శరీరమును బ్రతికించుకొనుటకు గావలసిన భిక్షాన్నము, కపాలము కమండలము, శాటి మొదలగు వస్తువులయందుగూడ పట్టుదల వదిలి, నేనాత్మ జ్ఞానము గలవాడనను గర్వములేక, గ్రామైకరాత్రివాసిగ, నన్నిగ్రామములను దిరుగునో ముముక్షువగునట్టి యతి బ్రహ్మభావమును బొందును.

ఓయి! "స్థితప్రజ్ఞస్యకాభాషా సమాధిస్థస్య కేశవ । స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్" అను నర్జునుని ప్రశ్నకు నింతటితో సమాధాన మేమి దేలిన దనినచో వినుము.

(1) సమస్తకోరికలను విడచుట. (2) ఆత్మను ప్రేమించుట. (3) దుఃఖముల వలన భయపడకుండుట. (4) సుఖములయందు కోరికలేకుండుట. (5) రాగ, భయ, క్రోధములు లేకుండుట. (6) దేనియందును స్నేహము లేకుండుట. (7) మంచి చేకూరినపు డానన్దింపకుండుట. (8) చెడు చేకూరినపుడు ద్వేషింపకుండుట. (9) ఇన్ద్రియముల జయించుట. (10) జీవబ్రహ్మైక్యానుసన్ధానమునం దాసక్తి. (11) చిత్తైకాగ్రత. (12) ప్రాపంచిక వ్యవహారములు లేకుండుట. (13) శరీరజీవనము నందుగూడ నిచ్ఛలేకుండుట. (14) శరీర జీవమునకు గావలసిన వస్తువులయందు గూడ పట్టుదల లేకుండుట. (15) ఆత్మశ్లాఘ లేకుండుట. – నీ పదునైదును స్థిత ప్రజ్ఞునియొక్క లక్షణములు. ఇవియే స్థితప్రజ్ఞు డగుటకు సాధనములు గూడ నగు చున్నవి. ఈయవి నెవనియందు గన్పట్టునో వాడు స్థితప్రజ్ఞుడని యొరులు జెప్పుదురు.

ఈ లక్షణము లున్నపుడే తానుగూడ దనను స్థితప్రజ్ఞుడ నని దెలుసుకొనును- అని. ఇట్టివానికి భిక్షను యాచించు సమయమున దప్ప మరయొక సమయమున వాక్సంభాషణ ముండదు.

మంచి శిష్యుడు లభించినచో వానికి తత్త్వము నుపదేశించుట మాత్ర ముండును. ఇయ్యది నిచట జెప్పకున్నను శాస్త్రాన్తరమువలన గ్రహింపవలయును. లేనిచో తత్త్వోపదేశ సమ్ప్రదాయము విచ్ఛిన్నమగును.

ఇన్ద్రియములను తమ విషయములనుండి మరల్చి తన స్వాధీనముగం దుంచుకొనుట, ఆత్మస్వరూపము ననుసన్ధానముజేయుట-నీ రెంటియందే మనోవ్యాపారము.

కాయవ్యాపారము భిక్షకొరకు దిరుగుటయే. అదియే నిచట "చరతి" అను పదముచే జెప్పబడినది.

మరియు, ప్రశ్న శ్లోకమునందలి "వ్రజేత కిమ్" అను ప్రశ్నవలన దేనినిబొందు నను నర్థముగూడ వచ్చును. అందుకు సమాధానముగ నీ శ్లోకమునందు "సశాన్తి మధిగచ్ఛతి" (వాడు మోక్షము నొందుచున్నాడు) అని జెప్పబడినది. దీనిచే స్థితప్రజ్ఞునకు మోక్షమే ఫలమని దేలినది.

విద్యవలన నవిద్య నశింపగా అవిద్యాప్రయుక్తమగు సర్వప్రపంచోపరతి రూప మోక్షము స్థితప్రజ్ఞునకు యుక్తము నగును. కావున కర్మనిష్ఠులకు మోక్షము లేదని స్పష్టమగుచున్నది. కనుకనే "నాస్త్యకృతః కృతేన" "తమేవ విదిత్వా అతి మృత్యుమేతి" "నాన్యఃపన్థా విద్యతేఽయనాయ" అనుశ్రుతులుపన్నములగుచున్నవి.

సర్వ కామములను విడచుట, ఇన్ద్రియములను జయించుట, లోక వ్యవహారము నంటకుండుట, నీయవి గృహస్థునియందు సంభవింపనందున నీయవి సంభవించునట్టి సన్యాసియే స్థితప్రజ్ఞుడని సఙ్క్షేపము. ॥ ౭౧ ॥

శ్లో. ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ! నైనాం ప్రాప్య విముహ్యతి
స్థిత్వాఽస్యా మన్తకాలేపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి ॥ ౭౨ ॥

అ. బ్రాహ్మీ=బ్రహ్మయందుండునట్టిది అని యర్థము. ఇచట "తత్రభవః" అను సూత్రమువలన భవార్థమునం దణ్ప్రత్యయము. అన్ అను టిభాగమునకు లోపమార్షము. "బ్రాహ్మః" అని నిపతించుటవలన "బ్రాహ్మీ" యనురూపము సిద్ధించినదని యనరాదు. నిపాతసూత్రమునదంలి బ్రహ్మశబ్దము చతుర్ముఖ బ్రహ్మవాచిగాని పరబ్రహ్మమును జెప్పదు. రెండర్థములయందును వర్తించునని యంగీకరించినచో, ననేకార్థత్వదోష మాపాదించును. ఏతద్దోష పరిహారము కొరకు నిపాతసూత్రమునందలి బ్రహ్మశబ్దము తత్త్వమగు పరబ్రహ్మమునే జెప్పునని

యనరాదు. ఇట్లన్నచో "బ్రాహ్మం హవిః" ఇత్యాది ప్రయోగములు సిద్ధింపవు. ఈ ప్రయోగమునందు బ్రహ్మదేవతాకమగు హవిస్సు "బ్రహ్మం" అని జెప్పబడు చున్నది. ఇట్టి బ్రహ్మమగు హవిస్సు చతుర్ముఖబ్రహ్మ నుద్దేశించి యగ్నిహోత్రము నందు వుంచబడుచున్నది. కావున నిపాతసూత్రమువలన "బ్రాహ్మీ" యను రూపము సిద్ధింపనేరదు. యద్వా (లేక) ఈ శ్లోకమునందలి బ్రహ్మశబ్దముగూడ చతుర్ముఖబ్రహ్మనే చెప్పుననియు నట్టి బ్రహ్మశబ్దము లక్షణావృత్తిచే శుద్ధబ్రహ్మమును బోధించుననియు "బ్రాహ్మః" అని నిపతించుటవలన టి లోపము ప్రాప్తించిన దనియు జెప్పుకొనవలయును.

"బ్రాహ్మీస్థితిః" అనగా బ్రహ్మస్వరూపముతో నుండుట. అనగా నేనే బ్రహ్మము నను నిశ్చయముతో నుండుట యని యర్థము. బ్రహ్మనిర్వృతి యనగా బ్రహ్మనన్దమని యర్థము. "అన్తకాలేపి" అను పదమునందలి అపిశబ్దమువలన చివర వయసునందు బ్రహ్మానుసన్ధానముతో నుండునట్టి వాడే బ్రహ్మనన్దము నొందునని జెప్పగా, బ్రహ్మచర్యమునుండియే సన్యసించి యావజ్జీవము నెవడు బ్రహ్మాత్మానుసన్ధానముతో నుండునో అట్టివాడు బ్రహ్మనన్దము నొందునని జెప్పనేల ? యని సూచింపబడుచున్నది.

దీనిచే బ్రహ్మచర్యము మొదలుకొని, దేహము పడిపోవులోపల నెపుడయినను బ్రాహ్మణుడు సన్యసింపవలెననియు, సన్యసించి, సర్వకామములను విడచి స్థితప్రజ్ఞుడు గావలయుననియు హితోపదేశము సూచింపబడినది.

అధికారములేని యర్జునునకు సన్యాసము నుపదేశించుట యెట్లని ప్రశ్నింపరాదు; తనకు జ్ఞాననిష్ఠయందు అధికారము లేదని యర్జునునకు దెలియక నర్జునుడు స్థితప్రజ్ఞ లక్షణము నడుగుటవలన నతనికి సన్యాసము నుపదేశించుట యుపపన్నమగుచున్నది.

"కర్మణ్యేవాధికారస్తే" అని శ్రీకృష్ణుడు నీకు కర్మయందే యధికారమని జెప్పియుండగా అర్జునునకు దనయధికారము దెలియకుండు టెట్లని ప్రశ్నింపరాదు. శ్రీకృష్ణుడు జెప్పినను అర్జునుడు తనకు కర్మాధికారమును సామాన్యదృష్టితో దెలిసికొని యున్నాడు. దాని సహేతుకముగా, నిస్సంశయముగా దెలిసికొనలేదు. నిస్సందిగ్ధముగా దెలిసికొనియున్నచో వెంటనే "జ్యాయసీచేత్కర్మణస్తే" కర్మకంటె జ్ఞానము శ్రేష్ఠమగుచో నని యడిగియుండడు. గనుక నాపాతజ్ఞానము గల వాసని నిష్కృష్టముగా దనకుగల యధికారమును దెలియక నడుగుటయు, నాతని యుద్దేశించి శ్రీకృష్ణు డుపదేశించుటయు యుపపన్నమగుచున్నది. ౭౨.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే సాఙ్ఖ్యయోగోనామ
ద్వితీయోధ్యాయః

అ. సాఙ్ఖ్యముతో సంబంధముగలది గాన సాఙ్ఖ్యయోగ మనబడును - అనగా జ్ఞానయోగమని యర్థము. సాఙ్ఖ్యయోగముగలది గాన నీయధ్యాయము సాఙ్ఖ్యయోగాధ్యాయమని అర్శాది గణమునకు జెప్పిన నచ్ప్రత్యయాంతముగా గ్రహింపవలయును. లేక ప్రతిపాద్యమగు సాఙ్ఖ్యయోగమునకు, ప్రతిపాదకమగు నధ్యాయమునకు నభేద సంబంధమును జేసికొని, సాఙ్ఖ్యయోగమును బ్రతిపాదించునట్టి యధ్యాయమును సాఙ్ఖ్యయోగ మను పదముతో జెప్పు టౌపచారిక మని గ్రహింపవలయును. ఈ యధ్యాయమునం దచ్చటచ్చట కర్మయోగముగూడ జెప్పబడినది. అయినను తరచుగా సాఙ్ఖ్యయోగముచే జెప్పుటవలన సాఙ్ఖ్యయోగ మను వ్యవహార ముపపన్నమగుచున్నది.

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య గోవిన్ద భగవత్పూజ్యపాద శిష్య
శ్రీమచ్ఛంకర భగవత్పాదకృతౌ శ్రీభగవద్గీతాభాష్యే
ద్వితీయోఽధ్యాయ స్సమాప్తః.

అ. కుటీచక, బహూదక, హంస, పరమహంస లని యతులు నలుగురు. అందు కుటీచకుల కంటె బహూదకులు, బహూదకుల కంటె, హంసలు, హంసల కంటె, పరమహంసలు, జ్ఞానవైరాగ్యాదిగుణములచే గొప్పవారు (పరిత్యజ్య వ్రజతీతి) సంసారమును విడచివెళ్లువాడు గాన పరివ్రాజకు డనబడును. అనగా సన్యాసి యని యర్థము. పరమహంసయగు పరివ్రాజకుడుగాన పరమహంస పరివ్రాజకు డనబడుచున్నాడు. శాస్త్రోక్తమగు నివృత్తి ధర్మమును దా నాచరించుచు నితరులగు పద్మపాదాది శిష్యులకొరకు నుపదేశించువాడుగాన నాచార్యు డనబడును. (ఆచారమాచారయతీ త్యాచార్యః) అని వ్యుత్పత్తి.

పూజింపదగిన పాదములు గలవాడు గాన పూజ్యపాదుడు, అనగా గురువు. భగవంతుడనగా, షడ్గుణైశ్వర్య సంపన్నుడు. భగవంతుడగు పూజ్యపాదుడు గాన భగవత్పూజ్యపాదుడు. గోవిన్దు డను (పేరుగల) భగవత్పూజ్యపాదులు గాన గోవింద భగవత్పూజ్యపాదులు. వానియొక్క శిష్యుడు-

శ్రీమాన్ అనగా జ్ఞానవైరాగ్యాది గుణములతో గూడినవాడు (భగవన్తౌ పాదౌ) షడ్గుణైశ్వర్య సమ్పన్నములగు పాదములు యెవ్వనికో వాడు భగవత్పాదుడు. ఆత్మగుణములను పాదములయం దారోపించి యిట్లు చెప్పబడినది. లేక (పద్యతే-గమ్యతే సేవ్యత ఇతి) సేవింపబడుచున్నాడుగాన పాదుడు. (1) భగవన్తులగు పద్మపాదాదులచుగూడ సేవింపదగినవాడు గాన భగవత్పాదుడనిగాని, (2) శంకరుడు శివావతారమగుటవలన భగవన్తు డగు శఙ్కరుని యొక్క (పాదము) యంశముగాన

భగవత్పాదు డనిగాని, (3) (పద్యతే-జానాతి) అను వ్యుత్పత్తిచే భగవన్తుడగు పరమాత్మను దెలిసికొనుచున్నాడు గాన భగవత్పాదుడనిగాని, (4) (పాదయతి - బోధయతి) అను వ్యుత్పత్తిచే భగవన్తుడగు పరమాత్మను నితరులకు బోధించుచున్నాడు గాన భగవత్పాదు డనిగాని జెప్పవచ్చును. శఙ్కరు డను భగవత్పాదుడు గాన శఙ్కరభగవత్పాదుడు- ఇయ్యది విశేష్యపదము. వెనుకటి ప్రథమాన్త పదము లన్నియు విశేషణములు. ఆ విశేషణ పదములకు "శఙ్కర భగవత్పాద" అను విశేష్యపదముతో నభేదసమ్బన్ధముచే సమాసము. "విశేషణం విశేష్యేణ" అను సూత్రమునందు బహుళగ్రహణమును జేయుటచే విశేషణములకు గూడ పరస్పర మభేదసమ్బన్ధముతో సమాసము సిద్ధింపవచ్చును. లేక గొన్ని విశేషణములయందు విశేష్యత్వము నారోపించి యయినను సమసింపజేయవచ్చును.

(క్రియత ఇతి కృతిః) చేయబడుచున్నదిగాన కృతియనబడును. భగవత్పాదుని యొక్క కృతిగాన, భగవత్పాద కృతియనబడును. దానియందు అనగా భగవత్పాదులచే చేయబడినదానియం దని యర్థము, (శ్రీయుక్తః) లక్ష్మీయుక్తుడగు భగవన్తుడు గాన శ్రీభగవన్తుడు. భగశబ్దార్థములలో జేరిన లక్ష్మిని వేరుగా గ్రహించుట ప్రాశస్త్యముకొరకుగాని ప్రాధాన్యముకొరకుగాని అని గ్రహింపవలయును. లేక లక్ష్మీదేవిగలవాడని గాని జెప్పవచ్చును. వానియొక్క గీతలుగాన, శ్రీభగవద్గీత లనబడును. కర్త్రర్థమునందు షష్ఠీసమాసము గాన భగవత్కర్తృకములగు గీతలని యర్థము. (గీయన్త ఇతి) చెప్పబడుచున్నవి గాన గీత లనబడును. అనగా శ్లోకము లని యర్థము. ఆ శ్లోకములయొక్క భాష్యగ్రంథమునందు ద్వితీయాధ్యాయము సమాప్తి జెందినది.

ద్వితీయాధ్యాయము సమాప్తము.

---

# శ్రీ భగవద్గీతా భాష్యార్క ప్రకాశికానువాదము
## తృతీయాధ్యాయము

[ప్రథమ శ్లోకావతరణ గ్రంథము]

భగవంతుడగు కృష్ణపరమాత్మ, ద్వితీయాధ్యాయమునందు, శాస్త్రముచే ప్రతిపాదింపదగిన ప్రవృత్తి మార్గమునకు విషయమగు కర్మయోగమును శాస్త్రముచే ప్రతిపాదింపదగిన నివృత్తిమార్గమునకు విషయమగు సాంఖ్యయోగమును ఉపదేశించియున్నాడు.

(లేక) శాస్త్రము ప్రవర్తించుటకు విషయమగు ప్రవృత్తిమార్గమునందలి (కర్మమార్గమునందలి) బుద్ధియు, శాస్త్రము, నివర్తించుటకు విషయమగు నివృత్తి మార్గము (జ్ఞానమార్గము) నందలి బుద్ధియు నుపదేశించియున్నాడు.

(ప్రవృత్తిమార్గమునం దున్నవానికే శాస్త్రముతోటి యపేక్షగాని నివృత్తి మార్గమునం దున్నవానికి శాస్త్రముతో బనిలేదు. గావున నివృత్తిమార్గము (జ్ఞాన మార్గము) నందు శాస్త్రముగూడ నివర్తించునని యర్థము).

అందు "ప్రజహాతి యదాకామాన్" అను 55 వ శ్లోకము మొదలుకొని ద్వితీయాధ్యాయము ముగియువరకు సాంఖ్యబుద్ధిని (జ్ఞానయోగమును) ఆశ్రయించినవారలకు నాశ్రమస్వీకారము (సన్యాసము) అవశ్యకర్తవ్యమని జెప్పి "ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ, నైనాం ప్రాప్య విముహ్యతి" అను తుదిశ్లోకముచే నట్టివారలకు సర్వకర్మసన్యాసపూర్వకమగు జ్ఞాననిష్ఠచే గృతకృత్యతనుగూడ సూచించియుండిరి.

అర్జునునికొరకు మాత్రము "కర్మణ్యేవాధికారస్తే" "మాతే సంగోస్త్వకర్మణి" అను దానిచే యోగబుద్ధిని యాధారపరచుకొని, కర్మయే అవశ్యకర్తవ్యమని జెప్పిరి. కాని యట్టి కర్మయోగము వలన మోక్షప్రాప్తి కలదని చెప్పలేదు. దీనినంతయు బరిశీలించి యర్జునుడు, భక్తుడను, శ్రేయఃకాముడను అగు నాకు కృష్ణుడు సాంఖ్యనిష్ఠను వినిపించి యనేకార్థములతో గూడి యుండి, యెప్పటికిని దప్పక మోక్షము నియ్యనను నియమములేనియా ఘోరకర్మమునం దేలనన్ను నియోగించెను? అని చిత్తమున వ్యాకులతజెంది కృష్ణుని యడుగుచున్నాడు. "జ్యాయసీచేత్" అని—

శ్రేయఃకాముడయినను, భక్తిలేనిచో నట్టివానికి తత్త్వ ముపదేశింప తగదు. భక్తియున్నను విషయలోలుడగుచో నట్టివానికిని తత్త్వ ముపదేశింప దగదు. కావున భక్తి, శ్రేయోభిలాషలు రెండును గలిగి యర్హుడ నగు నన్నేల కృష్ణుడు తత్త్వమార్గమున నియమింపలేదు? అని యర్జునుని నియాకూతము — (గూఢాశయము).

'లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠా పురాప్రోక్తా మయానఘ!
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్'', అను

కృష్ణుని సమాధాన వచనమునందలి విషయ విభాగము గూడ నర్జునుని ప్రశ్న ననురూప మగుచున్నది.

ఇచట వృత్తికారులు అర్జునునియొక్క ప్రశ్నకు, ఇతరార్థమును కల్పించి అందుకు ప్రతికూలముగా భగవంతుని సమాధాన వచనమును వర్ణించుచున్నారు. అదెట్లన, ఓయికృష్ణ! జ్ఞానకర్మలయొక్క సముచ్చయమువలన మోక్షము కలుగునని నీయొక్క మతమయి, అందునుగూడ కర్మకంటె జ్ఞానమే గొప్పదని నీయభిప్రాయ మైనచో, నన్నుమాత్రము కేవల కర్మమార్గమునం దేల నియోగించుచుంటివి? అని పార్థుని ప్రశ్నకు అర్థమును కల్పించి, అందుకు ప్రతికూలముగా, నేను సాఙ్ఖ్యులకు జ్ఞానయోగమును, యోగులకు కర్మయోగమును జెప్పియుంటిని. అని భగవంతుని సమాధాన వచనమును వర్ణించిరి. వృత్తికారులు జేసిన నీయర్థకల్పనమునందు నర నారాయణుల ప్రశ్న ప్రతివచనములకు పరస్పర విరోధము సుస్పష్టమగుచున్నది.

ఇంతియె గాక వృత్తికారుల గ్రంథమునందలి పూర్వాపరవిరోధము గూడ తేటతెల్ల మగుచున్నది. ఎట్లన, వృత్తికారులు, తమ గీతాశాస్త్రారంభోపోద్ఘాత గ్రంథమునందు బ్రహ్మచారి మున్నగు నలుగురు ఆశ్రమస్థులకు, జ్ఞానకర్మలయొక్క సముచ్చయము, గీతాశాస్త్ర ప్రతిపాద్య మని జెప్పి, దానిని బలపరచుటకు "యావ జ్జీవ మగ్నిహోత్రం జుహుయాత్" ఇత్యాది శ్రుతులచే విధింపబడిన కర్మలను పరి త్యజించి కేవల జ్ఞానమువలననే మోక్షముకలుగు నను విషయము గీతాశాస్త్రముచే నిషేధింపబడిన దని జెప్పిరి.

ఆ వృత్తికారులే తృతీయాధ్యాయ ప్రారంభమున "జ్ఞానయోగేన సాఙ్ఖ్యానాం కర్మయోగేన యోగినాం" అను శ్లోకమునందు సన్న్యాసులకు శ్రుతిచే బ్రతికియుండు నంతవరకు విధింపబడిన కర్మలతో పని యావజ్జీవ శ్రుతివిహితకర్మరహితమగు జ్ఞానము వలననే మోక్షమనియు, గృహస్థులకు కర్మయోగమువలన మోక్షమనియు నంగీకరించిరి.

అనగా వృత్తికారులు మొదట నుపోద్ఘాతగ్రంథమునందు జ్ఞానకర్మసముచ్చ యము గీతాశాస్త్రప్రతిపాద్య మని ప్రతిజ్ఞ చేసి, శ్రౌతకర్మలను విడచుట (సన్న్యసిం చుట) శ్రుతివిరుద్ధమగుటవలన యుక్తము గాదని జెప్పి మరల తృతీయాధ్యాయా రంభమునందు సన్న్యాసులకు జ్ఞాననిష్ఠయనియు, యోగులకు కర్మనిష్ఠయనియు, ఆశ్రమవిభాగమును జూపుచు, మొదట నిషేధించిన కర్మపరిత్యాగమును మరల నంగీకరించిరి.

ఇయ్యది వారి గ్రంథమునందు పూర్వాపరవిరోధ మనక తప్పదు. ఒకవేళ భగవంతుడగు శ్రీకృష్ణుడు ప్రతిపాదించినట్లు వృత్తికారులు వ్యాఖ్యానమొనర్చిరి. అందు వృత్తికారుల తప్పేమి? అని యందురేమో. అట్లనదగదు. సర్వజ్ఞుడును, పార్థునకు

పరమాప్తుడు నగు శ్రీకృష్ణుడు మాత్రము ఇంతటి విరుద్ధార్థము నుపదేశించునా? ఉపదేశింపడు. ఇంక అర్జునుడు విరుద్ధముగా గ్రహించుటవలన వాని యభిప్రాయము ననుసరించి వ్యాఖ్యానమునుజేయు వృత్తికారు లపరాధులు గారని సమాధానపర చుదమన్న నదియును పొసగనేరదు. భగవంతుడగు కృష్ణునకు ఆత్మయైన కృపా పాత్రుడగు నర్జునుడు మాత్రము యింతటి యవివేకి యెట్లగును? అతడును శ్రీకృష్ణు డుపదేశించినట్లే గ్రహించునుగాని విరుద్ధముగా గ్రహింపనేరడు. కావున వృత్తికారులే విరుద్ధార్థవాదులని యనవలయును.

ఇక నీ విరోధమును బోగొట్టుకొనుటకు ఉపోద్ఘాతగ్రంథమునందు తాము జెప్పిన సర్వకర్మ పరిత్యాగ నిషేధము, అన్తఃకరణ పరిపాకములేక అపాతాత్మ జ్ఞానమువలన మోక్షము నపేక్షించు గృహస్థుల విషయముగాని, యితరాశ్రమస్థుల విషయముగాదని జెప్పినను విరోధము పరిహృతము గానేరదు. ఏలయన ఉపోద్ఘాత మునందు ( సర్వేషా మాశ్రమిణాం ) ఆశ్రమస్థులందరికి జ్ఞానకర్మసముచ్చయమే మోక్షము నిచ్చునని జెప్పి, అందుకు విరుద్ధముగా తృతీయాధ్యాయమునందు సర్వ కర్మపరిత్యాగపూర్వక కేవలాత్మజ్ఞానమువలననే సన్యాసులకు మోక్షమని జెప్పిన వృత్తికారులకు పూర్వాపరగ్రంథవిరోధ మెట్లు దొలగును?

ఇక "జ్ఞానయోగేన సాఙ్ఖ్యానాం" అనుచోట సన్యాసులకు కేవల జ్ఞానము వలన మోక్షమనగా నిచట కేవలశబ్దమునకు శ్రౌతకర్మమాత్రరహితమగు జ్ఞానమని యర్థమును జెప్పవలయును. అందువలన సన్యాసులకు శ్రౌతకర్మరహితజ్ఞానమువలన ముక్తియనియు, గృహస్థులకు మాత్ర మట్లుగాదనియు దేలును. ఈమతమున సర్వాశ్ర మస్థులకు జ్ఞానకర్మసముచ్చయమువలననే ముక్తియనువచనమునకు విరోధముండదు. ఏలయన స్మార్తకర్మసముచ్చితమగు జ్ఞానమువలన సన్యాసులకు మోక్షమనియు, శ్రౌతస్మార్తోభయకర్మ సముచ్చితమగు జ్ఞానమువలన గృహస్థులకు మోక్షమనియును స్పష్టమగుచున్నందున సర్వాశ్రమములకు కర్మసముచ్చయము సిద్ధించుచునే యున్నదని శంకించుచో నదియును విరుద్ధమే యగుచున్నది.

గృహస్థులకే శ్రౌతకర్మసముచ్చయ మనియు మిగిలిన యాశ్రమస్థులకు స్మార్తకర్మమాత్ర సముచ్చయమనియు పక్షపాత మవలంబించుటలో కారణము కనుపించదు. ఉపోద్ఘాతగ్రంథమునందు కర్మపరిత్యాగపూర్వక కేవలజ్ఞానమువలన మోక్ష మను విషయమును నిషేధించుటలో గృహస్థులకే స్మార్తకర్మసముచ్చిత జ్ఞానము వలన మోక్షము నిషేధింపబడివదనియు, మిగిలిన యాశ్రమస్థులవిషయమున నట్లుగాదనియు భేదమును గ్రహింపవీలులేదు. అందువలన వృత్తికారుల క్లిష్టకల్పనా సమర్థనము యర్థమే యగుచున్నది.

మరియు నేజ్ఞానము స్మార్తకర్మ సముచ్చితమగుచు సన్యాసులకు మోక్షము నిచ్చుచున్నదో, అట్టి జ్ఞానమే గృహస్థులకుగూడ మోక్షము నిచ్చునని యంగీకరించిన నేమి? గృహస్థుల జ్ఞానమునందు మాత్రము శ్రౌతకర్మ సముచ్చయమును అధికముగా జేర్చనేల?

ఇక అగ్నిహోత్రాది శ్రౌతకర్మలను సన్యసించుటయే సన్యాస లక్షణమగుటవలనను, సన్యాసులకు శ్రౌతకర్మ సన్యాసము విధింపబడుటవలనను, సన్యాసికి కేవల స్మార్తకర్మ సముచ్చితజ్ఞానమువలననే ముక్తియనియు గృహస్థులకు శ్రౌతస్మార్తోభయకర్మ సముచ్చిత జ్ఞానమువలన మోక్షమనియు భేద మంగీకరింపవలెనన్నచో అట్లైనచో యధిక ప్రయాసతోగూడి యత్యన్త దుఃఖరూపమగు శ్రౌతస్మార్తోభయవిధమగు కర్మభారమును గృహస్థుని నెత్తిన బెట్టినట్లగును. అయ్యది యుక్తముగాదు.

మరియు నాయాసబహుళమగు కర్మభారమును మోయుటవలన గృహస్థులే మోక్షము నొందుదురుగాని, శ్రౌత నిత్యకర్మలతో శూన్యులగు యతులు ముక్తి నొందరన్నచో నదియును యుక్తము గాదు. (అనగా వృత్తికారులు స్మార్తకర్మ సముచ్చితమగు జ్ఞానమువలన యతులకు మోక్షము కలదని మొదట నంగీకరించి, ఆ యంగీకారముతో కొంతదూరము వ్యవహరించి, తుదకా మతమును గూడ పరిత్యజించి, తమ కత్యన్తాభీష్టమగు సముచ్చయ వాదమును నిలువబెట్టుకొనుటకు కేవల జ్ఞానమువలన సన్యాసులకు మోక్షమే లేదను త్రోవను దొక్కుచున్నారని భావము)

అట్లైనచో సన్యాసాశ్రమవిధానమే వ్యర్థమగును. శ్రుతి స్మృతీతిహాస పురాణాదులయందు ముముక్షువు నుద్దేశించి జ్ఞానాంగముగా సన్యాసము విధింపబడియున్నది. జ్ఞానము మోక్షసాధనమే గానిచో నిట్టి విధానము వ్యర్థమగును. కావున సన్యాసులకే జ్ఞాననిష్ఠయం దధికారము, జ్ఞానమువలననే కైవల్యసిద్ధియు కలుగును. కనుకనే "బ్రహ్మచర్యం సమాప్య గృహీ భవేత్; గృహీభూత్వా వనీ భవేత్, వనీభూత్వా ప్రవ్రజేత్" అను శ్రుతి సకామునకు యథాక్రమంబుగ బ్రహ్మచర్యాద్యాశ్రమ సముచ్చయమును నిష్కామునకు "యదివా ఇతరథా బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్, గృహాద్వా, వనాద్వా" అను శ్రుతి, "తస్యాశ్రమ వికల్పమేకే" "యమిచ్ఛేత్తమావసేత్" అను స్మృతియు వైరాగ్యముయొక్క తరతమ భావము ననుసరించి యాశ్రమ వికల్పమును విధించియున్నది. గనుక జ్ఞానమువలన సన్యాసులకు మోక్షమే లేదను వాదము చెల్లనేరదు.

ఓయి! ఆశ్రమము లన్నియు శ్రుతి, స్మృతులవలన సిద్ధములయిన వగుచో నాయా యాశ్రమములయందలి కర్మలుగూడ శ్రుతిస్మృతులచే విధింపబడినవే కావున నట్టి కర్తలకు జ్ఞానముతో సముచ్చయము గూడ శ్రుతిసిద్ధమే యగుచున్నది."

అని శంకింపరాదు. ముముక్షువగువాడు జ్ఞానసిద్ధికొరకు శ్రౌతస్మార్తాది సర్వకర్మలను విడువవలయుననియే శ్రుతిజెప్పుచున్నది. అదెట్లన: శ్రు॥ "వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరంతి" (గృహస్థాశ్రమమునుండి లేచి భిక్షాటనముతో జీవించుట నాచరింపవల యును). గృహస్థాశ్రమమునుండి లేచుటయనగా గృహస్థాశ్రమము కర్మమయ మగుట వలన అందలి కర్మలను విడచుట (సన్యసించుట యనియే యర్థము.)

శ్రు॥ "తస్మాన్న్యాస మేషాంతపసామతిరిక్త మాహుః" (సత్యముమున్నగు తపస్సు లన్నిటిలోను (న్యాసం) సన్యాసమనునది గొప్ప తపస్సు అని విద్వాంసులు చెప్పుచున్నారు).

శ్రు॥ "న్యాసఏవాత్య రేచయత్" (సన్యాసమే అన్ని యాశ్రమములను అతిక్రమించుచున్నది. అన్నిటిలోను గొప్పదగుచున్నదని యర్థము).

శ్రు॥ "నకర్మణా న ప్రజయాధనేన త్యాగేనైకేఽమృతత్వమానశుః" (లోకులు కర్మవలన మోక్షమును బొందరు, సంతానముచే మోక్షము నొందరు, ధనముచే మోక్షము నొందరు. నేర్పరులగు కొందరు సర్వకర్మ పరిత్యాగముచే మోక్షము నొందుచున్నారు).

శ్రు "బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్" (వైరాగ్యమున్నచో బ్రహ్మచర్యాశ్రమము నుండియే సన్యసింపవలయును).

శ్రు. "ఆత్మానమేవ లోకమిచ్ఛన్తః ప్రవ్రజంతి" (ఆత్మ లోకమును పొంద గోరువారు సన్యసింపవలయును) ఇత్యాది శ్రుతులు ముముక్షువునకు సర్వకర్మ సన్యాసమును విధించుచున్నవి.

ఇట్లే "శ్లో. త్యజధర్మమధర్మంచ ఉభే సత్యానృతే త్యజ।
ఉభేసత్యానృతే త్యక్త్వా యేన త్యజసి తత్త్యజ॥"

అ. యజ్ఞయాగాది ధర్మమును విడువుము. హింస మొదలగు నధర్మమును విడువుము. సత్యానృతము లను రెంటిని విడువుము. సత్యానృతములను రెంటిని విడచి, యేమనసుచే వీటినన్నిటిని విడచితివో ఆ మనసును గూడ విడువుము. అనగా మనస్సుయందలి అహంతా మమతలను విడచుటయే మనసును విడచుట. ధర్మాధర్మత్యాగముగూడ కర్మాధికారియగు గృహస్థునకు సంభవించదు. అయ్యది సన్యాసికే సంభవించును. కావున నీస్మృతి సన్యాసమునే విధించుచున్నదని భావము.

శ్లో. సంసారమేవం నిస్సారం దృష్ట్వా సార దిదృక్షయా।
ప్రవ్రజన్త్యకృతోద్వాహాః పరం వైరాగ్య మాశ్రితాః॥

అ. ఇట్లు వివేకులు సంసారమును సారములేని దానినిగా నిశ్చయించుకొని వివాహమాడక, పరవైరాగ్యమునొంది, సారమగు నాత్మను దెలిసికొనుగోరికచేసన్య సించుచున్నారు. అని బృహస్పతిగూడ సర్వకర్మసన్యాసమును విధించియున్నాడు.

"శ్లో. కర్మణా బధ్యతే జన్తుః విద్యయాచ విముచ్యతే
తస్మాత్కర్మ నకుర్వన్తి యతయః పారదర్శినః ॥"

అ. ప్రాణులు పుణ్యపాపరూపమగు కర్మచే సంసారబన్ధమును బొందు చున్నారు. జ్ఞానముచే సంసారబన్ధమునుండి విముక్తులగుచున్నారు. కావున తత్త్వవేత్తలగు యతులు కర్మల నాచరింపరు. ఇట్లు శుకస్మృతిగూడ సంసారబన్ధవిముక్తి కొరకు సర్వకర్మసన్న్యాస మావశ్యకమని జెప్పుచున్నది.

ఇట్లే "శ్లో. సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖంవశీ
నవద్వారేపురే దేహే నైవ కుర్వన్న కారయన్ ॥" అను

గీతాస్మృతిగూడ, ఈ యర్థమునందు ప్రమాణమగుచున్నది. కావున అన్ని యాశ్రమముల యందును జ్ఞానకర్మసముచ్చయము శ్రుతిసిద్ధమనువాదము నిరాధారమగుచున్నది. మరియు మోక్షము అకార్యమగుటవలన (కార్యము కాకుండుటవలన) ముముక్షువునకు కర్మలతో బనిలేదు. కర్మజన్యమగునది కార్యమగును. లోకములో దణ్డచక్రభ్రమణాది క్రియాజన్యమగు ఘటము, యజ్ఞాది కర్మజన్యములగు స్వర్గాది ఫలములు కార్యము లనబడుచున్నవి. మోక్ష మట్లు కార్యముగాదు. అందువలన కర్మ జన్యముగాదు. మోక్షము కార్యము గాదనుటలో "నాస్త్యకృతఃకృతేన" అను శ్రుతి ప్రమాణమగుచున్నది.

మరియు మోక్షము కార్యమగుచో ఘటాదులవలె, స్వర్గాదులవలెను అనిత్యమగును. మోక్షము నిత్యమని అన్ని మతములవారును అంగీకరించిరి. కావున ముముక్షువునకు కర్మఫలములగు స్వర్గాదులయందుగాని, ప్రత్యవాయ పరీహారాదులయందుగాని కోరికలేనందునను, మోక్షము కర్మజన్యము కానందునను ముముక్షువునకు కర్మలతో బనిలేదనియు, కావున ముముక్షువునకు సర్వకర్మసన్న్యాసమును విధించుట యుక్తమనియు సుస్పష్టము.

ఓయి! ముముక్షువునకుగూడ నిత్యకర్మలు ప్రత్యవాయమును బోగొట్టు కొనుటకు అవశ్య కర్తవ్యములు. వాటి ననుష్ఠింపనిచో నవ్వి యతులకుగూడ పాపమును దెచ్చిపెట్టును. అనినచో నట్లుగాదు. ఎవరు శాస్త్రోక్తమగు సర్వకర్మ సన్న్యాసము నాచరింపరో; వారలకే, నిత్యకర్మల ననుష్ఠింపనందున ప్రత్యవాయము కలుగునని శాస్త్రము చెప్పియున్నది. శాస్త్రము విధించిన దానిని చేయకుండుట శాస్త్రము నిషేధించిన దానినిచేయుట నీరెండును దోషహేతువులు. పురుషునకు సన్న్యాసమునకు పూర్వము కర్మలు విధింపబడినవి. సన్న్యాసానన్తరము కర్మలను విధించుట పొసగదు ఒకే పురుషునియందు ఒకే సమయమున సర్వకర్మసన్న్యాసమును సర్మకర్మలను శాస్త్రము విధింపనేరదు. ఈశ్వరుడయినను అట్లు విధింపశక్తుండు గాడు. కావున సర్వకర్మసన్న్యాసులకు తమను విధింపని నిత్యకర్మల ననుష్ఠించు

టయే దోషహేతువగును. కావున నిత్యకర్మానాచరణము అసన్న్యాసులకు ప్రత్యవాయము నిచ్చును గాని, సన్న్యాసులకు ప్రత్యవాయ మీయజాలదు.

అగ్నిహోత్రము పాణిగ్రహణసమయకాలమునందు ప్రాప్తమగుటచే సన్న్యాసులు గాకున్నను అగ్నిహోత్రవిధి బ్రహ్మచారులనుగూడ బద్ధపఱుపజాలదు. వారల యెడ నావిధి ప్రవర్తించదు. గనుకనే వారు (బ్రహ్మచారులు) అగ్నిహోత్రము ననుష్ఠింపకున్నను వారికి (బ్రహ్మచారులకు) ప్రత్యవాయము లేదు. అట్లే సన్న్యాసుల యెడ గూడ నిత్యకర్మల ననుష్ఠింపవలెనను విధిలేనందున వారు నిత్యకర్మల ననుష్ఠింపకున్నను ప్రత్యవాయము లేదు.

ఇంతవఱకు నిత్యకర్మలను చేయనందువలన ప్రత్యవాయము కలుగునను మతము నంగీకరించి అయ్యది సన్న్యాసుల విషయముగాదని సమాధానము చెప్పబడినది. ఇపుడు నిత్యకర్మాచరణమువలన ప్రత్యవాయము కలుగుటకే వీలులేదని ప్రతిపాదింపబడుచున్నది.

నిత్యకర్మాచరణము (నిత్యకర్మలను చేయకుండుట) అనగా కరణభావమని యర్థము. అకరణశబ్దమునందలి నఞ్ నను అభావ మర్థము. ప్రత్యవాయమనగా దోషమని యర్థము. అయ్యది భావరూపము గనుక భావరూపమగు దోషము, అభావరూపమగు "అకరణము" వలన బుట్టనేరదు. అట్లు పుట్టుట యుక్తమునుగాదు. "కథ మసతస్సజ్జాయేత" అను శ్రుతిగూడ పైయర్థమును ఋజువుచేయుచున్నది. (అసతః = అసత్పదార్థమువలన, సత్ = సత్పదార్థము, కథం ఎట్లు, జాయేత = పుట్టును ? ఎట్లును పుట్టనేరదని యర్థము.) దీనిచే ఘటప్రాగభావమువలన ఘటము పుట్టునని చెప్పు తార్కికుల మతము ప్రత్యుక్తమగుచున్నది. లోకమునందు అభావరూపమగు కుందేటికొమ్మువలన నేవస్తువైనను పుట్టినట్లు వినిగాని కనిగాని యెఱుంగము. కావున అభావమువలన భావోత్పత్తి లోకవిరుద్ధము, అసంభవమును అగుచున్నది.

ఓయి! "అస దేవేదమగ్ర ఆసీత్ తతో వై సదజాయత" దీనియర్థము: ఇదం = ఈ కనుపడుచున్న ప్రపంచము, అగ్రే = సృష్టికిపూర్వము, అసదేవ = అసద్రూపమే, తతో వై = ఆయసత్తువలననే, సత్ = సద్రూపమగు నీఘటపటాది ప్రపంచము, అజాయత = పుట్టెను. అను నీ శ్రుతిచే అభావమువలన భావము పుట్టునని చెప్పబడుచున్నదిగదాయని శంకింపదగదు. "సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్" "యతో వా ఇమాని భూతాని జాయన్తే" "తద్బ్రహ్మ" "ఆనన్దాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే" "సన్మూలాస్సోమ్యేమాస్సర్వాః" ఇవి మొదలగు ననేక శ్రుతులు సద్రూపుడగు పరమాత్మవలననే సద్రూపమగు ప్రపంచము పుట్టెనని చెప్పుచున్నవి. కావున పై శ్రుతియందలి "అసత్" శబ్దముచే గూడ సట్టిపరమాత్మయే గ్రహింపబడవలెను. సద్రూపుడగు పరమాత్మ యసచ్ఛబ్దవాచ్య మెట్లగునని శంకింపవలదు.

లోకములో సద్వస్తువులు రెండువిధములు. జన్మాధీనమయిన సత్వముగలవి కొన్ని, జన్మాధీనముగాని సత్వముగలవి కొన్ని. అనగా పుట్టియునికిగలవియనియు, పుట్టకనే యునికిగలవియనియు భేదము. గనుక పరమాత్మ పుట్టుకలేనివాడగుటచే పరమాత్మ యందు జన్మప్రయుక్తమయిన సత్వములేనందున "అసదేవేదమగ్రఆసీత్" అను శ్రుతి పరమాత్మను అసచ్ఛబ్దముచే వ్యవహరించినదని గ్రహించవలయును. లేక ప్రమాణప్రమేయాది వ్యవహారము లేకుండుటచే నసత్కల్పుడగుటవలన సదూపమగు బ్రహ్మగూడ "అసత్" అని చెప్పబడుచున్నాడు. గనుకనే 'శ్లో. మేనేఽసన్తమివాత్మానాం సుప్తశక్తిర సుప్తదృక్" అను భాగవతవచనము ఉపసన్నమగుచున్నది.

మరియు నిజముగ అభావమే జగత్కారణమగుచో "తదైక్షత బహుస్యాం ప్రజాయేయ" అను శ్రుతియందు జెప్పబడిన ఈక్షణ సంకల్పాదులు అభావమున కెట్లు పొసగును? అభావము చేతనముగాదుగదా, చైతన్యము భావధర్మము గదా, ఈక్షణ సంకల్పాదులుగూడ చేతనధర్మములుగాని యచేతనధర్మములుగావని సర్వలోక విదితముగదా! కావున, "అసదేవేదమగ్రఆసీత్" "తతోవైసదజాయత" అను శ్రుతిని యాధారపరచుకొని, అభావమువలన భావము పుట్టునని యనుకొనుట అసంగతమగుచున్నది.

ఓయి! అభావమువలన భావపదార్థము పుట్టుట యుచితము కాకపోవుగాక, అయినను, ఇన్ద్రియగోచరముకాని విషయమునందు వేదమే ప్రమాణమగుట వలనను, నిత్యకర్మను విధించునట్టి వేదము, నిత్యకర్మల నాచరింపనందున ప్రత్యవాయము కలుగునని చెప్పుటవలనను, నిత్యకర్మాచరణము (నిత్యకర్మలను చేయకుండుట) వలన ప్రత్యవాయము కలదనియే జెప్పవలెనన్నచో నపుడు నిత్యకర్మలను విధించునట్టి వేదము అనర్థకమగుటచే నప్రమాణ మనవలసివచ్చును. ఏలనన విహితములగు నిత్యకర్మల నాచరించినచో పితృలోకప్రాప్తి రూపమగు ఫలము కలదని వేదము చెప్పుటలేదు. నిత్యకర్మ నాచరించు పక్షములో పరికరములను సంపాదించుకొనుటయందలి ప్రయాస, అనుష్ఠాన సమయమున ధూమాదులచే నేత్రబాధ యీరెండును దుఃఖప్రాయములని ప్రత్యక్షమే యగుచున్నది.

అకరణమునందుగూడ ప్రత్యవాయముండుచో, నిత్యకర్మలు ఆచరించినపుడు, ఆచరించనపుడును దుఃఖము నిచ్చుచున్నందున అనర్థకరములనియు, అట్టికర్మలను విధించు వేదము అప్రమాణమనియు, దప్పక నొప్పుకొనవలయును. ఇట్టితరి కర్మప్రవర్తకమగు వేదము ప్రమాణము కాకపోగా, అయుక్తార్థమును బోధించునట్టిది (పొసగని విషయమును చెప్పునట్టిది) యగును. భగవదాజ్ఞారూపమగు వేదము కూడని విషయమును బోధించుటగాని, దుఃఖకరములగు వాటిని విధించుటగాని

సమ్మతింపదగినది కాదు. స్వతః ప్రమాణమయి, సకలపురుషార్థములను బోధించునట్టివేదము (జ్ఞాపకము) ప్రమాణము గాదనుట యనుచితము.

ఇచట నీ రహస్యము గ్రహింపవలయును. నిత్యకర్మలకు ప్రత్యవాయమును బోగొట్టుటయే ఫలమని యనదగదు. వెనుకజేసిన పాపములను బోగొట్టుట, ప్రాజాపత్యలోకమును బొందించుట, చిత్తశుద్ధి, మున్నగు గొప్పఫలములు నిత్యకర్మల వలన కలుగును. 'శ్లో. సన్ధ్యాయేన నవిజ్ఞాతా సన్ధ్యాయేనానుపాసితా। జీవమానో భవేచ్ఛూద్రోమృత శ్శ్వానోఽభిజాయతే॥' అను స్మృతులవలన దెలియబడు ప్రత్యవాయము మానవుడు నిత్యకర్మల నాచరించి, చిత్తశుద్ధినిబొంది, జ్ఞానము నార్జించి, మోక్షమునొందదగు బ్రాహ్మణదేహమును బొందియు, అట్లాచరింపక ఆత్మనాశమును చేసికొనువాడు ఘోరనరకములపాలగు నను అభిప్రాయముతో ప్రవర్తించినదిగాని వేరుగాదు. లేక, ఎవడు నిత్యకర్మలచే బాపమును బోగొట్టుకొనడో, పుణ్యమును సంపాదించుకొనడో, అట్టివాడు ఇంతకంటె నతినీచమగు కుక్కజన్మను బొందునని ఆ స్మృతియంశము.

ఎటులయినను, నిత్యకర్మాకరణము (నిత్యకర్మలను చేయకుండుట) వలన ప్రత్యవాయము పుట్టదు. మరేమనిన నిత్యకర్మలను చేయనిచో లోగడ పాపములు బోవు. దానికితోడు ముందార్జించిన పుణ్యముకూడ లేనియెడల కుక్కజన్మ మున్నగు దోషములు తప్పవు అని.

ఇచట భాష్యమునం దిట్లొకానొక వాక్యముకలదు. "తథాచ కారకం శాస్త్రం నజ్ఞాపకమితి అనుపపన్నార్థం కల్పితంస్యాత్" అని దీని యర్థమును వివరించుటలో ఆనందగిరి పండితులొక త్రోవనుద్రొక్కిరి. బెల్లంకొండవారు వేరొకత్రోవ ను నడచిరి. ఈ రెంటికిని గల భేదమును వివరించెదను. పైనుదహరించిన భాష్యపంక్తికి ఆనందగిరిపండితు లిట్లవతారికనుచూపిరి: "నిత్యకర్మలను విధించునట్టివేదమే వాటినాచరింపనందువలన ప్రత్యవాయముపుట్టునని చెప్పుచూ, అభావమునకు భావపదార్థమును పుట్టించునట్టి సామర్థ్యమును గూడ సంపాదింపగలదు. కావున నిత్యకర్మల నాచరింపనందున గలుగు ప్రత్యవాయము నిత్యకర్మలనాచరించినందున పరిహృతము కాగలదు (బోగలదు) అందువలన నిత్యకర్మాచరణమునకు ప్రత్యవాయపరిహారము ఫలమనునది సిద్ధించునన్నచో నట్లు కాదని చెప్పుచున్నారు భాష్యకర్తలు. "తథాచ కారకం శాస్త్రం నజ్ఞాపకమిత్యనుపపన్నార్థం కల్పితంస్యాత్" అని. పై యాక్షేపమునకు ఆనన్దగిరిపండితులు భాష్యపంక్తివలన జెప్పిన సమాధానమిది.

వేదము అభావమునకు భావపదార్థమును పుట్టించునట్టి సామర్థ్యమును కల్పించుచో, శాస్త్రమగు వేదము కారకమగును గాని, జ్ఞాపకము గానేరదు. పదార్థములకు నూతనశక్తిని కలుగుజేయునట్టిది కారకము, లోకసిద్ధమగు పదార్థశక్తిని

ఆశ్రయించి ప్రవర్తింపజేయునది జ్ఞాపకము అని నీరెంటికిభేదము. శాస్త్రమునకు కారకత్వము అయుక్తము, అనుపపన్నము ప్రత్యక్ష విరుద్ధమునగును. లోకమునం దగ్నికి గల దాహకత్వమును పురస్కరించుకొనియే "అగ్నిహోత్రం జుహోతి" యను శాస్త్రము హోమమును విధించునదిగాని, అగ్న్యాదిపదార్థములను క్రొత్తగా దాహకత్వాది శక్తులను శాస్త్రము కల్పింపనేరదు. అయ్యది ప్రత్యక్షవిరుద్ధము.

చక్షురాది ప్రమాణములవలన బాధింపబడక తాత్పర్యవిషయమగు సంబంధమును బోధించునట్టి వాక్యము ప్రమాణ మగును. (మానాన్తరాబాధిత తాత్పర్య విషయసంసర్గ బోధకంహి వాక్యం ప్రమాణమ్) గనుక నే"అగ్నినాసిఞ్చ" (నిప్పుతో తడుపుము) అనువాక్యము ప్రత్యక్ష విరుద్ధార్థమును బోధించుటచే నప్రమాణమగుచున్నది. అట్లే అభావమువలన, భావపదార్థముపుట్టుట ప్రత్యక్షాది ప్రమాణ విరుద్ధమగుటచే (నిత్యాకరణమువలన) నిత్యకర్మలను చేయనందువలన ప్రత్యవాయము బుట్టునను వాక్యముగూడ ప్రమాణము గానేరదు.

పదార్థములయొక్క సంసర్గము ప్రమాణాన్తరసిద్ధము కావలెనని నియమించుచో, నట్టిసంసర్గమును బోధించునట్టి వాక్యము వ్యర్థమగునని యనరాదు. "గామానయ" గోవును తీసుకొనిరమ్ము-అని పెద్దలు చెప్పినమాటవలన పిల్లవానికి ఆవును తీసికొని వచ్చుటయందు ప్రవృత్తి కలుగుచుండుటచే, నట్టివాక్యములు వ్యర్థములు గానేరవు.

ఇక "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" ఇత్యాది వేదవాక్యములు జ్యోతిష్టోమాదికర్మలకు, స్వర్గాది ఫలములకు గల (ప్రత్యక్షాదిప్రమాణాన్తరాసిద్ధి) కంటితో చూచుటకుగాని, చెవితో వినుటకుగాని వీలులేని సంబంధమును బోధించుటచే, నట్టివాక్యములు వ్యర్థములని శంకించుటకే తావులేదు.

కావున వాక్యములచే, జెప్పబడు పదపదార్థములయొక్క సంబంధము ప్రమాణాన్తరసిద్ధమగుగాక, కాకపోవుగాక, అందు నిర్బంధములేదు. కాని వాక్యములచే జెప్పబడు పదపదార్థములయొక్క సంబంధము ప్రత్యక్షాది ప్రమాణాన్తరమువలన బాధింపబడకూడదు. ఇందుమాత్రము నిర్బంధముకలదు.

కావున శాస్త్రము పదార్థములయందున్న సామర్థ్యము ననుసరించియే అగ్నిహోత్రమునందు ఇంద్రాదిదేవతల నుద్దేశించి, ఆజ్యాది హవిస్సులనిచ్చి, యజమానునకు, స్వర్గాది ఫలము కలుగునని అజ్ఞాతార్థమును (తెలియని విషయమును) తెలుపుటచే జ్ఞాపకమగు ప్రమాణమగుచున్నది. అట్లుగాక లోకవిరుద్ధమగు నర్థమును విధించుచో శాస్త్రము కారకమగునుగాన అప్రమాణమే యగును. అని యానందగిరి పండితులు చెప్పిన సమాధానము.

కావున, నిత్యకర్మాకరణము వలన ప్రత్యవాయము కలుగునని వేదము చెప్పుచో, వేదము కారకమగునుగాని జ్ఞాపకము గానేరదు. కారకమగుటవలన వేదము అప్రమాణమగును, గనుక వేదవాక్యము లోకవిరుద్ధమగు నర్థమును బోధించు నట్టిదని కల్పించి నట్లగును. అని భావము.

ఇక రామరాయల వ్యాఖ్యానము వివరింపబడుచున్నది.

“ తథాచ కారకం శాస్త్రం నజ్ఞాపకమితి అనుపపన్నార్థం కల్పితం స్యాత్ ” అని భాష్యపంక్తి.

రామరాయులుచెప్పిన అర్థము: నిత్యకర్మలను చేయనందువలన ప్రత్యవాయములు పుట్టినని వేదముచెప్పినచో నపుడు నిత్యకర్మలను చేయునపుడు ధూమాదులచే నేత్రబాధ, పరికరములనుసంపాదించు కొనుటయందలి ప్రయాస రూపమగుప్రత్యక్ష దుఃఖము చేయనిచో ప్రత్యవాయప్రయుక్తమగు దుఃఖము. ఉభయథా నిత్య కర్మలు దుఃఖకరములగుటవలన (కారకం) నిత్యకర్మలను విధించునట్టి శాస్త్రము (నజ్ఞాపకం) ప్రమాణము కానేరదు గాన శాస్త్రము కూడని యర్థమును చెప్పునట్టిది యనిగాని, అసంభవమగు విషయమును చెప్పునటువంటిదని గాని భగవన్తునిచే కల్పింపబడిన దగును. అని.

రామరాయుల మతమున ( కారకంశాస్త్రం జ్ఞాపకం నభవతి ) అని యన్వయము అనగా కర్మవిధాయకమగు శాస్త్రము ప్రమాణము కానేరదు అని యర్థము.

ఆనన్దగిరి పండితులమతమునందు :- (శాస్త్రం కారకం భవతి నతు జ్ఞాపకమ్) అని అన్వయము.

అనగా వేదము ( శాస్త్రము ) పదార్థములకు లేని శక్తిని కలుగజేయు నట్టిది యగునుగాని, తెలియనివిషయమును తెలుపునట్టిది గానేరదు అనియర్థము.

వీరుభయుల మతమునందును పదములకుగల యర్థభేదము చూపబడుచున్నది.

| రామరాయుల మతమున | ఆనన్దగిరి పండితుల మతమున |
|---|---|
| కారకం = ( విధాయకం ) విధించునట్టి | శాస్త్రమ్ = శాస్త్రము |
| శాస్త్రం = శాస్త్రము | కారకం = కలుగజేయునట్టిది ( అగును ) |
| జ్ఞాపకం = ప్రమాణము | జ్ఞాపకం = తెలియపరచునట్టిది |
| న = కాదు ( అని ) | న = కాదు. |

ఇచట జ్ఞాపక, కారకపదములకే అర్థభేదముగాని యితర పదములకు అర్థ భేదము లేదు.

భాష్యమునందలి పూర్వాపరవాక్య సందర్భమును పరిశీలించిచూడ ఆనిన్దగిరి పండితుల వ్యాఖ్యానమే యుక్తముగా కనుపించుచున్నది. ఇచట రామరాయులు భిన్నమార్గము నేల త్రొక్కిరో తెలియుటలేదు. పండితోక్తము లిందలి యుక్తా యుక్తముల బరిశీలింతురుగాక.

ఏ మతమునందయినను వేదము (అనుపపన్నార్థమని) యుక్తముగానివిషయమును చెప్పునట్టి దనుట యిష్టముగాదు.

కావున నిత్యకర్మాకరణము వలన ప్రత్యవాయము పుట్టను. అందువలన తత్పరిహారముకొరకు సన్యాసులు నిత్యకర్మల నాచరింప బనిలేదు. గనుక జ్ఞానకర్మలకు సముచ్చయమనునది పొసగదు.

మరియు గీతాశాస్త్రము జ్ఞానకర్మ సముచ్చయమే మోక్షసాధనమని మొదట ప్రతిపాదించియున్నచో తృతీయాధ్యాయమునందు "జ్యాయసీచే త్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన" అను శ్లోకముచే నర్జునుడుచేసిన ప్రశ్నయే కుదరనేరదు. ఏలనన ద్వితీయాధ్యాయమునందు శ్రీకృష్ణుడు జ్ఞానకర్మలరెంటిని యనుష్ఠింపుమని యర్జునున కుపదేశించియున్న, కర్మకంటె గొప్పదగు జ్ఞానముగూడచెప్పబడినట్లే కావున "నన్ని ఘోరకర్మయం దేల నియోగించుచుంటి"వని యర్జును డడుగుట యెట్లు పొసగును?

ఇక కృష్ణుడు సర్వసాధారణముగా జ్ఞానకర్మల రెంటిని యనుష్ఠింపవలయునని చెప్పి, అర్జునునకుమాత్రము శ్రేష్ఠమగు జ్ఞానమార్గమును అవలంబింపవలదని చెప్పెననియు, అందువలన తృతీయాధ్యాయమునం దర్జును డిట్లడుగవలసి వచ్చెననియు కల్పించుటగూడ నుచితముగాదు. అతిభక్తుడు శ్రేయఃకాముడు, హితోపదేశయోగ్యుడు నగు అర్జునునియందు హితవగు జ్ఞానమార్గము నుపదేశింపనంతటి యసూయ కృష్ణునకు కలదని యారోపించుట మిక్కిలి యసంగతము.

కావున పరస్పర విరుద్ధములగు జ్ఞానకర్మలను ఒకే అధికారి అనుష్ఠించుట కుదరనందున భిన్నపురుషులచే ననుష్ఠింపదగినవని శ్రీకృష్ణుడుచెప్పినట్లంగీకరించుచో తృతీయాధ్యాయమునందు పార్థుడు "జ్యాయసీచేత్" అను శ్లోకముచే జేసిన ప్రశ్న ఉపపన్నమగును.

అట్లుగాక శ్రీకృష్ణుడు ద్వితీయాధ్యాయమునందు జ్ఞానకర్మసముచ్చయమును చెప్పియున్నను, పార్థుడు దానిని గ్రహించలేక నవివేకమువలన జ్ఞానయోగమునందు కొందర కధికారమనియు, తనకుమాత్రము కర్మయందధికారమనియే శ్రీకృష్ణుడు చెప్పియుండెననియు గ్రహించి యిట్లు ప్రశ్నించెనని యనుకున్నను, భగవన్తుడు తన జవాబునందయినను నిజమును విప్పిచెప్పక నేను సాంఖ్యులకు జ్ఞానయోగమును, యోగులకు కర్మయోగమును చెప్పియుంటి ననుట ఉచితముగాదు.

ఇక భగవన్తుడుగూడ దాను మొదటచెప్పిన జ్ఞానకర్మసముచ్చయమును అజ్ఞానముచే మరచి భిన్నపురుషానుష్ఠేయమగు నిష్ఠాద్వయమును చెప్పియుంటినని సమాధానమును జెప్పెననిన, సర్వజ్ఞుడును భ్రమప్రమాదాది దోషరహితుడును అగు శ్రీకృష్ణునియందు అజ్ఞానమును కల్పించుట యెంత అందముగానుండును ?

కావున భగవన్తుడగు శ్రీకృష్ణునియొక్క జబాబువలన, జ్ఞానకర్మనిష్ఠలు భిన్నపురుషానుష్ఠేయములని దేలుటచే జ్ఞానకర్మలకు సముచ్చయము పొందనేరదు. కేవల జ్ఞానమువలన మోక్షమనియే గీతయందలి నిశ్చితార్థము.

మరియును అట్లుగాక సముచ్చయమే భగవన్తున కభిమతమయి పారున కట్లే చెప్పియున్నచో "తదేకం వద నిశ్చిత్య యేనశ్రేయోఽహ మాప్నుయామ్" అని తృతీయాధ్యాయమునందలి రెండవశ్లోకముచే జ్ఞానకర్మలరెంటిలో నాకు శ్రేయస్కరమగు నొకదానిని నిర్ణయించి చెప్పుమని యర్జునుడడుగుటయే పొసగదు. శ్రీకృష్ణుడును "నేను నీకు సముచ్చయమును చెప్పియుంటిని. నీవు తెలియక భ్రాంతి చెందుచుంటివి. జ్ఞానకర్మల రెంటిలో నొకదానివలన శ్రేయఃప్రాప్తి కలుగనేరదు. కావున జ్ఞానకర్మల రెంటిని నీ వనుష్ఠింపుము" అనియే చతుర్థాధ్యాయమునందు చెప్పియుండవలయును. అట్లుచెప్పక "కురు కర్మైవ తస్మాత్త్వమ్" నీవు "కర్మనే యాచరింపుము" అని చెప్పెను. గనుక జ్ఞానకర్మ సముచ్చయము గీతాశాస్త్రప్రతిపాద్య మెంతమాత్రముగాదు.

దీనిచే ఆత్మతత్త్వజ్ఞానపూర్వకముగా, కర్మ నాచరింపవలయునను రామానుజమతము నిరాకరింపబడిన దగుచున్నది. ఆత్మయాథాత్మ్యజ్ఞానము సాఙ్ఖ్యవిషయము, కర్మయోగివిషయము కర్తృత్వాద్యభిమానపూర్వకము కర్మ. తదభిమానత్యాగము వలన కలుగునది జ్ఞానము. కనుక నీరెంటికి సామానాధికరణ్యము అసంభవము.

శ్లో. జ్యాయసీచే త్కర్మణ స్తే మతా బుద్ధి ర్జనార్దన ।
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ ॥౧॥

అ. (జనం= అర్దతి= గచ్ఛతి) అన్తర్యామిరూపముతో మానవలోకమును పొందువాడుగాన, జనార్దను డనబడుచున్నాడు. (అనగా సర్వాన్తర్యామి యని యర్థము) లేక గత్యర్థకధాతువులన్నియు జ్ఞానార్థకము లను నియమముండుటచే జనార్దన శబ్దమునకు సర్వజ్ఞుడని గూడను అర్థమును చెప్పవచ్చును. లేక (జనైరర్ద్యతే) పురుషార్థసిద్ధికొరకు జనులచే యాచింపబడువాడు కావున జనార్దను డనబడును.

కావున సర్వజ్ఞుడవు, సర్వాన్తర్యామియు, సర్వప్రార్థనీయుడవు నగు నీకు నేదియిష్టమో అదియే సర్వసమ్మతమగుననియు, సకలపురుషార్థముల నిచ్చు నీ వెద్దానిని యాజ్ఞాపింతువో, అదియే సర్వుల కనుష్ఠేయమనియు సూచింపబడుచున్నది.

జ్ఞానకర్మల రెంటిని కలిపి యనుష్ఠింపుమని కృష్ణుని యభిప్రాయమయినచో పార్థుఁడు తనప్రశ్నయందు జ్ఞానకర్మల రెంటిలో నొకటి శ్రేయస్సాధనమని గాని, కర్మకంటె జ్ఞానము గొప్పదనిగాని వేరుగా నిర్వచించుట యుక్తముగాదు. "తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహ మాప్నుయాం" అని సిచట అర్జునుడు జ్ఞానకర్మల రెంటిలో నొకటి శ్రేయస్సాధనమనియు "జ్యాయసీ చేత్కర్మణ స్తే మతా బుద్ధి ర్జనార్దన" ఇచ్చోట కర్మకంటె జ్ఞానము గొప్పదనియు నిర్వచించియున్నాడు.

సముచ్చయము సంప్రతిపన్నమయినను బుద్ధి కర్మకంటె వేరయినదిగాని, గొప్పదిగాని యగుగాక, తప్పేమి? అని యనరాదు.

ఒకే వస్తువు తనకంటె తాను ఫలరూపమున అతిరిక్తము గానేరదు. కర్మజ్ఞానసముచ్చయము, కర్మజ్ఞానోభయరూపము. ఒకే సముదాయరూపములగుట వలన రెండును ఏకరూపమేయగును కావున ఏకరూపములగు జ్ఞానకర్మలను భేదముగాని, హెచ్చుతగ్గులుగాని యుండనేరవు.

తల, చేతులు, కాళ్లు మొదలగు అవయవసముదాయరూపమగు శరీరమునందు, చేతులు, కాళ్లు మొదలగు వాటికంటె శిరస్సు ప్రధానమని యెట్లు చెప్పబడుచున్నదో, అట్లే కర్మజ్ఞానములయొక్క రెంటి స్వరూపమగు సముచ్చయమునందు కర్మకంటె జ్ఞానము శ్రేయస్కరమైన యనుగాక, అని యనదగదు. శరీరము శిరఃపాణ్యాదులకంటె వేరుగాదు. కర్మజ్ఞాన సముచ్చయము కర్మ జ్ఞానముల రెంటికంటె వేరుగాదు. అవయవాతిరిక్తమగు అవయవి సంభవింపనేరదు.

శిరఃపాణ్యాదులకంటె వేరగు శరీరమను అవయవి మరియొకటి లేదు. అట్లు అవయవాతిరిక్తమగు నవయవి యుండుచో శిరఃపాదాద్యవయవములలో నొకదానికంటె మరియొక దానికి యుత్కర్షగాని, అపకర్షగాని జెప్పవచ్చు. అట్లే జ్ఞానకర్మలకంటె వేరుగా జ్ఞానకర్మసముచ్చయమను నవయవి లేదు. అందువలన నా సముచ్చయము యొక్క అవయవములగు జ్ఞానకర్మలలో నొకదానికి గొప్పతనముగాని, మరియొక దానికి కొద్దితనము గాని జెప్పవీలులేదు. కావున శిర ఆద్యవయవములకే శరీరమను పేరు. అట్లే జ్ఞానకర్మల రెంటికే సముచ్చయమని పేరు. కావున శిరస్సు శరీరమే యనిపించుకొనును, పాదము శరీరమే యనిపించుకొనును; అట్లే కర్మయు సముచ్చయమే యగును, జ్ఞానమున్ను సముచ్చయమే యగును. ఇట్టితరి కర్మకంటె జ్ఞానము గొప్పదనినచో సముచ్చయముకంటె సముచ్చయము గొప్పదనిన ట్లగును. అయ్యది అయుక్తమగునది కనే "నహి తదేవ తస్మాత్ ఫలతోఽతిరిక్తం స్యాత్" అని భాష్యకారులు చెప్పియున్నారు.

ఓయి! ఇట్లైనచో "శరీర మంతటికి శిరస్సు ప్రధాన" మను లోకోక్తి యెట్లు పొసగునన్నచో? వినుము. అజ్ఞానమే యందుకు కారణము. లోకులు తెలియకనే శరీరమంతటికి తల ప్రధానమని యనుచున్నారు. అవయవములకంటె నవయవి వేరని కల్పించుట అవివేకమువలననే జరుగుచున్నది. అవయవములకంటె వేరుగా నవయవి లేదను సిద్ధాన్తమును అవలంబించినచో; అవయవములు ఏకరూపములు కానందువలన వేర్వేరగు అవయవములగు శిరఃపాదములకు ఉత్కర్షాపకర్షలు సంభవించును. అట్లే ప్రకృతమునందు జ్ఞానకర్మసముచ్చయమును నంగీకరింపనిచో వేర్వేరగు జ్ఞానకర్మలకు ఉత్కర్షాపకర్షలు తప్పగా కుదురును. కనుక దీనివలన జ్ఞానకర్మ సముచ్చయమను పదార్థమే నిరూపింప నలవికాదని తేటతెల్లమగుచున్నది. జ్ఞానకర్మలకు సముచ్చయము కుదరదుగనుకనే

ఓయి కృష్ణా! భగవన్తుడవగు నీవు కర్మకంటె బుద్ధి శ్రేయస్కరమయినదని చెప్పి నన్నుమాత్రము శ్రేయోదాయకముగాని కర్మను చేయుమని ప్రతిపాదించుచుంటివి? ఏమికారణము? అని భగవన్తుని నిందించుచున్నవాడువలె నర్జునుడు చెప్పుచున్నాడు. "తత్కిం కర్మణి ఘోరేమాం నియోజయసి కేశవ" ఓయి కేశవ! హింసారూపమగు నీ ఘోరయుద్ధకర్మమునందు నన్నేల నియమించుచుంటివి? అని.

ఇచట కేశవ శబ్దమువలన కృష్ణపరమాత్మ బ్రహ్మరుద్రులకు గారణమని గ్రహింపవలయును. ఇందుకు ప్రమాణము శ్లో. క ఇతి బ్రహ్మణోనామ ఈశోఽహం సర్వదేహినాం, ఆవాంతవాఙ్గేయసమ్భూతౌతస్మాత్కేశవనామతే॥ అని దీనియర్థము. క కారమునకు బ్రహ్మ అర్థము. సర్వప్రాణులకు నియన్తనగు నేను ఈశశబ్దవాచ్యుడను బ్రహ్మరుద్రులమగు మేమిద్దరము నీ అవయవమువలనబుట్టితిమి గాన నీకు "కేశవ" అను పేరు కలిగెను. అని.

దీనివలన సర్వజగత్కర్తవును, సర్వేశ్వరుడవు నగు నీకు నన్ను కర్మలయందు నియమించుట తగదని తోచుచున్నది.

(లేక) బ్రహ్మరుద్రుల కధిపతివగు నీవు ఏదియో యొక నిమిత్తముచే నన్ను కర్మలయందు నియమించుచుంటివి కాని, వ్యర్థముగా నియమింపవు. కోపము చేతను నియమింపవు. కాని నేనుమాత్రము ఆ కారణమును తెలుసుకొనలేకున్నాను. నాకే గాదు బ్రహ్మరుద్రులకుగూడ నయ్యది తెలియ శక్యముకాదు. గనుకనే నేను నిన్నడుగుచుంటిని. ఏ కారణమున నన్ను కర్మయందు నియమించుచుంటివి? అని ఈ యభిప్రాయమును మదియం దిడుకొనియే భాష్యకారులు తమ భాష్యమునందు "ఉపాలంభమివ కుర్వన్" అని "ఇవ" కారమును ప్రయోగించిరి. దీనివలన అర్జునుడు నిజముగా నిందింపలేదని యర్థ మగుచున్నది.

ఈ గ్రన్థసందర్భముచే శ్రౌతస్మార్తకర్మసముచ్చిత జ్ఞానమువలన గృహస్థు

నకు ముక్తి యనియు, స్మార్తకర్మసముచ్చిత జ్ఞానమువలన సన్న్యాసులకు ముక్తి యనియు, ఇంతకుమున్ను వృత్తికారులుచేసిన పూర్వపక్షమున్ను, దానియందు ప్రసంగవశమున వచ్చిన అవాన్తరవిషయములున్ను ఖణ్డితము లగుచున్నవి.

మరల భాష్యకారులు వృత్తికారుల పూర్వపక్షమునం దొకానొక భాగమును బయల్పరచి ఖండించుచున్నారు. "అథస్మార్తేనైవ కర్మణా" ఇత్యాది గ్రంథముచే ఇచట ఘోరకర్మ యనగా యుద్ధము. అయ్యది స్మృతివిహితమగుటచే స్మార్తకర్మ యనిపించుకొనును. జ్ఞానమార్గము నుపదేశించు ప్రకరణమున భగవన్తుడు అర్జునిని యుద్ధమును జేయుమని చెప్పియుండెను. కావున స్మార్తకర్మసముచ్చితమగు జ్ఞానమును నీ వనుష్ఠింపుమని భగవన్తుడు చెప్పియుండగా "నన్ను ఘోరకర్మయం దేల నియమించుచుంటివి?" అని యర్జునుడు శ్రీకృష్ణుని యేలయడుగును? "జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధి ర్జనార్దన" అని కర్మద్వారా జ్ఞానము శ్రేష్ఠమని యెట్లు చెప్పును? "తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహ మాప్నుయామ్" అని మాత్రము యెట్లడుగును?

ఇక నర్జునుడు శ్రీకృష్ణుడు చెప్పిన విషయమును నిర్ణయించుకొనజాలక యిట్లడిగె నని యనుకొన్నను భగవన్తుడయినను "నేను నీకు స్మార్తకర్మజ్ఞానసముచ్చయమును చెప్పియుంటిని, నీవు తెలిసికొనలేకపోతివి" అని చెప్పవలెను. అట్లు చెప్పియుండలేదు. పైగా "లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా" అని కర్మజ్ఞానములు రెండు భిన్నపురుషానుష్ఠేయము లని చెప్పియుండెను.

కావున కేవల జ్ఞానమువలన మోక్షమనియే గీతాశాస్త్రమునందును ఉపనిషత్తులయందును నిర్ణయింపబడిన దని స్పష్టమగుచున్నది.

శ్లో. వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహమాప్నుయామ్ ॥౨॥

అ. ఇవ శబ్దమువలన భగవద్వాక్యము నిజముగా సంకీర్ణమైనది గాదని తెలియుచున్నది. భగవన్తుడు స్పష్టముగా విషయము నుపదేశింపువాడయినను బుద్ధిమాంద్యముగల నాకుమాత్రము భగవద్వాక్యము సంకీర్ణముగా దోచుచున్నదని యర్థము. కర్మజ్ఞానములయొక్క పరస్పర భేదము గోచరించుటలేదు పరమార్థము. గనుక నాబుద్ధిని వ్యామోహపరచువానివలె నుంటివి. ఇచటగూడ ఇవ శబ్దమువలన భగవన్తుడు నిజముగ వ్యామోహపరచువాడు గాడని తేలుచున్నది. కావున వ్యవహారభూమియందు భిన్నకర్తృకములగు జ్ఞానకర్మలు రెండును ఏకపురుషానుష్ఠేయములు కావని నీ కభిప్రాయమైనచో, నా రెంటిలో కర్మమార్గముగాని, జ్ఞానమార్గముగాని యేదియో నొకటియే యర్జునునకు తగినదని నా బుద్ధిశక్తి కనుకూలముగా నిశ్చ-

యించి నా కుపదేశింపుము. అద్దాని ననుష్ఠించి నేను శ్రేయస్సును పొందుదును.

అ. మరల సముచ్చయవాదమును నిరాకరింపుచున్నారు. జ్ఞానముతోకూడిన కర్మమార్గమును నీ వనుష్ఠింపుమని కృష్ణుడు అర్జునున కుపదేశించి యున్నచో అర్జునుడు జ్ఞానకర్మల రెంటిలో నొకదానిని నాకుజెప్పుమని యెట్లడుగును? (అడుగుట యెట్లు పొసగును?)

ఓయి! భగవన్తుడు సముచ్చయమునే యుపదేశించియున్నాడు. కాని అయ్యది వివేకముగల పురుషశ్రేష్ఠునిచే ననుష్ఠింపదగినది. అర్జునునకు అందుప్రవేశింప శక్తి లేదు. అందువలన భగవన్తుడగు శ్రీకృష్ణుడు జ్ఞానకర్మల రెంటిలో నొకదానినే యర్జునున కుపదేశించెనని యన్నచో నదియును పొసగనేరదు. ఏలయన, ఇంతకుముం దెచటను కృష్ణుడు జ్ఞానకర్మల రెంటిలో 'నొకదానినే నేను నీకు జెప్పెదను, రెంటిని నీకుజెప్పను' అని యనలేదు. కృష్ణుడట్లనియన్నచో సముచ్చయానుష్ఠానము తనకు సంభవింపదని యెంచి యర్జునుడు యొకదానినే నాకు జెప్పుమని యడిగెనని యనవచ్చును. మరియు "జ్ఞానయోగేన సాఙ్ఖ్యానాం కర్మయోగేన యోగినామ్" అను శ్లోకముచే భగవన్తుడు నిష్ఠాద్వయమునే జెప్పెను. వివేకముగల పురుషధౌరేయునిచే ననుష్ఠింపదగిన సముచ్చయరూపమగు నిష్ఠను చెప్పియుండలేదు. కావున నిచట సముచ్చయవాదమున కెంతమాత్రము అవకాశము లేదు.

ఓయి! "కర్మణ్యేవాధికారస్తే" అను శ్లోకముచే భగవన్తుడు అర్జునునికొరకు కర్మమార్గమే శ్రేయస్కరమని నిర్ణయించి చెప్పియుండ, మరల యర్జును డడుగు టెట్లు పొసగును? నిజమే కనుకనే "తత్కిం కర్మణి ఘోరేమాం నియోజయసి" అని యర్జునుడు భగవన్తుని నిందించెను. గాక భగవన్తుడు ద్వితీయాధ్యాయమునందు సామాన్యరూపముగ కర్మయోగమును, విస్తారముగ జ్ఞానయోగమును ప్రతిపాదించి యుండెను. అర్జునుడు మాత్రము బంధుప్రేమవలన భీతిజెంది యుద్ధకర్మనుండి మరలినవాడగుచు జ్ఞానయోగము నవలంబించి, భిక్షాటనమే తనకు శ్రేయస్కరమను నిశ్చయముతో నున్నటుల "గురూనహత్వాహి మహానుభావాన్ శ్రేయో భోక్తుం భైక్షమపీహలోకే" అను శ్లోకముచే సూచితమగుచున్నది. గనుక సన్న్యాసాశ్రమమును ప్రేమించియుండి సన్న్యాసమే సాక్షాన్మోక్షసాధనమని భగవదుపదేశముచే నిశ్చయించుకొనియున్న నర్జునునకు "కర్మణ్యేవాధికారస్తే" (నీకు కర్మయందే యధికారము) అని యుపదేశించినంతమాత్రమున కర్మలయందు ప్రవర్తించుటకుగాని, సన్న్యాసమునుండి నివర్తించుటకుగాని కోరిక బుట్టలేదు. అందువలన "తదేకం వద నిశ్చిత్య" (ఆ రెంటిలో నొకదానిని నిశ్చయించి చెప్పుమని) యడిగెను.

ఇదియునుగాక అర్జునునకు కర్మమార్గమే శ్రేయస్కరమని కృష్ణుడు చెప్పగలడని యింతకుముందే యర్జునునకు తెలుసును. అయినను 'నే నెందువలన జ్ఞాన

యోగము నందు నియోగింపబడలేదు ? ఎందువలన కర్మయోగమునందు నియో గింపబడితిని ? సాక్షాచ్ఛ్రేయస్సాధనమగు జ్ఞానయోగముండ కర్మయోగ మేల శాస్త్రముచే జెప్పబడినది?' ఇత్యాది సందేహములను దీర్చుకొనగోరి కర్మయోగము యొక్క మాహాత్మ్యమును వినుటకు అర్జును డిట్లడిగెను.

లేక "కర్మణ్యేవాధికారస్తే" అను దానిచే అర్జునునకు కర్మ యుపదేశింప బడినది. "బుద్ధౌ శరణమన్విచ్ఛ" అనుదానిచే ద్వితీయాధ్యాయమునందు జ్ఞాన ముప దేశింపబడినది. అందువలన నర్జునుడు ఆ రెంటిలో నొకదానిని జెప్పుమని యడిగెను.

ఇక నిందలి నిజమేమన కృష్ణుడు విషయమును సుస్పష్టముగానే చెప్పెను. మొదట కర్మయోగము ననుష్ఠించి చిత్తశుద్ధికలిగినపిదప జ్ఞానయోగ మనుష్ఠింపు మని చెప్పినట్లు "శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా సమాధావచలాబుద్ధి స్తదా యోగ మవాప్స్యసి" అను దానివలననే స్పష్టపడుచున్నది. కాని యర్జును డద్దానిని గ్రహింపక నిట్లడిగెనని తెలియవలెను.

ఇచట రామానుజులు ఆత్మసాక్షాత్కారమునొందుటకు నింద్రియవ్యాపారోప రతిరూపమగు జ్ఞాననిష్ఠసాధనమనియు నిట్టి జ్ఞాననిష్ఠను పొందుటకు తద్విరుద్ధ మగు కర్మయోగము సాధనమనియును కృష్ణు డుపదేశించెననియు, నిత్యాది వ్యామి శ్రమగు వాక్యమనియు గనుకనే అర్జునుడు అవిరుద్ధమగు వాక్యమును నా కుపదేశింపు మని యడిగెననియును వ్రాసిరి.

ఇత్యాది అసమంజసము. జ్ఞానయోగము కర్మయోగమువలన గలుగునని చెప్పుటలో వాక్యవిరోధ మేమియు లేదు. ఒకవేళ కృష్ణుడు కర్మయోగమే జ్ఞానయోగ మని చెప్పియున్నచో అప్పుడు ఇంద్రియవ్యాపారరూపమగునది కర్మయోగమున్ను, తదుపరతిరూపమగునది జ్ఞానయోగమున్ను కాన నీ రెంటికి విరోధమున్నందున కృష్ణునివాక్యమునందు విరోధముండెడిది.

ఇంద్రియవ్యాపారోపరమరూపమగు జ్ఞానమును ఇంద్రియవ్యాపారరూపమగు కర్మచే సాధించుటయే విరుద్ధమని యనదగదు. "తదుదితస్సహి యో యదనన్తరః" (ఏది దేని తరువాత కలిగినదో యది దానివలన బుట్టినది) అను న్యాయముచే (ఇంద్రియవ్యాపారోపరతి రూపమగు) ఏ యింద్రియము పనిచేయనట్టి దశయగు నిద్ర సర్వేంద్రియములు పనిచేయునట్టి దశయగు జాగ్రదవస్థానంతరము కలుగుట చేతను మనస్సునకు నెవ్విధమగు వృత్తులు లేకుండుటయును ఇంద్రియనిగ్రహము మనోవృత్తిచే సాధింపబడుచుండుటవలనను పూర్వోక్తమగు విరోధము పొసగదు.

అట్లే "వ్యామిశ్ర" మను పదమునకు "విరుద్ధ" మని వ్యాఖ్యాన మొన ర్చుటయు "ఏక" మను పదమునకు "అవిరుద్ధ" మని వ్యాఖ్యాన మొనర్చుటయు యుక్తముగాదు. ఆ రెండు పదములవలన నాయర్థము లభింపనేరదు.

మరియు కర్మయోగమువలన కలుగు బుద్ధి (జ్ఞానయోగము) గొప్పదని నీ యభిప్రాయమయినచో నన్ను కర్మయందేల నియోగించుచుంటివని నిందించుటగూడ అర్జునున కుచితము గాదు.

కర్మయోగమందు నియోగించబడిన అర్జునుడు కర్మయోగమును సాధించి నచో, నందువలన కలుగు జ్ఞానము శుభముగా లభించుచుండ నీడు నిందింప జనిలేదు.

మరియు ప్రకృతములగు బుద్ధి కర్మల రెంటిని యనువదించి అం దొకదానిని జెప్పుమని యడుగ "నా రెంటిలో నొకదానిని" యని సులభముగ స్వరసముగ నర్థ మగును. (వద) చెప్పుమని యనినంతమాత్రముననే యర్జునుని యభిప్రాయము నెరవేరుచుండ (వాక్యం వద) "వాక్యమును చెప్పుము" అని రామానుజులు వ్యాఖ్యాన మొనర్చుట పునరుక్తమగును.

మరియు ("యేనవాక్యేన అహమనుష్ఠేయ రూపం నిశ్చిత్య శ్రేయఃప్రాప్ను యామ్") అని రామానుజులు వ్రాసిరి. ఇందు "నిశ్చిత్య" అను పదమునకు ఉత్తర వాక్యముతో సంబంధము అనుచితము. భగవంతుడగు శ్రీకృష్ణుడు చెప్పిన యర్థము నందు అర్జునుని నిశ్చయముతో బనిలేదు. భగవంతు డెట్లుచెప్పెనో అట్లే యాచరింప వలయును. (నిశ్చిత్య వద) నిశ్చయించి చెప్పుమని యన్వయించినచో భగవంతుని యొక్క సర్వజ్ఞత్వము చెడునని యనరాదు. 'నాకు వాక్యార్థ మెట్లు నిర్ణీతమగునో అట్లు చెప్పుము' అని యర్జునుని యాశయమగుటచే నందు భగవంతునియొక్క సర్వ జ్ఞత్వమునకు భంగము వాటిల్లదు.

మరియు రామానుజుల వ్యాఖ్యానమునందు మూలశ్లోకమునందలి "యేన" అను పదమునను "ఏవాక్యముచే" అని యభిప్రాయ పడినట్లుఅర్థమగుచున్నది. అది యుచితముగాదు. శ్రేయఃప్రాప్తికి యెయ్యది సాధనమో దానినే యర్జునుడు తెలిసి కొన గోరినాడు. కేవల వాక్యము వలన శ్రేయఃప్రాప్తికలుగదు. అందువలన వాక్యము శ్రేయస్సునకు సాధనము గానేరదు. "నీవు కర్మయే చేయుము" అనువాక్యమే నిశ్చయరూపమగుటచే "వాక్యముచే నిశ్చయించి" యని చెప్పుటయు యుచితము కాదు. కావున రామానుజ భాష్యము పొసగనేరదు. ౨

శ్రీభగవాన్ :

శ్లో. లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ।
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్ ॥3॥

అ. పూర్వశ్లోకమున పార్థుడడిగిన ప్రశ్న కనుకూలముగానే శ్రీకృష్ణుడు బదులు చెప్పుచున్నాడు. వృత్తికారాదులు సూచించినట్లు వ్యతిరేక జవాబునకు గడంగలేదు. లోకమున శాస్త్రార్థానుష్ఠానమునకు బ్రహ్మ క్షత్రియ వైశ్యులు మువ్వురే యధికారులు. శూద్రుల కట్టి యధికారములేదు. ఇచట యోగమనగా పురుషార్థ ప్రాప్తికి సాధనమగు నుపాయము. అయ్యది జ్ఞానమనియు, కర్మయనియు రెండు తెఱంగులు. అందు ఇయ్యది యాత్మపదార్థము, ఇయ్యది యనాత్మపదార్థ మను వివేకము జ్ఞానము, దీనినే సాంఖ్యమందురు. వేదాన్త శాస్త్రశ్రవణాదులగాని యిట్టి జ్ఞాన మలవడదు. కావున నోయి యర్జునా? బ్రహ్మచర్యమునుండియే సన్యసించి వేదాన్త శాస్త్రశ్రవణాదులచే నాత్మతత్త్వనిశ్చయమునొందిన పరమహంసలకు పురుషార్థ ప్రాప్త్యుపాయము జ్ఞానయోగమనియు, కర్మాధికారులగు నితరుల కయ్యది కర్మయోగమనియు నేను వెనుక జెప్పియుంటిని- అని.

ఇచట ఒకే పురుషుడు ఒకే పురుషార్థముకొరకు జ్ఞాన కర్మల రెంటిని కలిపి యనుష్ఠించుట భగవన్తుని కిష్టమైనచో గీతలయందట్లే నిరూపింపదలచినచో, వేదములయందట్లు చెప్పియున్నచో విశిష్టగుణములు గలిగియుండి ప్రపన్నుడగు పార్థునకు జ్ఞానకర్మలు భిన్నపురుషకర్తృకము లని భగవన్తుడు చెప్పడు. 'నా ప్రియశిష్యుడగు అర్జునుడు జ్ఞానకర్మసముచ్చయమును అనుష్ఠించి ముక్తినొందుగాక, ఇతరులు మాత్రము యీ రెంటిలో నేదియో యొకదాని ననుష్ఠించి ముక్తినిబొందకుండుగాక' అని తలచి భగవంతుడు కపటముగా నిట్లు చెప్పెనన్నచో నపుడు భగవన్తుడగు శ్రీకృష్ణుడుగూడ ప్రాకృతజీవునివలె గొందరియెడల ననురాగముకలవాడును మరి కొందరియెడల ద్వేషముకలవాడును కావలసివచ్చును. అట్టివానిమాటలు పాటింపదగవు. సర్వసముడును, పాపరహితుడు నగు భగవంతునియందు రాగద్వేషాదు లుండరాదు. కావున జ్ఞానకర్మలకు సముచ్చయము ఘటింపదు. కర్మయోగముకంటె జ్ఞానయోగమునకు గొప్పదనము సిద్ధాంతము. కర్ములగు గృహస్థులకు జ్ఞానయోగమునం దధికారము లేదు. దీని ననుష్ఠింపుటకు సన్యాసులే యర్హులు. ఇయ్యది భగవన్తునకు పరమసమ్మతమగు సిద్ధాంతము.

3

అ. ప్రియభక్తుడనగు నన్ను భగవన్తుడు బంధహేతువగు కర్మమార్గమున నియమించుచున్నాడని దుఃఖించుచు కర్మమార్గమునకు విముఖుడుగానున్న పార్థుని కర్మమార్గమున నియోగింపదలచి శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు.

( లేక ) పరస్పరవిరుద్ధములగు జ్ఞానకర్మనిష్ఠలు ఒకే యజమానిచే ఒకేమారు అనుష్ఠింప నలవికానందున నయ్యవి స్వతంత్రపురుషార్థము లను శంక రాగా భగవంతుడు కర్మనిష్ఠ చిత్తశుద్ధిద్వారా జ్ఞాననిష్ఠాప్రాప్తికి హేతువుకాని స్వతన్త్రముగా పురుషార్థహేతువు కాదని చెప్పుచున్నాడు.

శ్లో. న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే।
న చ సన్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥౪॥

అ. ఈ జన్మమునగాని, జన్మాంతరమునందుగాని, యనుష్ఠించిన యజ్ఞాది కర్మలు వెనుకటి పాపములను పారద్రోలి చిత్తశుద్ధిని కలుగజేసి జ్ఞానమును బుట్టించుచున్నవి. అతిస్వచ్ఛమగు నద్దమునందు దన ప్రతిబింబమును తాను జూచినట్లు పాపరహితమగు నన్తఃకరణమునందు మానవు డాత్మను సాక్షాత్కరింపజేసికొనును. ఈ జన్మయందుగాని, జన్మాంతరమునందుగాని చేసిన నిష్కామకర్మలు దురితక్షయ మొనర్చును. దురితక్షయమున చిత్తశుద్ధి యేర్పడును. దానివలన జ్ఞానము కలుగును. జ్ఞానమువలన జ్ఞాననిష్ఠ సిద్ధించును. ఇయ్యది క్రమము. శుకవామదేవాదులయందు యిప్పటి కర్మయోగము కనుపించకున్నను క్రమముగా జ్ఞానప్రాప్తికి హేతువగు జన్మాన్తరీయ కర్మానుష్ఠానమున్నటుల నూహింపవలయును. ఐహికసంపదవలన మానవులయందు జన్మాన్తరీయ శివపూజ నూహించుట ఐహికమగు క్షయరోగాదులవలన జన్మాన్తరీయములగు బ్రహ్మహత్యాది పాతకముల నూహించుట లోకానుభవసిద్ధము. కారణములేని దేకార్యము పుట్టనేరదు. కావున మానవులు కర్మల ననుష్ఠింపనంత మాత్రమున కర్మరాహిత్యమును, అనగా ఆత్మస్వరూపముతో నుండుటను పొంద నేరరు. జ్ఞానముచేతనే జ్ఞాననిష్ఠను బొందుదురు. జ్ఞానమనగా ఆత్మానాత్మవివేకము. జ్ఞాననిష్ఠయనగా ఆత్మతత్త్వసాక్షాత్కారము. ఇట్టిజ్ఞాననిష్ఠ కర్మానుష్ఠానముననే క్రమముగా బుట్టునని తెలియవలయును. నైష్కర్మ్యలక్షణమగు జ్ఞానయోగమునకు కర్మయోగ ముపాయము. ఉపాయమాచరింపనిదే యుపేయము సిద్ధింపదు. ఆత్మజ్ఞానమునకు కర్మలు సాధనమని "తమేతం వేదానువచనేన" అను శ్రుతియందు ప్రతిపాదింపబడినది. గీతలయందుగూడ భగవంతుడు కర్మానుష్ఠానము లేక సన్న్యాస మల వడ నేరదని ముందు చెప్పబోవుచున్నాడు. యోగులు చిత్తశుద్ధి కొరకు కర్మలను చేయుచున్నారనియు, యజ్ఞము, దానము, తపస్సు మున్నగునవి మానవులను పవిత్రకరములనియును శ్రీకృష్ణుడు చెప్పబోవుచున్నాడు.

ఓయి! "భూతాభయప్రదానస్య కలాం నార్హంతి షోడశీం" అను శాస్త్రమును బట్టి కర్మసన్న్యాసమువలనగూడ నైష్కర్మ్యము కనుపించుచున్నది. లోకానుభవమునగూడ, కర్మల నాచరింపనందుననే కర్మరాహిత్య మేర్పడుచున్నది. ఇట్టితరి నైష్కర్మ్యమునుగోరువాడు కర్మల నారంభించుట, దారిద్ర్యమును గోరువాడు వ్యవసాయాదులజేయుటవలె పరిహాసాస్పదముకదా యని యనరాదు. జ్ఞానరహితముగా కర్మలను విడచినంతమాత్రమున నైష్కర్మ్యలక్షణమగు జ్ఞాననిష్ఠ ప్రాప్తించదు. జ్ఞానసహితమగు కర్మసన్న్యాసమువలననే మానవుడు నైష్కర్మ్యమును బొందును. అట్టి జ్ఞానము చిత్తశుద్ధిద్వారా కర్మయోగసాధ్యము. కావున కర్మానుష్ఠానమువలననే

చిత్తశుద్ధిద్వారా జ్ఞానసహితమగు కర్మసన్న్యాసమును చేసినవానికి నైష్కర్మ్యము ప్రాప్తించును.

ఇచట రామానుజులు "అనారంభాత్" అను పదమునకు (అనుపక్రమాత్) మొదలు పెట్టనందువలన అనియు, "సన్న్యసనాత్" అను పదమునకు మొదలిడిన దానిని మధ్య విడచినందువలన అనియు అర్థమును రచించిరి. అయ్యది పొసగదు. ఏలయన పూర్వార్థమున కర్మల నాచరింపకున్నందున నైష్కర్మ్యము సిద్ధింపదని చెప్పుటవలననే మొదలిడిన కర్మలను విడచినందున మానవుడు ఫలసిద్ధిని బొందనేరడని తేలుచుండ, నుత్తరార్థమున మరల యావిషయమును జెప్పుట వ్యర్థమగును. సమాప్తిచెందని కర్మము ఫలము నిచ్చునని యెవ్వడు తలంచడు. సమాప్తిచెందని వ్యవసాయమువలన సస్యసంపద కలుగుటలేదు. మరియు రామానుజమతమున "సన్న్యసనాదేవ" అను ఏవకారము వ్యర్థమగును. కావున రామానుజులయర్థము యుక్తముకాదు.

శ్లో. నహి కశ్చిత్క్షణమపి జాతు తిష్ఠ త్యకర్మకృత్
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైః గుణైః ॥౫॥

అజ్ఞానియగువా డెవ్వడు యేపనిని చేయక క్షణకాలమయిన నుండనేరడు. అజ్ఞానులందరు ప్రకృతిపరతన్త్రులగుచు సత్త్వాదిగుణప్రేరణచే నేదియో నొకపనిని చేయుచునే యుందురు. జ్ఞానులు గుణములచే చలింపరు కాన, నిచట సర్వశబ్దమునకు నజ్ఞానులు గ్రహింపదగరు. అజ్ఞానిపరముగనే సర్వశబ్దమును సంకోచపరచవలయును. ఇందువలన నజ్ఞునకు కర్మసన్న్యాసమే పొసగదు. కావున నాతనికి నైష్కర్మ్యము అసంభవమని స్పష్టమగుచున్నది.

ఓయి! అజ్ఞానికి సన్న్యాసమే సిద్ధింపనిచో జ్ఞానరహితమగు కేవల సన్న్యాసమువలన జ్ఞాననిష్ఠ సిద్ధింప దను వెనుకటి గ్రంథమునుబట్టి జ్ఞానరహిత సన్న్యాసమొకటి యున్నటుల స్పష్టమగుచున్నది కదా! లోకములో జ్ఞానరహితులగు సన్న్యాసు లనేకులు యిప్పటికిని కనుపడుచున్నారుకదా! ఇట్టితెరి యజ్ఞానికి సన్న్యాసములేదను టెట్లు? అని యనరాదు.

శిఖాయజ్ఞోపవీతములను, అగ్నిహోత్రాది కర్మలను విడనాడి, కాషాయ వస్త్రములను ధరించి, జ్ఞానరహితులై తిరుగు సన్న్యాసు లనేకులు లోకమున జూడబడుచున్నారు. కాని వారు నిజమయిన సన్న్యాసులు కారు. వారు క్షణకాలమయినను యేపనిని చేయక నుండజాలరు. ఎప్పుడు నేదియో యొకపనిని చేయుచునే యుందురు. అందువలన వారికి కర్మసన్న్యాసము దుర్ఘటము. శిఖా యజ్ఞోపవీతములను విసర్జించినంతమాత్రమున ఫలము లేదు. ఇట్టి సన్న్యాసము శాస్త్రసిద్ధముకాదు. జ్ఞాన-

పూర్వకసన్న్యాసమే శాస్త్రసిద్ధము. శాస్త్రసిద్ధసన్న్యాస మవలంబించిననే ఫలసిద్ధి కలుగును.

ఓయి! జ్ఞానరహితసన్న్యాసి యగ్నిహోత్రాది కర్మల నాచరించుట లేదు. జ్ఞానియగు సన్న్యాసికూడ వాటి నాచరింపడు. జ్ఞానియగు సన్న్యాసి భిక్షాటనమును చేయుచున్నాడు. అజ్ఞానియగు సన్న్యాసికూడ భిక్షాటనమునే చేయుచున్నాడు. ఇట్లుండ అజ్ఞానియగు సన్న్యాసియే క్షణమయినను యేపనిని చేయక నుండనేర డనుటెట్లు? అనినచో నిజమే. జ్యోతిష్టోమాదికర్మ సకాములకు స్వర్గాదిఫలము నిచ్చును. అట్టి జ్యోతిష్టోమాదికర్మయే నిష్కాములకు స్వర్గము నీయ నేరదు. అట్లే అజ్ఞసన్న్యాసులకే భిక్షాటనాదులు కర్మరూపము లగును. విద్వత్సన్న్యాసులకు కర్తృత్వాభిమానము లేనందున భిక్షాటనాదులు కర్మరూపములు కావు. ఆత్మ నిర్వికారమగు సచ్చిదానంద పరబ్రహ్మస్వరూపమని తెలిసినవాడు తాను భిక్షాటకుడ ననియు కపాలధారి ననియు, కాషాయవస్త్రధారి ననియు, శిఖాయజ్ఞోపవీతశూన్యుడ ననియు నను కొనడు. కావున నిర్వికారాత్మజ్ఞానికి కర్మలయందు కర్తృత్వాభిమాన ముండదు. అజ్ఞానియగు సన్న్యాసికి దేహాత్మాభిమానము పోనందున కర్తృత్వాభిమాన ముండును. కావున భాష్యకారులు మూలమునందలి "సర్వ" పదమును అజ్ఞనిపరముగా సంకోచపరచుట యుక్తము.

ఇచట నుత్తరార్థమునందలి సర్వపదము అనేకవిధములుగా నన్వయింపవీలగును.

(1) అందరు పరవశులగుచునే ప్రకృతిగుణములచే కర్మనుగూర్చి ప్రవర్తింపజేయబడుచున్నారు. (2) పరతంత్రులగు నందరు అని (3) గుణములచే నందరు కర్మ చేయింపబడుచున్నారు. అని ద్వికర్మక కర్మణి ప్రయోగము.

ఎట్లయినను ప్రకృతియొక్క గుణములచే ప్రేరితులై యందరు పరతంత్రులయియే కర్మల నాచరింపుచున్నారని ఫలితార్థము. ౫

శ్లో. కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచార స్సఉచ్యతే ॥౬॥

అ. ఏ మూఢుడు కర్మేంద్రియములను నియమించుకొని శబ్దాదివిషయములను మనసుతో స్మరించుచుండునో వాడు మిథ్యాచారు డని చెప్పబడుచున్నాడు. మాటాడుట, గ్రహించుట, నడచుట, విడచుట, సంగమమొనర్చుట (మైథునము) యను నవి యయిదు కర్మలు. ఈ పనులకు సాధనములగు వాక్పాణి పాదపాయూపస్థ లను నయిదును కర్మేంద్రియములు. శబ్దాదివిషయములను మనసా స్మరించుచు అని చెప్పుటచే స్మరణదశయందు కండ్లను, చెవులను మూసికొనినట్లు తోచును. లేక కంటితో రూపమును, చెవితో శబ్దమును గ్రహించుచుండగా మనస్సుచే శబ్దరూపములను

స్మరించుట కుదరదు. అనుభవస్మరణము లేక కాలీనములు కానేరవు. అనుభవము వలన సంస్కారము పుట్టును. ఈయది శాస్త్రసిద్ధాంతము.

లేక దేవాలయము మొదలగు విజనప్రదేశమునందుండి కంటికి కనుపించని పట్టణమునందలి భోగముదాని రూపమును, చెవికి వినిపించని పట్టనమునందలి భోగముదాని పాటను మనసా స్మరించుచున్నటుల చెప్పినచో, కంటిని చెవిని మూసికొనన వసరములేదు.

ప్రాజ్ఞుడు కర్మేంద్రియములను నిగ్రహించుకొని, విషయములను స్మరింపక నుండును. అజ్ఞాని విషయములను మనసా స్మరించుచు కర్మేంద్రియముల నణచుకొని యుండును. వీరిరువురి యాచారము వ్యవహారదశలో సత్యమే అయినను, విద్వాంసుల యాచారమే గ్రహింపదగును కాని అజ్ఞానుల యాచారము గ్రహింపదగదు.

ఇచట రామానుజులు "ఒకరీతిగా సంకల్పించి మరియొకరీతిని ప్రవర్తించుట మిథ్యాచారమని యనిరి. అది తుచ్ఛము. నేను కర్మను చేయనని సంకల్పించి యెవడును కర్మచేయడు. కావున నిట్టి మిథ్యాచారత్వము ఎట్టి యవివేకియందును పొసగదు. విషయములను మనసుతో స్మరించుట కర్మ కానేరదు. అట్లగుచో సంకల్పమునకు విపరీతము ఆచారమగును.

అజ్ఞాని జ్ఞానయోగము ననుష్ఠింతునని సంకల్పించి, మనసా విషయములను స్మరించుచుండును. కావున వీనిది మిథ్యాచారమని యనరాదు. అజ్ఞానికి జ్ఞానయోగ సంకల్పమే యసంభవము. జ్ఞానయోగ మెప్పుడును జ్ఞానపూర్వకముగనే కలుగును. మరియు "సహికశ్చిత్ క్షణమపి" అను శ్లోకము మొదలుకొని యిచట కర్మయోగమే చెప్పబడుటచే జ్ఞానయోగ సంకల్పమిచట యసంగతము. "యస్త్వింద్రియాణి మనసా" అను ముందు శ్లోకమునకూడ కర్మయోగమే విస్తరించి చెప్పబడుచున్నది. కావున రామానుజుల యర్థము అసంగతము. ౬.

శ్లో. యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున!
కర్మేంద్రియైః కర్మయోగ మసక్తస్సవిశిష్యతే ॥౭॥

అ. ఓయి అర్జున! కర్మలయందధికారముగల యే యవివేకి జ్ఞానేంద్రియములను మనసుతో నిరోధించుకొని ఫలాపేక్ష లేనివాడగుచు కర్మేంద్రియములతో కర్మయోగ మాచరించునో వాడు పూర్వము చెప్పబడిన మిథ్యాచారునికంటె గొప్పవాడు. జ్ఞానేంద్రియములనగా త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములు. వీటిని నిరోధించుకొనుట యనగా చేతితో కంటిని మూసికొనుట, చెవులను గుడ్డల నడ్డముపెట్టుట మొదలగునది కాదు. మనస్సునందు చూడవలెనని సంకల్పము లేకుండుట, వినవలెనని సంకల్పము లేకుండుట మున్నగునది. మనస్సునందు కోరికలు నశించినచో,

జ్ఞానేంద్రియములు తమంతట తామే విషయములనుండి నివర్తించును. దీనివలన నన్తరింద్రియ నిగ్రహమే బాహ్యేంద్రియ నిగ్రహమునకు సాధనమని తేలుచున్నది.

ఇచట మిథ్యాచారుడగు కర్మయోగికంటె నితడు గొప్పవాడని భావము. కాని జ్ఞానయోగికంటె కర్మయోగి గొప్పవాడని కాదు. దీనిచే జ్ఞాననిష్ఠునకంటె కర్మనిష్ఠుడు గొప్పవాడను రామానుజమతము నిరాకృతమగుచున్నది. కర్మనిష్ఠచే సాధింపదగిన జ్ఞాననిష్ఠకంటె కర్మనిష్ఠ తక్కువ దని యెల్లరెరుంగుదురు. స్వర్గఫలమును అనుభవించువానికంటె యజ్ఞము చేయువాడు విశిష్టుడుకాడు. ముక్తునికంటె జ్ఞాననిష్ఠు డెట్లు గొప్పవాడగును?

మరియు రామానుజులు, జ్ఞానయోగమునందు గొన్ని ప్రమాదములు సంభవింపవచ్చుననియు కర్మయోగమునం దట్లు సంభవింప వనియు, అందువలన కర్మయోగము గొప్పదని యనుచున్నారు. అదియును పొసగదు. ఏలయన, జ్ఞానయోగము పుట్టుటకు కర్మయోగాపేక్ష కలదు. కర్మయోగము జ్ఞానయోగముద్వారా మోక్షము నిచ్చును. జ్ఞానయోగము కర్మయోగమున గలుగుననియు, అయ్యది యాత్మసాక్షాత్కారమునకు గారణమనియు రామానుజులుగూడ నంగీకరించిరి.

కావున జ్ఞానయోగము పుట్టుటకు కర్మయోగాపేక్ష యుండుటవలనను, కర్మయోగము, జ్ఞానయోగముద్వారా మోక్షమునిచ్చుటవలనను, జ్ఞానయోగము కర్మయోగమువలన బుట్టుననియు, నయ్యది యాత్మసాక్షాత్కారమునకు సాధనమనియును, రామానుజు లంగీకరించుటవలనను, రామానుజమత మసంగతము.

కర్మయోగి యాత్మసాక్షాత్కారము చేసికొనవలసినచో, జ్ఞానయోగమునందు ప్రవర్తింపఁబనిలేదనియు, ముక్తిని సాధింపనెంచినమానవుడు యావజ్జీవము కర్మమార్గమునందే యుండవలెననియు, వానికి కర్మయోగముననె ముక్తిలభించుననియు ననరాదు. అట్లయినచో బహుప్రమాదభూయిష్ఠమయి సులభసాధ్యముగాని నిరర్థక జ్ఞానయోగమును విధించిన శాస్త్ర మప్రమాణ మనవలసివచ్చును. ఇట్టి శాస్త్రమునకు ప్రవర్తకుడగు భగవంతుడు కూడ అప్రమాణు డగును. కాక రామానుజమతమున కేవల మాత్మావలోకనము పురుషార్థముకాదు. ఆత్మభిన్నపరమాత్మసాక్షాత్కారమువలన తత్సారూప్యాదుల బొందుట ముక్తియందురు. కావున నిట్టియెడ జ్ఞానయోగ విధానమే వ్యర్థమగును. ఆత్మావలోకనమును ఫలముండుటచే జ్ఞానయోగము వ్యర్థము కాదనరాదు. మోక్షరూపము (పురుషార్థరూపము) గాని యాత్మావలోకనము స్వకుచమర్దనతుల్యమగును. ఇట్టి యాత్మావలోకనము మీమతమున ముక్తిదశలో కేవల కర్మయోగమునగూడ కలుగునని యొప్పుటచే జ్ఞానయోగము వ్యర్థము కాకమానదు. ముక్తియందా త్మావలోకనము కలుగదనుటయు పొసగదు. అపహత

పాప్మత్వ సర్వజ్ఞత్వాది గుణములుగల ముక్త జీవులు ఆత్మజ్ఞులు కారనుట విరుద్ధమగును. కావున సర్వథా రామానుజ మతమున జ్ఞానయోగము రిత్తపోవును.

ఇంకమా సిద్ధాంత మవలంబించినచో నాత్మసాక్షాత్కారమే మోక్షము కావునను, అయ్యది జ్ఞానయోగసాధ్యమగుటవలనను, ముముక్షువగు కర్మయోగి తప్పక జ్ఞానయోగమును సంపాదింపవలయును. ఇట్టి యెడ జ్ఞానకర్మయోగముల రెంటిలోనేదియు వ్యర్థముకాదు. ఈ రెండును సమప్రధానములును కావు. కర్మయోగముచే చిత్తశుద్ధిని సంపాదించి దాన నేకాదశేంద్రియముల జయించియుండ నావల జ్ఞానయోగమునందు ప్రమాదము సంభవించునని యూహించుట వెఱ్ఱితనము.

కనుక మిథ్యాచారునికంటె కర్మయోగియే గొప్పవాడు. కాని జ్ఞాననిష్ఠునికంటె కర్మయోగి గొప్పవాడు కానేరడు. అయ్యది శ్రీకృష్ణునకు సమ్మతమునుకాదు.

శ్లో. నియతం కురు కర్మ త్వం కర్మజ్యాయో హ్యకర్మణః ।
శరీరయాత్రాపి చ తేన ప్రసిద్ధ్యే దకర్మణః ॥ ౮ ॥

అ. అర్జునా! నీవు క్షత్రియుడవు. కర్మాధికారివి. నీకు యుద్ధకర్మ నిత్యము. కావున నీవు దాని నాచరింపుము. కర్మను చేయకుండుటకంటె చేయుట మేలు. ఏ కర్మను ఆచరింపనిదే నీకుజీవయాత్రకూడ జరగనేరదు. జ్ఞానముకంటె కర్మ తక్కువదయినను, చేయకుండుట కంటె చేసిన కర్మ గొప్పదే యగుచున్నది. లోకమునందు సంధ్యావందన మొనర్పనివానికంటె దానినొనర్చువాడు శ్రేష్ఠుడు. వైశ్వదేవము చేయనివానికంటె దానిం జేయువాడు గొప్పవాడు. యాగాదుల నాచరింపని వానికంటె వాటి నాచరింపువాడు ఉత్కృష్టుడు. ఇట్టి లోకప్రసిద్ధిని గమనించి యయినను నీవు నీ నియతకర్మ నాచరింపుట మేలు. కర్మాకర్మలకు గల యీ విశేషమునే భాష్యకర్తలు భాష్యమునందు సూచించిరి. ఇయ్యది అజ్ఞానివిషయముగాని వివేకి విషయము కాదు. వివేకికి కర్మయే సంభవింపదు. కావున విహితకర్మల నాచరింపని యజ్ఞానికంటె జ్ఞానియే గొప్పవాడనియు సిద్ధించుచున్నది.

ఇచట శరీరయాత్ర యనగా శరీరస్థితి అనగా ప్రాణధారణమని నిశ్చయము. ఏదియో యొక కృషి చేసిననేకాని అన్నమబ్బదు. అన్నముండిననేకాని శరీరము నిలువనేరదు. కావున శరీరస్థితికొరకు కర్మాచరణ మావశ్యకమని భావము.

(లేక) లోకమునందు నీచమానవుల బ్రతుకును గురించికాని, పశ్వాది జంతువుల జీవితమునుగురించికాని యెవరును మెచ్చుకొనరు. యజ్ఞాది క్రియలనుగాని, యుద్ధాదులనుగాని విహితకృత్యముల నాచరించువారలకు గొప్పఖ్యాతి కలదు. ఎవడైతే నిత్యము పొట్టనింపుకొనువాడై చేయదగిన పనులను చేయడో వానికిసుమంతయు లోకప్రతిష్ఠ లేదు. పైగా వానిని పశుతుల్యునిగా జూతురు. వాని జీవ

నము వ్యర్థము. కావున నర్జునా ? నీవును విహితకర్మయగు యుద్ధమును చేయనిచో నీకు లోకఖ్యాతి యేమాత్రము నుండదు. పైగా నీవను నొకడవుండినటులనే లోకము తెలియనేరదు.

ఇచట రామానుజులు అకర్మశబ్దమునకు జ్ఞానయోగమని యర్థమును చెప్పిరి. జ్ఞానయోగముకంటె కర్మయే గొప్పదనియు, జ్ఞానయోగికూడ కర్మల నాచరింపనిదే జీవయాత్రను గడుపనేరడనియు, కావున జ్ఞాననిష్ఠునకుగూడ యజ్ఞాది కర్మలవశ్యకర్తవ్యము లనియు, కర్మయోగమునందుగూడ ఆత్మయాథాత్మ్యానుసంధానమిమిడియుండుననియు జెప్పుచున్నారు. ఇది అసమంజసము. ఏలయన పూర్వము గీతయందు "స్థిత్వాఽస్యామంతకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి" అను శ్లోకముచే అంతకాలమునందు బ్రహ్మనిష్ఠయందున్నవాడు బ్రహ్మానందము నొందునని భగవంతుడు చెప్పెను. ముందుగూడ చతుర్థాధ్యాయమునందు 'శ్లో. నహిజ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే, తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి" అను శ్లోకముచే జ్ఞానయోగముతో సమానమయిన పవిత్రకరసాధన మెద్దియు లేదనియు, అట్టి జ్ఞానమును కర్మయోగమువలన చిత్తశుద్ధినొందినవాడు చాలకాలమునకు బొందుననియును శ్రీకృష్ణుడు చెప్పబోవుచున్నాడు కావున నిచట జ్ఞానయోగముకంటె కర్మయోగము గొప్పదనిచెప్పి, చతుర్థాధ్యాయమున జ్ఞానయోగముతో సమానమయిన సాధనములేదని చెప్పు భగవంతుడు, విరుద్ధార్థమును జెప్పువాడు కావున భగవంతు డప్రమాణు డగును. కావున గీతాప్రవర్తకుడగు శ్రీకృష్ణుని యప్రమాణునిగా జేయుటకు గీతావ్యాఖ్యానమొనర్ప సమకట్టిన రామానుజుల పాండిత్యమహిమ యేమని వర్ణింపవలయును ?

మరియు, శ్రీకృష్ణుడు చతుర్థాధ్యాయమున, అన్నికోరికలను చంపుకొని, శరీరేంద్రియాదుల నిగ్రహించి, సర్వపరికరములను విడచి, శరీరము నిలచియుండుటకు వీలగు కర్మమాత్రము నాచరించువాడు పాపము బొందడనియు, జ్ఞానాగ్ని సర్వకర్మలను భస్మము చేయుననియు, జ్ఞాని జ్ఞానమను నావచే సమస్తపాపమును తరింప వీలగుననియును చెప్పబోవుచున్నాడు. కావున యజ్ఞశిష్టాన్నమును భుజింపని జ్ఞానియగు యతికి పాపము సంభవింపదు. సర్వపాపములను పోగొట్టునట్టి జ్ఞానాస్త్రము చేతిలోనుండ యజ్ఞశిష్టాన్నమును భుజింపనందున జ్ఞానికి కిల్బిషము ప్రాప్తించుననుట యవివేకము. గనుక జ్ఞానికి యజ్ఞాదికర్మాచరణము ఆవశ్యకము కాదు.

మరియు జ్ఞానయోగి భిక్షాటనమొనర్చుచుండ నాతనికి దేహయాత్ర యెట్లు సిద్ధింపదు ? నివృత్తిమార్గమందున్న జ్ఞానికి యజ్ఞాదులయందు ప్రవృత్తి యెట్లు ? ప్రవృత్తి నివృత్తులు రెండును ఒకనికి యాచరింప సాధ్యములు కావుకదా ? ఆత్మ

యాథాత్మ్యానుసంధాన మనగా “ఆత్మ సచ్చిదానందరూపుడు, అవిక్రియుడు, అకర్త, అభోక్త అని తెలియుట.” ఇట్లు తెలిసికొని యనుసంధానము చేయువాడు కర్మలయందు ప్రవర్తించి, తాను కర్తనని యెట్లనుకొనును? కావున సూర్యుడు అంధకారములో నిమిడి యుండనటుల ఆత్మజ్ఞానము కర్మయోగము నంతర్భావము చెందదు. కాక చిత్తవిక్షేపరహితునకు సాధ్యమగు ఆత్మయాథాత్మ్యానుసంధానము కర్మలచే విక్షిప్తచిత్తున కెట్లబ్బును? జ్ఞాననిష్ఠుడు కూడ వ్యవహారసంబంధములేనపుడే, ఆత్మతత్త్వమును అనుసంధానము చేయుచున్నాడు. కావున రామానుజభాష్య మీ యెడల అసమంజసమగును.

శ్లో. యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబన్ధనః
తదర్థం కర్మ కౌంతేయ! ముక్తసంగ స్సమాచర ॥ ౯ ॥

అ. ఈశ్వరార్థములైన కర్మలకంటె నితరకర్మలయం దధికృతులై కర్మల నాచరించు మానవులు కర్మబంధము నొందుచున్నారు. కావున నోయి కౌన్తేయ! నీవు ఫలేచ్ఛను విడచి యీశ్వరార్థముగ కర్మ నాచరింపుము. మానవులకు యీశ్వరాజ్ఞాపరిపాలన మావశ్యకము. అయ్యది యీశ్వరార్థముగ కర్మల నాచరించియే నెరవేర్పదగును. వర్ణాశ్రమ విహితములగు కర్మలు ఈశ్వరార్థము లని దెలియవలెను. వీటి నాచరించిన మానవుడు జన్మమరణరూపమగు బంధము నొందనేరడు. ఇతరములగు సకామకర్మల నాచరించినవారు జన్మమరణరూపబంధము నొందెదరు.

ఇచట రామానుజులు యజ్ఞార్థకర్మ లనగా శాస్త్రీయములగు యాగాదులకు సాధనమయిన ద్రవ్యార్జనాదికర్మ లనియు (డబ్బుసంపాదించుట మొదలయిన పనియు) తద్భిన్నకర్మలనగా, తన స్వంత యుపయోగార్థమయి ద్రవ్యార్జనచేయుట మున్నగు కర్మలనియును వ్యాఖ్యానమొనర్చిరి. అయ్యది అసమంజసము. ఏలయన, నిఖిల శాస్త్రీయకర్మలను నిచట జేర్చుటకు సూచకమగు “ఆది” అను పదము మూలమున లేదు. యజ్ఞపదమే యందు కుపలక్షణమనుట యుచితముకాదు. ప్రధానకర్మ బంధప్రదము కాదని చెప్పుటవలననే తదంగభూతమగు కర్మకూడ బంధకము కాదని స్పష్టమగుచుండ, తిరిగి చెప్పుట వ్యర్థమగును. యజ్ఞార్థకర్మకంటె నితరమగుకర్మ యజ్ఞముకూడ కావున యజ్ఞముకూడ బన్ధకమగును. కాక యుద్ధముకొరకు తయారయి దానినుంచి మరలిన అర్జునునకు యుద్ధము చేయుమని చెప్పుటయే యుచితము కాని, యుద్ధముకొరకు ద్రవ్యార్జన మొనర్పుమని యుపదేశించుట యుచితముకాదు. ఇంతకుముందే యర్జునుడు యుద్ధసంభారములనుసంపాదించియుండ నిపు డీయుపదేశము పిష్టపేషణమగును.

శ్లో. సహయజ్ఞాః ప్రజా స్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః
అనేన ప్రసవిష్యధ్వం ఏష వోఽస్త్విష్టకామధుక్ ॥ ౧౦ ॥

అ. పూర్వము సృష్ట్యాదియందు బ్రహ్మదేవుడు కర్మలతోగూడిన ప్రజలను పుట్టించి, మీరీ కర్మమార్గముచే సుకృతమును సంపాదించుకొనుడు. (లేక వృద్ధి జేసికొనుడు) ఈ కర్మమార్గమే మీ కోర్కెల దీర్చుటకు కామధేనువగు గాక అని చెప్పెను. ఇందు సుకృతపదము నధ్యాహారముచేసికొనవలయును. ఇచట ప్రసవ శబ్దమునకు ఉత్పత్తి యని కాని, వృద్ధియని కాని యర్థము గ్రహింపవలెను. దేవతలకు మనుష్యులకు యజ్ఞములద్వారానే ఉపకార్యోపకారభావముకలదు. దేవతల బూజింపనివారు చోరులు. యజ్ఞశిష్టముగానియన్నము భుజించుట పాపహేతువు. యజ్ఞశిష్టాన్నభోజనము పాపమును బోగొట్టును. కావున యజ్ఞాచరణము మానవుల కావశ్యకము.

ఇచట రామానుజులు "ప్రసవిష్యధ్వమ్" అను పదవ్యాఖ్యాన సందర్భమున, యజ్ఞానుష్ఠానముచే నాత్మను వృద్ధిపరచుకొను డని వివరించిరి. అయ్యది యుక్తము గాదు. ఆత్మకు వృద్ధిక్షయాదివికారములు లేనందున నాత్మను వృద్ధిపరచుకొనుట యసంభవము. ౧౦

శ్లో. దేవాన్ భావయతానేన తే దేవా భావయన్తు వః।
పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ ॥ ౧౧ ॥

అ. ఈయజ్ఞముచే దేవతలను వృద్ధిపరచుడు. ఆ దేవతలు వర్షము, పసువులు పుత్రులు మొదలగు సంపదతో మిమ్ము వృద్ధినొందింతురుగాన మీరిరువురు యిట్లొకరి నొకరు వృద్ధినొందించుకొనుచు చిత్తశుద్ధి, విజ్ఞానప్రాప్తిద్వారా, మోక్షరూపమగు పరశ్రేయస్సును పొందుడు. మీరు సకాములగుచో స్వర్గరూపమగు పరశ్రేయస్సును పొందుడు. యజ్ఞానుష్ఠానముచే దేవత లెట్లు వృద్ధినొందుదురని యడుగరాదు. దేవతలు అమృతమును భక్షించువారు "అమృతంవై ఘృతం" అను శ్రుతి అమృత మనగా నెయ్యి యని చెప్పుచున్నది. యజ్ఞమునందు దేవతలకు అగ్నిహోత్రము ద్వారా నెయ్యి యియ్యబడుచున్నది. కావున దాన దేవతలు వృద్ధినొందుట సంభవించును.

శ్లో. ఇష్టాన్ భోగాన్హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః
తైర్దత్తా నప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః ॥ ౧౨ ॥

అ. ఓ మానవులారా! యజ్ఞములచే సంతోషపరుపబడిన దేవతలు మీరు కోరిన స్త్రీ పశుపుత్రాది భోగముల నిత్తురు. వారిచ్చిన స్త్రీపశుపుత్రాదులను వారికియ్యక ననుభవించువాడు దొంగ యగును. దేవత లిచ్చిన స్త్రీపశుపుత్రాదులను దేవతలకిచ్చుట యెట్లు సంభవించునని శంకింపరాదు. భార్యతోగూడియగ్నియందాజ్యాహుతుల నిచ్చుటచేగాని, తనకుశక్తి లేనిచో కుమారులచే నాపని చేయించుటగాని దేవతలిచ్చిన భోగములను దేవతలకిచ్చుట యను ఋణవిముక్తి సంభవించును.

యజమాని పురోడాశము నిచ్చుటచే ధాన్యరూపమయిన భోగమును తిరిగియిచ్చుట యగును. ఇట్లు ఋణనివృత్తిని చేసికొనుటయే ప్రత్యర్పణమని గ్రహింపవలయును.

ఇచట, మానవుల కిష్టమగు భోగము లనగా స్త్రీ, పశు, పుత్ర, ధాన్యాది భోగములే గ్రహింపవలెను. ఇవియే దేవతల కుపయోగపడును. భార్యలేనివాడు, పుత్రులేనివాడు యజ్ఞమునం దధికారి కాడు, క్షీరము, ఆజ్యము లేనిదే హోమము సంభవించదు కాన, పశువులు లేనివాడు యజ్ఞమునాచరింపలేడు. ఇచట పశు శబ్దముచే పవిత్రమయిన గోవునే గ్రహింపవలయును. అపవిత్రమయిన మహిష్యాదుల గ్రహింపదగదు. 'ఓ ద్విజులారా మేమిచ్చిన స్త్రీని, పుత్రుని, గోవును, ధాన్యాదులను తీసికొని, యజ్ఞాదులతో మమ్ము తృప్తిపరచుడు' అని ద్విజులకీ సంపదలను దేవత లిచ్చుచున్నారు. ఏ ద్విజుడు వాటిని గైకొని వారిని యజ్ఞములచే దృప్తిపర చునో వాడు బుద్ధిమంతుడు, లేక నా భోగములను తాను మాత్రమే యనుభవించు వాడు— దొంగవాడని భావము. స్త్రీపశ్వాదిభోగములచే దన దేహేంద్రియాదుల తృప్తిపరచుకొనుటయే, వాటిని కేవలము తా ననుభవించుట దేవద్రవ్యము నపహ రించినవాడుకావున వీడు చోరుడగును. లోకములో నొకరి వస్తువును మరియొక డనుభవించుట దొంగతన మనబడుచున్నది. ఇచటకూడ దమను పూజించుటకు దేవత లిచ్చిన స్త్రీపుత్రపశ్వాదిభోగములు దేవతల సొత్తు; అట్టి సొత్తును కేవలము తనదిగా భావించి తా నుపయోగించుకొనుట దొంగతనమే యగును.

ఓయి! లోకమున యేవస్తువునందైనను తనకుగల యధికారమును పూర్తిగా వదలుకొని, యితరులకు దానియందు పూర్ణాధికారము కలుగచేయబడునో, అపుడే అయ్యది దాన మనబడును. కావున దేవతలు ద్విజులకెప్పుడు స్త్రీపశుపుత్రాదిభోగ ముల నిచ్చిరో, అప్పుడే వారికి వాటితో సంబంధము తీరినది. ఇట్టితరి వాటిని యుప యోగించుచున్న వారెట్లు దొంగలగుదురు? అని యడుగరాదు. పుత్రులు లేని వాడు కన్యాదానముచేయునపుడు "అస్యాంయోజాయతే పుత్రస్సమే పుత్రో భవిష్యతి" ఈ చిన్నదానియందు కలిగిన కుమారుడు నాకు కొమరుడు కాగలడని సంకల్పపూర్వముగా కన్యను దానమిచ్చుచున్నను, వాని కాకన్యయందు కలిగిన పుత్రుని యందు స్వామిత్వము (ఆధిపత్యము అనగా అధికారము) కలుగుచునే యున్నది. అట్లే దేవతలుకూడ యజ్ఞములకొరకు మీకీ భోగముల నిచ్చుచుంటిమి, అని సంకల్పపూర్వకముగా ద్విజులకు స్త్ర్యాదిభోగముల నిచ్చుచున్నందున దేవత లాభోగములయం దధికారమును వదలనేరరు. సంకల్పముల ననుసరించి దానమున వైచిత్ర్య మేర్పడును. ౧౨

శ్లో. యజ్ఞశిష్టాశిన స్సంతో ముచ్యంతే తేఽపి కిల్బిషైః
భుజ్జతే తేత్వఘం పాపాః యే పచంత్యాత్మకారణాత్ ॥ ౧౩ ॥

అ. యజ్ఞశిష్టాన్నమును భుజించు సత్పురుషులు సర్వపాప విముక్తులగుదురు. ఇచట యజ్ఞశబ్దమునకు బ్రహ్మయజ్ఞము, దేవయజ్ఞము, పితృయజ్ఞము, మనుష్య యజ్ఞము, భూతయజ్ఞము అను నయిదు యజ్ఞము లర్థము. వీటి ననుష్ఠించినచో కుట్టనీ, పేషణీ, చుల్లీ, ఉదకుంభీ, మార్జనీ, అను నయిదు విధములయిన పాపములు పోవును. మూలమునందలి సర్వశబ్దమువలన, పొరపాటున జేసిన నితరపాపములు కూడ నీయజ్ఞములచే దొలగునని గ్రహింపవలయును. గృహస్థు కుట్టనీ మొదలగు నయిదు హింసలచే స్వర్గము నొందనేరడు. రోటిలో ధాన్యమును పోసి రోకలితో దంపునపుడు సాధారాణముగా పురుగులుపడి చచ్చుట సంభవించును. దానివలన కలిగిన పాపము కుట్టనీ యనబడును. తిరగటిరాళ్ళలో ధాన్యమును విసరునప్పుడు పురుగులు చచ్చుటవల్ల కలిగెడు పాపము పేషణీ యనబడును. పొయిలో కట్టెలనుంచి నిప్పుచేసి అన్నమును వండునపుడు చచ్చెడు పురుగులవలన కలుగు పాపము చుల్లీ యనబడును. కుండలలో నీరు తెచ్చునపుడు నీటిలో కాలుపెట్టుటవలనగాని కడవ నుంచుటవలనగాని స్వల్పజంతువులు చచ్చుటవలన కలుగు పాపము ఉదకుంభీ యన బడును. చీపురుతో గృహభూమిని (ఇంటిప్రదేశమును) చిమ్మునపుడు చీపురుక్రింద పడి పురుగులు చచ్చుటవలన కలుగు పాపము మార్జనీ యనబడును. ఈ యయిదు రకములయిన పాపములు గృహస్థు అగు యజమానిచే చేయబడుటలేదు. ఆయన భార్యయే యీ పాపము లాచరించుచున్నది. అయినను ఆమెచేయు పాకమునందు సంక్రమించిన నీ పాపములు ఆ యన్నమును భుజించిన గృహస్థునియందుకూడ సంక్రమించుచున్నవి. లేక భర్తప్రేరణచే భార్య యీ పాపముల జేయుచున్నది కాన ప్రేరకుడగు భర్తను సంక్రమించుచున్నవి. లేక భార్యాభర్తలు యేకరూపులగుటచే భార్యచేయు పాపములు భర్తకంటును. నిజముగ విచారించినచో భర్తకొరకే భార్య వంటచేయుచున్నది. కావున నీ పాపములు భర్తకే చెందును. భర్తభుజింపగా, మిగిలిన పదార్థమును భార్య భుజించుటచే భార్యకు దోషమంటదు. కావున వైశ్వమును నిత్యకర్మవలన నీయయిదు పాపములు నివర్తించునని ధర్మశాస్త్రము.

ఓయీ! అయిదు రకములగు పాపములచే తయారయిన అన్నము యజ్ఞశేషము చేసినంతమాత్రమున పాపముల నెట్లు పోగొట్టును? అని యనరాదు. ప్రతిరోజున దేవతానివేదనకొరకే పాకముచేయవలెనని విధికలదు. ఆత్మార్థము పాకముచేయు మని విధిలేదు. దేవతానివేదనకు పాకమును చేయనిచో దోషముకలదు. కావున హింసాత్మక మయినను వేదవిహితమగుటచే నగ్నిష్టోమము యెట్లవశ్యకర్తవ్యమో అట్లే హింసా ప్రాయమయినను పాకము దేవతలకొరకు తప్పక చేయవలయును. ఆత్మార్థమగు పశుహింసలో దోషముకలదు. ఆత్మార్థమయిన పాకమునందును దోషము కలదు. కావున వేదవిహితమగుటచే యజ్ఞమునందు హింసించిన పశుమాంసము పుణ్యమయి నటుల అయిదు పాపములచే తయారయినను దేవార్థమయిన పాకము పుణ్యమే.

యగును. కావున పాకసంబంధమయిన దోషములు యజమానుని యంటనేరవు.

ఇక దన యుదరపూరణమున కెవరు పాకమును చేయుదురో వారు అన్నమును భుజించుచున్నను పాపమునే భుజింపుచున్నారు. మానవుల కేదియో యొక అన్నముచే నుదరపూరణ మగును. కాని యజ్ఞశిష్టాన్నముచే పాపనివృత్తి కలుగును. ఆత్మార్థ మగు అన్నముచే పాపము సంభవించును. ఇదియే నీ రెంటికి భేదము. కనుక ఇహలోకమున కడుపు నిండుటయు, పరలోకమున పుణ్యము కలుగుటయు దేనివలన కలుగునో అదియే యజ్ఞశిష్టాన్నము. పాపభీరువు లగు ద్విజులు తప్పక నిట్టి యన్నమునే భుజింపవలయును. కావున యజ్ఞము అవశ్య మాచరింపవలయును. ౧౩

శ్లో. అన్నా ద్భవంతి భూతాని పర్జన్యాదన్న సంభవః ।
యజ్ఞా ద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః ॥ ౧౪ ॥

అ. జగచ్చక్రప్రవృత్తికి కారణమగుటచే తప్పక కర్మయాచరింపవలెనని చెప్పబడుచున్నది. స్త్రీ పురుషులచే ననుభవింపబడిన యన్నము లోహితరూపముగను, రేతోరూపముగను పరిణమించును. ఆ శుక్ల శోణితములు స్త్రీ పురుష సంయోగము వలన మిశ్రితములు కాగా జరాయుజాండజాది భూతములు బుట్టును. ఇంతియేకాని పాత్రాదులయందున్న అన్నమువలన భూతములు పుట్టనేరవు. ఇచట పర్జన్యపదమునకు లక్షణచే వర్షము అర్థము. కావున వ్రీహ్యాదిరూపమగు అన్నము వర్షము వలన కలుగునని యర్థము. వర్షము లేకున్నను నదీజలమువలన అన్నము సంభవించ కూడదా ? యని ప్రశ్నింపరాదు. నదీజలముకూడ వర్షాధీనమే కావున వర్షములేనిదే అన్నము పుట్టుట యసంభవము. యజ్ఞమువలన యజ్ఞానుష్ఠానమున వర్షము కలుగును. ఋత్విగ్యజమానులయొక్క హోమాది వ్యాపారరూపమగు కర్మవలన యజ్ఞము పుట్టును. ఇందుకు ప్రమాణము "శ్లో. అగ్నౌ ప్రాస్తాహుతిస్సమ్యగాదిత్య ముపతిష్ఠతే, ఆదిత్యాజ్జాయతే వృష్టిః వృష్టేరన్నంతతః ప్రజాః" అని. ఇందలి ప్రాస్తా అను పదమునకు 'ఉంచబడిన' అని యర్థము. ప్రపూర్వకమగు అను "గతిక్షేపణయోః" అను ధాతువునకు కర్మార్థమునందు క్తప్రత్యయము చేర్చగా 'ప్రాస్తా' అను రూప మేర్పడును. ఇచట యజ్ఞశబ్దమునకు స్వర్గాదిఫలప్రాప్తికి హేతువగు అపూర్వము అర్థముకాని, క్రియారూపమగు యాగమాత్రము అర్థముకాదు. అపూర్వ మనగా సుకృతవిశేష మని యర్థము. ఇయ్యది కర్తృనిష్ఠమగు ధర్మము. ఇద్దాని నంగీకరింపనిచో సమాప్తి కాలమునందే నశించిన యాగ మను క్రియ యజమానునకు జన్మాంతరమందు స్వర్గ ఫలము నొసగనేరదు. ౧౪

శ్లో. కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవం ।
తస్మా త్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితం ॥ ౧౫ ॥

అ. వేదము వలన కర్మ ప్రకాశింపచేయబడును. వేదము అక్షరరూపుడగు

పరమాత్మవలన బుట్టెను. మృద్ఘటములకు, బ్రహ్మజగత్తులకువలె వేదకర్మలకు కార్య
కారణభావసంబంధము లేదు. ప్రకాశ్యప్రకాశకభావసంబంధము మాత్రమే కలదు.
కావున బ్రహ్మోద్భవ మనుచోట నుద్భవపదమునకు ప్రకాశక మనియే యర్థమును
చెప్పుట యుచితము. ప్రకాశకమనగా ఇది యిట్లు చేయవలెనని ప్రతిపాదించునది అని
యర్థము. "తస్యమహతో భూతస్య నిశ్వసిత మేతద్య దృగ్వేద" ఇత్యాది శ్రుతిప్రమా
ణమును బట్టి వేదములు బ్రహ్మనుంచి యప్రయత్నముగా బుట్టినవని గ్రహింప వల
యును. కావున వేదము సర్వార్థప్రకాశమగుటచే సర్వవ్యాపకమయినను యెల్లపుడు
యజ్ఞవిధియందే స్థిరముగ నున్నది. కర్మవిధానమునే ప్రధానముగా ప్రతిపాదించు
చున్నదని యర్థము.

ఇచట రామానుజు లిట్లు అర్థమును చెప్పుచున్నారు. "యజ్ఞః కర్మ సము
ద్భవః" అనుచోట కర్మశబ్దమునకు (ద్రవ్యార్జనక్రియ) డబ్బును సంపాదించుట
మొదలగు పని అని యర్థము చెప్పి ద్రవ్యార్జనముచే యజ్ఞము నెరవేరుచున్న దనిరి.
"కర్మబ్రహ్మోద్భవం" అనుచోట బ్రహ్మపదమును శరీరపరముగా వాడి శరీరము
వలన కర్మపుట్టు ననిరి. "బ్రహ్మాక్షరసముద్భవం" అనుచోట, అక్షరశబ్దమునకు జీవు
డను యర్థము నంగీకరించి శరీరము జీవునివలన బుట్టు ననిరి. మరియు అన్నపానా
దులచే తృప్తిచెందిన జీవునిచే నధిష్ఠింపబడిన శరీరము కర్మాచరణకు సమర్థ మగు
చున్న దనిరి. కావున సర్వాధికారులయందలి, బ్రహ్మ(శరీరము) యెల్లపుడు యజ్ఞము
నందు స్థిరపడియున్నది. అనగా యజ్ఞమూలము అని వ్యాఖ్యానమొనర్చిరి. వీరి
వ్యాఖ్యాన మెంతమాత్రము పొసగనేరదు. ఏలయన క్రియారూపమయిన యజ్ఞము
క్రియచే సాధ్యమగుట యసంభవము. క్రియచే ఫలమును సాధింప జగును కాని
క్రియచే క్రియ సాధింప నలవికాదు. మరియు, యజ్ఞశబ్దమునకు అపూర్వము అర్థము
చెప్పినచో నయ్యది ఋత్విగ్యజమానుల వ్యాపారముచే సాధ్యమగును. కాని
ద్రవ్యార్జనముచే సాధ్యము కానేరదు.

మరియు శరీర మను అర్థమునందు బ్రహ్మపదప్రయోగము అప్రసిద్ధము.
"మమయోని ర్మహద్బ్రహ్మ" ఇత్యాది ప్రయోగములయందు ప్రకృతి యందు
బ్రహ్మపదము వాడబడినది. శరీరమునందు ప్రయోగింప బడలేదు. ప్రకృతిని చెప్పు
నట్టి బ్రహ్మపదము ప్రకృతికార్యమగు శరీరమును కూడ నౌపచారికముగా చెప్పు
నన్నచో నయ్యది లాక్షణికార్థమగుటచే నంగీకరింప దగదు. బ్రహ్మపదమునకు
ప్రకృతియను నర్థమే లక్షణచే సిద్ధించుచుండ ప్రకృతికార్య మగు శరీరమను నర్థము
లాక్షణికమని వేరుచెప్ప నేల? మరియు "శరీరవాఙ్మనోభి ర్యత్కర్మ ప్రారభతే నరః"
మానవుడు శరీరవాఙ్మనస్సులచే నేకర్మను మొదలు పెట్టుచున్నాడో అని ముందు
చెప్పబోవుచుండ నిచట శరీరమాత్రమున కర్మపుట్టునని చెప్పు టెట్లు పొసగును?

జీవుడు అన్నపానాదులచే దృప్తి జెందు ననుటకూడ నుచితము కాదు. అన్నపానాదులచే ప్రాణము మొదలగు నింద్రియములు తృప్తిచెందును కాని భోక్తృత్వము లేనిజీవుడు తృప్తి చెందనేరడు. అన్నపానాదులచే జీవునకు తృప్తి యంగీకరించినచో నవి లేనపుడు శోకముకూడ నంగీకరింపవలెను. వికారరహితుడగు జీవునకు శోకవికార మంగీకరించుట యుక్తముకాదు.

ఇక జీవుడు కర్తయు, భోక్తయు, విజ్ఞానాత్మయు కాని సచ్చిదానందరూపుడు కాడన్నచో కర్తృత్వాది వికారములచే ననిత్యుడగు జీవుడు క్షరు డగును. కాని యక్షరుడు కానేరడు. లోకమునం దెచ్చటను వికారము చెందు వస్తువు నిత్యముగా నుండుటలేదు. ఘటాదిరూపముగా వికారమును చెందు మట్టి కూడ ప్రళయకాలమున నశించుచునే యున్నది.

మరియు "సర్వగతం" అను మూలపదమునకు "సర్వాధికారుల యందలి" అని యర్థసంకోచమును చేయుట కూడ పొసగదు. యజ్ఞానధికారు లగు శూద్ర పశ్వాదుల శరీరములు కూడ యజ్ఞమూలము లగుచుండ అధికారిశరీరములే యజ్ఞమూలములనుట హాస్యాస్పదము. ఈదోషమును పోగొట్టుకొనుటకు "సర్వగతం" అను పదమునకు "సర్వజీవగతం" అని చెప్పినచో మత్స్యాది జీవశరీరములు కూడ యజ్ఞమూలములు లనవలసి వచ్చును. సముద్రమునందలి మత్స్యాదులు వర్షమువల్ల పండిన ధాన్యాదుల దిని బ్రతుకుటలేదు. కావున సర్వథా రామానుజవ్యాఖ్యానము అయుక్తము.

శ్లో. ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః
అఘాయు రిన్ద్రియారామో మోఘం పార్థ స జీవతి ॥ ౧౬ ॥

అ. ఇట్లు ఈశ్వరునిచే వేదయజ్ఞములతో గూడ సృజింపబడిన జగచ్చక్రమును యెవ్వ డనుసరింపడో వాడు పాపజీవనుడు, ఇంద్రియములతో క్రీడించువాడు. అట్టివాని బ్రతుకు వ్యర్థము.కావున నధికారి తప్పక కర్మమార్గ మాచరింపవలయును.

ఆయు వనగా శరీరమునందు ప్రాణవాయువు సంచరించుట; ఎవ్వనిశరీరమునందు ప్రాణవాయుసంచారము కేవలము పాపముకొరకగుచున్నదో, వాడు అఘాయు వనబడును. గుఱ్ఱము మున్నగు వాహనములతో ఉద్యానాదులయందుసంచరించినట్లు ఇంద్రియములతో శబ్దాది విషయములయందు విహరించువాడు ఇంద్రియారాము డనబడుచున్నాడు.

ఇచట రామానుజులు, అన్నమువలన భూతశబ్దముచే నిర్దేశింపబడు జీవవిశిష్ట శరీరములు పుట్టుననియు మేఘుని వలన అన్నము పుట్టుననియు, యజ్ఞమువలన మేఘుడు బుట్టుననియు, యజ్ఞము కర్తృవ్యాపారరూపమగు కర్మవలన పుట్టుననియు,

కర్మ జీవవిశిష్టశరీరమువలన పుట్టుననియు, జీవవిశిష్టశరీరము తిరిగి అన్నమువలన బుట్టుననియు, ఇట్లు పరస్పర కార్యకారణభావముచే ప్రపంచము చక్రమువలె తిరుగుచున్నదని చెప్పిరి. మరియు జీవునకు ఇంద్రియములే యుద్యానములు. కావున జ్ఞానయోగాదులయందు ప్రయత్నించుచున్నను ఇంద్రియారాముడగు జీవుడు ఫలము నొందలేకుండుటచే వ్యర్థముగానే జీవించుచున్నా డనియును చెప్పిరి.

ఇయ్యది అవిచారిత రమణీయము. ఏలయన "కర్మబ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవం" అనుచోట రామానుజులు శరీరమువలన కర్మపుట్టుననియు, జీవునివలన శరీరము పుట్టుననియును చెప్పి మరల యిప్పుడు జీవవిశిష్టశరీరమువలన కర్మ పుట్టుననియు, జీవవిశిష్టశరీరము అన్నమువలన పుట్టుననియు జెప్పుట పరస్పర వ్యాఘాతమగును. మరియు భూతశబ్దమువలె బ్రహ్మశబ్దము సజీవశరీరమును చెప్పుచో "బ్రహ్మాక్షరసముద్భవం" అనుచోట అక్షరశబ్దవాచ్యమగు సజీవశరీరమువలన సజీవశరీరము పుట్టునని చెప్పవలసివచ్చును. ఇయ్యది అనుచితము. కార్యకారణములకు అత్యంతైక్యము లోకవిరుద్ధము. ఇక అక్షరశబ్దము కేవల జీవవాచియన్నచో కేవల జీవునివలన జీవవిశిష్టశరీరము పుట్టుననుటకూడ కారణజీవునికంటె కార్యజీవునకు భేదము లేకుండుటచే వ్యాఘాతమే యగును. బ్రహ్మశబ్దము జీవరహిత శరీరమును చెప్పు నన్నచో దానివలన కర్మపుట్టనేరదు. లోకమున జీవసహితమగు శరీరమువలన కర్మ పుట్టుచున్నది. కాని శవశరీరమువలన కర్మ పుట్టుటలేదు.

మరియు, సజీవశరీరము పుట్టునన్నచో శరీరముతోపాటు జీవునకుకూడ జన్మ సిద్ధించును. "అజోనిత్యః" ఇత్యాది శ్రుతులు జీవుడు నిత్యుడని చెప్పుచుండ, జీవునకు పుట్టుక నంగీకరించుట శ్రుతి విరుద్ధమగును. కనుకనే అక్షరుడగు జీవున కుత్పత్తి లేకుండుటచే చక్రత్వము కూడ పొసగనేరదు. ఉత్పత్తి యొప్పినచో నాశముకూడ సంభవించును. కాన నాశరాహిత్యరూపమగు అక్షరత్వము సంభవింపనేరదు. "బ్రహ్మాక్షరసముద్భవం" అను పదము లేకున్నచో భూతబ్రహ్మశబ్దములు ఒకే యర్థమును చెప్పుటచే అన్నమువలన భూతములు పుట్టుననియు, బ్రహ్మ మరల యన్నమువలన పుట్టుననియు చక్రత్వము కుదురును. అట్లె యంగీకరింతు మన్నచో మూలమునందు అట్లు లేకుండుటచే రామానుజుల పాండిత్యము మూలమును చెరచిన దగును.

ఓయి! భూత, బ్రహ్మ, అక్షర శబ్దములు మూడును జీవవిశిష్టశరీరమునే చెప్పును. అందు బ్రహ్మశబ్దవాచ్యమగు సజీవశరీరము పుత్రుడు. అక్షరశబ్దవాచ్యమగు సజీవశరీరము తండ్రి. తండ్రివలన కుమారుడు పుట్టును అని యన్నచో అదియును పొసగ నేరదు. లోకములో తండ్రియొక్క శరీరమువలన కుమారుని శరీరము పుటుచున్నది. తండ్రిశరీరము తాతశరీరము వలన పుట్టుచున్నది. కాని పుత్రశరీరమువలన పుట్టుట

లేదు. అట్లే బ్రహ్మశబ్దవాచ్యమగు సజీవశరీరము అక్షరశబ్దవాచ్యమగు పితృదేహము వలనపుట్టినను అక్షరశబ్దవాచ్యమగు పితృదేహము తిరిగి యన్నమువలన పుట్టనేరదు.

"అన్నాద్భూతానిభవంతి" అనుచోట అన్నమయమగు పితృదేహము వలన భూతములు (అనగాపుత్రదేహములు) పుట్టుచున్న వని యర్థమన్నచో అపుడు "బ్రహ్మాక్షరసముద్భవం" అను దానితో సమానార్థకము గాన, పునరుక్త మగును. పునరుక్తమయినను చక్రత్వమును ప్రతిపాదించుటకు అంగీకరింపబడిన దని యన రాదు. కర్మ భూతములవలన పుట్టుననియు భూతములు అన్నమువలన పుట్టుననియు, స్వపదముచేతనే చక్రత్వమును ప్రతిపాదింపవలెను. స్వపదముకాని పర్యాయపదము కాని లేకున్నను "అన్నాద్భూతాని భవంతి" "కర్మ బ్రహ్మోద్భవం" అను జెప్పుట చేతనే చక్రత్వము స్ఫుటముగా ప్రతీయమానమగుచుండ భూత, బ్రహ్మ, అక్షర శబ్దములకు ఏకార్థత్వమును చెప్పుట యుచితముకాదు. భిన్నార్థమును చెప్పినచో మీ మతప్రకారము మీ యభీష్టము సిద్ధింప నేరదు.

అట్లే "ఇంద్రియారామః" అనుచోట సాధనములగు ఇంద్రియములయందు ఆరామత్వమును ఆరోపించుట విరుద్ధము. ఆరామమనగా విహారస్థానము. కావున శబ్దస్పర్శాది విషయములే విహారస్థానములు. కావున శబ్దాదులయందే ఆరామత్వ మును నిరూపించుట యుచితము కాని, విహారకరణములగు ఇంద్రియములయందు ఆరామత్వమును ఆరోపించుట యుచితముకాదు. విషయభోగాసక్తుడను ఫలితార్థ మును చెప్పుటలో మాకు తాత్పర్యము కాని విహారసాధనము లగు ఇంద్రియములే విహారస్థానము లని చెప్పుటలో మాకు తాత్పర్యము లేదన్నచో ఋజుమార్గమును విడచి వక్రమార్గమును అవలంబించుట యగును.

మరియు జ్ఞానయోగాదుల యందు ప్రవర్తించియు ప్రయత్నము ఫలించనందున వ్యర్థముగా బ్రతుకుచున్నా డనుట కూడ యుచితముకాదు. జ్ఞానయోగమునందు ప్రవర్తించిన సన్న్యాసికి యజ్ఞానుష్ఠానమునం దధికారములేదు. ఎవని కేది విహితమో వాడు దాని ననుష్ఠింపనిచో వ్యర్థముగా బ్రతుకువా డగును. జ్ఞానయోగికి జ్ఞానము విహితము కాని కర్మవిహితముకాదు. కర్మనాచరింపనందున జ్ఞానయోగి వ్యర్థజీవనుడుకా నేరడు.

సన్న్యాసి ఇంద్రియారాము డగుట వ్యర్థపు బ్రతుకని యనదగదు. ఈ ప్రకరణము అజ్ఞానివిషయముకాని, జ్ఞానియగు సన్న్యాసి విషయముకాదు. "యస్త్వాత్మరతిరేవ స్యాత్" అను ముందు శ్లోకముచే జ్ఞానియగు సన్న్యాసియొక్క విషయమును చెప్ప బోవుచున్నాడు. కావున రామానుజభాష్యము సర్వథా అనుచితము. ౧౬

శ్లో. య స్త్వాత్మరతిరేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః
ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే ॥ ౧౭ ॥

అ. ఆత్మజ్ఞాననిష్ఠుడగు నేమానవుడు విషయాదులయం దాసక్తి జెందక ఆత్మయందే ఆసక్తి కలవాడగునో, అన్నరసాదులతో తృప్తిజెందక ఆత్మతోనే తృప్తి చెందునో బాహ్యార్థలాభములని సంతోషము నపేక్షింపక ఆత్మయందే సంతోషము చెందునో, అట్టి మానవునకు చేయదగిన పని యేమియు లేదు. జ్ఞానమార్గమునందు దేవతల కధికారమున్నను కర్మసన్యాసమునందు దేవతలకధికారము లేకుండుటచే శ్రీకృష్ణుడు కర్మసన్యాసపూర్వక జ్ఞానయోగమునందు మానవులకే అధికార మని సూచింపదలచి మూలమున మానవపదమును ప్రయోగించెను.

ఇచట రామానుజులు: ఈ శ్లోకము ముందు చెప్పబోవు "నైవ తస్య కృతేనార్థో" అనుశ్లోకము యీ రెండును ముక్తుని విషయము కాని సన్యాసాశ్రమ విషయము కాదనిరి. వేదాన్తదేశికులు కూడ నట్లే వ్యాఖ్యానించిరి. ఈ భాష్యవ్యాఖ్యానములు రెండును నిస్సారములు. గీతాశాస్త్రము ముముక్షువును గురించి ప్రవర్తించియుండుటచే ముక్తున కిచట ప్రసక్తియే లేదు. వేదాన్తశాస్త్రమునందు ముముక్షువే అధికారికాని ముక్తుడు అధికారికాడు. ఆత్మతుష్టి స్థితప్రజ్ఞలక్షణము. స్థితప్రజ్ఞుడు జ్ఞానయోగికాని ముక్తుడు కాడు. దుఃఖములు ప్రసక్తించినపుడు ఉద్వేగము లేకుండుట ముముక్షుధర్మ మగును కాని ముక్తుని ధర్మముకాదు.

మరియు మూలము నందలి "మానవః" అను పదము ముముక్షువును బోధించును కాని ముక్తుని బోధింపనేరదు. ముముక్షువునకు మానవత్వాది దేహధర్మములంటి యుండునుకాని ముక్తుల కుండనేరవు. ముక్తులలో మానవులు, అసురులు, దేవతలు అను విభాగము లేదు.

మరియు 'ఆత్మరతిరేవ' అను పదమునందలి విషయరతిని నిషేధించునట్టి ఏవకారము రామానుజమతమునందు కుదరదు. ముక్తిదశలో విషయముల ప్రసక్తియే లేనపుడు తన్నివృత్తికొరకు ఏవకారము వ్యర్థమగును. ఇక ముక్తియనగా వైకుంఠలోకమనియు అందు అప్రాకృతవిషయములు కలవనియు ననినచో అపుడు అప్రాకృత విషయములచే నింద్రియములు లాగబడుచుండ ముక్తుడు విషయరతుడే యగును కాని, ఆత్మరతుడు కానేరడు. వైకుంఠలోకమునందు ముక్తులకు అప్రాకృత విషయభోగము లేనిచో భోగ్యములుకాని యా విషయములను పరమేశ్వరుడు సృజించుట వ్యర్థమగును. పైగా, నిరర్థకవస్తువులను సృజించు విష్ణువు అప్రమాణుడగును.

మరియు వేదాన్తదేశికులు యీ శ్లోకమునకు భాష్యవ్యాఖ్యాన మొనర్చుటలో సన్యాసులకుకూడ వర్ణాశ్రమ ధర్మములు కల వనిరి. అది అయుక్తము. కుటీచకాదులకు దండతర్పణాది ధర్మములున్నను పరమహంసల కట్టి ధర్మములులేవు. పరమహంసలు తరుతలవాస కరతలభిక్షాదులతో కాలమును గడపు నివృత్తినిష్ఠులు.

నివృత్తికూడ ధర్మమే యని యనరాదు. ఇట్టి నివృత్తిధర్మము ముక్తులయందునూ కూడ సంభవించును. కావున వేదాంతదేశికుల వ్యాఖ్యానము నిస్సారము.

శ్లో. నైవ తస్య కృతేనార్థో నాకృతే నేహ కశ్చన
నచాస్య సర్వభూతేషు కశ్చి దర్థవ్యపాశ్రయః ॥ ౧౮ ॥

అ. ఆత్మరతుడగు సన్యాసికి కర్మల ననుష్ఠించి సాధింపదగిన ఫల మేమియు లేదు. కర్మలను మానినందున వచ్చెడు ప్రత్యవాయమున్ను లేదు. మరియు బ్రహ్మాది స్థావరాంతభూతములలో నేభూతమును ఆశ్రయించియు ఆత్మనిష్ఠుడు పొందదగిన ప్రయోజనము లేదు. అనగా బ్రహ్మరుద్రాదులను ధ్యానించి పొందదగిన సత్య లోక కైలాసాది రూపఫలముకాని, రాజును, ధనికులను ఆశ్రయించి పొందదగిన భూమి, ధనము మొదలగు ఫలముకాని, సాగరయాత్ర చేసి సంపాదింపదగిన పుణ్యము కాని, అశ్వత్థప్రదక్షిణాదులతో పుత్రసంతానాదుల నొందుటకాని యెద్దియు నాత్మ జ్ఞాని కుండ నేరదని భావము.

శ్లో. తస్మా దసక్త స్సతతం కార్యం కర్మ సమాచర
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః ॥ ౧౯ ॥

అ. ఓయి అర్జునా? నీకు జ్ఞానయోగమునం దధికారము లేకుంటచే నీవు సంగరహితుడ వగుచు నెల్లపుడు నిత్యకర్మను ఆచరింపుము. బంధప్రాపకములగు కామ్యకర్మల నాచరింపకుము. సంగరహితుడై ఈశ్వరార్పణబుద్ధితో కర్మల నాచ రించు పురుషుడు చిత్తశుద్ధిద్వారా పరబ్రహ్మను పొందును.

ఇచట రామానుజులు పరశబ్దమునకు జీవు డని యర్థమును రచించిరి. అయ్యది యనుచితము. వారిమతమున జీవుడు బ్రహ్మస్వరూపుడు కాకుండుటచే. కర్మల నాచరించు జీవుడు పరశబ్దవాచ్యుడగు జీవుని పొందుట నిష్ఫలమగును. ౧౯

శ్లో. కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః
లోకసంగ్రహమేవాఽపి సంపశ్యన్కర్తు మర్హసి ॥ ౨౦ ॥

అ. "అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః" — (ఫలమునం దాసక్తిలేక కర్మల నాచరించువాడు ముక్తినొందునని) పూర్వశ్లోకమున చెప్పబడినది. అందు ప్రమాణ మేమియని శంకరాగా జనకాదులే ప్రమాణ మని భగవానుడు చెప్పుచున్నాడు.

జనకాదులు చిత్తశుద్ధిద్వారా కర్మతోనే ముక్తిచెందిరి. కాని కర్మసన్యాసము వలన కాదు. అని యొక యర్థము.

భాష్యకారులు "కర్మణాసహైవ" (కర్మలతోడనే) అని చెప్పుటచే కర్మ యోగమువలన జ్ఞానయోగము, జ్ఞానయోగమువలన ముక్తి అనుక్రమమున్ననూ

జనకాదులు జన్మాన్తరమునం దనుష్ఠించిన జ్ఞానయోగముయొక్క మాహాత్మ్యముచే పై క్రమము ననుసరింపకయే ముక్తినొందిరని స్పష్టమగుచున్నది.

ఇయ్యది రహస్యము. వేదాన్తశ్రవణాదులచే పరోక్షముగా బ్రహ్మను తెలిసికొని విద్వాంసులు జ్ఞానయోగమునందు ప్రవర్తించుచున్నారు. జ్ఞానయోగము సిద్ధించినచో బ్రహ్మాపరోక్షజ్ఞానము కలిగి ముక్తి నొందుదురు. అయ్యది సిద్ధింపనిచో నపక్వజ్ఞానులగుచు ముక్తినొందక మరియొక జన్మమును పొందుచున్నారు. ఆ జన్మమునందు జ్ఞానయోగము లేకుండగను కొందరు కర్మయోగముకూడ లేకుండగను వేదాన్తశ్రవణమాత్రము చేతనే ముక్తి నొందుదురు. కావున నిట్టి వారలకు కర్మసన్యాసము లేకయే ముక్తి లభించును.

శుకుడు మొదలగు కొందరు జ్ఞానులు ప్రారబ్ధకర్మబలమున కర్మమార్గమునందు ప్రవర్తింపకున్నను కొందరు మాత్రము లోకసంగ్రహార్థమై కర్మల నాచరించెదరు. ప్రారబ్ధకర్మానుసరణము జ్ఞానులకు కూడ అనివార్యము. కావున జ్ఞానులలో కొందరు కర్మయోగమునందు, మరికొందరు తపోయోగమునందు, కొందరు గ్రంథరచనయందు, కొందరు వ్యవహారమునందు, కొందరు వ్యాపారమునందును ప్రారబ్ధవశమున ప్రవర్తించుచుందురు. అంతమాత్రమున వారు బంధమునొందరని గ్రహింపనగును.

మూలమున "కర్మణాసహైవ" కర్మలతోకూడనే జనకాదులు ముక్తినొందిరని చెప్పియుండుటచే కర్మకుకూడ ముక్తియందు ప్రవేశము లభించును. నిష్క్రియబ్రహ్మరూపమగు ముక్తిలో కర్మచేరుట అనిష్టము కనుక జనకాదులు కర్మలతోకూడ ముక్తిని పొందుటకు ప్రవర్తించిరని చెప్పవలయును. ఇయ్యది రెండవ యర్థము.

మరియు "కర్మణాసహైవ" కర్మలతోడనే అని చెప్పుటచే కర్మలను సన్యసింపకయే అను నర్థము లభించుటచే జనకాదులు సన్యాసమును స్వీకరింపక కర్మయోగమునందుండియే జన్మాన్తరీయమగు ప్రారబ్ధబాహుళ్యవశమున అపరోక్ష బ్రహ్మసాక్షాత్కారము కలిగి ముక్తినొందిరని యర్థమగుచున్నది. ఇయ్యది మూడవయర్థము.

ఇక "సంసిద్ధిమాస్థితాః" అనుచోట సంసిద్ధి పదమునకు చిత్తశుద్ధి యనునర్థమును చెప్పి చిత్తశుద్ధిని పొందిరని నాల్గవయర్థము. పరబుద్ధి అప్రత్యక్షమగుటచే జనకాదులు సమ్యగ్జ్ఞానమునుపొంది రని నిశ్చయింప నలవికానందున పక్షాంతరము నంగీకరించి భాష్యకారు లీ తుదియర్థమును ప్రతిపాదించిరి.

ఓయి! జనకాదులు సమ్యగ్జ్ఞానమును పొందిరనుటలో ప్రమాణము లేదు. జనక యాజ్ఞవల్క్యుల ప్రశ్న ప్రతివచనములు పరోక్షజ్ఞానమును సాధించుటయందే పర్యవసన్నము లగుచున్నవి. పైగా అజ్ఞానివిషయములగు కర్మల నాచరించుటచే

జనకాదులు సమ్యగ్జ్ఞానమును పొందలేదనుటకే బలవంతమగు ప్రమాణము కలదు. 'నాకు మాత్రము యింతవరకుండు సమ్యగ్జ్ఞానము లేకున్నను, నీ యుపదేశమాహాత్మ్యముచే నిపుడు తత్వజ్ఞానమును పొందితిని. కావున నేను యుద్ధమును కాని మరియొక కర్మనుగాని చేయను' అను పార్థుని మతమును ఆశంకించుకొని శ్రీకృష్ణుడు "లోకసంగ్రహ మేవాపి" అను ఉత్తరార్థమును చెప్పెను.

ఓయి అర్జునా! జనకులు మొదలగు ప్రాచీనులు అజ్ఞాను లయి తత్వజ్ఞానములేక కర్మలు చేసిరి. నేను జ్ఞానిని, కృతకృత్యుని కనుక నాకు కర్మలతో పని లేదని నీవు తలచెదవేమో అట్లు తలంచకుము. ప్రారబ్ధకర్మాయత్తుడవగు నీవుకూడ లోకులు అధర్మమార్గమున ప్రవర్తించకుండ నుండవలెనని యాలోచించి యయినను యుద్ధమాచరింపవలెను. ౨౦

శ్లో. యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః
స య త్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే ॥ ౨౧ ॥

అ. విద్యావృద్ధులు వయోవృద్ధులు అగు పెద్దలు దేని నాచరింతురో ఇతరులు కూడ దానినే ఆచరింతురు. అట్టి పెద్దలు ఏ శాస్త్రము ప్రమాణముగా స్వీకరింతురో మిగిలినవారుకూడ దానినే ప్రమాణముగా గైకొందురు. ౨౧

శ్లో. న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి ॥ ౨౨ ॥

అ. ఓయి అర్జునా! నన్ను దృష్టాంతముగా జూచుకొని లోకోపకారము కొరకు కర్మల నాచరించుటలో నీకుగల సంశయము బాపుకొనుము. (విప్రతిపత్తిని పోగొట్టుకొనుము). పొందబడని ఫలమును పొందుటకు కర్మను చేయుట లోకములో ప్రసిద్ధముకదా? పొందబడని స్వర్గాదులను పొందుటకుకదా మానవులు జ్యోతిష్టోమాదుల నాచరించుచుండిరి? సమస్త కోరికలను పొందియుండి పరిపూర్ణుడ నగు నేను దేని నుద్దేశించి కర్మమార్గము నవలంబించుచుంటిని? ఏదియో యొక యవతారమునెత్తి అందొకానొక కర్మను ఆచరించుచుంటినిగదా? ఇందుకు లోకసంగ్రహమే ఫలముకాని వేరొండులేదు. అట్లే నీకును కర్మానుష్ఠానము తప్పదని భావము.

శ్లో. యది హ్యహం న వర్తేయం జాతు కర్మ ణ్యతంద్రితః
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః ॥ ౨౩ ॥

అ. భగవంతుడు కర్మమార్గమున ప్రవర్తించనందున కలిగెడి యనర్థమును జెప్పుచున్నాడు.

ఓయి అర్జునా! నేను అలసుడనై కర్మమార్గము నవలంబింపనిచో మనుష్యులందరు నామార్గమునే అనుసరింతురు. ౨౩

శ్లో. ఉత్సీదేయు రిమే లోకాః నకుర్యాం కర్మచే దహం
సంకరస్య కర్తా స్యా ముపహన్యా మిమాః ప్రజాః ॥ ౨౪ ॥

ఓయి అర్జునా! నేను కర్మను చేయకున్నచో లోకులు నరకమును పొందుదురు. యజ్ఞముచేయుట బ్రాహ్మణధర్మము, యుద్ధము క్షత్రియధర్మము; గోరక్షము వైశ్యధర్మము; సేవ శూద్ర ధర్మము; గురుకులవాసము బ్రహ్మచారిధర్మము; వైశ్వదేవాదులు గృహస్థాశ్రమధర్మములు; వనవాస తపోనుష్ఠానములు వనప్రస్థ ధర్మము. భిక్షాటనాదులు యతిధర్మములు. ఇట్టి వర్ణాశ్రమ ధర్మములు కూడ లోపించును. ఇట్లు మానవులకు నరకపాతాది దుఃఖములను కలుగచేసినవాడ నగుదును. కనుక నేను పరమాత్మను, సర్వజ్ఞుడను అయినను క్షత్రియజాతికి గృహస్థాశ్రమమునకు దగిన కర్మల నెట్లు లోకసంగ్రహముకొరకు చేయుచుంటినో, అట్లే నీవుకూడ నీజాతికి విహితమగు యుద్ధమును చేయుము. ౨౪

శ్లో. సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత
కుర్యా ద్విద్వాన్ తథాసక్తః చికీర్షు ర్లోకసంగ్రహమ్ ॥ ౨౫ ॥

అ. నేను కృతార్థుడను అను బుద్ధిగలవాడు కృతార్థబుద్ధి యనబడును. లేక పరమార్థమగు ఆత్మతత్వమును బుద్ధితో సాక్షాత్కారము చేసికొనినవాడు, లేక కృతకృత్యమయిన బుద్ధిగలవాడు అనియు చెప్పనచ్చును. కృతకృత్యుడనగు నే నెట్లు లోకానుగ్రహముకొరకు కర్మల నాచరించుచుంటినో కృతార్థుడవయినను నీవుకాని నీవలె ఇతరుడుకాని లోకానుగ్రహముకొరకు కర్మను ఆచరించియే తీరవలయును. కావున ఓయి అర్జునా! అజ్ఞానులు కర్మఫలములయందు దాసక్తిగలవారై యెట్లు కర్మల నాచరించుచున్నారో అట్లే ఆత్మజ్ఞానులుకూడ కర్మఫలమునం దాసక్తిని విడచి లోకసంగ్రహబుద్ధితో కర్మను చేయవలయునని తాత్పర్యము. ౨౫

శ్లో. న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినాం
జోషయే త్సర్వకర్మాణి విద్వాన్ యుక్తస్సమాచరన్ ॥ ౨౬ ॥

అ. విద్వాంసుడు కర్మఫలమునం దాసక్తిగల అజ్ఞానులయొక్క బుద్ధిని చలింప చేయకూడదు. తాను పట్టుదలతో కర్మల నాచరించుచూ అజ్ఞానులచే కూడ కర్మను చేయింపవలెను. ఆత్మవేత్తలగు వారికి లోకసంగ్రహముకంటె వేరు ప్రయోజనము లేదు. వారు లోకసంగ్రహార్థమే కర్మల నాచరించుచుందురు. కనుక అర్జునా! నీవును ఆత్మవేత్తవయినప్పటికి లోకసంగ్రహార్థము కర్మ నాచరింపవలయునని నా యుపదేశము. పురుషులకు మొట్టమొదటనే జ్ఞానయోగమునం దధికారము లేకుండుటచే మొదట కర్మలయందు ప్రవృత్తి కలుగును. జ్ఞాని కర్మలను నిందించినచో అజ్ఞాని కర్మలనుండి స్వయముగానే నివర్తించును. కాని జ్ఞానయోగమునందు

ప్రవర్తింప సమర్థుడు కానేరడు. అందుచే నుభయ భ్రష్టు డగును. కావున కర్మలను నిందించి యజ్ఞాదుల బుద్ధిని చెడగొట్టకూడదు. ౨౬

శ్లో. ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః,
అహంకార విమూఢాత్మా కర్తాఽహ మితి మన్యతే ॥ ౨౭ ॥

అ. ప్రకృతియొక్క గుణములచే చేయబడుచున్న కర్మలను అన్ని విధముల దేహేంద్రియాదులయందు అహం మమాభిమానముగల మూఢుడు నేనే కర్తనని తలంచును.

"ఈక్షతే ర్నాశబ్దం" అను సూత్రమునందు వ్యాసులు సాంఖ్యశాస్త్రప్రసిద్ధ మగు ప్రధానమను తత్త్వమును శ్రుతిసమ్మతము కాదని నిరాకరించిరి. ఈ శ్లోకము నందు చెప్పబడిన ప్రకృతి యా ప్రధానమను తత్త్వము కాదు. ఈయది మాయ. ఇదియును సత్వరజస్తమోగుణములు కలదియే. ప్రళయకాలమునందు యీ మూడు గుణములు దీనియందు లీనమయి సమానముగా నుండును. అప్పుడు దీనికి ప్రకృతి యని పేరు. సృష్టిప్రారంభమున నీ ప్రకృతి యొక్క గుణము కదలిక చెందును. అదియే గుణగుణ క్షోభమనియు సత్త్వాదిగుణములయొక్క ఉత్పత్తియు చెప్పబడును.

దేహేంద్రియాదులయం దాత్మబుద్ధి యహంకార మనుటచే బ్రహ్మాయం దాత్మబుద్ధి అహంకారము కాదని తేలుచున్నది. మానవు లిట్టి యహంకారముచే నేను స్థూలుడను, నేను గ్రుడ్డివాడను, రోగిని, బాధపడువాడను అని అనేకవిధముల వ్యామోహమును చెందుచున్నారు.

అహంకారముచే దేహేంద్రియాదులయందు అహంమమాభిమానముకలవాడు భ్రాంతిచే ఆత్మయందు కర్మలు కలవని తలంచుచూ దేహేంద్రియాదులచే చేయ బడు కర్మలయందు తాను కర్తనని యనుకొనును. దేహము నడచుచుండగా తాను నడచుచున్నాననియు, కన్నుచూచుచుండ తాను చూచుచున్నాననియు, మనసు దుఃఖింపు చుండ తాను దుఃఖింపుచున్నాననియు దేహాది తాదాత్మ్యాధ్యాసవలన పురుషుడు తలచుచున్నా డని తాత్పర్యము. ౨౭

శ్లో. తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మ విభాగయోః
గుణాగుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే ॥ ౨౮ ॥

అ. ఓయి! బాహుపరాక్రమముకల అర్జునా! గుణవిభాగముయొక్కయు, కర్మవిభాగముయొక్కయు, యథార్థస్థితిని తెలిసినవాడు ఇంద్రియములు విషయాత్మకములగు గుణములయందు (అనగా శబ్దస్పర్శాది విషయములయందు) ఉంటున్న వని తలచి వాటియం దాసక్తిని పొందడు. భగవంతు డగు శ్రీకృష్ణుడు పదునాల్గవ యధ్యాయమునందు "సత్త్వా త్సంజాయతే జ్ఞానం" అను మొదలగు శ్లోకములచే

గుణకర్మలవిభాగమును, యీ విభాగమును గుర్తెరింగినవాడు తాను కర్తననుకొనక ముక్తినొందుననియును చెప్పబోవుచున్నాడు. ఆ విషయమే ఇచటకూడ చెప్పబడి నది. ఇంద్రియరూపముగా పరిణమించిన సత్వాది గుణములు శబ్దస్పర్శాది విషయ రూపముగా పరిణమించిన సత్వాదిగుణముల యందున్నవని తాత్పర్యము.

లేక “ గుణాస్త్వావృత్తి శబ్దాద్యేన్ద్రియా ముఖ్యతంతుషు ” అను అమరకోశము వలన గుణశబ్దమునకు ఇంద్రియములు అర్థము, కర్మశబ్దమునకు ఇంద్రియవ్యాపార ములు అర్థము. ఈ ఇంద్రియమునకు ఇయ్యది పని అని విభాగమును తెలుసుకొనిన వాడు అని యర్థము. శ్రీధరాచార్యులవారు గుణకర్మలనుండి యాత్మకు గల విభాగములను తెలిసినవాడని యభిప్రాయపడిరి. ఎట్లయినను గుణకర్మవిభాగమును దెలిసినవాడు తాను కర్తనని యనుకొనడు. ౨౮

శ్లో. ప్రకృతే ర్గుణసంమూఢా స్సజ్జన్తే గుణకర్మసు తాన్
అకృత్స్నవిదో మందాన్ కృత్స్నవి న్నవిచాలయేత్ ॥ ౨౯ ॥

అ. ప్రకృతియొక్క సత్వాదిగుణములచే మోహముచెందిన మానవులు గుణకార్యములగు యజ్ఞాదులందు సంగము నొందుచున్నారు. ఆత్మవేత్త లట్టి మూఢుల చిత్తములను చలింపచేయకూడదు. అట్లైతెరి వారు జ్ఞానకర్మల రెంటికి దూరులగుదు రని భావము. ౨౯

శ్లో. మయి సర్వాణి కర్మాణి సన్యస్యాధ్యాత్మచేతసా
నిరాశీ ర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః ॥ ౩౦ ॥

అ. ఓయి యర్జునా ! స్వయంప్రకాశరూపుడను, పరమేశ్వరుడను, సర్వజ్ఞు డను, సమస్త భూతములకు ప్రత్యగ్రూపముతో నాత్మభూతుడను అగు నాయందు అధ్యాత్మజ్ఞానముతో సర్వకర్మలను యుంచి పరమేశ్వరుని కొరకు నేను భృత్యుడనై కర్మల జేయుచుంటి నని తలచి యహంకార మమకారములను విడచి యుద్ధము చేయుము.

తత్వదృష్టిలో ఆత్మనిష్ఠులుడు, నిష్క్రియుడు, శాన్తుడు, పరిపూర్ణానన్ద రూపుడు అయినను స్వర్గాదులకొరకు కర్మలచేయువానికంటె ఈశ్వరుడొకండు కలడనియు వేదరూపమగు వాని యాజ్ఞచే మనము కర్మలు చేయవలెననియు కోరు వాడు వివేకియే యగును. వీనిబుద్ధి వివేకబుద్ధియే యగును. దీని నే యధ్యాత్మచేతస్సు అని భాష్యకారులు వాడిరి. అధ్యాత్మచేతస్సు అనగా పరమాత్మవిషయకజ్ఞాన మని యర్థము. ౩౦

శ్లో. యే మే మత మిదం నిత్య మనుతిష్ఠంతి మానవాః
శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేఽపి కర్మభిః ॥ ౩౧ ॥

అ. ఏ మానవులు శ్రద్ధగలవారై అసూయభావమును విడచి కర్మ చేయవలె నను నామతమును అనువర్తింపుచున్నారో వారుకూడ పుణ్యాపుణ్యములతో విముక్తు లగుచున్నారు. పుణ్యాపుణ్యముల వలన కలుగు సంసారబంధమును వదలి మోక్షమును పొందుచున్నారని భావము. 31

శ్లో. యే త్వేత దభ్యసూయంతో నానుతిష్ఠంతి మే మతమ్
సర్వజ్ఞాన విమూఢాం స్తాన్ విద్ధి నష్టా నచేతసః ॥ 32 ॥

అ. ఓయి యర్జునా! ఎవరు నాయం దసూయాభావము నొంది యీ కర్మమార్గమును అనుష్ఠింపరో వారెవ్విధమగు జ్ఞానమును లేక నశించిన యవివేకులని గ్రహింపుము. 32

శ్లో. సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవా నపి
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి ॥ 33 ॥

అ. ఎంతటి వివేకశాలి యయినను జన్మాంతరీయమగు తన ప్రకృతికి అనుకూలముగానే ప్రవర్తించుచున్నాడు. సమస్తభూతములు ప్రకృతిని పొందియే యున్నవి. అందు జీవునియొక్కగాని యీశ్వరునియొక్కగాని నిగ్రహ మెంతమాత్రము పనికిరాదు.

పూర్వజన్మమునందు పురుషులు సంపాదించిన పుణ్యాపుణ్యములు వారి యాత్మయందు సంస్కారరూపముగా నుండును. ఉత్తరజన్మమునందలి యుద్బుద్ధములగుచు పురుషునియొక్క సంసారమున కనుగుణముగా మంచిపనియందుగాని, చెడుపనియందుగాని ప్రవర్తింపచేయును. ఈశ్వరుడే యిట్టిసామర్థ్యమును యీసంస్కారమున కిచ్చినందున దీనిని నిగ్రహింప మరలి యీశ్వరునకు గాని మరియొకరికి గాని సామర్థ్యములేదు. 33

శ్లో. ఇంద్రియ స్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ
తయోర్న వశ మాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపంథినౌ ॥ 34 ॥

అ. సర్వజనులు తమతమ ప్రకృతి కనుకూలముగనే ప్రవర్తించుచుండ పురుషప్రయత్నమున కవకాశమే లేనందున శాస్త్రము వ్యర్థమను శంకరాగా సమాధానమును చెప్పుచున్నాడు.

ఇంద్రియగోచరములగు శబ్దాది విషయములలో ప్రతిదానియందును రాగద్వేషములు తప్పక కలవు. అట్టి రాగద్వేషములకు స్వాధీనము కాకూడదు. రాగద్వేషములే పురుషులకు శ్రేయోవిఘాతకములు. ధర్మాధర్మసంస్కారరూపమగు ప్రకృతి వ్యవహారదశలో నశింపనేరదు. ముక్తిపర్యంతము నిల్వయుండును. పురుషప్రయత్నము ప్రకృతిని నిగ్రహింపలేనందున పురుషుడు తన ప్రకృతికనుకూలముగనే

ప్రవర్తించుచుండును. శాస్త్రమును చదివియు శాస్త్రమునందు చెప్పినట్లు నడువ
జాలడు. కావున శాస్త్రము వ్యర్థమని భావము.

ఇయ్యది సమాధానము. పురుషుడు తనయొక్క ధర్మాధర్మసంస్కారముల కను
గుణముగా సత్కర్మయందుగాని దుష్కర్మయందుగాని, రాగద్వేష పూర్వకముగానే
ప్రవర్తించును. ఎవ్వడనురాగములేకుండ పాపసంస్కారమాత్రముచే పర
దారాగమనమునందు ప్రవర్తింపడు. ద్వేషములేకుండ తన భార్యను విడువడు. అట్లే
అనురాగములేక కేవల పుణ్యసంస్కారమాత్రముచే తనభార్యను పొందుటకు ప్రవ
ర్తించడు. ద్వేషములేకుండ పాపసంస్కారమాత్రముచే పరస్త్రీగమనమును విడు
వడు. కావున నట్టిరాగద్వేషములకు స్వాధీనము కాకుండుటయే పురుషకారమునకు
ఫలము. ఇట్టి పురుషప్రయత్నము శాస్త్రాధీనమగుటచే శాస్త్రము వ్యర్థముకానేరదు.

ఓయి! పురుషునకు పుణ్యసంస్కారమువలన మంచివిషయమునం దను
రాగము, పాపసంస్కారమువలన చెడుపనియందు ద్వేషమున్ను కలుగుచున్నది. రాగ
ద్వేషములు కలిగిన తరువాతనే వాడు వాటియందు ప్రవర్తించుచున్నాడు. కనుక
రాగద్వేషములు పుట్టుటకు కారణ మగు ధర్మాధర్మ సంస్కారముండగా పురుష
ప్రయత్నముచే రాగద్వేషములు పుట్టకుండుట సంభవింపదని ప్రశ్నింపరాదు. మేము
రాగద్వేషములయొక్క ఉత్పత్తిని నివారించుటలేదు. పుట్టిన రాగద్వేషములను
పురుషకారముచే నడగించుటనే చెప్పుచున్నాము. కట్టెనుంచి పుట్టిన నిప్పువలన
మంట బయలుదేరకుండ మణిమంత్రాదు లెట్లు నిప్పును అడగించుచున్నవో, అట్లే
ప్రకృతివలన పుట్టిన రాగద్వేషములు ప్రవృత్తిని కలుగచేయకుండ వాటిని యడ
గించుటయే పురుషకారమునకు ఫలము. మరియు రాగద్వేషములను పుట్టించునట్టి
ప్రకృతియే ప్రవృత్తినికూడ కలుగచేయు ననియు, అట్టి ప్రకృతిని నిగ్రహింప శక్యము
కాదనియు, కనుక పురుషకారమునకు విషయమే లేదనినచో నదియు సమంజసము
కాదు. ధర్మాధర్మసంస్కారరూపమగు ప్రకృతి, శబ్దాది విషయములయందు రాగ
ద్వేషములను మాత్రమే పుట్టించునుకాని; కార్యమునందు ప్రవృత్తిని కలుగజేయ
నేరదు. ప్రకృతికి నట్టి సామర్థ్యము కూడ నున్నచో, నీచునకుగూడ రాజకుమార్తె
యం దనురాగముండుటచే నామెను పొందుటకు ప్రవృత్తిగూడ యనురాగమువలన
నాతనికి కలుగవలసి వచ్చును. అట్లు కలుగుటలేదు. పైగా రాజకన్యను చూచి యను
రాగమును పొందికూడ, నేనెక్కడ? రాచకూతురెక్కడ? అని విమర్శించుకుని ఆ
యనురాగమును కూడ విడచుచున్నాడు. అంతియెకాని రాజకన్యనుపొందుట కెంత
మాత్రము ప్రయత్నింపడు. కావున నిట్టియెడ, ప్రకృతివలన బుట్టిన యనురాగము
పురుషప్రయత్నరూపమగు విమర్శనాజ్ఞానముచే నివృర్తించుచున్నది. ఇట్టి విమర్శన
రూపమగు పురుషకారములేనివాడు ప్రవర్తించుచూ రాజభటులచే కొట్టబడు

చున్నాడు. కావున పురుషకారము స్వభావజన్యమగు అనురాగమును పుట్టకుండ చేయలేదు. పుట్టిన అనురాగమునుమాత్రము పురుషకారము మరల్చును. పురుష కారముచే ననురాగమును మరల్చుకొన్నచో ప్రవృత్తి కలుగదు. మరల్చుకొననేర నిచో కార్యాకార్యములయందు ప్రవృత్తి కలుగును. కనుక పురుషకారమునకు రాగ ద్వేషములను వశపరచుకొనుట యను ప్రయోజనము కలదు.

పాపసంస్కారమువలన పురుషునకు పరధర్మమునందు అనురాగము, స్వధర్మ మునందు ద్వేషము ఎప్పుడు ఉదయించునో అపుడు స్వధర్మత్యాగము, పరధర్మాను ష్ఠానము పురుషునకు కలుగును.

పుణ్యసంస్కారమువలన స్వధర్మమునం దనురాగము, పరధర్మమునందు ద్వేషము ఎప్పుడు కలుగునో అపుడు పురుషునకు స్వధర్మానుష్ఠానము, పరధర్మ త్యాగమున్ను కలుగును.

ఓయి! పురుషుడు పురుషప్రయత్నమువలన పుణ్యసంస్కారముచే కలిగెడి రాగద్వేషములను నియమించుకొనినచో స్వధర్మమునందు ప్రవృత్తియు, పరధర్మము నందు నివృత్తియు నాతనికి కలుగనేర దనినచో నట్లుకాదు. పుణ్యసంస్కారమువలన స్వధర్మమునందు రాగము, పరధర్మమునందు ద్వేషము కలుగగా విద్వాంసుడు పురుషకారముచే నారాగద్వేషములను నియమించుకొనియే స్వధర్మమునందు ప్రవ ర్తించుచున్నాడు. పరధర్మమునుంచి నివర్తించుచునూ యున్నాడు.

అట్లుగాక రాగద్వేషపూర్వకముగా ప్రవర్తించినచో కర్మఫలము అవశ్యము అనుభవించవలసివచ్చును. లేక పుణ్యాపుణ్య సంస్కారములవలన కలిగెడు అనుకూల విషయమునందలి రాగముచేతను, ప్రతికూలవిషయమునందలి ద్వేషముచేతను పురు షునకు స్వధర్మ పరిత్యాగము, పరధర్మానుష్ఠానము కలుగుచున్నది.

అదెట్లన బ్రాహ్మణులకు యజ్ఞమును చేయుట, చేయించుట మున్నగునవి స్వధర్మము. రాజ్యపరిపాలనాదులు పరధర్మము లయినను ఇయ్యవి యిష్టములు. వీనియం దనురాగముచే బ్రాహ్మణుడు పరధర్మమగు యుద్ధమునందు ప్రవర్తించు చున్నాడు. అట్లే ఉపవాసాదులు అనిష్టములు (ప్రతికూలములు). వీటి యందలి ద్వేషముచే బ్రాహ్మణుడు స్వధర్మమును విడచుచున్నాడు. క్షత్రియునకు యుద్ధము స్వధర్మము. భిక్షాన్నభోజనాదులు సులభము లగుటచేతను వెనుకటి జన్మమునందలి పాపసంస్కార బలమువలనను అనుకూలము లగును. వీటియం దనురాగముచే క్షత్రి యుడు పరధర్మమగు (బ్రాహ్మణధర్మమగు) భిక్షాటనాదులయందు ప్రవర్తించు చున్నాడు. రాజ్యభోగము ప్రతికూల విషయము. ఇందు ద్వేషముచే స్వధర్మమగు రాజ్యపాలనమును విడచుచున్నాడు.

శ్లో. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥ 35 ॥

అ. గుణవంతమయినను పరధర్మము ననుష్ఠించుట కంటె గుణరహిత మయినను స్వధర్మము ననుష్ఠించుట ప్రశస్తము. పరధర్మము నవలంబించి జీవించుట కంటె స్వధర్మము నాచరించి మరణించుట మేలు. కావున ఓయి అర్జునా! నీవు గుణ వంతమయినను భిక్షాన్నమును భుజించి జీవించుటకంటె స్వధర్మమగు యుద్ధమునందు ప్రవర్తించి మరణించుట యయినను మేలు. అట్టితరి స్వధర్మమగు యుద్ధమునందు ప్రవర్తించి జయమునొందుట మేలని వేరుగ చెప్పనేల? అని కృష్ణోపదేశము సూచిత మగుచున్నది.

శ్లో. అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః ॥ 36 ॥

అ. శబ్దస్పర్శాది విషయములను ధ్యానించుటయే సర్వానర్థములకు మూల మని లోగడ కృష్ణుడు చెప్పియున్నను మరల అదే విషయమును అడిగి నిర్ణయించు కొనదలచి యర్జునుడు శ్రీకృష్ణుని ప్రశ్నించుచున్నాడు: ఓయి కృష్ణ! మానవుడు ఎవనిచే ప్రేరేపింపబడుచూ తన కిష్టములేకున్నను బలాత్కారముగా పాపము నాచరించుచున్నాడు?

శ్రీభగవానువాచ :
శ్లో. కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్ ॥ 37 ॥

అ. భగవన్తుడగు శ్రీకృష్ణుడు అర్జునుని ప్రశ్నకు సమాధాన మొసంగు చున్నాడు:

ఐశ్వర్యము, పరాక్రమము, కీర్తి, లక్ష్మి (ధనము), జ్ఞానము, వైరాగ్యము యీ యారును పూర్తిగా కలవాడు భగవన్తుడు (లేక) భూతములయొక్క పుట్టు కను, నాశమును, రాకను, పోకను, జ్ఞానమును, అజ్ఞానమును యీయారింటిని తెలిసినవాడు భగవన్తుడు.

ఓయి యర్జునా! రజోగుణమువలన బుట్టిన ఈ కామము, ఈ క్రోధమున్ను యెంత ఆహారమునయినను భుజించునదియు నెంతటి మహాపాపమునయినను చేయు నవియు నగుచున్నవి. కావున సంసారమునందీ కామమే మహాశత్రువని తలంపుము. కామముయొక్క పరిణామమే క్రోధము గాన నీ రెండు నిచట నభేదముగా చెప్ప బడినవి.

ఇచట భాష్యకారులు "రజోగుణ సముద్భవః" అను పదమునకు నందలి సమాసమును నిరూపించుటలో (రజశ్చ+తద్గుణశ్చ) అని కర్మధారయ సమాసమునే నిరూపించిరి కాని (రజఏవ గుణః) అని యవధారణాపూర్వపదకర్మధారయ సమాసమును నిరూపింపలేదు. అవధారణాపూర్వపదకర్మధారయసమాస మనునది వ్యాకరణశాస్త్రమునందు లేదని భాష్యకర్తల యాశయము.

రజోగుణమువలన కామము పుట్టుననియు కామమువలన రజోగుణము పుట్టుననియు చెప్పవచ్చును.

రాజసేవాదులయందు ప్రవర్తించి దుఃఖించువారలు 'ఆశచే నే నిట్లు చేసితి' నని ప్రలపించుట లోకమునందు చూచుచున్నాము. తృష్ణ, ఆశ, కామము అనునవి సమానార్థములు. కావున కామమువలన రజఃకార్యములందు ప్రవృత్తి లోకసిద్ధము. కామమున కాహారము శబ్దస్పర్శాది విషయానుభవము. ఎంతకాలము విషయముల ననుభవించినను కామమునకు ఇంక చాలునను బుద్ధి యుదయింపదు. పైగా బహుచాకచక్యముతో నింక ననేక విషయముల ననుభవింప ప్రయత్నించును. కావుననే కామము మహాశన మనబడుచున్నది. కనుకనే ఆజ్యాది హవిస్సుతో నగ్నిహోత్రుడు వృద్ధిచెందినట్లు విషయానుభవముతో కామము మరింత వృద్ధిచెందు నని పెద్ద లందురు. ఆశకు మేరలేదని లోకవాడుక కలదు. చూడుడు: శ్లో. నిస్స్వోహ్యేకశతం శతీ దశశతం లక్షం సహస్రాధిపో, లక్షేశః క్షితిపాలతాం క్షితిపతి శ్చక్రేశ వత్సం పదం, చక్రేశః పునరింద్రతాం సురపతిః బ్రహ్మాస్పదం వాంఛతి, బ్రహ్మా విష్ణుపదం హరి శ్శివపదం తృష్ణావధిం కోగతః॥ అని యందురు. దీనియర్థము. దరిద్రుడు నూరురూపాయల నపేక్షించును. నూరుగలవాడు వేయి నపేక్షించును. లక్షాధికారి రాజ్యపదవిని కోరును. క్షితిపాలకుడు సార్వభౌముడు కాగోరును. సార్వభౌముడు ఇంద్రపదము నపేక్షించును. ఇంద్రుడు బ్రహ్మపదమును కాంక్షించును. బ్రహ్మ విష్ణుస్థానమును కోరును. విష్ణువు రుద్రపదమును కోరును. కావున ఆశయొక్క పరమావధిని యెవ్వడు పొందును? అని.

మరికొందరు "అత్యాశ కామవికారము కాదనియు లోభవికారమేననియు మానవుడు ఆకలి దప్పికలతో కామముయొక్క అంతమును పొందును. ఫలోత్పత్తి వలన క్రోధముయొక్క అంతమును పొందును. కాని దిక్కులను జయించియు, భూమండలము నేలియు లోభముయొక్క అంతమును పొందనేరడని భాగవతప్రమాణము కలదనియు నందురు." ఆ మతమున క్రోధమువలె లోభముకూడ కామవికారమే కావున లోభముద్వారా కామము మహాశనమని గ్రహింప నగును. నిజస్థితిలో ఏమాత్రము దాతృత్వగుణము లేనివానియందు 'లుబ్ధు' డను పదము వాడుకలో నుండుటచే లోభ మనగా 'ఉన్న వస్తువును విడువకుండుట' యని చెప్పవల

యును. తృష్ణ యనగా కామమే కావున మహాశనత్వము (అత్యాహారము) కామమునకు స్వాభావికమే నని తెలియవలయును. మహాపాపమునకు కారణమగుటచే కామము మహాపాప్మ యని చెప్పబడినది. కావున పాపాచరణమునకు కామక్రోధములే మూలకారణము లని గ్రహింపవలయును. ॥ ౩౭ ॥

శ్లో. ధూమే నావ్రియతే వహ్ని ర్యథాఽదర్శో మలేన చ
యథోల్బేనావృతో గర్భః తథా తేనేద మావృతమ్ ॥ ౩౮ ॥

అ. ప్రకాశరూపమగు వహ్ని అప్రకాశరూపమగు ధూమము (పొగ)చే గప్పబడినట్లు, మాలిన్యముచే నద్దము కప్పబడినట్లు, జరాయువు (మాయ) చే గర్భము కప్పబడినట్లు కామముచే జ్ఞానము కప్పబడియుండును. అందువలన కామము నిత్యవైరి యగుచున్నది. ॥ ౩౮ ॥

శ్లో. ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా
కామరూపేణ కౌంతేయ దుష్పూరేణానలేన చ ॥ ౩౯ ॥

అ. ఓయి యర్జునా! జ్ఞానికి నిత్యశత్రువయినట్టియు, దుఃఖముతో నిండియున్నట్టియు, తృప్తిలేనట్టియు కామముచే మానవుని జ్ఞానము కప్పబడి యుండును. మానవుడు పాపకర్మ నాచరించుటను పూర్వముకూడ తనకుగల కామము తనకు శత్రువని తెలిసియు కామబలమువలన తా నా పనియందు ప్రవర్తించుచున్నాడు. అజీర్ణరోగముకలవాడు అరటిపండును తినదలచి తనకు కోరిక గలిగినప్పుడే దీనివలన తనకు అనర్థము కలుగునని తెలుసుకొనుచున్నాడు. అట్లే కామము నిత్యశత్రువని తెలిసియుండియే మానవుడు కామబద్ధుడై పాపకృత్యమునందు ప్రవర్తించుచున్నాడు.

శ్లో. ఇంద్రియాణి మనోబుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే
ఏతై ర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్ ॥ ౪౦ ॥

అ. కామమునకు జ్ఞానకర్మేంద్రియములు, మనోబుద్ధులు అధిష్ఠానము లగుచున్నవి. ఇంద్రియమనోబుద్ధుల నాశ్రయించియుండు కామము పురుషున కాత్మానాత్మవివేకము (జ్ఞానము)ను కృత్యాకృత్యజ్ఞానమును అణచివైచి పురుషుని శబ్దస్పర్శాదివిషయములయందును సుఖదుఃఖాదులయందును ప్రవర్తింపచేసి వాటియందనేక విధములైన వ్యామోహమును పుట్టించుచున్నది. ౪౦

శ్లో. తస్మాత్త్వ మింద్రియా ణ్యాదౌ నియమ్య భరతర్షభ
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్ ॥ ౪౧ ॥

అ. కావున నోయి అర్జునా! నీవు మొదట ఇంద్రియములను నిగ్రహించుకొని పిదప శ్రేయఃప్రాప్తికి హేతువులగు జ్ఞానవిజ్ఞానములను రూపుమాపునట్టి కామ

మును ఛేదించుము. గురువులవలనను, శాస్త్రమువలనను సంపాదించుకొనిన ఆత్మజ్ఞానము జ్ఞానమనబడును. అపరోక్షాత్మ సాక్షాత్కారము విజ్ఞాన మనబడును. ఈ రెంటికిని కామము ప్రబలశత్రువు. దీనిని చంపుకొననిదే మానవు డెవ్విధమగు శాంతిని పొంద నేరడు.

శ్లో. ఇంద్రియాణి పరాణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః
మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః ॥ ౪౨ ॥

అ. పూర్వశ్లోకమునందు ఇంద్రియములను నిగ్రహించుకొని కామ మను శత్రువును జయింపు మని చెప్పబడినది. ఎవరిని యాశ్రయించుకొని శత్రుజయమును చేయువలెను? అను శంకరాగా సమాధానము యీ శ్లోకమున చెప్పబడుచున్నది. దేహము స్థూలము, బాహ్యము, పరిచ్ఛిన్నమును అగుచున్నది. ఇంద్రియములు దేహముకంటె సూక్ష్మములు, అంతస్థితములు, వ్యాపకములును అగుచున్నవి. కావున దేహముకంటె నింద్రియములు గొప్పవగుచున్నవి. మనోవశ్యములగు ఇంద్రియములకంటె మనస్సు గొప్పది. సంకల్పవికల్పాత్మక మగు మనసుకంటె నిశ్చయాత్మక మగు బుద్ధి గొప్పది. దేహము మొదలు బుద్ధివరకు నుండు తత్వము లన్నిటికంటె లోపలవాడును దృశ్యపదార్థముల నన్నిటిని చూచునట్టి యాత్మ బుద్ధికంటె గొప్పవాడు. ఈ శ్లోకముచే ఆత్మ సర్వాన్తర్యామి యనియు, సర్వద్రష్ట యనియు, సర్వాధిను డనియు, సర్వవ్యాపకు డనియు, సర్వసూక్ష్ము డనియును చెప్పబడుచున్నాడు.

ఇచట రామానుజులు: బుద్ధికంటె గొప్పది కామమని వ్యాఖ్యాన మొనర్చిరి. అయ్యది అసమంజసము. "శ్లో. ఇంద్రియేభ్యః పరాహ్యర్థా హ్యర్థేభ్యశ్చ పరంమనః। మనసస్తు పరాబుద్ధి ర్బుద్ధేరాత్మా మహా న్పరః। మహతః పర మవ్యక్తం అవ్యక్తాత్పురుషః పరః। పురుషాన్నపరం కించి త్సా కాష్ఠా సా పరాగతిః॥" అను కఠవల్లి యొక్క అర్థమే ఇచట చెప్పబడినది. కాని కామముయొక్క ప్రసక్తి యొంతమాత్రము లేదు. కఠవల్లియందు పేర్కొనబడిన శబ్దాద్యర్థములు, మహత్తత్వము, అవ్యక్తము యిచట గ్రహింపబడనందున ప్రకృతశ్లోకమునకు కఠవల్లీశ్రుతికిని సంబంధము లేదన రాదు. ఉపలక్షణచే అర్థమహదవ్యక్తములుయిచటగూడగ్రహింపబడినట్లే తలంచవలయును. గాక, గ్రాహ్యము లగు అర్థములకంటె (శబ్దాదివిషయములకంటె) గ్రాహకములగు (తెలిసికొనునట్టి) ఇంద్రియములే గొప్పవి. కావున శ్రీకృష్ణు డిచట అర్థములకంటె ఇంద్రియములే గొప్పవని చెప్పెను. సూత్రభాష్యమునందు మహత్తత్వము నిరాకరింపబడుచు బుద్ధియే మహత్తత్వమని చెప్పబడినది. అవ్యక్తమనగా అజ్ఞానము- అనగా మాయ యని యర్థము. సర్వబుద్ధిసమిష్టియే మాయ కాన అవ్యక్త రూపమగు మాయ బుద్ధియందే అంతర్భావ మగుచున్నది. కావున గీతాశ్లోకమున

బుద్ధి చెప్పబడుటచే మహదవ్యక్తములను వేరుగ జెప్ప నవసరము లేనందున జెప్పబడ లేదు.

మరియు "కామ స్సంకల్పో విచికిత్సా శ్రద్ధా" ఇత్యాది శ్రుతిప్రమాణము వలన కామము మనోధర్మ మని స్పష్టమగుచున్నది. మనోధర్మమగు కామము ధర్మిరూపమగు బుద్ధికంటె గొప్పది కానేరదు. ఇచట ధర్ములే పూర్వపూర్వము కంటె ఉత్తరోత్తరము గొప్పవని నిర్ణయింపబడినవి. ఆ గొప్పతనము ధర్మపూర్వకము. సూక్ష్మత్వ వ్యాపిత్వాది ధర్మములచే దేహముకంటె ఇంద్రియముల కుత్కర్ష చెప్పబడినది. ఇట్టితరి కామమే గొప్పదగుచో బుద్ధికంటె కామము ధర్మముగా గల మనసే గొప్పదని చెప్పబడి యుండెడిది. అట్లు చెప్పబడ లేదు.

మరియు ధర్మికి స్వాధీనమగు ధర్మరూపమగు కామము స్వతన్త్రపదార్థము కానపుడు ధర్మరూపమగు పదార్థములయొక్క తారతమ్యమును వివేచించి చెప్పు ప్రకరణమునందు ధర్మరూపమగు కామము గొప్పదని చెప్పుట యెట్లు పొసగును?

మరియు బుద్ధిపర్యంతములగు పదార్థము లన్నియు వ్యాపారమును కట్టిపెట్టి యున్నను ఇచ్ఛాపర్యాయమగు కామమున్నచో నదియే యింద్రియములను స్వవిషయములయందు ప్రవర్తింపచేసి యాత్మజ్ఞానమును నిరోధించుచున్నది. కావున కామము బుద్ధికంటె గొప్పదని రామానుజులు కామముయొక్క గొప్పదనమునకు కారణమును నిరూపించిరి. అయ్యది మిక్కిలి హాస్యాస్పద మగుచున్నది. బుద్ధి యుపరమించినపుడుకూడ కామ ముదయించునని చెప్పుట యసమంజసము. అట్టితరి బుద్ధి లయముచెందిన నిర్వికల్పసమాధియందుగూడ కామ ముండు నని చెప్పవలసి వచ్చును. అపుడు నిర్వికల్పసమాధియే చెడిపోవును. వ్యాసులవారు శ్రీమద్భాగవతమునందు మనస్సు ఉపరతి చెందగా ఆత్మసాక్షాత్కారము కలుగునని "యదోపరామో మనసో నామరూప రూపస్య దృష్టస్మృతిసంప్రమోషాత్ । య ఈయతే కేవలయా స్వసంస్థయా హంసాయ తస్మై శుచిషద్మ నే నమః" అను శ్లోకమున నుడివిరి. మనసు ఉపరతి చెందినను కామముండునని చెప్పినచో వ్యాస వచన మపపన్నము కానేరదు.

మరియు ధర్మియగు మనస్సే ఉపరతిని చెందగా తద్ధర్మ మగు కామ ముండు టెట్లు? ఎచట నయినను నిప్పు చల్లారిన తరువాత మంట కనిపించునా? రామానుజులకు మనోబుద్ధులయొక్క యుపరతిరూపమగు నిద్రావస్థయం దేమయినను కోరికలు కలుగుచున్నవా? లేనిచో నిట్లు వ్యాఖ్యాన మొనర్పరు.

ఇంక వేదాన్తదేశికుల వ్యాఖ్యానమును పరిశీలించినను వారి సిద్ధాంతము హాస్యాస్పదమే యగుచున్నది. ఏలయన వేదాంతదేశికులు "ఇంద్రియాణి మనోబుద్ధి

రస్యాధిష్ఠాన ముచ్యతే। ఏతైర్విమోహయత్యేష జ్ఞాన మావృత్య దేహినమ్" అను శ్లోకమున ఇంద్రియమనోబుద్ధికామములు నాలుగు ఆత్మను వ్యామోహపరచుచున్న వని చెప్పుటచే "ఇంద్రియాణి పరాణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః మనసస్తు పరా బుద్ధి ర్యోబుద్ధేః పరతస్తు సః" అను శ్లోకమునగూడ ఇంద్రియ మనోబుద్ధికామములను నాల్గింటినే గ్రహింపవలయు నని చెప్పిరి. ఇయ్యది యెంతమాత్రము పొసగనేరదు. "ఇంద్రియాణి మనోబుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే" అను శ్లోకమునందు కామ మొక్కటియే ఆత్మను వ్యామోహపరచుననియు ఇంద్రియమనోబుద్ధులు కామమున కధిష్ఠానము లనియు చెప్పబడినది. ఇంద్రియాదుల నాశ్రయించనిదే కామము స్వయముగా జీవుని వ్యామోహపరుపలేదు. కామముచే నాశ్రయింపబడని యింద్రియ మనోబుద్ధులుగూడ ఆత్మను వ్యామోహపెట్టజాలవు. స్వతంత్రముగా కామముగాని ఇంద్రియాదులుగాని పురుషుని వ్యామోహపరుపజాలినపుడు ఇంద్రియమనోబుద్ధి కామములు నాలుగు ఆత్మసమ్మోహకము లని చెప్పుట పొసగును. అదియే యసంభవమయినందున వేదాన్తదేశికుల వివరణము నిస్సారము.

కావున "ఏతైర్విమోహయత్యేష" అను మూలమువలన ఇంద్రియమనోబుద్ధుల నాశ్రయించిన కామమొక్కటియే పురుషుని వ్యామోహపరచు ననియు, అందు ఇంద్రియాదులు సాధనమాత్రములనియు స్పష్టమగుచున్నది. మనోధర్మమగు కామమునకు మనసు సాధన మెట్లగునని యనదగదు. మనోధర్మమగు కామమునందు కర్తృత్వము నారోపింపగా కామము వ్యామోహపరచుటలో కర్తయు, మనసు కరణమున్ను (సాధనమున్ను) అగుచున్నవి.

వస్తుతః ఇంద్రియాదులు కామమున కాశ్రయములే కాని సాధనములు (కరణములు) కానేరవు. భాష్యకారులు కూడ నిట్లే నిరూపించిరి. ధర్మమునకు ధర్మియాశ్రయమగును. కాని కరణము కానేరదు. మనోధర్మ మగు కామము ఇంద్రియముల నెట్లాశ్రయించునని యనరాదు. మనసు ఇంద్రియముల కభిముఖమగుచుండగా తద్వారా కామముకూడ నింద్రియముల నాశ్రయించిన దగును. మనోబుద్ధులు రెండును ఒక్క అంతఃకరణస్వరూపములే కావున మనోధర్మమగు కామము బుద్ధిని యాశ్రయించుట యుచితమే యగుచున్నది.

శ్లో. ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సం స్తభ్యాత్మాన మాత్మనా
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదం ॥ 43 ॥

అ. ఓయి అర్జునా! ఇట్లు బుద్ధికంటె గొప్పవాడగు ఆత్మను తెలిసికొని, మనసును బుద్ధితో నేకాగ్రపరచి నిశ్చలమయిన మనస్సుకలవాడవయి దుర్విజ్ఞేయమగు కామ మను శత్రువును జయింపుము. గత్యర్థమగు సద్ ధాతువు జ్ఞానార్థకమగుటచే దురాసద మనగా దుర్విజ్ఞేయమని చెప్పనగును.

ఇచట ( దుఃఖేన ఆసదః ఆసదనం ప్రాప్తిః యస్య తం దురాసదం) అను భాష్యకారుల వివరణము. ఫలితార్థమును చెప్పుట సమాసముమాత్రము. ( దుఃఖేన ఆసత్తుం శక్యో దురాసదః) అనియే చెప్పవలయును. ఇందు "ఈషద్దుస్సుషు కృచ్ఛ్రాకృచ్ఛ్రార్థేషు ఖల్" అను సూత్రమువలన ఖల్ ప్రత్యయము. దుష్ప్రజా– ఇత్యాది పదములయందువలె బహువ్రీహిసమాస మేల చెప్పరాదని యనదగదు. "ప్రాదిభ్యోధాతుజస్యవాచ్యో వాచోత్తర పదలోపః" అను వార్తికమునుబట్టి ప్రాద్యుపసర్గలకంటె ధాతూత్పన్నమయిన శబ్దముండిననే గాని బహువ్రీహి పుట్ట నేరదు. ( దుష్టా+ప్రజాయస్య ) అనుచోట "ష్ఠా గతినివృత్తౌ" అను ధాతువు వలన బుట్టిన స్థాశబ్దము కలదు. అదియు ప్రాదులలో చేరిన దుర్ అను ఉపసర్గ కంటె పరమందు కలదు. ఇచట దుఃఖార్థకమగు దుర్ ఉపసర్గకంటె పరమగు ఖల్ శబ్దము ధాతూత్పన్నముకాదు. కావున బహువ్రీహిసమాసము చెప్పుట తగదు. ఇక ఇచ్చటగూడ బహువ్రీహిసమాసమే చెప్పవలయునని పట్టుదలయున్నచో ( దుస్థః + ఆసదః యస్య తం దురాసదం ) అని విగ్రహము చెప్పవలయును. కామము తెలియ సాధ్యముగాని యనేక భేధములు కలదగుటచే దుర్విజ్ఞేయ మగుచున్నది. విషయము లనంతములగుటచే కామ మనంతమగుచున్నది. మరియు సద్ఌ ధాతువునకు నాశము కూడ అర్థముండుటచే దురాసద మనగా దుర్జయమని కూడచెప్పనగును.

ఇచట ( బుద్ధేః పరం కామం ) బుద్ధికంటె ప్రకృష్టమగు కామమును అను రామానుజవ్యాఖ్య పూర్వశ్లోకమునందే నిరాకరింపబడినది. కామమును జయించు టకు కామము బుద్ధికంటె గొప్పదని తెలిసికొనుట యావశ్యకము కానేరదు. కావున అనావశ్యకమగు విషయము నుపదేశించుటగూడ వ్యర్థమేయగును. కాక భగవంతుడు అప్రమాణమగు అర్థము నుపదేశించెనను దోషముకూడ భగవంతునియందు ప్రసక్తించును. కావున రామానుజమత మంగీకరింపతగదు. ౪౩

శ్రీ భగవద్గీతా భాష్యార్థ ప్రకాశమునందు
తృతీయాధ్యాయానువాదము
సమాప్తము.



# శ్రీ భగవద్గీతా భాష్యార్థ ప్రకాశికానువాదము

## చతుర్థాధ్యాయము

వేదార్థము ప్రవృత్తిరూపమనియు, నివృత్తిరూపమనియు రెండు తెఱంగులు. అందు ప్రవృత్తిమార్గ మన కర్మయోగము. నివృత్తిమార్గ మన జ్ఞాననిష్ఠారూపమగు సన్యాసయోగము, ఈ రెండు తెఱంగులగు యోగమునే గీతలయందు భగవంతు డుపదేశింపదలచెను. ఈ రెండుయోగములను ద్వితీయ తృతీయాధ్యాయములలో భగవంతుడు చెప్పియుండెను. కావున సమస్త వేదార్థమును చెప్పిన శ్లించి శ్రీకృష్ణుడు వంశక్రమాగతమగు సంప్రదాయమును చెప్పుచూ యోగమును స్తుతింపుచున్నాడు.

శ్రీ భగవా నువాచ:

శ్లో. ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయం
వివస్వాన్మనవేఽప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్ ॥ ౧ ॥

అ. శ్రేయఃప్రాప్తికి నుపాయమగు, కర్మజ్ఞానరూపమగు యోగమును నేను బ్రాహ్మణ, క్షత్రియ జాతులయొక్క బలమును వృద్ధిపరుప దలచి సూర్యున కుపదేశించితిని. ఆ సూర్యుడు మనువున కుపదేశించెను. ఆ మనువు ఇక్ష్వాకున కుపదేశించెను. అవిక్రియబ్రహ్మరూపమగు మోక్షఫలము నొసంగునట్టి యీయోగము అవ్యయ మనబడును. ౧

శ్లో. ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః
స కాలేనేహ మహతా యోగో నష్టః పరంతప ॥ ౨ ॥

అ. ఇట్లు గురుశిష్య సంప్రదాయముగా వచ్చిన నీయోగమును రాజర్షులు తెలిసికొనిరి. ఓయి యర్జునా? ఇట్లు చాలకాలము గడువగా సంప్రదాయము విచ్ఛిన్నమగుటవలన నయ్యది నశించెను. ౨

శ్లో. స ఏవాయం మయా తేద్య యోగః ప్రోక్తః పురాతనః
భక్తోసి మే సఖాచేతి రహస్యం హ్యేత దుత్తమమ్ ॥ ౩ ॥

అ. ఓయి అర్జునా! ఇంద్రియ నిగ్రహము లేని దుర్బలుల నాశ్రయించి జ్ఞాన కర్మరూపమగు నీ యోగము నశించిన దనియు, లోకము పురుషార్థరహితమయిన దనియును గ్రహించి నీవు నాకు భక్తుడవు, మిత్రుడవు ననుభావముతో నేను నీ కీ యోగమును చెప్పితిని. ౩

అర్జున ఉవాచ :

శ్లో. అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః
కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవానితి ॥ ౪ ॥

అ. ఓయి కృష్ణ! నీవు వసుదేవుని యింటిలో నిటీవల పుట్టితివి. సూర్యుడు సృష్టిప్రారంభమున నీకంటె ముందెన్నడో బుట్టియుండెను. కావున నాకు జెప్పిన నీ యోగమును నీవు సూర్యునకుఁ జెప్పియుంటివని నే నెట్లు గ్రహింతును? ఇయ్యది నాకు విరుద్ధముగా దోచుచున్నది. ౪

శ్రీ భగవానువాచ :

శ్లో. బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున
తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరన్తప ॥౫॥

అ. పార్థునకు శ్రీకృష్ణుని తత్త్వము తెలుసును. అయినను మూఢులకు నమ్మిక పుట్టగలందులకు అర్జును డిట్లు ప్రశ్నించెను. అందుకు భగవంతుడు బదులు చెప్పు చున్నాడు. ఓయి అర్జునా! నాకు అనేకజన్మలు గడచినవి. నేను ప్రకృతి పరతంత్రుడను కాను. నిత్యబోధరూపుడను, సర్వజ్ఞుడను, ముక్తుడను, ఆవరణములేని జ్ఞానశక్తి కలవాడను కావున నే నెరుంగుదును. నీవు ప్రకృతిపరతంత్రుడవు. ప్రతిబద్ధమగు జ్ఞానశక్తి కలవాడవు. కించిత్ జ్ఞుడవు. కావున నీ వెరుంగవు. ౫

శ్లో. అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సమ్భవా మ్యాత్మమాయయా ॥ ౬ ॥

అ. పుణ్యాపాపములవలన కలిగెడు శరీరసంయోగ వియోగ రూపములగు జన్మమరణములు పుణ్యాపాపసంస్కారవశమున స్వతస్సిద్ధముగా పుట్టుకలేని జీవునకు గూడ కలుగుగాక. నిత్యముక్తుడయి పుణ్యాపాపసంబంధము లేని యీశ్వరునకు జన్మ మరణము లెట్లు సంభవించు నను ప్రశ్నకు సమాధానమును చెప్పుచున్నాడు.

ఓయి అర్జునా! నేను కర్మాధీనమగు జన్మమరణములు లేనివాడ నయినను, తరగని జ్ఞానశక్తిస్వభావము కలవాడ నయినను, సర్వభూతములను నియమించునట్టి వాడ నయినను, త్రిగుణాత్మకమగు ప్రకృతిని యాశ్రయించి నా మాయచే నేను పుట్టుచున్నాను.

ఇచట ప్రకృతి, మాయ సమానార్థకము గాన ప్రకృతిని అధిష్ఠించి మాయతో బుట్టితి నని మూలకారులు చెప్పుట కాని, పరమార్థమగు లోకమే లేనందున లోక మువలె పరమార్థముగా పుట్టె నని భాష్యకర్తలు వివరించుటగాని యనుచితమని యందురు. అది యుక్తము కాదు. మాయాప్రకృతులకు భేదము కలదు. అవిద్యా మాత్రము ప్రకృతి, దోషముతో గూడిన యవిద్య మాయ యనబడును.

అవిద్యోపాదానకమగు కార్యము వ్యావహారిక మగుటవలన పరమార్థముగా బుట్టినదని చెప్పబడుచున్నది. మాయోపాదానమగు కార్యము ప్రాతిభాసిక మగు టచే నపారమార్థ మనబడుచున్నది. దృష్టాంతము: అవిద్యవలన బుట్టిన సర్పము,

నిజమయిన సర్పము. మాయామయమగు రజ్జుసర్పము మిథ్యాసర్పము. అవిద్యాజన్యమగు జాగ్రత్ప్రపంచము సత్యము. మాయామయమగు స్వాప్నప్రపంచము మిథ్యాప్రపంచము. అట్లే జీవులయొక్క శరీరసంయోగము అవిద్యాజన్యము. ఈశ్వరునకు శరీరసంయోగము మాయామయము. కావున మూలమునందుగాని భాష్యమునందుగాని దోషము లేదు.

ఈశ్వరపరతంత్రమగు నవిద్య యీశ్వరునకు శరీరము నీయలేదు. జీవులను మాత్రము తాను వశపరచుకొని వారికి శరీరసంయోగము నిచ్చును. కావున జీవుల శరీరమే అవిద్యామయము. ఇచట జీవుడనగా చిదాభాసుడు గాని కూటస్థాత్మకాదు. కూటస్థాత్మయనగా నీశ్వరుడు. జీవునకు వాస్తవస్వరూపము కూటస్థాత్మ యనియు వ్యావహారికరూపము చిదాభాసతో గూడిన బుద్ధియనియు భేదముగ్రహింపవలయును.

(లేక) త్రిగుణాత్మకమగు మాయ ప్రకృతి యనియు, ఇన్ద్రజాలశక్తితో సమానమగు మాయ మాయ యనియు భేదము. కావున ప్రకృతికార్యమగు జీవులయొక్క దేహేన్ద్రియాదికము వ్యావహారికము. మాయాకార్యమగు ఈశ్వరుని దేహేన్ద్రియాదికము ఐన్ద్రజాలిక గన్ధర్వ నగరాదులవలె ప్రాతిభాసికములుకనుకనే (న పరమార్థతో లోకవత్) యథార్థముగా లోకమువలె కాదు, అని యాచార్యు లనిరి. పరమార్థమనగా వ్యవహారదశ యని యర్థము.

ఇచట నియ్యది రహస్యము: పదార్థములు వ్యావహారిక సత్తు లనియు, పారమార్థిక సత్తు లనియు, ప్రాతిభాసిక సత్తులనియు, కేవల అసత్తులనియు, నాలుగు రకములు.

అందు జాగ్రదవస్థలో నిర్దుష్టము లయిన నింద్రియములతో గ్రహింప బడు మనుష్య పశు పక్ష్యాది ప్రపంచము వ్యావహారిక సత్తు. అద్వితీయమగు బ్రహ్మము పారమార్థికసత్తు. దోషయుక్తమగు నింద్రియములచే గ్రహింపబడు స్వప్నమింద్రజాల రజ్జుసర్పాదికము, ప్రతిభాసకాలమునందుమాత్రమే యుండుటచే ప్రాతిభాసిక మన బడును. గొడ్డురాలి బిడ్డ, కుందేటి కొమ్ములు; ఆకాశ కుసుమము- మున్నగునవి అత్యన్తాసత్తులు (బొత్తుగా లేనివి). కనుకనే "వంధ్యా పుత్రో న తత్త్వే న మాయయా వాపి జాయతే" (గొడ్డురాలిబిడ్డ నిజముగా పుట్టదు, మాయచేతను పుట్టదు) అని పెద్ద లందురు.

ఇట్లుండ రామకృష్ణాద్యవతారములు ప్రతీతిసిద్ధములయినందునఅత్యంతాసత్తులు కావు. (బొత్తుగా లేనివి కావు.) పరమార్థదశలో లేకుండుటచే పారమార్థికములును కావు. అట్లే యవతారపురుషులు జన్మమరణాదు లూహింప నలవి కానందున వ్యావహారికములును కావు. మరేమనిన గంధర్వనగరాదుల వలె ప్రాతిభాసికములే యగుచున్నవి. శంఖచక్రాదులతో గూడిన నాలుగు భుజములు గలవాడును, కిరీటాదు

లతో నలంకృతుడును, సర్వజ్ఞుడు నగు పిల్లవా డొకఁడెను కలిగెనని చెప్పినచో లోక
మునం దెవ్వడును యిది నిజమని నమ్మడు. అట్లే భయంకరాకారముగల నరసింహు
డగు పురుషుడు స్తంభమునుండి పుట్టెనన్నచో లోకము విశ్వసింపదు. యుక్తికి
సరిపోవు విషయమునే లోకము నమ్మును. యుక్తికి నచ్చని విషయమును ఇంద్ర
జాలమువలె మిథ్య యని తలంచును. యద్యపి సిద్ధాంతమునందు- వ్యావహారికప్రపం
చముకూడ. పురుషుని రేతస్సు, విత్తనములు, మట్టి, మున్నగునవి శరీర వృక్ష ఘటా
దుల నెట్లు పుట్టించును? అను విచారణను నిలువనేరదు. అయినను పురుషవీర్యము
వలన శరీరము, బీజములవలన చెట్లు, మట్టివలన కుండలు పుట్టుట లోకమునం దను
భవ సిద్ధమగుటచే నందాశ్చర్యమేమియు లేదు. అప్రమాణబుద్ధియు లేదు. అందు
వలన నయ్యది విచారక్షమమే యగుచున్నది. కావున లౌకికుల యుక్తికి నిలువక
నాశ్చర్యవిషయమగు వస్తువు గంధర్వనగరాదులవలె మిథ్యయనియు, యుక్తికి నచ్చి
యాశ్చర్యవిషయము కాని వస్తువు వ్యావహారిక మనియు గ్రహింప నగును. అందు
వలన నింద్రజాలమువలె విచిత్రహేతువగు యీశ్వరశక్తి మాయ యనియు, సర్వ
సాధారణమగు నీశ్వరశక్తి ప్రకృతి యనియు భేదము.

(లేక) ప్రకృతి, మాయ యీ రెండును ఒకఁటియే. ప్రకృతిని స్వాధీనపరచు
కొనిన శ్రీకృష్ణుడు "నేను ప్రకృతివలననే పుట్టితినిగాని, పుణ్యాపుణ్యసంస్కారము
వలన బుట్టలేదు." అను నభిప్రాయముతో "ఆత్మమాయయా" అని నుడివెను.

పుణ్యాపాప సంస్కారములతో గూడిన ప్రకృతివలన బుట్టిన మనుష్యాదులు
పరమార్థముగా బుట్టరని చెప్పబడుచున్నది. కేవల మాయవలన బుట్టిన రామకృష్ణా
దులు పరమార్థముగా పుట్టినవారు కానందున పుట్టినవారువలె అని చెప్పబడు
చున్నారు. అజ్ఞాని యొనర్చు సకామకర్మ నిజముగా కర్మయే యగుచున్నది. వివేకి
యొనర్చు నిష్కామకర్మ కర్మరూపమయినను బన్ధప్రాపకము కానందున కర్మవలె
తోచును. గాని నిజముగా కర్మ కానేరదు. అట్లే సర్వజ్ఞుడగు నీశ్వరునకు రామ
కృష్ణాది దేహధారణరూపమగు జన్మబన్ధప్రాపకము కానందున జన్మవలె తోచును
గాని నిజముగా జన్మకానేరదు. అజ్ఞాని యగు జీవునకు గల మనుష్యశరీరధారణ
రూపమగు జన్మ బన్ధము నిచ్చుటచే నిజముగా జన్మయే యగుచున్నది.

ద్వైతులు ఈశ్వరునియొక్క జన్మ కర్మాధీనము కాదనియు, లీలామాత్రమే
యనియు చెప్పుదురు. ఆ లీలకూడ మాయారూపమే కాని మాయకంటె వేరు కానే
రదు. కేవల నిర్విశేషుడగు నీశ్వరునియందు మాయకంటె వేరగు లీల సంభవింపదు.
దీనిచే జీవపదవాచ్యుడగు చిదాభాసుడు ప్రకృతి పరతంత్రుడగుటచే నాతనికి
ప్రకృతివలన జన్మ యనియు, ఈశ్వరుడు ప్రకృతి పరతంత్రుడు కానందున నీశ్వరుని
జన్మ మాయామయ మనియు నిష్కృష్టార్థము తేలుచున్నది.

ఓయి! ఈశ్వరశరీరము ప్రతిభాసకాలమునందు మాత్రమే యుండుటచే మాయామయ మనియు, జీవశరీరములు వ్యవహార దశయందుండుటచే వ్యావహారికము లనియును భేదము చెప్పుట దుష్కరము. అర్జునశరీరమువలె శ్రీకృష్ణశరీరము కూడ వ్యవహారదశయం దుండియేయున్నది. అన్నచో నట్లుకాదు. శ్రీకృష్ణశరీరము అనేకరకములుగా కనబడును. ఒకప్పుడు కనుపడదు. కావున మాయామయము. రజ్జుసర్పము ఒకప్పుడు దండరూపముగా కనుపడును. ఒకప్పుడు నీటిచారవలె కనుపడును. ఒకప్పుడు పూలమాలవలె కనుపడును. మరియొకప్పుడు కనుపించదు. కావున నియ్యది మాయామయమగుచున్నది. అట్లే శ్రీకృష్ణశరీరముకూడ. కావున, అర్జునునకువలె శ్రీకృష్ణునకు పరమార్థముగా జన్మలేదనియు, శ్రీకృష్ణుడు నిత్యుడు, అజుడు, ఈశ్వరు డనియు స్పష్టము.

ఇచట రామానుజులు శ్రీకృష్ణుని జన్మ మిథ్యకాదనియు, సత్యమేననియు, శ్రీకృష్ణుడు తన ప్రకృతిని విడువకయే సత్యసంకల్పజ్ఞానముచే పుట్టె ననియు, ఈశ్వరుని స్వరూపము సగుణమని శ్రుతిచెప్పుచున్నదనియు ప్రతిపాదించిరి.

అయ్యది తుచ్ఛము. సచ్చిదానందమగు బ్రహ్మ "నిష్కలం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనం" ఇత్యాది శ్రుతిచే నీరూపుడని చెప్పబడుచున్నది. బ్రహ్మను హిరణ్యవర్ణత్వాది రూపములు ఉపాసనకొరకు కల్పింపబడినవి; కాని వాస్తవములు కావు. ఈశ్వరుడు శరీరవిశిష్టుడగుచో నాతనికి సర్వాన్తరత్వము, సాక్షిత్వము మున్నగునవి పొసగవు. శరీరవిశిష్టుడగు ఈశ్వరుడు దృశ్యుడగును. అందువలన ఘటాదులవలె యనిత్యుడగును. అజుడగు నీశ్వరునకు జన్మయనునది సంకల్పముచే గూడ సంభవింపదు. అసంగుడగువానికి శరీరసంగ మసంభవము. కావున కృష్ణాద్యవతారములు మిథ్యకాని యథార్థములు కావు. ౬

శ్లో. యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజా మ్యహం ॥ ౭ ॥

అ. ఓయి భారతా! లోకమున ఎప్పుడెప్పుడు ధర్మమణంగునో, అధర్మ మభివృద్ధి చెందునో అప్పుడప్పుడు మాయచే నన్ను నేను సృజించెదను. ౭

శ్లో. పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే ॥ ౮ ॥

అ. సన్మార్గమునందున్న దేవతలను, ఋషులను, మానవులను కాపాడుటకును దుర్మార్గులగు రక్షసాదుల మదమణంచుటకును, ప్రపంచమున ధర్మమును నిలబెట్టుటకును ప్రతియుగమునందు నేను పుట్టుచుందును.

ఇచట రామానుజులు (విష్ణువిరహాసహానాం వైష్ణవాగ్రేసరాణాం) విష్ణువియోగమును సహింపజాలని వైష్ణవాగ్రేసరులను కాపాడుటకు ఈశ్వరావతారము

అని వివరించిరి. అయ్యది తుచ్ఛము. వారి మతమున వైష్ణవాగ్రేసరులు జ్ఞానులనియా? అజ్ఞానులనియా? అందు మొదటి పక్ష మవలంబించినచో "శ్లో॥ వాసుదేవ స్సర్వమితి సమహాత్మా సుదుర్లభః" అని కృష్ణుడు చెప్పినట్లును, "శ్లో. సర్వగత్వాదనంతస్య సఏవాహ మవస్థితః! మత్తస్సర్వ మహం సర్వం మయిసర్వం సనాతనః" అని ప్రహ్లాదులు చెప్పినట్లును. (సర్వంబ్రహ్మ) అంతయు బ్రహ్మమే. (బ్రహ్మోహమస్మి) నేనే బ్రహ్మమునగుచుంటిని అను జ్ఞానము యెవరికి కలదో అట్టి యద్వైతాత్మజ్ఞానులే వైష్ణవాగ్రేసరులు. అట్టివారికి విష్ణువే ఆత్మయగుటచే విష్ణువియోగ మెట్లు ప్రసక్తించును?

రెండవమతమవలంబించినచో విష్ణువును తెలియనివారలు వైష్ణవు లెట్లగుదురు? ఎవరు విష్ణువును దెలిసికొని ఆయనయందు భక్తిభావము కలిగియుందురో వారు కదా వైష్ణవులు "శ్లో॥ విష్ణ్వర్పితాఖి లాచారః సహి వైష్ణవ ఉచ్యతే॥" అని కదా శాస్త్రము.

"శ్లో. నచలతి నిజవర్ణ ధర్మతో యః స్థిరమనసం త మవేహి విష్ణుభక్తం" అను ప్రమాణమును బట్టి వర్ణాశ్రమ ధర్మమునుండి తొలగక స్థిరచిత్తు డగువాడు వైష్ణవుడు కాని యితరుడు కాడని యనదగదు. ఇట్టివాడు యోగికాని, జ్ఞాని కానేరడు. వైష్ణవుడన్న యోగియన్నచో జ్ఞాని వైష్ణవుడు కాకపోవలసివచ్చును. అట్లంగీకరించినచో "ప్రియో హి జ్ఞానినో౽త్యర్థం అహం సచ మమప్రియః" అను ముందు గీతా వచనము విరోధించును. విష్ణుప్రియుడగు జ్ఞాని వైష్ణవుడు కాడనుట హాస్యాస్పదము. పోనిండు. జ్ఞానశూన్యుడగు యోగియే వైష్ణవుడగుగాక, అయినను అట్టి వైష్ణవునకు భగవత్స్వరూపస్వభావజ్ఞానమే లేకపోవుచుండగా వాడు భగవద్వియోగము నెట్లు సహింపలేకపోవును?

తప్తశంఖచక్రచిహ్నములను ధరించువారలును, ఊర్ధ్వపుండ్రధారులును, అర్చకులు నగు ద్విజులు వైష్ణవులని యనదగదు. శరీరతాపాదులు వేదవిరుద్ధమగు నాచారము లగుటచే, నిట్టి దురాచారపరులగు దుర్మార్గులను నశింపజేయుటకే భగవంతు డవతరించునని చెప్పవలయును. కావున వీరు వైష్ణవులు కానేరరు. శరీరతాపాదులు, ద్విజేతరులకు కాదని మేము రచించిన శూద్రధర్మదర్పణ మను గ్రంథమున వివరింపబడినది. కావున మూలమునందలి సాధుపదమును మాత్రము చూచి వైష్ణవులు తమయాడంబరము నంతయు వెల్లడించుట తగదు. ౮

శ్లో. జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్వతః
త్యక్త్వాం దేహం పునర్జన్మ నైతి మామేతి సో౽ర్జున ॥౯॥

అ. ఓయి యర్జునా! నా పుట్టుకను దివ్యమగు నా కర్మను ఎవ్వడు నిజముగా గుర్తెరుంగునో వాడు దేహమును విడచి మరలపుట్టడు. ముక్తినొందును.

ఈశ్వరుడు జన్మరహితుడనియు, నిత్యుడనియు, శుద్ధుడనియు, బుద్ధుడనియు, ముక్తుడనియు, ఇట్టివాడు మాయచే బుట్టుననియు, వాని పని ప్రాకృతము కాద నియు, లోకాతీతమనియు నెవ్వడెఱుంగునో వాడు ముక్తినొందునని యర్థము.

ఇచట రామానుజులు: నాజన్మకర్మలు తెలిసికొని పాపరహితుడయి నన్నా శ్రయించి, నన్నే ముఖ్యముగా ప్రేమించి, నాయందె చిత్తము నుంచినవాడు నన్నే పొందును- అని వ్యాఖ్యాన మొనర్చిరి. ఇందు మూలములో లేని పదముల ననేక ములను కల్పింపవలసినందున నియ్యది యప్రమాణ మగుచున్నది. ౯

శ్లో. వీతరాగభయక్రోధాః మన్మయా మా ముపాశ్రితాః
బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః ॥ ౧౦ ॥

అ. రాగ, భయ, క్రోధముల వీడి పరమేశ్వరు నాశ్రయించి జ్ఞాననిష్ఠచే బరిపూతులగు ననేకులు బ్రహ్మవేత్తలు మోక్షము నొందిరి. ఇచట మోక్షము నొందుటకు నితర తపస్సులతో పని లేదనియు కేవల జ్ఞానమొక్కటియే సాధన మనియు; "జ్ఞానతపసా" అను మూలముచే సూచింప బడుచున్నది.

జ్ఞానమునందు తపోధర్మము నారోపించుటవలన నితర తపస్సులకు ముక్తితో బనిలేదని స్పష్టపడుచున్నది. ఇతరతపస్సు లున్నను నిజముగా జ్ఞానము తపస్సు కాదని చెప్పుటకు జ్ఞానమునందు తపోధర్మ మారోపింపబడినది. ౧౦

శ్లో. యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహం
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః ॥ ౧౧ ॥

అ. ఎవరెవరు యే యే ఫలమును గోరి నన్నారాధించుచుందురో వారి వారి కా యా ఫలముల నొసంగుచు నేను వారల ననుగ్రహింతును. ఫలమును కోరువారికి ఫలము నిచ్చుచు, ఫలము నపేక్షింపని ముముక్షువులకు జ్ఞానము నొసంగుచును, జ్ఞాను లగు సన్యాసులకు మోక్షము నిచ్చుచును, ఆర్తులగు వారల బాధల తొలగించుచును అనుగ్రహింతు నని భావము.

ఇందుకు శ్రుతిప్రమాణము "తం యథా యథోపాసతే తం తామేవ ఫలం లభతే" అని – దీని యర్థము. పరమేశ్వరుని యే యే ఫలము నుద్దేశించి మానవు లుపాసింతురో వారు ఆ యా ఫలమును బొందుదురు. కావున నోయి పార్థా! సర్వ విధముల మానవులు నామార్గమునే యనుసరించుచున్నారు.

ఇచట రామానుజులు: "మమవర్త్మ" అను పదమునకు "మత్స్వభావం" నా స్వభావమును అని యర్థమును వివరించి, నా స్వభావము ననుభవించి యనువర్తింపు చున్నారను భావమును ప్రకటించిరి. అయ్యది యుక్తముగాదు. వర్త్మ అను పదము

నకు స్వభావ మను యర్థము లేదు. భగవత్స్వభావము ననుభవించుట మానవులకు దుష్కరము. కావున రామానుజవ్యాఖ్యాన మసంగతము.

శ్లో. కాంక్షంతః కర్మాణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః
క్షిప్రంహి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా ॥ ౧౨ ॥

అ. లోకమునందు మానవులు కర్మఫలమును గోరుచు ఇంద్రాగ్న్యాది దేవతలను పూజించుచున్నారు. ఫలమును గోరి భిన్నభిన్న దేవతలను బూజించు దేవతలకు మనుష్యలోకమునందు ఫలము త్వరగా సిద్ధించును. ఎవడు- కర్మఫలము నిచ్చు నింద్రుడు వేరు, ఫలము ననుభవించు నేను వేరు, అను భేదబుద్ధితో నుపాసన చేయునో వాడు అజ్ఞాని. దేవతలకు పశువు.

సర్వాత్మకుడగు వాసుదేవు డొక్కడే యభిన్న దేవత. ఇంద్రాదులు వివిధలింగ దేహాభిమానులగుటవలన భిన్న దేవతలు. ఇందుకు భాగవతమునందు ప్రమాణము కలదు. "శ్లో. ఏవం గజేంద్ర ముపవర్ణిత నిర్విశేషం బ్రహ్మాదయో వివిధలింగభిదాభిమానాః। నైతే యదా ఉపసస్రుపు ర్నిఖిలాత్మకత్వా త్తత్రాఖిలామరమయో హరిరావిరాసీత్॥" అని.

వాసుదేవుడన దేహేంద్రియాది సముదాయమునం దభిమానముగల పురుషుడు కాడు. నిత్యశుద్ధబుద్ధముక్తుడగు నాత్మ కావున వాసుదేవుడు భిన్నదేవత కాడు.

మూలమునందు "క్షిప్రం హి మానుషే లోకే" మనుష్యలోకమున కర్మసిద్ధి త్వరగా జరుగు ననుటచే, నితరలోకములయం దాలస్యముగా జరుగునని సూచింపబడుచున్నది. ఇతరలోకములయందు కర్మాధికారమే లేనపుడు అచట కర్మఫలము సిద్ధించు టెట్లని యనదగదు. మనుష్యలోకమునందు చేసిన కర్మలయొక్క ఫలములు అనేకరూపములు. అందు పశుపుత్రాది రూపమగు నైహికఫలము యీ లోకమున త్వరగా సిద్ధించును. స్వర్గాదిరూపమగు నాముష్మికఫలము పరలోకమున చాలకాలమునకు సిద్ధించును. కావున స్వర్గాది లోకములయందు కర్మాధికారము లేకున్నను కర్మఫలములుమాత్రము కలవని గ్రహింప వలయును. ౧౨

శ్లో. చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః
తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్. ॥ ౧౩ ॥

అ. నేను, గుణకర్మ విభాగపూర్వకముగ నాలుగు జాతులవారిని సృష్టించితిని. అందువలన మనుష్యులు వారి వారి వర్ణాశ్రమ ధర్మానుష్ఠానముద్వారా నన్నే సేవింపుచున్నారు. వర్ణాశ్రమ ధర్మసృష్టికి నేను కర్తనయినను నిజముగా నేను కర్తృత్వాది వికారములు లేని యవినాశస్వరూపుడను. లోకములో నెవ డేపనిని చేయునో వాడు తత్ఫలితముతో గూడుకొనును. వ్యవసాయకుడు వ్యవసాయఫల

మగు సస్యముతో గూడుకొనుచున్నాడు. చాతుర్వర్ణ్యాది సృష్టికర్తయగు నీశ్వరుడుకూడ సృష్టిక్రియాఫలముతో గూడుకొనుచుండ నిత్యముక్తు డెట్లగునని ప్రశ్నింపదగదు. ఈశ్వరుడు మాయతో సృష్ట్యాది క్రియలను చేయుచున్నాడు. ఈశ్వర రూపముతో సృష్ట్యాదుల జేయుటలేదు. మాయాతాదాత్మ్యము నీశ్వరునియం దధ్యసించి యజ్ఞానులు యీశ్వరుడు కర్తయని యనుచున్నారు. దీని నే విశ్వామిత్రులు అధ్యాత్మరామాయణమునందు జెప్పిరి. "శ్లో. రామో నగచ్ఛతి, న తిష్ఠతి, నానుశోచత్యాకాంక్షతే త్యజతినో న కరోతి కించిత్। ఆనందమూర్తి రచలః పరిణామహీనో మాయాగుణానను గతోహి తథా విభాతి" అని. దీనియర్థము (శ్రీరాముడు యెచటకు వెళ్ళడు, ఉండడు, దుఃఖింపడు, దేనిని కోరడు. దేనిని విడువడు, ఏపనిని చేయడు, ఆనందరూపుడు, స్థిరుడు, వికారరహితుడు, అయినను మాయాగుణముల ననుసరించి ఆయాపనులను చేయువానివలె తోచును.)

మాయచే కర్తృత్వము వహించిన వానికి పరమార్థముగా అకర్తృత్వము సిద్ధించును. కనుకనే శ్రీకృష్ణుడు "కర్తారమపి, అకర్తారమ్" చేయుచున్నను చేయని వానినిగా అని నుడివెను. ౧౩

శ్లో. న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా
ఇతి మాం యోఽభిజానాతి కర్మభి ర్న స బధ్యతే ॥ ౧౪ ॥

అ. ఓయి యర్జునా! నేనుచేయు కర్మలయందు నా కహంకారము లేకుండుటచే నాకవి దేహేంద్రియాదుల నిచ్చుచు నంటజాలవు. నాకు కర్మఫలమునందు కోరికగూడలేదు. అందుచే జన్మవృద్ధ్యాదిరూపమగు సంసారలేపము నాకు లేదు. నన్నిట్టివానినిగా నెరింగినవాడుగూడ కర్మబద్ధుడుకాడు. ఫలేచ్ఛ, అహంకారము యుండిననే కర్మలు బంధము నిచ్చును. అయ్యవి లేనపుడు కర్మలు బంధప్రదములు కానేరవు. ౧౪

శ్లో. ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్ ॥ ౧౫ ॥

అ. పూర్వులగు ముముక్షువులుగూడ కర్మతత్త్వము నిట్లెఱింగియే కర్మ నాచరించిరి. కావున నీవుగూడ ప్రాచీనులగు జనకాదులచే నాచరింపబడిన కర్మను చిత్తశుద్ధికొరకుగాని, లోకసంగ్రహముకొరకుగాని యాచరింపుము. ౧౫

శ్లో. కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః
తత్తే కర్మ ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥ ౧౬ ॥

అ. ఏది కర్మ? ఎయ్యది యకర్మ? అని వివేకసంపన్నులు గూడ స్వబుద్ధిచే దెలియజాలకున్నారు. వారును పూర్వులాచరించినది కర్మ యనియు

వా రాచరించని దానిని యకర్మయనియు దెలిసికొనిరి. సర్వజ్ఞుడ నగు నేను నీకు ప్రాచీన మగు కర్మాకర్మవిభాగమును చెప్పెదను. దానిని తెలిసికొని యాచరించినచో నీవు సంసారమోక్షము నొందెదవు. ౧౬

శ్లో. కర్మణోహ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యంచ వికర్మణః
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః. ॥ ౧౭ ॥

అ. కర్మయన దేహేన్ద్రియాదులచేష్ట. అకర్మయన నూరకుండుట. కావున నిందేమి తెలియవలయును ? అని యనరాదు. శాస్త్రవిహితమగు కర్మయొక్క తత్త్వము గుర్తెఱుంగవలయును. శాస్త్ర నిషిద్ధమగు వికర్మయొక్క తత్త్వము తెలియ వలయును. అట్లే అకర్మయగు తూష్ణీంభావముయొక్క రహస్యమునుగూడ గ్రహించ వలయును.

ఇచట కర్మాకర్మ వికర్మలస్వరూపమును రామానుజు లిట్లుపపాదించిరి. మోక్షసాధనమగునది కర్మయనియు, నిత్య నైమిత్తిక కామ్యాది వివిధరూపమ యిన కర్మ వికర్మయనియు, అకర్మయన జ్ఞానమనియు వా రనిరి.

అయ్యది తుచ్ఛము. ఫలాభిసంధిలేక యాచరించిన నిత్యనైమిత్తికాది వివిధ కర్మలు పరంపరగా మోక్షసాధన మగుచున్నందున రామానుజ మతమున కర్మ వికర్మలకు భేదము దుర్వచమగును. ఇక అకర్మయనుచోటకూడ "అహననమ్" ఇత్యాది పదములయందువలె నఞ్ నకు స్వప్రతియోగ్య భావమును (తాను దేనితో చేరియుండునో దానియొక్క అభావమును) బోధించు స్వభావముండుటచే, కర్మా భావరూపార్థమే లభించునుగాని జ్ఞానరూపార్థము లభింపనేరదు. నఞ్ నకు స్వప్రతి యోగి విరుద్ధార్థము లాక్షణికముగాని ముఖ్యము కానేరదు. ముఖ్యార్థము సంభ వించుచుండగా లాక్షణికార్థము స్వీకరించుట న్యాయముకాదు.

మరియు, కర్మకు విరోధిగనుక జ్ఞానము అకర్మయని వాదించుట రామానుజు లకు శక్యముకాదు. వారిమతమున జ్ఞానకర్మలకు విరోధమును వా రంగీకరింపరు. జ్ఞానపూర్వకముగా కర్మ యనుష్ఠింపవమని రామానుజు లనేకపర్యాయములు వక్కా ణించిరి. నఞ్ నకు సాదృశ్యార్థమును గూడ నంగీకరింప నలవికాదు. కర్మజ్ఞానము లకు సాదృశ్య మసంభవము. అకర్మయను పదమునకు కర్మభిన్నమను అర్థముకూడ పొసగదు. అట్టితరి కర్మభిన్నములయిన ద్రవ్యాదులుండ జ్ఞానమే కర్మభిన్నమని చెప్పుట యుచితము కాదు. మరియు అకర్మయన కర్మకంటె తక్కువది అని చెప్పుట గూడ సమంజసముగాదు. కర్మకంటె గొప్పదగు జ్ఞానము కర్మకంటె నల్పము కానే రదు. ఇంక ప్రకరణమువలన "అకర్మ" యను పదమునకు జ్ఞానమను అర్థము చెప్పుద మన్న నదియు పొసగదు. ఇయ్యది కర్మప్రకరణముగాని జ్ఞానప్రకరణముకాదు. కావున రామానుజులమతము పొసగదు.

శ్లో. కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః
స బుద్ధిమాన్ మనుష్యేషు సయుక్తః కృత్స్నకర్మకృత్ ॥ ౧౮ ॥

అ. ఎవడు కర్మయందు కర్మాభావమును చూచునో, కర్మాభావమునందు కర్మను చూచునో వాడు మనుష్యులలో బుద్ధిశాలి, యోగయుక్తుడు, సమస్త కర్మలను ఆచరించినవాడు అని యన్వయము.

ఇచట కొంత విమర్శింప దగిన విషయముకలదు. "సప్తమ్యధికరణేచ" అను పాణిని సూత్రముచే నధికరణార్థమునందు సప్తమీవిభక్తి విధింపబడినది. "ఆధారోఽధికరణమ్" అను సూత్రము వలన ఆధారమున కధికరణమను పేరు విధింపబడినది. ఔపశ్లేషికము, వైషయికము, అభివ్యాపకము అని యాధారము మూడు విధములు. క్రమముగా వీటికి యుదాహరణములు- 1. చాపమీద గలదు; 2. మోక్షవిషయకమగు నిచ్ఛకలదు; 3. అన్నిటిని వ్యాపించి యాత్మ కలదు అని (కట్యామాస్తే, మోక్షే, ఇచ్ఛాస్తి, సర్వస్మిన్నాత్మాఽస్తి).

ఇట్లుండ నీ శ్లోకమున "కర్మణి" "అకర్మణి" అని కర్మాకర్మలయందు విధింపబడిన సప్తమీవిభక్తి వైషయికాధారమని కొందరు, అభివ్యాపకాధారమని మరికొందరును అందురు. ఇందు మొదటి పక్షమున శ్లోకార్థము వ్రాయబడుచున్నది. 'కర్మణి' దేహేన్ద్రియాదిచేష్టావిషయమై "అకర్మ" కర్మాభావరూపమగు ఆత్మను "అకర్మణి" దేహేన్ద్రియాదివ్యాపారోపరమము విషయమై కర్మను ఎవడు తెలిసికొనునో వాడు మనుష్యులలో బుద్ధిమంతుడు, యోగి, కృతకృత్యుడును అగుచున్నాడు. అని.

లోకములో తిమిర దోషముగల పురుషుడు కటికిచీకటిలో నున్న త్రాడును పాముగాను, అట్టి పామును త్రాడునుగాను గ్రహించినట్లు లోకము ఆత్మను కర్మరూపునిగాను, దేహాదివ్యాపారాభావమును కర్మాభావరూపముగాను భ్రాంతిచే గ్రహించుచున్నది. ఇట్లుండ త్రాటిని త్రాడుగాను, పామును పాముగాను తెలిసికొనినట్లు ఆత్మను ఆత్మగాను, దేహాదివ్యాపారోపరమమును కర్మరూపముగాను తెలిసికొనినవాడు బుద్ధిమంతుడు. కర్మాభావము ఆత్మరూప మెట్లగునని యనదగదు. కల్పిత పదార్థముయొక్క అభావము అధిష్ఠానరూపము గనుక కర్మ ఆత్మయందు కల్పింపబడుటచే కర్మాభావ మాత్మరూపమగును. త్రాటియందు కల్పింపబడిన సర్పముయొక్క అభావము త్రాడురూపమే అగుచున్నది. కావున నజ్ఞానుల కభిమతమగు కర్మ అకర్మ యనియు, అకర్మ కర్మయనియు వివేకి తెలియనలెను.

ఈపక్షమున రెండవ యర్థము కలదు. ఎట్లన "కర్మణి" కర్మాశ్రయు డగుట వలన కర్తగా భావింపబడు జీవునివిషయమై "అకర్మ" కర్మరహితమగు బ్రహ్మము నెవడు చూచునో "అకర్మణి" బ్రహ్మవిషయమై "కర్మ" జీవుని; యెవడు

గ్రహించునో వాడు బుద్ధిమంతుడు, యోగి, నిఖిలకర్మల నాచరించినవాడు; అని-అవివేకి ఏ జీవుని కర్తనుగాను, సంసారిగాను తలచుచున్నాడో "అయ మాత్మా బ్రహ్మ" అను శ్రుతి ప్రమాణమువలన వివేకి అట్టి జీవుని కర్తృత్వ సంసార సంబంధ రహితమగు బ్రహ్మమునుగా దెలిసికొనును. అట్లే అజ్ఞాని బ్రహ్మను తనకంటె భిన్నునిగాను, పరోక్షునిగాను, ఈశ్వరునిగాను తెలిసికొనును. జ్ఞాని అట్టి బ్రహ్మను తనతో నభిన్నునిగాను, ప్రత్యక్షునిగాను, ప్రత్యక్స్వరూపునిగాను "తత్త్వమసి" అను శ్రుతి ప్రమాణమువలన దెలిసికొనును. ఇట్లు జీవబ్రహ్మలకు బ్రహ్మజీవులకు అత్యంతాభేదమును గ్రహించువాడు బుద్ధిమంతుడని భావము. జీవుడు కర్మాశ్రయుడు. ఈశ్వరుడు కర్మానాశ్రయుడు. జీవుడు కర్మప్రయుక్తమయిన సుఖదుఃఖాది భోగముల ననుభవించును. ఈశ్వరుడు తద్వ్యతిరిక్తుడు. ఇట్లు జీవేశ్వరులకు పరస్పరభేదము కలదు. కాని యియ్యది వ్యావహారికముకాని పారమార్థికము కాదు. "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అను శ్రుతినిబట్టి పరమార్థముగా కర్మతత్ఫలములు లేవు. వ్యవహారదశయందుగూడ కర్మతత్ఫలములు జీవునకు ఉపాధిగతములుకాని, స్వరూపసిద్ధములు కావు. స్వతస్సిద్ధముగా చిదేకరసుడగు జీవునకు సుఖదుఃఖాదులు స్వరూపగతములు కానేరవు. కావున నిష్క్రియము, నిర్వికారము నగు బ్రహ్మయే జీవుడని రహస్యము.

కర్మాకర్మలయొక్క స్వరూపమును చెప్పు నీ ప్రకరణమునందు జీవబ్రహ్మల కభేదమును ప్రతిపాదించుట యసందర్భ మని యనదగదు. కర్మ యనాత్మగతమేకాని నిష్క్రియబ్రహ్మరూపమగు నాత్మగతము కాదని చెప్పుట ప్రకృతసందర్భమున కుచితమే యగుచున్నది. ఇచట కర్మశబ్దమువలన కర్మాశ్రయుడగు జీవుడు లక్షణచే చెప్పబడుచున్నాడు.

ఈ శ్లోకమునకు మూడవయర్థముకూడ స్ఫురించుచున్నది. "కర్మణి" కర్మాశ్రయమగు దేహాది సంఘాతమునందు, "అకర్మ" బ్రహ్మను ఎవడు చూచునో అని. అనగా దేహేన్ద్రియాది సంఘాతము బ్రహ్మయందు కల్పింపబడుటచే అట్టి దేహాది సంఘాతము బ్రహ్మాభిన్నమని యెవడు తలంచునో- యని అర్థము. కల్పితవస్తువు అధిష్ఠానముకంటె వేరు కానందున నిట్టి దృష్టి పొసగును. కనుకనే "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనువది పొసగుచున్నది. అట్లే "అకర్మణి" ఉపరతవ్యాపారమగు సంఘాతము విషయమై, "కర్మ" తూష్ణీమాసన రూపమగు ( ఊరక నుండుట రూపమగు ) కర్మాశ్రియమునుగా నెవ్వడు తలంచునో వాడు బుద్ధిశాలి అని మూడవ యర్థము.

రెండవ పక్షమున శ్లోకమున కిట్లర్థము గ్రహింపవలెను. ఎవడు కర్మాశ్రయుడగు కర్తయందు కర్మరాహిత్యమును గ్రహించునో అట్లే కర్మాభావరూపమగు దేహాదిచేష్టోపరమమందు యెవడు కర్మత్వమును తెలిసికొనునో. అని.

ఆత్మ కర్మసమవేతుడుగా నుండుటచే లోకము ఆత్మను కర్తనుగా తలచుచున్నది. కర్తయని లోకాభిమతమగు నాత్మయందు ప్రాజ్ఞుడు కర్మరాహిత్యమును గ్రహించును. అవిక్రియత్వాది యుక్తుల వలన నాత్మ కర్తగాడని విద్వాంసుడు తెలుసుకొనును. కర్మ దేహాదిసంఘాతమునం దున్నదికాని యాత్మయందు లేదని తెలుసుకొనును. అట్లే ప్రాజ్ఞులు వ్యాపారమువలె వ్యాపారోపరమముకూడ కర్మయే కావున లోకమునందు అకర్మగా నభిమతమయిన వ్యాపారోపరమమును కర్మనుగానే తెలియుదురు. అని భావము-

ఇట్టితరి అనగా కర్మశబ్దమునకు కర్మాశ్రయము అనియు, అకర్మ శబ్దమునకు తదనాశ్రయమనియు అర్థము నంగీకరించినచో వ్యాసులు "కర్తర్యకర్మ యః పశ్యే దకర్తరిచ కర్మ యః" అని శ్లోకము నేందుకు రచింపలేదు? అని ప్రశ్న యుదయించును. లోకులు యెచ్చట కర్మను జూచెదరో అచ్చట వివేకి కర్మరాహిత్యమును గ్రహించునని బోధింపదలచి వ్యాసు లట్లు శ్లోకమును రచియింపలేదు.

కావున ప్రవృత్తి నివృత్తులు రెండును కర్మరూపము లనియు, నా రెండును అనాత్మనగు దేహాది సంఘాతమునం దుండు ననియు నీయవి యవిద్యచే నాత్మయందధ్యస్తములు కాన ఆత్మ నిష్క్రియుడు, అవికారి యనియు పక్షద్వయమునందును పండితార్థము.

ఓయి! కర్మయం దకర్మను గ్రహించుట, అకర్మయందు కర్మను గ్రహించుట లోకవిరుద్ధము. ఇట్లు గ్రహించినవాడు బుద్ధిమంతు డనుటకూడ లోకవిరుద్ధము. కావున నియ్యది యెట్లు పొసగును? అనినచో నట్లు కాదు. మూఢదృష్టిగల లోకమునకు నిజముగా అకర్మ కర్మవలె తోచును. అట్లే కర్మ అకర్మవలె తోచును. ఇట్టి తరి యథార్థజ్ఞానముకొరకు భగవంతుడు "కర్మణ్యకర్మ యఃపశ్యేత్" అని చెప్పెను. కనుకనే యిట్టి యథార్థజ్ఞానముకలవాడు బుద్ధిమంతు డనుట కూడ లోక విరుద్ధము కాదు. ఇయ్యది యథార్థజ్ఞానము కనుకనే దీనివలన సంసార మోక్ష ముపపన్నమగుచున్నది.

కుండలో రేగుపండ్లు యుండినట్లుకర్మయందు అకర్మగాని, అకర్మయందు కర్మగాని లేదు. కర్మ అకర్మకుగాని, అకర్మ కర్మకుగాని రేగుపండ్లకు కుండవలె నధికరణము కానేరదు. ఎండమావులయం దుదకమును, ముత్యపుచిప్పయందు రజతమును గ్రహించినట్లు లౌకికులు కర్మాకర్మలను భ్రాంతిచే విపరీతముగానే గ్రహించిరి. ఏది నిజముగా అకర్మయో దానిని లౌకికులు కర్మరూపముగా గ్రహించిరి. అట్టి కర్మ విషయమై బుద్ధిమంతునకు కర్మరాహిత్యజ్ఞానము కలదు. ఏది వస్తుతః కర్మయో దానిని లౌకికులు అకర్మనుగా గ్రహించిరి. అట్టి అకర్మవిషయమై బుద్ధిమంతునకు కర్మజ్ఞానము

కలదు. కావున కర్మాకర్మలయెడల లౌకికుల జ్ఞానము భ్రమరూపమును వివేకవంతుల జ్ఞానము ప్రమాత్మకము నగుచున్నది.

ఓయి! వివేకులకు నవివేకులకు నందరకును కర్మ కర్మగానే తోచును. అకర్మయు అకర్మగానే తోచును. కర్మ అకర్మయు, అకర్మ కర్మయు కానేరదు. ఘటము యెల్లరకు ఘటముగానే కనుపడును, పటముగా కనుబడనేరదు. పటముకూడ నందరకు పటముగానే తోచునుగాని ఘటముగా స్ఫురింపదు. కావున కర్మాకర్మలయెడల అజ్ఞులకు విపరీత జ్ఞానమున్ను బుద్ధిమంతులకు యథార్థజ్ఞానమున్ను కలదనుట యెట్లు పొసగును? సమాధానము: పడవలోనున్న పురుషులు పడవ నడచుచుండగా కదలక నున్న యొడ్డున గల చెట్లను నడచువాటినిగా గ్రహింతురు. కంటికి నతిదూరముగా నున్న జనసంఘము నిజముగా నడచుచున్నను దూరమున నున్నవారికి నడువనివారు వలె కనుపింతురు. అట్లే లౌకికులకు (అజ్ఞులకు) గూడ కర్మరహితుడగు నాత్మయందు కర్మజ్ఞానమున్ను దేహేన్ద్రియాది వ్యాపారోపరమరూపమగు కర్మయందు కర్మాభావజ్ఞానమున్ను విపరీతదర్శనమై విరాజిల్లుచున్నది— ఇట్టి విపరీతజ్ఞానమును పోగొట్టదలచి భగవంతుడగు శ్రీకృష్ణుడు "కర్మణ్యకర్మ యఃపశ్యేత్" ఇత్యాది వచనము నుపదేశించెను.

ఆత్మకు ప్రవృత్తి నివృత్తులు లేకుండుటచే, ఆత్మ నిష్క్రియుడనియు; నిర్వికారుడనియు జెప్పదలచియే భగవంతునిచే నీ శ్లోకము చెప్పబడినదని భావము.

ఆత్మ అవిక్రియుడని నింతకుమున్ను "అవ్యక్తోఽయ మచింత్యోఽయం" "నజాయతే మ్రియతే వా కదాచిత్" ఇత్యాది శ్లోకములచే పలుమారు చెప్పియున్నను, ఆత్మతత్త్వము దుర్విజ్ఞేయమని గుర్తించి భగవంతుడు మాటమాటకి, అవివేకుల ప్రశ్నలకు సమాధాన మొసంగదలచి యీ శ్లోకమును చెప్పెనని నిశ్చయార్థము.

ఆత్మయందు కర్మాభావము శ్రుతిస్మృతి న్యాయములచే బ్రసిద్ధము. ఈవిషయ మింతకుమున్ను శ్రీకృష్ణులు "అవ్యక్తోఽయ మచింత్యోఽయ మవికార్యోఽయముచ్యతే" ఇత్యాది శ్లోకములచే జెప్పియుండిరి. "సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖంవశీ" అను మొదలగు ప్రమాణములచే ముందుఁ జెప్పబోవుచుండిరి. "నజాయతే మ్రియతేవా విపశ్చిత్" "అవినాశీవా అరేఽయమాత్మా" అను శ్రుతులు "రామో నగచ్ఛతి నతిష్ఠతి నానుశోచతి" ఇత్యాది స్మృతులు, (ఆత్మ, కర్తృత్వాది వికారములు లేనివాడు, నిస్సంగుడగుటవలన, వ్యాపకుడగుట వలనను ఆకాశమువలె.) అను యుక్తియు; ఆత్మయందు కర్మరాహిత్యమును చాటుచున్నవి. అయినను నిష్క్రియుడగు నాత్మయందు విపరీతమగు కర్మజ్ఞానము లోకమున నత్యంత నిరూఢమయియున్నది. కనుకనే "కిం కర్మ కిమకర్మేతి కవయోప్యత్ర

మోహితాః" అని శ్రీకృష్ణభగవాను లనిరి. విద్వాంసులకే యిట్టి భ్రాంతి గలుగుచుండ నవిద్వాంసుల స్థితి యేమనదగును? కావున నిట్టి భ్రాంతికి లోనయిన మానవులు దేహేంద్రియాదులయందలి కర్మను ఆత్మయం దారోపించి నేను కర్తను యీ పని నాది, నే నీఫలము ననుభవింపవలెను, నేను యూరకనుంటిని, నేను నిరాయాసుడను, సుఖముగానుంటిని– అని తలంచుచున్నారు. అట్లే దేహేంద్రియాది గతమగు వ్యాపారోపరతిని, దానివలన కలుగు సుఖమును ఆత్మయం దారోపించి, నేనేమియు చేయుటలేదు, ఊరకయుంటిని, సుఖముగానుంటిని, అని లోకము తలంచుచున్నది. లోకమున కీ రెండు జ్ఞానములు విపరీతములే యగుచున్నవి. ఈ విపరీతజ్ఞానమును రూపుమాపుటకే భగవంతు డీ శ్లోకము నుపదేశించెను.

కావున ఆత్మ సమవేతమని సర్వజన ప్రసిద్ధమగు కర్మవిషయమై కర్మాభావమునే మానవుడు గ్రహించునో, ఆత్మాధ్యస్తమగు దేహేంద్రియ వ్యాపారోపరమము నందు కర్మజ్ఞాన మెవ్వని కుదయించునో వాడు కర్మాకర్మల విభాగములఁ దెలిసిన బుద్ధిమంతుడు, వాడే పండితుడు, వాడే కృతకృత్యుడు అని శ్లోకార్థము. పడవలో నున్నవారి కందరకు నదియొడ్డునగల చెట్లు కదలుచున్నట్లు కన్పించుచున్నను యెవ్వని "కాచెట్లు కదలుటలేదు, పడవయే కదలుచున్నది" అని జ్ఞానముండునో వాడే బుద్ధిమంతుడు, కాని మిగిలినవారు కారు. అట్లే దేహాత్మలయందుగూడ గ్రహింపనగును.

కార్యకరణవ్యాపారోపరమ ( దేహేంద్రియ వ్యాపారోపరమ ) రూపమగు అకర్మయందు పండితునకు కర్మబుద్ధి యెట్లు కలుగును? కలిగినను అయ్యది నెట్లు పోసగును? అని యనదగదు. కర్మాచరణమునందు "నేను యీ ఫలముకొరకు యీ పనిని చేయుచున్నాను" అని కర్తృత్వాభిమానము, ఫలేచ్ఛయు నెట్లుకలుగు చున్నవో, అట్లే "నేను సుఖముకొరకు నూరకుండెదను" అని కర్మాభావము (అకర్మ) నందుగూడ అహంకారము, ఫలేచ్ఛయు, కలుగుచునే యున్నవి. ఎయ్యది కర్తృత్వాభిమాన ఫలేచ్ఛాపూర్వకమో అయ్యది కర్మ అని శాస్త్రసిద్ధాన్తము.

ఇట్టి కర్మాభావము ( అకర్మ ) దేహేంద్రియాది గతముకాని ఆత్మగతము కాదు. ఎచట కర్మయుండునో, అచటనే తదుపరతియు, ( కర్మాభావమున్న ) పొసగును. ఉ:– చెట్టుయందు చలనము కలదు. చలనాభావముకూడ చెట్టుయందే కలుగును. కావున ఆత్మయందు వ్యాపారము ( కర్మ ) లేదు కనుక వ్యాపారభావముకూడ ఆత్మయం దుండ నేరదు. వ్యాపార, వ్యాపారాభావములు రెండును, దేహాద్యాశ్రయములేకాని యాత్మాశ్రయములుకావు. ఎవ్వనియందు వ్యాపారోపరమ ముండునో వాడు ఉపరత వ్యాపారుడని పిలువబడును. నిలచియున్న పురుషునియందు గమన క్రియోపరతి(నడువకుండుట)కలదుగాన వాడు పరతగమనుడు (నడచుట మానిన వాడు

అని చెప్పబడుచున్నాడు. అట్లే అకర్మ (కర్మాభావము) ఆత్మయం దుండుచో అకర్మాత్మ ఉపరతక్రియుడు (పనులు చాలించినవాడు) అని యనవలసివచ్చును. అయ్యది శక్యముగాదు. క్రియోపరతికి పూర్వము ఆత్మయందు అవశ్యము క్రియ యుండి తీరవలయును. అక్రియుడగు నాత్మయందు కాలత్రయమునగూడ క్రియ యూహింపశక్యముగాదు. ఈ యుద్దేశముతోనే శ్రుత్యాదులు ఆత్మయందు కర్మ రాహిత్యమును ప్రతిపాదించినవి. నిషేధము ప్రసక్తిపూర్వక మగుచుండ, ఆత్మ యందు కర్మప్రసక్తియే లేనపుడు కర్మనిషేధ మెట్లుపొసగును? శ్రుత్యాదు లెట్లాత్మ యందు కర్మను నిషేధించినవి? అని ప్రశ్నింపరాదు. శ్రుత్యాది వచనములు భ్రాంతిప్రసక్తకర్మనిషేధ పరములుకాని వాస్తవిక కర్మనిషేధపరములు కావు. (అనగా మానవు లున్నవనుకొను కర్మలను శ్రుతులు నిషేధించుచున్నవి కాని, నిజముగా ఆత్మయందు కర్మలు కలవని నిషేధించుట లేదు. అని యర్థము.)

కావున కాలత్రయమందును, ఆత్మయందు కర్మలేకుండుటచే ఆత్మయే యకర్మ, అజ్ఞాని దేహాదులయందలి (దేహాద్యాశ్రయమగు) కర్మను ఆత్మయం దున్నటుల తలచుచున్నాడు. దేహేన్ద్రియాది వ్యాపారోపరమరూపమగు కర్మను దేహాదులయందలి కర్మాభావమునుగా తలంచుచు నద్దాని నాత్మయం దున్నటుల గ్రహించుచున్నాడు. అవివేకి జనాభిమతములగు నీ కర్మాకర్మలు రెండును ఆత్మ యందు కాలత్రయమునను లేవు. కనుకనే ఆత్మ అకర్మయనబడుచున్నాడు. ఇట్లు కర్మాకర్మ విభాగముల నెవ్వడు గ్రహించుచున్నాడో వాడు అశుభమునుండి (సంసా రమునుండి) విడిపింపబడినవాడై కృతకృత్యు డగుచున్నాడు.

ఎవడు ఆత్మను అకర్మనుగా తెలిసికొనుచున్నాడో, దేహాది వ్యాపారమును తదుపరతిని కర్మనుగా తెలిసికొనుచున్నాడో వానికి దేహాది వ్యాపారరూపకర్మగాని తూష్ణీమాసనరూప (ఊరకనుండుటరూపమగు) కర్తగాని లేకుండుటవలన వాడు కృతకృత్యుడని భావము.

దీనిచే నెవ్వడు ఊరక నుండెనో, ఎవడు వ్యాపారవంతుడుగానుండెనో, వాడు ఆత్మ గాడనియు, అయ్యది దేహాదిసంఘాతమే ననియు తేలుచున్నది. ఇందువలన వ్యాపారరూపములగు జాగ్రత్స్వప్నావస్థలును, నిర్వ్యాపారాత్మకమగు నిద్రావస్థయు నీయవస్థాత్రయము ఆత్మకు లేకుండుటచే నాత్మయవస్థాత్రయసాక్షియనియు, కూటస్థు డనియు సిద్ధమగుచున్నది. ఇట్లాత్మతత్త్వమును తెలిసిన మనుజుడు "తరతి శోక మాత్మవిత్" "బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి" అను శ్రుతిప్రమాణము ననుసరించి ముక్తుడే యగును.

ఈ శ్లోకమును కొంద రన్యథా వ్యాఖ్యానించిరి. ఈశ్వరప్రీతికొరకు అను ష్ఠించు నిత్యకర్మలకు ఫలము లేకుండుటచే లక్షణావృత్తిచే నయ్యవి యకర్మ లని

చెప్పబడుచున్నవి. వాటి ననుష్ఠింపకుండుట అకర్మ. దీనివలన ప్రత్యవాయ మను ఫలముండుటచే నిత్యాది (నిత్యకర్మాకరణము) లక్షణచే కర్మ యని చెప్పబడు చున్నది. ఇట్టితెరి ఫలము లేకుండుటచే నిత్యకర్మలయందు అకర్మ యను బుద్ధియు, ప్రత్యవాయరూప ఫలముండుటచే నిత్యకర్మాకరణమునందు కర్మ యను బుద్ధియు నెవ్వనికి కలుగునో వాడు బుద్ధిమంతుడు అని. ఇయ్యది తత్త్వము. నిత్యకర్మ కర్మ యనియు, నిత్యకర్మానాచరణము అకర్మయనియు మూఢు లనుకొనుచున్నారు. ఇయ్యది యుక్తముకాదు. ఎద్దానికి ఫలముండునో అయ్యదియే కర్మ. ఫలము లేకుండు టచే నిత్యకర్మ కర్మ కానేరదు. ప్రత్యవాయరూపఫలముండుటచే నిత్యాకరణము (నిత్యకర్మల ననుష్ఠింపకుండుట) అకర్మ గాదు. మరేమనిన నిత్యకర్మ అకర్మయనియు నిత్యకర్మాకరణము కర్మయనియు నెవ్వడెఱుంగునో వాడు బుద్ధిమంతుడు అని. వారి వ్యాఖ్యానము యుక్తముగాదు. నిత్యకర్మలకు ఫలము లేదని తెలిసినందునను, నిత్యాననుష్ఠానమువలన ఫలముకలదని తెలిసినందునను, సంసారమోక్షమను ఫలము సంభవింపదు. "యత్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్" అను భగవద్వచనము బాధితమగును. మరియు భగవంతుడు జ్ఞానమువలన మోక్షము కలుగునని చెప్పి యుండెనుకాని, తెలిసికొని నిత్యకర్మల నాచరించినచో మోక్షము కలుగు నని చెప్పియుండలేదు. కాక అనుష్ఠింపబడిన నిత్యకర్మ పాపనివృత్తిరూపమయిన నశుభ మోక్షమునకు హేతువగును కాని, తెలుసుకున్నంతమాత్రమున పాపనివృత్తికి హేతువు కానేరదు అట్లయినచో నిత్యకర్మలు చేయనందున ప్రత్యవాయము పుట్టక పోవలసివచ్చును. వేదాధ్యయనమాత్రముచే సమస్తనిత్యకర్మలు తెలిసినవి కాన, యజ్ఞయాగాదు లనుష్ఠింప బనిలేకపోవును. కావుననిత్యకర్మానుష్ఠానమేమానవులకు పాపమోచకముకాని, తత్ జ్ఞానమాత్రము కాదు. కామ్యకర్మానుష్ఠానమే స్వర్గము నిచ్చునుగాని కామ్యకర్మజ్ఞానము స్వర్గమునొసంగనేరదు. వ్యవసాయకృత్యమువలన సస్యాదిఫలము లభించునుగాని, వ్యవసాయజ్ఞానమాత్రమున సస్యము లభింపదు.

మరియు "తరతిశోక మాత్మవిత్" ఇత్యాది శ్రుతులు శోకతరణమున కాత్మ జ్ఞానము సాధన మని విధించినట్లు నిత్యకర్మలయొక్క ఫలాభావజ్ఞానముకాని, నిత్య కర్మ జ్ఞానము కాని, యశుభముక్తికి (పాపమోచనమునకు) సాధన మని వేదము విధించి యుండలేదు. భగవంతుడు గూడ గీతలయం దెచ్చటను అట్లు చెప్పియుండ లేదు. కావున పరోక్తమగు (నితరులచే జెప్పబడిన) నీవ్యాఖ్యానము నిరాకరింపబడు చున్నది.

మరియు నిచట శ్రీకృష్ణుడు నిత్యాకరణమును, కర్మగా దెలిసికొనుమని విధిం చుటలేదు. "కురుకర్మైవ తస్మాత్త్వమ్" ఇత్యాది వచనములచే నిత్యకర్మలను చేయ మనియే విధించియున్నాడు. నిత్యకర్మల ననుష్ఠింపనిచో ప్రత్యవాయము కలు

దను జ్ఞానమువలన నేమియు ఫలములేదు. "కర్మ యకర్మ" అను మిథ్యాజ్ఞానము వలన పాపమోక్షము పొసగదు. మిథ్యాజ్ఞానమే పాపరూపము. కాన నయ్యది పాపమును పోగొట్టనేరదు. చీకటి చీకటిని పారద్రోలుట యసంభవము, లోకవిరుద్ధము నగుచున్నది. ఇక నిత్యాకరణమువలన ప్రత్యవాయము కలదని తెలిసికొని, నిత్యకర్మ నాచరించిన మానవుడు పాపనివృత్తి నొందుచున్నా డనినచో నప్పటికి నిత్యకర్మానుష్ఠానమున పాపనివృత్తి కలుగుచున్నది. కాని ప్రత్యవాయజ్ఞానమువలన పాపనివృత్తి కలుగుటలేదు. ప్రత్యవాయజ్ఞానము నిత్యకర్మలయందు ప్రవృత్తికి గారణమగుచున్న దనినచో నదియును పొసగదు. ప్రత్యవాయమును తెలిసికొనినవారుకూడ ననేకులు ప్రారబ్ధవశమున నిత్యకర్మల నాచరించుట లేదు. ప్రత్యవాయదోషమును తెలియని మూఢులు అనేకు లాచరించుచున్నారు.

తత్త్వజ్ఞానమువలన ముక్తి కలిగినట్లు, కర్మాకర్మజ్ఞానమువలనకూడ ముక్తియేల కలుగగూడదు? అని ప్రశ్నింపరాదు. తత్త్వజ్ఞానమువలన ముక్తి కలుగుట పొసగును. కాని మిథ్యాజ్ఞానము (కర్మ, అకర్మయను జ్ఞానము) వలన ముక్తి కలుగుట పొసగదు. కర్మ అకర్మయను జ్ఞానము మిథ్యాజ్ఞాన మగును. కాని తత్త్వజ్ఞానము కానేరదు. కర్మయందు అకర్మ యను జ్ఞానము, అకర్మయందు కర్మ యను జ్ఞానము "అతస్మిం తద్బుద్ధి" రూపమగుటచే మిథ్యాజ్ఞానమే యగును. ఇట్టి మిథ్యాజ్ఞానము వలన (అశుభమోక్షణము) పాపవిమోచనము విప్రతిషిద్ధము (విరుద్ధము). మిథ్యాజ్ఞానరూపమగు రజ్జుసర్పజ్ఞానమువలన భయకంపాదులు ప్రసక్తించును గాని నివర్తింప నేరవు. కావున నిట్టి మిథ్యాజ్ఞానము కలవాడు బుద్ధిమంతుడు, కృతకృత్యుడును అగుట నెంతమాత్రము పొసగదు.

ఇక కర్మయందకర్మజ్ఞానము కాని, అకర్మయందు కర్మజ్ఞానముకాని మిథ్యాజ్ఞానము కాదనియు, ఫలాభావమును నిమిత్తముగా జేసికొని ప్రవర్తించిన గౌణజ్ఞానమనియు ననినచో నదియు యుక్తముగాదు. గౌణమగు కర్మాకర్మజ్ఞానమువలనకూడ నశుభమోక్షణమను ఫల ముపపన్నముగాదు. మరియు నిత్యకర్మలకు ఫలము లేదనియు, నిత్యకర్మల ననుష్ఠింపనందున నరకపాతమను ప్రత్యవాయము కలదనియు, ఋజుమార్గముచే జెప్పనలవియగుచుండ భగవంతుడగు శ్రీకృష్ణుడు "నిత్యకర్మలను అకర్మలనియు, నిత్యాకరణమును కర్మయనియు తెలిసికొమ్మని" పరవంచనారూపముతో జెప్పుటలో ఫలమేమి? నిజముగా శ్రీకృష్ణునకీ యాశయ మున్నచో వ్యాసులు శ్లో॥ ననిత్యకర్మణోఽర్థోఽస్తి ప్రత్యవాయో విధానతః" అనియే శ్లోకమును రచించెడువారు.

భగవంతుడు రహస్యమగు విషయమును శిష్యుడయిన అర్జునునకు వెల్లడించుటకు ప్రవర్తించెనుకాని, రహస్యార్థమును దాచ ప్రవర్తింపలేదు. అట్లు దాచి

చెప్పదలచినచో నిట్టి ఛద్మవాక్యమును ప్రయోగించుట యుచితమగును.

ఓయి! ఆత్మతత్త్వ మతి దుర్బోధ మగుటవలన భగవంతుడు మాటమాటకి "అవ్యక్తోఽయ మచింత్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే! నిత్యస్సర్వగతస్థాణు రచలోఽయం సనాతనః" ఇత్యాది వచనాంతరములచే నెట్లుపదేశించెనో, అట్లే నిత్యకర్మాకర్మలయొక్క తత్త్వమును సుబోధపరచుటకు, పూర్వము "కర్మణ్యేవాధికారస్తే" ఇత్యాది వచనములచే జెప్పియున్నను, మరల యిప్పుడు "కర్మణ్యకర్మ యః పశ్యేత్" ఇత్యాదివచనముచే మార్గాంతరమున చెప్పుచున్నాడు. అనినచో నదియు యుక్తముగాదు. ఏలయన నిత్యకర్మలకు, ఫలములేదనియు తదకరణమునకు ప్రత్యవాయము కలదనియు దెలిసికొనుట ఆత్మతత్త్వమువలె దుర్బోధముగాదు. అట్లయినచో మాటమాటకి చెప్పుట పొసగును.

మరియు నెయ్యది ఫలవంతమో అదియే తెలియ దగినదియు, చేయదగినదియు, నన్నిటికంటె ప్రశస్తమయినదియు నగును. నిష్ప్రయోజనమగు నిత్యకర్మను తెలిసికొని లాభములేదు. అనుష్ఠించియు లాభములేదు. కాన దానిని సులభముగా తెలుపుటకు భగవంతు డేల యింత ప్రయాసపడవలెను? ఇక భగవంతుడు నిత్యకర్మను తెలిసికొనమని బోధించుటలేదని, నిత్యకర్మ అకర్మయని తెలిసికొనుమని బోధించుచున్నాడని, అనినచో అపుడు కర్మణి అకర్మజ్ఞానము రజ్జుసర్ప జ్ఞానమువలె మిథ్యాజ్ఞానము కావున నదియు మిథ్యాజ్ఞాన విషయమగు వస్తువుయు రెండును తెలియ దగినవి కానేరవు.

ఇంతవరకు నిత్యకర్మల నాచరింపనిచో ప్రత్యవాయము కలదను మతము నంగీకరించి, యీశ్లోకమునకు పరులు చెప్పిన యర్థము నిరాకరింపబడినది.

ఇకమీదట నిత్యాకరణమువలన ప్రత్యవాయమే లేదని భాష్యకారు లంగీకరించి పరవ్యాఖ్యానమును నిరాకరించుచున్నారు. నిత్యాకరణమువలన ప్రత్యవాయమను భావపదార్థము పుట్టనేరదు. అకరణమనగా అభావము, ప్రత్యవాయము, భావపదార్థము. అభావమువలన భావపదార్థము పుట్టనేరదు. "నాసతో విద్యతే భావః" అభావమువలన భావపదార్థము పుట్టదని భగవద్వచనము కలదు. "కథమసతస్సజ్జాయేత" అను శ్రుతిగూడ అభావమువలన భావోత్పత్తిని నిషేధించుచున్నది. ఇదియును గాక అభావమువలన భావము పుట్టునని యొప్పినచో కారణము కార్యరూపముగా పరిణమించును కాన, కారణమగు అసత్తు కార్యమగు సద్రూపము కావలయును. అట్లే కార్యమునకు కారణస్వరూపముకూడ లోకసిద్ధముకాన కార్యమగు సత్పదార్థము (కారణమగు) అసద్రూపము కావలయును. ఈ రెండును ప్రత్యక్షాది సర్వప్రమాణ విరుద్ధములగుటచే నొప్పదగినవి కావు.

ఇక పరాభిప్రాయ ప్రకారము నిత్యకర్మకు ఫలము లేదను మత మంగీకరించి విచారింతము. నిజముగా నిత్యకర్మ నిష్ఫలమే యగుచో లోకానుగ్రహముకొరకు ప్రవర్తించిన శాస్త్రము ఫలరహితమగు నిత్యకర్మను విధింపదు. నిష్ఫలమగు నిత్యకర్మానుష్ఠానము దుఃఖరూపమగును కాని సుఖరూపము కానేరదు. దుఃఖరూపమయిన నిత్యకర్మయందు లోకమునకు బుద్ధిపూర్వకముగా ప్రవృత్తి కలుగదు. పోనిండు, నిత్యకర్మ నిష్ఫలము, దుఃఖరూపము నయినందున ననుష్ఠింపకుండ మన్నను అకరణమునందు ప్రత్యవాయము వినబడుటవలన నివృత్తియు (అనుష్ఠింపకుండుటయు) దుఃఖరూపమే యగును. గనుక నిత్యకర్మలను చేయుటకుగాని, చేయకుండుటకుగాని యెవ్వడును బుద్ధిపూర్వకముగా సమకట్టడు. ప్రవృత్తినివృత్తులు రెండును శాస్త్రబలముననే తటస్థించును. నిత్యకర్మానుష్ఠానాననుష్ఠానములు రెండును దుఃఖరూపము లగుటచే నవ్వానియందు ప్రవర్తింపజేయు శాస్త్రమును భగవంతుడు అనర్థము కొరకే కల్పించినట్లగును. ఇట్లు లోకమున కనర్థకరమును, నిష్ఫలమున్ను అగు శాస్త్రము ప్రమాణము కానేరదు. ఆహా! యేమి నీ పాండిత్యము. వేదమూలమగు గీతాశాస్త్రమును వ్యాఖ్యాన మొనర్చుటకు ప్రవర్తించిన నీవు గీతాశాస్త్రమునే యప్రమాణ మొనర్చితివి కదా ?

ఇదియునుగాక, "కర్మణైవహి సంసిద్ధిమాస్థితా జనకాదయః" అను శ్లోకమును వ్యాఖ్యానించుటలో, నిత్యకర్మానుష్ఠానమునకు మోక్షము ఫలమని యంగీకరించి, జనకాదులు నిత్యానుష్ఠానమువలన మోక్షమొందిరని వ్రాగుచ్చి యిపుడు నిత్యకర్మలకు ఫలములేదని చెప్పుటలో స్వాభ్యుపగమవిరోధ మను దోషముకూడ ప్రసక్తించును. కర్మసముచ్చితజ్ఞానమువలన మోక్షము కలుగునని గ్రంథారంభమున చెప్పినమాటకూడ పాటియై చెల్లకపోవును.

కావున నీశ్లోకమునకు వ్యాకరణాది ప్రమాణముల వలన శబ్దశక్తిచే సిద్ధించునట్టి యథాశ్రుతార్థమే యుక్తముకాని గౌణవృత్తి నాశ్రయించికాని లక్షణావృత్తి నాశ్రయించికాని, పరులుచెప్పిన యర్థము యథాశ్రుతము కానేరదు. అయ్యది యంగీకరింప దగదు.

రామానుజ మతము :

ఇచట రామానుజులు ఆత్మయాథాత్మ్యానుసంధానముతో జేయుకర్మను జ్ఞానాకారమయిన కర్మనుగాను అట్టి జ్ఞానము కర్మయం దంతర్భావము నొందుటచే కర్మాకారమగు జ్ఞానమునుగాను ఎవ్వడు తెలిసికొనునో వాడు బుద్ధిమంతుడు, కృతకృత్యుడు; యోగి అని వ్యాఖ్యానమొనర్చిరి.

ఇయ్యది తుచ్ఛము. పరస్పరము భిన్నము లగు కర్మజ్ఞానములలో నొకదానియందు మరియొక దానియొక్క యాకారమును తెలిసికొనుట యసంభవము. అట్లు

తెలిసికొనినచో నయ్యది మిథ్యాజ్ఞాన మగును. ఆత్మతత్త్వానుసంధాన మున్నంత మాత్రమున కర్మను జ్ఞానాకారముగ్నా, జ్ఞానమునకు కర్మాకారముగ్నా రానేరదు. ఒకవస్తువునకు మరియొక వస్తువుయొక్క యాకారము భ్రాంతివలన నేర్పడును గాని మరి యే యితర కారణములవలనను యేర్పడదు. తత్త్వానుసంధానమున ఆత్మకు నిష్క్రియత్వ మేర్పడును గాని దేహాశ్రయమగు కర్మకు జ్ఞానాకారత్వ మేర్పడదు. మనోవృత్తి విశేషరూపమగు "అయం ఘటః" అను జ్ఞానమునకు కర్మాకారత్వము సిద్ధింపదు. జ్ఞానశక్తి బుద్ధినిష్ఠము, క్రియాశక్తి ప్రాణనిష్ఠము. బుద్ధి ప్రాణములు రెండు పరస్పరము భిన్నములు. ఈ రెంటికి అభేదమును యెంతటి పండితుడైనను ఋజువర్చలేడు.

ఫలమును కోరక జేయు కర్మ జ్ఞానరూపమగు నన్నచో నదియు పొసగదు. ఫలమును కోరి చేయు కర్మ బంధము నిచ్చును. ఫలమును కోరక జేయు కర్మ బంధము నివ్వదు. ఇంతియే భేదముగాని ఫలాభిసంధి అనభిసంధులకు ఒకదానికి మరియొకదాని యాకారము భ్రాంతిమూలమున తప్ప మరి యితర కారణమున దుర్ఘటము. నిష్కామకర్మ బంధకము కానందున నయ్యది జ్ఞానాకార మను జ్ఞానమొకానొకనికి కలిగినను అయ్యది గౌణజ్ఞానమగునుగాని, వాస్తవము కాదు. ఇట్టి గౌణజ్ఞానమువలన భగవంతుడు ప్రతిజ్ఞ చేసిన, యశుభ మోక్షణ మను ఫలము సంభవింపదు.

ఇక తత్త్వానుసంధానమువలన కలుగు జ్ఞానము కర్మాన్తర్గతమగుటచే కర్మాకారమను విషయము విద్వాంసులకు మిక్కిలి పరిహాసాస్పద మగుచున్నది. దేహాంతర్గతమగు నాత్మ దేహాకారు డగుచుండెనా ? పైగా దేహాంతర్గతమగు నాత్మయందు దేహాకారజ్ఞానము మిథ్యాజ్ఞానమని ప్రసిద్ధము. అట్లే కర్మాంతర్గతమగు జ్ఞానమునందు కర్మాకారజ్ఞానముకూడ మిథ్యయే యగును. కాక కుండలో రేగుపండ్లు యిమిడి యున్నట్లు కర్మలో జ్ఞానము యిమిడి యుండ నేరదు. మనోనిష్ఠమగు జ్ఞానమునకు దేహాశ్రయమగు కర్మకు ఆధారాధేయభావము అసంభవము, లోకవిరుద్ధము. కర్మజ్ఞానములు రెండు నొకే పర్యాయము అనుష్ఠింప నలవికాదు.

"అహం కర్తా" నేను కర్తను— అను జ్ఞానమునకు, కర్మకు విరోధము లేకున్నను, నేను క్రియుడను అను జ్ఞానమునకు, కర్మకు విరోధము కలదు. కావున విరుద్ధములగు నీ రెండును ఒకే కాలమున ననుష్ఠింప నలవికావు.

దీనిచే జ్ఞానికూడ కర్మను అనుష్ఠింపవలయు ననునది నిరాకృత మగుచున్నది. ఆత్మాపరోక్షజ్ఞానమునకు కర్మలకు విరోధమున్నను పరోక్షజ్ఞానమునకు కర్మలకు విరోధములేదని యనదగదు.

ఆత్మ నిత్యాపరోక్షు డగుచుండ, ఆత్మవిషయమైన జ్ఞానము పరోక్ష మెన్నటికిని కానేరదు. ఆత్మసాక్షాత్కారము కలుగనంతవరకు మానవుడు అనాత్మ వేత్తయే యగును. అనాత్మవేత్తకు కర్మ లంగీకరింపబడియే యున్నవి. ఆత్మయాథాత్మ్యాను సంధానము కలవాడు ఆత్మవేత్తకాని యనాత్మవేత్తకాడు. ఇట్టివానికి కర్మాచరణము శాస్త్రవిరుద్ధము.

మరియు ఏకాగ్రచిత్తునకు గాని యాత్మానుసంధానము సాధ్యము కాదు. విక్షిప్తచిత్తుడుకాని కర్మల నాచరింప నేరడు. మనసు ఆత్మయందుండగా దేహేన్ద్రియ ములు కర్మలయం దెట్లు వ్యాపారము నొందును? అట్లగుచో సమాధియందున్న వానికిగూడ కర్మాచరణము ప్రసక్తించును. ఇయ్యది లోకసిద్ధముకాదు. దేహేన్ద్రియ వ్యాపారము మనోవ్యాపారపూర్వకము. మనస్సు అన్యాక్రాంతమగుచుండగా చక్షురాదీంద్రియములకు ఘటాదులు కనుపింపనేరవు. కావున నొకే పర్యాయము ఒక్కమనస్సు ఆత్మతత్త్వమును అనుసంధానమొనర్చుట, దేహాదులతో సంయోగము చెంది కర్మను చేయించుట నీరెండును ఉపపన్నముకాదు. కనుక కర్మకు జ్ఞానాకారము గాని, జ్ఞానమునకు కర్మాకారముగాని స్వప్నమునందుగూడ నూహింపశక్యముగాదు. కావున రామానుజభాష్యము సావద్యము. ౧౮

శ్లో. యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః
జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం త మాహుః పండితం బుధాః ॥ ౧౯ ॥

అ. కర్మాకర్మల యాథాత్మ్యమును (రహస్యమును) గుర్తెఱింగిన నేమహా నుభావుడు స్వర్గాది ఫలములయం దాసవిడచి, స్వర్గము నాకు కలుగుగాక అని సంకల్పింపక, లోకసంగ్రహముకొఱకుగాని, నివృత్తిమార్గమునందున్నచో జీవ నార్థము గాని కర్మల నాచరింపుచున్నాడో అట్టివానిని పండితుడని యందురు. పండితు డనగా తర్కాదిశాస్త్రముల జదివినవాడుమాత్రము కాదు ఆత్మజ్ఞానము కలవాడని యర్థము. ఇట్టి జ్ఞాని యాచరించిన శుభాశుభకర్మలు పుణ్యమునిచ్చి కాని, పాపమునిచ్చికాని బంధప్రదములు కానేరవు. జ్ఞానమువలన నీ కర్మలయందలి ఫలమును బుట్టించు శక్తి నశించును. కావున నీయవి సంసారబంధము నీయజాలవు.

ఇచట రామానుజులు కర్మకు జ్ఞానాకార మెట్లు కుదురు నను శంకకు నీ శ్లోకము సమాధానము చెప్పుచున్నదనియు, సంకల్పమనగా ప్రకృతితోను, ప్రకృతి యొక్క గుణములతోను ఆత్మను నేకీభావ మొనర్చి వ్యవహరించుట యనియు వ్యాఖ్యానించిరి.

ఇయ్యది సరిగాదు. ఈ శ్లోకము కర్మకు జ్ఞానాకారతను ప్రతిపాదించుట లేదు. జ్ఞానియొక్క కర్మారంభములు కామసంకల్పరహితము లని చెప్పినంతమాత్రమున

కర్మ జ్ఞానాకారము కానేరదు. పైగా "జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం" అను శ్లోకము జ్ఞానకర్మలకు విరోధమును చెప్పుచుండ తనను దహింపజేయు జ్ఞానముయొక్క యాకారమును కర్మ ధరించుట స్వప్నావస్థయందుగూడ పొసగదు. దూది నిప్పు యొక్క యాకారమును చెందుట యెచటనయిన పొసగునా?

ఇక కర్మజ్ఞానముచే దగ్ధమగుచూ జ్ఞానాకారము నొందునన్న నదియు పొసగదు. కర్మ తానున్నదశలోనే, జ్ఞానాకారమునొంద నర్హము గానపుడు తాను నశించినపిదప జ్ఞానస్వరూపము నెట్లుపొందును? నశించిన కర్మయనగా కర్మాభావము కాని కర్మకాదు. అపుడు కర్మాభావము జ్ఞానరూపమయినను కర్మకు మాత్రము జ్ఞానాకారము సిద్ధింపదు.

ఇంక రామానుజులు చేయబడుచున్న (వర్తమానమగు) కర్మ జ్ఞానాగ్నిచే దగ్ధముకాదనియు, పుణ్యాపుణ్యరూపమగు ప్రాచీన కర్మయే జ్ఞానాగ్నిచే దగ్ధమగు ననియు జెప్పినచో నిచట మాత్రము క్రియమాణమగు (చేయబడుచున్న) కర్మకు జ్ఞానాకారతను యీ శ్లోకముచే నెట్లు చెప్పిరి?

కావున కామసంకల్పరహితమగు సర్వకర్మారంభణము జ్ఞానమునకు చిహ్నము కాని జ్ఞానమేకాదు. ఆత్మయాథాత్మ్యానుసంధానమే జ్ఞాన మనియు భయవాదిసమ్మతము. ఆత్మయాథాత్మ్యమును తెలిసికొని యెవడు కామసంకల్పరహితకర్మల నాచరించునో వాడు సంసారబంధమును పొందడు. ఆత్మయాథాత్మ్యమును తెలియని వాడు కామసంకల్పముతోగూడి కర్మల నాచరించును. వాడు బంధము నొందును.

అ. కర్మారంభమునకు పూర్వమే ఆత్మానాత్మవివేకమువలన నెవడు సన్న్యాసమునందు ప్రవర్తించునో అట్టి విద్వత్సంన్యాసి తిరిగి కర్మమార్గమున ప్రవర్తించడు. ఇంక నెవడు యజ్ఞాదుల నారంభించి వాటిని ముగించకపూర్వమే ఆత్మజ్ఞానమును పొందుచున్నాడో అట్టివాడు కూడ మొదలిడిన కర్మను పరిత్యజించి సన్న్యాసియే యగును; కాని కర్మమార్గమున ప్రవర్తించడు. కావున వీరిద్దరు "త్యక్త్వాకర్మఫలాసంగం" అను శ్లోకమున కధికారులు కారు. మరేమనిన నెవడు కర్మను ప్రారంభించిన పిదప నాత్మజ్ఞానము కలిగి కూడ నేదియో యొక ప్రతిబంధకమువలన కర్మలను విడనాడజాలడో అట్టివాని నుద్దేశించి యీ శ్లోకము ప్రవర్తించుచున్నది.

ఇట్టివాడు తాను మొదలిడిన కర్మలతోను వాటి ఫలముతోను తనకెట్టి ప్రయోజనము లేకున్నను నిస్సంగుడుగానుండి లోకసంగ్రహముకొరకు జ్ఞానము కలుగక పూర్వమువలె జ్ఞానము కలిగిన తరువాతగూడ కర్మయందు ప్రవర్తించును. ఆత్మవేత్త కర్మయందు ప్రవర్తించినను కర్మలేపము నొందదు. వానికి యాకర్మ బంధకము కానేరదు. ప్రత్యుత అయ్యది కర్మాభావరూపమే యగును. ఈ విషయము నంతయు ముందుశ్లోకముచే భగవంతుడు చెప్పుచున్నాడు.

శ్లో. త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః ॥ ౨౦ ॥

నేను యీ కర్మను చేయువాడను, యీపని నాది అను నభిమానమును విడచి ఫలేచ్ఛనుగూడ వదలి నిష్క్రియాత్మజ్ఞానముచే విషయములయందు గోరిక లేనివాడై దృష్టాదృష్టఫలములయం దాసలేమిచే కర్మను పరిత్యజింపదగిన స్థితిలో నున్నను లోకసంగ్రహాముకొరకుగాని, పెద్దలు నిందింతురను భీతిచేగాని కర్మమార్గ మున ప్రవర్తించిన ఆత్మజ్ఞాని యేపనియు చేయనివాడే యగును. కర్మ దేహాదుల నాశ్రయించి యుండునుగాని యాత్మను ఆశ్రయించి యుండ నేరదని తెలియు జ్ఞాని యాత్మను అకర్తనుగా తలచును కాన, నట్టి యాత్మజ్ఞాని యేపనిని చేయువాడు కానేరడని భావము.

ఇచట రామానుజులు "నైవ కించిత్కరోతి" అను పదమునకు కర్మవ్యాజ ముచే జ్ఞానాభ్యాసము నే చేయుచున్నాడని వ్యాఖ్యానము చేసిరి. శబ్దస్పర్శాది ప్రతి కూలవిషయములయందు ప్రవర్తించుటచే జ్ఞానాభ్యాసమునకు విరుద్ధములగు ఇంద్రి యములను అనుకూల విషయములయందు ప్రవర్తింపఁజేయుట కర్మయోగమని వేదాన్తదేశికులు కర్మయోగశబ్దమునకు నిర్వచన మొనర్చిరి.

వీరిద్దరి వ్యాఖ్యానము సరియయినదికాదు. రామానుజాశయమును వ్యాసులు చెప్పదలచినచో "నైవ కించిత్కరోతి సః" అను పాదమును "జ్ఞానమేవ కరోతిసః" అను పాదముతో పూర్తిచేసి యుండెడివాడు. జ్ఞానాభ్యాసమనగా యింద్రియ వ్యాపారములను కట్టిపెట్టుట. అట్టితరి ఇంద్రియములు ప్రతికూలవిషయములయందు ప్రవర్తించుట జ్ఞానాభ్యాసమున కెట్టి విరోధమో, అనుకూలవిషయములయందు ఇంద్రియములు ప్రవర్తించుటకూడ అట్లె జ్ఞానాభ్యాసమునకు విరుద్ధమగును. అంత ర్ముఖమగు మనస్సుచే సాధింపదగినది జ్ఞానాభ్యాసము. బహిర్ముఖమగు మనస్సుచే తెలియదగినవి సర్వవిషయములు. ఇయ్యవి ప్రతికూలములయినను, అనుకూలము లయినను, మనోవేద్యము లగుటలో భేదములేదు. కావున అనుకూలవిషయములు మాత్రము జ్ఞానాభ్యాసమునకు అవిరుద్ధము లెట్లగును? కావున నెవడు నిస్సంగ ముగా కర్మను చేయునో వాడు కర్మయోగమునం దున్నవాడే యగును. జ్ఞానయోగము నభ్యసించువాడు కానేరడు. కర్మయోగ సాధ్యమగు జ్ఞానయోగము నందు కర్మయోగముయొక్క ఆకారము సంభవింపదు. కావున రామానుజ, వేదాన్త దేశికుల వివరణము పొసగనేరదు. ౨౦

అ. ఎవడు బ్రహ్మచర్యమునుండియే సన్యసించి యాత్మజ్ఞానమును పొంది జ్ఞాననిష్ఠుడగునో వాడు శుకవామదేవాదులవలె ముక్తి నొందునని చెప్పుచున్నారు.

శ్లో. నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్త సర్వపరిగ్రహః
శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్ ॥ ౨౧ ॥

అ. కోరికలను విడచి, మనోదేహములను నిగ్రహించుకొని, గృహాదిపరికరములను వదలి శరీరము నిలచుట కుపయోగపడు భిక్షాటనాది కర్మను మాత్రము చేయు యతి తన కనిష్టములగు పుణ్యపాపములనొందడు. దేవాదిజన్మము నిచ్చు పుణ్యముకూడ ముముక్షువునకు నిష్టమే కావున నిచట కిల్బిష మను పదమువలన ధర్మము ( పుణ్యము ) కూడ గ్రహింపబడుచున్నది.

ఇచట " శారీరం కేవలం కర్మ " అను వాక్యమువలన శరీరముచే చేయదగిన పని యనియు, శరీరము నిలచియుండుటకు దగిన పని యనియు రెండు విధముల యర్థము లభించుచున్నది. ఇందు మొదటిపక్షమున యజ్ఞయాగాది విహితకర్మలవలె పరదారాగమనాది నిషిద్ధకర్మలుకూడ శరీరముచే చేయతగినవే కావున నిషిద్ధకర్మలు కూడ అనివార్యముగా శారీరము లగును. ఇట్టితరి ( శారీరకమగు కర్మను చేయువాడు పాపము నొందడను) " శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్ " అను శ్లోకమునకు శరీరముచే చేయదగిన పరదారాగమనాది నిషిద్ధకర్మలను చేయువాడు పాపమును బొందడని చెప్పినచో నిషిద్ధకర్మాచరణమువలన పాపము సంభవించునని ఘోషించు శాస్త్రములు వ్యాహతము లగును.

ఇక శారీరము లగు విహితకర్మల నాచరించువాడు పాపము నొందడని చెప్పినచో అప్రసక్తప్రతిషేధమను దోషము వాటిల్లును. నిషేధమునకు ప్రసక్తి యావశ్యకము. విహితము లగు యాగాదుల ననుష్ఠించినందున పాపము వాటిల్లునని యెచట నయినను చెప్పబడి యున్నచో నిచట నట్టి పాపనిషేధము పొసగును. యాగాద్యనుష్ఠానమువలన పాపప్రసంగము వచ్చుటను కాన్పింపదు. కావున పాపనిషేధము అప్రసక్తప్రతిషేధ మగును.

మరియు " కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్ " అని చెప్పక " శారీరమ్ కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ " అని చెప్పుటచే అనగా జ్ఞాననిష్ఠుడగు యతి కర్మ చేసినను పాపము నొందడని చెప్పక శారీరకకర్మను చేసియు పాపమును బొందడని చెప్పుటచేతను, తత్రాపి కేవల శారీరకకర్మ అని కేవలశబ్దమును విశేషణ మొనర్చుట చేతను వాచిక మానసిక కర్మలను చేయువాడు పాపమును పొందు నని సిద్ధించుచున్నది. ఇందు కనుకూలముగ పదవిభాగముకూడ నుపపన్న మగును. శారీరం, కేవలం, కర్మ, కుర్వన్, ఆప్నోతి, కిల్బిషమ్ అని. ఇచట జ ముడాగమముచే " కుర్వాన్నాప్నోతి " అని సంధి యగును. మూలమునందుమాత్రము కుర్వన్–న–ఆప్నోతి అని పదవిభాగ మని గ్రహింపనగును.

సమాధానము. ఈ వ్యాఖ్యానమునందుగూడ వెనుకటి దోషములే ప్రసక్తించును. ఎట్లన- వాచిక, మానసిక కర్మలు విహితములా? లేక నిషిద్ధములా? అని ప్రశ్నింపవలెను. విహితములన్నచో విహితములగు వాచిక, మానసిక కర్మల నాచరించిన పాపము వచ్చుననుట శాస్త్ర విరుద్ధమగును. నిషిద్ధములన్నచో నిషిద్ధములగు వాచిక, మానసిక కర్మల ననుష్ఠించిన పాపము ప్రసక్తించు ననునది సిద్ధమే కావున దానిని మరల చెప్పుట వ్యర్థమగును.

కావున "శారీరం కర్మ" అను పదమునకు శరీరము నిలచియుండుట కనుకూలమగు కర్మ అనియే యర్థమును గ్రహింపవలెను. లోకములో కర్మలు విహితములనియు, నిషిద్ధములనియు రెండు తెఱంగులు. ఈ రెండును దృష్టఫలకములనియు, అదృష్టఫలకము లనియు ప్రత్యేకముగా మరి రెండు తెఱంగులు. విహిత కర్మలకు దృష్టఫలము పశుపుత్రాన్నాదులు అదృష్టఫలము స్వర్గాదులు. నిషిద్ధకర్మలకు దృష్టఫలము రోగము, రాజశిక్షాదులును, అదృష్టఫలము నరకము. కావున ముముక్షువు యిందేదియు ననుష్ఠింపక శరీరము నిలచియుండుటకు నాధారమగు భిక్షాటనాదులను మాత్రము కర్తృత్వాభిమానమును వదలి యాచరించుచుండును. అందువలన నాతడు పాపము నొందడు.

అయితే ఇట్టి యతికి పాపప్రాప్తియే అసంభవ మగుచుండ అప్రాప్తమగు కిల్బిషమును నిషేధించుట యనవసరము కదా? యని ప్రశ్నింపరాదు. అజ్ఞానులగు లోకులు భిక్షాటనాదుల నాచరించు యతులకు గూడ సంసారప్రాప్తి కలదని భ్రాంతిచే తలచెదరు. కావున భ్రాంతి ప్రాప్తమగు సంసారసంబంధమును నిషేధించుట భగవంతున కుచితమగును కావున "శారీరం కేవలం కర్మ" అను పదమునకు 'శరీరస్థితి మాత్రప్రయోజనమగు కర్మ' అను నర్థమే యుక్తము.

ఇచట రామానుజులు "శారీరం కేవలం కర్మ కుర్వన్" అను వాక్యమునకు జ్ఞాననిష్ఠతో వ్యవధానములేని కర్మయోగ మాచరించుచు సంసారమును పొందడని వివరించిరి. ఇయ్యది సరిగాదు. వాచికమానసికము లగు జపధ్యానాదుల ననుష్ఠించిన సంసారప్రాప్తి యనివార్యమగును. కాక కేవల పదమునకు అవ్యవధానమను అర్థము చెప్పుట అప్రమాణమగును. కావున వారి వివరణము ఉచితముకాదు. ౨౧

శ్లో. యదృచ్ఛాలాభ సంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః
సమ స్సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే ॥౨౨॥

అ. "అయాచిత మసంక్లుప్తం ఉపపన్నం యదృచ్ఛయా" ఇత్యాది వచనముల ననుసరించి యతికి శరీరమును నిలబెట్టుకొనుటకు యెవ్వరిని యాచింపక, సంకల్పరహితముగా అయిదు యిండ్లనుంచికాని ఏడు యిండ్లనుంచికాని, భిక్షాటనచే సంపాదించుకొనబడిన యన్నముకాని, భక్తజనులచే స్వయముగా తీసికొని రాబడిన

సిద్ధాన్నముకాని ముఖ్యమని యీ శ్లోకముచే భగవంతుడు ప్రకటించుచున్నాడు.

తాను కోరక వచ్చువానితో సంతోషించుచు, శీతోష్ణాదులచే బాధపడుచును మనోవికారము నొందక, నేభూతమును విరోధింపక, దైవికముగా పదార్థములు లభించినను లభింపకున్నను సమభావముతో నుండు యతి ఆత్మయాథాత్మ్యజ్ఞానము కలవాడగుచు శరీరము నిలచియుండుట కుపయోగపడు భిక్షాటనాదులయందు "నేనేమియు చేయుటలేదు. గుణములు గుణములయందు ప్రవర్తించుచున్నవి." అని యెల్లపుడు తలచుచు భిక్షాటనము మున్నగు కర్మలనుగూడ జేయును. ఒకవేళ భిక్షాటనాదులయందు ప్రవర్తించినను, కర్తృత్వాభిమానము లేమిం జేసి యయ్యవి యాతనిం బంధింపజాలవు. ౨౨

శ్లో. గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే. ॥ ౨౩ ॥

అ. ప్రపంచసంగమును వదలి, పుణ్యాపుణ్యాది బంధమునుండి మరలి జ్ఞానమాత్రమునందు చిత్తమును నిలిపి, మొదలిడిన యజ్ఞమును పూర్తిచేయుటకు, ప్రవర్తించిన యతియొక్క కర్మఫలమునీయక నశించును. ఇచట యతిశబ్దమునకు "యతతే ప్రయత్నం కరోతి" అను వ్యుత్పత్తిచే మోక్షము కొరకు ప్రయత్నించువాడు అని యర్థము. కాని సన్యాసి యనికాదు. మరియు "యజ్ఞాయ" అను పదమునకు యీశ్వర ప్రీతికొరకు అని యర్థము చెప్పదగదు. ఆత్మజ్ఞానికి యీశ్వర ప్రీత్యర్థకమగు సంకల్పముండ నేరదు. ఆత్మజ్ఞాని యనగా తానే యీశ్వరుడని తెలుసుకొనువాడు. ఇట్టితరి యీశ్వరప్రీతియనగా ఆత్మప్రీతియే యగును. ఇయ్యది యనిష్టము. ఆత్మజ్ఞానికి తనప్రీతిరూపమగు ఫలమునందుకోరిక యుచితముకాదు. లోకసంగ్రహము కొరకు ప్రారబ్ధమగు యజ్ఞమును నెరవేర్చుట ఆత్మజ్ఞానికిగూడ నుచితమే యగును.

కావున ఆత్మజ్ఞానిచే ననుష్ఠింపబడిన కర్మఫలముతోసహా నశించును. ఫలాభిసంధి అహంకారాదులు లేనందున ఆత్మజ్ఞాని చేసిన యజ్ఞము స్వర్గాది ఫలమునీయజాలదు.

శ్లో. బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతం
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా ॥ ౨౪ ॥

అ. అర్పణము (హోమసాధనమగు స్రుగాదులు) బ్రహ్మము, ఆజ్యాది హవిస్సు బ్రహ్మము, అగ్నిహోత్రము బ్రహ్మము, యజమాని బ్రహ్మము, హోమము బ్రహ్మము, పొందదగిన స్వర్గాదిఫలము బ్రహ్మము అని యన్వయము. జ్ఞేయములగు స్రుగాదులు జ్ఞాతయగు సాక్షి బ్రహ్మరూపము లెట్లగునని యనదగదు. లోకములో కారణముకంటె భిన్నముగా కార్యము లుండనేరవు. మట్టికంటె భిన్నముగా ఘటా-

చులు కన్పించుటలేదు. "ఆత్మన ఆకాశస్సంభూతః" "యతోవా ఇమాని భూతాని జాయంతే" అను శ్రుతులు నిఖిలప్రపంచమునకు ఆత్మకారణమని చెప్పుచున్నవి. కావున ప్రపంచాంతర్గతములగు స్రుగాదులుకూడ ప్రపంచకారణమగు ఆత్మకంటె భిన్నరూపములుగా నుండనేరవు. గనుక స్రుగాదులు సాక్షిబ్రహ్మరూపములగుచున్నవి.

ముత్తెపుచిప్పయందు రజతము కల్పింపబడినట్లు ఆత్మయందు జగత్తు కల్పింపబడిన దని సిద్ధాంతము. కావున ముత్తెపుచిప్పకంటె భిన్నముగా రజతము లేనట్లు ఆత్మకంటె వేరుగా స్రుగాది వస్తుజాలము లేదు. శుక్తికయొక్క నిజరూపమును గుర్తెఱింగినవాడు, శుక్తికయందు రజతములేదని తెలుసుకొనినట్లు ఆత్మతత్త్వమును దెలిసికొనినవాడు ఆత్మయందు స్రుగాదివస్తుజాలము లేదని తెలిసికొనును.

అజ్ఞానికిమాత్రము శుక్తియందు రజతము గోచరించినట్లు, బ్రహ్మయందు ప్రపంచము భాసించుచుండును. కంటిలోని దోషమువలన శుక్తికయే రజతాకారముగా భాసించినట్లు అవిద్యావశమువలన అజ్ఞానులకు ఆత్మయే ప్రపంచాకారముగా దోచును. విద్వాంసులకు శుక్తిక శుక్తికగా దోచినట్లు, బ్రహ్మ బ్రహ్మగానే భాసించునని భావము.

ఓయి! ఇట్టితరి బ్రహ్మ బ్రహ్మయేకాని స్రుగాదిపదార్థజాలముకాదు— అని చెప్పదగియుండగా, ఏది స్రుగాదివస్తుజాలమో అయ్యది బ్రహ్మమే యని చెప్పనేల? అని యనరాదు. లోకములో భ్రాంతిచే నెయ్యది రజతాకారముగా దోచుచున్నదో అయ్యది రజతముకాదు. మరేమనిన నిజముగా నయ్యది శుక్తికయే అని పురుషుడు రజతభ్రాంతి దొలగిన పిదప తెలిసికొనినట్లు, ఎయ్యది స్రుగాదివస్తురూపముగా దోచుచున్నదో అయ్యది స్రుగాదికము కాదు. మరేమనిన అయ్యది నిజముగా బ్రహ్మమే అని భ్రాంతిదొలగిన పిదప విద్వాంసుడు తెలుసుకొనును. అవిద్వాంసుడుమాత్రము శుక్తికయందు భాసించిన రజతమును రజతమునుగానే గుర్తెరింగినట్లు ఆత్మయందు భాసించిన స్రుగాది వస్తుజాలమును స్రుగాదిరూపముగానే దెలిసికొనును.

ఇచట బ్రహ్మకును స్రుగాదివస్తుజాలమునకును భాష్యకారులు శుక్తికారజతదృష్టాంతమును చూపినందున బ్రహ్మజగత్తులకు వివర్తవాదము కాని, మృద్ఘటాదులకువలె పరిణామవాదము కాదని సూచితమగుచున్నది. కార్యకారణములు సమసత్తాకములయినచో పరిణామవాద మనియు అయ్యవి విషమసత్తాకము లయినచో వివర్తవాదమనియు భేదము తెలియవలెను.

బ్రహ్మవేత్తకు స్రుగాదివస్తుజాలము బ్రహ్మరూపమని చెప్పినట్లు స్వర్గమను ఫలముకూడ బ్రహ్మరూపమే యని చెప్పదగియుండగా మూలమునం దట్లు చెప్పక

"బ్రహ్మైవ తేన గంతవ్యమ్" అని బ్రహ్మవేత్తచే పొందదగిన ఫలము బ్రహ్మమే యని చెప్పుట యెట్లు పొసగునని శంకింపరాదు. అజ్ఞాని యజ్ఞానుష్ఠానమువలన పొందు స్వర్గాదిఫలమును జ్ఞాని బ్రహ్మరూపముగా చూచునని దాని భావము. ఎవడు స్రుగాదివస్తుజాలమును బ్రహ్మముగా తెలిసికొనునో వాడు బ్రహ్మమునే పొందును. అని గ్రహింపవలెను. ఇట్లు లోకసంగ్రహముకొరకు బ్రహ్మవేత్త బ్రహ్మబుద్ధితో చేయునట్టి కర్మ పరమార్థముగా అకర్మరూపమే యగును. కారకముల స్వరూపము బ్రహ్మబుద్ధితో నుపమృదితమయినందున అట్టి కారకములచే నెరవేర్చునట్టి కర్మ కర్మరూపము కానేరదు. ప్రత్యుత బ్రహ్మరూపమే యగును. యజ్ఞమునందు ఏస్రుగాదులు ప్రసిద్ధముగా నున్నవో పరమార్థజ్ఞానము కలవానికి అయ్యవి అధ్యాత్మమునందు బ్రహ్మరూపముగానే తోచును. సర్వప్రపంచమునందు వానికి బ్రహ్మబుద్ధియుండుటచే నట్టి భావము బ్రహ్మవేత్తకు సహజము.

లోకములో యజ్ఞాది కర్మలు దేవతా విశేష సంప్రదానాదికారకబుద్ధితోను, కర్తృత్వాభిమాన ఫలాభిసంధులతోను కూడియున్నవి. అందుచే నయ్యవి కర్మరూపములగును. బ్రహ్మవేత్తచే లోకసంగ్రహార్థ మనుష్ఠించు యజ్ఞాదులయందు బ్రహ్మవేత్తకు సంప్రదానాదికారకబుద్ధి కాని, కర్తృత్వాభిమానము కాని, ఫలాభిసంధి కాని యుండదు. అందువలన నయ్యవి కర్మరూపములు కానేరవు. బ్రహ్మరూపములే యగును.

బుద్ధిభేదముచే కర్మలయందు స్వరూపభేదము, ఫలభేదము, లోకశాస్త్ర సిద్ధము, కామ్యాగ్నిహోత్రము కామన లేమింజేసి కామ్యము కానేరదు. (అకామ్యమగును). బుద్ధిపూర్వకృతమగు ప్రాణిహింస రౌరవాదినరకము నిచ్చును. అదియే అబుద్ధిపూర్వకమగుచో రోగాదులమాత్రమే కలుగజేయును. కావున బ్రహ్మవేత్తచే జేయబడు యజ్ఞాదులు బ్రహ్మరూపములు కాని కర్మరూపములు కావు.

ఈ శ్లోకమును కొందర న్యథా వ్యాఖ్యానించుచున్నారు. ప్రతిమాదులయందు విష్ణుబుద్ధియు, నామాదులయందు బ్రహ్మబుద్ధియు నుంచినట్లు ఈ శ్లోకముచే అర్పణాదులయందు (స్రుగాదులయందు) బ్రహ్మబుద్ధి యుంచబడుచున్నదని యభిప్రాయపడి, ఏది బ్రహ్మమో అది స్రుగాదికము, బ్రహ్మమే హవిస్సు, బ్రహ్మమే అగ్నిహోత్రము, బ్రహ్మమే యజమానుడు, బ్రహ్మమే హోమము, బ్రహ్మమే స్వర్గము అని యన్వయించిరి. బ్రహ్మయే కరణకారక, కర్మకారక, అధికరణకారక, కర్తృకారక, సమ్ప్రదానకారకములను పంచవిధకారక రూపముగా పరిణమించి యుండెనని వీరి యాశయము.

పూర్వ వ్యాఖ్యానమువలన అర్పణాదులయందు అర్పణాదిబుద్ధి పోయి బ్రహ్మబుద్ధి యుదయించు ననియు, యీ వ్యాఖ్యానమువలన అర్పణాదులయందు బ్రహ్మ

బుద్ధి యుదయించుననియు భేదము గ్రహింపవలెను. పూర్వమతమున అర్పణాదుల యందు అర్పణాదిబుద్ధి నశించును. ఈ మతమున నయ్యది నశింపనేరదని భావము.

ఓయి ! ప్రతిమాదులయందు ప్రతిమాదిబుద్ధి యుండగా విష్ణ్వాదిబుద్ధి యెట్లు కలుగును ? అని యనరాదు. ప్రతిమాదులయందు ప్రతిమాదిబుద్ధి నిజమయినది. విష్ణ్వాదిబుద్ధి కల్పితము. కావున విషయభేదమువలన రెండుబుద్ధు లొకచోట నుండ వచ్చును. రెండుబుద్ధులు నిజములయినను, లేక రెండును కల్పితములయినను విరోధ ముండును. ఇచట యొకబుద్ధి కల్పితము రెండవది వాస్తవికము అయినందున విరోధములేదు.

అయితే ప్రతిమాదులయందు విష్ణ్వాదిబుద్ధి కల్పితమయినను, బ్రహ్మజన్యము లగు అర్పణాదుల (స్రుగాదుల) యందు బ్రహ్మబుద్ధి కల్పిత మెట్లగును? మృజ్జన్య మగు ఘటమునందు మృద్బుద్ధి కల్పితము కానేరదు కదా ? అని యనరాదు. అట్టి తెరి మృజ్జన్యమగు ఘటాదులయందు, మృద్బుద్ధి ఘటబుద్ధులు రెండును విరోధము లేకుండ యుండినట్లు బ్రహ్మజన్యములగు అర్పణాదులయందు బ్రహ్మబుద్ధి, అర్పణాది బుద్ధులు రెండును యుండుటకు విరోధముండ నేరదు.

అయితే అర్పణాదులయందు బుద్ధిద్వయమును యొప్పినచో, బ్రహ్మవేత్తకు అర్పణాదులయందు అర్పణాదిబుద్ధి యెట్లు నశించునని యనదగదు. ఆత్మసాక్షాత్కా రము కలవానికి సర్వముబ్రహ్మముగానే తోచును. అల్పున కట్లు తోచదు. వీనికిసర్వ మునందు బ్రహ్మదృష్టి ప్రతిమాదులయందు విష్ణుబుద్ధివలె నారోపమగును. కావున నిజముగా స్రుగాదులు బ్రహ్మరూపములయినను అది గుర్తెఱుంగని కించిత్ జ్ఞునిచే స్రుగాదులయం దుంచబడిన బ్రహ్మబుద్ధి కల్పితమే యగును. కావున బ్రహ్మవేత్త దృష్ట్యా స్రుగాదులయందు (అర్పణాదులయందు) బుద్ధిద్వయముండనేరదు. బ్రహ్మవేత్త బ్రహ్మకంటె భిన్నముగా నేదియు లేదనియే తెలుసుకొనును. అజ్ఞానికే అర్పణా దులయందు బుద్ధిద్వయ ముదయించును. ఇందు యొకటి కల్పితము, రెండవది తాత్త్వి కము అయినందున నీ రెంటికి విరోధము లేదు.

కావున నీశ్లోకము బ్రహ్మయందు అర్పణాదిబుద్ధిని విధించుటకు ప్రవర్తించు చున్నదని పూర్వపక్షము.

సమాధానము :— ఈ ప్రకరణము జ్ఞానయజ్ఞమును స్తుతించుటకు ప్రవర్తించి నదా ? లేక స్రుగాదికారకములతోఁ గూడిన యజ్ఞమును స్తుతింపవచ్చినదా ? యని ప్రశ్నింపవలెను. ఇందు రెండవది నిజమయినచో పూర్వపక్షము కుదిరెడిది. అట్లు కాదు. ఈ ప్రకరణము యజ్ఞస్తుతికొరకారంభముకాలేదు. "కర్మ ణ్యకర్మ యః పశ్యేత్" ఇత్యాది వచనములతో జ్ఞానయజ్ఞమును స్తుతింపుచు నీ ప్రకరణ మారంభ మయినది. కావున నిందు ప్రతిమాదులయందు విష్ణుబుద్ధివలె అర్పణాదులయందు

బ్రహ్మబుద్ధి కర్తవ్యమని (యుంచదగినదని) చెప్పుట యుచితముకాదు. అట్లు చెప్పినను అద్దానివలన (అర్పణాదులయందు బ్రహ్మదృష్టిసంపాదన జ్ఞానమాత్రమున) బ్రహ్మ ప్రాప్తిరూపమగు మోక్షఫల ముపపన్నము కానేరదు. "బ్రహ్మైవ తేన గంతవ్యమ్" అని మోక్షఫలము యిచట సూచింపబడినది.

మరియు "కర్మణ్యకర్మ యః పశ్యేత్" అని సమ్యగ్దర్శనము నుపక్రమించి "శ్రేయాన్ ద్రవ్యమయాత్ యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప" అని జ్ఞానయజ్ఞ మును స్తుతింపుచు నీ యధ్యాయము ముగిసినది. ఇట్టిస్థితిలో మధ్య నీ శ్లోకమున అప్రసక్తముగా అర్పణాదులయందు బ్రహ్మదృష్టిని విధించినచో ప్రకరణవిరోధము వాటిల్లును. కావున మొదటి వ్యాఖ్యానమునందలి యర్థమే సమంజసము. ద్వితీయ వ్యాఖానము సమంజసముకాదు.

రామానుజ మతము :

బ్రహ్మ స్రుగాదికము, బ్రహ్మ హవిస్సు, బ్రహ్మ అగ్ని, బ్రహ్మ యజమానుడు, బ్రహ్మ హోమము, ఇట్లు కర్మయంతయు బ్రహ్మాత్మకమగుటచే బ్రహ్మమయమే నని యెవ డనుసన్ధానము చేయుచున్నాడో (యెవడు సమాధాన పరచుచున్నాడో) వాడు బ్రహ్మకర్మసమాధి, వాడు బ్రహ్మమునే పొందును. ముముక్షువుచే చేయ బడు కర్మ పరబ్రహ్మస్వరూపమే నని యనుసంధానముతో కూడియుండుటచే జ్ఞానా కారమగుచు. అదియే సాక్షాదాత్మసాక్షాత్కారమునకు సాధన మగును. కర్మ జ్ఞాన నిష్ఠను కలుగజేసి మోక్షము నిచ్చు ననునది యుక్తముగాదు. జ్ఞానయుక్తమగు కర్మయే నేరుగా మోక్షసాధనమగును. అని రామానుజు లనుచున్నారు.

వేదాన్తదేశికులు కర్మయోగముచే ప్రత్యక్షముచేసికొనదగిన యాత్మ స్వరూ పమే యిచట స్రుక్కు, హవిస్సు, అగ్న్యాదులవలె బ్రహ్మశబ్దముచే చెప్పబడు చున్నదని యనిరి.

వీ రుభయుల వ్యాఖ్యానము సరిగాదు (యుక్తముగాదు). కర్మ బ్రహ్మమయ మని తెలియువాడు ఆత్మసాక్షాత్కారము నొందుననుట యుక్తముగాదు. ఆత్మ సాక్షాత్కారమునకును కర్మ బ్రహ్మమయమను జ్ఞానమునకును కార్యకారణభావము లేదు. ఆత్మ బ్రహ్మకంటె భిన్న మను రామానుజమతమున, కర్మ బ్రహ్మ జ్ఞానము వలన బ్రహ్మసాక్షాత్కారము కలిగినను ఆత్మసాక్షాత్కారము కలుగనేరదు.

మరియు ఇన్ద్రియవ్యాపారోపరమరూపమగు జ్ఞాననిష్ఠ లేనిదే అన్తస్థితమగు ఆత్మవస్తువు ప్రత్యక్షముకానేరదు. కర్మానుష్ఠానపరుడు బహిర్ముఖ మనస్కుడుగా నుండును. వానికి కావలసిన కారకములన్నియు బాహ్యములుకాని ఆంతరములు కావు. ఆత్మ ఆంతరుడు (లోపలనుండువాడు). వానిని తెలిసికొనుటకు లోపలనుండు

మనస్సుయే కారణముకాని బాహ్యాకారకములతోఁ కూడిన కర్మ కారణము కానేరదు. కర్త, బ్రహ్మ అను జ్ఞానమువలన ఆత్మసాక్షాత్కారము కలుగు నన్నచో "ఘటో బ్రహ్మ" ఘటము బ్రహ్మము అను జ్ఞానమువలనగూడ ఆత్మసాక్షాత్కారము కలుగు ననవలసివచ్చును. ఇయ్యది లోకవిరుద్ధము కాన నంగీకరింప దగదు. ఇక ఆత్మహవి రాదులవలె బ్రహ్మాత్మకు డను వేదాన్తదేశికుల మతము పరిశీలింతము. ఆత్మ బ్రహ్మకార్యమగుటవలన బ్రహ్మరూపుడా? లేక బ్రహ్మకుజ్ఞేయమగుట వలన బ్రహ్మరూపుడా? అని ప్రశ్నింపవలెను. "అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణః" ఇత్యాది శ్రుతులు ఆత్మ నిత్యుడని చెప్పుచున్నందున ప్రథమవికల్పము పొసగదు. కాక వేదాన్తదేశికులుకూడ ప్రకృతి, పురుషుడు, కాలము – ఈయవి యనాదిపదా ర్థములని యంగీకరించిరి. బ్రహ్మవలె, ఆత్మకూడ దృగ్రూపుడగుటచే జ్ఞేయుడు కానందున రెండవ వికల్పముకూడ పొసగదు. ఆత్మ జ్ఞేయమగుచో జడ మగును. "చేతనశ్చేతనానామ్" అను శ్రుతియందు జీవులు చేతనులని రామానుజీయులు కూడ నంగీకరించిరి.

ఇక ఆత్మ బ్రహ్మకు జ్ఞేయమగుటవలన బ్రహ్మాత్మక మన్నచో బ్రహ్మకూడ "దృశ్యతేత్వగ్ర్యయాబుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః" అను శ్రుతి ప్రమా ణమువలన ఆత్మకు జ్ఞేయ మగుచున్నందున బ్రహ్మ ఆత్మరూపుడు కావలసివచ్చును. అపుడు బ్రహ్మకు జడత్వ పరిచ్ఛిన్నత్వ, అనిత్యత్వాది దోషములు ప్రాప్తించును. కావున ఆత్మయందు బ్రహ్మాత్మకత్వము బ్రహ్మభిన్నత్వమేకాని వేరుకాదు. ౨౪

శ్లో. దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి ॥౨౫॥

అ. కొందరు కర్మయోగులు దేవతలను పూజించెడి కర్మయజ్ఞము ననుష్ఠిం చుచున్నారు. మరికొందరు బ్రహ్మవేత్తలు బ్రహ్మ మను అగ్నిహోత్రమునందు ఆత్మను ఆత్మరూపముతో హోమము చేయుచున్నారు. బుద్ధ్యాద్యుపాధిధర్మము లతోఁగూడిన జీవాత్మను నిరుపాధికమగు పరమాత్మస్వరూపునిగా తెలిసికొనుటయే బ్రహ్మాగ్నియం దాత్మను హోమముచేయుట.

శ్లో. శ్రోత్రాదీనీన్ద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి
శబ్దాదీ న్విషయా నన్యఇన్ద్రియాగ్నిషు జుహ్వతి ॥౨౬॥

అ. మరికొందరు శ్రోత్రాది యింద్రియములను, ఇంద్రియ నిగ్రహములను అగ్నులయందు హోమము చేయుచున్నారు. మరికొందరు శబ్దస్పర్శాది విషయము లను ఇన్ద్రియాగ్నులయందు హోమము చేయుచున్నారు. ఇంద్రియావిరుద్ధము లగు విషయములను ఇంద్రియములతో గ్రహించుచున్నారని భావము. ౨౬

శ్లో. సర్వాణీన్ద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే
ఆత్మసంయమ యోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే ॥౨౭॥

అ. మరికొందరు శబ్దస్పర్శాది విషయగ్రహణరూపమగు జ్ఞానేంద్రియవ్యాపారములను, గమనము, సంభాషణము(నడచుట, మాటాడుట)మున్నగు కర్మేంద్రియవ్యాపారములను, ముడుచుట, చాచుట మొదలగు ప్రాణవాయువ్యాపారములను వివేకజ్ఞానముచే వెలుగొందుచున్న ఆత్మసంయోగమను అగ్నియందు హోమముచేయుచున్నారు.

ఆత్మయందు మనస్సును నియమించుట (కట్టివేయుట) ఆత్మసంయమ మనబడును. అదియే యోగమను అగ్ని కాన ఆత్మసంయమయోగాగ్ని అనగా నిర్బీజసమాధి (నిర్వికల్పసమాధి) యని భావము.

శ్లో. ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞాః యోగయజ్ఞా స్తథాఽపరే
స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ యతయ స్సంశితవ్రతాః ॥౨౮॥

అ. పుణ్యతీర్థములయందు ద్రవ్యమును దానముచేయువారు గొందరు, తపస్సును ఆచరించువారు గొందరు, ప్రాణాయామ ప్రత్యాహారాది యోగము ననుష్ఠించువారు కొందరు, వేదము నభ్యసించువారు కొందరు, వేదార్థమును తెలుసుకొనువారు కొందరు, శరీరముకృశించునట్టి కృఛ్రవ్రతముల నాచరించువారు కొందరు, వీరందరు ఆయారూపములతో యజ్ఞముల నాచరించువారే యగుచున్నారు. ౨౮

శ్లో. అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః ॥౨౯॥

అ. కొందరు అపానవృత్తియందు ప్రాణవృత్తిని హోమము చేయుచున్నారు. అనగా పూరకమను ప్రాణాయామమును చేయుచున్నారని యర్థము. మరికొందరు ప్రాణవృత్తియందు అపానవృత్తిని వ్రేల్చుచున్నారు. అనగా రేచకమను ప్రాణాయామమును చేయుచున్నారు. ముఖనాసికలచే వాయువును బయటికివిడచుట ప్రాణగతియనబడును పృష్ఠభాగముచే వాయువును క్రిందికివిడచుట అపానగతి యనబడును. కావున కొందరు ప్రాణాయామ పరాయణులు ప్రాణాపానగతులను నిరోధించి కుంభకమను ప్రాణాయామమును చేయుచున్నారు. ౨౯

శ్లో. అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః ॥౩౦॥

అ. మరికొందరు పరిమితముగా నాహారమును తీసికొనుచు ప్రాణవాయువులను ప్రాణవాయువులందు హోమముచేయుచున్నారు. అనగా ప్రాణాది పంచవాయువులలో నేయేవాయువు స్వాధీనమగుచున్నదో ఆ యా వాయువునందు, ఇతర

వాయువులను ప్రవేశపెట్టుటయే నిచట హోమము. కావున యజ్ఞవేత్తలగు వీరందరు యజ్ఞములచే తమపాపముల పారద్రోలుకొనుచున్నారు. 30

శ్లో. యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మసనాతనమ్
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ ॥ 31 ॥

అ. వెనుకటి యజ్ఞముల నాచరించి యజ్ఞములయందు మిగిలిన అమృతమును భుజించువారలు బ్రహ్మను పొందుదురు. ఇందు జ్ఞాననిష్ఠులు శీఘ్రముగా బ్రహ్మను పొందుదురు. మిగిలినవారు చిత్తశుద్ధిని పొంది పిదప జ్ఞానముకలిగి క్రమముగా బ్రహ్మను పొందుదురని భావము. ఇందు యేయజ్ఞమును అనుష్ఠించనివారలకు మనుష్యలోకములో ననుభవింపదగిన పశుపుత్రకళత్రాన్నాదిభోగములే నుండవు: ఇంక విశిష్టసాధనసాధ్యమగు స్వర్గాదిలోకముండదని వేరుగ చెప్ప నేల?

ఓయి! ఆజ్యాది హవిస్సులతో దేవతలను పూజించెడి దైవయజ్ఞమునందు ఆజ్యముకాని, అన్నముకాని, మాంసముకాని భుజింపదగిన పదార్థము మిగిలి యుండును. వారు దానిని భుజింతురు. యోగ, స్వాధ్యాయ, జ్ఞానాది యజ్ఞముల యందట్లు భుజింపదగిన పదార్థము లేనందున స్వాధ్యాయాది యజ్ఞముల నాచరించినవారలకు యజ్ఞములందు మిగిలిన పదార్థములను భుజించు టెట్లు సంభవించును?

సమాధానము: దైవయజ్ఞములయందు యజ్ఞశిష్టమగు అన్నాదులను భుజింతురనియు, మిగిలిన యోగాది యజ్ఞములయందు యజ్ఞముల నాచరించగా మిగిలిన కాలమునందు విధిచోదితమగు అన్నమును భుజించెదరనియు అర్థభేదమును అంగీకరింపవలెను. 31

శ్లో. ఏవం బహువిధా యజ్ఞాః వితతా బ్రహ్మణో ముఖే
కర్మజాన్ విద్ధి తాన్ సర్వా నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే ॥ 32 ॥

అ. ఇట్లు నానాకరములయిన యజ్ఞములు "వాచిహిప్రాణం జుహుమ ప్రాణేవాచం యేహ్యేవప్రభవః స ఏవాప్యయః" ఇత్యాది వేదవాక్యముల ద్వారా విస్తరించి చెప్పబడినవి. ఇవి యన్నియు కాయిక, వాచిక, మానసిక, వ్యాపారము వలన కలిగినవని గ్రహింపుము. దీనిచే ఆత్మ నిర్వ్యాపారుడను జ్ఞాన ముదయించును. ఇట్టి యాత్మ తత్వజ్ఞానముచే మోక్షము ప్రాప్తించును. 32

శ్లో. శ్రేయాన్ ద్రవ్యమయాత్ యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప!
సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే ॥ 33 ॥

అ. "బ్రహ్మార్పణం" ఇత్యాది శ్లోకముచే ఆత్మజ్ఞానమునకు యజ్ఞరూపమును చెప్పి వివిధములగు యజ్ఞముల నుపదేశించి, సిద్ధపురుషార్థములగు నా యజ్ఞములచే జ్ఞానమును స్తుతింపుచున్నాడు.

దైవయజ్ఞము, ద్రవ్యయజ్ఞము, తపోయజ్ఞములు కాయికములు. స్వాధ్యాయ యజ్ఞము వాచికము. ఆత్మసంయమయోగ యజ్ఞము, శాస్త్రార్థజ్ఞాన యజ్ఞము ఈరెండును మానసికములు. వీటియన్నిటికంటె జ్ఞానయజ్ఞము గొప్పది. ద్రవ్యాది యజ్ఞములు ఫలమును పుట్టించును. జ్ఞానయజ్ఞము ఫలమును పుట్టింపదు. జ్ఞాన యజ్ఞమువలన కలుగు మోక్షము సిద్ధరూపమగుటచే నయ్యది పుట్టనేరదు. మోక్ష సిద్ధికి ప్రతిబంధకముగానున్న యవిద్యను నశింపజేయుటకు మాత్రమే జ్ఞానయజ్ఞ మువయోగపడును. నాలుగు అంకములుగల కృత మను పేరుగల జూదమును జయించినవానికి మూడు, రెండు, ఒకటి యంకములుగల త్రేతా, ద్వాపర, కలి యను పేరుగల జూదములు జయింపబడిన వగుచున్నవి. కృతమునందు త్రేతాదులు యిమిడియున్నట్లు, కర్మయంతయు జ్ఞానమునం దిమిడియుండును. ఆత్మజ్ఞానము కలిగి నచో సర్వకర్మలు ఫలించినట్లే యగునని భావము.

ఇచట రామానుజులు కర్మ రెండంశలు కలదనియు, అందు కర్మాకారమగు అంశకంటె జ్ఞానాకారమగు నంశము గొప్పదని వ్యాఖ్యాన మొనర్చిరి. ఇయ్యది సరిగాదు. కర్మకు నుభయాకారత్వము అసంభవము. కర్మ కర్మాకారమే యగును. జ్ఞానము జ్ఞానాకారమే యగును. ఇందొకదానికి మరియొకదాని యాకారము లభిం పదు. అట్లు లభించినచో నయ్యది యుభయమే యగునుకాని కర్మ కానేరదు. 33

శ్లో. తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః ॥34॥

అ. సాష్టాంగ నమస్కారముచేతను, బంధమోక్ష విద్యాఽవిద్యలగురించిన ప్రశ్నచేతను, గురుశుశ్రూషచేతను స్వాధీనపరచుకొనబడిన గురువులు తత్త్వ వేత్తలుకనుక తత్త్వము నుపదేశింతురు. బ్రహ్మజ్ఞానము నొందుట కుపాయమును అట్టి గురువుల నడిగి తెలుసుకొనుము.

ఇచట రామానుజులు "సాష్టాంగనమస్కారాదులచే బ్రహ్మజ్ఞానమును తెలిసి కొనుము" అని వివరించిరి. ఇయ్యది సరిగాదు. ప్రణిపాతాదులు ఆత్మజ్ఞానమునకు సాధనములు కావు. ఆత్మజ్ఞానము శాస్త్రముచే ప్రతిపాదించబడుచున్నది కాని ప్రణి పాతాదులచే ప్రతిపాదింపబడుట లేదు. కావున రామానుజాన్వయము పొసగదు. యద్యపి "విద్ధి" అను క్రియాపదమునకు లాభార్థము నాశ్రయించినచో రామాను జాన్వయముకూడ పొసగును. కాని, విద్ ధాతువునకు పొందుట అను అర్థమే అయుక్త మగును.

భగవంతుడగు శ్రీకృష్ణుడు అర్జునునకు సాక్షాత్ ఆత్మజ్ఞానమునే యుప దేశించి యున్నందున పార్థునకు ఆత్మజ్ఞానము నొందుట కుపాయ మెద్దియా? యను జిజ్ఞాసయే యుదయింపదు. అయినను లోకానుగ్రహము కొరకు అర్జునుని నిమిత్త.

ముగా జేసికొని భగవంతుడు జ్ఞానప్రాప్త్యుపాయముల నుపదేశించె నని గ్రహింప వలెను. ఇందువలన గురూపదేశము లేకుండా స్వయముగా శాస్త్రవిచారముచే సంపాదించుకొన్న జ్ఞానము మోక్షసాధనము కాజేర దని స్పష్టమగుచున్నది.

భగవంతుడు యెట్లు భక్తిచే భక్తపరవశుడగుచూ భక్తులకు ఫలమునొసగు చున్నాడో, అట్లే విద్వాంసులుగూడ సాష్టాంగ నమస్కారాదులచే శిష్యులకు స్వాధీనులయి శాస్త్రార్థము నుపదేశింతురు. ఇంతియేకాని తత్వవేత్తలగు గురువులు ధనాదులచే లొంగరు.

కావున తత్వవేత్తలకుగూడ శిష్యానుగ్రహము కొరకు శాస్త్రపాఠము భాష్య రచనయు ఆవశ్యకమగుచున్నది. అట్లుకానిచో శాస్త్రార్థసంప్రదాయమే నశించును. భగవంతుడగు శ్రీకృష్ణుడవాప్తసర్వకాముడు కనుక "ఏది యెట్లుజరిగిన నాకేమి" అని యూరకున్నచో గీతాశాస్త్రమే ప్రవర్తించెడిది కాదుకదా? కనుక గురువు ననుగ్రహింప జేసికొనుట శిష్యునకు, శిష్యుని యనుగ్రహించుట గురువునకును ఆవశ్యకము. 34

శ్లో. యద్జ్ఞాత్వా న పునర్మోహ మేవం యాస్యసి పాండవ
యేన భూతా న్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి ॥ 35 ॥

అ. ఓయి యర్జునా! తత్వవేత్తలచే నుపదేశింపబడు నేజ్ఞానమును పొంది నీవు మరల యిట్టివివేకమునకు పాల్పడవో, ఏజ్ఞానముచే బ్రహ్మాది స్తంబపర్యంతములయిన భూతములను ప్రత్యగాత్మయందు, నాయందును జూతువో అట్టి జ్ఞానమును తెలిసి కొనుము. అని పూర్వశ్లోకముతో నన్వయము.

ఓయి! ఒకప్పుడు ఒకానొక మందువలన ఒకానొక రోగము నివర్తింపగా మరల యారోగము ఆమందువలన నివృత్తి చెందునని యెల్లమానవులకు సాధారణ ముగా దెలియును. అట్లే ఒకప్పు డాత్మజ్ఞానమువలన యవివేకము నశింపగా మరల యింకొకప్పు డట్టి యవివేక ముదయించిన నయ్యది ఆత్మజ్ఞానముచే నశించునని సుల భముగా అర్జునుడు తెలిసికొనును. ఇద్దానిని భగవంతు డీశ్లోకముచే జెప్ప నేల? అని యనదగదు. మహానుభావుడగు శ్రీకృష్ణు డుపదేశించిన యాత్మజ్ఞానమువలన నిపుడు అవివేకము నశించినను, యీ జ్ఞానము మరచిపోయి మరల యిట్టియవివేక ముదయించిన, అపుడు శ్రీకృష్ణుని యంతటివారు లేనందున అర్వాచీనులగు గురు వులచే నుపదేశింపబడిన యాత్మజ్ఞానమువలన నజ్ఞానము నివర్తించునా? నివర్తిం పదా? యనుశంక పార్థునకు కలుగవచ్చును. అట్టిశంకను బాపుటకు శ్రీకృష్ణుడు తత్వవేత్తలగు గురువులుకూడ నావంటివారే యనియు కావున వార లుపదేశించిన ఆత్మజ్ఞానమువలన గూడ మోహనివృత్తి కలుగుననియు, భగవంతు డీ శ్లోకముచే నుపదేశించుట నుచితమే యగుచున్నది.

లేక నేను అవకాశము లేనందున నీకు సంగ్రహముగా నాత్మజ్ఞానము నుపదేశించితిని. దీనివలన నీకు తాత్కాలికముగా మోహము నశించునుకాని శాశ్వతముగా నశింపదు. నీకు శాశ్వతనివృత్తి కావలయు నన్నచో, అర్జునా! నీవు యుద్ధానన్తరము తత్త్వవేత్తల కడకేగి వారలవలన విస్తరించి యాత్మజ్ఞానమును దెలిసికొనుము. అని శ్లోకప్రవృత్తికి కారణ మూహింపవచ్చును.

ఇచట జీవేశ్వరులయందు సమస్తభూతములను చూడగలవని చెప్పుటవలన జీవేశ్వరుల కభేదము సూచితమగుచున్నది. జీవేశ్వరులకు భేదము ఉపాధిప్రయుక్తము. మాయోపహితుడు యీశ్వరుడు. అంతఃకరణోపహితుడు జీవుడు అని భేదము.

ఇచట రామానుజులు ప్రకృతి వినిర్ముక్తులగు ఆత్మలందరు పరస్పరము సమానులనియు, సర్వేశ్వరులతో సములనియును యీ శ్లోకమునకుపిండితార్థమని చెప్పిరి. మరియు దృష్టాంతభూతమగు ఆత్మయందు స్థాలీపులాకన్యాయముగ సర్వభూతములను చూడగలవని వివరించిరి.

ఇయ్యది సరిగాదు. ఆత్మ దృష్టాంతమగుచో తనవలె సర్వభూతములను చూతువని చెప్పవలెను. "ఆత్మని" అనుసప్తమి అధికరణార్థమునందు విధింపబడినది. కర్త్రార్థమునందు సంభవింపదు. భావలక్షణాసప్తమీ కూడ నుచితముకాదు. సర్వభూతదర్శనమునకు ఆత్మనిదర్శనత్వము భావలక్షణము కానేరదు. పైగా "నిదర్శనభూతే" అను పదము మూలములో లేనందున కల్పింపవలసి వచ్చును. దేహేన్ద్రియాదిసంఘాతమును చెప్పునట్టి భూతపదమును ఆత్మయందు ప్రయోగించుట కుదరదు.

ప్రకృతి రహితులగు ఆత్మలకు భేదకారణమే లేనందున "సర్వమాత్మవస్తు" వని చెప్పుటకూడ యుక్తముకాదు.

నియామ్య నియామకాది భేదముగల ఆత్మేశ్వరులకు సామ్యము అయుక్తము. ప్రకృతి రహితమగు చైతన్యము ఏకరూపమే కావున ఆత్మాభేదమే సిద్ధించును. కాని ఆత్మభేదము సిద్ధింపదు. "ఆత్మవస్తువు ప్రకృతి వినిర్ముక్తము" అని యొప్పిన రామానుజమతమున నిరుపాధికాత్మవాదము బలాత్కారముగా ప్రసక్తించును. కావున వారి వివరణము యుక్తముకాదు. 35

శ్లో. అపిచేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సన్తరిష్యసి ‖ 36 ‖

అ. పాపమొనర్చిన వారందరికంటె నీవు మిక్కిలి పాపమొనర్చిన వాడవయినను, ఆ పాపమునంతయును జ్ఞాన మను తెప్పచే తరింపగలవు. ఇచట పాపశబ్దము "శస్తంచాథ త్రిషుద్రవ్యే పాపపుణ్య సుఖానిచ" అను అమరకోశమువలన పాపము చేసినవానియందు వర్తించును. ఉత్తరార్థము నందలి వృజినశబ్దమునకు "పాపపుణ్యాత్మకమగు సంసార సముద్రము" అని యర్థము.

శ్లో. యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥ 37 ॥

అ. ఓయి అర్జునా! మండుచున్న అగ్ని కట్టెల నెట్లు భస్మముచేయునో అట్లే జ్ఞానమను అగ్ని సర్వకర్మలను భస్మముచేయును. అనగా బీజశక్తిలేని వాటినిగా చేయు నని యర్థము. "తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యే అథసంపత్స్యే" అను శ్రుతి, జ్ఞానికి ప్రారబ్ధాధీనమగు శరీరము పడిపోవునంతవరకు మోక్షము సిద్ధింపదని చెప్పుటచే, జ్ఞానమునకు ప్రారబ్ధకర్మను భస్మముచేయు సామర్థ్యములేదని తేలుచున్నది. అందువలన "సర్వకర్మాణి" అను పదమునకు "ప్రారబ్ధవ్యతిరిక్తకర్మలను" అని చెప్పవలెను. అనగా ఆగామిసంచితములను మాత్రమే జ్ఞానాగ్ని భస్మముచేయు నని యర్థము. ప్రారబ్ధకర్మమాత్రము "ప్రారబ్ధం భోగతో నశ్యేత్" అను శ్రుతి వలన అనుభవించియే నశింపజేసికొనవలయును. 37

శ్లో. నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి ॥ 38 ॥

అ. ఓయి అర్జునా! జ్ఞానముతో సమానమయిన పవిత్రవస్తువు యీ లోకమున లేదు. అట్టి జ్ఞానమును కర్మయోగముచేగాని, సమాధియోగముచేగాని, చిత్తసంస్కారమును సంపాదించుకొనిన ముముక్షువు చాలకాలమునకు పొందును. 38

శ్లో. శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయతేంద్రియః
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరేణాధిగచ్ఛతి ॥ 39 ॥

అ. శ్రద్ధ కలవాడును, గురూపసత్తియందు (గురువు దరిజేరుటయందు) ఆసక్తి కలవాడును, ఇంద్రియనిగ్రహము కలవాడును జ్ఞానమును పొందును. అనగా శ్రద్ధా గురూపసదన, ఇంద్రియనిగ్రహములు జ్ఞానప్రాప్తికి యుపాయము లని స్పష్టమగుచున్నది. అయితే లోగడ ప్రణిపాత, పరిప్రశ్న, గురుశుశ్రూష లను నుపాయములు చెప్పబడియుండగా మరల యిచట శ్రద్ధా, ఆసక్తి ఇంద్రియనిగ్రహము లను నుపాయముల జెప్పనేల? అని యనరాదు. అయ్యవి బాహ్యములు, అనైకాన్తికములును. వాటివలన తప్పక జ్ఞానము కలుగు నను నియమము లేదు. ప్రణిపాతాదులను కృత్రిమముగా కూడ గొందరు కపటులు ఆచరింపవచ్చును. అట్టి కపటులు నియమముగా జ్ఞానమును పొందరు. ఈ శ్లోకమున చెప్పిన శ్రద్ధాద్యుపాయములు అంతరంగికములు, ఏకాంతికములు. (తప్పక ఫలమునిచ్చునట్టివి) శ్రద్ధాదులు కపటముగా నాచరింప వీలులేదు. కావున శ్రద్ధా, అసక్తి, ఇంద్రియనిగ్రహములు తప్పక ఫలమునిచ్చునట్టి వయినందున వెనుకటి యుపాయములకంటె వేరుగా జెప్పుట పొసగుచున్నది. ఇట్టి జ్ఞానమును పొందినవాడు వెంటనే మోక్ష మను శాంతిని పొందును. కర్మయోగాదులు విలంబముగామోక్షము నిచ్చుననియు,జ్ఞానయోగము వెంటనేమోక్షము నిచ్చు

ననియు "అచిరేణ" అను పదమునలన స్పష్టమగుచున్నది. "తరతిశోక మాత్మవిత్" "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" ఇత్యాది శాస్త్రములిందు ప్రమాణములగుచున్నవి.

శ్లో. అజ్ఞశ్చ అశ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః ॥ ౪౦ ॥

అ. బొత్తుగా ఆత్మజ్ఞానములేనివాడు, అజ్ఞుడు, గురువు ఆత్మతత్వమును గురించిచెప్పినను అందు విశ్వాసములేనివాడు, అశ్రద్ధధానుడు, ఆత్మశాస్త్రముచెప్పినట్లు బ్రహ్మభిన్నుడా? లేక తార్కికాదులుచెప్పినట్లు ఈశ్వరునికంటె భిన్నుడా? బౌద్ధులు చెప్పినట్లు దేహాదిరూపుడా? అను సంశయములుగలవాడు, సంశయాత్మ, ఈ మువ్వురు చెడిపోవుదురు. ఇందు మూడవవానికి అనగా సంశయాత్మకు ఇహలోక సుఖము, పరలోకసుఖము రెండును లేవు. సంశయాత్మకు ఆత్మయందెట్లు సందేహమో అన్నిటియందును అట్లే సంశయ ముదయించును. పుత్రేష్టి జేసిన పుత్రులు పుట్టెదరో లేదో అని సంశయముండును. జ్యోతిష్టోమముచేసిన స్వర్గము కలుగునో కలుగదో అను సంశయముండును. స్రక్చందనవనితాదుల వలన నాకు సుఖముండునో లేదో అను సంశయముండును. ఇట్లు అన్నిటియందు సంశయపడు వాడుదేనిని యాచరింప నేరడు. కావున వానికి నేవిధమగు సుఖము నుండదనిభావము.

శ్లో. యోగసన్న్యస్తకర్మాణం జ్ఞాన సఞ్ఛిన్న సంశయం
ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నంతి ధనఞ్జయ ॥ ౪౧ ॥

అ. పరమార్థదర్శన రూపమగు యోగముచే సర్వకర్మలను వదలుకొని, ఆత్మైకత్వజ్ఞానముచే సర్వసంశయములను వీడి, మనోనిగ్రహముగల ముముక్షువును యేకర్మలు సంసారబంధము సేయజాలవు. జ్ఞానికి మనశ్చాంచల్యరూపమగు ప్రమాదము తగదు. దానివలన జ్ఞానిసర్వానర్థములను పొందు నని "ధ్యాయతో విషయాన్పుంసః" "బలవా నిన్ద్రియగ్రామో విద్వాంస మపికర్షతి" అను శ్లోకములచే పూర్వము యీయధ్యాయమున చెప్పబడినది. కావున ముముక్షువగు విద్వాంసుడు జితేన్ద్రియుడయి అన్తర్ముఖమగు మనస్సుతో నెల్లపుడు ఆత్మస్వరూపమును సాక్షాత్కారమును చేసికొనుచుండ ముక్తినొందునని భావము. ౪౧

శ్లో. తస్మా దజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాత్మనః
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత ॥ ౪౨ ॥

అ. ఓయి యర్జునా? అవివేకమువలనబుట్టిన, మనోగతమగు సంశయమును జ్ఞానమను కత్తితో ఛేదించి, సమ్యగ్జ్ఞానమునకు సాధనభూతమగు కర్మయోగ మాచరింపుము.

ఇట్లు శ్రీభగవద్గీతాభాష్యార్క ప్రకాశికానువాదమున
చతుర్థాధ్యాయము ముగిసినది.

# శ్రీ భగవద్గీతా భాష్యార్క ప్రకాశికానువాదము

## పంచమాధ్యాయము

శ్రీకృష్ణుడు ద్వితీయాధ్యాయమున కర్మ, జ్ఞాన, యోగముల, ప్రతిపాదించి అందు కర్మయోగముకంటె జ్ఞానయోగము గొప్పదని నిరూపించి, యర్జునుడు జ్ఞానయోగమున కర్హుడుకానందున నతనికి కర్మయోగమే కర్తవ్యమని తృతీయాధ్యాయమున వివరించెను. మరల చతుర్థాధ్యాయమున "కర్మణ్యకర్మ యః పశ్యేత్" అను వాక్యము మొదలు "జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం" 'శారీరం కేవలం కర్మకుర్వన్' "బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః" "కర్మజాన్ విద్ధితాన్ సర్వాన్" "జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి" ఇత్యాది వచనములచే సర్వకర్మసన్న్యాసపూర్వక జ్ఞానయోగమునే ప్రశంసించి, అధ్యాయాంతమునందు "ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠ భారత" అను వచనముచే నర్జునునికొరకు కర్మయోగము నుపదేశించెను.

కర్మసన్న్యాసము రెండువిధములు, విద్వత్సన్న్యాసము, వివిదిషాసన్న్యాసము అని. విద్వత్సన్న్యాసమునం దధికారి జ్ఞాని, వివిదిషాసన్న్యాసమునందు అజ్ఞాని యధికారి. విద్వత్సన్న్యాసము సాక్షాన్మోక్షహేతువగుటచే ప్రధానము. వివిదిషాసన్న్యాసము చిత్తశుద్ధిద్వారా జ్ఞానమాత్రమునకు హేతువగుటచే నప్రధానము. ఇట్టిస్థితిలో అజ్ఞానికి కర్మయోగమునందువలె కర్మసన్న్యాసమునందుకూడ నధికారముండుటచే, నజ్ఞానికి కర్మయోగము శ్రేయస్కరమా? లేక కర్మసన్న్యాసము శ్రేయస్కరమా? అని యీరెంటిలోని విశేషమును తెలియగోరి యర్జునుడడుగుచున్నాడు. "సన్న్యాసం కర్మణాం కృష్ణ" అను శ్లోకముచే, "సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరావుభౌ, తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే" అని శ్రీకృష్ణుడు చెప్పిన సమాధానమును బట్టికూడ పార్థుని ప్రశ్నాభిప్రాయ మిదియే యని స్పష్టమగుచున్నది.

శ్రీకృష్ణుని సమాధానవాక్యార్థ మిసుమంత విచారింతము. శ్రీకృష్ణుడు కర్మయోగ, కర్మసన్న్యాసముల రెంటికి నిశ్శ్రేయసకరత్వము (మోక్షమును కలుగజేయుట) ఫలమని యొప్పి ఆ రెంటిలో నేదియో యొక విశేషమువలన కర్మసన్న్యాసముకంటె కర్మయోగము గొప్పదని చెప్పెను.

ఇచట శ్రీకృష్ణుడు ఆత్మజ్ఞాని యాచరించెడి కర్మసన్న్యాస కర్మయోగములకు మోక్షఫలము నంగీకరించి, అందు సన్న్యాసముకంటె కర్మయోగము గొప్పదని

చెప్పెనా? లేక అజ్ఞాని యాచరించెడి సన్న్యాసకర్మయోగములకు మోక్షప్రదత్వ మంగీకరించి అందు కర్మసన్న్యాసముకంటె కర్మయోగము గొప్పదని చెప్పెనా? అని విచారింపవలెను. ఇందు మొదటి పక్షము పపన్నముకాదు. ఏలయన జన్మాది సర్వవికారరహితమగు నిర్వికారాత్మను తానుగా తెలిసికొను నట్టి యాత్మవేత్తను మిథ్యాజ్ఞానము పూర్తిగా నశించినందున నిష్క్రియాత్మస్వరూపముతో నుండుట యను సర్వకర్మసన్న్యాసమే సంభవించునుగాని మిథ్యాజ్ఞానమూలకమగు కర్మయోగము సంభవింపనేరదు. తత్త్వవేత్తయగు జనకాదులకు కర్మలయందు ప్రవృత్తి, ఆత్మవేత్తయగు సన్న్యాసికి భిక్షాటనాదులయందువలె, వాసుదేవునకు సృష్ట్యాదుల యందువలెయు నెంచవలె గాని యయ్యది కర్మరూప మనదగదు. కావున మిథ్యాజ్ఞానము నశించిన యాత్మవేత్తకు మిథ్యాజ్ఞానమూలకమగు కర్మయోగము సంభవింపదు. అందువలన ఆత్మవిత్కర్తృకములగు, సన్న్యాస కర్మయోగములే సంభవము కానందున వాటికి నిశ్రేయసకరత్వము చెప్పుటకాని అందు సన్న్యాసయోగముకంటె, కర్మయోగమే గొప్పదనుటకాని యెంతమాత్రము పొసగదు.

గీతాశాస్త్రమునం దచ్చటచ్చట "య ఏనం వేత్తి హంతారం య శ్చైనం మన్యతే హతం, ఉభౌ తౌ నవిజానీతః నాయం హంతి నహన్యతే" "వేదావినాశినం నిత్యం య ఏన మజమవ్యయం, కథం సపురుషః పార్థ కం ఘాతయతి హన్తి కం" ఇత్యాది స్థలముల యందు ఆత్మవేత్తకు కర్మాభావము ప్రతిపాదింపబడినది.

అయితే గీతాశాస్త్రమునందు ఆత్మస్వరూపమును నిరూపించు ప్రకరణమున "స్వధర్మ మపి చావేక్ష్య నవికంపితు మర్హసి, ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్యనవిద్యతే" "తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ యుద్ధాయ కృతనిశ్చయః" "తతోయుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి" "తస్మాద్యుధ్యస్వ భారత" "కర్మణ్యేవాధికార స్తే మా ఫలేషు కదాచన" ఇత్యాదివచనములచే కర్మయోగము ప్రతిపాదింపబడి యుండుటవలన ఆత్మవేత్తకు కర్మయోగము సంభవమే యని శంక కలుగును.

సమాధానము: 1. సమ్యగ్జ్ఞానముకలవాడు ఆత్మవేత్త, మిథ్యాజ్ఞానముగలవాడు కర్మయోగి. మిథ్యాజ్ఞాన సమ్యగ్జ్ఞానములకు పరస్పరవిరోధము కలదు. కావున సమ్యగ్జ్ఞానముకల యాత్మవేత్తకు మిథ్యాజ్ఞానమూలకమగు కర్మయోగము సంభవింపదు. 2. శ్రీకృష్ణుడు తృతీయాధ్యాయమున ఆత్మవేత్తలకు జ్ఞానయోగమనియు, యోగులకు (అనాత్మవేత్తలకు) కర్మయోగమనియు వేరుపరచి యుపదేశించి యుండెను. 3. కృతకృత్యుడగు నాత్మవేత్తకు కర్మలవలన పొందదగినఫలము లేదు. 4. "తస్య కార్యం న విద్యతే" (ఆత్మజ్ఞానికి చేయదగిన పనిలేదు) అని శ్రీకృష్ణుడు జ్ఞానికి కర్మలతో బనిలేదని స్పష్టముగా చెప్పెను. 5. గీతలయందు కర్మయోగము

ఆత్మజ్ఞానాంగముగా విధింపబడినది. 6. "యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే" అని జ్ఞానయోగము నొందినవానికి కర్మయోగముతో బనిలేదని శ్రీకృష్ణుడు వివరించెను. 7. ఆత్మజ్ఞానికి శరీరము నిలచియుండుటకు తగిన కర్మల కంటె మిగిలిన పనులు పనికిరావని నివారించెను. 8. "నైవ కించిత్కరోమీతి యుక్తోమన్యేత తత్త్వవిత్" అను వచనముచే కేవల దర్శనశ్రవణాది పనులయందు కూడ జ్ఞానికి కర్తృత్వాభిమాన ముండకూడదని భగవాను డుపదేశించెను. కావున ఆత్మవేత్తకు సమ్యగ్జ్ఞానవిరుద్ధమగు కర్మయోగము స్వప్నమునందుగూడ నూహింప శక్యముకాదు.

కావున అజ్ఞాని యాచరించెడి సన్న్యాసకర్మయోగములకే నిశ్శ్రేయసకరత్వమును (మోక్షము నిచ్చుటను) శ్రీకృష్ణుడు చెప్పెననియు, అజ్ఞానియాచరించెడి సన్న్యాసముకంటె వానికి కర్మయోగమే ప్రశస్తమని భగవాను లుపదేశించెననియు శ్రీకృష్ణుని సమాధానవాక్యములవలన గ్రహింపనగును.

ఆత్మవేత్తయొక్క సన్న్యాసము, జ్ఞానసహితము. అనాత్మవేత్తయొక్క సన్న్యాసము జ్ఞానరహితము. అనాత్మవేత్తకు సన్న్యాసమునందు 'నేను కర్తను, నేను భిక్ష నాచరింపుచున్నాను' ఇత్యాద్యభిమానముండును. తత్త్వవేత్తకు "నాహం కరోమి" 'నేనేమియు చేయుటలేదు' అను తత్త్వనిశ్చయముండును. ఇంతియేకాని కర్తృత్వాభిమాన ముండదు- కనుక అనాత్మవేత్తయొక్క సన్న్యాసము ఆత్మవేత్తయొక్క సన్న్యాసముకంటె విలక్షణమగుచున్నది. అజ్ఞుడు కర్మజాతములో కొంతభాగమునే విడచును. దండతర్పణస్నానభిక్షాటనాది కర్మలు అనాత్మవేత్తయగు సన్న్యాసికిగూడ కలవు. అనాత్మవేత్తయగు సన్న్యాసికి ఆన్నృశంస్యము, క్షమ, సత్యము, అహింస, దమము, ఆర్జవము, ప్రీతి, ప్రసాదము, మాధుర్యము, క్రోధరాహిత్యము మున్నగు నియమములు కలవు. కావున యిన్నినియమములతోగూడిన సన్న్యాసముకంటె యనాత్మవేత్తకు కర్మయోగమే ప్రశస్తమని భావము-

ఓయి! ఆత్మవిత్కర్తృకమగు (ఆత్మజ్ఞాని యాచరించెడి) సన్న్యాసముకంటె, అనాత్మవేత్త యాచరించెడి కర్మయోగమే గొప్పదని భగవన్తుని సమాధానవాక్యమున కర్థ మేల చెప్పరాదు? అనినచో నట్లుకాదు. సాక్షాన్మోక్షహేతువగు విద్వత్సన్న్యాసముకంటె పరంపరామోక్షసాధనమగు అవిద్వాంసుడాచరించెడి కర్మయోగము గొప్పదని కలలోగూడ నూహింప శక్యముకాదు. ఇక నాత్మవేత్తకు కర్మయోగము ప్రశస్తతర మెన్నడును కానేరదు. ఆత్మవేత్తను మిథ్యాజ్ఞానము నశించినందున కర్మయోగము ననుష్ఠింపడు. తప్పక సన్న్యసించును. కావున ఆత్మవేత్త విషయమై తెలియదగిన యంశమేమియు లేదు. అనాత్మవేత్తయగు ముముక్షువు విషయమై తెలుసుకొనదగిన యంశము కలదు. అనాత్మవేత్త కర్మయోగము నాచరింపవలెనా? లేక

సన్న్యాస మాచరింపవలెనా ? ఈ రెంటిలో నేది ప్రశస్తము ? అని తెలుసుకొనగోరి యర్జును డడుగుచున్నాడని భావము.

ఓయి ! "కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మయః" అను గ్రంథముచే శ్రీకృష్ణుడు కర్మసన్న్యాసమును ప్రతిపాదించియుండెను. కర్మసన్న్యాసము జ్ఞానమార్గమగుటవలన నందు ఆత్మవేత్తయే కర్తగాని యనాత్మవేత్త కర్త కానేరడు. ఇట్టితరి యర్జునుడు అనాత్మవేత్తకు కర్మసన్న్యాస కర్మయోగములలో నెయ్యది ప్రశస్త మని యెట్లడిగెను ? వినుము సమాధానము.

కర్మసన్న్యాసమునందు సమ్యగ్జ్ఞాన మను హేతువువలన ఆత్మవేత్తకు కర్తృత్వ మెట్లు సంప్రాప్తమయ్యెనో అట్లే అనాత్మవేత్తకుగూడ కర్మఫల మనిత్యమని తెలుసుకున్నందువలనను, వైరాగ్యము కలిగినందునను కర్మసన్న్యాసమునందు కర్తృత్వము ప్రాప్తించును.

"జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్" అను వచనముచే శ్రీకృష్ణుడు ఆత్మవేత్తకు సన్న్యాసయోగము, అనాత్మవేత్తకు కర్మయోగము అని నియమించెనుకదా ? యని యనరాదు. శ్రీకృష్ణుడు ఆత్మవేత్తకు సన్న్యాసమే కర్తవ్యమని నియమించెను కాని ఆత్మవేత్తయే సన్న్యసింపవలెనని నియమించియుండలేదు. కావున సన్న్యాసమునందు ఆత్మవేత్తయే కర్తయనుటకు వీలులేదు.

అయితే యిట్లే కర్మయోగముకూడ అనాత్మవేత్తయే యాచరింపవలెనని నియమింపబడలేదు కనుక, ఆత్మవేత్తకుగూడ కర్మయోగము సంభవముకదా ? అని యనదగదు. కర్మయోగమునకు కారణమగు మిథ్యాజ్ఞానమునకు, ఆత్మవేత్తయందలి సమ్యగ్జ్ఞానమునకును పరస్పర విరోధముండుటచే, నాత్మవేత్తకు కర్మయోగము సంభవింపదు.

అయితే యిట్లు సమ్యగ్జ్ఞాన మిథ్యాజ్ఞానములకు పరస్పర విరోధముండుచో సమ్యగ్జ్ఞానమూలకమగు కర్మసన్న్యాసము మాత్రము మిథ్యాజ్ఞానముగల యనాత్మవేత్తకెట్లు సంభవమగును ? అని శంకింపరాదు. సర్వకర్మసన్న్యాసము, సమ్యగ్జ్ఞానమువలన కలిగినను, కర్మైకదేశసన్న్యాసము (కొన్నికర్మలనుమాత్రమే విడచుట) సమ్యగ్జ్ఞానమూలకము కాదు. కావున, నయ్యది మిథ్యాజ్ఞానముకల అనాత్మవేత్తలకుగూడ సంభవింపవచ్చును.

ఓయీ! యిట్లు సర్వకర్మసన్న్యాసము, కర్మైకదేశసన్న్యాసముఅనిరెండురకముల సన్న్యాసము కలదనుటకు ప్రమాణమేమి? వినుము. ఇందు భాష్యకారవచనమే ప్రమాణము. మరియు సన్న్యాసులలో కుటీచకాదులకు కొన్నికర్మలుండు ననియు, అవధూతలగు పరమహంసలకు నేకర్మయు లేదనియు శాస్త్రమే చెప్పుచున్నది.

మరియు, జ్ఞానసహితమగునది సర్వకర్మసన్న్యాస మనియు, జ్ఞానరహితమగునది కర్మైకదేశసన్న్యాసమనియు యుక్తికూడ కలదు.

కావున జ్ఞానసహితమగు సర్వకర్మసన్న్యాసమునందు ఆత్మవేత్త కర్తయనియు, జ్ఞానరహితమగు కర్మైకదేశసన్న్యాసమునందు అనాత్మవేత్త కర్తయనియు గ్రహింపవలెను.

అనాత్మజ్ఞునకు కర్మయోగమే అవశ్యకర్తవ్యమని శ్రీకృష్ణుడు "కర్మయోగేన యోగినామ్" అను వచనము నియమించి యున్నను, యమనియమాది పూర్వక ధ్యానయోగాత్మక కర్మయోగమునందు యోగ్యతను సంపాదించెడి కర్మైకదేశ సన్న్యాసముకూడ కర్మయోగమే యగును కాని అతిరిక్తము కానేరదు.

కావున అనాత్మవేత్తయగు పురుషుడు సన్న్యసించి ధ్యానయోగ మభ్యసింపవలెను. సన్న్యసింపక పూర్వము యజ్ఞాది కర్మల ననుష్ఠింపవలెను. అని యిట్లు అనాత్మజ్ఞునకు సన్న్యాసమునందు పాక్షికప్రవృత్తి కలదు. అనాత్మజ్ఞునకు సన్న్యాసము కలదనుటలో "నచ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి" అను భగవద్వచనమే ప్రమాణము.

రామానుజమతము:

"కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణిచ కర్మయః" అను గ్రంథముచే శ్రీకృష్ణభగవానులు ప్రతిపాదించిన జ్ఞానము కర్మయోగమున కుపకరించు జ్ఞానముకాని సన్న్యాసమున కుపకరించు జ్ఞానముకాదు.

"తస్మా దజ్ఞాన సంభూతం హృత్స్థం జ్ఞానాసి నాత్మనః"

ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత" అని చతుర్థాధ్యాయాంతమందు కర్మానుష్ఠానమునగూడ సంశయ నిరాసముకొరకు జ్ఞాన మావశ్యకమని శ్రీకృష్ణభగవానులు ప్రతిపాదించిరి.

"నమాం కర్మాణి లింపంతి నమే కర్మఫలే స్పృహా, ఇతిమాం యోఽభిజానాతి కర్మభి ర్నసబధ్యతే" "ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః" "కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతం" అని ప్రారంభమునందుగూడ జ్ఞానపూర్వకముగ కర్మ యనుష్ఠింపదగిన దని నిరూపింపబడినది.

యస్య సర్వే సమారంభాః కామసంకల్ప వర్జితాః
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం త మాహుః పండితం బుధాః॥
త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః
కర్మణ్యభి ప్రవృత్తోఽపి నైవకించి త్కరోతి సః॥
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతేఽర్జున॥ అని మధ్యనుగూడ జ్ఞాన

పూర్వక కర్మానుష్ఠానము పరామర్శింపబడినది. కావున ఆత్మవేత్తకుగూడ కర్మయోగము సంభవించును.

"తస్యకార్యం నవిద్యతే" "సర్వకర్మాణి మనసా సన్న్యస్య" ఇత్యాదివాక్యాంతరములచే నాత్మవేత్తకు కర్మసన్న్యాసముగూడ విధింపబడినది. కావున అర్జునుడు "సన్న్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగంచ శంససి, యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మే బ్రూహి సునిశ్చితం" అని ఆత్మవిత్కర్తృకములగు సన్న్యాసకర్మయోగములలో తారతమ్యమును తెలియగోరియే యర్జునుడు ప్రశ్నించెనని రామానుజులు వ్యాఖ్యానమొనర్చిరి.

మరియు ఫలేచ్ఛతో జేసెడి కర్మ సాధారణమగు కర్మ. ఫలేచ్ఛను విడచి చేయునట్టి కర్మ విశిష్టమగు కర్మయోగ మనబడును. అజ్ఞునకు ఫలాభిసంధిపూర్వకమగు సాధారణకర్మ సంభవించినను, ఫలాభిసంధి రహితమగు విశేషకర్మయోగము సంభవింపదు. ఆత్మజ్ఞానములేనిదే ఫలపరిత్యాగము కుదరదు. కనుకనే "త్యక్త్వా కర్మ ఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః, కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః" అను శ్లోకము ప్రవృత్తిమార్గమందున్న యాత్మవేత్తవిషయ మని భాష్యకారు లనిరి.

"జ్ఞేయ స్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి
నిర్ద్వంద్వో హి మహాబాహో సుఖం బంధా త్ప్రముచ్యతే" అని చెప్పబోవు భగవంతుని సమాధాన వచనమునుబట్టికూడ కర్మయోగము ఆత్మవిత్కర్తృకమని (ఆత్మవేత్త యాచరించునని) నిర్ణయమగుచున్నది. రాగద్వేషములు జ్ఞానములేనిదే యెవ్వనికిని నశింపవు. కావున ఆత్మవేత్తకు విశేషకర్మయోగము సంభవించును గనుక ఆత్మవేత్త యాచరించెడి కర్మయోగ కర్మసన్న్యాసములలో తారతమ్యమును తెలుసుకొనగోరియే యర్జునుడు ప్రశ్నించెనని రామానుజీయుల యభిప్రాయము.

ఇయ్యది యుక్తముకాదు. కర్మయోగమున కెట్టి జ్ఞాన మావశ్యకమో, కర్మసన్న్యాసమున కెట్టిజ్ఞాన మావశ్యకమో-యీ భేదము రామానుజీయులకు బొత్తుగా తెలియదు. తెలిసినచో వారిట్టి వ్యాఖ్యానమునకు తారసిల్లెడువారు కారు. ఆత్మ నిత్యుడు, ఈశ్వరునికొరకు నేను కర్మ చేయుచున్నాను, నశించునట్టి స్వర్గాది ఫలము నాకు వలదు. ఇంద్రియముల విషయాభిముఖ్యమును నేను నివారించుకొనవలెను, మనస్సును నాస్వాధీనములో నుంచుకొనవలెను, శీతోష్ణాది ద్వంద్వములను సహించుకొనవలయును, కర్మఫలము సిద్ధించినను సిద్ధింపకున్నను సమచిత్తతతో నుండవలెను అనుజ్ఞానము కర్మయోగమున కావశ్యకము.

"ఆత్మ నిర్వికారుడు, కర్తృత్వ భోక్తృత్వరహితుడు, సచ్చిదానందబ్రహ్మరూపుడు, కర్మలు దేహేన్ద్రియాదుల నాశ్రయించి యుండును" అను జ్ఞానము కర్మ

సన్యాసమున కావశ్యకము. ఇదియే సమ్యగ్జ్ఞాన మని చెప్పబడును. ఇట్టి జ్ఞానముకల వాడే యాత్మవేత్త. కావున ఆత్మవేత్తయందలి సమ్యగ్జ్ఞానమునకు కర్మయోగమున కుపయుక్తమగు జ్ఞానమునకును అత్యంత విరోధముండుటచే నాత్మవేత్తకు కర్మ యోగము సంభవింపదు.

"త్యక్త్వా కర్మఫలాసంగమ్" అను శ్లోకముచే రామానుజీయులు చూపిన కర్మయోగము కర్మయోగముకాదు. అయ్యది లోకసంగ్రహార్థ మగుటవలనను నిరభి మానపూర్వక మగుటవలనను అకర్మరూపమే యని గీతాశాస్త్రము నందు అనేక మారులు ప్రతిపాదింపబడినది.

సంశయ నిరాశకొరకు కావలసినది శోకమోహాదిదోషజ్ఞానమే కాని సమ్యగ్ జ్ఞానముకాదు. లేక "తత్వవేత్తయగు నేను లోకసంగ్రహార్థము కర్మ యాచరింప వలెనా? లేదా? అను సంశయమునుపోగొట్టుకొని జనకాదుల దృష్టాంతముచేసికొని కర్మ నాచరింపుము" అనియే. "ఛిత్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠభారత" అను శ్లోకమున కర్థము. ఎట్లైనను కృతకృత్యుడయి నిర్వికారబ్రహ్మరూపముతో నుండునట్టి తత్వవేత్తకు కర్మయోగాసంభవము సుస్థిరము. బ్రహ్మరూపముతో నుండుటయను సర్వకర్మసన్యాసమే యతనికి స్థిరము.

ఇక శ్రీకృష్ణుడు "కర్మణ్యకర్మ యఃపశ్యేత్" అను శ్లోకముచే జ్ఞాని యాచ రించెడి సన్యాసమునే చెప్పెను. కాని యర్జునుడు మాత్రము దానిని తెలుసుకొన లేక అజ్ఞానికర్తృకమగు సన్యాసముగా నభిప్రాయపడి యిట్లడిగె నని యనరాదు. అట్లగుచో శ్రీకృష్ణుడయినను "నేను విద్వత్సన్యాసమే చెప్పియుంటిని, అవిద్వత్స న్యాసమును చెప్పలేదు. విద్వత్సన్యాసము కర్మయోగముకంటె గొప్పది. అవిద్వత్స న్యాసము కర్మయోగముకంటె తక్కువది" అని బదులుచెప్పియుండవలెను. శ్రీకృష్ణు డట్లు బదులుచెప్పలేదు. కావున రామానుజీయుల వ్యాఖ్యానము యుక్తముగాదు. శాంకరసిద్ధాంతమే నిర్దుష్టము.

శ్లో. సన్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగం చ శంససి
యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మే బ్రూహి సునిశ్చితం ॥ ౧ ॥

అ. ఓయి కృష్ణ! నీవు శాస్త్రవిహితములగు నిత్యనైమిత్తిక కర్మలను విడువు మని "కర్మణ్యకర్మ యఃపశ్యే" దిత్యాది గ్రంథముచే జెప్పుచుంటివి. మరలి "ఛిత్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత" అను వచనముచేనిత్యనైమిత్తిక కర్మల ననుష్ఠింపు మనుచుంటివి. ఇవి రెండును ఒకనిచే నొకేమారు అనుష్ఠించుటకు శక్యముకావు. అందువలన నేనేమిచేయవలె నను సంశయము నాకు కలిగినది. కావున నీరెంటిలో నేది శ్రేయస్కరమో (ప్రశస్తమో) దానిని నీవు నిర్ణయించి చెప్పుము.

ప్రాశస్త్యమును తెలిసికొనినగాని యనుష్ఠింప ప్రవృత్తి కలుగదు. సర్వజ్ఞుడవగు నీకు నెయ్యది యభిప్రేతమో అయ్యది మాబోటివారల కనుష్ఠేయము. కావున కర్మసన్న్యాస కర్మయోగములలో నేది ప్రశస్తమో దానిని నిర్ధారించి చెప్పుము. ౧

శ్రీభగవా నువాచ :

శ్లో. సన్న్యాసః కర్మయోగశ్చ నిఃశ్రేయసకరావుభౌ
తయోస్తు కర్మసన్న్యాసా త్కర్మయోగో విశిష్యతే ॥ ౨ ॥

శ్రీకృష్ణుడు సమాధానము చెప్పుచున్నాడు.

అ. కర్మసన్న్యాసము, కర్మానుష్ఠానము యీ రెండును జ్ఞానోత్పత్తి ద్వారమున మోక్షము నిచ్చును. అయినను జ్ఞానరహితమగు కర్మసన్న్యాసముకంటె కర్మయోగము గొప్పది. ౨

శ్లో. జ్ఞేయ స్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి
నిర్ద్వంద్వో హి మహాబాహో సుఖం బన్ధా త్ప్రముచ్యతే ॥ ౩ ॥

అ. ఎవడు దుఃఖమును గాని, దుఃఖహేతువునుగాని ద్వేషింపడో యెవ్వడు సుఖముకాని, సుఖహేతువునుగాని కోరడో వాడు నిత్యసన్న్యాసి. ప్రసిద్ధుడగు యతి ఆశ్రమస్వీకారానన్తరమే సన్న్యాసి యనబడును. రాగద్వేషములు లేని కర్మయోగి యెల్లపుడు సన్న్యాసి యనబడును. ఓయి అర్జునా! శీతోష్ణ రాగద్వేషాది, ద్వంద్వములను సహించిన పురుషుడు అనాయాసముగా సంసారబంధమునుండి విముక్తుడగును. ఇచట కర్మయోగికికూడ సన్న్యాసివలె రాగద్వేషాదులు పనికిరావని యుపదేశము సూచితమగుచున్నది. కర్మయోగి సుఖముగా విముక్తుడగునని చెప్పుటచే, కర్మసన్న్యాసికి దుష్కరములగు యమనియమాదు లుండుటచే ముక్తి నొందుటలో గొంత క్లేశము కలదనియు, అందువలన కర్మసన్న్యాసముకంటే కర్మయోగము విశిష్టమనియు స్పష్టమగుచున్నది. ౩

శ్లో. సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతి న పండితాః
ఏకమప్యాస్థిత స్సమ్య గుభయో ర్విందతే ఫలం ॥ ౪ ॥

అ. సాంఖ్యము, యోగము యీరెండును పరస్పరము వేరనియు, విరుద్ధములనియు, భిన్నఫలము కలవనియు, నజ్ఞానులందురు. జ్ఞాను లట్లనరు. సాంఖ్యయోగముల రెంటిలో నేయొక్కటియయినను చక్కగ ననుష్ఠించినవాడు రెంటియొక్క ఫలమును పొందును. కావున నీ రెంటికి ఫలమునందు విరోధములేదు.

ఓయి ! అర్జునుడు అవిద్వత్కర్తృకములగు కర్మసన్న్యాస కర్మయోగములను గురించి ప్రశ్నించగా శ్రీకృష్ణుడు సమాధానగ్రంథములో జ్ఞాన కర్మయోగముల నుద్దేశించి బదులు చెప్పుట అప్రకృతముకదా ? కాదు. భగవంతుడు అర్జును డడిగిన

విషయమును విడువకయే స్వాభిప్రేతవిశేషమునుకూడ చేర్చి మాటభేదముచే సమాధానమును చెప్పెను. అర్జును డడిగిన ప్రకృతసన్న్యాసమే జ్ఞానయుక్త మగుచో సాంఖ్యమనబడును. సమత్వబుద్ధితో కూడినపుడు కర్మానుష్ఠానమే యోగమనబడును. కావున పార్థుని ప్రశ్న విషయములగు సన్న్యాస కర్మయోగములు, శ్రీకృష్ణుని సమాధానమునందలి సాంఖ్యయోగములలో నిమిడియే యున్నవి. కనుక కృష్ణుని సమాధానము అపకృతముకాదు.

శ్లో. యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగై రపి గమ్యతే
ఏకం సాంఖ్యంచ యోగం చ యః పశ్యతి సపశ్యతి ॥ ౫ ॥

అ. సాంఖ్యమనగా ఆత్మతత్త్వజ్ఞానము. అది కలవారు సాంఖ్యులు. అనగా జ్ఞానులని యర్థము. సమత్వబుద్ధితో నాచరించెడు కర్మయోగము యోగమనబడును. అదికలవారు యోగులనబడుదురు. సాంఖ్యులు పొందు మోక్షపదవిని యోగులు కూడ పొందుదురు. సాంఖ్యులు సాక్షాత్ మోక్షమునొందుదురు. యోగులు పరమార్థజ్ఞాన సన్న్యాసప్రాప్తిద్వారా మోక్షము నొందుదురు. కావున సాంఖ్యయోగములు రెండును ఒకే ఫలమును యిచ్చునని తెలిసికొనినవాడు తెలివిగలవా డనబడును. సాక్షాన్మోక్షసాధనమగు సాంఖ్యయోగముకంటె పరంపరామోక్షసాధనమగు కర్మయోగము గొప్పది కాకున్నను, జ్ఞానరహితమగు సన్న్యాసయోగముకంటె కర్మయోగముమాత్రము సుకరమగుటచే నుత్కృష్టమగును. "తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే" అను శ్లోకమున కర్మసన్న్యాస, కర్మయోగ పదములు జ్ఞానరహిత సన్న్యాస కర్మయోగపదములు. ప్రకృత శ్లోకమునందలి సాంఖ్యయోగ పదములు మాత్రము జ్ఞానసహితమయిన సన్న్యాస కర్మయోగపదములు- యీ రెంటిని గురించిన తారతమ్యమును పార్థు డడుగలేదు. అయినను శ్రీకృష్ణుడు ప్రియశిష్యుడయిన పార్థునకు అడిగినదానికంటె నధికముగా జెప్పదలచి యీ రెంటిని ముచ్చటించెను.

ఇచ్చట నియ్యది తత్త్వము. సన్న్యాస, యోగములు పారమార్థికములు, అపారమార్థికములు అని రెండు రకములు. ఆత్మవేత్త యాచరించెడి సన్న్యాసము పారమార్థికము. అనాత్మవేత్త యాచరించెడి సన్న్యాసము అపారమార్థికము. ఆత్మవేత్త యాచరించెడి లోకసంగ్రహార్థమయిన కర్మయోగము పారమార్థికము. అనాత్మవేత్త యాచరించెడి చిత్తశుద్ధ్యర్థమయిన కర్మయోగము అపారమార్థికము. ఇందు పారమార్థికమయిన సన్న్యాసము. పారమార్థికమయిన కర్మయోగముకంటె భిన్నముకాదు. అచ్చట సన్న్యాసికివలె కర్మయోగికికూడ కర్తృత్వాద్యభిమానము లేకుండుటచే కర్మయోగి యాచరించెడికర్మ కర్మ కానేరదు. అకర్మయే యగును. అట్లే అనాత్మవేత్త యాచరించెడి కర్మసన్న్యాస కర్మయోగములున్ను

భిన్నములు కావు. ఇరువురకు కర్తృత్వాద్యభిమానము సమానముగా నుండుటవలనను, యోగికి యజ్ఞాదులవలె సన్న్యాసికి యమనియమాదులు కర్మరూపములగుట వలనను, యీ రెంటికి భేదములేదు. కనుకనే అనాత్మవేత్తయొక్క కర్మయోగము "జ్ఞేయస్స నిత్య సన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి" అను వచనముచే నౌపచారికముగా సన్న్యాసమునందు చేర్చబడినది. అనాత్మవేత్తయొక్క సమాధియోగముకూడ నట్లే కర్మయోగమునం దన్తర్భూతమగుచున్నది. లేక సన్న్యాసము పారమార్థికమనియు, జ్ఞానహీనమనియు రెండు విధములు. అట్లే కర్మయోగముకూడ సమతాబుద్ధియుక్త కర్మయోగమనియు, కేవల కర్మయోగమనియు రెండు విధములు. అందు పారమార్థిక సన్న్యాసము సాంఖ్యమనబడును. సమత్వబుద్ధితో గూడిన కర్మయోగము పరమార్థ యోగమనబడును.

శ్లో॥ సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః
యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి ॥ ౬ ॥

అ. ఓయి అర్జునా! సన్న్యాసము కర్మయోగము లేనిదే పొందసులభము కాదు. కర్మయోగముతో గూడిన ముని (బ్రహ్మ) పరమాత్మజ్ఞాన నిష్ఠాలక్షణమగు సన్న్యాసమును శీఘ్రముగా బొందును. ఇచట పరమాత్మజ్ఞానలక్షణమగు సన్న్యాసమునందు పరమాత్మను చెప్పునట్టి బ్రహ్మశబ్దమును ప్రయోగించుట ఔపచారికమగుచున్నది. సన్న్యాసమను యర్థమునందు బ్రహ్మశబ్దమును ప్రయోగించుటలో శ్రుతి ప్రమాణము కలదు. "న్యాస ఇతి బ్రహ్మ బ్రహ్మహి పరః పరోహి బ్రహ్మ" అని శ్రుతి. బ్రహ్మ= బ్రహ్మశబ్దవాచ్యమగు, న్యాసః= సన్న్యాసము, పరః= సత్య శమదమాది తపస్సులకంటె గొప్పది, హి= ఏకారణమువలన, బ్రహ్మ= హిరణ్యగర్భుడు, ఆహ= (అనియధ్యాహారము) చెప్పెనో, హి= ఏకారణమువలన, బ్రహ్మ= హిరణ్యగర్భుడు, పరః= ఆదిపురుషుడగుటవలన సందరికంటె గొప్పవాడు, "తస్మాన్న్యాస ఏవాపరాణి తపాంస్య త్యరేచయత్" అని తరువాత వాక్యము. కావున సన్న్యాసమే అల్పములగు సత్యశమదమాది తపస్సులను మిగులుచున్నది. అని వాక్యశేషమున కర్థము. సత్యాది స్వల్పతపస్సులకంటె సన్న్యాసమే గొప్పదని వాక్యశేషముయొక్క భావము.

ఈ శ్రుతి తైత్తిరీయక విద్యారణ్యభాష్యమునందు "న్యాస ఇతి బ్రహ్మహి పరః పరోహి బ్రహ్మ" అని మాత్రమే యుదాహరింపబడినది. అచ్చట విద్యారణ్యులు "సన్న్యాసమే యుత్తమమగు మోక్షసాధనమని హిరణ్యగర్భుడు తలచెను" అని వ్యాఖ్యానము చేసిరి. దీనినిబట్టిచూడ, సన్న్యాసమునందు బ్రహ్మశబ్దము ప్రయోగించుటకు శ్రుతి ప్రమాణముగా నుదాహరింపదగదు. సన్న్యాసము మోక్షహేతువగుటచే నుత్తమమని భాష్యమును పూర్తి చేయవలెను.

ఓయి! జ్ఞానరహితమగు సన్న్యాసము పారమార్థికసన్న్యాసమున కుపాయమగు

చున్నది. కర్మయోగముకూడ చిత్తశుద్ధిద్వారా పారమార్థికసన్న్యాసమున కుపాయమే యగుచున్నది. ఇట్టిస్థితిలో సన్న్యాసముకంటె కర్మయోగము గొప్ప దెట్లగును? వినుము. కర్మయోగికి పారమార్థికసన్న్యాసము శీఘ్రముగా కలుగును. జ్ఞానరహిత (కేవల) సన్న్యాసికి చాలకాలమునకు కలుగును. కేవల సన్న్యాసికి ప్రాణాయామాదులతో మనస్సును స్వాధీనపరచుకొనుట చిరకాలమున కగును. రాగద్వేషాది రహితుడగు కర్మయోగికి మనోనిగ్రహము చిత్తశుద్ధిద్వారా సులభము. కావున కేవల సన్న్యాసముకంటె కర్మయోగము గొప్పదని రహస్యము.

ఈ శ్లోకమునకు యోగయుక్తుడగు పురుషుడు శీఘ్రముగా సన్న్యాసియయి బ్రహ్మపదమును పొందును, అని యన్వయము చెప్పవచ్చును. కర్మయోగమున పారమార్థికసన్న్యాసప్రాప్తి, దానివలన బ్రహ్మవ్యాప్తి అని యర్థము.

రామానుజమతము :

ఇచట రామానుజులు కర్మయోగయుక్తునకు ఆత్మప్రాప్తి సులభమనియు, జ్ఞానయోగముతోఁగూడినవానికి ఆత్మప్రాప్తి కష్టసాధ్యమనియు వ్యాఖ్యానమొనర్చిరి.

ఇయ్యది యుక్తముగాదు. ఇచట ఆత్మప్రాప్తియనగా ముక్తియా? లేక జ్ఞానమా? అని యడుగవలెను. ఇందు మొదటి పక్షము కుదరదు. కర్మలవలన ముక్తి సంభవింపదు. ఆత్మప్రాప్తి ముక్తియని రామానుజు లంగీకరింపరు. ఇక రెండవ పక్ష మంగీకరించినచో, నదియు పొసగదు. కర్మయోగమువలన ఆత్మజ్ఞానము సులభముగా ప్రాప్తింప జ్ఞానయోగమువలనమాత్ర మట్టి జ్ఞానమేల ప్రాప్తింపదు? ఇక జ్ఞానయోగమునందలి జ్ఞానము పరోక్షమనియు, కర్మయోగమువలన లభించు జ్ఞానము అపరోక్ష మనియు, నన్నచో పరోక్షజ్ఞానము లేనిదే యపరోక్షజ్ఞానము కుదరదు. కావున పరోక్షజ్ఞానరూపమయిన జ్ఞానయోగమువలన అపరోక్షజ్ఞానము సులభముగా ప్రాప్తించును. పైగా కర్మయోగమే పరోక్షజ్ఞానమును పుట్టించి పిదప నపరోక్ష జ్ఞానమును పుట్టింపవలెను. కావున కర్మయోగమే ఆత్మప్రాప్తికి బహిరంగ సాధనమగును. కావున రామానుజుల వ్యాఖ్యానము పొసగదు.

శ్లో. యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే ॥ 7 ॥

అ. కర్మయోగముతోఁగూడిన మానవుడు చిత్తశుద్ధి నొంది, దేహేన్ద్రియాదుల జయించుకొని, సమ్యగ్జ్ఞానము కలవాడయి, కర్మలు చేయుచున్నను కర్మఫలమంటడు. తనలోనున్న చిదాత్మయే యెల్లభూతములకు ఆత్మయని తలచువాడు సర్వభూతాత్మభూతాత్మ యనబడుచున్నాడు. ఇట్టి జ్ఞానము జీవబ్రహ్మాభేదజ్ఞానము వలన కాని కలుగదు. కావున "సర్వభూతాత్మభూతాత్మ" యనగా సమ్యగ్జ్ఞానమని యర్థము.

ఇచట రామానుజులు "సర్వభూతాత్మభూతాత్మా" అను పదమునకు జ్ఞానాకారులగుటచే, సర్వాత్మలు సమానులను జ్ఞానముకలవాడు అనివ్యాఖ్యానముచేసిరి.

ఇయ్యది సరిగాదు. మూలకర్తయగు శ్రీకృష్ణున కీ యర్థ మభిప్రేతము కాదు. అట్లగుచో శ్రీకృష్ణుడు "సర్వభూతాత్మతుల్యాత్మ" అనియే చెప్పియుండెడివాడు. మరియు సర్వదేహములు భౌతికము లని సామ్యము చెప్పిన నెంతప్రయోజనమో సర్వాత్మలకు స్వరూపసామ్యము చెప్పుటవలన గూడ నంతే ఫలముండును. అత్యన్త సామ్యముచెప్పినచో భేదమే కుదరదు. ఉపాధిభేదముచే భేద మంగీకరించినచో నాత్మైకత్వము సిద్ధించును. మరియు ఆత్మస్వరూపమగు జ్ఞానము వృత్త్యాత్మకమా? లేక చైతన్యాత్మకమా? మొదటి పక్షము కుదరదు. వృత్తిజ్ఞానము మనోజన్యమగును. కాని యాత్మస్వరూపము కానేరదు. మొదటిపక్ష మంగీకరించినచో, సుషుప్త్యాద్యవస్థలయం దనుభవసిద్ధమగు నిర్విశేషచైతన్యమునకు భేదము కుదరదు. కావున అద్వైతము సుస్థిరమగును. ౭

శ్లో. నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్
పశ్యఞ్ శృణ్వన్ స్పృశఞ్ జిఘ్రన్ అశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్ ॥ ౮ ॥

శ్లో. ప్రలపన్ విసృజన్ గృహ్ణన్ ఉన్మిషన్ నిమిషన్నపి
ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్ ॥ ౯ ॥

అ. పరమార్థజ్ఞానము కల మానవుడు సమాహితచిత్తుడగుచూ చూచుచును, వినుచును, తాకుచును, వాసనచూచుచును, తినుచును, వెళ్లుచును, నిదురించుచును, ఊపిరి పీల్చుచును, మాటాడుచును, విడచుచును, తీసికొనుచును, కను తెఱచుచును, కనుమూత వేయుచును, ఇంద్రియములు విషయములందు ప్రవర్తించుచున్నవికాని 'నే నేమిచేయుట లేదు' అని తలచును.

ఎండమావులయం దుదకబుద్ధివలె, ఆత్మయం దజ్ఞానవశమున కర్మ తోచును. అందువలన అజ్ఞాని ప్రవర్తించుచున్నాడు. అజ్ఞానము నశించుచో, ఆత్మయందు కర్త్రాభావమే తోచును. అపుడు తత్త్వవేత్తకు విషయాదులయందు ప్రవృత్తి సంభవింపదు.

ఓయి! దర్శనాదిక్రియల నొనర్చువాడు నే. నేమియు చేయుట లేదనుకొనుట మిథ్యాజ్ఞానము కాదా? అని యనదగదు. ఆత్మకు కర్మలేదు. కర్మచేయునట్టి దేహేన్ద్రియాదు లాత్మలుకావు. కావున తత్త్వవేత్త యదార్థదృష్టి కలవాడేకాని, మిథ్యాజ్ఞానికాదు.

ఓయి! తత్త్వవేత్తకు కర్మలయందు ప్రవృత్తి సంభవింపనిచో శ్రీకృష్ణుడు దర్శనాదిక్రియల నెట్లు వర్ణించెను? అనియెదరేమో- వినుడు సమాధానము :-

తత్త్వవేత్త లోకదృష్టిచే కర్మలను చేయుచున్నట్లు కనుబడుచున్నను నిజముగా చేయువాడు కాడని యర్థము. అధ్యాత్మరామాయణమునందు విశ్వామిత్రుడుకూడ నిట్లే చెప్పెను. "రామో నగచ్ఛతి, నతిష్ఠతి నానుశోచత్యాకాంక్షతే త్యజతినో నకరోతి కించిత్, ఆనందమూర్తి రచలః పరిణామహీనః మయాగుణా ననుగతోహి తథా విభాతి" అని. శ్రీరామచంద్రునకు గమనాగమనాది క్రియ లెవ్వియు లేవు. అతడు ఆనందరూపుడు, అచలుడు, నిర్వికారుడు, మాయాకార్యముల ననుసరించు వానివలె కనుబడును. అని భావము.

శ్లో. బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః
లిప్యతే న స పాపేన పద్మపత్రమివామ్భసా ॥ ౧౦ ॥

అ. కర్మాధికారియగు అజ్ఞాని యీశ్వరునియందు కర్మల నుంచి కర్మఫలము తా నపేక్షింపక కర్మలజేయుచో నట్టిమానవుడు తామరాకు నీటిని యంటనట్లు పాపము నంటడు.

ఇచట రామానుజులు బ్రహ్మశబ్దమునకు "నింద్రియాకారముగా నున్న ప్రకృతి యని" అని యర్థమును చెప్పిరి. వెనుకటి శ్లోకముతో పౌనరుక్త్య మేర్పడును గాన అయ్యది యుక్తముగాదు.

శ్లో. కాయేన మనసా బుద్ధ్యా కేవలై రిన్ద్రియైరపి
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాఽత్మశుద్ధయే ॥ ౧౧ ॥

అ. కర్మయోగులు చిత్తశుద్ధికొరకు ఫలేచ్ఛను వదలి దేహముతోను మనసుతోను, బుద్ధితోను, ఇంద్రియములతోను ఈశ్వరార్పణబుద్ధితో కర్మల నాచరింతురు. వైదికులు సంధ్యావందనాంతమునందు పఠించునట్టి "కాయేన వాచా మనసేన్ద్రియైర్వా" అను శ్లోకమున కియ్యది మూలభూతము. సంశయాత్మకము మనస్సు, నిశ్చయాత్మకమయినది బుద్ధి. అని భేదము.

శ్లో. యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తి మాప్నోతి నైష్ఠికీం
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే ॥ ౧౨ ॥

అ. కర్మలు యీశ్వరునికొరకుకాని. నాకు ఫలముకొరకు కాదు- అను నిశ్చయముకలవాడు కర్మఫలమును విడచి కర్మ నాచరింపుచు చిత్తశుద్ధి, జ్ఞానప్రాప్తి, సర్వకర్మసన్యాసపూర్వక జ్ఞాననిష్ఠద్వారా మోక్ష మను శాన్తిని బొందును. అట్టి నిశ్చయములేనివాడు ఫలాశతో గూడినవాడయి, ఫలేచ్ఛతో కర్మల నాచరించుచూ జన్మమరణరూపమగు సంసారము నొందును. కావున అర్జునా! నీవుమాత్రము ఫలాసక్తుడవు కాకుము.

శ్లో॥ సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ
నవద్వారే పురే దేహీ నైవ కుర్వ న్న కారయన్ ॥ ౧౩ ॥

అ. పరమార్థజ్ఞానముకల సన్న్యాసి- నిత్యనైమిత్తిక, కామ్య,ప్రతిషిద్ధ కర్మలను వివేకబుద్ధితో వదలి, ఇంద్రియనిగ్రహము కలవాడగుచు, నేపనిని చేయక, చేయింపకయు, తొమ్మిదిద్వారములుకల పట్టణమగు దేహమునందు సుఖముగా నుండును. రెండు చెవులు, రెండు నేత్రములు, రెండు ముక్కులు, నోరు, యీ యేడు తల నుండు ద్వారములు. క్రిందిభాగమున మూత్ర పురీషములను విడచు ద్వారములు రెండు. మొత్తము శరీరమునకు తొమ్మిది ద్వారములు. ఈ శరీరమునకు పత్తన సామ్యముండుటచే నియ్యది పురమని పోల్చబడినది. ఇందు ఆత్మ ప్రభువు. ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, శబ్దాది పంచవిషయములు, ఇవియన్నియు స్వామికార్యమును నెరవేర్చునట్టి ప్రజలు.

ఓయి ! జీవులందరు దేహమునందుండుట లోకసిద్ధమగుచుండ సన్న్యాసిమాత్రమే దేహమునం దుండునని చెప్పుటలో విశేషమేమి ? సమాధానము : దేహేన్ద్రియసంఘాతమునం దాత్మజ్ఞానముకల యజ్ఞాని "నేను దేహమునందుంటినని" తలచడు. ఇంటిలోనో, లేక నేలమీదనో, లేక కుర్చీమీదనో, యుంటినని తలచును. దేహేన్ద్రియాది సంఘాతము వేరు, ఆత్మవేరు అను జ్ఞానముకల యతికిమాత్రము, నేను దేహమునందుంటి ననుప్రత్యయముం (జ్ఞానముం)డును. నిష్క్రియుడగు నాత్మయందు కర్మలయొక్క ప్రసక్తి లేకున్నను, అజ్ఞానముచే దేహేన్ద్రియాదులయొక్క కర్మలను ఆత్మయం దారోపించుకొనుటచే నాత్మయందు కర్మలు ప్రసక్తించుచున్నవి. సన్న్యాసి యట్టి యారోపిత కర్మలను విద్యచే (జ్ఞానముచే) విడచుచున్నాడు. ఇట్టి వివేకజ్ఞాన సంపన్నుడగు యతికి కూడ ప్రారబ్ధఫలకర్మశేషపర్యంతము దేహమునం దునికి సంభవించును. కావున ("దేహే ఆస్తే") అను విశేషణము సన్న్యాసికిమాత్రమే యుక్తము. మిగిలినవారికి పొసగదు.

ఆత్మవేత్తయగు సన్న్యాసి నిత్యనైమిత్తికాది కర్మలను సన్న్యసించుట యనగా ఆత్మయందున్న కర్మలను పరిత్యజించుటకాదు. మరేమనిన "నిజముగా ఆత్మయందు కర్మలు లేవు. దేహాదిసంఘాతమునందే కర్మలు కలవు" అను అనుసంధానమే సన్న్యాసము. ఇట్టి సన్న్యాసము కనుకనే విద్యవలన పొసగుచున్నది.

కావున నిర్వికారుడగు ఆత్మ స్వయముగా కర్మల నాచరించుటకాని, దేహేన్ద్రియాదులచేఁ జేయించుటకాని పొసగదు. బుద్ధి ధ్యానించుచుండ ధ్యానించువాడువలెను, బుద్ధి చలించుచుండ చలించువాడువలెయు ఆత్మ తోచును. ౧౩

శ్లో॥ నకర్తృత్వం నకర్మాణి లోకస్య సృజతి ప్రభుః
నకర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే ॥ ౧౪ ॥

అ. ఈశ్వరుడు నీ వీ కర్మలను చేయుమని లోకమును ప్రవర్తింపచేయడు. లోకమునకు రథ, ఘట, ప్రాసాదాది కర్మలను సృజింపడు. కర్మఫల సంబంధమును సృజింపడు. అవిద్యారూపమయిన ప్రకృతియే యీపనులను చేయుచున్నది.

ఇచట రామానుజులు స్వభావ శబ్దమునకు వాసన యని యర్థమును చెప్పిరి. అది యుక్తముకాదు. నిస్సంగుడగు ఆత్మకు ప్రకృతి సంబంధమే దుర్ఘటముకాగా, ప్రకృతివలన బుట్టిన దేహేన్ద్రియాదులయం దాత్మాభిమానమువలన కలుగు వాసన ఆత్మయందుండుట దూరాపాస్త మగుచున్నది. ౧౪

శ్లో. నాదత్తే కస్యచిత్పాపం నచైవ సుకృతం విభుః
అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యంతి జన్తవః ॥ ౧౫ ॥

అ. ఏ మానవుడైనను జన్మాన్తరీయములగు బ్రహ్మహత్యాదిపాతకములఁ బాపుకొనుటకు భగవన్తునియందు భక్తిభావముతో నుండినను, యీశ్వరు డాతని పాపమును పరిగ్రహింపడు. పరమేశ్వరరార్పణ బుద్ధితో యజ్ఞ, దాన, జపాది కర్మల నాచరించినను వాని సుకృతమును స్వీకరింపడు. నిస్సంగుడగు పరమేశ్వరునకు పుణ్యాపాపసంబంధము లేదు పుణ్యాపాపసంబంధ ముండుచో నీశ్వరుడు ధర్మాధర్మములకు పరతంత్రుడగును. అపుడు యీశ్వరున కీశ్వరత్వమే నశించును.

భక్తులు శివవిష్ణ్వాది దేవతలకు సుకృతమును అర్పించుచున్నారు. కాని ఆత్మ కర్పించుట లేదని యనరాదు. శివవిష్ణ్వాది దేవతల కర్పించినను, శివవిష్ణ్వాది దేహములయందు అంతర్యామిరూపముగానున్న ఆత్మకే చెందును కాని అనాత్మభూతములగు దేహములకు జెందదు. కనుకనే "ఆకాశాత్పతితం తోయం యథాగచ్ఛతి సాగరం, సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" అను స్మృతి యుపపన్నమగుచున్నది- ఇచట కేశవపదము ఆత్మపరముకాని నాలుగుభుజములతో గూడిన శరీరపరముకాదు. కావున కేశవపదమున కర్థమగు పరమాత్మ సర్వదేవతలయందు ఆత్మరూపముతో నుండుటచే నేదేవతకు నమస్కరించినను కేశవుని చెందును.

ఓయి! ఈశ్వరుడు భక్తుల పుణ్యాపాపములను గ్రహింపనిచో భక్తులు తాము చేసిన యాగాదులయొక్క పుణ్యమును భగవన్తున కర్పింపనేల? అని యనరాదు. మానవులు అజ్ఞానముచే, జ్ఞానసంస్కారము నశించి "తనకంటె యీశ్వరుడు వేరనియు, వాడు తమ పాపమును బోగొట్టు ననియు, తాముచేసిన స్వల్పసుకృతమును గ్రహించి యెక్కువ ఫలము నిచ్చుననియు వ్యామోహమును జెంది, యీశ్వరుని కొరకు కర్మల నాచరించుచూ సుకృతమును యీశ్వరున కర్పించుచు, జన్మమరణాత్మకమగు సంసారమును పొందుచున్నారు. ఇయ్యది యాత్మానాత్మ వివేకము లేమింజేసి కలుగునది కాని యాతకంటె వేరుకాదు.

రామానుజమతము : ఇచట రామానుజులు "నాదత్తే" అను పదమునకు (నాపనుదతి) పోగొట్టడు. అని యర్థమును చెప్పిరి. "అజ్ఞానేన" అను పదమునకు (ప్రాచీనకర్మణా) వెనుకటి కర్మచే అని యర్థమును చెప్పిరి. "ఆవృతం" అను పదమునకు (సంకుచితం) సంకోచమును చెందినది. అని యర్థమును చెప్పిరి.

ఇయ్యది యుక్తము గాదు. ఆదానము, అపనోదనము యీరెండును వేర్వేరు క్రియలు. ఈ రెంటికి యభేదము చెప్పదగదు. అట్లు భేదమును చెప్పుట వ్యాకరణ కోశాదులకు విరుద్ధము. ఆత్మజ్ఞానము సమస్తపుణ్యపాపములను భస్మముచేయునని "జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతేర్జున" అని శ్లోకముచే నిదివరకే చెప్పబడి యున్నది. పుణ్యపాపములను భస్మముచేయునట్టి యాత్మజ్ఞానమునకు పుణ్యపాపఫల మగు సుఖదుఃఖములను పోగొట్టుట సంభవమే కాని యసంభవము కాదు.

మరియు రామానుజులు "పుత్రాదేః పాపం దుఃఖంచ నాదత్తే" ఆత్మ (పుత్రాదులయొక్క పాపమును, దుఃఖమున్ను పోగొట్టడు) అని వ్యాఖ్యానమొన ర్చిరి. అది యుక్తముకాదు. పుత్రాది శబ్దమునకు ఆత్మలు అర్థమా ? లేక దేహాది సంఘాతము అర్థమా ? మొదటిపక్ష మంగీకరించినచో, ఆత్మయందు పాపసంబంధమే పొసగదు. దేహాదిసంఘాత మర్థమన్నచో, దేహాదిసంఘాతముతో ఆత్మకు సంబం ధము లేనందున పుత్రాదులు ఆత్మసంబద్ధు లని చెప్పుట పొసగ నేరదు.

ఓయి ! దేహాదిసంఘాతముతో ఆత్మకు సంబంధము లేకున్నను ఆత్మమాత్రము సంబంధ మున్న ట్లభిమానించుచున్నచో నదియు యుచితము కాదు. స్వయంప్రకాశు డగు నిర్విశేషాత్మయం దభిమానము కూడ నుండదు. ఎవడు "నాకు వీడు పుత్రుడు, నేను వానికంటె వేఱు, తండ్రిని" అని యభిమానించునో వాడు సంఘాతమేకాని, కేవ లాత్మ కాడు. సంఘాతము అచేతనమయినను అందు చిదాభాస యుండుటచే నభి మానము పొసగుచున్నది. లేనిచో జడమయిన నన్తఃకరణమునకు సంకల్పాది వ్యాపార మెట్లు కలుగును ? కావున నెవడు పుత్రాదులు తమవారని యభిమానిం చునో వాడు తనశక్తికొలది పుత్రాదుల దుఃఖమును పోగొట్టుచునే యున్నాడు. పోగొట్టడని రామానుజులు చెప్పుట లోకవిరుద్ధమగును.

అట్లే రావణాదులయొక్క దేహేన్ద్రియసముదాయము, తనకు శత్రువగు రామాది శరీరముయొక్క సుఖమును భార్యాపహరణముచే బోగొట్టెను. ఇట్టితరి ఆత్మ తనకు ప్రతికూలమని యభిమానించినవానియొక్క సుఖమును పోగొట్టడని రామానుజులు చెప్పుటగూడ తగదు.

మరియు రామానుజులు అజ్ఞాన శబ్దమునకు కర్మ యని యర్థమును చెప్పుటకూడ సమంజసముకాదు. కర్మ అజ్ఞానకార్యముగాని యజ్ఞానరూపము కాదు. మరియు కర్మ జ్ఞానము నావరించుట సంభవించదు. ద్రవ్యముకాని మరియొకదానిని

యావరింపజాలదు. కర్మవలన జ్ఞానమునకు సంకోచమేర్పడునన్నచో జ్ఞానమును సంకోచపరచుట కర్మయొక్క గుణమగును కాని, స్వరూపము కానేరదు. కర్మ కూడ గుణమన్నచో, గుణకర్మలకు భేదము లేకపోవును. పుణ్యాపుణ్య సంస్కార రూపమగు నీ కర్మ గుణమే యని యంగీకరించినను అయ్యది జ్ఞానావరణరూపము కానేరదు. కేవల సంస్కారరూపమే యగును. కావున అజ్ఞాన శబ్దమునకు జ్ఞాన విరోధియగు మాయ యను సర్థము స్వరసముగా నుండ, దానిని విడచి యన్యార్థమును కల్పించుట అయుక్తమగును. కావున అజ్ఞానశబ్దమునకు జ్ఞానవిరోధి యగు మాయయే యర్థముకాని మరి యితరము అర్థము కానేరదు. ౧౫

శ్లో. జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః
తేషా మాదిత్యవత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥ ౧౬ ॥

అ. ఇచట ఆత్మశబ్దముయొక్క ఆవృత్తిచే పూర్వార్థమునకు మూడు విధముల అన్వయము కలుగుచున్నది.

(1) ఏషాంతు తదాత్మనో; అజ్ఞానం జ్ఞానేన నాశితం.

ఎవరియొక్క ఆత్మస్వరూపమును ఆవరించునట్టి యజ్ఞానము ఆత్మవిషయక జ్ఞానముచే నాశము జెందునో,

(2) ఏషాంతు తదజ్ఞానం ఆత్మనః జ్ఞానేన నాశితం.

ఎవరియొక్క అయితే, వెనుకటిశ్లోకముచే జెప్పబడిన, జ్ఞానావరకమగు అజ్ఞానము బ్రహ్మాస్మీత్యాకారక స్వస్వరూపజ్ఞానముచే నాశమొందెనో,

(3) ఏషాంతు తదాత్మనో అజ్ఞానం ఆత్మనః జ్ఞానేన నాశితం.

ఎవరియొక్క ఆత్మస్వరూపావరకాజ్ఞానము ఆత్మస్వరూపజ్ఞానముచే నాశమొందునో, లేక ఆత్మవిషయక అజ్ఞానము ఆత్మవిషయక జ్ఞానముచే నాశము చెందెనో అనియర్థము.

అట్టి జీవులయొక్క జ్ఞానము సూర్యుడు సర్వవస్తువులను ప్రకాశింప చేసినట్లు పరమార్థతత్త్వమును ప్రకాశింపఁ జేయును. ప్రకాశస్వరూపమగు జ్ఞానము ప్రకాశక మెట్లగునని యనరాదు. ఇచట జ్ఞానశబ్దముచే బుద్ధివృత్తి రూపమగు జ్ఞానము వివక్షితము. ఇయ్యది ప్రకాశరూపము కాదు, ప్రకాశకరణము. బుద్ధివృత్తిరూపమగు జ్ఞానము ఆత్మావరకమగు అవిద్యను నశింపజేయుచు ఆత్మను ప్రకాశింపజేయును. కావున విద్యకు (జ్ఞానమునకు) బ్రహ్మవస్తుప్రకాశత్వము చెప్పబడినది. ఘటజ్ఞానముచే ఘటావరకాజ్ఞానము నశించి, ఘటము ప్రకాశితమయినట్లు, బుద్ధివృత్తిరూపజ్ఞానముచే ఆత్మావరకాజ్ఞానమును నాశమొనర్చుచూ ఆత్మ ప్రకాశింపజేయబడుచున్నాడు. కావున బుద్ధివృత్తిరూపజ్ఞానము ప్రకాశాత్మకముకాదు, ప్రకాశసాధనమే

యగును. చైతన్యమే ప్రకాశాత్మకము అని సిద్ధమయినది.

రామానుజమతము :

ఇచట నుత్తరార్థమున అజ్ఞాననాశము కలిగిన జీవులను నిర్దేశించి చెప్పుటలో "తేషాం" (వారలయొక్క) అని బహువచనమున నిర్దేశించుటచే ఆత్మలు స్వరూపతః అనేకులనియు, వారియొక్క జ్ఞానమునకు సూర్యుని దృష్టాంతపరచుటచే, శక్తిశక్తిమంతులకువలె, ప్రభాప్రభావంతులకువలెయు, జ్ఞాత్మజ్ఞానములకు అభేదముగా నునికి సిద్ధించుచున్నదనియు, ఆత్మలు జ్ఞానమను ధర్మము కలవారనియును, రామానుజులు ప్రతిపాదించిరి.

ఇయ్యది యుక్తముకాదు. ఇచట "తేషామ్" అను పదముచే పూర్వశ్లోకమున చెప్పబడిన జంతువులు పరామృశింపబడిరి. జంతుశబ్దమునకు ప్రాణిమాత్రమర్థముకాని, ఆత్మ యర్థముకాదు. పుట్టుకలేనివాడు ఆత్మ, (జాయత ఇతి) అను వ్యుత్పత్తిచే జన్మకలది జంతువు. జంతుశబ్దముచే లక్షణవలన ఆత్మలే వివక్షితము లన్నచో స్వయంప్రకాశుడగు ఆత్మకు "తేన ముహ్యన్తి జంతవః" అని పూర్వశ్లోకముచే జెప్పబడిన మోహము సంభవింపదు. ఇక ఆత్మలకు స్వయముగా మోహము లేకున్నను, అంతఃకరణ తాదాత్మ్యాభిమానము వలన మోహము కుదురు నన్నచో, అపుడు జంతువు లనగా నిరుపాధికాత్మలు కారనియు, సోపాధికాత్మలనియుఁ దేలును. అట్టితరి అంతకరణాద్యుపాధిప్రయుక్తమగు ఆత్మానేకత్వము అద్వైతుల కిష్టమే యగును. కావున ఉపాధిభేదముచేతనే ఆత్మల కనేకత్వము సిద్ధించుచుండ, ఆత్మబహుత్వమును కల్పించుట గౌరవమున్ను అప్రమాణమున్ను అగును.

మరియు నిర్ధర్మకుడగు ఆత్మయందు జ్ఞానమును ధర్మమును కల్పించుట యుక్తముగాదు. వృత్తిరూపమగు నీ జ్ఞానము అంతఃకరణధర్మముకాని, ఆత్మధర్మము కానేరదు. అంతఃకరణము నాశముచెందినపుడు వృత్తి కనుపింపదు. "తస్యభాసా" అను శ్రుతియందలి షష్ఠీనిర్దేశముచే జ్ఞాన మాత్మధర్మమని తేలుచున్నదనరాదు. అయ్యది "రాహోశ్శిరః" అను ప్రయోగమువలె నౌపచారిక భేదమును పురస్కరించుకొని ప్రవర్తించినదికాని వేరుకాదు. కావున "తస్యభాసా" అను శ్రుతికి ఆత్మస్వరూపభూతజ్ఞానముచే అని యర్థమును చెప్పవలెను.

మరియు ఆత్మజ్ఞానముకలవాడగుచో జ్ఞానము ఆత్మకంటె లోపలిది కావలసివచ్చును. అయ్యది యనిష్టము. ఆత్మ సర్వాంతరుడని శ్రుతి చెప్పుచున్నది.

"య ఆత్మని తిష్ఠన్ ఆత్మానమంతరోయమయతి" అను శ్రుతివలన, ఆత్మకంటెను పరమాత్మయే లోపలివాడనియు, ఆత్మ సర్వాంతరుడు కాడనియు ననినచో నదియు పొసగదు. అచట ఆత్మశబ్దమునకు ప్రమాత యర్థముకాని సాక్షి యర్థము కాదు.

ప్రమాంతాత్మను కూటస్థాత్మ నియమించుచున్నాడని ఆ శ్రుతి కర్థము. కావున "సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" ఇత్యాది శ్రుతులను బట్టి పరమాత్మయే సాక్షి రూపుడు కాని ఆత్మకంటె పరమాత్మ వేరుకాదని స్పష్టమగుచున్నది.

ఇక జ్ఞాతయగు ఆత్మజ్ఞానరూపు డెట్లగునని యనరాదు. ఆత్మ జ్ఞాతయని యంగీకరించిన నీవు కూడ, ఆత్మకు జ్ఞానరూపత్వ మంగీకరించుచుంటివి. కావున నీ దోష ముభయులకు సమానమగును. ౧౬

శ్లో. తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః
గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః ॥ ౧౭ ॥

అ. బ్రహ్మయందు బుద్ధిగలవారు, బ్రహ్మయే ఆత్మ అను జ్ఞానముకలవారు, బ్రహ్మయందు తాత్పర్యము కలవారు, బ్రహ్మయే పరమమగు గమ్యస్థానమని తలచు వారును జ్ఞానముచే పాపమును పోగొట్టుకొని పునరావృత్తి రహితమగు మోక్షమును పొందుచున్నారు.

ఇచట విశేషణముల కర్థభేదము లేదని శంకింపరాదు. "తద్బుద్ధయః" అను పదముచే పరోక్షబ్రహ్మజ్ఞానము గ్రహింపవలయును. 'తదాత్మానః' అను పదము నకు బ్రహ్మాత్మాపరోక్షజ్ఞాన మర్థము. "తన్నిష్ఠాః" అను పదమునకు నిరంతర బ్రహ్మ స్వరూపానుసంధాన మర్థము. "తత్పరాయణాః" అను పదమునకు ఆత్మరతి యర్థము.

శ్లో. విద్యా వినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః ॥ ౧౮ ॥

అ. ఉత్తముడును సంస్కారవిశిష్టుడును అగు సాత్వికబ్రాహ్మణుని యందును, మధ్యమమును సంస్కార రహితమగు రాజసగోవునందును, అధమమును కేవల తామసమునగు హస్త్యాదులయందును, సర్వసముడును, అవిక్రియుడును అగు బ్రహ్మమును గుర్తెరింగిన పండితులు సమదృష్టితో నుందురు. ౧౮

శ్లో. ఇహైవ తైర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితం మనః
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మా ద్బ్రహ్మణి తే స్థితాః ॥ ౧౯ ॥

అ. ఓయి! బ్రాహ్మణాదులయం దాత్మ యేకరూపముగా నుండుటచే పండి తునకు గోబ్రాహ్మణ శునకాదుల యెడ సమబుద్ధి యుండుచో బ్రాహ్మణాదులవలె గోవు మున్నగునవికూడ సమానముగా పూజింపదగినవగును. అట్లు పూజించినవాని యన్నము భుజింపరాదని ధర్మశాస్త్రము కలదు. అని యాక్షేపము రాగా సమా ధానము చెప్పబడుచున్నది.

"సమా సమాభ్యాం విషమ సమే పూజాతః" అని గౌతమ ధర్మసూత్రము. కులశీలవిద్యాదులతో సమానప్రతిపత్తి కలవారిని పూజించునపుడు పరస్పరము

విషమముగాను, విషమముగా(హెచ్చుతగ్గుగా) పూజింపదగినవారిని సమానముగాను పూజించువాని యన్నము భుజింపరాదని దీనియర్థము. ఇయ్యది గౌతమ ధర్మసూత్ర మను గ్రంథములో అభోజ్యాన్నప్రకరణము (భుజింపదగని యన్నము కలవారిని నిరూపించు ప్రకరణము) నందున్నది.

యజ్ఞాదులయందు విద్వాంసులను బూజించు సమయమున యజమానుడు వేదవేత్తలను వేదవేత్తలతో సమానముగాను, షడంగవేత్తలను షడంగవేత్తలతో సమానముగాను, బ్రహ్మవేత్తలను బ్రహ్మవేత్తలతో సమానముగాను, శాస్త్రజ్ఞులను శాస్త్రజ్ఞులతో సమానముగాను బూజింపవలెను. అట్లుకాక వేదవేత్తలను షడంగవేత్తలతో సమానముగాను, షడంగవేత్తలను బ్రహ్మవేత్తలతో సమానముగాను, బ్రహ్మవేత్తలను శాస్త్రజ్ఞులతో సమానముగాను పూజించినచో, నట్టి యజమానుని యజ్ఞాన్నము భుజింపరాదని దీని భావము.

సమాధానము : సమస్తభూతములయందును ఒకే బ్రహ్మము కలదని యెవరు తెలిసికొందురో వారు జీవించియుండగనే జన్మమరణాత్మకమగు సంసారమును జయించుకొనిరి. బ్రహ్మము స్వతస్సిద్ధముగాగాని, గుణభేదమునగాని దోషముకలవాడు కాడు. ప్రకృతి సత్త్వాదిగుణభేదమువలన ననేక విధములుగ మారును. కాని బ్రహ్మమాత్రము నిర్గుణమగుటచే నట్లు మారదు. కావున నిర్దోషమగు బ్రహ్మమును సర్వసమునిగా గుర్తెరింగిన నాత్మజ్ఞానుల కెట్టి దోషమున్ను అంటదు. పరమాణ్వాదులను భేదపరచునట్టి విశేషములవలన బ్రహ్మభేదము సిద్ధించునని కూడ శంకింపరాదు. నిర్విశేషుడగు బ్రహ్మయందు నెట్టి విశేషములున్ను యుండ నేరవు. శరీరము లనిత్యములగుటచే నిత్యద్రవ్యములయందుండెడి విశేషములు శరీరములయందుండ నేరవు. ఒకవేళ విశేషములు (శరీరములయందుండునని) శరీరాశ్రయములని యంగీకరించినను, శరీరములకు పరస్పరభేదము సిద్ధించునుకాని యాత్మభేదము సిద్ధింపదు.

కావున వెనుకజెప్పబడిన "సమాసమాభ్యాం విషమసమే పూజాతః" అను సూత్రము, శరీరమునందాత్మాభిమానము కలవారి విషయముకాని యాత్మజ్ఞానుల విషయముకాదు. సూత్రమునందు "పూజాయాం" అని యుండుటచే నియ్యది కర్మవిషయమగునుకాని జ్ఞానవిషయము కానేరదు. దేహాభిమానముకల మానవులకు పూజాసత్కారాదులు ప్రసక్తించినపుడు వీడు బ్రహ్మవేత్త, వీడు షడంగవేత్త, వీడు చతుర్వేదవేత్త, వీడు శాస్త్రజ్ఞుడు అని గుణవిశేషమును పురస్కరించుకొని తారతమ్యము పొడసూపును. వారు అట్టి తారతమ్యమును గ్రహించి వారి వారిని యథాక్రమముగ బూజింతురు.

బ్రహ్మనిష్ఠున కట్టి పూజాప్రసక్తియే లేదు. వీనికి సర్వము బ్రహ్మమయముగానే తోచును. కావున గౌతమస్మృతి కర్మాధికారి విషయమనియు, గీతాశ్లోకము

ఆత్మజ్ఞానివిషయమనియు, కావున నీ రెంటికి విరోధము లేదనియు గ్రహింపవలెను. కనుకనే జనకాదులకుగూడ గోబ్రాహ్మణశునకాదులయందు సమత్వబుద్ధి జ్ఞానవిషయమేకాని కర్మవిషయముకాదు. మూలమునందుగూడ "పండితాః సమదర్శినః" అని చెప్పబడినదికాని, "పండితాస్సమపూజకాః" అని మూలమునందు చెప్పలేదు. కావున స్మృతివిరోధములేశముగూడ లేదని సుస్పష్టము. ౧౯

శ్లో. న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియం
స్థిరబుద్ధి రసంమూఢో బ్రహ్మవి ద్బ్రహ్మణి స్థితః ॥ ౨౦ ॥

అ. ఆత్మ సర్వభూతములయందు నొక్కడే యనియు, సమానుడనియు (సముడనియు), దోషరహితుడనియును, నిర్ణయజ్ఞానము కలిగి సమ్మోహము లేక, సర్వకర్మసన్యాసియగు బ్రహ్మనిష్ఠుడు ఇష్టవస్తువు లభించినపుడు సంతసింపడు, అనిష్టవస్తువు సంప్రాప్తమయినపుడు దుఃఖింపడు. ఇష్టానిష్టములు శరీరసంబంధముకలవానికిగాని యంటవు. ఆత్మ వాస్తవముగ శరీరసంబంధముకలవాడు కాడు. కావున ఇష్టానిష్టము లాత్మకంటవు. ౨౦

శ్లో. బాహ్యస్పర్శే ష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖం
సబ్రహ్మయోగయుక్తాత్మా సుఖ మక్షయ్యమశ్నుతే ॥ ౨౧ ॥

అ. బాహ్యవిషయములయందాసక్తి లేనివాడెట్టి యాత్మానందము నొందునో బ్రహ్మజ్ఞానియగువా డట్టి నాశరహితమగు నాత్మానందము నొందును. కావున క్షణిక సుఖము నిచ్చునట్టి బాహ్యవిషయములను ప్రేమింపకూడదు. ఆత్మస్వరూపానుసంధానమునందే యింద్రియములను ప్రవేశపెట్టవలెను. ఆత్మయే సుఖరూపుడగుచుండ నాత్మయందలి సుఖమును (ఆత్మని యత్సుఖం) అని మూలమునం దెట్లు చెప్పిరని ప్రశ్నింపరాదు. "ఆనన్దం బ్రహ్మణో విద్వాన్" ఇత్యాది శ్రుతులయందువలె కల్పితభేదమును పురస్కరించుకొని యట్లు చెప్పిరి. మరియు "ఆనన్దో విషయానుభవో నిత్యత్వం చేతి సంతి తద్ధర్మాః అపృథక్త్వేఽపి చైతన్యాత్పృథగివావభాసంతే" అను శ్రుతి ఆనన్దము, విషయానుభవము, నిత్యత్వము అను ధర్మములు ఆత్మయందు కలవనియు, నయ్యవి యాత్మస్వరూపముకంటె వేరుగ లేకున్నను, వేరుగనున్నట్లు భాసించు ననియును చెప్పుచున్నది. కావున మూలకారులు (ఆత్మని యత్సుఖం) సుఖమాత్మధర్మమని చెప్పుట పొసగుచున్నది. మరియు ఆత్మయే సుఖరూపుడగుచుండ, నాత్మ సుఖమును బొందుటెట్లు? అను శంక కలుగును. ఆత్మ సుఖస్వరూపముతో నుండుటయే ఆత్మ సుఖమును పొందుట అని సమాధానము చెప్పుకొనవలెను. ఆత్మ నిత్యుడుకాన ఆత్మసుఖము నిత్యము, విషయములు క్షణికములుకాన విషయసుఖ మనిత్యము. కావున నిత్యసుఖముకొరకు ప్రయత్నించుట యుచితమని భావము.

శ్లో. యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే
ఆద్యన్తవన్తః కౌన్తేయ న తేషు రమతే బుధః ॥ ౨౨ ॥

అ. బాహ్యవిషయములనుండి యింద్రియములను మరల్చుకొనుటకు కారణాంతరమును చెప్పుచున్నారు.

ఓయి పార్థ! ఏ భోగములు విషయేన్ద్రియసంబంధము వలన కలుగునో, అయ్యవి దుఃఖహేతువులే గాని సుఖమును లేశమాత్రము నీయవు. ఇహలోక భోగములయందు సుఖమెట్లు లేదో పరలోక భోగములయందు గూడ నట్లే సుఖము లేదని యూహింపవలెను. అనాత్మవస్తువులయం దాత్మాభిమానము అవిద్య యనబడును. ఇట్టి యవిద్యవలననే "నేను శబ్దమును వినుచున్నాను" "నేను రూపమును చూచుచుంటిని" ఇత్యాది భ్రాంతులకు లోనయి మానవులు సుఖదుఃఖముల ననుభవించుచున్నారు. మరియు నీయవి చావు పుట్టుకలు కలవి. కావున వివేకి యిట్టి భోగములను ప్రేమింపడు. ఏ క్షణమున నింద్రియములకు పదార్థములతో సంబంధ ముండునో ఆక్షణముననే సుఖముండును. దానికి పూర్వక్షణమందుకాని, తదుత్తర క్షణమందుకాని సుఖదుఃఖము లుండ నేరవు. కావున నీయవి క్షణికములు. వివేకియగువాడు యిట్టి క్షణికభోగముల నాసింపడు. వీటినుండి యింద్రియముల మరల్చి యాత్మానుసంధానముతో మెలంగుట యుచితము. ౨౨

శ్లో. శక్నోతీహైవ యః సోఢుం ప్రాక్శరీర విమోక్షణాత్
కామక్రోధోద్భవం వేగం స యుక్తః స సుఖీ నరః ॥ ౨౩ ॥

అ. ఎవడు బ్రతికియుండగనే శరీరము పడిపోకపూర్వము కామక్రోధముల వలన బుట్టు వేగమును సహింపఁజాలునో వాడు యోగియగును. వాడే ఇహలోక సుఖము ననుభవించును.

ఇష్టవస్తువు కంటికి కనుపించినను, ఇష్టమగు శబ్దము చెవికి వినిపించినను, ఇష్టమగు విషయము మనసుకు తలపుకొచ్చినను వాటియందు మానవునకు కలుగు తృష్ణ (ఆశ) కామ మనబడును.

ప్రతికూల పదార్థములు కనుపించినను, వినిపించినను, స్మరించినను కలుగు ద్వేషము క్రోధమనబడును.

శరీరమున గగుర్పాటు (వెంట్రుకలు నిక్కబొడుచుట), నేత్రములు విప్పారుట, ముఖమున హర్షమొదవుట మున్నగువాటివలన నూహింపదగిన మనఃక్షోభము కామవేగ మనబడును.

శరీర మదురుట, శరీరము చెమటపట్టుట, పెదవులు కొరకుట, కండ్లు యెఱ్ఱపడుట మున్నగు వికారములచే గుర్తింపదగిన మనఃక్షోభము క్రోధవేగ మనబడును. ఈ రెంటిని సహించుటయే మానవునకు సుఖదాయకము.

విషయములు : 1. శ్రూయమాణములు (వినబడునవి), 2. స్మర్యమాణములు (తలచబడునవి), 3. అనుభూతములు-అని మూడు విధములు.

పురుషుడు దేశాన్తరమందున్న అందమైన స్త్రీని విని కామించును. ఆమెనే మాటిమాటికి తలచుకొని ప్రేమించును. ఆమెయే దగ్గరనున్నపుడు అనుభవించియే కాముకుడగును.

కావున కామము శ్రూయమాణవస్తువిషయకము, స్మర్యమాణవస్తువిషయకము, అనుభూయమానవస్తువిషయకము అని మూడు విధములు.

అట్లే క్రోధము కూడ దృశ్యమానవస్తువిషయము, శ్రూయమాణవస్తువిషయము, స్మర్యమాణవస్తువిషయము అని మూడువిధములు. కావున నిట్టి కామక్రోధముల జయించిన మానవుడే చిత్తైకాగ్ర్యము నొందును. వాడే ఇహ పర సుఖముల బొందును. ౨౩

శ్లో. యోఽన్తస్సుఖోఽన్తరారామ స్తథా న్తర్జ్యోతిరేవ యః
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి ॥ ౨౪ ॥

అ. ఎవడు అంతరాత్మయందే సుఖము నొందునో, అంతరాత్మయందే విహరించునో, అంతరాత్మనే జూచుచుండునో, బ్రహ్మభూతుడగు నా యోగి బ్రహ్మానన్దము నొందును.

శ్లో. లభంతే బ్రహ్మనిర్వాణం ఋషయః క్షీణకల్మషాః
ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితే రతాః ॥ ౨౫ ॥

అ. పాపరహితులు, నిశ్చయాత్ములు, జితేన్ద్రియులు, సర్వభూతదయాళువులు నగు యతులు బ్రహ్మానందము నొందెదరు. ౨౫

శ్లో. కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్
అభితో బ్రహ్మ నిర్వాణం వర్తతే విదితాత్మనామ్ ॥ ౨౬ ॥

అ. కామక్రోధరహితులు, జితేన్ద్రియులు, తత్త్వవేత్తలు నగు యతులకు జీవించియున్నను, మరణించినను బ్రహ్మసుఖము కలదు.

శ్లో. స్పర్శాన్కృత్వా బహిర్బాహ్యాం శ్చక్షుశ్చైవా న్తరే భ్రువోః
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యంతరచారిణౌ ॥ ౨౭ ॥

అ. శ్రీకృష్ణభగవానులు తత్త్వజ్ఞానమునకు/అంతరంగసాధనమగు ధ్యానయోగమును చెప్పదలచి అందుకు సూత్రస్థానములగు శ్లోకములను అధ్యాయాంతమున నుపదేశించుచున్నారు.

శ్రోత్రాదింద్రియములద్వారా బుద్ధియందు ప్రవేశించియున్న శబ్దాది విషయములను బయటికి నెట్టి భ్రూమధ్యభాగమున దృష్టి నిలిపి నాసికామధ్యభాగమున సంచరించెడి యుచ్ఛ్వాసనిశ్వాసరూపములయిన ప్రాణాపానవాయువులను సమానములనుగాజేసి, ఇంద్రియమనోబుద్ధుల నియమించుకొని మోక్షమునం దాసక్తికలిగి, ఇచ్ఛాభయక్రోధముల విడనాడుకొని యెవడు యెల్లపుడు నుండునో వాడు ముక్తుడగును. బాహ్యములగు శబ్దస్పర్శాది విషయములు మనస్సుచే సంకల్పింపబడుచూ శ్రోత్రాది యింద్రియములద్వారా మనస్సునందు ప్రవేశించును. అట్టివాటిని తలచకుండుటయే వాటిని బాహ్యములనుగా జేయుట యని యర్థము. అనగా బాహ్యవస్తువులు స్వస్వరూపముతో లోపల ప్రవేశింప నేరవు. మనస్సు విషయాకారమును చెందుటయే విషయములకు అంతఃప్రవేశము కనుకనే కంటితో నొక్కమారు చూపబడిన స్త్రీ కన్నుమూసికొన్నను కాముకుని హృదయమునందు స్ఫురించును, కంటితో చూడనిచో కాముకుని హృదయమునందు కామిని యగు స్త్రీ స్ఫురింపదు. కావున బాహ్యవిషయములు యింద్రియములద్వారా బుద్ధియందు ప్రవేశించు ననుట యుక్తమగుచున్నది.

మనస్సునకు విషయచింతన లేనిచో విషయములు మదియందు ప్రవేశింపవు. విషయచింతన లేకుండుటయే విషయములను బయటనుంచుట యని గ్రహింపవలయును.

ఇచట భాష్యకర్తలు ధ్యానయోగము సమ్యగ్జ్ఞానమున కంతరంగసాధనమని చెప్పుటచే, కర్మయోగము బాహ్యసాధనమని స్పష్టమగుచున్నది. కావుననే శంకరులు "ధ్యానయోగమును పొంద శక్తిలేని గృహస్థులు అంతవరకు కర్మల నాచరింపవలెనని ముందు చెప్పబోవుచున్నారు.

శ్లో. యతేన్ద్రియమనోబుద్ధి ర్మునిర్మోక్షపరాయణః
విగతేచ్ఛాభయక్రోధో యస్సదా ముక్తఏవ సః ॥ ౨౮ ॥

అ. ఏ యతి మనోబుద్ధుల నియమించుకొని మోక్షమునం దత్యంతాసక్తుడై ఇచ్ఛాభయక్రోధముల విడనాడుకొని యెల్లపుడు భగవద్ధ్యానముతో నుండునో వాడు ముక్తుడే యగును. ధ్యానయోగికి జ్ఞానము లభించును. జ్ఞానమువలన మోక్షము వచ్చును. కావున ధ్యానయోగికి యనుష్ఠింపదగిన మోక్షోపాయము వేరు లేదు. ఇంతమాత్రమున ధ్యాన జ్ఞానయోగములు రెండును ఏకమే నని యనరాదు. ఏవస్తువునందు చిత్తము యేకాగ్రత చెందునో ఆ వస్తువు బ్రహ్మమే యను జ్ఞానము ధ్యాతకుండదు. జ్ఞానికి ఆ వస్తువుకూడ బ్రహ్మమే యను జ్ఞానముండును. చిత్తైకాగ్రతయం దుభయులకు సామ్యమున్నను యీ విషయమునందు మాత్రము యీ ఉభయులకు భేదము కలదు. ౨౮

శ్లో. భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరం
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి ॥ ౨౯ ॥

అ. ఎవఁడు యేపనిని చేయునో వాఁడాపనియొక్క ఫల మనుభవించును. ఏ దేవత ఆజ్యాది హవిస్సులతోఁ బూజింపబడునో ఆ దేవత ఆ యాజ్యాది హవిస్సును భుజించును. పరమేశ్వరుఁడు సర్వయజ్ఞములయందు, సర్వతపస్సులయందును, కర్తగాను, దేవతగాను యుండును. అందువలన శ్రీమన్నారాయణమూర్తి సర్వయజ్ఞములయొక్కయు, సర్వతపంబులయొక్కయు ఫల మనుభవించును. పరమేశ్వరుఁడు సర్వజనులకంటె గొప్పవాఁడు, సర్వప్రాణులను నియమించు స్వభావము కలవాఁడు, సర్వజీవులకు కర్మానుగుణముగ ఫలము నిచ్చువాఁడు, సర్వజీవులయంతఃకరణమునందు బుద్ధివృత్తులకు సాక్షిరూపముతో నుండువాఁడు. ఇట్టి నారాయణరూపమగు శ్రీకృష్ణతత్వమును తెలిసికొనినవాఁడు మోక్షము నొందును. అయ్యాది స్థానముగా కలవాఁడు నారాయణుఁడు. (దేహేంద్రియసంఘాతరూపమయిన జంతువుల సమూహము స్థానముగా కలవాఁడు నారాయణుఁడు అనగా) భూతముల హృదయమునం దుండువాఁడని యర్థము.

లేక జీవులయొక్క కర్మఫలములు నారములు. వాటిని పొందించువాఁడు నారాయణుఁడు అనగా సర్వమానవుల కర్మఫలమున కధ్యక్షుఁడని యర్థము.

లేక జీవులయొక్క బుద్ధివృత్తులు నారములు. వాటిని తెలిసికొనువాఁడు కావున నారాయణుఁడుఅనగా సర్వాంతఃకరణసాక్షి యనియర్థము.

లేక నారమనగా జీవసమూహము. జీవసమూహమును తెలిసికొనువాఁడు నారాయణుఁడు జీవసాక్షియని యర్థము. ఆత్మయే నారాయణుఁడు. కావున నారాయణ కృష్ణులకు భేదము లేదు. కనుకనే భాష్యకర్తలు "నారాయణరూపుఁడగు నన్ను తెలిసికొనినచో" నని చెప్పిరి. అట్లుకాక నారాయణుఁడు ఆత్మభిన్నుఁడగుచో నారాయణజ్ఞానముచే మానవులకు సంసారోపరతి కలుగనేరదు. అన్యజ్ఞానముచే నన్యునకు సంసార నివృత్తి యసంభవము. పైగా భేదజ్ఞానముచే సంసారభయ మేర్పడును. కావున ధ్యానయోగికికూడ బ్రహ్మాత్మజ్ఞానము వలననే మోక్షమని స్పష్టమయినది.

రామానుజ మతము: "జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి" అనుచోట శ్రీకృష్ణపరమాత్మను తెలిసికొనుట యనగా కృష్ణపరమాత్మను ఆరాధించుటయే కర్మయోగమని తెలిసికొనుట అనియు, ఇట్లు తెలిసికొనినవాఁడు సుఖముగా కర్మయోగమునందు ప్రవర్తించు ననియు రామానుజులు వ్యాఖ్యాన మొనర్చిరి. ఇయ్యది సరిగాదు. జ్ఞాన, శాంతి ప్రాప్తులకు మధ్య క్రియాంతర వ్యవధానము

లేదు. క్రియాంతరవ్యవధానమును కల్పించుట అప్రమాణము, శ్రుతివిరోధము నగును. "సర్వకర్మాణి మనసా" అను శ్లోకముచే సర్వకర్మసన్న్యాస ముపక్రమింపబడియుండ నిచట కర్మయోగమును జెప్పుట యప్రస్తుతమగును. మరియు "స్పర్శాన్ కృత్వా" అను శ్లోకముచే ధ్యానయోగము చెప్పబడినందున కర్మయోగమున కవకాశము లేదు. కర్మయోగమువలన కలుగు చిత్తశుద్ధిని బొంది, దానివలన కలుగు జ్ఞానముదయించినపిదప మరల కర్మయోగ మాచరించుటకు ప్రసక్తియే యుండదు. కావున రామానుజవ్యాఖ్యానము సరికాదు.

ఇట్లు శ్రీ భగవద్గీతా భాష్యార్క ప్రకాశికానువాదమున

పంచమాధ్యాయము ముగిసినది.



# శ్రీ భగవద్గీతా భాష్యార్థ ప్రకాశికానువాదము

## షష్ఠో௨ధ్యాయము

అ. పంచమాధ్యాయముయొక్క తుదిభాగమున "స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాన్" "యతేన్ద్రియ మనోబుద్ధిః" "భోక్తారం యజ్ఞతపసాం" అని మూడు శ్లోకములు శ్రీకృష్ణునిచే నుపదేశింపబడినవి. ఈ మూడుశ్లోకములును ఆత్మతత్వజ్ఞానమున కంతరంగసాధనమగు ధ్యానయోగమును సూత్రప్రాయముగా సూచించుచున్నవి. అట్టి ధ్యానయోగమును వివరించిచెప్పుటకే నీ యారవయధ్యాయ మారంభమగుచున్నది. ధ్యానయోగము లభించువరకు నధికారియగు గృహస్థు కర్మయోగమును తప్పక నాచరించితీరవలయును కావునను, అందు ధ్యానయోగమునకు కర్మయోగము సాధనము కావునను, శ్రీకృష్ణుడు ముందు రెండుశ్లోకములచే కర్మయోగమును స్తుతింపుచున్నాడు.

ఓయి! "యావజ్జీవ మగ్నిహోత్రం జుహుయాత్" అను శ్రుతి బ్రతికియున్నంతవరకు నధికారియగు గృహస్థు విహితకర్మను ఆచరించి తీరవలయు నని చెప్పుచుండ, ధ్యానయోగము లభించునంతవరకే కర్మాచరణమని హద్దును యేర్పరచు టెట్లు పొసగును? వినుము. కళత్రవియోగాది ప్రతిబంధములవలన యావజ్జీవశ్రుతిచే విధింపబడిన కర్మానుష్ఠానమున కెట్లు భంగము కలుగునో అట్లె వైరాగ్యాది ప్రతిబంధములవలనకూడ యావజ్జీవకర్మానుష్ఠానమునకు భంగము కలుగును. మరియు, శ్రీకృష్ణుడు "ఆరురుక్షోర్మునే ర్యోగం కర్మకారణ ముచ్యతే। యోగారూఢస్య తస్యైవ శమఃకారణ ముచ్యతే" అను శ్లోకమున, ధ్యానయోగమును అవలంబించ దలచినవానికి కర్మ సాధనమనియు, ధ్యానయోగమును (జ్ఞానయోగము)ను అవలంబించినవానికి యా యోగఫలమును బొందుటకు కర్మసన్న్యాసము సాధనమనియు విభాగము నేర్పరచెను. యావజ్జీవశ్రుతికి హద్దును యేర్పరచనిచో నీ విభాగము వ్యర్థమగును. కావున ధ్యానయోగమును బొందునంతవరకే కర్మాచరణము. ఆపైన కర్మలతోఁ బనిలేదు.

ఇక ఆరురుక్షువునకు, నారూఢునకు, వీరుభయులకు శమ, కర్మలు రెండును ఆచరణీయములని యభిప్రాయపడినచో, నదియు పొసగదు. ఏలనన మునికి శమము కర్మయు, కర్తవ్యమని చెప్పినంతమాత్రముననే ఆరురుక్ష్వారూఢుల కిద్దరకు శమ

కర్మలు రెండు నాచరణీయము లని సిద్ధించును. అట్టితరి ఆరురుక్షువునకు కర్మ ఆరూఢు నకు శమము అని విషయవిభాగముచే నారోహణమును వేర్వేరుగా విశేషణ మొన ర్చుట వ్యర్థమగును. కావున కర్మ, శమము (కర్మసన్న్యాసము)లకు హద్దు నేర్పర చుట యుక్తము.

ఓయి! ప్రపంచములో గొందరు యోగమును అధిష్ఠింపదలచినవారు, కొందరు యోగము నధిష్ఠించినవారు, మరికొందరు యోగము నధిష్ఠింపక నధిష్ఠింప దలచక నున్నవారు. అని యిట్లు అధికారులు మూడు రకముల నుండిరి. ఇందు మూడవరకములోనున్న యధికారుల నుద్దేశించి, శ్రీకృష్ణుడు ఆరురుక్షువునకు నారూఢునకు అని విశేషణమొనర్చుట కర్మ, శమ భేదముచే విభాగమును జేయు టయు కుదురుచున్నది. కావున యావజ్జీవశ్రుతికి హద్దును యేర్పరచుట తగదన్నచో నది పొసగదు. "యోగారూఢస్య తస్యైవ" అని యుత్తరార్థమునందలి తచ్ఛబ్ద ముచే పూర్వార్థమున జెప్పబడిన యారురుక్షువునే పరామర్శించినందున యెవడు పూర్వము యోగమును పొందదలచెనో వాడే యిప్పుడు యోగమును బొందినవాడని స్పష్టమగుచున్నది. కావున యోగమును పొందదలచుట, యోగమును బొందుట నీ రెండుధర్మములు కాలభేదముచే నొకేపురుషునియం దున్నటుల స్పష్టమగును. ఇట్టితరి పురుషభేదమును వర్ణించి (అనగా నారురుక్షువు వేరు, ఆరూఢుడు వేరు అని వర్ణించి) శ్లోకమును అన్వయించుట యుక్తముకాదు.

మరియు పూర్వార్థమునందు ("ఆరురుక్షోర్మునేర్యోగం") అని యోగ శబ్దము కలదు. దానిని యుత్తరార్థమునం దనువృత్తి చేసికొన్నచో "ఆరూఢస్య" అను పదమాత్రమువలన కావలసిన యర్థము లభించును. అయినను యుత్తరార్థము నందు "యోగారూఢస్య" అని మరల యోగపదమును గ్రహించుటచే పూర్వ మెవ్వడు యోగము నవలంబించదలచెనో, వాడే మరల యాయోగమును బొందిన పిదప వానికి యోగఫలమును పొందుటకు కర్మసన్న్యాసము (శమము) కర్తవ్యమని స్పష్టమగుచున్నది. అందువలన నారురుక్ష్వారూఢులకు భేదము తోచుచున్నది. కావున వారిరువురకు భేదమును శంకింపవీలులేదు. కనుక నేకర్మకును యావజ్జీవ కర్తవ్యత్వము ప్రాప్తించదు.

మరియు గీతలయందు "కచ్చిన్నోభయవిభ్రష్టః ఛిన్నాభ్రమివ నశ్యతి" "శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే" అను శ్లోకములచే యోగ భ్రష్టుడు చెప్పబడెను. ఉభయవిభ్రష్టుడనగా కర్మలను సన్న్యసించి, ధ్యానయోగము నవలంబించి యందు చిత్తైకాగ్ర్యము నొందనేరనివాడని యర్థము. ఇట్టివాడు (సన్న్యాసి యగు యోగభ్రష్టుడు) చెడిపోవునేమో నని శంకించి యర్జునుడు శ్రీకృష్ణుని యడి గెను. మానవునకు కర్మాచరణము యావజ్జీవకర్తవ్యమగుచో, కర్మసన్న్యాసియే దొర

శడు కావున నుభయవిభ్రష్టుడు సంభవించడు. వానికి వినాశమును పార్థుడు శంకించి యడుగుటయు పొసగదు. కావున కర్మ యావజ్జీవము కర్తవ్యమని యనదగదు.

ఇక నారవయధ్యాయమునందు ధ్యానయోగము గృహస్థునకే విధింపబడినచో గృహస్థు ధ్యానయోగమునందు నిలువలేకున్నను కర్మమార్గము నవలంబించి యందలి ఫలమును బొందునుగాన వాడు చెడిపోవునేమో నను శంకయే కుదరదు. ఆచరింపబడిన నిత్యకర్మకాని, కామ్యకర్మకాని, తప్పక ఫలము నిచ్చును. లేకున్న కర్మలను విధించునట్టి వేదవాక్యములు వ్యర్థమగును. ధ్యానయోగమునుండి భ్రష్టుడగు గృహస్థునకు ఫలమునిచ్చునట్టి కర్మయోగముండగా, యోగభ్రష్టుడు విడిపోయిన మేఘములవలె చెడిపోవునను ఆశంక యర్జునున కుచితముకాదు.

ఉభయవిభ్రష్టుడనగా కర్మయోగ ధ్యానయోగముల రెంటినుంచి భ్రష్టుడు కర్మమార్గముండుటచే గృహస్థున కట్టి యుభయభ్రంశము సంభవింపదు. గృహస్థు కర్మలను సన్యసింపకయే ధ్యానయోగమునందు ప్రవర్తించినందున నెప్పుడు ధ్యానయోగమునుండి జారునో యప్పుడు కర్మయోగమునందు ప్రవర్తించియే తీరును. కావున గృహస్థునకు కర్మయోగమునుండి భ్రంశ మెన్నటికిని సంభవింపదు. గృహస్థు యాచరించిన కర్మలయొక్క ఫలమును యీశ్వరార్పణ చేయుటచే, గృహస్థునకు గూడ కర్మభ్రంశము సంభవించు నన్నచో నదియు పొసగదు. ఈశ్వరార్పితములగు కర్మలు మెక్కువగా ఫలమునిచ్చునుకాని యెన్నటికి వ్యర్థములు కావు.

ఇక కర్మయోగి తా నాచరించెడి కర్మలను మోక్షాపేక్షతో నీశ్వరున కర్పించుచున్నాడనియు, నయ్యవి మోక్షఫలమునే యిచ్చునుకాని తదితరఫలము నీయజాలవనియు మోక్షము పరిపక్వమగు కర్మయోగముచే సాధ్యమగుననియు, కర్మయోగముయొక్క పరిపాకము బ్రతికియున్నంతవరకు ఫలేచ్ఛను వదలి కర్మల నాచరించుటచేఁ గలుగునుకాని మధ్యకాలమున కర్మలను వదలినచో కలుగదనియు, కావున నెవడు కర్మల ననుష్ఠింపుచు కర్మయోగమును వదలి ధ్యానయోగము నవలంబించి దానిని పూర్తిచేయలేక మధ్య మృతుడగునో, అట్టిగృహస్థు కర్మయోగ ధ్యానయోగముల రెంటినుంచి భ్రష్టుడుకాన వాడు యుభయభ్రష్టుడనియు, కావున గృహస్థు నుద్దేశించి యర్జునుని యాశంక యుక్తమే నన్నచో నది సరిగాదు.

"యోగీయుంజీత సతతమాత్మానం రహసి స్థితః
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః"
"ప్రశాంతాత్మా విగతభీః బ్రహ్మచారివ్రతే స్థితః
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్తఆసీత మత్పరః" అని.

యీయధ్యాయమున శ్రీకృష్ణుడు చెప్పబోవుచున్నాడు, ఇందుచెప్పబడిన ఏకాకిత్వము

(ఒంటరిగానుండుట) యేవస్తువును కోరకుండుట, దేనిని పరిగ్రహింపకుండుట, బ్రహ్మచర్యము, మున్నగుధర్మములు సన్న్యాసియందే సంభవించునుకాని గృహస్థునందు సంభవింపవు కావున నీ ధ్యానయోగము సన్న్యాసినిగురించి చెప్పబడినది కాని గృహస్థునుద్దేశించి చెప్పబడినదికాదు.

గృహస్థు రెండవవ్యక్తితోఁ గూడినవాఁడైనను (భార్యాసహితుడయినను) ధ్యానకాలమునందు భార్యనువిడచి యొంటరిగా నుండునుగనుక గృహస్థునకు గూడ నేకాకిత్వము (ఒంటరిగా నుండుట) సంభవించును. అందువలనఁ బైశ్లోకముల యందలి "ఏకాకి" అనుపదముచే సన్న్యాసి చెప్పబడడనియు, గృహస్థువే చెప్పబడు ననియు, నన్నచో నదియుక్తము కాదు. గృహస్థు కర్మాచరణసమయమునందువలె, ధ్యానకాలమందు స్త్రీసహాయుడుగా నుండవలెనను నియమములేదు. కావున నేకాకి యనుశబ్దమునకు స్త్రీసహాయములేనివాడని యర్థముకాదు, సన్న్యాసియనియే చెప్ప వలెను.

"ఏకాదాకిచ్చాసహాయే" అను పాణినిసూత్రమువలన నేకశబ్దముకంటె, యసహాయార్థమందు ఆకిచ్ప్రత్యయము రాగా ఏకాకీ అనుపదము సిద్ధించినది కావున నియ్యాది సహాయము లేనివాడను నర్థమును చెప్పును. ఇట్టి యసహాయత్వము ధ్యాన కాలమందు గృహస్థునకుఁగూడ నావశ్యకము. కనుక గృహస్థునకుగూడ నేదియో యొక మార్గమున నసహాయత్వనియమము కలదని యొప్పినను, మిగిలిన నిష్కామత్వము (దేని కోరకుండుట), అపరిగ్రహత్వము (దేనిని స్వీకరింపకుండుట), బ్రహ్మచర్యము మున్నగుధర్మములు గృహస్థునందు సంభవించనందున, నాధర్మములలోఁ జేర్చి చెప్పబడిన నేకాకిత్వముకూడ సన్న్యాసివిషయమేకాని గృహస్థువిషయము కాదు.

మరియు కర్మమార్గమునందున్న గృహస్థునకు నుభయభ్రంశము సంభవింపదు. సన్న్యాసి కర్మలనువిడచి, ధ్యానయోగమునందు ప్రవర్తించును. అందు చిత్తపరిపాకము నొందనిచో ధ్యానయోగమునుంచి భ్రష్టుడగును. కర్మసన్న్యాసము చేసినందున కర్మ యోగమునుంచియు భ్రష్టుడగును. కనుక నుభయభ్రష్టుడు సన్న్యాసియగునుకాని గృహస్థుకాడు.

సన్న్యాసికికూడ జన్మాన్తరీయకర్మఫల మున్నందున నుభయభ్రంశ మెట్లు కుదురు నని యనదగదు. జన్మాంతరకర్మఫలమగు స్వర్గాదులయందుఁ గోరికలేనివానికే సన్న్యాసమునం దధికారముండును. ఇహాముత్రఫలభోగవిరాగము సన్న్యాసమునకు గారణము, అనగా ఐహికఫలములందును ఆముష్మికఫలములయందును వైరాగ్యముకల వాడే సన్న్యాసియగును. కావున సన్న్యాసికి వెనుకటి కర్మఫలానుభవముండునని చెప్ప గూడదు. కనుక పార్థుని ప్రశ్న యుభయభ్రష్టుడగు సన్న్యాసివిషయముకాని గృహస్థు విషయ మెంతమాత్రముకాదు. దీనివలన ధ్యానయోగమునుబొందు సామర్థ్యము

కలుగునంతవరకు గృహస్థు కర్మల నాచరింపవలెననియు, నట్టి సామర్థ్యము కలిగిన తరువాత కర్మలను సన్న్యసించి, ధ్యానయోగ మధిష్ఠింపవలెననియు, జ్ఞానయోగము నందువలె ధ్యానయోగమునందుగూడ కర్మసన్న్యాసికే యధికారముకాని, కర్మాధికారియగు గృహస్థున కధికారము లేదనియును స్పష్టమయినది.

ఓయి! శ్రీకృష్ణుడు "అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతియః, స సన్న్యాసీచ యోగీ చ" అనుశ్లోకముచే కర్మాధికారియగు గృహస్థుయే సన్న్యాసియనియు, యోగియనియు జెప్పిరి. "ననిరగ్ని ర్నచాక్రియః" అను తురీయపాదముచే, నగ్నిహోత్రాదులను విడచినవాడు సన్న్యాసికాడనియు, తపోదానాది క్రియలను విడచినవాడు యోగి కాడనియును చెప్పిరి. కావున కర్మయోగి యగు గృహస్థుడే సన్న్యాసి, ధ్యానయోగి యగునుకాని కర్మసన్న్యాసమును చేసినవాడు సన్న్యాసికాని యోగికాని కా నేరడు గృహస్థుడగు కర్మాధికారికే ధ్యానయోగమునం దధికారము. కాని సన్న్యాసికి ధ్యానయోగమునం దధికారము లేదు. ఇదియే శ్రీకృష్ణుని యాశయము కానిచో సన్న్యాసమను నాశ్రమమే లేదు. కర్మఫలమును విడచిన గృహస్థుడే సన్న్యాసియని శ్రీకృష్ణుని మత మనినచో నది యుక్తముగాదు. "అనాశ్రితః కర్మఫలమ్" అనుశ్లోకముచే కేవల మగ్నిహోత్రాదులను తపోదానాది క్రియలను, విడచినవాడే సన్న్యాసియు, యోగియు కాడు. కర్మాధికారియయినను కర్మఫలమునందు కోరికనువిడచి, చిత్తశుద్ధికొరకు కర్మల ననుష్ఠించువాడుకూడ సన్న్యాసియు యోగియు నగును" అని కర్మఫలాకాంక్షాపరిత్యాగమును స్తుతింపుచున్నదికాని, ప్రసిద్ధసన్న్యాసాశ్రమమును నిషేధించుటలేదు. ఒకేవాక్యమునకు కర్మఫలాసంగపరిత్యాగమును స్తుతించుట, తురీయాశ్రమమును నిషేధించుట కుదరదు. గాక భగవంతుడగు శ్రీకృష్ణుడు "సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖంవశీ"

"నవద్వారేపురే దేహే నైవకుర్వ న్నకారయన్"

"..................సంతుష్టో యేనకేనచిత్"

"అనికేతస్థిరమతిః"

"విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః"

"సర్వారంభపరిత్యాగీ యస్సదా ముక్త ఏవ సః" ఇత్యాదివచనములచే శ్రుతిస్మృతీతిహాసపురాణయోగశాస్త్రసిద్ధమయిన సన్న్యాసయోగములను అనువదించి చెప్పి మరల తానే యిచట "అనాశ్రితః కర్మఫలమ్" అను శ్లోకమునందు "ననిరగ్ని ర్నచాక్రియః" అను వాక్యముచే సన్న్యాసయోగములను నిషేధింపడు. అట్లు శ్రీకృష్ణుడు నిషేధించుచో స్వవచనవ్యాఘాతమను దోషము వాటిల్లును. సర్వజ్ఞుడును, స్వతంత్రస్వతంత్రుడును అగు భగవంతునియం దట్టిదోష మాపాదింపజేయుట యుక్తముగాదు.

మరియు "కర్మయోగిసన్యాసి" అను వచనము "సింహోమాణవకః" (పిల్లవాడు సింహము) అను వాక్యమువలె గౌణమనియు స్తుతిపరమనియు ననక తప్పదు అట్టిస్తుతియు ప్రసిద్ధమగు సన్యాస మొకటియుండిననే కుదురునుకాని లేనిచో కుదరదు. ప్రసిద్ధమగు సింహమున్నపుడే దానియందుగల శౌర్యధైర్యాదిగుణములు పిల్లవానియం దుండుటంబట్టి "సింహోమాణవకః" అనుమాట కుదురుచున్నది. ప్రసిద్ధసింహమే లేనిచో నీమాటయే కుదరదు.

మరియు నాలంకారికులు "నాయం సుధాంశుః కిం తర్హి సుధాంశుః ప్రేయసీ ముఖం" అనుచోట ప్రసిద్ధమగు చంద్రుని కప్పిపుచ్చి కామినీముఖమునందు చంద్రత్వము నారోపించుచున్నారు. అచ్చట గూడ ప్రసిద్ధచంద్రు డొకడుండిననే ఆ యపహ్నవారోపణములు సంభవించునుకాని నిజముగా చంద్రుడే లేనిచో నయ్యది పొసగదు. అట్లే యిచటగూడ ప్రసిద్ధసన్యాసి యున్నపుడే వానియందలి సన్యాసిత్వము కప్పిపుచ్చి కర్మయోగియందు సన్యాసిత్వ మారోపింపబడును. లేనిచో నీయపహ్నవారోపణలు కుదరవు. కావున దీనివలన ప్రసిద్ధసన్యాసి యున్నటుల స్పష్టమగుచున్నది.

మరియు నిషేధము ప్రసక్తిపూర్వకముగా నుండును. అప్రసక్తమగుదానిని నిషేధించుట కుదరదు. కావున తురీయాశ్రమము గొత్తుగా లేనిచో నిచట తన్నిషేధము యుపపన్నముకాదు. కావున నిచట చతుర్థాశ్రమప్రతిషేధము శ్రీకృష్ణున కభిప్రేతమని చెప్పుట బ్రహ్మకుగూడ సాధ్యముకాదు.

కావున ధ్యానయోగ మధిష్ఠింపదలచెడి గృహస్థుచే ఫలాపేక్షరహితముగా నాచరింపబడు కర్మయోగము చిత్తశుద్ధిద్వారా ధ్యానయోగము నెక్కుటకు సాధనమగుచున్నదికాన నట్టి గృహస్థు సన్యాసియనియు, యోగియనియు స్తుతింపబడుచున్నాడు.

శ్రీ భగవాన్ ఉవాచ:

శ్లో. అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః
సససన్యాసీచ యోగీచ ననిరగ్ని ర్నచాక్రియః ॥ ౧ ॥

అ. ఎవ్వనికి కర్మఫలమునం దాసయుండునో వాడు కర్మఫలము నాశ్రయించినవా డగును. ఎవ్వనికి కర్మఫలమునం దాసయుండదో వాడు కర్మఫలమును ఆశ్రయింపనివా డగును కాలాన్తరమందును, జన్మాంతరమందును కలుగు కర్మఫలమును ఆశ్రయించుట యనగా దానియం దాసక్తితో నుండుట, ఆశ్రయింపకుండుటయనగా దానియం దాసక్తి లేకుండుట. ఓయి యర్జునా! కర్మఫలము నాశ్రయింపక (అనగా కర్మఫలము నపేక్షింపక) విహితమగు నిత్యాగ్నిహోత్రాది కర్మను యెవ్వడు నెరవేర్చునో వాడు ఫలాపేక్షతో కర్మల నాచరించువారలకంటె గొప్ప

వాడు. ఇంతియేకాని పరమార్థసన్న్యాసి ధ్యానయోగులకంటె గొప్పవా డనదగదు. ఉపాయమగు కర్మయోగము ఉపేయములగు ధ్యానయోగ, సన్న్యాసయోగముల కంటె గొప్పది కానేరదు. అయినను ప్రసిద్ధసన్న్యాసియం దుండెడి పరిత్యాగ (విడచుట) మను గుణసంబంధమునుబట్టి సన్న్యాసియనియు, ప్రసిద్ధ ధ్యానయోగియం దుండెడి చిత్తైకాగ్రత యను గుణమునుబట్టి ధ్యానయోగియనియు నిట్టివాడు చెప్పబడును. ప్రసిద్ధసింహమునందలి శౌర్య ధైర్యాది గుణసంబంధమునుబట్టి పిల్లవాడు సింహమని చెప్పినట్లు నిష్కామకర్మయోగి సన్న్యాసి, యోగి యని చెప్పుటగూడ గౌణమని గ్రహింపవలయును.

ప్రసిద్ధసన్న్యాసి కర్మలను విడచును. నిష్కామకర్మయోగి కర్మఫలములను విడచును. వీరిరువురకు పరిత్యాగ (విడచుట) విషయమునందు పోలిక కలదు. అట్లే ప్రసిద్ధయోగి బ్రహ్మయందు చిత్తము నేకాగ్రపరచినట్లు నిష్కామకర్మయోగి కర్మయందు చిత్తము నేకాగ్రపరచును. వీరిరువురకును చిత్తసమాధానమునందు సాదృశ్యము కలదు. ఈ సాదృశ్యమునుబట్టి నిష్కామకర్మయోగియందు సన్న్యాసిత్వయోగిత్వములు గౌణములుకాని ముఖ్యములు కావు.

ఎవ్వడు కర్మసన్న్యాసముఁ జేయునో వాడు ధ్యానయోగమునం దధికారము కలవాడగును. ఎవ్వడు ధ్యానయోగమునం దుండునో వాడు సన్న్యాసి యగును. కావున నిచట సన్న్యాసియని చెప్పినంతమాత్రమున యోగియనికూడ సిద్ధించును. మరల "యోగీచ" యోగియు అని జెప్పబనిలేదు. అయినను జ్ఞాననిష్ఠుడగు సన్న్యాసి సన్న్యాసిశబ్దమువలనను ధ్యానయోగనిష్ఠుడగు సన్న్యాసి యోగిశబ్దమువలనను చెప్పబడుచున్నాడుకాన నీరెండుశబ్దములకు అర్థభేదమును గ్రహింపవలెను.

ఇచట నిష్కామకర్మయోగియందు ముఖ్యసన్న్యాసిత్వము విధింపదలచినచో సన్న్యాసి, యోగి శబ్దములలో నేదియో యొకటియే చాలును. కాని ఇచట గౌణసన్న్యాసిత్వమును విధింపదలచెను. సన్న్యాసియందు పరిత్యాగము, చిత్తసమాధానము అను రెండుగుణములు కలవు. ఆరెండుగుణములను నిమిత్తముగా జేసికొని సన్న్యాసియందు సన్న్యాసియను శబ్దము, యోగియనుశబ్దము ప్రవర్తించుచున్నవి. ఆరెండుగుణములు నిష్కామకర్మయోగియందుగూడ నేదియో యొకవిధముగ నుండునుకాన నిష్కామకర్మయోగియందుగూడ సన్న్యాసిశబ్దము, యోగిశబ్దము ప్రయోగింపబడినది. కావున రెండుశబ్దములు ప్రయోగించుట సార్థకమని గ్రహింపవలెను. కావున నగ్నిహోత్రాది క్రియలను విడచినవాడే సన్న్యాసియనికాని, తపోదానాదిక్రియలను విడచినవాడే యోగియనికాని యనదగదు. నిష్కామకర్మయోగికూడ సన్న్యాసియనియు, యోగియనియు స్తుతికొరకు గౌణముగా జెప్పబడుచున్నాడని భావము.

ఈ శ్లోకమునకు శ్రుతిస్మృతీతిహాసపురాణప్రసిద్ధమగు యథార్థసన్యాసి సన్యాసికాడని నిషేధించుటయందు తాత్పర్యముకాదు. మరేమనిన, సన్యాసి యోగులయందలి గుణసాదృశ్య మీ నిష్కామకర్మయోగియం దుండుటచే నితడు గూడ సన్యాసియనియు, యోగియనియు స్తుతించుటయందే తాత్పర్యము. కావున శ్రుతిస్మృతివిరోధము లేదు.

**రామానుజమతము:**

కర్మఫలమునుకోరకుండ విహితకర్మను యెవడుచేయునో వాడు జ్ఞానయోగ నిష్ఠుడును, కర్మయోగనిష్ఠుడును అగును. వాడు ( ననిరగ్నిః ) కర్మలయందు ప్రవర్తించనివాడు కాడు. ( నచాక్రియః ) కేవలజ్ఞాననిష్ఠుడునుకాడు. జ్ఞానయోగనిష్ఠునకు కేవల జ్ఞానమార్గమే తటస్థించును. నిష్కామకర్మయోగికి జ్ఞానకర్మలు రెండును సంప్రాప్త మగును. అని రామానుజు లనిరి.

ఇయ్యది యుక్తముకాదు. వీరిమతమున సన్యాసియనగా జ్ఞానయోగియనియు యోగి యనగా కర్మయోగియనియు నర్థము. ఎవడు కర్మయోగియో వాడు సన్యాసియు, యోగియు నగునని మూలమునందు చెప్పబడినది. మరల వాడే నిరగ్నియు, అక్రియుడును కాడని యెట్లుచెప్పవీలగును ? ఒకే నిష్కామకర్మయోగి సన్యాసియని చెప్పుట, సన్యాసికాడనిచెప్పుట రెండును యెట్లు పొసగును ? తపోదానాదిక్రియలు కాని, అగ్నిసాధ్యకర్మలుకాని సన్యాసికుండవు. కనుక "నిరగ్ని" "అక్రియ" శబ్దములు సన్యాసినే బోధించును.

"నిరగ్ని" "అక్రియ" శబ్దములు కర్మలయందు ప్రవృత్తిలేని జ్ఞాననిష్ఠుని చెప్పునుకాని, సన్యాసిని బోధింపనేరవని యనరాదు. కర్మప్రవృత్తిలేని జ్ఞాననిష్ఠుడు సన్యాసియే యగును. గృహస్థునకు కర్మలయందు ప్రవృత్తిలేకుండుట, జ్ఞాననిష్ఠలో నుండుట యీరెండును పొసగవు. కర్మలయందు ప్రవృత్తిలేకుండుటయనగా కర్మ సన్యాసము. అదియే జ్ఞాననిష్ఠయగును. ఈ రెండును సన్యాసికి యుచితములుకాని, గహస్థునకు తగవు. నాస్తికు డగు గృహస్థునకు నీ రెండు సంభవములు కాన వాని నుద్దేశించి చెప్పెనన్నచో నదియు పొసగదు. శాస్త్రమెప్పుడును ఆస్తికుని గురించి చెప్పునుకాని, నాస్తికునిగురించి యుపదేశింపదు.

మరియు నిష్కామకర్మయోగియందు సన్యాసిత్వ, యోగిత్వము లను ధర్మములు (సన్యాసీచ యోగీచ) అను తృతీయ పాదమువలననే సిద్ధించుచుండ మరల (ననిరగ్నిర్నచాక్రియః) అని చెప్పుట రామానుజమతమున పునరుక్తమగును.

మరియు సన్యాసిశబ్దమునకు జ్ఞాననిష్ఠయను నర్థమును యొప్పినను కర్మాచరణ కర్మప్రవృత్తులకు కర్మయోగనిష్ఠ జ్ఞానయోగనిష్ఠలకును విరోధము స్పష్టము.

గాక ఎవడు కర్మలనుచేయుచున్నాడో వాడు కర్మయోగియనునది సర్వవిదితము. మరల వాడు “యోగి” అని చెప్పుట వ్యర్థము. అట్లే కర్మలను చేయువాడు నిరగ్నికాడనియు, అక్రియుడుకాడనియు స్పష్టమగుచుండ మరల “ననిరగ్నిర్నచాక్రియః” అని చెప్పుట పునరుక్తమగును. కర్మయోగనిష్ఠునకు జ్ఞాననిష్ఠ, కర్మనిష్ఠలు రెండును సంభవించుననుటకూడ పరస్పర విరుద్ధమగును. ఇట్టి విరుద్ధార్థమును భగవంతు డుపదేశింపడు. ఉపదేశించుచో భగవంతు డప్రమాణు డగును. కావున భగవంతుడగు శ్రీకృష్ణునియందుగూడ నప్రామాణ్యబుద్ధిని యాపాదింపజేయునటుల వ్యాఖ్యానమొనర్చిన రామానుజుల వ్యాఖ్యానము చాలా మెచ్చదగును. ౧

అ. ఓయి ! గార్హపత్యాహవనీయాన్వాహార్య పచనాద్యగ్నులతో నెరవేరు కర్మలను మానినవాడు సన్యాసి యనియు, తపోదానాదిక్రియల పరిత్యజించినవాడు యోగియనియు శ్రుతిస్మృతిపురాణములయందు ప్రసిద్ధము. ఇట్లుండ నీ శ్లోకమునందు అగ్నిసాధ్యకర్మలను జేయువాడు సన్యాసి యనియు, తపోదానాదిక్రియలనుఁ జేయువాడు యోగియనియు నెట్లు చెప్పబడినది? అనినచో కర్మఫలమును విడచినందున సన్యాసి యనియు చిత్తవిక్షేపమునకు గారణమగు కర్మఫలసంకల్పమును విడచినందున యోగియనియు, గౌణముగా చెప్పబడినదికాని యియ్యది ముఖ్యసన్యాసవిషయము కాదని చెప్పుచున్నారు.

శ్లో. యం సన్యాసమితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాండవ!
న హ్యసన్యస్త సంకల్పో యోగీ భవతి కశ్చన ॥ ౨ ॥

అ. ఓయి! అర్జునా శ్రుతిస్మృతిపురాణములు సర్వకర్మలను తత్ఫలమును పరిత్యజించుట నిజమయిన సన్యాసమని చెప్పుచున్నవి. ఫలమును పరమేశ్వరున కర్పించి నిష్కామముతో కర్మల నాచరించుటయే పరమార్థసన్యాసమని నీవు తెలిసికొనుము.

ఓయి! కర్మయోగము ప్రవృత్తిరూపము; సన్యాసము నివృత్తిరూపము; ఈ రెంటికి నత్యంత భేదము కలదు. కావున కర్మయోగము తనకంటె విపరీతమగు సన్యాసరూప మెట్లగును? అని యనరాదు. వినుము, పరమార్థసన్యాసి సర్వకర్మలను సర్వకర్మ సాధనములను విడచును. మరియు కర్మలయందు ప్రవృత్తికారణమగు ఫలవిషయక సంకల్పమునుగూడ విడచును. నిష్కామకర్మయోగి కర్మలను జేయుచునే ఫలమును గురించిన సంకల్పమును విడచుచున్నాడు. కావున ఫలసంకల్ప పరిత్యాగమునందు వీరిరువురకు సామ్యమున్నందున నిష్కామకర్మయోగము గౌణముగా సన్యాసమని యనదగును.

అట్లే చిత్తవిక్షేప హేతువగు ఫలసంకల్పమును విడచి, సమాహిత చిత్తుడగువాడుకాని యోగి కానేరడు. నిష్కామకర్మయోగికూడ ఫలసంకల్పమును విడచు

చున్నాడు. కావున కర్మయోగులకు చిత్తవిక్షేప హేతుపరిత్యాగమునందు సామ్యముండుటచే, కర్మానుష్ఠాతగూడ యోగి యనదగుచున్నాడు.

ఇచట నీ విశేషమును గ్రహింపవలయును. సన్యాసి కర్మనుగురించిన సంకల్పమును ఫలమునుగురించిన సంకల్పమును విడచును. యోగి కర్మనుగురించిన సంకల్పమును విడువడు. కర్మసంకల్పమును విడచినచో వానికి కర్మానుష్ఠానమునందు ప్రవృత్తి కలుగదు. కావున కర్మయోగి ఫలసంకల్పమును మాత్రమే విడచును.

కర్మసంకల్పమువలన కర్మలయందు గోరిక యేర్పడును. దానివలన కర్మలయందు ప్రవృత్తి యేర్పడును. సన్యాసికి కర్మసంకల్పములేనందున కర్మలయందు గోరిక లేదు. అందువలన కర్మలయందు ప్రవృత్తియులేదు. యోగికి సంకల్పము లేనందున ఫలమునందు గోరికలేకున్నను కర్మసంకల్పమున్నందున కర్మలయందు గోరిక కలిగి తద్వారా కర్మానుష్ఠానము కలుగును.

అయితే యోగికి ఫలసంకల్పములేనిచో కర్మసంకల్పము మాత్ర మెందుకని యనరాదు. ఫలసంకల్పములేకున్నను, ఈశ్వరానుగ్రహమందుకాని చిత్తశుద్ధియందుకాని, పాపక్షయమందుకాని, యోగికి కోరకుండుటచే కర్మసంకల్పము పోసగును. దానివలన కర్మానుష్ఠానము కలుగును. ఇయ్యవి పుణ్యాపాపములలో చేరవు. అందువలన దేవతిర్యగాది జన్మల నిచ్చి బంధకములు కానేరవు.

( లేక ) ఎవ్విధమగు ఫలసంకల్పము కర్మయోగికిలేకున్నను గృహస్థుడనగు నేను కర్మాధికారినగుటచే నీశ్వరాజ్ఞారూపములగుకర్మల ననుష్ఠింపవలెనను బుద్ధితో కర్మలయందు ప్రవర్తించును. కావున నిష్కామకర్మయోగికి ఫలసంకల్ప మవసరము లేదు. ఫలసంకల్పమును పరిత్యజింపక నెవ్వడు కర్మయోగి కానేరడు.

రామానుజమతము:

రామానుజులు సన్యాసశబ్దమునకు జ్ఞానయోగమని, యోగశబ్దమునకు కర్మయోగమని యర్థముచెప్పి "ఓయిఅర్జునా? ఏది జ్ఞానయోగమో అది కర్మయోగమని తెలియుము. ఆత్మయాథాత్మ్యజ్ఞానము కర్మయోగమునందు జేరుటచే నియ్యది యుక్తము. అనాత్మపదార్థమందు ఆత్మతాదాత్మ్యాభిమాన మను సంకల్పమును విడువనివాడు కర్మయోగి కానేరడు." అని శ్లోకమునకు వ్యాఖ్యాన మొనర్చిరి.

ఇయ్యది యుక్తముగాదు. కర్మయోగాంతర్గతమగు జ్ఞానయోగము యోగశబ్దమునకు వాచ్యము (అర్థము) కానేరదు. అట్లగుచో పెట్టెలో నున్న గుడ్డకూడ పెట్టెయనుపేరుతో పిలువబడవలసివచ్చును. లక్షణచే నాయర్థము చెప్పవచ్చునన్నచో నదియు పొసగదు. ముఖ్యార్థమును విడచుటకు కారణము లేనందున లక్షణ ప్రసక్తించదు.

మరియు కర్మయోగసాధ్యమయిన జ్ఞానయోగము కర్మయోగమునం దంతర్గత మగుటకూడ కుదరదు. అనాత్మపదార్థమందు ఆత్మాభిమానము యధ్యాస యగును కాని సంకల్పము కానేరదు. అనాత్మపదార్థమునందు ఆత్మాభిమానము పూర్తిగా వదలినచో యజమానికి కర్తృత్వాభిమానమే లేనందున కర్మయోగస్వరూపమే సిద్ధింపదు. జడములయిన అనాత్మపదార్థములకు కర్తృత్వము అసంభవము. లోకము నందు జడములయిన ఘటాదులకు కర్తృత్వము కని విని యెరుంగము.

మరియు "అహం కర్మ కుర్యామ్" నేను పనిని చేయుదును. అని సంకల్ప మూలమునకాని కర్మలయందు ప్రవృత్తి కలుగదు. ఇయ్యది యందరంగీకరించిన విషయము. ఇట్టి సంకల్పము అహంకారమను అనాత్మపదార్థమందు ఆత్మాభిమాన మున్నపుడే కలుగును. అహంకారము కర్త, ఆత్మ యకర్మ కావున నట్టి యభిమాన మును పరిత్యజించినచో కర్మయోగ మెట్లు సిద్ధించును? కర్మయోగికి యధ్యాసనివృత్తి యవసరము లేదు. ఆత్మ దేహాదులకంటె భిన్నుడు. నిత్యుడు అనుబుద్ధి చాలు.

ఆత్మ కర్తగానిచో విధినిషేధశాస్త్రములు వ్యర్థమగును. కాన ఆత్మకు కర్తృత్వ మంగీకరింపవలె నన్నచో నదియు పొసగదు. విధినిషేధశాస్త్రములు అజ్ఞానిని గురించి ప్రవర్తించినవికాని జ్ఞానినిగురించి ప్రవర్తింపలేదు. దేహాద్యనాత్మ పదార్థసంఘాతమునందు ఆత్మాభిమానముగల యజ్ఞాని కర్తగా నుండుటచే శాస్త్ర వైయర్థ్యము లేదు. "కర్తా శాస్త్రార్థవత్వాత్" అను అధికరణవిరోధమున్ను లేదు.

"నిష్కలం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనమ్" ఇత్యాది శ్రుతులను బట్టి ఆత్మ వాస్తవముగా అకర్తయనియే యంగీకరింపవలెను. అట్లుగాక ఆత్మకు కర్తృత్వమంగీకరించినచో భోక్తృత్వము ఆపాదించును. ఈ రెండు నున్నచో వికారిత్వము కలుగును. వికారిత్వ మంగీకరించినచో అనిత్యత్వ మేర్పడును. అప్పుడు "అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణః" "అవికార్యోఽయ ముచ్యతే" ఇత్యాది గీతాశాస్త్ర మప్రమాణమగును. కావున ఆత్మకు కర్తృత్వము లేదనియు అహంకారము కర్తయనియు సిద్ధాంతము.

ఇట్టితరి ఎవడు ఆత్మను అకర్తనుగా దెలిసికొనునో వాడికి నేను కర్మచేయుదునని సంకల్ప మెట్లు కలుగును? కర్మలయందు ప్రవృత్తి యెట్లు కలుగును? కావున అజ్ఞానియే కర్మయోగి యగును. వాడే జ్ఞానముకొరకు కర్మలయందు ప్రవర్తించును. మొదలే జ్ఞానియగుచో వాడికి నింక కర్మలతోఁ బనియేమి? కావున జ్ఞానయోగమునకు కర్మయోగమునం దంతర్భావము కుదరదు. ఈ విషయ మింతకు మున్ను పలుసారులు చెప్పబడినను తెలిసికొనువారికి సులభముగా దెలియుటకు నిట్లు మాటిమాటికి చెప్పబడుచున్నది.

శ్లో. ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే ॥ 3 ॥

అ. నిష్కామకర్మయోగము ధ్యానయోగమునకు బహిరంగసాధనమగుటచే దానిని సన్న్యాసమని స్తుతించి యిపుడు కర్మయోగము ధ్యానయోగమున కంగమని చెప్పుచున్నారు. కని విని యున్న విషయములనుండి మనస్సును మరల్చుకొని భగవత్తత్త్వమునందు మనస్సును నిలుపుట ధ్యానయోగ మనబడును. మనోనిగ్రహము లేనివానికి నిది సాధ్యముకాదు. ఇట్టివాడు మనోనిగ్రహము కలుగుటకు ఫలనిరపేక్షుడై కర్మల నాచరింపవలెను. నిష్కామకర్మానుష్ఠానమున మనస్సు పరిశుద్ధమై యేకాగ్రత జెందును. అపుడు ధ్యానయోగమును బొందు శక్తి యేర్పడును. కావున ధ్యానయోగమును పొందదలచినవాడు కర్మల నాచరింపవలె నని భావము. ఫలాపేక్షను వదలి కర్మల నాచరించువాడుకూడ ఫలసన్న్యాసమును జేసినందున గౌణవృత్తిచే సన్న్యాసి యనియు, ముని యనియు జెప్పబడుచున్నాడు. నిచ్చెన యను సాధనముచే మేడను యెక్కినట్లు ముముక్షువు నిష్కామకర్మయోగమును సాధనచే ధ్యానయోగము నధిష్ఠించును. మునికి నిష్కామకర్మయోగము ధ్యానయోగము నధిష్ఠించుటకు తగు సామర్థ్యమును మాత్రమే యిచ్చును. ధ్యానయోగము నెక్కినపిదప నందు నిలచియుండుటకు, తుదకు ముక్తిఫలము బొందుటకును కర్మసన్న్యాసమునే యాచరింపవలెను. పురుషునకు నిచ్చెన మేడ నెక్కుటకే సాధనమగును. మేడనెక్కిన పిదప మేడమీద స్థిరముగా గొంతకాల ముండుటకు నిచ్చెనతో బనిలేదు. అందు స్థిరముగా నుండుటకు మేడమీద సిద్ధముయిన ఆసనాదుల నేర్పరచుకొనవలెను. అట్లే ధ్యానయోగమునందు స్థిరముగా నుండుటకు కర్మసన్న్యాసమే యవసరముగాని కర్మయోగమవసరములేదు. ఎంతగా ముముక్షువు కర్మలనుండి యుపరమించునో అంతగా నిరాయాసముగా జితేంద్రియుడగును. చిత్తము యేకాగ్రత జెందును. అపుడు యేకాగ్రారూఢుడగును.

ఇందు ఇయ్యది రహస్యము నిష్కామకర్మయోగి ఫలసంకల్పము విడచుటచే చిత్తవిక్షేపములేనివాడయినను కర్మాచరణమునకు కావలసిన పరికరములను సంపాదించుకొనుట యందలి పరిశ్రమాదులచే మనోజయమును బొందనేరడు. గావున కర్మి ధ్యానయోగారూఢుడు కానేరడు. కర్మసన్న్యాసికి యెవ్విధమగు నాయాసము లేకుండుటచే నిరాయాసముగా మనోజయమును చిత్తైకాగ్రతను బొంది యోగారూఢుడగును. కావున కర్మసన్న్యాసికే ధ్యానయోగమునం దధికారము. కర్మికి ధ్యానయోగమును బొందుటకు తగు సామర్థ్యము కలుగుటకై కర్మయోగమునందే యధికారము కావుననే బ్రాహ్మణునకు సర్వత్ర సమత్వబుద్ధి, బ్రహ్మయే సత్యమనుబుద్ధి, సత్త్వభావము, బ్రహ్మనిష్ఠ, మనోవాక్కాయ నియమనము, అంతట ఋజుబుద్ధి, సర్వకర్మల

నుండి నివర్తించుట యిదియే ధన మనియు దీనితో సమానమయిన ధనము మరి యొకటి లేదనియును స్మృతులు చాటుచున్నవి.

ఇచట మధుసూధనసరస్వతీస్వామి ఈ శ్లోకమునందలి యోగశబ్దమునకు వైరాగ్యమని యర్థముచెప్పి, వైరాగ్యము పుట్టునంతవరకు భగవదర్పణబుద్ధితో కర్మాచరణ మవసరమనియు వైరాగ్యముకలిగినపిదప సర్వకర్మసన్యాస మావశ్యక మనియు, సర్వకర్మసన్యాసమే జ్ఞానపరిపాకమునకు సాధనమనియును చెప్పిరి.

శ్రీధరాచార్యులవారు మూలమునందలి యోగపదమునకు జ్ఞానయోగమని యర్థమును చెప్పి జ్ఞానయోగమును పొందదలచినవానికి కర్మకారణమనియు, జ్ఞాన యోగమును పొందినవానికి జ్ఞానము పరిపాకమును చెందుటకు శమము (అనగా సమాధి) కారణమనియు శ్లోకమును వ్యాఖ్యానించిరి. వీరిమతమునందు యోగ శబ్దమునకు జ్ఞానయోగమనియు, శమశబ్దమునకు సమాధియనియు నర్థమును గ్రహింపవలెను.

రామానుజమతము :

రామానుజులు యోగమనగా ఆత్మసాక్షాత్కారరూప మోక్షమని చెప్పి యట్టి మోక్షము కలుగునంతవరకు కర్మ కర్తవ్యమని చెప్పిరి. వేదాన్తదేశికులు శమమనగా కర్మనివృత్తియేకాని పారివ్రాజ్యము (సన్యాసము) కాదని నిర్వచించిరి.

ఈ రెండును యుక్తముగాదు. రామానుజమతమునందు ఆత్మావలోకనము (ఆత్మసాక్షాత్కారము) మోక్షమని యంగీకరించరు. కర్మలవలన నాత్మావలోక నము సంభవింపదు. ఆత్మావలోకనము (ఆత్మసాక్షాత్కారము) వేదాన్తవిచా రమువలనకాని, సమాధియోగమువలనకాని సాధ్యమగును. కర్మలవలన సంభవిం చుట దుర్ఘటము.

శమమనగా కర్మనివృత్తియేకాని పారివ్రాజ్యము కాదనుట పొసగదు. కర్మాధికారియగు గృహస్థునకు కర్మనివృత్తి యసంభవము. ఒక్క సన్యాసికే కర్మ నివృత్తి సంభవము. కావున కర్మనివృత్తియే పారివ్రాజ్యము (సన్యాసము). ఈ రెంటికిని భేదములేదు. ధ్యానయోగము నధిష్ఠించిన గృహస్థునకుగూడ కర్మనివృత్తి కలుగుచున్నదని యనరాదు. గృహస్థునకు ధ్యానయోగారోహణమే సంభవింపదు. కావున కర్మసన్యాసములేనిదే కర్మనివృత్తి సంభవింపదుకాన శమమనగా పారి వ్రాజ్యమేకాని వేరుకాదు.

శ్లో. యదా హి నేన్ద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే
సర్వసంకల్పసన్యాసీ యోగారూఢ స్తదోచ్యతే ॥ ४ ॥

అ. సంసారులచే గోరబడుచున్నందున అర్థములనగా శబ్దస్పర్శాది విషయములు. ఈయవి యింద్రియములచే గ్రహింపబడుచుండును. కర్మలు నాలుగువిధములు- నిత్యములు, నైమిత్తికములు, కామ్యములు, నిషిద్ధములు అని. అగ్నిహోత్రాదులు నిత్యములు, దర్శాదులు నైమిత్తికములు, కారీర్యాదులు కామ్యములు, హింసాదులు నిషిద్ధములు. వివేకవంతునకు శబ్దాది విషయములతోగాని, కర్మలతోగాని ప్రయోజనములేదు. విషయానుభవమువలన కలుగు సుఖమున్ను, కర్మఫలమున్ను అత్యల్పము, అస్థిరము, సాతిశయము, తుదకు దుఃఖము నిచ్చునట్టిదిన్ని అగును. కావున వివేకి విషయసుఖమునందు కర్మఫలమునందును గల దోషమును విమర్శించుకొని విషయములతోను, కర్మలతోను సంబంధమును వదలుకొనుట యుక్తము. ఘటాదులవలె స్వరూపసహితములకు కర్మలతో సంబంధమును వదలుకొనుట యనగా కర్మల నాచరింపకూడ దనుబుద్ధి యుండుటయేయని గ్రహింపవలయును. నేనీకర్మలను చేయవలెనను బుద్ధియే కర్మలతో సంగము. అట్టిబుద్ధిలేకుండుటయే కర్మలతో సంబంధమును వదలుకొనుట. స్వరూపసహితములగు శబ్దాది విషయములతో పురుషునకు సాక్షాత్సంబంధమే యుండును.

వసుపుత్రా ద్యైహికవిషయములయందు స్వర్గాద్యాముష్మికవిషయముల యందును సంకల్పమును విడచినవాడు యోగారూఢు డగును. కర్మలయందు ప్రవృత్తికి కామము కారణము. కామమునకు సంకల్పము కారణము. అట్టి సంకల్పమును విడచినచో కామముండదు. కామములేనిచో కర్మలయందు ప్రవృత్తి కలుగదు. అపుడు యోగనిష్ఠ స్థిరపడునని భావము. శ్లో॥ సంకల్పమూలాః కామోవై యజ్ఞాః సంకల్పసంభవాః కామజానామితే మూలం సంకల్పా త్కిలజాయతే॥ అను స్మృతి గూడ సర్వకామములు సంకల్పమూలములని చాటుచున్నది.

"యథా కామో భవతి తత్క్రతుర్భవతి యత్క్రతుర్భవతి తత్కర్మ కురుతే" (దీనియర్థము ఎవడు యేపురుషార్థమును కోరునో వాడు ఆ పురుషార్థసాధనములను అనుష్ఠింప దృఢనిశ్చయము కలవాడగును. ఎవడు దేని ననుష్ఠింప దృఢనిశ్చయుడగునో వాపడానిని చేయును.) అనుశ్రుతియు పైయర్థమునే స్పష్టపరచుచున్నది.

"ఎవడు దేనిని కోరునో వాడు దానిని సాధించుపనిని చేయును. "యోయత్కామః సతత్సాధకం కర్మకురుతే తత్తత్కామహేతుత్వా త్తత్తత్కర్మణః యథా జలకామః కూపం గచ్ఛతి" ఆకోరిక ఆపనిని చేయుటకు సాధనమగుటవలన (ఉ) నీటియందుకోరికగలవాడు బావియొద్దకు వెళ్ళినట్లు" అను న్యాయము (అనుమానము) వలనకూడ కామము కర్మప్రవృత్తికి కారణమని స్పష్టపడుచున్నది.

కావున సంకల్పములేనిదే మానవుడు కదలుటకుగూడ సమర్థుడు కానేరడు. దీనివలన "సంకల్పసత్త్వే కర్మసత్త్వం" (సంకల్పమున్నచో కర్మయుండును) అను నన్వయవ్యాప్తియు "సంకల్పాభావే కర్మాభావః" (సంకల్పములేనిచో కర్మయుండదు) అను వ్యతిరేకవ్యాప్తియు చూపబడినట్లయినది. దీనివలన సంకల్పములు కర్మానుష్ఠానమునకు గారణమనియు, సంకల్పములను సన్యసించినకాని కర్మలను సన్యసింపనేరడనియు, సర్వకర్మసన్న్యాసియయినకాని యోగారూఢుడు గాడనియు, గృహస్థునకు యోగమునం దధికారము లేదనియు సిద్ధాంతమగుచున్నది. ४

శ్లో. ఉద్ధరే దాత్మనాత్మానం నాత్మాన మవసాదయేత్
ఆత్మైవ హ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః ॥ ५ ॥

అ. ఆత్మసాక్షాత్కారము కలుగునంతవరకు నవిద్యావస్థయందు వీడు బద్ధుడు, వీడు ముక్తుడు అనువ్యవహారము కలదు. నీరు కదలుచుండగా నీటిలో ప్రతిఫలించిన సూర్యబింబము కదలుచున్నట్లు కనుపించును. అట్లే బుద్ధి సంసారమును పొందుచుండ బుద్ధి ప్రతిఫలిత చిదాభాసుడగు జీవుడు అజ్ఞానమువలన సంసారసంబంధము కలవాడువలె దోచును. "ధ్యాయతీవ లేలాయతీవ" అనుశ్రుతి యీయర్థమునందు ప్రమాణమగుచున్నది.

నీరు నిశ్చలముగా నున్నపుడు నిశ్చలమయిన సూర్యప్రతిబింబము కనుపించినట్లు యోగసంస్కారముచే బుద్ధిని స్థిరపరచినయెడల నాత్మస్వరూపసాక్షాత్కారము కలుగును. కావున పురుషుడు యోగముచే బుద్ధిని స్థిరపరచుకొని యోగారూఢుడు కావలయును. అపుడు సంసారసాగరమునుండి యుత్తీర్ణుడగును.

కావున సంసారసాగరమునందు మునిగియున్న జీవాత్మను తాను స్వయముగా పైకి లేవదీసికొనవలయును. ఇంతియెకాని క్రిందకు అణగద్రొక్కకూడదు. ఆత్మకు ఆత్మయే బంధువుకాని యితరులు బంధువులుకారు. ఇతరబంధువులు స్నేహాదిబంధనములను కలుగజేయుచు మోక్షమునకు ప్రతికూలు లగుదురు. పురుషార్థమును అడ్డుపరచువారు లోకములో బంధువు లనబడరు. ధనమును దొంగిలించువానినికాని, ధనార్జనకు ప్రతికూలులగువారినికాని లోకములో బంధువులని తలంచరు. ఇట్టివారిని శత్రువులుగానే తలంతురు. ఇట్టితరి సకలాస్తికజనమునకు సమ్మతమయి పరమపురుషార్థమగు మోక్షమునకు ప్రతికూలురగు తండ్రి, తల్లులు మున్నగు బంధువులు శత్రువులనుటలో వింతలేదు. సాధారణముగా లోకములో జీవులు "నాయం దింతటి యనురాగముగల తండ్రిని నే నెట్లు విడతును ?" "నాయం దింతప్రేమగల నా తల్లిని విడచి నే నెచట కేతెంతును ?" "నాముద్దుగున్నయగు నీబిడ్డ నెడబాసి నేనెట్లు జీవింతును ?" "నాప్రాణసమానురాలగు యర్ధాంగిని విడచి నేనెట్లు బ్రతుకుదును ?" అని స్నేహపాశములకు బద్ధులగుచుందురు. కావున స్నేహపాశబంధములను కలుగ

జేయు పితృపుత్రాదులు బంధువులుకారు. ఆత్మకు ఆత్మయే బంధువు. యోగారూఢుఁడుకాని యాత్మయే ఆత్మకు శత్రువు.

పితృపుత్రాది బంధువులయందుగాని, క్షేత్రవిత్తాదుల నపహరించునట్టి శత్రువులయందుగాని స్వతస్సిద్ధముగా బంధుత్వ శత్రుత్వములు లేవు. శత్రుత్వమిత్రత్వములు ఆత్మప్రయుక్తములే యగును. "నాకు వీఁడు కుమారుఁడు, ఇది నాయిల్లు, ఇది నాధనము" అను మమకారము లేనిచో నేను వీనిచే వృద్ధిబొందితిని, నేను వీనివలన చెడిపోతిని" అను యహంకారము లేనిచో ఎవ్వఁడు నెవ్వనికి బంధువుకాని, శత్రువుకాని కానేరఁడు. బంధుత్వశత్రుత్వములు అహంకార మమకారరూపమయిన ఆత్మాభిమానమువలననే యేర్పడును. కావున నాత్మయే యాత్మకు బంధువు. ఆత్మయేఆత్మకుశత్రువు. ఇతరులు బంధువులుకాని, శత్రువులుకాని కానేరరు.

పితృపుత్రాదులుగూడ నాత్మరూపులేకాన వారేల బంధువులుకారని యనఁదగదు. లోకములో మానవులు ఆత్మను పితృపుత్రాదులను (తండ్రికుమారులనుగా) తలంచుటలేదు. దేహేంద్రియాది సముదాయమునే పితాదులనుగా తలంచుచున్నారు. దేహాదిసంఘాతము ఆత్మకానేరదు. ఆత్మయందు నిజముగా తల్లి తండ్రియనుభేదము లేదు. అట్టిభేదము దేహాది సంఘాతమునందే కలదు. దేహేంద్రియాది సముదాయమునందలి యాకారభేదమునుబట్టి "వీఁడు నాతండ్రి" "యీమె నాతల్లి" "వీఁడు నా యన్న" అని లోకము తలంచుచున్నది. కావున పితృపుత్రాదులు బంధువులు కారనియు, ఆత్మకు నాత్మయే బంధువనియు, నాత్మయె శత్రువనియును సిద్ధాంతము.

ఓయి! బావిలో మునిగి లేచుటకు శక్తిలేనివానిని గట్టునయున్న మరియొకఁడు త్రాడు మొదలగు సాధనములతో పైకి లేవదీయును. అట్లే సంసారసాగరమందు మునిగియున్న నాత్మను గురువుకాని, యీశ్వరుఁడుకాని యుద్ధరింపవలెకాని స్వయముగా తనను తానే యుద్ధరించుకొను టెట్లని యనరాదు.

గురువు మహావాక్యమునుమాత్ర ముపదేశించును. ఈశ్వరుఁడు చిత్తశుద్ధి కలుగునటుల యనుగ్రహించును. పురుషుఁడు మహావాక్యార్థమననమును నిదిధ్యాసమును తానే జేసికొనును. ఇట్టివిచారముచే నాత్మసాక్షాత్కారము కలుగనిచో గురువు చెప్పినరీతిగ ప్రాణాయామాదియోగమును స్వయముగా తా నభ్యసించును. శబ్దాది విషయమునుండి యింద్రియములను తానే మరల్చుకొనును. కూటస్థాత్మను స్వయముగా సాక్షాత్కారము చేసికొనును. ఇందు యితరసాయ మిసుమంతయును లేదు. మానవుఁడు తనంతట తాను నిదురించినట్లు తనంతట తానె సమాధిని చెందును. కావున నాత్మను ఆత్మయే యుద్ధరించునుకాని యితరు లుద్ధరింపనేరరు. కనుక నాత్మకు నాత్మయే బంధువు. ఆత్మయే శత్రువు. ౫౬

శ్లో. బంధురాత్మాత్మన స్తస్య యేనాత్మై వాత్మనా జితః
అనాత్మనస్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్ ॥ ౬ ॥

అ. దేహేన్ద్రియాది సముదాయమును వశపరచుకొన్న వానికి (జితేన్ద్రియునకు) యాత్మయే బంధువగును. ఇంద్రియనిగ్రహము లేనివానికి యాత్మయే శత్రువగును. అనగా ఇంద్రియనిగ్రహము కలిగియున్నచో వానికి వాడే బంధువు, వానికి యితర బంధువులతోఁ బనిలేదు. ఇంద్రియనిగ్రహము లేనపుడు వాడికి వాడే శత్రువు, ఇతర శత్రువులతోఁ బనిలేదు. జితేన్ద్రియుడుకాని యాత్మ తనకుతానే యపకార మొనర్చుకొనును. తననుతానే సంసార సాగరమునందు పడవేసికొనును. కావున మానవులు అజితేన్ద్రియులై యాత్మను నశింపఁ జేసికొనదగదు. జితేన్ద్రియులై సంసారబంధవిముక్తులగుట యుక్తము. ౬

శ్లో. జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః
శీతోష్ణ సుఖదుఃఖేషు తథా మానావమానయోః ॥ ౭ ॥

అ. ఇంద్రియ నిగ్రహముకలిగి, వాచిక, మానసిక, కాయిక వ్యాపారములను మానినవానికి పరమాత్మసాక్షాత్కారము కలుగును. ఇంద్రియనిగ్రహము లేనివాడు తనను కూటస్థాత్మనుగా తెలిసికొనలేడు. తాను ప్రమాతయని యనుకొని కూటస్థుడగు నీశ్వరుడు తనకంటె వేరనియు, పరోక్షమం దుండెననియును తలంచును. కావున వీనికి జీవాత్మయే పరమాత్మ యను భావముండదు. జితేన్ద్రియుడు తానే కూటస్థాత్మ యని తెలుసుకొనును. గాన వానికి పరమాత్మయే జీవాత్మయని భావముండును.

ఇచట జితేన్ద్రియుడును, ప్రశాంతుడు నగువానియొక్క హృదయమునందు పరమాత్మ యాత్మరూపముగా స్ఫురించుననికూడ నన్వయము జెప్పవచ్చును. శమదమాది సంస్కారసహితమయిన మనస్సు యాత్మసాక్షాత్కారమునకు సాధనము కాన నీయన్వయముకూడ నుచితమగును.

వ్యాసులవారు భాగవతమునం దిట్లుచెప్పిరి. "యదోపరామో మనసోనామరూపరూపస్య దృష్టస్మృతి సమ్ప్రమోషాత్, య ఈయతే కేవలయా స్వసంస్థయా హంసాయ తస్మైశుచిసద్మనే నమః" అని జితేంద్రియునకు మనస్సు యుపరమింపగా హంసయను పేరుగల యాత్మ తనంతట తానే స్ఫురించునని దీనియర్థము.

అయితే "ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి" అనుప్రమాణమువలన నెల్లమానవుల హృదయమందు బరమాత్మ సమాహితుడేయని (యుండియున్నాడని) స్పష్టమగుచున్నది. అయినను అందరట్లు తెలియుటలేదు. వివేకిమాత్రమే తనహృదయమునం దున్నవాడు పరమాత్మయని గుర్తెరుంగుచున్నాడు.

కావున నెవ్వనికి పరమాత్మ తనహృదయమునం దున్నట్లు జ్ఞానములేదో వానికి పరమాత్మ పరోక్షముగా నెచటనో నున్నవాడే యగును. ఎవ్వని కట్టిజ్ఞానముకలదో వానికే పరమాత్మ హృదయమునందు సాక్షాత్ స్ఫురించును. ఇదియే యభిప్రాయముతో వ్యాసులు "జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః" అని శ్లోకమును రచించిరి. శంకరులును యిట్లే భాష్యమును చేసిరి. కాని "సమాహితః" అనుపదమునకు "సాక్షాదాత్మత్వేన ప్రతిభాతి" సాక్షాత్ జీవాత్మగా దోచును, అనియర్థమును జెప్పినచో( బైశంకాసమాధానముల కవకాశమే యుండదు. ౭

శ్లో. జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః ॥ ౮ ॥

అ. శాస్త్రమునందు జెప్పబడినపదార్థములను దెలిసికొనుట జ్ఞానమనబడును. శాస్త్రమువలన దెలిసికొనినవాటిని యనుభవమునకు దెచ్చికొనుట విజ్ఞానమందురు. ఇట్టి జ్ఞానవిజ్ఞానములచే( దృప్తిజెందినవాడై, నిర్వికారుడై, జితేన్ద్రియు డగువాడు యోగియని శాస్త్రజ్ఞులందురు. యోగియగువాడు మట్టిగడ్డ, రాయి, బంగారముల యందు సమభావము కలవాడగును. ౮

శ్లో. సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థ ద్వేష్యబంధుషు
సాధుష్వపిచ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే ॥ ౯ ॥

అ. ప్రత్యుపకారమును కోరకయే నుపకారము జేయువాడు సుహృత్ (స్నేహితుడు) స్నేహముగలవాడు మిత్రుడు. అపకారమొనర్చువాడు శత్రువు. ఏపార్టీయందును జేరనివాడు ఉదాసీనుడు. వివాదపడు నిద్దరకు హితమునుకోరువాడు మధ్యస్థుడు. తన కయిష్టుడు, ద్వేషుడు, సంబంధముకలవాడు బంధువు. శాస్త్రానుకూలముగా నడచువాడు సాధువు, నిషిద్ధకార్యములను జేయువాడు పాపి. వీరందరియందును మట్టిగడ్డ, రాయి, బంగారములయందును సమభావముకలయోగి సర్వోత్తముడు. యోగికి మట్టిముద్దను పారవేయుదమను బుద్ధియు, బంగారమును స్వీకరింతమను బుద్ధియు నుండనేరదు. మట్టిముద్దనువలె బంగారమునుగూడ యోగి స్వీకరింపడు. సృష్టిసిద్ధమయిన కాంతాకనకములయందలి భ్రమను యోగియగువాడు లొంగడు.

లోష్టాదులయందు సమబుద్ధియనగా న్యూనాధికములగు వస్తువులనుజూచి వికారముచెందని బుద్ధిగలవా డనియర్థము. ఆత్మ నిర్వికారుడగుటవలనను, అనాత్మపదార్థము చేతనమగుటవలనను కర్తృత్వవికారములేదు. ఆత్మభిన్నమగు పదార్థము మిథ్యయగుటచే( గర్మత్వవికారమున్ను లేదు. అందువలన యోగికి నిర్వికారబుద్ధి యేర్పడునని భావము.

సుహృన్మిత్రాదులయందు సమభావము కలవాడు సర్వోత్తముడనగా జ్ఞానయోగులకంటె గొప్పవాడని యర్థముకాదు. జ్ఞానయోగులే యందరికంటె గొప్పవారు. సమబుద్ధికలయోగి కర్మయోగులకంటె గొప్పవాడనుటయు సమంజసముకాదు. ధ్యానయోగికి కర్మయోగులకంటె గొప్పదనము స్వతస్సిద్ధమైయుండుటవలన నయ్యది మరల జెప్పఁబనిలేదు. కావున సమబుద్ధిగల ధ్యానయోగి ఇతరధ్యానయోగులకంటె నుత్తముడనియే జెప్పవలయును. ౯

శ్లో. యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థితః
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః ॥ ౧౦ ॥

అ. ధ్యానయోగి యేకాంతమయిన గిరిగుహాదులయందు నివసించుచూ, నొంటరిగానుండి, మనోదేహముల నిగ్రహించుకొని, యాసను విడచి (దేనిని కోరక), యెవరు దేని నిచ్చినను తీసికొనక, ఆత్మను యెల్లపుడు ధ్యానింపవలెను.

ఇచట "ఏకాకీ" "రహసిస్థితః" అనురెండూ విశేషణములవలన ధ్యానయోగికి భార్యాదులసహాయము కూడదనియు, సన్యాసిగా నుండవలయుననియు స్పష్టమగుచున్నది. "ఋతౌ భార్యా ముపేయాత్" (ఋతుకాలమునందు భార్యను కలియవలెను) అని దీనియర్థము. అను శాస్త్రమువలన గృహస్థునకు భార్యాపరిత్యాగము కూడదని తేలుచున్నది. మరియు గృహస్థు గృహమునందుండునుగాని గిరిగుహాదులయం దుండడు. కావున ధ్యానయోగి సన్యాసియనియే గ్రహింపవలెను.

భార్యాపరిత్యాగము (భార్యను విడచుట) గృహస్థునకువలె సన్యాసికిగూడ నుచితముకాదని యనరాదు. "ఋతౌ భార్యాముపేయాత్" అను శాస్త్రము ఋతుకాలమున భార్యాగమనమును విధించుచున్నది. ఇయ్యది పరిసంఖ్యావిధి. ఇది సర్వకాలములయందును భార్యాగమనము ప్రాప్తమయిన గృహస్థును మాత్రమే యుద్దేశించి యితరకాలములయందు భార్యాగమనమును నివర్తింపజేయుచు గృహస్థునకు ఋతుకాలమునందే భార్యాగమనమును విధింపుచున్నది. సన్యాసికి భార్యయే లేనందున భార్యాగమనమే ప్రసక్తించదు. కావున నీశాస్త్రము సన్యాసివిషయము కానేరదు. సన్యాసికి భార్యాపరిత్యాగము దోషముకాదు.

"ఋతౌ భార్యాముపేయాత్" అనుశాస్త్ర మపూర్వవిధియనియు,, అందువలన సన్యాసికిగూడ ఋతుకాలమున భార్యాగమన మనివార్యమనియు, గావున సన్యాసికిగూడ భార్యాపరిత్యాగము కూడదనియు ననరాదు. గృహస్థునకు భార్యాగమనము యెల్లపుడు ప్రాప్తించియుండుటచే నియ్యది యపూర్వవిధి కానేరదు. "యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్" అనుశాస్త్రము. విరాగముగల సన్యా

సికి సర్వసంగపరిత్యాగమును విధించుచున్నందున సన్యాసికి భార్యాపరిత్యాగము దోషముకాదు.

కావున "నొంటరిగానుండుట, రహస్యప్రదేశమునం దుండుట" నీరెండును సన్యాసికే సంభవించునుగాని గృహస్థునకు సంభవింపవు. గృహస్థుయనగా గృహమునం దుండువాడనిగాని, గృహశబ్దమునకు భార్యయనియర్థమును చెప్పి భార్యతో గూడినవాడనికాని వ్యుత్పత్తి చెప్పవలెను. యతచిత్తాత్మా యనగా ఆహారవిహారాదులను స్వాధీనపరచుకొనినవాడని యర్థము.

లోకములో గొందరు సన్యాసులు ఆశ్రమస్వీకారమును జేసికూడ, దేవాలయ నిర్మాణాది ధర్మకార్యములకొరకు ధనాదులను పరిగ్రహింతురు. ముముక్షువులగు సన్యాసులకు ధర్మకార్యములతోగాని యధర్మకార్యములతోగాని పనిలేనందున వారికి ధనాదులను పరిగ్రహించుట తగదు. పరిగ్రహాదులయందు నిమగ్నుడయిన యోగికి (సన్యాసికి) బ్రహ్మయందు చిత్తసమాధానము కుదరదు. కావున సన్యాసికి పరిగ్రహము పనికిరాదు.

రామానుజ మతము :

ఇచట రామానుజులు మూలమునందలి "యోగి" యను పదమునకు కర్మయోగనిష్ఠుడనియు "యతచిత్తాత్మా" యనుపదమునకు ( యతచిత్తమనస్కః ) నిగ్రహించుకొనబడిన చిత్తమనస్సులుకలవాడనియు నర్థమునుజెప్పిరి. అదియుక్తము గాదు. కర్మయోగికి విజనప్రదేశమునం దునికి యసంభవము. కారకసామగ్రితోగూడినవాడుగాని కర్మయోగము నాచరింపలేడు. అట్టివానికి విజనప్రదేశమునం దునికి యసంభవము. మరియు యతచిత్తుడనిచెప్పుటచేగాని యతమనస్కుడని చెప్పుటచే గాని కావలసిన మనోజయమను నర్థము లభించుచుండ యతచిత్తమనస్కుడని చెప్పుట పునరుక్తమగును. కావున రామానుజవ్యాఖ్యాన ముచితము కాదు. ౧౦

శ్లో. శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజిన కుశోత్తరం ॥ ౧౧ ॥

అ. ఇకముందు ధ్యానయోగి కవసరమగు నాహారవిహారాసనాదుల నియమమును చెప్పుచున్నారు. ధ్యానయోగి పరిశుద్ధమయిన ప్రదేశమునందు మెక్కువ యెత్తు 'మిక్కిలిలోతులేని స్థిరమయిన (కదలని) నాసనమును (అనగా కొయ్యతో చేయబడినపీటను) వేసికొని, దానిమీద దర్భాసనమును, అందుపైన కృష్ణాజినమును, దానిపైన వస్త్రమును పరచుకొని. ౧౧

శ్లో. తత్రైకాగ్రం మనఃకృత్వా యతచిత్తేంద్రియక్రియః
ఉపవిశ్యాసనే యుంజ్యా ద్యోగ మాత్మవిశుద్ధయే ॥ ౧౨ ॥

అ. ఆయాసనముమీఁద కూర్చొని, మనోవ్యాపారమును బాహ్యేంద్రియ వ్యాపారములను కట్టిపెట్టుకొని మనస్సును ఏకాగ్రము జేసికొని (సావధానముజేసికొని) యంతఃకరణశుద్ధికొరకు యోగమును చేయవలెను. ౧౨

శ్లో. సమం కాయ శిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చా నవలోకయన్ ॥ ౧౩ ॥

శ్లో. ప్రశాంతాత్మా విగతభీః బ్రహ్మచారివ్రతే స్థితః
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః. ॥ ౧౪ ॥

అ. శరీరమును, తలను, మెడను, సమానముగా కలదలకుండా ధరించుచు, తాను స్థిరముగానుండి తన నాసికాగ్రమునుమాత్రమే చూచుచు, దిక్కులను దిలకింపక నిర్మలాన్తఃకరణతోనుండి విజనప్రదేశమునం దుంటినను భయములేక, గురుశుశ్రూషాభైక్షాశనాది బ్రహ్మచారిధర్మముల నాచరించుచూ, మనస్సును కామాది వృత్తులు లేనిదానినిగా జేసికొని, పరమేశ్వరునియందు చిత్తముంచి వాసుదేవుడే పరతత్త్వమను భావనతో సమాహితుడగుచూ, ఆసనమందు కూర్చుండవలెను. ౧౪

శ్లో. యుంజ న్నేవం సదాత్మానం యోగీ నియతమానసః
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి ॥ ౧౫ ॥

అ. మనోనిగ్రహముగల ధ్యానయోగి వెనుక జెప్పినవిధానప్రకారముగా నెల్లపుడు ఆత్మను ధ్యానించుచూ, ఆత్మస్వభావ భూతమయిన మోక్షశాంతి నొందును. అనగా నెల్లపుడు యేకాగ్రమనస్సుతో నాత్మసాక్షాత్కారము జేసికొనుచుండునని భావము. ౧౫

శ్లో. నాత్యశ్నతస్తు యోగోఽస్తి నచైకాంత మనశ్నతః
నచాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున ॥ ౧౬ ॥

అ. యోగికి మిక్కిలి యాహారము పనికిరాదు. కేవలము నిరాహారమున్ను యుక్తముకాదు అట్లే యెప్పుడు నిద్రించుటకాని, యెల్లపుడు మేలుకొని యుండుటకాని యోగమునకు భంగకరములు. ఈ విషయమునందు శ్రుతి యిట్లు చెప్పుచున్నది. "యదుహవా ఆత్మసమ్మితమన్నం తదవతి తన్నహి నస్తి, యద్భూయో హి నస్తి తద్యత్కనీయో నతదవతి" అనిశ్రుతి. దీనియర్థము మితమయిన యన్నము భుజించువానిని రక్షించును. అయ్యది భుజించువానిని చెరచదు. (యద్భూయః) మిక్కిలియాహారము భుజించువానికి రోగాదులను కలుగజేసి చెడగొట్టును. (యత్కనీయః) జఠరకోశమునకు యేమాత్రము చాలని యతిస్వల్పాన్నము భుజించినవానిని రక్షింపదు. పైగా భోక్తను నింద్రియపుష్టిలేకుండ జేసి చెడగొట్టును.

మరియు యోగశాస్త్రమునందు యోగికి యాహారపరిమాణము యిట్లు చెప్పు

బడినది. శ్లో. అర్థం సవ్యంజనాన్నస్య తృతీయముదకస్యచ, వాయోస్సంచరణార్థంతు చతుర్థ మవశేషయేత్ " అని జఠరకోశములో రెండుభాగములు వ్యంజనముతో గూడినయన్నముతో నింపవలెననియు, మూడవభాగ ముదకముతో నింపవలెననియు, నాల్గవభాగము వాయుసంచారమునకు (ఖాళీగా) మిగిల్చియుంచవలెననియు దీని యర్థము. ౧౬

శ్లో. యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు
యుక్త స్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా ॥ ౧౭ ॥

అ. తగుమాత్రము యాహారము తీసికొనువానికి, తగుమాత్రముగా నడచు వానికిని, నియతమయిన పనులు చేయువానికినిఁ నిద్రాజాగృతులు తగుమాత్రముగా ననుభవించువానికిని యోగము సుఖము నిచ్చును. లేనిచో యోగము దుఃఖము నిచ్చును. ౧౭

శ్లో. యదా వినియతం చిత్తం ఆత్మన్యేవావతిష్ఠతే
నిస్పృహః సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా ॥ ౧౮ ॥

అ. మనస్సు బాహ్యవిషయములయందు వ్యాపించియున్నపుడు ఏకాగ్రతను బొందదు. ఏకాగ్రతలేనిదే తత్త్వానుసంధానము కలుగదు. కావున నెప్పుడు మనస్సు సర్వకామములయందును విరక్తి చెంది, యేకాగ్రతను బొందియుండునో అపుడు ఆత్మానుభవమునందు నిలచియుండును. అప్పుడే సాధకుడు యోగి యనబడును. ౧౮

శ్లో. యథాదీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా
యోగినో యతచిత్తస్య యుంజతో యోగ మాత్మనః ॥ ౧౯ ॥

అ. మనస్సును నిగ్రహించుకొని యాత్మసమాధిని యనుష్ఠించునట్టియోగికి గాలిలేనిచోట కదలకుండ (నిశ్చలముగా) వెలుగునట్టి దీప ముపమానమని యోగ శాస్త్రజ్ఞులు చెప్పిరి.

"ఆత్మనో యోగం యుంజతః" అనుచోట నాత్మశబ్దమునకు మనస్సు అని కాని, బుద్ధియనికాని యర్థము ప్రత్యక్చైతన్యమని యర్థముకాదు. మనస్సు సమాధేయమగునుకాని చైతన్యమెన్నటికి సమాధేయము కానేరదు.

(లేక) ఆత్మశబ్దమునకు చైతన్యమే యర్థము. షష్ఠీవిభక్తికి విషయ విషయి భావసంబంధ మర్థము. "ఆత్మనః యోగః" అనగా నాత్మవిషయకమగు యోగము (చిత్తసమాధానము) అని యర్థము లభించును. ఆత్మయందు చిత్తమును సమాధాన పరచుట యనిభావము. గాలిలేనిచోటనున్న దీపమెట్లుకదలదో, అట్లే ఆత్మయోగ మందు యోగి చలింపడని పరమార్థము.

యోగియనగా ఆత్మకాని యనాత్మ కాదు. ఆత్మ యచలుడుకాని చంచలుడు కాదు. ఆత్మకు చాంచల్యప్రసక్తియే లేదు. కావున దీపదృష్టాంతముతో యోగికి చాంచల్యమును నిషేధించుట పొసగదని యాక్షేపము. ఆత్మ స్వతస్సిద్ధముగా చలన రహితుడయినను బుద్ధియందలి చాంచల్యము నాతనియం దారోపించుకొనుటచే చలనము ప్రసక్తించుచున్నదికాన చలననిషేధము పొసగునని సమాధానము.

(లేక) ఆత్మయోగము ననుష్ఠించునట్టి యోగియొక్క చిత్తమునకు గాలిలేని చోట నున్నదీపము యుపమానమని యన్వయము చెప్పవలెను. అపుడు గాలిలేని చోటనున్న దీపమెట్లు కదలదో అట్లే యాత్మయందున్న యోగియొక్క చిత్తముకూడ కదలదని యర్థము లభించును. ఇదియే నిర్వికల్పసమాధి. మనస్సు వృత్తిరహితమయి యాత్మస్వరూపమునందు లీనమయియుండుటయే నిర్వికల్పసమాధి యనియందురు.

(లేక) మరియొకవిధముగాకూడ నన్వయము జెప్పవచ్చును. "(యథా నివాతస్థో దీపో నేఙ్గతే తథా యోగినః ఆత్మస్థం చిత్తం నేఙ్గతే)" "గాలిలేనిచోట నున్న దీపమెట్లు కదలదో యోగియొక్క ఆత్మయందున్న చిత్తమట్లు కదలదు" అని రెండువాక్యార్థములకు దృష్టాంతదార్ష్టాంతికభావము చెప్పవచ్చును. ఈయన్వయమునందును ఆత్మయందున్న యోగిచిత్తము గాలిలేనిచోటనున్న దీపమువలె కదలదనియే యర్థము పర్యవసించును. ౧౯

(అ) శ్లో. యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా
యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి ॥ ౨౦ ॥

(ఆ) శ్లో. సుఖమాత్యంతికం యత్త ద్బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్
వేత్తి యత్ర న చైవాయం స్థిత శ్చలతి తత్త్వతః ॥ ౨౧ ॥

(ఇ) "యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః
యస్మిన్ స్థితో నదుఃఖేన గురుణాపి విచాల్యతే ॥ ౨౨ ॥

(ఈ) "తం విద్యా ద్దుఃఖసంయోగ వియోగం యోగసంజ్ఞితం
స నిశ్చయేన యోక్తవ్యో యోగో నిర్విణ్ణచేతసా ॥ ౨౩ ॥

(అ) అ. యోగాభ్యాసబలమువలన సర్వవిషయములనుండి నివారింపచేయబడిన చిత్తము యెప్పు డుపరతిచెందునో, సమాధిపరిపాకమువలన పరిశుద్ధమయిన నంతఃకరణమునందు చిద్రూపుడగు బరమాత్మను ప్రత్యక్షముజేసికొనుచు నెపుడు యోగి తృప్తిజెందునో,

(ఆ) యోగి బాహ్యేంద్రియముల సహాయములేని సూక్ష్మబుద్ధితో ననంతమగు నాత్మసుఖము నెప్పు డనుభవించునో, ఆత్మస్వరూపమునందున్న యోగి యెప్పుడు తత్త్వానుసంధానమునుండి దిగజారడో,

(ఇ) యోగి యేయాత్మలాభమునుబొంది యంతకంటె నధికమయినవస్తువు మరియొకటి కలదని తలంచడో, ఏయాత్మతత్త్వమునందుండి యెంతటి గొప్పదుఃఖము వాటిల్లినను యోగి చలింపడో,

(ఈ) దానిని దుఃఖసంబంధ మిసుమంతయులేని యోగమునుగా గ్రహింపవలయును. ఇచట యోగమను పేరుగల వియోగమునుగా గ్రహింపవలెనని యర్థమగుచున్నది. యోగమును వియోగమునుగా గ్రహించుట విరుద్ధము. కనుక విరుద్ధలక్షణాచే గ్రహింపవలెనని భాష్యకర్త లనిరి. ఇట్టియోగమును నిశ్చయజ్ఞానముతో నిర్వేదపడక తప్పక యాచరింపవలెను.

ఓయి! శాస్త్రమునందు యత్తచ్ఛబ్దార్థముల కనుకూలత నుండవలయును. "యత్రోపరమతే చిత్తం" "యత్ర చైవాత్మ నాత్మానం" "వేత్తియత్ర నచైవాయం" అను శ్లోకములయందలి యచ్ఛబ్దములకు కాలము అర్థమని చెప్పిరి. "యం లబ్ధ్వాచాపరం లాభం" "యస్మిన్ స్థితో న దుఃఖేన" అనుచోట్ల యచ్ఛబ్దమునకు ఆత్మ యర్థమని చెప్పిరి. "తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితామ్" అనుచోట తచ్ఛబ్దమునకు యోగము అర్థమని చెప్పిరి. కావున యత్తచ్ఛబ్దములయొక్క యర్థభేద మెట్లంగీకరింపనగును? అనినచో వినుము. "తం విద్యాత్" అను శ్లోకమునందలి తచ్ఛబ్దమునకు తత్కాలోపలక్షితయోగమనియు తదాత్మవిషయకమగు యోగమనియు నర్థమును చెప్పినచో విరోధముండదు.

రామానుజభాష్యమునందు యచ్ఛబ్దములన్నిటికి యోగమనియే యర్థమును జెప్పిరి. అప్పుడు "తంయోగం" అనుశ్లోకమునందలి తచ్ఛబ్దముతో నర్థము సరిపోవును. అట్లుకాక కాలోపలక్షితయోగమనియు ఆత్మవిషయకయోగమనియు అర్థము చెప్పినచో లక్షణ యాశ్రయింపవలసివచ్చును. అయ్యది దోషము అనినచో నది యుక్తముగాదు. "యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా" అను శ్లోకమునందలి యచ్ఛబ్దమునకు యోగమనియర్థముచెప్పినచో "యత్ర= ఏయోగమునందు; యోగసేవయా= యోగానుష్ఠానముచే" అని యర్థము చెప్పవలసివచ్చును. అట్టితరి పునరుక్తదోషము వాటిల్లును. పతంజలి నిర్వచించిన "చిత్తవృత్తినిరోధాత్మకమగు యోగమే యిచట "యోగసేవయా చిత్తం నిరుద్ధమ్" అను వాక్యముచేం జెప్పబడినది. "యత్ర" అను త్రలంతావ్యయమునకుగూడ నదే యర్థ మంగీకరించినచో పునరుక్తదోషము సుస్పష్టము.

మరియు చిత్తనిరోధరూపమగు యోగమునకు చిత్తనిరోధ మధికరణమగుట యసంభవము. యోగమునందు యోగసేవచే చిత్తము నిరోధింపబడినది అను నర్థమునందు ఒకేయోగమునకు అధికరణత్వము హేతుత్వము, యీరెండునువిరుద్ధమగును.

కావున రామానుజభాష్యపద్ధతి నవలంబించినచో చిత్తనిరోధమునందు, చిత్తనిరోధసేవచే, చిత్తనిరోధము కలిగినదని వాక్యార్థ మేర్పడును. ఇట్టివాక్యార్థము అతిదుష్టమని సర్వవిదితము.

అట్లే అదేశ్లోకమునందలి "యత్రచైవాత్మ నాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి" అను నుత్తరార్థమున 'ఏయోగమునందు ఆత్మను ఆత్మచే జూచుచూ' అని యర్థము లభించును. మనసుతో నాత్మను జూచుటయే యోగము (యోగోహి ఆత్మని చిత్తసమాధానమ్) ఆత్మయందు చిత్తమును యేకాగ్రపరచుట యోగము అని శాస్త్రజ్ఞు లందురు. కావున నిచటగూడ యోగమునకు యోగ మధికరణమను దోషము తటస్థించును.

మరియు "యం లబ్ధ్వా చాపరం లాభం" అనుశ్లోకమునగూడ యచ్ఛబ్దమునకు యోగమని యర్థము చెప్పినచో యోగమును బొంది యంతకంటె గొప్పది మరియొకటి లేదని తలచుచున్నాడని చెప్పవలసివచ్చును. యోగముకంటె గొప్పదగు మోక్షలాభముండగా మరియొకటి లేదని తలంచుట పొసగదు. అద్వైతమతమున యచ్ఛబ్దమునకు ఆత్మార్థము చెప్పినచో మోక్షము ఆత్మస్వరూపమేకనుక మోక్షము నాత్మకంటె గొప్పదికాని, యాత్మకంటె నితరమయినదికాని కానేరదు. కావున నద్వైతమతమున నంతయు పొసగును.

మరియు "యస్మిన్‌స్థితో నదుఃఖేన గురుణాపి విచాల్యతే" అనుశ్లోకమునందలి యచ్ఛబ్దమునకు "యోగము" అనునర్థమును చెప్పినచో క్రియారూపమగు యోగమునందు సాధకుడగు పురుషుడుండుట సంభవింపదు. లేక "స్థితః" అను పదమునకు ఉన్నటువంటివా డను నర్థమును చెప్పక వ్యాపించినవా డను నర్థమును చెప్పినచో వాచ్యార్థమును విడచి లక్ష్యార్థము నంగీకరించినట్లగును.

మరియు "యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా" అనుశ్లోకమునందలి "ఉపరమతే" అను పదములో "ఉప" అను నుపసర్గకు అతిశయార్థమును జెప్పి మిక్కిలి క్రీడించుచున్నది యని రామానుజులు భాష్యమును రచించిరి. అదియును యుక్తముగాదు. ఉపయను నుపసర్గతోగూడిన రమధాతువునకు నుపరతియే (విరమించుట) యర్థముకాని మిగిలిన యర్థము వర్ణింప నలవికాదు. "ఉపరమేత్" "ఉపరతః" "ఉపరమ్య" ఇత్యాదిపదములయందు లోగడ రామానుజులుగూడ విరమించుట (చాలించుట) అను నర్థమునే యంగీకరించి యుండిరి. కావున "ఉపరమతే" అనుపదమునకు రామానుజులు చెప్పినయర్థము పొసగదు.

ఇచట ఆత్మసుఖానుభవము, ఆత్మతుష్టి, యాత్మలాభము, దుఃఖసంయోగవియోగము అను యోగఫలమునంతయును జెప్పి ముగించినపిమ్మట మరల శ్రీకృష్ణుడు యోగము కర్తవ్యమని చెప్పుటలో తాత్పర్యమేమి? యని ప్రశ్న కలుగు

చున్నది. సమాధానము నిశ్చయ నిర్వేదములు రెండు యోగమునకు సాధనము లనియు, వాటిని తప్పక యోగారంభమునం దాచరింపవలెననియు జెప్పదలచి యన్వారంభముచే మరల యోగము నాచరింపమని శ్రీకృష్ణులు జెప్పిరి. అన్వారంభమనగా నొకమారు ఒకపనిని చేయమని జెప్పి మరల మరియొకవిధానముచే నాపనినే చేయుమని చెప్పుట యనియర్థము. కావున నాత్మసుఖమున్నగు ఫలములు గల యోగము నిశ్చయజ్ఞానముతో నాచరింపవలెనని భావము.

ఇట్టి యోగము నాచరించుటకు నిర్వేదరహితమయిన చిత్తము. (విసుకు లేని చిత్తము) (విరక్తి లేని చిత్తము) సాధనమని, కర్మధారయ సమాస గర్భితమగు "అనిర్విణ్ణచేతసా" అను పదమువలన లభించుచున్నది. "అనిర్విణ్ణం+ చేతః యస్య సః తేన అనిర్విణ్ణచేతసా" అను బహువ్రీహిసమాసముచే, నిర్వేదము లేని చిత్తము కలవాడు అని కర్త్రర్థముకూడ లభించును. అయినను యిచట సాధనము ప్రధానము కాని, కర్త ప్రధానముకాదు. కర్త వాక్యము లేకున్నను అర్థాత్సిద్ధించును. సాధనమట్లు సిద్ధింపదు. కావున సాధనార్థము నొసంగునట్టి కర్మధారయసమాసమునే యంగీకరింపవలెను. కావున యోగసిద్ధ్యాదులయందు సంశయమున్నను, నిర్వేదమున్నను యోగము సిద్ధింపదు. కనుక నిశ్చయ నిర్వేదములను ముఖ్యముగా బాటింప వలెనని ఫలితార్థము. 23

శ్లో. సంకల్ప ప్రభవాన్ కామాన్ త్యక్త్వా సర్వా నశేషతః
మనసై వేంద్రియగ్రామం వినియమ్య సమంతతః ॥ 24 ॥

అ. సంకల్పమువలన బుట్టునట్టి శబ్దస్పర్శాది విషయముల యందలి కోరికలను పూర్తిగా వదలుకొని, బాహ్యేంద్రియ సముదాయమును సర్వవిషయముల నుండి మనసుచే మరల్చుకొని.

రామానుజ మతము :

రామానుజులు యీ శ్లోకమునందలి కామ శబ్దమునకు (కామ్యంతఇతి) కోరబడుచున్నవను కర్మణివ్యుత్పత్తిచే విషయములని యర్థముం జెప్పి యవి స్పర్శజములని, సంకల్పజములని రెండు తెఱంగు లనిరి. (అనగా స్పర్శవలన బుట్టినవి, సంకల్పమువలన బుట్టినవి యని యర్థము.) అందు స్పర్శవలన బుట్టినవి శీతోష్ణాదులనియు, నయ్యవి స్వరూపముతో విడువశక్యముగావనియు, సంకల్పమువలనబుట్టు విషయములు పుత్ర మిత్రాదు లనియు వీరు మాత్రము స్వరూపముతో విడువశక్యముగుదురనియు, గనుకనే సంకల్పమువలన బుట్టునట్టి కామములను నిశ్శేషముగా విడువమని శ్రీకృష్ణులు జెప్పిరనియును రామానుజులు వారిభాష్యమున జెప్పిరి.

ఇదియంతయు నిస్సారము. వారిమతమున స్పర్శ యనగా త్వగింద్రియముచే గ్రహింపదగినగుణమా? లేక విషయేంద్రియములకుగల సంబంధమా? అవి యడుగ

వలయును. మొదటిపక్షమున శీతోష్ణాదులకంటె భిన్నమగు స్పర్శయే త్వగింద్రియమునకు విషయమగుచుండ, శీతోష్ణాదులు స్పర్శవలన బుట్టుననుట సంభవింపదు. మరియు సంకల్పమువలన బుట్టని స్పర్శ యను విషయ మెట్లుకలదో, అట్లే సంకల్పమువలన బుట్టని శబ్దాదివిషయముకూడ కలదుకాన విషయములు రెండువిధములు కావలసివచ్చును. కొండగుహాలో నున్న యోగి శీతస్పర్శను, నీటిలోనున్న యోగి యుష్ణస్పర్శను స్వరూపతః విడచుట సంభవించుచుండ శీతోష్ణాదులు స్వరూపముతో విడువశక్యముగావనుట యుచితముగాదు.

ఇక రెండవపక్ష మవలంబించినచో విషయములు విషయేన్ద్రియసంబంధరూపమయిన స్పర్శమువలన బుట్టునవి అని చెప్పినట్లగును. ఇది యుక్తముగాదు. ఏలయన, విషయములు బుట్టకపూర్వమే విషయేన్ద్రియసంబంధములు కారణముగా నుండుటచే, విషయములు పుట్టకపూర్వమే విషయములు సిద్ధించునట్లగును. మరియు నింద్రియములతో సంబంధించిన విషయములవలన విషయములు బుట్టినట్లు చెప్పుట తటస్థించినది. కనుక తనవలన తాను బుట్టునను దోషము ప్రసక్తించును. మరియు విషయములు పుట్టకపూర్వము విషయేన్ద్రియసంబంధము అసంభవము. కావున స్పర్శవలన బుట్టినవి భోగములేకాని విషయములుకావు. (స్పృశ్యన్తే ని ఇతి స్పర్శాః) స్పృశింపబడుచున్నవి కాన స్పర్శలు అను వ్యుత్పత్తిచే స్పర్శలనగా విషయములనియే యర్థము. "మాత్రా స్పర్శాస్తు కౌన్తేయ" అను శ్లోకమునందు శ్రీకృష్ణులు స్పర్శశబ్దమును విషయము లను నర్థమునందే నిర్వచించిరి.

అట్లే పుత్రమిత్రక్షేత్రాది విషయములుగూడ నీశ్వర సంకల్పమువలన బుట్టునుకాని తన (జీవ) సంకల్పమున బుట్టవు. ఈశ్వరుడు తాను అనేకరూపములుగా బుట్టుదునని సంకల్పించి ప్రపంచము నంతయును బుట్టించి అందు తాను ప్రవేశించి చరాచరరూపమును దాల్చెనని "తదైక్షత బహుస్యాం ప్రజాయేయ" "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" "సచ్చత్యచ్చాభవత్" ఇత్యాది శ్రుతులు ఘోషించుచున్నవి.

ఈశ్వరసంకల్పమువలన బుట్టు విషయములుకూడ నన్నియు స్వరూపముతో విడువశక్యములుకావు. సమస్తభూమి తనదే యయినందున సార్వభౌముడగు రాజు భూరూపమయిన విషయమును విడువలేడు. కాని ఆభూమియందు తనకున్న యభిమానమును మాత్రము విడువగలడు. ప్రతివస్తువునందును యిది నాది యను నభిమానమే జీవసంకల్పముచే సృష్టింపబడిన ప్రపంచము. ఇదియే జీవునకు బంధకమగుచున్నది. స్త్రీయాకారరూపమయిన శరీరమునందు యీామె నా భార్య, యీామెతో నేను సుఖ మనుభవింపవలెను. అను బుద్ధిలేకున్నను మృద్రూపమయిన క్షేత్రమునందు 'యిది నాది' యను బుద్ధిలేకున్నను యీా రెండును పురుషుని బంధింపవు.

కావున జీవసంకల్పమువలన బుట్టిన నభిమానరూపమగు కామమయప్రపంచమును యోగి పూర్తిగా విడువవలయును. లేకున్న యోగము సిద్ధింపదు.

ఈశ్వరసంకల్పముచే సృష్టింపబడిన విషయప్రపంచము వస్త్రము, చర్మము, బర్హిస్సు, ఆసనము మొదలయినవి. ఇయ్యది యోగమునకు సాధనమే కావున దీనిని యోగి విడువవలసిన పనిలేదు. కావున నిచట కామములనగా విషయముల యందలి కోరికలేకాని రామానుజులు చెప్పినట్లు విషయములుమాత్రము కావు.-౨౪

శ్లో. శనై శ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా
ఆత్మసంస్థం మనః కృత్వా నకించి దపి చిన్తయేత్ ॥ ౨౫ ॥

అ. ధైర్యముగలబుద్ధితో మనస్సును ఆత్మయందుంచి, మెల్ల మెల్లగా వృత్తి రాహిత్య మొనర్పవలయును. మనస్సుతో దేనిని ధ్యానింపగూడదు. ఇందు మొదటి పాదమునందలి "ఉపరమేత్" అను పదమునకు నాల్గవపాదము వ్యాఖ్యానరూపము.

ఓయి! మనస్సు ఆత్మయందుండుట యెట్లుపొసగును? "యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానతి సభూమా" అను శ్రుతి భూమాత్మయగు నిర్విశేష చిన్మాత్రాద్వితీయ బ్రహ్మాయందు వ్యావహారికసత్యము, జడము, ద్వితీయ వస్తువు నగు మనస్సుయుండనేరదని చెప్పుచున్నది. లేక ఆత్మయందు మనస్సు యుండుచో మనసుతో బ్రహ్మకు సద్వితీయత్వ మేర్పడును. మరియు నాత్మ సద్వితీయుడగును. జడప్రపంచముతో సంబంధముకలవాడగును. కనుకనే "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ" అను శ్రుతి ఆత్మ మనోవాక్కులకు గోచరుడుకాడని చెప్పుచున్నది. కావున మనస్సును ఆత్మయందుంచుట పొసగదు. అని యాక్షేపము.

"సర్వభూతస్థ మాత్మానం సర్వభూతానిచాత్మని" అను శ్లోకముచే సకల భూతములు ఆత్మయందుండునని శ్రీకృష్ణులు ముందు చెప్పబోవుచున్నారు. అట్టితరి మనస్సుమాత్ర మాత్మయందుండుటకు నాక్షేపమేమి ? అని యనరాదు. సర్వభూతములు అవిద్యాకల్పితములుకాని పరమార్థములుకావు. భూతములు పరమార్థములగుచో బ్రహ్మకు సద్వితీయత్వముండదు. కావున బ్రహ్మయందు సర్వభూతము లుండుట యవిద్యాకల్పితముకాని పరమార్థముకాదు.

అయితే ఆత్మయందు మనస్సుయుండుటగూడ నవిద్యాకల్పితమేయని యన దగదు. అట్టియభిప్రాయమును యిచట వర్ణించుటలో ప్రయోజనములేదు. త్రాటి యందు సర్పమున్నట్లు ఆత్మయందు మనస్సు అవిద్యచే గల్పింపబడియున్నదని చెప్పుట యుచితముగాదు. అట్లగుచో "ఆత్మసంస్థం మనః కృత్వా" అని కృత్వా అనుపదము వ్యర్థమగును. యోగిమనస్సును ఆత్మయందున్నదానినిగా చేయక

పూర్వముగూడ మనస్సు అవిద్యచే నాత్మయందుండియే యున్నది. ఇచట విషయములనుండి మనస్సును మరల్చి యాత్మయందుంచమని చెప్పబడినది. ఇయ్యది అవిద్యాకార్యముకాదు. విద్యాకార్యమేయగును. కావున యోగికాని, విద్వాంసుడుకాని యాత్మయందు మనస్సునుంచుట యెట్లు పొసగును? అని యవాంతరాక్షేపము.

సమాధానము: ఇచట మనస్సును ఆత్మయందుంచుట యనగా పెట్టెలో గుడ్డనుంచినట్లని యర్థముకాదు. ఆత్మతత్త్వమును మనసా అనుసంధానము చేయుటయే మనస్సును ఆత్మయం దుంచుట. సర్వప్రపంచము ఆత్మయే యనియు నాత్మకంటె వేరేమియు లేదనియు నను జ్ఞానమే ఆత్మతత్త్వము.

ఓయి! "నతతోఽన్య త్కించి దస్తి" అను శ్రుతివలన సర్వాభావత్వము (ఏమియు లేకుండుట) చెప్పబడుటచే నాత్మకు నద్వితీయత్వము సిద్ధించుగాక, అయినను సర్వప్రపంచము అనృతము, జడము, దుఃఖరూపము నగుటచే సచ్చిదానంద స్వరూపుడగు పరమాత్మకు సర్వాత్మకత్వము యుక్తముగాదు. కావున సర్వము ఆత్మయే యను జ్ఞాన మెట్లు యథార్థమగును? అని యాక్షేపము.

సమాధానము: రజ్జువునందు సర్పము కల్పింపబడినట్లు సర్వప్రపంచము మాయచే నాత్మయందు గల్పింపబడినది. కాన భ్రాంతిచేఁ దోచబడుచున్న ప్రపంచమంతయు నిజముగా నాత్మయే యగును. త్రాటియందు భ్రాంతిచేఁ దోచుచున్న సర్పము నిజముగా త్రాడే యగుచున్నది. కావున రజ్జువు సర్పాత్మకమయినట్లు స్థాణువు పురుషాత్మక మయినట్లును ఆత్మ సర్వప్రపంచాత్మకమగుట యుక్తమగును.

ఆత్మభిన్నవస్తువేమియు లేనందున నితరచింతనము గూడదు. ఆత్మచింతనమే అవశ్యకర్తవ్యము. సర్వవ్యాపారములు చాలించుట రూపమయినందున ఆత్మచింతనమే యుపరతి యనబడును. ౨౫

శ్లో. యతో యతో నిశ్చరతి మన శ్చంచల మస్థిరమ్
తత స్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్ ॥ ౨౬ ॥

అ. మనస్సు సంకల్పవికల్పాత్మకము. దానికి సదా ప్రవృత్తియే స్వభావము. కావున నెప్పుడు నొకచోట నుండనేరదు. అగ్నికి నౌష్ణ్యమువలె మనస్సుకు సదా ప్రవృత్తి (చాంచల్యము) స్వాభావికదోషము. కావున సహజచాంచల్యముగల మనస్సు శబ్దస్పర్శాది విషయములలో వేనికొఱకు బయలువెడలుచున్నదో వాటియొక్క యథార్థరూపమును వివేకజ్ఞానముచే విమర్శించుకొని యవియన్నియు మిథ్యారూపము లగుటచే వాటినుండి మనస్సును మరల్చి యాత్మయందు లయపరచవలెను. విషయములు నాశసహితములు, సాతిశయములు తుదను దుఃఖము నిచ్చునవియు యగుచున్నవి. యోగికి వాటియం దనురాగము తగదు. వైరాగ్య ముచితము.

కావున విరాగియై యోగి మనస్సును విషయములకు స్వాధీనముగాకుండ జేసి తనకు వశపరచుకొనవలెను. అప్పుడుగాని యోగము నిరూఢమై సిద్ధింపదు. ౨౬

శ్లో. ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమం
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూత మకల్మషం ॥ ౨౭ ॥

అ. ఇట్లు ఆత్మయందు మనస్సును లయపరచి, రజోగుణకార్యములగు మోహాది క్లేశములను రూపుమాపుకొని, పుణ్యపాపాదికల్మషములతో నంటకయుండి జీవన్ముక్తుడగు యోగిని ఆత్మానందము స్వయముగా వచ్చి పొందును. మనోలయము నందు, సుషుప్తియందును స్వరూపసుఖానుభవము ప్రసిద్ధము.

భూపరాగము ఆకాశమునావరించి ఆకసమును కనుపించకుండ జేసినట్లు మోహాదిక్లేశములు ఆత్మను ఆవరించి యాత్మప్రకాశను భంగపరచును. కావున గౌణవృత్తిచే మోహాదిక్లేశములయందు రజశ్శబ్దము ప్రయోగింపబడినది.

జ్ఞానికి అధర్మమువలె ధర్మముకూడ బంధకమయినందున ధర్మాధర్మములు రెండును కల్మషములే యగుచున్నవి. కావున స్వరూపానందము నొందదలచిన యోగికి ధర్మాధర్మసంస్కారములను రూపుమాపుకొనుట యుక్తము. ౨౭

శ్లో. యుంజన్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః
సుఖేన బ్రహ్మసంస్పర్శం అత్యంతం సుఖ మశ్నుతే ॥ ౨౮ ॥

అ. యోగి యీ ప్రకారము నిర్విఘ్నముగా మనస్సును బ్రహ్మయందు సమాధానపరచుచు, పుణ్యపాపములను విడనాడుకొని యనాయాసముగా నిరతిశయమగు బ్రహ్మానందము నొందుచున్నాడు. మోక్షము నొందదలచిన యోగికి పుణ్యముకూడ పాపరూపమే కనుక పుణ్యసంస్కారమునుగూడ బంధకముగాకుండ నశింపజేసికొనవలయును.

పూర్వశ్లోకమునందు సుఖము యోగిని బొందునని చెప్పబడినది. ఇచట యోగి సుఖమును బొందునని చెప్పబడినది. కావున పూర్వశ్లోకార్థమే యిచట ప్రకారాంతరముచే జెప్పబడిన దని గ్రహింపవలయును. లేక పూర్వశ్లోకమున జీవన్ముక్తిదశలో ననుభవింపదగిన సుఖము చెప్పబడిన దనియు నిచట విదేహముక్తిదశలోని సుఖము చెప్పబడినదనియు భేదము గ్రహింపవలెను.

లేక పూర్వశ్లోకములో యోగదశయందుఁ బొందదగిన నాత్మానందము చెప్పబడినదనియు, ఇచట బ్రహ్మానందము చెప్పబడినదనియు భేదమును గ్రహింపవలెను.

ధ్యానయోగమువలన మోక్షసుఖ మెట్లుప్రాప్తించునని ప్రశ్నింపదగదు. జ్ఞానయోగప్రాప్తిద్వారా మోక్షసుఖమును బొందునని సమాధానము చెప్పుకొనవలెను.

లేక నీ రెండుశ్లోకములును జీవన్ముక్తిసుఖపరములే యని యంగీకరించినచో ఁ బైప్రశ్నకే యవకాశముండదు. ౨౮.

శ్లో. సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥ ౨౯ ॥

అ. ఇప్పుడు యోగమునకు జీవబ్రహ్మైక్యభేదజ్ఞానము నిరతిశయమగు (గొప్ప) ఫలమని శ్రీకృష్ణులు చెప్పుచున్నారు. సమాహితాంతఃకరణుడగు యోగి బ్రహ్మాది స్థావరాంతభూతములయందు సమభావము గలవాడయి, ఆత్మ సర్వభూతములయందు గలడనియు, సకలభూతములు ఆత్మయందు గలవనియును దెలిసికొనును. జీవబ్రహ్మై భేదజ్ఞానము కలుగునని భావము. ఆత్మానందము ననుభవించు యోగికిగూడ తత్త్వజ్ఞానములేనిచో పునర్జన్మము సంభవించును. యోగి తా ననుభవించు నాత్మానందము పరమాత్మస్వరూపమని తెలిసికొననంతవరకు కృతకృత్యుడు కానేరడు. కావున మైథునమునకు తాత్కాలిక సుఖలాభము అవాంతరఫలమున్ను పుత్రోత్పత్తిప్రధాన ఫలమున్ను యెట్లో, అట్లే యోగమునకుగూడ నాత్మానందము అవాంతరఫలమనియు, తత్త్వజ్ఞానము ప్రధానఫలమనియు గ్రహింపవలయును.

అజ్ఞానకల్పితమగు సంసారము సమ్యగ్జ్ఞానములేనిదే నివర్తించదు. అజ్ఞానకల్పితమయిన ఆత్మానాత్మ తాదాత్మ్యాధ్యాసమువలననే నేను లావయినవాడను, నేను గ్రుడ్డివాడను, నేను సుఖిని, నేను దుఃఖిని- అను భ్రాంతిజ్ఞానము కలుగుచున్నది. అజ్ఞానమువలననే నేను యీశ్వరునికంటె వేరు, నన్ను యీశ్వరుడు శిక్షించువాడు అను బుద్ధియు కలుగుచున్నది. "నేను దేహాది సంఘాత స్వరూపుడనుకాను, సచ్చిదానందస్వరూపుడగు ఆత్మను, నేనే బ్రహ్మను, నాకును బ్రహ్మమునకును భేదములేదు. ఈశ్వరుడుగూడ బ్రహ్మస్వరూపుడేకాని బ్రహ్మకంటె భిన్నుడుగాడు. నేను చిద్రూపుడను, బ్రహ్మ చిద్రూపుడు, ఈశ్వరుడు చిద్రూపుడు కావున చిద్రూపులమగు మాముగ్గురిలో పరస్పరభేదములేదు." అను జీవబ్రహ్మైభేదజ్ఞానము లేనిదే సంసారము నివర్తించదు. త్రాటియం దారోపింపబడిన సర్పము త్రాడుయొక్క జ్ఞానము లేనిదే నివర్తించదు, అట్లే ఆత్మయందు ఆరోపింపబడిన సంసారము ఆత్మజ్ఞానము లేనిదే నివర్తించదు. కావున బ్రహ్మాత్మైక్యజ్ఞానమే సంసారనాశమునకు గారణము. కర్మగాని, జ్ఞానకర్మసముచ్చయముకాని సంసారనాశమునకు కారణము కానేరదు. ఇట్టి బ్రహ్మాత్మైక్యజ్ఞానము కలుగునంతవరకు యోగికిగూడ సంసారనివృత్తి కలుగదు. సంసారనివృత్తికలుగనిదే యోగి కృతకృత్యుడుకాడు. కావున సంసారనాశకారణమగు జీవబ్రహ్మైభేదజ్ఞానమే యోగమునకు ముఖ్యఫలమని భావము.

"సర్వభూతాని చాత్మని" బ్రహ్మాదిస్తంబపర్యంత సర్వభూతములు ఆత్మయం

దున్నవనగా ఆత్మయందు సర్వభూతములు, రజ్జువుయందు సర్పమువలె నభేదమును బొందినవని యభిప్రాయము. "యతోవా ఇమాని భూతాని జాయంతే" "యేన జాతాని జీవంతి" "యత్ప్రయంత్యభిసంవిశంతి" అను శ్రుతి సర్వభూతములకు స్వోపాదానకారణమునందు లయమును చెప్పుచున్నది. లోకములో కార్యములగు ఘటాదులకు కారణమగు మృగాదులయందు లయము సర్వానుభవసిద్ధము. కార్యము కారణమునందు లయమును చెందుట యనగా కారణాభేదముతో నుండుట సర్వభూతలయ మన సర్వభూతములు ఆత్మయం దభేదమును చెందుటనియే సిద్ధాంతము. ప్రళయమునందు సర్వభూతలయము సంభవింపదు. అందు సూక్ష్మభూతములుండును. ప్రళయమునందుగూడ సర్వభూతములు లయముఁజెందుచో జ్ఞానములేకయే సర్వులు ముక్తి చెందవలసివచ్చును. కావున పరమార్థదశలో మోక్షరూపమగు నాత్యంతిక ప్రళయమునందే సర్వభూతలయము.

ప్రళయము నాలుగువిధములు. నిత్యప్రళయము, నైమిత్తికప్రళయము, మహాప్రళయము, ఆత్యంతిక ప్రళయము అని. ఇందు ప్రతిరోజున జరుగు సుషుప్తి నిత్యప్రళయము, చతుర్ముఖబ్రహ్మయొక్క రాత్రికాలము నైమిత్తిక ప్రళయము, బ్రహ్మయొక్క ఆయుఃకాలము రెండుపరార్థములుపూర్తి కాగా జరుగునది మహాప్రళయము, మోక్షము ఆత్యంతికప్రళయము. కావున మోక్షమనగా ఆత్మస్వరూపమేకనుక ఆత్మస్వరూపమునందు సర్వభూతలయము యుచితము.

దీనివలన సమదర్శియగు విద్వాంసుడు సర్వభూతములయందున్న ఆత్మ తానే యనియు, తనయందు మూడుకాలములయందును నిజముగా సర్వభూతములు లేవని యును తెలిసికొనును నని సిద్ధమగుచున్నది.

రామానుజమతము :

రామానుజులు "సర్వభూతస్థ మాత్మానం" అను ప్రథమపాదమునకు "సర్వభూతములతో సమానమయిన ఆకారముగల ఆత్మను" అనియు "సర్వభూతాని చాత్మని" అను ద్వితీయపాదమునకు "ఆత్మతో సమానాకారముగల సర్వభూతములను" అనియు వ్యాఖ్యానము రచించిరి.

ఇయ్యది అయుక్తము. "సర్వభూతస్థం" అను వాక్యమునందలి భూతశబ్దము సప్తమ్యంతము "ఆత్మని" అనుపదముగూడ నట్లే సప్తమ్యంతమని సుస్పష్టము. ఈ రెండు పదములయందు సప్తమీ విభక్తివలన నధికరణత్వము స్పష్టమగుచుండగా ఆయర్థము ను విడచి, సమానాకార మను నర్థమును చెప్పుట అప్రమాణమగును.

అయితే మీమతమందుమాత్రము ఆత్మకు ఆధారత్వము, ఆధేయత్వము—ఈ రెండును యెట్లు ఘటించునని యనరాదు. ఆకాశమందు ఘటము, ఘటమునం

దాకాశము యుండినట్లు, భూతములయందు ఆత్మ, ఆత్మయందు భూతములు నుండుట యుక్తమే యగును. ఆత్మ సర్వాంతరుడనియు, సర్వాధారుడనియు శాస్త్రము కలదు. సర్వాంతరుడనగా నన్నిటియందుండువాడు. సర్వాధారుడన నన్నిటికి నాధార భూతుడు. కాక జాగ్రద్దశలో దేహములయందు ఆత్మయు, స్వప్నదశలో నాత్మ యందు రథాదిప్రపంచమున్ను యుండుట సర్వానుభవసిద్ధము- కావున "సర్వ భూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని" అను శ్లోకమునకు రామానుజులు వ్రాసిన యర్థము. దురభిమతాభినివేశముతో కల్పించిన మూలవిరుద్ధార్థ మనుటలో సందియములేదు.

మరియు భూతశబ్దమునకు ఆత్మ యను అర్థము యెవ్విధముగను కుదరదు. ఒకవేళ భూతశబ్దము ఆత్మవాచియయినను ఆత్మయం దాత్మయుండుట పొసగదు. భూతశబ్దము దేహాదిసంఘాతవాచి యగుచో జడమయిన దేహాదులతో సమానా కారము చేతనుడగు ఆత్మకు సంభవింపదు. కావున రామానుజుల వ్యాఖ్యానము దుష్టము.

శ్లో. యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి
తస్యాఽహం నప్రణశ్యామి సచ మే న ప్రణశ్యతి ॥ 30 ॥

అ. "సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని ఈక్షతే" అను పూర్వ శ్లోకముయొక్క పూర్వార్థమునకు నీ శ్లోకమునందలి పూర్వార్థ మనువాదమాత్ర మగుచున్నది. ఆ రెంటియందును ఆత్మైకత్వజ్ఞానము స్పష్టపరుపబడినది. అందుకు ఫలముమాత్రము యుత్తరార్థముచే జెప్పబడుచున్నది. ఆత్మైకత్వజ్ఞానముకలవానికి యీశ్వరుడు పరోక్షుడుకాడు. ఈశ్వరునకు ప్రత్యగభిన్నబ్రహ్మసాక్షాత్కారము కల వాడును పరోక్షుడుకాడు. రాజభృత్యన్యాయమునందు రాజునకు భృత్యుడు, భృత్యు నకు రాజు పరస్పరము అపరోక్షత్వము నెట్లు కోరుదురో, కామినీకాముకులలో నొకరికొకరు పరస్పరాపరోక్షత్వము నెట్లుకోరుదురో అట్లే విద్వాంసుడుకూడ తనకు నీశ్వరాపరోక్షత్వమున్ను, ఈశ్వరునకు స్వాపరోక్షత్వమున్ను కోరును. ఆత్మైకత్వదర్శికి ఆరెండును సిద్ధించును. విద్వాంసుడు, యీశ్వరుడు ఒకే యాత్మ స్వరూపులగుటవలన వీరిరువురకు పరస్పరము పారోక్ష్యాభావము సిద్ధించునని భావము.

ఓయి! "తస్యాఽహం న ప్రణశ్యామి సచమే న ప్రణశ్యతి" వాడికి నేను పరోక్షుడనుకాను, నాకు వాడు పరోక్షుడుకాడు అని శ్రీకృష్ణులు చెప్పుటచే, జీవపర మాత్మలకు భేదము చెప్పినట్లే యగునుకదా? తచ్ఛబ్దార్థము, అహంశబ్దార్థము-యీ రెండును యెన్నటికి నేకము కానేరవుకదా అనినచో నట్లు కాదు. "సర్వభూతస్థ

మాత్మానం సర్వభూతాని చాత్మని" అను శ్లోకముచే నాత్మకు సర్వభూతములయం దుండుట, సర్వభూతములు తనలోనుండుట అను యే ధర్మము చెప్పబడినదో యోమాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి" అను శ్లోకమువలన నదేధర్మము పరమాత్మకుగూడ చెప్పబడినది. ధర్మభేదములేనిదే ధర్మిభేదము సంభవింపదు కనుక "సర్వభూతస్థ మాత్మానం" "యోమాం పశ్యతి సర్వత్ర" అను వాక్యద్వయముచే జీవపరమాత్మల కభేదమును ప్రతిపాదించి "తస్యాఽహం నప్రణశ్యామి సచమే న ప్రణశ్యతి" అను వాక్యద్వయముచే సర్వజ్ఞుడగు భగవంతుడు జీవపరభేదము నెట్లు ప్రతిపాదించును ?

ఇంక సర్వభూతములయందు ఆత్మ యుండుననియు, అట్టి ఆత్మయందు పరమాత్మ యుండుననియు, సర్వభూతములకు నాత్మయాధారమనియు, అట్టి ఆత్మకు పరమాత్మ ఆధారమనియు కావున పరమాత్మయందు సర్వభూతములుండుట, సర్వభూతముల యందు పరమాత్మయుండుట పొసగుచున్నదని యనరాదు. వ్యాసమహామునికి ఆత్మ యందు పరమాత్మకలడనియు, పరమాత్మయందు ఆత్మకలడనియును చెప్ప నభిప్రాయమున్నచో,

శ్లో. "సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే మయి చాత్మానం త మాత్మనిచ మామపి ॥ అనియే

ఋజుమార్గముచే శ్లోకమును రచియించియుండెడివారు. అట్లు రచియించియుండక పోవుటచే వ్యాసులకట్టి యభిప్రాయము లేదని గ్రహింపవలయును.

మరియు నిరవయవుడగు నాత్మయందు పరమాత్మయుండుట కవకాశముండదు. ఆత్మకు నిరవయవత్వము సర్వసమ్మతిపన్నము. అట్టిచో నిరవయవమగు బ్రహ్మ యందుగూడ జగత్తుయుండుట కవకాశముండదుకదా? అని యనరాదు. అది మాకు సమ్మతము. అద్వైతులెన్నడును బ్రహ్మ సద్వితీయమని యొప్పరు. రజ్జువునందు సర్పము వలె బ్రహ్మయందు ప్రపంచము మాయచే దోచునని యద్వైతులవాదము.

దీనివలన నిరవయవుడు నిరవకాశుడు నగు పరమాత్మయం దాత్మయుండుట గూడ నిరాకరింపబడినది. పరమాత్మయందాత్మయుండుచో పరమాత్మకంటె జీవాత్మ అంతరుడగును (లోపలవాడగును) అపుడు రామానుజులు చెప్పిన అంతర్యామి బ్రాహ్మణమునకు విరోధము తటస్థించును. అందు పరమాత్మయే సర్వాంతరుడని చెప్పబడినది. ఇప్పుడు పరమాత్మయందు జీవాత్మయుండుచో జీవాత్మయే సర్వాంతరు డగును. ఇయ్యది అంతర్యామి బ్రాహ్మణమునకు విరుద్ధము.

ఇక పరమాత్మయందుగూడ నాత్మ మాయచే గలడని యనదగదు. నిత్యశుద్ధ బుద్ధముక్తస్వభావుడయిన ఆత్మకు మాయాసంబంధమును వాస్తవముగా నంగీకరింప

తెలుసు. మాయికములయిన దేహాదులు అసత్తులనియు, అమాయికమయిన ఆత్మ సత్స్వార్థమనియు "నాసతో విద్యతేభావః" అను శ్లోకముచే నిర్ణయింపబడినది. మాయికమగు వస్తువు తప్పక నశించును. నశించనిస్వభావమే సత్యము. నశించుస్వభావమే అసత్యము. కావున సద్రూపుడగు ఆత్మ మాయికుడుకాడు. జగత్తు మాయచే పరమాత్మయం దుండినట్లు ఆత్మ మాయచే పరమాత్మయం దుండుట పొసగదు.

కావున ఆత్మయందు పరమాత్మకు, పరమాత్మయం దాత్మకు నునికి సంభవించనందున "సర్వభూతస్థ మాత్మానం" "యోమాం పశ్యతి సర్వత్ర" అను శ్లోకద్వయముచే పరమాత్మాభిన్నమయిన నాత్మకు, ఆత్మాభిన్నమయిన పరమాత్మకును అంతట యునికి చెప్పబడినది. ఇంతియే కాని ఆత్మభేదముచే చెప్పబడలేదు. కావున "తస్యాఽహం" "సచమే" అను రెండుపదములచే శ్రీకృష్ణుడు ఆత్మభేదమును చెప్పె ననుట యనుచితము.

"తస్యాహం" "సచమే" వాడికి నేను, నాకు వాడు అని భేదోపదేశము లోకసిద్ధమయిన జీవేశ్వరభేదము ననువదించికాని, తత్వనిర్ణయము కొరకుగాదు. జీవేశ్వరులు ఏకాత్మస్వరూపులగుటచే ఒకరికొకరు పరోక్షులు (అగపడనివారు) కారని భాష్యకారు లనిరి. జీవేశ్వరు లుభయులు చైతన్యస్వరూపులేకనుక నొకరికొకరు పరోక్షులుకారనికూడ చెప్పవచ్చును.

ఇచట రామానుజులు "యోమాం పశ్యతి సర్వత్ర" అను పాదమునకు "యః సర్వత్ర ఆత్మవస్తునిచ మాం పశ్యతి" ఎవడు అంతట ఆత్మవస్తువుయందు నన్నుజూచునో అని యన్వయమును కల్పించిరి. "సర్వంచ మయి పశ్యతి" "మయి సర్వం ఆత్మవస్తు చ పశ్యతి" నాయందు సమస్తమయిన ఆత్మవస్తువును జూచునో అని యన్వయమును కల్పించిరి. ఇది అయుక్తము. ఏలయన రెండుపాదములయందును మూలముకంటె వ్యతిరిక్తముగా "ఆత్మవస్తువు" అను పదమును కల్పించుట అప్రమాణము. పదమును కల్పించినను అర్థము కుదరదని యిదివరకే నిరూపింపబడినది.

30

శ్లో. సర్వభూతస్థితం యో మాం భజ త్యేకత్వ మాస్థితః
సర్వదా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ॥ 30 ॥

అ అభేదభావమునుబొందినవాడై సర్వభూతములయం దిమిడియున్న పరమాత్మను తెలిసికొనునో, వాడు ప్రారబ్ధవశమున యథేచ్ఛగా సంచరించుచున్నను, సర్వవ్యాపకుడగు పరమాత్మయొక్క సచ్చిదానందస్వరూపమందున్న వాడేయగును.

తనయొక్క స్వరూపము తనకంటెభిన్నము కానేరదు. పరమపద మనిపించుకొనదగిన విష్ణుసంబంధమయిన స్వరూపము సాక్షాద్విష్ణువే యగును. నిర్ధర్మక పర

నానందబోధస్వరూపుడగు పరమాత్మయందు ధర్మధర్మిభావము కల్పింపగూడదు. విద్వాంసుడు స్వస్వరూపమునందుండుటయనగా స్వస్వరూపముతో నిలచిపోవుటయే కాని, ఆధారాధేయభావముతోఁగూడిన యునికిగాదు. జ్ఞాని స్వస్వరూపముతో నుండుటయే ముక్తి. సమ్యగ్జ్ఞానము కలవాడు ముక్తినొందుటలో దేహాదులు ప్రతిబంధకములు కానేరవు. అయ్యవి బ్రహ్మాత్మైకజ్ఞానమునలన సూర్యునివల్ల అంధకారము నశించినట్లు నశించిపోవును. విద్వాంసునకుగూడ ప్రారబ్ధముండునంత వరకు దేహాదులున్నను, అయ్యవి కాలిపోయి గుడ్డవలె (దగ్ధపటవత్) బంధకములు కానేరవు. పుణ్యపాపాదిసంస్కారములు ఆత్మతత్త్వజ్ఞానముచే నశించినందున నవి గూడ ప్రతిబంధకములుకావు. కావున బ్రహ్మాత్మైకత్వజ్ఞానముకలవానికి మోక్షము ప్రతిబంధరహితముగా సిద్ధించునని భావము.

"సర్వభూతస్థ మాత్మానం" "యోమాం పశ్యతి సర్వత్ర" అను రెండు శ్లోకములచేఁ జెప్పబడిన సమ్యగ్జ్ఞానమును (తత్త్వజ్ఞానమును) అనువదించి యీ శ్లోకమునందలి యుత్తరార్థముచే మోక్షఫలము విధింపబడినది.

రామానుజమతము :

ఇచట రామానుజులు "సయోగీ మయి వర్తతే" అను పాదమునకు "మత్సామ్యమేవ పశ్యతి" నాతోటిసామ్యమునే తెలిసికొనును. అని భాష్యమును రచించిరి. అది యుక్తముకాదు. సమాధియందుకాని, మరి యే ఇతరావస్థయందుకాని ఆత్మ పరమాత్మల నిద్దరను చూచుట సంభవించదు. ఇద్దరను ఒకేపర్యాయము చూచుట సంభవించుచో వారిద్దరకుగల సామ్యము (పోలిక) బోధపడును. ఆత్మ అనుభవ (జ్ఞాన) రూపుడుకాన సమాధియందు అనుభవమాత్రమే మిగులును.

నాలుగుభుజములతోగూడిన దేహముగలవాడు, పరమాత్మయనియు, రెండు భుజములతోగూడిన శరీరముకలవాడు జీవుడనియు సిద్ధాంతమగుచో నపుడు వీడు పరమాత్మ, వీడు జీవాత్మ యను బుద్ధి యుదయించును. అప్పుడు కూడ వారిరువురకు పోలిక కవకాశములేదు. ఒకరు అప్రాకృతదివ్యశరీరులు, రెండవవారు (జీవులు) ప్రాకృతశరీరులు, వీరుభయులకు పోలికయే అసంభవము.

మరియు తనకంటె వేరుగా పరమాత్మ తనచే (జూడబడుచో) పరమాత్మ జ్ఞేయ (తెలియదగినవాడు) మగును. పరమాత్మకు జ్ఞేయత్వమును శ్రుతి యంగీకరింపదు. "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" అను శ్రుతి పరమాత్మ జ్ఞాతయనియే చెప్పుచున్నదికాని, జ్ఞేయమని చెప్పుటలేదు. పరమాత్మ జ్ఞేయమగుచో జడు డగును. అంతట యనిత్యత్వముగూడ సంప్రాప్తమగును కావున, జీవాత్మ పరమాత్మ అను

వస్తుద్వయముయొక్క జ్ఞానము వాస్తవముగా కుదరనందున వారిరువురి సామ్యమున కెంతమాత్ర మవకాశములేదు. కనుక రామానుజవ్యాఖ్యానము పొసగదు. 30

శ్లో. ఆత్మౌపమ్యేన సర్వత్ర సమంపశ్యతి యోఽర్జున
సుఖంవా యదివా దుఃఖం స యోగీ పరమోమతః ॥ 32 ॥

అ. ఓయి అర్జునా! ఏ యోగి పరులసుఖదుఃఖములను తనసుఖదుఃఖములతో సమానముగా జూచుకొనునో ఆ యోగి సర్వోత్తముడు. ఆత్మజ్ఞానికి మోక్షముకలుగుటలో నేదియు ప్రతిబంధము కానేరదనియు, వానికి విధిప్రతిషేధ శాస్త్రనిర్బంధముతో నిమిత్తములేదనియును వెనుకటిశ్లోకమున చెప్పబడినది. అందువైన ఆత్మజ్ఞాని శాస్త్రమర్యాద నుల్లంఘించి హింసాకాండయందు ప్రవర్తించినను తప్పులేదు కదా? అట్లు ప్రవర్తించవచ్చుకదా? అని ప్రశ్న కలుగుచున్నది. దానికి సమాధానముకొరకు నీ శ్లోకము ప్రవర్తించినది తనకు సుఖమెట్లు అనుకూలమో పరులకు గూడ నట్లే సుఖము అనుకూలమని యోగి తలంచును. తనకు దుఃఖము ప్రతికూలమయినట్లు పరులకుగూడ నట్లే దుఃఖము ప్రతికూలమని తలంచును. ఇట్టి జ్ఞానము కలవాడు పరుల కపకారమును జేయడు. తనకు తనభార్యతో కలియుట సుఖము, తనభార్యను పరు లపహరించుట దుఃఖము. అట్లె పరులకుగూడ స్వభార్యాగమనము సుఖమనియు, భార్యాపహరణము దుఃఖమనియు తలంచినవాడు పరస్త్రీహరణ రూపమగు పాపమునకు పాల్పడడు. కావున యోగికి (అహింసకత్వము) అపకార మొనర్చకుండుట పరమసాధనమని సూచితమగుచున్నది.

అజ్ఞానులుకూడ గొందరహింసాస్వభావులుందురు. అంతమాత్రమున వారు అత్యుత్తములనదగరు. కావున అహింసాస్వభావముతోబాటు ఆత్మతత్వజ్ఞానము కూడ ఆవశ్యకము. బ్రహ్మాత్మైకత్వజ్ఞానము కలవానికి భూతదయ యావశ్యకమని సూచితమగుచున్నది.

రామానుజమతము:

ఇచట రామానుజులు శత్రువుయొక్క పుత్రజన్మ పుత్రమరణాదులతో సమానముగా తనయొక్క పుత్రజన్మ పుత్రమరణాదులను యెవడు గ్రహించునో ఆయోగి సర్వోత్తము డని యర్థముచు చెప్పిరి.

ఇది యుక్తముకాదు. అర్థము కొంతబాగున్నను ఈ యర్థమును బోధించు పదములు మూలమునందు లేవు. మూలమున సమభావమునకు తానే యుపమానమని గ్రహింపబడినది. శత్రువు ఉపమానమని చెప్పలేదు.

శత్రువుయొక్క పుత్రోత్పత్తి, పుత్రవియోగములతో తన కేలాటి సంబంధ ముండదని చెప్పవీలులేదు. శత్రువునకు పుత్రసంపదకలిగిన తనకు వైమనస్యము

కలుగుట, శత్రువునకు పుత్రవియోగముకలిగిన తనకు సంతోషముకలుగుట—లోక సిద్ధము యయున్నది. అట్లే మిత్రునకు పుత్రోత్పత్తికలిగిన తన మనస్సుకు సుఖవికారమున్ను, పుత్రమరణము తటస్థించిన తనకు దుఃఖవికారమున్ను లోకమునందు జూచుచున్నాము. అట్టికార్యములపట్ల తనకిట్టి వికారములు కలుగుటనుబట్టి శత్రుమిత్రుల యొక్క పుత్రోత్పత్తి పుత్రమరణములతో తనకుగూడ గొంతసంబంధ మున్నటుల నూహింపవగును. సంబంధములేనిదే సుఖదుఃఖవికారరూపమయినకార్యము పుట్టదు.

శత్రువుయొక్క పుత్రజన్మమరణాదులవలె తనయొక్క పుత్రజన్మమరణాదులు గూడ గ్రహింపవలెనన్నచో శత్రువునకు కుమారుడు గలుగగా, విరోధమను నిమిత్తమువలన తనకు దుఃఖముకలుగును. కాన తనకు పుత్రుడు కలిగినను తాను దుఃఖింపవలెనని యాపత్తి కలుగును (యర్థమగును). ఈ యాపత్తిని తప్పించుకొనుటకు తనయొక్క పుత్రజన్మమరణములను తనయొక్క బంధువుల పుత్రజన్మమరణముల వలె జూచుకొనవలెనన్నచో నట్టియుపదేశమే వ్యర్థమగును. ఎంతటి అజ్ఞానియయినను తనకు పుత్రోదయము కలిగినపుడు, తనబంధువులకు పుత్రోదయము కలిగినప్పుడు వలె సుఖాధికమును బొందుచునే యుండును. ఇట్టివిషయమును శాస్త్రకర్త లుపదేశింప బనిలేదు. ఇయ్యది లోకమునకు సహజము.

ఇక రామానుజభాష్యమునందలి “పర” శబ్దమునకు శత్రువనికాని మిత్రుడనికాని యర్థముకాదనియు, ఉదాసీనుడని యర్థమనియు, ఉదాసీనునకు పుత్రోత్పత్తి కలిగిన తనకు సుఖవికారముకాని, దుఃఖవికారముకాని కలుగదనియు, అట్లే సమభావముగలవాడు తనయొక్క పుత్రజన్మమరణాదులయందుగూడ నుండవలెననియు జెప్పుచో సరియు పొసగదు. సర్వసముడై భూతదయగల పురుషునకు, ఉదాసీనుని పుత్రియోగముకూడ దుఃఖావహమే యగును. అట్లుకానిచో నతడు నిర్దయుడనిపించుకొనును.

కావున తనకు పుత్రజన్మ మెట్లు సుఖమో పుత్రవియోగ మెట్లు తనకు దుఃఖకరమో అట్లే యితరునకును అని తెలిసికొని ఇతరులకు పుత్రద్రోహము మున్నగు నపకారములను చేయనివా డుత్తముడనియే శ్లోకమునకు ఋజువగు అర్థము. ౩౨

అర్జునః :

శ్లో. యోఽయం యోగ స్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన
ఏతస్యాఽహం నపశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్ ॥ 33 ॥

అ. అర్జును డడుగుచున్నాడు. ఓయికృష్ణ! మనస్సు అతిచంచలమయినది. ఒకక్షణకాలమయినను నిలచియుండ నేరదు. నీవు సర్వసమతాలక్షణమయిన యోగమును చెప్పియుంటివి. మనస్సు చంచలమయినందున సర్వసమతాయోగము స్థిరపడ నేరదని నాయభిప్రాయము. 33

శ్లో. చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవ ద్దృఢమ్
తస్యాఽహం నిగ్రహం మన్యే వాయో రివ సుదుష్కరమ్ ॥3౪॥

అ. భక్తులయొక్క పాపములను ఛేదించుటవలన భగవన్తుడు కృష్ణు డనిపించు కొనును. లేక కృషిధాతువునకు సత్త యర్థము. ణకారమునకు ఆనన్ద మర్థము. ఈ రెంటియొక్క ఐక్యమువలన కృష్ణుడనగా పరమానందసద్రూపుడని యర్థము.

ఓయి కృష్ణ! మనస్సు అతిచంచలము. శరీరమును ఇంద్రియములను క్షోభింప చేయుటయే దాని స్వభావము. ఎవరికిని నిగ్రహింపసాధ్యముకాదు. ఊర్ణనాభము (సాలెపురుగు) అవిచ్ఛిన్నముగా (సందులేకుండగా) దారముల నల్లి అందు యితరపురుగులను బంధింపజేయును. అట్లే మనస్సుకూడ సంకల్పవికల్పాదులను తెంపులేకుండా పుట్టించి వాటిచే పురుషుని కట్టివేయును. ఈ దృష్టాంతమువలన మనస్సు దృఢముగా బంధించుననియే తేలుచున్నది. సాలెపురుగు దృఢమైనది కానందున మనస్సు దృఢమైనదని సిద్ధింపదు. కొన్నిపుస్తకములయందు "తంతునాగ"మని పాఠముకలదు. అపుడు తంతునాగమువలె మనస్సు అతిదృఢమైనదని యర్థమగును. తంతునాగమనగా వరుణపాశ మను పేరుగల నీటిలో దిరుగు జంతువు. అయ్యది అతి దృఢమైనది-ఛేదింపశక్యముగాదు. అట్లే మనస్సుకూడ అతిదృఢమైన దని సిద్ధించును.

ఇట్టి మనస్సును నిగ్రహించుట గాలిని నిగ్రహించుటకంటెగూడ దుస్సాధ్య మని నేను తలచెదను. మూలమునందు (వాయోరివ) అని వాయు వుపమానముగా జేర్కొనబడినది. అది యుచితముకాదు. ఉత్కృష్టమగు మనస్సునకు అపకృష్టమగు (నీచమగు) వాయువును ఉపమానముగా జెప్పుట యనుచితము. లోకములో ఉప మానమగు చంద్రాదులు ఉత్కృష్టములుగా నుండుట అపకృష్టమగు ముఖాదులు ఉపమేయములుగా నుండుట సహజము. వేగమునందు వాయువుకంటె మనస్సు గొప్పదని ప్రసిద్ధము. కావున అవ్యయములకు అనేకార్థము లుండుటచే నిచట "ఇవ" శబ్దము "అపి" శబ్దముయొక్క అర్థమును చెప్పును. కనుకనే భాష్య కారులు (శంకరులు) భాష్యమునందు (తతోఽపి దుష్కరం మన్యే ఇత్యభిప్రాయః) గాలికంటెగూడ దుష్కరమ్మని తలచెదనని యభిప్రాయమనిరి. ॥3౪॥

శ్లో. అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలం
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే ॥3౫॥

అ. అర్జునా! మనస్సు చంచలమని, నిగ్రహింప శక్యముగాదని నీవు చెప్పిన దంతయు నిజము. కాని అట్టిమనస్సుకూడ అభ్యాసవైరాగ్యములచే నిగ్రహింప శక్యమగును. అభ్యాసమనగా ఒకానొక చిత్తభూమియందు (చిత్తమునకు విషయ మగు వస్తువునందు) సమానాకారమయిన జ్ఞానములను ఆవృత్తిపరచుట. ఉదాహర ణము:- ప్రణవోపాసకులకు ప్రణవమునందు మనస్సును నిలపి "ఓం బ్రహ్మ"

"ప్రణవో బ్రహ్మ" "ప్రణవమే బ్రహ్మ" అను జ్ఞానమును ఆవృత్తిపరచుట విష్ణూపాసకులకు విష్ణువుయందు మనస్సు నిలిపి (విష్ణుమూర్తిర్బ్రహ్మ) విష్ణుమూర్తి బ్రహ్మయను జ్ఞానమును ఆవృత్తిపరచుట.

ఆత్మోపాసకులకు ఆత్మయందు మనస్సు నిలిపి (అహం బ్రహ్మాస్మి) నేను బ్రహ్మను అను జ్ఞానమును ఆవృత్తిపరచుట అభ్యాసమనబడును.

ఐహికవిషయము లన్నియు దృష్టవిషయములు. పరలోకవిషయములు అదృష్ట విషయములు. ఈ రెంటియందును నశించుట, హెచ్చుతగ్గులు కలిగియుండుట, తుదకు దుఃఖమునే యిచ్చుట అను దోషములు కలవు. ఈ దోషములను మాటి మాటికి మనసా నిమర్శించుకొనుటవలన విషయములయందు వైరాగ్య మేర్పడును. ఇట్టి అభ్యాసవైరాగ్యములను సాధనములచే మనస్సు నిగ్రహించుకొనవలయును. సంకల్ప వికల్పాది వికారములతో గూడియున్న మనస్సును హఠాత్తుగా వృత్తి రహిత మొనర్చుట సాధ్యముకాదు కనుక మొట్టమొదట ఉపాసనాక్రియయందు మనస్సును ప్రవేశపెట్టి అటుపైన విషయములయందలి దోషజ్ఞానముచే విషయ చింతనమునుండి మనస్సును మరల్పి మదించిన గుఱ్ఱమును నేర్పరి స్వాధీనపరచు కొనునట్లు మెల్లమెల్లగా మనస్సును స్వాధీనపరచుకొనవలయును. ఇట్లు క్రమక్రమ ముగా మనస్సును స్వాధీనపరచుకొనుటకు పురుషునకు స్వాతంత్ర్యము కలదు. ౩౫

శ్లో. అసంశయాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః ॥ ౩౬ ॥

అ. ఓయి యర్జునా! అంతఃకరణము స్వాధీనముకానివానికి యోగము పొంద శక్యముగాదని నా యభిప్రాయము.

అభ్యాసవైరాగ్యము లను సాధనములచే అంతఃకరణమును స్వాధీనపరచు కొని మాటిమాటికి ప్రయత్నముచేయువానికి యోగము స్వాధీనమగును. "సనిశ్చ యేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా" అని చెప్పుటచే ప్రయత్నావస్థలో నిర్వే దము యెంతమాత్రము కూడదు. "ఉత్సేధ ఉదధే ర్యద్వత్కుశాగ్రేణైక బిందునా, మనసో నిగ్రహ స్తద్వద్భవే దపరిఖేదతః" అని యార్యోక్తి కలదు. ఒకానొకపక్షి సముద్రతీరమున గ్రుడ్లనుపెట్టుకొనెను. సముద్రుడు తరంగవేగముచే వాని నపహ రించెను. అంతట నా పక్షి సముద్రుని యెండగట్టెదనని తలచి తనముఖముతో దర్భ పుల్లను పట్టుకొని దానిచివరభాగముతో ఒక్కొక్క-బిందువును గట్టున వేయ సాగెను. అప్పు డనేకపక్షులు వచ్చి నివారించినను ఆ పక్షి ఆపనినుండి మరలలేదు. అంతట దైవికముగా నచ్చటకు వచ్చిన నారదుడు విషయము నంతయు విని నివారిం చినను వినక నారదునితో "యీ జన్మయందుగాని మరియొక జన్మయందుగాని యేదియో యొకనుపాయముతో సముద్రుని ఎండింపజేతు" నని ప్రతిజ్ఞ చేసెను.

తదుపరి దయాళుడగు నారదుడు యీ విషయమంతయు గరుత్మంతునితోఁ జెప్పి నీ సజాతీయమగు పక్షిని సముద్రుడవమానపరచుచున్నాడని చెప్పి ప్రేరేపించి సాయమొనరింప పంపెను. అంతట గరుడుని రెక్కలయొక్క గాలిచే నెండిపోవు చున్న సముద్రుడు భయపడి యా గ్రుడ్లను ఆపక్షికి నిచ్చెను. కావున నీ పక్షివలె ఖేదములేకుండ ప్రయత్నముచేయువానికి యోగము సిద్ధించునని భావము. 36

శ్లో. అయతి శ్శ్రద్ధయోపేతో యోగా చ్చలితమానసః
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి ॥ 37 ॥

అ. ఓయికృష్ణ! ప్రయత్నమును వదలి యోగమార్గమునందు ఆస్తిక్యబుద్ధి మాత్రముండి ప్రాణావసానకాలమునందు చిత్తచాంచల్యముకలుగగా, యోగవిషయమైనస్మృతి తప్పిపోయిన యోగఫలమగు సమ్యగ్జ్ఞానమును పొందలేడుకదా? అట్టి యోగి మరేగతినిబొందును? ఈ ప్రశ్న సన్యాసివిషయముకాని గృహస్థువిషయము కాదు. 37

శ్లో. కచ్చి న్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్రమివ నశ్యతి
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి ॥ ॥ 38 ॥

అ. ఓయి కృష్ణ! బ్రహ్మమార్గమందు నిలువలేక కర్మమార్గమునుండియు, యోగమార్గమునుండియు చెడిపోయిన యోగి గాలికి విడిపోయిన మేఘమువలె నశించడుకదా?

రామానుజమతము :

ఇచట రామానుజులు "అప్రతిష్ఠః" అను పదమునకు స్వర్గసాధనమయిన కర్మమార్గమును (సకామకర్మమార్గమును) వదలినవాడు అనియు, "బ్రహ్మణః పథి విమూఢః" మొదలుపెట్టిన బ్రహ్మమార్గమునుండి జారిపోయినవాడనియు అర్థమును చెప్పి యీవిధముగా నుభయభ్రంశమును సాధించిరి. వీరి యాశయ ప్రకారము సకామకర్మను వదలి నిష్కామకర్మను నాచరించుచు బ్రహ్మజ్ఞానమును పొందలేని గృహస్థునుగురించి యీ ప్రశ్న చేయబడినదని తేలుచున్నది.

ఇది యుక్తముగాదు. స్వర్గసాధనమయిన కర్మనుగూడ ఫలేచ్ఛను వదలి యాచరించినచో చిత్తశుద్ధి దురితక్షయము మున్నగు మహాఫలము కలదు కాని చెఱుపులేదు మరియు గృహస్థునకు నిత్యకర్మఫలముండగా యోగమార్గము నాశ్రయించినంతమాత్రమున గృహస్థు కర్మమార్గభ్రష్టుడు కానేరడు. కావున గృహస్థును గురించి యుభయభ్రంశప్రశ్న యుచితముకాదు. ఈవిషయము యింతకుముందు అధ్యాయారంభమునందే శంకరులు ప్రతిపాదించిరి.

శ్లో. ఏతం మే సంశయం కృష్ణ! ఛేత్తు మర్హస్యశేషతః
త్వదన్య స్సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే ॥ ౩౯ ॥

అ. ఓయి కృష్ణ! నాకు కలిగిన యీ సంశయమును నీవే తీర్పగలవు కాని యితరులు బ్రహ్మాదిదేవతలుకాని, వసిష్ఠాది ఋషులు కాని యెవ్వరు తీర్పలేరు. ౩౯

శ్రీ భగవా నువాచ :

శ్లో. పార్థ నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే
న హి కల్యాణకృత్కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి ॥ ౪౦ ॥

అ. ఓయి అర్జునా! యోగభ్రష్టునకు యీలోకమునందుగాని, పరలోకమునందుగాని వినాశములేదు. అనగా యీలోకమునందు పశుపక్ష్యాది నీచజన్మగాని, పరలోకమునందు నరకసంబంధమయిన హీనజన్మగాని రాదని భావము. మంచి చేసినవానికి చెడు యెన్నటికిని రాదని లోకసామెత. యోగము మిక్కిలి మంచిపని కావున యోగాభ్యాసికి దుర్గతి సంభవింపదు. ఇచట శ్రీకృష్ణుడు అర్జునుని తాత అని సంబోధించెను. (తనోత్యాత్మానం పుత్రరూపేణ) అను వ్యుత్పత్తిచే తన స్వరూపమును పుత్రరూపముగా విస్తరింపజేసికొనుచున్నాడు కాన తండ్రియే 'తాత' యనబడును. "అంగాదంగాత్సంభవసి హృదయాదధిజాయతే" అను శ్రుతి యిందుకు ప్రమాణమగుచున్నది. "ఆత్మావై పుత్రనామాసి" అను శ్రుతివలన తండ్రియే కొడుకుకాన తండ్రియందు వర్తించు తాత అను శబ్దము పుత్రునియందుగూడ వర్తించును. శిష్యుడుగూడ కొడుకుతో సమానుడు కావున తాతశబ్దము శిష్యునకుగూడ వర్తించును. అదెట్లన వంశము రెండువిధములు. విద్యాప్రయుక్తము, జన్మప్రయుక్తము అని. జన్మచే తండ్రివలన కుమారుడు కలుగును, విద్యచే గురువువలన శిష్యుడు కలుగును. విద్యచే జన్యజనకభావసంబంధము గురుశిష్యులకు కలదుగాన గురువు తండ్రియు, శిష్యుడు కొడుకును అగును. కావున కొడుకునందు వర్తించిన తాత శబ్దము యీవిధముగా శిష్యునియందుగూడ వర్తించును.

భాష్యమునందు "శిష్యోపి పుత్రవదితి అపుత్రోఽపి తాత ఉచ్యతే" అని వాక్యము కలదు. అందు అపుత్రోఽపి అనుచోట నఞ్ నకు (అకారమునకు) సాదృశ్యార్థము. కావున అపుత్రుడనగా పుత్రసదృశుడని యర్థము. పుత్రునికంటె నితరుడు అపుత్రుడని యేల చెప్పరాదని యనదగును. అట్టితరి పుత్రునికంటె నితరమగు పటాదులుగూడ అపుత్రమగును. అపుడు ఘటముకూడ తాతశబ్దవాచ్యము కావలసివచ్చును. ఇయ్యది అనిష్టము. కావున నఞ్ నకు సాదృశ్యమే యర్థము చెప్పవలెను. పుత్రసదృశుడనియే యర్థము, పుత్రసదృశుడగు శిష్యునియందు తాతశబ్ద ప్రయోగము యుక్తమగును. ॥ ౪౧ ॥

శ్లో. ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే ॥ ౪౧ ॥

అ. యోగమార్గమునందు ప్రవర్తించిన సన్యాసి అశ్వమేధాది యాగములొనర్చిన పుణ్యవంతులయొక్క లోకములను జేరి యచ్చట అనేక సంవత్సరములుండి ఆ పుణ్యభోగము నశించినపిదప వేదవిహితకర్మల నాచరించు నైశ్వర్యవంతుల యింటిలో బుట్టును. ౪౧

శ్లో. అథవా యోగినామేవ కులే భవతి ధీమతాం
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్ ॥ ౪౨ ॥

అ. లేక బుద్ధిమంతులగు యోగులయొక్క వంశమును బుట్టును. దరిద్రులగు యోగులయొక్క కులమున జన్మ దొరకుట చాలదుర్లభము. యోగులుకాని దరిద్రులయొక్క కులమునందు జన్మ పాపమునకు కారణమగును. యోగులయినను ధనికులయినవారింటి బుట్టుట మదమునకు కారణమగును. కావున దరిద్రులయిన యోగుల యింట బుట్టుట మంచిదని భావము. ౪౨

శ్లో. తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికం
యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురునందన ॥ ౪౩ ॥

అ. యోగభ్రష్టుడు దరిద్రులయిన యోగులవంశమున బుట్టి పూర్వదేహసంబంధమయిన యోగజ్ఞానమును పొంది మరల యోగసిద్ధిని బొందుటకు మాటిమాటికి ప్రయత్నించుచుండును. దీనినిబట్టి శ్రీమంతులయిన యోగుల నింట బుట్టిన యోగభ్రష్టునకు పూర్వజన్మజ్ఞానము కలుగదని తేలుచున్నది. కారణమేమన దరిద్రయోగులనింటబుట్టినవాడు దారిద్ర్యమును అనుభవించుటచే వానిపాపము నశించును. పుణ్యము నశింపదు. దారిద్ర్యము పాపఫలముకాని పుణ్యఫలముకాదు. కావున దారిద్ర్యానుభవముచేత పాపమే నశించును.

కావున నెవరు ఐశ్వర్యమును అనుభవించుచున్నారో వారు పూర్వజన్మసుకృతమును నశింపజేసికొనుచున్నారు. ఇందుకు "పూర్వపుణ్యవిభవ వ్యయలబ్ధా స్సంపదో విపద ఏవ విమృష్టాః" అను శ్రీహర్షప్రయోగము ప్రమాణము. అందువలన ఐశ్వర్యానుభవముచే పూర్వార్జితమయిన యోగపుణ్యము నశించినందున శ్రీమంతులయిండ్ల బుట్టిన యోగభ్రష్టునకు పూర్వజన్మజ్ఞాన ముండదు. దరిద్రయోగికులమందు బుట్టినవానికి దారిద్ర్యానుభవముచే యోగపుణ్యము నశించనందున ఆపుణ్యబలముచే పూర్వదేహజ్ఞానముండును.

కావున ఐశ్వర్యానుభవముచే నెవ్వని పూర్వపుణ్యము నశించునో వాడు తక్కువవాడు. దారిద్ర్యానుభవముచే నెవ్వని పూర్వపుణ్యము నశించదో వాడు

ఉత్తమము. కనుక దరిద్రులయిన యోగులయింట జన్మించుట పరమోత్తమమని భావము. ఇచట సంసిద్ధపదమునకు మోక్షమనికాని, సమ్యగ్దర్శనమనికాని యర్థము.

శ్లో. పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే ॥ ౪౪ ॥

అ. యోగాభ్యాసపరుడు యోగాభ్యాస సంస్కారముకంటె బలవత్తరమయిన పుణ్యాపాప కర్మలను పూర్వము చేసియున్నయెడల వాటివల్ల యోగాభ్యాస సంస్కారము అడ్డుపడియుండును. ప్రతిబంధకములయిన పుణ్యాపాపసంస్కారములు నశించినపిదప యోగసంస్కారము యోగభ్రష్టుని మరల యోగమార్గమునందు ప్రవేశపెట్టును. యోగసంస్కార మెంతకాలము నిలవయుండినను నశింపదు. ప్రతిబంధక సంస్కారములు నశించినపిదప తనపనిని తాను నెరవేర్చియే తీరును. ఎవ్విధముగను యోగ సంస్కారము వ్యర్థమనుటకు వీలులేదు. కావున యోగస్వరూపమును పూర్తిగా తెలియక యోగనిష్ఠుడయినవాడు గూడ వేదోక్త కర్మానుష్ఠానమువలన కలుగు ఫలముకంటె గొప్పఫలమునే పొందును. యోగస్వరూపమును పూర్తిగా తెలిసికొని యోగాభ్యాస మొనర్చువాడు గొప్ప ఫలమును పొందునని వేరుగా చెప్ప నక్కరలేదు.

రామానుజమతము :

రామానుజులు మూలమునందలి "శబ్దబ్రహ్మ" అను పదమునకు దేవ మనుష్యాది పదములచే జెప్పదగిన ప్రకృతి యని అర్థమును రచించిరి. ఇది అయుక్తము. బ్రహ్మపదము చేతనే ప్రకృతి యను అర్థము లభించుచుండగా 'శబ్ద' అను పదము వ్యర్థమగును. శబ్ద వ్యవహారయోగ్యమగు బ్రహ్మ ప్రకృతియనియు, శబ్దవ్యవహారమునకు యోగ్యముకాని బ్రహ్మ పరబ్రహ్మయనియు అర్థమన్నచో పరబ్రహ్మ రూపశబ్దవ్యవహారయోగ్యుడు పరబ్రహ్మకూడ యగునుకాన, నదియు పొసగదు. దేవమనుష్యాది విశేషశబ్దములు మూలమునందు లేనందున దేవమనుష్యాది శబ్ద వ్యవహారయోగ్యమగు బ్రహ్మయనికూడ చెప్ప వీలులేదు.

మరియు శబ్ద అను పదమునకు శబ్దవ్యవహారయోగ్యము అను అర్థము కూడ వాచ్యార్థము కానేరదు. లక్షణ యంగీకరింపక తప్పదు. అప్పుడు లక్షణాంగీకారదోషము శాంకరమతమునందువలె రామానుజమతమునగూడ అనివార్యమగును.

పోనిండు: అతిప్రయాసచే "శబ్దబ్రహ్మ" అను పదమునకు "ప్రకృతి" అను అర్థము నంగీకరింతము. అయినను అన్వయము కుదరనేరదు. యోగజిజ్ఞాసువు ప్రకృతిని యెట్లతిక్రమించును? మీమతమున ప్రకృతిని యెట్లతిక్రమించును?

మీమతమున ప్రకృతిని అతిక్రమించినవాడు పరమాత్మ యొక్కడేకదా? ముక్తులు గూడ భగవదనుగ్రహమువలననే మాయను అతిక్రమింతురుకాని స్వయముగా నతిక్రమింపలేరుకదా? యోగజిజ్ఞాసువు బద్ధజీవుడుకాని పరమాత్మకాడు, ముక్తుడును కాడు. కావున యోగజిజ్ఞాసువు (యోగమును తెలియగోరినవాడు) యెట్లు ప్రకృతిని అతిక్రమించును?

ఇంక యోగజిజ్ఞాసువు యోగమును తెలుసుకొని యోగమును అనుష్ఠించి ప్రకృతిని అతిక్రమించును. ఈ యభిప్రాయముతో జిజ్ఞాసువు శబ్దబ్రహ్మను (ప్రకృతిని) అతిక్రమించునని చెప్పబడిన దన్నచో నదియు పొసగదు. "జిజ్ఞాసురపి" అని మూలమునందలి అపి శబ్దము యోగమును తెలిసికొనినవానికంటె యోగము ననుష్ఠించినవానికంటెకూడ యోగజిజ్ఞాసువు వేరని చెప్పుచున్నది. కావున జిజ్ఞాసువే తెలిసికొని యనుష్ఠించి ప్రకృతిని అతిక్రమించునని యనదగదు.

మరియు యోగానుష్ఠానముచేసినవాడుగూడ యోగానుష్ఠానమాత్రముచే ప్రకృతి నతిక్రమింపనేరడు. మరేమనిన యోగానుష్ఠానమువల్ల సమ్యగ్జ్ఞానమును పొంది దానిచే ప్రకృతి నతిక్రమించును. కావున ప్రకృతిని అతిక్రమించు సామర్థ్యము జ్ఞానికేగాని, యోగికిగూడ లేదని తేలుచుండ, యోగజిజ్ఞాసువునకు ప్రకృతికిని అతిక్రమించు సామర్థ్యము యెట్లేర్పడును?

**వేదాన్తదేశికమతము :**

ఈ శ్లోక వ్యాఖ్యానసందర్భములో వేదాంతదేశికులు జ్ఞానానన్దమయుడగు ఆత్మ పరమాత్మకు శేషు (దాసు) డని యనిరి.

ఇదియును యుక్తముగాదు. జ్ఞానానన్దమయు డన్నచోట మయులు ప్రత్యయమునకు ప్రాచుర్య మర్థమా? వికార మర్థమా? అని ప్రశ్నింపవలెను. అందు మొదటిపక్షము కుదరదు. ఆనన్దము ప్రచురముగా నున్నదనినచో దుఃఖముకూడ కొద్దిగా నున్నదని తోచును. ఆత్మ నిర్వికారుడు కాన ఆనన్దవికారు డను రెండవ పక్షముకూడ కుదరదు.

ఇంక "జ్ఞానానన్ద మయస్తు" అని వైలక్షణ్యాద్యోతకమగు తు శబ్దముగూడ నుచితముకాదు. ఆత్మ పరమాత్మలకు వైలక్షణ్యము లేదు. మీమతమున పరమాత్మకూడ జ్ఞానస్వరూపుడు. ఆనన్దమయుడు అని యంగీకరించియే యుండిరి. శంకరమతమునగూడ జీవ పరమాత్మ లిద్దరు ఆనన్దరూపులయినందున వారుభయులకు భేదములేదు.

ఇక అనాత్మ పదార్థములద్వారా ఆనన్దమయాత్మకు భేదము కలదుకాన తు శబ్దప్రయోగము ఉచితమగు నన్నచో నదియు పొసగదు. అనాత్మలగు విజ్ఞానానన్ద

మయ కోశములు జ్ఞానానందమయుడగు ఆత్మకంటె భిన్నమని ప్రతిపాదింప శక్యము కాదు. విజ్ఞానమయాత్మ ఆనందమయాత్మయందు లయమగునని శ్రుతిచెప్పుటచే విజ్ఞానమయుడు జీవుడనియు, ఆనందమయుడు యీశ్వరుడనియు భేదము నిర్వచింప శక్యముకాదు. ఆనందస్వరూపమును ఆవరించుటచే విజ్ఞానమయ ఆనందమయములు కోశములనియు, వాటిలోపల నుండువాడుమాత్రమే ఆత్మయనియు నంగీకరింపక తప్పదు.

కావున విజ్ఞానానందమయ కోశములయందుండు జ్ఞానానందరూపుడగు ఆత్మ పరమాత్మకు శేషుడని యనదగదు. ఈశ్వరుడుకూడ ఆత్మభిన్నుడగుచో ఆత్మకు శేషుడు కావలసివచ్చును. జ్ఞానానందరూపుడగు ఆత్మకంటె నీశ్వరుడు భిన్నుడగుచో జ్ఞానానందస్వరూపుడు కానేరడు. జ్ఞానానందస్వరూపుడగుచో ఆత్మకంటె భిన్నుడు కానేరడు. స్వరూపభేదము లేనిదే వస్తుభేదము సంభవింపదు.

ఘటములు రెండు మృణ్మయములయినను రెంటికి పరస్పరభేదమున్నటుల జ్ఞానానందరూపులగు జీవేశ్వరుల కిద్దరకుకూడ నట్లే భేదముండుగాక యని వచింప రాదు. ఘటములు రెండు మృణ్మయములయినను ఆకారభేదముండుటచే భేదము పొసగుచున్నది. జీవేశ్వరులిద్దరు జ్ఞానాకారులగుటచేతను, ఆకారభేదము లేకుండుట చేతను పరస్పరభేదము పొసగదు.

ఓయి! జీవేశ్వరులకు స్వరూపతః భేదములేకున్నను ధర్మమువలన భేదము సంభవించును. జీవుడు కించిత్ జ్ఞుడు. ఈశ్వరుడు సర్వజ్ఞుడు. కావున నీ ధర్మభేదము వలన జీవపరమాత్మలకు భేదము ఉచితము అన్నచో నది యుక్తముగాదు. కించిత్ జ్ఞత్వ, సర్వజ్ఞత్వములు ఉపాధిధర్మములుకాని ఆత్మధర్మములుకావు. ఔపాధిక భేదము వాస్తవముకానేరదు. కావున జీవపరమాత్మలకు భేదముకాని, శేష శేషీ భావముకాని యసంభవము. ॥౪౪॥

శ్లో. ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః
అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్ ॥ ౪౫ ॥

అ. యోగమార్గమునందు యెక్కువగా ప్రయత్నించునట్టి విద్వాంసుడు పాపములను పారద్రోలుకొని అనేకజన్మలయందు క్రమక్రమముగా సంస్కారమును సంపాదించుకొని, ఆ సంస్కారబలముచే సమ్యగ్జ్ఞానముచు పొంది, దానివలన మోక్షము నొందుచున్నాడు. ॥ ౪౫ ॥

శ్లో. తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భవార్జున ॥ ౪౬ ॥

అ. ఓయి అర్జున! ధ్యానయోగి తపోనుష్ఠానపరులకంటె గొప్పవాడు. శాస్త్రార్థ పాండిత్యముగల విద్వాంసులకంటె గొప్పవాడు. అగ్నిహోత్రాది కర్మానుష్ఠానపరులకంటె గొప్పవాడు. కావున నీవుకూడ ధ్యానయోగివగుము. మూలమునందలి జ్ఞానపదము శాస్త్రార్థజ్ఞానవిషయముకాని సమ్యగ్జ్ఞానము విషయముకాదు. సమ్యగ్జ్ఞానము సాక్షాన్మోక్షసాధనము. ధ్యానయోగము జ్ఞానయోగముద్వారా మోక్షసాధనము. కావున జ్ఞానయోగముకంటె ధ్యానయోగము గొప్పదికానేరదు. కనుక జ్ఞానపదమునకు శాస్త్రార్థజ్ఞానమే యర్థము.

ఓయి! అజ్ఞానియగు క్షత్రియునకు కర్మయోగమునందే యధికారమని శ్రీకృష్ణులు "కురుకర్మైవ తస్మాత్త్వమ్" "కర్మణ్యేవాధికారస్తే" అను ప్రమాణములచే పార్థునిగురించి నిరూపించిరి. ఇప్పుడు "యోగీభవ" ధ్యానయోగివగుమని యర్జునునిగురించి యేలచెప్పిరి? ధ్యానయోగము సన్యాసికే తటస్థించును కాని గృహస్థున కబ్బదని యింతకుమున్నే సిద్ధాంతముచేయబడినదికదా? క్షత్రియునకు సన్యాసాధికారము లేదనికూడ నిదివరకే నిరూపింపబడినదికదా? కావున నిపుడు "అర్జునా! నీవు ధ్యానయోగివగు" మని శ్రీకృష్ణు డేల యుపదేశించెను?

సమాధానము: యుద్ధరూపమయిన కర్మయోగమును అనుష్ఠించి, పిదప సన్యసించి, ధ్యానయోగి వగుమని శ్రీకృష్ణోపదేశమునకు తాత్పర్యము.

క్షత్రియునకు బొత్తుగా సన్యాసమునం దధికారము లేదని యనదగదు. శిఖాయజ్ఞోపవీత పరిత్యాగపూర్వక సమస్త్రిక సన్యాసమునం దధికారము లేకున్నను పుత్ర మిత్ర కళత్రాది పరివారమును విడచుట రూపమయిన అముఖ్యసన్యాసమునం దధికారము కలదు. ముచుకుందుడు మున్నగు క్షత్రియులు తనకున్న పరివారమునంతయు వదలి యొకానొక విజనప్రదేశమున ధ్యానయోగమునం దుండుట పురాణాదులవలన వినుచున్నాము. అట్టి సన్యాసమే క్షత్రియులకు విహితము.

ఓయి! సన్యాసికే ధ్యానయోగమునం దధికారమగుచో సన్యసింపని వసిష్ఠాదులు ధ్యానయోగ మెట్లవలంబించిరి? వినుము. లోకాతీత మహిమగల మహానుభావులు యిట్టి స్థలములయం దుదాహరణకు తగరు. తత్త్వవేత్తలయిన నట్టి మహానుభావులు ప్రారబ్ధానుసారముగా నెట్లెట్లో వర్తింతురు. ఈవిషయ మింతకుమున్ను విపులముగా ప్రతిపాదింపబడి యున్నది. కావున శ్రీకృష్ణోపదేశ ముచితమే యగును.

శ్లో. యోగినా మపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా
శ్రద్ధావాన్ భజతే యోమాం సమే యుక్తతమోమతః ॥౪౭॥

అ. ఓయి అర్జునా! ఎవడు కడుశ్రద్ధతో అంతరాత్మను నాయందుంచి నన్ను సేవించునో వాడు యోగులందరిలోను శ్రేష్ఠుడని నామతము. ధ్యేయవస్తువుయందు

చిత్తము నేకాగ్రము చేయుట యోగమనబడును. ధ్యేయులు, రుద్రుడు, ఆదిత్యుడు, విరాట్, హిరణ్యగర్భుడు, ఇన్ద్రుడు, వరుణుడు అని నానావిధములుగా కలరు. వారి వారి నుపాసించు యోగులుకూడ నానావిధము లగుదురు. కనుకనే మూలమున యోగినాం అని బహువచనము ప్రయోగింపబడినది. వాసుదేవుని సగుణముగాకాని, నిర్గుణముగాకాని ధ్యానింపవచ్చును. ధ్యానమనగా "సోహమస్మి" అని ప్రత్యగభేదముగా చింతనము చేయుట.

రుద్రాదిత్యులు జీవులు. వారికి పరస్పరభేదము కలదు. వారి యుపాసన కూడ భిన్నోపాసన యగును. వాసుదేవుడు జీవుడుకాడు. పరమాత్మ, వాసుదేవోపాసన అభేదోపాసనయగును. కావున రుద్రాదిత్యాద్యుపాసకులకంటె వాసుదేవోపాసకు డుత్తముడని భావము.

ఓయి! అన్తఃకరణావచ్ఛిన్నచైతన్యము ప్రత్యగాత్మ, మాయావచ్ఛిన్నచైతన్యము పరమాత్మ. యీ రెంటికి భేదముండుటచే అభేదచింతనము, అన్నము బ్రహ్మయని యుపాసించినట్లు కాల్పనికమగునుకాని వాస్తవము కానేరదు. అనినచో వినుము. అంతఃకరణము మాయ అను ఉపాధులు వేరయినను తదవచ్ఛిన్న (వాటితో కూడిన) చైతన్యముమాత్రము ఒకటే యగుచున్నది. ఘటమఠాద్యుపాధులు వేరయినను వాటితో కూడిన ఆకాశమునకు వాస్తవముగా భేదము లేనట్లు చైతన్యమునకుగూడ ఉపాధిభేదమువలన నిజముగా భేదములేదు. కావున ప్రత్యగాత్మను "సోఽహమస్మి" అని అభేదముగా నుపాసించుట వాస్తవమె యగుచున్నది.

మరియు ప్రత్యగాత్మ పరిచ్ఛిన్నుడనియు, పరమాత్మ పరిపూర్ణుడనియు విశేషముండుటచే నభేదోపాసన యెట్లు పొసగు నని యనరాదు. పరిచ్ఛేదము, పరిపూర్తి అను ధర్మములు ఉపాధిప్రయుక్తములు. వాస్తవముగ నా ధర్మములు చైత్యమునందు లేవు. "ఏకమేవాద్వితీయం" అను శ్రుతి చైతన్యము అభిన్నమని చెప్పుచున్నది. ప్రత్యగాత్మకు పరిచ్ఛిన్నత్వము అంగీకరించినచో పరిచ్ఛిన్నములయిన ఘటాదులు అనిత్యములు, జడములు అయినట్లు ప్రత్యగాత్మకూడ జడము, అనిత్యము కావలసివచ్చును. అయ్యది అనిష్టము, శాస్త్రవిరుద్ధమున్ను అగును. మరియు ప్రత్యగాత్మ జీవుడు, పరమాత్మ యీశ్వరుడు. వీరుభయులకు ఏనుగదోమలకువలె చాలభేదము కలదు అని యనరాదు. "జీవ ప్రాణధారణె" అను శాసనమునుబట్టి ప్రాణధారులే జీవులని స్పష్టమగుచున్నది. "అప్రాణోహ్యమనాశ్శుభ్రః" అను శ్రుతి ప్రత్యగాత్మకు ప్రాణసంబంధము లేదని చెప్పుచున్నది. కావున ప్రత్యగాత్మ పరమాత్మలకు భేదములేదు.

కావున, దేవమనుష్యాది భేదముచే భిన్నభిన్నమయిన శరీరేంద్రియసంఘాతమునందు అహంమమాభిమానము కలవారు జీవులు. వీరు ప్రత్యగాత్మయగు కూటస్థునియందు కల్పింపబడుటచే వాస్తవముగా ప్రత్యగాత్మలే యగుదురు. రజ్జువునందు కల్పింపబడిన సర్పము వాస్తవముగా రజ్జుస్వరూపమే యగునుకాని వేరుకాదు. కనుకనే "తత్త్వమస్యాది" శ్రుతులు జీవేశ్వరులకు అభేదమును చెప్పుచున్నది.

అదెట్లన సంసారి, జీవ అను శబ్దముచే చెప్పదగిన అన్తఃకరణ విశిష్టచైతన్యము త్వాం పదమునకు వాచ్యార్థము. సంసారసంబంధములేని అంతఃకరణోపహిత చైతన్యము లక్ష్యార్థము. జగత్కర్తయగు మాయావిశిష్ట యీశ్వరచైతన్యము తత్పదమునకు వాచ్యార్థము. మాయోపహితమగు పరబ్రహ్మచైతన్యము తత్పద లక్ష్యార్థము. ఏ చైతన్యము మాయోపహితమో, అదియే చైతన్యము. అన్తఃకరణోపహితమగుచున్నది. మాయ, అంతఃకరణము లను ఉపాధులకు భేదమున్నను ఉపహితమగు చైతన్యమునకు భేదములేదు. కనుక "తత్త్వమసి" ఇత్యాది శ్రుతులకు అఖండమగు బ్రహ్మయే లక్ష్యార్థము.

ఇట్లు ప్రథమషట్కముచే కూటస్థునియందు గల్పింపబడిన సంసారియగు చిదాభాసునియొక్క స్వస్వరూపము నిర్ధర్మక పరమానన్దప్రత్యక్చైతన్యమే యని శోధిత త్వం పదార్థము నిరూపింపబడినది.

ఇట్లు శ్రీ భగవద్గీతా భాష్యార్కప్రకాశికానువాదమున
నారవయధ్యాయము ముగిసినది.

ప్రథమషట్కము సమాప్తము



# శ్రీ భగవద్గీతా భాష్యార్క ప్రకాశికానువాదము

## సప్తమాధ్యాయము

శ్రీకృష్ణ భగవానులు చెప్పుచున్నారు:

శ్లో. మయ్యాసక్తమనాః పార్థ! యోగం యుంజ న్మదాశ్రయః
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి త చ్ఛృణు ॥ ౧ ॥

అ. శ్రీకృష్ణుడు పూర్వాధ్యాయాంతమున, "యోగినా మపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా, శ్రద్ధావాన్ భజతే యో మాం సమే యుక్తతమో మతః" (౬-౪౭) అనుశ్లోకముచే యోగులందరిలోను, నాయం దంతరాత్మనుయుంచి శ్రద్ధాభక్తులతో నన్ను సేవించువాడు గొప్పవాడు అని పార్థునితోఁ జెప్పెను. దీనివలన పార్థునకు, 'వాసుదేవుడవగు నీయొక్క తత్వ మెట్టిది? నీయం దంతరాత్మ నుంచు టెట్లు?' అని రెండుప్రశ్న లుదయించవచ్చును. శ్రీ కృష్ణుడు ఆరవయధ్యాయమును "తస్మాద్యోగీ భవార్జున" (౬-౪౬) అను నలుబదియారవ శ్లోకముతోనే ముగించి యున్నయెడల పార్థున కీ రెండుప్రశ్నలు పుట్టుటకు కారణముండదు. కావున శ్రీకృష్ణుడు తానే పార్థున కీ ప్రశ్నబీజమును కలుగజేసినందున, పార్థు డడుగకున్నను, శ్రీకృష్ణుడు తనంతటతానే యీ యధ్యాయమున 'నాదు తత్వమిట్టిది. నాయం దంతరాత్మనుంచిన యోగి యిట్లుండును' అని సమాధానము జెప్పదొడంగెను. దీనివలన గీతాశాస్త్రమునందలి సప్తమాధ్యాయము మొదలు పదిరెండవయధ్యాయమువరకు నుండు మధ్యమ షట్కమునకు తత్పదార్థమగు వాసుదేవునియొక్క తత్వమును నిర్ణయించుటయే పరమతాత్పర్యమని సూచితమగుచున్నది.

ఓయి అర్జునా! నాయం దాసక్తమగు మనస్సుకలవాడవై నన్నాశ్రయించి యోగమును పూను నీవు నిస్సంశయముగా సంపూర్ణముగా, నన్నెట్లు తెలిసికొందువో చెప్పెద వినుము. అని యన్వయము. శ్లోకమునందలి "మయి" అను పదమునకు 'పరమేశ్వరునియందు' అని యర్థము. ఓయి! లోకమునందిరువురుకలసిమాటాడు కొనునప్పుడు "అహమ్" (నేను) అనుపదము ఇతరునితో మాటనుచెప్పు వక్త యందు ప్రసిద్ధమై యున్నది. ఇచ్చటగూడ నదే న్యాయ మవలంబించుట యుక్తము; ఇచ్చట గీతాశాస్త్ర ముపదేశించు వక్త శ్రీకృష్ణుడు. అతడు దేహేంద్రియ సంఘాత మాపుడు కావున శ్రీకృష్ణు డుచ్చరించిన "మయి" అను పదమునకు దేహేంద్రియ

సముదాయరూపమయిన శ్రీకృష్ణు డను అర్థము లోకమర్యాదవలన లభించుచుండ పరమేశ్వరు డని యర్థమును చెప్పు టెట్లు పొసగును? వినుము. దేహేంద్రియసంఘాతమునందు ఆత్మాభిమానముగల సామాన్యమానవు లుచ్చరించెడి "అహమ్" శబ్దమునకు దేహేంద్రియసంఘాతము అర్థముకావచ్చును. కాని శ్రీకృష్ణునకు దేహేంద్రియ సంఘాతమునందు, అహం మమాభిమానములు లేవు. స్వస్వరూపచైతన్యమగు పరమాత్మయందే అహ మను జ్ఞానముకలదు. కావున నిచ్చట శ్రీకృష్ణు డుచ్చరించిన "అహం" పదము లోకసాధారణమయినదికాదు. అందువలన నియ్యది లక్షణచే చిద్రూపుడగు పరమాత్మనే బోధించును. అయితే మనముగూడ "అహం పరమాత్మ" (నేను పరమాత్మను) అని చెప్పవచ్చుగదా ? నిరభ్యంతరముగా చెప్పవచ్చును. "అహం బ్రహ్మాఽస్మి" అనుచోట అహం పదమునకు ప్రత్యగాత్మయందు లక్షణను చెప్పిరికాని పరమాత్మయందు లక్షణను చెప్పలేదు కదా యని అనరాదు. ప్రత్యక్పరమాత్మలకు భేదములేదు. పరమాత్మ పరోక్షుడనియు, ప్రత్యగాత్మ అపరోక్షుడనియు, అనదగదు. "యత్సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ" అను శ్రుతి పరమాత్మ అపరోక్షుడనియే చెప్పుచున్నది. మరియు పరమాత్మ పరమాకాశమునందు కలడనియు, ప్రత్యగాత్మ హృదయాకాశమునందు కలడనియు జెప్పదగదు. హృదయాకాశమే పరమాకాశము. ఈ రెంటికిని భేదములేదు. "ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి" (౧౮-౬౧) అను శ్లోకముచే గీతయందు పరమాత్మ హృదయాకాశమునం దుండునని నిర్ణయింపబడినది. బృహదారణ్యకమునందలి అంతర్యామి బ్రాహ్మణముగూడ పరమాత్మ హృదయాకాశాంతర్వర్తి యనియే చెప్పుచున్నది. ప్రత్యగాత్మ పరమాత్మలకు భేదములేనిచో "భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా" అని భగవద్గీతబోధించెడి "సంసారచక్రమునందు సకలజీవులను త్రిప్పుట" అనునది పరమాత్మకు పొసగ నేరదు కదా ? తనను తాను త్రిప్పుకొనుట సంభవింపదుగదా ? అని యనరాదు. అనాత్మపదార్థమగు కార్యకారణసంఘాతమునే పరమాత్మ మాయచే సంసారమండలమునందు త్రిప్పుచున్నాడు. అట్లుగాక ప్రత్యగాత్మకుకూడ సంసారచక్రభ్రమణమును అంగీకరించినచో ప్రత్యగాత్మకు వికారిత్వము అనిత్యత్వమున్ను యేర్పడును. నిర్వికారమగు పరమాత్మకు భ్రామణము (భ్రమింపజేయుట- త్రిప్పుట) యను వికారమును అంగీకరించుట యెట్లు ? అని ప్రశ్నింపరాదు. నిర్వికారమగు సూదంటురాయి (అయస్కాంతోపలము లోహమును భ్రమింపజేసినట్లు నిర్వికారమయిన పరమాత్మ వికారమును చెందకయే సకలభూతములను భ్రమింపఁజేయుట (త్రిప్పుట) పొసగును. మరియు కుమ్మరి చక్రమును త్రిప్పునట్లు (భ్రమింపజేయునట్లు) పరమాత్మ అనాత్మపదార్థములను స్వయముగా భ్రమింపజేయుటలేదు. మరేమనిన మాయచే భ్రమింపఁజేయుచున్నాడు. అఘటిత ఘటనా ధురంధర యగు మాయ తనకాశ్రయమగు పరమా

త్మకు వికారమును కలుగజేయకయే కార్యమంతయు నెరవేర్చును. ఇంద్రజాలుని యొక్క మాయ ఆకసమునకు వికారమును పుట్టింపకయే ఆకసమునందు గంధర్వ నగరమును నిర్మించుచున్నది. అట్లే మాయచే నెల్లభూతములను సంసారమునందు భ్రమింపజేయు పరమాత్మకు వికారప్రసక్తి లేదు. కావున శ్రీకృష్ణు డుచ్చరించిన అస్మచ్ఛబ్దము, "మయి" అను శబ్దము లక్షణచే పరమాత్మను బోధించుట యుక్త మగుచున్నది.

లేక, రుద్రాదిత్యాదులయొక్క దేహేంద్రియాది సంఘాతములు, జీవు లయి నట్లు కృష్ణునియొక్క దేహేంద్రియ సంఘాతము యీశ్వరుడగుట పొసగును. కావున శ్రీకృష్ణు డుచ్చరించిన అస్మచ్ఛబ్దమునకు పరమేశ్వరు డను అర్థము అభిధ చేతనే చెప్పనగును. కనుక శ్రీకృష్ణు డుచ్చరించిన "మయి" అను పదమునకు పరమేశ్వరు డను అర్థ ముచితమగుచున్నది. దేహేంద్రియసంఘాతవిశేషత్వము సమానమగుచుండ రుద్రాదిత్యులు జీవులనియు, కృష్ణుడుమాత్రము యీశ్వరుడనియు జెప్ప నెట్లని ప్రశ్నింపరాదు. కృష్ణుని శరీరేంద్రియసముదాయము మాయామయము. రుద్రాదిత్యాదుల దేహేంద్రియాదిసంఘాతములు మనబోంట్ల శరీరేంద్రియాదులవలె కర్మాధీనములు. కావున దేవమనుష్యాది శరీరావచ్ఛిన్నచైతన్యము జీవుడనినట్లు శ్రీకృష్ణునియొక్క దేహేంద్రియాద్యాకారముగా పరిణమించిన మాయావచ్ఛిన్న చైతన్యము పరమేశ్వరు డనుట యుచితమగును.

పరాపరప్రకృతులు రెండును కలిగియుండుట, సర్వప్రపంచమునకు కారణ మగుట; సర్వభూతములకు నాత్మరూపుడగుట- మున్నగునవి పరమేశ్వరునియందు (శ్రీకృష్ణునియందు) ముందుజెప్పబోవు విశేషణములు. ఇట్టి విశేషణములుకలవాడు పరమేశ్వరుడు. లోకములో ఒకానొక పురుషార్థమును గోరువాడు, దానికి సాధన మగు దాని నాశ్రయించును. (ఉ) స్వర్గమను పురుషార్థమును గోరువాడు తత్సాధన మగు అగ్నిహోత్రాది కర్మను ఆశ్రయించుచున్నాడు. అట్లే భగవద్భక్తుడు, భగ వంతునే (ఆత్మనే) ఆశ్రయించునుకాని తపోదానాదిక్రియల నాశ్రయింపడని యర్థము. అర్జునా! నీవుకూడ నాయందాసక్తికలవాడవై నన్నాశ్రయించియుండుము. ఎవడు నన్నాశ్రయించియుండునో వానికి నాయం దాసక్తి కలుగును. ఎవనికి నాయందాసక్తి కలుగునో వాడు నన్నాశ్రయించును. ఇయ్యది లోకప్రసిద్ధము కనుక నిట్టిధ్యాన నిష్ఠులవలె నాయందాసక్తుడవై నన్నాశ్రయించిన నీవు విభూతి, బల, శక్త్యై శ్వర్యాది గుణములతోఁ గూడియున్న మాయావియగు నీశ్వరుని (నన్ను) నిస్సం దిగ్ధముగా, సాకల్యముగా నెట్లు దెలిసికొందువో అట్లు చెప్పెద వినుము. (ఇచట బలమనగా శరీరసామర్థ్యము, శక్తియన మనస్సామర్థ్యము. అని భేదము) విభూ

త్వాదిగుణములు కలవాడు సగుణబ్రహ్మయగును. కాని శుద్ధబ్రహ్మ కానేరడు. కావున నీశ్లోకమున శ్రీకృష్ణుడు సగుణబ్రహ్మనే చెప్పదలచెనని గ్రహింపవలెను.

ఇచట నన్ను (ఈశ్వరుని) దెలిసికొనువిధానమును చెప్పెద వినుమని యొక అన్వయము తెలిసికొను విధానము (రీతి, ప్రకారము) గల ఈశ్వరుని జెప్పెద వినుమని మరియొక అన్వయము.

ఇచట "ఏ జ్ఞానముచే నన్ను దెలిసికొందువో" అని మూలమునందలి "యథా" అను నవ్యయమునకు జ్ఞానమను అర్థమును చెప్పిరి. అది యుచితముకాదు. "ప్రకారవచనే థాల్" అను పాణినీయ శాసనము ప్రకారార్థమునందు థాల్ ప్రత్యయమును విధించినది. అందువలన "యథా" అను పదమునకు ప్రకారార్థమును చెప్పనగును, కాని జ్ఞానార్థము చెప్పదగదు. వ్యాసుల కట్టి వివక్షయే యున్నచో "యే నజ్ఞా స్యసి తచ్ఛృణు" అనియే శ్లోకమును రచించియుండెడివారు. కావున రామానుజునియర్థము సరిగాదు. ౧

శ్లో. జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః
యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్, జ్ఞాతవ్య మవశిష్యతే ॥ ౨ ॥

అ. ఓయి అర్జునా! ఏ జ్ఞానమును దెలిసికొనిన నీకు మరల తెలియదగినది యుండదో విజ్ఞానసహితమగు నట్టి జ్ఞానమును నీకు నిశ్శేషముగా జెప్పెద వినుము.

జ్ఞానమనగా శాస్త్రీయజ్ఞానము. విజ్ఞానమనగా దానిని యనుభవమునకు దెచ్చికొనుట. జ్ఞానమునకు అనుభవమే పర్యవసానము. అనుభవసిద్ధమగు జ్ఞానమే ప్రమాణము. ఈ విషయమును సూచించుటకే మూలమున "జ్ఞానం సవిజ్ఞానం" అని చెప్పబడినది. దీనివలన ముందుచెప్పబోవు జ్ఞానము పరమప్రమాణమని స్పష్టమగును. అనుభవానుకూలముగ నీకు శాస్త్రీయజ్ఞానమును జెప్పెదనని శ్రీకృష్ణుని ప్రతిజ్ఞకు పరమార్థము. లేక సవిజ్ఞాన మను పదమును క్రియావిశేషణమును జేయవచ్చును. కావున నేను జెప్పెడి జ్ఞానము నీకెట్లు అనుభవారూఢమగునో అట్లు జ్ఞానమును చెప్పెదనని యర్థము. అనగా నీ కనుభవారూఢమగునట్లుగా జ్ఞానము నుపదేశింతునని భావము. ఈ జ్ఞానము ఈశ్వరవిషయమగుటవలన నీ జ్ఞానముకలవాడు సర్వజ్ఞుడగునని భాష్యకారు లనిరి. ("మత్తత్త్వజ్ఞో యః ససర్వజ్ఞో భవతీత్యర్థః" అని. అనగా నీశ్వరతత్త్వమే ఆత్మయగుటవలనను, ఈశ్వరుడు సర్వజ్ఞుడగుటవలనను, ఆత్మవేత్తయగు పురుషుడు సర్వజ్ఞుడేయగునని భావము. లేక "మత్తత్త్వ" మను పదమునకు "మమ ఈశ్వరస్య" "తత్త్వమ్" అని యర్థముచెప్పవచ్చును. అపుడు ఈశ్వరుని యొక్క తత్త్వము ప్రత్యగభిన్నమగు బ్రహ్మయగును. సర్వము బ్రహ్మయగుటచే బ్రహ్మను దెలిసికొనినవాడు, సర్వజ్ఞుడే యగును. దీనిచే తత్త్వవేత్తను సర్వప్రపంచ

సాక్షాత్కారము లేదుకాన తత్వవేత్త సర్వజ్ఞుడెట్లగునను శంక నివారింపబడినది. బ్రహ్మజ్ఞానమే సర్వజ్ఞానముకాని సర్వప్రపంచజ్ఞానము సర్వజ్ఞానముకాదు. ఇదే యభిప్రాయముతో శ్రుతి- "ఏక విజ్ఞానేన సర్వవిజ్ఞానమ్" ను ప్రతిజ్ఞచేసినది. ముముక్షువునకు ఘటపటాది సర్వప్రపంచజ్ఞానము నిష్ప్రయోజనము. పైగా నయ్యది ద్వైతజ్ఞానమగుటచే బంధహేతువగును. కావున నీ శ్లోకముచే ఆత్మజ్ఞానమే పరమపురుషార్థసాధనమనియు అట్టిజ్ఞానము కల ఆత్మయే ఈశ్వరుడనియు సిద్ధించినది.

రామానుజ మతము :

"శ్రీకృష్ణుడనగు నేను నిఖిలహేయగుణప్రత్యనీకుడను, నిరవధికాసంఖ్యేయ కల్యాణగుణములు కలవాడను, అనంతమహావిభూతిశాలిని కావున నాకంటె భిన్నమగు సమస్త చిదచిద్వస్తుసముదాయముకంటె విలక్షణుడను (భిన్నుడను). అట్లె నానావిధములగు నా యాకారములు విషయముగాగల జ్ఞానము విజ్ఞానము. ఇట్టి (వివిక్తవిషయజ్ఞానమగు) విజ్ఞానముతోటికూడ మత్స్వరూపవిషయమగు జ్ఞానమును చెప్పెద వినుము" అని వివరించిరి.

ఇది యుక్తముకాదు. వివిక్తా(భిన్నా)కార విషయకజ్ఞానము విజ్ఞానమగుచో అవివిక్తా(అభిన్నా) కార విషయకజ్ఞానము జ్ఞానము కావలసివచ్చును. స్వరూపవిషయకజ్ఞానము జ్ఞానముకాకపోవును. మరియు విశిష్టాద్వైతమతమున ఈశ్వరస్వరూపము వివిక్త(భిన్న)మే, కావున వానినిగురించిన జ్ఞానము వివిక్తవిషయకమే యగును. అందువలన వారు చెప్పినట్లు అది విజ్ఞానమే యగునుకాని, జ్ఞానము కానేరదు.

ఇంక "ఈశ్వరుడు చిదచిద్విలక్షణుడను జ్ఞానము విజ్ఞాన మనియు, "ఈశ్వరుడు సచ్చిదానందరూపుడనుజ్ఞానము జ్ఞానమనియును, జ్ఞాన విజ్ఞానములకు భేదమన్నచో నదియును పొసగదు. అట్టితఱి జ్ఞానవిజ్ఞానముల కన్యోన్యాశ్రయదోషమాపాదించును. దాన రెండును సిద్ధింపకుండును. ఈశ్వరుడు ప్రపంచముకంటె భిన్నుడను జ్ఞానములేనిదే సచ్చిదానందమయుడను జ్ఞానము పుట్టదు. సచ్చిదానందమయుడను జ్ఞానము కలుగనిదే ప్రపంచవిలక్షణు (భిన్ను) డను జ్ఞానము పుట్టదు. కావున అన్యోన్యాశ్రయదోషము తటస్థించును. దీనివలన రెండుజ్ఞానములూ సిద్ధింపకుండును.

ఈశ్వరుడు సచ్చిదానందరూపుడు, ప్రపంచము అనృతజడదుఃఖాత్మకము అను జ్ఞానము కలిగినచో నీశ్వరుడు ప్రపంచవిలక్షణుడను వివేకము (భేదజ్ఞానము) ఉపదేశములేకుండగనే సిద్ధించుచుండ నిందులకు విజ్ఞానసహితమగు జ్ఞానము నుపదేశించుట వ్యర్థమగును.

మరియు అవివేక మనగా అజ్ఞానమని లోకములో ప్రసిద్ధము. ఇట్టితఱి వివేక జ్ఞానరూపమగు విజ్ఞానముకంటె నతిరిక్తమగు జ్ఞానముండుటయే అప్రమాణమగును. మరియు ఘటపటములయొక్క భేదజ్ఞానము కలుగకపూర్వము ఘటముయొక్క గాని పటముయొక్కగాని స్వరూపజ్ఞానము కలుగదు.

ఓయి ! ఘటజ్ఞానమునందు ఘటముమాత్రము విషయమగును. "ఘటము పటముకంటె భిన్న" మను జ్ఞానమునందు ఘటపటములయొక్క భేదము విషయమగును. కావున ఘటస్వరూపజ్ఞానముకంటె ఘటము పటభిన్నమను జ్ఞానము తన్వక భిన్నమనియే నంగీకరింపవలయును. అట్లే ఈశ్వరుడనుజ్ఞానముకంటె గాని, యీశ్వరుడు సచ్చిదానందరూపుడనుజ్ఞానముకంటెగాని ఈశ్వరుడు ప్రపంచవిలక్షణు (భిన్ను)డను విజ్ఞానము భిన్నమనియే అంగీకరింపవలయును. అనినచో నట్లుకాదు. ఇట్లంగీకరించుచో ఆకారభేదమువలన జ్ఞానవిజ్ఞానములకు భేదమొప్పినట్లు, ఆకార భేదమున జ్ఞానమున కవాంతరభేద మంగీకరింపవలసివచ్చును. అపుడు, ఘటము, పటము, కుడ్యము, కుసూలము, అను విషయాకారములయొక్క భేదమువలన తత్ జ్ఞానముకూడ భిన్నమనవలయును. ఈయది యిష్టాపత్తిచే పరిహరింపదగినవిషయముకాదు విషయములు భిన్నములయినను, విషయయగు జ్ఞానముమాత్రము అభిన్నమని శాస్త్రసిద్ధాంతము. అట్లుగాక ప్రతివిషయము జ్ఞానము భిన్నమగుచో జ్ఞాత (జ్ఞానముకలవాడు) కూడ భిన్నుడనవలయును. అట్టితఱి ఒక్కశరీరమునందు అనేకమందిజీవులు కలరని యంగీకరించిన ట్లగును. ఈయది యనుభవవిరుద్ధము.

మరియు చైతన్యరూపమయిన జ్ఞానమొక్కటియయినను అంతఃకరణవృత్తి క్షణికమగుటచే వృత్తిరూపజ్ఞానము లనేకములు. కాన వృత్తిజ్ఞానములు స్వతస్సిద్ధముగా భిన్నములని యనదగదు. వృత్తియనగా అంతఃకరణవ్యాపారము. అయ్యది క్రియ కావున జడము, తత్ప్రతిఫలితమగు (వృత్తిఫలితమగు) చైతన్యమే జ్ఞానము, కావున సంకుగూడ మనోవృత్తులు భిన్నములయినను చైతన్యము నిత్యము, స్వయం ప్రకాశము నయినందున, జ్ఞానము అభిన్నమనియే అంగీకరింపనలెను.

ఇట్టి నిత్యమగు జ్ఞానమే (చైతన్యమే) యీశ్వరుడని సిద్ధమయినది.

ఓయి ! అంతఃకరణవృత్తియే జ్ఞానమని ఔపచారికముగ జెప్పబడుచున్నది. అదియే జ్ఞానము, విజ్ఞానము అని రెండు తెఱంగులు. సచ్చిదానందరూపుడు ఈశ్వరుడు అనియు, యీశ్వరుడు ప్రపంచవిలక్షణు డనియును, యీశ్వరవిషయమగు మనోవృత్తియే జ్ఞానము, విజ్ఞానము అని చెప్పబడుచున్నది. అనినచో అది యుక్తముగాదు. వృత్తిజ్ఞానము, వృత్తివిజ్ఞానము అని రెండువిధముల వృత్తి లోకమునం దప్రసిద్ధము. ఘటజ్ఞాన మెట్లు వృత్తిజ్ఞానమో అట్లే ఘటము పటముకంటె భిన్నమను జ్ఞానముకూడ వృత్తిజ్ఞానమే యగును, విజ్ఞానము కానేరదు.

ఘటాదిప్రత్యక్షస్థలమున చక్షురింద్రియముద్వారా అన్తఃకరణము విషయదేశమునకేగి విషయాకారమును చెందును. అట్టి యంతఃకరణపరిణామమే వృత్తి యని అనబడుచున్నది. "ఘటము పటముకంటె వేరు" అను జ్ఞానము ఘటపటములు ప్రత్యక్షములుకాకున్నను కలుగును. ఇచ్చట ఘట పటరూపముగా అంతఃకరణ పరిణామములేదు. ఘటపటభేదాకారముగా అంతఃకరణమునకు పరిణామము సంభవింపదు. కనుక "ఘటః పటాద్భిన్నః" ఘటము పటముకంటె వేరు- అను జ్ఞానము వృత్తిరూపము కానందున విజ్ఞానమే యగును అనినచో, కాదు. ఇట్టి తఱి వృత్తి జ్ఞానము, చైతన్యజ్ఞానము, విజ్ఞానము అని మూడురకముల జ్ఞానము నంగీకరింపవలసివచ్చును. ఈయది లోకవిరుద్ధము. ఇట్లు వృత్తిజ్ఞాన, చైతన్యజ్ఞానములకంటె నతిరిక్తముగ విజ్ఞానమును కల్పించుట గౌరవదోషగ్రస్తమగును. మరియు సుఖాద్యాకారముగా అంతఃకరణమునకు పరిణామమున్నటుల ఘటపటభేదాకారముగకూడ నంతఃకరణమునకు పరిణామము సంభవించునుకాన ఘట పట భేదజ్ఞానముకూడ వృత్తి జ్ఞానమే యగును.

ఘటపటజ్ఞానములకువలె జ్ఞాన, విజ్ఞానములకు ఆకారభేనమువలన భేదము కల్పితమగుగాక, అంతమాత్రమున నిచటఁ బ్రయోజనములేదు. ప్రకృతమున నీశ్వర స్వరూపముమాత్రమే చెప్పదలచబడినది ఈశ్వరస్వరూపమును నిర్ణయించినచో ప్రపంచవైలక్షణ్యము (భేదము) చెప్పకుండగనే సిద్ధించును. ప్రపంచవైలక్షణ్యమే యీశ్వరస్వరూపము. యీశ్వరుడు ప్రపంచవిలక్షణుడని యెవ్వడు తెలిసికొనడో, వాడు ఈశ్వరస్వరూపమును తెలియనివాడే యగును. కావున ప్రపంచవిలక్షణ సచ్చిదానందమయేశ్వరస్వరూపజ్ఞానమే జ్ఞానమని చెప్పబడుచున్నది. ఇం దేకదేశమగు ప్రపంచవిలక్షణేశ్వరజ్ఞానము విజ్ఞాన మనదగదు.

ఇంక రామానుజులు చెప్పెడి "ఈశ్వరుడు చిదచిద్విలక్షణు"డను విషయమును విచారింతము. ఈశ్వరునియందు అచిద్వైలక్షణ్యమున్నను చిద్వైలక్షణ్యముండ నేరదు. చిద్రూపుడగు నీశ్వరుడు చిద్విలక్షణుడగుట విరుద్ధము. ఇక చిచ్ఛబ్దము, కించిద్జ్ఞుడు, సావద్యుడు(దోషి)యగు జీవుని చెప్పుననియు, ఈశ్వరుడు, సర్వజ్ఞుడు, నిరవద్యుడు (నిర్దోషి) యనియు. కావున చిద్వైలక్షణ్యము యీశ్వరుని యందుఁ బొసగునన్నచో నది యుక్తముగాదు. "చిత్" అను శబ్దమునకు చైతన్యమాత్రము అర్థము. కించిత్ జ్ఞత్వాదులు చిచ్ఛబ్దార్థములుకావు. కించిత్ జ్ఞత్వ సర్వజ్ఞత్వాదులు ఉపాధిధర్మములు. ఉపాధులగు ఘటమఠములు భిన్నములయినను ఉపహితమగు ఆకాశము ఏకరూపమయినట్లు మాయావిద్య లను నుపాధులు భిన్నములయినను చైతన్యముమాత్రము ఏకరూపమే యగును. కావున జీవేశ్వరు లిద్దరు

నిజముగా చిన్మాత్రులని యనందగుదురు. కనుక చైతన్యమునందు కించిత్ జ్ఞత్వాది జీవధర్మము లుండ నేరవు.

మరియు చిన్మాత్రుడగు ఈశ్వరునియందు కల్యాణగుణము లుండుటకూడ సంభవింపవు. కల్యాణగుణములు సత్త్వగుణముయొక్క వికారములు, చైతన్యము నిర్గుణము. నిర్గుణచైతన్యమునందు సత్వవికారములగు కల్యాణగుణము లుండుట అసంభవము. అయితే అద్వైతమునందుమాత్రము 'నిర్గుణబ్రహ్మమునందు సత్తాచిత్తి ఆనందాది గుణము లెట్లుండును?' అని యనరాదు. అవి బ్రహ్మమునకు స్వరూప భూతములు, పృథగ్భూతములుకావు. మీామతమున "తదైక్షత" "తత్వం నారాయణఃపరమ్" అను శ్రుతిప్రోక్తమగు తద్రూపత్వము, తత్వరూపత్వము ఈ రెండును నారాయణునియం దెట్లుకలవో అట్లే అద్వైతమతమునగూడ, సద్రూపత్వము, సత్తారూపత్వము ఈ రెండును అద్వితీయబ్రహ్మమునకు సంభవించును. కావున తచ్ఛబ్ద తత్వశబ్దములు బ్రహ్మవాచకములయినట్లు సచ్ఛబ్ద సత్తాశబ్దము లున్ను, చిచ్ఛబ్ద, చిత్వశబ్దములున్ను గూడ బ్రహ్మవాచకములగును. ఇంతియెకాని ఈ శబ్దములకు ధర్మధర్మివాచకత్వముకాదు. నిర్గుణబ్రహ్మయందు నిర్గుణత్వమను ధర్మ ముండగా బ్రహ్మ నిర్ధర్మకు డెట్లగునని యనరాదు. అట్లైనచో నిర్ధర్మకత్వముగూడ ధర్మరూపమేకావున నిర్ధర్మకత్వాభావమే ధర్మాభావరూప మనందగును. ఇందు యిష్టాపత్తిచూపదగదు. "తదభావాభావస్యతద్రూపత్వ" మను న్యాయముచే నిర్ధర్మకత్వాభావము ధర్మరూపమగుటచే ధర్మాభావరూపము కానేరదు. ఇక నిర్ధర్మకత్వము ధర్మాభావరూపమని సమ్మతమయినచో నిర్గుణత్వముకూడ గుణాభావమని యంగీకరింపుడు. గుణమే ధర్మముకనుక గుణాభావము ధర్మాభావమే యగును.

మరియు నిర్గుణబ్రహ్మయందున్న నిర్గుణత్వము బ్రహ్మరూపము. నిర్గుణత్వ మనగా గుణాభావము. అభావమంతయు బ్రహ్మరూపమయినందున, గుణాభావము గూడ బ్రహ్మరూపమే యగును. కనుకనే (నిష్ప్రపంచం) ప్రపంచాభావరూపము బ్రహ్మయని శ్రుతులు చాటుచున్నవి. భావరూపమయిన బ్రహ్మ,అభావరూపు డెట్లగునని ప్రశ్నింపరాదు. అభావరూపమగు ప్రపంచమంతయు భావరూప మెట్లగుచున్నదో భావరూపమగు బ్రహ్మగూడ అభావరూప మట్లే యగును. లోకము కాలత్రయమునందును లేని (అభావరూపమగు) జగత్తును భావరూపముగా తలచుచున్నది. తద్విలక్షణమగు బ్రహ్మను అభావరూపముగా తలంచుచున్నది.

అట్లు, లోకులచే సర్వప్రపంచభావరూపముగా వ్యవహరింపబడు భావపదార్థమే బ్రహ్మము, సకల ప్రపంచముగా వ్యవహరింపబడు, అభావపదార్థమే ప్రపంచము. కావున భావపదార్థమగు బ్రహ్మ సర్వాభావమగును. అభావరూపుడగు బ్రహ్మ భావరూపు డెట్లగునని ప్రశ్నింపరాదు. ఘటాభావాభావము, ఘటరూప

మయినట్లు అభావరూపమగు సర్వప్రపంచముయొక్క అభావము అభావాభావము కనుక భావమే యగును. కావున బ్రహ్మ అభావరూపుడయినను భావమే యగును. ఇక ప్రసక్తానుప్రసక్తితో బెరిగిన నీగ్రంథ మింతటితో ముగింతము. ౨

శ్లో. మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే
యతతామపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్వతః ॥ 3 ॥

ఆత్మతత్వజ్ఞానము కలవానికిఁ దెలిసికొనదగిన దేదియు మిగిలియుండదు. సర్వము ఆత్మరూపమగుటచే సర్వము తెలియబడినదగును. ఇట్టి జ్ఞానమే మోక్షము నిచ్చును. మోక్షఫలము సర్వోత్కృష్టము. కావున మోక్షప్రదమగు జ్ఞానము మిక్కిలి దుర్లభమని చెప్పబడుచున్నది. మానవు లనేకులలో నేర్పరియగువాఁడొక్కఁడే మోక్షముకొరకు ప్రయత్నమును చేయును. మూలమునందలి "సహస్ర" శబ్దము సంఖ్యావిశేషవాచకముగాదు. అనంతము లను అర్థమును చెప్పును. సిద్ధి శబ్దమునకు మోక్ష మర్థము. అట్లు మోక్షముకొరకు పాటుబడు మానవులలో ధన్యుఁడగువాఁ డెవ్వఁడో యొక్కఁడే యాత్మతత్వజ్ఞానము నొందును. మూలము నందు మోక్షముకొరకు ప్రయత్నించువారలు సిద్ధులని "సిద్ధానాం" అను పదముచేఁ జెప్పబడినది. ఇయ్యది (భావినీం వృత్తిం) ముందువారికి కలుగఁబోవు ఫల సిద్ధిని యుద్దేశించి చెప్పబడినది. మోక్షమును (సిద్ధిని) పొందుట కర్హులని యర్థము. కావున నీయది యౌపచారికపదమని గ్రహింపవలయును. (లేక) మోక్షముకొరకు ప్రయత్నించు మానవులు నిత్యముక్తాత్మరూపులుకాన వారు సిద్ధులనియే చెప్ప వచ్చును.

మూలమునందలి "కశ్చిత్" అను పదమునకు ఎవ్వఁడో ఒకానొక ధన్యుఁడని యర్థము. కాని వేదాంతదేశికులు చెప్పినట్లు ఒక్కఁడే యని నియమముకాదు. అట్లగుచో "కశ్చిదేవ న ద్వౌ" ఒక్కఁడే కాని యద్వైతమతమున నిద్దరు ముక్తినొందరని వేదాంతదేశికులు శాంకరమతమును దూషించుట పొసగెడిది. అబద్ధములను ఆరోపించుటలో మొదటి దేశికులకు వేదాంతదేశికులకు నిట్టి యన్వయములు పొడసూపు టయుక్తము. కావున ఆత్మతత్వజ్ఞానము సుకృతవంతునకు సులభమయినను సామాన్యమానవు లందరకు దుర్లభమగుటచే ఆచార్యపాదులు అవతారికయందు ఆత్మజ్ఞానము దుర్లభమని చెప్పిరి.

ఈ శ్లోకమునకు రామానుజభాష్య మిట్లుకలదు—

రామానుజభాష్యము : ( మనుష్యాః శాస్త్రాధికారయోగ్యాః తేషాం సహస్రేషు కశ్చిదేవ సిద్ధిపర్యంతం యతతే; సిద్ధిపర్యంతం యతమానానాం సహస్రేషు కశ్చిదేవ మాంవిదిత్వా మత్తః. సిద్ధయే యతతే మద్విదాం సహస్రేషుకశ్చిదేవతత్వతో

యథావస్థితం మాం వేత్తి నకశ్చి దిత్యభిప్రాయః"; "సమహాత్మా సుదుర్లభః"; "మాంతు వేద న కశ్చన" (భగ-౭-౧౯-౨౬) ఇతివక్ష్యత ఇతి-

దీనియర్థము-

మనుష్యులు శాస్త్రమునం దధికారము నొందుటకు యోగ్యతకలవారు. వారలలో వేయికి నొక్కడే సిద్ధి (మోక్ష) పర్యంతము ప్రయత్నించును. సిద్ధిపర్యంతము ప్రయత్నించు మానవులలో వేయిమందిలో నొక్కడే నన్ను తెలిసికొని నావలన ముక్తినొందుటకు ప్రయత్నించును. నన్ను తెలిసికొనువారలలో వేయికి నొక్కడే యథారూపముతో నున్న నన్ను యథార్థముగాఁ దెలిసికొనును. ఈశ్లోకమునందలి "నకశ్చిత్" అను పదముయొక్క అభిప్రాయమే "స మహాత్మా సుదుర్లభః" "మాంతు వేద నకశ్చన" అని యీయధ్యాయమునందలి ౧౯, ౨౬వ శ్లోకములచే చెప్పబడగలదు అని.

ఈయది యనుచితముకాదు. దేవతలకుఁగూడ శాస్త్రమునం దధికారము కలదని వేదవ్యాసులు బ్రహ్మసూత్రములచే నిర్ణయించిరి. "యతతి సిద్ధయే" అను వాక్యమునకు సిద్ధిపర్యంతము ప్రయత్నించు నను అర్థము సిద్ధించుట దుర్లభము. ఈ రెండుపదములను ఆవృత్తిచేసి రెండువాక్యములనుగాఁ జేయుట న్యాయము గాదు. "మాం- విదిత్వా-మత్తః" నన్ను-తెలిసికొని-నావలన అను మూడుపదములను మూలమునందులేని వానిని కల్పించుట ప్రమాణసిద్ధముకాదు. "సిద్ధిపర్యంతము ప్రయత్నించువారలలో నొక్కడే సిద్ధికొరకు ప్రయత్నించుచున్నాడు" అను వాక్యము అన్వయించదు. సిద్ధిపర్యంతము ప్రయత్నించువాడే సిద్ధికొరకు ప్రయత్నించువాడుకూడ నగును. వీరిరువురకు భేదముండదు. "కశ్చిన్మాం వేత్తి" ఒకానొకడు నన్ను తెలిసికొనుచున్నాడు. అను వాక్యమునకు "నకశ్చిన్మాం వేత్తి" 'ఎవ్వడు నన్ను తెలిసికొనలేడు' అని యర్థమును చెప్పుటకూడ యుక్తముకాదు. ఇట్టి అర్థమును చెప్పుటకు విరుద్ధలక్షణను ఆశ్రయింపవలెను. అద్దాని నాశ్రయించుట అప్రమాణము. "మాంతు వేద న కశ్చన" అను శ్లోకమునందు 'నాభక్తుని, నన్ను శరణమునొందినవానిని విడచి యెవ్వడు నన్ను తెలిసికొనలేడు.' అని శ్రీకృష్ణుడు చెప్పదలచెను. కావున అచ్చట నాయర్థము యుక్తమగును. ఇచ్చటమాత్ర మయ్యది పొసగదు. అట్లుగాక ఈశ్వరతత్వము యేరికిఁ దెలియతగని దగుచో నయ్యది (ఈశ్వరతత్వము) సంప్రదాయసిద్ధము గాకపోవును. అపుడు ఈశ్వరతత్వమునకే లోపము ప్రసక్తించును. కావున నీశ్వరతత్వ మెవ్వరికిని తెలియదగినదికాదని అంగీకరింప దగదు. "దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా" అను శ్రుతి యీశ్వరతత్వము సూక్ష్మబుద్ధులకు గోచరించునని చెప్పుచున్నది. "తమేవ విదిత్వా అతిమృత్యుమేతి" అను శ్రుతి ఈశ్వరతత్వజ్ఞానమువలననే ముక్తికలదని ప్రతిపాదించుచున్నది. అట్టితత్వ

యీశ్వరతత్త్వమే యెరికిఁ దెలియనిచో (గోచరము కానిచో) ముక్తియే అప్రసిద్ధ మగును. అప్పుడు ముక్తికొరకు వేదాన్తశాస్త్రమునందు ప్రవృత్తియే సంభవింపదు. అట్లగుటచే, గృహస్థుని సన్యాసాశ్రమమునందు ప్రవేశపెట్టు వేదాంతశాస్త్రము అనర్థ కరమగును. ధర్మార్థకామములను సాధించు గృహస్థాశ్రమమును విడచుటవలనను, సన్యాసస్వీకారమువలన మోక్షము లభింపకుండుటవలనను. కావున "నన్ను నెవ్వడో ఒకానొక ధన్యుడు తెలిసికొనుచున్నాడు" అనియే "కశ్చిన్మాం వేత్తి" అను వాక్యమున కభిప్రాయము. నన్ను నెవ్వడు తెలిసికొనడని కాదు.

మరియు, వేదాంతిదేశికులు, మూలమునందలి మనుష్యశబ్దము జాతివిశేష మును చెప్పునది కాదనియు, మోక్షసిద్ధికొరకు ప్రయత్నించు యోగ్యతకల వ్యక్తి మాత్రమును చెప్పుననియును వ్యాఖ్యానించిరి. అదియును యుక్తము కాదు. మనుష్య శబ్దమునకు ముఖ్యార్థము విడచుటలో కారణము లేదు. అర్జునుడు మనుష్యుడు కాన మనుష్యులగు మీకు పరమాత్మతత్త్వజ్ఞానము మిగుల దుర్లభమనియే భగవంతుడగు శ్రీకృష్ణుడు చెప్పదలచెను. కాక దేవాదులకు పరమాత్మతత్త్వజ్ఞానము సులభమని కాని, దుర్లభమనికాని వినినంతమాత్రమున పార్థునకు కలిగెడు ఫలమేమియు లేదు.

ఇక మోక్షసిద్ధికొరకు ప్రయత్నించుటమాత్రము తరచుగా, సర్వసాధార ణము (అందరకు సాధారణము) కావున, సిద్ధిపర్యంతమని తమ వ్యాఖ్యానమున వేదాంతదేశికులుచెప్పితి మన్నచో నదియును పొసగదు. మోక్షసిద్ధికొరకు ప్రయ త్నించుట మాత్రముకూడ నెల్లరకు సాధారణముకాదు. లోకములో నందరు సిద్ధి కొరకు ప్రయత్నించువారలు కనుపించుటలేదు. సంసారముకొరకు ప్రయత్నించుట ఎల్లరకు సాధారణమయి యున్నది. మరియు నెవ్వడు (మోక్ష) సిద్ధికొరకు ప్రయ త్నించునో వాడే సిద్ధిపర్యంతము ప్రయత్నించుచున్నాడు. నడుమ నాప్రయత్న మును విడువడు. దైవికముగా మోక్షసిద్ధిలోపల మరణము సంభవించినను జన్మాం తరమందైనను మరల ప్రయత్నించును. లేక సిద్ధికొరకు ప్రయత్నించువార లందర కును సిద్ధిపర్యంతము ప్రయత్నము సంభవింపదు కావున మోక్షసిద్ధికొరకు ప్రయ త్నించు వేలకొలది మానవులలో ఒకానొకడే సిద్ధిపర్యంతము ప్రయత్నించునని చెప్పవలయును. అట్లు మూలకర్త చెప్పియుండలేదు. మూలకర్త చెప్పనిదానిని రామానుజులు చెప్పినచో రామానుజవచనము నిర్మూలమగును.

మరియు రామానుజులు: ప్రయత్నించుచున్న సిద్ధులలో ఒకానొకడే నన్ను తెలిసికొనుచున్నాడు అనియు నన్ను తెలిసికొనువారలలో ఒకానొకడే నిజముగా నన్ను తెలిసికొనుచున్నా డనియును రెండువాక్యములు వివక్షితము లని చెప్పిరి. అదియు నుచితము కాదు. మూలమునందు అట్టి వివక్ష కలదని సూచించుపదము లేదు. రామానుజులు సూచించిన ప్రకారము రెండువాక్యములు మూలమున కానము.

మూలమునందు లేని వాక్యద్వయమును రామానుజులు కల్పించుట అప్రమాణమగును.

మరియు రామానుజుల కల్పనము అప్రమాణమగుటయేగాక అసంగతముగూడ నగుచున్నది. అదెట్లన, నన్ను తెలిసికొనువాడు నిజముగా నన్ను తెలిసికొనడు. నన్ను నిజముగా తెలిసికొనువాడు నన్ను తెలిసికొనువానికంటె నితరుడు అని చెప్పినట్లగును. ఈయది యనుచితము. ఈశ్వరుని (తత్వత) యథార్థరూపముతో తెలియనివాడు యీశ్వరుని తెలిసినవాడని చెప్పబడడు. అట్లె ఈశ్వరుని యథార్థరూపముతో తెలిసికొనినవాడు ఈశ్వరుని తెలిసికొననివాడని చెప్పబడడు. "మాం వేత్తి" అను వాక్యముచే నీశ్వరునియొక్క సామాన్యజ్ఞానమున్ను "మాం తత్వతో వేత్తి" అను వాక్యముచే విశేషాకారముగా నీశ్వరజ్ఞానమున్ను చెప్పబడినదని యనరాదు. నిర్విశేష చిన్మాత్రుడగు నీశ్వరునియందు సామాన్యవిశేషభావకల్పనము అసంభవము. ఈశ్వరునకుగూడ పరోక్షత్వ అపరోక్షత్వములచే సామాన్యవిశేష భావభేదము కలదని యనరాదు. "యత్సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ" అను శ్రుతి ఈశ్వరుడు నిత్యాపరోక్షబ్రహ్మరూపుడని చెప్పుటవలన పారోక్ష్యాపారోక్ష్య భేద మంగీకరింపదగదు. ఆత్మయే నీశ్వరుడు, ఆత్మ యెవ్వనికి అప్రత్యక్షుడుకాడు. మరియు ఈశ్వర స్వరూపజ్ఞానము వేరనియు, ఈశ్వరస్వభావజ్ఞానము వేరనియు, అందువలన ఈశ్వర జ్ఞానమునకు భేద ముపపన్నమని యన్నచో నదియు పొసగదు. ఈశ్వరస్వరూప స్వభావములకు భేదములేదు. ఎవడు ఈశ్వరస్వరూపమును తెలిసికొనునో వాడు ఈశ్వరస్వభావమును తెలిసికొనును. ఈశ్వరస్వరూపముకంటె నితరమగు స్వభావము మాయికము. కాన యసత్యమగును. స్వరూపమున్మాత్రమే సత్యము కావున నెవడు ఈశ్వరుని యథార్థరూపముతో తెలిసికొనునో వాడే ఈశ్వరుని గుర్తెరింగినవాడు. ఎవడు యీశ్వరుని యథార్థముగా తెలిసికొనడో వాడు యీశ్వరుని తెలిసికొనినవాడు కానేకాడు అని సిద్ధమయినది. కావున రామానుజవ్యాఖ్యానము యుచితముకాదు. 3

శ్లో. భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవచ
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా ॥ ౪ ॥

అ. గీతాశాస్త్రమును విను అర్జునుని యభిరుచిపరచి, శ్రీకృష్ణు డీశ్లోకముచే తన నిజరూపమును చెప్పుచున్నాడు. ఈశ్లోకము దీని తరువాతశ్లోకమున్న ఈశ్వరునియొక్క స్వరూపము, స్వభావమున్ను చెప్పుచున్నవి. ఈశ్వరునియొక్క స్వరూపస్వభావములు తెలియనిదే యీశ్వరజ్ఞానము సిద్ధింపదు. ప్రకృతిశబ్దము స్వరూపమను అర్థమునందు, స్వభావమను అర్థమునందును ప్రయోగింపబడుచున్నది. కావున నీశ్వరునియొక్క స్వరూప మొక ప్రకృతియనియు, స్వభావము మరియొక

ప్రకృతియనియు గ్రహింపవలెను. అందు మొదట అనాత్మపదార్థము తెలియబడి నచో ఆవల నాత్మజ్ఞానము కలుగుట సులభమగును. కావున ముందు అనాత్మభూత మగు నీశ్వరస్వభావ మను ప్రకృతిని చెప్పుచున్నాడు.

"అష్టౌ ప్రకృతయః" అను శ్రుతిప్రమాణమువలనను, "మూలప్రకృతి రవికృతి ర్మహదాద్యాః ప్రకృతి వికృతయ స్సప్తషోడశకశ్చ వికారో న ప్రకృతి ర్న వికృతిః పురుషః" అను సాంఖ్యశాస్త్రమును బట్టియు, మూలప్రకృతి, ప్రకృతి వికృతులగుమహదహంకారపంచతన్మాత్ర లను నేడును ప్రకృతిశబ్దార్థములగుచున్నవి. పాణిని "జనికర్తుఃప్రకృతిః" అను సూత్రమున ప్రకృతి యన అపాదాన మని నిర్వచించెను. వికృతి యనగా కార్యము, అనాదియు, సర్వజగదుపాదానమును అగు మాయప్రకృతి, పదునారు వికారములకుఁ గారణమును, మూలప్రకృతియొక్క కార్యమున్ను అగు మహదహంకార పంచతన్మాత్ర లేడును ప్రకృతులు వికృతులున్ను అగుచున్నవి. అందు ప్రకృతిత్వమను అంశమునుబట్టి మహదాదు లేడును ప్రకృతు లని వ్యవహరింపబడుచున్నవి. పంచమహాభూతములు, పదియింద్రియములు, (జ్ఞానేం ద్రియము లయిదు, కర్మేంద్రియము లయిదు), మనస్సు- ఈపదునారును వికారము లనబడుచున్నవి. ఇయ్యవి యెప్పుడును కార్యములేకాని, వేటికిఁ గారణములుకావు. అందువలన నీ పదునారింటికి ప్రకృతు లను వ్యవహారములేదు. భూతవికారములయిన దేహములకు స్థూలభూతములు కారణములగుచున్నవి. కావున పంచమహాభూతము లను గూడ ప్రకృతిశబ్దముచే వ్యవహరింపవచ్చును. అయినను దేహములు తత్త్వము లలో చేరనందునను, తత్త్వములకే పరస్పరము కార్యకారణభావమును చెప్పదలచుట వలనను, మహాభూతములను కారణకోటిలో పరిగణింపలేదు.

వికారములగు పదునారింటనుండి యేతత్త్వము పుట్టనందున ఈ పదు నారింటికి ప్రకృతిత్వము లేదు. ప్రళయకాలమునందుఁగూడ నశింపనిపదార్థమే తత్త్వమని సాంఖ్యుల సిద్ధాంతము. ఇట్టి తత్త్వ మీ పదునారింటివలన నేదియు పుట్టదు. లేక, ప్రాణాది వాయుపంచకము, ఇంద్రియదశకము, మనస్సు- ఈ పదునారు వికారములని యనదగును. ఈ విషయమునంతయు నుద్దేశించియే శ్రీ కృష్ణుడు యీ శ్లోకము నుపదేశించెను. "భూమిరాపోఽనలో వాయుః" అని.

ఇందు భూమియనగా పృథివీతన్మాత్రయని అర్థము. అపంచీకృతములయిన సూక్ష్మభూతములకు తన్మాత్రలని వ్యవహారము. ఈ తన్మాత్రలే పంచీకృతములయి, స్థూలభూతములకుఁ గారణమగుచున్నవి. ఇపుడు వ్యవహారదశలో కనుబడునవి స్థూల భూతములు. ఈ స్థూలభూతములు పుట్టుటకు పూర్వమున్నవి తన్మాత్రలని యర్థము. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు తన్మాత్రలని కొందరందురు.

ఇచట స్థూలభూతములను విడచి తన్మాత్రలనే గ్రహించు టేల? అని ప్రశ్నింప రాదు. మూలమున "భిన్నాప్రకృతి రష్టధా" అని కలదు. స్థూలభూతములకు ప్రకృతి యను వ్యవహారము లేదు. అందువలన స్థూలభూతములను విడచుట సంభవించినది. అట్లె మనస్సునకుగూడ ప్రకృతి యను వ్యవహారము లేనందున ఇచట మన శ్శబ్దము లక్షణచే స్వకారణమగు అహంకారమునందు ప్రవర్తించుచున్నది. మనస్సు అన అంతఃకరణము. అహంకారమన అంతఃకరణమునకు కారణమగు తత్వాంతము అని యీ రెంటికి భేదము గ్రహింపవలెను. బుద్ధి యనగా మహత్తత్వము, అహంకారమన మూలప్రకృతి, అవిద్యాఽహంకార వాసనలతోఁగూడిన అవ్యక్తము మూలప్రకృతి యనియు, అహంకారమనియు చెప్పబడుచున్నది. విషముతోఁగూడిన అన్నము విషమని యనినట్లు అహంకారవాసనలతోఁగూడిన యవ్యక్తము అహంకారమని చెప్పబడుచున్న దని భావము.

అవ్యక్తము మానవుని కర్మలయందు ప్రేరేపించును. అహంకారముగూడ నట్లే మానవుల కర్మలయందు ప్రేరేపించుచున్నది. 'నేను' అను అహంకారము లేనిదే యెవ్వనికి దేనియందును ప్రవృత్తి సంభవింపదు.

లోకములో అహంకారమువలన నెల్లరకు ప్రవృత్తి సంభవింపవచ్చును గాని అవ్యక్తమువలన ప్రవృత్తి యెట్లు సంభవించునని ప్రశ్నింపరాదు. అనాత్మయందు ఆత్మాభిమానరూపమగు అహంకారము అజ్ఞానమూలకము. అజ్ఞానమునందు ప్రవర్తకత్వము లేనిదే తత్కార్యమగు అహంకారమునందు ప్రవర్తకత్వ ముండ నేరదు. కారణధర్మములు కార్యమునందు సంక్రమించుట లోకసహజము. కారణమగు అజ్ఞానమునకే ప్రవర్తకత్వము లేనిచో తత్కార్యమగు అహంకారమునకు ప్రవర్తకత్వముండుట అసంభవము. మాయ యనునది ఆత్మస్వరూపమును కప్పిపుచ్చి, అందరను అన్నిటియందును ప్రేరేపించును.

ఓయి! ప్రకృతియనగా నేమి? మాయ. మాయయన నేమి? ఈశ్వరుని యందలి ప్రపంచమును పుట్టించు సామర్థ్యము. ఈయది కారణరూపముతోను, కార్యరూపముతోను యెనిమిది విధములుగా విభజింపబడినది. అందు మహదాదు లేడును కార్యప్రకృతులు. మూలప్రకృతి, కారణప్రకృతి ఇట్లు యీశ్వరప్రకృతి యెనిమిదివిధములు గలదని తెలియవలెను.

అయితే శారీరక మీమాంసాశాస్త్రమునందు "ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాంతానుపరోధాత్" అను సూత్రమున శ్రీబాదరాయణులు సాంఖ్యమతమును నిరాకరించిరి. ఇచట సాంఖ్యమతసిద్ధమగు ప్రకృత్యష్టకమును శ్రీకృష్ణు డుపన్యసించెను. ఈ విరోధ మెట్లు పరిహృతమగును? వినుము. శారీరమీమాంసాశాస్త్రమునందు ప్రకృత్యాదులు బ్రహ్మకంటె వేరుకావనిమాత్రమే నిరాకరింపబడినది. ప్రకృ

త్త్వాదుల స్వరూపమును నిషేధించలేదు. శారీరకశాస్త్రమునందుగూడ మాయ మున్నగువాటి నంగీకరించిరి. బుద్ధి మహత్తత్త్వమనియు, మనస్సు అహంకారమనియును వేదాంతు లంగీకరించిరి. అంతఃకరణమే మనస్సు అనియు, అహంకారమనియు, వృత్తిభేదముచే రెండువిధములు : "అహంవృత్తి రిదంవృత్తి రిత్యంతఃకరణం ద్విధా" అని విద్యారణ్యులు నుడివిరి. అందు అహంవృత్తి యహంకారమనియు, ఇదంవృత్తి మనస్సనియు విభాగము. ఈ రెండును అంతఃకరణపరిణామము లగుటచే నీరెంటికి మహత్తత్త్వకార్యములని వ్యవహారము. అందు ఇదంవృత్తి అహంవృత్తి పూర్వకమగుటచే మనస్సు అహంకారకార్యమను వ్యవహార ముపపన్నమగుచున్నది.

మరియు, సాంఖ్యమతమున మూలప్రకృతియే జగదుపాదానమని చెప్పిరి. "న ప్రకృతి ర్న వికృతిః పురుషః" అని యాత్మకు జగదుపాదానత్వమును నిషేధించిరి. వేదాంతశాస్త్రమున "జన్మాద్యస్య యతః" (బ్ర॥ సూ॥ ౧-౧) అనుసూత్రముచే మాయాద్వారమున పురుషునకే ప్రపంచోపాదానత్వమును చెప్పిరి. ఇట్లు సాంఖ్యాద్వైతములకు చాల భేదముకలదు. కావున నిచట సాంఖ్యమత ముపన్యసింపబడినదను దోష మాపాదింప వీలులేదు.

లేక "అదుష్ట మన్యతో గ్రాహ్యం" అను న్యాయమున సాంఖ్యశాస్త్రమునందుఁ జెప్పినదయినను దోషరహితమయిన అంశము గ్రహింపదగినదే యగును. సాంఖ్యశాస్త్రమున ప్రకృత్యష్టకము పేర్కొనబడినది. అయ్యది శ్రుతిసిద్ధమగుటచే దుష్టముకాదు. కావున నాయంశముమాత్రమే యిచట గ్రహింపబడినది. శ్రుతివిరుద్ధమగుటచే పురుషుడు ప్రకృతియు, వికృతియు గాడను అంశము గ్రహింపలేదు. అయితే నిజస్థితిలో పురుషునకు ప్రకృతిత్వముకాని, వికృతిత్వముకాని లేదు. మాయాద్వారమున పురుషునకు ప్రకృతిత్వమును శ్రుతి బోధించినదని తెలియవలెను.

రామానుజమతము :

ఇచట రామానుజులు భూమి, ఉదకము మున్నగునవి యథాశ్రుతముగ స్థూలభూతములనే బోధించునని చెప్పిరి. స్థూలభూతములకు ప్రకృతు లను వ్యవహారము లేనందున రామానుజులు చెప్పిన యర్థము యుక్తముకాదు.

ఇక వేదాంతదేశికులు : "ఏషాహి పూర్వమేకా పశ్చాదష్టధా పరిణతా" (ఈప్రకృతి మొదట నేకరూపముగానుండి పిదప నెనిమిదివిధములుగ పరిణమించెను) అనిచెప్పిరి అది యుచితముకాదు. భూతపంచకము, ప్రాణపంచకము, ఇంద్రియదశకము, విషయపంచకము, మనోబుద్ధ్యహంకారత్రయము అను నీ ఇరువదియెనిమిదివిధములుగా పరిణమించిన ప్రకృతి మనోబుద్ధ్యహంకారములు, పంచభూతములు అను నెనిమిదివిధములుగ పరిణమించెనని చెప్పుట యుక్తముకాదు. అట్టితరి ప్రకృతి

యిరువదియెనిమిది విధముల పరిణమించినదని చెప్పదగియున్నది. ఘటరూపముగా పరిణమించిన మృత్తుకంటె వేరుగా అట్లు పరిణమించిన మృత్తుయుండినట్లు భూతాది రూపముగా పరిణమించిన ప్రకృతికంటె వేరుగా అట్లు పరిణమింపని ప్రకృతి లేనందున ప్రకృతి మొదట నొకటియయి పిదప నెనిమిదివిధముల పరిణమించినదని చెప్పుట సమంజసముగాదు. ప్రకృతి కార్యరూపముతో నెనిమిదివిధములుగను, కారణరూపముతో నేకవిధముగను ఉన్నదనియే చెప్పవలయును. మొత్తము 'ప్రకృతియంతయు కార్యరూపముగ పరిణమించినదని యేల చెప్పగూడదు?' అని యనరాదు. అపుడు ఈశ్వరోపాధియగు నవ్యక్తమే లేకపోవును. జీవునకు కారణశరీరమగు అజ్ఞానమున్ను లేకపోవును. ఇది ఇష్టాపత్తిని చూపదగదు. అట్టితరి సుషుప్తియందు జీవునకు అజ్ఞానానుభవము లేకపోవలసివచ్చును. వ్యవహారకాలమందుఁగూడ "అహమజ్ఞః" (నేను అజ్ఞానిని) అని యనుభవసిద్ధమయిన అజ్ఞానమును త్రోసిపుచ్చుట సాధ్యముకాదు. అజ్ఞానమే లేనిచో లోకానుభవసిద్ధమయిన ఘటజ్ఞానముచేఁ గలిగెడి యజ్ఞాననివృత్తి పొసగనేరదు.

అజ్ఞానమనగా జ్ఞానాభావమేకాని మాయ గాదని యనరాదు. అనాదిభావపదార్థమయి జ్ఞాననివర్త్యమయినది మాయ యని మాయకు లక్షణమును చెప్పిరి. అజ్ఞానమునకును అదే లక్షణము నంగీకరించిరి. మరియు "అహమజ్ఞః" (నేను అజ్ఞానిని) అని ప్రతీతి కలదుగాని నేను జ్ఞానాభావముకలవాడ నను ప్రతీతి లేదు. కావున అజ్ఞానము భావరూపమేకాని, అభావరూపముగాదు. కనుక రామానుజ వ్యాఖ్య పొసగనేరదు. ౪

శ్లో. అపరేఽయ మితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం
జీవభూతాం మహాబాహో! యయేదం ధార్యతే జగత్ ॥ ౫ ॥

అ. ఎనిమిదివిధముల భేదముగల, పూర్వశ్లోకముచేఁ జెప్పబడిన ప్రకృతిని అపరప్రకృతి యందురు. దీనికంటె వేరయినట్టియు, పరమాత్మయొక్క స్వరూపమయినట్టియు, జీవభూతమయిన ప్రకృతిని చెప్పెద వినుము. ఈ ప్రకృతిచేతనే ప్రపంచమంతయు ధరింపబడియున్నది. వెనుకటి శ్లోకమునందు చెప్పిన ప్రకృతి యీశ్వరుని యొక్క స్వభావభూతమనియు, ఈ శ్లోకమునందుఁ జెప్పిన ప్రకృతి యీశ్వరుని యొక్క స్వరూపభూతమనియు భేదమును గ్రహించవలెను. ఈశ్వరస్వరూపభూతమయిన ప్రకృతిని జీవప్రకృతియనియు క్షేత్రజ్ఞలక్షణప్రకృతియనియు నందురు. (జీవయతి- చేతయతి- దేహమితి- జీవః) అను వ్యుత్పత్తిచే దేహమును చైతన్యముకలదానినిగా చేయునదికాన జీవప్రకృతియని యనబడుచున్నది. క్షేత్రమనగా దేహేంద్రియాద్యనాత్మపదార్థసంఘాత మని యర్థము. దానిని తెలుసుకొనునట్టిదికాన క్షేత్రజ్ఞప్రకృతి యనియు నందురు. ఈ విషయము త్రయోదశాధ్యాయమునందు

స్పష్టపడగలదు. కావున నీ ప్రకృతి కూటస్థాత్మస్వరూప మస్పష్టమగుచున్నది. దీనిచే ఈశ్వరస్వరూపము జీవుడని వ్యక్తమగుచున్నది. అందువలన జీవేశ్వరుల కభేదము స్పష్టమగుచున్నది. మరియు నీ ప్రకృతి, దేహము ప్రాణమును ధరించుటకు నిమిత్త మని యనదగును. ఇందు "జీవాపేతం వావ కిల శరీరం మ్రియతే" (ఛాం-౬-౧౧-33) అను శ్రుతి ప్రమాణమగుచున్నది. "మృఙ్ = ప్రాణత్యాగే" అను ధాతువు వలన "మ్రియతే" అనగా ప్రాణత్యాగమును చేసికొనుచున్నాడని యర్థము.

ఓయి! జీవుడు శరీరమునుండి వెడలినప్పుడుకదా శరీరమునకు మరణమేర్పడును! (పూర్ణుడు) అంతటనుండు జీవునకు శరీరమునుండి లేచిపోవుట పొసగు టెట్లు? వినుము. జీవుడు నిజరూపముతో పరిపూర్ణుడయినను బుద్ధి మున్నగు నుపాధుల యొక్క సంబంధముచే పరిచ్ఛిన్నుడుకాన శరీరమునుంచి వెడలిపోవుట సంభవించును. ఆకాశము స్వతస్సిద్ధముగా పరిపూర్ణ మయినను ఘటమను ఉపాధివశమున పరిచ్ఛిన్నమై ఘటాకాశమను పేరును బడసి ఘటము దండప్రహారముచే భిన్నము కాగా (బ్రద్దలుకాగా) ఘటాకాశముపోయి, మహాకాశములో చేరుచున్నది. ఇట్లే బుద్ధ్యాద్యుపాధి పరిచ్ఛిన్నుడగు జీవునకు శరీరమునుండి (ఉత్క్రాంతి) లేచిపోవుట తటస్థించును.

ఇందు "ధ్యాయతీవ లేలాయతీవ" అను శ్రుతి ప్రమాణమగుచున్నది. బుద్ధి ధ్యానించుచుండ ఆత్మ ధ్యానించువాడువలె నుండును. బుద్ధి చలించుచుండ ఆత్మ చలించువాడువలె నుండును. అట్లె బుద్ధి (అంతఃకరణము) శరీరమునుండి లేచిపోవుచుండ ఆత్మ లేచిపోవుచున్నవాడువలె నుండును. ఇట్లే చైతన్యము ప్రాణధారణకు నిమిత్తమగుటకూడ బుద్ధ్యవచ్ఛిన్నరూపముతో ననియే గ్రహింపవలయును.

చిదాత్మ (జీవుడు) అంతర్యామి నారాయణాది శబ్దవాచ్యమయిన కూటస్థ సాక్షిచైతన్యరూపముతో జగత్తులో ప్రవేశించి ప్రపంచమును నిలవబెట్టుచున్నాడని భావము. జీవుడు సర్వప్రపంచమును లోపల వెలుపల వ్యాపించియుండెనని "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః" అని శ్రుతి చెప్పుచున్నది. అయినను వెలుపల వ్యాపించి యున్నవానికి లోపల ప్రపంచమును ధరించియుండు టెట్లను శంకకు సమాధానముగాభాష్యకారు లనిరి. "అంతఃప్రవిష్టయా ప్రకృత్యా" అని. అనగా లోపల వ్యాపించియుండు ప్రకృతిచే ప్రపంచము ధరించబడుచున్నదని భావము. యథాశ్రుతార్థమునందుమాత్రము పరిపూర్ణుడయిన జీవునకు లోపలప్రవేశ మెట్లు సంభవించునని ప్రశ్నపుట్టును. నిజస్థితిలో పరిపూర్ణునకుఁగూడ బుద్ధ్యాద్యుపాధివశమున అంతఃప్రవేశము సంభవింపవచ్చును. "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" అను శ్రుతిప్రమాణమువలన ఇదియంతయు స్థావరజంగమ దేహాపేక్షయా

చెప్పబడినది. కేవలాచేతనములయందు ఈశ్వరునకు క్రొత్తగా ప్రవేశమనునదియే లేదు.

ఇట్లు లోపల వ్యాపించియున్న చైతన్యము జీవుడనియు, కూటస్థుడనియు, సాక్షియనియు, ఆత్మయనియు వ్యవహరించుచున్నారు. వెలుపల వ్యాపించియున్న వానిని యీశ్వరుడనియు, బ్రహ్మయనియు వ్యవహరించుచున్నారు. లోపల వెలుపల ఉనికియనునది చైతన్యమునందు కల్పింపబడుటవలన వస్తుతః నిరవయవము, ఏకరూపము, అద్వితీయము నగు చైతన్యమునందు జీవేశ్వరభేదములేదని సిద్ధాంతము.

చేతనపదార్థములయందు జీవుడున్నను, అచేతనపదార్థములయందు జీవుడెట్లుండునని యనరాదు. అచేతన పదార్థములయందు చిదాభాసరూపుడయిన జీవుడుండడుకాని, ప్రత్యగాత్మరూపుడయిన జీవుడుండును.

" చేతనాచేతనభిదా కూటస్థాత్మకృతా నహి,

కింతు బుద్ధికృతాభాస కృతైవేత్య వగమ్యతాం " అని ప్రమాణముకలదు. చేతనాచేతన విభాగము కూటస్థాత్మనుబట్టి రాలేదు, చిదాభాసునిబట్టి యేర్పడినది. అనగా చిదాభాసుడు కలవి చేతనములనియు, చిదాభాసుడు లేనివి అచేతనములనియు విభాగము.

రామానుజ మతము :

ఈశ్వరునకు అచేతనప్రకృతి, చేతనప్రకృతి అని రెండు ప్రకృతులు కలవు. అందు అచేతనప్రకృతి భోగ్యము. ఈయది "భూమి రాపః" అను పూర్వశ్లోకముచేఁ జెప్పబడినది. చేతనప్రకృతి భోక్తృరూపము. అది యీ శ్లోకముచే జెప్పబడుచున్నది, అని రామానుజులు తమ భాష్యమునం దుదహరించిరి.

అది యుక్తముగాదు. " అవికార్యోయ ముచ్యతే " (భగ-౨-౨౫) అను శ్లోకముచే జీవునియందు భోక్తృత్వమను వికారములేదని నిషేధింపబడినది. (2) అహంవృత్తిరూపమగు విజ్ఞానమయకోశరూపమయిన బుద్ధియే భోక్తయని నిరూపించబడినది. బుద్ధి స్వతస్సిద్ధముగా జడము, భోక్తృభోగ్యరూపమయిన ప్రకృతియు జడము. చేతను డగు జీవుడు కర్తకానందున భోక్తగూడ గాడు.

మరియు " ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః

అహంకార విమూఢాత్మా కర్తాఽహ మితి మన్యతే॥ (భగ 3-౨౭) అనియు, " నకరోతి నలిప్యతే " (భగ-౧3-3౨) అనియును జీవునకు కర్తృత్వమే లేదని నిరూపింపబడుచున్నది.

మరియు " నిష్కలం నిష్క్రియం శాంతం " ( శ్వేతా-౬-౧౯) ఇత్యాది శ్రుతి బుద్ధితాదాత్మ్యాధ్యాసమువలన జీవునకు కర్తృత్వ మేర్పడినదనియు, అయ్యది

ప్రభమాత్మకమనియును చెప్పుచున్నది. బుద్ధితాదాత్మ్యాధ్యాసలేని సుషుప్తిదశయందు జీవునకు కర్తృత్వములేదు. కర్తృత్వములేనివానికి భోక్తృత్వము పొసగనేరదు. అట్లు పొసగుచో సోమయాగ మనుష్ఠించువాడొకడును, తత్ఫల మనుభవించువాడు మరియొకడును కావలసివచ్చును. మరియు రామానుజమతమున జీవుడు అణురూపుడు గనుక అణురూపుడగు జీవస్వరూపమయిన భోక్తచే నుత్తము ప్రపంచము ధరింపబడ నేరదు. కావున రామానుజవ్యాఖ్యానము సర్వదా అసంగతమగుచున్నది ॥ ౫ ॥

శ్లో. ఏత ద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయ స్తథా ॥ ౬ ॥

అ. ఓయి అర్జునా! క్షేత్రక్షేత్రజ్ఞములను (పరాపర) ప్రకృతులు రెండును సమస్త భూతములకు కారణములని తెలిసికొనుము. అందువలననే నీ రెండు ప్రకృతులద్వారమున సర్వప్రపంచముయొక్క ఉత్పత్తి స్థితి లయములకుఁ గారణమగుచున్నాను.

క్షేత్రప్రకృతి యనగా అపరప్రకృతి, క్షేత్రజ్ఞప్రకృతియనగా పరప్రకృతి. ఇదంప్రత్యయ విషయమగు భూమ్యాదులు క్షేత్రము, అహంప్రత్యయవిషయమగు చిదాత్మ క్షేత్రజ్ఞుడు. అని భేదము.

అహంకారముగూడ అహంప్రత్యయవిషయమగుచున్నందున అహంప్రత్యయ విషయుడు ఆత్మయే యని యనదగదు. అని ప్రశ్నించుట యుచితముగాదు. (మమాహంకారః) నాకీ యహంకారము అను ప్రతీతి యుండుటచే అహంకారము కేవలము అహంప్రత్యయవిషయననుకాదు. అయితే ఆత్మకూడ (మమాత్మా) అనుప్రతీతిని బట్టి కేవలము అహంప్రత్యయవిషయుడు గాడని చెప్పవచ్చునుకదా? కాదు, అచ్చట ఆత్మశబ్దము స్వరూపవాచకము కాని ఆత్మవాచకము కాదు. కావున ఆత్మ కేవలాహంప్రత్యయ విషయుడే యగుచున్నాడు. అహంకారము సాక్షికముగా అహంప్రత్యయవిషయమగుచున్నందున సాక్షికముగా ఆత్మయగునుకదా? కాదు. అనాత్మపదార్థమగు అహంకారమునకు సాక్షికముగాకూడ ఆత్మత్వముసంభవించదు. అహంకారమునకు అహంప్రత్యయవిషయత్వము, ఆత్మతాదాత్మ్యాధ్యాసవలన నేర్పడుచున్నది. (ఆత్మతాదాత్మ్యాధ్యాసచే అహంకారము అహంశబ్దముగాఁ జెప్పబడుచున్నది.)

మూలమునందలి "యోని" అను పదమునకు ఉపాదానకారణము లని యర్థము.

ఓయి! జడమయిన క్షేత్రప్రకృతి జడములయిన భూతములకు ఉపాదానకారణమయిన నగుగాక, చేతనమయిన క్షేత్రజ్ఞప్రకృతి జడములయిన భూతముల

కుపాదానకారణ మెట్లగును ? కార్యకారణములకు సారూప్య ముండవలెకదా ? భూత ములు జడములుకదా? క్షేత్రజ్ఞుడు చేతనుడుకదా ? నిజమే. వినుము సమాధానము. పరిణామవాదపక్షమునందు కార్యకారణములకు సాలక్షణ్యము (సమానరూపత్వము కలిగియుండుట)అను నియమముకలదు. కాని వివర్తవాదమునం దట్టి నియమములేదు.

కావున క్షేత్రప్రకృతి భూతముల కుపాదానకారణమయినను క్షేత్రజ్ఞప్రకృతి మాత్రము వివర్తాధిష్ఠానమగును. ప్రపంచమునకు వివర్తోపాదానమగుచున్నందున క్షేత్రజ్ఞుడు ప్రకృతిశబ్ద వాచ్యుడగుచున్నాడు. ప్రకృతి యనగా ఉపాదానమని యర్థము. కావున త్రాడు సర్పమునకువలె జీవుడు సర్వభూతములకు ఉపాదానమని తేలినది. ఉపాదాన మనగా తనతో నభిన్నమయిన కార్యముయొక్క పుట్టుకకు కారణము అని యర్థము. ("స్వాభిన్నకార్యజనిహేతుత్వ ముపాదానత్వమ్" అని లక్షణము). ఈయది వివర్తాధిష్ఠానమునందును పరిణామియందును అనుగతమగు సాధారణ లక్షణము. కావున సర్వభూతములు చేతనవివర్తములగుటచే చేతనయోనులనియు, మాయాపరిణామములగుటవలన మాయాయోనులనియును, చెప్పనగును. పరిణామ వివర్తములకు వేరువేరు లక్షణము ఆవశ్యకమయిన నిట్లు చెప్పుకొనవలయును. (ఉపాదాన సమసత్తాక కార్యాపత్తిః పరిణామః) (ఉపాదానవిషమసత్తాక కార్యాపత్తిః వివర్తః ) అని. అనగా ఉపాదానకారణ ముండునంతకాలము నుండు కార్యమును పుట్టించుట పరిణామము. ఉపాదానకారణముండు కాలముకంటె తక్కువకాలముండు కార్యమును పుట్టించుట వివర్తము. అని.

సత్తయనునది మూడువిధములు. పారమార్థికసత్త, వ్యావహారికసత్త, ప్రాతిభాసికసత్త యని. అందు పారమార్థికసత్త బ్రహ్మయందును, క్షేత్రజ్ఞుని (జీవుని) యందును యుండును. వ్యావహారికసత్త జగత్తుయం దుండును. ప్రాతిభాసికసత్త, రజ్జుసర్పాదులయందు, స్వప్నప్రపంచాదులయందు నుండును. పారమార్థికసత్త యన ఎల్లపుడు నుండుట. వ్యావహారికసత్త యన వ్యవహారదశలోమాత్రముండుట. ప్రాతిభాసికసత్తయన, ప్రతీతిసమయమునందుమాత్ర ముండుట. కార్యకారణములగు మృద్ఘటములు రెండును వ్యావహారికసత్తకలవి. కావున నిచట కార్యమగు ఘటము ఉపాదానసమసత్తాకము, పరిణామము నగుచున్నది. అట్లే మాయా, ప్రపంచములు రెండును వ్యావహారికసత్త కలవి. ఇందు కార్యమగు ప్రపంచము ఉపాదానసమసత్తాకము. (ఉపాదానమగు మాయ యుండునంతకాల ముండునది.) కావున పరిణామమగుచున్నది. ఇక రజ్జుసర్ప స్థలమున కారణమగు రజ్జువు ( త్రాడు ) వ్యావహారిక సత్తకలది. కార్యమగు సర్పము ప్రాతిభాసికసత్త కలది. అట్లే బ్రహ్మ జగత్తులలో బ్రహ్మ పారమార్థికసత్తకలవాడు. జగత్తు వ్యావహారికసత్తకలది. కావున నిచట కార్య

కారణములు భిన్నసత్తాకములగుటచే సర్పము రజ్జు వివర్తమనియు, జగత్తు బ్రహ్మ వివర్తమనియు గ్రహింపవలెను.

కార్యకరణసంఘాతరూపములయిన పదార్థము లన్నియు భూతవికారములు. పృథివ్యాదిమహాభూతములుగూడ కార్యములు. మహదంహకార పంచతన్మాత్రలను నేడునుకార్యములే యగుచున్నవి. మూలప్రకృతిమాత్రము కార్యముకాదు. అయ్యది అనాది. కావున దానికి మూలప్రకృతి (మూలకారణము) అని వ్యవహారము పొసగుచున్నది. క్షేత్రజ్ఞుడుగూడ అజుడు, నిత్యుడు, శాశ్వతుడును అగుచున్నాడు. అందువలన క్షేత్రజ్ఞుడు అనాది యగును. కావున మూలప్రకృతి, క్షేత్రజ్ఞుడును తప్ప మిగిలిన ప్రపంచమంతయు కార్యరూపమే యని గ్రహింపవలెను.

మూలప్రకృతి అనాది యయినను నైయాయికులు చెప్పెడి ప్రాగభావము వలె అనిత్యమే యగుచున్నది. క్షేత్రజ్ఞునివలె నిత్యముకాదు. ఇట్లు క్షేత్రజ్ఞ మూల ప్రకృతులకు నిత్యత్వానిత్యత్వములతోను, జ్ఞానజాడ్యములతోను మిక్కిలి భేదము గలదు.

ఓయి! క్షేత్ర, క్షేత్రజ్ఞ ప్రకృతులు రెండు సర్వభూతములకుఁగారణము లని చెప్పినందున సర్వప్రపంచముయొక్క ఉత్పత్తి ప్రళయములకు నా ప్రకృతిద్వయమే కారణమగును. ఈశ్వరుడు కారణముగాడు. ఇట్లుండ "అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయ స్తథా" అని శ్రీకృష్ణుడు సర్వప్రపంచోత్పత్తిప్రళయములకు తాను (ఈశ్వరుడు) కారణమని యెట్లుచెప్పెను? వినుము. తనయొక్క స్వరూపస్వభావ భూతములగు క్షేత్రజ్ఞ క్షేత్రప్రకృతులు రెండును జగదుపాదానములగుటవలన వాని ద్వారమున తాను సర్వప్రపంచమున కుపాదానకారణ మగుచున్నానని శ్రీకృష్ణుని భావము.

లోకములో ఉపాదానకారణములగు మృదాదులనుండి ఘటాదికార్యములు పుట్టుచున్నవి. మరల నయ్యవి ఉపాదానకారణమునందే లీనమగుచున్నవి. అట్లే ఈశ్వరుడు ప్రకృతిద్వయద్వారమున నెల్లజగము సకలప్రపంచమునకు ఉపాదాన కారణమయినందున ప్రపంచము జగత్తుయొక్క ఉత్పత్తి లయములకు స్థానమగుచున్నాడు.

జగమనగా ఉత్పత్తివినాశములుకలది యని అర్థము. (జాయత ఇతిజం గచ్ఛతీతిగం) అని వ్యుత్పత్తినిచెప్పి "హ్రిస్వస్యపితి కృతి" అను సూత్రమున తుగాగమును చేయగా "జగత్" అను రూప మేర్పడును. అనగా "జ" అన పుట్టునది, "గ" యన పోవునది. కావున జగత్ అను శబ్దమునకు ఉత్పత్తి వినాశములు కలది యని అర్థము లభించును. అనిత్య మని నిశ్చయార్థము. మూలమునందలి "ప్రభవః" అను పదమునకు ఉత్పత్తిస్థానమని యర్థము "ప్రలయః" అను పదమునకు వినాశ

స్థానమని యర్థము. అన్వయసౌకర్యముకొరకు "భవామి" (అగుచున్నాను) అను పదమును అధ్యాహారముచేసికొనవలయును. ఇట్లే భాష్యమునందలి ఉత్పత్తి వినాశ శబ్దములుగూడ ఉత్పత్తి వినాశస్థానపరములుగాని ఉత్పత్తి వినాశము లను ధర్మపర ములుగావు ఈశ్వరుడు జగత్తుయొక్క- జన్మధర్మముగాని, మరణధర్మముగాని కాడు. అందువలన అన్వయము పొసగదు. "యతోవా ఇమాని భూతాని జాయంతే" "యేన జాతాని జీవంతి" "యత్ప్రయం త్యభిసంవిశంతి" అను (తై. ఉ. ౯-౧) తైత్తిరీయోపనిషచ్ఛ్రుతివలన ఈశ్వరుడు ప్రపంచోత్పత్తి స్థితి లయములకు గారణ మని స్పష్టమగుచున్నది.

ఆత్మశబ్దముయొక్క- పరమార్థమున్ను కూటస్థ, సాక్షి, క్షేత్రజ్ఞ, ఈశ్వర, బ్రహ్మ మున్నగు పదములచే బ్రతిపాదింపఁదగిన నేనే (ఈశ్వరుడే) నిఖిలజగదా కారముగా పరిణమించిన మాయాధిష్ఠానచైతన్య మను అర్థము పర్యవసించినది. దీని వలన జీవేశ్వరభేదవాదము మొదలంట తుడిచిపెట్టబడినది.

రామానుజ మతము :

రామానుజులు చేతనాచేతన ప్రకృతులు రెంటికి ఈశ్వరుడు కారణ మని వ్యాఖ్యానించిరి. ఈయది సరిగాదు. "అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణః" అను శ్రుతి యీశ్వరునినుండి జీవుడు పుట్టడని చెప్పుచున్నది. పుట్టినవానికిగాని మరణము సంభవింపదు. ప్రకృతి పురుషకాలములు అనాదిపదార్థములని రామానుజులుగూడ నంగీకరించిరి. "అజామేకాం లోహిత శుక్ల కృష్ణామ్" అను శ్రుతి ప్రకృతికి (మాయకు) గూడ ఆత్మనుండి జన్మలేదని చెప్పియున్నది. మాయకు జన్మ అంగీక రించుచో, మాయ పుట్టకపూర్వము యీశ్వరు డమాయికుడు గావలసివచ్చును. అపుడు "మాయినం మహేశ్వరం" అను శ్రుతి విరుద్ధమగును. మరియు మాయా రహితుడగు నీశ్వరునకు మాయను పుట్టించుసామర్థ్యము లేనందున మాయకు ఉత్ప త్తియే సంభవింపదు. మాయ యన, ఈశ్వరునియొక్క- సామర్థ్యముగాని వేరు గాదు. ఇదియే ఈశ్వరశక్తి యనిగూడ వ్యవహరింపబడుచున్నది. ఈశ్వరుడు మాయను పుట్టించుసామర్థ్యరూపమయిన మరియొక మాయను కలిగియున్నాడని నచో ఆ మాయను పుట్టించుటకు మరియొక మాయ, దానికి మరియొక మాయ అని యిట్లు అనేకమాయలు కల్పింపవలసివచ్చినందున అనవస్థాదోష మేర్పడును. వాస్తవస్థితిలో ఈశ్వరసామర్థ్యముకంటె వేరుగ మాయ అను తత్త్వము మరియొకటి లేదు. మాయ ఈశ్వరాతిరిక్తమగు తత్త్వాంతర మని యంగీకరించు సాంఖ్యసిద్ధాం తము అవైదికమగుటచే నప్రమాణము. కావున జీవునివలె మాయగూడ అనాది యని సిద్ధమయినది. ఇట్టితెరి జన్మరహితములగు మాయాజీవులకు ఈశ్వరుడెట్లు కారణమగును? కావున చేతనాచేతన ప్రకృతుల రెంటికి ఈశ్వరుడు కారణమని చెప్పు

రామానుజమతము పొసగనేరదు. కనుకనే పరమేశ్వరునివలన జీవులు పుట్టుదు
రను దోషముండుటంబట్టి భాగవతమతమును బాదరాయణులు శారీరకమీమాంసా
శాస్త్రమున నిరాకరించిరి.

ఉపాధిపరిచ్ఛిన్నత్వరూపముతో జీవునకు జన్మయనియు, తద్భంగ (ఉపాధిభంగ)
ముచే జీవునకు జీవత్వనాశమే మోక్షమనియుఁ జెప్పరాదు. ఉపాధిగతములగు
జన్మనాశములచే ఉపహితునకు జన్మనాశము లంటనేరవు. అట్లు కానిచో
ఘటముయొక్క జన్మనాశమువలన ఆకాశమునకుఁగూడ జన్మనాశములు ప్రసక్తిం
చును. బుద్ధిపరిచ్ఛిన్నుఁడగు జీవునకుగూడ శరీర మను ఉపాధియొక్క జన్మనాశము
లచే, జన్మనాశములు ప్రసక్తించును. ఈ రెండుదోషములను ఇష్టాపత్తిచే పరిహరిం
పఁదగదు. "నహన్యతే హన్యమానే శరీరే" (భగ-౨-౨౦) శరీరము నశించినను
జీవుడు నశించడు. అని యిచటనే శ్రీకృష్ణుడు చెప్పియుండెను. మరియు తత్త్వమును
చెప్పు నీ ప్రకరణమున ఔపాధికము అతాత్త్వికము అగు జన్మనాశములను చెప్పుట
అసంబద్ధమగును. కావున జీవునకుఁగాని మాయకుగాని యీశ్వరుడు కారణముకాడు.

మరియు రామానుజులు: "మహా నవ్యక్తే లీయతే" "అవ్యక్త మక్షరే
లీయతే" "అక్షరం తమసి లీయతే" "తమః పరేదేవ ఏకీ భవతి" అను శ్రుతిని
తమవాదమున కాధారపరచుకొనిరి. అదియును రామానుజుల యభిప్రాయమున కను
కూలించదు. ఇచట అవ్యక్తత్వ అక్షరత్వ తమస్త్వములు ప్రకృతియొక్క అవస్థా
విశేషములుకాని ఆత్మధర్మములుకావు. ప్రకృతికి ఆత్మయందు లయమును అద్వైతు
లంగీకరించిరి. ఆత్మకార్యముగాని ప్రకృతి యాత్మయం దెట్లు లయమగునని యన
రాదు. అకార్యమగు ప్రాగభావమునకు లయము (నాశము) కనిపించుచున్నది.
ఆకాశముయొక్క కార్యముగాని మేఘము ఆకాశమునందు లయమగుచున్నది.
అగ్నికార్యముగాని పటము అగ్నియందు లయమగుచున్నది. కావున కార్యమే
లయముచెందుననియు, కారణమునందే లయమునుచెందుననియును నియమములేదు.
మరియు నీ శ్రుతి మాయను లయమును చెప్పుటలేదు. మరేమనిన "తమః పరే
దేవ ఏకీ భవతి" అని యేకీభావమాత్రమును చెప్పుచున్నది. ఏకీభావ మనగా బ్రహ్మ
కంటె వేరుగా కార్యకారణరూపముతో నుండకుండుటయే నని యర్థము.

మరియు "అక్షరశబ్దమునకు జీవు డర్థము. తమశ్శబ్దమునకు మాయ యర్థము.
కావున జీవుడు మాయయందును, మాయ పరమాత్మయందును లయము చెందు
నని పై శ్రుతివలన అర్థమగుచున్నది." అనినచో నదియును పొసగదు. "కూటస్థోఽ
క్షర ఉచ్యతే" అను ప్రమాణము ననుసరించి పులింగమగు అక్షరశబ్దము జీవవాచ
కముగాని, నపుంసకలింగమగు అక్షరశబ్దము జీవవాచకముగాదు, "అజో నిత్య
శ్శాశ్వతోఽయం పురాణః" అను శ్రుతి జీవుడు నిత్యుడనిచెప్పి, యిచట మరల

జీవుడు అనిత్యుడని శ్రుతి స్వాయముగాఁ జెప్పనేరదు. అట్లు చెప్పినచో సమబలముగల శ్రుతులకు పరస్పర వ్యాఘాతము తటస్థించును.

మరియు "సతి సంపద్య న విదుః" "సతి సంపత్స్యామహే" అని శ్రుతి ప్రమాణమువలన సుషుప్తిదశలో జీవుడు అజ్ఞానద్వారమున (అజ్ఞానముద్వారా) బ్రహ్మయందు లయముఁజెందునని తెలియుచున్నది. అనుభవముకూడ నట్లేకలదు. కావున జీవునకు అజ్ఞానమునందు లయమనియు జీవునితోఁగూడిన అజ్ఞానమునకు (తమస్సునకు) పరమాత్మయందు లయమనియును చెప్పదగదు. సుషుప్తిదశలో జీవునకు బ్రహ్మసంపత్తియనగా బ్రహ్మస్వరూపముతోనుండుటయే కాని వేరుకాదు. అయ్యది లయమనిపించుకొనదు. "ప్రాజ్ఞే నాత్మనా సం పరిష్వజ్య" అను శ్రుతి కూడ నట్లే చెప్పుచున్నది.

సుషుప్తిదశలో జీవునకు బ్రహ్మతో సంబంధమేకదా చెప్పబడినదని యన రాదు. అయినను ఆసంబంధము లయము కానేరదు. నశించిన జీవునకు బ్రహ్మతో సంబంధ ముండనేరదు. లోకములో ఉన్న పదార్థములకే రెండింటికి పరస్పర సంబంధ మగపడుచున్నది. గగనమునకు గగనకుసుమముతో సంబంధము కనుపిం చుటలేదు. కావున జీవునకు సుషుప్తిదశలో బ్రహ్మసంపత్తి యనగా అజ్ఞాన కల్పితము లగు సంసారిత్వాది ధర్మములను విడచి బ్రహ్మస్వరూపముతో నుండుట యనియే గ్రహింపవలెను. "సతిసంపత్స్యామహే ఇతి న విదుః" అని వాక్యశేషముకలదు. అందు జీవులు బ్రహ్మసంపత్తిని చెందినట్లు తెలిసికొనుట లేదని యర్థమగుచున్నది. జీవులు నిజముగా లయమును చెందియున్నచో నశించిన (లయమునుచెందిన) జీవులను తెలిసికొనుటయే అప్రసక్తము. కావున తెలిసికొనరని శ్రుతి చెప్పుట అప్రసక్త ప్రతిషేధ మగును. "నవిదుః" అని జీవులకు సుషుప్తిదశలో గల అజ్ఞానానుభవ మును చెప్పుచున్నదని గ్రహించవలయును. "నవిదుః" అను బహుత్వనిర్దేశము ఉపాధ్యభిప్రాయముతోగాని వస్తుదృష్టితో గాదు.

లేక జీవోపాధి యగు అంతఃకరణమునకు అజ్ఞానమునందు లయమనియు, అజ్ఞానమునకు బ్రహ్మయందు లయమనియు, ఉపాధిప్రయుక్తమగు లయమే జీవునకు శ్రుతి చెప్పదలచినదికాని, సాక్షాల్లయమును జీవునకు శ్రుతి చెప్పదలచలేదు. అపరిచ్ఛిన్నుడును, పరిపూర్ణుడును, నిత్యుడును అగు జీవునకు సాక్షాల్లయము (స్వరూపనాశము) అసంభవము. జీవుడే నిజముగా బ్రహ్మమగుటచే నట్టి లయము జీవునకు పొసగదు. ఘటాకాశముకంటె మహాకాశము నిజముగా వేరుగాదు. అట్లె బుద్ధ్యాద్యుపాధికుడగు జీవునికంటె ఈశ్వరుడును భిన్నుడుగాడు. కనుక ఉపాధి నాశమువలననే జీవునకు సుషుప్తియందుఁగాని, ప్రలయమునందుగాని, ముక్తియందు గాని బ్రహ్మస్వరూపముతో నునికి తటస్థించుచున్నది. అందు సుషుప్తిప్రళయము

లలో జీవుడు వాసనారూపముతో నుండుటచే తిరిగిరాక (మరల యుపాధిసంబంధము నొందుట) సంభవించుచున్నది. మోక్షదశలో ఉపాధివాసనారూపముతో నుండక సంపూర్ణముగా లయముచెందినందున జీవునకు పునరావృత్తి లేదు. జీవునకీయుపాధిసంబంధము అజ్ఞానముచేఁ గల్పింపబడినందున జ్ఞానముచే నివర్తించుచున్నది. కనుకనే శ్రుతులు కేవలజ్ఞానమువలననే ముక్తి యని నుడువుచున్నవి.

ఇట్టితరి రామానుజులుగూడ జీవున కుపాధిభంగమే బ్రహ్మమందు లయమని చెప్పదలచినచో సాయుజ్యముక్తి యొప్పని రామానుజుల కపసిద్ధాంత మేర్పడును. అట్లుగాక వాస్తవమగు లయమును జీవున కంగీకరించినచో జీవునకు నిత్యత్వముచు చెప్పు శ్రుతులతో విరోధ మేర్పడును.

ఇక ప్రళయమునందు జీవులకు లయమనియు, ప్రపంచమునందు మరల క్రొత్త (యితర) జీవులు పుట్టుదు రనియు జెప్పినచో చేసిన పాపపుణ్యములకు నాశము, చేయని పాపపుణ్యములవలన జీవులకు జన్మమనియు దోషము వాటిల్లును. ఇట్టి జీవులను సృజించు యీశ్వరునకు వైషమ్యనైర్ఘృణ్యము లను దోషములు సంభవించును. కర్మసాపేక్షుడయి జీవులను సృజించు నీశ్వరునకు వైషమ్యనైర్ఘృణ్యాది దోషము లంటవని యనరాదు. కర్తయే లేనపుడు కర్మ యెట్లుండును? కర్మ కర్తను కదా యాశ్రయించుకొని యుండును. జీవులయొక్క అదృష్టము కదా కర్మశబ్దమున కర్థము. జీవులే ప్రళయకాలమున నశించగా నిక కర్మయేది? దేని నపేక్షించుకొని యీశ్వరుడు మరల జీవుల సృష్టించును? "న జాయతే మ్రియతేవా విపశ్చిన్నాయం భూత్వా భవితా వా న భూయః" (భగ-౨-౨౦) అని కదా యిచట భగవంతునిచే స్మరింపబడినది. కాఠక శ్రుతిగూడ నిట్లే చెప్పును కదా! మీరు (రామానుజులు) కూడ నా గీతాస్మృతిని వ్యాఖ్యానించుటలో జీవులు నిత్యులనియే వ్యాఖ్యానించిరికదా? కావున నట్టి మీరు (రామానుజులు) ఇపుడు జీవులు బ్రహ్మము నందు లయమును చెందుదురని చెప్పినచో స్వవచనవ్యాఘాతము · తటస్థించును. మఱియు నీసందర్భమున రామానుజు లుపన్యసించిన స్మృతిని విచారింతము. "ప్రకృతిర్యా మయాఖ్యాతా వ్యక్తావ్యక్తస్వరూపిణీ। పురుషశ్చాప్యుభావేతౌ లీయేతే పరమాత్మని" అను స్మృతి ప్రకృతి పురుషులకు పరమాత్మయందు లయమును చెప్పుచున్న దనిరి. ఇదియును యుక్తముగాదు. ఈ స్మృతి ప్రకృతిపురుషులకు వాస్తవ లయమును చెప్పుటలేదు. మరేమనిన, ప్రళయకాలమునందు ప్రకృతి యేకార్యమును పుట్టింపఁజాలక నసమర్థమయి, లీనమయినదానివలె నున్నదనియు, పురుషుడు (బుద్ధి పరిచ్ఛిన్నుఁ డగు జీవుడు) అజ్ఞానతాదాత్మ్యాధ్యాస నొంది, లీనునివలె నుండెననియును, ఔపచారిక లయమును మాత్రముచెప్పుచున్నది. అట్లుగాక మాయ ప్రళయకాలమున స్వరూపముతో నశించుచో జీవులందరు ప్రయత్నములేకయే ముక్తి

నొందుదురు కాన మోక్షశాస్త్రము వ్యర్థమగును. ఎల్ల జీవులు ముక్తి చెందుచో మరల ప్రపంచమునందు నితరజీవుల బుట్టింపవలసివచ్చును. ఈయది యంగీకరించిన జన్మనాశములులేని జీవులకు జన్మనాశములును, కృతహానాకృతాభ్యాగమ దోషము లున్ను ప్రసక్తించును. ఈశ్వరునకు వైషమ్యనైర్ఘృణ్యాది దోషముకూడ వాటిల్లును. కావున ప్రళయకాలమున జీవనాశమును ఒప్పిన నీదోషములన్నియు అనివార్యము లగును.

కావున నిదురించిన పురుషుడు బ్రహ్మస్వరూపమునం దెట్లు లయమును చెందునో, అట్లే ప్రళయకాలమునందుగూడ జీవుడు లయముచెందును కాని వాస్తవ ముగా లయముచెందడు. అట్లుకానిచో, సద్రూపు డగు జీవునకు నాశమున్ను అస ద్రూపు డగు జీవునకు పునరుత్పత్తియు ప్రసక్తించు. అట్టెతరి "నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః" (భగ-౨-౧౬) అను గీతావచనము విరోధించును. అసత్పదార్థమునకు సత్తయు (ఉనికియు) సత్పదార్థమునకు అసత్తయు (లేకుండుటయు) అయుక్తమగును. కావున నిట్టి కల్పనము అంగీరింపదగదు.

అయితే సద్రూపమగు (ఉన్న) ప్రపంచమునకు మాత్రము లయ మెట్లు పొసగును? అని యనదగదు. ప్రపంచము అసద్రూపముగాని సద్రూపముగాదు. ప్రపంచము అసద్రూపమగుచో శశశృంగాదులవలె (కుందేటికొమ్ము మున్నగువాటివలె) ప్రతీయమానము కాదుకదా? (కనిపించదుగదా) వినుము. అసద్రూపమగు రజ్జు సర్పము కనిపించినట్లు అసద్రూపమగు ప్రపంచముకూడ కనిపించవచ్చును. లేని (అస ద్రూపమగు) ప్రపంచము కనిపించుటవలననే ప్రపంచము శుక్తిరజతాదులవలె మిథ్య యనియే మేము (అద్వైతులు) అనుచుంటిమి. ఏది కనిపించుచు నాశముచెందునో, అయ్యది యింద్రజాలాదులవలె మిథ్యయని అద్వైత సిద్ధాంతము. కావున నిత్యు డయిన జీవునకు ప్రళయమునందుకాని, ముక్తియందుకాని లయము అసంభవము. అట్లే మాయకుగూడ ప్రళయమునందు లయము లేదు. ముక్తియందు మాత్రమే మాయ నశించును. ప్రకృతిపురుషులు ప్రళయమునందు లయముచెందుదు రని చెప్పెడి స్మృతి యౌపచారికస్మృతివిషయముకాని వాస్తవస్మృతివిషయముకాదు. ప్రకృతి పురుషులు ప్రళయమునందు లయముచెందరు. కనుకనే ప్రపంచమునందు మరల నూతనముగా బుట్టరు. కావున ప్రకృతి పురుషులకు ఈశ్వరుడు (యోని) కారణము అను రామానుజవచనము సర్వథా అనుచితము. ౬

శ్లో. మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥ ౭ ॥

అ. ఓయి అర్జునా! నాకంటె వేరుకారణమేదియు లేదు. లేక నాకంటె వేరేదియు కారణములేదు. దారమునందు మణులుకూర్చబడినట్లునాయం దీ ప్రపంచ

మంతయు కూర్చబడినది. నేనే నిఖిల ప్రపంచమునకు ఉత్పత్తిస్థానము. నేనే నిఖిల ప్రపంచమునకు ప్రలయస్థానము. శ్లోకమునందు వేరే అన్యశబ్ద ముండుటవలన పర తర శబ్దమునకు నితరము అను అర్థముకాదు. కారణము అని యర్థము. అట్లు కానిచో పౌనరుక్త్యదోషము వాటిల్లును. మట్టివలన బుట్టిన పదార్థము లన్నియు మట్టియం దనుగతములయి యున్నటుల ప్రత్యగభిన్నబ్రహ్మస్వరూపుడనగు నాయందు ప్రమేయజాతమంతయు ననుగతమయి యున్నది ఘటాకారముగా బరిణమించిన మృత్తిక యందు ఘటమువలె ప్రపంచాకారముగా బరిణమించిన మాయయందు ప్రపంచ మనుగతమగుచున్నది. ప్రపంచాకారముగ బరిణమించు మాయకు అధిష్ఠానమయి నందున ఆత్మయందుగూడ ప్రపంచ మనుగతమగుచున్నదను ప్రతీతి పొసగుచున్నది. అని యొకదృష్టాంతము. దారమునందు మణు లెట్లు కూర్చబడునో, అట్లే అంతర్యామి యగు నాత్మయందు ప్రపంచము కూర్చబడినది. ఈ రెండు దృష్టాంతముల ననుస రించియే భాష్యకారులు భాష్యమునందు "ప్రోత" శబ్దమునకు "అనుస్యూతం" (అనుగతము యినది) "అనువిద్ధం" (కూర్చబడినది) అని రెండర్థములను సూచించిరి. దీనివలన లోపలనున్న దారముచే మణులుధరించబడినటుల, లోపలనున్న జీవప్రకృతిచే ప్రపంచము ధరింపబడుచున్న దని సూచిత మగుచున్నది. ౭

శ్లో. రసోఽహ మప్సు కౌంతేయ! ప్రభాస్మి శశిసూర్యయోః
ప్రణవ స్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ॥ ౮ ॥

అ. ఓయి! నీయందే ప్రపంచమంతయు నేల యనుగతమగుచున్నది? మట్టి యందు ఘటము, దారములయందు పటము అనుగతమయినట్లు ఆయాకార్యములు ఆయాకారణముల యం దనుగత మగునుకదా? అను శంకరాగా సమాధానము చెప్పబడుచున్నది.

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ తన్మాత్రలవలన యథాక్రమముగ ఆకాశ, వాయు, అగ్ని, జల, పృథివీ భూతములు పుట్టినవి. కావున పృథివ్యాదిపంచభూతములు స్వకారణములయిన శబ్దాదిపంచతన్మాత్రలయందు ప్రోతములగుచున్నవి. ఆ శబ్దాదితన్మాత్రలు పరమేశ్వరునివలన బుట్టుటచే పరమేశ్వరస్వరూపములు. మట్టి వలనబుట్టిన ఘటము మట్టిరూపమగుట లోకవిదితము.

ఓయి అర్జునా! నేను ఉదకములయందు రసరూపుడను, ఆకాశమునందు శబ్దస్వరూపుడను, పృథివియందు గంధరూపుడను, అగ్నియందు తేజోరూపుడను, వాయువునందు స్పర్శరూపుడను, పంచభూతములయందుండెడి శబ్దస్పర్శాది పంచ తన్మాత్రలు సారపదార్థములు. సారమనగా స్థిరమయిన భాగమని యర్థము. కార్యమునకు కారణము స్థిరాంశము. (ఉ) ఘటమునకు మృత్తిక, కుండలమునకు

కనకము స్థిరాంశములు. అట్లే ఆకాశాదులకు శబ్దాదులు సారములని గ్రహింప వలయును.

అట్లే చంద్రుని యందుండెడి చంద్రికా రూపమగు తేజస్సు, సూర్యునియందుండెడి ఆతప (ఎండ) రూపమగు తేజస్సు కూడ నేనే (ఈశ్వరుడే) అని గ్రహించవలెను.

మరియు నిఖిల వేదములకు ఆదియగు ఓంకారము గూడ నేనే యగుచున్నాను. అట్లే మానవులయందు పౌరుషము (వీర్యము) గూడ నేనే యగుచున్నాను. పౌరుష మనగా పురుషునియొక్క భావము (ధర్మము) అని యర్థము. అయ్యది వీర్యమే యగును. లోకములో నిర్వీర్యుని (వీర్యములేనివానిని) నపుంసకుడని యందురు. కావున పుంస్త్వమునకు కారణము వీర్యమనుట నిర్వివాదము. అందువలన కారణభూతమయిన వీర్యమునందు పురుషులు (అనగా దేహము లని యర్థము) అనుగతములగుచున్నవి. పురుషశబ్దము యథార్థదృష్టిలో పురుషదేహ మను అర్థమునే యిచ్చును. కాని యిచట స్త్రీశరీరములుగూడ పురుషవీర్యమువలననే కలుగునుకాన నిచట పురుషశబ్దము దేహమాత్రపరమని గ్రహించవలయును. మూలమునందలి "నృ" శబ్దమునకు పురుషు లని యర్థము. స్త్రీలకుగాని, నపుంసకులకుగాని వీర్యముండదు. కావున వీర్యముగల పురుషులే నృశబ్దమున గ్రహింపవలయునన్న భావము.

౮

శ్లో. పుణ్యో గంధః పృథివ్యాం చ తేజ శ్చాస్మి విభావసౌ
జీవనం సర్వభూతేషు తప శ్చాస్మి తపస్విషు ॥ ౯ ॥

అ. ఓయి అర్జునా! నేను పృథివియందు పుణ్య (పరిమళ) మయిన గంధరూపుడను, అగ్నియందు తేజోరూపుడను, సమస్తభూతములయందును జీవనాధారమగు అన్నరూపుడను, తపస్వులయందు తపోరూపుడను, ఈ శ్లోకమునందు గంధమునకుఁ జెప్పిన పుణ్యత్వవిశేషణము రసాది తన్మాత్రలకుగూడ నుపలక్షణమర్యాదచే నన్వయించుకొనవలయును.

పృథివ్యాదులయందుండెడి స్వాభావికములగు గంధాది గుణములు, పుణ్యములు (మంచివి). ఆగంతుకములగు గంధాదులు, అపుణ్యములు (చెడువి). (ఉ) పృథివికి సుగంధము స్వాభావికము, దుర్గంధము ఆగంతుకము. జలమునందు స్వాదురసము స్వాభావికము, అస్వాదురసము (అనగా ఉప్పు, చవ్వన, చేదు మున్నగు రసము) ఆగంతుకము. ఇట్లే మిగతవాటియందుగూడ గ్రహించవలెను. పృథివ్యాదులయందు ఆగంతకము లయిన అపుణ్యగంధాదులు, అవిద్యవలనను, అధర్మమువలనను కలిగెడి భూతవిశేషములయొక్క సంబంధమున నేర్పడుచున్నవి. పృథివీ జలసంయోగమువలన పృథివియందు రసమున్ను, జలమునందు గంధమున్ను యేర్పడి

నట్లు ఒకానొకప్పుడు ధర్మవశమున జలచందన సంయోగమువలన ఆగంతుకముగా సుగంధము పుట్టుచున్నది. కాని యీ యది విశేషన్యాయము. భూతములయందు చెడ్డగుణము లేర్పడుటయే ఆగంతుకము, ఈయది సాధారణము. "అన్నాత్ భూతాని జాయంతే" "జాతాన్యన్నేన జీవంతి" "అన్నం ప్రయం త్యభిసం విశంతి" (తై-ఉ) ఇత్యాది శ్రుతి ప్రమాణమును బట్టి జీవనశబ్దమునకు అన్న మర్థమని చెప్పవలయును.

ఓయి! శబ్దస్పర్శరూపరసగంధాదులు పృథివ్యాదిభూతములకుఁ గారణములు. ఈయవి యీశ్వరస్వరూపములు. లోకములో కార్యములు కారణముల యం దను గతమగు ధర్మముకలదు. అందువలన పృథివ్యాది కార్యములు గంధాదికారణరూపు డగు నీశ్వరునియందు ప్రోతము (అనుగతము) లగుగాక. అట్లు తపోఽనుష్ఠాతలకు తపస్సు కారణముకాదు కదా? అట్టితరి తపస్వులు తపస్సుయందు అనుగతులని యెట్లుచెప్పబడినది? నిజమే, కాని కార్యములు కారణము నాశ్రయించుకొని యున్నటుల, తపోనుష్ఠాతలు తపస్సును ఆశ్రయించుకొని యుండిరి కాన, వారు తపస్సునందు ప్రోతు (అనుగతు) లని ఔపచారికముగాఁ జెప్పబడినది. ఇదేన్యాయ మును ముందుశ్లోకమునఁ జెప్పబోవు "బుద్ధి ర్బుద్ధిమతాం" అనుచోట అన్వయించు కొనవలయును. లేనిచో తపోనుష్ఠాతలకు తపస్సుకు, నెట్టి యాశ్రయాశ్రయిభావ మున్నదో, రసజలాదులయందుగూడ నట్టి యాశ్రయాశ్రయిభావమేయున్నదనిచెప్పు కొనవచ్చును. కావున జలాదులు రసాదులనాశ్రయించుకొనియున్నవి. కాన నయ్యవి రసాదులయందు ప్రోతములు. అని.

అయితే, "గుణముకలవానిని గుణము ఆశ్రయించుకొనియుండును. కాన గుణియే (గుణముకలవాడే) గుణమున కాశ్రయు డగును. కావున గుణము గుణి యందే ప్రోతమగును. ఇంతియేకాని గుణి, గుణమునం దనుగతు డని చెప్పదగదు." అని శంకింపరాదు. గుణి యనగా 'గుణః అస్య అస్తి' అను వ్యుత్పత్తిచే గుణము కలవాడని యర్థము. కావున గుణము లేనిదే గుణి సిద్ధింపనేరడు. కనుక గుణమే గుణికి (గుణముకలవానికి ఆశ్రయ మని యంగీకరింపవలయును.

మరియు గుణియందు గుణము ప్రధానము అప్రధానములు ప్రధానము నాశ్రయించియుండుట లోకసహజము కనుక ప్రధానభూతమగుగుణమే అప్రధాన మయిన గుణికి ఆశ్రయమగును. కనుక నే "అపాం యస్సారః" (ఉదకములలో ప్రధా నాంశ మేదికలదో) "ఆకాశే శబ్దస్సార భూతః" (ఆకాశమునందు శబ్దము సార భూతము) అను భాష్యవచనములు ఉపపన్నములగుచున్నవి. సారమనగా ప్రధాన మని యర్థము. కనుక తపస్సు ప్రధానమగుటవలనను, తపస్సు ఆశ్రయమగుటవలనను తపస్వులు తపస్సుయందు ప్రోతులయిరి (అనుగతులయిరి). అట్లే, బుద్ధి ప్రధాను లగుటవలనను, బుద్ధిని యాశ్రయించియుండుటవలనను, బుద్ధిమంతులు బుద్ధియం

దనుగతులయిరి. అట్లే, బలము ప్రధానమగుటవలనను, బలము నాశ్రయించి యుండుట వలనను బలవంతులు బలమునందు అనుగతులయిరి (ప్రోతులయిరి). అని యూహించవలయును. (లేక) కారణము లేనిదే, కార్యము లేనటుల, విశేషణము లేనిదే విశిష్టముండదు. కాన కారణమునందు కార్యమువలె, విశేషణమునందు విశిష్టము ప్రోతమయినది అని గ్రహింపవలెను. 9

శ్లో. బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ? సనాతనమ్
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్ ॥ ౧౦ ॥

౫. ఓయి అర్జునా! లోకములో వృక్షములు మొలచుటకు వటాదిబీజములెట్లు కారణములో అట్లే సర్వభూతములు ప్రాదుర్భవించుటకు నేను అనాదిబీజమునుగా తెలిసికొనుము. ఎల్లభూతములకు అనాదికారణమగు నాయందే సర్వభూతములు ప్రోతములయిన (ఇమిడియున్న) వని ఫలితార్థము. ఈయది "జీవనం సర్వభూతేషు" అను పాదముయొక్క అర్థముతో పునరుక్తముగదా యని శంకింపరాదు. పరమేశ్వరుడు ప్రపంచమునకు జీవనభూతుడు, బీజభూతుడును గనుకనే ప్రోతత్వ మనునది అనుగతిరూపముగను, కూర్చబడియుండుట రూపముగను రెండువిధముల చెప్పుట పొసగుచున్నది.

ప్రపంచమునకు పరమేశ్వరుడు మాయారూపముతో బీజముగును కాని, చిద్రూపముతో కానేరడు. స్థూలమగు ప్రపంచము వృక్షమువంటిది. దానికి సూక్ష్మమగు మాయయే బీజమగును. చిన్మాత్రుడగు ఈశ్వరునియందు "అస్థూలమ నణు" ఇత్యాది శ్రుతులచే స్థూలత్వ, సూక్ష్మత్వములు నిషేధింపబడినందున, చిద్రూపుడు ప్రపంచబీజము కానేరడు. అవ్యక్తమగు మాయా ప్రతిబింబితచైతన్యమే ప్రపంచ బీజమని సిద్ధించినది.

ఈ యంశము లోగడనే "మయి సర్వ మిదం ప్రోతం" అనుశ్లోకమునందు చెప్పబడినది. కాన మరల యిచ్చట చెప్పుట పునరుక్తము కదా యని శంకింపరాదు. దానికి వివరణభూతమే ఈ శ్లోకమని గ్రహించవలెను. (లేక) "సూత్రే మణిగణా ఇవ" (దారమునందు మణులవలె) అను దృష్టాంతము ననుసరించి "మయి" ప్రత్యగాత్మయగు నాయందు అని, యాశ్లోకమునం దర్థము. మాయారూపుడనగు నేను ప్రపంచకారణుడ నని యిచట చెప్పబడినది. కావున పునరుక్తదోషములేదు. (లేక) "దీర్ఘపట తంతువత్" (పొడవయిన దారమునందు గుడ్డవలె) అను దృష్టాంతము ననుసరించి "మయి" అను పదమునకు జగదాకారముగా పరిణమించిన మాయాధిష్ఠానబ్రహ్మ చైతన్యమునందు" అని యచ్చట జెప్పబడినది. ఇచ్చట మాయారూపుడ నగు నాయందు అని యర్థము కావున పునరుక్తములేదు.

"మయి సర్వ మిదం ప్రోతం" అను శ్లోకమునందు ఈశ్వరుడు ప్రత్యగ్రూప ముతోను, బ్రహ్మస్వరూపముతోను, సర్వప్రపంచాధిష్ఠానమని చెప్పబడినది. "జీవ నం సర్వభూతేషు" అను శ్లోకమున అన్నరూపముతో ప్రపంచకారణమని చెప్పబడి నది. "బీజంమాం సర్వభూతానాం" అను శ్లోకమునందు మాయారూపముతో ఈశ్వ రుడు ప్రపంచాధిష్ఠానమని చెప్పబడినది. ఈమూడు శ్లోకములను భేద మిట్లిది గమనింపనగును.

ఓయి! అన్నము ఈశ్వరవివర్తముకాని యీశ్వరాధిష్ఠిత మాయా పరిణా మముకాని యగుచున్నది. కావున నీశ్వరుడు అన్నరూపు డగుగాక, మాయ అకా ర్యమగుటచే (కార్యముకాకుండుటచే) ఈశ్వరవివర్తముకాదు పరిణామరూపము కాదు. కావున ఈశ్వరుడు మాయాస్వరూపు డెట్లగును? వినుము. ఈశ్వరునికంటె భిన్నమయిన వస్తుజాతమంతయు ఈశ్వరునియందు అధ్యస్తమయినది (కల్పింపబడి నది). మాయకూడ నీశ్వరాతిరిక్తముకావున ఈశ్వరునియందుఁ గల్పింపబడినదే యగును. అట్లుకానిచో మాయ సత్యముకావలసివచ్చును.

అయితే ఈశ్వరునియందు మాయచే ప్రపంచము కల్పింపబడినది. మాయ ఈశ్వరునియందు దేనిచేఁ గల్పింపబడినది? మాయను కల్పించు పదార్థము మరి యొకటి కనిపించదు. మాయను కల్పించునట్టి పదార్థమును మరియొకదాని నంగీక రించుచో దానిని కల్పించు మరియొకపదార్థము, దాని కల్పించు మఱియొకపదా ర్థము అని యిట్లనవస్థాదోష మేర్పడును. కావున మాయకే అధ్యాస సంభవించ దనినచో నట్లు కాదు. మాయ తనంతట తానే యధ్యస్తమగును. మాయను కల్పిం చుటకు మరియొక పదార్థము అవసరములేదు. "మాయాచ అవిద్యాచ స్వయ మేవ భవతి" (మాయావిద్యలు రెండు నస్వయముగానే కలుగును.) అని శ్రుతి ప్రమాణముగూడ గలదు. ఇయ్యది యసంభ మనదగదు. శ్రుతి చెప్పుటవలన అసం భవమని శంకించుటకే తావులేదు. యుక్తివలనగూడ జ్ఞానమువలన నివృత్తమగుటచే మాయ అధ్యస్తమనియే అంగీకరింపవలెను.

అధ్యస్తము కాని వస్తువు సత్యమగును. సత్యవస్తువు జ్ఞానముచే నివర్తింప నేరదు. ఎయ్యది నివర్తించునో అయ్యది అధ్యస్తము. ఎయ్యది నివర్తించదో అయ్యది సత్యము అను నియమము లోకసిద్ధము. ధర్మిగ్రాహకప్రమాణముచే అధ్య స్తమాయకు డగు ఈశ్వరుడు సిద్ధించుచున్నాడు. "యతోవా ఇమాని భూతాని జాయంతే" అను శ్రుతి సూచితమగు అనుమానముచే (జగజ్జన్మాదిలింగకాను మానముచే) మాయాశ్రయుడగు నీశ్వరుడు సిద్ధించుచున్నాడు. ఇట్లు మాయ స్వయ ముగా అధ్యస్తమగుటచే అకార్యమనియు, అనాది యనియు జెప్పబడుచున్నది. కనుక ఈశ్వరుడు తనయందుఁ గల్పింపబడిన అన్నరూపుడయినట్లు, తనయందు

గల్పింపబడిన మాయారూపుడగుట నిర్వివాదము. మాయ ఈశ్వరరూపము కానిచో మాయాపరిణామమగు అన్నముగూడ నీశ్వరరూపము గాకపోవును. ఇంతట మూలమునందలి బీజశబ్దార్థవిచారణ ముగిసినది.

ఇక బీజశబ్దవిశేషణమగు సనాతనశబ్దార్థము వివరింపబడుచున్నది. సనాతన మనగా అనాది యని అర్థము. వేదాంతమతమున దృక్, దృశ్యము అని రెండే పదార్థములు. అందు దృక్ పదార్థము క్షేత్రజ్ఞుడగు ఆత్మ. దృశ్యము క్షేత్రము. దృశ్యము మూడు విధములు. అవ్యాకృతము, అమూర్తము, మూర్తము అని. ఇందు అవ్యాకృత మను దృశ్యము అవ్యక్తమనియు, అజ్ఞానమనియు, మాయ యనియు, మూలప్రకృతి యనియు, ఈశ్వరోపాధి యనియు వ్యవహరింపబడును. ఇదియే ఆకాశము మున్నగు అమూర్తపదార్థమునకు పృథివ్యాదిప్రపంచమునకున్ను కారణమగుటచే బీజమనిగూడఁ జెప్పఁబడుచున్నది. ఈ యవ్యాకృతము దేనికి కార్యముగానందున సనాతన మనబడుచున్నది. ఇయ్యది యేకవిధమే యగును. మూర్తామూర్తములుమాత్రము పృథివ్యాదిప్రపంచరూపములై అనేకవిధములున్ను, కార్యములున్ను అగుచున్నవి. ఇచట "మాం" "మయి" (నన్ను, నాయందు) అని అస్మచ్ఛబ్దముచేఁ బ్రతిపాదింపదగినవాడు దృక్పదార్థమగు ఆత్మ—సనాతన, బీజ, శబ్దములచేఁ బ్రతిపాదింపఁదగినది అవ్యక్తము. రస, అప్, పృథివీ ఇత్యాది శబ్దములచే ప్రతిపాదింపదగినది మూర్తామూర్తమగు ప్రపంచము అని భేదము. కావున నిట్లు బీజశబ్దమువలననె అవ్యాకృతపదార్థము లభించుచున్నది. అయినను అయ్యది అనాది యని ధ్రువపరచుటకు "సనాతన" మను విశేషణము గ్రహింపబడినది.

(లేక) కారణమాత్రమును చెప్పు బీజశబ్దము పృథివ్యాదులకు గారణములగు జలాదులను, ఘటాదులకు కారణములగు పృథివ్యాదులను, పుత్రాదిశరీరములకు గారణములగు పిత్రాదిదేహములను, వృక్షాదులకు కారణములగు బీజాదులను ఇట్లు అవాంతర కారణ సముదాయమునే చెప్పును. అట్టి భావమును మరల్చ ప్రధాన కారణ మను అర్థమును సూచింపఁజేయుటకు సనాతనమను పదము విశేషణముగా గ్రహింపబడినది. ఈ విశేషణసామర్థ్యమువలన అవాంతరకారణములగు పృథివ్యాదులుగాని, కారణముకాని నిర్విశేషచిన్మాత్రచైతన్యముకాని బీజశబ్దవాచ్యములు కావు. ఈశ్వరుడు మాయాద్వారమున జగత్కారణమగునుకాని, స్వయముగా జగత్కారణముకాదు. "సనాతనుడగు నన్ను సర్వభూతములకు బీజమునుగా తెలిసికొనుము" అని యన్వయము. ఇచట సర్వభూతము లనగా మూర్తామూర్తప్రపంచమర్థమగుటచే, తత్కారణమగు అవ్యక్తమే బీజశబ్దార్థమని గ్రహింపవలెను.

రామానుజమతము- ఇచట వేదాంతదేశికులు బీజశబ్దమునకు సకలపరిణామి ద్రవ్యములకు ఉపాదానకారణత్వమనియు, లేక నానాయాయవాంతరోపాదానద్రవ్యమనియు అర్థమును చెప్పిరి. అది యనుచితము. ధర్మివాచియగు బీజశబ్దమునకు ఉపాదానత్వమను ధర్మవాచిత్వము సంభవింపదు. ముఖ్యార్థము సంభవించుచుండగా లక్షణ యంగీకరించుట అన్యాయ్యము. మూలమునందలి "సర్వభూతానామ్" అను పదమున సర్వపదముయొక్క స్వారస్యము చెడిపోవుటవలన బీజశబ్దమునకు అవాంతరోపాదానకారణమను అర్థముగూడ చెప్పుట యుచితముగాదు.

ఇచట బుద్ధిశబ్దమునకు మంచిచెడ్డలను వివేచనచేయు సామర్థ్యము అని యర్థము. ఇంతియెకాని అంతఃకరణమని యర్థముకాదు. అంతఃకరణము ఎల్లరకు కలదుగాన "బుద్ధిమతాం" (బుద్ధిమంతులలో) అని విశేషించిచెప్పుట అనుచితమగును. కావున బుద్ధిమంతులకు ఆశ్రయమయినట్టియు ప్రధానమయినట్టియు, బుద్ధి (సదసద్వస్తు వివేచన సామర్థ్యము) నేను అని యర్థము. ౧౦

శ్లో. బలం బలవతాం చాహం కామరాగవివర్జితమ్
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ ॥ ౧౧ ॥

అ. బలమనగా శరీరసామర్థ్యముకాని, యింద్రియసామర్థ్యముకాని లేక నారెండుసామర్థ్యములుకాని యర్థము. కామమన దూరమున నున్న వస్తువులయందాశ. సంప్రాప్తములయిన వస్తువులయందలి ఆసక్తి రాగమనబడును. బలమున్నపుడు స్త్రీ మొదలగు విషయములయందు కామరాగములు కలుగును. కావున తృష్ణారాగములకు బలము కారణము. ఈ రెంటికి పరమకారణము అజ్ఞానము.

బలముకలవారిలో కామరాగములులేని బలము నేనగుచున్నాను అని పూర్వార్థమున కర్థము. భూతములలో ధర్మావిరుద్ధమగు కామము నేనగుదును అని యుత్తరార్థమున కర్థము.

ఓయి! బలముగలవారిలో బలము నారూపమని శ్రీకృష్ణుడు చెప్పక కామరాగవివర్జితబలము నేనని చెప్పుటకుఁ గారణమేమి? వినుము. పృథివ్యాదులయందు అజ్ఞానమువలనను, అధర్మమువలను, భూతవిశేష సంసర్గవలనను కలుగు అపుణ్యగంధాదులఁ జెప్పలేదు. పుణ్యగంధ పుణ్యరసాదులనే భూతములయందు భగవద్రూపముగాఁ బేర్కొనెను. అట్లే ఇచ్చటగూడ కామరాగములతోగూడిన బలము దుష్టబలమగునుకాని, పుణ్యబలము కానేరదు. కావున దోషరహితమయిన బలమే భగవద్రూపమని చెప్పదలచి యిట్లుచెప్పెను.

అయితే లోకములో దుష్టవస్తువులు, అదుష్టవస్తువులు అన్నియు భగవద్రూపములే అయినను ఈయవి గ్రహింపదగినవని తెలియుటకు అదుష్టవస్తువులనే యిచట

భగవద్రూపములని చెప్పెను. కనుకనే ఉత్తరశ్లోకమున సర్వము భగవత్స్వరూపమని చెప్పబడుచున్నది. ఇకముందుగూడ వృక్షజాతిలో నేను అశ్వత్థవృక్షమనుచు మంచి మంచివస్తువు లన్నియు తనరూపములనిచెప్పి, పిదప "విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్" (భగ.౧౧-౪౨) అను శ్లోకముచే సర్వము తనరూపమే యని చెప్పబోవుచున్నాడు.

దీనిచే జలాదులయందున్న పుణ్యరసాదులు భగవద్రూపముగా ఉపాసింప దగినవనియు, తపస్సు, బుద్ధి, తేజస్సు, బలము, కామము ఈయవి ధర్మావిరుద్ధములు తనయందు సంపాదించుకొనవలె ననియు ఉపదేశము సూచింపబడుచున్నది. ౧౧

శ్లో. యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చ యే
మ త్త ఏవేతి తా న్విద్ధి న త్వహం తేషు తే మయి ॥ ౧౨ ॥

అ. ఓయి అర్జునా! సత్త్వగుణమువలన బుట్టిన పదార్థము, రజోగుణమువలన బుట్టిన ప్రాణులు, తమోగుణమున బుట్టిన ప్రాణులు వీరందరు నావల్ల పుట్టిరనియె గ్రహించుము. వాటియందు నేనులేను; అవి నాయందుకలవు.

సాత్త్వికాదిపదార్థములకు అవాంతరకారణములు సత్త్వాదిగుణములు. పరమ కారణము పరమేశ్వరుడు. పరమకారణజన్యమగు వస్తువు అవాంతరకారణజన్యము కాకపోవచ్చును. అవాంతరకారణజన్యమగు వస్తువు మాత్రము తప్పక పరమకారణ జన్యమగును. (ఉ) ఘట శకలములు మృత్తికామయములగును. కాని ఘటము మాత్రము శకలమయము కానేరదు. మూలమున "మ త్తఏవ" అని యవధారణ చేయుటచే, రజతము వస్తుతః శుక్తికయే యయినటుల, సత్త్వాదిగుణములు మూడున్ను నిజముగా నేనే అని యర్థము.

సాత్త్వికభావములు దేవతలనియు, రాజసభావములు మనుష్యాదులనియు, తామసభావములు తిర్యగ్జంతువులనియు భేదము.

ఓయి! సాత్త్వికాదిప్రాణులు ఈశ్వరునివలన బుట్టిరని చెప్పినచో, అప్రాణులు మరియొకరివలన బుట్టిరని చెప్పినట్లేకదా? కాదు- క్షిత్యంకురాది యప్రాణి వర్గము నకు కర్త యీశ్వరుడే యని తార్కికు లింతకుమున్నే అంగీకరించి యుండుటచే మరల యీవిషయ మిచటఁ జెప్పపనిలేదు.

తండ్రివలన కొమరుడు, కుమారునివలన మనుమడు, యిట్లు ప్రాణులు మరి యొక ప్రాణివలన బుట్టుచున్నట్లు లోకప్రతీతియుండుటచే ఆ లోకప్రసిద్ధిని నిరసించు టకే శాస్త్రము ప్రవర్తించినది.

భ్రమప్రమాదాదులతోగూడిన లోకదృష్టికంటె శాస్త్రమెప్పుడును బలవత్తర మగును. శాస్త్రవిరుద్ధమైన లోకదృష్టియే అప్రమాణమగును. అట్లుకానిచో

లోకదృష్టి సిద్ధములగు సూర్యోదయము, సూర్యాస్తమయము, చంద్రక్షయము గ్రహణము, కలంకము, ఆకాశముయొక్క నలుపు ఇవియన్నియు సత్యములగును.

"యతో వా ఇమాని భూతాని జాయంతే" అను శాస్త్రము ప్రాణులందరు ఈశ్వరునివలననే పుట్టుచున్నారని చెప్పుచున్నది. అవిక్రియుడును, అద్వితీయుడును, నిత్యుడును అగు ఈశ్వరునకు జన్మలేదు. దేవదత్తాది దేహాకారముగా పరిణమించిన మాయనుండి విష్ణుదత్తాది దేహములు పుట్టుచున్నవి.

మాయాపరిణామమగు దేహమునుండి మరల పరిణామమెట్లు కలుగునని ప్రశ్నింపరాదు. అన్నపరిణామమగు రక్తము క్షీరాకారముగా పరిణమించుచున్నది. మృత్పరిణామమగు ఘటమునుండి కపాలపరిణామము ముదయించుచున్నది. బీజపరిణామమగు వృక్షమునుండి పుష్పాదులయొక్క పరిణామము కలుగుచున్నది మేఘము యొక్క పరిణామమగు జలమునుండి బుద్బుదముల (బుడగల) యొక్క పరిణామము కలుగుచున్నది. అట్లే యిచ్చటగూడ దేహముచే భుక్తమయిన (అనుభవించిన) అన్నమునకు రక్తరూపముగను, రక్తమునకు వీర్యరూపముగను, వీర్యమునకు పిండ రూపముగను పరిణామము సంభవించును.

ఓయి! "సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని" (భగ-౬-౨౯) అను శ్లోకమున తాను సర్వభూతములయందు కలనని చెప్పి; యిచ్చట మరల "న త్వహం తేషు తే మయి" అని విరుద్ధముగా నేలచెప్పెను? వినుము సమాధానము. ఇచట "అధీన" అను పదమును అధ్యాహారము చేసికొనవలెను. దానిని ద్వారా వృత్తిచేయవలెను. ఒకమారు ఏకవచనాంతముగను, మఱియొకమారు బహువచనాంతముగను మార్చవలెను. అపుడు (అహం తేష్వధీనో న) నేను వారలకు స్వాధీనుడనుగాను. (తే తు మయ్యధీనాః) వారుమాత్రము నాకుస్వాధీనులు అని యర్థము లభించును. కాన పూర్వశ్లోకముతో విరోధములేదు. సర్వప్రాణులు నాకెట్లు స్వాధీనులో, నేనువారల కట్లు స్వాధీనుడను కానని భావము.

ఈశ్వరునకు స్వాధీనములగు భావము (పదార్థము) లెవ్వి యన, భాష్యకారులు చెప్పిరి; "సంసారిణః" సంసారు లని. ఆత్మానాత్మతాదాత్మ్యాధ్యాసగలవారని భావము. కేవలాత్మ పరమేశ్వరాధీనుడుగాడు. కేవలాత్మేశ్వరులు అభిన్నులగుటచే నొకరికొకరు స్వాధీనులగుట పొసగదు. కనుకనే భాష్యకారులు "సంసారి" అను పదమును వాడిరి. కేవలాత్మ సంసారిగాడు. అంతమాత్రముచే ఆత్మ భిన్నమగు జడ పదార్థము సంసారి యెట్లగునని ప్రశ్నింపరాదు. జడమగుబుద్ధియందు ఆత్మయొక్క ఆభాసయుండుటవలన, ఆభాసవిశిష్టమగు బుద్ధి యను జీవుడు సంసారియగును.

ఆభాసమనగా ప్రతిబింబము. అనగా మరియొకచోట మరియొక దానియొక్క ధర్మము ప్రతిఫలించుట. ఈయది అజ్ఞానమువలన కలుగును.

ఓయి! లోకములో తండ్రివలనబుట్టిన కుమారుడు తండ్రికి స్వాధీనుడై ఉంటున్నాడు. తండ్రియు కుమారునకు స్వాధీనుడై యుంటున్నాడు. అట్లే ఈశ్వరుని వలన బుట్టిన భూతములు ఈశ్వరాధీనములయి యుండవలయును. ఈశ్వరుడున్ను భూతములకు స్వాధీనుడయి యుండవలెనుకదా? అట్లేల కలుగుట లేదు. వినుము— భూతములు పరమేశ్వరునివలన బుట్టినను ఈశ్వరుడు సర్వేశ్వరు డగుటచే భూతపరతంత్రుడుగాడు. భూతములుమాత్రము పరతంత్రములగుటచే ఈశ్వరాధీనములగుచున్నవి.

లోకమున అచేతనపదార్థము లన్నియు చేతనపదార్థముయొక్క స్వాధీనములో నుండుచున్నవి. అట్లె చేతనుడగు ఆత్మయొక్క స్వాధీనమునందు అచేతనమగు ప్రాణిజాతమంతయు కలదని గ్రహింపవలయును.

ఓయి! బుద్ధి చేతనమే కదా? బుద్ధియొక్క స్వాధీనమునందు మిగతపదార్థము లన్నియు నేలయుండరాదు? చేతనమయిన బుద్ధి యేల ఆత్మాధీనమగును? అని యనరాదు. బుద్ధియందు చైతన్యము, ఆత్మధర్మము ప్రతిఫలించుటచే కలిగినదికాని స్వతస్సిద్ధముకాదు. స్వతస్సిద్ధముగా బుద్ధి జడము. మాయ జడము కాన మాయాపరిణామమగు బుద్ధిగూడ జడమే యగును. దీనిచే ప్రాణి శబ్దవాచ్యులగు సంసారులు దేహేంద్రియసముదాయరూపులుకాని, ఆత్మ కారనియు, దేహేంద్రియాది విలక్షణుడును, దేహేంద్రియాదుల కుపాదానమును అగు ఈశ్వరుడే ఆత్మయని సిద్ధమయినది. ౧౨

అవ. ఓయి అర్జునా! నేను బ్రహ్మ, విష్ణు, రుద్రేంద్రాది యీశ్వరులకు గూడ నీశ్వరుడను, నిత్యుడను, దోషరహితుడను (శుద్ధుడను), సర్వజ్ఞుడను (బుద్ధుడను), ముక్తుడను, సకలభూతములకు ఆత్మను, సత్త్వాదిగుణత్రయరహితుడను, సంసారబీజములగు అవిద్యాతత్కార్యరాగద్వేషాదులను రూపుమాపుటను కారణభూతుడను అయినను లోకము నన్ను దెలియలేకున్నది. అబ్బా! యేమనవచ్చును! అని యిట్లు భగవానుడు లోకులయెడ దయచూపుచు లోకముయొక్క అజ్ఞానమునకు గారణమును చెప్పుచున్నాడు.

శ్లో. త్రిభి ర్గుణమయై ర్భావై రేభి స్సర్వ మిదం జగత్
మోహితం నాభిజానాతి మా మేభ్యః పర మవ్యయం ॥ ౧౩ ॥

అ. ప్రపంచమంతయు సత్త్వాదిగుణత్రయపరిణామ భూతములగు భావములచే వ్యామోహము చెందినదై గుణవ్యతిరిక్తుడను, అవ్యయుడను అగు నన్ను తెలియలేకున్నది. గుణత్రయ పరిణామములగు భావములనగా రాగద్వేష మోహాదులు.

రాగము సాత్వికము, ద్వేషము రాజసము, మోహము తామసము అని భేదము. ఆదిపదమువలన సుఖదుఃఖాదులుగూడ గ్రహించవచ్చును. మూలమునందలి "సర్వమిదం జగత్" (ఈ ప్రపంచమంతయు) అను పదమునకు ప్రపంచములోని ప్రాణిసమూహముమాత్రమే అర్థముచెప్పవలెను. ప్రపంచాంతర్గతమగు మృదాదికమునకు మోహము సంభవించదు. కావున దేవమనుష్యాది చేతనవర్గమే "సర్వం జగత్" అను పదమున కర్థము.

మోహితంఅనగా ఆత్మానాత్మ వివేకము లేనిదిగా చేయబడినదిఅని యర్థము.

'ఏభ్యః పరం' అనగా స్వరూపమువలనను, స్వభావమువలనను, గుణముల కంటె అత్యంతభిన్నుడని యర్థము.

"అవ్యయం" అనగా వికారరహితుడని యర్థము.

రాగద్వేష మోహాదులచే, ప్రాణుల యంతఃకరణమునకు ఆత్మానాత్మ వివేచన సామర్థ్యము నశించినందున ప్రాణులకు దేహాది విలక్షణాత్మజ్ఞానము సంభవించదని పరమార్థము. ౧౩

శ్లో. దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా
మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే ॥౧౪॥

అ. సత్వాది గుణవికారములయిన రాగద్వేషాదులచే ప్రపంచము వ్యామోహము చెందినను మాయామోహితమనియే జెప్పవలయును. ఏలనన, సత్వరజస్తమస్సులు మాయాగుణములు. సత్వాది గుణములయొక్క వికారములు రాగద్వేషాదులు కావున పరంపరచే మాయవలననే లోకము వ్యామోహము జెందినదగును. కనుకనే భాష్యకారు లీ శ్లోకముయొక్క అవతారికలో "కథం పునః మాయాం త్రిగుణాత్మికా మేతా మతిక్రామతి" (త్రిగుణాత్మకమగు నీమాయను లోకమెట్లు దాటును?) అని నుడిరి. కావున పూర్వశ్లోకమున రాగద్వేషాదులచే ప్రపంచము వ్యామోహమును చెందినదని శ్రీకృష్ణభగవానుడు చెప్పగా భాష్యకారులు యీ శ్లోకావతారికాగ్రంథమున మాయను లోక మెట్లతిక్రమించునని శంకించుకొనుటకాని శ్రీకృష్ణుడు తనను శరణుజొచ్చినవారు మాయను తరింతు రని శ్లోకమున సమాధానమొసంగుటగాని యుపపన్నము కానేరదు. ఈ రెంటినిబట్టి రాగద్వేషాది మోహితమయిన జగత్తు మాయామోహితమనియే స్పష్టమగుచున్నది. కావున పూర్వశ్లోకమున జేర్కొనబడిన త్రిగుణాత్మికయగు మాయను లోకమెట్లు తరించునను శంక రాగా సమాధాన మొసంగబడుచున్నది.

ప్రపంచమును వ్యామోహపరచునట్టియు, ప్రపంచముయొక్క ఉత్పత్తి స్థితిలయములను గారణమగునట్టియు గుణత్రయరూపమగుమాయ స్వయంప్రకాశు

డును, సర్వసమర్థుడును, సర్వవ్యాపకుడును అగు శ్రీమహావిష్ణువుయొక్క- స్వభావమయి యున్నది. ఈమది యేరికిని అతిక్రమింప శక్యముగాదు. నన్ను అనన్యశరణముగా సేవించువారలే యీ మాయను తరింతురు. సర్వధర్మములను విడచి పరమేశ్వరుని సర్వాత్మనా సేవించుటయన పరమేశ్వరసాక్షాత్కారమునొందుట యనియర్థము.

ఆరోపింపబడిన సర్పమున కధిష్ఠానమగు రజ్జువు (త్రాడు) యొక్క- స్వరూపము తెలిసినవెంటనే సర్పభ్రాంతి నశించినట్లు కల్పితమయిన దేహాదిప్రపంచమున కధిష్ఠానమయిన ఆత్మతత్త్వమును సాక్షాత్కారముచేసికొనినవెంటనే కార్యప్రపంచముతోసహా మాయ నివర్తించునని పరమార్థము. ఆత్మానాత్మవివేకపూర్వకముగ ఆత్మతత్త్వసాక్షాత్కారముకలుగగా మరల ఆత్మానాత్మావివేక ముదయించుట కవకాశముండదు. అవివేకము లేనిదే దానిచే నూహింపదగిన మాయ యుండుననుట పొసగదు.

అయితే, ప్రారబ్ధాధీనమయిన దేహము పడిపోవకపూర్వము ఆత్మతత్త్వసాక్షాత్కారము కలిగినంతమాత్రమున మాయాకార్యమగు ప్రపంచము నశించనేరదు. అందువలన మాయ యున్నటుల నూహింపదగును. కాని ఆత్మతత్త్వసాక్షాత్కారము నొందినవానికి, మాయ "దగ్ధ పటవత్" (కాలిన గుడ్డవలె) నిస్సారముగా నుండునుకాని బంధహేతువు కానేరదు. కనుకనే మూలమునందలి "మాయా మేతాం తరంతి" (యీ మాయను తరింతురు) అను పదమునకు భాష్యకర్తలు "సంసారబంధమునుండి ముక్తులగుదురు" అని యర్థమును చెప్పిరి.

లేక, మాయను ఆవరణశక్తి, విక్షేపశక్తి అని రెండుశక్తులుగలవు. అందు ఆవరణశక్తిచే ఆత్మస్వరూపము కప్పివేయబడును; విక్షేపశక్తిచే సర్వప్రపంచము ఉదయించును. ఇందు ఆత్మసాక్షాత్కారముచే ఆవరణశక్తినశించుచున్నది. విక్షేపశక్తి నశించదు. ఆత్మజ్ఞానమునకు విక్షేపశక్తికి విరోధములేదు. ఘటసాక్షాత్కారమువలన ఘటస్వరూపమును ఆవరించిన అజ్ఞానమే నశించును. ఈ యావరణశక్తినే యవిద్య యని గొందరందురు. కావున ఆత్మసాక్షాత్కారమువలన అవిద్య నశించినను మాయనశించలేదు. కనుక ప్రపంచము కనుపడుచున్నను సంసారముండదు.

కావున అవిద్యవలన ఆత్మానాత్మావివేకమేర్పడును. దానివలన సంసారము కలుగును. ఆత్మసాక్షాత్కారరూపమయిన విద్యచే సమూలము సంసారము నివర్తించును. చీకటిలో స్థాణువును చూచి, స్థాణుపురుషభేదమును గమనింపలేక ఈయది స్థాణువా? పురుషుడా? అను సంశయము నొందును. ఆవల దీపమును తీసికొనిరాగా దానికాంతిచే చీకటి నశించిన తోడనే స్థాణు పురుష సంశయము సమూ

లము నశించును. ఇట్లే ఆత్మసాక్షాత్కారముచే సంసారము సమూలముగ నివర్తించు నని శ్లోకమునకు పరమార్థము.

దీనివలన పురుషునకు దేహాదిప్రపంచము బంధకారణము గాదనియు, కావున దేహాదులు నశించనిదే పురుషునకు సంసారనివృత్తి కలుగ దను నాపత్తి పొసగదనియు, పురుషునకు దేహాద్యనాత్మతాదాత్మ్యాధ్యాసమే బంధహేతువనియు, ఇట్టి యధ్యాస ఆత్మజ్ఞానముచే నివర్తించుననియు తేలినది. కావున ముముక్షువు గురుశుశ్రూషావేదాంతశ్రవణాదులచే ఆత్మజ్ఞానమే సంపాదించవలెనని సిద్ధించినది.

ఆత్మజ్ఞానముచే ఆత్మయం దారోపింపబడిన అనాత్మతాదాత్మ్యాధ్యాస నివర్తించును. అనాత్మభూతములగు దేహాదులు ప్రారబ్ధము నశించినతోడనే నివర్తించును. కావున ఆత్మజ్ఞానమువలన జీవన్ముక్తి యనియు, దేహతత్త్వాత్మజ్ఞానపూర్వక ఆత్మజ్ఞానమువలన విదేహముక్తియనియు స్పష్టమైనది.

వస్తుతః ఆత్మయందు కాలత్రయమునందును దేహాదిప్రపంచము లేనందున ఎవ్వడాత్మను సాక్షాత్కారముచేసికొనునో, వానిదృష్ట్యా అజ్ఞానికమగు అజ్ఞాన ప్రపంచముకాని, మాయికమగు అర్థప్రపంచముకాని లేనందున ఆత్మజ్ఞానమువలన కార్యవిశిష్టమగు మాయ నివర్తించునని తెలియవలయును. అహంకార మమకార రూపమయినది అజ్ఞానప్రపంచము. ఈయది జీవసృష్టము. పృథివ్యాదిరూపమయినది అర్థప్రపంచము. ఈయది యీశ్వరసృష్టము. ఇందు జీవసృష్టప్రపంచమే బంధ హేతువు. ఈశ్వరసృష్టప్రపంచము బంధహేతువు కాదు.

**రామానుజమతము :**

ఇచట రామానుజీయు లిట్లందురు. రామానుజీయభాష్యపంక్తు లుదాహరించబడుచున్నవి.

త్వ దన్య శ్శరణం నాస్తి త్వమేవ శరణం మమ
తస్మా త్కారుణ్యభావేన రక్ష రక్ష జనార్దన ॥

ఇత్యేవం నిశ్చయరూపం ప్రపత్తిమత మిహోపదిశ్యతే భగవతా. తత్ర మామితి విష్ణుః ప్రపత్తవ్య ఇతి–ఏ వేతి న దేవతాన్తరం ప్రపత్తవ్యమితి– ప్రపద్యంత ఇతి భక్తిజ్ఞానాదిభ్యః ప్రపత్తి రేవ గరీయసీ కర్తవ్యా ఇతి– బహువచనేన జీవభేదః– మాంప్రపద్యంత ఇతి ప్రపత్తిక్రియా కర్తృ కర్మణో ర్జీవేశ్వరయో ర్భేదః– మాయామేతాం తరంతి త ఇతి ప్రపన్నానామేవ మోక్షలాభః మాయానివృత్తి పూర్వక ఇతి చ సిద్ధమ్. తదేవం స్వరసతః సిద్ధ మర్థం విహాయ శాంకరీకుకల్పనా అనాదరణీయా ఇతి. వీని యర్థము సంగ్రహముగా వ్రాయబడుచున్నది.

"నీవే నాకు రక్షకుడవు, నాకు నీకంటె వేరు రక్షకుడు లేడు" కావున నోయి జనార్దనా ? నన్ను కరుణతో రక్షింపుము అను నిశ్చయరూపమయిన ప్రపత్తి

మతమును భగవంతు డీ శ్లోకమున నుపదేశింపదలచెను. ఈ శ్లోకమునందు "మామ్" అను పదమువలన విష్ణువే శరణుపొందదగినవాడు. "ఏవ" కారమువలన ఇతరదేవతలు శరణుపొందదగినవారు కారు. "ప్రపద్యంతే" అను పదమువలన భక్తిజ్ఞానముల కంటె ప్రపత్తియే గొప్పదనియు, అదియే కర్తవ్యమనియు అర్థమగుచున్నది. బహువచన లకారముచే జీవులకు భేదము స్పష్టమగుచున్నది. "మాం ప్రపద్యంతే" అను దానివలన ప్రపత్తి క్రియాకర్తయగు జీవుడు వేరుగను, ప్రపత్తి క్రియాకర్మయగు నీశ్వరుడు వేరుగను నిర్దేశింపబడుటచే జీవేశ్వరులకు భేదము స్పష్టమగుచున్నది. "మాయా మేతాం తరంతి" అని చెప్పుటచే ప్రపన్నులకే మాయానివృత్తి పూర్వకముగ మోక్షలాభమని సిద్ధించుచున్నది. ఇట్లు స్వరసముగా సిద్ధించుచున్న అర్థమును విడచి శంకరులు చేసిన కుకల్పన యంగీకరింపఁదగదు. అని.

ఈయది నిరాకరింపబడుచున్నది. ఈయది ప్రపత్తిని బోధించు ప్రకరణము గాదు. "జ్ఞానం తేఽహం స విజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః" (భగ-౭-౨) అని జ్ఞానము నుపక్రమించి, "తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమ్" (భగ-౭-౨౯) అను శ్లోకముచే జ్ఞానయోగమును శ్రీకృష్ణు డుపసంహరింపబోవుచున్నాడు. మరియు "ప్రియో హి జ్ఞానినోఽత్యర్థం" (భగ-౭-౧౭) అనియు, "జ్ఞానవాన్ మాం ప్రపద్యతే" (భగ-౭-౧౯) అనియును జ్ఞానమే మధ్యయందు అచ్చటచ్చట పరామర్శింపబడినది. ఇచట జ్ఞానికే ప్రపత్తి యుపదేశింపబడినదని యనరాదు జ్ఞానికి ఈశ్వరుడు ఆత్మయగుటచే ఆత్మాతిరిక్తుడగు ప్రపత్తవ్యమయిన (శరణుబొందదగిన) నీశ్వరుడే లేనందున జ్ఞానికి ప్రపత్తి పొసగనేరదు. "జ్ఞానీ త్వాత్మైవ మే మతం" అని శ్రీకృష్ణు డిచ్చటనే జ్ఞాని నాకాత్మయని చెప్పియుండెను. ఈశ్వరుడు అంతర్యామి. ఆత్మయే అంతర్యామి యగును కాని ఆత్మవ్యతిరిక్తుడు అంతర్యామి కానేరడు. ఆత్మకు ఈశ్వరునకు భేదమంగీకరించినచో ఈశ్వరుడు సర్వాత్మరూపుడు గాకపోవును. "ప్రపద్యంతే" అను బహువచనముపాధిభేదమును బోధించునుకాని ఆత్మభేదమును బోధింపదు. సోపాధికుడగు ఆత్మ (జీవుడు) ప్రపత్త (శరణుపొందువాడు). నిరుపాధికుడగు ఆత్మ ప్రపత్తవ్యుడు. "మామ్" అను అస్మచ్ఛబ్దము స్వతస్సిద్ధముగా ఆత్మపరము. ఆత్మకంటె వేరు దేవత లేదు. నిఖిలదేవశరీరోపహితుడగు ఆత్మయొకడే యగుచున్నాడు. విష్ణువనగా ఆత్మయే యగుచున్నాడు. శరీరము అనాత్మ, అయ్యది విష్ణువు కానేరదు. "మామ్" అను పదముచే ఆత్మను పరిగ్రహించనిచో వసుదేవుని కుమారుడగు కృష్ణశరీరమే పరిగ్రహింపవలయును. అయ్యది యిప్పుడు నశించి యున్నందున ఇప్పటివారలకు గాని, వెనుకటి వారలకు గాని యీ శరీరమునకు ప్రపత్తిచేయుట అసంభావితము, అశక్యము అగును. కాక శరీరమునకు ప్రపన్నుడయినచో అనాత్మోపాసనయగును. అనాత్మోపాసన వలన

మాయాతరణము సంభవించదు. మరియు ఆత్మను ఆశ్రయించుకొనియున్న మాయ ఆత్మసాక్షాత్కారము లేనిదే నివర్తించదు.

మఱియు ఆత్మప్రపదన మనగా "తచ్చింతనం తత్కథనం అన్యోన్యం తత్ప్రబోధనం ఏతదేకపరత్వంచ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః" అను శ్లోకమునందు జెప్పబడిన బ్రహ్మాభ్యాసమే యగును. బ్రహ్మ యనగా ఆత్మ. కావున ఆత్మాభ్యాస మని తాత్పర్యము. ఇట్టి బ్రహ్మాభ్యాసము యితర ధర్మములయం దాసక్తిగలవానికి పొసగదు. కనుక భాష్యమునందు భాష్యకర్తలు "సర్వధర్మాన్ పరిత్యజ్య" అను శ్లోకము నుదాహరించిరి.

దీనిచే ఆత్మప్రపత్తియందు గృహస్థుల కధికారములేదనియు, సన్న్యాసులకే యధికార మనియు సూచిత మగుచున్నది. సన్న్యాసులకే సర్వకర్మసన్న్యాసము విధింపబడినది. కావున సన్న్యాసియే సర్వకర్మల వీడగలడు. సర్వకర్మలను వీడిన మానవుడు గృహస్థు కానేరడు. సర్వకర్మల నాచరించుటయే గృహస్థుని లక్షణము. ఈ విషయము భాష్యమునం దెచ్చటఁ బేర్కొనలేదని శంకింపఁ దగదు. జ్ఞాననిష్ఠ యందు సన్న్యాసియే అధికారియని భాష్యమున స్పష్టముగా జెప్పబడినది. ఆత్మప్రపత్తి యన జ్ఞాననిష్ఠకాని వేరుగాదు. జ్ఞాననిష్ఠ యన జ్ఞానరూపు డగు బ్రహ్మయందుండుట. బ్రహ్మయన ఆత్మయే యగును. కావున ఆత్మప్రపత్తి, బ్రహ్మనిష్ఠ, జ్ఞానయోగము, ఆత్మసమాధి యీశబ్దము లన్నియు సమానార్థములు కావున "సన్యసించి నన్ను (పరమేశ్వరుని) ప్రపత్తినొందినవారే మాయను తరింతురు ఇతరులు తరింపనేరరు" అని బోధించుటకే భాష్యకారులు తమ భాష్యమునందు "సర్వధర్మాన్ పరిత్యజ్య" (సర్వధర్మములను విడచి) అని వ్రాసిరి. కావున మాయాతరణ మను సంసార నివృత్తినిగోరు మానవులు మాయను రూపుమాపునట్టి ఆత్మసాక్షాత్కారమునొందు టకు సన్న్యాసాశ్రమమును స్వీకరింపవలె నని సిద్ధించినది. కనుకనే జ్ఞానులకు సన్న్యాసమునందే యధికార మనియు గృహస్థులకు జ్ఞానయోగమునం దధికారము లేదని యును భాష్యకారులు పలుమారు లుచ్చరించిరి. ౧౪

శ్లో. న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః
మాయయాఽపహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః ॥౧౫॥

అ. పాపాత్ములగు నీచమానవులు అవిద్యవలన జ్ఞానరహితులై యాసుర భావము నొంది, నన్ను సేవింప నొల్లరు. వారికి నాయందు ప్రపత్తి కడుదుర్లభము. జన్మాంతరార్జితమయిన దుష్కృతవశమున ఆత్మానాత్మ వివేకము చెడి, దేహాదులయం దాత్మాభిమానము గలవారై దేహేంద్రియాది విలక్షణమయిన బ్రహ్మ లేడనియు, ప్రకాశించుట లేదనియు నుడువుదురు. పైగా తాము కుక్షింభరులై తామే ఘనాఢ్యులమనియు, మంచికులమున బుట్టినవారమనియు, లోకమున తమకు దీ

ఎవరు లేరనియును ప్రగల్భము లాడుచు నాసురసంపదతో సంసారము నొందుదురు—కాని ముక్తి బొందనేరరు. ౧౫

శ్లో. చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతినోఽర్జున
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ॥ ౧౬ ॥

అ. ఆపన్నుడు (దుఃఖి), భగవత్తత్త్వమును తెలియగోరినవాడు, ధనాదికాముడు, తత్త్వజ్ఞాని అని యిట్లు నాలుగు రకముల పుణ్యముగలవారు నన్ను (పరమేశ్వరుని) సేవింతురు. ఆపన్నుడు పరమేశ్వరుని యారాధించుననుటకు "విపదస్సంతు నశ్శశ్వత్ యాసు సంకీర్త్యతే హరిః" (కృష్ణా! మాకెల్లపుడు ఆపదలు కలుగుగాక, అపుడుగాని మేము నిన్ను గీర్తింపనోల్లము) అను కుంతీవచనము ప్రమాణ మగుచున్నది. పైజెప్పబడిన నలుగురిలో జ్ఞాని, తానే సాక్షాత్ వాసుదేవుడ నని యెంచి వాసుదేవుని సేవించును. మిగిలిన ముగ్గురు ఈశ్వరు డెచ్చటనో యుండునని తలచి యీశ్వరుని సేవింతురు. ఇయ్యది వీరలలోగల భేదము.

అయితే యీ నలుగురిలో జ్ఞానియొక్కడే ఆత్మరూపు డగు వాసుదేవుని సేవించును. మిగిలిన ముప్వురు రోగనివృత్తికొరకుగాని, జ్ఞానముకొరకుగాని, (భగవంతుని తెలిసికొనుటకొరకు), ధనాదులకొరకుగాని ఔషధాదుల సేవింపవచ్చును. యోగాది కర్మల నాచరించవచ్చును. వ్యవసాయాది వృత్తుల నాశ్రయింపవచ్చును. లేక ఇతరదేవతల బూజించవచ్చును. (లేక) వాసుదేవుని యయినను సేవింపవచ్చును. అందు నియమములేదు. (ఈ ముప్వురు వాసుదేవునే సేవింపవలె నను నియమము లేదు). అయినను, రోగార్తుడు సుకృతియయినచో వాసుదేవుని సేవించుననియు, దుష్కృతియయినచో ఔషధాదుల సేవించుననియు భేదము గ్రహించవలెను. అట్లే జిజ్ఞాసువు సుకృతియయినచో వాసుదేవుని సేవించును. దుష్కృతియయినచో కర్మల నాచరించును; యోగము నభ్యసించును. ధనాదుల గోరువాడు గూడ సుకృతియయినచో వాసుదేవుని భజించును, దుష్కృతియయినచో వ్యవసాయాది వృత్తుల నవలంబించును. లేక ఇతర దేవతల సేవించును. కనుకనే మూలమునందు "సుకృతినః" అను పదము విశేషణ మొనర్చబడినది.

లేక వాసుదేవుడు సర్వాత్మకుడగుటచే బాధానివృత్తికొరకు నెవ్వరు యితర దేవతల సేవింతురో వారును వాసుదేవునే సేవించినవారగుదురు. "యేప్యన్య దేవతాభక్తా యజంతే శ్రద్ధయాన్వితాః। తేఽపి మామేవ కౌంతేయ యజంత్యవిధిపూర్వకం" (ఇతర దేవతలయందు భక్తి కలిగి శ్రద్ధతో నితరదేవతలం బూజించువారుగూడ, అర్జునా! విధిదప్పి నన్నే బూజించుచున్నారు) అని తొమ్మిదవ యధ్యాయమునందు శ్రీకృష్ణుడు చెప్పబోవుచున్నాడు.

ఐశ్వర్యాది మదమత్తులుమాత్రము దుష్కృతులయినచో నన్ను నెప్పు డును నెవ్విధమునను సేవింపరు. అని సూచింపదలచి, మూలమున శ్రీకృష్ణుడు, ఆర్త పదమును, అర్థార్థిపదమును చేర్చెను.

ఈ శ్లోకముచే ఆర్తి (బాధా) నివారణ కొరకును, దారాపత్యధనాదులు సిద్ధించుటకొరకును, జ్ఞానముకొరకున్ను, మోక్షముకొరకున్ను, మానవులకు భగవంతు డొక్కడే సేవింపదగినవాడని యుపదేశము సూచితమగుచున్నది. కావున సోపాధిక ముగగాని, నిరుపాధికముగగాని యే మానవునకు నీశ్వరారాధన యుండదో వాడు నరాధముడనియు, పాపియనియు, దుఃఖింపదగినవాడనియును భావము.

ఓయి! "పూర్వజన్మ కృతం పాపం వ్యాధిరూపేణ బాధతే" (వెనుకటి జన్మమునందుఁ జేసిన పాపము యీ జన్మమున వ్యాధిరూపమున భాధించును) అని శాస్త్రప్రమాణముండుటచే పాపఫలమగు వ్యాధి పుణ్యవంతునియం దెట్లుండును? దారిద్ర్యమువలన నేర్పడు ధనార్థిత్వము సుకృతియం దెట్లుండును? దారిద్ర్యము పాపమునకు ఫలముగదా? అనినచో వినుము. పుణ్యపాప మిశ్రమమువలన మను ష్యజన్మ యేర్పడును. కాన మానవుడు పాపఫలమగు వ్యాధ్యాదిక మనుభవించుచు పుణ్యమునుగూడ నాచరించి యున్నందున వ్యాధ్యాది నివృత్తికొరకు భగవంతుని సేవించుచున్నాడు. పుణ్యము లేనిదే భగవద్భజనము దుర్లభము. ధనికుడగు నార్తు నకు ధనానుభవముచే సుకృతము క్షీణించినందున యీశ్వరసేవ యెట్లు కలుగునని శంకింపరాదు. పుణ్యకర్మలు విచిత్రములు, అనంతములు. ధనభోగమునిచ్చెడి పుణ్యము ధనభోగమునిచ్చుటచే క్షీణించినను యీశ్వరారాధనను కలుగఁజేసెడి పుణ్యము నశించనందున నీశ్వరసేవ సంభవించవచ్చును. కావున నాలుగు విధము లయిన పుణ్యవంతులు పరోక్షముగగాని, అపరోక్షముగగాని, యీశ్వరుని సేవింతు రని స్పష్టమయినది.

భరతవంశమునందుఁ బుట్టిన రాజులు భారతులు. వారలలో శ్రేష్ఠుడుగాన అర్జునుడు భరతర్షభు డనబడుచున్నాడు. కృష్ణార్జును లిరువురు నరనారాయణావ తారు లగుటచే నరావతారుడగు అర్జునుడు భరతర్షభుడని భావము. లేక శౌర్య, ధైర్యాదులతోఁ గూడినందునగూడ అర్జునుడు భరతర్షభు డనవచ్చును.

ఈ శ్లోకముచే అర్జునుడు శత్రుతిరస్కారమను ఆపద నొందినవాడనియు, తత్వజిజ్ఞాసువనియు, రాజ్యకాముడనియు, పుణ్యవంతుడనియు, గనుక అర్జునునకు వాసుదేవ భజనము అవశ్య కర్తవ్యమని స్పష్టమగుచున్నది. అయ్యది ఫలాభిసంధి రహితమగు స్వధర్మరూపమయిన యుద్ధానుష్ఠానమే యని యుపదేశముగూడ సూచితమగుచున్నది. ౧౬

అ. ఓయి! ఆర్తుడు మున్నగు నలుగురు సమానులా? లేక వారిలో నెవ్వ డేని యొక్కడు అధికుడా? అను శంకకు సమాధానము చెప్పబడుచున్నది.

శ్లో. తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ఏకభక్తిర్విశిష్యతే
ప్రియోహి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః ॥ ౧౭ ॥

అ. నిత్యయుక్తు డనగా ఎల్లపుడు ఆత్మయందు చిత్తసమాధానము గలవాడు. "ఏకభక్తిః" అను పదమున భక్తిశబ్దమునకు సేవింపబడువాడు. అని కర్మణి వ్యుత్పత్తి గ్రహింపవలెను. అందుచే అద్వితీయమగుఆత్మను సేవింపువా డను అర్థము లభించును. (లేక) అద్వితీయమగు ఆత్మయందు స్నేహవిశేషము గలవాడు ఏకభక్తియని చెప్పవచ్చును. ఇట్లు జ్ఞాని నిత్యయుక్తుడు, ఏకభక్తియగుటచే వెనుకఁ జెప్పిన నలుగురిలో జ్ఞాని గొప్పవాడు- నేను జ్ఞానికి ఆత్మరూపుడను. "ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి" అను న్యాయప్రకారము లోకములో నందరకు ఆత్మ మిక్కిలి ప్రియమైన వస్తువు. అట్లె వాసుదేవునకుగూడ జ్ఞాని ఆత్మయగుటచే మిక్కిలి ప్రియమగుచున్నాడు. కావున జ్ఞాని, వాసుదేవుడు-ఇరువురు ఏకాత్మరూపులని భావము.

ఈ శ్లోకమును నాలుగు విధముల నన్వయింపవచ్చును. అయ్యది యీ క్రింద సంస్కృతమునను ఆంధ్రమునను యథాక్రమముగఁ జూపబడుచున్నది.

(1) "హి యస్మాన్నిత్యయుక్త ఏకభక్తిర్జ్ఞానీ తేషాం విశిష్యతే తస్మాదహం జ్ఞానినోఽత్యర్థం ప్రియః; సచ మమప్రియః ఇత్యేకోఽన్వయః"

(ఏకారణమువలన నిత్యయుక్తుడు ఏకభక్తియగు జ్ఞాని, ఆర్తుడు మున్నగు నలుగురిలో గొప్పవాడో, ఆ కారణమున నేను జ్ఞానికి మిగుల యిష్టుడను. జ్ఞానియు నా కిష్టుడు అని యొక అన్వయము)

(2) "జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిరతఏవ తేషాం విశిష్యతే హి యస్మాదహం జ్ఞానినః ఆత్మా తస్మాదహం జ్ఞానినోఽత్యర్థం ప్రియః స చ మమ ఆత్మత్వాత్ప్రియ ఇత్యపరోఽన్వయః"

(జ్ఞాని నిత్యయుక్తుడును, ఏకభక్తియు నగుచున్నాడు. కనుకనే వారలలో గొప్పవాడు. ఎందువలన నేను జ్ఞానికి ఆత్మనో అందువలన నేను జ్ఞానికి మిక్కిలి యిష్టుడను. జ్ఞానియు నాకాత్మరూపుడగుటచే నిష్టుడు. అని రెండవ యన్వయము.)

(3) "తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే" అతఏవేతి శేషః, అహం జ్ఞానినోఽత్యర్థం ప్రియః స చ మమ ప్రియో భవతి హిః ప్రసిద్ధా" ఇత్యన్యోఽన్వయః

(అర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని; ఈ నలుగురిలో జ్ఞాని నిత్యయుక్తుడు, ఏకభక్తుడు నయి యార్తాదుల నతిశయించుచున్నాడు. గనుకనే నేను జ్ఞానికి మిక్కిలి యిష్టుడను. జ్ఞానియు నా కిష్టుడగుచున్నాడు. ఇయ్యది ప్రసిద్ధము. అని మరియొక అన్వయము.)

(4) "తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే। అహ మాత్మత్వాత్ ఇతి శేషః। జ్ఞానినోఽత్యర్థం ప్రియః భవామి స చ ఆత్మత్వాన్మమ ప్రియో భవతి" ఇత్యపరోఽన్వయః.

(అర్తుడు మున్నగు నలుగురిలో జ్ఞాని యెల్లపుడు ఆత్మయందు చిత్తైకాగ్రత గలవాడు. ఎల్లపుడు అద్వితీయమగు ఆత్మనే సేవింపువాడు. కాన గొప్పవాడు. జ్ఞానికి నేను ఆత్మరూపుడ నగుటవలన మిక్కిలి యిష్టుడ నగుచున్నాను. జ్ఞానియు నా కాత్మరూపుడగుటచే నిష్టుడగుచున్నాడు.) అని మరియొక అన్వయము.

ఈ యన్వయమునందు ఆత్మపదమును అధ్యాహారమును చేయుటలో ప్రమాణము లేదని యనరాదు. "జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" అని ముందు శ్లోకమున శ్రీకృష్ణుడు చెప్పబోవు వాక్యమే ప్రమాణము.

లేక నేను జ్ఞానికి మిక్కిలి యిష్టుడను; జ్ఞానియు నాకు యిష్టుడు. అనియే యిచట అన్వయము. అందు "జ్ఞానీత్వాత్మైవ మే మతం" అని ముందు చెప్పబోవు వాక్యమే ప్రమాణము. కనుకనే భాష్యకారులు ముందు శ్లోకమునందలి "జ్ఞానీత్వాత్మైవ" అను వాక్యమును "తత్కస్మాదిత్యత ఆహ" అని ప్రశ్నపూర్వకముగ నవతరింపజేసిరి. అయితే యిచట ఆత్మత్వ మను హేతువు నుపన్యసించుట ముందు శ్లోకమునందలి యర్థమును యిచటనే స్పష్టపడుట కనుపదించుట మాత్రమే యని గ్రహింపవలెను

రామానుజ మతము:

"జ్ఞానికి నేను ముఖ్యముగా పొందదగినవాడను కావున నాతోటి జ్ఞానికి సంబంధము నిత్యము. నాయొక్కనియందే జ్ఞానికి భక్తియుండును. కనుక జ్ఞాని గొప్పవాడు. "అత్యర్థం అత్యభిధేయం" జ్ఞానికి నాయందుగల ప్రేమ సర్వజ్ఞుడను, సర్వశక్తి యుక్తుడను అగు నాకుగూడ జెప్పనలవిగాదు. మిగిలిన యిద్దరకు వారు కోరినది ప్రాప్తించునంతవరకే నాతో సంబంధము. వారు కోరినవాని నిచ్చుటకు నేను సాధనముగనుకనే నాయందు వారికి భక్తి" అని వ్యాఖ్యానించిరి. ఈ యనువాదార్థము సుబోధ మగుటకు నీ సందర్భమున గల వారి భాష్యపంక్తుల నుదాహరించుచున్నాను–

"జ్ఞానినో మదేక ప్రాప్యస్య మయా యోగో నిత్యః మయ్యేకస్మిన్నేవ భక్తిః అతస్సఏవ విశిష్యతే అత్యర్థం అత్యభిధేయం జ్ఞానినోఽహం యథా ప్రియః

తథా సర్వజ్ఞేన సర్వశక్తినాపి మయాపి అభిధాతుం నశక్యతే ఇత్యర్థః. ఇతరయోస్తు యావత్స్వాభిలషిత ప్రాప్తి మయా యోగః స్వాభిలషితే తత్సాధనత్వే నచ మయి భక్తిః”

ఇయ్యది యుక్తముగాదు. జీవున కీశ్వరునితో నిత్యసంబంధమున్నచో ఈశ్వరుడు నిత్యప్రాప్తుడే (యెల్లపుడు పొందబడినవాడే) కాన, జీవున కీశ్వరుడు ప్రాప్యుడు (పొందదగినవాడు) యెట్లగును? లోకములో అప్రాప్తమగు పదార్థము కదా ప్రాప్యమగును. మరియు పరోక్షమున పరమపదమగు వైకుంఠమునందు ఈశ్వరునితో జీవులకు నిత్యసంబంధ మెట్లేర్పడును? పరోక్షునితో సంబంధమా? లేక అంతర్యామితో సంబంధమా? లోకములో నీ విట్లు చేయుమని ప్రేరేపించు వాడెవ్వడును తన హృదయమునందు తనకు ప్రత్యక్షముగాడు.

జీవుడు పరతంత్రు డను హేతువుచే జీవప్రేరకుడగు నీశ్వరుని యూహింప వలెను. “అంగుష్ఠమాత్రః పురుషః మధ్యే ఆత్మని తిష్ఠతి” “ఆదిత్యవర్ణ” ఇత్యాది శ్రుతులచే నీశ్వరుడు సాకారుడని యనదగదు. నిరవయవుడును, అణుపరిమాణుడును అగు జీవునియొక్క లోపలనుండు ఈశ్వరుడు పరమాణువు కావలయును. అట్టివాడు సాకారుడనుట పొసగదు. “అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం” అను శ్రుతి భగవంతుడు నిరాకారుడని చెప్పుచున్నందున, శ్రుతివిరోధ మేర్పడును. “అంగుష్ఠమాత్రః” ఇత్యాది శ్రుతులు భగవంతునియొక్క కల్పితరూపమును చెప్పుచున్నవి. కల్పితరూపముగల యీశ్వరుని నిత్యసంబంధమే జీవున కిచ్చుట వివక్షితమని యనదగదు. వాస్తవస్వరూపమును విడచి కల్పితరూపమును పరిగ్రహించుటలో కారణము లేదు, కాక ఇయ్యది తత్త్వమును చెప్పునట్టి ప్రకరణము. ఇందు యీశ్వరు డెచ్చటను నా కెద్దియో యొక రూపమును కల్పించి నన్ను సేవింపుడని చెప్పియుండలేదు.

ఇచ్చట ఏకభక్తి శబ్దముగూడ ఆత్మాతిరిక్తమగు పరోక్షేశ్వరభక్తిని చెప్పుటలేదు. ఆత్మభక్తినే చెప్పుచున్నది. వస్తుస్వరూపము తెలియనిదే వస్తువునందు ప్రేమకలుగదు. అజ్ఞానికి కల్పితమగు అర్చావతారమునందు భక్తి, ప్రీతి కలిగినను జ్ఞానికి మాత్రము కల్పితరూపమునందు ప్రీతి కలుగదు. “యోమాం సర్వేషు భూతేషు సంతమాత్మాన మీశ్వరం। హిత్వాఽర్చాం భజతే మౌఢ్యా ద్భస్మన్యేవ జుహోతి సః” (సర్వభూతములయం దాత్మరూపముతో నున్న యీశ్వరుని విడచి అవివేకమువలన అర్చావతారమును (అర్చారూపమును) యెవడు సేవించునో వాడికా భగవద్భజనము బూడిదలో బోసినట్లగును) అని భగవంతుడగు వ్యాసమహర్షి అర్చారూపమును సేవించుట మూఢజన విషయ మని స్పష్టపరచెను. సచ్చిదానంద రూపము తత్త్వము. తత్త్వమును దెలిసినవాడే జ్ఞాని, కావున జ్ఞానికి ఈశ్వరునియొక్క కల్పితాకారమునందు ప్రీతి యుదయింపదు.

మరియు రామానుజభాష్యమునందు "అహం జ్ఞానినః అభిధేయ మతిక్రమ్య ప్రియః" అనువాక్యము అన్వయించదు. "అభిధేయ మతిక్రమ్య" అను పదమునుంచి (అభిధాతుం నశక్యతే) చెప్ప నలవికాదను అర్థము లభింపదు. "అభిధాన మతిక్రమ్య" అను వాక్యమువలననే అట్టి యర్థము లభించును. కాక "అత్యర్థం" అను పదమునకు మిక్కిలి యను అర్థము లోకప్రసిద్ధము. ప్రసిద్ధార్థమును పరిత్యజింపఁ గారణ మగపడదు.

మరియు విషయములయందలి ప్రేమగూడ మితిలేని దగుటచే ఈశ్వరుని యందలి ప్రేమకు మితిలేదు అని చెప్పుటగూడ వ్యర్థము. విషయములయందలిప్రేమ సాతిశయమనియు, ఈశ్వరునియందు ప్రేమ నిరతిశయ మనియు చెప్పుట యుచితము. అట్లైతే, యీశ్వరుడు అనాత్మయయినచో (ఆత్మభిన్నమయినచో) నిరతిశయ ప్రేమాస్పదుడు కానేరడు.

ఆత్మ నిరతిశయప్రేమాస్పదమని శ్రుత్యాది ప్రమాణములు గలవు. తాను కోరినదానిని యిచ్చుటవలననే పరోక్షుడగు ఈశ్వరుడు ప్రియు డను లోకవ్యవహారము పొసగుచున్నది. కనుకనే పరోక్షేశ్వరుడు ఆత్మశేషుడగుచున్నాడు.

"సత్వాసక్త మతిః కృష్ణే దశ్యమానో మహోరగైః, నవివేదాత్మనో గాత్రం తత్స్మృత్యాహ్లాద సంస్థితః"
అను శ్లోకమునందు జెప్పిన కృష్ణస్మరణజన్యమగు ప్రహ్లాదుని యానందము ఆత్మానందమే కాని వేరుకాదు. అచ్చట ప్రహ్లాదుడు కృష్ణుని యాత్మరూపునిగా భావించియే యానందించెను.

సాకారేశ్వర ధ్యానమువలన కలుగు ఆనన్దముగూడ చూతఫలమును తినునపుడు కలుగు ఆనన్దమువలె, ఆత్మానందముయొక్క ప్రతిబింబానందమే కాని వేరుగాదు. దీనిచే ప్రతిబింబానందముకంటె బింబానందము ముఖ్యమని రుజువగుచున్నది. కృష్ణుడు సాకారేశ్వరుడగుచో కృష్ణస్మరణమువలన కలిగిన ప్రహ్లాదునియొక్క ఆనందము సాతిశయమేకాని నిరతిశయముకాదు.

మరియు ఈశ్వరస్మరణమువలన భక్తులకు నిరతిశయానందము కలుగుననియు, అందువలన భక్తులకు ఈశ్వరుడు అత్యంత ప్రియు డనియు, అట్లే భక్తుల స్మరియించి యీశ్వరుడుగూడ నిరతిశయానందము నొందునుకాన, యీశ్వరునకుగూడ భక్తుడు మిక్కిలి యిష్టుడని రామానుజీయు లందురు ఈయది పరిహాసాస్పదమగు విషయము. పరిపూర్ణానందరూపు డగు ఈశ్వరుడు తనభక్తుల దలచుకొని మిక్కిలి యానందము నొందుననియు, లేనిచో నీశ్వరుని యానందము తగ్గుననియు గల్పించుట అయుక్తము, అప్రమాణము నగును. ఇందు రెండుదోషము లేర్పడును. (1) ఆనందముకొరకు నీశ్వరుడుగూడ భక్తుల స్మరింపవలసివచ్చును. (2) అందరిచే సేవింపదగిన ఈశ్వరుడు తనభక్తులకు సేవకుడు గావలసివచ్చును.

మరియు ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని – అని నాలుగురకముల పుణ్య వంతుల ప్రస్తుతించి, అందు జ్ఞాని గొప్పవాడని జెప్పి మిగిలినవారిని "యితరులు" అని బహువచనముతో నిర్దేశింపవలసియుండగా, "ఇతరయో" అని ద్వివచనముతో నిర్దేశించుట అయుక్తము.

ఆర్తుడు, అర్థార్థి- వీ రుభయులు ఏకాధికారులు; కాన యేకముగా భావించి "ఇతరయోః" అని ద్వివచనము ప్రయోగింపబడినదని యనదగదు.

అనార్తుడు అర్థార్థి యగును; అర్థమును గోరనివాడు ఆర్తుడగును. కాన వీరిద్దరిని యొకే కక్ష్యలో జేర్చుట యుక్తముగాదు. వ్యాధినివృత్తిరూపమగు అర్థమును (ప్రయోజనమును) కోరువాడు ఆర్తుడు, ధనాదిరూపమగు అర్థమును (ప్రయోజనమును) కోరువాడు అర్థార్థి- వీరిద్దరియందును అర్థార్థిత్వమను ధర్మము సమానమగుటచే వీరుభయులు యొకే కక్ష్యలో చేరుదురన్నచో, అపుడు జ్ఞానమను అర్థమును (ప్రయోజనమును) కోరుట జిజ్ఞాసువుయందుగూడ గలదుగాన, జిజ్ఞాసువునుగూడ నదే కక్ష్యలోచేర్చి యీముగ్గురను యేకవచనముచే నిర్దేశింపవలెను. ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి అను ముగ్గురను వేరుగా నిర్దేశించుట వ్యర్థమగును. మరియు నితరులు ముగ్గురు సుకృతవంతులు అనిగాని, యిద్దరు సుకృతవంతులు అని గాని చెప్పవలసివచ్చును. మూలమునందట్లు చెప్పియుండలేదు. కావున, రామానుజులు తమ భాష్యమునందు జూపిన "ఇతరయోస్తు" అను ద్వివచనాంతపదము అయుక్తమనుట సుస్పష్టము. ౧౩

శ్లో. ఉదారాః సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్
ఆస్థితః స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్ ॥౧౮॥

అ. ఓయి యర్జునా! నాకు వీరందరు యిష్టులే. కాని జ్ఞానిమాత్రము నా కాత్మభూతుడని నా నిశ్చయము. అనగా జ్ఞాని నేనేయని నా నిర్ణయము. అందు వలన నాతడు నాకు కడునిష్టుడు.

"విద్యా వినయసంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని। శునిచైవ శ్వపాకేచ పండితాస్సమదర్శినః॥ అని చెప్పినట్లు సర్వసముడగు పరమేశ్వరునకు సర్వము ఆత్మరూపమగుచుండ, జ్ఞానియే ఆత్మయనియు, ఇతరులు ఆత్మరూపులు కారనియు చెప్పుటెట్లు? వినుము :

జ్ఞాని వాసుదేవునియందు చిత్తమును నిలిపి "నేనే వాసుదేవుడను, నేను వాసుదేవునికంటె వేరుగాదు." అనుభావముతో స్థిరచిత్తుడయి భగవంతుడగు వాసుదేవుడే సర్వోత్తమమయిన గమ్యస్థానమని వాసుదేవుని చేర ప్రవర్తించుచున్నాడు. కావున జ్ఞాని వాసుదేవున కాత్మరూపుడని భావము.

ఈయది తత్త్వము. జ్ఞానివలె ఆర్తాదులుగూడ ఆత్మరూపులే (ఆత్మలే) అయినను "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" అను శ్రుతి బ్రహ్మవేత్తయే బ్రహ్మయగునని చెప్పుచున్నది. కావున "అహం బ్రహ్మాస్మి" అను బ్రహ్మాత్మైక్యజ్ఞాన మెవ్వనికి కలుగునో వాడే బ్రహ్మరూపుడు. ఇట్టి జ్ఞానము లేనివాడు బ్రహ్మరూపుడుగాడు. బ్రహ్మవేత్తయే భగవంతునకాత్మరూపుడు, అబ్రహ్మవేత్త ఆత్మరూపుడుకాడు. బ్రహ్మవేత్త కూటస్థుని యాత్మగా దలచును. చిన్మాత్రుడగుటచే నా కూటస్థుడు బ్రహ్మయే యగును. అబ్రహ్మవేత్త (బ్రహ్మజ్ఞానములేనివాడు) కర్త, భోక్తయగు జీవుని యాత్మగా దలంచును. కర్తృత్వ భోక్తృత్వాది వికారములుగల అకూటస్థుడు బ్రహ్మగాడు. బ్రహ్మకు కర్తృత్వాది వికారము లుండవు. కావున "ఆర్తాదులచే ఆత్మగా అభిమతముయిన సంసారియగు జీవుడను నేను గాను. అందువలన ఆర్తాదులు నేనుగాను. జ్ఞానియే నేను" అని శ్రీకృష్ణుని యభిప్రాయము. కావున సంసారులును, చిదాభాసులును అగు ఆర్తాదులు శ్రీకృష్ణునకు ప్రియులుమాత్రమే యగుదురు. ఆత్మలుకారు. జ్ఞానిమాత్రము, చిదాత్మకూటస్థుడు నగు వాసుదేవుడే యగుచున్నాడు.

నేనే భగవంతుడగు వాసుదేవుడను అనునిరూఢజ్ఞానముగలవాడు, కేవలానుభవానందరూపముతోనుండునుగాని బ్రహ్మాత్మానుసంధానము నపేక్షింపడు. కనుకనే శ్రీకృష్ణుడు "ఆస్థితస్సహి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిం" అని బ్రహ్మాత్మైక్యజ్ఞానముగలవాడు, సమాహితచిత్తుడనియు ఉత్తమగతిని పొంద సంసిద్ధుడనియును చెప్పెను.

చిదాత్మయగు జ్ఞాని యుత్తమగతిని పొంద నెట్లు ప్రవర్తించునని యనరాదు. చిదాత్మగూడ మాయచే బుద్ధ్యాది తాదాత్మ్యము నొంది సంసారియయి మెల్లమెల్లగా బుద్ధ్యాది తాదాత్మ్యమును వదలి, కూటస్థాత్మానుసంధానముచే స్వస్వరూపమగు చిదాత్మత్వమును, మరల పొందుటకు ప్రవర్తించువానివలె కనుపించును. బంధముక్త్యాది వ్యవహారమంతయు మాయామయము, వస్తుతః బంధముక్త్యాదివ్యవహారములేదు. ఈయది యద్వైతుల కలంకారము.

రామానుజ మతము :

ఓయి! విష్ణువుచే క్రీడార్థము నిర్మింపబడి సత్వరజస్తమోగుణాత్మక యగు ప్రకృతి మాయ. ఈయది యసురులయొక్కయు, రాక్షసులయొక్కయు, అస్త్రములవలె విచిత్రకార్యములను నెరవేర్చుటచే మాయాశబ్దవాచ్య మగుచున్నది. ఇందు

"తతో భగవతో తస్య రక్షార్థం చక్ర ముత్తమం
ఆజగామ సమజ్ఞప్తం జ్వాలామాలి సుదర్శనం
తేన మాయా సహస్రం తచ్ఛంబరస్యాశుగామినా
బాలస్య రక్షతా దేహ మేకైక శ్యేన సూదితమ్" అని ప్రమాణముగూడ

కలదు. కనుక మాయాశబ్దము మిథ్యార్థమును జెప్పదు. లోకములో మణి మంత్రౌషధాదులచే మిథ్యావస్తువిషయకమగు పారమార్థిక బుద్ధిని పుట్టించుటవలననే ఇంద్రజాలికాదులయందు మాయావి యను ప్రయోగము ఉపపన్నమగుచున్నది. అచ్చోట మణిమంత్రౌషధాదులే మాయ. ఒకే శబ్దమునకు అన్ని ప్రయోగములయందును అనుగతమగు నొకే యర్థము సంగీకరించుట న్యాయము. మిథ్యార్థమునందు మాయాశబ్దప్రయోగము మాయాకార్యబుద్ధివిషయము కాన యౌపచారికము. కావున మాయ సత్యమే కాని మిథ్యకాదు. "మాయాంతు ప్రకృతిం విద్యా న్మాయినంతు మహేశ్వరం" అను శ్రుతిగూడ నిందు ప్రమాణమగుచున్నది.

"త్వం హి లోకగతిర్దేవ సత్యాం కేచిత్ప్రజానతే, ఋతే మాయాం విశాలాక్షీం తవ పూర్వ పరిగ్రహాం";

"యోగనిద్రా మహామాయా" ఇత్యాది ప్రయోగములవలన గూడ మాయ సత్యమని స్పష్టమగుచున్నది. యోగనిద్ర మాయ యనికాని, ప్రకృతితత్వాభిమానిదేవత మాయ యనికాని యెట్లయినను చెప్పవచ్చును. ఎట్లయినను మాయ సత్యముకాని మిథ్యకాదు. కావున సత్య మాయాప్రయుక్తమగు బంధముక్త్యాది వ్యవహారము మిథ్యయనుటగాని మాయ మిథ్యయనుటగాని యెట్లు పొసగునని రామానుజీయ పూర్వపక్షము-

సమాధానము :

రామానుజులు గుణమయమగు భగవన్మాయ పారమార్థికమని, మాయకు పారమార్థికత్వమును, సత్యత్వమును చెప్పిరి. మాయయందలి సత్యత్వము అవినాశిత్వరూపమా ? లేక, అర్థక్రియాకారిత్వరూపమా ? అని రామానుజుల ప్రశ్నింపవలెను.

అనగా, మాయ సత్యమనగా, నశింపనిదని యర్థమా ? లేక విచిత్రకార్యములను పుట్టించునదని యర్థమా ?

ఇందు మొదటిపక్షము పొసగదు. ప్రకృతి పురుషు లిరువురు పరమాత్మయందు లయము చెందుదురని రామానుజు లంగీకరించి యుండిరి. మరియు

"తస్మాన్న విజ్ఞాన మృతేఽస్తి కించిత్ క్వచిత్ కదాచిత్ ద్విజ వస్తుజాతమ్ సద్భావ ఏవం భవతో మయోక్తో జ్ఞానం యథా సత్య మసత్య మన్యత్"

"అవినాశిపదమార్థశ్చ ప్రాజ్ఞైరభ్యుపగమ్యతే
తత్తునాశి న సందేహో నాశి ద్రవ్యోపపాదితమ్ ॥
యత్తు కాలాంతరేణాపి నాన్యసంజ్ఞా ముపైతివై
పరిణామాది సంభూతాం తద్వస్తు నృపతచ్చకిమ్"

అని పరాశరులు చెప్పిరని "నాసతో విద్యతేభావః" అను శ్లోకమును వ్యాఖ్యా
నించు సందర్భమున రామానుజులే యుదాహరించియుండిరి నశించునట్టి ద్రవ్యముచే
బుట్టింపబడిన వస్తువుగూడ నశించు స్వభావముకలదగుటచే, నశించునట్టి ప్రపంచ
మున కుపాదానమగు ప్రకృతి గూడ నాశముగలదియే కావలెను. అట్లుగాక
ప్రకృతి సత్యమయినచో ప్రకృతిచే బుట్టింపబడిన ప్రపంచముగూడ సత్యముకావలసి
వచ్చును.

"జ్ఞానం యథా సత్య మసత్య మన్యత్" అను ప్రమాణముచే జ్ఞానాకారు
డగు ఆత్మ సత్యమనియు, తద్భిన్నమగు ప్రకృత్యాదికము, అజ్ఞానమున్న, అసత్య
మనియు పరాశరులే స్పష్టపరిచిరి కావున మాయకు అవినాశిత్వరూపమగు సత్య
త్వము (నాశములేకుండుట యను సత్యత్వము) రామానుజమతమునుబట్టికూడ
నిలువనేరదు.

ఇట్లే రెండవపక్షముగూడ నిలువదు. అర్థక్రియాకారియగు కార్యములను
పుట్టించునది సత్యమయినచో నిద్రగూడ సత్యము కావలయును. మాయ జాగ్ర
త్ప్రపంచమును పుట్టించునట్లు, నిద్రగూడ స్వాప్నప్రపంచమును పుట్టించుచున్నది.
ఇట్లె రజ్జుసర్పభ్రమజనకమగు అవిద్యగూడ సత్యము కావలసివచ్చును. రజ్జుసర్పా
దులు అర్థక్రియాకారులు కావని యనరాదు. రజ్జుసర్పాదులవలనగూడ భయకంపా
దులు కలుగుచున్నవి. ప్రాతిభాసికరజతము వ్యావహారికరజతమువలె, కటకాద్యర్థ
క్రియాకారి కాదన్నచో అగుగాక, అంతమాత్రమున వ్యావహారికరజతము పరమార్థ
ముగా సత్యము కానేరదు. పరమార్థరజత మనునదియే లేదు. సుషుప్తిలో ఆత్మ
యందు రజతాది ప్రపంచము కనిపించదు, కావున అర్థక్రియాకారి విచిత్రకార్యము
లను కల్పించునంతమాత్రమున మాయ పారమార్థిక మనదగదు. పరమార్థముగా
మాయయే లేదు. నశించునట్టివస్తువు పరమార్థముగా నుండ నేరదు. పరమార్థముగా
నుండుటకు, వినాశమునకు పరస్పర విరోధము కలదు. ఏది నశించునో అయ్యది
వస్తుతః మిథ్యయే యగును. ఉ. ఘటము రజ్జుసర్పమువలె కావున నశించుటవలన
మాయగూడ మిథ్యయే యగును. నశించకుండుటయే సత్యత్వమునకు ప్రయోజ
కము. అర్థక్రియాకారిత్వాదికము సత్యత్వప్రయోజకము గాదు.

ఇక, ఈశ్వరుని విడచియుండని శక్తియగు మాయ ఈశ్వరునివలె సత్యమే
యనినచో, నదియు యుక్తముగాదు. "జహాత్యేనాం భుక్తభోగామజోఽన్యః"
ఈశ్వరుడు ప్రకృతిని విడచునని శ్రుతియే చెప్పుచున్నది. మాయ యీశ్వరుని విడచి
యుండనిదగుచో, నీశ్వరునిచే త్యజింపబడదు. సత్యమయిన, నీశ్వరునిచె విడువబడిన
మాయ సత్యము కానేరదు, మాయ సత్యమగుచో "మాయామేతాం తరంతితే"
అను శ్రుతి చెప్పెడి మాయాతరణము యుపపన్నముగాదు. సత్యమయిన నదీజల

మును చేతులతో నీత నీది తటించునట్లు, సత్యమగు మాయనుగూడ ప్రపత్తిచే తరింప వీలగునని యనరాదు. నాశరహితమయిన మాయకు పారము (అంతము) లేనందున తరణము సంభవింపదు. మాయకు పారము నంగీకరించుచో అయ్యది నాశరూపమే యగును. నది యొక్క-యొడ్డున నదీస్వరూపముండదు. నదీస్వరూపము లేకుండుటయే నదికి పారము (అంతము) (ఒడ్డు) అట్లే మాయకుగూడ. పారము నాశమే యగును.

ఇక సంసారమండలమున మాయకలదనియు, విష్ణులోకమున మాయ లేదనియు, గనుక మాయాతరణము ఉపపన్నమగునన్నచో నదియు పొసగదు. సత్యమగు మాయ విష్ణుపదమున (విష్ణులోకమున) లేకుండు టెట్లు? లేనిదానికి నునికి, ఉన్నదానికి లేకుండుట సంభవింపదనిగదా? శ్రీకృష్ణుడు చెప్పెను. కావున విష్ణులోకమున, లేని మాయకు సత్యత్వమనునది అయుక్తము కనుకనే మేముమాయ, మిథ్యయని చెప్పితిమి. ఎయ్యది యంతట నుండదో అయ్యది మిథ్య (ఉ) ఘటము-ఇందుకు వ్యతిరేక దృష్టాంతము. ఆత్మ - ఆత్మ యంతట కలదు. కనుకనే ఆత్మకు నెప్పుడును అభావము లేదు. కనుకనే ఆత్మ సత్యస్వరూపుడు. కనుకనే పరాశరులు "జ్ఞానం సత్య మసత్య మన్యత్" అని చెప్పిరి. కావున నాశస్వభావము గలదగుటచే మాయ మిథ్యయేగాని సత్యముగాదు.

ఇక విచిత్రకార్యములను కల్పించుటచే నీయది మాయాశబ్దవాచ్య మగునను విషయము మాకును యిష్టమే. విచిత్రకార్యములను కల్పించు ఐంద్రజాలికుని శక్తిగూడ మాయాశబ్దవాచ్యమే యగుచున్నది. సర్వప్రపంచము మాయామయమయినపుడు రాక్షసులయొక్క- అస్త్రాదులుగూడ మాయామయమగుట మాకును సమ్మతము. "శంబరస్య మాయా సహస్రం" అనుచోటగూడ మాయాశబ్దము మిథ్యార్థమునందే ప్రయోగింపబడినది.

రజ్జుసర్పాది మాయలవలె, అసురకల్పితములగు మాయలు, ప్రాతిభాసికములు, వ్యావహారికములు గావు. ఐంద్రజాలికాది మాయలుగూడ ప్రాతిభాసికములే.

ఇక, ఐంద్రజాలికుడు మణిమంత్రాదులచే తయారుచేసిన వస్తువులు మిథ్యయయినను మణిమంత్రాది రూపమయిన మాయ సత్యమే యని రామానుజులు చెప్పిన విషయము పరిహాసాస్పదము. ఈశ్వరశక్తియే మాయ యని రామానుజులంగీకరించిరి. కాని యీశ్వరుడు మాయ యని రామానుజు లనలేదు. కావున మణిమంత్రాదులయందలి విచిత్రశక్తియే మాయ యని చెప్పనగును. శక్తి మాయాశబ్దార్థ మనునది సర్వసమ్మతము. ఇట్టి శక్తి మిథ్యాకార్యములను పుట్టించుచు, సత్యమగునని యనుట అసంభవము. శక్తి సత్యమయినపుడు తత్కార్యములుగూడ సత్యముకావలయును. గంధర్వనగరాదులను కల్పించు మణిమంత్రాది-

శక్తి కార్యసమయమున దప్ప వెనుక ముందు కాలముల లేనందున, రజ్జుసర్పాదుల వలె ప్రాతిభాసిక మనక దప్పదు. ప్రాతిభాసికము మిథ్యయగును కాని సత్యము కానేరదు.

ఇక ఇంద్రజాల మను శక్తి మణిమంత్రాదులయం దుండుటచే, మణిమంత్రాదులు మాయాశబ్దవాచ్యములగు ననినచో అపుడు ఐంద్రజాలికుడుగూడ మాయాశబ్దవాచ్యు డనవలయును. లోకమున ఇంద్రజాలమే మాయ యని వాడుక కలదు. ఐంద్రజాలికుడు మాయాశబ్దముచే పిలువబడుట లేదు. అట్లె మణిమంత్రాదులను మాయాసాధనములనుగా లోకులు గ్రహించుచుండిరి కాని, మాయ యని గ్రహించుట లేదు. ఐంద్రజాలికుడు పింఛమును చేతబూని గగనమండలమున ద్రిప్పుచు, గంధర్వనగరమును నిర్మించుచుండ వివేకము గల యే మానవుడు పింఛాభ్రమణము మాయ యని గ్రహించడు. గంధర్వనగరమే మాయయని గ్రహించును. పింఛాభ్రమణము మాయను పుట్టించుటకు సాధనమనియు గ్రహించును. కావున మణిమంత్రాదులు మాయాశ్రయమైన పదార్థములే కాని, మాయమాత్రము కావు. మణిమంత్రాదులయొక్క శక్తియే మాయ. అయ్యది మణిమంత్రాదులకంటె వేరనియు, కాదనియు నిరూపింప నలవికానందున మిథ్యయే యగును.

వస్తువు మిథ్య యయినను తద్విషయకమగు బుద్ధి పారమార్థికమను వాదము గూడ యుక్తముగాదు. వస్తువును బట్టియే బుద్ధికి పారమార్థికత్వముగాని, వ్యావహారికత్వముగాని, ప్రాతిభాసికత్వముగాని నిర్ణయింపవలెను. బ్రహ్మ పారమార్థికముకాన బ్రహ్మ యను బుద్ధి పారమార్థికము. ఘటము వ్యావహారికము కాన ఘట మనుబుద్ధి వ్యావహారికము. రజ్జుసర్పము ప్రాతిభాసికముకాన, రజ్జువునందు సర్ప మను బుద్ధి ప్రాతిభాసికము. అని సిద్ధాంతము. విషయము మిథ్యయయినచో తద్విషయమగు విజ్ఞానము సత్యమెన్నటికిని కానేరదు. అట్లగుచో భ్రమప్రమాజ్ఞానములు రెండును యేకము కావలసివచ్చును. భ్రాంతి జ్ఞానముగూడ స్వరూపమువలన సత్యమని యనరాదు. రజ్జువుయందు గలిగెడి "అయం సర్పః" (ఇది సర్పము) అను జ్ఞానమున విషయమగు సర్పము అసత్యమగుచో "అయం సర్పః" (ఇది సర్పము) అను జ్ఞానముమాత్రము సత్యమెట్లగును.

విషయాతిరిక్తమయిన శుద్ధజ్ఞానము ఆత్మస్వరూపము. అయ్యది దేనివలనను పుట్టదు. (అనగా ఆత్మ, అజుడు, అవిక్రియుడు కావున ఆత్మస్వరూపమగు జ్ఞానము పుట్టునది కాదని భావము.) కావున మిథ్యావస్తువిషయకమగు జ్ఞానము పారమార్థికము కానేరదు. జ్ఞానము సత్యమనుటకు, అసత్యమనుటకును విషయములయొక్క సత్త్వాసత్త్వములే కారణములని లోకసిద్ధము. అట్లుగాక మిథ్యావస్తువిషయక జ్ఞానము సత్యమగుచో "అగ్నినా సించేత్" (నిప్పుతో తడుపుము) అను వాక్యము

వలన కలిగెడి జ్ఞానముకూడ సత్యము కావలసి వచ్చును. కాన లోకమున సర్వము అప్రమాణమే యగును.

కావున ఇంద్రజాలశక్తివలె అనిర్వచనీయమగు నీశ్వరశక్తియే మాయ. అనిర్వచనీయమగుటవలననే మాయాకార్యమయిన ప్రపంచమునందుగూడ మాయ యను వ్యవహారము పొసగుచున్నది.

ఇట్లైనచో "ఋతే మాయాం విశాలాక్షీం తవపూర్వపరిగ్రహాం" అను ప్రయోగము లెట్లు పొసగునని యనరాదు. మాయగల విశాలాక్షియందు మాయాశబ్దము ప్రయోగింపబడినదని గ్రహింపవలెను. అట్లుకానిచో లక్ష్మ్యాద్యాకార పరిణత మాయావచ్ఛిన్న చైతన్యమునందు మాయా శబ్ద ప్రయోగమెట్లు కుదురును? లక్ష్మ్యాదులు చైతన్యములేని జడప్రకృతిరూపులుకారు. అందువలన ప్రకృతిగూడ చేతనమే యని అనరాదు. "ఈక్షతేర్నాశబ్దం" అను బ్రహ్మసూత్రమున ప్రకృతి యచేతనమని నిరూపింపబడినది. లక్ష్మి, పార్వతి మున్నగు స్త్రీదేవతలును, బ్రహ్మ విష్ణు మున్నగు పురుషదేవతలును స్త్రీ పురుష భేదము శరీరగతమేకాని యాత్మగతముకాదు. కావున లక్ష్మ్యాదులు ప్రకృతిస్వరూపులనియు, బ్రహ్మాది పురుషదేవతలు ఈశ్వరరూపులనియును చెప్పుటెట్లు? జగన్నియంతృత్వాది కృత్యము ఆత్మరూపముతో విష్ణువునకువలె లక్ష్మికిగూడ పొసగును. కావున విష్ణువువలె లక్ష్మి గూడ ఈశ్వరరూపురాలే కాని మాయాస్వరూపురాలుకాదు. ఇట్లు లక్ష్మి యీశ్వరస్వరూపురాలుకనుకనే ఈశ్వరునియందుండెడి మాయ లక్ష్మియందుగూడ నుండుననుభావముతో లక్ష్మియందు మాయాశబ్దము ప్రయోగింపబడినది. ఇక లక్ష్మియనగా నీశ్వరశక్తియే యని గ్రహించినచో, అపుడు లక్ష్మి మాయయే యగును. శబ్దములయొక్క వ్యాపారము వివక్షాధీనమై యుండును.

ఇట్లుగాక లక్ష్మియే మాయ యయినచో "తవ పూర్వ పరిగ్రహాం" అని యెట్లు చెప్పును? లక్ష్మి పూర్వపరిగ్రహ ( మొదటిభార్య ) యయినచో, విష్ణువును విడచియుండని లక్ష్మిని విష్ణువు పరిగ్రహించకపూర్వము విష్ణువు మాయావి కాక పోవలసివచ్చును.

ఇక దేహాద్యాకారముగా బరిణమించినది ప్రకృతి యనియు మాయయనగా దేహాద్యభిమానిదేవతయగు లక్ష్మియనియు ననరాదు. దేహాద్యాకారముగా బరిణమించిన ప్రకృతియే మాయ. అగ్న్యాదులు వాగాద్యభిమాన దేవతలు. విరాట్పురుషుడొక్కడే నిఖిలప్రపంచాభిమానిదేవత. లక్ష్మియే విరాట్పురుషుడన్నచో అపుడు ప్రపంచాభిమానత్వము లభించినను మాయాత్వము లభించదు. మాయయయినచో లక్ష్మిగూడ మిథ్యయగును. నిర్విశేషచైతన్యరూపమయిన లక్ష్మి మాయకానేరదు.

మాయావియగు విష్ణువునందువలె ప్రపంచమును పుట్టించి, పాలించి, సంహరించు సామర్థ్యరూపమయిన మాయ, లక్ష్మియందుగూడ కలదు.

కావున లక్ష్మియొక్క శక్తియే మాయగాని, లక్ష్మి మాయగాదు. ఆ శక్తియు "నిస్తత్త్వా కార్యగమ్యాఽస్య శక్తిర్మాయాఽగ్ని శక్తివత్" (స్వరూపములేనిది) పనివలన నూహింపదగినదియగుశక్తియే మాయ. అగ్నియొక్క శక్తివలె అని పంచదశియందు జెప్పినట్లు నిస్తత్త్వముగాన మిథ్యయే యగుచున్నది.

కావున నిట్లు బంధముక్త్యాది వ్యవహారము మాయామయమగుటవలనే మిథ్యయని సిద్ధించినది. ౧౮

శ్లో. బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే
వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః ॥౧౯॥

అ. ఈ శ్లోకమునకు అన్వయము మూడువిధములు-

(1) పురుషుడు అనేక జన్మలు గడచినతరువాత సర్వము వాసుదేవుడే యను జ్ఞానముగలవాడగుచు నన్ను పొందును.

(2) పురుషుడు అనేకజన్మలుగడిచినతరువాత జ్ఞానముగలవాడగుచు సర్వము వాసుదేవుడని నన్ను పొందును.

(3) అనేకజన్మలు గడచినతరువాత జ్ఞానముగలపురుషుడు వాసుదేవుడే సర్వమని నన్ను పొందును. అట్టిమహానుభావుడు కడుదుర్లభుడు.

ఇచట అనేకజన్మ లనగా పశుపక్ష్యాది జన్మలను గ్రహించకూడదు. మరే మనిన ఆత్మసాక్షాత్కారమును కలుగజేయు పుణ్యసంస్కారముగల జన్మలనే గ్రహించవలెను.

అనగా అనేకవేలమనుష్యజన్మలయందు యోగిగానో, కర్మిగానో యుండి వేదాంతవిచారమును చేసి, జ్ఞానార్థమయిన సంస్కారమును సంపాదించి, ఆ సంస్కార బలమువలననే వేదాంతవిచారమునందు ప్రవర్తించి జ్ఞానమును పొందినవాడని యర్థము. అయ్యది ఫలభూతమగు ఆత్మసాక్షాత్కారాత్మక జ్ఞానముగాని వేరు కాదు. ప్రపంచమంతయు నేనే, ప్రపంచమంతయు వాసుదేవుడే యనియే జ్ఞానము యొక్క ఆకారము. వాసుదేవుడనగా, సర్వభూతములయందుండువాడును స్వయం ప్రకాశరూపుడును, ప్రత్యగాత్మయు నిట్టివాడే. కావున వీరిరువురకును భేదములేదు. ప్రత్యగాత్మయన, దీపాదులకంటె విరుద్ధముగా భాసించువాడని యర్థము. దీపాదులు తనను ఇతరవస్తువులను, ఇతరులకు ప్రకాశింపజేయును. ఆత్మ తనను, ఇతరమయిన వానిని,తనకు ప్రకాశింపజేసికొనును. లేక ప్రత్యగాత్మయనగా,సర్వవ్యాపియనియు,

సర్వసాక్షియనియు జెప్పవచ్చును. కావున ప్రత్యగాత్మయన, అహం శబ్ద లక్ష్యార్థ మగు కూటస్థుడు, తత్పదలక్ష్యార్థమగు పరమాత్మ వీరిద్దరు చిన్మాత్రులేకాన వీరికి "తత్త్వమస్యాది వాక్యోక్తమగు నభేదము సిద్ధించును. కనుకనే భాష్యకారులు భాష్యమునందు ఒకానొకచోట వాసుదేవుని పరమాత్మనుగాను, ఒకానొకచోట ప్రత్యగాత్మనుగాను ప్రతిపాదించుచున్నారు. ప్రత్యగాత్మ పరమాత్మశబ్దములు ఒకే యర్థమును చెప్పునని భాష్యకర్తల యాశయము.

మూలమునందలి "మహాత్మా" అను పదమునకు తనతో సమానుడుగాని, తనకంటె నధికుడుగాని లేనివాడని యర్థము. ఇట్టివా డాత్మయొక్కడే యగును. ఆత్మభిన్నమగు పదార్థమంతయు అచేతనము. పరతంత్రము నగుటవలన ఆత్మతో సమానముగాని, యధికముగాని కాదు. కనుకనే "నత త్సమాశ్చాభ్యధికశ్చ దృశ్యతే" అను శ్రుతి యాత్మ సమాభ్యధికరహితుడని చెప్పుచున్నది. ఈ శ్రుతి యీశ్వరుని గురించి చెప్పుచున్నదికాని, జ్ఞానియగు ఆత్మనుగురించి చెప్పుటలేదని శంకింపరాదు. జ్ఞానియే ఆత్మ, ఆత్మయే యీశ్వరుడు కాన యీశ్వరపరములగు శ్రుతులన్నియు ఆత్మయందు సమన్వయించును. అట్లే అజ్ఞానియగు జీవునియందు నిఖిల జీవశ్రుతులు సమన్వయించును.

ఓయి! అజ్ఞాని జీవుడనుట లోకానుభవము, జ్ఞాని యీశ్వరుడనుటకు లోకానుభవములేదు- ఈశ్వరధర్మములగు సర్వజ్ఞత్వ సత్యకామత్వాదులు జ్ఞానియందెచ్చటను కనిపించుటలేదు. అనినచో వినుము. సర్వము బ్రహ్మమను జ్ఞానమే సర్వజ్ఞత్వము- సర్వప్రపంచమును తెలిసికొనుటగాదు. అట్లే సత్యస్వరూపుడగు ఆత్మయందలి గోరికయే సత్యకామత్వము. అమోఘమయిన ఆశగాదు.

ఇవ్విధమగు సర్వజ్ఞత్వ సత్యకామత్వములు జ్ఞానియందుగూడ నగపడుచున్నవి.

లేక ఈశ్వరునియందు కనిపించు సర్వజ్ఞత్వాది ధర్మములు మాయాగతములు కాని, యీశ్వరునివి కావు. సచ్చిదానందములే ఈశ్వరధర్మములు. అయ్యవి జ్ఞానియందుగూడ గలవు.

లేక, సర్వజ్ఞత్వాదిధర్మములు విష్ణ్వాది శరీరోపాధికుడగు ఆత్మయందుగలవు. అయ్యవి జ్ఞానిశరీరోపాధికుడగు ఆత్మయందును అజ్ఞానిశరీరోపాధికుడగు ఆత్మయందును గలవు. కాని అజ్ఞాని యాత్మను తెలిసికొనలేడు. జ్ఞాని యాత్మను తెలిసికొనగలడు. కావున ఒకేయాత్మకు విష్ణ్వాది శరీర ప్రదేశములయందు సర్వజ్ఞత్వము ప్రత్యక్షమగును. అస్మదాది శరీరదేశములయందు కించిత్ జ్ఞత్వము ప్రత్యక్షమగును. నిరవయవుడగు ఆత్మయందు ప్రదేశభేదమును కల్పించుట మాయికము. ఒకే ఆకాశమునం దొకానొకచోట జలపూరితమయిన మేఘము కనిపించును. మరియొకచోట

నిర్జలమేఘము కనిపించును. కనుక అద్వితీయుడును, పరిపూర్ణుడును అగు ఆత్మ యందు సర్వజ్ఞత్వ కించిత్ జ్ఞత్వాది ధర్మములచే జీవేశ్వరభేదమును కల్పించుట యుక్తముగాదు.

నిజముగ విచారించినచో, హిరణ్యాగర్భుడు, విష్ణువు, ఈశ్వరుడు, కుమారస్వామి, విఘ్నేశుడు, లక్ష్మీదేవి, పార్వతి, సరస్వతీ మున్నగువారును; ఇంద్రుడు, యముడు, వరుణుడు మొదలగువారున్ను; సూర్యచంద్రాగ్నులు, పితృదేవతలు, అష్టవసువులు, సిద్ధులు, సాధ్యులు, మనుష్యులు, పశువులు, పక్షులు, పాములు, పురుగులు, ధాన్యములు, చెట్లు, తీగెలు, స్థావరములు (కొండలు) యీ మొదలగు ప్రాణులన్నియు జీవులే. "జీవప్రాణధారణే" అను ధాతువువలన ప్రాణధారణ యనునది జీవధర్మమని స్పష్టమగుచున్నది.

"అప్రాణోహ్యమనాశ్శుభ్రః" అను శ్రుతి యీశ్వరునకు ప్రాణము లేదని చెప్పుచున్నది. ప్రాణములేని పాషాణాదులు, శుభ్రములు, భారూపములు కానంమన యీశ్వరరూపములు కావు. ప్రాణము లేనంతమాత్రమున, పాషాణములీశ్వర రూపములు కావు. "హిరణ్యాగర్భ స్సమవర్తతాగ్రే" అను శ్రుతి హిరణ్యాగర్భుడు మొదట జీవుడని చెప్పుచున్నది. ఇట్లె సూత్రభాష్యమునగూడ నిర్ణయింపబడినది. చతుర్భుజాదులు (విష్ణ్వాదులు) హిరణ్యాగర్భుని సంతతివారు. విరాట్పురుషుడు హిరణ్యాగర్భుని కుమారుడు. హిరణ్యాగర్భుడు సత్యలోకమున నుండు బ్రహ్మ. ఈశ్వరుడు తాను నిర్వికారుడుగ నుండియే హిరణ్యాగర్భాదుల ద్వారమున సృష్ట్యాదులఁ జేయుచున్నాడు. కనుకనే "ధాతా యథాపూర్వమకల్పయత్" అని హిరణ్యాగర్భునకు సృష్టికర్తృత్వము చెప్పబడినది.

ఇట్లే ఈశ్వరుడు చతుర్భుజుని (విష్ణువు) ద్వారమున ప్రపంచరక్షణమును, యీశ్వరునిద్వారమున ప్రపంచసంహారమును చేయుచున్నాడు. బ్రహ్మవిష్ణు మహేశ్వరులు మువ్వురు సత్యలోకాధిపతు లని కొందరందురు. ఒకే సత్యలోకము సత్యవైకుంఠ కైలాస రూపములతో భిన్నమని వారి యాశయము. ఒకే భూలోకము భారతాది ఖండభేదములచే భిన్నమయినట్లు, సత్యలోకమునగూడ అవాంతరభేదములచే వైకుంఠాది లోకములు కలవని యందురు. మరికొందరు వైకుంఠ కైలాస లోకములు సత్యలోకమునకు క్రిందివని యందురు. సత్యలోకమే సగుణముక్తిస్థానమని లోకవ్యవహారము. ఈ బ్రహ్మవిష్ణురుద్రులు మువ్వురు స్వయంభువు లని గొందరందురు. మరికొందరు హిరణ్యాగర్భుడొక్కడే స్వయంభువు (తనంతట తాను పుట్టినవాడు) యనియు, విష్ణురుద్రులు హిరణ్యాగర్భుని కుమారులనియు నందురు. ఈ మువ్వురు స్వయంభువులయినను పుట్టుకయను వికారము కలదు. మాయకుగూడ పుట్టుకయను వికారముకలదు.

("స్వయం భవతి జాయతే") స్వయముగా పుట్టువాడు అని స్వయంభూ శబ్దమునకు వ్యుత్పత్తి. త్రిమూర్తుల శరీరములుగూడ మాయామయములు కనుక శరీరేంద్రియ ప్రాణ మనస్సులను ధరియించిన నీ ముగ్గురును కార్యరూపులగుటచే జీవులే యని నిర్ణయము. ఈశ్వరు డొక్కడే శరీర రహితుడయినందున అజుడు (జన్మలేనివాడు). శరీరధారులకు జన్మ మరణములు అనివార్యములు. జన్మమరణాది వికారములుగల జీవులు సంసారులని సిద్ధాంతము. హిరణ్యగర్భుడుగూడ, ద్విపరార్థ పర్యంతమునుండి యావల నశించునని వినబడుచున్నది. హిరణ్యగర్భునికంటె నర్వాచీనులందరు బ్రహ్మయొక్క దినప్రళయాదులయందె నశింతురు. ఇట్లు హిరణ్యగర్భుడే జన్మమరణములుగలిగి జీవుడగుచుండ హిరణ్యగర్భునివలన సృజింపబడి జన్మమరణములుగల యింద్రాదిదేవతలు, దక్షాదిప్రజాపతులు, సనకాది పరమహంసలు, నారదాదిఋషులు, పితృసిద్ధసాధ్యాదులు, మనుష్యపశుపక్ష్యాదులు, వృక్షాదులును, జీవులగుటలో విప్రతిపత్తిలేదు. విష్ణుసంబంధమయిన రామకృష్ణాద్యవతారములుగూడ శరీరవిశిష్టులయి జన్మమరణ సుఖదుఃఖాది వికారములు గలవారలగుటవలన జీవులే యగుచున్నారు. విష్ణుమూర్తియే శరీరధారియయి, లక్ష్మీవియోగమున దుఃఖమును, లక్ష్మీసంయోగమున సుఖము ననుభవించుచు, జీవత్వమునొందియుండ తదవతారులగు రామకృష్ణాదులు జీవు లనుటలో విప్రతిపత్తిలేదు.

జన్మాది వికారములు జీవలింగములు. శరీరవిశిష్టునకు జన్మాది వికారములనివార్యములు కావున శరీరధారులగు బ్రహ్మవిష్ణ్వాదులందరు జీవులని సిద్ధాంతము. పరమాత్మ యొక్కడే అశరీరుడు.

జీవేశ్వరవిభాగ మిట్లుండ సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వాది ధర్మములతో గూడిన ఈశ్వరులని సర్వజనాభిమతమయిన బ్రహ్మ విష్ణు రుద్రాదులుగూడ జీవులే కావున జీవునకు సర్వజ్ఞత్వాది ధర్మములు సంభవింపవను టెట్లు పొసగును? నిర్వికారుడు, నిర్ధర్మకుడు అగు నీశ్వరునియందు సర్వజ్ఞత్వాది ధర్మము లెట్లు పొసగును. కావున కించిజ్జ్ఞత్వాది గుణములు గల వానివలె సర్వజ్ఞత్వాది గుణములు గల యీశ్వరుడుగూడ జీవుడే యగును. అయితే బ్రహ్మాదులు యీశ్వరు లను లోకశాస్త్రవ్యవహారము— భూపాలకులు మానవులు కీశ్వరు లను లోకవ్యవహారమువంటిది. భూపాలకుడు జీవుడయినను ప్రజలను పాలించుటచే నీశ్వరుడని చెప్పబడుచున్నాడు. అట్లు బ్రహ్మాదులుగూడ లోకములను సృష్టించుచు, పాలించుచు, సంహరించుచు ఈశ్వరుడని చెప్పబడుచున్నాడు.

అయితే "యతోవా ఇమాని భూతాని జాయంతే" ఇత్యాది శ్రుతులు సృష్టి స్థితి లయములు యీశ్వరధర్మములని చెప్పుచున్న వని శంకింపరాదు. మన జోటివారల శరీరాది సృష్టి స్థితి లయములకు గారణమగు హిరణ్యగర్భాది జీవుల

యొక్క సృష్టిస్థితిలయములకు గారణమగుటచే పరమకారణు డగుటవలన ఈశ్వరు నకు జగత్సృష్ట్యాది వ్యవహారము చెప్పబడినది. పుత్రదేహమునకు తండ్రిశరీరము కారణము. తండ్రిశరీరమునకు తాతశరీరము కారణము. ఇట్టితరి తాతశరీరము తండ్రి శరీరముద్వారా కుమారుని (పౌత్రుని) శరీరమునకు గూడ గారణమగును. అట్లే భూఖండమును పాలించు రాజులకు అధిరాజుగూడ భూపాలకుడగును.

మరీచ్యాది ప్రజాపతుల ద్వారమున హిరణ్యగర్భుడు జగత్సృష్టికర్త యయి నట్లు హిరణ్యగర్భునిద్వారా యీశ్వరుడుగూడ సృష్టికర్త యగును. ఈశ్వరుడు హిరణ్యగర్భాద్యాకారముగా పరిణమించిన మాయకు అధిష్ఠానమగుటవలనగాని, హిరణ్యగర్భాదిస్తంబపర్యంత జగదాకారముగా వివర్తమాను డగుటవలనగాని, సృష్టికర్త యగును. కావున హిరణ్యగర్భాదిస్తంబపర్యంత శరీరధారులందరు జీవులని సిద్ధమయినది. అందు గొందరకు సర్వజ్ఞత్వము, గొందరకు కించిత్‌జ్ఞత్వము తర తమ భావముచే సిద్ధించును. కావున జ్ఞానియందు ఈశ్వరధర్మములగు సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వాదులు సంభవించవను దోషములేదు. సర్వజ్ఞత్వాదులు జీవధర్మములు గాని, యీశ్వరధర్మములు గావు. సర్వజ్ఞత్వాదులు బుద్ధిధర్మములు, చిదాభాస విశిష్టబుద్ధిగలవారు జీవులు- ఇట్లగుచో "యస్సర్వజ్ఞ స్స సర్వవిత్" అను శ్రుతి విరోధము వాటిల్లునుకదా యని అనరాదు.

అచట సర్వావభాసకత్వ రూపమగు (సర్వప్రపంచమును ప్రకాశింప జేయుట రూపమగు) సర్వజ్ఞత్వమే చెప్పబడినది. కావున పై శ్రుతి విరోధములేదు.

లేక క్షేత్రమనగా సకలప్రపంచము. దానిని తెలిసికొనిన ఆత్మ క్షేత్రజ్ఞుడు, వాడే సర్వజ్ఞుడు. ఇట్టి క్షేత్రజ్ఞాత్మను తెలిసికొనిన జ్ఞానియు సర్వజ్ఞుడే యగును. హిరణ్యగర్భాదులుగూడ క్షేత్రజ్ఞాత్మను తెలిసికొనినందుననే సర్వజ్ఞులు, యీశ్వ రులు నగుచున్నారు. హిరణ్యగర్భాదులు శరీరేంద్రియాభిమానదృష్టిచే జీవులు, ఆత్మదృష్టితో నీశ్వరులు అని సిద్ధాంతము.

కావున, నాలుగు ముఖములుగలవాడు బ్రహ్మ యనియు, నాలుగు భుజ ములుగలవాడు విష్ణువనియు, మూడు నేత్రములు గలవా డీశ్వరుడనియు, రెండు భుజములు గలవాడు మానవు డనియు, నాలుగు కాళ్ళుగలవి పశువులనియు, నెవరి ననుకొనుచుంటిమో, వారందరు జీవులే యగుదురు. వారిలోపలనుండు అదృశ్యుడు ద్రష్ట. క్షేత్రజ్ఞుడగు ఆత్మ యీశ్వరుడు. వా డద్వితీయుడు. జ్ఞాని యాత్మయె కాన యీశ్వరుడగును. అజ్ఞానులు అనాత్మలు. అజ్ఞులు దేహేంద్రియ సముదాయమును (అనాత్మపదార్థమును) ఆత్మనుగా దలంతురు. శ్రుతులు ఒకానొకచోట హిరణ్య గర్భాదులను ఆత్మదృష్టితో ఈశ్వరులుగాను, ఒకానొకచోట దేహేంద్రియసము

చాయదృష్టితో జీవులుగను చెప్పుచున్నవి. కాన విరోధములేదు. వస్తుతః విచారించి నచో సంసారులగు జీవులకు, ఆత్మకు భేదములేదు కాన యద్వైతము సిద్ధించును.

ఆత్మయే మాయచే జీవభావమునొంది మాయచే తనను దేహేంద్రియసంఘాతమునుగా దలంచును. విద్యచే ఆత్మను (తనను) క్షేత్రజ్ఞునిగాను, కూటస్థునిగాను తలంచును. లోకములో పురుషుడు, నిద్రాదోషముచే తనను యేనుగునుగానో, సింహమునుగానో, మృగమునుగానో తలంచును. మెలకువరాగానే మామూలుగా మానవునిగా తెలిసికొనును. నిద్రాదోషమునకే యిట్టి శక్తియున్న అఘటన ఘటనాపటీయసుగు మాయకు నింకెంతటిశక్తి యుండును? వస్తుతః ఆత్మయందు జీవత్వము పొసగదనుట అద్వైతుల కలంకారమే యగును. అయినను మాయచే నిది యంతయు పొసగును.

కావున అద్వితీయుడు, క్షేత్రజ్ఞుడు, ఈశ్వరుడు నగు ఆత్మ యొక్కడే మాయచే హిరణ్యగర్భాది స్తంబపర్యంతము జీవభావము నొందినవాడై బద్ధునివలె, ముముక్షువువలె, మోక్షముకొరకు ప్రయత్నించువానివలె కనిపించును. తుదకు జ్ఞానానంతరము ముక్తుడని వ్యవహరింపబడును. నిజముగా ఆత్మయందు బద్ధముక్తాది వ్యవహారము లేదు.

“న నిరోధో న చోత్పత్తి ర్నబద్ధో న చ సాధకః
న ముముక్షు ర్నవై ముక్త ఇత్యేషా పరమార్థతా” అని శాస్త్రప్రమాణము.
ఇట్లాత్మతత్వమును తెలిసికొనినవాడు సర్వజ్ఞుడు, యీశ్వరుడు, నారాయణుడు.

ఇట్టి జ్ఞాని దుర్లభుడు. అనేకవేల మానవులలో నొక్కడైనను తత్వవేత్త యుండునా, యుండడా? అని సందేహింపదగియున్నది. జ్ఞాని దుర్లభుడన జ్ఞానము దుర్లభమని తేలినది. దీనిచే ఆత్మ దుర్లభుడని తేలినది. ఈ విషయము “ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేనం” అను శ్లోకమున నింతకుమున్నే చెప్పబడినది.

ఆహా! భగవన్మాయ యేమనదగును? సర్వాత్మభూతమగు కూటస్థ చైతన్యము పరోక్షము, మిక్కిలి దుర్లభము అయినది. ఆత్మయం దనాత్మభ్రమయు, అనాత్మయం దాత్మభ్రమయు బ్రహ్మాది స్తంబపర్యంతజీవులకు సర్వసాధారణమైనది.

అ॥ ఓయి! అందరు ఆత్మయే సర్వప్రపంచము, వాసుదేవుడు అని యేల దెలియరు?

శ్లో. కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః,
తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వయా ॥ ౨౦ ॥

అ॥ లోకములోని మానవులందరు పశుపుత్ర స్వర్గాదులయందలి కోరికలచే వివేకవిజ్ఞానమును పోగొట్టుకొని ఆత్మరూపుడగు వాసుదేవునికంటె భిన్న దేవతలఁ బూజింతురు. జన్మాంతరమునందు ఎవరెవరు యేయే దేవతను పూజించిరో వారు వారు ఆ యా సంస్కారమున యీజన్మమునందు ఆ యా దేవతనే పూజింతురు. ఇందు వారివారి ప్రకృతియే ( జన్మాంతసంస్కారమే ) కారణము.

రామానుజమతము :

ఇచట " పాపవాసనాబద్ధులగు మానవులు విష్ణుని విడచి యింద్రాదిదేవతల బూజించుచున్నారు " అని వ్యాఖ్యానించిరి.

అది యుచితముగాదు. పాపవాసనాబద్ధులగువారు యే దేవతలకు పూజింప నేరరు. దేవతారాధన చేయని పాపులకే పాపవాసన లుండును. విష్ణుదేవతారాధన వలె ఇంద్రాది దేవతల నారాధించుటగూడ పుణ్యావాసనవలననే గలుగును. ఇంద్రాది దేవతలవలె విష్ణుదేవతగూడ దేవత్వజాతి గలదగుటచే రుద్రాదిదేవతల బూజించు వారలకంటె విష్ణువును పూజించువాడు గొప్పవా డనదగదు. శివవిష్ణు లిరువుర శరీరము శుద్ధ సత్వమయమే యగుచున్నది. ఇల్లే బ్రహ్మాది దేవతల శరీరములు గూడ సత్వగుణమయములే యగుచున్నవి. కనుకనే వీరు వైష్ణవులనియు, వీరు శైవులనియు, వీరు హైరణ్యాగర్భులనియు, వీరు కౌమారులనియు, వీరు శాక్తేయు లనియును లోకప్రవాదము కుదురుచున్నది. నృసింహాద్యవతారములయందు విష్ణువు నకు తమోగుణమున్న, దక్షిణామూర్త్యవతారమునందు శివునకు సత్వగుణమున్న గనుపడుచున్నది.

మాయావియు, ఈశ్వరుడును అగు ఆత్మయొక్కడే మాయయందలి సత్వాది గుణభేదముచే సృష్టిని చెప్పదలచినపుడు బ్రహ్మయనియు, పరిపాలనమును చెప్పదలచినపుడు విష్ణువనియు, సంహారమును చెప్పదలచినపుడు రుద్రుడనియును పేరు పెట్టుదురు.

శరీరధారులగు బ్రహ్మ విష్ణు రుద్రులకు ఈశ్వరత్వము లేదు. శరీరము కలిగి యుండుట, యీశ్వరుడగుట యీ రెండును విరుద్ధములు. ఇయ్యది సిద్ధాంతము. కావున విష్ణువు సత్వమయుడనియు, బ్రహ్మదేవుడు రాజసుడనియు, రుద్రదేవుడు తామసుడనియును కల్పింప నలవికాదు. దేవతలందరు సాత్వికులు, మానవులందరు రాజసులు, వృక్షాదులు తామసములు.

సత్వగుణముయొక్క యుద్రేకము లేనిదే దేవతాజన్మ సంభవింపదు. మలిన సత్వప్రధానమయిన అవిద్య జీవోపాధి. శుద్ధసత్వ ప్రధానమయిన మాయ ఈశ్వ రోపాధి. ఇట్లుండ మాయ యుపాధిగా గల బ్రహ్మరుద్రులలో నొకరు రాజసు

లనియు, మరియొకరు తామసులనియు భేదమెట్లు పొసగును? అద్వితీయుడగు సర్వేశ్వరునకు త్రిత్వము (ముప్పురగుట) యెట్లు సంభవించును. కనుక శరీరులగు బ్రహ్మ విష్ణు రుద్రులు ముప్పురు యీశ్వరులు కారు. అద్వితీయుడగు సర్వేశ్వరున కొక్కనికే సృష్టి స్థితి సంహారములనుపట్టి బ్రహ్మ విష్ణు రుద్రనామము లేర్పడినవి. కావున అన్యదేవతాపదముచే విష్ణువుగూడ గ్రహింపబడును. దేవత్వముచే విష్ణువునకుగూడ ఆత్మాన్యత్వము (ఆత్మ భేదము) గలదు. దేవతలుగూడ మనుష్యులవలె అనాత్మలే యగుదురు. కావున ఆత్మకంటె భిన్నమగు విష్ణువునుగాని, రుద్రునిగాని, బ్రహ్మనుగాని, ఇంద్రాదులనుగాని యెవడు ఉపాసించునో వాడు కామోపహతుడే యగును. నిష్కాముడుగాని, మోక్షకాముడుగాని యొక్కడే ఆత్మనుపాసించును. తుద కాత్మను పొందును. నిష్కాములుగా నుండి చిత్తశుద్ధికొరకు విష్ణ్వాదుల నుపాసించువారు అజ్ఞానులును కారు, జ్ఞానులును కారు. సాకార బ్రహ్మోపాసకులగు వారు మధ్యస్థు లనబడుదురు.

"మోక్షమిచ్ఛేజ్జనార్దనాత్" అను స్మృతివలన విష్ణూపాసనము మోక్షప్రదమని యనదగదు. అచ్చట జనార్దన పదము ఆత్మపరముగాని వేరుకాదు. లేక చిత్తశుద్ధి ద్వారా విష్ణూపాసనము జ్ఞానము నిచ్చునుకాన, మోక్షప్రదమని చెప్పబడినది. ఇట్లే "జ్ఞానం మహేశ్వరాదిచ్ఛేత్" అని మహేశ్వరోపాసనముగూడ జ్ఞానప్రదమని చెప్పబడినది.

ఎక్కువగా జెప్పనేల? నిష్కాముడయి యేదియో యొక దేవతను సర్వేశ్వరునిగా ఉపాసించినచో చిత్తశుద్ధి తప్పక కలుగును. విష్ణువునే ఉపాసించి తీరవలయునని నియమము లేదు. నిర్గుణబ్రహ్మయందు కల్పింపబడిన వ్యక్తులందరు సగుణబ్రహ్మలనియే వ్యవహారము. మాయచే శరీరేంద్రియాదులతోఁగూడిన బ్రహ్మ సగుణబ్రహ్మ. ఇట్టి సగుణబ్రహ్మత్వము పాషాణద్వారాదులయందు గూడ గలదు. అట్లు కానిచో శ్రీరంగనాయకులయందు, జగన్నాథస్వాములయందును, సగుణబ్రహ్మత్వము యెట్లు పొసగును?

కాని అజ్ఞానులు పాషాణాదికమును సగుణబ్రహ్మనుగా తెలియలేరు. పాషాణరూపముగానే గ్రహింతురు. కనుకనే "వాసుదేవ స్సర్వమితి సమహాత్మా సుదుర్లభః" (వాసుదేవుడే సర్వమని గ్రహించువాడు దుర్లభు డని చెప్పబడినది.)

కావున ఇంద్రాదిదేవతలవలె విష్ణువుగూడ అనాత్మయే యగును. లేక విష్ణుదేవునివలె ఇంద్రాదిదేవతలుగూడ సగుణబ్రహ్మలే యగుదురు. కనుక రుద్రాది దేవోపాసనకంటె విష్ణుదేవోపాసనకు గొప్పదనము లేదు. ఇతరదేవతల నుపాసించుటకంటె ఆత్మ నుపాసించుటయే ప్రశస్తము. ౨౦

శ్లో. యో యో యాంయాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి,
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధా మ్యహమ్ ॥ ౨౧ ॥

అ॥ ఏ యే భక్తుడు, ఏ యే దేవతాశరీరమును శ్రద్ధతో బూజింపదలంచునో, ఆ యా భక్తునకు, ఆ యా దేవతాశరీరమును పూజించుటయందే స్థిరమయిన శ్రద్ధను నే నొసంగుదును.

రామానుజ మతము:

ఇచట రామానుజులు, "య ఆదిత్యే తిష్ఠన్ యస్యాదిత్య శ్శరీరం" అను శ్రుతిని ఆధారముగా గైకొని, "అంతర్యామిరూపుడ నగు నాయొక్క ఏ యే ఆదిత్యాది రూపశరీరమును" అని వ్యాఖ్యానించిరి. ఇయ్యది మా మతప్రకారము సరియయినను, రామానుజమతరీతిన విరుద్ధమగును.

ఎట్లన? రామానుజులు, చిదచిద్విశిష్టుడు, సకలకల్యాణగుణ నిలయుడు, దివ్యమంగళవిగ్రహుడు, శంఖచక్రాది దివ్యాయుధధరుడు నగు పరమేశ్వరుడు విష్ణు వని యంగీకరించిరి. అట్టివానికి ఆదిత్యాదులు శరీర మెట్లగుదురు? వానికి అంతర్యామిత్వ మెట్లు పొసగును? ఆదిత్యాది శరీరములు ఆ యా శరీరాభిమానముగల జీవులను సంబంధించినవి. ఆ యా శరీరసంబంధమువలననే ఆదిత్యాదులు జీవు లనబడుదురు. జీవులు శరీరాభిమానముగలవా రనునది, శారీరక సూత్రభాష్యమున స్థిరపరచబడినది.

ఆదిత్యాది శరీరములయందు ఆదిత్యాది జీవులు గలరనియు, ఆదిత్యాది జీవులయందు ఈశ్వరుడు గలడనియు, ననదగదు. మీ మతప్రకారము అణుపరిమాణులు, నిరవయవులు అగు జీవులయందు దివ్యమంగళ విగ్రహుడగు ఈశ్వరు డుండుట సంభవింపదు. మధ్యమపరిమాణముగల చిదచిద్విశిష్టునకును, చిదంతస్థితి (చిత్తునకు లోపలనుండుట) సంభవింపదు.

అద్వైత మతప్రకారము సర్వవ్యాపకుడగు నీశ్వరునకు సర్వము శరీరమే కావున, సర్వము యీశ్వరశరీరమగును. ఇట్లైనచో నీశ్వరుడు శరీరరహితుడను శ్రుతికి విరోధము ప్రాప్తించునుకదా? అని యనరాదు. నిజముగా అశరీరియగు ఈశ్వరుడుగూడ మాయచే సశరీరి కావచ్చును. మాయయందు నెంతటి దుర్ఘట కార్యమయినను సంభవించును. సంభవింపనివానిని సంభవింపజేయుటయే మాయ కావున రామానుజవ్యాఖ్యానము సంగతముకాదు. ౨౧

శ్లో. స తయా శ్రద్ధయా యుక్తః తస్యారాధన మీహతే,
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్ ॥ ౨౨ ॥

అ॥ అట్టి భక్తుడు నేను స్థిరపరచిన, ఆ దేవతావిషయకశ్రద్ధతోఁ గూడికొని, యా యా దేవతాశరీరమును పూజింపనెంచును. తాను ఆరాధించిన ఆ దేవతా శరీరమునుండియే, సర్వజ్ఞుడగు పరమేశ్వరునిచే నిర్మింపబడిన గోరికలను పొందు చున్నాడు. సర్వేశ్వరుడనగు నేనే ఈ దేవతోపాసకునకు ఈ ఫలము సిద్ధించునని వ్యవస్థ చేసితిని కాన, ఈశ్వరనిర్మితమయిన వ్యవస్థను అతిక్రమించకుండగనే ఆ యా దేవతలు, ఆ యా యుపాసకునకు ఆ యా కామముల నొసంగుచున్నారు. ఇంతియె కాని స్వాతంత్ర్యముచే నీయుటలేదు.

ఇచట ఉత్తరార్థమున, "హితాన్" అను పదమును కామ పదమునకు, విశేషణమొనర్చి యన్వయింపవచ్చును. కాని యయ్యది స్వరసముగాదు. అపుడు ఉపాసకులకు హితవయిన గోరికలను అని యర్థము లభించును. సంసారబంధము నిచ్చెడి కామములు ప్రియములగును కాని హితములు గానేరవు.

ఇక (హి - తాన్) అని పదవిభాగమును చేసి, హి శబ్దమునకు "ప్రసిద్ధి" యను అర్థమును చెప్పి, యొకే వాక్యముగా నన్వయించుట సులభము. కాని, యీశ్వరుడు దేవతోపాసకులకొరకు కామములను నిర్మించెనని, యెవ్వడును యెరింగిన విషయముకాదు. అందువలన నయ్యది యప్రసిద్ధము కాన 'హి' శబ్దమునకు ప్రసిద్ధ్యర్థమును చెప్పుట అనుపపన్నమగునని భాష్యకారుల యాశయము.

"మయైవ విహితాన్" అను పదము లేనిచో, ఉపాసకులు దేవతలనుండి కోరికలను పొందుదురని చెప్పినచో నయ్యది సర్వవిదితము కాన, యపుడు హి శబ్దమునకు ప్రసిద్ధ్యర్థము కుదురును.

రామానుజ మతము :

"ఆ యా దేవతల నారాధించువారలకు గూడ, ఆ యా కర్మానుగుణముగ నా యా ఫలముల నిచ్చువాడను నేనే, యగుచున్నాను" అని వ్యాఖ్యానించిరి.

అదియు యుక్తమే యగుచున్నది. ఆ యా ఫలముల నిచ్చు దేవతల యాకారముగా బరిణమించిన మాయకు నధిష్ఠానమయిన నీశ్వరుడు ఆ యా ఫలముల నిచ్చుట యుక్తమే యగును. వస్తుతః ఫలప్రదత్వము నిర్ధర్మకుడగు ఆత్మకు విరుద్ధమే యగును. ౨౨

శ్లో॥ అన్తవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసాం,
దేవాన్ దేవయజో యాంతి మద్భక్తా యాంతి మామపి ॥ ౨౩ ॥

అ॥ అల్పజ్ఞానముగల దేవతారాధకులకు ఫలము అల్పమున్ను, నాశసహితమున్ను అగుచున్నది. ఇతర దేవతల నారాధించువారలు దేవతలను పొందుదురు.

నా భక్తులు అనగా ఆత్మోపాసకులు, సచ్చిదానందమయుడనగు నన్నే పొందుదురు.
అనగా ముక్తులగుదు రని భావము.

ఈ యుభయులకు ప్రయాస సమానముయినను, అనంతఫలము నపేక్షించి నన్ను పొందరు. అహా? లోకులెంతటి యవివేకులు?

దేవతారాధకులకు, ఆత్మోపాసకులకు, ప్రయాస సమానమని ప్రతిపాదించుట, స్థూలదృష్టిచేగాని, సూక్ష్మదృష్టిచే పొసగదు. అనేక పరికరములతోఁ గూడిన దేవయజనము అతిప్రయాసకరము. ఆత్మయజనమే సులభము.

"ఆత్మత్వా త్సర్వభూతానాం సిద్ధత్వాదిహ సర్వతః" అని ప్రహ్లాదులు చెప్పినట్లు, భగవత్సేవయందు కారకముల సంపాదించుకొనవలె నను ప్రయాసలేదు. విషయాభిముఖమగు మనస్సును, ఆత్మయందుంచుటయే యిచట క్లేశము. ఈయది విరాగములేనివారలకు దూరమయినను, విరాగము గలవారలకు అభ్యాసవశమున సుకరమే యగును. విరక్తులగు సన్యాసులకే ఆత్మభజనమునం దధికారమని యింతకు మున్నే చెప్పబడినది. కావున, దేవతారాధనయందు కాయిక, వాచిక, మానసిక, క్లేశములు మూడును కలవు. ఆత్మభజనమునందు మానసికక్లేశమొక్కటియే కలదు. కావున ఆత్మభజనమునందు దేవయజనమునందువలె నెక్కుడు ప్రయాసలేదని గ్రహింపవలెను ॥౨౩॥

శ్లో. అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యంతే మామబుద్ధయః,
పరంభావ మజానంతః మమావ్యయ మనుత్తమమ్ ॥౨౪॥

అ॥ అవివేకులు నాదగు, సచ్చిదానందాత్మకమయిన పరస్వరూపమును, తెలిసికొనలేక అజ్ఞాతమయిన నన్ను జ్ఞాతమయినవానినిగ నూహింతురు. నిజముగ నాదురూపము సర్వోత్కృష్టము, వికారరహితము నగుచున్నది.

మూలమునందలి "మమభావం" అను పదమునకు (మదీయం) నా సంబంధమయిన రూపమును అని వ్యాఖ్యానించిరి. సచ్చిదానందములు భగవద్రూపములు కాని, భగవంతుని సంబంధముయినవి కావు. ఇచట భేదనిర్దేశము. "రాహోశ్శిరః" అను వాక్యమునందువలె, ఔపచారికమని గ్రహింపవలెను. కనుకనే "ఆనందో విషయానుభవో నిత్యత్వంచేతి సంతి తద్ధర్మాః, అపృథక్త్వేఽపి చైతన్యాత్ పృథగివ అవభాసంతే" అని పెద్దలందురు. విషయానుభవ మన చైతన్యము. నిత్యత్వమన సత్త. అనగా సచ్చిదానందములు ఆత్మాభిన్నములయినను, ఆత్మభిన్నములుగా దోచుచుండును. అని దీనియర్థము.

జీవపరమాత్మల కభేదమును తెలియని యవివేకులు పరోక్షముగా వైకుంఠాది లోకములయందున్న విష్ణ్వాది దేవతలు యీశ్వరులని తలచి, యట్టి పరోక్ష

మయిన విష్ణువు భక్తానుగ్రహముకొరకు శ్రీకృష్ణరూపముతో నవతరించెనని తలంచుచున్నారు. అని నిర్గళితార్థము. దీని జీవపరభేదవాదులగు ద్వైతులును, విశిష్టాద్వైతులును నిరాకరింపబడుచున్నారు.

రామానుజ మతము :

సర్వేశ్వరుడగు విష్ణువు తనస్వభావమును విడువకయే వసుదేవుని కొమరుడయి యవతరించెను. శ్రీకృష్ణుని పరస్వరూపమును తెలియనివారు, శ్రీకృష్ణుడు ప్రాకృతరాచబిడ్డతో సమానుడనియు, నింతకుముందు కనిపించని వాడనియు, ఇప్పుడే కర్మవశమున జన్మనెత్తి కనిపించుచున్నాడనియు మూఢులు తలచుచున్నారు. అని రామానుజులు తమ భాష్యమునం దుదాహరించిరి. కావున నీ శ్లోకముచే విశిష్టాద్వైతులెట్లు నిరాకరింపబడుదురు? అని యనదగదు. ఇందు రామానుజ భాష్యము అసంగతము. ఎట్లన? కృష్ణావతారము యింతకుమున్ను అగపడనిదనియు నిపు డగపడుచున్నదనియు నెల్లరెఱింగిన విషయము. ఇందు అజ్ఞానమిసుమంతయు లేదు. కృష్ణావతారము త్రేతాయుగమున లేదు; కలియుగమందును లేదు. ద్వాపరాంతముననే కృష్ణావతారము కలదు. కావున కృష్ణావతారము మొదట అవ్యక్తమగుట, మధ్య వ్యక్తమగుట, ద్వాపరాంతమున అయ్యది నాశమొందుటయు సిద్ధమగు చున్నది. ఇట్టి యవతారము నాశరహితమగుట పొసగదు.

లీలావశమున వ్యక్తమయిన నన్ను కర్మవశమున వ్యక్తమయిన వానినిగా దలంచుట యవివేకమని యనరాదు. కర్మవశ మను పదము మూలమునందు లేదు. మూలమునలేని పదమును కల్పించి యన్వయించుట అప్రమాణమగును. ఒకవేళ అట్లు నిర్మూలపదమును కల్పించినను రామానుజుల యభీష్టము నెరవేరదు. ఎట్లన?

వినుడు శ్రీమద్భాగవతమున, విదురమైత్రేయ సంవాదమున బాదరాయణులచే జేయబడిన ప్రశ్నోత్తర గ్రంథమును-

> "బ్రహ్మన్ కథం భగవతః చిన్మాత్రస్యావికారిణః
> లీలయాచాపి యుజ్యేరన్ నిర్గుణస్య గుణాః క్రియాః ॥
> క్రీడాయాముద్యమోర్భస్య కామశ్చిక్రీడిషాఽన్యతః
> స్వతస్తృప్తస్యచ కథం నివృత్తస్య సదా స్వతః ॥
> అస్రాక్షీద్భగవాన్ విశ్వం, గుణమయ్యాత్మమాయయా
> తయా సంస్థాపయత్యేతత్, భూయః ప్రత్యభిధాస్యతి ॥
> దేశతః కాలతో యోసా వవస్థాతస్స్వతోఽన్యతః,
> అవిలుప్తావబోధాత్మా సయుజ్యేతా జయా కథమ్॥

భగవానేక ఏవైషః సర్వక్షేత్రేష్వవస్థితః,
అముష్యదుర్భగత్వంవా క్లేశోవా కర్మభిః కుతః.
ఏతస్మిన్మే మనోవిద్వన్ ఖిద్యతే జ్ఞానసంకటే
తన్మేపరాణుద విభో! కశ్మలం మానసం మహత్!
స ఇత్థంచోదితః క్షత్త్రా తద్విజిజ్ఞాసునా మునిః,
ప్రత్యాహ భగవచ్చిత్తః స్మయన్నివ గతస్మయః,
సేయం భగవతో మాయా యన్నయేన విరుధ్యతే,
ఈశ్వరస్య విముక్తస్య కార్పణ్య ముత బంధనమ్॥
యథార్థే నవినాపుంసః మృషైవాత్మ విపర్యయః,
ప్రతీయత ఉపద్రష్టు స్స్వశిరశ్ఛేదనాదినా॥
యథా జలే చంద్రమసః కమ్పాది స్తత్కృతో గుణః,
దృశ్యతే సన్నపి ద్రష్టురాత్మనోఽనాత్మనో గుణః॥ (అని)

ఈ శ్లోకములయందు, విదురుని ప్రశ్నభాగమునకు సారాంశ మిట్లు గ్రహింప వలెను.

1. చిన్మాత్రుడు, నిర్వికారుడు, నిర్గుణుడు అగు నీశ్వరునకు, లీలచే నయినను గుణక్రియాసంబంధ మెట్లు పొసగును?
2. దేశకాలాదులచే చెడని జ్ఞానముగల యీశ్వరునకు ప్రకృతితో సంబంధ మెట్లు పొసగును?
3. భగవంతుడగు వానికి దుర్భగత్వము (దౌర్భాగ్యము) కాని, క్లేశముకాని యెట్లు సంభవించును?.

మైత్రేయుని సమాధానభాగములోని సారమిది:-

1. మాయచే నిదియంతయు కుదురును.
2. నిద్రచే జీవునకు, తన తల దెగగొట్టబడినట్లు పొడసూపుట.
3. నీరు కదలినంతమాత్రమున అందలి చంద్రప్రతిబింబము కదలినట్లు కని పించుట- యెట్లు పొసగుచున్నవో, అట్లే ఆత్మయందు లేకున్నను, అనాత్మ గుణము మాయచే దోచును. (అని)

ఇట్లుండ నిర్విశేష చిన్మాత్రమయిన ఈశ్వరునకు తలచేనయినను జన్మాదు లెట్లు సంభవించును? వానికి కర్మవశమున జన్మలేదనిమాత్ర మెట్లు చెప్పనగును?

శ్రీమహావిష్ణువు దైత్యహననము కొరకు, భృగువుయొక్క భార్యను చంపి భృగువుచే "నావలె నీవుగూడ భార్యావియోగము నొందుము" అని శపింపబడిన

వాడై, ఆ శాపమును నెరవేర్చుట కొఱకును, పాపమును పోగొట్టుకొనుటకును, శ్రీరామరూపముగ నవతరించి,సీతావియోగము ననుభవించెనుగదా?అట్లె రామావతారమందును చెట్టుచాటున దాగి, వాలినిజంపి, ఆపాపమునకు ఫలముగ కృష్ణావతారమున, కిరాతుని బాణములచే దెబ్బలుతిని శరీరవియోగము నొందెనుగదా? కావున జన్మాంతరార్జిత మయిన పుణ్యాపాపముల ఫలానుభవముతో గూడియున్న కృష్ణావతారాదులు, అకర్మప్రయుక్తము లెట్లగును? లీలచే, తనను దుఃఖమునిచ్చెడి కర్మను తా నెట్లాచరించును? లోకములో నెవ్వడును లీలచె నిప్పులో దుమకడుగదా! లీలచేగాని, కర్మవలన గాని, జన్మ జరామరణ, సుఖ దుఃఖ వికారజాతము కలుగుచుండ నీశ్వరత్వమెట్లు సిద్ధించును? "అజోనిత్యః" ఇత్యాదిశ్రుతులవలన నిర్వికారుడుకదా యీశ్వరు డని తెలియబడుచున్నాడు. కావున నీశ్వరునకు లీలచే గాని, కర్మచేగాని కృష్ణావతారము స్వీకరించుట కుదరదు. మాయవలన నంతయు కుదురును. ఈశ్వరునకు వస్తుతః (నిజముగ) జన్మాది వికారములు లేవు. మాయచే జన్మమరణాది వికారములుగలవాడువలె దోచుచుండును.

కావున నిత్య శుద్ధ బుద్ధ ముక్తస్వభావుడగు ఆత్మను, శ్రీకృష్ణరూపముగ నవతరించిన పరోక్ష ఈశ్వరునిగ దలంచువారే యల్పబుద్ధులు. కాని వారు మాయామయమగు కృష్ణావతారమును ప్రాకృత రాచకొమరునితో సమానముగ దలంతురు. అయినను వా రల్పబుద్ధులే యగుదురు. కాని వీరికంటె నల్పబుద్ధులు మొదటివారు. మొదటివారు ఆత్మానాత్మవివేకరహితులు. రెండవవారు అనాత్మలయందే తారతమ్యజ్ఞాన శూన్యులు; ఇంతియే భేదము.

ఓయి! ప్రాకృతులగు రాజపుత్రులు, మాయామయులయినట్లు శ్రీకృష్ణుడు గూడ మాయామయుడగుచుండ శ్రీకృష్ణుడే మాయామయుడని నొక్కి-చెప్ప నేల? వినుము. లోకములో రెండు రకముల సర్పములు కలవు. వ్యావహారిక సర్పము, ప్రాతిభాసిక సర్పము-అని ఈ రెండును మాయచే తయారయినవే యగుచున్నవి. అయినను, ప్రాతిభాసికసర్పమే మాయామయమని లోకులు వ్యవహరించుచున్నారు. వ్యావహారిక సర్పమును మాయామయమని వ్యవహరించుటలేదు. అట్లే లోకదృష్టిచే శ్రీకృష్ణుడే మాయామయుడని వ్యవహరింపబడుచున్నాడు.

రాజకుమారులు, మాయాకార్యమయిన పంచభూతములయొక్క- పరిణామమగుటచే భౌతికులగుచు, ప్రాకృతు లనబడుచున్నారు. కృష్ణశరీరము సాక్షాన్మాయాకార్యము. పంచభూతపరిణామము కాదు. కావున భౌతికముకాదు గనుక ప్రాకృతముకాదు. అందువలన అప్రాకృతముగనుక మాయామయమని వ్యవహరింపబడుచున్నది.

కావున ఆకసమున గల్పింపబడిన గంధర్వ నగరాదులతో కృష్ణావతారము సమానము. సాక్షాద్గంధర్వ నగరాదులతో సమానులు, రాజపుత్రులు అని భేదము సిద్ధమయినది. ఇంద్రజాలునిచే గల్పింపబడిన గంధర్వనగరాదులవలె మాయా కల్పితమయిన కృష్ణావతారము ప్రాతిభాసికమగుటచే మాయామయమగుచున్నది.

ఇట్లు కృష్ణావతారము భూతవికారము కాకుండుటచేతను, కేవల మాయా మయమగుటచేతను గోవర్ధనగిరి నెత్తుట మున్నగు చేష్టలు సంభవించుచున్నవి.

నిద్రచే బుట్టిన స్వాప్నగజాదులు పర్వతోద్ధరణాది చేష్టలను చేయుట లోకానుభవసిద్ధము.

ఇట్టిమాయ ఆత్మకు (ఈశ్వరునకు) స్వభావమని పలుమారులు చెప్పబడి నది. కనుకనే రామకృష్ణాదులు యీశ్వరావతారములని లోకవ్యవహారము.

అయితే ఆత్మయొక్కడే తన మాయచే రామకృష్ణాది రూపముగ పరిణ మించినట్లు మనుష్య పశ్వాదిరూపముగగూడ పరిణమించెనుకాన, రామకృష్ణాదుల వలె దేవమనుష్య పశ్వాదులుగూడ నీశ్వరావతారములని చెప్పుట యుచితము. కాని ఆత్మ తనమాయచే సాక్షాత్ రామకృష్ణాది రూపమున బరిణమించెను. మహదహంకారభూతముల ద్వారమున మనుష్యాది రూపముగ పరిణమించెను కాన మనుష్యాదులు ఈశ్వరావతారము లనబడరు.

అయితే సాక్షాన్మాయాపరిణామమగు మహత్తత్త్వము, యీశ్వరావతార మని యేల జెప్పగూడదు? ఇష్టాపత్తియే మేమంగీకరింతుము. మహత్తత్త్వమన హిరణ్యగర్భతత్త్వము. ఇయ్యది యీశ్వరావతారమని మే మంగీకరింతుము. జీవులకు మొదటివాడు హిరణ్యగర్భుడు. అట్లే రుద్రమయు మగు అహంకారముగూడ నీశ్వ రావతారమే యగును.

కావున భౌతికములుగాక సాక్షాన్మాయామయములగునవి యీశ్వరావతార ములనియు, భౌతికములగుచు ప్రాకృతములయినవి జీవావతారములనియు దెలినవి.

ఈశ్వరావతారమగు దేహముగూడ దృశ్యమగును. జడముగ నుండును. స్థూలముగ నుండును. జీవదేహములు గూడ నిట్లె దృశ్యములు, జడములు, స్థూల ములు నగును. ఈ యంశమునం దుండెడు దేహములకు భేదము లేదు. అయినను ఈశ్వరావతారమయిన దేహములయందు, లోకాతిక్రాంతమయిన మహిమలు కని పించుచుండును. జీవదేహములయం దయ్యవి కనిపించవు. అందువలన నీయవి యీశ్వరావతార దేహములనియు, నీయవి జీవదేహములనియు గ్రహింపనగును. ఎట్లన అగస్త్యునియందు సముద్రపానమున్ను, ఈశ్వరునియందు విషభక్షణ మున్ను, హనుమంతునియందు పర్వతములనెత్తుటయు, శ్రీకృష్ణునియందు దావా

నలమును మ్రింగుటయు- శ్రీరామచంద్రునియందు, సేతునిర్మాణమున్ను- నృసింహునియందు స్తంభమును బద్దలుచేసికొని వెడలుటయు, వరాహమూర్తి యందు భూమినుద్ధరించుటయు, మత్స్యావతారమునందు వేదములను తీసికొని వచ్చుటయు, వామనమూర్తి యందు ముల్లోకముల వ్యాపించుటయు- మున్నగు లోకాతీతమయిన చర్యలు కనిపించుచున్నవి. కనుక వీరు యీశ్వరావతారులని నిశ్చయము. లోకసామాన్యమయిన చరిత్రగల మనుష్యాదులు జీవదేహము లనియు, అవతార దేహములు కావనియు గ్రహింపవలెను.

జీవుని దేహము భౌతికము. ఈశ్వరుని దేహము అభౌతికము. ఈ భేదమును బట్టియే భౌతిక దేహమునందున్న ఆత్మ జీవుడనియు, అభౌతికదేహమునందున్న ఆత్మ- యీశ్వరుడనియు వ్యవహరింపబడుచున్నాడు. దేహభేదమువలననే జీవులనే కులని చెప్పుచున్నారు. దేహభేదమును బట్టియే యీశ్వరునిగూడ వారివారి మత ప్రకారము భిన్నభిన్నముగా వ్యవహరించుచున్నారు.

ఇట్టి జీవేశ్వరభేదమే (వ్యవహారమే) స్వమతమగు అద్వైతమును సిద్ధాంత పరచుటకు శ్రుతులచే ననువదించబడుచున్నది. పూర్వపక్షము ననువదింపనిదే సిద్ధాంతము జెప్ప సులభముగాదు. శ్రుతులు జీవేశ్వరభేదమును అనువదించినంత మాత్రమున, జీవేశ్వరవిభాగము శ్రుతిసమ్మతమని యనరాదు. ఆత్మ యొక్కడే యీశ్వరుడను మతమే శ్రుతికి సమ్మతము. ఆత్మభిన్నములన్నియు అనాత్మలనియు, కల్పితములనియును శ్రుతిసిద్ధాంతము.

కావున, ఆత్మానాత్మ వివేకశూన్యులగు ప్రాకృతులు, ఆయా కార్యకరణ సంఘాతాత్మకులగు రామ కృష్ణ శంకర అగస్త్య హనుమదాదులను యీశ్వరు లని తలంచుచున్నారు.

వివేకవంతులు మాత్రము నిఖిలోపాధిరహితుడును, నిరస్తాశేషవిశేషుడును, సచ్చిదానంద ఘనుడును అగు ఆత్మనొక్కనినే యీశ్వరుడని తలంతురు. కావున నిట్లు జ్ఞానుల కద్వైతమున్ను, అజ్ఞానులకు ద్వైతమున్ను సిద్ధమయినది.

ఇట్టితరి విశిష్టాద్వైతము సంకరులకె సంభవించుచున్నది. విశిష్టాద్వైతమను పదము శ్రుతిసిద్ధముకాదు. విశిష్టత్వ, అద్వైతత్వములకు సామానాధికరణ్యము సంభవించదు. ఈ విషయమంతయు విస్తరించి శ్రీ రామరాయకవికృతమగు సిద్ధాంతమందు వ్యాఖ్యానరూపమయిన సిద్ధాంతసింధు నామక గ్రంథమునందు ప్రతిపాదించబడినది.

కావున అజ్ఞానసిద్ధమగు ద్వైతవ్యవహారము ముముక్షువులచే నాదరింప దగదు. ఇయ్యది సంసారభీతి నొసంగును. "ద్వితీయాద్వై భయం భవతి" అని శ్రుతి చెప్పుచున్నది.

కావున సంసారభయమును పోగొట్టుకొనగోరినవాడు అద్వైతభాష్యమునే శ్రవణము చేయవలయును. దానినే మననము చేయవలయును. నిదిధ్యాసనము చేయవలయును. అని శ్రుతి సిద్ధాంతము. ౨౪

శ్లో. నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయా సమావృతః
మూఢోఽయం నాభిజానాతి లోకో మామజ మవ్యయమ్ ॥ ౨౫ ॥

అ॥ నే నందరకు ప్రత్యక్షము కాను. యోగమాయచే నావరింపబడిన మూఢులు ఉత్పత్తి వినాశరహితుడనగు నన్ను దెలియనేరరు. నేను యోగమాయాఽఽవరణములేని శంకర, సనక, నారదాదులకు, మాత్రమే ప్రత్యక్షమగుదును.

ఇచట యోగమాయయన సత్వరజస్తమోగుణములయొక్క సంబంధమని యర్థము. దీనిచే లోకుల చిత్తము వ్యామోహమును చెందును. ఇట్టివారు పరమేశ్వరుని గుర్తింపజాలరు.

(లేక) భగవంతునియొక్క సంకల్ప ప్రయుక్తమయిన అవివేకముగూడ యోగమాయ యనవచ్చును.

ఇచట మూలమునందలి లోకశబ్దమునకు చిదాభాసు డర్థము. ప్రత్యగాత్మయగు సాక్షి యర్థముగాదు. సాక్షిచైతన్యమే యోగమాయచే నావరింపబడుచో, జగత్తు అంధకారమున మునిగిపోవును.

మూలమునందలి "మామ్" అను పదమునకు, అనాత్మ పదార్థవిలక్షణమును, పరమాత్మాభిన్నమునగు ప్రత్యక్స్వరూపుని" అని యర్థము. కావున నిట్టివానినిగా నన్ను దెలియనేరరని భావము.

లోకులు అస్వాధీనమయిన మాయగలవారు కాన, యీశ్వరుని తెలియలేరు. ఈశ్వరుడు మాత్రము స్వాధీనమయిన మాయగలవాడగుటచే దన్ను తాను తెలిసికొనును.

ఈశ్వరపరతంత్రమగు మాయ, యీశ్వరుని వ్యామోహపరచ జాలదు. ఐంద్రజాలికునిచే పంపబడిన మాయ చూచువారలనే మోహపెట్టునుగాని, ఐంద్రజాలికుని మోహబెట్టజాలదు.

ఇచట యోగమాయాసమావృతత్వ మనగా ఘటాదులవలె అజ్ఞాన విషయమగుటకాని, చైతన్యమువలె అజ్ఞానాశ్రయమగుటకాని కాదు. మరేమనిన యోగమాయచే, జ్ఞానము ప్రతిబద్ధమగుటయే (అడ్డగించబడుటయే) అనగా లోకులయొక్క జ్ఞానము మాయచే నావరింపబడుటయే యని భావము. పరమేశ్వరునియొక్క జ్ఞానమును మాయ అడ్డగించజాలదు.

మాయా ప్రతిబద్ధమగు జ్ఞానముగూడ జీవులయొక్క స్వరూప చైతన్యము గాదు. స్వరూపచైతన్యము మాయావృతమగుచో జగదాంధ్యము ప్రసక్తించును. వ్యాపకమగు స్వరూపచైతన్యము, వ్యాప్యమగు మాయచే నావరింపబడుట యసంభవము. మాయనుగూడ భాసింపఁజేయు చైతన్యము మాయచే నావరింపబడ నేరదు. మరేమనిన, జీవులయొక్క వృత్తిజ్ఞానమే మాయచే నావరింపబడును.

మాయచే జీవావచ్ఛేదకమగు అంతఃకరణము ఆవరింపబడుచో జీవుల యొక్క వృత్తిజ్ఞానము ప్రతిబద్ధమగును. అనగా అంతఃకరణము యోగమాయచే గప్పబడియుండగా "అహంబ్రహ్మాస్మి" అను వృత్తిజ్ఞానము యుదయించదు.

జీవులయొక్క యంతఃకరణమునకే మాయాసంవరణము కాని వృత్తిజ్ఞానమునకు గాదు. వృత్తి యుదయించినగాని వృత్తజ్ఞాన మనిపించుకొనదు. ఉత్పన్నమయిన వృత్తిజ్ఞానమునకు మాయాసంవరణము సంభవించదు.

ఓయి! యీశ్వరునకు అంతఃకరణములేదు కదా! అందువలన వృత్తజ్ఞానమనునది యీశ్వరునకు అసంభవముగదా, అట్టితరి మాయ పరమేశ్వరునియొక్క జ్ఞానమును అడ్డగించదని జెప్పు టెట్లు పొసగును? నిషేధ మెప్పుడును ప్రసక్తిపూర్వముకదా. ఈశ్వరునకు వృత్తిజ్ఞాన ప్రసక్తియే లేనప్పుడు, అద్దానిని మాయ యడ్డగించదని జెప్పుట నిరర్ధకముకదా? కాదు వినుము. ఈశ్వరునకు అంతఃకరణ వృత్తజ్ఞానము లేకున్నను, మాయావృత్తజ్ఞానము కలదు. దానినిగూడ మాయ ఆవరింపజాలదు.

ఏలనన, ఈశ్వరావచ్ఛేద మయిన మాయను, మాయ యావరింపలేదు గాన, మాయావృత్తిజ్ఞానము ప్రతిబద్ధముగాదని భావము. ఎప్పుడును తనను తాను ఆవరించుకొనలేదు. తాను తన వృత్తినిగూడ నడ్డగించలేదు. ఇయ్యది లోకసిద్ధము.

కావున నీశ్వరోపాధి యావరింపబడినందున యీశ్వరునకు "అహం బ్రహ్మాస్మి" అను జ్ఞానము యెల్లప్పు డుండును. జీవోపాధియగు అంతఃకరణము అవృతమయినందున జీవున కట్టి జ్ఞాన మెప్పుడును లేదని తేలినది.

జీవేశ్వరు లిరువురయొక్క స్వరూపచైతన్యము ఆవరింపబడనిచో నదియేల ప్రకాశించదు? వినుము. జీవులకు అంతఃకరణమాయావృతమగుటయే నిందులకు గారణము. అట్లుండుము. మీరు చూపిన కారణము సమంజసముకాదు. అంతఃకరణము ఆవృతమగుచో, అంతఃకరణవృత్తిరూప జ్ఞానము ప్రకాశించకపోవుగాక. స్వరూపజ్ఞానము ప్రకాశింపకుండుటకు గారణమేమి? వినుము. కన్ను ఆవరింపబడినచో ఘటము ప్రకాశించుచున్నదా? అచట ఘటముగూడ అజ్ఞానావృతమని యనరాదు. కన్ను వ్రేలిచేతను, అంతఃకరణము అజ్ఞానముచేతను, ఆవరింపబడినంతమాత్రముననే, ఘటము ప్రకాశింపకుండుట సిద్ధించుచుండ, ఘటమును ఆవరించు

నట్టి మరియొక అజ్ఞానము నంగీకరించుట వ్యర్థమగును కావున అంతఃకరణము మాయావృతమయినందున నేస్వరూపచైతన్యము భాసించుటలేదు. ఇంతియకాని స్వరూపచైతన్యమునకు ఆవరణముండి కాదు.

ఓయి! ఇట్లు జీవుడు మాయావృతుడనియు, ఈశ్వరుడు మాయావృతుకు గాడనియు భేదమొప్పినచో నద్వైతమెట్లు సిద్ధించును? వినుము. వ్యవహారముండు నంతవరకు నుపాధిప్రయుక్తమయిన భేదమున్నను, పరమార్థముగా జీవేశ్వరులు చైతన్యైకరసరూపులగుటచే చైతన్యస్వరూపముతో నద్వైతము సిద్ధించును. ॥౨౫॥

శ్లో. వేదాఽహం సమతీతాని వర్తమానాని చార్జున,
భవిష్యాణి చ భూతాని మాంతు వేద న కశ్చన ॥౨౬॥

అ॥ ఓయి అర్జునా! నేను మాయావృతుడను కానందువలన గడచిన భూతములను, వర్తమాన భూతములను, రానున్న భూతములను యెఱుంగుదును. నన్నుమాత్ర మెవ్వ డెఱుంగడు.

మూలమునందలి “తు” కారము అహంశబ్దముతో నన్వయించవలయును. (అహంతు) అని. దీనివలన శ్రీకృష్ణునియందు జీవవైలక్షణ్యము దోచును. అప్పుడు ప్రత్యగభిన్న పరమాత్మయగు పరమేశ్వరుడు అహంశబ్దార్థ మగును.

అయితే మాయావచ్ఛిన్న చైతన్యమగు పరమేశ్వరుడున్ను, అంతఃకరణోపహిత చైతన్యమగు ప్రత్యగాత్మయు, అభిన్నమెట్లగుదురని యన రాదు.

మాయావచ్ఛిన్నుడగు నీశ్వరుడు, మాయోపహితమగు బ్రహ్మయు, నొక్కటేయని యెల్లరెఱింగిన విషయము. అచ్చట అవచ్ఛిన్నత్వ, ఉపహితత్వములకు భేదమున్నను, మాయకు భేదములేదు కాన, యీశ్వర బ్రహ్మలకు గూడ భేదములేదు.

ఇట్లే అంతఃకరణోపహితమగు ప్రత్యగాత్మకు, మాయోపహిత మగు బ్రహ్మకున్ను భేదములేదు. ఉపాధులు భిన్నమయినను, ఉపహితులకు భేదములేదు.

అట్లె మాయావచ్ఛిన్న చైతన్యమునకు, అంతఃకరణోపహిత చైతన్యమునకును భేదములేదు. ఏలయన ఉపాధులకు భేదమున్నను ఉపహితులకు భేదము లేదు.

మాయావచ్ఛిన్న చైతన్యమే మాయోపహిత చైతన్య మగును. మాయావచ్ఛిన్నము, మాయోపహితమును అగు చైతన్యమే యంతఃకరణోపహితముగూడ నగుచున్నది. కావున మాయావచ్ఛిన్న చైతన్యమగు పరమేశ్వరునకును, అంతఃకరణోపహిత చైతన్యమగు ప్రత్యగాత్మకున్ను భేదములేదు.

ఇట్లగుచో, అంతఃకరణోపహిత చైతన్యమే అంతఃకరణావచ్ఛిన్నముకాన, యంతఃకరణావచ్ఛిన్న చైతన్యమగు జీవుడు గూడ ప్రత్యగాత్మతోను, యీశ్వరుని తోను, బ్రహ్మతోను అభిన్నమగుగాక అనినచో, నందుకు మే మంగీకరింతుము.

అయితే జీవ, ప్రత్యగాత్మేశ్వర బ్రహ్మలకు నభేదమయినచో, "లోకము నన్ను దెలియలేదు. నేనుమాత్రము సర్వమును తెలిసికొందును." అని జీవేశ్వరులకు భేదనిర్దేశమును శ్రీకృష్ణు డేలఁజేసెను? వినుము. ఉపాధికృతమగు అజ్ఞత్వ, సంసారిత్వ ధర్మములచే జీవుడు తెలియలేదనియు, ఈశ్వరోపాధి ప్రయుక్తమయిన ప్రాజ్ఞత్వ అసంసారిత్వ ధర్మములచే నీశ్వరుడు సర్వమును తెలియుచున్నా డనియును జీవేశ్వరులకు భేదమును కృష్ణుడు నిర్దేశించెను.

ఓయి! ప్రత్యగాత్మకు, బ్రహ్మకును భేదములేకున్నను, ప్రత్యగాత్మకు ఈశ్వరునకు భేద మంగీకరింపక దప్పదు. ప్రత్యగాత్మ జీవునియొక్క స్వరూపము; బ్రహ్మ యీశ్వరునియొక్క స్వరూపము గనుక ప్రత్యగాత్మేశ్వరులకు స్వరూపభేదముండుటచే భేదమంగీకరింపవలెనని భావము.

ఇయ్యది సరిగాదు. ప్రత్యగాత్మ జీవునకువలె నీశ్వరునకు గూడ స్వరూపమగుచున్నాడు. బ్రహ్మయే యీశ్వరునియొక్క స్వరూపమని శంకింపరాదు. ప్రత్యగాత్మయే బ్రహ్మ. ప్రత్యక్చైతన్యమునకు, బ్రహ్మకును భేదములేదు. బ్రహ్మయే అంతఃకరణ ప్రదేశమునందు తెలియబడుచుండుటవలన, ప్రత్యగాత్మయని వ్యవహరింపబడుచున్నాడు. కావున పరమేశ్వరు (బ్రహ్మ) డన ప్రత్యగభిన్నుడేగాని, వేరుగాదు.

ఈశ్వరుడు సకలభూతములను స్వరూపచైతన్యముతోఁగాని, మాయావృత్తిచేగాని తెలిసికొనును. సృష్టికి ప్రాక్కాలమున ఈశ్వరుడు మాయావృత్తిరూపముతో నుండునని ప్రమాణములు కలవు. అవిద్వాంసులకు నీశ్వరుడు ఆత్మరూపుడను జ్ఞానము లేమింజేసి వారు యీశ్వరుని తెలియజాలరు.

అంతమాత్రమున లోకములో నెల్లప్రాణులు యీశ్వరుని తెలియజాలరని యనదగదు. అందరు తెలియలేకున్నచో నీశ్వరతత్త్వము నుపదేశించెడి శాస్త్రము వ్యర్థమగును. తమతమ శిష్యులకు ఈశ్వరతత్త్వము నుపదేశించెడి ఆచార్య, శంకర భగవత్పాద వ్యాసాదులు యీశ్వరతత్త్వమును తెలియనివారని యనలేము. కావున నీశ్వరభక్తులగు మహానుభావులు యీశ్వరతత్త్వమును తెలిసికొందురు. మిగిలిన యవిద్వాంసులు మాత్రము తెలియలేరు.

విద్వాంసులు యీశ్వరు డాత్మయే యను జ్ఞానము కలవారై యుందురు. అవిద్వాంసులు అనాత్మయగు నంతఃకరణాదులయం దాత్మబుద్ధి కలవారై

యుందురు. కావున వీరికి నంతఃకరణాదులే యాత్మరూపముతో భాసిల్లును. విద్వాంసులకు అంతఃకరణాదులయం దాత్మబుద్ధి యుండదు. ఆత్మయందే యాత్మబుద్ధి యుండును. కనుక ఆత్మస్వరూపుడగు నీశ్వరుని విద్వాంసులు తెలిసికొందురు.

కావున అన్ని భూతములను నేనే తెలిసికొందును. నన్నుగూడ నేనే దెలిసికొందును. ఏ విద్వాంసుడు నన్ను తెలిసికొనుచున్నాడో ఆ విద్వాంసుని యాత్మ నేనే కావున, నన్ను నేను తెలిసికొనునట్లే యగునని ఫలితార్థము.

"చక్షుషశ్చక్షుః శ్రోత్రస్యశ్రోత్రం" యన్మనసానమనుతే" "యేనాహుర్మనోమతం" "విజ్ఞాతారమరేకేన విజానీయాత్" ఇత్యాదిశ్రుతులవలన జ్ఞాతయగు, ఆత్మ దృశ్యముగా దని తెలియబడుచున్నది. ఆత్మ దృశ్యమగుచో ఘటాదులవలె జడము, మిథ్యయు నగును. దృగ్రూపమగు ఆత్మచే కార్యకరణ సంఘాతరూపమగు సకల ప్రపంచము భాసింపబడుచుండుటవలననే సర్వము దృశ్యమగుచున్నది. ఇందుకు "తస్యభాసాసర్వ మిదం విభాతి" అను శ్రుతి ప్రమాణ మగుచున్నది. ప్రపంచమును ప్రకాశింపజేయు సూర్యచంద్రాగ్న్యాదులనుగూడ ఆత్మ ప్రకాశింపజేయుటవలనను, ఆత్మతేజస్సు ఇతర తేజస్సులచే ప్రకాశింపబడకుండుట వలనను, ఆత్మ స్వయంప్రకాశమనియు, ప్రత్యగ్రూపమనియును చెప్పబడుచున్నాడు. దీపాదులు సర్వపదార్థములను, తనను తనకొరకు ప్రకాశింపజేయవు. ఇతరుల కొరకు ప్రకాశింపజేయును. ఆత్మమాత్రము సకల ప్రపంచమును, తనను తనకొరకే ప్రకాశింపచేయును. కాన దీపాది ప్రాతిలోమ్య మాత్మ యందుడుటచే, ఆత్మ ప్రత్యగాత్మ యనబడును.

కావున ప్రకృత శ్లోకమునందు, అనన్య భాస్యత్వముతో గూడిన సర్వావభాసకత్వమను స్వయంప్రకాశత్వము ఆత్మకు నిరూపింపబడిన దని గ్రహింపవలెను. "మాంతు వేద నకశ్చన" అనుదానిచే అనన్యభాస్యత్వమున్ను "అహంతు సర్వం వేద" అను దానిచే సర్వావభాసకత్వమున్ను నిరూపింపబడినదని భావము.

ఓయి! "దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా" అను శ్రుతిచే ఆత్మయందు బుద్ధివేద్యత్వము తెలియబడుచుండ ఆత్మ స్వయంప్రకాశ మెట్లగును? బుద్ధివేద్యమగు ఆత్మకు, అనన్య భాస్యత్వము సంభవింపదు గదా? అట్లుగాదు. విచారాత్మకమగు బుద్ధిచే ఆత్మతత్వమిట్టిదను జ్ఞానముమాత్ర ముదయించును. ఇంతియే కాని యాత్మ సాక్షాత్కారము కలుగదు. అట్లు కలుగుచో, "విజ్ఞాతారమరేకేన విజానీయాత్" అను శ్రుతి యుపపన్నము కానేరదు.

లేక జాగ్రత్స్వప్నములయందువలె, నిక్షేపము లేనట్టియు సుషుప్తియందువలె లయము లేనట్టియు, నేకాగ్రమగు బుద్ధియందు స్వయంప్రకాశమగు ఆత్మ స్ఫురిం

చును కాన, యౌపచారికముగ బుద్ధివేద్యత్వము ఆత్మకు జెప్పబడుచున్నదని గ్రహింప వలయును.

ఇట్లు జెప్పబడిన అనన్యావభాస్యత్వ విశిష్ట సర్వావభాసకత్వరూపమగు ఆత్మలక్షణము ద్వైతాదిమతములయందు కుదరదు. వారి మతమున జీవేశ్వరులు భిన్నులగుటచే నొకరిచే మరియొకరు తెలియబడుచుండెదరు. గాన అనన్యావభాస్యత్వము (ఎవరిచేతను తెలియదగకుండుట) సంభవింపదు.

ఓయి! జీవుడు ఈశ్వరునిచే ప్రకాశింపజేయదగినందున, జీవునియందు ప్రకృత లక్షణము కుదరకున్నను, యీశ్వరుడు జీవావభాస్యుడుగాడు కాన, యీశ్వరుని యందు ప్రకృతలక్షణము సమన్వయించుగాక యనినచో నదియును పొసగదు. "తమేవవిత్వా అతిమృత్యుమేతి", "యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః" అను శ్రుతిస్మృతులవలన, నీశ్వరుడుగూడ, జీవునిచే దెలియదగినవాడని స్పష్టమగుచున్నందున నీశ్వరునియందుగూడ ప్రకృతలక్షణము అన్వయించదు. మరియు ముక్తియందు జీవులకు ఆత్మసాక్షాత్కారము అంగీకరింపబడుచున్నది. కనుక ద్వైతాదిమతములయందు స్వయంప్రకాశలక్షణము కుదరదు.

అద్వైతమతమున ఆత్మయొక్కడే జ్ఞాత జ్ఞేయము నగుచున్నందున, లక్షణము కుదురును. ఇతరముచే ప్రకాశింపజేయదగువాడు తాను స్వయముగ ప్రకాశించువాడు కానేరడు. ఇతరమునకు తాను ప్రతియోగి (విరోధి) లోకములో నెవ్వడు తనను యితరునిగాగాని, యితరుని తననుగాని తలంచడు. తనచే తాను ప్రకాశ్యుడగుచో ప్రకాశకు తానేకర్త, తానే కర్మయగును గాన కర్మకర్తృత్వ విరోధము గదా యని అనరాదు. మాయచే నెట్టి విరోధమయిన నుపపన్నమగును.

ఓయి! ఈ శ్లోకమున సర్వజ్ఞుడును, యీశ్వరుడును అగు శ్రీకృష్ణపరమాత్మ, "అహమ్" (నేను), "మామ్" (నన్ను) అని చెప్పుకొనుటచే నీ శ్లోకము యీశ్వరపరము కాని ప్రత్యగాత్మపరముగాదు. కనుకనే అతీతానాగత వర్తమాన సర్వభూతజ్ఞాన రూపమగు సర్వజ్ఞత్వము ప్రసన్నమగుచున్నది. లేనిచో నయ్యది యుపన్నముగాదు. అనినచో అవును, నిజమే, కాదని యెవ్వరనిరి? మీరింతవరకు నీ శ్లోకమును ప్రత్యగాత్మపరముగ వ్యాఖ్యానించిరికదా? అవును ప్రత్యగాత్మయనగా, నీశ్వరుడే,అంతఃకరణావచ్ఛిన్నుడు ప్రత్యగాత్మయనియు మాయావచ్ఛిన్నుడగు పరమాత్మ యీశ్వరుడనియు మీ యభిప్రాయమైనచో శ్రీకృష్ణుడుగూడ నానా శరీరములయందలి అంతఃకరణములతో గూడినవాడే యయినందున, ప్రత్యగాత్మయే యగును. కృష్ణశరీరమున నంతఃకరణము లేదనగలరా? అంతఃకరణావచ్ఛిన్నమగు చైతన్యము ప్రత్యగాత్మ గాదనగలరా? ఈ రెండును యసంభవము.

అయితే ప్రత్యగాత్మయన జీవుడని లోకప్రసిద్ధి యుండగా, ప్రత్యగాత్మ యగు శ్రీకృష్ణు డీశ్వరు డెట్లగును? ఇక కృష్ణ శరీరమునందలి యంతఃకరణము, సాక్షా న్మాయాపరిణామగుట వలన మాయయే కావున మాయావచ్ఛిన్న చైతన్యమీశ్వరు డగునన్నచో మహత్తత్త్వరూపమగు మన యంతఃకరణముగూడ సాక్షాన్మాయా పరిణామముగుటచే మాయయే కావలసివచ్చును. తదవచ్ఛిన్న చైతన్యులమగు మనము గూడ నీశ్వరులమే యగుదుము.

ఇక శుద్ధసత్త్వమగుటచే కృష్ణాంతఃకరణము మాయయన్నచో యోగుల చిత్తముగూడ శుద్ధసత్త్వమయమగుటచే మాయ యగును.

ఇక కృష్ణునకు సర్వభూత సాక్షాత్కారరూపమగు సర్వజ్ఞత్వముండుటచే నీశ్వరత్వముగల దన్నచో జీవులయిన వసిష్ఠాదియోగులకుగూడ సర్వజ్ఞత్వ ముండు టచే నీశ్వరత్వ మంగీకరింపవలయును.

ఇక, యోగాదిశక్తులవలన కలుగని సహజమయిన సర్వజ్ఞత్వము కృష్ణున కుండుటచే కృష్ణుడు యీశ్వరుడన్నచో అప్పుడును కృష్ణశరీరములోనున్న అంతః కరణావచ్ఛిన ప్రత్యగాత్మయే సర్వజ్ఞుడగుటచే నీశ్వరుడగును. స్వతస్సిద్ధముగా జడమయిన అంతఃకరణము ఆత్మావభాసవలననే జ్ఞాత యగుచున్నది. (జ్ఞాతృత్వము గలదగుచున్నది) కాని స్వతంత్రముగా జ్ఞాత గానేరదు.

ఓయి! ఇట్లు శ్రీకృష్ణుడుగూడ మనబోటి వారలవలె ప్రత్యగాత్మయగుచో సర్వజ్ఞుడే యగును. ప్రత్యగాత్మలమగు మనలకు సర్వజ్ఞత్వము లేదు. ప్రత్యగాత్మలకు అనుభవసిద్ధముగానున్న అసర్వజ్ఞత్వమును శాస్త్రశతముగూడ నివారింపలేదు. కావున సర్వజ్ఞుడగు శ్రీకృష్ణుడు పరమాత్మయేకాని ప్రత్యగాత్మ గాడన్నచో నట్లు కాదు.

వినుము. ప్రత్యగాత్మలకు కించిత్ జ్ఞత్వము స్వాభావికము గాదు. స్వాభా వికమగుచో నయ్యది యెల్లప్పుడు యేకరూపముగానే యుండును. అట్లు గనిపించుట లేదు. బాలుడు చిన్నతనమున అకారాది అక్షరపరిజ్ఞానముగూడ లేక నుండును. వాడే యౌవనమునందు వేదవేదాంగముల దెలిసిన వాడగును. మరల వాడే, వార్ధక్యమున నంతయు మరచును.

మరియు, జీవులకు కించిత్ జ్ఞత్వము సహజమగుచో, నయ్యది సుషుప్తి యందుగూడ గనిపించవలయును. అట్లు కనిపించుటలేదు– కావున కించిత్ జ్ఞత్వము అంతఃకరణధర్మమేకాని జీవులకు సహజముగాదు. అంతఃకరణము సంకోచవికా సాదికమును పొందును. సుషుప్తియందు అంతఃకరణము లీనమయినందున, కించిద్ జ్ఞత్వము కనిపించుటలేదు. ఇట్లు అంతఃకరణ మున్నపుడు, కించిద్ జ్ఞత్వముండుట,

అంతఃకరణము లేనపుడు కించిద్‌జ్ఞత్వములేకుండుట, యను నన్వయ వ్యతిరేకముల వలన కించిద్‌జ్ఞత్వము అంతఃకరణధర్మ మని తేలినది. ఇట్లే సర్వజ్ఞత్వముగూడ నంతఃకరణధర్మమే యగును. యోగాభ్యాసాదులచే వికసించిన యోగియంతఃకరణమునకు సర్వజ్ఞత్వము సంభవించుచున్నది. అందును విశిష్టులగు విశ్వామిత్రాదుల యంతఃకరణమునకు సర్వజ్ఞత్వత, సర్వకర్తృత్వములు పురాణప్రసిద్ధములై గన్పట్టుచున్నవి.

స్వతస్సిద్ధముగా, జడమయిన అంతఃకరణమునకు కించిత్‌జ్ఞత్వ, సర్వజ్ఞత్వ ధర్మములు చిత్ప్రతిబింబసంబంధమువలననే యేర్పడుచున్నవి. కనుకనే ఆ ధర్మములను చైతన్యమునందు ఆరోపించి ఆత్మ సర్వజ్ఞుడనియు, కించిద్‌జ్ఞుడనియు వ్యవహరింపబడుచున్నాడు.

నిజస్థితిని విచారించినచో, అంతఃకరణాది సర్వప్రపంచమును ప్రకాశింపజేయుటచే, ఆత్మకే సర్వజ్ఞత్వము సిద్ధించును. సర్వజ్ఞముగాని, కించిద్‌జ్ఞముగాని, యగు నంతఃకరణమునకును, సర్వప్రపంచమునకును, సాక్షికదా ఆత్మ. కావున, సర్వజ్ఞమయిన అంతఃకరణమునకు సాక్షియగుటచే, సర్వజ్ఞత్వమున్ను కించిద్‌జ్ఞమగు అంతఃకరణమునకు సాక్షియగుటచే, కించిద్‌జ్ఞత్వమున్ను ప్రత్యగాత్మయం దుపచరించబడుచున్నది.

ఇట్లైనచో వెనుకజెప్పిన స్వయంప్రకాశాత్మ లక్షణము, సర్వజ్ఞత్వ విశిష్టమయిన అంతఃకరణమునందలి వ్యాప్తముకదా అని యనరాదు, అంతఃకరణము సాక్షిభాస్యమగుటచే అనన్యభాస్యత్వ మద్దానికి సంభవింపదు. మరియు, సర్వావభాసకత్వముగూడ, స్వతస్సర్వావభాసకత్వమని వివక్ష చేయబడుచున్నది. అంతఃకరణము చిత్ప్రతిబింబ సామర్థ్యమువలననే, భాసకమగునుకాని, స్వయముగ భాసకము (ప్రకాశింపజేయునది) కానేరదు. కావున నంతఃకరణమునందు అన్యావభాసకత్వ విశిష్టసర్వావభాసకత్వమను లక్షణము అతివ్యాప్తముగాదు.

దీనివలన సర్వజ్ఞాన్తఃకరణతో ఆత్మకు తాదాత్మ్యాధ్యాసజేసి పరమాత్మ సర్వజ్ఞుడనియు కించిత్‌జ్ఞాన్తఃకరణతో ఆత్మను తాదాత్మ్యాధ్యాసజేసి ప్రత్యగాత్మ కించిత్‌జ్ఞుడనియును, అవివేకులు వ్యవహరించుచున్నారనియు వివేకులుమాత్రము ఆత్మాన్తఃకరణలకు తాదాత్మ్యాధ్యాసను నిరసించి, అంతఃకరణాది సర్వసాక్షియగుటచే, సర్వావభాసకుడగు ప్రత్యగాత్మను, సర్వజ్ఞేశ్వరుడని చెప్పుచున్నారనియును తేలినది.

ఓయి! శ్రీకృష్ణుడు స్వాభావిక, నిరవధిక, నిరతిశయ, అసంఖ్యేయ యోగమహిమగల యంతఃకరణముగలవా డగుటచే సర్వజ్ఞుడనియు, అర్జునాదుల కట్టి

యంతఃకరణము లేనందున అర్జునునియందు సిద్ధించినది. ఇట్టి వ్యావహారిక భేదమును బట్టియే శ్రీకృష్ణుడు నేనందఱి నెఱుంగుదును. నన్నెవ్వరెఱుంగరు. అని జెప్పెను. ఇంతియేకాని తత్త్వదృష్టితోఁ జెప్పలేదు. తత్త్వదృష్టిలో సర్వభూతజ్ఞానరూప మున్ను అంతఃకరణధర్మమును అగు సర్వజ్ఞత్వము శ్రీకృష్ణునియందు సంభవింపదు అనినచో నట్లుకాదు.

తత్త్వమును చెప్పుసమయమున శాస్త్రదృష్టినే యాశ్రయింపవలెగాని, లోక దృష్టి నాశ్రయింపగూడదు. యోగవిభూతిగల యంతఃకరణాదులతో గూడిన సాకారేశ్వరులగు రామకృష్ణాదులు అందఱిచే దెలియబడుచుండ, నన్నెవ్వ రెఱుగరని శ్రీకృష్ణుడు చెప్పుట యుచితముగాదు.

పరిచ్ఛిన్నుడగు ప్రత్యగాత్మకు సర్వభూత సాక్షాత్కారము సంభవింప దన రాదు. ప్రత్యగాత్మ పరిచ్ఛిన్నుడగుచో, ఘటాదులవలె ననిత్యమగును. అప్పుడు "నిత్యస్సర్వగతస్థాణు రచలోఽయం సనాతనః" అను కృష్ణవచనమునకు విరోధము వాటిల్లును. కావున, ప్రత్యగాత్మ పరిపూర్ణుడే యగును. వాడు సర్వగతుడగుటచే సర్వము నెఱుంగును. ప్రత్యగాత్మకంటె భిన్నమగు పదార్థమంతయు జడమగుటచే ప్రత్యగాత్మను దెలియలేదు. చిదాభాసయుక్తమగు అంతఃకరణముగూడ ప్రత్యగాత్మను భాసింపఁజేయలేదు. సూర్యాదుల ప్రతిబింబము సూర్యాదులను ప్రకాశింపజేయలేదు. ఈ యంతఃకరణమునందలి వేత్తృత్వము (తెలివి) అంతఃకరణము నందున్న చిదాభాసునిదే కాని జడమయిన అంతఃకరణము నదికాదు. కావున నయ్యది చిద్ధర్మమేకాని జడమయిన అంతఃకరణముయొక్క ధర్మముకాదు.

అంతఃకరణమునకు స్వతస్సిద్ధముగా కించిద్‌జ్ఞత్వముగాని, సర్వజ్ఞత్వముగాని లేనందున సర్వద్రష్టృత్వరూపమగు సర్వజ్ఞత్వము ఆత్మకే కలదని సిద్ధమయినది.

ఈ యాత్మకంటె వేఱుద్రష్ట లేడని చెప్పు "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" అను శ్రుతిగూడ నీయర్థమునే దృఢపరచుచున్నది. ఈ శ్రుతియందలి "అతః" అనుపదమునకు జీవు డర్థమయినచో జీవునికంటె వేఱగు నీశ్వరుడు ద్రష్టలేడని యర్థమగును. అప్పుడు యీశ్వరున కపలాపము తటస్థించును. ఈశ్వరుడర్థమగుచో నీశ్వరునికంటె వేఱగుజీవుడు ద్రష్టలేడని యర్థమగును. అప్పుడు జీవున కపలాపము తటస్థించును.

లేక జీవుడు దృశ్యమగుటచే జడత్వము, అనిత్యత్వము జీవునకు సంభవించును. కాన ద్వైతమతమున శ్రుతి యుపపన్నము కానేరదు. ఇట్లు శ్రుతివిరుద్ధములగుటవలననే తార్కికాది ద్వైతమతము లప్రమాణములగుచున్నవి. కావున ప్రత్యగభిన్న పరమాత్మ యొక్కడే సర్వద్రష్టి తద్భిన్నమగు అంతఃకరణాది సర్వప్రపంచము దృశ్యము అని తేలినది.

ప్రత్యగాత్మలనగా భూతములనియు, అహంకారము పరమాత్మ యనియు ననరాదు. దేహేంద్రియాది సముదాయమునం దభిమానముగల సాభాసబుద్ధులగు జీవులే భూతములని సిద్ధాంతము. "భవంతీతి భూతాని" అని వ్యుత్పత్తి. ప్రత్యగాత్మ కంటె వేరగు ప్రపంచమంతయు కార్యమగుటచే భూతశబ్దవాచ్యమగును. ప్రత్యగాత్మ "అజోనిత్యశ్శాశ్వతః" అను మంత్రమువలన, కార్యభూతుడుగాడు. అట్టి ప్రత్యగాత్మయే అహంకారము ప్రత్యగాత్మకంటె వేరు పరమాత్మలేడు. అట్టి పరమాత్మయొక్కడే శ్రుతిద్రష్ట యొక్కడే యని చెప్పుచు, పరమాత్మకంటె వేరు ద్రష్టలేడని నిషేధించుచున్నది. ఇట్టి ప్రత్యగాత్మయె సర్వజ్ఞుడు, క్షేత్రజ్ఞుడును. మిగిలిన దంతయు క్షేత్రము. చిదాభాసగూడ చిత్కార్యమగుట వలనను మిథ్యయగుట వలనను బుద్ధ్యాదులవలె క్షేత్రమే యగుచున్నది.

చిద్రూపమగుటచే, ఆభాసుడు సత్యమనియు వానికి చిద్భేదముమాత్రము కల్పితమనియు గొందరందురు. వారి మతమున ఆభాసుడుగూడ ప్రత్యగాత్మయే కాన, చిదాభాసు డుక్షేత్రముగాదు. బుద్ధ్యాదులే క్షేత్రమగును.

ఇట్టితఱి చిత్, చిదాభాసు లుభయులు ప్రత్యగాత్మ లెట్లగుదురని యనరాదు. చిత్, చిదాభాసము అను భేదము కల్పితముగాని వాస్తవముగాదు. ఒకేచైతన్యము ఉపాధివశమున బింబప్రతిబింబ భావము నొంది చిత్, చిదాభాసరూపముగ గన్పించుచున్నది. ఒకే ముఖము, దర్పణ మను ఉపాధివశమున బింబప్రతిబింబ భావముగ గనిపించినట్లు. కావున బింబప్రతిబింబభావము ఔపాధికమగుటచే మిథ్యయగును కాని వాస్తవము కానేరదు.

ప్రకృతమున నొకే యజ్ఞానమునందు చైతన్యము ప్రతిఫలించుచున్నది. అందు బింబభూతమయిన చిత్ ఈశ్వరుడు; ప్రతిబింబభూతమయిన చిత్ జీవుడు. కావున బింబప్రతిబింబ భావముచే జీవేశ్వరులకు భేదము గల్పితమందురు. అట్లే యంతఃకరణమున చైతన్యము ప్రతిఫలించగా అందలి బింబభూతమగు చైతన్యము కూటస్థుడనియు ప్రత్యగాత్మయనియు, ప్రతిబింబభూతమగు చైతన్యము జీవుడనియును కొందరందురు.

ఇట్టి బింబభూతమగు ప్రత్యగాత్మనే శ్రీకృష్ణుడు యీశ్వరుడని చెప్పబోవుచున్నాడు. "ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి" అని. ఈశ్వరుడు ప్రత్యగ్రూపముతో సర్వభూతముల హృదయమునం దున్నాడని దీని యర్థము.

ఏది యెట్లయినను, బింబచైతన్యము యీశ్వరుడనియు, ప్రతిబింబచైతన్యము జీవుడనియు సిద్ధాంతము.

కనుకనే శ్రీ శంకరులు:-

శ్లో. త్వత్ప్రభుజీవప్రియ మిచ్ఛసిచే న్నరహరిపూజాం కురు సతతం,
ప్రతిబింబాలంకృతి విధికుశలా బింబాలంకృతి మాదధతే
భవమరుభూమౌ విరసయాం త్వం చేతో భృంగ భ్రమసి వృథా
భజభజ శ్రీలక్ష్మీనరసింహానఘ పదసరసిజ మకరందమ్॥ అని చెప్పిరి.

నీటియందలి సూర్య ప్రతిబింబము నీరు కదలుటచే గదలినట్లువలె ప్రతిబింబ రూపుడగు జీవుడు ఉపాధిభూతబుద్ధి ధర్మములగు కర్తృత్వాదులను తనయం దారోపించుకొని సంచరించువాడువలె నుండును. బింబమునకు నుపాధితో సంబంధము లేదు. ఉపాధిసంయోగము బింబమున కుండుచో ప్రతిబింబమే పుట్టును. కావున బింబమున కుపాధిధర్మసంబంధము లేదు. కనుక ప్రత్యగాత్మయగు నీశ్వరుడు నిర్వికారుడు ప్రతిబింబముగూడ వస్తుతః బింబాభిన్నుడే కాన నిర్వికారుడేయగును. కాని ఉపాధితాదాత్మ్యాధ్యాసవలన మాత్రము వికారివలె దోచుచుండును. కాన యిట్లు జీవునకు సంసారిత్వము, యీశ్వరాభేదమున్ను సిద్ధమయినది.

ఈ ప్రతిబింబము బుద్ధితాదాత్మ్యాధ్యాసవలన క్షేత్రమనియు, బింబతాదాత్మ్యమువలన క్షేత్రజ్ఞుడనియు జెప్పబడును. కాన ప్రతిబింబము భూత మనియు ప్రత్యగాత్మయు వివక్షాభేదముచే నిర్దేశింపబడుచున్నది.

కావున నెవడు తనను చిద్రూపునిగా దెలిసికొనునో వాడు జ్ఞాని, ప్రత్యగాత్మయు నగుచున్నాడు. ఎవడు తనను కర్తృత్వ భోక్తృత్వములు గలవానినిగా దెలిసికొనునో, వాడు అజ్ఞానియు జీవుడును అగును. ఇట్టి జీవేశ్వరవిభాగము నాశ్రయించియే ఈ శ్లోకము ప్రవర్తించినది. బింబభూతుడను ఈశ్వరుడును ప్రత్యగాత్మయునగు నేను, సర్వభూతములను యెరుగుదును. ఏ ప్రతిబింబుడు బింబప్రతిబింబముల కభేదమను తత్త్వమును తెలిసికొనునో, వాడును ప్రత్యగాత్మయే కావున సర్వమును తెలిసికొనును, నన్నును తెలిసికొనును. ఉపాధితాదాత్మ్యాపన్నుడగు ప్రతిబింబుడు మాత్రము సర్వభూతములను తెలిసికొనును. నన్నుమాత్రము తెలియ నేరడు.

ప్రత్యగాత్మను తెలిసికొనలేని ప్రతిబింబుడు జీవుడు కించిద్జ్ఞుడు. తెలిసికొను జీవుడు సర్వజ్ఞుడు కాన బింబమునకువలె ప్రతిబింబమునకుగూడ సర్వజ్ఞత్వము సిద్ధమగుచున్నది. బింబము ఏకమయినను అంతఃకరణభేదముచే ప్రతిబింబు లనేకులు. కనుకనే యీశ్వరుడొక్కడనియు, జీవు లనేకులనియు వ్యవహారము పొసగుచున్నది.

వస్తుతః బింబప్రతిబింబములకు భేదములేనందున, జీవేశ్వరులకు గూడ భేదము లేదు. కృష్ణుడుగూడ వసిష్ఠాదులవలెయు మనవలెయు ప్రతిబింబుడే యగును. కాని వసిష్ఠాదులవలె బింబతాదాత్మ్యాపన్నుడుగాని, మనవలె బుద్ధితాదాత్మ్యాప

న్నాడు గాడు. కనుకనే శ్రీకృష్ణుడు తనయందు బింబచైతన్యాభేదమును సిద్ధపరచు కొని సర్వేశ్వరుడు, సర్వజ్ఞుడు అగు ప్రత్యగాత్మను, నేను అని వ్యవహరించెను. ఇట్లే వాసుదేవుడుగూడ 'నేను మనువును, నేను సూర్యుడను అని జెప్పెను. ప్రహ్లాదుడున్ను నావలననే సర్వ ముత్పన్నమయినది, నేనే సర్వము యంతయు నగు చున్నాను, నాయందె సర్వము లీనమగుచున్నది' అని యనెను.

శుద్ధచైతన్యమయిన బ్రహ్మమే బింబభూతుడు. వానికి చెప్పుట, వినుట మున్నగు వ్యవహారము లేదు. శరీరాదులు లేవు. కాని చైతన్యరూపు డగుటచే సర్వము నెఱుంగునని యనదగును. "న తస్య కార్యం కరణం చ విద్యతే" "యస్సర్వజ్ఞ స్స సర్వవిత్" అను శ్రుతి యిందులకు ప్రమాణ మగుచున్నది. కావున ప్రత్య గాత్మకు సర్వజ్ఞత్వము స్వయంప్రకాశత్వము సిద్ధమయినది.

దీనివలన అంతఃకరణాదులయం దభిమానముగల ప్రతిబింబుడు జీవుడు, పర తంత్రుడు, సంసారియనియు; బింబము సర్వజ్ఞేశ్వరుడనియును, జీవేశ్వరభేదము ఔపా ధికుడనియు, నిట్టిభేదము నాశ్రయించియే సర్వవ్యవహారము నడచుచున్నదనియు వస్తుతః జీవేశ్వరులకు భేదములేదనియును సుస్పష్టమయినది.

ముఖము దర్పణవశమున ప్రతిబింబముఖముగ కనిపించినట్లు చైతన్యమే ఉపాధివశమున జీవుడుగా దోచును. వస్తుతః ప్రతిబింబముఖము లేదు. అట్లే జీవుడు లేడు. కాన బ్రహ్మయే మాయచే జీవభావమునొంది సంచరించుచున్నాడు. విద్యచే ముక్తు డగుచున్నాడు. రూపరహితములయిన మాయాద్యుపాధులయందు నీరూపు డగు బ్రహ్మకు ప్రతిబింబమనునది సంభవించదు. ఇట్లు పరమార్థదృష్టిలో జీవుడే బ్రహ్మకాన జీవుడే ప్రత్యగాత్మ, సర్వజ్ఞుడు నగును. ఆత్మభిన్నమంతయు జడము, దృశ్యమున్ను అగుచున్నది. కనుకనే 'నేను సర్వము నెఱుంగుదును. నన్నెవ్వ రెఱుం గరు' అని శ్రీకృష్ణుడు చెప్పెను.

ఎవడు ప్రత్యగాత్మను తెలిసికొనలేడో వాడు బ్రహ్మస్వరూపుడయినను కించిద్జ్ఞుడే; వాడే ఉపాధిభేదమున భిన్నుడగుచున్నాడు. వానినే భూతశబ్దమువలన గ్రహించుచున్నారు. ఇట్టిజీవుడే దేహేంద్రియ సంఘాతమునందు అభిమానమునొందు చున్నాడు.

ప్రత్యగాత్మను తెలిసికొనిన జీవుడున్ను బ్రహ్మయే. వాడు పూర్ణుడు కాన యద్వితీయుడు. కావున తత్త్వవేత్తల దృష్టిలో సర్వజ్ఞుడు, యీశ్వరుడు అగు ఆత్మ యొక్కడే. అతత్త్వవేత్త దృష్టిలో యీశ్వరునికంటె భిన్నులగు జీవు లనేకులు. ఈ మతప్రకార మీ శ్లోకము తత్త్వవేత్తలకు ఆత్మ సర్వజ్ఞుడనియు మిగిలిన ప్రాణు లందరు అనాత్మలు, జడము లనియును వాక్యార్థమును కలుగజేయును. అతత్త్వ

వేత్తలకు సర్వజ్ఞుడు యీశ్వరుడనియు, జీవులు కించిద్జ్ఞులనియు, నీశ్వరుని తెలియ నేర రనియును వాక్యార్థమును కలిగించును.

ఇచట రామానుజులు: "కృష్ణుడనయిన నన్ను యీశ్వరావతారముగా నొక్కడయినను తెలియుటలేదు" అని వ్యాఖ్యానమొనర్చిరి. అది యుక్తముగాదు. మూలమునందులేని "ఈశ్వరమవతీర్ణం" అను పదమును కల్పించుట అప్రమాణ మగును. నన్ను కృష్ణునిగా తెలిసికొనరని వర్ణించుటగూడ యుక్తముగాదు. ఆకాల మునం దున్న వారలందరు కృష్ణుని తెలిసికొనుచునే యున్నారు. కాన రామానుజ వ్యాఖ్యాన మంత స్వరసముగాదు. ॥౨౬॥

శ్లో. ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేన భారత !
సర్వభూతాని సంమోహం సర్గే యాంతి పరంతప ॥౨౭॥

అ॥ పూర్వశ్లోకమునందలి భాష్యమున శ్రీశంకరులు భగవద్భక్తుడొక్కడే భగవంతుని తెలిసికొనునుగాని మరి యితరులు తెలియనేరరని చెప్పిరి. అందుకు యోగమాయయే ప్రతిబంధమనిగూడఁ జెప్పిరి. ఇపుడు ప్రతిబంధాంతరమును వివరింప దలచి యీశ్లోకము ప్రవర్తించుచున్నది.

దేహేంద్రియాదిసంఘాతాభిమానులగు జీవులను అంతర్యామి స్నేహితుడు దేహేంద్రియాదుల ప్రవర్తింపఁజేయును. అయినను వాని సఖ్యమును జీవుడు తెలిసి కొనసేరడు. కాని జీవుడు కేవలము జడుడుగాడు. దేహేంద్రియాదికమును తెలిసి కొనుచునేయున్నాడు. అయినను ఉపకారిని గుర్తించు స్వభావము జీవునకు లేదని యర్థాత్సిద్ధమగుచున్నది. ఇందుకు రాగద్వేషముల వలన బుట్టిన మోహమే (అవి వేకమే) కారణము. రాగద్వేష వశీకృతమయిన చిత్తముగలవానికి బాహ్యపదార్థ జ్ఞానమే కలుగదు. (ఉదా) సుందరమయిన స్త్రీయందు ద్వేషముకలుగగా ఆ స్త్రీ యందలి సౌందర్యజ్ఞానమే వాని కుదయించదు. ఇట్టి స్థితిలో రాగద్వేషపూరితుడు ప్రత్యగాత్మ నెట్లు తెలిసికొనును?

కావున నోయి, అర్జునా! సకలభూతములు రాగద్వేషప్రయుక్తమయిన మోహముచే సంమోహమును పొందుచున్నారు. అందువలన వారు ఇష్టప్రాప్తి అనిష్టపరిహారములకొరకు ప్రయత్నించుచున్నను దేహేంద్రియాభిమానముచే ఆత్మను కర్తనుగాను భోక్తనుగాను దలంచు ఆత్మను యీశ్వరునిగా తెలిసికొనలేరు. కావున రాగద్వేషములు సకల పురుషార్థములకు ప్రతిబంధములని తలంచి వాటికి స్వాధీనముగాకుండుట సాధకున కుత్తమమార్గమని సూచితమగుచున్నది. ॥౨౭॥

శ్లో. యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణాం,
తే ద్వంద్వమోహనిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః ॥ ౨౮ ॥

అ॥ జన్మాంతరమునందుగాని, యీజన్మమునందుగాని యాచరించిన యజ్ఞాది రూపమగు నిష్కామకర్మవలనగాని యోగాదులవలనగాని చిత్తశుద్ధికలుగగా రాగాదిదోషములు తొలగిపోవును. అంతట మోహము దొలగును. మోహము పోగా ఆత్మానాత్మవివేకము కలుగును. పిమ్మట ఆత్మసాక్షాత్కారము నొంది యాత్మారాముడై విహరించును. ౨౮

శ్లో. జరామరణ మోక్షాయ మామాశ్రిత్య యతంతి యే
తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమధ్యాత్మం కర్మచాఖిలమ్ ॥ ౨౯ ॥

అ॥ ఇచట జరామరణశబ్దములు జన్మాది షడ్భావవికారముల కుపలక్షణములు. ఈ వికారములను పోగొట్టుకొనుటకు పరమేశ్వరుడగు ప్రత్యగాత్మయందు చిత్తము నుంచి యాత్మభజన రూపమగు ప్రయత్నము నెవరుచేయుచున్నారో, వారు సర్వజగద్విలక్షణమగు (తత్పదలక్ష్యమగు) బ్రహ్మను తెలిసికొనుచున్నారు. ఆత్మవిషయక మగు తత్త్వమును (త్వంపదలక్ష్యమగు ఆత్మను) తెలిసికొనుచున్నారు. అనగా సచ్చిదానందరూపమగు తత్త్వమునుగాని సర్వజ్ఞత్వ, సర్వాంతరత్వాది రూపమగు తత్త్వమునుగాని తెలిసికొనుచున్నారు. మరియు యజ్ఞాది లక్షణమగు నిఖిలకర్మను తెలిసికొనుచున్నారు. శ్రుతి ఏకవిజ్ఞానముచే సర్వవిజ్ఞానమును ప్రతిజ్ఞ చేసి బ్రహ్మము తెలిసినచో సర్వము తెలియునని చెప్పుటచేతను ఆత్మ బ్రహ్మాభిన్నమగుటవలనను సర్వము బ్రహ్మకార్యమగుట వలనను, ఆత్మజ్ఞానమువలన బ్రహ్మజ్ఞానము, సర్వప్రపంచజ్ఞానమున్ను సంభవించును. జరామరణ మోక్షరూపమగు పురుషార్థముకూడ సిద్ధించును.

ఓయి! ఆత్మవేత్తలగు శుకాదులకుగూడ మరణము వినబడుచున్నది. ఆత్మవేత్తలగు వసిష్ఠాదులకు వార్ధక్యము కనబడుచున్నది. దేవతలకు జరామరణ రాహిత్యము అమృతపానమువలనను విష్ణ్వాదులనుండి వరమును పొందుటవలనను సంభవించుచున్నది. అట్లే విభీషణ మార్కండేయాదులకు గూడ జరామరణ రాహిత్యము పురాణములయందు కనిపించుచున్నది.

కావున జరామరణ మోక్షమునకు ఆత్మజ్ఞానమే యావశ్యక మను టెట్లు పొసగును? అనినచో వినుము. దేవాదులకుగూడ బ్రహ్మయొక్క దైనందిన ప్రళయమునందు మరణము గలదు. అమృతపానము వలన ఆత్యంతికమరణరాహిత్యము వారలకు లేదు. అదియును వారలకు జరామరణములుగల దేహమునందు తాదాత్మ్యాధ్యాసలేకుండుటవలననే కలుగుచున్నది. నిత్యుడు, నిర్వికారుడు నగు ఆత్మకు జన్మాది వికారములు లేవు. అందువలననే ఆత్మవేత్తలకుగూడ జరాదు లుండవు. ఆత్మవేత్తయనగా ఆత్మయే "బ్రహ్మవి ద్బ్రహ్మైవభవతి" అను శ్రుతి బ్రహ్మవేత్త

బ్రహ్మ కాగలడని చెప్పుటలేదు. "భవతి" అని వర్తమానకాలమును నిర్దేశించి బ్రహ్మవేత్త బ్రహ్మయే యని నిర్ణయించుచున్నది.

ఇక శుకాదులకు దేహత్యాగ రూపమగు మరణము అజ్ఞానులదృష్ట్యాకల్పితముకాని నిజముకాదు. పరిపూర్ణుడు, అసంగుడునగు ఆత్మకు శరీరసంయోగముండుచో నిపుడు శరీరవియోగము కలుగును. అసంగునకు నిజముగ శరీరసంయోగమే సంభవింపదు. కావున శుకాదులకు ముక్తిగూడ లోకదృష్టిచేతనే యొప్పదగియున్నది. బంధముక్త్యాది వ్యవహారమంతయు ఆధ్యాసిక మని యింతకుమున్నే చెప్పియుంటిమి. ఇక్కడ ఆత్మజ్ఞానమువలన జరామరణాది వికారములుగల అనాత్మతాదాత్మ్యాస నివృత్తిమాత్రమే చెప్పబడుచున్నది. మోక్షము చెప్పబడుటలేదు. ఆత్మ నిత్యముక్తుడు. అతనికి మోక్ష మొకానొకప్పుడు వచ్చునదికాదు.

లేక జ్ఞానికిగూడ ప్రారబ్ధ దేహధర్మములగు జరామరణాదులయొక్క అనుభవము తప్పనిదగుటచే దేహమును విడచిన తరువాత అజ్ఞానికివలె జ్ఞానికి మరల దేహసంబంధము లేదు. కాన తిరిగి జరామరణాది ప్రసక్తిలేదను నభిప్రాయముతో మూలమునందు "జరామరణ మోక్షార్థం" అని చెప్పబడినది. అనగా పునర్జన్మ నివృత్తికొరకని నిశ్చయార్థము.

అయితే తత్వవేత్తకు "ప్రాణానోత్క్రామంతి" అను శ్రుతి ప్రాణోత్క్రమణమే లేదని చెప్పుచుండ ప్రాణోత్క్రమణ రూపమగు మరణము తత్త్వవేత్త కెట్లు సంభవించును? అని ప్రశ్నింపరాదు. తత్వవేత్తకు ప్రాణోత్క్రమణము లేకున్నను ప్రాణత్యాగము కలదు. తత్వవేత్తయొక్క ప్రాణాదులుగూడ వాయ్వాదులయందు లయమగునని శ్రుతి జెప్పుచున్నది "మృఙ్ ప్రాణత్యాగే" అను ధాతువువలన మరణమే ప్రాణత్యాగము. అయితే ప్రాణముతోగూడియే అజ్ఞాని లోకాంతరమున కేగుచుండ ప్రాణత్యాగరూపమయిన మరణ మాతనికెట్లు కలుగునని యనరాదు. శరీరమే ఆత్మ అను నభిమానముగల అజ్ఞానికి శరీరమునుండి ప్రాణములు వియోగమును చెందుట రూపమయిన ప్రాణత్యాగము సంభవించును.

లేక మూలమునందలి జరాశబ్దము రోగాదుల కుపలక్షణము. వార్ధక్యము, రోగము మున్నగువానివలన వచ్చెడి ప్రాణోత్క్రమణ లక్షణమగు మరణమును తొలగించుకొనుటకొరకని యర్థము లభించును. తత్వవేత్త పరిపూర్ణుడు గనుక నాతనికి లోకాంతరగమనము సంభవింపదు. అందువలన తత్వవేత్తకుమాత్రమే ప్రాణోత్క్రమణము సంభవింపదు. కావున ఆత్మభజనమునకు జరామరణ మోక్షమున్ను పరబ్రహ్మాది జ్ఞానమున్ను ఫలము. ॥ ౨౯ ॥

శ్లో. సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞంచ యే విదుః
ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్త చేతసః ॥30॥

అ॥ నాయం దఖండ భక్తిభావముగల యేభక్తులు అధిభూత అధిదైవ అధి యజ్ఞ సహితుడనగు నన్ను తెలిసికొనుచున్నారో అట్టి యేకాగ్రచిత్తులు అభ్యాస సంస్కారపాటవమువలన మరణకాలమునందుఁగూడ నన్ను తెలిసికొందురు. బ్రతికి యున్నపుడు దృఢాభ్యాస విషయమైన వస్తువు మరణకాలమునగూడ స్మృతికి వచ్చును. కావున "యాంతేమతి స్సా గతిః" అను న్యాయము ననుసరించి అంత కాలమున నారాయణస్మరణము సిద్ధించుటకు జీవద్దశయందే విషయసంగమును వదలి ముముక్షువులు నారాయణభజనమును ఆవశ్యము చేయవలెను. భరతుడు లేడితో సంగముగలవాడై ప్రాణావసానమున నాలేడినే స్మరించుచు ముక్తిని బొందలేక పోయెను. లేడిజన్మనే పొందెను. కావున పరబ్రహ్మసాయుజ్యము నొందదలచిన వారలకు ప్రాణావసానమున నారాయణస్మరణ మావశ్యకము. ఆ నారాయణస్మరణము నారాయణునియొక్క నామోచ్చారణ మాత్రముగాదు. మరేమనిన ప్రత్యగాత్మయగు నారాయణునియొక్క సచ్చిదానందలక్షణమగు నేతత్త్వము కలదో దానిని స్మరించుట అనగా "సచ్చిదానందం బ్రహ్మాఽహమస్మి" అని యనుసంధానమును చేర్చుకొనుటయే నారాయణస్మరణ మను భావము.

అదియు రాగద్వేషముల విడచి ప్రత్యగాత్మయందు మనస్సు నేకాగ్రపరచక సంభవించదు. కనుక జీవద్దశయందు యుక్తచేతస్కులే, చిత్తైకాగ్ర్యము గలవారే అంతకాలమున నారాయణుని స్మరింతురు.

సన్నిపాతాది రోగములవలన నెవ్వరికి మరణకాలమున చిత్తసమాధానము దుర్లభమగునో వారు తిరిగి జన్మనొంది వెనుకటి జన్మయందలి యభ్యాసవశమున మరల యాత్మభజనమునందు ప్రయత్నింతురు. ఎట్లయినను అంతమున నారాయణ స్మరణములేనిదే ముక్తి సిద్ధించదని తేలినది.

అయితే "కాశ్యాంతు మరణాన్ముక్తిః" అను వచనము కాశీక్షేత్రమున మరణము నొందిన మాత్రముననే ముక్తికలుగునని చెప్పుచున్నది కదా! యని శంకింపరాదు. కాశీక్షేత్రమున అంతకాలమునందు శంకరుడు తారకమంత్రము నుపదేశింపగా మరల జన్మనొంది తారకమంత్రోపాసన జేసి యాత్మజ్ఞానమును బొంది ముక్తి నొందుచున్నాడని నావాక్యమున కర్థము. ఇట్లయినచో "జ్ఞానాదేవతు కైవల్యమ్" అను శ్రుతి విరోధముకదా, అని యనరాదు. అంతకాలోపలక్షిత జ్ఞానమువలన ముక్తియని శ్రుత్యర్థమును గ్రహించవలయును.

వస్తుతః నిత్యముక్తుడయిన ఆత్మకు బంధముగాని మోక్షముగాని లేదు. జ్ఞాని యాత్మయే కాన వానికి అంతకాలమునగాని జీవత్కాలమునగాని ముక్తికొరకు జేయదగిన ఆత్మస్మరణాదికము లేదు. జ్ఞానమువలననే అతడు కృతకృత్యుడగును. ఏరికట్టి నిశ్చయజ్ఞానముండదో వారికి మాత్రము అంతకాలమున నారాయణస్మరణ మావశ్యకమని గ్రహించవలయును ॥౩౦॥

ఇట్లు మల్లావఝ్ఝలోపనామక వెంకట సుబ్బరామశాస్త్రి
విరచితమగు భాష్యార్థప్రకాశికానువాదమున
సప్తమాధ్యాయము సమాప్తము
(శ్రీ) (శ్రీ) (శ్రీ)

శ్రీ హయగ్రీవాయనమః

# శ్రీ భగవద్గీతా భాష్యార్క ప్రకాశికానువాదము

## అష్టమాధ్యాయము.

శ్లో. కిం తద్బ్రహ్మ కి మధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ,
అధిభూతంచ కిం ప్రోక్త మధిదైవం కి ముచ్యతే ॥ ౧ ॥

అధియజ్ఞః కథం కోఽత్ర, దేహేఽస్మిన్ మధుసూదన,
ప్రయాణకాలేచ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః ॥ ౨ ॥

అ॥ ఓయి పురుషోత్తమా! పూర్వాధ్యాయాంతమున నీ భక్తులు బ్రహ్మ మన్నగువానిని దెలిసికొందురని నీవు చెప్పియుంటివి. ఆ బ్రహ్మమెద్ది? అధ్యాత్మ మననేమి? కర్మమన నేమి? అధిభూతము, అధిదైవము, అన శాస్త్రజ్ఞులేమని నిర్ణయించిరి? అనగా నీ భక్తులు తెలిసికొందురని నీవు చెప్పిన బ్రహ్మము సోపాధికమా? నిరుపాధికమా? అధ్యాత్మమనగా శ్రోత్రాది యింద్రియ సముదాయమా? లేక, ప్రత్యక్చైతన్యమా? కర్మ యజ్ఞాదికమా? లేక మరేదయిననా? అధిభూతమన పృథివ్యాది భూతకార్యమా? లేక సమస్త కార్యజాతమా? అధిదైవమన దేవతావిషయకమగు అనుధ్యానమా? లేక సర్వదేవతానుస్యూత మగు చైతన్యమా? అధియజ్ఞమన యజ్ఞమునందలి దేవతయా? లేక పరబ్రహ్మమా? అట్టి అధియజ్ఞపురుషుని తాదాత్మ్యబుద్ధితో ధ్యానింపవలెనా? లేక అత్యంత అభేదభావముతో ధ్యానింపవలెనా? వీని నన్నిటిని వివరింపుమని పార్థుని ప్రశ్నకు తాత్పర్యము.
౧ – ౨

ఈ ప్రశ్నలకు యథాక్రమముగ శ్రీకృష్ణుడు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో. అక్షరం బ్రహ్మపరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః ॥ ३ ॥

అ॥ నాశరహితమయిన నిరతిశయ బ్రహ్మము బ్రహ్మశబ్దముచే జెప్పబడుచున్నాడు. అక్షరుడే బ్రహ్మయనుటలో "ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః" "భీషాస్మాద్వాతః పవతే" ఇత్యాది శ్రుతులు ప్రమాణములగుచున్నవి ఇచట నక్షరశబ్దమునకు "పరమ" శబ్దము విశేషణముగా నుండుటచే నక్షరశబ్దముచే నోంకారము గ్రహింపబడదు. ఓంకారము వర్ణాత్మకము, జడము నగుటచే నిరతిశయము కానేరదు. కావున నిరతిశయమగు అక్షరము బ్రహ్మమే యగును.

అధ్యాత్మమనగా పరబ్రహ్మయొక్క స్వభావము. అనగా, బ్రహ్మ ప్రతిశరీరమునందును ప్రత్యగాత్మరూపముతోనుండుట యని అర్థము దేహము నాశ్రయించి ప్రత్యగాత్మరూపముతో నుండి, తుదకు పరమార్థ బ్రహ్మరూపముతో పరిసమాప్తిని జెందువస్తువు స్వభావమనియు అధ్యాత్మమనియు జెప్పబడును.

పరమాత్మ బ్రహ్మమనియు, ప్రత్యగాత్మ అధ్యాత్మమనియును ఫలితార్థము.

ఇచట "అధ్యాత్మమ్" అనుపదమున విభక్త్యర్థమునం దవ్యయీభావసమాసమును గ్రహింప వీలులేదు

ప్రాణులయొక్క సత్తకు (ఉత్పత్తిద్వారా ఉనికికి) కారణమగు యజ్ఞాదికము కర్మయనబడును అనగా అనభివ్యక్తములై లోగడ సిద్ధములైయున్న ప్రాణులను దేహాదులనిచ్చి యభివ్యక్తపరచుటయే యజ్ఞాదికర్మలకృత్యము.

లింగశరీరావచ్ఛిన్నులగు జీవులు అనాదికాలమునుండి యుండియేయున్నారు. జీవులకు ప్రళయమునందు గూడ నాశములేదు. మోక్షకాలమునందే లింగశరీరభంగ మను నాశము జీవులకేర్పడును. ఇట్టిజీవులు స్థూలశరీరసంయోగ మను జన్మను స్థూలశరీరవియోగ మను మరణమును కర్మవశమున బొందుదురు. అందు స్థూలశరీరసంయోగ మను జన్మమునే ఇచట "భూతభావోద్భవకరః" అనుపదముచేఁ జెప్పబడినది.

లేక భూతశబ్దమునకు కార్యమాత్రము అర్థమునుచెప్పి కార్యవస్తువులయొక్క పుట్టుకను కారణమయిన యజ్ఞాదికము కర్మశబ్దార్థమనియును జెప్పవచ్చును. యజ్ఞము విసర్గలక్షణ మని భాష్యకర్త లనిరి. దేవతల నుద్దేశించి పురోడాశాది హవిస్సును అర్పించుటయే యజ్ఞాదుల స్వరూపము. ఇట్టి యజ్ఞాదికర్మలు వృష్ట్యాది క్రమమున స్థావరజంగమభూతములను బుట్టించును.

ఓయి! "అన్నా ద్భవంతి భూతాని పర్జన్యా దన్నసంభవః" యజ్ఞాద్భవతి పర్జన్యః యజ్ఞః కర్మసముద్భవః" అని తృతీయాధ్యాయమున యజ్ఞము కర్మవలన బుట్టునని చెప్పిరి. ఇచట యజ్ఞమే కర్మయని చెప్పితిరి. ఇయ్యది పూర్వాపరవిరోధము కదా? కాదు. వినుము యజ్ఞశబ్దమునకు అపూర్వమనియు, కర్మయనియు రెండర్థములు గలవు. తృతీయాధ్యాయమున యజ్ఞశబ్దము అపూర్వ మను అర్థమునందు వాడబడినది. ఇచ్చట కర్మార్థమునందు వాడబడినది. కాన పూర్వాపరవిరోధము లేదు.

కనుక కర్మరూపమయిన యజ్ఞమువలన అపూర్వము బుట్టును. అపూర్వము వలన వర్షము కలుగును. దానివలన అన్నము కలుగును. అన్నమువలన ప్రజలు పుట్టుదురు. ఇట్లు క్రమము సిద్ధించుచున్నది. భాష్యమునందుమాత్రము శంకరులు వర్షము

నకే ప్రాథమ్యమును చెప్పిరి. అయ్యది కర్మాపూర్వములు రెండును ఒక్క యజ్ఞశబ్ద వాచ్యము లను భావముతో జెప్పబడినదని తెలియవలయును. 3

శ్లో. అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతమ్,
అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాంవర ॥ 4 ॥

అ. ( అధిభూతం - క్షరో - భావః ) ఉత్పత్తి వినాశములుగల వస్తుజాత మంతయు అధిభూత మనబడును. అనగా ప్రాణిపదార్థము మాత్రమే అధిభూతశబ్దార్థముకాదు. దేహాదిరూపము శీతోష్ణాదిరూపము నగు పదార్థజాతమంతయు, అధిభూత మనదగును.

అధిదైవత మన పురుషుడు, పురము (శరీరము) నందుండువాడు పురుషుడు. ఇచట ఆదిత్యుని శరీరము పురము. పురుషశబ్దవాచ్యుడగు హిరణ్యగర్భుడు సూర్యమండలమం దుండును. కావున సూర్యమండలముయొక్క మధ్యమున్నట్టియు, హిరణ్యశ్మశ్రుత్వాదిగుణములు గలిగినట్టియు, సకలప్రాణులయొక్క ఇంద్రియములకు శక్తి నిచ్చు హిరణ్యగర్భు డను పురుషుడు, అధిదైవత మనిపించుకొనును. దైవతమనగా దేవతాజాతిలో చేరినవా డగుటచే నాదిత్యుడు; వానియందుండు వస్తువు అధిదైవతము- హిరణ్యగర్భుడని యర్థము. అధియజ్ఞు డన సర్వయజ్ఞములయందు అభిమానముగలవాడు. "యజ్ఞో వై విష్ణుః" అను శ్రుతి యజ్ఞాభిమానిదేవత విష్ణువని జెప్పుచున్నది. విష్ణువుయొక్క అవతార మగుటచే శ్రీకృష్ణుడే అధియజ్ఞుడని భావము. అట్టి అధియజ్ఞుడగు శ్రీకృష్ణుడు అంతర్యామిరూపముతో దేహమునం దుండునని గ్రహింపవలెను. యజ్ఞము దేహముతో నెరవేర్చదగినది కాన, యయ్యది దేహమునం దుండును. యజ్ఞాభిమానియగు శ్రీమహావిష్ణువుగూడ నంతర్యామిరూపముతో దేహమునందే యుండునని తాత్పర్యము.

ఇచట నధిదైవత, అధియజ్ఞ పదములు ప్రత్యగాత్మనే చెప్పును. ఆదిత్యశరీరము ఉపాధిగాగల చైతన్యము యధిదైవతము. విష్ణుదేహము ఉపాధిగాగల చైతన్యము అధియజ్ఞము. కావున నుపాధిభేదమేకాని చైతన్యమునకు భేదములేదు. అయినను ఈశ్వరశరీరము ఉపాధిగా గలవారగుటచే వారలు వేరుగ నిర్దేశింపబడిరి. జీవశరీరము ఉపాధిగాగల చైతన్యమునందే ప్రత్యగాత్మశబ్దము రూఢము. ఇట్లు బ్రహ్మ, అధ్యాత్మ, అధిదైవత, అధియజ్ఞ శబ్దములచే జెప్పబడు నలుగురు ఆత్మరూపులే. కాన, వీరికి భేదము లేనందున నద్వైతము సిద్ధించుచున్నది. యజ్ఞమను కర్మయు, అధిభూతమను కార్యజాతమున్ను, ఆత్మకార్యము లగుటచే కారణజ్ఞానముచే కార్యజ్ఞానము లోకసిద్ధముకాన, ఆ యాత్మజ్ఞానముచే యజ్ఞాదుల జ్ఞానము సిద్ధించును.

కావున పూర్వాధ్యాయాంతమున "నా భక్తులు నన్ను అధిభూత, అధిదైవ, అధియజ్ఞములతో గూడ దెలిసికొందు"రని చెప్పిన విషయము సంగతమగుచున్నది.

రామానుజ మతము :

బ్రహ్మ, అధ్యాత్మ, కర్మ, అధిభూత, అధిదైవత, అధియజ్ఞ పదములకు, రామానుజు లీ క్రిందివిధముగ దమభాష్యమునం దర్థవివరణమును జేసిరి.

1. క్షేత్రజ్ఞులయొక్క సమష్టిరూపమై, ప్రకృతి వినిర్ముక్తమగు (విడువబడిన) ఆత్మస్వరూపము బ్రహ్మ.

2. ఆత్మయందు సంబంధించిన భూతసూక్ష్మ తద్వాసనాదికము అధ్యాత్మము.

3. మనుష్యాది ప్రాణులయొక్క ఉత్పత్తికి గారణమై, స్త్రీ పురుషసంయోగమున గలుగు వీర్యవిసర్జనము, కర్మ.

4. సాశ్రయమగు శబ్దస్పర్శాదికము, అధిభూతము.

5. బ్రహ్మేంద్రాదులకు వేఱైవాడయి, విలక్షణ శబ్దాదుల ననుభవించువాడు అధిదైవతము.

6. యజ్ఞములచే నారాధింపదగియుండి, పరమేశ్వరుని శరీరమగు నింద్రాదులయందుండు శ్రీమహావిష్ణువు (కృష్ణుడు) అధియజ్ఞుడు అని.

మరియు నిందు బ్రహ్మ ముముక్షువులకు ప్రాప్యమనియు. అధ్యాత్మము త్యాజ్యమనియు, కర్మపరిహరణీయమనియు, ఐశ్వర్యమును గోరువారు అధిభూతాధి దైవతములు ప్రాప్యములనియు మహాయజ్ఞాది నిత్యనైమిత్తికాది కర్మల నాచరించునపుడు అధియజ్ఞుడు స్మరింపదగినవాడనియును గ్రహింపవలెనని రామానుజులు చెప్పిరి.

ఇత్యాది యుక్తముగాదు "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అను ప్రమాణమునుబట్టి, క్షేత్రజ్ఞు డొక్కడే యగుటచే, నాతనికి సమష్టియే పొసగదు. అంతఃకరణభేదముచే, క్షేత్రజ్ఞులకు భేద ముపపన్నము కాన సమష్టి కుదురునన్నను, చిదచిచ్ఛరీరకుడగు నీశ్వరునకు క్షేత్రజ్ఞ సమష్టిరూపత్వ మసంభవము.

క్షేత్రజ్ఞ సమష్టియగు బ్రహ్మ వేరు, చిదచిచ్ఛరీరకుడగు ఈశ్వరుడు వేరు, అనినచో నపుడు బ్రహ్మ ఈశ్వరునకు శరీరము కావలసివచ్చును.

ఇక పరమాత్మయగు బ్రహ్మకంటె, క్షేత్రజ్ఞ సమష్టి భిన్నమయినను, గౌణవృత్తిచే బ్రహ్మశబ్దముచే జెప్పబడుచున్న దనినచో, ముఖ్యార్థమును పరిత్యజించిన ట్లగును. అందు గారణము లేదు.

"అక్షరం బ్రహ్మపరమం" అను మూలమునందలి, పరమం, బ్రహ్మ, అను పదద్వయము పరమాత్మయందు, యోగరూఢమగుచుండ, గౌణబ్రహ్మను ప్రతిపా

దించుట తగదు. పరమ శబ్దము ప్రకృతి విలక్షణమని యభిప్రాయపడినను, ప్రకృతి విలక్షణుడు పరబ్రహ్మమే యగును. కాక మీరుచెప్పెడి బ్రహ్మ క్షేత్రజ్ఞునికంటె వేర గుచో జడమగును. క్షేత్రక్షేత్రజ్ఞులకంటె విలక్షణమయిన వస్తువే లేనందున, తద్విలక్షణమయిన బ్రహ్మ సిద్ధించదు. మరియు బ్రహ్మతో సమానమయిన ధర్మము గలవాడగుటచే క్షేత్రజ్ఞుడు, బ్రహ్మయని జెప్పదగియుండగా, "అక్షరం బ్రహ్మ పరమం" అనుమూలమున గూడ నట్లు చెప్పియుండగా మీరు దానిని విడచి క్షేత్రజ్ఞ సమష్టిపర్యంతార్థమును గల్పించుట అప్రమాణమగును, అయుక్తము నగును. మూలకారులు పరమాక్షరసమష్టి బ్రహ్మయని జెప్పలేదు. ధాన్యముయొక్క స్వరూపము వ్రీహులయొక్క సమష్టిరూప మయినట్లు, ఆత్మలయొక్క స్వరూపము క్షేత్రజ్ఞసమష్టిరూపము కానేరదు. ఆత్మలకు రాశిత్వము సంభవింపదు. క్షేత్రజ్ఞ సమష్టిఆత్మస్వరూపము పరమాత్మకు శరీరమని యనరాదు. పరమాత్మకు శరీరమగుచో, (శీర్యతే-నశించునది) అను వ్యుత్పత్తివలన ఆత్మకు వినాశము సంభవించును. పరమాత్మచే జీవాత్మ నియమింపదగినవాడుకాన పరమాత్మకు శరీరమగు నన్నచో నదియును పొసగదు. అద్వితీయమగు నాత్మతత్వమునందు నియమ్య నియామక భావమను ద్వైతము సంభవింపదు. సుషుప్తియందు ఆత్మకు, నియమ్యత్వము కనిపించుట లేదు. వ్యవహారకాలమునందు, శరీరాది తాదాత్మ్యాధ్యాసవలన నియమ్యత్వము కనిపించుచున్నది.

ఇక నద్వైతులగు మీరు ఎవనిని ప్రత్యగాత్మయని వ్యవహరింతురో విశిష్టాద్వైతుల మగు మేము, వానినే పరమాత్మయందుము మీరు ఎవనిని ప్రమాతయనియు చిదాభాసుడనియు నందురో వానిని మేము ప్రత్యగాత్మ యందుము. కావున చిదాభాసులకు పారతంత్ర్యము, అనేకత్వము మీరును అంగీకరించినదేకదా! యనినచో అదియునుపొసగదు. మామతమున చిదాభాసుడే వస్తుతః ప్రత్యగాత్మ. సర్పాభాసము నిజముగ త్రాడుకాని వేరుగాదు. చిదాభాసుడే నిజముగ ప్రత్యగాత్మగానిచో సుషుప్తి దశయందు చిదాభాసుడు లయించియుండ నా చిదాభాసలయమునకు సాక్షియగు ఆత్మ చిదాభాసు డెట్లగును? ప్రమాతృత్వరహితుడగు, సుషుప్తియందలి ప్రాజ్ఞుడనునాత్మయే సుషుప్తిదశలో తాననుభవించిన అజ్ఞానమును, ఆనందమును ప్రబోధ దశలో స్మరించుచున్నాడు. సుషుప్తిలో చిదాభాసుడు లేడు. ప్రత్యగాత్మ గలడు. ప్రత్యగాత్మయే సుషుప్తిలో అజ్ఞానానందముల ననుభవించెను. జాగ్రదవస్థయందు చిదాభాసుడు గలడు. ఇతడే, అజ్ఞానానందములను స్మరించుచున్నాడు. కనుక వీరిరువురు వేరగుచో ఒకరనుభవించిన దానిని మరియొకరు స్మరించుట తటస్థించదు. కాన ప్రత్యగాత్మయే చిదాభాస తాదాత్మ్యమునొంది సంస్మరించుచున్నాడు. కనుక ప్రత్యగాత్మ ప్రమాత (చిదాభాస)లకు భేదము లేదు. చిదాభాసునియొక్క నిజరూపము

చిత్తుయే; అంతఃకరణవిశిష్టచైతన్యరూపమయిన ప్రమాతయొక్క నిజరూపము గూడ చైతన్యమే. కావున ప్రకృతి వినిర్ముక్తమయిన ఆత్మస్వరూపమగు చైతన్యము ప్రత్యగాత్మయేకాని వేరుగాదు. చిదాభాసుడన్నను, ప్రమాతయన్నను ప్రకృతి పరిణామమగు నంతఃకరణముతోఁగూడిన చైతన్యము. ఇట్టి విశిష్టచైతన్యమునకు ప్రకృతిసంబంధరాహిత్యము సంభవింపదు. చైతన్యమాత్రమునకే యయ్యది సంభవించును.

కావున ప్రకృతి వినిర్ముక్తమయిన ఆత్మస్వరూపము కేవలచైతన్యమే యగును. అదియే క్షేత్రజ్ఞుడు. నిరుపాధికమగుటచే నద్వితీయము నగుచున్నది. ఇట్టిచైతన్యము సచ్చిదానందలక్షణమయిన పరబ్రహ్మమే కావున "అక్షరం పరమం బ్రహ్మ" అను మూలమునకు శ్రీ శంకరభగవత్పాదులు చెప్పిన యర్థమే సిద్ధమయినది. బ్రహ్మభిన్నుడైన జీవుడుగాని, జీవసముదాయముగాని యర్థముగాదు. బ్రహ్మాభిన్నమయిన జీవునకే ప్రకృతిసంబంధరాహిత్యము పొసగును. బ్రహ్మభిన్నపదార్థ మంతయు ప్రకృతిసంస్పృష్టమే యగును. కావున బ్రహ్మపదమునకు రామానుజులు చెప్పిన యర్థము యుక్తముగాదు.

ఇట్లే అధ్యాత్మపదవివరణముగూడ సముచితముగాదు. ఆత్మయందు సంబంధించిన భూతసూక్ష్మ తద్వాసనాదికము అధ్యాత్మమని రామానుజు లనిరి. అసంగుడగు నాత్మయందు భూతసూక్ష్మములయొక్క (శబ్దస్పర్శాదులయొక్క) సంబంధము కుదరదు. మీ మతమున భూతసూక్ష్మాదులు (శబ్దస్పర్శాదులు) సత్యములగుటచే భూతసూక్ష్మాది సంబంధము ఆత్మకు మాయచే ఘటించునని జెప్పుటగూడ నుచితముగాదు. మీరు ప్రకృతి సత్యమందురు. సత్యమయిన ప్రకృతితోటి ఆత్మస్వరూపమునకు వినిర్ముక్తి దుర్ఘటము (సంభవింపదు). సత్యమయిన పదార్థము నివర్తించునట్లు లోకములో కనివిని యెఱుంగము. ఒకవేళ సత్యమయిన ప్రకృతిగూడ నీశ్వరసేవచే నివర్తించుచో నీశ్వరుడు చిదచిద్విశిష్టుడెట్లగును? ఈశ్వరునియొక్క ప్రకృతిమాత్రము నివర్తింపదన్నచో, ఈశ్వరునికే ప్రకృతి నివర్తించకపోతే వానిని సేవించుభక్తులకు మాత్రము ప్రకృతి యెట్లు నివర్తించును? జీవులకు ప్రకృతిసంగము దోషమగుచో హేయప్రత్యనీకుడగు ఈశ్వరునకు మాత్రము ప్రకృతివైశిష్ట్యము దోషమెట్లుకాదు? ఇంక ప్రకృతివైశిష్ట్యము ఈశ్వరునకు గుణమగుచో ముముక్షువునకు మాత్రము పనికిరాని దెట్లగును? ఈశ్వరునకు ప్రకృతిసంగము గుణమనియు, జీవునకుమాత్రము దోషమనియు రామానుజీయుల యాశయ మనినచో నదియును ఉచితముగాదు. జీవేశ్వరు లుభయులు జ్ఞానైకాకారులు, సమానధర్మము గలవారు. అందు నొకరికి ప్రకృతిసంబంధము గుణమనియు, మరియొకరికి నది దోషమనియు గల్పించుట ఉచితముగాదు. పైగా అప్రమాణముగూడ నగును.

ప్రకృతి రెండువిధములు– శుద్ధము అశుద్ధము అని. అందు శుద్ధప్రకృతిసంబంధము యీశ్వరునకు గలదు. దాని కైశ్వర్యాది గుణము. అశుద్ధప్రకృతిసంబంధము జీవునకు గలదు. అయ్యది జీవునకు దోషము. అనినచో నది సరిగాదు. మీరు ముక్తుడయిన జీవునకు ఈశ్వరసాధర్మ్యమంగీకరింతురు. అట్టితరి ముక్తజీవునకు శుద్ధప్రకృతిసంగము అవశ్యము కలుగును గాన, ముముక్షువులకు ప్రకృతివినిర్ముక్తమయిన (ప్రకృతిచే విడువబడిన) ఆత్మస్వరూపము ప్రాప్యమెట్లగును? అశుద్ధప్రకృతిచే విడువబడినట్టియు, శుద్ధప్రకృతితో సంబంధముగలిగినట్టియు ఆత్మస్వరూపము ముముక్షువులకు ప్రాప్యము గాదు అని తలంచినచో, నట్టి ఆత్మస్వరూపము నిత్యసిద్ధముగాన ప్రాప్యము గానేరదు. శుద్ధప్రకృతియే ప్రాప్యమగును. కాన ప్రాప్యమని తెలియదగినది ప్రకృతి గాని యాత్మస్వరూపము గాదు.

అట్లైన "అక్షరం బ్రహ్మపరమం" అను దానికి. "పరమం = శుద్ధముగు, అక్షరం = ప్రకృతి, బ్రహ్మ = బ్రహ్మ" అని యర్థము చెప్పవలెను. ఇంతియెకాని ప్రకృతి వినిర్ముక్తమయిన ఆత్మస్వరూపము, బ్రహ్మమని అర్థము వర్ణింపదగదు. ఇట్లు అట్లు చెప్పెదమన్నచో, శుద్ధాశుద్ధ ప్రకృతిద్వయసాధారణమయిన స్వభావ శబ్దమును, అశుద్ధప్రకృతి పరముగా అన్వయించుటకు ప్రయోజకము (కారణము) లేకుండుట అట్లు జెప్పదగదు.

ఇం "అక్షరం బ్రహ్మపరమం" అను స్థలమున శుద్ధప్రకృతి చెప్పబడినది. "స్వభావోఽధ్యాత్మముచ్యతే" అనుచోట పరిశేషన్యాయముచే అశుద్ధ ప్రకృతి చెప్పబడుచున్నది అనినచో, నది సరిగాదు. ఈశ్వరుడు శుద్ధప్రకృతి విశిష్టు డనినంత మాత్రముననే అశుద్ధప్రకృతితో నీశ్వరునకు సంబంధములేదని స్పష్టమగుచున్నది. సర్వము యీశ్వరునకు శరీరమని యంగీకరించు మీమతమున అశుద్ధప్రకృతి సంగము యీశ్వరునకు లేదనుటలో ఇష్టాపత్తి చూపదగదు.

మరియు భూతసూక్ష్మాదులు జీవప్రకృతికార్యములా? ఈశ్వరప్రకృతికార్యములా? చెప్పవలెను. ఇందు మొదటిపక్షమున, జీవుడే జగత్ స్రష్ట యగును. రెండవ పక్షమున జీవునకు నా భూతసూక్ష్మములతో సంబంధము లేకపోవలసి వచ్చును. ఈశ్వరునకే భూతసూక్ష్మ సంబంధమేర్పడినదికాన ఈశ్వరుడు తన్మోక్షము కొరకు మరియొక ఈశ్వరుని సేవింపవలసివచ్చును. కాక సర్వప్రపంచసృష్టికి గారణమయిన ప్రకృతి యొక్కటియగుచుండ రెండు ప్రకృతులను గల్పించుట అయుక్త మగును. మరియు జీవు లనేకు లగుటచే అశుద్ధప్రకృతులనుగూడ ననేకములను గల్పింపవలసివచ్చును.

మరియు "దైవీహ్యేషా గుణమయీ" అని శ్రీకృష్ణుడు ఈశ్వరప్రకృతి సత్త్వరజస్తమోగుణాత్మక మని చెప్పుచుండ, దానికి శుద్ధత్వము అసంభవము. శుద్ధ

సత్వమయమగు ప్రకృతి శుద్ధ మనదగును. త్రిగుణాత్మకమగు ప్రకృతికి శుద్ధసత్వ స్వరూప మెట్లు సంభవించును? శుద్ధసత్వమయమగు నీశ్వరప్రకృతివలన తామసము లయిన పృథివ్యాది భూతము లెట్లు పుట్టును?

మహాభూతములు జీవునివలన బుట్టుననుట ఉచితము గాదు. "ఆత్మన ఆకాశస్సంభూతః" "యతో వా ఇమాని భూతాని జాయంతే" అను శ్రుతివాక్యములు సృష్టిప్రకరణమునందలి ఆకాశశబ్దము పరమాత్మపరమని నిర్ణయించుచు పరమాత్మవలననే మహాభూతములు [illegible] బుట్టినవని చెప్పుచున్నవి. కావున [illegible]మగు ప్రకృతి [illegible] సకలప్రపంచము సృజింపబడు చున్నది. [illegible] భూతములన్నియు [illegible] తెలుపుచున్నవి.

ఈశ్వరునకు శుద్ధాశుద్ధము లను రెండు ప్రకృతులు గలవు. [illegible] అశుద్ధ ప్రకృతితో సర్వప్రపంచమును సృజించుచున్నాడు. శుద్ధప్రకృతి ఈశ్వరుని యొక్క దివ్యమంగళ విగ్రహముగ నున్నది అని యనరాదు ఈశ్వరుని దివ్యశరీరము అప్రాకృతమని చెప్పి రామానుజులు, శుద్ధప్రకృతివలన కలుగునని చెప్పుట మత విరుద్ధమగును. అప్రాకృతమనగా అశుద్ధప్రకృతియొక్క కార్యముగాదని యర్థము గాని శుద్ధప్రకృతియొక్క కార్యముగాదని కాదు — అనినచో నిట్టి యర్థమును కల్పించుటయందు ప్రమాణము కానము. ఈశ్వరునకు జీవభూతమగు ప్రకృతి యొకటి, భూమ్యాద్యష్టతత్వములకు కారణమయిన ప్రకృతి యొకటి అని, రెండు ప్రకృతులిచట నే చెప్పబడినవి. ఈ రెండునుగాక మూడవ ప్రకృతిని కల్పించుటలో ప్రమాణము లేదు. మరియు "అప్రాణో హ్యమనాః శుభ్రః" అను శ్రుతి ప్రమాణమునుబట్టి యీశ్వరుడు అశరీరుడని స్పష్టమగుచున్నది. కాన వానికి శరీరమే లేదు. కావున సచ్చిదానందమయమగు నీశ్వర స్వరూపమొక్కటియే యప్రాకృతము. మిగిలిన దంతయు ప్రాకృతము కనుక అప్రాకృతమయిన దివ్యమంగళవిగ్రహ మనగా సచ్చిదానంద రూపమే కాని వేరుగాదు.

మరియు వైకుంఠాది లోకములయందు విష్ణురుద్రాదుల దేహములన్నియు మాయామయములు. వాటియందుగూడ దృశ్యత్వము, జడత్వము కలదు. వారి నుపాసించువారలకు వారితో సమానమయిన దేహము లభించును. ఇంతియేకాని ముక్తి లభించదు; శరీరరాహిత్యమే ముక్తి. లింగశరీరనాశమే మోక్షము కావున అధ్యాత్మ శబ్దమునకు రామానుజులు నిరూపించిన యర్థము సంగతముకాదు.

అట్లే రేతోవిసర్జనమను కర్మ ముముక్షువులచే దెలియదగినదని రామానుజులు చెప్పిన విషయము విద్వాంసులకు వినుట కింపుగనుండదు. క్రిమి కీట పక్షి పశ్వాదులకు స్వతస్సిద్ధముగా తెలిసిన మైథునకర్మను ముముక్షువులు తెలిసికొనవలెనని

చెప్పుట యెంత సమంజసము? జరామరణమోక్షాయ మా మాశ్రిత్య యతంతి యే తేబ్రహ్మ తద్విదుః కృత్స్న మధ్యాత్మం కర్మచాఖిలం" అని భగవద్వాక్యములకే బ్రహ్మ జ్ఞానమువలె మైథునకర్మజ్ఞానముగూడ ఆవశ్యకమనియు, నితరులకు ఆవశ్యకము గాదనియును శ్రీకృష్ణాశయమును వర్ణించు రామానుజుల పాండిత్యము యెంత ప్రశంసనీయము!

ఇక రేతోవిసర్జనమే భూతోత్పత్తికి కారణమనుటకూడ యుక్తముగాదు. జరాయుజ, అండజ, స్వేదజ, ఉద్భిజ్జము లను నాలుగువిధముల జీవరాశిలో జరాయుజాండజములు రేతస్సువలన బుట్టినను, స్వేదజోద్భిజ్జములుమాత్రము రేతస్సువలన బుట్టవు.

మరియు మూలమునందలి "దేహే" అను పదము ప్రత్యక్షముగా కంటికగపడు అర్జునాది దేహములను చెప్పుచుండ నింద్రాదిదేహపరముగ అన్వయించుట అయుక్తము. ఇంద్రాదిదేహములు పరోక్షములు. అర్జునాదిదేహములు ప్రత్యక్షములు. పరోక్షదేహములయందువలె ప్రత్యక్షదేహములయందు గూడ, నీశ్వరుడు ఆత్మరూపముతో నుండుట సమానమగుచుండ, ప్రత్యక్షదేహములను విడచుటలో కారణము లేదు.

అట్లే అధిదైవతశబ్దమునకు, అతిదైవతశబ్దమునకు వలె 'దేవతలకుపైన' అను అర్థమును జెప్పుటకూడ నుచితముగాదు. అధియజ్ఞశబ్దమునకు, యజ్ఞారాధ్యుడు అను అర్థముగూడ పొసగదు. ఉపర్యర్థమునందుగాని, ఆరాధ్యార్థమునందుగాని అధిశబ్దమునకు ప్రయోగ మెచ్చటను లేదు.

మరియు "చతుర్విధా భజంతే మాం" అని భగవద్వచనమునందు నలుగురు అధికారు లని చెప్పియుండ, ముగ్గురే అధికారులని రామానుజులు చెప్పుట న్యూనమగును. కావున సర్వథా రామానుజవివరణ మిచ్చోట అసంగత మగుచున్నది.

శ్లో. అంతకాలేచ మామేవ స్మరన్ముక్త్వా కలేబరం,
యః ప్రయాతి స మద్భావం యాతి నా స్త్యత్ర సంశయః ॥ ౫ ॥

అ. ఏకాగ్రచిత్తులు ప్రయాణకాలమునందుగూడ నన్ను దెలిసికొందురని శ్రీకృష్ణుడు చెప్పగా విని, అర్జునుడు ప్రయాణకాలమున నిన్నెట్లు తెలిసికొనవలెనని ప్రశ్నించెను. శ్రీకృష్ణు డందులకు సమాధానమును చెప్పుచున్నాడు.

మరణకాలమున ప్రత్యగభిన్నమయిన బ్రహ్మను "అహంబ్రహ్మాస్మి" అని బ్రహ్మాకారవృత్తితో అను సంధానము చేయుచు;
లేక, కేవల మాత్మస్వరూపమును ధ్యానించుచు;
లేక, మనస్సును వృత్తిరహితమొనర్చి యూరక ఆత్మ ననుభవించుచుగాని

యెవడు మరణించునో వాడు (మద్భావం) ఆత్మతత్వమగు సచ్చిదానందరూపమును పొందును. ఇందు సంశయములేదు.

ఓయి! తత్వవేత్తలకు ప్రాణోత్క్రమణము లేనందున, లోకాంతరగమనము లేదుకదా? మూలమున శ్రీకృష్ణుడు గమనార్థకమగు (ప్రయాతి) అనుపదము నేల ప్రయోగించెను? వినుము. లోకసిద్ధమగు అర్థమును అనువదించియే శ్రీకృష్ణు డట్లు ప్రయోగించెను. తత్వవేత్త శరీరమును విడచి వెళ్లునని లోకు లనుకొందురు. కాని యాత్మజ్ఞాని యెచ్చటకును వెళ్లువాడు గాడు. సర్వవ్యాపకమగు నిర్విశేష చిన్మాత్రముయొక్క తత్వమును యిచ్చటనే పొందుచున్నాడు.

లేక "ప్రయాతి" అనగా శరీరమును విడచుచున్నా డనియే యర్థము. "కలేబరం ముక్త్వా" అను పదముతో పునరుక్తమని శంకింపరాదు. (వాచం-వదతి, కార్యం-కరోతి)మాటను చెప్పుచున్నాడు. పనిని చేయుచున్నాడు. అనుప్రయోగముల వలె పునరుక్తమును పరిహరింపవచ్చును. కావున "శరీరం ముక్త్వా యఃప్రయాతి" అను వాక్యమునకు మరణించుచున్నాడు అనియే యర్థము.

లేక "ప్రయాతి" అను పదమునకు, (మ్రియతే) మరణించుచున్నా డనియే అర్థము. మరణ మనగా ప్రాణత్యాగము. కాన "ప్రయాతి" అను పదమువలన ప్రాణములను విడచుచున్నాడని యర్థము లభించును. ప్రాణములు లింగశరీరాత్మక ములుకాన ప్రాణములను విడచుచున్నాడనగా, ఉపలక్షణముచే లింగశరీరమును విడచుచున్నాడని యర్థమగును. ఇట్లు ప్రాణత్యాగమనగా లింగశరీరత్యాగమని తేలినది. ఇపుడు ఎవడు స్థూలశరీరమును వదలి (ప్రయాతి) లింగశరీరమును విడచు చున్నాడో, వాడు (మద్భావం) బ్రహ్మసాయుజ్యము నొందుచున్నాడని తేలినది.

అయితే లింగశరీరమును విడచినను కారణశరీరముండగా ఆత్మకు నిరుపాధి కత్వము సంభవించుటగాని, బ్రహ్మసాయుజ్యము ప్రాప్తించుటగాని యెట్లని ప్రశ్నింప రాదు. కారణశరీరమగు అజ్ఞానము నశించనిదే లింగశరీరమునకు నాశము సంభ వింపదు. కాన లింగశరీరనాశమువలననే కారణశరీరనాశముకూడ సిద్ధించుచున్నది.

స్థూలశరీరము నశించినంతమాత్రముననే సూక్ష్మ శరీరమున్నను వికుంఠ లోకము ప్రాప్తించుచున్నదికదా? అని యనరాదు.

శ్లో. స్వధర్మనిష్ఠ శ్శతజన్మభిః పుమాన్ విరించితామేతి తతఃపరం హి మామ్,
అవ్యాకృతం భాగవతోథ వైష్ణవః పదం, యథాఽహం విబుధాః కలాత్యయే॥

అని భాగవతమునందు రుద్రవచనము కలదు. నూరుజన్మలయందు స్వధర్మానుష్ఠాన నిరతుడై యున్న బ్రహ్మలోకము నొందును. ఆపైన రుద్రలోకము నొందును. విష్ణుభక్తుడు లింగశరీరము నశించినచో అవ్యాకృతమగు వైకుంఠస్థానము నొందును. అని జెప్పుచున్నది.

మరియు జీవునకు లింగశరీరమున్నచో దానితో తాదాత్మ్యాధ్యాస కలుగును. అటుపైన సంసారిత్వ మేర్పడును. కాన లింగశరీరనాశములేనిదే యసంసారి బ్రహ్మభావము సంభవించదు.

ఓయి! లింగశరీరవిశిష్టులగు జీవులే ముక్తిక్షేత్రమగు వైకుంఠలోకమును పొందుచున్నారుకదా? కాదు. అయ్యది, సగుణముక్తిక్షేత్రమగు సత్యలోకము. బ్రహ్మసాయుజ్యమును లింగశరీరవిశిష్టులు పొందుట యసంభవము.

అయితే యిచట సగుణముక్తియే వివక్షితమని యనరాదు. మూలమునందలి "మద్భావం" అనుపదము బ్రహ్మసాయుజ్యరూపమగు నిర్గుణముక్తిని చెప్పుచున్నది. మద్భావమనగా మత్స్వభావము, మదాకారము అని యనరాదు. నిరాకారుడయిన ఈశ్వరునకు ఆకారములేదు. ఆకారములేని యీశ్వరునిగూడ ఆకారముగలవానినిగా స్మరించుచో, సాధకుడు ఆయా యాకారమును బొందునని యనరాదు. తత్వవేత్త (జ్ఞాని) యెల్లప్పుడు, సచ్చిదానందరూపుడైన నిరాకారాత్మనే స్మరించును.

తత్త్వవేత్తలు కానివారు (అజ్ఞానులు) ఈశ్వరుని సాకారునిగా గల్పించి ధ్యానింతురు. స్వతస్సిద్ధమయిన రూపమునందు, కల్పితరూపమును ధ్యానించువారు తత్వజ్ఞానులుగారని సర్వసంప్రతిపన్నము. త్రాటిని సర్పమునుగా ధ్యానించుపురుషుడు రజ్జుతత్వజ్ఞానియని జెప్పనలవికాదు. నిజరూపమును గుర్తెఱింగినవాడే తత్వవేత్త. ఆత్మయొక్క వాస్తవరూపము సచ్చిదానందమే యగును. కాన సచ్చిదానందాత్మను తెలిసికొనినవాడే తత్వవేత్త

కావున, సాకారేశ్వరుని ధ్యానించువారలు వైకుంఠాదిలోకములకు వెళ్లుట సంభవించినను నిరాకార ప్రత్యగభిన్న బ్రహ్మాత్మను ధ్యానించువారలకు వైకుంఠాది లోకగమనము సంభవింపదు.

కాన, మరణకాలమున ఆత్మస్వరూపమును ధ్యానించు తత్త్వవేత్తలు, బ్రహ్మత్వమునే బొందుదురు. లోకాంతరమునకు వెళ్ళరు.

మరియు, "మద్భావం" అనుపదమునందలి భావశబ్దమునకు, ఆకార మను అర్థమును వర్ణించుట యుక్తముగాదు. భావశబ్దము ధర్మవాచకము. నిర్ధర్మకమగు బ్రహ్మకు ధర్మ మెట్లు పొసగునని యనరాదు. ఇచట స్వరూపమే ధర్మము. కనుకనే శంకరులు "మద్భావం" అనుపదమునకు "వైష్ణవం తత్వం" అని భాష్యమును రచించిరి.

పూర్వమే బ్రహ్మగానున్న ఆత్మకు తిరిగి బ్రహ్మత్వ మెట్లు పొసగునని శంకింపరాదు. పూర్వము "నేను బ్రహ్మను గాను" అని విపరీతజ్ఞానము కలదు.

ఇపు డావిపరీతజ్ఞానము బ్రహ్మజ్ఞానముచే సమూలముగ నశించినది. కావున విపరీత జ్ఞాననివృత్తియే, జీవునకు బ్రహ్మభావప్రాప్తియని గ్రహింపవలెను. ౫

శ్లో. యం యంవాపి స్మరన్ భావం త్యజంత్యంతే కలేబరం,
తం తమే వేతి కౌన్తేయ సదా తద్భావభావితః ॥ ౬ ॥

అ. ఓయి అర్జునా? మానవుడు ఏయే దేవతావిశేషమును (లేక) ఏయే పదార్థమును, ప్రాణములు లేచిపోవునపుడు స్మరించుచు స్థూలశరీరమును విడచునో వాడు తద్వాసనావాసితాంతఃకరణు డగుచు, ఆయా దేవతావిశేషమును, లేక (ఆయాపదార్థమును) పొందుచున్నాడు.

సాధారణముగా ఆస్తికులు ఇంద్రాదిత్యాదిదేవతల నుపాసింతురు. కాన, భాష్యకారులు "భావ" శబ్దమును దేవతావిశేషమని వివరించిరి. వస్తుతః "యంయం భావం" అనగా 'ఏయేపదార్థమును' అనియే చెప్పవలెను. కనుక నే జడభరతునకు ప్రాణ వియోగకాలమున లేడిని స్మరించుటచే లేడిజన్మ ప్రాప్తించినది.

కావున పురుషునకు అవసానకాలమునందు సంస్కారబలమున పుణ్యవశమున ఇంద్రాదిదేవతాస్మరణము గల్గినచో ఇంద్రాదిలోకము ప్రాప్తించును. పాపవశమున స్త్రీపశ్వాదిస్మరణము గలిగినచో స్త్రీపశ్వాదిజన్మను పొందును. అని నిశ్చయము. ఇంతియెకాని ఇంద్రాదిదేవభావమును పొందుదురని కాదు. అట్లయినచో ఇంద్రలోకమున అనేకమంది యింద్రు లుండవలసివచ్చును.

దీనిచే విష్ణుమూర్తిస్మరణవలన విష్ణులోకప్రాప్తియనిగూడ సిద్ధించినది.

కనుక "అక్రుశ్య పుత్రమఘవాన్య దజామిాలోపి నారాయణేతి మ్రియమాణ ఉపైతి ముక్తిం" (పాపియగు అజామిాళుడుగూడ పుత్రునిగూర్చి నారాయణ అని యరచుచు, మరణించినవాడై ముక్తినొందెను.) అనుచోట ముక్తిశబ్దము వైకుంఠ లోకపరముగాని, బ్రహ్మసాయుజ్య మను అర్థముగలది కాదని తేలినది.

ఓయి! బ్రహ్మసాయుజ్యమను ముక్తి యొకటిలేదు. వైకుంఠలోకప్రాప్తియే ముక్తి. వైకుంఠలోకమునందున్న అనంతుడు గరుడుడు మున్నగువారు నిత్యముక్తు లనబడుచున్నారు. వైకుంఠలోకమును బొందిన శుకాదులు ముక్తులని వ్యవహారము గలదు. బ్రహ్మసాయుజ్యమే ముక్తియయినచో బ్రహ్మయందు జీవులు లయమును చెందుదురుగనుక జీవులకు స్వనాశము తటస్థించును. అయ్యది పురుషార్థము గానేరదు.

కాక నిత్యులయిన జీవులకు లయము సంభవించనేరదు. "నిరంజనః పరమం సామ్య ముపైతి దివ్యం" అను శ్రుతిననుసరించి బ్రహ్మసామ్యమే జీవులకు ముక్తి

సాయుజ్యము గాదు. ఆ సామ్యముగూడ సచ్చిదానందరూపముగాని శుద్ధసత్త్వమయ మయిన శరీరము కలిగియుండుటగాని, సర్వజ్ఞత్వాదికముగాని యగును. అని ద్వైతుల పూర్వపక్షము.

సమాధానము:- ముక్తియనగా మోక్షము. అనగా విడచుటయని నిశ్చయార్థము, దేనిని విడచుట ? అని ప్రశ్న రాగా స్థూలశరీరమును విడచుట అని యనరాదు. అట్లితరి నీ వీమోక్షము (గడ్డముడి విడిపోవుట) గూడ, మోక్షము గావలసి వచ్చును. మరేమని సుఖదుఃఖాది ద్వంద్వములను విడచుటయే మోక్ష మనవలయును. ఇయ్యది శరీరవిశిష్టునకు కలుగదు. "అశరీరంవా వసంతం నప్రియాప్రియే స్పృశతః" అను శ్రుతి శరీరములేనివానికే ఇష్టాయిష్టము లంటవని జెప్పుచున్నది. స్థూలశరీరము లేనంతమాత్రమున సుఖదుఃఖాది ద్వంద్వము లంటవనుటకు వీలు లేదు. స్వప్నదశయందు స్థూలశరీరము లేకున్నను, ద్వంద్వము లంటుచున్నవి. సుషుప్తియందు స్థూలసూక్ష్మ శరీరములు రెండును లేకపోవుచుండగా సుఖదుఃఖాది ద్వంద్వము లంటుటలేదు. కావున శరీరద్వయరహితునకే సుఖదుఃఖాది ద్వంద్వము లుండవని చెప్పవలెను. మనస్సు, ప్రాణము- యీ రెండునుండగా మనోధర్మములగు కామ సుఖదుఃఖాదులను ప్రాణధర్మములగు క్షుత్పిపాసాదులను అనుభవించకుండుటగాని, స్మరింపకుండుటగాని సంభవింపదు. ప్రియాప్రియములను అనుభవించుటవలనవలె స్మరించుటవలనగూడ సుఖదుఃఖములు కలుగును. కాని వైకుంఠలోకమునందు అప్రియానుభవము లేదు. అయినను అనుభవించిన అప్రియమును (అయిష్టమును) స్మరించుటమాత్రము తటస్థించును. అందుకు మనస్సు యుండుటయే గారణము. కాన వైకుంఠలోకము ముక్తిక్షేత్ర మెట్లగును? ఎక్కువ సుఖ ముండుటవలన సగుణముక్తిక్షేత్రమని మాత్రము ఔపచారిక వ్యవహారము గలదు. కావున వైకుంఠలోకమున స్థూలసూక్ష్మ శరీరములు రెండు నుండుటచే జీవునకు ప్రియాప్రియస్పర్శ మోక్షముండదు. మీ మతమున బ్రహ్మ సాయుజ్య మనునది లేదు. కావున ద్వైతమతమున "అశరీరమి" త్యాది శ్రుతి యప్రమాణమగును. ఆస్తికులకు శ్రుతిని యప్రమాణ మొనర్చుట తగదు. శ్రుతిని ప్రమాణ మొనర్పదలచినచో జీవులకు అశరీరత్వమును బ్రహ్మసాయుజ్యమును అంగీకరించవలయును. శరీరస్పర్శలేని శుద్ధచైతన్యమే బ్రహ్మము.

జీవుడు బ్రహ్మయందు లయించుట పురుషార్థముగాదని యనరాదు. చైతన్యరూపుడగు జీవునియం దంతఃకరణవైశిష్ట్యాంశమే నశించును. జీవునకు స్వనాశము లేదు. అంతఃకరణము లేకుండుటయే బ్రహ్మసాయుజ్యము. కావున బ్రహ్మసాయుజ్య మను ముక్తియందు జీవు డనిత్యుడగు ననుదోషము లేదు. జీవుడు బ్రహ్మభిన్నుడు.

బ్రహ్మము నిత్యమని సర్వసంప్రతిపన్నము. "నిరంజనః పరమంసామ్యం" అను శ్రుతియందలి సామ్యశబ్దమునకు పరమ శబ్దము విశేషణమగుటచే నిరతిశయ మగు (అత్యంత) సామ్యమని యర్థమగును. సామ్యమనగా సమత్వము అనగా అభేద మని నిశ్చయము. ఏది యెల్లపుడు యేకరూపముగానుండునో, అది సమ మన బడును. అనేకరూపముగా నుండునది విషమ మనబడును. కావున సమమనగా ఏకమని యర్థము. కావున ఘటనాశముచే ఘటాకాశమునకు మహాకాశసామ్యము కలిగినటుల ఉపాధినాశముచే జీవునకు బ్రహ్మసామ్యము కలుగును. పరిపూర్ణమయిన చైతన్యమును భేదింపజేయు అంతఃకరణము నశించగా జీవేశ్వరులకు భేదము కలుగనేరదు.

కావున ద్వైతులకు బ్రహ్మసాయుజ్యము లేదు. వారి మతమున 'ప్రత్యగభిన్నం బ్రహ్మ' అను జ్ఞానమే ఘటింపదు. కనుకనే వారు వారిమతరీత్యా జీవునకు బ్రహ్మ సాయుజ్యము లేదందురు. ఇట్లే నాస్తికులుగూడ వారిదృష్టిచే బ్రహ్మమే లేదందురు. కావున శ్రుతిసమ్మతముగాని స్వకపోలకల్పితమతముల నంగీకరింపదగదు. ౬

శ్లో. తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్యచ,
మయ్యర్పిత మనోబుద్ధి ర్మామేవైష్యస్య సంశయః ॥౭॥

అ. ఓయి అర్జునా? అంతకాలమునందున్న భావనాఖ్యసంస్కారము స్మరణ ద్వారమున దేహాంతరప్రాప్తికి కారణము గనుక నీవు యెల్లపుడు నాయందు భావ మునుంచి నన్ను స్మరించుచుండుము. ఎల్లపుడు నాయందు చిత్తమునుంచినగాని తుదకు నాస్మరణము లభించదు. ఇట్లు నా స్మరణమును మానక స్వధర్మమగు యుద్ధమును జేయుము. నాయందు మనోబుద్ధుల నుంచినవాడ వగుచు నన్ను బొందు దువు. అందు సంశయము లేదు.

ఓయి! ఆత్మభజనలక్షణమగు జ్ఞాననిష్ఠయందు సన్న్యాసులకే యధికారము. అజ్ఞానులకు కర్మయం దధికారము. ఇట్లుండ శ్రీకృష్ణుడిచట "నన్నెల్లపుడు స్మరించుము, స్వధర్మము నాచరింపుము" అని, యర్జునునకు జ్ఞానకర్మల రెంటిని యె ట్లుపదేశించెను? వెనుకటి గ్రంథమున జ్ఞానకర్మలు భిన్నపురుషానుష్ఠేయములని గదా! చెప్పెను. పోనీ ఇచట భిన్నకాలానుష్ఠేయములని చెప్పెనన్నచో నదియు పొసగుట లేదు. మూలమునందు "సర్వేషు కాలేషు" అని యుండుటచే యుద్ధ మను స్వధర్మమును అనుష్ఠించునపుడుగూడ భగవద్భజనము కర్తవ్యమని చెప్పిన ట్లగపడుచున్నది. ఇక యుద్ధాతిరిక్తమయిన సర్వకాలములయం దని చెప్పుటగూడ నుచితముగాదు. "మయ్యర్పిత మనోబుద్ధిః" నాయందు మనోబుద్ధులనుంచి యని జెప్పుటచే యుద్ధకాలమునగూడ భగవద్భజనము కర్తవ్యమని నిర్ణయమగుచున్నది.

మరియు లోగడ "కురుకర్మైవ తస్మాత్త్వం" నీవు కర్మనే చేయుమని చెప్పి ఇప్పుడు "మా మనుస్మర యుధ్యచ" అని, చకారముచే కర్మజ్ఞానసముచ్చయము నె ట్లుపదేశించును ? కావున నిచట "మామనుస్మర యుధ్యచ" అని విధించుటచే జ్ఞానకర్మసముచ్చయము శ్రీకృష్ణునకు సమ్మతమని స్పష్టమగుచున్నది. అనినచో, కాదు.

అర్జునుడు తత్త్వవేత్తకాడు. గనుక జ్ఞాననిష్ఠయం దధికారము లేదని తలచి, కర్మయే చేయుమని పూర్వము చెప్పెను. ఇప్పుడు తానుజేసిన ఆత్మోపదేశమహిమచే నర్జునుడు, తత్త్వవేత్తలలో శ్రేష్ఠుడని తలంచి, 'జనకాదులవలె నీవుగూడ లోకసంగ్రహముకొరకు కర్మను చేయుము. జ్ఞాననిష్ఠయం దుండుము' అని చెప్పెను. గనుక పూర్వాపరవిరోధము లేదు.

నీవు మోక్షముకొరకు యుద్ధమును జేయుమని చెప్పనందున, నింతమాత్రముచే కర్మజ్ఞానసముచ్చయము సిద్ధింపదు. కర్మజ్ఞానసముచ్చయమే మోక్షము నిచ్చునను వాదము ఇంతకుమున్నే నిరాకరింపబడినది.

N. B "మామనుస్మర" అను మూలవాక్యమునకు సగుణబ్రహ్మచింతన మర్థమైనచో, నిర్గుణబ్రహ్మజ్ఞానమునకు కర్మసముచ్చయము విరుద్ధముగాని, సగుణబ్రహ్మోపాసనమునకు కర్మసముచ్చయము విరుద్ధముగాదు. కనుక సముచ్చయవాదమునుగురించిన పైపూర్వోత్తరపక్షముల కవకాశములేదు. కాని, "మామనుస్మర" అను మూలవాక్యమును భగవత్స్వరూపానుసంధానపరముగ వ్యాఖ్యానించినచో, పైపూర్వోత్తరపక్షముల కవకాశ మేర్పడును. ఈ మార్గమును ఆనందగిరిపండితులు తమవ్యాఖ్యానమునందు సూచించిరి. రామరాయులుగూడ సామార్గమునే ద్రొక్కిరి. కాక, నీమధ్యమకాండమునందుగూడ భక్తి, ఉపాసన, చింతనము అనుస్మరణము, మున్నగుపదములను నిర్గుణబ్రహ్మజ్ఞానపరముగ రామరాయకవీంద్రు లన్వయింపదలచినట్లు వ్యక్తమగుచున్నది.

ఓయి ! కర్మజ్ఞానములు యేకపురుషానుష్ఠేయములు కావని, పూర్వము చెప్పియుండ, నిపుడు లోకసంగ్రహబుద్ధితో మాత్రము రెంటిని పార్థుడాచరించుట యెట్లు పొసగును ? వినుము. కర్తృత్వాభిమానపూర్వకమయిన కర్మనిష్ఠకు జ్ఞాననిష్ఠతో సాంగత్యము కుదరదని వెనుక జెప్పబడినది. కర్తృత్వాభిమానరహితమయిన కర్మలు కర్మలే కావు (అనగా వానియందు కర్తృత్వముండదు. గనుక, ఆ రెంటికిని యేకపురుషానుష్ఠేయత్వము కుదురును. కావున, తత్త్వవేత్తయగు అర్జునునిచేగాని, జనకాదులచేగాని జేయబడుకర్మ, కర్మగాదు. వాసుదేవునిచే జేయబడు కర్మవలె, అకర్మయే యగును.

కావున ఓయి అర్జునా! నీకు తత్త్వజ్ఞానము లేనిచో కర్మయందే యధికారము కనుక స్వధర్మమగు యుద్ధము నాచరింపుము. తత్త్వవేత్తవయినచో నాదు నిజరూపమును స్మరించుచునే లోకసంగ్రహముకొరకు జనకాదులవలె కర్మను ఆచరింపుము. అని శ్రీకృష్ణు డర్జునున కుపదేశించినట్లు సిద్ధమయినది.

సన్న్యాసిగాని యర్జునునకు, ఆత్మభజనము (జ్ఞాననిష్ఠ) యెట్లు పొసగునని? యనరాదు. క్షత్రియులకు సన్న్యాసాశ్రమ స్వీకారము లేకున్నను జ్ఞాననిష్ఠ కనిపించుచున్నది. అందుకు జనకుడే దృష్టాంతము. ఆశ్రమస్వీకారము లేకున్నను క్షత్రియుడగు జనకుడు మహాజ్ఞాని యయ్యెను.

అర్జునుడు జ్ఞానియయినను ఫలాభిసంధ్యహంకార రహితమయిన యుద్ధకర్మయందు అధికారము కలదు. ఫలేచ్ఛారహితమయిన కర్మ కర్మగాదని పలుసారులు చెప్పబడినది. తూష్ణీంభావము మాత్రమే యకర్మగాదు.

గృహస్థులయిన బ్రాహ్మణులకు గూడ జ్ఞాననిష్ఠయం దధికారముగల దనరాదు బ్రాహ్మణులకు జ్ఞాననిష్ఠయం దధికారము నొసంగుటకే శ్రుతులు సన్న్యాసమును విధించినవి.

"సర్వధర్మాన్ పరిత్యజ్య" అను శ్లోకముచే నర్జునునకు గూడ సన్న్యాసము విధింపబడినదికదా? లేదు. సర్వపరికరములను విడువుమనియే యచట జెప్పబడినది. రాజ్యాదిపరికరములుండగా విషయవ్యాకులమయిన చిత్తము ఆత్మయందు ఏకాగ్రతను జెందదు.

అయితే ప్రకృతము రాజ్యాది పరికరము లుండగా జ్ఞాననిష్ఠ యేల నుపదేశింపబడినది? పరికరములున్నను జనకాదులవలె చిత్తవిక్షేపము లేనపుడు జ్ఞాననిష్ఠ నుపదేశింపవచ్చును శ్రీకృష్ణుడు "దేహభృతాంవర" అని పార్థుని సంబోధించుటచే దన యుపదేశమున పార్థుడు జనకాదులలో సమానుడయినట్లు శ్రీకృష్ణుని హృదయము విదితమగుచున్నది.

ఓయి అర్జునా! నీవు జనకాదులవలె దృఢమయిన జ్ఞానము గలవాడవయినచో సర్వధర్మపరిత్యాగమును చేయకయే నిరంతరము నన్ను స్మరించుము. యుద్ధమును చేయుము. దృఢమయిన జ్ఞానము లేనిచో నిపుడు యుద్ధమునే చేయుము. పిదప సర్వధర్మములను పరిత్యజించి నన్నే శరణు బొందుము. అని శ్రీకృష్ణుని యుపదేశమని దేలినది.

కనుకనే అప్పుడప్పుడు శ్రీకృష్ణుడు పార్థుని తత్త్వవేత్తయనియు, అతత్త్వవేత్తయనియును, నిర్దేశించుట పొసగుచున్నది. శాస్త్రాధికారులుగూడ రెండురకముల నుందురు. కనుకనే శ్రీమహావిష్ణువు చతుర్ముఖబ్రహ్మకు 'నీవు నన్ను దలచుచు,

ప్రపంచము సృజించినచో కల్పవికల్పములయందు వ్యామోహమును జెంద' వని జెప్పినట్లు, శ్రీకృష్ణుడు పార్థునకుగూడ, 'తత్త్వవేత్తయగు జనకునివలె నన్ను నిరంతరము స్మరించుచు, విహితకర్మ నాచరింపు' మని చెప్పెను.

కావున, తత్త్వవేత్తయగు అర్జునునకు జ్ఞాననిష్ఠయుం దున్నను యుద్ధము నందు ప్రవృత్తి జనకాదులకువలె బ్రహ్మాదులకువలెయు పొసగుచున్నది.

ఓయి! మరణకాలమునందున్న ఆత్మస్మరణము, కదా ముక్తిహేతువు. అయ్యది సర్వకాలములందును ఆత్మభజనముచేసినగాని లభింపదు. అందువలన శ్రీకృష్ణుడు అర్జునునకు, ఎల్లకాలము నన్ను స్మరింపుమని జెప్పవలసియుండగా యుద్ధమును జేయుమని యెట్లుచెప్పెను? వినుము. ఇచట యుద్ధము చేయుమని విధింపబడుట లేదు. యుద్ధమును చాలించుట వలదని నిషేధించబడుచున్నది. గీతాశాస్త్రము నివృత్తిలక్షణముగాని ప్రవృత్తిలక్షణము గాదు.

ముముక్షువగు తత్త్వవేత్తగూడ లోకసంగ్రహము కొరకు ఐహికప్రతిష్ఠను సంపాదింపవలెను. అట్లులేనిచో లోకములో అందరు తత్త్వవేత్తల మని తలంచుచు, వా రిచ్చవచ్చినట్లు నటించుచు అధోగతిని చెందుదురు. కనుక తత్త్వవేత్తలకుగూడ లోకానుగ్రహమును జేయుట ఆవశ్యకము.

ఇట్లైనచో తత్త్వవేత్తయగు బ్రాహ్మణుడు గృహస్థుగానుండి కర్మయే యాచరింపవలెనుగాని, సన్యసింపవలదుగదా? కాదు, అట్టివారు లోకసంగ్రహార్థము సన్యసించియే తీరవలయును. సర్వసాధారణమయిన త్రోవనుంచి మరల్పి లోకమును శాస్త్రవిహితమార్గమునందు ప్రవేశపెట్టుటయే లోకసంగ్రహము, సన్న్యాసము, విహితమార్గముకాని, అపమార్గముకాదు. శ్రుతిసిద్ధమయిన త్రోవ అపమార్గ మెన్నడును కానేరదు.

అట్టి సన్న్యాసముగూడ ముముక్షువగు బ్రాహ్మణునకు, జ్ఞానముకొరకే విధింపబడినది. కావున జన్మాన్తరీయమయిన సహకారకారణసామగ్రిబలమువలన తత్త్వజ్ఞానము నొందినవాడు గూడ వామదేవాదులవలె లోకసంగ్రహముకొరకు సన్న్యాసమును స్వీకరించి, గురుసన్నిధియందు వేదాంతశ్రవణమును జేయవలెను.

స్వతస్సిద్ధమయిన తత్త్వజ్ఞానముగల శ్రీ శంకరులుగూడ సన్యసించి గోవిందపూజ్యపాదగురువులయొద్ద వేదాంతశ్రవణమును చేసిరి.

ఓయి! క్షత్రియులకు సన్న్యాసము లేకున్నను జ్ఞాననిష్ఠ కలుగుననిచెప్పి, బ్రాహ్మణునకుమాత్ర మట్లు కాదందురే, బ్రాహ్మణు డేమి తప్పుచేసెను? వినుము. బ్రాహ్మణు డపరాధ మొనర్పలేదు. జన్మాంతరార్జితమయిన పుణ్యాతిశయమున బ్రాహ్మణత్వము లభించును. కావున బ్రాహ్మణుడు మహాపుణ్యశాలి. కనుకనే అతనికి

పవిత్రమయిన సన్న్యాసాశ్రమాధికారము లభించెను. అన్ని జాతులకు బ్రాహ్మణు డెట్లు పూజ్యుడో, అట్లే అన్ని ఆశ్రమములలోను సన్న్యాసాశ్రమము గొప్పది. సన్న్యాసమును స్వీకరించినవాడు తత్త్వజ్ఞానము సంపాదించక మరణించినను వానికి యమదర్శన ముండదు. ఇంద్రదర్శనము, స్వర్గప్రాప్తియు కలుగును. లేక మరల బ్రాహ్మణ జన్మయయినను లభించును. తత్త్వజ్ఞానమును సంపాదించుటకు సన్న్యాసము అంతరంగసాధనము. గృహాదిపరికరములు చిత్తవిక్షేపమును కలిగించి, వేదాంతశ్రవణాదులకు ప్రతిబంధకము లగును. కాన ముముక్షువునకు పరిగ్రహ పరిత్యాగము ఆవశ్యకము. కనుక బ్రాహ్మణుడు సన్న్యాసాశ్రమ స్వీకారయోగ్యతను సంపాదించినందున మహాసుకృతవంతుడుగాని యపరాధి గాడు.

ఇక బ్రాహ్మణుడయినను ఎవడు వైరాగ్యములేక దారాపుత్రాదులను విడువ జాలడో, ఐహిక భోగపరవశుడయిన వానికి వేదాంతశ్రవణప్రసక్తి యుండదు. "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను సూత్రమున సాధనచతుష్టయ సంపత్తిగలవానికే బ్రహ్మవిచారమునం దధికారమని బాదరాయణులు చెప్పిరి.

ఎవ్వడేని యొకానొకబ్రాహ్మణుడు గృహస్థుగానుండి, శమదమాది సంపత్తి లేకయే, కుతూహలముతో (బులపాటుచే) వేదాంతశ్రవణమునందు ప్రవర్తించుచో వాడు తా నపమార్గమునందు ప్రవర్తించి లోకమునుగూడ అపమార్గమునందు ప్రవర్తింపజేయనెంచినవాడుగాన, వాని యాచారమును ఆస్తికులు ఆదర్శముగా దీసికొనగూడదు. అంతమాత్రమున ఉత్సాహమున జేసిన వేదాంతశ్రవణము వ్యర్థ మనరాదు. వేదపాఠమువలె నాశ్రవణముగూడ సుకృత హేతువగును. ఈసంస్కార బలమున జన్మాంతరమునందు సన్న్యాసాశ్రమ స్వీకారము లభించును.

కావున ముముక్షువు, గృహస్థు నగు బ్రాహ్మణునకు, సన్న్యాసాశ్రమస్వీకార పూర్వకముగనే జ్ఞాననిష్ఠయం దధికారము. సన్న్యాసములేనిచో కర్మనిష్ఠయందే అధికారము. క్షత్రియాదులకుమాత్రము సన్న్యాసములేకున్నను జ్ఞాననిష్ఠయందుగాని కర్మనిష్ఠయందుగాని, స్వార్థముకొరకుగాని, లోకసంగ్రహార్థముగాని, అధికార మని సిద్ధించినది. ౭

శ్లో. అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్ ॥ ౮ ॥

శ్లో. కవిం పురాణ మనుశాసితార మణోరణీయాంసమనుస్మరేద్యః
సర్వస్యధాతార మచింత్యరూప మాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ॥ ౯ ॥

అ. ఓయి అర్జునా! విజాతీయ ప్రత్యయానంతరిత సజాతీయ ప్రత్యయ ప్రవాహరూపమగు యోగముతోగూడి విషయాంతరమును దలచు స్వభావములేని

మనసుతో నిరతిశయుడును, సూర్యమండలమునందున్నవాడును, సర్వజ్ఞుడును, అతి ప్రాచీనుడును, సకలప్రపంచమును నియమించువాడును, అతిసూక్ష్ముడును, సకల ప్రపంచమును విభజించువాడును, ఊహింపనలవికాని రూపము కలవాడును, సూర్యునివలె నిత్యచైతన్య ప్రకాశరూపుడును మాయాతీతుడును అగు పురుషుని యెవడు ధ్యానించునో, వాడు అట్టి పురుషుని బొందును.

మన దేహములయందున్న ఆత్మ ప్రత్యగాత్మ. సూర్యమండలమందున్న ఆత్మ పరమాత్మ. ప్రత్యగాత్మకు పురుషుడని పేరు. పరమాత్మకు పరమపురుషు డనిపేరు. కావున సూర్యమండలమునందు అధిదైవతపురుషునియొక్క నిత్యచైతన్యాత్మకమగు వాస్తవస్వరూపమే యిచట ధ్యేయమనియు ప్రాప్యమనియు జెప్పబడినది. ఇంతియె కాని కల్పితమయిన హిరణ్యశ్మశ్రుత్వాదిరూపము (బంగారుమీసములతోగూడిన రూపము) ధ్యానించమని జెప్పబడుట లేదు. హిరణ్య శ్మశ్రుత్వాదిరూపమే యచింత్యమగునుకాని సచ్చిదానందాత్మకము అచింత్యముగాదుకదా? అని యన రాదు. పరమ పురుషుని (పరమాత్మ) యొక్క పారమార్థికమయిన సచ్చిదానంద రూపము అవాఙ్మనసగోచర మగుటచే నీయదిగూడ నచింత్యమగును. కనుకనే ఈయది అజ్ఞానమున కావలదని జెప్పబడినది. హిరణ్యశ్మశ్రుత్వాదిరూపము అజ్ఞానము కావలదిగాదు. అజ్ఞానాంతర్గతమే యగును. అజ్ఞానము యొక్క ఆవలియొడ్డుచేరనిదే చైతన్యసాక్షాత్కారము సంభవించదు. అజ్ఞానమనగా సముద్రమువంటిది. దాని యావలియొడ్డయన నాశము. అంధకారావరణముగల కంటికి ఘటాదులు ప్రత్యక్షము గానట్లు అజ్ఞానావరణముగల చిత్తమునకు పరమాత్మ ప్రత్యక్షము గాడు. కావున పరమపురుషుడు (తమసఃపరస్తాత్) అజ్ఞానమున కావలివాడని జెప్పబడెను.

ఇట్టి పురుషుడు ఆదిత్యవర్ణుడని శ్రుతి చెప్పుచున్నది సూర్యుడు సమస్త ప్రపంచమును ప్రకాశింపజేయుచు ప్రకాశరూపమయిన వర్ణముతో నెట్లు యొప్పు చుండెనో అట్లే పురుషుడుగూడ సమస్త ప్రపంచమును ప్రకాశింపజేయుచు ప్రకాశ రూపమయిన చైతన్యశాలి యగుచున్నాడు. సూర్యునియొక్క ప్రకాశము దీప్తి. పురుషునియొక్క ప్రకాశము చైతన్యము. జ్ఞానము అని భేదము. కనుకనే నిత్య చైతన్య ప్రకాశుడని పురుషునకు వ్యవహారము. నిత్యచైతన్యరూపుడగు పరమ పురుషునకు కర్మఫలవిధానము మాయచే నొప్పును. నిత్యచైతన్యరూపుడగు పరమ పురుషుడే సూక్ష్మముకంటె నతిసూక్ష్మమగునుకాని హిరణ్యశ్మశ్రుత్వాది విశిష్ట పురుషుడు సూక్ష్మతరుడు (దుర్జ్ఞేయుడు గా నేరడు) సాకారపదార్థము అత్యంత దుర్జ్ఞేయ మగుట అసంభవము. "అణోరణీయాన్ మహతో మహీయాన్" అను శ్రుతి చైతన్యార్థమునందే సమన్వయించును. సాకారమయిన పదార్థము మహత్తుకంటె మహత్తు గా నేరదు.

ఇట్లైనచో అధ్యాత్మాధిదైవతముల కభేదము కలుగునుకదా? ఇష్టాపత్తియే ఒకే ఆత్మ సూర్యమండలమధ్యనుండి అధిదైవతమనియు అస్మదాదిదేహములనుండి యధ్యాత్మయనియు జెప్పబడుచున్నాడు. అధ్యాత్మాధిదైవతలకు, ఔపాధికభేదమే కాని వాస్తవభేదము లేదు.

ఓయి! సూర్యమండలమునందున్న అధిదైవతాత్మ, తన శరీరమునందున్న ప్రత్యగాత్మ - వీరిరువురు అభిన్నులైనచో శరీరమునందున్న ప్రత్యగాత్మను ధ్యానింపక సూర్యమండలమందున్న అధిదైవతాత్మను ధ్యానించుటవ్యర్థముకదా? కాదు. సాధకునకు (ఉపాసకునకు) సూర్యునియందు భక్తి కలదు. అందువలన సూర్యునియందలి ఆత్మను యుపాసించుచున్నాడు. ప్రత్యగాత్మోపాసనకు సూర్యదేవతాభక్తి ప్రతిబంధకమయినది. ఆత్మభక్తునకుగాని ఆత్మోపాసనము ఘటింపదు. సూర్యభక్తుడయిన ముముక్షువునకు ఆత్మయందు ప్రేమను కల్పించుటకొఱకే, శ్రుతి సూర్యబింబ ముపాధిగా గల పురుషుని ఉపాసింపుమని విధించినది. మహిషీస్నేహబద్ధుడగు భిక్షువునకు మహిషీఉపాధిగాగల బ్రహ్మము నుపదేశించియే గురువు ఆ భిక్షువును ఆత్మభక్తునిగ జేయును. దీనివలన ముక్తికాములగు విష్ణురుద్రాది భక్తులకు విష్ణురుద్రాది శరీరావచ్ఛిన్నమయిన ఆత్మయే ఉపాసింపదగినవాడుకాని; విష్ణురుద్రాదుల శరీర ముపాసింపదగినది గాదని సిద్ధించినది.

ఇట్లు సూర్యమండలమం దున్నపురుషుని ధ్యానింపగా ఆ పురుషునియొక్క స్వరూపసాక్షాత్కారము కలుగును. పిదప సర్వగతుడగు ఆ పురుషుడే తాను గనుక తనకు (తనఆత్మకు) ఆ పురుషునకును అభేదనిశ్చయము కలుగును, తరువాత ప్రత్యగభిన్నపరమాత్మ సాక్షాత్కారమువలన బ్రహ్మసాయుజ్యము లభించునని భావము.

ఇచట నీ భేదమును గ్రహింపవలెను. ఎవడు పరమాత్మయే ప్రత్యగాత్మయని యెల్లపుడు ధ్యానించుచు మరణకాలమునందుగూడ స్మరించునో ఎవడు సూర్యమండలమందున్న పురుషుడనే నేను అని ధ్యానించుచు, అంతకాలమునందు స్మరించునో వారిరువురు తత్త్వవేత్తలుకాన బ్రహ్మభావము నొందుదురు. ఎవడయితే పరమాత్మను హిరణ్యశ్మశ్రుత్వాది గుణములుగల సూర్యబింబమునందలి పురుషరూపునిగా ధ్యానించుచు తుదకుగూడ నట్లే స్మరించునో వాడు హిరణ్యలోకమును బొందును. ౮, ౯

శ్లో. ప్రయాణకాలే మనసాఽచలేన భక్త్యాయుక్తో యోగబలేన చైవ
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్ సతం పరం పురుష ముపైతి దివ్యమ్. ౧౦

అ. పూర్వము జ్ఞాని మరణకాలమున జేయదగిన విధానమును వివరించి యిపుడు యోగియొక్క విధానమును వివరింపుచున్నాడు.

యోగి మరణకాలమున నిశ్చలమనసుతోను ఆత్మస్వరూపానుసంధాన రూపమగు భక్తితోను చిత్తస్థైర్యలక్షణమగు యోగబలముతోను గూడినవాడై మొదట హృత్పుండరీకమునందు చిత్తమును వశపరచుకొని పిదప హృదయస్థానము నుండి బయలుదేరిన సుషుమ్నానాడిచే నాసనజయము, ఇంద్రియజయము, ప్రాణజయము, మనోజయములను క్రమముగా జేసికొనుచు కనుబొమ్మలనడుమ ప్రాణము నుంచి జాగరూకుడై ఆత్మతత్త్వమును దెలిసికొనినచో నాతడు చైతన్యరూపుడగు పరమపురుషుని బొందును. కాని రోగార్తుడై మరణింపబోవు యోగికి ఇట్టియోగము సాధ్యముగాదు. అయినను మరణహేతువగు ఒకానొకరోగము పుట్టకపూర్వమే యోగి మరణముకొరకు ప్రయత్నించవలెనని భావము. ౧౦

శ్లో. యదక్షరం వేదవిదో వదంతి విశంతి యద్యతయో వీతరాగాః
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి తత్తేపదం సంగ్రహేణ ప్రవక్ష్యే ॥౧౧॥

అ. బ్రహ్మవేత్తలు ఎవనిని అక్షరరూపునిగా (నాశరహితునిగా) చెప్పుచున్నారో వీతరాగులగు సన్న్యాసులు, ఆత్మజ్ఞానము కలుగగా ఎవనిని బొందెదరో బ్రహ్మచారులుగాని బ్రహ్మజిజ్ఞాసువులుగాని యెవనిని దెలిసికొనగోరి గురుసాన్నిధ్యమున బ్రహ్మచర్యమును (వేదాధ్యయనాదికమును) చేయుచున్నారో, అట్టి అక్షరాఖ్యబ్రహ్మను సంగ్రహముగా జెప్పెద వినుము. ౧౧

అవ॥ పరమాత్మను ప్రత్యగ్రూపునిగాను పురుషరూపునిగాను భజించుట (అనుసంధానముజేయుట) పూర్వము చెప్పబడినది. మరణకాలమునందు పరమాత్మను స్మరించుటవలన సాయుజ్యప్రాప్తిగూడ జెప్పబడినది. ఇంతమాత్రమున ఉత్తరగ్రంథ మారంభింప బనిలేదని శంకింపరాదు. ఉత్తమాధికారులకు నీ విధానమున బ్రహ్మజ్ఞానము సంభవించినను మందాధికారులకు, మధ్యమాధికారులకును ఈయది సాధ్యముగాదు. కావున వారలకు త్రోవచూపుటకు ఉత్తరగ్రంథ మారంభింపబడుచున్నది. "సయోహవై తద్భగవన్ మనుష్యేషు ప్రాయణాంత మోంకార మభిధ్యాయీత, కతమం వావసతేన లోకం జయతీతి తస్మై సహోవాచ "ఏతద్వై సత్యకామపరంచాపరంచ బ్రహ్మ యదోంకార" (ప్రశ్నోపనిషత్ ౫-౧) ఓయి! మహానుభావుడా! మనుష్యులలో నెవడు మరణించునంతవరకు ఓంకారమును ధ్యానించునో వాడు ఆ ఓంకారధ్యానముచే నేలోకమును పొందును? అని సత్యకాముడను శిష్యు డడుగగా, పిప్పలాదుడు ఓంకారము పరాపర బ్రహ్మస్వరూపమని ప్రారంభించి, ("యః పునరేతం పరం పురుషం త్రిమాత్రేణ ఓమిత్యనేనైవ అక్షరేణ పరం పురుష మభిధ్యాయీత" (ప్ర॥ ౫-3) ఏ మానవుడు అకారోకార మకారరూప

మాత్రాత్రయము గలిగి ప్లుతస్వరముతో గూడిన "ఓమ్" అను వర్ణముతో పరమ పురుషుని ధ్యానించునో వాడు బ్రహ్మలోకమును బొందును." అని చెప్పెను.

ఇట్లే కఠవల్లియందుగూడ సర్వధర్మాతీతమగు బ్రహ్మను బ్రస్తుతించి యట్టి పరబ్రహ్మకు వాచకముగాను ప్రతిమవలె ప్రతీకము (ఆలంబనము) గాను ఓంకారము బ్రహ్మజ్ఞానమునకు సాధనమని చెప్పి మందమధ్యమాధికారులకు గావలసిన ఓంకారోపాసనము చెప్పబడినది. ఇదియే గీతాశాస్త్రమునందుగూడ "కవిం పురాణ మనుశాసితారం" అనుమంత్రముచే సూచింపబడినది. ఇట్టి ఓంకారోపాసనమును యోగధారణాక్రమమును వివరింపదలచి ముందుగ్రంథ మారంభింపబడుచున్నది.

అవతారికాసంగ్రహము: ఓంకారము శబ్దమువలనను, అర్థమువలనను పరాపర బ్రహ్మస్వరూపము. అందు శబ్దమువలన అపరబ్రహ్మరూపము. అర్థమున పరబ్రహ్మ రూపము. శబ్దము బ్రహ్మకు ప్రతీకముగాన పరబ్రహ్మయగును. అర్థము బ్రహ్మయే కాన పరబ్రహ్మయగును. ఇందు పరబ్రహ్మను భజించినచో బ్రహ్మసాయుజ్యము లభించును. ఈయది యుత్తమాధికారులకు సులభము. ఇపుడు మందమధ్యమాధికారి విషయమయిన అపరబ్రహ్మవాచకమగు ఓంకారమును భజించుటవలన బ్రహ్మ లోకప్రాప్తిద్వారమున క్రమముక్తి కలుగునని చెప్పబడుచున్నది.

శ్లో. సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్ ॥ ౧౨ ॥

శ్లో. ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్
యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్ ॥ ౧౩ ॥

అ. జ్ఞానసాధనములగు చక్షురాదీంద్రియములను నిగ్రహించుకొని హృదయ కోశమునందు మనస్సును నిరోధించి వశీకృతమగు మనసుతోగూడ ప్రాణవాయువును బ్రహ్మరంధ్రమునం దునిచి యోగధారణకు బ్రవర్తించినవాడై బ్రహ్మవాచకమగు ఓంకారము నుచ్చరించుచు ఓంకారవాచ్యమగు బ్రహ్మను స్మరించుచు దేహత్యాగ రూప మరణమును యెవడు బొందునో వాడు స్వర్గాదులకంటె నుత్తమగతియగు హిరణ్యగర్భలోకమును బొందును.

ఇచట "మామనుస్మరన్" అని నిర్దేశించుటచే నీ యోగి ఓంకారమును వాచకరూపముతో నుపాసించుచున్నాడుగాని ప్రతీకరూపముతో నుపాసించుటలేదని తెలియుచున్నది. ఓంకారమును ప్రతీకరూపముతో నుపాసించువానికే ఓంకారము నందు బ్రహ్మబుద్ధి యుండును. అన్నాదులయందు బ్రహ్మబుద్ధివలెను సాలగ్రామా దులయందు విష్ణుబుద్ధివలెను వాచకరూపముతో నుపాసించువానికి నోంకారము

నందు బ్రహ్మబుద్ధియుండదు. వానికి పరోక్షేశ్వరస్మరణమేకాని ప్రత్యగభిన్నేశ్వర స్మరణముండదు. కావున వీనికి హిరణ్యాగర్భలోకప్రాప్తియేగాని సాక్షాన్ముక్తి లేదు.

శ్లో. అనన్యచేతా స్సతతం యోమాం స్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్తస్య యోగినః ॥౧౪॥

అ॥ ఓ యి! అర్జునా? ఏయోగి ఇతరవిషయములను చింతింపక, ఎల్లప్పుడు నన్నే స్మరించుచుండునో న్నాయందే యెల్లపుడు చిత్తము నిలిపియున్న నాయోగికి నేను సులభముగా బొందదగుదును.

ఈ శ్లోకమునందుః జెప్పబడిన ఈశ్వరస్మరణము అభేదజ్ఞానరూపమగుచో, సాక్షాన్ముక్తికి కారణమగును, భేదజ్ఞానరూపమగుచో క్రమముక్తికి గారణమగును.

లేక "సర్వద్వారాణి" "ఓమిత్యేకాక్షరం" అను రెండు శ్లోకములచే మంద బుద్ధులకు క్రమముక్తిఫలమునిచ్చు ఓంకారోపాసనము జెప్పబడినవి. మధ్యమ బుద్ధులకు అభేదోపాసనము యిచట విధింపబడినది. ఏ ముముక్షువునకు అనేక పర్యాయములు వేదాంత శ్రవణము జేసినను, ప్రతిబంధము లెక్కువగా నుండుటచే అభేదజ్ఞానము కలుగదో, వాడు యెల్లపుడు మంత్రమునువలె "అహం బ్రహ్మాస్మి" అని జపించుచునే యుండును. ఈ జపముచే ప్రతిబంధములు నశించినచో నీ జన్మమునందే ముక్తి కలుగును. ప్రతిబంధములు మిగిలియున్నచో కాలాంతరమున ముక్తి కలుగును. ఏ ముముక్షువునకు బుద్ధిమాంద్యమువలన వేదాంతశ్రవణమునందుగూడ నధికారము లేదో, వాడు ఓంకారోపాసనమునే చేయవలెనని భావము.

ఇట్లు మందాధికారులకు, మధ్యమాధికారులకును బ్రహ్మప్రాప్త్యుపాయముగా ఓంకారోపాసనము, "అహంబ్రహ్మాస్మి" అను నభేదోపాసనమును శ్రీకృష్ణుడుచేసిన ప్రతిజ్ఞప్రకార ముపదేశింపబడినది.

రామానుజమతము: "అభ్యాసయోగయుక్తేనచేతసా నాన్యగామినా" (౮) అను శ్లోకమునందు ఐశ్వర్యకాములకు పరమేశ్వరోపాసనా విధానమును "యదక్షరం వేదవిదో వదంతి" "సర్వద్వారాణి సంయమ్య" "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" అను మూడు శ్లోకములయందు మోక్షకాములయొక్క ఉపాసనావిధానమును "అనన్యచేతా స్సతతం" అను ప్రకృత శ్లోకమునందు జ్ఞానులయొక్క ఉపాసనావిధానమును శ్రీకృష్ణుడు జెప్పెనని రామానుజులు వ్యాఖ్యానించిరి. ఈయది యుక్తముగాదు. "అభ్యాసయోగ యుక్తేన" అను శ్లోకముయొక్క ఉత్తరార్థమునందు "పురుష ముపైతిదివ్యం" అని దివ్యపురుషప్రాప్తి చెప్పబడినది. ఐశ్వర్యకాముడు దివ్యపురుషునిబొందుట అసంభవము. మరియు పరమపురుషప్రాప్తియనగా

పరమపురుషునియొక్క ఐశ్వర్యప్రాప్తి యని జెప్పుట యుక్తముగాదు. అట్టితఱి ముఖ్యార్థమును పరిత్యజించి, లాక్షణికార్థమును స్వీకరించుట యను దోషము వాటిల్లును. కాక, నీ శ్లోకములు ఐశ్వర్యకాముని విషయమనుటకు ప్రమాణము లేదు. మూలమునం దెచ్చటను ఐశ్వర్యకాముడగు భగవద్భక్తుడు పరమపురుషుని బొందునని జెప్పలేదు. అట్లు చెప్పియున్నచో ముఖ్యార్థమునకు బాధ కలిగినందున లాక్షణికార్థము గల్పింపనగును.

మఱియు నైశ్వర్యకామునకు పునరావృత్తిని బొందునని స్వయముగ శ్రీకృష్ణుడే చెప్పియున్నాడు. శ్రీకృష్ణుడే విష్ణువు అతడే పరమపురుషుడు. విష్ణువుయొక్క ఐశ్వర్యమునొందుట యన విష్ణుసారూప్యమునొందుటయే. ఇట్టి సారూప్యము విష్ణులోకమును జేరినవారలకే కలుగును. విష్ణులోకమునందున్నవారలే శంఖ చక్ర చతుర్భుజాదులతో విరాజిల్లుట పొసగును. విశిష్టాద్వైతులమతమున విష్ణులోకము పునరావృత్తిరహితమని యొప్పియుండ నైశ్వర్యకాములయిన విష్ణుభక్తులు విష్ణుసారూప్యము నొంది తిరిగి వత్తురని జెప్పుట యెట్లు పొసగును? మఱియు విశిష్టాద్వైతమతమున సాయుజ్యముక్తి లేదు సాలోక్య, సామీప్య, సారూప్యములు మూడేముక్తులు. ఇట్టితఱి సారూప్యముక్తిని బొందినవారలకు పునరావృత్తియున్నచో సాలోక్య, సామీప్య ముక్తులను బొందినవారలకు గూడ పునరావృత్తి కలుగునుగాన విష్ణులోకము పునరావృత్తిరహితమను మాట కర్థమే లేకపోవును.

"మా ముపేత్యతు కౌంతేయ" అను చోట విష్ణుసాయుజ్యమని అర్థమును జెప్పినచో స్వమతమును వీడుట, పరమతమున ప్రవేశించుట యగును. లేక విష్ణులోకమును అని యర్థము జెప్పినచో విష్ణుసారూప్యమునొందిన ఐశ్వర్యకాములకు గూడ పునరావృత్తిలేదని స్వవచోవ్యాఘాత (తనమాట కొట్టుబడుట) మేర్పడును. కావున రెండుపక్షములయందును మెడ కురి యేర్పడును.

మరియు విష్ణులోకముగూడ పునరావృత్తి గలదగుచో "ఆ బ్రహ్మభువనాల్లోకా" అనునది కుదరదు. ఐశ్వర్యకాములు బ్రహ్మలోకమును బొంది తిరిగి వత్తురని యనదగును. ఐశ్వర్యకాములగు విష్ణూపాసకులకు చతుర్ముఖాది లోకప్రాప్తి మంచిది కాదు. "పరమం పురుష ముపైతి" అని విష్ణులోకప్రాప్తియే జెప్పబడినది.

కావున ఐశ్వర్యమునుగోరు విష్ణుభక్తులకు విష్ణులోకప్రాప్తిలేదు. విష్ణుసారూప్యముగూడ లేదు. వారికి మనుష్యలోకముగాని, స్వర్గలోకముగాని ప్రాప్తించును కావున వారలకు పునరావృత్తియే నిజము.

వైకుంఠైశ్వర్యమును గోరువారికి మాత్రము విష్ణులోకము సంభవించును. పునరావృత్తియు నుండదు. వైకుంఠైశ్వర్యమును గోరుట నిష్కామరూపముగాని,

సకామముగాదు. కావున నిష్కాములు, మోక్షకాములకు విష్ణులోకప్రాప్తియు, అపునరావృత్తియు నుచితము. వీరే కైవల్యకాములు. కైవల్యమనగా మోక్షము. మోక్షమనగా రామానుజమతమున వైకుంఠలోకప్రాప్తియే. అట్టితరి జ్ఞాని గూడ మోక్షకాముడే కాన, ఆతనిని వేరు చేయరాదు.

ఇక కైవల్యమనగా ఆత్మస్వరూపమనియు, దానిని కైవల్యకాములు పొందుదురనియు, జ్ఞానిమాత్రము పరమాత్మను బొందుననియు ననరాదు. కైవల్యకాముడు పొందునట్టి ఆత్మస్వరూపము కైవల్యకాముడే కాన, వానిని వాడు బొందుట సంభవింపదు. కేవలాత్మకు, పరమాత్మకును భేదము పొసగదు. ఆత్మకు, పరమాత్మకు భేదమున్నచో జ్ఞాని పరమాత్మను బొందుట సంభవించదు.

నిరవయవులగు ఆత్మపరమాత్మలకు క్షీరనీరన్యాయముచే సంయోగము కుదరదు. మరియు జ్ఞానమే యాకారముగాగల ఆత్మపరమాత్మలకు క్షీరనీరములకువలె భేదములేదు. పాలయందు నీరు లీనమయినట్లు పరమాత్మయందు జీవాత్మ అట్లు లీనముగాదు. అట్టితరి, జీవునియొక్క స్వరూపమే లయమయినందున అయ్యది జీవాత్మకు పురుషార్థము కానేరదు.

జీవాత్మ పరమాత్మయందు ప్రవేశించి ఆనంద మనుభవించునని యనరాదు. పరిపూర్ణుడు చైతన్యఘనుడు నగు పరమాత్మయందు జీవునకు ప్రవేశావకాశమే లేదు. అట్టి యవకాశమే యున్నచో పరమాత్మ అపరిపూర్ణుడే యగును. ఇది యంతయు గీతాశాస్త్రమునకును శ్రుతిసిద్ధాంతమునకును విరుద్ధమగును.

కావున జ్ఞానికి, కైవల్యమునకును భేద మిసుమంతయులేదు. వా రుభయులు బ్రహ్మము నే బొందుదురు. బ్రహ్మ నిత్యప్రాప్తుడయినను, మాయచే అప్రాప్తునివలె దోచుచుండును. కాన యిపుడు బొందబడునని శాస్త్రము చెప్పుచున్నది.

మరియు "ఆబ్రహ్మభువనాల్లోకాః, పునరావర్తినోఽర్జున" "మాముపేత్య తు కౌంతేయ! పునర్జన్మ నవిద్యతే" అనుగీతాస్తుతి భగవత్ప్రాప్తియే పునరావృత్తి రహితమని చెప్పుచున్నది. ఆత్మ భగవంతునికంటె భిన్నుడయినచో ఆత్మప్రాప్తి పునరావృత్తికలదియే యగును. అక్షరపురుషప్రాప్తి యన భగవత్ప్రాప్తికాని ఆత్మప్రాప్తిగాదు. అక్షరశబ్దము పరమాత్మయందే శ్రుతిప్రసిద్ధమయియున్నది.

మరియు శత్రువు లపహరించిన రాజ్యమును, దైవానుగ్రహమున రాజు మరల పొందునట్లు కామక్రోధాదులచే నపహరింపబడిన ఆత్మస్వరూపమును, భగవదనుగ్రహాదులచే జీవుడు మరల పొందునని రామానుజీయుల ఆశయము. ఈయది కుదరదు రాజుకంటె రాజ్యము వేరు. జీవునికంటె ఆత్మస్వరూపము వేరు గాదు. ఆత్మకు సచ్చిదానందస్వరూపము అపృథక్సిద్ధము.(ఆత్మకంటె వేరుగ నుండునదిగాదు)

ఘటమునకు కంబుగ్రీవాదిమత్త్వమే స్వరూపము. కంబుగ్రీవత్వాదికమను స్వరూపము లేనిచో ఘటమే లేదు. రాజునకు రాజ్యము స్వరూపముగాదు. స్వరూపాతిరిక్తము. కావున నీయది అపహరింపబడవచ్చును. తిరిగి పొందవచ్చును. ఆత్మస్వరూపము యితరులచే నపహరింపబడ నేరదు. అట్లపహరింపబడుచో ఆత్మనాశమే యగును. కావున ఆత్మస్వరూపము పొందబడ నేరదు. ఏది యుపాయములచే బొందబడునో అయ్యది అనిత్యమగును.

ఆత్మస్వరూపమును బొందుటయనగా ప్రకృతి వియోగమును బొందుటయని అనదగదు. అసంగుడగు ఆత్మకు వాస్తవముగా ప్రకృతిసంబంధమే లేదు. "అసంగో హ్యాయం పురుషః". అను శ్రుతి యిందు ప్రమాణము. ఆత్మ ప్రకృతిసంస్పృష్టుడగుచో సర్వవ్యాపకుడు కానేరడు. బుద్ధ్యాదులతో గూడిన జీవునకు సర్వగతత్వమంగీకరింపలేదు.

కాక ప్రకృతివియోగము పరమాత్మకే దుర్లభమగుచుండ, నయ్యది జీవునకెట్లు సంభవించును? చిదచిద్విశిష్టుడగు పరమాత్మ ప్రకృతివియుక్తుడు గానేరడు గదా? ప్రకృతి విశిష్టుడయినను ప్రకృతి వియుక్తుడగునని యనరాదు. విశిష్టత్వ, వియుక్తత్వములు వ్యధికరణములు. అనగా ఒకేవ్యక్తికి నొకదానితోగూడి యుండుట, గూడకయుండుటయు సంభవింపదని భావము.

మరియు సగుణముక్తి, నిర్గుణముక్తి అని రెండువిధములయిన ముక్తియే శాస్త్రసిద్ధమయియున్నది. అందు బ్రహ్మసాయుజ్యము నిర్గుణముక్తి. సత్యలోక ప్రాప్తి సగుణముక్తి. ఇట్లుండ రామానుజులు, అక్షరప్రాప్తియను మూడవముక్తిని కల్పించిరి. ఇయ్యది శాస్త్రవిరుద్ధము.

మరియు అక్షరుని బొందిన జీవులు ప్రకృతివియుక్తులగుచు, పరమాత్మను బొందక నెట్లుందురు? పరమాత్మ పరిపూర్ణుడు, అన్నిటికి నాధారభూతుడు. ఆకసమును బొందకుండ యుండ నేరదు. అక్షరుని బొందిన జీవులు పరమాత్మయందే యుందురని అంగీకరించినపుడు జ్ఞానికి, కైవల్యకామునకు భేదమేమి? ఇంక జ్ఞానిగూడ వైకుంఠ లోకమును బొందునని అంగీకరించుచో అపుడు ఐశ్వర్యకామునకు, కైవల్యకామునకు భేదమే లేకపోవునుగాన రామానుజులు అధికారులు ముగ్గురని గల్పించుట అనుచితమగును. కావున రామానుజవ్యాఖ్యానము సమంజసము గాదు. ౧౪

శ్లో. మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్
నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాంగతాః ॥ ౧౫ ॥

అ. ఓయి అర్జునా! నా సాయుజ్యమును బొందిన మహానుభావులు మోక్షమను గొప్పపదవి నొందుదురు. కాన వారు దుఃఖాకరము అశాశ్వతము నగు పునర్జన్మను ( అనగా సంసారమును అని భావము ) పొందరు.

బ్రహ్మసాయుజ్యమును బొందినవారు ముక్తిని బొందిరని జెప్పుట పునరుక్తము. ముక్తిని బొందినవారు బ్రహ్మసాయుజ్యమును బొందిరని జెప్పుటయు పునరుక్తమే యగును. కావున నీ శ్లోకమున "మాముపేత్య" "సంసిద్ధింగతాః" అను పదములు రెండును పునరుక్తములుగదా? అని యనరాదు, సంసిద్ధియను పదమునకు చిత్తశుద్ధియను నర్థమును నివారించుటకు "మాముపేత్య" అను పదమున్ను, "మాముపేత్య" అను పదమునకు (మాం సేవిత్వా) నన్ను సేవించి అను నర్థమును నివారించుటకు "సంసిద్ధింగతాః" అను పదమున్ను ప్రవర్తించినవి కాన పునరుక్తదోషములేదు. కావున పరమేశ్వరుడు సులభుడయినచో సాధకునకు పునరావృత్తిరాహిత్యము సంభవించునని భావము.

ఈ శ్లోకము సాయుజ్యముక్తిని అంగీకరింపని విశిష్టాద్వైతులకు మెడ యురియగుచున్నది ఇందు "మాముపేత్య" అని సాయుజ్యము వినబడుచున్నది. "మామ్" అను పదమునకు మత్సాలోక్యము (నా సాలోక్యము) నా సారూప్యము నా సామీప్యము అని యర్థమని యనరాదు. ముఖ్యార్థమును విడచి లాక్షణికార్థమును గల్పించుటలో కారణముకాని ప్రమాణముకాని లేదు. "రాజానముపేత్య" (రాజును సమీపించి) అను వాక్యములయందువలె "మాముపేత్య" అను వాక్యమునందుగూడ "పరమేశ్వరుని సాన్నిధ్యమును జెంది" అనియే ముఖ్యార్థమని యనరాదు. "రాజాన ముపేత్య" అను వాక్యమునందు రాజును సాక్షాత్తుగా బొందుట బాధితముగాన రాజుయొక్క సన్నిధి యను అర్థము కల్పింపబడినది. ప్రకృతమున ముఖ్యార్థమునకు బాధలేదుకాన యితరార్థమును గల్పింపదగదు. కాన యిచట పరమేశ్వరసాన్నిధ్యమను అర్థము ముఖ్యార్థముగాదు.

మరియు "కాంతాం ప్రాప్య" (స్త్రీని బొంది) అను వాక్యమునందువలె "మాముపేత్య" అనుచోటగూడ జీవేశ్వరులకు సంయోగమే వివక్షితమని యనరాదు. సావయవ పదార్థములకు అవయవ సంయోగద్వారమున సంయోగము సంభవించినను, నిరవయవులగు జీవేశ్వరులకు సంయోగము సంభవించదు. జీవేశ్వరులకు నిరవయవత్వము అంగీకరింపబడినది, కనుకనే ఈశ్వరునకు చిదచిద్విశిష్టత్వము కుదరనందున ఈశ్వరుడు చిదచిద్విశిష్టుడను వాదముగూడ అత్యంతము అయుక్తము.

సశరీరుడగు ఈశ్వరుని, సశరీరురాలగు లక్ష్మీదేవిగాని, సశరీరుడగు అనంతుడుగాని సంబంధించియున్నటుల సశరీరుడగు జీవుడు గూడ పరమేశ్వరునితో గలసియుండునని యనరాదు. ఉపాధివలన నేర్పడిన కలయిక నిత్యము కానేరదు. ఇట్టి కలయికకు వియోగముగూడ నుండును. ఇట్టితరి, మరల తిరిగిరాడని జెప్పుట యుక్తముగాదు. లక్ష్మీదేవిగూడ విష్ణుమూర్తిని విడచి పాలసముద్రమున మరల పుట్టినది. శరీరసహితులగు అనేకమంది జీవులు పరిచ్ఛిన్నుడగు విష్ణుశరీరముతో

సంయోగించియుండుట సంభవించదు. గరుడుడు, విష్వక్సేనుడు మున్నగువారు విష్ణుని విడచియే యుండిరి. ఇట్టి సశరీరుడగు ఈశ్వరుడే రామకృష్ణాది రూపమున నవతరించుచు మరల వచ్చుచుండ వాని భక్తులగు జీవులు మరల వత్తురనుట వేరుగ జెప్పనక్కరలేదు.

కావున ఈశ్వరుడు అశరీరుడేగాని శరీర విశిష్టుడు గాడు. జీవుడు అజ్ఞానముచే శరీరసహితుడయినను విద్యవలన శరీరబంధమునుండి విముక్తుడయి ఈశ్వరభావమును (అనగా అశరీరత్వమును) మోక్షము నొందును. తిరిగి సంసారమునకు రాడు. ౧౫

శ్లో. ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున
మాముపేత్య తు కౌన్తేయ! పునర్జన్మ న విద్యతే ॥ ౧౬ ॥

అ. కృష్ణా! నీ సాయుజ్యమును బొందినవారు తిరిగి సంసారమునకు రారుసరే? మరెవరినిబొందిన వారు తిరిగివత్తురు? వినుము, సమస్తలోకములకు పైననుండునదియు బ్రహ్మాండమున కావలనుండునదియు, హిరణ్యగర్భుడు ప్రభువుగాగలదియు, రెండు పరార్థముల సంఖ్యాకాలముండునదియు, సగుణముక్తికి స్థానమగునదియు, అర్చిరాది మార్గమున కావల హద్దు అగునదియు నగు సత్యలోకము బ్రహ్మభువన మనబడును. దానితోగూడ తదవాంతర లోకములగు కైలాస వైకుంఠాది లోకములన్నియు పునరావృత్తి గలవగుచున్నవి. ఇచట ఆఙ్ అను నవ్యయమునకు అభివిధి యర్థము. మర్యాదార్థము జెప్పుట యుచితముగాదు. అట్లు చెప్పినచో బ్రహ్మలోకము పునరావృత్తిరహితము గావలసివచ్చును. అం దిష్టాపత్తిని జూపదగదు. "ఏది అనిత్యమో, అది పునరావృత్తి కలదు. ఏది నిత్యమో అయ్యది పునరావృత్తి లేనిది" అను వ్యాప్తి సర్వసంప్రతిపన్నమయి యున్నది. "తత్సత్యం, అతోఽన్యదార్తమ్" ఇత్యాది శ్రుతులు బ్రహ్మభిన్నమంతయు అనిత్యమని చెప్పుచున్నందున బ్రహ్మభిన్నమగు సత్యలోకము నిత్యమని నిర్ణయింప నలవికాదు.

మరియు "బ్రహ్మణాసహ తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే। పరస్యాంతే కృతాత్మానః ప్రవిశంతి పరంపదమ్" అను స్మృతి మహాప్రలయమునందు హిరణ్యగర్భునితోగూడ జ్ఞానులందరు పరమ పదమును బ్రవేశింతురని జెప్పుచు, అధిపతియగు బ్రహ్మతోగూడ సత్యలోకమునకు నాశమును చెప్పుచున్నది.

ఓయి! ప్రకృతశ్లోకమున ఆఙ్‌నకు అభివిధ్యర్థము నంగీకరించి బ్రహ్మలోకము ఆవృత్తిసహితమని చెప్పినచో, "శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతశ్శాశ్వతే మతే, ఏకయా యాత్యనావృత్తిం అన్యయా ఆవర్తతే పునః" అను ముందు జెప్పబోవు గీతాశ్లోకము, శుక్లగతి (అర్చిరాది మార్గము) వలన బొందెడి బ్రహ్మలోకము

పునరావృత్తిరహితమని చెప్పుచున్నందున గీతలోని పూర్వోత్తరవాక్యములకు పరస్పర విరోధము సంభవించునుగదా? నిజమే, ఆ విరోధమును ఇట్లు పరిహరించుకొనవలెను.

ఎట్లన ఈ మహాప్రళయమునందు బ్రహ్మలోకము నశించి ప్రళయావసానమునందు మరల బ్రహ్మలోకము పుట్టును. కాన బ్రహ్మలోకమునకు పునర్జన్మయున్నందున పునరావృత్తి స్వభావముగలదియే బ్రహ్మలోకము.

అయితే నశించిన బ్రహ్మలోకము మరల పుట్టకున్నను అత్యంతసాదృశ్యమువలన అదియే యీ బ్రహ్మలోకమను ప్రత్యభిజ్ఞ కలుగుచున్నది. ( లేక ) బొత్తుగా లేని కుందేటికొమ్ము మున్నగునవి పుట్టుటలేదు. కాన స్వకారణమగు మాయయందు లీనమైయున్న బ్రహ్మలోకమే మరల పుట్టుచున్నందునను ప్రత్యభిజ్ఞ కుదరవచ్చును. పోనిండు, నిజముగా నశించిన బ్రహ్మలోకమునకు పునరాగమనము లేకపోవుగాక. అయినను ఏది జన్మనాశములుగలదియో, అదియే పునరావృత్తిగలదని యిచట వివక్ష. జేయుటచే జన్మనాశములుగల బ్రహ్మలోకము పునరావృత్తి కలదియే యగును.

ఇక అర్చిరాది మార్గముచే బ్రహ్మలోకము చేరినవారలకు, పునరావృత్తి లేకుండుట యనగా- బ్రహ్మలోకము నశించినను అచట నున్న జనులు ప్రళయావసానమునందుగూడ మరల సంసారమునకు స్వర్గాదిలోకములను గురించి రారనియు, వారు బ్రహ్మతోగూడ ముక్తు లగుదురనియు అను నభిప్రాయముతో జెప్పబడినది. "అనావృత్తిశ్శబ్దాత్" "కార్యాత్యయే తదధ్యక్షేణసహాతః పరమ భిధానాత్" అను బ్రహ్మసూత్రములుగూడ నీ యభిప్రాయమును బలపరచుచునే సంగతములగుచున్నవి.

అయితే బ్రహ్మలోకమునకే ఆవృత్తియుండ అందున్నవారికి ఆవృత్తి యేల నుండదు? అనియనరాదు. విద్యామహిమవలన బ్రహ్మలోక గతులకు పునరావృత్తి యుండదు. లోకము నశించినచో లోకమునందలి జనులు నశించినట్లు లోకమునకు ఆవృత్తియున్నచో లోకమునందలి జనులకు మాత్ర మావృత్తి యేల నుండదన రాదు ? ఇచట సూక్ష్మమును గ్రహించవలయును. నాశమాత్రము పునరావృత్తికి కారణముకాదు. నాశము జన్మమాత్రమునకే కారణము. కాన బ్రహ్మలోకమునందలి జనులకు గల ఉపాధి పరిత్యాగరూపమయిన నాశము పునర్జన్మకు గారణము కాదు. బ్రహ్మలోకమునకు కొంతకాలము మాయయందు దాగియుండుట అను నాశము కలదు. అయ్యది పునర్జన్మకు కారణము కావున నిందు దోషము లేదు. దీనివలన స్వర్గలోకమును బొందినవారలకువలె బ్రహ్మలోకమును బొందినవారలకు కూడ నుపాధిపరిత్యాగరూపనాశము అనివార్యమగుటచే బ్రహ్మలోకమునకు పునరావృత్తి సిద్ధించుచున్నది.

కాని ఉపాధిపరిత్యాగరూపమయిన నాశము ఉభయులకు సమానమయినను స్వర్గలోకగతులు ఉపాధినాశానంతరము మరియొక ఉపాధిని స్వీకరింతురు. అదియే వారికి జన్మ; బ్రహ్మలోకగతులు అట్లు ఉపాధినాశానంతరము మరియొక ఉపాధిని స్వీకరింపరు. కావున వీరికి జన్మలేదు. వీరు బ్రహ్మతోగూడ ముక్తి నొందుదురు. కనుకనే ఈ యభిప్రాయముతో "అనావృత్తిశ్శబ్దాత్" అను సూత్రమును వ్యాసులు రచించిరి. "ఇమం మానవమావర్తం నావర్తంతే" (ఆవృత్తిగల మానవ లోకమునకు దిరిగిరారు) అను శ్రుతియు, "ఏకయా యాత్యనావృత్తిం" (శుక్ల గతిచే ననావృత్తిని బొందుదురు) అను గీతాస్మృతియు నీ యభిప్రాయమునందే బ్రహ్మలోకగతులు తిరిగి యుపాధిని బొందరను నభిప్రాయమునందే సమన్వితము లగు చున్నవి.

కాన బ్రహ్మలోక గతులకు పునర్జన్మ లేకున్నను బ్రహ్మలోకము మాత్రము పునరావృత్తిగలదియే యగును. ఈ భావమునే భాష్యకర్తలగు శ్రీశంకరులు సూచించిరి. కాన బ్రహ్మసాయుజ్యమునకు మాత్రమే జన్మనాశరూపమయిన ఆవృత్తి లేదు. మిగిలిన లోకము లన్నిటికి జన్మనాశరూపమయిన ఆవృత్తి గలదు.

లేక బ్రహ్మలోకమును బొందిన జీవులకు బ్రహ్మలోకమునందు దివ్యశరీర మును ధరించుటయను శరీరము గలదు. దానిని బరిత్యజించుట రూపమయిన నాశ మున్ను గలదు. పరబ్రహ్మను బొందినవారలకు శరీరసంబంధముగాని తన్నాశము గాని లేదు. కావున భగవంతుడగు నాత్మను బొందినవారలకే పునర్జన్మరాహిత్యము కనుక నిర్గుణబ్రహ్మను బొందినవానికే పునరావృత్తిరాహిత్యము పొసగును.

ఇట్లైనచో సగుణముక్తిస్థానమును బొందినవానికిగూడ పునరావృత్తిలేదని జెప్పెడి, "అనావృత్తిశబ్దాత్" అను బాదరాయణ సూత్రమునకు విరోధముగదా? అని యనరాదు. సగుణముక్తిస్థానమును బొందినవానికి తాత్కాలిక శరీరమును విడచిన తరువాత మరల శరీరగ్రహణముండదను నభిప్రాయముతో నా సూత్రము ప్రవర్తించినది. కాన పై సూత్రవిరోధము లేదు.

బ్రహ్మసాయుజ్యమును బొందినవానికి ఉపాధిసంబంధము లేదుగాన పునర్జన్మ లేదని తేలినది. దీనివలన బ్రహ్మలోకగతులకు నుపాధిసంబంధ ముండుటచే పునర్జ న్మార్హత గలదని సూచితమగుచున్నది.

ఇంతమాత్రమున బ్రహ్మలోకగతులకు పునర్జన్మ గలదని శంకింపదగదు. బ్రహ్మలోకమునందు వారలకు గలిగిన సమ్యగ్జ్ఞానముచే వారల యజ్ఞానము నశించినందున వారికి పునర్జన్మ ప్రసక్తి లేదు. కనుకనే "ఇహాచేదవేదీదథసత్య మస్తి నచేదిహా వేదీ న్మహతీ వినష్టిః" అను శ్రుతి స్వర్గాది లోకములయందు

మోహము మెండగునుగాన మనుష్యలోకమునందే జ్ఞానము సంపాదించవలెనని జెప్పుచున్నది. అయితే బ్రహ్మలోకమునందు జ్ఞానము సులభముగా సంపాదించ వచ్చును. కాని బ్రహ్మలోకమును బొందుటయే కష్టసాధ్యము.

అథవా పునరావృత్తి శబ్దమునకు లక్షణచే స్థానభ్రంశమని యర్థము చెప్ప వచ్చును. కాన స్వర్గమును బొందినవానికి స్థానభ్రంశ మెట్లుగలదో బ్రహ్మలోక మును చేరినవానికిగూడ అట్లే స్థానభ్రంశము గలదు. బ్రహ్మలోకగతుడు స్థానభ్రం శము లేనిదే పరమపదమును బొందనేరడు. కావున లోకములన్నియు పునరావృత్తి సహితములే యగుచున్నవి. బ్రహ్మమొక్కటియే పునరావృత్తిరహితము. "అనా వృత్తిశ్శబ్దాత్" అను సూత్రము బ్రహ్మలోకమును జేరినవాడు తిరిగి సంసార మండలమునకు రాడను అభిప్రాయముతో జెప్పబడినదికాని, బ్రహ్మలోకమునకు పునరావృత్తిలేదను అభిప్రాయముతోగాదని దెలియవలెను.

కావున స్వర్గాదిలోకములను పొందినవారలు, తిరిగి సంసారమండలమును బొందుదురుకాన పునరావృత్తి గలవారని చెప్పబడుచున్నారు. బ్రహ్మలోకమును పొందినవారలు వారికాశ్రయమగు బ్రహ్మలోకము పునరావృత్తి కలదగుటవలనను తమ కుపాధియుండుటవలనను ఉపాధినాశము తమకు అపరిహార్యమగుటవలనను, పునరావృత్తిగలవారని జెప్పబడుచున్నారు. ఎవ్వడు బ్రహ్మసాయుజ్యము నొందునో వానికి ఏ విధముగను పునరావృత్తిలేదుగాన "మాముపేత్యతు కౌంతేయ, పునర్జన్మ నవిద్యతే" ( నన్ను బొందినవాడు తిరిగి జన్మనొందడు ) అని పునరావృత్తిరహితు డని జెప్పబడుచున్నాడు. అర్చిరాదిమార్గమున బ్రహ్మలోకమును బొందినవాడు తిరిగి సంసారమండలమునకు రాడు గనుక పునరావృత్తిరహితుడని జెప్పబడు చున్నాడు. కనుక నిందు పూర్వాపరవిరోధము లేదు.

స్వర్గాదిలోకములవలె బ్రహ్మలోకము అనిత్యముగనుక పునరావృత్తి సహి తము బ్రహ్మలోకమును బొందినవారలను బ్రహ్మచేసిన మహావాక్యోపదేశమువలన బ్రహ్మాత్మైక్యజ్ఞానము గలిగి బ్రహ్మభూతులగుదురుగాన వారికి పునరావృత్తిలేదని నిష్కృష్టార్థము. ఇందుకు అపరోక్షబ్రహ్మసాక్షాత్కారముగల శుకవామదేవా దులే దృష్టాంతము.

కావున "ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున"

"తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ, బ్రహ్మవిదోజనాః"

"ఏకయా యాత్యనావృత్తి మన్యయాఽవర్తతే పునః" అను వాక్యములకు పర స్పర విరోధ మిసుమంతయులేదు. అని సంక్షేపము = రామానుజమతము– "మాము పేత్యతు కౌంతేయ" అను వాక్యమునకు "సత్యసంకల్పుడు, సర్వజ్ఞుడు అగు నన్ను

పొంది” అని రామానుజులు వ్యాఖ్యానమును చేసిరి. అది యుచితముగాదు. జీవే శ్వరులను వేరుపరచునట్టి మాయ యను ఉపాధియుండగా జీవుడు యీశ్వరుని బొందుట (ఈశ్వరసాయుజ్యము) సంభవింపదు. మాయ లేదనినచో ఈశ్వరునకు సత్యసంకల్ప సర్వజ్ఞత్వాదు లుండవు.

ఇంక విద్యచే జీవోపాధియగు నవిద్య నశించినను యీశ్వరోపాధియగు మాయ నశించనందున ఈశ్వరున కుపాధిగలదనియు అయినను ఉప్పునీటియందు మంచినీరు చేరినట్లు సోపాధికుడయిన ఈశ్వరునియందు, నిరుపాధికుడయిన జీవునకు ప్రవేశము సంభవించుననియు, జీవేశ్వరు లిరువురు ఉపాధి సహితులయినప్పుడే ఒకరియందు మరియొకరికి ప్రవేశము సంభవించదనియు ననరాదు. జీవునకు తన జ్ఞానముచే తనయజ్ఞానమును పోగొట్టుకొన సామర్థ్యముండ నీశ్వరునకు మాత్రము తనవిద్యచే దన మాయను బోగొట్టుకొన శక్తి యేలలేదు? అట్లు శక్తి లేనిచో సోపాధికుడయిన నీశ్వరునికంటె నిరుపాధికుడయిన జీవుడే గొప్పవాడుగాన జీవునకు ఈశ్వరప్రాప్తి యేల?

మాయోపాధికుడయిన బ్రహ్మకంటె నిరుపాధికుడయిన జీవు డధికుడగును. ఉపాధివిశిష్టమయిన ఘటాకాశముకంటె నిరుపాధికమయిన మహాకాశము గొప్ప దగుచున్నదికదా? ఉపాధిచే నుపహితపదార్థము పరిచ్ఛిన్నమగును. కావున నీశ్వ రుడు పరిచ్ఛిన్నుడును, నిరుపాధికుడయిన జీవు డపరిచ్ఛిన్నుడును అగును. అట్టితరి అపరిచ్ఛిన్నుడు పరిచ్ఛిన్నునియందు బ్రవేశింప నేరడు.

జీవు డపరిచ్ఛిన్నుడయినను అణురూపుడుగాన నీశ్వరునియందు బ్రవేశింప సమర్థుడని యనరాదు. జీవు డణువయినచో శరీరమంతటను౦డు బాధను దెలిసికొనలేక పోవును. మరియు మాయావ్యవహితుడయిన నీశ్వరుని యణువగు జీవుడు బ్రవేశింప సమర్థుడు గానేరడు.

మాయయందే ప్రవేశించునన్నచో నందుకు జ్ఞాన మార్జింప నవసరములేదు. అపుడు సుషుప్తియందువలె ముక్తియందుగూడ అజ్ఞానాభిభూతుడు గావలసి వచ్చును. ఇట్లు మాయను బొందినవాడు తిరిగి సంసారమునకు వచ్చును. అపుడు “మామువేత్య” “పునర్జన్మ నవిద్యతే” అను వచనమునకు వ్యాఘాతము కలుగును.

ఇంక జీవుడు మాయను భేదించుకొని లోపలనుండు నీశ్వర చైతన్యమును ప్రవేశించునన్నచో నదియు బొసగదు. మాయ భేద్యముగాదు. అయ్యది భేద్య మగుచో నీశ్వరు డేల భేదింపలేదు.

మరియు ఈశ్వరుడు మాయకు వెలుపలనుండుచో నీశ్వరునియొక్క సర్వ వ్యాపకత్వమునకు భంగము వాటిల్లును. “అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారా

యణ స్థితః" అను శ్రుతివిరోధముగూడ తటస్థించును. మాయయొక్క లోపలగూడ నీశ్వరచైతన్యము వ్యాపించియున్నచో నచట యవకాశము లేనందున జీవునకు ప్రవేశము సంభవింపదు. అవకాశమున్నచో నీశ్వర చైతన్యమునకు వ్యాపిత్వము సంభవింపదు.

ఇంక చైతన్యముకంటె వెలుపలనె మాయ యుండునన్నచో కారణమగు మాయయందే కార్యప్రపంచమున్నందున చైతన్యమునందు ప్రపంచము లేకపోవును. "పాదోఽస్య విశ్వాభూతాని" అనుశ్రుతి యీశ్వరచైతన్యమునందు ప్రపంచముండు నని చెప్పుచున్నందున శ్రుతివిరోధము తటస్థించును.

అయితే అద్వైతమతమున మాత్రము నిరవకాశమయిన చైతన్యమునందు ప్రపంచమెట్లుండును? వినుము. అద్వైతమతమున మాయచే నంతయు నుపపన్న మగును. మాయావాదమున ఇది యెట్లు పొసగునను శంకయే పనికిరాదు.

కావున "మామ్" అనుపదమునకు ప్రత్యగభిన్నమగు బ్రహ్మమే అర్థము గాని రామానుజులు చెప్పినట్లు సత్యసంకల్పుడగు నీశ్వరు డర్థముగాదు.

ఓయి! గీతలయం దంతటను "మామ్" అను పదమునను ప్రత్యగభిన్న మయిన బ్రహ్మమే యర్థమయినచో శ్రీకృష్ణుడు అంతట "మామ్" అని యేల జెప్పవలెను. "త్వామ్" అని యేల జెప్పగూడదు? త్వచ్ఛబ్దార్థముగూడ ప్రత్యగ భిన్నబ్రహ్మమేకదా? అనినచో వినుము. చెప్పునట్టి శ్రీకృష్ణునకు బ్రహ్మాత్మ సాక్షాత్కారముచే దాను బ్రహ్మయను నిశ్చయముండుటవలన "మామ్" అని చెప్పెను. వినుచున్న అర్జునునకు బ్రహ్మాత్మసాక్షాత్కారములేక దనయందు దాను జీవుడను నిశ్చయమే యున్నందున "త్వామ్" అని చెప్పలేదు.

ఇచట వక్తయగు శ్రీకృష్ణుడు పరమాత్మగనుక "మామ్" అని చెప్పె ననరాదు. స్కాందపురాణమున మాఘమాహాత్మ్యమునందు నొకానొక బ్రాహ్మణుడు భార్యకు తత్త్వోపదేశ మొనర్చు సమయమున నిట్లు చెప్పెను.

"మయి సర్వాణి భూతాని తేషుచాహ మవస్థితః
మత్తఃపరతరం నైవ విద్యతేఽహ మతఃపరం." అని

ఇచ్చట మచ్ఛబ్దార్థమేమి? జీవుడనియందురా? జీవునియందు సర్వభూతా ధారత్వము సర్వభూతాంతరాత్మత్వము, సర్వపరతత్వము, నిరతిశయత్వము అనెడి యీశ్వరధర్మములు కుదరవు. కావున నిచట మచ్ఛబ్దార్థము పరమాత్మయే యనవలెను. వక్తయగు బ్రాహ్మణమాత్రుడు వాసుదేవునివలె బరమాత్మ కానేరడు. కాన కృష్ణునివలె తత్త్వవేత్తలందరు పరమాత్మ లనియే యనవలయును. పరమాత్మయే ఆత్మ, తత్త్వవేత్తగూడ ఆత్మయే యగును. కావున గీతాశాస్త్రమునందు శ్రీకృష్ణునిచే

జెప్పబడిన మచ్ఛబ్దమునకు ( నేననుశబ్దమునకు ) నెచ్చటను జీవభిన్నుడగు నీశ్వరు డర్థమని భ్రమింపదగదు. ప్రత్యగభిన్నమయిన బ్రహ్మయనియే అర్థమును జెప్ప వలెను. ౧౮

శ్లో. సహస్రయుగ పర్యంతం అహర్యద్బ్రహ్మణో విదుః
రాత్రింయుగ సహస్రాంతాం తేఽహోరాత్రవిదో జనాః ॥ ౧౭ ॥

అ. రాత్రింబవళ్లు అను కాలపరిమాణమును దెలిసిన మహానుభావులు హిరణ్య గర్భునియొక్క పగటికాలము వేయి యుగములు పరిమాణము గలదనియు, రాత్రి కాలము వేయియుగములు పరిమాణము గలదనియును దెలిసికొనుచున్నారు. కాన కాలపరిచ్ఛిన్నమయిన బ్రహ్మలోకముగూడ బునరావృత్తి గలదియే యగుచున్నది.

ఇచట మూలమునందలి యుగశబ్దమునకు నాలుగుయుగములు యొక్క సముదాయమగు మహాయుగ మర్థము. "చతుర్యుగ సహస్రాణి బ్రహ్మణో దిన ముచ్యతే" అను స్మృత్యంతరము గూడ నీ యర్థమునే చెప్పుచున్నది. హిరణ్య గర్భునియొక్క పగటికాలము పూర్తికాగానే, స్వర్గాది మర్త్యలోకములే నశించును గాని బ్రహ్మలోకము నశించదు. కాని యిట్టి రోజులు మూడువందల అరవైకాగా బ్రహ్మ కొక సంవత్సరమగును. ఇట్టి సంవత్సరములు యేబది పూర్తికాగా, బ్రహ్మ కొక్క పదార్థమగును. రెండుపదార్థములు పూర్తియయినచో, బ్రహ్మయొక్క పరమాయుర్దాయము పూర్తియగును. అపుడు బ్రహ్మలోకముగూడ నశించును. కాన స్వర్గాది లోకములవలె బ్రహ్మలోకముగూడ కాలపరిచ్ఛిన్న మగుచున్నది. ఎవనియొక్క ఆయుస్సును కాలము నశింపజేయునో, వాడు కాలపరిచ్ఛిన్నుడని యర్థము.

ఇట్టి కాలపరిచ్ఛేదము లేనివాడు పరమాత్మయొక్కడే. కావున నాతనికి జన్మనాశములు లేవు. కనుకనే శరీరసంబంధముగూడ లేదు. ఆత్మజ్ఞానమునకు బూర్వ మాత్మకుండు శరీరము మాయికముగాని వాస్తవికముగాదు. కావున పర మాత్మ వాస్తవముగ నశరీరుడని తెలియవలెను.

దీనివలన నాయా మతములవారిచే శరీరసహితులని యంగీకరింపబడిన విష్ణు, రుద్ర, గుణపతి, కుమారాదులందరు దేవులు కాలపరిచ్ఛిన్నులు, నాశశీలులు గాన జీవులేకాని యీశ్వరులుగారని తేలినది.

శరీరరహితుడయిన పరమాత్మయొక్కడే యీశ్వరుడు. విష్ణురుద్రాది శబ్దము లచే శరీరాంతర్వర్తియగు నాత్మయే వివక్షితమనినచో అపు డాతడు యీశ్వరుడే గాని జీవుడుగాడు.

కాన బ్రహ్మ సత్యమనియు ప్రపంచము మిథ్యయని దేలినది. బ్రహ్మ కాలానవచ్ఛిన్నుడగుటచే నిత్యుడనియు, బ్రహ్మభిన్నమయిన లోకములు, లోకపాలురు-అందరు కాలావచ్ఛిన్నులగుటచే అనిత్యులనియు సిద్ధించినది. కనుకనే యెవరు నిత్యుడయిన ఆత్మను బొందుదురో, వారు తిరిగి జన్మనొందరు. ఎవరు అనిత్యమయిన బ్రహ్మాదిలోకములను బొందుదురో వారు తిరిగి జన్మను బొందుదురనియును స్పష్టమయినది. ౧౭

అవ॥ ప్రజాపతియొక్క పగటికాలమందును రాత్రికాలమందును జరుగుదానిని చెప్పుచున్నాడు.

శ్లో. అవ్యక్తా ద్వ్యక్తయస్సర్వాః ప్రభవంత్యహరాగమే,
రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవావ్యక్త సంజ్ఞకే. ౧౮

అ॥ అవ్యక్తమన, నిద్రించుచున్న ప్రజాపతియొక్క నిద్రావస్థయని యర్థము. అనగా సమష్టిరూపమగు అజ్ఞానమని భావము. వ్యష్టిరూపమయిన అజ్ఞానము, మనబోటివారల నిద్రారూపము. కాని యీయది అవ్యాకృత మనదగదు. అవ్యాకృత మీశ్వరోపాధి కాని, హిరణ్యగర్భోపాధి గాదు.

ఇందు ఈ రహస్యమును గ్రహింపవలెను.

1. దేనియందు ఒకే లింగశరీరము లీనమైయుండునో, అది వ్యష్ట్యజ్ఞానము. ఈయది ప్రాజ్ఞుడగు జీవునకు వ్యష్ట్యుపాధి.

2. దేనియందు సమస్తమయిన లింగశరీరములు లీనమగుచున్నవో, మహాభూతములుమాత్రము లీనములు కావో, అది సమష్ట్యజ్ఞానము (దీనిని హిరణ్యగర్భుని నిద్రయని పేరు) ఈయది ప్రాజ్ఞులకు సమష్ట్యుపాధి.

(3) దేనియందు సమస్త లింగశరీరములు, పంచ మహాభూతములతోగూడ లీనములగునో అది యవ్యాకృతము. ఈయది ఈశ్వరోపాధి.

ఈ యవ్యాకృతము, మహాప్రలయమునం దుండును. మహాప్రళయమునందే మూర్తామూర్తములయిన సర్వదృశ్యములు లయించును. మోక్షమునం దవ్యాకృతముగూడ నశించును.

ఇట్లుండ నవ్యక్తశబ్దము అవ్యాకృతపరమగును (అవ్యాకృతమను నర్థము నిచ్చును). కాని మూలమునందు, (అహరాగమే, రాత్ర్యాగమే) పగటికాలమున రాత్రికాలమున అను లింగము (హేతువు) ఉండుట వలన అవ్యక్తశబ్దముచే నవ్యాకృతము గ్రహింపవీలులేదు. రాత్రింబవళ్లు ప్రజాపతియగు హిరణ్యగర్భునికే యుండునుగాని ఈశ్వరున కుండవు. ఎపుడు ప్రజాపతి మెలకువతో నుండునో

అపుడు పగలనియు, ఎపుడు నిద్రించియుండునో అప్పుడు రాత్రియనియు నీరెండును హిరణ్యగర్భునకు జెల్లునుగాని, యీశ్వరునకు జెల్లవు. ఈశ్వరునకు జాగ్రదాద్యవస్థలు లేవు.

ఓయి! అవ్యాకృత ముపాధిగాగలవా డీశ్వరుడగుచో నట్టి యీశ్వరుడు మహాప్రలయమునందు మాత్రమే యుండుటచే నీశ్వరునకు కాలత్రయమునందుండుట యను వ్యాపకత్వము సంభవింపదుగదా? కాదు. అవ్యాకృతోపహితచైతన్యమే మూర్తామూర్తోపహితము; అదియే ఈశ్వరుడు. లేక, ఈశ్వరోపాధియగు అవ్యాకృతమే మూర్తామూర్తరూపమున బరిణమించియుండుటచే తద్ద్వారా, యీశ్వరుడు గూడ సర్వవ్యాపకు డగుచున్నందున వ్యాపకత్వమునకు భంగములేదు.

ఇక మోక్షకాలమం దవ్యాకృతము లేనందున, అవ్యాకృతముగూడ కాలత్రయ వ్యాపకము గాదనరాదు. మోక్షదశలో కాలమే లేనందున కాలత్రయమను వ్యవహారమే వ్యాఘాతమగును.

ఇచట శ్రీధరుడు అవ్యక్తశబ్దము కారణవాచకమనియు కార్యముయొక్క అవ్యక్తస్వరూపము కారణాత్మకమనియు ననుచున్నాడు. సృష్టికి పూర్వము కార్యము అనభివ్యక్తమగుచు కారణరూపముతో నుండునని శ్రీధరుని ఆశయము. ఈ పక్షమున వ్యక్తములయిన భౌతిక పదార్థములకు కారణమగు నవ్యక్తము భూతసముదాయము. ఈయది చతుర్ముఖబ్రహ్మయొక్క దైనందిన ప్రళయమునందు గలదు. వ్యక్తమయిన భూతజాతమునకు కారణము అవ్యక్తమగు నవ్యాకృతము. ఈయది బ్రహ్మప్రళయమునందుఁ గలదు. బ్రహ్మయొక్క పగటికాలమున సమష్ట్యజ్ఞానము నుండి వ్యక్తములయిన స్థావరజంగమ పదార్థములు పుట్టును. రాత్రికాలమున అవ్యక్తమని పేరుగల సమష్ట్యజ్ఞానమునందు వ్యక్తములయిన పదార్థములన్నియు ప్రలీనములగును.

ఈయవి సత్కార్యవాద సిద్ధాంతప్రకారము పుట్టుకకు బూర్వము కారణరూపముతోనుండియే పుట్టుచున్నవి.

ఓయి! ప్రలయకాలమున సూక్ష్మావస్థతోనున్న పదార్థములన్నియు హిరణ్యగర్భోపాధియగు అజ్ఞానమునందు లీనమైయుండుననియు ప్రపంచమునందు స్థూలావస్థతో గూడికొని మరల యజ్ఞానమునుండి వచ్చుననియు జెప్పబడినది. ఇందు ఈ వ్యక్తులకు (పదార్థములకు) సూక్ష్మావస్థ మొదటిదా? లేక స్థూలావస్థ మొదటిదా? అనినచో వినుము. ప్రపంచ మనాదియగుటచే నీ ప్రశ్నయే పొసగదు. ౧౮

శ్లో. భూతగ్రామ స్స ఏవాయం భూత్వాభూత్వా ప్రలీయతే.
రాత్ర్యాగమే అవశః పార్థ! ప్రభవత్యహరాగమే ॥ ౧౯ ॥

అ. పూర్వశ్లోకమున అజ్ఞానమునుండిపుట్టు వ్యక్తులు (పదార్థములు) ప్రలయకాలమున దిరిగి యజ్ఞానమును ప్రవేశింతురని చెప్పబడినది. ప్రలయకాలము పూర్తి కాగా తిరిగి సృష్టిప్రారంభమున నూతనమయిన వ్యక్తులు పుట్టుదురని యంగీకరించు పక్షమున నాలుగు దోషములు వాటిల్లును.

(1) పూర్వకల్పమునందలి వారు, తాము చేసినకర్మను పూర్తిగ ననుభవించకుండగనే ప్రకృతిలీనులయిపోయిరిగాన, కృతహానమను దోషము మొదటిది. (కృతహానమనగా చేసినపని చెడిపోవుట).

(2) మరల సృష్టిలో, అజ్ఞానమునుండి పుట్టువారు తాముచేయని కర్మలకు ఫలమనుభవింతురు గాన అకృతాభ్యాగమమను దోషము రెండవది.

(అకృతాభ్యాగమ మన చేయనికర్మ అనుభవమునకు వచ్చుట.)

(3) వెనుకటి కల్పమునందు ప్రకృతియందు లీనమైనవారు శాస్త్రజన్యజ్ఞానముగాని, గురూపదేశముగాని లేకుండగనే ముక్తులయిరిగాన నందఱు ముక్తి జెందుదు రనుదోషము మూడవది.

4. విహితకర్మను జేసినవారు, నిషిద్ధకర్మలను జేసినవారు- ఉభయులు యేమాత్రము భేదములేకుండ ప్రలయకాలమున నజ్ఞానమునందు లీనమగుచుండిరి గాన, విధి నిషేధశాస్త్రము వ్యర్థమగు ననునది నాల్గవదోషము.

ఈ దోషములన్నియు పరిహారింపదలచి యీ శ్లోకము ప్రవర్తించినది.

లింగశరీరముగల జీవసముదాయము ప్రతికల్పమునందును, స్థావరజంగమాత్మకమగు స్థూలశరీరసంయోగమున పుట్టుచున్నది. ప్రతి ప్రలయమునందును స్థూలశరీర వియోగమువలన మరణించుచున్నది. దీనివలన పూర్వకల్పమునందున్న భూతసముదాయమే యీ కల్పమునందు బుట్టెనుగాని, వేరుగాదని తేలినది. కనుక కృతహానాకృతాభ్యాగమము లను దోషములు రెండును ప్రసక్తించవు.

స్థూలశరీరము నశించినను, ప్రలయకాలమున లింగశరీరము అజ్ఞానమునందు దాగి (లీనమై) యుండుటచే ప్రలయకాలమున జీవులకు ముక్తి కలుగదు. కాన సర్వముక్తి ప్రసంగమను దోషములేదు.

ఆయాజీవుల యంతఃకరణములయందు వారు వారాచరించిన పుణ్యపాపకర్మలయొక్క సంస్కారము లుండుటవలనను అసంస్కారవశముననే మరల ప్రపంచమునందు వారివారి కుచితమయిన పుణ్యాపాప శరీరభోగములు సంభవించుటవలనను, విధినిషేధ శాస్త్రములకు వైయర్థ్యములేదు.

గురుశాస్త్రోపదేశములేనిదే లింగదేహమునకు కాలమువలన నాశము లేదు కాన మోక్షశాస్త్రమునకుగూడ వైయర్థ్యములేదు.

రామానుజ మతము:

ఇచట రామానుజులు: అవ్యక్తపదమునకు చతుర్ముఖబ్రహ్మయొక్క శరీరమని వ్యాఖ్యజేసిరి. ఇది యుక్తముగాదు. చతుర్ముఖునియొక్క స్థూలశరీరమునందు జీవులు ప్రవేశించుటగాని, దానినుంచి బయలు వెడలుటగాని సంభవించదు. తండ్రి శరీరమునుండి కుమారునిశరీరము పుట్టినట్లు, చతుర్ముఖబ్రహ్మ శరీరమునుండి జీవరాశి పుట్టుననుట యుచితముగాదు. చతుర్ముఖునియొక్క మనస్సుచేతనే తరచుగా ప్రపంచమంతయు పుట్టును. బ్రహ్మసృష్టి సంకల్పపూర్వకము, సనక, సనందనాదులు బ్రహ్మకు మానసపుత్రులుగాని, శరీరమున బుట్టినవారు గారు. చతుర్ముఖునియొక్క శరీరమునుండి ప్రజాపతిమున్నగువారి దేహములు పుట్టినను మనబోటివారల శరీరములు మాత్రమట్లు పుట్టుటలేదు.

జీవులు వారివారి శరీరమునందు, వారున్నటుల బ్రహ్మశరీరమునందు, సర్వజీవులు కలరని యనరాదు. అట్లైతరి బ్రహ్మశరీరమునందెల్ల జీవులకు స్వీయత్వాభిమాన ముండవలెను. ప్రళయావస్థయందట్టి యభిమానములేకున్నను ప్రళయము గడచిన నుత్తరక్షణమందైనను, అట్టి యభిమాన ముండవలెను. ఉత్తరక్షణమునందే చతుర్ముఖుని శరీరమునుండి బయలువెడలి ప్రపంచములోనికి వచ్చుటచే నట్టి యభిమానమున కవకాశము లేదనరాదు. ప్రళయము గడచినవెంటనే (సృష్టి ప్రారంభమునందే యెల్లజీవులకు శరీరములు సృష్టియగు ననుట చెల్లదు. మొట్టమొదట ప్రజాపతులు పుట్టి తరువాత చాలకాలమునకుగాని ప్రపంచసృష్టి జరుగదు. అయితే అంతవరకు (తమకు శరీరములు సృష్టియగునంతవరకు) జీవులు అజ్ఞానమునందు లీనమై యుండురనుట పొసగదు. అట్లైతరి, లాఘవము నపేక్షించి యజ్ఞానమే అవ్యక్తమనుట యుక్తమగును. ఇంక బ్రహ్మశరీరము అవ్యక్తశబ్దార్థమని వ్యాఖ్యానించుటలో ప్రయోజనమేమి? కావున రామానుజులు చేసిన అవ్యక్తశబ్దార్థ నిర్వచన సమంజసము గాదు. ౧౯

అవ॥ అక్షరబ్రహ్మయొక్క స్వరూపమును నిర్వచింపదలచి ముందుశ్లోకము ప్రవర్తించుచున్నది.

శ్లో. పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః
యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి ॥ ౨౦ ॥

అ. దృశ్యత్వ, జడత్వ, మిథ్యాత్వాది లక్షణములుగల అజ్ఞానముకంటె ద్రష్టృత్వ చిదాత్మత్వ, సత్యత్వాది లక్షణములుగల అక్షరపురుషుడు విలక్షణుడు. ఈతడు

ఇంద్రియగోచరుడుకాడు. అయినను ఆత్మరూపు డగుటవలనను సాక్షిభాస్యుడగుట వలనను, లేడనుటకు వీలులేదు. అక్షరపురుషుడు అవ్యక్తము (అజ్ఞానము) కంటె విలక్షణుడని చెప్పుటచే నవిద్యా (నవ్యక్త) కార్యమయిన భూతరాశికంటెగూడ వైలక్షణ్యము సిద్ధించుచున్నది. మృద్విలక్షణమగు జలము మృత్కార్యమయిన ఘటముకంటె విలక్షణమగుట లోకసిద్ధము.

అవ్యక్తము జడరూపమనియు, భూతరాశి చిదచిద్రూపమనియు గావున నీ రెంటికి నభేదము అసంభవమని యనరాదు. భూతము లనకార్యకరణ సంఘాతములు. ఈయవి జడరూపములు. కనుకనే అవ్యక్తమువలన పుట్టుచున్నవి. అక్షరు డొక్కడే చిద్రూపుడు.

ఇట్టి యక్షరబ్రహ్మ, హిరణ్యగర్భాది స్తంబాంతభూతములు నశించుచున్నను తాను నశించడు. దీనివలన "అవినాశితు తద్విద్ధి" అను ద్వితీయాధ్యాయ శ్లోకము స్మృతిగోచర మగుచున్నది. ఇచట భూతశబ్దమునకు జీవుడర్థమని చెప్పి జీవులు నశించుచున్నను పరమాత్మ నశించడని యనరాదు. అపుడు "అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణః" అనుశ్రుతి విరోధము ప్రాప్తించును.

ఇక జీవశబ్దమునకు చిదాభాస విశిష్టమయిన బుద్ధులు అర్థమని యంగీకరించి నచో వారలు అనేకులు సంసారులు, నాశశీలురును అగుదురు. అయినను వారు గూడ ముక్తియందే నశింతురుకాని ప్రళయకాలమున నశింపరు. అట్టితరి ప్రళయ కాలమున అందరు ముక్తులు గావలసివచ్చును.

అయితే భూతశబ్దమునకు శరీరసంఘాత మర్థమయినను ప్రలయాదికాలముల యందు లింగ, కారణ దేహములు నశింపవుగదా? మూలమున "సర్వేషు భూతేషు" అని యెట్లు చెప్పబడినదని యనరాదు. స్థూలదేహనాశాభిప్రాయముతోనే మూలమున అట్లు చెప్పబడినది. లోకమునందుగూడ స్థూలము నశించినంతమాత్రముననే దేవదత్తుడు మృతుడను వ్యవహారము కలుగుచున్నది. సూక్ష్మదేహము అజ్ఞానము నందు లీనమై సంస్కారరూపముతో నుండునుగాన దానికి నాశ మౌపచారికము.— కారణశరీర మనగా నవిద్యయే; అయ్యది విక్షేపశక్తిని సంకోచపరచుకొని కేవలము ఆవరణశక్తి నాధారపరచుకొని, ప్రళయకాలమున జీవులను మోహపెట్టుచు నుండును. ఇట్టి యవ్యక్తమునకు (అజ్ఞానమునకు) ప్రళయకాలమునగూడ నాశము లేదు. ముక్తియందు మాత్రమే యవిద్య (అవ్యక్తము) నశించును.

ఇట్లు మహాప్రళయమందు స్థావరజంగమాత్మకములయిన సకల స్థూలశరీరములు స్వరూపముతో నశించుటవలనను సూక్ష్మదేహములు అవిద్యయందు లయించుటవలనను అక్షరుడొక్కడే మాయాతీతుడై మాయకు సాక్షిగానుండు నని

తెలినది. కావున జీవేశ్వరభేదమునకు గాని, జీవభేదమునకుగాని యవకాశము లేదు.

రామానుజమతము:-

అవ్యక్తపదమునకు అక్షరుడగు జీవు డర్థమని రామానుజులు చెప్పిరి. ఈయది సరిగాదు. జీవులనగా ప్రాణధారులు వీరు అవ్యక్తమువలన బుట్టుదురు. కాన యవ్యక్తముకంటె విలక్షణులు గారు. నశ్వరులు గనుక అవినాశులుగూడ గారు. రామానుజులు చెప్పెడి జీవులు భూతశబ్దవాచ్యు లగుదురు, భూతములు నశించుచుండగా భూతములకంటె విలక్షణమయిన అక్షరుడు జీవుడు గానేరడు. సర్వోపాధి వినిర్ముక్తుడగు నక్షరుడు ప్రాణమను నుపాధియుక్తుడు గానేరడు. భేదకమగు నుపాధి లేదుగాన నక్షరునియందు భేదముగూడ సిద్ధింపదు. కాక అక్షరుడు జీవుడగుచో అక్షరునికంటె గొప్పవాడు పురుషుడుండగా, "పురుషాన్న పరం కించి త్సా కాష్ఠా సా పరాంగతిః" అనిచెప్పుట చెల్లదు. కావున నిచట అవ్యక్తుడగు నక్షరుడు ప్రత్యగభిన్నమయిన పరమాత్మయే కాని జీవుడు గాడు. ౨౦

శ్లో. అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్తమాహుః పరమాం గతిమ్
యం ప్రాప్య ననివర్తంతే తద్ధామ పరమం మమ ॥ ౨౧ ॥

అ. పూర్వశ్లోకమున నేయక్షరుడు అవ్యక్తశబ్దముచే జెప్పబడెనో, అట్టి యక్షర సంజ్ఞకమగు పరబ్రహ్మమే నిరతిశయమగు ప్రాప్యస్థానము. ఈయది పునరావృత్తి రహితమగుటచే పరమగతియని చెప్పబడుచున్నది. స్వర్గాదులు పునరావృత్తి కలవగుటచే పరమపదములు గావు. జీవులు యే స్థానమును జెంది మరల సంసార మనుభవించుటకు రారో, అట్టి ధామము (స్థానము) ( స్వరూపము ) సర్వవ్యాపకుడ నగు నాది ఇచట ధామశబ్దమునకు స్వరూపమని నిష్కృష్టార్థము చెప్పవలెను. సర్వవ్యాపకుడగు శ్రీ మహావిష్ణువునకు ప్రత్యేకస్థాన ముండనేరదు. దీనివలన అక్షరపురుషుని స్వరూపము అవ్యక్తముకంటె పరమనియు, అవ్యక్తముకంటె విలక్షణమనియు, సనాతనమనియు, అవ్యక్తమనియు, నాశరహితమనియు సర్వభూత వినాశసాక్షియనియు, విష్ణువుయొక్క పరమపదమనియు, పునరావృత్తి రహితమనియు, సదా సద్రూపమనియును సిద్ధించినది.

రామానుజ మతము-

ఇచట రామానుజులు : అచేతనప్రకృతి యొక నియమనస్థాన మనియు, జీవప్రకృతి రెండవ నియమనస్థాన మనియు, ముక్తస్వరూపము పరమ నియమనస్థానమనియును, "తద్ధామ పరమంమమ" అను తురీయపాద నిర్వచన సందర్భమున వివరించిరి. ఈయది అత్యల్పము. ముక్తాత్మస్వరూపము తనతో నభిన్నమగుచుండ, దనచే నియమ్యమగుట సంభవించదు. ముక్తుడుగూడ నియమింపబడుచో వానికి

ముక్తత్వమే సిద్ధింపదు. ముక్తియందు దేహమాత్రము దుఃఖముండ వీలులేదు. సుషుప్తి యందు అంతకరణమున్నను తత్తాదాత్మ్యాధ్యాస లేనంతమాత్రమున జీవున కేమాత్రము నియమనము లేకపోవుచుండ ముక్తిదశలో సర్వోపాధులు నశించి నను జీవునకు నియమనమనునది యెట్లు పొసగును ?

కనుక నీయది జీవునియొక్క వాస్తవస్వరూపమును దెలియకజేసిన భాష్య ముగా నుపేక్షణీయము.

మరియును, వారు "ధామ" పదమునకు "తేజస్సు" అని యర్థమును జేసిరి. అది యుక్తము. అం దాక్షేపమేమియు లేదు. కాని యక్షరుడు, విష్ణువున కంగభూతుడని యనిరి. ఈయది యుక్తముగాదు. అక్షరుడే యాత్మకాన యాతడు సర్వశేషి. శేషత్వ మాతని కసంభవము. ప్రకృతివియుక్తమయిన జ్ఞానమే యాకారముగా గల ఆత్మ పరమాత్మల కంగాంగిభావ కల్పన మసంగతము.

ముక్తజీవుడు అపరిచ్ఛిన్న జ్ఞానరూపుడగుటచే విష్ణువు శద్విలక్షణుడు గానేరడు. అపరిచ్ఛిన్న జ్ఞానమునందు పరిచ్ఛేదకము (భేదింప చేయునది) లేనందున జీవేశ్వరభేదమున కవకాశము లేదు. జ్ఞానము లనేకము లయినచో నొకజ్ఞానము నకు మరియొక జ్ఞానముతో పరిచ్ఛేదము సిద్ధించుచున్నందున, జ్ఞానమున కపరిచ్ఛిన్న త్వము సంభవించదు ॥౨౧॥

శ్లో. పురుష స్సపరః పార్థ భక్త్యా లభ్య స్త్వనన్యయా
యస్యాంతస్థాని భూతాని, యేన సర్వమిదం తతమ్ ॥౨౨॥

అ. ఓయి అర్జునా! భూతములు యే పురుషుని లోపలనుండునో యే పురుషునిచే ప్రపంచమంతయు వ్యాపించబడినదో, అట్టి పరమపురుషుడు అనన్య భక్తిచే బొందబడును. (పురిదేహే శేత ఇతి పురుషః) శరీరమునందు వరుండి యుండును గాన పురుషు డనబడును. (పిపర్తి పూరయతి సర్వమితి పురుషః) ప్రపం చమంతయును నిండింపజేయువాడుగాన పురుషుడు. పరిపూర్ణమయిన ఆకాశము కుండలోపల నుండినట్లు పరిపూర్ణుడగు పరమాత్మగూడ శరీరములోపల నుండుట పొసగును.

పురుషుడు ( పరుడు ) గొప్పవాడనుటలో "ఇంద్రియేభ్యః పరాహ్యర్థాః అర్థేభ్యశ్చ పరం మనః। మనసస్తు పరాబుద్ధిః బుద్ధేరాత్మా మహాన్పరః। మహతః పర మవ్యక్తం అవ్యక్తాత్పురుషః పరః। పురుషాన్న పరం కించిత్సాకాష్ఠా సాపరాగతిః" అను శ్రుతి ప్రమాణమగుచున్నది.

ఇచట జ్ఞానము భక్తి శబ్దార్థము. అద్వితీయాత్మయందు సేవాదిరూప మయిన భక్తి సంభవింపదు. "జ్ఞానాదేవతు కైవల్యమ్" అను శ్రుతి జ్ఞానమువలననే ముక్తియని చెప్పుచున్నది.

నిరవకాశుడయిన ఆత్మయందు భూతము లెట్లుండునని ప్రశ్నింపరాదు. నిరవకాశునియందుగూడ మాయచే నవకాశము లభించును. భూతములున్నను ఆత్మ యొక్క నిరవకాశత్వమునకు భంగములేదు. భూతజాతము కార్యరూపము గనుక గారణమయిన పురుషునియందుండుట యుచితము. ఘటాదులు మృదాదుల యందును, రజతాదులు శుక్తికాదులయందును యుండుట లోకసిద్ధము.

పరమాత్మ ప్రపంచమునకు పరిణామ్యుపాదానముగాని, వివర్తోపాదానముగాని యగుటచే భూతాధిష్ఠానమగుచున్నాడు.

ఇట్లు భూతములు పురుషునియందుండుచో, పురుషునకు సద్వితీయత్వము కలుగునుగదా యనరాదు. మృత్తుయందున్న ఘటముతో మృత్తునకు సద్వితీయత్వము గాని శుక్తికయందలి రజతముతో శుక్తికకు సద్వితీయత్వముగాని ఆకసమునందలి నైల్యముచే నాకసమునకు సద్వితీయత్వముగాని కనిపించుటలేదు. మాయామయ మయిన వస్తువులచే సత్యవస్తువునకు సద్వితీయత్వముండదు. మరీచికాజలములచే భూమికి పంకిలత్వము సంభవింపదు. పోనిండు మాయతో సద్వితీయత్వము కలుగును గదా? కాదు. అదియును మిథ్యయే. నిజముగా మాయగూడ లేదు. మృత్తికయందు ఘటాకారము, ఘటనామము గల్పింపబడినట్లు ఆత్మయందు భూతముల నామ రూపములు కల్పింపబడినవి.

కావున అద్వితీయమగు బ్రహ్మమే పురుషుడు. ఆతడు జ్ఞానమాత్రము చేతనే లభ్యుడగును. పురుషస్వరూపజ్ఞానమే పురుషస్వరూపలాభము. ఘటస్వరూప మును తెలియనివాడు యెదుటనున్న ఘటమును బొందలేడు.

రామానుజమతము:

"పురుష స్సపరః పార్థ" అనుచోట పరపురుషుడు పరమపురుషుడగు విష్ణువుగాని ప్రత్యగాత్మ గాదనియు, వాడు భక్తిచేతనే లభ్యుడనియు రామానుజు లనిరి. అది సరిగాదు. వెనుకటి శ్లోకములచేఁ జెప్పబడిన సనాతనత్వ, అవ్యక్త విలక్షణత్వ సర్వవ్యాపిత్వాది లక్షణములు గల యక్షరపురుషునికంటె పరమ పురుషుడని మరియొకడుండడు. "పురుషాన్న పరం కించిత్" అను శ్రుతిగూడ పురు షునికంటె గొప్పవాడు లేడని నిరసించుచున్నది. శ్రీకృష్ణుడుగూడ గీతలలో "మత్తఃపరతరం నాన్యత్" అని తనకంటె గొప్పదేదియు లేదని నిరూపించి యున్నాడు. "అవినాశితు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్" అను శ్లోకమును మీరు గూడ పురుషపరముగ వ్యాఖ్యానించియున్నారు. పురుషుడు సర్వవ్యాపకుడగుచో నింక పరమపురుషుని కల్పింప నేల? పురుషునకు సర్వవ్యాపకత్వము లేదన్నచో బురు షునకు పురుషత్వమే లేకపోవును. "అవినాశి" అను శ్లోకమునందు జెప్పబడిన

"యేన సర్వమిదం తతమ్" అనునది విరుద్ధమగును. అచ్చట సర్వపదము దేహపరము గాని, ప్రపంచపరముగాదని యనరాదు. అట్లనుటకు ప్రమాణము లేదు. కాన సర్వ ప్రపంచము వ్యాపించియుండుననియే చెప్పవలెను.

వ్యష్టిశరీరమును వ్యాపించినంతమాత్రమున పురుషుడు (జీవుడు) పూర్ణుడగుచో, కుండయొక్క యుదరభాగమును వ్యాపించినందున జలముగూడ పూర్ణమనవలయును. మరియు మీ మతమున పురుషుడు (జీవుడు) అణువు, కాన యాతనికి పూర్ణత్వము బొత్తుగా కుదరదు. కావున జీవేశ్వరులకు భేదమంగీకరించి, వారిరువురకు సర్వవ్యాపిత్వమును జెప్పుట కుదరదు. "అవినాశితు తద్విద్ధి" "పురుషస్సపరఃపార్థ" అను రెండు శ్లోకములచే, శ్రీకృష్ణుడే జీవేశ్వరులకు సర్వవ్యాపిత్వమును జెప్పియున్నాడు. ఈయది భేదవాదమున నుపపన్నముకాదు. గనుక జీవేశ్వరుల కభేదమును అవశ్యము అంగీకరించి తీరవలయును.

కావున పురుషాతిరిక్తుడగు పరమపురుషు డొకడు లేడు. పరమశబ్దము లేకుండగనే కేవల పురుషశబ్దము పరమాత్మయందు ప్రయోగింపబడుచున్నది. "తేనేదం పూర్ణం పురుషేణ సర్వం" "సహస్రశీర్షాః పురుషః" ఇత్యాది శ్రుతులయందు-

ఇట్లైనచో, పరమాత్మయే పురుషుడుగాని, జీవుడు పురుషశబ్దవాచ్యుడుగాడని యనరాదు. జీవునియందు పురుషశబ్ద ప్రయోగము సర్వ సమ్ప్రతిపన్నము. (అందరిచే నంగీకరింపబడినది.)

ఓయి! "అవ్యక్తోఽక్షర ఇత్యుక్తః" అను శ్లోకమునందు అక్షరుడు చెప్పబడెను. "పురుష స్సపరఃపార్థ" అను నీశ్లోకమునందు పురుషుడు జెప్పబడెను. అక్షరుని కంటె పురుషుడు వేరని యనవలయును. కాన వీరిరువురకు జీవేశ్వరరూపమగు భేద మంగీకరింపక దప్పదు. కావున అక్షరుడు జీవుడనియు, పురుషుడు యీశ్వరుడనియు ననవలెను. అనినచో నట్లుకాదు. "అవ్యక్త" శ్లోకమునందు జెప్పబడిన అక్షరపురుషుని పొందుట కిచట నుపాయము మాత్రమే "పురుషస్సపరః పార్థ" అను శ్లోకమునందు జెప్పబడినది కాని, తద్విలక్షణుడగు పురుషుడు చెప్పబడలేదు. సమానాకారులయిన వారికి వైలక్షణ్యము అసంభవము. ఉభయులు ప్రకృతివివిక్తమయిన జ్ఞానాకారులగుచుండ వీరికి భేద మసంభవము. జ్ఞానబలక్రియాశక్త్యాదులు హెచ్చుతగ్గులుగా నుండుటయే వీ రిరువురకు భేదమని యనరాదు. అయ్యవి యుపాధిధర్మములుగాని, స్వరూపధర్మములు గావు. ముక్తిదశయందు జీవున కుపాధి యుండదు. ఈశ్వరున కుపాధి యుండుననుట హాస్యాస్పదము. జీవుడు యీశ్వరుని యుపాసించి నిరుపాధికు డాయెను. కాని యీశ్వరుడుమాత్రము సోపాధికుడేయని

చెప్పుట లజ్జావహము – కావున నుపాధి వియుక్తమయిన చైతన్యమునకు భేదము గగనకుసుమాయితము.

కనుక అజ్ఞానముకంటె విలక్షణమయిన అక్షరపురుషుడు ప్రత్యగభిన్నమయిన పరమాత్మయే గాని వేరుకాదు. వానిని బొందు నుపాయము జ్ఞానమేకాని భక్తి గాదు. భక్తిద్వైత విషయము ద్వైతముభయహేతువని శ్రుతి చెప్పుచున్నది. కాన భయహేతువగు భక్తి ముక్త్యుపాయము కానేరదు ॥౨౨॥

అవ. ప్రణవమును బ్రహ్మదృష్టితో నుపాసనజేసిన యోగులకు హిరణ్యగర్భలోక ప్రాప్తిద్వారా పరమాత్మప్రాప్తికొరకు నర్చిరాది మార్గము చెప్పదలచి యుత్తరగ్రంథ మారంభింప బడుచున్నది. అర్చిరాది మార్గస్తుతికొరకు ధూమాది మార్గముగూడ నుపదేశింప బడుచున్నది.

శ్లో. యత్రకాలే త్వనావృత్తిం ఆవృత్తిం చైవ యోగినః
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ ॥౨౩॥

అ. ఓయి భరతశ్రేష్ఠుడా! ఏ మార్గమునందు మరణించిన యోగులు పునరావృత్తిని (పునర్జన్మను) బొందరో ఆయుత్తర మార్గమును, ఏమార్గమునందు మరణించిన యోగులు పునరావృత్తిని బొందుదురో ఆ దక్షిణమార్గమును జెప్పెద వినుము.

మూలమునందలి కాలశబ్దమునకు కాలాభిమాని దేవతలచే గుర్తింపబడు మార్గ మర్థము.

"ఏకయా యాత్యనావృత్తి మన్యయా వర్తతే పునః"అను పై శ్లోకమునందు జెప్పబడు ఆవృత్త్యనావృత్తులు మార్గధర్మము లగునుగాని, కాలధర్మములుగా నేరవు. కాలశబ్దమునకు మార్గమని యర్థమును జెప్పుట భాష్యవిరుద్ధమని యనదగదు. "తత్ర ప్రయాతా గచ్ఛంతి" అనుచోట "తత్ర" అను పదమునకు భాష్యకర్తలే మార్గ మర్థమని, నిర్ణయించిరి. దాని ననుసరించి యిచటగూడ మార్గార్థము ను వర్ణించుటయే యుచితము.

ఓయి! అచ్చట భాష్యముగూడ మూలవిరుద్ధమే యగుచున్నది. మూలమున కాలశబ్దము మాత్రమే కనిపించుచున్నది. దక్షిణాయనమందు శరతల్పమును బొందిన భీష్ముడు యుత్తరాయణపుణ్యకాలమున కెదురుచూచెను. కాన కాలశబ్దమునకు మార్గమర్థమని యనరాదు. అనినచో నట్లు కాదు. "శుక్లకృష్ణే గతీహ్యేతే" "ఏతే సృతీపార్థ జానన్" అను శ్లోకమునందు కాలశబ్దము గతి, సృతి శబ్దములచే బరామృశింపబడినది. గతి, సృతిశబ్దములకు మార్గమర్థ మనునది నిర్వివాదము. కావున భాష్యము మూలవిరుద్ధముకాదు.

మరియు నుత్తరాయణమునందు శుక్లపక్షమున పగటికాలమునందు మరణించినవారు యుత్తరమార్గమున బోవుదురనియు, దక్షిణాయనమునందు కృష్ణపక్షమున రాత్రికాలమున మరణించినవారు దక్షిణమార్గముచే బోవుదురనియు, గావున కాలమార్గములు రెండును జెప్పవలెనని యనరాదు. అట్లైనచో నుత్తరాయణమునం దేపాపియు మరణించడనియు, దక్షిణాయనమునందు యేసుకృతియు మరణింపడనియు జెప్పవలయును.

ఇట్టి వ్యవస్థ యెచ్చటను గానరాదు. క్రిమికీట పశుపక్ష్యాదులు, స్థావరములున్ను యుత్తరాయణమునందుగూడ మరణించుచున్నవి. బ్రహ్మజ్ఞానులు దక్షిణాయనమునందుగూడ మరణించుట జూచుచుంటిమి.

మరియు నుత్తరాయణమున కృష్ణపక్షమునందు పగటికాలమున మరణించినవారలకుగాని, శుక్లపక్షమునందు రాత్రికాలమున మరణించినవారలకుగాని యుత్తరమార్గ గమనము లేకపోవును. అట్లే దక్షిణాయనమునందు శుక్లపక్షమున రాత్రిపూట మరణించిన వారలకుగాని, అందు కృష్ణపక్షపు పగటికాలమున మరణించినవారలకుగాని దక్షిణమార్గ గమనమున్ను లేకపోవును. ఇట్టివారల ప్రయాణమునకు వేరొక మధ్యమార్గము వినబడుట లేదు. వీరల కధోగతియే యనియు ననరాదు. పాపుల కధోగతి ఫలమయినను, విహితకర్మల నాచరించిన వారల కయ్యది ఫలము గానేరదు. విహితాచరణులు గూడ నిట్లు మరణించుట గలదు.

మరియు దక్షిణాయనమున కృష్ణపక్షమునందు రాత్రికాలమున మరణించినవారలకు చంద్రలోక ప్రాప్తి కలుగుచుండగా, నుత్తరాయణమునందు గృష్ణపక్షమున రాత్రి మరణించినవారలకుగాని, దక్షిణాయనమున శుక్లపక్షమునందు పగటికాలమున మరణించినవారలకుగాని, వేరుగ జెప్పనేల? యను నర్థాపత్తి ప్రమాణమువలననే వీరికి చంద్రలోక ప్రాప్తి సంభవించును. ఇందు యిష్టాపత్తి చూపదగదు "ధూమోరాత్రిస్తథా కృష్ణ షణ్మాసా దక్షిణాయనమ్" అను వచనముయీ కాలమునందు మరణించినవారలకే చంద్రలోకప్రాప్తిని వర్ణించుచున్నది.

మరియు పగలు, రాత్రి, శుక్ల కృష్ణపక్షములు ఉత్తరాయణ, దక్షిణాయనముల కంటె వ్యతిరిక్తమయిన కాలమేలేదు. ఈ కాలములన్నియు పుణ్యావంతుల యొక్క మృతికి విషయములగుచో పాపులు మరణించి నరకఫలమును బొందు మరణకాలమే యుండకపోవును.

ఇదియునుగాక "అహః" "శుక్లః" "షణ్మాసాః" ఇత్యాది పదములు కాలపరములయినను అగ్ని, జ్యోతి, ధూమాదిపదములు కాలవాచకములు గానేరవు. అగ్ని యను కాలవిశేష మెచ్చటను లేదు. కాన కాలవాచకములుగాని

అగ్న్యాది పదముల సాహచర్యమువలన అహోరాదిపదములుగూడ కాలవాచకములు గావు. కావున అగ్న్యాదిపదములు దేవతావాచకములు. ఈ దేవతలు సపిండితే మయిన ఇంద్రియసముదాయముగలిగి స్వయముగ నడువజాలని యోగులను అంచె లంచెలుగా దాటవేయుటకు నర్చిరాదిమార్గమునందు యథాక్రమముగ నుందురు.

మరియు అహరాది శబ్దములు కాలవాచకములేగాని, దేవతావాచకములు గావనియు, ఆ కాలమునందు మరణించిన యోగులే బ్రహ్మలోకమును జెందుదురు గాని యితరులు బ్రహ్మలోకమును జెందనేర రనియు ననరాదు.

అట్టితరి ప్రణవోపాసకులగు యోగులు దక్షిణాయనమున మరణించినందున చంద్రలోకమును జేరవలసివచ్చును. యోగులుకాని సోమయాజులు, ఉత్తరాయణ మున మరణించియు జంద్రలోకమును జేరకపోవుదురు. కర్మయోగులుగూడ యోగులని యంగీకరించుచో నుత్తరాయణమునందు మరణించిన కర్మయోగులు గూడ బ్రహ్మలోకమును జేరుదురుకాన, వీరికి చంద్రలోకప్రాప్తి యసంభవ మగును. కావున అహరాది పదములు దేవతావాచకములేకాని కాలవాచకములు గావు. భీష్ము డుత్తరాయణముకొరకు వేచియుండుట లోకసంగ్రహార్థముకాని బ్రహ్మలోకప్రాప్తికొరకు గాదు.

లేక తరచుగా పుణ్యకాలమునందు మరణించినవారలకే పుణ్యలోకము సంభవించునని చూపించుటకొరకే భీష్ము డట్లాచరించెను. లేక తాను యిచ్ఛవచ్చి నపుడు మరణించు శక్తిగలవాడ నని లోకమునకు ప్రదర్శించుటకైనను అట్లాచరించి యుండవచ్చును.

ఓయి ! తత్త్వవేత్తకు రాకపోకలు లేకపోవుటచే కాలముయొక్క అపేక్ష లేకున్నను చంద్రలోకమునుగాని, బ్రహ్మలోకమునుగాని పొందగోరినవారలకు కాలముయొక్క అపేక్ష గలదు. కాన పుణ్యకాలమునందు మరణించిన వారలకే పుణ్యలోకప్రాప్తి కలదు అనినచో, శారీరక శాస్త్రవిరోధము వాటిల్లును గాన యట్లనదగదు.

అదెట్లన ? "సూ॥ తదోకోఽ గ్రజ్వలనం తత్ప్రకాశితద్వారః, విద్యా సామర్థ్యాత్, తచ్ఛేషగత్యనుస్మృతియోగాచ్చ, హార్దానుగృహీతశ్శతాధికయా" (౪-౨-౧౭) అని వ్యాససూత్రము కలదు.

మరణించుచున్న జీవునియొక్క హృదయాగ్రము (సుషుమ్నానాడీ ముఖము) వెలుగొందును (ప్రకాశించును). ఆ వెలుగుచే ద్వారము ప్రకటిత మగును. ఆవల విద్యామహిమవలనను, విద్యాశేషమయిన మార్గముయొక్క స్మృతివలనను హృదయమునందుపాసింపబడిన బ్రహ్మయొక్క అనుగ్రహముచే

విద్వాంసుడు సుషుమ్నా నాడినుండి బయలువెడలును. అవిద్వాంసులు యితర స్థానములనుండి లేచిపోవుదురు. అని దీనిభావము. శ్లో-

"శతంచైకాచ హృదయస్యనాడ్యః తాసామూర్ధాన మభినిస్సృతైకా; తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవంతి" అని శ్రుతిగూడ గలదు. అవిద్వాంసు లుత్క్రమణము జెందుటకు నానావిధములయిన నాడులుగలవని యీ శ్రుతియొక్క నాలవపాదమున కర్థము.

సుషుమ్న యనునాడి హృదయమునుండి బయలుదేరి దక్షిణతాలు కంఠము లోపలనున్న స్తనముయొక్క మధ్యభిత్తిద్వారమున బ్రహ్మరంధ్రమును జేరి, సూర్యకిరణములతో నేకీభవించును.

ఇట్టి బ్రహ్మలోకమార్గము సగుణబ్రహ్మోపాసకులగు విద్వాంసులకేగాని యితరులకు గాదని భావము.

( సూ॥ రశ్మ్యనుసారీ = ౪-౨-౧౮ ) సుషుమ్న యనునాడి, సూర్యకిరణములతో సంబంధించి యుండుటచే సుషుమ్నానాడీద్వారమున బయలు వెడలిన పురుషుడు సూర్యకిరణముల ననుసరించి నిష్క్రమించును. (బయలు వెడలును )

సూ॥ "నిశి నేతిచేన్న సంబంధస్య యావద్దేహ భావిత్వాద్దర్శయతిచ" ౪-౨-౧౯)
ఈ సూత్రమునందు రాత్రికాలమున మరణించిన విద్వాంసుడు సూర్యకిరణములతో సంబంధించునా, లేదా ? అని సంశయించి, రాత్రి మరణించినవానికి సూర్యరశ్మి సంబంధముండదుగాన వాడు సూర్యకిరణ ప్రాప్తికొరకు సూర్యోదయమువరకు వేచియుండవలెనని పూర్వపక్షమునుజేసి, రాత్రింబవళ్లు సూర్యకిరణములతో దేహమునకు సంబంధముండుటచే రాత్రిమృతునకు కిరణసంబంధము లేదనిగాని, రాత్రి మృతుడు కిరణప్రాప్తికొరకు సూర్యోదయ పర్యంతము నిరీక్షించవలెననిగాని యనరాదని సిద్ధాంతము జేయబడినది. సుషుమ్నానాడికి సూర్యరశ్మిసంబంధము యావద్దేహభావి; అనగా దేహ ముండునంతవరకు నుండునని భావము.

శ్రు. "అముష్మాదాదిత్యాత్ప్రతాయంతే తా ఆసునాడీషు సృప్తా ఆభ్యో నాడీభ్యః ప్రతాయంతే అముష్మిన్నాదిత్యేసృప్తాః" ఈ సూర్యునినుండి విస్తరించి బయలుదేరిన కిరణములు శరీరమునందున్న నాడులతో సంబంధించియున్నవి. ఈ నాడులనుండి బయలుదేరిన కిరణములు యీ సూర్యునియందు గలసియుండును. అని చెప్పునట్టి శ్రుతిగూడ బైసూత్రసిద్ధాంతమును దృఢపరచుచున్నది. గ్రీష్మకాలమునందు రాత్రులయందుగూడ సూర్యకిరణానువృత్తి కనిపించుచున్నది. కిరణసంబంధమయిన తాపము ననుభవించుచున్నాము. అత్యల్పమయిన కిరణానువృత్తి గుర్తింపలేము. రాత్రిమరణించినవాడు సూర్యకిరణముల ననుసరించకయే నిష్క్రమి

మించునెడల కిరణానుసారమును జెప్పుట వ్యర్థమగును. పగటికాలమున మరణించిన వాడే సూర్యకిరణముల నపేక్షించి పైకి లేచిపోవుననియు, రాత్రిమరణించినవాడు కిరణముల నపేక్షింపకయే లేచిపోవుననియును విశేషించి చెప్పలేదు.

ఇంక విద్వాంసుడుగూడ రాత్రిమరణించినంతమాత్రపు దోషమున నూర్ధ్వగతిలేనిచో బ్రహ్మవిద్య పాక్షికఫలముగలది యగును. అట్టితరి మృత్యుకాలమునకు నియమములేనందున బ్రహ్మవిద్యయందు బ్రవృత్తియే లేకపోవును. "స యావత్ క్షిప్యేత్ మనస్తావ దాదిత్యం గచ్ఛతి" (వాడు యెప్పుడు మరణించునో అప్పుడే మనసు సూర్యుని చేరును) అని చెప్పునట్టి శ్రుతి కాలనిరీక్షణమును సూచించుట లేదు. కాన రాత్రి, పగలు అను భేదములేకయే మరణించిన నుపాసకునకు సూర్యకిరణసంబంధ ముండును.

(సూ. "అతశ్చాయనేపి దక్షిణే ౪-౨-౨౦") కాలనిరీక్షణము లేనందువలనను బ్రహ్మవిద్య నియతఫలముగల దగుటవలనను దక్షిణాయనమందుగూడ మరణించిన విద్వాంసుడు బ్రహ్మలోకమును బొందును. భీష్ము డుత్తరాయణమువరకు కాలమును నిరీక్షించుట ఉత్తరాయణమునందు మరణము ప్రశస్తమని సూచించును.

"అయనేపి దక్షిణే" అను సూత్రమువలన ఉత్తరాయణకాలము నిరీక్షింపవలయునను నాశంక పరిహృతమగు చున్నది.

కావున అవిద్వాంసులకే యుత్తరాయణమరణము పరలోకసుఖము నిచ్చును గాన ప్రశస్తము. విద్వాంసులగు దహరాద్యుపాసకులకు దక్షిణాయన మరణముగూడ బ్రహ్మలోకము నిచ్చును. రెండయనములయందును అర్చిరాదిమార్గము అవృత్తిరహితమని తేలినది.

శ్రుతిగూడ "తేర్చిష మభిసంవిశంతి, అర్చిషోఽహః, అహ్న ఆపూర్యమాణపక్షం, ఆపూర్యమాణపక్షాద్యాన్ షడుదఙేతిమాసాన్, మాసేభ్యః సంవత్సరం, సంవత్సరా దాదిత్యం" అని యర్చిరాదులు పొందదగిన దేవతలని చెప్పుచున్నది కాని, కాలవిశేష రూపములని చెప్పుటలేదు. పగటికాలమున మృతుడయినవాడు పగటినుండి శుక్లపక్షమును శుక్లపక్షమునుండి యుత్తరాయణమాసములను బొందడు. ఇట్లే "స ఏతం దేవయానం పన్థానం ఆపద్య అగ్నిలోక మాగచ్ఛతి, సవాయులోకం, సవరుణలోకం, సఇంద్రలోకం, సప్రజాపతిలోకం, సబ్రహ్మలోకం" అను శ్రుత్యంతరమున్ను "ఇమేచార్చిరాదయోగంతౄణాం నేతారః" అను శ్రుతియు అర్చిరాదులు మార్గమునందుండు నాతివాహిక దేవతలని చెప్పుచున్నవి. "ఆతివాహికాస్తల్లింగాత్" (౪-౩-౪) అనుసూత్రముగూడ నిదేవిషయమును సిద్ధాంతపరచుచున్నది.

కావున బ్రహ్మలోకమును బొందగోరిన విద్వాంసునకు కాలాపేక్ష లేదు.

లేక ||సూ|| "యోగినః ప్రతిచ స్మర్యతే స్మార్తేచైతే" (౪-౨-౧౧) అను బాదరాయణసూత్రమునుబట్టి, అనావృత్తికొరకు అహరాదికాల వినియోగము యోగులకని స్పష్టమగుచున్నది. కనుక శ్రుత్యాదులయందు జెప్పబడిన దహరాద్యుపాసనల నాచరించిన విద్వాంసునకు కాలనియమము లేదు.

కావున నిష్కామకర్మానుష్ఠాతకు అకర్తృత్వానుసంధాతకు మాత్రమే మరణమునకు కాలనిరీక్షణము గలదు. దహరాద్యుపాసకుడు బ్రహ్మలోకము నొందుట కట్టి కాలాపేక్ష లేదని సిద్ధించినది.

నిజపరిస్థితిని గమనించినచో నీ చివరిపక్ష మంత సమీచీనము గాదు. శ్రుతి స్మృతులకు భిన్నార్థమును చెప్పుట యుచితము గాదు. "అగ్నిర్జ్యోతి రహః" "ధూమో రాత్రి స్తథాకృష్ణః" అను శ్లోకములచే శ్రుత్యుక్తములయిన దేవయాన పితృయాన మార్గములే యిచట జెప్పబడినవి. ఇట్టితరి గీతాస్మృత్యుక్తమయిన సాంఖ్యయోగులకు అనావృత్త్యావృత్తిమార్గము లిచట నిరూపింపబడినవని నిర్ణయించుట పాడిగాదు.

గీతాస్మృతియందలి అగ్న్యాదిపదములు అతివాహిక దేవతాపరము లని యంగీకరించినచో శ్రుతిస్మృతులకు విరోధమే యుండదు. కావున కాలశబ్దము మార్గపరముకాని మరి యితరముగాదు.

కాలశబ్దము దేవతాపరముగాదని, పై సూత్రముల భాష్యరత్న ప్రభయం దున్నదిగదా? అని యనరాదు. మార్గము దేవతామయము కాన మార్గపరమయినను దేవతాపరమే యగును. ఎచ్చట నర్చిరాదిదేవతలు అతి వాహికులుగ నుందురో అదియే మార్గము. కావున "యత్రకాలే" అను మూలమునకు (యస్మిన్ మార్గే) ఏ మార్గమునందు అనియే యర్థము.

ఇచట యోగిశబ్దము గౌణవృత్తిచే కర్మయోగియందుగూడ వర్తించును. దీనివలన యోగులకుమాత్రమే దేవయానమార్గముచే బ్రహ్మలోకప్రాప్తిద్వారా అపునరావృత్తియనియు, కర్మయోగులకు పితృయానమార్గముచే చంద్రలోకప్రాప్తి ద్వారా పునరావృత్తియనియు సిద్ధమయినది.

కావున ఏకాలమున మరణించినయోగులు అవృత్తిని చెందరో ఆకాలమును, ఏకాలమున మరణించిన యోగులు ఆవృత్తిని చెందుదురో ఆకాలమును జెప్పెద వినుము. అని శ్లోకాన్వయము. కాలశబ్దమునను దేవతామయ మయిన మార్గ మర్థము కాని, కాల మర్థముగాదు.

శ్లో. అగ్నిర్జ్యోతి రహశ్శుక్లష్షణ్మాసా ఉత్తరాయణమ్
తత్రప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదోజనాః ॥ ౨౪ ॥

అ. ఎచ్చట అగ్ని, జ్యోతిస్సు, పగలు, శుక్లపక్షము, ఉత్తరాయణ మాసము లారును గలవో (అనగా కాలాభిమానులగు నీ దేవతలు గలరో) అందు మరణించిన బ్రహ్మవేత్తలు బ్రహ్మను బొందుదురు. ఇందు అగ్ని, జ్యోతిస్సు యథా శ్రుతమయిన దేవతలు (అగ్నిదేవతా, జ్యోతిర్దేవతా యని) మిగిలినవారు కాలాభిమానదేవతలు. ఈ మార్గమునం దితర దేవతలు అగ్ని, జ్యోతిస్సు అని యిద్దరున్నను కాలాభిమానిదేవత లెక్కువగానుండుటచే నీ మార్గము కాలశబ్దముచే వ్యవహరింపబడినది. ఒకానొకతోటలో నుసిరిగచెట్లు మున్నగునవి కొలదిగ నున్నను, మామిడిచెట్లు యెక్కువగానుండుటచే నాతోట (ఆమ్రవనమ్) మామిడితోటయని చెప్పబడును.

ఇందు మార్గచిహ్నములుగాని భోగభూములుగాని యనేకము లున్నను వాటిని గ్రహింపక అగ్న్యాది శబ్దములచే దేవతలను గ్రహించుట లోకన్యాయము ననుసరించి యని తెలియువలెను. లోకములో గ్రామాంతరము వెళ్లువారికి త్రోవజూపు వారిని చెప్పుట సహజము. అట్లే లోకాంతరమున కేగువారికి మార్గమును జూపునట్టి దేవతలను (ఆతివాహిక దేవతలను) జెప్పుట యుచితము.

ఈ శ్లోకమునందు జెప్పబడిన అగ్న్యాదులు మార్గచిహ్నములా? భోగభూములా? లేక త్రోవ నడిపెడువారా? అని సంశయించి గ్రామాంతరము వెళ్లువారికి త్రోవకు గురుతులు చెప్పుట యుచితముగాన మార్గచిహ్నము లనియు అగ్న్యాదులయందు లోకశబ్దమును బ్రయోగించుటచేతను మనుష్యాదిలోకములు భోగాయతనములని ప్రసిద్ధంబు లగుటంజేసియు భోగభూములనియును, యుక్తుల జూపుచు ఎట్లయినను అచేతనములయిన అగ్న్యాదులు ఆతివాహికులగుట లోకవిరుద్ధముగాన అగ్న్యాదు లాతివాహికులు గానేరరని పూర్వపక్షమురాగా, "ఆతివాహికాస్తల్లింగాత్" (౪-3-౪) అనుసూత్రముచే బాదరాయణులు అగ్న్యాదులు ఆతివాహికులని సిద్ధాంత మొనర్చిరి. మరియు "చంద్రమసో విద్యుతః తత్పురుషోఽమానవః సఏనాన్ బ్రహ్మ గమయతి" అను వాక్యశేషమున అమానవపురుషుడు ఆతివాహికుడని సిద్ధించుటచే నా హేతువుచే అగ్న్యాదులుగూడ నాతివాహికులని సిద్ధించుచున్నది. ఏలనన అర్చిరాదులయందు త్రోవనడిపెడు పురుషులు మానవులయియుండగా తన్నివృత్తికొరకు నీవాక్యశేషణమునందు "అమానవః" (అమానవుడు) త్రోవనడిపెడు పురుషునకు విశేషణ ముండవలెను. కావున అగ్న్యాదులు ఆతివాహికులని సిద్ధాంతము.

ఓయి ! లింగమాత్రమున (అనగా అమానవత్వ విశేషణమను హేతుమాత్రమున) అగ్న్యాదు లాతివాహికులని నిర్ణయింప వీలులేదు. లోకమునం దుచితమగు యుక్తిగూడ నుండవలెను. లోకములో, ఇంద్రియ వికలుడయిన చేతనునకు దారిచూపుటకు ఇంద్రియ సామర్థ్యముగల చేతనుడే యుపయోగించును. గ్రుడ్డివానిని గ్రుడ్డివాడు త్రోవనడుపలేడు; చేతనుని యచేతనములయిన కాష్ఠలోష్టాదులు దారి నడుపలేవు. లోకములో అగ్న్యాదులు అచేతనములని ప్రసిద్ధము లయినవి. కాన నిట్టి యచేతనములయిన అగ్న్యాదులు, లోకాంతరగాములగు నుపాసకులను నెట్లు దారినడపుదురు ? ఈయది దోషముగాదు. ఈ విషయము (సూ = "ఉభయ వ్యామోహాత్తత్సిద్ధేః" ౪-౩-౫) అనుసూత్రమున బాదరాయణులచే విమర్శింపబడినది.

అర్చిరాదిమార్గమునందు బోవువారు స్థూలదేహ వియోగమును జెంది, సూక్ష్మదేహమాత్రము గలవారై, పిండాకారమునుజెందిన (ముద్దయియున్న) నింద్రియసముదాయముగలవా రైనందున స్వతంత్రముగా నడువలేరు. అట్టివారిని స్వతంత్రులయిన చేతనులుగాని దారిన నడుపలేరు. గ్రుడ్డివానికి గ్రుడ్డివానిని సహాయపరచుట వ్యర్థమగును. కావున అగ్న్యాదులు లోకాంతరమున కేగు విద్వాంసులను మార్గమున నడపించువారని శ్రుతి చెప్పుటచే, నట్టి యగ్న్యాదులు చేతనులయిన దేవతా విశేషులని సిద్ధించుచున్నది. లోకమునందుగూడ నింద్రియములు స్వాధీనము నందులేని మత్త మూర్ఛితాదులు (మదించినవాడు, మూర్ఛపోయినవాడు) స్వాధీనేంద్రియులయిన చేతనులవలననే దారిన నడుపబడుచున్నారు. అర్చిరాదులు మార్గచిహ్నములన వీలులేదు. రాత్రి మరణించినవానికి పగటిస్వరూపము సంప్రాప్తము కాదు. పగటివరకు మరణించక వేచియుండుట సంభవింపదని యింతకుమున్నె నిరూపింపబడినది. కావున అగ్న్యాదులు దేవతారూపులని చెప్పినచో వీరికి దేవతారూపము స్థిరమయినది. గాన రాత్రికాలమునగూడ దేవతారూపముండును. అయితే వీరికి అర్చిరాదిదేవతలని పేరువచ్చుటకు గారణమేమి ? అనగా నర్చిరాదులయందలి యభిమానమే కారణమని చెప్పవలయును. కావున నర్చిరాదులు ఆతివాహికదేవతలేగాని వేరుగాదు.

అర్చిరాదిమార్గముల బోవువారి యింద్రియములు సంపిండితములై యున్నందున వారి కచ్చట సుఖదుఃఖాద్యనుభవము లేదు. కావుననే అయ్యవి భోగములు గావు. కాని యచ్చట వీరికిభోగములేకున్నను ఆ లోకమున స్థానికముగా నున్నవారల కచ్చట భోగమున్నందున అయ్యవి లోకము లనందగును. కావున దారిన బోవువారిని దాటవేయుటకు వాటిని లోకములని వ్యవహరింపవచ్చును.

కావున అగ్ని యధిపతిగా గల లోకమును బొందినవాడు అగ్నిచేతను, వాయువు అధిపతిగాగల లోకమును బొందినవాడు వాయువుచేతను దాటవేయబడు నని యన్వయించుకొనవలెను.

ఇంక నర్చిరాదిమార్గమును (ఉత్తర) (దేవయాన) మార్గమును వ్యాఖ్యానించెదము.

వాయునిరోధమును జేసిన యోగులు, తమకు మృత్యువు సన్నిహితమని తెలిసికొని నిచ్చెనచే మేడనెక్కినట్లు సుషుమ్నానాడిచే శిరోభాగమునెక్కి, శిరస్సును భేదించుకొని, సుషుమ్నానాడియొక్క చివర భాగమందున్న సూర్యకిరణములయందు ప్రవేశించి, వాటివెంట నగ్నిలోకమును బొందుదురు. ఆ యగ్ని లోకమునందే జ్యోతిర్లోక మను అవాంతరలోక మొకటి కలదు. దానినిగూడ బొందుదురు. శ్రుతియందు మాత్రము యీ రెంటినికలిపి యొకేలోకమునుగా నిర్దేశించెను. ("తేఽర్చిష మభిసంవిశంతి") అని. అటుపైన అగ్నిచేగాని జ్యోతిస్సుచేగాని, దాటింపబడినవారై అహర్లోకమును చేరుదురు. ఆ లోకమునకు అహఃకాలాభిమాని దేవత ప్రభువు. వానిచే దాటవేయబడి శుక్లపక్షలోకమును, వానిచే దాటింపబడి యుత్తరాయణలోకమును, వానిచే దాటింపబడి సంవత్సరలోకమును, వానిచే దాటింపబడి దేవలోకమును జేరుదురు. పిదప దేవతలచే దాటింపబడి వాయులోకమును, వాయువుచే దాటింపబడి సూర్యలోకమును, సూర్యునిచే దాటింపబడి చంద్రలోకమును జేరుదురు. ఈ చాంద్రమస లోకము పితృయానమునందలి చంద్రలోకముకంటె వేరు. కాన చంద్రలోకములు రెండని తెలియవలెను. కనుకనే జ్యోతిశ్శాస్త్రమునందు చంద్రలోకమునకు పైన సూర్యలోకమనియు, సూర్యలోకమునకు పైన చంద్రలోకమనియును రెండు విధముల నిర్దేశించుట యుక్తమగును. పిదప చంద్రునిచే దాటింపబడి విద్యుల్లోకమును జేరుదురు. తరువాత హిరణ్యగర్భునిచే నియోగింపబడిన ఒకానొక అమానవపురుషుడు వచ్చి విద్యుల్లోకమునుండి వరుణలోకమునకును, వరుణలోకమునుండి ఇంద్రలోకమునకును, ఇంద్రలోకమునుండి ప్రజాపతిలోకమునకును, ప్రజాపతిలోకమునుండి బ్రహ్మలోకమునకును తీసికొనిపోవును. ఇట్లుపాసకులు బ్రహ్మలోకమును జేరుదురు. ఈ యర్చిరాదిమార్గము యుత్తరదిక్కునందుండుటచే నుత్తరమార్గమని చెప్పబడును. దేవలోక విషయమగుటచే దేవయానమనియును జెప్పబడును.

ఈ మార్గమునగూడ నెవరు బ్రహ్మలోకమున జేరుదురో వారే తిరిగిరారు. అంతకు క్రిందిలోకములను జేరినవారు తప్పక తిరిగి వత్తురు. అగ్నిని, వాయువును ఉపాసించువారలకు అగ్నిలోకము, వాయులోకము ప్రాప్తించును. కనుకనే ఇంద్రలోకమయిన స్వర్గమును బొందినవారుగూడ తిరిగివత్తురు.

కావున ఉత్తరమార్గమును బొందినంతమాత్రమున పురుషులకు పునరావృత్తిరాహిత్యము లేదు. బ్రహ్మలోక ప్రాప్తివలననే పునరావృత్తిరాహిత్య మేర్పడును.

ఓయి! "తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదోజనాః" అనికదా యుత్తరార్థము. ఇందు బ్రహ్మవేత్తలు బ్రహ్మను బొందుదురు, అనిగదా యర్థమగును. అట్టితరి బ్రహ్మవేత్తలు బ్రహ్మసాయుజ్యమును బొందుదురని చెప్పక "బ్రహ్మవిదః" అను పదమునకు బ్రహ్మోపాసనాపరులని యర్థముచెప్పి, వారు క్రమముగా బ్రహ్మలోకమును బొందుదురని వ్యాఖ్యానించుట అన్యాయ్యముకదా? అని యనరాదు.

ఇందలి ప్రయాతాః" అను పదమునకు మరణించువారని యర్థము. మరణించుట యనగా ప్రాణములు శరీరమునుండి లేచిపోవుట. ఈయది యుపాసకులకు తటస్థించును. కాని తత్త్వజ్ఞానులకు తటస్థించదు. "న తస్య ప్రాణా ఉత్క్రామంతి" "అత్రైవ సమలీయంతే" అను శ్రుతి బ్రహ్మవేత్తయొక్క ప్రాణములు లేచిపోవని చెప్పుచున్నది.

మరియు, నిందు "గచ్ఛంతి" అని కలదు. పరిపూర్ణబ్రహ్మను దెలిసికొనినవాడు బ్రహ్మస్వరూపుడే కాన యట్టివానికి గమనాగమనములు సంభవించవు. కావున నిచట "ప్రయాతాః" "గచ్ఛంతి" అను రెండుపదములనుబట్టి బ్రహ్మవిదులనగా బ్రహ్మోపాసకులని వ్యాఖ్యానించుట యుక్తమే యగును.

దీనివలన జీవాణుత్వవాదము జీవుడు మధ్యమపరిమాణు డనువాదము నిరాకరింపబడుచున్నవి.

ఈ శ్లోకముయొక్క ఉత్తరార్థమున బ్రహ్మవిదులయిన జనులు (బ్రహ్మ), హిరణ్యగర్భుని పొందుదురని యర్థము తోచుచున్నది. కాని సాక్షాత్ హిరణ్యగర్భునిపొందుట సంభవించదు. గాన బ్రహ్మలోక మను లాక్షణికార్థము గ్రహింపవచ్చునను భావముతో భాష్యకర్త లాయర్థము నుపేక్షించిరి.

మరియు, పూర్వము "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" ఇత్యాది శ్లోకముచే బ్రహ్మోపాసకుడు ప్రస్తావింపబడెను. కాన మార్గముగూడ బ్రహ్మోపాసకునకు సంబంధించినదే యయినందున "బ్రహ్మవిదః" అనగా బ్రహ్మోపాసనాపరులని చెప్పబడినది. బ్రహ్మబుద్ధితో ప్రణవమునుగాని, దహరాదికమునుగాని యుపాసించువారని యర్థము.

దీనివలన కర్మయోగులకు క్రమముగగూడ బ్రహ్మప్రాప్తి లేదని తేలినది. కనుకనే వారలకు పితృయాన మని వేరుమార్గ ముపదేశింపబడుచున్నది. ౨౪

శ్లో. ధూమో రాత్రి స్తథా కృష్ణ షణ్మాసా దక్షిణాయనమ్
తత్ర చాంద్రమసం జ్యోతిర్యోగీ ప్రాప్య నివర్తతే ॥ ౨౫ ॥

అ. ఏ మార్గమునందు ధూమాభిమానదేవత, రాత్ర్యభిమానదేవత, కృష్ణ పక్షాభిమానదేవత, దక్షిణాయనాభిమానదేవతయు గలరో శ్రౌతస్మార్తకర్మల (ఇష్టాపూర్తముల) నాచరించిన కర్మయోగులు ఆ మార్గమున చంద్రలోకమున కేగి యచ్చట కర్మఫల మనుభవించి కర్మక్షయముకాగానే తిరిగివత్తురు. మూలమునందలి "జ్యోతి" శ్శబ్దమునకు కర్మఫల మర్థము. వెలు గర్థము కాదు.

శాస్త్రప్రసిద్ధమయినటువంటి వర్ణాశ్రమ విహితకర్మలను సకామముగ నాచరించినవారు, వాపీకూపతటాకాది పుణ్యకర్మల నాచరించినవారు, వీ రుభయులును పితృయానమార్గమున చంద్రలోకమునుబొంది యచ్చట తాము చేసిన కర్మలఫల మనుభవించి తిరిగి జన్మకొరకు మరల వత్తురు. అని పరమార్థము.

ఇందు "అథ య ఇమే ఇష్టాపూర్తే దత్తమిత్యుపాసతే, తే ధూమ మభిసంభవంతి" ఇత్యాది శ్రుతిని ప్రమాణముగా గైకొనవలయును. ౨౫

శ్లో. శుక్లకృష్ణే గతీహ్యేతే జగతశ్శాశ్వతే మతే
ఏకయా యాత్యనావృత్తి మన్యయాఽవర్తతే పునః ॥ ౨౬ ॥

అ. దేవయానమార్గము జ్ఞానప్రకాశక మగుటవలన శుక్లమార్గము. పితృయానమార్గము జ్ఞానప్రకాశకముగానందున కృష్ణమార్గము లోకమునందుగూడ తెల్లని చంద్రాదుల తేజస్సు ఘటపటాదులను ప్రకాశింపజేయుట, నల్లనిచీకటి వాటిని ప్రకాశింపజేయలేకపోవుటయు ప్రసిద్ధము. అట్లే ప్రకాశింపజేయుట అను గుణసంబంధముండుటవలన దేవయానమార్గము శుక్లమనియు, అయ్యది లేకుండుటచే పితృయానమార్గము కృష్ణమనియును తత్త్వము.

కొందరు శుక్లపక్షసంబంధ ముండుటవలన దేవయానమార్గము శుక్లమనియు, కృష్ణపక్ష సంబంధముండుటవలన పితృయాన మార్గము కృష్ణమనియు నందురు. అది యుచితముగాదు. అహస్సు, రాత్రి, మాసములు యుండగా శుక్ల, కృష్ణపక్షములను మాత్రము గ్రహించుటలో ప్రమాణము లేదు. ఆద్యంతములనుబట్టి మార్గమును నిర్ణయించుట యుక్తము. దేవయానమార్గమునకు మొదట అగ్నిశబ్ద మున్నది. అగ్ని జ్యోతిశ్శబ్దములు రెండును యేకార్థములని నిర్ణయింపబడినది. కావున దేవయానమార్గము అర్చిరాది మార్గమనియు, పితృయానమార్గము ధూమాదిమార్గమనియు ప్రసిద్ధము.

ఈ రెండును జ్ఞానకర్మలయం దధికారముగలవారికి మాత్రమే చెల్లును. మిగిలినవారికి నరకగతియను మూడవమార్గము గలదు. ఈయవి ప్రవాహరూపమున నిత్య

ములు. ఈ రెండు మార్గములలో జ్ఞానాధికారి దేవయానమార్గమున బ్రహ్మలోకము చేరి, అనావృత్తిని కర్మాధికారి పితృయాన మార్గమున చంద్రలోకమును జేరి, యావృత్తిని బొందును.

ఓయి! దక్షిణాయనమునందు మరణించిన విద్వాంసునకుగూడ ధూమాది మార్గముచే పితృదేవతలయొక్క మహిమను బొంది చంద్రలోకమున కేగి యచ్చట నుండి బ్రహ్మలోకమును బొంది తిరిగిరాడని తైత్తిరీయక శ్రుతి చెప్పుచుండ పితృ యానమార్గమున బోవువా రందరు మరల వత్తురనుట యెట్లు పొసగును? వినుము. అవిద్వాంసుడు చంద్రలోకమును బొంది తిరిగి వచ్చుననియు, విద్వాంసుడు చంద్ర లోకమును బొందినను అచ్చట ప్రారబ్ధము పూర్తి కాగా, అచ్చటనుంచి దేవయాన మార్గముచే మరల బ్రహ్మలోకమును బొందుననియు నా శ్రుతి కర్థము. ౨౬

శ్లో. నైతే సృతీ పార్థ! జానన్ యోగీ ముహ్యతి కశ్చన
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున ॥ ౨౭ ॥

అ. ఓయి! అర్జునా? ఈ రెండుమార్గములను దెలిసికొనిన యోగి "నేను ధూమాదిమార్గమున చంద్రలోకమునకు వెళ్ళి, అచ్చట భోగముల ననుభవింతును. దేవయానమార్గముచే ఇంద్రాది లోకములనుబొంది అచ్చటి భోగముల ననుభ వింతును" అను వ్యామోహమును జెందడు. కావున ఇష్టాపూర్తాది కర్మలయందు బ్రవర్తింపడు. ప్రణవాదుల నుపాసించి దేవయాన మార్గముచే మోక్షప్రదమయిన బ్రహ్మలోకమును బొందుటకే బ్రవర్తించును. కావున నోయి అర్జునా! నీవుగూడ సర్వకాలములయందును సమాహిత చిత్తుడ వగుము. ౨౭

శ్లో. వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టం
అత్యేతి తత్సర్వ మిదం విదిత్వా యోగీ పరం స్థానముపైతి చాద్యమ్ ॥ ౨౮ ॥

అ. బ్రహ్మమన నేమి? అధ్యాత్మమన నేమి? కర్మయన నేమి? అధిదైవమన నేమి? అధిభూతమన నేమి? అధియజ్ఞమన నేమి? ప్రయాణకాలమున నీశ్వరు నెట్లు తెలియవలెను? అను నేడు ప్రశ్నలను వివరించుచు జెప్పిన నీ యర్థమును సాకల్య ముగా దెలిసికొనిన యోగి సకలవేదాధ్యయనమువలనను, సకల యజ్ఞానుష్ఠానము వలనను, తపోనిష్ఠవలనను, దానమువలనను వచ్చెడి పుణ్యముకంటె మించిన పుణ్యము నొందును, సచ్చిదానందమగు బ్రహ్మనుగూడ బొందును. బ్రహ్మజ్ఞానము లేనపుడు బ్రహ్మలోకప్రాప్తిద్వారా బ్రహ్మసాయుజ్యము నొందునని భావము.

రామానుజ మతము:-

"పరంస్థానం" అనగా పరమపదమగు వైకుంఠమని వ్యాఖ్యానించిరి. ఈయది యుక్తముగాదు. వైకుంఠలోకము సత్యలోకములోని యవాంతరలోకము. దీని కాదిగలదు. మూలమునందలి "ఆద్యమ్" అను పదమును (అనాదిమ్) ఆది లేనిదని రామానుజులుకూడ వ్యాఖ్యానించిరి. కావున అనాదియగు పరస్థానము వైకుంఠలోకము కానేరదు. "తదక్షరే పరమే వ్యోమన్" అను శ్రుతిప్రోక్తమయిన పరమాకాశము అక్షరబ్రహ్మరూపముగాని వైకుంఠలోకరూపముగాదు. ప్రపంచ సంగరాహిత్యము, నిర్లేపత్వము, ఆకాశధర్మములు- ఈయవి చైతన్యమున కుండుటచే చైతన్యము ఆకాశ శబ్దముచే వ్యవహరింపబడుచున్నది. పరమాకాశము ఆత్మాతిరిక్తమగుచో, దానియందుండు బ్రహ్మ దానికంటె తక్కువవాడు కావలయును. ఆధారముకంటె నాధేయము తక్కువదని లోకమునందు ప్రసిద్ధము. నిరతిశయబ్రహ్మకు న్యూనత్వ ముచితముగాదు. బ్రహ్మస్వరూపమువలనను గుణమువలనను నిరతిశయుడని అంగీకరింపవలయును. గుణమువలన మాత్రము నిరతిశయుడుగాని స్వరూపమువలన సాతిశయుడనినచో బ్రహ్మయొక్క నిరతిశయత్వమునకు అర్ధజరతీయత యేర్పడును. సర్వాధారుడయిన పరబ్రహ్మకు (వ్యోమము) ఆకాశము ఆధారమగుచో సర్వాధారత్వమునకు భంగము కలుగును. కావున సర్వవ్యాపకుడును, సర్వాధారుడును, సర్వాత్మయు నగు విష్ణువునకు నియతమగు స్థానమొకటి లేదు. అట్టి స్థానమే యున్నచో విష్ణువుయొక్క విష్ణుత్వము (వ్యాపకత్వము) నకు భంగము కలుగును. కావున "పరంస్థానం" అనుపదమునకు రామానుజులు చేసిన వైకుంఠలోకమను వ్యాఖ్య యుక్తము గాదు.

ఈ యధ్యాయమునకు అక్షరపరబ్రహ్మయోగ మనిపేరు. నాశరహితుడయిన పరబ్రహ్మను బొందుటకు దగిన నుపాయము లిందుపదేశింపబడినవిగాన నీ యధ్యాయ మాపేరున బడసెను.

అర్చిరాది మార్గములను సంగ్రహముగా జెప్పు శ్లోకము లీక్రింద నుదహరింపబడుచున్నవి.

శ్లో. అగ్నిజ్యోతి రహశ్శుక్ల షణ్మాసా ఉత్తరాయణమ్
సంవత్సరో దేవలోకో వాయులోక స్తతఃపరః
ఆదిత్యశ్చంద్రమా విద్యుత్ లోకశ్చ వరుణాలయః
ఇంద్రః ప్రజాపతి ర్బ్రహ్మ విద్యుతోఽమానవః పుమాన్.

అగ్న్యాదులు పదునాలుగు లోకములు. అగ్న్యాదిలోకములయందు అగ్న్యాదులగు మానవపురుషులే యాతివాహికులు. విద్యుల్లోకమునకు పైలోకములకును

అమానవపురుషుడు, ఆతివాహికుడు, అగ్నియన్నను అర్చిస్సుయన్నను ఒకటే యర్థము. వీరుభయులకు అర్చిర్లోక మొక్కటియే అభిమానాస్పదము.

శ్లో. ధూమో రాత్రిః కృష్ణపక్షః షణ్మాసా దక్షిణాయనమ్
సంవత్సరః పితృలోకః ఆకాశ శ్చంద్రమండలమ్.

ఈయది ధూమాదిమార్గమునకు సంగ్రహ శ్లోకము.

ఇట్లు
శ్రీమద్భగవద్గీతా భాష్యార్థ ప్రకాశికానువాదమున
అ ష్ట మా ధ్యా య ము
ముగిసినది.

శ్రీ హయగ్రీవాయనమః

# శ్రీ భగవద్గీతా భాష్యార్క ప్రకాశికానువాదము

## నవమాధ్యాయము

శ్రీ భగవా నువాచ ॥

శ్లో॥ ఇదంతు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే,
జ్ఞానం విజ్ఞానసహితం యద్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. ॥ ౧ ॥

అ॥ ఎనిమిదవ అధ్యాయమున సుషుమ్నానాడీద్వారముచే ప్రాణనిరోధ రూపమయిన సగుణయోగమును జెప్పి, దానికి నర్చిరాదిమార్గమున క్రమముగా కాలాంతరమునందు బ్రహ్మను బొందుటయే ఫలమని నిరూపింపబడినది. దీనివలన మోక్షము నొందుట కిట్టి సగుణయోగమే మార్గముగాని, వేరుమార్గము లేదను శంక కలుగుచున్నది. "జ్ఞానాదేవతు కైవల్యమ్" అనువాక్యమునకు, వైయర్థ్యము గూడ కలుగుచున్నది. కావున నిట్టి యాశంకను నివర్తింపజేయదలచి, శ్రీకృష్ణుఁడు "ఇదంతు" ఇత్యాది శ్లోకములచే అనుభవయుక్తమగు బ్రహ్మజ్ఞానము, మోక్షసాధన మని చెప్పుచున్నాఁడు.

బ్రహ్మజ్ఞానము శ్రీకృష్ణునిచే వెనుకటి యధ్యాయములయందుఁ జెప్పఁబడినది. ముందు చెప్పబడగలదు. అదియంతయు శ్రీకృష్ణునకు బుద్ధియందుంటచే శ్రీకృష్ణుఁడు శ్లోకారంభముననే "ఇదమ్" అని వచించెను. వెనుకటి యధ్యాయమున జెప్పిన సగుణయోగముకంటె జ్ఞానము విలక్షణమని ప్రకటించుటకు 'తు'కారమును ప్రయోగించెను. యోగము క్రమముగా ముక్తి నొసంగును. "వాసుదేవ స్సర్వమితి సమహాత్మా సుదుర్లభః" "ఆత్మైవేదగ్ం సర్వమ్" "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" "ఇదం సర్వం యదయమాత్మా" ఇత్యాది శ్రుతిస్మృతిసిద్ధమగు "సర్వము బ్రహ్మ స్వరూపము", 'నేనే బ్రహ్మను' అను జ్ఞానము సమ్యగ్ జ్ఞానము – ఈయది నేరుగా ముక్తి నొసంగును.

ఇక నెవ్వరు, "నేను వేరు", "ఈశ్వరుడు వేరు", "ఈశ్వరుడు నాకు ఉపాస్య దేవత", "బ్రహ్మాదులు నాకు ప్రభువులు (ఉపాస్యులు)" అని తలంతురో, వారు అజ్ఞానులు. అట్టివారు నశించెడి స్వర్గాదిలోకముల బొందుదురు.

కావున నోయి అర్జునా! అసూయారహితుడవయిన నీకు నేను అతిగోప్యమగు నాత్మజ్ఞానము నుపదేశింతును. అనుభవయుక్తమగు నీ యాత్మజ్ఞానమును దెలిసికొని, అమంగళమగు సంసారబంధమునుండి విముక్తుడ వగుదువు. ॥ ౧ ॥

శ్లో॥ రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్,
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్. ॥ ౨ ॥

అ॥ బ్రహ్మజ్ఞానమును స్తుతించుచున్నాడు.

అన్నివిద్యలలోను బ్రహ్మవిద్య మిక్కిలి ప్రకాశ గలది. కావున నీయది రాజవిద్య. ఇయ్యది పరమగోప్యము. పవిత్రము చేయువస్తువులలో గొప్పది. లోకములో పాపమును బోగొట్టునట్టి అగ్నిజలాదులు పవిత్రములనియు, దుఃఖ హేతువులగు బ్రాహ్మణద్రవ్యాపహరణాదులు పాపములనియు ప్రసిద్ధి కలదు. అట్లే స్వర్గసుఖము నిచ్చెడి యజ్ఞాదులు పవిత్రములనియు, దుఃఖహేతువులగు పరదారా గమనాదులు అధర్మములనియును ప్రసిద్ధి గలదు. ఈధర్మము శాస్త్రదృష్టిచే ధర్మ మయినను, తత్త్వదృష్టిలో సంసారబంధము నిచ్చుటచే పాపమే యగును. "ధర్మేణ పాపమపనుదతి" అను శ్రుతి, ధర్మమువలన అధర్మము నశించునని చెప్పుచున్నది. కావున దుఃఖము నిచ్చు అధర్మమును బోగొట్టు ధర్మము పావనముకాగా, సంసార దుఃఖము నిచ్చెడి ధర్మాధర్మములను బోగొట్టు బ్రహ్మజ్ఞానము పరమపావన మనుటలో సందియము లేదు. సంసారైకదేశమగు నరకమును నివర్తింపజేయు ధర్మములే పావనము లగుచుండ, స్వర్గ నరకాదిరూపమయిన సర్వసంసారమును నివర్తింపఁజేయు బ్రహ్మజ్ఞానము పరమపావనమని కైముతికన్యాయముచే సిద్ధించు చున్నదని భావము.

మరియు నీ బ్రహ్మజ్ఞానము సుఖాదులవలె ప్రత్యక్షానుభవగోచర మగును. "ఆత్మావా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యః" అనుశాస్త్రముచే విధింపబడినందున జ్ఞానము ధర్మ్యము. ధర్మమునుగూడ నశింపజేయు బ్రహ్మజ్ఞానము ధర్మ్యమెట్లగునని శంకింపరాదు. ధర్మాధర్మనిర్ణయమునందు శాస్త్రమే ప్రమాణము. శాస్త్రవిహితమగుటచే జ్ఞానము ధర్మ్యమనుటకు సందియము లేదు. జన్మప్రదమగు ధర్మము, మోక్షప్రదమగు జ్ఞానముచే భస్మమగును. పురాకృత సుకృతమున గలిగెడు జ్ఞానము సుకృతమును యెట్లు నశింపఁజేయునను శంక తగదు. ప్రారబ్ధసుకృతమువలన జ్ఞానము కలుగును. ఈయది (జ్ఞానము) సంచిత సుకృతమును నశింపఁజేయును. ప్రారబ్ధమును అను భవించియే తీరవలయును. కావున నిందు బాధకము లేదు. బ్రహ్మజ్ఞానము అవ్యయము (నాశము లేనిది). కర్మ నశించును. ఫల మనుభవించినపిదప కర్మ యుండనేరదు. కాక, కర్మ స్వరూపముచేగూడ నశించును. యజ్ఞాది కర్మలు అయిదారు దినముల కంటె పిదప గనుపించవు. వాని ఫలముగూడ కొలదికాలమే యుండును. కాన కర్మలకు స్వరూపమువలనను, ఫలమువలననుగూడ నాశము గలదు. "అహం బ్రహ్మ" (నేను బ్రహ్మను) అనుజ్ఞానము మనోవృత్తిరూపమగుటచే క్షణికమయినను, తత్ఫలమగు బ్రహ్మ శాశ్వతము కాన, జ్ఞానమునకు స్వరూపముచే నాశమున్నను, ఫలమువలన

నాశము లేదు. కాన, బ్రహ్మజ్ఞానము అవ్యయమని చెప్పబడినది. దీనివలన అఖండ బ్రహ్మాకారవృత్తిరూపమయిన జ్ఞానము, కర్మలవలె స్వరూపముతో నశించునని సిద్ధమయినది. యజ్ఞాదిరూపమయిన ధర్మము శాస్త్రైకగమ్యము, ప్రయాస సాధ్యము, నశించునట్టి ఫలము గలది.

బ్రహ్మజ్ఞానము, ప్రత్యక్షానుభవగమ్యము, సులభసాధ్యము,నాశరహితమయిన ఫలముగలది. కావున నిట్టి యాత్మజ్ఞానము నందరు విశ్వసింపవలెనని భావము.

కర్మఫలము నిత్యమని చెప్పెడి, "అక్షయ్యగ్ం హవై చాతుర్మాస్యయాజినః సుకృతం భవతి" ఇత్యాదివాక్యములు ప్రరోచనావాక్యములని గ్రహింపవలెను.

స్వర్గాదులు అనిత్యములని శ్రుతిస్మృతులు వేనోళ్ల చాటుచున్నవి. కావున సంసారబంధనివర్తకమై శాశ్వతఫలప్రదమయిన ఆత్మతత్త్వజ్ఞానమునందు శ్రద్ధాళువు లగు మానవులు కృతకృత్యులగుదురు. ॥ ౨ ॥

శ్లో॥ అశ్రద్దధానాః పురుషాః ధర్మస్యాఽస్య పరంతప,
అప్రాప్య మాం నివర్తంతే మృత్యుసంసారవర్త్మని. ॥ 3 ॥

అ॥ ఓయి అర్జునా ! ఆత్మజ్ఞానమనెడి ధర్మముయొక్క స్వరూపమునందును, ఫలమునందును శ్రద్ధలేనివారును 'దేవుడులేడు' 'పరలోకము లేదు' అని వాదించు వారును, వెనుకటిజన్మయందు పాపమొనర్చి ఆ వాసన (సంస్కారము)చే నీ జన్మ యందుఁగూడ పాపమొనర్చుస్వభావము గలవారును అగు బౌద్ధులు నన్ను బొంద లేక, తుదకు నన్ను బొందుటకు మార్గమయిన సాధనభక్తిమాత్రమునుగూడ బొంద లేక పుట్టుచు, చచ్చుచు నుండెడి సంసారకూపమున గూలెదరు.

నాస్తికమతమును యిసుమంత వివరింతుము.

రాక్షసులగు విరోచనాదులు దేహమే యాత్మయని వాదింతురు. వారు ఆ సిద్ధాంతముతో మతగ్రంథములనుగూడ రచించిరి. నాస్తికులందరు వీరి మతమును ఆదరింతురు. దేహమే యాత్మయని నాస్తికుల పరమసిద్ధాంతము.

ఈ మతమందు, పుణ్యపాపములను జేసిన దేహ మను ఆత్మ యీ లోకము ననే నశించినందున, వీరలకు స్వర్గనరకాదు లనుభవించు ప్రసక్తియే లేదు. మరల జన్మయనునది అంతకుముందే సున్న. ఆరిపోయిన దీపము మరల పుట్టదు. కావున వీరికి ఇహలోకభోగమే భోగము. ఐహికభోగమును దొంగతనముచేగాని, వ్యభిచార వృత్తిచేగాని సంపాదించుకొందురు. జన్మాంతరమే లేదుగాన వీరియెడల విధినిషేధ శాస్త్రములు నిరర్థకములు. కనుకనే, వీరికి "ప్రాణతర్పణపరాయణుల"ని బిరుదు. ఏదియో యొక నుపాయముచే బొట్టనింపుకొందురు. పరదారాగమనాదులచే నింద్రి యములను తృప్తిపరతురు. వీరికి, దేహము పడిపోవుటయే మోక్షము. ఇహలోక మున నితరుల భార్యలతో సుఖించుటయే స్వర్గము. ఇహలోకదుఃఖమే నరకము.

కంటి కగుపడు వస్తువుమాత్రమే కదలని వీరి నమ్మకము. మిగిలినదంతయు లేదనియే వీరి సిద్ధాంతము. కనుకనే వీరు వేదశాస్త్రములయందు శ్రద్ధలేక ఆత్మజ్ఞానము నందును, దాని ఫలమునందును విశ్వాసమును గోలుపోవుదురు. కనుకనే వీరు భగవంతుని పొందలేకపోగా, భగవంతుని పొందుట కుపాయములగు జ్ఞానోపాసనాది మార్గములనుగూడ బొందలేరు. ఆత్మను నుపాసింపకున్నను, ఆత్మను ప్రేమించుట గూడ వీ రెఱుంగరు. కావున వీరికి నరకమే తారకము. ॥ 3 ॥

అవ. ఇట్లు జ్ఞానస్తుతిచే అర్జునుని అభిముఖపరచి, జ్ఞానము నుపదేశించుచున్నాడు.

శ్లో॥ మయా తతమిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా,
మత్స్థాని సర్వభూతాని నచాహం తే ష్వవస్థితః. ॥ ౪ ॥

అ॥ ఈ ప్రపంచమంతయు అవ్యక్తస్వరూపుడనగు నాచే వ్యాప్తమయినది. సర్వభూతములు నాలో కలవు. నేను ఆ భూతములయందు లేను. ఈశ్వరునకు పరరూపము, అపరరూపము అని రెండురూపములు గలవు. అందు సచ్చిదానందము పరరూపము. కల్పితమయిన ఓంకారాదులు అపరరూపములు. ఇందు పరరూపముతో ప్రపంచమును వ్యాపించియున్నాడు. కనుకనే లోకములో "ప్రపంచము గలదు" "ప్రపంచము ప్రకాశించుచున్నది" "ప్రపంచము ప్రియమయినది" ("జగదస్తి", "జగద్భాతి" "జగత్ప్రియమ్") అని ప్రతీతి కలుగుచున్నది. కార్యమయిన ఘటమునందు కారణమగు మృత్తు వ్యాపించియుండును. కనుకనే "మృద్ఘటః" అను ప్రతీతి పొసగును. ప్రపంచము బ్రహ్మకార్య మనునది స్పష్టము. కావున కార్యమగు ప్రపంచమునందు కారణమగు బ్రహ్మము వ్యాపించియుండును. ప్రపంచమును వ్యాపించెడి పరరూపము (సచ్చిదానందరూపము) ఇంద్రియాదులకు గోచరముగాదు. ఇంద్రియగోచరమగు దానిని ఇదమిత్థం అని నిర్వచింపవచ్చును. ఇంద్రియగోచరము గానిదాని నట్లు నిర్వచింప సాధ్యముగాదు. అందువలన నీయది యవ్యక్త మనబడును. ఇట్టి అవ్యక్తమగు సచ్చిదానందరూపమునందు, దేహేంద్రియసముదాయరూపమయిన భూతము లన్నియు త్రాటియందు సర్పమువలె గల్పింపబడి యున్నవి. అధిష్ఠానములేని భ్రమ సంభవింపదుగాన, ప్రపంచకల్పనమునకు అధిష్ఠానముగా సచ్చిదానందరూపబ్రహ్మము సిద్ధించుచున్నాడు. కల్పితపదార్థములకు అధిష్ఠానము కంటె వేరురూపము లేదు. సర్పమునకు రజ్జుస్వరూపముకంటె వేరురూపము లేదు. ఈ న్యాయము భ్రమస్థలమునందేగాదు, ప్రమాస్థలమునగూడ అన్వయించును. మృత్కార్యమయిన ఘటము అధిష్ఠానమగు మృద్రూపముగాని వేఱురూపముగాదు. కావున, భ్రమాత్మకకార్యముగాని, ప్రమాత్మకకార్యముగాని భూతమయిన అధిష్ఠానరూపమే గనుక శూన్యముగాదు. శశశృంగాదులుమాత్రమే స్వరూప

శూన్యములు. కార్యమునకు గారణము అధిష్ఠానమని మృద్ఘటస్థలమున జూడబడినది. బ్రహ్మాది స్తంబపర్యంత భూతములు బ్రహ్మకార్యములుగనుక బ్రహ్మయం దుండును. ఇచ్చట బ్రహ్మయం దుండుట యనగా, బ్రహ్మస్వరూపముచే వ్యాపించబడుట యని గ్రహించవలయును. మృత్తుయందు ఘటముండుటయనగా ఘటము మృత్స్వరూపముగా నుండుటయని అర్థము.

అనృతములును, జడములును, దుఃఖాత్మకములును అగు భూతములు సచ్చిదానందరూపమయిన పరమాత్మరూపము లెట్లగునని శంకింపదగదు. రజ్జుకల్పితమయిన సర్పము రజ్జుస్వరూప మగుచున్నది. అట్లే ఆకాశమునందు గల్పితమయిన నైల్యము ఆకాశరూపమున్ను, సూర్యకిరణములయందు గల్పింపబడిన ఉదకము కిరణరూపమున్ను అగుచున్నవి. సచ్చిదానందలక్షణమయిన పరమాత్మయందుఁ గల్పింపబడిన ప్రపంచము పరమాత్మ స్వరూపమగుట పొసగును. మృదంశముకంటె వేరుగ ఘటము లేదు. సచ్చిదానందాంశముకంటె వేరుగ భూతములు లేవు. ఆ భూతములయందు గనుపడు అనృతత్వ, జడత్వ, దుఃఖాద్యంశములు నామరూపములున్ను, మాయా కార్యములున్ను. మృత్తుయందు కంబుగ్రీవాద్యాకారము, ఘటమనునామము కల్పితమయినట్లు, బ్రహ్మయందు మనుష్యత్వాద్యాకారము, మనుష్యాదినామములు కల్పితములు. ఆ నామమునందును, ఆ యాకారమునందును యుండు సత్తాద్యంశములు మాత్రము బ్రహ్మధర్మములు కాన, నామరూపములయందు బ్రహ్మధర్మముగూడ గలదు. కావున సచ్చిదానందాంశములకంటె నతిరిక్తముగా భూతపదవాచ్యమయిన వస్తువు లేదు.

భూతములు సచ్చిదానందానందబ్రహ్మాత్మకములు గనుకనే, "సర్వం బ్రహ్మ" "వాసుదేవ స్సర్వమ్" అను శ్రుతిస్మృతు లుపపన్నము లగుచున్నవి.

ఇట్టి తఱి "బ్రహ్మ సత్యము, జగన్మిథ్య" అను న్యాయమునకు విరోధము కదా ? అని యనరాదు. కార్యప్రపంచము కార్యరూపముతో మిథ్య కారణమయిన బ్రహ్మరూపముతో సత్యము; ఘటము ఘటరూపముతో మిథ్య కారణమగు మృద్రూపముతో సత్యము. కనుకనే, "వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్" అను శ్రుతివికారములు (కార్యములు) వాఙ్మాత్రములనియు, మృత్తిక సత్యమనియు జెప్పినది.

ఇట్లు బ్రహ్మస్వరూపముచే వ్యాప్తమయినందున, భూతములు బ్రహ్మయందున్నను, భూతములయందుమాత్రము బ్రహ్మ లేదు. కాని భూతములకు బ్రహ్మ ఆత్మయయినందున, భూతములయందు బ్రహ్మయున్నటుల మూఢులనుకొందురు. కాని యది యుచితముగాదు. సాకారమయిన వస్తువు మరియొక వస్తువుతో నంటియుండును గాని, నిరాకారమయినబ్రహ్మ మరియొక వస్తువుతో నంటియుండనేరదు. జలము

పృథివియందును, పృథివి జలమునందును యుండును. అట్లు బ్రహ్మ పృథివ్యాదులయం దుండనేరదు. అసంసర్గమయిన వస్తువు ఒకానొకచోట ఆధేయముగా నుండదు.

అయితే, అమూర్తమయిన (నిరాకారమయిన) ఆకాశము ఘటాదులయం దుండునుగదా! ఘటమునకు, అమూర్తమయిన ఆకాశమునకు సంశ్లేషము (ఆధారాధేయభావసంబంధము) అంగీకరింపబడినదికదా? నిజమే వినుము. పరమాత్మ ఆకాశముకంటె గూడ విలక్షణుడు. ఆకాశము అత్యంతము అమూర్తము గాదు. అట్లగుచో ఆకాశము కంటి కగపడదు. అట్లగపడనిచో "ఇది యాకాశము" అను ప్రతీతియే కలుగదు. ఆకాశ మగుపడుచున్నది. ఇది యాకాశమను ప్రతీతియు కలుగుచున్నది. ఆకాశము కంటికి సంబంధించిన ప్రకాశమువలనగాని, కంటికి సంబంధించిన చీకటివలనగాని కంటికి గోచరమగును. తమఃప్రకాశముల కంటె వేరుగా ఆకాశమను పదార్థము కనిపించదు. కావున ఆకాశము సహజముగా అమూర్తమయినను (నిరాకారమయినను) చీకటివెలుతురులలో నేదియో యొకదాని యొక్క సంబంధముచే మూర్తము (సాకారము)గాన, ఆకాశమునకు ఘటముతో సంబంధము కలుగవచ్చును. నిరాకారమయిన ఆకాశమునకు తమఃప్రకాశముల యొక్క సంశ్లేష మెట్లు పొసగునని శంకింపరాదు. తమఃప్రకాశములచే నభివ్యాప్త మగుటయే సంశ్లేషము. అట్టి అభివ్యాప్తి ప్రత్యక్షసిద్ధముగాన యందు సంభవాసంభవములను శంకింపరాదు. కావున ఆకాశమునకు ఘటాదులతో సంశ్లేషము కుదురును.

కాని అత్యంతము అమూర్తమయిన బ్రహ్మకు భూతములతో సంశ్లేషము అసంభవము.

అత్యంతము అమూర్తమయిన సచ్చిదానందబ్రహ్మకుగూడ అజ్ఞానముతో సంగము కలదుగదా! లేదు. చైతన్యాత్మకమయిన బ్రహ్మమే అజ్ఞానావృతమగుచో ప్రపంచమంతయు గ్రుడ్డిదగును. "అసంగో హ్యాయం పురుషః" అను శ్రుతియు విరుద్ధమగును. కావున అజ్ఞానముగూడ పరమాత్మయందు భూతభౌతికములవలె నంటకుండనే యుండును. మాయచే నెంతటి కార్యమయినను ఘటించును.

కావున అసంసర్గియగు వస్తువు యెచ్చటను ఆధారాధేయభావముతో నుండదని సిద్ధించినది.

ఇచట భాష్యకర్తలగు శంకరులు, పరమాత్మ ఆకాశముకంటెగూడ అత్యంత విలక్షణుడనియు, ఆకాశముకంటెగూడ ఆంతరతముడనియు (లోపలివాడనియు) రెండువిధముల పాఠము సూచించిరి.

అందు మొదటిపాఠము ననుసరించి యింతకుమున్ను వివరింపబడినది.

ఇకముందు రెండవపాఠము ననుసరించి విషయము ఉపపాదింపబడుచున్నది. కారణము, కార్యమునకు అంతరము (లోపలిది). ఆకాశము అవ్యాకృతకార్యము. కాన, ఆకాశముకంటె అవ్యాకృతము లోపలిది. కారణముచే, కార్యము వ్యాప్తమగును. కారణము వ్యాపకము. కార్యము వ్యాప్యము. అవ్యాకృతము చైతన్యమున కుపాధి. కావున చైతన్యముచే నుపాధియయిన నవ్యాకృతము వ్యాప్తమగును. ఆకాశమున కుపాధియయిన ఘట మాకాశముచే వ్యాప్తమగుచున్నది. కావున, వ్యాప్యమయిన అవ్యాకృతముకంటె వ్యాపకమగు చైతన్యము లోపలిది (అంతరము).

మరియు రజ్జువునందు కల్పితమయిన సర్పము రజ్జువుచే వ్యాప్తమయినట్లు, చైతన్యమునం దధ్యస్తమయినందువలనగూడ అవ్యాకృతము చైతన్యముచే వ్యాప్తమగుచున్నది.

మరియు "యః ప్రకృతౌ తిష్ఠన్ ప్రకృతి మంతరః" అను నంతర్యామి బ్రాహ్మణముగూడ చైతన్యము, అవ్యాకృతమునకు లోపలిదని చెప్పుచున్నది. ప్రకృతి యవ్యాకృతములకు భేదము లేదు. కనుకనే "అవ్యక్తా త్పురుషః పరః" అను శ్రుతి యవ్యాకృతముకంటె చైతన్యము గొప్పదని చెప్పుచున్నది. ప్రకృతి, అవ్యక్తము, అవ్యాకృతము యీ మూడుపదములు సమానార్థకములు.

కావున ఆకాశముకంటె అంతరము అవ్యాకృతము. అవ్యాకృతముకంటె అంతరము చైతన్యము. కాన పరమాత్మ సర్వాంతరమనునది సుస్పష్టము.

అయితే భాష్యకర్తలగు శంకరులు, పరమాత్మ (చైతన్యము) అవ్యాకృతము కంటె అంతరుడని చెప్పక, ఆకాశముకంటె అంతరుడని చెప్పుటకు కారణమేమి? వినుము. అవ్యాకృత మన నెల్లరకు దెలియదు. ఆకాశము అమూర్తమని అందఱకు దెలియును. కాన ఆకాశముకంటె పరమాత్మ అంతరుడని భాష్యకర్తలు చెప్పిరి. ఆకాశమే యమూర్తమగుచో, ఆకాశముకంటె మిక్కిలి యాంతరుడగు పరమాత్మ అమూర్తుడని వేరుగ జెప్పనేల? అని అవ్యాకృతపదార్థమును తెలియనివారలకు భావము సుబోధమగుట కాకాశముకంటె అంతరుడని భాష్యకారులు చెప్పిరి.

పరమాత్మ ఆకాశముకంటె అంతరుడను విషయమున సంశయము లేదు. "ఆకాశ శరీరం బ్రహ్మ" "య ఆకాశే తిష్ఠన్" ఇత్యాది శ్రుతులే ప్రమాణములు.

మరియు "ఆత్మన ఆకాశ స్సంభూతః" అనుశ్రుతి యాకాశము ఆత్మకార్యమని చెప్పుచు, ఆత్మ ఆకాశముకంటె అంతరుడని (లోపలివాడని) చెప్పుచున్నది.

ఓయి! ఆకాశము, అవ్యాకృతమునకు కార్యము. అవ్యాకృతమునకు శరీరము ఆత్మకార్యము, ఆత్మకు శరీరమున్ను గానేరదు. నిజమే. అవ్యాకృతముద్వారా ఆకాశము ఆత్మకార్యమున్ను, ఆత్మశరీరమున్ను అగును. ఆత్మకు శరీరము అవ్యాకృతము, అవ్యాకృతమునకు శరీరము ఆకాశము. ఇట్లె ఆకాశము పరంపరగా ఆత్మకుగూడ శరీరమగును.

కావున, అత్యంతామూర్తమయిన పరమాత్మ, భూతములయం దుండుట యసంభవము. కనుకనే "నచాహం తే ష్వవస్థితః" అని శ్రీకృష్ణులు చెప్పిరి. ॥ ౪ ॥

శ్లో॥ నచ మత్స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్,
భూతభృన్న చ భూతస్థః మమాత్మా భూతభావనః. ॥ ౫ ॥

అ॥ ఓయి అర్జునా! నే నసంగుడ నగుటచే భూతములుగూడ నాయం దుండవు. భూతములకు నే నాధారుడను గాను. దేనితోను సంసర్గములేని వస్తువు దేనికి నాధారముగూడ గానేరదు. కావున పూర్వశ్లోకమున సర్వభూతములు నాయం దుండునని చెప్పినమాట అజ్ఞానుల దృష్టిననుసరించి చెప్పితినని గ్రహింపవలయును. లేనిచో పూర్వోత్తర శ్లోకములకు విరోధ మేర్పడును. భూతములు నాయందు గలవనియు, లేవనియు నొక్కడే చెప్పుట యుచితముగాదు. అట్లొక్కడే పరస్పర విరుద్ధమయిన మాటలను జెప్పినచో వా డున్మత్తు డనిపించుకొనును. కావున పరమాత్మయందు భూతములు గలవనియు, పరమాత్మ భూతములయం దుండుననియును మూఢమతులకే దోచునుగాని, తత్త్వవేత్తల కట్లు దోచదు. అసంగుడయిన పరమాత్మకు నాధారాధేయభావ మసంగతము.

ఓయి, ఇట్లయినచో, "సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని" "ఈక్షతే యోగయుక్తాత్మా" "(సర్వభూతములయం దాత్మ యుండుననియు, సర్వభూతము లాత్మయం దుండుననియు యోగయుక్తుడయిన మానవుడు దెలిసికొనును). అని చెప్పినమాట విరోధించునుగదా ?" కాదు.

విద్యయొక్క తారతమ్యముచే విద్వత్తుకు దారతమ్యము ఘటించును. విద్వాంసులు, 'బ్రహ్మవిదుడు, బ్రహ్మవిద్వరుడు, బ్రహ్మవిద్వర్యుడు, బ్రహ్మవిద్వరిష్ఠుడు' అని నాలుగు విధముల బ్రసిద్ధులయిరి. అందు "సర్వభూతములయం దాత్మ కలదు, సర్వభూతము లాత్మయందు గలవు" అని తలంచువాడు బ్రహ్మవిదుడు. "ఆత్మ భూతముల కాధారముగాదు, భూతము లాత్మయందు లేవు" అని తెలిసికొనువాడు బ్రహ్మవిద్వరిష్ఠుడు. వీనికంటె వెనుక జెప్పబడిన బ్రహ్మవిదుడు మూఢుడు. కావున, అధికారిభేదము ననుసరించి విషయము భిన్నభిన్నముగా నుపదేశింపబడినందున విరోధము లేదు.

ఏది యెటులయినను, యుక్తియుక్తముగా పూర్వ ముపపాదింపబడిన మతమును మరల యిపు డాక్షేపింపనేల? వినుము సమాధానము : "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" "నేహనానాస్తి కించన"ఇత్యాది శాస్త్రముల ననుసరించి జ్ఞానకాలముననగాని; యజ్ఞానకాలముననగాని అసంగస్వప్రకాశమగు బ్రహ్మమునందు మాయ, కార్యప్రపంచముతోగూడ మూడుకాలములయందును లేదని చెప్పుటయే నీ యాక్షేపమునకు దాత్పర్యము. రజ్జుసర్పము అధ్యాసకాలమందుండి, రజ్జుయథార్థజ్ఞానకాలమందు

లేనట్లు, బ్రహ్మకల్పితమయిన ప్రపంచము అజ్ఞానకాలమందుండుననియు, బ్రహ్మజ్ఞాన కాలమందుమాత్రము లేకుండుననియు ననరాదు. అట్లైతజే బ్రహ్మము ప్రపంచము యొక్క భావాభావములచే వికారమునొందును. వికారమునొందిన బ్రహ్మ మనిత్య మగును. లోకమునందు మృద్వికారమగు ఘటాదు లనిత్యములగుచున్నవి. బ్రహ్మము నిత్యము, సజాతీయ విజాతీయ స్వగతభేదశూన్యము; అవిక్రియము, నిర్విశేష చిన్మాత్రము, అసంగము. ఇట్టి బ్రహ్మయందు జ్ఞానకాలమునగూడ ప్రపంచముండుట పొసగదు.

రజ్జువుయందుగూడ సర్పము కాలత్రయమందును లేదు. అధ్యాసకు బూర్వము అధ్యాసనివృత్త్యనన్తరము లేని సర్పము అధ్యాసకాలమున నుండనేరదు. భ్రమజెందిన వాడుగూడ భ్రమనివృత్త్యనంతరము యిది రజ్జువేగాని, సర్పముగాదని యను చున్నాడు. అక్కడ పాము లేదనియు, త్రాడుమాత్రమే గలదనియు, తాను భ్రమ జెందితిననియును తెలిసికొనుచున్నాడు.

భ్రమకాలమున రజ్జువు (త్రాడు) సర్పాకారముగా బరిణమించెనని యన రాదు. క్షీరమునకు దధిరూపముగా పరిణమించు సామర్థ్యమున్నట్లు రజ్జువునకు సర్పా కారముగా పరిణమించు సామర్థ్యములేదు. రజ్జువున కట్టిసామర్థ్యమే యున్నచో, భ్రమలేకున్నను తాను పరిణమించును. క్షీరము భ్రమకాలమున దధిరూపముగా పరిణమించుట లేదు. ప్రమాకాలమందే దధిరూపముగా పరిణమించుచున్నది.

భ్రమకాలమున రజ్జువుయందు నూతనమయిన సర్పము బుట్టుననుటగూడ నుచితముగాదు. అచట సర్పముయొక్క యుత్పత్తియే భ్రమ.

ఇట్లైతరి మాధ్యమికులవలె శూన్యవాద మొప్పినట్లేకదా? కాదు. సత్యమగు బ్రహ్మ నంగీకరించుచుంటిమి. కనుక అద్వైతమున శూన్యవాద ప్రసక్తి లేదు. రజ్జువుయందు ప్రాతిభాసికమగు నూతనరజతము బుట్టునను మతము, భ్రాంతుల దృష్టి ననుసరించిగాని, వివేకవంతుల దృష్టి ననుసరించిగాదు.

ప్రపంచము బొత్తిగా లేదనువాదము, బౌద్ధులకు, అద్వైతులకు సమాన మయినను, "విజ్ఞానము క్షణికమని బౌద్ధులు", "జ్ఞానము సత్యమని యద్వైతులు" అంగీకరించుటచే వీ రుభయులకు భేదము గలదు. అంతఃకరణమందున్న ప్రపంచము, వెలుపలనున్నట్లు కనిపించునని విజ్ఞానవాదులు, ప్రపంచము నిజముగా బుద్ధియందు గాని బాహ్యమునందుగాని లేదనియు కాని భ్రాంతునకు బాహ్యమునందున్నట్లు తోచుచుండుననియు నద్వైతులు. కావునఅద్వైతులకు విజ్ఞానవాద మాపన్నముగాదు.

అయితే ప్రపంచము బొత్తుగా లేనిచో "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను శ్రుతి "ఇదమ్" శబ్దముచే ప్రపంచమును జెప్పుచున్నందున నా శ్రుతి విరోధము ప్రసక్తించదా? యను నాశంక కలుగుచున్నది.

ఏది రజతముగా కనిపించినదో అది శుక్తియేగాని, రజతము గాదనినట్లు, ఏది ప్రపంచముగా దోచినచో అయ్యది బ్రహ్మయేగాని ప్రపంచముగాదు. రజ్జువుయందు సర్పభ్రాంతి గలిగినట్లు, బ్రహ్మయందు జగద్భ్రాంతి కలుగుచున్నది. అని యాశ్రుతికి దాత్పర్యము. కాన శ్రుతివిరోధము లేదు.

ప్రపంచ మత్యంతశూన్య మగుచో వ్యవహారయోగ్యమే కాదుగదా యని అనరాదు. వ్యవహారమే లేనపుడు దానికి యోగ్యమగుట ప్రపంచమునందు లేదని చింత యేల?

భ్రాంతులయొక్క దృష్టిలో ప్రపంచము గలదు. వ్యవహారమున్ను కలదు. విద్వాంసుల దృష్టిలో ప్రపంచము లేదు. తద్వ్యవహారము లేదు. శశశృంగాదికము భ్రాంతులయొక్క దృష్టిలోగూడ లేదు. గాన వారి దృష్టిలోగూడ నయ్యది వ్యవహార యోగ్యము గాదు. ఎవరిదృష్టిలో నే పదార్థముండునో వారి కాపదార్థము వ్యవహార యోగ్య మగును. కలగాంచినవాని దృష్టిలోనున్న పదార్థము, కలగాంచినవానికే వ్యవహారయోగ్య మగును.

కావున నిష్ప్రపంచమగు బ్రహ్మమునందును, కాలత్రయమునందును ప్రపంచము లేదు. ప్రపంచము లేదుగనుకనే, ప్రపంచమునందు బ్రహ్మయు లేదు. శశశృంగమునం దేవస్తువు నుండనేరదు. శశశృంగము మరియొక వస్తువునందును యుండదు. వివేక వంతుల దృష్టిలో ప్రపంచము శశశృంగముతో సమానము. భ్రాంతుల దృష్టిలో రజ్జుసర్పముతో సమానము. ఇందు తేజోబిందూపనిషద్వాక్యమును చూడుడు :

" వంధ్యాకుమారవచనే భీతిశ్చే దస్తికించన
శశశృంగేణ నాగేన్ద్రో మృతశ్చే జ్జగదస్తి తత్ "

"గొడ్డురాలి కొడుకు చెప్పిన మాటయందు మీకు భయమున్నచో, కుందేటి కొమ్ముతోగొట్టిన నాగేంద్రుడు చచ్చుచో, ప్రపంచ ముండును" అని దీనియర్థము. ఇందు ప్రపంచము, వంధ్యాపుత్రునితో సమానముగను, శశశృంగముతో సమానము గను నిరూపింపబడినది. కనుకనే శ్రీకృష్ణులు గీతయందు "నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః" అనిచెప్పిరి.

కనుక, ఒకానొక కాలమందు లేనివస్తువు, కాలాంతరమం దుండనేరదు. ఒకా నొక కాలమం దున్న వస్తువు కాలాంతరమందు లేకపోదు. కనుకనే జ్ఞానకాలమందు లేనిప్రపంచము, అజ్ఞానకాలమం దుండుట యసంభవము. సత్యమయిన బ్రహ్మ జ్ఞాన కాలమందు గలడనియు, అజ్ఞాన కాలమందు లేడనియు జెప్పనలవికాదు. బ్రహ్మ సత్య మనియు మిగిలినదంతయు నసత్యమనియు గీతలలో "అవినాశితు తద్విద్ధి" అనుశ్లోకమున నిరూపింపబడినది. "తత్సత్యం అతోన్యదార్తమ్" అను శ్రుతిగూడ నీయర్థమునే వివరించుచున్నది.

కావున జ్ఞానకాలమందుగూడ ప్రపంచము లేదనియు, అట్లున్నదనుకొనుట భ్రాంతిసిద్ధమనియు దేలినది. కాన యాధ్యాసికమగు నొకప్రపంచము బ్రహ్మయందు గలదని పూర్వమతము. ఈయది "మత్స్థాని సర్వభూతాని నచాహం తేష్వవస్థితః" అను పూర్వశ్లోకముచే జెప్పబడినది.

ఆధ్యాసికమగు ప్రపంచముగూడ బ్రహ్మయందు లేదని యుత్తరమతము. ఈయది "నచ మత్స్థాని భూతాని పశ్యమే యోగమైశ్వరమ్" అను నుత్తరశ్లోకముచే జెప్పబడినది.

కావున బ్రహ్మయం దాధ్యాసికప్రపంచము గలదని వాదించువారలే మూఢులని శ్రీకృష్ణభగవానులు, శంకరులు అంగీకరింపగా, నిజముగా ప్రపంచము గలదని వాదించుద్వైతులు, విశిష్టాద్వైతులును, మూఢబుద్ధులని వేరుగ జెప్పనేల ?

ప్రపంచము లేదను సిద్ధాంతము, అచలవేదాంత మతగురువగు శివరామ దీక్షితులవారిదికదా అని యనరాదు. అచలమతగురువులు, ఆత్మ బ్రహ్మస్వరూపుడనరు. జీవబ్రహ్మల కభేదము నంగీకరించుచో జీవునకు స్వరూపనాశమే పురుషార్థము కావలసివచ్చునని వీరి భయము. అచలమతము "అహం బ్రహ్మాస్మి" అనుశ్రుతికి విరుద్ధము. అచలమతమున, "పరిపూర్ణమగు బ్రహ్మము, మాయ" అను రెండు తత్త్వముల నంగీకరింతురు. అద్వైతులు, పరిపూర్ణమగు తత్త్వ మొక్కటియే యని యందురు. ఇట్లద్వైతవాదులకును, అచలమతస్థులకును పెక్కుయంశములయందు భేదము గలదు.

అద్వైతమునగూడ, "దృక్, దృశ్యమ్" అను పదార్థద్వయ మంగీకరింపబడినది కదా? అని యనరాదు. అట్లంగీకరించు నద్వైతులు మూఢులు. తత్త్వవేత్తల దృష్టిలో కల్పితమయిన దృశ్యము తత్త్వము గానేరదు. తత్త్వవేత్తలు దృశ్యమును శశశృంగతుల్యముగా జూతురు.

ఇట్టితరి బంధమోక్షాది వ్యవస్థ కుదరదుగదా? మాకిష్టమే. కనుకనే కైవల్యోపనిషత్తుయందు,

> "న నిరోధో నచోత్పత్తిః న బద్ధో నచ సాధకః
> న ముముక్షు ర్నవై ముక్తః ఇత్యేషా పరమార్థతా"

అని బంధమోక్షాది వ్యవహారము లేదని చెప్పబడినది.

ఇట్టితరి గురుశిష్యాది సంప్రదాయ మెందులకు ? శాస్త్ర మెందుకు ? అతి గుహ్యమగు నీ బ్రహ్మతత్త్వము, గురుశాస్త్రములు లేనిదే తెలియశక్యము గాదు. "గురుశాస్త్రై వినాత్యంతం గంభీరం బ్రహ్మవేత్తికః ?" అని విద్యారణ్యులు చెప్పిరి.

వేదశాస్త్రములుగూడ మూఢుల కావశ్యకము లగును. కనుకనే "త్రైగుణ్య విషయా వేదాః" అని శ్రీకృష్ణులు చెప్పిరి.

కావున, అసంగుడగు బ్రహ్మయందు భూతములు లేవు. భూతముల యందును అసంగుడగు బ్రహ్మ లేదు.

ఇట్టి నిష్ప్రపంచత్వమే పరమేశ్వరునియొక్క తత్త్వము. ఈశ్వరసంబంధమయిన యోగమనగా, యథాతథ్యమని యర్థము.

ఓయి అర్జునా! ప్రత్యక్షాది బహుప్రమాణగమ్యమయిన ప్రపంచము, శాస్త్ర యుక్త్యనుభవపూర్వకముగ లేదని నిరూపించితిని. ఇదియొక యాశ్చర్యము.

నాయందు మరియొక ఆశ్చర్యము కలదు చూడుము. నే నసంగుడ నయినను భూతములను భరించెదను. భూతములను భరించుచున్నను, భూతములయం దుండను. నాయొక్క ఆత్మ భూతముల బుట్టించును; వృద్ధిపరచును. శ్లోకమునందు శ్రీకృష్ణుడు "మమాత్మా" అని చెప్పెను.

"మమపుస్తకమ్" ఇత్యాది ప్రయోగములయందు మచ్ఛబ్దార్థమునకు, పుస్తకమునకు భేదము స్ఫురించుచున్నది. అట్లే శ్రీకృష్ణప్రయోగమునందుగూడ మచ్ఛబ్దార్థమునకు, ఆత్మకు భేదము తోచును. దీనివలన సర్వజ్ఞుడగు శ్రీకృష్ణుడుగూడ ప్రాకృతపురుషునివలె ఆత్మాభేదమును (ఆత్మతత్త్వమును) తెలియక, "తాను వేరు", "ఆత్మ వేరు" అని నిర్దేశించెనని యర్థమగును. సర్వజ్ఞుడగు శ్రీకృష్ణునియం దంతట యవివేకము నారోపించుట యుచితము గాదు. కాన శ్రీకృష్ణుడు లోకదృష్టిననుస రించి, భేదమును నిర్దేశించెననియే ఆ ప్రయోగమున కర్థమును వర్ణింపవలయును. కాన నా యాత్మ యనగా, నే నను నాత్మయనియే యర్థము.

అసంగుడగు ఆత్మ, భూతములయం దుండకపోవుట యుచితమేగాని భూత ముల దరించుటమాత్రము విరుద్ధము. కాన నీయది మరియొక ఆశ్చర్యము.

(1) అసంగుడనయినను మాయచే భూతముల భరించువాడను అని గాని,

(2) మాయచే, భూతములను భరించుచున్నను, నిజముగా భూతములయం దుండువాడను గాననిగాని,

(3) భూతములయం దుండని వాడనయినను, నేను మాయచే భూతములను భరించువాడననిగాని,

(4) తత్త్వవేత్తలదృష్టిలో భూతములయం దుండకున్నను, మూఢదృష్టిలో భూతములయం దుండుటచే నేను భూతముల భరించువాడ నయితిని; అనిగాని యీ విరోధమునకు పరిహారమును జెప్పుకొనవలయును.

అసంగుడును, అక్రియుడును అగునాత్మయందు నిజముగ భూతములు లేకున్నను ఆత్మయందు భూతభావనత్వమున్నటుల మాయచే మూఢులకు గోచరించును.

ప్రపంచమున్నటుల విద్వాంసులకుగూడ దోచునని యనరాదు. విద్వాంసు లకు పాంచభౌతికమగు ప్రపంచము మరుమరీచికాజలముతో సమానముగా దోచును.

"శ్లో. మధ్యాహ్నార్క మరీచికాస్వివ పయఃపూరో యదజ్ఞానతః,
ఖం వాయుర్జ్వలనో జలం క్షితిరితి త్రైలోక్య మున్మీలతి.

అను కృష్ణమిశ్రోక్తిని తిలకింపుడు. కావున బ్రహ్మాత్మసాక్షాత్కారము నొందిన వారలకు ప్రపంచసాక్షాత్కార ముండదు.

(ఉదా) సుషుప్తియం దేరికిని ప్రపంచము భాసించదు. సమాధియందు యోగులకును ప్రపంచము భాసించుటలేదు. ఇట్లె జ్ఞానులకు ప్రపంచము భాసించదు.

ప్రారబ్ధ మున్నంతవరకు విద్వాంసులకుగూడ దేహాది ప్రపంచము కలదుగదా? అని యనరాదు.

"యథారజ్జుం పరిత్యజ్య సర్పం గృహ్ణాతివై భ్రమాత్
తద్వ త్సత్య మవిజ్ఞాయ జగత్పశ్యతి మూఢధీః
రజ్జుఖండే పరిజ్ఞాతే సర్పరూపం న తిష్ఠతి
అధిష్ఠానే తథాజ్ఞాతే ప్రపంచే శూన్యతాంగతే
దేహస్యాపి ప్రపంచత్వా త్ప్రారబ్ధావస్థితిః కుతః ?
అజ్ఞానజన బోధార్థం ప్రారబ్ధ మితిచోచ్యతే"

అను నాదబిందూపనిష త్ప్రమాణము ననుసరించి విద్వాంసునకు ప్రారబ్ధమే లేదందుము.

కనుక నిష్ప్రపంచమగు బ్రహ్మమందు ప్రపంచము కాలత్రయమందును లేదు. ప్రపంచమునందు బ్రహ్మయు లేదు. ఈయది తత్త్వము. ॥ ౫ ॥

శ్లో. యథా ఆకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్
తథా సర్వాణి భూతాని మత్ స్థానీ త్యుపధారయ. ॥ ౬ ॥

అ॥ గడచిన రెండు శ్లోకములచే జెప్పబడిన యర్థమును దృష్టాంతపురస్సరముగ నీ శ్లోకముచే నుపపాదించుచున్నాడు.

ఆకాశమునం దున్న వాయువునకు ఆకాశముతో సంబంధ మెట్లు లేదో, అట్లే నాయందున్న భూతములకుగూడ నాతో సంబంధము లేదు. కాన మాయచే నాయందు భూతములున్నను, నాయొక్క అసంగిత్వమునకు బాధలేదని భావము.

ఈయది మూఢబుద్ధుల ననుసరించి చెప్పబడినది. యథార్థపక్షమున నాయందు భూతములుకాని, మాయకాని కాలత్రయమందును లేదు.

రా మా ను జ మ త ము

రామానుజు లీ శ్లోకార్థము నిట్లు వివరించిరి. అంతర్యామిరూపుడనగు నాచే సమస్తప్రపంచము వ్యాప్తమయి యున్నది. భూతములస్థితి నామీద నాధారపడి యున్నది. కావున ప్రపంచమంతయు నాయందున్నది, నేను భూతముల మీద నాధారపడి యున్నవాడనుగాను. కనుక నేను భూతములయం దుండను. "నాయందు

భూతములున్నవనగా, కుండలో నీళ్ళున్నట్లు గాదు, నిరాధారమయిన నాకసమునందు గూడ నాచే ధరింపబడుచు వాయువున్నట్లు భూతములు నాయందు గలవు-" అని.

ఈయది యనుచితము.

ఈశ్వరు డంతర్యామియనినచో సమస్తప్రపంచమునకు లోపలయే నుండవలె గాని, వెలుపల నుండదగదు. అట్లు అంతర్వ్యాప్తిమాత్రమే యీశ్వరున కంగీకరించుచో "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణస్థితః" అను శ్రుతికి విరుద్ధమగును. ఈ శ్రుతి యీశ్వరుడు సకలప్రపంచమునకు లోపల వెలుపల వ్యాపించియున్నాడని చెప్పుచున్నది. సర్వవ్యాపి యగు నీశ్వరునకు, అంతర్వ్యాప్తిమాత్రమున సంకోచ పరచుట అన్యాయ్యము. అంతర్వ్యాపి యగు నీశ్వరునికంటె, బహిర్వ్యాపి యగు నీశ్వరుడు మరియొకడు లేడు. ఈశ్వరు లిద్దరున్నపుడే న్యాయము పొసగెడిది. ఒక డంతర్యామియనియు, మరియొకడు బహిర్వ్యాపియనియును___

స్థావరజంగమాత్మక భూతములు జీవాధీనములుగాని, అంతర్యామ్యధీనములు గావు. "జీవాపేతం వావ కిల శరీరం మ్రియతే" (జీవునిచే విడువబడిన శరీరము మరణించును) అను శ్రుతి జీవుడు లేనిచో శరీరము మరణించునని చెప్పుచున్నది. అచేతనములయందు, మృతశరీరమునందు, భస్మమందును అంతర్యామి గలడు. ఇందులకు "యఃపృథివ్యాం తిష్ఠన్ పృథివీ మంతరః" అను నంతర్యామిబ్రాహ్మణము ప్రమాణము.

జీవునియొక్క స్థితి (ఉనికి) అంతర్యామ్యధీనము గాదు. నిత్యుడయిన జీవుడు పరాధీనస్థితి నొందడు. జీవుడు స్వతంత్రుడుగాని, పరతంత్రుడు గాడు. జీవునియందు గనిపించు పారతంత్ర్యము అంతఃకరణధర్మముగాని జీవధర్మముగాదు. లోకములో అచేతనము చేతనపరతంత్ర మగును. చేతను డెల్లప్పుడును స్వతంత్రుడు.

కాక మూలకర్తయగు వ్యాసులకు, రామానుజులు చెప్పిన యర్థమునందు దాత్పర్యమున్నచో, అపుడు వ్యాసులు "మద్వశానితు భూతాని నచాహంత ద్వశః పునః" అని చెప్పియుండెడివారు.

మరియు, "కుండలో నీళ్ళవలె నాయందు భూతములు లేవు" అని రామానుజులు వివరించుటగూడ నుచితముగాదు. విశ్వరూపుడయిన శ్రీకృష్ణునియందు దీభూతములన్నియు కుండలో నీరువలెనే యున్నవి. శ్రీకృష్ణు డట్లు విశ్వరూపమును ముందు జూపగలడు. రామానుజులు వారి మతప్రకారము విశ్వరూపుడయిన శ్రీకృష్ణుడు యీశ్వరుడని యంగీకరించకతప్పదు.

మరియు, సర్వభూతముల కాధారమై తా నింకొక యాధారము నపేక్షింపక యుండెడి వాయువు నిరాధారమయిన ఆకాశమునందుండుటయం దాశ్చర్యమేమి? అట్టివాయువును యీశ్వరుడు పట్టుకున్నాడని వర్ణింపనేల? ఈశ్వరుడు పట్టుకొననిచో వాయు వాకాశమునం దుండక నెచ్చటయుండును?

"వాయు వాకసమునం దున్నటుల భూతములు నాయందు గలవని" మాత్రమే మూలమునం దుండ, "నాచే ధరింపబడినదగుచు" అను నంశమును కల్పించుట నిర్మూలము, అప్రమాణమును గదా ?

"నాచే ధరింపబడుచు వాయువాకాశమునం దెట్లు కలదో" అని దృష్టాంతము నందుగాని, "నాయందున్న భూతములు నాచే ధరింపబడినవి" అని దార్ష్టాంతికము నందుగాని లేదుగదా ?

ఒకవేళ తుష్యతు న్యాయముచే నీయర్థ మంగీకరింత మన్నను, దృష్టాంత దార్ష్టాంతిక భావము పొసగదు.

దృష్టాంతమున ఆకాశమునందున్న వాయువు ఈశ్వరునిచే ధరింపబడినది. దార్ష్టాంతికమున ఈశ్వరునియం దున్నభూతములు యీశ్వరునిచే ధరింపబడినవి. ఈరెంటికి దృష్టాంతదార్ష్టాంతికభావ మెట్లు పొసగును ?

లోపలనున్న యీశ్వరునిచే ధరింపబడిన భూతములు యీశ్వరునియం దెట్లుండును ? వెలుపల యీశ్వరుడు లేడుకదా ? "అంతర్యామియగు నాచే ధరింప బడినవని" గదా మీరు చెప్పినది. వెలుపలగూడ నీశ్వరుని అంగీకరించినయెడల వాడే భూతముల కాధారమగును. వాయువున కాకాశ మాధారమయినట్లు; ఇక "ఈశ్వరునిచే ధరింపబడి" అని వర్ణింప బనిలేదు. మరియు, ఈశ్వరునిచే ధరింపబడుచు వాయువు ఆకాశమునందు గలదు. సరే, ఆకాశ మెవ్వరిచే ధరింపబడి యెచ్చటనున్నది ? కొంచెము చెప్పుడు ?

వాయువు ఆకాశమునందు గలదని యందఱకు దెలియును. ఈయది ప్రత్యక్షము. ఆకాశము విషయమే అజ్ఞాతము. ఆకాశము యీశ్వరునిచే ధరింపబడి యీశ్వరునియం దున్నదని, మీమత మగుచో ఆయంశమునే దృష్టాంతమీయవలె గాని దానిని విడచి మరియొక అంశమును దృష్టాంతమీయుట తగదు. దార్ష్టాంతిక మున కనుకూలమున్ను గాదు.

మరియు "మమాత్మా" అనుపదమునకు "మత్సంకల్పః" (నాసంకల్పము) అని రామానుజులు అర్థము చెప్పిరి. అదియు నుచితము గాదు. ఆత్మశబ్దమునకు ముఖ్యార్థమును విడచి గౌణార్థమును గ్రహించుట న్యాయము గాదు. కాక, భూతములను బుట్టించుటకు ఆత్మ కర్తయగును. సంకల్పము కారణమగును. ఇట్టితఱి కర్తయగు ఆత్మను విడచి, కారణమగు సంకల్పమునకు భూతభావనకర్తృత్వమును వర్ణించుట యుక్తముగాదు.

ఇక, నాసంకల్పమే భూతములను బుట్టించును. నేను భూతముల బుట్టింతునని వేఱుగ జెప్పనేల ? అని యర్థాపత్తిని సూచింపదలచి, "మమాత్మా భూతభావనః"

అని వ్యాసులు చెప్పిరనుట పొసగదు. ఈశ్వరునకు సంకల్పాతిరేకముగ భూతసృష్టి లేదు. "తదైక్షత బహుస్యాం" అను శ్రుతి సృష్టి సంకల్పపూర్వకమనియే చెప్పు చున్నది. కుమ్మరి దండచక్రాది వ్యాపారముచే కుండను తయారుచేసినట్లు యీశ్వరు డొకానొక వ్యాపారముచే ప్రపంచమును నిర్మించుటలేదు, సంకల్పమాత్రముచేతనే నిర్మించుచున్నాడు. కావున అర్థాపత్తిసూచనకొరకుగూడ నిట్లుదాహరించుట యుచితముగాదు.

కావున "మమాత్మా" అను పదమునకు, "వసుదేవతనయుడ నయిన నాయొక్క స్వరూపమయిన సచ్చిదానందలక్షణ పరమాత్మ" యను అర్థమే సమీచీనము.

శ్రీకృష్ణుడే పరమాత్మయగుచో "మమఆత్మా" అని షష్ఠ్యంతప్రథమాంత పదములు కుదరవుగదా ? కాదు, దేహేంద్రియసంఘాతస్వరూపదృష్టితో "మమ" యనియు, సచ్చిదానందస్వరూపదృష్టితో "ఆత్మ" యనియు, నిర్దేశించుటవలన నిందు దోషము లేదు. ॥ ౬ ॥

శ్లో. సర్వభూతాని కౌంతేయ ! ప్రకృతిం యాంతి మామికామ్,
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్. ॥ ౭ ॥

అ॥ ఓయి అర్జునా ! ప్రళయకాలమునందు సమస్తభూతములు నామాయలో లీనమగుచున్నవి. సృష్టిప్రారంభమున మరల యాభూతములను నేను వెనుకటివలె బుట్టింతును.

ఇచట లోకన్యాయమున కొకింత విరోధము కనిపించుచున్నది. లోకములో ఘటము మృత్తికయందు లయమును చెందును. మరల మృత్తికనుంచియే పుట్టును. ప్రకృత మీ శ్లోకమునందు భూతములు ప్రకృతియందు లీనమయి, పరమాత్మవలన బుట్టునని జెప్పబడినది. ఈయది లోకవిరుద్ధము—

కాదు. భూతములు సృష్టిసమయమున పరమాత్మవలన బుట్టుటగాని, పరమాత్మయం దుండుటగాని మాయాద్వారముననే జరుగును. పరమాత్మ స్వయ ముగా ప్రపంచసంగరహితుడు. వానియందు సాక్షాత్తుగా భూతము లుండనేరవు.

కావున, పరమాత్మయందు మాయ గలదు. మాయయందు భూతములు గలవు. ఆ భూతములు మాయయందే లయించును. దానినుంచియే మరల పుట్టును. కాన విరోధము లేదు.

ప్రళయకాలమున మాయగూడ నుండుచో బ్రహ్మకు సద్వితీయత్వము సంభ వింపదా ! అని యనరాదు.

అగ్నియొక్క దహనప్రకాశనశక్తులతో నగ్నికివలె, మాయయను స్వశక్తితో పరమాత్మకు సద్వితీయత్వము సంభవింపదు. బ్రహ్మకంటె వేరుగ మాయా

స్వరూపము నిరూపింప నలవియగుచో నపుడు మాయతో బ్రహ్మకు సద్వితీయత్వ మాపన్న మయ్యెడిది.

అయితే యిట్లు మాయయే ప్రపంచముయొక్క ఉత్పత్తిస్థితి లయములకు గారణమయినచో "యతోవా ఇమాని భూతాని జాయంతే" అను శ్రుతి బ్రహ్మకు జగజ్జన్మస్థితిలయహేతుత్వమును లక్షణముగా జెప్పుట యుక్తము కాదుగదా?

ప్రపంచాకారముగా పరిణమించిన మాయకు నధిష్ఠానమగుటచే బ్రహ్మ యందు శ్రుత్యుక్తమగు జగత్కారణత్వలక్షణముపపన్నమగును.

ఇట్లు మాయాద్వారమున ఈశ్వరుడు భూతముల కాధారభూతుడని తలంచియే శ్రీకృష్ణుడు నాయందు భూతములు గలవనియు, లేవనియు జెప్పెను. ॥ 7 ॥

శ్లో॥ ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునఃపునః,
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతే ర్వశాత్. ॥ 8 ॥

అ॥ నేను అవిద్యారూపమగు నా ప్రకృతిని వశపరచుకొని పరాధీనమయి యున్న నీ భూతసముదాయమును మాటిమాటికి బుట్టించెదను. భూతసముదాయము యొక్క ఉత్పత్తిప్రళయములకు ప్రకృతి యాధారమగుటవలన ప్రకృతిలేనిదే ఈశ్వరు నకు భూతములను బుట్టించుట సంభవించదని భావము.

ఇంతమాత్రమున ఈశ్వరునకు ఈశ్వరత్వము చెడిపోదు. ప్రకృతిని వశపరచు కొనియుండుటయే ఈశ్వరత్వము. జీవుడు ప్రకృతిపరతంత్రుడు.

కాన ఈశ్వరుడు తనమాయాశక్తిచే సమస్త ప్రపంచమును ప్రతి కల్పము నందును మాటిమాటికి పుట్టించి మరల ప్రతిప్రళయమునందును మాయయందు లయింపజేయుచున్నాడు.

అయినను వారివారి కర్మవశమున కర్మానుగుణముగ బుట్టించుచు సంహరించు చున్న పరమేశ్వరునకు వైషమ్య నైర్ఘృణ్య దోషము లంటవు.

అవ॥ అయితే భూతసముదాయమును యిట్లు విషమముగా తయారు చేయు చున్న పరమేశ్వరునకు విషమసృష్టికి కారణమయిన ధర్మాధర్మములతో సంబంధ ముండునుగదా ? అను శంకకు సమాధానము జెప్పుచున్నాడు.

శ్లో॥ నచ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ,
ఉదాసీన వదాసీన మసక్తం తేషు కర్మసు. ॥ 9 ॥

అ॥ ఓయి అర్జునా ! ఉదాసీనునివలె సృష్టిస్థిత్యాదికర్మలయందు ఫలాసంగమును కర్తృత్వాభిమానమును విడచియున్న నన్ను విషమసృష్టికి నిమిత్తములయిన పుణ్య కర్మలు బంధించవు. సుఖదుఃఖాది సంసారమును సంపాదించుచు భూతసముదాయ మునే బంధించును.

ఇద్దరు తగాదాపడుచు తగాదాకు సంబంధించిన మనోవికారమును పొందు చుండ, ఉదాసీనుడగు మూడవ వాడచ్చటనుండియు నేమాత్రము వికారమును

బొందడు. అట్లే యీశ్వరుడుగూడ నిర్వికారముగ నుండునని భావము. బంధమునకు ఫలేచ్ఛాకర్తృత్వాభిమానములు కారణములు. జీవులకు ఆత్మస్వరూపజ్ఞానము లేనందున నీయవి కలిగియుండును. కాన జీవులు కర్మలయందు సక్తులై సంసారమును బొందుదురు. పరమేశ్వరుడు అసక్తుడై సంసారమును బొందడు. శంకరులు జీవులయొక్క ప్రవృత్తికి కోశకారమను కీటవిశేషమును దృష్టాంతపరచిరి. కోశకారమన గవ్వపురుగు. అయ్యది తనకు బంధకమగు కోశమును తాను తయారుచేసికొనును. అందు సందులేనందున తా నా కోశమునందే మరణించును. అట్లే జీవుడుగూడ దనకు బంధకమగు కర్మను తానొనర్చి తుదకు దానివలననే వాడు జన్మమరణముల నొందుచుండును. ॥ ౯ ॥

శ్లో॥ మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరమ్,
హేతునానేన కౌంతేయ ! జగద్విపరివర్తతే. ॥ ౧౦ ॥

అ॥ లోకములో వివాదపడువాడు ఉదాసీనుడు కానేరడు. ఉదాసీనుడు వివాదపడడు. అట్లే, భూతసముదాయమును బుట్టించుట యను క్రియగల పరమేశ్వరుడు నిర్వికారుడు గాడు. నిర్వికారుడయిన పరమేశ్వరుడు భూతములను బుట్టించనేరడు. కాన పరమేశ్వరునియందు నీవిరుద్ధధర్మములు రెండును యెట్లు ఘటించును ? అని యాక్షేపము.

సమాధానము : ఓయి అర్జునుడా! నేను అధిష్ఠానముగా నుండ ప్రకృతి చరాచర ప్రపంచమును బుట్టించుచున్నది. అదేకారణమున ప్రపంచము తిరుగుచున్నది.

దేహము నడచుచుండగా దేహధర్మమగు గమనమును దేహియం దారోపించి దేహి వెళ్ళుచున్నాడని లోక మనుకొనుచున్నది. అట్లే ప్రకృతి ప్రపంచమును సృష్టించుచుండ ప్రకృతిధర్మమగు సృష్టిని, ప్రకృతి కధిష్ఠానమయిన నీశ్వరునియం దారోపించి యీశ్వరుడు ప్రపంచమును సృజించుచున్నాడని శాస్త్రజ్ఞులుగూడ జెప్పుచున్నారు.

కావున క్రియ ప్రకృతియందేగాని యాత్మయందు లేదు. అందువలన ఆత్మ వికారరహితు డగును. ఆత్మయందు సృష్టికర్తయను ప్రతీతి సృజించునట్టి ప్రకృతి కధిష్ఠానమగుటచే నేర్పడినదిగాని సహజముగాదు. కాన సృజించునట్టి ప్రకృతికి సాక్షియగుటచే నీశ్వరునకు సృష్టికర్తయను వ్యవహారము కలిగెను. కనుక విరోధము లేదు.

"ఏకో దేవ స్సర్వభూతేషు గూఢస్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా కర్మాధ్యక్ష స్సర్వభూతాధివాస స్సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" అను శ్రుతి పరమేశ్వరుడు సర్వసాక్షియనియు, ప్రపంచాధిష్ఠాతయనియు వాచ్యముగా చెప్పుచున్నది. పరమేశ్వరుడు సర్వసాక్షికాగా, అగతికముగ ప్రకృతికర్త యగును.

"అజామేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీం ప్రజాఃజనయంతగ్ం సరూపాః" ఇత్యాది శ్రుతులు ప్రకృతికి ప్రపంచ కర్తృత్వమును నేరుగా జెప్పుచున్నవి.

ఇట్లైనచో, "యతోవా ఇమాని భూతాని జాయంతే" అను శ్రుత్యుక్తమయిన జగజ్జన్మాదిహేతుత్వ మను లక్షణము ప్రకృతికే యన్వయించును గాని, ఆత్మకు అన్వయించదుగదా! ఇందు యిష్టాపత్తిని జూపదగదు. "ఈక్షతే ర్నాశబ్దమ్" అను సూత్రమున శంకరులు ప్రకృతికి సృష్టికర్తృత్వమును నిరాకరించి యుండిరి. కాక "మూలప్రకృతి రవికృతిః" అను సాంఖ్యశాస్త్రసిద్ధాంతమే యద్వైతులకుగూడ ప్రసక్తించును. అనినచో,

అట్లుకాదు. ఈశ్వరాధిష్ఠితమయిన ప్రకృతిగాని, ప్రకృతితోగూడిన నీశ్వరుడుగాని ప్రపంచోత్పత్తి ప్రళయములకు గారణము. జడమయిన కేవల ప్రకృతిగాని, చిన్మాత్రుడయిన కేవలీశ్వరుడుగాని, ప్రపంచకారణము కాదు. జడమయిన ప్రకృతికి సంకల్పరూపజ్ఞానము సంభవింపదు. చిన్మాత్రునకు మాయావృత్తిరూప సంకల్పము సంభవించదు.

అందు సాంఖ్యులు కేవల ప్రకృతియే జగత్కారణ మందురు. అద్వైతులట్లంగీకరింపరు. కనుక వీరికి సాంఖ్యమతప్రవేశదోషము లేదు. అద్వైతులు కేవలీశ్వరుడు సృష్టిహేతువుకాడని నిషేధింతురు. కాన వీరికి శ్రుతివిరోధముగూడ లేదు.

"యతోవా ఇమాని" అను శ్రుతి మాయాధిష్ఠాత యయిన ఈశ్వరుడు జగత్కారణమని జెప్పుచున్నది. మాయద్వారా బ్రహ్మగూడ జగత్కారణమగు నన్నచో, నది మా కిష్టము. కేవల బ్రహ్మయందు సృష్ట్యాదిక్రియలు సంభవింపవనియే మాయద్వారా కారణమని యొప్పబడినది.

కావున శరీరశరీరులకు భేదము తెలియనప్పుడే, శరీరికి గమనక్రియాశ్రయత్వము పొసగుచున్నది. అట్టి భేదము తెలిసినచో, శరీరి గమనక్రియాశ్రయుడే గాడు. అట్లే యీశ్వరప్రకృతులకు భేదము లేనప్పుడే యీశ్వరునకు కర్తృత్వము పొసగును. అట్టిభేదమే యున్నచో నీశ్వరుడు కర్తయేగాడు. ప్రకృతియే కర్త యగును.

మాయావచ్ఛిన్నచైతన్యమే యీశ్వరుడు కాన, ప్రకృతితో భేద మున్నపుడు యీశ్వరుడే సిద్ధింప డనరాదు. అప్పుడు మాయతోగూడిన నీశ్వరుడు సిద్ధింపకున్నను చైతన్యరూపుడగు నీశ్వరుడు సిద్ధించును. ఈశ్వరునకు సహజరూపము చైతన్యమాత్రము. మాయావచ్ఛిన్నరూపము ఆధ్యాసికము. అట్లే జీవునకుగూడ చైతన్యమే స్వస్వరూపము. అంతఃకరణావచ్ఛిన్నత్వము ఆధ్యాసికరూపము (కల్పితరూపము) మాయా అంతఃకరణములు రెండును చైతన్యమునం దధ్యసింపబడినవి.

కావున, జీవేశ్వరు లిద్దరు చైతన్యరూపులుకనుకనే "తత్వమస్యాది" శ్రుతులు జీవేశ్వరుల కభేదమును బోధించుచున్నవి. కనుకనే "ఏకోదేవ! (దేవుడొక్కడే)

అని శ్రుతియందు జెప్పబడినది. జీవేశ్వరుల కిద్దఱకు చైతన్యలక్షణమయిన ఆత్మ యొక్కఁడే కాని వేరుగాదు.

కాన చైతన్యలక్షణుడగు ఆత్మ వికారరహితుడు. తనుకనే యుదాసీనుడు. జగత్కర్తృత్వము ప్రకృతిదిగాని యీశ్వరునిదిగాదు. అయ్యది యీశ్వరునియందు గల్పింపబడినది.

ఈశ్వరుడు అధ్యక్షుడుగా నుండుటను బట్టియే ప్రపంచము సృష్టిప్రళయముల నొందుచు, కులాలచక్రమువలె దిరుగుచున్నది.

బుద్ధి స్వయముగ జడమయినను, చిత్ప్రతిబింబముతో గూడినందున, చేతనత్వము నొంది, "నేను జూచుచున్నాను", "వినుచున్నాను" అని వ్యవహరించుచున్నది. అట్లే ప్రకృతి జడమయినను, చిత్ప్రతిబింబముతో గూడినదై, చేతనత్వము నొంది, సృష్ట్యాదివ్యవహారమును జేయును. ప్రకృతి అంతఃకరణాలకు సమష్టి వ్యష్టిభేదమేకాని, వేరుభేదము లేదు."

ఈశ్వరునకు అధ్యక్షత్వమనగా, ప్రకృతియందు ప్రతిఫలించుట; లేక అయస్కాంతమువలె ప్రకృతిని ప్రేరేపించుట.

లేక, ప్రకృతిని వశపరచుకొనుట.

లేక సర్వప్రపంచమును, మాయను ప్రత్యక్షము చేసికొనుట.

లేక, ప్రకృతికి తద్వారా సకలప్రపంచమునకు అధిష్ఠానమగుట. ఇం దేపక్షమంగీకరించినను యీశ్వరునకు నిర్వికారత్వము, ప్రపంచవిపరివర్తనము సిద్ధించును.

బ్రహ్మాదిస్తంబపర్యంత భూతసముదాయముయొక్క ప్రవృత్తి, చేతనాధీనమని యంగీకరింపవలెను. జడమయిన భూతగ్రామమునకు స్వతఃప్రవృత్తి కుదరదు. కాన చేతనుడయిన ఆత్మచే జూడబడుచునే, భూతగ్రామము సకలవ్యవహారమును నెరవేర్చుకొనుచున్నది.

దేహేంద్రియాన్తఃకరణాదులకు భోజన దర్శనాదులయందు కలిగెడి ప్రవృత్తికిని చేతనుడగు ఆత్మ చూచుచుండుటయే నిమిత్తము.

ఇట్లే జగచ్చక్ర పరిభ్రమణమునకుగూడ, సాక్షాద్దర్శనమే నిమిత్తము. ఇదియే ఈశ్వరునకు ప్రపంచాధ్యక్షత్వము.

ఈశ్వరుడు ప్రపంచ, ప్రకృతులకు అధ్యక్షుడగుటలో, "యోస్యాధ్యక్షః పరమే వ్యోమన్" ఇత్యాది మంత్రములు ప్రమాణములు. పరమేశ్వరుడు పరమాకాశమం దుండునని యీ మంత్రము చెప్పుచున్నది. పరమాకాశమన అవ్యాకృతము, లేక హృదయాకాశము. ఈశ్వరుడు యీశ్వరత్వముతో ప్రకృతియందును, ప్రత్యగ్రూపముతో బుద్ధియందును ఉండును. ఇట్లంతర్యామి బ్రాహ్మణము ప్రమాణమగుచున్నది.

ఓయి, బుద్ధియందుండు జీవుడు, (ప్రత్యగాత్మ) ప్రపంచాధ్యక్షుడు గాడు. తన కుపాధులగు బుద్ధీంద్రియాదులకుమాత్రమే యత డధ్యక్షుడు. పరమాత్మ పరిపూర్ణుడు, జీవుడు అపరిపూర్ణుడు; పరమాత్మ అప్రత్యక్షుడు, జీవుడు ప్రత్యక్షుడు; పరమాత్మ అద్వితీయుడు, ప్రత్యగాత్మ సద్వితీయుడు.

ఇట్లు జీవపరమాత్మలకు చాలభేదము గలదు. ఇట్టి భేదముండుటవలననే తత్త్వమస్యాది స్థలమున లక్షణ స్వీకార మవసరమయినది. కాన ప్రత్యగాత్మకు పరమాత్మ ధర్మమగు ప్రపంచాధ్యక్షత్వము, పరమాత్మకు ప్రత్యగాత్మధర్మమగు అంతఃకరణస్థితి యీ రెండును పొసగవు. అనినచో,

అట్లుకాదు "యస్మాత్సా దపరోక్షా ద్బ్రహ్మ" అను శ్రుతినిబట్టి పరమాత్మకూడ నపరోక్షుడు. "యేన సర్వమిదం తతమ్" అను గీతావచనానుసారమున, ప్రత్యగాత్మ కూడ పరిపూర్ణుడు. జీవపరమాత్మలకు ఉపాధిభేదముతప్ప స్వరూపభేదము లేదు. ఒకే యాత్మ జగత్కారణమగుటచే పరమాత్మయనియు, బుద్ధ్యభివ్యక్తమగుటచే ప్రత్యగాత్మయనియు జెప్పబడుచున్నాడు. కాన బుద్ధియందున్న ప్రత్యగాత్మయే ప్రపంచాధ్యక్షుడయిన పరమాత్మ యని సిద్ధించినది. వాక్యవృత్తియను గ్రంథములో జీవపరమాత్మలకు సూచించిన భేదము అజ్ఞానిదృష్టి ననుసరించికాని, వస్తుస్థితినిబట్టి కాదు. జీవపరమాత్మలకు వ్యవహారదశయందుగూడ భేదములేదు. ఔపాధికమగు భేదము ఉపాధిగతముకాని, ఆత్మగతము కాదు. కనుకనే "ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి" అనెడి శ్రీకృష్ణవచనము పొసగుచున్నది. ఈశ్వరుడే ప్రత్యగాత్మయని నీవచనమున కర్థము.

జీవేశ్వరుల కెల్లపుడు భేదము లేదని నంతమాత్రమున సాంఖ్యమత ప్రవేశము సంభవించదు. సాంఖ్యులు, ఈశ్వరుడు జగత్కారణమని యంగీకరించరు. అద్వైతు లంగీకరింతురు. జీవపరమాత్మలకు భేద మంగీకరించనందున ద్వైతమతప్రవేశముకూడ లేదు. "ఏకమేవాద్వితీయం బ్రహ్మ", "స ఆత్మా" ఇత్యాదిశ్రుతులు ఆత్మభేదము ను నిషేధించుచున్నవి. కేవల శ్రుతులవలననేగాక యుక్తివలనగూడ ఆత్మభేదము పొసగదు.

ఎట్లన: ఆత్మభేదము యెవరిచేనయినను దెలియబడునా! లేదా! తెలియబడుచో, ఆత్మచే దెలియబడునా లేక అనాత్మచే దెలియబడునా? - ఇందు మొదటి పక్షము పొసగదు. ఆత్మదృశ్యమగు ఆత్మభేదము ఆత్మధర్మము కానేరదు. అనాత్మ జడముకాన ఆత్మభేదమును గ్రహింపలేదు. కాన రెండవపక్షముగూడ పొసగదు. ఇక ఆత్మభేదము తెలియబడదనినచో నయ్యది శశశృంగాదులవలె నసంభవమగును.

మరియు ఆత్మభేదము ఆత్మకంటె భిన్నమా? అభిన్నమా? భిన్నమగుచో, అనాత్మధర్మ మగును. అభిన్నమగుచో ఆత్మభేదము, ఆత్మ యొకటే యగును. ఆత్మభేదము సిద్ధించనిదే ఆత్మబహుత్వము సిద్ధించదు.

అయితే సర్వప్రపంచాధిష్ఠాన చైతన్యమాత్రుడయిన పరమేశ్వరుడు అద్వితీయుడై, సర్వభోగములను కోరనివాడై, చేతనుడును భోగాభిలాషగలవాడును అగు మరియొక ఆత్మ లేనపుడు పరమేశ్వరునకీ ప్రపంచసృష్టి యెందులకు? ప్రపంచభోగములను దానను భవించువాడు గాడు. అనుభవించు చేతనుడు మరియొకడు లేడు. అను నాక్షేపము కలుగును.

అందుకు శ్రుతి యిట్లు పరిహారమును జెప్పుచున్నది. "కో అద్ధా వేదక ఇహ ప్రవోచత్" "కుత ఆజాతా కుతఇయం విసృష్టిః" అని. దీనియర్థము ఈప్రపంచసృష్టి యెవరివలన కలిగినదో, ఏకారణమున కలిగినదో ఎవనికి నేరుగా తెలియును? ఎవడు చెప్పును?

కావున 'నీప్రశ్న' ప్రతివచనములేకుదరవని తాత్పర్యము.

ప్రపంచసృష్టికి ఈశ్వరలీల కారణమని యనరాదు. అఖండ చిన్మాత్రుని యందు లీలకూడ సంభవించదు. కనుక సృష్టికి ప్రయోజనము లేకుండుటనుబట్టికూడ సృష్టి మాయామయమని యంగీకరింపవలయును. అసంగతమయినవాటిని కూర్చుశక్తి మాయయందుమాత్రమే కలదు. కనుకనే భగవంతుడు "అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతిజంతవః" అని జెప్పెను.

మాయచే ఆత్మానాత్మ వివేకజ్ఞాన మడుగంటి, ఆత్మానాత్మ తాదాత్మ్యాధ్యాస పెరిగి, అనాత్మయందలి కర్తృత్వాధికము ఆత్మయం దారోపించి, ఆత్మ కర్తయని లోకులు వ్యామోహము నొందుచున్నారు. వస్తుతః ఆత్మ అకర్త, నిర్వికారుడు. సృష్ట్యాది వ్యాపారము ప్రకృతిది. దర్శనశ్రవణాది వ్యాపారము ప్రపంచము సొత్తు. ప్రపంచమునకు, ప్రకృతికి నీప్రవృత్తియంతయు నీశ్వరకటాక్షలబ్ధమే యని గ్రహింపవలయును. ॥ ౧౦ ॥

శ్లో॥ అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్,
పరంభావ మజానంతో మమభూత మహేశ్వరమ్. ॥ ౧౧ ॥

అ॥ ఇట్లు నేను నాశరహితుడను, నిర్మలుడను, జ్ఞాతను, నిత్యముక్తుడను, సర్వజ్ఞుడను, సర్వప్రాణుల కాత్మరూపుడను అయినను, ఆకాశాది భూతములను వ్యాపించియున్న నాదు పరమాత్మతత్వమును గుర్తెఱుగక, నన్ను మనుష్యదేహము నొందిన వసుదేవతనయునిగాను యాదవునిగాను దలంచుచు, అవమానపరచుచున్నారు.

"ఇచట మానుషీం" అనుపదము క్రిమికీటాది శరీరములకుగూడ నుపలక్షణము. కాన క్రిమికీట పక్షిపశ్వాది దేహములయందున్న ఆత్మను ఈశ్వరునిగను, శ్రీకృష్ణ పరబ్రహ్మనుగాను దెలియక, సామాన్యజీవునిగ నెంచి, యందును క్రిమికీటాది రూపునిగ భావించి, యీయది క్రిమి, యీయది కీటము, అని తిరస్కరించుచున్నారని భావము. ఈయది అవివేకుల స్వభావము.

వివేకులు, అనాత్మపదార్థములనుంచి యాత్మవస్తువును వేరుపరచి, సచ్చిదానందరూపునిగ గ్రహింపుమని తాత్పర్యము.

రా మా ను జ మ త ము :-

రామానుజులు "ఉదాసీనవదాసీనం అసక్తం తేషు కర్మసు" (౯-౯) అను తొమ్మిదవ శ్లోకమునందు "అసక్తం తేషు కర్మసు" అను పదమును "విషమ సృష్టియందు నేను కారణుడను గాను" అని వివరించిరి.

"మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరమ్" (౯-౧౦) అను శ్లోకమునందు "సత్యసంకల్పుడనగు నేను అధ్యక్షుడుగానుండి చూచుచుండ ప్రకృతి చరాచర ప్రపంచమును బుట్టించుచున్నది" అని వివరించిరి.

"నచ మత్థ్సాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్" (౯-౫) అను నయిదవ శ్లోకమునందలి రెండవపాదమునకు "వసుదేవతనయుడ నయిన నాయొక్క సత్యసంకల్పత్వము, నైర్ఘృణ్యాది దోషరాహిత్యము అను సామర్థ్యమును (యోగమును) జూడుము" అని వ్యాఖ్యాన మొనర్చిరి.

ప్రకృతశ్లోకమున, "నేను మనుష్యశరీరము నాశ్రయించినంతమాత్రమున నాయొక్క అపార కారుణ్య ఔదార్య సౌశీల్య వాత్సల్యాదులకు గారణమయిన మనుష్యత్వ సమాశ్రియణరూపమగు నీ పరభావమును దెలిసికొనలేక మూఢులు తిరస్కరించుచున్నారు" అని జెప్పిరి.

ఇదియంతయు నసంగతము.

యథాక్రమమున పరిహారము వ్రాయబడుచున్నది.

"అసక్తం" "తేషు కర్మసు" అని మూలమునందుండ, రామానుజులు "తేషు కర్మసు" అను పదద్వయమునకు "తత్ర వైషమ్యే" అని యర్థమును వ్రాసిరి. ఆ రెండుపదములవలన ఈయర్థము లభించదని వేరుగ జెప్పనక్కరలేదు. ఇక "ఆ కర్మలయందు ఏ వైషమ్యము కలదో, దానియం దసక్తుడను" అని జెప్పవలదన్నను వైషమ్యపదాధ్యాహారదోషము తప్పదు. సర్వాంతర్యామియగు నీశ్వరునకు విషమకర్మయందలి వైషమ్యమునకుగూడ కారణత్వము సంభవించుచుండ సంబంధరాహిత్య మెట్లు సిద్ధించును ?

మరియు "సత్యసంకల్పుడ నగు నేను చూచుచుండ ప్రకృతి చరాచర ప్రపంచమును పుట్టించు" ననుటగూడ పొసగదు. ప్రకృతిలేనిదే యీశ్వరునకు సంకల్పమే సంభవించదు. సంకల్పమనునది మాయావృత్తిగాని యంతఃకరణవృత్తి కాదు.

అట్లే "వసుదేవపుత్రుడ నగు నేను" అని చెప్పుటకూడ ఉచితముగాదు. శ్రీకృష్ణుని శరీరమే వసుదేవునివలన బుట్టినది కాని, శరీరవిలక్షణుడగు ఆత్మ వసుదేవునివలన బుట్టలేదు. సర్వేశ్వరుడగు శ్రీకృష్ణునకు దేవ తాదాత్మ్యాభిమాన

మున్నదనుట యుక్తముగాదు, ప్రకృతమున కుపయుక్తమున్ను కాదు. "మామ్" అను పదమును దూరముననున్న "భూతమహేశ్వరమ్" అను పదముతో నన్వయించుట యనుచితము. పరభావమనగా "మనుష్యశరీరము నాశ్రయించుట యను నర్థమును వర్ణించుటకూడ నుచితము కాదు. అప్రాకృత దివ్యమంగళవిగ్రహధారి యగు శ్రీమహావిష్ణువునకు మనుష్యశరీరమును ధరించుట గొప్పతనము కానేరదు. అట్లగుచో మనమందరము మానవశరీరమును ధరించియుంటిమికాన పరభావము నొందినవారలమే యగుదుము.

అయితే మనము కర్మనిమిత్తమున దేహమును ధరించితిమనియు, ఈశ్వరుడు భక్తవాత్సల్యాది కారణములవలన మనుష్యశరీరమును ధరించుచున్నాడనియు, భేదము చెప్పదలచినచో నదియును పొసగదు. మనుష్యత్వము దేహధర్మము. ఈశ్వరుడు అశరీరుడని శ్రుతులు చెప్పుచున్నవి. ఇట్టితరి వాత్సల్యాదులచే మాత్రము శరీరధర్మము నాశ్రయించుట నీశ్వరున కెట్లుపొసగును? అయినను ఈశ్వరునకు సచ్చిదానంద రూపమే పరభావ (ఉత్కృష్టధర్మ) మగును కాని, మనుష్యదేహము నాశ్రయించుట పరభావముకాదు. ఈయది మాయికమగు ధర్మమే యగును. మాయచే మనుష్యదేహము నాశ్రయించుట ఈశ్వరునకు పరభావమనినచో, ప్రాకృతదేహము అపరభావము కావలసివచ్చును. మాయచే సర్వచరాచర దేహజాలము నాశ్రయించు నీశ్వరునకు మనుష్యదేహమాత్రాశ్రయణము పరభావమనుట యేమి యుచితము?

కాక పూర్వార్థమున "మానుషీం తనుమాశ్రితమ్" అను రెండవపాదముచే మనుష్యదేహము నాశ్రయించుట చెప్పియుండగా, మరల "పరంభావం" అను రెండుశబ్దములచే గూఢముగా అదేవిషయమును చెప్పుట వ్యర్థము, క్లిష్టకల్పనయు నగును. వెనుకజెప్పిన యర్థమును పరామర్శించునట్టి తచ్ఛబ్ద ఇదమ్ శబ్దాదు లేమియు మూలమునందు లేవు.

కావున పైకారణములనుబట్టి రామానుజవ్యాఖ్యానము సమంజసము కాదు. ॥ ౧౧ ॥

శ్లో॥ మోఘాశా మోఘకర్మాణః మోఘజ్ఞానా విచేతసః,
రాక్షసీ మాసురీంచైవ ప్రకృతిం మోహినీం శ్రితాః. ॥ ౧౨ ॥

అ॥ భగవన్తుని తిరస్కరించిన మానవుల కోరిక లెన్నటికిని సఫలములు కావు. వా రనుష్ఠించెడి యగ్నిహోత్రాది కర్మలుకూడ నిష్ఫలములు. వారికిగల శాస్త్రార్థపాండిత్యము నిరర్థకము. వారు కేవలము వివేకరహితులనియే యనదగును. అట్టివారు రాజస, తామస ప్రకృతిని పొంది వీనిని కొట్టుమనియు, వానిని నరకుమనియు, వానిమాంసము తినుమనియు, వీనినెత్తురు త్రాగుమనియు, వీనిధనమును దొంగిలించుమనియును లోకుల కుపదేశించుచు, ఘాతుకకృత్యములను జేయుచుందురు.

॥ ౧౨ ॥

శ్లో॥ మహాత్మానస్తు మాం పార్థ! దైవీం ప్రకృతి మాశ్రితాః,
భజం త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్. ॥ ౧౩ ॥

అ॥ భగవన్తునియందు శ్రద్ధాభక్తులు గలవారుమాత్రము భగవద్భక్తి లక్షణ మయిన మోక్షమార్గమునందు ప్రవర్తించి, నీచభావమును వదలి, శమదమాది లక్షణమగు దైవప్రకృతిని పొంది, యెల్లభూతములకు నెల్లప్రాణులకు ఆదికారణుడ నగు నన్ను దెలిసికొని అనన్యభావముతో (అనన్యచిత్తులై) నన్ను సేవింతురు. ॥ ౧౩ ॥

శ్లో॥ సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః,
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే. ॥ ౧౪ ॥

అ॥ దైవప్రకృతిని పొందిన మహానుభావులు బ్రహ్మస్వరూపుడనయిన నన్నెల్లపుడు ధ్యానింతురు. శమ, దమ, దయా, అహింసాది నియమములతో నన్ను సేవింప బ్రయత్నింతురు. దృఢవ్రతులై నన్ను నమస్కరించుచు సర్వాంతఃకరణసాక్షియగు నాత్మను చిత్తైకాగ్రతతో సేవింతురు. ద్వైతులు పరోక్షమయిన సూర్యచంద్రాదులను నమస్కరించినట్లు, అద్వైతులుకూడ ఆత్మను నమస్కరింతురని భావము. ॥ ౧౪ ॥

శ్లో॥ జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మా ముపాసతే,
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్. ॥ ౧౫ ॥

అ॥ దైవప్రకృతులు భగవంతుని యుపాసించు క్రమము చెప్పబడుచున్నది.

సాత్విక ప్రకృతిగల మహానుభావులు క్షుద్రఫలములను గోరరు. యక్షరక్షః పిశాచాదుల నుపాసింపరు. వారు జ్ఞానయజ్ఞముచే నన్నే పూజించుచు నుపాసింతురు. అందు గొందరు "పరబ్రహ్మ యొక్కడే" అనుభావముతో, అభేదబుద్ధితో నుపాసింతురు. మరికొందరు భేదబుద్ధిచే సూర్యచంద్రాది భావముతో నుపాసింతురు. మరి కొందరు పరమాత్మ సర్వతోముఖుడని యనేకరీతుల నుపాసింతురు.

ఇందు పరమార్థదర్శన లక్షణమగు జ్ఞానయజ్ఞము ప్రధానము. ఇం దుత్తము లగు జ్ఞాను లధికారులు.

బ్రహ్మ సూర్యచంద్రాది దేవతారూపముతో వేర్వేరుగా నుండునను జ్ఞానము మరియొక జ్ఞానయజ్ఞము. ఇందు మధ్యముల కధికారము.

బ్రహ్మ నానారూపములతో నుండునను జ్ఞానము మరియొక జ్ఞానయజ్ఞము. దీనియందు మందులు (మూఢులు-అధములు) అధికారులు.

రామానుజమతము

ఇచట రామానుజులు, "మహానుభావులగు సాత్విక ప్రకృతులు భూతకారణుడును, నాశరహితుడును, వాఙ్మనస్సులకు గోచరముకాని నామ, కర్మస్వరూపములు కలవాడును, పరమకారుణికు డగుటచే సాధుపవిత్రాణముకొరకు మనుష్యరూపముతో నవతరించినవాడు నగు నన్ను దెలిసికొని నాదుదాస్య మొనర్ప నిశ్చయించుకొని

న న్నుపాసింతురు" అనియు, వేర్వేరుగా ప్రపంచాకారముగా నున్న నన్ను అభిన్ను నిగా (ఒక్కనిగా) ఉపాసింతు రనియును వ్యాఖ్యానించిరి.

ఈయది యుక్తముగాదు. మహానుభావులు కృష్ణావతారము నుపాసింతురని చెప్పినచో, రామావతారము నుపాసించువారు నీచులని తేలును. ఇక రామకృష్ణాది మనుష్యావతారములను మహానుభావు లుపాసింతు రనినచో, మత్స్య వరాహాది యవతారముల నుపాసించువారు నీచులని తేలును.

మహానుభావులు అవతారము నుపాసింతురనినచో, అపుడు, పర - వ్యూహ - విభవ - అంతర్యామి - అర్చా - అను అయిదు రూపములతోనున్న యీశ్వరుని యొక్క విభవోపాసకులే మహానుభావులనియు, మిగిలిన రూపముల నుపాసించువారు నీచులనియు జెప్పినట్లగును.

పరావతారమన నిత్యవిభూతియగు నారాయణుడు. వ్యూహమన వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధులు. రామకృష్ణాద్యవతారములు విభవములు.

అన్తర్యామియన అంతఃకరణయందుండు యీశ్వరుడు అర్చావతారమన, 'వేఙ్కటేశ్వర శ్రీరఙ్గ భద్రాద్రిరాములు మున్నగువారు' అని భేదము.

ఓయి, మేము మహానుభావులు కృష్ణావతారమునే యుపాసింతురని చెప్పము. మహానుభావులే కృష్ణావతారము నుపాసింతురని యందుము. అనినచో నదియు పొసగదు. నీచులుగూడ కృష్ణుని యుపాసించుచున్నారు. నీచులకుగూడ కృష్ణునియందు యీశ్వరబుద్ధి కలదు.

కృష్ణుని తిరస్కరించువారు నీచులనియు, గృష్ణునియం దీశ్వరబుద్ధికలవారు మహానుభావులనియు ననదగదు. అట్టితరి శ్రీరామ, నరసింహ, గణపతి, కుమార స్వామి, శఙ్కర, పార్వతులు మున్నగువారిని తిరస్కరించువారు నీచులు కారనియు, వీరలయం దీశ్వరబుద్ధికలవారు మహానుభావులు కారనియు దేలును. ఇం దిష్టాపత్తిని చూపదగదు. పాషండులగు మీ రిద్దాని నంగీకరించినను వైదికు లంగీకరింపరు. శివుడు, విష్ణువు, గణపతి, కుమారస్వామి మున్నగువారందరు యీశ్వరావతారులని వైదికుల మనోనిశ్చయము. శాస్త్రసిద్ధాంతము నట్లే.

కావున (నవతారియగు) నవతరించునట్టి యీశ్వరుని విడచి, యవతారరూపు డగు గృష్ణుని సేవింపుమని వర్ణించుట అనుచితము. ఇచట అవతారమే ప్రస్తుతమని మూర్ఖింపరాదు. "సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాంతి మామికామ్, కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్" అను నేడవశ్లోకముచే నీశ్వర స్వరూపమే యిచట ముచ్చటింపబడినది కాని, యవతారరూప మిందు ముచ్చటింప బడలేదు.

మరియు, "భూతాదిం అవ్యయం మాం జ్ఞాత్వా" అను వాక్యమునకు, "వాఙ్మానసాగోచర నామకర్మస్వరూపం" (మనోవాక్కులకు నందని నామ రూప

శర్మలుకలవాడు) అని వ్యాఖ్యానించుటగూడ నుచితముకాదు. పై పదములు అభిధావృత్తిచే నీయర్థము నీయవు. వాచ్యార్థమునకు బాధలేనిదే దానిని పరిత్యజించుట కాని, లక్షణచే నన్యార్థమును పరిగ్రహించుటకాని యుచితముకాదు.

మరియు, ఇచట మనుష్యరూపముతో నవతరించినది దేహముకాని ఈశ్వరుడు కాడు. మనుష్యదేహమునం దీశ్వరబుద్ధికలవారు దేహాత్మవాదులగు చార్వాకాదుల వలె నీచులగుదురుకాని మహానుభావులు కానేరరు.

శ్రీకృష్ణుని శరీరమునందు అహమభిమానము కలవానిని యీశ్వరుడని తలంచుటగూడ మహాత్ముల లక్షణముకాదు. దేహాత్మభ్రాంతి కలవా రెన్నటికి సర్వజ్ఞుడగు నీశ్వరుడు కానేరరు. సకల దేహములయందు నీశ్వరు డంతర్యామిగా గలడు. కాన సకలదేహములు యీశ్వరదేహములే యగును. కృష్ణదేహమునందుమాత్రమే యీశ్వరదేహ మను బుద్ధి యుదయించుట గొప్పకాదు.

కృష్ణదేహము యీశ్వరావతారము కాదు. చిద్రూపుడగు నీశ్వరుడు దేహరూపముగా నవతరించుట యసంభవము. "మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః" అని శ్రీకృష్ణుడే బ్రహ్మాది స్తంబపర్యంత నిఖిలచరాచర దేహావచ్ఛిన్న చైతన్యము, తనయంశ యని చెప్పియుండ, శ్రీకృష్ణదేహావచ్ఛిన్నమగు చైతన్యమే యీశ్వరాంశయని మహాత్ములు నిర్ణయించుట, అం దీశ్వరావతారబుద్ధితో నుండుట మహాత్ముల కుచితముకాదు. సర్వదేహములయందలి చైతన్యము యీశ్వరరూపమే యగుచున్నది. కావున చిన్మయుడగు నీశ్వరుడు మనుష్యరూపముతో నవతరించుట, కృష్ణశరీరావచ్ఛిన్నచైతన్యమే యీశ్వరుడగుట యీరెండును పొసగవు.

మరియు కృష్ణశరీరము మాయామయముకనుక తదవచ్ఛిన్నమగు చైతన్యము (కృష్ణశరీరముతో గూడినచైతన్యము) సర్వేశ్వరుడని యనదగదు. సర్వప్రపంచము మాయామయమే యగుచున్నది. కృష్ణశరీర మొక్కటియె మాయామయముగాదు. కావున అవచ్ఛేదకములగు శరీరములు పరస్పరము భిన్నములయినను చైతన్యము మాత్రము యేకము, పరిపూర్ణము నగుచున్నది.

కావున "అంతట నున్నట్టియు పరిపూర్ణుడనయినట్టియు సర్వేశ్వరుడనయినట్టియు ఎల్లభూతములకు ఆత్మరూపుడనగు నన్ను దెలిసికొని" అను నర్థమె సమీచీనము. ఈ యర్థముసందె "భూతాదిం అవ్యయం" అను పదములు అనుకూలము లగును.

మరియు రామానుజులు చెప్పిన "ఆత్మాన్తం దాస్యమ్" (ఆత్మపర్యంతము దాస్యమొనర్చుట) అనునది పొసగదు. ఆత్మయే యీశ్వరుడు. ఈశ్వరుడు సర్వశేషి. ఆతడు మరియొకరికి శేషుడు (అంగము) కానేరడు.

మరియు వేరుగా నున్నవానిని అభిన్నునిగా నుపాసించుట భ్రాంతిరూపమగును. నిర్వికారుడగు నీశ్వరునకు మృత్తునకువలె పరిణామము సంభవించదు. సూక్ష్మచిద

చిద్విశిష్టమయిన, నీశ్వరుడు స్థూల జగదాకారముగా పరిణమించె ననుట యనుచితము. అందును విశేషణాంశమగు సూక్ష్మభాగమే స్థూలరూపము నొందెను. కాని విశేష్య మయిన ఈశ్వరుడు పరిణామము నొందలేదు. స్థూలప్రపంచాకారముగగాని, సూక్ష్మ ప్రపంచాకారముగగాని నానావిధముల పరిణమించునది ప్రకృతియేకాని ఈశ్వరుడు గాడు. కాన ఈశ్వరుడు వేర్వేరుగా నుండుట అసంభవము.

మా మతమున (అద్వైతమతమున) మాయచే నీశ్వరుడు విశ్వరూపుడగుట సంభవించును. మాయవలన ఘటింపని పని యేదియు నుండదు.

శరీరభేదముచే నీశ్వరుడు వేరుగాడు. అట్లనుకొనుట భ్రాంతి. ఘటభేదముచే నాకసము భిన్నమగుట లేదు. ఘటములు పరస్పరము భిన్నములగుచున్నను ఆకాశ మొక్కటియే యగుచున్నది. కనుకనే " ఏకో దేవస్సర్వభూతేషు గూఢః " అను శ్రుతి ఈశ్వరు డొక్కడేయని చెప్పుచున్నది.

సకలశరీరములయందున్న నీశ్వరుని యొక్కనిగా నుపాసింతురని చెప్పినచో, నయ్యది మాకును సమ్మతము. కాని మూలమువలన అట్టి యర్థము లభించుటలేదు. " పృథక్త్వేన " అను పదమునకు " సర్వశరీరములయం దుండుటచే వేరుగానున్న " అను నర్థము లాక్షణికమని యనరాదు. ముఖ్యార్థమునకు బాధలేనిదే లక్షణ నాశ్రయించుట తగదు. కాన సర్వథా రామానుజవ్యాఖ్యాన మసంగతము. ॥ ౧౫ ॥

శ్లో॥ అహం క్రతు రహం యజ్ఞః స్వధాహ మహ మౌషధమ్,
మంత్రోఽహ మహమేవాజ్య మహ మగ్ని రహం హుతమ్. ॥ ౧౬ ॥

అ॥ ఓయి కృష్ణా! నీవు పరబ్రహ్మవు కనుక నిన్ను అద్వితీయునిగా ఉపాసించు వారలు నిన్నుపాసించువార లగుదురుగాక. అట్లుగాక సూర్యచంద్రాది దేవతాంతర ముల నుపాసించువారును, విశ్వరూపోపాసకులున్ను, నిన్నుపాసించువా రెట్లగుదురు? వినుము. సకలప్రపంచము నాయందు కల్పింపబడినది. కల్పితము దేనియందు కల్పింప బడునో, దానికంటె భిన్నముగాదు. నాయందు గల్పింపబడిన ప్రపంచమంతయు నాకంటె భిన్నముకాదు. " సర్వం ఖల్విదం బ్రహ్మ " అను శ్రుతి సర్వము నేనే యని చెప్పుచున్నది. కాన యీశ్వరబుద్ధితో సూర్యచంద్రాదుల నుపాసించినను విశ్వము నుపాసించినను యీశ్వరోపాసనమే యగును.

శ్రౌతకర్మలన్నియు నేను. స్మార్తకర్మలు నేను. పితృదేవతల కిచ్చెడి స్వధా న్నము నేను. వ్రీహియవాదిరూపమయిన అన్నము నేను. లేక ఔషధమనగా మందు అని యయినను జెప్పవచ్చును. మంత్రము నేను. దేవతల కిచ్చెడి హవీరూపమయిన ఆజ్యము నేను. హోమాధారమగు అగ్ని నేను. హవనక్రియ నేను. ॥ ౧౬ ॥

శ్లో॥ పితాహమస్య జగతో మాతా ధాతా పితామహః,
వేద్యం పవిత్ర మోంకార ఋక్సామ యజురేవచ. ॥ ౧౭ ॥

అ॥ నేను ప్రపంచమునకు తండ్రిని, తల్లిని, తాతను. ప్రాణులకు కర్మఫల మిచ్చువాడను. పరమపావనమగు ఓంకారరూపుడను. ఋగాది వేదత్రయరూపుడను.

రామానుజ మతము :

ఇచట రామానుజులు ప్రపంచమునందు, దేవదత్తాది పుత్రులనుగురించి, యే విష్ణుమిత్రాది తండ్రులు గలరో, కళావతి మున్నగు తల్లులు కలరో, యజ్ఞదత్తుడు మొదలగు తాతలు కలరో, శంభుదత్తుడు మొదలగు ఉపపతులు కలరో, వారందరు యీశ్వరుడే. వారందరు యీశ్వరునియొక్క శరీరము. ఈశ్వరుడు వారిలోపలనుండు అంతర్యామి, అని చెప్పిరి.

ఈయది సరిగాదు. "పితామహస్య జగతః" అను మూలమునందు, "ఈప్రపంచమునకు నేను తండ్రి యని చెప్పబడుటచే, విష్ణుమిత్రాదులందరు యీశ్వరునకు సంతానమని తేలుచున్నది. ఇట్లుండ కొందరు తండ్రులు, కొందరు తాతలు, కొందరు తల్లులు అనునది పొసగదు. ఇట్టియర్థమును జెప్పు తాత్పర్యము మూలకర్తకున్నచో, పితామహ మత్రజగతి" అనియే చెప్పియుండెడివాడు. అట్లు చెప్పనందున రామానుజవ్యాఖ్యానము మూలకర్తకు సమ్మతముగాదు. ॥ ౧౭ ॥

శ్లో॥ గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాస శ్శరణం సుహృత్,
ప్రభవః ప్రళయస్థానం నిధానం బీజ మవ్యయమ్. ॥ ౧౮ ॥

అ॥ నేను ప్రపంచమునకు కర్మఫలము (గతి) అగుచున్నాను.

ప్రపంచమును పోషించునట్టి ప్రభువును. ప్రాణు లొనర్చిన పుణ్యాపాపములకు సాక్షిని. సకలప్రాణులకు నివాసస్థానమును. ఆర్తులయొక్క బాధలను పోగొట్టువాడను. ప్రత్యుపకారమును గోరకయే యుపకారమును చేయు స్నేహితుడను. ప్రపంచమునయొక్క ఉత్పత్తి స్థితిలయములు నావలన గల్గును. ప్రాణులు కాలాంతరమం దనుభవింపదగిన నిక్షేపము నా స్వరూపము. సంసారమను మొలకకు నేను తరగని విత్తనము.

రామానుజ మతము

ఇచటగూడ రామానుజులు 'లోకములందలి స్వర్గాదిగతులు, పోషకులు, శిక్షించువారు, సాక్షులు, ఇండ్లు, రక్షకులు, హితవునుగోరు స్నేహితులు, ఘటాది కార్యముల యొక్క ఉత్పత్తి, ప్రళయస్థానమగు మృదాదికము, ఘటాది కార్యజాతము, నాశరహితమయిన కార్యములు, యివియన్నియు నేనే' అని వ్యాఖ్యానించిరి. ఈ వ్యాఖ్యానమునందుగూడ వెనుకటి దోషములే పట్టును. కాన యుపేక్షింపదగును. ॥ ౧౮ ॥

శ్లో॥ తపామ్యహ మహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామిచ,
అమృతంచైవ మృత్యుశ్చ సదసచ్చాహ మర్జున ! ॥ ౧౯ ॥

అ॥ నేను సూర్యునిగానుండి తపింతును. కొన్ని కిరణములచే, నాలుగు మాసములు (ఆషాఢ, శ్రావణ, భాద్రపద, ఆశ్వయుజములు) వర్షింతును. మరికొన్ని కిరణములచే నెనిమిది మాసములు వర్షములేకుండ జేతును. మరల వర్షాకాలమున వర్షింతును. దీనివలన భగవంతునకు వర్షమునిచ్చుట, వర్షమునీయకుండుట, యీ రెండును బీజాంకురములవలె ప్రవాహరూపమున అనాదులని తేలుచున్నది. మరియు నేను, దేవతలకు చావులేకుండుటకు కారణమయిన అమృతము నగుచున్నాను. మర్త్యులకు మరణహేతువగు మృత్యుదేవతనుగూడ నేనే. ఓయి అర్జునా! లోకములో సద్రూపమయిన వస్తువు నేను. అసద్రూపమయిన వస్తువుకూడ నేనే. అనగా భగవంతుడు, అసత్తులయిన శశశృంగాది రూపుడని భ్రమింపవలదు. కుమారులకు సంబంధించిన తండ్రి మున్నగువారు భగవద్రూపులనియు, సంబంధించని పరాయివారు భగవద్రూపులనియును గ్రహింపవలయును.

లేక సత్ అనగా కార్యమనియు, అసత్ అనగా కారణమనియు నర్థము. కాన భగవంతుడు కార్యకారణరూపుడని యభిప్రాయము. ॥ ౧౯ ॥

శ్లో॥ త్రైవిద్యా మాం సోమపాః పూతపాపాః
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే
తే పుణ్యమాసాద్య సురేంద్రలోక
మశ్నంతి దివ్యాన్ దివి దేవ భోగాన్. ॥ ౨౦ ॥

అ॥ ఋగ్యజుస్సామము లను మూడువేదములను జదివి, సోమపానముచే పవిత్రులయినవారు వసురుద్రాదిదేవతారూపుడయిన నన్ను అగ్నిష్టోమాదులచే బూజించి, స్వర్గమను గమ్యస్థానమును యాచింతురు. వారు పుణ్యఫలమగు దేవేన్ద్రలోకమును పొంది, యచ్చట అప్రాకృతములగు రంభాసంభోగాది దేవభోగముల ననుభవింతురు.

ఇచ్చట పుణ్యపదము లక్షణచే పుణ్యఫలమును చెప్పును. పుణ్యమనగా జ్యోతిష్టోమాది కర్మజన్యమగు అదృష్టము (అపూర్వము.) లేక జ్యోతిష్టోమాది రూపమయిన కర్మవిశేషము పుణ్యము. ఇట్టి పుణ్యమునకు ఫలము స్వర్గము ॥ ౨౦ ॥

శ్లో॥ తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతం కామకామా లభన్తే. ॥ ౨౧ ॥

అ॥ స్వర్గలోకమును పొందిన సోమయాజులు, విశాలమయిన స్వర్గలోకము నందున్న భోగముల ననుభవించి, స్వర్లోకసుఖము నిచ్చెడి ప్రారబ్ధకర్మవిశేషము నశించగా దేవేంద్రునిచే పంపబడిన రాజభటులగు దేవతలచే నినుపగుండు దెబ్బలను

రోకంటెపోటులను తిని, దేవతాశరీరమును విడచి మరల మనుష్యదేహమును బొందు దురు. వేదత్రయమందు జెప్పబడిన కర్మమార్గము ననుసరించినవారిట్లు స్వర్గలోక మునుగురించి గమనాగమనములను బొందుదురు. కావున వీరికి జన్మమరణలక్షణ మయిన సంసారము అవర్జనీయమని భావము. ఏలోకమునందును వీరికి స్వాతంత్ర్య ముండనేరదు. అబ్బా ! ఫలాభిసంధిగల కర్ములయొక్క దురవస్థ యేమని వర్ణింతుము?

శ్లో॥ అనన్యాశ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్. ॥౨౨॥

అ॥ ఏ నిష్కాములగు సమ్యగ్జ్ఞానులు, ఈశ్వరాభిన్నులగుచు, నీశ్వరుడే నేనను జ్ఞానము కలవారై, సర్వకర్మలను విడచి సర్వావస్థలయందును నన్ను సేవింతురో, ఎల్లపుడు చిత్తసమాధానము కలిగియున్న అట్టివారలకు నేను, లేనివానిని సంపాదించిపెట్టుట కాని, ఉన్న వానిని కాపాడుటగాని తప్పక జేతును.

అనగా జ్ఞానులు జ్ఞానముచే వారు పొందని యణిమా ద్యైశ్వర్యమును యీశ్వరు డిచ్చును. వారు పొందినజ్ఞానమును మరపురానీక నీశ్వరుడు గాపాడునని భావము. జ్ఞానియే యీశ్వరున కాత్మ, జ్ఞానియే యీశ్వరున కిష్టుడు. కావున జ్ఞానుల యోగక్షేమముల నీశ్వరుడు వహించును.

అయితే జీవున కీశ్వరు డాత్మయగును కాని, యీశ్వరునకు జీవు డాత్మ యెట్లగు నని యనరాదు. జీవునకు నీశ్వరునకును ఒకేచైతన్యము స్వరూపము కాన యీశ్వ రునకుగూడ జీవు డాత్మ కావచ్చును. చైతన్యరూపుడగు నీశ్వరుడు జ్ఞానుల కాత్మ భూతుడే. కనుకనే "నేను జ్ఞాని కిష్టుడను, జ్ఞాని నాకిష్టుడు" అని శ్రీకృష్ణుడు చెప్పెను. అజ్ఞానులకు దేహమే యాత్మ అను నభిమాన ముండుటచే దేహము చైతన్యరూపము కాదుకనుక అజ్ఞాని యీశ్వరున కిష్టుడుగాడు.

ఈశ్వరుడు జ్ఞానులకు యోగక్షేమములను గలుగజేసినట్లు భక్తులకుగూడ కలుగజేయును. కాని, జ్ఞానులు కోరని యోగక్షేమమును భగవంతుడు స్వయముగ నిచ్చును. భక్తులకు గోరినదానినే భగవంతు డిచ్చును. ఇదియే జ్ఞానులకు, భక్తు లకు గల తారతమ్యము.

కావున భక్తులు భగవంతునిచే తమ యోగక్షేమములను యిప్పించుకొను చున్నారు. భగవంతుడుమాత్రము స్వయముగ నిచ్చుట లేదు. జ్ఞాను లట్లు భగవంతు నిచే నిప్పించుకొనుట లేదు. భగవంతుడే స్వయముగా జ్ఞానులకు యోగక్షేమముల నిచ్చుచున్నాడు.

రా మా ను జ మ త ము :

ఇచట రామానుజులు "నాభక్తులకు నన్ను బొందుటరూపమయిన యోగమును, అపునరావృత్తిలక్షణమయిన క్షేమమున్ను కలుగజేతును" అని వ్యాఖ్యానించిరి.

ఈయది యుక్తము కాదు. పరిపూర్ణ చైతన్యరూపుడయిన ఆత్మ యెల్లప్పుడు పొందబడియుండ నిత్యము అప్పుడయియుండ, క్రొత్తగా బొందుటయనునది పొసగదు. ఈశ్వరుని పొందినవారలకు పునరావృత్తిశంకయే లేనపుడు అపునరావృత్తి లక్షణమ యిన క్షేమమని చెప్పుట యనుచితము. ॥ ౨౨ ॥

శ్లో॥ యేఽప్యన్యదేవతా భక్తా యజంతే శ్రద్ధయాఽన్వితాః,
తేఽపి మామేవ కౌంతేయ! యజంత్యవిధిపూర్వకమ్. ॥ ౨౩ ॥

అ॥ ఎవరు సూర్యాదితర దేవతలయందు భక్తికలవారగుచు, కడు శ్రద్ధతో సూర్యాదిదేవతలను బూజింతురో వారుగూడ అజ్ఞానపూర్వకముగా నన్నే పూజించు చున్నారు. కాని వారికి సూర్యాదిదేవతలు యీశ్వర (నా) స్వరూపులను జ్ఞానము లేదు. ॥ ౨౩ ॥

శ్లో॥ అహంహి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ,
న తు మా మభిజానంతి తత్త్వేనాత శ్చ్యవన్తి తే. ॥ ౨౪ ॥

అ॥ సూర్యాది దేవతలను బూజించుట అజ్ఞానపూర్వక మెట్లగును ? వినుము. నిఖిలయజ్ఞములయందును హవిర్భాగములను భుజించు నింద్రాదిదేవతలు నాయందు గల్పింపబడిరి. వారు నా స్వరూపులు; ఇంద్రాది దేవతావచ్ఛిన్నచైతన్యము ఈశ్వరుడు. కనుక ఇంద్రాదులు యీశ్వరస్వరూపులని చెప్పనగును. వారుచేయు యజ్ఞములకు నేను ప్రభువును. ఇతర దేవతాభక్తులు యీ రహస్యమును గుర్తెఱుంగరు. కావున వారు అజ్ఞానపూర్వకముగ నన్ను బూజించి, యాగఫలమగు జ్ఞానమార్గమునుంచి భ్రష్టులగుచున్నారు. జ్ఞానులు సర్వాత్మకుడగు నీశ్వరుని (నన్ను) తెలిసికొని, యేకొద్ది ఫలమును గోరక కేవలము యజ్ఞాదికర్మలను జేయుదురు. వారు జ్ఞానప్రాప్తి ద్వారా మోక్షమును బొందుచున్నారు. అజ్ఞానులు కర్మల నాచరించియు, తత్ఫల మగు జ్ఞానము వారికి దుర్లభమగుటచే మోక్షము నొందరని భావము. ॥ ౨౪ ॥

శ్లో॥ యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాంతి పితృవ్రతాః,
భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోపి మామ్ ॥ ॥ ౨౫ ॥

అ॥ అజ్ఞానపూర్వకముగ నిన్నుపూజించువారలకు యాగఫలము నున్నదా ? యేమి? కాదు. అవిధిపూర్వకముగ పూజించువారు దేవతాభక్తులుగూడ. దేవలోక మును బొందుదురు. పితృదేవతలను బూజించుచు, శ్రాద్ధాదిక్రియ లొనర్చువారు అగ్నిష్వాత్తాది పితృదేవతలను బొందుదురు. భూతములనుపూజించువారు వినాయక, మాతృగణ చతుర్భగిన్యాది భూతములను పొందుదురు. నన్ను పూజించు విష్ణుభక్తులు నన్నే పొందుదురు. అనగా ఇతర దేవతాభక్తులు క్షుద్రఫలమయిన స్వర్గాదు లను పొందుదురనియు, విష్ణుభక్తులు విష్ణుసాయుజ్యరూపమయిన మహాఫలమును పొందుదురనియును భావము.

ఇచ్చట రామానుజులు: దేవవ్రతు లనగా దేవతలను పూజించు సంకల్పము గలవారు దేవతలను పొందుదురని వ్యాఖ్యానించిరి. ఇది యుక్తముకాదు. క్రియా రహితముగా సంకల్పమాత్రముచే ఫలము సిద్ధింపనేరదు. అట్లు సిద్ధించుచో, "నేను కాశికి వెళ్ళగలను" అను సంకల్పమాత్రముననే కాశికి వెళ్ళకున్నను గంగాస్నానము, విశ్వేశ్వరదర్శనము మున్నగు వాటివలన కలిగెడిఫలము కలుగవలసివచ్చును. ॥ ౨౫ ॥

శ్లో॥ పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః. ॥ ౨౬ ॥

అ॥ నా భక్తులకు పునరావృత్తిరహితమయిన ఫలము లభించుటయేకాక, నేను సులభముగా నారాధింపబడినవాడ నగుదును. అదెట్లన ? ఆకునుగాని, పూవునుగాని పండునుగాని, ఉదకమునుగాని, యెవ్వడు నాకు భక్తితో నిచ్చునో పరిశుద్ధాంతఃకరణు డిచ్చిన నా స్వల్పవస్తువును నేను గ్రహింతును. కాళికాదిదేవతల నారాధించువారలకు రక్తము, మాంసము మొదలగు వస్తువులను సంపాదించుకొనవలెనను ప్రయాస యుండును. ఈశ్వరారాధన చేయువారలకు అందరకు సులభమయిన పత్రపుష్పాదులను సంపాదించుకొను ప్రయాసయే యుండును. కాన యీశ్వరారాధన సులభమని తాత్పర్యము. ॥ ౨౬ ॥

శ్లో॥ యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌంతేయ ! తత్కురుష్వ మదర్పణమ్. ॥ ౨౭ ॥

అ॥ కావున నోయి యర్జునా ! నీవు దేనిని చేయుదువో, దేనిని భుజింతువో, ఎద్దానిని హోమము చేయుదువో, దేనిని దానము చేతువో, దానిని నా కర్పింపుము. అనగా "ఈశ్వరార్పణమస్తు" అని మనఃపూర్వకముగా నా కర్పింపుము అని భావము. ఇట్లుచేసినచో ఫలసంగదోషము నీకంటదు. ॥ ౨౭ ॥

శ్లో॥ శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబంధనైః,
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి. ॥ ౨౮ ॥

అ॥ సర్వము యీశ్వరార్పణము చేయుచున్నవానికి గలుగుఫలమును జెప్పెద వినుము.

ఈశ్వరార్పణముచేయువాడు, సుఖదుఃఖప్రదములగు కర్మబంధములనుండి విముక్తుడగును. ఈశ్వరార్పణబుద్ధితోఁ జేసెడి కర్మయోగము సన్న్యాసయోగ మనబడును. ఏలనన, ఫలమును పరమేశ్వరునకు వదలినందున సన్న్యాసమనియు, కర్మను ఆచరించినందున యోగమనియు కావున సన్న్యాసయోగ మనబడును. కావున నీవు కూడ నిట్టి సన్న్యాసయోగముతో గూడిన అంతఃకరణగలవాడవగుచు, బ్రతికియుండగనే కర్మబంధములతో విముక్తుడ వగుదువు. శరీరము పడిపోయినతరువాత నన్ను బొంద

గలవు. అనగా మొదట జీవన్ముక్తిని, పిదప విదేహముక్తిని పొందగలవని భావము. కర్మలయందు కర్తృత్వాభిమానము, ఫలేచ్ఛయు నున్నప్పుడు ఫలము నెరవేరినపుడు కాని, నెరవేరనపుడుకాని హర్షశోకాది వికారములు కలుగును. అవి రెండును లేనపు డెవ్విధమగు వికార ముండనేరదు. ॥ ౨౮

శ్లో॥ సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషుచాఽప్యహమ్. ॥ ౨౯ ॥

అ॥ ఇట్లైనచో భక్తుల ననుగ్రహించుచు, ఇతరుల ననుగ్రహింపని భగవంతుడు రాగద్వేషములు గలవాడగును. కాదు - వినుము. సర్వఘటములయందును ఆకాశము యేకరూపమయినట్లు సర్వభూతములయందును ఆత్మ యేకరూపముగా నుండును. అందువలన ఆత్మకు ఒకడిష్టుడు, మరియొక డయిష్టుడు అని యుండదు. నిర్ధర్మకుడగు నీశ్వరునియందు ప్రీతిద్వేషములను ధర్మము లసంభవములు. ఇందు అగ్ని దృష్టాంతము. అగ్నికి శీతమును బోగొట్టుట స్వభావము. ఆ యగ్ని తనచెంతజేరిన వాటి నన్నిటికి సమానముగానే శీతమును బోగొట్టును. తనకు సమీపమున లేనివానియొక్క శీతమును బోగొట్టదు. ఇంతమాత్రమున అగ్నికి రాగద్వేషరూప పక్షపాత మున్నదందుమా? లేదు. అగ్నియొక్క సామీప్యమును బొందకపోవుట పురుషునిదే లోపము. అగ్ని తనచెంతజేరినవారలలో కొందరిశీతమును బోగొట్టి మరికొందరి శీతమును బోగొట్టనిచో నపు డగ్నిది దోషమనవచ్చును. అట్లు జరుగుటలేదుకావున అగ్ని యెట్లు సర్వసముడో, అట్లే పరమేశ్వరుడు గూడ, తన నాశ్రయించినవారల ననుగ్రహించును. ఇతరుల ననుగ్రహింపడు. భగవంతుని యాశ్రయించకుండుట పురుషునిదే తప్పు.

ఓయి, అగ్ని పరిచ్ఛిన్నపదార్థము కనుక (కొద్ది ప్రదేశమునం దుండు పదార్థము గనుక) దూరమునం దున్నవారలకు అగ్నిసేవ సంభవింపదు. ఆత్మ అపరిచ్ఛిన్నుడు. సర్వవ్యాపి. కనుక ఆత్మ కొందరిచే సేవింపదగనివా డెట్లగును? వినుము. ఆత్మసేవ యనునది జ్ఞానపూర్వకము. ఆత్మ సర్వవ్యాపియయినను, యెవరు ఆత్మను తెలిసికొనరో, వారు ఆత్మతో నిత్యసంగతులయినను (యెల్లపుడు కలిసికొనిన వారయినను) ఆత్మను సేవింపనొల్లరు. (ఉ) తన యింటిలోనున్న నిధిని యెవరు తెలిసికొనరో వారు ఆ నిధిని సేవింపనేరరు. తన మెడలో కంఠమాలను మరచిన వారు దానిని సేవింపనివారే యగుచున్నారు. కావున నెవరు నన్ను భక్తితో సేవింతురో వారు నాయందు నుందురు. నేనును వారియం దుందును. మాయుభయుల కీయది స్వభావముకాని రాగమూలకముగాదు. నేను వారియం దుండకుండుటకు, వారు నాయం దుండకుండుటకు ద్వేషమున్ను కారణముకాదు. భక్తులు యీశ్వరుని యం దుండుటయనగా ఈశ్వరపరాయణులగుట. ఈశ్వరుడు భక్తులయం దుండుట యనగా భక్తపరాయణు డగుటయని భావము.

అయితే జ్ఞానుల కాత్మపరాయణత్వము, ఈశ్వరున కాత్మారామత్వము యుచిత మగుచుండ జ్ఞానుల కీశ్వర పరాయణత్వము, ఈశ్వరునకు భక్తపరాయణత్వము - యీ రెండును యెట్లుచిత మగును? వినుము.

జ్ఞానులకు ఆత్మయే యీశ్వరుడు, ఈశ్వరునకు భక్తులే ఆత్మలు. భక్తుడనగా నిచట ప్రకరణవశమున జ్ఞానియని అర్థము.

కావున జ్ఞానుల కాత్మగా నభిమతమయిన చైతన్యమే యీశ్వరు డగుటవలన జ్ఞానియందున్న ఈశ్వరు డాత్మయం దున్నవాడే యగును. ఈశ్వరునియందున్న జ్ఞానియు, తన యాత్మయం దున్నవాడే యగును. కాన జ్ఞానీశ్వరు లిద్దరు ఆత్మయం దుండుటవలన ఆత్మపరాయణులేకాన యిచట జీవేశ్వరభేదము ప్రసక్తించదు. ఆత్మ భూతుడనగు నాయందు (ఈశ్వరునియందు) జ్ఞానులు కలరు. ఆత్మభూతులగు జ్ఞానుల యందు నేను కలను అని యర్థమును గ్రహింపవలయును.

ఓయి, "మయి తే తేషు చాహమ్" అని అస్మత్తచ్ఛబ్దములచే జీవేశ్వరులకు భేదమును నిర్దేశించుటవలన జీవుల కీశ్వరాభేద మెట్లు సిద్ధించును? వినుము.

సప్తమ్యంతములగు అస్మత్తచ్ఛబ్దములు లక్షణచే చైతన్యమాత్రమును బోధించును. ప్రథమాంతములగు నా శబ్దములు అభిధచే ప్రమాతను బోధించును. ప్రమాత లనేకులు, జీవునకువలె నీశ్వరునకుగూడ ప్రమాతృత్వము ఆధ్యాసికము. కావున సర్వజ్ఞుడును, ప్రమాతయు నగు నీశ్వరునికంటె ప్రమాతలును కించిద్జ్ఞులును అగు జీవులు భిన్నులు, అనేకులును. జీవులకు నీశ్వరునకు పారమార్థికమగు స్వరూపముమాత్రము చైతన్య మొక్కటియే. కాన జీవేశ్వరాభేదము సిద్ధమగుచున్నది.

రా మా ను జ మ త ము :-

ఇచట వేదాంతదేశికులు, "అహం చ తే చ అన్యోన్యం పితృాదిష్వివ న్యస్త భరాః ఇతి పిండితార్థః" అని వ్రాసిరి. (జీవేశ్వరు లుభయులము పరస్పరము తండ్రి కుమారులవలె, నొకరిభారము మరియొకరియం దుంచుకొంటిమి అని పిండితార్థము) అని దీని యర్థము.

ఈయది యుక్తముగాదు.

జీవులు ఈశ్వరునియందు భారముంచినను, ఈశ్వరుడుమాత్రము జీవులయందు భారముంచుట తగదు. ఈశ్వరుడు స్వతంత్రుడు, సర్వరక్షకుడు. వానికి నితరులతో నపేక్షలేదు. అట్టి యీశ్వరుడు, తన సంరక్షణభారమును జీవునియం దెట్లుంచును? జీవుడు పరతంత్రుడుకాన, తనను రక్షించుకొనుటకు అసమర్థుడై తన సంరక్షణ భారమును యీశ్వరునియం దుంచవచ్చును. కనుకనే జీవులకు నీశ్వర శరణాగతియే

కాని, యీశ్వరునకు జీవశరణాగతి యెచ్చటను చెప్పబడలేదు. అట్లున్నచో ఈశ్వరున కీశ్వరత్వమే నశించును. ॥ ౨౯ ॥

శ్లో. అపిచే త్సుదురాచారో భజతే మామనన్యభాక్,
సాధురేవ సమంతవ్య స్సమ్యగ్వ్యవసితోహి సః. ॥ ౩౦ ॥

అ॥ ఎంతటి దురాచారుడయినను ఇతరులయందు భక్తిలేనివాడగుచు, నాయందే భక్తిగలిగి నన్నే సేవించునెడల వాని నిశ్చయము మంచిదికనుక వాడు మంచివాడనియే చెప్పనగును. నేనే బ్రహ్మనను నిశ్చయజ్ఞానము కలవాడు దురాచారుడయినను మంచివాడనియే తాత్పర్యము. ఆచారమనునది దేహాద్యనాత్మ ధర్మము. ఆత్మజ్ఞానికి అనాత్మధర్మమగు నాచారముతో పనిలేదు. ఆత్మ, నిత్య శుద్ధ బుద్ధ ముక్తుడుకాన, ఆత్మజ్ఞానికి నాచారముతో పనిలేదని భావము. ॥ ౩౦ ॥

శ్లో. క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి,
కౌంతేయ ! ప్రతిజానీహి నమే భక్తః ప్రణశ్యతి. ॥ ౩౧ ॥

అ॥ అట్టివాడు బాహ్యమయిన్న దురాచారమును విడచి, బ్రహ్మాత్మనిశ్చయము వలన వెంటనే ధర్మచిత్తు డగును. నిత్యమయిన శాంతినికూడ బొందును. ఓయి అర్జునా !నాభక్తు డెన్నటికి చెడిపోడని నీవు గట్టిగా ప్రతిజ్ఞచేసి చెప్పుము. ॥ ౩౧ ॥

శ్లో. మాం హి పార్థ ! వ్యపాశ్రిత్య యేపి స్యుః పాపయోనయః,
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేఽపి యాంతి పరాంగతిం. ॥ ౩౨ ॥

అ॥ మరియు, ఓయి అర్జునా ? పాపపుజన్మగల స్త్రీ వైశ్యశూద్రులుగూడ నన్నాశ్రయించి గొప్పదశను బొందుదురు. కావున నాభక్తు లెన్నటికి చెడిపోరని గ్రహింపుము. వైదికకర్మలయం దధికారములేనందున శూద్రులు పాపులు. వైశ్యులు ద్విజులుకనుక వైదికకర్మలయం దధికారము కలవారైనను క్రయవిక్రయాది వ్యాపారముచే వారు పాపులు. లేక, కలియందు వైశ్యులు శూద్రప్రాయులగుటవలనగూడ పాపు లనదగును. ॥ ౩౨ ॥

శ్లో. కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా,
అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్. ॥ 33 ॥

అ॥ పాపయోనులగు స్త్రీ వైశ్యశూద్రులే భగవద్భక్తివలన తరించుచుండ, పుణ్యయోనులగు బ్రాహ్మణులు, రాజర్షులు, భగవద్భక్తులై తరింతురని వేరుగ జెప్ప నేల ? కావున అర్జునా ? క్షణకాలములో నశించు స్వభావము గలిగి, రోగాది భూయిష్ఠమయిన మనుష్యదేహమును పొంది నన్ను సేవింపుము. భగవంతుని రేపు సేవింతు మను కాలయాపన యెన్నటికిని తగదు. మృత్యువు మానవులకు నిత్యసన్నిహితము. విషయసుఖముల నపేక్షించుట దుఃఖహేతువగును. అనిత్యమయిన మానవ దేహముతో మనమేమి చేతుము? అని యుపేక్షించుట అనుచితము. అనిత్యమయినను

మానవదేహముతోనే పురుషార్థమును సాధింపవలెను. పశుపక్ష్యాదులు తమ శరీరముతో మోక్షమును యెన్నటికిని సాధింపనేరవు. ఈయది (మానవదేహము) మాటిమాటికి లభించునదికాదు. అనేక జన్మార్జిత సుకృతముననగాని మనుష్య శరీరము లభించదు. ఈ శరీరము నశించుచో, మరల మనుష్యశరీరము లభించునను యాశ సున్న- కనుకనే భాగవతమున ప్రహ్లాదు డిట్లు చెప్పెను.

"శ్లో. కౌమార ఆచరే త్ప్రాజ్ఞః ధర్మాన్ భాగవతానిహ,
దుర్లభం మానుషం జన్మ తదప్యధ్రువ మర్థదమ్."

వివేకవంతుడు కౌమారదశయందే భాగవతధర్మముల నాచరించవలెను. మనుష్య జన్మయే దుర్లభము. అందు పురుషార్థసాధకమగు మనుష్యజన్మ అత్యంత దుర్లభము, – అని దీని యర్థము. ॥ 33 ॥

శ్లో. మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః. ॥ 34 ॥

అ॥ అర్జునా! నీవు నాయందు మనస్సు వుంచుము. నన్ను భక్తితో నర్చింపుము. నన్ను నమస్కరింపుము. ఇట్లు చిత్తమును నాయందు సమాధానపరచి మత్పరాయణుడ వగుచు ఆత్మరూపుడనగు నన్నే పొందుదువు.

ఇచట "మామేవైష్యసి, మత్పరాయణశ్చ భవిష్యసి" నన్నే పొందుదువు. మత్పరాయణుడ వగుదువు. అని రెండు వాక్యములుగా అన్వయించదగదు. అట్లన్వయించుచో ఈశ్వరసాయుజ్య ప్రాప్త్యనంతరముకూడ ముక్తునకు, ఈశ్వరపరాయణత్వ మనునది మిగిలియున్న దను నర్థము లభించును. ఈయది దుష్టము. ముక్తుడు కృతకృత్యుడుగాని అకృతకృత్యుడు గాడు. అవశిష్టకృత్యుడును గాడు.

ఇచట "మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం." ఇట్లు చిత్తమును సమాధానపరచి ఆత్మరూపుడనగు నన్నే పొందుదువు. అని ముగించిన వాక్యార్థమును "మత్పరాయణః" అను పదాన్వయముకొరకు మరల స్వీకరించినందున సమాప్త పునరాదానదోషము సంభవించునని యనరాదు. మత్పరాయణుడవయిననే, నన్ను బొందగలవు. లేనిచో బొందలేవు అని యీశ్వర సాయుజ్యప్రాప్తికి నీశ్వరపరాయణత్వ మావశ్యకమగుటచే సమాప్త పునరాదానదోషము ప్రసక్తించదు.

ఈశ్వరపరాయణత్వమనగా, ఎల్లపుడు నీశ్వర స్వరూపానుసంధాన మను తదేకనిష్ఠ యని గ్రహింపవలెను. కావున, అర్జునా! నీవు యీశ్వరార్పణబుద్ధితో స్వధర్మమగు నీయుద్ధమును కర్తృత్వాభిమానరహితుడ వగుచు ముగించి, పిదప సర్వకర్మలను సన్యసించి, ఆత్మజ్ఞానమును సంపాదించుకొని, యాత్మానుసంధానమును జేసికొనుము. అట్లగుచో నీకు బ్రహ్మభావము కలుగగలదు, అని తేలినయర్థము. ॥ 34 ॥

రాజవిద్యా, రాజగుహ్యములయొక్క సంబంధము యీయధ్యాయమున నున్నందున నీయధ్యాయము "రాజవిద్యారాజగుహ్యయోగ" మను నామమును బడసెను.

ఇట్లు
మల్లావఝులోపనామక వేంకటసుబ్బరామశాస్త్రి విరచితమగు
గీతాభాష్యార్క ప్రకాశికానువాదమున
న వ మా ధ్యా య ము
ముగిసినది.

---

శ్రీ హయగ్రీవాయనమః

# శ్రీ భగవద్గీతా భాష్యార్థ ప్రకాశికానువాదము

## దశమాధ్యాయము

అవ॥ ఏడవ యధ్యాయమునందును, తొమ్మిదవ యధ్యాయమునందును భగవత్తత్త్వము, భగవద్విభూతులు వివరింపబడినవి. ఇపు డీ యధ్యాయమున భగవంతుని ధ్యానింపదగిన పదార్థములు నిరూపింపబడుచున్నవి. దుర్విజ్ఞేయమగుటచే నచ్చటచ్చట భగవంతుని నిజరూపముగూడ నిరూపింపబడునని శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ భూయఏవ మహాబాహో! శ్రుణు మే పరమం వచః
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా. ॥ ౧ ॥

అ॥ జానువుల (పిక్కల) పర్యంతము వ్రేలాడు బాహువులుగల, ఓయి యర్జునా! నీకు నేను నిరతిశయ వస్తుప్రతిపాదకమగు మాటను మరల చెప్పెద వినుము. వినినకొలది ప్రేమించుచున్న నీకు, సంసార నివర్తకమగు నీవస్తువును బోధింపవలెనను గోరికతో జెప్పుచుంటినికాని, నాకొరకు గాదు. అమృతమును త్రాగినవానికి నోరూరినట్లు, భగవత్తత్త్వము నెన్నిసారులు బోధించినను నీకు ప్రేమ మెండగుచున్నది. ఇట్టివారల గడతేర్చుటయే నాదు కృత్యము. ఇచట "మహాబాహో" అనునర్జునుని సంబోధనచే, భగవదంశసంభూతుడగు నర్జునుడు భగవద్వాక్యమును విననర్హుడని సూచిత మగుచున్నది.

శ్లో॥ న మే విదు స్సురగణాః ప్రభవం న మహర్షయః
అహ మాదిర్హి దేవానాం మహర్షీణాంచ సర్వశః. ॥ ౨ ॥

అ॥ ఓయి అర్జునా! ఇంద్రాదిదేవతలుగాని, కశ్యపుడు మున్నగుఋషులుగాని నీకు భగవత్తత్త్వమును జెప్పెదరని నీవాశపడకుము. వారెవ్వరు నామహిమను నాపుట్టుకను గుర్తెఱుంగరు. కావున నేనే నీకు తత్త్వము నుపదేశింపదలచితిని.

దీనివలన నీశ్వరు డొక్కడే సర్వజ్ఞుడనియు, మిగిలినవారందరు కించిద్జ్ఞులనియు దేలినది.

ఓయి! ఇచట "నేను సర్వజ్ఞుడను, సర్వమును నీకు జెప్పెదను" అని ప్రతిజ్ఞ చేసినది ఆత్మయా? ప్రమాతయా! ఇందు మొదటిపక్షు మంగీకరింపదగదు. నిర్వికారుడగు నాత్మకు వక్తృత్వాది (చెప్పుట మున్నగు) వికారములు సంభవింపవు.

ప్రమాత జీవుడగునుగాని సర్వజ్ఞుడు గాడు. కాన రెండవపక్షమున్ను పొసగదు. అనినచో;

వినుము. జీవునకు వాస్తవమనియు, ఆధ్యాసికమనియు రెండు రూపములు గలవు. అట్లే యీశ్వరునకుగూడ రెండురూపములు గలవు. అందు జీవేశ్వరు లిరువురకు వాస్తవరూపము చైతన్యలక్షణమయిన ఆత్మయే. ఇయ్యది యేకరూపమే యగును. ఆధ్యాసికరూపముమాత్రము జీవునకును ఈశ్వరునకును వేరువేరు. జీవులకు గూడ ఒండొరులకు వేరువేరుగా గలదు.

ఇట్లుండ వ్యవహారదశయందు జీవు డెట్లు ప్రమాత యనబడునో అట్లే వ్యవహారదశలో ఈశ్వరుడుగూడ ప్రమాతయే యగుచున్నాడు. జీవులలో నొకరి కొకరికి జ్ఞానతారతమ్యము కలదు. అట్లే జీవేశ్వరులకుగూడ పరస్పరము జ్ఞానతారతమ్యము కలదు. జీవున కుపాధియగు నవిద్య పరిచ్ఛిన్నము (కొద్దిది). కాన, జీవుడు (ప్రమాత) కించిద్‌జ్ఞుడు. ఈశ్వరోపాధియగు అజ్ఞానము (అవిద్య) అపరిచ్ఛిన్నము (గొప్పది). కాన, నీశ్వరుడు సర్వజ్ఞు డనబడుచున్నాడు. జీవున కుపాధి బుద్ధియనియు, ఈశ్వరున కుపాధి మాయ యనియు నింతకుముందే చెప్పబడినది. బుద్ధి పరిచ్ఛిన్నమని, మాయ అపరిచ్ఛిన్నమని, శాస్త్రము చెప్పుచున్నది. ఇట్లుండ కృష్ణశరీరముతో (నవచ్ఛిన్నమయిన) గూడిన ప్రమాత, మాయోపాధికుడగు నీశ్వరుడని తేలినది. కాన శ్రీకృష్ణునకు సర్వజ్ఞత్వము సిద్ధించుచున్నది. ఇంద్రాది శరీరముతో గూడిన చైతన్యరూపులగు ప్రమాతలు అంతఃకరణ ముపాధిగా గలవారని తేలినది. కాన వీరికి కించిద్‌జ్ఞత్వము సిద్ధించుచున్నది.

ఇట్లు, జీవేశ్వరు లిరువురకు ప్రమాతృత్వాంశమున కించిత్‌జ్ఞత్వ, సర్వజ్ఞత్వ రూపభేద ముండుటంబట్టి యభేదము సిద్ధింపదనియే తత్త్వమస్యాది వాక్యములయందు చైతన్యమాత్రమునందు లక్షణ యంగీకరింపబడినది. శ్రీకృష్ణశరీరమునందు మాయావచ్ఛిన్నచైతన్యము కలదనియు, అస్మదాది శరీరములయందు బుద్ధ్యవచ్ఛిన్న చైతన్యము కలదనియును జెప్పుటకు గారణమేమని యనరాదు. ఈశ్వరుడు సర్వజ్ఞుడగుట, అస్మదాదులము కించిద్‌జ్ఞుల మనుటయే యిందుకు నియామకము. కావున వ్యవహారముండునంతవరకు ప్రమాతలగు జీవేశ్వరులకుగాని, ప్రమాతలగు జీవులలో నొండొరులకుగాని యైక్యము (అభేదము) సిద్ధింపదు.

కాన కృష్ణుడు యీశ్వరుడనియు, నింద్రాదులు జీవులనియును సిద్ధమయినది. పరమార్థదశలో, ప్రమాతలందరు జీవులనియు, ఆత్మయొక్కడే యీశ్వరుడనియును గ్రహింపవలెను. ఇట్లు ప్రమాతయగు నీశ్వరునకుగూడ సర్వజ్ఞత్వము సిద్ధించుచున్నందున శ్రీకృష్ణుడు తాను సర్వజ్ఞుడనని ప్రతిజ్ఞచేయుట యుచితమే యగును.

ఓయి, అర్జునా! నీ వనుకొనెడి దేవతలకును, మహర్షులకును నేను ఆది కారణుడను. కుమారునిపుట్టుక దండ్రి యెఱుంగునుకాని తండ్రి పుట్టుకను కుమారు డెఱుంగడు. కావున సర్వకారణుడగుటవలన నీశ్వరుడు సర్వము నెఱుంగునుకాని, యీశ్వరునిమాత్రము యెవ్వరును తెలియజాలరు. ఈశ్వరుడు సర్వప్రపంచమునకు ఆదికారణుడని, "యతోవా ఇమాని భూతాని జాయంతే" అను శ్రుతి చెప్పు చున్నది.

ఓయి, జీవుల కుత్పత్తి లేదుకదా? ఈశ్వరుడు జీవుల కాదికారణు డెట్లగును? జీవులకు పుట్టుకలేదని, "అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణః" అను గీతాస్మృతియు, "అజోహ్యేకో జుషమాణోనుశేతే" అను శ్రుతియు జెప్పుచున్నది. కావున "యతోవా ఇమాని భూతాని" అనుశ్రుతి, భూతశబ్దవాచ్యములగు దేహాదుల కుత్పత్తిని చెప్పుచున్నదనియే వర్ణింపవలయును. అనినచో నిజమే. ఇంద్రుడు మున్నగు జీవులు దేహేంద్రియాది సముదాయమునే ఆత్మగా నభి మానించుచు 'నేను దేవుడను, నేను మనుష్యుడను, నేను బ్రాహ్మణుడను' అని యనుకొనుచున్నారు. దేహముపుట్టినచో తాను పుట్టితిననియు, దేహము నశించగా తాను నశించితిననియును దలచుచున్నారు. కాన వారి సహజస్వభావము ననుస రించి, "అహమాదిర్హి దేవానాం" అని చెప్పబడినది.

దేహేంద్రియసంఘాతము పుట్టును. దానితో తాదాత్మ్యాధ్యాసమువలన ఇంద్రాదిజీవులుగూడ కార్యరూపు లగుదురు (పుట్టుదురు). అందువలన నింద్రాదుల కాది కలదు.

ఈశ్వరునకు దేహాది తాదాత్మ్యాధ్యాసలేనందున కార్యరూపుడు గాడు. కాన ననాదియగును. పరమార్థదశలో జీవుడుగూడ నీశ్వరునివలె ననాదియనియే భావము.

దేవత్వ, మనుష్యత్వాది జాతితోగూడిన దేహములు యీశ్వరునివలననే పుట్టుచున్నవి. కావున "యతోవా ఇమాని" అను శ్రుతియు, "అహమాదిర్హి దేవానాం" అను గీతయు నుపపన్నము లగుచున్నవి.

ఈశ్వరుడు, తనకు శరీరములేకున్నను సంకల్పమాత్రముననే ఆకాశాది భూతములద్వారా భౌతిక దేహములను బుట్టించుచున్నాడు. లేక భూతములను భౌతికములను ఒకేతూరి పుట్టించుచున్నాడు. లేక, మొదట హిరణ్యగర్భుని పుట్టించి, తద్వారమున భూతభౌతికపదార్థములను నెరవేర్చుచున్నాడు. లేక తానుగూడ మాయచే నొకానొక దేహము నధిష్ఠించి యుండుచునే వాని నాభికమలమునుండి బ్రహ్మను బుట్టించి, వానిచే సకలప్రపంచమును సృష్టింపజేయుచున్నాడు. ఇట్లు సృష్టిప్రకారము లనేకవిధములుగ శ్రుతిస్మృతిపురాణాదులయందు గనుపడుచున్నది.

కావున నిం దేవిధ మంగీకరించినను సర్వవిధముల యీశ్వరుడే సర్వజగత్కర్త యని స్పష్టపడుచున్నది.

కనుక శ్రీకృష్ణు డీయభిప్రాయమును మదియం దిడుకొనియే మూలమునందు "సర్వశః" (అన్నివిధముల) నేను ఆదికారణుడ నని చెప్పెను. భాష్యకర్తలగు శంకరులుగూడ నిదే యభిప్రాయముతో "సర్వశః" అనుపదమును "సర్వప్రకారైః" అని వ్యాఖ్యానించిరి. కావున దేహాదిసంఘాతములద్వారమున నింద్రాదిజీవులుగూడ బుట్టుదురని సిద్ధించినది. ॥ ౨ ॥

శ్లో. యో మా మజ మనాదించ వేత్తి లోకమహేశ్వరమ్,
అసమ్మూఢ స్సమర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే. ॥ 3 ॥

అ॥ ఓయి కృష్ణా ? నీవు దేవతలకు, మహర్షులకు ఆదికారణుడవు. నీకు కారణు డెవ్వడు ? ఓయి అర్జునా ! నాకు ఆదిలేదు. నాకు మరియొకటి ఆదియున్నచో దాని కెద్ది యాది ? దానికేది యాది ? యను నవస్థ యేర్పడును. నాకు పుట్టుక లేదు. కార్యము కారణముయొక్క యాధీనములో నుండును. నే న ట్లొకరియొద్దికలో నుండను. నేను సర్వప్రపంచమునకు ప్రభువును. ఇట్లు నన్ను యేమానవుడు పొరబాటు లేక నభిన్నాత్మరూపునిగా దెలిసికొనునో, వాడు సర్వపాపములనుండియు పుణ్యములనుండియు విముక్తుడగుచు ముక్తుడగును.

ఇచట భిన్నేశ్వరజ్ఞానమువలన మానవులకు పాపములు దొలగిపోవునని చెప్పుచుండ, అభిన్నేశ్వరజ్ఞానమును మీరేల ప్రవేశపెట్టితిరని యనరాదు.

ఈశ్వరతత్వజ్ఞానమువలన పాపక్షయము కలుగునుగాని, భ్రాంతిజ్ఞానమువలన పాపక్షయము కలుగదు.

ఈశ్వరతత్త్వము జీవాభేదముగాని జీవభేదము గాదు. పైగా ఈశ్వరుడు జీవుని కంటె భిన్నుడను జ్ఞానము భ్రాంతిరూపము. ఇట్టి జ్ఞానమువలన పాప మభివృద్ధి నొందును. నిత్యుడై జీవరూపముతోనున్న నీశ్వరునకు జన్మమరణములు మున్నగు వికారముల నాపాదింపజేయుట యనుచితము.

ఈశ్వరునకు జీవరూపత్వ మేల వచ్చినదని శంకింపరాదు.

శ్రు. " తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్ "
శ్లో. " మమైవాంశో జీవలోకో జీవభూత స్సనాతనః "
శ్లో. " ఈశ్వరో జీవకలయాప్రవిష్టో భగవా నితి "
శ్లో. " భగవా నేకఏవైష సర్వక్షేత్రే ష్వవస్థితః,
అముష్యదుర్భగత్వం వా క్లేశోవా కర్మభిః కుతః"

ఇత్యాది శ్రుతిస్మృతి పురాణ ప్రామాణ్యమువలన ఈశ్వరునకు జీవరూపత్వము సంభవించినదని తెలియుచున్నది.

ఓయి, మాయావచ్ఛిన్నుడగు నీశ్వరుడు బుద్ధ్యవచ్ఛిన్నమయిన జీవు డెట్లా యెను ? వినుము. మాయావచ్ఛిన్నచైతన్య, బుద్ధ్యవచ్ఛిన్నచైతన్యములకు భేదము లేదు. మహాకాశ ఘటాకాశములకు భేదము లేదు. మహాకాశమే ఘటాకాశమగు చున్నది. అట్లె యీశ్వరుడుగూడ జీవుడు కావచ్చును. కనుకనే యీశ్వరధర్మము లగు అజత్వ, నిత్యత్వ శాశ్వతత్వాదులు జీవునియందు గలవని గీతాగ్రంథమున చెప్పుట పొసగుచున్నది. అజత్వాదులు యీశ్వరధర్మము లనుటలో వివాదము లేదు.

ఓయి, ఈశ్వరునివలె జీవుడు అజుడు, నిత్యుడు అని చెప్పినంతమాత్రమున వీ రిరువురకు నభేద మెట్లు సిద్ధించును ? కించిద్జ్ఞత్వ, సర్వజ్ఞత్వాది ధర్మములతో పెక్కు భేదము గలదుకదా ? లేదు, కించిద్జ్ఞత్వాదులు కల్పితధర్మములు. నిర్వి కారుడు, నిర్ధర్మకు డగు ఆత్మయందు కించిద్జ్ఞత్వాది వికారములు సంభవింప వని యింతకుపూర్వమే చెప్పబడినది.

కావున జీవేశ్వరు లభిన్ను లను జ్ఞానమే యథార్థజ్ఞానము. ఇయ్యదియే మానవుల పాపమును బోగొట్టును. అని తేలినది.

కనుకనే శ్రుతి " నేను వేరు " ఈశ్వరుడు వేరు " అను భేదభావముతో నుపా సించువాడు పశువని చెప్పుచున్నది.

భారతమునందుగూడ " యోఽన్యథా సంతమాత్మాన మన్యథా ప్రతిపద్యతే, కిం తే నవకృతం పాపం చోరేణాత్మాపహారిణీ " అని ఒకరీతిగనున్న ఆత్మను మరి యొకరీతిగ తెలిసికొనువాడు ఆత్మను దొంగిలించిన చోరుడనియు, వాడు సర్వపాప ములు చేసినవా డనియును జెప్పబడినది.

కావున జీవేశ్వరులు భిన్ను లనుకొనువారు యథార్థజ్ఞానులు కారు. వారు అయథార్థ జ్ఞానులు, పాపులు అని తేలినది.

ఓయి ! ఇంతకుముందు శ్లోకమున నింద్రుడు మున్నగుజీవులు, పాదులు (పుట్టుకగలవారు) అని వ్యాసులుచెప్పి, యీ శ్లోకమున నేనొక్కడనే యనాది పదార్థ (పుట్టుకలేనివాడ) మని యీశ్వరుడొక్కడే యనాదియని నిరూపించెను. ఇట్టివ్యాసులు జీవేశ్వరాభేదమును నిరూపింప నెట్లు సమర్థులైరి? ఈత డున్మత్తుడా యేమి ?

వినుము. వెనుకటిశ్లోకమున దేహాది సంఘాతబుద్ధితో నింద్రాదులు పుట్టుక గలవారని వ్యాసులచే జెప్పబడినది.

ఇచ్చట దేహాదిసంఘాత విలక్షణమయిన ఆత్మ యీశ్వరాభిన్నమని చెప్ప బడినది. దేహాదిసంఘాత విలక్షణుడగు సచ్చిదానందుడే యాత్మ. ఆతడే యీశ్వరుడు. ఆతడే నిత్యుడు. పుట్టుకలేనివాడు. ఆత్మకంటె భిన్నుడగు నీశ్వరుడు మరియొకడు లేడు. కావున నిందు దోషములేదు. వ్యాసు డున్మత్తుడును గాడు.

రా మా ను జ మ త ము

ఈ శ్లోకమును రామానుజు లిట్లు వ్యాఖ్యానించిరి :

" భగవంతుడు యితర చేతనులతో సజాతీయు డను మోహమును విడిచి, యెవ్వడు నన్ను చిదచిద్విలక్షణునిగాను, నిఖిలహేయగుణ ప్రత్యనీకమయిన అనంత కల్యాణగుణ నిలయునిగాను, కర్మప్రయుక్తమగు జడపదార్థ సంసర్గ రూపమయిన జన్మలేనివాడ నగుటచే బద్ధజీవులకంటె విలక్షణునిగను, ఆదిగలిగి యజుడగు ముక్తాత్మ కంటె భిన్నునిగను అజుని, యనాదిని, యీశ్వరునిగా దెలిసికొనునో, వాడు యెల్ల పాపములచే విముక్తుడగును " అని.

ఈయది నిస్సారము.

1. చిద్రూపుడగు నీశ్వరుడు చిద్విలక్షణుడు గానేరడు.

2. " కేవలో నిర్గుణశ్చ " అని శ్రుతిచే జెప్పబడిన నిర్గుణుడు గుణనిలయు డగుట యసంభవము.

3. దేహసంసర్గమే జన్మయగుచుండ, కర్మప్రయుక్తమయిన జడసంసర్గము జన్మయని చెప్పుట యనుచితము, గౌరవగ్రస్తము నగును.

4. ఈశ్వరునకు గూడ నిట్టి జన్మ యుండుటచే, అజత్వము సంభవింపదు. బద్ధజీవులలో వైలక్షణ్యమున్ను సంభవింపదు.

5. ఆదిమత్వము, అజత్వము (ఆదియుండుట, పుట్టుక లేకుండుట) యీ రెండును విరుద్ధ ధర్మము లగుటచే నొకచోట నుండవు. కావున ముక్తాత్మలకు ఆదిమత్వము, అజత్వము సంభవింపదు. పుట్టున దంతయు నాది గలదియే. ఎయ్యది పుట్టదో దాని కాదిలేదు.

6. మరియు ముక్తుడు యీశ్వర సాయుజ్యము నొందియుండ ముక్తాత్మభేద మీశ్వరున కెట్లు సిద్ధించును ? " బ్రహ్మవి ద్బ్రహ్మైవ భవతి " అను శ్రుతి యీశ్వర సాయుజ్యము ముక్తియని చెప్పుచున్నది కదా ?

7. మరియు, " సాక్షీ చేతా " అను శ్రుతిచే జెప్పబడిన యీశ్వరు డొక్కడగు చుండ, నీతనికి చేతనాన్తర విసజాతీయత్వ మెట్లు సిద్ధించును? మరియొక చేతను డున్న పుడుగదా, దానితో విసజాతీయత్వము సిద్ధించును.

" నాన్యోఽతోఽస్తి ద్రష్టా " అను శ్రుతి మరియొక చేతనుడు లేడనికదా చెప్పుచున్నది. కావున పై కారణములనుబట్టి రామానుజవ్యాఖ్యాన ముచిత మనదగదు.

శ్లో॥ బుద్ధి ర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమశ్శమః,
సుఖం దుఃఖం భవోఽభావో భయంచాభయ మేవచ. ॥ ౪ ॥

అ॥ నేను కేవల మనాదియగుటచేతనే మహేశ్వరుడను కాను. మరేమనిన, మానవులకు బుద్ధిమున్నగు పదార్థముల నిచ్చుటచేగూడ మహేశ్వరుడ నగుచున్నాను.

సూక్ష్మార్థములను తెలిసికొనెడి యంతఃకరణసామర్థ్యము బుద్ధియనబడును. ఆత్మానాత్మాది పదార్థములను దెలిసికొనుట జ్ఞానము. తెలియదగిన సర్వకార్యవస్తువులయందును, పుట్టునవన్నియు ననాత్మలను వివేకముతో ప్రవర్తించుట అసమ్మోహ మనదగును. అనగా అనాత్మలయందు ఆత్మయను పొరపాటులేకుండుట యని భావము.

కొట్టినను, తిట్టినను చిత్తమునందు వికారములేకుండుట క్షమ యనబడును-
చూచినదానిని చూచినట్లు, విన్నదానిని వినినట్లు యితరులకు జెప్పుట సత్యము.
బాహ్యేంద్రియనిగ్రహము దమము. అంతరింద్రియ నిగ్రహము శమము-
ఆహ్లాదము సుఖము. సంతాపము దుఃఖము.
పుట్టుట భవము - చచ్చుట యభావము - త్రాసము భయము - త్రాసము లేకుండుట యభయము ॥ ౪ ॥

శ్లో॥ అహింసా సమతా తుష్టి స్తపోదానం యశోయశః,
భవంతి భావా భూతానాం మత్తఏవ పృథగ్విధాః. ॥ ౫ ॥

అ॥ ఇతరప్రాణులను బాధింపకుండుట, అందరియందు సమచిత్తతతో నుండుట, తృప్తి, ఉపవాసాదులచే శరీరమును నిగ్రహించుకొనుట, శక్తికొలది ధనధాన్యాదులను యాచకులకు పంచియిచ్చుట, ధర్మమాచరించినందున కలిగెడి కీర్తి, అధర్మచరణమున వచ్చెడి యపకీర్తి ఈ మొదలగు భావములన్నియు ప్రాణులకు తమతమ కర్మానుగుణముగ నావలననే కలుగుచున్నవి. పుణ్యాపాపకర్మానుగుణముగ సుగుణములను, దుర్గుణములను కలుగజేసెడి నాకు, విషమస్వభావుడ ననుదోష మంటదు. ॥ ౫ ॥

శ్లో॥ మహర్షయస్సప్తపూర్వే చత్వారో మనవస్తథా,
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః. ॥ ౬ ॥

అ॥ భృగువుమున్నగు సప్తమహర్షులు, బ్రహ్మసావర్ణుడు, రుద్రసావర్ణుడు, ధర్మసావర్ణుడు, దక్షసావర్ణుడు అను నలుగురు మనువులు; వీరందరు నాకు మానస పుత్రులు. నావలననే మహిమను పొంది, యీ కనిపించు స్థావరజంగమ భూతములను పుట్టించుచుందురు.

శ్లో. ఏతాం విభూతిం యోగంచ మమ యోవేత్తి తత్త్వతః,
సోవికమ్పేన యోగేన యుజ్యతే నాత్రసంశయః. ॥ ౭ ॥

అ॥ ఇట్టి నాదుమహిమను, క్రియాకౌశల్యమును, యెవ్వడు యథార్థముగా దెలిసికొనునో, వానికి దృఢమయిన బ్రహ్మాత్మాభేదజ్ఞానము కలుగును. అనగా

ఈశ్వరమహిమను దెలిసికొన్న విద్వాంసునకు, "బ్రహ్మైవాహ" మను సమ్యగ్ జ్ఞానము స్థిరపడును. ఇందు సందియము లేదు.

ఇచట రా మా ను జు లు, విభూతియనగా ఐశ్వర్యమనియు, యోగ మనగా కల్యాణగుణగణమనియు, (యోగేన) యోగముచే ననగా భక్తి యోగముచే ననియును వ్యాఖ్యానించిరి.

ఈయది నిస్సారము.

ఈశ్వరునిమహిమ దెలియనివానికిగూడ భక్తి యోగము కనిపించుచున్నది. రాజుయందలి యైశ్వర్యాది గుణములను దెలిసికొన్నవారు రాజును సేవింతురు. ఇయ్యది లోకసిద్ధము. ఇద్దానిని శాస్త్రము చెప్పబనిలేదు. యోగశబ్దమునకు కల్యాణ గుణ మను అర్థము లోకశాస్త్రములకు విరుద్ధము. కాన రామానుజులు చెప్పినది సరిగాదు.

శ్లో॥ అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే,
ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః. ॥ ౮ ॥

అ॥ విద్వాంసులు నేనే వాసుదేవాఖ్య పరబ్రహ్మననియు, నావలననే జగచ్చక్రము దొరలుచున్నదనియును దెలిసికొని, పరమార్థభావముతో నన్ను సేవింతురు.

ఈశ్వరునివలన ప్రపంచోత్పత్తి స్థితిలయములు జరుగుచున్నవని శ్రుతి చెప్పుచున్నది. ఆ యీశ్వరుడే సర్వక్షేత్రములయందును ప్రత్యగ్రూపముతో నుండు ననికూడ చెప్పుచున్నది. కాన నేనే యీశ్వరుడను. నావలననే జగత్తు పుట్టుచున్నది. పెరుగుచున్నది. నశించుచున్నది. ఇట్లు యీశ్వరు నాత్మగా దలచి పండితులు సేవింతురని భావము.

రా మా ను జ మ త ము

ఇచట రామానుజులు, "శ్రీకృష్ణుడగు నీశ్వరుడు జగత్సృష్ట్యాదులకు గారణుడని తలచి, శ్రీకృష్ణు డను పరబ్రహ్మను, బుధులు భక్తితో సేవింతు" రని వ్యాఖ్యానించిరి.

అది యుచితము గాదు. శ్రీకృష్ణావతారమునకు పూర్వోత్తరకాలముల యందున్న వారలకు, అవతారకాలమందును శ్రీకృష్ణావతారమునకు దూరమున నున్న వారలకును శ్రీకృష్ణభజనము సంభవించదు కృష్ణునకు దగ్గిరనున్న విద్వాంసులకుగూడ ఆత్మయం దీశ్వరబుద్ధి కలదుగాని శ్రీకృష్ణశరీరమునం దీశ్వరబుద్ధి లేదు. కాన వారివ్యాఖ్యాన ముచితముగాదు. ॥౮॥

శ్లో॥ మచ్చిత్తా మద్గతప్రాణాః బోధయంతః పరస్పరమ్
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతిచ. ॥౯॥

అ॥ అట్టి విద్వాంసులు చిత్తము నెప్పుడు నాయందుంచి, చక్షురాదీంద్రియ వ్యాపారముల నా వశమొనర్చి ఆత్మానందానుభవముతో నెల్లపుడు కాలమును గడపుచు, ఆత్మతత్త్వము నొకరి కొకరు చెప్పుకొనుచు సంతోషింతురు, క్రీడింతురు. కాంతునికలయికతో కామిని క్రీడించినట్లు క్రీడింతు రనిభావము.

ఇచట తుష్యంతి అనుపదమువలన కృతకృత్యత చెప్పబడుచున్నది. ఈయది గృహస్థునకు దుర్లభము. కనుక నీయది సన్న్యాసివిషయమని గ్రహింపవలయును. అందును పరమహంసవిషయముగాని యితరసన్న్యాసులవిషయము గాదు. ఇతర సన్న్యాసులకు దండతర్పణాదికృత్యము లుండును. ఇట్లు వీరు కృతకృత్యులుగనుకనే యాత్మారాము లగుచున్నారు. వీరికి విషయసుఖముతో ప్రయోజనములేదు. శాశ్వత మయిన ఆత్మానందముతోడనే వీరెల్లపుడు క్రీడింతురు. ॥౯॥

శ్లో॥ తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే. ॥౧౦॥

అ॥ ఎల్లపుడు ఆత్మయందు చిత్తైకాగ్ర్యము నుంచి, ప్రేమపూర్వకముగ బరమేశ్వరుని సేవించునట్టి మహానుభావులకు బ్రహ్మసాయుజ్యసాధనమయిన సమ్యగ్దర్శనమును నే నిత్తును. ఆర్తత్వాది నిమిత్తములచే సేవించువారలకు జ్ఞానోదయము కలుగదు. ఇంతమాత్రమున పరమేశ్వరునకు దాతృత్వవికారము సంభవించునని యనరాదు. ఇచట పరమేశ్వరునకు ముఖ్యమయిన దాతృత్వము చెప్పబడుట లేదు. ఆత్మస్వరూపానుసంధానమువలన పురుషులకు "అహంబ్రహ్మాస్మి" అనుజ్ఞానము కలుగును. కాన పరమేశ్వరు డిచ్చుచున్నాడని చెప్పబడినది. ఇంతియేకాని పరమేశ్వరుడు దానక్రియావికారము గలవాడని చెప్పుట యందు దాత్పర్యము లేదు. ॥౧౦॥

శ్లో॥ తేషా మేవానుకంపార్థ మహ మజ్ఞానజం తమః,
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా. ॥౧౧॥

అ॥ కృష్ణా! నీభక్తులకు నేరుగా సాయుజ్యము నేల యీయవు? జ్ఞానయోగము నిచ్చుటలో కారణమేమి? వినుము. వారికి నాదు సాయుజ్యము నొందుటకు ప్రతిబంధకమయిన అజ్ఞానము గలదు. దానిని నశింపజేయుటకు బుద్ధియోగము అవశ్యకము. కనుక నాకు వారియందలి దయచే, వారియంతఃకరణమునం దుండి, జ్ఞానమను దీపముచే, మిథ్యాప్రత్యయరూపమయిన మోహాంధకారమును నశింపజేతును.

నిర్వికారుడయిన ఆత్మకుగూడ మాయచే, భక్తశ్రేయోభిలాషయనునది కలుగవచ్చును. అందువలన నిర్వికారత్వమునకు భంగములేదు.

జీవులకు అజ్ఞాన ముండునంతవరకు ఆత్మరూపుడయిన యీశ్వరుడుకూడ పరోక్షుడే యగును. ఆ యీశ్వరుడు మాయావచ్ఛిన్నుడు. మాయావచ్ఛిన్నునకు మాయచే కృపాళుత్వ ముచితము. జ్ఞానముచే నజ్ఞానము నశించినపిదప ఆత్మ రూపుడయిన నీశ్వరు డపరోక్షుడగును. అపుడు మాయయే లేదుకాన నాత్మరూపు డయిన యీశ్వరుడు మాయావచ్ఛిన్నుడుగాడు. మాయావచ్ఛిన్నుడు నిర్వికారు డగుటచే వానికి కృపాళుత్వమను ధర్మము యుచితముగాదు. కాన నజ్ఞానముండునంత వరకు ఈశ్వరునకు భక్తశ్రేయోభిలాష యుక్తమగును.

ఓయి! భక్తులకు దయతో జ్ఞానయోగము నిచ్చెడి యీశ్వరుడు, మాయతో గూడినవాడా? లేక అంతఃకరణముతో గూడినవాడా? ఇందు మొదటిపక్షము కుదరదు. మాయావచ్ఛిన్నుడు (మాయతోగూడినవాడు) అంతఃకరణయందుండుట సంభవించదు. రెండవపక్షమున్ను సంభవింపదు. అంతఃకరణతోగూడినవాడు పరిచ్ఛిన్నుడుకాన, వానికి నజ్ఞానాంధకారమును బోగొట్టు సామర్థ్యము సున్న, యనినచో,

వినుము. మాయావచ్ఛిన్నుడై. సర్వవ్యాపకుడయిన ఈశ్వరుడే అంతః కరణావచ్ఛిన్నుడుకాన, యాత డంతఃకరణమునం దుండుట సంభవించును. ఇట్లంగీక రింపనిచో నీశ్వరునకు సర్వవ్యాపిత్వమే (అంతట నుండుటయే) సంభవించదు. ఈశ్వరు డంతఃకరణమునం దుండుటవలననే, "ఈశ్వరస్సర్వభూతానాం హృద్దే శేఽర్జున తిష్ఠతి" అని శ్రీకృష్ణుడు ముందు చెప్పగలడు. ఈశ్వరు డంతఃకరణమునం దుండుచో, పరిచ్ఛిన్నత్వ మేర్పడి, యాతని సర్వజ్ఞత్వాదికమునకు భంగము వాటిల్లునని యనరాదు. సిద్ధాంతమునందు అంతఃకరణావచ్ఛిన్నుడుగూడ నపరిచ్ఛిన్ను డని యంగీకరింపబడినది. అంతఃకరణావచ్ఛిన్నుడయిన జీవుడు నిజముగ పరిచ్ఛిన్ను డగుచో ఘటపటాదులవలె అనిత్యము కావలసివచ్చును.

అయితే పరిచ్ఛిన్నుడయిన జీవునియందు సర్వజ్ఞత్వము కనిపించుటలేదుకదా అని అనరాదు. ఈ జీవులయందలి సర్వజ్ఞత్వము, అజ్ఞానరహితుడయిన ఈశ్వరునకు దెలియుచున్నది. కాని యజ్ఞానులగు మనబోంట్లకు తెలియదు.

మరియు, జీవుడు వేరు, ఈశ్వరుడు వేరు అనియనరాదు. అట్లనుటకు ప్రమాణము లేదు. ప్రత్యుత, ఈశ్వరుడే జీవరూపముతో సర్వక్షేత్రములయందు ప్రవేశించెనని శ్రుతి చెప్పుచున్నది. జీవేశ్వరులు వేరనుటకు "ద్వాసుపర్ణా" అను శ్రుతి ప్రమాణమని యనరాదు. ఆశ్రుతి చిదాభాస, ప్రత్యగాత్మపరముకాని, జీవేశ్వరపరము కాదు. లేక, బుద్ధి చిదాత్మపరమనియును జెప్పవచ్చును. చిదాభాసుడే జీవుడనియు, ప్రత్యగాత్మ యీశ్వరుడనియును జెప్పదగదు. సుషుప్తియందు చిదాభాసుడు లయించినను ప్రత్యగాత్మ యనుభవింపబడుచున్నాడు. సంసారియగు చిదాభాసుడు సుషుప్తియందు గనిపించడు.

కావున నీశ్వరుడే ప్రత్యగాత్మరూపముతో హృద్దేశమున నుండుచు, నజ్ఞాన ముండుపర్యంతము పరోక్షుడయి భక్తులకు మాయను తొలగించుటకు జ్ఞానయోగము నిచ్చుచున్నాడనునది నిర్దుష్టము.

ఇచట జ్ఞానమను దీపమునకు, బ్రహ్మచర్యాది సాధనములవలన కలిగెడు ప్రజ్ఞయనునది వృత్తి. దీనికి విరాగముగల యంతఃకరణము ప్రమిత. ఈయది విషయములనుండి మరలి, రాగద్వేషాదులచే కలుషము చెందని చిత్తమను గాలిలేని గదిలో నుంచబడును. ఈవృత్తి ఆత్మప్రీతియను చమురుతో దడుపబడును. పరమేశ్వర భావనయను కొద్దిగాలిచే చలించుచుండును. నిరంతర ప్రవృత్తమయిన నేకాగ్ర ధ్యానముచే బుట్టిన సమ్యగ్జ్ఞానమే యీ దీపముయొక్క వెలుగు (ప్రకాశ). ఇట్టి దీపము భగవదనుగ్రహమున ప్రాప్తించును. ఇది భగవత్ప్రాప్తికి ప్రతిబంధక మయిన అజ్ఞానమును రూపుమాపు నని సిద్ధించినది. ॥ ౧౧ ॥

శ్లో. పరంబ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్. ॥ ౧౨ ॥

శ్లో. ఆహుస్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా
అసితో దేవలో వ్యాస స్స్వయంచైవ బ్రవీషి మే. ॥ ౧౩ ॥

అ॥ ఓయి కృష్ణా! నీవు పరమపవిత్రమయినట్టియు పరంధామమగు పరబ్రహ్మ మగుచుంటివి. నారదుడు, అసితుడు, దేవలుడు, వ్యాసుడు మున్నగు ఋషులందరు నిన్ను శాశ్వతుడ వనియు, దివ్యుడ వనియు, ఆదిదేవుడ వనియు, జన్మరహితుడ వనియు, వ్యాపకుడ వనియు, పురుషుడ వనియును జెప్పుచున్నారు. నీవుకూడ నాకట్లే చెప్పితివి. ఇచట మొదటి శ్లోకమున పూర్వార్థమునందు బ్రహ్మ, ధామ, పవిత్ర, శబ్దములకు పరమపదము విశేషణముగా గూర్చబడినది. అందుకు ప్రయోజన మేమన? బ్రహ్మశబ్దమునకు ప్రకృతియర్థము గాదనుటకు పరశబ్దము విశేషణము.

ధామశబ్దమునకు దీపాదులర్థము గాదనుటకు పరశబ్ద విశేషణము.

పవిత్రములగు గంగాదులకంటె విలక్షణుడని చెప్పుటకు పవిత్రశబ్దమునకు పరమశబ్దము విశేషణము అని గ్రహింపవలెను.

ఇందు "భవాన్" (నీవు), "త్వామ్" (నిన్ను) అను పదములకు శ్రీకృష్ణ శరీరావచ్ఛిన్న చైతన్య మర్థము. అర్జునశరీరావచ్ఛిన్న చైతన్యముగూడ నిట్టిదనుటకు సందియము లేదు.

అయినను అర్జునునకు ఇంతవరకు ఆత్మయందు దీశ్వరబుద్ధి యుదయించలేదని మాత్రము గ్రహించవలెను. లేక 'భవాన్' అనుపదమునకు, 'త్వామ్' అనుపదము నకును చిన్మయుడగు ఆత్మయనియే జెప్పవలయును. ॥ ౧౨-౧౩ ॥

శ్లో. సర్వ మేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ !
నహి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవాః. ॥ ౧౪ ॥

అ॥ ఓయి కేశవ ! నీవు చెప్పినదంతయు నిజమని నే తలంతును. నీ వనాది యగుటచే దేవదానవు లెవ్వరు నీదుపుట్టుకను దెలియ లేకున్నారు. ॥ ౧౪ ॥

శ్లో. స్వయమేవాత్మ నాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ !
భూతభావన ! భూతేశ ! దేవదేవ జగత్పతే ! ॥ ౧౫ ॥

అ॥ ఓయి, పురుషోత్తమ ! ఓయి భూతభావన ! భూతేశ ! దేవదేవ ! ఓయి జగత్పతే ! నీవు నిన్ను నీచేతనే స్వయముగ దెలిసికొనుచున్నావు.

ఇచట పురుషోత్తము డన క్షరాక్షరముల కావలివాడు.

భూతభావను డనగా భూతములను బుట్టించువాడు.

భూతేశు డన భూతములను నియమించువాడు.

దేవదేవుడన, దేవతలకు దేవుడు

జగత్పతియన ప్రపంచమునకు పాలకుడు.

ఓయికృష్ణా ! నీ విట్టివాడ వగుటచే నిన్ను యితరప్రాణు లెవ్వరును తెలియ నేరరని భావము. ॥ ౧౫ ॥

శ్లో. వక్తు మర్హస్య శేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః
యాభి ర్విభూతిభి ర్లోకాని మాం త్వం వ్యాప్య తిష్ఠసి. ॥ ౧౬ ॥

అ॥ కావున నీవు యేయే విభూతులచే నీలోకములను వ్యాపించియుంటివో ఆ యా విభూతుల నన్నింటిని నిశ్శేషముగా జెప్పుము. ॥ ౧౬ ॥

శ్లో. కథం విద్యా మహం యోగిన్ త్వాం సదా పరిచింతయన్,
కేషు కేషుచ భావేషు చింత్యోఽసి భగవన్మయా. ॥ ౧౭ ॥

అ॥ అణిమాద్యైశ్వర్యముగల ఓయి కృష్ణా ! నిన్ను నే నెల్లపుడు ధ్యానించుట కెట్లు తెలిసికొందును ? ఏ యే వస్తువులయందు నిన్ను ధ్యానింపవలెను ? ॥ ౧౭ ॥

శ్లో. విస్తరే ణాత్మనో యోగం విభూతించ జనార్దన,
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్. ॥ ౧౮ ॥

అ॥ ఓయి జనార్దనా ? నీ శక్తివిశేషమును విభూతిని నాకు విస్తరించి చెప్పుము. అమృతతుల్యమయిన నీ వాక్కును వినుచున్న నాకు తృప్తి తీరలేదు. కాన మరల విస్తరించి చెప్పుము.

ఇచట "జనార్దన" అను పదమునందలి అర్థధాతువు గత్యర్థకము. గమన మర్థమని భావము. కావున "జనానా మర్దనః జనార్దనః" అని వ్యుత్పత్తి అనగా ఆసురమానవులను నరకాదిలోకములను బొందించువాడని యర్థము.

లేక అర్దధాతువునకు యాచ్ఞార్థముగూడ కలదు. అపుడు "జనై అర్ద్యతే" అని వ్యుత్పత్తి. కాన భక్తులచే అభ్యుదయమును పురుషార్థమును గురించికాని, నిశ్శ్రేయస మను పురుషార్థమును గురించికాని యాచింపబడువాడుగాన జనార్దను డని యర్థము. ఇందు యాచ్ఞార్థకమగు అర్దధాతువు ద్వికర్మకమని గ్రహింపవలెను. ॥ ౧౮ ॥

శ్లో॥ హంత తే కథయిష్యామి దివ్యాహ్యాత్మవిభూతయః,
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ! నాస్త్యంతో విస్తరస్య మే. ॥ ౧౯ ॥

అ॥ అర్జునా! నీ కిపుడు నాదు దివ్యవిభూతులను ప్రధానముగా జెప్పెదను. నా విభూతులయొక్క విస్తారమున కంతములేదు. ఈ విభూతులన్నియు అధిష్ఠానమగు బ్రహ్మయందు మాయచే గల్పింపబడినవి. కాన చరాచరాత్మక పదార్థములన్నియు విభూతిశబ్ద వాచ్యములగుచున్నవి. ॥ ౧౯ ॥

శ్లో॥ అహమాత్మా గుడాకేశ! సర్వభూతాశయస్థితః,
అహమాదిశ్చ మధ్యంచ భూతానా మంతఏవచ. ॥ ౨౦ ॥

అ॥ ఓయి, గుడాకేశుడా! సర్వభూతములయొక్క అంతఃకరణమునం దుండాత్మను నేనే; నేనే భూతముల కాదియు, అంతమును, మధ్యయు నగుచున్నాను. ఇచట గుడాకేశశబ్దమునకు నిద్రను జయించినవాడని యొక యర్థము, ఆలస్యమును జయించినవాడని మరియొక అర్థము. ఎటులయినను, తమోగుణరహితుడని భావము. వనవాసమున తపోనుష్ఠానముచేఁ గడ్డకట్టిన వెంట్రుకలు గలవాడని మూడవ యర్థము.

ఈ శ్లోకమున జెప్పబడిన ముఖ్యార్థ మేమన, హృదయమను పదార్థమునందు యీశ్వరుడు ప్రత్యగ్రూపముతో ధ్యానింపదగినవాడని ప్రథమ (ముఖ్య) పక్షము సూచింపబడినది.

కనుక నే లీలాశుకు లిట్లు చెప్పిరి. "ప్రాచీనులగు ఆత్మవేత్తలు పరమపురుషుని (పరమేశ్వరుని) బుద్ధిగుహాయం దున్నవానినిగా నుపాసించుగాక! మేముమాత్రము యశోదాతనయుడగు శ్రీకృష్ణుని బాలచేష్టాకథ లను అమృతసింధువులయందు విహరింతుము," అని ఈముఖ్య పక్షమునం దధికారములేనివారు ముందు జెప్పబోవు వానియం దీశ్వరుని ధ్యానింపవలెనని భావము.

నేనే ప్రపంచోత్పత్తి స్థితిలయములకు గారణుడనుగనుక నన్నే ధ్యానింపవలెనని యర్థము.

రా మా ను జ మ త ము:

ఈశ్లోకమున శ్రీ కృ ష్ణు డు "నేను సర్వాంతఃకరణములందును ఆత్మ రూపముతో నుంటినని చెప్పుటచే ప్రత్యగాత్మకుగూడ లోపల పరమాత్మ గలడని

రామానుజులు చెప్పిరి. ఇందుకు "య ఆత్మని తిష్ఠన్" అను నంతర్యామి బ్రాహ్మణ మును ప్రమాణమునుగా జూపిరి.

ఇదియంతయు నిస్సారము.

ప్రత్యగాత్మకంటె వేరుగ పరమాత్మ హృద్దేశమునందు కనిపించుటలేదు. (తెలియబడుటలేదు). సమాధియందు మనస్సున్నగు సర్వప్రపంచభావమునకు సాక్షిగా ప్రత్యగాత్మయే ప్రకాశించుచున్నాడు.

ప్రజ్ఞానఘనుడయిన ఆత్మయం దితర వస్తువుండుట కవకాశము లేదు. అంత ర్యామిబ్రాహ్మణమునందలి భూతశబ్దమునకు ప్రాణి యర్థము. ఆత్మశబ్దమునకు బుద్ధి యర్థము. కాన నంతర్యామిబ్రాహ్మణము రామానుజులు చెప్పిన యర్థము నందు ప్రమాణము కానేరదు. ॥ ౨౦ ॥

శ్లో. ఆదిత్యానా మహం విష్ణు ర్జ్యోతిషాం రవిరంశుమాన్,
మరీచి ర్మరుతా మస్మి నక్షత్రాణా మహం శశీ. ॥ ౨౧ ॥

అ॥ నేను పదిరెండుమంది ఆదిత్యులలో విష్ణు వను ఆదిత్యుడను. దీనిచే విష్ణువు కూడ నీశ్వరవిభూతులలో జేరినవా డనియు విష్ణ్వాదులయందుగూడ నీశ్వరుడు ధ్యానింపదగినవా డనియును సూచిత మగుచున్నది. కాన విష్ణువను ఆదిత్యునియందు ధ్యానింపదగిన నీశ్వరుడు హిరణ్మయపురుషరూపుడని ద్యోతమగుచున్నది. "ధ్యేయ స్సదా సవితృమండలమధ్యవర్తీ నారాయణ స్సరసిజాసన సన్నివిష్టః" అను స్మృతి ప్రమాణ మగుచున్నది.

జ్యోతిఃపదార్థములలో నేను అంశుమంతుడ నగు రవిని. మరున్నామక దేవతావిశేషులలో మరీచియనువాడను, నక్షత్రములలో చంద్రుడను.

ఖగోళమునందున్న, రాత్రి ప్రకాశించు జ్యోతిఃపిండములన్నియును నక్షత్ర పదవాచ్యములు. అందు చంద్రుడు స్థూలజ్యోతిఃపిండము. మిగిలిన నక్షత్రములు సూక్ష్మజ్యోతిఃపిండములు. కాన చంద్రుడు నక్షత్రపదవాచ్యుడని సిద్ధించుచున్నది.

లేక 'నక్షత్రాణాం' అను పదమునకు ఖగోళమునందు ప్రకాశించు జ్యోతిః పిండము లనియే యర్థము.

వస్తుతః "యోవా ఇహ యజమానోఽముం లోకం నక్షతేత న్నక్షత్రాణాం నక్షత్రత్వమ్" అను శ్రుతిప్రమాణమునుబట్టి చంద్రుడుగూడ నక్షత్ర మనబడును. పుణ్యఫలానుభవముకొరకు యజమానుడు దేహావసానమునందు వెళ్లు లోకములు నక్షత్రము లనబడును. (నక్షతే - గచ్ఛతి) అని నక్షత్రపదమునకు వ్యుత్పత్తి. కాన చంద్రుడుగూడ ఇష్టకర్మ లాచరించెడువారు పొందదగిన లోకములలో చేరినవాడగుటచే చంద్రుడుగూడ నక్షత్రపదవాచ్యు డగును.

ఇంతియెకాని నక్షత్రముల కధిపతియగు చంద్రుడనిమాత్రము వ్యాఖ్యానించ దగదు. మిగిలిన స్థలములయందు నిర్ధారణార్థకమగు షష్ఠి యంగీకరించి, యిచట మాత్ర మద్దానిని విడచుట సమంజసముకాదు. ॥ ౨౧ ॥

శ్లో. వేదానాం సామవేదోఽస్మి దేవానా మస్మి వాసవః,
ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానా మస్మిచేతనా. ॥ ౨౨ ॥

అ॥ నేను వేదములలో సామవేద మగుచున్నాను. రుద్రాదిత్యాది దేవతలలో నింద్రుడను. పదునొకండు యింద్రియములలో మనోరూపుడను. దేహేంద్రియ సంఘాతమునందు బుద్ధివృత్తి రూపుడను.

వేదాంతులు మనస్సు యింద్రియము కాదందురు. అయినను గొందరు మనస్సు యింద్రియమని యంగీకరించిరి. కాన పదునొకండని చెప్పబడినది. మనస్సు ఇంద్రియమనుటకు గీతావచనము ప్రమాణ మగుచున్నది.

మిగత యింద్రియముల వ్యాపారము మనఃపూర్వక మగుటచే, మనస్సు మిగత యింద్రియములకంటె గొప్పది.

దేహేంద్రియాది సంఘాతమునందు స్పష్టమయిన బుద్ధియొక్క వృత్తిచేత యన బడును. అది నే నగుచున్నాను. చేతనాశబ్దము బుద్ధిపర్యాయముకనుక చేతనయనగా స్పష్టవృత్తిగల బుద్ధియనికూడ చేతనాశబ్దమున కర్థమును జెప్పవచ్చును. కను కనే "బుద్ధిశ్చేతనా" అని భాష్యమునందు పాఠాంతరముకూడ కనిపించుచున్నది. అయితే "ఉపలబ్ధి" "చిత" "సంవిదాది" శబ్దములకు జ్ఞానమర్థము కనుక, వానితో సాహచర్యమువలన చేతనాశబ్దమునకుగూడ జ్ఞానమను నర్థమును జెప్పుటయే యుచితము. అమరకారుడుమాత్రము లక్షణచే చేతనాదిశబ్దములు బుద్ధిపర్యాయము లని చెప్పెను.

కాన చేతనాశబ్దమునకు స్పష్టమయిన బుద్ధివృత్తి యను నర్థమే ముఖ్యమని యాచార్యస్వామిపాదుల హృదయము.

సుషుప్తియందు అస్పష్టమయిన బుద్ధివృత్తి కలదు. దానినే అవిద్యయందురు. సుషుప్తియందున్న బుద్ధివృత్తికి చేతన (జ్ఞాన) మను పేరు లేదు. కనుకనే యిచట స్పష్టమయిన బుద్ధివృత్తియని యాచార్యపాదులు వ్రాసిరి. కాన జాగ్రదాదుల యందున్న బుద్ధివృత్తియే చేతన యనిపించుకొను నని గ్రహించవలయును.

ఇచట రామానుజులు చేతనావంతులగు భూతములయొక్క చేతనారూపుడను నే నని వ్యాఖ్యానించిరి. అయ్యది ప్రకరణ విరుద్ధమయినందున నుపేక్షింపదగును. ఇందంతటను నిర్ధారణార్థమునందు షష్ఠి ప్రారంభమయినది. మిగత పాదములయం దిట్లు వేదవంతుల సంబంధమయిన సామవేదము నేననియు, యింద్రియములు గలవారల సంబంధమయిన మనసు నేననియును లేదు. కావున రామానుజ వ్యాఖ్యాము అసంగతము. ॥ ౨౨ ॥

శ్లో. రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్,
వసూనాం పావకశ్చాస్మి మేరుశ్శిఖరిణా మహమ్. ॥ ౨౩ ॥

అ॥ పదునొకండు రుద్రులలో నేను శంకరుడను. యక్షులలోను రాక్షసుల లోను కుబేరుడను. యక్షులకును రాక్షసులకు నవాంతర భేదమున్నను జాతియొకటే కావున "యక్షరక్షసామ్" అని కలిపి చెప్పబడినది.

లేక ఒకే సంధ్యారూపమగు పితామహశరీరమునుండి యక్షులు, రాక్షసులు బుట్టిరి కాన యిద్దరను గలిపి నిర్దేశింపబడినదని గ్రహింపవలెను.

పర్వతములు సశిఖరములు, అశిఖరములు- అని రెండు విధములు. అందు సశి ఖర పర్వతములలో నేను మేరుపర్వతమును. అశిఖర (శిఖరములేని) పర్వతములలో హిమాలయము గొప్పది. అయ్యది "స్థావరాణాం హిమాలయః" అని ముందు శ్లోకముచే హిమాలయము యీశ్వరరూపమని చెప్పబడగలదు. ॥ ౨౩ ॥

శ్లో. పురోధసాంచ ముఖ్యం మాం విద్ధి పార్థ! బృహస్పతిం,
సేనానీనా మహం స్కంద స్సరసామస్మి సాగరః. ॥ ౨౪ ॥

అ॥ శతానన్దాది రాజపురోహితులలో నేను ఇంద్రపురోహితుడగు బృహ స్పతిరూపుడను. ఇతర పురోహితులకంటె రాజపురోహితుడు గొప్పవాడు. వారి కంటెగూడ నింద్రుడు మహారాజుగాన యింద్రపురోహితుడు గొప్పవాడు. సేనాధి పతులలో దేవసేనాధిపతియగు కుమారస్వామి నేను. మనుష్యులచే ద్రవ్వబడిన వాపీకూప తటాకాదులకంటె దేవతలచే ద్రవ్వబడిన సరస్సులు గొప్పవి. వాటిలో సగరచక్రవర్తి కుమారులచే త్రవ్వబడిన సాగరము (సముద్రము) గొప్పది. అట్టి సాగరము నాస్వరూపము. సగరచక్రవర్తి కుమారులు మానవులె కాన వారిచే ద్రవ్వబడిన సాగరము మనుష్యఘాతమే యగును. అయినను సాగరము, గంగాది జలములతో నిండియుండుటవలనగాని అంతములేని జలముండుటవలనగాని సగరుని కుమాళ్ళు దేవతలకంటెగూడ మిక్కిలి మహిమగలవా రగుటచేగాని, సాగరమునకు గొప్పదన మియ్యబడినదని గ్రహింపవలెను.

లేక సగరులచే త్రవ్వబడిన సముద్రముకంటె, భిన్నమయిన బ్రహ్మసృష్ట సముద్రమే యిచట సాగరశబ్దముచే బ్రతిపాదింపబడుచున్నది. బ్రహ్మ దేవతలందరి లోను గొప్పవాడు. కనుక బ్రహ్మసృష్ట సముద్రముగూడ గొప్పదనిభావము. ॥ ౨౪ ॥

శ్లో. మహర్షీణాం భృగురహం గిరా మస్మ్యేకమక్షరమ్,
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః, ౨౫ ॥

అ॥ మరీచ్యాది మహర్షులలో భృగువు గొప్పవాడు. ఈతని పాదమునందు శివుని ఫాలమునందలి నేత్రముయొక్క మహిమనుగూడ దిరస్కరించు నేత్రముగలదు. కావున భృగు వీశ్వరరూపుడు. లేక త్రిలోకజననియగు లక్ష్మి యీతనివలన బుట్టిన

దను గాథ కలదు. కాన యిందునగూడ గొప్పవా డనదగును. పదములలో నేకాక్షర పరమగు ప్రణవము నేను. (గీర్య_న్తే-ఉచ్యంతే) అను వ్యుత్ప_త్తివలన గీశ్శబ్దము పదవాచకమగును. ఓంకారము బ్రహ్మప్రతీకము, బ్రహ్మవాచకము నగుటవలన ప్రశ_స్తమని భావము. ద్రవ్యయజ్ఞాదులలో నేను ప్రణవజపాది లక్షణమయిన యజ్ఞరూపుడను. ద్రవ్యయజ్ఞములకంటె నీయది చిత్తశుద్ధికి నంతరంగమయిన హేతువుకాన జపయజ్ఞము గొప్ప దగుచున్నది. శిఖరములేని పర్వతములలో నేను హిమాలయ పర్వతమును. ॥ ౨౫ ॥

శ్లో॥ అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీణాంచ నారదః,
గంధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః. ॥ ౨౬ ॥

అ॥ సర్వవృక్షములలో నేను అశ్వత్థవృక్షము, ఈయది మూల, మధ్య, అగ్ర భాగములచే బ్రహ్మవిష్ణుశివరూపముకాన నియ్యది గొప్పదగుచున్నది. దేవఋషులలో నేను నారదుడను. దేవతలయి అందు మంత్రద్రష్టలగువారు దేవర్షులు. గంధర్వులలో చిత్రరథుడను. గంధర్వుడను. సిద్ధులలో కపిలమహామునిని. ॥ ౨౬ ॥

శ్లో॥ ఉచ్చై(శ్రవ సమశ్వానాం విద్ధి మా మమృతోద్భవమ్
ఐరావతం గజేన్ద్రాణాం నరాణాంచ నరాధిపమ్. ॥ ౨౭ ॥

అ॥ అమృతముకొరకు మథించునపుడు పాలసముద్రమునబుట్టి యింద్రునకు వాహనమయిన నుచ్చైశ్శ్రవమను గుఱ్ఱము నాస్వరూపము. అట్లే అమృతమథన సమయమున బుట్టిన నైరావతమను నేనుగుగూడ నామరూపము. ॥ ౨౭ ॥

శ్లో॥ ఆయుధానా మహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్
ప్రజనశ్చాస్మి కన్దర్ప స్సర్పాణా మస్మి వాసుకిః. ॥ ౨౮ ॥

అ॥ ఖడ్గాద్యాయుధములలో దధీచిమహర్షియొక్క యెముకలవలన బుట్టిన వజ్రాయుధము నారూపము. దధీచియొక్క తపస్సునకు సారభూతముగనుక నీయది గొప్పదని భావము. గోవులలో, కోరిన కోర్కెల నిచ్చెడి కామధేనువు నేను. విశ్వామిత్రులకు, వసిష్ఠునకు కలహము తటస్థించినపుడు, విశ్వామిత్రుని సైన్యమును జంపుటకు వసిష్ఠుని కామధేనువు మ్లేచ్ఛసైన్యమును బుట్టించినది. కాన, కామధేనువు యొక్క సామర్థ్యము లోకప్రసిద్ధము - తపస్సు మున్నగువాటిచే ప్రజలను సృష్టించు దక్షాది ప్రజాపతులకంటె, మైథున కర్మద్వారమున ప్రజలను బుట్టించు మన్మథుడు గొప్పవాడు. నిష్కామునకు మైథునము సంభవించదు. కామము మన్మథాధీనము. మైథునమువలన ప్రజావృద్ధి కలుగును. కాన మన్మథుడు గొప్పవాడని భావము. అట్టి మన్మథుడు నారూపుడు. ఇదేయర్థమును శంకరులు "ప్రజనయితా" అను పదముచే భాష్యమునందు సూచించిరి. కాక సృష్టిహేతువులయిన అవిద్యా కామ కర్మాదులలో కందర్పుడు శ్రేష్ఠుడు. ఈశ్వరసంకల్పమే కామము. అయ్యది సృష్టికి

ప్రధాన కారణము. "తదైక్షత బహుస్యామ్ ప్రజాయేయ"అను శ్రుతి సృష్టిసంకల్ప పూర్వకమని చెప్పుచున్నది. సృష్టికి కందర్పుడు ప్రకృష్టహేతువు (ప్రబలకారణము) గనుకనే మూలమున కందర్ప శబ్దమునకు "ప్రజనః" అను పదము విశేషణ మొనర్ప బడినది. లేక (ప్రకర్షేణ జనయతి) అను వ్యుత్పత్తిచే కామము లన్నిటిలోను పుత్రో త్పత్తికొరకయిన కామము నారూపము అని చెప్పవచ్చును. లేక సుందరమయిన వస్తువులలో కందర్పుడను నేను అని యయినను జెప్పవచ్చును. ఈ పక్షమున "సుందరాణామ్" అను పదమును మూలమునం దధ్యాహారము జేయవలయును. ఒంటి తలగల సర్పములలో వాసుకియను సర్పము నేను. ॥ ౨౮ ॥

శ్లో. అనన్తశ్చాస్మి నాగానాం వరుణ యాదసా మహమ్
పితౄణ మర్యమా చాస్మి యమస్సంయమతా మహమ్. ॥ ౨౯ ॥

అ॥ అనేక తలలుగల సర్పములలో అనంతుడు నారూపుడు. ఇచట శ్రీధరా చార్యులవారు "విషరహితమయిన సర్పములలో" అని వ్యాఖ్యానించిరి. ఆదిశేషుడు సహస్ర శిరస్సులు (అనేక తలలు) గలవాడగుటచే నాగవిశేషములలో చేరును. అందువలన గొప్పవాడు నగును. జలజంతువులలో వరుణుడు గొప్పవాడు. వరుణుడు నీటిలో నుండుటచే జలజంతువగును. అట్టి వరుణుడు నాదు రూపుడు. మరియు నీవరుణుడు ఉదకాభిమాని. దేవతలగు గంగా కృష్ణాదులకు ప్రభువు. నదీపతియగు సముద్రమునకు ప్రభువయిన వరుణుడు గంగా కృష్ణా యమునాది నదులకు గూడ ప్రభువగును. కాని మూలమునందలి యాదశ్శబ్దము మత్స్యాది జలజంతువులను జెప్పునుగాని దేవజాతిలో చేరిన వరుణుడని చెప్పదు. అయినను లక్షణచే జలములో నున్న ప్రాణులను జెప్పునని గ్రహింపవలెను.

అట్లె అగ్నిష్వాత్తాది పితృదేవతలలో అర్యము డను పితృదేవతను, శిక్షించు వారలలో యముడను. ॥ ౨౯ ॥

శ్లో. ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతా మహమ్
మృగాణాంచ మృగేంద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్. ॥ ౩౦ ॥

అ॥ దితివంశమున బుట్టిన రాక్షసులలో ప్రహ్లాదుడను. లెక్కించువారలలో కాలస్వరూపుడను. మృగములలో సింహమును. పక్షులలో గరుత్మంతుడను. ॥ ౩౦ ॥

శ్లో. పవనః పవతామస్మి రామశ్శస్త్రభృతా మహమ్
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసా మస్మి జాహ్నవీ. ॥ ౩౧ ॥

అ॥ జగత్తును పావనముచేయు నీరు, నిప్పు మున్నగువానిలో వాయువు గొప్పవాడు. వాయువు ఆకాశమునం దంతటను సంచరించును గాన సర్వవ్యాపి కావున సర్వపావనుడు. అట్టి వాయువును నేను. శస్త్రమును ధరించువారలలో దశరథపుత్రు డగు రాముడును నేను. ఇచట రామశబ్దముచే బలరామ, పరశురాములు గ్రహింప

దగరు. దశరథరాముడు క్షణకాలములో ఏడు తాటిచెట్లను, పర్వతభూభాగముల నొకేమారు భేదించెను. సర్వక్షత్రియులను హననమొనర్చిన పరశురాముని జయించెను. రామబాణ మమోఘము. కావున బలరామ పరశురాములకంటెగూడ దశరథ రాముడే గొప్పవాడు. శస్త్రధారులనగా చేత శస్త్రమునుబూని యుద్ధమునుజేయు వీరపురుషులు. వారు భీష్మ ద్రోణ అశ్వత్థామ కర్ణార్జున రావణ కుంభకర్ణాదులు. రాముడుగూడ శస్త్రధారియేకాన నందు జేర్చబడమయినది. శస్త్రమును ధరించుట యనునది జాతి. రాముడు వ్యక్తి అని భేదమును గ్రహింపవలెను. కాన నిచట రాముడే యీశ్వరవిభూతిగాని శస్త్రధారు లీశ్వరవిభూతులు గారు. శస్త్రధారులు వృక్షాది స్థానీయులు. రాము డశ్వత్థ స్థానీయుడు. ఆయా జాతిలో గొప్ప పదార్థమే యీశ్వరవిభూతి. అట్లే మొదటినుంచి ప్రారంభమయినది.

అయితే రాముడు సాక్షాత్ భగవంతుడుకదా! భగవద్విభూతి యెట్లగును? అని ప్రశ్నింపరాదు. దశరథమహారాజువలన బుట్టిన కార్యకరణసంఘాతాత్మకమగు దేహమునందు స్ఫురించు (ప్రకాశించు) చిన్మయుడు సాక్షాద్భగవంతు డయినను, జడమయిన కార్యకరణసంఘాతము మాత్రము కార్యముకనుక భగవద్రూపము కాదు. భగవంతుడగు పరమాత్మయందు మాయచే దేవాదిసంఘాతములవలె, కార్యకరణ సంఘాతముగూడ కల్పితము. భూతశబ్దవాచ్యమయిన నట్టి శరీరేంద్రియ సంఘాత రూపమయిన ప్రాణియే యిచట దశరథరాముడుగ జెప్పబడెను. ఇట్టి రాముడు భగవంతునియందు గల్పితుడుకాన భగవద్విభూతి యగును. ఇంతియేకాని యిచట కేవల చిన్మయుడు రాముడని వివక్షింపబడలేదు. ఏలయన, కేవల చిన్మయుడు శస్త్రధారి గాజాలడు. శస్త్రధారులు ప్రాణులే యగుదురు. ప్రాణులయొక్క చేతులచే ధరింపదగినవి శస్త్రములు. కావున నిచట కేవల చిన్మయుడగు భగవంతుని యొక్క ప్రసక్తి లేదని గ్రహింపవలయును.

రా మా ను జ మ త ము

ఇచట రామానుజులు, "శస్త్రభృత్త్వం విభూతిః అర్థాంతరాభావాత్" (మరియొక యర్థములేనందున నిచట శస్త్రములను ధరించుటయే విభూతి) అని తమ భాష్యమున నుదహరించిరి. వేదాన్తదేశికులు "అచిద్విశేషస్య చేతనాన్తరస్యవా శస్త్రభృచ్ఛబ్దవాచ్యస్య అత్ర అసంభవాత్" "శస్త్రభృత్" అను శబ్దమునకు "అచేతనముకాని, మరియొక చేతనముకాని యర్థమును జెప్పుటకు వలనుపడనందున" అని వ్యాఖ్యాన మొనర్చిరి. ఇదియంతయు నసంగతము.

శరీరాభిమానము కలవాడును, దేహేంద్రియసంఘాతాత్మకమయిన ప్రాణి యును చిన్మయుడగు నాత్మకంటె వేరగు ప్రమాత శస్త్రభృచ్ఛబ్దమున కర్థమును జెప్పుట వలనుపడును.

అచిద్విశేషమగు శ్రీరామదేహమునకు శస్త్రములతో సాక్షాత్ సంబంధము కలదు. శరీరద్వారమున చిదాభాసునకును శస్త్రసంబంధము కలదు. కాన దేహరూపమయిన నచేతనపదార్థముకాని, చిదాభాసరూపమయిన చేతనపదార్థముకాని శస్త్రభృచ్ఛబ్దమున కర్థమగుచుండ శస్త్రభృచ్ఛబ్దమునకు మరియొక యర్థములేదని రామానుజులు వ్రాయుట, దానిని దేశికులు సమర్థించుట యనుచితము.

కాని, మనబోటివారల శరీరమునందున్న చిదాభాసుడు జీవుడనియు, రామకృష్ణాది శరీరములయందున్న చిదాభాసు డీశ్వరుడనియును భేదమును గ్రహింపవలయును.

చిదాభాసుడు సంసారియనియు, నీశ్వరునకు సంసారసంబంధము లేదనియు, గావున నీశ్వరుడు చిదాభాసుడని వ్యవహరింప దగడని యనదగదు.

"జీవేశ్వరౌ ఆభాసేన కరోతి" (చిదాభాసముచేతనే జీవేశ్వరు లేర్పడుచున్నారు) అని శ్రుతియే జీవునివలె నీశ్వరుడుగూడ చిదాభాసుడని చెప్పుచున్నది. మాయయందలి చిత్ప్రతిబింబము యీశ్వరు డనబడును. ప్రతిబింబమనగా ఆభాసమే యగును. చిదాభాసుడగు నీశ్వరునకు సర్వజ్ఞత్వము, ఆత్మస్వరూపజ్ఞానము యున్నందున సంసారసంబంధము లేదు. అట్లే జ్ఞానియగు జీవునకుగూడ సంసారిత్వము లేదు.

కావున మాయికమగుటచే రామావతారము విభూతియగునుకాని భగవంతుడు విభూతి కానేరడు.

ఇట్లగుచో రాముడు పరమాత్మ యను నధ్యాత్మరామాయణాది గ్రంథవ్యవహారమునకు విరోధము వాటిల్లునుగదా యని యనరాదు. అచట రామశబ్దముచే చిన్మయుడుమాత్రమే గ్రహింపబడుచున్నాడు. ఇచ్చటగూడ రామశబ్దమున కదే యర్థమును జెప్పగూడదా యని శంకింపదగదు. "శస్త్రభృత్" అను పదసంబంధము వలన నిచట చిన్మయుడను నర్థము చెప్పవలనుపడదు. దేహసంబంధముగల చిదాభాసుడనియే చెప్పవలయును. కేవల చిన్మయుడు వస్త్రములను గ్రహింపజాలడు. అందుకు దేహసంబంధ మవసరము.

మరియు రామానుజులు తమ భాష్యమునందు క్షేత్రజ్ఞులగు నాదిత్యాదులు యీశ్వరశరీరు లగుటచే శస్త్రభృత్థానీయులనియు, రాముడుమాత్రము స్వయముగ నీశ్వరుడనియును జెప్పిరి. అదియును పొసగదు.

ఇచట ప్రకరణమునుబట్టి శస్త్రధారులగు జీవులలో గొప్పవాడగు జీవునే భగవద్విభూతియని చెప్పవలయునుగాని, ఈశ్వరుడు భగవద్విభూతియని చెప్పదగదు. అయ్యది ప్రకరణవిరుద్ధమగును.

అట్లే జలజంతువులలో మకరమును, నదులలో విష్ణుపాదములనుండి పుట్టిన గంగను. ॥ ౩౧ ॥

శ్లో॥ సర్గాణామాదిరంతశ్చ మధ్యంచైవాహ మర్జున,
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతా మహమ్. ॥ 32 ॥

అ॥ క్రియలలో సృష్టి, స్థితి (పరిపాలన) సంహారక్రియలు నా విభూతులు. వేదవేదాంగవిద్యలలో మోక్షార్థమగు నధ్యాత్మవిద్య నా విభూతి; ప్రవక్తృధర్మము లగు వాదజల్పవితండములలో వాదము నా విభూతి.

రా మా ను జ మ త ము

ఇచట "సర్గాణామ్" అను పదమునకు సృష్టిస్థిత్యాదులకు గారణు లను నర్థమును జెప్పి వారలలో సృష్టికర్తను, పరిపాలనకర్తను, సంహారకర్తను నేనని రామానుజులు వ్యాఖ్యానించిరి.

అది సరికాదు. వారి వ్యాఖ్యానమున నిర్ధారణ యనునది లభించదు.

ఇక ప్రాణులలో నేను స్రష్టృత్వాది ధర్మములు కలవాడనని చెప్పినచో నిర్ధారణ సంభవించునని యనరాదు. స్రష్టృత్వాది ధర్మములలో నేదియో యొక ధర్మము లేనిప్రాణియే యుండదు. తృణాదులుగూడ పురుగుల బుట్టించుచున్నవి. పశువుల బాలించుచున్నవి. సంహరించుచున్నవి. మరియు నిచట "ఆదిర్మధ్యం అంతః" అని యున్న పదములకు పాలక నాశకాది యర్థములయందు లక్షణ యంగీకరించవలయును. ముఖ్యార్థమునకు బాధలేనపుడు లక్షణ యంగీకరించుట న్యాయము కాదు.

ఇక (సర్గాణాం) ప్రాణులయొక్క సృష్టిస్థితిలయములకు (ఆదిః) నేనే కారణుడను, అని శ్లోకార్థమును వర్ణించినచో నందు నిర్ధారణార్థము లభింపదు. కాక, నీయర్థమింతకు మున్నే జెప్పబడినందున పునరుక్తిదోషమున్ను సంభవించును.

పూర్వము "అహ మాదిర్హి దేవానాం" అను రెండవ శ్లోక తృతీయపాదమున జీవావిష్టులగు భూతములయొక్క యుత్పత్తి ప్రళయములు చెప్పబడినవనియు, నిచట సృష్టిమాత్రమునకు ననగా : గగనాది సర్వపదార్థములకు దాను కారణుడనని శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడనియు, నిట్లె భాష్యకారులగు శంకరులుగూడ నీ రెండు శ్లోకములకుగల పునరుక్తి దోషములను వారించిరనియును జెప్పినచో నపుడు నిర్ధారణము అవివక్షితమగును. మఱియు స్రష్టృత్వ రక్షకత్వ సంహర్తృత్వములే యిచట విభూతియని చెప్పదగియుండును.

ఇదే శ్లోకమునుండి యచ్చటచ్చట "తేజస్వినా మహమ్" ఇత్యాది శ్లోకములయందు నిర్ధారణ కనిపించనందున ప్రకరణసిద్ధమగు నిర్ధారణకు నిది మొదలుకొని, భంగము వాటిల్లె ననియును గ్రహింపవలయును.

ఇట్లైనచో "నక్షత్రాణాం శశీ" అనుచోట గూడ నిర్ధారణకు భంగము కనిపించుచున్నది గదాయని యనరాదు. అచట నిర్ధారణ కనిపించుచున్నది. గతిలేని చోట్లనే నిర్ధారణకు భంగ మంగీకరింతుము. ప్రకరణభంగము వక్తకు దోషావహము

గదా యనుట పాడిగాదు. సర్వజ్ఞుడగు భగవంతునకు ప్రకరణభంగాది దోషములు కించిత్కరములు. వేదములందుగాని, ఆర్షగ్రంథములందుగాని, ఛందోభంగాదులు దోషములని విద్వాంసులు గ్రహించుచుండిరా ? కావున ఆర్షగ్రంథమగు దీనియందు ప్రకరణభంగము దోషమని పాటింపదగదు.

లేక "ఆదిత్యానా మహం విష్ణుః" అను శ్లోకము మొదలు "స్రోతసామస్మి జాహ్నవీ" అను ముప్పదియొకటవ శ్లోకపర్యంతమే నిర్ధారణ షష్ఠీప్రకరణమనియు, ముప్పదిరెండవ శ్లోకము మొదలు శేషషష్ఠీ ప్రకరణము ప్రారంభింప బడెననియు, నిర్ధారణ షష్ఠివలె శేషషష్ఠిని ప్రయోగించినను ప్రకరణభంగదోషము లేదని సమాధాన పరచుకొనవచ్చును.

లేక విష్ణ్వాదులు నా విభూతులని చెప్పుటయందే భగవంతుడగు శ్రీకృష్ణునకు దాత్పర్యము. ఆదిత్యాదులలో విష్ణ్వాదులు గొప్పవారని చెప్పుటయందు భగవంతునకు దాత్పర్యము లేదు. ఆదిత్యాదులలో విష్ణ్వాదులు గొప్పవారని శ్రీకృష్ణుడు చెప్పుట స్వరూపకథనముగాని మఱియొకటి గాదు. ఇట్లగుచో "నక్షత్రాణా మధిపతి శ్శశి అహమ్" (నక్షత్రములకు నధిపతియగు చంద్రుడను నేను) అని మీరు వ్యాఖ్యానించుట తగదుగదా అని యనరాదు. నిజమే, చంద్రునకు నక్షత్రములలో గొప్పదనముకూడ నచట సిద్ధింపదు.

ఇట్లగుచో "సర్గాణా మాదిరంతశ్చ" అను శ్లోకమునం దెవ్విధమగు విభూతియు లేనట్లే కదా. కాదు, సృష్టి స్థితి లయహేతువగు నీశ్వరుడు నట విభూతి యని చెప్పబడినది. జీవునివలె నీశ్వరుడుగూడ పరమాత్మయందు మాయచే గల్పింప బడినందున నీశ్వరుడు పరమాత్మయొక్క విభూతి యగుట పొసగును.

ప్రారంభింపబడిన నిర్ధారణషష్ఠీప్రకరణము పరిత్యజింపదగదని పట్టుదల యున్నచో "సర్గాణాం భూతానాం మధ్యే" (భూతములలో) సృష్టి స్థితి లయములకు కారణమగు నీశ్వరు డను ప్రాణిని నేనను నర్థము ప్రాప్తించును. అపుడు "అహమాదిశ్చ మధ్యంచ భూతానా మంతఏవచ" అను నిరువదవ శ్లోకమును గూడ నిర్ధారణ షష్ఠీ ప్రకరణమున జేర్చుకొనినచో పునరుక్తి సంభవించును. దానిని పరిహరించుకొనుటకు భూతశబ్దమునకు జీవసహిత ప్రాణు లర్థమనియు, ఈశ్లోకమందలి సర్గశబ్దమునకు సజీవ నిర్జీవరూపమగు కార్యమాత్ర మర్థమనియును జెప్పవలయును. అపుడు ప్రాణులలో నీశ్వరు డను ప్రాణిని నేను, కార్యములలో నీశ్వరుడగు కార్యమును నేను, అని యర్థము లభించును. "జీవేశౌ ఆభాసేన కరోతి" అను శ్రుతి యీశ్వరుడుగూడ కార్యమని చెప్పుచున్నందున నందు వివాదపడ దగదు.

ఇప్పటికిని యీశ్వరుడు రెండుమారులు నిర్ధారణ చేయబడినందువలన పునరుక్తిదోషము తదవస్థయేగదా? కాదు, నిర్ధారణజేయబడుచున్న నీశ్వరుడొక్కడైనను,

నిర్ధారణాశ్రయములగు భూతములు (సజీవప్రాణులు) నిర్ధారణాశ్రయములగు నిర్జీవ కార్యములును పరస్పరము వేరైనందున పునరుక్తిదోషము లేదు.

లేక, ప్రాణులలో హిరణ్యగర్భుడు అను నీశ్వరుడు గొప్పవాడు. భూతములలో మాయా ప్రతిబింబుడగు నీశ్వరుడు గొప్పవాడు, అనియును నిర్ధార్యమాణులకు భేదము చెప్పనగును. వస్తుస్థితిలో నర్జునుడు భగవద్విభూతిని భగవన్మాహాత్మ్య రూప యోగమును దెలిసికొన కోరినందున శ్రీకృష్ణుడుగూడ విభూతిని చెప్పునపుడు యోగమును గూడ జెప్పెనని రహస్యమును గ్రహింపవలయును. కావున "అహమాదిశ్చ" అను శ్లోకమువలె "సర్గాణా మాదిరంతశ్చ" అను శ్లోకమున్ను భగవన్మాహాత్మ్య ప్రదర్శనపరమే యగుచున్నది. విభూతి శ్లోకములయందు నిర్ధారణ షష్ఠి ప్రారంభింపబడిన గాని, మాహాత్మ్య ప్రదర్శన ప్రకరణమున నిర్ధారణ షష్ఠి ప్రస్తుతింపబడలేదు. కాన "సర్గాణామాదిః" అనుచోట నిర్ధారణ షష్ఠి కాదు, "నక్షత్రాణామహం శశీ" అనుచోట శేషషష్ఠియు గాదు.

ఇందు పునరుక్తిదోషము మఱియు పలువిధముల నాశంకించి పరిహరింపబడినది. గ్రంథవిస్తరభీతిచే నిచట ననువదింపదలచలేదు. అవసరమగుచో మూలగ్రంథమున దిలకింపుడు.

వేదవేదాంగాది విద్యలలో మోక్షప్రదమగు నాత్మవిద్య నేను. ప్రవక్తలకు ప్రధానభూతమగు వాదము నా స్వరూపము. ప్రమాణఫలతత్త్వమును దెలిసికొన గోరినవారియొక్క కథ వాదమనబడును. ఒండొరులను జయింపదలచినవారికథ జల్పమనబడును. స్వపక్షమును స్థాపించుకొనలేక, పరపక్షమును ఖండించుటయే ప్రధానముగా గల కథ వితండవాద మనబడును. ఒక యభిప్రాయముతో ప్రయోగింపబడిన దానిని అభిప్రాయాంతరముచే దూషించుట ఛలము. చెడుసమాధానము (అసదుత్తరము) జాతి. ॥ 32 ॥

శ్లో॥ అక్షరాణా మకారోస్మి, ద్వంద్వస్సామాసికస్యచ,
అహమేవాక్షయఃకాలో, ధాతాఽహం విశ్వతోముఖః. ॥ 33 ॥

అ॥ అచ్చులు హల్లులు అను నక్షరములలో అకారము గొప్పది. అయ్యది సర్వవర్ణములకు మొదటిది. ప్రణవమునకు మొదటి యవయవము. "అకారో వై సర్వావాక్" అను శ్రుతిప్రమాణమును బట్టి అకారము సర్వవర్ణములకు ప్రకృతియు నగుచున్నది. కాన నియ్యది నారూపము. సమాస సంఘములో ద్వంద్వసమాసము ఉభయపదార్థ ప్రధానమగుట వలన శ్రేష్ఠమగును. అయ్యది నా రూపము. అవ్యయీభావ సమాసము పూర్వపదార్థము ప్రధానముగా గలది. ఉత్తర పదార్థము ప్రధానముగాగలది తత్పురుష. అన్యపదార్థము ప్రధానముగా గలది బహువ్రీహి. ఉభయ పదార్థప్రధానముగా గలది ద్వంద్వము అని యిట్లు తరచుగా వాదముగలదు. కావున ద్వంద్వసమాసము భగవద్విభూతి యగుచున్నది.

నిత్యానిత్యములగు కాలద్వయములో నిత్యమగు కాలమును నేను. బ్రహ్మలలో చతుర్ముఖుడగు హిరణ్యగర్భుడను నేను. ఈ రెండు వాక్యములయందును, నిర్ధారణ రూపమగు షష్ఠి లేనందున భగవన్మాహాత్మ్యపరములనిగూడ నీయవి గ్రహింప నగును.

॥ 33 ॥

శ్లో॥ మృత్యుస్సర్వహరశ్చాహ ముద్భవశ్చ భవిష్యతాం,
కీర్తి శ్శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా. ॥ 34 ॥

అ॥ మృత్యువు ధనాదులను హరించునది, ప్రాణమును హరించునది యని రెండు విధములు. అందు ప్రాణహరణ రూపమగు మృత్యువు నే నగుచున్నాను.

లేక, ప్రపంచమున సర్వప్రాణులయొక్క జీవితము హరించునట్టి యము డొక మృత్యుదేవత యనియు, ప్రళయమునందు సర్వజగత్తును నశింప జేయునట్టి యీశ్వరుడు మఱియొక మృత్యుదేవత యనియు ప్రతీతి గలదు. వారిరువురిలో సర్వ ప్రపంచహరుడగు యీశ్వరు డను మృత్యుదేవత నేను. లేక, యిచట నీశ్వరశబ్దము నకు మాయా తమోగుణావచ్ఛిన్నుడగు రుద్రుడనిగూడ జెప్పవచ్చును. దానివలన రుద్రుడు యీశ్వరవిభూతియని సిద్ధించును. బ్రహ్మ విష్ణు రుద్రులు ముప్పురు పరమేశ్వరుడగు బ్రహ్మయందు కల్పింపబడుటచే నదియును పొసగును.

లేక, మాయావచ్ఛిన్న చైతన్యలక్షణుడగు నొకే యీశ్వరుడు పుట్టించుట, పాలించుట, సంహరించుట యను గుణసంబంధమువలన బ్రహ్మ విష్ణు రుద్ర శబ్దములచే జెప్పబడుచున్నాడు. అందు సంహరింప జేయుటయను గుణసంబంధముగల పరమేశ్వరుడను నేను. సగుణేశ్వరుడు నిర్గుణబ్రహ్మకు విభూతియగుట పొసగును.

రా మా ను జ మ త ము

ఇచట వేదాంతదేశికులు యమునియొక్క యాజ్ఞను నెరవేర్చుచు, ప్రాణహరణాధికారమందున్న నొకానొక పురుషుడు మృత్యువని మృత్యుశబ్దార్థము నిర్వచించిరి.

అది యనుచితము. అట్టి ప్రమాణ మెచ్చటను కన్పించదు. యమదూత లనేకులు కలరు. అం దెవ్వడు మృత్యు వనునది నిర్ణయింప నలవిగాదు. మృత్యుదేవత ప్రత్యేకమగురు కాని, యమదూతలలో చేరదనినచో, నయ్యది భగవదాజ్ఞాపరతంత్ర మగునుగాని యముని యాజ్ఞను నెరవేర్చునట్టిది గాదు.

ఓయీ ! " భూతానా మంతఏవచ " అను నిరువదవ శ్లోకమున ప్రపంచనాశమునకు కారణుడగు నీశ్వరుడు చెప్పబడుటవలన నిచట మరల యదే యర్థమును జెప్పినచో పునరుక్త దోషము వాటిల్లునుగదా ? లేదు; వినుము. ఇరువదవ శ్లోకమున లయస్థానము మాత్రమే జెప్పబడినది. కాక, నయ్యది భగవన్మాహాత్మ్య కథనపరము కాని విభూతి ప్రదర్శనపరము కాదు.

ఐతే, "సర్గాణా మాదిరంతశ్చ" అను శ్లోకార్థముతో పునరుక్తమగునుగదా యనుటయు నుచితము గాదు. అచట సృష్టి స్థితి లయముల మూటికి గారణమగు నీశ్వరుడు నిర్ధారణ చేయబడెను. ఈ శ్లోకమున కేవల లయహేతువగు నీశ్వరుడు మాత్రమే నిర్వచింపబడెను. కాన నిందు బునరుక్తము లేదు.

ఇక యీశ్వరుడనగా మూడునేత్రములుగల రుద్రుడని వ్యాఖ్యాన మొనర్చినచో పునరుక్తిదోషమునకు దావే లేదు. మధుసూదనుడుమాత్ర మిచట సంహర్తలగు వారిలో సర్వసంహర్త యగు మృత్యువు 'నేను' అని వ్యాఖ్యానించెను.

భావికల్యాణములో నభ్యుదయప్రాప్తిహేతువు నాదు రూపము. మృత్యుశబ్ద సాహచర్యమున నిచట యుద్భవ శబ్దమునకు బుట్టుకయే యర్థమని యనదగదు. మృత్యుశబ్దముగూడ నిచట మరణార్థవాచకముగాదు. మరేమనిన సర్వప్రాణహరణ రూపమైన నశుభమునకు కారణమగు మృత్యువునుజెప్పెను. అటువంటి సర్వాభ్యుదయ రూపమైన శుభమునకు గారణమెవ్వడని ప్రశ్న యుదయించుటయు, అట్టివానిని నేనే యని భగవంతుడు నిర్వచించుటయు పూర్వాపర సందర్భమునకు దగిన యర్థ మగుచున్నది.

స్త్రీలలో కీర్తి, లక్ష్మి, వాక్కు, స్మృతి, మేధా, ధృతి, క్షమా యను నుత్తమ స్త్రీలు నేనగుచున్నాను. వీరందఱు ధర్మమను పురుషునకు భార్యలు. వారు వారు ఆయా గుణముం దభిమానముగల దేవతలు. అందు, కీర్తియనగా ఖ్యాతి. శ్రీయనగా సంపద, వాక్కు యన విద్య. స్మృతి యన తలపు. మేధ యన గ్రంథమును ధరించునట్టి బుద్ధిగత సామర్థ్యము. ధృతి యన ధైర్యము. క్షమ యన మానావమానములయందు చిత్తము వికారము నొందకుండుట. ఇవి యన్నియు లేశమాత్రముగా నున్నను లోకము (అజ్ఞానియగు జీవులు), నాయంతటివారు లేరని విఱ్ఱవీగుదురు. స్త్రీలు, పురుషులు ధనాదులచే తామే కృతార్థులమని తలంతురు. విద్వాంసులుమాత్రము ధనాదులచే కృతార్థులమని తలచరు. వారు ఆత్మజ్ఞానముచే కృతార్థుల మగుదమను నిర్ణయముతోనే యుందురు. ॥ 34 ॥

శ్లో॥ బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసామహమ్,
మాసానాం మార్గశీర్షోఽహ మృతూనాం కుసుమాకరః. ॥ 35 ॥

అ॥ సామములలో బృహత్సామమను పేరుగల సామము నే నగుచున్నాను. "త్వామిద్ధి హవామహే" అను ఋక్కునందు గానముచేయబడు సామము బృహత్సామ మనబడును. ఉష్ణిక్, అనుష్టుప్, త్రిష్టుప్ మున్నగు ఛందస్సులలో గొప్పదగు గాయత్రీఛందస్సు నాదురూపము. అనగా : ఛందో విశిష్టములగు ఋక్కులలో గాయత్రీఛందస్సుతో గూడినఋక్కు భగవద్విభూతియని భావము. పాదబద్ధమగు వేద భాగము ఋక్కనబడుచున్నది. గాయత్రీ ఛందస్సునం దొక్కొక పాదమున కారేసి

అక్షరము లుండును. ఉ:- మారాయుధభూతా, బాలాశఫరాక్షీ, కాంతంహారిమాగా, లక్ష్మీ ర్మస్తనుమధ్యా- ఇత్యాదులు. ఇట్లు ఆరేసి యక్షరములుగల నాల్గుపాదములతో గూర్చబడిన ఋక్కు గాయత్రీఛందో విశిష్టమగును.

ఓయీ! లోకమునందువలె వేదమునందుగూడ ఆరక్షరములుగల నాల్గుపాద ములు గాయత్రీఛందస్సని సంజ్ఞయున్నచో "తత్సవితుర్వరేణ్యాం" ఇత్యాదిమంత్ర మునం దట్లక్షరపాదవిభాగము లేనందున గాయత్రీమంత్రము గాయత్రీఛందస్కము గాకపోవును. మంత్రశాస్త్రమునందు "తత్సవితుః" అను మంత్రమునకు విశ్వా మిత్రుడు ఋషియనియు, సవిత (సూర్యుడు) దేవతయనియు, గాయత్రి ఛంద స్సనియు ప్రసిద్ధిగలదు. అట్లే "ఉదిత్యం జాతవేదసం" ఇత్యాదిమంత్రములకు గూడ గాయత్రీఛందస్సనునది ప్రసిద్ధము. అట్లే గాయత్రి త్రిపదా (మూడుపాదములుగలది) యని ప్రసిద్ధము. "గాయత్రీ చతుర్వింశత్యక్షరా త్రిపదా షట్కుక్షిః" అని మంత్ర ప్రయోగమున గన్పించుచున్నది. కావున వేదమునందు ఎనిమిదేసి యక్షరములుగల మూడుపాదములతో విరాజిల్లునదే గాయత్రీఛందస్సు. ఇట్టి గాయత్రీఛందోవిశిష్ట మగుటవలననే "తత్సవితుః" అను మంత్రమునకు గాయత్రీమంత్ర మను వ్యవహారము పొసగుచున్నది.

"తత్సవితుర్వరేణ్యాం" అను మొదటిపాదమున ఏడక్షరములే కలవని శంకింప దగదు. "ణ్యామ్" అను తుదియక్షరమును "ణియమ్" అని రెండక్షరములుగా విభజించి పఠించిన సరిపోవును. అట్లే "పరోరజసి సావదోమ్" అని నాల్గవపాదము గూడ గలదనుట పొసగదు. అయ్యది వేరుమంత్రము. దానికి గాయత్రీమంత్రమునందు జేరిక లేదు. కాన గాయత్రీ త్రిపదయనియే యంతట యుపదేశించుట పొసగుచున్నది.

ఇట్లే "ఉదిత్యం జాతవేదసమ్" ఇత్యాది ఋక్కులయందు గూడ నొక్కొక్క ఋక్కు మూడేసిపాదములు కలదిగనే కనుపించుచున్నది. "ఉదిత్యం జాతవేదసం, దేవం వహంతి కేతవః, దృశేవిశ్వాయ సూర్యం" అనున వొకే ఋక్కు. ఇందు మూడు పాదములు మాత్రమే కలవు. "అపత్యేతాయవో యథా" అను నాల్గవ పాదము కలదని యనరాదు. "నవాద్యా గాయత్రీఛందః" అని చెప్పియుండుటచే "ఉదిత్యం జాతవేదసం" అను మంత్రమునందు తొమ్మిది గాయత్రీ ఋక్కులుండ వలయును. ఇరువదియేడు పాదములును కనుపించుచున్నవి. కాన నొక్కొక్క ఋక్కు పాదత్రయాత్మకమై యుండితీరవలయును. కనుక ఎనిమిది యక్షరములు గల్గి మూడు పాదములుగలదే గాయత్రీ ఛందస్సగును.

లోకమునందు మాత్రము ఇరువది నాల్గక్షరములు గల గాయత్రీ ఛందస్సు ఆరేసి యక్షరముల కొక్కొక్క పాదము చొప్పున నాల్గుపాదములు కలదిగా పింగళ మునిచే గల్పింపబడినది. నాల్గుపాదములైనను ఇరువది నాల్గక్షరము లను సంఖ్య యున్నందున గాయత్రీ ఛందస్సనబడుచున్నది. ఇట్లే వేదమునందుగూడ ఇరువది

నాల్గక్షరములు గల ఋక్కును నాల్గుభాగములుగా విభజించి ఆరేసి యక్షరముల కొక్కొక పాదముగా గల్పింపబడుగాక యని యనరాదు. "ఉదుత్యం జాతవేదస" మనుచోట "ఉదుత్యం జాతవే" అని యారక్షరములకు పాదవిభాగము చేయుట శక్యముగాదు. ఒకేపదమునందు యతివిచ్ఛేద ముండదు. అట్లైనచో లోకమునందే గాయత్రీఛందస్సునకు ఎనిమిదేసి యక్షరములుగల మూడుపాదములను గల్పింప గూడదా? అని యనుట యుచితముగాదు. లోకమునందు శ్లోకములు నాల్గుపాద ములు కలవిగనే యుండితీరవలయును. మూడుపాదములతో శ్లోకపూర్తి యసంభవము. కాన గాయత్రీపాదము అష్టాక్షరమే యగుచున్నది.

గాయత్రికి మూడు పాదములును, ఇరువదినాల్గక్షరములును నుండును. అనుష్టుప్ ఛందస్సునకు నాల్గుపాదములు, ముప్పదిరెండక్షరములు నుండును. కాన నీ రెంటికి సాంకర్యములేదు.

కావున త్రిష్టుబాది ఛందస్సులతో గూడిన ఋక్కులలో గాయత్రీ ఛందో బద్ధమైన ఋక్కు గొప్పది. అయ్యది 'తత్సవితుర్వరేణ్యమ్, భర్గోదేవస్యధీమహి, ధియోయోనః ప్రచోదయాత్' అని చూపితిని. ఈ మంత్రమునకు గాయత్రీ దేవ తయు, అదియే ఛందస్సును గాన గాయత్రి యను వ్యవహారము. "ఉదుత్యం జాత వేదసం" ఇత్యాది మంత్రములకు ఛందస్సు గాయత్రియైనను, దేవత వేరగుటచే వాటికి గాయత్రీమంత్రమను వ్యవహారము లేదు.

ఇట్లు గాయత్రీఛందోవిశిష్ట ఋక్కులలో గాయత్రీమంత్రమే గొప్పది గనుకను త్రిష్టుబాది ఛందోవిశిష్ట ఋక్కులలో గూడ గాయత్రీమంత్రమే యుత్త మోత్తమము గనుకను, నిట గాయత్రీశబ్దముచే గాయత్రీమంత్రమే గ్రహింప నర్హము. "న గాయత్ర్యాః పరో మంత్రః" అను ప్రమాణముచే గాయత్రీ మంత్రము ప్రశస్తమని స్పష్టమగు చున్నది.

ఓయీ! ఎవరీ గాయత్రీదేవత? అయ్యది సవితృదేవునియొక్క తేజస్సే. అది వెలుగా ఏమి? కాదు, చైతన్యమే. సూర్యమండలావచ్ఛిన్నమగు చైతన్యము గాయత్రి యని చెప్పబడుచున్నది. సూర్యుడు సర్వసాక్షి గనుక ఈశ్వరుడని ప్రసిద్ధి గలదు. వానిలోపల నుండు చైతన్య మేది కలదో యదియే గాయత్రి యనబడు చున్నది. ఇంతమాత్రమున మనబోటివారల శరీరముతో గూడిన చైతన్యముగాని, కూడని చైతన్యము గాని గాయత్రి కాదను వ్యవహారము లేదు. చిచ్ఛక్తియే గాయత్రి యనదగును. కావున చిద్రూపమగు పరబ్రహ్మయే గాయత్రి. స్త్రీలింగ ప్రయోగమును బట్టి కాళీ, సరస్వతీ మున్నగు శక్తులే గాయత్రీ దేవతలు అని పొరపడ దగదు. నిర్విశేషమగు చైతన్యమునందు ఆత్మ యను పుంలింగశబ్దమును, బ్రహ్మ యను నపుంసకలింగశబ్దమును ప్రయోగించినట్లు గాయత్రీ యను స్త్రీలింగశబ్దమును గూడ ప్రయోగించుట సంభవించును.

ఇట్లు బ్రహ్మపరమగుట వలనను, జీవబ్రహ్మాభేదరూపమగు తత్త్వార్థమును బోధించుటవలనను, గాయత్రీమంత్ర మన్ని మంత్రములలో గొప్పదగుచున్నది.

గాయత్రీ మంత్రార్థము

"ధియోయోనః ప్రచోదయాత్" యః = ఏ యీశ్వరుడు, నః = జీవుల యొక్క, ధియః = బుద్ధులను, ప్రచోదయాత్ = ప్రేరేపించుచున్నాడో. ఈ యర్థము నందు, శ్లో. ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి, భ్రామయ న్సర్వ భూతాని యంత్రారూఢాని మాయయా॥ అను వచనము "యోభూతేషు తిష్ఠన్" ఇత్యాద్యంతర్యామిబ్రాహ్మణమున్ను ప్రమాణమగుచున్నవి.

యచ్ఛబ్దమునుబట్టి తచ్ఛబ్దమును మార్చుకొనవలయును. "తత్సవితు ర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి" తస్య, సవితుః = మాయచే ప్రపంచ సృష్టిస్థితి లయములకు గారణమైన, దేవస్య = ఈశ్వరునియొక్క, వరేణ్యం = స్వరూపభూత మగుటచే గొప్పదగు, భర్గః = చైతన్యమును, (అనగా బ్రహ్మమును అని భావము) ధీమహి = సోహమని ప్రత్యగభిన్నముగా దెలిసికొందుము (ధ్యానింతుము).

ఇట్లు మంత్రములలో నేను గాయత్రీమంత్రమని యర్థము పర్యవసన్నమైనది. కాన గాయత్రీమంత్రముగాని, గాయత్రీ ఛందోవిశిష్టమంత్రములుగాని భగవ ద్విభూతులని సిద్ధించినది.

లేక "అగ్రంవై ఛందసాం గాయత్రీ" అను శ్రుతివలన ఛందస్సులలో గాయత్రీఛందస్సు గొప్పదగుచున్నది. పింగళాచార్యులు "ఉక్తాత్యుక్తా తథా మధ్యా" అని చెప్పియుండుటచే ఉక్తయను ఛందస్సే గొప్పదని యేల ననకూడదు? వినుము, "అగ్నిమీళే పురోహితం" అను ఋక్కుయే అన్ని వేదములలో మొదటిది. ఇయ్యది గాయత్రీఛందోబద్ధ మగుచున్నది. "అగ్నిమీళే" యను మంత్రమునకు అగ్ని దేవతయనియు, గాయత్రీఛందస్సనియును మంత్రపాఠమునందు కనిపించుచున్నది. కావున గాయత్రీఛందస్సెయే గొప్పది. పింగళాచార్యుడు జెప్పిన ఉక్తఛందస్సు గాదు.

ఓయీ! ఇతర ఛందోబద్ధములగు మంత్రములకంటె గాయత్రీఛందోబద్ధము లగు మంత్రములు గొప్పవగుటలో గాయత్రీఛందోబద్ధత్వమేకదా కారణము. అపుడు ఛందస్సులలో గాయత్రీఛందస్సు గొప్పదనికదా తేలిన యర్థము. ఇట్టితరి "గాయత్రీ ఛందసా మహమ్" అను శ్లోకముయొక్క వాచ్యార్థమే గ్రహింపనగును. ఎట్లన? త్రిష్టుబాది ఛందస్సులలో గాయత్రీఛందస్సు నేను అని. ఇట్లే రామానుజులు జెప్పిరి. ఈప్రక్రియను విడచి, శ్రీశంకరులు "గాయత్ర్యాది ఛందోవిశిష్టఋక్కులలో గాయత్రి ఋక్కు నేను" అని గాయత్రీపదమును ఋక్పరముగ లాక్షణికార్థమును గల్పించి ప్రయాసపడుటకు కారణమేమి?

వినుము. పాదాక్షరసంఖ్యావిశేష నియమము ఛ దశ్శబ్దార్థము. తన్మాత్రమునకు గొప్పదనములేదు. ఆ నియమముతోఁ గూడినశబ్దసమూహమునకే గొప్పదనముగలదు. "అగ్నిమీళే పురోహితం" అను నిట్టిమంత్రమే వేదాదియం దుండుట చేతను, అయ్యది గొప్పదగుటవలనను, నీయర్థమునందు శ్రుతిసంవాదముగూడ గలదు. కాన ఛందోమాత్రమునకు గొప్పదనము జెప్పుటకంటె ఛందోవిశిష్టమైన శబ్దసమూహమునకు గొప్పదనమును జెప్పుటయే యుచితమను నాశయముతో నాచార్యపాదులు లాక్షణికార్థప్రయాస నంగీకరించిరి.

వేదము మొదటయున్న "అగ్నిమీళే" యనుమంత్రము గాయత్రీఛందోవిశిష్టమగుటచే గాయత్రీఛందోవిశిష్టఋక్కు గొప్పదని యెట్లుచెప్పిరో? యట్లే వేదాదియందున్న మంత్రమునందు గాయత్రీఛందస్సు యుండుటంబట్టి గాయత్రీఛందస్సు గూడ ఛందస్సులలో గొప్పదని యేల చెప్పరాదు? నిజమే వినుము. ఇట్టి న్యాయ మవలంబించినచో, వేదాదియం దగ్నియుండుటవలన అగ్నియే అన్నిభూతములలో గొప్పదని చెప్పవలసినదేకదా? ఇష్టాపత్తియే యందురా? "దేవానా మస్మి వాసవః" అని గీతలలో శ్రీకృష్ణుడు, దేవతలలో నగ్ని దేవతను గొప్పగాజెప్పక ఇంద్రునేల గొప్పగా జెప్పెను? కాక, మఱియొకచోట వేదమునందే "అగ్నిర్వై దేవానా మవమో విష్ణుః పరమః" అనువాక్యముచే దేవతలలో నగ్ని తక్కువవాడనియు, విష్ణువు గొప్పవాడనియు జెప్పబడినదిగదా? దీని కేమి సమాధానము జెప్పెదరు? కావున పై న్యాయమంతట నవలంబింప వీలుపడదు. అయితే శ్రుతివిరోధముండుటవలన వేదాదియందున్న నగ్ని గొప్పదిగాకున్నను, శ్రుతివిరోధము లేకుండుటచే వేదాద్యమంత్రమునందున్న గాయత్రీఛందస్సు గొప్పదగుగాక, అనినచో నదియును బొసగదు. అగ్నిశబ్దోత్తరమందున్న ద్వితీయావిభక్తిగాని, అగ్నిశబ్దముగాని వేదమునకు మొదట యుండుటచే గొప్పదని చెప్పవలసివచ్చును.

లేక ఛందోమాత్రమునకు గొప్పదన ముండుగాక, అయినను ఏ మంత్రము వలన ఛందోమాత్రమునకు గొప్పదనము ప్రాప్తించినదో, యా మంత్రమే యిచట గొప్పదని లాఘవమున గ్రహింపదగును. తజ్జాతీయములగుటచే నితర మంత్రములు గూడ నట్లే గొప్పవని తెలియవలయును. వస్తుతః ఋక్కుకంటె, ఛందస్సు వేరుగ లేనందున ఋక్సత్తయే ఛందస్సత్త యనవలయును. ఛందస్సునకు స్వతంత్రముగ సత్త లేదు. కాన నిచట స్వతంత్ర సత్తాశాలియగు ఋక్కునే గ్రహించుట యుచితము కనుక నిచట గాయత్రీఛందో విశిష్టమగు ఋక్కే భగవద్విభూతిగాని కేవల గాయత్రీ ఛందస్సు భగవద్విభూతి కాదని సుస్పష్టము.

మార్గశీర్షమాసమునందు సర్వసస్యములు ఫలసంపత్తితో గూడియుండుట వలనను, ఆ మాసము వ్రతాదులకు నుచితకాల మగుటవలనను మాసములలో మార్గశీర్షము గొప్పది. ఇయ్యది భగవద్విభూతి. అట్లే వసంతఋతువు జ్యోతిష్టోమ

యాగమున కుచితకాలమగుట వలనను, పుష్పసమృద్ధి కలదగుటవలనను, ప్రాణులకు సుఖకరమగుటవలనను ఋతువులలో గొప్పదగుచున్నది. కాన నయ్యది భగవద్విభూతి. ॥ 35 ॥

శ్లో. ద్యూతం ఛలయతామస్మి తేజ స్తేజస్వినా మహమ్,
జయోఽస్మి వ్యవసాయోఽస్మి స త్త్వం సత్వవతా మహమ్ ॥ 36 ॥

అ॥ ధనాపహరణము ఫలముగాగల వంచనావిషయములగు (కపటోపాయములగు) క్రయ, విక్రయ, ఋణ, దాయసంవిభాగ, సంగరాదులను ఛలములలో జూదమనునది చాలగొప్పది. ఏలనన:- దుర్యోధనాదు లీ జూదముచే క్షణకాలములో ధర్మరాజాదుల నోడించి, వారల దరిద్రులజేసి, యడవిపాల్పరచి, తాము రాజాధిరాజులైరి. కాన, కపటోపాయములలో జూదము చాల గొప్పది. కనుకనే "అక్షైర్మాదీవ్యేత్" అను శ్రుతి జూదమును నిషేధించుచున్నది. ఇట్టిజూదము భగవద్విభూతి. -తేజోవంతులలో తేజస్సు నేనగుచున్నాను. జయాపజయములలో జయమును నేను, ఉద్యోగానుద్యోగములలో నుద్యోగము (ప్రయత్నము) నేను.

లేక, సామర్థ్యము నాలుగు విధములు. వాక్సామర్థ్యము, శరీరసామర్థ్యము, ఇంద్రియసామర్థ్యము, మనస్సామర్థ్యమని. ఇందు మనస్సామర్థ్యము గొప్పది. అది భగవద్విభూతి.

లేక; సాత్త్విక ధర్మములలో శమదమాది లక్షణమగు సాత్త్వికధర్మము గొప్పది. అయ్యది భగవద్విభూతి.

లేక, సత్త్వరజ స్తమోగుణములలో సాత్త్వికులయొక్క గుణమగు సత్వము గొప్పది. అయ్యది భగవద్విభూతి.

కాన "సత్వం సత్వవతా" మను తురీయపాదమునకు నిట్లే యర్థమును జెప్పవచ్చును. ॥ 36 ॥

శ్లో॥ వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః,
మునీనా మప్యహం వ్యాసః కవీనా ముశనాకవిః. ॥ 37 ॥

అ॥ యాదవులలో వసుదేవకుమారుడ నగు వాసుదేవుడను నేను. పాండవులైదుగురిలో, నిఖిలరాజుల జయించి ద్రవ్యము నార్జించిన ధనంజయుడను (అర్జునుడను); సర్వపదార్థ జ్ఞానముగల మునులలో వ్యాసుడను నేను. వ్యాసులు బ్రహ్మసూత్రములను, అష్టాదశ పురాణములను రచించుటచేతను వేదమును విభజించుటచేతను సర్వజ్ఞు లగుచున్నారు. నారాయణాంశ సంభూతులగుటచేగూడ వ్యాసులు గొప్పవా రనదగును. కవులలో (అనగా:- భూతభవిష్య ద్వృత్తాంతమును దెలిసికొనువారలలో శుక్రుడను నేను. ఈతడు నీతిశాస్త్రాది కర్తయగుటచే గొప్పవాడు. మఱియు, శుక్రుడు విద్వాంసులలో గొప్పవాడని గూడ ప్రసిద్ధిగలదు. ॥ 37 ॥

శ్లో॥ దండో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్,
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్. ॥ 38 ॥

అ॥ వాది ప్రతివాదుల వాక్యశ్రవణము, సాక్షి విచారణము మున్నగు ధర్మము లలో శిక్షణరూపమగు దండము గొప్పది. అది నే నగుచున్నాను. లేక రాజ, గురువు మున్నగువారు భృత్యుడు, శిష్యుడు మున్నగువారలయెడ కనపఱచునట్టి నయ, భయ, దమాది భావములలో దమమను భావము గొప్పది. అది నేను.

ఇచట నిర్ధారణ షష్ఠి యంగీకరింపవలయు నను నభినివేశము లేనిచో, శిక్షించు వారల కుండెడి ప్రధానమగు దండము నేనగుచున్నాను- అని యర్థము జెప్పవచ్చును.

ఇట్లే, జయశీలుల కుండెడి శౌర్య ధైర్యాదిగుణములలో ప్రధానమైన నీతి యను గుణము నేను.

దాచదగిన ధన కనక యౌషధాదివస్తువులను దాచుటకు సాధనములైన వస్త్రము, పెట్టె మున్నగువానిలో మౌన మనునది గొప్పది. అయ్యది నేను. మౌనము లేకున్నచో వస్త్రాదులచే దాచబడిన వస్తువు ఆ గుడ్డముడిలో వున్నదని, యా గోప్యవస్తువును బయల్పరచుట సంభవించును. కావున పేటికాదులచే దాచశక్యము గాని రహస్యవస్తువునుగూడ వాఙ్మౌనముచే దాచుటకు వీలగును. కావున మౌనము గోపన పదార్థములలో గొప్పదని భావము.

అట్లే జ్ఞానవంతుల కుండెడి జ్ఞాన, శమ, దమ, సుఖాది గుణములలో జ్ఞానము గొప్పది. అయ్యది నేనగుచున్నాను. ॥ 38 ॥

శ్లో॥ యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున,
నతదస్తి వినా యత్స్యా న్మయా భూతం చరాచరమ్. ॥ 39 ॥

అ॥ బీజ(కారణ)ములలో సర్వభూతములకు బీజ(కారణ)మగు ప్రకృతిని నేను. దీనిచే ప్రకృతికూడ నీశ్వరవిభూతియని సిద్ధించినది. విత్తనము వృక్షాదులకు గారణ మైనట్లు సూక్ష్మావస్థాపన్నయగు ప్రకృతి, స్థూలావస్థయగు ప్రపంచమునకు గారణ మగును.

ఇట్లు భగవద్విభూతుల గొన్నిటిని జెప్పి, ఇకముందు సంక్షేపముగా జెప్పుచున్నాడు.

సచ్చిదానంద రూపుడను, సర్వవ్యాపిని, సమస్త ప్రపంచమునకు నాత్మభూతు డను అగు నన్ను విడచి జంగమస్థావర ప్రపంచములో నే వస్తువును లేదు. కావున ప్రపంచమంతయు నా స్వరూపముతోనే నిండి, నిబిడీకృతమై యున్నదని భావము.

ఎట్లన, కల్పిత వస్తువులు అధిష్ఠానరూపములు. కార్యము కారణాత్మకము. ఉదా:- ఘటము మృత్స్వరూపము. సర్పము రజ్జ్వాత్మకము. ఇట్లే ప్రపంచము నీశ్వర స్వరూపమని భావము. ఈశ్వరుడు ప్రపంచమునందు ప్రవేశించనిచో ప్రపంచమునకు

స్వరూపమే లేదు గాన శూన్యత్వ మేర్పడును. మఱియు సచ్చిదానందుడగు నీశ్వరుడు ప్రపంచమునందు బ్రవేశింపనిచో "జగదస్తి" (ప్రపంచము కలదు) "జగద్భాతి" (ప్రపంచము భాసించుచున్నది), "జగత్ప్రియం" (ప్రపంచము ప్రియమైనది) అను వ్యవహారమే సిద్ధించదు. సత్తా ప్రకాశానందము లీశ్వరధర్మములు. ఈశ్వరుడు ప్రపంచమున బ్రవేశించనిచో నాధర్మములు ప్రపంచమునందు సంక్రమించుట యసంభవము. కాన శశశృంగాదికమువలె జగత్తు లేదు. జగత్తు భాసించుటలేదు. ఇత్యాది ప్రతీతులు కలుగవలసివచ్చును. కావున ప్రపంచము శూన్యమే యగును.

ఓయీ! సర్వవ్యాపి యగు నీశ్వరునకు ప్రపంచమునందు ప్రవేశము లేదను నూహ యెట్లు పొడసూపును ?

వినుము. 'ఈశ్వరుడు వేరు' ప్రపంచము వేరు అని వేరు చేయుటయే ప్రపంచమునం దీశ్వరునకు ప్రవేశము లేకుండుట అని యిచట వివక్షితమైనది. వేరుపరచుట యనగా ప్రపంచమున కనుపించు సత్తాజాడ్యాది ధర్మములను వేరుపరచుటయని భావము. " ఇది యీశ్వరధర్మము ", " ఇది ప్రపంచధర్మము "అనుబుద్ధిచే ప్రపంచము నుండి యీశ్వరధర్మములను వేరుపరచినచో ప్రపంచము అనృతమే యగును. అనృతమగువస్తువు శశశృంగాదులవలె శూన్యమగును. దీనిచే సర్వప్రపంచము ఈశ్వరుని యందు కల్పింపబడుటవలన నీశ్వరవిభూతి యని తేలినది. ॥ ౩౯ ॥

శ్లో॥ నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరన్తప !
ఏషతూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా. ॥ ౪౦ ॥

అ॥ అర్జునా! "నేను ఘటము", "నేను పటము", "నేను రాయి", "నేను మృత్తు", అని యిట్లు నాదు విభూతుల నన్నిటిని నేను జెప్పజాలను. నేను సర్వజ్ఞుడనుగనుక అనంతములగు నాదు విభూతులను నేను తెలియుచున్నాను. కించిజ్ఞులగు మరియితరులు తెలియజాలరు. కావున నేనిపుడు నీకు ప్రధానముగానున్న నాదు విభూతులను మాత్రము సంక్షేపముగా జెప్పితిని. ॥ ౪౦ ॥

శ్లో॥ యద్య ద్విభూతి మత్సత్వం శ్రీమ దూర్జితమేవవా,
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్. ॥ ౪౧ ॥

అ॥ ఓయి అర్జునా! లోకములో సామర్థ్యముకలదికాని, శోభాయుక్తమయి నదికాని, ఉత్సాహముకలదికాని, యేవస్తువుకలదో అదియంతయు జ్ఞానరూపమగు నాయొక్క తేజస్సులో నేకదేశమువలన బుట్టినదని గ్రహింపుము.

ఓయీ ! 'శ్లో॥ మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః,' అని యింతకు ముందే చెప్పియుండుటచే సమస్త పదార్థములు యీశ్వరాంశ సంభూతములని యింతకుమున్నే సిద్ధించినది. అయ్యది మరల చెప్పనేల ? వినుము. సాధారణప్రాణుల (సామాన్యజీవుల) యందు, ఈశ్వరునియొక్క సర్వజ్ఞత్వములోని భాగము కనిపిం

చుట లేదు. ఈశ్వర విభూతులగు ప్రాణులయందు మాత్ర మయ్యది కలదు, కనిపించును. కాన నీశ్వరవిభూతులు యీశ్వర తేజోంశ సంభూతము లని నిర్ణయింపనగును.

ఇచట తేజశ్శబ్దముచే బలక్రియలు గూడ నుపలక్షణముగా జెప్పవలయును. ఈశ్వరునకు జ్ఞాన బల క్రియలు స్వాభావికములు. ఆ మూటియొక్క యంశలచే, నీశ్వరవిభూతులగు ప్రాణులు పుట్టుదురని భావము. కనుకనే యీశ్వరవిభూతులగు రామ కృష్ణ మహేంద్రాదులయందు, జ్ఞానబలక్రియలు యెక్కువగ కనిపించుచున్నవి.

లేక తేజశ్శబ్ద మిచట భగమున కుపలక్షణము. ఐశ్వర్య, వీర్య, యశ, శ్రీ, జ్ఞాన, వైరాగ్యములు భగములనబడును. వీటియొక్క యంశలచే నీశ్వర విభూతులు పుట్టుదురని యర్థము.

అందు జీవులు యీశ్వరునియొక్క చైతన్యాంశభూతులు. విభూతులు, యీశ్వరునియొక్క చైతన్యాంశరూపు లగును. వాని గుణాంశములచేగూడ గూడి యుందురు. కాన యిచట తేజశ్శబ్దము స్వరూప చైతన్యపరము కాదు.

లేక, మహాకాశమునకు ఘటాకాశములువలె ప్రత్యగాత్మలగు జీవులు పరబ్రహ్మయొక్క చైతన్యాంశభూతులు. రామకృష్ణాది విభూతులు సర్వజ్ఞత్వాది గుణ విశిష్టమయిన ఈశ్వరునియొక్క అంశభూతులు. కనుకనే విభూతులయందు నీశ్వరగుణములు కొలదిగ గనిపించుట పొసగును. ఇచట జీవులు. ఈశ్వరాంశులని చెప్పదగదు. అచట 'మమ' అను పదమునకు పరబ్రహ్మ యర్థము. ఈశ్వరుడు ప్రయోగించిన అస్మచ్ఛబ్దము లక్షణచే పరమాత్మను జెప్పును. జీవులచే బ్రయోగింపబడిన అస్మచ్ఛబ్దము లక్షణచే ప్రత్యగాత్మను జెప్పును.

రామానుజ మతము

ఇచట రామానుజులు, తేజశ్శబ్దమునకు, నియమనశక్తిరూపమగు సామర్థ్య మర్థమని చెప్పిరి.

అది యనుచితము. ఈశ్వరాంశులగు ప్రభువులయందు నియమనశక్తి కనిపించుచున్నను, జ్ఞానులయందుగాని, విరక్తులయందుగాని యయ్యది కనుపించుట లేదు.

ఇక తేజశ్శబ్దమునకు సర్వకర్తృత్వ, సర్వేశ్వరత్వాది సామర్థ్యమని యర్థమును జెప్పినచో నయ్యది భగరూపమేయగును. అపుడు తేజశ్శబ్దమున కుపలక్షణము లేకుండగనే భగవాచకత్వము సంభవించుచున్నది. కాన నియ్యది సమీచీనమే యగును. ॥ ౪౧ ॥

శ్లో. "అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున,
విష్టభ్యాఽహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్. ॥ ౪౨ ॥

అ ॥ ఓయి కృష్ణా! నీవు "న త దస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరం" అను ముప్పది తొమ్మిదవ శ్లోకమున "చరాచర ప్రపంచములో నీ స్వరూపము ప్రవేశించని వస్తువే లేద"ని చెప్పితివి.

మఱల "యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జిత మేవవా" అను నలుబదవ శ్లోకమున విభూతిమంతులు (సమర్థులు), ధనవంతులు, ఉత్సాహవంతులు - వీరలే నీ తేజోంశవలన బుట్టిరనియు, అసమర్థులు, దరిద్రులు, నిరుత్సాహులు, వీరలు నీ తేజస్సువలన బుట్టలేదనియును జెప్పితివి. ఈయది పూర్వాపర విరుద్ధముగదా ?

కాదు, వినుము. "మమ తేజోంశసంభవం" అను శ్లోకమున విభూత్యాది గుణయుక్తులను నిర్దేశించి, వీరలే నా తేజస్సువలన బుట్టిరని చెప్పుటలో వారలయందే ప్రధానముగా నన్ను ధ్యానింపుమని చెప్పుటయే నాదు తాత్పర్యము.

వస్తుతః నాయందు గల్పింపబడినందున ప్రపంచమంతయు నా విభూతియు, మదాత్మక (మత్స్వరూప)ము నగుచున్నది- అని శ్రీ కృష్ణభగవానులు ఈ శ్లోకమున జెప్పుచున్నారు.

అ॥ ఓ అర్జునా ! "నే నాదిత్యుడను, నే నశ్వత్థవృక్షమును, ఇంద్రుడను, చంద్రుడను అని ప్రత్యేకముగా నేనుజెప్పిన ప్రయోజనమేమి, వినినందున నీకు ఫలమేమి ? ఇట్లొక్కొక్కటిగా నాదు విభూతుల నన్నిటిని నేను నీకు జెప్పజాలను. అయ్యవి యట్లు జెప్పుటకు శక్యములు గావు. నీవు నిరవశేషముగా దెలిసికొనినవాడవును గానేరవు.

ఇప్పుడు జెప్పెద వినుము. నే నీప్రపంచమంతయును నొక్కపాదముచే నాక్రమించి యుంటిని. ఇందు మంత్రవర్ణముగూడ ప్రమాణము గలదు. "పాదోఽస్య విశ్వాభూతాని" అని. కావున జగత్తంతయు నా స్వరూపమే యగుచున్నది.

పై మంత్రవర్ణమునుబట్టియే నిరంశుడగు ఈశ్వరునకు అంశిత్వ మంగీకరింపవలయును. కనుక నీ యీశ్వరునకు సర్వభూతములు నొక్కయంశమే. అనగా - ఈశ్వరునియొక్క నొక్కపాదమే ప్రపంచమున గలదని యర్థము.

లేక, వీనియొక్క యేకపాదమునందు- ప్రపంచము గలదనికాని వీనియొక్క యేకపాదము జగద్రూపముతో నున్నదనికాని, వీనియొక్క యేకపాదము జగద్రూపముగా జూడబడుచున్నదనికాని పైమంత్ర వర్ణమున కర్థము.

ఓయీ ! శ్రుతి చెప్పినంత మాత్రమున విరుద్ధమైన అర్థము నెట్లు గ్రహింపనగును ? వినుము. నిరంశునకుగూడ మాయచే నంశభేదము సంభవించును. మట్టిలో నేకదేశమగు తడిమట్టియందు ఘటమును బుట్టించు సామర్థ్య మున్నటుల బ్రహ్మయొక్క యేకదేశమునందు మాయ యున్నది.

అయితే, మాయమాత్రము నిరవయవుడగు బ్రహ్మకు నవయవ విభాగము నెట్లు కల్పించినది ? అందు దానెట్లున్నది ? అని శంకింపవలదు. మాయాకృత్యము అనిర్వచనీయము. అది మనసా యూహింపను, వచసా వచింపను నలవిగాదు. కాన నందు 'అదెట్లు, ఇదెట్లు' అను ప్రశ్నయే తగదు.

ఈ సర్వభూతాత్మకమగు బ్రహ్మయొక్క యేకపాదమే "మాయా" అనియు, "ఈశ్వరు"డనియును జెప్పబడుచున్నది. మాయావచ్ఛిన్న బ్రహ్మయే యీశ్వరుడు. శుద్ధచైతన్యము పరబ్రహ్మమే యగును. అదియే తత్త్వము. మాయ అతాత్త్వికమగుటచే మాయావచ్ఛిన్నుడగు నీశ్వరుడుగూడ నతాత్త్వికుడే యగుచున్నాడు. అట్లే మాయామయములగు భూతములును అతాత్త్వికము లగుచున్నవి. కావున యట్టి శుద్ధ చైతన్యమే ప్రత్యగాత్మయని జీవబ్రహ్మల కైక్యము సిద్ధించినది.

రామానుజమతము

ఇచట రామానుజులు "ఏకాంశేన స్థితో జగత్" అనుచోట "ఏకాంశ" మను పదమునకు "నా యొక్క మహిమలో నయుతాంశముచే నావరించి" అని యర్థమును జెప్పిరి.

అయ్యది నిస్సారము. "ఏకాంశేన "అను పదమువలన, అయుతాయుతాంశ మను నర్థము లభింపదు. పైపెచ్చు మహిమ యనుపదము ఈ శ్లోకమున శూన్యము. పైగా సర్వప్రపంచము భగవద్విభూతి యని చెప్పదగియుండ ప్రకరణవిరుద్ధముగా జగన్నియమనమును జెప్పుట యనుచితమగును.

కావున శంకరులు జెప్పిన యర్థమే సుఖకరము. రామానుజుల యర్థము క్లేశావహము.

ఈ యధ్యాయమునందు భగవద్విభూతులయొక్క సంబంధము కలదుగాన నీయది విభూతియోగమను నామమును బడసెను. ॥ ౪౨ ॥

ఇట్లు
మల్లావఝలోపనామక వేంకటసుబ్బరామశాస్త్రి విరచితమగు
శ్రీమద్భగవద్గీతా భాష్యార్క ప్రకాశికానువాదమున
దశమాధ్యాయము
ముగిసెను.

శ్రీ హయగ్రీవాయనమః

# శ్రీ భగవద్గీతా భాష్యార్థ ప్రకాశికానువాదము

## ఏకాదశాధ్యాయము

శ్లో॥ మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మసంజ్ఞితమ్,
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ. ॥ ౧ ॥

అ॥ శ్రీకృష్ణునిచే పూర్వాధ్యాయమునందు జెప్పబడిన భగవద్విభూతులను పార్థుడు విని, ప్రపంచమంతయు భగవత్స్వరూపమని గ్రహించి, యట్టి భగవత్స్వరూపమును ప్రత్యక్షపరచుకొనదలచి పార్థు డడుగుచున్నాడు.

ఓయీ! కృష్ణా! నీవు నన్ననుగ్రహించదలచి చెప్పిన పరమగోప్యమగు నధ్యాత్మతత్త్వమును వినినంతనే నా చిత్తమునందలి యవివేకత దొలగిపోయినది. కాని యట్టి తత్త్వము నొక్కతూరి నాకు కనుబరచి నన్ను గృతార్థుని చేయుము.

ఓయీ! ప్రపంచమంతయు నాయందు గల్పింపబడినది. అయ్యది నాదు రూపము. అద్ది నీకు ప్రత్యక్షమగుచునే యున్నది. అట్టితఱి నేనుగూడ బ్రత్యక్షమైనటులేగదా? మఱి యేల నిట్లడిగెదవు? అని యందువేమొ. అట్లుగాదు. నాకు కేవలము ప్రపంచ మగుపడుచున్నదిగాని యయ్యది నీయం దున్నట్లుగా నా కంటి కగుపడుటలేదు.

అయితే, బ్రహ్మ కనుపించిననేగాని బ్రహ్మయం దున్నట్లుగా ప్రపంచము గనుపించదనియు, బ్రహ్మ దృగ్గోచరుడుగాన కనుపించువాడు గాడనియు, కావున బ్రహ్మయందు ప్రపంచ మున్నటుల జూచుట కేవలము శాస్త్రమువలననే గ్రహింపవలెననియు; ననినచో—

నిజమే. ప్రపంచము బ్రహ్మయం దున్నట్లుగా దెలిసికొనుట యలవి గాకున్నను మాయావచ్ఛిన్నచైతన్యమగు నీశ్వరునియందున్నట్లు దెలిసికొను టసాధ్యమగును గాన నద్దానిని యుపదేశింపుము.

ఈయది భావము. ఈశ్వరున కనేక రూపములు గలవు. అందు ప్రధానమైన రూపము చైతన్యము. ఇదియే తాత్త్వికము. మాయావచ్ఛిన్నరూపము రెండవది. అంతఃకరణావచ్ఛిన్న చైతన్యము మూడవది. నాల్గవది విరాడ్రూపము. ఈ విరాడ్రూపమువలన విష్ణువు, రాముడు, కృష్ణుడు మున్నగువా రుద్భవింతురు.

ఇం దొకటిరెండు రూపములలో ప్రపంచమును దెలిసికొనుట శాస్త్రప్రమాణమువలననే సంభవించునుగాని మఱి యితర ప్రమాణములవలన సంభవించదు.

మూడవరూపమగు నంతఃకరణావచ్ఛిన్నచైతన్యము జీవాత్మరూపమగుటచే నెల్లపుడు ప్రత్యక్షమేకాన దానిం దెలిసికొన బనిలేదు. ఇక విరాడ్రూపముమాత్రము ప్రత్యక్ష ప్రమాణవేద్యమే కాన, నర్జును డీశ్వరునియొక్క విరాడ్రూపమును చూడగోరి యిట్లడిగెను.

ప్రపంచము చక్షురాది ప్రమాణవేద్యము గాన నీశ్వరునియొక్క ప్రపంచరూపమగు విరాడ్రూపముగూడ ప్రత్యక్షమే యగుచున్నదనిన దో నిజమే. భగవంతుని యొక్క విరాడ్రూపము (విశ్వరూపము)లో చర్మచక్షువులగు మానవుల కణుమాత్రమే చక్షుర్గోచర మగుచున్నది. సాకల్యముగా విశ్వరూపమంతయు కంటికగుపడుటలేదు.

ఇపుడు సాకల్యముగా విశ్వమును చూడదలచి, యర్జునుడు భగవంతుని యిట్లు గోరెను.

లేక, ప్రపంచము ప్రత్యక్షమగుగాక ప్రపంచమును తయారుజేసెడి యవ యవ సన్నివేశరూపమైన నీశ్వరశరీర మెట్లున్నదో యెవ డెఱుంగును ? అద్దానిని తెలిసికొనగోరియైనను పార్థు డిట్లడుగవచ్చును.

అయితే, భగవంతుడగు శ్రీకృష్ణుడు అర్జునునితో 'నోయి యర్జునా ! నాయందు ప్రపంచ నిర్మాణకుశలమైన నొకానొక రూపము గలదని చెప్పలేదుగదా ? అట్టితఱి యర్జును డారూపమును నాకు జూపుమని యడుగుట యెట్లు పొసగును ?' అని శంకింపదగదు. "విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్" అను శ్లోకముచే భగవంతు డట్టి రూపమును జెప్పెను. కాన నర్జునుని ప్రశ్న యుపపన్నమగుచున్నది.

లేక, కృష్ణార్జును లిరువురు సన్నిహిత బంధువులు గాన కృష్ణుని మహిమ యర్జునునకు తెలియకున్నను నాతని మహిమను దేవకీ వసుదేవ యశోదాదు లెఱుంగుదురు గాన, వారు శ్రీకృష్ణునియందు జగదాకారరూపము గలదని యెప్పుడో యర్జునునకు జెప్పియుండవచ్చును. అర్జును డిపు డద్దానిని ప్రకరణవశమున స్మరించియైనను ని ట్లడుగవచ్చును. ॥ ౧ ॥

శ్లో॥ భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా,
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్య మపి చావ్యయమ్. ॥ ౨ ॥

అ॥ తామరపూరేకులవంటి కన్నులు గల ఓయీ ! కృష్ణా ! నీవు భూతముల యొక్క ఉత్పత్తి ప్రళయములగురించి చెప్పగా వింటిని. నాశరహితమయిన నీదు మాహాత్మ్యమునుకూడ వింటిని. ॥ ౨ ॥

శ్లో॥ ఏవ మేత ద్యథాఽఽత్థ త్వ మాత్మానం పరమేశ్వర !
ద్రష్టు మిచ్ఛామి తే రూపమైశ్వరం పురుషోత్తమ ! ॥ 3 ॥

అ॥ ఓయి, పరమేశ్వరా! నీవు నీ స్వరూపము నెట్లు నిరూపించి చెప్పితివో, అది యంతయు నట్లు నిజమే. అందు సందియము లేదు. ఓయి, పురుషోత్తమా! నీదు ఈశ్వరరూపమును (విశ్వరూపమును) నేను జూడగోరుచున్నాను. ॥ 3 ॥

శ్లో॥ మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో,
యోగేశ్వర! తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్. ॥ ౪ ॥

అ॥ ఓయి ప్రభూ! నీదు విశ్వరూపమును నేను చూడగలనని నీకు నిశ్చయ మున్నచో యోగశక్తుల నన్నిటిని నీవశ మొనర్చుకొనియున్న నీవు, నా కా విశ్వ రూపమును జూపుము. ఇచట "యోగేశ్వర" అను సమాసమునందలి యోగశబ్దము అర్శాదిగణమునకు విధించిన 'అచ్' ప్రత్యయము అంతమందు గలదగుచు యోగిపర మగుచున్నదని గ్రహింపవలయును.

మూలమునందలి "తతః" అనుపదమునకు కారణార్థత్వము నంగీకరించి తచ్ఛబ్దముతో నియతాపేక్షగల యచ్ఛబ్దమున నధ్యాహారముజేసి "ఎందువలన నేను మిక్కిలి కోరికగల్గియుంటినో యందువలన నా కోరిక నెరవేర్చుటకొఱకు నీవు నాకు విశ్వరూపమును జూపు" మని యర్థమును జెప్పవలెను. కావున నీయది నాటకముల యందలి రామాది వేషప్రదర్శనప్రాయము గాదని భావము. ॥ ౪ ॥

శ్లో. పశ్య మే పార్థ! రూపాణి శతశోఽథ సహస్రశః,
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ. ॥ ౫ ॥

అ॥ ఇట్లర్జునునిచే ప్రేరేపితుడై భగవంతుడగు శ్రీకృష్ణుడు జెప్పుచున్నాడు. ఓ యర్జునా! నాదురూపము లప్రాకృతములనియు ప్రాకృతములనియు రెండు రకములు. అం దప్రాకృతరూపములు దివ్యములు. ప్రాకృతము లన్నియు ననేక రకముల రంగులతోను, అనేకరకముల యాకారములతోను, అనేక రకముల యవయవ విశేషములతోను గూడియుండును. ఈయవి సంఖ్యచే జెప్పనలవిగావు. అనంతములని గ్రహింపుము. ॥ ౫ ॥

శ్లో. పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రా నశ్వినౌ మరుత స్తథా,
బహూ న్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత! ॥ ౬ ॥

అ॥ ఇందు గొన్నింటిని పేరుతో నిర్వచించి చెప్పెదను చూడుము. నాలో ద్వాదశాదిత్యులును, నెనిమిదిమంది వసువులును, పదునొకండు రుద్రులును, ఇద్ద రశ్వినీదేవతలును, ఏడేసి వాయుగణములును, ఇట్లే నీ వెన్నడును మనుష్యలోకమున కని విని యెఱుంగని యత్యాశ్చర్యములైన రూపము లనేకములు కలవు. ॥ ౬ ॥

శ్లో॥ ఇహైకస్థం జగ త్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్,
మమ దేహే గుడాకేశ! యచ్చాన్య ద్ద్రష్టు మిచ్ఛసి॥ ॥ ౭ ॥

అ॥ ఇంతేగాదు. ఇప్పుడు నీకు బయట కనుపడు చరాచరప్రపంచమంతయు నా శరీరములో నొకమూల నున్నది. చూడుము. మఱియు, నీవు రణరంగమధ్యమున,

శంకించిన జయపరాజయాదికముగూడ గలదు. నీవు చూడదలచినచో దానినిగూడ నా శరీరమునందు జూడుము. ॥ ౭ ॥

శ్లో॥ న తు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా,
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ ॥ ॥ ౮ ॥

అ॥ అర్జునా! నీవు ప్రాకృతమైన నీ చర్మచక్షుస్సుచే విశ్వరూపమును ధరించిన నన్ను జూడజాలవు. దివ్యదృష్టితో జూడగలవు. అట్టి దివ్యనేత్రమును నేను నీకిచ్చుచున్నాను. దానిచే నాయొక్క యీశ్వరసంబంధమైన యోగశక్తి నంతయు జూడుము. ॥ ౮ ॥

శ్లో॥ ఏవ ముక్త్వా తతో రాజన్ మహాయోగీశ్వరో హరిః,
దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్. ॥ ౯ ॥

అ॥ సంజయుడు జెప్పుచున్నాడు. ఓయీ ధృతరాష్ట్రుడా! కృష్ణు డిట్లు జెప్పి, పిదప పరమాత్మరూపుడగు నా భగవంతుడు పృథాపుత్రుడగు నర్జునుని కొఱకు సర్వాధికమైన విశ్వరూపమును జూపెను. ॥ ౯ ॥

శ్లో॥ అనేక వక్త్ర నయన మనేకాద్భుత దర్శనమ్,
అనేక దివ్యాభరణం దివ్యా నేకోద్యతాయుధమ్, ॥ ౧౦ ॥

అ॥ అనేక ముఖములు, నేత్రములు గలిగి యనేక విధముల నాశ్చర్యపరచునట్టియు అనేక దివ్యాభరణములు గలిగినట్టియు, దివ్యములైన యనేక యాయుధములు గలిగినట్టియు నాదు విశ్వరూపమును జూడుమని పూర్వశ్లోకముతో సంబంధము. ॥ ౧౦ ॥

శ్లో॥ దివ్యమాల్యామ్బరధరం దివ్యగంధానులేపనమ్,
సర్వాశ్చర్యమయం దేవ మనంతం విశ్వతోముఖమ్. ॥ ౧౧ ॥

అ॥ దివ్యమైన పూలమాలలు, వస్త్రములను ధరించినట్టియు, దివ్యగంధమును బూసికొనినట్టియు, సర్వాశ్చర్యప్రచురమైనట్టియు అనేక ముఖములు గల భగవద్రూపమును భగవంతుడు జూపించెను. అర్జునుడు జూచెనని యైన నధ్యాహారము జేయవచ్చును. ॥ ౧౧ ॥

శ్లో. దివి సూర్య సహస్రస్య భవే ద్యుగప దుత్థితా,
యది భా స్సదృశీ సా స్యాద్భాస స్తస్య మహాత్మనః. ॥ ౧౨ ॥

అ॥ భగవంతునియొక్క విశ్వరూపప్రకాశ కుపమానము జెప్పబడుచున్నది. అంతరిక్షమునందు కాని, స్వర్గమునందు కాని వేయిమందిసూర్యు లొక్కమాటుదయించినచో నెంతటి కాంతి పుట్టునో, యాకాంతి మహాత్ముడైన విశ్వరూపధరుని యొక్క కాంతికి సమానమగును. లేక సమానము కాకపోవచ్చును. ఇంకను విశ్వరూపముయొక్క ప్రకాశమే గొప్పది కావచ్చును. ॥ ౧౨ ॥

శ్లో. తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకధా,
అపశ్య ద్దేవదేవస్య శరీరే పాండవ స్తదా. ॥ ౧౩ ॥

అ॥ అప్పు డర్జునుడు దేవదేవుడగు శ్రీకృష్ణునియొక్క శరీరమునం దొకమూల యనేకవిధముల విభక్తమయియున్న ప్రపంచమంతయును జూచెను. ॥ ౧౩ ॥

శ్లో. తత స్స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః,
ప్రణమ్య శిరసా దేవం కృతాంజలి రభాషత. ॥ ౧౪ ॥

అ॥ పిదప యర్జును డాశ్చర్యమును జెంది గగుర్పాటు నొందెను. తరువాత దోసిలి యొగ్గి శ్రీకృష్ణుని శిరసా నమస్కరించి, యిట్లు పలికెను. ॥ ౧౪ ॥

శ్లో. పశ్యామి దేవాం స్తవ దేవ దేహే
సర్వాం స్తథా భూతవిశేష సంఘాన్,
బ్రహ్మాణ మీశం కమలాసనస్థం
ఋషీంశ్చసర్వా నురగాంశ్చ దివ్యాన్. ॥ ౧౫ ॥

అ॥ అర్జునుడు జెప్పుచున్నాడు, ఓయీ కృష్ణా! నీ శరీరమునందు నిఖిల దేవతలను జూచుచున్నాను. భూతవిశేషములను గుంపులు గుంపులుగా జూచు చున్నాను. కమలాసనస్థుడగు చతుర్ముఖబ్రహ్మను జూచుచున్నాను. అట్లే సర్వ ఋషులను, దివ్యమైన సర్పములను జూచుచున్నాను.

ఇచట మూలమునందు బ్రహ్మకు కమలాసనస్థుడని విశేషణము కనిపించు చున్నది. కాన నిం దొకింత విచార మవసరప్రాప్త మగుచున్నది.

అదెట్లన, సామాన్య పరిణామముగల మానవమాత్రుడే కమలమునం దుండ జాలడు. అట్టితతి మహానుభావుడగు బ్రహ్మ కొద్దిపాటి తుమ్మెదవలె పద్మమధ్యమున నెట్లుండెను? అను శంక గలుగుచున్నది. అందుకు సమాధానమును శ్రీ శంకరులు తమ భాష్యమునందు "ప్రజానాం కమలాసనస్థం పృథివీ పద్మమధ్యే మేరుకర్ణి కాసనస్థం" అను వాక్యముచే సూచించిరి.

దీని యర్థము:—పృథివియే యొక పద్మము. దాని మధ్యనున్న మేరుపర్వతమే పద్మముయొక్క బొడ్డు. దానియొక్క యగ్రభాగము సత్యలోకము. కాన సత్య లోకమునందు నివసించుటవలన బ్రహ్మ కమలాసనస్థు డనబడుచున్నాడని దీని భావము.

కనుకనే "ధాతాబ్జయోని ర్ద్రుహిణో విరించిః కమలాసనః" అని కమలాసన శబ్దము బ్రహ్మదేవునియందు అమరాది నిఘంటుకారులచే ప్రయోగింపబడినది.

కావున విష్ణుమూర్తియొక్క నాభిపద్మమునందు బుట్టుటవలన బ్రహ్మ కమలా సను డగుచున్నాడని జెప్పదగదు. ప్రపంచమయమైన శరీరము గల విష్ణుమూర్తికి పాతాళలోకము పాదస్థానతుల్యము, భూతలము నాభిస్థానము, సత్యలోకము శిరః

స్థానము అని ప్రసిద్ధి యుండుటచే భూపద్మమే విష్ణువుయొక్క నాభిపద్మ మగు చున్నది.

లేక, చతుర్ముఖబ్రహ్మకు విలక్షణమైన విష్ణువుయొక్క నాభిపద్మమునం దునికి ప్రళయకాలముననేగాని యిపుడు గాదు. కావున నిపుడు బ్రహ్మయొక్క కమలాస నము మేరుశిఖరరూపమే యని గ్రహింపవలయును.

మఱియు కమలాసన మనగా పద్మాసన మనియు, నీయది పద్మాకారమైన యాసనవిశేష మనియు, భద్రాసన స్వస్తికాద్యాసనములలో నంతర్గత మనియును జెప్పుచు, నట్టి పద్మాసమునం దుండుటవలన బ్రహ్మ కమలాసనస్థుడని చెప్పుట సులభమనియు ననదగదు. విశ్వరూప సందర్శనముచే కలవరపడిన యంతఃకరణము గల చతుర్ముఖు డపుడు నిశ్చలముగా పద్మాసనమునం దుండుట యసంభవము.

రా మా ను జ మ త ము :

ఇచట రామానుజులు బ్రహ్మ యనగా నండాధిపతియగు చతుర్ముఖు డనియు, కమలాసనస్థు డనగా కమలాసనుడగు బ్రహ్మయం దున్న నీశ్వరుడనియును వ్యాఖ్యా నించిరి. ఇది యనుచితము. బ్రహ్మయం దున్న చిన్మాత్రము చక్షుర్విషయము గాదు. అంతర్యామి యెప్పుడును నీ రూపుడు. ఇక బ్రహ్మయొక్క మతమునం దున్న రుద్రు డని వ్యాఖ్యానించుటగూడ పొసగదు. కమలాసనస్థ శబ్దముచే కమలాసన మతస్థుడను నర్థము లభించదు.

ఓయీ ! బ్రహ్మ, విష్ణు, రుద్రులు త్రిమూర్తులైనను, విష్ణువు సాక్షాన్నారా యణుడుగాన వాని శరీరమునందు బ్రహ్మవలె శివుడుగూడ నుండవచ్చును. కాన నిచట కమలాసనస్థు డగు బ్రహ్మను, నట్లే (ఈశం) శివుని చూచుచున్నాను అని యేల వ్యాఖ్యానించగూడదు? అనినచో నట్లు గాదు. మొదటిపాదమునందే "సర్వాన్ దేవాన్" అను పదముచే రుద్రులు, ఆదిత్యులు మొదలగు దేవత లందరు జెప్పబడిరి. కాన శంభువు (ఈశుడు) రుద్రగణమునందు జేరుటచే మఱల వేరుగ జెప్పవలసిన యవసరము లేదు.

ఇక "కమలాసనస్థమ్ ఈశం" అనగా కైలాసగిరియందు పద్మాసనముతో గూర్చుండిన శివుడని వ్యాఖ్యానించినచో మా కేమియు బాధ లేదు. విష్ణు, శివులకు చైతన్యరూపముతో భేదము లేకున్నను శరీరేంద్రియాది సంఘాతరూపముతో భేదము కలదు. శివ, విష్ణు శరీరములు రెండును ఒక్క విష్ణువుయొక్క యవతారరూపములే యగుచున్నవి. కావున రామానుజవ్యాఖ్యాన మసంగతము. ॥ ౧౫ ॥

శ్లో. అనేక బాహూదర వక్త్ర నేత్రమ్
పశ్యామి త్వాం సర్వతోఽనన్తరూపమ్,
నాన్తం నమధ్యం న పున స్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర ! విశ్వరూప ! ॥ ౧౬ ॥

అ॥ ఓయి కృష్ణా! అనేక బాహువులు, ఉదరములు, ముఖములు, నేత్రములు గలిగి యనంతరూపుడ వగు నిన్నంతటను జూచుచుంటిని. ఓయి విశ్వరూపా! నీదు రూపమునకు ఆదిమధ్యావసానములను తెలియకున్నాను. అనగా నిన్నే యంతట జూచుచున్నానుగాని, నీకు మొదలెక్కడో, చివర యెక్కడో యాద్యంతములయొక్క మధ్య యెక్కడో తెలియుటలేదని పరమార్థము. ॥ ౧౬ ॥

శ్లో. కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తిమంతమ్,
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం
సమన్తా ద్దీప్తానలార్క ద్యుతిమప్రమేయమ్. ॥ ౧౭ ॥

అ॥ అనేక కిరీటములు గలిగినట్టియు, గదా, చక్ర, శంఖ, అసి, ధనురాద్యనేకాయుధములతో గూడుకొని యున్నట్టియు, నంతటను ప్రకాశము గలిగియున్న తేజఃపుంజమునుగా నిన్ను జూచుచున్నాను. నీవు అంతటా వెలుగొందు సూర్యాగ్నుల వలె వెలుగొందుచుండుటచే జూడశక్యము గాకుంటివి. నీ తేజస్సు యింతటిదని పరిచ్ఛేదపరచుటకు నలవి గాకున్నది. ॥ ౧౭ ॥

శ్లో. త్వ మక్షరం పరమం వేదితవ్యమ్
త్వమస్య విశ్వస్య పరం నిధానమ్,
త్వ మవ్యయః శాశ్వత ధర్మగోప్తా
సనాతన స్త్వం పురుషో మతో మే. ॥ ౧౮ ॥

అ॥ ఓయి కృష్ణా! నీదు యోగశక్తినిబట్టి నేనిట్లూహించుచుంటిని. అదెట్లన: నీవు ముముక్షువులచే దెలియదగిన పరబ్రహ్మ మనియును, నీవు సమస్త ప్రపంచమునకు గొప్ప యాధార మనియు, నీవు నాశరహితుడ వనియు, నీవు శాశ్వతమైన ధర్మమును గాపాడువాడ వనియు, పురాణ పురుషుడ వనియును నా యభిప్రాయము. ॥ ౧౮ ॥

శ్లో. అనాది మధ్యాంత మనంత వీర్యమ్
అనన్త బాహుం శశి సూర్య నేత్రమ్,
పశ్యామి త్వాం దీప్తహుతాశ వక్త్రమ్
స్వతేజసా విశ్వ మిదం తపంతమ్. ॥ ౧౯ ॥

అ॥ మఱియు ఆదిమధ్యావసానములు లేనట్టియు, అనంతమైన పరాక్రమము గలిగినట్టియు, అనంత బాహువులు గలిగినట్టియు, సూర్యచంద్రులు నేత్రములుగా గలిగినట్టియు, ప్రకాశించుచున్న యగ్నిహోత్రుడు ముఖముగా గలిగినట్టియు, తేజస్సుచే ప్రపంచము నంతయును తపింపజేయుచున్న నిన్ను జూచుచున్నాను. ॥ ౧౯ ॥

శ్లో॥ ద్యావాపృథివ్యో రిద మంతరం హి
వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః,
దృష్ట్వాఽద్భుతం రూప మిదం తవోగ్రం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్. ॥౨౦॥

అ॥ కృష్ణా! నీ వొక్కనిచేతనే భూమ్యాకాశముల మధ్యభాగమంతయు వ్యాపింపబడినది. అట్లే దిక్కులన్నియు వ్యాపింపబడినవి. ఓయి మహాత్మా! భయంకరమైన నీదు రూపమును జూచి, ముల్లోకము భయపడి గడగడ వణకుచున్నది. ఇచట లోకశబ్దమునకు లోక మనునది ముఖ్యార్థ మనియును, "జనము" అను నర్థము లాక్షణిక మనియును గ్రహింపవలయును. ॥౨౦॥

శ్లో॥ అమీ హి త్వాం సురసఙ్ఘా విశన్తి
కేచి ద్భీతాః ప్రాఞ్జలయో గృణన్తి,
స్వస్తీత్యుక్త్వా మహర్షి సిద్ధసంఘాః
స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః. ॥ ౨౧ ॥

అ॥ ఈ దేవతాసంఘము లన్నియు నిన్ను బ్రవేశించుచున్నవి. కొందఱు భయపడి, దోసి లొగ్గి, నీకు మ్రొక్కులిడుచున్నారు. మహర్షులును, సిద్ధులును గుంపులుగుంపులుగూడి ప్రపంచకల్యాణ మగుగాక యని చెప్పుచు, సంపూర్ణమైన స్తోత్రపాఠములచే స్తుతించుచున్నారు. ఇచట మూలమునందలి "అమీ సురసంఘాః" అను పదమునకు యుద్ధముజేయ సమకట్టిన భీష్మాది యోద్ధ లర్థము. వీరలు మను ష్యాకారముతో నున్నను, భూభారావతరణముకొఱకు మనుష్యజాతియందు బుట్టిన దేవతలు గాన "సురసంఘ" పదముచే జెప్పబడుచున్నారు. ॥౨౧॥

శ్లో॥ రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యాః
విశ్వేఽశ్వినౌ మరుత శ్చోష్మపాశ్చ,
గంధర్వ యక్షాసుర సిద్ధసంఘా
వీక్షంతే త్వాం విస్మితాశ్చైవ సర్వే. ॥౨౨॥

అ॥ మఱియు, ఓయి కృష్ణా! ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, సాధ్యులు, విశ్వేదేవతలు, అశ్వనీదేవత లిరువురు, పితృదేవతలు, హాహాహూహూ ప్రభృతి గంధర్వులు, కుబేరుడు మున్నగు యక్షులు, విరోచనుడు మున్నగు రాక్షసులు, కపిలుడు మొదలగు సిద్ధులు, వీర లందఱు గుంపులు గుంపులుగా జేరి యాశ్చర్యపడుచు నిన్ను జూచుచుండిరి. ॥౨౨॥

శ్లో॥ రూపం మహత్తే బహువక్త్ర నేత్రం
మహాబాహో బహు బాహూరుపాదమ్,
బహూదరం బహుదంష్ట్రాకరాళం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితా స్తథాఽహమ్. ॥౨౩॥

అ॥ ఓయి మహాబాహూ! అనేక ముఖములు, నేత్రములు, బాహువులు, ఊరువులు, ఉదరములు కలిగి, భయంకరమైన ననేక కోరలతో నొప్పుచున్న నీ రూపమును జూచి లోకమునందలి సకల ప్రాణులు భయముచే వణకుచున్నారు. నేనుకూడ వణకుచుంటిని.

ఇచట మూలమునందలి లోకశబ్దమునకు లక్షణచే లోకమునందలి ప్రాణులని యర్థము. ఈ యర్థము "లోకస్తు భువనే జనే" అను నమరకోశమువలన నభిధా వ్యాపారముచేతనే యేల ప్రాప్తించకూడదని ప్రశ్నించరాదు. శబ్దమున కనేకార్థము లుండుట న్యాయము గాదు. నానార్థక శబ్దములయెడగూడ అందొక్కయర్థమే ముఖ్యము. మిగిలిన యర్థములు లాక్షణికములే యగును. అమరకోశమునందు లాక్షణికార్థములు ముఖ్యార్థములతోగూడ నానార్థకత్వమును సూచించుటకొఱకు సంగ్రహించి చెప్పబడినవి. మఱియు మూలము నందలి "ప్రవ్యథితాః" అను పదమునకు చలనార్థమునే జెప్పవలయును. "వ్యథ భయ చలనయోః" అని ధాతువు. ఇందు వ్యథ ధాతువునకు భయార్థము నాశ్రయించినచో "భీతాః" (భయపడిరి) అనియే యర్థము సిద్ధించును. అపుడు "భయేన ప్రచలితాః" అను శంకరభాష్య ముపపన్నము గాదు. కావున నిచట వ్యథ ధాతువుయొక్క చలనార్థమునే శంకరు లాశ్రయించి రని గ్రహింపవలయును. ॥ ౨౩॥

శ్లో॥ నభ స్స్పృశం దీప్త మనేక వర్ణమ్
వ్యాత్తాననం దీప్త విశాల నేత్రమ్,
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా
ధృతిం న విందామి శమంచ విష్ణో! ॥ ౨౪॥

అ॥ ఓయి విష్ణూ! ఆకాశమునంటి ప్రజ్వలించుచున్నట్టియు, అనేక రంగులు గలిగి నోరు దెరచుకొని నిప్పులొలుకు విశాలమగు నేత్రములు గల నిన్ను జూచి నేను భయపడినచిత్తము గలవాడ నగుచు ధైర్యమును, శాంతిని పొందకున్నాను. ॥ ౨౪॥

శ్లో॥ దంష్ట్రా కరాళాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానల సన్నిభాని,
దిశో న జానే న లభేచ శర్మ
ప్రసీద దేవేశ! జగన్నివాస! ॥ ౨౫॥

అ॥ ఏలయన కోరలచే వికారము నొంది ప్రళయకాలాగ్నితో సమానమైన నీముఖములను జూచి, ఓయి జగన్నివాసా! నేను దిగ్భ్రాంతి నొందుచున్నాను. సుఖము నొందకుంటిని. కావున దేవదేవా! యనుగ్రహింపుము. ॥ ౨౫॥

శ్లో॥ అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః
సర్వే సహైవావనిపాల సంఘైః,
భీష్మ ద్రోణ స్సూతపుత్ర స్తథాఽసౌ
సహాస్మదీయై రపి యోధముఖ్యైః. ॥ ౨౬ ॥

అ॥ ఇంతకుముందు నాకు నెవరివలన పరాజయము నొందెదమను సందేహముండెడిదో, యదియు నిపుడు దొలగినది. ఏలయన ధృతరాష్ట్రపుత్రులగు నీసుయోధనాదు లందఱు, వారిసహచరులగు రాజులతోఁగూడ నీ భయంకరమగు ముఖములను జొచ్చుచున్నారు. అట్లే యీ భీష్ముఁడు, ద్రోణుఁడు, కర్ణుఁడు, వీరును మాయొక్క యోధశ్రేష్ఠులగు ధృష్టద్యుమ్నాదులతోఁగూడ త్వరపడుచు నీముఖమున బ్రవేశించు చున్నారు. ॥ ౨౬ ॥

శ్లో॥ వక్త్రాణి తే త్వరమాణా విశంతి
దంష్ట్రాకరాళాని భయానకాని,
కేచిద్విలగ్నా దశనాంతరేషు
సందృశ్యంతే చూర్ణితై రుత్తమాంగైః. ॥ ౨౭ ॥

అ॥ మఱియు గొందఱు తలలు బగిలి, ముక్కలుముక్కలై, నీదంతములమధ్య చిక్కుకొని యున్నట్లు నాకు గనుపించుచున్నారు. కొందఱు నీనోటిలో బ్రవేశించు చున్నారు. ॥ ౨౭ ॥

శ్లో॥ యథా నదీనాం బహవోఽమ్బువేగా
స్సముద్ర మేవాభిముఖా ద్రవంతి,
తథా తవామీ నరలోకవీరా
విశంతి వక్త్రా ణ్యభివిజ్వలంతి. ॥ ౨౮ ॥

అ॥ ప్రవాహవేగముగల నదులన్నియు, త్వరచే సముద్రమున కనుకూలము (ప్రతిముఖము) గా నెట్లు ద్రవించునో యట్లే యీ నరలోక వీరులందఱు (ధార్త రాష్ట్రాదులు) మండుచున్న నీ ముఖములను జొచ్చుచున్నారు. ॥ ౨౮ ॥

శ్లో॥ యథా ప్రదీప్తం జ్వలనం పతంగా
విశంతి నాశాయ సమృద్ధవేగాః,
తథైవ నాశాయ విశంతి లోకా
స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః. ॥ ౨౯ ॥

అ॥ వారేల యట్లు ప్రకాశించుచున్నా రనెదవేమొ? వినుము. మండుచున్న యగ్నిహోత్రమును నశించుటకొఱకు పురుగులెట్లు ప్రవేశించునో; యట్లే యీ రాజులందరు నతివేగముగా తమ నాశముకొఱకే నీ ముఖములను బ్రవేశించు చున్నారు. ॥ ౨౯ ॥

శ్లో॥ లేలిహ్యసే గ్రసమాన స్సమంతాత్
లోకాన్ సమగ్రాన్ వదనై ర్జ్వలద్భిః,
తేజోభి రాపూర్య జగ త్సమగ్రమ్
భాస స్తవోగ్రాః ప్రతపంతి విష్ణో ! ॥ 30 ॥

అ॥ నీవుమాత్రము నలుదిశల మండుచున్న నీనోళ్ళచే నీ రాజులందఱిని భక్షించుచు రుచి చూచుచున్నావు. ఓయి విష్ణూ ! భయంకరమైన నీయొక్క తేజస్సులు జగత్తంతయును నిండి తపింపజేయుచున్నవి.

ఇచట "తేజోభిరాపూర్య జగత్సమగ్రమ్" అనుదానిని పూర్వవాక్యముతో నన్వయించినచో సమాప్త పునరాదాన మను దోషము సంభవించునని యనరాదు. అనాకాంక్షిత విశేషణమును నన్వయించునపుడే యా దోషము సంభవించును. ఆకాంక్షిత విశేషణమును నన్వయించునపుడు సమాప్త పునరాదానమను దోషము లేదు. ఇయ్యది సిద్ధాంతము.

అయితే, విశ్వరూపమునకు తేజస్సులచే జగత్తును నిండింపజేయుట యనాకాంక్షిత విశేషణముగదా యని యనరాదు. తేజస్సులతో ప్రపంచమును నిండింపజేయక లోకముల భక్షించుట సంభవించదు. కావున నయ్యది యాకాంక్షిత విశేషణమె యగుచున్నది. బెబ్బులి మున్నగు క్రూరజంతువులుగూడ తమ తేజస్సుచే నితర మృగములను పరిభవించియే మ్రింగుచున్నవి. రుచి చూచుచున్నవి. అట్లే యీశ్వరుడుగూడ తన తేజస్సుచే జగత్తును పరిభవించియే భక్షించుచున్నాడు. రుచి చూచుచునూ యున్నాడు. తేజస్సుచే ప్రపంచమును వ్యాపించుటయే ప్రపంచ పరిభవము. జగత్తు నాక్రమించిన తేజస్సు గొప్పదనియు, జగత్తుచే నాక్రమింపబడిన తేజస్సు తక్కువదనియును నభిప్రాయము.

ఇచట "ప్రతపంతి" యనునది ధాత్వర్థ సంగృహీత కర్మ కలదౌటవలన నకర్మకధాతువని గ్రహింపవలయును. ॥ 30 ॥

శ్లో॥ ఆఖ్యాహి మేకో భవా నుగ్రరూపో
నమోఽస్తు తే దేవవర ప్రసీద,
విజ్ఞాతు మిచ్ఛామి భవంత మాద్యమ్
నహి ప్రజానామి తవ ప్రవృత్తిమ్. ॥ 31 ॥

అ॥ ఓయి దేవోత్తమా ! భయంకరమయిన నీ రూపముగల నీ వెవ్వరో చెప్పుము. నీకు నమస్కారము. అనుగ్రహింపుము. ప్రపంచమునకు మొదటివాడవగు నిన్ను దెలిసికొన గోరుచున్నాను. నీపని యేమియో నాకు తెలియదు. నేను మాత్రము నీదు విశ్వరూపమును తెలిసికొనగోరి ప్రార్థించితిని. నీ విట్టి భయంకరమయిన రూపమును జూపుచుంటివి. కాన నీ వెవ్వరని నే నడుగుచున్నాను. ఈ నీవు

విశ్వరూపుడవేనా ? లేక నీయది నీకు విశ్వరూపముకంటె వేఱురూపమా ? లేక భయంకరాకారముగల యీ పురుషుడు, వేరెవరయిన నీకంటె నితరుడా ? నీ విట్టి ఘోరాకారుడ వింతకుమున్ను కావే ! ఇట్టి ఘోరరూపమును దాల్చి నీ వేమి చేయదలచితివి ? చెప్పుము. ॥ ౩౧ ॥

శ్లో॥ కాలోఽస్మి లోకక్షయకృ త్ప్రవృద్ధో
లోకా న్సమాహర్తు మిహ ప్రవృత్తః,
ఋతేఽపి త్వా న భవిష్యంతి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః. ॥౩౨॥

అ॥ భగవంతుడగు శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు. నేను లోకనాశముకొరకు వృద్ధినొందిన యముడను. లోకసంహారము కొరకిట్లు ప్రవర్తించితిని. ఈ యిరుసేనల యందు గనిపించు భీష్మ ద్రోణ కర్ణాది యోధులందరు, నీవు లేకున్నను ఇకముం దుండరు. నీకోరిక ననుసరించియే నే నీవిశ్వరూపమును జూపితిని. ఈ విశ్వరూపము సహజముగా భయంకరముగనే యుండును. కావున నీయది మరియొకరి రూపము గాదు. నాదియే యని గ్రహింపుము. ఇచట యముడనగా ప్రసిద్ధయమునకుగూడ యముడగు నీశ్వరుడని యర్థముగాని ప్రసిద్ధయముడని యర్థముకాదు. లేక, నిత్యకాల రూపుడయిన నీశ్వరుడని యయినను జెప్పవచ్చును.

మరియు, మూలమునందలి "ప్రత్యనీక" పదమునకు ఇరుసైన్యములని యొక అర్థము. శత్రుసైన్యము లని మరియొక అర్థము. ఇం దేయర్థము నయినను గ్రహింప వచ్చును. ॥౩౨॥

శ్లో॥ తస్మా త్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూ న్భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్,
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్. ॥౩౩॥

అ॥ కావున నోయి యర్జునా ? యమరూపుడనగు నేనే వీరలందరిని చంపె దను. నీవు చంపవలసిన పనిలేదు. లెమ్ము, యుద్ధము చేయుము. దుర్యోధనాదుల జయించితి నను కీర్తిని బడయుము. నిష్కంటకమయిన రాజ్యము ననుభవింపుము. నీవు చంపకపూర్వమే యీ ధార్తరాష్ట్రులు లందరు నాచే జంపబడిరి. నీవును నాదు విశ్వరూపమునందు వీరందరు చచ్చి పడియుండుట జూచియుంటివి. నీవుమాత్రము నిమిత్తమాత్రుడ వగుము. దైవము నీ కనుకూలించును. వారికి ప్రతికూలించును. జయము నీకు తథ్యము. అయినను నీ వుదాసీనుడవుగ నుండదగదు. పౌరుషమును విడచి దైవము నవలంబించుట నీచులకు దగును; కాని నీబోటి యుత్తములకు దగదు. కాన, పార్థుడా ? లెమ్ము, యుద్ధ మాచరింపుము. ॥౩౩॥

శ్లో॥ ద్రోణంచ భీష్మంచ జయద్రథంచ
కర్ణం తథాఽన్యానపి యోధవీరాన్,
మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్. ॥34॥

అ॥ అర్జునా ! నీవు నేను చంపిన భీష్మ ద్రోణ జయద్రథ కర్ణాదులను జంపుము. అట్లె నేను జంపిన మిగత వీరులనుగూడ జంపుము. వారలవలన నీవు భయపడకుము. లెమ్ము, యుద్ధమును జేయుము. తప్పక శత్రువులను జయింపగలవు. ॥34॥

ఇచట మూలమునందు భీష్మ, ద్రోణ, జయద్రథ, కర్ణులను మాత్రమే పేరుతో నిర్దేశించుటవలన వీరు నలుగురు జయింప నలవికానివా రని సూచితమగుచున్నది. కనుకనే భగవంతుడు నేను వీరలజంపితినికాన నీకింక భయములే దని చెప్పెను. భగవదనుగ్రహము వారలయందు లేకపోవుటయే వారలు భగవంతునిచేఁ జంపబడుటయని భావము. ॥34॥

శ్లో॥ ఏత చ్ఛ్రుత్వా వచనం కేశవస్య,
కృతాంజలిః వేపమానః కిరీటీ,
నమస్కృత్వా భూయఏవాహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య. ॥35॥

అ॥ సంజయుడు ధృతరాష్ట్రునితో జెప్పుచున్నాడు. ఓయి ధృతరాష్ట్రుడా ! శ్రీకృష్ణునిమాట విని, యర్జునుడు గడగడ వణకుచు దోసిలి యొగ్గినవాడై నమస్కరించి మిక్కిలి భయపడుచు, నమ్రుడై, గద్గదస్వరముతో నిట్లు చెప్పెను–

ఇచట కృష్ణార్జునుల ప్రశ్నోత్తర ప్రకరణము ముగియకపూర్వము మధ్య సంజయుడు ధృతరాష్ట్రునితో "ఏతచ్ఛ్రుత్వా వచనమ్ కేశవస్య" ఇత్యాది శ్లోకరూపమగు మాటను జెప్పుట వ్యర్థము.

అనగా నీయది భావము. శ్రీకృష్ణుడు యింతకు వెనుకటి శ్లోకముచే "నీవు శత్రువులను జంపగల"వని చెప్పెను. దానిని వినినతరువాత అర్జును డేమిచెప్పినను నాకాంక్ష కలుగును కాన, యర్జునవచనమే యిచట సంగతముకాని, సంజయ వచనము సంగతముకాదు. పైపెచ్చు అనవసరముకూడ నగును అని.

కాన మధ్య యనవసరముగా సంజయవాక్యమును బొందుపరచిన వ్యాసుల యభిప్రాయమేమి ? యని యిచట ప్రశ్న యుదయించును.

సమాధానమేమన ?

భారతయుద్ధగాథను జెప్పు సంజయుడు ధృతరాష్ట్రునితో "కాలోస్మి లోక క్షయకృ త్ప్రవృద్ధః" (32) అని మొదలుకొని, "యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్" (34) అని శ్లోకమువరకు నుండు శ్రీకృష్ణవచనమును ధృతరాష్ట్రునితో జెప్పి,

ధృతరాష్ట్రుడు సంధికి (రాజీకి) సమ్మతించునేమోయను నాసతో క్షణకాల మూరకుండెను. అయినను ధృతరాష్ట్రు డందుకు (సంధికి) ప్రయత్నించనందున మరల సంజయుడు దరిమిలా వృత్తాంతమును జెప్పదొడంగెను. ఈ యభిప్రాయమును సూచింపదలచియే శ్రీకృష్ణుడు సంజయవచనము నిచట పొందుపరచెనని గ్రహింపవలయును.

ద్రోణ, భీష్మ, జయద్రథ, కర్ణులు నలుగురును అర్జునునిచే జయింపబడిరని వినినతరువాత దుర్యోధనుడు నిరాశ్రయుడుగనుక వాడు నిహతప్రాయుడే యని తలచి, ధృతరాష్ట్రుడు తమవారికి జయము చేకూరుట సున్నయను నభిప్రాయముతో సంధిచేసికొనునేమో యను భావము సంజయునకు కలుగుట యుచితము. అయినను భావికార్యవిధాన మట్లుండుటచే నందుల కాతడు (ధృతరాష్ట్రుడు) అంగీకరించక పోయెను. పిదప మరల సంజయుడు చెప్పదొడంగెను.

కాన నడుమ బాదరాయణులుకూర్చిన సంజయవచనము వ్యర్థముకాదు. ॥35॥

అర్జున ఉవాచ :

శ్లో॥ స్థానే హృషీకేశ ! తవ ప్రకీర్త్యా
జగత్ప్రహృష్య త్యనురజ్యతే చ,
రక్షాంసి భీతాని దిశో ద్రవంతి
సర్వే నమస్యన్తి చ సిద్ధసంఘాః. ॥36॥

అ॥ ఓయి హృషీకేశుడా ! నీకీర్తిని విని ప్రపంచము సంతోషించుచున్నదనుట యుచితము. నిన్ను ప్రేమించుచున్న దనుట యుచితము. మరియు రాక్షసులందరు భయపడి, దిక్కులంట పరుగిడుచున్నా రనుటయు యుక్తము. కపిలాది సిద్ధసంఘములు నమస్కరించుచున్నా రనుటయు యుక్తము. ॥36॥

శ్లో॥ కస్మాచ్చ తే న నమేరన్ మహాత్మన్
గరీయసే బ్రహ్మణోప్యాది కర్త్రే,
అనన్త ! దేవేశ ! జగన్నివాస !
త్వ మక్షరం సదసత్తత్పరం యత్. ॥37॥

అ॥ ఓయి కృష్ణా ! సృష్టికర్తయగు హిరణ్యగర్భునకుగూడ కారణభూతుడయిన నీకు కపిలాది సిద్ధులు యేల నమస్కరింపరు ? ఓయి దేవదేవ ! జగన్నివాస ! నీవు కార్యకారణములకంటె విలక్షణమయిన అక్షరబ్రహ్మవు. కాన నిన్నందరు నమస్కరించుట, ప్రేమించుట, నిన్ను దలచుకొని యానందించుట, నీ యాజ్ఞకు విరుద్ధముగా నిలువనేరక భయపడి పరుగెత్తుట, యిది యంతయు యుచితమగుచున్నది.

రా మా ను జ మ త ము :

ఇచట రామానుజులు, "అక్షరమగు జీవుడు నీవే "సత్" కార్యావస్థయగు ప్రకృతియు నీవే. "అసత్" కారణావస్థయగు ప్రకృతియు నీవే. ఆ ప్రకృతి పురుషుల కంటె పరమయిన ముక్తజీవస్వరూపమున్ను నీవే అని యన్వయించిరి.

అది యనుచితము. ఈ యన్వయమునం దనేక వాక్యకల్పనాగౌరవము తట స్థించును. అట్లు గల్పించుటకు బ్రమాణమున్ను గానము. ఈ శ్లోకము బ్రహ్మయొక్క స్వరూపకథనపరము కాని, బద్ధాత్మ ముక్తాత్మలయొక్క భేదమును బోధించుచున్నది కాదు. కాన నట్టి భేదమును గల్పించుటగూడ న్యాయము కాదు. ॥37॥

శ్లో॥ త్వ మాది దేవః పురుషః పురాణః
త్వమస్య విశ్వస్య పరం నిధానమ్,
వేత్తాసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వ మన న్తరూప! ॥38॥

అ॥ ఓయి కృష్ణా! నీవు సర్వచరాచరప్రపంచమును బుట్టించు పరమాత్మవు. నీవు పురాణ పురుషుడవు. సర్వ జగన్నాశకుడవు. నీవు వేద్యము. అనగా పరమాత్మ సంసారనాశముకొరకు దెలియదగినవాడవని భావము. ప్రమాతలగు జీవులద్వారా వేత్తవుకూడ నగుచుంటివి. నీవు సర్వోత్కృష్టమయిన స్థాన మగుచున్నావు. నీచే నీ ప్రపంచమంతయు వ్యాప్తమయినది. ॥38॥

శ్లో॥ వాయు ర్యమోఽగ్ని ర్వరుణ శ్శశాంకః
ప్రజాపతి స్త్వం ప్రపితామహశ్చ,
నమో నమ స్తేఽస్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోపి నమో నమ స్తే. ॥39॥

అ॥ నీవు వాయు, యమ, అగ్ని, వరుణ, చంద్ర, ప్రజాపతి, బ్రహ్మ లగుచున్నావు. నీ కనేక పర్యాయములు నమస్కరించుచున్నాను. ఇచట శ్రద్ధా భక్త్యతిశయములవలన తనివితీరక, అర్జునుడు మాటిమాటికి ననేకపర్యాయములు నమస్కరించుచున్నాడని భావము. ॥39॥

శ్లో॥ నమః పురస్తా దథపృష్ఠత స్తే
నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ,
అనన్త వీర్యామిత విక్రమ స్త్వమ్
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః. ॥40॥

అ॥ ఓయి కృష్ణా! నీకు తూర్పుదిక్కున నమస్కారము. అట్లే పశ్చిమదిక్కున నమస్కారము. అన్ని దిక్కుల నమస్కారము. నీవు తరగని సామర్థ్యము, అమిత

మయిన పరాక్రమము గలవాడ వగుటచే, సర్వదిక్కులను చైతన్యరూపముతో వ్యాపించి యున్నావు. సర్వవ్యాపివి కావున నీకు సర్వదిక్కుల నమస్కారము. ॥౪౦॥

శ్లో॥ సఖేతి మత్వా ప్రసభం యదుక్తమ్
హే కృష్ణ! హే యాదవ! హే సఖేతి,
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదా త్ప్రణయేనవాఽపి. ॥౪౧॥

అ॥ ఓయి కృష్ణా! నీ మాహాత్మ్యమును దెలిసికొనలేక నేను నీ కపకారమును జేసితిని. ఈ విశ్వరూపత్వము, నీదు మహిమ, ఇద్దానిని తెలిసికొనలేక (విశ్వరూపత్వ రూపమయిన నీ మహిమను దెలిసికొనలేక) నేను, నాతో సమాన వయస్సుగల స్నేహితునిగా నిన్ను దలంచి పొరపాటునగాని పరిచయవిశేషమునగాని, "ఓయి కృష్ణా! ఓయి స్నేహితుడా! ఓయి యాదవుడా!" అని యప్పుడప్పుడు పిలచుచు నిన్నవమానించితిని.

ఇచట మూలమున, "మహిమానం తవేమం" అను పాఠ మున్నచో "ఇదం" శబ్ద "మహిమ" శబ్దములకు విశేషణ విశేష్యభావముతో (సామానాధికరణ్యముచే) నన్వయము చెప్పవలయును. లేక "త వేదమ్" అనియున్నచో, నపుడు "ఇదమ్" శబ్దము నపుంసక లింగమున్ను, మహిమశబ్దము పుంలింగమున్ను గనుక పరస్పరము విశేషణ విశేష్యభావము పొసగదు. కాన వైయధికరణ్యముచే నన్వయము చెప్ప వలెను. మరియు "య దుక్తమ్" అను మూలమునందలి కర్మణి ప్రయోగమును భాష్యకర్తలు "యదుక్తవా నస్మి" (ఏమి చెప్పియుంటినో) అని కర్తరి ప్రయోగ మునుగా మార్చి వ్యాఖ్యానించిరి. ॥౪౧॥

శ్లో॥ యచ్చాపహాసార్థ మసత్కృతోఽసి
విహార శయ్యాసన భోజనేషు,
ఏకోఽథవా ప్యచ్యుత త్వ త్సమక్షమ్
త త్క్షామయే త్వా మహ మప్రమేయమ్. ॥౪౨॥

అ॥ మరియు నేను నడచుటయందుగాని, పరుండుటయందుగాని, కూర్చుండుట యందుగాని, భుజించుటయందుగాని పరిహాసముచే బరోక్షమున నిన్నవమానించి యున్నను, లేక సమక్షమున నవమానించియున్నను దాని నంతయును అపరిచ్ఛిన్న మహిమగల నీవు క్షమింతువుగాక యని నిన్ను వేడుకొనుచున్నాను. ఈ శ్లోకమునం దుత్తరార్థమున సమక్ష మను పద ముండుటచే బూర్వార్థమునందలి "ఏక" శబ్ద మును పరోక్షవాచియని శంకరులు వ్యాఖ్యానించిరి. ఏకత్వము పరోక్షత్వమునకు ప్రయోజకము (కారణము). "ఇంటిలో వా డొక్కడే యుండెను" అను వాక్యము వలన నింటిలోనున్న ఒక్కనికి నితరు లెవ్వరు ప్రత్యక్షము గారనియు, వా డితరులకు

ప్రత్యక్షము గాడనియును దెలియును. ఇంటిలో నిద్ద రున్న చో నొకరి కొకరు ప్రత్యక్ష మగుచునే యుందురు. కాన నేకత్వము పరోక్షత్వమునకు ప్రయోజకమని భావము.

కావున నేను పరిచయమువలనగాని పొరపాటునగాని ని న్నవమానించి యున్నను, లేక నీవు యెదుట లేనపుడు పరిహాసముగా ని న్నవమానించియున్నను లేక నీయెదుట అవమానించియున్నను క్షమింపు మని పార్థుని యాశయము. ॥42॥

శ్లో॥ పితాసి లోకస్య చరాచరస్య
త్వమస్య పూజ్యశ్చ గురు ర్గరీయాన్,
న త్వ త్సమో ఽ స్త్యభ్యధికః కుతో ఽ న్యో
లోకత్రయే ఽ ప్యప్రతిమ ప్రభావ ! ॥43॥

అ॥ ఓయి యర్జునా! నేనుగూడ నీవంటివాడనే; యేల నన్ను క్షమింపు మని ప్రార్థించెదవు? అనినచో నట్లు కాదు.

నీవు చరాచర ప్రపంచమునకు దండ్రివి. నిఖిల ప్రపంచమునకు బూజ్యుడవు. గురువులగు బ్రహ్మాదులకుగూడ గురువు నయియున్నావు. కాన పరమగురు వగు చున్నావు. నిరుపమ మహిమాశాలియగు నోయి కృష్ణా! ముల్లోకములయందును నీతో సాటియగువాడు లేడు. నిన్ను మించినవా డసలే సున్న.

ఓయి, బ్రహ్మావిష్ణుమహేశ్వరులు ముప్వురు పరస్పరము సమాను లగుచుండ నాతో సమానులు లేరను టెట్లు? వినుము, ఈశ్వరునకు మరియొక ఈశ్వరుడు సము డగునా? లేక జీవుడు సము డగునా? ఇందు మొదటిపక్ష ముచితము గాదు. ఈశ్వరు లిద్ద రుండుట యసంభవము. రెండవ పక్షమున్ను పొసగదు. అసర్వజ్ఞుడు, అసర్వకర్త యగు జీవుడు యీశ్వరునకు సాటి కాలేడు. కాన నీశ్వరు డసముడనునది యుచితము. ఈశ్వరు డొక్కడే బ్రహ్మ, విష్ణు, రుద్రనామములచే వ్యవహరించబడుచున్నాడు.

అందు బ్రహ్మ (చతుర్ముఖ) రుద్రు లిరువురు జీవులే. విష్ణు వొక్కడే మాయావచ్ఛిన్న చైతన్య లక్షణు డగు నీశ్వరుడు. కాన కృష్ణునకు సాటియగు నీశ్వరుడు లేడని స్పష్టము.

ఇక బ్రహ్మ, విష్ణు, రుద్ర, గణపత్యాదు లనేకుల నీశ్వరు లని యొప్పినచో అం దొకనికి సృష్టియందు కోరికపుట్టగా, మరియొకనికి సంహారమునందు గోరిక యుదయించును. అపుడు సృష్ట్యాది వ్యవహారము లన్నియు కుదరవు.

అయితే లోకములో బ్రహ్మ రుద్రాదు లీశ్వరులని వ్యవహార మెట్లు కలిగిన దనగా చతుర్ముఖాది శరీరావచ్ఛిన్న చైతన్యదృష్టిచే గలిగినది.

చతుర్ముఖాది దేహేంద్రియసంఘాతమునం దభిమానము గలవారు జీవులు. వారిలోపల నుండు కూటస్థచైతన్య మీశ్వరుడు. ఆత డొక్కడే కాన చతుర్ముఖాదులు కూటస్థచైతన్య దృష్టితో నీశ్వరులు. కార్య కారణ సంఘాతాభిమానముగల ప్రమాతృ దృష్టితో జీవులు అనిభావము.

ఇట్లగుచో చైతన్యదృష్టితో నందరును ఈశ్వరులే కదా ? అవును నిజమే. చైతన్యమే యంతటను ఈశ్వరు డనియు, సాక్షి యనియు, కూటస్థు డనియు, ఆత్మ యనియు జెప్పబడుచున్నది. కనుకనే ఈశ్వరుడు సర్వాత్మకు డగుచున్నాడు.

"ప్రతి మీయతే" పోల్చబడుచున్నది కాన "ప్రతిమా" అనగా ఉపమాన మని యర్థము. "న విద్యతే, ప్రతిమా యస్య ప్రభావస్య సః అప్రతిమః, అప్రతిమః ప్రభావః యస్య సః అప్రతిమ ప్రభావః" అని విగ్రహము. దీనివలన నీశ్వరుడు నిరతిశయమయిన మహిమ గలవాడని తెలుచున్నది. కనుకనే ఈశ్వరుడు సర్వాతిశాయి యగుచున్నాడు. ॥ ४३ ॥

శ్లో॥ తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వా మహమీశ మీడ్యమ్,
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియా యార్హసి దేవ సోఢుమ్. ॥४४॥

అ॥ కావున నీకు తల యొగ్గి నమస్కరించి సర్వేశ్వరుడవయిన నీదు అనుగ్రహమును ప్రార్థించుచున్నాను. నీవు కుమారుని తప్పును తండ్రి మన్నించినట్లున్ను, స్నేహితుని తప్పును స్నేహితుడు మన్నించినట్లును భార్య తప్పును భర్త మన్నించినట్లును నా యపరాధమును క్షమింపుము.

ఈ మూడు దృష్టాంతములందును గొంత యభిప్రాయవిశేషము గలదు. ఎట్లన ?

1. ఈశ్వరుడు జగత్స్రష్టయు, జగత్పాలకుడు నయినందున తండ్రి యనియు, అర్జునుడు పాలింపదగినవా డయినందున కుమారు డనియును మొదటి దృష్టాంతమున కభిప్రాయము.

2. ఈశ్వరు డింద్రియప్రేరకు డగుటచే సర్వభూత సఖుడనియు, పార్థుడు శ్రీకృష్ణున కిష్టమయిన పని చేయువా డగుటచే గృష్ణునకు సఖు డనియును రెండవ దృష్టాంతమున కభిప్రాయము.

3. ఈశ్వరుడు నిరతిశయ ప్రేమాస్పదు డగుటచే ప్రియుడనియు, అర్జును డీశ్వర పరతంత్రు డగుటచే ప్రియ (భార్య) యనియును మూడవ దృష్టాంతమున కభిప్రాయము.

కావున నీవు నాకు దండ్రివి, స్నేహితుడవు, ప్రియుడవును కాన, నా యపరాధమును క్షమింపు మని పార్థుని తాత్పర్యము.

రా మా ను జ మ త ము :

ఇచట రామానుజులు, "ప్రియు డయిన నీవు, ప్రియుడనయిన నా కొరకు" అని వ్యాఖ్యానించిరి. ఇది యుచితము గాదు. వీరి వ్యాఖ్యానము నంగీకరించినచో "పితేవ పుత్రస్య" అను మూలమునందలి దృష్టాంతము పొసగదు. ఈ దృష్టాంతము

ననుసరించి (ప్రియస్య మమ) "ప్రియు డయిన నాయొక్క" అని షష్ఠీవిభక్తినే చెప్పవలయునుగాని చతుర్థి చెప్పుట తగదు.

"నాయొక్క ప్రీతికొరకు" అని మార్చుటగూడ దగదు. దృష్టాంత మట్లులేదు. కాక, తండ్రి తన ప్రేమకొరకు కుమారుని తప్పును క్షమించుచున్నాడు కాని, కుమారుని ప్రేమకొరకు గాదు. "ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి" అను శ్రుతిని బట్టి యందఱు తన ప్రేమకొరకే యితరుల ప్రేమింతురు. ఇతరుల ప్రేమకొరకు నితరుల ప్రేమింపరు. కాన రామానుజుల వ్యాఖ్యానము క్లిష్టకల్పనము. ॥౪౪॥

శ్లో॥ అదృష్ట పూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే,
తదేవ మే దర్శయ దేవ! రూపం
ప్రసీద దేవేశ! జగన్నివాస! ॥౪౫॥

అ॥ ఓయి కృష్ణా! నే నెన్నడు జూచి యుండని యీ విశ్వరూపమును జూచి యానందించితిని. భయముచే మనస్సు చలించుచున్నది. ఓయి జగన్నివాస! న న్ననుగ్రహించి నాకు సుఖకరమైన రూపమును జూపుము. ॥౪౫॥

శ్లో॥ కిరీటినం గదినం చక్రహస్తం
ఇచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ,
తే నైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో! భవ విశ్వమూర్తే! ॥౪౬॥

అ॥ నేను వెనుకటివలె కిరీటము, గద, చక్రము మున్నగునవిగల నిన్ను జూడగోరుచున్నాను. ఓయి విశ్వమూర్తీ! నీవు నాలుగు భుజములతో గూడుకొని నాకు ప్రత్యక్ష మగుము. వసుదేవతనయుడుగ నున్నపుడు రెండే భుజము లున్నను ఒకానొకపుడు నాలుగుభుజము లుండుటచే నట్లు గోరెను. ॥౪౬॥

శ్లో॥ మయా ప్రసన్నేన తవార్జు నేదం
రూపం పరం దర్శిత మాత్మయోగాత్,
తేజోమయం విశ్వ మనన్త మాద్యం
యన్మే త్వ దన్యేన న దృష్టపూర్వమ్. ॥౪౭॥

అ॥ అర్జునుడు భయపడెనని తెలిసికొని విశ్వరూపము నుపసంహరించి మంచిమాటలతో నోదార్చుచు శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు.

ఓయి అర్జునా! నేను నిన్ననుగ్రహించి యోగశక్తిచే తేజోమయమగు నా విశ్వరూపమును నీకు జూపితిని. ఇద్దాని నింతకుము న్నెవ్వఱును జూచియెఱుంగరు. ॥౪౭॥

శ్లో॥ న వేదయజ్ఞాధ్యయనై ర్న దానై ర్నచ క్రియాభి ర్న తపోభి రుగ్రైః,
ఏవం రూప శ్శక్య అహం నృలోకే ద్రష్టుం త్వ దన్యేన కురుప్రవీర! ॥౪౮॥

అ॥ ఓయి, కురుశ్రేష్ఠుడా! మానవలోకములో నిట్టి రూపముగల నేను వేదాధ్యయనముచేగాని యజ్ఞాధ్యయనముచేగాని చూడ నలవికాను. అట్లే దానముచేతను, కర్మలతోను, ఘోరమయిన తపస్సులతోను జూడ నలవిగాను. నా యనుగ్రహమువలన నీ కొక్కనికే విశ్వరూపదర్శన మబ్బినది. నీవు కృతార్థుడ వయితివి. ఇచట యజ్ఞాధ్యయన మనగా యజ్ఞములయొక్క యితికర్తవ్యతా జ్ఞాన మని యర్థము. మూలమునందు "నృలోకే" అని చెప్పుటచే దేవలోకముల యందలి బ్రహ్మాది దేవతలకు విశ్వరూపదర్శనము సులభమని భావము. ॥౪౮॥

శ్లో॥ మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోర మీదృ ఙ్మమేదమ్,
వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వం
త దేవ మే రూప మిదం ప్రపశ్య. ॥౪౯॥

అ॥ ఇట్టి ఘోరమయిన నాదు రూపమును జూచి నీకు భయము వలదు. వ్యామోహము వలదు. భయమును వదలి యానందముతో ప్రసన్నమయిన నాదు రూపమును జూడుము. ॥౪౯॥

శ్లో॥ ఇ త్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః,
ఆశ్వాసయామాస చ భీత మేనం
భూత్వా పునస్సౌమ్య వపు ర్మహాత్మా. ॥౫౦॥

అ॥ శ్రీకృష్ణుడు పార్థునితో నిట్లు చెప్పి తన నిజరూపమును జూపెను. ఆ మహానుభావుడు సౌమ్యమయిన శరీరమును దాల్చి, భయపడినట్టి యర్జునుని యిట్లోదార్చెను. ॥౫౦॥

శ్లో॥ దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన!
ఇదానీ మస్మి సంవృత్త స్సచేతాః ప్రకృతిం గతః. ॥౫౧॥

అ॥ అర్జునుడు చెప్పుచున్నాడు: ఓయి జనార్దనా! ఇపుడు సౌమ్యమగు నీదు మానుషరూపమును జూచి స్వస్థచిత్తుడ నయితిని. ॥౫౧॥

శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు:

శ్లో॥ సుదుర్దర్శ మిదం రూపం దృష్టవానసి యన్మమ,
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శన కాంక్షిణః. ॥౫౨॥

అ॥ ఓయి యర్జునా నీ విపుడు చూచిన నాదు విశ్వరూపమును చూడగోరినను దేవతలుకూడ చూచి యెరుంగరు. మానవుల కత్యంతము చూడనలవికాదు. ॥౫౨॥

శ్లో॥ నాహం వేదై ర్న తపసా న దానేన న చేజ్యయా,
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా. ॥౫౩॥

అ॥ అర్జునా ! నీవు చూచినట్లు విశ్వరూపుడ నగు నన్ను చూచుటకు వేద, దాన, తపో, యజ్ఞములలో నేదియు సాధనము గాలేదు. ॥౫౩॥

శ్లో॥ భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవం విధోఽర్జున !
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరన్తప. ॥౫౪॥

అ॥ ఓయి అర్జునా ! నన్ను నిజరూపముతో దెలిసికొనుటకుగాని, ప్రత్యక్ష మొనర్చుకొనుటకొరకుగాని, మోక్షము నొందుటకుగాని యనన్యభక్తియే సాధనము. భగవద్భక్తులకు భగవదనుగ్రహమువలన విశ్వరూప పరిజ్ఞానము, విశ్వ రూపదర్శనము, మోక్షమున్ను కలుగునని భావము. వేదాధ్యయన సంపన్నులుగాని, తపోనుష్ఠానపరులుగాని దానశీలురుగాని, సోమయాజులుగాని, భగవంతునియొక్క విశ్వరూపమును దెలిసికొనుటయందును, చూచుటయందును, మోక్షము నొందుట యందును సమర్థులుగా రని పరమార్థము.

ఈశ్వరుని పరోక్షునిగా దెలిసికొనువారు, ఆత్మరూపునిగా దెలిసికొనువారును వీ రిరువురు నిచట భక్తులని చెప్పబడుచున్నారు. అందు ఆత్మతత్త్వవేత్తలు భగవంతుని విశ్వరూపము మాయిక మనియు, విలాసార్థ మనియును గ్రహింతురు. పరోక్షేశ్వర జ్ఞానులు అత్యాశ్చర్యకరమగు భగవంతుని విశ్వరూపమును అభిలాషపూర్వకముగా కడు నాదరముతో జూతురు. ఇది వీ రిరువురికి గల భేదము. ॥౫౪॥

అవ. ఇపుడు, సర్వశాగీతాశాస్త్రమునకు సారభూతమైన నిశ్శ్రేయసార్థము (మోక్షఫలకమగు నిష్కామకర్మము) అనుష్ఠింపదగినదని నిశ్చయించి చెప్పుచున్నాడు.

శ్లో॥ మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః,
నిర్వైర స్సర్వ భూతేషు య స్స మామేతి పాండవ ! ॥౫౫॥

అ॥ ఓయి యర్జునా ! నాకొరకు కర్మచేయువాడును, నేనే మరణానంతరము పొందదగినవాడ నని విశ్వసించువాడును, అన్నివిధముల సర్వాత్మభావముతో నన్ను సేవించువాడును, పుత్ర మిత్ర కళత్ర బంధు వర్గములయందును స్నేహములేని వాడును, సర్వభూతములయందును శత్రుభావము లేనివాడును నన్ను బొందును. కావున నీవుకూడ నాయందు భక్త్యాదులుగలిగి, మదర్థమగు యుద్ధమును నిత్యకర్మ మాచరింపుము. దానివలన జ్ఞానము కలిగి నన్ను పొందగలవు. మోక్షము నొందగలవు అని శ్రీకృష్ణోపదేశము సూచిత మగుచున్నది. ॥౫౫॥

ఇట్లు మల్లావఝలోపనామక వేంకటసుబ్బరామశాస్త్రి విరచితమగు
శ్రీమద్భగవద్గీతా భాష్యార్క ప్రకాశికానువాదమున
నేకాదశాధ్యాయము ముగిసినది.

శ్రీ హయగ్రీవాయనమః

# శ్రీ భగవద్గీతా భాష్యార్థ ప్రకాశికానువాదము

## ద్వాదశాధ్యాయము

అవ॥ ఓయి కృష్ణా! నీవు ద్వితీయాధ్యాయము మొదలు, విభూత్యధ్యాయ పర్యన్తము నుండు తొమ్మిది యధ్యాయముల యందును నిరస్త సర్వోపాధికమగు శుద్ధ బ్రహ్మయొక్క ఉపాసనమును చెప్పితివి. అచ్చటచ్చట మాయాశబలిత బ్రహ్మ యొక్క ఉపాసనమునుగూడ నిరూపించితివి. పదునొకండవ దగు విశ్వరూపాధ్యాయము నందు నిఖిల జగదాత్మకమగు నీదు విశ్వరూపమును జూపితివి. అదియు నుపాసన కొఱకే ఉపయోగపడును. అటుపిమ్మట "మత్కర్మ కృత్" అను శ్లోకముచే సగుణో పాసనమునకుగూడ బ్రహ్మసాయుజ్యము ఫలమని సూచించితివి. కావున నిర్గుణ సగుణబ్రహ్మోపాసనల రెంటిలో నేయది గొప్పదను విషయమును తెలిసికొనగోరి నిన్నడుగుచుంటిని.

అర్జును డడుగు చున్నాడు:

శ్లో॥ ఏవం సతత యుక్తా యే భక్తా స్త్వాం పర్యుపాసతే,
యేచా ప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః. ॥౧॥

అ॥ ఓయి కృష్ణా! నిన్ను యెల్లపుడు చిత్తైకాగ్ర్యముచే సేవించు నీ భక్తులు, నిరస్త సర్వోపాధికమగు అక్షరబ్రహ్మము నుపాసించు నిర్గుణోపాసకులు, వీ రిరువురిలో నెవరు శ్రేష్ఠులో నాకు నిర్ణయించి చెప్పుము.

ఇట్లు ప్రశ్నించు పార్థుని యభిప్రాయము వివరింపబడుచున్నది.

లోకమునం దంతటను ఆస్తికులకు ప్రవృత్తి, నివృత్తి యను మార్గములు రెండే గన్పట్టుచున్నవి. భాష్యకారులుగూడ దమ భాష్యారంభమున నిద్దానిని సూచించిరి.

"లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ,
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్." అను శ్లోకముచే

శ్రీకృష్ణభగవానులుగూడ నీ మార్గద్వయమును వాక్రుచ్చిరి. అందు నివృత్తిమార్గము జ్ఞానయోగము. ప్రవృత్తిమార్గము కర్మయోగము. ఈ ప్రవృత్తి మార్గము కర్మఫలేచ్ఛను పరిత్యజించుటద్వారమున కర్మయోగ మనబడుచు

ముముక్షువులను సంసారమునుంచి తరింపజేయును. ఫలేచ్ఛను విడువనిచో సంసారులను (మానవులను) సంసారకూపమున గూలద్రోయును.

ఈ రెండుమార్గము లొకనికి నేకకాలమున సంభవించవు. కావున నిందధికారులు వేరువేరని గ్రహింపవలయును. "జ్ఞానయోగేన సాంఖ్యానామ్" అని చెప్పుటచేతను, "వేదావినాశినం నిత్యం య యేన మజ మవ్యయమ్, కథం స పురుషః పార్థ, కం ఘాతయతి హంతి కమ్" అని జ్ఞానికి సర్వకర్మాభావము చెప్పుటచేతనున్ను జ్ఞానులకు నివృత్తిమార్గము విషయమని గ్రహింపవలయును. ఇట్టి నివృత్తిమార్గ నిష్ఠులగు జ్ఞానులే సన్యాసు లనబడుదురు. సన్యాసులకే సర్వకర్మ సన్యాసము సంభవించును. సర్వకర్మలను విడచి వెళ్ళువాడుకాన సన్యాసి (పరిత్యజ్య-ప్రజతి) అను వ్యుత్పత్తిచే పరివ్రాట్ అని చెప్పబడుచున్నాడు.

ఇక కర్ములనగా పరిశేషన్యాయమున సన్యాసేతరులగు బ్రహ్మచారి, గృహస్థ, వానప్రస్థులు- వీరు ముప్వురకు ప్రవృత్తిమార్గమే విషయము.

ఇట్లుండ, నిపు డేకాదశాధ్యాయమున బ్రకటించిన విశ్వరూపోపాసనము జీవాభిన్నమయిన నిర్గుణ పరమాత్మ నుపాసించు జ్ఞానుల నుద్దేశించి విధింపబడుచున్నదా? లేక కర్ముల నుద్దేశించి విధింపబడుచున్నదా? అని యర్జునుని సందేహము.

ఇందు మొదటిపక్షము కుదరదు. నిర్గుణోపాసకులకు సగుణోపాసన సంభవించదు. పైపెచ్చు శ్రీకృష్ణుడే "మత్కర్మకృత్" ఇత్యాది శ్లోకముచే విశ్వరూపోపాసకులగు భక్తులకు గర్మలను విధించియున్నాడు. సన్యాసులకు గర్మానుష్ఠానము దూరాపాస్తము. కావున నిచట కర్ములకే విశ్వరూపోపాసనము విధింపబడినదని తెలియవలెను. విశ్వరూపాది సగుణోపాసకులగు కర్మయోగులే యిచట భక్తశబ్దముచే వ్యవహరింపబడుచున్నారు. నిర్గుణోపాసకులు జ్ఞానిశబ్దముచే వ్యవహరింపబడుదు రని భేదమును గ్రహింపవలెను. జ్ఞానులకంటెను, కర్ములకంటెను భక్తులు లేరనుట యనుచితము. "యే వర్ణాశ్రమ ధర్మస్థా స్తే భక్తాః కేశవం ప్రతి" అని స్మృతి చెప్పుచున్నది. ఈ గీతయందుగూడ సాంఖ్యనిష్ఠ, యోగనిష్ఠ అని రెండే నిష్ఠలు చెప్పబడినవి. ఇపుడు వీ రిరువురికంటె భక్తులు వేరనినచో భక్తినిష్ఠ యనునది మూడవది కావలసివచ్చును. అట్లు కల్పించుటలో ప్రమాణమును గానము. కావున తమ తమ వర్ణాశ్రమధర్మముల నాచరించుటయే భక్తి. పూజ్యులయందు (పూజింపదగిన వారలయందు) అనురాగము, భక్తి యని అనరాదు. పూజ్యులకు ప్రీతిని కలుగజేయుటగూడ ధర్మమునందే యంతర్భావమును జెందును. ఇట్లే సగుణ, సాకార భగవ దుపాసనముగూడ కర్మలయందే చేరును. బ్రాహ్మణులకు విహితములయిన నాదు కర్మలలో దేవతార్చన యనునది యొకానొక కర్మ. కావున నిట్టి కర్మయోగముకంటె భక్తియోగ మనునది వేరుకాదు.

బాహ్య ప్రతిమాదులయందు జేసెడి దేవతార్చనము కర్మయనియు మానసికమగు భగవద్విగ్రహార్చనము భక్తియనియును జెప్పుట యుచితముగాదు. అదియును మానసిక్రియయే కావున కర్మమునందే చేరును.

నే నిపుడు భగవంతునకు స్నానమును కల్పించుచున్నాను. పూర్వము దంతధావనమును గల్పించితిని. ఇకముందు వస్త్రమును గల్పింతును. అని కదా భక్తుడు బాహ్యమునందువలె మనస్సునం దనుసంధానము జేయును. ఇట్లు మానసికములగు వస్త్రాభరణాద్యుపకరణములచే సాధింపదగిన మానసికార్చనము కర్మయేలకాదు? కారక వ్యాపారమువలన సాధింపదగినదికదా కర్మ యనబడుచున్నది. కావున భక్తియోగము కర్మయోగమునకంటె వేరుగాదని తేలినది. ఇట్లుండ నీరెండు యోగములలో (జ్ఞాన కర్మయోగములలో) నేది యుత్తమము? అని యర్జునుని ప్రశ్నకు దాత్పర్యము.

ఓయి! కర్మయోగముకంటె జ్ఞానయోగము గొప్పదని శ్రీకృష్ణు డింతకు మున్నే చెప్పియుండెను. అర్జును డద్దానిని నిశ్చయించుకొనియే యున్నాడు. కనుకనే యర్జునుడు తృతీయాధ్యాయమున "జ్యాయసీచే త్కర్మణస్తే మతాబుద్ధిర్జనార్దన" అని శ్రీకృష్ణుని ప్రశ్నించెను. అట్లే జ్ఞానయోగులకు సాక్షాన్మోక్షము ఫలమనియు, కర్మయోగులకు చిత్తశుద్ధి, జ్ఞానప్రాప్తి ద్వారమున మోక్షము ఫలమనియును నింతకుమున్నే చెప్పబడినది.

కావున జ్ఞానయోగము గొప్పదని చెప్పినచో జ్ఞానయోగులు గొప్పవారని చెప్పినట్లే - కాన, నయ్యది యర్జునునకు దెలిసిన విషయమయినందున నాయంశమునుగురించి యర్జును డడుగ బనిలేదు.

ఇక కర్మయోగులకంటె జ్ఞానయోగులు గొప్పవారని యర్జునునకు దెలిసినను భక్తులకంటె జ్ఞానులు గొప్పవారని తెలియదనినచో నదియును బొసగదు. కర్మయోగులకును భక్తులకును భేదములేదు. కాన నర్జునుని ప్రశ్న యెట్లు పొసగును? అనినచో వినుము. కర్మయోగము, భక్తియోగము యొక్కటే యనువిషయము పార్థు డెఱుంగడు. "జ్యాయసీచేత్" అను ప్రశ్నకు బూర్వము శ్రీకృష్ణుడు భక్తియోగమును జెప్పియుండలేదు. కావున సగుణబ్రహ్మోపాసనములేక ఫలాభిసంధిని విడచి యజ్ఞాదికర్మల నెవరాచరింతురో, అట్టి కర్ములకంటె జ్ఞానులు గొప్పవారగుగాక. ఎవరు సగుణబ్రహ్మము నుపాసించుచు, కర్మయోగమునం దుందురో వారికంటె జ్ఞానులుత్తములా? కాదా? యను సంశయము పార్థునకు కలుగుట న్యాయము. కాన నర్జునుని ప్రశ్న యుపపన్నముగుచున్నది.

మరియు, సగుణబ్రహ్మోపాసనచేయువారే భక్తులుగాని, కర్మల నాచరించువారు భక్తులు గారని యనదగదు. "మత్కర్మకృత్" అను పూర్వాధ్యాయాంతిమ శ్లోకముచే, కర్మాచరణమునందే భక్తిమార్గ ముపసంహరింపబడినది.

"ఏవం సతతయుక్తా యే" అను నీ యధ్యాయము యొక్క మొదటశ్లోకము నందలి, "ఏవమ్" అనుపదము, గడచిన యధ్యాయముయొక్క చివర శ్లోకమగు "మత్కర్మకృత్" అను దానిచే జెప్పబడిన యర్థమునే పరామర్శించును.

ఈశ్వరభక్తుడుగానివాడు యీశ్వరునికొరకు కర్మను జేయడు. రాజు యందు భక్తిగల భృత్యుడే రాజకార్యమును నెరవేర్చును. అన్నికర్మలను విడచిన సన్యాసియగు జ్ఞాని, యేకర్మను జేయడు. కావున భక్తుడు కర్మయోగియే గాని, యితరుడు గాడు. ఈ విషయము దెలియక నీయధ్యాయమున నర్జునుడు ప్రశ్నించుచున్నాడు.

లేక కర్మయోగముకంటె జ్ఞానయోగము నుత్తమమని శ్రీకృష్ణుడు మొదటనే చెప్పియున్నను అర్జునుడు విశ్వరూపమును జూచుటచే మనసు చెదరి, యద్దానిని మరచి, మరల నిట్లడుగుచున్నా డనియును జెప్పవచ్చును.

ఓయికృష్ణా! నీదు విశ్వరూపము నుపాసించుచు నీ కర్మల నాచరించెడి భక్తులును నిన్నే పొందుచున్నారు. ప్రత్యగభిన్నమగు శుద్ధబ్రహ్మము నుపాసించు వారును నిన్నే పొందుచున్నారు. వీ రిరువురకు ఫలమునందు భేదము తెలియ సాధ్యము గాకున్నది. కాన భక్త జ్ఞానులలో నెవరు యుత్తములో చెప్పుము? అని యర్జునుని ప్రశ్నకు తాత్పర్యము.

కాన నెట్లయినను అర్జునుని ప్రశ్న యుపపన్నమగునుగాని యనుపపన్నము గాదు.

ఓయి, భగవంతుడగు శ్రీకృష్ణుడుమాత్రము "మత్కర్మకృత్" "య స్స మామేతి" (నన్ను గురించి కర్మలజేయువాడు నన్ను జొందును.) అని యెట్లు చెప్పెను? కర్మలకు సాక్షాత్కైవల్యము ఫలము కాదుకదా? నిజమే అచట కర్మల జేయువాడు జ్ఞానమును జొంది, పిదప భగవంతుని పొందుననియే భగవంతుని యభిప్రాయము. భగవంతుని యభిప్రాయమును దెలియకయే యర్జును డిట్లు ప్రశ్నించెను.

రామానుజ మతము:

విశ్వరూపోపాసకులు భక్తులు. ప్రత్యగాత్మోపాసకులు జ్ఞానులు. వీ రుభయులకు తారతమ్యమును తెలిసికొనగోరి, యర్జునుడు ప్రశ్నించుచున్నాడు. అని యిచట రామానుజులు వ్యాఖ్యానించిరి.

ఈయది యనుచితము.

రామానుజులు చెప్పిన ప్రత్యగాత్మ జీవుడా? లేక, యీశ్వరుడా? మొదటిపక్షమున జీవునికంటె ఈశ్వరుడు గొప్పవాడగుటచే జీవోపాసకునకంటె ఈశ్వరోపాసకుడు గొప్పవాడని సిద్ధించుచున్నందున నిచట ప్రశ్నకే యవకాశము

లేదు. రెండవపక్షమున రామానుజులకు స్వమతత్యాగము, పరమతప్రవేశము అను దోషము సంభవించును.

మఱియు, అన్యదేవతోపాసకులకు అన్యదేవతాప్రాప్తి యనునది విరుద్ధము. అక్షరబ్రహ్మము నుపాసించువారుగూడ నన్నే పొందుదురని శ్రీకృష్ణుడు జెప్పుటచే జీవోపాసకులకు నీశ్వరత్వప్రాప్తి చెప్పినట్లగుచున్నది. 'తే ప్రాప్నువంతి మామేవ' అనుచోట 'ప్రాప్నువంతి మామ్' అనుపదమునకు మత్సమానాకారమయిన అసంసార్యాత్మను పొందుట యర్థమని చెప్పుటయు దగదు. ముఖ్యార్థమును విడచి యన్యార్థమును గ్రహించుట తగినంత కారణములేనిదే న్యాయము గాదు. లక్షణ నాశ్రయించుట యప్రమాణము. 'మామ్' అనుపదమునకు (మత్సమానాకారము) 'నాతోసమానమయినయాకారముగలవానిని'యను నర్థము శబ్దము యొక్క ముఖ్యవృత్తిచే లభించ నేరదు.

కావున బ్రహ్మప్రాప్తియను ఫలము వినబడుటచేతను, బ్రహ్మోపాసకులకే బ్రహ్మప్రాప్తి సంభవించుటవలనను అక్షరోపాసకులగు వీరు బ్రహ్మోపాసకులే యగుదురు. అట్టిబ్రహ్మము ప్రత్యగభిన్నమే యగుచున్నది. మరియు నీశ్వరునకు సోపాధికము, నిరుపాధికము అని రెండురూపములు గలవు. అందు సచ్చిదానంద లక్షణమయిన చైతన్యము నిరుపాధికరూపము.విశ్వరూపాదికము సోపాధికరూపము-అని యిట్లర్థమును జెప్పుట సర్వసంప్రతిపన్నము. ఇట్లుండ సోపాధికేశ్వరుని యుపాసించు వీరిరువురిలో నెవరు గొప్పవారు? అని తెలిసికొనగోరి యర్జును డడుగుట పొసగును. కాని మరి యితరవిధముగ బొసగ నేరదు. కావున నిచట అక్షరశబ్ద వాచ్యము బ్రహ్మమేకాని తద్భిన్నమయిన ప్రత్యగాత్మ కాదు.

అయితే ఇట్లర్జునుడు ప్రశ్నింపకున్నను సోపాధికేశ్వరోపాసకులకు సాక్షాన్మోక్షము లేదను విషయము సిద్ధించునుగదా, ఎందు కర్జునుడు ప్రశ్నించుట? అని యనరాదు. 'నిర్వైర స్సర్వభూతేషు య స్స మామేతి పాండవ' అను శ్లోకముచే శ్రీకృష్ణుడు సోపాధికోపాసకునకుగూడ సాక్షాన్మోక్షమును జెప్పియున్నందున నర్జును డడుగుట యుక్తము. అయితే యిట్లు విరుద్ధార్థమును భగవంతు డేల చెప్పెను? అనియును ప్రశ్నింపరాదు. కర్మానుష్ఠానపరుడు, నన్ను (తనను) జ్ఞాన ద్వారమున బొందునని శ్రీకృష్ణుని యాశయమని యింతకుముందే చెప్పబడినది.

ఇట్లైనచో, విశ్వరూపోపాసకులకు సాక్షాన్మోక్షము లేనపుడు అర్జును డడిగినతరువాత యయినను 'భక్తులకు సాక్షాన్మోక్షము లేదు, జ్ఞానులకే సాక్షాన్మోక్షము' అని శ్రీకృష్ణు డేల జెప్పలేదు? వినుము. భగవంతుడు వ్యక్తముగా నీమాట చెప్పలేదుకాని, వ్యంగ్యముగా నీవిషయమును జెప్పియే యున్నాడు. తన యందు మనసునుంచి శ్రద్ధతో దన నుపాసించువారలు యుక్తతములని చెప్పెను.

కాని తనను బొందుదురని చెప్పలేదు. అక్షరోపాసకులు 'తే ప్రాప్నువంతి మామేవ' అని తననే పొందుదురని చెప్పెను. కాని వీరు యుక్తతములని చెప్పలేదు. దీనిచే జ్ఞానులకు సాక్షాన్మోక్షమనియు, భక్తులకు జ్ఞానద్వారమున మోక్షమనియును భగవంతుని యభిప్రాయము స్పష్టపడుచునే యున్నది.

రామానుజభాష్యమును బట్టిచూడ నీశ్వరోపాసకులు యుక్తతములనియు, జీవోపాసకులు ఈశ్వరుని బొందుదురనియు స్పష్టమగుచున్నది. ఈయది యత్యంత విరుద్ధము. కావున సగుణనిర్గుణ బ్రహ్మోపాసకులగు యోగిసాంఖ్యులలో నన్యతర ప్రాశస్త్యమును తెలుసుకొనగోరి "ఏవం సతతయుక్తా" అను శ్లోకముచే నర్జును డడుగుచున్నాడు.

ఇట్లు నిరంతరము నిత్యనైమిత్తిక కర్మలయందును, విశ్వరూపధ్యానాదుల యందును సమాహితచిత్తులై, సర్వాత్మభావముచే నీశ్వరునియే శరణుజొచ్చి, నీదు విశ్వరూపమును నెవరు ధ్యానించుచున్నారో, దార ధన పుత్రులయందు అభిలాషను వదలి, సర్వకర్మలను వీడి, సర్వవ్యాపియు సర్వభూతాంతరాత్మయు కర్మాధ్యక్షుడును సాక్షియు నగు నక్షరబ్రహ్మము నెవ రుపాసింతురో, వీరిరువు రిలో (అనగా విశ్వరూపోపాసక, అక్షరోపాసకులలో) నెవరు యోగవిత్తము లని యర్జునుని ప్రశ్న.

యోగమనగా కర్మయోగము, జ్ఞానయోగమున్ను– ఈ రెంటిని సేవించు వారు యోగవేత్తలు. అనగా యోగులు, జ్ఞానులు అని యర్థము. వీ రిరువురిలో నుత్తములు యోగవిత్తము లనబడుదురు. ఇచట తమప్రత్యయము విదధాతువుతో నన్వయించును. అయినను యోగశబ్దముతో నన్వయింపవలయును. దానివలన యోగులు, జ్ఞానులు– వీ రిరువురిలో నుత్తమమైన యోగమును బొందినవారు యోగులా ? (కర్మలా) లేక జ్ఞానులా ? యను ఫలితార్థము లభించును.

లేక యోగమును నతిశయించి (బాగుగా) సేవించువారుగాన యోగవిత్తము లనబడుదురు. అనగా యోగముయొక్క పరాకాష్ఠను బొందినవా రని యర్థము. కర్మయోగ జ్ఞానయోగములు రెండును యోగములగుటచే నందు కర్మలకు యోగముయొక్క పరాకాష్ఠ సిద్ధించునా ? యని పార్థుని ప్రశ్న. అనగా విశ్వరూపో పాసనము యోగమునకు పరాకాష్ఠయా ? లేక , పరబ్రహ్మోపాసనము యోగము యొక్క పరాకాష్ఠయా ? అని ప్రశ్నకు తాత్పర్యము.

ఇచట "విదంతి" యను పదమునకు "భజంతి" యను వ్యాఖ్యానము అయుక్తమని యనరాదు. ధాతువుల కనేకార్థములు గలవు. కర్మయోగాదులను అనుష్ఠించిన ఫలము గలుగును గాని, వానిని దెలిసికొనినంతమాత్రమున ఫలము

కలుగదు. కావున నిచట జ్ఞానార్థకమైన విద ధాతువునకు 'సేవించుట' అనియే యర్థమును జెప్పవలయును.

అక్షరశబ్దార్థవిచారము:

"ఏకో దేవ స్సర్వభూతేషు గూఢః, సర్వవ్యాపీ, సర్వభూతాంతరాత్మా, కర్మాధ్యక్షః, సర్వభూతాధివాసః సాక్షీ, చేతా కేవలో నిర్గుణశ్చ" అనుశ్రుతి యందు జెప్పబడిన విశేషణములు గలవా డక్షరుడు.

లేక అవ్యక్తస్వరూప విశేషణ విశిష్టుడుగూడ అక్షరు డనబడును. అక్షర బ్రహ్మము సర్వోపాధిశూన్యమగుటచే నవ్యక్తమగుచున్నది. లోకములో మనసు మొదలగు నింద్రియముల కేది గోచరమగునో యది వ్యక్తమనియు ఇంద్రియ గోచరముగానిది యవ్యక్తమనియును బ్రసిద్ధిగలదు. వ్యజిధాతువు సకర్మకము. ప్రకటించుట యని దీని యర్థము. ఈధాతువునకు కర్మయగు పదార్థము ప్రకటించుటకు యోగ్యమైనదియే యగును. ప్రకటింపయోగ్యముగానిదానిని ప్రకటన జేయుట సంభవించదు. ఇంద్రియగ్రాహ్యమైన వస్తువులే ప్రకటింప సాధ్యమగును గాని, యింద్రియగ్రాహ్యముగాని వస్తువు ప్రకటింప సాధ్యముగాదు. వ్యంగ్యమగు ఘటాదికము వ్యంజకములగు చక్షురాదులచే వ్యక్తము చేయబడుచున్నది. కావున వ్యజిధాతువు వ్యంగ్యకర్మకమగుటవలన అట్టి వ్యజిధాతువునకు కర్మ కానేరని యాత్మ యవ్యక్తుడే యగును. కాన యక్షరుడనగా నవ్యక్తుడని యర్థము. మనస్సు మొదలగు నింద్రియములకు గోచరుడు కానివాడని నిశ్చితార్థము. ౧

శ్లో. మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః. ౨

అ. శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు.

ఓయి యర్జునా! అక్షరోపాసకులగు సమ్యగ్జ్ఞానుల నట్లుండనిమ్ము. వారల గూర్చి చెప్పదగిన నంశమును నాపల జెప్పెదను. విశ్వరూపోపాసకుల విషయము ముందు జెప్పెద వినుము. ఎవరు మిక్కిలి శ్రద్ధగలిగి నాయందు మనస్సునుంచి నిరంతరము చిత్తైకాగ్రతతో నెల్లప్పుడు నన్ను సేవింతురో, వారు యుక్తతములని (యోగానుష్ఠానపరులలో గొప్పవారని) నామతము. వీరు ఎల్లపుడు చిత్తము నాయందుంచి రాత్రింబవళ్ళు గడుపుచుందురు. అందువలన వారు యుక్తతములని నేను జెప్పుచున్నాను.

ఈయది యభిప్రాయము. విశ్వరూపోపాసనలేని కేవల కర్మయోగులు యుక్తులు. విశ్వరూపోపాసకులగు కర్మయోగులు యుక్తతములు అని.

అక్షరబ్రహ్మోపాసకులగు జ్ఞానులకంటె విశ్వరూపోపాసకులగు కర్మయోగులు ఉత్తములుగాన జ్ఞానులకంటె భక్తులు యుక్తతములని యనదగదు.

ఇచట నా విషయ మ ప్రస్తుతము. కర్మ జ్ఞానయోగముల రెంటిలో జ్ఞానయోగము గొప్పదని యింతకుము న్న నేకమారులు చెప్పబడినది. జ్ఞానయోగము మోక్షము నకు సన్నిహితము "తే ప్రాప్నువంతి మామేవ" అని యిచట గూడ నీయది చెప్పబడుచునే యున్నది.

ఓయి ! సగుణోపాసక, నిర్గుణోపాసకులలో నెవరు గొప్పవారని యర్జును డడుగగా దానికి జవాబు శ్రీకృష్ణుడు కర్మయోగులు సగుణోపాసకులలో సగుణోపాసకులు గొప్పవారని జెప్పుట విరుద్ధముగదా ! కాదు. ఇచట సగుణో పాసకులు యుక్తములా ? లేక నిర్గుణోపాసకులా ? అని పార్థునిప్రశ్న. అందు సగుణోపాసకులే యుక్తములని శ్రీకృష్ణుని జవాబు. ఈయది ప్రశ్న కనుకూలము గాని ప్రతికూలముగాదు.

అయితే నిర్గుణోపాసకులు సగుణోపాసకులకంటె తక్కువవారా ? (యుక్తులా) అని ప్రశ్నరాగా నందుకు సమాధానము 'తే ప్రాప్నువంతి మామేవ' అను శ్లోకముచే శ్రీకృష్ణుడే చెప్పుచున్నాడు. నిర్గుణోపాసకులు యుక్తులుగారు. యుక్తతములును గారు. వారు కేవలము నేనే. జ్ఞానులు నాస్వరూపులే. యని శ్రీకృష్ణుని యాశయము.

ఓయీ ! జ్ఞానులు భగవద్రూపు లగుచో (అనగా భగవంతున కాత్మ భూతులగుచో) వారలలో నెవరు మిక్కిలి యోగవేత్తలు ? అనుప్రశ్న కుదరదు గదా ! అనినచో నిజమే. ఆ ప్రశ్నకును తాత్పర్య మిదియే యని గ్రహించవల యును. ఇచట వారలలో నెవరు యుక్తతము లను ప్రశ్నవలన నెవరు యుక్తులను మరియొకప్రశ్న తోచును. దాని నిచట చెప్పలేదు. అట్టి ప్రశ్నాంతరము నను సంధానముచేసికొన్నను బాధ లేదు. జ్ఞానులలో నెవరును యుక్తులు కారు. భక్తులు యుక్తతములే యగుదురు. జ్ఞాని నేనే కేవల కర్మానుష్ఠానపరులే యుక్తులు. అని సమాధానము గల్పించవచ్చును.

ఓయీ ! రెండువిధములైన యోగులలో నెవ రుత్తములు ? అని ప్రశ్నా ర్థమును నింతకుమున్న వర్ణించి యిపుడు సమాధానమును నన్యథా ప్రతిపాదించి రేమి ? అనినచో నట్లు గాదు. వినుము. 'తే ప్రాప్నువంతి మామేవ' అని చెప్పు టచే జ్ఞానులే యుత్తములని శ్రీకృష్ణుని జవాబు స్పష్టమగుచున్నది. అట్లైనచో 'తే మే యుక్తతమాః మతాః' అని చెప్పుటచే భక్తులే యుత్తములని సాక్షా చ్ఛ్రీకృష్ణుడు జెప్పిన ట్లేల కాకూడదు ? కాదు. 'యుక్తతమాః' అనుపదమునకు నుత్తములను నర్థము లభించదు. యోగవిత్తములు, యుక్తతములు, అను నీరెండు పదములకు నర్థభేదములేదని చెప్పదగదు. వక్తయొక్క తాత్పర్యము ననుసరించి శబ్దముల కర్థభేదము సంభవింపవచ్చును.

అది యెట్లన:- సగుణోపాసకులు, అక్షరబ్రహ్మోపాసకులు వీరిలో నెవరుత్తము లను తాత్పర్యముతో నర్జును డెవరు యోగవిత్తము లని ప్రశ్నించెను. ఉత్తములే యోగవిత్తము లగుదురని పార్థుని యాశయము. భగవంతుడు పార్థుని యాశయము దెలిసికొనియు వారలలో నెవరు యుక్తతములను యథా శ్రుతార్థమును గ్రహించి, భక్తులే యుక్తతములని బదులు చెప్పెను. ఇట్టి శ్రీకృష్ణుని సమాధానవాక్యముచే పార్థునకు తన వివక్షానుసారమున 'భక్తులే యుత్తము' లని శ్రీకృష్ణుడు జవాబు చెప్పెనని నమ్మిక కలుగవచ్చును. అట్టినమ్మికను నిరాకరించుటకొరకే ముందు శ్రీకృష్ణుడు 'జ్ఞానులు నన్నే పొందుదురు, నేనే జ్ఞాని స్వరూపుడను, కాన జ్ఞాని యుక్తుడుగాడు, యుక్తతముడును గాడు. నాదురూపుడే యగుచున్నాడు.' అని చెప్పబోవుచున్నాడు.

కాన నర్జును డడుగదలచిన ప్రశ్నకు జవాబు వచ్చిన ట్లగును. పార్థుని హృదయమునందు భక్తులు, జ్ఞానులు- వీ రిరువురిలో ఎవరు ఉత్తము లను నభిప్రాయము కలదు. పార్థుని ప్రశ్నవాక్యసామర్థ్యమువలన ఎవరు యుక్తతములను మరియొకప్రశ్న కూడ స్ఫురించుచున్నది. ఈ రెంటికిని శ్రీకృష్ణుడు సమాధానమును జెప్పెనని గ్రహింపవలయును.

ఇందు నిజ మేమన? "తేషాం కే యోగవిత్తమాః" అనుపదమునకు వారలలో నెవరు యోగవిత్తములు? అనునదియే నిజమైన అర్థము. భక్త జ్ఞానులిరువురిలో నెవరు యుక్తతము లని ప్రశ్నార్థము. యుక్తతములను (శ్రేష్ఠమయిన యోగులను) తెలిసికొనినచో పరిశేషన్యాయముచే యుక్తులు తెలియబడుదురు. కాన నర్జునుడు వేరుగ నడుగలేదు.

"మే ముభయులము రామలక్ష్మణులము." అని చెప్పినపిదప యిందు రాము డెవరని యడిగి తెలిసికొనగా లక్ష్మణుని వేరుగ బ్రశ్నింప బనిలేదు. అందువలన భగవంతుడగు శ్రీకృష్ణుడును పార్థుని ప్రశ్న కనుకూలముగనే 'భక్తులు యుక్తతము' లని బదులు చెప్పెను. శ్రీకృష్ణుని సమాధానమున 'జ్ఞానులు యుక్తులని తేలగా' 'తే ప్రాప్నువంతి మామేవ' అనుశ్లోకముచే శ్రీకృష్ణుడు 'జ్ఞానులు యుక్తులుగారనియు, యుక్తతములును గారనియు, వారు తనరూపులే యనియు' జెప్పెను. దీనిని వినకపూర్వము అర్జునునకు, జ్ఞానులు యుక్తులను నభిప్రాయముండెడిది. 'తే ప్రాప్నువంతి మామేవ' అను శ్రీకృష్ణవచనమును వినినతోడనే అయ్యది నిర్మూలమయినది. పైగా జ్ఞానులు భగవద్రూపులగుటవలన జ్ఞానులకంటె తక్కువవారనియును విశ్వాసము కలిగినది.

కావున, కేవల కర్మయోగులు యుక్తులనియు, భక్తియోగసహితకర్మయోగులు యుక్తతములనియు, జ్ఞానులు భగవత్స్వరూపు లనియును దేలినది.

ఇందు భక్తులు యుక్తతములని చెప్పినంతమాత్రమున, జ్ఞానులకంటె భక్తుల కుత్తమత్వము సిద్ధింపదు. అట్లనుకొనుట భ్రమమాత్రము. జ్ఞానము మోక్షమునకు సాక్షాత్సాధనము. భక్తి జ్ఞానద్వారమున పరంపరామోక్ష సాధనము. భక్తియోగము కర్మయోగములో జేరును, కర్మయోగము జ్ఞానయోగముకంటె తక్కువదని యనేకపర్యాయములు భగవంతుడు వివరించియుండెను.

కాన, జ్ఞానులకంటె భక్తు లుత్తములనియు, భక్తులు శీఘ్రముగా మోక్షము నొందుదు రనియును చెప్పు రామానుజవ్యాఖ్యాన మాదరింపదగినది కాదు. 'బ్రహ్మవి ద్బ్రహ్మైవ భవతి' 'తస్య తావదేవ చిరం యావన్నవిమోక్ష్యే' ఇత్యాది శ్రుతులు జ్ఞానులే శీఘ్రముగా మోక్షము నొందుదురని సిద్ధాంతపరచుచున్నవి.

కాన భక్తులు యుక్తతములనియు జ్ఞానులు సాక్షా దాత్మరూపులనియును భగవంతుని యభిప్రాయము. కావున జ్ఞానులే యుత్తములు. ౨.

శ్లో. యే త్వక్షర మనిర్దేశ్యం అవ్యక్తం పర్యుపాసతే
సర్వత్రగ మచింత్యంచ కూటస్థ మచలం ధ్రువమ్. ౩.

అ. ఇంద్రియసముదాయమును నిగ్రహించుకొని సర్వప్రాణులయందు సమబుద్ధిగల్గి సర్వభూతములహితమును కోరుచు శబ్దములచే నిర్వచింప నలవి కానట్టియు ప్రత్యక్షాది ప్రమాణములకు గోచరుడుగానట్టియు సర్వవ్యాపకుడై నట్టియు మనస్సుచే నూహింపశక్యము గానట్టియు కూటస్థుడగు అక్షరబ్రహ్మను నుపాసించువారు నన్నే పొందుదురు. అని పై శ్లోకమునకును నీ శ్లోకమునకును కలిపి యన్వయమును చేయవలయును.

బ్రహ్మము అనుభవైకవేద్యముగాని ప్రత్యక్షాది ప్రమాణవిషయము గాదు. శబ్దగోచరమును గాదు. అంతమాత్రమున బ్రహ్మకు వ్యవహార మెట్లు సిద్ధించినది ? శాస్త్రసంప్రదాయ మెట్లు ప్రవర్తించినది ? బ్రహ్మమునందు శాస్త్రము ప్రమాణమని చెప్పిన శాస్త్రయోనిత్వాధికరణము నెట్లు పొసగును ? శ్రీమద్భాగవతమునందలి శ్రుతిగీత లెట్లు ఉపపన్నములగును ? అని ప్రశ్నింపరాదు. సుఖదుఃఖాదులవలె బ్రహ్మ యనుభవైకవేద్యము. నాసుఖ మిట్టిది, నాదుఃఖ మిట్టిదని యెవ్వడు చెప్పనోపడు. అట్లే బ్రహ్మ మిట్టిదని నిర్వచించుట సాధ్యముకాదు. 'బ్రహ్మే'ది శబ్దములు గూడ బ్రహ్మను అభిధావృత్తిచే బోధింపనేరవు. కనుకనే బ్రహ్మ శబ్దముల కగోచరు డగుచున్నాడు.

వస్తుతః అద్వితీయమగు బ్రహ్మమునందు శబ్దాదులే లేకపోవుచుండ శబ్దగోచరత్వ మెట్లుండును ? వ్యవహారము మాయవలన సంభవించవచ్చును,

మాయశబ్దాగోచరమగు బ్రహ్మయందు శబ్దాదులను గల్పించి వానికి తద్గోచరత్వ మును గూడ గల్పించును.

ఇచట అక్షరబ్రహ్మము నుపాసించుట యను శాస్త్రోక్తవిధముచే 'అహం బ్రహ్మాస్మి' నేనే బ్రహ్మను అను నాకారముతో బ్రహ్మను సాక్షాత్కారము చేసికొనుచు, తైలధారవలె నెడతెరపిలేని సమానాకారమైన మనోవృత్తులయొక్క ప్రవాహముచే జాలకాలము మనస్సును నిలుపుటయని యర్థము. ఉపాసించదగిన యాత్మయొక్క సమీపమునందు మనసు సుషుప్తిదశలోగూడ నుండును. కాని యపుడు మనసు సద్రూపబ్రహ్మయందు లయించుటవలన దానికి (మనస్సుకు) ప్రత్యయప్రవాహములేదు. ఇక జాగ్రదవస్థలో 'నేనే బ్రహ్మను'అను వాగ్రూప మైన ప్రత్యయప్రవాహమున్నను విషయాంతరములయందు లగ్నమైన మనస్సు బ్రహ్మకు దూరమునం దుండుటచే నయ్యది యుపాసన యనబడదు. నిర్వికల్పక సమాధియందు మనస్సు బ్రహ్మసమీపమున నున్నను, ప్రత్యయప్రవాహము లేనందున నిర్వికల్పకసమాధియు నుపాసనారూపము గాదు. కనుక నుపాసనాశబ్దము నకు పైన నిర్వచించిన యర్థమే స్వరసమని గ్రహింపవలయును.

ఇచట అక్షరబ్రహ్మమునకు కూటస్థమను విశేషణ ముత్తరార్థమున గన్పట్టుచున్నది. దానియర్థ మించుకంత విచారించుట యవసరము. లోకములో పైకి గుణములు గనబడుచు, లోపల దోషములుగల ఐంద్రజాలాదికము మొదలగు మిథ్యావస్తువు, కూట మనబడుచున్నది. అట్లే పైకి రజతమువలె గనబడుచు, నిజముగా రజతముకాని రంగాదికము (తగరము మున్నగునది) కూటరజత మన బడుచున్నది. అట్లే పైకి యథార్థవాక్యములవలె గన్పించుచు, (నిజమైన మాటల వలె) నిజముగ, నిజమైన మాటలుగాని సాక్ష్యముకూడ కూటసాక్ష్య మనబడు చున్నది. అట్లే ప్రకృతమునగూడ సంసారబీజములగు మాయా, అవిద్యాదుల యందు పైకి సత్యత్వప్రియత్వాది గుణములు కనిపించుచు, లోపల దుఃఖత్వానృ తత్వాది దోషములుండుటచే, మాయావిద్యాదులు కూటము లనబడుచున్నవి.

అజ్ఞానము తన కార్యములతోగూడ అనృతము, జడము, దుఃఖాత్మకమైనను సచ్చిదానందమువలె తోచుచు, అట్లు వ్యవహరింపబడుచున్నది. కనుక అజ్ఞానము కూటవస్తు వని సిద్ధించుచున్నది. మిథ్యాభూతమగు కూటరూపకము అర్థక్రియా కారి యైనట్లు అజ్ఞానము, దానివలనబుట్టిన ప్రపంచము – ఈరెండును అనృతము లైనను, అర్థక్రియాకారులగుట (కొంతపనిని నెరవేర్చుట) యుక్త మగుచున్నది. కావున సత్యముగా దోచుచు, నిజముగా నసత్యమగు నజ్ఞానము కూటమే యగును.

ఓయీ ! అజ్ఞానమను నొకవస్తువు ఉన్నదా ? లేదా ? ఇందు మొదటి పక్షమున అద్వైతమునకు భంగము కలుగును. రెండవపక్షమున అజ్ఞానమే లేనిచో

దేనికి కూటత్వమును మీరుచెప్పెదరు ? వినుము. బ్రహ్మయందు కల్పితమగుటచే ప్రపంచవిశిష్టమగు నీయజ్ఞానము బ్రహ్మరూపముతో నున్నది. ఆరోపితములగు వస్తువులు అధిష్ఠానరూపముతో నుండుట సహజము. త్రాటియందు కల్పింపబడిన సర్పము త్రాటిరూపముతో నుండునుగాని, సర్పరూపముతో నుండుటలేదు. కాన నిజము విచారించినచో నజ్ఞానపదవాచ్యమగు వస్తువు బ్రహ్మమేకాని వేరుకాదు. ఆ బ్రహ్మము ఏకమైనందున అద్వైతహాని లేదు. సచ్చిదానందబ్రహ్మమే అనృత, జడ, దుఃఖ రూపమైన అజ్ఞానస్వరూపముతో గ్రహింపబడుచు కూట మనబడు చున్నాడు. కావ కల్పితమైన అజ్ఞానశబ్దవాచ్యమగు వస్తువు కలదనుటలో బాధ లేదు.

మిథ్యారజతము యథార్థరజతము అనిట్లు కూటాజ్ఞానము, సత్యాజ్ఞానము అని రెం డజ్ఞానములు లేకున్నను కూటబ్రహ్మ, సత్యబ్రహ్మ అని యిద్దరు బ్రహ్మ లుండుట పొసగును. కూటబ్రహ్మయను వ్యవహారము శాస్త్రమునం దెచ్చటను కనుపించుట లేదుగదా ! అని యనరాదు. కార్యబ్రహ్మ యనుశబ్దమే కూటబ్రహ్మయనుశబ్దమునకు పర్యాయ మగుచున్నది. అనగా బ్రహ్మయందు కల్పితమైన అజ్ఞానము కార్యబ్రహ్మగా వ్యవహరింపబడుచున్న దని భావము.

అజ్ఞానమునందు ప్రతిఫలించిన చిదాభాసుడగు నీశ్వరుడు కార్యబ్రహ్మ యగునుగాని కేవల మజ్ఞానము కార్యబ్రహ్మ మనిపించుకొనదుగదా! అని యనరాదు. ఆ చిదాభాసముగూడ మిథ్యయగుటచే కూటమే యగుచున్నది అజ్ఞానమునందు ప్రతిఫలించిన చిదాభాసము ఈశ్వరు డెట్లో, చిదాభాసతోగూడిన యజ్ఞానముకూడ నట్లే యీశ్వరు డగును. కావున కార్యబ్రహ్మయే కూటబ్రహ్మ. కార్యమంతయు మిథ్యయగుటచే కూటము. అట్టి కూటబ్రహ్మయే యజ్ఞానము. దాని పరిణామమే ప్రపంచము. కాన ప్రపంచముగూడ అజ్ఞానమే.

ఓయీ ! కార్యబ్రహ్మ, కారణబ్రహ్మ అని యిద్దరు బ్రహ్మ లుండుట యప్రసిద్ధముగదా ! 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ' అనికదా శ్రుతిచెప్పుచున్నది. అనినచో నట్లు కాదు. వినుము. ఇద్దరుబ్రహ్మలు కలరు. 'బాఢం ద్వే బ్రహ్మణీ' (అవును యిద్దరుబ్రహ్మలు) అని భాష్యకర్తలే చెప్పిరి. 'ఏతద్వై సత్యకామ, యత్పరంచ అపరంచ' అని శ్రుతికూడ పరాపరబ్రహ్మ లిద్దరు కలరని చెప్పుచున్నది. కనుకనే శాస్త్రమునం దచ్చటచ్చట అపరబ్రహ్మకంటె వేరని నిర్ణయించుటకు 'పరబ్రహ్మ' అని బ్రహ్మపదమునకు పరపదము విశేషణము చేయబడుచున్నది. బ్రహ్మ మొక్కటే యైనచో నాతనికి పరబ్రహ్మయని పరపదవిశేషణ మెందులకు ? కాన కూటరూపక సత్యరూపకములవలె కూటబ్రహ్మ, సత్యబ్రహ్మ లిద్దరు గలరు. అందు కనిపించునట్టి అజ్ఞానము, తజ్జన్యమగు ప్రపంచము- ఇది

యంతయు కూటబ్రహ్మము. సత్యబ్రహ్మ యన దృగాత్మ (జ్ఞానస్వరూపుడు) అని భేదము.

కాన కూటశబ్దవాచ్యమగు అజ్ఞానమునందు సాక్షిస్వరూపముతో నుండుటచే బ్రహ్మ కూటస్థు డనబడుచున్నాడు. చీకటియందు వెలుతు రుండుట యెట్లు పొసగదో, యట్లే యజ్ఞానమునందుగూడ సాక్షిరూపముతో నైనను జ్ఞానస్వరూపుడగు బ్రహ్మ ముండుట పొసగదుగదా! యని యనరాదు. చైతన్యరూపమగు జ్ఞానము అజ్ఞానమునకు విరోధికాదు. అజ్ఞానమునందు చైతన్యరూపమగు బ్రహ్మము లేనిచో బ్రహ్మకు సర్వాంతరాత్మత్వము సిద్ధింపదు. కావున అంతట సచ్చిదానందరూపముతో వ్యాపించియున్న బ్రహ్మము అజ్ఞానమునందుగూడ నుండియే యున్నాడు.

### కూటశబ్దమున కర్థాంతరము

లేక, కూటమనగా రాశి. దానివలెనుండువాడుగాన కూటస్థుడు. లోకములో ధాన్యాదులయొక్క రాశి తనకు కావలసినంత ప్రదేశమును వ్యాపించి యెల్లపుడు ఎట్లుండునో అట్లే మహత్పదార్థముకంటె మహత్పదార్థమగు పరమేశ్వరుడు గూడ సర్వప్రపంచమును వ్యాపించి యెల్లపుడు ఉంటున్నాడు. రాశివలె నున్నందుననే కూటస్థబ్రహ్మమునకు అచలము అనుపదము సార్థకమగుచున్నది. మాయకు నధిష్ఠానమగుటవలన గూడ కూటస్థునకు చలనరాహిత్యము సంభవించవచ్చును. ఏలనన? మాయ అంతట యున్నది. దాని కధిష్ఠానమగు బ్రహ్మముకూడ నంతట యుండును. అంతట యున్న బ్రహ్మమునకు చలన మెట్లు కలుగును? అపరిపూర్ణ పదార్థము చలించునుగాని పరిపూర్ణవస్తువు చలింపనేరదుగదా! ఈతడు పరిపూర్ణుడుగనుకనే నిత్యు డగుచున్నాడు. లోకములో నొకదేశమునుండి మరియొక ప్రదేశమునకు వెడలిన వస్తువు నశించినదని యనబడుచున్నది. మానవలోకము నుండి స్వర్గాదిలోకముల కేగిన దేవదత్తాదులు నశించిరని లోకవ్యవహారము ఇట్లుండ అంతట నిండియున్న పరమేశ్వరుడు దేశాంతరగతుడుకాడు గాన నీతనికి నశించె నను వ్యవహారము లేదు. కనుకనే యీ శ్లోకమునందలి 'ధ్రువం' అను పదము పొసగుచున్నది.

**రామానుజమతము:**

వీరిమతమున 'అక్షర' మన ప్రత్యగాత్మ స్వరూపమని యర్థము. 'అనిర్దేశ్య' మన దేహాదులకంటె వేరుగ దేవాదిశబ్దములచే నిర్దేశించతగనివాడు. 'సర్వత్రగం' అనగ దేవతాదిశరీరములయం దుండువాడు. 'కూటస్థమ్' అనగా సర్వసాధారణమైనవాడు. 'అచలమ్' అనగా చ్యుతిలేని (జారిపోని) యాకారముగలవాడు. అనియిట్లు ఈ యీ పదముల కర్థనిర్వచనమును రామానుజులు తమభాష్యమున జూపిరి.

ఈయది యనుచితము. దేవాదిశబ్దములచే చెప్పనలవికానందున అక్షర మనిర్దేశ్యమగుచో బ్రహ్మానందాదిశబ్దములచే జెప్పనలవికానందున దేహముమాత్ర మనిర్దేశ్య మేల కాగూడదు ? 'యత్తదద్రేశ్యమ్, అగ్రాహ్యమ్' 'యతో వాచో నివర్తంతే' ఇత్యాది శ్రుతులు ఆత్మయే అనిర్దేశ్యుడని చెప్పుచున్నవి. దేహ మనిర్దేశ్యమని చెప్పుటలేదు. కనుక శ్రుతివిరుద్ధార్థము సంభవించును. మరియు రామానుజమతమున ఆత్మలు అణురూపులు. అణురూపులగు ఆత్మలకు దేవాద్యనేక శరీరములయం దునికి సంభవింపదు. ఒక్కొకయాత్మ ఒక్కొకశరీరమునం దంతట యుండుటచే సర్వదేహస్థుడని వారు చెప్పినను అట్టి యాత్మ ఒక్కశరీరమునం దంతట యుండుటవలన నొకచోటనే యున్నవా డగునుగాని యంతట యున్నవాడు (సర్వత్రగః) గానేరడు. సర్వశబ్దము దేవాదిదేహపరముగా సంకోచపరచుట యుక్తముగాదు. సర్వశబ్దమునందు పాషాణాదిసర్వపదార్థములను జేర్చుటయే యుత్తమము. అపుడు అచేతనములైన పాషాణాదులయందు అక్షరుడగు ప్రత్యగాత్మ లేనందున అక్షరునకు అంతటయుండుట యనునది (సర్వత్రగత్వము) పొసగనేరదు.

ఇక ఒకే యాత్మ కాలభేదముచే దేవాదిశరీరములను స్వీకరించుచున్నందు వలన దేవాదిశరీరములం దంతట యుండుట పొసగునన్నచో నదియును పొసగదు. వారివ్యాఖ్యానమున (సర్వత్రగం దేవాది దేహేషు వర్తమానం) అని వ్రాసిరి. కాని కాలభేదమును జూపలేదు. వర్తమానకాలమునం దొకశరీరమునందున్న ప్రత్యగాత్మ శరీరాంతరములయం దుండుట సంభవించదు. కాయవ్యూహవిద్యచే నయ్యది సంభవించునన్న నట్టివిద్య మాయామయమగుటచే నిచట యుదాహరణము గాదు.

అట్లే కూటస్థపదమునకు సర్వసాధారణు డను నర్థముగూడ ఉచితముగాదు. సర్వసాధారణత్వము కూటస్థశబ్దార్థమగుచో పృథివ్యాది పదార్థములుగూడ సర్వసాధారణములుగాన కూటస్థశబ్దార్థము లగును. అవియును పశు, పక్షి, మనుష్యాది సర్వప్రాణులకు సాధారణము లగుచున్నవి. నీరు త్రాగుట కందరకు సాధారణమైనది. పృథివి నివసించుట కందరకు సమానము. గాలి పీల్చుకొనుటకు, గగనము అవకాశ మిచ్చుటకు, అగ్ని శీతబాధను పోగొట్టుటకును అందరకు సమానము లగుచున్నవి. మరియు శరీరము ఆత్మ లందరకు భోగాయతనమగుచు, సర్వసాధారణమైనందువలన దేహముగూడ కూటస్థశబ్దార్థము కావలసివచ్చును.

ఇక సర్వసాధారణత్వ మనగా వారిమతమున ఆయాదేవాదుల యసాధారణాకారముతో సంబంధించియుండుట అని యన్నచో నిట్టిసాధారణత్వము జలాదుల యందుగూడ కలదు. జలాదులును దేవాదులయొక్క యసాధారణాకారముతో సంబంధించియే యున్నవి. ఇక జలాదులయందు రసత్వ, గంధత్వ, రూపత్వాదులు

అసాధారణాకారములు గలవుగాని, సాధారణాకారము లేదన్నచో జీవునియందు కూడ చేతనత్వాదులు అసాధారణాకారములు కలవు. నిరాకారమునకే సర్వ సాధారణత్వ మని యంగీకరించినను, వాయ్వాకాశములుగూడ నిరాకారములై నందున సర్వసాధారణములగుచు, కూటస్థశబ్దవాచ్యములు గావలసివచ్చును. ఇట్లే మనస్సునకు ఇంద్రియాదులకుగూడ నిరాకారములైనందువలన కూటస్థశబ్దవాచ్య త్వము ప్రసక్తించును. కనుక నిట్లు కూటస్థశబ్దమునకు ముఖ్యార్థమును విడిచి, లాక్షణికార్థము నంగీకరించుట అయుక్తము, అప్రమాణము నగును.

ఇట్లే అచలమను పదమునకు అప్రచ్యుతాకారమను అర్థవర్ణనముగూడ యుక్తముగాదు. అనగా చలించని యాకారముకలవాఁడు. అనగా నాకారమునుండి చలించనివాడు అని తాత్పర్యము. ఈయర్థమునందు ఆకారమునకు అపాదాన త్వము ప్రాప్తించుచున్నది. ఈయది స్వకపోలకల్పిత మగును. చలించనిది(నచలతి) అచలము అని అపాదానములేకుండగనే అచలపదనిర్వచనము సిద్ధించు చున్నది. కావున అపాదానకల్పనము స్వకపోలకల్పిత మగును. ఇట్టితరి ఘటము కూడ మృత్స్వరూపమునుండి చలించుటలేదుగాన నచల మేల కాగూడదు?

ఇక అద్వైతమతమునజీవునకు శరీరమునుండి వెడలిపోవునపుడు ఉత్క్రాంతి (లేచిపోవుట) అంగీకరించినందున అద్వైతమతమునమాత్రము జీవు డచలు డె ట్లగును ? అని ప్రశ్నింపరాదు. సర్వవ్యాపకుడు, అచలుడు నగు ఆత్మకుగూడ బుద్ధితాదాత్మ్యాధ్యాసచే నుత్క్రాంత్యాదులు(చలనాదులు)సంభవించవచ్చును. 'ధ్యాయతీవ లేలాయతీవ' అనుశ్రుతిని బట్టి బుద్ధి చలించుచుండగా ఆత్మ చలించు వాడుగ నుండుననియు, బుద్ధి (అంతఃకరణము) శరీరమునుండి లేచిపోవుచుండగ ఆత్మ లేచిపోవువాడువలె నుండుననియు స్పష్టమగుచున్నది. అందువలన అద్వైత మతమున స్వతస్సిద్ధముగ చలనరహితుడగు ఆత్మకు అచలత్వము (చలనము లేకుండుట) యుక్తమగును. కావున పై పదములకు రామానుజులు చూపిన నిర్వచన మంగీకరింపదగదు. ॥3॥

శ్లో. సన్నియమ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః ॥4॥

అ॥ ఇష్టవస్తువు ప్రాప్తించినపుడు హర్షము, అనిష్టవస్తువు ప్రాప్తించినపుడు ఉద్వేగము లేక నెల్లపు డేకరూపమగు బుద్ధితోనుండి యింద్రియనిగ్రహము గలవారై సకలభూతములకు హితమును జేకూర్చువారు (లేక సర్వభూతహితు డగు ఆత్మయందు దాసక్తికలవారు) పరమాత్మయగు నన్నే పొందుదురు. ఇతరుని పొందరు. లేక, వారు నన్ను బొందియే తీరెదరు; అనికాని, 'సర్వం వాక్యం సావధారణమ్' అను న్యాయమునుబట్టి వారే నన్ను పొందియే తీరుదురు కాని అని

యన్వయించుకొనవచ్చును. ఇంతియేకాని కర్మయోగులుగాని, భక్తులుగాని పరమాత్మను సాక్షాత్తుగా పొందలేరు.

ఓయి, ఇత్యాది పొందనివానిని పొందుటయా? లేక నిత్యముగా పొంది యున్నవానిని పొందుటయా? మొదటిపక్ష మవలంబించినచో పరమాత్మ కార్య రూపుడు, అనిత్యుడు కావలసివచ్చును. సర్వవ్యాపకుడు గాకపోవును. అన్నిటితో నెల్లపుడు సంబంధించినవస్తువు సర్వవ్యాపి యనబడుచున్నది. ఇక నిత్యము ప్రాప్తమయియున్నవానిని యిపుడు తిరిగిపొందుట సంభవించనందున రెండవ పక్షము పొసగదు, అనినచో నిజమే, కనుకనే 'వారు నేనే' అనియే చెప్పవలెగాని, 'వారు నన్ను బొందుదురు' అని ముందుగా జెప్పతగదు. కనుకనే శ్రీకృష్ణుడు వెనుక 'జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్' అని చెప్పియుండెను. అయితే యిపుడు మాత్ర మట్లేల జెప్పలేదు? అనినచో వినుము. మెడలోనున్న కంఠాభరణమును మరచినవానికి మెడలోనున్నటుల జ్ఞాపకముచేయగా వానికి నది పొందిన ట్లగ పడును. అట్లే నిత్యాప్తుడయిన ఆత్మ యజ్ఞానమువలన పొందబడనివాడువలె దోచెను. జ్ఞానమువలన అజ్ఞానము నశించగా, పొందబడినవాడువలె నుండును. అందువలన శ్రీకృష్ణుడు 'తే ప్రాప్నువంతి' వారు పొందుదురు అని చెప్పెను.

అయితే, వారలలో నెవరు యోగవిత్తములు? అని యర్జును డడిగిన ప్రశ్నకు భగవంతుడు చెప్పిన యీసమాధాన మేమి యుచితము? ఇంతకుమున్ను భక్తులు యుక్తతములని చెప్పియున్నందున నిపుడు జ్ఞానులు యుక్తులనికదా చెప్ప వలెను? కాదు, భగవత్స్వరూపులై నిర్విశేషచిన్మాత్రమునందు అహమ్ అను నాత్మబుద్ధితో నొప్పు విద్వాంసులు యుక్తతములనికాని, యుక్తులనికాని చెప్ప తగదు. అక్షరోపాసకులు కర్మయోగులవలె యుక్తులు కారు. విశ్వరూపోపాసకుల వలె యుక్తతములును గారు. మరేమనిన వారు సాక్షాద్భగవద్రూపులే యగు దురు. కావున భగవంతుని సమాధానము ప్రశ్నానుకూలమే యగునుకాని, ప్రశ్నకు ప్రతికూలము కానేరదు. ॥౪॥

శ్లో. క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్త చేతసామ్,
అవ్యక్తాహి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే ॥౫॥

అ॥ అక్షరాత్మోపాసకులకు ప్రయాస అధికము, వా రతికష్టముచే నక్ష రాత్మను బొందుదురు. భక్తులకు క్లేశ మధికమనియు, జ్ఞానులకు దేహాభిమాన పరి త్యాగము అవసరమైనందున అత్యాది దుర్లభమగుటచే వీరిప్రయాస అధికతరమని యును భేదము గ్రహింపవలయును. దీనివలన భక్తులకు దేహాభిమాన ముండునని తెలుచున్నది. మానవుల కనాదికాలమునుండియు దేహాభిమానము కలదు. దానిని విడుచుట కష్టము. దేహాభిమానమును వీడనిదే పరమాత్మయం దాత్మబుద్ధి కలు

గదు. కావున అతిప్రయాసపడి నిర్గుణోపాసకులు దేహాభిమానమును విడువవలెను. భక్తులు విశ్వరూపదేహమునందు ఈశ్వరబుద్ధిని, మనుష్యాది దేహమునందు జీవబుద్ధిని యుంచెదరు. కాన వారికి (భక్తులకు) దేహాభిమానమును వదలవలె నను ప్రయాసలేదు. దేహాభిమానము వదలనివారికి ఆత్మ సులభుడు గాదు.

కాన ఆత్మలాభముకొరకు అక్షరోపాసకులు మిక్కిలిప్రయాసను జెందుదు రని పరమార్థము.

ఓయీ! జ్ఞానమువలననే కైవల్యము కలుగునని శ్రుతి చెప్పుచుండ, నీ యక్షరోపాసన మెందులకు? వినుము. ఎవరు శ్రవణ మననాదులచేతనే ఆత్మను బ్రహ్మగా దెలిసికొందురో వారికి జ్ఞానమువల్లనే కైవల్యము. ఉపాసనతో బని లేదు. మరియెవరు ప్రతిబంధబాహుళ్యమువలన అనేకమారులు శ్రవణాదు లొనర్చి నను ఆత్మను తెలిసికొనలేరో, అట్టివారలకు అక్షరోపాసనను విహితము. వీరికి ఉపాసనామహిమవలన ప్రతిబంధము నశించి, ఆత్మయందు బ్రహ్మబుద్ధి పుట్టును. ఈయుపాసనము బ్రహ్మసాక్షాత్కారపర్యంతము చేయవలయును. అటుపైన చేయ నక్కరలేదు. నీరు దొరికినతరువాత గోయి తీయుట వ్యర్థముగదా! కాన ప్రతి బంధక్షయముకొరకు ఉపాసన మవసరమని సుస్పష్టము. ॥౫॥

శ్లో. యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే ॥౬॥

అ. అక్షరోపాసకులయొక్క ప్రవృత్తిని గురించి ఇకముందు 'అద్వేష్టా సర్వభూతానామ్' అను శ్లోకము మొదలుకొని చెప్పెదను.

ఇపుడు భక్తులయొక్కపరిస్థితి చెప్పెద వినుము. ఎవరు నేనే గొప్పవాడ నని నాయందు పరమేశ్వరత్వబుద్ధిని యుంచి, అనన్యయోగముతో నన్ను నిరంతరము ధ్యానింతురో, అట్టివానిని నేను సంసారసాగరమునుండి యుద్ధరింతును. ॥౭॥

శ్లో. తేషా మహమ్ సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్,
భవామి నచిరాత్పార్థ! మయ్యావేశిత చేతసామ్ ॥౭॥

అ॥ ఓయీ! అర్జునా? నాదు విశ్వరూపము నుపాసించుటయందు ఆసక్తి గల నాభక్తులను నేను మృత్యుసంసారసాగరమునుండి కొలదికాలములోనే జ్ఞానము నిచ్చి యుద్ధరింతును. అని దీనిభావము.

జ్ఞానములేనిదే మోక్షము సంభవించదు. ఈశ్వరుడు స్వస్వరూపమగు మోక్షమును భక్తులకు స్వయముగా నీయడు. ఈశ్వరానుగ్రహమువలన జీవులకు ఈశ్వరసాయుజ్యము కలుగుననికాని దుఃఖధ్వంసరూపమగు మోక్షము కలుగునని కాని, యనుకొనుట పొరపాటు. జీవులకు ఈశ్వరసాయుజ్యము నిత్యసిద్ధము.

అసంగుడు, ఆనందరూపుడు నగు జీవునకు దుఃఖసంబంధ మసంభవము. 'కామస్సంకల్పః' అను శ్రుతి సుఖదుఃఖాదులు మనోధర్మములని స్పష్టముగా తెలుపుచున్నది. నిరతిశయబ్రహ్మానంద ప్రాప్తికూడ జీవులకు ఈశ్వరానుగ్రహమువలన కలిగెడిది కాదు. జీవునకు బ్రహ్మానందము స్వతస్సిద్ధమేకాని యాగంతుకము కాదు. వికారరహితుడగు ప్రత్యగాత్మయే జీవుడు.

అయితే ఈశ్వరుడు సంసారసాగరమునుండి జీవు నుద్ధరించు టెట్లు ? చెప్పెద వినుము. జ్ఞానమునిచ్చి జీవుల నుద్ధరించునని నమ్ముము. అజ్ఞానమువలన జీవుడు తాను దేహాదిరూపుడనని తలచి సంసారసాగరమున బడియుండును. వాడే ఈశ్వరానుగ్రహమువలన తాను దేహాదివిలక్షణ సచ్చిదానందబ్రహ్మ యని తెలిసికొని సంసారసాగరమునుండి ఉత్తీర్ణు డగును. "ఈశ్వరానుగ్రహాదేవ పుంసా మద్వైతవాసనా" అనుస్మృతినిబట్టి ఈశ్వరానుగ్రహము జ్ఞానప్రయోజకమేగాని మోక్షప్రయోజకము కాదు. అజ్ఞానమూలమగు రజ్జుసర్పభ్రాంతి రజ్జుతత్త్వజ్ఞానమువలననే నివర్తించును.

కావున నీశ్వరమాయచే వివేకజ్ఞానము నశియించి యనాత్మతాదాత్మ్యాధ్యాసను బొంది సంసరించు జీవులను భగవంతుడు భక్తిచే ననుగ్రహించినచో వారల వివేకవంతులజేసి యనాత్మతాదాత్మ్యాధ్యాసను రూపుమాపి యాత్మసాక్షాత్కార మొసంగును. దాన వారు ముక్తులగుదురు. కాన యీశ్వరుడు భక్తులను సంసారసాగరమునుండి యుద్ధరించునని చెప్పుట యుచితమగును.

భక్తులస్థితి యీశ్వరాధీనమయి యుండుటంబట్టియే వీరలయందు పూర్వులు మార్జారకిశోరన్యాయము నుపయోగించిరి. మార్జారము తన శిశువును తాను నోటితో గఱచుకొని యింకొకచోటికి దీసికొనిపోవును. అట్లె యీశ్వరుడుకూడ భక్తులను స్వయముగా జ్ఞానమునిచ్చి సంసారమునుండి తరింపజేయును.

జ్ఞానులు తమంతట తామే తరింతురు. వారలకు అజ్ఞానాంధకారము సూర్యుని వెలుగున చీకటి నశించినట్లు "అహం బ్రహ్మాస్మి" అను జ్ఞానమున సమూలముగా నశించును. కావున వీరలయందు మార్జారకిశోరన్యాయము ప్రసరించదు. వీరలయెడ పూర్వులు మర్కటకిశోరన్యాయము నుపయోగింతురు. కోతిపిల్ల తనంతట తానే తన తల్లియుదరమును గట్టిగా బట్టుకొని (కౌగలించుకొని) యొకచెట్టునుండి మరియొక చెట్టునకేగును. అట్లే జ్ఞానికూడ స్వయముగానే యీశ్వరుని యాత్మనుగా దెలిసికొని బ్రహ్మసాయుజ్యమును బొందును.

దీనివలన స్వయముగా సంసారసాగరమును దరింప సమర్థులగు జ్ఞానులు యిట్టి సామర్థ్యములేని భక్తులకంటె గొప్పవారని తేలినది. భక్తులు పరమేశ్వరుని సాయము సంసారసాగరమును థరింతురుగాన వారికి ప్రయాసలేదనియు జ్ఞానులు

స్వయముగా నద్దానిని తరింపవలెగాన జ్ఞానులకు ప్రయాసమే యుండదనియు సూచిత మగుచున్నది.

కాని భక్తులుగూడ నీశ్వరానుగ్రహమున జ్ఞానము నొంది జ్ఞానమను దెప్ప చేతనే సంసారమును దరింతురు. మొదట భక్తులుగానుండియేపిదప జ్ఞాను లగు చున్నారు. ఇట్టితరి భక్తులనుమాత్రము యీశ్వరు డుద్ధరించునని చెప్పు టెట్లు పొసగును? అనినచో నిజమే. భక్తుల నీశ్వరు డుద్ధరించుననగా సంసారసాగరోత్తారక మగు జ్ఞానమును భక్తుల కిచ్చునని యే దానియర్థము.

జ్ఞానులకు సంసారములేదు. వారి నుద్ధరించువాడును లేడు. జ్ఞానులే యీశ్వరుడు. ఈశ్వరుడే జ్ఞానులు. వీ రిరువురకును భేదములేదు.

లేక, సగుణబ్రహ్మోపాసకులను యీశ్వరుడు సంసారసాగరమునుండి జ్ఞానము నిచ్చి యుద్ధరించుననియు, నిర్గుణోపాసకులు స్వయముగానే ఆత్మసాక్షాత్కారము నొంది సంసారమును దరింతురనియు జెప్పవచ్చును. సగుణోపాసకులు గూడ నిర్గుణోపాసకు లయియే ముక్తి జెందుదురుగదా ? (భక్తులు జ్ఞానులయియే ముక్తినొందినట్లు) అని యనరాదు. నిర్గుణోపాసనము జ్ఞానము కాదు. నిర్గుణ బ్రహ్మసాక్షాత్కారమే జ్ఞానము. కావున సగుణోపాసకులకు నిర్గుణోపాసకు లయియే ముక్తిని పొందవలెనను నియమము లేదు.

కాన సద్గుణోపాసకులను యీశ్వరుడు మార్జారకిశోర న్యాయమున సంసారమునుంచి తరింపజేయుననియు, నిర్గుణోపాసకులు మర్కటకిశోరన్యాయమున స్వయముగానే తరింతురనియు, జ్ఞానులకు వారిదృష్టిలో సంసారముగాని, సంసార తరణముగాని, యీ రెండును లేవనియును భేదము సిద్ధించినది.

ఓయి ! ఇట్లైనచో, అవ్యక్తోపాసకులు జ్ఞానులనికదా యింతకుమున్ను జెప్పితిరి. ఇపుడు నిర్గుణోపాసనము జ్ఞానము కాదన్నచో వెనుకటి మాటకు విరుద్ధ మగునుకదా ? కాదు, వినుము. అవ్యక్తోపాసకులు ఆత్మానాత్మవివేక జ్ఞానము గలవారుకనుకనే జ్ఞానులని వ్యవహరింపబడిరి. నిర్గుణబ్రహ్మసాక్షాత్కారము గలవారని కాదు. ఇట్టితరి సగుణోపాసకులుగూడ నీశ్వరానుగ్రహమువలన ఆత్మసాక్షాత్కారమును బొంది యాత్మను బొందుదురనియు అవ్యక్తోపాసకులుగూడ నాత్మ సాక్షాత్కారమునొంది యాత్మను పొందుదురనియును దేలినది. ఇట్లుండ భగవంతుడు "తే ప్రాప్నువంతి మామేవ" (వారు నన్నే పొందుదురు) అని జ్ఞానులను గూర్చియు "తే మే యుక్తతమా మతాః" (వారు మిక్కిలి యోగకుశలులు) అని భక్తులను గూర్చియు భగవంతుడు చెప్పు టెట్లుపొసగును?

వినుము, అక్షరోపాసకులకు (అవ్యక్తోపాసకులకు) తత్వసాక్షాత్కారమునకు పూర్వముగూడ తత్వసంబంధమయిన పరోక్షజ్ఞానము కలదు. కావున జ్ఞానులగు

వీరు (అవ్యక్తోపాసకులు) సచ్చిదానందుడగు నీశ్వరుని యాత్మరూపునిగ బొందుదురు. ఆత్మానాత్మవివేకము లేకుండుటచే భక్తుల కట్టిపరోక్షజ్ఞానముకూడ లేదు. కాన పరోక్షజ్ఞానులు అక్షరోపాసనమువలన నపరోక్షుడగు నీశ్వరుని పొందుటచే "తే ప్రాప్నువంతి మామేవ" (వారు నన్నే పొందుదురు) అని చెప్పబడినది. అక్షరోపాసనమునకు తత్త్వసాక్షాత్కారమనెడి యీశ్వరప్రాప్తియే ఫలముగాని వేరొండు ఫలము లేదు.

భక్తులు ఈశ్వరోపాసనమువలన ఆత్మానాత్మవివేకము నొంది పిదప పరోక్షజ్ఞానమును బడసి యావల తత్త్వసాక్షాత్కారమును బొందుచున్నారు. కాన భక్తులకు నీశ్వరప్రాప్తికంటె వేరుగ బొందదగినఫలములు రెండు కలవు. ఆత్మానాత్మవివేకము, పరోక్షజ్ఞానము అని ఈరెండును భక్తులకు నడ్డుండుటచే, వారియెడ భగవంతుడు "తే ప్రాప్నువంతి మామేవ" (వారు నన్నే పొందుదురు) అని చెప్పలేదు. వారు యోగకుశలులని మాత్రమే చెప్పెను "తే మే యుక్తతమా మతాః) అని వివేకాదిప్రాప్తిద్వారా వారలకుగూడ క్రమముగా మోక్షముండును. కాన యాత్మానాత్మవివేకజ్ఞానములేని భక్తులకంటె ఆత్మానాత్మవివేకజ్ఞానముగల జ్ఞాను లుత్తములని సంస్పష్టము.

కావున వివేకజ్ఞానహీనులగు సగుణోపాసకులను భగవంతుడు వివేకజ్ఞానము నొసంగి సంసారమునుంచి యుద్ధరించును. వివేకజ్ఞానముగల అక్షరోపాసకులు వివేకాది సాధనములచే స్వయముగానే తరింతురు. కాన నక్షరోపాసకులకు నీశ్వరానుగ్రహముతో నపేక్షలేదు. అక్షరోపాసకులు ఈశ్వరుడు వేరు, ఆత్మ వేరు అని తలంచరు. ఆత్మయే యీశ్వరుడని తలంతురు. భక్తులు తరించుటకు నీశ్వరానుగ్రహముతో నపేక్ష కలదు.

ఓయి! ఈశ్లోకమున 'అహం తేషాం మృత్యుసంసారసాగరాత్ నచిరాత్సముద్ధర్తా భవామి' (నేను వారలను మృత్యుసంసారసాగరమునుండి వెంటనే లేవదీయుదును) అనియుండుటచే భక్తులకు తత్త్వసాక్షాత్కారమును సులభముగా సుఖముగా నీశ్వరు డిచ్చుననియు, భక్తులుకానివారల కాత్మసాక్షాత్కారము దుర్లభమనియును దెలియుచున్నందున జ్ఞానముకంటె భక్తియే గొప్పదని యేల జెప్పగూడదు? అట్లు కాదు, వినుము. "తే ప్రాప్నువంతి మామేవ" అని చెప్పుటచే నక్షరోపాసకులకే భగవత్ప్రాప్తి సులభమని తేలుచున్నది. ఈశ్వరుడయినను భక్తులకు తత్త్వసాక్షాత్కారమును వేరుగా నీయజాలడు. అట్లిచ్చునో వివేకాదిసాధనములు వ్యర్థము లగును. మరేమనిన; వివేకాదిసాధనముల నిచ్చియే తత్త్వసాక్షాత్కారము నీయవలెను. కావున వివేకాదులుగల అక్షరోపాసకులు

మోక్షమున కంతరంగులనియు, వివేకజ్ఞానరహితులగు భక్తులు మోక్షమునకు బహిరంగులనియును జెప్పకతప్పదు

ఈశ్వరుడు వివేకము, పరోక్షజ్ఞానము, అపరోక్షజ్ఞానమున్ను భక్తుల కొకే సారి నిచ్చుననుటయు పొసగదు. అట్లీయు నీశ్వరునకు నిర్గుణోపాసకులయందు ప్రద్వేష మేమి? వారికి వివేకజ్ఞానమున్నను పరమాత్మసాక్షాత్కార మిచ్చుట లేదే! భక్తిలేనందువలన నందురా? కూటస్థేశ్వరునందు భక్తిభావము గలిగి యాత్మరతులగు నిర్గుణోపాసకులకు ఈశ్వరభక్తి లేదనుట యెట్లు పొసగును? విశ్వరూపుడగు కృష్ణుడే యీశ్వరుడుగాని కూటస్థుడీశ్వరుడు గాదనుట పాడియా! పైగా సచ్చిదానందరూపుడగుటచే కూటస్థునే ఈశ్వరు డనవలయును. విశ్వరూపుడగు శ్రీకృష్ణుని మాయామయు డగుటవలన నీశ్వరుడని యనదగదు. యథార్థ మిట్లుండ సత్యస్వరూపుడగు కూటస్థాత్మను ఈశ్వరునిగా నుపాసించువారే ఈశ్వరునకు ప్రియులనవలయును. అయథార్థమగు విశ్వరూపుని ఈశ్వరునిగా నుపాసించువారీశ్వరున కంతటిప్రియులు గారు. తండ్రికి పండితుడగు కుమారునియందు ప్రేమ యుండునుగాని, మూర్ఖునియం దుండదు. భగవంతుడుగూడ సర్వప్రపంచమునకు తండ్రి. కావున పండితులగు బ్రహ్మాదిపుత్రులే భగవంతునకు ఇష్టులగుదురు. కనుకనే జ్ఞానులు 'నాకుప్రియులు' అనుమాట చెల్లును. ఇట్లు ప్రియులైన కుమారులనుగూడ ఈశ్వరుడు సంసారసాగరమునుండి తరింపజేయును. వారలకు అక్షరోపాసనముచే ఆత్మసాక్షాత్కారము కలుగగా ఈశ్వరుడు తరింపచేయదగిన సంసార సంబంధమే వారికి లేదు. అట్టి సంసారసంబంధము భక్తులకు కలదు. కావున ఈశ్వరుడు భక్తుల నుద్ధరించును. జ్ఞానుల నుద్ధరింప బనిలేదు. ఇంతమాత్రమున భక్తులే యీశ్వరున కిష్టులనియు జ్ఞానులకు స్వయముగ సంసారసాగరమును తరించుటయందు ప్రయాసగలదనియు భ్రమింపతగదు.సంసారమే లేనివారలకు సంసారతరణప్రయాస యనునది యసంభవము. జ్ఞానులు నా కిష్టులని యింతకుమున్ను భగవంతుడు నొక్కివక్కాణించెను.

జ్ఞానులు ఈశ్వరుని ఆత్మరూపునిగా తలంతురు. భక్తు లీశ్వరుని తనకంటె వేరుగ దలంతురు. కాన వీరి కీశ్వరానుగ్రహ మవసరము జ్ఞానుల కాత్మానుగ్రహమే చాలును. ఆత్మానుగ్రహమనగా తన యనుగ్రహమనియే యర్థము. కనుక జ్ఞాని తనను తానే యుద్ధరించుకొను ననియు, భక్తుడు ఈశ్వరునిచేత నే యుద్ధరింపబడుననియు భేదము గ్రహింపవలయును.

ఓయీ! ఈశ్వరుడు జ్ఞానుల కాత్మరూపు డగుచో, అజ్ఞానుల కాత్మానుగ్రహ మెట్లు గలుగును? తనకుదాను అనుగ్రాహకు డగుట యసంభవముకదా! కాదు, వినుము. జ్ఞానులనగా ప్రమాతలు. వీరు ఆత్మానుగ్రహమువలన అపరోక్ష

జ్ఞానము నొందుదురు. ఆత్మానుగ్రహమువలననే వీరి కింతకుముందు పరోక్షజ్ఞానము లభించెను. వేరేల, ప్రమాతలకు ఘటాది విషయజ్ఞానముగూడ ఆత్మానుగ్రహము ననేకదా ఆత్మభిన్నమంతయు జడము. ఆత్మప్రతిబింబముచేతనే ప్రమాతయగు అహంకారమునకు చైతన్యము సిద్ధించెను. ఇంతమాత్రమున ఆత్మకంటె ప్రమాత వేరనతగదు. ఆత్మప్రతిబింబమగు ప్రమాతకు బింబరూపమగు నాత్మకంటె అత్యంతభేదముగాని, అత్యంతాభేదముగాని, నిరూపింప నలవిగాదు. భేదాభేదములు అనిర్వాచ్యము లగుటవలననే ప్రమాతకు మిథ్యాత్వము జెప్పబడినది. ప్రతిబింబమగు ప్రమాతయందు అనుగతమైన శుద్ధచైతన్యముమాత్రమే సత్యము. అదియే ప్రమాతకు నిజరూపము. కాన ప్రమాత ఆత్మకంటె మిక్కిలి భిన్నుడు కాడు.

కావున నేను వేరు, ఈశ్వరుడు వేరు– అని తలచెడి భక్తులనే వివేకవిజ్ఞానాదుల నొసగి యీశ్వరు డుద్ధరించును. నేనే యీశ్వరు డనుకొను జ్ఞానులను ఈశ్వరు డుద్ధరింపబని లేదు.

ఇచట 'సముద్ధర్తా' అనుపదము విచారణీయము. తిరిగి సంసారసాగరమునందు మునుగకుండగ నుద్ధరించుట 'సం'అనుపదమున కర్థము, సంసారమనగ 'జన్మ, మరణ, సుఖ, దుఃఖ, రోగ, ఆరోగ్య, శీత, ఉష్ణ, వృద్ధిక్షయాదిరూపము.' ఇందు మరణ మనునది చేరియున్నను 'మృత్యుసంసారసాగరాత్' అని శ్రీకృష్ణుడు సంసారమునుంచి మృత్యుపదమును విడదీయుటలో సముద్రమునందు మొసలివలె సంసారమునందు మృత్యువు అతిభయంకర మని వ్యక్తమగుచున్నది. తనకుగాని, తనవారలకుగాని మరణము నూహించినంతమాత్రమున లోకము మిగుల భయపడుచున్నది. జన్మాదులవలన నంతగ భయపడదు. శీత, ఉష్ణ, దారిద్ర్యాదులు దుఃఖము నిచ్చునవియైనను మృత్యువంతటి భయంకరములు గావు. ధనికుడు మృత్యుభీతిచే ధనాదికమునుగూడ విడుచును. కాన అతిభయంకరమగు మృత్యువుతో గూడిన నీసంసారము భయంకరమనియు దుస్తరమనియును భావము.

ఓయీ! ''సంసారసాగరాత్'' అనుపదమునందు సంసారమునకు సాగరత్వము నేల చెప్పెదరు? సంసారసాగరములకుగల ఔపమ్య మేమి? వినుము. దాటశక్యముకాకుండుటయే ఈ రెంటికిగల పోలిక. కాన సంసారము సాగరమని యౌపచారికముగ జెప్పబడినది. ఇచట ''సంసారశ్చాసౌ సాగరః'' అని కర్మధారయ సమాసము. ఇంతియకాని, ''సంసార ఏవ సాగరః'' అని విగ్రహమును జూపి, అవధారణపూర్వపదకర్మధారయసమాస మని పేరిడదగదు. వ్యాకరణ శాస్త్రమునం దెచ్చటను అవధారణపూర్వపదకర్మధారయ మనునది కనిపించదు. సంభావనా అవధారణ పూర్వపదకర్మధారయలు రెండు విశేషణ సమాసములనియే ''విశేషణం

విశేష్యేణ బహుళం" అని సూత్రముచే చెప్పబడినది. ఇచట సంసారము సాగరమువంటిదని యుపమిత సమాసముగూడ జెప్పనగును.

రా మా ను జ మ త ము :

ఇచట రామానుజులు "మృత్యుభూతాత్ సంసారాఖ్యా త్సాగరాత్" 'మృత్యుభూతమగు సంసార మను పేరుగల సముద్రమునుండి' అని వ్యాఖ్యానించిరి. ఇది యనుచితము. సంసారములో చేరియున్న మృత్యువు సంసారమున కుపమానము కానేరదు. మరియు భక్తులను శీఘ్రముగా తరింపజేతుననియు జ్ఞానులను ఆలస్యముగా దరింపజేతుననియు భగవంతుని యాశయమైనట్లు సూచించిరి. ఇదియును అనుచితము. జ్ఞానమే మోక్షమున కంతరంగము, సన్నిహితము. కాన జ్ఞానులకే మోక్షము శీఘ్రముగా లభించును. భక్తులకు జ్ఞానద్వారమున క్రమముగా మోక్షము లభించును. ఇదియే సిద్ధాంతము. అయితే ఇచట "న చిరాత్" అను పదమునకు శ్రీకృష్ణుని అభిప్రాయ మీయదియని గ్రహింపవలయును. 'కేవల కర్మయోగులకంటె భక్తియోగులను త్వరగా తరింపజేతును' అని. కాన ఈ రెండంశములయందును రామానుజవ్యాఖ్యాన మంత యుచితము గాదు. ॥7॥

శ్లో. మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ
నివసిష్యసి మయ్యేవ అతఊర్ధ్వం నసంశయః. ॥8॥

అ. కనుక ఓయీ! అర్జునా! నీవు సంకల్పవికల్పాత్మకమగు మనస్సును నిశ్చయాత్మికయగు బుద్ధిని నాయందుంచుము. శరీరము పడిపోయినపిదప నీవు నిశ్చయముగా నాస్వరూపముతో నుందువు.

ఓయీ! ఒకే యాత్మకు నాధారాధేయభావ మెట్లు కుదురును? అనినచో వినుము. నాస్వరూపముతో నీవుండుటయే నీకు నాయందు నివాసము వివక్షితమైనది. జీవేశ్వరులిర్వురు చైతన్యరూపులగుటచే దేహపాతముకంటె పూర్వముగూడ జీవు డీశ్వరస్వరూపుడే అయినను జీవన్ముక్తిదశయందు గానొకప్పుడు దేహాదులతోటి తాదాత్మ్యాధ్యాస యున్నందున జీవున కెల్లపుడు ఈశ్వరస్వరూపముతో నునికిలేదు. విదేహకైవల్యమునందైతే దేహాదులు లేవు గనుకను, అజ్ఞానము నశించినందునను దేహాద్యభిమానము లేదు. కాన నపుడు ఎల్లపుడు జీవున కీశ్వరరూపముతో నునికియుండును. కనుకనే విదేహకైవల్యమునకు పునరావృత్తి లేదు. ఇదియె యర్థము. మూలమునందు "మయ్యేవ" అని "ఏవ" కారముచే తెలియపఱుపబడినది. శరీరపాతానంతరము నీవు నాయందే యుండగలవు. తిరిగి మరలిరావు అని మూడవపాదమున కర్థము.

విశ్వరూపుఁడగు శ్రీకృష్ణుని (ఈశ్వరుని) యందు మనోబుద్ధుల యుంచినందున చిత్తశుద్ధి కలుగును. దాన జ్ఞాన ప్రాప్తియు, తద్ద్వారమున పరమాత్మసాయుజ్యమును కలుగునని దీని పరమార్థము.

విశ్వరూపోపాసన మాత్రముననే పరమపదము ప్రాప్తించునని శ్రీకృష్ణుఁడిచట చెప్పినట్లు అభిప్రాయపడదగదు. అట్లభిప్రాయపడినచో జ్ఞానమువలననే ముక్తియని చెప్పెడి యనేక శ్రుతిస్మృతులతో విరోధము వాటిల్లును. అజ్ఞానమువలన నేర్పడిన సంసారము జ్ఞానములేనిదే నశింపనేరదు. ఈశ్వరోపాసనము క్రియారూపము. ఈయది యజ్ఞానమునకు విరోధి కానేరదు. విశ్వరూపుఁడగు నీశ్వరుని యుపాసించువారలకు "నాహం బ్రహ్మ" నేను బ్రహ్మనుగాను. "అహమజ్ఞః" నేనజ్ఞానిని. "అహం మనుష్య స్సంసారి" నేను మనుష్యుఁడను. సంసారసంబంధము కలవాఁడను అను నజ్ఞానము కనుపించుచున్నది. మరియు వారలకు విశ్వరూపదేహమునందు ఈశ్వరుఁడను భ్రాంతియు గనిపించుచున్నది. కాన విశ్వరూపోపాసకులకు గూడ జ్ఞానమువలననే మోక్షమని తప్పక నంగీకరింపవలయును. ॥౮॥

శ్లో॥ అథ చిత్తం సమాధాతుం నశక్నోషి మయి స్థిరమ్
అభ్యాసయోగేన తతో మా మిచ్ఛాప్తుం ధనంజయ. ॥౯॥

అ॥ ఓయీ! యర్జునా! నాయందు నీచిత్తమును ఏకాగ్రపరుచుటకు నీకు శక్తిలేకున్నచో, నభ్యాసయోగముతో నన్నుపొందఁగోరుము. అభ్యాసయోగమును నింతకుమున్ను వివరించియుంటిని. అది యెట్లన నీకిష్టమగు నొకానొకరమ్యవస్తువునందు ఇతరవిషయములనుంచి చిత్తము నాకర్షించి యుంచుట, ఆచిత్తము సహజచాపల్యమువలన మరల్చి విషయాంతరముకొరకు పోవుచో నపుడు తిరిగి దానిని మరల్చి ఈ రమ్యవస్తువునం దుంచవలయును. ఇట్లే ప్రతిదినమును బలాత్కారముగా చిత్తమును నొకానొకవస్తువునందు నిలుపుటచే యభ్యాస మనబడును. ఇట్టి యభ్యాసముచే పురుషుఁడు చిత్తైకాగ్రమునందు సమర్థుఁడగును. నీవును నాదు విశ్వరూపమునందు మనస్సును సమాధానపరచినచో తప్పక నన్ను పొందుదువు.

మనసు తనవృత్తిచే బాహ్యములగు ఘటాదిరూపములను నెట్లు పొందునో, నట్లే లోపలగూడ వృత్తిచేతనే విశ్వరూపుఁడగు భగవంతునియొక్క రూపమును పొందును. కనుక మనసునకు నాంతరంగికవృత్తి స్థిరపడవలెనన్న ముందు బాహ్యపదార్థమునందు మనోవృత్తిని స్థిరపరచుట యవసరము.

లోకములో పెద్దరాతిని యెత్తదలచిన పురుషుఁడు మొదట కొద్దికొద్ది రాళ్ళ నెత్తుట యభ్యసించును. అట్లె మానసికమగు నభ్యాసమునందుగూడ క్రమమును పాటింపవలయును. ఇంతియెగాని బాహ్యపదార్థమునందు నిలకడ చెందలేని మనసు హఠాత్తుగా విశ్వరూపుఁడగు నీశ్వరునియందు నిలుకడ చెందలేదు. ॥౯॥

శ్లో॥ అభ్యాసే ప్యసమర్థో ఽసి మత్కర్మ పరమో భవ
మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి. ॥౧౦॥

అ॥ నీకు అభ్యాసమునందు శక్తిలేనిచో ఈశ్వరార్పణబుద్ధిచే యజ్ఞాదివిహిత కర్మల నాశ్రయింపుము. సహజముగా చంచలమైన చిత్తము నొకచోట నుంచుట సాధ్యముగాకున్నను చిత్తసమాధానములేకయే యజ్ఞాదికర్మల నాచరించుట సులభమని కృష్ణుని యభిప్రాయము. కర్మలు ఫలమును గోరి చేసినచో సంసారబంధము నిచ్చును. ఫలమును యీశ్వరార్పణముచేసిన నయ్యవి బంధము నీయజాలవు. విశ్వరూపోపాసనమువలన పురుషులకు ఫలసిద్ధియున్నను అయ్యది యభ్యాససాధ్యము గనుక దుష్కరమగును. దానికంటె అభ్యాసయోగముతో నపేక్షలేని యీశ్వరార్థములగు కర్మలు సుకరములని (సులభములని) శ్రీకృష్ణుని యాశయము. మూలమునందలి సిద్ధిపదమునకు చిత్తశుద్ధియని యర్థము. ॥౧౦॥

శ్లో॥ అథైత దప్యశక్తో ఽసి కర్తుం మద్యోగ మాశ్రితః
సర్వకర్మ ఫలత్యాగం తతః కురు యతాత్మవాన్. ॥౧౧॥

అ॥ ఓయి యర్జునా! ఈశ్వరార్థములైన కర్మలను చేయుటకుగూడ నీకు శక్తిలేనిచో మనస్సును నిగ్రహించుకొని మద్విషయకమగు యోగము నాశ్రయించి సర్వకర్మఫలమును పరిత్యజించుము.

ఓయీ! ఈశ్వరార్థములైన కర్మలు చేయుటకును కర్మఫలమును యీశ్వరునకు వదలి కర్మల నాచరించుటకును భేదమేమి? వినుము. ఈశ్వరునికొఱకు కర్మలు చేయువానికి కర్మలయందు కర్తృత్వాభిమానముగూడ పనికిరాదు. కర్మఫలము యీశ్వరునియం దర్పించినవానికి కర్తృత్వాభిమానమున్నను బాధలేదు. ఇదియే వెనుకటిశ్లోకమునందు జెప్పిన నీశ్వరార్థకర్మానుష్ఠానమునకు యిశ్లోకమునందలి సర్వకర్మఫలత్యాగమునకును గల భేదము. కనుకనే యీమార్గము సుకరమని శ్రీకృష్ణుడు ఉపదేశించెను.

లేక, రాజు విధించిన పనులను భృత్యు డాచరించినట్లు ఈశ్వరునిచే విధింపబడిన యజ్ఞాదికర్మలను నే నాచరింపవలయునని తలచి కర్మను చేయువాడు యీశ్వరునికొఱకు కర్మచేయువాఁ డగును.

అయితే నిష్కాముడును పూర్ణకాముడునగు నీశ్వరునకు సకాముడగు రాజునకువలె జీవులచే నీపనులు చేయించవలెనని యభిప్రాయ మేలయుండును? జీవులు చేసిన యజ్ఞాదికర్మలచే నీశ్వరునకు జీవులయెడ ప్రేమ యెట్లు గలుగును? అనినచో, వినుము. ఈశ్వరునకు ప్రయోజనము లేకున్నను తనయాజ్ఞప్రకారము కర్మాచరణము జేయు జీవులను ప్రేమించును. లోకములో తండ్రియాజ్ఞను గైకొని గురు

కులము చేరి విద్యాభ్యాసము జేయు పుత్రునియందు తండ్రికి ప్రేమగలుగుట జూచుచుంటిమి. అట్లే తత్త్వవేత్తయగు గురువునకు శిష్యునియందు వాత్సల్యము లోకసహజము. కావున వీర లిట్లు యీశ్వరార్థమైన కర్మనుమాత్రమే చేయువారని భావము. ఇతరులు తాముచేసిన కర్మఫలమును యీశ్వరునకు వదలివేయుదురు.

ఇంద్రుడు, చంద్రుడు, ఆదిత్యుడు, గణపతి మున్నగు దేవతలను కర్మలచే నారాధించుచు దానిఫలమును తాను గోరక యీశ్వరునకు వదలివేయువాని కర్మలు యీశ్వరార్థములగు కర్మలు గావు. ఆకర్మలఫలముమాత్రమే యీశ్వరార్థ మగును. ఇంక యజ్ఞాదికర్మలచే నీశ్వరుడే యారాధింపదగినవాడను బుద్ధిచే నెవడు కర్మల నాచరించునో వాడు యీశ్వరునికొఱకు కర్మల నాచరించినవా డగును. ఇదియే యీశ్వరార్థకర్మానుష్ఠాతలకు, ఫలత్యాగులకును గలభేదము. సర్వ కర్మలను ఆచరించి, ఫలము బ్రహ్మార్పణ మగుగాక యని ఫలమును పరిత్యజించుట సుకరము. 'సర్వకర్మలు యీశ్వరారాధనార్థములు' అను ననుసంధానము దుష్క రము కావున శ్రీకృష్ణు డీ రెండుపక్షముల నుపదేశించెను.

రా మా ను జ మ త ము :

ఇచట రామానుజులు ('మదర్థమపి కర్మాణి') ఈశ్వరార్థములయిన కర్మ లనగా ఆలయనిర్మాణము, ఉద్యాననిర్మాణము (తోటలు వేయుట), ప్రదీపారోప ణము (దీపములుపెట్టించుట), అభ్యుక్షణము (కడుగుట లేక తడుపుట), ఉపలేప నము, అలుకుట, మార్జనము, తుడుచుట పూలు తీసికొనివచ్చుట, పూజలుచేయిం చుట, నామసంకీర్తనము, ప్రదక్షిణము, స్తుతి, నమస్కారము మున్నగు కర్మలని వ్యాఖ్యానించిరి. మరియు సర్వకర్మఫలత్యాగ మనగా యజ్ఞాదికర్మలఫలమగు స్వర్గాదులను పరిత్యజించుట అనియును జెప్పిరి. ఈయది యనుచితము.

యజ్ఞాదికర్మలుగూడ నీశ్వరారాధనరూపములగుచుండ, ఆలయనిర్మాణాదుల వలె నీశ్వరార్థము లేలకావు? అట్లు కానిచో శ్రుతి, ఆలయనిర్మాణాదికర్మలనే విధింపక యజ్ఞాదికర్మల నేల విధించెను? ఇచటగూడ భగవంతుడు 'త్రైవిద్యా మాం సోమపాః' ఇత్యాద శ్లోకముచే యజ్ఞాదికర్మ లీశ్వరారాధనారూపములని విధించియుండెను.

మరియు యజ్ఞాదికర్మలకంటె పుష్పాహరణాది (పూలను తెచ్చుట) మున్నగు కర్మలే సుకరములుకాన యజ్ఞాదులయందు శక్తిలేనివారలకే పుష్పాహరణాది కర్మలయం దధికారముండును. అట్టితరి "అథైతద ప్యశక్తో௨సి" అని పుష్పాహర ణాదులయందు శక్తిలేనివానికి యజ్ఞాదికర్మఫలత్యాగమును విధించుట యనుచిత మగును.

మరియు ఆలయనిర్మాణాదికర్మలు పూర్తములు. వీటికి చంద్రలోకమునందు భోగము ఫలము. వేదము పూర్తకర్మలయొక్క ఫలత్యాగమును విధింపలేదు. కావున కర్మలవలన చిత్తశుద్ధియే సంభవించదు. మోక్ష మెట్లు సిద్ధించును ?

మరియు "అహరహస్సంధ్యా ముపాసీత" "వసంతే వసంతే జ్యోతిషా యజేత" అను శ్రుతిసిద్ధమయిన సంధ్యావందన యజ్ఞాది కర్మలను విడచి ఆలయ నిర్మాణాది కార్యములను స్వీకరించినచో భర్తను వదలి విటుని మరగిన వ్యభిచార స్త్రీకి పట్టెడి దుర్గతియే పట్టును. యజ్ఞాదికర్మలయందుండియే ఆలయనిర్మాణాది కార్యములను జేయవచ్చునన్నచో నదియు పొసగదు. ఒక కర్మయందు ప్రవేశించిన వానికి రెండవపనియందు ప్రవృత్తి సంభవించదు. యజ్ఞాదికర్మలయం దధికారము లేని ద్విజేతరులకు పరలోక భోగముకొరకు పూర్తకర్మల నీశ్వరుడు నిర్మించెను. "యో మాం సర్వేషు భూతేషు సంత మాత్మాన మీశ్వరం, హిత్వా ఽర్చాం భజతే మౌఢ్యా ద్భస్మ న్యేవ జుహోతి సః"(సర్వభూతములయందున్న నన్ను విడచి ప్రతిమయందు నీశ్వరుని యర్చించినవాడు బూడిదలో హోమముచేసినవాడగును.) అని ప్రతిమయందు భగవదారాధనము నిందింపబడినది. ప్రతిమార్చనము స్త్రీశూద్రాదులకుసులభము. ఇట్టిదానినిమహానుభావుడయిన అర్జునున కుపదేశించుట యుచితము కాదు. ప్రతిమార్చనముకంటె యజ్ఞాదికర్మఫలత్యాగము సుకరమనినచో విద్వాంసులు పరిహసింతురు.

మరియు మూలమునందలి పూర్వార్థమును "మద్యోగం = మద్భక్తియోగ మాశ్రితస్స న్నేతత్కర్తుమశక్తోసి"(నాయందు భక్తియోగము నొంది నాకర్మలను జేయజాలకున్నచో) అని యన్వయమును శ్రీభాష్యమునందు జూపిరి. అదియు దగదు. "మద్యోగ మాశ్రితః" అను పదమును పూర్వవాక్యముతో నన్వయించిన సమాప్త పునరాదానదోష మేర్పడును. ఆర్షగ్రంథములం దట్టి దోషములు పాటింపబడ వన్నచో "మద్యోగ" మను పదమునకు "మద్భక్తియోగ" మను నర్థము లాక్షణికముగాన నుపేక్షింపనగును. ఈశ్వరునియందు యోగము అనగా చిత్తసమాధానము. అర్థాత్ భక్తియే యగును. కాన లక్షణదోషము లేదని యంగీకరించినను భగవంతునియందు మనసు నిలపలేనివానికే యీశ్వరార్థమయిన కర్మలను విధించి యుండుటచే నీశ్వరార్థములగు కర్మలను జేయువానికి నీశ్వరునందు చిత్తసమాధానమే యసంభవమగుచుండ "నాయోగము నాశ్రయించి నాకర్మలను (పనులను) జేయ జాలనిచో అని వర్ణించుట యనుచితమగును."

ఇచట "మద్యోగ మాశ్రితస్స న్నేతదపీ త్యన్వయోఽపి గమ్యతే" నాయోగ మును బొంది దీనినికూడ జేయజాలనిచో అనియు నన్వయము స్ఫురించును.

కావున "మద్యోగ" శబ్దమునకు శంకరులు చెప్పిన సర్వకర్మఫలత్యాగమే యుచితమయిన అర్థము. కాన కర్తృత్వాది బుద్ధులను వదలి యీశ్వరార్థములయిన కర్మల జేయనోపనివానికి కర్మఫలపరిత్యాగమే కర్తవ్య మనునది నిర్దుష్టమగు మార్గము.

నా కీ పనియొక్క ఫలమక్కరలేదను అనుసంధానముమాత్రమే ఫలత్యాగికి ఆవశ్యకము.

ఈశ్వరునికొరకు కర్మల నాచరించువానికి ఈశ్వరారాధనకొరకే నే నీపని చేయుచున్నాను అనికాని, ఈకర్మచే నీశ్వరుడొక్కడే నాచే నారాధింపదగినవాడు; అని కాని, ఈశ్వరప్రీతికొరకు నే నీకర్మను జేయుచున్నాను అనికాని, నే నీపనిని చేయుటలేదు, ఈశ్వరుడే చేయుచున్నాడు అని కాని; నే నీపనిని చేయుట లేదు, ప్రకృతియే చేయుచున్నది అనికాని మానసికమగు ననుసంధాన మావశ్యకము. కావున కర్మఫలత్యాగముకంటె నీశ్వరార్థములయిన కర్మల నాచరించుట దుష్కర మని భావము. ॥౧౧॥

శ్లో. శ్రేయోహి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే।
ధ్యానా త్కర్మఫలత్యాగ స్త్యాగా చ్ఛాంతి రనన్తరమ్ ॥౧౨॥

అ॥ సర్వకర్మఫలత్యాగమును స్తుతించుచున్నాడు. "యదా సర్వే ప్రముచ్యంతే కామా యే ఽస్య హృది శ్రితాః, అథ మర్త్యో ఽమృతో భవతి అత్ర బ్రహ్మసమశ్నుతే" అను శ్రుతి సకల కోరికలు నశించుటవలన మానవునకు ముక్తి సిద్ధించునని చెప్పుటచే శ్రౌతస్మార్త కర్మలయొక్క ఫలములే కోరికలుగాన, నట్టి ఫలములను విడచినందునగూడ శాంతికల్గు నని స్తుతించుచున్నాడని భావము.

కావున కర్మఫలత్యాగమున కర్మయోగముగూడ శ్రేయస్సాధనమగునని శ్రీకృష్ణుని యభిమతము.

ఈశ్వరార్థకర్మానుష్ఠానముకంటె జ్ఞానము అనగా శాస్త్రార్థపాండిత్యము అనగా ఆత్మానాత్మవివేకజ్ఞానము గొప్పది. దీనికంటె ధ్యానము (విశ్వరూపోపాసనము) గొప్పది. ఇట్టి ధ్యానముకంటె సర్వకర్మఫలత్యాగము గొప్పది.

ఇచట నీశ్వరార్థములయిన కర్మలను జేయ శక్తిలేనివానికే కర్మఫలత్యాగము విధింపబడినది. అయినను కర్మఫలత్యాగ మన్నిటికంటె గొప్పది. ఏలయన? "త్యాగా చ్ఛాంతి రనంతరం" అని శ్రీకృష్ణుడు కర్మఫలత్యాగానన్తరమే శాంతి కలుగునని చెప్పియుండుటచే జ్ఞానవిశిష్టమగు ధ్యానముకంటెగూడ ఫలత్యాగము గొప్పదని యనదగును.

పూర్వము విశ్వరూపోపాసనము, అభ్యాసయోగము, ఈశ్వరార్థములైన కర్మల ననుష్ఠించుట, కర్మఫలత్యాగము అను నాల్గు ఉపాయములు చెప్పబడినవి.

ఆ నాలుగింటిలో కర్మఫలత్యాగమును నాల్గవ యుపాయము గొప్పదని స్తుతింపఁ దగియుండుటచే వెనుకటి నాలుగుపాయములే యిచ్చటను జెప్పుట యవసరము. ఐనను చిత్తము నొకానొకచోట నిలుపుటయను నభ్యాసయోగము నిచట చెప్ప లేదు. అభ్యాసయోగము విశ్వరూపోపాసనకు కారణమగుటచే సాక్షాన్మోక్ష మార్గము కానేరదు. విశ్వరూపధ్యానసామర్థ్యముకొఱకు నభ్యాసయోగమువిధింపఁ బడినది. జ్ఞానమును వెనుకఁజెప్పకున్నను నయ్యది మోక్షమార్గమగుటచే దాని కంటెఁగూడ కర్మఫలత్యాగము ప్రశస్తమని జెప్పఁదలచి యీశ్లోకమునందు జ్ఞానము గ్రహింపబడినది.

ఇంతమాత్రమున జ్ఞానయోగముకంటెఁగూడ కర్మఫలత్యాగము గొప్ప దని భ్రమింపదగదు. ఈశ్లోకము జ్ఞానినిగుఱించి చెప్పబడినది. అజ్ఞానికి జ్ఞానయో గమునం దధికారము లేదు. కాన వానికి జ్ఞానయోగము మోక్షమార్గముకానేరదు. అయితే యజ్ఞానికి శాస్త్రార్థపరిజ్ఞాన మెట్లు కలుగును? అని శంకింపవలదు. ఏ మాత్రము జ్ఞానము లేక, అవైదికుఁడై నాస్తికుఁ డగువానికి కర్మయందుఁగూడ నధికార ముండదు. కావున ఆత్మయాథార్థ్యజ్ఞానశూన్యుఁడే యచట అజ్ఞుఁ డని చెప్పఁబడెను. శాస్త్రార్థవేత్తలుగూడ ఆత్మయాథార్థ్యజ్ఞానము లేనిచో నజ్ఞానులే యగుదురు.

లేక అభ్యాసపదమునకు యోగాభ్యాస మని యర్థముచెప్పి దానికంటెశాస్త్రా ర్థపరిజ్ఞానము గొప్పదని చెప్పవచ్చును. మిగిలినదంతయు వెనుకటివలె సమానము. భగవత్కర్మపరత్వము, అభ్యాసయోగము, శాస్త్రార్థజ్ఞానము, ధ్యానము,ఫలత్యా గము-వీటిలో ఫలత్యాగము గొప్పదని భావము.

లేక జ్ఞానపదమునకు శాస్త్రార్థములైన యజ్ఞాదికర్మలయొక్క పరిజ్ఞానమని యర్థమును జెప్పి లక్షణచే నట్టిజ్ఞానము కలిగి చేసిన యీశ్వరార్థకర్మానుష్ఠానము అభ్యాసయోగముకంటె గొప్పదని యైనను జెప్పవచ్చును. అభ్యాసయోగము నందు సామర్థ్యములేనివానికి యీశ్వరార్థకర్మపరత్వము విధింపఁబడినది. అయి నను అవివేకపూర్వకమైన అభ్యాసయోగముకంటె వివేకపూర్వకమైన యీశ్వర కర్మపరత్వమే గొప్పది. విశ్వరూపోపాసనమునకు అభ్యాసయోగము అంతరంగ కారణమగుటచే విశ్వరూపోపాసనానంతరము అభ్యాసయోగము చెప్పబడినది. కాన విశ్వరూపోపాసనము, అభ్యాసయోగము, యీశ్వరకర్మపరత్వము, ఫలత్యా గము-వీటిలో ఫలత్యాగమే గొప్పదని భావము.

ఇచట విశ్వరూపోపాసనాత్మకమగు అభ్యాసయోగముకంటె ఆత్మానాత్మ వివేకరూపమగు జ్ఞానము గొప్పది. అట్టి జ్ఞానముకంటె ఆత్మోపాసనారూపమగు ధ్యానము గొప్పది. ధ్యానముకంటె సర్వకర్మఫలత్యాగము గొప్పది. ఫలత్యాగా

నంతరము శాంతికలుగునని అర్థాత్సిద్ధించును. అయ్యది యప్రకృతమగుటచే నీ శ్లోకమునందు జెప్పలేదు. ఇందు కర్మఫలత్యాగమును స్తుతించుటయే తాత్పర్యము.

**రా మా ను జ మ త ము :**

ఇచట రామానుజులు భగవంతుని స్మరించుట యను నభ్యాసయోగము కంటె నాత్మపరోక్షజ్ఞానము గొప్పదనియు, దానికంటె ధ్యానము గొప్పదనియు, ధ్యానముకంటె ఫలత్యాగముతో నాచరించిన కర్మ గొప్పదనియు, అటువిమ్మట కర్మానుష్ఠానముచేఁ బాపము తొలఁగి, మనశ్శాంతి యేర్పడి, శాంతమైన మనస్సు యందు ఆత్మధ్యానము కలుగుననియు, ధ్యానముకంటె ఆత్మసాక్షాత్కారము గొప్పదనియు, దానికంటె పరాభక్తి గొప్పదనియు, భక్తియోగము నభ్యసించుటకు శక్తిలేనివానికి ఆత్మనిష్ఠయే మంచిదనియు, అశాంతమనస్కునకు ఆత్మనిష్ఠ కుదురదుగాన నయ్యది సంభవించుటకు ఆత్మజ్ఞానము కలిగి ఫలేచ్ఛను వదలి చేసెడి కర్మనిష్ఠయే శ్రేయస్కరమనియును వ్యాఖ్యానించిరి.

అయ్యది యుక్తము కాదు. ''క్లేశో ఽధికతర స్తేషా మవ్యక్తాసక్త చేతసామ్'' అను శ్లోకముచే ఆత్మనిష్ఠయే భక్తియోగముకంటె మిక్కిలి కష్టసాధ్యమని చెప్పుటచే జ్ఞానయోగమే భక్తియోగముకంటె దుష్కరము. కాన జ్ఞానయోగమునందు శక్తిలేనివానికే భక్తియోగమునం దధికారము. ఇదియే యుక్తము. జ్ఞానయోగికి ఆత్మానాత్మవివేకము, అనాత్మలయందు ఆత్మాభిమానత్యాగము, కనురెప్పమూత, కనురెప్పను తెరచుట మున్నగు సర్వకర్మలయందు దేహాదులకే కర్తృత్వముగాని తనకు కర్తృత్వము లేదని యనుసంధానము, కనిపించు సర్వప్రపంచము మిథ్యయను నిశ్చయము, ఇట్టిగుణము లెన్నియో కావలయును. ఇవి లేనిచో జ్ఞానయోగము సిద్ధింపదు. కావున నజ్ఞానికి జ్ఞానయోగము దుష్కరము.

భక్తియోగమైతే— నేను విష్ణుకర్మ యను బ్రాహ్మణుడను, మోక్షముకొరకు భగవంతుని రామచంద్రుని సేవింతును, అను ననుసంధానముచే సాధింపనగును. భక్తియోగమునందు దేహాభిమానమును త్యజింప బనిలేదు. ఆత్మానాత్మవివేకమున్నా అవసరము లేదు. కర్తృత్వాభిమానమునుగూడ వదల నవసరము లేదు. కాన భక్తియోగము సుకరము.

అయితే భక్తియోగమునందు భగవదారాధనకొరకు కావలసిన పత్రపుష్పాద్యుపకరణములను సంపాదించుట యను ప్రయాస కలదు. కాన భక్తియోగము దుష్కరముకదా? అని యనరాదు. అట్లైతరి ఇంతకంటె నెక్కుడు పరికరములతో సాధింపఁదగిన కర్మయోగమే దుష్కరముకాన, కర్మయోగమునందు శక్తిలేని వానికే భక్తియోగాధికారమని యేల చెప్పరాదు? కావున మనఃక్లేశమే క్లేశము

కాని, కాయక్లేశ మొకక్లేశము కాదు. అట్లుకానిచో కర్మయోగముకంటె వ్యవసాయకృత్యమే దుష్కరము కావలసివచ్చును.

జ్ఞానయోగము దుష్కరముకనుకనే జ్ఞానులకు విధించబడినది. కర్మయోగము సుకరముగనుకనే అజ్ఞానులకు విధించబడినది. ఇందుకు ప్రమాణము 'లోకే ఒస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయా ఒనఘ, జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్' అను గీతాశ్లోకము భక్తియోగము కర్మయోగమునందుఁ జేరినదని యింతకుముందే చెప్పియుంటిమి. శ్రీకృష్ణుడు జ్ఞాన,కర్మ లను రెండునిష్ఠలనే చెప్పెనుగాని మూడవనిష్ఠను జెప్పలేదు. కాన కర్మయోగముగాని, యందు జేరిన భక్తియోగముగాని జ్ఞానయోగమునందు శక్తిలేని యజ్ఞానికే శ్రేయోదాయకమని విధించబడినది. కావున భక్తియోగమునందు శక్తిలేనివానికి జ్ఞానయోగమనియు జ్ఞానయోగమునందు శక్తిలేనివానికి కర్మయోగమనియును రామానుజులు వ్యాఖ్యానించుట యుచితము గాదు. భక్తి, కర్మయోగము లొకటే యగుచుండ నాటికి జ్ఞానయోగమునుగూర్చి యుత్కర్షాపకర్షలు జెప్పుట యులవిగాదు.

(1) అట్లే ఆత్మసాక్షాత్కారమువలన పరాభక్తి గలుగునని చెప్పుటకూడ రామానుజులకు దగదు. ఆత్మసాక్షాత్కార మొనర్చుకొనిన విద్వాంసునకు నాత్మయే యీశ్వరు డను భావముండునుగాని, తనకంటె నీశ్వరుడు వేరను భావముండదు. అట్టితరి భక్తిమార్గమున కవకాశ మేది? సేవింపఁదగినవాడు, సేవించువాడు వీరిద్దరుండినపుడుగదా భక్తిమార్గము కుదురును! ప్రకృతమునందు జీవేశ్వరులకు భేదమే లేనప్పుడు, సేవ్యసేవకభావ మేది? ఆత్మకంటె నీశ్వరుడు వేరనుటయు జూసగదు. 'జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్' అని చెప్పుటచే నీశ్వరుడే సకలభూతముల కాత్మగా వారిహృదయమునం దుండియున్నాడు. "అథ యోఒన్యాం దేవతా ముపాస్తే అన్యో సా వన్యోఒహ మస్మీతి న స వేద యథా పశుః" అను శ్రుతి జీవేశ్వరులకు భేదమును నిందించుచున్నది. కావున ఆత్మభేదజ్ఞానముతో జేసెడి భక్తియోగము అజ్ఞానివిషయమే యగును. "తరతి శోక మాత్మవిత్" అను శ్రుతి యాత్మసాక్షాత్కారమువలన సర్వసంసారనివృత్తిని జెప్పుచుండ జ్ఞానముకంటె భక్తి గొప్ప దెట్లగును? పైగా; జ్ఞానముకంటె భక్తి తక్కువదనియే చెప్పనగును. జ్ఞానములేనిదే భక్తిమాత్రముచే సంసారము నివర్తించదు. సంసారము అజ్ఞానప్రయుక్తముగాన జ్ఞానమాత్రముచేతనే నశించును. ఇక ఆత్మజ్ఞానము వలన నాత్మానందముమాత్రమే లభించుననియు, భక్తిచే బ్రహ్మానందము లభించుననియును రామానుజు లభిప్రాయపడుట యసంగతము. ఆత్మానందమే బ్రహ్మానందము. ఈ రెండును వేరు గాదు. పైగా భక్తులకు బ్రహ్మానందము లభించదు. భక్తునకు భక్తిదశలో దాను గల్పించుకొనిన విశ్వరూపానుభవము

వలన గలిగెడి యానందమే స్ఫురించును. అయ్యది మాయికము గావున ననిత్యము గూడ నగును. బ్రహ్మ నిత్యుడగుటచే బ్రహ్మానందముగూడ నిత్యము. ఇట్లు ఫలమునుబట్టి చూచినను జ్ఞానయోగము దుష్కర మనకతప్పదు. కనుకనే జ్ఞాను లందు బ్రవర్తింతురు. అజ్ఞాను లద్దానిని విడతురు. అయ్యది యజ్ఞానులకు సాధ్యము గాదు. కావున జ్ఞానులకు గోచరమగు జ్ఞానయోగముకంటె నజ్ఞానికి గోచరమగు భక్తియోగ మెన్నటికిని గొప్పది కానేరదు.

(2) ఇక ఆత్మనిష్ఠగలవానికిగూడ కర్మనిష్ఠయే శ్రేయస్కరమని రామానుజులు చెప్పినదానిని విచారింతము. ఆత్మనిష్ఠాకర్మనిష్ఠలు రెండును నొకనియం దేకకాలమున సంభవింపవు. అన్ని కర్మలను విడచిన సన్న్యాసికి నాత్మనిష్ఠయం దధికార మేర్పడును. వానికి మరల కర్మనిష్ఠాప్రాప్తి యసంభవము. ఆత్మనిష్ఠయం దర్హతలేని యజ్ఞానికి చిత్తశుద్ధికొఱకుఁ గర్మనిష్ఠ విధించబడినది. ఆత్మనిష్ఠునకు నాత్మనిష్ఠచే గృతకృత్యత గలుగును. వాడు గర్మనిష్ఠ నాశ్రయించవలసిన పని లేదు. ఆత్మనిష్ఠు డనగా జ్ఞాని. జ్ఞానికి గర్మాధికారము లేదని 'వేదావినాశిన'మ్మను శ్లోకభాష్యమునందుఁ బూర్వము నిరూపింపఁబడినది. కాన ఆత్మనిష్ఠయం దధికారము లేని యజ్ఞానికే కర్మనిష్ఠ శ్రేయస్కరముగాని జ్ఞానికిఁ గర్మనిష్ఠ శ్రేయస్కర మెంతమాత్రమును గాదు. పైపెచ్చు విరోధముగూడ నగును.

కర్మఫలత్యాగమువలన మనశ్శాంతియు, మనశ్శాంతివలన ఆత్మధ్యానము నాత్మధ్యానమున ఆత్మాపరోక్షసాక్షాత్కారము, ఆత్మాపరోక్షత్వమున భక్తియు క్రమముగా గలుగునని యొకానొక ప్రణాళికను జూపిరి.

అందు ఆత్మాపరోక్షసాక్షాత్కారమున భక్తి కలుగు నను విషయము నిరాకరింపబడినది. అన్నిసాధనములకు ఆత్మసాక్షాత్కారమే ఫలము. ఆత్మసాక్షాత్కారానన్తరము మానవుడు కృతకృత్యుడే యగును. ఇంక నాతడు పొందదగిన ఫలమేమియు లేదు.

ఆత్మధ్యానమువలననే యాత్మసాక్షాత్కారము కలుగునని నియమింప వీలు లేదు. ఆత్మధ్యానము లేకున్నను శ్రవణమననాదులచే నాత్మసాక్షాత్కారము కలుగును. శ్రవణాదులను జేయజాలని మధ్యమాధికారికే యాత్మధ్యానము విధింపబడినది. ఉత్తమాధికారులకు శ్రవణాదులు విధింపబడినవి. మరియు మూలమునందు "త్యాగా చ్ఛాంతి రనన్తరమ్" (ఫలత్యాగానన్తరము మనశ్శాంతి) అని యున్నది కాని, "శాంతే రనన్తరం ధ్యానం. ధ్యానా దనన్తరం జ్ఞానమ్" మనశ్శాంతి కలిగిన పిదప ధ్యానమనియు, ధ్యానము కలిగినతరువాత జ్ఞానమనియు క్రమమును సూచించునట్టి వాక్యములేదు. అట్టివాక్యములేనపు డీ క్రమమును నిరూపించుట యప్రమాణమగును.

మరియు కర్మఫలత్యాగము మనశ్శాంతికి గారణ (నుపాయ) మయినట్లు ఆత్మజ్ఞానము ఆత్మధ్యానమునకు గారణ (నుపాయ) మగునని చెప్పినచో నుపాయ మగు ధ్యానమునకు నుపేయమగు జ్ఞానముకంటె గొప్పదనమును చెప్పినట్లగును. అయ్యది యనుచితము. లోకములో నుపాయముకంటె నుపేయము (ఫలము) గొప్ప దని యందరకు దెలిసిన విషయము. కనుకనే ఫలము (ఉపేయము) చిక్కినపిదప నుపా యమును విడిచిపెట్టుదురు. ఉపేయముకంటె నుపాయమే గొప్పదగుచో నుపాయ మును విడచి యేమానవుడును ఉపేయమును బొందగోరడు- అవివేకపూర్వకమగు నభ్యాసము (ధ్యానము) నకు అవివేకమును నశింపజేయుజ్ఞానము యెన్నటికి సాధనము కానేరదు.

భక్తిమార్గమునందు గనిపించుచున్న విశ్వరూపుని యీశ్వరు డని తలచు వారలకు విశ్వరూపముకంటె వేరగు ద్రష్టయగు ఆత్మయొక్కజ్ఞానము కలుగనేరదు. అనాత్మకంటె వేరగు ద్రష్టయగు ఆత్మజ్ఞానము కలిగినచో ప్రపంచరూపము అనా త్మయు నగుదేహమునం దనురాగము కలుగనేరదు. ఆత్మజ్ఞానముకలవా రెప్పు డును సచ్చిదానందరూపునియందే క్రీడింతురు. అభ్యాసమునందు (ధ్యానమునందు) ఆత్మానాత్మవివేక ముండదు. కావున అజ్ఞానియయి కర్మయందు ప్రవర్తించినవానికి జ్ఞానమార్గమునం దధికారము లేనందునను, విశ్వరూపోపాసన మొనర్చుటకు శక్తి చాలనందునను అట్టివాడు శాంతినొందుటకు కర్మఫలత్యాగమే సుకరమని చెప్ప వలయును. ఇదియే యుచితమార్గము.

("అశక్తోసి, అశక్తో ఽసి") అని క్రమక్రమముగా శక్తి లేకున్నచో అని శ్రీకృష్ణుడు చెప్పుటచే శక్తి చాలక అజ్ఞానముచే కర్మమార్గమున బ్రవర్తించిన వానికే కర్మఫలత్యాగము శ్రేయస్సాధనము. సామర్థ్యముకలిగిన యజ్ఞానికి గాదు. కర్తలయందు ప్రవర్తించని యజ్ఞానికిని గాదు. ఇంక ప్రాజ్ఞుడయిన సన్యాసికి కర్మ ఫలత్యాగము శ్రేయస్సాధనము కానేరదని వేరుగ జెప్పనేల?

ఇందు నభ్యాసముకంటె జ్ఞానమునకు, జ్ఞానముకంటె ధ్యానమునకు గొప్ప దనము స్వతస్సిద్ధము. ఇచ్చట స్తుతిలేదు. ఇంక అభ్యాస, జ్ఞాన, ధ్యానములయం దసమర్థుడయిన అజ్ఞానికి సర్వకర్మఫలత్యాగము అభ్యాస జ్ఞాన ధ్యానములకంటె గొప్పదని చెప్పుటయే స్తుతి.

కావున, సంపన్నములయిన నుత్తమసాధనములగు విశ్వరూపోపాసనాదుల ననుష్ఠింపలేని యశక్తునకు నీయదిగూడ సులభము కాదుకాన నిది చేసినను వాడు గొప్పవాడే యని స్తుతించబడుచున్నది.

అయితే ఫలత్యాగమునకు, సంసారోపరమణమునకును కార్యకారణభావము లేదుగదా! త్యాగమువలన శాంతియని యెట్లు చెప్పబడినది? ఫలత్యాగమువలన

చిత్తశుద్ధి, దానివలన జ్ఞానము అనికదా క్రమమును జెప్పవలయును. నిజమే "యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేస్య హృదిస్థితాః అథ మర్త్యో ఽమృతో భవతి, అత్ర బ్రహ్మసమశ్నుతే" (హృదయమునందలి కోరికలెప్పుడు నశించునో, యప్పుడు మానవుడమృతత్వము నొందును) అని శ్రుతి చెప్పుచున్నది. కామములనగా కర్మఫలములు. నిష్కామునకు సుఖము లోకానుభవసిద్ధము. కావున సర్వకర్మఫలత్యాగము వలన సంసారోపరమరూపమయిన శాంతి చెప్పబడినది.

విద్వాంసులకు (ఆత్మజ్ఞానులకు) సర్వకామత్యాగము సంభవించును. దాన వారు శాంతి (సంసారోపరతి) నొందుదురు.

అజ్ఞానులు కర్మఫలమును ద్యజించినచో, త్యాగసామ్యముచే వీరుగూడ శాంతినొందుదురని స్తుతించబడినది. కర్మాధికారియగు నజ్ఞానికి, కర్మఫలత్యాగమునం దభిరుచిని కలిగించుట కిట్లు స్తుతించి చెప్పబడినదని గ్రహింపవలెను.

కావున, భగవదుపాసనయందు శక్తిజాలని ముముక్షువులు "ఛీ; మే మెంత పనికిరాలినవాండ్లము ? మన కింక గతి యేమి ?" అని ఖేదపడుచుండ కృపాళువగు భగవంతు డిట్లు లాలన చేయుచున్నాడు.

"మీరు ఖేదపడకుడు. మీకు కర్మఫలత్యాగము సులభము. అది యంత తక్కువది కాదు. దానివలనగూడ మోక్షము కలుగును" అని.

ఇట్లు భగవంతునివాక్యమును విని, మనకు కర్మఫలత్యాగమువలన వెంటనే మోక్షము కలుగును. మిగిలినవారికి నాలస్యముగా మోక్షము కలుగునని యెంచి యత్యుత్సాహముతో గర్మఫలత్యాగమునందు బ్రవర్తింతురు. దాన చిత్తశుద్ధి జ్ఞానములను బొంది క్రమముగా మోక్షము నొందుదురు.

పూర్వ మెప్పుడో యగస్త్యు డను యొకానొక బ్రాహ్మణుడు సముద్రమును త్రాగగా, నామాహాత్మ్యమును పురస్కరించుకొని బ్రాహ్మణత్వజాతి సామాన్యముచే నిప్పటి బ్రాహ్మణులుగూడ మహానుభావు లని స్తుతింపబడు చున్నారు. ఇప్పటి బ్రాహ్మణులు సముద్రోదకమంతయు ద్రావగలరా ? లేరు. మరి యెందు కీ స్తుతి ? వినుడు. తక్కువజాతివారికి బ్రాహ్మణులయందు భక్తిశ్రద్ధలు కలుగుట కిట్లు స్తుతింతురు.

విద్వాంసు (ఆత్మజ్ఞానులు) లొనర్చెడి సర్వకామత్యాగము అగస్త్య బ్రాహ్మణుని వంటిది. అజ్ఞానిచేసెడి కర్మఫలత్యాగము యీనాటి బ్రాహ్మణుని వంటిది. వీ రుభయులకును దుండెడి బ్రాహ్మణత్వమను జాతివంటిది త్యాగము. అగస్త్యునియందలి మహిమను బురస్కరించుకొని యీనాటి బ్రాహ్మణులను స్తుతించగా శూద్రాదులు వీరిని బూజించుటకు బ్రవర్తింతురు. అట్లే విద్వాంసుని సర్వకామత్యాగమువలన గలిగెడి శాంతిని పురస్కరించుకొని యవిద్వాంసుని కర్మ

ఫలత్యాగమువలనగూడ శాంతి కలుగునని చెప్పినచో నవిద్వాంసు (నజ్ఞాను)లందరు యాశపడి కర్మఫలత్యాగమునందు ప్రవర్తింతురని భావము.

దీనివలన బ్రాహ్మణజాతి యగస్త్యుని యాశ్రయించి పేరెన్నికగని అదియే యిప్పటి బ్రాహ్మణుల నాశ్రయించికూడ చెడకుండ గౌరవాస్పదముగ నుండినట్లు విద్వాంసుల నాశ్రయించి గొప్పదనమును బొందిన త్యాగము యిప్పు డవిద్వాంసుల నాశ్రయించికూడ నశించలేదను వ్యంగ్యార్థము స్ఫురించుచున్నది.

ఓయి! శాంతిశబ్దమునకు సంసారోపరతి యను నర్థము అంగీకరింపబట్టి గదా, యీప్రయాసయంతయు కలిగినది! శాంతిశబ్దమునకు చిత్తశుద్ధి యని అర్థము జెప్పినచో కర్మఫలత్యాగమునకు, చిత్తశుద్ధికిని కార్యకారణభావము కలదు గాన భగవంతుడగు శ్రీకృష్ణుడు యథార్థమును జెప్పినవాడే యగునుగదా యని నచో నట్లుకాదు. అట్టిచో చిత్తశుద్ధివలన కలిగెడి ధ్యానముకంటె చిత్తశుద్ధికి కారణమగు ఫలత్యాగము గొప్పదని జెప్పుట సంభవింపదు. ఫలత్యాగము సులభమగుటయే గొప్పదన మని యనరాదు. అపుడు 'శ్లో॥సులభం జ్ఞాన మభ్యాసా జ్జ్ఞానా ద్ధ్యానంచ భారత, ధ్యానా త్కర్మఫలత్యాగ స్త్యాగా చ్ఛాంతి రనన్తరమ్" అనియే వ్యాసులు శ్లోకమును రచించియుండవలసివచ్చును. మరియు ధ్యానముకంటె ఫలత్యాగముమాత్రమే సులభమనియు, అభ్యాసయోగముకంటె జ్ఞానము విశిష్టమనియు, అట్లే జ్ఞానముకంటె ధ్యానముగూడ గొప్పదనియు ననరాదు. అప్పుడు జ్ఞాన ధ్యానములయందు ప్రకృతమయిన గొప్పదనమును త్యాగమునందు జూపక విడచుట సంభవించదు.

అయితే, యిచట ధ్యానముకంటె గొప్పదయిన విద్వత్కర్తృకమయిన సర్వకామత్యాగమే యేల జెప్పగూడదు? అపు డట్టి త్యాగమువలన సంసారోపరతి రూపమయిన శాంతి నిరాటంకముగా కుదురునుగదా ?

అట్లుకాదు, వినుము. ఈశ్లోకము అజ్ఞానిపరము. "అద్వేష్టా సర్వభూతానామ్" ఇత్యాది శ్లోకములచే విద్వాంసులయొక్కగతిని నిరూపింపబోవుచున్నాడు. ప్రస్తుత మిచట "అథచిత్తం నశక్నోషి" అని మొదలగు శ్లోకములచే, నశక్తులగు నవిద్వాంసుల గతిని చెప్పుట ప్రారంభింపబడినది. కావున సర్వకామత్యాగము శాంతిహేతువగుటచే సర్వకర్మఫలత్యాగముకూడా శాంతిహేతువని యజ్ఞానుల కభిరుచిని గలిగించుటకు స్తుతింపబడిన దనుటయే యుచితము.

కర్మఫలత్యాగము సులభమగుటచే దీనియందు ఫలములేదని, యజ్ఞానులకు ప్రవృత్తి కలుగదు. కావున నట్టియజ్ఞానులను ప్రవర్తింపజేయుటకు 'నీయది సులభ

మయినను నిష్ఫలము గాదు. సంసారోపరమమను గొప్పఫలము గలదు' అని శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడని భావము.

ఓయి సర్వకామత్యాగమే సర్వకర్మఫలత్యాగముకాన నీరెంటికి భేదమేమి? ఇం దొకటి విద్వాంసుల కలవడునని మరియొకటి యవిద్వాంసులకని చెప్పుటలో నిమిత్తమేమి?

వినుము. చేయబడుచున్నకర్మలయొక్క ఫలమును విడచుట కర్మఫలత్యాగము. కర్మాధికారములేని విద్వాంసుల కీయది. సంభవించదు. ఐహికాముష్మికసర్వవస్తువిషయకామనాపరిత్యాగము సర్వకామత్యాగము. ఇది యజ్ఞానులకు సంభవించదు. అజ్ఞానులకు జీవనోపాయములగు కర్మలయందును యజ్ఞాదికర్మలకు సాధనములయిన సమిత్కుశాదులయందును కామ ముండును.

అయితే, కర్మఫలమును త్యజించినను జ్ఞానము కలిగినపిదపనే శాంతి కలుగునుకాని, జ్ఞానము కలుగనిదే శాంతి యసంభవముగదా! సర్వకామత్యాగానన్తరముగూడ సంసారోపరమము కలుగుట దుర్లభముకదా!

కాదు. ఆత్మస్వరూపసాక్షాత్కారము లేనిదే, విద్వాంసులకుగూడ సర్వత్యాగము కలుగదు. గొప్పవస్తువును బొందియే కొద్దివస్తువునందలి కోరికను మానవుడు విడచును. పరమానందమయిన ఆత్మస్వరూపమును బొందినపిదపనే క్షుద్రసుఖమునకు గారణములయిన అన్నాదులయందు గోరికను విడచును.

ఇట్లైనచో "తరతి శోక మాత్మవిత్" ఇత్యాదిశ్రుతులు ఆత్మజ్ఞానానన్తరమే శోకనివృత్తిరూపమయిన మోక్షము కలుగునని చెప్పుట విరుద్ధమగునుకదా! సర్వకామత్యాగ మనునది మధ్య యొక టుండ శ్రుతి యట్లు చెప్పుట విరుద్ధముగదా! కాదు, ఆత్మసాక్షాత్కారానన్తరము వెంటనే సర్వకామత్యాగము, సంసారోపరమము కలుగును. జ్ఞానము కలిగినతరువాత సర్వకామత్యాగమను వేరొకపని యుండదు. అందువలన దానివ్యవధానము సంసారశాంతికి ప్రసక్తించదు.

లేక, జ్ఞాననిష్ఠయందు ప్రవర్తించిన విద్వాంసునకు సర్వకామత్యాగ మెప్పుడు కలుగునో, యపుడు జ్ఞాననిష్ఠ పరిపాకమును జెందినదనియు, నదిలేనపుడు జ్ఞాననిష్ఠ పరిపాకమును జెందలేదనియును గ్రహింపనగును. జ్ఞానముయొక్క పరిపాకమే యాత్మసాక్షాత్కారము. కాన, ఫలత్యాగానన్తరము కలిగెడి సంసారశాంతికి త్యాగమే కారణముగాదు. త్యాగముతో కలసియున్న జ్ఞానమే కారణము. కాన పైశ్రుతికి విరోధములేదు.

లేక, త్యాగానన్తరముశాంతియనుమాటవలనత్యాగశాంతులకు,కార్యకారణ భావ మర్థము కాదు. లక్ష్మణునితర్వాత శత్రుఘ్నుడు పుట్టెనని యన్నట్లు,జ్ఞానము కంటె మొదట త్యాగము కలిగెననియు, తర్వాతనే శాంతి కలిగెననియు నర్థము. ఇంతమాత్రమున జ్ఞానశాంతులమధ్య త్యాగ మను కృత్య మున్నదని యనరాదు. జ్ఞానము పరిపక్వమయినదని గుర్తింపజేయును త్యాగము. జ్ఞానముతర్వాత సంసారోపరమము యెట్లు కర్తవ్యము కాదో, అట్లే త్యాగముగూడ కృత్యము కానేరదు. కావున విద్వాంసులకు ఆత్మసాక్షాత్కారము కలిగినవెంటనే సర్వకామప్రహాణము (త్యాగము), సంసారోపరమము కలుగును. ॥౧౨॥

శ్లో. అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ,
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ. ।౧౩॥

అ. పూర్వము జీవేశ్వరభేదముగల యజ్ఞానులకు కర్మయోగము, విశ్వరూపోపాసనాయోగమున్ను చెప్పబడినది. అశక్తియనునది యజ్ఞానకార్యము. అశక్తునకే పైరెండును జెప్పబడినవి. దీనివలన జ్ఞానికి కర్మయోగము, విశ్వరూపోపాసనమును సంభవించదనియు, అజ్ఞానికి అక్షరోపాసనము సంభవించదనియు సూచితమగుచున్నది. అజ్ఞానుల కభేదజ్ఞానము, జ్ఞానులకు భేదజ్ఞానము సంభవించనేరదు.

జీవేశ్వరభేదవాదులు జ్ఞానులు కారు. 'అథ యోన్యాం దేవతా ముపాస్తే అన్యోసా వన్యోహ మస్మీతి న స వేద యథా పశురేవ స దేవానాం" అనుశ్రుతి భేదవాదులు పశువులని చెప్పుచున్నది. "య ఉదర మంతరం కురుతే అథ" తస్య భయం భవతి' "ద్వితీయా ద్వై భయా భవతి'' ఇత్యాదిశ్రుతులు భేదజ్ఞానమును నిందించుచున్నవి కావున నీ ప్రకరణమంతయు అజ్ఞానివిషయము.

ఇచట కర్మయోగ మజ్ఞానివిషయమయినను, భక్తియోగముమాత్రము అజ్ఞానివిషయము గాదని యాసపడవలదు. అక్షరోపాసకులవలె విశ్వరూపోపాసకులు కూడ జ్ఞానులగుచో నక్షరోపాసకులకువలె విశ్వరూపోపాసకులగు భక్తులకుగూడ మోక్షము స్వతంత్రముగావలయును. భగవంతుడగు శ్రీకృష్ణుడు 'తే ప్రాప్నువంతి మా మేవ' అని యక్షరోపాసకులకు మోక్షము స్వతంత్రమనియు, 'తేషా మహం సముద్ధర్తా' అను శ్లోకముచే భక్తులను నే నుద్ధరింతుననియు జెప్పెను. కాన భక్తులు జ్ఞానులు గారు– కావున నక్షరోపాసకులకు కైవల్యము అఱచేతిలో నుసిరెగపండువలె స్వతంత్రము. భక్తుల కయ్యది యీశ్వరాయత్తము. శ్రీకృష్ణుడు జ్ఞానులు నేనే యని చెప్పెను. 'జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్' అని శ్లోకమున 'తేషా మహం సముద్ధర్తా' అనుశ్లోకమునందు భక్తుల నే నుద్ధరింతునని చెప్పెను. భక్తులయెడ నుద్ధ

రింపదగినవాడు నుద్ధరించువాడు అను వస్తుద్వయము కలదు. జ్ఞానులు భగవత్స్వరూపులు కాన, నచ్చట వస్తుభేదము లేదు. అభేదభావముగల జ్ఞానులు, తమను తమకంటె వేరుగ నీశ్వరు డుద్ధరించునని తలంచరు. భక్తులకు 'తాను వేరు, యీశ్వరుడు వేరు' అను భేదభావము గలదు. కాన నీశ్వరుడు భక్తులను మృత్యుసంసారసాగరమునుంచి యుద్ధరింతునని చెప్పెను. జ్ఞానులను నే నుద్ధరింతునని చెప్పలేదు. పైగా నేనే వారని చెప్పెను. అభేదభావముగల జ్ఞానులయందు సముద్ధరణక్రియానిరూపితకర్మత్వముగాని, యీశ్వరునియందు జ్ఞానికర్మకసముద్ధరణక్రియానిరూపితకర్తృత్వముగాని సంభవింపదు.

కావున కైవల్యము యీశ్వరాధీనమని భ్రమించెడి భక్తులు అజ్ఞానులు. స్వతంత్రముగా భగవత్స్వరూపమును బొందెడి యక్షరోపాసకులు ప్రాజ్ఞులు. వీరికి కైవల్యము (మోక్షము) స్వతంత్రము.

కావున నజ్ఞానులకే భక్తిమార్గము నందవకాశము. జ్ఞానులకు నక్షరోపాసము నందే యధికారము. కనుకనే భక్తియోగమును అజ్ఞానివిషయమగు కర్మయోగము నందు జేర్చుట పొసగుచున్నది. 'జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్' అని చెప్పుటచే గర్మయోగ మజ్ఞానివిషయ మనునది సుస్పష్టము. ఆత్మానాత్మవివేకజ్ఞానముగలవారు సాంఖ్యులు. వీరికంటె భిన్నులగు యోగులు అజ్ఞానులనక తప్పదు. కనుకనే శ్రీకృష్ణుడు భేదదృష్టిగల యజ్ఞానులకు కర్మయోగము మంచిదని చెప్పి, యభేదదృష్టిగల జ్ఞానులకు జ్ఞానయోగమే మంచిదని చెప్పి, ఆవల కర్మయోగముకంటె జ్ఞానయోగ ముత్తమ మని నుడివెను.

కనుకనే, పార్థునియొక్క హితవును గోరిన శ్రీకృష్ణుడు, అక్షరోపాసకులకు సాక్షాన్ముక్తిహేతువగు ధర్మపుంజమును నీకు జెప్పెదనని ప్రవర్తించెను. అభేద దృష్టిగల జ్ఞాని కర్మాంగము కానేరడు. తా నీశ్వరుడనని ప్రమాణపూర్వకముగ దెలిసికొనినవాడు మరియొకనికి దాసుడగుటకు (నౌకరగుటకు) నంగీకరింపడు.

సర్వజ్ఞత్వాది గుణములుగల యీశ్వరుడు వేరు, కించిద్జ్ఞత్వాదిగుణములతో గూడిన నేను వేరు, అని యనుకొనినవాడే యీశ్వరుని సేవింపగలడు. నేనే యీశ్వరుడనని యనుకొనువాడు యీశ్వరుని సేవింపదలంచడు. సేవ్యసేవకభావము భేదబుద్ధి నాశ్రయించియుండును. భేదబుద్ధిలేని జ్ఞానులకు సేవ్యసేవకభావ ముండదు. కాన జ్ఞానులకు కర్మయోగముకాని, యందుజేరిన భక్తియోగముకాని యలవడదు. కనుకనే భేదదృష్టిగల యర్జునునకు గర్మయోగము నుపదేశించెను.

అద్వేష్టృత్వాది ధర్మపుంజము క్రమముగా మోక్షసాధనమగును. కాన నయ్యది భక్తుల కుపదేశింపబడినది. మోక్షమునకు జ్ఞానయోగమే యంతరంగసాధనము. కర్మయోగముగాని, దానిలోజేరిన భక్తియోగముగాని బహిరంగసాధనము.

పార్థునియొక్క హితవునుగోరిన శ్రీకృష్ణపరమాత్మ, పార్థునకు కర్మయోగజ్ఞానయోగముల రెంటిని యుపదేశించెను. అం దర్జునుడు ప్రాజ్ఞుడగుచో, జ్ఞానయోగ మనుష్ఠించును. లేనిచో కర్మయోగ మాచరించును. కనుకనే శ్రీకృష్ణుడు, "పార్థుడా! నీవు నాయందు మనస్సు నుంచుము" అని భక్తియోగము నుపదేశించి, అందు శక్తిలేనిచో నభ్యాసయోగమును జేయుము. అందును శక్తిలేనిచో నా కర్మలను జేయుము. దానికి శక్తిచాలనిచో కర్మఫలత్యాగ మాచరింపు మని యుపదేశించెనని కొందఱందురు.

నిజ మది కాదు. అర్జునుని నిమిత్తముగా జేసికొని సర్వలోకహితవును గోరి శ్రీకృష్ణుడు శాస్త్రమును విప్పిచెప్పెను. లోకములో ప్రాజ్ఞుడగు మానవుడు అక్షరోపాసనమును యాచరించును అజ్ఞాని విశ్వరూపము నుపాసించును. అందును శక్తిచాలనివాడు అభ్యాసయోగము నూనును. అందును చాలనివాడు ఈశ్వరార్థ మాలయుః కర్మల నాచరించును దానికి సామర్థ్యములేనివాడు కర్మల నాచరించి కర్మఫలమును త్యజించును, అని భగవంతుని యాశయము. ఇంతియెకాని యర్జునునకు వీటన్నిటియందును అధికార మున్నదనుటకు వీలులేదు. అర్జునున కెం దధికారమున్నదియు భగవంతునకు దెలియదనుటకు వీలులేదు.

కావున, పార్థుని మేలుకోరినను, భగవంతుడు సర్వలోకహితవును గోరి భేదదృష్టిగలవారలకు కర్మయోగమును, అభేదదృష్టిగలవారలకు జ్ఞానయోగము నుపదేశించెనుగాన జ్ఞానయోగమే యుత్తమము. ప్రాజ్ఞులు ఉత్తమయోగమునే యాశ్రయింతురు.

లేక "తేషాం కే యోగవిత్తమాః" అను శ్లోకముచే అర్జును డడిగిన ప్రశ్నకు భగవంతుడు "తే మే యుక్తతమా మతాః" "తే ప్రాప్నువంతి మామేవ" అను శ్లోకద్వయముచే సమాధాన మొసగెను. అందు కర్మయోగమున ప్రయాస స్వల్పము. జ్ఞానయోగమునం దయ్యది యధికము. కాన కర్మయోగము సుకరమని చెప్పఁబడినది. భక్తిమార్గమునందు శక్తిలేనివారలకుఁగూడ గత్యంతరములు జూపబడినవి. ఇంచుమించు చింతటితో గ్రంథము ముగిసినట్లే. ఇటుపైన "అద్వేష్టా సర్వభూతానాం" మిత్యాద్యుత్తరగ్రంథారంభమున కంతగ నవకాశము కనిపింపదు. కాని లోకహితమును గోరు బురుషు లెవరిహితమును గోరుదురో వారడి

గినదానినంతయును జెప్పుదురు. మిక్కిలి హితమును గోరు పురుషులు అడుగని విషయమునుగూడ జెప్పుదురు. అందు తాము జెప్పెడి యర్థము వానికి హితకర మగునా ? కాదా ? యనియే వీరి యభిప్రాయము. వా డిద్దాని నడిగెనా ? లేదా ? యని సందేహింపరు. అట్లే శ్రీకృష్ణుగూడ అర్జునహితవును మిక్కిలి గోరినవాడు గాన అర్జును డడుగని విషయమునుగూడ నాతని కుపదేశించెనని చెప్పవచ్చును. అక్షరోపాసకుల ధర్మసముదాయమును అర్జునుడు విని, దాని నలవరచుకొనుట మిక్కిలి కష్టమైనను అక్షరోపాసకులమార్గమే సర్వాధికమని యర్జునునకు జ్ఞానము కలుగుననియు దానివలన క్లేశాధిక్యము నంగీకరించికూడ నర్జునుడు జ్ఞానమార్గ మందుఁ బ్రవేశించుననియు అటుపైని నర్జునునకు మోక్షము స్వాధీనమగుననియును శ్రీకృష్ణుని యాశయము. కనుకనే శ్రీకృష్ణుడు పార్థున కత్యంతహితైషి యని స్పష్ట పడుచున్నది.

లేక, అర్జునునకు జ్ఞానమార్గమునందు ప్రవేశము లేకుండుగాక. అయినను జ్ఞానులలక్షణమును వినినతోడనే పార్థునకు జ్ఞానులయం దీశ్వరబుద్ధి కలిగి పిదప జ్ఞానులగు సత్పురుషులయొక్క సంగాదులయందు ప్రవర్తించును. సత్సాంగత్యము వలన జ్ఞాన మేర్పడును. దాన ముక్తిని జెందును, అను నభిప్రాయముతో శ్రీకృష్ణుడు జ్ఞానుల ధర్మసముదాయము నిచటఁ బార్థున కుపదేశించె ననియును జెప్పవచ్చును.

దీనిచే 'అద్వేష్టా సర్వభూతానా' మను శ్లోకము మొదలుకొని యధ్యాయాంతమువఱకు నుండుప్రకరణము జ్ఞానయోగ ప్రకరణమని తేలినది. కావున కర్ములకు, జ్ఞానులకు ధర్మసాంకర్యము గలదని చదువరులు భ్రమింపవలదు.

ఇక శ్లోకమునందలి ప్రతిపదార్థమును వివరింతుము. సర్వభూతములు మాయచే నాత్మయందు గల్పితములనియు, సర్వభూతములయందును నాత్మ యంతర్యామిరూపముతో ననుగతుడనియు గ్రహించిన ప్రాజ్ఞుడు "ఐత దాత్మ్యమిదం సర్వ" మను భావముతో నేభూతమును ద్వేషింపడు. అట్లే ప్రాజ్ఞుడు సర్వ భూతములయందును మైత్రి కలిగియుండును. సర్వభూతములయందును దయా భావము కలిగి యెల్లరకు నభయము నిచ్చువాడుగ విరాజిల్లును. ఇట్టివానికి రాగ ద్వేషములు పూర్తిగా నశించినందున వీఁడు సన్యాసి యనదగును.

ఓయీ ! సర్వభూతములయందు మైత్రీకరుణాభావములు గలవానికి భూత ములందు రాగమేర్పడునుగాని యయ్యది యెట్లు నశించును ? వినుము. రాగము లేకున్నను దుఃఖించుచున్న శునకాదులయందు మహనీయులకు గరుణాభావము కని పించుచున్నది. అట్టి కరుణయే లేనిచో దుఃఖించుచున్న శిష్యులదుఃఖమును

బోగొట్టుటకు గురువు ప్రయత్నింపడు. అట్టితరి శాస్త్రసంప్రదాయమే లోకములో విచ్ఛిన్నమగును. గురువునకు నైర్ఘృణ్యాదోషముకూడ కలుగును. కనుకనే యీశ్వరునకు నే భూతమునందను రాగములేకున్నను యీశ్వరుడు దయాసముద్రుఁ డనియే చెప్పబడుచున్నాడు. మైత్రి యనగా సర్వభూతము లాత్మరూపములు అను ప్రేమ లేక సర్వభూతముల హితమును గోరుటగాని యగును. సన్న్యసింపని కర్మని జూచి యెల్లభూతములు భయపడును. వీడు మనలను ఛేదించునని సోమలతాపశ్వాదులు భయంపడును. వీడు మనలను నిరసించునని భూతప్రేత రాక్షసాదులు భయపడుదురు. వీడు మనలను ధనమును యాచించునని రాజాదులు, ధనికులు భయపడుదురు. మమ్ముల బనులయందు నియమించి బాధించునని భార్యాబిడ్డలు మున్నగువారు భయపడుదురు. సన్న్యాసినిజూచి యే ప్రాణియు భయపడదు. కావున సన్న్యాసి సర్వభూతాభయప్రదుడని చెప్పబడుచున్నాడు. దీనిచేఁ గర్మసన్న్యాసిగాని యజ్ఞానికి, భక్తునకును అద్వేష మైత్రీకరుణాదిభావములు గలుగవని తేలినది.

ఏభూతమును ద్వేషింపకుండుట, యెల్లభూతములయందు మైత్రీకరుణాదులతో నుండుట యలవడినచో వాడు పశులతాపుష్పఫలాదులను ఛేదింపడు. కాన నద్వేషకరుణామైత్ర్యాది ధర్మములుగలవాడు సన్న్యాసియేకాని కర్మి గానేరడు.

అజ్ఞానికి "ఈ దేహము నాది, నేను బ్రాహ్మణుడను, నేను జ్యోతిష్టోమమును జేయుచుంటిని, నాచేతిన లేడికొమ్ము గలదు" అను జ్ఞానముండును.

జ్ఞానియగు సన్న్యాసికి "నేను దేహాదులు కాను, నాకు దేహాదులతో నెట్టి సంబంధము లేదు" అను జ్ఞాన ముండును. అందువలన సన్న్యాసికి సుఖదుఃఖములు సమానముగా నుండును. దుఃఖమును బుట్టించుదానిని ద్వేషింపడు. సుఖమును-బుట్టించుదానిని ప్రేమించడు.

మఱియు జ్ఞాని జుట్టుపట్టి లాగినను, కొట్టినను, చిత్తమునందేమాత్రము వికారము నొందడు. అహంకార మమకారములేనివానికినియ్యది సహజము. ఇట్టిభావమే క్షమ యనబడును. 'అహమ్, మమ' అను నభిమానముగలవానికి తాడనాదులవలన దుఃఖాది వికారములు గలుగును. అభిమానము నశించినచో పుట్టలో విడచినపాము కుబుసమును మనము కొట్టినచో- పామున కద్దానియం దభిమానము లేనందున దాని కెట్లు కోపాదివికారము లుండవో, యట్లే దేహాభిమానములేనివాని దేహమునం దేపనిని మనము జేసినను వానికి కోపాదివికారము లుండవు. కర్మానుష్ఠానపరునకు దేహాభిమాన ముండును. కావున వానికి తాడనాదులవలన కోపాదివికారములు గల్గును. క్షమయనుగుణము కర్మి కలవడుట దుష్కరము ॥౧౩॥

శ్లో. సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః
మ య్యర్పిత మనోబుద్ధి ర్యో మద్భక్త స్స మే ప్రియః ॥౧౪॥

అ॥ లోకములో దేహమే తానని కాని, దేహము తనదని కాని యభిమానము గలవాడు దేహము నిలచియుండుటకు గారణమయిన అన్నాదులు లభించినచో సంతోషించును. దేహాభిమానములేనివానికి అన్నాది పదార్థములు లభించినను లభింపకున్నను అలంబుద్ధియే యుండును(సంతోషమె యుండును) దేహాదివిలక్షణ మయిన అసంగాత్మను దెలిసికొన్నవానికి అన్నాదులతో బనిలేదు. ఇట్టిబుద్ధి కర్మాధికారికి నుండుట యసంభవము.

అట్లె దేహాభిమానికి నెల్లప్పుడు చిత్తము విక్షిప్తముగా నుండును. చిత్తము నకు చలనములేనిదే యేవ్యవహారమును పొసగదు. సుషుప్తియందు దేహాభిమానము లేనందున, వ్యవహారాభావము పొసగుచున్నది. కర్మానుష్ఠానపరు డొకింతకాలము చిత్తమును నిలుపుకొన్నను చిరకాలము నిలుపుకొనలేడు. ఇట్టి సామర్థ్యము యోగికే తటస్థించును.

ఒకవేళ కర్మఫలత్యాగమున కర్మికి చిత్తసమాధానము లభించినను దేహాభి మానమును విడువనందున నయ్యది నిలచియుండనేరదు. దేహాభిమానపూర్వకముగ సమిత్కుశాదిపరికరము లనేకములను సంపాదించుకొను కర్మికి చిత్తసమాధాన మనునది మచ్చునకుగూడ నుండుట దుర్లభము. కర్మఫలమును వీడినందున గలిగిన చిత్తసమాధానము ఫలసిద్ధి యసిద్ధులవలన కలిగెడి వికారము లేకుండుట మాత్రమే కాని, యే వికారములు లేకుండుట కాదు.

ఇట్లే, యతాత్మ=బలాత్కారముగ ధర్మాధర్మాది లక్షణమయిన స్వభావ మును నియమించుకొనుట జ్ఞానికి సంభవించునుగాని యితరునకు సంభవించదు. స్వభావ మెల్లరకు దురతిక్రమమని యనరాదు. అట్టితఱి పురుషకారము వ్యర్థ మగును.

లేక 'యతాత్మ'యను పదమునకు ఆత్మశ్రవణాదులయందు నియమముగా ప్రవర్తించువాడని యయినను జెప్పవచ్చును. కర్మలకు కర్మలయందు నియత మయిన ప్రవృత్తియుండును. వారలకు ఆత్మశ్రవణాదులయందు బ్రవృత్తి నియ తము కానేరదు.

లేక "యతాత్మ" శబ్దమునకు నిశ్చలమయిన స్వభావముగలవాడనియు నర్థము చెప్పవచ్చును. స్వభావమనగా దేహేన్ద్రియసముదాయమని యానంద గిరులు చెప్పిరి.

మరియు జ్ఞానులకు 'నేనే బ్రహ్మ' నను దృఢనిశ్చయ ముండును. దేహాభిమానము నశించక, ఆత్మజ్ఞానములేని కర్ములకు 'అహంబ్రహ్మ' అను నిశ్చయ ముండదు.

ఇట 'మయ్యర్పిత మనోబుద్ధిః' అను వాక్యమునందలి 'మయి'అను పదమునకు ఆత్మరూపుడనగు నాయందు అని యర్థముకాని, విశ్వరూపుడనగు నాయందు అని యర్థము కాదు. ఈయది జ్ఞానిప్రకరణముకాని యజ్ఞానిప్రకరణము గాదు. ఇందు 'మద్భక్తః' అను పదమునకు ఆత్మనిష్ఠుడని యర్థము. అట్లు కానిచో విశ్వరూపోపాసకునకు వెనుకజెప్పిన ధర్మము లన్వయించవు. విశ్వరూపదేహమునందు యీశ్వరాభిమానముగలవాడు యజ్ఞాని యగునుకాని, జ్ఞాని కానేరడు.

ఓయి! 'యో మద్భక్త స్స మే ప్రియః' (నాయందు భక్తిగలవాడు నాకిష్టుడు) అనికదా నాల్గవపాదము కలదు. ఇచట 'జ్ఞానముగలవాడు నా కిష్టుడు' అను నర్థమును వర్ణించు టేమియుచితము? వినుము. శ్రీకృష్ణుడు సప్తమాధ్యాయమున 'ప్రియోహి జ్ఞానినోఽత్యర్థం అహం సచ మమ ప్రియః' (జ్ఞానికి నేను మిక్కిలి యిష్టుడను. జ్ఞాని నాకును మిక్కిలి యిష్టుడు) అనికదా చెప్పెను. ఇపుడీ యధ్యాయమున మరల యాతడు, భక్తుడు నాకిష్టుడని చెప్పునా? అట్లు చెప్పినచో వెనుక దాను జెప్పినమాటకు విరోధము వాటిల్లదా? కావున నేడవ యధ్యాయమున 'జ్ఞాని నాకిష్టు'డని చెప్పియున్నందున నిచటగూడ ప్రియశబ్ద సాహచర్యమువలన 'మద్భక్తః' యనుపదమునకు జ్ఞానియనియే చెప్పవలయును. అపుడే పూర్వాపరముల కైకకంఠ్యము (విరోధము లేకుండుట) పొసగును.

ఇట్లైనచో నేడవయధ్యాయమున జ్ఞాని నాకిష్టుడని చెప్పి మరల యిచటగూడ నదే విషయమును (జ్ఞాని నాకిష్టుడు అను విషయమును) జెప్పినచో పునరుక్తిదోషము వాటిల్లదా? లేదు. ఏడవ యధ్యాయమున 'జ్ఞాని నాకిష్టు'డని సంక్షేపముగా జెప్పి యిచట నద్దానిని వివరించెను. కాన పునరుక్తిదోషము లేదు.

## రామానుజమతము:

ఇచట రామానుజులు "అద్వేష్టా సర్వభూతానామ్" 'సంతుష్ట స్సతతం యోగీ' అను రెండుశ్లోకములచే జెప్పబడిన ఎల్లభూతములను ద్వేషింపకుండుట, ఎల్లభూతములయందు మైత్రి, కరుణ, మమతారాహిత్యము, అహంకారాభావము, సుఖదుఃఖములయందు సమత్వము, క్షమ, నిత్యసంతోషము, చిత్తసమాధానము, ఆత్మనిగ్రహము, దృఢనిశ్చయము, మనోబుద్ధుల నీశ్వరునియం దుంచుట యను

సీ ధర్మములు కర్మనిష్ఠున కుపాదేయము (గ్రాహ్యము) లని చెప్పిరి. ఈయది కడు మోసము.

కర్మయోగులకు నిర్మమత్వాది ధర్మములు సంభవించవు. బ్రాహ్మణత్వాది జాత్యభిమానములేనిదే కర్మలయందు ప్రవృత్తి సంభవించదు.

"మద్భక్తః" అను పదమునకు కర్మయోగముచే సేవించువాడు అని యర్థమును వర్ణించుటగూడ నుచితము గాదు.

'కర్మయోగముచే' అనుదానికి మూలమునం దాధారము కనిపించదు. ఏడవయధ్యాయమున జ్ఞాని నా కిష్టుడని చెప్పి, యిచట కర్మి నా కిష్టుడనుట విరుద్ధమగును.

మరియు "సతతం యోగీ" అను పదమునకు "ప్రకృతివివిక్తాత్మానుసంధానపరుడు' అని యర్థమును వర్ణించిరి. ఈయది యక్షరోపాసకు డగు జ్ఞానికి సంభవించునుగాని; కర్మానుష్ఠాతలకు సంభవించదు. కర్మానుష్ఠానము, ఆత్మానుసంధానము- ఈ రెండు నొకేకాలమున నొకేపురుషునికి సంభవించవు. కనుకనే తృతీయాధ్యాయమున జ్ఞానులకు వేరుగను, కర్మలకు వేరుగను, నిష్ఠలను విభజించి శ్రీకృష్ణ భగవానులు చెప్పెను.

ఇచ్చటగూడ కర్మయోగమును, అక్షరాత్మానుసంధానమును వేరువేరు అధికారులకని నిరూపించెరు. భక్తు లొక కక్షకు చెందినవారనియు, ఆత్మోపాసకులు మరియొక కక్షకు చెందినవారనియును నిరూపింపబడినది. అట్లుకాక కర్మయోగులు, ఆత్మానుసంధానపరులు - వీరిరువు రొకేతెగకు చెందినవా రగుచో వీరిలో నెవరు యోగవిత్తములు? అని ప్రశ్నించుట కుదరదు. కావున కర్మలకంటె ఆత్మానుసంధానపరులు వేరనియే స్పష్టముగా జెప్పవలయును. ఈవిషయ మింతకు మున్ను జ్ఞానకర్మసముచ్చయవాదనిరాకరణప్రసంగమున విపులముగా చర్చించబడినది. కాన నిచట పునర్విమర్శన మనవసరము. ॥౧౪॥

శ్లో. యస్మాన్నోద్విజతే లోకో లోకా న్నోద్విజతేచ యః
హర్షామర్షభయోద్వేగై ర్ముక్తో య స్సచ మే ప్రియః ॥౧౫॥

అ. ఏ సన్న్యాసి (జ్ఞాని) నుండి లోకము సంతాపమును జెందదో, లోకమునుండి యేజ్ఞాని (సన్న్యాసి) సంతాపమును జెందడో, హర్ష, అమర్ష, భయ ఉద్వేగములను వీడినయట్టి సన్న్యాసి (జ్ఞాని) నా కిష్టుడు.

ఇష్టవస్తువు లభించినపు డ న్తఃకరణకుగలిగెడి యుత్కర్ష హర్ష మనబడును. రోమముల గగుర్పాటు, కన్నీరు స్రవించుట మున్నగునవి హర్షమునకు చిహ్నములు.

ఇష్టవస్తువుయొక్క ప్రతిఘాతమును సహించలేకపోవుట యమర్షము. భయ మనగా త్రాసము. ఈ గుణము లన్నియు సన్న్యాసికి యావశ్యకములు. కర్మికి సంభవించవు. పైగా అనావశ్యకములు కావున నిట్టిజ్ఞానియే భగవంతునకు ప్రియుడు. కర్మి భగవంతున కిష్టుడు కాడు. ॥౧౫॥

శ్లో. అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యథః
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్త స్స మే ప్రియః ॥౧౬॥

అ. దేహేంద్రియ విషయాదులయం దపేక్షను వదలి, కార్యమాత్ర మంతయు మిథ్యయని తెలియు సామర్థ్యము గలిగి, బాహ్యాభ్యంతరశుద్ధి గలిగి మిథ్యాభూతములయిన కర్మలయందు ప్రవర్తించక, గతవ్యథుడై ఐహికాముష్మిక కర్మలను వీడి నాయందు భక్తిగలిగిన జ్ఞాని నా కిష్టుడు.

ఇందు చేరో్కనబడిన ధర్మములన్నియు సన్న్యాసియగు జ్ఞానికి సంభవించునుగాని కర్మికి సంభవించవు. అందువలన నిచట "మద్భక్తః" అను పదమునకు జ్ఞానియని యర్థమును జెప్పవలయునుగాని కర్మలతో జేరిన భక్తు డను నర్థము చెప్ప వీలులేదు ॥౧౬॥

శ్లో. యో నహృష్యతి నద్వేష్టి నశోచతి నకాంక్షతి
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ య స్స మే ప్రియః ॥౧౭॥

అ. ఇష్టవస్తువు ప్రాప్తించినపుడు సంతసింపక అనిష్టవస్తువు ప్రాప్తించినపుడు ద్వేషింపక ఇష్టవస్తువు వియోగము జెందినపుడు దుఃఖింపక అప్రాప్తమయిన ఇష్ట వస్తువును గోరక పుణ్యపాపకర్మలను పరిత్యజించు స్వభావము గలవాడై నాయందు భక్తిగలవాడు (జ్ఞానముగలవాడు) నా కిష్టుడు. కర్మి, కర్మపరికరములు ప్రాప్తించి నపుడు సంతోషించకమానడు. ప్రాయశ్చిత్తా ద్యనిష్టములు ప్రాప్తించినపుడు ద్వేషింపకమానడు. అట్లే కర్మ చెడిపోయినచో దుఃఖించును. మొదలిడిన కర్మ యొక్క ముగింపును గోరును. పాపకర్మను కర్మి విడచినను పుణ్యకర్మ విడువనేరడు. కాన నీశ్లోకమునందలి లక్షణములన్నియు జ్ఞానికి సంభవించునుకాని, కర్మికిగాని యందుజేరిన భక్తునకుగాని సంభవించవు. కాన నిచట భక్తపదమునకు జ్ఞానియే యర్థము. ॥౧౭॥

శ్లో. సమశ్శత్రౌచ మిత్రేచ తథా మానావమానయోః
శీతోష్ణ సుఖదుఃఖేషు సమ స్సంగవివర్జితః. ॥౧౮॥

అ. శత్రుమిత్రులయందు, పూజాతిరస్కారములయందు, శీతోష్ణ సుఖదుఃఖములయందును సమానమయిన బుద్ధిగలవాడును, శరీరానుబంధముగల పుత్రమిత్ర కళత్రాదులయందు ఆసక్తిలేనివాడును నా కిష్టుడు. ఇట్టివాడు సన్న్యాసి యగు జ్ఞాని యగునుకాని, కర్మి కానేరడు. కర్మికి మానావమానములయం దభిమాన ముండును. మరియు కర్మికి దారాపుత్రాదులయం దాసక్తి యనివార్యముగా నుండును. శీతోష్ణాదులయందు దేహాభిమానముగల కర్మి వికారమునొందుచుగాని నిర్వికారముగా నుండ నేరడు. కనుక నీయవి సన్న్యాసియగు జ్ఞానియొక్క ధర్మము లనక తప్పదు ॥౧౮॥

శ్లో. తుల్య నిందా స్తుతి ర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్
అనికేతః స్థిరమతి ర్భక్తిమాన్ మే ప్రియో నరః ॥౧౯॥

అ. నిందాస్తుతులను సమానముగా జూచుకొనుచు, వాగింద్రియమును నిగ్రహించుకొని దైవసంప్రాప్తమయిన వస్తువుతో సంతోషించుచు, ఎల్లపుడొకేచోట నుండక పరమార్థవస్తువగు నాత్మతత్త్వమునందు స్థిరమయిన బుద్ధిగలిగి యున్న జ్ఞాని నా కిష్టుడు. నిందాస్తుతులు దేహవిషయములుకాని, ఆత్మవిషయములు కావను జ్ఞానము జ్ఞాని కుదయించునుగాని కర్మి కుండదు. కర్మి, యెప్పుడును నన్ను వీడు నిందించుచున్నా డని ద్వేషించుచుండును. నన్ను, వీడు భూషించుచున్నాడని సంతోషించుచుండును. మరియు, కర్మికి పెక్కుమాట లావశ్యకములు. గృహకృత్యములను నెరవేర్చుకొనుటయందుగాని, గృహోపకరణములను సంపాదించుకొనుట యందుగాని, కర్మి బహుభాషిగ నుండును.

అట్లే కౌపీనాదులను గప్పికొని శాకఫలాదులను భుజించుచు స్థండిల శాయిగా నుండుట సన్న్యాసి యగు జ్ఞానికి జెల్లునుగాని గృహస్థుడగు కర్మికి చెల్లదు.

ఇందుకు ప్రమాణవచన మిట్లున్నది. 'శ్లో. యేనకేనచి దాచ్ఛన్నో యేన చిదాశితః యత్ర క్వచన శాయీస్యాత్ తం దేవా బ్రాహ్మణం విదుః' అని. ఇచట బ్రాహ్మణశబ్దము సన్న్యాసియందు సార్థకముగు చున్నది. కనుకనే "బ్రాహ్మణస్య విజానతః" అనుచోట భాష్యకర్తలు బ్రాహ్మణపదము సన్న్యాసిపరముగ వ్యాఖ్యానించిరి. ఇతరున కాత్మనిష్ఠయం దధికారము లేదు. దేహాభిమానము లేని సన్న్యాసియే బ్రహ్మాత్మజ్ఞానమువలన కౌపీనము గట్టినదేహమును పీతాంబరముగట్టిన

దేహమును ఒకేవిధముగ జూచును. హంసతూలికాతల్పమును భూతలమును ఒకే విధముగ జూచును. కర్మి కిట్టి సమత్వజ్ఞాన ముండదు.

అశ్లే ఒక్కొకరాత్రి యొక్కొకయూరుచొప్పున దేవాలయాదులయందు కాలమును గడుపుట, పరమార్థసత్యమయిన బ్రహ్మమే తా నను బుద్ధికలిగియుండుట జ్ఞానికే సంభవించునుగాని కర్మికి సంభవించవు. కావున నీ ప్రకరణమునగల భక్తి పదము జ్ఞానిపరముగాని కర్మపరము గాదు. కేవల భక్తిపరమును గాదు. ॥౧౯॥

శ్లో. యేతు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే
శ్రద్ధధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః. ॥౨౦॥

అ. పూర్వము "అద్వేష్టా సర్వభూతానాం" అను శ్లోకముచే ప్రారంభించిన అక్షరోపాసకులయొక్క ధర్మము నుపసంహరించుచున్నాడు.

ఎవరు శ్రద్ధతో, నేనే నిరతిశయమగు గతియని, నాయందు భక్తికలిగి నమ్మి, ముక్తిసాధనమగు నీ ధర్మము నుపాసించెదరో వారుకూడ నాకు మిక్కిలి యిష్టులు. ఇచట ధర్మమునందు అమృతపద మూపచారికము. అమృతహేతువని యర్థము (మోక్షహేతువని యర్థము). ఇచట 'మద్భక్తాః' అనుపదమునకు పరమార్థలక్షణ జ్ఞాను లర్థముకాని, విశ్వరూపోపాసనాత్మకభక్తియోగు లర్థము కాదు. "ప్రియోహి జ్ఞానినో ఽత్యర్థం" అని వెనుక సంక్షేపముగా సూచించిన యర్థము నిట్లు వివరించెను. వస్తుతః జ్ఞానియే విష్ణువున కాత్మరూపు డగుటచే ప్రియుడగును కాని భేదభావముగల భక్తుడు ప్రియుడు గాడు.

రామానుజమతము :

రామానుజులు 'అద్వేష్టా సర్వభూతానామ్' ఇత్యాది శ్లోకములచే కర్మయోగియొక్క ధర్మములు చెప్పబడినవనియు, 'యే తు ధర్మ్యామృత మిదమ్' అను నీ శ్లోకమున భక్తియోగియొక్క ధర్మము చెప్పబడిన దనియును వ్యాఖ్యానించిరి.

ఈయది నిస్సారము. సర్వారంభపరిత్యాగ మను ధర్మము కర్మియందు బొత్తుగా సంభవించ దనునది యెల్లరకు దెలిసిన విషయము. సర్వారంభపరిత్యాగపదమునకు విహితకర్మలకంటె నితరకర్మలను విడచువాడని యర్థమును గల్పించుట కూడ పొసగదు. అపుడు సర్వశబ్దమునకు సంకోచము నంగీకరించవలయును.

వ్యాసుల కిట్టియాశయమే యున్నచో నపుడు 'నిషిద్ధకర్మ సంత్యాగీ' అనియే చెప్పియుండెడివారు.

అట్లే అనికేతత్వముగూడ కర్మియగు గృహస్థునకు సంభవించదు. అనికేత పదమునకు గృహాదులయందు దాసక్తిలేనివాడను నర్థమును గల్పించుటకూడ న్యాయ్యముకాదు. అపుడు "సంగవర్జితః" అను పదముతో పౌనరుక్త్య మేర్పడును.

అట్లే ఆత్మయందు స్థిరమతిత్వమను ధర్మముకూడ కర్మికి సంభవింపదు. కర్మి యజ్ఞాని. అజ్ఞానిచిత్తము ఆత్మయందు స్థిరపడుట యసంభవము.

ఇక, 'యేతు ధర్మ్యామృతమ్' అను శ్లోకము భక్తవిషయ మను దానిని విచారింతము.

ఇందు 'ఇదమ్' అను పదము కలదు. ఇది వెనుకజెప్పినయర్థమును పరామృశించును. వెనుకజెప్పిన ధర్మములు కర్మిధర్మము లని యంగీకరించిన రామానుజులు తత్పరామర్శకముగు 'ఇదమ్' శబ్దము భక్తులధర్మమును జెప్పుచున్న దనుటకు నో రెట్లు వచ్చెనో తెలియకున్నది.

ఇక 'యే తు' అనుచోట తుకారమువలనను 'అతీవ మే ప్రియాః' అనుచోట "అతీవ" అను పదమువలనను వెనుకజెప్పిన యధికారులకంటె నితరులను జెప్పెనని యూహించినను, విశ్వరూపోపాసకులకంటె నితరులయిన జ్ఞానులను జెప్పెననుటయే యుచితము. జ్ఞాని నీకిష్టుడయినచో నీకు మిక్కిలి యిష్టు డెవడను ప్రశ్నకు జ్ఞానియే నాకు ప్రియతముడు (మిక్కిలి యిష్టుడు) అనుటకే యిచట "అతీవ" అను శబ్దము ప్రయోగింపబడినదికాని వేరుకాదు. కాన నిచట ప్రియ, ప్రియతర, ప్రియతమత్వాదిభేదమును సంచరింపజేయ వీలులేదు. కాన జ్ఞానియే భగవంతున కత్యంత ప్రియుడు భక్తుడు కాడు. అయితే 'జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్' అనుచోటగూడ జ్ఞానిపదమునకు భక్తుడని యేల అర్థమును జెప్పగూడదు? కూడదు, వినుము. అచట 'జ్ఞానీ' అని స్పష్టముగా జ్ఞానిని చెప్పె పదము గలదు. అయితే యిచట మాత్రము 'భక్తాః' అను పదము స్పష్టముగా భక్తులను జెప్పుటలేదా? నిజమే. అయినను వెనుకజెప్పినదానికి విరోధము లేకుండ నన్వయించుటకు నిచట భక్తపదముచే జ్ఞానినే గ్రహింపవలయును.

అయితే, భక్తి జ్ఞాన మెట్లగునని శంక యుదయింపవచ్చును. వినుము, కేవలాత్మయగు నీశ్వరునియందలి రతియే జ్ఞానము. అదియే భక్తి- యీరెంటికిని భేదము పరమార్థదశలో లేదు. కనుకనే శంకరులు భక్తిపదమునకు 'పరమార్థజ్ఞానలక్షణాం ఉత్తమాం భక్తిమ్' అని వ్యాఖ్యానించిరి.

దీనివలన విశ్వరూపోపాసనరూపమయిన భక్తి యధమమనియు నీయది యుత్తమమనియు తేలినది. ఈయది యుక్తము, జీవేశ్వరభేదబుద్ధిని శ్రుతి నిందించుచున్నది. కాన భేదబుద్ధితోఁగూడిన భక్తి యధమమనుటలో సందియములేదు.

కావున 'యేతు ధర్మ్యామృత మిదమ్' అను శ్లోకముచే మొదలిడిన జ్ఞానుల యొక్క ధర్మపుంజమే ముగింపబడినదనుట నిరవద్యము. ॥౨౦॥

ఈ యధ్యాయమునందు విశ్వరూపోపాసనాత్మకమగు అనుత్తమభక్తియు అక్షరోపాసనాత్మకమగు ఉత్తమభక్తియు ప్రతిపాదింపబడినందున నీ యధ్యాయము భక్తియోగాధ్యాయ మను పేరును వడసెను.

ఇట్లు శ్రీ భగవద్గీతా భాష్యార్కప్రకాశికానువాదమునందు
ద్వాదశాధ్యాయము ముగిసెను.

ఇట్లు మల్లావఝులోపనామక వేంకటసుబ్బరామశాస్త్రి
కృతమగు భాష్యార్కప్రకాశికానువాదమున
మధ్యమషట్కము
సమాప్తము

శ్రీ శ్రీ శ్రీ

# శ్రీ భగవద్గీతా

# భాష్యార్క ప్రకాశికానువాదము

శ్రీ బెల్లంకొండ రామరాయకవీంద్ర విరచితము




# శ్రీ భగవద్గీతా

## భాష్యార్క ప్రకాశికానువాదము

(శ్రీ బెల్లంకొండ రామరాయకవీంద్ర విరచితము)

# శ్రీ భగవద్గీతా

# భాష్యార్క ప్రకాశికానువాదము

( శ్రీ బెల్లంకొండ రామరాయకవీంద్ర విరచితము )

## PART 13 TO 18 PART .

FIRST PRINTED EDITION : 1959.

DIGITAL EDITION : 2015.

UP-LOAD BY : - BELLAMKONDA CHAKRADHAR.

SRI BELLAMKONDA RAMA RAYA KAVINDRULA TRUST

SRI NILAYAM.

D.o.NO. 12-8-5/5.

PRAKASH NAGAR,

NARASARAOPET.-- 522601.

CONTACT : - bvlnckumar @gmail.com



కీ॥శే॥ బెల్లంకొండ నరశింగరావు (కరణంగారు)
1914 - 1960 జమిందారు పమిడిపాడు సర్వా అగ్రహారం

**MY GRAND FATHER .**

**CHAKRADHAR.**

# SRI BELLAMKONDA RAMA RAYA KAVINDRA TRUST

NARASARAO PET -522 601.



BELLAMKONDA VENKATA SUBRAMANYA SARMA.



BELLAMKONDA SRINIVASASARMA



BELLAMKONDA CHAKRADHAR KUMAR.

# శ్రీ భగవద్గీతా
# భాష్యార్థ ప్రకాశికానువాదము

(శ్రీ బెల్లంకొండ రామరాయకవీంద్ర విరచితము)


అనువాదకులు :

వేదాంత శిరోమణి.

బ్రహ్మశ్రీ మల్లావఝుల వేంకట సుబ్బరామశాస్త్రిగారు

విశ్వేశ్వర సంస్కృత కళాశాలోపాధ్యక్షులు

వరంగల్ (ఆంధ్రప్రదేశ్)



ప్రకాశకులు :

బ్రహ్మశ్రీ కవితా వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి

శ్రీ బెల్లంకొండ రామరాయ కవితా గ్రంథమాల

నరసారావుపేట, గుంటూరు జిల్లా.

Printed at Sri Durga Printing & Publishing House,
Satyanarayanapuram, Vijayawada-2.

1959





[ Price Rs. 10

శ్రీ గురుభ్యోనమః

# శ్రీ భగవద్గీతా భాష్యార్క ప్రకాశికానువాదము

## త్రయోదశాధ్యాయము

అ. పరమేశ్వరునకు పర, అపర, అను రెండుప్రకృతులు గలవని ఏడవ అధ్యాయమున సూచింపబడినవి. అందు అపరప్రకృతి గుణత్రయరూపము; ఎనిమిది విధముల విభాగమును బొందియున్నది. పరప్రకృతి క్షేత్రజ్ఞరూపము; యీశ్వర రూపమునున్న. ఈరెండు ప్రకృతులవలననే యీశ్వరుడు ప్రపంచమును బుట్టించుచు, పోషించుచు, సంహరించుచున్నాడు. ఈరెండుప్రకృతులను నిరూపించుచు, ఈశ్వరునియొక్క తత్త్వమును నిర్ణయించదలచి యిప్పుడీ క్షేత్రక్షేత్రజ్ఞాధ్యాయ మారంభింపబడుచున్నది.

మఱియు, పూర్వాధ్యాయమున తుదివరకు తత్త్వజ్ఞానులయొక్క జ్ఞాననిష్ఠ నిరూపింపబడినది. "తత్త్వజ్ఞాను లన నెవరు ? వా రెట్టిధర్మము లాచరించిన భగవదనుగ్రహము నొందుదురు ?" అను విషయములను వివరించుటకూడ నీ యధ్యాయమునం దావశ్యకము.

గుణత్రయరూపమగు ప్రకృతి దేహేంద్రియ విషయాకారములనొంది, పురుషునకు భోగాపవర్గముల నిచ్చును. కావున ప్రకృతియొక్క పరిణామమగు దేహేంద్రియాదులసంఘాతమే శరీరమని శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు.

శ్లో. ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమి త్యభిధీయతే
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥౧॥

అ. ఇచట శ్రీకృష్ణుని ప్రతివచన(జవాబు) రూపమయిన యీశ్లోకమునుబట్టి యింతకుపూర్వము, పార్థుని ప్రశ్నరూపమగు నొకానొకశ్లోకము గలదని యూహింపదగియున్నది. కొన్నిప్రతులందు శ్లోకమిట్లు కనిపించుచున్నది.

శ్లో. ప్రకృతిం పురుషంచైవ క్షేత్రం క్షేత్రజ్ఞమేవచ
జ్ఞానం జ్ఞేయం కి మిత్యేతత్ జ్ఞాతు మిచ్ఛామి కేశవ. అని.
కనుక ముందు దీనియర్థమును వివరింతుము.

ఓయి కృష్ణా ! నేను ప్రకృతిని, పురుషుని, క్షేత్రమును, క్షేత్రజ్ఞుని, జ్ఞానమును, జ్ఞేయమును, తెలిసికొనదలచితిని కావున, ప్రకృతి యననేమి? పురుషు డెవరు ? క్షేత్రమేది ? క్షేత్రజ్ఞుడెవరు ? జ్ఞానమననేది ? జ్ఞేయమని దేనినందురు ? అని యిట్లు

ఆరు ప్రశ్నల నర్జును డడిగెను. ప్రకృతిక్షేత్రములకు, పురుషక్షేత్రజ్ఞులకు అభేద మును గుర్తింపలేక అర్జునుడు ఆరుప్రశ్నలుగ విభజించెనని తెలియుచున్నది.

లేక, కార్యకరణసంఘాతమగు శరీరము క్షేత్రమనియు, దీనికిని అచేతన మయిన పాషాణాదులకును కారణమయిన మాయ ప్రకృతియనియు, సంసార సంబంధముగల జీవుడు (ప్రమాత) క్షేత్రజ్ఞుడనియు, సాక్షిచైతన్యము పురుషు డనియు గ్రహించియుయినను అర్జునుడు వీనిని ఆరు పదార్థములుగ ప్రశ్నింప వచ్చును.

ప్రార్థనిప్రశ్న కనుకూలముగ శ్రీకృష్ణుడుగూడ ఆరువస్తువులను నిరూపించి యున్నాడు. "ఇదం శరీరం" అని క్షేత్రమును, "ఏతద్యో వేత్తి" అని క్షేత్రజ్ఞుని, "తత్త్వజ్ఞానార్థదర్శనమేతద్ జ్ఞానమితి ప్రోక్తమ్" అని జ్ఞానమును, "భూతభర్తృచ తత్ జ్ఞేయం" అని జ్ఞేయమును, "ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి" అని ప్రకృతిపురుషులను, శ్రీకృష్ణుడు చెప్పబోవుచున్నాడు.

లేక, అర్జునుడు నాలుగింటినే యడిగెను. "ప్రకృతిం క్షేత్రం" ప్రకృతి శబ్దముచే చెప్పదగిన క్షేత్రమును, "పురుషం" "క్షేత్రజ్ఞం" పురుషశబ్దముచే చెప్ప దగిన "క్షేత్రజ్ఞుని" అని శ్లోకమును అన్వయించెను.

ఇందు కనుకూలముగ శ్రీకృష్ణుడుగూడ క్షేత్రజ్ఞునిచెప్పి పిదప "ఇతి క్షేత్రం తథాజ్ఞానం జ్ఞేయం చోక్తంసమాసతః" అని నాలుగువిషయములతోనే ముగించి యున్నాడు. శ్రీకృష్ణుడు మరల "ప్రకృతిం పురుషంచైవ" అని ప్రకృతిపురుషుల నుటంకించుట, వెనుకజెప్పిన క్షేత్రక్షేత్రజ్ఞులను ప్రకృతి పురుషశబ్దములతో పరా మర్శించుటకాని, నూతనముగ నిరూపించుట కాదు.

క్షేత్రక్షేత్రజ్ఞజ్ఞానముకంటె వేరుగ ప్రకృతిపురుషజ్ఞానము లేదు. క్షేత్ర క్షేత్రజ్ఞులే ప్రకృతిపురుషులు. క్షేత్రక్షేత్రజ్ఞజ్ఞానమువలననే మోక్షము.

మరియు మట్టికంటె కుండ వేరుకానటుల క్షేత్రముకంటె పురుషుడు వేరు గాడు. అట్లే క్షేత్రజ్ఞునికంటె సాక్షియగు పురుషుడును వేరు కాదు. కాన నాలుగు పదార్థములనే అర్జును డడిగెననియు వానినే కృష్ణుడు నిరూపించెననియును జెప్పుట సమంజస మనవచ్చును.

లేక, అర్జునుడు ప్రకృతి, పురుష, జ్ఞేయముల మూటినే యడిగెను. కృష్ణుడు కూడ నీ మూటినే "ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః" అని నిరూపించెను.

లేక, సప్తమాధ్యాయమున ఈశ్వరుడు తనకు రెండు ప్రకృతు లున్నట్లు చెప్పెను. దానినివిన్న అర్జునుడు ఆరెండుప్రకృతులను, అవిగల యీశ్వరుని, వాని జ్ఞానమును అని నాలుగుపదార్థముల నడిగెననియు; ఆ నాలుగుపదార్థములనే శ్రీకృష్ణుడు నిరూపించెననియు జెప్పుట తగును.

ఓయి, ఇం దర్జునుడు దృక్, దృశ్యము అను రెండు పదార్థములనే అడుగ వలెను. శ్రీకృష్ణుడుకూడ నీ రెంటినే నిరూపింపవలెను. నిజమేకాని, కృష్ణుడు బుద్ధి ధర్మమగు జ్ఞానమును క్షేత్రమునందు జేర్పవలసియున్నను అట్లు చేర్చక జ్ఞానము అవశ్యముగ సంపాదింపదగినదను నుద్దేశ్యముతో దానిని వేరుజేసి **మూడు** పదార్థములను నిరూపించెను.

నిజస్థితిలో అర్జునుడు తెలియక, ఆరు పదార్థములనే యడిగెను. ఇతనికి ప్రకృతిక్షేత్రములు, పురుషక్షేత్రజ్ఞులు, జ్ఞానజ్ఞేయములు ఒక్కటియని తెలియదు. అట్లు తెలిసియున్నచో నిట్లడుగడు. భగవంతుడగు శ్రీకృష్ణుడుమాత్రము అతని యవివేకము గ్రహించెను. యర్జునుని పొరపాటును తొలగింపదలచి, ప్రకృతి పురుషులు, క్షేత్రక్షేత్రజ్ఞులకంటె వేరుకారని సూచించుచు, నాలుగుపదార్థములనే "ఇదం శరీరం కౌంతేయ" అను శ్లోకముచే నిరూపించుచున్నాడు.

అట్లుకానిచో అర్జునుని ప్రశ్నక్రమమును విడచి, ముందుగ క్షేత్రమును కృష్ణుడు నిరూపించతగదు. ముందు ప్రకృతిని, ఆపైని పురుషుని, నిరూపించియే క్షేత్రక్షేత్రజ్ఞుల నిరూపింపవలెను. కావున పార్థుడు ఆరుపదార్థముల నడిగెననియు, దానిని గ్రహించియే కృష్ణుడు, అంతర్భాగము చెందదగినవానిని అంతర్భాగము చేసి, మిగిలినవానినే నిరూపించెననియు జెప్పుట యుచితము.

అయితే, కృష్ణుడు నాలుగుపదార్థములను నిరూపించికూడ నుపసంహారము నందు మూడుపదార్థములనే యెట్లు ముగించెను? క్షేత్రజ్ఞ, బ్రహ్మ లిరువురు యొక రను భావముతో నట్లు ముగించెను. ఇక నీవిమర్శ చాలింతము.

నిజస్థితిలో నీశ్లోకము ప్రక్షిప్తమనవచ్చును. దీనిని శ్రీశంకరులుగాని, ఆనందగిరిపండితులుగాని, మధుసూదన, రామానుజాదు లెవ్వరుగాని వ్యాఖ్యానించి యుండలేదు. నాగర గ్రంథములయందును లేదు.

కావున నీయధ్యాయమునందు క్షేత్రము, క్షేత్రజ్ఞుడు, ఈశ్వరుడు, జ్ఞానము-అను నాల్గుపదార్థములు నిరూపింపబడుచున్నవి. క్షేత్రక్షేత్రజ్ఞ నిరూపణమే, ప్రకృతి పురుషుని రూపము. కాన ప్రకృతిపురుషుల వేరుగ నిరూపింపబడలేదు. ఓయి అర్జునా! ప్రత్యక్షాదిప్రమాణములచే తెలియదగినదగుచున్న ఈశరీరము క్షేత్ర మనబడుచున్నది. దీనిని గుర్తెరింగినవాడు క్షేత్రజ్ఞుడని శాస్త్రవేత్త లందురు.

పంచమహాభూతములు, అహంకారము, బుద్ధి, పదియింద్రియములు, మనస్సు, శబ్దస్పర్శాదివిషయములు అయిదు- ఈయిరువదిమూడు తత్త్వములును కలసి శరీర మనిపించుకొనుచున్నవి. సత్త్వరజస్తమోగుణాత్మకమయిన ప్రకృతి జీవులకు, భోగ మోక్షముల నీయగలందులకు, దేహేంద్రియవిషయముల రూపాకారము నొందుచున్నది. కనుకనే శరీరమునకు భోగాయతనమని తార్కికులు చెప్పిరి. ఎల్లశరీరములు సుఖదుఃఖానుభవమునకు సాధారణములయినను, మోక్షసంపాదనకు

మాత్రము మానవశరీరమొక్కటే అసాధారణము. ఈయది మోక్షప్రకరణము కనుకనే శ్రీకృష్ణుడు "ఇదం శరీరం" (ఈశరీరము) అని మానవశరీరమునే నిర్దేశించెను.

జడమయిన ప్రకృతికి ఈమహదాదికముల పరిణామము ఈశ్వరానుగ్రహమునచే కలుగుచున్నది. స్వతస్సిద్ధముగ జడమయినదానికి పరిణామమను క్రియయుండదు.

శరీరమునకు క్షేత్రమని పేరొచ్చుటకు ఆఱుహేతువులు గలవు.

౧. స్థానమును బుట్టించి, మానవుని నరకపాతరూపమయిన దెబ్బనుంచి కాపాడునుగాన శరీరము క్షేత్రము.

౨. భోగసాధనమయిన శరీరము భోగములనిచ్చుచు, భోగనాశరూపమయిన దెబ్బనుంచి మానవునికాపాడునుగాన శరీరము క్షేత్రము.

౩. కవచము దెబ్బలనుంచి శరీరమును గాపాడినట్లు, లోపలనున్నజీవుని యీ శరీరము దెబ్బతగులకుండ గాపాడునుగాన శరీరము క్షేత్రము.

౪. "క్షీయతే ఇతి క్షేత్రమ్" నశించుటవలనకూడ శరీరము క్షేత్రమగుచున్నది.

౫. "క్షరతీతి క్షేత్రమ్" ఇచట క్షరణమనగా జారుట, శరీరము స్వస్వరూపమునుండి (జారి) భ్రంశమునొంది భస్మమగునుగాన శరీరము క్షేత్రము.

౬. కర్మఫలములు మొలకెత్తించుటకు శరీరము క్షేత్రము (పొలము) వంటిది గాన క్షేత్రము.

ఇట్టిశరీరమును అపాదమస్తకము (అరికాల్నుంచి తలవరకు) నెవడు జ్ఞానగోచరము చేసికొనుచున్నాడో వాడు క్షేత్రజ్ఞుడు లేక, గురూపదేశమున గలిగిన ఆత్మానాత్మవివేకమున ఇది శరీరము, ఇది యింద్రియము, ఇది విషయము అని వేరుపరచి తెలుసుకొనువాడు క్షేత్రజ్ఞుడనబడును.

ఇట్టిక్షేత్రజ్ఞుడు,ఆపాదమస్తకము వ్యాపించియుండి క్షేత్రమును దెలిసికొనును. కాన, విభుపరిమాణుడుగాని, అణుపరిమాణుడును, మధ్యమపరిమాణుడును గాడు. కనుకనే ఏయవయవమున బాధగలిగినను గ్రహింపగలుగుచున్నాడు.

దీనివలన శరీరము క్షేత్రమనియు, శరీరి (శరీరముగలవాడు) క్షేత్రజ్ఞుడనియు దేలినది. ఈక్షేత్ర, క్షేత్రజ్ఞులే ప్రకృతిపురుషులు. కనుకనే శ్రీకృష్ణుడు ప్రకృతిపురుషులను వేరుగ నిరూపింపలేదు.

దేహేంద్రియాదిసంఘాతరూపముగ పరిణమించిన ప్రకృతియే క్షేత్రము.

అది యను పురమందు శయనించియున్న క్షేత్రజ్ఞుడే పురుషుడు.

శరీరాకారముగను, పంచమహాభూతముల సూక్ష్మాకారముగను పరిణమించిన ప్రకృతియు, ఇట్టి పరిణామమును చెందని మూలప్రకృతియు క్షేత్ర మగును. సప్తమాధ్యాయమునందు జెప్పిన ఈశ్వరుని యపరప్రకృతియంతయు క్షేత్రమనుటకు

సందేహములేదు. కాని యిచ్చట శ్రీకృష్ణుడు శరీర మను క్షేత్రమునుమాత్రమే పేర్కొనెను. ముముక్షువు శరీరమునుంచి ఆత్మనువేరుపరచి తెలియవలెను. శరీరమునందాత్మాభిమానమే సంసారమునకు మూలకారణము. దానినిమ్రాప్పుకొనిన మ్రానవుడే ఆత్మజ్ఞానము నొందును. కావున ముందు శరీరముయొక్క తత్త్వమును దెలియవలెను. అందువలననే కృష్ణుడు కారణప్రకృతిని విడచి కార్యప్రకృతియగు శరీరమును మొదట నిర్దేశించెను. దానిని "ఇదం" అనుపదముచే నిర్దేశించుటచే స్థూల, సూక్ష్మ, కారణ రూపమయిన శరీరమంతయు ఇదంప్రత్యయవిషయ మయినందున ఆత్మ గాదని తేలినది.

దీనిని తెలిసికొనువాడు క్షేత్రజ్ఞుడనుటచే తెలిసికొనునట్టి ఆత్మ "విషయి" అని తేలినది. ఇందుమూలమున శరీరాత్మలకు సూత్రభాష్యమునందు సూచించిన విషయ, విషయిత్వరూపమగు వైలక్షణ్యమును ఇచటగూడ శ్రీకృష్ణుడు చూపినట్లయినది.

మరియు, శరీర మనుపదమువలన నశించుస్వభావము గలదియను నర్థము వచ్చుటచే, నశించునట్టి శరీరముకంటె జీవునకు నశించకుండుటయను వైలక్షణ్యము గూడ సూచితమగుచున్నది. ॥౧॥

శ్లో॥ క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత !
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తద్జ్ఞానం మతం మమ ॥౨॥

అ॥ క్షేత్ర, క్షేత్రజ్ఞులను తెలిసికొనినంతమాత్రమున సంసారభయము తొలగదు. బ్రహ్మాత్మజ్ఞానమునగాని సంసారభయము నశించదు. భేదజ్ఞానము భయమునకు కారణము. "య ఉదరమన్తరం కురుతే అథ తస్య భయం భవతి" అనుశ్రుతి భేదజ్ఞానముగలవానికి భయము కలుగునని చెప్పుచున్నది.

"భీషాస్మా ద్వాతః పవతే భీషా దేతి సూర్యః" అనుశ్రుతికూడ ఈశ్వరుని వలన సూర్యాదులు భయపడుచున్నారని చెప్పుచున్నది. జీవేశ్వరులకు అభేదజ్ఞానమున్నచో నియమ్యనియామకభావమే లేదుగాన భయమున కవకాశములేదు. 'ఈశ్వరునిచే శిక్షింపదగినవాడను' అనుబుద్ధి జీవేశ్వరులకు భేదమున్నపుడుగానియేర్పడదు. జీవునకు సర్వసంసారభయనివృత్తి అభేదజ్ఞానమువలననే కలుగును. కాన నీశ్వరాభేదజ్ఞానమును ఈ శ్లోకముచే చెప్పుచున్నాడు.

ఈశ్వరాభేదజ్ఞానముగలవానికిగూడ యమాదులవలన భయము కలుగును కదా అని యనరాదు. ఈశ్వరపరతంత్రులగు యమాదులు ఈశ్వరాభేదజ్ఞానిని బాధింపజాలరు. ఈశ్వరుడు యమాదులకుగూడ ఆత్మరూపుడు. అందువలన తమను తాము బాధించుకొనుట తటస్థించదు. యమాదులు ఈశ్వరునియందు కల్పితులు. కాన మిథ్యారూపులు. ఈశ్వరుడు అధిష్ఠానము కాన సత్యరూపుడు. మిథ్యావస్తువు సత్యవస్తువును బాధించుట అసంభవము. మరీచికోదకమువలన భూమి బురదగానే

రదు. కావున సర్వ సంసారబంధమును నశింపజేసికొనుటకు జీవులు అభేదజ్ఞానమును సంపాదించుకొనవలెను.

అయితే, సంసారియగు జీవుడు అసంసారియగు నీశ్వరుడనని యనుకొనుట ఉచితమా? అది భ్రాంతికాదా? అని సందేహము కలుగవచ్చును. నిజమే. అది భ్రాంతి కాదు. జీవునకుగూడ సంసారసంబంధము నిజముగ లేదు. దేహేంద్రియాదులతో తాదాత్మ్యమును ఆరోపించుకొనినందున ఏర్పడినది. జీవునకు నిజరూపము (స్వస్వరూపము) సచ్చిదానందలక్షణము. కాన నీతడు యీశ్వరాభిన్నుడు. ఈశ్వరాభేదము నుపదేశించుటకే యీశ్లోక మారంభింపబడుచున్నది.

ఓయి అర్జునా? సర్వక్షేత్రములు (శరీరముల) యందునుండి క్షేత్రముల గుర్తెరుంగునట్టి క్షేత్రజ్ఞుడు 'నేనే' అని తెలిసికొమ్ము.

ఇచట అపి శబ్దము ఏవకారార్థము. కావున ఈశ్వరుడే సర్వశరీరముల యందును క్షేత్రజ్ఞ (జీవ) రూపముతో నుందునని తెలియుము'' అని దీని భావము.

ఇచట "క్షేత్రేషు" అని బహువచనమును బట్టియు, "క్షేత్రజ్ఞం" అను నేకవచనమునుబట్టియు, శరీరము లనేకములనియు, జీవు డొక్కడే యనియును దేలినది. కావున, నొకే యీశ్వరుడు ఘటాద్యుపాధులచే మహాకాశమువలె, శరీరోపాధులచే విభజింపబడినవాడై వేరువేరుగ గనిపించుచున్నాడు. ఇందువలన లౌకికులకు తార్కికులకు జీవు లనేకు లను భ్రమ యేర్పడినది.

ఉపాధిభేదమువలన ఉపహితునకు వాస్తవభేద ముండదు. కనుకనే గీతలలో శ్రీకృష్ణుడు "న త్వేవాహం జాతు నాసమ్"అను శ్లోకమున దేహభేదమునననుసరించి "వయమ్" "మనమందరము" అను బహువచనమును వాడెను.

ఆత్మ నిజస్థితిలో సమస్తఉపాధిసంబంధమును లేనివాడు. కనుకనే సదసదాదిశబ్దములకు గోచరుడు గాడు. లోకములో ఇంద్రియగోచరమైనవస్తువు సత్ అనబడుచున్నది. ఆత్మ యింద్రియగోచరు డగుటలేదుగాన, సత్ అనుపదమునకు వాచ్యుడు గాడు. లోకములో లేని వస్తువు అసత్ అని యనబడుచున్నది. ఆత్మ ఉన్నందున అసచ్ఛబ్దమునకును విషయుడు గాడు.

ఆత్మ మాయాకల్పితములయిన ఉపాధులతో వేర్వేరుగ కనిపించుచున్నను విద్వాంసుడు ఉపాధిసంబంధము నిజముగ ఆత్మకు లేదని గ్రహించుట యుచితమగును. నిజస్థితిలో నీ యుపాధు లెవ్వియు క్షేత్రజ్ఞునియందు లేవు. కావున నిరుపాధికుడయిన ఈశ్వరు డొక్కడే పరమాత్మ యని గ్రహింపవలెను. ఇట్టి జ్ఞానమే శ్రీకృష్ణసమ్మతమయిన సమ్యగ్జ్ఞానము. తార్కికాదులు ఘటపటాదిజ్ఞానము గూడ సమ్యగ్జ్ఞాన మని యందురు. కృష్ణుడు అట్టిజ్ఞానము సమ్యగ్జ్ఞాన మని యొప్పడు.

"ద్వా సుపర్ణాసయుజా సఖాయా" అను శ్రుతి కర్మఫల మనుభవించు జీవులు వేరనియు, సాక్షియగు ఈశ్వరుడు వేరనియు చెప్పుచుండ అన్నిశరీరములయందును ఈశ్వరు డొక్కడే క్షేత్రజ్ఞుడనియు, వీనికంటె వేరుగ కర్తృత్వభోక్తృత్వాదిధర్మములుగల జీవుడు లేడనియు ననుట విరుద్ధముగదా? ఇట్టితఱి యీశ్వరునకు సంసారసంబంధ మేర్పడుటకాని, సంసారసంబంధముగలవా డెవ్వడు లేకుండుటకాని తటస్థించదా? ఈ రెండుదోషములు అంగీకరింపదగినవి కావు.

నిత్యముక్తుడయిన ఈశ్వరుడు సంసారియై బద్ధుడైనచో ఈతని విడిపించువాడు లేనందున, ఈశ్వరునకు ముక్తి లేకపోవును. స్వతంత్రుడయిన ఈశ్వరునకు బంధమనునది మిథ్యకము. స్వతంత్రు డెవ్వడును బంధమనుభవింపడు. అస్వతంత్రుడు యీశ్వరుడు గానేరడు. ఈశ్వరునికంటె వేరెవ్వరు లేనందున ఈశ్వరునకు పారతంత్ర్యమున్ను సంభవించదు. ప్రకృతి యీశ్వరునకు పరతంత్రమగునుకాని ప్రకృతికి నీశ్వరుడు పరతంత్రుడుగాడు. ప్రకృతి జడము. ఈశ్వరుడు చేతనుడు. చేతనునకు జడము లొంగవలెగాని, జడమునకు చేతనుడు లొంగపనిలేదు. కనుక ఈశ్వరునకు పారతంత్ర్యము లేనిచో బంధమోక్షములే కుదరవు. బంధమోక్షములు లేనపుడు వేదాంతశాస్త్రమే వ్యర్థమగును.

మరియు, ఈశ్వరునికంటె వేరుగ జీవులు లేరన్నచో ప్రత్యక్షాదిప్రమాణములకు విరోధము వాటిల్లును. ఆయా జీవులయందు వేరువేరుగ సుఖదుఃఖములు కనిపించుచున్నవి. వీటికి కారణములగు ధర్మాధర్మములుగూడ వేరని అనుమానప్రమాణమున ఊహింపనగును. లోకములో నొకడు ధనికుడు, మరియొకడు దరిద్రుడు; ఒకడురోగి, మరియొకడు నిర్రోగి; ఒకడు సుఖి, మరియొకడు దుఃఖి; ఇట్లు అనేకవిధములయిన మార్పులు జీవులలో గనిపించుచున్నవి. వీని కనుకూలముగ పుణ్యపాపములు వేరువేరుగ గలవని యూహింపనగును. జీవేశ్వరులు వేరుగారన్నచో నీ యనుభవమంతయు తారుమారగును. భేదవాదమునం దీ దోషము లేవియు నుండవు. ఈశ్వరుడు సంసారబంధరహితుడు. జీవులు సంసారసహితులు. కాన వీరు బద్ధులు. వీరిని విడిపించువాడు ఈశ్వరుడు. ఇట్లు బంధమోక్షములు, వాటికొరకు వేదాంతశాస్త్రము సార్థకమగును అని ద్వైతవాదులపూర్వపక్షము.

అభేదాది సిద్ధాంతము: జీవేశ్వరు లొక్కటేయను సిద్ధాంతమునందు దోషమేమియులేదు. జ్ఞానాజ్ఞానములనుబట్టి బంధమోక్షాదికమంతయు కుదురును. అద్వితీయాత్మతత్త్వము నాశ్రయించుకున్నది జ్ఞానమార్గము. ఆత్మభేదము నాశ్రయించుకున్నది అజ్ఞానమార్గము. ఈ రెండుత్రోవలు పరస్పరభిన్నములు. అజ్ఞానమార్గమునందు జీవేశ్వరులకు భేదము కలదు. జీవునకు బంధము కలదు. ఈశ్వరునకు నిత్యముక్తత్వము, జీవులను విడిపించుట, జీవనానాత్వముకూడ కలదు. దీని నాధారపరచుకొని సర్వసంసారము యేర్పడును. జ్ఞానమార్గమునందు జీవుడే ఈశ్వరుడు.

అతడు సచ్చిదానందలక్షణుడు. వానికి బంధము లేదు. మోక్షమున్ను లేదు. ఇట్లు రెండుమార్గము లుండ నీశ్వరునకు సంసారము లేదు. అజ్ఞానదశలో జీవునకు సంసారము కలదు. గాన సంసార మెవ్వరికి లేకనూపోలేదు.

జ్ఞానిదృష్టిలో సంసారమే లేదుగాన, నీశ్వరుడు జీవుడయినను అతనికి సంసారములేదు. అజ్ఞానిదృష్టిలో సంసారమున్నను జీవునికంటె నీశ్వరుడు భిన్నుడగుటచే ఈశ్వరునకు సంసారములేదు. కావున బంధమోక్షాది శాస్త్రముకూడ వ్యర్థము కానేరదు. అయితే జ్ఞానిదృష్టిలో సంసారమే లేనప్పుడు బంధమోక్షశాస్త్రము వ్యర్థము కాదా? కాదు. జ్ఞానిదృష్టిలో శాస్త్రములుకూడా లేవు. ఆత్మ యొక్కడే కలడు. శాస్త్రములే లేనప్పుడు వానికి వైయర్థ్య మెక్కడిది?

శ్లో॥ "న నిరోధో నచోత్పత్తి ర్న బద్ధో నచ సాధకః
న ముముక్షు ర్నవై ముక్త ఇత్యేషా పరమార్థతా."

అను శ్రుతి పరమార్థదశలో నేమియు లేవని చెప్పుచున్నది. జ్ఞానమార్గమే పరమార్థదశ. ఇందు శాస్త్రములు లేవు. వానికి వైయర్థ్యమున్ను లేదు.

ఒకవేళ నానాబలమువలన జ్ఞానిదృష్టితోగూడ శాస్త్రము లుండుగాక! అయినను అప్పుడవి మిథ్యాభూతములు గనుక వాటి కానర్థక్యము మాకిష్టము. అయితే శాస్త్రమువలన జ్ఞానమును సంపాదించుకొని, దాన గృతార్థుడయి శాస్త్రమును నిరాకరించుట యుచితమా? అని యనరాదు. నీటికొరకు గోయితవ్వి,నీరు దొరికినతరువాత ఆ నీటిని బావి కట్టించి, భద్రపరచుకొని, తుదకు నీరు దొరికిన గోతిని పూడ్చివేసినట్లు జ్ఞాని శాస్త్రమువలన జ్ఞానమునొంది, దాన గృతార్థుడయి శాస్త్రమును నిరాదరించుట యుచితమగును. శాస్త్రము సంసారనివర్తకమగు జ్ఞానము నీయదని జ్ఞాని యన్నచో నాతనికి నుపజీవ్యవిరోధమనునది సంభవించును.

జ్ఞాని యట్లనుటలేదు. శాస్త్రము చెప్పినట్లు గురుశాస్త్రాదికమంతయు మిథ్యయని జ్ఞాని యనుచున్నాడు. అందువలన నాతని దోషమేమియు లేదు. పైగా జ్ఞాని శాస్త్రమును జదివికూడ ద్వైతప్రపంచమంతయు సత్యమని చెప్పినచో 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా' అను శాస్త్రమునకు విరుద్ధమయిన అర్థమునుజెప్పినందున దోషి యగును. అందువలన నీశ్వరునకుగూడ విరోధి యగును. శాస్త్రమనగా ఈశ్వరుని యాజ్ఞారూపము. ఈశ్వరుని యాజ్ఞను మీరినందున ఈశ్వరునకు విరోధి యగును. కావున శాస్త్రాభిమతముకాని యాత్మాభేదమును వాదించెడి ద్వైతులే శాస్త్ర విరోధులు. ఇట్లు జ్ఞానాజ్ఞానములవలన రెండుమార్గములు ప్రసిద్ధములై యుండ నీశ్వరునకు సంసారప్రసంగముకాని, సంసారాభావప్రసంగముకాని యేమియు లేదు.

జీవబ్రహ్మాభేదము జ్ఞానమార్గమనియు, తద్భేదము అజ్ఞానమార్గమనియును కాఠకశ్రుతి నిరూపించుచున్నది. "దూర మేతే విపరీతే విషూచీ అవిద్యా యాచ విద్యేతి జ్ఞాతా" "యా, అవిద్యా, విద్యా, ఇతిచ, జ్ఞాతా, ఏతే విషూచీ, దూరం

విపరీతే” అని పదాన్వయము. విషూచీ అను శబ్దమునకు మార్గములని యర్థము. జ్ఞానాజ్ఞానము లను మార్గములు రెండును పరస్పరవిలక్షణములు అని శ్రుత్యర్థము.

అవిద్యామార్గమునందు జీవుడు సంసారి; ఈశ్వరునికంటె భిన్నుడు. ఈశ్వరుడు సంసారరహితుడు; ఒక్కడు.

విద్యామార్గమునందు జీవుడు అసంసారి, ఒక్కడు. ఈశ్వరుడును, సంసారము మిథ్య అని యిట్లు రెండుమార్గములకు భేదము కలదు. ఈరెండుమార్గములకు స్వరూపభేదముమాత్రమే కాదు. ఫలభేదముగూడ కలదు. అవిద్యకు బంధరూపమగు స్వర్గాదికము ఫలము. జ్ఞానమునకు బంధనివృత్తిరూపమయిన మోక్షము ఫలము. ఇందుకు “శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్య మేతః, తౌ సంపరీత్య వివినక్తి ధీరః, శ్రేయోహి ధీరో ఽభిప్రేయసో వృణీతే, ప్రేయో మందో యోగక్షేమాద్వృణీతే” అను కాఠకశ్రుతి ప్రమాణము. ఇచట విద్యావిషయమగు స్వర్గ పశు పుత్రాది రూపమయిన ఫలము శ్రేయస్సు. నిత్యసిద్ధమయిన మోక్షము విద్యాఫలమనుటకూడ నౌపచారికము.

ఇట్లు విద్యావిద్యామార్గములు రెండు వేరని గీతాస్మృతిప్రమాణము కలదు. “జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్” అని.

ఓయి, కర్మమార్గ మెట్లు వ్యావహారికమో, జ్ఞానమార్గముకూడ అట్లే వ్యావహారికము. పరమార్థదశయందు జ్ఞానమార్గముకూడ లేదు. ఇట్లుండ పరమార్థదశలో జ్ఞానమార్గమని చెప్పు టెట్లు ?

వినుము. జ్ఞానమార్గమునం దున్నవాడు సంసారము మిథ్యయని తలచును. పరమార్థదశయందున్నవాడు సంసారమే లేదని తలంచును. ఇట్లు పరమార్థదశకు జ్ఞానమార్గము కొంచెము సన్నిహితమయినందున ఔపచారికముగ జ్ఞానమార్గము పరమార్థదశ యని చెప్పబడినది.

లేక జ్ఞానాజ్ఞానమార్గములు రెండును వ్యవహారదశయందే చెప్పవచ్చును. అప్పుడు జ్ఞానిదృష్టిలో సంసారముండునుకదా? ఉండదు. సంసారరహిత బ్రహ్మాత్మ సాక్షాత్కారమే జ్ఞానమనబడును. జ్ఞానప్రారంభదశలో సంసారమునందు మిథ్యాత్వ నిశ్చయ ముండును. పరిపాకదశయందు సంసారాభావము దోచును.

లేక ఎవ్వనికి జ్ఞానమార్గము పరిపక్వమయినదో వాడే జ్ఞాని. వానిదృష్టిలోనే సంసార ముండదు.

ఇట్లు మార్గద్వయ ముండుటచే, నవిద్యవలన ఈశ్వరునకు బంధమనియు, విద్యవలన ఈశ్వరునకు మోక్షమనియును తేలినది. అజ్ఞానమువలననే యీశ్వరుడు బద్ధుడనియు, జీవుడనియును లోక మనుకొనుచున్నది. కాన, సంసారము అవిద్యావస్థయందే కాని, విద్యావస్థయందు లేదని స్పష్టము. కనుక నవిద్యను దాని కార్యములగు రాగద్వేషాదులతోగూడ నిర్మూలించవలెను.

"ఇహచేదవేదీదథ సత్యమస్తి నచేదిహావేదీన్మహతీ వినష్టిః" (ఈ జన్మయందే బ్రహ్మను తెలిసికొనినచో మోక్షము కలదు. లేనిచో నరకాదిప్రాప్తిరూపమయిన గొప్పచేటు కలదు.) "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" (బ్రహ్మజ్ఞాని బ్రహ్మయే యగును.) "నాన్యః పంథా విద్యతే ఽయనాయ" (మోక్షమునకు జ్ఞానముకంటె వేరు మార్గము లేదు.) ఇత్యాది శ్రుతులనేకములు జ్ఞానమువలన అజ్ఞానమును నశింప జేసికొన్నచో మోక్షము కలుగునని చెప్పుచున్నవి.

నేను వేరు, ఈశ్వరుడు వేరు ("అన్యోఽసావన్యోఽహమస్మి") అని యనుకొనువాడు దేవతలకు పశుతుల్యుడు. ఆత్మజ్ఞానికి ప్రపంచమంతయు బ్రహ్మస్వరూపముగ గనిపించును.

"యదా చర్మవ దాకాశం వేష్టయిష్యంతి మానవాః
తదా దేవ మవిజ్ఞాయ దుఃఖస్యాంతో భవిష్యతి."

(మానవులు చర్మమును గప్పికొనినట్లు, ఆకాశమును గప్పికొనగలిగినచో ఆత్మను దెలిసికొనకుండగ దుఃఖనివృత్తిరూపమగు మోక్షము నొందుదురు. అనగా నకాశమును కప్పికొనుట యసంభవము. అట్లే ఆత్మజ్ఞానములేనిదే మోక్షమును బడయుట అసంభవము.)

లోకములో పాడుబడ్డ బావిలోని గరికపోచలను, పాములను జూచి నేర్పుగల మానవులు ఇది బావియని తెలిసికొని తొలగిపోవుదురు. అజ్ఞానులు దానిని గ్రహించలేక నందులో పడుదురు. ఇట్లు జ్ఞానాజ్ఞానములకు ఫలభేదము ప్రత్యక్షసిద్ధము. అజ్ఞానము సంసారకూపమునందు బడుటకు కారణము – జ్ఞానము దానిని తొలగించుకొనుటకు కారణము. దేహాదులయం దాత్మబుద్ధి యజ్ఞాన మనబడును. అజ్ఞాని రాగద్వేషాదులచే ధర్మాధర్మముల నాచరించుచు, జన్మమరణముల నొందును. చెఱకుముక్క గానుగచక్రములోపడి నలిగిపోయినట్లు అజ్ఞాని సంసారచక్రములో బడి కడు ఖేదపడును.

ఆత్మ దేహేంద్రియాదివ్యతిరిక్త మనుజ్ఞానము జ్ఞానము. ఇట్టి జ్ఞానికి రాగద్వేషాదు లుండవు. వీడు ధర్మాధర్మముల నాచరించడు. కాన వీనికి జన్మమరణము లుండవు. ముక్తి నొందును. ఇద్దానిని కాదని త్రోసిపుచ్చుట కేరికిని శక్యముగాదు.

కావున నిట్లు అజ్ఞానికి సంసారబంధమనియు, జ్ఞానికి సంసారబంధము లేదనియు ప్రత్యక్షమగుచుండ ఈశ్వరుడు సంసారియగు టెట్లు? అజ్ఞానులగు జీవులనేకు లుండ సంసారబంధ మనునది లేకపోవు టెట్లు?

కొద్దిచీకటిలోనున్న స్థాణువును (కొయ్యమొద్దును) జూచి యవివేకులు అజ్ఞానమున పురుషుడని నిశ్చయించుకొనుచున్నారు. అట్లే అసంసారియగు నీశ్వరుడే యయియున్న క్షేత్రజ్ఞుని (జీవుని) అవివేకులగు తార్కికాదులు సంసారియని తలంచుచున్నారు. బౌద్ధాదులు దేహమే యాత్మయని అనుచున్నారు.

అయితే ఇంతమాత్రమున క్షేత్రక్షేత్రజ్ఞ సంసారబంధము నిజముగా నున్నదని భ్రమింపవలదు. మనము పొరపడి యనుకున్నంతమాత్రమున స్థాణువునకు పురుష ధర్మ మంటుచున్నదా? పురుషునకు స్థాణుధర్మ మంటుచున్నదా? ఏదియు లేదు. అట్లే ఆత్మధర్మమగు చైతన్యము దేహమున కంటదు. దేహధర్మమగు సుఖదుఃఖాదిక మాత్మ కంటదు. ఇయ్యది తత్త్వము. ఇందు చార్వాకాదులు మిక్కిలి పొరపడిరి. శరీరాత్మలకు భేదమును గుర్తింపలేక చార్వాకులు దేహధర్మమయిన సంసారమును ఆత్మయం దధ్యసించిరి (ఆరోపించిరి.)

స్థాణుపురుషదృష్టాంతము శరీరాత్మలయందు పొసగదని కొంద రందురు. స్థాణుపురుషులు జ్ఞేయములుగాన దానియందు దీనిధర్మమును, దీనియందు దానిధర్మమును ఆరోపించుట పొసగును. కాని ప్రకృతమున దేహము జ్ఞేయము. క్షేత్రజ్ఞుడు జ్ఞాత. దృష్టాంతము విషమము. కనుక వీరివురికి పరస్పరాధ్యాసము పొసగదు. అందువలన దేహధర్మము (జ్ఞేయధర్మమగుటచే జ్ఞాతయగు క్షేత్రజ్ఞున కంటవచ్చునని వీరియాశయము. అట్లగుచో దేహధర్మములయి) జరామరణము లాత్మ కంటవనియు సుఖదుఃఖమోహేచ్ఛాదులుమాత్రమే అంటుననియు జెప్పుటకు కారణమేమి? జరామరణములుకూడ నంటుచున్నచో ఆస్తికులు శరీరము మరణించిన తరువాత దేహిని (ఆత్మను) గురించి శ్రాద్ధాదుల నెట్లు జేతురు? స్వర్గాదిఫలము నపేక్షించి యజ్ఞాదు లెట్లాచరింతురు? కనుక జరామరణములు స్థూలదేహధర్మము లనియు, సుఖదుఃఖాదులు సూక్ష్మదేహధర్మము లనియును జెప్పవలెను. ఇంతేకాని యిం దేవియు ఆత్మధర్మములు గావు.

సుఖదుఃఖమోహాదు లాత్మధర్మములే యయినచో వానిని తొలగించు కొనుట కాత్మకు సాధ్యముకాదు. ఆత్మధర్మములయిన ఆనందచైతన్యాదులను ఆత్మ తొలగించుకొననేరడు. అట్లే ఆత్మయం దారోపింపబడనిచో ఆత్మచే గ్రహింపబడ నేరవు. ఒకదానిధర్మమును మరియొకటి గ్రహింపనేరదు. సుఖదుఃఖాదులను జ్ఞానులు తొలగించుకొనుచున్నారు. అజ్ఞానులు స్వీకరించుచున్నారు. కావున నియ్యవి ఆత్మకు స్వాభావికములుగావనియు, ఆత్మయం దారోపితములనియు జెప్పవలయును. కాన ఆరోపితములయిన ధర్మములచే ఆత్మకు కలిగెడు హాని లేదు. బాలుడు తెలియక ఆకాశమునందు తలమలినతాదుల నారోపించినంతమాత్రమున ఆకాశమున కేమి యొరిగినది? ఏమి చెడినది? అట్లే మనోధర్మములయిన సుఖదుఃఖమోహేచ్ఛాదు లను ఆత్మయం దారోపించినంతమాత్రమున ఆత్మకు సంసారవాసనకూడ లేదు.

స్థాణుపురుషదృష్టాంతము దేహాత్మలయందు కుదరదని యనరాదు. అవిద్యా ధ్యాసమాత్ర మిచట దృష్టాంత దార్ష్టాంతికములకు సాధర్మ్యము. ఇయ్యది రెంటను సరిపోవుచున్నది. స్థాణుపురుషులయందు పరస్పరాధ్యాస యవిద్యవలననే జరుగు చున్నది. దేహాత్మలయందుకూడ నట్లే. కాన నిం దనౌచిత్యమేమియు లేదు.

క్షేత్రజ్ఞునియం దవిద్య యున్నందున సంసారిత్వముకూడ నుండునని యూహించరాదు. అవిద్యయన తామసప్రత్యయము. ఇయ్యది యావరణాత్మకము. దీనివలన సంశయ, విపర్యయ, అగ్రహణములు కలుగును. "ఇది స్థాణువుకాదు, పురుషుడు" అనునది విపర్యయజ్ఞానము. "స్థాణువా ? పురుషుడా ?" అనునది సంశయాత్మకము. "ఇచట స్థాణువు లేదు" అనునది స్థాణ్వగ్రహణము. అట్లే "ఆత్మ దేహమా ? దేహాతిరిక్తుడా ?" అనునది సంశయము. "దేహమే యాత్మ" అనునది విపర్యయము. "ఆత్మ లేదు" అనునది అగ్రహణము. ఈమూడువిధములజ్ఞానము తామసము. కాన సంసారము అవిద్యాకార్యముకాని వాస్తవముకాదు. వెలుతురున్నపుడు చీకటి నశించినట్లు, విద్యయున్నపుడు, ఈ మూడువిధములజ్ఞానము లుండవు. అందువలన నియ్యది యవిద్య యనక తప్పదు.

అట్టి యవిద్య జ్ఞాతృ (ఆత్మ) ధర్మముగాదు. లోకములో తిమిరాదిదోషములు సాధనమయిన చక్షురాదులదోషములుకాని, కర్తయగు నాత్మయొక్క దోషములు గావు. అట్లే అవిద్యకూడ కరణదోషముకాని కర్తృదోషము కాదు. జ్ఞేయము లెన్నడును జ్ఞాతృధర్మములు కావు. సుఖదుఃఖాదులుకూడ జ్ఞేయమయిన మనోధర్మములుకాని జ్ఞాతయగు ఆత్మధర్మములు కావు. సత్యత్వ ఆనన్దత్వాదులు ఆత్మాభిన్నములుకాని యాత్మధర్మములు కానేరవు. ఆత్మవ్యతిరిక్తప్రపంచమంతయు సంవేద్య మగుచున్నది. అవిద్యాదులుగూడ ఆత్మవ్యతిరిక్తములు. కాన సంవేద్యములే యగును. సంవేద్యములు (జ్ఞేయములు) సంవేత్త (జ్ఞాత) యొక్క ధర్మములు కానేరవు.

అవిద్యాదు లాత్మధర్మములని ద్వైతులుగూడ నంగీకరించరు. మోక్షము చక్షురాదీంద్రియములు వియోగమును జెందగా ఆత్మకు నవిద్యాదదోషము లుండవని యెల్లమతములవా రంగీకరించిరి. అవిద్యాదు లాత్మధర్మములయినను ముక్తియం దాత్మను విడచిపోవునని యనరాదు. అగ్నికి సహజధర్మమయిన వేడిమి యెన్నటికి అగ్నిని విడచి పోనేరదు. వేడిమి పోయినచో అగ్నియే నశించును. అట్లే సంసారిత్వము ఆత్మధర్మమగుచో ఆత్మనువిడచి యెప్పుడును బోనేరదు.

కాని నిర్వికారుడయిన ఆత్మకు ధర్మసంయోగవియోగము లను వికారములు పొసగవు. ఆకాశమువలె సర్వవ్యాపకుడయిన ఆత్మకు ఒకానొకధర్మముతో నూతన సంయోగముకాని, ఒకానొకధర్మముతో వియోగముకాని సంభవించదు. లోకములో పరిచ్ఛిన్నము, సవికారము నయిన ఘటాదులకే ఒకానొకవస్తువుతో సంయోగవియోగములు కలుగుచున్నవి. అపరిచ్ఛిన్నము నిర్వికారమునయిన ఆకసమునకు దేనితోను అపూర్వసంయోగవియోగములు కలుగుటలేదు. కాన క్షేత్రజ్ఞునకు అసంసారిత్వము నిత్యము. అనగా ముక్తియందుమాత్రమే జీవుడు అసంసారి

కాదు. బంధమగు సంసారము అవిద్యాధర్మమని నిర్ణయింపబడినందున నెల్లప్పుడు ఆత్మ అసంసారియే యగుచున్నాడు.

లోకములో తిమిరాది దోషములు చక్షురాది కరణగతములు. సుఖదుఃఖ మోహేచ్ఛాది ధర్మములు దేహాదిగతములు. దేహేంద్రియ మనస్సులు కరణములు (సాధనములు). ఇంద్రియములు మనస్సు కరణ (సాధన) మగును కాని, దేహము కరణముగాదని శంకించరాదు. గమనాదిక్రియలయందు పాదాదీంద్రియములద్వారా దేహముగూడ కారణమగుచున్నది. ఇందవిద్యాగ్రహాదిదోషము లంతఃకరణధర్మములు. కాన అవిద్యాప్రయుక్తమయిన సంసారమంతయు అంతఃకరణధర్మమే యగుచున్నది. ఆత్మవిద్యచే నంతఃకరణమునందు యవిద్య తొలగగా (నశించగా) ఆత్మయందు సంసారము కనిపించనందున క్షేత్రజ్ఞునకు అసంసారిత్వము, ఈశ్వరత్వము సుస్థిరమగుచున్నది. ఇందు, "అనాదిత్వా న్నిర్గుణత్వాత్ ..." అను గీతాస్మృతి ప్రమాణమగుచున్నది. ఈగ్రంథమువలన ఈశ్వరునకు సంసారిత్వము ప్రాప్తించినదను వాదము నిరాకరింపబడినది. ఈశ్వరునకు జీవత్వముగూడ నిట్లే అవిద్యాకల్పితముకాన, నది మదియందుంచదగను.

జీవేశ్వరు లభిన్నులగుచో లోకములో సంసారమే లేకపోవునన్నదానిని విచారింతము. ఆత్మవేత్తలందరు సంసారము లేదనియే యంగీకరించుచున్నారు. సంసారము లేనపుడు సంసారి లేకపోవుట వింతకాదు. సంసారము లేనందువల్లనే ఆత్మలు నిత్యముక్తులగుచున్నారు. అయితే వీరియెడల శాస్త్రము వ్యర్థముకదా? నిజమే. మే మది యంగీకరింతుము. కాని యది దోషము కాదు. ముక్తాత్మలకు శాస్త్రాదులతో బనిలేదు. విద్యావస్థయందు శాస్త్రాదులు నిష్ప్రయోజనములు. అవిద్యావస్థయందే వీనిఫలము కనిపించును. ద్వైతులందరును బంధావస్థయందే శాస్త్రాదులు సార్థకము లనియు, ముక్తావస్థయందు నిరర్థకములనియు, నంగీకరించుచున్నారు. అట్లే అద్వైతులుకూడ జీవునకు విద్యావస్థయందు శాస్త్రాదులు వ్యర్థములనియు, అవిద్యావస్థయందే సార్థకములనియు నంగీకరించుదురు. ఇందు తప్పేమి? ఉభయ మతములయందు నీదోషము సమానమేకదా?

కాదు. వినుము. ద్వైతవాదులమతమున బంధమోక్షములు రెండును పరమార్థములు. వారిమతమున హేయోపాదేయములను తత్సాధనములను వా రంగీకరించుచున్నారు. కనుక ద్వైతులకు శాస్త్రాదులు సార్థకము లగును. బంధమోక్షములు మిథ్యాభూతములనియెడి యద్వైతులకు శాస్త్రాదు లెట్లు సార్థకము లగును? అనగా సర్పము నిజముగా నున్నచో దానిని కొట్టుటకు కర్ర కావలెను. సర్పమే నిజముగా లేనప్పుడు యింక కర్ర యేల? కలలో కనిపించు పశ్వాదులు సత్యములయినచో వానిని మేపుటకు గడ్డికావలయును. పశువులే మిథ్యయయినచో వాటిని మేపుటకు గడ్డి తేవలెనని ప్రయాసపడనేల?

తాను కోరినకాంత సత్యముగానున్నచో దానితో భోగింపదలచి యాచించుట సఫలమగును. ఆమెయే మిథ్యయయినపుడు యాచించి పొందుఫలమేమి?

అట్లే జీవునకు బంధము సత్యమగుచో మోక్షముకొరకు గురువునాశ్రయించుట, శాస్త్రము నభ్యసించుట సఫలమగును. బంధమే అసత్యమయినపుడు గురువెందుకు? శాస్త్ర మెందుకు?

కావున ద్వైతమతమున శాస్త్రాదులు సార్థకములుకాని. అద్వైతమతమున శాస్త్రాదులు సార్థకములు కావు అని ద్వైతవాది యాశయము.

సమాధానము: ఆత్మకు బంధమోక్షములు యథార్థముగ నేకకాలమున సంభవించునా? లేక క్రమముగా సంభవించునా? అని ద్వైతుల నడుగవలెను. ఇందు మొదటిపక్షము కుదరదు. పరస్పరవిరుద్ధములయిన స్థితిగతులు రెండును ఒకరియం దొకేకాలమున నుండవు. అట్లే బంధమోక్షములు రెండును యేకకాలమున నేకపురుషునియం దుండవు. శీతోష్ణములు సుఖదుఃఖములు యేకకాలమునందు యేకవ్యక్తియం దుండుట లోకవిరుద్ధము.

ఇక రెండవపక్ష మవలంబించినను క్రమముగా కలిగెడి బంధమోక్షములు నిమిత్తవశమున కలుగునా? లేక నిర్నిమిత్తముగా కలుగునా? నిర్నిమిత్తముగా కలుగునన్నచో, ముక్తుడయిన ఆత్మకుగూడ నిష్కారణముగ మరల బంధమేర్పడును. కాన నాత్మకు మోక్షమే లేకపోవును. ఇక ఆత్మకు బంధమోక్షములు అవిద్యారాగాదులనుగాని విద్యాశమదమాదులనుగాని నిమిత్తముల నపేక్షించి వచ్చునన్నచో అపుడు బంధమోక్షములు నిమిత్తవశమున కలుగుచున్నవికాని, స్వతస్సిద్ధముగా కలుగుటలేదు కాన, అయ్యవి పరమార్థములు కానేరవు. స్వతస్సిద్ధముగా నైనవస్తువు పరమార్థమని లోక మనదు. స్వతస్సిద్ధముగాని రజ్జుసర్పము అపరమార్థమనియు, స్వతస్సిద్ధమయిన రజ్జువుమాత్రమే పరమార్థమనియు లోకసమ్మతము. రజ్జుసర్పము సత్యమని ఏ ద్వైతియు నంగీకరించడు. రజ్జుసర్పము కంటి యందలి కాచకామలాది దోషములవలన గలిగినందున, అపరమార్థము నిజమైన సర్ప మట్టిదోషములవలన బుట్టదు. కావున పరమార్థము.

అయితే నిజమయిన సర్పముగూడ అజ్ఞానమను దోషమున బుట్టినందున అపరమార్థ మేల గాదు? అని యనరాదు. బ్రహ్మభిన్నమయిన జగత్తంతయు మిథ్యయని యంగీకరించెడి యద్వైతులమతమం దిది పొసగునుకాని, ద్వైతమతమున నీప్రశ్న పొసగదు. ద్వైతమతప్రకారమే యీసమాధానము ప్రతిపాదింపబడినది. లేక అద్వైతులుగూడ కాచాదిదోషములవలన బుట్టని సర్పమును వ్యావహారిక సత్యముగా నంగీకరించుచున్నారు. దోషజనితమయిన రజ్జుసర్పమును వ్యవహారమువలన గూడ అసత్యమనియే తలంచుచున్నారు. ఇం దేకల్పము నంగీకరించినను పై సమాధానవచన ముపపన్న మగును.

కావున ద్వైతమతముగూడ ఆత్మకు బంధమోక్షములు పరమార్థములు గావని తెలినందున వారికభ్యుపగమహాని యను దోషము వాటిల్లును. (అనగా తా మంగీకరించినది నిలువకుండుట).

ఓయి, నిమిత్తమువలన బుట్టినది యసత్యమనియు, నిర్నిమిత్తమయినది సత్యమనియు నన వీలులేదు. లోకానుభవమును తిలకించుము. లోకములో సనిమిత్తము లయినవస్తువులే సత్యములు. నిర్నిమిత్తములయిన స్వప్నపదార్థము లసత్యములని తేటతెల్లము. సర్ప మను నిమిత్తమునబుట్టిన సర్పము సత్యము. సర్పమను నిమిత్తమువలన బుట్టినందుననే రజ్జుసర్పము అసత్య మనబడుచున్నది. ఏ కార్యమున కే కారణము నిమిత్తమని లోకములో ప్రసిద్ధమయియున్నదో ఆకారణమువలన బుట్టిన వస్తువు సత్యమని లోకవ్యవహారము. నిర్నిమిత్తమయిన వస్తువు లోకమునం దేదియు లేదు. రజ్జుసర్పాదులు ప్రసిద్ధ సర్పాదులవలన బుట్టినందున, అప్రసిద్ధమయిన రజ్జ్వాది నిమిత్తమువలన బుట్టినందునను అసత్యములని యంగీకరింపబడుచున్నవి. కావున విపరీత నిమిత్తమువలన బుట్టిన వస్తువే యపరమార్థము. సనిమిత్తమయిన వస్తువు అపరమార్థము గాదు. కాన సనిమిత్తములయిన బంధమోక్షములు పరమార్థములే యగునన్నచో అట్లు కాదు. "వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం" అను శ్రుతినిబట్టి కారణపదార్థమే సత్యము. కార్యము సత్యము గాదు. కారణముకంటె వేరుగ కార్యమునకు స్వరూపము లేదు. కావున దాని కింకొకనిమిత్తములేక అదియింకొకదానికి నిమిత్తమగువస్తువే సత్యము. కనుకనే బ్రహ్మ సత్యము, జగత్తు మిథ్య అని యద్వైతుల సిద్ధాంతము. మృదాదివస్తువులు ఘటాదులగురించి కారణములయినను, జలాదులవలన బుట్టుచున్నందున అనిమిత్తములు గావు. కనుక సత్యములు గావు. "మృత్తికేత్యేవ సత్యమ్" అను శ్రుతివాక్యము ఘటాదికార్యములద్వారా మట్టి సత్యమని చెప్పుచున్నది. ప్రపంచమంతయు కార్యములవలన నిమిత్తము కాదుగనుక ప్రపంచము సత్యము గాదు. బ్రహ్మ జగత్తంతకు నిమిత్తము. "యతో వా ఇమాని భూతాని జాయంతే" అను శ్రుతి బ్రహ్మ జగత్కారణమని చెప్పుచున్నది. బ్రహ్మ కార్యరూపుడు కాడుకనుక నిమిత్తములేనివాడుగూడ నగుచున్నాడు. "అనిమిత్తం నిమిత్తం వస్తు సత్యం" అను లక్షణము సత్యమయిన బ్రహ్మయందే సమన్వయించును గాని అసత్యమయిన కార్యప్రపంచమందు సమన్వయించదు. ఈలక్షణమునకు వ్యభిచారమును లేదు.

ఇట్లయితే ప్రపంచమంతయు సనిమిత్తమయినందున అసత్యమగుచుండ దుష్టకారణములవలన బుట్టినరజ్జుసర్పము మిథ్యయగుటలో విచిత్రమేమి? అవును. ప్రపంచము నిజముగా మిథ్యయే. అయినను వ్యవహారదశలో సత్యమగుచున్నది. అయితే సనిమిత్తములయిన బంధమోక్షములుమాత్రము వ్యవహారదశలో సత్యము లేలకావు? ఎవరు కావనిరి? బంధముక్త్యాదివ్యవహారము అజ్ఞానము నాశ్రయించియుండును. కాన

అజ్ఞానాశ్రయుం డాత్మకు బంధమోక్షములు గలవు. విద్యావస్థయందుమాత్రమే ఆత్మకు బంధమోక్షములు లేవని యద్వైతు లందురు. ఇంతమాత్రమున అద్వైతులకుగూడ బంధమోక్షవ్యవస్థ ఇష్టమేకదా? అని యనరాదు. విద్యావస్థలో నీయవి (బంధమోక్షములు) లేనందువలనే వాస్తవముగా లేనట్లు చెప్పబడినది. కాన ఆత్మకు పరమార్థముగా బంధమోక్షములు లేవు. కనుకనే, గౌడపాదులవారు "న నిరోధో న చోత్పత్తి ర్న బద్ధో న చ సాధకః, న ముముక్షు ర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా" అని చెప్పిరి.

మరియు ఆత్మకు బంధమోక్షములు పరమార్థము లనినచో బంధము లేనిదే మోక్షముండదు. కాన మోక్షము బంధపూర్వకమే కావలయును. ఆబంధమునకంతము లేనిదే మోక్షము సంభవించనందున బంధమునకు నంతము గలదనియు, కనిపించనందున అది లేదనియు చెప్పవలయును. కాన బంధము అనాదియు (సాంతము- అంతముకలదియు) నని చెప్పినట్లగును. ఈయది ప్రమాణవిరుద్ధము. అనాది పదార్థమునకు అంతముండుట ప్రమాణవిరుద్ధము. ఇట్లే మోక్షముగూడ సాదియు. అనంతము ననుట ప్రమాణవిరుద్ధము. సాదిపదార్థము నశింపవలెగాని, నశించకుండ నుండజాలదు. ఆదిగలదాని కంతము, అంతముగలదాని కాదియు తప్పక యుండును. "జాతస్యహి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్యచ" అను గీతావచన మిందుకు ప్రమాణము. లోకానుభవమున్ను యిట్లే యగపడుచున్నది.

ఓయి, ప్రాగభావమున కాదిలేకున్నను అంతమున్నది. ప్రధ్వంసాభావమున కాదియున్నను అంతములేదు. కాన పై న్యాయ మెట్లు కుదురును ?

అనినచో వినుము.

ఓయి, ప్రాగభావము పుట్టకున్నను చచ్చుచున్నది. ప్రధ్వంసాభావము పుట్టుచున్నను చచ్చుటలేదు. కాన పై న్యాయ మెట్లు కుదురును- అనినచో

వినుము. పుట్టని ప్రాగభావము చచ్చుననియు, పుట్టినప్రధ్వంసాభావము చావదనియును దార్కికులందురు. వారిసిద్ధాంతముతో మాకు పనిలేదు. అజ్ఞానము అనాదిభావపదార్థమయి, జ్ఞానముచే నివర్తించుటచే అనాదియు, సాంతము- అంతముగలదియు) నగుచున్నది. అనినచో నదియు పొసగదు. "మాయా చావిద్యాచ స్వయమేవ భవతి" అను శ్రుతి యజ్ఞానమునకాదిగలదని చెప్పుచున్నది.

ఫలానప్పుడు పుట్టినట్లు చెప్పుటకు శక్యముగాదనియే యనాదిపదమున కర్థమని గ్రహింపవలయును. అవిద్యాకార్యమగు ప్రపంచము ప్రవాహముగా ననాదిగా నున్నటుల అవిద్యకూడ ప్రవాహరూపముగ నుండుటచే అనాదియని చెప్పబడు చున్నది.

ప్రపంచము అజ్ఞానముచే ఆత్మయందుగల్పింపబడినది. ఆత్మకార్యమని యన బడుచున్నది. అట్లే అజ్ఞానముగూడ ఆత్మయందు గల్పింపబడును. ఆత్మకార్య

మనబడుచున్నది. కార్యవస్తువు సాదియే యగును. సాదిపదార్థమున కంత ముం డుట యుక్తము.

ఓయి, ఆత్మ నిర్ధర్మకుఁడు కదా? అతనియందు కర్తృత్వ మను ధర్మముకూడ నుండదు కదా? ఇట్టితరి కర్తృత్వ మను వికారములేని యాత్మ అజ్ఞానము నెట్లు పుట్టించును? అజ్ఞానము ఆత్మ నాశ్రయించియుండి జగత్తును పుట్టించుగాక! అది మే మంగీకరింతుము. అజ్ఞానముమాత్రము ఆత్మకార్యము గానేరదు. అనినచో-

వినుము. అవిద్యను యెవరును సృజించరు. అది తనంతట తానే పుట్టును. "మాయాచ అవిద్యాచ స్వయమేవ భవతి" అను శ్రుతి యవిద్య స్వయముగా బుట్టునని చెప్పుచున్నది. ఆత్మయందు బుట్టునుగాన ఆత్మకార్యమని వ్యవహరింప బడుచున్నది.

కావున అంతముగల బంధము ఆదికలదియే యగును. ఆదిగల మోక్షమున్ను అంతముగలదియే యగును. ఇందుకు ద్వైతు లిష్టపడినచో వారిమతమునఁగూడ బంధమోక్షశాస్త్రములు వ్యర్థములగును. ఏలయన బంధమున కాదియున్నచో బంధముకంటె పూర్వ మాత్మకు సంసారసంబంధము లేదు. కాన మోక్షశాస్త్రాదులు వ్యర్థము లగును. మోక్షమున కంత మంగీకరించినచో మోక్షము నశించినతరువాత మరల యాత్మకు బంధమేర్పడును. అప్పుడును మోక్షశాస్త్రము వ్యర్థమగును. మోక్షము నిత్యపురుషార్థమని తలచి, ఆలుబిడ్డలను వస్తువాహనములను విడచి, వివేకవంతులు మోక్షమార్గమునందు బ్రవర్తించుచున్నారు. అట్టి మోక్షమార్గము గూడ స్వర్గాదులవలె అనిత్యములగుచో మోక్షమార్గమునందు ప్రవర్తించవలె నను ప్రయాస వ్యర్థమయ్యెడిని. ఎవరును మోక్షశాస్త్రమునందు ప్రవర్తించరు.

కాక ప్రమాణవిరుద్ధమయిన అర్థము నంగీకరింపవలనుపడదు. బంధమునుండి మోక్షమునకు, మోక్షమునుండి బంధమునకు దిరుగు ఆత్మ నిత్యుఁడు కానేరడు. ఘటాకారమునుండి కపాలాకారమును జెందు ఘటము నిత్య మనబడదు. అవయవ స్వరూపమునుండి భస్మరూపమునొందెడి శరీరము నిత్య మని యనబడదు.

అయితే, సత్కార్యవాదమునందు అవస్థలుమారునుగాని, యవస్థగలవాడు మారడుగదా? వాడు నిత్యుడుగానే యుండును. ఎట్లన, మట్టి ఘటత్వ కపాలత్వ చూర్ణత్వాది యవస్థల నొందుచున్నను, మట్టి రూపముతో నిత్యముగానేయున్నది. ఘటత్వాద్యవస్థలే నశించుచున్నవి, పుట్టుచున్నవి. కాన యవస్థలే యనిత్యములు. కావున బంధముక్త్యవస్థలుగల యాత్మ నిత్యుడే యగును. బంధమోక్షావస్థలుమాత్ర మనిత్యములు. ఆత్మ యనిత్యుడు గానేరడు. అనినచో-

కాదు వినుము. సత్కార్యవాదమునుగూడ మేమంగీకరింపము. దీనినికూడ దూషింతుము. కార్యము పుట్టకపూర్వము లేక (ఉండక), కారకవ్యాపారమువలన బుట్టుచున్నదని యసత్కార్యవాదము. ఇట్టితఱి యసద్రూపములయిన శశశృం

గాదులుగూడ బుట్టవలసివచ్చు నను నభిప్రాయముతో కార్యము కారణమునందు తాను పుట్టకపూర్వ ముండియే కారకవ్యాపారముచే నభివ్యక్తమగుచున్నదని సత్కార్యవాదము బయలుదేరినది. కార్యము పూర్వముండియున్నచో కారక వ్యాపారము వ్యర్థమగునని తలచి, కార్యము సత్తు కాదు; అసత్తును కాదు; మిథ్యయే అని మిథ్యావాద మవతరించినది. ఇట్లుండ ఘటత్వాద్యవస్థలు, ఘటాద్యుత్పత్తికి పూర్వము మృత్తుయం దున్నచో నపుడు కులాలాదులవ్యాపారము వ్యర్థ మగును. మరియు పిండాకారమయిన మట్టియందుగూడ ఘటబుద్ధి పుట్టవలసివచ్చును. ఘటత్వాద్యవస్థలు కారణమునందు లేనిచో శశశృంగము పుట్టినట్లు మట్టివలన ఘటము గూడ బుట్టకపోవును. కావున మట్టికి సంబంధించిన ఘటత్వాద్యవస్థలు సదసత్తులుగా నిర్వచింపనలవికావుగనుక మిథ్యాభూతములే యనవలయును.

అట్లే ఆత్మకు బంధముక్త్యవస్థలుకూడ మిథ్యాభూతములే. ఏలయన బంధము కంటె పూర్వము బంధమున్నచో రాగాది దోషములు వ్యర్థములగును. లేనిచో శశశృంగమువలె బంధము పుట్టకుండును. అట్లే ముక్తికిపూర్వము ముక్తియున్నచో గురుశాస్త్రాదులు వ్యర్థములు. లేనిచో శశశృంగాదులవలె ముక్తి పుట్టకపోవును. కావున సత్కార్యాసత్కార్యవాదములు రెండును చెల్లవు. మిథ్యావాదమే సరియయినది.

అయితే మిథ్యావాదమునందుగూడ అవస్థలే మిథ్యాభూతములుగాని, యవస్థలుగల ద్రవ్యము మిథ్యకాదు. కాన బంధముక్త్యవస్థలు మిథ్యయయినను, ఆత్మమాత్రము నిత్యు డగును అనినచో నది సరికాదు. అవస్థలు మిథ్యయయినచో అవస్థగల ద్రవ్యముగూడ మిథ్య యగును. ఎట్లన? ముద్దగానున్న మట్టి యవస్థగల దందురా? లేని దందురా? మొదటిపక్షమున మృద్ద్రవ్యమునం దుండు యవస్థ గంధము గలిగియుండుట యనవలయును. అదికూడ నవస్థయేకాన మిథ్యయే యగును. రెండవ పక్షమున నిరవస్థమయిన మృద్ద్రవ్యము (మట్టి) అనిర్వాచ్యమే యగును. అది యిట్టిరూపము కలదని నిర్వచించి చెప్పుటకు వీలుకాదు. నిరవస్థమయిన మృద్ద్రవ్యము మృద్రూప మనదగదు. అందు మృత్త్వముండుటచే నయ్యది మృత్త్వమను నవస్థతో సావస్థమే యగును. మృత్త్వమను నవస్థలేనిచో మృద్రూపత్వమే దానికి సిద్ధింపదు. కావున నిట్లు సావస్థమగు మృద్ద్రవ్యమునుండి మిథ్యాభూతమగు మృత్త్వావస్థ తొలగిపోయినచో నపుడు మృద్ద్రవ్యమే లేనందున మృత్తు మిథ్యయే యనవలయును. ఘటమునుండి ఘటత్వమును వేరుపరచగా ఘటపదార్థమేముండును ?

అయితే ఘటమునుండి ఘటత్వమును తీసివేసినచో మట్టి మిగులును. దాని యందలి మృత్త్వమును దీసినచో జలము మిగులును. దానియందు జలత్వమును దీసినచో నగ్ని మిగులును. అం దగ్నిత్వమును దీసినచో వాయువుండును. వాయుత్వ

మును దీసినచో నాకసము మిగులును- అనినచో నట్టితరి ఘటత్వాదులవలె మృత్త్వ జలత్వాద్యవస్థలుగూడ మిథ్యాభూతములేకాన అవస్థాంతములయిన మృజ్జలాది ద్రవ్యములకుగూడ మిథ్యాత్వము ప్రసక్తించును. ఇందువలన "అవస్థావంతమయిన ద్రవ్యము మిథ్య"యని వ్యాప్తి సిద్ధించినది. కాన ఆత్మబంధ ముక్త్యాద్యవస్థ గలవా డగుచో మిథ్యయే యగును. దానివలన ఆత్మ కనిత్యత్వమును ప్రసక్తించును. కావున శాస్త్రానర్థక్యాది దోషము ద్వైతులకుగూడ పరిహరింప సాధ్యముకాదు. ఇం దద్వైతుల నెక్కిరింప బనిలేదు.

కాక, దేహాద్యభిమానముగల యజ్ఞానులగురించి విధిప్రతిషేధాది శాస్త్రములు ప్రవర్తించిన వని చెప్పెడి యద్వైతుల మతమున శాస్త్రాదులు వ్యర్థములే కావు. శాస్త్రాధికారు లగు అవిద్వాంసులు మామతమున గలరు. కాన ద్వైతులకే శాస్త్రానర్థక్యదోషము అపరిహార్యము.

శాస్త్రము అవిద్వాంసుల గురించియే ప్రవర్తించెనని. ఆత్మజ్ఞానులగురించి ప్రవర్తించలేదు. అజ్ఞానులకే దేవశరీరాదులయందు గోరికయుండును. వారలు తమ దేహేంద్రియాదులయం దహంబుద్ధియుంచి కర్మల చేయుదురు. దేహాది విలక్షణాత్మజ్ఞానము గల విద్వాంసులకు దేవాది శరీరములయందుగాని, తమ శరీరము నందుగాని ఆత్మబుద్ధియుండదు.

ఆత్మానాత్మవివేకము లేనివాడు మూఢుడు. స్వపరవివేకము లేనివా డత్యంత మూఢుడు. ఎంతటి మూఢుడును నీరునిప్పులు, ఎండనీడలు ఒకటని యనుకొనడు. అట్లనుకొన్నచో దాహమయినవాడు నిప్పు మ్రింగవలయును. ఎండ నోర్వలేని వాడు ఎండకు చెమటబట్టినవాడు నిప్పులో దుముకవలయును. ఎవ్వ డయిన నిట్లు చేయుచున్నాడా? లేదు. కావున నీచందమున ఆత్మానాత్మవివేకముగలవా డెవ్వడును ఆత్మానాత్మల కభేదమును దలంచడు! ఆత్మానాత్మ వివేకములేని మూఢుడట్లు తలంచినచో దలంచుగాక!

కావున "యజేత స్వర్గకామః" ఇత్యాది విధిశాస్త్రమున "న పరదారాన్ గచ్ఛేత్" ఇత్యాది నిషేధశాస్త్రమున్ను అనాత్మపదార్థములకంటె ఆత్మపదార్థము వేరని తెలిసికొన్నవానిని గురించి ప్రవర్తించవు.

ఇందు దృష్టాంతమును జూపెదము. లోకములో యజ్ఞదత్తుడు దేవదత్తుని "నీ వీపనిని చేయుమని" యొకానొకపనియందు నియమించుచుండ, చెంతనున్న 'విష్ణుమిత్రుడు' యీమాట వినుచున్నను, నే నీపనియందు నియమింపబడితినని యనుకొనడు (అనగా యజ్ఞదత్తుడు దేవదత్తుని నీరు తెమ్మని నియోగింప చెంతనున్న విష్ణుమిత్రుడు నీరుతెచ్చుటకు పరుగిడడు.) పైగా ఈనియోగము (ప్రేరణ) నావిషయము కాదని యుపేక్షించియుండును. ఒకవేళ "నీపనియందు యజ్ఞదత్తుడు దేవదత్తుని నియమించెనా? లేక నన్ను నియమించెనా?" అని విష్ణుమిత్రునకు సందేహ

మున్నచో నియోగవిషయవివేకము లేనందున దేవదత్తునిపనియందు విష్ణుమిత్రుఁడు ప్రవర్తింపవచ్చును. ఇట్టిసందేహములేక 'ఈ నియోగము (విధి) దేవదత్తునిది' అను విషయవివేకజ్ఞానమున్నపుడు విష్ణుమిత్రుఁడు తాను నియమింపబడినట్లు గ్రహింపఁడు. తా నాపనిని చేయుటకును ప్రవర్తింపఁడు.

అట్లే, కార్యకారణము (ఫలహేతువు)లయందు ఆత్మత్వభ్రాంతిగల యజ్ఞానులకే కర్మలయందు బ్రవృత్తి. ఆత్మానాత్మలు వేరు అను నిర్ణయజ్ఞానముగల వివేకులకు కర్మలయందు బ్రవృత్తి యసంభవము.

ఓయి ? అనాత్మవస్తువులయిన కార్యకారణముల (ఫలహేతువుల)కంటె ఆత్మ వేరని తెలిసినను విద్వాంసులకు అహం మమాభిమానరూపమయిన ప్రాకృత (అజ్ఞానిక) సంబంధమువలన శాస్త్రము నన్నీపనిని చేయు మన్నది, శాస్త్రము నన్నీపని మాను మన్నది అను జ్ఞానము సహజముగా గలుగుచున్నది. ఇల్లు తగులబడిపోగా నింటిలో నివసించు యజమాని యింటికంటె వేరయినను, యింటియం దున్న మమాభిమానమువలన దుఃఖాదు లనుభవించుచున్నాఁడు. ఇట్టి మమాభిమానము నపేక్షించియే విద్వాంసుఁడుగూడ తాను యిష్టఫలహేతువునందు బ్రవర్తింపబడితిననియు, అనిష్టఫలహేతువునందు నివర్తింపబడితిననియు దలంచుచు, ననుకూలకర్మయందు బ్రవర్తించుచున్నాఁడు; ప్రతికూలకర్మనుండి నివర్తించుచున్నాఁడు. దేహసౌఖ్యముచే తనకు సౌఖ్యము, దేహముయొక్క అసౌఖ్యముచే దన కసౌఖ్యము లోకములో ననుభవసిద్ధమేకదా ? అట్లే స్వర్గలోకమున ఒకానొక దివ్యదేహము నొంది సుఖ మనుభవించెదను. యాతనాదేహప్రయుక్తమయిన దుఃఖము నాకు వలదు, అని తలంచి వివేకముగల మానవుఁడు విహితమును జేయుచున్నాఁడు, నిషిద్ధమును బరిత్యజించుచున్నాఁడు. కావున విద్వాంసులకుగూడ విహితములెవ్వియో, అవిహితము లెవ్వియో తెలియుటకు శాస్త్ర మావశ్యకము. కాన శాస్త్రమునకు విద్వద్విషయత్వముగూడ సంభవించును.

లోకములో తండ్రికంటె నేను వేరనుజ్ఞానము కుమారునకు, కుమారునకంటె నేను వేరను జ్ఞానము తండ్రికి యున్నను వీరిరువురు, ఒకరిపనియందు మరియొకరు ప్రవర్తించుచునే యున్నారు. కుమారుఁడు తండ్రికి సుఖాదు లొనగూర్చుటకు తండ్రిపనియందు బ్రవర్తించుచున్నాఁడు. తండ్రియు పుత్రునకు నరకాది దుఃఖముల దొలగించుటకొరకు పుత్రుని నిషిద్ధకర్మలనుంచి నివారించుచున్నాఁడు. ఇందుకు కారణము వా రుభయులు వేరయినను వా రుభయులకు ఒకరియందు మరియొకరికిగల మమకారమే నని స్పష్టపడుచున్నది. అట్లే విద్వాంసునకుగూడ ఆత్మానాత్మవివేకజ్ఞానమున్నను అనాత్మపదార్థములయందున్న మమకారమువలన విధిప్రతిషేధములయందు బ్రవృత్తి యుపపన్న మగునని భావము.

అయితే యిందొకానొక యవాంతరాశంక కలుగును. ఎట్లన తండ్రికొడుకు లకు పరస్పరము భేదజ్ఞానమున్నను, కుమారుడు "మమాయం జనకః" నాకు వీడు తండ్రి యను ప్రాకృతసంబంధము (మమకారము) వలన దండ్రికొరకు విధి ప్రతిషేధముల గుర్తెరుంగునుగాక! దేహముకంటె నేను వేరను జ్ఞానముగలవాడు దేహముకొరకుగాని, తనకొరకుగాని విధిప్రతిషేధముల దెలియజాలడు. కారణ మేమన- దేహము నశించును. ఆత్మయో? యసంగుడు, అవిక్రియుడును. కాన విధి ప్రతిషేధముల దెలిసికొని చేయున దేమి? ఇందుకు సమాధానము, దేహముకంటె నేను వేరను జ్ఞానముగలవానికిగూడ 'దేహము నాది' అను మమకారము గలదు. అట్టివా డీదేహమునందుండియే స్వర్గలోకమున తనకు దివ్యదేహము కావలెనని కర్మచేయును. నాకు నీచజన్మ రాకుండుగాక యని నిషిద్ధాచరణమునుంచి నివర్తించును. అనగా వివేకవంతులకుగూడ ఫలహేతువులగు ననాత్మపదార్థములయం దాత్మబుద్ధి లేకున్నను, ఆత్మీయబుద్ధి (ఇవినావి యనుబుద్ధి) యుండుటచే శాస్త్రార్థము నందు ప్రవృత్తి సంభవింపవచ్చునని పూర్వవాదియొక్క పరమాశయము.

సిద్ధాంతియొక్క సమాధానము:-

విధిప్రతిషేధశాస్త్రములు అజ్ఞానివిషయములుగాని, జ్ఞానివిషయములు గావు. దేహాది విలక్షణాత్మజ్ఞానము గలిగినంతమాత్రమున కర్మలయందు ప్రవృత్తినివృత్తుల నాచరించెడివాడు విద్వాంసుడు కానేరడు. ఆత్మ దేహాదులకంటె భిన్నుడనుజ్ఞాన ముదయించకపూర్వము ఎల్లమానవులకు అనాత్మభూతములగు ఫలహేతువులయం దాత్మాభిమానము స్వతస్సిద్ధము. విధిప్రతిషేధార్థమును గుర్తెఱింగినపిదప ఫలహేతువుల (కార్యకారణముల) కంటె ఆత్మ వేరనిమాత్రము తలంచును. అదెట్లన మానవులు తమ కనాదికాలముగా జరుగుచున్న దేహాదులయందలి యాత్మాభిమానముతో విలసిల్లుచు, విధిప్రతిషేధముల గుర్తెఱిగి "నేను బ్రాహ్మణుడను; స్నానసంధ్యాది కర్మలయందు శాస్త్రముచే నియోగింపబడితిని; మద్యపానాది కర్మలనుంచి నిషేధింపబడుచున్నాను" అని తలంచుచు విహితకర్మలయందు ప్రవర్తించును. నిషిద్ధకర్మలనుంచి నివర్తించును.

ఇట్లు విధినిషేధార్థజ్ఞానము కలిగినతరువాత వివేకముకలిగి యిట్లు విచారించును. దేహమే నేనగుచో దేహ మీలోకముననే నశించుచుండ నా కవిహిత కర్మలయందు బ్రవృత్తి యేల? నిషిద్ధకర్మలనుంచి నివృత్తి యేల? అని పిదప శాస్త్రమును బ్రమాణముగా జేసికొని యాస్తికుడు దేహాదులకంటె ఆత్మ వేరని తలంచును.

ఈజ్ఞానమును బురస్కరించుకొని తా నీలోకమున ననుష్ఠించినకర్మలకు పరలోకమున ఫలమును నే ననుభవింతు నను నిశ్చయముతో మానవుడు విధిప్రతిషేధములను నెరవేర్చుకొనుచున్నాడు. కావున కర్మలయందు ప్రవర్తించిన అజ్ఞానికి, దేహముకంటె ఆత్మవేరనియు, ఆత్మ, కర్త భోక్తయనియును జ్ఞానముకలిగినను

అయ్యాది తా నాచరించదగినకర్మలను నెరవేర్చుకొనుట కుపయోగించునుగాని, మోక్షమునొందుట కుపయోగించదు. అజ్ఞాని కర్మమార్గమున ప్రవర్తించకపూర్వమే దేహాభిన్నమయిన ఆత్మను అనుసరించినచో నాతనికి తనయందు కర్తృత్వభోక్తృత్వ నిశ్చయమే పుట్టనందున కర్మలయందు ప్రవృత్తియే కలుగదు. కాన, నజ్ఞానికి కలిగిన దేహవిలక్షణాత్మజ్ఞానము కర్మఫలభోక్తయగు నాత్మను సంపాదించుచు, కర్మల నెరవేర్చుకొనుట కుపయోగించునుగాని కర్మసన్న్యాసమున కుపయోగపడదు.

ఓయి, శాస్త్రము విద్వద్విషయమా? లేక అవిద్వద్విషయమా? అని కదా పరికృతప్రశ్న. దానికి సమాధాన మేమి వచ్చినది? వినుము, ఏ అజ్ఞానికి దేహాదులయం దహ మభిమానముండెనో వానికే కర్మలయందు ప్రవర్తించిన తరువాత ఆత్మ దేహముకంటె వేరనుజ్ఞానము కలుగగా దేహాదులయందు మమాభి మానము, ఆత్మయందు కర్తృత్వభోక్తృత్వాభిమానములున్న కలుగును. అట్టితరి యా మానవుడు దేహాభిన్నాత్మజ్ఞాని యయినను, కర్తృత్వభోక్తృత్వాభిమానము లుండుటచే నజ్ఞుడేయగును. ఇక కర్మలయందు ప్రవర్తించనిదేహాభిన్నాత్మజ్ఞానికాని కర్మలయందు ప్రవర్తించినను దేహాభిన్నాకర్త్రభోక్త్రాత్మజ్ఞానికాని దేహాదికమును దాని నాశ్రయించియున్న కర్మజాలమును కర్మఫలములను మమకారముతో జూడడు. ఇట్టివాడు విద్వాంసు డనబడును. కావున దేహాభిన్నాత్మజ్ఞాన మున్నను కర్తృత్వ భోక్తృత్వవిశిష్టాత్మజ్ఞానము గల యజ్ఞానిని గురించియే శాస్త్రము ప్రవర్తించును గాని, అకర్త్రభోక్త్రసంగాత్మజ్ఞానియగు ప్రాజ్ఞునియెడల విధిప్రతిషేధశాస్త్రము ప్రవర్తించదు. విద్వాంసునకు దేహాదులయందు మమాభిమాన ముండదు. వాని యందు మమాభిమాన ముండుచో వాడు విద్వాంసుడే కానేరడు. విద్వాంసునకు దేహాదులతో ప్రాకృతసంబంధముగూడ నుండదు. ప్రాకృతసంబంధ మనునది యజ్ఞానమువలన నేర్పడును.

కావున, అజ్ఞానకార్యములయిన అహం మమాభిమానములు గల యజ్ఞా నులే విధిప్రతిషేధశాస్త్రమునకు విషయము లగుదురుగాని, అహంమమాభిమాన రహితులగు విద్వాంసులు శాస్త్రమునకు విషయభూతులు కారుకనుక, విధిప్రతిషేధ శాస్త్రము అవిద్వద్విషయమగుచు సార్థకమగుచున్నది. ఇట్లే మోక్షశాస్త్రముగూడ నవిద్వాంసులయెడలనే సార్థకమగును.

అవిద్వాంసులు (అజ్ఞానులు)ఆత్మ సంసారియనియు, బద్ధుడనియు తలంచుచు, సంసారబంధమునుండి యాత్మను విడిపించుటకొరకు గురువునుంచి శాస్త్రము నభ్య సించి శమదమాదిసంపాదనద్వారమున జ్ఞానమును సంపాదించి ముక్తు లగుచు న్నారు. కాన మోక్షశాస్త్రముగూడ వ్యర్థముగాదు. విధి ప్రతిషేధ మోక్షశాస్త్ర ములు మూడును అవిద్వద్విషయము లగుచు సార్థకము లగుచున్నవి. అందు విధి ప్రతిషేధశాస్త్రము, సకామాజ్ఞవిషయము.(ఫలేచ్ఛగల యజ్ఞానివిషయము); మోక్ష

శాస్త్రము నిష్కామాజ్ఞవిషయము అని భేదము. మోక్షశాస్త్రముగూడ, మోక్షకామి (మోక్షమును గోరువాని) విషయ మని యనదగదు. మోక్షకామము కామములలో చేరదు. ముముక్షువు నిష్కాము డని ప్రసిద్ధి. పురుషులకు బంధహేతు వగు కామమే కామమని సిద్ధాంతము. మిగిలినవి కామములు కానేరవు. ముముక్షు వునకు మోక్షకామమువలన బంధ మేర్పడదు.

ఓయి, "కర్తా శాస్త్రార్థవత్త్వాత్" అను సూత్రమునందు వేదవ్యాసులు శాస్త్రార్థములయిన యజ్ఞాదులు ననుష్ఠించువా రుండుటచే శాస్త్రములు సార్థకములని సాధించెను. అది యెంతవరకు నిలచునని మన మాలోచించుట యావశ్యకము.

ఏల యన ? దేహాత్మవాదుల కు నజ్ఞానులమతమున దేహ మిచ్చట నే నశించుటవలనను, స్వర్గాదిఫల మనుభవించువాడు వేరుగ లేకుండుటవలనను, దేహమే కర్త యగుటవలనను, కర్మానుష్ఠానము వ్యర్థమనుదృష్టితో నజ్ఞానులు యజ్ఞాదుల యందు ప్రవర్తించరు.

దేహవ్యతిరిక్త అకర్త్రభోక్త్రాత్మజ్ఞానము గల ప్రాజ్ఞులకు మొదలే కర్మలతో బనిలేదు. కావున శాస్త్రార్థముల ననుష్ఠించువారు లేనందున "స్వర్గకామో యజేత" "న కలంజం భక్షయేత్" అను విధి ప్రతిషేధ శాస్త్రములు వ్యర్థము లగును. ఇపుడు వేదవ్యాసుల సూత్రమునకు వారిసిద్ధాంతమునకును గతి యేమి?

అలాగా, వినుము. లోకప్రసిద్ధాత్మజ్ఞానముగల పురుషులకు యజ్ఞాదుల యందు బ్రవృత్తియు, కలంజభక్షణాదులనుంచి నివృత్తియు కుదురును. జీవేశ్వరుల కభేదమును గ్రహించిన బ్రహ్మవేత్తకు ప్రవృత్తినివృత్తు లుండవు. దేహాత్మవాది యగు నాస్తికునకును, యజ్ఞాదులయందు బ్రవృత్తినివృత్తు లసంభవములు. ఇక 'బ్రహ్మవేత్త' 'నాస్తికుడు' పేరిరువురునుదప్ప కర్మానుష్ఠానపరుడని లోకములో బ్రసిద్ధిచెందిన ఆస్తికు డగు వైదికుడు శాస్త్రమునందు ప్రామాణ్యనిశ్చయముండుట వలన దేహాతిరిక్తమయిన ఆత్మ లేనిచో శాస్త్ర మెట్లు ప్రమాణమగునని విమర్శించుకొని దేహాతిరిక్తుడు, కర్తయు, భోక్తయు నగు నొకానొకయాత్మ గలడని యూహించి, అట్టియాత్మయొక్క అకర్త్ర భోక్తృసచ్చిదానందలక్షణమయిన విశేష రూపమును గుర్తింపజాలక, ఆత్మయందు భోక్తృత్వము గలదని భ్రమించి కర్మ ఫలమగు స్వర్గాదులయం దాసపడి కడుశ్రద్ధతో యజ్ఞాదికర్మలయందు బ్రవర్తించుట యెల్లరెఱింగినవిషయము. కావున శాస్త్రార్థ మనుష్ఠించుటకు అజ్ఞుడు కర్తగానుండుట వలన శాస్త్రము వ్యర్థముగాదు. దేహాతిరిక్త కర్తృభోక్త్రాత్మవాది యగు కర్త నాధారపరచుకొని ప్రవర్తించిన వ్యాససూత్రమును వ్యర్థముగాదు.

అయితే "యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనాః" అనికదా ? లోకన్యాయము. బ్రహ్మవేత్తలు శ్రేష్ఠులుకదా ? వారు శాస్త్రార్థ మనుష్ఠించుటకు ప్రవర్తించరుకదా ? వారి వెంట బోవు యవివేకులుగూడ కర్మయందు ప్రవర్తిం

చరుకదా ? ఇట్టితరి శాస్త్రార్థమనుష్ఠించుటకు కర్త యెవడు ? శాస్త్రము సార్థక మెట్లగును ?

ఓహో, ఇదియా మీయభిప్రాయము. లోకములో శాస్త్రార్థమనుష్ఠించువారే (కర్తలే) వేనవేలు గలరు. శాస్త్రార్థమునందు ప్రవృత్తికలుగని బ్రహ్మవేత్త (వివేకి) యెచ్చ్చన కొక్క డుండునో లేదో? కనుకనే శ్రీకృష్ణుడు "బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే" "మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే, యతతామపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః"అని చెప్పియుండెను.

సామాన్యముగా రాగాదిదోషదూషితులయిన మూఢులు వివేకి ననుసరించి ప్రవర్తించరు. రాగాదుల బురస్కరించుకొని కర్మలయందే ప్రవర్తింతురు. శ్రేష్ఠులయిన జనకాదులు కర్మల నాచరించిరని శాస్త్రము చెప్పుచున్నను, మానవులు జనకాదులమార్గ మవలంబించవలెనని కర్మల నాచరించుట లేదు. వారికి కర్మఫలములయందుగల కోరికవలననే కర్మల నాచరించుచున్నారు. అట్లుకానిచో పరదారాగమనాదులను, కలంజభక్షణాదులను, ఆభిచారికకర్మలను యే జనకాదు లాచరించిరని వీ రాచరించుచున్నారు ? కావున నంతట కర్మప్రవృత్తికి ఫలేచ్ఛయే కారణము. ఇదియే అజ్ఞానులకు గల దోషము.

అయితే "వర్త ఏవచ కర్మణి" (నేను కర్మమార్గమునందే యుండు చున్నాను.) "మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః" (ఓయి అర్జునా! అన్నివిధముల మానవులు నామార్గము ననుసరింతురు.) అని శ్రీకృష్ణుడు చెప్పిన మాటకు విరోధమునాటిల్లునుకదా ?అని యనరాదు. రాగాదిదోషములచే తమంతట తామే కర్మలయందు ప్రవర్తించినవారలకు విహితకర్మలయందు రుచిబుట్టించుటకు శ్రీకృష్ణు డట్లు చెప్పెను. కాక, శ్రీకృష్ణుడే మానవులకు కర్మప్రవృత్తి స్వాభావికమని "స్వభావస్తు ప్రవర్తతే" అని చెప్పియుండెను. కావున, మూఢులు భోజనాదుల యందు బ్రవర్తించినట్లు, ధర్మాధర్మసంస్కారమువలన జన్మమొదలుకొని స్వాభావికముగనే ప్రవర్తింతురు. కావున శాస్త్రము, కర్మానుష్ఠానము యీరెండును అజ్ఞానివే. అవిద్యాపరియుక్తమయిన సంసారముగూడ నజ్ఞానికే. ఇంతియెకాని కేవల క్షేత్రజ్ఞునకు అవిద్యకాని, తత్కార్యముగాని లేదు. అవిద్యాకల్పితమయిన సంసారము పరమార్థముగా ఆత్మను బంధింపజాలదు. ప్రాతిభాసికములయిన గంధర్వనగరాదులు, పారమార్థికములయిన గగనాదులను దూషింపజాలవు. నిజమయిన నీరు యూషరక్షేత్రమును జేరి యాక్షేత్రమును బురదచేయగలదుకాని, మరీచ్యుదకము (యెండమావులనీరు) మరుభూమిని చేరి బురదయొనర్పజాలదు. అట్లే అవిద్యగూడ క్షేత్రజ్ఞుని యేమియు జేయజాలదు. కనుకనే శ్రీకృష్ణులు "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత" "అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః" అని చెప్పిరి.

ఇచట అవిద్య యన నేమి? యని యిసుమంత విచారింతము. "ప్రపంచమున కనాదిగా నుపాదాన మగుచు మిథ్యయగునది యవిద్య" అని యవిద్యకు లక్షణము. సత్తుయనియు, అసత్తుయనియు నిర్వచించి చెప్పనలవికానిది మిథ్య యని యర్థము.

ఇక తూలాజ్ఞానము అవిద్య యనుపక్షమునందు "ఉపాదానమగుచు మిథ్య యగునది" అవిద్య అనియే లక్షణము.

ఎట్లయినను అవిద్య మిథ్యయే యగును. అవిద్యయే మిథ్యయయినప్పుడు దానివలన వచ్చిన సంసారము మిథ్యయని చెప్పుటకు విప్రతిపత్తియేమి? అవిద్య జ్ఞానముచే నశించుచున్నది. కాన, సత్యము (సత్) గాదు. ప్రతీయమానమగుచున్నందున అసత్తును గాదు. మరేమనిన ప్రతీయమానమగుచు బాధింపబడుచున్నందున మిథ్యయే యగుచున్నది. కాన సంసారముగూడ మిథ్యయే. అందు సందియములేదు.

"న చ మిథ్యాజ్ఞానం పరమార్థవస్తు దూషయితుం సమర్థమ్" అను భాష్య పంక్తికి మరియొకయర్థము స్ఫురించుచున్నది. మిథ్యాజ్ఞానమనగా (మిథ్యా చ తత్ అజ్ఞానం చ) అను వ్యుత్పత్తివలన మిథ్యాభూతమగు నజ్ఞానమని యర్థము. పరమార్థ వస్తు వనగా పరమార్థసత్యమయిన బ్రహ్మ. కావున మిథ్యాభూతమయిన అజ్ఞానము పరమార్థసత్యమగు బ్రహ్మను దూషించుటకు అనగా సంసారినిగా జేయుటకుగాని, లేక మిథ్యాభూతునిగా జేయుటకుగాని సమర్థము గాదు. కారణ మేమియన, సత్య మిథ్యావస్తువులకు నితరేతరతాదాత్మ్యము కుదరనందువలన అని హేతువు. ఈభావమునందుగూడ నూసరక్షేత్రమరీచ్యుదకాదిదృష్టాంతములు పొసగును. దీనివలన అజ్ఞులచే గల్పింపబడిన సంసారముతో క్షేత్రజ్ఞున కేమాత్రము లేపములేదని తేలినది. కాన అవిద్యవలన క్షేత్రజ్ఞుని సంసారముగలవానినిగా అజ్ఞాను లనుకొందురు గాక. అంతమాత్రమున ఆత్మ కేమాత్రము సంసార మంటదు. తెలియనిబాలుడు ఆకాశము నల్లగా నున్నదని యన్నంతమాత్రమున నీరూపమయిన ఆకాశమునకు రూపమంటుచున్నదా? అట్లే క్షేత్రజ్ఞునకుగూడ సంసార మంటదని భావము. వస్తుతః క్షేత్రజ్ఞుడు (జీవుడు) అసంసారి. కనుకనే, క్షేత్రజ్ఞుడు వస్తుతః ఈశ్వరు డగుచున్నాడు. ఈ యభిప్రాయముతోనే భగవంతు డగు శ్రీకృష్ణుడు "అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః" అని చెప్పెను. అజ్ఞానావరణమువలన క్షేత్రజ్ఞుడు సంసారి యని ప్రాణులు వ్యామోహమును జెందుచున్నారని దీనియర్థము.

ఇట్లుండ మరల ద్వైతవాది శంకించుచున్నాడు.

ఓయి, విద్వాంసులదృష్టిలో క్షేత్రజ్ఞుడు అసంసారి యయి, అవిద్వాంసుల దృష్టిలోనే సంసారియగుచో అనాత్మభూతములయిన దేహాదులయందు "నేనే ఇది" "ఇది నాది" అను నభిమానము అవిద్వాంసులకువలె విద్వాంసుల కేల గలుగుచున్నది? సంసారహేతువయిన నీయభిమానము, అజ్ఞానమువలనగదా గలు

టను! విద్వాంసుల కజ్ఞాన ముండదు కదా! కావున విద్వాంసులకుగూడ అనాత్మ పదార్థములయం దహం మమాభిమాన ముండుటచే దేహాత్మలకు సంసర్గము (సంబంధము) సత్యమే యనవలయును. కావున దేహాదులతో నిజమయిన సంబంధ ముండుటచే క్షేత్రజ్ఞుడు నిజముగా సంసారియే యని యేల యనగూడదు ?

అద్వైతవాదిసమాధానము వినుము. లోకములో అత్యంతమూఢులు దేహమే యాత్మయని తలంతురు. ఆస్తికులు దేహముకంటె ఆత్మ వేరనియు, కర్త, భోక్త యనియు తలంతురు. ఈ ఆస్తికులకు దేహమునం దాత్మాభిమానము లేకున్నను, అంతఃకరణమునం దహ మభిమానము గలదు. దీనిని పురస్కరించు కొనియే అంతఃకరణధర్మములయిన భోక్తృత్వాదులను ఆత్మయం దధ్యసింతురు. ఆస్తికులు ఆత్మ యంతఃకరణవిలక్షణు డని యనరు. నా పట్లంగీకరించుచో (వైదికులను అంతఃకరణమునందు అహమభిమానము లేకున్నచో) కర్తృత్వభోక్తృత్వ విశిష్టమయిన అంతఃకరణముకంటె విలక్షణమయిన ఆత్మను నిర్వికారునిగా జూతురు. అపుడు వారికి నా కీఫలము కావలెనని కోరికగాని, నే నీకర్మ చేయవలెనని కోరికగాని యుండదు. భోగములుకాని కర్మలుగాని వికారరూపములు. అవిక్రి యాత్మజ్ఞానులకు నిట్టి వికారములయం దాకాంక్ష యుండదు. వారికి కర్మలయందు ప్రవృత్తియు నసంభవము. కావున కర్మలయందు ప్రవర్తించెడి యాస్తికులకు నంతః కరణమునం దహమభిమాన ముండును. దానివలననే వారు ఫలాకాంక్షతో కర్మల యందు ప్రవర్తింతురు. అవిక్రియాత్మజ్ఞానముగల విద్వాంసులకు ఫలాపేక్ష లేనందున కర్మలయందు ప్రవృత్తి లేకపోవుచుండగా, దేహేంద్రియవ్యాపారోపరమరూప మయిన నివృత్తి వారియం దారోపించబడుచున్నది. ఇంతియేకాని నివృత్తిగూడ నొకానొకవిధమయిన కర్మయే యని భ్రమింప దగదు. కావున కర్తృభోక్త్రంతః కరణ తాదాత్మ్యాధ్యాసతో గూడిన వైదికులకే యహంమమాభిమానముగాని తత్త్వ వేత్తల కుండదు. ఈయది యద్వైతవాదులసిద్ధాంతము.

ఇందుకు వ్యతిరేకముగ ద్వైతవాదులు తమ పాండిత్యము నిట్లు ప్రకటింతురు. ఎట్లన? క్షేత్రజ్ఞు డన నీశ్వరుడేకాని, జీవుడు కాడు. జీవుడు సంసారి. క్షేత్రజ్ఞుడు అసంసారి. క్షేత్రజ్ఞు (ఈశ్వరు) నిచే ప్రకాశింపజేయదగిన క్షేత్రము (శరీరము) క్షేత్రజ్ఞుని (ఈశ్వరుని) కంటెయు, జీవునికంటెయు విలక్షణము. క్షేత్రక్షేత్రజ్ఞుల కంటె భిన్నుడగు జీవుడు సంసారి. అతడే సుఖియు దుఃఖియు నగుచున్నాడు. క్షేత్ర క్షేత్రజ్ఞులకంటె విలక్షణమయిన జీవుడు క్షేత్రజ్ఞధ్యానముచే క్షేత్రజ్ఞుడగు నీశ్వరుని సాక్షాత్కార మొనర్చుకొని, భ్రమరకీటన్యాయముగ నీశ్వరరూపముతో నుండుచు సంసారబంధమును రూపుమాపుకొనును అని ద్వైతు లందురు. అనగా క్షేత్రజ్ఞుడే (ఈశ్వరుడే) సంసారియగునని యద్వైతులభావము. క్షేత్రజ్ఞు డనగా నీశ్వరు డని యంగీకరించుచు, సంసారియగు జీవు డీశ్వరునికంటె వేరని ద్వైతులభావము.

ఇందు నిజమేమన జీవుడు క్షేత్రజ్ఞుడు గాడని తెలిసికొను పండితుడుగాని, శిష్యుల కిట్లు బోధించు గురువుగాని వీరిరువురు పండితాపశదులు (నీచపండితులు). సంసారమోక్షములు మిథ్యయగుచో శాస్త్రము వ్యర్థమగు నని తలంచి, యావింటికిని సత్యత్వమును వర్ణించి శాస్త్రమును సార్థక మొనర్పదలచిన మూర్ఖులు వీరు. ఇట్టి నీచులు తాము మూఢులగుచు, నితరుల మోసపుచ్చ నడుకట్టి, యాత్మనాశ మొనర్చి, వ్యాసశుకాది గురుశిష్యపరంపరాప్రవృత్తమయిన శాస్త్రసంప్రదాయమును మంట గలుపుచున్నారు. శాస్త్రార్థసంప్రదాయ మెట్లు ప్రవర్తించినది నిర్ణయించుట ముఖ్యము. మూలకర్త యగు వ్యాసులు తనశిష్యుడు, కుమారుడు నగు శుకయోగీంద్రునకు ఏనయాశయమును యథార్థముగా బోధించెను. ఆ శుకులు గౌడపాదులను తమశిష్యుల కుపదేశించిరి. గౌడపాదులవారు గోవిందయోగీంద్రుల కుపదేశించిరి. గోవిందయోగీంద్రులు శ్రీ శంకరుల కుపదేశించిరి. ఇట్లు శాస్త్రార్థసంప్రదాయము పరంపరాప్రాప్తమని గీతార్థ సంప్రదాయమునందు సుస్పష్టము.

శంకరులు తమయభిప్రాయమును సర్వజనసులభమగునట్టుల భాష్యరచనాద్వారమున లోకమునకు వెల్లడించిరి. కాన నెవడు యిట్లు సంప్రదాయపూర్వకముగ ప్రవృత్తమయిన శాంకరభాష్యమును పఠింపచేయునో వాడే సంప్రదాయవేత్త యగు గురువు.

మిగిలిన రామానుజులు మున్నగువారల కిట్టిసంప్రదాయము లేదు.

కావున రామానుజాదులభాష్యమును పఠింపజేయువారు సంప్రదాయరహితులు. అందువలన వీరు శాస్త్రసిద్ధమయిన యర్థమును పరిత్యజించి, తాము స్వతంత్రముగా లేని యర్థమును గల్పించి లోకమును మోసపుచ్చుచున్నారు. కాన నిట్టివారలముఖమును జూడగూడదు. వారి నుపేక్షించవలెగాని, వారికి శిష్యత్వ మవలంబించి వారిని సేవింపగూడదు.

చూడుడు, వారు లోకమున కొనర్చెడి మోసమును – "ఇదం శరీరం కౌంతేయ క్షేత్ర మి త్యభిధీయతే" అను శ్లోకముచే శ్రీకృష్ణుడు శరీరము క్షేత్రమని చెప్పి "ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః" అను శ్లోకముచే శరీరమును దెలిసికొనువాడు క్షేత్రజ్ఞ డని చెప్పెను. శరీరమును దెలిసికొనువాడు శరీరసంబంధము గల జీవు డని యెల్లరకు ననుభవసిద్ధము. "నేను మనుష్యుడను, నేను స్థూలుడను, ఇది నాశరీరము, నాచేయి" అను ప్రతీతులు జీవునకు సహజములు. అట్టిక్షేత్రజ్ఞుడే (జీవుడే) "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత" అను శ్లోకముచే నా నని చెప్పి, జీవున కీశ్వరాభేదమును దృఢపరచెను.

ఇట్టి యథాశ్రుతార్థమును విడచి, జీవుడు క్షేత్రజ్ఞుడు గాడనియు, క్షేత్రజ్ఞుడనగా నీశ్వరుడనియును అర్థమును వర్ణించుట లేనిదానిని కల్పించుటయేకదా?

క్షేత్రజ్ఞుడయిన ఈశ్వరునికంటె జీవుడు వేరనియు, క్షేత్రజ్ఞ (ఈశ్వర) ధ్యానముచే ఈశ్వరస్వరూపప్రాప్తి కలుగుననియు జెప్పుట యుక్తముకాదుకదా ?

ఒకవస్తువునకు మరియొకవస్తువుయొక్కరూప మెట్లుసంభవించును ? జీవున కున్నరూపము నశించినచో జీవుడు నశించినట్లేకదా ? జీవుడు మారురూపము నొందెననగా మరల పుట్టినట్లేకదా ? ఇట్లు జన్మనాశములుగల జీవుడు నిత్యు డెట్లగును ? ఘటము కంబుగ్రీవాద్యాకారమును వదలినచో నశించిన దని యను చున్నాము. కపాలస్వరూపముతో పుట్టినదని యనుచుంటిమి. ఇట్టి ఘట మనిత్యమని కదా లోకప్రసిద్ధి.

ఇక జీవుడు స్వంతరూపమును విడువకయే ఈశ్వరరూపమును బొందు నను టయు పొసగదు. రెండురూపము లేకవ్యక్తియందు దేశకాలముల నుండుట విరుద్ధము. అట్లుండుటకు లోకదృష్టాంతమును గానము. భ్రమరకీటన్యాయమునందుగూడ కీటము కీటరూపమును విడచియే భ్రమరరూపమును బొందుచున్నది. కీటభ్రమరరూపములు రెండును నొకచోట కనుపింపవు. భ్రమరకీటరూపములు రెండును పరస్పరవిలక్షణ మయియుండ, కీటరూపమును విడువక కీటము భ్రమరరూపమునొందుటెట్లుపొసగును? భ్రమరకీటరూపములకు పరస్పరభేదమే లేదందువా? అపుడు ఇది భ్రమరము, ఇది కీటము అను వ్యవహారముయేటకలియును. ఇక ఘటరూపమును విడచి కపాల రూపమునొందిన మృద్ద్రవ్యము నిత్యముగా నున్నందున పూర్వరూపమును విడచి, ఉత్తరరూపమును బొందినను, జీవుడు నిత్యుడేయగునుకాని యనిత్యుడుగాడని యన రాదు. దృష్టాంతమునందు (మృద్ద్రవ్యమునందు) ఘట కపాల ద్వయానుగతమయిన మృద్ద్రవ్య మొకటియే. కావున నచట మృద్ద్రవ్యము నిత్యమగుగాక. ప్రకృతము నందు కీటభ్రమరములవలె జీవేశ్వరులుగూడ వేరయినందున జీవుడు నిత్యుడు గానేరడు. మరియు ఉభయరూపానుగతమయిన మృద్ద్రవ్యము నిత్యమయినను, తద్వికారములయిన ఘటకపాలము లనిత్యములే యగుచున్నట్లు, జీవేశ్వరానుగత మయిన మరియొకవస్తువు నిత్యమనియు, జీవేశ్వరు లనిత్యులనియు జెప్పవలయును. అట్లు చెప్పుటకు ద్వైతమతమున జీవేశ్వరానుగతమయిన వస్తు వేదియు లేదు. అట్టి వస్తువు నంగీకరించినచో జీవునివలె నీశ్వరుడుగూడ అనిత్యు డగును. అబ్బా! జీవ నిత్యత్వమును సాధింపనుంకట్టిన నీవు యీశ్వరానిత్యత్వమును సాధించితివికదా? ఏమి ఫలమును బొందితివి?

ఇక ఘటకపాలములరెంటియందును మృద్ద్రవ్య మనుగత మయినట్లు జీవేశ్వ రులయందు చైతన్య మనుగతమయి కలదనియు అదియే నిత్యము, సత్యము ననియు ద్వైతు లంగీకరించినచో మృద్రూపముతో ఘట కపాలము లేకరూప మయినట్లు (అభిన్నమయినట్లు) చైతన్యరూపముతో జీవేశ్వరుల కేకత్వము చెప్పిన ట్లగును. కాన, వారికి స్వమతభంగము, పరమతప్రవేశము సంభవించును.

మరియు

(1) జీవేశ్వరులకు ఘటపటములకువలె రూపమువలన భేదమా?
(2) లవణకర్పూరములవలె ధర్మతః (ధర్మమువలన) భేదమా?
(3) రెండుఘటములకువలె వ్యక్తితః భేదమా? లేక
(4) ఘటాకాశములకువలె పదార్థతః భేదమా? లేక
(5) వాయ్వాకాశమువలె గుణతః (గుణమువలన) భేదమా? లేక
(6) ఘటకలశములవలె నామతః (నామమువలన) భేదమా?

(1) జీవేశ్వరులు నిరూపులయినందున మొదటిపక్షము పొసగదు.
(2) జీవేశ్వరులు నిర్ధర్మకులయినందున రెండవమతము చెల్లదు.
(3) వ్యక్తిద్వయము ప్రత్యక్షముగానందున మూడవమతము కుదురదు.
(4) ఆత్మత్వముతో జీవేశ్వరులిరువురు యేకపదార్థమైనందున నాల్గవపక్షము నిలువదు.
(5) జీవేశ్వరులు, గుణరహితులయినందున అయిదవపక్షము ఘటింపదు.
(6) కావున నిక పరిశేషన్యాయముచే నాల్గవపక్షము మంగీకరింపనగును.

ఒకేవస్తువునకు ఘటము, కలశము అని పేరిడినట్లు ఒకేయాత్మను (చైతన్యమునకు) జీవుడు, యీశ్వరుడు అని నామమాత్రమేకాని, వాస్తవముగా జీవేశ్వరులకు భేదములేదు.

అయితే, భేదములేనిదే అభేదవాదముగూడ పొసగదు. నిషేధ మెప్పుడును ప్రసక్తిపూర్వకముగా నుండును. భేదములేనిదే భేదనిషేధరూపమయిన అభేదవాద మెట్లు పొసగును? అని యనరాదు. అజ్ఞానులదృష్టిలోనున్న భేదమును ప్రతియోగిగా చేసికొని తన్నిషేధరూపమైన అభేదవాదము చెల్లనగును.

అంతఃకరణావచ్ఛిన్నత్వ, మాయావచ్ఛిన్నత్వరూపవిశేషణ భేదముచే తదవచ్ఛిన్నచైతన్యరూపులగు జీవేశ్వరులకు భేద మనుటయు పాడిగాదు. నిర్విశేష చైతన్యమునందు విశేషణ సంబంధముండదు. కనుకనే ఆత్మనిర్ధర్మకు డని శ్రుతులు చాటుచున్నవి. మరియు పరిపూర్ణమగు చైతన్యము, అంతఃకరణాదులతో పరిచ్ఛిన్నము కానేరదు. ఘటాకాశ మహాకాశములకు వలె జీవేశ్వరులకు భేద మౌపాధికమను వాదముకూడ చెల్లదు. ఔపాధికభేదము వాస్తవభేదమును బుట్టింపనేరదు. ఉపాధిప్రయుక్తమగు భేదము ప్రయోజనకరము గాదు. ఉపాధిసంబంధమువలన వస్తువు పరమార్థముగా భిన్నముగానేరదు. ఘటమఠభేదమువలన ఆకాశము భిన్నమగుట లేదు. ఉపాధిప్రయుక్తమయిన భేదము నిస్సారము కనుకనే వెనుకటి వికల్పములలో నిద్దానిని చేర్పలేదు. కనుక జీవేశ్వరభేదవాదము అయుక్తము, అప్రమాణము నగుచున్నది. పైగా "స ఆత్మా తత్త్వ మసి" ఇత్యాదిశ్రుతులు జీవేశ్వ

రాభేదమును సాధించుచున్నవి. "ద్వాసుపర్ణా సయుజా సఖాయా" అను శ్రుతిగూడ జీవేశ్వరులకు భేదమును సాధించుటలేదు. అయ్యది, అంతఃకరణజీవులకుగాని ప్రమాతకు సాక్షికిగాని గల భేదమును సూచించుచున్నది. ప్రమాతసాక్షులకుగూడ వాస్తవభేదము లేదు. సాక్షియగు కూటస్థచైతన్యమునందే ప్రమాతృత్వము కల్పింపబడినందున సాక్షియే జీవుడుగాని, జీవుడు సాక్షికంటె నిజముగ వేరుగాడు. అజ్ఞానులు ప్రమాతృచైతన్యమునే, అధ్యస్తాహంకారరూపుడగు జీవునిగా దలంచుచున్నారు. అహంకారమే జీవుడని భ్రమింపగగదు. సుషుప్తిదశయందు అహంకారము లయముచెందినను, దానికి (అహంకారలయమునకు) సాక్షిగా జీవుడున్నాడు. కనుక జీవేశ్వరభేదవాదము సర్వథా అప్రమాణము. కనుకనే "అన్యోసావన్యోహ మస్మీతి యో విదు స్తే పశవః" అను శ్రుతి ఆత్మభేదవాదిని పశువని నిందించుచున్నది. కనుకనే శంకరాచార్యులు భేదవాదులను పశువులని యనలేక మూర్ఖులనియు, నుపేక్షింపదగినవారనియును తమభాష్యమునందు వ్రాక్రుచ్చిరి. పశుతుల్యులగు భేదవాదులకు సంసారభయము దుర్వారము. ఈశ్వరుడసంసారి కాగా, తద్భిన్నుడగు జీవుడు తప్పక సంసారియే కావలయును. కాన, సంసారనివర్తకమయిన సమ్యగ్జ్ఞానమును సంపాదించుటకు తగిన మానవజన్మమునొందియు సమ్యగ్జ్ఞానమును సంపాదించుకొనలేక, ఆత్మను సంసారమునుంచి విడిపించుకొనలేనివాడు మానవాధముడుగాక మరేమి ? ఆత్మహంత లన వీరలేకదా ? ఇట్టివారలకు నరకము తప్పదని "అన్ధం తమః ప్రవిశంతి యేకే చాత్మహీనో జనాః" అను శ్రుతి చెప్పుచున్నది. కావున భేదవాదులు తాము నరకమునకు బాల్పడి, యితరుల గూడ నరకమువాలు చేయుచుండ, వీరలతో పొత్తు యేల ? 'దుష్టుని దూరముగా విడువవలె' నన్న న్యాయ మవలంబించుటయే మంచిది. ఆత్మహంత లనగా ఆత్మను జంపువా రని యర్థము గాదు. ఆత్మ యొకనిని చంపువాడుగాని, యొకనిచే జంపబడువాడుగాని కాడు. అజ్ఞానకల్పితమయిన ప్రమాతృత్వము నాత్మ కంట బెట్టెడు భేదవాదులు ఆత్మయొక్క నిజరూపమును జెడగొట్టుచున్నారుకాన, ఆత్మహంత లనబడుదురు – కావున ఆత్మభేదమే యాత్మహత్య. కనుక అసంసారి యగు క్షేత్రజ్ఞుడే జీవు డని సుస్పష్టము.

ఈపై గ్రంథముచే తేలిన దేమి? వినుము. విద్యావిద్యలు రెండును వేరు. ఆత్మకు విద్యచే నీశ్వరత్వము. అసంసారిత్వము ప్రాప్తించును. అవిద్యచే ఆత్మకు సంసారిత్వము సంభవించును. అవిద్యచే నేర్పడ్డ సంసారిత్వముచే ఆత్మకు వాస్తవముగ లేపమంటదు. సంసారము సంసారి యీరెండును అవిద్యాకల్పితములు, మిథ్యాభూతములు. కాన నీరెండును వాస్తవముగా లేకుండుట విద్వాంసుల కిష్టము. విద్యాదశయందు సంసారములేదు; సంసారియు లేడు. అంతఃకరణమునుంచి యాత్మను వేరుపరచి చూడ సంసారి యనువా డెచటను కనిపించడు. కేవలాంతఃకరణమునకుగూడ

సంసారములేదు. అయ్యది జడము. ఆత్మానాత్మాధ్యాసలేనిచో జడమయిన అంతఃకరణమునకు సంసారమంటనేరదు. అట్లగుచో జడములయిన ఘటాదులకు గూడ సంసార ముండవలయును. అట్లు లోకానుభవములేదు. కనుక ఆత్మాంతఃకరణములకు భేదము తెలియకుండుటవలననే సంసార మేర్పడును. ఆరెంటికి భేదము తెలిసినపిదప సంసారి, ప్రమాత యను భేద ముండ నేరదు.

ఓయి! క్షేత్రజ్ఞున కవిద్య యుండునుగదా? అదియే దానికి సంసారము. దాని వలననే క్షేత్రజ్ఞునకు సుఖదుఃఖము లనుభవగోచరము లగుచున్నవి. కావున క్షేత్రజ్ఞునకు (ఆత్మకు) సంసారము లేదనుటెట్లు? అని పూర్వవాది యాక్షేపము. ఈదోష మొకతూరి నివారింపబడినను స్థూణానిఖననన్యాయమునుచే పరిహారమును స్పష్టపరచ గలందులకు మరల లేవదీయబడినది.

సమాధానము: అవిద్య జ్ఞేయమయిన అంతఃకరణముయొక్క ధర్మముగాని జ్ఞాతయగు ఆత్మయొక్క ధర్మము గాదు. జ్ఞేయధర్మముచే జ్ఞాత కెట్టి దోషము లేదు. జ్ఞేయములగు ఘటాదులయొక్క ధర్మమయిన జాడ్యాదులు జ్ఞాత కేమియు దోషమును గల్పించుటలేదు. అట్లే జ్ఞేయగుణములుగూడ జ్ఞాతకు గుణమును గల్పింప నేరవు. ద్వైతులు క్షేత్రజ్ఞున కంటగట్టెడి దోషములన్నియు జ్ఞేయము లగుటచే క్షేత్ర ధర్మములుగాని, క్షేత్రజ్ఞ ధర్మములు గావు. ఇచట దోషశబ్దము గుణమునకుగూడ నుపలక్షణము. ఆత్మ గుణదోషశూన్యుడు. కనుకనే యాత్మ నిర్ధర్మకుడు, సాక్షి యని సిద్ధాంతము.

అయితే, అవిద్య (అజ్ఞానము) క్షేత్రధర్మమయినను, అయ్యది క్షేత్రజ్ఞునకు సంసారబంధము నేర్పరచవచ్చును. అగ్నిధర్మమయిన ఔష్ణ్యము (వేడిమి) లోహమునకు దాహకత్వమను (కాల్చుటయను) దోషమును కలుగజేయుచున్నదికదా? అని ప్రశ్న కలుగును. కాని యీ దృష్టాంతము సరిపోదు. అగ్నిలోహములు రెండును జ్ఞేయములుకనుక, ఒకదానియొక్క గుణదోషములు మఱియొకదాని కంటును. ప్రకృతమున క్షేత్రక్షేత్రజ్ఞులు జ్ఞేయజ్ఞాతృరూపులు కనుక వారెంటికి పరస్పరసంబంధము కుదుర నేరదు. జ్ఞేయజ్ఞాతలకు పరస్పరసంబంధమే యుండు నెడల జ్ఞాతకు జ్ఞాతృత్వమే నిలువనేరదు. అగ్నిసంపర్కమువలన లోహమునకు అగ్నిరూపత్వ మేర్పడినట్లు జ్ఞేయసంసర్గమువలన జ్ఞాతకుగూడ జ్ఞేయరూపము ప్రాప్తించు చుండ జ్ఞాతకు జ్ఞాతృత్వ మెట్లు నిలుచును? అవిద్యాసుఖదుఃఖాదు లాత్మధర్మము లగుచో ప్రత్యక్షముగా నుపలభ్యమానములు గావు. అయ్యది యుపలభ్యమానము లగుచున్నవి. కావున నయ్యవి క్షేత్రజ్ఞధర్మములు గావు. క్షేత్రధర్మములే కావలయును.

కనుక జ్ఞేయమంతయు క్షేత్రమనియు, జ్ఞాతయే క్షేత్రజ్ఞుడనియును నిర్ణయించినపిదప ప్రత్యక్షముగా నుపలభ్యమానములగు అవిద్యాసుఖదుఃఖాదులు క్షేత్రజ్ఞధర్మము లనుటకాని, క్షేత్రజ్ఞధర్మములు ప్రత్యక్షముగ నుపలభ్యమానము లనుట కాని, యవిద్యాలంబనముచే జెప్పెడి విరుద్ధసంభాషణములుగాని వేరు గాదు.

ఓయి, శరీరధర్మములు క్షేత్రజ్ఞునిచే దెలియబడినట్లు క్షేత్రజ్ఞునిధర్మములు గూడ వానిచే దెలియబడుగాక. అట్లుకానిచో, జ్ఞానానందాదులగు క్షేత్రజ్ఞధర్మములు లేకపోవలసివచ్చునుకదా ? అని యనరాదు. "సచ్చిదానందం బ్రహ్మ" అను శ్రుతి క్షేత్రజ్ఞుడు సచ్చిదానందస్వరూపు డని చెప్పుచుండ, జ్ఞానానందాదులు క్షేత్రజ్ఞధర్మములనుట పాడిగాదు. జ్ఞానానందాదులు ఆత్మకు స్వరూపభూతములుకాని ధర్మస్వరూపములు గావు. కనుకనే ఆత్మ నిర్ధర్మకుడను సిద్ధాంతము పొసగుచున్నది. జ్ఞానానందాదులు జ్ఞాతచే దెలియబడుటలేదు. "నే నానందము ననుభవించుచున్నాను" అను ప్రతీతికిలేదు. సుషుప్తియందుగాని, మూర్ఛయందుగాని కనిపించుట లేదు. అచట కేవల మనుభవముమాత్రమే కలదు. "నేను సుఖము ననుభవించుచున్నాను" అను ప్రతీతి, యంతఃకరణధర్మమగు సుఖముయొక్క అనుభవమును సూచించుచున్నది. ఆత్మానందానుభవమును సూచించుట లేదు. కావున కేవలానుభవమే యానందము. అదియే క్షేత్రజ్ఞుడు. కేవలానుభవమునం దెట్టిధర్మమును లేదు. అట్లున్నచో నాధర్మముగలవాడు క్షేత్రజ్ఞుడగును. కనుక జ్ఞానమన్నను, ఆనందమన్నను జ్ఞాతయగు ఆత్మయొక్క స్వస్వరూపమేకాని, గుణము (ధర్మము) కాదని సిద్ధాంతము. ఇట్లయిననే జ్ఞానానందాదులకు సాక్షిరూపముతో స్వతః ప్రకాశము (జ్ఞానము) కుదురును. లేనిచో నియ్యది కుదరనేరదు.

అయితే, జ్ఞానానందాదులు ఆత్మధర్మములను శాస్త్రవ్యవహారమునకు విరోధముకదా ? యని ప్రశ్నింపదగదు.

"ఆనందో విషయానుభవో నిత్యత్వంచేతి సన్తి తద్ధర్మాః, అపృథక్త్వేపి చైతన్యా త్పృథగివావభాసంతే" అను శాస్త్రవ్యవహారము, ఆనందాదులు ఆత్మకంటె వేరయినట్లు తోచుచుండునని చెప్పుచున్నదికాని, నిజముగా ఆనందాదులు ఆత్మధర్మములని చెప్పుటలేదు. కాన శాస్త్రవిరోధము లేదు.

సరేకాని, సచ్చిదానందములు ఆత్మస్వరూపములయితే కానిండు. సర్వాంతరత్వ సర్వనియామకత్వ సర్వశేషిత్వ సర్వాధారత్వ అపహతపాప్మత్వాది ధర్మములాత్మకు కలవందురా ? లే వందురా ? ఆత్మ కున్నచో నయ్యవి ఆత్మచే దెలియబడునా ? లేక నితరునిచే దెలియబడునా ?

ఇందు మొదటిపక్షము పొసగనేరదే - జ్ఞాతృధర్మములు, జ్ఞాతృవేద్యములు కావని మీ రింతకు మున్ను చెప్పినదేకదా ? ఇక నితరులచే నాధర్మములు తెలియబడునన్నచో నదియును పొసగదు. ఆత్మకంటె నితరమంతయు జడముకాన జడ

మగున దేదియు ఆత్మధర్మములను దెలిసికొననేరదుకదా? ఇక పైన చెప్పబడిన ధర్మములు ఆత్మకు లేవన్నచో "ఏకో దేవ స్సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా, కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ॥" అను శ్రుతివిరోధము ప్రసక్తించును. ఈశ్రుతి సర్వాంతర్యామిత్వాదిధర్మములాత్మకు కలవని చాటుచున్నది. లోకానుభవముకూడ నిట్లే కలదు. లోకములో నెల్లమానవులు దేవుడు ప్రపంచమున కాధారభూతుడనియు, సర్వాంతర్యామియనియు, కర్మఫలప్రదాతయనియు ననుచున్నారు. కావున నిట్టి లోకానుభవవిరోధమును శ్రుతివిరోధమునున్న ఆత్మ నిర్ధర్మకుడను మీవాదమున నెట్లుపసంహరించుకొనెదరు?

వినుము. ప్రపంచమంతా నిజమైతే సర్వాంతర్యామిత్వాదిధర్మములుగూడ ఆత్మకు నిజమగును. ప్రపంచమే నిజముకాదు. "అతోఽన్య దార్తమ్" అను శ్రుతి బ్రహ్మ మొక్కటే సత్యమనియు, మిగిలినదంతయు నసత్యమనియును చెప్పుచున్నది. కావున అజ్ఞానముచే ప్రపంచమంతయు గల్పింపబడినట్లు సర్వాంతర్యామిత్వాదిధర్మములుగూడ నవిద్యచే ఆత్మయందు గల్పింపబడినవి. ఆ ధర్మములు సాక్షిభాస్యములగుటచేకూడ గల్పింపబడినవే. కావున జ్ఞాతయొక్క ధర్మములు జ్ఞాతచే దెలియబడుటకాని, జ్ఞాతచే దెలియబడునవి జ్ఞాతృధర్మములగుటకాని, యీరెండును నెంతమాత్రము పొసగవు. అయితే ఇదేన్యాయమున జ్ఞేయమగు ఈ ప్రపంచము, దానిధర్మములు, యీరెండును జ్ఞాతచే దెలియబడుట, ఇదియంతయుగూడ అవిద్యాకల్పితమేకదా? అవును నిజమే, అది మాకు సమ్మతమే.

అయితే, ఈయవిద్య ఆత్మకు సంబంధించినదా? లేక అనాత్మపదార్థమునకు సంబంధించినదా? ఇందు మొదటిపక్షము కుదరదు. అసంగస్వప్రకాశుడయిన ఆత్మకు నవిద్యాసంబంధము అసంభవము. జడమయిన అనాత్మపదార్థము అవిద్యకాశ్రయము కానేరదు. ఇక 'అవిద్య' ఆత్మ నాశ్రయించియుండదు. అనాత్మపదార్థమును ఆశ్రయించియుండదు. ఈయది స్వతంత్రముగా నుండు నన్నచో, నదిమాత్ర మెట్లు పొసగును? పరతంత్రమయిన జడపదార్థము స్వతంత్రముగా నుండుట దుర్లభముకదా? కావున నీయవిద్య దేని నాశ్రయించియుండి యీ ప్రపంచమును ప్రాపంచికధర్మములను, ఆత్మధర్మములను గల్పించుచున్నది? అని పూర్వవాది యవిద్యాశ్రయమునుగూర్చి ప్రశ్నించెను.

ఇందుకు సమాధానమును జెప్పదలచినసిద్ధాంతి పూర్వవాది నిట్లు వికల్పించి యడుగుచున్నాడు.

ఓయి, పూర్వవాదీ! నీవు అవిద్యకు ఆశ్రయమాత్రము నడుగుచుంటివా? లేక అవిద్యావిశేషము నడుగుచుంటివా? ఇందు మొదటిపక్షమున ఎవనియందవిద్య కనిపించుచున్నదో, వాడే దాని కాశ్రయము. అనగా, అవిద్య దృశ్యమా?

లేక అదృశ్యమా? అని ముందు విచారించుకొనవలయును. దృశ్యమగుచో, పర తంత్రమయిన నవిద్య దేనినో నొకదాని నాశ్రయించియుండును. కాన, నెవనియం దవిద్య దృశ్యమగుచున్నదో, వాని నాశ్రయించియున్నట్లు సుస్పష్టమగుచున్నది. ఇక అవిద్య యదృశ్యమగుచో, ప్రకాశయే లేనందున అవిద్య లేకనేపోవలసివచ్చును అని భావము.

ఇప్పటికిని అవిద్య దృశ్యమగుచున్నను, (కనపించుచున్నను) అవిద్యకు నాశ్రయమయిన వస్తువిశేషము గోచరమగుటలేదని యెంచి మరల యాశ్రయమును గురించి ప్రశ్నించెడి పూర్వవాదిని నీప్రశ్నయే నిరర్థకమని సిద్ధాంతి చూపించు చున్నాడు.

ఓయి పూర్వవాదీ! నీ వవిద్యను జూచినచో, అవిద్యగలవానిఁగూడ దెలిసి కొనియే యున్నావు. ఆశ్రయము కనిపించనిదే ఆశ్రయవిశిష్టమయిన వస్తువు గోచ రించదు. అవిద్యాశ్రయమగు వస్తువు కనిపించనిదే, నీకు అవిద్య యెట్లు కనుపించి నది? కనుక నీకెప్పు డవిద్య కనిపించినదో యప్పు డవిద్యాశ్రయముకూడ గోచరించియే యున్నది. ఇట్టితరి నాకు కనిపించుచున్న యవిద్యకు ఆశ్రయ మెవ్వని యడిగెడి నీ ప్రశ్న కర్థ మేమి? లోకమునందు నెవ్వడయినను గోవులను గోస్వామిని జూచిన తరువాత, ఈ గోవు లెవ్వనివి? అని యడుగునా? నీ వింతకు మూర్ఖుడ వేమి?

కాదు కాదు. ఓయి సిద్ధాంతీ! నీవుచూపిన దృష్టాంత మిచట పొసగదు. గోవులు, గోస్వామి, ఆయిరువురికిగల సంబంధము యీమూడును ప్రత్యక్షమగుటచే నచట ప్రశ్నించనవసరము లేదు. ప్రకృతము, అవిద్యా; అవిద్యావంతులు ప్రత్యక్ష ముగా కనిపించుటలేదు. కావున నిచట ప్రశ్నించుట కవకాశము కలదు.

ఓయి పూర్వవాదీ! అవిద్య ప్రత్యక్షమగుచున్నదని యంగీకరించినచో, అవిద్యావంతుడుకూడ ప్రత్యక్షమగుట ట్లంగీకరింపవలసివచ్చునని తలచి, రెండును అప్రత్యక్షము లంటివి.

అవిద్యావంతుడు (అవిద్యగలవాడు) పరోక్షుడయినను, ప్రత్యక్షము గాకు న్నను అవిద్యాశ్రయు డెవరని నివడిగెడిప్రశ్న వ్యర్థమే యగును. నీకు ప్రత్యక్షము కాని యవిద్యావంతునితో అవిద్యకు సంబంధమున్నదని నీకు దెలిసినంతమాత్ర మున నీప్రశ్న వ్యర్థమని యాక్షేపించెడివారలకు నీ వేమి సమాధానము చెప్పగలిగి తివి? ఇంతమాత్రమున నీ కేమియు సమాధానము లభించలేదు. అనగా అవిద్యతో సంబంధము గలదని నీకు పరోక్షజ్ఞానమున్నను 'అవిద్య యెవనికి' అను నీప్రశ్న నిష్ఫలమే యని భావము.

ఓయి, సిద్ధాంతీ! అవిద్యయందు శోకమోహాదిలక్షణమయిన సంసారమును కలుగజేసెడిదోషము కలదు. అందువలన అవిద్య పోగొట్టుకొనతగినది. దానిని బోగొట్టుటకు నే నిట్లు ప్రశ్నించితిని అనినచో నదియును యుచితముగాదు. నీవు

పరోక్షముగా కనిపెట్టిన యవిద్య యెవనికి సంబంధించియున్నదో, వాడే దానిని బోగొట్టుకొనగలడు. దాని యవిద్యను బోగొట్టవలెనన్న ప్రయాస నీ కేల ?

ఇక, ఆయవిద్య నీకే యుండెనేని నీయవిద్యను బోగొట్టుకొనదలచి యిట్లడిగనచో నప్పుడు నీ వవిద్యను, అవిద్యగల నిన్ను తెలిసికొనియే యున్నావు. కాన నవిద్య యెవని కని మరల యడుగ నేల ?

మరల పూర్వవాది తన ప్రశ్నను నిలబెట్టుకొనదలచి సిద్ధాంతితో ననుచున్నాడు.

ఓయి, సిద్ధాంతీ! నేను, అవిద్యగలనన్ను నేత్రములుగల దేవదత్తుని దెలిసికొనినట్లు ప్రత్యక్షముగా దెలిసికొనుటలేదు. నేత్రములచే, నేత్రస్వామిని ప్రత్యక్షముగాజూచినట్లు అవిద్యను అవిద్యగల నన్ను, నేను ప్రత్యక్షముగా జూచినయెడల నా ప్రశ్న వ్యర్థమగును. అట్లు ప్రత్యక్షజ్ఞానము లేదు. పరోక్షజ్ఞానమాత్రమే కలదు. (నేను - అవిద్యగలవాడను - అవిద్యాకార్యములైన శోకమోహాదులు నాయందుండుటవలన - అవిద్య, అవిద్యాకార్యములు నావి యున్నవనియె) అను ననుమానజ్ఞానమాత్రమే నాకున్నది. కాన నా ప్రశ్న నిష్ఫలము కాదు. అనగా, అవిద్య, అవిద్యాసంబంధము నాకు ప్రత్యక్షముకానందున, పరోక్షముగా నాకెంతేని దెలిసికొని, అవిద్య యెవనికని నేను ప్రశ్నించుచున్నానని పూర్వవాదిభావము.

సిద్ధాంతి యీభావము నాక్షేపించుచున్నాడు.

ఓయి పూర్వవాదీ! నీవు అనుమానప్రమాణముచే, అవిద్యను అవిద్యావంతుని దెలిసికొనియున్నచో నప్పుడు నీకు అవిద్యకుగల తాత్కాలికసంబంధము నెట్లు గ్రహించితివి? అనుమానప్రమాణముచేతనే యాసంబంధమునుగూడ గ్రహించితి నన్నచో, నది యెంతమాత్రము పొసగదు. అవిద్యను దెలిసికొనిన సమయములో అవిద్యాసంబంధమును దెలిసికొనుటకు నీకు సాధ్యముకాదు. ఏలనన ? అవిద్య జ్ఞేయము. నీవు జ్ఞాతవు. అవిద్యను విషయముగా గ్రహించి, దానికి జ్ఞాతవుగా నుపయోగపడిన నీకు అవిద్యాసంబంధమును దెలిసికొనుట యసంభవము. (అనగా అవిద్యాసంబంధమునకు జ్ఞాత వగుట యసంభవ మని తాత్పర్యము.)

ఇక అవిద్యను గ్రహించిన జ్ఞాత వేరనియు, తత్సంబంధమును గ్రహించిన జ్ఞాత వేరనియు నన్నచో, నప్పుడు జ్ఞాతల కనవస్థ యేర్పడును. ఎట్లన? మొదటి జ్ఞాతను, జ్ఞేయసంబంధమును, మరియొకజ్ఞాత తెలిసికొను నన్నచో, నప్పటి జ్ఞాతను దెలిసికొనుటకు ఇంకొకజ్ఞాత, దానిని దెలిసికొనుట కింకొకజ్ఞాత అని యిట్లు జ్ఞాతల కనవస్థ యేర్పడునని భావము.

మొదటిజ్ఞాత మరియొకజ్ఞాత లేనిదే యెట్లు జ్ఞేయము (తెలియదగినవాడు) కాలేదో అట్లే రెండవజ్ఞాతగూడ మరియొక (మూడవ) జ్ఞాతలేనిదే తెలియబడ నేరదు. కావున నిట్లు ఒక్కొక్కజ్ఞాతను దెలిసికొనుటకు ఇంకొకజ్ఞాతను కల్పించుచు

పోవుచుండ నీకల్పన కెన్నటికిని యంతు చిక్కనేరదుగాన, ననవస్థ యేర్పడు నని నిశ్చయార్థము.

ఓయి! మేము జ్ఞాత యగు నాత్మకు జ్ఞేయత్వమును జెప్పుటలేదు. అట్లు చెప్పినచో జ్ఞాతల కనవస్థ యేర్పడుమాట నిజమే. మరేమనిన జ్ఞాతకు జ్ఞేయత్వము లేకపోతే పోనిమ్ము. అవిద్యా ఆత్మలకు గల సంబంధము జ్ఞేయమగుటలో అనుపపత్తి యేమి?

వినుము, జ్ఞాత యగు ఆత్మ జ్ఞేయముగానిదే వానియందున్న అవిద్యాసంబంధము జ్ఞేయము గానేరదు. ఆత్మ, అవిద్య అను రెండుపదార్థములు తెలిసిననే కాని, యాత్మావిద్యలసంబంధము తెలియనేరదు. కనుకనే జ్ఞాతయగు నాత్మకు కర్మకర్తృత్వ విరోధము వాటిల్లు నను భీతిచేతనే ఆత్మావిద్యలసంబంధము జ్ఞేయము గాదని అభియుక్తులందురు. కావున నవిద్యాత్మల సంబంధముకూడ ఆత్మ జ్ఞేయము గానిదే యుపపన్నము గానేరదు.

అయితే అవిద్యావంతుడయిన ఆత్మ అనుమానప్రమాణముచే దెలియబడుట యెట్లు పనికిరాదో, అట్లే ప్రత్యక్షప్రమాణముచే దెలియబడుటకూడ పనికిరాకపోవుచుండ, శ్రీ శంకరభగవత్పాదులు తమభాష్యమున "ఆత్మను ననుమానప్రమాణముచే దెలిసికొన్నచో నీకు, అవిద్యాత్మల సంబంధజ్ఞాన మెట్లు కలిగినది?" అని యెట్లనిరి? వినుము. ఈరెంటికిని భేదము కలదు. స్వయంప్రకాశరూపుడగు నాత్మ నిత్యాపరోక్ష చైతన్యరూపు డగుటచే నాతడు ప్రత్యక్షమగుటలో విప్రతిపత్తి లేదు.

'య త్సాక్షా దపరోక్షాత్ బ్రహ్మ' అను శ్రుతి యాత్మ స్వయంప్రకాశరూపు డనియు, నిత్యాపరోక్షు డనియును జెప్పుచున్నది. ఆత్మ యెల్లరకు ప్రత్యక్షమగుచున్నాడు. లోకములో నెవ్వడును 'నాకు నేను ప్రత్యక్షమగుటలే'దని తలచుటలేదు. ఆత్మ యెల్లరకు ప్రత్యక్షమయినంతమాత్రమున జ్ఞాతకు జ్ఞేయత్వము సంభవించినదని యనరాదు. చక్షురాదీంద్రియములవ్యాపార మున్నపుడుగాని జ్ఞేయత్వము ప్రసక్తించదు. చక్షురింద్రియము ప్రవర్తించినతరువాత ఘటప్రత్యక్షము గలుగుచున్నది. అప్పు డయ్యది జ్ఞేయమగుచున్నది. అంతఃకరణము వ్యాపారవంతమయినపిదప సుఖాదులు ప్రత్యక్షము లగుచున్నవి. అప్పుడు సుఖాదులు జ్ఞేయములగుచున్నవి. కాన నింద్రియవ్యాపారము లేకమునుపు నెవ్వియు జ్ఞేయము లగుటలేదు. ప్రకృతము ఆత్మప్రమాణ (ఇంద్రియ) వ్యాపారమునకు బూర్వమే (అస్తీతి భాతీతి) కలడనియు ప్రకాశించుచున్నాడనియును బ్రతీతియుండుటచే ఆత్మకు జ్ఞేయత్వ మసంభవము.

అనగా దెలిసికొనువాడు, తెలియదగినవా డెన్నటికిని కానేరడని సిద్ధాంతము.

కావున, నిట్లాత్మ ప్రత్యక్షమయినను జ్ఞేయముగాడని సిద్ధింప, (న జానామి) తెలియకున్నాను అను ననుభవబలముచే నవిద్య ప్రత్యక్షమగుచుండ, నారెండిటి

సంబంధముగూడ ప్రత్యక్షముగుటలో దోషమేమియు లేదు. కాన ఆత్మాతిరిక్త మంతయు (అవిద్య మొదలగునది) జడమగుటచే జ్ఞేయమే యగునుగాని, జ్ఞాత కాదు. చేతనుడగుటచే ఆత్మ యొక్కడే జ్ఞాత. ఈతడు జ్ఞేయుడుగాడు. వీరిరువురికి సంబంధము అప్రామాణికము, మిథ్యాభూతము గాన నంతమాత్రమున నాత్మ కేమియు ముప్పులేదు.

ఈయది చచ్చట రహస్యము. పగలు సూర్యుడు స్వచ్ఛముగా వెలుగుచుండ, దినాంధ యగు గుడ్లగూబకు, చీకటి గోచరించినట్లు ఆత్మ యసంగస్వప్రకాశు డయినను ఆత్మయందు అజ్ఞానుల కవిద్య యనుభవసిద్ధ మగుచుండును. ఈయది యప్రామాణికము, అనిర్వాచ్యము ననబడియున్నది. సూర్యునియందు గుడ్లగూబ తలచెడి యంధకారము యెన్నడును లేనట్లు ఆత్మయం దెట్టి యవిద్యకైనది యజ్ఞాన మెన్నడును లేదు కాన 'ఆత్మయం దవిద్యాసంబంధ మెట్లు గలిగినది' యను ప్రశ్నయే వ్యర్థము. 'అహ మజ్ఞః' అను ననుభవబలమునుబట్టి యాత్మయం దజ్ఞానసంబంధము గలదని యంగీకరింపవలయును కాని యది మిథ్యాభూతముగాని, వాస్తవము కాదు. దానినిగురించి యెట్లు వచ్చినదా? యను విచారణయే పనికిరాదు. అది యింద్ర జాలము వంటిది. తెలివితక్కువవా ళ్ళనుకొనుదానిని గురించి యింత విచారణ యేల? అజ్ఞానస్వరూపమే విచారార్హము కాకపోవుచుండ జ్ఞానసంబంధమును గురించి విచారణ యేల?

కావున ఆత్మయం దవిద్యాసంబంధము నిరూపింప నలవికాదు. ఆత్మకు నవిద్యాసంబంధమే లేనపుడు అవిద్యాకార్యములయిన సుఖదుఃఖాదులసంబంధ మెట్లుండును? కాన, ఆత్మ యసంగస్వప్రకాశచిద్రూపుడేకాని యవిద్యాదుఃఖాది సంబద్ధుడు గాడని స్పష్టము.

అయితే "నే నజ్ఞానిని" (నా కేమియు దెలియదు) "నేను దుఃఖిని" అను ననుభవబలముచే ఆత్మయం దజ్ఞాన, దుఃఖములు ప్రత్యక్షమగుచుండ, నాత్మయం దవి లేవను టెట్లని యందువేమో? వినుము. ప్రత్యక్షసిద్ధమయినను ప్రమాణవిరుద్ధ మయిన అర్థము నంగీకరించుట న్యాయముగాదు. అజ్ఞానికి ప్రత్యక్షముగా రజ్జు సర్పము గనిపించుచున్నను రజ్జుసర్ప మచట లేదందుముగాని యున్నదని యంగీ కరించుచుంటివా? కావున భ్రాంతిసిద్ధమయిన (పొరపాటున యనుకొనెడి) పదార్థము లను లేవని నిరాకరించుట సులభము. ఆత్మయం దజ్ఞానసంబంధము లేదని యన్నను అది యప్రమాణికమనియును, ఆచార్యపాదు లెన్నియోసారులు బోధించిరి.

సుఖముగా దెలియుటకు మరల యీవిషయమునే మేము వివరింతుము.

ఆత్మచే ననుభవింపబడిదెడి యజ్ఞానము, దుఃఖము మున్నగునవి ఆత్మధర్మ ములా? ఇందు మొదటిపక్షము కుదరదు. ఆత్మధర్మములు ఆత్మచే ననుభవింపబడ నేరవు. ఆత్మధర్మముల ననుభవించెడి యాత్మ మరియొకడు లేడు. అట్టివాని

నింకొకనిని గల్పించినచో ననవస్థ యేర్పడును. 'నాన్యోఽతోఽస్తి ద్రష్టా' (జ్ఞాత మరియొకడు లేడు) అను శ్రుతికి భంగమున్ను గలుగును. కావున నిక పరిశేష న్యాయముచే ననాత్మ యగు నంతఃకరణమునకే అని యనవలయును.

అట్లును అనాత్మధర్మములకు ఆత్మయందు సంబంధ మెట్లు పొసగును? ఘటధర్మములయిన కంబుగ్రీవాదులు ఘటమును జూచు నాత్మ కంటునా? అంటవు. కావున అజ్ఞానదుఃఖాదులు అంతఃకరణధర్మములే యనవలయును.

అచేతనమయిన అంతఃకరణము అజ్ఞానమున కాశ్రయ మెట్లగునని శంకింప రాదు. ఆత్మప్రతిబింబమును గ్రహించినందున నయ్యది సచేతన మగుచున్నది.

ఈ యంతఃకరణధర్మములు అనాదిసిద్ధమగు మాయచే నాత్మయందు త్రాటియందు సర్పము గల్పింపబడినట్లు కల్పింపబడినవి. అందువలన అజ్ఞానులు 'నే నజ్ఞానిని' 'నేను దుఃఖిని' అని యనుకొనుచున్నారు కావున అధ్యస్తములయిన అవిద్యాదుఃఖిత్వాదులచే ఆత్మకు వచ్చిన చే టేమియు లేదు. తెలియని బాలుడు ఆకసమునందు తలమలినత్వాదుల నారోపించినంతమాత్రమున ఆకాశమున కేమి యంటినది? కావున ఆత్మచే ననుభవింపబడియెడి యనాదిసిద్ధమగు మాయ ఆత్మ ధర్మము కాదు. అనాత్మధర్మమున్ను గాదు. అనాత్మపదార్థమంతయు మాయా కార్యమగుటచే మాయకు నాశ్రయము కానేరదు. కనుక మాయ (అవిద్య) ధర్మ రూపమనికాని, ధర్మిరూపమనికాని నిర్వచింపనలవికానందున అనిర్వాచ్యమని యనవలయును.

ఓయి, ఆత్మకు నవిద్యా, దుఃఖిత్వా ద్యనాత్మధర్మములతో సంబంధము లేనందున జెబ్బుపులేనిచో పోనిమ్ము. అయినను, దుఃఖజరాదిదోషములతోఁగూడిన యంతఃకరణశరీరాది లక్షణమయిన క్షేత్రమును దెలిసికొనుచున్నందున గలిగెడి దోషము ఆత్మకు దప్పదుగదా? దుష్టులయిన భార్యాపుత్రాదులను జూచుచు పోషించుచున్న యజమానికి (భర్తకు) దోష మాపాదించినట్లు దుష్టక్షేత్రము (శరీరము) నందు స్వీయత్వాభిమానమున్న ఆత్మకు శరీరసంబంధమయిన దోషమెట్లాపాదించదు? వినుము, ఆత్మకు క్షేత్రజ్ఞత్వ (శరీరమును దెలిసికొనుటయను) మను జ్ఞాతృత్వముగూడ తాత్త్వికము గాదు. నిర్వికారుడయిన ఆత్మకు జ్ఞాతృత్వ మను వికార మసంభవము. 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' అను శ్రుతినిబట్టి యాత్మ జ్ఞానస్వరూపుడే యనునది సిద్ధాంతము.

అయితే జ్ఞానముమాత్రము నిర్వికారమని యంగీకరించు టెట్లు? ఘటజ్ఞానము, పటజ్ఞానము కుడ్యజ్ఞానము, అని భేదరూపమయిన వికారము జ్ఞానమునకు గలుగు చున్నదికదా?

అనినచో నట్లుకాదు. అచట ఘటాదివిషయములకే భేదముగాని, జ్ఞాన మునకు భేదములేదు. జ్ఞాన మెప్పుడును యేకరూపముగానే యుండును. అది స్వయం

ప్రకాశము. తనను నితరులను ప్రకాశింపజేయును. ఘటప్రకాశ, కుడ్యప్రకాశ, కుసూలాదిప్రకాశములయందు ఘటాదులకు భేదమున్నను ప్రకాశమునకు భేదము లేదు. ప్రకాశ మంతట యేకరూపముగానే యున్నది. ఘటజ్ఞానాదులు అంతఃకరణ వృత్తులుగాన వికారరూపములని యనదగదు. అట్లన్నచో వృత్తులు జడములుకాన జ్ఞానరూపములే కాకపోవును. వృత్తి ప్రతిఫలితచైతన్యము జ్ఞానమగుటచే వృత్తుల యందు జ్ఞానత్వ ముపచరింపబడినది.

కావున (అయం ఘటః) ఇది ఘటము అను జన్యములకు గారణమయిన బుద్ధివృత్తులయం దనుగతమై విషయములు భిన్నమయినను తానుమాత్రము భేద మును జెందక నిర్వికారముగా నున్న జ్ఞానమే యాత్మ. ఇట్టి జ్ఞానరూపుడయిన ఆత్మకు వికారము లేదు. లోకములో కాంతయొక్క కుచాదులను జూచుచున్న కాముకునకు మనశ్చాంచల్య మను వికారమున్నను కాంతయొక్క కుచాదిజ్ఞానమున కెవ్విధమగు వికారములేదు. కావున జ్ఞానస్వరూపుడై, నిర్వికారుడయిన ఆత్మకు జ్ఞాతృత్వ మౌపచారికముగాని వాస్తవము గాదు. కాన, నాత్మకు జ్ఞాతృత్వము వలన గలిగెడి దోషము లేదు.

అగ్ని కేవలము ఉష్ణస్వరూపము. అది జ్వాలనక్రియకు ( మంటను గలుగ జేయుట యను పనికి ) కర్త గాదు. కర్తృత్వము (క్రియను జేయుట) చేతనుని ధర్మము. అచేతనమయిన వస్తు వేపనిని చేయజాలదు. అగ్ని యచేతన మనుట నిర్వివాదము. కావున అగ్ని తాపకము గాదు. అయినను లోకులు 'అగ్ని ర్దహతి' అను ప్రతీతులచే తాపక్రియాకర్తృత్వము నగ్నియం దారోపించుచున్నారు. లోకులు అగ్నియం దట్టియారోపణచేయుటకు అగ్నియందుగల యుష్ణత్వమే (వేడిమియే) వారలకు ప్రబలాధారము. కాన వేడిమిమాత్రముచే నచేతనమయిన అగ్నికి తాపకత్వ మను (వేడిని గలుగజేయుట యను) చేతనధర్మము నెట్లారోపించు చున్నారో అట్లే జ్ఞానస్వరూపుడయిన ఆత్మ ప్రకాశరూపుడయినంతమాత్రమున జ్ఞాతృత్వ మనుక్రియ నాతనియందారోపించుచున్నారు.(క్షేత్రజ్ఞః క్షేత్రం జానాతి) శరీరమును దెలిసికొనువాడు అని. ఇంతియెకాని నిజముగా ఆతనికి జ్ఞాతృత్వ మను వికారము లేదు. దీనివలన క్షేత్రజ్ఞేశ్వరు డనియు, నాతడు సర్వావభాసకు డనియు, సర్వజ్ఞు డనియు సూచిత మగుచున్నది.

సర్వము సన్నిహితమయినపుడు సర్వావభాసకత్వము దోచ్పడును. ఈశ్వరుడు సర్వవ్యాపి (అంతట నుండువాడు) కావున, అతని కంతయు సన్నిహితమగును. అందువలన నీశ్వరుడు సర్వావభాసకుడు గావచ్చును. జీవుడు (క్షేత్రజ్ఞుడు) పరిచ్ఛిన్న మయిన శరీరమునందుమాత్రమే యుండ నీతనికి సర్వము సన్నిహిత మగుటెట్లు సర్వావభాసకత్వ మీతనికి సిద్ధించు టెట్లు? అని ప్రశ్నింపరాదు.

ఈ శరీరమునందున్నవాడే యెల్లశరీరములయందు నున్నాడు. కనుకనే శ్రీకృష్ణుడు 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత' అని చెప్పియున్నాడు. కనుక ఎల్లశరీరములయందుండి సర్వవ్యాపియగు క్షేత్రజ్ఞునకు సర్వము సన్నిహితమేకాన సర్వావభాసకత్వము సిద్ధింపవచ్చును. కాన క్షేత్రజ్ఞుడు సర్వజ్ఞుడయిన నీశ్వరుడేకాని కించిత్ జ్ఞుడయిన జీవుడు గాడు.

ఇట్లగుచో క్షేత్రజ్ఞుడు సర్వప్రపంచమును ప్రకాశింపజేయుచున్నటుల ప్రత్యక్షము కావలెనుగదా ? అట్లు ప్రత్యక్షమగుటలేదే అని యనరాదు. నీకు సర్వమును ప్రకాశింపజేయునటుల క్షేత్రజ్ఞుడు ప్రత్యక్షమగుచున్నాడా? అదియును లేదే? "క్షేత్రజ్ఞ మహం న జానామి" నేను క్షేత్రజ్ఞుని దెలియకున్నాను అని నీ వనుచుంటివే. కావున నీ వజ్ఞానివి. నీకు క్షేత్రజ్ఞుడు ప్రత్యక్షమగుచో నీవు జ్ఞానివే యయ్యెడివాడవు. ఇక బింకమును వీడలేక నీవు "నాకు క్షేత్రజ్ఞుడు తెలియు" నన్నచో నీవు గురూపదేశము శాస్త్రవచనములవలన పరోక్షముగా దెలిసికొంటివా? లేక నపరోక్షముగా దెలిసికొంటివా? ఇందు మొదటి పక్ష మవలంబించినచో నదేవిధమున సర్వజ్ఞునిగూడ తెలిసికొనుము. రెండవపక్షమున క్షేత్రజ్ఞుని సాక్షాత్కార మొనర్చుకొనిన నీకు "సర్వము నాకు దెలియ"దను అజ్ఞాన మెక్కడిది? క్షేత్రజ్ఞసాక్షాత్కారమువలన యజ్ఞానము దానికార్యవర్గముతో గూడ నశింపవలసియుండెనుగదా? సూర్యుడు ప్రత్యక్షమయినపిదప యంధకార ముండునా? కావున క్షేత్రజ్ఞుడు ప్రత్యక్షముగానిదే క్షేత్రజ్ఞ ధర్మములయినసర్వజ్ఞత్వ సర్వాంతర్యామిత్వాది ధర్మములు ప్రత్యక్షములుగావు. నీకు సంశయము దొలగనేరదు. కాన క్షేత్రజ్ఞుడు ప్రత్యక్షముగావలెనని నీకున్నచో శ్రవణమననాదులను జేయుము. శ్రవణాదుల జేయజాలనిచో నిర్వికల్పసమాధిని జేయుము. అందును శక్తి లేనిచో సవికల్పసమాధి నొనర్చుము. అందును నశక్తుడ వగుచో కర్మయోగ మాచరింపుము. ఇంతియేకాని క్షేత్రజ్ఞుడు అసంసారి, సర్వజ్ఞుడు, యీశ్వరుడు అను భగవంతుని వచనమును పరిశీలింపుము. "సంశయాత్మా వినశ్యతి" అని పెద్దలందురు. సంశయాత్మకు సంసార మను నరకమునందు బడి నశించుట తప్పదు!

కావున ఆస్తికులందరు భగవద్వచనమును గ్రహింపక దప్పనందున క్షేత్రజ్ఞుడన అసంసారి యగు సర్వజ్ఞేశ్వరు డనియే గ్రహింపవలయును.

ఆత్మయందు క్రియాకారణాదిసంబంధము అవిద్యారోపితమేకాని వాస్తవము గాదనియు, అది ఆత్మయం దుపచరింపబడినదనియు, స్వతస్సిద్ధముగా ఆత్మయందు క్రియాకారకఫలసంబంధములేదనియును నీయధ్యాయమునందుగాని, యీశ్లోకము నందుగాని, భగవంతునిచే నెట్లు నిరూపింపబడినదో అట్లే గీతాశాస్త్రమునం దచ్చటచ్చట భగవంతునిచే నిరూపింపబడినది. ఆత్మయందు క్రియాకారకఫలసంబంధము ఆరోపితముగాని వాస్తవముగాదు. స్వాభావికమయినది వాస్తవమగును. ఆగంతుక

మయినది దోషజన్యమగుటచే వాస్తవము గానేరదు. రజ్జువునందు స్వాభావికమయిన రజ్జుత్వము వాస్తవము. ఆగంతుకమయిన సర్పత్వము మిథ్యాభూతము. కాన నాత్మయందు క్రియాకారకఫలసంబంధము మిథ్యయే యను నర్థమును భగవంతుడగు శ్రీకృష్ణుడిచట ప్రతిపాదించినటుల యనేకచోట్ల గీతలలో ప్రతిపాదించియున్నాడు.

దీనివలన ఈశ్లోకమున కపార్థమును గల్పించినచో అన్యప్రకరణములకు విరోధము తటస్థించుననియు, ననేకప్రకరణములసంవాద మేర్పడుటంబట్టి ఈశ్లోకమున కిదియే సమీచీనమయిన అర్థమనియును స్పష్టమగుచున్నది.

ఆత్మయందు క్రియాకారకఫలాత్మత్వము లేదని భగవంతుడగు శ్రీకృష్ణుడు గీతాశాస్త్రమున నిరూపించినట్లు శ్రీశంకరులు తమభాష్యమునం దుదాహరించి యుండిరి. ఇందు 'క్రియాకారకఫలాత్మత్వ' మను పదమున కర్థము వివరింపబడుచున్నది.

క్రియ దేహము నాశ్రయించియుండునుగాన, నిచట క్రియాశబ్దమునకు లక్షణచే దేహ మర్థము. కారకము లనగా, కరణములు – అనగా మనసు మొదలగు నింద్రియములు. ఫల మనగ నింద్రియగోచరములగు శబ్దస్పర్శాదివిషయములు. ఇవియే మానవులకు భోగ్యములు. దేవలోకమునందైన నివియే దేవతలకు భోగ్యము లగుచున్నవి. విషయపంచకముకంటె ప్రపంచమున భోగ్యవస్తువు మరియొకటిలేదు. ఇట్టి క్రియాకారకఫలములు స్వరూపముగాగలవాడు క్రియాకారకఫలాత్మకుడు అనగా కార్యకారణసంఘాతరూపుడని యర్థము (దేహేంద్రియసముదాయరూపుడని భావము). కావున ఆత్మ దేహేంద్రియసముదాయరూపుడుగాడని దీనిఫలితాంశము. సచ్చిదానందము లాత్మకు స్వాభావికములుకాన, ఆత్మ సచ్చిదానందరూపుడని నిశ్చయార్థము. త్రాడునందు సర్పమువలె నాత్మయందు క్రియాకారకఫలములు (దేహేంద్రియవిషయములు) అధ్యస్తములు (కల్పింపబడినవి). అధిష్ఠానమెన్నటికిని నిజముగ నధ్యస్తరూపము గానేరదు. త్రాడు నిజముగా సర్పరూపము గాదు. కావున అధిష్ఠానమయిన ఆత్మకు అధ్యస్తములైన దేహేంద్రియాదులరూపము కల్పితము కాన మిథ్య. కావున నౌపచారికము.

అధ్యాసము, ఉపచారము ఈరెంటికి నర్థభేదము లేదు. ఒకదానియందు మరియొకదానియొక్క ధర్మము నారోపించుటయే యుపచారము. ఉ॥ మాణవకుని యందు సింహధర్మము నారోపించుటయే 'సింహో మాణవకః' అను ప్రయోగమునకు తాత్పర్యము. అయితే భాష్యమునందలి 'అవిద్యాధ్యారోపిత ఏవ...... ఆత్మని ఉపచర్యతే' అను పంక్తియందు అవిద్యాధ్యారోపితము యుపచరింపబడుచున్నదని యుండుటచే నచట ఆరోపిత మను పదమునకు చేయబడినదని యర్థము. కాన 'అవిద్యాధ్యారోపితము' అనగా, అవిద్యచే చేయబడిన దని దీని యర్థము. కాన పునరుక్తి లేదు. లేక 'ఆరోపితము' అనగా 'అధ్యస్తము' అనియే యర్థ

మగుగాక. అయినను పునరుక్తి లేదు. ఏలనన, అవిద్యచే మొట్టమొదట ఆత్మయందు దేహేంద్రియాదుల కధ్యాస, పిదప దేహేంద్రియాదుల ధర్మముల కధ్యాస. కావున 'అవిద్యారోపిత' మను పదముచే, ధర్మ్యధ్యాసయు, 'ఉపచర్యతే' అను పదముచే ధర్మాధ్యాసయు జెప్పబడుచున్నందున బునరుక్తి లేదు. ఇందు ధర్మ్యధ్యాసవలన దేహేంద్రియాది ప్రతీతి గలుగును. ధర్మాధ్యాసవలన 'నేను మనుష్యుడను' 'నేను గ్రుడ్డివాడను' 'నేను సుఖిని' 'నేను దుఃఖిని' అను ప్రతీతులు గలుగును అని యిట్లు భేదమును గ్రహింపవలయును. అజ్ఞానకార్య మగు నీయధ్యాసయే సర్వసంసారమునకు హేతువగుచున్నది.

భగవంతుడగు శ్రీ కృష్ణుడు 'య ఏనం వేత్తి హంతారం', 'ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః', 'నాదత్తే కస్యచి త్పాపం' ఇత్యాది ప్రకరణములయందు దేహేంద్రియాదు లాత్మయం దారోపింపబడిన వని నిరూపించి యున్నాడనియు, దాముకూడ నట్లే వ్యాఖ్యాన మొనర్చితిమనియు, సికముందుగూడ నాయా ప్రకరణములయం దీవిషయమును జూపగలమనియును భాష్యకారులగు శంకరులు తమభాష్యాంతమున వ్రాసిరి. దీనినిబట్టి చూడ శ్రీశంకరులు మాత్రమే శ్రీకృష్ణుని యభిప్రాయమున కనుకూలముగ వ్యాఖ్యాన మొనర్చిరనియు, మిగిలిన వ్యాఖ్యాతలు భగవదభిప్రాయమునకు వ్యతిరేకముగ వ్యాఖ్యానించి రనియును సూచిత మగుచున్నది.

ఇట్లుండ, పూర్వవాది మరల శంకించుచున్నాడు:

ఓయి! ఆత్మయందు స్వతస్సిద్ధముగా క్రియాకారకఫలరూపత్వము లేనిచో విద్వాంసులకు (ఆత్మజ్ఞానులకు) దేహేంద్రియాదులయం దభిమానము లేనందున, విద్వాంసులకు కర్మలయందు ప్రవృత్తి కలుగదు. అవిద్వాంసులకు (అజ్ఞానులకు) అజ్ఞానవశమున దేహేంద్రియాద్యభిమాన ముండుటచే, 'నేను బ్రాహ్మణుడను, నాకు స్వర్గము గానలయును' అని తలంచుచు నజ్ఞానులు కర్మలయందు బ్రవర్తించుచున్నారు.

విద్వాంసుల కవిద్య లేనందున దేహేంద్రియాదులయం దభిమానము జంపుకొని, నేను సచ్చిదానందస్వరూపుడ నను ఆత్మయాథాత్మ్యజ్ఞానముగలవారై స్వర్గాది ఫలముల నపేక్షింపక గర్మలయందు బ్రవర్తింపరు. కావున శాస్త్రార్థమునందు గొందరు ప్రవర్తింపకుండుటచే శాస్త్రమునకు నర్ధజరతీయముగ వైయర్థ్యము సంభవించును. లేక, వ్యవసాయాదికర్మలవలెను, బుద్ధాగమాదులవలెను, శాస్త్రార్థమంతయు (కర్మభాగమంతయు) మూఢవిషయమగుటచేతను, విద్వాంసులకు గ్రాహ్యము గాకుండుటచేతను పూర్తిగా నిరర్థమగును. విద్వాంసులకు గ్రాహ్యమగునదియే సార్థకమగును. కావున నిట్లు మరల శాస్త్రానర్థక్యము ప్రాప్తించినదికదా ? అనినచో, నిజమే. శాస్త్రార్థమంతయు నవిద్వాంసులపాలబడిన మాట వాస్తవము. విధి

నిషేధరూపమయిన శాస్త్రమంతయు నవిద్వాంసులకొఱకే పుట్టినది. అవిద్వాంసులే కర్మాధికారులు. వారు కర్మకాండయందు బ్రవర్తించనిచో శాస్త్రము వ్యర్థమయ్యెడిది. విద్వాంసులకొరకు శాస్త్రము ప్రవర్తింపలేదు. వారందు బ్రవర్తించనందున శాస్త్రము వ్యర్థము గానేరదు. నటులకొరకు బుట్టిన భరతశాస్త్రము నటకులు నాట్యసమయమున నాభరతశాస్త్రము నవలంబించనిచో నయ్యది వ్యర్థమగును కాని పురోహితబ్రాహ్మణులు తాము పౌరోహిత్యముచేయునపుడు భరతశాస్త్రము నవలంబించనిచో నాభరతశాస్త్రము వ్యర్థమగునా? ఏది యెవరికొరకు బుట్టినదో వారందు బ్రవర్తించనప్పు డయ్యది వ్యర్థమగును. దేవదత్తుని నివసించుటకై రాజు యిల్లు కట్టించియియ్యగా నాతడందులో నివసించనియెడల నది వ్యర్థమగును. అంతేగాని యుద్దేశించనివా నెవరు చేరనందున వ్యర్థమని లోకానుభవమున లేదు.

ఇక విధిప్రతిషేధశాస్త్రము విద్వాంసులను అవిద్వాంసులను నుభయుల నుద్దేశించి ప్రవర్తించిన దన్నచో నది యుచితము కాదు. 'వేదావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్, కథం స పురుషః పార్థ! కం ఘాతయతి హంతికమ్' అని విద్వాంసులకు కర్మాభావమును జెప్పిన భగవంతుడు విద్వాంసులకొరకు విధిప్రతిషేధ శాస్త్రము నెట్లు నిర్మించును? కావున విద్వాంసులకొరకు భగవంతుడు శాస్త్రమును నిర్మించనందున విద్వాంసులు శాస్త్రమునందు బ్రవర్తించకున్నను శాస్త్రమునకు నిందగాగాని, నగముగాగాని వైయర్థ్యము లేదు. బ్రాహ్మణులకొరకు పుట్టిన వైశ్వదేవాదికర్మలయందు శూద్రులు ప్రవర్తించనందున వైశ్వదేవాదులు వ్యర్థము లగుచున్నవా? పైగా వారు (శూద్రులు) ప్రవర్తించిననే వ్యర్థము లగును. ఒకరి ధర్మములయందు మరొకరు ప్రవర్తించుట నరకహేతువు. ధర్మాధర్మనిరూపణ ద్వారమున లోకులను నరకమునుంచి తరింపజేయుటకు నీశ్వరుడు శాస్త్రమును నిర్మించెను. కావున సర్వకర్మసన్న్యాసమునకు నర్హులయిన విద్వాంసులు కర్మలయందు బ్రవర్తించుటయే నరకహేతువు. మరికొందరెవ్వరయినను యీవిషయమును దెలియని మూఢులు విద్వాంసుల గోచినంటి కర్మలయందు బ్రవర్తింపకున్నను శాస్త్రము యేకదేశమున (కొంతభాగమున) వ్యర్థము గానేరదు. అనగా పురుషుని తప్పిదమువలన శాస్త్రము చెడిపోదు.

రోగి తిట్టినంతమాత్రమున రుచిగలిగిన మంచి చెక్కెరకేళి యరటిపండు రుచిలేనిదగునా! కాన కర్మాధికారులు కర్మలయందు ప్రవర్తించనిచో వారే చెడిపోవుదురు. కాని శాస్త్రము చెడదు. ఉ॥ నీరుమోసికొనిరమ్మని ప్రభువు భృత్యునకాజ్ఞాపించి కావడి యిచ్చెను. ఆభృత్యుడు కావడి గొంపోయి తటాకమువద్ద పెట్టుకొని నీరును దీసికొనిరా డనుకొనుడు. దానివలన భృత్యునకు చేటువాటిల్లునా? లేక రాజునకుగాని, రాజాజ్ఞకుగాని ముప్పు సంభవించునా? భృత్యునకే చేటు వాటిల్లును.

కావున కర్మాధికారులయిన అజ్ఞానులయిన త్రైవర్ణికులకే విధినిషేధములు పుట్టినవి. సన్న్యాసులకు గాదు. విద్వాంసులకు సర్వకర్మసన్న్యాసమే ప్రాప్తమయినది. ఈ విషయము నింతకును న్నసేకమూరులు శంకరులు తమ భాష్యమున నిరూపించిరి. ముందుకూడ నచ్చటచ్చట విపులముగా నిరూపించగలరు. కాన జిజ్ఞాసువులమనసు విసుకుజెందక నింతటితో నీవిషయ మిచట ముగింతము.

ఇకముందు రామానుజమతము వివరించి నిరాకరింతుము.

ఇచట రామానుజులు వారిభాష్యమునం దిట్లు వ్రాసిరి. 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధీతి సామానాధికరణ్యాదర్శనా దీశ్వరస్యైవ సతో అజ్ఞానాత్ క్షేత్రజ్ఞత్వమివ భవతి.తన్నివృత్త్యర్థ శ్చాయ మేకత్వోపదేశః. అనేన చాప్తతమభగవదుపదేశేన రజ్జు రేషా నసర్ప ఇత్యాప్తోపదేశేన సర్పత్వభ్రమనివృత్తివత్ క్షేత్రజ్ఞత్వభ్రమో నివర్తత ఇతి కేచి దాహుః' అని దీని యర్థము.

మూలమునందలి 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి' అని 'క్షేత్రజ్ఞం' 'మామ్' అను పదములు రెండును సమానాధికరణములు. సమానాధికరణములనగా రెండు పదము లొకే విభక్తియందును, ఒకేవచనమునందు నుండవలెను. ఇచ్చట 'క్షేత్రజ్ఞం' అను పదము 'మాం' అను పదము యీరెండును ద్వితీయావిభక్తియందును, ఏకవచనమునందును యుండియున్నవి. అందువలన సమానాధికరణము లనబడుచున్నవి. అట్టి సమానాధికరణ్యముండుటచే నీశ్వరు డయినవానికి అజ్ఞానమువలన క్షేత్రజ్ఞత్వము (జీవత్వము) గలిగినదివలె నున్నది. అట్టిక్షేత్రజ్ఞత్వమును (జీవత్వమును) నివర్తింపజేయుటకు నిచట జీవేశ్వరుల కభేదము చెప్పబడినది. ఇది త్రాడుగాని పాము గాదు అని చెప్పిన ఆప్తునియుపదేశముచే పామనుభ్రాంతి తొలగినట్లు పరమాప్తుడయిన భగవంతునియుపదేశముచే జీవత్వభ్రమ తొలగును అని కొందరందురు అని పైనకనుపరచిన రామానుజభాష్యపంక్తులకు వారివ్యాఖ్యాతలగు వేదాంతదేశికులు వ్యాఖ్యానమునం దిట్లర్థమును వివరించిరి.

'సర్వజ్ఞ స్యేశ్వర స్యైవ సతోఽజ్ఞానాత్ క్షేత్రజ్ఞత్వభ్రమో భవతి. సఏవ చేశ్వరః క్షేత్రజ్ఞా యోపదిశతీతిచ వ్యాకులభాషిణ స్తే' ఇతి.

దీనియర్థము— 'సర్వజ్ఞుడయిన నీశ్వరునకే యజ్ఞానమువలన జీవత్వభ్రమ కలిగినది. ఆ యీశ్వరుడే (అనగా క్షేత్రజ్ఞత్వ జీవత్వభ్రమ గల యీశ్వరుడే) క్షేత్రజ్ఞునికొరకు నుపదేశించుచున్నాడు అని వారు తబ్బిబ్బులుగ మాటాడుచున్నారు ?' అని.

ఇచట రామానుజభాష్యమునందు దేశికులవ్యాఖ్యానమునందును, కేచిత్, తే అను పదములు అద్వైతులగురించియే వాడబడినవి.

ఇక వీరివ్యాఖ్యానము నిసుమంత విచారింతము. అద్వైతు లెన్నడును యీశ్వరునకే అజ్ఞానమువలన క్షేత్రజ్ఞత్వము (జీవత్వము) గలిగిన దని జెప్పలేదు.

మరేమనిన ఈశ్వరుడే యగుచున్న జీవునకు (క్షేత్రజ్ఞునకు) అజ్ఞానమువలన సంసార సంబంధ మేర్పడిన దని యద్వైతు లనిరి. కాని ఈశ్వరునకు క్షేత్రజ్ఞత్వము భ్రమ కాదు. ప్రమయే యగుచున్నది. ఈశ్వరుడే క్షేత్రజ్ఞు డగుటవలనను ఆతడు అసంసారి యగుటవలనను క్షేత్రజ్ఞత్వము ప్రమ యగుటలో బాధలేదు. నాదుకాని నానియందు నా యనుబుద్ధి కలిగినచో నది భ్రమ యగును. నియమించుట, క్షేత్రమును గుర్తించుట, అను ప్రవృత్తినిమిత్తభేదమువలన సచ్చిదానందస్వరూపుడయిన ఆత్మ యొక్కడే యీశ్వరుడు క్షేత్రజ్ఞుడు అను రెండుపదములకును వాచ్యు డగును. కావున నీశ్వరున కీశ్వరత్వ మెట్లు భ్రమకాదో క్షేత్రజ్ఞత్వముగూడ నట్లే భ్రమ కాదు. 'సాక్షీ చేతా కేవలః' అను శ్రుతులచే నీశ్వరునకు సాక్షిత్వము శ్రుతి సిద్ధమయినది. సాక్షాత్తుగా సర్వమును జూచువాడగుటచే సాక్షి యని సాక్షిపదమునకు వ్యుత్పత్తి. చూచువాడగుటచే నీశ్వరు డుదాసీనుడును, నిర్వికారుడు నగుచున్నాడు. వివాదపడువారివలె సాక్షి సుఖదుఃఖాదివికారము నొందడు. కనుకనే సాక్షి యుదాసీను డనబడుచున్నాడు. సుఖదుఃఖాదివికారములే సంసారము. కావున అసంసారియగు నీశ్వరుడే క్షేత్రజ్ఞుడని యద్వైతు లనుచున్నారు. ఈయది నిజము గాని రజ్జుసర్పమువలె భ్రమ గాదు. రజ్జువునందు సర్పము గల్పించబడినట్లు యీశ్వరునియందు క్షేత్రజ్ఞత్వము గల్పింపబడినా దని యద్వైతు లెన్నడు ననలేదు.

కావున ఈశ్వరుడు క్షేత్రజ్ఞుడగుట భ్రమ యని యద్వైతులు తలంచుచున్నారని వ్రాసిన రామానుజీయులే భ్రాంతులు. ఈశ్వరుడు భ్రాంతుడు గాడు. అద్వైతులును భ్రాంతులు గారు. రామానుజీయులకు అజ్ఞానవశమున క్షేత్రజ్ఞునికంటె నీశ్వరుడు వేరనియు, క్షేత్రజ్ఞుడు సంసారసబంధము గల జీవుడనియును భ్రమకలుగుచున్నది. కావున వారు భ్రాంతు లగుట యుక్తము. అట్లే 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి' అను శ్లోకమున కపార్థమును గల్పించుటగూడ వారికి భ్రాంతియే.

ఎట్లనగా? వారు 'క్షేత్రజ్ఞంచ మాం మదాత్మకం విద్ధి. అపిశబ్దాత్ క్షేత్రమపి మదాత్మకం విద్ధి' అని వ్రాసిరి. క్షేత్రజ్ఞుని నారూపునిగ దెలిసికొనుము. అపిశబ్దము వలన క్షేత్రమునుగూడ నారూపముగా దెలిసికొనుము అని దీనియర్థము.

(౧) ఈవ్యాఖ్యానమునందు క్షేత్రజ్ఞ అస్మచ్ఛబ్దములకు గనిపించుచున్న ముఖ్య సామానాధికరణ్యమునకు భంగము కలుగును. ఇది యొకదోషము.

(౨) 'మామ్' అను అసమస్తపదమునకు 'మదాత్మకమ్' అని సమాసమును గల్పించుట రెండవదోషము.

(3) 'మదాత్మకమ్' అనుచోట ఆత్మశబ్దము స్వరూపార్థక మగునో స్వమత ప్రచ్యుతి (తమ మతమునుంచి తొలగుట) యగునది మూడవదోషము.

(౪) దేహము శరీరమనియు, జీవుడు శరీరి, ఆత్మయనియును జెప్పినట్లు జీవుడు శరీరమనియు, ఈశ్వరుడు శరీరి, జీవున కాత్మయనియు జెప్పినచో నిత్యుడయిన జీవునియందు 'శీర్యతే' అను వ్యుత్పత్తి వలన నేర్పడెడి శరీరశబ్దము ప్రవర్తించుటకు నిమిత్తము లేకపోవుట నాల్గవదోషము.

(౫) ఈదోషమును తప్పించుకొనుటకు జీవు డనిత్యు డని యంగీకరించినచో 'అజో నిత్యః' అను గీతావిరోధము మరియొకదోషము.

(౬) 'ఆత్మా శేషీ' యని యర్థమును జెప్పినచో నాత్మ దేనికి నంగము (శేషము) కాడనియు, సర్వము ఆత్మకు గమనియు (శేషమనియు) ను ప్రసిద్ధమయిన జీవాత్మకు నీశ్వరశేషత్వమును గల్పించుట యారవదోషము.

దేహము జీవునకువలె, జీవు డీశ్వరునకు అపృథక్సిద్ధవిశేషణముగుటవలన నీశ్వరాత్మకు డనియర్థమును వర్ణించుటలో దృష్టాంత దార్ష్టాంతికముల కుపపత్తి కుదరదు. దేహము జ్ఞేయము. జీవుడు జ్ఞాత. దేహము మమేద మను ప్రతీతికి గోచరమగును. జీవుడు 'అహం'ప్రత్యయమునకు గోచరు డగును. ఇట్లు వేరువేరు ప్రతీతులకు గోచరులగు దేహాత్మల కపృథక్సిద్ధి సంభవింపదు. దేహముకంటె వేరుగ జీవుడు సిద్ధించ డని యన్నచో బౌద్ధమత మంగీకరించినట్లె యగును. బౌద్ధులు దేహాత్మవాదులు. ఇక జీవుని విడచి దేహము వేరుగ నుండ దన్నచో దేహమునకు మరణమే లేకపోవును. జీవుడులేని శరీరమే మరణించినదని యందురు. ఎల్లప్పుడు జీవుడు దేహమునం దుండుచో దేహమునకు మరణ మెక్కడిది ?

ఇట్లే జీవునికంటె వేరుగ అనగా జీవునివిడిచి వేరుగా నీశ్వరుడు లే డన్నచో నీశ్వరునకు సంసారము ప్రసక్తించును. ఇట్టితరి జీవేశ్వరుల కభేద మంగీకరించినట్లగును. కాన, స్వమతభంగము వాటిల్లును. పరమతప్రవేశమును కలుగును. ఈశ్వరు డెల్లప్పుడు జీవునితో గూడుకొనియున్నచో నగ్నిసంయోగమువలన నినుము కు వేడెక్కినట్లు జీవసంగమువలన నీశ్వరునకు సంసార మేల ప్రసక్తించగూడదు? మరియు నపుడు జీవేశ్వరులకు నియమ్య నియామకభావముగూడ ఘటింపదు. ఈశ్వరునికంటె వేరుగ జీవుడే లేనిచో సంసారసంబంధముగల జీవుడే లేకపోవలసి వచ్చును. ఇంక సంసార మెవ్వరికి ?

మరియు రామానుజీయులు జీవు డెల్లప్పుడు యీశ్వరునిచే నియమింపబడు చుండు నని యందురు. సుషుప్తియం దట్లు గానము. సుషుప్తియందు జీవు డెవ్వని చేతను నియమింపబడుచున్నట్లు కనిపించదు. జీవున కీశ్వరనియామ్యత్వము స్వభావమే యయినచో నది సుషుప్తియందు లేకపోవునా ? స్వభావ మెన్నటికి మారదు గదా ? అధ్యాసలేకుండగా జీవునకు దేహస్వరూపము, దేహమునకు జీవస్వరూపము సిద్ధించునెడల దానిని దృష్టాంతముగా జేసికొని జీవున కీశ్వరాత్మత్వముగాని,

యీశ్వరునకు జీవాత్మత్వముగాని వారు చెప్పవచ్చును. అది లేదు. తెలిసినవా (విద్వాంసు) డెవ్వడును తాను దేహస్వరూపుడ ననిగాని, దేహము తనరూపమనిగాని తలంచడు. పైగా తనకంటె దేహము వేరనియు దేహముకంటె దాను వేరనియును తలంచును. ఎవడు తనను మనుష్యునిగా దెలిసికొనుచున్నాడో వాడు దేహాత్మలకు పరస్పరాధ్యాసగల యవిద్వాంసుడే యగుచున్నాడు. ఇట్లుండ సర్వజ్ఞుడగు భగవంతుడు తాను జీవుడ ననిగాని జీవుడు తా ననిగాని యెట్లు తలంచును? ఎట్లు చెప్పును? కావున దేహాత్మలకుగాని జీవేశ్వరులకుగాని సమానాధికరణ్యమును గురించి యపృథక్సిద్ధవిశేషణత్వము (ఒకదాని విడచి మరియొకటి యుండకుట) కారణము గాదు. అజ్ఞానమే కారణము. 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి' అని జీవేశ్వరులకు సామానాధికరణ్యము నిరూపించుచున్నది. దీనికి కారణమయిన అజ్ఞానము యీశ్వరునియం దసంభవమే. కాన రామానుజులవ్యాఖ్యాన మసంగతము. రామానుజులు చెప్పినట్లు దేహము తన కపృథక్సిద్ధవిశేషణ మని దెలిసినను, లోకములో వివేకముగలవా రెవ్వడును 'నన్ను మనుష్యునిగా దెలిసికొనుము' అని జెప్పడు. అట్టియెడ సర్వజ్ఞుడయిన యీశ్వరుడు 'నేను జీవుడ' నని యెట్లు చెప్పును?

ఎవడు తాను దేవుడనని చెప్పుకొనునో వానికి దేహాత్మాభిమానము నశించనట్లే. దేవత్వ మనుష్యత్వాదులు దేహధర్మములుగాని, జీవధర్మములు గావు. ఇట్లు ఈశ్వరునకుగూడ జీవునియం దాత్మాభిమానము నశించలేదని చెప్పినచో, వాని కింక సర్వజ్ఞత్వ మెక్కడిది! క్షేత్రమునకు (శరీరమునకు) ఈశ్వరాత్మత్వ ముండియే యున్నది. ఈశ్వరునియందు శరీరము కల్పింపబడినందునను, అధ్యస్త పదార్థము లధిష్ఠానరూపము లను నియమ ముండుటవలనను, క్షేత్రమున కీశ్వరాత్మత్వము తప్పదు. మరియు నీశ్వరుడు క్షేత్రమున నంతరాత్మ యగుటవలనగూడ క్షేత్రము యీశ్వరాత్మక మగును. అయినను ఆయర్థ మిచట అపి శబ్దమువలన వ్యంగ్య మని జెప్పబడలేదు. 'సర్వక్షేత్రేషు' అని భగవంతుడు స్వోక్తిగనే యీశ్వరు డెల్లక్షేత్రముల కంతరాత్మ యని జెప్పియున్నాడు.

క్షేత్రములయం దుండువాడు క్షేత్రాంతరాత్మ. క్షేత్రము లనేకములుకనుక క్షేత్రాంతరాత్మలుగూడ ననేకులు గావలయును. జీవుడు 'క్షేత్రజ్ఞం' అను ఏకవచనాంతపదములు పొసగవు. ఇవి జాత్యేకవచనము లన్నచో నప్పుడు 'సర్వక్షేత్రేషు' అను బహువచనముయొక్క స్వారస్యము చెడును. కాక జాత్యేకత్వమును స్వీకరించుటకు ప్రమాణము గానరాదు. అట్టి ప్రమాణమే యున్నచో, బాదరాయణులు 'క్షేత్రజ్ఞానపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత' అనియే చెప్పియుండెడివారు. మరియు సచ్చిదానందలక్షణుడయిన పరమాత్మ యందు జాతియనునది యసంభవము. వ్యక్తిభేద మున్నప్పుడుగాని, జాతిభేదము లేదని చెప్పుట సంభవించదు. ఈశ్వరునియందు వ్యక్తిభేదము లేదు. క్షేత్రజ్ఞు డవ్య

కర్తృడు, అకర్తుడును నగుచున్నాడు. నిరాకారమయిన వాయ్వాకాశములకే వ్యక్తి భేదము లేదు. నిరాకారుడయిన జీవునకు వ్యక్తిభేదము లేదని జెప్పనేల?

కావున క్షేత్రజ్ఞులనేకు లనుట యప్రమాణము. క్షేత్రజ్ఞు డొక్కడే యయినచో సుఖదుఃఖాదులకు సాంకర్యముకలుగునుకదా యని ప్రశ్నింపరాదు. సుఖదుఃఖాదులు అంతఃకరణధర్మములు. అంతఃకరణము లనేకములు. కాన సుఖదుఃఖాదులకు సాంకర్య ముండదు. అయినను క్షేత్రజ్ఞుడు పరిచ్ఛిన్నుడన్నచో వాని కనిత్యత్వము సంప్రాప్తమగును. కాక నిత్యుడు, సర్వవ్యాపకుడు, జ్ఞాతయు నగు జీవునకంటె నీశ్వరునకు నేయంశమున మీరు (రామానుజులు) భేదమును జెప్పదలచిరి. జీవుడు జ్ఞాత, దేహము జ్ఞేయము;జీవుడు నిత్యుడు, దేహ మనిత్యము. జీవు డపరిచ్ఛిన్నుడు, దేహము పరిచ్ఛిన్నము. కావున నీరెంటికి భేదముండుట న్యాయము. ఈశ్వరుని యందున్న సత్యత్వ, చిత్త్వ, ఆనందత్వాదు లన్నియు జీవునియందుగూడ గలవు. ఇట్టితరి వీరికి భేదమును జెప్పుటెట్లు పొసగును? ఇక జీవుడు కించిజ్జుడనియు, నీశ్వరుడు సర్వజ్ఞుడనియు, గాన వీరిద్దరికి భేద మున్నదనినచో నదియు యుక్తముగాదు. ఈశ్వరునియం దుండెడి సర్వజ్ఞత్వము మాయాధర్మముగాని, యీశ్వరధర్మము గాదు. సర్వజ్ఞత్వమనగా జ్ఞానధారావత్త్వ మనినచో నయ్యది జీవునియందు గూడ గలదు. కినుక జీవేశ్వరులకు భేదములేదు. జీవులలోగూడ పరస్పర భేదములేదు. అట్టి భేదజ్ఞానము సంసార హేతువుగాని మోక్షహేతువు గాదు.

మరియు రామానుజు లిచట మరియొక యాక్షేపమును జూపిరి. వారి స్వంత వాక్యముల నుదాహరించి పిదప యర్థమును వివరింతుము.

'అయ ముపదేష్టా భగవాన్ వాసుదేవః ఆత్మయాథాత్మ్య సాక్షాత్కారేణ నివృత్తాజ్ఞానః? ఉత న? అద్యే నిర్విశేష చిన్మాత్రైక స్వరూపే ఆత్మని అతద్రూపాధ్యాసా సంభావనయా కౌన్తేయాది భేద దర్శనం తాన్ప్రత్యుపదేశాది వ్యాపారాశ్చ న సంభవంతి అథాత్మసాక్షాత్కారాభావాత్ అనివృత్తాజ్ఞానశ్చేత్ తర్హ్యాజ్ఞత్వా దేవాత్మ జ్ఞానోపదేశాసంభవ ' ఇతి.

దీని యర్థము:

గీతాశాస్త్రము నుపదేశించు శ్రీకృష్ణున కాత్మసాక్షాత్కారము కలిగినదా? లేదా? దాన నతని యజ్ఞానము నశించినదా? లేదా? ఇందు ఆత్మసాక్షాత్కారము గలిగి యజ్ఞానము నశించిన దన్నచో నట్టితరి, నిర్విశేష చిన్మాత్రైక స్వరూపుడగు తనయందు నే నట్టివానిని గానను నధ్యాస యుండుట యసంభవము. కాన, ధర్మరాజాదులు వేరు, దుర్యోధనాదులు వేరు అను భేదజ్ఞాన ముండుటగాని, ధర్మరాజాదులకు తత్త్వోపదేశముజేయుటగాని యిట్టివను లేవియు బొసగవు. ఇక కృష్ణునకు ఆత్మసాక్షాత్కారము కలుగలేదనియు, నజ్ఞానము నశించలేదనియు నన్నచో నప్పుడు

శ్రీకృష్ణు డజ్ఞానియే. అతడు తత్త్వ ముపదేశించు టెట్లు? పార్థునకు తత్త్వోపదేశము జేయుట పొసగదు- అని.

ఈయాక్షేప మెంతమాత్రము సరిగాదు. ఆత్మ యజ్ఞానముగలవాడనిగాని, అజ్ఞానము నశించినవాడనిగాని తలచువాడు మూర్ఖుడు. ఆత్మయం దెప్పుడును నజ్ఞానము లేదు. ఆత్మయం దొకప్పు డజ్ఞానముండియున్నచో నది నశించునుగాని, యెప్పుడును లేని యజ్ఞానము నశించు టెట్లు? చిన్మాత్రుడయిన వాసుదేవున కజ్ఞానప్రసక్తి యేల? తన్నివృత్తి యేల? ఇట్లుండ శ్రీకృష్ణుని,పార్థునకు తత్త్వార్థము నుపదేశించువానినిగా దలంచువాడు ఆత్మతత్త్వజ్ఞానములేనివాడుగాని వేరు గాడు. నిర్విశేషచిన్మాత్రు డయిన ఆత్మ యెవనికి నేదియు నుపదేశింపడు. ఉపదేశించుటకు వాగాదీంద్రియము లావశ్యకములు. ఉపదేశించువాడు దేహేంద్రియసముదాయరూపుడుగాని యాత్మరూపుడు గాడు.

జ్ఞాతయగు పరమాత్మ యెరికి నగుపడడు. దేహేంద్రియసముదాయమునకు భేదదర్శనము తత్త్వోపదేశము మున్నగుపనులు పొసగును. ఆత్మ యొక్కడయినను దేహేంద్రియసముదాయమయిన శరీరము లనేకములు. పరస్పరము భిన్నములు. కావున సంఘాత మెంతటిపనియయినను జేయనోపును. అయితే యివి జడములు గదా? వీటివలన నుపదేశాదికృత్యము లెట్లు నెరవేరునని యనరాదు. ఆత్మప్రతిఫలనముచే జడములయిన దేహేంద్రియాదులుగూడ చైతన్యముగలవియై పనులను నెరవేర్చుచుండును. అందువలన, దేహము నడచుచుండగా 'నేను నడచుచున్నాను' అని యనుకొను టెట్లు పొరపాటో, అట్లే దేహేంద్రియసముదాయము చెప్పుచుండగా ఆత్మ చెప్పుచున్నా డనిగాని, దేహేంద్రియసముదాయము వినుచుండగా నేను (ఆత్మ) వినుచున్నానని యనుకొనుటకాని పొరబాటు. కావున నిట్లు నుపదేశించువాడు సంఘాతరూపుడయిన వసుదేవపుత్రుడు. వినువాడు సంఘాతరూపుడయిన కౌంతేయుడు. వీరిరువురియందును ఆత్మత్వభ్రాంతిగల (వీ రిరువు రాత్మలని భ్రాంతిపడియెడి) రామానుజులపాండిత్య మేమని మెచ్చుకొనవచ్చును?

అయితే, శుద్ధాత్మయం దుపదేశాదివ్యవహారములు పొసగకుండుగాక! కాని, దేహేంద్రియాదిసంఘాతవిశేషము నేనని తలచెడి వసుదేవపుత్రునకు అజ్ఞానము నశించిన దందురా? లే దందురా? ఇంకు మొదటిపక్షమున భేదదర్శనము కుదరదు, రెండవపక్షమున నుపదేశించుట కుదరదు అనినచో, నట్లు కాదు. విద్వాంసుడయిన శ్రీకృష్ణునకు ఆత్మ యొక్కడనుజ్ఞానము, ప్రమాత లనేకులను జ్ఞానము యీ రెండును గలవు. శ్రీకృష్ణునకు ప్రమాతృభేదజ్ఞానము లేనిచో కౌంతేయాదులు వేరను జ్ఞాన ముండదు. ఆత్మైకత్వజ్ఞానము లేనిచో ఆత్మోపదేశము పొసగదు. శ్రీకృష్ణుడు కౌంతేయాదులు వేరని తెలిసికొనుచున్నాడు. అం

దర్జునునకు ఆత్మైకత్వము నుపదేశించియున్నాడు. కావున రెండుజ్ఞానములు గలవని భావము.

ఓయి! ప్రమాత యగు నే జీవుడు తనను సచ్చిదానందాద్వితీయబ్రహ్మనుగా దెలిసికొనునో యాజీవుడుగదా విద్వాంసు డనబడును. కృష్ణుడు తాను ప్రమాత యని యెట్లు తెలిసికొనును? పార్థునకు తత్త్వ మెట్లుపదేశించును? అనినచో వినుము. ఇది యొకదోషము గాదు. దశాభేదముచే నిది కుదరవచ్చును. మీరును ఒకే జీవునకు సమాధిదశను వ్యవహారదశను భిన్నముగా నంగీకరించుచున్నారు.

అతిమూర్ఖులయిన శూద్రులకుగూడ నిద్రావ్యవహారదశలు భిన్నముగా జరుగుచున్నవి. అట్లే వ్యవహార, పరమార్థదశ లను భేదముచే నర్జునున కుపదేశించుట యద్వితీయబ్రహ్మను జూచుట యీరెండును బొసగును. ప్రమాత ఆత్మసాక్షాత్కారి మొనర్చుకొనుదశ పరమార్థదశ. ఈదశయందు వక్త లేడు. శ్రోత లేడు. ఉపదేశమున్ను లేదు. ఇక నెప్పు డుపదేశాదివ్యవహారమును జరపునో యది వ్యవహారదశ. ఈదశయందు వక్త గలడు. శ్రోత గలడు. ఉపదేశమున్ను గలదు. కాన నిం దనుపపత్తి యేమియు లేదు.

అయితే వ్యవహారదశయందు విద్వాంసుడగు ప్రమాతకు (జీవునకు) 'అహం బ్రహ్మ' (నేను బ్రహ్మను) అను జ్ఞాన మున్నదా లేదా? ఇందు మొదటిమతమున ఆత్మ యద్వితీయుడయినందున నుపదేశాదివ్యవహారము కుదరదు. రెండవమతమున తన కద్వితీయాత్మతత్త్వజ్ఞానము లేదుగనుకనే మరియొకనికి తత్త్వము నుపదేశింపజాలడు. అనినచో నట్లు కాదు. వ్యవహారదశయం దున్న బ్రహ్మాత్మజ్ఞానము పరోక్షరూపమగుటవలన భేదజ్ఞానము యుపదేశము యీరెండును గుదురును. అపరోక్షబ్రహ్మాత్మజ్ఞానదశయందే భేదదర్శన ముండదు. విదేహకైవల్యపర్యంతము అవిద్య కాలినగుడ్డచందమున నుండుటచే దాన నపరోక్షుడగు ఆత్మగూడ పరోక్షుడుగా భాసించును. అజ్ఞానావరణమువలననే యాత్మకు పరోక్షత్వము సంప్రాప్తమగుట. ఆత్మప్రకాశస్వరూపుడయినను 'అహ మజ్ఞః' (నే నజ్ఞానిని) యను ననుభవబలమునుబట్టియు, 'అజ్ఞానే నావృతం జ్ఞానం' అను శాస్త్రమువలనను అజ్ఞానావరణము నొందుచున్నా డని యనకతప్పదు. కాన వ్యవహారదశయందు గురువు, శిష్యుడు, శాస్త్రము – అను ద్వైతభాగమంతయు నుండుటచే వసుదేవపుత్రుండయిన కృష్ణునకు భేదజ్ఞాన ముండుటకు గొదువలేదు.

నిజము విచారించినచో రామానుజులు చెప్పినదంతయు వారిమతమునందే చెల్లదు. ఎట్లన? జీవునిలోపలనుండి జీవుడు శరీరముగాగల పరమాత్మ తనకు శరీరమగుజీవుడు తనస్వరూపు డని తెలిసియుండి తనశరీరముకొరకు దా నెట్లుపదేశించును?

జీవుడు వేరు, నేను వేరు అను జ్ఞానమున్నప్పుడుగదా? యుపదేశాదులు పొసగును. నేను మనుష్యుడనని తలచువా డెవ్వడును తనస్వరూపమయిన శరీరముతో

దాను ముచ్చటించడు. 'నేను దేవదత్తుడను' 'వీడు విష్ణుమిత్రుడు' 'వాడు నాకంటె వేరు' అను జ్ఞాన మున్నప్పుడే దేవదత్తుడు విష్ణుమిత్రున కుపదేశించును. ఇంతియే కాని యేకత్వజ్ఞానమున్నపు డుపదేశాదులు నెరవేరవు. జీవున కంతరాత్మయగు పరమాత్మకుగూడ నేను జీవునికంటె వేరనుజ్ఞాన మున్నదనియు, దానింబట్టి పరమాత్మ జీవున కుపదేశించుననియు జెప్పినచో నప్పుడు దేహములోనున్న నేను దేహముకంటె వేరనుజ్ఞానముగల జీవుడుగూడ దేహమున కేల నుపదేశింపడు ? దేహ మచేతనమయినందున జీవుడు దాని నుపదేశింప డన్నచో నదియును పొసగదుకదా ? జీవు డున్నపుడు దేహము సచేతనమగునుగాని, యచేతనము గాచేరదుకదా. అట్లుకానిచో లోకములో చేతనాచేతనవ్యవహారమే పొసగదు. తిరుగుచు, తిట్టుచు, మాటాడుచు నున్న శరీర మచేతనమని యెవ్వరును పలుచరు. మృత్పాషాణాదికమే యచేతనమని లోకు లందురు.

కాక, లోకములో నేజీవుడయినను తనలోపలనుండి తన కేదియో నుపదేశించుచు దనకంటె వేరయి తాను శరీరముగాగలవానిని మరియొకనిని చూచు చుండెనా? అట్లు జూచుచో నప్పుడు శరీరరూపుడయిన జీవునకు, శరీరియగు నీశ్వరు డుపదేశించుచున్నా డని నమ్మెడివాడు. అట్టి యనుభవములేనందున రామానుజులవాక్యము విశ్వసింపదగదు.

అయితే, లోకములో నట్టియనుభవము లేకున్నను, కృష్ణార్జునోపదేశమును దృష్టాంతముగా గైకొని యీయది యంగీకరింపవలెనన్నచో నర్జునునికంటె వేరుగా కనిపించుచున్న శ్రీకృష్ణుడు పార్థునిలోపల అంతరాత్మగానుండుట యసంభవము. ఆత్మభేదము నంగీకరించెడి మీరు కృష్ణార్జునుల శరీరములలో నుండు నంతరాత్మ యొక్కడేనని యంగీకరింపరు. ఇక అర్జునుని శరీరములో యంతరాత్మగా నున్నవాడే శ్రీకృష్ణశరీరమునందు ప్రమాతగా నుండి అర్జునశరీరములోని ప్రమాతకొరకు నుపదేశించెననుటయు బొసగదు. అర్జునశరీరప్రమాతయందువలె గృష్ణశరీరప్రమాత యందుగూడ నంతరాత్మ యుండుట యవసరము. ఇట్టితరి యొకడే యంతరాత్మగా నుండవలెగాని పార్థునియందలి యంతరాత్మ శ్రీకృష్ణశరీరమునందు ప్రమాతగా నుండుట యసంభవము. ఒకచోట నున్న యంతరాత్మ మరియొకచోట ప్రమాత యగుచో వాని కంతర్యామిత్వమే చెడును. ప్రమాతలోపలనుండి ప్రమాతను నియమించునా డంతరాత్మ యని చెప్పబడుచున్నాడు. ఇట్టితఱి కృష్ణప్రమాతయే యర్జునాంతరాత్మయగుచో కృష్ణప్రమాతయందలి అంతరాత్మ అర్జునాంతరాత్మకు గూడ నంతరాత్మ కావలసివచ్చును. ఇది యంగీకరించుచో నంతర్యామికి మరియొక అంతర్యామి, వానికి మరియొకడు, యిట్లనవస్థాదోష మేర్పడును. అప్పు డంతర్యామి బ్రాహ్మణమునకు విరోధ మేర్పడును. కావున నంతర్యామియగు నీశ్వరుడు తనకు శరీరభూతులయిన జీవుల నుద్దేశించి యుపదేశించుచున్నా డనుట కుదరదు.

మరియు రామానుజులు అద్వైతాదివాదములను శ్రుతిస్మృతీతిహాసపురాణ న్యాయములను గమనించనట్టియు పూర్వాపరవిరోధములను సరిగ్గా తెలియంగనట్టియు అజ్ఞానసాగరమున మునిగియున్నవారు లోకమును మోసపుచ్చదలచి బయల్వరచి నారనిరి. వారివ్యాఖ్యాతలగు వేదాన్తదేశికులుగూడ శంకరమతమున భేదశ్రుతులు, సగుణశ్రుతులు, అంతర్యామిశ్రుతులు, ప్రకృతిపురుషనిత్యత్వశ్రుతులు, మరి కొన్ని స్మృతులు విరోధించునని యనిరి.

ఇదియంతయు ననుచితము. లోకములో వ్యవహారదశ, పరమార్థదశ అని రెండు దశలు గలవు. వీనినే యవిద్యావస్థ, విద్యావస్థ యందురు. ఇవి శ్రుతిసిద్ధములు కాని స్వకపోలకల్పితములు గావు. అట్టి శ్రుతులను శ్రీశంకరు లీ శ్లోకభాష్యమున నిరూపించిరి. స్మృతులనుగూడ నుటంకించిరి. ఇదియంతయు బురాణ ప్రసిద్ధము, అనుభవసిద్ధము ననుటకు సందియములేదు. ఇట్లుండ వ్యవహార ముండు నంతవరకు (అవిద్యయుండునంతవరకు) జీవేశ్వరులభేదము మున్నగునవి కుదురును.

'జీవ ఈశో విశుద్ధాచిత్ తథా జీవేశయో ర్భిదా

అవిద్యా తచ్చితో ర్యోగ షడస్మాక మనాదయః' అను వచనము అవిద్యాదశయందు జీవేశ్వరులకు భేద ముండునని నిరూపించుచున్నది. కాన 'ద్వా సుపర్ణా సయుజా సఖాయా' అను భేదశ్రుతిగూడ నుపపన్నమగును.

ఈశ్వరునకు సత్యకామత్వ, సర్వేశ్వరత్వాది గుణము లుండుటచే, నాగుణములను దెలిపెడి సగుణశ్రుతు లుపపన్నమగును.

జీవుడు నియమ్యుడు, ఈశ్వరుడు నియామకుడు; కనుక 'య ఆత్మని తిష్ఠన్' ఇత్యాద్యంతర్యామిశ్రుతి కుదురును. విద్య యను సూర్యు డుదయించునంతవరకు ప్రకృతి యను నంధకార ముండుటచే ప్రకృతి నిత్య మను వ్యవహారము కుదురుచున్నది. ప్రళయమునందు నశించు మృత్తికాదులు ప్రపంచ ముండునంతవరకు నిత్యములయినట్లు ప్రకృతిగూడ నాపేక్షికముగ నిత్యమగును కాన ప్రకృతి నిత్యతా శ్రుతికి విరోధములేదు.

పురుషుడయిన ఆత్మ పారమార్థికు డగుటచే నిరపేక్షనిత్యుడుగాన పురుష నిత్యత్వమును బ్రతిపాదించుశ్రుతికిని విరోధము లేదు.

'తత్వమసీ'త్యా ద్యభేదశ్రుతులు పరమార్థదశలో నిర్విశేషబ్రహ్మ యొక్కటేనని లక్షణచే బ్రతిపాదించుచున్నందున అభేదశ్రుతులకుగూడ విరోధము లేదు. ముఖ్యార్థమును విడచుటకూడ విరోధమేకదా అని యనరాదు. తత్పద ముఖ్యార్థమునకు (అనగా సర్వజ్ఞేశ్వరునకు కించిత్ జ్ఞ జీవునకు) నైక్యము (అభేదము) కుదరనందున లక్ష్యార్థము స్వీకరింపవలసివచ్చినది. కాని రామానుజీయులు తత్పదమునకు 'ఈశ్వరాత్మకు డగు జీవుడు' అని అర్థమును వర్ణించి మామతమున ముఖ్యార్థమునకు బాధలేదని చెప్పిరి. ఇది కోడలికి

బుద్ధిచెప్పి యత్త రంకుబోయిన ట్లున్నది. అద్వైతులకు లక్ష్యార్థస్వీకారము
దోషమని యద్వైతుల నాక్షేపించి మరల తామే లక్ష్యార్థమును స్వీకరించిరి. వీరి
పాండిత్యమును జూడుడు. తత్పదమునకు 'ఈశ్వరాత్మకుడు' అను నర్థము
ముఖ్యము గాదు. కనుక రామానుజులుమాత్రము జీవేశ్వరులకు ముఖ్యసామానాధి
కరణ్యము నేల యంగీకరింపరు? విరోధమువలన నంగీకరింపమని వా రన్నచో
నామాట యద్వైతు లనుటలో దప్పేమి?

అయితే, రామానుజులు తాము తత్పదమునందుమాత్రమే లక్షణ నంగీక
రించితిమనియు, అద్వైతులు పదత్రయమునందును లక్షణనంగీకరించుచున్నారనియు
ననినచో నదియు నుచితముగాదు. ఒక్కపదమునందు లక్షణ నంగీకరించుట వారి
కెట్లు దోషముగాదో, మాకుగూడ పదత్రయమునందు లక్షణ నంగీకరించుట
దోషముగాదని యద్వైతు లేల యనగూడదు?

మహావాక్యములందు మేము (అద్వైతులు) చెప్పిన యర్థము లాక్షణిక
మయినను నిర్దుష్టము. మీరు చెప్పినయర్థము దుష్టము. ఈవిషయము వెనుక
నిరూపించితిమిగాన మరల నిచట దానిని విమర్శించము.

'సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ' అను నిర్గుణశ్రుతులు విద్యాదశలో ఆత్మ
నిర్గుణుడని బోధించుచున్నందున నవి మాకు విరోధించవు. నిర్గుణశబ్దమునకు
హేయగుణరహితుడని మీరు చెప్పిన యర్థ ముచితము గాదు. గుణశబ్దము దోష
విరుద్ధములయినవాటిని చెప్పుట యుచితము. 'గుణదోషం బుధో గృహ్ణన్' అను
చోట గుణశబ్దము దోషమునకు విరుద్ధములయినవాటినే చెప్పుచున్నది. ఆత్మయందు
నిర్దోషత్వము సంభవించుట కీమార్గ మవలంబింపదగదు. 'నిర్గుణశ్చ' అను పదము
నందలి చకారబలమునను, 'అపహతపాప్మా' అను శ్రుత్యంతరమువలనను నిర్దోష
త్వము లభించును. అభేదశ్రుతులు నిర్గుణశ్రుతులు విద్యాదశలోని వనియును, భేద
శ్రుతులు సగుణశ్రుతులు అవిద్యాదశలోనివనియును విషయవ్యవస్థను జేసితిమి. కాన
మాకు (అద్వైతులకు) శ్రుతివిరోధ మెన్నడును లేదు.

విద్యవలన నవిద్య బాధనొందుచుండుటచే విద్యావిషయములయిన అభేద
శ్రుతులచే అవిద్యావిషయములయిన భేదశ్రుతులు బాధింపబడునని మే మంటిమి.
భేదశ్రుతులు బాధింపబడుట యనగా భేదశ్రుతుల యర్థమునకు విద్యావస్థలో ప్రామా
ణ్యము లేకుండుట. రజ్జుజ్ఞానముచే సర్పజ్ఞానమునకు అప్రామాణ్యమేర్పడినట్లు ఇట్టి
అప్రమాణమయిన అర్థమును శ్రుతి యెట్లు చెప్పునని ప్రశ్నింపరాదు. జీవేశ్వరుల
యొక్క భేదరూపమయిన అర్థము అవిద్యాదశలో ప్రమాణమయినందున శ్రుతిచెప్పుట
పొసగుచున్నది. కావున 'ద్వా సుపర్ణా సయుజా' ఇత్యాది భేదప్రతిపాదక శ్రుతులు
అవిద్యావిషయము లగుటవలనను, 'తత్త్వమస్యా' ద్యభేదప్రతిపాదకశ్రుతులు విద్యా

విషయము లగుటవలనను, నీ రెంటికి నిజస్థితిలో బాధ్యబాధకభావమే లేదు. కాన నద్వైతమతమున న్యాయవిరోధమును శంకించుటయే పొసగదు.

ఓయి, యద్వైతీ! మీరు 'బ్రహ్మ నిర్విశేష' మని యను టెంత విరుద్ధము? బ్రహ్మ నిర్విశేషము-చిన్మాత్రమగుటవలన వ్యతిరేకమున ఘటమువలె అను ననుమానమున పక్షమయిన బ్రహ్మయందు నిర్విశేషత్వ మను సాధ్యము, చిన్మాత్రత్వ మను హేతువు నీ రెండు ధర్మములు లను విశేషము లుండ బ్రహ్మకు నిర్విశేషత్వమెట్లు సంభవించును? కాన, మీరు బ్రహ్మనిర్విశేష మని యెట్లు సిద్ధాంతపరతురు?

వినుము: భేదవాదు లగు మీరు బ్రహ్మ సవిశేష మని యందురుకదా? మీ బ్రహ్మయం దున్న విశేషములు సవిశేషరూపములా ? నిర్విశేషరూపములా? సవిశేషరూపము లనినచో నా విశేషములయం దున్న విశేషములు సవిశేష రూపములా? నిర్విశేషరూపములా? అని యిట్లనవస్థ యేర్పడును. నిర్విశేషము లనినచో బ్రహ్మయం దున్న నిర్విశేషములయిన విశేషములయందు నిర్విశేషత్వ మున్నదా? లేదా? ఇందు మొదటిపక్ష మవలంబించినచో నద్వైతులమీద నారోపించినదోషము మీకుకూడ ప్రసక్తించును. ఇక నాధర్మములయందు నిర్విశేషత్వము లేదందురా? అప్పుడవి నిర్విశేషము లెట్లగును? ఘటత్వములేనివస్తువు ఘటమగునా? అట్లె నిర్విశేషత్వములేని వస్తువు నిర్విశేష మెట్లగును? కావున నీస్వవచనవ్యాఘాత మను దోషము మీకును నపరిహార్యమే యగును. కాన నిందు మే మేసమాధాన మును జెప్ప బనిలేదు. మీమతమున లేని దోషమునకుమాత్రమే మేము సమాధానమును జెప్పవలెను. కనుకనే 'య స్తూభయో స్సమో దోషః పరిహారోపివా సమః, నైకః పర్యనుయోక్తవ్య స్తాదృగర్థనిరూపణే' (దోష ముభయులకు సమాన మయినప్పు డొకరినొకరు నిందించుకొన బనిలేదు) అని పెద్ద లందురు.

ఇక మనమతమున బ్రసక్తించినదోషమును మనము పోగొట్టుకొను టెట్లు ? అని మామతస్థులు (అద్వైతమతస్థులు) మ మ్మడిగినచో మేము సమాధానము చెప్పెదము, వినుము.

నిర్విశేషత్వము విశేషరూపముగాదు. సవిశేషరూపమును గాదు. మరేమనిన నిర్విశేషరూపమే యగును. ఉ॥ నిర్ధర్మత్వము ధర్మరూపము గాదు, నిర్ధర్మత్వ రూపమే. నిర్ధర్మత్వము ధర్మరూపమగుచో నిర్ధర్మమునందు ధర్మముండుట యసంభవముగాన నిర్ధర్మత్వరూపధర్మముగల వస్తువు నిర్ధర్మకమే కాకపోవును. నిర్ధర్మక సధర్మకములకు రెంటికిని పరస్పరము భేద ముండుటచే నిర్ధర్మకము సధర్మకమును గానేరదు. నిర్ధర్మకము కలలోగూడ సధర్మకము గానేరదు.

ఇక నిర్ధర్మకత్వ నిర్విశేషత్వ నిర్గుణత్వ మను పదముల కర్థనిర్వచనము సాధ్యముగానంపున లోకములో నన్నివస్తువులు సధర్మకములు సవిశేషములు సగుణ

ములు అనియే యనవలయునుగాని నిర్ధర్మకము నిర్విశేషము నిర్గుణము అను వస్తువు మచ్చుకు నొక్కటిగూడ లేదు అనినచో నది చెల్లదు.

ఏ ధర్మము లేనిది నిర్ధర్మకము. ఏవిశేషము లేనిది నిర్విశేషము. ఏగుణము లేనిది నిర్గుణము. ఇట్టిపదముల కర్థమును సులభముగా జెప్పనగును. ఏ విశేషము లేకుండుటగూడ నొకానొకవిశేషమే యని యందురేమో? అట్లు కాదు. విశేషము భావరూపము. విశేషాభావము అభావరూపము. విశేషాభావాభావమే మరల భావరూప మగును. ఇంతియెకాని విశేషాభావము విశేషరూపము గానేరదు. నిర్విశేషరూపమే యగును. ఇట్లే ధర్మాభావము నిర్ధర్మరూపము. గుణాభావము నిర్గుణరూపము. కాన విశేషాభావముగల బ్రహ్మయం దెవ్విధమగు విశేషమును నాపాదింపవీలులేదు. విశేషాభావమే ధర్మరూప మేల గాకూడదు? అని శంకింప రాదు. విశేషాభావము అభావరూపము. ధర్మము భావరూపము. కావున విశేషాభావము ధర్మరూపము గానేరదు. కావున తార్కికులమతమున నిర్వికల్పజ్ఞానము సిద్ధించినట్లు మామతమున (అద్వైతమతమున) నిర్విశేషబ్రహ్మము సిద్ధించును.

నిజస్థితిలో నిర్వికల్పజ్ఞానమే బ్రహ్మము. తార్కికు లద్దానిని గుర్తించలేక పోయిరి. కాన, బ్రహ్మ నిర్విశేషము, చిన్మాత్రమగుటవలన వ్యతిరేకముచే ఘటాదులవలె అను ననుమానమునందు దోషమేమియు లేదు. అయితే విశేషాభావరూపమయిన నిర్విశేషత్వము విశేషరూపముగాకున్నను చిన్మాత్రత్వము భావరూపమగుటచే, విశేషరూపమగును. కాన చిన్మాత్రత్వరూపమయిన విశేషముగల బ్రహ్మ నిర్విశేషమెట్లగును? వినుము, చిన్మాత్రమనగా చిత్తుయే. అట్లుగాక నీయది ధర్మరూపమయినచో దీనియందు చిత్త్వ మను ధర్మము, దానియందు చిత్త్వత్వమను ధర్మము, దానియందు చిత్త్వత్వత్వ మను ధర్మము అని యిట్లనవస్థ యేర్పడును.

కాన చిన్మాత్ర మన చిద్రూపమే. ధర్మము గాదు. నిర్ధర్మకమైన చిత్తునందు ధర్మముండుట యసంభవము. అయితే చిత్తునందు చిత్త్వమే లేనిచో దానియందు చిత్పదమును బ్రయోగించు టెట్లు? జాడ్యాభావరూపమయినచిత్త్వము నాధారముగా జేసికొని యాపదమందు బ్రవర్తించుచున్నది. కనుకనే సత్యజ్ఞానాదిపదములకు బ్రహ్మయందు లక్షణ యంగీకరింపబడినది. అనృతత్వాభావమును, జాడ్యాభావమును బ్రవృత్తినిమిత్తముగా జేసికొని బ్రహ్మయందు బ్రయోగింపబడిన సత్యజ్ఞానాది శబ్దములు కేవలచైతన్యమాత్రమును లక్షణచే బోధించుచున్నవి. కాన చిద్రూపముకాని, జాడ్యాభావరూపముగాని యగు చిన్మాత్రత్వము ధర్మరూపము గానందున చిన్మాత్రుడయిన బ్రహ్మకు సవిశేషత్వము ప్రసక్తించదు.

మరియు వేదాంతదేశికులు 'అనుభూతి' యవేద్యముగానేరదని మరియొక యాక్షేపమును జేసిరి. అదియు నుచితము గాదు. అనుభూతి వేద్యమగుచో, నీయనుభూతి కర్మగాగలిగినట్టియు, జ్ఞాత కర్తగాగల యనుభవముగూడ వేద్యము గావలసి

వచ్చును. దానివలన అనుభవపరంపర యేర్పడును. జ్ఞానమునకు జ్ఞేయత్వము విరుద్ధము. జ్ఞానము విషయి. జ్ఞేయము విషయము. ఈ రెంటికి నిట్లు భేద ముండ, జ్ఞానము జ్ఞేయము గానేరదు. కావున అనుభవమే జ్ఞాత యని ఆరోపింపబడుచున్నది. అనుభవమునం దంతయు విషయమగుచున్నందున, విషయి యగు ననుభవమే యాత్మ. ఈయనుభవరూపమయిన ఆత్మస్వప్రకాశము శబ్దవేద్యము గాదు. స్వప్రకాశమయిన వస్తు వున్నదా? లేదా? యని సందేహింపబనిలేదు. అనుభవము సర్వమును దెలిసికొనును. జ్ఞానమాత్రము దేనిచేతను దెలియబడదు. కాన అనుభవము అవేద్యమనుటలో దోషములేదు.

అట్లే సత్య బ్రహ్మాది శబ్దములచే నభిధావృత్తివలన బ్రతిపాదింపబడక శబ్దలక్ష్యమగుటచే బ్రహ్మశబ్దప్రతిపాద్యముగాడని చెప్పబడినది. అనగా బ్రహ్మాదిశబ్దములు బ్రహ్మయందు లక్షణచే బ్రవర్తించు నని యర్థము.

ఓయి, బ్రహ్మాదిశబ్దములు లక్షణచే దేనియందు బ్రవర్తించును? చైతన్యము నందు. చైతన్యము చైతన్యశబ్దవాచ్య మగునా కాదా? నిజమే. బొత్తుగా శబ్దాదివిషయమగునో బ్రహ్మ వ్యవహరింపదగినవాడు గాకపోవును. బ్రహ్మ శాస్త్రైకవేద్యమని చెప్పెడి 'శాస్త్రయోనిత్వాత్' అను బ్రహ్మసూత్రమునకును 'వేదైశ్చ సర్వైరహ మేవ వేద్యః' అను గీతావచనమునకును విరోధము తటస్థించును.

ఇక బ్రహ్మ శాస్త్రవిషయమని యంగీకరించినచో నప్పుడు—

'యద్వాచా నభ్యుదితం యేన వా గభ్యుద్యతే'

'యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ'

'బ్రహ్మన్ బ్రహ్మ ణ్యనిర్దేశ్యే నిర్గుణే గుణవృత్తయః'

'కథం చరంతి శ్రుతయః సాక్షా త్సదసతః పరే' ఇత్యాది

శ్రుతి స్మృతిపురాణములకు విరోధము వాటిల్లును.

కావున పరమార్థముగా బ్రహ్మ శబ్దావిషయమనియు, వ్యవహారమునందు శబ్దవిషయమనియును వ్యవస్థ నంగీకరింపవలెను.

లేక శబ్దములచే బ్రహ్మ యిట్టివాడని నిరూపింపనలవికానందునగూడ శబ్దప్రతిపాద్యుడుగాడని చెప్పియుండవచ్చును. అంతమాత్రమున బ్రహ్మ శబ్దావిషయుడన వీలులేదు.

నిజస్థితిలో నీశ్రుతిస్మృత్యాదివిరోధములన్నియు, రా మా ను జీ యు ల నెత్తిన పిడుగువలె బడుచున్నవి. వివరింతుము. చూడుడు.

౧ 'ఐత దాత్మ్య మిదం సర్వం స ఆత్మా తత్త్వ మసి'

౨ 'నాన్యో ఽతో ఽస్తి ద్రష్టా' ౩ 'అయ మాత్మా బ్రహ్మ'

౪ 'ప్రజ్ఞానం బ్రహ్మ' ౫'సచ్చిదానందం బ్రహ్మ' 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ'

౬ 'నిష్కలం నిష్క్రియం శాంతం'
౭ 'సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ'
౮ 'ఏక మే వాద్వితీయం బ్రహ్మ'
౯ 'మృత్యో స్స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి'
౧౦ 'య ఉదర మంతరం కురుతే అథ తస్య భయం భవతి'
౧౧ 'ద్వితీయా ద్వై భయం భవతి'
౧౨ 'అశబ్ద మస్పర్శ మరూప మవ్యయమ్'
౧౩ 'అథ యో ఽన్యాం దేవతా ముపాస్తే. అన్యోఽసా వన్యో ఽహ మస్మీతి న స వేద యథా పశు రేవం స దేవానామ్'
౧౪ 'అసంగో హ్యయం పురుషః'
౧౫ 'యత్ర నాన్యత్పశ్యతి నాన్యత్ శృణోతి నాన్య ద్విజానాతి సభూమా యోవై భూమా తదమృతం, అథ యదల్పం తన్మర్త్యమ్'
౧౬ 'నేహ నా నాస్తి కించన'
౧౭ 'యత్రహి ద్వైత మివ భవతి. తదితర ఇతరం పశ్యతి యత్ర త్వస్య సర్వ మాత్మై వాభూత్ తత్కేన కం పశ్యేత్'
౧౮ 'స దేవ సోమ్యేద మగ్ర ఆసీత్'
౧౯ 'బ్రహ్మేదం పురస్తాత్'
౨౦ 'య త్తదద్రేశ్య మగ్రాహ్యమ్'
౨౧ 'యద్వాచా నభ్యుదితం యేన వా గభ్యుద్యతే, తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ముపాసతే'
౨౨ 'అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాత మవిజానతామ్'

ఈ రెండవలగు శ్రుతులన్నియు యథాక్రమముగ నిక్రింద కనుపరచిన యర్థములను బోధించుచు భేదవాదులగు రామానుజీయుల కశనిప్రహారము లగుచున్నవి.

(౧) ప్రపంచమంతయు నాత్మస్వరూపము. అట్టి యాత్మయే జీవుడు.
(౨) ద్రష్టయగువానికంటె వేరుగ నాత్మ లేదు.
(౩) ఈ యాత్మయే జీవుడు.
(౪) ప్రజ్ఞానమగు జీవుడే బ్రహ్మము.
(౫) బ్రహ్మ సచ్చిదానందరూపుడు.
(౬) బ్రహ్మ నిరవయవుడు, నిష్క్రియుడు.
(౭) బ్రహ్మ కేవలము చిద్రూపుడు, సాక్షి, నిర్గుణుడు.
(౮) బ్రహ్మ సజాతీయ విజాతీయ స్వగత భేద శూన్యుడు.
(౯) బ్రహ్మను భిన్నముగా జూచువాడు మరణపరంపరలనుబొందును.

(౧౦) బ్రహ్మయందు స్వల్పభేదమునయినను తలంచెడివాడు సంసారభయము నొందును.
(౧౧) రెండవవస్తు వున్నపుడు భీతి యేర్పడును.
(౧౨) బ్రహ్మ శబ్దస్పర్శాదివిషయసంగరహితుడు, అవ్యయుడు.
(౧౩) నేను వేరు దేవత వేరు అని తలంచి యితర దేవత నుపాసించువాడు పశువు.
(౧౪) పరమాత్మ నిస్సంగుడు.
(౧౫) ఎవడు యితరమును జూడడో, యితరమును వినడో, యితరమును దెలిసికొనడో వాడు సర్వవ్యాపకుడు. వాడు అమృతస్వరూపుడు (మరణము లేనివాడు). ఏది యల్పమో యది నశించును.
(౧౬) బ్రహ్మయందు లేశమాత్రము భేదము లేదు.
(౧౭) ఎవనికి నితర (రెండవ) వస్తు వున్నటుల దోచునో వాడు రెండవ వస్తువును జూచును. ఎవనికి సర్వము ఆత్మగా దోచునో వాడు దేనితో నెవనిని చూచును?
(౧౮) కనిపించుచున్న ప్రపంచమంతయు సృష్టికి బూర్వము బ్రహ్మముగానే యున్నది.
(౧౯) బ్రహ్మ నిర్దేశించి చెప్పనలవిగాడు, గ్రహింపనలవిగాడు.
(౨౦) ఎవడు వాక్కులచే జెప్పనలవికాడో, ఎవనిచే వాక్కులు జెప్పబడుచున్నవో వానిని నీవు బ్రహ్మనుగా తెలిసికొనుము.
(౨౧) బ్రహ్మ తెలుసుననుకొనువారలకు తెలియనివాడును, తెలియడనుకొనువారలకు దెలిసినవాడును నగును. అని.

ఇట్లే స్మృతులుగూడ విశిష్టాద్వైతులకు పిడుగుపాటు లగుచున్నవి.

'అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః'

(ఓయి యర్జునా! నేను సకలభూతముల హృదయములం దుండుచు, సర్వభూతముల కాత్మరూపు డగుచుంటిని)

'సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని'

(సర్వభూతములయందు ఆత్మ కలడనియు, సర్వభూతములు ఆత్మయందు గలవనియును)

'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత'

(సర్వశరీరములయం దుండెడి క్షేత్రజ్ఞుని నన్నుగా దెలిసికొనుము)

'ఉదారా స్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్'

(ఆర్తుడుమున్నగువారందరు గొప్పవారేకాని యిందు జ్ఞాని నాస్వరూపుడే)

'అవినాశితు తద్విద్ధి యేన సర్వ మిదం తతం'

(ఏయాత్మచే నీప్రపంచమంతయు వ్యాపించబడినదో అట్టి యాత్మ నాశరహితు డని తెలియుము.

'అవ్యక్తోఽయ మచింత్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే'

(ఈయాత్మ చక్షురాదీంద్రియముల కగపడడు. మనసుచే నూహింప నలవికాడు. ఎవ్విధమగువికారము లేనివాడు)

'భూతభృన్నచ భూతస్థో భూతాత్మా భూతభావనః'

(ఆత్మ భూతముల బోషించును. కాని, భూతములయం దుండడు. భూతముల కాత్మస్వరూపుడు)

'సర్వభూతస్థితం యో మాం భజ త్యేకత్వ మాస్థితః'

(సర్వభూతములయం దున్న నన్ను అభేదభావనతో నెవడు సేవించునో)

'అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మాఽయ మవ్యయః'

'శరీరస్థోఽపి కౌంతేయ న కరోతి న లిప్యతే'

(పరమాత్మ యనాదియగుటవలనను, గుణరహితుడగుటవలనను నాశరహితుడగు నీయాత్మ శరీరమునం దుండియున్నను నేదియు జేయడు. దేనితోను అంటడు.)

'భగవా నేక ఏ వైష సర్వక్షేత్రే ష్వవస్థితః'

(సర్వక్షేత్రములయం దున్న భగవంతు డొక్కడే)

'అహ మే వాస మేవాగ్రే నాన్య ద్య త్సదసత్పరమ్'

(సృష్టికిబూర్వము నే నొక్కడనే యుంటిని. సదసద్విలక్షణమయిన మరి యొకవస్తు వెద్దియును లేదు).

'బ్రహ్మన్ కథం భగవత శ్చిన్మాత్ర స్యావికారిణః
లీలయా వాపి యుజ్యేరన్ నిర్గుణస్య గుణాః క్రియాః'

(ఓయి శుకమహర్షీ! చిన్మాత్రుడు నిర్వికారుడు నిర్గుణుడు నగు భగవంతునకు విలాసచే నయినను గుణక్రియ లెట్లు పొసగును?)

'సేయం భగవతో మాయా య న్నయేన విరుధ్యతే
ఈశ్వరస్య విముక్తస్య కార్పణ్య ముత బన్ధనమ్'

(నిత్యముక్తుడయిన నీశ్వరునకు కార్పణ్యముగాని సంసారబంధనముగాని యుక్తివిరుద్ధమయినను భగవంతునియొక్క మాయచే నొనగూడును)

'యథా జలే చంద్రమసః కంపాది స్తత్కృతో గుణః
దృశ్యతే ఽసన్నపి ద్రష్టు రాత్మనో ఽనాత్మనో గుణః'

(నీటిలో చందురునకు నీటియొక్క సంపర్కమువలన కంపాదిగుణము లేర్పడి నట్లు ద్రష్టయగు ఆత్మకు లేనియనాత్మగుణము లుపాధిసంపర్కమున సంభవించును.)

'దేశతః కాలతో యో సా వవస్థాతః స్వతో ఽన్యతః
అవిలుప్తావబోధాత్మా సయుజ్యే తాజయా కథమ్'

(దేశకాల యవస్థాదులవలనగూడ దరగని బోధస్వరూపుడయిన ఆత్మకు మాయతో సంబంధ మెట్లేర్పడును?) ఈమున్నగు స్మృతులు పరమేశ్వరుడు ప్రకృతి పురుషులతో సంబంధములేనివాడని చెప్పుచున్నందున చిదచిద్విశిష్టేశ్వరవాదమునకు విరోధము. పరమేశ్వరుడు గుణక్రియాదులు లేనివాడని చెప్పుచున్నందున గుణ క్రియావిశిష్టేశ్వరవాదమునకు విరోధము.

జీవేశ్వరుల కభేదమును బోధించుచున్నందున భేదవాదమునకు విరోధము.

ఆత్మయొక్కడే యని చెప్పుచున్నందున నానాత్మవాదమునకు విరోధము.

బ్రహ్మ ద్వితీయపదార్థరహితు డని చెప్పుచున్నందున ప్రకృతిపురుషేశ్వరులు మువ్వురు నిత్యు లను వాదమునకు విరోధము.

బ్రహ్మ సత్యము, జగన్మిథ్య యని చెప్పుటచే ప్రపంచసత్యతావాదమునకు విరోధము.

ఈశ్వరుడు చిన్మాత్రుడు (చిద్రూపుడు) అని చెప్పుటచే చిద్విశిష్టేశ్వర వాదమునకు విరోధము.

ఆత్మ (బ్రహ్మ) జ్ఞానానందస్వరూపుడే యని చెప్పుటచే, ఈశ్వరుడు జ్ఞానా నందగుణములు గలవాడను వాదమునకు విరోధము.

ఈశ్వరునకు మూడుకాలములయందును ఈశితవ్యుడు (నియమింపదగినవాడు) లేడని చెప్పుటచే నీశ్వరేశితృత్వవాదమునకు విరోధము.

బ్రహ్మ జ్ఞేయము గాదని చెప్పుటచే జ్ఞేయత్వవాదమునకు విరోధము.

ఈశ్వరుడే అజ్ఞానవశమున సంసారము నొందుచున్నాడని చెప్పుటచే బద్ధ ముక్తులగు జీవు లనేకులు గలరనువాదమునకు విరోధము. ఇత్యాది విరోధములు వేలకొలది రామానుజమతమునందు గలవు.

మరియు వారిమతమున గల న్యాయవిరోధములను వివరింతుము.

౧. అద్వితీయాది శబ్దములకు, తనతో సమానమయిన రెండవవస్తువు లేనివాడు అనునది విరుద్ధము.

౨. ఒకడే అద్వితీయుడు అసంగుడు నగు బ్రహ్మ ప్రకృతిపురుషవిశిష్టుడు అను నది స్వవచనవిరోధము.

(ప్రకృతిపురుషవిశిష్టుడయినవాడు అసంగు డనుటకాని, యద్వితీయు డనుట కాని కుదరదు. ప్రకృతిపురుషులతో విశేషణవిశేష్యభావసంబంధమున్నపుడే ప్రకృతి పురుషవిశిష్టు డగును. ఇట్టివా డసంగు డెట్లగును? కాన నీమాట పరస్పరవిరుద్ధము)

౩. జ్ఞానమను గుణముగల యీశ్వరుడు జ్ఞానస్వరూపుడు.
౪. అనన్తగుణములు గల యీశ్వరుడు అనన్తరూపుడు.
౫. నిర్వికారుడయిన ఈశ్వరుడు ప్రపంచాకారముగ బరిణమించెను.
౬. జీవరూపుడయిన ఈశ్వరుడు జీవునకు లోపలివాడు.
౭. ద్రష్టయగు నీశ్వరుడు భక్తులకు దృగ్గోచరుడు.
౮. అనిత్యమయిన ప్రపంచము సత్యము.
౯. నిత్యుడయిన జీవుడు సంసారి.
౧౦. సచ్చిదానందాదులకంటె భిన్నుడయిన ఈశ్వరుడు సచ్చిదానందుడు.
౧౧. చిద్రూపుడయిన జీవుడు చిద్రూపుడయిన ఈశ్వరునకు శరీరము.
౧౨. అజ్ఞుడగు జీవుడు జ్ఞానరూపుడు.
౧౩. అణువగు జీవుడు సర్వగతుడు.
౧౪. పరిచ్ఛిన్నుడయిన జీవుడు నిత్యుడు- ఈ మొదలగునవి న్యాయవిరోధములు.
ఇట్లు శ్రుతిస్మృతిన్యాయవిరుద్ధమయినందున భేదవాదులమతమంగీకరింపదగదు.
మరల విశిష్టాద్వైతి తమమతమును సాధించుకొనుచున్నాడు.

ఓయి, అద్వైతీ! మామతము శ్రుతిస్మృతులకువిరుద్ధము గాదు. శ్రుతిస్మృతి సమ్మతము. చూడుము.

౧. 'అస్మాన్మాయీ సృజతే విశ్వ మేతత్ తస్మింశ్చాన్యో మాయయా సన్నిరుద్ధః'
౨. 'మాయాంతు ప్రకృతిం విద్యా న్మాయినంతు మహేశ్వరం'
౩. 'క్షరం ప్రధానం అమృతాక్షరం హరః'
౪. క్షరాత్మానా వీశ తే దేవ ఏకః'
౫. ప్రధానక్షేత్రజ్ఞపతి ర్గుణేశః'
౬. 'పతిం విశ్వ స్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివ మచ్యుతమ్'
౭. 'జ్ఞాజ్ఞౌ ద్వా వజా వీశనీశౌ'
౮. నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానామ్'
౯. 'భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా'
౧౦. 'పృథ గాత్మానం ప్రేరితారం చ మత్వా జుష్ట స్తత స్తే నామృతత్వమేతి'
౧౧. 'తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్న న్నన్యో అభిచాకశీతి'

౧౨. 'అజా మేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీం ప్రజాం జనయంతీగ్ం సరూపామ్. అజో హ్యేకో జుషమాణోఽనుశేతే జహా త్యేనాం భుక్త భోగా మజో ఽన్యః'
౧౩. 'సానాద్యనన్తవతీ సా జనిత్రీ భూతభావినీ'
౧౪. 'సమానే వృక్షే పురుషో నిమగ్నః అనీశయా శోచతి ముహ్యమానః'
౧౫. 'జుష్టం యదా పశ్య త్యన్య మీశ మస్య మహిమాన మితి వీతశోకః'
'య ఆత్మని తిష్ఠ న్నాత్మనో ఽన్తరో యమాత్మా న వేద యస్యాత్మా శరీరమ్'
౧౬. 'యో ఽక్షర మంతరే సంచరన్ యస్యాక్షరం శరీరం య మక్షరం న వేద'
౧౭. ఏష సర్వభూతాన్తరాత్మా అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః'
౧౮. 'అన్తః ప్రవిష్ట శ్శాస్తా జనానాగ్ం సర్వాత్మా'
౧౯. 'త దైక్షత బహుస్స్యామ్ ప్రజాయేయ'
౨౦. 'త త్తేజోఽసృజత' 'సో కామయత' 'స తపో తప్యత'
౨౧. 'తత్సృష్ట్వా, త దేవానుప్రావిశత్, త, దనుప్రవిశ్య, సచ్చత్య చ్చాభవత్'

ఈ మొదలగు శ్రుతులన్నియు, జీవేశ్వరులు భిన్నులనియు, ఈశ్వరుడు మాయావిశిష్టుడనియు, జీవేశ్వరులకు నియంతృ నియామ్యభావము గలదనియు, జీవుడు సంసారియనియు, ఈశ్వరుడు జీవాంతరుడనియు, ఈశ్వరుడే ప్రపంచరూపముగ బరిణమించెననియు జెప్పుచున్నవి. ఇట్లే-

'ప్రకృతిం విద్ధి మే పరామ్ జీవభూతామ్'
'సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాంతి మామికామ్'
'మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే స చరాచరమ్'
'ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభా వపి'
'మమ యోని ర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధా మ్యహమ్'

అను శ్రుతులుగూడ నియర్థమునే నిరూపించుచున్నవి. కనుక మామతము శ్రుతి స్మృత్యనుభవములకు విరుద్ధము గాదనినచో నట్లు కాదు, వినుము.

౧. శ్రుతి స్మృతులకు నీవు విరుద్ధార్థమును గల్పించి సంతసించుచుంటివి. అదెట్లన 'అస్మా న్మాయీ సృజతే విశ్వమ్' ఇత్యాది శ్రుతికి మాయావిశిష్టుడగు నీశ్వరుడు ప్రపంచమును సృజించెననియు, నితరుడగు జీవుడు మాయచే నిరోధింపబడి ప్రపంచమునం దుండెననియు నీ వర్థమును జెప్పితివి.

'అనేన జీవే నాత్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి' అను శ్రుతియు 'మ మైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః' అను స్మృతియు జెప్పెడి 'జీవు డీశ్వరాంశభూతుడు' అను మాట యథార్థము. కాని యీశ్వరుడు ప్రపంచమును సృష్టించు నంతట వానియంశరూపుడగు జీవుడు ప్రపంచమున నిరోధింపబడియుండు

కెట్లు పొసగును? ఇది విరుద్ధముకదా! అంశలయొక్క సమష్టిరూపుడేకదా అంశి యగు నీశ్వరుడు.

కాక సర్వాంశసమష్టి యీశ్వరు డగుచుండ, సర్వజీవులసంసారము ఈశ్వరునకుగూడ ప్రాప్తించును. అంశాంశులు వేరనుటలోకవిరుద్ధము. ఇక అంశాంశులకు భేదములేకున్నను, ఈశ్వరాభిన్నుడు జీవు డగునుగాని, యీశ్వరుడు మాత్రము జీవునికంటె భిన్నుడే అని యన్నచో, అప్పుడు, యీశ్వరాభిన్నుడయిన జీవునకు అసంసారిత్వము, సర్వజ్ఞత్వము ప్రాప్తించును.

మరియు, చిదచిద్విశిష్టుడయిన నీశ్వరున కంశయగు జీవుడుగూడ చిదచిద్విశిష్టుడే కావలసివచ్చును. అది మీ రంగీకరించినచో, ఈశ్వరుడు చిదచిద్విశిష్టుడనియు, జీవుడుమాత్రము చిద్రూపుడేయనియు మీరు చెప్పెడిసిద్ధాంతమునకు భంగము వాటిల్లును.

ఇక చిదచిద్విశిష్టమగు నీశ్వరునిలోని చిదంశమాత్రము జీవుడని మీరు తప్పుకొనినచో, నట్టితఱి, యచిత్తుకూడ నీశ్వరాంశ కావలసివచ్చును. ఈశ్వరునుంచి చిదంశను అచిదంశను వేరుజేసినచో నింక నీశ్వరుడే లేకపోవును.

మీమతమున నీశ్వరుడు చిద్రూపుడా? అచిద్రూపుడా? లేక చిదచిద్రూపుడా? లేక చిదచిదనిర్వాచ్యుడా?

ఇందు మొదటిమతమున ఈశ్వరుడు జీవుడు గావలసివచ్చును. రెండవమతమున, ఈశ్వరుడే ప్రపంచ మగును. ఒక్కడు పరస్పరవిరుద్ధము లయిన రెండు రూపముల నొందుట లోకవిరుద్ధము. కాన, మూడవమతము చెల్లదు. ఈశ్వరునకు మిథ్యాత్వము ప్రసక్తించునందువలన నాల్గవమతము చెల్లదు. చిత్తనికాని, యచిత్తనికాని, చెప్పనలవికానివాడు మిథ్యాభూతుడే యగును. లేకపోతే శశశృంగాదులవలె అసద్వస్తు వగును.

'సచ్చిదానందం బ్రహ్మ' అని శ్రుతి చెప్పుచుండ బ్రహ్మ చిదచిద్విలక్షణమని యనుట శ్రుతివిరుద్ధము. కాక, ఈశ్వరుడు జ్ఞాత. చిత్ అనగా జ్ఞానము కాన నీశ్వరుడు చిద్రూపుడు గానేరడు. ఇక, నీశ్వరుడు చిద్వ్యక్తి యన్నచో జ్ఞాత యగు జీవుడుగూడ చిద్వ్యక్తియే యగును. ఇది మీరొప్పుకొనినచో జీవేశ్వరులకు భేదము సిద్ధించదు. కాన, నీశ్వరాంశయగు జీవుడు ఈశ్వరునికంటె వేరగుట సంభవించదు. మహాకాశముయొక్క యంశమగు ఘటాకాశము మహాకాశముకంటె వేరుగాదు. కాన, నీశ్వరాభిన్నుడయిన జీవుడు మాయచే నిరోధింపబడు టెట్లు కుదురును? మరియు నీశ్వరునివలె నాతనియంశమగు జీవుడుగూడ సంసారరహితుడుగావలయును. మహాకాశము నిర్లిప్తమయినట్లు దానియంశమగు ఘటాకాశముగూడ నిర్లిప్తమే యగుచున్నది. కనుక మాయచే జీవుడు నిరోధింపబడుట యసంగతము.

అయితే యీశ్రుతి కర్థ మేమి? వినుము. 'మాయచే నీశ్వరుడు వేరయిన వానివలెను, నిరోధింపబడినవానివలెను దోచుచున్నాడు' అని పైశ్రుతి కర్థము.

౨. దీనిచే('బ్రహ్మణ ఏవ జీవత్వ మజ్ఞానా దితి ప్రలాపో నిర్మూలితః')అజ్ఞానము వలన బ్రహ్మకే జీవత్వము ప్రాప్తించిన దను నద్వైతులప్రలాపము నిర్మూలింపబడినది అని వ్రాసిన వేదాంతదేశికులప్రలాపము నిర్మూలింపబడినది. అజ్ఞానమువలన గగనమునకు నైల్యము, స్థాణునకు సర్పత్వము, నిదురించు వానికి దేశాంతరగమనము సంభవించినట్లు, బ్రహ్మకు జీవత్వముగూడ సంభవించవచ్చును. మాయవలనగానిపని యేమున్నది? జీవత్వభ్రాంతిని కలుగ జేయు శక్తియే యీశ్వరునియందలి యజ్ఞానము. ఇట్టిశక్తియుండుటంబట్టియే యీశ్వరుడు మాయి యనబడుచున్నాడు.

ఓయి, భ్రమ యేరికి? ఉన్నవానికే. అయితే నాకే యున్నది. ఉండే నీకేభ్రమ. అయితే నేను యీశ్వరాంశుడనుగదా, నాకు భ్రమ యెట్లు? ఆవిషయము దెలియకపోబట్టియే నీ కాభ్రమ. అయితే యీశ్వరాంశత్వము తెలియక పోవుట ముందా? జీవత్వభ్రాంతి గలుగుట ముందా? దానివలన నిది, దీనివలన అది అని యన్యోన్యాశ్రయముగదా? కాదు వినుము. ఈయది నాయది. ఇంచు భ్రాంతి ముందనికాని, అజ్ఞానము ముందనిగాని చెప్పనలవిగాదు. ఇక మాయ, ప్రకృతి, యజ్ఞానము అనునవి మూడు సమానార్థకములుగాని వేరుగాదు.

3. ఓయి, 'క్షరం ప్రధానం అమృతాక్షరం హరః' అను శ్రుతి నశించునట్టిది ప్రధానమనియు, నశించనివాడు పురుషుడనియు, వీరిరువురకు ప్రభువగువాడీశ్వరుడనియును జెప్పుచు నీమూడుపదార్థములు భిన్నములని సూచించు చున్నదికదా? కాదు. భోక్తయగు జీవున కక్షరత్వము సంభవించదు. భోక్తృత్వ మనునది వికారము. వికారము గలవాడు నశించకదప్పడు. వికారములేని పరమాత్మయే యక్షరుడు. కావున జీవునకు (పురుషునకు) నాశములేకుండుట యసంభవము. ప్రకృతిపురుషులిద్దరు నిత్యులగుచుండ నంపు ప్రకృతి (ప్రధానము) క్షరమగుటెట్లు? క్షరమనగా నశించునది అని కదా యర్థము. నిత్యమయిన ప్రధానము నశించు టెట్లు పొసగును? కనుక ప్రధానపరిణామమయిన దేహాదికమే క్షరము. సర్వభూతములు ప్రధానము నందు లయము చెందుచున్నందున ప్రధానము అక్షరము (నశించనిది) క్షేత్రజ్ఞేశ్వరు లిరువురు యొక్కటే. లేక జ్ఞానముచే నశించుచున్నందున ప్రకృతి క్షరమగును. పరమాత్మ యక్షరుడు.

౪. 'క్షరాత్మానా వీశతే దేవ ఏకః' అను శ్రుతియందు క్షర శబ్దమునకు భూతము లర్థము. ఆత్మ శబ్దమునకు ప్రకృతి యర్థము. స్వాభావమునం దాత్మశబ్దము

ప్రయోగించుట కలదు. ఈశ్వరునిస్వభావమే ప్రకృతి కాన ప్రకృతియం దాత్మ శబ్దము పొసగును.

౫. అయితే 'ప్రధానక్షేత్రజ్ఞపతిః' అను శ్రుతియందు ప్రధానశబ్దమునకు ప్రకృతియనియు, క్షేత్రజ్ఞశబ్దమునకు జీవాత్మయనియు, వీరిరువురకు నీశ్వరుడు ప్రభువనియును జెప్పకతప్పదు. దీనిననుసరించి చూచినచో 'క్షరాత్మానా వీశతే దేవ ఏకః' అను శ్రుతియందు గూడ క్షరశబ్దమునకు ప్రధానమనియు, ఆత్మశబ్దమునకు క్షేత్రజ్ఞుడనియును అర్థము చెప్పక తప్పదుగదా ? అని యనరాదు—

౬. 'ప్రధానక్షేత్రజ్ఞపతిః' అను శ్రుతియందు ప్రధానశబ్దమునకు ప్రకృతి యర్థము. క్షేత్రజ్ఞశబ్దమునకు భూతము లర్థము. ఆత్మచైతన్యప్రతిఫలనమువలన భూతములుగూడ క్షేత్రజ్ఞము లగును. అయితే 'ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞఇతి తద్విదః' అను గీతావచనమునకు విరోధముకదా ! అని యనరాదు. ఎవనికి జ్ఞాతృత్వ మొక్కటియే యుండునో, జ్ఞేయత్వ ముండదో వాడు క్షేత్రజ్ఞుడని గీతాతాత్పర్యము. బ్రహ్మాదిభూతములు ఘటాదికమును దెలిసికొన్నను, అవికూడ సాక్షిచైతన్యముచే దెలియబడుచున్నందున భూతములకు జ్ఞాతృత్వము ముఖ్యముగాదు. లేక స్వయముగా దెలిసికొనువాడు క్షేత్రజ్ఞుడు. భూతములు ఖడ్గములుగాన స్వయముగా దెలిసికొన సమర్థములు గావు. కాన, భూతములకు క్షేత్రజ్ఞత్వము లేదు. శ్రుతియందలి క్షేత్రజ్ఞపదమున కాత్మయే యర్థము. కూటస్థుడయిన క్షేత్రజ్ఞాత్మగుణాధిపతికాన నిర్గుణుడు. గుణములకు ప్రభువగువాడు గుణములుగలవాడు కానేరడు. నిర్గుణుడు గనుకనే నిర్వికారుడు.

౭. ఓయి! గుణేశుడు ఆత్మ యెట్లగును? గుణేశుడు యీశ్వరుడుకదా! 'పతిం విశ్వ స్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివ మచ్యుతమ్' అను శ్రుతి ఆత్మకు ప్రభువగువా డీశ్వరు డని చెప్పుచున్నదికదా ? అనినచో నట్లు కాదు. అచట 'ఆత్మకు అనగా ప్రకృతికి నీశ్వరుడుగాన ఆత్మేశ్వరు డని యర్థము. అట్లుకాక, ఆత్మకు ప్రభువే యీశ్వరు డని యన్నచో గీతయందలి 'అహ మాత్మా గుడాకేశ' అను శ్రీకృష్ణవాక్యమునకు గతియేమి? ఆత్మయే ఈశ్వరుడయినప్పుడే యాగీతాస్మృతి యుపపన్న మగును (కుదురును). భగవంతు డగు శ్రీకృష్ణు డీశ్వరుడు, అతడు తనయం దాత్మశబ్దమును బ్రయోగించుకొనెను. విశ్వరూపమును బ్రదర్శించిన శ్రీకృష్ణు డీశ్వరుడు గాడనుట పాడిగాదు. కాన 'ఆత్మేశ్వరం' అను చోట యాత్మశబ్దమునకు ప్రకృతి యనియైనను అర్థమును జెప్పవలయును. లేక ఆత్మయయిన నీశ్వరుడుగాన, ఆత్మేశ్వరు డనియైనను జెప్పవలయును.

౮. ఓయి! జీవుడు ఆత్మ, ఈశ్వరుడు పరమాత్మ, జీవుడు అజ్ఞుడు, ఈశ్వరుడు, ప్రాజ్ఞుడు; జీవుడు పరతంత్రుడు, ఈశ్వరుడు స్వతంత్రుడు– అని యిటు 'జ్ఞా జ్ఞౌ ద్వా వజా వీశనీశౌ' అను శ్రుతి చెప్పుచున్నది. అనినచో–

అట్లు కాదు. ఆత్మ ప్రకృతికంటె వేరని తెలిసికొనువాడు ఆత్మజ్ఞుడు. అట్లు తెలియనివాడు అజ్ఞుడు. ఆత్మవేత్తయే యీశ్వరుడు. అనాత్మవేత్త సంసారి కాన నీశ్వరుడు గాడు. కాని వీరిద్దరు అజ్ఞులే. ఇం దొకరికి అనాత్మతాదాత్మ్యాధ్యాస యున్నది. మఱియొకరి కట్టి యధ్యాస లేదు. ఈభేదమును బురస్కరించుకొని యిద్దరని చెప్పబడినది. ఇంతియేకాని, నిజముగ ఆత్మభేదము లేదు.

౮. ఓయి! నిజముగా ఆత్మభేదము గలదు. 'నిత్యో నిత్యానాం' అను శ్రుతి యాత్మాభేదమును జెప్పుచున్నది. అట్లే 'ఏకో బహూనాం యో విదధాతి కామాన్ (ఒక్కయీశ్వరు డనేకమందిజీవులకు గోర్కెల దీర్చుచున్నాడు) అను శ్రుతి జీవేశ్వరులకు భేదమును జెప్పుచున్నది. అనినచో నది యుక్తముగాదు.

దేహేంద్రియాదిసంఘాతమునం దాత్మాభిమానముగల ప్రమాతలు వస్తుతః ఆత్మలుగాన, శ్రుతియందు 'నిత్యానాం' అని చెప్పబడినది. వ్యవహారము వలన వీర నేకులుకాన 'బహూనాం' అని చెప్పబడినది. వారుకోరినఫలముల నిచ్చెడి క్షేత్రజ్ఞాత్మయగు నీశ్వరు డొక్కడేకాన 'ఏకః' అని చెప్పబడినది. కాన నీశ్రుతులు జీవులకుగాని, జీవేశ్వరులకు గాని, వ్యవహారదశయందుండెడి భేదమును సూచించినవి గాని, వాస్తవికభేదమును సూచించలేదు. జీవులలో బరస్పరభేదము నిజముగ లేదు. జీవేశ్వరులకును భేదములేదు. ఈశ్వరుడుగూడ వ్యవహారమువలన జీవునివలె ప్రమాత యగును. జీవుడు పరమార్థతః ఈశ్వరునివలె ఆత్మ యగుచున్నాడు. ఇది సిద్ధాంతము. కాన పైశ్రుతులు భేదసాధకములు గావు.

౯:౧౦. ఓయి! 'భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా' అను శ్రుతి జీవుడు భోక్తయనియు, ప్రధానము భోగ్యమనియు, ఈశ్వరుడు ప్రేరకుడనియు, పృథగీశ్వర జ్ఞానమువలననే ముక్తియనియును జెప్పుచున్నదిగదా? అనినచో నది యసంగతము.

అంతఃకరణ తాదాత్మ్యాధ్యాస నొందిన ప్రమాతయే భోక్త. అయస్కాంత శిల వికారమునొందకయే లోహమును గదలించినట్లు (చలింపజేసినట్లు) నిర్వికారుడయిన ఆత్మయే ప్రేరకుడు. ఆత్మభేదజ్ఞానము సంసారభయమునకు హేతువు. ఇది శ్రుతిసిద్ధాంతము. భేదజ్ఞానము మోక్షహేతు వని వర్ణించుట యజ్ఞానవిలసితము. ఇది నిజమైనచో లోకములో 'నేను వేరు, యీశ్వరుడు వేరు' ఈశ్వరుని పరోక్షునిగా దలచెడి మూఢులందఱికి మోక్షము రావలసివచ్చును. ద్రష్ట యగు నీశ్వరుడు జీవునకు గనిపించనందున ఈశ్వరుని యపరోక్షునిగా దెలిసికొనుట యసంగతము. పరమాత్మను అపరోక్షునిగా (ప్రత్యక్షముగా) దెలిసికొన్నను రాజును బ్రత్యక్షముగా దర్శించిన గ్రామీణునకు దుఃఖము తొలగనట్లు జీవునకుగూడ దుఃఖము తొలగదు. పైపెచ్చు తాపము పెరుగును. తనకంటె మించినవానిని చూచి యసూయపడి దుఃఖించుట లోకసహజము. జీవునకు గూడ నట్టిదుఃఖ మనివార్య

మగును, సంసారరహితుడయిన ఈశ్వరుని చూచినంతమాత్రమున జీవునకు సంసారము దొలగదు. యాచకుడు యాచించినంతమాత్రమున రాజు వానికి డబ్బిచ్చినట్లు జీవుడు సేవించినంతమాత్రమున గాని యాచించినందువనగాని యీశ్వరుడు మోక్షమిచ్చుట సంభవించదు. మోక్షము ధనమువలె నీయదగినదిగాదు. అట్టితటి దేయములన్నియు (ఈయదగినవన్నియు) అనిత్యము లయినట్లు మోక్షముగూడ ననిత్యమగును. పైగా నిర్వికారుడయిన యీశ్వరునకు దాతృత్వమను (ఇచ్చుటయు) వికారము పొసగదు. కావున బైశ్రుతిభేదజ్ఞానమునకు మోక్షహేతుత్వమును సాధింప నేరదు.

౧౧. ఓయి! జీవుడు సాక్షియగు నీశ్వరునికంటె భిన్నుడనియు భోక్తయనియు, 'తయో రన్యః పిప్పలంస్వాద్వత్తి' అను శ్రుతి చెప్పుచున్నదికదా? కాదు వినుము. నీవు జీవుడని తలచెడి ప్రమాతయే భోక్తం కేవలాత్మభోక్త గాదు. కేవలాత్మ సాక్షి. వాడే యిచట 'అనశ్న న్నన్యో ఽభిచాకశీతి' (భోక్తగానుండెను.) అని చెప్పబడెను. ఇట్టియాత్మయే ప్రమాతయొక్క నిజరూపము. నిజస్థితిలో ప్రమాత ఆత్మరూపుడే. అట్లుగాకున్న సాక్షియగు నాత్మ యనుభవించెడి స్వాప, అజ్ఞాన, ఆనందములను 'సుఖ మహ మస్వాప్సమ్ న కించి దవేదిషమ్' అను వాక్యముచే ప్రమాత యెట్లు స్మరించును.? కాన నీశ్వరునికంటె జీవుడు నిజస్థితిలో భిన్నుడు గాడు.

౧౨. ఓయి! క్షేత్రజ్ఞుడయిన ఆత్మ సాక్షి కానేరదు. సుషుప్తి, మూర్ఛా ప్రళయములయందు జొత్తుగా అజ్ఞానిగా నున్న క్షేత్రజ్ఞుడు సాక్షి యెట్లగును? అని అనినచో నట్లుకాదు. స్మరణ మెప్పుడును అనుభవపూర్వకము. స్మృతినిష్పత్తి లోగడ యనుభవమును గల్పింపవలెను. 'సుఖమహ మస్వాప్సమ్' అను ప్రత్యభిజ్ఞా జ్ఞానము భ్రాంతి యని త్రోసిపుచ్చరాదు. సుషుప్తియందు నీ వజ్ఞానివని నీవు తెలుసుకొనుచున్నావా? లేక నితరుడు తెలిసికొనుచున్నాడా? నీకు జ్ఞానమే (తెలివియే) లేదుగాన నీవు దెలిసికొనుటలేదు. మరియొక డచట లేనందున, నితరునికిని దెలియుటలేదు. 'యత్ర త్వస్య సర్వ మాత్మైవాభూత్ తత్ర కేన కం పశ్యేత్' అను శ్రుతి సుషుప్తి మున్నగు దశలయందు సర్వద్వైతము లేదని చెప్పుచున్నది. ద్వితీయపదార్థమే లేనపుడు రెండవవాడు దెలిసికొన్నాడను టెట్లు పొసగును? ఇక నాకు నిద్రలో నజ్ఞానమున్నదని యీశ్వరుడు దెలిసికొను చున్నాడనెదవా? ఈశ్వరుడు దెలిసికొన్నాడని నీ కెట్లు దెలిసినది? నీ కీశ్వరుడు చెప్పెనా? అదిగూడ నీవు కలగంటివా? కాన కలలో నీ కజ్ఞాన మున్నదనుటకు సాక్షి లేనందున అసాక్షికమయిన నీయజ్ఞానము శశశృంగాదులవలె నప్రసిద్ధము గావలయును. ఇట్లే సుషుప్తికిగూడ సాక్షిలేనందున సుషుప్తియు నసిద్ధమగును. దానికిగూడ నీవు సాక్షి కానేరవు. మరియొకడు సాక్షిలేడు. ఇక నదిమాత్ర మెట్లు సిద్ధించును? మరియు, నిద్రనుంచి నీవు లేవగనే మరియొకడువచ్చి నిన్ను 'ఇంత

కాలము నీవేమి చేయుచుంటివి ? అని యడుగగా నీ వేమి బదులు చెప్పెదవు ?
ఏమియులేదు' అని బదులుచెప్పెదవు. ఏజ్ఞానము నాకు లేదనుజ్ఞానముగూడ నీ
కప్పుడు లేనందున నీ వట్లు బదులుచెప్పుట యుచితము కాదు. కావున స్వాపాదుల
యందు నీకు నజ్ఞానాద్యుల యనుభవము గలదనియు, దానిని సాక్షి నీయాత్మ
యనియు జెప్పకతప్పదు. సాక్షిరూపముతో ననుభవించిన యజ్ఞానాదులను, సాక్షి
కంటె భిన్నుడయిన ప్రమాత స్మరించుట కుదరనందున ప్రమాత సాక్షికంటె
మిక్కిలి భిన్నుడుగాడు. సాక్షి ప్రమాతలకు సంసార తదభావముచే భేదము
కనిపించుచున్నందున సాక్షిప్రమాతలు మిక్కిలి యభిన్నులు గారు. ఈ రెండువిధ
ముల జెప్పనలవికానందున ప్రమాత మిథ్యాభూతు డగును. సాక్షియగు నాత్మ
యందు ప్రమాతృత్వము అజ్ఞానముచే గల్పింపబడినవి. కనుకనే అజ్ఞాని సంచరించు
చున్నాడు. జ్ఞాని ముక్తి నొందుచున్నాడు. కనుకనే 'అజా మేకాం లోహితశుక్ల
కృష్ణాం' అను శ్రుతి యజ్ఞాని సంసారము నొందుననియు, జ్ఞాని సంసరింపడనియును
జెప్పుచున్నది. ఇంక నీ శ్రుతికి, ప్రకృతిని సేవించుచున్న జీవుడు సంసరించుచున్నాడ
నియు, భోగముల నన్నిటిని యనుభవించిన యీశ్వరుడు ప్రకృతిని విడచుచున్నా
డనియు, నర్థమనినచో నిత్యముక్తుడయిన నీశ్వరునకు ప్రకృతి భోగమువలన
పూర్వము సంసారమున్నదనిచెప్పుట యనుచితము. మరియు ప్రకృతిని భుజించుచు
బద్ధుడయిన నీశ్వరునకు మోచకము నిచ్చువాడు (మోచకుడు=విడిపించువాడు)
మరియొకడు లేనందున ఈశ్వరునకు ముక్తియే లేకపోవును. ఇక జీవులే భుక్తభోగు
లనుటయు బొసగదు. జీవు లిప్పటికిని ప్రకృతి ననుభవించుచునే యున్నారు.
కావున, నీ శ్రుతి విద్వదవిద్వత్పరమనియే జెప్పవలయును విద్వాంసుడు జ్ఞాన
మబ్బక పూర్వము ప్రకృతిని యనుభవించును. జ్ఞాన మబ్బినపిదప ప్రకృతిని విడ
చును. ఆత్మయొక్కడయినను ప్రమాతృభేదముచే విద్వాంసుడు, అవిద్వాంసుడు
అను భేదము చెల్లును. లేక నుపాధిభేదమునగూడ నీభేదము పొసగును. కాన నీ శ్రుతి
జీవేశ్వరులకు భేదమును సాధింపనేరదు.

౧౩. ఓయి! విద్వాంసులుమాత్రము ప్రకృతి నెట్లు విడువగలుగుదురు? దాని
కంతమే లేదుగదా? 'గౌ రనాద్యంతవతీ' అను శ్రుతి, ప్రకృతికి నాశములేదని చెప్పు
చున్నది అనినచో, నిదెంతటిమాట? వ్యవహార ముండునంతవరకు, జ్ఞానముగలుగు
నంతవరకు ప్రకృతికి నాశములేకపోవుట వాస్తవము. జ్ఞానము కలిగిన తరువాత అజ్ఞా
నము నశించునని 'జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః' అను గీతా
వచనము చెప్పుచున్నది. ప్రకృతి యనగా అజ్ఞానమని యింతకుమున్నే చెప్పియుం
టిమి. జ్ఞానాజ్ఞానములకు విరోధము లోకసమ్మతము. అజ్ఞానము, జ్ఞానాభావరూప
మనుట యనుచితము. లోకములో, నే నజ్ఞానముగలవానిని అని ప్రతీతికలదుగాని,
నేను జ్ఞానాభావము గలవాని నను ప్రతీతి లేదు. జ్ఞానాభావము జ్ఞానము నావరింప

లేదు. అంధకారము గూడ భావపదార్థముగాని, తేజోఽభావరూపముగాదు. అంధకారము దృగ్గోచరమగుచున్నది. కాన నంధకారమువలె, నజ్ఞానముగూడ భావరూపమే. అప్పుడే యజ్ఞానమునకు నావరణశక్తి యేర్పడును. కాన నజ్ఞానము అనాదిగాని, యనన్తము (నాశములేనిది) గాదు.

౧౮. ఓయి! 'అజో హ్యేకో జుషమాణః' అను శ్రుతి విస్పష్టవిద్యావిషయమయినను 'సమానే వృక్షే పురుషో నిమగ్నో అనీశయా శోచతి ముహ్యమానః' అను శ్రుతిమాత్రము జీవేశ్వరులకు దప్పక భేదమును జెప్పుచున్నది. సమానవృక్షమనగా నొకే శరీరము. అందు నిమగ్నుడయిన జీవుడు, వ్యామోహము నొందుచు నసమర్థుడై దుఃఖించుచున్నాడు. పిదప దనకంటె వేరయిన యీశ్వరుని, వానిమహిమను, దెలిసికొనినజీవుడు దుఃఖరహితుడగుచున్నాడు. అని దీనియర్థము. కాన జీవేశ్వరులు భిన్నులనక దప్పదు. అనినచో నఖండనము.

ఈ శ్రుతి ప్రమాతను సాక్షినిగురించి చెప్పుచున్నది. ప్రమాత, శరీర తాదాత్మ్యాధ్యాసను బొందియున్నందున శరీరమునందు నిమగ్నుడగును. సాక్షి కది లేనందున శరీరమునందు నిమగ్నుడు గాడు. సుషుప్తియందు సాక్షికి శరీరతాదాత్మ్యాధ్యాస లేనట్లు, జాగ్రత్స్వప్నములయందు గూడ సాక్షికి తాదాత్మ్యాధ్యాస లేదు. తాను వికారము నొందక, జరుగుదానిని గుర్తించువాడు సాక్షి. జాగ్రదాద్యవస్థలయందు గూడ వృత్తిలేనపుడు యసంసారిత్వరూపమయిన సాక్షిస్వరూపమును గుర్తింపవీలగును. సాక్షియే ప్రమాతకాత్మ. కాన నెపుడు ప్రమాత 'అహం బ్రహ్మాస్మి' నేను బ్రహ్మను అను జ్ఞానవశమున తాను సాక్షిననియు, దనకు స్వయంప్రకాశత్వరూపమయిన మహిమకలదనియు దెలిసికొనునో. అపుడు తాను సంసారి కాననియు, సాక్షిననియు, నిర్ణయించుకొని దుఃఖరహితుడగును. ఇంతియేకాని తనకంటె నీశ్వరుడు వేరనుభేదజ్ఞానమువలన దనకు సంసారము నివర్తించదు. వైష్ణవమతమున అర్చావతారములుగూడ నీశ్వరస్వరూపములేగదా! అట్టి శ్రీరంగనాయకాద్యర్చావతారములను దర్శించినంతమాత్రమున సంసారము నివర్తించుచున్నదా? లేదు. కావున నీశ్రుతిగూడ జీవేశ్వరభేదమును సాధింపనేరదు.

౧౯. ఓయి! 'య ఆత్మని తిష్ఠ న్నాత్మనోఽన్తరోఽయమాత్మా న వేద' ఇత్యాద్యన్తర్యామిబ్రాహ్మణము ఆత్మయం దన్తర్యామిచైతన్య మున్నదని చెప్పుచు జీవబ్రహ్మలకు భేదమును సాధించుచున్న దనినచో నదియును, జీవపరమాత్మలకు భేదమును సాధింపనేరదు. ఆశ్రుతియందలి యాత్మశబ్దము బుద్ధ్యాద్యర్థకము. సాక్షిపరముగాదు. సాక్షియే సర్వాన్తరుడు. వానికి మరియొకడు అంతరుడగు సాక్షి లేడు. అట్లుండునని కల్పించినచో వానికి మరియొకడు, వానికి మరియొకడు అని యనవస్థ యేర్పడును.

'నాన్యోఽతోఽస్తి ద్రష్టా' అను శ్రుతి మరియొకసాక్షి లేదని నిషేధించు చున్నది. 'సాక్షీచేతా కేవలో నిర్గుణశ్చ' అను శ్రుతి యీశ్వరుడే సాక్షి యని చెప్పుచున్నది. కావున సాక్షికంటె నీశ్వరుడు వేరుగాడు. సాక్షియగు క్షేత్రజ్ఞుడే యీశ్వరుడు. ఈశ్వరుడే సాక్షియగునుగాని, క్షేత్రజ్ఞుడు సాక్షి గానేరడని యన దగదు. సాక్షికానివాడు క్షేత్రజ్ఞుడు గానేరడు. ప్రమాత సాక్షిగాడు. ప్రమాత వికారమునొందును. తనవికారమును దాను దెలిసికొనుట యసంగతము. కావున ప్రమాతయొక్క వికారములను దెలిసికొనుసాక్షి ప్రమాతకంటె వేరని చెప్పనగును. కావున బైశ్రుతివలన ప్రమాతకు నీశ్వరునకు భేదము కనుపడునుగాని, క్షేత్రజ్ఞేశ్వరులకు (సాక్షి) భేదము దెలియబడదు.

౧౬, ౧౭. ఓయి! శ్రుతి యక్షరునకుగూడ నంతరాత్మ యుండునని చెప్పుచున్నది. పరిచ్ఛిన్నుడయిన జీవసాక్షి జీవులయం దంతరాత్మగ నుండినను అక్షర పురుషులయందుమాత్రము జీవసాక్షి యంతరాత్మగ నుండుట కుదరదు. కాన సర్వభూతాన్తరాత్మ నారాయణుడేకాని, క్షేత్రజ్ఞుడగు సాక్షిగాడు. అనినచో కాదు. 'చేతనా చేతనభిదా కూటస్థాత్మకృతా న హి, కింతు బుద్ధికృతా భాసకృతై వేత్యవిగమ్యతామ్' ఇది చేతనము, ఇది యచేతనము- అను భేదము, కూటస్థాత్మను బుచ్చుకొనిరాలేదు. 'అనగా కూటస్థాత్మ యున్నది చేతనము, కూటస్థాత్మలేనిది యచేతనము.' అని కాదు. బుద్ధికృతమయిన నాభాస చైతన్యముగలది చేతనమనియు, అదిలేనిది యచేతనమనియును భేదము లోకసిద్ధము. దీనినిబట్టి యచేతన వస్తువులందుగూడ సాక్షికలడనియు, ప్రమాతమాత్ర ముండడనియు దేలినది. కాన ప్రమాతయే పరిచ్ఛిన్నుడు, సాక్షియే పరిపూర్ణుడు. కనుకనే సాక్షి యద్వితీయుడు. ఈతడు జ్ఞాత, స్వయంప్రకాశుడు, సర్వప్రమాతల కంతర్యామి. కావున నారాయణు డనబడుచున్నాడు. శరీరములు మృతిజెందినను ప్రమాతలు నశించరుగాన, నరులనగా సకలభూతము (ఎల్లజీవు) లని యర్థము. వారిసమూహము నారము. ఆసమూహము స్థానముగా గలవాడు నారాయణు డని నారాయణపదమునకు వ్యుత్పత్తి. ఇట్టి సాక్షి యంతటనున్నను, దేనితోను సంబంధములేనందున ఆకాశము వలె, నపహతపాప్మ (పాపమంటనివాడు) యగుచున్నాడు. అనగా నెట్టివికారములు లేనివాడని యర్థము.

౧౮. ఓయి! ఇట్లైనచో సాక్షికి సర్వులను శాసించుట కుదరదు. శాసించుట యీశ్వరునిధర్మము. సాక్షి నిర్వికారుడు. నిర్వికారునకు శాసించుట యను వికారము దుర్ఘటము, అనినచో నోయి రామానుజా! ఈదోషము నీకుగూడ సమానమే. నీవలనగూడ 'సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ' అనుశ్రుతినిపట్టి యీశ్వరునకు సాక్షిత్వము నంగీకరించుచుంటివి. కాన సాక్షియయిన నీశ్వరునకుమాత్రము శాసన మెట్లు ఘటించును ? సాక్షి నిర్వికారుడని నీవు నాకు చెప్పినదేకదా ! నీ యీశ్వరు

డును సాక్షియయినప్పుడు నిర్వికారుడగునుకదా? అట్టివాడ వానికిమాత్రము శాసన మను వికార మెట్లు ఘటించును?

అయితే (రెండువృక్షముల దోషమున్నచో) శ్రుతికి గతియేమి? ఈమాట మా వా రడిగినచో మేము జవాబు చెప్పుదుము. మీ కేల చెప్పవలె? అయ స్కాంతశిలాలోహన్యాయమున నిర్వికారమయిన సాక్షికిగూడ శాసనము పొసగును.

అయస్కాంతశిల చలనాదివికారములు లేకుండగనే లోహమును ఆకర్షించు చున్నది. కాన 'అంతః ప్రవిష్ట శ్శాస్తా జనానాం' అను శ్రుతిగూడ సాక్షిపరమే. సాక్షియే సర్వప్రమాతలకు లోపల నుండును. శాసనముచేయుటవలననే సాక్షి యీశ్వరు డనబడుచున్నాడు.

౧౫. ఓయి! సాక్షిచైతన్యము సృష్టినిచేయలేదు. సృష్టిసంకల్పపూర్వకముగ జరుగును. సంకల్పము మనోధర్మము. సాక్షికి మనస్సులేదు. సాక్షి సృష్టికర్తగాడు. అయినచో రామానుజా! మీ ఈశ్వరునకు మనస్సు కలదా? లేదే. మహాభూతముల యొక్క సత్వాంశములవలన బుట్టెడిమనస్సు మహాభూతసృష్టికి పూర్వముననున్న యీశ్వరున కెట్లుండును? ఇక మాయీశ్వరునకు మాయచే సంకల్పము కలుగు నన్నచో మాసాక్షికిగూడ దానివలననే సంకల్పము కలుగును. అయితే జ్ఞాన స్వరూపుడయిన సాక్షికి, అజ్ఞాన (మాయా) సంబంధ మెట్లని యందురేమో? మీమతమున సర్వజ్ఞుడయిన ఈశ్వరునకు అజ్ఞానసంబంధ మెట్లో అట్లే మాసాక్షికి గూడ నజ్ఞానసంబంధము పొసగును.

మరియు సాక్షిస్వరూపమయిన జ్ఞానము అజ్ఞానమునకు విరోధికాదు. పైపెచ్చు అజ్ఞానమును భాసింపజేయును. కాన సాక్షికి నజ్ఞానసంబంధ ముపపన్నమని మా వారికి మేము చెప్పెడి సమాధానము.

నిజస్థితిలో సాక్షి- యజ్ఞానములకు సంబంధము, జగద్రూపకార్యము, యితర విధమున గుదరనందున కల్పితముగాని, వాస్తవము గాదు. ప్రపంచమే నిజముగ లేదు. కనుకనే ఆత్మ యనంగాద్వితీయు డగుచున్నాడు. ప్రపంచము వాస్తవ మను మీరు సుషుప్తి ప్రళయములందు ప్రపంచము జూపగలరా? చూపలేరు. ప్రళయా దులయందు ప్రపంచము సూక్ష్మరూపముతో నున్నదనినచో, ముక్తిదశలో సూక్ష్మ రూపముతోగూడ లేదని మే మందుము. ఒకరూపములేదని మీ రంగీకరించినపుడు రెండవరూపముగూడ నుండదని మే మేల జెప్పరాదు? 'యత్ర త్వస్య సర్వ మాత్మైవాభూత్ తత్కేన కిం పశ్యేత్' ఇత్యాది శ్రుతులు ముక్తిలో ప్రపంచము లేదని చెప్పుచున్నవి.

అయితే సుషుప్తియందు అజ్ఞాన మున్నట్లు ముక్తియందుగూడ నజ్ఞాన ముండునని కల్పింతుమన్నచో, నపుడు నిదురించినవానివలె ముక్తులుగూడ లేచి రావలసివచ్చును. నిదురించినవాని దృష్టిలో ప్రపంచము లేనట్లు ముక్తుల దృష్టిలో

నది లేదన్నను నితరుల దృష్టిలో నది యుండునుకదా? ఉండనిమ్ము. మా కేమి? మేము ముక్తదృష్టిలో నజ్ఞానము లేదనియే చెప్పుచున్నాము. విద్వాంసులయిన ముక్తులకు గోచరించునది వాస్తవము. (పారమార్థికము). అవిద్వాంసులకు గోచరించునది మిథ్యాభూతము. కాన ముక్తుల దృష్టిలో ఆత్మయొక్కడే గలడు. ప్రపంచముకాని యజ్ఞానముగాని యేమియు లేదు. ఈ రెండును యున్న వనుకొనుట భ్రాంతిగాని వేరొండుగాదు.

౨౦. ఓయి! నిర్గుణుడయిన సాక్షికి కామము (కోరిక) సంభవించదు. 'సోఽకామయత' అను శ్రుతి సృష్టికర్త కోరెనని చెప్పుచున్నది. కాన నీ శ్రుతి సగుణేశ్వరుని చెప్పుచున్నది. కాని నిర్గుణసాక్షిని చెప్పదు. కనుక నీశ్వరుడు సగుణుడే. నిర్గుణసాక్షి యీశ్వరుడు గానేరడు-అనినచో నట్లు కాదు. నిర్గుణుడయిన సాక్షికిని గూడ మాయావశమున కామముండును. (కోరిక యుండును). జీవునకు కామసంకల్పాదు లెట్లు మనోధర్మములో నట్లే యీశ్వరునకు గూడ నివి మాయాధర్మములు. సాక్షియయిన ఈశ్వరుని మాయి. అయితే పరిపూర్ణుడయిన సాక్షికి 'తదేవానుప్రావిశత్' అను శ్రుతి చెప్పెడి యనుప్రవేశ మెట్లు కుదురును? నీవుగూడ నీశ్వరుడు పరిపూర్ణు డని యంగీకరించుచుంటివే? పరిపూర్ణుడయిన మీ యీశ్వరునకు మాత్ర మనుప్రవేశ మెట్లు కుదురును? జీవరూపముతో ప్రవేశము కుదురునని నీవన్నచో జీవునికంటె మిక్కిలి విలక్షణు డయిన ఈశ్వరునకు జీవరూపమున ప్రవేశ మెట్లు సంభవించును?

ఇక నంతర్యామిరూపముతో ప్రవేశమన్నచో నీశ్వరుడు ప్రవేశించక పూర్వమే యన్తర్యామి యచట నుండెకదా? యింక నారూపముతో ప్రవేశ మెందులకు? అట్లు లేదందువా? నీమతమున నీశ్వరుడు అపరిపూర్ణు డన్నమాటయే. మామతమునందు పరిపూర్ణుడయి సాక్షికి అంతఃకరణోపహితత్వరూపముతో ప్రవేశ ముపపన్న మని మాకు సమాధానము గలదు. అంతఃకరణోపహితుడే సాక్షికదా? అని యందువేమో? అట్లనకుము, అంతఃకరణోపహితుడుగూడ సాక్షి యగును. అవిద్యోపహితుడు,మాయోపహితుడుగూడసాక్షియగును. మాయావిద్యలు రెండును పర్యాయపదములు. అయితే అవిద్యోపహితుడు అంతఃకరణోపహితు డెట్లగును? మఠోపహితమయిన ఆకాశము,మఠములోపల నున్నఘటోపహిత మెట్లయినది? మఠఘటములను నుపాధిభేదమువలన అనియన్నచో, నట్లే యిచటగూడ అవిద్యాంతఃకరణములను నుపాధిభేదమువలన ఉపహితములయినవారలకు భేద మని గ్రహింపుము. ఔపాధిక భేదము అకించిత్కరము. ఘటమఠములు భేదించినంతమాత్రమున ఆకాశమునకు నిజముగా భేదములేదు.

'అంతఃకరణావచ్ఛిన్నుడు జీవుడు. తదుపహితుడు జీవసాక్షి మాయావచ్ఛిన్నుడీశ్వరుడు. తదుపహితు డీశ్వరసాక్షి' అని కదా? వేదాంతపరిభాషయందు

జెప్పినది నిజమే. అయ్యది మతాంతరాభిప్రాయములతో జెప్పబడినది. ఇచట 'సాక్షీ చేతా' ఇత్యాది శ్రుతివలన నీశ్వరు డొక్కడే సాక్షిగా బ్రతిపాదింపబడి నందున, ఈశ్వరునికంటె వేరుసాక్షి కల్పింపబనిలేదు. ఈయీశ్వరుడే యంతఃకరణోప హితుడై జీవసాక్షి యగునని చెప్పుట యుచితమగుచుండ సాక్షిద్వయమును గల్పించుట యనవసరము. అయితే, యిట్లు సాక్ష్యైకత్వమును సాధించుట శ్రుతిసమ్మతమయినను అనుభవమునకు విరుద్ధముగదా? దేవదత్త యజ్ఞదత్తుల సాక్షి యేకమగుచుండ దేవదత్త సాక్షి యనుభవించిన నిద్రాదులను దేవదత్తు డను ప్రమాత స్మరించినట్లు యజ్ఞదత్తుడను బ్రమాతకూడ స్మరించవలసివచ్చును. అనినచో, నది యనుచితము. సాక్షి యొక్కడయినను యే యంతఃకరణముతో దేని ననుభవించునో ఆ యంతఃకరణావచ్ఛిన్నుడే దానిని స్మరించును కాని, యితరాంతఃకరణావచ్ఛిన్నుడు దానిని స్మరింపజాలడు. ఇట్టినియమ మంగీకరించిన నెట్టిదగు దోషమును లేదు.

ఓయి! 'తదను ప్రవిశ్య సచ్చ త్యచ్చాభవత్' అని జ్ఞానస్వరూపు డయిన సాక్షికి భూతపంచకాత్మత్వ మెట్లు పొసగును? (ఈ శ్రుతియందలి సచ్ఛబ్దమునకు వాయ్వాకాశము లర్థము. తచ్ఛబ్దమునకు పృథివ్యప్తేజస్సు లర్థము) మామతమునం దయితే యీశ్వరుడు చిదచిద్విశిష్టుడుగనుక, అచిదంశములయిన భూతముల యొక్క స్వరూపమునొందుట యీశ్వరునకు బొసగును అనినచో నిది యొక దోషము గాదు.

సాక్షికిగూడ మాయావశమున జగదాత్మకత్వము సంభవించును. అజ్ఞాన (మాయా) వశమున స్థాణువునకు పురుషాకారము, త్రాటనకు సర్పాకారము, ఆకాశమునకు నీలరూపము గలుగుట లోకానుభవసిద్ధ మయియున్నది. మాయ యచిద్రూపము గాదు. చిచ్ఛక్తియే మాయ యనబడును. కాన చిచ్ఛక్తి యయిన మాయ చిద్రూపు డయిన సాక్షియం దుండుట విరుద్ధముగాదు. అంతమాత్రమున సాక్షి యచిద్విశిష్టు డని యనరాదు. మాయాశక్తికి వేరుగ స్వరూపసత్తలు లేవు. అది కార్యవశమున నూహింపదగియున్నది. అగ్నియొక్క దహనప్రకాశశక్తు లెట్లు కార్యగమ్యములో నట్లే మాయాశక్తిగూడ కార్యగమ్య మని యనదగును. అగ్ని యొక్కశక్తితో నగ్నికి సద్వితీయత్వము లేదు. అగ్ని యొకటి, దానిశక్తి మఱి యొకటి అని రెండుపదార్థములుగ గ్రహింపబడుట లేదు. అట్లే సాక్షికంటె వేరుగ మాయాశక్తి లేదు. కాన మిథ్యాభూతమయిన మాయతో సాక్షికి వైశిష్ట్యము (కలయిక) అసంభవము. కాన సాక్షి చిన్మాత్రుడనుట నిర్వివాదము.

ఇందు నీ రహస్యమును గమనింపవలెను.

త్రాటియొక్కనిజరూపముదెలియనపుడు సర్పభ్రాంతిపుట్టినట్లు, సాక్షియొక్క స్వరూపసాక్షాత్కారము లేనపుడు, జగద్భ్రాంతి పుట్టును. దీనిని నిమిత్తముగాం

జేసికొని సాక్షి మాయచే జగత్తును బుట్టించుచున్నాడని ప్రతీతి కలిగినది. ఇంతియె కాని నిజముగ సాక్షి ప్రపంచమును బుట్టించుట లేదు. నిర్వికారునియందు సృష్టి వికార మసంభవము. కనుకనే వానియందు నిజముగ మాయ లేదు. కనుకనే చైతన్యము సజాతీయవిజాతీయస్వగతభేదశూన్యమయిన నద్వితీయబ్రహ్మ మని చెప్పబడుచున్నది. ఇట్టిబ్రహ్మయం దెవ్విధమగు భేదమును గల్పింప వలనుపడదు.

ఇక 'ప్రకృతిం విద్ధి మే పరాం జీవభూతాం' ఇత్యాది స్మృతులను శ్రీ శంకరులే అద్వైతపరముగ వ్యాఖ్యానించిరికాన మే మిచట మరల వ్యాఖ్యానింప బనిలేదు. కావున శ్రుతిస్మృతు లెవ్వియు జీవేశ్వరభేదాదులను నిరూపించుటకు బ్రమాణములు గావు. అందు కొకయజ్ఞానమే ప్రమాణము. యథార్థస్థితిలో ద్వైతవాదులకు జీవేశ్వరభేదవాదిను లగు శ్రుతులు ప్రమాణములు. అభేదవాదినులగు శ్రుతులు వారిమెడల కురిత్రాళ్ళు. అద్వైతవాదులకు వ్యవహారదశలో భేదశ్రుతులు, పరమార్థదశలో నభేదశ్రుతులును బ్రమాణములుకాన వీరికి శ్రుతివిరోధము లేశమున్ను లేదు.

విశిష్టాద్వైతులకు శ్రుతు లిసుమంతయు ననుకూలింపవు. శ్రుతులయందు విశిష్టాద్వైత మెచ్చటను లేదు. ఇట్లుండట మేము భేదాభేదశ్రుతులకు విరోధమును బోగొట్టసమకట్టితిమని వైష్ణవు లనుకొనుట వెఱ్ఱితనము. అట్టివైష్ణవుల నాదరించువా రంతకంటెను వెఱ్ఱివారు. వీ రుభయులు అవైదికు లని యనదగుదురు.

ఇక వైష్ణవులు మామతము శ్రుతిసమ్మతము గాకున్నను, న్యాయసమ్మతమని యందురు. అది యెంత సొబగుగనున్నదో చూడుడు:- విశిష్టత్వము, అద్వైతత్వము యీ రెండు నొకచోట సంభవింపవు. కాన వీరిమతమునకు బెట్టినపేరే అన్యాయము. మత మెట్లు న్యాయసమ్మతమగును? అది మఱియంత అన్యాయము, ఇంక విశిష్టములయిన రెంటికి నద్వైత మని వారిమతనామమునకు వ్యుత్పత్తి చెప్పినచో, నదిమాత్ర మేమి న్యాయము? దండవిశిష్టపురుషుడు, పటవిశిష్టపురుషుడు వీ రిరువు రొక్క రగుదురా? స్థూలచిదచిద్విశిష్టుడు, సూక్ష్మచిదచిద్విశిష్టుడు - వీరిద్దరు యొక్క రను నాశయముతో విశిష్టాద్వైతమని నామమిడితిమన్న నదిమాత్ర మెంత సొగసుగనున్నది? పరస్పరవిరుద్ధములైన స్థూలసూక్ష్మము లొకచోట అభేదమునొందు టెట్లు? ఇక విశేషణాంశములను వదలి, విశేష్యాంశమునకుమాత్రము ఐక్యమును జెప్పెద మన్నచో నపుడు స్వమతమును విడనాడి యద్వైతమతమును అంగీకరించినవా రగుదురు. తత్త్వమసీత్యాది వాక్యములయం దద్వైతులు విశేషణాంశపరిత్యాగముచే వాక్యార్థమును నిరూపించిరి. దానిని విశిష్టాద్వైతు లంగీకరించినచో నద్వైతమునందు జేరినట్లే యగుదురు. జీవేశ్వరుల కభేదమును జెప్పువా రద్వైతులు. ఈశ్వరునకుమాత్ర మభేదమును జెప్పువారు విశిష్టాద్వైతులు. కాన శరీరిపురకు భేదము గలదు అనినచో నదియును బొసగదు. ఈశ్వరున కొక్కనికి

భేదమే ప్రసక్తించనప్పుడు, దానిని(భేదమును) నిషేధించి యభేదమును సాధింపనేల శ్రీరాముడు, పరశురాముడు అని యిద్దరు రాములు వేరువేరుగ నున్నట్లు, స్థూల చిదచిద్విశిష్టుడు, సూక్ష్మచిదచిద్విశిష్టుడు అని యిద్దరున్నచో, వీరిద్దరకు నీశ్వర రూపముతో నభేదమును జెప్పదగును. అట్లు లేదు. సూక్ష్మోపాధి ప్రళయకాలమం దున్నది. స్థూలోపాధి ప్రపంచమునందు గనిపించుచున్నది. ఇంక మీరు పూర్వము దశరథునివలన బుట్టినవాడు, యిప్పుడు వసుదేవునివలన బుట్టినట్లు- ప్రళయకాలమున సూక్ష్మరూపముతోనున్నవాడు, యిప్పుడు స్థూలోపాధితోనున్నాడుగావున వీరిరువు రకు నభేదమును జెప్పవలసివచ్చెనన్నచో నదిమాత్ర మేమంతస్వరసము? ఉపాధి స్థూలసూక్ష్మరూపములతో వికారమునొందుచున్నను, ఉపహితమగు చైతన్యము వికారమును జెందదని యొప్పి, నిర్వికారుడయిన ఈశ్వరుని ప్రతిపాదించుట సులభ మగుచుండ, నెందుకీ విశిష్టాద్వైత మను శ్రుతివిరుద్ధమయిన మతమును ద్రొక్కుట? ఇట్టి విశిష్టాద్వైతము నంగీకరించిన మీరు పూర్వము పురుగుశరీరములో నున్న జీవు డిప్పుడు మనుష్యశరీరములోకి రాగా వీరిరువురికిగూడ విశిష్టాద్వైతము నేల గల్పింపరు? కాన వీరి మతనామమే యుక్తిసమ్మతముగ లేదు.

మరియు రామానుజులు వారిమతమం దెవ్విధమగు విరోధము లేదని ప్రతిజ్ఞ చేయుచు గొన్నిమాటల నుదహరించిరి. వాటిని వివరించెదము:-

౧. "అనేన జీవే నాత్మ నానుప్రవిశ్య"అను శ్రుతి జీవుడు బ్రహ్మరూపుడని చెప్పుచున్నది. అనగా జీవుడు బ్రహ్మాత్మకమయినశరీరమని యర్థము. అప్పుడే "తదనుప్రవిశ్య సచ్చత్యచ్చాభవత్" అను శ్రుతి సరిపోవును.

౨. కార్యావస్థుడును, కారణావస్థుడును, సూక్ష్మచిదచిద్విశిష్టవస్తుశరీరు డయిన బరమాత్మయే.

3. కార్యము కారణముతో నభిన్నముగాన, ఏకవిజ్ఞానముచే సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞయుపపన్నది యుపపన్నమగును.

౪. సమస్తపదములు చిదచిద్విశిష్టపరమాత్మవాచకములుగాన సర్వవేదవేద్య త్వము బ్రహ్మకు ముఖ్యముగానే సిద్ధించును.

౫. స్థూల, సూక్ష్మ భేదముచే చిదచిద్విశిష్టమగుచు బ్రహ్మయే కార్యము, కారణము నగుచున్నాడు. కాన, సంఘాత ముపాదానమయినను, చిదచిద్బ్రహ్మలకు స్వాభావసాంకర్యము లేదు.

౬. పరబ్రహ్మ కార్యప్రపంచమున బ్రవేశించినను, స్వరూపమునకు మార్పు లేనందున ఆతనికి నిర్వికారత్వముచెల్లును.

౭. నామరూపవిభాగములతో భేదించిన స్థూలావస్థగల చిదచిద్వస్తువు ఆత్మ రూపముతో నున్నందున, బ్రహ్మకు కార్యత్వముగూడ నుపపన్నమగును. మరియొక యవస్థను బొందుటయే బ్రహ్మకు కార్యత్వము.

౮. పరబ్రహ్మయందు హేయగుణములు లేనందున నిర్గుణవాదముకు దుకును.

౯. సర్వజ్ఞుడయిన ఈశ్వరునియొక్క స్వరూపము జ్ఞానమాత్రముచే నిరూపింపదగియున్నందునను, ఆతడు స్వయంప్రకాశరూపుడయినందునను "జ్ఞానస్వరూపం బ్రహ్మ" అను వాదము కుదురును.

౧౦. లోకములో అన్నివస్తువులు బ్రహ్మాత్మకములై భిన్నభిన్నములుగా నున్నవి కాని, బ్రహ్మాత్మకములు గాకుండ భిన్నములుగా లేవు అని నిషేధించుటచే "నేహ నానాస్తి" అను నిషేధవాక్యము లుపపన్నము లగును.

౧౧. ఇట్లు చిదచిదీశ్వరులకు స్వరూపమునను, స్వభావమునను భేదముంకుటచే అభేదవాదము చెల్లదు. ఇవి వారిభాష్యమునందలి పలుకులు.

ఇక నీపలుకులస్వారస్యమును విచారింతము.

౧. ఈశ్వరుడు చిదచిద్విశిష్టుడని రామానుజులసిద్ధాంతము. అనగా నీశ్వర శరీరమునందు చిజ్జడభాగములు రెండు కలసియుండు నని భావము, ఇట్టితఱి "అనేన జీవేన" అను శ్రుతికి నీశ్వరుడు చిచ్ఛరీరముతో ప్రవేశించె నని యర్థమును జెప్పు టెట్లు పొసగును? అచిద్భాగము కలియనిదే యీశ్వరశరీరమే యేర్పడదనికదా? వారందురు. ఇక వారు యీశ్వరునకు చిచ్ఛరీరము వేరుగను, అచిచ్ఛరీరము వేరుగను రెండు గలవని యనవలయును. అట్లన్నచో, జీవశరీరము చిచ్ఛరీర మెట్లగును? అంతఃకరణాద్యచిద్భాగములతోఁగూడినవాడుకదా జీవుడు! ఇట్టిజీవుడు యీశ్వరునకు చిచ్ఛరీర మెట్లగును? ఇట్లే చిన్మిశ్రితయిన యచిత్తగు దేహముగూడ నీశ్వరునకు శరీరము కాకపోవును.

ఓయి! మేము ఈశ్వరునకు పాషాణాదులు అచేతనశరీరమనియు, జీవుడు చేతనశరీరమనియు, దేహము జీవశరీరముగాన, జీవద్వారా శరీరమనియు నందుము. అందు తప్పేమి? వినుము. జీవశరీరమయిన దేహమునందు స్వయముగా నీశ్వరుడు లేనటులేకదా? ఇట్టితరి 'సమానే వృక్షే పరిషస్వజాతే' (జీవేశ్వరు లిద్దరు ఒకే వృక్షము (శరీరము) నం దుండిరి.) అను శ్రుతికి విరోధము తటస్థించును. పైశ్రుతి జీవునివలె జీవదేహమునం దీశ్వరుడుగూడ నున్నటుల జెప్పుచున్నది.

మరియు దేహమునం దీశ్వరుడు జీవద్వారమున నుండునన్నచో దేహము నుంచి జీవుడు లేచిపోయినపుడు వానితోబాటు యీశ్వరుడుగూడ లేచిపోవలసి వచ్చును. అపుడు అచేతనమయిన మృతశరీరమునందు ఈశ్వరుడు లేనందున 'అచిద్వస్తువంతయు నీశ్వరశరీర' మను మీ సిద్ధాంతమునకు భంగము కలుగును.

ఇంక జీవునియందు దేహమునందు మృదాదులయందును ఈశ్వరుడు గల డన్నచో నపుడు దేహమునం దొకయీశ్వరుడు దేహములోపలనున్న జీవునిలో నొకయీశ్వరుడు యి ట్లిద్దరీశ్వరు లుండవలసివచ్చును.

ఈశ్వరుడు దేహమునందు పరరూపముతో నుండెననియు జీవునియం దంత
ర్యామిరూపముతో నుండెననియును జెప్పుట యనుచితము. జీవునివలె నీశ్వరుడు
దేహి గావలయును. దేహమునందున్న పరమేశ్వరునియందు జీవు డున్నాడు కనుక
జీవుడు పరమేశ్వరునకు అంతర్యామి యగును. ఇది సిద్ధాంత విరుద్ధము.

మరియు నీశ్వరుడు చిదచిచ్ఛరీరు డీశ్వరు డగుచో, గనుపించు నెదచిత్పదా
ర్థము లీశ్వరరూపములు కాకపోవును. ఇది సమ్మతించిన 'సర్వం ఖల్విదం బ్రహ్మ'
అను శ్రుతి విరోధించును. 'వాసుదేవ స్సర్వమ్' అను గీతావచనమునకును విరోధ
మేర్పడును. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అను శ్రుతియందలి సర్వశబ్దమునకు 'సర్వము
శరీరముగా కలవాడు బ్రహ్మ'యని యర్థమును జెప్పుటకు సర్వశబ్దమునందు లక్షణ
యంగీకరింపవలెను. 'అంత ర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణస్స్థితః' అను
శ్రుతి ప్రపంచముకంటె బయట బ్రహ్మకలడని చెప్పుచున్నది. దీనిబట్టి ప్రపంచము
నకు బయటనున్న బ్రహ్మ ప్రపంచమునకు శరీరమని యనదగును. అట్టితఱి 'పూర్ణస్య
పూర్ణ మాదాయ' అను శ్రుతి చెప్పెడి, పరమాత్మయొక్క పరిపూర్ణతకు భంగము
గలుగును. బ్రహ్మకంటె వేరుగ ప్రపంచమున్నపుడు బ్రహ్మ పరిపూర్ణ డెట్లగును?
చిదచిదాత్మకమయిన సర్వప్రపంచము బ్రహ్మభిన్నమగుచుండ బ్రహ్మ సర్వశబ్ద
వాచ్యమగుట దుర్లభము. సర్వము శరీరముగా నున్నంతమాత్రమున సర్వశబ్ద
వాచ్యత్వము బ్రహ్మకు చెప్పదగదు. జీవుడు మనుష్యుడని చెప్పిన ట్లయ్యది యవి
వేక మూల మగును. శరీరముకంటె జీవుడు వేరని తెలిసికొనినవా డెవ్వడును, జీవుడు
మనిషి యనికాని, పశువనికాని చెప్పడు. అట్లు చెప్పినవాడు పశు వన్నమాటే.
అయితే యీశ్వరుడు సర్వశబ్దవాచ్యు డనుట యవివేకమూలకమని యంగీకరింతు
మన్నచో 'వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః' అని సాక్షాత్ సర్వజ్ఞుడయిన శ్రీ
కృష్ణుడే నేను వేదవేద్యుడ నని చెప్పియుండ నది భ్రమమూల మని మన మెట్లన
గలము? వేదములు శబ్దాత్మకములేకదా?

మరియు ఘటపటాదిశబ్దముల కన్నిటికి నీశ్వరు డర్థమన్నచో, నింక పదా
ర్థములను బోధించుపదము లెవ్వి? లోకవ్యవహార మెట్లు జరుగును? ఒక్క
యీశ్వరునితో వ్యవహారప్రపంచము నడచునా? కాక ఘట పదమునకు, ఘటాంత
ర్యామి పదమునకును ఈ రెంటికి, ఈశ్వరుడే యర్థమనుట విరుద్ధము. సర్వపదములు
చిదచిద్విశిష్టపరమాత్మవాచకము లను మాటకూడ కుదరదు. 'చిదచిద్విశిష్ట' అను
సమాసమునందలి 'చిత్, అచిత్' అను పదములు పరమాత్మవాచకము లగునా?
కావా? అగుచో నపుడు 'పరమాత్మ విశిష్టపరమాత్మ' అని యర్థమగును. ఇది
అపార్థము. కానిచో, సర్వవాచకములు చిదచిద్విశిష్టపరమాత్మవాచకము లను
మీ సిద్ధాంతమునకు భంగము.

మరియు, సర్వపదములు (వాచకములు) పరమాత్మను జెప్పు ననుట కుదరదు. ఏలనన 'పరమాత్మవాచకాః' అను పదమును జెప్పునా? చెప్పదా? చెప్పుచో పరమాత్మ దానియందు విశేషణముగా నుండుట సంభవించదు. చెప్ప నిచో సర్వశబ్దవాచ్యత్వమునకు భంగము వాటిల్లును.

మరియు 'అపరమాత్మ' అను పదము (వాచకము) పరమాత్మను జెప్పునా? లేదా? చెప్పు నన్నచో నఞ్ సమాసమునకు విరోధము. రెండవపక్షమున సిద్ధాంత భంగము.

మరియు 'నాస్తి' అను పదము ఈశ్వరుని చెప్పునా? లేదా? ఇందు మొదటి పక్షమున ఈశ్వరునకు సత్ప్రూపత్వము సిద్ధించదు. రెండవపక్షమున మీసిద్ధాంత భంగము.

ఇట్లే 'శబ్దావాచ్యః' అను శబ్దము యీశ్వరుని చెప్పునా? లేదా? మొదటి పక్షమున శబ్దవాచ్యత్వమునకు విరుద్ధము. రెండవపక్షమునకూడ నదే దోషము. మరియు 'చిత్' అను శబ్దమున ఈశ్వరుడు వాచ్యు డగునా? లక్ష్యు డగునా? చిచ్ఛబ్ద వాచ్యుడయిన జీవు డీశ్వరుడు గానందున మొదటిమతము కుదరదు. రెండవపక్ష మున సర్వశబ్దములు పరమాత్మవాచకము లను సిద్ధాంతమునకు భంగము.

కావున చిదచిదాదిశబ్దములకు ఈశ్వరునియందు లక్షణ నంగీకరింపవలెను. బ్రహ్మ ముఖ్యముగా శబ్దవాచ్యము గానేరడు. జీవుడు శరీర శరీరిభావసంబంధముతో బ్రహ్మరూపు డనుట చెల్లదు. ఇంతమాత్రమున 'సచ్చత్యచ్చాభవత్' అనుశ్రుతితో నేకవాక్యతకు భంగములేదు. ఈశ్వరుడు మాయచే జగద్రూపు డనుట సులభము, ఉచితము.

ఓయి జీవబ్రహ్మలకు శరీరశరీరిభావనిమిత్తమయిన భేదములేనిచో ముఖ్యా భేద మెట్లు పొసగును? శ్రుతియందలి'ఆత్మనా' అను పద మెట్లు కుదురును? వినుము- జీవబ్రహ్మ లిరువురు సచ్చిదానందరూపు లగుటచే నభేదము ముఖ్యమే యగు చున్నది. ముఖ్యముగా అభేదము సిద్ధించుచుండ లక్షణచే శరీరశరీరిభావనిబంధన మయిన భేదమును గల్పించుట అన్యాయము. 'ఆత్మనా' అను పదమునకు శరీ రముచే, అనికాని, స్వరూపముచే ననికాని యర్థము. 'జీవేన ఆత్మనా ప్రవిశ్య' అనగా 'అంతఃకరణోపహితరూపముతో బ్రవేశించి' అని యర్థము. పరిపూర్ణుడయిన నీశ్వరుడు అంతఃకరణోపహితు డగుటయే ప్రవేశము. చిద్రూపుడయిన బ్రహ్మ ప్రవేశించుటకు బూర్వమే యంతట నిండియుండ, నతనికి బ్రవేశ మెట్లు ముఖ్య మగును.

ఇంక బరమాత్మ కార్యావస్థ, కారణావస్థ, యను రెండవస్థలు గలవాడని మీరు చెప్పినమాటకూడ చెల్లదు. లోకములో వికారములుగల దేహమునకు బాల్యాద్యవస్థలు కనిపించుచున్నవి. నిర్వికారుడయిన ఆత్మ కవస్థ లుండనేరవు. ఇద

చిత్తులయిన శరీరములకుగల కార్యకారణావస్థలు పరమాత్మకు జెప్పుట యను చితము. ఇది శరీరము, వీడు శరీరి అను భేదజ్ఞానము గలవాడెవ్వడును శరీరావస్థలను శరీరికి జెప్పడు. అవివేకి జెప్పినను వానిమాట ప్రమాణముగాదు. దేహదేహులకు భేదము తెలియనివాడు 'దేహి పుట్టెను' 'దేహి మృతిజెందెను' అని చెప్పినను వానిమాటను ప్రమాణముగా దీసికొనము.

పరమాత్మకు కార్యకారణావస్థ లంగీకరించినచో సర్వవిజ్ఞానప్రతిజ్ఞ కుదరదనియు అందువలన పరమాత్మకీ యవస్థ లంగీకరింపవలెననియు, ననరాదు. మీ రట్లంగీకరించినను, స్థూల చిదచిద్విశిష్టేశ్వరజ్ఞానము, సూక్ష్మ చిదచిద్విశిష్టేశ్వరజ్ఞానమువలె సర్వవిజ్ఞానరూపము కానేరదు. కారణజ్ఞానమువలన కార్యము తెలియబడునని ప్రతిజ్ఞచేయబడినది. ఈశ్వరుడు కారణమేకాని కార్యముగాడు. సూక్ష్మచిదచిత్తులు కారణములు. స్థూలచిదచిత్తులు కార్యములు, అని యనుట యసంగతము. ఈశ్వరుడు మరియొక యీశ్వరునకు గారణమగునా? అట్లే చిదచిత్తులు, చిదచిత్తుల కెట్లు కారణము లగును? దారము దారమునకు, పటము పటమునకు, గారణమగుటలేదు గదా? అయితే పెద్దచెట్టునకు చిన్నగింజ కారణ మగుటలేదా? నిజమే, యచట (బీజాంకురస్థలమున) బీజముయొక్క నామమువేరు, రూపమువేరు. వృక్షముయొక్క నామమువేరు, రూపమువేరు.అందువలన నచట కార్యకారణభావ ముండవచ్చును. ప్రకృతమున మీరు చిదచిత్తులే చిదచిత్తులకు గారణ మనుచుంటిరికదా? నామభేదమెద్ది? స్థూలము, సూక్ష్మము, అను నవస్థాభేదము కలదుకదా? నిజమే!అయితే లోకములో నెవ్వరయినను సూక్ష్మావస్థగల మృత్తు, స్థూలావస్థ గల మృత్తునకు కారణమని యందురా? కుండకు మృత్తు (మట్టి) కారణ మని యందురు. కార్యకారణములకు నామరూపభేదము లావశ్యకములు. నిరూపమయిన చిత్తునకు రూపమె బొత్తుగా లేదు.

కావున కారణమయిన పరమాత్మను దెలిసికొన్న కార్యమయిన పరమాత్మ తెలియుననియే సర్వవిజ్ఞానప్రతిజ్ఞ కర్థమును జెప్పవలయును. పరమాత్మ కారణము కాగా, జన్మలేని జీవుడు కార్యము గానందున జీవ పరమాత్మలకు అభేదము సిద్ధించును. కార్యకారణము లనన్యములుగాన కారణపరమాత్మ జ్ఞానమున కార్యజగద్జ్ఞానము సిద్ధించును.

కార్యజాతమంతయు నిజముగా బ్రహ్మమే యని 'అనరాదు. సర్వకారణమయిన బ్రహ్మము వాస్తవముగ కార్యరూపమునొందుట యసంభవము. అట్లయిన నాత డనిత్యు డగును. కాన బ్రహ్మ కారణమేకాని కార్యముగాడు. జగత్తు కార్యమేకాని కారణము గాదు.

ఓయి, కుండకు కారణమయిన మట్టి, కుండరూపముతో కార్యము కాలేదా, అట్లే బ్రహ్మమాత్ర మేల కాకూడదు? మృత్తునకు ఘటరూపముతో బరిణామము

నొప్పిరి. బ్రహ్మకు జగద్రూపమున పరిణామము నంగీకరించలేదు. మృద్ఘటములు రెండు నొక్కే ద్రవ్యము. కావున వాటికి కార్యకారణభావము ముఖ్యము గావచ్చినను. బ్రహ్మ జగత్తులు రెండు నట్లేక ద్రవ్యములు గావు. మీరుకూడ చేతనాచేతనాత్మక మయిన జగత్తుకంటె బ్రహ్మ వేరని యొప్పుకొంటిరి. ఆమాట మేమును అంగీక రించితిమి. ఏకద్రవ్యములకు వైలక్షణ్యము యుచితముగాదు. కావున నత్యంతవిలక్షణ మయి బ్రహ్మజగత్తులకు కార్యకారణభావము ముఖ్యము గానేరదు. ఇక అజ్ఞాన విశిష్టమయిన బ్రహ్మము ప్రపంచాకారణముగ పరిణమించునుగాన, బ్రహ్మజగత్తు లకు కార్యకారణభావము ముఖ్యమే యని అనరాదు. ఆపక్షమున అజ్ఞానమే ప్రపంచరూపమున బరిణమించునుగాని, బ్రహ్మ పరిణమించుట లేదు. కావున జగ దజ్ఞానములకే కార్యకారణభావము. నిర్వికారుడయిన బ్రహ్మకు పరిణామము లేదు. సూక్ష్మమయిన అజ్ఞానము స్థూలమయిన ప్రపంచరూపముగ బరిణమింప, అందున్న బ్రహ్మకూడ తన సూక్ష్మత్వమును వదలి స్థౌల్యమునొందు నని అని యందురేమో ఇది మీకు వృథాయాశ. నిర్వికారుడు, నిత్యుడు అయిన నాత్మకు స్థూలత్వ సూక్ష్మత్వము లుండవు. ఒక యవస్థను విడచి మరియొకయవస్థను బొందు వస్తువు నిత్యము కానేరదు. అవస్థాభేదముల నొందుచున్న దేహము నిత్యమగుట లేదు. కాన బ్రహ్మ కవస్థాభేదము లేదు. అజ్ఞానమునందున్న స్థూలసూక్ష్మావస్థలను బ్రహ్మయం దవివేకమువలన నారోపించుచున్నారు. వస్తుతః బహ్మ స్థూలముకాని, సూక్ష్మముకాని కాదు. ఆతడు పరిపూర్ణుడు, నిర్వికారుడు, ఎల్లప్పు డొకే రూప మున నుండువాడు నిత్యుడు. చైతన్యమునకు సూలసూక్ష్మావస్థ లున్నచో, జీవుడు కూడ అనిత్యు డగును. జీవుడు నిత్యుడు, నిర్వికారుడు అని గీతలలో శ్రీకృష్ణుడు నిరూపించియున్నాడు.

అయితే, సూలావస్థగల యచిద్వస్తువు లన్నియు ఆత్మకలవిగానున్నందున, బ్రహ్మయే కార్యరూపము నొందెనని యేల యనగూడదు? అట్లితటి మనుష్యాది శరీరములయం దాత్మరూపముగ నున్న జీవులుగూడ కార్యము కావలసివచ్చును. ఇట్టిమాటలు ఆత్మానాత్మవివేకము లేనివారు మాటాడుదురు. వీటిని పాటింపదగదు. దేహము కార్యమగునుకాని, జీవుడు కార్యము కానేరడు.

బ్రహ్మ సగుణ మనువాదముగూడ జెల్లదు. బ్రహ్మ సగుణమగుచో, బ్రహ్మ బ్రహ్మయందలి గుణములు భాస్యములు గానేరవు. అందుకొరకు మరియొకసాక్షి నొప్పినచో ననవస్థాదోష మేర్పడును. కాన బ్రహ్మ జ్ఞానస్వరూపుడుకాని, జ్ఞాన మను గుణము గలవాడు కాడు.

జ్ఞానమువలన నిరూపింపదగినవాడుకాన, బ్రహ్మ జ్ఞానస్వరూపు డనువాదము ప్రారంభమయిన దనరాదు. సర్వము జ్ఞానముచే నిరూపింపదగినదే కాన సర్వము జ్ఞానస్వరూప మగును. ఇంక జ్ఞాన మను గుణ ముండి జ్ఞానముచే నిరూపింపబడు

మనస్సుగూడ జ్ఞాన మను గుణము కలదై జ్ఞానముచే నిరూపింపదగియున్నందున జ్ఞాన స్వరూపము కావలసివచ్చును. కావున బ్రహ్మ స్వయంప్రకాశుడుకాన జ్ఞానస్వరూపుడు గాని, జ్ఞానైకనిరూపణీయుడయినందున జ్ఞానస్వరూపుడుగాడు. జ్ఞానము స్వయంప్రకాశము. సర్వమును జ్ఞానము ప్రకాశింపచేయుచు తాను దీపప్రకాశమువలె దనంతట తానే ప్రకాశించును. ఇట్టి జ్ఞానస్వరూపుడయిన బ్రహ్మయం దెప్పుడును ప్రపంచము లేదు. కాన బ్రహ్మ మద్వితీయము. 'నేహ నానాస్తి కించన' అను శ్రుతి బ్రహ్మ మద్వితీయ మని నిరూపించుచున్నది. ఈ శ్రుతి బ్రహ్మస్వరూపముగాని వస్తువులు లేవని నిషేధించుచున్న దని కల్పించరాదు. చిదచిద్విలక్షణమయిన బ్రహ్మ చిదచిదాత్మకుడు కానేరడు. బ్రహ్మాత్మకమయినవస్తువే లేనప్పుడు తదభిన్న వస్తువును నిషేధించు టెట్లు? – ఇక, 'బ్రహ్మ ఆత్మా యస్యాః' అను వ్యుత్పత్తి వలన బ్రహ్మ సర్వాంతర్యామిగా నున్న ప్రపంచమంతయు బ్రహ్మాత్మక మని యనుటయు గుదరదు. ఇట్టివస్తువులు భిన్నముగా లేవని నిషేధింప మరికొన్నివస్తువు లున్న ట్లేర్పడును. కాక శ్రుతియందు లేని 'అబ్రహ్మాత్మక' మను పదము స్వకపోల కల్పిత మగును.

లేక, నిట్టికల్పనలన్నియు మీకు చెల్లును. 'అద్వితీయమ్' అనగా తనతో సమానమయిన రెండవవస్తువు లేదని యర్థమనియు, జ్ఞానమన జ్ఞానగుణక మనియు ఆనందమన ఆనన్దగుణకమనియు, 'తత్త్వమ్' అనగా నీవు వానియొక్క శరీరమనియు లేనిపోని కుకల్పనలకు బాల్పడిన మీకు నెట్టికల్పనలయినను జెల్లును. యథాశ్రుత మయిన అర్థముమాత్రము మీకు పనికిరాదు.

ఇక బ్రహ్మ నానాప్రకారములుగ నుండెనని మీ రంటిరి. అదియును పొసగదు. ప్రకారరహితమయిన బ్రహ్మకు నానాప్రకారము లసంభవములు. ప్రకృతి నానాప్రకారములనున్నంతమాత్రమున బ్రహ్మకు నానా ప్రకారములుంటవు. మట్టి నానాప్రకారము లగుచున్నంతమాత్రమున ఆకసమునందు నానాప్రకారము లంటుట లేదు. బ్రహ్మ యాకసమువలె నేకరూపుడు. మీరుచెప్పిన జీవులే నానా ప్రకారములయిన శరీరముల ధరించినను, నానాప్రకారములుగలవారు కారు. ఇంక బ్రహ్మ కాడని వేరుగ జెప్పనేల ? అవివేకమున జీవుడు నానాప్రకారము లగుచున్న నదియు చెల్లదు. అవివేకమున నగ్ని జలము గాదు. జల మగ్ని గాదు. అవివేక మున్నంతమాత్రమున త్రాడు పా మగుచున్నదా ? కావున నిదియంతయు భ్రమమాత్రము. భ్రమమాత్రమున నొకవస్తువు మరియొకవస్తువు గానేరదు.

ఇట్లు మనుష్యత్వాదిప్రకారములేని జీవుని నిరూపించుటకే గీతాశాస్త్రము ప్రవృత్తమయినది. దేహాత్మభ్రమతో నేర్పడుచున్న యర్జునునకు దేహవిలక్షణ మయిన ఆత్మను ప్రతిపాదించుటయేకదా – గీతాశాస్త్రముయొక్క తాత్పర్యము. కాన దేహముకంటె వేరయిన జీవునియందు దేహప్రకారము లెట్లు లేవో, అట్లే

ప్రపంచవిలక్షణమయిన బ్రహ్మయందుగూడ ప్రపంచప్రకారములు లేవు. జీవునకు దేహమువలె బ్రహ్మకు సర్వము శరీరమని కదా నీవు చెప్పుచుంటివి? ఇట్టితరి దేహ ధర్మములు జీవున కంటనపుడు ప్రపంచప్రకారములు (ధర్మములు) మాత్రము బ్రహ్మ కెట్లు సంక్రమించును, ఇట్లు ప్రపంచధర్మములయిన అనృతత్వ, నశ్వరత్వ, జడత్వాదులు బ్రహ్మయందు సంభవించవు. స్థూలదేహధర్మములయిన జరామర ణాదులు సూక్ష్మదేహధర్మములయిన సుఖదుఃఖాదులు, కారణదేహధర్మములయిన మోహాదులు, జీవునియందును సంభవించవు. ఇట్లుండ జీవునియొక్కయు, బ్రహ్మ యొక్కయు స్వరూపము చిన్మాత్రమే మిగులును. ఈ చైతన్యమాత్ర స్వరూపము, కాలత్రయాబాధ్య మగుటచే సత్యము, పరమప్రియ మగుటచే ఆనందరూపము. కాన సచ్చిదానంద మయిన బ్రహ్మమే జీవుడు. ఇందు భేద మిసుమంతయు లేదు.

కనుకనే యిచట శ్రీకృష్ణుడు 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత' అని చెప్పెను. ఇట్టి జీవబ్రహ్మాద్వైత జ్ఞానమే సంసారాకారమును బోగొ ట్టుచు సమ్యగ్ జ్ఞాన మనబడుచున్నది. అద్వైత జ్ఞానము సమ్యగ్జ్ఞాన మని సామా న్య మానవులు చెప్పినమాట కాదు. సర్వజ్ఞుడయిన సాక్షాత్ శ్రీకృష్ణుని నోట వచ్చినమాట. కావున నిదియే నిజము. 3.

శ్లో॥ తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్
స చ యో య త్ప్రభావశ్చ త త్సమాసేన మే శ్రుణు. ౪.

ఈ శ్లోకము క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగమను నీ పదిమూడవ యధ్యా యమునందలి విషయమును సంగ్రహముగా సూచించు చున్నది. ఇందలి 'తత్' అను శబ్దము మొదటి శ్లోకమునం దుదాహరించబడిన శరీరమును పరామృశించు చున్నది. కావున మొదటి శ్లోకమున 'ఇదం శరీరమ్' అను వాక్యముచే నే శరీరము నిర్దేశింపబడినదో దాని ధర్మములు, దాని వికారములు, దాని కెయ్యది యుపాదాన కారణ మయినది, దానిని తెలిసికొనిన క్షేత్రజ్ఞుని మహిమలను సంక్షేపముగా జెప్పెద వినుము. ముందు జెప్పబోవు జ్ఞాన, జ్ఞేయ, ప్రకృతి, పురుషులలో జ్ఞాన, ప్రకృతి క్షేత్రమునందును; జ్ఞేయ, పురుషులు క్షేత్రజ్ఞుని యందును జేరుటచే, వాటిని వేరుగ సూచింప బనిలేదు. 'బుద్ధి రవ్యక్త మేవ చ' అనుదానిచే, నవ్యక్త మగు ప్రకృతి సాక్షాత్ క్షేత్రమనియు, 'పరమాత్మే చాప్యుక్తో దేహేస్మిన్ పురుషః పరః' అను శ్లోకముచే, పురుషుడు క్షేత్రజ్ఞు డనియును జెప్పబడుటచే నీ యంశమున సంశయింపవలదు.

రామానుజ మతము:

'ఈ శరీర మను ద్రవ్య మేదియో, వేటి కాధార భూతమో- దీని వికారము లెవ్వియో; ఏ ప్రయోజనముకొరకిది పుట్టినదో, దీని స్వరూప మెద్దియో' క్షేత్రజ్ఞు

డనగా నెవ్వడో, వాని స్వరూప మెట్టిదో, వాని మహిమ లెవ్వియో, దీని నంతయు సంగ్రహముగా జెప్పెద వినుము.' అని రామానుజులు వ్యాఖ్యానించిరి.

ఈ వ్యాఖ్యాన మసంగతము. శబ్దాది గుణములుగూడ క్షేత్రము ద్రవ్యమని నొక్కి వక్కాణించుట పొరపాటు. జడాజడ ద్రవ్యములు రెండును క్షేత్ర శబ్ద వాచ్యములు. చేతను లయిన మనుష్యాది భూతములు, అచేతనములయిన మృత్పాషాణాదులును, క్షేత్ర మనబడుచున్నవి. ఆత్మ అజడద్రవ్యము (చిద్ద్రవ్యము), మిగిలిన దంతయు జడ ద్రవ్యము. పరమాత్మ రెంటికి విలక్షణమను వాదము పొసగదు. ఆత్మ ద్రవ్యమనిచెప్పు ప్రమాణమును గానము. అందుకు తర్కశాస్త్రమును మీరు ప్రమాణముగా గైకొనినచో, దానినిబట్టి పరమాత్మకూడ అజడద్రవ్యము (చిద్ద్రవ్యము) కావలసివచ్చును. ఇక వేదాంతములు ప్రమాణము లన్నచో, నందు పరమాత్మ చిద్రూపుడని చెప్పబడుచున్నదికాని, జడాజడ విలక్షణుడని చెప్పబడుట లేదు. పైపెచ్చు వేదాన్తములు జీవుడుకూడ చిద్రూపుడని చెప్పుచున్నవి. జ్ఞాన మను గుణ మున్నందున జీవుడు ద్రవ్యమన్నచో, మీ మతమున పరమాత్మకూడ జ్ఞానమను గుణము కలవా డగుటచే చిద్ద్రవ్యమే కావలసివచ్చును. కావున అచిద్వస్తువులే ద్రవ్యము. చిద్వస్తువు నిర్గుణమగుటచే ద్రవ్యముగాదు. ఇట్లుండ క్షేత్రశబ్దమును ద్రవ్య విశేష నిర్ధారకమని వ్యాఖ్యానించు టెట్లు పొసగును?

మరియు, "ఇదం శరీరం కౌన్తేయ క్షేత్రమి త్యభిధీయతే" అను శ్లోకము శరీరము క్షేత్రమని చెప్పుచుండ, చిద్ద్రవ్యము క్షేత్రమా, అచిద్ద్రవ్యము క్షేత్రమా అను సందేహమునకు తావెద్ది? నీవు క్షేత్రమన నేద్రవ్యమో నిరూపింతుమని వ్యాఖ్యానించుటకు

ఇట్లె 'యత్తస్య రూపమ్' అనునదికూడ నిరర్థకము. శరీరమను పదముచే స్వరూపము చెప్పబడియున్నది.

శరీరమును దెలిసికొనినవాడు క్షేత్రజ్ఞుడని చెప్పుచుండ, క్షేత్రజ్ఞు డెవడని ప్రశ్న యేల? మరియు శ్లోకమునందు'మే' అని షష్ఠ్యంతముగానుండ, దానిని 'మత్' అని పంచమ్యంతముగా మార్చుట యనుచితము. కాన రామానుజ వ్యాఖ్యానము అసంగతము. ౪

శ్లో॥ ఋషిభిర్బహుధాగీతం ఛందోభి ర్వివిధైః పృథక్
బ్రహ్మసూత్ర పదైశ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః॥ ౫

అ. ఈ క్షేత్రక్షేత్రజ్ఞ యాథాత్మ్యమును వసిష్ఠ విశ్వామిత్ర యాజ్ఞవల్క్యాది మహామును లనేకవిధముల ప్రతిపాదించిరి. ఋగాది వేదములు నిరూపించినవి యుక్తియుక్తములు, నిస్సందిగ్ధములు నగు బ్రహ్మసూత్రముచేగూడ నీయర్థ మనేక విధముల నిరూపింపబడినది. ఇచట బ్రహ్మసూత్రములచే ఆత్మ తెలియబడుచున్నందున ('విద్యతే జ్ఞాయతే') అను వ్యుత్పత్తివలన బ్రహ్మసూత్రములు పదము లనబడు

చున్నవి.' ఇంతకు నీయర్థము శ్రుతిస్మృతిన్యాయసిద్ధము కావున గ్రహింపదగిన దని భావము.

శ్లో॥ మహాభూతా న్యహంకారో బుద్ధి రవ్యక్తమేవ చ
ఇంద్రియాణి దశైకంచ పంచచేంద్రియగోచరాః॥ ౬

అ. సూక్ష్మ భూతములు 5, స్థూలభూతములు 5, జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5, మనోబుద్ధ్యహంకారములు 3, ప్రకృతి యొకటి. ఈ మొత్తము యిరువదినాలుగు తత్వములను సాంఖ్యులు చెప్పిరి.

ఓయి! వెనుక శరీరము క్షేత్రమని చెప్పి యిప్పుడు యిరువదినాలుగు తత్త్వములను జెప్పితివే? ఇది స్వవచోవ్యాఘాతముకాదా? కాదు, వినుము. ఈ యిరువదినాలుగు తత్త్వములే మూడువిధములయిన శరీరము లగును. అదెట్లన? ప్రకృతి కారణశరీరము. మనోబుద్ధ్యహంకారములు పంచతన్మాత్రలు, పంచజ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, లింగ (సూక్ష్మ) శరీరము స్థూలభూతము లయిదును, స్థూలశరీరము – ఇట్లిరువదినాలుగు తత్వములు మూడుశరీరము లగు చున్నవి.

ఇచట 'ఇంద్రియగోచరాః' అను పదమువలన శబ్దాదిగుణములుగల స్థూల భూతములు చెప్పబడినవి.

ప్రాణము, వాయుభూతమునందు జేరుటచే పృథక్తత్వము గాదు. ౬

శ్లో॥ ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సంఘాతశ్చేతనాధృతిః
ఏతత్ క్షేత్రమ్ సమాసేన సవికార ముదాహృతం॥ ౭.

అ॥ సుఖహేతువులగు పదార్థములయం దుండెడికోరిక ఇచ్ఛ. దుఃఖహేతువు లగు పదార్థములందుండెడి మనోవికారము ద్వేషము. ఇవి యంతఃకరణధర్మములు జ్ఞేయములు. సుఖదుఃఖములుకూడ మనోవృత్తివిశేషములు. దేహేంద్రియముల యొక్క సముదాయము సంఘాతము. చేతనయనగా చిదాభాసచే వ్యాప్తమయిన అంతఃకరణముయొక్క వృత్తివిశేషము. ధృతియనగా ధైర్యము – ఈ మొత్తము మహదాదివికారములతోగూడి క్షేత్ర మనబడుచున్నది.

ఇచట అంతఃకరణధర్మములలో గొన్నిటిని మాత్రమే చెప్పినను, 'కామ సంకల్పశ్రద్ధా' ఇత్యాది శ్రుతినిబట్టి యంతఃకరణ ధర్మములన్నియు క్షేత్రమని యెఱుంగవలెను.

అంతఃకరణాదులవలె, నంతఃకరణధర్మములుకూడ క్షేత్రరూపములే యగును. క్షేత్ర క్షేత్రజ్ఞులకంటె నతిరిక్తమయిన క్షేత్ర ధర్మరూపమయిన మరియొక మూడవ వస్తువు లేదు. దృక్ దృశ్యములు రెండే పదార్థములు. అందు దృక్పదార్థము క్షేత్రజ్ఞుడు, దృశ్యము క్షేత్రము.

'ఇదం శరీరం కౌన్తేయ' అను శ్లోకమునందు జెప్పిన క్షేత్రమునకును, సమిష్టి వ్యష్టి భేదముతో నిర్దేశించుటతప్ప వేరు భేదములేదు.

రామానుజ మతము-

ఇచ్ఛా, ద్వేష, సుఖ, దుఃఖాదులు క్షేత్రముయొక్క వికారములు. ఇవి యాత్మధర్మము లయినను, ఆత్మకు క్షేత్ర సంబంధ ముండుటవలన నేర్పడుటచే క్షేత్రకార్యము లనబడుచున్నవి. అని రామానుజులు వ్యాఖ్యానించిరి.

ఇది యనుచితము. శ్రుతి 'కామస్సంకల్ప' అని ప్రారంభించి 'తత్సర్వం మనఏవ' అని యన్నియు మనోధర్మములని చెప్పుచున్నది. ఆత్మధర్మము లయినచో సుషుప్తియందును, మనోనిరోధమునందును కనిపించవలసియుండును. అట్లు కనిపించుటలేదు. ఇచ్ఛాది వికారము లాత్మధర్మము లగుచో, ఆత్మకు విక్రియావత్త్వము, దానివలన అనిత్యత్వమును యేర్పడును. ఆత్మవేద్యము లయినవి యాత్మధర్మములు కాజేరవు. ఇచ్ఛాదు లాత్మ వేద్యములు. 'స యది పితృలోకకామో భవతి, సంకల్పాదేవాస్య పితరస్స ముత్తిష్ఠంతే' అను శ్రుతి ముక్తాత్మయందు కామ సంకల్పాదు లున్నట్లు చెప్పబడుచున్నందున, కామ సంకల్పాదు లాత్మ ధర్మము లందురేమో ? ఆ శ్రుతి సగుణముక్తిని పొందినదాని విషయముకాని, కేవ లాత్మవిషయముకాదు. సగుణముక్తిస్థానమగు హిరణ్యలోకమునందు మన ఆదులు కలవు. కైవల్యమునందు మన ఆదులు లేవు. 'స్వాప్యయ సంపత్త్యోః' అను సూత్రము 'తంత్రకేన కం పశ్యేత్' అను శ్రుతియు, సుషుప్తియందు, ముక్తి యందును, ఆత్మకు కామాది వికారము లుండవని చెప్పుచున్నది.

సుఖాదులు ఆత్మ ధర్మమయిన జ్ఞానముయొక్క అవస్థా విశేషము లనుట కూడ నుచితము కాదు. జ్ఞానస్వరూపుడయిన ఆత్మకు, ధర్మభూతమయిన జ్ఞాన ముండుట యసంగతము. స్వరూప జ్ఞానమునందు ధర్మభూత జ్ఞానమని మరియొకటి యుండదు.

'సోఽకామయత' అను శ్రుతి యింద్రియాదులు లేని యీశ్వరునకు, కామాదు లున్నటుల చెప్పుచున్నందున కామాదు లాత్మ ధర్మము లందుమన్నచో నదియును కుదరదు. మాయవలన నీశ్వరునకు కామ సంకల్పాదులు సంభవించ వచ్చును. కనుక నా శ్రుతి చెప్పెడి ప్రపంచసృష్టివిషయములయిన కామ సంకల్పములు మాయాధర్మములెకాని ఆత్మధర్మములు గావు. ముక్తి కాలమునందలి బ్రహ్మానందానుభవమైన సుఖము ఆత్మస్వరూపముగాని, యాత్మ ధర్మముగాదు. లౌకిక సుఖానుభవము సుఖముకంటె వేరగునుగాని, బ్రహ్మానం దానుభవము ఆనందముకంటె వేరుగాదు. ముక్తియం దానందానుభవముకంటె వేరువస్తువు లేదు. అట్లున్నచో 'ఏకమేవాద్వితీయంబ్రహ్మ' అనుశ్రుతికి విరోధము తటస్థించును.

ఓయి యద్వైతీ! జ్ఞానమని ప్రసిద్ధిచెందిన కామసంకల్పాదులు మనోధర్మము లయి, మనోవృత్తిరూపములగుచో వృత్తులు జడము లయినందున, వీనికి జ్ఞానమను వాడుక యసంగతమగును. పైపెచ్చు విషయములను ప్రకాశింపఁ జేయలేకపోవును. మనోవృత్తులు చైతన్య సంబంధమున విషయములను ప్రకాశింపజేయునని తృప్తి పరచుకున్నను, నిర్విచైతన్యమునకే విషయముల ప్రకాశింపజేయు శక్తి లేనపుడు, దానిసాయమున వృత్తులు విషయములను ప్రకాశింపజేయు ననునది 'గ్రుడ్డివారలు నూర్గురైనను జూడలేరుకదా' అను న్యాయమువంటి దగును. నిర్విశేషచైతన్యమునకే విషయప్రకాశన సామర్థ్యమున్నచో, నీయది వృత్త్యావచ్ఛిన్నమగుట యెందులకు? నిర్విశేష చైతన్యమునకు సంసారదశయందు సంకోచము, మిగిలినదశయందు వికాసము, అంగీకరించినచో నిర్విశేష చైతన్యము నిర్వికారమని ప్రతిపాదించెడి శ్రుతులకు విరోధము తటస్థించునుకదా? ఇక మతమునం దయితే ధర్మభూతమయిన జ్ఞానము వికారమని మే మంగీకరించితిమికాన, మాకు పైదోషము లంటవు. అనినచో నట్లుకాదు.

ఆత్మ, జ్ఞానస్వరూపుడు కానిచో విషయప్రకాశము కలుగదు. ఆత్మకు జ్ఞానస్వరూపత్వము శ్రుత్యాదిసిద్ధము. నిర్ధర్మికు డయినంతమాత్రమున విషయ ప్రకాశకత్వ ముండదన వీలులేదు. ప్రకాశకత్వము ప్రకాశముకంటె వేరుగాదు. వ్యాపకమయిన (అంతటనుండు) సాక్షిచైతన్యము, విషయములకు విముఖము కానేరదు. నిర్విశేషచైతన్యము (సాక్షిచైతన్యము) విషయముల ప్రకాశింపజేయు శక్తి గలదయినను, ఆ చైతన్యమువలన, అవిద్యా అంతఃకరణాదులు ప్రకాశించినను, ఘటాదులు ప్రకాశించుటకు వృత్తి యవసరము. ఘటాదులు అంతఃకరణవృత్తి భాస్యములుకాని, సాక్షిభాస్యములు కావు.

నిజస్థితిలో అవిద్యాదులుకూడ, నవిద్యాకారవృత్తివలననే భాసించును. కాచిన యినుమునకు, అగ్నితాదాత్మ్యమున వేడిమెక్కినట్లు, వృత్తికి చిత్ప్రతిఫలనమువలన భాసకత్వము యేర్పడును. సాక్షిచైతన్యము అంతఃకరణోపహితుడై యెల్లవిషయములను భాసింపజేసినను, ఆ చైతన్యమునకు సంకోచము లేదు. ఘటాకాశమునకు సర్వవ్యాపిత్వము లేకున్నను సంకోచమున్నదని యనుటలేదు. మనకు కనిపించునట్టి సంకోచము ఔపాధికముగాని, తాత్త్వికము గాదు. స్వాభావికము తాత్త్వికమగును. కావున 'ఆత్మ కెవ్విధమగు వికారము లేదు. కాక నిరవయమగు చైతన్యమునకు అంతఃకరణముతో పరిచ్ఛేదమే లేనందున సాక్షిచైతన్యము పూర్ణమే యగును. ఆత్మకు ధర్మజ్ఞానములేదని ముందెన్నడో చెప్పితిమి. వృత్తి జ్ఞానము మనోధర్మముకాని, యాత్మధర్మముకాదు. కాన రామానుజుల వ్యాఖ్యాన మిప్పట్ల యసమంజసము. ॥2॥

శ్లో॥ అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతిరార్జవమ్
ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మ వినిగ్రహః. ॥౮॥

అ॥ క్షేత్రజ్ఞుని తెలిసికొనుటకు సాధనములయిన గుణగణములను చెప్పు చున్నాడు.

తన్ను దాను పొగడుకొనకుండుట, తనుచేసిన ధర్మకార్యములను దాను జెప్పుకొనకుండుట, ప్రాణుల కపకారర మొనర్పకుండుట, ఓర్పు, కౌటిల్యము లేకుండుట, శాస్త్రార్థమును తానాచరించుచు నితరులచే నాచరింపఁజేయువా డాచార్యుడు. ఇట్టివానిని సేవించుట కాయిక మానసిక శౌచము. మృజ్జలాదులచే ప్రక్షాళనము చేసికొనుట కాయశౌచము. వైరాగ్యాదిగుణముల నంతఃకరణమునందు భావనచేయుట మానసికశౌచము. మోక్షమార్గమునందు స్థిరమయిన నిశ్చయ ముండుట స్థూల సూక్ష్మశరీరములను నిగ్రహించుకొనుట. ॥౮॥

శ్లో॥ ఇంద్రియార్థేషు వైరాగ్యమనహంకార మేవచ
జన్మమృత్యు జరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్. ॥౯॥

అ॥ ఇంద్రియార్థము లనగా శబ్దావిషయములు. ఇవి యిష్టములు, అనిష్టములు అని రెండువిధములు. మరియు దృష్టములు, అదృష్టములు అని మరిరెండు విధములు. వీటి ననుభవించుటయందు వైరాగ్యము గలిగియుండుట, అహంకారము లేకుండుట, జన్మ, మృత్యు, జరా, వ్యాధి, దుఃఖముల యందు దోషము నాలోచించుట – ఈయవి జ్ఞానసాధనములు.

జన్మమునందు రెండురకములయిన దోషములుగలవు. మలమూత్రాది దుర్గంధములతో నిండియుండి; చేయి, కాలు కదల్చుటకయినను అవకాశములేని తల్లి గర్భమునందు పురుగువలెనుండుట యొక దోషము. మూత్రస్థానమయిన యోని ద్వారమున బయలువెడలుట మరియొకదోషము. జన్మమునం దీ రెండు దోషములను ఆలోచింపవలెను. మృత్యువునందు ప్రాణము లేచిపోవుట, కఫము కంఠమునకు త్రాడువలె జుట్టుకొనుట, శ్వాసలాడకుండుట.

ముసలితనమునందు బుద్ధిమాంద్యము, ఇంద్రియముల సామర్థ్య ముడుగుట, భార్యాపుత్రాదులచే దిరస్కరింపబడుటయు దోషము.

వ్యాధులయందు, దుఃఖమునందును బాధ నోర్చుకొనలేకుండుట, మనఃక్షోభము మున్నగునవి దోషములు. కాన వాని వానియం దాయా దోషముల గురించిన వైరాగ్యము కలుగునని భావము.

(లేక) జన్మ దుఃఖము, జర దుఃఖము, వ్యాధి దుఃఖము, అని తలంచుట అని యయినను అన్వయించవచ్చును. ఇట్టి యనుచింతనమువలన వైరాగ్యము గలిగి జ్ఞాన మావిర్భవించవచ్చునని భావము. ॥౯॥

శ్లో॥ అసక్తిరనభిష్వంగః పుత్ర దార గృహాదిషు
నిత్యంచ సమచిత్తత్వం ఇష్టా నిష్టోపపత్తిషు. ॥౧౦॥

అ॥ విషయములయందు ప్రేమలేకుండుట, పుత్ర దార గృహాదులయందు అభిష్వంగము లేకుండుట, (అభిష్వంగమనగా, పుత్ర, మిత్ర, కళత్రాదులు సుఖముగానుండగా తాను సుఖముగనుంటిననియు, వారు దుఃఖించుచుండ తాను దుఃఖము నొందితిననియును దలంచెడి యనన్యాత్మభావన ( నేనేవారు, వారేనేను అనుభావన). ఇట్టిభావన లేకుండుట అనభిష్వంగము. ఇష్టవస్తువులు సంప్రాప్తమయినప్పుడును అనిష్టవస్తువులు సంప్రాప్తమయినప్పుడును హర్ష క్రోధములు లేక నెల్లప్పుడు సమానమయిన భావముతో నుండుట – ఇవిగూడ జ్ఞానసాధనము లని భావము. ॥౧౦॥

శ్లో॥ మయిచానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ
వివిక్తదేశ సేవిత్వ మరతి ర్జనసంసది. ॥౧౧॥

అ॥ అభేదభావనాపూర్వకమయిన బుద్ధితో వాసుదేవుని నిరంతరము ధ్యానించుట, మలమూత్రాది అశుచిపదార్థసంబంధము, సర్ప చోర వ్యాఘ్రాదులభయము, పిశాచాది భయము లేని అరణ్య నదీపులిన దేవాలయాదుల సేవించుట, వివేకసంస్కార మేమాత్రము లేని ప్రాకృత (మూర్ఖ) పురుషుల సమాజమునందు కోరికలేకుండుటయు ఆత్మజ్ఞానమునకు సాధనములని భావము. ॥౧౧॥

శ్లో॥ అధ్యాత్మ జ్ఞాననిత్యత్వం, తత్వజ్ఞానార్థ దర్శనమ్
ఏతత్ జ్ఞానమితిప్రోక్తం అజ్ఞానం యదతోఽన్యథా. ౧౨॥

అ॥ ఎల్లప్పుడు ఆత్మజ్ఞానముతోనుండుట, తత్వజ్ఞానమువలననే మోక్ష మను నాలోచనము– ఈ గుణములన్నియు జ్ఞానసాధనములుగాన జ్ఞాన మనబడుచున్నవి. మిగిలినదంతయు నజ్ఞానము. ఆత్మజ్ఞానము నొందుటకు అమానిత్వాదు లెట్లు అలవరచుకొనదగినవో, అట్లే సంసారమును దొలగించుకొనుటకు సంసారకారణములయిన మాన, దంభ, హింసాదుల గూడ దొలగించుకొనవలయును.

రామానుజమతము:–

ఇచట రామానుజులు, 'తత్వజ్ఞానార్థదర్శనమ్' అను ద్వితీయపాదమును 'తత్వజ్ఞానార్థచింతనమ్' అని సవరించి, తత్వజ్ఞానార్థమయిన భగవచ్చింతనము నందు నిరతుడగుట– అని వ్యాఖ్యానించిరి.

ఇది యనుచితము. 1. వారు సవరించినట్లు మూలమున పాఠములేదు. 2. లాక్షణికార్థమును కల్పించుట యుచితముగాదు. ఒకవేళ వారిపాఠ మంగీకరించినను 'తత్వజ్ఞానార్థమయిన చింతనమేమి?' అను ప్రశ్నరాగా, దానికి సమాధానము లేనందున ముముక్షువులకు ప్రవృత్తి దేనియందు గలుగును ?

ఇట్లే 'సంఘాతే చేతనాధృతిః' అనుచోట 'సంఘాత శ్చేతనాధృతిః' అని పాఠమును గల్పించి, (చేతనస్య-జీవస్య-ఆధృతిః-ఆధారః) జీవున కాధారమయిన శరీర మని వ్యాఖ్యానించిరి. ఇదియును సరికాదు. ఈ విషయ మింతకుమున్ను 'ఇదం శరీరం కౌన్తేయ' అనుచోటనే చెప్పియుండ, మరల యిప్పుడింత కష్టపడి చెప్పబని లేదు. పైగా చెప్పినవిషయమును చెప్పుట పునరుక్తము నగును. ॥౧౨॥

శ్లో॥ జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వాఽమృతమశ్నుతే
　　అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే ॥౧౩॥

అ॥ ముముక్షువులగు విద్వాంసులు యేవస్తువును దెలిసికొని మోక్షము నొందెదరో, ఆవస్తువును జెప్పెదను. అయ్యది ఆదిలేని పరబ్రహ్మము. అది 'సత్' అనికాని, 'యసత్' అనికాని చెప్పనలవికాదు.

ఓయి! ఇంతకుమున్ను అధ్యాయారంభమునుండి అమానిత్వము, అదంభిత్వము మున్నగు ధర్మములు చెప్పబడినవి. ఇవి యమ నియమాదులలో జేరును. వీటివలన నేవస్తువును గుర్తింపబడనేరదు. ఒకానొక వస్తువును పరిచ్ఛేదపరచి (వేరుపరచి) బోధించు సామర్థ్యము యీ సాధనములకు లేదు. ఏవస్తువు మనకు దెలియదగియున్నదో, ఆవస్తువుయొక్క జ్ఞానమే ఆవస్తువును ఇతరవస్తువునుంచి వేరుపరచి బోధించును. ఇంతియెకాని యితరవస్తువులయొక్క జ్ఞానముచే నితరవస్తువు తెలియబడనేరదు. ఘటజ్ఞానముచే ఘటము తెలియబడునుగాని, పటము తెలియబడనేరదు.

ఇచట 'కుండ కలదు' అనుజ్ఞానము, దేశాంతర కాలాంతరములందున్న ఘటాదులనుంచియు పటాదులనుంచియు, వేరుపరచి ప్రకృతఘటమును నిరూపించుచున్నది.

ఘటపటాదులయందున్న శుక్ల, నీల, పీతాది గుణములయొక్క జ్ఞానమే ప్రకృతఘటమును, నక్తఘటమునుంచి పరిచ్ఛేదబరచు (వేరుపరచు) చున్నదికాని, యజ్ఞాతములయిన శుక్ల, నీల, పీతాది గుణములు పరిచ్ఛేదపరచుటలేదు. కావున జ్ఞాయమానములయిన విశేషణములు, ఉపాధులు వ్యావర్తకము లగునుగాని, కేవల విద్యమానములయిన విశేషణోపాధులకు వ్యావర్తకత్వము(భేదజ్ఞానము)నొసంగుట ఘటింపదు. కనుక కేవల మమానిత్వాదు లిచట జ్ఞేయపరిచ్ఛేదకము లెట్లగును? అనగా, అమానిత్వాదిధర్మములచే జ్ఞేయమగు వస్తువిశేష మిచట తెలియబడు టెట్లు? అని పూర్వపక్షము.

అమానిత్వాది ధర్మసహకృతమయిన జ్ఞానముచే జ్ఞేయము తెలియబడునని సమాధానము- అనగా, కేవలము అమానిత్వాది ధర్మములు జ్ఞేయమును వివరించి చెప్పజాలకున్నను, వానిజ్ఞానము జ్ఞేయమును వేరుపరచి నిరూపింప సమర్థమగునని భావము.

ఇచట, 'అనాదిమత్' అనుపదము ఆదిశబ్దముకంటె మత్ ప్రత్యయమును జేర్చి, నఞ్ సమాసమును జేయగా సిద్ధించినది. కావున, 'కారణము లేనిది' అని దీని యర్థము. అనగా, జన్మలేని దని తాత్పర్యము. కావున 'ఆత్మావా అరే ద్రష్టవ్యః' అను శ్రుతిననుసరించి, క్షేత్రజ్ఞ లక్షణమయిన బ్రహ్మయే యిచట జ్ఞేయమని చెప్ప బడిన ట్లయినది.

ఓయి ! క్షేత్రజ్ఞుడు పూర్వము జ్ఞాతయని చెప్పితిరి. ఇపుడు జ్ఞేయమని చెప్పు చుంటిరి. ఇది యెట్లు పొసగును? వినుము. అసలు క్షేత్రజ్ఞుడు జ్ఞానస్వరూపుడు. వీని యందు జ్ఞాతృత్వము లేదు, జ్ఞేయత్వమును లేదు. ఇట్టితరి జ్ఞాతృత్వ మెట్లు కల్పింప బడినదో, అట్లే జ్ఞేయత్వముకూడ గల్పింపబడినది. కావున నీ రెండును క్షేత్రజ్ఞునకు నౌపచారికములే యని గ్రహింపవలెను.

జ్ఞాతృత్వ జ్ఞేయత్వములు రెండును, యొకేయాత్మ కంగీకరించుట కర్మ కర్తృత్వ విరోధముగదా? అని ప్రశ్నింపరాదు. జ్ఞాత యనగా ప్రమాత. అనగా, అంతఃకరణావచ్ఛిన్న చైతన్యము. ఇతడు స్వస్వరూపమయిన క్షేత్రజ్ఞుని, వివేక సంస్కారయుక్తమయిన మనస్సుతో దెలిసికొనుచున్నాడు. ఒకేచైతన్యము అంతః కరణావచ్ఛిన్నత్వరూపముతో, ప్రమాత (జ్ఞాత) అంతఃకరణవృత్త్యవచ్ఛిన్నత్వ రూపముతో జ్ఞానకరణము - అంతఃకరణోపహితత్వరూపముతో జ్ఞేయము స్వతస్సిద్ధ ముగ చిద్రూపము. కావున,సంస్కారవిశిష్టమయిన మనస్సుగల ప్రమాతకు, క్షేత్రజ్ఞ లక్షణమయిన బ్రహ్మ జ్ఞేయమగును. కనుకనే యిచట బ్రహ్మ జ్ఞేయమని నిర్దేశింప బడినది.

ఇచట 'అనాదిమత్' అను పదమును గొంద రాక్షేపించుచున్నారు. (న ఆదిః యస్యతత్ అనాది దేనికి ఆదిలేదో అయ్యది అనాది) అను బహువ్రీహి సమాసమువలననే మతుప్ప్రత్యయముయొక్క అర్థము లభించుచుండ, 'నకర్మధారయాన్మత్వర్థీయః బహువ్రీహిశ్చేత్తదర్థప్రతిపత్తికరః' అను శాస్త్రము ననుసరించి యిచట మతుప్ప్రత్యయమును విధింపరాదు. ఈయది దోషము. కావున నిచట అనాది, మత్పరః, అని పదవిభాగమును జేయవలెను, అని యాక్షేపించి 'మత్పరం' అను పదమున కర్థవిశేషమును గూడ జూపుచున్నారు.

ఈయది సరిగాదు. ఏల యన, వీరు 'మత్పరం' అను పదమునకు 'అహం-పరా-యస్య-మత్పరం' అని విగ్రహమును జూపుచు, వాసుదేవు డను పరాశక్తి కలది మత్పరమని వివరించిరి. ఈయర్థవిశేషమును మదియందుంచుకొనియే, అనాది మత్ అను పదమునందు దోషము నుద్ఘాటించిరి. వీరు పదవిభాగమును జేసి నిరూపించిన యర్థము సరిపోవుచో, వీరుచూపిన దోషము నంగీకరించవచ్చును. వారి యర్థమే సరిపడదు. ఈ శ్లోకమునందలి నాలవపాదము నిర్విశేషబ్రహ్మను నిరూపింప

సమకట్టియుండ, వీరు తృతీయపాదమున వాసుదేవాఖ్యశక్తివిశిష్టమయిన బ్రహ్మను ప్రతిపాదించుట యసమంజసము.

నిర్విశేషమగు బ్రహ్మ ఈశ్వరశక్తివిశిష్టముగానేరదు. విశేషము, విశేష నిషేధము. యీ రెండును పరస్పర విరుద్ధములు. కాన నిర్విశేషబ్రహ్మను ప్రతిపాదించు నీ ప్రకరణమున విశిష్టబ్రహ్మను నిరూపించుట విరుద్ధము.

ఇక 'అనాది పరంబ్రహ్మ' అని చెప్పినచో నొక యక్షరము తరిగినందున శ్లోకము చెడును. 'అనాది పరమంబ్రహ్మ' అని యనినచో, శ్లోకము కుదురునుగదా? నిజమే, కాని యార్షగ్రంథములయందున్న దానికి గతిని కల్పించవలెగాని, పాఠాంతరముల గల్పించుట యుచితముగాదు.

✓ ఓయి! తెలియదగిన వస్తువును జెప్పెద నని, యార్భాటముగా ప్రతిజ్ఞచేసి, తుదకు నా వస్తువు, 'ఉన్నది' కాదు 'లేనిది' కాదు: అని యంటివే! ఇది యేమి? నీవు చెప్పిన ప్రతిజ్ఞ కిది విరుద్ధముగదా? నీవు యే పరబ్రహ్మము తెలుసుకొనదగిన దని ప్రతిజ్ఞచేసితివో – ఆ వస్తువు యున్నదా? లేదా? ఉన్నచో, నది సచ్ఛబ్దమున కేల విషయముగాదు? నీ వది 'నసత్' సత్తు గాదనుచుంటివే? ఇక నా వస్తువు లేనిచో, లేనివస్తువు జ్ఞేయ మెట్లగును? లేని శశశృంగాదులు జ్ఞేయములగుచున్నవా? కనుక బ్రహ్మ జ్ఞేయమనెదవా – సచ్ఛబ్దవాచ్యమే యగును. బ్రహ్మలేదని అనెదవా – అది జ్ఞేయమే కాదు. కాన 'బ్రహ్మ జ్ఞేయము, సచ్ఛబ్దవాచ్యముగాదు.' అనిన పరస్పర విరుద్ధము గదా?

కాదు. బ్రహ్మ పరమార్థముగ 'అస్తి నాస్తి' బుద్ధులకు గోచరుడుగాడని యుపనిషత్తులన్నియు నైకకంఠ్యముతో నిరూపించుచున్నవి. ఇట్టితతి సదసద్బుద్ధుల కనుగతమయిన బ్రహ్మబుద్ధికిగూడ గోచరుడు గాడని యందువేమో! అనగా లోకములో ఘటపటాది బుద్ధులన్నియు సద్బుద్ధికిగాని, యసద్బుద్ధికిగాని యనుగతములై యున్నవి. ఈ రెండుబుద్ధుల ననుసరించనిబుద్ధి యేలోకములోను లేదు. కాన బ్రహ్మబుద్ధికూడ సదసద్బుద్ధుల ననుసరించియే యున్నది. మీరు 'జ్ఞేయంబ్రహ్మ' అని యెప్పుడు చెప్పిరో, అప్పుడు బ్రహ్మబుద్ధివిషయమయిన బ్రహ్మ, సద్బుద్ధికిగాని యసద్బుద్ధికిగాని విషయమయియే తీరవలయును. అట్లుకానిచో, బ్రహ్మబుద్ధికిగూడ విషయముగాకపోవలయును. అనినచో, నిజమే. బ్రహ్మ ఇంద్రియగోచరుడుగాకుండుటచే, సద్బుద్ధికిగాని, యసద్బుద్ధికిగాని, యీ రెంటి ననుసరించిన బ్రహ్మబుద్ధికిగాని గోచరుడు గాడు. లోకములో ఇంద్రియగమ్యమయిన ఘటాదివస్తువులు, సద్బుద్ధికిగాని యసద్బుద్ధికిగాని, ఈ రెంటిననుసరించియున్న ఘటబుద్ధికిగాని గోచర మగుచున్నవి.

బ్రహ్మ ఇంద్రియగోచరుడు గానందున సద్బుద్ధివిషయముగాని, యసద్బుద్ధి విషయముగాని, ఉభయబుద్ధ్యనుగతమయిన బ్రహ్మబుద్ధివిషయముగాని కాదు. ఇంత

మాత్రమున బ్రహ్మ మిథ్యాబుద్ధివిషయమని యనదగదు. మిథ్యాబుద్ధికూడ నసద్బుద్ధి విశేషమే కాన మిథ్యాబుద్ధి విషయుడుకూడ గాదు.

ఓయి! 'నాసతో విద్యతే భావః' అను శ్లోకభాష్యమునందు ఆచార్యస్వామి అంతట'సద్బుద్ధి అసద్బుద్ధి' అని రెండుబుద్ధులు కనిపించుచున్నవి అనివ్రాసిరి. ఇచట సద్బుద్ధి. యసద్బుద్ధి, బ్రహ్మబుద్ధి, మిథ్యాబుద్ధి అని నాలుగు బుద్ధులు చెప్పినచో నిది యొకవిరోధము.

'అవినాశితు తద్విద్ధి' అను శ్లోకభాష్యమునందు శంకరులు,ప్రపంచమంతయు అసద్బుద్ధి విషయమనియు, బ్రహ్మ యొక్కడు మాత్రము సద్బుద్ధి విషయమనియు జెప్పియుండి, వారే యిచట బ్రహ్మ సద్బుద్ధివిషయము గాదని చెప్పినచో, నిది రెండవ విరోధము.

ఘటాదులు సద్బుద్ధివిషయము లనునది మూడవ విరోధము. 'మనసైవాను ద్రష్టవ్యమ్' అను శ్రుతి బ్రహ్మ మనోగమ్యమని చెప్పుచుండ నిచట ధర్మాదుల వలె బ్రహ్మ యతీంద్రియుడని చెప్పుట నాల్గవవిరోధము. అసదృశుడయిన బ్రహ్మకు ధర్మాధర్మాది సాదృశ్యమనునది అయిదవ దోషము. సద్రూపుడయిన బ్రహ్మకు సచ్ఛబ్దావాచ్యత్వమును జెప్పుట యాఱవదోషము. 'అస్తి బ్రహ్మేతి చేద్వేద సంతమేనంతతో విదుః' ఇత్యాది శ్రుతివిరోధము యేడవది. కావున నిట్లు పెక్కు విరోధము లుండుటచే నుపనిషత్సిద్ధాంతము నిలువనేరదనినచో. వినుము.

కాలత్రయమునందును బాధింపబడక, నిత్యమగు వస్తువు సద్వస్తువనియు, మిగిలినది అసద్వస్తువనియు నను బుద్ధితో 'నాసతో విద్యతేభావః' అను శ్లోకము నందు బ్రహ్మ సత్పదార్థ మనియు, జగత్తు అసత్పదార్థ మనియును జెప్పబడినది. ఇదే యాశయముతో 'సద్బుద్ధి' 'అసద్బుద్ధి' అను రెండుబుద్ధులు కనిపించుచున్నవని చెప్పబడినది. దృగ్రూపమయిన బ్రహ్మముకంటెను, దృశ్యమయిన జగత్తుకంటెను, వేరుపదార్థము లేదనియు, నారెండును విషయముగాగల బుద్ధులకంటె వేరుగ బుద్ధియు లేదని యచట తాత్పర్యము. మిథ్యాబుద్ధియందు గూడ నసత్పదార్థము విషయమగుటచే, నయ్యది యసద్బుద్ధి యనబడును. బ్రహ్మబుద్ధి సద్విషయమగుట వలన సద్బుద్ధి యనబడును. కావున నిట నాలుగు బుద్ధు లుండవలయునను ప్రసక్తి యెంతమాత్రము లేదు. విషయములు పెరుగనిదె బుద్ధులు పెరుగవు. ఇదే యభిప్రాయమున శ్రుతి బ్రహ్మకలడనియు, సద్రూపుడనియు జెప్పినది.

ఇంక నిచట ఇంద్రియగమ్యమగు వస్తువే సద్వస్తువుగాని, అసద్వస్తువుగాని యగునని చెప్పబడుచున్నది. కాన త్రికాలాబాధ్యత్వరూపసత్తకంటె, ఇంద్రియ గమ్యత్వరూపమగు ( ఇంద్రియముల గోచరమగుట రూపమగు) సత్త వేరు. ఇది బ్రహ్మయందు లేదు. ఘటాదులయందు గలదు. కావున బ్రహ్మ సద్బుద్ధివిషయము

గాదు. ఘటాదులు సద్బుద్ధివిషయము లగుచున్నవి. కనుక పూర్వోత్తర విరోధము లేదు.

మరియు మనస్సు ఇంద్రియము గాదు. ఒకవేళ ఇంద్రియమైనను సంస్కార రహితమయిన మనసు బ్రహ్మను దెలిసికొనుటకు సాధనము గాదు. అందువలన బ్రహ్మ అతీంద్రియుడని చెప్పబడినది. అతీంద్రియత్వాంశమునందు ధర్మాధర్మాదులతో సాదృశ్యము బ్రహ్మకున్నను, త్రికాలాబాధ్యత్వాంశమునందు సాదృశ్యము లేదుగాన, బ్రహ్మయొక్క అసదృశత్వ (నిరుపమానత్వ) మునకు భంగము లేదు. శాస్త్రీకవేద్యము లగు స్వర్గాదులుకూడ బ్రహ్మసదృశములు గావు. బ్రహ్మ త్రికాలాబాధ్యమయిన వస్తువును జెప్పెడి సచ్ఛబ్దముచే చెప్పబడుచున్నాడు గాని, యింద్రియ గమ్యమగు వస్తువును జెప్పెడి సచ్ఛబ్దముచే జెప్పబడుట లేదు. కనుక బ్రహ్మకు సద్రూపత్వము సంభవింపదని యాక్షేపింప వీలులేదు. కావున జ్ఞేయమగు బ్రహ్మ సత్తు, అసత్తును, గాదనుటతో విరోధములేదు. 'అన్యదేవతద్విదితాదథో విదితాదధి' అను శ్రుతి బ్రహ్మవిదితావిదితములకంటె వేరని చెప్పుచున్నది.

బ్రహ్మ అతీంద్రియు డగుటచే, 'అస్తి, నాస్తి' శబ్దములచే జెప్పబడడని మా యాశయము. ఇట్టి బ్రహ్మము జ్ఞేయమగుచో నప్పుడు విరుద్ధవాదమే యేర్పడును. కాన బ్రహ్మ జ్ఞానరూపుడు గాని జ్ఞేయముగాడు. జ్ఞేయమగు బ్రహ్మ విదితము కాని. అవిదితముగాని యగును. ఈ రెండునుగాకుండ నుండ నేరదు. ఈయది లోక విరుద్ధము. లోకములో జ్ఞేయమగు ఘటము కొందరిచే విదితము, మరికొందరిచే (బాలురచే) అవిదితము (దెలియబడనిది) యగుచున్నది. కాన ఎవ్వనిచేతను విదితము, అవిదితముగాని బ్రహ్మ జ్ఞేయమగుట కుదరదు. కనుక నీ శ్లోకమున బ్రహ్మ జ్ఞేయమని చెప్పుట యౌపచారికమని సమాధానము. ఇట్లు బ్రహ్మకు ముఖ్యమగు జ్ఞేయత్వము లేదని నిరూపింపలేని వస్తువు జ్ఞేయమగుటెట్లు? జ్ఞేయమగువస్తువు లేకుండు టెట్లు?' అను దోషములు రెండు నిరాకృతము లగుచున్నవి. జ్ఞానస్వరూపుడు గాన బ్రహ్మవిద్యమానుడే (ఉన్నవాడే) అని యభిప్రాయము. ఇట్టి జ్ఞానస్వరూపమయిన బ్రహ్మము త్రికాలాబాధ్యము. జ్ఞానము త్రికాలాబాధ్య మయినచో, ఘటాదు లెల్లపు డేలనుకు భాసించవు? అని యనరాదు. జ్ఞాన మెప్పుడును తనకు విషయ మయిన వస్తువును ప్రకాశింపజేయుచు తానుకూడ ప్రకాశించును. ఘటాది పదార్థములు యెల్లప్పుడు జ్ఞానగోచరములు గావు. ఒకొక్కప్పు డొకొక్కవస్తువు జ్ఞాన గోచరమగుచుండును. గోచరమయిన వస్తువును మాత్రము జ్ఞానము ప్రకాశింపజేయును. కాన విషయములు మారుచున్నను, విషయియగు జ్ఞానముమాత్రము, మారక త్రికాలాబాధ్యమగుచున్నది. ఇందు సందియములేదు. కనుకనే 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' అను శ్రుతి యుపపన్నమగుచున్నది.

వేదములో యజ్ఞానుష్ఠానముకొరకు శాలానిర్మాణమును జేయుమని చెప్ప నారంభించిన శ్రుతివాక్యము దేవలోకము, మనుష్యలోకముకంటె దూరమున చాటుగా నున్నదికాన, దానిని నమ్మి మానవులు యీలోకమును విడచిపోవలదని చెప్పినవి. 'కోహిత ద్వేద యద్యముష్మిన్ లోకేఽస్తివా నవేతి' అనునది ఈ శ్రుతి సందిగ్ధార్థమును బోధించునదిగాన విరుద్ధార్థమని యనబడుచున్నది. అట్లే 'బ్రహ్మ తెలియబడువాడుగాడు, తెలియబడని వాడునుగాడు; ఇట్టి బ్రహ్మ జ్ఞేయము.' అని చెప్పెడి 'అన్యదేవతద్విదితాదథో ఽవిదితాదధి' అను శ్రుతికూడ విరుద్ధార్థమును బోధించునట్టిదే యనినచో, నిది సరికాదు. పై శ్రుతి యర్థవాద. దానికి స్వార్థము నందు దాత్పర్యములేదు. అతికాశకరణమను విధి కీయది శేషము. కాన నా శ్రుతి యట్టి సందిగ్ధార్థమును బోధించవచ్చును. ప్రకృతమున నీ శ్రుతి బ్రహ్మను ప్రతిపాదించుటకు ప్రవర్తించినది. ఇది ప్రధానవాక్యము. మరియొకదాని కంగముకాదు. కాన నీ రెంటికి దృష్టాంత దార్ష్టాంతికభావము కుదరదు.

మఱియు, బ్రహ్మ జ్ఞేయమయినను సదాది శబ్దములచే జెప్పబడ దనుటకు యుక్తికూడ కలదు కాన నిందు విరుద్ధవాద మేమాత్రములేదు. లోకములో ప్రయోగింపబడు శబ్దములన్నియు జాతిగుణ క్రియా సంబంధములను ద్వారముగ జేసి కొనియే వినువారల కర్థజ్ఞానమును గలుగజేయుచున్నవి. గోత్వా అశ్వత్వాదులు జాతులు, శుక్లకృష్ణాదులు గుణములు పచన పఠనాదులు క్రియలు. స్వస్వామి భావాదులు సంబంధములు. ఇం దెవ్వియు బ్రహ్మయందు లేవు. నిర్ధర్మకుడగు బ్రహ్మ యందు జాతియుండుట అసంభవము. నిష్క్రియునియందు క్రియయుండుట అసంభవము. నిర్గుణునియందు గుణముండుట విరుద్ధము. ఒక్కని (అద్వితీయుని) యందు సంబంధ ముండుటయు జెల్లదు. కావున శబ్దములు ప్రవర్తించుటకు తగు నిమిత్తము లెవ్వియు లేనందున, నేశబ్దము బ్రహ్మను బోధింప సమర్థము.

మఱియు బ్రహ్మ విషయికాని విషయుడు గాదు. బ్రహ్మయే ఆత్మ. ఆత్మ విషయి యనియు, అనాత్మలు విషయము లనియు సిద్ధాంతము. కనుక డిత్థ, డవిత్థాదులవలె సంజ్ఞాశబ్దములుగూడ బ్రహ్మయందు బ్రవర్తించవు. కనుకనే 'ననామ రూపే గుణదోష ఏవవా' అను శ్రుతి బ్రహ్మయందు నామము (పేరును జెప్పుపదము) లేదని చెప్పుచున్నది. 'తమేవభాంత మనుభాతిసర్వం తస్యభాసా సర్వమిదం విభాతి' అను శ్రుతి సర్వప్రపంచమును ఆత్మ ప్రకాశింపజేయునని చెప్పుచుండ, నట్టి యాత్మను ప్రకాశింపజేయుటకు ప్రపంచములోని శబ్దములు ప్రవర్తించు ననుట వెఱ్ఱితనము.

మఱియు, ఆత్మ 'ఇది ఘటము, ఇది పటము,' అని ఘట పటములను దెలిసికొనినట్లు, 'ఇది శబ్దము' అని శబ్దమునుగూడ దెలిసికొనును. కాన, ఆత్మచే దెలిసికొనబడునట్టి శబ్దము ఆత్మను నెట్లు తెలుపును? ఘటమనుశబ్దము జడము

గనుక తాను ఘటమును దెలిసికొనలేదు. అయినను అది యితర పురుషునికి ఘటమును బోధించును. ఆత్మమాత్ర మట్లు ఘటమువలె శబ్దముచే బోధింపబడ నేరడు.

ఆత్మశబ్దము ఆత్మను బోధించు నన్నచో, నిజమే - ఎవనికొఱకు బోధించును? ఆత్మకొఱ కన్నచో, ఆత్మ యంతకుముందే యపరోక్షుడై సిద్ధించియున్నాడు. తనకు దానెప్పుడును పరోక్షుడు గాడు. ప్రమాతకొఱకు బోధించునన్నచో నదియుపొసగదు. ప్రమాతగూడ వస్తుతః ఆత్మయే. అత డపరోక్షుడై ప్రకాశించుచునే యున్నాడు. కాన, బ్రహ్మ ఆత్మరూపు డగుటవలన శబ్దప్రతిపాద్యుడు గాడని తేలినది.

ఓయి! యిట్లగుచో, శబ్దములచే ప్రతిపాదింపబడక ఇంద్రియములకు గోచరముగాని బ్రహ్మము తుచ్ఛమగునుకదా? అనగా లేనిదేకదా? కాదు. బ్రహ్మ, ఆత్మరూపమున నిత్యాపరోక్షుడు. (ఎల్లప్పుడు ప్రత్యక్షముగా ప్రకాశించుచుండు వాడు). తుచ్ఛమగు శశ శృంగాదులు ప్రకాశించుటలేదు. ప్రకాశించుచుండుట వలననే బ్రహ్మ తుచ్ఛ మనుటకు వీలులేదు. అయితే యిట్టి బ్రహ్మమును దెలుపుటకు శాస్త్రీయములగు శబ్దములకుగూడ శక్తి లేనందున శాస్త్రము వ్యర్థమేకదా? అని యనదగదు. బ్రహ్మ అతీంద్రియుడు, శబ్దావిషయుడు, యెల్లప్పుడు ప్రకాశించు వాడు. (నిత్యాపరోక్షుడు) చైతన్యరూపుడు, ఆత్మస్వరూపుడు, అను విషయమును దెలిసికొనుటకైనను శాస్త్ర మవసరముకదా? శాస్త్రముగాని, గురూపదేశముగాని లేకస్వతస్సిద్ధమయినజ్ఞానముచే నీయమును యెవ్వడును దెలియజాలడు. గురూపదేశ బలము శాస్త్రబలము యున్నను యొకానొక మహానుభావుడే యీ విషయము గుర్తెఱుంగును. కనుకనే శ్రీకృష్ణుడు గీతలలో 'శ్రుత్వాప్యేనం వేదనచైవ కశ్చిత్' అని చెప్పియుండెను. ఇట్టియెడ గురుశాస్త్రములు లేనిచో బ్రహ్మతత్త్వమును యెవ్వ డెఱుగును? లోకములో నందఱును తమకు వంటబుట్టిన జ్ఞానముతో తాము మనుష్యు లనియు, వృద్ధు లనియు, పుట్టినవా రనియు, సుఖు లనియు, దుఃఖు లని యును తలంచుచున్నారు. ఇంతియెకాని, తాము నిర్వికారమయిన సచ్చిదానంద బ్రహ్మరూపు లని తలంచుటలేదు.

అయితే తనయందు తన కిట్టి భ్రమయేల? అని యందురేమో? నిజమే అందు కేమిచేయుదుము? కనిపించుచున్నదానిని కుదరదని తీసివేయు టెట్లు? దానికి హేతువిచారము మాత్ర మేల? దీనిని (ఈ భ్రాంతిని) పోగొట్టుకొను టెట్లా యని ప్రయత్నింపవలెను. రోగి తన కనుభవములో నున్న రోగమును బోగొట్టుకొన ప్రయత్నించును గాని, యీ రోగమునకు కారణ మేమియా యను విచారణకు గడంగడు. ఇట్టి విచారము నిష్ఫలము. రోగమును బోగొట్టుకొనుటకు మందు యెట్లు ప్రసిద్ధమయి యున్నదో, అట్లే సంసారభ్రమను పోగొట్టుకొనుటకు తత్త్వజ్ఞానము ప్రసిద్ధ మయియున్నది. దానిని వేదాంతశాస్త్రము వలనగాని, గురూపదేశము

వలనగాని సంపాదించుకొనవలెను. కావున వేదాంతశాస్త్రము సాక్షాత్తుగా ఆత్మను బోధింపజాలకున్నను ఆత్మయందు గల్పింపబడిన భ్రమజాలమును బోగొట్టునట్టి తత్త్వజ్ఞానమును బుట్టించుచున్నందున గొప్ప ఫలము గలదనియు, నేమాత్రము వ్యర్థము కాదనియు గ్రహింపవలయును.

అయితే, శాస్త్రమునందు కనిపించుచున్న ఆత్మ, బ్రహ్మ, సత్, చిత్ మున్నగు శబ్దములు ఆత్మను బోధించుచు, సంసారభ్రమను బోగొట్టునా? లేక బోధించకుండగనే సంసారభ్రమను బోధించునా? ఇందు మొదటి పక్ష మవలంబించినచో బ్రహ్మ శబ్దప్రతిపాద్యము గాదను సిద్ధాంతమునకు భంగము వాటిల్లును. ఇక రెండవ మత మవలంబించినచో, (ఆత్మను బోధించకున్నచో) సంసారభ్రమ యెట్లు తొలగును? త్రాటియందు గల్పింపబడిన సర్పభ్రాంతి అధిష్ఠానమయిన రజ్జు జ్ఞానము లేనిదే, నివర్తించజాలదుగదా?

అట్లు కాదు. ఆత్మ బ్రహ్మాది శబ్దములు ఆత్మను ఇదమిత్థ మని ప్రతిపాదింపవు. మరేమనిన, ఆత్మ అనాత్మ బ్రహ్మాదులకంటె విలక్షణమని మాత్రము ప్రతిపాదించును. దానివలన శ్రోతకు ఆత్మయందు గలిగిన అనాత్మభ్రాంతి కాని అబ్రహ్మ భ్రాంతికాని, అసత్తు అను భ్రాంతికాని తొలగును. నేను ఆత్మను, నేను బ్రహ్మను, నేను సచ్చిదానందరూపుడను అను జ్ఞానము కలిగిన పిదప సంసార ముండదు. అవిషయుడగు ఆత్మను ఇదమిత్థమని శబ్దములు ప్రతిపాదింపజాలవు. ప్రత్యక్ష విషయమగు అర్థమునందు మాత్రమే ఇదం శబ్దము ప్రయోగింప బడు చున్నది. అనుభవ రూపుడగు ఆత్మ అతీంద్రియుడు కాని యింద్రియగోచరుడు కానేరడు.

ఇంతమాత్రమున ఆత్మ శబ్దము ఆత్మను ప్రతిపాదింప దనుట లోకవిరుద్ధమని యనదగదు. లోకములో ఘటాది శబ్దములచే కంబుగ్రీవా ద్యాకారములు గల మృత్పిండ విశేషాదులు వివక్షితము లగుచున్నవి. అయ్యవి యింద్రియగోచరములే కాన వాటి నా శబ్దములు బోధింపవచ్చును. ఆత్మశబ్దముచే వివక్షితమగు వస్తువు 'ఇది' అని యెవ్వరును నిరూపింపజాలరు. నిర్విశేషుడగు ఆత్మను ఇదమిత్థమని నిరూపించుట సాధ్యపడదు. కాన నట్టి నిర్విశేషవస్తువును యే శబ్దములును ప్రతిపాదింపజాలవనుట యుచితము. కేవల యుక్తులు పురుషబుద్ధి తంత్రములు కాన ప్రమాణములు కాకపోవచ్చును. కాని శ్రుతిస్మృతిమూలకమయిన యుక్తులను ప్రమాణములుకావని త్రోసిపుచ్చుట అన్యాయము. ఆత్మ శబ్దావిషయుడనుటలో యతోవాచో నివర్తంతే' 'యద్వాచా నభ్యుదితమ్' ఇత్యాది శ్రుతులు 'బ్రహ్మన్ బ్రహ్మణ్యనిర్దేశ్యే నిర్గుణే గుణవృత్తయః కథం చరంతి శ్రుతయస్సాక్షాత్సదసతః పరే' అను స్మృతులును ప్రమాణము లగుచున్నవి. ఇట్లు శ్రుతి యుక్త్యనుభవ సిద్ధమగుచున్నందున శ్రీ శంకరులు జెప్పిన యర్థమే గ్రహింపదగును.

కావున,

౧. బ్రహ్మ ఘటమువలె సత్ కాడు, అతీంద్రియుడగుటవలన.

౨. బ్రహ్మ శశశృంగమువలె అసత్తుకాడు, శబ్దైకవేద్యుడగుటవలనను, అశూన్యుడగుటవలనను, ఆత్మయగుటవలనను,

3. బ్రహ్మము ఘటాదులవలె సదసచ్ఛబ్దవాచ్యముకాదు, నిర్విశేషమగుటవలన,

౪. బ్రహ్మ పరుడు, అనాదియగుటవలన, వ్యతిరేకముచే ఘటమువలె,

౫. క్షేత్రజ్ఞుడే = పరబ్రహ్మము = అద్వితీయజ్ఞానస్వరూపుడగుటవలన వ్యతిరేకముచే ఘటమువలె.

౬. క్షేత్రజ్ఞాభిన్నమయిన బ్రహ్మమే = ముముక్షువులకు జ్ఞేయము = బ్రహ్మాత్మజ్ఞానమే మోక్షహేతువగుటవలన. వ్యతిరేకముచే ఘటమువలె.

అని యిట్లు వ్యతిరేకదృష్టాంతముతోగూడిన అనుమానప్రయోగముల నూహింపనగును. బ్రహ్మయొక్కడే నిర్విశేష సత్యజ్ఞానానందరూపుడు. మిగిలిన ప్రపంచమంతయు సవిశేషము, అనృతము, జడము, దుఃఖరూపము. కావున నిచట అన్వయ దృష్టాంతము దొరకదు.

మఱియు, రామానుజులు: ఈ శ్లోకవ్యాఖ్యానమున నిట్లనిరి. "బ్రహ్మ భిన్నుడయిన క్షేత్రజ్ఞునియొక్క స్వరూప మిట శోధింపబడుచున్నది. అమానిత్వాది సాధనములచే బొందదగిన ప్రత్యగాత్మస్వరూపమును చెప్పెదను. దానిని తెలిసికొనినవాడు జన్మమరణ రహితుడయిన ఆత్మను బొందును. ఆత్మ ఆదిలేనివాడు, కనుకనే అంతములేనివాడు. (మత్పరం) నేనే శేషిగా కలవాడు. బృహత్వగుణము కలవాడు = అనగా క్షేత్రజ్ఞతత్వము శరీరముకంటె వేరయి, స్వతః శరీరాదులతో పరిచ్ఛేదము లేనిదని యర్థము. "బ్రహ్మణోహి ప్రతిష్ఠాఽహమ్" ఇత్యాదులయందు బ్రహ్మశబ్దము ఆత్మయందుగూడ బ్రయోగింపబడుచున్నది. ఆత్మ కార్యకారణ రూపమయిన అవస్థాద్వయము లేనివాడగుటచే ఆత్మస్వరూపము సచ్ఛబ్దముచేగాని అసచ్ఛబ్దముచేగాని చెప్పబడదు అని.

పరా. ఇందుకు మూలగ్రంథమును శ్రీరామానుజభాష్యమునందుగాని, సంస్కృతభాష్యార్కప్రకాశికయందుగాని చూడనగును.

ఇది యేమాత్రము పొసగదు ప్రత్యగాత్మయొక్క స్వరూపము ప్రత్యగాత్మకంటె భిన్నమా? అభిన్నమా? అని రామానుజుల నడుగవలయును. ఇందు రెండుపక్షముల దోషము కలదు. ఎక్కడయినను తనస్వరూపము తనకంటె భిన్నమగుట సంభవించునా? అభిన్నమయిన తనదురూపమును తాను బొందుట సంభవించునా? మరియు రామానుజులు: "జ్ఞేయం" అను పదమునకు "ప్రాప్యమ్" అని

వ్యాఖ్యానముజూపిరి. జ్ఞానార్థకముగ బ్రసిద్ధిచెందిన జ్ఞా ధాతువునకు పారి స్త్యర్థమును కల్పించుట అనుచితము. మరియు వారిమతమున జీవుడు అణుపరిమాణుడని వాదిం చుచు జీవాత్మయందు బ్రహ్మశబ్దమును ప్రయోగించుటకు జీవాత్మకు బృహత్త్వ గుణయోగమును (సంబంధమును) నిరూపించిరి. అణుపరిమాణునకు బృహత్త్వగుణ సంబంధ మెట్లు పొసగును? ఒకవేళ జీవునకు ముక్తిదశలో బృహత్త్వగుణయోగము సంభవించునన్న నదియును బొసగదు. ముక్తియందు వెనుకటిస్వరూపముకంటె క్రొ త్తరూపమేర్పడునా? అదేరూప మేర్పడునా? ఇందు మొదటిపక్షమున మొదటిరూప మును విడచి రూపాంతరము నవలంబించినందున జీవుడు జన్మమరణములు కలవాడై అనిత్యు డగును. ఆవిర్భవించిన రూపముగూడ అనిత్యమే యగును. ఇక రెండవపక్ష మవలంబించినచో వెనుకనున్నరూపము మరల నావిర్భవించుట అయుక్తమగును మరియు బృహత్త్వగుణముగూడ క్రొత్తది వచ్చునా? క్రొత్తది వచ్చునన్నచో నదియ నిత్యము కావలసివచ్చును. వెనుకనున్నదే వచ్చునన్నచో నది మరల యావిర్భవిం చుట వ్యర్థమగును. కాక ముక్తిదశలో నావిర్భవించెడి బృహత్త్వగుణము జీవునియొ క్క అణుత్వమును బోగొట్టి వచ్చునా? లేకుండగనా? జీవునియొక్క అణుత్వమును బోగొట్టినచో జీవునికే నాశ మేర్పడును. రెండవపక్షమున జీవునకు అణుత్వముండగా బృహత్త్వము సిద్ధింపనేరదు.

స్వతస్సిద్ధముగా అణువయిన జీవుడు ముక్తియందు బృహత్పరిమాణుడగు చో జీవుడు సావయవుడు గావలసివచ్చును. అణువయిన వస్తువు అనేకాణువులు కలి యనిదే మధ్యమపరిమాణముకలదియే కానేరదు. మహత్పరిమాణముకల దెట్లగును? జీవునకు సావయవత్వ మొప్పినచో అనిత్యత్వము ప్రాప్తించును. రామానుజులు గూడ జీవుడు నిరవయవుడని యంగీకరించియుండి యిప్పు డా సిద్ధాంతమునకు విరుద్ధ ముగ మాట్లాడినట్లగును. ఇక శరీరపరిచ్ఛేదమువలన సంసారదశలో జీవుడు అణు వనియు ముక్తియందు శరీరపరిచ్ఛేదము లేనందున బృహత్పరిమాణుడనియు నన్న చో నిదియును బొసగదు. అపరిచ్ఛేద్యుడయిన పరమాత్మకు పరిచ్ఛేదము సంభవిం చదు. అట్లు సంభవించుచో ఘటాదులవలె నాత డనిత్యుడగును.

కాక శరీరాదులతో పరిచ్ఛేదము జీవునకా? పరమాత్మకా? జీవున కన్నచో పరిచ్ఛేదమునకుబూర్వము జీవుడే లేకపోవుచుండ జీవునకు పరిచ్ఛేద మనుట దెట్లు కుదురును? జీవుడు పరిచ్ఛిన్నుడంచురా అణువు కానేరదు. పరమాత్మకు శరీరా దులతో పరిచ్ఛేద మొప్పినచో పరమాత్మకే జీవత్వము ప్రసక్తించును. జీవులు పరమాత్మకంటె వేరని రామానుజుల సిద్ధాంతము. ఇందువలన బ్రహ్మశబ్దము యౌగిక వ్యుత్పత్తిని విడచి, రూఢిచేతనే ఆత్మను చెప్పునన్నచో నదియును పొసగదు. బ్రహ్మశబ్దము రూఢి చే బరమాత్మయందు బ్రసిద్ధమయినది. పరమాత్మాభేదమును

పురస్కరించుకొని షష్ఠ్యాత్మయందుకూడ ప్రయోగింపబడుచున్నది. "బ్రహ్మణోహి ప్రతిష్ఠాఽహమ్" అనుచోట పరమాత్మను ప్రత్యగాత్మ ప్రతిష్ఠయని అర్థమును చెప్ప బోవుచున్నారు. కావున బృహత్త్వగుణయోగమువలన బ్రహ్మశబ్దము జీవుని యందు వర్తింపదనుట నిస్సారము.

మరియు "మత్పరమ్" అను పదములకు రామానుజులు చెప్పిన నిర్వచనముకూడ యుచితముగాదు. ఈశ్వరునివలె ముక్తుడయిన జీవుడుకూడ బృహత్ప్రమాణుడనియు, సచ్చిదానంద రూపుడనియు, నంగీకరించు రామానుజులు, బంధావస్థలో జీవుడీశ్వరు డనియన్నను ముక్తావస్థలో నీశ్వర శేషుడని యనుట అజ్ఞాన విలసితముగను. ముక్తియందు జీవున కీశ్వరసాధర్మ్యము కలుగునని వైష్ణవులందురు. అందుకు "మమ సాధర్మ్యమాగతాః" అను గీతాస్మృతినికూడ ప్రమాణముగ జూపుదురు. ఇట్టియెడ సమానధర్మముగల వస్తువులకు పరస్పరము శేషశేషిభావమును గల్పించు టెట్లు పొసగును? ధనికునకును దరిద్రునకును శేషశేషిభావము కనిపించుచున్నది. భార్యాభర్తలకును శేషశేషిభావము కలదు. వీరందరు సమానధర్మముగల వారు కారు. వీరి కియ్యది యుచితము గానచ్చును. సమానధర్మముగల జీవేశ్వరుల కిది యెట్లు పొసగును? ఇక జీవేశ్వరులిద్దరు సచ్చిదానందరూపులయినను ముక్తిదశలో జీవులకు జగద్వ్యాపారము లేనందునను, ఈశ్వరుని కిది యున్నందునను జీవునికంటె నీశ్వరుడు గొప్పవాడన్నచో నదియు నిలువనేరదు.

సగుణముక్తి సాధనమయిన హిరణ్యగర్భలోకమును బ్రవేశించిన జీవులకు మాత్రమే జగద్వ్యాపారము లేదని సూత్రకారు లభిప్రాయపడిరి. వీరికి పరిచ్ఛేదము కలదుగాన నీశ్వరసాధర్మ్యమున్ను లేదు. ముక్తజీవునివలె నీశ్వరుడుకూడ సశరీరుడే యనినచో, శరీరవిశిష్టుడయిన హిరణ్యగర్భునకుకాని, విష్ణువుకాని, శివుడుకాని వీరు జీవు లనబడుదురుకాని యీశ్వరు లనబడరు. శరీరరహితుడే యీశ్వరుడు "అశబ్ద మస్పర్శ మరూప మవ్యయమ్" అను శ్రుతి, పరమాత్మ అశరీరుడని ప్రతిపాదించుచున్నది. ముక్తజీవునకుగూడ శరీరము లేదన్నచో నుపాధిభేదమే లేనపుడు జీవేశ్వరులకు భేదముచే చెప్పుటెట్లు? అపరిచ్ఛిన్నము పరిపూర్ణము, మహత్పరిమాణము గల వస్తువులు రెండుండనేరవు. అట్లుండుచో జీవునితో నీశ్వరునకు పరిచ్ఛేదము సంభవించుచుండుటచే వారిరువురకును అపరిచ్ఛిన్నత్వమే పొసగదు. దేశకాల వస్తువులచే పరిచ్ఛేదములేని వస్తువు అపరిచ్ఛిన్నమయిన బ్రహ్మ మని చెప్పబడుచున్నది. ఇక బ్రహ్మకు తనశరీరమయిన జీవునితో పరిచ్ఛేదము లేదన్నచో, లేక పోవుగాక. జీవునకు తనశరీరముతో పరిచ్ఛేద మెట్లు తప్పును? శరీరములు రెండు పదార్థములందురా, పరస్పర పరిచ్ఛేద మనివార్యము. ఒకే పదార్థమందురా? శరీరశరీరిభావమే పొసగదు.

కావున జీవేశ్వరులు భిన్నులనియున్నచో ఈశ్వరునకు జీవునితో పరిచ్ఛేదముండుటచే పూర్ణత్వరూపమగు మహత్త్వము లేనందున ఈశ్వరుడే బ్రహ్మ కాకపోవుచుండ జీవుడు బ్రహ్మ యెట్లగును? ఆహా! జీవునకు బ్రహ్మత్వమును సాధింప దలచిన రామానుజులు బ్రహ్మకే బ్రహ్మత్వమును లేకుండచేసిరి. మరియు ముక్తిదశలో ప్రకృతికూడ నున్న యెడల బ్రహ్మకు దానితోకూడ పరిచ్ఛేద మవశ్యమగును. కావున పరమార్థముగా జీవేశ్వరులకు భేదములేదు. ప్రకృతిలేదు. దానికార్యమగు ప్రపంచమున్నూ పరమార్థముగ లేదు. కనుకనే "ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ" అను శ్రుతిసిద్ధమయిన అద్వైతము సుస్థిరమగుచున్నది. ॥౧౩॥

శ్లో॥ సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి॥ ౧౪

అ. సచ్ఛబ్దమునకు విషయుడు కానందున బ్రహ్మ లేడను శంకరాగా సకలప్రాణులయొక్క ఇంద్రియము లను ద్వారమున బ్రహ్మయొక్క యునికిని గ్రహింపవచ్చునని యీ శ్లోకముచే ప్రతిపాదించుచున్నాడు.

పూర్వశ్లోకముయొక్క నాలవపాదమున "నసత్తన్నాసదుచ్యతే" యని బ్రహ్మ యసత్తుకాదని చెప్పుటచే అసత్య (లేడను)శంక నిరాకరింపబడినట్లే. అయినను సత్తుకానిది యసత్తుకాకుండ నెట్లుండును? అను నాశంక మరల బుట్టుట కవకాశము కలదు. కాన నీశ్లోకముచే నా యాశంకను తొలగించుట యవసరము.

సకలప్రాణులయొక్క పాణిపాదాద్యుపాధులచే క్షేత్రజ్ఞాత్మ యున్నటుల గుర్తింప నగునని శ్లోకతాత్పర్యము.

ఉపహితుడు లేనిదే యుపాధు లుండనేరవు. ఉపాధులు యింద్రియగోచరములగుచు నగపడుచున్నవి. అందువలన నుపహితుడగు ఆత్మకూడ నున్నటుల నిర్ణయమగుచున్నది. ఉపాధికృతమయిన పాణిపాదత్వాది ధర్మజాతమంతయు క్షేత్రజ్ఞునకు మిథ్యగాని సత్యముగాదు. కనుకనే మిథ్యాభూతములయిన ఉపాధిధర్మములను నిషేధించి నిర్విశేషబ్రహ్మమును దెలిసికొమ్మని "నసత్తన్నాసదుచ్యతే" అను స్మృతిచే చెప్పబడినది. అయితే నిర్విశేషబ్రహ్మమును తెలిసికొనమని పూర్వశ్లోకముచే జెప్పి యీశ్లోకమున "సర్వతఃపాణిపాదం" అని సకలప్రాణులయుపాధులు క్షేత్రజ్ఞునవని నిర్వచించుచు సవిశేషబ్రహ్మము నిరూపించుట ప్రకరణ విరుద్ధముకదా! యని యనరాదు. "అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే" అను న్యాయము ననుసరించి ఆత్మయందు నిజముగ లేని ధర్మముల గల్పించి బ్రహ్మమును బోధింప నీ శ్లోకము ప్రవర్తించినదికాని బ్రహ్మ సవిశేషమని నిరూపించుటకు ప్రవర్తించలేదు.

ఓయి, యిచట అధ్యారోపాపవాద న్యాయము ప్రవర్తించదు. అధ్యారోపముకంటె పూర్వమే "నసత్తన్నాసదుచ్యతే" అను నపవాదము చెప్పబడినది. ముందు అధ్యారోపమును జూపి యావల నపవాదమును చేసినచో అధ్యారోపాపవాద న్యాయము ప్రసక్తించును. ఇట నా న్యాయము తలక్రిందు యైనది. కాన న్యాయము ప్రవర్తించదు. అనినచో నట్లుకాదు. "నసత్తన్నాసదుచ్యతే" అను శ్లోకమున నిర్విశేషబ్రహ్మము సూచింపబడినది. అట్టిబ్రహ్మను తెలియుటకు "సర్వతః పాణిపాదం" అనుశ్లోకముచే పాణిపాదత్వాది ధర్మములు కల్పింపబడినవి. ఇట్లు కల్పింపబడిన విశేషములను నిరసించి నిర్విశేషబ్రహ్మను ప్రతిపాదించుటకు "సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్" అను ఉత్తరశ్లోకము ప్రవర్తించినది. ఈశ్లోకములు వరుసగ 12, 13, 14 సంఖ్యలతో యథాక్రమముగ నున్నవి. కావున నిచట అధ్యారోపాపవాద న్యాయమునకు భంగములేదు.

వహ్ని యున్నదనుటకు ధూమము హేతువయినట్లు తెలిసికొనదగిన బ్రహ్మమున్నదనుటకు జ్ఞానబలక్రియాది శక్తులు గల చక్షుశ్శ్రోత్రపాణిపాదా ద్యవయవములు హేతువు లగుచున్నవని భావము.

రామానుజ మతము—

ఇచట రామానుజులు పరిశుద్ధాత్మస్వరూపము అంతట పాణిపాదాది యింద్రియములయొక్క పనులను చేయుటయందు శక్తికలదనియు, 'అపాణిపాదో జవనో గ్రహీతా' యను స్మృతి పరమాత్మ యట్టివాడని చెప్పుచున్నదనియు, ముక్తజీవునకు కూడ పరమాత్మతో సాదృశ్యముండుటచే ముక్తజీవుడుగూడ నట్టివాడగుట యుక్తమనియు జీవుడు లోకమునందలి వస్తుజాతమంతయు వ్యాపించియుండి దేశకాలాది పరిచ్ఛేదములు లేనందున సర్వగత (సర్వవ్యాపక) మగు ననియును వ్యాఖ్యానించిరి.

ఇది యుచితము గాదు. కర్తృత్వవికారములేని యాత్మ పాణిపాదాది కార్యములకు గర్త కానేరదు. "నిష్కలం నిష్క్రియం శాన్తం" అనుశ్రుతిని బట్టి యాత్మయందు గ్రహణము (పట్టుకొనుట) మున్నగుక్రియలు సంభవించవు. అయితే "అపాణిపాదో జవనో గ్రహీతా" అనుశ్రుతి, బ్రహ్మ సర్వేంద్రియోపాధుల యొక్క గుణముల కనుకూలమయిన వేగము మున్నగుశక్తులు గలదిగా దెలిసికొమ్మని చెప్పుచున్నది. తా నాపనులను జేయువాడని చెప్పుటలేదు. ఈశ్వరుని యొక్క శక్తిచేతనే ఇంద్రియములన్నియు నాయాపనుల నెరవేర్చుచున్నవి.

అణువయిన జీవుడు బృహత్పరిమాణముగల పరమాత్మతో సామ్యము గల వాడనుట యనుచితము. పైగా నెవరయిన ఈమాట వినినచో నవ్వెదరు. ఇట్టి అణువును, పరిచ్ఛిన్నుడును అగు జీవునకు దేశకాలపరిచ్ఛేదములు లేకపోవ్రటగాని, దానివలన నాతనికి సర్వవ్యాపకత్వము గలుగుటకాని బొత్తుగా కుదురదు.

ఇక శ్రీభాష్యవ్యాఖ్యాత లగు వేదాన్తదేశికులు, జీవుడు ముక్తిదశలో గూడ అణురూపుడనియు, అట్లుగాక, ముక్తిదశలో అణుత్వము పోయి బృహత్త్వమేర్పడునో స్వరూపమునకు వికారము కలుగుననియు, అప్పుడు నిర్వికారత్వశ్రుతికి విరోధము కలుగుననియు జెప్పిరి. మరియు, ధర్మభూతజ్ఞానముద్వారా జీవునకు సర్వవ్యాపిత్వ ముండుననియు జెప్పిరి. ఇదియును ఉచితము గాదు. మూలమునందు లేని ధర్మభూతజ్ఞానద్వారమును గల్పించుట న్యాయముగాదు. జీవుడు నిర్ధర్మక జ్ఞానస్వరూపుడనియు, ధర్మభూతజ్ఞాన మాతనికి సంభవించదనియు, నింతకుమున్నె ప్రతిపాదింపబడినది. మరియు, ముక్తుడై పరమపదమునం దున్నజీవునకు ధర్మభూతమగు జ్ఞానముతో వ్యాప్తి యసంభవము. వస్తుజాతమంతయు బ్రహ్మాండములో నున్నది. పరమపదము బ్రహ్మాండమున కావల యున్నది. కనుక బ్రహ్మాండమున కావలనుండు ముక్తజీవుడు బ్రహ్మాండములోపలనుండు వస్తువులను ధర్మరూపమగు జ్ఞానముతో నెట్లు వ్యాపింపగలడు? ఒకవేళ ఇంటివెలుపల నుండువాడు యింటిలోనుండు ఘట పటాదులను బయటనుంచి కంటితో జూచినట్లు, ముక్తజీవుడు గూడ బ్రహ్మాండమువెలుపలనుంచి ధర్మరూప జ్ఞానముతో, లోపలివస్తువులను వ్యాపింప నలవియగుననన్నచో, నపుడు సంసారదుఃఖముతో వ్యాకులపడియున్న నీ ప్రాణివర్గమునంతయు జూచి, ముక్తులయిన జీవులుకూడ దుఃఖింపవలసివచ్చును. పైగా జీవునకు స్వరూపజ్ఞానము నిర్వికారమయినను, ధర్మభూతమగు జ్ఞానము సుఖదుఃఖాద్యనేకవిషయకమగుచు సవికారమయినందున జీవుడుగూడ సవికారుడు కావలసివచ్చును. కావున వీరి వ్యాఖ్యానమిన్నిదోషములతో నిండియున్నందున గ్రహింపదగినదికాదు. ఇక నద్వైతమతమున, ధర్మభూతజ్ఞాన మంతఃకరణధర్మ మగుటచే జీవునకు సవికారత్వ ముండదు. వారిమతమునగూడ ధర్మభూతజ్ఞానముతో సర్వవ్యాపిత్వమనునది పొసగనేరదు. ధర్మభూతజ్ఞానము వృత్తిజ్ఞానము. ఇయ్యది క్షణికము. ఈక్షణమునం దున్న సుఖాదికము మరొకక్షణమం దుండదు. ఈ క్షణమందున్న ధర్మభూతజ్ఞానమున్ను మరొకక్షణమం దుండనేరదు. ఇట్టి క్షణికజ్ఞానము క్షణాంతరమునందున్న సుఖాదుల నెట్లు వ్యాపించును?

కావున అణువగు జీవునకు నెవ్విధముగను, సర్వవ్యాపకముతో సిద్ధించదు. కనుక, సర్వవ్యాపకుడయి దేశకాలాది పరిచ్ఛేదములులేని పరిపూర్ణబ్రహ్మమే జీవుడను అద్వైతమత మంగీకరింపక దప్పదు. ౧౪

శ్లో. సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ॥ ॥౧౫॥

అ॥ తెలిసికొనదగిన బ్రహ్మయందు పాణిపాదాదీంద్రియముల నారో

పించుటయేకాని, నిజముగ ఉపాధిసంబంధము బ్రహ్మకు లేదని చెప్పుటకే శ్లోక మారంభింపబడుచున్నది.

బాహ్యేంద్రియములయొక్క ప్రవృత్తియంతయు అంతరింద్రియమగు మనస్సుయొక్క ప్రవృత్తిమీద సాధారపడియున్నది. కావున ఆత్మకు శ్రోత్రాదీంద్రియములు అంతఃకరణముద్వారా ఉపాధులుగాని, స్వయముగ నుపాధులు గావు. ఆత్మకు దగ్గరయుపాధి యంతఃకరణము. దూరపు ఉపాధులు శ్రోత్రాదులు. ఆత్మ అంతరింద్రియ బాహ్యేంద్రియములయొక్క ధర్మములయిన అధ్యవసాయ (నిశ్చయజ్ఞానము) సంకల్ప శ్రవణాదులతో భాసించును. అనగా యింద్రియములు వ్యాపారముగలవిగ నుండ తాను వ్యాపారము గలవానివలె గనుపించును.

ఇందుకు ప్రమాణము "ధ్యాయతీవ లేలాయతీవ" అనుశ్రుతి.
(బుద్ధి ధ్యానించుచుండ ఆత్మ ధ్యానించువానివలె నుండును. బుద్ధి చలించుచుండ తాను చలించువానివలె నుండును.)

కనుకనే ఆత్మ సర్వేంద్రియరహితుడు. ఇంద్రియములు కరణములు. కరణములు కర్తృపరతంత్రములు. ఆత్మ కర్తయగుచో అతనికి కారణము లుండెడివి. ఆత్మ యకర్త. కావున ఆత్మకు కరణసంబంధము లేదు. అయితే "అపాణిపాదో జవనో గ్రహీతా" అనుశ్రుతి ఆత్మకు స్వతస్సిద్ధముగ వ్యాపార మున్నదని చెప్పుట లేదు. సకలోపాధిగుణములకు అనుకూలపడు చైతన్యశక్తి యాత్మకు కలదని మాత్రమే యీశ్రుతి చెప్పుచున్నది మాయవలన సర్వేంద్రియానుగ్రాహకత్వము ఆత్మకు సంభవించవచ్చునని భావము. నిజముగ ఆత్మకు వ్యాపారమున్నచో "నిష్కలం నిష్క్రియం శాంతం" అనుశ్రుతి కుదరదు. కనుక రెండుశ్రుతులకు విరోధము లేకుండ అర్థమును వర్ణింపవలెనన్న పైనిచెప్పిన రీతిగనే యీశ్రుత్యర్థమును నిర్వచింపవలెను.

అయితే యిట్లు శ్రుతులకు ముఖ్యార్థమును విడిచి ఇతరార్థమును కల్పించుట న్యాయమా? అనుప్రశ్న కలుగవచ్చును. ప్రత్యక్షాది ప్రమాణాంతరవిరుద్ధమయిన అర్థమును చెప్పునపుడు అన్యార్థమును గల్పించుట న్యాయము. ఇట్టి శ్రుతులు వేదమునందచ్చటచ్చటగలవు. 'అన్ధో మణి మవిందత' (గ్రుడ్డివాడు మణిని చూచెను.) 'త మనయంగుళిరావయత్' (దానిని వ్రేళ్ళులేనివాడు గ్రహించెను.) "అగ్రీవః ప్రత్యముంచత్' (మెడలేనివాడు ధరించెను.) "తమజిహ్వో అసశ్చత" (నాలుకలేనివాడు దానిని వర్ణించెను.) అని ఇట్లు అరుణమునందు గొన్నిమంత్రములుగలవు. వీనికి వాచ్యార్థము ప్రత్యక్షాదిప్రమాణవిరుద్ధము. కన్ను, వేళ్ళు, మెడ నాలుక లేనివారు మణిని చూచుట, పట్టుకొనుట, ధరించుట, వర్ణించుట అను పనులను జేయజాలరు. కావున పైమంత్రములకు ప్రత్యక్షాదిప్రమాణవిరుద్ధము.కాని

యర్థమును వర్ణింపవలెను. అట్లుగాక నిరర్థకములైనను, విరుద్ధార్థకములైనను వేదము ప్రమాణమగును. ఆదెట్లనగ? ప్రసిద్ధివారు మున్నగువారు కలలో మనస్సుతో మణిని గ్రహించుట మున్నగు పనులను జేసిరి. అని సమన్వయించవలెను. ఇట్లే అపాణి పాదో జవనో గ్రహీతా ॥ అను మంత్రముకూడ సమన్వయించుట యుచితము.

ఇచట కొందరు, "అంధా"దిమంత్రములవలె "అపాణిపాదః" అను మంత్రముకూడ అర్థశూన్యమని యనెదరు. అదియుక్తముగాదు. భాష్యమున కనుగుణము కాదు. పైగా వేదమునకు అప్రామాణ్యమునుగూడ నాపాదించును. ఆత్మ సర్వేంద్రియరహితుడు గనుకనే యసంగుడు. సర్వమును ధరించినవాడు, సర్వము తనయందు గల్పింపబడినదికనుక నిర్గుణుడు అయినను గుణముల ననుభవించుటయను హేతువుచే దెలియతగినవాడు. ఇచట కొందరు ఆత్మయందు నిర్గుణశబ్దముచే సత్త్వాదిగుణములు లేవనియు, కల్యాణగుణములు గలవనియు జెప్పుచున్నారు. అది యనుచితము. కల్యాణగుణములుగూడ సత్త్వరూపములే కావున, సత్త్వాదిగుణములు లేనప్పుడు కల్యాణగుణములుగూడ నుండవు. కావున ఆత్మ (బ్రహ్మ) నిర్గుణుడగును.

సత్త్వగుణముయొక్క పరిణామము సుఖము రజోగుణముయొక్క పరిణామము దుఃఖము. తమోగుణముయొక్క పరిణామము మోహము. ఇయ్యవి (సత్త్వాదిగుణములు) శబ్దస్పర్శాది విషయములద్వారమున పురుషునకు సుఖాదుల గలుగజేయును. అందువలన గుణభోక్తృత్వము (గుణముల ననుభవించుట) క్షేత్రజ్ఞునకు గలుగుచున్నది. గుణముల ననుభవించుటయన, గుణపరిణామములయిన సుఖదుఃఖాదుల ననుభవించుటయని అర్థము. క్షేత్రజ్ఞునకు భోక్తృత్వముగూడ జ్ఞానరూపము. అనగా సుఖదుఃఖాదులను దెలిసికొనుటయని యర్థము. అందువలన భోక్తృత్వ వికారముగూడ నీతనికి లేదని తేలుచున్నది.

అనగా సుఖదుఃఖాదులకు క్షేత్రజ్ఞుడు సాక్షి యని సిద్ధించుచున్నది. అంతఃకరణము సుఖదుఃఖాదులతో వికారము నొందుచుండ క్షేత్రజ్ఞుడు సాక్షిగా జూచుచుండును. సాక్షిచే జూడబడియెడి సుఖాదులు సాక్షిధర్మములు కాని, సాక్షిభోగ్యములు గాని కాజాలవు. కావున సుఖదుఃఖాదులకు సాక్షిత్వమాత్రమే యిచట గుణభోక్తృత్వపదముచే జెప్పబడినది. కనుక జ్ఞేయములయిన సుఖాదులచే జ్ఞాతయగు ఆత్మ యూహింపబడుచున్నాడు. ఇట్టి సదూపుడు క్షేత్రజ్ఞానరూపుడు నగు బ్రహ్మను గుర్తింపవలెనని యీ శ్లోకతాత్పర్యము.

రామానుజ మతము:—

ఇచట రామానుజులు: "సర్వేంద్రియగుణాభాసం" సర్వేంద్రియ వృత్తులతోటి విషయములను దెలిసికొనుటకు సమర్థుడును, స్వతస్సిద్ధముగా సకలేంద్రియములు లేనివాడును, "అసక్తం" స్వతస్సిద్ధముగ దేవాదిదేహములతో సంబంధము లేనివాడు,

'సర్వభృత్' = సకల దేహములను ధరించుటయందు సమర్థుడు;
'నిర్గుణం'= స్వభావతః, సత్త్వాది గుణములు లేనివాడు;
'గుణభోక్తృ'=సత్త్వాదిగుణముల ననుభవింపసమర్థుడు, అని వ్యాఖ్యానించిరి.
ఇదియంతయు విచార రమణీయము కాదు-

ఏలయన, ఆత్మ స్వభావమువలన సర్వేంద్రియవివర్జితుడు, అసక్తుడు, నిర్గుణుడు అనిచెప్పినచో సర్వేంద్రియాభాసత్వము, సర్వభృత్త్వము, గుణభోక్తృత్వము అను మూడును స్వతస్సిద్ధములుగావని తెలినది. అప్పు డీ మూడును ఆత్మకు స్వరూపమువలన నున్నవా? ఉపాధివలన నున్నవా? ఇందు మొదటిపక్షము కుదరదు. స్వరూపతః సర్వేంద్రియగుణాభాసత్వ మున్నచో సర్వేంద్రియవివర్జితుడగుట సంభవించదు. ఇక రెండవపక్షమాశ్రయింపదగిన దదియును పొసగదు. పరిశుద్ధాత్మ స్వరూపమును జెప్పదలచిన నీప్రకరణమున కౌపాధికధర్మముల జెప్పుట యనుచితమగును. ఉపాధిరహితమయిన వస్తువుకాని పరిశుద్ధము గానేరదు. ఆత్మకు ఇంద్రియ వృత్తులతో విషయములను గ్రహించు సామర్థ్యమున్నదని ఆబాలగోపాలము తెలిసియుండ, నావిషయము నిచట చెప్పుట వ్యర్థమున్ను, శాస్త్రమున కప్రామాణ్యమున్ను ఆపాదించును. తెలియనివిషయమును బోధించెడి శాస్త్రమే ప్రామాణ్యమగును. పరిశుద్ధముక్తాత్మస్వరూపమునకు ఇంద్రియవృత్తులతో విషయములను దెలిసికొను సామర్థ్య మున్నదా? లేదా? అను సందేహ మెంతటిమూఢులకును గలుగదు. కాన నట్టి విషయమును జెప్పుట నిరర్థకము.

మరియు 'సర్వేంద్రియ వివర్జితం' అను పదము యథాశ్రుతార్థము సర్వేంద్రియరహితుడు అని. దీనిని విడచి యింద్రియవృత్తులులేకుండగనే సర్వమును దెలియువాడు అను అర్థమును వర్ణించుటయు నిరర్థకము.

మరియు జీవుడు లేచిపోవునప్పుడు శరీరము పడిపోవుట యెల్లరకు దెలిసియుండుటచే, ఆత్మకు నెల్లదేహములను భరించు సామర్థ్య మున్నదని చెప్పుటయు వ్యర్థము.

కాక ఆత్మ ఒక్కొకదేహమును భరింప సమర్థుడుగాని, యెల్లదేహములను యొకమారు భరింప సమర్థుడుగాడు. కనుక నియ్యది చెప్పుట అయుక్తము. కాక 'సర్వభృత్' అనుచోట సర్వశబ్దము మృత్ప్రాణాదుల నన్నిటిని చెప్పుచుండ, నద్దానికి దేహపరముగ సంకోచ మొనర్చుట యనుచితము.

దేవాది దేహములతో సంగములేనివానికి నాదేహములను భరించు సామర్థ్య మున్నదా, లేదా? అను సందేహమే లేనపుడు భరించు సామర్థ్య మున్నదని చెప్పుటయు నుచితముకాదు.

ఇట్లే 'గుణభోక్తృ' పదమునకును గుణముల ననుభవింప సమర్థుడు అని వర్ణించుటయు నిరర్థకము. పరిశుద్ధాత్మ నిర్గుణుడు. వీనికి గుణానుభవ సామర్థ్యము

కలదా, లేదా? అను శంకయే కలుగదు. అట్టితటి యీవిషయ మిచట జెప్పనేల?

బంధావస్థయందువలె ముక్తావస్థయందుగూడ ఆత్మకు దేహాము లుండుచో ఆత్మ కెల్లపుడు దేహాదిసంగ ముండియుండ, స్వభావతః అసక్తత్వ మెట్లు సంభవించును?

గుణభోగము లుండుచో అవిక్రియత్వ మెట్లు పొసగును? జక్షణాదిశ్రుతి హిరణ్యగర్భలోకమును బొందిన జీవునిగురించి చెప్పబడినదికాని, ముక్తాత్మనుగురించి చెప్పబడినదికాదు. కావున నిచట రామానుజవ్యాఖ్య నిస్సారము. ౧౫॥

శ్లో॥ బహిరంతశ్చ భూతానాం అచరం చరమేవ చ
సూక్ష్మత్వా త్త దవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్ ॥ ౧౬॥

అ॥ మరియు, జ్ఞేయమగు (తెలియదగిన) బ్రహ్మపదార్థము, నిఖిలభూతములకు దేహమునకు వెలుపలను, లోపలను గలదు. మధ్యనున్న చరాచరవస్తుజాలముగూడ బ్రహ్మరూపమే. అయినను ఆకాశమువలె అతిసూక్ష్మమగుటచే నేరికిని తెలియుటలేదు. కనుకనే తెలియని యజ్ఞానులకు దూరమున నున్నదియు, తెలిసికొన్నవారలకు దగ్గరనున్నదియు నగుచున్నది. చైతన్యము, ప్రత్యగాత్మరూపముతో నిఖిలభూతములకు లోపలను, పరమరూపముతో వెలుపలను ఉన్నది. అంతఃకరణముపాధిగాగల చైతన్యము ప్రత్యక్చైతన్యమనియు, మాయ ఉపాధిగాగలచైతన్యము పరచైతన్యమనియు గ్రహింపవలయును.

ప్రత్యగాత్మపరమాత్మలకు భేదమును జెప్పువారల కీయది సిద్ధించదు. వారిమతమున లోపలనున్న ప్రత్యక్చైతన్యము వెలుపలనుండుటకాని, వెలుపలనున్న పరచైతన్యము లోపలనుండుటకాని సంభవించదు. 'అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః' (నారాయణుడు లోపల వెలుపల నిండియున్నాడు)–'ఏకో దేవ స్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా' (సర్వభూతములయందు రహస్యముగానుండి, సర్వభూతముల కంతరాత్మయయి,సర్వప్రపంచమును వ్యాపించియుండు దేవుడొక్కడే) అను శ్రుతులు క్షేత్రజ్ఞుడు సర్వవ్యాపకు డని చెప్పుచున్నవి. కావున అద్వితీయమగు చైతన్యమునకు సర్వవ్యాపకత్వము శ్రుతిసిద్ధము.

క్షేత్రజ్ఞుడు దేహాంతర్భాగమునందును దేహబహిర్భాగమునందును మాత్రమే యుండుచో మధ్యప్రదేశమున లేనందున సర్వవ్యాపకత్వమునకు భంగము వాటిల్లును. కాన మధ్యప్రదేశమున నుండు దేహాభాసముగూడ చిద్రూపమే. త్రాటియందు గల్పింపబడిన సర్పాభాసము రజ్జురూపమయినట్లు బ్రహ్మయందు గల్పింపబడిన చరాచరవస్తుజాతమంతయు బ్రహ్మరూపమే యగుచున్నది. బ్రహ్మయందు చరాచరప్రపంచము అవిద్యచే గల్పింపబడిన దనుటలో సందియము వలదు. స్వప్నావస్థలో ఆత్మయందు రథాదివస్తుకల్పనమును మనము జూచుచున్నాము. ఇట్టితటి మట్టికంటె వేరుగ ఘటాదులును, త్రాడుకంటె వేరుగా సర్పమును లేనం

దున, కారణముకంటె వేరుగ కార్యముండదని నిర్ణయము. కావున ప్రపంచకారణ మగు బ్రహ్మకంటె ప్రపంచము వేరుగ లేదు. అయినను బ్రహ్మము ఆకాశమువలె నతీంద్రియమగుటవలన నెరికిని తెలియబడుట లేదు.

ఆకాశము నావరించియున్న చీకటికాని, వెలుతురుకాని కంటి కగపడు చున్నది. ఇంతియెకాని, రూపరహితమయిన ఆకాశము కంటికగపడ నవకాశము లేదు. కనుకనే యాకాశమును సాక్షిభాస్యమని యంగీకరించిరి. వాయువుమాత్ర మిట్టిది కాదు. వాయువు రూపములేనిదయినను స్పర్శరూపమగుటచే, త్వగింద్రియము వలన గ్రహింపబడుచున్నది.

అయితే, శబ్దాత్మకమయినందున ఆకాశముమాత్ర మేల గ్రహింపబడరాదు? అని ప్రశ్నింపదగదు. భేర్యాదుల శబ్దమును శ్రోత్రేంద్రియముచే వినువారెవ్వ రును నే నాకాశమును వింటినని తలంచుట లేదు. ప్రతిధ్వనియే ఆకాశముయొక్క గుణము. లోకులు ఆకాశముయొక్క సోపాధికరూపమగు తేజస్తమస్సులనే గ్రహిం చుచున్నారుకాని, నిరుపాధికమగు నాకసమును గ్రహించుటలేదు. కావున ఆకాశము అతీంద్రియము,సూక్ష్మము. ఆకాశమే క్షేత్రజ్ఞుడని భ్రమింపవలదు. ఆకాశము సాక్షి భాస్యము, జడము, కార్యము, సావకాశము; క్షేత్రజ్ఞుడు సాక్షిరూపుడు, చిద్రూ పుడు, కారణుడు, నిరవకాశుడు—— ఇట్లీ రెంటికిని భేద మత్యంతము గలదు.

ఇట్టి యాత్మవస్తువు విద్వాంసులకు నిత్యాపరోక్షము. అవిద్వాంసులకు మాత్రము పరోక్షమువలె భాసించును. నిధిశాస్త్రజ్ఞునకు సన్నిహితమయిన నిధి యపరోక్షమయినను. ఆ శాస్త్రము తెలియనివానికి నయ్యది దూరమునం దున్నట్లు భాసించుట లోకసహజము కనుక బ్రహ్మపదార్థము జ్ఞానుల కపరోక్ష మగుటయు, అజ్ఞానులకు పరోక్షమగుటయు నుపపన్నము.

రా మా ను జ మ త ము:—

"ఆత్మవస్తువు పృథివ్యాదిభూతములనువిడచి, శరీరములేనిదై వెలుపల నున్నది. పృథివ్యాది భూతములయందును గలదు. ఆత్మతత్త్వము స్వతసిద్ధముగా అచరము. దేహమునం దున్నపుడు చరము. ఇటు సర్వశక్తియుక్తము, సర్వజ్ఞము నగు ఆత్మతత్త్వము, ఈ క్షేత్రమునం దున్నను అతిసూక్ష్మమగుటవలన సంసారులకు దెలియ సాధ్యము గాకున్నది" అని రామానుజులు వ్యాఖ్యానించిరి.

అ ం ద లి యా చి త్య ము ను వి చా రి ం త ము:—

ము క్తి ద శ లో నున్న పరిశుద్ధాత్మస్వరూపము సశరీరమా? అశరీరమా? లేక భయరూపమా? ఇందు మొదటిపక్షమున శరీరముగలది, శరీరమునకువెలుపల నుండుట యసంభవము. రెండవపక్షమున శరీరములోపల నుండుట యసంభవము. మూడవపక్షమున శరీర ముండుట, శరీరము లేకుండుట— ఈ రెండు నొకచోట

నుండుట విరుద్ధము. పరిశుద్ధాత్మస్వరూపమునకు ఒకానొకపుడు శరీరముండుట, ఒకానొకపు డది లేకుండుటయు నుచితము గాదు.

ఆత్మకు శరీరత్వము ఔపాధికము. అశరీరత్వము స్వాభావికము. ఏది స్వాభావిక మో అదియే పరిశుద్ధము. శరీరసంబంధములేని పరిశుద్ధాత్మస్వరూపము భూతములలోపలనుండుట తగదు. లోపలనుండుచో శరీరసంబంధమే యేర్పడును. పరిశుద్ధాత్మస్వరూపమును నిరూపించునట్టి యీప్రకరణమున, "ఆత్మకు దేహసంబంధముండుచో చర మగు" నని చెప్పుట పొసగనేరదు. పరిశుద్ధాత్మస్వరూపము దేహముగలది కాదు.

ఇక ఆత్మకు అచరత్వము స్వతస్సిద్ధ మంటిరికదా? అయ్యది పరిపూర్ణుడగుటవలననా? లేక ఇంద్రియములు లేనందువలననా? ఇందు మొదటిపక్షము కుదరదు. రామానుజమతమున ఆత్మ యణువందురు. అణువునకు పరిపూర్ణత యసంభవము. పూర్ణునకు దేహపరిచ్ఛేదముగూడ నసంభవము. "అపాణిపాదో జవనో గ్రహీతా" అను శ్రుతి ఆత్మకు నింద్రియములు లేకున్నను గమనాదిక్రియలు కలవని చెప్పుచుండుటచే రెండవపక్షముగూడ నిలువదు. ఇట్లు అచరత్వమునకు తగుకారణము కుదరనిచో చరత్వమే యాత్మకు స్వాభావిక మగును. అపుడు శ్రుతివిరోధము అనివార్యము.

మరియు, మీరు జీవేశ్వరులకు భేదముగలదని చెప్పుటకు జీవుడు కించిజ్ఞుడనియు, అల్పశక్తికలవాడనియు, ఈశ్వరుడు సర్వశక్తియుక్తుడు, సర్వజ్ఞుడు అనియు నందురు. ఇట్టి మీరికి సర్వజ్ఞమయిన పరిశుద్ధాత్మస్వరూప మెక్కడిది? జీవుడుగూడ సర్వజ్ఞుడు, సర్వశక్తియుతుడు నగుచో జీవునకంటె వేరుగ నీశ్వరు నంగీకరించుటలో గారణ మేమి? ప్రపంచసృష్టికొరకు నీశ్వరుడు గావలెనన్నచో అపనిని సర్వజ్ఞుడు, సర్వశక్తియుక్తుడు నయిన జీవు డేల చేయకూడదు? ఈశ్వరునికంటె వేరయిన జీవుడు సర్వజ్ఞుడని చెప్పుట శ్రుతివిరుద్ధముగూడ నగును. "స సర్వజ్ఞ స్సర్వవిత్" "పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే" అను శ్రుతులు ఈశ్వరునకే సర్వజ్ఞత్వాది ధర్మములను జెప్పుచున్నవి. జీవునియందు కించిత్ జ్ఞత్వాదులు అనుభవసిద్ధ మగుచుండ కాదన వీలులేదు.

మరియు మూలమున "అంతర్బహిశ్చ భూతానామ్" అనియుండ ఒకానొకపుడు లోపల, ఒకానొకపుడు వెలుపల అను నర్థమును గల్పించుటయు బాడిగాదు. "కదాచిత్" అనుపదమును అధ్యాహారమును జేయుటలో ప్రమాణమును గానము. "భూతానాం బహిః" (భూతములకు వెలుపల) అనుచోట పృథివ్యాదిభూతములను విడచి అని చెప్పుటయు నుచితముగాదు. ఆకాశభూతమును విడచి యాత్మవస్తువుండుట యసంభవము. ఆకసము సర్వవ్యాపకము. బ్రహ్మాండమునకు వెలుపలగూడ నవకాశముండుటచే నాకాశ ముండియే యున్నది. మీ కిష్టమయిన వైకుంఠలోక

మందుగూడ నవకాశము గలదు. అవకాశముకలదియే యాకస మనబడును. కాన రామానుజవ్యాఖ్య సముచితముకాదు. ౧౬॥

శ్లో॥ అవిభక్తం చ భూతేషు విభక్త మివ చ స్థితమ్
భూతభర్తృ చ తద్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ॥ ౧౭।

అ॥ దేహములకు భేదమున్నను ఆత్మకు భేదము లేదు. ఘటములు వేరైనను అందుండు నాకాశము వేరుగాదు. కనుకనే ఆత్మ బ్రహ్మ యనియు, అద్వితీయు డనియు శ్రుతులు చెప్పుచున్నవి. అయినను అజ్ఞానమువలన దేహములయందు వేరుగ నున్నట్లు కనిపించుచున్నాడు.

మూలమునందు 'విభక్తమివ' అని ఇవకార ముండుటచే, నిజముగా ఆత్మ వస్తువు విభాగమును జెందలేదని స్పష్టమగుచున్నది. ఇట్టి యాత్మవస్తువు స్థితికాలము నందు భూతములను ధరించుచున్నది. సంహారకాలమునందు భూతములను మ్రింగు చున్నది. ఉత్పత్తికాలమునందు బుట్టించుచున్నది.

మిథ్యాకల్పితమైన సర్పముయొక్క ఉత్పత్తిస్థితిలయములు త్రాటియం దెట్లో ప్రపంచముయొక్క ఉత్పత్తిస్థితిలయములుగూడ నాత్మయం దట్లే యనిభావము.

రా మా ను జ మ త ము:-

ఇచట రామానుజులు: 'అవిభక్తమ్' అనగా జ్ఞానాకారు డగుటచే జాతివలన నొక్కడనియు, "విభక్తం" అనగా అజ్ఞానులకు "వీడు దేవుడు, వీడు మనుష్యుడు" అని వేరయినవానివలె నుండెననియు, "భూతభర్తృ" శరీరమును ధరించినవాడనియు "గ్రసిష్ణు" అన్నాదుల దినువాడనియు, "ప్రభవిష్ణు" తిన్న అన్నాదులను శుక్లశో ణితరూపమున పరిణమింపజేయువాడనియును వ్యాఖ్యానించిరి. ఇది యుక్తముగాదు.

లోకములో వ్యక్తివలన వేరగువస్తువు జాతివలన నొక్కటని చెప్పబడుచు న్నది. ఆత్మ అవ్యక్తుడు. ఇతనికి వ్యక్తివలన భేదము లేదు. ఇట్టితరి జాతివలన నేక త్వమును జెప్పు టెట్లు పొసగును? నిర్ధర్మకు డగు నాత్మయందు ధర్మసంబంధమే లేనపుడు జాత్యేకత్వ మను ధర్మ మెట్లుండును? ఆత్మ వ్యక్తిభేదముచే వేరుగ నుండుచో విద్వాంసులకుగూడ వేరుగ దోచియే తీరును. ఇట్టితరి అవిద్వాంసులకు విభక్తునివలె గనిపించునని చెప్పు టెట్లు? విద్వాంసులకు దేవత్వాది భ్రమలు లేకున్నను నే నని, వా డని, దేవదత్తు డని యిట్టి భేదములు (యథార్థజ్ఞానములు) కలుగుచునే యున్నవి.

ఇక దేవత్వాదులు స్థూల దేహ ధర్మము లన్నచో సుఖిత్వాదులు సూక్ష్మ దేహధర్మము లనియు, మోహాము కారణదేహధర్మమనియు గ్రహింపుము. ఇట్లు మూడుశరీరములను ఆత్మకంటె వేరుపరచినచో నింక ఆత్మను వేరుపరచున దే ము న్నది? కనుక 'నీవు, నేను' అను భేదముగూడ భ్రమయేగాని ప్రమగాదు.

"న త్వేవాఽహం జాతు నాసం" అనుచోట శ్రీకృష్ణుడు లోకదృష్టిననుసరించి 'నీవు, నేను, వారు' అని చెప్పనుగాని, తత్త్వదృష్టిననుసరించి కాదు.

శరీరమును భరించునది ప్రాణాదులుగాని ఆత్మ గాదు. భక్షణాదులుగూడ ప్రాణాదుల ధర్మములుగాని ఆత్మధర్మములు గావు. ప్రాణాధిష్ఠితమయిన శరీరమే నోటితో తినుచున్నది. ఇంద్రియరహితుడైన ఆత్మ తినుటలేదు. తిన్న ఆహారము శుక్లశోణితరూపముగా పరిణమించుటకుగూడ కారణము ప్రాణాధిష్ఠితమయిన శరీరమే యగుచున్నది.

అయితే, జీవుడు లేని శరీరము తినుటలేదుగాన తినుట మొదలయినవి జీవధర్మములే అని యేల ననరాదు? అని ప్రశ్నింపదగదు.

స్థూలశరీరమునుండి లింగశరీరముతోగూడిన ప్రమాతయే లేచిపోవుచున్నాడుకాని, క్షేత్రజ్ఞలక్షణుడయిన ఆత్మ పరిపూర్ణుడగుటచే నాతడు లేచిపోవుట లేదు. అట్టి పరిపూర్ణచైతన్యమునకు భక్షణాదిసామర్థ్యము లేదు. స్థూలశరీరమే భోగాయతనము. అదిలేనిదే దేనిని అనుభవింప సాధ్యము గాదు.

అయితే, కేవల స్థూలశరీరమునకుగూడ నాహారాదులను దీసికొను సామర్థ్యము లేదు. సుషుప్తియందుగాని, మూర్ఛావస్థయందుగాని యట్టి సామర్థ్యము కానిపించుట లేదు.

కావున లింగశరీరము, స్థూలశరీరము యీ రెంటితోగూడిన ప్రమాతయే శరీరావయవములద్వారా అన్నాదులను దినుటయు, మనస్సుద్వారా సుఖదుఃఖాదుల ననుభవించుటయు సంభవించుచున్నది. కావున ప్రమాతతోగూడిన శరీరమే గ్రసిష్ణు, ప్రభవిష్ణు వగునుగాని, కేవలాత్మవస్తువు కానేరదు. ॥౧౭॥

శ్లో॥ జ్యోతిషామపి తజ్జ్యోతిః తమసః పర ముచ్యతే
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్ ॥౧౮॥

అ॥ బ్రహ్మ తేజోరూపము. తేజోరూపులగు సూర్యాదులనుగూడ ప్రకాశింపజేయును. ఇట్టి బ్రహ్మ అజ్ఞానరూపుడు గాడు. కొన్ని పదార్థములను ప్రకాశింపజేయు సూర్యాదులవంటివాడును గాడు. కాన చైతన్యరూపు డని భావము.

సూర్యుడుమున్నగు వెలుగువస్తువులుగూడ ఆత్మచైతన్యముచే ప్రకాశింపబడి పనిచేయుచున్నవి. 'యేన సూర్య స్తపతి తేజసేద్ధః' అను శ్రుతి సూర్యు డాత్మ తేజస్సుచే వెలుగొందుచున్నా డని చెప్పుచున్నది. కావున బ్రహ్మ సర్వావభాసకము. సూర్యాదులయొక్క తేజస్సులు జడములు. అయ్యవి యితరులకు ఘటాదులను ప్రకాశింపజేయును. ఆత్మతేజస్సు చిద్రూపముగాన సర్వమును తనకొరకే ప్రకాశింపజేయును. కాన ఆత్మ స్వప్రకాశజ్ఞాన(చిద్రూప) స్వరూపుడని నిర్ణయము.

అయితే, ఆత్మ (బ్రహ్మ) వెలుగులకు వెలుగయితే, చీకటికికూడ చీకటియా యేమి? కాదు. మూలమునందలి తమశ్శబ్దమునకు చీకటి యర్థము గాదు. అజ్ఞాన మర్థము. కాన నజ్ఞానముతో నేమాత్రమును అంటనివాడు ఆత్మ యనియర్థము. ఆత్మ నిజముగ దేనితోను అంటియుండువాడు కాడు. ప్రపంచముతో నంటనిచో ప్రపంచము నెట్లు భాసింపజేయునని యనరాదు. దీపము ఘటాదులను అంటకుండగనే వాటిని ప్రకాశింపజేయుచున్నదికాని, అంటి ప్రకాశింపజేయుట లేదు. కన్నుకూడ కరతలాదుల నంటకయే వాటిని ప్రకాశింపజేయుచున్నది. అట్లే ఆత్మకూడ దేనితోను నంటకయే ప్రకాశింపజేయును. కావున ఆత్మ అజ్ఞానముతో నంటనివా డని భావము. అయితే యెల్లప్పుడు భాసించవలదా? అనినచో నిజమే. ఆత్మ యెల్లప్పుడు భాసించువాడే. అందు సందియము లేదు.

సూర్యాదులు ఘటపటాదులకు భాసకములయినను, చక్షురాదులకు భాస్యములే యగుచున్నారు. అనగా సూర్యుడు ఘటమును కనుపరచుచున్నాడు. మన కంటి కగపడుచు నున్నాడు. అందువలన సూర్యాదులకు అజ్ఞానావరణ ముండవచ్చును. ఆత్మ యెల్లపుడు భాసకుడేకాని, భాస్యుడుగాడు. కనుక నీతనికి అజ్ఞానావరణము లేదు. ఆత్మకూడ అజ్ఞానావృతు డగుచో వీనిని భాసింపజేయు వస్తువే లోకములో లేదు. ఆత్మభిన్నము లన్నియు జడములే. కావున ప్రపంచమంతయు గ్రుడ్డిది కావలసివచ్చును.

కాక, ఆత్మ అజ్ఞానావృతు డన్నచో నీ యావరణమును గనిపెట్టినవా రెవరు? ఆత్మ యందురా – వాడు అజ్ఞానావృతు డయియున్నాడు. మిగిలినవన్నియు జడములు. కాన ఆత్మయొక్క అజ్ఞానావరణమునకు సాక్షియే లేడు. సాక్షిలేని యావరణము నంగీకరించు టెట్లు? కాన ఆత్మ యావరణలేని ప్రకాశరూపుడనియే సిద్ధాంతము.

అయితే ఆత్మ అజ్ఞానావరణములేని ప్రకాశరూపు డగుచో, ఆత్మసాక్షాత్కారముకొరకు 'అహం బ్రహ్మాస్మి' (నేను బ్రహ్మను) అను బుద్ధితో పని యేమి? నిజమే. లోకములో నందఱును ఆత్మను దెలిసికొనుచున్నారు. కాని వారు సచ్చిదానందరూపునిగ తెలియుట లేదు. నేను దేవుడ నని కొందఱును, నేను మనుష్యుడనని కొందఱును తెలిసికొనుచున్నారు. పిల్లలు సూర్యుని తెలిసికొనుచున్నారు. కాని వారు సూర్యుని యొకపండు అని గ్రహించుచున్నారుకాని, ప్రకాశరూపు డని గ్రహించుట లేదు. కావున నిట్టి భ్రాంతిని తొలగించుటకు పిల్లలకు తలిదండ్రుల యుపదేశమువలె శాస్త్రోపదేశమావశ్యకము. తండ్రి పిల్లవానిని 'నాయనా, నీవు పండను కొన్నవాడు ప్రకాశరూపుడగు సూర్యుడుగాని, పండుగాదురా అని చెప్పుచున్నాడు.

అట్లే యిచటకూడ ఓయి శిష్యా! నీవు మనుష్యరూపుడవుగావు, సచ్చిదానందరూపుడవగు బ్రహ్మవు. అని శాస్త్రము చెప్పుట యవసరము.

అయితే యెల్లప్పుడు ప్రకాశించు నాత్మయందు నిట్టి మనుష్యత్వాది భ్రాంతి పుట్ట నేల? అనినచో నీ కావిషయ మనవసరము. రోగమువచ్చినవాడు రోగమునకు మందును వెదకుకొనునుగాని, రోగ మెందుకు వచ్చినదా? యని విచారింపసాగడు. అయినను నీ కాకారణము తెలియవలెనని పట్టుదలయున్నచో వినుము, బుద్ధిలోనున్న అజ్ఞాన మను దోషమే దానికి కారణము. ఆత్మయందు భ్రమాజ్ఞానాదు లుండవలెనని. కాని, యుక్తమనికాని నెవరును జెప్పరు. కాని యందుండదగనివైనను మాయావశమున గలుగుచున్నవనిమాత్రము మే మందుము. కాన బ్రహ్మ అజ్ఞానావృత మగుట నిజము.

ఇట్టి బ్రహ్మను దెలిసికొను జ్ఞానము (అమానిత్వాదికము), ఈ జ్ఞానముచే దెలియదగిన (జ్ఞేయమగు) బ్రహ్మము జ్ఞానమువలన పొందదగినఫలము– ఈమూడును యెల్లమానవులకు బుద్ధియందే గలవు. సంస్కార రహితమయిన బుద్ధి బ్రహ్మమును గ్రహింపలేకున్నను, సంస్కార సహితమయిన బుద్ధి బ్రహ్మను గ్రహించగలదు. అందువలన "యతో వాచో నివర్తంతే" అను శ్రుతివిరోధ మిందు లేదు. ॥౧౮॥

శ్లో॥ ఇతి క్షేత్రం తథాజ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావా యోపపద్యతే ॥౧౯॥

అ॥ ఈ శ్లోకము వెనుకటిశ్లోకములయందలి అర్థమంతయును సంగ్రహించి చెప్పుచున్నది. 'ఓయి! అర్జునా, ఇట్లు క్షేత్రమును, జ్ఞానమును, జ్ఞేయమగు బ్రహ్మమును నీకుసంగ్రహించి చెప్పితిని. దీనినంతయు దెలిసికొనిన నాభక్తుడు నా స్వరూపమును బొందును.' పరమేశ్వరుడగు వాసుదేవునియందు సర్వాత్మభావమును సమర్పించినవాడు బ్రహ్మభావము (మోక్షము) నొందునని భావము.

ఓయి! జీవుడు మోక్షదశలో బ్రహ్మరూపమును బొందునన్నచో బ్రహ్మకు నింద్రియాదులులేవుకాన వీనికిగూడ లేవని చెప్పినట్లగును. అప్పుడు జీవులకు ఇంద్రియాధీనములయిన జ్ఞానము లేవియు నుండవు. వీ డొక పాషాణకల్పుడుగ తయారగును. ఇట్టి ముక్తినికోరు మూఢు డెవ్వడు నుండడు. కావున నీ మోక్షశాస్త్ర మెందులకు అనినచో– వినుము.

నీకు నిద్రావస్థలో ఏయింద్రియములు, ఏయింద్రియజ్ఞానములు లేవుగదా! అపుడు నీవు పాషాణకల్పుడవే కదా! మరియు, అర్థశవాకారుడవేకదా? అయినను నీవు నిద్రను గోరుచున్నావా? లేదా? కోరనిచో నీవు కొద్దిరోజులలోనే సిద్ధి బొందగలవు. నీవు నిద్రను గోరుచున్నచో మేమును అట్లే ముక్తిని గోరుచున్నాము. ఇందు దప్పేమి?

ఇక, నిద్రావస్థలో ఆనంద మున్నదనియు, ఆ యానందమును జీవుడు అవిద్యావృత్తులచే ననుభవించుచున్నాడనియు మీ రంగీకరించుచో అవిద్యగల

నిద్రావస్థయందే ఆనంద ముండగా, అవిద్యలేని మోక్షావస్థయందు ఆనందము లేదనుటెట్లు పొసగును? ఉన్నను ఇంద్రియములు లేనందున అనుభవింపబడుట లేదందురా? అనుభవములో లేని యానందము ఉన్నదని మీ రేల నంగీకరించితిరి? నిద్రావస్థలో జడములయిన అవిద్యావృత్తులవలన ఆనందము అనుభవగోచర మగుచుండ, అది ముక్తిదశలో స్వతస్సిద్ధమయిన చిద్రూపుని కేల అనుభవగోచరము గాదు?

పోనిండు, వృత్తులవలననే ఆ ఆనందానుభవము. ఆ వృత్తులకు అనుభవము దేనివలన? అవి దేనివలనను అనుభవింపబడకున్నచో, అనుభవింపబడని వృత్తు లున్నట్లంగీకరించు టెట్లు? సాక్షిలేనిదే వస్తువున్న ట్లంగీకరించుట లోకసిద్ధము కాదుకదా?

ఇంక నా యవిద్యావృత్తులు ఆత్మచే ననుభవింపబడుచున్న వనినచో, సుఖరూపవృత్తులయందు ప్రతిఫలించిన ఆనందమును, ఆవృత్తులను అనుభవించెడి యాత్మ ముక్తిలో స్వరూపానందము నేల ననుభవింపదు?

కాక, ముక్తిలో ఆనందము అనుభవగోచరము గాకున్నను మాకు నిష్టమే. అది అనుభవరూపముగాని, అనుభవవిషయము గాదు. కనుక ననుభవరూపమగు 'ఆత్మానందము నందఁజాలు గోరుదురు. సుషుప్తియందలి అజ్ఞానావృతములయిన ఆనందమునే 'సుఖ మహ మస్వాప్సం' అని స్మరించుచుండ అజ్ఞానరహితమయిన శుద్ధానందమును గోర రనుట వెఱ్ఱితనము. కావున ముక్తియం దాత్మలు పాషాణకల్పులుగారు.

రా మా ను జ మ త ము:-

ఇచట రామానుజులు– 'మద్భావా యోపపద్యతే' అను పదమునకు (అహమివ అసంసారీభవతి') నావలె సంసారములేని వాడగును. అని వ్యాఖ్యానించెను.

ఈ య ది ని స్సా ర ము.

జీవేశ్వరులకు భేదమున్నంతవరకు సంసారసంబంధముండకమానదు. సంసారము ఔపాధికము. జీవేశ్వరభేదముగూడ నుపాధివలననే యేర్పడును. జీవున కంతఃకరణము ఉపాధి, ఈశ్వరునకు అజ్ఞానము ఉపాధి. వీ రిరువురకు నీ రెండు నుండగా నీ రెంటివలనగలిగెడి సంసార మేల నుండదు? ఉపాధియే లేదందురా? శుద్ధచైతన్యమునకు భేదమే లేదుగాన, భేదమే యుండదు– ౧౯॥

శ్లో॥ ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి,
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్॥ ౨౦.

ఈయధ్యాయారంభమున అర్జునుడు 'ప్రకృతి, పురుషుడు, క్షేత్రము, క్షేత్రజ్ఞుడు, జ్ఞానము, జ్ఞేయము,' అను నారువిషయములగూర్చి యడిగెను. అందు నాల్గు విషయములకు కృష్ణుడు జవాబు చెప్పెను. మిగిలిన రెంటిని (ప్రకృతిపురుషులను) గూర్చి యిపుడు చెప్పుచున్నాడు.

ఓయి, అర్జునా? నీ వడిగిన నాఱువస్తువులు నిజస్థితిలో - క్షేత్రము, క్షేత్రజ్ఞుడు అని రెండే యగుచున్నవి. జ్ఞాన, ప్రకృతులు క్షేత్రమునందును, పురుష జ్ఞేయములు క్షేత్రజ్ఞునియందును జేరును. కావున నా రెంటిని నిరూపించెద వినుము.

ప్రకృతి పురుషులిద్దఱు అనాదులు. ఈ రెంటివలననే బుద్ధ్యాది వికారములు సుఖదుఃఖాది గుణములు పుట్టుచున్నవి.

ఈశ్వరునకు జీవస్వరూపమయిన ప్రకృతిస్వరూపము క్షేత్రజ్ఞలక్షణమైన ప్రకృతి స్వభావభూతము. జీవలక్షణమయిన ప్రకృతికంటె నతిరిక్తమయిన ఈశ్వరుడు లేడు. క్షేత్రలక్షణమైన ప్రకృతిమాత్రము జ్ఞానము కలిగినంతవఱకు నిత్యము. ఆపైన నది నశించును. ఆకాశాదులవలె క్షేత్రరూపమయిన ప్రకృతికి జన్మ శ్రుతులయందు గనిపించకున్నను, 'మాయాచ అవిద్యాచ స్వయమేవ భవతి' అను శ్రుతినిబట్టి దానికిని జన్మము నంగీకరింపవలెను.

జీవున కట్లు యీశ్వరునికంటె వేరుగ జన్మలేదు.

ఉన్నట్లు కనిపించెడి శ్రుతులు ఔపాధికమగు జన్మమును సూచించుచున్నవి కాని వాస్తవిక జన్మమును బోధించుటలేదు. మహాకాశ ఘటాకాశములకు భేద మెట్టిదో ఆచార్యవాదులమతమున జీవేశ్వరులకుగూడ భేద మట్టిదే. కనుక జీవేశ్వరు లిరువురు స్వరూపముతోడనే భిన్నులని చెప్పెడి మతాంతరుల ప్రసక్తి యిందు లేదు.

పైగా మతాంతరులు, జీవేశ్వరులకు శేషశేషిభావము గలదందురు. ముక్తి యందుగూడ ప్రకృతి నొప్పెదరు. శ్రీ శంకరు లట్లనరుకనుక శంకరసిద్ధాంతమున మతాంతరసాంకర్య మిసుమంతయు లేదు.

అయితే శంకరభాష్యమున ('ప్రకృతిద్వయవత్వమేవ ఈశ్వరత్వం') రెండు ప్రకృతులు గలిగియుండుటయే యీశ్వరత్వము. అని యుండుటచే నీ రెండుప్రకృతులు ఈశ్వరునివలె నిత్యములని తేలుచున్నది. ఇవి అనిత్యము లన్నచో పైభాష్య పంక్తికి విరోధము వాటిల్లుచున్నది.

కాని యచట వ్యవహారసిద్ధమయిన భేదము నాశ్రయించి ప్రకృతిపురుషేశ్వరులకు భేదము జెప్పబడినదిగాని, వాస్తవదృష్టి ననుసరించి చెప్పబడలేదు. వాస్తవమున ఈశ్వరు డొక్కడేయని శ్రుతులు వేనోళ్ళ చాటుచున్నవి. ఇద్దానిని శంకరులుగూడ అనేకమాఱులు నిరూపించియున్నారు. కావున వ్యావహారికసత్యత్వము ననుసరించి ప్రకృతియు పారమార్థికసత్యత్వము ననుసరించి పురుషుడును అనాదులుగాన, శంకరులు తమభాష్యమున, 'ద్వే అనాదీ సత్యౌ' (రెండును అనాదులు) అని వ్రాసిరి.

అయితే, ప్రకృతిపురుషు లిద్దఱు ఆదిలేనివా రగుచో, వారివలననే ప్రపంచము పుట్టునుగాన, నింక నీశ్వరుడు ప్రపంచకారణమని చెప్పనేల?

ఈశ్వరుడు ఈ రెండు ప్రకృతుల ద్వారమున కారణమన్నచో అనాదులగు నీ ప్రకృతులకు ముఖ్యకారణత్వము చెప్ప వీలగుచుండ, నీశ్వరుని కల్పించుటగాని వీనికి ద్వారకారణత్వము చెప్పుటగాని, యీ ప్రయాసయంతయు నేల?

ఇక ప్రకృతికి ఈక్షణము సంభవించదనియు, పురుషుడు ఉదాసీనుడనియు, గాన నీశ్వరుడు జగత్కారణమనుట ఆవశ్యకమనినచో—

పురుషసంసర్గమున జడమయిన ప్రకృతికి ఈక్షణసంకల్పాదులు సంభవించవచ్చును గదా?

కాక ప్రకృతిపురుషులు అనాదులయినప్పుడు ఈశ్వరుడు వాటికి కారణము కాడు, అప్పుడాతనికి సర్వకారణత్వమును సిద్ధించదు. కావున ప్రకృతిపురుషులు అనాదులుకారు, నాదులే- (ఆదికలవారే) న-ఆదీ (కారణములు) —అనాదీ (కారణములుగారు) అని తత్పురుషసమాసమును జెప్పినచో గీతలలోని 'అనాదీ' అనుపదమునకుగూడ విరోధముండదు; అని కొందరనెదరు.

ఇది సమంజసము గాదు. వీరిమతమున, ప్రకృతిపురుషులు పుట్టకపూర్వము మీ ఈశ్వరునకు (ఈశితవ్యయములయిన నియమింపదగినవి లేనందున, ఈశ్వరునకు నీశ్వరత్వమే యుండదు. కాన,నిచట ప్రకృతిపురుషులకు కార్యత్వ మంగీకరింపదగదు. తత్పురుష సమాసమును జెప్పదగదు.

అయితే అద్వైతులుగూడ, ప్రకృతికి పుట్టుక నొప్పెదరు. పురుషుడు యీశ్వరాభిన్నుడందురు. వీరిమతమున మాత్రము ప్రకృతి పుట్టకపూర్వము (ఈశితవ్యము) నియమింపదగినది యీశ్వరున కేది? అను ప్రశ్నయున్నది.

కాని వీరు ప్రకృతి పుట్టునని చెప్పినను 'ఇప్పుడు పుట్టునని' కాలనిర్ణయమును జేయరు, అనాది యందురు. అద్వైతులు అనాదిసిద్ధములని చెప్పేది వస్తువు లారు గలవు. కనుక అవిద్యయున్నంతవరకు అనాదిసిద్ధముగా ప్రకృతిపురుషు లుందురుగాన అద్వైతులమతమున ఈశ్వరునియొక్క- ఈశ్వరత్వమునకు భంగములేదు. అవిద్య నశించిన తరువాత ప్రకృతి లేదు, పురుషుడు లేడు; యీశ్వరుడును లేడు.

ఓయి! ఈశ్వరుడు ప్రకృతిపురుషులనుకాని ప్రపంచమునుకాని తన యిచ్ఛ కొలది నిర్మించునా? లేక ఏదియో యొకకారణము నపేక్షించి నిర్మించునా? మొదటి పక్షమున, ఈశ్వరుని యిచ్ఛ నిత్యముగాన ప్రకృతిపురుషరూపమయిన ప్రపంచము గూడ నెల్లపు డుండవలసివచ్చును. ఇక సంసారమునకు నివృత్తియే యుండదు. రెండవపక్షమున ఆనిమిత్త మేమియో నిర్ణయింపవలెను. జీవుల అదృష్టమనుపేరు గలకర్మ యనియందురా? అయ్యది ప్రకృతిలోనే చేరిపోవును. జీవుడు సాదిపదార్థము గాన నంతము నొందును. ఆవల నీ యదృష్టమను కర్మ నిరాశ్రయమై నిలువనేరదు. మరియు జీవుడు పుట్టకపూర్వము కర్మయే లేనందున నాతడు పుట్టుటయే కుదరదు. అతడు పుట్టిన తరువాతకదా- కర్మచేయుట తటస్థించును? ఇక సృష్టికి అజ్ఞానము

కారణమన్నచో నది ప్రకృతియందే చేరినందున, ప్రపంచాంతర్గతమగునుగాని నిమిత్తము కానేరదు. ఇక సంసారోత్పత్తికి నిమిత్తమే లేదన్నచో, నిర్నిమిత్తమైన సంసారము నివర్తింపజాలదు. ఒకవేళ యున్నసంసారము జ్ఞానముచే నశించినను, మరల నిర్నిమిత్తముగా సంసారమేర్పడును. ఇక సంసారము నివర్తించదనే నివర్తించదన్నచో, సంసారనివృత్తికొరకు పుట్టిన వేదాంతశాస్త్రము వ్యర్థమగును. నిర్నిమిత్తముగా కార్యముండుటయే అసంభవముగాన బంధమే లేకపోవును.

ఇక సృష్టికి ఈశ్వరుడు నిమిత్తమనుటయు పొసగదు. ఈశ్వరుడు ప్రధానకారణముగాని, నిమిత్తకారణము గాడు. ప్రకృతిపురుషులు కారణమందురా?- వాటిని మీరు కార్యములని యంగీకరించిరికాని కారణములని యంగీకరింపలేదు.

కావున ప్రకృతిపురుషులు నిత్యము లన్నచో నీదోషము లేకయు నుండవు ప్రకృతిపురుషులు సంసారనిమిత్తములుకాన, సంసారము నిర్నిమిత్తముగాదు. జ్ఞానము వలన ప్రకృతి నశించునుగాన ముక్తునకు మరల సంసారముండదు. జ్ఞానమును కలుగ జేయునుగాన శాస్త్రము సార్థకమగును. ప్రకృతి అనాదిసిద్ధముగ నుండుటచే దానివలన కలుగు బంధమున్ను ఉండును. బంధముండబట్టియే తన్నివృత్తిరూపమగు మోక్షమున్ను సంభవించును. కాన నీపక్షమున దోషమేమియు లేదు.

అయితే ప్రకృతిపురుషులు జగత్కారణమగుచో, ఈశ్వరునకు జగత్కారణత్వ ముండదుగదా? కాదు, నిర్విశేష చిన్మాత్రుడయిన పరమేశ్వరుడు, ప్రకృతిపురుషులను నిమిత్తముగా జేసికొనియే జగత్కారణ మగును. జడమయిన ప్రకృతిగాని, ఉదాసీనుడయిన పురుషుడుగాని స్వతంత్రముగా ప్రధానకారణము కానేరరు. పురుషసంసర్గమువలన ప్రకృతిగాని, ప్రకృతిసంసర్గమున పురుషునకుగాని సృష్టిసంకల్ప ముదయించదు. అసంగుడయిన పురుషునకు ప్రకృతితో సంబంధము అసంభవము. ప్రకృతితో సంబంధించిన పురుషుడు ప్రకృతిపరవశుడగుటచే కించిద్జ్ఞుడగును. కించిద్జ్ఞునకు సృష్టిసంకల్పము దూరాపాస్తము. ఇట్టిపురుషునితో జేరిన ప్రకృతికిని సృష్టించవలెనను సంకల్పము కలుగదు. కనుక ప్రపంచసృష్టికి ఈశ్వరుడే ప్రధానకారణు డనవలెను. ఈశ్వరుడు వశీకృతమాయుడుగాన వీనిజ్ఞానము పరిచ్ఛిన్నముగాదు. వీనికి సృష్టిసంకల్పము సంభవించవచ్చును.

ఈశ్వరచైతన్యాభాసవలన ప్రకృతికి వృత్తిపుట్టినను సంకల్పముమాత్రము ఘటింపదు. బుద్ధ్యాది చేతనులకు ముఖ్యము, సహజమున్ను. ఈశ్వరునకు ముఖ్యమగు ఈక్షణము సంభవించుచుండ గౌణమగు నీక్షణము నంగీకరించుట న్యాయ్యముకాదు. కావున ఈశ్వరుడే ప్రకృతిపురుషులను నిమిత్తముగా జేసికొని ప్రపంచకారణమగునుకాన నీశ్వరునకు జగత్కారణత్వము సిద్ధింపదనుట పొసగదు,

ఓయి! అసంగుడయిన ఈశ్వరునకు మాయతో సంబంధమెట్లు?

ఈశ్వరుడే పురుషుడగుచుండ ఈశ్వరుడు అపరిచ్ఛిన్నజ్ఞానుడనియు, జీవుడు పరిచ్ఛిన్నజ్ఞానుడనియును భేదమేల? వినుము. విద్యావస్థయందు ఈశ్వరుడుగాని, పురుషుడుగాని, యొకండే యగును. అవిద్యావస్థలో ఈశ్వరుడు మాయతో సంబంధముగలవాడే. ఈయవస్థలో జీవుడున్న మాయాపరతంత్రుడే. మాయవలననే ఈశ్వరునకు జీవత్వము కలుగుచున్నది. ఈశ్వరునకు జీవత్వము సహజముగాదు. త్రాటికి సర్పత్వము అజ్ఞానమువలన గలిగినట్లు ఈశ్వరునకుగూడ జీవత్వము అజ్ఞానసిద్ధమని యంగీకరింపవలెను. కావున ఈశ్వరునకు స్వతస్సిద్ధమగు ఈశ్వరత్వము, అజ్ఞానవశమున జీవత్వము నుండుటలో విరోధములేదు.

కనుక జడమయిన ప్రకృతి జగత్కారణము కాలేదు. అట్లే ప్రకృతిపరతంత్రుడయిన జీవుడున్న జగత్కారణము గానేరడు.

వశీకృతప్రకృతియయి సర్వజ్ఞుడయిన ఈశ్వరుడే జగత్కారణ మనుట యుక్తము. ఇదియే శ్రుతిస్మృతిసమ్మతము

కాన, నిరీశ్వరసాంఖ్యులమత మవైదిక మగుటచే ప్రమాణము గాదు. భేదవాదము లెవ్వియు ప్రమాణములు గావు. అభేదవాద మొక్కటియే శ్రుతి యుక్త్యనుభవసిద్ధ మగుటచే ప్రమాణము.

మహదహంకారాదివికారము, సుఖదుఃఖమోహాదిగుణములు - ఈ మొత్తమంతయు ప్రకృతికార్యము. కాన కార్యజాతమంతయు ప్రకృతిలక్షణమని తేలినది.

ప్రపంచమంతయు ప్రకృతియొక్క పరిణామరూపమయినను ఈశ్వరసంకల్పముననే ప్రకృతిపరిణామము చెందుచున్నందున ఈశ్వరునకు కర్తృత్వము సిద్ధించును. కుమ్మరియొక్క సంకల్పమువలనను వానిపనులచేతనుమట్టిఘటాద్యాకారమున పరిణామముచెందినను, అందుకు కుమ్మరి కర్తయని చెప్పబడుచున్నాడు. అట్లే ప్రకృతి యుపాదానకారణము, ఈశ్వరుడు నిమిత్తకారణము నగుదుగాని, యీశ్వరునకు అభిన్న నిమిత్తోపాదానత్వము సంభవించదుగదా! అని యనరాదు. ఈశ్వరుడు ప్రపంచనివర్తమునకుగాని, ప్రపంచాకారముగ పరిణమించు ప్రకృతికిగాని అధిష్ఠానమగుటచే ఈశ్వరునకు కర్తృత్వ ఉపాదానత్వములు రెండును పొసగవచ్చును.

ఓయి! ఈశ్వరుడు ప్రపంచమును సృజించుటకు ప్రకృతియొక్కటియే చాలును. పురుషునితో బనిలేదు. కనుక శ్రీశంకరులు, ఈశ్వరుడు రెండుప్రకృతులచే జగత్తును సృజించెనని యెట్లుచెప్పిరి? వినుము, భోక్తయగు పురుషుడులేనిదే, భోగ్యమగు ప్రపంచముండి లాభములేదు. కాన భోగ్యప్రపంచమును బుట్టించుటకు భోక్తయగు పురుషుడుగూడ నిమిత్తముగాన పురుషుడు ద్వారకారణమని చెప్పబడినది. అనగా ఈశ్వరుడు ప్రకృతిద్వారమున ప్రపంచమును బుట్టించుచున్నాడనియు, పుట్టించిన ప్రపంచమును, పురుషద్వారమున అనుభవించుచున్నాడనియును అర్థము. ౨౦॥

శ్లో॥ కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే,
పురుష స్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే॥ ౨౧॥

అ॥ స్థూలశరీరమును అంతర్బాహ్యేంద్రియములను, పంచభూతములను, శబ్దస్పర్శాది విషయములను సుఖదుఃఖాదిగుణములను పుట్టించుటకు ప్రకృతి కారణము. ఇవ్విధముగ నీరెండును ప్రపంచమునకు కారణమగుచున్నాను. భోక్తృ భోగ్యములు లేనిదే సంసారమే లేదు. పురుషుడు స్వతస్సిద్ధముగా అసంగుడయినను అతనికి మిథ్యాభూతమయిన సుఖదుఃఖానుభవ ముండవచ్చును.- 'క్షేత్రజ్ఞంచాపి మాం విద్ధి' అను శ్లోకముచే ఆత్మకు సంసారిత్వము లేదని చెప్పబడియే యున్నది.

రా మా ను జు ల మ త ము:-

దేహేంద్రియాదులు పనిచేయుటకు పురుషాధిష్ఠితమయిన ప్రకృతి కారణమని రామానుజు లనిరి. అది సరికాదు. ప్రకృతిపరిణామములగు దేహేంద్రియాదులు పురుషాధిష్ఠితములగుచు, కార్యకారణములగునని చెప్పుట యుక్తమగుచుండ, పురుషాధిష్ఠితమయిన ప్రకృతికి కారణమును జెప్పుటలో ప్రయోజనము లేదు.

అట్లే పురుషాధిష్ఠితమయిన బుద్ధియు క్రియాహేతువనుట యుచితముగాదు. అదియు నన్తఃకరణమగుటచే కరణములలోనే చేరును. ఇంక పురుషాధిష్ఠితమయిన అజ్ఞానము క్రియా హేతువన్నచో, అయ్యది నిద్రావస్థలోగూడ నున్నందున నిద్రలోగూడ దేహేంద్రియాదులు పనిచేయవలసివచ్చును.

మరియు ప్రకృతి పనులను నెరవేర్చుటలో పురుషునిచేనధిష్ఠింపబడుట కారణమన్నచో దేహేంద్రియాదులు పని నెరవేర్చుటకుగూడ నదియే (పురుషునిచే నధిష్ఠింపబడుటయే) కారణమన్నట్లగును. అపుడు అధిష్ఠాతయగు పురుషుడు క్రియాకారి యని చెప్పినట్లె. ఇది యంగీకరించినచో, 'ప్రకృతి చేయుటకు గారణమనియు, పురుషు డనుభవించుటకు గారణమనియును' జెప్పిన మూలవచనమునకు విరోధ మేర్పడును. ఇక మూలవిరోధమున్నను 'కర్తా శాస్త్రార్థవత్వాత్' అను సూత్రము ననుసరించి యీ యర్థ మంగీకరింతమన్నచో నపుడు,

'శ్లో॥ ప్రకృత్యైవచ కర్మాణి క్రియమాణాని సర్వశః
యః పశ్యతి త దాత్మాన మకర్తారం స పశ్యతి॥'

(అన్నివిధములపనులను ప్రకృతియే చేయుచున్నదనియు, ఆత్మ చేయువాడు గాడనియును దెలిసికొన్నవాడే తెలివిగలవాడు.)

"శ్లో॥ ప్రకృతేః క్రియమాణాని గుణకర్మాణి సర్వశః
అహంకార విమూఢాత్మా కర్తాఽహమితి మన్యతే॥"

(ప్రకృతిచే జేయబడుచున్న గుణకర్మలను, అహంకారముచే మూఢుడయిన ఆత్మ, తానుచేయుచున్నట్లు తలంచును) అని యాత్మ కర్తగాడని చెప్పెడి గీతాశాస్త్రమునకు విరోధము వాటిల్లును. ఇట్టి గీతాశాస్త్రమునకు విరుద్ధముగ వ్యాస

సూత్రము ఆత్మకు కర్తృత్వమును ప్రతిపాదించజాలదు. సూత్రకార గీతాకారులలో పరస్పరవిరోధ ముండదు. గీత భారతాంతర్గతము గాన గీతాకారుడు వ్యాసుడే, సూత్రకారుడును వ్యాసుడే. ఇట్టితరి ఒకేవ్యాసుడు యొకచోట ఆత్మ కర్తయనియు, మరియొకచోట ఆత్మ కర్త గాదనియును ఎట్లు చెప్పును?

కావున సూత్రమునకుగూడ అహంకారము కర్త యనియే తాత్పర్యము. కావున ప్రకృతి కర్తయనియు, పురుషుడు భోక్తయనియును దేలినది.

ఈశ్వరేచ్ఛవలన జడమయిన ప్రకృతికిగూడ కర్తృత్వము లభించును. నిర్వికారుడయిన పురుషునకు సాక్షిత్వరూపమయిన భోక్తృత్వమున్న నిర్వికారత్వమునకు భంగములేకుండగనే కుదురును.

అయితే, సుఖదుఃఖసాక్షాత్కార రూపమయిన అనుభవము వికారము గాకున్నను, 'నేను సుఖిని, నేను దుఃఖిని' అను ప్రతీతిసిద్ధమయిన సుఖదుఃఖానుభవము వికారరూప మేల గాదు?

నిజమే, అది వికారరూపమే. నిర్వికారుడయిన పురుషునియందా వికారము అవిద్యావశమున సంభవించుచున్నది. అట్లే కర్తగాని పురుషునియందు 'నేను వెళ్ళువాడను, నేను గ్రహించువాడను' అను ననుభవబలమునుబట్టి యజ్ఞానవశమున కర్తృత్వము సంభవించుచున్నది. ఇదియంతయు ముందుశ్లోకమున స్పష్టము కాగలదు. ౨౦॥

శ్లో॥ పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్
కారణం గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు॥ ౨౧॥

అ॥ ప్రకృతియందు తాదాత్మ్యభావముగల పురుషుడు ప్రకృతివలన బుట్టిన సుఖదుఃఖమోహాదిగుణముల ననుభవించుచున్నాడు. పురుషునకు ప్రకృతియందు గాని, దానికార్యమునందుగాని సాక్షా దాత్మభావము లేదు. అయినను 'నే నజ్ఞానిని, నేను కర్తను, నేను సందేహించుచున్నాను, నేను నిర్ణయించుచున్నాను; నేను తాకుచున్నాను, నడచుచున్నాను' అనుచు ప్రకృతియొక్క ధర్మములను తనయందారోపించుకొనుచున్నాడు. ప్రకృతియొక్క కార్యవిశేషమగు దేహాదులయందు సాక్షాత్తుగానే ఆత్మభావ మారోపింపబడుచున్నది. ఇందుకు 'నేను దేవుడను, నేను మనుష్యుడను' అను ప్రతీతు లాధారములు. ఇట్లు ఆత్మయం దారోపించుకొనబడిన ప్రకృతి తత్కార్యాదులతోను వానిధర్మములతోను ఆత్మకు మిథ్యాభూతమగు సంసార మేర్పడుచున్నది. కావున సంసార సంబంధమునకు అధ్యాస కారణమని సిద్ధించినది.

ఆత్మకు సుఖదుఃఖాదిభోగము శరీరాదులకు అన్నాదిభోగములవంటిది కాదు. చక్షురాదులకు ఘటాద్యుపలబ్ధివంటిది. కనుకనే ఆచార్యపాదులు మూలమునందలి 'భుంక్తే' అనుపదమునకు 'ఉపలభతే'అని వ్యాఖ్యానించిరి. అనగా (జానాతి) తెలిసి

కొనుచున్నాడని యర్థము. సుఖాదిసాక్షిభూతుడయిన ఆత్మకు వాస్తవికమగు సుఖాదిభోగము సంభవింపదు.

సత్త్వగుణము సుఖాకారముగను, రజోగుణము దుఃఖాకారముగను, తమోగుణము మోహాకారముగను పరిణమించుటవలన సుఖదుఃఖాదులకు ప్రకృతివలన బుట్టినగుణము లని వ్యవహారము.

పాండిత్యముకూడ సత్త్వగుణముయొక్క పరిణామము. సుఖదుఃఖాదులను సాక్షాత్కరించుకొను పురుషుడు 'నేను సుఖమును దెలిసికొనుచున్నాను, నేను దుఃఖమును తెలిసికొనుచున్నాను' అని తెలియవలెను. ఇంతియెకాని 'నేను దుఃఖిని, అని తెలియదగదు. సుఖదుఃఖాదులు అంతఃకరణధర్మములు. పురుషునియం దవి యుండుట యసంభవము. అయినను అనాత్మ తాదాత్మ్యాధ్యాసవలన 'నేను సుఖిని' అని యనుకొనుచున్నాడు.

కావున, పురుషునకు సంసారమునుగూర్చి కేవల యవిద్యమాత్రము కారణము గాదు. అవిద్యాకార్యములయిన సుఖదుఃఖాదులు కారణములు గావు. వాని సాక్షాత్కారమున్ను కారణము గాదు. సుషుప్తియందు దీ సామగ్రియంతయు నున్నను, పురుషునకు సంసార మగపడుటలేదు. సంసారబంధమునకు అధ్యాస మొక్కటియే కారణము. కనుకనే, ఉత్తరార్థమున శ్రీకృష్ణులు, 'దేవమనుష్యాది జన్మలయందు పురుషునకు సుఖదుఃఖాదిగుణములతో నేర్పడిన సంబంధమే సంసారబంధమునకు గారణ'మని చెప్పిరి. అవిద్యలేనిదే యధ్యాసయే లేదు. కాన, సంసారబంధమున కధ్యాస ప్రధానకారణమనియు, అవిద్యాపు లప్రధానకారణములనియు దెలియవలెను. గుణసంగమనగా 'ఈసుఖదుఃఖాదిగుణములు నావి' అని, యాత్మయం దంతఃకరణధర్మాధ్యాస మని భావము. .ధర్మాధ్యాసమువలె ధర్మ్యధ్యాసకూడా సంసారకారణము. ధర్మ్యధ్యాసలేనిదే ధర్మాధ్యాస పొసగదు. 'అహం మనః' (నేను అంతఃకరణము) అను ప్రతీతిలేనందున ధర్మ్యధ్యాసము సాక్షాత్తుగా తెలియబడుట లేదు. కాని ధర్మాధ్యాసవలన, ధర్మ్యధ్యాసము నూహింపవలయును. కనుకనే భాష్యకారులు ధర్మాధ్యాసమునే యుటంకించిరి.

ఇట్టి ధర్మాధ్యాస సంసారకారణమనుటలో, 'స యథా కామో భవతి తత్క్రతు ర్భవతి' అను శ్రుతి ప్రమాణమగుచున్నది. ఎవని కేకోరిక యుండునో వాడు ఆకోరిక నెరవేను కర్మల నాచరించును అని శ్రుత్యర్థము. స్వర్గకాముడు జ్యోతిష్టోమ మాచరించును, వర్షకాముడు కారీరేష్టి చేయును. ఇట్లాయా యజ్ఞాదుల నాచరించినందున మానవులు ఫలానుభవముకొరకు ఉచ్చనీచాది జన్మల నొందెదరు. దేవాదిజన్మ లుచ్చములు, పశ్వాదిజన్మలు నీచములు. ఈ యాయాజన్మలందు గుణసంగమువలన మానవులకు గోరిక లుదయించును. పురుషుడు సత్త్వగుణమున దేవతాజన్మ కావలె ననుకొనును. రజోగుణవశమున మనుష్యజన్మము నపేక్షించును.

తమోగుణమునుబట్టి పశుజన్మమును కామించును. ఇట్లు గుణసంగమే క్రమక్రమ ముగ బంధహేతు వగునని తెలుచున్నది.

ఇట్టి సంసారమును తొలగించుకొనుటకు సన్యాస వైరాగ్యప్రాప్తికైన క్షేత్రక్షేత్రజ్ఞ జ్ఞానము అధ్యారోపాపవాదములతో కారణమని గీతాశాస్త్రమున "యజ్జ్ఞాత్వాఽమృతమశ్నుతే" అను శ్లోకమున నిరూపింపబడినది.

రామానుజ మతము :

ప్రకృతియొక్క సంసర్గమువలన పురుషునకు బంధము సత్యమే యనియు, ప్రకృతిసంసర్గమునకు గుణసంగము కారణమనియు, ఇట్టి కార్యకారణభావము బీజాంకురన్యాయమున ప్రవాహరూపముగ అనాదియనియు, అమానిత్వాదిగుణములు నలవరచుకొనినచో గుణసంగము నివర్తించుననియు, గుణసంగము నివర్తింప ప్రకృతితో సంసర్గముండదనియు దాన సత్యమగు బంధముగూడ నివర్తించునని యును రామానుజు లనిరి. ఈయది అనుచితము.

"అసంగో హ్యాయం పురుషః" అనుశ్రుతినిబట్టి అసంగుడగు పురుషునకు ప్రకృతితో సంగము సత్య మెట్లగును? అసంగునకు నైల్యగుణసంగము సత్యమా ? మొదట ప్రకృతి సత్యమగుచో, దానితో పురుషునకు సంగము సత్యమగును. "ఏక మేవాద్వితీయం బ్రహ్మ" "నేహ నానా స్తి కించన" అనుశ్రుతులు రెండవ వస్తువే లేదని చెప్పుచున్నవి. కాన ప్రకృతియే సత్యముగాదు. అట్టితఱి దానితో సంగము సత్య మెట్లగును ? తత్ప్రయుక్తమగు బంధము సత్య మెట్లగును ?

మరియు ప్రకృతిసంగమునకు గుణసంగము కారణమనుటయే కుదరదు. ఇచట బీజాంకురన్యాయము ప్రసక్తించదు. ప్రకృతిసంగము అనాది. గుణసంగము సాది. అనాది పదార్థమునకు సాదిపదార్థము హేతువగుట విరుద్ధము. ప్రకృతి యనాదియే యయినను దాని సంగమమాత్రము సాదియని యనరాదు. అనాదు లయిన ప్రకృతిపురుషులు పరస్పరసంగములేక నుండుననుటలో ప్రమాణము లేదు. ఒకవేళ నట్లుండుచో, తరువాత నా రెంటికి సంబంధము నేర్పరచెడి కారణము లేనందున, ఆ రెంటికి సంబంధమే సిద్ధింపదు. అజ్ఞానము సంగహేతువనుట విచి త్రము. అజ్ఞానమే ప్రకృతి. దానిసంగమున కదియే హేతు వెట్లగును ? ఇక అజ్ఞా నము, ప్రకృతి వేరన్నచో నపుడు అజ్ఞానమునకు పురుషునకు సంగమున్నదా? లేదా? ఉన్నచో దానికి హేతువేది ? సంగహేతువులేనిదే సంగమెట్లు సిద్ధించును ? అజ్ఞాన పురుషులకు సంగమేర్పరుప, మరియొకటి కారణమున్నచో దానితో పురుషునకు సంగమున్నదా, లేదా ? ఉన్నచో దానికి సంగహేతువెద్ది ? లేనిచో నది సంగము నెట్లు కలిగించును? అని యిట్లనవస్థాదోషము ప్రసక్తించును. ఈ దోషమును వాపు కొనుటకు అజ్ఞానపురుషుల సంగమున కజ్ఞానమే కారణమన్నచో ఆత్మాశ్రయ దోషము ఘటించును. కనుక ప్రకృతిపురుషులసంగము అనాదియనియే సిద్ధాంతము

కనుకనే, "అవిద్యాత్మచిత్సంబంధః షడస్మాకమనాదయః" అను నభియుక్తోక్తి చెల్లు చున్నది. కావున అనాదియగు ప్రకృతిపురుషసంగమే గుణసంగమునకు హేతువు. ఇట్లుండ రామానుజులు గుణసంగము ప్రకృతిపురుష సంగమునకు హేతువని నుడువుట మృత్యువుయొక్క పుట్టుకకు మరణము కారణమనుమాటవలె పరిహాసాస్పద మగు చున్నది.

మరియు వారు (రామానుజులు) అమానిత్వాది గుణములవలన సత్యమగు బంధము తొలగు ననిరి. సత్యమైనది నివర్తించుటకాని నివర్తించునట్టిది సత్యముగుటగాని లోకమునం దెచ్చటను గానము.

కర్రదెబ్బతో నిజమయినసర్పము నివర్తించుటలేదా? అనియందు రేమో? ఆ సర్పమునందలి సత్యత్వమే తగాదాలలో యున్నది. తగాదాలో లేనివస్తువు దృష్టాంతముగ నీయవలెను. దృష్టాంతముగా నీయదగిన అట్టివస్తువు మా మతమున (అద్వైతమతమున) లేదు కనుకనే మేము ప్రపంచమంతయు మిథ్యయందుము.

శ్రుతియు క్త్యనుభవములకు విరుద్ధమగు అర్థమెన్నటికిని గ్రహింపదగదు. "యోవై భూమా త దమృతం అథ య దల్పం త న్మర్త్యమ్" "తత్సత్యం స ఆత్మా తత్త్వమసి" "అతోఽన్యదార్తం" అను శ్రుతులు బ్రహ్మ సత్యమనియు, మిగిలిన ప్రపంచమంతయు మిథ్యయనియు జెప్పుచున్నవి.

యుక్తి :—

౧. బ్రహ్మ = సత్యము = త్రికాలాబాధ్యమగుటవలన, = వ్యతిరేకమున ఘటమువలె.

౨. ప్రపంచము=మిథ్య = తోచెడిసమయమునందుమాత్రమే యుండుట వలన = కలలోని రథాదులవలెను, ఇంద్రజాలాదులవలెను. అని.

ఓయి! ప్రపంచము = సత్యము = ప్రతీయమానమగుటవలన-బ్రహ్మవలె, అని యేల నూహింపకూడదు?

నిజమే. దృష్టాంతమగు బ్రహ్మయందు ప్రతీయమానత్వమను (తెలియబడుటయను) హేతువు లేదు.

అతీంద్రియమయి, శాస్త్రైకగమ్యమగు బ్రహ్మవస్తువునందు ప్రతీయమానత్వము కుదరదు.

ఇంద్రియగోచరమగువస్తువే ప్రతీయమానమగును. బ్రహ్మ ఇంద్రియ గోచరముగాదు. కాన ప్రతీయమానము గాదు. "అప్రాప్య మనసాసహ" "యత్త దద్రేశ్య మగ్రాహ్యమ్" అనుశ్రుతు లిందు కాధారము. కావున ప్రతీతిరూపమగు బ్రహ్మయందు ప్రతీయమానత్వ మను హేతువు సిద్ధింపనందున హేత్వసిద్ధి యను దోషము వాటిల్లును.

ఓయి! ప్రపంచము = సత్యము = త్రికాలాబాధ్యమగుటవలన = బ్రహ్మ వలె: అని యనుమానము రచించెదము.

ఇందు పక్షమున హేత్వసిద్ధియనుదోషము లేదు. ప్రళయకాలమునగూడ సూక్ష్మరూపముతో ప్రపంచమున్నది. అనినచో నీయది పొసగదు.

స్థూలప్రపంచము త్రికాలాబాధ్యమా? లేక సూక్ష్మప్రపంచము త్రికాలాబాధ్యమా? ఇందు మొదటిపక్షము కుదరదు. ప్రళయమునందు స్థూలప్రపంచము లేనందువలన. రెండవపక్షమున్ను పొసగదు ప్రపంచమున్నకాలమున నది లేనందున.

ఇక స్థూలసూక్ష్మోభయాత్మకమయిన జగత్తు సత్యమన్నచో, నదియును చెల్లదు. ఉభయరూపమయిన ప్రపంచమే లేదు. స్థూలత్వ సూక్ష్మత్వములు పరస్పరవిరుద్ధములుగాన స్థూలము సూక్ష్మమగుటకాని, సూక్ష్మము స్థూలమగుట కాని సిద్ధించదు.

మరియు నిట్లే ప్రకృతి = సత్యము = త్రికాలాబాధ్యమగుటవలన=బ్రహ్మ వలె = అను ననుమానప్రయోగముకూడ నిలువదు.

ఇందును, స్థూలప్రకృతి సత్యమా, సూక్ష్మప్రకృతి సత్యమా? ప్రళయము నందు స్థూలప్రకృతి లేనందున నది సత్యముగాదు. ప్రపంచదశలో సూక్ష్మప్రకృతి లేనందున నదియును సత్యముగాదు.

అయితే, ఇట్లే బ్రహ్మవిషయమునగూడ స్థూలబ్రహ్మ సత్యమా, సూక్ష్మబ్రహ్మ సత్యమా? అని యేల వికల్పింపగూడదు? నిజమే! అస్థూల మనణ్వ హ్రస్వమ్" ఇత్యాది శ్రుతి బ్రహ్మయందు స్థూలత్వ సూక్ష్మత్వాదిధర్మములు లేవని చెప్పుచున్నందున బ్రహ్మవిషయమున నిట్టివికల్పము చేయ వలనుపడదు.

నిజస్థితిలో మోక్షదశయందు ప్రకృతికాని దానికార్యముకాని లేనందున త్రికాలాబాధ్యత్వలక్షణమయిన సత్యత్వము ప్రకృతికిగాని, దానికార్యమునకుగాని లేదు.

ఇట్లు ప్రకృతి తత్కార్యములకు అసత్యత్వము సిద్ధింప, దానివల్ల నేర్పడిన గుణసంగరూపమగు బంధమున కసత్యత్వ మనివార్యము. బంధ మసత్యము కనుకనే, జ్ఞానమువలన దానికి నివృత్తి లోకములో జ్ఞానమువలన బోవు (నశించు) వానికి సత్యత్వ మెచ్చటను కనిపించుటలేదు. రజ్జుసర్పము రజ్జుజ్ఞానమున నశించుచున్నదికాని, సత్యసర్పము జ్ఞానమాత్రమున నశించుటలేదు.

అమానిత్వాది సాధనములచే బంధము నివర్తించుననుట పొరపాటు. అమానిత్వాదులు జ్ఞానసాధనములుగాని మోక్షసాధనములు కావు. కావున అమానిత్వాది సాధన జన్యమయిన జ్ఞానమువలననే బంధనివృత్తి. ౨౨

శ్లో॥ ఉపద్రష్టానుమంతాచ భర్తా భోక్తా మహేశ్వరః
పరమాత్మేతి చాప్యుక్తో దేహేస్మిన్ పురుషః పరః॥

ఆ। యజ్ఞకర్మలయందు ఋత్విగ్యజమానులు వారివారిపనులు నెరవేర్చుచుండ, సమీపమందుండి వారిపనులలో నిమగ్నుడుగాక వారిపనులయందలి గుణదోషములను నిరీక్షించువానిని యుపద్రష్ట యందురు.

అట్లే దేహేంద్రియాదులు వ్యాపారముచేయుచుండ తానేపనిని చేయక దేహేంద్రియాదులకు విలక్షణుడయి, వాటిసామీప్యమున నుండు పురుషుడు, ఉపద్రష్ట యనబడును.

లేక ద్రష్టలందరిలో నాంతరతముడయిన ఆత్మ యుపద్రష్ట యనబడును. దేహ చక్షు ర్మనో బుద్ధ్యాత్మలు ద్రష్టలు. వానిలో దేహము బాహ్యద్రష్ట. దానికంటె చక్షురాదులు లోపలిద్రష్టలు. వానికంటె మనసు, దానికంటె బుద్ధి, దానికంటె ఆత్మ అంతరముగు ద్రష్ట.

దేహేంద్రియాదులు కర్మవ్యాపృతము లగుచుండ, తాను చేయకున్నను అనులుగరించి సంతోషించు నాత్మ అనుమంత. ఆత్మ దేహేంద్రియాదుల పనుల నెన్నడు నివారించదు. ఎప్పుడును ఆయాపనుల నంగీకరించుచునే యుండును

ఆత్మ దేహేంద్రియమనోబుద్ధులకు చిదాభాస నొసంగుచు- స్వరూపమును ధరించియుండునట్లుల వానిని పోషించును. కావున ఆత్మ భర్త. దేహాదులు తమ స్వరూపమును తాము స్వయముగ ధరింపజాలవు. ఆత్మయొక్క అనుగ్రహబలమువలననే తాము నిలచియుండును. ఆత్మయొక్క అనుగ్రహ మన ఆత్మచైతన్యమును దేహాదులయందు ప్రతిఫలింపజేయుటయే. అజ్ఞులు దేహాదులయందలి చైతన్యము స్వరూపచైతన్యమేయని తలచెదరు. నిజస్థితిలో నది ఆత్మచైతన్య ప్రతిఫలనమువలన కలిగిన చైతన్యాభాసయే. ఇట్టి చైతన్యాభాసము లేనిదే దేహేంద్రియాదులు గమనాగమనాదివ్యాపారములను నెరవేర్చజాలవు.

లోకములో స్వతంత్రులయిన రాజులు ఈశ్వరు లనబడుచున్నారు. కాని వారు మహేశ్వరులు గారు. వారికిపైన నియంతలగు దేవాదు లున్నారు. బ్రహ్మాదులుగూడ కాలాదులకు పరతంత్రులు. కాన మహేశ్వరులు గారు. కాని యెల్ల శరీరములయం దుండు ఆత్మమాత్రము మహేశ్వరుడు. సర్వాత్మ. సమస్తభూతములు ఈతనియందు గల్పింపబడినవి. ఈత డధిష్ఠానరూపుడు.

ఇచట మీరు, అంతఃకరణోపహితుడై పరిచ్ఛిన్నుడైన పురుషుడు సర్వాధిష్ఠాత యెట్లగునని ప్రశ్నించరాదు. అంతఃకరణముగూడ పురుషునియందు గల్పింపబడినది. కనుక నది పురుషుని పరిచ్ఛేదపరచజాలదు. పురుషుడు స్వతహాగా పరిచ్ఛిన్నుడయినచో వానిని అంతఃకరణము పరిచ్ఛేదపరచుట వ్యర్థము. స్వతహాగా అపరిచ్ఛిన్నుడగుచో వానిని అంతఃకరణము పరిచ్ఛేదపరచజాలదు.

కావున అపరిచ్ఛిన్నుడయిన పురుషునియందే అంతఃకరణాదికముగల్పింపబడినది. కనుక పురుషుడు సర్వాధిష్ఠాత యగును. కనుకనే యీతడు ప్రత్యగాత్మ

యయినను పరమాత్మయే యని యీ శ్లోకమునందే శ్రీకృష్ణుడు చెప్పియున్నాడు.
అయితే కూటస్థునియందు వ్యష్టిదేహాదికము కల్పింపబడినదనియు, పరమాత్మ
యందు ప్రపంచమంతయు గల్పింపబడినదనియును వెనుక జెప్పితిరిగదా! ఇప్పుడు
పురుషునియందు అంతఃకరణాదికమంతయు గల్పింపబడినట్లు చెప్పుచుంటిరే—
యిదియేమి? ఇందు దోషములేదు, వినుము. కూటస్థపరమాత్మలకు అంతఃకరణోప
హితత్వ మాయోపహితత్వరూపమైన కల్పితభేదము నవలంబించి యిట్లు చెప్పితిమి.
అట్లుకానిచో తత్త్వమస్యాది మహావాక్యములు, కూటస్థపరమాత్మలకు అభేదము
నెట్లు ప్రతిపాదించును?

అయితే కూటస్థపరమాత్మలు భిన్నులయియుండి మహావాక్యములు అభే
దమును బోధించుచున్నవా? అభిన్నులయియుండి యభేదమును బోధించుచున్నవా?
భిన్నులయితే అభేదము సంభవింపదు అభిన్నులయితే కూటస్థుడు, పరమాత్మ, అని
భేదముగా శబ్దములను ప్రయోగించుటెట్లు?

వినుము. ఇదియొక దోషముకాదు. లౌకికులు, తార్కికులును, అద్వితీ
యమగు ఆత్మయందు కూటస్థుడు, పరమాత్మ అను భేదమును వ్యవహరించిరి. వారి
వ్యవహారమున ప్రసక్తించిన భేదమును తత్త్వమస్యాది మహావాక్యములు నిరసించు
చున్నవి. కావున నిట్లు సర్వాత్మయగుటవలననే పురుషుడు స్వతంత్రుడయినాడు.
సచ్చిదానందరూపుడయిన పురుషుని సర్వప్రపంచమునుంచి విడదీయగా, వస్త్రమునుంచి
దారములను విడదీయగా వస్త్రమే లేకుండినట్లు సర్వప్రపంచము లేకపోవును. కాన
పటము తంత్వధీనమయినటుల సర్వప్రపంచము పురుషపరతంత్రము. కనుక పురు
షుడే మహేశ్వరుడు, పరమాత్మయు.

పరమాత్మయనగా ఉత్కృష్టమయిన ఆత్మయని యర్థము. గొప్పవాడని
భావము. ఇచట అనాత్మలలో గొప్పవాడా? ఆత్మలలో గొప్పవాడా? అని ప్రశ్న
పుట్టును. రెండవపక్షమున అనేకాత్మదోషము. మొదటిపక్షము లోకవిరుద్ధము. అనా
త్మలలో అనాత్మనే నిర్ణయించవలెగాని ఆత్మను నిర్ణయించదగదు. మనుష్యులలో
నుత్తముడు దేవత కానేరడు. కావున బౌద్ధాదులచే గల్పింపబడిన దేహాద్యాత్మ
లలో నీతడు గొప్పవాడని యభిప్రాయము.

అజ్ఞానమువలన గొందరు బౌద్ధాదులు దేహమే యాత్మయని తలచిరి.
మరికొందరు ఇంద్రియము లాత్మయనిరి. కొందరు ప్రాణమును, కొందరు మన
స్సును, కొందరు బుద్ధిని యాత్మ యనిరి. వివేకులుమాత్రము దేహాదివిలక్షణమయిన
చైతన్యము నాత్మయనిరి. ఇట్లుండ అజ్ఞులు, ప్రాజ్ఞులు తలచెడి యాత్మలలో పురు
షుడు పరమాత్మయని యిచట శ్రీకృష్ణునిచే నిర్ధారణ చేయబడినది. కల్పితములైన
దేహాదిబుద్ధ్యంతములగు ఆత్మలలోను కల్పితములైన ప్రత్యగాత్మలలోను అకల్పితు
డయిన ప్రత్యగాత్మ ఉత్కృష్టుడని భావము. ఈయది శ్రుతిసిద్ధముకాన ఆస్తికులకు

గ్రాహ్యము. ఈశ్వరుడు వేదమునందు జెప్పిన విషయమునే గీతలయందుగూడ జెప్పెను. పరమాత్మయను నీపురుషుడు, మనుష్యపశ్వాది సకలదేహములయందును గలడు. లేక నానాశరీరములయందు గనిపించుననియు జెప్పవచ్చును. దీనిచే సర్వవ్యాపి యగు పురుషుడు పరిచ్ఛిన్నమగు దేహమునం దెట్లుండుననను శంక తొలగినది. పురుషుడు పరమాత్మయని పదునైదవ యధ్యాయమునగూడ జెప్పబడగలదు. ఇట్లు పురుషునకు పరమాత్మభావమును మాటిమాటికి జెప్పుట అభేదవాదము ప్రమాణమను బుద్ధిశోగాన భేదవాదము అప్రమాణమని తేలినది.

రామానుజ మతము :—

ఈ దేహమునందున్న పురుషుడు దేహప్రవృత్తి కనుకూలమగు సంకల్పాదుల గలుగజేయుచు, దేహమున కుపద్రష్టయు, అనుమోదకుడు నగుచున్నాడు. అట్లే దేహమును బోషించువాడును, దేహప్రవృత్తివలన గలిగెడి సుఖదుఃఖముల ననుభవించువాడును అగును. కావున నిట్లు దేహమును నియమించుటచేతను, దేహమును బోషించుటచేతను, దేహమునకు శేషి (అంగి) యగుటచేతను దేహేంద్రియ మనస్సులకు మహేశ్వరుడు (ప్రభువు) డగుచున్నాడు. దేహాదులగూర్చి పరమాత్మయు నని చెప్పబడుచున్నాడు. పురుషుడు, పరుడు, సర్వోత్కృష్టుడు, అపరిచ్ఛిన్నజ్ఞాన శక్తిగలవాడు. అనాదియయిన ప్రకృతిసంబంధమువల్ల నేర్పడిన గుణసంగమువలన నీదేహమాత్రమునకే మహేశ్వరుడగుచున్నాడు. దేహమాత్రమునకు పరమాత్మయు నగుచున్నాడు. అని రామానుజులు వ్యాఖ్యానించిరి. ఇదియంతయు నిస్సారము.

స్థూలదేహముయొక్క ప్రవృత్తి కనుకూలమైన సంకల్పము సూక్ష్మదేహమయిన మనస్సుయొక్క ధర్మముగాని పురుషుని ధర్మముకాదు. అయినా - అధ్యాసలేనిదే ఒకదానిధర్మము మఱియొకదాని కంటదు. అధ్యాసను రామానుజు లంగీకరింపరు. రామానుజులు పమేశ్వరునకుగూడ సంకల్పము (ఈక్షణము) స్వాభావిక మందురు. ఇట్టివారు జీవునకు స్వాభావికమనుటలో వెనుదీతురా? జీవునకు సంకల్పము స్వాభావికమగుచో సుషుప్తిలో గనుపింపదేల ? మూర్ఛాదులయం దేల గనిపించదు. కాన సంకల్పము పురుషధర్మముగాదు.

సుఖదుఃఖానుభవముకూడ బుద్ధిధర్మముగాని పురుషధర్మముగాదు. నిర్వికారునకు సుఖదుఃఖాద్యనుభవరూపమయిన వికారము, గుణసంగము, ప్రకృతి సంగము మున్నగునవి యుండవు.

/ మామతమున సంగము ఆధ్యాసికమయినందున, ఆత్మయం దుపపన్నమగును. మీరు సంగము సత్యమందురు. మీబోటివారు పురుషునియందలి యీశ్వరత్వమును సంకోచ పరతురని తలచియే బాదరాయణులు మహేశ్వరపదమును వాడిరి. అయినను మీరు 'పురుషుడు దేహాదులగూర్చి మహేశ్వరుడు' అని సంకోచ

పరచినచో మిమ్ముల శాసించువా రెవ్వరు? మహచ్ఛబ్దమునకు అనర్థక్యమును, సంపాదించి మూలచ్ఛేదమగు మీపాండిత్యమును బయటపెట్టుకుంటిరి. "మాయాం తు ప్రకృతిం విద్యాన్ మాయినం తు మహేశ్వరం" అను శ్రుతియందున్న మహేశ్వరశబ్ద మిచట ప్రయోగింపబడినది. అట్టిదానిని, మూలమునకు వ్యతిరిక్తముగా సంకోచపరచుటకు గారణమేమి? ఈశ్వరునియందు యోగరూఢములయిన మహేశ్వర పరమాత్మపదములు జీవేశ్వరులు భిన్నమయినచో జీవునియం దెట్లు ప్రయోగింపబడును. గీతాశాస్త్రమం దెక్కడయినను దేహమాత్రమునకు పరమాత్మయని యను బ్రయోగముకలదా? అట్లున్నచో రామానుజు లిట్లు అర్థసంకోచమును చేయుట యెుప్పెడిని.

మరియు తనఇంద్రియములు తనకర్మననుసరించి ప్రవర్తించుచుండ సంసారము నొందెను జీవుడు దేహమునుగూర్చిమాత్రము మహేశ్వరు డెట్లగును. వ్యాధిగ్రస్తుడు అడుగుమాత్రయినను చలింపచేయ సమర్థుడుగాడు. జీవుడు దేహాదుల మీద స్వాతంత్ర్యము గలవాడే యగుచో ప్రేమాస్పదమయిన దేహమును విడిచి యమాదిలోకముల కేలపోవుడును. కాన దేహము కాలకర్మములకు పరతంత్రము. జీవున కందు స్వాతంత్ర్యము లేదు.

పురుషుడు దేహమును గూర్చి యీశ్వరుడే కానప్రుడు మహేశ్వరు డగుట యసంభవము.

"దేహః కిమన్నదాతుః స్వం నిషేక్తు ర్మాతురేవవా" దేహము అన్న మిడినవాని సొత్తుయా? బీజావాపము చేసినవాని సొత్తుయా ? కన్నతల్లిసొత్తుయా ? అను భాగవత ప్రమాణమును బట్టి దేహమునుగూర్చి అన్నదాత, తల్లిదండ్రిలు, భార్య, రాజు, శునకము, అగ్ని, మున్నగువా రెందరో స్వాతంత్ర్యము కలవారు కలరు.

దేహమునం దహమభిమానముగల యజ్ఞానికూడ అన్నదాత మున్నగు వారికి పరతంత్రుడే. సేవకులు రాజపరతంత్రులు. కాన జీవునికూడ పరతంత్రునిగా జేయు దేహమునందు జీవునకు స్వాతంత్ర్య ముండు టెట్లు? జీవునకు గమనాది సంకల్పమునందుగూడ స్వాతంత్ర్యము లేదు. స్వాతంత్ర్యమున్నచో తమ కనిష్టమైన సంసారము నెవ్వడును కోరడు. "మత్తః స్మృతిః జ్ఞానమపోహనంచ" అని భగవంతుడు స్మరణాదులు తనవల్లనేయని నిర్వచించెను. ఇట్లు జీవున కెందునను స్వాతంత్ర్యము లేనందుననే "జ్ఞా జ్ఞాద్వావజావీశ నీశౌ" అను జీవు డనీశ్వరుడని చెప్పుచున్నది.

ఇక నే జీవుడు సంసారమును విడచునో, అట్టిప్రాజ్ఞుడు అన్నిటగూర్చియు నీశ్వరుడేకాక దేహాదులగూర్చియే యని యాతనిపట్ల చెప్పదగదు.

సంసారమును పరిత్యజించిన జీవుడు యీశ్వరునకుగూడ నీశ్వరుడే. అట్టి జీవుడు సాక్షాదీశ్వరుడే. కనుకనే "క్షేత్రజ్ఞంచాపి మాం విద్ధి" అని చెప్పబడినది.

అస్వామ్యరూపుడయిన ఈశ్వరుడు, అజ్ఞుడయిన జీవునకుగూడ పరతంత్రుడు. శకిలేంద్రియాదులుగల శ్రీరామాదులు దశరథాజ్ఞానుసారులకు డగుటచే పారతంత్ర్యము సుస్పష్టము.

సర్వాంతరుడయిన అశకిలేశ్వరుడు మాత్రము స్వతంత్రుడు. సర్వశేషియు. వాడే ప్రత్యగాత్మ కనుక ప్రత్యగాత్మకు మహేశ్వరత్వ ముచితము.

పరమాత్మకు పరతంత్రుడయిన ప్రత్యగాత్మ అజ్ఞానియగు ప్రమాతకాని కూటస్థుడుకాడు. కూటస్థుడు పరమాత్మయే. వాడు పరతంత్రుడు గాడు. అయితే అనుభవసిద్ధమయిన జీవులయందలి రాజాది పారతంత్ర్యము యెట్లు తొలగును? ఎవడు తాను రాజాది పరతంత్రుడనని తలంచునో వాడు దేహాదులయం దాత్మాభిమానముగలవాడే. ఎవడు తాను దేహాదివిలక్షణుడ నని తలచునో వాడు రాజాదులకు పరతంత్రుడుగాడు. సుషుప్తియందుగాని మూర్ఛావస్థయందు గాని తాను పరతంత్రుడనని తలంచునా?

కనుక, రాజభృత్యులకు ప్రమాతృభేదముకాని యాత్మభేదము లేదు. ఆత్మ అద్వితీయుడు. వీనికి పారతంత్ర్యము ప్రసక్తించుటయే దుర్ఘటము. ఆత్మభిన్నమంతయు జడము. అది చేతనపరతంత్రము. ఆత్మ యొక్కడే చేతనుడు. ఈతడు పరతంత్రుడగుటకు గారణమే లేదు.

కనుక ఆత్మకంటె వేరుగ సమానుడుగాని, యధికుడుగాని లేనందున సర్వమునుగూర్చియు ఆత్మ పరమాత్మయే. కేవలము దేహమాత్రమునకే కాదు. ౨౩

శ్లో॥ యఏవం వేత్తి పురుషం ప్రకృతించ గుణైస్సహ
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే॥ ౨౪

అ॥ ఇట్లు ఉపద్రష్టృత్వాది లక్షణమయిన పురుషుని యాత్మభావముతో (నేనే యను భావముతో) దెలిసికొనుచు, ప్రకృతిని, దాని కార్యవర్గముతోసహా నశించినదానినిగ గ్రహించినవాడు, స్నానసంధ్యాదుల విడచి యవధూతమార్గముతో నెట్లున్నను ఈ విద్వచ్ఛరీరము రాలిపోయిన పిదప మరల జన్మించడు.

ఆత్మసాక్షాత్కారము గలుగునంతవరకే ప్రకృతియొక్క కార్యములు అనుభవగోచర మగుచుండును. సూర్యోదయ మగువరకే రాత్రికాలముగాని, అకాలమున సంచరించెడి పిశాచాదులుగాని గోచరించును. సూర్యోదయానంతరము రాత్రికాలముకాని అందు దిరిగెడి పిశాచాదులుగాని గోచరింపవు. అట్లే ఆత్మాపరోక్షజ్ఞాన మబ్బినపిదప ప్రకృతియొక్క నాటక మేమాత్రమును సాగదు.

కనుకనే "యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్ తత్కేన కం పశ్యేత్" అనుశ్రుతి, విద్యావస్థయందు నిఖిలద్వైతాభావమును ప్రతిపాదించుచున్నది.

ఇచట ఆత్మసాక్షాత్కారమును జెప్పినంతమాత్రముననే, అజ్ఞాననివృత్తికలిగిన ట్లర్థమగుచుండ, మరల శ్లోకమున "ప్రకృతించ గుణైస్సహ" అని చెప్పనేల యని కొందరందురు. కాని యాత్మసాక్షాత్కారానంతరముకూడ ప్రకృతి, తత్కార్యములుండునేమోయను సందేహమును వారించుటకే శ్రీకృష్ణ భగవానులు చెప్పిరి.

లేక, ఆత్మసాక్షాత్కారము రెండు తెఱంగులు. పరోక్షము, అపరోక్షము అని. అందు పరోక్షసాక్షాత్కారమున ప్రకృత్యాదులు నివర్తించవు. అపరోక్షసాక్షాత్కారసమయమందే యవి నశించును. కావున నిచ్చట అపరోక్షసాక్షాత్కారమును జెప్పదలచియే శ్రీకృష్ణులు "ప్రకృతించ గుణైస్సహ" అని ప్రకృతినివృత్తి నుటంకించిరి.

"సర్వథా వర్తమానోపి" అని చెప్పుటచే ఆత్మజ్ఞానికి, అవిహితమార్గము (నిషిద్ధమార్గము) నందువలె, విహితమార్గమునందుగూడ నభినివేశము కూడదని సూచితమగుచున్నది. జ్ఞానియొక్క దేహేంద్రియాదులు ప్రారబ్ధకర్మానుసారముగ స్నాన, సంధ్యా, దేవతార్చనాదులయందు ప్రవర్తించుగాక, లేక అవధూతమార్గము ననుసరించుగాక- ఎటులయినను జ్ఞానికి హానిలేదు. దేహేంద్రియాదులయందతనికి అహంమమాభిమానము లేకపోవుటయే యిందుకు గారణము.

ఇచట "న స భూయోభిజాయతే" విద్వాంసుడు మరల పుట్టడు, అని చెప్పబడినది. దీనివలన నింతకుము న్నొకతూరి పుట్టిన ట్లర్థమగుచున్నది. ఇది యనుచితము. అజుడగు ఆత్మ కెప్పుడును బుట్టుకలేదు. నిజమే కనుకనే ఆవాక్యమునకు మఱియొకదేహమును గ్రహింపడని యర్థము. ఉన్నదేహము నశించినచో, జీవుడు మరణించినట్లును, క్రొత్తదేహమును గ్రహించగా జీవుడు పుట్టినట్లును, లోకులనుకొనియెదరు. ఆ జన్మనాశములు జీవునకు అజ్ఞానమూలములు. స్వతస్సిద్ధముగా జీవునకు జన్మనాశములు లేవు- జీవు డజుడు.

జీవు డనాదికాలమునుంచియు అజ్ఞానవశమున ప్రకృతదేహమును పరిత్యజించి నూతనదేహమును ధరించుచున్నాడు. అట్టి యజ్ఞానము నశించినతరువాత జీవుడు క్రొత్తదేహమును ధరించడు. ఉన్నదేహమునుమాత్రము విడచును. సర్వవ్యాపియగు ఆత్మకు నిట్లు దేహత్యాగముకూడ నుచితముకాదు. అయినను విద్వచ్ఛరీరము నాశ్రయించిన ప్రాణాదులు వాయ్వాదులయందు లయించుటచే ప్రాణరహితమయిన విద్వచ్ఛరీరమును విద్వాంసుడు విడచినట్లు తలంతురు- అజ్ఞానులు ప్రాణములేని పాషాణాదులను ఆత్మలేనివాటినిగ దలంచినట్లు.

విద్వాంసుని ప్రాణము లుత్క్రాంతిని చెందవు. ఇచటనే లయించును. చైతన్యాభాసమున్నదే కాని, ప్రాణాదుల కుత్క్రమణశక్తి (లేచిపోవుశక్తి) కలుగదు. జ్ఞానికి చైతన్యాభాస నశించినది. చైతన్యాభాసము నశించినతోడనే, ప్రాణాదీంద్రియములు తమతమకార్యములయందు లయించును. కనుక వీనికి (ప్రాణాదులకు) నూతనచైతన్యాభాసను గ్రహించుటకూడ నవకాశము లభించదు. లేక ప్రాణాద్యుపాధులు నశించినతోడనే, చైతన్యాభాసము బింబచైతన్యముతో నైక్యము చెందును. అద్దము నశించగానే, అద్దములోని ప్రతిబింబము బింబములో జేరినట్లు. కావున ఆత్మసాక్షాత్కారమువలన అజ్ఞానతత్కార్యములు నశించగా ప్రమాత (జీవుడు) బ్రహ్మాభావము నొందును.

ఓయి! జ్ఞానమువలన అజ్ఞానతత్కార్యములు నశించినపిదప జ్ఞానికి "సర్వథావర్తనము" అన్నివిధముల నుండుట యెట్లు తటస్థించును? దేహేంద్రియాదు లుండుచో వానికి నాశ మనున దెట్లు? వినుము. "ఈ కనిపించు ప్రపంచమంతయు ఆత్మయే. ఆత్మవ్యతిరిక్తముగా నేదియును లేదు" అను ననుసంధానమే ప్రకృతి నాశనము. అట్టి యనుసంధానమువలన ప్రకృతి తద్గుణములు (అజ్ఞాన తత్కార్యములు) స్ఫురింపవు. ఎల్లప్పుడు బ్రహ్మమొక్కటే స్ఫురించును. స్ఫురింపకపోతే నశించినట్లా? అని యందువేమో? సుషుప్తియం దట్టి యనుభవము గలదు. నిద్రాదశలో ప్రపంచమున్నను నిదురించినవానిదృష్టిలో లేదు. అట్లే విద్వాంసుని దృష్టిలో జగత్తు లేనిదే. విద్వాంసునకు తనదృష్టిలో సర్వథావర్తనము సంభవించదు. లోకదృష్టిలో నుండును. లోకులు శరీరేంద్రియాదులు పనిచేయుచుండగా ఆత్మ చేయుచున్నాడని యనుకొందురు. అట్లే విద్వాంసులకు ప్రాణోత్క్రమణము లేకుండుటగూడ లోకదృష్టిలోనేగాని, విద్వద్దృష్టిలో గాదు. 'అప్రాణోహ్య మనాశ్శుభ్రః' అను శ్రుతి విద్వాంసునకు ప్రాణాదులే లేవని చెప్పుచున్నది. ఆత్మజ్ఞానియే విద్వాంసుడు. వీనికి బంధమోక్షములుగూడ లేవు. కావున అజ్ఞానికి బంధవ్యవహార మెట్లు అజ్ఞానకల్పితమో, అట్లే జ్ఞానికి మోక్షవ్యవహారము గూడ అవిద్యాకల్పితమేయగుచున్నది. కనుక విద్వాంసుడగు ఆత్మకు అజ్ఞానతత్కార్య దేహేంద్రియాదులు లేవు. అట్టితఱి సర్వథావర్తన మెట్లు సంభవించును? సంభవించదు. లోకదృష్టిననుసరించి, విద్వాంసుడెట్లున్నను మరలబుట్టడని దానిభావము.

ఓయి! విద్వాంసునకు పునర్జన్మ లేకుండుట యసంభవము. జ్ఞానము కలిగినను ప్రారబ్ధకర్మాధీనమయిన శరీరముండునని శాస్త్రకారులు చెప్పుచున్నారు. ప్రారబ్ధము నశించినతరువాతనే ఆశరీరము నశించునని సిద్ధాంతము. ఇట్లుండ, జ్ఞానమున్నంతమాత్రమున ఆగామిసంచితకర్మలుమాత్రము తమఫలము నీయక నెట్లు నశించును ? చేసినవాటికి నాశ మెన్నటికిని కలుగదు. కృతవిప్రణాశము

తగదని శాస్త్రసిద్ధాంతము.

ఈ జన్మయందుగాని, పూర్వజన్మయందుగాని, జ్ఞానోత్పత్తికి పూర్వము చేయబడి ఫలోన్ముఖములుగాని కర్మలు సంచితము లనబడును. ఇవి రెండువిధములు. ఇహజన్మార్జితములు, పూర్వజన్మార్జితములు అని. జ్ఞానోత్పత్త్యనంతర మీజన్మయందుండు చేయబడి, ఫలోన్ముఖములు గానివి ఆగాములు. ఈ మహాసంచితములయిన కర్మలకు ఫలములేకుండగ నాశముండదు. కావున నీ మహాకర్మలకు మహాజన్మలు విద్వాంసునకుగూడ తప్పవు.

కడచిన అనేకజన్మలయందు చేయబడిన కర్మలు, జ్ఞానోత్పత్తికి పూర్వము యీజన్మయందు చేయబడిన కర్మలు, జ్ఞానోత్పత్త్యనంతరము చేయబడిన కర్మలు, నానా మహాను ప్రత్యేకముగ మహాజన్మలనుగాని, కలసి యొకజన్మనుగాని విద్వాంసునకుగూడ తప్పక సేయవలయును. అట్లు కానిచో కృతవిప్రణాశ మను దోషము వాటిల్లును. ఆదోషము నంగీకరించినచో యజ్ఞాదికర్మలయందు నాస్తికుల వలె, ఆస్తికులకుగూడ అనాదర మేర్పడును. అనాదరణ కలిగినచో నెవ్వడును వాని నాచరించడు. చేసినకర్మలకు ఫలము కలుగునను నిశ్చయమున్నప్పుడుగాని, కర్మలయందు ప్రవృత్తి కలుగదు. కర్మలనుజేయువారు లేనిచో జేయమని చెప్పెడి శాస్త్రములు వ్యర్థమగును. ఈశ్వరాజ్ఞారూపమయిన శాస్త్రము వ్యర్థముకాదు. అట్టిచో గీతాశాస్త్రముగూడ వ్యర్థమగును. కావున కృతవిప్రణాశ మనుదోష మంగీకరింపతగదు. కనుక విద్వాంసునకుగూడ పునర్జన్మము తప్పదు. అని పూర్వపక్షము.

సిద్ధాంతము:—

ప్రత్యగభిన్నపరమాత్మ సాక్షాత్కారము కలిగినచో, ప్రారబ్ధవ్యతిరిక్తమయిన కర్మలన్నియు నశించునని శ్రుతులు చెప్పుచున్నవి.

౧. "తస్య తావదేవ చిరం యావన్నవిమోక్ష్యే అథసంపత్స్యే" అను శ్రుతి ఆత్మజ్ఞాని మోక్షము నొందుటకు ప్రారబ్ధకర్మనాశమే అవధి. ప్రారబ్ధ శరీరము పతనము కాగానే జ్ఞాని ముక్తినొందగలడు. అని చెప్పుచున్నది.

౨. "ఇషీకాతూలవత్ సర్వాణి కర్మాణి ప్రదూయంతే" అను శ్రుతి ముంజగడ్డియందలి దూదివలె, జ్ఞానియొక్క కర్మలు పూర్తిగా నశించునని చెప్పుచున్నది.

3. "యథైదాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున। జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా" అను గీతాస్మృతియు పైయర్థమునే నిరూపించుచున్నది. లోకములో బీజసహితములయిన ఫలములే మొలకెత్తును, నిర్బీజములయిన ఫలములు మొలకరించవు. అట్లే అవిద్యాకామక్లేశాది బీజములు గల కర్మలే జన్మలిచ్చును. అవిద్యా కామక్లేశాది బీజరహితమయినకర్మలు జన్మల

నీయవు. అగ్నిదగ్ధములయిన వ్రీహ్యాదిబీజములు మొలకలెత్తవు. అట్లే జ్ఞానదగ్ధము లయిన కర్మబీజములుకూడ జన్మాంకురముల నీయవు.

ఆత్మజ్ఞానము కలిగినతరువాత జ్ఞాని ఫలాపేక్షతో కర్మల జేయడు. అందువలన నవి జన్మల నీయవు. జ్ఞానము కలుగకపూర్వము ఫలాపేక్షతో జేసినకర్మ లనుకూడ తరువాత కలిగిన జ్ఞానము నశింపజేయును. కనుక నవికూడ జ్ఞానికి జన్మల నీయజాలవు. కనుకనే శ్రీకృష్ణుడు గీతలలో "సర్వకర్మాణి" అని చెప్పియుండెను. అయితే ప్రారబ్ధకర్మలుమాత్ర మేల నశింపవు? అను శంక కలుగును. కాని యవి, "ముక్తేషువత్" విడచినబాణమువలె ఫలమునకు సంసిద్ధములయినవి. అందువలన వానివేగమున్నంతవరకు నిరర్థకమయినను నశించవు. కాన శరీరపతనము జరుగదు. బాగుగ లాగి వదలినబాణము లక్ష్యమును ఛేదించినను, దానివేగ మున్నంతవరకు వెళ్లి యాగునుగాని మధ్యలో నాగదు. అట్లే ప్రారబ్ధకర్మముగూడ అందువలన శరీరము పడిపోదు. కనుకనే శ్రుతికూడ నాకర్మలకు ప్రాబల్యము నిచ్చినది. కావున ప్రారబ్ధకర్మ నశించినపిదప సంచితాగాములు విద్వాంసునకు ఉత్తరజన్మల నీయజాలవు.

రామానుజమతము:—

దేవమనుష్యాది దేహములయందు మిక్కిలి క్లేశరూపముతోనున్నను ప్రకృతిపురుషవివేకముతో నున్నవాడు మరల పుట్టడు. అని, 'సర్వథా వర్తమానః' అనుపదమును వ్యాఖ్యానించిరి. అయ్యది నిస్సారము.

విద్వాంసునకు దేవాదిదేహములయందలి కష్టము లంటవు. అవిద్వాంసులకే ప్రకృతిపురుషవివేకము సున్న. అందు సచ్చిదానందపరబ్రహ్మను గన్న విద్వాంసునకు క్లేశము సంభవించదు. ఆనందరూపుడయిన ఆత్మయందు క్లేశములు పొసగవు. అపరిచ్ఛిన్నపరిపూర్ణాత్మకు దేహమునం దునికి, చిలుకకు పంజరమునం దునికివలె క్లేశకారణముకాదు. రూపసహితవస్తువునకు క్లేశము లంటును. నీరూప పదార్థమునకు క్లేశములంటవు. ఆత్మ నీరూపుడు, నిరవయవుడు. సర్వవ్యాపియగు ఆత్మ దేహమునందుమాత్ర ముండనేరదు. అట్లుండు ననుకొనుట పొరబాటు. ఇట్టిపొరబాటులకు గురియగువారే మూర్ఖులు. ప్రకృతికి విలక్షణుడయి, అసంగుడగు ఆత్మకు వివేచనకు బూర్వముగాని తరువాతగాని ప్రకృతిసంగ మెట్లగును? వాస్తవముగ ప్రకృతిసంగములేని యాత్మకు క్లేశ మెట్లుకలుగును? కావున రామానుజుల వ్యాఖ్యానము అసంగతము. ॥౨౩॥

శ్లో॥ ధ్యానేనాత్మని పశ్యంతి కేచి దాత్మాన మాత్మనా
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే॥ ౨౪

అ॥ ఆత్మసాక్షాత్కారము విషయమై ధ్యానాద్యుపాయములు చెప్పబడుచున్నవి.

కొందరు యోగులు ధ్యానమార్గముచే బుద్ధియందు ప్రత్యక్చైతన్యమును ధ్యానసంస్కృతమయిన అంతఃకరణముతో సాక్షాత్కరింపజేసికొనుచున్నారు. ధ్యానమనగా శ్రోత్రాదీంద్రియములను శబ్దాదివిషయములనుండి యుపసంహరించి, మనస్సును ప్రత్యక్చైతన్యమునం దేకాగ్రపరచి, తైలధారవలె సంతత చింతనము. లోకములో కొంగ ధ్యానించుచున్నది. పృథివి ధ్యానించుచున్నది. కొండలు ధ్యానించుచున్నవి." అను ప్రయోగములు గలవు. చేపలఁబట్టుకొనుటకై పొంచుచుండి నిశ్చలముగానున్న కొంగకుగాని, అచేతనములయిన పృథివీపర్వతములకు గాని ప్రత్యక్చింతనము లేదు. కాని ధ్యానించువారివలె నిర్వ్యాపారముగా నుండుటనుబట్టి వాటియెడల నావ్యవహారము లోకసిద్ధమయినది. కావున ధ్యానమార్గమున నిర్వ్యాపారత్వము అవశ్యకమని తెలినది.

మరికొందరు సాంఖ్యులు, ఆత్మజ్ఞానరూపమయిన సాంఖ్యయోగముచే ఆత్మను దెలిసికొందురు. "సత్వరజస్తమోగుణములకు, వాటివ్యాపారములకు సాక్షిభూతుడై వాటికంటె విలక్షణుడు ఆత్మ" అని చింతించుట సాంఖ్యమనబడును. ఈశ్వరార్పణబుద్ధితో నాచరించెడి కర్మయోగముతో చిత్తశుద్ధి, జ్ఞానప్రాప్తి ద్వారమున మరికొంద రాత్మసాక్షాత్కారమును వడయుదురు. ఇట్లు, "ధ్యానయోగము, కర్మయోగము, జ్ఞానయోగము" అను మూడు నుపాయములు ఆత్మసాక్షాత్కారము విషయమై చెప్పబడినవి. ఇందు, ప్రతిబంధములు లేని సన్యాసికి సాంఖ్యయోగము. వీ డుత్తమాధికారి. ప్రతిబంధములుగల సన్యాసికి ధ్యానయోగము. వీడు మధ్యమాధికారి. సన్యాసికాని వానికి (గృహస్థునకు) కర్మయోగము. వీడు అధమాధికారి అని వివేకము. కొందరు ధ్యానయోగమే ఉత్తమాధికారి విషయమనియు, జ్ఞానయోగము మధ్యమాధికారివిషయ మనియు నందురు.

రామానుజమతము:—

నిష్పన్నయోగులకు ధ్యానయోగమునందును, అనిష్పన్నయోగులకు జ్ఞానయోగమునందును, ఉత్తములకు కర్మయోగమునందును అధికారమని నిరూపించిరి. ఇది యసంగతము. ఉత్తములయిన విద్వాంసులకు సన్యాసమునందే యధికారమని పూర్వమే సిద్ధాంతీకరించబడినది. కర్మయోగము దేహాభిమానమున్నవారలకుగాని తటస్థించదు. సచ్చిదానందలక్షణమగు నిర్వికారాత్మను తెలసికొన్నవానికి దేహాభిమానము లేనందున కర్మయోగ మసంభవము.

అసమాహితచిత్తులకుగూడ జ్ఞానయోగమునం దధికారముండుచో, వింధ్యపర్వతముగూడ సముద్రమున మునిగినట్లే— ఆత్మానాత్మవివేకము, చిత్తసమాధాన

ప్రాప్యకము. ఆత్మవస్తువు చెప్పనలవికానంత సూక్ష్మము. అట్టిదానిని చిత్తవిక్షేపము గలవారు గ్రహింపజాలరు. చిత్తసమాధానములేనివారు బయటనున్న ఘటాదివస్తువులనే కాని గ్రహింపజాలరు. లోపలనున్న ఆత్మవస్తువు నెట్లు గ్రహింతురు? సమాహితచిత్తులయిన వారికిని చిత్తవిక్షేపమనెడి ప్రతిబంధకములు లేనందున ఆత్మసాక్షాత్కారము సులభమగును. అట్టివారలకు యమ నియమాది సాధనములతో గూడిన ధ్యానయోగము శ్రేయస్కరము. ౨౫

శ్లో॥ అన్యే త్వేవ మజానంతః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే
తేఽపి చాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః। ౨౬

అ॥ కొంద రీసాధనోపాయములలో నజ్ఞానివలనను, ఆత్మను దెలిసికొనజాలక గురువులవలన "అహం బ్రహ్మాస్మి" అను నుపదేశమునొంది "ఈ యుపదేశమునే మీ రావృత్తి పరచుకొనుడని" వారియాజ్ఞ దీసికొని శ్రద్ధతో నిరంతర ముపాసించుచు మృత్యువును తరింతురు.

రామానుజ మతము—

ఎవరు ఇతరులవలన కర్మయోగాదికమును విని యుపాసించుచున్నారో, వారుకూడ పరోపదేశ ప్రమాణులయినను మృత్యువును తరింతురు- అని వ్యాఖ్యానించిరి.

ఇది యుచితముకాదు. ఈ వ్యాఖ్యానమున యత్తచ్ఛబ్దము వలన నధ్యాహార మొనర్పవలెను. ౨౬

శ్లో॥ యావత్సంజాయతే కించి త్సత్త్వం స్థావరజంగమమ్
క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగా త్తద్విద్ధి భరతర్షభ॥ ౨౭

అ॥ ఈయధ్యాయారంభమున, క్షేత్రక్షేత్రజ్ఞాభేదజ్ఞానము మోక్షసాధనమని చెప్పబడినది. అందుకు తగినకారణమును యీ శ్లోకమున నిరూపించుచున్నారు. స్థావరజంగమరూపమయిన వస్తుజాతమంతయు క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగమున బుట్టుచున్నది.

అసంగుడయిన క్షేత్రజ్ఞునకు క్షేత్రముతో సంగ మెట్లని యనరాదు? రజ్జుఘటములకు, అవయవసంశ్లేషద్వారా సంయోగమనెడి సంబంధము గలదు. క్షేత్రక్షేత్రజ్ఞుల సంబంధ మట్టిదికాదు. క్షేత్రజ్ఞుడు నిరవయవుడు. త్రాడునకు, కుండకుగల సంయోగసంబంధము, ఘట ఆకాశములకుండదు. ఆకాశము నిరవయవమగుటయే నిందులకు కారణము.

౨. అట్లే మృద్ఘటములకువలె క్షేత్రక్షేత్రజ్ఞులకు సమవాయిసంబంధము కూడ పొసగదు. మృద్ఘటములకువలె క్షేత్రక్షేత్రజ్ఞులకు పరస్పరకార్యకారణ

భావములేదు. "యతోవా ఇమానిభూతాని జాయంతే" అనుశ్రుతి క్షేత్రజ్ఞుడయిన ఈశ్వరుడు క్షేత్రమునకు గారణమని చెప్పుటలేదా యని యందురేమో! అట్లు కాదు; ఆ శ్రుతి, పరిణామ్యుపాదానత్వరూపమగు కారణత్వమును చెప్పుటలేదు. పరిణామ్యుపాదానకారణమునకును కార్యమునకును సమవాయసంబంధ ముండును. ఈశ్వరుడు ప్రపంచమునకు వివర్తోపాదానముగాని, పరిణామ్యుపాదానముగాదు. సర్పాభాసమునకు రజ్జువువలె ఈ రెంటికి లోకములో సమవాయము సంబంధమనను. కాన క్షేత్రక్షేత్రజ్ఞులకు సంయోగసంబంధముగాని, సమవాయసంబంధముగాని లేదు. కనుకనే, "అసంగో హ్యయంపురుషః" అను శ్రుతి పొసగుచున్నది. ఇట్టితఱి క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగమున చరాచరప్రపంచము పుట్టునని శ్రీకృష్ణుడు చెప్పుట శ్రుతివిరుద్ధము, యుక్తిదూరమును గనుక నప్రమాణమని పూర్వపక్షము.

సమాధానము:—

క్షేత్రక్షేత్రజ్ఞులకు అధ్యాసరూపమయిన సంయోగమున్నందున, ప్రకృత గీతావచనమున కెట్టివిరోధమును లేదు. అసంగశ్రుతి విరోధమున్ను లేదు. క్షేత్రజ్ఞుడు సచ్చిదానందరూపుడు. క్షేత్రము అనృతజడ దుఃఖాత్మకము. క్షేత్రమునందు క్షేత్రజ్ఞునకు, నాటి ధర్మములకును పరస్పరాధ్యాస కలదు. నేను దేవుడను, నేను మనుష్యుడను అనునది ధర్మ్యధ్యాస. నేనుసుఖిని నేనుదుఃఖిని అనునది ధర్మాధ్యాస. ఇట్టి యధ్యాస కలుగుటకు కారణము క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క స్వరూపభేదము తెలియకపోవుటయే. రజ్జుశుక్తికాదుల స్వరూపము తెలియనప్పుడే నాటియందు సర్పరజతాద్యధ్యాసలు కలుగుచున్నవి. రజ్జువునందు సర్పము, శుక్తికయందు రజతము కల్పింపబడినట్లు క్షేత్రజ్ఞునియందు క్షేత్రము అవిద్యచే గల్పింపబడినది. ఇట్లు ఆరోప్యాధిష్ఠానములకు సంయోగాది సంబంధము లేకున్నను, అధ్యాసరూపసంబంధ ముండుటచే సద్దాని నాధారపరచుకొని చరాచర ప్రపంచ ముత్పన్నమగుచున్నది.

ఇట్టి యధ్యాసకు భ్రాంతియే లక్షణము. దీనిని నివర్తింపజేసికొనవలెనన్న వేదాంతశాస్త్రమున జెప్పినట్లు క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క స్వరూపభేదమును గ్రహించి క్షేత్రముకంటె క్షేత్రజ్ఞుడు వేరనియు, నిరస్తసర్వోపాధివిశేషుడనియును దెలిసికొనవలెను. దాన మిథ్యాజ్ఞానము నశించి జన్మరాహిత్యము నొందుదురు.

దీనిచే క్షేత్రము క్షేత్రజ్ఞునియందు మాయచే గల్పింపబడినట్లు సూచితమయినది. మాయామయములయిన హస్తిహర్మ్యాది పదార్థములు లేనివయినను, ఉన్నట్లు భాసించుపగిది, క్షేత్రములేనిదయినను ఉన్నట్లు భాసించుచుండును. కాన క్షేత్రాదికము శశశృంగతుల్యముగాదు. బ్రహ్మవలె సత్యమును గాదు. మెలకువచే గలలోనివస్తువులు బాధింపబడినట్లు ఆత్మవిద్యచే క్షేత్రము బాధింపబడుచున్నది. ఇట్లు ప్రతీయమానమగుటవలనను, బాధింపబడుటవలనను, క్షేత్రము

అసత్తు అనికాని, సత్తు అనికాని నిర్వచింపనలవికాదు. కనుకనే మిథ్య యనబడును. గోచరించుచు, బాధింపబడునది మిథ్యయని యర్థము. కావున ప్రత్యగభిన్నమయిన బ్రహ్మమొక్కటే సత్యము. క్షేత్రజాతమంతయు మిథ్యయే. మిథ్యాజ్ఞానము సహా మూలకారణముతో బ్రహ్మజ్ఞానముచే నశించును. అవిద్యాకృతమగు క్షేత్ర క్షేత్రజ్ఞసంయోగముగూడ విద్యచే నివర్తించును. ఆత్మయాథాత్మ్యజ్ఞానమే విద్య, వేదాదిశాస్త్రపాండిత్యము విద్యగాదు. విద్యవలన క్షేత్రము నశించగా, క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగముగూడ నశించును.

కతకరజము నీటియందలి మాలిన్యమును బోగొట్టి తానుగూడ నశించి నట్లు, బుద్ధిరూపమగు విద్య క్షేత్రమును నశింపజేసి తుదకు దానుగూడ నశించును. కాన ఆత్మజ్ఞానికి ద్వైతప్రసక్తి యిసుమంతయులేదు. కనుక అద్వైతము సుస్థిరము.

రామానుజమతము:—

పుట్టినట్టి సత్త్వమంతయు, (వస్తువంతయు) సంయోగమువలననే పుట్టును. సంయుక్తమయియే పుట్టుచున్నది. అని రామానుజులు వ్యాఖ్యానించిరి.

ఇది అయుక్తము. వారిమతమున యావచ్ఛబ్దమునకు సాకల్యమను అర్థమును జెప్పి, తావచ్ఛబ్దమును అధ్యాహార మొనర్చుట గౌరవావహము. దానికి గూడ సాకల్యార్థమును జెప్పుట పునరుక్తము. అయినను ఉత్తరవాక్యమునందలి తచ్ఛబ్దాన్వయమునకు యచ్ఛబ్దమును తప్పక నధ్యాహార మొనర్పవలయును.

నాలవపాదమునందలి తచ్ఛబ్దము జన్మప్రకారమర్థకమని వేదాంతదేశికులు చెప్పినదికూడ యుక్తముగాదు.

మరియు, యావచ్ఛబ్దము యచ్ఛబ్దార్థ మనుటయు తగదు. తచ్ఛబ్ద మునకు ప్రతిద్వంద్వి (విరోధము) గా యావచ్ఛబ్దమును నిర్దేశించుటయే, యావచ్ఛబ్దము యచ్ఛబ్దార్థకమనుటలో బ్రమాణమగుచున్నది. అట్లు నిఘంటువు లుండబనిలేదు. మహర్షి ప్రయోగములే ప్రమాణములు.

కావున "యత్కించి త్సత్త్వం సంజాయతే తత్సర్వం సంయోగాదేవ జాయతే" ఏకొద్దివస్తువు పుట్టుచున్నదో అదియెల్లయు సంయోగమువలననే పుట్టుచున్నది. అని వ్యాఖ్యానించవలయును.

"సంయోగాత్సంజాయతే" అనుదానికి సంయుక్తముయియే పుట్టుచున్నది. అను నర్థముకూడ నుచితముగాదు. ఆ వాక్యమువలన నాయర్థము లభింపనేరదు. సంయోగము సత్త్వమునకు గారణముగా నిర్దేశింపబడినది. అట్లుకానిచో సత్త్వమంతయు క్షేత్ర క్షేత్రజ్ఞ సంయుక్తమయియే పుట్టుచున్నదని చెప్పెడివాడు– ఇంతియె కాని, సంయోగమువలన బుట్టుచున్నదని చెప్పియుండడు.

మరియు, క్షేత్రక్షేత్రజ్ఞసంయుక్తమగుచు బుట్టువస్తువేది? సత్త్వము కాదేరదే. అది సంయోగప్రయోజకములయిన క్షేత్ర క్షేత్రజ్ఞులకంటె వేరుగాదు. ఏది దేనితో గూడియుండునో అది దానికంటె వేరయి యుండజాలదు. కాన క్షేత్ర క్షేత్రజ్ఞులతోగూడి, వాటికంటె భిన్నముగాబుట్టు వస్తువు లేనందున, క్షేత్ర క్షేత్రజ్ఞులతో గూడి సత్త్వము పుట్టుచున్నదను రామానుజవ్యాఖ్యానము సంగతముగాదు.

క్షేత్ర క్షేత్రజ్ఞు లిరువురు పరస్పర సంయుక్తులై పుట్టుచున్నారనుట కూడ నిలువదు. జన్మకు పూర్వమే పరస్పర సంయుక్తులయి సిద్ధించియున్న శరీర శరీరులకు మరల జన్మ మెట్లు? ఇక జన్మకు పూర్వము సూక్ష్మరూపముతో నున్న క్షేత్రక్షేత్రజ్ఞులకు స్థూలరూపము నొందుటయే జన్మమని అనవలయును. అప్పుడు నిర్వికారుడయిన క్షేత్రజ్ఞునకు స్థూలసూక్ష్మత్వవికారము లుండుటెట్లు?

అయితే మీ మతమునమాత్రము (అద్వైతమున) క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగమువలన బుట్టెడు సత్త్వము క్షేత్ర క్షేత్రజ్ఞరూపమా? కాదా? మొదటి పక్షమున జన్మకుపూర్వమే సిద్ధించియున్న ఉభయాత్మకమయినదానికి మరల జన్మ మెట్లు? క్షేత్ర క్షేత్రజ్ఞాత్మకముగాని వస్తువే లోకములో లేనందున రెండవ పక్షమును చెల్లదు. అనినచో చెప్పెదము. ఎనిమిదివిధముల పరిణమించిన ప్రకృతి క్షేత్రము, ఈశ్వరుడు క్షేత్రజ్ఞుడు వీ రిరువురకుగల అధ్యాసికసంబంధమే నిఖిల భూతోత్పత్తికి నిమిత్తము. కేవల ప్రకృతివలనగాని కేవలేశ్వరునివలనగాని ప్రపంచము పుట్టదు. ప్రకృతితో గూడిన పురుషునివలనగాని, పురుషునితో గూడిన ప్రకృతివలనగాని ప్రపంచము పుట్టుచున్నది. కాన ప్రకృతిపురుషసంయోగము సర్వప్రాణ్యుత్పత్తికి నిమిత్తమనునది సిద్ధాంతము.

లేక క్షేత్రమన మూలప్రకృతి. క్షేత్రజ్ఞు డీశ్వరుడు. వారిద్దరిసంయోగమున అహంకారాద్యుత్పత్తిద్వారమున సర్వభూతములు బుట్టును. దేహేంద్రియ సముదాయాత్మకమయిన చరాచరప్రాణిజాతమంతయు క్షేత్రము (ప్రకృతి) యొక్క పరిణామము. ఈయది క్షేత్రజ్ఞునికంటె భిన్నము. క్షేత్రజ్ఞునకు బుట్టుక లేదు. క్షేత్ర పరిణామమంతయు బుట్టును. దీనివలన ప్రకృతి కారణక్షేత్రమనియు చరాచర ప్రాణిజాతము కార్యక్షేత్రమనియు, కార్యక్షేత్రమునందలి చైతన్యాభాసము కార్యక్షేత్రజ్ఞుడనియు, ఈశ్వరచైతన్యము కారణక్షేత్రజ్ఞుడనియును దేలినది. కారణక్షేత్రక్షేత్రజ్ఞులకువలె, కార్యక్షేత్రక్షేత్రజ్ఞులకుగూడ అధ్యాసికసంబంధము గలదు. కారణక్షేత్ర క్షేత్రజ్ఞసంయోగమువలన కార్యక్షేత్రము జన్మించుచున్నదని భావము.

దీనివలన ప్రకృతి, పురుషుడు- వారియుభయసంయోగము, ఈ మూడు భూతోత్పత్తికి నిమిత్తమని సిద్ధించినది. అయితే యిచట నొక్క- ప్రకృతిపురుష

సంయోగముగూడ నే చెప్పబడినదికదా? అని యనరాదు. భూతోత్పత్తికి తత్సంయోగము కారణమయినను. సంయోగమునకు నాకెందుకు కారణమని చెప్పవలయును. లేక, ప్రకృతి తత్సంయోగముద్వారా పురుషుడొక్కడే నిమిత్తము. "యతోవా ఇమాని" అను శ్రుతి ననుసరించి పురుషుడొక్కడే జగత్కారణమని చెప్పబడియుండ, నద్దానిని విడచి ప్రకృతిపురుషసంయోగము జగత్కారణమని చెప్పుటకు గారణము అజ్ఞానమూలకమయిన ప్రకృతిపురుషసంయోగము జగత్కారణమగుటయే యని గ్రహింపవలెను. జ్ఞానమువలన నా సంయోగము నివర్తింప సర్వసంసారనివృత్తియు గలుగును. ॥౨౬॥

శ్లో॥ సమం సర్వేషుభూతేషు తిష్ఠంతం పరమేశ్వరం
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి॥ ॥౨౭॥

అ॥ ఈ శ్లోకమున అవిద్యానివర్తకమగు సమ్యగ్జ్ఞానము భంగ్యంతరముచేఁ జెప్పబడుచున్నది.

ఎల్లభూతములు నశించుచున్నను వానియందు సమానముగానుండి నశించని పరమేశ్వరుని తెలిసికొన్నవాడే వివేకి. దేహేంద్రియాద్యాత్మలకంటె చిదాత్మ గొప్పవాడుకనుక పరమేశ్వరు డనదగును. జన్మాది వికారములుగలవి భూతములు. ఈవికారములు లేనివాడు పరమాత్మ (ఆత్మ). కాన, ఆత్మకు భూత వైలక్షణ్యము సిద్ధించినది. వికారములు సద్వస్తువున కుండును గాని యసద్వస్తువున కుండవు. వస్తువే లేనపుడు దానికి వికారములుండుట యసంభవము. కాన నాశమను నది అంత్యవికారము. దానినొందినదానికి మరి యేవికారమున్ను యుండదు. అయితే గీతలలో శ్రీకృష్ణుడు "ధ్రువం జన్మ మృతస్యచ" అని నశించినదానికిగూడ పునర్జన్మరూపవికారమును జెప్పెనుగదా? కాన నాశము అంత్యవికార మెట్లగును? అని ప్రశ్నింపరాదు.

చల్లారినదీపము మరల వెలుగుచో నశించినవస్తువు మరల పుట్టును. ప్రకృతగీతావచనము దేహముయొక్క జన్మనాశముల ననుసరించి జన్మనాశముల నొందిన జీవునియుద్దేశించి ప్రవర్తించినదిగాని, మరియొకటికాదు.

దేహము నశించి భస్మరూపముతో బుట్టినదనుటకాని, ఘటము నశించి కపాలరూపముతో బుట్టినదనుటకాని వెఱ్ఱిమాట. భస్మమయిన శరీరమునందు పుట్టిన దనువ్యవహారము లోకములో లేదు. దేహముయొక్క ఆకారము బూడిదలో గనిపించునెడల దేహము పుట్టినదని యనవచ్చును. అదియు లేదు. దీపమునందుగూడ చల్లారినదీపము మరల వెలుగుటలేదు. వత్తినుండి మరియొకదీపము (జ్వాల) వెలుగుచున్నది. కాన నాశము అంత్యవికారమేకాని నాశానంతరము మరియొక వికారము

లేదు. అదియే వికారములకు పరమావధి కావున, ఆత్మవస్తువునందు అంత్యవికారమయిన నాశములేదని చెప్పుటచే దానికిముందుండు మిగత వికారములన్నియు లేనట్లు సిద్ధించినవి.

నాశములేదని చెప్పినతరువాత జన్మాదివికారము లావస్తువునకు లేవని వేరుగ జెప్ప నవసరములేదు. ఎప్పుడును పుట్టి కనిపించినవస్తువే కనిపించకుండుట యను నాశమును బొందుచున్నది. కాన ఆత్మ పుట్టదు— నాశములేకుండుటవలన ఏది నాశముకలదియో అదియే పుట్టుచున్నది. ఉ॥ ఘటమువలె అనుప్రమాణముచే గూడ ఆత్మవస్తువునందు జన్మాదివికారములు లేవనునది సిద్ధాంతము.

ఓయి! అయితే భూమ్యాకాశాదులకు జన్మయున్నను నాశము కనిపించుటలేదుకదా? అట్లనా! భూమ్యాకాశాదుల జన్మమాత్రము నీకేమి కనిపించుచున్నది. నీకు కనిపించని భూమ్యాదినాశమునందు నీకెట్లు నమ్మిక లేదో, అట్లే నీకు కనిపించని భూమ్యాకాశాదులజన్మయందుగూడ నమ్మిక లేకపోవుట యుక్తము. అందు కొప్పుకొందువా? భూమ్యాదులకు జన్మలేనందువలననే నాశము కూడ లేదని యంగీకరింపుము.

ఇక శాస్త్రప్రమాణమునుబట్టి నిర్ణయింపదలచినచో "ఆత్మన ఆకాశస్సంభూతః" ఇత్యాది శాస్త్రమువలన, భూమ్యాకాశాదులకు జన్మమును "యత్ప్రియం త్యభిసంవిశంతి" అనుశాస్త్రమువలన నాశమును గ్రహించుము.

కావున శ్రుతివాదమునుబట్టికాని యుక్తివాదమునుబట్టికాని జన్మనాశములయొక్క సమానాధికరణ్యమునకు భంగ మెన్నటికిని లేదు.

ఇట్లు ఆత్మయందు నాశములేనందున జన్మలేకపోగా మధ్యనుండు సత్తావృద్ధ్యాదులు (వికారములు) గూడ లేవనుట నిర్వివాదమయినది.

ఓయి! వృద్ధిపరిణామ అపక్షయాది వికారములు జన్మపూర్వకములయినను, సత్తారూపవికారముమాత్రము జన్మపూర్వకము గాదు. అయ్యది జన్మరహితమయిన బ్రహ్మయందుగూడ గలదు. అనినచో నట్లుకాదు.

దేహాదులు జన్మకు లేవు. వాటియం దపుడు సత్త యనువికారమున్ను లేదు. జన్మానంతరమే దేహాదులయందు సత్తావికార మేర్పడుచున్నది. కాన నీయది జన్మవికారపూర్వకమే యగును. బ్రహ్మకు జన్మలేనందున బ్రహ్మయందలి సత్తా జన్మపూర్వకముగాదు. అయ్యది కాలత్రయాబాధ్యమయిన సత్తా.

మరియు, దేహాదులయందలి సత్త్వము ఇంద్రియగోచర మగుచున్నది. కాన వీటియందలి సత్త వికారరూపము. బ్రహ్మయందలి సత్త్వమ ట్లింద్రియగోచర మగుట లేదు. కాన నయ్యది వికారరూపముగాదు. కావున నిట్లు నిర్వికారుడయిన పరమేశ్వరునకు (పరమాత్మకు) సర్వభూతవైలక్షణ్యము నిర్వివాదము.

ఓయి! ఇట్టి పరమేశ్వరుడే ఆత్మ. ఆత్మ యెల్లరకు నిత్యాపరోక్షము. ఆత్మ యన తానే యగుటచేత నెపుడు పరోక్షము గాదు. కాన నిట్టి పరమేశ్వరుని యెల్లరు తెలిసికొనుచునేయున్నారు. ఇట్టివాని నేరిని తెలిసికొన్నవాడే వివేకి. అని శ్రీకృష్ణుడు క్రొత్తగ జెప్పనేల?

నిజమే. అందఱు పరమేశ్వరుని తెలిసికొనుచునే యున్నారు. కాని విపరీతముగా గుర్తించుచున్నారు. విపరీత దర్శనములేని వానిని శ్లాఘించుటకు శ్రీకృష్ణు డిచట క్రొత్తగ జెప్పెను.

లేక, ఆత్మను అభిన్నముగ తెలిసికొనినవాడే పరమాత్మను గుర్తించిన వాడు. భేదజ్ఞానముగలవాడు పరమేశ్వరుని గుర్తించువాడు. చంద్రు డొక్కడని తెలిసికొన్నవాడే చంద్రునిగుర్తించినవాడు. చంద్రులనేకులని యనుకొనెడువాడు చంద్రుని గుర్తించినవాడుగాడు. కావున ఏకచంద్రదర్శి గొప్పవాడు. అట్లే అద్వితీయాత్మదర్శి శ్రేష్ఠుడు. ఆత్మయందు ఉపాధివలనగూడ భేదదృష్టి కూడదు. స్వతస్సిద్ధముగ భేదదృష్టి కూడదని వేరుగ జెప్పనేల? కావున అవిద్యామోహితాంతః కరణులకే ఆత్మభేదబుద్ధియు, ఆత్మసంసారియనెడు బుద్ధియు, ఆత్మ యీశ్వరుని కంటె వేరనుబుద్ధియు, అనాత్మయందాత్మబుద్ధియు గలుగునని భావము.

**రామానుజమతము:—**

నిఖిలభూతములయందు దేవాదివిషయాకారములకంటె వేఱయి తదీయ దేహేంద్రియమనస్సులగూర్చి పరమేశ్వరుడుగ నుండి అన్నిటిని సమానముగ దెలిసికొనుచు, దేహాదులు నశించుచున్నను తానుమాత్రము నశించుట స్వభావము లేనివా డయినందున నశించకుండనున్న పరమేశ్వరుని తెలిసికొన్నవాడు యథార్థమయిన ఆత్మను తెలిసికొన్నవాడు అని వ్యాఖ్యానించిరి. వీరి వ్యాఖ్యానమును వివరించుటకు వారి భాష్యమునందలి సంస్కృతవాక్యముల నుదాహరించుట యావశ్యక మయినది. కనుక వాటిని ముం దుదాహరించి యావల దానిపై విమర్శను జూపుదము. "ఏవ మితరేతరయుక్తేషు సర్వేషు భూతేషు దేవాది విషయాకారాద్వివిక్తం తత్ర తత్ర తద్దేహేంద్రియ మనాంసిప్రతి పరమేశ్వరత్వేన స్థితం ఆత్మానం జ్ఞాతృత్వేన సమానాకారం, తేషు దేహాదిషు వినశ్యత్సు వినాశానర్హ స్వభావేన అవినశ్యంతం యః పశ్యతి స ఆత్మానం యథావస్థితం పశ్యతి" అని వారిభాష్యము.

ఇందలి సారాసారముల విచారింతము.

"సమం సర్వేషుభూతేషు తిష్ఠంతం" అని శ్లోకము. ఇందు "సర్వేషు భూతేషు, తిష్ఠంతం" అను మూడుపదములు ఏకవాక్యత జెందియున్నవి. ఇట్టియెడ సర్వేషు భూతేషు దేవాది విషయాకారాద్వివిక్తం" అని "తత్తద్దేహేంద్రియ

మనాంసిప్రతి పరమేశ్వరత్వేన స్థితం” అనియు రెండువాక్యములుగ వ్యాఖ్యానించుట ప్రమాణరహితము.

మరియు “దేహాదివిషయాకారాద్విభక్తం” అనుపదమును అధ్యాహారము చేయుటకూడ న్యాయముగాదు.

“సర్వేషుభూతేషు” అనుపదమును మూడువిధములు ఆవృత్తిపరచుటలో ప్రమాణమును గానము.

(1) “సర్వేషుభూతేషు విభక్తం” (2) “సర్వేషు భూతేషు స్థితం” (3) సర్వేషుభూతేషు వినశ్యత్సు అవినశ్యంతం” అని చెప్పుట తగదు.

“పరమేశ్వరం” అను మూలములోని పదమునకు “శ్రోత్రాదీంద్రియ మనాంసిప్రతి పరమేశ్వరత్వేన” అనగా దేహేంద్రియమనస్సులకు పరమేశ్వరుడుగా నున్న– అని వ్యాఖ్యానమొనర్చుట మూలము నతిక్రమించి యనేకపదముల గల్పించుట యనుచితము. మరియు విశేష్యముయిన పరమేశ్వరపదమును విశేషణ మొనర్చుటయు “ఆత్మానం” అనుపదమును అధ్యాహారముచేయుటయు నిష్ప్రమాణము.

అట్లే “సమం” అనుపదమును “జ్ఞాతృత్వేన సమానాకారం” (తెలిసికొనుటతో సమానాకారముగానున్న) అని వివరించుటయు, బహుపదకల్పనముతో గూడినందున నుచితముగాదు.

మరియు, సూత్రప్రాయమయిన శ్లోకమును వివరించుటకు మూలము నతిక్రమించి యనేకపదముల గల్పించుటయు న్యాయముగదని యనరాదు. అట్టి కల్పనము లేకున్నను పదాన్వయము కుదురుచుండుటచేత నీకల్పన శబ్దము వలనను, అర్థమువలనను న్యాయముకాదు. ఎట్లన ఆత్మ దేహాదివిషయాకారములతో గూడి యున్నచో నపుడు వాటికంటె విభక్తుడని చెప్పుట రామానుజుల కసంగతమే యగును.

ఆస్తికుడైనను– ఆత్మ దేహాదులకంటె వేరని, కర్త, భోక్త అని తెలిసికొని బౌద్ధునివలె మరల యాత్మకు పరిణామములు కలవాడని యనుకొనడు. “మమ దేహః” నాదేహము అనియే యనుకొనును. ఒకానొక యింటిలో నున్న బౌద్ధుడు యింటికంటె వేరయినను, ఇంటియందు “నాయిల్లు” అని యభిమానము నొందును. అట్లే ఆస్తికుడుగూడ నాదేహమని యనుకొనును. ఈ యభిమానము ఆత్మ దేహాది విషయాకారముకంటె విలక్షణుడని యుపదేశించినంతమాత్రమున తొలగదు. బౌద్ధునకు ఇంటియందలి మమత్వము తొలగినదా? ఇక దేహాదులగూర్చి పరమేశ్వరుడను వాదము యింతకుమున్నె నిరాకరింపబడినది.

ఆత్మజ్ఞాతృత్వముతో సమానాకారుడని వివరించుటకూడ నిలువనేరదు. ఈ సమానాకారత అనాత్మలతోనా? ఆత్మలతోనా? పరమాత్మతోనా? జడములయిన

అనాత్మలందు జ్ఞాతృత్వమే లేనందున వాటితో సమానాకారత కుదరదు. ఇక రెండవ పక్షమున ఆత్మ తానే కాన, తనతో తనకు సమానాకారత చెల్లదు. మూడవ పక్ష మవలంబించినచో, పరమాత్మయందలి సర్వజ్ఞత్వరూప జ్ఞాతృత్వమునకు జీవునియందలి కించిద్జ్ఞత్వ రూప జ్ఞాతృత్వమునకు భేదముండుటచే నీ యిరువురి జ్ఞాతృత్వమునకు సామ్యమే లేదు.

ఇక ఆత్మలలోనే పరస్పరము ఒకానొకని జ్ఞాతృత్వమునకు మరియొకని జ్ఞాతృత్వముతో సమానాకారతయున్నచో నదిమాత్రి మెట్లు పొసగును. ఆత్మలలో అనేకత్వము లేదుగదా? కనుకనే "ఆత్మానం అని చెప్పియుండెను. అయ్యది జాత్యేకవచన మనదగదు. ఆత్మకు జాతియనునదే లేదు.

ఒకవేళ అజ్ఞానవశమున ఆత్మభేదముండుగాక, అయినను ఆత్మలకు పరస్పరము జ్ఞాతృత్వసామ్యము కుదరదు. ఒకడు తర్కము తెలిసినవాడు, మరియొకడు వ్యాకరణము తెలిసినవాడు. వీరిద్దరి జ్ఞాతృత్వమునకు సామ్య మెట్లు పొసగును ?

ఇక జ్ఞానమాత్రమే జ్ఞాతృత్వమన్నచో అపుడు నిరుపాధికమగు జ్ఞానమునకు భేదము లేనందున జ్ఞానరూపుడయిన ఆత్మకు ఏకత్వమే సిద్ధించినది. మరియు నీ శ్లోకవ్యాఖ్యాన సందర్భములో వేదాంతదేశికు లిట్లనిరి.

క్షేత్రాకారముగ పరిణమించిన ప్రకృతి యనేకముగాన ఆయా శరీరములతో గూడిన పురుషులుకూడ ననేకులు. వారియెడల వేర్వేరుగ సుఖ దుఃఖములు కనిపించుచున్నవి. ఆత్మ నిరవయవుడయినను యుతసిద్ధములయినవాటికుండెడి సంయోగసంబంధము నిరవయవుడయిన ఆత్మయందుగూడ నుండును. నిరవయవములకు, నిరవయవ సావయవములకు, కేవల సావయవములకును సంయోగము సంభవించును. ఆత్మయం దధ్యాసలక్షణమయిన సంబంధము కుదరదు– అని యనిరి.

ఇదియంతయు అనుపపన్నము. యుతసిద్ధములయిన సావయవపదార్థములకే సంయోగ సంబంధము. నిరవయవములకు, నిరవయవ సావయవములకును సంయోగముండదు. "కపినా వృక్షస్సంయుక్తః" కోతితో చెట్టు కలిసియున్నది. అనివలె "ఆకాశేన వృక్షస్సంయుక్తః" ఆకాశముతో చెట్టు కూడియున్న దను ప్రతీతి లోకములో లేదు. మరియు ఘటాకాశము మహాకాశముతో గూడియున్న దను ప్రతీతియు లేదు.

ఇక, ఆకాశము విభువనియు, విభుత్వ మన సర్వమూర్త ద్రవ్యసంయోగిత్వమనియు, కావున నిరవయవమయిన ఆకాశమునకు మూర్తపదార్థములతో సంయోగము కలదనియు, అట్లే "ఆత్మా మనసా సంయుజ్యతే" "మనఇంద్రియేణ" అను ప్రతీతులనుబట్టి నిరవయవమయిన ఆత్మకు, నిరావమయిన మనసుతో

సంయోగము కలదనియును ననరాదు. దృష్టాంతము [illegible]. [illegible] శాస్త్రము ప్రమాణము గాదు. కనుకనే దానిని చదివినవారు [illegible] స్మృతి కలదు.

మరియు, ఆత్మకు మనస్సంగమును ప్రతిపాదించుట "అసంగోహ్యయం పురుషః" అను శ్రుతి విరుద్ధము. "ఘటాకాశములు సంయుక్తములు" అను ప్రతీతి లేకుండుటచే, మూర్తామూర్తద్రవ్యసంయోగత్వరూప విభుత్వము ఆకాశమునకు [illegible].

ఇట్లే క్షేత్రక్షేత్రజ్ఞులకు [illegible] సమవాయసంబంధము గూడ [illegible]. [illegible] క్షేత్రజ్ఞునియందు క్షేత్రరూపవిశేషము [illegible] యమునందును లేదు. [illegible] క్షేత్రమునుండి క్షేత్రజ్ఞునకు విభాగము [illegible]. దీనికి [illegible] చెప్పజాలరు. "ప్రకృతి వియుక్తమైన ఆత్మను పొందుదురని [illegible] చెప్పియుండిరి.

కనుక అసంగుడయిన ప్రత్యగాత్మకు [illegible] సంబంధము [illegible] రూపమునదప్ప మరెవ్విధమునను సంభవించనందున ఆత్మకు అద్వితీయత్వము సుస్థిరము. అనేకత్వబుద్ధి యధ్యాసకల్పితమే.

రజ్జువునందు సర్పమునకువలె ఆత్మయందు సంసారాధ్యాస సంభవించును. దృష్టాంతమున దృశ్యమునందు భ్రమ కలుగుచున్నది. దార్ష్టాంతికములో ద్రష్టయందే దేహాదిభ్రమ యెట్లు చెప్పెదరు? నిజమే. మేము ద్రష్టయగు క్షేత్రజ్ఞునకు ఆత్మయందు అనాత్మభ్రమయని చెప్పము. మరేమనిన ప్రమాతకు ఆత్మయందనాత్మభ్రమయని మేమందుము. నిజస్థితిలో ప్రమాతయే క్షేత్రజ్ఞుడు. అయినను సంసారమున్నంతవరకు ప్రమాత తాను క్షేత్రజ్ఞునికంటె వేరనియే తెలిసికొనుచుండును. జ్ఞానదశలోనే ప్రమాతకు క్షేత్రజ్ఞస్వరూపము. అవిద్యావస్థలో సంసారిత్వమే. కాన ప్రమాతకు సంసారమున్నంతవరకు అనాత్మభ్రమము యుక్తము.

మరియు వేదాంతదేశికులు "అవినశ్యంతం" అను విశేషణము జీవపరముగ నన్వయించునుగాని యీశ్వరపరముగ నన్వయించదనియు, దేహాభిమానము గల మానవులు (జీవులు) నశింతురనియు తలంతురుగాని యీశ్వరుడు నశించునని తలంచరు. ఈశ్వరునకు నాశప్రసక్తియే లేనందున దానిని నిషేధింపబనిలేదు. అనియును వ్యాఖ్యానించిరి.

ఇదియు ననుచితము. శాస్త్రవిచారమునం దాస్తికులే యధికారులు. నాస్తికులు కారు. ఇందు వివాద లేదు. ఆస్తికులు ఆత్మ దేహాదివిలక్షణుడు, నిత్యుడు అని తలంతురు. అట్టి తలంపు వారికి లేనిచో స్వర్గఫలానుభవముకొరకు యజ్ఞాదులయందు వారికి ప్రవృత్తియే కలుగదు. పితౄనులగూర్చి శ్రాద్ధాదు

లున్ను జరుగవు. కాన జీవునియందు నూతనము నాదవ ప్రసక్తి యేది? దేహనాశము వల్ల జీవనాశమును పొందుచుండిన వారీశ్వరులని యనుకొనుచున్న రామకృష్ణుల కూడ దేహనాశము కలిగియున్నందున ఈశ్వరుడుగూడ నశించునని వారేల ననుకొనరు? నాస్తికులీశ్వరుని యంగీకరించరు కాన వారిదృష్టిలో ఈశ్వరుని నిత్యమను భావనే లేదు. కనుక ఈశ్వరునియందువలె జీవునియందుగూడ నాశ ప్రసక్తి లేక పోవ లేదని చెప్పనొప్పును.

కనుకనే "అవినశ్యంతం" అను పదమునకు నిర్వికారత్వమును ప్రతిపాదించుటలో తాత్పర్యమని యనెదె. ఆచార్యపాదులు షడ్భావ వికారములవలె సుఖదుఃఖాది వికారములుగూడ ఆత్మకు లేవని చెప్పుట యుచితము. ఆస్తికులు ఆత్మయందు కర్తృత్వాది వికారములు కలవని భావింతురు. కాన "అవినశ్యంతం" అను పదముచే ఆత్మ నిర్వికారుడని నిరూపించుట యావశ్యకము. కనుక నిర్వికారుడు, అసంసారి యగు క్షేత్రజ్ఞుడు యీశ్వరుడే. వేరుకాదు.

శ్లో॥ సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థిత మీశ్వరం
నహి నస్త్యాత్మనాత్మానం తతో యాతి పరాంగతిమ్. ౨౮

అ॥ అజ్ఞానులు తమను తాము చెరచుకొందురు. (చంపుకొందురు) భేద దృష్టియే వారికి నాశకారణము. ఇట్టివారు నరకరూపమున 'అంధఃతమః ప్రవిశంత్యే కే నాత్మహనో జనాః' అను శ్రుతి చెప్పుచున్నది. జీవేశ్వరభేదము గలవారే ఆత్మహంతకులగుచో నిక నిరీశ్వరవాదులగు సాంఖ్యులకు దేహాత్మవాదులగు బౌద్ధులకు గతియేమి?

ఓయి! ఎంతమూర్ఖులయినను తనను తాను చంపుకొనడు. తనయందు తనకు ద్వేషముండదు. తనసుఖమున కడ్డుతగిలిన పరునియందే యిందరకు ద్వేషము కలుగును. తన సుఖముకొరకు మానవులు పశ్వాదుల హింసింతురు. ఇంతియెకాని తమకొఱకుగాని యితరులకొరకుగాని తమను జంపుకొనరు. ఇట్లుండ శ్రీకృష్ణు డిచట అప్రసక్త మయిన ఆత్మహింసనమును నిషేధించనేల? ఈ నిషేధము "నేలమీద అగ్నిచయనము చేయకూడదు. ఆకాశమున చేయకూడదు" అనుదానివలె నున్నది. ఆత్మ హత్యానులయందుగూడ దేహమునకంటె భిన్నుడే దేహమును హింసించుచున్నాడుగాని తనను తాను హింసించుకొనుట లేదు. కావున నిది యెట్లు పొసగును, అని పూర్వపక్షము.

సిద్ధాంతము:—

జీవుడు, అనాత్మయయిన స్థూలదేహమును ఆత్మగా దలచి పుణ్యాపుణ్యముల నాచరించి మరల యా దేహమును ఫలానుభవముచే జంపుకొని సంచిత

కర్మచే క్రొత్తదేహమును మరల బొంది దాని నాత్మగాదలచి దానితో ధర్మాధర్మముల నాచరించుచు కర్మఫలానుభవముతో దానిం జంపుకొని సంచితముతో మరల నూతనదేహముల బొందుచుందురు. ఇట్లు ఆత్మగాదలచిన అనాత్మయగు దేహమును జంపుకొనుచున్నందున జీవు లాత్మహంత లగుచున్నారు. అనగా జీవుడు పుట్టడు, చావడు. కాని మూఢజనుడు దేహముకంటె ఆత్మ వేరని యెరుగడు. దేహమే ఆత్మ యనుకొనును. కనుకనే నేను లావు, నేను సన్నము, నేను రోగిని, నేను ముసలిని, నేను మనుష్యుడను అని యనుచున్నారు.

ఇట్టి దేహాత్మాభిమానమువలననే రాజ[illegible]చే దేహాత్మను జంపుకొనుటకు మూర్ఖులు ఉరిచ్ఛేద జలాగ్నిపాతాదులను చేయుచున్నారు. కాన నంతటను లోకవ్యవహారములో దేహాత్మఘాతుకులే ఆత్మహంతలని స్పష్టము. ఇట్లు ఆత్మహింసనము లోకప్రసిద్ధము.

ఈయది శాస్త్రప్రసిద్ధముగూడ నగుచున్నది. శాస్త్రము కృతవిప్రణాశ అకృతాభ్యాగమదోషములను బాపుకొనుటకు ధనికత్వ దరిద్రత్వాది భోగవైచిత్ర్యములను నిర్వహించుకొనుటకొరకును పూర్వోత్తర జన్మలను సూచించినది. ఆ జన్మలు కర్మాధీనములు. కర్మ కర్త్రధీనము. ఆకర్త దేహాత్మయే. దేహమే స్నానపానాది కర్మలయందు వ్యాపించుచున్నది. ఇంద్రియాత్మ, మనఆత్మ, బుద్ధ్యాత్మలు దేహాత్మకు సహాయకారులు. ఈ దేహాత్మ ఫలానుభవముతో ప్రారబ్ధకర్మను నశింపచేసికొని ఇతరదేహమునకు కర్మనాచరించుచు నీదేహాత్మను ఉత్తరజన్మలో ఫలానుభవముతో నశింపచేయుచున్నాడు. ఇది యనాదికాలమునుంచి జరుగుచున్న నాటకము.

అయితే, దేహమును ఆత్మగా గ్రహించినను నిజస్థితిలో దేహ మనాత్మ కనుక దానిని హింసించిన జీవులు అనాత్మహింసకు లగుదురుగాని ఆత్మహింసకు లెట్లగుదురని మీరడుగవచ్చును. కాని యనాత్మలగు దేహాదులయందు ఆత్మాభిమానముచే పరమార్థసత్యమయిన ఆత్మకు కూడ హాని కలుగుచున్నది. ఎట్లన జీవులకు దేహాత్మాభిమానముచే పరమార్థముగానున్న సచ్చిదానందాత్మ అజ్ఞానావృతుడయి అనుభవగోచరు డగుటలేదు. ఆత్మానందము నిచ్చుటలేదు. లేనివాని వలె నిరర్థకుడగుచున్నాడు. ఇట్లు సచ్చిదానందాత్మను లేనివానిగజేసి నిరర్థక మొనరించిన అజ్ఞానులగు జీవులు ఆత్మహంతలనుట వింతకాదు. వీరు దేహాత్మను ప్రత్యగాత్మను యుభయులను హింసించుచున్నారు. మరియు వీరియెడల ఆత్మకు సంసారబంధ మేర్పరచుట జీవేశ్వరులకు భేదము నేర్పరచుట మనుష్యజన్మ మెత్తి జ్ఞానముండికూడ అజ్ఞానమును బోగొట్టుకొనలేకపోవుట మొదలగు ననేక దోషము లున్నవి.

కాన నెల్లదేహములయందును యీశ్వరుడు సమానముగా నుండెనని గ్రహించినవాడు ఆత్మహింసకుడు గాడు. ఇట్టివాడు ముక్తినొందును. ॥౨౯॥

శ్లో॥ ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః
యఃపశ్యతి తథాత్మానం అకర్తారం స పశ్యతి॥ ౩౦

అ॥ వాఙ్మనఃకాయములచే జేయబడుకర్మలు ప్రకృతిచే జేయబడుచున్నటుల యెవడు తెలిసికొనునో అట్లె ఆత్మకు కర్తృత్వాదివికారములు లేవని యెవడు గుర్తించునో వాడు పరమార్థజ్ఞాని. ప్రాకృతగుణములు ఆత్మకు సంబంధించవు కాన గుణకర్మభేదమువల్ల ఆత్మకు భేదముండదు. ప్రకృతిని దానిధర్మములను ఆత్మయం దారోపించుకొని ఆత్మ కర్త, భోక్త యని ద్వైతులగు తార్కికాదు లందురు. ఈయది అజ్ఞానవిలసితము. అద్వైతమే పరమార్థము. ॥౩౦॥

శ్లో॥ యదా భూతపృథగ్భావ మేకస్థ మనుపశ్యతి
తతఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా. ౩౧

అ॥ విద్వాంసు డెప్పుడు వేర్వేరుగ గనిపించు భూతములన్నియు అద్వితీయుడగు ఆత్మయం దున్నటుల దెలిసికొనునో, అనగా "ఆత్మైవేదం సర్వం" ఈ ప్రపంచమంతయు ఆత్మయే." అని యాత్మసాక్షాత్కారమును జేసికొనునో అట్టి ఆత్మనుంచియే నిఖిలభూతములు బుట్టి విస్తరించుచున్నవని యెవడు గుర్తించునో వాడు బ్రహ్మభావము నొందును. "ఆత్మనుంచి ప్రాణము, ఆత్మనుంచి మనస్సు, ఆత్మనుంచి ఆకాశము, ఆత్మనుంచి మన్మథుడు, అగ్ని, నీరు, అన్నము, సర్వము ఆత్మనుంచి పుట్టి చచ్చుచున్నటుల శ్రుతులు చాటుచున్నవి. కాన సర్వము ఆత్మయందున్నటుల దెలిసికొనువాడు బ్రహ్మభావము నొందుట సుస్థిరము.

రామానుజ మతము :—

భూతములయొక్క దేవత్వ, మనుష్యత్వ, హ్రస్వత్వ దీర్ఘత్వాది భేదము ప్రకృతివలన నేర్పడినదికాని ఆత్మకు సంబంధించినది కాదనియు, ప్రకృతివలననే ఉత్తరోత్తర పుత్రపౌత్రాది భేదవిస్తారము పెరుగుచున్నదనియును గుర్తించువాడు బ్రహ్మను బొందును. అని రామానుజులు వ్యాఖ్యానించిరి. ఈయది నిస్సారము.

ప్రకృతిపరిణామమయిన భూతములయందే దేవత్వ, మనుష్యత్వ, హ్రస్వత్వ దీర్ఘత్వాదులు గలవుకాని యాత్మయందు లేవని తెలిసికొనినచో యిష్టసిద్ధియగుచుండ "నివి ప్రకృతగతము లని" యనుసంధానము చేయుటలో ఫలమేమి? మరియు ఆధునికప్రపంచమంతయు ప్రకృతి పరిణామమని యనుకొనుటకంటె పుత్రపౌత్రాది ప్రపంచానుసంధానమున నొరగెడు ఫలమేమి ?

**మరియు, మీామతమున ఆత్మ యణువగుటచే పరిచ్ఛిన్నుడగును. ఇట్టివాడు**

అపరిచ్ఛిన్నమయిన ఆత్మను బొందుట విరుద్ధము. ఇక ఆత్మ సంసారదశలో అణు వనియు, మోక్షదశలో విభువనియు నంగీకరించుట అన్యాయము. సవికారత్వమను దోషము నంగీకరించినట్లగును. దీనివలన ఆత్మ కనిత్యత్వ మేర్పడును.

మరియు సంసారదశలో ఆత్మను పరిచ్ఛేదకరము బుద్ధియనెడి యుపాధి మోక్షదశలో లేనందున ఆత్మ విభు వగుచున్నాడో అప్పుడాత్మకు అణుత్వము ఔపాధికముగాని సహజముగాదని తేలినది. కాన జీవుడు విభుడేయగును. విభుడగుచో నీశ్వరుడగుట కడ్డులేదు. జీవుడు యీశ్వరునివలె విభువుగాని యీశ్వరుడుగాని యనరాదు. ఒక్కనికె వ్యాపిత్వము సంభవించునుగాని యనేకులకు వ్యాపిత్వము సంభవించదు. అనేకులున్నపుడు అందరికి వ్యాపిత్వముండదు. కాన రామానుజ సిద్ధాంతము పొసగదు. ॥ ౩౦ ॥

శ్లో॥ అనాదిత్వాత్ నిర్గుణత్వాత్ పరమాత్మాయ మవ్యయః ।
శరీరస్థోపి కౌంతేయ! న కరోతి న లిప్యతే ॥ ౩౧ ॥

లోకములో మృదాదికారణముగల ఘటాదిద్రవ్యములు తంత్వాద్యవ యవములుగల పటాది ద్రవ్యములును కొంతకాలమునకు స్వరూపనాశమును జెందు చున్నది. ఆత్మ కారణముగలవాడుగాడు (కార్యముగాడు), సావయవుడును గాడు. అందువలన వికారమును జెందడు. ఏది కార్యమో ఏది సావయవమో అది నశించునను నియమము కలదు. దానికెందును భంగముండదు. దీనివలన పుట్టుటయను వికారము నొందిన ఆకాశాదులు సావయవము లనుటలో వివాదములేదు.

ఓయి! ఆకాశము పుట్టుక కలదయినను (కార్యమయినను) నిరవయవ మగుచున్నది. దానికి నిరవయవమను ప్రతీతి కలదు. కనుకనే భాష్యకారులుకూడ నొకానొకపుడు "ఆకాశమువలె ఆత్మ నిరవయవుడగుటవలన" (ఆకాశావ న్నిరవ యవత్వాత్ ఆత్మనః) అని చెప్పిరి. కనుక కార్యములు సావయవములను నియ మము నిలువనేర దనినచో- నట్లు కాదు.

ధాన్యముపోయని కుండలో నెంతటియవకాశము (ఆకాశము) కలదో అంతటి యవకాశము ధాన్యమున్నకుండలో గనిపించదు. అదేకుండలో నిండా ధాన్యముపోసి నింపినచో ఆకాశము (అవకాశము) బొత్తుగా కనిపించదు. ఇట్లు వట్టి కుండలో పూర్తియాకాశము, సగము ధాన్యమున్న కుండలో సగము మాత్రమే యవకాశము, నిండా ధాన్యమున్న కుండలో బొత్తుగా (ఆకాశమే) అవకాశమే లేకుండుట మూడురకముల ననుభవమున్నది. ఈయది ఆకాశముయొక్క సంకోచ వికాసము లనదగును. అవయవరహితమయిన ఆకాశమున కిట్లు సంకోచవికాసము లుండవు. కాన ఆకాశము సావయవము. ఇదేచందమున మఠాకాశ, గృహాకాశ ములుగూడ సావయవములు. ఈ సంకోచవికాసములు అవకాశమునవికాని ఆకా

శముగనే కావని భ్రమించవలదు. అవకాశమే యాకాశము. ఈ రెంటికిని భేదము లేదు. సావయవము కనుకనే శ్రుతి యాకాశము పుట్టునని చెప్పినది. భాష్యకర్తలు వేదాంతాభిప్రాయముతో నాకాశము నిరవయవమని చెప్పిరి. ఆకాశము నిరవయవమగుచో దానికి ఘటాదులతో పరిచ్ఛేదముండదు. “ఘటావచ్ఛిన్నాకాశము” “మఠావచ్ఛిన్నమాకాశము” అని ఘటమఠాది పరిచ్ఛేద మాకాశమునకు ప్రతీతితో నున్నది. ఇదేన్యాయమున అహంకారాది పరిచ్ఛేద మాత్మకున్నందున ఆత్మ మాత్రమేల సావయవుడు గాడు? అని మీరు అడుగవచ్చును. అహంకారాదులు అధ్యాసముచే కల్పితములు. కల్పితవస్తువులతో పరమార్థవస్తువునకు పరిచ్ఛేద ముండదు. భ్రాంతిసిద్ధమయిన సర్పముతో రజ్జువునకు పరిచ్ఛేదము లేదు. ఎండమావులతో భూమికి పంకిలత్వము లేదు. కావున ఆత్మ అపరిచ్ఛిన్నుడు, నిరవయవుడు, అనాది, నిర్వికారుడు. ఆకాశాదికము పరిచ్ఛిన్నము, సావయవము, సాది, సవికారము. భూతలముమొదలు బ్రహ్మాండముయొక్క పైకపాలమువరకు వ్యాపించియుండు మహాకాశముకూడ భూతల బ్రహ్మాండోర్ధ్వకపాలములతో పరిచ్ఛిన్నమే యగుచున్నది. కనుకనే సావయవము, సాది, సవికారమును, దృశ్యము, అనాత్మయు నగుచున్నది. అట్లుకానిచో ఆధునికాచలమతశీతిన ఆకాశమే యాత్మయగును.

ఓయి! సావయవమగు ఆకాశము ఘటాదులతో సంయోగించుట కభ్యంతరములేదు. ఇట్టితేటి లోకములో ఘటసంయుక్త మాకాశము, ఆకాశసంయుక్తము ఘటము– అను ప్రతీతు లేల లేవు? భూతలము ఘటసంయుక్తము అని ప్రతీతి కలదుగదా? అనినచో వినుము. ఆకాశము అతిసూక్ష్మము. దాని అవయవములును అంతకంటె సూక్ష్మములు. కనుక ఆకాశావయవములకు ఘటావయవ సంయోగము అత్యంత దుర్విజ్ఞేయము. అందువల్లనే ఆకాశము సావయవము, ఘటసంయుక్తము అను వ్యవహారము లోకములో లేదు. దీనిని పురస్కరించుకొనియే భాష్యకారులు ఆకాశము నిరవయవ మనిరి. కావున ఆకాశము లోకదృష్టిలో నిరవయవముకాని శాస్త్రదృష్టిలో సావయవమేయగును.

అయితే నిరవయవుడగు ఆత్మకు దేహేంద్రియాదిసంబంధము లేదనుటకు దృష్టాంతమెద్ది? దృష్టాంతములేని వస్తువు అంగీకరింపదగదుకదా? ఆకాశముకంటె వేరువస్తువు నిరవయవ మనదగిన దెద్దియు లేదుకదా? నిజమే, మీరుచెప్పినదానికి నన్వయదృష్టాంతము లేకున్నను వ్యతిరేకదృష్టాంత మున్నది. ఏదృష్టాంతమున్నను వస్తువు (విషయము) పరిగ్రాహ్యామే యగును.

ఇట్లే ఆత్మ నిర్గుణుడగుటవలనగూడ నవ్యయుడు. అందువలన నిట్టియాత్మ శరీరమందున్నను యేపనిచేయువాడు గాడు. వానిఫలమును బొందువాడును గాడు. కర్మచేయనివానికి ఫలానుభవము అసంభవము. ఫలానుభవములేనివానికి వికారము

లుండవు. అవికారుడుకనుకనే శరీరాది దోషము లెవ్వియు నంటవు. కాన ఆత్మ అకర్త, అభోక్త, నిర్వికారుడు, నిర్గుణుడు, అనాది, యద్వితీయుడును. ఈయది సిద్ధాంతము.

అయితే దేహమునందున్న ఆత్మ చేయడు, అనుభవింపడు సరే! చేయువాడును అనుభవించువాడును మరెవ్వడు? ఎవ్వడైన మరియొకడు చేయువాడు కలడా? లేడా? మరియొకడున్నచో "క్షేత్రజ్ఞంచాపి" అను గీతావచనమునకు విరోధము లేనిచో నేను సుఖి, నేను దుఃఖి, నేను కర్త- అను లోకానుభవమునకు ఉపమ. కనుక పరమాత్మకంటె భిన్నముగ జీవుడు లేడని యనరాదు. ఈశ్వరునకు సంసారము అసంభవము. అనుభవములో నున్న సంసారమును తుడిచిపెట్టుట కష్టము. కాన ఈశ్వరునికంటె భిన్నముగ సంసారము నొందెడు జీవు డుండవలెను. కనుకనే వైశేషికులు, సాంఖ్యులు, బౌద్ధులు ఆచార్యపాదులు చెప్పిన ఉపనిషత్సిద్ధాంతమును విడచిరి.

వైశేషికులు ఈశ్వరునికంటె వేరుగ సకలాత్మ నొప్పిరి. సాంఖ్యులు ఈశ్వరుడే లేడనిరి. దైవమువలనగాని యజ్ఞానమువలనగాని పురుషార్థమునుంచికాని భ్రష్టులగు బౌద్ధులు దేహమే యాత్మయనిరి. వీరందఱకు శ్రీకృష్ణుడు చెప్పిన సిద్ధాంతము నచ్చలేదు. వారిసందేహము లింక దీరలేదు. అందువలన వీరు జీవేశ్వరాభేదవాదమును (మతమును) దురవగాహమని యెంచిరి. కాన ఆచార్యపాదుల యౌపనిషత్సిద్ధాంతము పరిగ్రాహ్య మెట్లగును? అనినచో, వినుము. దేహమునందు కర్తృత్వ భోక్తృత్వములుగల పదార్థము నిర్ణయముగాకకదా వీరు శ్రీకృష్ణ సిద్ధాంతమును విడచిరి. ఆసందేహమును శ్రీకృష్ణుడే తీర్చియున్నాడు. "స్వభావస్తు ప్రవర్తతే" అని పరమాత్మ చెప్పెను. స్వభావమనగా అవిద్యయని యర్థము. అవిద్యయే చేయుచున్నది. అదియే అనుభవించుచున్నది. కావున కర్తృత్వ భోక్తృత్వరూపమగు సంసారము పరమాత్మకు అవిద్యకమని యర్థము.

సరేకాని నీవు అవిద్యాదశలో కర్తృత్వభోక్తృత్వములు కలవానిని యడుగుచుంటివా? విద్యావస్థయం దడుగుచుంటివా? ఇందు మొదటిపక్షమున అజ్ఞానముచే ఆత్మయందు గల్పింపబడిన సాభాసాహంకారుడు సుఖదుఃఖాద్యభిమాని కర్తగా భోక్తగా కలడు. వాని నవలంబించియే నిఖిలవ్యవహారము జరుగుచున్నది. కాన అజ్ఞానానుభవమునకు విరోధము లేదు.

ప్రాజ్ఞుడు (జ్ఞాని), నేను కర్తను- భోక్తను, అని యనుకోనడు. ఇదియంతయు అజ్ఞానదశలోనే ఈదశయందు జీవేశ్వరుల కభేదమును జెప్పుటలేదు. గీతాతత్వము నకు అజ్ఞానుల యనుభవమునకును చాలదూర మున్నది. "క్షేత్రజ్ఞంచాపి" అనునది శ్రీకృష్ణునిచే జ్ఞానదశయందే చెప్పబడినది. జ్ఞానముచే అజ్ఞానము నశించగా కర్తృత్వ భోక్తృత్వాది అధ్యాసలన్నియు నశించును. అటుమీదట సంసారమే

జీవునకు లేదు. కావున పరమార్థముగా అసంసారియగు పరమాత్మయే జీవుడు. అజ్ఞానవశమున మానవులు జీవుడు సంసారియనియు ఈశ్వరునికంటె వేరనియును తలంతురు. ఇయ్యది దృష్టము. ఈ దేహమందును గీతాశాస్త్రమున సాంఖ్యయోగమున జెప్పబడినది.

సాంఖ్యము పరమార్థసాంఖ్యము, అపరమార్థసాంఖ్యము– అని రెండు విధములు. అందు శ్రీమద్భాగవతమున కపిలునిచే దేవహూతికొరకు జెప్పబడి తత్త్వమసీత్యాది వాక్యవిచారములయందు నిరూపింపబడిన జీవేశ్వరాభేదవిషయమగు ఆత్మజ్ఞానము పరమార్థసాంఖ్యము. అదియే యిచట జెప్పబడినది.

ఇరువదియయిదు తత్త్వములను జెప్పెడి నిరీశ్వరసాంఖ్యము అపరమార్థ సాంఖ్యము. ఇందు పరమార్థసాంఖ్యము అద్వైతమనికాని జ్ఞానమనికాని యనబడును. ఇట్టి పరమార్థసాంఖ్యదర్శనమునందు దున్నట్టి జ్ఞాననిష్ఠులగు పరమహంసలకు అవిద్యా వ్యవహారమంతయు నశించుటచే కర్మాధికారములేదని యచ్చటచ్చట శ్రీకృష్ణులు ప్రతిపాదించిరి. దీనివలన కుటీచక, బహూదక, హంసలకు కొలది కర్మాధికారము కలదని సూచితమగుచున్నది. ఇట్లే సన్యసించనివారలు శ్రౌతస్మార్తాది విహిత కర్మల పరిత్యజించుట తగదనికూడ దెలియుచున్నది. ఎవరికెం దధికారమో వా రం దుండవలయును. లేనిచో నరకము నొందుదురు. కనుకనే భగవంతుడు ప్రవృత్తి నివృత్తిరూపమయిన మార్గద్వయమును నిర్మించి దానిని వేదరూపమున బ్రకటించి అద్దాని ననుసరించువారల కభ్యుదయ నిశ్శ్రేయస్సుల నిచ్చుచు తద్భిన్నులను నరక పాతాదులచే శిక్షింపుచు సర్వేశ్వరుడు సర్వనియంతయగుచున్నాడు. వానియాజ్ఞ మీఱలేకయే సూర్య చంద్రాగ్ని యమ వాయువులు, వారివారిపనిని నెరవేర్చు కొనుచున్నారు.

**రామానుజమతము:—**

ఈపరమాత్మ దేహమునుంచి నిష్కృష్టస్వభావముచే నిరూపింపబడి శరీరమునందున్నవాడైనను, అనారభ్యుడగుటవలన (కార్యము గాకుండుటవలన) నాశరహితుడును సత్త్వాదిగుణములు లేనివాడగుటవలన కర్తృత్వము లేనివాడును దేహస్వభావములతో నంటనివాడును అగుచున్నాడని రామానుజులు వ్యాఖ్యా నించిరి. ఇయ్యది నిస్సారము.

వీరిమతప్రకారము ప్రత్యగాత్మ (జీవాత్మ) దేహేంద్రియాదుల నపేక్షించియే పరమాత్మకాని యీశ్వరాపేక్షచే పరమాత్మ గాడు. ఈశ్వరుడే జీవాత్మద్వారా పరమాత్మయని వీరందురు. ఇట్టిస్థితిలో పరమాత్మకానివానిని (ప్రత్యగాత్మను) పరమాత్మయని పలుమారులు వాడకపోతే జీవాత్మను నిరూపింప దలచిన వ్యాసులకు "ప్రత్యగాత్మ జీవాత్మ" యనుపదములు తోచలేదా యేమి? మరియు జీవాత్మను పరమాత్మయని చెప్పకపోతే "జీవాత్మ ప్రత్యగాత్మ" అని

యనినంతమాత్రమున దేహాదులకంటె నుత్కర్ష చెందదా యేమి? దేహాదుల కంటె జీవుడు గొప్పవాడను విషయ మొక్కబౌద్ధులకు దెలియదుగాని మిగిలినవా రందఱకు దెలిసినదే. వ్యాసు లావిషయమును ప్రతిపాదించినందున నొరిగినఫలమేమి?

మరియు 'నకరోతి' అను పదసాన్నిధ్యవశమున "నలిప్యతే" అను పదము నకుగూడ కర్మఫలలేపమను నర్థము సిద్ధించుచుండ నది విడచి దేహస్వభావములతో నని స్వకపోలకల్పితముగ జెప్పనేల?

దేహమునుంచి నిష్క్రాంతస్వభావుడయినవానికి దేహస్వభావలేపము లేదని సిద్ధమగుచుండ నామాట వేరుగ జెప్పనేల? గృహస్థునకు గృహస్వభావ లేపముండదు ఉండదని వేరుగ నిషేధింప నవసరములేదు. ప్రాప్తిలేని నిషేధము నిరర్థకము.

మరియు నిచట వేదాంతదేశికులు భాష్యమును వ్యాఖ్యానించుటలో నీవాక్యముల నుపయోగించిరి. "జ్ఞానసంకోచ రూపవ్యయస్య జ్ఞానాదిగుణానాం దేహాదిప్రేరణరూప కర్తృత్వస్యచ ఆత్మని సత్వాత్" అని

జ్ఞానము సంకోచించుట రూపమగు వ్యయము (నాశము) జ్ఞానాది గుణములు, దేహేంద్రియాదులను ప్రేరణచేయుట రూపమయిన కర్తృత్వమును ఆత్మయం దుండుటవలన- అని దీని యర్థము. అనగా ఆత్మయందలి జ్ఞానము సంకోచము చెందుననియు, ఆత్మయందలి గుణములు దేహేంద్రియాదులను ప్రేరేపించు ననియును వీ రంగీకరించినటుల దీనిభావము గోచరమగుచున్నది.

ఇది యుక్తముగాదు. ఆత్మయందు జ్ఞానసంకోచముండుచో నిర్వికారత్వ మునకు దెబ్బ. ఆత్మస్వరూపము నిర్వికారముకాని, ధర్మము నిర్వికారము గాదని కల్పింపదగదు. అట్లగుచో ఆత్మకు నిర్వికారత్వము పాక్షికమగును. శ్రుతి యెచ్చటను ఆత్మపాక్షికముగగూడ సవికారమని చెప్పటలేదు. పైగా సవికారత్వము నొప్పినచో ఆత్మ యనిత్యమగును.

జ్ఞానాదులు అంతఃకరణగుణములుకాని యాత్మగుణములు కావని యింతకుమున్నే నిరూపించితిమి.

జ్ఞానాదిగుణములు సత్వాది గుణప్రయుక్తములని "తత్ర సత్వం నిర్మలత్వాత్ ప్రకాశకమ్" అను శ్లోకముచే ముందు జెప్పబోవుచున్నారు. మూలభూతమయిన సత్వాదిగుణములే యాత్మయందు లేవని నిషేధించితే తత్కార్యములయిన జ్ఞానాదిగుణము లాత్మ కెట్లుండును?

మరియు, ఆత్మకు ప్రేరణ కర్తృత్వమే యున్నయెడల "నకరోతి" అని చెప్పు టెట్లు పొసగును? అట్లగుచో దేహముకూడ "నకరోతి" చేయుటలేదని చెప్ప వచ్చును గదా?

అయితే, ఆత్మను ప్రేరణకర్తృత్వము లేకపోతే అంతర్యామిబ్రాహ్మణ శ్రుతి విరుద్ధమగునని యందురేని? అట్లు కాదు.

అయస్కాంతశిలాసాన్నిధ్యమునందు న లోహము చలించినట్లు ఆత్మయొక్క సాన్నిధ్యవశమున శరీరాదులు చలించును. అంతమాత్రమున ఆత్మకు ప్రేరకత్వము సిద్ధించును. ఇంతేకాని యింతకంటె వేరుగ మన హృదయములో నిలిచి పని చేయుమని ప్రేరేపించువాడు వేరుగ లేడు. ఇంద్రియాదులు లేని యీశ్వరునకు ప్రేరణ చెల్లదు.

లేక ఆత్మ నాశ్రయించియున్న మాయయే ప్రేరేపించుచున్నది. మాయాకర్తృకమయిన ప్రేరణము ఆత్మయం దుపచరించబడుచున్నది. ఇట్లు భూతములను మాయ ప్రేరేపించుచుండగా ఈశ్వరుడు మాయీ అని వ్యవహరింప బడుచున్నాడు. ఇదేవిషయమును భగవంతుడు గీతాశాస్త్రమున "భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా" అని చెప్పబోవుచున్నాడు. మాయ ఈశ్వరునియొక్క శక్తి. అగ్నియొక్క శక్తి యగ్నికంటె వేరుకాదు. కాన నీశ్వర శక్తియయిన మాయయందలి ప్రేరణకర్మ ఈశ్వరునియం దారోపించి ఈశ్వరుడు ప్రేరణకర్తయని చెప్పబడుచున్నాడు.

ఇందు గమనాదిక్రియలు దేహాకారము నొందిన ప్రకృతియొక్క కార్యములు అయినను ప్రేరణమాత్రము ప్రకృతిదనియె చెప్పవలయును. ఇట్లు పరంపరగా ప్రేరణము మూలప్రకృతికార్యమని యనక తీరదు. మాయ జడ మయినను ఈశ్వరచైతన్యాభాసచే చేతనధర్మమయిన ప్రేరకత్వము మాయకు సంభవించవచ్చును. కావున మాయాద్వారముననే యీశ్వరునకు ప్రేరకత్వమని సంక్షేపము. స్వతస్సిద్ధముగ ఆత్మ అకర్తయే యని సిద్ధాంతము. ॥32॥

శ్లో॥ యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే
సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే॥ ॥33॥

అ॥ ఆకాశము సర్వవ్యాపకమయినను అతిసూక్ష్మ మగుటవలన ఘటపటాదిదోషములతో నెట్లంటదో అట్లే ఆత్మ సర్వదేహములయందున్నను దేహాదులయందలి కర్తృత్వ భోక్తృత్వాది దోషములతో నంటడు. ఆత్మ దేహాదులతో నిత్యసంయుక్తుడని రామానుజులు చెప్పినవిషయ మింతకుమున్నే నిరాకరింప బడినది. అసంగుడు నిరవయవుడునగు ఆత్మయందు దేహాదిసంగము సంభవించదు.

శ్లో॥ యథాప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత! ॥34॥

అ॥ సూర్యుడు చూచువారల కందఱకు కనిపించుచున్నను తానొక్కడగుచునే సమస్తజగత్తును నెట్లు ప్రకాశింపజేయుచున్నాడో అట్లే క్షేత్రజ్ఞుడు

ప్రతిశరీరమునందు వేర్వేరుగ గనిపించుచున్నను తా నొక్కడే యగుచు సమస్త క్షేత్రమును ప్రకాశింపజేయుచున్నాడు. కావున జూచువారలు వేరయినను సూర్యు డొక్కడే యయినట్లు దేహములు భిన్నములయినను ఆత్మ యొక్కడే యని భావము. ఆత్మ లనేకు లను బుద్ధిభ్రాంతి సర్వావభాసకుడయిన సూర్యునకు సర్వదోషము లంటనట్లు సర్వావభాసకుడగు క్షేత్రజ్ఞునకుగూడ క్షేత్రదోషము లంటవు. కనుకనే ఆత్మ అసంగస్వప్రకాశుడు. ఇతనియందు సత్త్వాదిగుణసంగము అవిద్యాధ్యస్తము కాని తాత్త్వికము గాదు. కనుక క్షేత్రజ్ఞునకు అసంసారిత్వము సుస్థిరము. "క్షేత్రజ్ఞంచాపి మాం విద్ధి" అను శ్లోకమునందే మొదట ప్రకాశించిన జీవేశ్వరాభేదమును శ్రీకృష్ణు డిచట నుపసంహార మొనర్చెను.

రామానుజీయము:—

ఇచట రామానుజులు, "ఒక్కడే క్షేత్రమును ఒక్కడే క్షేత్రజ్ఞుడు భాసింపజేయుచున్నాడని వ్యాఖ్యానించిరి. ఈవ్యాఖ్యానమున 'కృత్స్నం'" అను పదము వ్యర్థమగును. కృత్స్నపదమునకు ఆపాదతలమస్తకమని స్వశరీరమని నిర్వచించగూడదు. ఈయర్థము క్షేత్రం భాసయతి అనుపదములవలనే స్ఫురించును. సుఖదుఃఖాది వ్యవస్థాసిద్ధికొరకు ఆత్మభేదమును అంగీకరించుట నిరర్థకము. సుఖదుఃఖాదు లంతఃకరణధర్మములుకాని ఆత్మధర్మములు గావని ఎన్నోసార్లు చెప్పబడినది. కాన ఆత్మభేదవాదము శ్రుతియుక్తిదూరము. ॥34॥

శ్లో॥ క్షేత్రక్షేత్రజ్ఞయో రేవ మంతరం జ్ఞానచక్షుషా
భూతప్రకృతిమోక్షంచ యే విదు ర్యాంతి తే పరం॥ ॥35॥

అ॥ ఈశ్లోకము అన్ని అధ్యాయముల యర్థమును ముగించుచున్నది. శాస్త్రాచార్యోపదేశములవలన గలిగిన ఆత్మజ్ఞాన మను నేత్రముచే క్షేత్రక్షేత్రజ్ఞుల పరస్పరభేదమును గుర్తెఱింగినవారు. ఆత్మజ్ఞానమున నజ్ఞాననాశమును గన్నవారును పరబ్రహ్మభావమును బొందగలరు. "తరతి శోక మాత్మవిత్" "బ్రహ్మవి ద్బ్రహ్మైవ భవతి" అనుశ్రుతు లిందుల కాధారములు.

రామానుజమతము:—

"భూతప్రకృతిమోక్షమ్" అను వాక్యమునకు "భూతప్రకృతిమోక్షం భూతమయ్యాః ప్రకృతేః భూతానాం జీవానాం ప్రకృతే ర్వా మోక్షసాధనం అమానిత్వాదిక మవగమయ్య ఆచరంతి తే పర (నిర్ముక్తబంధన మాత్మానం యాంతి" అని వ్యాఖ్యానించిరి.

దీనిభావము భూతముల రూపమయిన ప్రకృతినుంచికాని భూతములగు జీవులకు ప్రకృతినుంచికాని మోక్షము నొందుటకు సాధనమయిన అమానిత్వ అదంభిత్వాది సాధనజాతమును దెలిసికొని యలవరచుకొనువారు నిర్ముక్తబంధను

దను (జడనముల [illegible]) [illegible] బోధించుచున్నాను అని. ఈవ్యాఖ్య యసంగతము. "[illegible]" ఎవరు తెలుసుకొనుచున్నారో అను మూలమునకు "యే నితత్త్వాన్ని [illegible] ఎవరు తెలిసికొని యాచరించుచున్నారో అను నర్థమును గల్పించుట [illegible].

మరియు దోషములు:

1. [illegible]కంటె భిన్నముగ ప్రకృతియను తత్త్వము నంగీకరించుట.

2. అసంగుడయిన పురుషునకు ప్రకృతితో నిజమయినసంగము నంగీకరించుట.

3. సంసారదశయందువలె మోక్షదశయందుగూడ ప్రకృతిగలదుగాని మోక్షదశలోనూత్రము పురుషునకు ప్రకృతితో సంబంధము (సంగము) లేదని కల్పించుట.

4. మోక్షదశయందుగూడ జీవునకు బ్రహ్మభావప్రాప్తి లేదనియు, స్వరూపప్రాప్తిమాత్రమే కలదనియును వర్ణించుట మొదలగునవన్నియు శ్రుతి, స్మృతి న్యాయములకు విరుద్ధములు.

శ్రుతియందెచ్చటను ప్రధాన మను నొకతత్త్వము వినబడదు. అది అశబ్దమని వ్యాసులు "ఈక్షతే ర్నాశబ్దమ్" అనుసూత్రమున నిర్వచించిరి. ప్రధానమను తత్త్వమును అవైదికులైన సాంఖ్యులు కల్పించిరి.

ఇట్టిప్రకృతితో సంగములేని పురుషుడు సంసృష్టుడని చెప్పుట గొప్ప విచిత్రము.

అసంగుడు నిరవయవుడు నగు పురుషుడు దేనితోను సంబంధించడు. సంసృష్టి (సంబంధము)యుండుచో అసంగత్వమే నశించును. సంసారమునందువలె ముక్తియందుగూడ ప్రకృతియుండుచో దానితో పురుషుడు తప్పక సంబంధించియే తీరును. పురుషుడు విభువు, ప్రకృతి సర్వవ్యాపి. ఇక నీరెంటికి సంబంధమేల నుండదు? అట్టిసంబంధమే ముక్తిదశలో లేనిచో అది (ప్రకృతి) యున్నదని చెప్పుటలో ప్రమాణమేమి? ఫలితమేమి? పురుషునకు సంసారము నేర్పరచుటకదా ప్రకృతి యొక్క యునికికి ఫలము.

సత్త్వాదిగుణరహితమయిన పరిశుద్ధప్రకృతి ముక్తులకొరకనియు గుణసహితమయిన ప్రకృతిబద్ధుల కొరకనియు వ్యవస్థ నేర్పరచుట వెఱ్ఱితనము. గంధములేని పృథివివలె గుణములులేని ప్రకృతియే యుండదు.

ఇట్లే ప్రకృతివిముక్తునకు బ్రహ్మభావము లేకుండుటకూడ విరుద్ధము. జీవునకు (పురుషునకు) ప్రకృతిమోక్షము కలుగగా ప్రకృతికార్యములయిన మహ

దాది యుపాధులన్నియు నశించును. అప్పుడు పురుషుడు నిరుపాధికుడు, అపరిచ్ఛిన్నుడు నగును. ఇట్టివానికి బ్రహ్మభావము తప్పక సిద్ధించును.

మరియు రామానుజమతమున ఈశ్వరునకే ప్రకృతిమోక్షము లేదు. ఇంక జీవుని కెక్కడిది? ప్రకృతిపురుష సంసృష్టుడు ఈశ్వరుడని వారందురు. ఇట్టిస్థితిలో ఈశ్వరుడే తనకుగల ప్రకృతిసంగమును బోగొట్టుకొనలేకపోతే జీవునికిగల ప్రకృతిసంగము నెట్లు బోగొట్టును? ఒకవేళ జీవునకు ప్రకృతిసంగము వివేకజ్ఞానమున దొలగినను, మరల ముక్తిలో ప్రకృతిసంయుక్తుడయిన ఈశ్వరునితో సంగమేర్పడునరికి తద్ద్వారా (తద్ద్వారమున) మరల జీవునకు ప్రకృతిసంగ మేర్పడును.

మరియు "నిష్కలం నిష్క్రియం శాంతం" అను శ్రుతిచే ఈశ్వరునకు సావయవత్వము నిషేధింపబడినది.

"అసంగో హ్యయం పురుషః" అనుశ్రుతిచే పురుషునకు ప్రకృత్యాది సంగము నిరాకరింపబడినది.

"ఏకమేవాద్వితీయం" అనుశ్రుతిచే ప్రకృత్యాదిద్వైతము నివారింపడినది.

"తత్త్వమస్యాది" శ్రుతిచే జీవేశ్వరద్వైతము నిషేధింపబడినది. "ఈక్షతే ర్నాశబ్దమ్" అను సూత్రముచే ప్రకృతికి తత్త్వాంతరత్వము నివారింపబడినది.

"యోవై భూమా తదమృతమ్" అనుశ్రుతిచే బ్రహ్మమాత్రమునకు నిత్యత్వము సత్యత్వము ప్రతిపాదింపబడినది. "అతోఽన్యదార్తమ్" అనుశ్రుతిచే నిఖిలద్వైతమునకు అనిత్యత్వ అసత్యత్వములు ప్రతిపాదింపబడినవి.

కావున నిట్లు శ్రుతిస్మృతివిరుద్ధ మగుటచే రామానుజదర్శనము గ్రాహ్యముకాదు. శ్రుతి స్మృత్యనుగృహీతముకనుక అద్వైతమతమే ముముక్షువులకు సర్వథా గ్రాహ్యము.

ఇట్లు,

ప్రకృతి పురుష వివేక యోగమను

పదమూడవ యధ్యాయము ముగిసెను.

శ్రీ శ్రీ శ్రీ

---

శ్రీ హయగ్రీవాయ నమః

# శ్రీ భగవద్గీతా భాష్యార్థ ప్రకాశికానువాదము

## పదునాల్గవ అధ్యాయము

అవ॥ ఇకమీద పదునాల్గవ యధ్యాయ మారంభమగుచున్నది. ఇందుకు మూడుకారణములు కలవు.

౧. ప్రపంచమంతయు క్షేత్రక్షేత్రజ్ఞసంయోగమువలన బుట్టునని వెనుకటి యధ్యాయములో జెప్పినదానిని వివరించుట.

౨. "సాంఖ్యులకువలె నద్వైతులకు ప్రకృతిపురుషులు స్వతంత్రులుగారు. ప్రకృతి స్వతంత్రముగ ప్రపంచకారణమును గాదు. ఈశ్వరపరతంత్రమయిన ప్రకృతియే జగత్కారణము. పురుషుడు ఈశ్వరరూపముతో స్వతంత్రుడయినను ప్రమాతృరూపముతో నీశ్వరపరతంత్రుడే అను విషయమును నిరూపించుట.

3. ప్రకృతియందుండి గుణసక్తుడయిన ఈశ్వరుడు ప్రపంచకారణమని చెప్పబడినది. ఈశ్వరుడు ప్రకృతియం దుండు టెట్లు? గుణము లెవ్వి? వాటితో సంబంధ మెట్లు? అవి యెట్లు వానిని బంధించును? గుణములనుంచి మోక్షము కలుగు టెట్లు? ముక్తునిలక్షణ మేమి? అను నీవిషయములను ప్రతిపాదించుటయు నీయధ్యాయారంభమునకు గారణములు.

శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు:

శ్లో॥ పరంభూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్
యద్ జ్ఞాత్వా మునయ స్సర్వే పరాం సిద్ధిమితో గతాః ॥౧॥

అ॥ సాంఖ్యులకు నద్వైతులకు మతసిద్ధాంతములో చాలభేదము గలదు.

సాంఖ్యమతమున ప్రకృతి స్వతంత్రముగా ప్రపంచకారణము. పురుషు డుదాసీనుడు. ప్రపంచకారణము గాడు.

అద్వైతమతమున ఈశ్వరపరతంత్రమయిన ప్రకృతియు ఆప్రకృతితో గూడిన క్షేత్రజ్ఞుడును ఈరెండును ప్రపంచకారణములు.

అద్వైతులు విద్యాదశయందే క్షేత్రజ్ఞుడీశ్వరాభిన్నుడని యందురు. అవిద్యాదశలో గుణసంయుక్తుడుకాన నీశ్వరపరతంత్రుడే యని వీరియాశయము.

ఇట్లు ఈశ్వరపరతంత్రమయిన ప్రకృతి పురుషులు ప్రపంచకారణమని చెప్పెడి యద్వైతులకు ప్రకృతిపురుషులు స్వతంత్రులగుచు జగత్కారణమని

చెప్పెడి సాంఖ్యులకును మిక్కిలి భేదము కలదు. ఇదియంతయు నీయధ్యాయమున బ్రకటింపబడును.

క్షేత్రజ్ఞుడు వస్తుతః ఈశ్వరుడయినను మాయచే ప్రకృతిసంగమునొంది జీవుడగుచు నీశ్వరాధీను డగుచున్నాడు.

మాయవలన నెంతటిపనియయినను జరుగును. మాయవలన త్రాడు పాముగుచున్నది. ఆకాశము నల్లనగుచున్నది. ఊసరక్షేత్రము జలప్రాయమగుచున్నది. పడకమీద పరున్నవాడు దేశాంతరమున కేగుచున్నాడు. తనతల తెగిపోయినట్లు తాను జూచుచున్నాడు. తాను జచ్చినట్లు తానే యేడ్చుచున్నాడు. ఆకసము మీద మిద్దెల మేడల జూచుచున్నాడు. కావున మాయచే క్షేత్రజ్ఞు డీశ్వరపరతంత్రుడగుట దుర్ఘటము గాదు.

ఓయి! అర్జునా, జ్ఞానము లన్నిటిలోను ఉత్తమమయిన జ్ఞానమును వెనుకనే ననేకపర్యాయములు చెప్పియున్నను మరల చెప్పెదను. ఈజ్ఞానమువలన ప్రాచీన మునులందఱు మోక్షము నొందిరి.

ఈశ్లోకమున "జ్ఞాన" మను పదమునకు 'పరమ్' 'ఉత్తమమ్' అను రెండు విశేషణము లొసగబడినవి. ఈవిశేషణముల సామర్థ్యమున అపరవస్తువులు విషయములుగా గలిగి అనుత్తమమయిన(ఉత్తమముకాని) స్వర్గాదులు ఫలముగాగల జ్ఞానములకంటె పరబ్రహ్మము విషయముగాగలిగి యుత్తమమయిన మోక్షము ఫలముగా గలిగిన నీజ్ఞానము చాలగొప్పదని సూచితమగుచున్నది. ఇట్టిజ్ఞానము పూర్వము పరమహంసలగు యాజ్ఞవల్క్యాదుల కలవడినది. వారు దేహబంధమును వీడి మోక్షమునొందిరి.

ఇచట రామానుజులు సత్త్వాదిగుణవిషయకమగు నీజ్ఞానము ప్రకృతి పురుషవిషయకమగు జ్ఞానములలో గొప్పదని వ్యాఖ్యానించిరి.

ఈయది యుక్తముగాదు. సత్త్వాదిగుణవిషయక జ్ఞానమునకు, ప్రకృతి విషయక జ్ఞానమునకు భేదమేమి? సత్వాది గుణములేకదా ప్రకృతి. మరియు మోక్షప్రదమయిన పురుషవిషయకజ్ఞానము సత్త్వాదిగుణవిషయక జ్ఞానముకంటె తక్కువదెట్లగును?

మరియు వారు "యత్ జ్ఞానం జ్ఞాత్వా" ఏజ్ఞానమును దెలిసికొని అని వ్రాసిరి. అదియు సరికాదు. జ్ఞానము విషయికదా? అది జ్ఞేయము (విషయము) ఎట్లగును? అట్లైనచో ఘటజ్ఞానముకూడ ఘటము కావలయునుగదా? కాన రామానుజుల వ్యాఖ్య సముచితముగాదు. ॥౧॥

శ్లో॥ ఇదంజ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః
సర్గేపి నోపజాయంతే ప్రలయే న వ్యథంతి చ॥ ॥౨॥

అ। పరబ్రహ్మజ్ఞానము నొందిన మహనీయులు పరమాత్మసాధర్మ్య మును బడసి సృష్టికాలములో బుట్టరు. ప్రళయకాలమున నశించరు. పునరావర్తి రహితమయిన ఫలమును బొందుదురని భావము. ఇచట సాధర్మ్యశబ్దమునకు (సమానః - అభిన్నః, ధర్మః - సచ్చిదానందలక్షణం స్వరూపం యస్య తస్య భావః) అను వ్యుత్పత్తిచే అభిన్నమయిన సచ్చిదానందలక్షణస్వరూపమని యర్థము. పరమాత్మభావమని తాత్పర్యము. విశిష్టాద్వైతులు చెప్పెడి సాదృశ్యముగాదు. జీవేశ్వరభేదము గీతాశాస్త్రమునకు వివక్షితముగాదు. ఆత్మాభేదము శాస్త్రసిద్ధ మయినను లోకవ్యవహారసిద్ధమయిన నుపాధిభేదమును పురస్కరించుకొని (న వ్యథంతి) అను బహువచనము ప్రయోగింపబడినది.

రామానుజీయము:-

ఇచట రామానుజులు సాధర్మ్యమనగా సాదృశ్యమని వ్యాఖ్యానించిరి. అట్టి వ్యాఖ్యాన మసంగతము. వారిమతమున పరమాత్మ సర్వజ్ఞుడు, సర్వేశ్వరుడు, సర్వశక్తియుక్తుడు, సర్వనియామకుడు, సర్వప్రపంచసృష్టిస్థితిసంహారకర్త, సర్వ వ్యాపకుడు, కల్యాణగుణనిలయుడును. జీవాత్మ కించిత్ జ్ఞుడు, పరతంత్రుడు, అల్ప శక్తియుక్తుడు, నియమ్యుడు, జగత్కర్తృత్వాదులు లేనివాడు, నిర్గుణుడు, అణు రూపుడును గాన వీరిద్దరకు పోలిక యసంభవము. బంధావస్థలో జీవుడిట్టివాడయినను ముక్తిదశలో పరమాత్మధర్మము లంటుననుట పొరబాటు. ముక్తిలో జీవులు అణు రూపులా? సర్వవ్యాపులా? అణురూపులగుచో అణురూపులందు సర్వజ్ఞత్వాది గుణము లుండుట యసంభవము. సర్వవ్యాపులగుచో సర్వవ్యాపులగు నీ ముక్తజీవు లందరు సర్వభూతములహృదయమం దీశ్వరునివలె నుందురు. అందు కిష్టపడినచో “ ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి ” “ ఈశ్వరు డొక్కడే నిఖిల భూతముల హృదయమునం దుండునని చెప్పెడి గీతావచనము విరోధించును. మరియు ముక్తజీవులు యెల్లభూతములయం దుండునని యెచ్చటను జెప్పబడలేదు.

మరియు ముక్తజీవులందరు నియామకులగుచో బద్ధులయిన జీవులు నియామకునిమాట విందురు. నియామకేశ్వరులు చాలమందియుండ నొక్కడే ఈశ్వరుడను వ్యవహారమెట్లు?

ఇక ముక్తజీవులు సర్వవ్యాపులయినను నియామకులు గారనియు, నూర కనే యుందురనియు నన్నచో నపుడు వీరలకు ఈశ్వరసాధర్మ్య మేది?

ముక్తజీవులను ఈశ్వరుడు నియమించనిచో నీశ్వరునకు సర్వేశ్వరత్వ మెట్లు నిలచును? అందుకొరకు ముక్తిలోగూడ జీవులు నియమ్యులగుచో బంధ ముక్తులకు తేడాయేమి? ముక్తజీవు లనేకులుందురని మీకు ప్రమాణమేమి? శాస్త్రము లెవ్వియు నట్లు చెప్పుటలేదుకదా?

మరియు ప్రకృతిపురుషసంయుక్తేశ్వరునకు ప్రకృతినియుక్త పురుషునకు సామ్యమెట్లు?

ఇక ముక్తజీవులకు ఈశ్వరునకును గొన్నియంశముల బోలిక మరికొన్ని యంశములభేదము గలదన్నచో బద్ధజీవేశ్వరులకుగూడ జ్ఞాతృత్వ నిత్యత్వాద్యంశల యందు పోలిక కలదుగాన నింక "మమ సాధర్మ్యమాగతాః అని విశేషించి చెప్ప నేల? ఇట్టి యసందర్భము లనేకములుంటచే వారివ్యాఖ్య యాదర్తవ్యముగాదు॥ ౨॥

శ్లో॥ మమయోని ర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్
సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత!

అ॥ అర్జునా! నా స్వరూపమయిన త్రిగుణాత్మికయగు ప్రకృతి నిఖిల భూతములకు గారణము. అది సర్వకార్యములకంటె గొప్పదగుటవలనను సర్వవికార ములను భరించుటవలనను మహత్తు బ్రహ్మ అని చెప్పబడుచున్నది. అందు హిరణ్యగర్భునిజన్మకు గారణమయిన క్షేత్రజ్ఞుని నే నుంచుచున్నాను.

అనగా సర్వేశ్వరునకు పారమార్థికమని వ్యావహారికమని రెండు రూపములు గలవు. పారమార్థికము సచ్చిదానందరూపము. వ్యావహారికము మాయా రూపము. కనుకనే యీశ్వరుడు వ్యవహారదృష్టిలో "మాయీ" అని చెప్పబడు చున్నాడు. కాన మాయ యీతని స్వరూపము.

ఇది క్షేత్రమనబడును. ఇందుంచిన బీజము క్షేత్రజ్ఞ డనబడుచున్నాడు. ఈక్షేత్రక్షేత్రజ్ఞులే చిచ్ఛక్తి, జడశక్తు లనదగుచున్నవి. ఈరెండుశక్తులుకలవా డీశ్వరుడు. ఈరెండుశక్తులు చరాచరప్రపంచమునకు గారణములు. ఇందు క్షేత్రజ్ఞుడు అవిద్యాకామకర్మవశమున క్షేత్రముతో సంయోగము జెందుచున్నాడు. కాన ప్రకృతితో పురుషునిసంయోజన మొనర్ప హిరణ్యగర్భశరీరము బుట్టు చున్నది. చూడు డిండలిరహస్యమును.

ప్రపంచావసానమున క్షేత్రజ్ఞుడు నిఖిలస్థూలోపాధులు నశించగా కారణో పాధులయిన అవిద్యాదులతోను సూక్ష్మశరీరమునంటియున్న కామాద్యుపాధుల తోను గూడినవాడై యీశ్వరప్రకృతియయిన మూలాజ్ఞానమునందు లీనమై ప్రళయావసానపర్యంతము నుండును. అంతట ప్రళయము పూర్తికాగా ఆసోపాధికు డగు క్షేత్రజ్ఞుడు ఈశ్వరసంకల్పమున స్థూలోపాధులతో గూడికొనును. ఆస్థూల శరీరము లొకేమారు పుట్టక క్రమముగ బుట్టును. అందు మొట్టమొదట హిరణ్య గర్భుడను స్థూలశరీరము పుట్టును. తరువాత ప్రజాపతిమన్వాదులు పుట్టుదురు.

ఓయి! క్షేత్రజ్ఞునకు క్షేత్రముతో సంయోగము కలిగినపిదప హిరణ్యగర్భ శరీరము పుట్టుననుట తగదు. ఏలనన హిరణ్యగర్భశరీరము పుట్టకపూర్వము క్షేత్రజ్ఞునితో క్షేత్రమునకు సంయోగమే లేదుకదా? కాదు. స్థూలశరీరాకారముగా

బరిణమింపనున్న ప్రకృతి యచట క్షేత్రశబ్దమున కర్థము. దానితో లింగిని (క్షేత్రజ్ఞుని) కలుపుచున్నాఁడు. జీవసహితముగా బుట్టినశరీరము ఆహారాదులచే మరల వృద్ధిచెందినట్లు.

ఓయి! ప్రపంచవ్యవహారదశలో స్థూలోపాధులవలన క్షేత్రజ్ఞులు వేరుగ నుండిరి. ప్రళయదశలో సూక్ష్మోపాధులను బురస్కరించుకొని క్షేత్రజ్ఞభేదముకలదు. ఇట్లుండ క్షేత్రజ్ఞుని క్షేత్రముతో గలుపుచున్నాఁడనని చెప్పు టెట్లు సరిపడును?

వినుము. ఉపాధిభేదము క్షేత్రజ్ఞభేదమునకు గారణముకాదు. భిన్నభిన్నము లయిన ఘటాద్యుపాధు లాకాసమును వేరుపరచజాలవు. అయినను అంతఃకరణములకు భేదములేకపోతే అందఱకు సుఖముకాని యందఱకు దుఃఖముకాని యుండవలసి వచ్చునుకాన అంతఃకరణసంబంధముగలవారలకు (లింగులకు) అనగా లింగశరీర ధారులకు పరస్పరభేదము చెప్పవలయును.

అయితే ఈలింగశరీరముగలవా రందఱు ప్రళయకాలమున నీశ్వరప్రకృతి యందు దాగియుందురని యంటిరికదా? అందులో ప్రళయావసానమున ఈశ్వరుడు యే లింగిని యే క్షేత్రముతో గలుపుచున్నాఁడు? ఇందుకు శ్రీకృష్ణుడు సమాధాన మిచ్చియే యున్నాఁడు. ఎవనికి హిరణ్యగర్భశరీరము నొందుటకు తగిన యదృష్ట మున్నదో వానిని (ఆ లింగిని) హిరణ్యగర్భ శరీరాకారముగ బరిణమింపనున్న ప్రకృతితో నీశ్వరుడు సంయోజన మొనర్చుచున్నాఁడు. ఆసంయోగమువలన చేతన వంతమయిన హిరణ్యగర్భశరీరము పుట్టుచున్నది. ఆశరీరమునం దభిమానము నొందిన హిరణ్యగర్భుడు యితర లింగులను (లింగశరీరవిశిష్టులను) యితరక్షేత్రము లతో గలుపుచున్నాఁడు. ఇట్లు సర్వభూతములు పుట్టుచున్నవి.

ఈయది హిరణ్యగర్భునకు మామూలుపని యని "ధాతా యథాపూర్వ మకల్పయత్" అనుశ్రుతి చెప్పుచున్నది.

అయితే ఈశ్వరుడు సృష్టికర్తగానుండ నీ శ్రుతి హిరణ్యగర్భుని సృష్టి కర్తగా నేల జెప్పినది? హిరణ్యగర్భుడు సృష్టికర్తయయినచో నీశ్వరుడు కర్తయని చెప్పు టెట్లు? ఇందు దోషములేదు. తండ్రిద్వారమున తాతకూడ మనుమనికి స్రష్టయగును. తండ్రి సాక్షాత్తుగ స్రష్టయగును.

కాన నీ శ్లోకమువలన తన ప్రకృతియందు దాగియుండి, బ్రహ్మాధికా రము నొందదగిన యదృష్టశాలియగు లింగిని పరమేశ్వరుడు తన సంకల్పవశమున హిరణ్యగర్భ శరీరాకారముగ బరిణమింపనున్న ప్రకృతితో సంయోగపరచు చున్నాఁడని ఫలితార్థమేర్పడినది.

క్షేత్రజ్ఞునకు ప్రకృతితో సంయోజనమున ప్రకృతితాదాత్మ్యాధ్యాస నొందించుట ఈయది యవిద్యాకృతము. కాన సృష్ట్యాది వ్యవహారమంతయు నవిద్యామయమని తెలినది.

రామానుజీయము—

అచేతనము, అపర ప్రకృతి, ప్రపంచకారణము నయిన మహద్బ్రహ్మ యందు పరప్రకృతిచేతనపుంజరూపమయిన గర్భము నుంచుచున్నాను. భోగభూమి యగు నచేతనప్రకృతితో భోక్తృవర్గరాశియగు చేతనప్రకృతిని కలుపుచున్నానని యర్థము. సంయోగమువలన బ్రహ్మాదిస్తంబపర్యంత సర్వప్రాణులు పుట్టు చుందురు. అని రామానుజు లనిరి.

అయ్యది నిర్యుక్తికము. చేతనపుంజము నొకేమారు ప్రకృతితో సంయోజన మొనర్చినచో బ్రహ్మాది నిఖిలప్రపంచము యొకేదఫా పుట్టవలసివచ్చును. చేతనోపాధియయిన లింగశరీర పుంజము పరప్రకృతి యగుటచే చేతనపుంజ మాత్రమునకు పరప్రకృతిత్వము సంభవించదు. అట్లు చెప్పుటయు తగదు. నిరుపాధిక చైతన్యము పుంజరూపము నొందదు.

ఇందు శాంకరమతానుసారముగ పదాన్వయము వ్రాయబడుచున్నది.

"మమ మదీయా యోనిః ప్రకృతిః మహద్బ్రహ్మ ఇత్యుచ్యతే" తస్మిన్ మహతి బ్రహ్మణి" నా సంబంధమగు ప్రకృతి మహద్బ్రహ్మ. ఆ మహద్బ్రహ్మ యందు" మిగిలినది సులభము.

రామానుజీయాన్వయము :—

"మమ మదీయం యోనిః కారణభూతం మహత్ యత్ బ్రహ్మ ప్రకృతిః తస్మిన్" (నా సంబంధమయినకారణమగు నే మహత్తయిన బ్రహ్మప్రకృతి గలదో దానియందు" అని.

శ్లో॥ సర్వయోనిషు కౌంతేయ! మూర్తయ స్సంభవంతి యాః
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా॥ ४

అ॥ ఓయి అర్జునా ! దేవాది నిఖిలయోనులయందు బుట్టెడి కరచరణాద్యవయవ విశిష్టమయిన స్థావరజంగమదేహములకు సర్వకార్యావస్థను జెందిన మహత్తత్వమనెడి బ్రహ్మ, ప్రకృతి- (కారణము) (యోని) పరమేశ్వరుడనగు, నేను, యోనియందు క్షేత్రజ్ఞరూపమయిన బీజము (గర్భము) నుంచు దండ్రిని.

లోకములోని తండ్రులు స్త్రీయోనులందు గర్భాధాన మొనరించువారని ప్రసిద్ధికలదు. కాని వారు నిజస్థితిలో గర్భము నుంచువారు గారు. రేతస్సు మాత్రము నుంచువారే. స్త్రీయొక్క యోనిరూపముతోనున్న ప్రకృతియందు బీజ (క్షేత్రజ్ఞ) లక్షణమయిన గర్భమునుంచువాడు పరమేశ్వరుడే.

లేక స్త్రీయందు గర్భమునుంచువాడు పురుషుడు. పురుషునియందు గర్భమునుంచువాడు పరమేశ్వరుడు. పురుషుడు రేతస్సు నుంచినంతమాత్రమున స్త్రీకి గర్భము కానేరదు. అందర కట్లగుటలేదు.

కాన, రేతోరూపముతోనున్న ప్రకృతియందు, క్షేత్రజ్ఞలక్షణమయిన బీజమును పరమేశ్వరు డుంచుచున్నాడు. అందువలన పురుషుడు గర్భవంతుడగుచున్నాడు. పిదప నాపురుషుడు, తాను ధరించిన జీవవిశిష్టరేతోరూపమగు న గర్భమును స్త్రీయోనియం దుంచుచున్నాడు. ఆపె దానితో గర్భముగల దగుచున్నది.

ఇట్లుండ పుట్టుచున్న శిశువునకు గర్భమునుంచిన పరమేశ్వరుడే తండ్రి. తల్లి పెనిమిటియగు దండ్రి యౌపచారికతండ్రి అని "బీజప్రదఃపితా" అను తురీయపాదముచే వ్యక్తమగుచున్నది.

దీనివలన సంతానము కలుగుటకు ప్రాకృతులగు తలిదండ్రులు ప్రధానకారణములు కాదని తెలినది.

ఈ పరమేశ్వరుడును ప్రాణుల పుణ్యాపుణ్యకర్మల నపేక్షించియే గర్భము నుంచుచున్నాడు. కనుక వైషమ్యాది దోషము లీశ్వరున కంటవు.

రాజులచే నియమింపబడిన భటులు, యుద్ధాదులయందు శత్రువుల జయింపగా రాజుజయించెనని లోకము చెప్పుకొనినట్లు అంతట పరమేశ్వరుడు గర్భము నుంచువాడయినను, హిరణ్యగర్భుడు సృష్టికర్తయని శ్రుతులు చెప్పుచున్నవి.

లేక భూతసృష్టిలో పరమేశ్వరుడు ముఖ్యకారణమనియు, హిరణ్యగర్భుడు ద్వారకారణమనియు గ్రహింపనగును. ॥౪॥

శ్లో॥ సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః
నిబధ్నంతి మహాబాహో! దేహే దేహిన మవ్యయమ్॥ ౫

అ॥ ఓయి! బాహుబలముగల యర్జునా ! ప్రకృతివలనబుట్టిన సత్త్వ, రజస్తమోగుణములు దేహమునందున్న నాశరహితుడయిన ఆత్మను బంధించుచున్నవి వలె నున్నవి.

తర్కశాస్త్రమునందు "ద్రవ్యముల నాశ్రయించియుండుట గుణములకు లక్షణముగ జెప్పబడినది. ప్రకృతియనునది యీశ్వరశక్తి. అగ్నియొక్క శక్తి ద్రవ్యముకానట్లు యీశ్వరశక్తియగు ప్రకృతికూడ ద్రవ్యముకాదు. అట్టి ప్రకృతి నాశ్రయించియున్న సత్త్వాదులు గుణము లనబడవు.

మరియు రూపసంఖ్యాపరిమాణాది గుణములవలె నీయవి యింద్రియవేద్యములును గావు. కాన వీటిని గుణములని వ్యవహరించు టెట్లు ?

నిజమే వీటియందు గుణశబ్దము వేదాంతశాస్త్రసిద్ధమయిన సాంకేతికము. ఇంతియేకాని, ద్రవ్యాశ్రితత్వ మను లక్షణప్రయుక్తముకాదు. ఇంద్రియవేద్యత్వమును బురస్కరించుకొని ప్రవర్తించినదియును గాదు.

లేక, లోకములో గుణగుణులగు ఘటరూపములకు భేదమగుపడుచున్నది. సత్త్వాదిగుణత్రయమునకు ప్రకృతికి నిచట భేదము చెప్పబడుటలేదు. ఈ రెంటికిని

కార్యకారణభావము చెప్పబడుచున్నది. కార్యకారణముల కభేదము లోకసిద్ధము. ద్రవ్యగుణముల కట్లు అభేదము అనుభవసిద్ధముకాదు. పైగా నారెంటికి భేదమే యనుభవసిద్ధము.

ఎట్లన కారణమగు దారములు నశించగా కార్యమయిన పటము నశించుచున్నది. తంతువులకంటె భిన్నముగ పట మగుపడదు. కారణమే కార్యరూపమున పరిణామమును జెందుచున్నది. కాన కార్యకారణము లభిన్నములు.

ఇక కావువేసిన మామిడిపండుయందున్న నీలరూపము పాకావస్థయందు పండు నశించకున్నను నశించుచున్నది. అట్లే పండు క్రొత్తగాబుట్టకున్నను పచ్చని రూపము క్రొత్తగా బుట్టుచున్నది. ఇందువలన గుణగుణులు భిన్నములని తేలుచున్నది.

కాన ఘటమునకు రూపమువలె ప్రకృతికి సత్త్వాదులు గుణములుగావు. కాని ప్రకృతియొక్క పరిణామములుమాత్ర మగును. కనుక వీటియందు గుణత్వ వ్యవహారము పారిభాషికము.

అయినను "గుణవతీ ప్రకృతిః" అను భాష్యకారుల వ్యవహారము "ఘటవతీమృత్తికా" అను వ్యవహారము వంటిది.

కారణమునందు కార్యముండును. కారణముయొక్క ఆకారవిశేషమే కార్యమనబడుచున్నది. కాన కార్యకారణములకు భేదములేదు. కనుకనే శ్రుత్యుక్తమయిన కార్యమిథ్యాత్వ ముపపన్న మగుచున్నది.

ఇక జాడ్యాదిగుణము లుండుటవలనను పృథివ్యాది ద్రవ్యముల కుపాదానకారణ మగుటవలనను, ప్రకృతి ద్రవ్యమేయని మీకు పట్టుదలయున్నచో. నపుడు, జ్ఞానాదిగుణము లుండుటవలనను, అంతఃకరణాద్యుత్పత్తికి గారణమగుటవలనను, సత్త్వాదులుకూడ గుణములు కావలసివచ్చును. అయ్యది మీర లంగీకరించరు. మరెవ్వరు నంగీకరించుదురు? కాన సత్త్వాదులకు గుణత్వవ్యవహారము పారిభాషికమనకతప్పదు.

మరియు గుణశబ్దమున కప్రధానమను నర్థముకూడ కలదు. లోకములో స్వతంత్రులయిన రాజాదులు ప్రధానులనియు, పరతంత్రులయిన నౌకరులు అప్రధానులనియును బ్రతీతి కలదు. అట్లే ఈసత్త్వాదిగుణములుకూడ క్షేత్రజ్ఞున కెల్లపుడు పరతంత్రము లయినందున గుణశబ్దముచే నప్రధానములని చెప్పబడుచున్నవి.

మరియు సత్త్వాదిగుణములు క్షేత్రజ్ఞునినం దవిద్యచే గల్పింపబడినవి. కాన మిథ్యాభూతములు. వీటికి నధిష్ఠాన క్షేత్రజ్ఞునకంటె వేరుగ సత్తలేదు. అందువలనకూడ సత్త్వాదులు పరతంత్రములగును. ఇట్లుండ క్షేత్రజ్ఞుడుసత్త్వరజస్తమోగుణములకు పరతంత్రుడని యనుకొనుట అజ్ఞానవిలసితమని తేలినది.

అయితే జీవుడు గుణపరతంత్రుడని లోకములోనున్న ప్రతీతిని మీరు కాదందురా? అని మీ రడుగవచ్చును. కాని మేము అజ్ఞానుల దృష్టిలోనున్న జీవ పారతంత్ర్యమును కానము. విద్వాంసులదృష్టిలోనున్న జీవస్వాతంత్ర్యమును (జీవ పారతంత్ర్యాభావమును) మేము ప్రతిపాదింతుము.

అయితే ఈశ్వరుడయిన క్షేత్రజ్ఞుడు స్వతంత్రుడయి గుణములు వానికి పరతంత్రములగుచో నింకనీగుణము లా క్షేత్రజ్ఞుని బంధించుటెట్లు? బంధించునని కదా! కృష్ణుడు చెప్పెను.

నిజమే. గుణములు క్షేత్రజ్ఞునియందు గల్పితములు. వానికి పరతంత్రములును. అయినను అవి యధిష్ఠానమయిన క్షేత్రజ్ఞుని యాధారపరచుకొని, స్వరూపము నొంది పిదప క్షేత్రజ్ఞుని స్వరూపము నావరించుచున్నవి. ఎట్లన త్రాటియందు గల్పింపబడిన సర్పము త్రాడునాధారపరచుకొని తాను ప్రాతీతిక స్వరూపము నొంది పిదప రజ్జుస్వరూపము నావరించినట్లు కాన నిట్లు క్షేత్రజ్ఞస్వరూపము నావరించుటయే వానిని బంధించుట.

కాని యియ్యది వాస్తవికముగాదు. స్వప్రకాశాసంగాద్వితీయ చిద్రూపునకు వాస్తవముగ నావరణము సంభవించదు.

కనుకనే భాష్యకర్తలు "నిబధ్నంతీవ"(బంధించుచున్నవివలె) అని వ్యాఖ్యానించిరి. ఈ బంధము మాయామయముకాని నిజముకాదని భావము. ఇట్టివ్యాఖ్యానము శంకరుల స్వకపోలకల్పితము గాదు. వేదవ్యాసులే శ్రీమద్భాగవతమున నుదహరించిరి.

" సేయం భగవతో మాయా యన్నయేన విరుధ్యతే
ఈశ్వరస్య విముక్తస్య కార్పణ్య ముతబంధనమ్ "

ఏది భగవంతుని నిజరూపమునకు విరోధించదో అదియే మాయ. నిత్యముక్తుడయిన నీశ్వరునకు కృపణత్వముకాని, బంధనముకాని వాస్తవము కాదు.

కాన కాలత్రయమునందును ఆత్మయం దవిద్యాసంగముకాని సంసార బంధముకాని లేదని పరమార్థము.

రామానుజీయము:—

"సత్త్వ రజస్తమస్సులను మూడుగుణములు ప్రకృతియొక్క స్వరూపము ననుసరించి యుండునట్టి స్వభావవిశేషములు. ఈయవి ప్రకాశాది కార్యముల వలన నిరూపింప నలవియగును. ప్రకృతిదశలో బయటపడవు. ప్రకృతివికారము లయిన మహదాదులయం దభివ్యక్తమగును. ఇయ్యవి స్వతస్సిద్ధముగ గుణసంబంధమున కర్మముకాని జీవుని దేహమునం దుంచుటవలన బంధించుచున్నవి. అని రామానుజులు వ్యాఖ్యానించిరి.

ఇదియు క్రమము కాదు.

౧. ప్రకృతిదశలో ఉద్భూతములుకాని సత్త్వాదులు ప్రకృతిస్వరూపాను బంధులనుట విరుద్ధము. ప్రకృతిస్వరూపము ననుసరించియుండునవి ప్రకృతిని ఎప్పటికిని విడువజాలవు.

౨. ఇంక సత్త్వాదిగుణములు ప్రకృతిదశలో సమానముగానుండి మహదాది వికారావస్థలో వైషమ్యమును జెంది యద్భూతములగుచున్నవని మీయభిప్రాయమైనచో ఘట, కపాల, కర్కరాదులన్నియు మృత్తుయందు సమానముగా నున్నవనుట యెంతప్రమాణమో, ఇదియు నంతే ప్రమాణము గును. ఘట కపాలాదులు స్వరూపనాశమును చెందినపుడుగాని మృత్తుయందు సామ్యస్థితిని చెందవు. అట్లే సత్త్వాదులుగూడ స్వరూపనాశమును చెందినపుడే ప్రకృతియందు సమానముగా నుండును. పరస్పరవైషమ్యమే సత్త్వాది గుణముల స్వరూపము. ఈ స్వరూపమిట్లుండగా వీటికి సామ్యస్థితి దుర్ఘటము.

మరియు ప్రకాశత్వము సత్త్వముయొక్క ధర్మము. రంజకత్వము రజోగుణధర్మము. మోహకత్వము తమోగుణధర్మము. ఇట్లు విరుద్ధధర్మములు గలవాటికి సామ్యస్థితి యసంభవము. ఒకవేళ ప్రకృతిదశలో నీ సత్త్వాదులయం దీ ధర్మములు లేవన్నచో నపుడు ధర్ములు (సత్త్వాదులు) మాత్రమున్నవని యూహించుటెట్లు?

మహదాది వికారములయందలి సత్త్వాదిగుణములనుబట్టి ప్రకృతియందలి గుణముల నూహించుట యుక్తిదూరము.

అపుడు ఘటాదికార్యములయందలి కంబుగ్రీవాద్యాకారములనుబట్టి, మట్టియందుగూడ కంబుగ్రీవాద్యాకారముల నూహింపవలసి వచ్చును. ఇయ్యది ప్రత్యక్షవిరుద్ధము.

మరియు సమవాయికారణముయొక్క గుణములయిన రూపాదులే కార్యములయందు సంక్రమించును. సత్త్వాదిగుణములు రూపాదులయందు పఠింపబడలేదు. సత్త్వాదు లతీంద్రియములు. రూపాదిగుణము లింద్రియగమ్యములు. కాన నవి రూపాదులలో జేరవు. కనుకనే ప్రకాశాదికార్యములచే నిరూపింపదగియున్నవి. ఇట్టితటి ప్రకృత్యవస్థలో వాటికార్యములయిన ప్రకాశాదులు లేనపుడు అవి యున్నవని నమ్ముటెట్లు? కావున సత్త్వాదిగుణములు ప్రకృత్యవస్థలో సమానముగా నుండునుట చెల్లదు. కాన ప్రకృతియందు సత్త్వాదిగుణములను బుట్టించియుండునట్టి శక్తియుండుటచే ప్రకృతిగుణములయొక్క సామ్యావస్థయని చెప్పబడుచున్నది. ఇంతియెకాని గుణములు సమానముగనుండుటవలనగాదు. గుణములు సమానముగా నుండుచో వాటిధర్మములుగూడ సమానముగా నుండవలసివచ్చును.

మరియు, సత్త్వాదిగుణములకు నుద్భూతత్వమును జెప్పు మీరు వాటికి కార్యత్వమును తప్పక అంగీకరించవలయును.

కాన సత్త్వాదిగుణములు దేనికార్యములో చెప్పుడు. ప్రకృతికార్యము లందురా? ప్రకృతిస్వరూపము ననుసరించునట్టివి ప్రకృతికార్యము లెట్లగును ? పృథివీ స్వరూపము ననుసరించియున్న గంధము పృథ్వీకార్యమగుచున్నదా ? స్వరూప నిరూపకములగు ధర్మము లెప్పుడు ధర్మిని విడచి యుండవని వేదాంతదేశికులే చెప్పిరిగదా ? పుట్టుకకుపూర్వములేని సత్త్వాదిగుణములు ప్రకృతిస్వరూపము నె ట్లనుసరించును? ప్రకృతి యనాదిగదా ?

ఇక సత్త్వాదులు పురుషకార్యములుగూడ గానేరవు. పురుషుడు కర్తయే కాడు. ఈశ్వరకార్యములనుటకూడ చెల్లదు. ఈశ్వరుడు ప్రకృతిపురుషద్వారమున కర్తయగునుగాని స్వతంత్రముగ కర్త కానేరడు. కాన సత్త్వాది గుణములు ప్రకృతి కార్యములనికాని పురుషకార్యములనికాని యీశ్వరకార్యములనికాని నిరూపింప నలవికాదు. అనాదులనుటయు పొసగదు. ఇక్కడనే "ప్రకృతిసంభవాః" అని చెప్పబడినది. మరియు ప్రకృతిస్వరూపానుబంధస్వభావవిశేషములయిన సత్త్వాదులు ప్రకృతినుంచి పుట్టిన వనుట లోకవిరుద్ధము. ధర్మినుంచి ధర్మముపుట్టుట యసంభ వము. అట్లుండుచో ధర్మముపుట్టకపూర్వము ధర్మికి ధర్మిత్వమే లేకపోవలయును. పుట్టకపూర్వముగూడ ధర్మమున్నదందురా ? మరల యిది పుట్టుట వ్యర్థము. ఘటమునుంచి రూపము పుట్టుటను గానము.

కాన సత్త్వాదులు ప్రకృతియొక్క పరిణామములనియే యనవలయును. అపుడు మహదాదులవలె నీయవి ద్రవ్యములగును. గుణవత్త్వము ద్రవ్యములకు లక్ష ణము. జ్ఞానాదిగుణములు సత్త్వాదులయం దుండుటచే నీయవి ద్రవ్యము లనక తప్పదు.

ఓయి ! అంతఃకరణమను ద్రవ్యమువలన బుట్టిన సుఖదుఃఖాదులు గుణములయినట్లు ప్రకృతిద్రవ్యమువలన బుట్టిన సత్త్వాదులుకూడ గుణములేయగును కాని ద్రవ్యములు కావు. కనుక సుఖదుఃఖాదు లంతఃకరణధర్మము లయినట్లు, సత్త్వాదులు ప్రకృతిధర్మము లనునది నిర్వివాదమన్నచో నట్లు కాదు.

మేము ద్రవ్యమునుంచి గుణములు పుట్టవని యనము. కాని యే గుణ మునకు, నేగుణితో సమవాయసంబంధ ముండునో ఆగుణినుంచి యా గుణము పుట్టు నని యందుము.

"సత్త్వాత్సంజాయతే జ్ఞానం" ఇత్యాది ప్రమాణమునుబట్టి సత్త్వాది గుణములనుంచి జ్ఞానాదులు పుట్టుచున్నవి. జ్ఞానాదులు సత్త్వాది ధర్మములు. సుఖాదు లంతఃకరణధర్మములు. కాన ప్రకృతివలన బుట్టెడు సత్త్వాదిగుణములు అంతఃకరణాదులవలె ద్రవ్యములుకాని గుణములుకావు.

సత్త్వాదులు ద్రవ్యము లయితే కనిపించవేమి ? అయితే ప్రకృతి యేల గనిపించదు? ప్రకృతి ద్రవ్యమేకదా! ద్రవ్యములన్నియు గనిపించితీరవలయు నను

నియమ మెక్కడిది? మహదాది కార్యములవలన ప్రకృతిని యనుమానించినట్లు ప్రకాశాది కార్యములవలన సత్త్వాదుల ననుమానించవలయును.

ఇక వ్యక్తములగునవియే ద్రవ్యములని మీకు పట్టుదల యున్నచో నవ్యక్తమయిన ప్రకృతి ద్రవ్యముగానట్లు సత్త్వాదులుగూడ ద్రవ్యములు గాకుండు గాక అను నాపత్తి కలుగును. ద్రవ్యములయిన సత్త్వాదులు కార్యములయిన మృదాదులయం దెట్లుచేరునని శంకింపవలదు. అనగా గుణములకు కార్యములయం దనుప్రవేశ మనుచితముకాని ద్రవ్యముల కుచితముగాదని శంకాభిప్రాయము. ద్రవ్యమయిన ప్రకృతికి మహదాదులయం దెట్లనుప్రవేశమో అట్లే సత్త్వాదులకును.

ఓయి! సత్త్వాదులు ద్రవ్యపరతంత్రములు కాన గుణములే యగును. ద్రవ్యములు కావు. శుద్ధసత్త్వగుణముకలది మాయ, మలినసత్త్వముకలది యవిద్య. అహంకారము, సాత్త్వికము, రాజసము, తామసము అని మూడువిధములు. పంచభూతములయొక్క సత్త్వాంశసమష్టివలన నేర్పడినది. మనస్సు అను నిట్టి వ్యవహారమంతయు సత్త్వాదులు గుణములని ధ్రువపరచుచున్న వనినచో నట్లుకాదు.

పరిణామముజెందు ప్రకృతియందు పరిణామములుండుట యుచితము. అనగా ఘటరూపముగ బరిణమించు మృత్తుయందు ఘటముండుట యనుభవసిద్ధము. సత్వరజస్తమస్సులు ప్రకృతియొక్క పరిణామములు. అవి శుద్ధములుకాని, అశుద్ధములుకాని ప్రకృతియందే యుండును. అందువలన శుద్ధసత్వముకలది మాయ యనియు, మలినసత్త్వముకలది యవిద్యయనియు వ్యవహార మేర్పడినది. రజస్తమస్సులతో గూడిన సత్త్వము అశుద్ధము. వానితోగూడ నది శుద్ధము. ఇట్లే యుద్భూతగుణముకల మాయ మహదహంకారాదిరూపముతో పరిణమించు చున్నందున త్రివిధ మనదగును. మహదహంకారాదులు ప్రకృతియొక్క పరిణాములు కాన ప్రకృతిమయములు కావచ్చునుగాని సత్త్వాదిమయములుగావు అన్నచో నది యుక్తము కాదు.

నీటిలో దడిసి ముద్దయయిన మట్టియొక్క చూర్ణపుంజమే ఘటరూపము జెందుచున్నదికాని, పిండాకారమును జెందనిచూర్ణపుంజము కుండ యగుట లేదు. అట్లే యీశ్వరసంకల్పవశమున సత్త్వాది గుణత్రయాకారముగ పరిణమించిన ప్రకృతియే మహదాద్యాకారముగ పరిణమించుచున్నది. వేరు ప్రకృతి పరిణమించుటలేదు. ప్రళయమునందు మాత్రము సత్త్వాదిరూపముగ పరిణమించని ప్రకృతి యుండును. కనుకనే గుణసామ్యావస్థ ప్రకృతియను ప్రవాదము. ప్రళయకాలమున ప్రకృతియందు సత్త్వాది గుణములుండవు. కావున నిట్లు గుణత్రయాకారముగ పరిణమించిన ప్రకృతియొక్క పరిణామములుకాన మహదాదులు గుణత్రయము గలవగుచున్నవి. పిండాకారముగ పరిణమించిన మట్టియొక్క కార్యములయిన ఘటాదులయందు పిండము కనిపించుట లేదనరాదు. ఘటమునందు మిళితమైయున్న చూర్ణ

పుంజమే పిండాకారము. అయ్యది ఘటమందు కలదు. కావున ప్రకృతియొక్క మొదటివికారము గుణత్రయము. సత్త్వాదిగుణత్రయరూపముగ వికారమునుజెందిన ప్రకృతియొక్క వికారములు మహదాదులు. సత్త్వాదిగుణత్రయము ప్రకృతి వికారమగుటచే ప్రకృతివలె ద్రవ్యములని తేలినది. కనుకనే శ్రీకృష్ణులు "గుణాః ప్రకృతిసంభవాః" అని యనిరి. సత్త్వాదులు ద్రవ్యములుకాక గుణములగుచో ప్రకృతివలన బుట్టనేఫుట్టవు. రూపము రూపసమవేతమయిన ఘటమువలన బుట్టుట లేదు. సత్త్వాదులు సత్త్వసమవేతమయిన ప్రకృతివలన బుట్టుచున్నవి. గాన గుణములుగావు.

ఇంక మీరు సత్త్వాదులు గుణములే యనవలెనను నాసతో నవి ప్రకృతి సమవేతములు గావని యన్నచో అపుడు సత్త్వాదులు ప్రకృతియొక్క స్వరూపమును నిరూపించు ధర్మములే గాకపోవును. వృక్షమునందలి కపిసంయోగము వృక్షముయొక్క స్వరూపమును నిరూపించజాలదు.

అట్లే సత్త్వాదిగుణసంయోగముకూడ ప్రకృతియొక్క స్వరూపనిరూపకముగాదు.

అయితే మహదాదివికారములవలె సత్త్వాదులు మూలప్రకృతియొక్క పరిణామము లయినపుడు "మూలప్రకృతి రవికృతిః" అనెడు వారి కారికయందు వీని నేల చెప్పలేదు? నిజమే. ఆమాట సాంఖ్యుల నడుగుడు. మేము సాంఖ్యులముగాము. ఇట్టి దోషములు పెక్కువారి మతమం దుండబట్టియే, వారిమత మప్రమాణమని మే మనుచున్నాము. ఇంక మీరు సాంఖ్యమతమును బోషింపదలచి యందలి తప్పులను గప్పిపుచ్చుటకు "సత్త్వాద్యాకారముగ పరిణమించిన ప్రకృతియే మహదాదులకు గారణమనియు, నదియే మూలప్రకృతియనియు నన్నచో నట్టి ప్రకృతి (పరిణామముచెందిన ప్రకృతి) వికృతియగునుగాని మూలప్రకృతి కానేరదు.

కావున ప్రకృతి, అజ్ఞాన, అవ్యక్త, శక్తి, అవిద్యా, మాయా మున్నగు పర్యాయపదములుగల యీశ్వరస్వభావముయొక్క పరిణామవిశేషములే సత్త్వాదులు. గుణములు కావు.

అంతఃకరణ పరిణామములయిన సుఖాదివృత్తులవలె ప్రకృతిపరిణామమయిన సత్త్వాదిగుణత్రయము గుణమని మీరంటిరి. అందు దృష్టాంతభాగమునే మే మంగీకరించము. అంతఃకరణ పరిణామములయిన సుఖాదివృత్తులు గుణములని మే మంగీకరించము. అంతఃకరణాత్మకము లయినందున నవికూడ ద్రవ్యములే యందుము. ద్రవ్యమునకు గుణరూపముతో పరిణామముండదు. కార్యకారణములకు సాలక్షణ్య (సారూప్యము) ముండవలెను.

అయితే శుక్లాది గుణములు దేనికైనను వికారము లగునా ? కాదా ? వికారములగుచో నవి దేనియొక్క వికారములో- అది ద్రవ్యమా ? వేరుయా ? ద్రవ్యమగుచో ద్రవ్యమునకు గుణరూపపరిమాణ మెట్లుకలిగినది? అది ద్రవ్యభిన్న

మనుటకు వీలులేదు. ఇక శుక్లాదిగుణములు వికారములు కావన్నచో అనాదు లనవలెను. పుట్టుచున్నట్లు ప్రసిద్ధిజెందిన రూపాదులను అనాదులనుట అయుక్తము, అప్రమాణము నగును. అన్నచో–

నిజమే వినుము. సమాధానము: గుణములన్నియు ద్రవ్యము నాశ్రయించియే పుట్టును. విడిగా బుట్టవు– వాయ్వాకారముగ పరిణమించిన ప్రకృతినుంచి తేజో ద్రవ్యము రూపసహితముగనే పుట్టుచున్నది. వాయ్వగ్నులు రెండును ద్రవ్యములే కనుక నిచట కార్యకారణములకు వైలక్షణ్యము లేదు. అయితే వాయువు నీరూపము. అగ్ని సరూపము, ఈభేదమున్నదికదా? అని యనవచ్చును. ఏయంశము నందును భేదములేకపోతే కార్యకారణభావ మెట్లుండును?

అయితే రూపరహితమయిన వాయుద్రవ్యము, రూపసహితమయిన తేజస్సుగ పరిణమించినచో ద్రవ్యమునకు గుణాకారముగ పరిణామ మున్నట్లేకదా? లేదు. ద్రవ్యాంశమునందే పరిణామము. గుణాంశమునందు వివర్తమే. వాయువునం దనుద్భూతరూప మున్నదని యనదగదు. కనిపించని యనుద్భూతరూప మున్నదనుటలో ప్రమాణములేదు. అట్లంగీకరించినచో ఆత్మయందుగూడ అనుద్భూతరూప మున్నదని కల్పించనగును. అట్టిది "అశబ్ద మస్పర్శ మరూప మవ్యయమ్" అను శ్రుతి విరుద్ధము. [illegible] దనుద్భూతరూపమున్నదని యంగీకరించి నను ఆ యనుద్భూతరూపమే [illegible]ద్భూతరూపముగ పరిణమించునుగాని, ద్రవ్యము గుణముగ పరిణమించదు. కావున సత్త్వాదులు ప్రకృతియొక్క అవస్థావిశేషములే కాని గుణములుకావు.

సత్త్వాదులు గుణములు కానిచో వాటియందు అనుభవములోనున్న గుణశబ్దప్రసిద్ధికి విరోధము వాటిల్లునని వేదాంతులు పలుకుదురు అనిరి. అదియును సమంజసముకాదు. గుణశబ్దప్రతీతి పారిభాషికముగ నయినను కుదురును. అనాదికాల ప్రవృత్తమయిన శాస్త్రబలమువలన నీప్రసిద్ధి యేర్పడినది. శాస్త్రములేనిచో మాయకు ప్రకృత్యాది ప్రతీతినిగూడ మనము తెలిసికొనలేము.

ఇక రామానుజులు "సత్త్వాదిగుణములు జీవుని దేహమునం దుండుటచే బాధించుచున్న"వని వ్యాఖ్యానించిరి. ఘటము తనయందున్న ఆకాశము నేమి బాధించినది? జీవుడు స్వతస్సిద్ధముగ బంధానర్హుడని వారే యొప్పుకొనిరి. అట్టివానికి శరీరమునం దునికిమాత్రము బంధహేతు వెట్లగును? "శరీరస్థోఽపి కౌంతేయ నకరోతి నలిప్యతే" అని భగవంతుడే చెప్పెనుకదా? కనుక నిర్లిప్తుడు బద్ధుడగుట దుర్ఘటము" ॥౫॥

శ్లో॥ తత్ర సత్త్వం నిర్మలత్వాత్ప్రకాశక మనామయం
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ! ॥౬

అ॥ ఇంక సత్త్వముయొక్క లక్షణము చెప్పబడుచున్నది. వ్యసనరహితుడవయిన నోయి యర్జునా! సత్త్వరజస్తమస్సులు మూటిలో సత్త్వము స్ఫటికమణివలె నిర్మలమయినది. ప్రకాశవంత మయినది. ఉపద్రవరహితమయినది. ఇది యాత్మయందు సుఖమును జ్ఞానమును గలుగజేసి ఆత్మను బంధించుచున్నది. విషయభూతమగు జ్ఞానమును విషయియగు నాత్మకు నంటించుటయే సత్త్వము చేసెడిపని. కనుకనే యీయది అవిద్య. ఒకదానిధర్మము మరియొకదాని కంటుట నిజముకాదు. అసంగుడయిన ఆత్మకు సుఖసంగము వాస్తవము కానేరదు. కనుకనే భాష్యకారులు "సంజయతీవ" అని యివశబ్దమును బ్రయోగించిరి.

సత్త్వగుణమువలన ఆత్మానాత్మవివేకము చెడి యనాత్మధర్మమయిన సుఖమును ఆత్మయం దధ్యాస జేసికొని నేను సుఖిని అని యనుకొనును. అందువలన బద్ధునివలె నగుచున్నాడు. ఈ శ్లోకమునందలి జ్ఞానము అంతఃకరణవృత్త్యాత్మకముకాని చైతన్యముగాదు. వృత్తిజ్ఞాన మాత్మధర్మముకాదు. దీనితో నాత్మకు సంగము నిజముకాదు. ఆధ్యాసికము కనుకనే జీవునకు బంధము మిథ్యాభూతమయినది.

ఇచట రామానుజులు "సత్త్వము పురుషునకు జ్ఞానసుఖములయందు నిజముగానే సంగమును కలుగజేయు"నని వ్యాఖ్యానించిరి. ఇది అయుక్తము. నిర్ధర్మకుడు,అసంగుడునగు ఆత్మయందు నిజమయిన సుఖజ్ఞానసంగము సంభవించదు. మిథ్యాభూతమయిన సంగముండవచ్చును. రూపరహితమయిన ఆకసమునందు మిథ్యాభూతమయిన నీలరూపము కనిపించుచున్నది. ॥౬॥

శ్లో॥ రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగసముద్భవం
త న్నిబధ్నాతి కౌంతేయ! కర్మసంగేన దేహినమ్. ॥౭॥

అ॥ ఓయి, కుంతీపుత్రుడా? రజోగుణము గైరికాది ధాతువులవలె రాగాత్మకము. అయ్యది తృష్ణా ఆసక్తుల బుట్టించుచు కర్మసంబంధముతో జీవుని బంధించునని తెలియుము.

లేక రజోగుణము రాగాత్మకమనియు తృష్ణాసంగములకు కారణమనియును దెలియుము.

లేక తృష్ణాసంగములకు గారణమగు రజస్సు రాగాత్మకమని తెలియుము.

లేక రాగాత్మకమయిన రజోగుణము తృష్ణాసంగములకు కారణమని తెలియుము.

లేనివస్తువునందలి యభిలాష తృష్ణ, ఉన్న వస్తువునందలి ప్రేమ సంగము ఈ రెంటియొక్క పుట్టుకకు కారణమగు రజోగుణము జీవునిచే పశుపుత్రాది దృష్ట ఫలముగల కర్మలను స్వర్గాద్యదృష్టఫలముగల కర్మలను జేయించును. అట్టి కర్మఫల మనుభవించుచు బద్ధునివలె జీవుడు భాసించును. పరమార్థముగ జీవుడు బద్ధుడుగాడు.

రామానుజీయము:—

స్త్రీపురుషుల కుండెడి పరస్పరకామము, రాగము; శబ్దాది విషయముల యందుండెడి కోరిక, తృష్ణ, పుత్రమిత్రాది బంధువులయం దుండెడి సంశ్లేషము సంగము. అట్లు కర్మలయందు గోరిక పుట్టించుటద్వారమున రజోగుణము జీవుని బంధించుచున్నది. అని రామానుజులు వ్యాఖ్యానించిరి.

ఇది నిస్సారము. ఒకే స్పృహను విషయభేదముచే ననేకవిధముల నిర్దేశించుట నిష్ప్రయోజనము. శబ్దాదివిషయస్పృహకంటె వేరుగ స్త్రీపురుషా న్యోన్యస్పృహ లేదు. ॥౭॥

శ్లో॥ తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్
ప్రమాదాలస్య నిద్రాభిః తన్నిబధ్నాతి భారత! ॥౮॥

అ॥ అజ్ఞానమువలన బుట్టిన తమస్సు సర్వప్రాణులకు వ్యామోహమును గలిగించును. ఈయది అజాగరూకతను మాంద్యమును నిద్రలను బుట్టించుచు జీవుని బంధించును.

ఇచట అజ్ఞానమనగా జ్ఞానాభావముకాని ప్రకృతికాదు. సత్త్వరజస్సులు కూడా ప్రకృతివలననే పుట్టుచున్నవి. అట్టితరి తమస్సు అజ్ఞానజమని చెప్పుట పాడిగాదు. అయితే జ్ఞానాభావమువలన భావరూపమయిన తమస్సు యెట్లు పుట్టునని యనరాదు. జ్ఞానాభావముగల ప్రకృతివలన బుట్టుటనుబట్టి జ్ఞానాభావమువలన బుట్టినట్లు వ్యవహరింపబడుచున్నది.

లేక చిదాభాసశూన్యమయిన అజ్ఞాన మిచట అజ్ఞానశబ్దమున కర్థము. సత్త్వరజస్సులకు కారణమగు అజ్ఞానము చిదాభాసపహితము. లేనిచో సత్త్వ రజస్సులయందు జ్ఞానసంగ మెట్లుండును? కర్మసంగమునకు కారణమగు రజస్సు యందుగూడ నాంతరీయకముగ జ్ఞానసంగము కలదు. జ్ఞానసంగప్రయుక్తకర్మ సంగముతో రజస్సు బంధకమనియు తృష్ణాసంగవ్యతిరిక్త జ్ఞానసంగముతో సత్త్వము బంధకమనియును భావము.

నిజస్థితిలో ఆవరణాత్మకముకాని ఆవరణశక్తిప్రధానముకానియగు ప్రకృత్యంశము యిచట అజ్ఞానమనబడును. ఆత్మానాత్మవివేకము మోహము. ఇట్టిమోహము సత్త్వరజస్సులయందుగూడ గలదు. కాని "వీడు ఆత్మ, ఇది యనాత్మ" అను వివేకాభావము సత్త్వరజస్సులవలన గలుగును. ఆత్మ, అనాత్మ అను వేరుగల పదార్థములనే తెలియకుండుట తమస్సువలన గలుగునని యీరెంటికిని భేదము.

ప్రమాదాలస్యనిద్రలు అంతఃకరణధర్మములు. వీనిని తనయం దారోపించుకొని జీవాత్మ బంధము నొందును. ఇట్టిబంధ మారోపితముకాని సత్యముగాదు.

పైమూడు శ్లోకములకును సాముదాయికాభిప్రాయ ముదాహరించబడు చున్నది.

ప్రకృతికార్యమయిన అంతఃకరణమందు సత్త్వాదిగుణత్రయము కలదు. అట్టి యంతఃకరణమునందలి సత్త్వాంశము దానికార్యములగు సుఖజ్ఞానములు— ఈ రెండును ఆత్మయందు దధ్యస్తములగుచు బంధకము లగుచున్నవి.

అట్లే అంతఃకరణమునందలి రజోంశము తత్కార్యములయిన తృష్ణా సంగములు దానివలన జేసెడికర్మలు,కర్మఫలములును ఆత్మయందు దధ్యస్తములగుచు బంధకము లగుచున్నవి.

అట్లే తమోంశము తత్కార్యములయిన ప్రమాదాదులు— ఈయవి అవిద్యచే ఆత్మయందు దధ్యస్తములగుచు ఆత్మకు బంధకము లగుచున్నవి. ఈ బంధ మంతయు ఆత్మకు మిథ్యకాని పరమార్థముగాదు. ||౮||

శ్లో|| సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత!
జ్ఞాన మావృత్యతు తమః ప్రమాదే సంజయత్యుత. ||౯||

అ|| అర్జునా! సత్త్వము జీవునిసుఖమునందు సంశ్లేషపరచుచున్నది. (ఆసక్తిని కలుగజేయుచున్నది.) రజస్సు కర్మలయందు సంగము నేర్పరచు చున్నది. తమస్సు ఆవరణశక్తితో జ్ఞానము నావరించి జీవుని ప్రమాదమునందు సంయోజించుచున్నది. ప్రమాదమన నప్పటికి సంప్రాప్తమయి చేయదగియున్న పనిని చేయకుండుట.

చేయదగినపనికంటె భిన్నమయినపనియందు ప్రవృత్తికి గారణమయినది ప్రమాదమని వివరించిరి. అది సరికాదు. కర్తవ్యాకరణమే ప్రమాదము. అనవహితచిత్తుడు తటస్థించియున్నపనినే చేయును. తటస్థించనిపని నెట్లు చేయును? ||౯||

శ్లో|| రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత!
రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా|| ||౧౦||

అ|| అర్జునా! సత్త్వము రజస్తమస్సులను దిరస్కరించి వృద్ధినొందును. తమస్సు సత్త్వరజస్సుల తిరస్కరించి వృద్ధినొందును. అనగా సత్త్వాదులు స్వభిన్న గుణముల నణగద్రొక్కి తమతమకార్యము నారంభించును.

రామానుజీయము :—

ఇచట రామానుజులు "సత్త్వాదయః ప్రకృతిసంసృష్టాత్మ స్వరూపానుబంధినః" సత్త్వాదులు ప్రకృతితోగూడిన ఆత్మస్వరూపము ననుసరించినవని యనిరి. వీ రిదివరలో నయిదవశ్లోకమును వ్యాఖ్యానించుటలో "దేహాకారపరిణత ప్రకృతిస్వరూపానుబంధినః" సత్త్వాదులు దేహాకారముగ పరిణామమునొందిన ప్రకృతియొక్క స్వరూపము ననుబంధించియున్నవని యనిరి. ఇపు డీశ్లోకమునం దాత్మ

స్వరూపానుబంధులని నిర్వచించిరి. ఇట్లు సర్వప్రవిసిద్ధముగ నిర్వచించిన వీరిమాటల వలననే వీరిమతమునందలి వైరస్యము వ్యక్తమగుచున్నది.

ప్రకృతిస్వరూపానుబంధులగు గుణములు ప్రకృతివిలక్షణమయిన ఆత్మ స్వరూపానుబంధు లగుట విరుద్ధము.

మరియు అసంగుడగు నాత్మ ప్రకృతిసంస్పృష్టుడగుట విరుద్ధము. నిరవయవునకు నితరపదార్థసంగ మసంభవము. ॥౧౦॥

శ్లో॥ సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే,
జ్ఞానం యదా తదా విద్యాత్ వివృద్ధం సత్త్వమిత్యుత। ॥౧౧॥

అ॥ ఈదేహమున శబ్దాదివిషయజ్ఞానమునకు ద్వారములగు చక్షురాదుల యందు బుద్ధివృత్తికి ప్రకాశము కలిగినపుడు సత్త్వము వృద్ధిజెందిన ట్లూహింప వలెను. జ్ఞానము సత్త్వకార్యము. ఇచట మూలమున జ్ఞానపదమునకు ప్రకాశపదము విశేషణ మొనర్చబడినది. ఆవిశేషణవిశేష్యములు పునరుక్తములు గావు. విశేషణ మయిన ప్రకాశపదము లేనిచో జ్ఞానపదము కేవల చైతన్యమును బోధించును. బుద్ధివృత్తిని బోధించదు. కేవలప్రకాశపదము సూర్యాది ప్రకాశమను బోధించును గాని జ్ఞానప్రకాశమును బోధించదు. ఈరెంటినుగలసి వృత్తిజ్ఞానమును బోధించును. కావున నీ విశేషణవిశేష్యములకు వైయర్థ్యముగాని పౌనరుక్త్యముగాని శంకింపవలదు.

శ్లో॥ లోభః ప్రవృత్తిరారంభః కర్మణా మశమః స్పృహా
రజస్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ! ॥౧౨॥

అ॥ గమనముమున్నగు సామాన్యవ్యాపనులు ప్రవృత్తి యనబడును. యజ్ఞాది విశేషకర్మల నాచరించుట యారంభము. నివృత్తిలేకుండుట యశమము. (అనగా హర్షరాగాదులయందు నిరంతర ప్రవృత్తి యశమమని భావము) సర్వసామాన్యములగు శబ్దాదులయందలి కోరిక, స్పృహా, పరద్రవ్యమునందలి యాస, లోభము— ఈయవి రజోగుణము వృద్ధిజెందినపుడు కలుగును.

ఇచట రామానుజులు, తనద్రవ్యమునందు త్యాగబుద్ధి లేకుండుట లోభమని వ్యాఖ్యానించిరి. ఈయది "కామస్యాంతం తు క్షుత్తృడ్భ్యాం క్రోధస్యాంతం ఫలోదయాత్, నరో యాతి న లోభస్య జిత్వా భుక్త్వా దిశో భువః" అను భాగవతవచనమునకు విరుద్ధమగుటవలన నుపేక్షింపదగును. ॥౧౨॥

శ్లో॥ అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహఏవ చ
తమస్యేతాని జాయంతే వివృద్ధే కురునందన! ॥౧౩॥

అ॥ తమోగుణము వృద్ధినొందినపుడు జ్ఞానములేకపోవుట, అప్రవృత్తి, ప్రమాదము, మోహము— అనునవి కలుగును. ॥౧౩॥

శ్లో॥ యదా సత్త్వే ప్రవృద్ధేతు ప్రళయం యాతి దేహభృత్
తదోత్తమవిదాం లోకా నమలాన్ ప్రతిపద్యతే॥ ॥౧౪॥

అ॥ అర్జునా! సత్త్వగుణము వృద్ధిచెందినపుడు దేహధారి మరణించి ఉత్తమలోకముల బొందును.

ఇచట రామానుజులు మూలమునందలి లోకశబ్దమునకు సమూహార్థమును జెప్పి "ఆత్మవేత్తలవంశములయందు బుట్టుదురని వ్యాఖ్యానించిరి.

ఇయ్యది నిస్సారము. భువనార్థముగ ప్రసిద్ధిజెందిన లోకశబ్దమునకు అప్రసిద్ధమగు సమూహార్థమును గల్పించుట, అందును మరల (కులేషు జాయతే) కులములయందు బుట్టునని యర్థమును వర్ణించుటయు నెంతేని యనుచితము.

శ్లో॥ రజసి ప్రళయం గత్వా కర్మసంగేషు జాయతే,
తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే. ॥౧౫॥

అ॥ రజోగుణము వృద్ధిజెందినపుడు మరణించిన జీవుడు కర్మసంగులగు మానవులలో బుట్టును. అట్లే తమోగుణము వివృద్ధమగుతరి మృతిచెందిన దేహి పశ్వాదిమూఢయోనుల జన్మించును.

ఇచట రామానుజులు "సత్త్వగుణము ప్రవృద్ధమయినపుడు మరణించినవాడు ఈలోకముననే తత్త్వవేత్తలగు మానవులయందు బుట్టుచు, పుణ్యకర్మల వాచరించుననియు రజోగుణము వృద్ధిజెందినపుడు మరణించినవాడు మానవలోకమున బుట్టి స్వర్గాదికర్మలయందు వ్యాపృతుడగుననియును వివరించిరి.

ఈయది నిస్సారము. సాత్త్వికులు పుణ్యకర్మల నాచరింతురనియు, రాజసులు స్వర్గాది కర్మల నాచరింతురనియునుగదా వారివివరణము. అట్టితటి స్వర్గాదికర్మలు పుణ్యకర్మలనియా, అపుణ్యకర్మలనియా వారియాశయము? స్వర్గాదికర్మలు అపుణ్యకర్మలనుట న్యాయ్యమగునా? ఆత్మయాథాత్మ్యజ్ఞానమునకు సాధనములగు కర్మలు పుణ్యకర్మలన్నచో యజ్ఞాది(స్వర్గాది)కర్మలుకూడ నట్టివియే. ఇక ఫలాభిసంధిలేనికర్మలు పుణ్యకర్మలన్నచో నయ్యవి పుణ్యకర్మలు కావు. పాపకర్మలును గావు. రెంటికి భిన్నములు. మరియు పాపకర్మలవలె పుణ్యకర్మలు కూడ దేవాదిజన్మల నొసంగుచు మానవుని బంధించును.

కావున స్వర్గాది సాధనములయిన యజ్ఞాదులనెడి పుణ్యకర్మలే ఫలాభిసంధి రహితములగుచు జ్ఞానసాధనము లగుచున్నవి. యజ్ఞాద్యతిరిక్తమయిన జ్ఞానసాధన పుణ్యకర్మలనునవి వేరుగ లేవు.

మరియు భగవంతుడగు శ్రీకృష్ణుడు, రజోగుణమునందు మరణించిన వానికి కర్మసంగమని వాగ్రుచ్చియుండ సత్త్వగుణమున మరణించినవారికి పుణ్యకర్మసంగమని రామానుజులు వ్యాఖ్యానించుటకు నేల సాహసించిరి? వీరికింతటి

యుచ్ఛృంఖల ప్రవృత్తియేల? కాన వీరి వివరణము నిరర్థకము.

శ్లో॥ కర్మణ స్సుకృతస్యాహుః సాత్త్వికం నిర్మలం ఫలమ్
రజసస్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్॥ ॥౧౬॥

అ॥ సాత్త్వికకర్మ నొనర్చినవాడు దేవత్వాది లక్షణమగు ఫలమును బొందును. రాజసకర్మ చేసినవాడు దుఃఖఫలమును బొందును. తామసకర్మ నాచరించువాడు పశ్వాదిలక్షణమయిన నజ్ఞానఫలము నొందును. అని వివేకము.౧౬

శ్లో॥ సత్త్వా త్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవచ
ప్రమాదమోహౌ తమసః భవతోఽజ్ఞానమేవచ॥ ॥౧౭॥

అ॥ ప్రవృద్ధమయిన సత్త్వమువలన జ్ఞాన మావిర్భవించును. ప్రవృద్ధమయిన రజస్సువలన లోభ ముదయించును. ప్రవృద్ధమయిన తమోగుణమున ప్రమాదమోహము లంకురించును.

శ్లో॥ ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థాః మధ్యే తిష్ఠంతి రాజసాః
జఘన్యగుణవృత్తస్థా అధోగచ్ఛంతి తామసాః॥ ॥౧౮॥

అ॥ దేహావసానపర్యంతము సాత్త్వికకర్మల నాచరించువారు మరణానంతరము దేవలోకములందు బుట్టుదురు. రాజసులు మనుష్యులయందు బుట్టుదురు. తమోగుణవృత్తులు పశ్వాద్యధోలోకముల నొందుదురు.

రామానుజులు "ఊర్ధ్వం గచ్ఛంతి" అను పదమునకు "ముచ్యంతే" ముక్తినొందుదురని వ్యాఖ్యానమొనర్చిరి. అది యుక్తముకాదు. "నాస్త్యకృతః కృతేన" అను శ్రుతిప్రమాణమునుబట్టి సాత్త్విక కర్మాచరణమునగూడ ముక్తి సంభవించదు. బ్రహ్మభావరూపమయిన ముక్తి యూర్ధ్వమున నుండదు. బ్రహ్మ పరిపూర్ణుడు. ॥౧౮॥

శ్లో॥ నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి
గుణేభ్యశ్చ పరంవేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి॥ ॥౧౯॥

అ॥ మరుమరీచికలయందు నీరు కలదను జ్ఞానమువలె కాలత్రయమందును ప్రకృతి కలదను జ్ఞానము మిథ్యాజ్ఞానము. మిథ్యాజ్ఞానము గలవానికి సుఖదుఃఖ మోహాత్మకములయిన గుణములయందు "నేను సుఖిని, దుఃఖిని, మూఢుడను" అను సంగమేర్పడును. ఇదియే (ఈసంగమే) దేవమనుష్య పశ్వాది జన్మలనొందుట యను సంసారమునకు గారణము. ఈ విషయము సూక్ష్మముగా వెనుకటియధ్యాయమున జెప్పబడినది. దానినే మరల యీ యధ్యాయమున "సత్త్వం రజస్తమఇతి గుణాః ప్రకృతిసంభవాః" అనుశ్లోకము మొదలుకొని యింతవరకు గుణములస్వరూపమును గుణములవ్యాపారమును అవి బంధింపజేయు విధానమును బద్ధున కబ్బుగతియు

మున్నగునవంతయు విస్తరించిచెప్పి యికమీదట సమ్యగ్దర్శనమువలన మోక్షమని శ్రీకృష్ణభగవానులు నిరూపించుచున్నారు.

అర్జునా! విద్వాంసుడు కార్యకరణ విషయాకారముగ పరిణమించిన గుణములకంటె వేరుగ కర్తలేడనియు ఆత్మ గుణవిలక్షణుడయిన సాక్షియనియు నెపుడు తెలిసికొనునో, ఆ విద్వాంసుడపుడు బ్రహ్మభావము నొందును.

అనగా అట్టివానికి "సర్వము వాసుదేవు"డను సర్వాత్మజ్ఞానము కలుగునని భావము.

ఇంక "సోఽధిగచ్ఛతి" అని వర్తమాన క్రియానిర్దేశముగలదు. బ్రహ్మభావప్రాప్తిరూపము కైవల్యము దేహపాతానంతరముగాని కలుగదు. అపుడు "మద్భావం సోఽధిగమిష్యతి" అని శ్రీకృష్ణులు చెప్పియుండవలెను. అట్లు చెప్పలేదు. కావున 'వాసుదేవస్సర్వ' మను సర్వాత్మజ్ఞానముకలిగి జీవన్ముక్తిదశలో నుండునని గ్రహించవలయును. కనుక ఈ శ్లోకము, దీనితరువాతిశ్లోకము నీరెండును జీవన్ముక్తిపరము అని గ్రహింపవలయును.

రామానుజీయము:—

సత్త్వమునందున్నవారికొక్క ఊర్ధ్వగమనప్రకార మీయీశ్లోకముచే చెప్పబడుచున్నదని రామానుజు లనిరి. ఈయది నిస్సారము.

"నేను జ్ఞానిని, నేను సుఖిని" అని సత్త్వకార్యములయిన జ్ఞానసుఖములను దనయం దధ్యసించుకొనెడివాడు సత్త్వస్థుడనబడును. నేను సుఖిని కానని యను సంధానము జేయువారు గుణాతీతులే యగుదురు. కావున నీయది జ్ఞానివిషయముగాని సాత్త్వికుని విషయము కాదు.

అయితే పూర్వము సాత్త్వికులే యిపుడు జ్ఞానులయిరికాన నీయది జ్ఞానివిషయమయినను సాత్త్వికవిషయము గావచ్చునని యనరాదు. అట్లైతరి వెనుక గృహస్థులే యిపుడు సన్న్యాసులయిరి. కాన సన్న్యాసివిషయమయిన దండ కమండలు శిఖాయజ్ఞోపవీత త్యాగాదులు గృహస్థవిషయము లగుచున్నవా? కాని వీరు సాత్త్విక విలక్షణులైన జ్ఞానులేయని నిర్ణయము. ॥౧౯॥

శ్లో॥ గుణానేతా నతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్
జన్మమృత్యు జరాదుఃఖై ర్విముక్తోఽమృతమశ్నుతే॥ ॥౨౦॥

అ॥ దేహధారి దేహమునకు గారణమయిన నీమూడుగుణముల నతిక్రమించి జన్మమృత్యుజరాదుఃఖములతో జీవించియుండియే విముక్తుడగుచు మోక్షము నొందును.

మట్టికి ఘటాకారము ఉపాధియయినట్లు సత్త్వరజస్తమస్సులు మాయకు నుపాధులు. దేహము సత్త్వాదిగుణములు పరిణామమగుటచేత నీగుణములు దేహమునకు గారణములు. జన్మమృత్యు జరలు మొదలగునవి దుఃఖహేతువులు కాన దుఃఖములే.

మిగిలిన రోగాదిప్రియుక్తదుఃఖములు దుఃఖశబ్దార్థములు.

ఓయి! గుణాతీతుడు బ్రతికియుండియే మృత్యువిముక్తుడగుచో, నింక జీవన్ముక్తునకు విదేహకైవల్య మెట్లు కలుగును ? జరావిముక్తుడగుచో జీవన్ముక్తు డెప్పటికిని యువకుడే. వార్ధక్యమే లేదు. ఈ రెండును కుదరవు. జీవన్ముక్తునకుగూడ వార్ధక్యమరణములు కనిపించుచున్నవి. కాన నిందుకు సమాధానమేమి ?

వినుము. " నేను దేహాదిరూపుడను గాను. బ్రహ్మరూపుడను. " అని తెలిసికొన్న జీవన్ముక్తునకు దేహాదులనంటియున్న జన్మాదులతో సంబంధ మెట్లుం డును? అజ్ఞాని దేహతాదాత్మ్యాధ్యాస వలనగదా "నేను పుట్టితిని" "నేను ముదుస లిని." "నేను మరణింతును" అని యనుకొనును. కావున అజ్ఞానమువలన ఆరోపించు కొన్న జన్మాదులతోటి యాత్మకు నాధ్యాసికసంబంధ ముండును. విద్వాంసుడు విద్యచే నాధ్యాసిక సంబంధమును బోగొట్టుకున్నాడు. కనుక జ్ఞాని జన్మాదివిముక్తు డని యనబడుచున్నాడు. కాని విద్వద్దేహమునకుమాత్రము జరామరణము లనివా ర్యము లగుటచే జీవన్ముక్తునకు విదేహకైవల్యము కలుగవచ్చును.

"న నిరోధో నచోత్పత్తిః నబద్ధో న చ సాధకః
న ముముక్షు ర్నవై ముక్త ఇత్యేషా పరమార్థతా"

అను గౌడపాదకారికను బట్టి విద్వద్దృష్టిలో బంధమోక్షములు లేవు. అజ్ఞానిదృష్టి లోనే యీ రెండు నుండును. అజ్ఞాని, విద్వచ్ఛరీరము ప్రాణముల ధరించియుండ, విద్వాంసుడు జీవన్ముక్తుడనియు, ప్రాణవియుక్తుడుకాగా విదేహముక్తుడనియు ననుకొనును. కాన నిందేమియు దోషము లేదు. ఇట అమృతపదమునకు బ్రహ్మ మర్థము. బ్రహ్మను బొందునని యర్థము.

రామానుజీయము :-

" అమృత మాత్మాన మనుభవతి, ఏషమద్భావ ఇత్యర్థః" (ఆత్మ నను భవించును. ఇదియే మద్భావము.) అని వివరించిరి. ఇది యనుచితము. వీరి మత మున ఆత్మ వేరు, ఈశ్వరుడు వేరు. ఇట్టితరి యాత్మానుభవము భగవద్భావము కానేరదు. ఈశ్వరు డాత్మానుభవము నొందినట్లు, జీవుడుకూడ నాత్మానుభవము నొందుచున్నాడను నర్థము. మద్భావ మను పదమున లభింపదు."మమ సాధర్మ్యమా గతాః" అని వెనుక జెప్పినదాని ననుసరించి యిచట మద్భావ పదమునకు మత్సా ధర్మ్యమని వ్యాఖ్యానము చేయగూడదు. అట్లయితే మద్భావ మను పదము నను సరించి వెనుకటి "మమ సాధర్మ్యం" అనుదానికే మ దభేదమను నర్థము నేల జెప్ప గూడదు ?

" పరమం సామ్యముపైతి దివ్యమ్ " అను శ్రుతిని బట్టి మద్భావ పద మునకు మత్సామ్యమని యర్థ మందురేమో ! "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" అను

శ్రుతినిబట్టి సామ్యశ్రుతికే అభేదార్థము నేల జెప్పగూడదు?

ఇక "యథోదకే శుద్ధే శుద్ధమాసిక్తం తాదృగేవ భవతి, మునేర్విజానత ఆత్మాభవతి గౌతమ" పరిశుద్ధమయిన నీరు పరిశుద్ధమయిన నీటిలో గలసినట్లు జ్ఞానియగు ఆత్మ పరమాత్మయే యగును.) అను శ్రుతికూడ జీవబ్రహ్మాభేదమునే చెప్పును.

జీవబ్రహ్మల కుపాధివలననే భేదము. ఉపాధి నాశానన్తరము జీవునకు బ్రహ్మైక్యమే సుస్థిరము. కడవలో బోసికొన్న గంగోదకమును కడవలోనుంచి మరల గంగలో బోయగా గంగాభేదమును జెందునుగాని గంగాసామ్యమును జెందదు. సామ్య మచట కనిపించదు కూడ. రెండు వస్తువులు విడిగానున్నపుడే సామ్యముండును. గంగలో జలరూపమయిన వస్తువొక్కటే కనిపించుచున్నది.

అట్లే ఈశ్వరచైతన్యమునుంచి జీవచైతన్యమును వేరుపరచునట్టి యంతఃకరణాద్యుపాధులు విద్యవలన నశించగా జీవచైతన్య మీశ్వరచైతన్యాభేదము నొందును. ఉపాధినాశానన్తరము రెండు చైతన్యములుండవు. కావున నుపాధి యున్నపుడే జీవేశ్వరులకు జ్ఞాతృత్వాది రూపమయిన సామ్యముండును. ఉపాధి లేనపు డట్టి సామ్యముండదు. కనుక ప్రకృతశ్రుతి జీవేశ్వరసామ్యమును జెప్పదు. అభేదమునే చెప్పును. ఘటము నశించిన పిదప ఘటాకాశ మహాకాశములకు సామ్యముండదు. తాదృక్ఛబ్దముయొక్క స్వారస్యమునుబట్టి యీశ్రుతి సామ్యపరమని చెప్పదగదు. తాదృక్ఛబ్దమునకుకూడ తదభేదమునందే తాత్పర్యము. న్యాయ విరుద్ధమయిన అర్థమునందు శ్రుతికి దాత్పర్యముండదు.

మరియు "పరేణ పరధర్మాచ భవత్యేవ సమేత్యవై" పరునితో గలసి పరధర్మము కలదియగును) అను వశిష్ఠ సంహిత ననుసరించి యీ శ్లోకమునకు సామ్యార్థమును స్వీకరింతుమని యనరాదు. జీవుడు ఉపాధిని విడచి పరునితో గలియునా? విడువక గలియునా? మొదటిపక్షమున "పరధర్మాభవతి" అను పదమునకు పరాభేదము నొందుననియే యర్థము. రెండవపక్షమున పరసదృశధర్మమనియే యర్థము. ఈ పక్షమున "సమేత్య" అనునది కుదరదు. భేదమయిన నుపాధియుండగా "తత్సంగతి" కుదరదు. నిరవయవాసంగచైతన్యమునకు ఘటపటములకువలె సాంగత్యము చెప్పదగదు.

ఇక నిచట శంఖచక్రాదులుగల యీశ్వరుడు పరశబ్దమున కర్థమన్నచో నపుడు "సమేత్య" అను పదమునకు సాన్నిధ్యమును బొంది అని యర్థము. అపుడు సగుణముక్తుడగు నీ జీవుడు శరీరేంద్రియములు గలవాడేకనుక నీశ్వరునితో శంఖచక్రాది మత్స్య రూపసాధర్మ్యమును బొందుట కడ్డులేదు.

కాన నీస్మృతి శ్రుతిశతసిద్ధమయిన జీవేశ్వరాభేదవాదమును నిరోధింప జాలదు.

మరియు "యోవై భూమా తదమృతం" అను శ్రుతి అమృతశబ్దమున సర్వవ్యాపకమగు బ్రహ్మను జెప్పుచుండ నాయర్థమును విడచి జీవబ్రహ్మభేదమును గల్పించి జీవుని వేరుగ గల్పించు రామానుజుల సాహస మేరికి నచ్చెరువును బుట్టించదు?

శ్లో॥ కైర్లింగై స్త్రీన్ గుణానేతా నతీతో భవతి ప్రభో
కి మాచారః కథంచైతాం స్త్రీన్ గుణా నతివర్తతే॥ ౨౧

అ॥ అర్జును డడుగుచున్నాడు. కృష్ణా! గుణత్రయాతీతుడగు విద్వాంసుని లక్షణములేమి? వాని యాచారమేమి? వా డీ సత్త్వాదిగుణముల నె ట్లతిక్రమించును?

౧. గుణాతీతుని లక్షణము లెవ్వి? యనునది మొదటి ప్రశ్న.

౨. వాని యాచారమేమి? అనునది రెండవప్రశ్న.

3. గుణముల నతిక్రమించుటకు సాధనమెద్ది? యనునది మూడవప్రశ్న.

ఇందు రెండవప్రశ్న మొదటిప్రశ్నలో జేరును. ఆచారవిశేషమే జీవన్ముక్తుని చిహ్నము. కాన నింక రెండుప్రశ్నలే మిగిలినవి

కనుకనే పై శ్లోకముయొక్క అవతరణికలో అర్జునుడు రెంటినే యడిగి నటుల వాగుచ్చిరి. ౨౧

అవ॥ ఇ ట్లర్జును డడిగిన రెండుప్రశ్నలకు శ్రీకృష్ణభగవానులు జవాబు చెప్పుచున్నారు.

శ్లో॥ ప్రకాశంచ ప్రవృత్తించ మోహమేవచ పాండవ!
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి॥ ॥౨౨॥

అ॥ ఓయి అర్జునా? గుణాతీతుడు "నా కవివేకము కలిగినందున నేను మూఢుడ నయితిని." తామసవృత్తిని ద్వేషింపడు. "నాకు కర్మలయందు బ్రవృత్తి కలిగినందున నేను స్వరూపమునుంచి భ్రష్టుడ నయితి" నని రజోగుణ వృత్తిని తూలనాడడు.

"నాకు శబ్దస్పర్శాదివిషయజ్ఞానము కలిగినందున నేను సుఖాసక్తుడ నగుచు బంధింపబడితి" నని సత్త్వగుణవృత్తిని తృణీకరించడు.

ఇట్లు సంప్రవృత్తములను (వచ్చిపడినవాటిని) యెట్లు ద్వేషింపడో అట్లే రానివాటిని కోరడు. ఇది జీవన్ముక్తుని లక్షణము. ఇయ్యది పరప్రత్యక్షము గాదు. కాన తాను జీవన్ముక్తుడయినది, లేనిది తాను నిర్ణయించుకొనుటకు మాత్రే మీ లింగ ముపయోగించును.

వీని హృదయమున నీ విషయములయందు ద్వేషమున్నదనికాని, యీ విషయములయందు గోరికయున్నదనికాని పరుడు తెలిసికొననేరడు. ఇది మొదటి ప్రశ్నకు జవాబు.

రామానుజీయము:—

రామానుజులు "అనిష్టములను ద్వేషింపడనియు, ఇష్టములను గోరడనియును" వ్యాఖ్యానించిరి. మూలమున నిష్టానిష్టపరములు లేనందున నీ వ్యాఖ్యానము యుక్తముకాదు. అజ్ఞులకు ప్రకాశాది కార్యముః లిష్టములు కావచ్చు. వాటియందు ప్రాజ్ఞులకు ఇష్టము లను జ్ఞానముండదు. ఇక మోహామునం దేరికిని యిష్టముండదు. నివృత్తమయిన మోహామును అజ్ఞానికూడ గోరడు. కాన అప్రసక్తమునకు నిషేధ మనుచితము. ॥౨౨॥

అవ॥ ఇంక రెండవప్రశ్నకు సమాధానము —

శ్లో॥ ఉదాసీన వదాసీనో గుణై ర్యో న విచాల్యతే
గుణావర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే॥ ॥౨౩॥

అ॥ గుణాతీతుడయిన విద్వాంసుడు ఉదాసీనునివలె మెలగుచు గుణములు గుణములయం దుండునను భావముతో నేమాత్రము చలింపడు.

ఇచట గుణాతీతున కౌదాసీన్యము ఆచారమని చెప్పినట్లయినది. జీవన్ముక్తున కౌదాసీన్యము విధియయినచో జీవన్ముక్తులయిన శ్రీకృష్ణ, వ్యాస, శుక, శంకరాదులకుగూడ నౌదాసీన్య మావశ్యకమగును. అపుడు బ్రహ్మసూత్రపురాణాదిరచన వ్యాసునకు, గీతోపదేశ దుష్టసంహారములు శ్రీకృష్ణునకు; భాష్యరచన, మతాంతఖండనలు శంకరునకు; పరీక్షితునకు భాగవతోపదేశ మొనర్చుట శ్రీశుకులకును పొసగెడిదికాదు. వేదాంతశాస్త్రమే సమూల ముచ్ఛిన్నమగును.

కనుక "స్వయంతీర్ణః పరాం స్తారయతి" అను న్యాయ మనుసరించి పరతారణముగూడ జీవన్ముక్తకృత్యమని విధింపబడినది. కనుకనే పైవారల కార్యాచర్యలు యుక్తమగుచున్నవి.

కనుకనే యిచటగూడ శ్రీకృష్ణుడు జీవన్ముక్తున కుదాసీనునివలె నుండుట యాచారమనిరి. ఉదాసీనునివలె నుండుటయనగా కర్మలయందు బ్రవర్తించకుండుటగాదు. ప్రవర్తించినను వానిఫల మంటకుండుట అనగా గుణకర్మలయందు కర్తృత్వాభిమానాదులు లేకుండుటయని భావము.

ఇందు కాధారముగ చిత్రదీపికయందలి విద్యారణ్యులవాక్యముల విలకింపుడు.

ఇందలి నాల్గవపాదమున "అవతిష్ఠతె" అని యాత్మనేపదమును బ్రయోగించినచో ఛందోభంగము కలుగును.

"అవతిష్ఠతి" యను ప్రకృతపాఠమున వ్యాకరణదోషము కలదు. ఆపాఠమున బాధితానువృత్తిమాత్రమే అనుష్ఠానమని యర్థము. కనుకనే కొన్నిప్రతులయందు "యో నితిష్ఠతి నేంగతే" అనుపాఠాంతరము కనిపించుచున్నది. "నితిష్ఠతి" యనగా

"నితరాం తిష్ఠతి" అనియర్థము. నాగరపుస్తకములలో ఆనందగిరి మధుసూదనీయాది వ్యాఖ్యలయందు "యోనుతిష్ఠతి" అనుపాఠాంతర మగుపడుచున్నది.

ఇందలి యచ్ఛబ్దమును వెనుకటిశ్లోకమున కనువృత్తిజేసి యీరెండు శ్లోకములను "గుణాతీత స్సఉచ్యతే" అను నుత్తరశ్లోకముతో నన్వయించుట న్యాయ్యమని తోచెడిని. ॥౨౩॥

శ్లో॥ సమదుఃఖ సుఖస్స్వస్థః సమలోష్టాశ్మకాంచనః
తుల్యప్రియా ప్రియోధీరః తుల్యనిందాత్మ సంస్తుతిః॥ ॥౨౪॥

అ॥ సుఖ మెట్లంతఃకరణధర్మమో దుఃఖము నట్లే యంతఃకరణధర్మమను తలంపుతో నిర్వికారముగ నుండువాడును, మట్టిముద్దయందు బంగారమునందును సమానమయిన బుద్ధిగలవాడును, (అనగా మట్టిముద్ద వలదనియు, బంగారము కావలెననియు దలంచనివాడని యర్థము) అట్లే యిష్టమయిన స్రక్చందనాదుల యందును అనిష్టములయిన దుర్గంధాదులయందును యథాక్రమముగ గ్రహణ పరిత్యాగబుద్ధులు లేనివాడును; ఆత్మదూషణము, ఆత్మభూషణము, ఈరెండును దేహవిషయములుగాని, ఆత్మవిషయములు గావను దలంపుతో నిందయందు ద్వేష బుద్ధియు స్తుతియందు ప్రేమబుద్ధియు లేనివాడును గుణాతీతు డనబడునని యుత్తర శ్లోకముతో నన్వయము. ॥౨౪॥

శ్లో॥ మానాపమానయో స్తుల్యః తుల్యో మిత్రారిపక్షయోః
సర్వారంభపరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే. ॥౨౫॥

అ॥ మానాపమానములయందు హర్ష విషాదములు లేనివాడును మిత్ర శత్రుపక్షములయందు సమానముగ నుండువాడును దేహాధారణార్థములయిన భోజనాదికర్మలను విడచి మిగిలినవాటి నన్నిటిని పరిత్యజించినవాడును గుణాతీతు డనబడును.

ఓయి! ఇం దుదాహరింపబడిన ఉదాసీనత్వాది ధర్మజాతము గుణాతీతు డగుటకు సాధనమా? లేక గుణాతీతునిలక్షణమా?

వినుము. ఉదాసీనత్వాది ధర్మజాతము ఎంతవఱకు ప్రయత్నసాధ్యమో అందరకు ననుష్ఠేయమగుచు ముముక్షువు గుణాతీతుడగుటకు సాధనమగును. ఆ ధర్మ జాతము స్థిరపడినపిదప స్వసంవేద్యమగుచు గుణాతీతునకు లక్షణమగును. కాన నొకేవిధమగు ధర్మము సాధ్యావస్థయందు గుణాతీతత్వ సాధనమును సిద్ధావస్థయందు గుణాతీతలక్షణమును నగుచున్నదని పరమార్థము. ॥౨౫॥

శ్లో॥ మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
సగుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయకల్పతే॥ ॥౨౬॥

అ॥ అర్జునా! యతికాని కర్మికాని అవ్యభిచరితమయిన భక్తియోగముతో

నారాయణుడ నగు నన్నెవడు సేవించునో, వాడు సత్త్వాదిగుణముల నతిక్రమించి మోక్షార్హుడగును. నారాయణు డనగా భూతసముదాయమునకు స్థానభూతుడని యర్థము. దీనివలన భక్తియోగము సులభమని సూచితమగుచున్నది.

ఇచట పై మూడుశ్లోకములచే జెప్పబడిన ఉదాసీనత్వాది ధర్మజాతము సన్న్యాసివిషయమా లేక కర్మివిషయమా? అని సందేహము.

౧. సర్వారంభపరిత్యాగము సన్న్యాసరూపముకాని కర్మరూపముకాదు.

౨. సన్న్యసించనివానికి యజ్ఞాదివిహితకర్మ పరిత్యాగము, ప్రత్యవాయ కరమగుటచే యుక్తముకాదు.

౩. సర్వారంభపరిత్యాగ మను బదమునకు సాంసారికములయిన సర్వకర్మలను విడచుట యను నర్థము. ప్రమాణరహితము. అందుసాంసారికమను విశేషణమును గల్పించవలసివచ్చును. సర్వపదముయొక్క స్వారస్యము చెడును.

౪. గృహస్థుడయినవాడు జీవనాధారములయిన వ్యవసాయాది సాంసారిక కర్మలను విడచుటకూడ సంభవించదు.

౫. గృహస్థునకు కృష్యాది సాంసారిక కర్మలను విడచి, బ్రతుకుటకు సన్న్యాసివలె భిక్షాటనాదులయం దధికారములేదు.

౬. విహితకర్మలే ఫలాభిసంధి లేనపుడు చిత్తశుద్ధిసంపాదకము లగు చుండ కర్మాధికారియగు గృహస్థునకు నట్టి కర్మలను విడచుట కధికారము లేదు.

౭. "ఋతౌ భార్యా ముపేయాత్" అను స్మృతిని పరిపాలింపదగిన గృహస్థునకు సాంసారికమగు మైథునకర్మను విడచుటకూడ ప్రత్యవాయజనకమగును.

కావున నీధర్మజాతము సన్న్యాసివిషయముకాని గృహస్థవిషయము కాదు. కాన నీ మూడు శ్లోకములు సన్న్యాసి విషయములు.

ఇట్లుండ "మాం చ యోఽవ్యభిచారేణ" అను శ్లోకముకూడ సన్న్యాసి విషయమని శంకింతురేమో యని భాష్యకారు లీ శ్లోకము సన్న్యాసి- అసన్న్యాసి విషయమని "యతిః కర్మీవా" అను వాక్యమున నిరూపించిరి.

ఓయి! ఇది తగదు. భక్తియోగము ద్వివిధము. కర్మాత్మకము, జ్ఞానాత్మకము, అని. ఇందు కర్మాత్మక భక్తియోగమున సన్న్యాసులకు, జ్ఞానరూపభక్తి యోగమున కర్ములకును నధికారముండదు. "యే వర్ణాశ్రమధర్మస్థా స్తే భక్తాః కేశవం ప్రతి"అను హారీతస్మృతి, కర్మరూపభక్తియోగ మున్నదనుటకు ప్రమాణము.

ఇందు జెప్పబడిన భక్తియోగము జ్ఞానరూపము. ఇందు కర్ములకె ట్లధికారముండును? "లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠా" అనికదా శ్రీకృష్ణుడు చెప్పెను. విద్వాంసులయిన సన్న్యాసులకు జ్ఞానయోగమనియు, అవిద్వాంసులయిన కర్ములకు కర్మయోగమనియును శ్రీకృష్ణుడు వ్యవస్థ జేసెను. భాష్యకారులుగూడ నిచ్చట ఇ ట్లంగీకరించిరి. ఆ భాష్యకర్తలే యిచ్చట తాము చెప్పినదానికి విరుద్ధముగ నేల

జెప్పిరి! "యతిః కర్మీవా" (సన్న్యాసికాని కర్మికాని) యని.

వినుము. అసన్న్యాసులు యోగులనియు, సన్న్యాసులు సాంఖ్యులనియును భాష్యకర్తల భావము. అందు యోగులు యోగవశమున తత్త్వవేత్తలగుచో సన్న్యాసమునయినను స్వీకరింతురు. రాజ్యమునయినను నేలుదురు. ఈ రెండు దశల యందును "అహం బ్రహ్మాస్మి" యను జ్ఞానాత్మక భగవద్భజనమును వీడరు.

సాంఖ్యులుమాత్రము తత్త్వజ్ఞానమును పొందినను తమ సన్న్యాసమును వీడి మరల గార్హస్థ్యమును గ్రహించి కర్మల నాచరించనేరరు. వారికి గార్హస్థ్య స్వీకారము దోషావహము. కాన తత్త్వవేత్తలయినను, అతత్త్వవేత్తలయినను సాంఖ్యులకు జ్ఞానయోగమునందే యధికారము. తత్త్వవేత్తలుకాని యోగులకు కర్మ యోగమునందే అధికారము. తత్త్వవేత్తలయిన యోగులకుమాత్రము ప్రారబ్ధానుసారముగ జ్ఞాన కర్మల రెంటియందును నధికారము.

ఇట్లైనచో తత్త్వవేత్తలయిన సాంఖ్యులకంటె, తత్త్వవేత్తలయిన యోగులే మెరుగుగదా? కానిమ్ము, మాకేమి? మాకు తత్త్వజ్ఞానమునందు పట్టుదలయేకాని సాంఖ్యులయొక్క తత్త్వజ్ఞానమునం దభినివేశము లేదు.

అయితే యోగులు తత్త్వవేత్తలగుచో సన్న్యసించనివారికికూడ వేదాంతశాస్త్రమునం దధికారమున్నట్లేకదా? ఈయది శ్రుతివిరుద్ధము. ఎట్లంగీకరింతురు?

నిజమే. సన్న్యాసులకే వేదాంతశాస్త్రాధికారము. సన్న్యాసులుకాని వారికికూడ ప్రారబ్ధవశమున వామదేవాదులకువలె శ్రవణాదికములేకుండగనే తత్త్వజ్ఞానమబ్బుచో వారికి వేదాంతశాస్త్రాధికారములేదని నిషేధించికాని యున్నదని ప్రతిపాదించికాని ప్రయోజనమేమి? అన్నము తిన్నవానినిగురించి నీ వన్నము తినవద్దని చెప్పుటలో ఫలమేమి?

కావున తత్త్వవేత్తలుకాని యసన్న్యాసులకే (సన్న్యాసీతరులకే) శ్రుతి వేదాంతశాస్త్రాధికారమును నిషేధించుచున్నది. తత్త్వవేత్తలయిన అసన్న్యాసులకుగాని అతత్త్వవేత్తలయిన సన్న్యాసులకుగాని వేదాంతశాస్త్రాధికారము నిషేధింపబడుటలేదు.

అతత్త్వవేత్తలు అసన్న్యాసులు నయిన బ్రాహ్మణులకు (ద్విజులకు) వేదాధికారముండుటచే వేదాంతశ్రవణాధికారముకూడ గలదని యొకచోట కనిపించుచున్నది. కావున దీని నింతటితో ముగింతము.

తత్త్వవేత్తకాని అతత్త్వవేత్తకాని యేయతి ధ్రువమయిన భక్తియోగముతో నన్ను (సర్వేశ్వరుని) భజించునో వాడు నిజస్థితిలో నింతకుమున్ను బ్రహ్మభూతుడయినను అజ్ఞానబలమున బ్రహ్మభావమునొందలేక జ్ఞానముచే నద్దానిని నశింపజేసికొని యిపుడు బ్రహ్మభావము నొంద సమర్థుడగును. ॥ ౨౬ ॥

శ్లో॥ బ్రహ్మణో హి ప్రతిష్ఠాహం అమృతస్యావ్యయస్య చ
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాంతికస్య చ॥ ॥౨౭॥

అ॥ పరమేశ్వరుని స్థిరమయిన భక్తియోగముతో సేవించువాడు గుణాతీతుడయి బ్రహ్మభూతుడగుటకు సమర్థుడగునని పూర్వశ్లోకమున జెప్పబడినది. అందుకుగారణ మీశ్లోకమున వివరింపబడుచున్నది.

ఓయి అర్జునా! నేను (అనగా అహంపదలక్ష్యమగు ప్రత్యగాత్మ) నాశరహితుడు, నిర్వికారుడు, నిత్యుడు, జ్ఞానయోగమనుధర్మముచే బొందదగినవాడు (అవ్యభిచరితానందరూపుడు)నగు పరమాత్మ కాధారభూతుడను. కాన మద్భక్తుడు బ్రహ్మభావము నొందుట కర్హుడగును.

"అహం, అమృతస్య, అవ్యయస్య, శాశ్వతస్య, ధర్మస్య, ఐకాంతికస్య, సుఖస్య, బ్రహ్మణః, ప్రతిష్ఠా" అని పదాన్వయము.

ఇచట పరమాత్మకు ప్రత్యకై్తతన్య మాధారమని తేలినది. ప్రతిపదార్థము తనస్వరూపమునందు తా నుండును. ఘటము స్వరూపభూతమయిన మృత్తుయందు గలదు కనుకనే "స్వే మహిమ్ని ప్రతిష్ఠితః" అని శ్రుతి చెప్పుచున్నది. భాష్యకారులుకూడ నిచట "ప్రత్యగాత్మ సమ్యగ్జ్ఞానముచే పరమాత్మగా నిశ్చయింపబడుచున్నాడ"ని యనిరి. కనుక పరమాత్మకు చైతన్యము స్వరూపమైనందున పరమాత్మ చైతన్యమునం దాధారపడియుండుట స్థిరము.

శ్లోకమునందలి "అహం" పదమునకు లక్ష్యార్థము పరమాత్మయగును. ప్రత్యగాత్మ యెట్లగునని శంకించదగదు. దేహత్రయములోపలనుండు చైతన్యము ప్రత్యగాత్మయనియు, దానివెలుపలనుండు చైతన్యము పరమాత్మయనియును, ప్రత్యగాత్మపరమాత్మలకు లోకవ్యవహారము కనిపించుచున్నది. ఈవ్యవహారమవిద్యాకల్పితమని మీరన్నచో పరమాత్మకు ప్రత్యగాత్మ యాధారమగుటకూడ నవిద్యాకల్పితమే యగును. జ్ఞానదశలో భేదవ్యవహారమునకు గారణమయిన దేహాద్యుపాధులు లేనందున ప్రత్యగాత్మ పరమాత్మ యను భేదవ్యవహారముండదు. కాన దేహత్రయములోపలగల చైతన్యమే పరమాత్మయొక్క స్వరూపముకావ పరమాత్మకు ప్రత్యగాత్మ యాధారమని చెప్పబడినది.

ఓయి! యెచ్చటనయినను ఘటాకాశమునకు మహాకాశ మాధార మగును గాని మహాకాశమునకు ఘటాకాశ మాధారమగునా? ఇది విరుద్ధముగదా? కాన పరమాత్మయే ప్రత్యగాత్మ కాధారము కావలయును. పరమాత్మ యపరిచ్ఛిన్నుడు కనుక అంతఃకరణ పరిచ్ఛిన్నుడగు ప్రత్యగాత్మ పరిచ్ఛిన్నుడుకనుకనే పరమాత్మ కాధారము గానేరడు. అనినచో నట్లుకాదు.

పరమాత్మవలె ప్రత్యగాత్మకూడ నపరిచ్ఛిన్నుడు. ప్రత్యగాత్మ పరిచ్ఛిన్నుడగుచో అనిత్యుడగును. దేహాదులతోటి లోపలనుండు చైతన్యమునకు పరిచ్ఛేద

మున్నప్పుడు ఆ దేహాదులతో వెలుపలనుండు పరమాత్మకు మాత్రము పరిచ్ఛేద మేల నుండదు?

మరియు దేహాదులలోపలనుండు చైతన్యము పరిచ్ఛిన్నమగుచో అపరిచ్ఛిన్నమగు పరమాత్మచైతన్యము దేహాదులయం దుండనక్కెక దా? దేహాదులయం దుండునా, అయ్యదికూడ పరిచ్ఛిన్నము కావలసినదే. ఇంక పరమాత్మచైతన్యము దేహాదులయందు లేకపోతే పరిపూర్ణ మెట్లగును? లోపల వెలుపల మధ్యనున్నది కదా పరిపూర్ణమగును. "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణస్థితః" అని కదా శ్రుతి. కాన ప్రత్యగాత్మ పరమాత్మలకు భేదములేదు. కావున ప్రత్యగాత్మ యపరిచ్ఛిన్నుడే. అతడు హృదయదేశమున కనుపడుచుండుటచే అంతరుడని వ్యవహరింపబడుచున్నాడు. ప్రత్యగాత్మ యహంకారాదులకు సాక్షియని విద్వాంసులు గ్రహించిరి. సాక్షిచైతన్యముచే నంతఃకరణాదులు భాసించుచున్నవి. సాక్షి మాత్రము తాను స్వయముగానే భాసించును. సాక్షి భాస్యమగుటచే ప్రపంచ మంతయు సాక్ష్యాశ్రయమని చెప్పబడుచున్నది. భాసకుడు భాస్యమున కాధారము. భాసకుడు లేనిదే భాస్యము స్ఫురించదు. కాన నీ ప్రపంచ మెట్లు సాక్షిభాస్యమో ప్రపంచాశ్రయమగు బ్రహ్మచైతన్యముకూడ సాక్షిభాస్యమే యగును. కాన అహంకారాశ్రయు డగు సాక్షిచేతనే ప్రపంచాధిష్ఠానమయిన బ్రహ్మ తెలియబడు చున్నాడు. కనుక పరమాత్మకు ప్రత్యగాత్మ యాధారమనుట యుక్తము.

ఇంతమాత్రముచే బ్రహ్మకు జ్ఞేయత్వము ప్రసక్తించదు. సాక్షి చైతన్యములకు స్వభాస్యత్వ ప్రయుక్త మయిన (తనచే తాను దెలియదగి యుండుటవలన నేర్పడిన) జ్ఞేయత్వ మెట్లులేదో అట్లే స్వాభిన్నసాక్షి భాస్యత్వప్రయుక్తమయిన (తనతో నభిన్నమయిన సాక్షిచే తాను భాసింపదగినవాడగుటవలన నేర్పడిన) జ్ఞేయత్వము గూడ బ్రహ్మకు లేదు.

అయితే పరమాత్మకూడ సర్వజ్ఞుడుకనుక స్వరూపచైతన్యముచేగాని, మాయావృత్తులతోగాని సర్వప్రపంచమును భాసింపజేయుచున్నందున సర్వసాక్షి యగుచున్నాడు. అయినను పరమాత్మయందున్న జగద్భానము మనకు ప్రత్యక్షము కాదు. ప్రత్యగాత్మయందలి జగద్భాసనము ప్రత్యక్షసిద్ధము.

లేక, పరమాత్మ సర్వమును ప్రకాశింపజేయువా డయినను సాక్షి భాస్యుడే. సాక్షియగు ప్రత్యగాత్మకూడ అంతఃకరణావచ్ఛిన్న చైతన్యమయిన ప్రమాతచే భాసింపదగినవాడే. కాన ప్రత్యగాత్మ పరమాత్మావభాసకుడు కనుక బరమాత్మ కాధారమగుచున్నాడు. పరమాత్మ ప్రత్యగాత్మచే తెలియబడుచున్నాడు.

లేక, ఈ శ్లోకమునందలి "అహం" అను పదమునకు గీతోపదేశమును జేయు శ్రీకృష్ణు డను నీశ్వరుడే యర్థము. కనుక నీశ్వరుడగు నేను బ్రహ్మకు ప్రతిష్ఠను. అనగా ప్రవృత్తిసాధన భూతుడనని యర్థము.

అనగా, బ్రహ్మ ఏ యీశ్వరశక్తిచే భక్తుల ననుగ్రహించుటకు సమర్థుడగుచున్నాడో ఆ శక్తి నేనె యని భావము. శక్తికి శక్తిమంతుల కభేదముండుటచే శక్తియే నేనని శ్రీకృష్ణుడు చెప్పెను.

ఈయది తత్త్వము. నిర్విశేషబ్రహ్మయే మాయోపాధికుడగుచు నీశ్వరుడనబడుచున్నాడు. మాయావచ్ఛిన్న చైతన్యము యీశ్వరుడని శాస్త్రసిద్ధాంతము. ఇందు చైతన్యాంశము బ్రహ్మమనియు, మాయ ఈశ్వరాంశమనియును తేలుచున్నది. కాన మాయకంటె వేరుగ నీశ్వరుడు లేడు. అట్లే యంతఃకరణముకంటె వేరుగ జీవుడున్నూ లేడు. అగ్నిశక్తి యగ్నికంటె వేరుగ లేనట్లు ఈశ్వరశబ్ద వాచ్యమయిన మాయాఖ్యశక్తి బ్రహ్మకంటె వేరుగాదు. కాన నీశ్వరుడనగు నేను బ్రహ్మనే అని నన్ను తెలియవలెను. ప్రత్యగాత్మపరమాత్మాభేదనిశ్చయరూప మయిన నీ జ్ఞానమువలన పరమాత్మశక్తియగు నీశ్వరునకు, ప్రత్యగాత్మశక్తియగు జీవునకును అభేదము సిద్ధించును. లేక తన శక్తియయిన నీశ్వరునినుంచి తనకు భయములేకుండుటయయినను కలుగును. ఇట్టి భయరాహిత్యమే మోక్షము.

ఇంతవరకు గడచిన గ్రంథమునుబట్టి మూలమునందలి అహం పదమునకు ప్రత్యగాత్మయని యొక యర్థము, ఈశ్వరుడని యొకయర్థము అని తేలినది.

ఇకమీదట పక్షాంతర మవలంబించి పదాన్వయము నిరూపింపబడుచున్నది. బ్రహ్మశబ్దమునకు సవికల్పక బ్రహ్మయర్థము. అహంశబ్దమునకు లక్షణచే నిర్వికల్పక బ్రహ్మమర్థము. సవికల్ప బ్రహ్మకు, నిర్వికల్పబ్రహ్మ యాధారమని సిద్ధించినది. బ్రహ్మ బ్రహ్మశబ్ద వాచ్యముకనుక సవికల్పకము. అహంపద లక్ష్యమవాచ్యముకనుక నిర్వికల్పము. నిర్వికల్పమునందుగూడ నిర్వికల్పకశబ్ద వాచ్యత్వము కలదుగదా యని ప్రశ్నింపరాదు. నిర్వికల్పక శబ్ద వాచ్యత్వము నిర్వికల్పకత్వమునకు కారణముగాని సవికల్పకత్వమునకు గారణముకాదు. కల్పితములకు అధిష్ఠానవస్తు వాధారము. సవికల్పకబ్రహ్మ కల్పితము కనుక నద్దానికి నిర్వికల్ప చైతన్య మధిష్ఠాన మనక తప్పదు.

అమృతత్వము, అవ్యయత్వము, నిత్యత్వము, జ్ఞానయోగ ప్రాప్యత్వము, ఐకాంతిక సుఖత్వము అనునవి ప్రకృత బ్రహ్మయందలి విశేషములని యీ శ్లోకము కంఠోక్తిగ జెప్పుచున్నది. ఇట్టి సవిశేష బ్రహ్మమునకు అహంపద లక్ష్యమగు నిర్విశేషబ్రహ్మ మాధారమని శ్రీకృష్ణుని యాశయము. ఇట్లు గ్రహించి ప్రవర్తించు విద్వాంసుడు బ్రహ్మభావము నొంద సమర్థుడగునని భావము.

కాన నీ శ్లోకమువలన

౧. నిర్వికల్పకచైతన్యమే యాత్మయనియు,

౨. బంధప్రపంచమువలె మోక్షాఖ్యబ్రహ్మము జీవన్ముక్తిసుఖము,

తత్సాధనమగు జ్ఞానయోగము, నిదియంతయు నిర్వికల్పకచైతన్యమునందు గల్పిత మనియు,

3. అట్లే ప్రత్యగాత్మపరమాత్మభేదము, ప్రత్యగాత్మయందు జీవుడు, పరమాత్మయం దీశ్వరుడును గల్పితమనియు,

౪. భక్తానుగ్రహాది సర్వద్వైతము నిర్వికల్పకచైతన్యమునందే కల్పిత మనియు,

౫. ప్రత్యగాత్మ పరమాత్మలకు జ్ఞాతృత్వ, జ్ఞేయత్వ ప్రయుక్తమయిన ఆధారాధేయభావము కల్పితమనియు,

౬. ఈకల్పనకంతకు అఘటఘటనాపటీయమగు మాయ కారణమనియు,

౭. ఇట్టి మాయ "అహంబ్రహ్మాస్మి" అను జ్ఞానమున నివర్తించుననియు,

౮. ఇట్లు తెలిసికొనిన విద్వాంసుడు ఆత్మరూపుడగు నారాయణుని భక్తి యోగమున భజించుచో బ్రహ్మభావము నొంద నర్హుడగుననియు,

౯. ఔదాసీన్యాది సాధనసంపన్నుడు క్రమముగా బ్రహ్మభావము నొందుననియు,

౧౦. కావున ఆత్మభజనమే జీవన్ముక్తి విదేహముక్తులకు రెంటికి సాధన మనియును నిరూపితమగుచున్నది.

శ్రీకృష్ణు డీ యధ్యాయారంభమున "ఉత్తమజ్ఞానమును జెప్పెద"నని యర్జునునితో బ్రతిజ్ఞచేసి "ప్రకాశంచ ప్రవృత్తించ" అను నిరువదిరెండవ శ్లోక మును మొదలుకొని యుత్తమజ్ఞానసాధనముల వివరించి "బ్రహ్మణోహమ్" అను తుదిశ్లోకమున నుత్తమమగు నాత్మజ్ఞానమును చెప్పెననియు నీ యాత్మజ్ఞానమునే యుత్తరాధ్యాయమున కృష్ణుడు వివరింపబోవుచున్నాడనియును గ్రహింపవలయును.

రామానుజీయము:—

"అహ మవ్యభిచార భక్తియోగేన సేవితోఽమృతస్యా వ్యయస్యచ బ్రహ్మణః ప్రతిష్ఠాఇతి" నేను అవ్యభిచరితమైన భక్తియోగముతో సేవింపబడుచు నాశరహితుడు, నవ్యయుడు నగు బ్రహ్మకు ప్రతిష్ఠయగుదును. అని రామానుజులు,

"జీవస్య ఫలదశాభావిత్వేన నిర్దిష్టం రూపమిహ బ్రహ్మశబ్దేనోపచర్యతే" జీవునకు ఫలావస్థయందు గలిగెడి రూప మిచట బ్రహ్మశబ్దముచే నుపచరింపబడు చున్నదని వేదాంతదేశికులును అనిరి. ఈయది యుక్తముకాదు.

ఫలావస్థలో జీవునకు ఉన్నరూపముకంటె వేరురూపమగుచో, జీవుడు సవికారుడును, అందువలన అనిత్యుడును నగును.

అణువగు జీవునకు, బృహత్త్వము ప్రాప్తించుచో, అణుత్వము నశించి నట్లు – అపుడు జీవునకు నాశము, బృహత్త్వము పుట్టినపుడు జన్మయు ప్రసక్తించును.

మరియు ఫలావస్థలో జీవునకుగలుగు బృహత్త్వమునకు జీవుడే యాశ్రయమగునుగాని, బ్రహ్మ కానేరడు. ఎవనిచే బృహత్త్వము పొందబడినదో వాడే బృహత్త్వమున కాశ్రయమగుట సహజము. ఇంక నీశ్వరునియందలి బృహత్త్వము జీవునకు ప్రాప్తించినదన్నచో నీశ్వరునకు బ్రహ్మత్వ ముండకపోవును. ఈశ్వరగత బృహత్త్వతుల్యమయిన బృహత్త్వము జీవునకు బుట్టినదన్నచో పుట్టినదానికి నాశ మావశ్యకముకాన మోక్ష మనిత్యమగును.

కనుక బంధావస్థలోనున్న బృహత్త్వమే అజ్ఞానావృతమయినందున, లేనిదానితో సమానమయి మోక్షదశలో అజ్ఞానము నశించనందున మరల స్ఫురించుచున్నది. కనుక బ్రహ్మయే జీవుడు, బ్రహ్మభూతుడయిన జీవునకు సగుణబ్రహ్మాధారత్వము వెనుకజెప్పిన ట్లవిద్యచే గల్పితమని తెలియవలయును.

అయితే, అవిద్య, విద్యనెట్లు కల్పించునను సందేహము మీకు కలుగవచ్చును. బుద్ధివృత్తివిశేషరూపమయిన విద్య అవిద్యాకల్పితమయిన బుద్ధియొక్క-పరిణామమగుటచే అవిద్యాకల్పిత మగుచున్నది. పరమార్థదశలో విద్యయే లేదు. అది యవిద్యాకల్పిత మెట్లగునని మీరు సందేహపడనేల? పరమార్థదశలో సుషుప్తియందుగాని, మూర్ఛయందుగాని మీరు విద్య ననుభవించుచుంటిరా?

కావున పరమార్థముగ అద్వితీయమగు బ్రహ్మమొక్కడే కలడు. బంధ, మోక్షవిద్యాదులన్నియు, నవిద్యావస్థయందు గల్పితములు. కనుక నద్వైతము స్థిరము.

ఇట్లు,

శ్రీ భగవద్గీతా భాష్యార్థ-ప్రకాశికానువాదమున

పదునాల్గవ యధ్యాయము ముగిసినది.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీ హయగ్రీవాయ నమః

# శ్రీభగవద్గీతా భాష్యార్క ప్రకాశికానువాదము

## పంచదశాధ్యాయము

అవ॥ లోకములోని కర్మలకు గర్మఫలమును, జ్ఞానులకు జ్ఞానఫలమును, నా స్వాధీనములో నున్నది. నన్ను భక్తియోగముతో సేవించువారు, నా యను గ్రహావశమున జ్ఞానమునొంది గుణాతీతులయి జీవన్ముక్తులగుచు, దేహపాతానన్త రము, విదేహకైవల్యము నొందుదురు. నన్ను భజించువారే మోక్షము నొందగా, నాతత్త్వమును బాగుగ దెలిసికొన్నవారు మోక్షము నొందుదురని వేరుగజెప్పనేల? అను నాశయముతో పార్థు డడుగకున్నను, కృష్ణు డాత్మతత్త్వమును జెప్పదలచి యీ యధ్యాయము నారంభించుచున్నాడు. అందు మొట్టమొదట వైరాగ్యము కలుగుటకు నీ ప్రపంచము నొకచెట్టుగా బోల్చి చెప్పుచున్నాడు. సంసారమునందు విరక్తి జెందినవానికే భగవత్తత్త్వజ్ఞానమునం దధికారముకాని, యితరున కధికారము లేదని భగవంతుని యాశయము!

శ్లో॥ ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయమ్,
ఛందాంసి యస్యపర్ణాని య స్తంవేద స వేదవిత్॥ ౧

అ॥ ఏసంసారవృక్షమును వేరు పైకి, కొమ్మలు క్రిందికి గల నాశములేని యశ్వత్థవృక్షమునుగా జెప్పుచున్నారో, దేనికి నాకులు వేదములో నాసంసార వృక్షమును దెలిసికొన్నవాడు వేదవేత్త యగును. లోకములో చెట్టు, వేరు, కొమ్మలు, ఆకులు కలిగియుండి, బీజాంకురన్యాయమున ప్రవాహరూపముతో ననాదియు, అనంతము నగుచున్నదో, అట్లే యీ సంసారముకూడ వేరు, కొమ్మలు, ఆకులు, కలదియై ప్రవాహరూపమున అనాదియు, ననంతము నగుచున్నది.

అవ్యక్త మాయాశక్తి విశిష్టమయిన బ్రహ్మ, సూక్ష్మమగుటవలనను గారణ మగుటవలనను నిత్యమగుటవలనను మహత్తగుటవలనను నూర్ధ్వము లేక నూర్ధ్వ మగు బ్రహ్మ పై నాలుగు కారణములచే సంసారమునకు మూలము. చెట్టుకుగూడ విత్తు మూలము. అది పరిమాణమున అల్పము. చెట్టు పుట్టుటకు గారణము మాటి మాటికి అంకురరూపమున, బీజరూపమున పరిణమించుచుండుటచే ప్రవాహనిత్యము, కార్యమయిన వృక్షరూపములో గొప్పదగుటచే మహత్తు.

అట్లే బ్రహ్మకూడ "అణోరణీయా న్మహతో మహీయాన్" అనుశ్రుతి వలన సూక్ష్మము, మహత్తు ననియు,

"యతోవా ఇమాని భూతాని" అను శ్రుతిచే కారణమనియు,

"అజో నిత్యశ్శాశ్వతోఽయం" అను శ్రుతిచే నిత్యమనియును జెప్పబడు చున్నాడు.

నిర్విశేషమగు బ్రహ్మము సంసారమూలము కానేరదు. మాయాశక్తియు క్తమగు బ్రహ్మ సంసారకారణ మగును. ఇందు అవ్యక్త, మాయా, శక్తి పదములు పర్యాయములు. కాన అవ్యక్తము, మాయ, యను పదద్వయముచే జెప్పదగిన శక్తితోగూడిన బ్రహ్మమని యర్థము. కాన మాయాశబలితబ్రహ్మ సంసార మూలమని పరమార్థము.

ఈయది "ఊర్ధ్వమూలోఽవాక్శాఖః ఏషోఽశ్వత్థ స్సనాతనః" అను శ్రుతి సిద్ధము.

మాయాశబలితమగు బ్రహ్మ సంసారవృక్షమునకు కారణమనియు, అవ్యక్త బ్రహ్మయొక్క యనుగ్రహమున సంసారవృక్షము వృద్ధినొందుననియు, దీనికి బుద్ధి స్కంధమనియు, ఇంద్రియగోళకములు తొర్రలనియు మహాభూతములు నలుదిక్కుల శాఖలనియు శబ్దస్పర్శాదివిషయము లాకులనియు, ధర్మాధర్మములు పూవులనియు, సుఖదుఃఖములు పండ్లనియు, ఈయది సర్వప్రాణుల కాధారమనియు ఇది యనాది సిద్ధమయిన బ్రహ్మవృక్షమనియు, ఈయది రేపటికిగూడ నుండునను నమ్మికకలది కానందున అశ్వత్థమను పేరును బడసినదనియును, ఇయ్యది జీవరూపమయిన బ్రహ్మకు భోగ్యమనియును, దీనిని "అహంబ్రహ్మాస్మి" యను జ్ఞానఖడ్గమున ఛేదించిన నశించుననియు నావల మరల బుట్టదనియును పురాణములు చెప్పుచున్నవి.

శ్లోకార్థము = ఊర్ధ్వమున నున్న బ్రహ్మ సంసారవృక్షమునకు మూలము. దిగువనున్న మహదహంకారాదులు శాఖలు, సంసారమునం దుండెడి దేహాదులు తప్పక యుత్తరక్షణమం దుండు నను నమ్మికలేనందున దీని కశ్వత్థమను పేరు సార్థకము; అయినను ప్రవాహరూపమున నిత్యముగా నుండుటచే నవ్యయము. ఈ సంసారవృక్షమును ఋగాది వేదత్రయము ధర్మాధర్మములను పుణ్యాపాప కర్మలను స్వర్గనరకాదిఫలములను ప్రతిపాదించుచు గాపాడుచున్నందున మూడు వేదములు దీనికి ఆకులు. ఇట్టి సంసారవృక్షమును సమూలము తెలిసికొనినవాడు వేదార్థమును దెలిసికొన్నవాడగును.

లోకానుభవమున సంసారము క్షణములో మారుచున్నను, దానికి గారణ మయిన మాయ యనాదియగుటవలన సంసారముకూడ ప్రవాహరూపమున ననాది యగుచున్నది.

స్థూలదేహము నశించినను సూక్ష్మదేహముమాత్రము ప్రళయకాలమందుగూడ నశించకనుండుట శ్రుత్యనుభవసిద్ధము. కాన నీరూపమున సంసార మవ్యయము.

వైదికులందరు సాధారణముగ వేదమును జదువుచున్నారు. కాని వారు దానియర్థమును దెలియరు. అర్థజ్ఞానములేని వేదాధ్యయనము ప్రయోజనకారి కాదు. వేదార్థమును దెలిసికొన్నవానికిగాని సంసారమూలమయిన బ్రహ్మ మంతుపట్టదు. కనుక వేదార్థమును దెలియుట యావశ్యకమని భావము.

లోకములో దృక్, దృశ్యము అను పదార్థములు రెండే కలవు. బ్రహ్మ దృక్కు. మాయ తత్కార్యమగు ప్రపంచము- దృశ్యము. కాన సంసారమూలమగు బ్రహ్మను, ప్రపంచరూపమగు సంసారమును దెలిసికొనినపిదప దెలియదగినవస్తువే లేదు. యజ్ఞాదికర్మలు, ఉపాసనాదులు, ఇవన్నియు సంసారమునందే చేరును. కాన సర్వవేదార్థవేత్త సర్వజ్ఞు డనదగును.

రామానుజీయము :

"ఏడులోకములయొక్క పైభాగమందున్న చతుర్ముఖు డాదియగుటచే నాత డూర్ధ్వమూలమనియు, పృథివీలోకమందున్న సర్వమనుష్య పశు మృగ క్రిమి కీట పతంగాదులన్నియు చివరవగుటచే కొమ్మలనియును, సంసారము వేదము గాకున్నను సంసారముదెలిసికొన్నవాడు వేదవేత్తయే యనియు వేదము సంసార వృక్షమును ఛేదించు నుపాయమును జెప్పుననియు వృక్షముయొక్క స్వరూపజ్ఞానము ఛేదనోపాయమునం దుపయోగపడుననియు గాన సమూలసంసారవేత్త వేదవేత్త యగుచున్నాడనియును జెప్పిరి.

ఇది యనుచితము –

చతుర్ముఖుడు జగద్రూపమగు సంసారమున కాదియా? దేహరూపసంసారమున కాదియా? సుఖదుఃఖానుభవరూపసంసారమున కాదియా? ఇందు రామానుజుల యాశయమెద్ది?

౧. "జన్మాద్యస్య యతః" అను సూత్రము ఈశ్వరుడు జగత్కారణమని చెప్పుచు నీశ్వరునకు జగదాదిత్వమును స్థాపించినందున పై వికల్పములలో మొదటిది నిలువదు.

౨. దేవమనుష్యాది దేహములకు చతుర్ముఖుడు ఆది (కారణ) (య) (మ)యినను చతుర్ముఖదేహమునకు చతుర్ముఖుడు కారణముగానందున రెండవ వికల్పము కుదురదు.

3. చతుర్ముఖునకుగూడ సుఖదుఃఖానుభవ ముండుటచే దానికి తాను కారణము గానందున మూడవ వికల్పము కుదరదు.

తనకనర్థమయిన సంసారమును తాను సృజించుకొనడు,

ఇంక "ఆది" శబ్దమునకు కారణమని యర్థము కాదనియు, అవయవమని యర్థమనియు చెట్టుకు ఆది మధ్య అంతభాగము లెట్లుకలవో అట్లె ప్రపంచమునకు గూడ చతుర్ముఖుడు ఆదిభాగమనియు పృథివీలోకమందలి మనుష్యాదులు మధ్య భాగమనియు, పాతాళవాసు లంతభాగమనియు నన్నచో నదియును నిలువదు.

అట్టితఱి చతుర్ముఖలోక నివాసులందఱు నుండ చతుర్ముఖు డొక్కడే ఆదిభాగ మెట్లగును?

మరియు చెట్టు నాశ్రయించుకున్న పక్షులు, పురుగులు నెట్టివో ప్రపంచము నాశ్రయించుకున్న చతుర్ముఖాది ప్రాణులుకూడ నట్టివారేకాని స్కంధశాఖాది స్థానీయులు కారు. సత్యాదిలోకములే ఆది మధ్య అంతభాగము లగును. కాన ప్రపంచమునకు సత్యలోక మాదియనియు భూలోకము మధ్యభాగమనియు, పాతాళ లోకము అంత్యభాగమనియు లేక స్వర్గ మర్త్య పాతాళలోకములు ఆది మధ్య అంత్యభాగములని యయినను చెప్పవలయును. ఇంతియేకాని ప్రపంచమునకు చతుర్ముఖు డాదియని చెప్పదగదు.

మరియు రామానుజులు ఊర్ధ్వశబ్దమునకు ఆద్యవయవము అర్థమనినచో అధశ్శబ్దమునకు మధ్యావయవ మర్థమందురా? అంతావయవ మర్థమందురా? లేక నుభయ మర్థమందురా?

౧. "స్థావరాంతతయా" అని వారే వ్రాసినందున స్వవచోవ్యాఘాత మగును కాన మధ్యావయవ మన వీలులేదు.

౨. పృథివికాని యందుండుచెట్లుకాని కొండలుకాని ప్రపంచవృక్షమున కంత భాగములు కావు. కాన రెండవ వికల్పము పొసగదు.

3. ఆయభిప్రాయముతో మీరు పృథివియందలి మనుష్యులు మధ్యభాగమనియు పాతాళమునందలి సర్పాదులు అంత్యభాగములనియు గాన "అధశ్శాఖలు" అని చెప్పనందున మూడవవికల్పము నిలువదు.

మరియు రామానుజులవ్యాఖ్యకు "ఊర్ధ్వమూలోఽవాక్శాఖం" అనుశ్రుతియు "అవ్యక్తమూలప్రభవః" అను పురాణశ్లోకమున్ను విరోధించును.

కాన ఊర్ధ్వమగు బ్రహ్మ ప్రపంచమునకు గారణమనియే వ్యాఖ్యానించ వలయును.

అయితే మీకు మాత్రము మాయ కారణమనిచెప్పు పురాణము విరోధించదా? అని యనరాదు. శక్తి, శక్తిమంతులకు భేదములేదని యెన్నిసారులో జెప్పితిమి. కేవల బ్రహ్మకాని కేవలమవ్యక్తము కాని ప్రపంచకారణము కానేరదు.

అవ్యక్తముతోగూడిన బ్రహ్మకాని బ్రహ్మ నాశ్రయించుచున్న యవ్యక్తముకాని ప్రపంచకారణ మగును.

మరియు సంసారములో చేరియున్న వేదముకూడ సంసారమగుచుండ వేదము సంసారము కాదని రామానుజు లనుటయు పొసగదు. వేదము సంసారవృక్షచ్ఛేదోపాయమును జెప్పుచున్న దనుటయు పాడికాదు. వేదము సంసారవృక్షము పెరిగెడి యజ్ఞాదికర్మలనుగూడ జెప్పుచున్నది. కాన వారివివరణ మసంగతము. ౧

శ్లో॥ అధశ్చోర్ధ్వం ప్రసృతా స్తస్యశాఖా గుణప్రవృద్ధా విషయప్రవాళాః,
అధశ్చ మూలా న్యనుసంతతాని కర్మానుబంధీని మనుష్యలోకే॥ ౨

అ॥ మనుష్య, పశు, పక్షి, సర్ప, క్రిమి, కీట, మత్స్య, కచ్ఛప, తరు, గుల్మ, లతాదులు దిగువనుండు వస్తువులు. (పదార్థములు)

గరుడ, గంధర్వ, యక్ష, రక్షః, పితృ, మాతృ, గణ, సిద్ధ, సాధ్య, చారణ, దేవ, దానవ, చతుర్ముఖాదులు ఊర్ధ్వశబ్దార్థములు.

ఇట్లు "అధః ఊర్ధ్వం" అను పదద్వయమువలన బ్రహ్మాదిస్థావరాంత సర్వప్రాణిసమూహము సంగ్రహింపబడినది. ఈ సకలప్రాణులు కర్మోపాసనలకు ఫలభూతులు. వీరు సంసారవృక్షమునకు నలుదిక్కుల వ్యాపించిన కొమ్మలవంటివారు. సత్వరజస్తమోగుణములచే వృద్ధినొందిరి. శబ్దస్పర్శరూపరసగంధములను విషయములు వీటికి చిగురుటాకులు.

మనుష్యాది స్థావరాంతమయిన జంతుసంతతిగల స్థానములు, అధశ్శబ్దార్థములు. బ్రహ్మాది మనుష్యాంతజంతుసంతతిగల స్థానములు ఊర్ధ్వశబ్దార్థములు. "మనుష్యాది" అనునది తద్గుణసంవిజ్ఞాన బహువ్రీహి "మనుష్యాన్తం" అనునది యతద్గుణసంవిజ్ఞానబహువ్రీహి.

పాతాళలోకసహితమగు పృథివి యధశ్శబ్దార్థమనియు సత్యాదిలోకసహితమయిన స్వర్గలోకము ఊర్ధ్వశబ్దార్థమనియును తాత్పర్యము. కావున స్వర్గమర్త్యపాతాళలోకములందున్న ప్రాణులందరు సంసారవృక్షముయొక్క ఊర్ధ్వభాగములందు వ్యాపించియున్న కొమ్మలని పరమార్థము.

ఓయి! ఈప్రాణులందరు సంసారవృక్షమునకు కొమ్మలుకదా? సంసారమనగా నేమి?—ప్రపంచమా? దేహమా? సుఖదుఃఖాద్యనుభవమా? ఇందు మొదటిపక్షము నిలువదు. ప్రపంచమనగా లోకములు. అయ్యవి సంసారవృక్షమునకు గొమ్మలు. రెండవపక్షమున్ను కుదరదు. దేహమను సంసారమునకు సర్వభూతములు కొమ్మలగుట యసంభవము. మూడవ వికల్పమున్ను నిలువదు. సుఖ

దుఃఖాది సంభోగము ప్రాణుల నాశ్రయించుకొని యుండును. కాని దానికి ప్రాణ ముండదు. అనినచో వినుము. జన్మమరణాది లక్షణమయిన సుఖదుఃఖాది సంభోగమే సంసారము. సంసారముకల ప్రాణులందరు యిట్టిసంసారము నాశ్రయించుకొని యున్నారు. కాన కొమ్మలకు చెట్టు ఆశ్రయమయినట్లు ప్రాణులకు నీయది యాశ్రయ మగుచున్నందున నిదియే సంసారము. ప్రాణులకు సంసారమునకును భార్యాభర్తలకు వలె పరస్పరము ఆశ్రయాశ్రయిభావము గలదు. కాన ప్రాణుల నాశ్రయించుకొని యున్న సుఖదుఃఖానుభవరూపసంసారము ప్రాణుల కాశ్రయము కాగలదు.

లేక అవిద్యామయము సంసారము. ప్రాణులందరు నీవిద్య నాశ్రయించి యున్నారు. కాన నవిద్యామయము సంసారము కాగలదు.

లేక ప్రపంచమే యిచట సంసారశబ్దార్థము. ప్రపంచము లోకమయము భూతమయమును అగుచున్నది. కాన లోకములవలె లోకమునందలి ప్రాణులుకూడ దానికి కొమ్మలగుచున్నారు. లేక ప్రాణులందరు తామున్నలోకముల ద్వారమున సంసారవృక్షమునకు గొమ్మలగుచున్నారు.

లేక ప్రపంచము వృక్షము. లోకములు స్కంధమునకు పై భాగమున బుట్టు లాపైన కొమ్మలవంటివి. లోకములోని ప్రాణులు, ఆకొమ్మలచివరనుండు చిన్నచిన్న రెబ్బలవంటివారు : (అనగా సూక్ష్మ, సూక్ష్మతర, సూక్ష్మతమమయిన వృక్షావయ వము లని యర్థము).

✓ ఈ సంసారవృక్షమునకు మాయాశబలితబ్రహ్మ కారణ మని లోగడ శ్లోకమున జెప్పబడినది.

ఇందు మనుష్యులయందలి రాగద్వేషాదివాసనలు సంసారవృక్షమునకు అవాంతరమూలము లని చెప్పబడుచున్నది.

కాన అజ్ఞానము మూలముగా గలదియు, పూర్వకర్మవాసనలచే వృద్ధినొంది నదియు, జన్మమరణాది ప్రయుక్తమయిన సుఖదుఃఖాద్యనుభవము ప్రాణులకు సంసారమని యీ రెండుశ్లోకములకు ఫలితార్థము.

ఈ శ్లోకమున మతాంతరులతోటి పెక్కువిరోధము లేదు. ౨

శ్లో॥ నరూపమస్యేహ తథోపలభ్యతే నాంతో నచాది ర్నచ సంప్రతిష్ఠా ।
అశ్వత్థమేనం సువిరూఢమూలం అసంగశస్త్రేణ దృఢేనఛిత్వా॥

అ॥ ఈసంసారమునకు రూపము వర్ణించిన ట్లగపడదు. దీని కాదిమధ్యావసాన ములు లేవు. బాగా వేరులు పాదుకొనియున్న నీయశ్వత్థవృక్షమును వైరాగ్యమను శస్త్రముతో ఛేదించి పునరావృత్తిరహితమయిన స్థానమును వెతకుకొనవలయును.

సంసారవృక్షముయొక్క స్వరూపము వర్ణించినట్లు సత్యముగ విద్యాదశలో నగపడదు. మిథ్యగా గనిపించును. సాంసారికవస్తువులు కలలోని వస్తువులవంటివి. ఇంద్రజాలికునిచే జూపబడిన వస్తువులవంటివి. ఇవన్నియు దృష్టనష్టస్వరూపములు

వ్యావహారికసత్యమగు వస్తువులు వాటిరూపముతో నెల్లప్పుడు గోచరించును. ప్రాతిభాసికము లట్లుండవు. ప్రాతిభాసికమగు సర్పము యొకపుడు సర్పముగాను, మరొకపుడు త్రాడువలెను గోచరించును.

అట్లే వ్యావహారికఘటమునకు కర్రదెబ్బతో నాశము కలదు. ప్రాతిభాసిక సర్ప మట్లు జావదు. రజ్జు జ్ఞానముచే నశించినట్లగుపడినను మరల లేజీకటి క్రమ్మ గొనగనే, త్రాడు వెంటనే పామగును. అట్లే వ్యావహారికఘటమునకు ఆది కలదు.

కుమ్మరి యిప్పు డీకుండను నిర్మించినట్లు మనము చూచుచున్నాము. అట్లు స్వాప్నిక పదార్థమున కాది కనిపించదు. అట్లే మధ్యకాలముకూడ ప్రాతిభాసికము నకు లేదు.

ఇట్లు ప్రాతిభాసికపదార్థమున కాదిమధ్యావసానములు లేకపోవుచుండ సంసా రమునకుగూడ నవి లేనట్లు సిద్ధించును. సంసారము అజ్ఞానులదృష్టిలో వ్యావహారిక ముగ నున్నను తత్త్వజ్ఞానులదృష్టిలో సర్వము కల్పితము కాన ప్రాతిభాసికమే యగుచున్నది.

ప్రత్యేకముగ నొక్కొక దేహమున కాదిమధ్యావసానము లున్నను, పూర్వ కర్మవశమున జరుగు జన్మమరణ లక్షణ సంసారమునకు కాదిమధ్యావసానములు లేవు.

దృష్టనష్టస్వరూపముకనుక దేహము ప్రాతిభాసికము. సుషుప్త్యాద్యవస్థల యందు సంసారమునకు నాశ మనుభవగోచరము. సంసారమున కజ్ఞానము మూల మయినను జన్మకాలము తెలియబడనందున ననాది యగుచున్నది.

కాని యీశ్వరునకుమాత్ర మయ్యది గోచరమగునా ? కాదా ? కానిచో నీశ్వరుడు అసర్వజ్ఞుడగునుకదా ? నిజమే.

ఈశ్వరుడు చిన్మాత్రుడా ? మాయామయుడా ? ఇందులో నెవడు సర్వజ్ఞు డని నీయాశయము ? చిన్మాత్రుడు సర్వజ్ఞుడన్నచో నిర్ధర్మకుడయిన చిన్మాత్రుని యందు సర్వజ్ఞత్వరూపధర్మము ప్రసక్తించును. రెండవపక్షమున నీశ్వరుడుకూడ మాయామయుడేకాన వానికి మాయామయసంసారముయొక్క జన్మ యెట్లు తెల్లమగును ? అయితే యీశ్వరు డసర్వజ్ఞుడగునుగదా ?

కాదు తెలియదగినదానిని తెలియకపోయినచో సర్వజ్ఞత్వమునకు భంగము తెలియదగనిదానిని తెలియనందున సర్వజ్ఞత్వమునకు భంగము లేదు.

అయితే సంసారమును పుట్టించిన యీశ్వరునకు దానిజన్మ తెలియకుండు టెట్లని మీ రడుగవచ్చును. ఈశ్వరుడు వెనుకటిసంసారమును జూచి మున్ముందు సంసారమును సృజించుచున్నాడు. కాన నిందు దోషము లేదు. అట్లు కానిచో యీశ్వరునియందు వైషమ్య నైర్ఘృణ్యాది దోషములు ప్రసక్తించును.

మరియు అజ్ఞానమునందు వాసనారూపముతో నున్న సంసారమే అజ్ఞానము నుంచి పుట్టుచున్నది. ఇట్టిస్థితిలో సంసారము అజ్ఞానమూలమయినంతమాత్రమున నీశ్వరునకు దానియాది యెట్లు తెలియును? దాని కాదియే లేదుకదా? లేని కుందేటికొమ్మును తెలియనందున నీశ్వరుడు అసర్వజ్ఞుడగునా?

కాక ఈ సంసారమునకు కేవల మవిద్య హేతువుకాదు. అవిద్యాచిత్తులకు సంయోగము కారణము. ఆసంయోగము అనాది. దానివలనబుట్టిన సంసారముకూడ ననాదియే. ఎప్పు డారెంటికి సంయోగము తటస్థించినదో అప్పుడే సంసారము ప్రవర్తించినది. కాన పుట్టినదైనను సంసార మనాదియే యని గ్రహింపవలయును.

సన్న్యాసాశ్రమమును స్వీకరించి వైరాగ్య శమదమాదులచే రాగద్వేషాదు లనెడి సంసారవృక్షమూలముల ఛేదించి ఆత్మానాత్మవివేకజ్ఞానమున సంసారవృక్ష మునకు ప్రధానమూలమగు నజ్ఞానమును పెకలించి యావల పునరావృత్తిరహిత మగు స్థానమును వెతకవలయును.

రామానుజీయము :

సంసారవృక్షమునకు చతుర్ముఖు డాదియగుటచే నూర్ధ్వమూలమనియు మనుష్యు లగ్రమగుటచే గ్రిందిశాఖలనియు చెప్పిరి.

ఇది సరికాదు.

చతుర్ముఖు డాదియయినచో స్థావరములు అగ్రమగునుగాని మనుష్యు లగ్ర ములు కారు.

మరియు రామానుజులు మనుష్యులుచేసిన కర్మలవలన నూర్ధ్వాధోభాగముల యందు గొమ్మలు వ్యాపించినవని యనిరి. ఇదియు నుచితముకాదు. మానవసృష్టికి పూర్వముకూడ పశ్వాదిసృష్టి యుండవచ్చును. పశ్వాదులుకూడ నీ వృక్షమునకు గొమ్మలు. ఈయవి మనుష్యకృతకర్మలవలన నేర్పడుట దుర్ఘటము.

అట్లె సంసారులు దీనిరూపమును తెలిసికొన నేరరనుటయు నుచితముకాదు.

ఈ సంసారులు, వేదవేదాంగాధ్యయన సంపన్నులా? లేక మూర్ఖులా? మొదటిపక్షమున, వారికి దీనిరూపము తెలియును. రెండవపక్షమున, నాస్తికజనుల యొక్కమతమును నిట వర్ణించుటలో ప్రయోజనమేమి?

ఆస్తికులలోగూడ నస్నైదికులు సంసారమూలమును దెలియలేరన్నచో, దానివలన మనకు ఫలమేమి? అంతకంటె మూఢుడగు బాలుడు తాను మనుష్యుడని, దేవదత్తుడనియు దెలియజాలడు. దాని కేమందుము?

మరియు, అంతశబ్దమునకు రామానుజులు చూపినయర్థము అసంగతము. అంతమనగా, గుణమయభోగాసంగకృతమని వివరించిరి. ఈయర్థ మెట్లు వారికి లభించినది? మూలమునందలి తథా అనుపదమువలన నీయర్థము లభించినదని యనరాదు. తథా శబ్దబలమున వారి కింతటి యర్థము యెట్లును లభించదు.

అట్లే 'సంప్రతిష్ఠా' అనుచోట మూలమును విడచి, యజ్ఞాన మను పదమును గల్పించుట అన్యాయ్యము.

ఇట్లే "అంతఇతి, ఆదిఇతి, సంప్రతిష్ఠేతి" అనియు మూడుచోటులను ఇతి శబ్దముల గల్పించుట గౌరవగ్రస్తము. మరియు వారి వివరణమున లఘువయిన అన్వయక్రమమును విడచి గౌరవగ్రస్తమయిన వాక్యాన్వయకల్పనము లెన్నియో కలవు. ఈదోషము లన్నియు వారికి సమ్మతములు కావచ్చుకాని విద్వల్లోకము హర్షించదని మేము విశ్వసింతుము. ॥3॥

శ్లో॥ తతఃపదం తత్పరిమార్గితవ్యం యస్మిన్గతా న నివర్తంతి భూయః।
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే యతః ప్రవృత్తిః ప్రసృతాపురాణీ॥ ४

అ॥ సంసారనాశమున చిత్తశుద్ధికలుగగా, సచ్చిదానందరూపుడగు పరమాత్మను దెలిసికొనవలయును. ఆత్మసాయుజ్యమును బొందినవారు, స్వర్గాదిలోకముల బొందినవారివలె దిరిగిరారు.

అనాదిసిద్ధమగు నీసంసారవృక్షము, యేపరమాత్మనుంచి బయలుదేరినదో ఆపరమాత్మయే పురాణపురుషుడు. అట్టి పరమాత్మను "అహం బ్రహ్మాస్మి" యను తత్త్వజ్ఞానమున బొందవలయును.

ఇందు రామానుజులు, "ప్రపద్యే" యనుపాఠమున, "ప్రపద్యేత్" అనిపాఠాంతరము నవలంబించిరి. పదధాతువు పాణినివ్యాకరణానుసారమున పరస్మైపదము కాదు. ఆత్మనేపదము. కాన వారిపాఠ మసాధువు.

మఱియు, రామానుజులు: "ప్రపద్యే యతః" అనుస్థలమున, "ప్రపద్య - ఇ=యతః" అని పదచ్ఛేదమును జేసి ఆపురాణపురుషుని "ప్రపద్య" శరణు పొంది, "ఇ" యతః "ఎవరినుంచి అజ్ఞాననివృత్త్యాదులకు సాధనమయిన పురాతన ప్రవృత్తి బయలుదేరినదో" అని వ్యాఖ్యానించిరి. ఇదియును సంగతము కాదు. శరణుపొందినవారు ముముక్షువులు. పురాణపురుషుని నుంచి బయలుదేరినది

పురాతనప్రవృత్తి. కాన నిచట సమానకర్తృకత్వము లేదు కనుక "ప్రపద్య" అను ల్యబంతప్రయోగ ముపపన్నము కాదు.

మఱియు, వారివ్యాఖ్యానప్రకారము పురాణీ పదము తప్పగును. వారు పురాతనులయిన ముముక్షువులయొక్క ప్రవృత్తి "పురాణీ" అని వ్యాఖ్యానించిరి. "పురాణానాం ఇయం ప్రవృత్తిః" అను విగ్రహమున "తస్యేదమ్" అను సూత్రమువలన "అణ్" ప్రత్యయము వచ్చి, "టిడ్ఢాణఞ్" అను సూత్రమున జీప్ రాగా 'పౌరాణీ' అని యుండవలయును. పురాణీ యను రూపము సిద్ధింపదు.

ఇ, యతః, అనుచోటకూడ సాధనభూమయిన ప్రవృత్తి యను నర్థమును గల్పించుట, "యతః" అనుపదమునకు అజ్ఞాననివృత్త్యాద్యర్థమును గల్పించుటయు నన్యాయ్యము, స్వకపోల కల్పితమును అగుచున్నది. యచ్ఛబ్దమున కంతటియర్థము అభిధావ్యాపారమున సిద్ధింపదు.

శాంకరమతమున, "ఎవరినుంచి పురాణప్రవృత్తి బయలుదేరినదో, ఆ పురాణపురుషుని శరణు బొందుదును. ఏస్థానము నొందినవారు తిరిగి సంసారమునకు రారో, ఆస్థానము వెతకదగినది - అని యన్వయము పొసగును. ॥४॥

శ్లో॥ నిర్మానమోహాః జితసంగదోషాః అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః ।
ద్వంద్వైర్విముక్తా స్సుఖదుఃఖసంజ్ఞైర్గచ్ఛంత్యమూఢాః పదమవ్యయం తత్ ॥

అ॥ అజ్ఞానాహం మమాభిమానములు లేనివారు, సంగదోషరహితులు, పరమాత్మస్వరూపాలోచనపరులు, కామవాసనలు నిశ్శేషముగ నశించినవారు, సుఖదుఃఖాది ద్వంద్వరహితులు నగు వివేకులు నాశరహితమగు బ్రహ్మస్వరూప మును బొందుదురు.

శ్లో॥ న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః
యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ॥ ౬

అ॥ పగటికాలమున సకలప్రపంచమును బ్రకాశింపజేయు సూర్యుడు ఆత్మ ధామమును బ్రకాశింపజేయలేడు. అట్లే రాత్రికాలమున సర్వమును ప్రకాశింపజేయు చంద్రుడు, సంధ్యాకాలములందు సర్వమును ప్రకాశింపజేయు నగ్నియు, ఆత్మధామ మును ప్రకాశింపజేయలేరు. వీరందఱు ఆత్మభాస్యులు, జడులు. తమనే తామెరుం గరు, సూర్యమండలములోనున్న చేతనుడే ద్రష్ట, తదతిరిక్తమయిన మండలమంతయు జడము. అయితే జడమయిన సూర్యాదు లెట్లు ప్రకాశింపజేతురని యనరాదు. శరీరము లోపలనున్న ప్రత్యగాత్మ బాహ్యఘటాదులను ప్రకాశింపజేయుటకు చక్షురా దీంద్రియవృత్తుల నపేక్షించినట్లు సూర్యాదిజ్యోతిస్సునుగూడ నపేక్షించును. చక్షు

రాదీంద్రియవృత్తి యజ్ఞానావరణమును బోగొట్టును. సూర్యాది తేజస్సు అంధకారావరణమును బోగొట్టును.

లేక, ప్రత్యగాత్మ అజ్ఞానావరణనాశముకొరకు చక్షుర్వృత్తి నపేక్షించును. చక్షుస్సు అంధకారావరణనాశముకొరకు సూర్యాది తేజస్సు నపేక్షించును. కాన సూర్యాదుల కంధకారనాశకత్వశక్తి కలదు. చక్షుర్వృత్తికి నజ్ఞాననాశకత్వశక్తి కలదు.

ఈరెంటివలన నీరెండురకముల యావరణములు నశించినను, స్వతస్సిద్ధముగ, జడమయిన ఘటము తనంతట తాను భాసించలేదు. క్షేత్రజ్ఞునివలననే భాసించును. కాన సర్వావభాసకత్వము క్షేత్రజ్ఞున (జీవున)కు సిద్ధించినది. ఈయవభాసకత్వము అంధకార నిరసనరూపముకాని, యజ్ఞాన నిరసనరూపముకాని కాదు. సర్వజ్ఞాతృత్వరూపము.

జీవున కిట్టి సర్వావభాసకత్వము లేదని శంకింపరాదు. "సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" అను శ్రుతి, సాక్షిత్వరూపమగు సర్వావభాసకత్వము కలదని చెప్పుచున్నది. జీవుడు పరాధీన ప్రకాశుడనికాని, భాస్యుడనికాని యనరాదు. చీకటిలో, కలలో, నిద్రయందును, సూర్యాదిజ్యోతిస్సు లేకున్నను, చక్షురాదివృత్తి లేకున్నను, జీవుడు స్వయముగ భాసించుచున్నాడు. కాన ఆత్మ స్వయంజ్యోతి.

కాన భాసకు లని పేరువడసిన సూర్యాదులందఱు ఆత్మభాస్యులగుటచే ఆత్మను భాసింపజేయలేరు.

కనుక సర్వావభాసకమయి, అన్యావభాస్యముకాని తేజస్సు నాదుచోటు. అచటికి జేరినవారు తిరిగి రారు. ముక్తులగుదురు.

ఇచట రామానుజులు "తద్ధామ పరమం మమ" అనుచోట ('మమ' మమైవాంశ ఇత్యర్థః") నాదియనగా నాయంశమని వివరించిరి.

ఈశ్లోకమున అంశాంశిభావమును జెప్పుటలో కృష్ణునకు తాత్పర్యములేదు. ఆ యంశమును ముందుశ్లోకమున జెప్పెదరు.

శ్లో॥ మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః
మనష్షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి॥

అ॥ ఓయి! సర్వేక్షయాంతానిచయాః పతనాంతాస్సముచ్ఛ్రియాః। సంయోగా విప్రయోగాంతాః మరణాంతంహి జీవితం॥ (అభివృద్ధులకు నాశమంతము. ఔన్నత్యమునకు పతన మంతము. సంయోగమునకు వియోగ మంతము. జీవితమునకు మరణ మంతము, అని ప్రసిద్ధి కలదు. అట్లే గమనమునకు ఆగమనము (రాక)

యంశమగును. కనుక ఆత్మధామమును జేరినవారు రారని యెట్లు చెప్పుదువు? ఊరికివెళ్ళినవాడుకూడ మరల తనయూరికి రాకున్నను, జన్మాంతరమున నెచ్చట కయినను వెళ్ళునుగాని యచటనే యుండడు. కాన, నిచటవెళ్ళినవాడు మరల రాడని చెప్పుటెట్లు?

వినుము. సంసారమునందు కర్త, భోక్తయని ప్రసిద్ధిజెందిన చిరంతనుడగు జీవుడు నాయంశభూతుడే. ఇచట అంశము, భాగము, అవయవము, ఏకదేశము, అను పదములు నాల్గును పర్యాయపదములు. వీటి కర్థభేదము లేదు.

నీటిలోని సూర్యప్రతిబింబము, ప్రతిబింబభావమునకు గారణమగు జలము నశించగా, బింబమగు సూర్యునిచేరి మరలి రాదు. అట్లే చిదాభాసుడగు జీవుడు కూడ చిద్రూపపరమాత్మయొక్క ప్రతిబింబ మగుటచే పరమాత్మాంశుడు. ప్రతిబింబభావమునకు కారణమయిన అవిద్యకాని, అంతఃకరణముకాని జ్ఞానమువలన నశించగా, బింబమగు పరమాత్మ చైతన్యమును బొంది మరల రాడు. అని ప్రతిబింబపక్షము నవలంబించి యాచార్యులు చెప్పిన సమాధానము.

అవచ్ఛేదపక్షము :

ఘటాది పరిచ్ఛిన్నమయిన ఆకాశము (ఘటాకాశము) మహాకాశము యొక్క యంశమగుచు ఘటాదినిమిత్తములు నశించగా, మహాకాశమును జేరి మరల రాదు.

అట్లె అవిద్యావచ్ఛిన్నుడుగాని, యంతఃకరణావచ్ఛిన్నుడుకాని యగు చైతన్యరూపుడగు జీవుడు ఉపాధులయిన అవిద్యాంతఃకరణములు నశించగా అపరిచ్ఛిన్నము, పరిపూర్ణమునగు పరమాత్మచైతన్యమునుబొంది మరలిరాడు. కాన నొకేచైతన్యము మహాకాశమువలె నుపాధివశమున పరిచ్ఛిన్నమగుచు వేర్వేరుగ దోచుచున్నది. ఉపాధి నశించినతోడనే పరిపూర్ణమగుచు నుండును. కనుక పూర్ణ చైతన్యమునకు గమనాదు లెట్లుకలుగును? ఎట్లును కలుగవని సమాధానము.

కాన "యద్గత్వా ననివర్తంతే" అనునది యుక్తాయుక్తము.

ఓయి! తాను లేనిచోట తాను ప్రతిఫలించుట సహజము. ముఖము తాను లేని యద్దమునందు ప్రతిఫలించుచున్నది.

ఆత్మ యపరిచ్ఛిన్నుడు, నిరవయవుడు, పరిపూర్ణుడు. ఇట్టివానికి ప్రతిఫలము కాని, పరిచ్ఛేదముగాని యసంభవము. కనుక శ్రీకృష్ణు డెట్లు చెప్పెను? నా యంశము జీవుడని శ్రీకృష్ణుడు చెప్పినందున ఆత్మ సావయవుడని యంగీకరించుచో ఆత్మ కనిత్యత్వాదిదోషములు వాటిల్లును. కాన నీవిరోధము నెట్లు పరిహరింతువు?

వినుము. "అవినాశీవా అరేఽయమాత్మా" అను శ్రుతి యాత్మ నాశరహితు డని చెప్పుచున్నది. మే మీవిషయ మింతకుమున్నే నిరూపించితిమి. జీవుడు నిత్యుడే కాని పరమాత్మమాత్ర మనిత్యుడని యందురేమో? ఎంత వెఱ్ఱితనము. అవయవి యనిత్యమయినచో నవయవము నిత్యమగునా? ఎచ్చటనయిన నట్లుకలదా? దేహ మనిత్యమయితే, చేతులుకాళ్ళు నిత్యములగునా? ఘట మనిత్యమయితే కపాల ములు నిత్యములగునా? చెరువులోని నీరు అనిత్యమయితే బిందువులు నిత్యము లగునా? కాన అవయవములు నిత్యములయినచో నవయవి యనిత్య మగుటెట్లు? అది యసంభవము.

అయితే మీరు తర్కశాస్త్రమును ప్రమాణముగ జేసికొని అవయవులగు ద్వ్యణుకాదులు అనిత్యములు కాగా, అవయవములగు పరమాణువులు నిత్యము లగుటలేదా? అని యడుగవచ్చు. కాని మేము పరమాత్మకంటె వేరేదియు నిరవయవమనికాని, నిత్యమనికాని యంగీకరించము. "యో వై భూమా తదమృతం అథ యదల్పం తన్మర్త్యమ్?" "తత్సత్యం స ఆత్మా" అతోఽన్యదార్తమ్" అను శ్రుతిప్రమాణమునుబట్టి బ్రహ్మమొక్కటే సత్యము నిత్యమనియు, మిగిలిన ప్రపంచ మంతయు మిథ్యయనియును మే మంగీకరింతుము. యథార్థమయిన వస్తువును బ్రతి పాదించు వేదాంతశాస్త్రమొక్కటే మాకుప్రమాణము. మిగిలినశాస్త్రము లసచ్ఛా స్త్రములు. మాకు ప్రమాణములు గావు. ఆస్తికులకు శ్రుతులు ప్రమాణములు. శ్రుతి సమ్మతమయినది వేదాంతశాస్త్రము. ఈయది యపౌరుషేయము కనుక స్వతఃప్రమా ణము. కాన తార్కికు లంగీకరించిన నిరవయవపరమాణుకల్పనము అప్రమాణము.

అయినను పరమాణువాదమును నిసుమంత విచారింతము. అణువు అనవస్థాదోషపరిహారముకొఱకు దానియవయవము నిరవయవముగా నుండవలెనను నాశయముతో పరమాణువు నిరవయవమని తార్కికు లంగీకరించిరి. ఇట్టితఱి నిరవయవములయిన రెండుపరమాణువులుకాని వెయ్యికాని సంయోగించి (కలసి) యణువును బుట్టింపజాలవు. నిరవయవములగు పరమాణువు లెన్నికలసినను పెచ్చు పరిమాణమును బుట్టింపజాలవు. సావయవవస్తువులు కలసినచో, నవయవసం యోగమువలన ప్రథిమ (పెచ్చుపరిమాణము - స్థౌల్యము) పుట్టును.

కాక సంయోగమనగా అవయవసంశ్లేషము అవయవములులేని పరమాణువు లకు నవయవసంశ్లేషరూపమగు సంయోగ మెట్లు కుదురును?

కాన నీశ్వరసంకల్పమున నణువులు సావయవము లగుచునే పుట్టినవి. పిదప నణుద్వయసంయోగమున ద్వ్యణుకము తయారగుచున్నది. కనుక సావయవములగు నణువు లనిత్యములు. కాని అవయవికంటె వేరుగ నీయవయవమునకు నుపలబ్ధిలేదు. అందువలన పరమాణువు నిరవయవమను ప్రతీతి యేర్పడినది.

అయితే! అణువు సావయవమగుచో నంగుంపు నవయవము లెవ్వి? పర మాణువులను మీ రంగీకరించలేదుకదా?

వినుము నిరవయమయిన బ్రహ్మయందు మాయవలన సావయవములగు నణువులు కల్పింపబడినవి. అణుత్వావచ్ఛిన్నమయిన నాబ్రహ్మయందు ద్వ్యణు కాదులు కల్పింపబడినవి. కాన నణువులయొక్క యవయవములు కల్పితములని తేలినది.

ఓయి! ప్రపంచమంతయు మాయామయ మను మీరు (అద్వైతులు) విశేషించి అణువులయొక్క యవయవములు కల్పితములని చెప్పనేల?

వినుము. మీ మతమున నణువు అవయవద్వయ సంయుక్తము. అట్టియణువు సంయోగమునకు బూర్వముండదు. అవయవద్వయము సంయుక్తమగుచు (కలియుచు), నణువును బుట్టించును. అణుత్వ ప్రాప్తికి కారణమయిన నవయవము పరమాణువనియు, నయ్యది నిరవయవమనియును మీ యభిప్రాయము.

అయితే, ఈ పరమాణువు దేని యవయవము? ౧. పరమాణుద్వయ సంయో గమునకు పూర్వ మణువే లేనందున, అణువుయొక్క యవయవము కాదు.

౨. తనకు దా నవయవమగుట విరుద్ధముకాన, పరమాణువుయొక్క యవ యవముకాదు.

3. బ్రహ్మకు సావయవత్వానిత్యత్వములు ప్రసక్తించునుగాన బ్రహ్మయొక్క యవయవముకాదు.

కాన పరమాణువు మాయయొక్క అవయవమని చెప్పవలయును. గట్టిగా విచారించినచో మాయ నిరవయవమనికాని, సావయవమనికాని నిరూపింప నలవి కానందున పరమాణువు మాయావయవముకూడ గాదు.

కనిపించనిది మిథ్యాభూతమయినది మాయ. కాన పరమాణువులని మీ రంగీకరించిన అణ్వవయవములు మాయాకార్యములయినందున మాయామయ ములు. కాన నివి నిరవయవములనికాని, సావయవములనికాని నిరూపింపనలవికాదు. అనిర్వాచ్యములు. కాన తార్కికుల నిరవయవ పరమాణుకల్పనము అయుక్తము.

జగత్తుకూడ నిట్లు సత్యాసత్యములచే ననిర్వాచ్యమే. అయినను ప్రపంచము సావయవమని నిరూపింపదగియున్నది. పరమాణువు లట్లు సావయవములని నిరూ పింప నలవికావు. ఇది యీ రెంటికిని భేదము.

అణ్వవయవములు సావయవములనికాని నిరవయవములనికాని నిరూపింప నలవికానందున నిరవయవ నిత్య పరమాణువాదము సిద్ధింపదు. నిరవయవుడు



నిత్యుఁడు నగువాఁడు ఆత్మయొక్కఁడే. అయితే జీవుఁడు నిరవయవుఁడగు పరమాత్మ కంశ మెట్లగును? "మమైవాంశః" అని శ్రీకృష్ణు డెట్లు చెప్పెను? అని మరల పూర్వపక్షము.

సమాధానము :

అపరిచ్ఛిన్నుఁడయిన పరమాత్మయందు మాయాంతఃకరణా ద్యుపాధులచే పరిచ్ఛేదము కల్పింపఁబడినది. అట్టి పరిచ్ఛేదమున నిరంశుఁడగు బరమాత్మ కంశము సిద్ధించినది. అపరిచ్ఛిన్నమయిన ఆకాశమునకు ఘటాద్యుపాధులతో నంశ మేర్పడినట్లు. కాన పరమాత్మకు జీవరూపాంశము కల్పితముకాని వాస్తవముకాదు. మరీచ్యుదకముచే మరుభూమికి బురద కలుగుచో మాయాకల్పితాంశమువలన పరమాత్మకు సావయవత్వము (సాంశత్వము) సిద్ధించును.

ఇట్టి మాయయె సంసారసంబంధరహితుఁడయిన జీవునియందు జన్మమరణాది లక్షణమయిన సంసారమును గల్పించుచున్నది.

ఈజీవుఁడు, స్వస్థానమునందున్న ఆఱింద్రియములను దీసికొని యిహపరలోకములకు గమనాగమనముల జేయును.

రామానుజీయము :

"మమైవాంశః" అను మూలవచనమును రామానుజులు "మద్విభూతిభూతో మదంశః" (నావిభూతియగు నాయంశము) అని వ్యాఖ్యానించిరి.

వేదాంతదేశికులును :

"పాదోఽస్య విశ్వాభూతాని"
"తస్యావయవభూతైస్తు వ్యాప్తం సర్వమిదం జగత్"

"యథాగ్నేః క్షుద్రావిస్ఫులింగా వ్యుచ్చరంత్యేవమేవాస్మా దాత్మన స్సర్వ ఏవాత్మానో వ్యుచ్చరంతి" ఇత్యాది శ్రుతిప్రసిద్ధమయిన అంశత్వము విశిష్టమునందు విశేషణభాగముగా కలదని, "అంశో నానావ్యపదేశాత్" అను నధికరణమున "ప్రకాశాదివత్తు నైవం పరే" అను సూత్రమునందు స్థాపింపబడినదని యనిరి.

మరియు నొకానొక యుపాధివశమున ఏకత్వముగా నభిమతములయిన ననేకములలో నిరూపింపబడు నొకానొకటి యంశమని వివరించిరి. ఉ॥ అనేక వస్త్రములను రాశిగా ప్రోగుచేసితిమి. అందు వస్త్రము లనేకములున్నను, రాశిని పుచ్చుకొని వాటికి నేకత్వప్రతీతి కలిగినది. అం దొకవస్త్రమును విడదీసినచో నయ్యది యారాశికి నంశమగును. ఈయది విశేషణవిశేష్యభావముతో నున్న వానియందు గూడ విశిష్టమునందు విశేషణమంశమను వ్యవహారము లసమానము. కాన నిచట

యత్యంతభిన్నములయిన జీవ పరమాత్మలలో విభూతి, విభూతిమద్భావముతో విశిష్ట మొక్క-టే యయినను, విశేషణమయిన జీవుడు విడదీసి వ్యవహరించబడుచు ప్రధానముద్వారమున అంశమని వ్యవహరింపబడుచున్నాడు.'' అని యుపపాదించిరి.

ఇదియంతయు నాపాతరమణీయము.

విశిష్టమునకు విశేషణమంశమగుచో ధనికునకు ధన మంశము కావలయును. దండవిశిష్టుడయిన పురుషునకు దండము అంశము కావలయును. ఇట్లు లోకానుభవములేదు. లోకములో నెవ్వడయినా చేతిలో రూపాయినికాని, కర్రనుగాని చూచి, యిది వీనియంశమని యనుచున్నారా?

మరియు, నీశ్వరుడు ప్రకృతిపురుష విశిష్టుడని వారిమతము. అపుడు, పురుషుడు విశేషణమయితే ప్రకృతికూడ విశేషణమయినట్లేకదా? అంగీకరింతురా? అయితే '' మమైవాంశో జీవభూతః '' అనినట్లు ''మమైవాంశః ప్రకృతిభూతః''అని యెచ్చటను లేదే - ధర్మమయిన విశేషణము విశిష్టమున కంశము కావచ్చును. ఉ:- జ్ఞానము గలవాడు పురుషుడు. జ్ఞానము పురుషధర్మము. కాన పురుషున కంశమగును. మీరు అపృథక్సిద్ధవిశేషణము అంశమగునని యభిప్రాయపడినను, జీవపరమాత్మలకు మీ రత్యంతభేద మంగీకరించిరికాన, పరమాత్మకంటె నత్యంత భిన్నమయిన జీవుడు పరమాత్మకు పృథక్సిద్ధవిశేషణమగునుగాని, యపృథక్సిద్ధ విశేషణము కాడు.

ఇంక భార్య భర్తకు అంగమయినటుల (శేషమయినటుల) జీవు డీశ్వరునకు శేషుడనియు, నారూపముతో జీవుడు విశేషణమనియు ననరాదు. భార్య భర్తకు శేషము. భర్తకూడ భార్యకు శేషుడే. ఇందు వినిగమకములేదు. ఉభయులకు ఆత్మశేషత్వము సమానము. భార్య తనసుఖముకొరకు భర్తను సేవించుచున్నది కాని భర్తృసుఖముకొరకు గాదు. అట్లే భర్త తనసుఖముకొరకు భార్యను పోషించుచున్నాడుకాని భార్యాసుఖముకొరకు భార్యను బోషించుటలేదు. కాని నీదృష్టాంతమునుబట్టి యాత్మ శేషికాని యెవ్వనికి శేషముగాడు. కాన పరమాత్మకు జీవాత్మ విశేషణము కాడు.

మరియు '' దండీపురుషః '' '' నీల ముత్పలమ్ '' అనుచోట విశేషణ విశేష్యములు రెండును ప్రతీతము లగుచున్నవి.

'' ప్రకృతిపురుషవా నీశ్వరః '' అనుచోటకూడ న ట్లుభయాంశములు ప్రతీతములగుట యావశ్యకము కాని యట్లగుట లేదు.

ప్రకృతిపురుషులు విశేషణాంశము. విశేష్యాంశమేమి? ఈశ్వరుడని యందురేమో? ఈశ్వరుడనగా ప్రకృతిపురుషవిశిష్టుడనికదా మీరంటిరి. కనుక వానికి

విశేషణవిశిష్టత్వమే రూపముకాని వేరురూపమేమి ప్రతీయమానమగుచున్నది ? ఇంక ప్రకృతిపురుషులకంటె విలక్షణముగా నీశ్వరరూప ముండుచో నప్పుడు ప్రకృతి పురుషులు పృథక్సిద్ధములయినందున నీశ్వరాంశములు కావు.

కనుక నా యీశ్వరాంశమేమి ? సచ్చిదానందరూపమా ? అన్యమా ? మొదటిపక్షమున జీవుడుకూడ సచ్చిదానందరూపుడే ? మీరును "నిరంజనః పరమం సామ్య ముపైతి దివ్యమ్" అని జీవేశ్వరులకు పరమసామ్య మంగీకరించిరి. కాన పరస్పరసదృశమయిన జీవేశ్వరులకు విశేషణవిశేష్యభావ మెట్లుపొసగును ?

రెండవపక్షమున సచ్చిదానందరూపముకంటె భిన్నమయినవి జడస్వరూపము కాన నప్పుడుమాత్రము ప్రకృతీశ్వరులకు విశేషణవిశేష్యభావ మెట్లుపొసగును ? విశేషణవిశేష్యములకు వైలక్షణ్యముండవలెగదా ? అదిలేనప్పుడు విశేషణవిశేష్య భావ మెట్లుపొసగును ?

ఒకానొకతఱి యీశ్వరశక్తియగు మాయ యీశ్వరునికంటె వేరనికాని, వేరుకాదనికాని నిరూపింప నలవికానందున అపృథక్సిద్ధవిశేషణమయినను "నే నజ్ఞానిని- సంసారిని" అని యీశ్వరునికంటె వేరుగ ననుభవగోచరమగుచున్న జీవుడుమాత్ర మపృథక్సిద్ధవిశేషణము కాడు. కాన మీరుచెప్పిన ట్లంగీకరించుచో ప్రకృతి యీశ్వరాంశమనియు పురుషు డీశ్వరాంశుడుగాదనియు దేలినది. ఆహా ! ఏమి మీ పాండిత్యప్రకర్షము మూలమునకు మోసము తెచ్చితిరికదా ?

మరియు పురుషుడుకూడ నీశ్వరశక్తియే యనుట చెల్లదు. ఈశ్వరుడు చిద్రూపుడు. జీవుడుకూడ చిద్రూపుడు. కాన తనకు తాను శక్తియగుట యసంభవము.

కాక, దృక్ దృశ్యము అనువస్తువులు రెండేకాని, ఈశ్వరు డను మూడవ వస్తువు లేదు. లోకసిద్ధమయిన త్రిపుటికూడ సూక్ష్మదృష్టితో విచారించిన నిందే చేరును. జ్ఞాతా, జ్ఞానం, జ్ఞేయం, అనికదా త్రిపుటి. ఇందు జ్ఞాత యెవరు ? జ్ఞాన మెవరు ? జ్ఞాతయగు నీశ్వరునకుగాని జీవునకుగాని స్వరూపము జ్ఞానమేకాని వేరు కాదు. కాన దృక్, దృశ్యము అను రెండే నిలచినవి. కాన దృక్కునకు దృక్కు విశేషణమనునది యనుచితము.

ఇంక, మీరు జీవేశ్వరులకు ధర్మభూత జ్ఞానసుఖాదు లంగీకరించి, అందు జీవునిజ్ఞానమునకు నీశ్వరునిజ్ఞానమునకు భేదమునొప్పి, యీ యిరువురకు విశేషణ విశేష్యభావ మంగీకరింతుమన్నను కుదరదు. నిర్విశేషజ్ఞానమునకు విశేషము నాపాదింపజేయు ధర్మములేదు. మీ రేదియో నొకధర్మమును దూర్చినను, అది మాయాకల్పితమగునుగాని, వాస్తవము గాదు.

కాన, నిర్విశేషచిన్మాత్రులగు జీవేశ్వరులకు విశేషణవిశేష్యభావము కుదరదు.

ఒకవేళ నీయుపపురకు కించిద్జ్ఞత్వ సర్వజ్ఞత్వములను ధర్మములవలన భేద మంగీకరించినను స్వరూపభేదము లేదు కాన విశేషణవిశేష్యభావము కుదరదు. జ్ఞానై కాత్మాస్త్రలకు స్వరూపభేద ముండెను. అల్పమగు ఘటాకాశము మహాకాశము నకు విశేషణముకాదు. మోమోటమున మీవాదమును మే మంగీకరించినను మేముచెప్పిన అంశాంశిభావమునకు భంగములేదు. పెద్దవస్తువుయొక్క కొద్ది భాగము అంశమని మేమంటిమి. దానినే విశేషణమని మీరంటిరి. ఇందు శబ్ద భేదముగాని యర్థభేదము లేదు. కాన జీవుడు విశేషణాంశమేకాని స్వరూపాంశము కాదని మీ రెట్లందురు ?

నిరంశునకు స్వరూపాంశము కుదరదుకాన విశేషణాంశమును జెప్పితి మన్నచో నిర్విశేషునకు విశేషణాంశముకూడ చెల్లదందున నదిమాత్ర మెట్లు చెప్పుదురు ? ఈశ్వరునికంటె వేరుగ జీవుడు కనిపించుచున్నందున జీవుడు పురుషు నకు దండమువలె విశేషణముకాని, స్వరూపము కాదన్నచో, నా కనిపించుట యవిద్యాకృతముకాని వాస్తవము కాదని మేమేన్నియోమారులు చెప్పినందున మరల యీ యంశమును బునరుద్ధరించుట నిరర్థకము. కాన చైతన్యరూపుడు, నిరంశుడు నయిన నీశ్వరునకు చైతన్యరూపుడయిన జీవుడు అవిద్యోపాధివలన స్వరూపాంశమేకాని విశేషణాంశముకాడు కనుక సర్వము నిరవద్యము.

"పాదోఽస్య విశ్వాభూతాని" అనుశ్రుతి నిర్విశేషుడయిన ఆత్మయం దేకదేశమున చరాచరప్రపంచమంతయు మాయచే నున్నదని చెప్పుచున్నది.

"తస్యావయవభూతైః" అనుచోట అంశశబ్దమునకు బర్యాయమయిన నవయవపదముంటచే నచట జీవునకు నీశ్వరాంశత్వము స్పష్టము. అవయవశబ్దమునకు అపృథక్సిద్ధవిశేషణమను నర్థ మెచ్చటను లేదు.

"యథాఽగ్నేః క్షుద్రావిస్ఫులింగాః" అను శ్రుతియు జీవపరమాత్మలకు నంశాంశిభావమునే చెప్పుచున్నది. అగ్నికి విస్ఫులింగములు అవయవములుకాని, విశేషణములు కావు. అట్లే జీవులుగూడ ఆత్మకు నవయవములని యీశ్రుతి తాత్పర్యము.

"అంశో నానావ్యపదేశాత్" అను నధికరణమునందును శంకరులు, జీవేశ్వరులకు నంశాంశిభావమునే మాయామయమని సాధించిరి.

ఇంక మీరు పటరాశిదృష్టాంతమును జూపితిరి. అందు నీలపీతరక్తాతిపటము లనేకములయినను, అందు పటత్వరూపోపాధియంశ మొక్కటియే యనిరి. ఈదృష్టాంతము సరిపోదు. పటములు స్వతస్సిద్ధముగ గుణభేదముచే ననేకములు,

ఆత్మల ట్లనేకులు కారు. ఆత్మ నిర్గుణుడని "అశబ్ద మస్పర్శ మరూప మవ్యయమ్" అను శ్రుతి చెప్పుచున్నది. సుఖదుఃఖాద్యనుభవవైచిత్ర్యము అంతకరణభేద ప్రయుక్తముకాని యాత్మభేదప్రయుక్తముకాదు. సుఖదుఃఖాదు లంతఃకరణధర్మములు. కాన నుపాధివలననే ఆత్మానేకత్వముకాని స్వతస్సిద్ధముగ గాదని సిద్ధాంతము. ౭

శ్లో॥ శరీరం య దవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః,
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధా నివాశయాత్॥ ౮

అ॥ ఈశ్వరు డెప్పుడు శరీరమునుండి బయలువెడలునో, మరల యెప్పుడు శరీరమును బ్రవేశించునో, అప్పుడు వాయువు పెటిమదుగులనుండి పూలవాసనల గ్రహించినట్లు మనస్సుమున్నగు నాఱుయింద్రియములను గ్రహించును.

ఇచట జీవస్థానమున ప్రయోగింపబడిన నీశ్వరశబ్దము క్షేత్రజ్ఞునికంటె వేరుగ నీశ్వరుడు లేడని నిరూపించుచున్నది. అందుచేత నీశ్వరుడే జీవుడు. కాన జీవేశ్వర భేదమున కవకాశములేదు. అపరిచ్ఛిన్నుడయిన నీశ్వరునకు నుపాధివశమున ప్రకృతశరీరమునుంచి యుత్క్రాంతి - శరీరాంతరప్రాప్తి కలుగుచున్నదని పరమార్థము. ౮

శ్లో॥ శ్రోత్రం చక్షుస్స్పర్శనంచ రసనం ఘ్రాణమేవ చ
అధిష్ఠాయ మనశ్చాయం విషయా నుపసేవతే॥ ౯

అ॥ మరియు నీశ్వరుడు శ్రోత్రాదీంద్రియములను మనస్సును ప్రత్యేకముగ నధిష్ఠించి, దేహమునం దుండియే శబ్దాది విషయముల ననుభవించును.

ఇచట రామానుజులు, అధిష్ఠాయ అనుపదమునకు "ఇంద్రియములను స్వస్వవిషయ వృత్త్యనుగుణములను జేసి" అని వివరించిరి. కన్ను రూపమును గ్రహించుటలో రెప్పలను తెరచుట రూపమయిన పురుషప్రయత్నము నపేక్షించినను త్వగాదులు స్పర్శాదులను గ్రహించుటలో నట్టి ప్రయత్నమును నపేక్షించనందున వారివివరణము అసంగతము. ౯

శ్లో॥ ఉత్క్రామంతం స్థితంవాపి భుంజానంవా గుణాన్వితం,
విమూఢా నానుపశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః॥ ౧౦

అ॥ ఇట్లు దేహమునందుండి దేహమునుంచి లేచిపోవుచున్నవానినిగాని, దేహమునం దున్నవానినిగాని, శబ్దాదివిషయముల ననుభవించుచున్నవానినిగాని, సుఖదుఃఖమోహాదులతో గూడియున్నవానినిగాని విషయభోగాసక్తులయిన మూఢులు తెలిసికొనలేరు. వివేకులు తెలిసికొందురు.

దేహమునుంచి లేచిపోవువాడు దేహముగాదు. ఇంటినుంచి లేచి పోవు పురుషుడు యిల్లుయౌనా? దేహమునందుండువాడును దేహము కాదు. ఇంటిలో నుండు పురుషుడు యిల్లగుచున్నాడా? లేదు. ఇట్లు ఆత్మానాత్మలను వేరుపరచి గ్రహించుట సులభమయినను, గ్రహించలేక నేను స్థూలుడను, నేను కృశించినవాడను, నేను మనుష్యుడను, అని మానవు లనుకొనుచున్నారు. ఇట్లే చక్షురాదులతో రూపాదులను, మనసుతో సుఖాదులను గ్రహించువాడుకూడ చక్షురాదులకంటె భిన్నుడు. అని సూక్ష్మశరీరమునుంచి జీవుని వివేకపరచు వీలున్నను, నేను గ్రుడ్డిని, నేను కుంటిని, నేను చెవిటిని, సుఖిని, దుఃఖిని, యని వ్యవహరించుచున్నారు.

అట్లే, నే నజ్ఞానిని, యని జీవుడు అజ్ఞానము ననుభవించుచున్నాడు. "న కించిదవేదిషమ్" (ఏమియు తెలియకుంటిని) అని యజ్ఞానానుభవమును అనుసంధాన మొనర్చుచున్నాడు. లోకములో ఘటము ననుభవించువాడు ఘటముకాదు. అనుభవింపబడుదానికంటె ననుభవించువాడు వేరు. ఇట్లు కారణశరీరముకంటెను జీవుని వేరుపరచుట సులభము. అయినను జీవుని వేరుగ గ్రహించుటలేదు.

మరియు నాధ్యాసికసంబంధముతో నుండు వస్తువు నిజముగ నుండదు. అట్లే సంయోగసంబంధముతో నుండునది స్వాభావికము కానేరదు. సంయోగము వియోగపూర్వకము స్వభావసిద్ధమయినది; వియోగము జెందనేరదు. అగ్నికి నౌష్ణ్యము (వేడిమి) స్వాభావికము. అది యగ్నిని విడచియుండదు. ఇట్లు సుఖాదిగుణసంయుక్తుడయిన జీవునకు సుఖాదులుకూడ స్వాభావికములు గావు. అన్యదీయములు (ఇతరమయిన దానిధర్మములు) జీవునియం దధ్యసింప బడుచున్నవి. ఇట్లు తెలిసికొను వివేకి యరుదు. ఆహా ఎంతకష్టము. మూఢులకు సంసారదుఃఖము అవర్జనీయముకదా! = ౧౦.

శ్లో॥ యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్
యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః॥ ౧౧

అ॥ ఉత్తములకు శ్రవణమననాదులవలననే యాత్మసాక్షాత్కారము. మందబుద్ధులకు యోగబలమున నాత్మసాక్షాత్కారము కలుగునని యీశ్లోకమున జెప్పుచున్నాడు.

అర్జునా! అభ్యాసయోగులుకూడ బుద్ధియందున్న ఆత్మను సాక్షాత్కారము చేసికొనుచున్నారు. అవివేకులు ప్రయత్నించినను శమదమాదులతో చిత్తసంస్కారము నొందక యాత్మను తెలిసికొనలేరు. మూలమునందలి చ శబ్దము జ్ఞానులను గూడ జేర్చుచున్నది. ఇందలి యోగపదము ధ్యానయోగపరముకాని, కర్మయోగపరముగాదు. కర్మయోగము ఆత్మసాక్షాత్కారమునకు జాల దూరపుసాధనము.

అవివేకి యింద్రియములను విషయములను బలాత్కారముగ లాగి, యాత్మాయత్త ములు చేయవలెనని యత్నించినను, శాస్త్రసంస్కారముకాని, శమదమాది సంస్కారముగాని లేనందున, చిత్తశుద్ధి నొందలేక ఇంద్రియముల సహజప్రవృత్తిని మరల్పలేడు. ఇట్టివాని కాత్మసాక్షాత్కార మతిదూరము.

కాన ముముక్షువు తమతమ యధికారము ననుసరించి శ్రవణాదులయందు గాని యోగమునందుగాని ప్రవర్తించవలయునని భావము. ౧౧

ఇట రామానుజులు: "మత్ప్రపత్తిపూర్వకం యతంతే" నాయందలి ప్రప త్తితో నెవరు ప్రయత్నింతురో" అని వ్యాఖ్యానించిరి. ప్రపత్తియనగా నే నీశ్వ రునికంటె వేరు. నన్నీశ్వరుడు రక్షించుగాక. అను నభిసంధి యని వారి యాశ యము. ఈయభిప్రాయముతో మూలమునలేని పదమును గల్పించుట యన్యాయము.

శ్లో॥ యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్॥ ౧౨

అ॥ సర్వావభాసకమగు ఆత్మజ్యోతిస్సు సర్వమున కాత్మరూపమనియు సర్వవ్యవహారమున కధిష్ఠానమనియును జెప్పదలచి సంక్షేపముగా భగవద్విభూతిని సూచించుచున్నాడు.

అర్జునా! సూర్యచంద్రాగ్నులయం దుండెడి తేజస్సు నాదని తెలియుము. నేనే మాయచే సూర్యాదులయందుండి ప్రపంచమును ప్రకాశింపజేయుచున్నాను. నన్నుంచి సూర్యాదులను వేరుపరచినచో వారికి స్వరూపముండదు. నిస్తత్త్వము లగును. సూర్యు డున్నాడు, సూర్యుడు ప్రకాశించుచున్నాడు. అనుచోట సత్తా ప్రకాశలను విడదీసినచో నట మిగిలెడి దేమియు లేదు. కాన లోకమునం దేయే వస్తువునం దేయే శక్తి గోచరమగుచున్నదో అయ్యది నాదికాని యావస్తువులది కాదు.

లేక ఆదిత్యాదులయం దుండు తేజస్సు పరమాత్మచైతన్యమని గ్రహిం పుము. దీనివలన నీరూపుడగు పరమాత్మకు రూపసహితమయిన తేజస్సు యెట్లుండు ననుశంక తీరినది.

ఓయి! ఆత్మచైతన్యజ్యోతిస్సు, స్థావరజంగమములయందు సమానముగ నుండ "ఆదిత్యాదులయందలి తేజస్సు" అని విశేషించిచెప్పనేల? వినుము. ఆదిత్య చంద్రాగ్నులయందు సత్త్వగుణము మెండు. అందు ఆత్మజ్యోతిస్సు మిక్కిలి ప్రకటముగ భాసించును. శ్రీకృష్ణాద్యవతారము లింతకంటె శుద్ధసత్త్వము కలవి. అం దాత్మచైతన్యము (జ్యోతిస్సు) స్ఫుటతమముగ భాసించును. కాన మను

ష్యాదులకంటె సూర్యాదులయందలి చైతన్యము స్ఫుటతరమయినందున మూలమున "యదాదిత్యగతం" (ఆదిత్యాదులయందలి) అని విశేషించి చెప్పబడినది.

ఇందుకు దృష్టాంతము.

ముఖాకారము సమానమయినను, కాష్ఠమునందుగాని, గోడయందుగాని ప్రతిఫలించదు. స్వచ్ఛమగు నద్దమునందు ప్రతిఫలించును. అట్లే సూర్యాదులయందుగూడ; అయితే అచేతనములయందు చైతన్యప్రతిఫలనము లేకపోతే యచట చైతన్యము లేనట్లేకదా? కాదు. ప్రతిఫలనము లేదుగాని చైతన్యము కలదు. అపరిచ్ఛిన్నము, పరిపూర్ణము నగు చైతన్యమున కొకచోట నుండుట, మఱియొకచోట నుండకుండుట యసంభవము. ప్రతిఫలనమునకు బూర్వమంతట చైతన్యమున్నను, మాయవలన నచ్చటచ్చట ప్రతిఫలనము కలుగుచుండును. కాన సూర్యాదులయందు సత్త్వగుణాధిక్యమువలన చైతన్యమునకు స్ఫుటతరమయిన ప్రకాశ యుండును. కనుకనే సూర్యాది దేవతలు జగత్తంతయును బ్రకాశింపజేయ గలుగుచున్నారు.

లేక, ఆదిత్యాది దేవతలయొక్క యంతఃకరణములయందు ప్రతిఫలించిన చైతన్యము నాదియే. "రాహోశ్శిర" అనివలె భేదము లేకున్నను భేదమున్నటుల "మామక" మను నిర్దేశము. ఈ చేతనప్రతిబింబము అంతఃకరణోపాధులు లేని మృదాదులయందు లేదు కాన చైతన్యప్రతిబింబము కలది చేతనమనియు అది లేనిది యచేతనమనియును భేదము. కూటస్థచైతన్యమునుబట్టి కాదు యీభేదము.

అయితే ప్రతిబింబవాదపక్షమున నుపాధినిబట్టి ప్రతిఫలము, ప్రతిఫలన తారతమ్యమునుబట్టి వస్తువులకు గొప్పతనము యుండుగాక.

అవచ్ఛేదవాదపక్షమున నియ్యదెట్లు కుదురును?

వినుము. ఉపాధిధర్మములయిన సుఖాదులు ఉపహితునియం దధ్యసింపబడినట్లు, ఆదిత్యాది దేవతలయొక్క అంతఃకరణమునందలి సత్త్వశుద్ధి విశేషప్రయుక్తమయిన జ్ఞానాధిక్యము ఉపహితమయిన చైతన్యమునందు మాయచే నారోపింపబడుచున్న దనిభావము.

రామానుజీయము:

"మామకం తేజః మయా తేభ్యో దత్తం" నాచే వారల కీయబడిన తేజస్సు" అని వివరించిరి. ఇందు "మమేదం మామకం" అను వ్యుత్పత్తియొక్క స్వారస్యము భగ్నమగును. ఇతరుల కిచ్చినదానిని నాదని యెవరు ననుకొనరు. భూతపూర్వగత్యా మామకమని సమర్థింపదలచినచో నపుడు "తత్పూర్వం విద్ధి మామకమ్" అని శ్లోకముండవలయును.

మరియు సూర్యాదులకు తేజస్సు నీయకపూర్వ మీశ్వరుడు తేజస్వియా? కాదా? మొదటిపక్షమున "అశబ్ద మస్పర్శ మరూప మవ్యయమ్" అను శ్రుతి విరోధము. రెండవపక్షమున తనకే తేజస్సులేనపుడు యితరుల కేమివచ్చును?

అట్లే యీశ్వరుడు తేజస్సునీయకమునుపు సూర్యాదులు తేజోమయులా? జలమయులా? పృథివ్యాకాశ వాయుమయులా? ఇం దేపక్షము నవలంబించినను దోషము తప్పదు. కాన సూర్యాదులు భగవంతునిచే మాయవలన సహజప్రకాశ కలవారలుగ సృష్టింపబడిరి. ఇంతియెకాని ఈశ్వరుడు సూర్యాదుల సృష్టించి పిదప వారికి తేజస్సు నీయలేదు. ౧౨

శ్లో॥ గామావిశ్య చ భూతాని ధారయా మ్యహమోజసా,
పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః॥ ౧౩

అ॥ నేను భూమిని ప్రవేశించి, నాబలముచే భూతములను నిలబెట్టుదును. రసరూపుడయిన చంద్రుడనయి సకలౌషధులను బోషింతును. కామరాగరహిత మయిన బలము గాడని యింతకుమున్నే చెప్పియుంటిని. ఇందుకు, "యేన ద్యౌ రుగ్రా పృథివీ చ దృఢా" "సదాధార పృథివీ ముతద్యాం" అను మంత్రవర్ణము ప్రమాణము. పృథివ్యాదులయందు నేను బలరూపముతోనుండి సకలప్రపంచమును నిలబెట్టుదునని పరమార్థము. పృథివ్యాదులయందుగనిపించు జగద్ధారణశక్తి నాది కాని పృథివ్యాదులది కాదు. అట్లే నీటియందు గనిపించెడి యోషధిపోషణశక్తికూడ నాదియె; నేనే చంద్రరూపముతోనుండి యోషధుల బెంచుచుంటిని. దీనివలన సూర్యాదులు, వారియందలి తేజస్సుయు నీశ్వరవిభూతియని తేలినది. ౧౩

శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః,
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధం॥ ౧౪

అ॥ నేను వైశ్వానరుడనయి, ప్రాణుల దేహము నాశ్రయించియుండి ప్రాణాపానాదివాయువులతోగూడి నాలుగురకముల యాహారమును పచనమును చేయుదును. బాహ్యాగ్నియందలి సర్వావభాసకత్వశక్తిమాత్రమే నాదికాదు. జాఠరాగ్నియందలి యాహారమును బచనముచేయుశక్తికూడ నాదియే. "అయ మగ్ని ర్వైశ్వానరః యోఽయ మంతఃపురుషే యేనేద మన్నం పచ్యతే" అను శ్రుతి వైయర్థమును రుజువుచేయుచున్నది. బాహ్యాగ్ని తండులములనుమాత్రమే యుడికించును. దానికి భుజించినయాహారముతో సంయోగములేదు. పక్వముగానియన్నము రక్తాదిరూపమున పరిణామము జెందదు. కాన భుజించినయాహారమును పరిణామ మొనర్చుటకు జఠరమున వైశ్వానరరూపముతో నేనుంటిని. "ప్రాణినాం దేహమాశ్రితః" అని చెప్పుటచే ప్రాణములేనివారల శరీరమున జఠరాగ్ని యుండదని తేలినది.

బాహ్యాగ్ని జ్వలించుటకు వాయుసహాయ మెట్లో, అంతరాగ్ని జ్వలించుటకు గూడ నట్లే ప్రాణాపానాది వాయుసహాయము గలదు. ఆహారము - భోజ్యము, భక్ష్యము, చోష్యము, లేహ్యము అని నాలుగువిధములు. అందు ప్రధానమయిన వ్రీహ్యాదులయన్నము భోజ్యము, మాషవటకాదులు భక్ష్యములు; చెఱకుముక్కలు మొదలయినవి చోష్యములు, పాయసము మొదలయినది లేహ్యము. ఇట్లు తేజోఽన్నాత్మికయగు నవాంతరప్రకృతి యీశ్వరవిభూతియని తెలిసినది.

అన్నమును వండునపుడు క్రిమికీటాది నాశప్రయుక్తదోషములు కొన్ని యుండును. వాటినివృత్తికొఱకు వైశ్వదేవము విధింపబడినది. వైశ్వదేవము చేయకున్నను అన్నము సాక్షాద్భగవద్రూపుఁడయిన సోముఁడనియు, భుజించువాఁడు సాక్షాద్భగవద్రూపుఁడయిన వైశ్వానరుఁడనియు దెలిసినవాఁడుగూడ నీదోషముల బొందఁడు. కనుకనే పెద్దలు పరిషేచనకాలమున నీశ్లోకమును బఠింతురు. ౧౪

శ్లో॥ సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తస్స్మృతి ర్జ్ఞానమపోహనం చ,
వేదైశ్చ సర్వై రహమేవ వేద్యో వేదాంతకృ ద్వేదవిదేవ చాహమ్॥ ౧౫

అ॥ ఓయి! అర్జునా! నేను శుద్ధచైతన్యరూపముతో సంతత యున్నను, అంతఃకరణావచ్ఛిన్నచైతన్యరూపముతోగాని, యంతఃకరణప్రతిబింబరూపముతో గాని ప్రాణులయొక్క బుద్ధియందు ప్రవేశించియుంటిని. దీనివలన నీశ్వరునికంటె జీవుఁడు వేరుకాదని తేలినది. హృదయమునందు జీవునికంటె వేరుగ నీశ్వరుఁడు కనిపించుటలేదు. పరమాత్మ జీవుని నియమించుటచేతను, అనుగ్రహించుటచేతను పరమాత్మకంటె జీవుఁడు వేరనరాదు. ప్రత్యక్చైతన్యముమాత్రమే నియమించుచున్నది. ఇందొక్కనికే కర్మకర్తృత్వముకదా యని యందురేమో? ప్రత్యగాత్మ ప్రమాతను నియమించునని చెప్పుటలో నేదోషమును లేదు. అంతఃకరణోపహితుఁడు ప్రత్యగాత్మయనియు, నంతఃకరణావచ్ఛిన్నుఁడు ప్రమాతయనియు నీయిద్దఱకు భేదము కలదు. ఇందు విశేష్యాంశమయిన చైతన్య మభిన్నమయినను నచట నియమనాదులు లేవు. జీవునియొక్క నిజరూపమే ప్రత్యగాత్మ. "గుహాం ప్రవిష్టౌ పరమే పరార్ధ్యే" "ద్వా సుపర్ణా సయుజా సఖాయా" "జ్ఞాజ్ఞౌ ద్వావజౌ" అను శ్రుతులు ఒకేచైతన్యమునకు అంతఃకరణోపహితత్వరూపముతోను, విశిష్టత్వ రూపముతోను భేదమును జెప్పుచున్నవికాని స్వరూపభేదమును జెప్పుటలేదు.

లేక పరమాత్మ ప్రాణిహృదయమున బింబరూపముతోను, ప్రతిబింబ రూపముతోను రెండువిధముల ప్రవేశించెను.

జీవుడు తనకంటె వేరొకనిచే ప్రేరేపితుడై సంసారమున ననుభవించుటలేదు. అజ్ఞానదశలో జీవుడు తాను ప్రత్యగాత్మ ననుకొనడు. సంసారియగు ప్రమాత ననుకొనును. కాన సాక్షియగు ప్రత్యగాత్మచే నియమితుడయినను ఇతరునిచే నియమింపబడినట్లు తలంచును. తాను ప్రత్యగాత్మయయినను, అజ్ఞానవశమున జీవునకు ప్రత్యగాత్మ పరోక్షుడుగ భాసించును. కనుకనే తార్కికులును ద్వైతులును, ప్రత్యగాత్మను బరోక్షేశ్వరునిగ దలంతురు. అంతేకాని జీవరూపవిభూతి ప్రత్యగాత్మకంటె భిన్నముకాదు. ఈయది పరమాత్మకు పరావిభూతి. క్షేత్రలక్షణమయినది యపరవిభూతి. ఈశ్వరుడేయయిన జీవు డీశ్వరవిభూతియగు టెట్లని శంకించరాదు. ఉపాధిసంబంధమునుబట్టి జీవునకు విభూతిత్వవ్యవహారము కలుగును.

"యదాదిత్యగతం తేజః" అను శ్లోకమున సూర్యచంద్రాగ్నులయందుండెడి జీవచైతన్యమే విభూతియని ప్రతిపాదించబడినది. ఈశ్లోకమున సర్వప్రాణిగతమయిన జీవచైతన్యము విభూతియని నిరూపింపబడినదని భేదము. లేక పూర్వము ఆదిత్యాదిగతమయిన ప్రమాతృచైతన్యము భగవద్విభూతియని చెప్పబడినది. ఇపుడు సాక్షిచైతన్యము భగవద్విభూతియని చెప్పబడినది. సాక్షిచైతన్యముకూడ సోపాధికముకాని శుద్ధముకాదు. శుద్ధమునందు సాక్షిత్వమను ధర్మముండదు. కావున సాక్షి, ప్రత్యగాత్మ, క్షేత్రజ్ఞుడు, జీవుడును నిరుపాధికచైతన్యముయొక్క విభూతియే.

నేను సర్వప్రాణులబుద్ధియందుండుటచే నావలననే అనుభవము, స్మృతి, యీరెండును లేకపోవుటయు గలుగుచున్నవి. ఎట్లన? ఈరోజు పగలు ఘటపటాదుల ననుభవించిన ప్రమాత రాత్రి నిదురించినతోడనే బ్రహ్మతో గలసెను. అపు డంతఃకరణతాదాత్మ్యాధ్యాస యతనికి లేదు. కాన ప్రమాతృత్వము లేదు. ప్రమాతృత్వము లేకపోతే ప్రమాత నశించినట్లే. నిద్రానంతరము బ్రహ్మనుంచి యజ్ఞానవశమున, కర్మవశమున మరునా డుత్థితుడయిన ప్రమాత వెనుకటి ప్రమాతకంటె వేరు. వానికి సాక్షిచైతన్యముయొక్క యనుగ్రహములేనిదే పూర్వదినమున ననుభవించిన ఘటపటాదుల స్మరణ మెట్లు పొసగును?

అయితే ప్రతిరోజు నిద్రలో ప్రమాత నశించి జాగ్రత్తులో ప్రమాత పుట్టుచో చేసినకర్మ చెడిపోవుట, చేయనికర్మ వెంటబడుట, యను దోషములు కలుగవా? యని శంకింపదగదు. ప్రమాత నశించినను, ఉపాధియుండుటచే నుపాధి నాశ్రయించుకొని కర్మలుండును. ఆకర్మలే మరల వెంటనంటును. కాన నైదోషములు ప్రసక్తించవు. అంతఃకరణమను నుపాధికూడ నిద్రలో నశించునని యనరాదు. అయినను, కారణశరీరమను తూలాజ్ఞానోపాధి నశించలేదు. దానినాశమే మోక్షము. ప్రమాత్రూపాధియగు నంతఃకరణము నశించినది. దాన ప్రమాత నశిం

చెను. అవిద్య ప్రాజ్ఞునియొక్క యుపాధి. అది నశించలేదు. అయితే చల్లారిన దీపము మరల వెలగనట్లు, నశించినప్రమాత మరల యెట్లుపుట్టును ? వినుము. వెనుకటిప్రమాత ఏయంతఃకరణముతోఁగూడియున్నాడో, ఈప్రమాతకూడ నా యంతఃకరణముతోనే కూడియున్నందున ప్రమాతృభేదము లేదు.

✓ లేక నిద్రాదశలో అజ్ఞానమునందు దాగియున్న యంతఃకరణము అజ్ఞానము నుంచి మరలివచ్చుటచే తత్తాదాత్మ్యసనొందిన ప్రమాతకూడ మరలివచ్చెనని యనబడుచున్నాడు.

అయితే, ఇట్లు ప్రమాతకూడ నిద్రలో నజ్ఞానమునందు దాగియున్నాడని యేల యనరాదు ? నిజమే. అట్లు దాగియుండుటనే మేము నాశమంటిమి.

లేక నిద్రలో అంతఃకరణ మజ్ఞానమునందు సంస్కారరూపమున నున్నది. ఇదియే దాగియుండుట. ఆ సంస్కారము కూటస్థునకు ప్రమాతృత్వము నావహింపఁ జేయజాలదు. (కలుగజేయజాలదు.) కాన సుషుప్తియందు ప్రమాత లేడు. సుషుప్తి యందు సంసారమున్నచో సంసారియగు ప్రమాత యుండెడివాడు. సుషుప్తియందు సంసారము లేదు. కాన సుషుప్తియందు ప్రమాత నశించినవాడే. కూటస్థరూపముతో నాతడు నిత్యుడు.

కాన, "నిన్నటిరోజున కుండను జూచిన నే నీరోజున దానిని స్మరించు చున్నాను" అను ననుసంధానము సాక్షియొక్క అనుగ్రహములేనిదే నశించిన ప్రమాత కెట్లు సంభవించును ? చైత్రు డనుభవించినదానిని మైత్రుడు స్మరించు చున్నాడా ? లేదు. కాన కూటస్థుని యనుగ్రహముననే ప్రమాత స్మరించుచున్నా డనవలెను. కూటస్థుడు పూర్వదినమున ప్రమాతృరూపముతో ఘటము ననుభవించి, మరురోజున ప్రమాతృరూపముతో దానిని స్మరించుచున్నాడని భావము.

మరియు సుషుప్తిలోనున్న ఆనందమును, అజ్ఞానమును సాక్షి యనుభవించగా, జాగ్రదవస్థలో వానిని ప్రమాత స్మరించుచున్నాడు. ఇది సాక్షియనుగ్రహము లేనిదే ప్రమాత కెట్లు తటస్థించును ? అనుభవము సాక్షివలననేకదా ? కలిగినది. సాక్షిచైతన్యప్రతిఫలనములేనిదే యంతఃకరణమునకు వృత్తిజ్ఞాన మెక్కడిది? కాన సాక్షియనుగ్రహమువలననే యంతఃకరణమునకు జ్ఞానప్రాప్తి. ఇట్లే అపోహనము కూడ సాక్షినుంచియే జరుగుచున్నది. సూర్యు డంధకారముతో గప్పబడగా వెలుతురుండదు. సాక్షి యజ్ఞానావృతుడు కాగా ననుభవస్మృతు లుండవు. అంతః కరణమునకు తమోగుణోద్రేకము కలుగగా ఏమియు తెలియదు. ఏదియు స్మృతికి రాదు. నిద్రమాత్రమే లభించును. తమోమయమయిన అంతఃకరణమునందు **సాక్షిచైతన్యమునకు స్పష్టముగా స్ఫురణము లేకుండుటయే యచ్చట కారణము.**

లేక మిక్కిలి తమోగుణముతో వ్యాపించియున్న యంతఃకరణమునందు కొయ్యమీద ముఖము ప్రతిఫలించనట్లు సాక్షిచైతన్యము ప్రతిఫలించదు. అప్పుడు ప్రమాత నిదురించును. ఆ నిద్రానుభవము సాక్షిదికాని, ప్రమాతదికాదు. అంతః కరణము తమోగుణములో దూషితముకాగా, సాక్షి యజ్ఞానావృతునివలె నుండును. ఇంతియేకాని నిజముగ నతని కావరణములేదు. సాక్షికావరణము నిజముగ నున్నచో ప్రపంచమంతయు నంధకారబంధుర మగును.

లేక అంతఃకరణవృత్తులు సాక్షిభాస్యము లయినట్లు తన్మధ్యభాగములు వృత్త్యభావములున్నూ సాక్షివలననే భాసించును. సాక్షిభాస్యముకాని వస్తువేదియు నంగీకరింపబడదు. అట్లుకానిచో శశశృంగాదులుగూడ నున్నవగును. కాన నపోహనముకూడ సాక్షిభాస్యమనుట యుక్తము.

ఓయి ! ఇట్లగుచో సాక్షికి వైషమ్యదోషము ప్రసక్తించునుగదా ? కొందరు కొంచెము తెలిసికొనుచున్నారు. మరికొందరు యెక్కువ తెలియుచున్నారు. కొందరు తెలిసినదానిని స్మరించుచున్నారు. మరికొందరు మరచుచున్నారు. ఇన్ని రకముల మారెడి సాక్షి విషమస్వభావుడయినట్లేకదా ?

కాదు, వెనుకజేసిన పుణ్యాపాపములవలన సత్వాదిగుణముల హెచ్చుతగ్గు లేర్పడును. దానివలన నంతఃకరణపరిశుద్ధికి తారతమ్యము కలుగును. అద్దానిం బురస్కరించుకొని సాక్షిప్రతిఫలనమునకు వైచిత్ర్యము సంభవించును. ఇందు సాక్షియొక్క వైషమ్యమేమి ? కర్మవైషమ్యముకదా దీనికంతకు గారణము. ముఖ ప్రతిఫలనములోని వైచిత్ర్యము, అద్దమునందలి స్వచ్ఛత్వాస్వచ్ఛత్వములబట్టియా? ముఖస్వరూపమును బట్టియా ? కాన నిందు సాక్షియొక్క స్వరూపదోషము లేదు.

లేక, పుణ్యకర్మ లాచరించినవారలకు పుణ్యకర్మ ననుసరించి కలిగెడి యనుభవస్మృతులు కర్మసాక్షియగు నావలననే కలుగును. అట్లే పాపకర్మవశమున కలిగెడి స్మృతిజ్ఞానాపోహనములుగూడ నావలననే. వారివారి కర్మల ననుసరించి కర్మఫలమును నేనే యిచ్చుచుందును.

"సర్వేవేదా యత్పద మామనంతి" అనుశ్రుతినిబట్టి వేదము లన్నిటి చేతను నేనే ప్రతిపాదింపబడుచున్నాను. యజ్ఞాదులు నాయందు గల్పింపబడినవి. కల్పితములు అధిష్ఠానాత్మకములు. కాన యజ్ఞాదులను ప్రతిపాదించు వేదములు కూడ నన్నే ప్రతిపాదించినట్లగును.

అట్లే వేదాంతార్థసంప్రదాయముకూడ నానుంచియే బయలుదేరినది. కాన వేదాంతార్థసంప్రదాయకర్తనుగూడ నేనే. నారాయణుడు చతుర్ముఖబ్రహ్మకు, బ్రహ్మ సనకాదులకు, సనకాదులు నారదునకు, నారదుడు వ్యాసునకు, వ్యాసుడు

శుకునకును వేదాంతార్థమునుజెప్పెనని ప్రామాణికప్రతీతి కలదు. కాన వేదాంత కృత్తునుగూడ నేనే.

రామానుజీయము :

ఇచట రామానుజులు "సర్వస్య చ" అను చ శబ్దమువలన సోమ, వైశ్వానరుల గ్రహించవలెననియు దేవమనుష్యాది శబ్దములకు, జీవాత్మ యర్థమనియు, సూర్యాదిశబ్దములకు తదంతర్యామి సూర్యు డర్థమనియును, "వేదాంతకృత్" అనగా వేదఫలప్రదాత యనియును వివరించిరి.

ఈయది నిస్సారము.

సర్వశబ్దమువలననే సోమవైశ్వానరుల గ్రహించుట సంభవించుచుండ, నందుకొఱకు చ శబ్దమును బ్రయోగించుట వ్యర్థమగును. వైశ్వానరుడనగా జఠరాగ్ని. అది జడము. అందు జీవరూపముతో నీశ్వరుడు ప్రవేశించుట యసంభవము. అంతర్యామిరూపముతో బ్రవేశించినను జేయు పనిలేదు. ఈశ్వరు డంతర్యామిగానుండి జడమును నియమింపజాలడు.

సూర్యాదిశబ్దములు తదంతర్యామీశ్వరుని ప్రతిపాదించినను, యూపాదిశబ్దము లట్లు యీశ్వరుని ప్రతిపాదింపజాలనందున నీరీతిన సర్వవేదవేద్యత్వ మీశ్వరునకు సిద్ధించదు.

దేవమనుష్యాది శబ్దములు దేహ తాదాత్మ్యాధ్యాసగల జీవుని ప్రతిపాదించుగాక, అధ్యాసలేని యీశ్వరు నెట్లు ప్రతిపాదించును? ఈశ్వరునకుగూడ నధ్యాస యుండుచో నీశ్వరుడుకూడ జీవునివలె నజ్ఞాని యగును. ఈశ్వరున కజ్ఞానము లేకున్నను, వేదముల కజ్ఞానమున్నందున నట్లు చెప్పెనన్నచో, నపు డజ్ఞానముగల వేదములు అప్రమాణము లగును. కాక జడమయిన వేదమునకు చేతనధర్మమగు నధ్యాస యుండు టెట్లు పొసగును? ఘటమున కధ్యాసకలదా? ఇక వేదపురుషు డందురా! అతడు సర్వజ్ఞుడుకాన, నాతని కధ్యాసయే యుండదు.

మరియు నీశ్వరుడు వేదోక్తకర్మఫలప్రదాతకాని, వేదఫలప్రదాత గాడు. "వేదాక్షరాణి యావంతి పఠితాని ద్విజోత్తమైః। తావంతి హరినామాని కీర్తితాని నసంశయః" అను స్మృతి యుచ్చరింపబడుచున్న వేదమునకు ఫలమును జెప్పుచున్నది. కాని కేవలవేదమునకు ఫలమును జెప్పుటలేదు. మరియు, "కృత్" అను పదమునకు దాత యను నర్థము వర్ణించుట వ్యాకరణవిరుద్ధము.

మరియు వేదాంతదేశికులు మూలమునందలి వేదాంతశబ్దము ఉపనిషత్పరమగుచో ప్రకృతమునకు సందర్భించ దనిరి.

అదియు ననుచితము.

విభూతినిచెప్పు ప్రస్తావమున వేదాన్తసంప్రదాయప్రవర్తకత్వరూపమయిన విభూతిని చెప్పుట యసంగతము కాదు.

కాన వారివివరణము సందర్భరహితము. ౧౫

శ్లో॥ ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ,
క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే॥ ౧౬

అ॥ ఇంతవరకు నీశ్వరునియొక్క విభూతి సంక్షేపముగా జెప్పబడినది. ఇప్పుడు నిరుపాధికమయిన తత్త్వమును నిర్ధారణచేయదలచి యుత్తరశ్లోకము లారంభమగుచున్నవి.

అర్జునా! ఈ సంసారమున పురుషుడు రెండు రాశులుగ విభాగము జెందెను. నశించునట్టి భూతములన్నియు క్షరరాశి. భగవంతునిమాయాశక్తి అక్షరరాశి. ఈ రెండే ప్రపంచగోచరమగు పదార్థములు.

ఇట్లుకాక రామానుజులుచెప్పినట్లు చేతనవర్గమునుమాత్రము గ్రహించినచో అచేతనవర్గము రాశిత్రయమునకు వెలుపల దగును. అంగీకరింతమన్నచో, శ్రీకృష్ణుడు నాల్గురాసుల ప్రతిపాదించనందున వీలులేదు. శ్రీకృష్ణుడు క్షర, అక్షర, పురుషోత్తమ మను రాశిత్రయమునే ప్రతిపాదించెను.

మరియు రామానుజులు చెప్పిన ట్లంగీకరించుచో క్షరాక్షరరాసులకంటె భిన్నమయిన పురుషోత్తముడు అచేతనమగును.

కాన పైవివరణమే యుచితము.

ఓయి! జ్ఞానముచే నశించుప్రకృతి యక్షరరాశి యెట్లగును?

వినుము. సంసారబీజములయిన కామకర్మావిద్యలు, బీజాంకురన్యాయమున అనంతము లగుటచే వాని కాధారమయిన ప్రకృతికూడ ననంతమే యగును. కాన ప్రకృతి జ్ఞానోదయపర్యంతము నశించనందున దానికి నాపేక్షికనిత్యత్వ మంగీకరింపబడినది. ఇట్లు రాశిద్వయముమాత్రమే యీశ్లోకమున నిరూపింపబడినది. మూడవ రాశి ముందుశ్లోకమున నిరూపింపబడగలదు.

రామానుజీయము :

ఇచట క్షరశబ్దముచే నిర్దేశింపబడిన పురుషుడు జీవశబ్దముచే జెప్పదగినట్టియు, నశించుస్వభావము గలిగినట్టియు, అచిత్పదార్థముతో గూడినట్టియు, బ్రహ్మాదిస్తంబపర్యంతభూతము లనియు, అచిత్సంబంధములేని స్వస్వరూపముతో నున్న ముక్తాత్మ అక్షరపురుషుడనియును వ్యాఖ్యానించిరి.

ఇది యుక్తముకాదు.

ఇచట జీవుడు, యీశ్వరుడు, వేరుపరచి చూపబడుచున్నాడా? లేక వేరు పరచక చూపబడుచున్నాడా?

౧. మొదటిపక్షమున జీవు డచిత్సంస్పృష్టు డనుట తగదు.

౨. రెండవపక్షమున ఈశ్వరుడుకూడ నచిద్విష్టుడేకాన క్షరుడే యగునుగాని క్షరభిన్నుడు కాడు.

అట్లే యీశ్వరుడు చిద్విశిష్టుడేకాన అక్షరభిన్ను డెట్లగును?

మరియు, "కూటస్థోఽక్షరః" అనిచెప్పుట, అచిద్వియుక్తచిత్ప్రదర్శన మెట్లగును? ఇందు కూటమను నచిద్భాగము కలదుకదా?

ఇంక జీవుడు ప్రకృతినుంచి విడదీసియు విడదీయకయు రెండురకముల నిరూపింపబడుచున్నాడనియు ఈశ్వరుడుమాత్రము ప్రకృతినుంచి వేరుపరచియే నిరూపింపబడుచున్నా డనియును జెప్పుచో నట్లు నిరూపింపబడుజీవుడు బద్ధజీవుడా? ముక్తజీవుడా?

౧. బద్ధజీవుని వేరుపరచి నిరూపింప బనిలేదు.

౨. ముక్తజీవుని ప్రకృతినుంచి వేరుపరచక నిరూపింప నలవికాదు.

అట్లే విశిష్టేశ్వరుడు వేరుపరచి నిరూపింపబడుచున్నాడా? లేక శుద్ధ చిన్మాత్రుడా?

౧. విశిష్టేశ్వరుని వేరుపరచిచూపుట యసంభవము.

౨. మీమతమున శుద్ధచిన్మాత్రమును అంగీకరించనందున నదియు గుదరదు.

మరియు జీవుడు, బంధావస్థలో నాశస్వభావముగల యచిద్భాగముతో గూడినందున క్షరుడనియు ముక్తిదశలో నచిద్విశిష్టుడు కానందున అక్షరుడనియును, ఈశ్వరుడు ప్రకృతిపురుష విశిష్టుడయినను, దండవిశిష్టుడయిన పురుషుడు దండము కంటె వేరయినట్లు ప్రకృతిపురుషులకంటె వేరనియు నన్నచో నదియు జెల్లదు.

జీవునకు నశించుట స్వభావమా? నశించకుండుట స్వభావమా? ఇందు ౧ మొదటిపక్షమున జీవునకు నక్షరత్వ మెట్లు? ౨ వపక్షమున వానికి క్షరత్వమెట్లు? ఇంక నచిద్వైశిష్ట్యమువలన జీవుడు నశించునన్నచో స్వభావసిద్ధమయిన ధర్మము స్వరూపనాశములేనిదే మారునా? ఉష్ణస్వభావుడయిన అగ్ని స్వరూపనాశము నొందకుండ శీతస్వభావు డగునా!

ఇంక నచిత్పదార్థమునందలి నాశస్వభావము జీవునియం దారోపింపబడు చున్న దనుటయు, మీ మతసిద్ధాంతమునకు భంగము. విధినిషేధములు విశేష్యము నందు బాధచెందినపుడు విశేషణమున సంక్రమించినను న్యాయము ననుసరించి అచిద్విశిష్టుడయిన జీవుడు క్షరుడని చెప్పగా నది కుదరనందున, నందు విశేషణాంశ మయిన అచిత్తునకే క్షరత్వము ప్రాప్తించుచున్నదని యనరాదు. అట్లగుచో, అచిత్పదార్థము క్షరమనియు, చిత్పదార్థము అక్షరమనియును జెప్పవచ్చును. ఈ వక్రమార్గ మవలంబించ నేల ? అయ్యా, ఇది మూలకర్తయగు వ్యాసులతప్పుకాని, మాది కాదందురేమో ? భగవంతుడగు పరాశరాత్మజునియందుగూడ దోష మాపాదింపజేయు మీ పాండిత్యమహిమ యేమని మెచ్చదగును ?

మరియు "సర్వాణి భూతాని" అను మూలమునందలి పదమునకు "అచిత్పదార్థ మంతయు," అను నర్థమును వర్ణించుటకు మీ కేమి నొప్పి ?

మీమతమున ప్రకృతికూడ నచిద్ద్రవ్యము నశించుస్వభావము కల దెట్లాయెను? అయితే కారణప్రకృతి నిత్యమనియు, కార్యప్రకృతి (అనగా దేహాదులు) యనిత్య మనియును సవరించుకొనుచో, "ఎంతచుట్టుతిరిగినను టోలుగేటువద్దనే తెల్లవారె నన్నట్లు" మీ రెంతవక్రమార్గ మవలంబించినను, తుదకు కార్యజాతమంతయు క్షరమని శ్రీశంకరులు చెప్పిన యర్థమే ఖాయమైనది.

మరియు క్షరశబ్దమునకు నశించుస్వభావముగల అచిద్ద్రవ్య మర్థమన్నచో, నశించని యచిద్ద్రవ్యమును నేపదముతో జెప్పెదరు ? మీ మతమున "కూటస్థో ఽక్షరః" అనువాక్యమునకు "నశించని స్వభావముగల యచిద్ద్రవ్య మర్థమని మీరు వ్యాఖ్యానించలేదు. ముక్తాత్మ యర్థమని వ్యాఖ్యానించిరి. అచిద్ద్రవ్యమును ప్రతి పాదించుటకు మా కనావశ్యకమందురేమో ? అ ట్లనరాదు. లోకములో నశించు పదార్థము, నశించనిపదార్థము - అని రెండేపదార్థములు. మూడవపదార్థము లేదు. వినాశావినాశములు రెండు నొకేపదార్థమునం దుండవు. అందువలన నీ రెండును కలసినది మరియొక పదార్థమన వీలులేదు.

కాన కార్యజాతమంతయు నశించుపదార్థము. ఇది "క్షరస్సర్వాణి భూతాని" అనుదానిచే జెప్పబడినది. అవినాశిపదార్థము (నశించని పదార్థము) రెండు తెఱంగులు. చిత్తు, అచిత్తు అని. చేతనాచేతనములకంటె వేరుగ తదుభయా త్మకముగాని, తదుభయవిలక్షణముకాని మరియొక వస్తువు లేదు. చిదచిద్విల క్షణు డీశ్వరుడు గలడని యందురేమో ? చేతనుడయిన నీశ్వరుడు చిద్విలక్షణుడు కానేరడు. ఈశ్వరుడు ద్రష్టయని (చేతనుడని) మీ రంగీకరించిన విషయము. ఇట్లు కానిచో నచేతనము ద్రష్ట యెట్లగును ?

కాన చిత్తు - అచిత్తుయని అవినాశియగు పదార్థము రెండువిధములని సుస్పష్టము. అందు, చిత్పదార్థము "ఉత్తమః పురుషస్త్వన్యః" అను ముందు శ్లోకముచే నిరూపింపబడుచున్నది. ఇంక నచిత్పదార్థము ప్రతిపాదింపదగియుండ ప్రతిపాదించకుండుట మీ మతమున దోష మేలగాదు?

అట్లే ఒకే చిత్పదార్థము "కూటస్థ" వాక్యముచేగూడ ప్రతిపాదింప బడునన్నచో పునరుక్తిదోషము వాటిల్లును.

ఇంక చిత్పదార్థము, జీవేశ్వరరూపమున రెండువిధముల నుండుననియు, నందు జీవుడు కూటస్థ వాక్యముచేతను ఈశ్వరుడు "పరమాత్మ"వాక్యముచేతను ప్రతిపాదింప బడుచున్నాడనియు గాన పునరుక్తిదోషము లేదన్నచో నదియు పొసగనేరదు.

౧. "పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః"అని పరమాత్మ వాక్యముకూడ జీవుని ప్రతిపాదించుచున్నది.

౨. కూటస్థవాక్యము నిర్వికారేశ్వరుని ప్రతిపాదించుచున్నది.

3. "ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గి" అను శ్రుతియందలి అక్షర శబ్దము యీశ్వరుని చెప్పుచున్నది.

అయితే ఆ యా ప్రకరణమునుబట్టి, ఆ యా శబ్దము లా యా యర్థముల జెప్పవచ్చును. ఇక్కడమాత్రము అక్షరశబ్దము, కూటస్థశబ్దమును జీవపరములే; పరమాత్మశబ్దముమాత్రము యీశ్వరపరమని మీరు సమాధానపరచుకొన్నను, చిత్పదార్థమయిన జీవునికంటె నీశ్వరునకు వైలక్షణ్యము లేనందున "ఉత్తమః పురుష స్త్వన్యః" అని చెప్పుట యసంగతమే యగును.

జ్ఞానాకారులయిన జీవేశ్వరులకుగూడ ధర్మమువలన భేద మున్నదనుట యుక్తిరహితము. నిర్ధర్మకమయిన జీవేశ్వరస్వరూపచైతన్యమునకు ధర్మభేద ముండుట యసంభవము.

మీరు మీమతమున ముక్తులు పొందదగిన యాత్మస్వరూపము సచ్చిదా నందమనియు సుఖాదిసంసార రహితమనియు, సర్వజ్ఞమనియును అంగీకరించిరి. ఇట్టితఱి జీవేశ్వరులకు కించిద్జ్ఞత్వ సర్వజ్ఞత్వప్రయుక్త భేదముమాత్ర మేది?

సర్వజ్ఞమనగా సర్వజ్ఞత్వమను ధర్మము కలదని యర్థముకాదు. సర్వజ్ఞత్వ మనగా సర్వమును ప్రకాశింపజేయుట. అదియు ననుభవమాత్రమయిన చైతన్యమే యని సిద్ధాంతము.

కావున నిచట "కూటస్థోఽక్షర ఉచ్యతే" అను వాక్యమునకు నాశము లేని యచిద్ద్రవ్యమే యర్థము. ఆత్మ ముందువాక్యముచే ("ఉత్తమః పురుషః"

అను వాక్యముచే) ప్రతిపాదించబడుచున్నాడు. కాన నిచట జీవేశ్వరభేదమును గల్పించు టెంతమాత్రము న్యాయముకాదు. ౧౬

శ్లో॥ ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః
యో లోకత్రయ మావిశ్య బిభ ర్త్యవ్యయ ఈశ్వరః॥ ౧౭

టీ॥ అర్జునా! వెనుక జెప్పిన క్షరాక్షరోపాధులకు విలక్షణుడై వానిదోషములతో నంటక, నిత్య శుద్ధ బుద్ధ ముక్తస్వభావుడయిన నుత్తమపురుషుడు పరమాత్మ యనబడుచున్నాడు. పరమాత్మ నాశరహితుడు, లోకత్రయమున బ్రవేశించి యందలి చరాచరభూతసంఘాతమును ప్రత్యగాత్మరూపముతో ధరించుచున్నాడు.

ప్రపంచమును నిండియుండుటవలనగాని, దేహమను పురమం దుండుటవలన గాని పురుషు డనబడుచున్నాడు. ఈ యుత్తమపురుషుడు అవిద్యాకల్పితమయిన దేహాద్యాత్మలకంటె మిక్కిలి విలక్షణుడు. ఇతడు కల్పితుడుకాడుకనుక నుత్తముడు. ప్రత్యగ్రూపముతో నిఖిలభూతములకు నంతరాత్మ. సర్వమును ప్రకాశింప జేయుట్లచే చేతనుడు. కావున పరమాత్మయని చెప్పబడుచున్నాడు.

ఓయి! సులభముగా పరిపూర్ణచైతన్యమును జెప్పునట్టి పరమాత్మ శబ్దమునకు ప్రత్యగాత్మయను నర్థమును లాగుట యుక్తమా? కాదు. "పరమాత్మేతి చాప్యుక్తో దేహేస్మిన్ పురుషఃపరః" అని వెనుకచెప్పియుంటచే ప్రత్యగాత్మను పరమాత్మ యనవచ్చును. కాక పరిపూర్ణచైతన్యమే యుపాధివశమున ప్రత్యగాత్మ యగుచున్నది.

మరియు, "యో లోకత్రయ మావిశ్య" అను హేతువుచే సర్వాంతర చైతన్యమునే యిట గ్రహించుట యుచితము. వినుడు. పరమాత్మ నిర్విశేష చిన్మాత్రుడయినను జ్ఞాన, బల, క్రియా శక్తులతోగూడిన ప్రత్యగ్రూపముతో సర్వాంతరాత్మ యగుచు, జ్ఞానశక్తితో సర్వమును చైతన్యముగలదానినిగ జేయుచున్నాడు. బలశక్తితో సర్వమును భరించుచున్నాడు. క్రియాశక్తితో సర్వమును పనిచేయించుచున్నాడు. అందు నిచట "యోలోకత్రయ" మనువాక్యముచే బలశక్తియొక్క కార్యము చెప్పబడుచున్నది. పదునాల్గు లోకములను మూటియం దంతర్భావముచేసి మూడని చెప్పబడినది. లోకత్రయశబ్దమునకు నందుండు భూతసంఘాతము లాక్షణికార్థము. పరమాత్మ ప్రాణిసంఘమును నియమించుస్వభావము గలవాడు. ఈతనికి నారాయణుడని ప్రసిద్ధమయిన నామము. (నారస్య = భూతసంఘస్య. అయనం = స్థితిః = యస్మిన్) అను వ్యుత్పత్తిచే భూతసంఘమున కధిష్ఠానమయిన పరమాత్మయే నా రా య ణు డు కనుకనే "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణస్థితః" అను శ్రుతి పొసగుచున్నది.

కావున పరిపూర్ణచైతన్యమే నిఖిలభూతసంఘమును ప్రత్యగ్రూపముతో ప్రవేశించి, బలశక్తితో సద్దానిని నిలబెట్టుచు, క్షరాక్షర విలక్షణమయిన పురుషోత్తమశబ్దవాచ్య మగుచున్నదని ఫలితార్థము.

ప్రకృతికార్యమంతయు క్షరపురుషుడనియు, కారణప్రకృతి అక్షరపురుషుడనియు, పరమాత్మ యుత్తమపురుషుడనియును భేదము.

ఇచట రామానుజులు "పురుషోత్తముడగు నీశ్వరుడు, క్షరాక్షరశబ్దములచే నిర్దేశింపబడిన బద్ధ, ముక్త పురుషులకంటె వేరనియు, నట్టిపరమాత్మ అచేతన లోకమును, బద్ధజీవలోకమును, ముక్తజీవలోకమును ప్రవేశించి భరించుచున్నాడనియును వ్యాఖ్యానించిరి. ఇది యనుచితము :

అసంగపురుషునకు నచిత్తుతో సంయోగవియోగములు సంభవించవు. కాన ఆత్మకు బద్ధత్వ ముక్తత్వావస్థ లుండవు. జ్ఞానైకాకారులగు జీవేశ్వరులు రెండు పదార్థము లగుట విరుద్ధము. కాన జీవుడీశ్వరునికంటె నర్థాంతరముగాడు.

శ్లో॥ యస్మాత్క్షరమతీతోఽహం అక్షరాదపి చోత్తమః
అతోఽస్మి లోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః॥ ౧౮

అ॥ నేను క్షరపదార్థము నతిక్రమించితిని. అక్షరపదార్థము నతిక్రమించితిని. అందువలన పురుషోత్తముడ నని వేదమునందును, లోకమునందును ప్రసిద్ధి జెందితిని.

లోకప్రసిద్ధికి "న చ తే న వినా నిద్రాం లభతే పురుషోత్తమః" అను కావ్య ప్రయోగ మాధారమగుచున్నది. ౧౮

శ్లో॥ యో మామేవ మసంమూఢో జానాతి పురుషోత్తమం
స సర్వవి ద్భజతి మాం సర్వభావేన భారత॥ ౧౯

అ॥ ఓయి అర్జునా! ఏ మానవుడు వివేకియై క్షరాక్షరవిలక్షణమయిన ప్రత్యగభిన్నపరమాత్మ నేనని సర్వాత్మనా తెలిసికొనునో, వాడు నన్ను సర్వభావముతో బొందును. అనగా నుపాధినిర్ముక్తు డగుచు పరిపూర్ణచైతన్యరూపముతో నుండునని యర్థము.

ఇచట సర్వాత్మచిత్తతతో సేవించువా డగుననికూడ నన్వయించవచ్చు. ౧౯

శ్లో॥ ఇతి గుహ్యతమం శాస్త్ర మిదముక్తం మయానఘ
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యా త్కృతకృత్యశ్చ భారత॥ ౨౦

అ॥ ఓయి పాపరహితుడా! అతిరహస్యమని నీ గీతాశాస్త్రమును నేను నీకు జెప్పితిని. దీనిని నేను జెప్పినట్లు తెలిసికొన్న బుద్ధిమంతుడు కృతకృత్యు డగును.

ఓయి! ఈ యొక్క యధ్యాయము గీతాశాస్త్ర మెట్లగును? అన్నియధ్యాయములు కలసికదా గీతాశాస్త్రమగునది?

నిజమే, వినుము. గీతాశాస్త్రార్థమయిన, క్షరాక్షరపరమాత్మ లీయధ్యాయమున సంక్షేపముగ జెప్పబడుటచే నీయది శాస్త్రమగుచున్నది. మరియు, సర్వవేదములచే తెలియదగిన పరమాత్మ యీ యధ్యాయమున జెప్పబడెను. కాన వేదార్థమంతయు నిందు బొందుపరచబడిన ట్లయినది. కాన నియ్యది శాస్త్ర మనదగును.

కృతకృత్యుడగు ననగా, ఉత్తమకులమందు బుట్టిన బ్రాహ్మణుడు చేయదగిన దానిని చేసిన ట్లగునని యర్థము.

ఇచట భాష్యమునందలి "బ్రాహ్మణేన" అను పదమునకు సన్న్యాసియని యర్థమును జెప్పవలయును. గీతాశాస్త్రమునందు సన్న్యాసుల కధికారముండుటవలన కనుక సన్యసించి చేయదగినదానిని చేసినవా డగునని భావము.

లేక సన్యసించకపూర్వము చేయదగిన యజ్ఞాదుల దాను జేయకున్నను, గీతాశాస్త్రార్థమును దెలిసికొన్నందున యజ్ఞాదుల జేసినవాడే యగునని మరియొక భావము.

లేక కలియుగమున దఱచుగ క్షత్రవైశ్యులు తమ ధర్మమును విడచియుండుటచే, "బ్రాహ్మణేన" అని భాష్యకారు లనిరి. కాన సన్న్యాసాశ్రమమును స్వీకరించి వేదాంతశ్రవణమును జేసి భగవత్తత్త్వమును దెలిసికొన్నచో, బ్రాహ్మణుడు చేయదగిన యజ్ఞాదు లాచరించినట్లే యని యర్థము.

దీనివలన గీతాశాస్త్రమునందు బ్రాహ్మణునకే యధికారము కలదుగాని, ఇతరులకుగాని, స్త్రీలకుగాని యధికారములేదని తేలినది. కాని యొకానొకచోట సన్యసించని బ్రాహ్మణులకుగూడ వేదాంతపాఠమునందువలె గీతాపాఠమునందును దానియర్థమును విచారణ చేయుటయందును అధికారమున్నటుల గనిపించుచున్నది.

భాష్యకారులకుమాత్రము వేదాంతములను, గీతలను చదువుటయందు మాత్రమే సన్యసించని బ్రాహ్మణుల కధికారమనియు, అర్థవిచారణయందు మాత్రము సన్న్యసించినబ్రాహ్మణులకే యధికారమనియును నభిమతమయినది.

స్త్రీశూద్రాదులకు వేదాంతములనుగాని, గీతలనుగాని చదువుటయందు గూడ నధికారములేదని సర్వసంమతము. "స్త్రీశూద్రద్విజబంధూనాం త్రయీ న శ్రుతిగోచరా" అను స్మృతి స్త్రీశూద్రాదులకు వేదత్రయమును వినెడి యధి

కారము లేదని చెప్పుచున్నది. భగవద్గీతాసూపనిషత్సు" అనిచెప్పుటచే గీతలు కూడ వేదతుల్యములు. కాన నీరెంటియందును స్త్రీశూద్రాదుల కధికారము కనిపించదు.

భగవత్తత్త్వము తెలియనిదే కర్మల నెన్నిచేసినను ప్రయోజనము లేదు. అందుకు మనువచనము ప్రమాణము. "ఏతద్ధి జన్మసామగ్ర్యం బ్రాహ్మణస్య విశేషతః। ప్రాప్యైత త్కృతకృత్యోహి ద్విజో భవతి నాన్యథా" అని. దీనికి పూర్వము "యద్విష్ణో ర్లింగధారణం" అని కలదు. విష్ణులింగమనగా సన్న్యాసము. దానిని స్వీకరించుటయే జన్మసాఫల్యమని దీనిభావము.

ఈతత్త్వమును వినుటచే నర్జునుడుకూడ కృతకృత్యుడు. ఈయధ్యాయార్థమును వినినవారందఱు నర్జునునివలె గృతార్థు లగుదురని సూచించబడుచున్నది.

సన్న్యాసాధికారములేని క్షత్రియులకుగూడ గీతార్థశ్రవణాధికారము కలదని భగవంతు డర్జునునికొఱకు గీతార్థము నుపదేశించుటచే సూచితమగుచున్నందున కృష్ణు డర్జునునకు గీత నెట్లు చెప్పెనని శంకించదగదు.

ఈయధ్యాయము సర్వగీతార్థమును సూచించుటవలనను, వేదార్థమంతయు నిందు పొందుపఱుపబడుటవలనను, నీయది యుత్కృష్టమయినదని యెంచి, సర్వగీతాశాస్త్రమును పారాయణము చేయజాలని శిష్టులు ఈయధ్యాయమును ప్రతి రోజున బఠింతురు. దీనిని పఠించుటవలనగూడ సర్వపాప వినిర్ముక్తులగుచు ఈజన్మమునగాని, జన్మాంతరమునగాని, శమదమాదిపూర్వకముగ సన్న్యాసము నొంది వేదాంతశ్రవణపూర్వకముగ తత్త్వజ్ఞానము నొంది ముక్తిని వడయుదురు. కనుక నీయధ్యాయపాఠముకూడ కృతకృత్యతకు గారణమగును.

కావున ముముక్షువు లెల్లరు నీయధ్యాయమును విని, పఠించి దీనియర్థమును చింతించవలయును. ఈయధ్యాయమునకు భాష్యార్థమును వివరించుభాగ్యము నాకు లభించినందున నేను ధన్యుడ నయితిని. దీనిని జూచినవారు, చెప్పినవారు, విన్నవారును ధన్యులు. ఇందు "ఏతద్బుధ్వా బుద్ధిమాన్ స్యాత్" అనిచెప్పుటచే జ్ఞానమాత్రమే కృతకృత్యతకు గారణముకాని, కర్మజ్ఞానసముచ్చయము కృతకృత్యతకు కారణము కాదని తేలినది.

కాన "తరతి శోకమాత్మవిత్" అను శ్రుత్యనుసరణ మీగీతకు సిద్ధించినది. కనుకనే దీనికి నుపనిషత్సామ్య మేర్పడినది.

ఈయధ్యాయమునకు పురుషోత్తమప్రాప్తియోగాధ్యాయమని పేరు గలదు.

౧. పురుషోత్తమప్రాప్తియనగా పరమాత్మస్వరూపప్రతిపాదన మని యొక యర్థము.

౨. పురుషోత్తమునియొక్క ప్రాప్తిగల జ్ఞానయోగమని మఱియొక యర్థము.

3. ఈయధ్యాయార్థము మోక్షప్రదాయకమని ఇంకొక యర్థము.

ఎట్లులయినను క్షరాక్షరపురుషులకంటె నుత్తమమయిన పురుషుడు, పరమాత్మయందు ప్రతిపాదించబడుటచే నీయధ్యాయమునకు పురుషోత్తమప్రాప్తియోగ మను పేరు కలిగెను.

ఇతి

శ్రీ భగవద్గీతా భాష్యార్కప్రకాశికానువాదమున
పురుషోత్తమప్రాప్తియోగ మను
పంచదశాధ్యాయము
ముగిసెను.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీః

శ్రీ హయగ్రీవాయ నమః

# శ్రీభగవద్గీతా భాష్యార్కప్రకాశికానువాదము

## షోడశాధ్యాయము.

"మోఘాశాః మోఘకర్మాణః మోఘజ్ఞానావిచేతసః,
రాక్షసీ మాసురీంచైవ ప్రకృతిం మోహినీం శ్రితాః॥
మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః,
భజన్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్॥ అను శ్లోకములచే తొమ్మిదవ అధ్యాయమునందు దైవీ, రాక్షసీ, ఆసురీ, అను మూడురకముల స్వభావములు సంక్షేపముగా చెప్పబడినవి. ఇందు దైవస్వభావము (ప్రకృతి) మోక్షమునకు సాధనమనియు రాక్షస ఆసురస్వభావములు సంసారబంధమునకు కారణములనియు నీయధ్యాయమునందు ముందు శ్రీకృష్ణుడు చెప్పబోవుచున్నాడు. ఇందు ఏ స్వభావము (ప్రకృతి) స్వీకరింపతగినది యే స్వభావము పరిత్యజింపదగినది తెలిసికొనుట మానవులకు ఆవశ్యమే కనుక నీమూడు ప్రకృతులను విపులముగా చెప్పదలచి పదునారవ యధ్యాయ మారంభింపబడుచున్నది.

శ్లో॥ అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగ వ్యవస్థితిః
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్॥ ౧

అభయమనగా అద్వితీయబ్రహ్మజ్ఞానము కలిగినమీదట సంసారభయము లేకుండుట, లేక, దేహాదులు అనిత్యములని నిశ్చయముండి ఆధివ్యాధులవలన భయములేకుండుట - ఇంతియెకాని నాస్తికులకువలె నరకాదులవలన భయము లేకుండుట కాదు. నరకపాతమువలన భయము లేకుండుట, ఆసురసంపదలో చేరును. ప్రకృత ప్రకరణము దైవసంపదను నిరూపించు ప్రకరణము. సత్త్వసంశుద్ధియన నిష్కపట స్వభావము. శాస్త్రమునలన ఆచార్యోపదేశమువలన కలిగిన ఆత్మజ్ఞానమును అనుభవమునకు తెచ్చుకొనుట జ్ఞానయోగము. ఇది ముఖ్యమయిన సాత్త్వికసంపద. తమతమ వర్ణాశ్రమ ధర్మానుష్ఠానము సాత్త్విక ప్రకృతియని అర్థము. శక్తికొలది అన్నవస్త్రాదులను ఇతరులకు యోగ్యతను కనిపెట్టి యిచ్చుట దాన మనబడును.

బాహ్యేంద్రియనిగ్రహము దమము. శ్రౌత స్మార్తాగ్నిహోత్రాదుల ననుష్ఠించుట యజ్ఞము. ఋగ్వేదాదులను అధ్యయనముచేయుట స్వాధ్యాయము. తపస్సు మూడు విధములు- శారీరము, వాఙ్మయము, మానసము అని. ఇయ్యది ముందు అధ్యాయము నందు విపులముగా చెప్పబడును. సమమయిన స్వభావము ఆర్జవ మనబడును. ౧

శ్లో॥ అహింసా సత్యమక్రోధ స్త్యాగ శ్శాంతి రపైశునమ్,
దయా భూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీ రచాపలమ్॥ ౨

అ॥ అబద్ధముకానిది, హితమగువచనము, సత్యము - ఇది సాత్త్విక స్వభావముకలవారికిగాని యలవడదు. కొట్టినను తిట్టినను క్రోధవికారము లేకుండుట అక్రోధము. కర్మతత్ఫలములను పరిత్యజించుట త్యాగము. ద్రవ్యత్యాగము త్యాగము కాదు. అయ్యది దానమని పూర్వము చెప్పబడినది. ఇతరులకు నితరుల దోషములను వెల్లడింపకుండుట అపైశునము. దుఃఖించుప్రాణులయందు కృప దయ. విషయములు తటస్థించినపుడు ఇంద్రియములు వికారమును చెందకుండుట అలోలుపత్వము. క్రౌర్యములేకుండుట మార్దవము. తనయొక్కగుణములను వినినపుడు కలిగెడు సిగ్గు లజ్జ యనబడును. కారణములేకుండ చేతుల కాళ్ళను కదల్చకుండుట అచాపలము.

ఇచట చేయరానిపనిని చేసినపుడు కలిగెడి సిగ్గు హ్రీ యని రామానుజులనిరి, అది సరిగాదు. సాత్త్వికపురుషునకు చేయరానిపనిని చేయుప్రసక్తి యసంభవము. కావున నట్లు చెప్పతగదు.

రామానుజులువ్రాసిన సత్యపదార్థనిర్వచనము, శాంకరభాష్యార్థమునకు విరుద్ధముకానందున ఆ భాగమును అనువదించలేదు. ౨

శ్లో॥ తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాతిమానితా,
భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత! ౩

అ॥ మరియు ఇతరులను తిరస్కరించు సామర్థ్యము తేజస్సు- కొట్టినను, తిట్టినను మనస్సు వికారమును చెందకుండుట క్షమ. (కలిగినవికారము శమించుట (శాంతించుట) అక్రోధము. వికారము కలుగకుండుట క్షమ అనిభేదమును గ్రహింపవలెను.)

**దేహేంద్రియాదులు శైథిల్యమును పొందునపుడు వాటిని శిథిలములు కాకుండ నిలువబెట్టునట్టి మనోవృత్తివిశేషము ధైర్యము. ధైర్యముతో నూపిరి పోసికొని దేహేంద్రియాదులు, మనస్సు చెడిపోవు. శౌచము- బాహ్యము, ఆభ్యంతరము అని రెండువిధములు. మట్టివలన, నీటివలన కలుగు శుద్ధి బాహ్యము.**

మనోబుద్ధులయందు రాగద్వేషాదులు లేకుండుట అభ్యంతరశుద్ధి. ఇతరులకు ద్రోహముచేయుతలంపు లేకుండుట అద్రోహము. తనను తాను పొగడుకొనకుండుట నాతిమానిత్వము. ఈయవి దైవసంపద ననుసరించి పుట్టినవానికి కలుగును.

ఈ మూడుశ్లోకములచే చెప్పబడిన ధర్మములు దేవధర్మములు. ఈధర్మములుగల సాత్త్వికపురుషుడు శరీరావసానమునందు దేవత్వమును పొందగలడు.

లేక అభయాదిగుణములు కలవానికి ఆత్మజ్ఞానము కలిగినచో మోక్షము సంభవించును. లేనిచో ఉత్తరజన్మమునందు దేవతగా బుట్టును.

లేక, "దైవీసంపద్విమోక్షాయ" అని చెప్పబోవుటచే అభయాదిగుణములుగల సాత్త్వికపురుషుడు సమ్యగ్జ్ఞానమును పొంది ముక్తుడగును. అనియు చెప్పనగును.

దీనివలన స్వర్గలోకమునందు శాంత్యాదిగుణములు కలవారు దేవతలు, క్రౌర్యాదిగుణములు గలవారు రాక్షసులు. అని రెండురకముల పురుషు లున్నటుల భూలోకమునగూడ అభయాది గుణములుగల మనుష్యదేవతలు, దంభాది గుణములుగల మనుష్యరాక్షసులు కలరని స్పష్టమగుచున్నది.

ఇచ్చట రామానుజులు : "దైవీ మభిజాతస్య" అనువాక్యమునకు భగవదాజ్ఞను నెరవేర్చుటకు పుట్టినవాడు. అని అర్థమును చెప్పిరి. అది యుక్తముకాదు. హిరణ్యాక్షుడుమున్నగు రాక్షసులుగూడ భగవదాజ్ఞను నెరవేర్చుటకే పుట్టిరి. అందువలన అభయాదిగుణములుకల సాత్త్వికులే దైవాజ్ఞను నెరవేర్చుటకు పుట్టుదురను నియమము లేదు. కావున రామానుజులు చెప్పినయర్థము పొసగదు.

శ్లో॥ దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవచ
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపద మాసురీం॥ ౪

అ॥ ఇప్పుడు అసురసంపద చెప్పబడుచున్నది.

ధర్మమే ధ్వజము (టెక్కెము) గా కలిగియుండుట దంభము. పార్థునకు కపి ధ్వజము. శ్రీకృష్ణునకు గరుత్మంతుడు ధ్వజము. అట్లే ఆసురభావముగలవానికి ధర్మమే టెక్కెమని యర్థము. రాజులు ధ్వజములచే (పతాకములచే) తమ ప్రతిష్ఠను ప్రకటించుకొనునట్లు ఆసురులు ధర్మముచే ప్రఖ్యాతిని పొందగోరుదురు. ధార్మికు డనుప్రఖ్యాతిని గణించుటకు ధర్మమును ఆచరించుట, దంభమని నిశ్చయార్థము. విద్యా, ధన, సద్వంశాదులవలన కలిగెడి గర్వము దర్పము. తనను యెక్కువగా గౌరవించవలెనని యనుకొనుట అతిమానము. ఇష్టవస్తువిఘాతము వలన కలుగు మనోవికారము క్రోధము. ఇట్టిక్రోధముచే కర్తవ్యాకర్తవ్యములను

తెలియనేరక తల్లినికాని, తండ్రినికాని, అన్ననుకాని, కుమారునికాని చంపుకొను చున్నాడు. కఠినమయినమాటలను మాటాడుట పారుష్యము. (నేత్రములు కల వానిని గ్రుడ్డివాడని యనుట, రూపవంతుని కురూపియనుట, గొప్పవంశమునందు బుట్టినవానిని నీచుడని యనుట. ఇవి కఠినోక్తులు.) గుణవంతునియందు లేనిదోష మును ఆరోపించి దూషించుట పారుష్యమని నిశ్చయార్థము. మిథ్యాజ్ఞానము, అజ్ఞానము– ఈయవి అసురప్రకృతిని యుద్దేశించిపుట్టినవానికి కలుగును.

శ్లో॥ దైవీ సంపద్విమోక్షాయ నిబన్ధాయాసురీ మతా
మా శుచస్సంపదం దైవీ మభిజాతోఽసి పాండవ ! ౫

అ॥ ఇందు దైవీసంపద మోక్షహేతు వగును. ఆసురీసంపద, రాక్షసీ సంపదయు, సంసారబంధమునకు కారణమగును. ఓయి అర్జునా! నీవు దైవ సంపదతో బుట్టితివి. నీకు ముందు మేలు కలదు. కావున నీవు దుఃఖింపకుము. ౫

శ్లో॥ ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు॥ ౬

అ॥ ఈలోకమున దైవము, ఆసురము అని భూతసర్గములు రెండు కలవు. అందు దైవసర్గమును విపులముగా చెప్పితిని. ఓయి అర్జునా! ఆసురభూతసర్గమును ఇపుడు విపులముగా జెప్పెద వినుము. సృష్టింపబడు ప్రాణులయొక్క భేదమునుబట్టి సృష్టి దైవీ అని, ఆసురీ అని, రెండురకము లయినది. సర్గశబ్దమునకు భావవ్యుత్పత్తిచే సృష్టియని అర్థము. కర్మవ్యుత్పత్తివలన సృజింపబడు భూతములు అర్థము. కావున సృజింపబడు భూతములు దైవసంపదతో కూడినవారు, ఆసురసంపదతో కూడినవారు అని రెండువిధము లనిభావము. ఇందు "ద్వయాహ ప్రాజాపత్యా దేవాశ్చ అసురాశ్చ" అను శ్రుతి ప్రమాణము. బ్రహ్మదేవునిచే సృజింపబడిన ప్రాణులు దేవతలు, అసురులు అని రెండువిధములు. అని శ్రుత్యర్థము.

అచేతనములయిన పంచమహాభూతములు దైవాసురసంపదలతో కూడినవి కావు. వాటిసృష్టి యిచట ప్రస్తుతము కాదు. సంసారసంబంధము కల ప్రాణుల (చేతనుల) యొక్క సృష్టియే యిచట ప్రకృతము. అచేతనములయిన మహాభూత ములకు సంసారప్రసక్తి లేదు. సంసారప్రసక్తికల ప్రాణులుమాత్రము యీరెండు రకములేకాని మూడవరకమువారు లేరు. ఈయధ్యాయము దైవాసుర సంపద్విభాగ యోగ మను పేరుతో విరాజిల్లుచున్నందున, ఇందు యీరెండుసంపదలను వివ రించి చెప్పుట యవసరము. అందు "అభయం సత్వసంశుద్ధిః" ఇత్యాదిశ్లోకములచే దైవసంపద విపులముగా చెప్పబడినది. ఇకముందు ఆసురసంపద విపులముగా చెప్ప బడగలదు. కావున వినుము. ౬

శ్లో॥ ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే॥ ౭

అ॥ ఇకముందు అధ్యాయపరిసమాప్తిపర్యంతము ఆసురసంపద వర్ణింపబడుచున్నది. మానవులు ఆసురసంపదయొక్క స్వరూపమును ప్రత్యక్షముగా తెలిసికొనినకాని దానిని పరిత్యజింపలేరు. కావున దానిని విపులముగా నిరూపించుట అవసరము.

స్వర్గసాధనమగు యజ్ఞాది విహితకర్మలయందు ప్రవర్తించుటకాని, నరకాది దుఃఖములకు హేతువగు అధర్మమునుండి నివర్తించుటకాని, ఆసురప్రకృతికల మానవులకు తెలియదు. మరియు వీరికి శౌచము తెలియదు. వీరియెడ ఆచారమిసుమంతయు నుండదు. సత్యమును వీరెరుంగరు. పైగా స్వర్గనరకములు లేవని పరులకు బోధించుచు నితరులనుగూడ చెరతురు. ఇవియన్నియు అసురుల లక్షణములు. కనుక అసుర మానవులుకూడ నిట్లే వర్తింతురు. ౭

శ్లో॥ అసత్య మప్రతిష్ఠం తే జగదాహు రనీశ్వరమ్,
అపరస్పర సంభూతం కిమన్య త్కామహైతుకమ్॥ ౮

అ॥ ఆసురప్రకృతిగలమానవులు అసత్యప్రాయులు కనుక ప్రపంచమంతయు అసత్యమని యందురు. ప్రపంచమునకు ధర్మాధర్మములు ఆధారభూతములు కావని వీరిసిద్ధాంతము. ప్రాణులకు సుఖదుఃఖములు ధర్మాధర్మములవలన కలుగవనియు, స్వాభావికములనియు వీరి ఆశయము. ప్రాణిజాతమును శిక్షించుటకు నీశ్వరుడు లేడని యందురు. ఈశ్వరుడు లేనిచో ప్రపంచ మెట్లు పుట్టును? అని యడుగగా వారిట్లు బదులు చెప్పుదురు. 'అపరస్పరసంభూతం' అని స్త్రీపురుషులయొక్క సంయోగమువలననే ప్రపంచమంతయు పుట్టుచున్నది. ప్రపంచముయొక్క పుట్టుకకు స్త్రీపురుషులకుగల పరస్పరానురాగమే కారణము. అంతకంటె వేరుకారణము లేదు. స్త్రీపురుషులకు గల కామమువలన వారిరువురకు కలయిక (సంయోగము) యేర్పడును. స్త్రీపురుషసంయోగమున ప్రపంచము పుట్టును. అని వీరిసిద్ధాంతము.

ఇచట నుత్తరార్ధమునందు రామరాయకవీంద్రులు మూడురకముల పాఠభేదములను సూచించుచున్నారు.

1. అపరస్పరసంభూతం నకించిత్కామహేతుకమ్॥

2. అపరస్పరసంభూతం నకించిత్కారణాన్తరమ్॥

3. అపరస్పరసంభూతం కిమన్యత్కామహైతుకమ్॥ అని.

ఇందు మూడవపాఠము నాగరపుస్తకములయందు కలదనియు, మిగిలిన రెండు పాఠములు తెనుగుపుస్తకములయందు కలవనియు వారియాశయము స్పష్టమగుచున్నది. మొదటి రెండుపాఠములకు అనుకూలమగు భాష్యపాఠమునుకూడ వీరి వ్యాఖ్యానమునందు వ్రాసిరి. కాని వీరివ్యాఖ్యయగు భాష్యార్కప్రకాశతోఁగూడిన శాంకరభాష్యగ్రంథమునందు మూలమున "అపరస్పర సంభూతం కిమన్యత్కామహైతుకమ్" అనుపాఠము; అందు కనుకూలమగు భాష్యము మాత్రమే యుదాహరింపబడినది.

తెనుగుప్రతులయందలి "నకించిత్కామహేతుకమ్" "నకించిత్కారణాంతరమ్" అను రెండుపాఠములకు అనుకూలమగు భాష్యపాఠము ఉదాహరింపబడుచున్నది.

"అపరస్పరసంభూతం నకించిద్దృష్టం, కామప్రయుక్తయోః స్త్రీపురుషయోరన్యోన్యసంయోగా జ్జగత్సర్వం సంభూతం, యది కారణాంతరం నవిద్యతే జగతః? కిమస్య కారణమ్? కామహేతుకమ్– కామహేతురేవ కామహేతుకం నకించిత్కారణాంతరం, నకించన కామాన్యకారణం స్యా ద్దృష్టమ్, కామఏవ ప్రాణినాం కారణమితి లోకాయతిక దృష్టి రియమ్" అని దీనియర్థము. పరస్పరమనగా– మిధునమని యర్థము. అన్యోన్యము (ఒకరికొకరు) అను అర్థమును చెప్పు పరస్పరశబ్దమునకు ఒండొరులు కలిసియున్న స్త్రీపురుషులయొక్కజంట యను అర్థమును ఔపచారికముగాఁ జెప్పవలెను. పరస్పరమన స్త్రీపురుషసంయోగమని భావము. కావున ప్రతిప్రాణియు స్త్రీపురుషసంయోగమువలననే పుట్టును. స్త్రీపురుషసంయోగమువలన పుట్టని భూత మేదియు లేదు, అని– ఇయ్యది నిరీశ్వరవాదులగు బౌద్ధులమతము. ఇది యుక్తమని భ్రమింపతగదు. ప్రాణులలో చేరని పృథివ్యాది భూతములకును, స్వేదజములు మొదలగు ప్రాణులకును జన్మహేతువు స్త్రీపురుషసంయోగము కానేరదు. ఈయవి ఈశ్వరునివలననే పుట్టదగియున్నవి. కావున నిరీశ్వరవాదము నిలువదు.

ప్రపంచోత్పత్తికి కారణ మేమన సమాధానమును చెప్పుచున్నారు. "కామహేతుకమ్" అని. కామమను హేతువే కామహేతుకమ్ అని స్వార్థమునందుకప్రత్యయము. కావున ప్రపంచోత్పత్తికి కామము కారణమని తేలినది. ఈయర్థము "అపరస్పరసంభూత" మను పదమువలన లభించునుకదా? అని యడుగరాదు. స్త్రీపురుషసంయోగము ప్రపంచమునకు కారణమనియు, స్త్రీపురుషసంయోగమునకు కామము కారణమనియు భేదమును గ్రహింపవలెను. కామము సంయోగము ద్వారా ప్రపంచమునకు కారణమగునని భావము. ఇంతవరకు పైనుదాహరింపబడిన భాష్యపంక్తులలో "కామహేతుకమ్" అనుభాగమువరకు అర్థము వ్రాయబడినది. ఈయుది "నకించిత్కామహేతుకమ్" అనుపాఠమునకు సంబంధించినది.

ఆవలిభాష్యము "నకించిత్కా-రణాన్తరం" అనుపాఠము ననుసరించి రచింపబడినది ఆభాగమునకు అర్థము వ్రాయబడుచున్నది.

ఈపాఠమునందు "నకించిత్" అనుపదమును ఆవృత్తిచేయవలెను. అప్పుడు "అపరస్పరసంభూతం కించిన్నాస్తి" "కారణాంతరం కించిన్నాస్తి" (స్త్రీపురుష సంయోగమువలన పుట్టనిదేదియులేదు. ప్రపంచమునకు మరియొక కారణమేమియు లేదు.) అని రెండువాక్యములుగా అన్వయ మేర్పడును. "అపరస్పరసంభూతం" అను పదమువలన అర్థాత్ సిద్ధించిన కామకారణత్వమును "నకించన కామాస్య కారణాస్యాత్ దృష్టమ్" అనుపంక్తి యనువదించుచున్నది. కామముకంటె ప్రపంచోత్పత్తికి వేరుకారణములేదని యన్వయము. కావున కామమే ప్రపంచోత్పత్తికి కారణమని ఫలితార్థము. ఇయ్యది బౌద్ధమతమని గ్రహింపవలయును.

ఇక "అపరస్పరసంభూతం కిమన్య-త్కామహైతుకమ్" అను నాగర పుస్తకములయందలి పాఠము ననుసరించి రచింపబడిన భాష్యము వివరింపబడుచున్నది.

ఈపాఠమునందు "అపరస్పరమ్" అనుచోట "అపరశ్చ + పరశ్చ" (అపరుడు + పరుడు) అని విగ్రహమును చెప్పవలెను. కాన అపరస్పరమనగా స్త్రీపురుష మిధునమని యర్థము, దానివలన పుట్టినది అపరస్పరసంభూత మగును. అనగా కామప్రేరితులగు స్త్రీపురుషులయొక్క- పరస్పరసంయోగమునలన ప్రపంచ మంతయు పుట్టును. అని యర్థమగును. "కామహైతుక" మనగా కామమే కారణముగా కలది. (కామఏవ హేతుర్యస్య) కామహేతుకమనియు, కామహేతుక మయినదే కామహైతుకమని యనిపించుకొనును. అనగా కామముకంటె వేరు కారణము లేనిదని యర్థము.

కావున స్త్రీపురుషసంయోగమువలన బుట్టిన ప్రపంచము కామమే కారణము కాగలుగుచున్నదని అన్వయము.

"కిమన్యత్ ?" అని ఆక్షేపము. ప్రపంచోత్పత్తికి కామరూపమగు ప్రత్యక్ష కారణము సంభవించుచుండగా, అప్రత్యక్షములగు పుణ్యాపాపరూపములయిన ఇతర కారణములు కల్పింపతగదు. కావున ప్రపంచోత్పత్తికి కామముకంటె వేరుకారణ మేమికలదు ? ఏమియు లేదని భావము.

ఈపక్షమునందు "అపరస్పరసంభూతం కామహైతుకం" అనువాక్యమధ్య "కిమన్యత్" అని మరియొకవాక్యము కల్పించవలసివచ్చును. ఇయ్యది అయుక్తము. మూలమునందు "అపరస్పరసంభూతం కామహైతుకం, కిమన్యత్" అని యుండియున్నచో నీ దోషముండెడిదికాదు. మూలశ్లోకము అట్లు లేదు. కావుననే

శ్రీధరాచార్యులుకూడ తమవ్యాఖ్యానమందు (జగదపరస్పరసంభూతం భవతి, కిమన్యత్కారణమస్య, నాస్త్యన్యత్కించిత్, కింతు కామహైతుకమేవ జగదితి శేషః) ప్రపంచము స్త్రీపురుషమిథునమువలన పుట్టుచున్నది, దీనికి వేరుకారణ మేమికలదు? యేమియు కారణము లేదు. మరేమనిన ప్రపంచము కామమే కారణముగా కలది. అని యుదాహరించిరి. ఈ వ్యాఖ్యానమునందు అనేకవాక్య కల్పనము బహుపదాధ్యాహారము సంభవించును.

"అపరస్పరసంభూతం నకించిత్కామహైతుకం" అను పాఠమునందుకూడ "నకించిత్" అనుపదము రెండువాక్యములమధ్య నుండుటచే నేకవాక్యతలేదుగదా? అని ప్రశ్నింపరాదు. "కామహేతుకం అపరస్పరసంభూతం నకించిత్" కామమే కారణముగాగలిగి స్త్రీపురుషమిథునమువలన పుట్టినది యేదియు లేదు. అని యేక వాక్యత యీ పాఠమునందు సంభవించును.

"అపరస్పరసంభూతం నకించిత్" అని వాక్యము ముగిసినపిమ్మట నున్న "కామహేతుకమ్" అను పదమును "అపరస్పరసంభూతమ్" అనుపూర్వవాక్యముతో అన్వయించినచో, సమాప్తపునరాఖ్యానదోషము సంభవించునుగదా అని యన రాదు. కామహేతుకమనుపదము హేతుగర్భవిశేషణము. ప్రపంచమునకు కామము కారణముకనుకనే స్త్రీపురుషమిథునమువలన బుట్టనదేదియులేదు. అని రెండుపదము లకు పరస్పరాపేక్షకలదు. కనుక పరస్పరాపేక్షచే నేకవాక్యత సంభవించుచున్నం దున సమాప్తపునరాఖ్యానదోషము లేదు. భాష్యకారులు ప్రౌఢివాదముచే ఏక వాక్యతగా వ్యాఖ్యానము చేయకపోవచ్చు. అంతమాత్రమున దోషము కలదనుటకు వీలులేదు.

ఇట్లుండ భాష్యార్కప్రకాశికాకారులగు రామరాయలకు "అపరస్పర సంభూతం నకించిత్కామహేతుకమ్" (కామమే కారణముగా గలిగి స్త్రీపురుష మిథునమువలన పుట్టినది యేదియులేదు.) అనుపాఠమే సమ్మతము. వీరు "కామ హేతుకమ్" అనుపదమునకు కామమే హేతువుగాకలది అని బహువ్రీహిసమాసమును చేసి, "శేషాద్విభాషా" అనుసూత్రమువలన కప్రత్యయమునుచేసి, రూపనిష్పత్తిని చేయుచున్నారు.

వీరు "అపరస్పరసంభూతం కిమన్యత్కామహైతుకమ్" అను పాఠమును అంగీకరించకపోవుటకు కారణము స్త్రీపురుషమిథునము అను అర్థమునందు "అపరస్పరమ్" అనుపదము వ్యాకరణరీత్యా సాధువుకాదని వీరిసిద్ధాంతము. కనుకనే "పరస్పరమ్" అనుపదము సాధువను ఆశయముతో నీ పాఠమును అంగీకరించి, (న+పరస్పరమ్) అనిన ఞ్ సమాసాంతమునుచేసి వ్యాఖ్యాన మొనర్చిరి.

ఈ రెండుపదములయొక్క సాధుత్వాసాధుత్వములగురించి వారు చూపిన వ్యాకరణప్రక్రియ యీక్రింద నుదహరింపబడుచున్నది.

పరశ్చ+పరశ్చ. పరస్పరః, అని సమాసము. పర-సు. పర-సు. అని అలౌకికవిగ్రహము. ఇందు "కర్మవ్యతిహారే సర్వనామ్నో ద్వేవాచ్యే" అను వార్తికమువలన పరశబ్దమునకు ద్విర్భావము, "సమాసవచ్చ బహులమ్" అను వార్తికమువలన బహులగ్రహణముచే,అసమాసవద్భావము. (సమాసము లేకుండుట) అందువలన సుప్పునకు అలుక్ (లోపము లేకుండుట) అప్పుడు పర-సు. పర-సు. అని అలౌకికవిగ్రహ మేర్పడును.

పిదప సుబ్విభక్తిసంబంధమయిన సకారమునకు రుత్వము, తరువాత విసర్గ, పిదప కస్కాదులకు విధించిన సకారము. అపుడు పరస్పరః అని రూపము సిద్ధించును. ఆవల నపుంసకత్వమును వివక్షచేయగా "పరస్పరమ్" అని యగును. ఈ యిద్దరిలో నొకవ్యక్తికి లక్షణచే స్త్రీత్వమును వివక్షచేయగా మిథునము అని యర్థము లభించును.

ఇక అపరశ్చ + పరశ్చ. అనువిగ్రహమునందు అపరస్పరమ్ అనురూపము సిద్ధింపదు. అపర, పరశబ్దములకు సమాసము చేసినచో, ఈ రెండుపదములు భిన్నము లయినందున "అన్య పరశబ్దములకుమాత్రమే విధింపబడిన కర్మవ్యతిహారప్రయుక్త మగు ద్విర్భావము రాదు. "సమాసవచ్చ బహులమ్" అనుదానివలన అసమాసవద్భావమునున్నూ రాదు. అపుడు సుప్ నకు లోపము వచ్చును. అందువలన విసర్గ లేకుండుట, సత్వము రాకుండుట తటస్థించును. మరియు సంతతక్రియ లేనందున బహువచనము కానందునను "అపరస్పరాః క్రియాసాతత్యే" అనుసూత్రమువలన నిపాతింపబడిన సుట్ కూడ రానేరదు. కావున "అపరస్పరమ్" అను రూపము సిద్ధించదు. కావున రామరాయకవీంద్రులు "అపరస్పరసంభూతం కిమన్యత్కామ హైతుకమ్" అనుపాఠము సాధువుకాదని త్రోసిపుచ్చి, "నకించిత్కామహేతుకమ్" అనుపాఠమే సాధువని అంగీకరించిరి.

సూచన :- ఇచట భాష్యకర్తలగు శంకరులు యేపాఠమును అవలంబించినది వ్యాఖ్యాతలు యేపాఠమును బలపరచినది విచారించు టొకింత యవసరము.

నాగరపుస్తకములయందును, చాలవరకు తెనుగు పుస్తకములయందును "అపరస్పరసంభూతం కిమన్యత్కామహేతుకమ్" అనుపాఠమే కనిపించుచున్నది. ఈపాఠమున కనుకూలముగనే శాంకరభాష్యముకూడ కలదు. రామారావుగారి భాష్యార్క-ప్రకాశికాయుత శాంకరభాష్యగ్రంథమునందుగూడ మూలశ్లోకము, శాంకరభాష్యమున్ను యిట్లే కనిపించుచున్నవి.

ఇక భాష్యవ్యాఖ్యాతలలో నీలకంఠాచార్యులవారు (అపరస్పరసంభూతం "అపరస్పరాః క్రియా సాతత్యే" ఇతిసుట్) అని ఉదాహరించుచు బీజాంకుర ములవలె పరస్పరకారణములయిన ధర్మాధర్మసంస్కారములయొక్క సాంతత్య మున్నందున సుట్ వచ్చునని యు, 'స్త్రీపురుషమిథునము' అను అర్థమునందు 'అపరస్పరమ్' అనుపదము సిద్ధించునని అభిప్రాయపడిరి.

మధుసూదన యతివర్యులు అపరస్పర మను పదమునకు భాష్యకర్తలు యిచ్చిన నిర్వచనమునే యథాతథముగా జూపుచు అపర, పర, పదములకు సమా సముచేయగా ద్విర్భావ, అసమాసవద్భావ, అలుక్, సత్వ, విసర్గ, సత్వములు వచ్చునని అభిప్రాయపడిరి.

భాష్యోత్కర్షదీపికాకారులుకూడ (అపరస్పరసంభూతం పరాపరశబ్దా అన్య పర్యాయా) అని వ్రాయుచు పరస్పరశబ్దమువలె అపరస్పరశబ్దముకూడ ద్విర్భావ అసమాసవద్భావాది ప్రక్రియతో సాధు వగునని సూచించిరి.

శ్రీధరులుకూడ (అపరస్పరమితి అపరశ్చ పరశ్చే త్యపరస్పరమ్) అని వ్రాయుచు పై విధముగనే అపరస్పరశబ్దముయొక్క సాధుత్వమును సిద్ధాంతీకరించిరి.

ఈవ్యాఖ్యాతలధోరణినిబట్టిచూడ స్త్రీపురుషుల మిథునము అను అర్థము నందు అపరస్పర మనుపదము సాధువని యభిప్రాయపడినటుల స్పష్టమగుచున్నది.

ఇదియునుగాక ఇతరవ్యాఖ్యాతలు శాంకరభాష్యమున కేమాత్రము వ్యతిరేక ముగా నటించినను, వారివాదమును ఖండించుటయే ప్రధానముగా బెట్టుకొనిన భాష్యో త్కర్షదీపికాకారులు నీలకంఠాచార్యులవారు సూచించిన క్రియాసాతత్యార్థము నందలి నిపాతరూపమయిన సుడాగమమును నిరాకరించుచు, అపరశబ్దము అన్య పర్యాయమని చెప్పుటచే పరస్పరశబ్దమువలె అపరస్పరశబ్దముకూడ వ్యాకరణముచే సాధువనుసిద్ధాంతము శంకరాచార్యులవారికి సమ్మతమని స్పష్టమగుచున్నది.

కాని ఆచార్యస్వాములవారు, "అపరస్పరసంభూతమ్" అనువాక్యమును భావార్థరూపమున వివరించిరి. ప్రతిపదార్థమున వివరింపలేదు. పదసాధుత్వమును బరిశీలింపను లేదు. వ్యాఖ్యాతలుమాత్రము వారు వారు వారిచ్చవచ్చినటుల పదసాధుత్వమును గొంతమట్టుకు పరిశీలించిరి. కాని ఒక్కరును సమగ్రమయిన ప్రక్రియను జూపి నిర్దుష్టమయిన సిద్ధాంతమును వెలువరించియుండలేదు. భాష్యార్క ప్రకాశికాకారులగు రామరాయకవీంద్రులుమాత్రము సమగ్రమయిన ప్రక్రియను సూత్రోదాహరణపూర్వకముగ జూపి, నిర్దుష్టమయిన సిద్ధాంతమును ప్రతిపాదిం చిరి. దీనినిబట్టి విమర్శింప పురాతనప్రతులయం దెచ్చటనయినను "అపరస్పర సంభూతం నకించిత్కామహేతుకమ్" అనుపాఠ ముపలబ్ధమయినచో, నాపాఠమును అంగీకరించుటయే యుక్తమని తోచెడిని.

ఇచట రామానుజులు, "అపరస్పరసంభూత మన్యత్ కిముపలభ్యతే? అతస్సర్వమిదం జగత్కామహేతుకమ్" అని వ్యాఖ్యానించిరి. స్త్రీపురుష సంయోగమువలన పుట్టనది మరియొకటి యేది కనుపడుచున్నది? కనుక ప్రపంచ మంతయు కామమే కారణముగా గలది యగుచున్నది. అని దీనియర్థము.

ఇయ్యది యుచితము కాదు. ఏలయన, ఇచట రామానుజులు చెప్పదలచిన యర్థము "అపరస్పరసంభూతమ్" అనుపదమువలననే లభించుచుండ, "అన్యత్" అనుపదము వ్యర్థమును, అసంగతమును అగుచున్నది. అన్యపదమువలన రామానుజులు దేనికంటె అన్యమును చెప్పదలచిరి? లేక దేనికి అన్యత్వమును చెప్పదలచిరి? అని ప్రశ్నింపవలయును. పరస్పరసంభూతమయినదానికంటె అన్యమును చెప్ప దలచినచో నాయర్థము "అపరస్పరసంభూతమ్" అను పదములోని నఞ్ నకు అన్యత్వమర్థమని చెప్పినచో లభించుచుండ మరల "అన్యత్" అను పదమును గ్రహించుట పునరుక్తమగును. ఇంక దేనికిని అన్యత్వము అని చెప్పుటకే వీలులేదు. అయ్యది యుండుచో, అపరస్పరసంభూతమయినది లేదని చెప్పుట తగదు. అయ్యది లేనిచో అప్రసక్తనిషేధము ప్రసక్తించును. మరియు కామహేతుక మను పదమును అన్వయించుటకు "సర్వమిదం జగత్" అనుపదమును అధ్యాహారము చేసికొన వలయును. పూర్వార్ధమునందలి జగత్పదమును తెచ్చినచో దూరమున నున్న పదమును ఆకర్షించుట యగును. అదియు నుచితముకాదు. కావున రామానుజ వ్యాఖ్యానము పొసగదు. ౮

శ్లో॥ ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః,
ప్రభవం త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః॥

అ॥ అసురప్రకృతిగల మానవులు లోకాయతికమతమును అవలంబించి జ్ఞాన శూన్యులగుదురు. పారలౌకికప్రయత్నములను గోలుపోవుదురు. ఎల్లప్పుడు శబ్ద స్పర్శాది విషయపరిచింతనమును చేతురు. పుట్టుకనుంచియు నాసురభావములను అలవరచుకొందురు. ఒరుల హింసింతురు. లోకశత్రువులగుచు బలాత్కారముగా అవైదికమార్గములను లోకుల కుపదేశించుచు ప్రపంచమును నాశమొనర్తురు.

శ్లో॥ కామమాశ్రిత్య దుష్పూరం దంభమాన మదాన్వితాః
మోహాద్గృహీత్వా అసద్గ్రాహాన్ ప్రవర్తంతేఽశుచివ్రతాః॥ ౧౦

అ॥ మరియు అసురజనులు నెరవేర్పసాధ్యముకాని యిచ్ఛావిశేషరూప మగు కామమును అవలంబింతురు. డాంబికు లగుదురు. దురభిమానముతోఁ దుల దూగుదురు. అహంకారపూరితు లగుదురు. కడు నీచమయిన పనులు చేయుదురు. అవివేకమువలన పనికిమాలిన పట్టుదలలను పూని లోకములో ప్రవర్తింతురు.

“ నజాతు కామః కామానా ముపభోగేన శామ్యతి, హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభిజాయతే ” (ఎన్నిపదార్థములను ననుభవించినను, కోరిక అనునది తీరదు. పైపెచ్చు వృద్ధినొందుచునే యుండును. ఎంత ఆజ్యముపోసినను అగ్నిహోత్రుడు చల్లారడు. పైగా నెక్కునెక్కుజ్వాలలతో వృద్ధినొందుచునే యుండును). ఇట్టికామము యొక్క స్వరూపమును నెఱుంగని నాసురులు దీనికి లొంగి ప్రవర్తించి తుదకు అనర్థప్రాప్తి మనుభవింతురు. ౧౦

శ్లో॥ చింతామపరిమేయాంచ ప్రళయాంతా ముపాశ్రితాః,
కామోపభోగపరమాః ఏతావదితి నిశ్చితాః॥ ౧౧
ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః
ఈహంతే కామభోగార్థం అన్యాయే నార్థసంచయాన్॥ ౧౧

అ॥ మరియు నాసురులు తాము మరణించునంతవరకు తెంపులేని శబ్దాది విషయచింతనలో మునిగియుందురు. విషయసుఖమును అనుభవించుటయే పరమ పురుషార్థమను నిశ్చయముతో ఆశాపాశములచే నటునిటు లాగబడుచు కామ క్రోధముల కాలవాలమై విషయానుభవముకొరకు పరద్రవ్యాపహరణము మున్నగు నన్యాయమార్గములచే ధనరాసులను ప్రోగుచేయ ప్రయత్నింతురు.

శ్లో॥ ఇదమద్య మయాలబ్ధ మిదంప్రాప్స్యే మనోరథం
ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనం॥ ౧౩

శ్లో॥ అసౌ మయాహత శ్శత్రుః ర్హనిష్యే చాపరానపి
ఈశ్వరోఽహం అహంభోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ॥ ౧౪

శ్లో॥ ఆఢ్యోఽభిజనవా నస్మి కోన్యోఽస్తి సదృశో మయా,
యక్ష్యే దాస్యామి మోదిష్యే ఇ త్యజ్ఞానవిమోహితాః॥ ౧౫

శ్లో॥ అనేకచిత్తవిభ్రాంతా మోహజాల సమావృతాః
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ॥ ౧౬

అ॥ ఇప్పుడు యీద్రవ్యమును నేను సంపాదించితిని, ఇకముందు నాకోరిక తీర కొంతద్రవ్యమును నేను సంపాదింపగలను. ఇది నాకిపుడు కలదు. ముందు మరల ధనము నాకు లభింపగలదు. ౧౩

ఈశత్రువును నేను జంపితిని, ఇకముందు యితరశత్రువులనుగూడఁ జంప గలను. నేను ప్రభువును, నేను భోగిని, నేను పుత్రపౌత్రాదులతో సంపన్నుడను, నేను బలశాలిని, నేను సుఖ మనుభవించువాడను. ౧౪

నేను ధనముతో దులదూగుచున్నాను. నేను ఏడుపురుషాంతరములనుండి శ్రోత్రియత్వము కలవాడను. లోకములో నాకు సాటి యెవ్వరును లేరు. నేను యాగమును చేయగలను. దానిచే నితరులను తిరస్కరింపగలను. నేను నటవిట గాయకాదులకు దానమీయగలను. నేను మిగుల సంతోషమును పొందగలను. అని యిట్లు అనేకవిధముల యవివేకమును పొందినవారై; ౧౫

చిత్తభ్రాంతులకు లోనయి, అజ్ఞాన మను వలలో చిక్కుకొని విషయసుఖాను భవ మను ప్రసంగముతో పాపపుంజముల నార్జించి దేహత్యాగానన్తరము నరక కూపమున గూలెదరు. ౧౬

ఇచట పదునైదవశ్లోకమునందు సూచించిన యాగము దైవవిభూతిలో చేరు నని తలంపరాదు. చిత్తశుద్ధికొరకుఁ జేసెడియాగమే దైవవిభూతిలో జేరును. అసురులు డాంబికముతో నితరులకంటె మనము గొప్పవార మనిపించుకొనవలెనను భావముచే యజ్ఞయాగాదు లాచరింతురు. కావున అసురులు చేసెడియాగములు అసురవిభూతిలో చేరునుకాని దైవవిభూతిలో చేరవు.

అట్లే దానముకూడ, సత్పాత్రులకిచ్చెడిదానము దైవవిభూతిలో చేరును. నటవిటగాయకాది అయోగ్యుల కిచ్చెడి దానము అసురవిభూతి యగును. కావున నిచట చెప్పబడిన యాగదానములు అసురములుకాని, దైవవిభూతికాదని గ్రహింప వలెను. ౧౬

శ్లో॥ ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః
యజంతే నామయజ్ఞైస్తే దమ్భేనావిధిపూర్వకమ్॥ ౧౭

అ॥ మరియు నాసురులు, తమను తామే గౌరవించుకొనుచు, పెద్దలయెడ నేమాత్రము వినయవిధేయతలను జూపక ధనికుల మను మదాభిమానములతోఁ గూడినవారై యీయాగము నిట్లు ఆచరింపవలెనను పద్ధతిని పరిపాలించక, వారిచ్చ వచ్చినటుల నామమాత్రమున యాగాదికర్మలను డాంబికముగా నాచరింతురు. ౧౭

శ్లో॥ అహంకారం బలం దర్పం కామం క్రోధంచ సంశ్రితాః
మామాత్మ పరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః॥ ౧౮

అ॥ అహంకారమును, బలమును, దర్పమును, కామక్రోధములను ఆశ్ర యించినవారుకనుకనే అసురులు తనలోను, యితరదేహములయందున యున్న పరమేశ్వరుని ద్వేషింతురు.

ఉన్నగుణములచేఁగాని, తనయం దారోపించుకొనిన గుణములచేఁగాని, తానే అందరికంటె గొప్పవాడ నని యనుకొనుటకు కారణమయిన అభిమానము,

అహంకార మనబడును. ఇది యవిద్యవలన నేర్పడుటచే అవిద్యయనియే జెప్పబడు చున్నది. దీనివలన నతిదుఃఖము సంభవించును. ఇయ్యది కామక్రోధాది సకలదోషములకు కారణమగును. హింసాదిప్రవృత్తులకు నిదానమగును. కామరాగములతోగూడి యితరుల పరిభవింప సమర్థమగు బలము ఆసురబలము. ధర్మమును అతిక్రమించుటకు (ఆచరింపకుండుటకు) కారణమగును. అంతఃకరణమునందలి దోషవిశేషము దర్పమనబడును. ప్రక్చందన వనితాదులయందలి కోరిక కామము. ప్రతికూల విషయములయందలి ద్వేషము క్రోధము; ఇవిగాక, నాసురజనులయం దింకెన్నియో దోషము లుండును. అందువలన వారు సర్వాంతఃకరణసాక్షియగు పరమాత్మను ద్వేషింతురు. ఈశ్వరాజ్ఞారూపమయిన వేదశాస్త్రముల నుల్లంఘించి, వారిచ్ఛవచ్చి నటుల ప్రవర్తించుటయే ఈశ్వరుని ద్వేషించుట. పరమేశ్వరుడే జీవస్వరూపముతో నంతట నుండెనను విషయమును తెలిసికొనలేక, వీడు నాకు శత్రువు అని- వానిని జంపజూచుటకాని వానిచే నేను జయింపబడితినని తనను నిందించుకొనుటగాని యాసురునకు సహజము. ఇట్టి భేదభావము ఈశ్వరప్రద్వేషమునకు కారణ మగును. ౧౮

శ్లో॥ తా నహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్,
క్షిపా మ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు॥ ౧౯

అ॥ ఓయి అర్జునా! నన్ను సజ్జనులను ద్వేషించునట్టి యా దురాత్ములను నేను అనేకనరకదుఃఖములను అనుభవించుటకు కారణములయిన వ్యాఘ్రసింహాది క్రూరయోనులయందు పడవేతును. నిరంతర పాపాత్ములగు ఆసురమానవులయందు శుభసంపద లవమాత్రమయిన నుండదు. అందువలన వారు మంచిజన్మను పొందజాలరు. ౧౯

శ్లో॥ ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని,
మా మప్రాప్యైవ కౌంతేయ! తతో యాన్త్యధమాం గతిం॥ ౨౦

అ॥ ఓయి అర్జునా! అవివేకులగు ఆసురజనులు ప్రతిజన్మయందును ఆసురయోనియందే పుట్టుచు నే నాజ్ఞాపించిన మంచిమార్గమును పొందలేక క్రమక్రమముగా అతినికృష్టమయిన జన్మను పొందుదురు. ఆసురప్రకృతిగల మానవులు మొదట వ్యాఘ్రాదియోనులయందు బుట్టి పిదప సర్పాదియోనులయం దుద్భవించి ఆపైన స్థావరము లగుదురు. వీరెన్నటికి ఉత్తమజన్మకు రానేరరు. ౨౦

శ్లో॥ త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః,
కామః క్రోధః తథాలోభః తస్మాదేతత్త్రయం త్యజేత్॥ ౨౧

అ॥ ఆసురప్రకృతిగల మానవుల అంతఃకరణములయం దనేకదోషములు కలవు. అందులో కామము, క్రోధము, లోభము, అను మూడును నరకప్రవేశమునకు

ద్వారము లగుచున్నవి. యీ మూటివలననే ముఖ్యముగా మానవులు పురుషార్థ భ్రష్టులయి చెడిపోవుచున్నారు. ఈమూఁడుమాత్రమే మిగిలిన ఆసురసంపదయంతకు మూలకారణ మగుచున్నవి. కావున ముముక్షువు యీమూటిని తప్పక విడువవలెను.

శ్లో॥ ఏతై ర్విముక్తః కౌంతేయ తమోద్వారై స్త్రిభిర్నరః
ఆచర త్యాత్మనశ్శ్రేయః తతో యాతి పరాంగతిం॥ ౨౨

అ॥ కావున నోయి అర్జునా! తమోద్వారములగు కామ, క్రోధ, లోభములను విడచిన మానవుడు తనకు శ్రేయోదాయకమగు మార్గమున ప్రవర్తించగలడు. క్రమముగా దేవత్వమును పొంది, జ్ఞానమును సంపాదించుకొని మోక్షమునుగూడ పొందగలడు.

అవ॥ ఆసురసంపదను పూర్తిగా విడచుటకుగాని శ్రేయోమార్గమును ఆచరించుటకుగాని శాస్త్రమే కారణము. శాస్త్రప్రమాణమున అంతయు నెరవేర్చ సాధ్యమగును. లేనిచో నేమియు చేయజాలము :

శ్లో॥ యః శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్॥ ౨౩

అ॥ ఓయి అర్జునా! ఎవడు విధినిషేధరూపమయిన వేదవిధిని (శాస్త్రమర్యాదను) యుల్లంఘించి, వానియిచ్చవచ్చినటుల ప్రవర్తించునో వాడు పురుషప్రాప్తికి యోగ్యుడు కానేరడు. సుఖమును పొందలేడు. స్వర్గమోక్షములను పొందలేడు. కావున శాస్త్రవిధిని అనుసరించి ప్రవర్తించుట యుక్తము : ౨౩

శ్లో॥ తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మకర్తు మిహార్హసి॥ ౨౪

అ॥ కావున ఈపని చేయదగినది, యీపని చేయదగనిది, అని నిర్ణయించుకొనుటకు శాస్త్రము ప్రమాణము. అందువలన నీవు శాస్త్రముచే శాసింపబడిన కర్మను ఆచరింపుము. శాస్త్రము వలదని చెప్పినదానిని ఆచరింపకుము. ఇదియే పురుషార్థము నొందుటకుఁ దగినమార్గము : ౨౪

ఇట్లు
శ్రీ భగవద్గీతాభాష్యార్థ-ప్రకాశికానువాదమున
దైవాసుర సంపద్విభాగయోగ మను
షోడశాధ్యాయము సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీః

శ్రీ హయగ్రీవాయ నమః

# శ్రీ భగవద్గీతా భాష్యార్క-ప్రకాశికానువాదము

## సప్తదశాధ్యాయము.

అర్జునుడు అడుగుచున్నాడు.

శ్లో॥ యే శాస్త్రవిధి ముత్సృజ్య యజంతే శ్రద్ధయాన్వితాః
తేషాం నిష్ఠా తు కా కృష్ణ! సత్త్వ మాహో రజ స్తమః॥ ౧

అ॥ కార్యాకార్యములను నిశ్చయించుకొనుటలో శాస్త్రము ప్రమాణమని కృష్ణుడు అర్జునునిగురించి చెప్పుటచే (గొందరకు శాస్త్రము ప్రమాణముకాదని సిద్ధించుచున్నందున, శాస్త్రము ప్రమాణముగా గ్రహింపనివారలస్థితిని తెలియగోరి పార్థుడు మరల కృష్ణుని అడుగుచున్నాడు. ఓయికృష్ణా! ఏమానవులు శ్రుతిస్మృతి లక్షణమయిన శాస్త్రవిధిని విడచి, ఆస్తిక్యబుద్ధితో దేవాదులను పూజింతురో వారి నిష్ఠ సాత్త్వికమా? రాజసమా? లేక తామసమా? అని అర్జునుని ప్రశ్న. ఇచట శాస్త్రవిధిని విడచినవారు రెండురకములు. శాస్త్రవిధిని తెలిసి విడచినవారు, దానిని తెలియక విడచినవారు, అని. ఇందు శాస్త్రవిధిని తెలిసి విడచినవారిని గురించి పార్థుడు ప్రశ్నించెనా? లేక శాస్త్రవిధిని తెలియక విడచినవారినిగురించి ప్రశ్నించెనా? యనునది విమర్శింపదగియున్నది. ఇందేది యుక్తిసహము? వినుము. తుదిపక్షమే యుక్తిసహము. ఏలనన అర్జునుని ప్రశ్నలో "శ్రద్ధయాన్వితాః" అను విశేషణము కలదు. శాస్త్రవిధిని తెలియక విడచినవారలకు పెద్దల యొక్క ఆచారమును తెలిసికొనినంతమాత్రమున కర్మలయందు శ్రద్ధాభక్తు లేర్పడునుకాని, శాస్త్రవిధిని తెలిసికొని దానియందు శ్రద్ధలేక విడచినవారలకు దేవతాపూజయందు శ్రద్ధ కలుగదు. కావున నీవిశేషణముయొక్క సామర్థ్యము మునుబట్టి శాస్త్రవిధిని తెలియకవిడచినవారిని గురించియే అర్జునుడు ప్రశ్నించెనని గ్రహింపవలెను.

శాస్త్రవిధిని తెలిసినవాడు, దానిని విడచుటకు శ్రద్ధలేకుండుటయే కారణము. శాస్త్రవిధిని తెలియనివాడు దానిని విడచుటకు శాస్త్రవిధి యిట్లున్నదను జ్ఞానము లేకుండుటయే కారణము కాని శ్రద్ధాభావము కారణము కాదు.

శాస్త్రవిధిని తెలియనివారలకు దానియందు శ్రద్ధ కలుగుటకు నవకాశమే లేదుకదా ? యని ప్రశ్నింపరాదు. విధిని తెలియనివారుకూడ పెద్దలయొక్క ప్రవృత్తినిబట్టి యీకర్మయం దేదియో యొకవిధి యుండవచ్చు. లేనిచో మన పెద్దలు యీకర్మను ఆచరించియుండరు, అని యూహించి వృద్ధవ్యవహారసిద్ధ మయిన దేవతాకర్మలయందు శ్రద్ధాభక్తులుగలవారు కావచ్చును.

కావున శాస్త్రవిధిని తెలియని అవిద్వాంసులుగూడ కడుశ్రద్ధతో దేవతా పూజాదులయందు ప్రవర్తించుచున్నారు. వారి ప్రవృత్తి సాత్వికమా ? రాజసమా? లేక తామసమా ? అనియే అర్జునుని ప్రశ్నకు తాత్పర్యము.

ఇచట నిష్ఠా అనుపదమునకు (నితిష్ఠతి అస్యామ్) అను వ్యుత్పత్తివలన ఆశ్రయము అని యర్థము. కనుకనే భాష్యకర్తలు నిష్ఠాశబ్దమునకు అవస్థానము అర్థమని చెప్పిరి. లేక, భావవ్యుత్పత్తిచే నిష్ఠాశబ్దమునకు స్థితి (ఉనికి) అర్థము. కావున నిష్ఠాశ్రయమగు వస్తువునందు నిష్ఠాపదప్రయోగము ఔపచారికము. కావున వారు సత్వమునందు యుందురా? లేక రజస్సుయం దుందురా ? తమస్సునం దుందురా ? అని ఫలితార్థము.

శ్లో॥ త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా,
సాత్వికీ రాజసీచైవ తామసీచేతి తాం శృణు॥ ౨

అ॥ అర్జునుడు శ్రద్ధాసామాన్యమును మాత్రమే విశేషణరూపమున నిర్దేశించెను. కృష్ణుడు శ్రద్ధయనుదానిని మూడువిధములుగ విభజించి విశేషరూపమున సమాధాన మొసగుచున్నాడు. పార్థుడు నిష్ఠనుగురించి ప్రశ్నించెనుకాని, శ్రద్ధను గురించి ప్రశ్నించలేదు. అయినను అర్జునుని ప్రశ్నకు శ్రద్ధానిష్ఠయందే తాత్పర్యమను అభిప్రాయముతో శ్రీకృష్ణుడు శ్రద్ధావిభాగక్రమంబున సమాధాన మిచ్చుచున్నాడని గ్రహించవలెను. ప్రాణులకుశ్రద్ధ మూడు రకములు. సాత్వికశ్రద్ధ, రాజసశ్రద్ధ, తామసశ్రద్ధ. అని: ఈయది స్వభావమువలననే బుట్టును. వెనుకటి జన్మలయందుఁ జేసిన ధర్మాధర్మసంస్కారములు అంతఃకరణయందుండి, మరణ కాలమునందు అభివ్యక్తమయి స్వభావమని యనబడుచున్నవి. ఇట్టిస్వభావభేదము వలన శ్రద్ధకూడ మారును. శ్రద్ధాభేదమువలన ప్రవృత్తికూడ భిన్నభిన్నముగా నుండును. సత్వగుణమువలన కలిగెడి శ్రద్ధగల మానవులు దేవాదులను బూజింతురు. రజోగుణమువలన కలుగు శ్రద్ధతో యక్షులను, రాక్షసులను బూజింతురు. తామస శ్రద్ధగలవారు ప్రేతపిశాచాదులను బూజింతురు. అని పరమార్థము. ౨

ఇచట "దేహినామ్" ప్రాణులకు అని సామాన్యనిర్దేశమును చేయుటచే శాస్త్రీయశ్రద్ధనే మూడువిధములుగా విభజించి చెప్పుచున్నాడను రామానుజ వ్యాఖ్యానము సంగతముకాదు.

శ్లో॥ సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత,
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధ స్స ఏవ సః॥ 3

అ। అర్జునా! ఎల్లమానవులకు తమతమ అంతఃకరణములయందలి పుణ్య పాపసంస్కారముల ననుసరించి శ్రద్ధ వేర్వేరుగా కలుగును. జీవు లందరు శ్రద్ధామయులు. అనగా శ్రద్ధాప్రచారులు అని యర్థము. ఇచట మయట్ప్రత్యయమునకు ప్రాచుర్యము అర్థము. కావున ఎక్కువ శ్రద్ధగలవారని నిశ్చయార్థము. అనగా శ్రద్ధయే ప్రధానముగా గలవారని తాత్పర్యము ప్రపంచసంగములేని పరమాత్మకు శ్రద్ధాసంబంధముకాదు ససంభవము. కావున శ్రద్ధాసంబంధము జీవులకే యని గ్రహింపవలయును. కనుకనే జీవుడు యెట్టిశ్రద్ధ గలవాడుగ నుండునో వాడు ఆ శ్రద్ధ కనుకూలముగనే ప్రవర్తించుచుండును. సాత్త్వికశ్రద్ధగలవాడు సాత్త్వికుడగును. వాడు సాత్త్విక కర్మలయందే ప్రవర్తించును. రాజసశ్రద్ధగలవాడు రాజసుడనబడును. వాడు రాజసకర్మలయందే ప్రవర్తించును. కావున జీవులయొక్క ప్రవృత్తి వారివారి శ్రద్ధానుకూలముగ నుండునని నిశ్చయార్థము.

ఇచట రామానుజులు మయట్ ప్రత్యయమునకు వికారార్థమును అంగీకరించి పురుషుడు శ్రద్ధాపరిణామముగలవాడు అని వ్యాఖ్యానించిరి. ఇయ్యది యుచితము కాదు. పురుషునకు శ్రద్ధావికార మగుట సంభవింపనేరదు. కావున మయట్నకు ప్రాచుర్యార్థమునే అంగీకరింపవలెను. 3

శ్లో॥ యజంతే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః
ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజంతే తామసా జనాః॥ 4

అ॥ కావున వారివారి ప్రవృత్తిచే వారివారి నిష్ఠ యూహింపనగును. సాత్త్వికుడు (సత్త్వనిష్ఠగలవాడు) దేవతలను బూజించును. రజోనిష్ఠగల మానవులు యక్షులను, రాక్షసులను బూజించును. తమోనిష్ఠగల పురుషులు ప్రేతలను సప్తమాతృకలుమున్నగు భూతగణములను బూజింతురు. కావున దేవతాపూజ యొనర్చువారలు సాత్త్వికులనియు, రాక్షసులను పూజించువారు రాజసులనియు, భూతప్రేతాదులను పూజించువారు తామసులనియును ఊహింపవలెనని భావము. స్వధర్మభ్రష్టులయిన బ్రాహ్మణాదులు దేహము పడిపోయినతరువాత (మరణానంతరము) వాయవీయదేహమును (గాలిసంబంధమయిన శరీరమును) పొంది ప్రేతలని చెప్పబడుచున్నారు. 4

శ్లో॥ అశాస్త్రవిహితం ఘోరం తప్యంతే యే తపోజనాః,
దంభాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః॥ 5

అ॥ శాస్త్రవిధి యెల్లరకు సమానమయ్యెను ఇట్లు వారివారి ప్రవృత్తినిబట్టి వారినిష్ఠను నిర్ణయించవచ్చును. అందు వెయ్యింటికి ఒక్కడే దేవపూజ నాచరించెడి సత్యనిష్ఠుడు కనుబడుచున్నాడు. తరచుగ ప్రాణులందరు రజోనిష్ఠులు, తమోనిష్ఠులే. అదెట్లన? వివేకరహితులయిన మానవులు దంభాహంకారములతో గూడినవారయి, కామరాగబలమునకు లొంగి యితరప్రాణులకు, తనకును బాధాకరమగు ఘోరతపస్సును ఆచరింతురు. ఈయది శాస్త్రవిహితము గాదని తెలిసియు, నాసుర ప్రకృతితో వారిట్లు ఆచరింతురు.

శ్లో॥ కర్శయంత శ్శరీరస్థం భూతగ్రామ మచేతసః,
మాం చైవ అన్తశ్శరీరస్థం తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్॥ ౬

అ॥ ఇట్టివారు శరీరేంద్రియములను కృశింపజేసికొని వివేకరహితులయి సర్వాన్తఃకరణసాక్షియగు పరమాత్మనుగూడ నాశమొనర్తురు. పరమాత్మయొక్క ఆజ్ఞను నెరవేర్చకపోవుటయే ఆత్మనాశనము కావున వీరు అసురధర్మములయందు నిశ్చయజ్ఞానముకలవారని గ్రహింపవలయును. ౬

అవ॥ ఇంతకుముందు సాత్త్విక, రాజస, తామసభేదముచే శ్రద్ధ మూడు విధములని చెప్పబడినది. ఇప్పుడు ఆహారము, యజ్ఞము, తపస్సు, దానము అనునవి కూడ సాత్త్విక, రాజస, తామస భేదముచే మూడువిధములని చెప్పబడుచున్నవి. సాత్త్వికాహారములను సాత్త్వికుడు ప్రేమించుననియు రాజసాద్యాహారములను రాజసాదులు ప్రేమింతురనియును సూచింపబడుచున్నది. దీనివలన సాత్త్వికాద్యాహారముల యందలి ప్రేమాతిశయముచే సాత్త్వికత్వమును గ్రహించి, రాజసతామసాహారములను పరిత్యజించుట కవకాశమేర్పడును. ఇట్లే యజ్ఞదానాదులయందుగూడ సాత్త్వికత్వాదిభేదమును గ్రహించి, సాత్త్వికములగు యజ్ఞాదుల ననుష్ఠించుటయు రాజసతామసాది యజ్ఞదానతపంబులను పరిత్యజించుటయు సంభవించు నను ఆశయముతో నీ విభాగము చెప్పబడుచున్నది.

శ్లో॥ ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః,
యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేద మిమం శృణు॥ ౭

అ॥ సర్వప్రాణులకు ఇష్టమయిన ఆహారము మూడువిధములుగ నున్నది. అట్లే యజ్ఞము మూడువిధములు. దానము మూడువిధములు. వీటిభేదమును చెప్పెద వినుము. ౭

శ్లో॥ ఆయుస్సత్త్వ బలారోగ్య సుఖప్రీతివివర్ధనాః
రస్యాస్స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారా స్సాత్త్వికప్రియాః॥ ౮

అ॥ రసవంతములయినవి, చమురుగలవి, దేహమునందు చాలకాలముండు నవి, మనసుకు ఇంపైన ఆహారములు సాత్వికులకు ఇష్టములు. వీటివలన ఆయుర్దాయము, (అనగా శరీరమునందు ప్రాణవాయుసంచారము) సత్వగుణము, శరీరేంద్రియపాటవము, ఆరోగ్యము, సుఖము, క్షేమ- అనునవి మిక్కిలి వృద్ధిజెందును.

శ్లో॥ కట్వామ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణ రూక్షవిదాహినః,
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః॥ ౯

అ॥ ఇచట "అత్యుష్ణ" అనుపదమునందలి అతిశబ్దమును అన్నిపదార్థములయందును చేర్చుకొనవలయును. కావున అతికటువు, అత్యామ్లము, అతిలవణము, అత్యుష్ణము, అతితీక్ష్ణము, అతిరూక్షము, అతివిదాహి యగు ఆహారములు రాజసునకు ఇష్టములని గ్రహింపవలయును. కట్వాదిరసములు కొలదిగానయినను లేనిచో ఏపదార్థము రుచింపదు. అందువలన సాత్వికునకుగూడ సూక్ష్మముగా కట్వామ్లాదిరసములను సేవించుట ఆవశ్యకమని గ్రహింపవలెను. కనుకనే భాష్యకర్తలు అతి శబ్దమును సర్వత్ర సంయోజించుకొనమని (చేర్చుకొనమని) వ్రాసిరి.

అతికటువు = మిక్కిలిచేదువస్తువు. (వేపమున్నగునవి), అత్యామ్లము = మిగుల పులుపువస్తువు (చింతపండు); అతిలవణము ప్రసిద్ధము. అత్యుష్ణము = మిక్కిలి వేడివస్తువు (వండగానే దించినవస్తువు); అతితీక్ష్ణము మిక్కిలి కారము గలవస్తువు (మిర్చి - మిరియము); అతిరూక్షము = వాతప్రకోపకమగు కొర్రలు మొదలయినవి. అతివిదాహి = మిక్కిలివేడిని కలుగజేయు ఆవాలు మొదలగునవి.

ఇట్టి యాహారమువలన దుఃఖము, శోకము, శరీరానారోగ్యము కలుగును. కనుక వీటిని సాత్త్వికులు గ్రహింపకూడదు. ౯

శ్లో॥ యాతయామం గతరసం పూతిపర్యుషితం చ యత్
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్॥ ౧౦

అ॥ యాతయామం- కొద్దిగా ఉడికినవస్తువు (అనగా ఉడకతగినంతగా ఉడకని వస్తువు); గతరసం- సారములేనివస్తువు, పూతి- దుర్గంధముగల వస్తువు, పర్యుషితం- వంటతయారయి ఒకరాత్రిగడచిన వస్తువు. ఉచ్ఛిష్టం- ఒకరు తినగా మిగిలినది. అమేధ్యం- దేవతానివేదనకు పనికిరాని వస్తువు. ఇట్టివస్తువులను భుజించుట తామసులకు ఇష్టమగును. (ఇట్టివస్తువులను తినుటకు తామసులు ప్రేమింతురు).

ఇచట (యాతః యామః నియమః యస్య) అని వ్యుత్పత్తిచే పాకము

యొక్క కాలనియమము పూర్తికానిది, అని అర్థమును చెప్పవలెను. అనగా మందపక్వమని అర్థమగును, "పచోవః" అనుసూత్రమువలన పచ్ ధాతువునకంటె నిష్ఠార్థమునందు వప్రత్యయముచేయగా పక్వశబ్దము నిష్పన్నమగును.

ఇట్లైతరి ఉపసర్గరహితమయిన యమధాతువువలన నియమమను అర్థ మెట్లు లభించునని? యనరాదు. ధాతువులకు అనేకార్థము లుండును. వాటియర్థము లను ప్రకటింపఁజేయుటయే ఉపసర్గల కృత్యము. కావున నిచట "ని" అను నుప సర్గ లేనంతమాత్రమున అనేకార్థకమయిన యమధాతువునకు నియమమను అర్థము చెప్పుట దోషము కానేరదు.

అయితే యామశబ్దమునకు సారము అను అర్థమునుచెప్పి యాతయామ మనగా నిర్వీర్యవస్తువు అని యేలఁజెప్పకూడదు? అని యనరాదు. గతరసమను ఉత్తరపదమువలన నీయర్థము పునరుక్తమగుచున్నందున నట్లుఁ జెప్పవీలులేదు. కావున యథాశ్రుతార్థమే యుక్తము.

ఇచట రామానుజులు "యాతయామం యాతప్రహారం చిరకాలావస్థితమ్" అని వ్యాఖ్యానము చేసిరి. అనగా వంట తయారయి ఒకర్ఝాముకాలము గడచిన పదార్థమని యర్థము. చాలకాలమున్నపదార్థమని భావము. ఇయ్యది సమంజసముకాదు. పర్యుషిత మనుపదమువలననే ఈ యర్థము లభించుచున్నది. యాతయామశబ్దమునకుగూడ నిదే యర్థము జెప్పినచో పునరుక్తదోషముకాని, యేదియో యొకపదమునకు నైయర్థ్యముకాని సంభవించును.

ఇక నొకరాత్రికాలమంతయు గడచినపదార్థము పర్యుషితమనియు, చాల కాల మున్నపదార్థము యాతయామ మనియు, నీ రెంటికిని భేదము. కాలము గడచుటచే రుచి మారిపోయినవస్తువు పర్యుషితమనియు, రుచిమారక కాలము మాత్రము గడచినవస్తువు యాతయామమనియు భేదమని చెప్పినచో, నదియు సమంజసముకాదు. రసాంతరమును చెందక (రుచి మారక) కాలము గడచినంత మాత్రముననే యాహారమును దుష్టము కానేరదు. ఒకరాత్రి గడచినందున బావి నీరు అపవిత్రమగును. గంగాజలము రాత్రికాలము గడచినంతమాత్రమున అప విత్రముకాదు. రాత్రిగడచిన అన్నము దోషమును చెందును. రాత్రికాలము గడచి నంతమాత్రమున మాషవటకాది భక్ష్యములు (మినపగారెలు మున్నగునవి) దుష్టములు కానేరవు.

మరియు రామానుజులు ఉచ్ఛిష్టపదార్థమును ఇట్లు నిర్వచించిరి: గురువులు, తండ్రికాక మిగిలినవారు తినగా మిగిలినయన్నము ఉచ్ఛిష్టమునని. "గుర్వాదిభ్యో

న్యేషాం భు క్తశిష్టమ్" అని రామానుజభాష్యపంక్తి. ఇయ్యది సమంజసముకాదు. శ్రోత్రియుడగు శిష్యునకు తాను తినగా మిగిలిన పదార్థమును బెట్టుట గురువునకు చాలదోషము ప్రసక్తించును. అట్లే ఉపనయనసంస్కారము జరిగిన కుమారునకు తండ్రితినగా మిగిలిన పదార్థమును బెట్టుట చాలతప్పు. అట్లు పెద్దల యాచారము కనుపించదు.

వైష్ణవులకుమాత్రము గురువు, తండ్రి మున్నగువారి ఉచ్ఛిష్టాన్నభోజనము శిష్టాచారమగుచో అగుగాక. చక్రాంకనాదిశిష్టాచారములతోగూడిన వైష్ణవులకు అన్నియు శిష్టాచారములే యగును. స్మార్తులకుమాత్ర మట్లుకాదు. మూలమునందు గురువు, తండ్రులుకంటె నితరులు తినగా మిగిలినదే యుచ్ఛిష్టమని చెప్పలేదు. ఉచ్ఛిష్టమనిమాత్రము మూలమునందు గలదు. సామాన్యార్థమును బోధించు ఉచ్ఛిష్టపదమును ఇట్లు విశేషార్థమునందు సంకోచపరచుట న్యాయ్యముకాదని సుస్పష్టము.

అమేధ్యమనగా అపవిత్రమని యర్థము. రామానుజులుమాత్రము అమేధ్య మనగా అయజ్ఞశిష్టమని నిర్వచించిరి. ఇది యుక్తముకాదు. యజ్ఞశిష్టముకానిది కేవల తామసాహారమని నిర్వచించుట తగదు. సాత్వికులు రాజసులుగూడ యజ్ఞ శిష్టముకాని యాహారమును భుజించుచున్నారు. యజ్ఞశిష్టముకాని యన్నమును భుజిం చువారందరు తామసులేయని నియమింప శక్యముకాదు. సాత్వికులలో గొప్పవారు కూడ యజ్ఞశిష్టములుకాని (దేవతానివేదన చేయని) పండిన మామిడిపండ్లు మున్నగు వాటిని భుజించుచున్నారు. కావున రామానుజులనిర్వచనము యుక్తము కాదు.

"భుజ్యతే = ఆహ్రియతే" అను వ్యుత్పత్తిచే భోజనశబ్దమునకు ఆహారమని యర్థము. ఇట్టి యాహారము తామసులకు ఇష్టము. ౧౦

శ్లో॥ అఫలాకాంక్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే
యష్టవ్యమేవేతి మనస్సమాధాయ స సాత్వికః॥ ౧౧

అ॥ నేను యజ్ఞములను తప్పకఁజేయవలెను, కాని వానిఫలమును కోరతగదు. అను మనోనిశ్చయముతో విధిప్రకారము చేయబడు కర్మలు సాత్త్వికము లనబడును. ౧౧

శ్లో॥ అభిసంధాయ తు ఫలం దంభార్థమపి చైవ యత్,
ఇజ్యతే భరతశ్రేష్ఠ! తం యజ్ఞం విద్ధి రాజసమ్॥ ౧౨

అ॥ ఓయి భరతశ్రేష్ఠుడా! ఫలమును గోరి డాంబికముకొరకు నేయజ్ఞము చేయబడునో అది రాజసయజ్ఞ మనబడును. ౧౨

శ్లో॥ విధిహీన మసృష్టాన్నం మంత్రహీన మదక్షిణమ్,
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే॥ ౧౩

అ॥ విధిరహితమయినదియు, అన్నదానము లేనిదియు, స్వరవర్ణసహిత మంత్రోచ్చారణ లేనిదియు, శ్రద్ధారహితమయినదియు దక్షిణలేనిదియు నగు యజ్ఞము తామసయజ్ఞ మనబడును. తామసులకుగూడ తామసమగు శ్రద్ధ యుండును. కాని వారు ఆ శ్రద్ధతో భూతప్రేతపిశాచాదులను బూజింతురు. దేవతలను బూజింపరు. కావున యజ్ఞములయందు తామసులకు శ్రద్ధ లేదనియే జెప్పవలెను. కనుకనే మూలమునందు "శ్రద్ధావిరహితమ్" అని యనిరి.

శ్లో॥ దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచ మార్జవమ్,
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే॥

అ॥ తపస్సు మూడువిధములు : శారీరము, వాచికము, మానసికము- అని. ఇయ్యది మరల సాత్త్విక, రాజస, తామసభేదముచే మూడువిధములు; అందు మొదటి భేదత్రయమును ముందు నిరూపించుచున్నారు. దేవతలనగా సూర్య చంద్రాదులు. ద్విజులన అతిథి అభ్యాగతిరూపమగు బ్రాహ్మణులు; గురువు లన తండ్రి, విద్యనేర్పినవారు, మంత్రోపదేశమును జేసినవారు. ప్రాజ్ఞు లన పండితులు. ఇట్టివారిని పూజించుటయు, శరీరమును పరిశుభ్రపరచుకొనుటయు, ఋజుభావము కలిగియుండుటయు, ఆడువారితో మాటాడుట మున్నగుపనులు లేకుండుటయు, పరులను బాధింపకుండుటయు, శారీరకమగు తపస్సు అని చెప్పబడుచున్నది. శరీరము ప్రధానముగాగల కర్తృకారక, కరణకారకములతో నెరవేరునది కావున శారీరమగు తపస్సు అని చెప్పబడుచున్నది. దేహేంద్రియాదులు కర్మసాధనము లనువిషయము "అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధం" అను శ్లోకముచే ముందు చెప్ప బడగలదు. కావున నీయది శారీరకతపస్సు అనుట నిర్వివాదము. ౧౪

శ్లో॥ అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే॥ ౧౫

అ॥ ప్రాణులకు దుఃఖకరము కానట్టియు, సత్యమయినట్టియు, ప్రియమయి నట్టియు, హితమయిన వాక్యము వాఙ్మయమయిన తపస్సు. నిరంతరము వేదా ధ్యయనమును జేయుటయు వాఙ్మయమగు తపస్సు అగును. ఇతరులకు బాధ కలుగజేయనిమాటలను మాటాడుట వాఙ్మయమగు తపస్సు. నిజమును పలుకుట వాఙ్మయతపస్సు. ప్రియము, హితము అయిన మాటలను జెప్పుట వాఙ్మయమగు తపస్సు అని యర్థము. ఇహలోకమున సుఖమును కలిగించుమాటలు ప్రియములు;

పారలౌకిక నరకాదిదుఃఖములను నివారింపజేయు వాక్యములు హితవులు, అని యీరెంటికి భేదము. "ప్రియహితం చ యత్" అను పూర్వార్ధమునందలి చ కారము, అనుద్వేగకరత్వాది ధర్మములన్నియు వాక్యమునం దుండవలెనను నియమమును సూచించుచున్నది. అందువలన అనుద్వేగకరత్వము, సత్యత్వము, ప్రియత్వము, హితత్వము, అను నాలుగుధర్మములు సమానముగా కలవాక్యమే తపోరూప మనందగును. ఇంతియెకాని యిందు ఒకధర్మముకాని, రెండుధర్మములు కాని, మూడుధర్మములుకాని కల వాక్యము తపోరూపము కానేరదు. కావున అనుద్వేగకరమయిన వాక్యమునందు సత్యత్వ, ప్రియత్వ, హితత్వములు లేనిచో నది వాఙ్మయతపస్సు కాదు. అట్లే సత్యమయినవాక్యమునందు అనుద్వేగకరత్వ, ప్రియత్వ, హితత్వములు లేనిచో, నదియు వాఙ్మయతపస్సు కానేరదు. అట్లే ప్రియమయిన వాక్యమునందు మిగిలిన మూడుధర్మములు లేకున్నను, హితమయిన వాక్యమునందు మిగిలిన మూడుధర్మములు లేకున్నను, అది తపోరూపము కానేర దని భావము.

ఈ వాఙ్మయతపస్సునందు వాగ్వ్యాపారమే ప్రధానము. అంతఃకరణాదులు అప్రధానములు. దేవతాపూజాదులయందువలె శరీరవ్యాపారము యేమాత్రము లేదు. ఇట్టి వాఙ్మయ తపోరూపమయిన వాక్యమునకు భాష్యకర్తలు ఉదాహరణ మును జూపిరి. "ఓయి పిల్లవాడా! నీవు కామాదివికారములులేని చిత్తముకలవాడ వగుము. స్వాధ్యాయమును, కర్మయోగమును అనుష్ఠించుము. ఈరెంటిని ఆచ రించినచో నీకు శ్రేయస్సు కలుగగలదు" అని.

ఎవనికి యేశాఖాధ్యయనము విధింపబడినదో, వాడు ఆశాఖాధ్యయనమును జేయుట స్వాధ్యాయాభ్యాసరూపమయిన వాఙ్మయతపస్సు అగును. అన్యశాఖా ధ్యయనమును జేసినవాడు సర్వకర్మబహిష్కృతుడుగాన నయ్యది వాఙ్మయ తపస్సు కాదు. ఇదే యభిప్రాయముతో మూలకారులు "స్వాధ్యాయాభ్యసనం" అని ప్రయోగించిరి. అధ్యాయమనగా, "అధీయతే" చదువబడుచున్నది- అను వ్యుత్పత్తిచే వేదమని అర్థము. స్వాధ్యాయమన తమయొక్క-వేదము, అనగా స్వశాఖాధ్యాయమని భావము. కావున, స్వశాఖాధ్యయనమే తపోరూపముకాని, అన్యశాఖాధ్యయనము తపోరూపముకాదని స్పష్టమగుచున్నది. ౧౫

శ్లో॥ మనఃప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మ వినిగ్రహః
భావసంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే॥ ౧౬

అ॥ మనఃప్రసాదము అనగా మనస్సునందు కామాదివికారములు లేకుండుట, మనోనైర్మల్య మనిభావము. "సౌమ్యత్వము" అనగా మంచిమనస్సు కలిగి యుం

ఘుట; ముఖప్రసాదము మున్నగుకార్యములచే నూహింపదగిన అంతఃకరణవృత్తి యని భావము.

కనుబొమ్మలను చిట్లించుట, కండ్లెర్రజేసికొనుట, మున్నగు చిహ్నములచే తనతండ్రి కోపించెనని కుమారుడు తెలిసికొని, స్తుతినమస్కారాదులచే తన తప్పిదము క్షమింపజేసికొనుచు, తండ్రియొక్క ముఖప్రసాదముచే కోపముతగ్గి సౌమ్యత్వ మును చెందెనని మరల నిశ్చయించుకొని, తాను కృతార్థుడయినట్లు తలంచును. ఇట్లు ముఖప్రసాదముచే నూహింపదగిన అంతఃకరణవృత్తి సౌమ్యత యని చెప్పబడు చున్నది. మనఃప్రసాదము అనుభవైకవేద్యము. సౌమ్యత్వము, పరప్రత్యక్షము, అని యీ రెంటికిభేదము. 'పరులయొక్క అభివృద్ధికి మనస్సు అభిముఖమగుట సౌమ్యత యని రామానుజు లనిరి. సౌమ్యుడగు రాజు యాచకులకు ధనాదికము నిచ్చును. మనస్సులో క్రోధాదులు లేకుండుటప్రసాదము. అనుగ్రహరూపమయిన అంతఃకరణవృత్తి సౌమ్యత, అని యీ రెంటికి భేదమని భావము.

అంతఃకరణము శుద్ధసత్త్వమును చెందినప్పుడు మనఃప్రసాదాదులు కలుగును. కావున అంతఃకరణముయొక్క సాత్త్విక పరిణామవిశేషమే సౌమ్యత్వమని గ్రహింప వలెను. మౌనమనగా మాటాడకుండుట. ఇయ్యది వాఙ్మయతపసులో చేరునుకాని, మానసతపస్సులో చేరదు. కావున, వాగింద్రియవ్యాపారము మనోవ్యాపారపూర్వక మగుటచే నిచట మౌన మనుశబ్దమునకు, మౌనమునకు హేతువగు మనస్సంయమము అర్థము చెప్పవలెను. ఆత్మవినిగ్రహమనగా మనోనిరోధము. సర్వవిషయముల నుండియు మనసును నిరోధించుట ఆత్మవినిగ్రహము. వాగింద్రియవిషయమగు శబ్దవ్యాపారమునుండిమాత్రమే మనసును నిగ్రహించుట- మనస్సంయమము అని యీ రెంటికిభేదము. సామాన్య విశేషభావముచే ఆత్మవినిగ్రహ, మనస్సంయ మములను నిర్దేశించినందున పౌనరుక్త్యము లేదు. ఇతరులతో నిష్కపటముగా వ్యవ హరించుట భావసంశుద్ధి- ఈయవి మానసతపస్సు అనబడుచున్నవి. ౧౬

శ్లో॥ శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్త్రివిధం నరైః
అఫలాకాంక్షిభి ర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే॥ ౧౭

అ॥ కాయిక, వాచిక, మానస, భేదముచే మూడువిధములగు నీతపస్సు మరల సాత్త్విక, రాజస, తామస భేదముచే మూడువిధములని చెప్పబడుచున్నది.

మానవులు కడుశ్రద్ధతో నాచరించు నీ మూడువిధములయిన తపస్సును ఫలాకాంక్షను వదలి ఆచరించినచో సాత్త్వికమని చెప్పబడును.

శ్లో॥ సత్కారమానపూజార్థం తపో దంభేన చైవ యత్
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్॥ ౧౮

అ॥ లాభపూజాఖ్యాతులకొరకు డాంబికముగా జేయు తపస్సు రాజస మనబడును. ౧౮

శ్లో॥ మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః
పరస్యోత్సాదనార్థం వా తత్తామస ముదాహృతమ్॥ ౧౯

అ॥ అవివేక నిశ్చయముచే తన శరీరేంద్రియాదులను కష్టపెట్టుకొనుచు పరులను నశింపజేయుటకొరకు జేయు తపస్సు తామసమని చెప్పబడును. ఇచట ఉత్తరార్థమునందలి వికల్పార్థకమగు వా శబ్దమువలన తామసతపస్సు ఆత్మపీడాకరమనియు, పరనాశకరమనియును, రెండువిధములని స్పష్టమగుచున్నది. ౧౯

శ్లో॥ దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే
దేశేకాలేచ పాత్రేచ తద్దానం సాత్త్వికం స్మృతం॥ ౨౦

అ॥ ఇపుడు దానముయొక్క త్రైవిధ్యము చెప్పబడుచున్నది. పుణ్యక్షేత్రమగు కురుక్షేత్రాదులయందును పుణ్యకాలమగు సంక్రమణాదులయందును షడంగ వేదవేత్తయగు బ్రాహ్మణునికొరకు నుపకారాపేక్షలేక విధిగా దానము చేయవలెనను భావముతో చేసెడిదానము సాత్త్వికమని చెప్పబడును. ౨౦

శ్లో॥ యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్యవా పునః
దీయతేచ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్॥ ౨౧

అ॥ ప్రత్యుపకారముకొరకుగాని, దానఫలమగు పుణ్యమును ఉద్దేశించిగాని, తాను కష్టపడుచు జేసెడిదానము రాజసమగును. ౨౧

శ్లో॥ అదేశకాలే యద్దానం అపాత్రేభ్యశ్చ దీయతే
అసత్కృత మవజ్ఞాతం తత్తామస ముదాహృతమ్॥ ౨౨

అ॥ దానమునకు యోగ్యముకాని ప్రదేశమునందు, దానమునకు తగని కాలమునందు అయోగ్యులకు గౌరవములేకుండగా తిరస్కరించుచు జేసెడిదానము తామస మగును. ఇచట "దీయతఇతి దానం" ఇవ్వబడుచున్నదికావున దానమను వ్యుత్పత్తిచే దానశబ్దమునకు ద్రవ్యమర్థము; ఇచ్చుట అనుక్రియమాత్రము అర్థముకాదు. అట్లు చెప్పినచో, దీయతే అను క్రియాపదముతో అన్వయింపదు. లేక ద్రవ్యము యివ్వబడుచున్నదనుట యేదికలదో, ఆ వితరణము అని యన్వయింపవలెను. ౨౨

శ్లో॥ ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధస్స్మృతః
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా॥ 23

అ॥ వేదాంతములయందు పరమాత్మను ఓమ్ అని, తత్ అని, సత్ అని, మూడువిధములనామము నిర్దేశింపబడినది. ఇందుకు యథాక్రమంబుగ నుదాహరణ ములు చూపబడుచున్నవి. "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" "తత్త్వమసి" "సచ్చిదా నందం బ్రహ్మ" అని. పూర్వము బ్రాహ్మణులు, వేదములు, యజ్ఞములు యీ మూడును ఆ నామనిర్దేశముచే సృష్టింపబడినవి.

అయితే పరమాత్మకు చిదానందాది నామాంతరములు కలవు. కాని, ప్రధానమగుటవలనను ప్రకృతమునకు ఉపయోగించుటవలనను,నామత్రయనిర్దేశమే గ్రహింపబడినది. ఈ నామత్రయనిర్దేశముతో నుండు ప్రకృతోపయోగము వెను వెంటనే చూపబడగలదు. నామరూపరహితమయిన పరమాత్మకు నామత్రయ నిర్దేశము కల్పితము కాని వాస్తవముకాదని గ్రహింపవలెను. బ్రాహ్మణాదులు మాయావియగు నీశ్వరునిచే నీ నామత్రయ నిర్దేశపూర్వకముగా సృష్టింపబడి రని భావము.

ఇచట రామానుజులు బ్రహ్మ శబ్దమునకు వేదము అని అర్థమును చెప్పి, లక్షణయా వైదికకర్మకు నామత్రయనిర్దేశమని వ్యాఖ్యానించిరి. ఆ నిర్దేశముతో కూడిన బ్రాహ్మణాదులు పూర్వము నాచే పుట్టింపబడిరని శ్రీకృష్ణుడు అర్జునునకుఁ జెప్పినట్లు అన్వయించిరి.

ఇది యుచితముకాదు. పరమాత్మను చెప్పునట్టి బ్రహ్మపదమునకు వేదము అను అర్థము సంభవింపదు. తత్రాపి వైదికకర్మ అను నర్థము లాక్షణిక మగుటచే యుచితముకాదు. వేదముగాని, వైదికకర్మగాని, ఓం, తత్, సత్, అనుపదత్రయ మునకు వాచ్యము కానేరదు. ఓం, తత్, సత్, అని మూడువిధములయిన శబ్దము వైదికకర్మకు అన్వయించునని చెప్పదగదు. "అన్వయీ" అనుపదము మూలము నందు లేదు. బ్రహ్మశబ్దమునకు వైదికకర్మ అని అర్థమును చెప్పినను అన్వయీ అనుపదమును క్రొత్తగా కల్పించవలెను. ఇట్లు కల్పించుటలో ప్రమాణములేదు.

బ్రాహ్మణులు, వేదములు, వైదికకర్మలగు యజ్ఞములు, యీమూడును యీత్రివిధమగు నిర్దేశముతో కూడి యుండిరని, "బ్రాహ్మణాస్తేన వేదాశ్చ" అను ఉత్తరార్థముచే చెప్పబోవుచుండగా వైదికకర్మ యీనామనిర్దేశముతో కూడి యున్నదని పూర్వవాక్యముచేఁ జెప్పుట వ్యర్థము, పునరుక్తమును అగును. మఱియు, "తేన విహితాః" అను వాక్యమునందలి తచ్ఛబ్దముచే బ్రాహ్మణాది

సృష్టికర్తృత్వము శబ్దనిష్ఠమయినట్లు స్పష్టమగుచున్నది. అనగా త్రివిధమగు శబ్దములవలననే బ్రాహ్మణాదులు పుట్టింపబడినట్లు అర్థమగుచున్నది. ఇట్టితరి తచ్ఛబ్దార్థమునకు అప్రాధాన్యమును కల్పించి "మయైవ" అని కర్త్రంతర వాచకపదమును అధ్యాహారము జేయుట అయుక్తమగును. పైపెచ్చు శ్రుతహాని అశ్రుతకల్పనాదోషములుగూడ ప్రసక్తించును. కావున రామానుజవ్యాఖ్యానము పొసగదు. ౨౩

శ్లో॥ తస్మా దోమి త్యుదాహృత్య యజ్ఞదాన తపఃక్రియాః
ప్రవర్తంతే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్॥ ౨౪

అ॥ ఓంకారము, తత్ అనుపదము, సత్ అనుపదము బ్రహ్మనామము లగుటవలన వేదవేత్తలయొక్క శాస్త్రచోదితములగు యజ్ఞ దాన తపస్సులను క్రియలు ఓంకారము నుచ్చరించియే ప్రవర్తించుచున్నవి. వైదికులు యేకర్మను ఆచరించినను ఓమ్కారమును ఉచ్చరించియే ఆచరించుచున్నారు. "ఓమిత్యా శ్రావయతి" "ఓమితి శగంసతి" "ఓమితి ఉద్గాయతి" అను ఛాందోగ్యశ్రుతియు "ఓమిత్యధ్వర్యుః ప్రతిగరం ప్రతిగృణాతి" ఇత్యాది తైత్తిరీయశ్రుతియును, వేద విహితమగు కర్మలన్నియు ఓంకారోచ్చారణపూర్వకముగనే జరుగుచున్నవని ఋజువు చేయుచున్నవి. ఇచట బ్రహ్మశబ్దమునకు వేదము అర్థము. కాని పరమాత్మ యర్థముకాదు. పరమాత్మను తెలిసికొనినవారలకు కర్మలయందు ప్రవృత్తి కలుగదు. వేదమును తెలిసికొనినవారలకు కర్మలయందు ప్రవృత్తి కలుగును. కావున బ్రహ్మశబ్దము పరమాత్మవాచకము కానేరదు.

ఇచట రామానుజులు, "వేదములు ఓమ్కారము నుచ్చరించి ఆరంభింప బడుచున్నవనియు, ఓంకారముతోఁగూడిన వేదమును ధారణచేయుటవలనను, ఓంకారముతోఁగూడిన యజ్ఞాదికర్మలను చేయుటవలనను, బ్రాహ్మణులకుఁగూడ ఓమ్ అను శబ్దసంబంధము కలదని యనిరి. ఈకథయంతయు మూలములో లేనందున ఉపేక్షింపదగిన దగుచున్నది. ౨౪

శ్లో॥ త దిత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపఃక్రియాః
దానక్రియాశ్చ వివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః॥ ౨౫

అ॥ చిత్తశుద్ధి జ్ఞానప్రాప్తిద్వారా మోక్షమును గోరు మానవులు "తత్" అనుపదమును ఉచ్చరించి కర్మఫలమును గోరక యజ్ఞములను, తపస్సులను, దాన ములను చేయుచున్నారు. ఈ శ్లోకము మోక్షమునుగోరు అవిద్వాంసులవిషయము గాని విద్వత్సన్యాసుల విషయముకాదు. విద్వత్సన్యాసులకు కర్మాధికారమే లేదు.

శ్లో॥ సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే॥ ౨౬

అ॥ సద్భావమనగా ఉండుట, సాధుభావమనగా మంచినడత. కావున, లేని వస్తువునకుఁ గొంతకాలమునకు ఉండుట తటస్థించగా, సత్ అనుశబ్దము ప్రయోగింపబడుచున్నది. (ఉ) పుట్టకపూర్వము, లేనికుమారుడు పుట్టుట తటస్థించగా, పుత్రజన్మయందు సత్ అనుశబ్దము ప్రయోగింపబడుచున్నది. (సన్ పుత్రః) అని. పుత్రుడున్నాడు అని దీనియర్థము.

అట్లే ఒకానొకమానవుడు మొదట గొంతకాలము చెడ్డనడతకలవాడుగ నుండి, పిదప అదృష్టవశమున గొంతకాలమునకు మంచినడత గల్గవాడాయెను. అట్టివాని మంచినడతయందు (సాధుత్వమునందు), సచ్ఛబ్దము ప్రయోగించబడుచున్నది. కావున, లేనివాడు ఉండెనని చెప్పవలసివచ్చినప్పుడును, చెడునడతగలవాడు మంచినడతకలవాడని చెప్పవలసివచ్చినపుడును, సత్ అను బ్రహ్మవాచకమగు పదము ప్రయోగింపబడుచున్నదని ఫలితార్థము.

సత్ అను పదము బ్రహ్మాభిధానము అనగా బ్రహ్మనామమని యర్థము. "ఘటః" అనునామము ఘటమను పదార్థమును బోధించునట్లు, బ్రహ్మనామమగు సచ్ఛబ్దము బ్రహ్మను బోధించును. ఎప్పుడు పేరుతో వస్తువు నిర్దేశింపబడుచుండును. ముసలివాడు ఘటమును తీసికొనిరమ్మని చెప్పగా విని, పిల్లవాడు ఘట మను పదార్థమును తెచ్చుచున్నాడు. ఈయది పేరునకు వస్తువును నిర్దేశించు సామర్థ్యములేనిచో కుదరదు. సద్భావమునందు "సత్పుత్రః" అను ప్రయోగ మున్నట్లు, సాధుభావమునందుగూడ "సాధుస్సత్" అను ప్రయోగము కలదు.

ఇట్లే వివాహము మొదలగు శుభకర్మలయందుగూడ సచ్ఛబ్దము ప్రయోగింపబడుచున్నది. ఈయవి సత్కర్మలు అని. ఆదిపదమువలన వాపీకూపతటాకాది పూర్తకర్మలను, అగ్నిష్టోమాది ఇష్టకర్మలను గ్రహింపవలెను.

ఇట్లు ప్రశస్తమయిన యజ్ఞ, దాన, తపస్సులు మూడింటికి సచ్ఛబ్దవిషయత్వము సిద్ధమయినది. "సత్ యజ్ఞః" "సత్తపః" "సద్దానమ్" అని. ౨౬

శ్లో॥ యజ్ఞే తపసి దానే చ స్థితి స్సదితి చోచ్యతే
కర్మచైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే॥ ౨౭

అ॥ యజ్ఞమునందు, తపస్సుయందు, దానమునందు, పురుషునకు గల ప్రవృత్తి ("సత్" అని) మంచిదని చెప్పబడుచున్నది. యజ్ఞాదులకొరకయిన ద్రవ్యార్జనాది వ్యాపారముగూడ మంచిదనియే చెప్పబడును. (లేక) ఈశ్వరార్థము

లయిన కర్మలన్నియు మంచివనియే చెప్పబడుచున్నవి. అని శ్లోకాన్వయము. కనుకనే యజ్ఞాద్యనుష్ఠానమునందు ప్రవర్తించిన పురుషునిజూచి పెద్దలు, "వీడిపుడు మంచిస్థితిలో నుండె"నని యనుకొందురు. కావున యజ్ఞాదిస్థితి సచ్ఛబ్దముచేఁ జెప్ప బడుచున్న దనిభావము.

ఇచట సచ్ఛబ్దమునకు సద్భావమనికాని, సాధుభావమనికాని, ప్రాశస్త్యమని కాని, అర్థముకాదు. యజ్ఞ దాన తపోకర్మలయందు దనికియే అర్థము. కావున వెనుకఁజెప్పినవిషయమునకు సాంకర్యములేదు. యజ్ఞాదికర్మలయందు దనికియే సత్ అనుపదమున కర్థమగుచో సత్, స్థితి, అనుపదముల రెంటికి పునరుక్తదోషము నాటిల్లునుకదా యని అనరాదు. "మృత్యుంజయశ్శివః" అను పదములకువలె సత్, స్థితి అనుపదములకుగూడ అర్థము ఉపపన్న మగును. విశేష్యాంతరమున్న పుడు విశేష్యముకూడ విశేషణార్థమునే యిచ్చును. కావున యజ్ఞాదులయందు దనికిని చెప్పు సచ్ఛబ్దము, స్థితిశబ్దమును ప్రయోగించియుండగా యజ్ఞాది విషయత్వమునందుమాత్రమే పర్యవసించును.

ఇచట "తదర్థీయమ్" అనుపదమునకు రెండర్థములు కలవు. ఒకటి యజ్ఞదానతపస్సులకొరకయిన కర్మ అని, రెండు (2) లోగడ యెవరియొక్క అభిధానములు (నామములు) ఓం తత్ సత్ అని చెప్పబడినవో అట్టి యీశ్వరుడు అని. కావున నీశ్వరార్థమయినకర్మ అని రెండవయర్థము. యజ్ఞాదులకొరకయిన కర్మగాని, ఈశ్వరార్థమగు కర్మగాని, ఈరెండును మంచివనియే చెప్పబడును.

ఓయి! ఓంకారము నుచ్చరించి కొందరు కర్మలను చేయుచున్నారని చెప్ప బడినది. మరికొందరు "తత్" అను బ్రహ్మనామము నుచ్చరించి కర్మల నాచరించుచున్నారని చెప్పబడినది. ఇంతియె కాని "సత్" అను బ్రహ్మనామము నుచ్చరించియే కర్మలను చేయుదురని చెప్పలేదు. పైగా సచ్ఛబ్దమునకు బ్రహ్మకంటె భిన్నముగా సద్భావము, సాధుభావము మున్నగు అర్థములు చెప్పబడినవి.

పైగా, కావునబ్రహ్మనామముల మూటికి ప్రయోగము యెట్లు సంభవమగును? ఓం, తత్ అను బ్రహ్మనామముల రెంటికే ప్రయోగము చూపబడినదికదా? అనినచో నిజమే, బ్రహ్మవాచకమగు సచ్ఛబ్దమునకే సద్భావ సాధుభావాదుల యందు ఔపచారికముగా ప్రయోగము చూపబడినది. సద్భావాదులయొక్క ప్రశంసకొరకు కనుక ముముక్షువులు సత్ అను బ్రహ్మనామమును ఉచ్చరించియే యజ్ఞదానతపస్సులను చేయుదురని గ్రహింపవలయును. (లేక) ఓమ్, తత్, సత్ అని యుచ్చరించి బ్రహ్మవేత్తలగు ముముక్షువులు ఈశ్వరార్థమయినకర్మ మంచి

దని తలచి, కర్మనుచేయుచున్నారు. ఈవిషయము తెలియని అవిద్వాంసులుకూడ బ్రహ్మనామములను ఉచ్చరించి కర్మలను చేయుచో అకర్మ విగుణమయినను నామోచ్చారణమువలన గుణము కలదగును. కావున ఓం, తత్, సత్ అను బ్రహ్మ నామోచ్చారణకు కర్మసాద్గుణ్యము కలుగజేయుటయే ప్రయోజనమని భావము.

సచ్ఛబ్దమునకు యజ్ఞాది క్రియలు అర్థమని యింతకుముందు కంఠతః చెప్ప బడినది. దాని ననుసరించి తచ్ఛబ్దమునకుగూడ యజ్ఞాదిక్రియలు అర్థమని చెప్పు టయే యుచితము. రామానుజు లట్లే వ్యాఖ్యానించిరి. ( ముముక్షువులు ఫలేచ్ఛను విడచి యజ్ఞాదిక్రియలను చేసిరి. ఆ క్రియలు తచ్ఛబ్దముచే జెప్పబడుచున్నవి. ) అని బ్రహ్మవాచకమగు తచ్ఛబ్దమునకు యజ్ఞాదిక్రియలు అర్థమెట్లగునని శంకింపరాదు. బ్రహ్మప్రాప్తికి సాధనము లగుటచే, యజ్ఞాదిక్రియలు బ్రహ్మవాచియగు తచ్ఛబ్దము నకు అర్థము కావచ్చును. కావున తత్ అనుబ్రహ్మాభిధానమును (బ్రహ్మనామమును) ఉచ్చరించి, యజ్ఞాదిక్రియలు చేయబడుచున్నవని వ్యాఖ్యాన మొనర్చుట యుక్త ముగా దన్నచో,

అట్లు కాదు. "తస్మా దోమిత్యుదాహృత్య" అను పూర్వశ్లోకమునందు చెప్పినట్లు, యిచ్చటగూడ ( తదిత్యుదాహృత్య ) తత్ అనుపదమును ఉచ్చరించి అనియే వ్యాఖ్యానమొనర్పవలయును. మరియు, యజ్ఞాదిక్రియలు తచ్ఛబ్ద నిర్దేశ్యము లయినట్లు, ఓంకారనిర్దేశ్యము లనికూడ జెప్ప సాధ్యమగును. అట్టితరి ఓంకారము నుచ్చరించి వైదికులకర్మలు ప్రవర్తించుచున్నవనియు, ఆ కర్మలు ఓమ్ అని చెప్ప బడుచున్నవనియును, రామానుజు లెందుకు వ్యాఖ్యానము చేయలేదు? ఇపుడు వ్యాఖ్యానము జేతుమన్నచో, నట్లే తత్ అనుపదమును ఉచ్చరించి, ముముక్షువులచే కర్మలు చేయబడుచున్నవని వ్యాఖ్యానము చేయుడు. ఈ రెండు శ్లోకములు సమానార్థకము లగుటవలన, ఇట్లు వ్యాఖ్యానము చేయుటయే యుచితమగును.

మరియు ఇట్లు వ్యాఖ్యానము చేసినచో "ఆ క్రియలు ఓమ్ అని చెప్పబడు చున్నవి "తత్" అని చెప్పబడుచున్నవి." అను రెండువాక్యములు మూలములో లేనందున రామానుజులకు స్వకపోలకల్పితములు కావలసివచ్చును. కావున రామా నుజవ్యాఖ్యానము సరియయినది కాదు. ఇక "తస్మా దోమిత్యుదాహృత్య" అను శ్లోకమునందు "ఓమిత్యనేన క్రియా ఉచ్యంతఇతి" ఓంకారముచే క్రియలు చెప్పబడుచున్నవని వ్యాఖ్యానము చేయుమన్నచో, నట్టితరి "తదిత్యనభిసంధాయ" అనుశ్లోకమునందుకూడ నట్లు వ్యాఖ్యానము చేయకుడు.

"తదిత్యనభిసంధాయ" అను శ్లోకమునందు "ఉదాహృత్య" (ఉచ్చరించి) అనుపదము లేనందున నిట్లు వ్యాఖ్యానము చేయబడుచున్నదనియు, "తస్మా

గోమిత్యుదాహృత్య" అను శ్లోకమునందు "ఉదాహృత్య" అను పదమున్నందున నిట్లు వ్యాఖ్యానము చేయబడలేదనియు, సమాధాన మీయదగదు. వెనుకటిశ్లోకమునందు జెప్పబడిన "ఉదాహృత్య" అనుపదము "తదిత్యనభిసంధాయ" అను శ్లోకమునందుగూడ అధ్యాహారము జేసికొని యన్వయించుకొనవచ్చును. వెనుకటి శ్లోకమునందు జెప్పబడకుండుటచే "తాశ్చ క్రియాస్త దిత్యుచ్యంతే" 'ఆ కర్మలు తత్ అని చెప్పబడుచున్నవి' అను పదములను అధ్యాహారము చేయుటమాత్రము అయుక్తమే యగును.

కావున "తస్మా దోమిత్యుదాహృత్య" అను పూర్వశ్లోకమునందువలె "తదిత్యనభిసంధాయ" అనుశ్లోకమునందుగూడ "ఉదాహృత్య" అనియే వ్యాఖ్యానము చేయవలెను. ఆ కర్మలు తత్ అనుపదముచే జెప్పబడునని వ్యాఖ్యానము చేయదగదు. సచ్ఛబ్దమునకు సాధుభావసద్భావాద్యర్థవిశేషములు చూపబడినవి. అట్లు తచ్ఛబ్దమునకు అర్థవిశేషములు చూపబడలేదు. అందువలన తచ్ఛబ్దమునకు సచ్ఛబ్దానుసారము యుక్తముకాదు.

కావున తచ్ఛబ్దమునకు ఓంకారానుసారమే యుక్తము. తచ్ఛబ్దమునకువలె ఓమ్కారమునకు గూడ అర్థవిశేషములు చూపబడనందున నారెంటికి సామ్యము కుదురును. కాక "ఓంకారము నుచ్చరించి తత్ అనుపదమును ఉచ్చరించి" అనివలె "సత్ అనుపదమును ఉచ్చరించి" అనియే కల్పించుటయుక్తము. అట్లైనచో ప్రకరణసందర్భము కుదురును.

కావున "ఓంతత్సత్" అని యుచ్చరించుటచే కర్మలు ఈశ్వరార్థమము లగుచున్నందుననే పెద్దలు సంధ్యావందనాది కర్మల నాచరించి "ఓం తత్సద్బ్రహ్మార్పణమస్తు" అని చెప్పుచున్నారు. ఓంతత్సత్ అను నిర్దేశము చేతను బ్రహ్మార్పణముచేతను కర్మలు సాద్గుణ్యమును జెందును. ఇట్లైననే యజ్ఞాది కర్మలు సాద్గుణ్యమును చెందుటకాని, సాత్త్వికములగుటకాని సంభవించును. లేనిచో కర్మలకు సాద్గుణ్యాదిసిద్ధి యుండదు.

శ్లో॥ అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతంచ యత్,
అసదిత్యుచ్యతే పార్థ! న చ తత్ప్రేత్య నోఇహ॥ ౨౮

అ॥ ఓయి అర్జునా! శ్రద్ధాపూర్వకముగ నాచరించినకర్మలే సాద్గుణ్యమును చెందును. అశ్రద్ధతో జేసెడి హోమములుకాని, అశ్రద్ధతో జేసెడిదానములుకాని, అశ్రద్ధతో జేసెడి తపస్సుకాని, అశ్రద్ధతో జేసెడి మరి యే యితరకర్మలుకాని, అవియన్నియు నిరర్థకము లగును. శ్రద్ధారహితములగు కర్మలు బ్రహ్మప్రాప్తి సాధనములగు కర్మయోగాదులకు బహుదూరములు. వాటివలన ప్రయాసయేకాని

ఆముష్మికమగు స్వర్గాదిఫలముకాని, విహితములగు పశుపుత్రవిత్తైశ్వర్యాదులుకాని సంభవింపవు. ఇట్టికర్మలను సజ్జనులు మిగుల నిందింతురు. వీటివలన నరకాది దుఃఖములు సంప్రాప్తము లగును.

కావున నెల్లరు వర్ణాశ్రమవిహితమయిన కర్మలను ఓం తత్ సత్ అను బ్రహ్మాభిధాన నిర్దేశపూర్వకముగా శ్రద్ధాభక్తులు కలిగి, ఫలమును కోరక, అవశ్య కర్తవ్యమను బుద్ధితో నాచరింపవలయును. అట్టి కర్మయోగము బంధప్రదముకాక చిత్తశుద్ధి జ్ఞానప్రాప్తిద్వారమున మోక్షహేతు వగును. కావున నోయి అర్జునా! నీవుకూడ యుద్ధ మను స్వకర్మను శ్రద్ధతో యథావిధి నాచరింపుము. నీవు సంసార బంధవిముక్తుడ వగుదువు.

ఇట్లు

శ్రీమద్భగవద్గీతా శాంకరభాష్యార్థ- ప్రకాశికానువాదమున

శ్రద్ధాత్రయ విభాగయోగ మను

సప్తదశాధ్యాయము

ముగిసినది.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీః

శ్రీ హయగ్రీవాయ నమః

# శ్రీభగవద్గీతా భాష్యార్కప్రకాశికానువాదము

## అష్టాదశాధ్యాయము.

అవ॥ ఈ యధ్యాయమునందు సకలవేదార్థమును జెప్పదలచి, గీతాశాస్త్రార్థమంతయు నుపసంహరించి చెప్పుచున్నాడు. లోగడ అధ్యాయములయందు జెప్పిన విషయము ఈ యధ్యాయమునందు తెలియనగును. అర్జునుడుమాత్రము సన్న్యాస త్యాగ శబ్దార్థముల విశేషమును మాత్రమే తెలియగోరి కృష్ణుని ప్రశ్నించుచున్నాడు.

అర్జున ఉవాచ—

శ్లో॥ సన్న్యాసస్య మహాబాహో! తత్త్వమిచ్ఛామి వేదితుం
త్యాగస్య చ హృషీకేశ పృథక్కేశినిషూదన॥ ౧

అ॥ "ప్రజహాతి యదాకామా న్సర్వా న్పార్థ మనోగతా న్"
"మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా"
"త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః"
"నిరాశీః యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః"
"జ్ఞేయ స్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి"
"సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తు మయోగతః"
"బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః"
"యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతిమాప్నోతి నైష్ఠికీం"
"సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ"
"అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః"
"స సన్న్యాసీ చ యోగీచ న నిరగ్ని ర్నచాక్రియాః"
"యం సన్న్యాసమితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాండవ"
"నహ్యసన్న్యస్త సంకల్పో యోగీ భవతి కశ్చన"
"సర్వసంకల్ప సన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే"

"సంకల్పప్రభవాన్ కామాన్ త్యక్త్వా సర్వా నశేషతః"
"సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి"
"యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః"
"సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్"
"సర్వారంభపరిత్యాగీ యో మే భక్త స్స మే ప్రియః"
"శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ య స్స మే ప్రియః"
"సర్వారంభపరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే" అని యిట్లు పూర్వాధ్యాయములం దచ్చటచ్చట సన్న్యాసము, యోగము నిర్దేశింపబడియున్నది. సన్న్యాస త్యాగములు రెండును యేకరూపములని సన్న్యాస, త్యాగ శబ్దార్థమువలన స్పష్టమగుచున్నది. సమ్ అను నుపసర్గ పూర్వమున గల న్యాసశబ్దమునకు త్యాగ మర్థము. కనుకనే "సన్న్యస్య" అనుపదమునకు "పరిత్యజ్య" అని యర్థమును శాస్త్రకారులు వ్రాయుచున్నారు. "పరిత్యజ్య, సర్వం వ్రజతి" (అంతయును విడచిపోవుచున్నాడు) అను వ్యుత్పత్తివలన పారివ్రాజ్యమనగా పరిత్యాగమని యర్థము, అనగా సన్న్యాసమని భావము :

ఇట్లు సన్న్యాస త్యాగముల కభేదము సిద్ధించుచుండ మోక్షమునకు త్యాగ మొకమార్గము, సన్న్యాసము మరియొకమార్గము అని శిష్టులు చెప్పుటగాని, ఇందు "నకర్మణా న ప్రజయా ధనేన త్యాగేనై కేఽమృతత్వమానశుః" "వేదాంతవిజ్ఞాన సునిశ్చితార్థా స్సన్న్యాసయోగాద్యతయ శ్శుద్ధసత్త్వాః" అను శాస్త్రవచనములు ప్రమాణమగుటగాని, జనకాదులు త్యాగమువలన ముక్తిపొందిరనియు, యాజ్ఞ వల్క్యాదులు సన్న్యాసమువలన ముక్తినొంది రనియును లోకప్రతీతికాని, ఇది యంతయు నెట్లు కుదురును ?

"కురు కర్మైవ తస్మా త్త్వం సంగం త్యక్త్వా ధనంజయ" (ఓయి యర్జునా! కావున నీవు ఫలేచ్ఛను వదలి కర్మయే చేయుము) అని భగవంతుడు నాకు కర్మానుష్ఠానమును, త్యాగమును ఒకేమారు యెట్లు ఉపదేశించెను ? కర్మానుష్ఠాన కర్మసన్న్యాసములు పరస్పర విరుద్ధములుకదా ? కర్మసన్న్యాసమన కర్మత్యాగమే కాని వేరుకాదుకదా ? ఒకవేళ సన్న్యాస త్యాగములు భిన్నములని యనుకొనెద మనినచో నట్టిభేదమున్ను స్పష్టపడుటలేదు. శబ్దములు భిన్నముగా నున్నంత మాత్రమున అర్థభేదము కలదని యూహించుటకు వీలులేదు. అట్టితఱి పట వస్త్ర ములకుకూడ అర్థభేద మంగీకరించవలసివచ్చును. కావున, సన్న్యాస త్యాగశబ్దములకు అర్థభేదము లేనంతలో నీరెండును భిన్నమార్గము లెట్లగును ? నాకుమాత్రము కర్మ త్యాగములయందే యెట్లధికారము ? సన్న్యాసమునం దేల నధికారము లేదు ?

అని యిట్లూహించుకొని సన్న్యాసత్యాగములయొక్క యాథార్థ్యమును తెలిసికొనఁ గోరి యర్జును డడుగుచున్నాఁడు. "సన్న్యాసస్య" అని. సన్న్యాసము, త్యాగము, అను రెండుమార్గములకు గలభేదము, వాటి యథార్థస్వరూపము తెలిసినచో తనయధికారము ననుసరించి అందేదియో యొకమార్గమునందు ప్రవేశించి, తాను సంసారమునుండి మోక్షమును చెందవచ్చునని పార్థుని యాశయము.

కాని యింతకుముందు "కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన" అను శ్లోకముచే పార్థునకు త్యాగమార్గమే యుచితమని శ్రీకృష్ణు డుపదేశించియుండెను. అయినను అర్జునుడు అద్దానిని త్యాగమార్గమని విశేషరూపమున తెలిసికొనలేదు. భగవంతునకుగూడ పూర్వాధ్యాయములం దెచ్చటను ఫలమును గోరక కర్మల నాచరించుట త్యాగమనియు, కర్మలను పూర్తిగా వదలుట (మానివేయుట) సన్న్యాసమనియును వివరించి చెప్పియుండలేదు. ఫలమును గోరక కర్మల నాచరించుట యోగమనిమాత్రము చెప్పియున్నాఁడు. అట్టితఱి అనుష్ఠానరూపమయిన నాయోగము త్యాగమని, వివరించి చెప్పనిదే అర్జును డెట్లు తెలిసికొనును? త్యాగమనగా విడచుట, అనగా కర్మపరిత్యాగమని యర్థము. యోగమనగా కర్మను ఆచరించుట. ఈ రెండును పరస్పరవిరుద్ధములు. కనుక నీరెండు నేకరూపములని తెలిసికొనుట యెట్లు పొసగును? ఫలమును విడచుటయే త్యాగముకాని కర్మలను విడచుట త్యాగముకాదని గురూపదేశములేనిదే యెవ్వడును తెలిసికొనజాలడు. కావున "జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం" అను శ్లోకముచే వెనుక జెప్పబడిన సాంఖ్య, యోగ మార్గములలో సాంఖ్యమార్గమే సన్న్యాసమార్గమనియు, యోగమార్గమే త్యాగమార్గమనియు గ్రహింపవలెను. త్యాగము కర్మానుష్ఠానరూపము, సన్న్యాసము కర్మసన్న్యాసరూపము. ఈ రెంటికిని పరస్పరము విరోధముకలదు. కావున నీరెండును ఒకటి కానేరవు. కర్మానుష్ఠాన కర్మఫలత్యాగములు అట్లు పరస్పరవిరుద్ధములు కావు. ఫలత్యాగపూర్వకముగ కర్మ ననుష్ఠించుటకు వీలగును. కర్మత్యాగపూర్వకముగా కర్మ ననుష్ఠించుట కెవ్వడును వీలుపడదు. కనుక కర్మయోగ, కర్మసన్న్యాసములకు విరోధము అనివార్యము. కనుక సాంఖ్య యోగములే సన్న్యాసత్యాగములని తెలియక సన్న్యాసత్యాగములకు అర్థ మొకటే యగుటవలన నారెంటికి భేదములేదని తలచి, యారెంటియొక్క విశేషరూపమును తెలిసికొనగోరియే అర్జునుడు ప్రశ్నించుచున్నాఁ డనుట యుక్తము.

పూర్వాధ్యాయములయందు చెప్పబడిన సాంఖ్యయోగములే యిచట సన్న్యాస త్యాగరూపముతో జెప్పబోవుటవలన ఆచార్యపాదులు వెనుకటియధ్యాయములయందు చెప్పబడిన విషయములే యిచట తెలియబడునని వ్రాసిరి. "అర్జునస్తు" అను తు శబ్దమువలన అర్జును డడుగని విషయములనుగూడ శ్రీకృష్ణు

డిచట నుపదేశించునని తెలియుచున్నది. ఇచట త్యాగ, సన్న్యాసములకు గలవిశేష మును మాత్రమే శ్రీకృష్ణుడు ప్రతిపాదించుటలేదు. మరేమనిన బ్రాహ్మణాది వర్ణధర్మములనుగూడ ప్రతిపాదించుచున్నాడు. వర్ణధర్మములు వెనుక చెప్పబడలే దని శంకింపబనిలేదు. శమదమాది ధర్మములు పూర్వము చెప్పబడియే యున్నవి. కాని ఈయవి బ్రాహ్మణధర్మములు, ఈయవి క్షత్రియధర్మములు అని విశేషించి చెప్పలేదు. ఇప్పు డీ అధ్యాయమునందలి విశేషించి చెప్పబడుచున్నవి. అట్లుకాక వెనుకచెప్పినవాటిని అదేరూపములో చెప్పినచో పునరుక్తదోషము వాటిల్లును. కనుక సన్న్యాసశబ్దార్థమునకు, త్యాగశబ్దార్థమునకు గల భేదమును తెలియ గోరి అర్జును డడుగుచున్నాడని సంబంధము.

ఈశ్లోకమునందు అర్జునుడు శ్రీకృష్ణుని మహాబాహు వనియు, హృషీకేశు డనియు, కేశినిషూదను డనియు, మూడువిధముల సంబోధించెను. అందు మహా బాహో? అను సంబోధనమున మహాపురుషలక్షణము సూచితమగును. కేశి నిషూదన అను దానివలన దానవాంతకుడను విషయము వ్యక్తమగును. కేశి యనగా అశ్వరూపుడగు ఒకానొక రాక్షసుడు. వానిని చంపుటచే శ్రీకృష్ణుడు కేశినిషూదన అను పేరును బడసెను. హృషీకేశ అను సంబోధనమువలన ప్రత్యగ భిన్నమగు పరమాత్మయని స్పష్టమగును. హృషీకేశ అను పదమునకు ఇంద్రియ ప్రేరకుడని యర్థము. అనగా సర్వభూతేశ్వరుడని భావము. కావున ఓయి కృష్ణా! నీవు సర్వమును స్వయముగా గుర్తెఱుంగుదువు. ఇతరులకు బోధించుటకు, ఇతరులచే గ్రహింపజేయుటకుగూడ నీవే సమర్థుడవు. కావున సన్న్యాస త్యాగములయొక్క తత్త్వమును తెలిసికొనదలచి, నేను నిన్నే యడుగుచున్నాను. చెప్పుమని నిన్ను నియమించుటకు నేనెంతవాడను? నాకు తెలిసికొన గోరిక కలదని నీయొద్ద మనవి చేసికొనుటయే నాధర్మము. స్నేహితుడవును, పరమకారుణికుడవును అగు నీవే నాకోరిక నెరవేర్తువు. కావున కృష్ణా! సన్న్యాస, త్యాగములయొక్క యాథా తథ్యమును (తత్త్వమును) వివరించి చెప్పుము. ౧

శ్లో॥ కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః,
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః॥ ౨

అ॥ శ్రీకృష్ణు డచ్చటచ్చట సన్న్యాస త్యాగశబ్దములను లోగడ అధ్యాయ ములయందు వాడియుండెను. కాని వాని యర్థనిర్ణయమును జేయలేదు. పార్థు డడుగగా, నిపు డర్థమును నిర్వచింపదలచి శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు.

అర్జునా! కామ్యకర్మలను విడచుట సన్న్యాసమనియు, అనుష్ఠించిన కర్మల యొక్క ఫలమును పరిత్యజించుట త్యాగమనియును, విద్వాంసు లందురు. ఇచట

కామ్యములనగా, స్వర్గాదిఫల నిమిత్తములగు కర్మలు, నిత్యములు నైమిత్తికము లును. నిత్యనైమిత్తికములకుగూడ ఫలము గలదని భగవంతునిమతము. కాన మూడును భగవంతునిమతమున కామ్యములు. చేయకున్న ప్రత్యవాయము కలవి నిత్యనైమిత్తికములు. అట్టి ప్రత్యవాయములేనివి కామ్యములు. అని యీమూటికి వ్యావహారికభేదము. అందు ప్రతిదినము ననుష్ఠించెడి కర్మలు నిత్యములు. నిమిత్తము తటస్థించినప్పుడు అప్పుడప్పు డాచరించబడునవి నైమిత్తికములు. సంధ్యా వందన దేవర్షి పితృతర్పణములు నిత్యములు. శ్రాద్ధాదులు నైమిత్తికములు. వేదమునందు స్వర్గాదిఫలముల నుద్దేశించి విధింపబడినవి కామ్యములు. ఈమూటికి ఫలముకలదుగాన నీమూడును కామ్యములనబడుచున్నవి. కావున ననుష్ఠేయము లయిన వీటిని ననుష్ఠించకుండుట సన్న్యాసమని యర్థము. కర్మల ననుష్ఠించకుండు టయే పరిత్యాగము. ధనాదులకువలె స్వరూప పరిత్యాగము వీటికి సంభ వించదు. అశ్వమేధాది కామ్యకర్మలనుగూడ ఫలేచ్ఛను విడచి, చిత్తశుద్ధికొఱకు జనకాదు లాచరించిరి. కావున భాష్యమునందలి "నిత్యనైమిత్తికానాం" అను పదమునకు కామ్యకర్మలుగూడ నుపలక్షణములు. సన్న్యాసు లీ మూడుకర్మలను విడువవలయును. త్యాగులు కామ్యకర్మలనుమాత్రమే స్వరూపతః పరిత్యజించ వలయును. నిత్యనైమిత్తికముల ననుష్ఠించితీరవలయును. లేనిచో ప్రత్యవాయ మాపాదించును. కాని వానిఫలమునుమాత్రము విడువకతప్పదు.

కాన సన్న్యాస త్యాగశబ్దముల రెంటియందును, త్యాగ మనునది సమాన మయినను సన్న్యాసమునందు గర్మత్యాగము, త్యాగమునందు ఫలత్యాగము అని యీరెంటికి నిష్కర్ష.

"అనిష్టమిష్టం మిశ్రంచ త్రివిధం కర్మణః ఫలం, భవత్య త్యాగినాం ప్రేత్య నతు సన్న్యాసినాం క్వచిత్" అని శ్రీకృష్ణుడు అత్యాగులకు నిత్య నైమిత్తికాది కర్మఫలమును బ్రతిపాదించుటచే నిత్యనైమిత్తికములకు ఫలము కలదని తేలుచున్నది.

రామానుజీయము :

"సన్న్యాస త్యాగశబ్దములు పర్యాయములు. వీటి కర్థభేదము లేదు. కాని కొందఱు విద్వాంసులు, బంధప్రదమయినందున, కామ్యకర్మ యనుష్ఠింపవలదనియు నిత్యనైమిత్తికములుమాత్రమే యనుష్ఠింపదగినవనియు, వీని ననుష్ఠింపకున్న ప్రత్యవాయ ముండుననియును జెప్పుచున్నారు.

మఱికొందరు కామ్యకర్మకూడ విడువదగదు. నిత్యనైమిత్తికములవలె జేయదగినదే; ఫలమునుమాత్రము విడచినందున బంధము తీరును. కావున మూడు

కర్మలు అనుష్ఠింపదగినవియే. నిత్యనైమిత్తికములకుగూడ ఫలము కలదు. కాన నీ మూటికి ఫలపరిత్యాగము జేయవలయును" అని వివరించిరి.

ఇది యుక్తము కాదు.

వీరి వివరణము అర్జునిని ప్రశ్నకు, శ్రీకృష్ణుని జవాబునకును అనుకూలముగ లేదు. సన్న్యాస త్యాగములయొక్క తత్త్వమును దెలియగోరి యర్జును డడిగెను. కాని, త్యాగముయొక్క వికల్పములను దెలియగోరి యడుగలేదు.

ప్రకృతశ్లోకముకూడ కర్మసన్న్యాసము సన్న్యాసమనియు, కర్మఫలత్యాగము త్యాగమనియు జెప్పుచున్నదికాని కర్మసన్న్యాసము యుక్తమని కొందరు, కర్మఫలత్యాగము యుక్తమని మరికొందరును జెప్పుచున్నారని యనుటలేదు. కనుక వీ రిరువురి ప్రశ్న ప్రతివచనమునకు విరుద్ధార్థమును గల్పించుట యుక్తము కాదు. మరియు నిచట వికల్పబోధకములగు కేచిత్, అన్యే, అనుపదములు మూలమున లేవు. "త్యాజ్యం దోషవదిత్యేకే" అను శ్లోకమునుంచి యాపదముల నధ్యాహారమొనర్చుటయు తగదు. అచ్చట కర్మయొక్క అనుష్ఠానానుష్ఠానములు మాత్రమే వికల్పింపబడినవి. ఇచట కర్మ, తత్ఫలముల పరిత్యాగము వికల్పమని వీరియాశయము. కాన విషయభేద ముండుటచే నాశ్లోకము ననుసరించుట తగదు.

మరియు, సన్న్యాసత్యాగములు రెండును ఏకార్థములని, యర్జునునకు తెలియునా? తెలియదా? ఇందు మొదటిపక్షమున సన్న్యాస త్యాగములయొక్క పృథక్త్వమును దెలియగోరితినని ప్రశ్న కుదరదు. మూలమునందు, పృథక్ అను పదము కలదు. రెండవపక్షమున కృష్ణుని జవాబు కుదరదు. శ్రీకృష్ణుడు సన్న్యాసత్యాగములు రెండు నొకటేయని చెప్పవలయును. అట్లు చెప్పలేదు. కావున శ్రీశంకరులు చెప్పినయర్థమే యుచితము. అర్జునుని ప్రశ్న కనుకూలమును.

సర్వకర్మపరిత్యాగము సన్న్యాసమనియు, సర్వఫలత్యాగము త్యాగమనియు, నీరెంటియొక్క తత్త్వము నిర్దేశింపబడినది.

ఇచట కామ్యశబ్దము, (కామే = సాధూని) అను వ్యుత్పత్తిచే నిత్యనైమిత్తిక, కామ్యము లను మూడుకర్మలయందును వర్తించును. వ్యాసులు మూలమున, "సర్వేషాం" అన్నికర్మలను అని చెప్పకపోవుట దోషమని యెంచరాదు. కర్మలన్నియు కామ్యములేకాన, నన్నిటిని పరిత్యజించుట సూచిత మగుచున్నది. అట్లుకాక, నితరస్థలమున శ్రుతిసిద్ధమయిన సర్వకర్మపరిత్యాగరూప సన్న్యాసము నిచట నెందుకు ప్రతిపాదించరు?

శ్లో॥ త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః
యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యమితి చాపరే॥ 3

అ॥ గతశ్లోకమున అర్జునుని ప్రశ్నకు జవాబు వచ్చినది. ఇపుడు ప్రసంగవశమున అవిద్వాంసులకు సన్న్యాసము శ్రేయస్కరమా? త్యాగము శ్రేయస్కరమా? అను శంక కలుగగా, నందు శాస్త్రకారులకు వికల్పము కలదని చెప్పుచున్నారు. విద్వాంసులకు కర్మాధికారము లేదని యింతకుముం దనేకమారులు ప్రతిపాదించి యున్నందున నీ యాశంక విద్వాంసులయెడ గలుగదు. అయితే అవిద్వాంసులకు కర్మసన్న్యాసముకంటె కర్మయోగము మంచిదని పూర్వమే యీవిషయము చెప్పబడినదికదా? మరల యీ యాశంకయెందుకు? నిజమే, స్పష్టముగా దెలియుటకు మరల యిచట విమర్శించబడుచున్నది. కనుకనే భాష్యకర్తలు గడచిన అధ్యాయములయందలి విషయజాతమంతయు మరల యీయధ్యాయమున జెప్పెదమనిరి.

లేక సన్న్యసించి, కర్మల విడచినవారికి మరల కర్మాధికారము లేనందున నీకర్మవికల్పము వారివిషయముకాదు. ఇంక నటు సన్న్యసించక, ఇటు కర్మల నాచరించక యుండువారిని గూర్చి యీకర్మ వికల్పమని గ్రహింపవలెను.

హింసాది దోషయుక్తమయిన కర్మ చేయగూడదని సాంఖ్యులగు కొందరు విద్వాంసు లందురు. యజ్ఞ, దాన, తపః ప్రభృతి కర్మలు విడువకూడదని మరి కొంద రందురు. ఇందు మొదటివా రాత్మజ్ఞానులు. వీరికి క్రియాకారక ఫలభావ మాత్మయందు లేదని తలంపు కలదు. అందువలన కర్మానుష్ఠానము వలదందురు. రెండవవారు కామ్యకర్మలు బంధప్రదములయినను నిష్కామకర్మలు చిత్తశుద్ధి ద్వారమున మోక్షహేతువు లయినందున అనుష్ఠించితీరవలయు నందురు.

జ్ఞాననిష్ఠులయిన సాంఖ్యులు కష్టమని, దుఃఖమని, కర్మల విడువరు. వారికి కాయక్లేశనిమిత్తమయిన దుఃఖము ఆత్మయందుగలదను భావముండదు. ఇచ్ఛా, ద్వేష, భయ, దుఃఖాదులు శరీరధర్మములని వారిభావము. కర్మలు సత్త్వాది గుణప్రయుక్తములుకాని ఆత్మప్రయుక్తములు గావని వారినిర్ణయము. కాన వారి కర్మసన్న్యాసము జ్ఞానపూర్వకముగాని, మోహ ( అజ్ఞాన ) పూర్వకముగాదు.

అనాత్మజ్ఞులు మాత్రము కాయక్లేశ భయమువలన కర్మల త్యజింతురు. అట్టి త్యాగులు, రాజసులు, తామసులు అని నిందింపబడుదురు. కాన నట్టివారికి కర్మత్యాగముకంటె ఫలత్యాగ ముచితమని ఫలత్యాగమును స్తుతించుటకు కర్మత్యాగము నిందించబడుచున్నది.

ఇంతేకాని, యాత్మజ్ఞానముగల సాంఖ్యులొనర్చెడి కర్మత్యాగము నిందించబడుటలేదు. ఆత్మవేత్తల సన్న్యాసముకంటె, ననాత్మవేత్తల కర్మఫలత్యాగము

గొప్పదికాదు. సర్వకర్మసన్యాసము ముఖ్యముకాని సర్వకర్మ ఫలత్యాగము ముఖ్యముగాదు.

"నహి దేహభృతా శక్యం త్యక్తుం కర్మా ణ్యశేషతః।
యస్తు కర్మ ఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే" (దేహధారి యగువాడు కర్మలను పూర్తిగా విడువ వీలులేదు. కావున కర్మఫలమును విడచినవాడే త్యాగి యనబడుచున్నాడు.) అని ఫలత్యాగిని స్తుతించుట అజ్ఞానిని పురస్కరించుకొనికాని జ్ఞానిని పురస్కరించుకొని కాదు. జ్ఞానికి సర్వకర్మసన్యాసము అసంభవము కాదు. అయ్యది అజ్ఞానికి నసంభవము కనుకనే పై శ్లోకము అజ్ఞానికి ఫలత్యాగమే యుచితమని స్తుతించుచున్నది.

అవిక్రియాత్మను దెలిసికొన్న విద్వాంసులకు ఆత్మయందు కర్మదృష్టియే లేనపుడు వారికి కర్మాధికార మెట్లుండును? కర్మల నాచరించికదా వాటి ఫలమును విడువవలయును? విద్వాంసులకు కర్మాచరణమే సంభవించదు. ఇంక వారు ఫలత్యాగమును జేయుటయా, కాన "నహి దేహభృతా" యనుశ్లోకము అజ్ఞానియొక్క కర్మ ఫలత్యాగమును స్తుతింపప్రవర్తించినదికాని, జ్ఞానియొక్క ఫలత్యాగమును జెప్ప ప్రవర్తించలేదు. "త్యాగాచ్ఛాంతి రనంతరం" అనునదికూడ నిట్లు స్తుతిపరమే-కానిచో, శ్రీకృష్ణుడు తృతీయాధ్యాయమునను "వేదావినాశినం పార్థ" అను శ్లోకమునందును జ్ఞానులకు సర్వకర్మసన్యాసమును ప్రతిపాదించి, మరల యిచ్చట దానికి విరుద్ధముగ జ్ఞానులకు కర్మఫలత్యాగము యుక్తమని యెట్లు చెప్పును?

కావున నిచట కర్మాధికారులగూర్చియే సంన్యాస, త్యాగవికల్పముకాని, కర్మాధికారములేని సాంఖ్యులగూర్చి కాదు.

ఇందు పూర్వార్థమున సంన్యాసము, ఉత్తరార్థమున త్యాగము చెప్పబడినదని వివేకము. ఈ రెంటికిని "ఏకే" "అపరే" అను పదములవలన వికల్పము చూపబడినది.

అనాత్మజ్ఞులయిన కర్మాధికారులకు కర్మసంన్యాసము కర్తవ్యమా? లేక కర్మ ఫలత్యాగము కర్తవ్యమా? అని.

సాంఖ్యుల (జ్ఞానుల) ప్రసక్తి యిం దేమాత్రమును లేదు. 3

శ్లో॥ నిశ్చయం శ్రుణు మే తత్ర త్యాగే భరతసత్తమ,
త్యాగోహి పురుషవ్యాఘ్ర త్రివిధ స్సంప్రకీర్తితః, ४

అ॥ అజ్ఞానులకు నిత్యకర్మత్యాగ మచితమా? నైమిత్తిక కర్మత్యాగ ముచితమా? అని యనేకవికల్పము లుదయించును. ఇవన్నియు 'కర్మత్యాగ ముచితమా?

'ఫలత్యాగ ముచితమా' అను రెండు వికల్పములలో జేసును. ఇం దేవపక్షము నా కభిమతమయినదియు చెప్పెద వినుము. ఈ త్యాగము, (కర్మత్యాగము, ఫలత్యాగము) సాత్త్వికము, రాజసము, తామసము, అని మూడువిధముల నుండును. దీనితత్త్వమును జెప్పుటకు నాకంటె సమర్థులు లేరు. విద్వాంసులు రెండు రకముల వికల్పమును జూప, నజ్ఞానియగు ముముక్షువునకు సందేహ మేర్పడును. అందెద్ది శ్రేయస్కరమా? యను సందిగ్ధస్థితిలో నుండి శాస్త్రము రెండు రకముల గనిపించుచుండుటచే శాస్త్రాధారమున నిర్ణయము నొందజాలడు. కనుక నందలి నిర్ణయమును శాస్త్రకర్తయగు నేనే నిరూపింపవలయును. శాస్త్ర మీశ్వరాజ్ఞారూపము. ఈశ్వరహృదయ మీశ్వరునకు ప్రత్యక్షమయినటుల పరులకు ప్రత్యక్షము కాదు. పరహృదయము పరుల కప్రత్యక్ష మను ప్రతీతి కలదు. కాన, నా యభిప్రాయమును నేనే చెప్పెద, విని యిందలి నిశ్చయమును నీవు గ్రహింపుము.

రామానుజీయము :

"కర్మత్యాగము, ఫలత్యాగము- కర్తృత్వత్యాగము అని త్యాగము మూడు విధములు. (మమేదం కర్మ) ఈకర్మ నాదియని కర్మయందలి మమతను విడచుట కర్మత్యాగము. (మమఫలం న స్యాత్) నాకు ఫలము కలదు, అనునది ఫలత్యాగము. (ఈశ్వరఏవ కర్తానాహం) ఈశ్వరుడే కర్త, నేనుగాదు. అనునది కర్తృత్వత్యాగము. ఈ కర్తృత్వత్యాగమును శ్రీకృష్ణుడు మయి సర్వాణి కర్మాణి సంన్యస్యాధ్యాత్మచేతసా, నిరాశీర్నిర్మమో భూత్వా యుద్ధ్యస్వ విగతజ్వరః॥ అను శ్లోకముచే పంచమాధ్యాయమున వెనుకనే చెప్పియుండెను" అని రామానుజులు వివరించిరి. ఇది యుక్తముకాదు.

౧. ఈ శ్లోకమున త్యాగము మూడు విధము లని శ్రీకృష్ణుడు కంఠతః చెప్పలేదు.

౨. కంఠతః చెప్పకున్నను అర్థాత్సిద్ధించు నన్నచో, "యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః। సమస్సిద్ధావసిద్ధౌచ కృత్వాపి న నిబధ్యతే" అను శ్లోకముచే అసంతోషత్యాగము, ద్వంద్వత్యాగము, మాత్సర్యతాగము, సిద్ధ్యసిద్ధులవలన కలిగెడి హర్షవిషాదత్యాగము- అను త్యాగములన్నియు, అర్థాత్సిద్ధములయినందున త్యాగము త్రివిధమే యని నియమింప వీలులేదు.

3. మరియు "యస్య సర్వే సమారంభాః" అను శ్లోకమున కామత్యాగ, సంకల్పత్యాగ, ఆశ్రయత్యాగములు "ఛిత్త్వైనం సంశయం" అను శ్లోకమున సంశయత్యాగమున్ను, అర్థసిద్ధము లగుచున్నవి. ఇట్లనేక త్యాగములు పూర్వము చెప్పియుండగా, త్యాగము మూడువిధములని యిప్పుడు చెప్పుటెట్లు?

కావున వెనుకటిశ్లోకములన్నియు నాయావిశేషణములచే కర్మయోగమునే విశేషించి చెప్పుచున్నవి. త్యాగభేదముల జెప్పుటలేదు.

మరియు పూర్వము కామ సంకల్పాది విషయభేదములచే త్యాగ మనేకవిధము లని చెప్పిన ట్లగపడుచున్నది. త్యాగముయొక్క స్వరూపభేదము చెప్పలేదు. ఒక రకమయిన త్యాగభేదముగల కర్మయందు రెండవరకమయిన త్యాగ ముండదు. ఉద్భూతరూపము గల వస్తువునం దనుద్భూతరూప ముండదు. ఉష్ణస్పర్శగల వస్తువునందు అనుష్ణస్పర్శ యుండదు.

ఇచటమాత్రము త్యాగము త్రివిధమని స్వరూపభేదము కంఠతః చెప్పబడు చున్నది. ఆ భేదములు సాత్త్విక రాజస తామసము లనికూడ చెప్పబడగలవు. ఇం దొకరకమయిన త్యాగముగలవానియందు రెండవరకమయిన త్యాగముండదు.

అట్లుండుచో త్యాగ మేకమే యగునుగాని, భిన్నము కాదు. భేదకారణ ముండదు. ఒకత్యాగమున్నచోట రెండవత్యాగము లేకపోవుటయే త్యాగముల పరస్పరభేదమునకు గారణము.

కామత్యాగ మమతాత్యాగాదులకు పరస్పర సామానాధికరణ్యము కలదు. అనగా నొకటున్నచోట మరియొక టుండును.

అందువలన విషయభేదమునుబట్టి వేరుగా తోచుచున్నను వెనుకటిత్యాగము లన్నియు నొకటే. ఇక్కడ చెప్పినత్యాగముమాత్రము స్వరూపభేద ముండుటనుబట్టి మూడువిధములు. ఈ భేదములకు (సాత్త్వికాది త్యాగములకు) పరస్పరసాంకర్యము కాని, సామానాధికరణ్యముకాని లేదు. కాన శ్రీకృష్ణునిచే కంఠోక్తమయిన త్యాగ మిదియే కాని వెనుకటిదికాదు. కాన వారివ్యాఖ్య యసంగతము.

మరియు "ప్రకృతేః క్రియామాణాని గుణైః కర్మాణి సర్వశః"అను శ్లోకమును బట్టి గుణములయందు కర్తృత్వము నారోపించుట యుక్తముకాని, నిర్వికారుడయిన నీశ్వరునియందు ఆత్మయందు నారోపించుట న్యాయముగాదు.

అయితే "మయిసర్వాణి కర్మాణి" (నాయందు నిఖిలకర్మలనుంచి) అని భగవంతుడు చెప్పినమాటకు గతియేమి? వినుము, నేను ఈశ్వరునికొఱకు కర్మ చేయు చున్నాను. రాజుకొఱకు భృత్యుడుచేసినట్లు అని యనుసంధాన మొనర్చుటయే ఈశ్వరునియందు కర్మసమర్పణమును జేయుట. అయితే గుణములయందు కర్తృత్వము నారోపించినపుడు "నేనుజేయుచున్నా"నను అనుసంధాన మెట్లు? నిజమే? ఈశ్లోకము కర్మాధికారియగు అనాత్మజ్ఞునివిషయము. తత్త్వవేత్తగుణములే కర్తలు, నేను గానని తలంచును.

కావున, నీశ్వరుడే కర్తయను ననుసంధానము అతి మూఢునివిషయమని సంక్షేపము.

శ్లో॥ యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్॥ ౫

అ॥ ఫలేచ్ఛలేని విద్వాంసులు యజ్ఞదానతపఃప్రభృతి కర్మలను పరిత్యజించరాదు. వారి కీయవి చిత్తశుద్ధికరములు.

ఇచట మూలమున "మనీషిణామ్" అను పదముండుటచే నీప్రకరణము విద్వాంసుల విషయమని భ్రమింపరాదు. అజ్ఞులలో ఫలేచ్ఛగలవారు మూఢులు, ఫలేచ్ఛలేనివారు విద్వాంసులు అని యిచట భావము. ఇంతేకాని, తత్త్వజ్ఞానులని యర్థముకాదు.

అదెట్లన? వైదికులలో వేదార్థవేత్తలు ప్రాజ్ఞులు. వేదపాఠకులు మూఢులు. అట్లే ద్విజులలో వేదపాఠరతులు ప్రాజ్ఞులు, సంధ్యావందనమాత్ర వేత్తలు, మూఢులు. విద్యార్థులలో శాస్త్రము చదువువారు ప్రాజ్ఞులు, కావ్యముల జదువు వారు మూఢులు. బాలురలో పేర్లను, వాక్యములను జదువువారు ప్రాజ్ఞులు. అక్షరముల నభ్యసించువారు మూఢులు. ఇట్లే అజ్ఞానులలో ఫలేచ్ఛలేనివారు ప్రాజ్ఞులు. ఫలేచ్ఛగలవారు వారిద్వారా మూఢులు.

యజ్ఞాదికర్మలు చిత్తశుద్ధికరము లని చెప్పుటచే, చిత్తశుద్ధిపర్యంతమే కర్మలనియు, నావల సన్న్యాసమే ముముక్షువునకు శరణ్యమనియు దేలుచున్నది. వివిదిషను బుట్టించనర్హము లయిన కర్మలకు నది పుట్టినపిదప నుపయోగము లేదు.

ఇట్లుండ, మరణపర్యంతము ముముక్షువులు కర్మలను జేయుచుండవలెనని వర్ణించు రామానుజులపాండిత్య మే మనదగును ?

యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్"

"వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరంతి"

"బ్రాహ్మణో నిర్వేదమాయాత్" "శాంతోదాంత ఉపరత" ఇత్యాది శ్రుతి సిద్ధమయినట్టియు, "సర్వారంభపరిత్యాగీ" యను ప్రకృతగీతాసిద్ధ మయినట్టియు, "విద్వాంసు లాచరించెడి సర్వకర్మసంన్యాసము నిషేధించు రామానుజుల నెంతేని మెచ్చదగును. ౫

శ్లో॥ ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ,
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మత ముత్తమం॥ ౬

అ॥ ఓయి అర్జునా ! ఈ కర్మలనుగూడ, కర్మాసక్తి, ఫలాసక్తిలేక యాచ

రించవలెనని నా నిశ్చయము. ఫలాసక్తితో జేసిన నివి బంధప్రదము లగును. వాటిని కూడ ఫలాసక్తి విడచి చేసినచో, చిత్తశుద్ధిద్వారమున మోక్షప్రదము లగును.

ఇచట కొందరు "ఏతాన్యపి" అను పదమునకు నిత్యకర్మలకంటె వేరయిన కామ్యకర్మ అర్థమనియు, నవికూడ ఫలాసక్తి లేకుండ నాచరించవలెననియు, నిట్లుండ, నిత్యములయిన యజ్ఞాదికర్మలాచరించ మని వేరుగ జెప్పనేల ? అని వ్యాఖ్యానించిరి :

ఇది యుచితము గాదు.

౧. నిత్యకర్మలకు గూడ ఫలము గలదని గీతాశాస్త్రమున నిరూపిత మయి నది. కాన నింక నిత్యములు, కామ్యము లను భేద మిందు ఫలమునుబట్టి లేదు.

౨. నిత్యకర్మలే బంధప్రదములను భయముతో విడువదలచిన ముముక్షువునకు కామ్యములయందు ప్రసక్తియేల ?

౩. "దూరేణ హ్యవరంకర్మ" "యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర" అను శ్లోకము లచే నీశ్వరార్థభిన్నము లయిన కర్మలు కామ్యము లనియు, అవి యన్నియు బంధకము లనియును, నిందించబడినవి.

౪. కామ్యకర్మలు "త్రైవిద్యా మాం సోమపాః" "క్షీణేపుణ్యే మర్త్య లోకం విశంతి" అను శ్లోకములచే చాలదూరమున సూచింపబడినవి. కాన నిచ్చటి "ఏతాన్యపి" అనుపదము అంతదూరముపోయి యన్వయించదు. వెనుక శ్లోకమున జెప్పిన యజ్ఞాదికర్మలను మాత్రమే పరామర్శించును.

కాన ఫలేచ్ఛనువదలి యజ్ఞాదికర్మల నాచరించవలెనని శ్రీకృష్ణుని నిశ్చయము. దీనివలన ఫలత్యాగపక్షము కృష్ణున కభిమతమయినటుల వ్యక్తమగు చున్నది. ౬

శ్లో॥ నియతస్య తు సంన్యాసః కర్మణో నోపపద్యతే
మోహాత్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః॥ ౭

అ॥ అజ్ఞానికి కర్మత్యాగపక్ష ముచితముకాదని చెప్పుచున్నారు: ముముక్షు వగు నజ్ఞాని నియతకర్మలను విడువగూడదు. ఒకవేళ అజ్ఞానవశమున విడచినను, అయ్యది తామసపరిత్యాగ మనిపించుకొనును. మూలమునందలి నియతపదము నిత్యనైమిత్తికకర్మపరము. బ్రాహ్మణునకు దేవ, పితృ, భూత, మనుష్య, బ్రహ్మ యజ్ఞము లను పంచమహాయజ్ఞములు, ప్రతిరోజున చేయదగిన నిత్యములు. "జ్యోతి ష్టోమము నైమిత్తికము" దానముకూడ నిత్యకర్మయే. అధ్యయనము బ్రహ్మ యజ్ఞమునందంతర్భూతము. ఏకాదశ్యా ద్యుపవాసము తపస్సు.

ఇట్టి యజ్ఞాదిరూపమయిన నిత్యకర్మను విడచుట ప్రత్యవాయకరము; చేయుట చిత్తశుద్ధికరము. ముముక్షువునకు మోక్షసిద్ధికొఱకు నియతకర్మానుష్ఠాన మావశ్యకము. అయ్యవి చిత్తశుద్ధిని కలుగజేయును. ఆపైన జ్ఞాన ముదయించును. దాన మోక్షము సిద్ధించును.

అయితే నిత్యకర్మలకుగూడ చిత్తశుద్ధి యను ఫలమున్నదికదా? ఫలాభిసంధిరాహిత్య మెట్లని మీ కాశంక కలుగవచ్చును. కాని, ఫలము బంధము నిచ్చుచో దోషమగును కాని, ఫలమయినంతమాత్రమున దోషము కానేరదు. దీనివలన ఆత్మజ్ఞానులకు నియతకర్మత్యాగ ముచితమని తేలినది. ౭

శ్లో॥ దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్,
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం భవేత్॥ ౮

అ॥ అర్జునా! ఎవడు దుఃఖమను దలంపుతో శరీరకష్టమునకు భీతిల్లి, నియతకర్మలను విడచునో, వాడట్టి రాజసత్యాగమును జేసినను త్యాగఫలము నొందడు.

అజ్ఞానమువలన జేసెడి త్యాగము (కర్మపరిత్యాగము) తామసము: శరీరకష్టమువలన భయపడి చేసెడిత్యాగము రాజసత్యాగము. ఈ రెండును పనికిరావు. కావున కర్మాధికారియయిన అజ్ఞాని నియతకర్మను తప్పక నాచరించవలయును. అజ్ఞాని యయినను, సన్న్యసించినచో కర్మాధికారము లేదు. కావున నట్టివాడు నియతకర్మల విడచినను ప్రత్యవాయము లేదు.

కాని అజ్ఞానికి సన్న్యాసముకంటె కర్మయోగము సమీచీనము. ఇట్టివాడు కర్మయోగము నాచరించక, శరీరకష్టమునకు వెఱచి, కర్మత్యాగ మాచరించినను వాడు త్యాగఫలమగు (పరమార్థసన్న్యాసఫలమగు) మోక్షమును పొందలేడు. ౮

శ్లో॥ కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున,
సంగం త్యక్త్వా ఫలంచైవ స త్యాగ స్సాత్త్వికో మతః॥ ౯

అ॥ ఓయి, అర్జునా! నియతకర్మను, సంగమును విడచి ఫలమును వదలి అవశ్యకర్తవ్యమను భావముతో జేసెడి త్యాగము సాత్త్విక మనబడును. అనగా, అవశ్యకర్తవ్యమనుభావముతో నియతకర్మల నాచరించుచు వానియందలి సంగమును ఫలమును వదలుట సాత్త్వికత్యాగమని భావము.

నిత్యకర్మలకు ఫలము కలదనుటలో శ్రీకృష్ణవాక్యమును ప్రమాణపరచితిమి. ఒకవేళ నట్లుగాకున్నను, అజ్ఞాని చిత్తశుద్ధికాని, ప్రత్యవాయపరిహారముకాని, నిత్యకర్మలకు ఫలము కలదని కల్పించుకొనును. ఆత్మవేత్తమాత్ర మట్లు కల్పించుకొనడు. కావున సర్వకర్మఫలత్యాగము సాత్త్వికత్యాగమని సిద్ధమయినది. కర్మాధికారియగు నజ్ఞాని నిత్యకర్మ నాచరించి దానిఫలమును విడచునుగాని, కర్మను విడువడు.

ఓయి ! త్యాగము మూడువిధము లని చెప్పితిరి. త్యాగమనగా సన్న్యాసమని చెప్పవలయును. "నియతస్య తు సన్న్యాసః" అను నేడవశ్లోక మా యర్థమునే సూచించుచున్నది. "కామ్యానాం కర్మణాం న్యాసం సంన్యాసం కవయో విదుః" అని సంన్యాసమే ప్రస్తుతమయినది. ఇట్లుండ సంన్యాసమనగా కర్మత్యాగమనిచెప్పి దాని ప్రకారములను మూటిని చూపి అందులో రెండు కర్మత్యాగరూపములు, మూడవది ఫలత్యాగమని చెప్పుటెట్లు ? కర్మత్యాగము సంన్యాసముకాని, ఫల త్యాగము సన్న్యాసము కాదుకదా ? ప్రకృత రాజస తామసత్యాగములు కర్మ త్యాగము లంటిరి. సాత్త్వికత్యాగము ఫలత్యాగ మంటిరి. ఈ విరోధ మెట్లు పరిహరింతురు ?

వినుము. ఇచట సంన్యాస త్యాగశబ్దములకు పరిత్యాగాంశమునందే సామ్యము కాని కర్మఫలమును అను విషయమునందు సామ్యము లేదు. కర్మను విడువనిండు, ఫలమును విడువనిండు– ఎటులయినను, విడచుటకలదుకాన నీయది సంన్యాసమగును. రాజస, తామస, కర్మత్యాగములకంటె సాత్త్వికమయిన ఫలత్యాగము గొప్పదని స్తుతించదలచి ఫలత్యాగమును సంన్యాసభేదములలో జేర్చితిమి. ౯

శ్లో॥ న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే,
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః॥ ౧౦

అ॥ రాజస తామసత్యాగులను నిందించి సాత్త్వికత్యాగికి పరమార్థసన్న్యాసము, జ్ఞాననిష్ఠయు లభించునని చెప్పుచున్నాడు. కర్మఫలత్యాగి సత్త్వగుణముతోగూడిన వాడై ప్రజ్ఞాశాలియగుచు, అవిద్యాప్రయుక్తములయిన సంశయముల బోగొట్టుకొని, కామ్యకర్మను ద్వేషింపడు. నిత్యకర్మయం దాసక్తిపడడు. సంసారకారణమని కామ్యమునందు ద్వేషము లేదు. మోక్షకారణమని నిత్యమునం దాసక్తియు లేదు.

కావున, కర్మాధికారియగు నజ్ఞాని వెనుకజెప్పినట్లు కర్మయోగ మాచరించి క్రమముగా చిత్తశుద్ధినొంది, జన్మాదివికారరహితమయిన ప్రత్యగాత్మను దెలిసి కొని నిఖిలకర్మలను సంకల్పముతోగూడ వదలి, తానేమియు చేయకయు, చేయించకయు నుండుచు పరమార్థ సంన్యాసరూపమగు జ్ఞాననిష్ఠను బొందును. ఇదియే కర్మయోగమునకు ఫలము. ౧౦

శ్లో॥ నహి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీ త్యభిధీయతే॥ ౧౧

అ॥ దేహాత్మాభిమానము గలవాడు కర్మలను విడువ సమర్థుడుకాడు. కాన కర్మఫలత్యాగియే త్యాగియని శిష్టులందురు. ఇచట దేహభృత్ అనగా "నాది యీ దేహము, నేను మనుష్యుడను" అని అహంమమాభిమాన పూర్వకముగ

శరీరమును ధరించువాడు. ఇంతియేకాని వివేకము గలవాడని యర్థముకాదు. వివేకి కర్మాధికారి కాడు. వానికి సమూలము కర్మత్యాగమునం దధికారము కలదు.

ఇచట ఫలాభిసంధిమాత్రమును త్యజించినవాడు సన్న్యాసియనుట స్తుతి. జ్ఞానపూర్వక సర్వకర్మసంన్యాసి, పరమార్థసంన్యాసి (ముఖ్యసంన్యాసి). అవివేకమున కర్మలను విడచినవానియొక్కయు, కష్టమని కర్మలను విడచినవానియొక్కయు సంన్యాసము నింద్యము. కావున కర్మల జేయుచున్నను, ఫలమును విడచినంత మాత్రమున సన్న్యాసియనుట వాని సంన్యాసము అముఖ్యమని సిద్ధమగును.

శ్లో॥ అనిష్టమిష్టం మిశ్రంచ త్రివిధం కర్మణః ఫలం
భవత్య త్యాగినాం ప్రేత్య నతు సంన్యాసినాం క్వచిత్॥ ౧౨

అ॥ కర్మలకు (కర్మానుష్ఠాతలకు) (అపరమార్థ సంన్యాసులకు) శరీర పాతానన్తరము అనిష్టము, ఇష్టము, మిశ్రము అని మూడురకముల ఫలము గలుగును. పరమార్థసంన్యాసుల కీయవి యుండవు.

౧. అందు శాస్త్రవిహితమయిన ధర్మానుష్ఠానముయొక్క ఫలము ఇష్టము.

౨. శాస్త్రనిషిద్ధమయిన హింసాదిరూపమగు నధర్మానుష్ఠానముయొక్క ఫలము అనిష్టము.

3. ధర్మాధర్మోభయాత్మకమయిన కర్మయొక్క ఫలము మిశ్రమము. (ఫల్గుతయా = లీయతే) అను వ్యుత్పత్తివలన ఫలశబ్దమునకు వ్యర్థముగా లయించున దను నర్థము లభించును. కాన నీయది మిథ్యాభూతము. అజ్ఞానప్రయుక్త మగుటవలనగూడ మిథ్య యనవలయును. ఐంద్రజాలికుని మాయతో సమాన మయినది. ఎంతటివారల నయినను పొరపరచును. ఇట్టి ఫలము ప్రత్యగాత్మకు సంబంధించినదివలె భాసించును. ఇది తుచ్ఛమయినది కనుకనే రజ్జువునందలి సర్పాభాసమువలె సులువుగా లయించును. (నశించును)

కాని మోక్షఫలమునం దీయర్థ మన్వయించదు. నిత్యసిద్ధమయిన మోక్షము ఫలమువంటిదికాని నిజముగ ఫలముగాదు. కనుకనే మోక్షమునకు నిత్యత్వవ్యవహారము పొసగుచున్నది. సగుణముక్తిస్థానమగు హిరణ్యలోకము మాయామయము, తుచ్ఛమును కనుక ఫలమగును. హిరణ్యగర్భలోకము నిత్యకర్మకుగాని, సగుణోపాసనమునకుగాని ఫలము. కావున నజ్ఞానులకు సర్వకర్మసంన్యాస మసంభవము. జ్ఞానుల కయ్యది సంభవము. ౧౨

శ్లో॥ పంచైతాని మహాబాహో కారణాని నిబోధ మే
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్॥ ౧3

అ॥ ఓయి అర్జునా ? కర్మలకు పరిసమాప్తిస్థానమయిన వేదాంతశాస్త్రము నందు నిఖిలకర్మలు నెరవేరుటకు నయిదుకారణములు చెప్పబడినవి. వానిని జెప్పెద వినుము.

ఇచ్చట సాంఖ్యశబ్దమునకు ప్రకృతిమహదహంకారాదులను లెక్కించి చెప్పు కపిలసాంఖ్య మర్థముకాదు. మరేమనిన, సాంఖ్యమనగా ఆత్మజ్ఞానము. దానిని ప్రతిపాదించుటచే వేదాంతశాస్త్రముకూడ సాంఖ్య మనబడుచున్నది.

రామానుజీయము.—

"సంఖ్యయనగా బుద్ధి; దానితోగూడినది సాంఖ్యము, కృతాంతమని నిర్ణయము" అని వివరించిరి.

ఇందు సాంఖ్యశబ్దముచేతనే వైదికబుద్ధితోగూడిన వేదాంతశాస్త్ర సిద్ధాంతమను నర్థము సిద్ధమగుచున్నందున, కృతాంతశబ్దము వ్యర్థమగును. "జ్ఞానయోగేన సాంఖ్యానాం" అనుచోట వేదాన్తశాస్త్రము సాంఖ్యమని ప్రసిద్ధిజెందినది. వేదాంతశాస్త్రము సేశ్వరసాంఖ్యము. దానియందు నిష్ఠగల సాంఖ్యులు జ్ఞానులనబడుదురు.

వేదాంతములయందుగూడ కర్మసంబంధముండుటచే వేదాంతశాస్త్రము కృతాంతము (నిర్ణయరూపము) గానేర దనరాదు. వేదాంతములయందు కర్మసంబంధము అజ్ఞానుల కని నిర్ణయించబడినది. పరమార్థసన్న్యాసులగు సాంఖ్యులకెచ్చటను కర్మసంబంధమును జెప్పలేదు. ఇచ్చటగూడ "సర్వారంభ పరిత్యాగీ" ఇత్యాదిశ్లోకములచే సాంఖ్యులకు కర్మాధికారము లేదని చెప్పబడినది. "తత్ర కేన కం పశ్యేత్" అను శ్రుతియు పై యర్థమును బలపరచుచున్నది. అంత శబ్దమునకు నిర్ణయమునందు రూఢియని యనరాదు. "శ్రుతావ వసితే రమ్యే సమాప్తావన్త ఇష్యతే" అని సమాప్తియందు అంతశబ్దము రూఢమయినది. కావున నిచట రామానుజులు కృతాంతశబ్దమునకు నిర్ణయమను నర్థమును వర్ణించి, దానిని వ్యర్థపుచ్చుట పాడిగాదు. ౧౩

శ్లో॥ అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధం
వివిధాచ పృథక్చేష్టాః దైవం చాత్ర పంచమమ్॥ ౧౪

అ॥ శరీరము ప్రాణులకు భోగాయతనము. అందు ప్రాణులయొక్క ఇచ్ఛాదులభివ్యక్తము లగును. కాన శరీరము ప్రాణుల కధిష్ఠానము. అంతఃకరణము అహంవృత్తి, ఇదంవృత్తి యని రెండువిధములు. అందు అహంవృత్తి విజ్ఞానమయుడు, భోక్త. ఇదంవృత్తి యంతఃకరణము. కాన, నహంకారము కర్త. దశేంద్రియములు, మనోబుద్ధులు గలసి పన్నెండు కరణములు. ఈయవి శబ్దస్పర్శాదు లనుభ

వించుటకు సాధనములు. ప్రాణాపానాది వాయువులయొక్క నానారకములయిన పనులు చేష్టలు. చక్షురాద్యనుగ్రాహకులయిన ఆదిత్యాదులు దేవతలు. ఈ యయిదును నిఖిల సంసార కారణములు.

ఇచట రామానుజులు : దైవమనగా అంతర్యామి యీశ్వరుడని వివరించిరి. అది యుక్తముకాదు. అంతర్యామి నిర్వికారుడు. ప్రత్యక్స్వరూపుడు. వానికి ప్రేరణరూప వ్యాపారమున్న దని భ్రమింపరాదు. ఇందు అయస్కాంతలోహ దృష్టాంతమే మనకు ప్రమాణము. నిర్వికారుడయిన నీశ్వరునివలననే మన ఆదులకు ప్రేరణ సంభవించును. భూమిలోని నిధులు, "మీరు భూమిని త్రవ్వి నన్ను గ్రహింపుడని ప్రేరేపించుటలేదు. అయినను, నిధిప్రేరితుడయియే భూ ఖననాది కమును మానవు లాచరించుచున్నారు. కావున నిర్వికారుడయిన నీశ్వరుడు కర్మ హేతువని నిర్ణయించదగదు. ౧౪

శ్లో॥ శరీర వాఙ్మనోభి ర్యత్కర్మప్రారభతేఽర్జున
న్యాయ్యంవా విపరీతం వా పంచైతే తస్య హేతవః॥ ౧౫

అ॥ మానవులు శరీరవాఙ్మనస్సులచే నారంభించెడు న్యాయాన్యాయము లయిన కర్మల కన్నిటికి నీ యయిదును కారణము లగును. నిమేషాదికర్మలు జీవ నాధారములయిన వ్యవసాయాది కర్మలును, ధర్మాధర్మ కార్యములయందే జేరును. జన్మాంతరమందుచేసిన పాపకర్మవశమున నిమేషాది చేష్టలకు ప్రతి బంధము కలిగి కొందరు గ్రుడ్డివారగుచున్నారు. అట్లే కొందరు పాపవశమున కష్ట జీవులు, మరికొందరు సుఖజీవులు నగుచున్నారు. కాన, నీయవికూడ ధర్మాధర్మ ముల యందజేరుట యుక్తము.

కర్మల కన్నింటికి నధిష్ఠానాదు లయిదును కారణము లయినను, శరీర ప్రధానములయిన కర్మలు శారీరకములని, వాక్ప్రధానములయిన కర్మలు వాచి కములని, మనఃప్రధానములయిన కర్మలు మానసికము లనియును, మూడు రాసు లుగ జేయబడినవి. కాన శరీరాది త్రయముచే నెరవేర్చబడగిన కర్మలకుగూడ నధిష్ఠానాదు లయిదును గారణము లగుచునేయున్నవి. కనుక నిందు విరోధము లేదు. ౧౫

శ్లో॥ తత్రైవం సతి కర్తా రమాత్మానం కేవలంతు యః
పశ్యత్యకృత బుద్ధిత్వాన్న స పశ్యతి దుర్మతిః॥ ౧౬

అ॥ ఇట్లు నిఖిలకర్మలు, అధిష్ఠానాదిపంచకముచే నెరవేరుచుండ నట్లు గ్రహించక చిత్తసంస్కారములేని యేమానవుడు కేవల మాత్మయే కర్తయని తలంచునో వాడు అతిదుర్మతి.

దేహాదు లాత్మ లనెడి బౌద్ధులు ఆత్మ కర్తయని తలచుచో దలంచుగాక, ఆస్తికులగు వైదికులు కూడ, ఆత్మ దేహాదివ్యతిరిక్తుడను జ్ఞానమున్నను అకర్త, అభోక్త యని గ్రహించలేకపోవుచున్నారు. వేదాంతశాస్త్రపరిచయముకాని, ఆచార్యోపదేశముకాని, బుద్ధియందు యుక్తికుశలతకాని లేకపోవుటయే నిందుకు గారణము. నేత్రములకు తిమిరదోషముగలవా డొక్క-చందురుని యనేకచంద్రులుగ జూచినను వాడు చూడనివాడనియే లోకములో ప్రతీతి. అట్లే ఆత్మ దేహాది వ్యతిరిక్తుడని తెలిసికొన్నను ఆకర్తను కర్తనుగా తెలిసికొన్నవాడు తెలియని వాడనియే యనవలయును.

ఓయి! "ఈ దృష్టాంతము సరిపడదు. ఒక్క- యాత్మ ననేకాత్మలునుగ గ్రహించునపు డీ దృష్టాంతము సరిపడును. ఇక్క-డ అకర్తను కర్తనుగా గ్రహించు చున్నందున నీయది పొసగదు." అనినచో, అపుడు ఆకసమున మేఘములు పరు గెత్తుచుండ పరుగెత్తకున్న చందురుని పరుగెత్తువానినిగ జూచినట్లు అధిష్ఠానాదులు కర్మలుచేయుచుండ ఆత్మ కర్మలజేయకున్నను జేయువానినిగ జూచువాడు- అని రెండవదృష్టాంతము నన్వయించుకొనుము.

ఓయి! "ఇదియును యుచితముగాదు. అక్రియునియందు సక్రియత్వ దర్శ నమునకే యిందు సామ్యము వివక్షితము. అది చంద్రదృష్టాంతమున సరిపడుటలేదు. అనినచో నపుడు పల్లకియందుగూర్చున్నవాడు పల్లకిమోయువారలు పరుగెత్తుచుండ దాను పరుగెత్తుచున్నట్లు తలంచును. అట్లే యితరములు చేయుచుండ తాను చేయుచున్నట్లు తలంచును. ఇట్లు తలంచువాడు విపరీతబుద్ధి" అని మూడవ దృష్టాంతమును గ్రహించవలయును.

ఓయి! "మూలమునందలి" "తత్ర" అనుపదమున త్రల్ ప్రత్యయము నిర్ధార ణార్థకము. కాన "తత్ర" యనగా వాటిలో అని యర్థము. అపుడు వాటిలో ఆత్మ నొక్క-నినే కర్తగా నెవడు తలంచునో వాడు దుర్మతియని యర్థమేర్పడును. అధిష్ఠా నాదిపంచకము కర్మను నెరవేర్చుచుండ నాత్మ కొక్క-నికిమాత్రమే కర్తృత్వము పొసగదు.

అధిష్ఠానాదులలో "కర్తా" యను పదముచే ఆత్మ చెప్పబడెను. "కర్తా శాస్త్రార్థవత్వాత్" అను సూత్రమున వ్యాసులవారు ఆత్మకు కర్తృత్వమును స్థాపించిరి. కాన అధిష్ఠానాదుల విడచి, 'యాత్మ యొక్క-డే కర్తయని చూచు వాడు దుర్బుద్ధి' అని ద్వైతులపూర్వపక్షము.

ఇందుకు సమాధానము :-

ద్వైతులమతమున కర్త యను పదమునకు జీవాత్మ యర్థమన్నచో, జీవాత్మను కర్తగా జూచువాడు సుమతియే యగునుకాని దుర్మతి కానేరడు. ఇంక వారు అధిష్ఠా

నాదు లయిదును కర్త లనవలెనని యభిప్రాయపడుచో, నదిమాత్రము పొసగదు. పూర్వశ్లోకమున జీవుడొక్కడే కర్తయని చెప్పిరికాని, అధిష్ఠానాదులుగూడ కర్త లని చెప్పలేదు. అధిష్ఠానాదులుగూడ కర్తలని చెప్పినచో, "అధిష్ఠానం తథా కర్తా కరణంచ" అనునపుడు కర్తృశబ్దముచేత జీవునే గ్రహించు టెట్లు? అధిష్ఠానము, కరణములు, చేష్టలు, దైవము– ఇవన్నియు కర్తలేకదా? సర్వసామాన్యమయిన కర్తృపదముచే జీవునిమాత్రమే నిర్దేశించు టెట్లు? వ్యాసులు, "అధిష్ఠానం తథా జీవః కరణంచ పృథగ్విధమ్" అని చెప్పలేదుకదా? వడ్రంగికి కత్తి మొదలయినవి సాధనములయినట్లు, అధిష్ఠానాదులు కర్తయగు జీవునకు సాహాయ్యకారులు. కావున ఆత్మయొక్కడే కర్తయని యనియు, తాను కర్తయనియు దలచువాడు సుమతియేకాని దుర్మతికాడు.

ఇంక నధిష్ఠానాదులతోగూడిన ఆత్మయే కర్తకాని, కేవ లాత్మ కర్త గాడనియు, కేవలాత్మ కర్తయని తలచువాడు దుర్మతియనియు నన్నచో, నపుడు కేవలాత్మకు అకర్తృత్వమే ప్రాప్తించినది.

శరీరాధిష్ఠాతృత్వరూపమయిన కర్తృత్వ మాత్మకు స్వతస్సిద్ధముగ నున్న దన్నచో, నట్టితఱి కేవలాత్మను కర్తనుగా జూచువాడు సుమతియే యగును. అధిష్ఠానాదుల సాహాయ్యము లేకయే ఆత్మకు కర్తృత్వము కలదుకదా? అపు డట్లనుకొనుటలో దప్పేమి?

అయితే, గమనాదికర్మను కేవలాత్మ నెరవేర్చలేడనియు, అట్టి శారీరాది కర్మత్రయమందు కేవలాత్మ కర్తయనువాడు దుర్మతియనియు నన్నచో?

ఈ దుర్మతి తానుచేయు శారీర, వాచిక, మానసిక కర్మలను, ఇది శారీరము, ఈయది మానసికము, ఇయ్యది వాచికము, అని తెలిసికొనుచున్నాడా? లేదా? ఇందు మొదటిపక్షమున శారీర, వాచిక, మానసిక కర్మలు– శరీర, వాక్, మనః ప్రధానములని తెలిసికొనువాడు శరీరాదుల సహాయములేని కేవలాత్మ కర్త యని యెట్లు తలంచును?

రెండవపక్షమున శరీరవాఙ్మనస్సులే యాత్మయని వా డనుకొనుచున్నాడు. ఇట్టివానికి శరీరాది విలక్షణమయిన ఆత్మయందు నేను కర్తనను భావ మెట్లుండును?

కావున "నే నాత్మ" అని యనుకొనువాడు బౌద్ధాదులలోజేరిన నాస్తికుడగుచో, వాడు దేహాది సంఘాతము కర్తయని తలచునుగాని, కేవలాత్మ కర్తయని తలచడు.

ఆస్తికుడగువాడు (ఆస్తికుడు) దేహాది విలక్షణమయిన ఆత్మ కర్తయని తలంచుచున్నను, మన ఇంద్రియాది సహితమయిన ఆత్మనే కర్తయని తలచునుగాని

కేవలాత్మను కర్తయని తలంచడు. ఆస్తికుడు ' నేను కర్తను; మన ఇంద్రియాదులు సాధనములు, శరీరవాఙ్మనస్సులచే నే సీపని చేయుచుంటిని ' అని యనుకొనును. కావున మీామతమున కేవలాత్మను కర్తయని తలచు దుర్మతియే సిద్ధించడు. కనుక మీాపాండిత్యము మూలమునకు ముప్పుదెచ్చినది.

ఇంక రామానుజమతము.

ఏవం వస్తుతః పరమాత్మానుమతిపూర్వకే జీవాత్మనః కర్తృత్వేసతి తత్ర తత్ర కర్మణి కేవల మాత్మానమేవ యః కర్తారం పశ్యతి సదుర్మతిః. (నిజస్థితిలో జీవాత్మకు కర్తృత్వము పరమాత్మయొక్క యనుమతివలన గలుగుచుండ నందు కేవల మాత్మయే కర్తయని తలచువాడు దుర్మతి) అని రామానుజవ్యాఖ్య.

ఇది నిస్సారము.

౧. "ఏవం సతి" అనుపదము నాధారముగ జేసికొని వస్తుతః ఇత్యాద్యర్థ మును బ్రతిపాదించుట యనుచితము.

౨. " దైవం చాత్రపంచమమ్ " అను తురీయపాదమున నీశ్వరుడుగూడ కర్మహేతువని చెప్పబడినదికాని, ఈశ్వరానుమతివలన జీవుడు కర్మహేతువని చెప్పబడలేదు.

3. పరమాత్మానుమతివలన జీవాత్మయొక్కడే కర్తయగుచో నపు డట్లనుకొను టలో దోష ముండదు.

౪. ఈశ్వరప్రేరణలేకయే జీవాత్మ కర్తయని మానవుడు తలచుచున్నా డనియు, అట్లు తలంచుట మానవుని తప్పనియు మీా యభిప్రాయమయినచో; వీ డెట్లనుకొన్నను దానిఫలమును దప్పక యనుభవించునుకదా? అట్టితఱి " నే నీశ్వరప్రేరితుడనై చేయుచున్నాను " అనుజ్ఞానమున వచ్చు విశేషఫలమేమి?

ఈశ్వరు నంగీకరించునట్టి యాస్తికులందరు ఈశ్వరప్రేరణను గుర్తించుచున్నే యున్నారు. దీనిని వేదాంతశాస్త్రమున బ్రతిపాదించిన ఫలమేమి? మోక్షమ్ము కొఱకుగదా వేదాంతశాస్త్రము వచ్చినది. ఈశ్వరప్రేరణ జ్ఞానమువలన నేరికయినన్ మోక్షమబ్బునా? వైదికులకు దెలిసినవిషయమును దెలిపెడి వేదాంతశాస్త్రమునకు " దెలియనివిషయమును దెలుపుట " యను ఫల మెట్లుసిద్ధించును?

నాస్తికుడు దేహాద్వ్యతిరిక్తమయిన ఆత్మ కర్తయని యనుకొనడు. వాని నిచట నిందించి పనిలేదు.

మరియు పరమాత్మానుమతివలన పనిచేయు జీవుడు వస్తుతః కర్తయా? లేక వస్తుతః ఉదాసీనుడగు నకర్తయా?

౫. వస్తుతః కర్తయగువానికి పరానుమతితో బనియేమి? అకర్తయగు వానికి వస్తుతః కర్తృత్వ మెట్లుండును? నిశ్చలమయిన ఆకాశము ఈశ్వరానుమతిచే

చలించుచున్నదా ? జీవాత్మకు నాయాపనులయందలి కర్తృత్వము ధర్మాధర్మసంస్కారప్రయుక్తముకాని, ఈశ్వరానుమతిప్రయుక్తము కాదు. సాక్షిభూతుఁడయిన నీశ్వరునకు అనుమతికాని యననుమతికాని కల్పించదగదు. అట్లు కల్పించుచో వికారిత్వ మేర్పడును. పైగా హింసాదికర్మలయందు ప్రవర్తించ నభిముఖుఁడయిన జీవునకు ఈశ్వరు డనుమతి నొసంగుచో, నీశ్వరుడు దయారహితు డగును. ప్రాచీన కర్మలు జీవుని ప్రేరేపించుచుండగా ఈశ్వరు డనుమోదించియున్నను వానికి నైర్ఘృణ్యాదోషము తప్పదు.

కాన నీశ్వరుడు సాక్షిభూతుఁడుగానుండ నాయాకర్మలే ఆయాజీవుని ఆయా పనులయందు ప్రేరేపించును. ఆ ప్రేరణము సాక్షియం దజ్ఞానవశమున నారోపించ బడుచున్నది. ఇట్లుండ నెవడు నేనే కర్తనని తలంచునో, వాడు దుర్మతి. నే నీశ్వర ప్రేరితుఁడనై చేయుచున్నానని యనుకొనువాడు మరింత దుర్మతి. కాన, నీశ్వరాను మతివలన ఆత్మ కర్తయగుచున్నాడని తెలిసికొనువాడు, తెలివిగలవాడని యెట్లు చెప్పెదరు ? కనుక శంకరభగవత్పాదులు చెప్పిన యర్థమే నిర్దుష్టము.

ఓయి ! శంకరులుమాత్రము మూలములోలేని "ఆత్మనోఽనన్యతమత్వేన" (ఆత్మయందులో నొకడుగాజేరనందున) అనుపదమును నెట్లుగల్పించిరి. నిజమే ఆకల్పనము శాస్త్రవిరుద్ధముకాదు. ఎట్లన "తత్రైవంసతి" తత్ర = ప్రస్తుతమయినఅధిష్ఠానాదిపంచకము ఏవంసతి "సర్వకర్మలకు కారణమగుచుండగా" అని యన్వయము.

లేక తత్ర = ప్రకృతమయిన కర్మజాతము, ఏవంసతి = అధిష్ఠానాది పంచ హేతువులచే నెరవేరుచుండ = అని యన్వయము.

పిదప "ఆత్మనో అనన్యతమత్వేన" అను పంక్తి ఆత్మకర్తయని యనుకొనుటలో గల దోషమునకు హేతువును జూపుచున్నది. అధిష్ఠానాదిపంచకములో ఆత్మ చేరియున్నయెడల ఆతనిని కర్తగా భావించవచ్చును. ఆత్మ యందు జేరలేదు. కనుకనే ఆత్మ కేవలుడు (శుద్ధుడు) మూలమునందలి "కర్తా" యనుపదము విజ్ఞానమయకోశము కర్తయని చెప్పుచున్నది. ఆత్మ కర్త యని చెప్పుటలేదు. ఇట్లుకాక శ్రుతిస్మృతి విరుద్ధముగ నిర్వికారుడయిన ఆత్మకు కర్తృత్వమును పరానుమతి పూర్వకముగగాని, కర్మచోదనాపూర్వకముగగాని చెప్పుట యసంగత మగును. ౧౬

శ్లో॥ యస్య నాహంకృతో భావః బుద్ధి ర్యస్య న లిప్యతే
హత్వాపి స ఇమాన్ లోకా న్నహన్తి న నిబధ్యతే॥ ౧౭

అ॥ ఓయి అర్జునా ? "ఎవరికి నేను జేయుచున్నాను" అను నహంకారముండదో, ఎవరికి "నే నీకర్మఫలము ననుభవింతును" అని బుద్ధికి కర్మఫలలేపముండదో, వాడు నిఖిలప్రాణులను జంపినను, జంపకకున్నవాడే.

నేను కర్తనని యనుకొనువాడే కర్మఫలము నొందును. బుద్ధి కర్త. ఆత్మ కర్తగాడు. కాన ఆత్మ కర్మఫలము నొందడు.

"అయితే బుద్ధికి లేపమేల నుండదు ? నిజమే, సంస్కారరహితమయిన బుద్ధికి లేపముండునుగాని, సంస్కారసహితమయిన బుద్ధికి లేపముండదు. సంస్కృతమయినబుద్ధి ఆత్మ నిర్వికారుడని తలంచుచు, తానుగూడ నిర్వికారమగును. కాన బుద్ధికికూడ లేపము లేకపోవుట యుక్తము. నేను జేయుచున్నాను" అని తలచువానియొక్కబుద్ధియే లేపము చెందును. "నేను జేయుటలేదు" అని తలంచువాని బుద్ధి లేపము చెందదు. స్వచ్ఛముగా నుండును.

ఇందలి తత్త్వమును గ్రహింపుము.

ఎవడు "నాహం కరోమి" అని తలచునో, వాడే నేను "మంచిపనిని చేయలేదు. చెడుపనిని చేసితిని" అని తలంచడు (యనుకొనడు). అట్లు తలంచు పదార్థమాత్మకాదు. ఆత్మకు వృత్తిజ్ఞాన మసంభవము. బుద్ధియే యట్లు తలంచును. ఇట్టి బుద్ధియె యొకానొకప్పు డాత్మతాదాత్మ్యాధ్యాసవలన నేను నిర్లిప్తుడ ననుకొనును ఒకానొకపుడు నాబుద్ధి నిర్లేప మనుకొనును. అంతఃకరణము (బుద్ధి) "ఇదంవృత్తి" "అహంవృత్తి" అని రెండువిధములని చెప్పితిమి.

కావున, కర్తృత్వమును జెందిన విజ్ఞానమయ శబ్దవాచ్యమయిన అంతఃకరణమునకు (బుద్ధికి) శాస్త్రసంస్కారవశమున "నాహం కరోమి" అను జ్ఞానము పుట్టును. కరణధర్మమునొంది మనోమయ మనదగిన యా బుద్ధికే (అంతఃకరణమునకే) తాపాభావము కలుగును.

కాన "అహం నరకం గమిష్యామి" నేను నరకమును బొందగలను. "అను తాపాభావము (తాపము లేకపోవుట), బుద్ధిదని చెప్పుటచే తాపముకూడ బుద్ధిది కాని యాత్మది కాదని తెలినది. అందువలన ఆత్మకు నిర్వికారత్వము ఫలించినది. కావున పరిశుద్ధమయిన అంతఃకరణ తాదాత్మ్యాధ్యాసను బొంది, "నేను కర్త కానని యు, "నాబుద్ధి లేపము చెందలేదనియు" నెవ్వ డనుకొనునో, వాడు విద్వాంసుడని భావము.

లేక ఎవ్వనియొక్క ఉపాధియయిన బుద్ధి "నేను చేయుచున్నానని యనుకొనునో, నేను నరకము నొందునని పరితపించునో" వాడు ఆత్మయని అర్థము.

లేక అంతఃకరణావచ్ఛిన్నుడయిన యే ప్రమాతకు, "అహంకర్తా" నేను జేయువాడను అనుజ్ఞానము "అహం నరకం గమిష్యామి" "నేను నరకమును బొందుదును" అను పరితాపమున్ను యుండదో, వాడు ప్రమాత అని యర్థము. కాన నిట్లు అహంకారము లేపములేనివాడు సుమతియనియు, వివేకియనియుభావము.

ఇట్టివానికి హననక్రియాసంబంధముకాని, తత్ఫలసంబంధముగాని యుండదు. అనగా, సత్త్వాదిగుణములే హననక్రియాకర్తలుకాని, నేను గాను "అను సనుసంధాన ముండుటచే నిట్టి విద్వాంసులకు, హననక్రియా తత్ఫలసంబంధము లుండవని భావము. ప్రాకృతజనులు వీరలజూచి "వీరు చంపువారు, వీరు దోష మనుభవించు వారు" అని యనుకొనుగాక, వీరి దృష్టిలోమాత్ర మవి రెండు నుండవు.

దీనివలన విద్వాంసునకు, సర్వకర్మసంన్యాసము, కర్మఫలసంబంధాభావము సిద్ధించినది.

అయితే పూర్వము విద్వాంసునకు కర్మాధికారమే లేదంటిరి. ఇప్పుడు చంపినను ఫల మంటదనుచుంటిరి. ఇదేమి ? వినుము. దేహాదివిలక్షణమయిన బ్రహ్మాత్మజ్ఞానముగలవాడు విద్వాంసుడు. వాడు బ్రాహ్మణుడయినచో వానికి సర్వకర్మసంన్యాసమునందే యధికారము. లోకసంగ్రహముకొరకును గూడ బ్రాహ్మణుడు సన్యసించియే తీరవలయును. ఇంక నాతడు కులమున క్షత్రియు డయినచో లోకసంగ్రహముకొఱకయినను స్వధర్మమగు యుద్ధాదుల ననుష్ఠించి తీరవలయును. ప్రకృతమున అర్జునుడు క్షత్రియుడగుటచే విద్వాంసుడయినను వీనికి యుద్ధమునందే యధికారము. సంన్యాసమునం దధికారములేదు. ఈయభిప్రాయముతో నర్జునుని యుద్దేశించి, శ్రీకృష్ణునిచే "హత్వాపి స ఇమాఀ లోకాఀ" అని చెప్ప బడినది. దీనివలన " అర్జునా ? నీవు దేహాదులయందు కర్తృత్వము నారోపించుము (ఉంచుము). నేను కర్తనుగానని యనుకొనుము. నేను నరకమును బొందుదునను ఖేదమునుగాని, స్వర్గమును బొందుదు నను మోదమునుగాని మదియం దుంచకుము. నీకు స్వధర్మమగు శత్రుసంహారమును నీ వొనర్పుము. దీనివలన నీ కెట్టిబంధము జుట్టుకొనదు. నేను జెప్పుదానికి మార్పు కలుగదు." అని శ్రీకృష్ణుని యుపదేశ మన్నట్లు స్ఫురించుచున్నది.

అహంకార మమకారములే బంధమునకు మూలకారణములు. అవి లేనందు వలననే నేను జగత్సంహార మొనర్చినను, శత్రుసంహార మొనర్చినను, పుత్రమిత్రాది స్వజనమును సంహరించినను అనర్థము నొందకున్నాను. నీవుకూడ నేనుజూపిన వివేకమును బొంది, సర్వశత్రువుల సంహరింపుము. దానివలన నీ వనర్థమును బొం దవు. అని శ్రీకృష్ణుని పరమతాత్పర్యము.

అర్జునా ? కర్మ బంధప్రదమనికదా ? నీ యభిప్రాయము. కనుక నీవు తూష్ణీంభావమను కర్మతో ముక్తినొందగలవా ? లేవు. కర్మలవలన ముక్తిరాదని శ్రుతి చెప్పుచున్నది. " త్యాగమువలననే నీకు ముక్తి కలుగును. పూర్వము జన కాదులుకూడ త్యాగమువలననే ముక్తినొందిరి. "త్యాగమనగా నేను కర్తనుగాను" అని యాత్మకర్తృత్వపరిత్యాగరూపము, గుణములయందు కర్తృత్వము నుంచుటరూ

పమున్ను మోక్షహేతువయిన త్యాగమిదియే. దీనినే సన్న్యాసులుకూడ నాచరింతురు. ఇదియే పరమార్థసంన్యాసము. కర్మఫలత్యాగము పరంపరామోక్షసాధనము గాని సాక్షాన్మోక్షసాధనము కాదు. తల గొరిగించుకొని, కాషాయగుడ్డల గట్టి, చేత దండమును బూనువాడు పరమార్థసన్న్యాసి కాడు. అహంకార కర్మఫలలేపములు లేని సుమతియే పరమార్థసంన్యాసి. పరమహంసపరివ్రాజకులే పరమార్థసంన్యాసులగుచో, బ్రహ్మవిష్ణుమహేశ్వరులుకూడ పరమార్థసంన్యాసులు కాకపోవలయును. వారును కృతకృత్యులగుటకు పరమార్థసంన్యాసము నవలంబించవలసివచ్చును.

కావున పరమహంసపరివ్రాజకులయి నివృత్తిమార్గమందున్న సనకాదులు, సృష్ట్యాదికర్తలయం దధికారము నొందిన బ్రహ్మాదులు, యజ్ఞాదికర్మలయం దధికారము గల జనకాది విద్వాంసులు – వీరలందరు పరమార్థసంన్యాసులే. యజ్ఞాదికర్మలను విడచుట బాహ్యసంన్యాసలక్షణము.

కనుక విద్వాంసుడు, జ్ఞాననిష్ఠుడు, పరమహంసపరివ్రాజకుడు నయిన పరమార్థసంన్యాసికి కర్మాధికారము లేదు. ఇట్టి గృహస్థునకును కర్తృత్వాభిమాన పూర్వకముగ కర్మాధికారము లేదు. కనుకనే, వాసుదేవాదులు చేసిన కర్మలవలె జనకాదులుచేసిన కర్మ కర్మ కాదని వెనుక జెప్పితిమి. కనుక పరమార్థసంన్యాసివి, విద్వాంసుడవు నయినను పరమహంసపరివ్రాజకుడవు కానందున శత్రులోకమును సంహరింపుము. బంధము నొందవు. దీనినే "యుధ్యస్వ విగతజ్వరః" అని లోగడ జెప్పితిని. దీనివలన వెనుకటి యాశంక తీరినది.

అర్జునా! కేవలాత్మకు కర్తృత్వవికారము లేదు. అధిష్ఠానాది సంహతమైన (కూడికొన్న) ఆత్మకును కర్తృత్వము లేదు. నిర్వికారుడయిన ఆత్మకు, అధిష్ఠానాదుల తోటి సంహననమే (కూడికయే) (కలయికయే) అసంభవము. సావయవ పదార్థమునకే సంహతత్వముండును. ఆత్మకు నధిష్ఠానాదులతో సంహననమే యుండుచో, నప్పు డాత్మకు నొకవిధమయిన పరిణామ మేర్పడును. అది శ్రుతి విరుద్ధము. కావున నిచట కేవలశబ్దము అనువాదమాత్రముకాని యర్థవంతము కాదు. ఆత్మతత్త్వము అవిక్రియమనునది శ్రుతిస్మృతిన్యాయసిద్ధమయిన రాజమార్గము.

ఒకవేళ ఆత్మ సవికారుడని యంగీకరించినను, ఆత్మయందలి క్రియలతో ఆత్మ వికారమును జెందునుగాని, అధిష్ఠానాదులయందలిక్రియలతో ఆత్మ వికారమును జెందదు. ఒకదానికర్మ మరియొకదాని కంటదు. అట్లు కానిచో, చైత్రుడు చేసినదానిని మైత్రు డనుభవించవలసివచ్చును. ఇతరునిడబ్బు దొంగతనమున నితరునకు జేరినను, ఇతరుని కర్మమాత్రము యితరునకు జేరదు.

ఒకవేళ అజ్ఞానమున దెచ్చిపెట్టినను, అది దీనికంటదు. శుక్తికయందు

అజ్ఞానముచే నధ్యసింపబడిన రజతత్వము, శుక్తికయొక్క ధర్మము కానేరదు. అట్లే రజ్జువునందు సర్పత్వము నారోపించినను, అయ్యది రజ్జుధర్మ మగుటలేదు.

అట్లే ఆత్మయందు అవిద్యచే కర్తృత్వము నారోపించినను అయ్యది యాత్మ ధర్మము కానేరదు.

కాన, తనయందు వికారములు లేనందువలనను, పరగతవికారములచే దనకు వికారములు కలుగనందునను, ఆత్మ నిర్వికారుడని సిద్ధాంతమయి ది.

కావున శ్రీకృష్ణుడు ఆత్మతత్త్వవేత్తకు కర్మాధికారములేదని శాస్త్రాదియందు ప్రతిజ్ఞచేసి, దాని నచ్చటచ్చట ప్రసంగించుచు, తుదకు నిచ టావిషయము నుప సంహరించెను.

కాన, వేదవేదాంతార్థసారమగు నీవిషయమును నిపుణమతులయిన పండి తులు విచారించి గ్రహించవలయును. ౧౭

శ్లో॥ జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః॥ ౧౮

అ॥ సర్వపదార్థవిషయకమగు అంతఃకరణవృత్త్యాత్మకజ్ఞానము, విషయ జాతము, అవిద్యాకల్పితుడయిన చిదాభాసుడు— ఈమూడును గలసి పరిగ్రహము, పరిత్యాగము, తూష్ణీంభావము; (స్వీకరించుట, విడచుట, యూరకుండుట) ప్రయోజనముగాగల నిఖిలకర్మలను జేయించును. మానవులు పాపమును బోగొట్టు కొనుటకు, పుణ్యము నార్జించుటకు, పరమేశ్వరప్రీతికొరకును మూడు విధములయిన కర్మల జేతురు. ఈకర్మల నాచరించుటకు జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములు కారణములు. శ్రోత్రాది - బాహ్యాంతరింద్రియములు, కర్మచే బొందదగిన స్వర్గాదిఫలములు, ఫలభోక్తయగు జీవుడు, ఈమూడును కర్మసంగ్రహము. అనగా కర్మ ఈమూటి యందును సమన్వయించి యుండునని భావము.

ఇచట జ్ఞానమనగా శాస్త్రమని శంకరాచార్యులు చెప్పినట్లు వేదాంత దేశికులు భ్రమపడిరి. ఆచార్యపాదు లట్లు చెప్పలేదు. బుద్ధివృత్తియే జ్ఞానశబ్దా ర్థము. శాస్త్రముకూడ బుద్ధివృత్తికి విషయమగుచునే కరణమగును. చక్షురా దీంద్రియములుగూడ తమద్వారా బయలువెడలిన బుద్ధివృత్తిచేతనే ఘటాదుల ప్రకాశింపజేయును. కేవలము చక్షురాదులకు కరణత్వము లేదు. కాన, (జ్ఞాయతే+ అనేన) అను వ్యుత్పత్తిచే జ్ఞానశబ్దమునకు బుద్ధివృత్తియే స్వారసమయిన అర్థము. జ్ఞానగోచరమయిన శాస్త్రమే కర్మలయందు ప్రేరేపించునుగాని కేవల శాస్త్రము ప్రేరేపింపలేదు. అట్లగుచో పెట్టెలోని శాస్త్రముకూడ పురుషుని ప్రేరేపించును.

అయితే జ్ఞాయమానమయిన శాస్త్రమే జ్ఞానమని యేల జెప్పగూడదు?

ప్రవృత్తిలక్షణమయిన శాస్త్రము విధినిషేధముల బోధించును. నివృత్తిలక్షణమయిన శాస్త్ర ముపేక్షను బోధించును. ధర్మాధర్మములు, బ్రహ్మమును శాస్త్రము వలననేకదా తెలియబడుచున్నవి. కాన ప్రవృత్తి నివృత్తిలక్షణమయిన పూర్వోత్తర మీమాంసాశాస్త్రములు రెండును జ్ఞానశబ్దార్థము లగునన్నచో నట్లుకాదు.

శాస్త్రీయకర్మారంభమునకు శాస్త్రము సాధనమయినను, లౌకికకర్మారంభమునకు శాస్త్రము సాధనముగాదు. ప్రకృతజ్ఞానపదమును, శాస్త్రీయకర్మారంభ పరముగ సంకోచపరచుట అన్యాయ్యము. భాష్యకారులుగూడ "సర్వవిషయం జ్ఞానమ్" అని సర్వశబ్దమును వాడిరి. కావున జ్ఞానమనగా బుద్ధివృత్తియే. శాస్త్రము కాదు. జ్ఞానసాధనములయిన చక్షుశ్శ్రోత్రాదీంద్రియములును గాదు. జ్ఞానశబ్దార్థము, చక్షురాదికరణము లగుచో నావిషయము పూర్వార్థమునందే చెప్పియుండ మరల యుత్తరార్థమున కరణ మను పదముచే నావిషయమును జెప్పుట పునరుక్తమగును. కాన జ్ఞానశబ్దమునకు బుద్ధివృత్తియనియే సిద్ధాంతము.

రామానుజీయము.

జ్ఞేయమనగా యాగము మున్నగు కర్మ యని రామానుజు లనిరి. వారి మతమున జ్ఞేయకర్మలకు పునరుక్తిదుర్వారము చెప్పదగియున్న ఫలమును జెప్పకుండుటయు దోషము.

మరియు జ్ఞానశబ్దమునకు భావవ్యుత్పత్తిచే నవగతిమాత్ర మర్థముకాని, జ్ఞానకరణ మర్థము గాదనిరి. ఇదియును కుదరదు. అసంగచిదాత్మరూపమయిన నవగతి జ్ఞాత్రాదులలో జేరదు. నిర్ధర్మకమయిన అవగతికి కర్మచోదన సంభవించదు. ఘటజ్ఞానాదులు ఘటాద్యాకారబుద్ధివృత్తిజన్యములు. కాన వాటికి వృత్తిజ్ఞానములని పేరు. ఇచట వృత్తిజన్యజ్ఞానముకూడ జ్ఞానపదమునకు జెప్పదగదు. అయ్యది (వృత్తిజ్ఞానము ముందుశ్లోకమున "యేన" అను తృతీయాంతపదముచే పరామృశింపబడుచున్నది. కాన నిచట జ్ఞానశబ్దమునకు బుద్ధివృత్తియే యర్థము. ఈయది జన్యజ్ఞానములకు కరణము. అనుభవము అనుభవమునకు కరణముగాదు. అనుభవ మభిన్నము. దానికి జ్ఞానత్వ జ్ఞానకరణత్వములు సంభవించవు. అనుభవము లనేకము లనుట నిష్ప్రమాణము. ఘటపటాద్యనుభవములలో విషయము లయిన ఘటపటాదులు వేరయినందున అనుభవము వేరగుచున్నది. అనుభవైకవేద్యమనుచోట శాస్త్రాదులవలన వేద్యముగాదని యర్థము. కాన నాప్రతీతినిబట్టి యనుభవమునకు కరణత్వ మంగీకరించదగదు.

సాక్షిభాస్యమనుచోటకూడ భానమునుగూర్చి సాక్షికి కర్తృత్వముకాని, కరణత్వము లేదు. "యేన ఈక్షతే" అనుచోట యచ్ఛబ్దమునందలి తృతీయకరణార్థకము కర్త్రర్థకము గాదు. కాన నిత్యజ్ఞానరూపుడయిన సాక్షికి వృత్తిజ్ఞానముల

గూర్చి కర్తృత్వమున్ను, వృత్తిజ్ఞానములకు (జన్యజ్ఞానములకు) ఘటపటాదిపదార్థావభాసమునుగూర్చి కరణత్వమున్ను నిర్వివాదము.

ప్రత్యభిజ్ఞారూపజ్ఞానమునకు గూడ ననుభవము కరణము కాదు. అచట యనుభవము కారణముమాత్రమే యగును. చక్షురాదికమే కరణము. కంటితో చూడనిదే "సోఽయం దేవదత్తః" అను ప్రత్యభిజ్ఞ యేరికిని కలుగదు. కాన నిచట జ్ఞానశబ్దమునకు జన్యజ్ఞాన మర్థమని యనదగదు. బుద్ధివృత్తియే యర్థ మనవలయును.

ఇచట రామానుజులు "కర్తవ్యకర్మవిషయం" చేయదగిన పనులగూర్చిన జ్ఞానము జ్ఞానమని యనిరి. అది యుక్తము కాదు. ఇచట నీ యర్థమును జెప్పుచో, "యేనైకంభావ మీక్షతే" అనుశ్లోకమునందుగూడ నీ జ్ఞానమునే గ్రహించవలయును. అపుడు ముందు జెప్పనున్న ఆత్మజ్ఞానము మూడువిధములయిన జ్ఞానములో జేరకపోవును. కావున నిచట సర్వవిషయకమయిన జ్ఞానమే జ్ఞానశబ్దార్థము. అయ్యది బుద్ధివృత్తిరూపము. నిత్యజ్ఞానరూపముకాని జన్యజ్ఞానరూపముకాని కాదు. ౧౮

శ్లో॥ జ్ఞానం కర్మచ కర్తాచ, త్రిధైవ గుణభేదతః
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావ చ్ఛృణు తాన్యపి॥ ౧౯

అ॥ కాపిలశాస్త్రమునందు (సాంఖ్యశాస్త్రమునందు) జ్ఞాన, కర్మ, కర్తలు సత్త్వాదిగుణభేదమున మూడువిధములని చెప్పబడినది. వానిని యథాశాస్త్రము చెప్పెద వినుము.

కాపిలులు నిరీశ్వరవాదులు. వారు బ్రహ్మ నంగీకరించరు. కాన వారి శాస్త్రమున బ్రహ్మైకత్వదర్శనము లేదు. ఆవిషయమున నయ్యది యప్రమాణమయినను సత్త్వాదిగుణములను నిరూపించుటలో ప్రమాణ మగును. విరోధములేని యంశము నితరశాస్త్రమునుంచి గ్రహించుటలో దోషములేదు.

పూర్వము జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములు, కర్తృ కర్మ కరణములు, అను నాఱు చెప్పబడినవి. వీటన్నిటికి త్రైవిధ్యమును జెప్పెదనని శ్రీకృష్ణుడు ప్రతిజ్ఞ చేయలేదు. జ్ఞాన, కర్మ, కర్తలకు మాత్రమే త్రైవిధ్యమును జెప్పెదనని ప్రతిజ్ఞ చేసెను. జ్ఞేయము లనేకవిధములు. కరణములుగూడ బహువిధములు. ఈరెంటికి త్రైవిధ్యము నియమింప శక్యముగాదు. జ్ఞాతృ, కర్త లొకరే. ఆ యిరువురికి భేదము లేదు. కాన జ్ఞాన, కర్మ, కర్తలకు మాత్రమే త్రైవిధ్యమును జెప్పెదనని ప్రతిజ్ఞ జేసెను.

ఇచట రామానుజులు జ్ఞేయమే కర్మశబ్దముచే పరామృశింపబడుచున్నదని యనిరి. అది తగదు. కర్మయే జ్ఞేయమని నియమింప వీలులేదు.

మరియు, "కర్మసంగ్రహః" అనుపదమునకు, ద్రవ్యము మున్నగుకరణములు, యాగాదిక్రియలు, అనుష్ఠాతయగు కర్త, ఈమూడువిధములగు తెలియ

దగినకర్మ సంగ్రహించి చెప్పబడుచున్నందున కర్మసంగ్రహమని వివరించిరి. ఇదియును యుక్తముగాదు. క్రియయే కర్మయగునుగాని, కర్తృకరణములు, కర్మభేదములో జేరవు. కరణముచే నిర్వర్తింపదగినది, కర్త నాశ్రయించి యుండునది కర్మ. లోకములో నెచ్చటయినను ఛేదనక్రియ, ఛేత్ర, లవిత్ర, ఛేదనరూపముగ నుండునని పిచ్చివాడయిన యనునా ?

అట్లే కరణ, కర్మ, కర్తలు మూడును జ్ఞేయము లనుటయు పొసగదు. జ్ఞేయమనగా కర్మయని మీరు పూర్వమే చెప్పితిరి. అట్టితతి కర్మభేదములు కానివి జ్ఞేయభేదములుమాత్ర మెట్లగును ?

కరణ, కర్తృసహితమయిన కర్మ జ్ఞేయమని చెప్పదగదు. కర్తను పరిజ్ఞాత యని మీరు చెప్పితిరి. పరిజ్ఞాతయగు కర్త జ్ఞేయమెట్లగును ?

ఇక కరణసహిత మయిన కర్మ జ్ఞేయమను మార్గమును ద్రొక్కినను వారి యభిప్రాయము నెరవేరదు. ద్రవ్యాదికరణజాత మిచట ప్రతిపాదింపబడుటలేదు. అట్టివానితోటి సాహిత్యమును జెప్పిన ప్రయోజనమేమి ?

మరియు రామానుజులు, గుణసంఖ్యాన మనుశబ్దమునకు గుణకార్యములను లెక్కించుటయని యర్థనిర్వచనమును జేసిరి. ఇదియు నుచితము కాదు. గుణశబ్దమునకు గుణకార్యము లను నర్థము లాక్షణికము కావలయును. వాచ్యమును విడచి లక్ష్యార్థమును గ్రహించుట యన్యాయ్యము. కాన నిచ్చోట రామానుజు లొనర్చిన వివరణ మసంగతము. ౧౯

శ్లో॥ సర్వభూతేషు యేనైకం భావ మవ్యయమీక్షతే
అవిభక్తం విభక్తేషు తద్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్॥ ౨౦

అ॥ జ్ఞానమునకు త్రైవిధ్యము చెప్పబడుచున్నది.

ఓయి ! దేశ, కాల, ఆకార, గుణ భేదములవలన పరస్పరభిన్నములయిన బ్రహ్మాది స్తంబపర్యంతమగు చరాచర శరీరములయందును ఆత్మవస్తువు ఒక్కటే అభిన్నముగా నున్నదని యేజ్ఞానముతో దెలిసికొనునో, ఆ జ్ఞానము సాత్త్వికము.

భూతములన్నియు మాయాకార్యములని స్ఫురింపజేయుటకు భాష్యకారులు భూతశబ్దమును "అవ్యక్తాదిస్థావరాంతము లని వ్యాఖ్యానించిరి.

వికారము స్వరూపగతమని, స్వభావగతమని రెండువిధములు. ఈ రెండు విధముల వికారమున్ను ఆత్మకు లేదు. అందువలన నిర్వికారుడు. ఇట్టి యద్వైతాత్మవిషయకజ్ఞానము సాత్త్వికజ్ఞానమని భావము.

రామానుజమతము.

బ్రాహ్మణ, క్షత్రియ, గృహస్థ బ్రహ్మచర్యాదిరూపమున నిఖిలభూతములు విభాగమును జెంది, కర్మాధికారులగుచుండ, నీబ్రాహ్మణాదిశరీరములు నశించుచున్నను, పరస్పరము భిన్నములయినను, అందుండు ఆత్మమాత్రము అవిభక్తుడనియు, నవ్యయుడనియు, నవికృతుడనియు, ఫలసంగము లేనివాడనియును కర్మాధికారసమయమున నేజ్ఞానముతో గ్రహించునో ఆజ్ఞానము సాత్త్వికమని రామానుజులు వివరించిరి.

౧. ఇందు సర్వశబ్దమును, కర్మాధికారిపరముగ సంకోచపగచుట యొక దోషము.

౨. ఏవిధమగు విభాగము లేదని చెప్పునట్టి యవిభక్తపదమును సితదీర్ఘాది (తెలుపు, పొడవు మొదలగు) విభాగములు లేనిదానిపరముగ సంకోచపరచుట మరియొకదోషము.

౩. అద్వితీయత్వమును ప్రతిపాదించునట్టి యేకశబ్దమునకు, జ్ఞానైకాకారుడని యర్థమును వర్ణించుట మరియొకదోషము.

౪. మూలమునలేని "కర్మాధికారవేళాయామ్" అను పదమును గల్పించుట యొకదోషము.

౫. మరియు జాత్యభిమానము గలవాడు అద్వితీయాత్మను గ్రహించలేడు.

జ్ఞానైకాకారుడు, అవ్యయుడు, అసంగుడు నయిన ఆత్మను జూచినవాడు నేను బ్రాహ్మణుడనని కర్మలయందు ప్రవర్తించనేరడు.

మూలమున "విభక్తేషు భూతేషు" అని బహువచనమును "అవిభక్తం ఏకం" అని యేకవచనమును నిర్దేశించుటచే దేహభేదమేకాని యాత్మభేదము లేదని సిద్ధించినది. ఇదే యభిప్రాయము "నత్వేవాహం జాతునాసం" అనుశ్లోకమున గూడ భాష్యకర్తలు సూచించిరి. భగవంతున కట్టి యభిప్రాయము లేనిచో నిచట గూడ నాత్మభేదమునే చెప్పెడివాడు. కాన నుపక్రమోపసంహారాదులచే ఆత్మైకత్వమే గీతాశాస్త్రార్థమని తెలుచున్నది. ౨౦

శ్లో॥ పృథక్త్వేన తు యద్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్
వేత్తి సర్వేషు భూతేషు తద్జ్ఞానం విద్ధి రాజసమ్॥ ౨౧

అ॥ సమస్తభూతములయందును, వేరువేరుగ అనేకాత్మలు కలరని తెలిసికొనుట రాజసజ్ఞానము. ద్వైతులు ప్రతిశరీరమునందును, వేరువేరుగ నొక్కొకజీవుడుండునని యందురు. అద్వైతులు అన్నిశరీరములయందు నొక్కడే జీవుడు గలడని యందురు.

సర్వశరీరములయందు నొకడే జీవు డగుచో జీవులకు సుఖదుఃఖభేదము సంభవించదు. ఒక డనుభవించినదానిని మరియొకడు స్మరించవలసివచ్చును. ఒక శరీరమునుంచి జీవుడు లేచిపోయినచో అన్నిశరీరములు అచేతనములు కావలయును. అని ద్వైతులు అద్వైతవాదముమీద దోషముల వెదకుదురు.

అద్వైతులు సుఖదుఃఖాదులు మనోధర్మములనియు, స్మరణము చిత్తధర్మమనియు, ఉత్క్రాంతి ( లేచిపోవుట ) బుద్ధిధర్మమనియు, లేక ప్రాణధర్మమనియు, దర్శనస్పర్శనాదులు ఇంద్రియధర్మములనియును, మనస్సు మున్నగునవి ప్రతిశరీరము భిన్నములనియు, కాన నిందు అనుభవసాంకర్యము లేదనియు నందురు.

రామానుజులు సితదీర్ఘాదిభేదముచే ఆత్మను దెలిసికొనుచున్నాడు- అని యనిరి. ఆస్తికుడగు కర్మఠుడు దేహముకంటె ఆత్మ వేరని తెలిసియుండియు, నేను పొడవు, నేను పొట్టి, నేను నలుపు, నేను యెఱుపు అని యనుకొనడు. దేహాత్మవాదులయిన బౌద్ధుల కీభావముండుచో నుండుగాక; అట్టిబౌద్ధులు కర్మల నాచరించరు. వారలమతమున కర్మఫల మనుభవించుభోక్త లేడు. కాన భిన్నాత్మజ్ఞానమే రాజసము. అయ్యది నింద్యము, త్యాజ్యమున్ను.

శ్లో॥ యత్తు కృత్స్నవ దేకస్మిన్కార్యే సక్త మహైతుకమ్
అతత్త్వార్థవ దల్పంచ తత్తామస ముదాహృతమ్॥ ౨౨

అ॥ భూతకార్యము లనేకములున్నను, అం దొక్క-దేహము మాత్రమే యాత్మయను భావముగలిగినదియు, అట్లే యనేకములయిన భౌతికపదార్థములలో పాషాణదార్వాది ప్రతిమారూపమగు పదార్థమొక్క-దానియందే యీశ్వరుడను భావము గలిగినదియు, భూతకార్యము లనేకములుండ వాటన్నిటికిని లేని యాత్మత్వము (ఈశ్వరత్వము) దీనికిమాత్ర మెట్లన విచారణలేనిదియు, "ఈ దేహమే యాత్మ, ఈ ప్రతిమయే యీశ్వరుడు, యింతకంటె వే రాత్మలేదు - యింతకంటె వే రీశ్వరుడు లేడు." అను నభినివేశముతో లగ్నమయినదియు, తత్త్వము నవలంబించనదియు, ఆత్మయందలి నిత్యవిభుత్వము లనుగ్రహించనందున అత్యల్పమగు నదియు నగు జ్ఞానము తామస మనబడును. ఇట్టి తామసజ్ఞానము దిగంబరులకును చార్వాకులకును గలదు. శ్రీరంగాదిక్షేత్రములయందు గల్పింపబడిన పాషాణదార్వాది మయమయిన అర్చావిగ్రహములే యీశ్వరుడుకాని, ఘటపటాదు లీశ్వరరూపములు కావనియు, చైతన్యము ఈశ్వరరూపము గాదనియును, మతాభినివేశము గల కొంద అందురు. ఈ జ్ఞానమంతయు తామసజ్ఞాన మనబడును.

ఎవరిదేహ మెంతటి పరిమాణము కలదిగనుండునో వారియాత్మకూడ నంతటి పరిమాణము కలవాడని దిగంబరులందురు. వీరిమతమున దేహమునకు సావయవత్వము

సిద్ధించును. కాని వీరు దేహాత్మవాదులు గారు. సావయవాత్మవాదులు దేహాత్మ వాదితుల్యులు. కనుక నిచట దిగంబరులు దృష్టాంత మీాయబడిరి: "దేహపరి మాణుడు జీవుడు" అను జ్ఞానమే తామసముకాగా, దేహమే యాత్మయను జ్ఞానము తామసమని వేరుగ జెప్పనేల ?

దేహపరిమాణుడు జీవుడను జ్ఞానము, ప్రతిమాదిరూపు డీశ్వరుడను జ్ఞాన మున్ను, తామసమని శ్లోకసారము.

ఓయి ! పూర్వము కర్మప్రవర్తకమయిన జ్ఞాతృ, జ్ఞేయ, జ్ఞానములను చెప్పి యిపుడు తదభిన్నమయిన జ్ఞానమును జెప్పితి రేమి ? వినుము. ప్రవృత్తిలక్షణము, నివృత్తిలక్షణము, అని కర్మ రెండు విధములు. అం దుపేక్షాఫలకమయిన నివృత్తి లక్షణకర్మను సాత్త్వికజ్ఞానము ప్రేరేపించును. నివృత్తిమార్గనిష్ఠులయిన సనకాదులు అం దధికారులు. రాజస తామసజ్ఞానములు ప్రవృత్తిలక్షణకర్మను ప్రేరేపించును. కావున మూడువిధములయిన జ్ఞానమున్ను కర్మప్రవర్తకమే యగును.

లేక జ్ఞానము కర్మచోదకమని సామాన్యదృష్టితో జెప్పబడినది. రాజస తామసజ్ఞానములు రెండే కర్మచోదకములు. సాత్త్వికజ్ఞానము కర్మచోదకముగాదు.

వస్తుతః "జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా" అను శ్లోకమునందు జెప్పిన జ్ఞానము వేరు. ఇది నిఖిలద్వైతవిషయము.

"జ్ఞానం కర్మచ కర్తాచ" అను శ్లోకమునందు జెప్పిన జ్ఞానము వేరు. ఇది జీవేశ్వరవిషయము. కనుకనే ఈ శ్లోకావతారభాష్యమునందు భాష్యకారులు "అథేదానీం" అని అథ శబ్దమును బ్రయోగించిరి. ఇది ( ఈ యథశబ్దము ) ముందుజెప్పబోవు విషయము ప్రకరణాంతరమని సూచించును.

దీనిచే "జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా" అను శ్లోకమునందు జెప్పిన పదార్థ ములే "జ్ఞానం కర్మచ కర్తాచ" అను శ్లోకమునం దనువదింపబడినవని వేదాంత దేశికులు చెప్పినమాట కొట్టుబడుచున్నది. ఒకటి కర్మవిషయము, మరియొకటి యకర్మవిషయము.

జీవేశ్వరజ్ఞానముకూడ కర్మలకొఱ కావశ్యకమని యనదగదు. క్రియాకార కాది ద్వైతజ్ఞానము కర్మల కుపయోగపడును. క్రియాకారకాదిద్వైతమును రూపు మాపెడి జీవేశ్వరజ్ఞానము కర్మల కుపయోగపడదు. ఈరెండును భిన్నవిషయములు. ద్వైత మవిద్యాదశయం దుండును. విద్యాదశయందు ద్వైతముండదు.

ఇట్లు సాత్త్వికజ్ఞానమును సంపాదించుటకును రాజస తామసజ్ఞానములను విడచుటకును జ్ఞానత్రైవిధ్యము చెప్పబడినది. ఇకముందు కర్త్రాది త్రైవిధ్యముగూడ

నిట్లు ప్రదర్శించబడును. కాన ముముక్షువు సాత్త్వికమగు నద్వైతజ్ఞానమును సంపాదించవలయును.

ప్రేతభూతాదుల నారాధించెడివారల జ్ఞానము తామసమని రామానుజులు వ్యాఖ్యానించిరి. ప్రకృత శ్లోకమునుంచి యా యర్థము రాదు. ఆత్మజ్ఞానమునందలి సాత్త్వికత్వాదిభేదముల జెప్పు ప్రసంగమున నీయర్థ మప్రస్తుతము. ౨౨

శ్లో॥ నియతం సంగరహితం అరాగద్వేషతఃకృతమ్
అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్విక ముచ్యతే॥ ౨౩

అ॥ నిత్యమయినట్టియు, ఆసక్తిలేనట్టియు, రాగద్వేషములేనివానిచే జేయబడినట్టియు, ఫలాశలేనివాడు చేసిన కర్మ సాత్త్వికము. ౨౩

శ్లో॥ యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణవా పునః
క్రియతే బహులాయాసం తద్రాజస ముదాహృతమ్॥ ౨౪

అ॥ కోరికగలవానిచేగాని, అహంకారముగలవానిచేగాని చేయబడు మిక్కిలి ప్రయాసగలకర్మ రాజసమనబడును.

లోకములో జేయబడు కర్మలన్నియు . "నేను జేయుచున్నాను" అను నహంకారముతోనే చేయబడుచున్నవి. నిరహంకారముతో కర్మాచరణమే యుండదు. ఇట్టితటి శ్రీకృష్ణుడు "సాహంకారేణ" అని చెప్పనేల? నిజమే ఇచట నిరహంకారులయిన తత్త్వజ్ఞానులనుబట్టి సాహంకారమని చెప్పలేదు. మరే మనిన లౌకికశ్రోత్రియులయొక్క నిరహంకారమునుబట్టి యిచట సాహంకారమని చెప్పబడినది. లౌకికశ్రోత్రియులగు నిరహంకారులకు నేనే గొప్పవాడ నను నహంకారముండదు. సాహంకారులగు కర్ములకు నేను వైశ్వదేవిని, నేను సోమయాజిని, ధనికుడను, కులీనుడను, అను నహంకారముండును. ఇట్టి యహంకార మిచట గ్రహింపబడినది. ఇంతేకాని నేను జేయుచున్నా నను సర్వజనసామాన్యాహంకారము కాదు. ౨౪

శ్లో॥ అనుబంధం క్షయం హింసా మనపేక్ష్యచ పౌరుషమ్
మోహా దారభ్యతే కర్మ యత్తత్తామస ముచ్యతే॥ ౨౫

రానున్న అనర్థమును ధననాశమును శక్తిక్షయమును ప్రాణిహింసను పురుష సామర్థ్యమును ఆలోచించక యవివేకమువలన జేసెడి కర్మ తామసము.

కర్మ తామసమగుటలో రానున్న యనర్థము నాలోచించకుండుట, ధన నాశము నాలోచించకుండుట, ప్రాణిహింస నాలోచించకుండుట, పురుషసామర్థ్యము

నాలోచించకుండుట, యజ్ఞానముచే చేయుట యనునవి యయిదుకారణము లని తేలి నది. ఈయవి ప్రత్యేకముగా కారణములనికూడ జెప్పవచ్చును.

అయితే ఇందు సముచ్చయపక్షము మంచిదా? అసముచ్చయ పక్షము మంచిదా? రెండును అంగీకరింపదగినవే. ఎట్లన?

౧. నియతకర్మ సాత్త్వికమని చెప్పినచో, సంగి చేసెడు నియతకర్మకూడ సాత్త్వికమగును.

౨. అందుకొఱకు నియతము, సంగరహితము నగు కర్మ సాత్త్వికమనుచో నసంగుడయినను, రాగద్వేషములు గలవాడు చేసెడి నియతకర్మ సాత్త్వికమగును.

౩. అందువలన నియతము, సంగరహితము, అరాగద్వేషపూర్వకము నగు కర్మ సాత్త్విక మన్నచో, ఫలకామి చేసెడి నియతకర్మకూడ సాత్త్వికమగును.

౪. అందువలన 1. నియతము, 2. సంగరహితము, 3. అరాగద్వేషపూర్వకము, 4. ఫలకామన గలవానిచే జేయుబడని కర్మ సాత్త్విక మని యనవలయును. అట్లే కోరికగలవాడు అహంకారములేనివాడు చేసెడి బహుళాయాసము గల కర్మ రాజసమనుచో నహంకారములేనివానిచే జేయబడిన బహుళాయాసము గల కర్మ రాజసము కాకపోవును. అట్లే కోరికగలవానిచేతను అహంకారము గలవానిచేతను జేయబడు బహుళాయాసములేని కర్మ రాజసము కాకపోవును.

అట్లే అనుబంధాదిచతుష్టయము నపేక్షించక అవివేకమున జేసెడికర్మ తామసమనుచో, ననుబంధాది త్రయాపేక్షకాని, ద్వయాపేక్షకాని, యేకాపేక్షకాని కలదియే అజ్ఞానమున నాచరించెడు కర్మ తామసము కాకపోవును. ఈ నాలుగు కారణములున్నను, అజ్ఞానముచే నాచరించబడని కర్మ తామసము కాకపోవును. కనుక సముచ్చయపక్షమును అసముచ్చయపక్షమును రెంటిని యాశ్రయించవలెను.

ఈ పై మూడుశ్లోకములయొక్క సారము.

"కర్మాధికారియగు ముముక్షుపురుషుడు రాగద్వేషములను, సంగమును, ఫలకామనను విడచి, నిరహంకారుడగుచు, నిరాయాసముగా, తనశక్తి ననుసరించి, భావ్యనర్థము లేనట్టియు, నహింసాత్మకమగు నిత్యకర్మను నిర్మోహుడగుచు నాచరించవలెను. ఏతద్విపరీతమయిన కర్మను పరిత్యజించవలయును." అని,

శ్లో॥ ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహ సమన్వితః
సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే॥ ౨౬

ఇకముందు కర్తృభేదము వివరింపబడుచున్నది.

అ॥ ఫలాసక్తిలేనివాడు, నేను గొప్పవాడనని గర్వించనివాడు, ధైర్యోత్సాహములు గలవాడు, ఫలము నెరవేరినను నెరవేరకున్నను వికారమును జెందనివాడు సాత్త్వికుడగు కర్త. ౨౬

శ్లో॥ రాగీ కర్మఫలప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః
హర్ష శోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః॥ ౨౭

అ॥ అనురాగముకలవాడు, కర్మఫలమును గోరువాడు, పరధనమునం దాసగలవాడు, పరులబాధించు స్వభావముగలవాడు, లోపల వెలుపల పరిశుద్ధిలేనివాడు, సంపత్తివిపత్తులయందు హర్షశోకములలో మునుగువాడు రాజసకర్త. ౨౭

శ్లో॥ అయుక్తః ప్రాకృతస్తబ్ధః శఠో నైష్కృతికోఽలసః
విషాదీ దీర్ఘసూత్రీచ కర్తా తామస ఉచ్యతే॥ ౨౮

అ॥ చిత్తసమాధానములేనివాడు, విద్యావిహీనుడు, కఱ్ఱవలె నెవ్వరికి లొంగనివాడు, మాయావి, పరుల మర్మములను భేదించువాడు, అలసుడు, యెల్లపుడు దుఃఖశీలుడు, దీర్ఘాలోచనపరుడు,– ఇట్టివాడు తామసకర్త.

శ్లో॥ బుద్ధే ర్భేదం ధృతేశ్చైవ గుణతః త్రివిధం శృణు
ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనంజయ॥ ౨౯

అ॥ ఓయి అర్జునా! సత్త్వాదిగుణభేదమువలన బుద్ధియొక్కయు, ధైర్యముయొక్కయు, భేదమును నిశ్శేషముగా విడివిడిగా జెప్పెద వినుము. ౨౯

శ్లో॥ ప్రవృత్తించ నివృత్తించ కార్యాకార్యే భయాభయే
బన్ధం మోక్షంచ యా వేత్తి బుద్ధి స్సాపార్థ సాత్త్వికీ॥ ౩౦

అ॥ ఓయి అర్జునా! బంధహేతువయిన కర్మ (ప్రవృత్తి) మార్గమును మోక్షహేతువయిన నివృత్తి (సన్న్యాస) మార్గమును, విహితప్రతిషిద్ధములగు లౌకిక, వైదిక కార్యాకార్యములను, దృష్టాదృష్ట భయాభయములను, బంధమోక్షములను దెలిసికొనుబుద్ధి సాత్త్వికము.

లేక ఇది ప్రవృత్తిమార్గము, ఇది నివృత్తిమార్గము, ఈదేశమునందు ఈ కాలమునందును ఈపని చేయుట మంచిది, దీనిని చేయకుండుట మంచిది, ఇది భయకారణము, ఇది యభయకారణము, ఇది బంధహేతువు, ఇది మోక్షహేతువు, ఇది బంధము, ఇది మోక్షము, అని యథాతథముగ గ్రహించునట్టి జ్ఞానము సాత్త్వికము.

ఓయి! మూలమునందు "యాబుద్ధిర్వేత్తి" అనికదా యున్నది "ఏ" బుద్ధి తెలిసికొనుచున్నదో అని యర్థము. తెలిసికొనుచున్నదనగా తెలివి కాశ్రయమని యర్థము. కాన, జ్ఞానాత్మకమయిన బుద్ధి, జ్ఞానమున కాశ్రయమగు టెట్లు? వినుము. వేత్తి, విదధాతువుకు వృత్త్యాత్మకజ్ఞాన మర్థము. అది బుద్ధియొక్క వృత్తి. అది క్రియ, బుద్ధియనగా వృత్తికలది. కాన వృత్తికలబుద్ధి వృత్తి కాశ్రయమగుట పొసగును.

అంతఃకరణమయిన బుద్ధికి పరిణామక్రియను గూర్చి కర్తృత్వము ఉచితము. కరణమయిన చక్షుస్సుకూడ పరిణామక్రియయందు కర్తయగుచున్నది. బుద్ధివృత్తి కరణముకాని బుద్ధి కరణము గాదని యనరాదు. వృత్తి వృత్తిమత్తుల కభేదము. కావున ప్రవృత్త్యాదులను యథాతథముగ దెలిసికొను బుద్ధి సాత్త్వికమని శ్లోకసారము. 30

శ్లో॥ యయా ధర్మమధర్మంచ కార్యం చాకార్యమేవచ
అయథావత్ప్రజానాతి బుద్ధిస్సా పార్థ రాజసీ॥ 31

అ॥ పురుషుడు యే బుద్ధిచే శాస్త్రచోదితమయిన ధర్మమును, శాస్త్రనిషిద్ధమయిన అధర్మమును వెనుకజెప్పిన కార్యాకార్యములను నిర్ణయించి తెలిసికొనలేదో యాబుద్ధి రాజసబుద్ధి. "యయా" అని చెప్పుటచే నిచట బుద్ధికి కరణత్వము కాని, కర్తృత్వము లేదు. 31

శ్లో॥ అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా
సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధిస్సాపార్థ తామసీ॥ 32

అ॥ తమోగుణముచే నావరింపబడిన యేబుద్ధి అధర్మము ధర్మమని తలంచునో సమస్తపదార్థములను విపరీతములనుగా తలచునో ఆబుద్ధి తామసబుద్ధి. 32

శ్లో॥ ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేంద్రియక్రియాః
యోగే నావ్యభిచారిణ్యా ధృతిస్సాపార్థ సాత్త్వికీ॥ 33

అ॥ ఓయి అర్జునా! ఎల్లపుడు చిత్తసమాధానముగల ధైర్యముచే మనః ప్రాణేంద్రియములయొక్క చేష్టలు శాస్త్రనిషిద్ధమార్గమునందు బడకుండ నిలుపుకొనునో ఆధైర్యము సాత్త్వికము. అనగా స్థిరమయిన ధైర్యముచే మనఃప్రాణేంద్రియచేష్టలు నిలచియుండునట్లు యోగము నభ్యసించవలయును. 33

శ్లో॥ యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతిస్సాపార్థ రాజసీ॥ 34

అ॥ ఓయి, యర్జునా? ఏ ధైర్యముచే ధర్మకామార్థములను ధారణచేయుచున్నాడో ధారణప్రసంగముచే ఫలమును గోరువాడుకూడ నగుచున్నాడో అట్టి ధైర్యము రాజసము. 34

శ్లో॥ యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ
న విముంచతి దుర్మేధా ధృతి స్సాపార్థ తామసీ॥ 35

అ॥ ఓయి అర్జునా? దుర్బుద్ధిగల యేపురుషుడు యే ధైర్యముచే నిద్రా, భయ, శోక, విషాద, మదములను అవశ్యకర్తవ్యము లను తలంపుతో విడువడో వానిధైర్యము తామసము. ఇష్టవియోగనిమిత్తమయిన సంతాపము శోకము. ఇంద్రియావసాదము విషాదము. 35

శ్లో॥ సుఖం త్విదానీం త్రివిధం శ్రుణు మే భరతర్షభ!
అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖాంతంచ నిగచ్ఛతి॥ 36

అ॥ గుణభేదముచే క్రియాకారకములకు త్రైవిధ్యమును జెప్పి, యిప్పుడు సుఖమునకు ఫలమునకు త్రైవిధ్యమును జెప్పుచున్నాడు. ఓయి భరతశ్రేష్ఠుడా? ఇపుడు సుఖమునకు త్రైవిధ్యమును జెప్పెద వినుము. మానవుడు యే సుఖమునందు అభ్యాసమువలన ననురాగముజెందునో యే సుఖానుభవమునందు దుఃఖోపశమనమును బొందునో,

ఇచట చిరకాలముండునట్టి ఆత్మసుఖానుభవమే వివక్షితము. దానియందే దుఃఖావసాన ముండును. విషయసుఖానుభవములో మరల మరల దుఃఖములే సంభవించుచుండును. 36

శ్లో॥ యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్
తత్సుఖం సాత్త్వికం ప్రోక్తం ఆత్మబుద్ధి ప్రసాదజమ్॥

అ॥ అర్జునా? మొదట (జ్ఞానవైరాగ్యధ్యానసమాధుల నభ్యసించునపుడు) విషమువలెనుండి వాటిపరిపాకదశయందు అమృతముతో దుల్యమయి, చిత్తనైర్మల్యమువలన గలిగెడి సుఖము సాత్త్వికము. అనగా, జ్ఞానాది సాధనములచే నిర్మలపరచుకొనబడిన చిత్తమునందు గోచరించెడి యాత్మసుఖము సాత్త్వికమని సిద్ధించినది. 37

శ్లో॥ విషయేంద్రియ సంయోగా ద్యత్తదగ్రేఽమృతోపమమ్
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్॥ 38

అ॥ విషయేంద్రియసంయోగమువలన బుట్టుచు, మొదట అమృతమువలెనుండి తుదకు విషమువలె మారునది రాజససుఖము. స్త్రీసంభోగజన్యమగు సుఖము బల,

వీర్య, రూప, ప్రజ్ఞా, మేధా, ధనోత్సాహములను నశింపజేయుట లోకానుభవసిద్ధము. వైషయికసుఖమంతయు నిట్లే యుండును.

శ్లో॥ యదగ్రే చానుబంధేచ సుఖం మోహన మాత్మనః
నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామస ముదాహృతమ్॥ ౩౯

అ॥ నిద్రా ఆలస్యప్రమాదములచే బుట్టుచు, మొదట చివరనుగూడ దెలియబడనిది తామససుఖము. అనగా ఏసుఖమును మానవు దనుభవించుచున్నను, నే ననుభంచుచున్నానని తెలియనేరడో, అనుభవానంతరము అనుసంధాన మొనర్చుకొనజాలడో, అట్టిసుఖము తామసమని భావము.

కాన సమాధియందు ప్రకాశమానమగు నాత్మానందము సాత్త్వికసుఖమనియు, నిద్రాదులయందు ప్రకాశమానముగాని యానందము తామససుఖమనియు వివేకము.

ఇచట ఆలస్యమనగా మాంద్యమని యర్థము. ప్రమాదమున అనవధానత (ఏకాగ్రత, జాగరూకత) లేకుండుట, నిద్రాదిజన్యమగు సుఖము అనుభవదశలో మోహనము, మెలకువ గలిగిన తరువాతకూడ గొంతకాలము మోహముండును. గనుక పరిపాకదశయందును మోహనమని చెప్పబడినది. ౩౯

శ్లో॥ న తదస్తి పృథివ్యాంవా దివి దేవేషువా పునః
సత్త్వం ప్రకృతిజై ర్ముక్తం యదేభిస్స్యా త్త్రిభిర్గుణైః॥ ౪౦

అ॥ భూలోకమునం దుండెడి మనుష్యాదిప్రాణులలోగాని స్వర్గమునందుండెడి దేవతలలోగాని సత్త్వాదిగుణత్రయములేని ప్రాణి యొక్కడును లేదు.

చరాచరాత్మకమగు బ్రహ్మాదిస్తంబపర్యంత ప్రాణిజాతము సత్త్వాదిగుణత్రయయుక్తము. అచేతనములయిన మృత్పాషాణలోహములయందుగూడ సాత్త్వికత్వాది భేదము గలదు. ౪౦

అవ॥ క్రియాకారకఫలరూపము, సత్త్వరజస్తమోగుణాత్మకము, అవిద్యాపరికల్పితము నయిన అనర్థరూపసంసారము, వృక్షముగా బోల్చి పంచదశాధ్యాయమున జెప్పబడినది. దానిని వైరాగ్యమను శస్త్రముచే ఛేదించి, ముక్తిమార్గమును వెతకవలెననియు నచటనే ప్రతిపాదింపబడినది. సర్వము త్రిగుణాత్మ మగుటచే సంసారకారణనివృత్తి యెట్లుగుట కనిపించదు. కావున నది నివర్తించెడి యుపాయమును జెప్పవలయును. గీతాశాస్త్రార్థమును ముగింపవలయును. బ్రహ్మ, క్షత్ర, వైశ్యు లనుష్ఠింపదగిన నిఖిల వేద స్మృత్యర్థము నిదియేయని నిర్ణయించవలయును. కాన నందుల కీ ముందుగ్రంథ మారంభింపబడుచున్నది. ౪౧

శ్లో॥ బ్రాహ్మణ క్షత్రియవిశాం శూద్రాణాంచ పరంతప
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవై ర్గుణైః॥ ౪౧

అ॥ ఓయి శత్రుమారకుడా ? బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు, శూద్రులకును, ఈశ్వరప్రకృతియగు మాయవలనబుట్టిన సత్త్వాదిగుణములచే శమాదికర్మలు వేరు వేరుగ విభజింపబడినవి. శూద్రులకు కర్మసంబంధమయిన రెండవజన్మము లేనందునను, వేదాధికారము లేనందునను, మొదటిసమాసములో శూద్రులను జేర్చక ప్రత్యేకించి చెప్పెను.

లేక బ్రాహ్మణస్వభావమునకు సత్త్వగుణము కారణము. క్షత్రియస్వభావమునకు సత్త్వ మంగముగాగల రజస్సు కారణము. వైశ్యస్వభావమునకు తమోగుణము అంగముగాగల రజస్సు కారణము. శూద్రస్వభావమునకు రజోగుణ మంగముగాగల తమస్సు కారణము. బ్రాహ్మణునకు ప్రశాంతి స్వభావము. క్షత్రియునకు ఐశ్వర్యము స్వభావము. వైశ్యునకు ధనార్జనప్రవృత్తి స్వభావము. శూద్రునకు మూఢస్వభావము లోకప్రసిద్ధము.

లేక జన్మాంతరకృత సంస్కారమువలనగూడ ప్రాణుల కీ కర్మభేదములు సంభవించవచ్చును.

శాస్త్రముకూడ సత్త్వాదిగుణ విశేషముల నపేక్షించియే ఈ జాతుల కీ కర్మభేదములను విధించినదికాని గుణముల నపేక్షించక స్వతంత్రముగ విధించలేదు. కాన శాస్త్రప్రవిభక్తము లయినను గుణప్రవిభక్తములనియే గ్రహించవలయును.

శ్లో॥ శమో దమ స్తప శ్శౌచం క్షాంతి రార్జవమేవ చ
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మకర్మస్వభావజమ్॥ ౪౨

అ॥ అంతరింద్రియనిగ్రహము, బాహ్యేంద్రియనిగ్రహము, తపస్సు, బ్రహ్మచర్యము, వేదాభ్యసనము, మనోనైర్మల్యము, బాహ్యాభ్యంతరశౌచము, ఆత్మాదిపదార్థజ్ఞానము, కలిగిన జ్ఞానమును అనుభవపరచుకొనుట, ఆస్తిక్యము (దేవుడున్నా డనుభావము) శాస్త్రార్థములయందు శ్రద్ధ, ఈయవి బ్రాహ్మణునకు సత్త్వగుణ స్వభావసిద్ధమయిన కర్మలు. ౪౨

శ్లో॥ శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్
దాన మీశ్వరభావశ్చ క్షాత్రం కర్మస్వభావజమ్॥ ౪౩

అ॥ పరాక్రమము, ప్రాగల్భ్యము, ధైర్యము, దాక్ష్యము (హఠాత్తుగా వచ్చిపడిన పనులయందు పొరపాటులేక ప్రవర్తించుట.) యుద్ధమునందు వెనుకకు

రాకుండుట, చేయివిడచి యిచ్చుట, ప్రభుశక్తిని ప్రకటించుట, ఈయవి క్షత్రియు నకు సత్త్వోపసర్జన రజోగుణస్వభావసిద్ధమయిన కర్మలు. ౪౩

శ్లో॥ కృషి గోరక్ష్య వాణిజ్యం వైశ్యకర్మ స్వభావజం
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్॥ ౪౪

అ॥ వ్యవసాయము, గోసంరక్షణము, వ్యాపారము అనునవి తమోపసర్జన రజోగుణస్వభావమువలన కలిగెడి వైశ్యకర్మలు.

ద్విజాతిశుశ్రూషాత్మకమయినకర్మ శూద్రునకు రజోగుణోపసర్జనమయిన తమోగుణస్వభావమునలన కలుగుకర్మ.

అవ॥ ఆయా జాతులకు విధించిన కర్మలను బాగుగ ననుష్ఠించుచో స్వర్గ ప్రాప్తి యనునది స్వతస్సిద్ధము. ఈకర్మలు, ఈశ్వరార్పణబుద్ధితో జేయుచో ఫలాంతరము నీయగలవు.

శ్లో॥ స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః
స్వకర్మనిరతః సిద్ధిం యథా విందతి తచ్ఛృణు॥ ౪౫

అ॥ తమతమకర్మలయం దాసక్తిగల నరుడు, జ్ఞాననిష్ఠాయోగ్యతారూప మగు సంసిద్ధిని పొందును. అట్టిమార్గమును జెప్పెద వినుము. ౪౫

శ్లో॥ యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వమిదం తతం
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః॥ ౪౬

అ॥ ఏ పరమాత్మవలన భూతములు బుట్టునో, యేపరమాత్మచే ప్రపంచ మంతయు వ్యాపించబడియున్నదో, అట్టిపరమాత్మను, జాతివిహితకర్మచే పూజించి మానవులు జ్ఞాననిష్ఠాయోగ్యతను బొందుదురు. చేసిన కర్మలయొక్క ఫలమును బ్రహ్మార్పణ మొనర్చుటయే పరమేశ్వరారాధనము. దానివలననే మానవులు సంసిద్ధిని పొందుదురు. ౪౬

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్॥ ౪౭

అ॥ గుణరహితమయినను, తనధర్మము తా ననుష్ఠించెడి పరధర్మముకంటె గొప్పది. స్వభావమునకు నియతమయిన కర్మను జేయువాడు పాపమును బొందడు.

ఈ శ్లోకమువలన ప్రాణిహింసాలక్షణమయిన యుద్ధమునందు పాపమున్నదను బుద్ధి యర్జునునకు దొలగింపబడినది. భిక్షాటనమునందు అర్జునునకు శ్రేయస్సు గలదను బుద్ధియు నివారింపబడినది.

శ్లో॥ సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్
సర్వారంభాహి దోషేణ ధూమేనాగ్ని రివావృతాః॥ ౪౮

అ॥ ఓయి! స్వధర్మమునందు దోషము గలదు. అందువలన నది చేయ దగదు. పరధర్మము పరునిది. (తనదికాదు.) కాన నిదియు జేయదగదు. కనుక కర్మానుష్ఠానాభావమే ప్రాప్తించినదికదా? కాదు. స్వధర్మము దుష్టమయినను అందు పాపము లేదు. పరధర్మమునందు గుణమున్నను, అది భయావహము. కాన, అనాత్మజ్ఞుడు (అజ్ఞాని) స్వధర్మ మనుష్ఠించితీరవలయు నని భగవంతుడు చెప్పుచున్నాడు.

ఓయి! కుంతీపుత్త్రుడా? దోషయుక్తమయినను సహజకర్మను విడువదగదు. కర్మలన్నియు దోషముతో గూడియే యుండును. పొగలేని నిప్పు యుండదు.

సంసారమునకు గుణత్రయము (సత్త్వాదికము) కారణము. గుణత్రయము నందు దోషము గలదు. కర్మకూడ గుణత్రయాత్మకము. కాన దీనియందును దోషము సంక్రమించియే యున్నది. కాన దోషములేని కర్మయే లేదు. ఇట్లుండ మానవుడు స్వధర్మమును (తనధర్మమును) పరధర్మ మాచరించినందున నేమి మూటగట్టుకొనును? అందుమాత్రము దోషములేదా? అది గుణత్రయాత్మకము కాదా? వీడు నిర్దుష్టమయిన కర్మ నాచరించినవా డగునా? నిర్దుష్టమయిన కర్మయే లేదే. కాన దోషయుక్తమయిన పరధర్మము నాచరించుటకంటె దోషయుక్త మయిన స్వధర్మము నాచరించుటయే శ్రేయస్కరము. సహజకర్మను విడచి, పర ధర్మము నాచరించినంతమాత్రమున దోషవిముక్తుడు గాడు. అజ్ఞాని నిశ్శేషముగా కర్మలను విడువలేడు. కనుక అనాత్మజ్ఞుడు సహజకర్మను దప్పక నాచరించి తీర వలయును. విడువదగదు.

అయితే కర్మలను పూర్తిగా విడుచుట సాధ్యము కానందున సహజకర్మ విడువకూడ దందురా? లేక సహజకర్మను విడచుటలో దోషమున్నందున సహజ కర్మ విడువదగ దందురా? ఇం దేపక్షము మీకు సమ్మతము?

ఏపక్షమయిననేమి? సహజకర్మను విడువరాదనుటలో మా కభినివేశము(పట్టుదల).

అట్లనా? మొదటిపక్ష మవలంబించేయడల కర్మలన్నిటిని పూర్తిగా విడ చుట సాధ్యమగుచో సహజకర్మను విడచుటయందు గుణమున్నదని తెలుచున్నది. నిజమే, కర్మలను పూర్తిగా విడచుట సాధ్యమయ్యేయెడల సహజకర్మను విడచుట గుణమే. అదియే (పూర్తిగా విడచుటయే) సాధ్యపడదు. కాన సహజకర్మను విడచిన దోషమున్నందుననే అయ్యది విడువతగదంటిమికాని పూర్తిగా విడచుట యశక్య మనుకారణమున గాదు. అట్లగుచో సహజకర్మను పరిత్యజించిన పరమహంస పరివ్రాజకునకు నరకపాతమేకదా? అని పూర్వపక్షియొక్క హృదయము.

అశేషకర్మత్యాగము సంభవించును. కాని అది యజ్ఞానికి సంభవించదు, అను నభిప్రాయమును మదియందిడుకొని, పూర్వపక్షమును నిరాకరింపదలచి చోద్యమును వివరించుచున్నాడు.

మీరు అశేషకర్మత్యాగము సంభవించ దనుటలో కారణము సాంఖ్య మతమున సత్త్వాదిగుణములవలె పురుషుడు (జీవుడు) సత్త్వాదిగుణత్రయాత్మకుడు కనుక నిత్యచలనస్వభావు డనియా? లేక బౌద్ధాదులవలె క్రియయే కర్తృకారక మయిన ఆత్మవస్తువనియా? బౌద్ధమతమున క్రియాకారకములకు భేదములేదు. కారకములే క్షణములో నశించెడు స్కంధము, అనగా క్రియాస్వరూపులు. అనగా రూప, వేదనా, విజ్ఞాన, సంజ్ఞా, సంస్కారములను పంచస్కంధములుగా పరివర్త మానమగుచున్న విజ్ఞానసంతానమే యాత్మయని బౌద్ధదర్శనము. విజ్ఞానములు క్షణికములుకాన, విజ్ఞానసంతానాత్మకములయిన స్కంధములుగూడ క్షణికములే. ఈవిజ్ఞానములు బుద్ధివృత్తిరూపములయినందున క్రియలగుచున్నవి. కనుక స్కంధ ములు క్షణములో నశించునట్టివియు, క్రియాస్వరూపములునున్న అనిభావము.

ఈ రెండుపక్షములయందును జీవుడు పూర్తిగా కర్మలను విడచుట సంభ వించదు. కాన నీరెండుపక్షములు మాకు (సిద్ధాంతికి) సమ్మతములే.

ఇంక మీరు కాలభేదము ననుసరించి యాత్మవస్తువు సక్రియమును, అక్రియ మును అగు నను కాణాదపక్ష మవలంబించవలయును.

ఈ మూడవపక్షమునందలి విశేష మిసుమంత జూపబడుచున్నది. ఇందు ఆత్మవస్తువు నిత్యచలనస్వభావుడు గాడు. ఎల్లపుడు క్రియ కనిపించనందున క్రియయే కారకమున్ను గాదు. క్రియాశ్రయమయిన కర్త క్రియారూపుడగుట యసంభవమగుటవలన, మరేమన, ఆత్మవస్తువునందు లేనిక్రియ పుట్టును. ఉన్నక్రియ నశించును. పరిశుద్ధమయిన ఆత్మద్రవ్యము క్రియాశక్తి కలదయియే యుండును. అనగా క్రియాశ్రయమయినదే కారక మను నర్థముకాదు. అట్టితటి యొకానొకపు డాత్మయందు క్రియలేనందున ఆత్మవస్తువు కారకము కాకపోవును. క్రియాశక్తి స్థిరముగా నున్నందున, ఆత్మవస్తువు కారకమగుట కభ్యంతరము లేదు. అని కాణాదులందురు.

వెనుకటి సాంఖ్య, బౌద్ధమతములయందు ఆత్మకు నశేషకర్మత్యాగము సంభ వించకున్నను, ఈకాణాదమతమున ఆత్మ కొకానొకపుడు నిష్క్రియత్వము సంభ వించును. వడ్రంగి కొయ్యచెక్కుటను విడచి యూరకున్నపుడు నిష్క్రియత్వము సంభవించినట్లు, కావున, జీవునకు శేషకర్మత్యాగము సంభవించును.

ఈకాణాదమతము మంచిదని తలచి యొకానొక యవాంతరపూర్వపక్షి యందు (ఈకాణాదమతమందు) దప్పేమి? అని యడిగెను. అందు కుత్తరవాది కాణాదమతము భగవంతునకు సమ్మతము కాదని బదులు చెప్పెను.

పూ॥ కాణాదమతము భగవంతునకు సమ్మతముగాదని మీరెట్లు చెప్పెదరు?

ఉ॥ భగవంతుడు "నాసతో విద్యతే భావః" (లేనిదాని కుత్పత్తిలేదు.) అని చెప్పెను. కాణాదులు లేనిదాని కుత్పత్తి యున్నదందురు. భగవంతుడు సత్కార్యవాది. కాణాదులు అసత్కార్యవాదులు. కావున నిది భగవత్సమ్మతము కాదని మేమందుము.

పూ॥ భగవంతునకు సమ్మతము కానంతమాత్రమున న్యాయబద్ధమయిన కాణాదమతమును ఏల నంగీకరించరు ?

ఉ॥ కాణాదమతము సర్వ ప్రమాణవిరుద్ధము. అందువలన దుష్టము. కాన నంగీకరించదగదు.

పూ॥ ప్రమాణవిరోధము నెట్లు జూపుదురు ?

ఉ॥ వినుము. కాణాదులు ప్రాగభావ ప్రధ్వంసాభావముల నొప్పెదరు. పుట్టకపూర్వము ఘటములేనందున ప్రాగభావమనియు నశించినతరువాత ఘటము లేనందున ప్రధ్వంసాభావమనియు మధ్యకాలమున నున్నందున ఘటమునకు సత్త్వమనియును వీరియాశయము. ఇట్టి వీరు లేనిదాని కునికిని, ఉన్నదానికి లేకపోవుటను జెప్పినట్లయినది. ఇం దనేకదోషములు గలవు.

ఎట్లన ! ద్వ్యణుకాది పదార్థజాతము కార్యమనియు నీయది పుట్టకపూర్వమున్ను నాశానంతరమున్ను అత్యంతాసత్తనియును వీరందురుకదా ? అప్పుడు అసత్తు సత్తయినట్లు సత్తు అసత్తయినట్లు నయినది. మరియు కార్యకారణముల కనన్యత్వము (భేదము) కనిపించుచున్నందున కారణమే కార్యమగుచున్న దన వలయును. అపుడు కార్య మసత్తయితే కారణముకూడ నసత్తయినట్లే. కాన అసత్తే సత్తుగా బుట్టినదనియు నాశానంతరము సత్తుయే అసత్తగుచున్న దనియును కాణాదు లంగీకరించినట్లు స్పష్టము.

మరియు వీరిమతమున వస్తువు పుట్టకపూర్వము దానియొక్క ప్రాగభావ ముండునందురు. అట్టితెరి ముందున్న ప్రాగభావమేకదా ? ఉత్పత్త్యనంతరము భావ రూపమును జెందినది. కావున ద్వ్యణుకాదులయొక్క ప్రాగభావము ద్వ్యణుకాది రూపమయిన భావపదార్థముగా తయారయిన ట్లయినది! అపుడు అభావము భావ మయినట్లేకదా ?

అట్లే ద్వ్యణుకాది రూపభావము నాశానన్తరము ప్రధ్వంసాభావరూప మయిన అభావమును జెందుచున్నది. ద్వ్యణుకాది ప్రాగభావమువలన ద్వ్యణుకాదిభావము పుట్టుచున్నదనియు, ద్వ్యణుకాదిభావము ప్రధ్వంసాభావమును బొందుచున్నదనియును కాణాదులందురు.

మరియు, అభావము భావముగా బుట్టునన్నచో, అభావమయిన కార్యము తనయొక్క పుట్టుకకు సమవాయి, అసమవాయ్యాది కారణత్రయము నపేక్షించునని

కాణాదు లంగీకరించిన ట్లయినది. అయ్యది యసంభవము. అసద్రూప (అభావ రూప) ము లయిన శశవిషాణాదులు కారణజాతము నపేక్షించుటలేదు. పుట్టుటయు లేదు. ఉత్పత్తికి పూర్వము లేని(అసత్తగు)ఘటము శశవిషాణాదితుల్య మనవలయును.

పుట్టకపూర్వము అనభివ్యక్తరూపముతో నున్న కార్యములు (ఘటాదులు) అభివ్యక్తిమాత్రమును గురించి కారణత్రయము నపేక్షించవచ్చును. పుట్టను వచ్చును. భావ (సత్) పదార్థమునకు కారణాపేక్షయు పుట్టుకయు కుదురును. కాన కార్యము భావాత్మకమనుటయే యుక్తము. కార్యము కారణాత్మకము, కార్యము అభావరూపమయినచో, కారణముకూడ అభావమయినట్లే. అభావము దేనికిని కారణము కానేరదు. శశవిషాణాదులు దేనికిని కారణము లగుటలేదు.

అభావము భావమగుట యెట్లు కుదరదో, అట్లే భావము అభావమగుటకూడ జెల్లదు. ఘటము నాశానంతరము కపాల చూర్ణాదిరూపమయిన భావరూపమును జెందుచున్నదికాని, యభావరూపమును జెందుటలేదు. పుట్టకపూర్వమునందువలె నాశానంతరముకూడ ఘటము స్వకారణమయిన మృత్తునందు సూక్ష్మరూపముతో నుండి యున్నది. కాన భావరూపమయిన ఘటమునకు అభావరూపత్వము విరుద్ధము.

కాక భావ మభావము, అభావము భావము నగుచో లౌకిక, వైదిక ప్రమాణ ప్రమేయ వ్యవహారమునందు విశ్వాస ముండనేరదు.

మరియు, కార్యములయిన ద్వ్యణుకాదులకు స్వకారణములయిన పరమాణువులతోను, సత్తాజాతితోను, సమవాయసంబంధము దుర్నిరూపము. గొడ్డురాలి బిడ్డకు సత్తాసంబంధముకాని, కారణసంబంధముకాని కల్పింపవలనుపడదు.

అభావత్వము సమానమగుచుండ ఘటాది ప్రాగభావలక్షణమయిన అభావమునకే పరమాణ్వాదికారణ సంబంధముకాని, వంధ్యాపుత్ర శశవిషాణాదిరూపమయిన అభావమున కట్టిసంబంధము లేదనుట యసమంజసము. కావున ప్రధ్వంసాభావాత్యంతాభావములకువలె ప్రాగభావమునకుగూడ పరమాణ్వాది కారణసంబంధ కల్పనము ఉత్పత్త్యాది వ్యవహారయోగ్యతా కల్పనమున్ను అత్యంతాయుక్తము. కావున పరిశుద్ధమయిన ఆత్మద్రవ్యమందు లేనిక్రియ పుట్టుననియు, క్రియపుట్టినపుడు ఆత్మవస్తువు సక్రియమనియు, క్రియపుట్టనపుడు ఆత్మవస్తువు నిష్క్రియవస్తువనియును కాణాదాభిమతమయిన మూడవపక్షముకూడ దోషయుక్తమే యగుచున్నది. ఇట్లసత్కార్యవాది కాణాదమతమును నిరాకరింప సత్కార్యవాది తలయెత్తుచున్నాడు.

"ఓయి! మేము వైశేషికులవలె అభావము భావమగునని చెప్పము. భావమునకే భావాపత్తి నంగీకరింతుము. స్వకారణమయిన మృత్తుయందున్న ఘటమే ఘటరూపమును జెందును. కాన మామతమున దోషమేమియు లేదు" అని.

ఇదియును ప్రమాణవిరుద్ధము. ఎట్లన, పుట్టకపూర్వము ఘటము మృత్తుయందుండుచో కులాలాదికారకవ్యాపారమునకు పూర్వముకూడ పిండావస్థయందును

ఘటము కనిపించవలయును. అట్లు కనిపించుటలేదు. పూర్వముండియున్న ఘట ద్రవ్యమునకు మరల ఘటోత్పత్తి యనుచితము. ఘటరూపమును జెందకపూర్వము ఘటమున్న దనుటయు జెల్లదు. ఘటభావమును జెందకపూర్వము ఘటమను ద్రవ్యమేలేదు. కావున ఘటోత్పత్తికి పూర్వము మట్టియె కలదుకాని, మృద్రూప ముతో ఘటములేదు.

అయితే యిట్లు మీరు సత్కార్యవాదమునుగూడ నిషేధించి పొందెడిఫల మేమి?

వినుము. సత్కార్యవాది హృదయమున ఆత్మవస్తువునందు వృత్తికి పూర్వము కూడ క్రియ కలదనియు, అందువలన సక్రియుడయిన ఆత్మకు అశేషకర్మత్యాగము అసంభవమనియును భావము కలదు. ఆభావమును దొలగించుటయే యీసత్కార్య వాదదూషణమునకు ఫలము.

ఘటము పుట్టకపూర్వము సూక్ష్మరూపముతో నామరూపములు అభి వ్యక్తముకాకుండ మృత్తికయందు కలదనియు, నామరూపము లనభివ్యక్తములుగా నున్నందున అపుడు ఘటము కనిపించుటలే దనియును, కారకవ్యాపారమువలన నామరూపము లభివ్యక్తము లగుననియును, పరిణామవాదులగు సాంఖ్యులందురు. వారిమతమునగూడ వైశేషికులమతమందువలె నీక్రిందివికల్పము లసమాధేయము లగుచున్నవి.

కారకవ్యాపారమువలన ఘటమునందు కలిగెడి అభివ్యక్తిరూపధర్మము (1) ఉత్పత్తికి పూర్వమున్నదా ? (2) లేదా ? (1) ఉన్నచో మరలపుట్టుట వ్యర్థము. (2) లేనిచో అసత్కార్యవాదప్రసంగము.

ఇంక నాయభివ్యక్తిరూపధర్మము ఉత్పత్తికి పూర్వము సూక్ష్మరూపముతో అనభివ్యక్తమయియే యున్నదన్నచో అనవస్థారూపదోషము ప్రసక్తించును. కాన వైశేషికమతమునవలె సాంఖ్యమతమునగూడ నీదోషములు అపరిహార్యములయి నందున సాంఖ్యమతమున నిర్దుష్టముకాదు.

పురుషు డుదాసీనుడని చెప్పెడి సాంఖ్యుడు నిష్క్రియాత్మవాదికి గొంత వరకు చెలికాడు. అయినను, సాంఖ్యాభిమతమయిన పరిణామవాదము నిష్క్రి యాత్మవాదికి పనికిరాదు. అందువలన సాంఖ్యమతమునుకూడ ఖండించుట యవసరమయినది.

ఇంక ఉత్పత్తివినాశాదులు సద్రూపమయిన ద్రవ్యముయొక్క అవస్థా విశేషములనియు, తంతువుమొదలయిన ద్రవ్యములు సద్రూపములుగా నుండియే రచనావిశేషమున పటాదు లనబడుచున్నవనియు, పూర్వావస్థయందున్న ద్రవ్య మునకు ఉత్తరావస్థాప్రాప్తివినాశమనియు ఉత్తరావస్థయందున్న ద్రవ్యము పూర్వావస్థను జెందుట యుత్పత్తియనియును ద్వైతులు విశిష్టాద్వైతులు నందురు. వీరిప్రక్రియనుగూడ వెనుకటివలె వికల్పించి చూచినచో నిలువనేరదు.

౧. పిండావస్థయందున్న మృద్ద్రివ్యమునకు ఘటావస్థ పుట్టబోవుచున్నదని వారందురు. అయ్యది( ఆ ఘటావస్థ ) ఉత్పత్తికి పూర్వమున్నదా ?
౨. లేదా ?
౧. ఉన్నచో కారకవ్యాపారము నిరర్థకము.
౨. లేనిచో అసత్కార్యవాదప్రసంగము.

అట్లే ఘటావస్థయందున్న మృద్ద్రివ్యమునకు కపాలావస్థను జెందుటయును, ఘటావస్థానాశము పుట్టునందురు.

౧. ఈఘటావస్థానాశము ఉత్పత్తికి పూర్వమున్నదా ?
౨. లేదా ?
౧. ఉన్నచో సత్కార్యవాదమునందు జెప్పినట్లు మరలపుట్టుట వ్యర్థము.
౨. లేనిచో అసత్కార్యవాదప్రసంగము.

కావున, నీద్వైత, విశిష్టాద్వైతుల పక్షముకూడ సాంఖ్యపక్షమువలె ప్రమాణ విరుద్ధమే యగుచున్నది. వైశేషిక పక్షమందున్న దోషములన్నియు నీమూడు పక్షములందును దుష్పరిహారములు.

కాన సత్కార్యవాదము, అసత్కార్యవాదము అనురెండుపక్షములే నిలచినవి. మిగిలినమతము లన్నియు నీరెంటిలో నిమిడియున్నవి. ఈరెండుమతములను పైవిధమున దూషింప, పరిశేషన్యాయమున కార్యమంతయు మిథ్యయను మూడవ పక్షము నిర్దుష్టమని తేలినది.

ఈ కనిపించు ప్రపంచమంతయు సచ్చిదానందబ్రహ్మయందు గల్పింపబడినది. ఇది పుట్టకపూర్వ మున్నదా? లేదా? అని వికల్పించుటకుగాని ఉన్నదని లేదనిచెప్పుటకుగాని వీలులేదు. అందువలన ప్రపంచము మిథ్య. ఒక్క నటకుడనేకవేషముల వేసి నటించినట్లు, అద్వితీయమగు బ్రహ్మము యిన్నిరీతుల గనిపించుచున్నాడు. ఇందు బ్రహ్మమొక్కటే సత్యము. మిగిలినదంతయు మిథ్యాభూతము. బ్రహ్మము నిర్వికారము. ఈతనియందు వెనుకటి వికల్పములేవియు పొసగవు. కావున కారణమయినబ్రహ్మ మొక్కడే సత్యమనియు, కార్యమయిన జగత్తంతయు మిథ్య యనియును భగవంతున కభిమతమయిన మతము. దీనినే "నాసతో విద్యతే భావః" అను శ్లోకమున శ్రీకృష్ణుడు వెలిబుచ్చెను. ఆత్మ సహజముగా నిర్వికారుడయినందున జీవునకు నశేషకర్మత్యాగము సంభవించును. సత్త్వాదిగుణములు, వాటిధర్మము, వానిక్రియలు, ఆత్మయం దవిద్యాధ్యారోపితము లని తెలియని అజ్ఞానికి కర్మత్యాగము సంభవించకపోవచ్చును. వానినిగూర్చియే "నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠ త్యకర్మకృత్" అని చెప్పబడినది. సర్వము ఆత్మయందు అవిద్యచే గల్పింపబడినదని తెలిసికొన్న విద్వాంసునకు, విద్యచే అవిద్య నశించగా సర్వకర్మపరిత్యాగము సులభముగా దటస్థించును. తైమిరిక దృష్టికలవానికి తిమిర

దోషము పోయినతరువాత ద్విచంద్రదర్శనము (ఇద్దరుచంద్రులు కనిపించుట) యుండుటలేదు. కనుకనే శ్రీకృష్ణుడు "సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ; నవద్వారే పురే దేహే నైవకుర్వన్ నకారయన్" ఇత్యాది శ్లోకములయందు విద్వాంసున కశేషకర్మత్యాగము సులభమని చెప్పియుండెను. కాన, తత్త్వవేత్తకు సర్వకర్మపరిత్యాగము సుసంభవమని సిద్ధించినది.

రామానుజీయము.

"జ్ఞానయోగమునందర్హతకలవాడుగూడ నెంతదుఃఖకరమయినను సహజ కర్మను విడువగూడదు. జ్ఞానారంభములు, కర్మారంభములును దుఃఖముతో నిండి యున్నవి. అని రామానుజులు వివరించిరి. అది యుక్తముకాదు. విద్వాంసుడు కర్మను విడవనిచో సర్వారంభపరిత్యాగమను గుణాతీతలక్షణము విద్వాంసునకు సిద్ధించదు.

"తరతి శోక మాత్మవిత్" అనుశ్రుతి జ్ఞానికి శోక ముండదని చెప్పుచుండ జ్ఞానారంభము దుఃఖసహితమనుట శ్రుతివిరుద్ధము.

జ్ఞానమునందు దుఃఖము లేకున్నను, జ్ఞానారంభమగు సన్న్యాసమునందు దుఃఖమున్నదని యనరాదు. త్యాగరూపమయిన సన్న్యాసమునందు దుఃఖమున్న దనుట వెఱ్ఱితనము. ఇల్లుకట్టుకొనువాని కున్నంతశ్రమ యింటిని విడచువాని కుండనేరదు. విద్వాంసునకుగూడ ననురాగము తొలగుట దుష్కరముకదా? కాదు. ఆత్మతత్త్వసాక్షాత్కారము కలిగినతరువాత ననురాగముకూడ నుండ నేరదు. కాన కర్మారంభము దుఃఖసహితముకాని, జ్ఞానారంభము దుఃఖసహితము గాదు. కాక, ఈగుణకర్మవిభాగప్రకరణమునందు జ్ఞానయోగముయొక్క ముచ్చటేల?

శ్లో॥ అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగతస్పృహః,
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసే నాధిగచ్ఛతి॥ ४९

అ॥ ఈశ్వరార్పణబుద్ధితో తమతమ నియతకర్మల నాచరించెడువానికి జ్ఞాననిష్ఠ నొందెడి యోగ్యత సిద్ధించును. దీనినే చిత్తశుద్ధియందురు. ఇదియే కర్మ ఫలసంసిద్ధి. ఇట్టివానియొక్కబుద్ధికి దారాపుత్రాదులయం దంతట సంగముండదు. మనసు వశమగును. దేహజీవితభోగములయందుగూడ నిస్స్పృహ కలుగును. పిదప సర్వకర్మసంన్యాసము నాశ్రయించి నైష్కర్మ్యసిద్ధి నొందును. నిష్క్రియాత్మ స్వరూపముతో నుండుట తటస్థించునని భావము. "నైష్కర్మ్యంచ తత్ సిద్ధిశ్చ నైష్కర్మ్యసిద్ధిః" అని కర్మధారయసమాసము. దీనినే కొందఱు "నైష్కర్మ్య మితి సిద్ధిః నైష్కర్మ్యసిద్ధిః" అని సంభావనాపూర్వపదకర్మధారయసమాసముగ వివరించిరి. అది యుచితము కాదు. శాస్త్రమునం దెచ్చటను "విశేషణం విశేష్యేణ బహులమ్" అను సూత్రకృతసమాసముకంటె వేరుగ, సంభావనాపూర్వపద



మనికాని, యవధారణపూర్వపద మనికాని కర్మధారయసమాసము కాదు. కావున నిది విశేషణసమాసమే యనదగును. "నైష్కర్మ్యస్య సిద్ధిః" అని సమాసాంతర మునుగూడ జెప్పనగును. అపుడు నైష్కర్మ్యప్రాప్తియని యర్థము. ఎటులయినను, నిష్క్రియాత్మస్వరూపావస్థాన మనియే ఫలితార్థము. ఈయది కర్మానుష్ఠానము వలన కలిగెడి చిత్తశుద్ధిదశకంటె విలక్షణమయినది. దానికంటె గొప్పదియు నగును. దీనినే సద్యోముక్తి యందురు. అనగా జీవన్ముక్తియని యర్థము. క్రమ క్రమముగ నిట్టిదశ నిష్కామకర్మానుష్ఠాతకు సంభవించునని శ్రీకృష్ణుడు గీతాశాస్త్ర మున "సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖంవశీ" అను శ్లోకముచే సూచించి యున్నాడు. ఇట్టిదశ నొందిన జీవన్ముక్తునకు దేహావసానమున విదేహకైవల్యమను దశ యబ్బునని ముందుశ్లోకమున జెప్పబడగలదు.

ఇచ్చటి గ్రంథసందర్భ మిట్లుండ కర్మయోగమువలననే బ్రహ్మప్రాప్తి కలుగునని చెప్పెడి రామానుజుల సాహసము యెంతేని మెచ్చదగును.

శ్లో॥ సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాప్నోతి నిబోధ మే
సమాసేనైవ కౌంతేయ, నిష్ఠా జ్ఞానస్య యా పరా॥ ౫౦

అ॥ ఓయి అర్జునా? చిత్తశుద్ధిని పొందిన మానవునకు నైష్కర్మ్య సిద్ధిలక్షణమయిన జ్ఞాననిష్ఠ కలిగెడి క్రమమును నేను సంగ్రహించి చెప్పెదను. సావధానముగ వినుము. జ్ఞాననిష్ఠయొక్క పర్యవసానమే బ్రహ్మప్రాప్తి. అనగా పరమాత్మజ్ఞానమే బ్రహ్మప్రాప్తి యని యర్థము. ఉపనిషద్వాక్య ప్రతిపాదితమయిన కూటస్థాసంగ స్వప్రకాశానందస్వరూపుడు పరమాత్మ.

ఓయి ! పరమాత్మజ్ఞానమే బ్రహ్మప్రాప్తియని మీరంటిరి. జ్ఞానమెప్పుడును విషయాకారమును జెందియుండును. ఘటజ్ఞానాదులు ఘటాది విషయాకారమును జెందుట లోకసిద్ధము. వేదాంతశాస్త్రమునం దెచ్చటను ఆత్మ విషయమని కాని, ఆకారముకలవాడని కాని యంగీకరించలేదు. ఆకారవిశిష్టమయిన వస్తువే జ్ఞానము నకు విషయమగును. విషయాకారమును జెందినదే జ్ఞానమగును. కావున నిరాకారు డయిన ఆత్మకు జ్ఞానవిషయత్వ మెట్లు కుదురును ? ఎటులను గుదరదు. అది కుదర నపుడు పరమాత్మజ్ఞానము సిద్ధించుటెట్లు ?

అయితే "సత్యంజ్ఞాన మనంతంబ్రహ్మ" అను శ్రుతిబనిట్టి ఆత్మ జ్ఞానా కారుడని యందురేమో ? అచట జ్ఞానపదము లాక్షణికము. చైతన్యమాత్ర మద్దాని కర్థము. వృత్తిజ్ఞానమే సాకారముకాని, చైతన్యము సాకారముకాదు. నిరాకారము ఆత్మస్వరూపభూతము నయిన చైతన్యము జ్ఞానవిషయము కానేరదు. స్వరూప చైతన్యము నిర్గుణము. "సాక్షీచేతా కేవలో నిర్గుణశ్చ" అను శ్రుతికూడ నిట్లు చెప్పుచున్నది. నిర్గుణము నిరాకారమగునుగాని సాకారము కానేరదు. జ్ఞానావిషయు

డయినను, ఆత్మ స్వయంప్రకాశస్వరూపుడయినందున ప్రకాశించుచున్నాడు.

వృత్తిజ్ఞాన మెప్పుడును స్వప్రకాశము కానేరదు. వృత్తి జడము. దాని యందు ప్రతిఫలించిన చైతన్యము బింబచైతన్యమునకు పరతంత్రము. కాన వృత్తిజ్ఞానము స్వప్రకాశము కానేరదు.

"ఘటము" అను వృత్తిజ్ఞానముకూడ వృత్త్యంశమునందు జడము, చైత న్యాంశమున స్వప్రకాశము. కాన చైతన్యైకస్వరూపుడగు నాత్మ నిరాకారుడనియే చెప్పవలయును. "ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్" అని ఆత్మకు వర్ణమును జెప్పు శ్రుతులకు ఆత్మకు తమోరూపత్వమును నిషేధించుటయందు తాత్పర్యముకాని యాకారమును జెప్పుటయందు తాత్పర్యము లేదు. కాన నిరాకారుడయిన ఆత్మకు జ్ఞానవిషయత్వ మసంభవమగుచుండ పరమాత్మాకారమగు జ్ఞాన మసంభవముకదా? ఇక పరమాత్మజ్ఞానము నిరాకారమని యంగీకరించుచో, నిరాకారమగు జ్ఞానమును మాటిమాటి కనుసంధానముచేయుటకాని, అయ్యది నిష్ఠారూపమును జెందుటకాని గగనకుసుమాయితము అని పూర్వపక్షము.

సిద్ధాంతము: ఆత్మజ్ఞానము అసంభవముకాదు. ఆత్మకు చైతన్య మాకారము. చైతన్యాకారుడయిన ఆత్మ అతినిర్మలుడు, మిక్కిలి స్వచ్ఛమయినవాడు, అత్యంత సూక్ష్ముడు. బుద్ధికూడ నిర్మలము, స్వచ్ఛము, సూక్ష్మము నయినది. ఇట్టిబుద్ధి చైతన్యా కారముగ భాసించును. బుద్ధ్యాత్మలకు అన్యోన్య తాదాత్మ్యాధ్యాస యుండుటచే బుద్ధియం దాత్మచైతన్యాకారాధ్యాస యేర్పడును. చైతన్యాధ్యాసవలన బుద్ధిచైత న్యము కలదివలె భాసించును. ఇట్లె బుద్ధిధర్మాధ్యాసవలన మనస్సు బుద్ధివలెను, మనోధర్మాధ్యాసవలన ఇంద్రియములు మనస్సువలెను, ఇంద్రియధర్మాధ్యాసవలన దేహము ఇంద్రియములవలెను చైతన్యముకలవి యగును.

కావున బుద్ధ్యాభాసము, మనస్సు, మనాభాసము లింద్రియములు, ఇంద్రియా భాసము దేహము అగును. ఇట్లు క్రమముగా బుద్ధ్యాదిదేహాంతములయందు ఆత్మ చైతన్యాకారాభాసముండుటచే లౌకికులు దేహమే ఆత్మ యని "స్థూలోహమ్" అను ప్రతీతులచే దేహమునం దాత్మదృష్టి యుంచుచున్నారు.

ఏచైతన్యము ఆత్మాకారమని వేదాంతు లందురో ఆచైతన్యము దేహము యొక్క యాకారమని వాదించు లోకాయతికులు (బౌద్ధులు) చైతన్యవిశిష్ట మయిన దేహమే ఆత్మయని యందురు.

మరికొందరు దేహ మాత్మయగుచో గ్రుడ్డి, కుంటి, చెమిటి దేహమునకు గూడ దర్శన, గమన, శ్రవణాది వ్యవహారములు కలుగవలెననియు, నవిలేనందున ఇంద్రియము లాత్మ యందురు.

మరికొందరు స్వప్నదశలో నింద్రియములు లేనందున నింద్రియము లాత్మ కావని తలచి, మనస్సు ఆత్మ యందురు. ఇట్లే మరికొందరు బుద్ధి యాత్మయనియు

అవ్యక్తము (కారణశరీరమయిన నజ్ఞానము) ఆత్మయనియు నందురు.

ఇట్లు బుద్ధ్యాదిదేహాంతములయిన అనాత్మవస్తువులం దాత్మచైతన్యాభాసము నాధారముగ జేసికొని, దేహచైతన్యవాదులు, ఇంద్రియచైతన్యవాదులు, మనశ్చైతన్యవాదులు, బుద్ధిచైతన్యవాదులు, అవ్యక్తచైతన్యవాదులు, అని పలువురు వెలసిరి.

అయితే యింతమాత్రమున ప్రకృతపూర్వపక్షమునకు సమాధాన మేమి వచ్చినదని యందురేమో? తెలిసికొని, నిజము తెలియకకాని, ఆత్మయను పదార్థ మొకటున్నటుల యందఱకు ప్రసిద్ధమని దీనివలన స్పష్టమయినది. ఇట్లు ప్రసిద్ధమయిన ఆత్మను తెలిసికొనుడని మేము విధించనేల? అయితే "ఆత్మావా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" అనుశ్రుతులు ఆత్మను దెలిసికొమ్మని చెప్పుచు, ఆత్మజ్ఞానము నేల విధించినవి? అని యందురేమో? ఆశ్రుతులు విధిచ్ఛాయావచనములుకాని, నిజముగ నవి యాత్మజ్ఞానమును విధించునట్టివి కావు. మరేమనిన, ఆత్మయం దారోపించుకొనిన నామరూపా ద్యనాత్మపదార్థారోపణమును బోగొట్టుమనియే యాశ్రుతులు చెప్పుచున్నవి.

ఇం దీయది తాత్పర్యము. లోకాయతికాదులందఱు ఆత్మచైతన్యము దేహాద్యాకార విశిష్టమని గుర్తించుచున్నారు. కాన నందఱకు ఆత్మచైతన్యజ్ఞానము కలదు. అయ్యది సిద్ధముకాని సాధ్యముకాదు. వీరందఱకుగల నీయాత్మజ్ఞానము భ్రమరూపముకాని, ప్రమ (యథార్థము) కాదు. భ్రమ అనర్థమునకు హేతువు. దానిని పోగొట్టుకొనుట క్షేమంకరము. విజ్ఞానవాదులగు బౌద్ధులు విజ్ఞానముకంటె వేరువస్తువు లేదని సిద్ధాంతపరచుకొని అట్టివిజ్ఞానము ప్రమాణాంతర నిరపేక్షమని యంగీకరించుచు, నయ్యది స్వయంప్రకాశమనిరి. అయితే వేదాంతులుకూడ జ్ఞానము స్వతఃప్రమాణమని వాదించెడివారే. కాని వీరుభయులకు మతప్రక్రియయందు చాలభేదము గలదు.

ఎట్లన? "విజ్ఞానము నిత్యము, అఖండము, ఏకరూపము, స్వయంప్రకాశము, బ్రహ్మరూపమును. చైతన్యరూపమగు బ్రహ్మకంటె వేరుపదార్థము లేదు. సర్వము బ్రహ్మయందు గల్పితము. కల్పితము అధిష్ఠానముకంటె వేరుకాదు." అని పరాశర మతము. ఈమతమున బాహ్యపదార్థముల కపలాపము లేదు. "బాహ్యార్థమగు ఘటాదులు కనిపించుచుండగనే విజ్ఞానము (చైతన్యము) ఘటాద్యాకారముగ పరిణమించిన బుద్ధివృత్తియందు ప్రతిఫలించిన దగుచు, ఘటాద్యాకారమని భ్రాంతిచే జెప్పబడుచున్నది. ఇంతియెకాని నిజముగ జ్ఞానము ఘటాద్యాకారము కాదు." అని పరాశరా ద్యద్వైతులమతము.

విజ్ఞానవాదులగు బౌద్ధులకు విజ్ఞానము క్షణికము. అది వాసనావైచిత్ర్యము వలన లోపలనే ఘటాకారమును జెంది బాహ్యవిషయమువలె (వెలుపలివస్తువువలె)

గనిపించును. ఇంతియెకాని స్వప్నమునందువలె జాగ్రదవస్థయందుగూడ నిజముగ బాహ్యపదార్థములు లేవు. అని విజ్ఞానవాదుల మతము. కాని యిది చెల్లనేరదు. క్షణికమయిన విజ్ఞానమునకు స్వసంవేద్యత్వము (తనచే దాను తెలియదగియుండుట) కుదరదు. విజ్ఞానము తనపుట్టుకకు పూర్వక్షణమున లేదు. ఉత్తరక్షణమున నుండదు. మధ్యక్షణమందుమాత్ర ముండును. ఇట్టితఱి దీనియొక్క చావుపుట్టుకలు దీనికి తెలియునా? తెలియునన్నచో వ్యాఘాతమను దోషము (లోకవిరుద్ధము). తన చావుపుట్టుకలు తనకు తెలియుట విరుద్ధము. రెండవపక్షమున తెలియని చావు పుట్టుకలు కలవని నమ్ముటెట్లు? అయ్యది యసంభవము. ఇక జ్ఞానాంతరముచే తెలియబడునన్నచో నపుడు స్వసంవేద్యత్వము చెడును. మరియు నదియును క్షణికమే యయినందున నందుగూడ నీదోషములే యాపాదించును. కాన వారిమతమున విజ్ఞానము అన్యావభాస్యమే యననలయును.

అద్వైతమతమున ఘటపటాదివిషయములు క్షణభేదము ననుసరించి చచ్చుచు పుట్టుచున్నను జ్ఞానముమాత్రము అఖండముగా నున్నందున నయ్యది నిత్యమగును.

లేక వృత్తి క్షణికమయినందున వృత్తిజ్ఞానము క్షణికమని వ్యవహారము. వృత్తిప్రతిఫలిత చైతన్యమే వృత్తిజ్ఞానము. ఆవృత్తి సాక్షిభాస్యమయినందున వృత్తిజ్ఞానముకూడ సాక్షిభాస్యమేకాని స్వసంవేద్యము కాదు. అద్వైతు లంగీక రించిన విజ్ఞానము సాక్షిభూతమయిన చైతన్యమే. కాన నయ్యది నిత్యమగుట స్వయంప్రకాశమగుట యుక్తము. బాహ్యపదార్థమగు ఘటము లేనిచో బుద్ధికి తదాకారముగ పరిణామముకాని, తద్వాసనకాని యసంభవమయినందున బాహ్యార్థముల కపలాపముకూడ నుచితముగాదు. కాన బౌద్ధమతము దుష్టము.

కావున ఆత్మజ్ఞానము సిద్ధమగుటచే దానియందు ప్రయత్న మేరికి నవసరము లేదు. ఆత్మ "దేహాతిరిక్తుడు, కర్త, భోక్త" యనువా డాత్మజ్ఞానమునందు ప్రయత్నించడు. "దేహమే యాత్మ" అనువాడును ఆత్మను దెలిసికొనుటకు ప్రయత్నించడు. అల్లేబ్రహ్మాత్మవాదికూడ ఆత్మజ్ఞానమునకై ప్రయత్నించడనిభావము.

పరమాత్మ యి ట్లందఱకు ప్రసిద్ధుడు. సులభముగా దెలియదగినవాడు. మిక్కిలి దగ్గరవాడు. అయినను అందరు తెలియనేరకున్నారు. అజ్ఞానులగు మూఢులు బుద్ధ్యాద్యనాత్మపదార్థములను ఆత్మనుగ నమ్మి "నేను స్థూలుడను, నేను మనుష్యుడను. నేను గ్రుడ్డిని, నేను కుంటిని, సుఖిని, దుఃఖిని, అజ్ఞానిని" అని తలచుచు ఆత్మయయిన సచ్చిదానందబ్రహ్మను దెలియలేకున్నారు. కనుకనే అట్టి యవిద్వాంసులకు ప్రసిద్ధమయిన బ్రహ్మకూడ నప్రసిద్ధముగ దోచును. సువిజ్ఞేయమయినను దుర్విజ్ఞేయముగ గనిపించును. మిక్కిలి దగ్గరనున్నను దూరముగ నున్నటుల భాసించును. ఆత్మభూతమయినను అనాత్మభూతమనియు వేరెవరో యనియు భాసించును.

గురుప్రసాదమువలన తత్త్వమస్యాది మహావాక్యోపదేశము నొంది, యీశ్వరానుగ్రహమున చిత్తశుద్ధిని బడసిన మహనీయులకు ( జ్ఞానులకు ) బుద్ధ్యాద్యనాత్మపదార్థములయం దాత్మబుద్ధి తొలగును. అట్టివారికి బ్రహ్మకంటె వేరు ఆనందరూపమయిన వస్తువులేదు. తానే ఆత్మ. ఆత్మయే బ్రహ్మ. బ్రహ్మ స్వయం ప్రకాశము. ప్రమాణాంతర నిరపేక్షము. ఇట్టి యాత్మను దెలిసికొమ్మని మేము చెప్పనేల? మే మెప్పుడును ఆత్మను దెలిసికొనమని విధించము. తెలిసికొనువాడే యాత్మ. దేహాద్యనాత్మపదార్థములయందలి ఆత్మబుద్ధిని తొలగించుకొనమని ఘోషింతుము.

అయితే అనాత్మలయం దాత్మబుద్ధిని తొలగించుకొనువా రెవరు? ఎవరు అనాత్మలను ఆత్మగా గ్రహించిరో వారే; ఎవరు పరిగ్రహించిరి? అవిద్వాంసుడు. అవిద్వాంసు డెవడు? అజ్ఞానముకలవాడు. అజ్ఞాన మెవరికి గలదు? అనాత్మను ఆత్మయని తలంచువాని కజ్ఞానము గలదు. అనాత్మను ఆత్మగా నెవడు తలంచును? అజ్ఞానియే.

అయితే " అవిద్యకలవానికి అనాత్మవస్తువులయం దాత్మబుద్ధి, అనాత్మలయం దాత్మబుద్ధిగలవాని కవిద్య " అని యిట్లన్యోన్యాశ్రయముకదా? కాదు. అనాత్మలయం దాత్మబుద్ధి యవిద్యాకార్యము. దీని కవిద్య కారణము. కాన, కార్యముచే గారణము నూహింపనగును.

ఓయి! అనాత్మలను ఆత్మగా దలచువా డవిద్యావంతుడని మాకును దెలుసును. వా డెవడని మా ప్రశ్న? మీ కెందు కీప్రశ్న? తెలిసికొనుటకే. అయితే నన్నడుగకపూర్వమే నీకీవిషయము తెలిసినదికదా? అనాత్మను ఆత్మగా తలంచువా డవిద్యావంతుడని నీకు తెలియనిచో, వాడెవ్వడని నీవు న న్నెట్లడుగుచుంటివి? నీవే అవిద్యావంతుడవని (అవిద్యకలవాడవని) నీకు తెలిసియే యున్నది. కాన నీవే అనాత్మలయం దాత్మబుద్ధిని తొలగించుకొనవలయును.

అసంగుడయిన ఆత్మకు ( పురుషునకు ). అవిద్యాసంగ మెట్లనుశంక నీకు పనికిరాదు. అవిద్య యతివిచిత్రమయినది. అది త్రాడును పామునుగ జేయును. అసంగుని ససంగునిగ జేయును. రూపరహితమయిన నాకసమును నలుపువర్ణము కలదానినిగ జేయును. ఆత్మ జ్ఞానస్వరూపుడనియు, జ్ఞానావిషయుడనియును తేలినది. బౌద్ధాభిమతమయి, వృత్తిజ్ఞానరూపమయిన క్షణికవిజ్ఞానము సాకారముకాని చైతన్యము సాకారముకాదు. కాన నిరాకారుడయిన ఆత్మ చైతన్యరూపుడగుట సుస్థిరము.

ఓయి! " దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః " అనుశ్రుతి ఆత్మ బుద్ధివిషయు డగునని చెప్పుచుండ, ఆత్మ అవిషయుడని పూర్వపక్షి యనుటకాని, సిద్ధాంతి యంగీకరించుటకాని యెట్లు పొసగును? నిజమే. " యత్త్

ద్రేశ్య మగ్రాహ్యం" "యతో వాచో నివర్తంతే" అను శ్రుతులు, ఆత్మ అవిషయుడనియే చెప్పుచున్నవి. మీరు సూచించిన శ్రుతి, బుద్ధియం దేకాగ్రతయుండ ఆత్మ స్వయముగ స్ఫురించునని వెల్లడించుచున్నది. జ్ఞాతయగు ఆత్మకు జ్ఞేయత్వమును నిరూపించుటలేదు. ఆత్మ అవిషయుడని చెప్పెడి శ్రుతి, స్మృతి, పురాణ వచనము లనేకములు కలవు. "అవిషయుడయిన ఆత్మయందు శాస్త్రప్రమాణ మెట్లు ప్రవర్తింపును? బ్రహ్మయందు శాస్త్రము ప్రమాణమగుచో, శాస్త్రమునకు బ్రహ్మ విషయమయినట్లేకదా? అను సందేహము మీకు వలదు. శాస్త్రముకూడ ఇదమిత్థమని బ్రహ్మను బోధించుటలేదు. అవిద్యాధ్యారోపణమును మాత్రము పోగొట్టుచున్నది. కనుకనే శ్రుతిగీతలయందు వ్యాసులు "శ్రుతయ స్త్వయిహి ఫలం త్యతన్నిరసనే నభవన్నిధనాః" (శ్రుతులు నీయం దారోపించబడిన వస్తువులను నిషేధించుచు సార్థకములగుచున్నవి) అనిచెప్పిరి.

ఓయి! వేదాంతములకు బ్రహ్మయందు రెండురకములయిన ప్రవృత్తి కలదు. విధిముఖమున నొకటి. నిషేధముఖమున మరొకటి. సచ్చిదానందాది వాక్యములు విధిముఖమున బ్రహ్మయందు ప్రవర్తించుచున్నవి. "అస్థూల మనణు" ఇత్యాది వాక్యములు నిషేధముఖమున ప్రవర్తించుచున్నవి. ఈయది శాస్త్రసంప్రదాయము. ఇట్టితరి సచ్చిదానందాది వాక్యములు బ్రహ్మయందు విధిముఖమున ప్రవర్తించుచుండ, బ్రహ్మ అవిషయుడగు టెట్లు పొసగును? నిజమే. సచ్చిదానందాది వాక్యములుకూడ లక్షణచేతనే బ్రహ్మను బోధించుచున్నవికాని, అభిధావ్యాపారమున బోధించుటలేదు. అభిధావ్యాపారముచే బ్రహ్మయందలి స్థూలత్వాది ధర్మములను నిషేధించునట్టి అస్థూలాదిశ్రుతులకు నిషేధముఖమున ప్రవృత్తియనియు, లక్షణావ్యాపారమున అసత్త్వ, జడత్వ దుఃఖాదులను నిషేధించునట్టి సచ్చిదానందాది వాక్యములకు విధిముఖమున ప్రవృత్తియనియు శాస్త్రసిద్ధాంతము. కనుకనే శ్రుతులు బ్రహ్మయందు తాత్పర్యవృత్తితో బర్యవసానమును జెందుచున్నవని శ్రుతిగీతలయందు జెప్పబడినది. కావున నిట్లు శబ్దగోచరత్వాది విశేషములు లేనందువలననే బ్రహ్మము నిర్విశేషమగుచున్నది.

నిర్విశేషమగు (నిరాకారమగు) జ్ఞాన మెచ్చటను లేదనరాదు. తార్కికులు కూడ నిర్వికల్పజ్ఞానము నంగీకరించిరి. కాన చైతన్యరూపజ్ఞానము నిర్విశేషమే యనదగును. వృత్తిజ్ఞానముమాత్రమే విషయాకారమును జెందును. కాన నిరాకారము, జ్ఞానమాత్రము నయిన చైతన్యమే యాత్మ. విషయాకారమును జెందునది బుద్ధియే. దానినే తార్కికాదులు క్షణికవిజ్ఞాన మనిరి.

ఇట్లే ఉపాసకుడు "అహంబ్రహ్మాస్మి" అని యావృత్తిపరచు జ్ఞానముకూడ బుద్ధివృత్తియే.

నీరూపమయిన గగనమునకు గగనాకారబుద్ధివృత్తియు, నీరూపమయిన సుఖమునకు సుఖాకారమయిన బుద్ధివృత్తియు కలిగినట్లు నిరాకారమయిన బ్రహ్మకు గూడ బ్రహ్మాకారమగు బుద్ధివృత్తి సంభవించును. ఇంతమాత్రమున బ్రహ్మకు బుద్ధివృత్తివిషయత్వము సంభవించదు. "ఇది ఘటము, ఇది యాకాశము" అనినట్లు "ఇది బ్రహ్మ" మని మనకు తెలియశక్యముగాదు. కాన బ్రహ్మ బుద్ధివృత్తి కవిషయమే యగును.

ఉపాసకుని బుద్ధివృత్తి బ్రహ్మాకారముగ పరిణామము నొందకయే కలుగును. అయ్యది రామమంత్రాదులవలె శబ్దాకారముగనె పరిణామమును జెందును. రామ మంత్రమును పలుమా రుచ్చరించినట్లే బ్రహ్మోపాసకుడుగూడ "అహంబ్రహ్మాస్మి" అను మహామంత్రము నుచ్చరించుచున్నాడు సమాహితుడగు జ్ఞానికిగూడ బ్రహ్మాకారవృత్తిలేకుండగనే బ్రహ్మసాక్షాత్కారము కలుగును. ఆత్మసాక్షాత్కారమునం దాత్మాకారమయినవృత్తి యనావశ్యకము. దేవదత్తుడు ఘటమును దెలిసికొనినట్లు తనను తాను స్వయముగ దెలిసికొనునుగాని బుద్ధివృత్తితో దెలిసికొనడు. సమాధి యందు బుద్ధికి బ్రహ్మాకారవృత్తియుండునన బుద్ధి నిర్వికల్పతను జెంది యేకాగ్రముగ నిలచియుండుటయే. బుద్ధి యట్లు నిలచియున్నపుడే ఆత్మసాక్షాత్కారము సంభవించును. సుషుప్తిదశలో బుద్ధియే లేదు. అందువలన నపు డాత్మసాక్షాత్కార ప్రసక్తి యసంభవము. జాగ్రత్స్వప్నములయందు బుద్ధి విక్షిప్తముగా నుండును. ఏకాగ్రతను జెందదు. కాన నారెండుదశలలోను ఆత్మసాక్షాత్కారప్రసక్తి లేదు. బుద్ధియొక్క యేకాగ్రత ఆత్మసాక్షాత్కారమున కుపయోగించుటనుబట్టియే "దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా" అని చెప్పబడినది. ఇంతియేకాని బుద్ధివేద్యు డగుటవలన గాదు. కనుకనే ఆత్మ స్వసంవేద్యు డనబడుచున్నాడు. స్వసంవేద్యు డనగా నితర సంవేద్యుడు కాకుండుటయే. కావున ఆత్మ స్వసంవేద్యుడు, జ్ఞానావిషయుడు ననునది నిర్వివాదము.

ఇది యిట్లుండ కొందరు సగుణోపాసకులు తామే పండితులమని గర్వించి, "ఆత్మ నిరాకారుడగుచో బుద్ధి యాత్మచెంతకు చేరలేదు. అనగా ఆత్మనుంచి తొలగిపోవును." అనగా బుద్ధికి ఆత్మనిష్ఠ యసంభవమని యనిరి.

ఈయది వీరియభిప్రాయము.

బుద్ధికి అనాత్మపదార్థములయొక్క ఆకారము తొలగినందున, ఆత్మజ్ఞానము కలుగుట సులభమే. అయినను ఆత్మజ్ఞాననిష్ఠ దుస్సాధ్యము. జ్ఞాననిష్ఠయన జ్ఞానమునం దెల్లపు డుండుట. అది బుద్ధియొక్క ధర్మము. విష్ణుధ్యాననిష్ఠయన ధ్యేయుడయిన విష్ణువునందు బుద్ధి చిరకాలముండుట యనినట్లు, ఆత్మజ్ఞాననిష్ఠయన జ్ఞేయమయిన ఆత్మయందు బుద్ధి చిరకాల ముండుటయని చెప్పవలయును. ఇట్టితరి సాకార

మగు వస్తువే బుద్ధికి చిరకాల మాధారమగునుకాని, నిరాకారమగు వస్తు వాధారము కానేరదు. నిరాకారమయిన ఆత్మవస్తువునందు బుద్ధి క్షణకాలముండుటయే దుష్కరము. ఇంక బహుకాలముండు టెట్లు? కాన ఆత్మజ్ఞాననిష్ఠ దుస్సాధ్యము" అని.

సమాధానము :

ఆత్మజ్ఞాననిష్ఠ విద్వాంసులకు దుస్సాధ్యమనియా మీయాశయము ? లేక అవిద్వాంసులకు దుస్సాధ్యమనియా ? ఇందు అవిద్వాంసులకు ఆత్మజ్ఞాననిష్ఠ దుస్సాధ్యమనునది మే మంగీకరింతుము. కాని వేదాంతసంప్రదాయములను గుర్తించి గుర్వనుగ్రహము నొంది, వేదాంతశ్రవణాదులను జేసి, బాహ్యవిషయములందు విరక్తి జెంది, ద్వైతవస్తువులను దూరపరచిన వివేకులకుమాత్ర మయ్యది దుస్సాధ్యము కాదు. పైపెచ్చు విద్వాంసులకు ద్వైతనిష్ఠయే దుస్సాధ్యము. వారికి ద్వైతవస్తువే గోచరించదు. గోచరించని వస్తువునందు బుద్ధికి స్థితి యెట్లేర్పడును ? గొడ్డురాలిబిడ్డయం దెవరికయినను బుద్ధి నిలచునా ? కావున, స్వయంప్రకాశుడు, నిత్యాపరోక్షుడు, అద్వితీయుడు నయిన ఆత్మయందే బుద్ధికి జ్ఞాననిష్ఠ సులభము.

ఓయి ! చక్షురాదీంద్రియములకు గనిపించు ద్వైతము లేదనియు, ఇంద్రియ గోచరముకాని ఆత్మవస్తువు కలదనియు, చెప్పుట విరుద్ధముకదా ? నిజమే అజ్ఞానుల కిది విరుద్ధముగనే కనిపించును. జ్ఞానులకు విరుద్ధముగ దోచదు. "నేహ నానా స్తి కించన" యత్రహి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి" "యత్రతు సర్వ మాత్మైవాభూ త్తత్కేన కం పశ్యేత్" "మృత్యోస్స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" అను శ్రుతులు విద్యావస్థలో ద్వైతము లేదనియు, అవిద్యావస్థలో ద్వైతము కలదనియు జెప్పుచుండ నీరెండును విరుద్ధము లెట్లగును ? శ్రుతిసిద్ధమయిన విషయము విరుద్ధమనుట కేరికిఁదరము ?

కావున నవిద్యాదశయందే ద్వైతము కనిపించుచున్నది. అప్పుడది లేదనుట యుచితముకాదు. విద్యాదశయందు ద్వైత మగపడదు. అప్పు డది లేదనుట యుక్తము. కనుక విద్యావంతుల కాత్మజ్ఞాననిష్ఠ సులభమే యగును. ఇదియంతయు కృష్ణ పరమాత్మ "యానిశా సర్వభూతానాం తస్యాం జాగ్రతిసంయమీ "అను శ్లోకము నందు నిరూపించిరి. కావున బుద్ధి ఆత్మస్వరూపము నవలంబించుటకు బాహ్యాకార భేదజ్ఞానము తొలగుటయే కారణముకాని, ఆత్మె కాకారముండ బనిలేదు. కాన ఆత్మ నిరాకారుడగుటచే నాతనియందు చిత్తము చిరకాలముండనేరదను వాదము నిరాధారము. సాకారములయందు బుద్ధి చిరకాలముండునను నియమ మగపడు చున్నదా ? విషయాసక్తులకు సాకారమయిన విష్ణుప్రతీకమున చిత్తము స్థిరపడు చున్నదా ? లేదు. కాన సాయా ఆలంబనములయందు బుద్ధి స్థిరపడుటకు నాలంబనములయందలి యాకారము ప్రయోజకము (కారణము) గాదు. ఇతరవిషయముల యందు బుద్ధి ప్రవేశించకుండుటయే యందులకు కారణము. కావున ఆత్మజ్ఞాననిష్ఠను

గోరెడి పురుషుడు బాహ్యాకారములయందలి భేదబుద్ధిని తొలగించుకొనవలెను. అంతమాత్ర మాతడాచరించినచో బుద్ధి కాత్మనిష్ఠ సులభముగ నేర్పడును.

సగుణోపాసకునకుమాత్రము బాహ్యావిషయములయందు బుద్ధిని మరల్చుకొన్నంతమాత్రమున విష్ణుస్వరూపమునందు జ్ఞాననిష్ఠ కలుగదు. శబ్దాదివిషయముల నుంచి బుద్ధిని మరల్చుకొని మనస్సునందు విష్ణుమూర్త్యాకారమును గల్పించుకొని ఆయాకారమునందు బుద్ధిని బలాత్కారముగ ప్రవేశపెట్టవలయును. అయ్యది కష్టతరము. అందు బుద్ధి చిరకాలముండుటయు కష్టతరమే. కాన సాకార విష్ణ్వాది మూర్తి ధ్యాననిష్ఠకంటె ఆత్మజ్ఞాననిష్ఠయే సులభము. ఆనందరూపమయిన ఆత్మస్వరూపము బుద్ధియం దొక్కతూరి స్ఫురించినచో, నింక చిరకాల ముండుట కడ్డులేదు.

ఇట్టి యాత్మానందము సకలప్రాణులకు సుషుప్తియం దనుభవగోచర మగుచున్నది. మనోవృత్తియందు ప్రతిఫలించిన ఆత్మానందమే విషయానంద మనబడుచున్నది. ఒక్కమా రాత్మానంద మనుభవించిన బుద్ధి మరల దానిని విడువదు. కావున అకృతబుద్ధికే ఆత్మస్వరూపాలంబనము కష్టతరము. కృతబుద్ధికి సులభమే యగును. సంస్కారరహితమయిన బుద్ధికే ఆత్మస్వరూపము అవిషయమగునుగాని, సంస్కారముగల బుద్ధి కవిషయము గాదు. ప్రమాతకు స్వస్వరూపానందానుభవమునుగురించి బుద్ధియందలి యేకాగ్రతయె సాధనము. మోక్షమునందుమాత్రము ఆత్మ స్వస్వరూపచైతన్యమాత్రములో నుండుటయే ఆనందానుభవము. సుషుప్తియం దవిద్యావృత్తులతో నానందానుభవము.

ఆత్మ యెప్పుడు యెవ్వనికిని అప్రసిద్ధుడు గాడు. విద్వాంసుల కాత్మ సచ్చిదానందరూపముతో ప్రసిద్ధుడు. అవిద్వాంసులకు ఆత్మరూపముతోమాత్రమే ప్రసిద్ధుడు. అవిద్వాంసులు అనాత్మవస్తువులను ఆత్మనుగా గ్రహించిరి. అందు యథార్థమును గ్రహింపజేయుటకే భగవంతుడు వేదాంతశాస్త్రమును ప్రవర్తింపం జేసెను. ఇంతియెగాని, యప్రసిద్ధమగు ఆత్మను బోధించుటకు వేదాంతములు ప్రవర్తించలేదు. ఆత్మ యప్రసిద్ధమగుచో లౌకికులు, వైదికులు ఆత్మకొఱ కాచరించెడి నిఖిలకృత్యములు నీట కలియును. మానవులకృత్యము లన్నియు, దేహాదుల కొఱకుగాని ఆత్మకొఱకుగాదని యనరాదు. అచేతనమయిన దేహాదులకు అన్నము తినినచో మనము పుష్టిఁజెందుదు మను జ్ఞానముండదు. దేహాభివృద్ధినికూడ ఆత్మయే కోరునుగాని, దేహములు కోరనేరవు. సుఖదుఃఖములకొఱకయిన ప్రవృత్తులుకూడ ఆత్మకొరకేగాని సుఖదుఃఖములకొఱకు గాదు. గాన ఆత్మ అప్రసిద్ధమగుచో కర్త, భోక్త లేనందున అన్నిపనులు వ్యర్థములగును.

లోకములో చక్షురాది ప్రమాణములచే (ఇంద్రియములచే) ప్రమేయములయిన ఘటాదులు పరిచ్ఛేదము నొందుచున్నవి. అట్లు తనదేహము ప్రమాణము

లచే పరిచ్ఛేదము నొందుటలేదు. ప్రమాణవ్యాపారమునకు పూర్వమందే తన దేహము తనకు దెలియుచున్నది. మానవుడు తనను తాను కంటితో జూచుకొని తాను మానవుడనని యనుకొనుటలేదు. అట్లగుచో చీకటిలో చక్షుర్వ్యాపారము లేనందున తనకు మానవుడ నను జ్ఞానమే యుండకపోవును. దేహముయొక్క లావు సన్ననలు గ్రహించుటకు చక్షురాదిక మావశ్యకమని యనరాదు. అయ్యది దేహ పరిచ్ఛేదము గాదు. దేహముయొక్క గుణపరిచ్ఛేదము. కావున దేహపరిచ్ఛేదము నకు ప్రమాణాంతరాపేక్ష లేకపోవుటకు దేహము ప్రమాణములకంటె దగ్గర దగుటయే కారణము. దూరమున నున్న ఉసిరిగకాయను గుర్తించుటకు ప్రమాణాపేక్ష యవసరము. అరచేతిలోనున్న యద్దానిని (ఆమలకను) గుర్తించుట కట్లు ప్రమాణాపేక్ష యుండదు. అరచేతిలోని యామలకమును దూరముగ విసరివైచి నచో దానిని గుర్తించుటకు మరల ప్రమాణాపేక్ష యావశ్యకము. కావున వస్తు పరిచ్ఛేదము నయ ప్రమాణాపేక్ష యుండుటకును లేకుండుటకును దగ్గర, దూరములే కారణములు.

ఇట్లు దేహజ్ఞానమునకే ప్రమాణాపేక్ష లేనపుడు అంతకంటె సన్నిహిత మయిన ఆత్మజ్ఞానమునకు ప్రమాణాంతరాపేక్ష లేదని వేరుగ జెప్పనేల? ప్రమాణ వ్యాపారముచే తనను తెలిసికొనగోరువాడే ఆత్మ (తాను). ఇంక తనను తెలిసి కొనుటకు ప్రమాణవ్యాపార మెందులకు? లోకములో నెవ్వరికిని తనయందు సంశయ విపర్యయజ్ఞానములు లేవు. కాన వివేకవంతులకు ఆత్మజ్ఞాననిష్ఠ సుప్రసిద్ధము. లోకములో నెంతటి మూఢుడయినను 'నేను మనిషినా? పశువునా?' అని సందేహ పడుటకాని "మనుష్యుని కాను. పశువును" అని విపరీతజ్ఞానము నొందుటకాని యుండదు.

అట్లే వివేకవంతునకుగూడ 'నేను సచ్చిదానందబ్రహ్మనా? సంసారినా? బ్రహ్మను గాను. సంసారినే' అను సంశయ విపర్యయజ్ఞానము లుండవు. కావున అవివేకులకు ఆత్మజ్ఞాననిష్ఠ దుర్లభమయినను వివేకులకుమాత్ర మయ్యది యత్యంత సులభమని సిద్ధమయినది.

ఇందు ఆత్మ నిరాకారుడయినను, నిత్యాపరోక్షుడయినందున ప్రసిద్ధుడగుట చెల్లును. నిరాకారమయిన జ్ఞానముమాత్రము ప్రత్యక్షము కానేరదని కొంద రందురు. అది పొరపాటు. జ్ఞాన మప్రసిద్ధమయితే జ్ఞేయము ప్రసిద్ధముగాదు. తండ్రి కుమారుని ఘటము తెమ్మని చెప్పె ననుకొనుడు. కుమారునకు "ఇది ఘట"మను జ్ఞానములేనిదే ఘటమెట్లు తెచ్చును? అచట జ్ఞానము సాకారమని యనరాదు. అచట విషయాంశమగు ఘటమె సాకారముగాని విషయియగు జ్ఞానము సాకారము గాదు. ఎట్లన?

"ఇది ఘట"మను జ్ఞానమునందు ఘటశబ్దముండుటవలన ఘటజ్ఞానము సాకారమందురా? లేక ఘటమునకువలె ఘటజ్ఞానమునకుగూడ కంబుగ్రీవాద్యాకార ముండుటవలన అనియందురా? ఇందు మొదటి పక్షము కుదరదు.

"ఇది ఘట"మను వాక్యమునందు ఘటశబ్ద మున్నదికాని, ఘటజ్ఞానమునందు లేదు. అట్లు కానిచో "అయం రామశబ్దః." ఇది "రామశబ్దము" అను జ్ఞానము నందుగూడ రామశబ్ద ముండవలయును. దాని నంగీకరించుచో, రామశబ్దమునందు రామశబ్దమను వ్యాఘాత మేర్పడును. (నిరోధ మేర్పడును.) మరియు శబ్దములు గలది వాక్యమను వ్యవహారముండుటచే శబ్దముగల జ్ఞానముకూడ వాక్యము కావలసి వచ్చును. జ్ఞానమునందు శబ్దముండుచో నాశబ్దమును గ్రహించుటకు మరియొక జ్ఞానము కావలసివచ్చును. దానియందున్న శబ్దమును గ్రహించుటకు మరియొక జ్ఞానము— అని యిట్లనవస్థ యేర్పడును. ఘటజ్ఞానమునందు ఘటశబ్దముండుచో నీజ్ఞానము ఘటశబ్దయుక్తమను జ్ఞానముండవలయును. లోకములో నట్లనుభవము లేదు. కావున ఘటజ్ఞానమునందు ఘటశబ్దము లేదు.

అట్లే ఘటజ్ఞానమునకు కంబుగ్రీవాద్యాకారము లేదు. జ్ఞానమునం దట్టి యాకారము కనిపించదు.

"అయంఘటః" అను జ్ఞానము సవిషయమగుటవలన సాకారమని యనరాదు. సవిషయజ్ఞానమునందు ఘటము విషయమా? నిర్విషయజ్ఞానమునందా? ఇందు మొదటిపక్షమున జ్ఞానమునందు ఘటము విషయముకాకపూర్వము జ్ఞానము సవిషయ మెట్లగును? రెండవపక్షమున నిరాకారమయిన జ్ఞానము సిద్ధించినట్లే.

మరియు పుట్టినజ్ఞానమునందు ఘటము విషయమగుట లేదనియు, బుట్టబోవు జ్ఞానమే సవిషయముగ బుట్టుననియు జెప్పుట తగదు. జ్ఞానమునకు జన్మనాశములు లేవు. ఉన్నచో వాటిని గ్రహించుటకు జ్ఞానాంతరము కావలసివచ్చును. ఇట్లనవస్థ యేర్పడును. తన జన్మనాశములను తాను గ్రహించనేరదు. జ్ఞానముయొక్క జన్మ నాశములను జ్ఞాత గ్రహించునని యనరాదు. జ్ఞానమే జ్ఞాత. జ్ఞానాశ్రయుడు గాడు. అట్లగుచో జ్ఞానము పుట్టకపూర్వము, జ్ఞానము నశించినతరువాతను వానికి జ్ఞాతృత్వము లేకపోవలసివచ్చును. ఇష్టాపత్తియున్నచో జ్ఞానోదయ నాశములకు సాక్షి యేది? సాక్షిలేనివాటి నంగీకరించు టెట్లు? వాటి కాత్మయే సాక్షియని యనరాదు. ఆత్మ యందు జ్ఞానము పుట్టకపూర్వము జ్ఞానప్రాగభావ ముండును. జ్ఞానప్రాగభావముగల ఆత్మయందు జ్ఞాన మెట్లుండును? జ్ఞానముండుచో తత్ప్రాగభావ మెట్లుండును? అట్లే జ్ఞానప్రధ్వంసానంతరము జ్ఞానముండుట యసంభవము. జ్ఞానముండుచో తత్ప్రధ్వంస మసంభవము. కావున జ్ఞానప్రాగభావ ప్రధ్వంసాభావములుగల యాత్మ జ్ఞాత కానేరదు. కాన ఘటజ్ఞానోదయ ఘటజ్ఞాననాశము లాత్మసాక్షిక

ములుకావు. వేరుసాక్షి లేదు. కనుక నవి అసాక్షికములు. అనుమానముచేగూడ వాటిని సాధింప వలనుపడదు. హేతుజ్ఞానమే అసాక్షికమయినందున అనుమాన ప్రమాణమే యవతరింపదు. కాన జ్ఞానమున కుదయాస్తమయములు లేవు. అది స్వయంప్రకాశము. అద్వితీయము. ఇట్టి సంవిత్తుయే జ్ఞానమనబడును. ఈయది బుద్ధివృత్తులయందు ప్రతిఫలించును. అప్పుడు వృత్తి జ్ఞాన మనబడును. బుద్ధి వృత్తులు క్షణికములు. కనుక వృత్తిజ్ఞానములుగూడ క్షణికములు. అందువలన ఘటపటాదిజ్ఞానములు సదాతనములు (నిత్యములు) కావు.

బుద్ధివృత్తులు విషయాకారమును జెంది, సాకారములయినంతమాత్రమున వానియందు ప్రతిఫలించిన చైతన్యముకూడ సాకారమని యనుకొనుట పొరపాటు. అద్దమునం దభివ్యక్తమయిన ముఖము అద్దముయొక్క ఆకారముతో సాకారమగుట లేదు. అట్లగుచో అంతఃకరణప్రతిఫలితచైతన్యముకూడ నంతఃకరణాకారముతో సాకారుడు కావలయును. నీటియందు ప్రతిఫలించిన ఆకసముకూడ నీటియాకార ముతో సాకారము కావలయును. అట్లగుటలేదు. కాన, ప్రతిబింబమునకు బింబా కారమేకాని యుపాధియొక్క ఆకారమంటదు: కనుక బుద్ధివృత్త్యభివ్యక్తమయిన చైతన్యమునకు బింబభూతమయిన చైతన్యముయొక్క ఆకారమేకాని బుద్ధివృత్తి యొక్క ఆకారమంటదు. ఆచైతన్యము నిరాకారమయినందున ప్రతిబింబచైత న్యముకూడ నిరాకారమే యగును. బింబప్రతిబింబముల కుపాధివలన భేదమేకాని తాత్త్వికభేదము లేదు. చైతన్యమునకు బుద్ధివృత్తులందు ప్రతిఫలము అనిత్యమగును కాని చైతన్యమమాత్ర మనిత్యముకాదు. అది సత్యము. స్వయంప్రకాశము. ఇదియే ఆత్మస్వరూపము. కాన జ్ఞానమే యాత్మ. జ్ఞానస్వరూపుడయిన ఆత్మ అత్యంత ప్రసిద్ధుడయినందున ఆత్మజ్ఞానమునందు ప్రయత్నింపవలసిన పనిలేదు. ఇంతమాత్రమున వేదాంతశాస్త్రము వ్యర్థముకాదు. వేదాంతశాస్త్రము ఆత్మ జ్ఞానార్థముకాదు. అనాత్మలయందుగలిగిన యాత్మబుద్ధిని నివర్తింపజేయుటయే వేదాంతశాస్త్రమునకు ప్రయోజనము. కావున ఆత్మజ్ఞాననిష్ఠ సులభము.

ఓయి ! ఆత్మజ్ఞాననిష్ఠ సులభమగుగాక. దానితో ఫలమేమి ? బ్రహ్మజ్ఞాన నిష్ఠకదా మోక్షము నిచ్చును. దానిని సంపాదించవలయును. బ్రహ్మ నిరాకారుడు. అప్రసిద్ధుడు. కావున బ్రహ్మజ్ఞాననిష్ఠ కుదురుట యసంభవము. అనినచో నట్లు కాదు.

బ్రహ్మ బొత్తుగా ప్రసిద్ధము కాకపోతే బ్రహ్మజ్ఞాననిష్ఠ కావలయునను గోరిక యెట్లు పుట్టినది ? నిజమే బ్రహ్మ బొత్తుగా ప్రసిద్ధము కాకపోలేదు. ఊహా వలన గొంచెము ప్రసిద్ధము. పూర్తిగా ప్రసిద్ధము కాలేదు. అందువలన బ్రహ్మ జ్ఞానేచ్ఛ కలిగినది. అయితే శాస్త్రము బ్రహ్మమే ఆత్మయని చెప్పుచున్నందున బ్రహ్మమే ఆత్మయని తెలిసికొని సుప్రసిద్ధమయిన బ్రహ్మయందు నిష్ఠనొందుము.

శాస్త్రము బ్రహ్మాత్మలకు భేదము లేదని చెప్పినను, అనుభవమునకు విరుద్ధమయి నందున దాని నంగీకరించు టెట్లని యనరాదు. శాస్త్రోక్తమయిన బ్రహ్మాత్మా భేదమునందు విరోధము లేదు. నీ వనుభవించెడి సుఖదుఃఖాద్యనుభవరూపమయిన సంసారము మనోధర్మముకాని ఆత్మధర్మము కాదు. "అహం సుఖీ" నేను సుఖిని, నేను దుఃఖిని అను ప్రతీతులు ఆధ్యాసికములు. నిజములు కావు. నాస్తికుడు దేహ ధర్మములను ఆత్మయం దారోపించుకొని 'పుట్టితిని, చచ్చితిని, కుంటిని, గ్రుడ్డిని' అని యనుకొన్నట్లు ఆస్తికుడుకూడ అనాత్మభూతమయిన మనస్సు మున్నగువాటి యొక్క ధర్మములను ఆత్మయం దారోపించుకొని 'నేను కర్తను, భోక్తను, సుఖిని, దుఃఖిని' అని యనుకొనును.

కావున నీలోకవ్యవహారమంతయు నవివేకకృతము. అనుభవించబడుచున్న జ్వరాదిబాధలు ఆత్మధర్మములు కావని నిషేధించతగ దనరాదు. జ్వరాదిబాధలు ఆత్మకా? దేహాదులకా? ఆత్మకయినచో నిద్రలో లేవేమి? దేహమునకు (అనా త్మకు) చికిత్సచేయగా ఆత్మతాపమేల నివర్తించును? ఆత్మకుకదా చికిత్సచేయ వలయును? రోగ మొకరికయినపుడు మందు మరియొకరికి వాడుట విరుద్ధముకదా? రెండవపక్షమున ఆత్మ అసంసారియని సిద్ధమయినది. కావున ఆత్మ అసంసారియగు సచ్చిదానందబ్రహ్మమే. ఇట్లు బ్రహ్మమే ఆత్మయగుటవలన బ్రహ్మజ్ఞాననిష్ఠ విద్వాం సులకు సులభము. అవిద్వాంసులయి పండితుల మనుకొనెడి వారలకు బ్రహ్మజ్ఞాన నిష్ఠ దుర్ఘటమే యగును. అట్టివారు సగుణబ్రహ్మోపాసనయందుగాని కర్మయోగము నందుగాని యావజ్జీవముండుగాక. "అనేకజన్మ సంసిద్ధ స్తతో యాంతి పరాంగతిం" అనినట్లు వా రనేకజన్మలకు జ్ఞాననిష్ఠాయోగ్యత నొంది, సంన్యసించి, జ్ఞాననిష్ఠను సంపాదించి, సచ్చిదానందబ్రహ్మము నేనను సమ్యగ్జ్ఞానమున ముక్తినొందుదురు. జన్మాంతరార్జిత సుకృతమున నీశ్వరానుగ్రహము నొందినవారు అద్వైతసిద్ధిని యీ జన్మమునందే బడసి ముక్తినొందుదురు. పరంపరా ముక్తి ద్వైతులకు, సాక్షాన్ముక్తి యద్వైతులకు. ఇదియే వీరిరువురకు గల విశేషము. ५०

శ్లో॥ బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽత్మానం నియమ్య చ
శబ్దాదీన్ విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ॥ ५१

భా॥ అ॥ జ్ఞానముయొక్క పరానిష్ఠను సంపాదించుట కుపాయ మిందు ప్రదర్శింపబడుచున్నది. "నిష్కపటమయిన నిశ్చయాత్మకజ్ఞానముతో గూడుకొని ధైర్యముచే కార్యకరణసంఘాతాత్మకమగు శరీరమును నిగ్రహించుకొని (వశపరచు కొని) శబ్దస్పర్శాది విషయములను దూరపరచి రాగద్వేషముల వీడి, విజనప్రదేశ ముననుండి కొలదిగ నాహారమును గ్రహించుచు వాక్కాయమనస్సులను నియమించు కొని సదా ధ్యానయోగపరుడై స్థిరమైన వైరాగ్యము నవలంబించి, అహంకార

మును కామరాగాదులవలన నేర్పడిన ఆవేగమును (బలమును) దర్పమును కామ క్రోధపరిగ్రహములను విడచి మమతారహితుడై శాంతుడగువాడు బ్రహ్మభావము నందుటకు సమర్థుడగును" అని మూడుశ్లోకములను కలిపి యన్వయించు కొనవలయును.

ఇచట బుద్ధిపదమునకు సాత్త్వికబుద్ధియని యర్థము. అయ్యదిగాని మనః ప్రాణేంద్రియక్రియలను శాస్త్రనిషిద్ధమార్గమునందు ప్రవర్తింపకుండగఁ జేయఁ జాలదు. శబ్దాది విషయత్యాగ మన శరీరము నిలిచియుండుటకు కారణమైన శబ్దా దుల విషయముకాదు. అంతకుమించి కేవలసుఖార్థములైన శబ్దాదివిషయములను విడుచుట యని తాత్పర్యము.

అయితే శరీరము నిలిచియుండుటకు శబ్దస్పర్శాదివిషయసేవ అవసరమని శాస్త్ర మంగీకరించినచో అందు కుపయోగపడు అన్నపానాది విషయములందు అను రాగమును తద్వ్యతిరిక్తములైన విషయములయందు ద్వేషమును అనివార్యమేకదా! కాదు. అట్లైనను శరీరస్థితిమాత్రమునకు హేతుభూతములైన అన్నపానాదివిషయము లందుగూడ అనురాగముకాని తదితరములందు ద్వేషముకాని పనికిరాదని తురీయ పాదాభిప్రాయము. కావున గీతాశాస్త్రము శరీరస్థిత్యర్థములైన విషయముల సేవిం చుట కభ్యనుజ్ఞ నొసగినది. కాని దానిని పురస్కరించుకొని కలిగెడి రాగద్వేషాదుల విషయమై అభ్యనుజ్ఞ నీయలేదు.

శ్లో॥ వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః ·
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః॥ ౫౨

శ్లో॥ అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహం
విముచ్య నిర్మమ శ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే॥ ౫౩

భా॥ అ॥ ఆత్మజ్ఞానముయొక్క పరానిష్ఠను సంపాదింపఁదలచినవానికి ఈ ముందుఁ జెప్పఁబోవు నేమము లావశ్యకములు. జ్ఞాని విజనప్రదేశముల (పవిత్ర ప్రదేశముల) సేవింపవలెను. ఆహారమును స్వల్పముగా తీసికొనవలెను. అరణ్యములు నదీపులినములు గిరిగుహాదులును విజనపవిత్రప్రదేశములు– ఇట్టివానిని సేవింపక జ్ఞాని పత్తనాది జనసహితదేశములను సేవించుచో గ్రామ్యకథాప్రసంగము నొందును. మఱియు సురూపస్త్రీపురుషాదులను సుగంధద్రవ్యాదులను చూచినందున చిత్తేం ద్రియములకు విక్షేపము కలుగును. ఆహారము నతిగా తీసికొనినందున నిద్రామదాది దోషము లలవడును. ఇట్టిదోషముల పోగొట్టుకొనుటకు పై నియమము లావశ్య కములు. అట్లే జ్ఞానికి వాఙ్నియమము, శరీరనియమము మానసనియమములుగూడ నావశ్యకములు. ఈనియమములవలన జ్ఞానప్రతిబంధకములగు వాచిక కాయిక మానసిక వ్యాపారములు నివర్తించును. దీనివలన మౌని జితాసనుడును జిత

మానసుడును కావలయునని తేలినది. ఇట్లు అంతర్బాహ్యేంద్రియములను నిగ్రహించుకొని ఆత్మస్వరూపచింతనమునందు మనస్సు నేకాగ్రపరచి సర్వదా ధ్యానపరుడై మంత్రజపాదులందువలె చిత్తవిక్షేపమొందక, దృష్టాదృష్టవిషయములందొకానొకప్పుడును అనురాగము జెందక దృఢమైన వైరాగ్యము నలవఱచుకొని అహంకారాది దోషములను రూపుమాపికొని పరమశాంతుడగు మౌని మోక్షము నొందుటకు అర్హుడగును.

దేహేంద్రియాదులయందు నేనను బుద్ధి అహంకారము సంతోషానంతరము కలుగుచు ధర్మము నతిక్రమించుటకు హేతువగు మనోవికారము దర్పమనబడును. అనగా గర్వమని భావము. ఇష్టవిషయములందలి కోరిక కామము. అనిష్టవిషయములందలి ద్వేషము క్రోధము.

పరిగ్రహము రెండువిధములు. ఆంతరము – బాహ్యము. రాగద్వేషాదికమాంతరపరిగ్రహము. వస్త్రాలంకారాదులు బాహ్యపరిగ్రహములు. ఈ రెంటిని విడుచుట జ్ఞాని కవసరము. ఇందు ఆంతరపరిగ్రహపరిత్యాగము (లోపలి పరికరములను విడుచుట) 'అహంకారం బలం దర్పం కామం క్రోధం విముచ్య' అనుదానిచే సూచింపబడినది. ఇక యీశ్లోకమునందలి పరిగ్రహపదము బాహ్యపరిగ్రహముమాత్రమే విడువుమని చెప్పుచున్నది. కాన సంపూర్ణ శ్లోకము రెండు రకముల పరిగ్రహమును విడుచుట యతికి ఆవశ్యకమని సూచించుచున్నది.

దీనిచే నిం దుదహరింపఁబడిన వివిక్తసేవాది ధర్మములు సన్న్యాసివిగాని గృహస్థునివి కావని సిద్ధించుచున్నది. కనుకనే భాష్యకర్తలగు శ్రీశంకరులు శ్లోకమునందలి 'నిర్మమః' అనుపదమునకు భాష్యమును రచించుటలో దేహజీవనమాత్రమునందును మమతలేనివాడని నిర్వచించిరి. గృహ ధన పశ్వాదులయందలి మమత విడుచుట సన్న్యాసికి ఇతఃపూర్వమే సిద్ధించినదనియు జ్ఞాని యిపుడు జ్ఞాననిష్ఠను దృఢపరచుకొనుటకు దేహమునందుగూడ మమతను విడుచుట అవసరమనియు వ్యక్తమగుచున్నది. తనదేహము జీవించుటయందే తనకు కోరిక కూడదని చెప్పగా తద్వ్యతిరిక్తవిషయములందు మమత కూడదని వేరుగఁ జెప్పనవసరములేదు. ఇట్లు నిర్మముడగు యతి శాంతుడనియు ఉపరతుడనియుఁ జెప్పఁబడును.

ఉపరతుఁడనగా హర్ష ఆయాసములను విడచినవాడని యర్థము. ఆయాసము (శ్రమ) వలె హర్షముకూడ చిత్తమునకు విక్షేపకరము. కావున యతి హర్షమును గూడ విడువవలెను. ఇట్లు సర్వోపరతుఁడగువాడు బ్రహ్మభావము నొందుట కడ్డు లేదు. ఇదియే జ్ఞానముయొక్క పరానిష్ఠ.

శ్లో॥ బ్రహ్మభూతః ప్రసన్నాత్మా నశోచతి నకాంక్షతి
సమః సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్॥ ౫౪

భా-అ॥ ఈక్రమమున గురుశాస్త్రాదులచే బ్రహ్మజ్ఞానమునొంది మనోబుద్ధులను నిర్మలపరచుకొనినవాడు తనకు గలిగిన అర్థనైకల్యమునుగూర్చి దుఃఖించడు. అప్రాప్తమగు విషయమును గోరడు. 'ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున, సుఖంవా యదివా దుఃఖం సయోగీ పరమోమతః' అని యారవ అధ్యాయమునందుఁ జెప్పినట్లు సమస్తభూతములయందు సమభావమునొంది పరమేశ్వరుని యందు నేనే బ్రహ్మము నను అఖండచైతన్యాకార బుద్ధివృత్తిరూపమైన పరాభక్తిని పొందును.

ఇచట మూలమునందలి భక్తిశబ్దమునకు భజనమని యర్థము. అనగా సేవించుట. ఇది జ్ఞానరూపమగు సేవ. ఇది యుత్తమసేవ యనియు, జ్ఞానికూడ భగవద్భక్తుడనియు వీడు భగవద్భక్తులలో తురీయుడనియును "చతుర్విధా భజన్తే మాం జనాః సుకృతినోఽర్జున" ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ" సప్తమాధ్యాయమునందలి పదునారవశ్లోకముచే చెప్పబడినది.

శ్లో॥ భక్త్యా మా మభిజానాతి యావా న్యశ్చాస్మి తత్త్వతః
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్॥ ౫౫

భా-అ॥ ఇట్టి జ్ఞాననిష్ఠ నొందిన తరువాత జ్ఞాని 'నేను ఉపాధిభేదముతో నెంతదూరము విస్తరించినదియు, ఉపాధిభేదము నుపసంహరించుకొన్న నాదు నిర్విశేషరూప మెట్టిదైనదియు, నాదు తత్త్వమును దెలిసికొనును. నేను అద్వితీయుడననియు, చైతన్యమాత్రైకరసుఁడననియు, జరామరణరహితుఁడననియు, అవినాశిననియు తెలిసికొనినవాడు నన్నే పొందును.

ఓయీ! ఇచటి "మాం జ్ఞాత్వా, మాం ప్రవిశతి" అను రెండు ధాతువులచే జ్ఞానక్రియ, ప్రవేశక్రియ అను రెండుక్రియలు చెప్పబడుచున్నవి. ఇందు జ్ఞానక్రియ మొదటిది. ప్రవేశక్రియ తరువాతది. ఎవడు ఎవనిని తెలిసికొనునో ఎవనియందు ప్రవేశించునో వాడు వానికంటె భిన్నుడగుట యుక్తము.

ఉదా :- 'పురుషుడు గృహమును దెలిసికొనుచున్నాడు. గృహమునందు బ్రవేశించుచున్నాడు' ఇచట గృహముకంటెఁ బురుషుడు, పురుషునికంటె గృహము వేరు. అట్లే జ్ఞాతయు ప్రవేష్ట (ప్రవేశించువాడును) యు నగు ఆత్మకంటె జ్ఞేయము, ప్రవేశ్యము (ప్రవేశింపఁదగినది) యగు బ్రహ్మము భిన్నమే కావలయును. కావున మీ అద్వైత మెట్లు సిద్ధించును? నిజమే, వినుము.

"జ్ఞాత్వా విశతే తదనంతరమ్" అను వాక్యమునందు జ్ఞానప్రవేశక్రియలు రెండు వేరని మూలకారుని ఆశయముకాదు. జ్ఞానమాత్రమే ప్రవేశమని శ్రీకృష్ణుని యాశయము. అట్లుగాక రెండుక్రియలు వేరగుచో వేరువేరు పనులకు ఫలము, వేరు

వేరుగ నుండవలయును. ఇచట బ్రహ్మజ్ఞానముకంటె వేరుగ బ్రహ్మప్రవేశమగు ఫలములేదు. 'క్షేత్రజ్ఞంచాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత' అనుశ్లోకమున శ్రీకృష్ణుఁడు జీవబ్రహ్మాఽభేదమును చెప్పెను. ఇంతియకాని జీవునికంటె వేరయి జీవునిచే పొందదగిన బ్రహ్మము వేరుగ కలడని చెప్పలేదు. కాన ఇచట 'పొందు వాడు, పొందదగినది అనుపదార్థములు రెండుగా లేనందున జ్ఞానమాత్రమే ప్రవేశ మని వివక్షితము. అయితే 'జ్ఞాత, జ్ఞేయము' అను పదార్థములు రెండుగ లేనిచో జ్ఞానముమాత్ర మెట్లు సిద్ధించునని మీ రడుగవచ్చును. కాని ఒకే చైతన్యము బుద్ధి తాదాత్మ్యాధ్యాసనొంది జ్ఞాతయు, ఆ యధ్యాసవలననే జ్ఞేయము నగుచున్నది. స్వతస్సిద్ధముగా నయ్యది జ్ఞానమాత్రమేకాన నిందు విరోధము లేదు.

ఓయీ, ఇచట శ్రీకృష్ణునకు బ్రహ్మజ్ఞానమాత్రమే వివక్షితమగుచో 'భక్త్యా మామభిజానాతి' అని మాత్రమే చెప్పియుండవలెను. 'జ్ఞాత్వా విశతే తదనంతరం' అని చెప్ప పనిలేదు. అనినచో నట్లు కాదు. 'భక్తితో నన్ను తెలిసికొను చున్నాఁడు' అనిమాత్రమే చెప్పినచో నిన్నుఁ దెలిసికొనినందులకు ఫల మేమని ఆశంక కలుగును. దానిని నివర్తింపచేయుటకొరకు నన్ను తెలిసికొనినవాడు నన్నే పొందునని చెప్పెను. అనగా బ్రహ్మజ్ఞానమునకు బ్రహ్మయే ఫలము. వేరుఫలము లేదు. బ్రహ్మసాక్షాత్కారమైనపిదప తెలియదగినవస్తువుకాని పొందదగిన వస్తువు కాని లేదు. కనుక జ్ఞానముకంటె వేరుఫలము లేదని సిద్ధించినది. బ్రహ్మజ్ఞాన స్వరూపుఁడు ఆతడే ఆత్మ కాన బ్రహ్మజ్ఞానముకంటె వేరుగ బ్రహ్మప్రవేశమనునది లేదు.

ఓయీ! కర్మయోగమువలన చిత్తశుద్ధినొందిన పురుషుఁడు క్రమముగా జ్ఞాననిష్ఠను బొంది బ్రహ్మను పొందునని 'సిద్ధిం ప్రాప్తః' అను ౫౦ వ శ్లోకము మొదలు 'విశతే తదనంతరం' అను ౫౫ వ శ్లోకమువరకు నుండు గ్రంథ ముచే చెప్పఁబడినది. అట్టి బ్రహ్మప్రాప్తి బ్రహ్మజ్ఞానముకంటె వేరుకాదని నిరూ పింపఁబడినది. కాన జ్ఞాననిష్ఠచే బ్రహ్మను దెలిసికొనుచున్నాఁడను విషయము తేలినది. ఈ జ్ఞాననిష్ఠయే 'భక్త్యా మాం అభిజానాతి' అను శ్లోకముచే 'భక్తి' శబ్దముచే చెప్పఁబడినది. జ్ఞానలక్షణమగు భక్తి నాల్గవదని యింతకుమున్ను నిరూ పింపఁబడినది. ఈ గ్రంథ మిట్లుండ జ్ఞాననిష్ఠచే బ్రహ్మను దెలిసికొనుచున్నా డనియు, జ్ఞానమాత్రముచే బ్రహ్మను దెలిసికొననేరడనియు పర్యవసించుచున్నది. జ్ఞానముచేతనే బ్రహ్మను దెలిసికొనుట సిద్ధించుచో జ్ఞానముకంటె వేరుగ జ్ఞాననిష్ఠను విధించుట వ్యర్థమగును. జ్ఞాననిష్ఠను సంపాదించుటకు ఉపాయమును చెప్పదలచియే 'బుద్ధ్యా విశుద్ధయా యుక్తః' ఇత్యాది గ్రంథ మవతరించినది. కాన జ్ఞానముచే బ్రహ్మను దెలిసికొనలేదనియు, జ్ఞాననిష్ఠచే బ్రహ్మను దెలిసికొనగలదనియుఁ దేలి నది. ఇయ్యది విరుద్ధముకదా! ఎట్లన లోకములో నెవనికి నేవిషయమునందు

జ్ఞానము కలిగినదో వా డప్పుడే ఆవిషయమును దెలిసికొనుచున్నాడు. జ్ఞానఆవృత్తి రూపమగు జ్ఞాననిష్ఠను అపేక్షించి యూరకుండుటలేదు. జ్ఞానముచేత జ్ఞేయము సాక్షాత్కారముకానిచో జ్ఞానాభ్యాసముచేతమాత్ర మదెట్లు సాక్షాత్కరించును? 'అయం ఘటః' అను జ్ఞానముచే ఘటము తెలియనిచో, అదేజ్ఞానము నా వృత్తి పరచిమాత్రము జ్ఞాత ఆఘటము నెట్లు తెలిసికొనును? అని ప్రశ్నింపరాదు :

జ్ఞాననిష్ఠయన జ్ఞానావృత్తికాదు. మరేమనిన, జ్ఞానము ఆత్మానుభవనిశ్చయావసానము నొందుటయే జ్ఞాననిష్ఠ యనబడును. అనగా 'అహం బ్రహ్మాస్మి' యను జ్ఞానము పుట్టుటకుగాని దృఢపడుటకుగాని కారణములగు నేయే బుద్ధియోగాదులు కలవో అట్టికారణములతోఁగూడిన జ్ఞానముకాని అట్టిజ్ఞానము పుట్టుటకు నయ్యది పరిపాకము చెందుటకును ప్రతిబంధములైన మానదంభాదులులేని జ్ఞానము కాని ఆత్మానుభవమును ఆపాదింపఁజేయగలదు. అంతవఱకు నుండుజ్ఞానమే జ్ఞాననిష్ఠ యనఁబడును. ఇట్టి జ్ఞాననిష్ఠ ఆర్త జిజ్ఞాసు అర్థార్థుల భక్తిత్రయముద్వారా నాల్గవభక్తియని చెప్పబడుచున్నది. ఇట్టిజ్ఞాననిష్ఠనే పరాభక్తి యందురు. ఆర్తాదుల భక్తి యపరాభక్తి. అయ్యది పరాభక్తికాదు. పరాభక్తిచేతనే భగవత్తత్త్వమును దెలిసికొందురు. కాన జ్ఞాననిష్ఠారూపమగు భక్తిచే నన్ను దెలిసికొనుచున్నాడని శ్రీకృష్ణుఁడు చెప్పినమాటలో విరోధ మేమియు లేదు.

ఓయీ! ఇచట జ్ఞానమనియు, జ్ఞాననిష్ఠయనియు, జ్ఞాననిష్ఠచే పరమేశ్వర జ్ఞానమనియు, (బ్రహ్మజ్ఞానమనియు) జ్ఞానత్రయము కనిపించుచున్నది. లోకములో జ్ఞానము పరోక్షమనియు అపరోక్షమనియును రెండేరకముల ప్రసిద్ధమైనది. మూడవ రకమగు జ్ఞానము ప్రసిద్ధముగ లేదు. కాన అప్రసిద్ధమగు నీ మూడవజ్ఞాన మెక్కడిది? వినుము. అపరోక్షజ్ఞానము బుద్ధివృత్తిరూప మనియు అనుభవరూపమనియు రెండురకములు. ఇందు బుద్ధివృత్తి జ్ఞాననిష్ఠ యనఁబడును. అనుభవము బ్రహ్మజ్ఞాన మనబడును. లేక పరోక్షజ్ఞానమే రెండురకము లనవచ్చును. శ్రవణమువలన కలిగిన 'అహం బ్రహ్మాస్మి' యను జ్ఞాన మొకరకము. మననమువలన కలిగిన 'బ్రహ్మైవాహమస్మి' 'బ్రహ్మయే నేను' అను నిశ్చయజ్ఞానము మఱియొకరకము. దీనినే జ్ఞాననిష్ఠయందురు. నిదిధ్యాసమువలన కలిగెడి అపరోక్షాత్మసాక్షాత్కారము బ్రహ్మజ్ఞానము. అని యిట్లు జ్ఞానము మూడురకము లనదగును.

లేక పరోక్షము, అపరోక్షము, అనుభవము నని జ్ఞానము మూడురకము లనియు, ఇందు పరోక్షాపరోక్షజ్ఞానములు రెండు సాధనములనియు, అనుభవజ్ఞానము ఫలమనియు జెప్పవచ్చును. ఇందు పరోక్షజ్ఞానము గురుశాస్త్రాదులవలనఁ గలుగును. అపరోక్షజ్ఞానము బ్రహ్మాకారమగు బుద్ధివృత్తి. ఇయ్యది జ్ఞాననిష్ఠారూపము. అనుభవజ్ఞానమనగా బ్రహ్మాత్మసాక్షాత్కారము. ఇట్లును జ్ఞానము మూడురకము లనవచ్చును.

లేక 'నేను బ్రహ్మను కాను' అను విపరీతజ్ఞానమును బోగొట్టెడిజ్ఞాన మొక రకము. ఇది గురుశాస్త్రోపదేశమువలనఁ గలుగును. (2) నేను బ్రహ్మనా? సంసారినా? అను సంశయమును బోగొట్టుజ్ఞానము రెండవది. ఇది సమాధివలన లభ్యమగును. ఇదియే జ్ఞాననిష్ఠారూపము. 'నేను బ్రహ్మనే' అను నిశ్చయాత్మకమగు బ్రహ్మాత్మ సాక్షాత్కారము 'మూడవజ్ఞానము' అనియైనను జ్ఞానము మూడురకములని నిరూపించుట యుపపన్నమగును; కాన జ్ఞాననిష్ఠచే బ్రహ్మజ్ఞానము సంభవించుచుండ నివృత్తిమార్గమును విధించు వేదాంతేతిహాసపురాణస్మృతిలక్షణమగు శాస్త్రజాత మంతయు సార్థకమగుచున్నది.

(1) శ్రుతి :- "విదిత్వా వ్యుత్థాయ అథ భిక్షాచర్యం చరన్తి"-
విదిత్వా = బ్రహ్మను పరోక్షముగఁ దెలిసికొని; అథ = అనంతరము; వ్యుత్థాయ = సంసారమునుండిలేచి (సన్యసించి) భిక్షాచర్యం చరన్తి = భిక్షాటనమును జేయుచున్నాడు.

(2) 'తస్మాన్న్యాస మేషాం తపసా మతిరిక్త మాహుః' కావున నీతపస్సులన్నిటిలో సన్న్యాసమును గొప్పదానినిగా జెప్పుచున్నారు.

(3) 'న్యాసఏవ అత్యరేచయత్'సన్న్యాసమే అన్నిటికంటె గొప్పదగుచున్నది.

అట్లే నారాయణోపనిషత్తునందు 'సత్యం తపో దమశ్శమో దానం ధర్మః ప్రజనన మగ్నయో అగ్నిహోత్రం యజ్ఞః మానసంన్యాసః' అని పన్నెండు ముక్తి కారణముల నుపన్యసించి 'తానివా ఏతాన్యవరాణి తపాంసి, న్యాసఏవ అత్యరేచయత్' సత్యాదులు సామాన్యములగు తపస్సు లనియు, వీనియన్నిటికంటె సన్న్యాసమే గొప్పతపస్సనియు జెప్పబడినది. అట్లే ఆ నారాయణమునందు మఱియొక యనువాకమున సత్యాది న్యాసాంతములగు మోక్షోపాయములను జెప్పి ('తస్మాత్ న్యాసమేషాం తపసాం' 'అతిరిక్తమాహుః') ఈతపస్సు లన్నిటికంటె సన్న్యాసము గొప్ప తపస్సని జెప్పబడినది.

మఱియు 'న్యాస ఇత్యాహు ర్మనీషిణో బ్రహ్మాణం'— మనీషిణః = స్మృతికర్తలు; న్యాసఇతి = సన్న్యాసమగు మోక్షోపాయమును; బ్రహ్మాణం = హిరణ్యగర్భరూపముగా; ఆహుః = చెప్పుచున్నారు.- అని చెప్పఁబడినది. సన్న్యాసము హిరణ్యగర్భప్రాప్తికి అంతరంగసాధన మగుటవలన హిరణ్యగర్భరూపమగుట చెల్లును.

మఱియు 'న్యాసఇతి బ్రహ్మా+హి పరః- పరోహి బ్రహ్మా' అనియు నచటనే కనిపించుచున్నది. పరఃబ్రహ్మా = హిరణ్యగర్భుడు; న్యాసఇతి = సన్న్యాసము మోక్షహేతువు అని చెప్పెను. ఆ హిరణ్యగర్భుడు, పరోహి = పరమాత్మరూపుడు కదా; అని శ్రుత్యర్థము.

ఇట్లు జీవులందరికంటె ప్రప్రథముఁడగు హిరణ్యగర్భునకు సమ్మతమగుటవలన సన్న్యాసమే అన్నిటికంటె గొప్పది. అట్లుకానిచో పై శ్రుతులన్నియు విరోధించును.

కర్మలను విడుచుటయే సన్న్యాస మనఁబడును. ఇందు గొన్ని శ్రుతుల నుదాహరించుచున్నాము.

(1) 'వేదా నిమం మనుష్యలోకం అముం స్వర్గలోకంచ పరిత్యజ్య త్యజ ధర్మ మధర్మంచ.

(2) అథ పునరవ్రతీవా స్నాతకోవా అస్నాతకోవా, ఉత్సన్నాగ్నిః అనగ్నికోవా యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్.

(3) బ్రహ్మచర్యం సమాప్య గృహీభవేత్ గృహాద్వనీభూత్వా ప్రవ్రజేత్.

శ్లో॥ అనన్యచిత్తతా బ్రహ్మనిష్ఠా సా కర్మతే కథం,
కర్మత్యాగీ తతో బ్రహ్మనిష్ఠా మర్హతి నేతరః॥

శ్లో॥ త్యాగఏవహి సర్వేషాం మోక్షసాధన ముత్తమం
త్యజతైవహి తత్ జ్ఞేయం త్యక్తుః ప్రత్యక్ పదం పదం॥

శ్లో॥ సశిఖం వపనం కృత్వా బహిస్సూత్రం త్యజేద్బుధః
యదక్షరం పరంబ్రహ్మ తత్సూత్రమితి ధారయేత్ ॥
కుటుంబం పుత్రదారాంశ్చ వేదాంగానితి సర్వశః
యజ్ఞం యజ్ఞోపవీతంచ త్యక్త్వా గూఢః చరేన్మునిః॥
ఏత ద్విజన్మసాఫల్యం బ్రాహ్మణస్య విశేషతః
ప్రాప్యైతత్ కృతకృత్యోహి ద్విజో భవతి నాన్యథా॥

ఇత్యాది శ్రుతి స్మృతులన్నియు సన్న్యాసము ఉత్కృష్టమగు మోక్షోపాయ మని చెప్పుచున్నవి. సన్న్యాసమునకు మోక్షోపాయత్వ మంగీకరింపక, పై వాక్యములను వ్యర్థపుచ్చుట యుచితము కాదు. పైగా గీతాశాస్త్రమునగూడ 'సర్వకర్మాణి మనసా సన్న్యస్య; సర్వారంభపరిత్యాగీ' అను శ్లోకములచే సన్న్యాసము మోక్షోపాయమని శ్రీకృష్ణు డంగీకరించియుండెను. కాన వీనిని వ్యర్థపుచ్చుటకాని అర్థవాదనలని త్రోసిపుచ్చుటకాని యుచితముకాదు. ప్రత్యగాత్మ నిర్వికార స్వరూపముతో నుండుటయే మోక్షము అనగా ప్రత్యగాత్మయొక్క నిష్కృష్ట స్వరూపమే మోక్షమని తేలినది. ఇయ్యది యవిద్యానివృత్తివలనగాని యబ్బదు. అవిద్యానివృత్తి ఆత్మజ్ఞాననిష్ఠచే సాధ్యమగును. ఆత్మజ్ఞాననిష్ఠ సర్వకర్మసన్న్యాసము వలన నలవడును. కావున మోక్షమునకు సన్న్యాసమే ఉత్తమకారణమని భావము.

మోక్షమును గోరువాడు సన్న్యాసము నవలంబింపక కర్మమార్గము నవలంబించుట తూర్పుసముద్రమునుగూర్చి వెళ్ళగోరువాడు పడమటిసముద్రమునుగూర్చి వెళ్ళువానితోఁ ప్రయాణముచేసినట్లగును. కర్మలకు స్వర్గాదుల విషయమై ప్రవృత్తి

మార్గమనియు, సన్న్యాసులకు మోక్షవిషయమై నివృత్తిమార్గమనియు నీశ్వరుఁడు విభజించి నిర్మించియుండెను. కర్మానుష్ఠానము ప్రవృత్తిమార్గము. కర్మసన్న్యాసము నివృత్తిమార్గము. స్వర్గమునుగోరు అజ్ఞాని కర్మమార్గముతోనే స్వర్గమునకు బోవలెను. సన్న్యాసమార్గముతో బోవ వీలులేదు. మోక్షము నందఁదలచిన విద్వాంసుఁడు సన్న్యాసమార్గముచేతనే మోక్షము నందవలయును. కర్మమార్గముచే మోక్షము నంద వలనుపడదు. ఇట్లు అజ్ఞప్రాజ్ఞులకు విరుద్ధఫలముగల మార్గములు రెండు కలవని 'దూరమేతే విపరీతే విషూచీ అవిద్యాయాచ విద్యాచ ఖ్యాతా' అని శ్రుతి చెప్పుచున్నది. ఇందు ప్రవృత్తిమార్గమన్నను, కర్మమార్గమన్నను అవిద్యామార్గమన్నను అర్థభేదము లేదు. అట్లే నివృత్తిమార్గము, జ్ఞానమార్గము, విద్యామార్గము, మోక్షమార్గము, అనుటలోను అర్థభేదములేదు. 'నాన్యః పంథా విద్యతేఽయనాయ'— మోక్షముకొఱకు వేరుమార్గము లేదు. అనుశ్రుతి విద్యామార్గమే మోక్షహేతువని నొక్కి వక్కాణించుచున్నది. కాన మోక్షార్థి సన్న్యసించి జ్ఞాననిష్ఠయందే యుండవలయును. స్వర్గార్థి సన్న్యసించక కర్మనిష్ఠయందే యుండవలయును. వీరిరువురు వారివారి మార్గముల విడరాదు. తూర్పుసముద్రమునకు వెళ్ళగోరువాడు పడమటిసముద్రపుదారి పట్టిన ఫలము నందలేడు. అట్లే పడమటిసముద్రమున కేగదలచినవాడును తూర్పుసముద్రపుదారిఁ బట్టిన వ్యర్థుడగును. వీరిరువురకు ఫలభేదమున్నందున మార్గభేద మావశ్యకము. ఒకేమార్గ మెన్నటికిని వీరికి కుదరదు. అట్లే కర్మజ్ఞానమార్గములకుకూడ కలయిక ( సహభావిత్వము ) అసంభవము. కాన ముముక్షువగు విద్వాంసునకు నివృత్తిమార్గమే ( సన్న్యాసమే ) శరణ్యము.

కొండకు ఆవగింజకు నెంతటి తారతమ్యము కలదో కర్మ జ్ఞానమార్గముల కంతటి తారతమ్యము కలదని ప్రమాణవిదులు ( విద్వాంసులు ) నిశ్చయించిరి చూడుడు— కర్మానుష్ఠానము క్రియాకారకభేదబుద్ధిప్రయుక్తము. స్వర్గప్రాపకము. బంధహేతువు. దేహేంద్రియవ్యాపారసాధ్యము. అనాత్మ తాదాత్మ్యాధ్యాస మూలకము. వర్ణాశ్రమా ద్యభిమానగ్రస్తము. యజ్ఞ అగ్నిహోత్రాద్యనేకవిధము. ఇట్టిలక్షణము గలది కర్మమార్గము.

ఇక కర్మత్యాగాత్మకమగు సన్న్యాసము క్రియాకారకాదిభేదబుద్ధిని పోగొట్టునది, బ్రహ్మప్రాపకము— మోక్షహేతువు. దేహేంద్రియవ్యాపారోపరమసాధ్యము—అనాత్మ తాదాత్మ్యాధ్యాస నివృత్తిమూలకము— వర్ణాశ్రమాద్యభిమానరహితము. 'అహం బ్రహ్మాస్మి' అగు నేకవిధము. ఇట్టిది జ్ఞానమార్గము. కాన స్వరూపముచేను, ఫలముచేను, పరస్పరము జ్ఞానకర్మమార్గద్వయము అత్యంతవిరుద్ధము. కనుకనే సకాములగు అవిద్వాంసులు కర్మమార్గమున జొచ్చుచున్నారు. నిష్కాములగు విద్వాంసులు జ్ఞానమార్గమునఁ జేరుచున్నారు. కావున ముముక్షువులకు సర్వకర్మ

సన్న్యాసపూర్వకమగు జ్ఞాననిష్ఠయే మోక్షము నందుటకు శరణ్యము. జ్ఞాననిష్ఠ ప్రాప్తించకపూర్వము అవిద్వాంసునకు సర్వకర్మసన్న్యాసమెట్లు ప్రాప్తించునని శంకింపవలదు. పరోక్షబ్రహ్మజ్ఞానికి సర్వకర్మసన్న్యాసము సంభవించును. కాన పరోక్షముగ బ్రహ్మను దెలిసికొని సర్వకర్మలను సన్న్యసించి జ్ఞాననిష్ఠ నభ్యసించి పరిపక్వమగు నీ జ్ఞాననిష్ఠచే ముముక్షువు పరబ్రహ్మను దెలిసికొనుచున్నాడు.

రామానుజమతము ;-

ఇచట రామానుజులు "పరిశుద్ధమైన బుద్ధియోగాదులచే ఆత్మసాక్షాత్కారము గలుగుననియు, ఆవల భగవంతుడును దనకు స్వామియు నగు పుండరీకాక్షునియందు మిక్కిలి ప్రేమానుభవరూపమగు భక్తి గలుగుననియు అట్టిభక్తిచే నిజముగ భగవంతుని దెలిసికొని ఆవల నాభక్తివలననే సాధకుడు భగవంతునిఁ జేరును" అని వ్యాఖ్యానించిరి.

ఇది అత్యంతానుచితము.

దేహాద్వ్యతిరిక్తమయిన ఆత్మస్వరూపము సాక్షాత్కారమయినపిదప పద్మములవంటి నయనములుగల అతిసుందరాకారమయిన దేహమునందు పరమాత్మ యను బుద్ధి పుట్టనేరదు. దేహాతిరిక్తమయిన ఆత్మను తెలిసికొన్నపురుషుడు పరమాత్మ దేహాత్మకుడని తలచడు. అట్లు తలచినపుడుకాని, వానికి పుండరీకనయనునియందు భక్తిపుట్టదు. దేహమునం దీశ్వరభ్రాంతిపూర్వకమగు భక్తిచే పరమాత్మసాక్షాత్కారము కలుగదు. సచ్చిదానందము పరమాత్మయొక్క తత్త్వము. అయ్యది అనాత్మబుద్ధి నశించినపుడుకాని సిద్ధించదు. "భగవంతుడు పుండరీకనయనుడు" అను అనాత్మమగు దేహమునం దీశ్వరబుద్ధిచే పరమాత్మతత్త్వమగు సచ్చిదానంద రూపము సాక్షాత్కరించదు.

ఏ యాత్మజ్ఞానికి దేహము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, అవ్యక్తము ఆత్మ కాదనియు చైతన్యజ్యోతిస్సుయే ఆత్మయని యును నిశ్చయముండునో అట్టివాడు సర్వాంతరము స్వయంప్రకాశము నగు సచ్చిదానందరూపమును విడచి, పద్మములవంటినేత్రములుగల యీ దేహము పరమాత్మయని యెట్లు నమ్మును ? అన్నిటికంటె లోపలివా డాత్మ. అన్నిటికంటె బయటిది దేహము. కాన సర్వాంతరుడు సర్వబాహ్యు డగు టెట్లు ? "య ఆత్మని తిష్ఠన్" అను అంతర్యామిబ్రాహ్మణము రామానుజీయులకు ప్రమాణమేకదా ?

కావున సర్వాంతరుడు సర్వాంతర్యామియు జ్ఞానానందరూపుడునగు ఈశ్వరుడు సర్వబాహ్యుడు పురుషబుద్ధ్యధీనమగు సత్తాకలవాడు జడరూపుడు నెట్లగును? కావున అనాత్మవేత్తకే సగుణబ్రహ్మయందు భక్తిగాని, ఆత్మవేత్తకు కాదు. ఆత్మవేత్త నిర్గుణమయిన సచ్చిదానందపరబ్రహ్మమునందు రమించును. "యస్త్వాత్మరతిరేవ

స్యాత్" అను గీతాస్మృతియు "ఆత్మరతి రాత్మక్రీడః" అనుశ్రుతియు నిందు ప్రమాణములు.

కావున పుండరీకనయనత్వాది విశిష్టభగద్విగ్రహమునందలి ప్రేమరూపమగు భగవద్భక్తివలన సచ్చిదానందబ్రహ్మసాక్షాత్కార మనునదెంతమాత్రముకుదరదు.

అట్టిభక్తివలన చిత్తశుద్ధినొంది దాన బ్రహ్మజ్ఞానమును వడసి బ్రహ్మసాక్షాత్కారము నొందిన నొందవచ్చును. కాని భక్తికి సాక్షాత్ బ్రహ్మసాక్షాత్కార హేతుత్వముమాత్రము లేదు. కావున భక్తిచే బ్రహ్మసాక్షాత్కారము నొంది భక్తిచేతనే బ్రహ్మను బొందు ననునది యసంభవము. బ్రహ్మసాక్షాత్కారము నొందినపిదప సర్వద్వైతము నివర్తించుచుండ "పొందువాడు పొందదగినది" అను వస్తుద్వయమే లేదు. జీవుడు బ్రహ్మభిన్నుడయినను, బ్రహ్మాభిన్నుడయినను– వీనికి నిరాకారుడు, పరిపూర్ణుడు, నిరవయవుడు, నిర్విశేషుడు అగు బ్రహ్మయందు ప్రవేశము కుదరదు. అవకాశమున్నపుడుగాని అన్యవస్తువు ప్రవేశింపలేదు. బ్రహ్మ నిరవకాశుడు; సావకాశుడగుచో పరిపూర్ణుడు కాకపోవును.

మరియు రామానుజమతమున జీవబ్రహ్మలకు సాయుజ్యమే లేనందున జీవుడు బ్రహ్మయందు ప్రవేశించుటయే సుతరాం అనుపపన్నము. కాన సముద్రమునందు నదీజలమువలెకాని, లక్ష్యమునందు బాణమువలెకాని, జీవుడు బ్రహ్మయందు ప్రవేశించుట యసంభవము. బ్రహ్మసాక్షాత్కారసమయమున నే విద్వాంసునకును వెనుకటిముక్తులు బ్రహ్మయందు బ్రవేశించియున్నటుల వేరుగ గనిపించుటలేదు. "యథా నద్యస్స్యందమానా స్సముద్రేఽస్తం గచ్ఛంతి" అనుశ్రుతి జీవుడు నామరూపములను వీడి బ్రహ్మరూపముతో నుండునని చెప్పుచున్నది. కాని జీవుడు బ్రహ్మయందు బ్రవేశించునని చెప్పుటలేదు. ఆశ్రుతికి తాత్పర్య మదికాదు. జీవులు బ్రహ్మాంశులు కారు. బ్రహ్మ నిరంశుడు. అట్టివానికి అంశమనునది లేదు. "మమైవాంశో జీవలోకే" అను గీతావచనము. ఔపాధికమగు అంశభావమును చొచ్చుకొని ప్రవర్తించినది.

ఇంక ఘటాకాశము ఘటము నశించినతరువాత మహాకాశములో చేరినట్లు అంతఃకరణావచ్ఛిన్నమగు చైతన్యము అంతఃకరణము నశించినతోడనే నిరవచ్ఛిన్న చైతన్యమును జేరుననియును అనరాదు. ఘటము నశించినతర్వాత ఘటాకాశ మనునది యుండిననేకదా? అయ్యది మహాకాశములో చేరును. అదియే (ఘటాకాశమే) లేనపుడు అది మహాకాశములో జేరుటెట్లు? ఉపాధినాశానంతరముకూడ ఘటాకాశము జీవుడునున్న కలడన్నచో నపుడు బ్రహ్మప్రవేశమే లేదు. ఉపాధిని విడచికూడ ఘటాకాశ మహాకాశములకు జీవబ్రహ్మలకు భేదము చెప్పినట్లయినది. ఉపాధినాశానంతరము నిరుపాధికములగువాటికి ఘటాకాశమని, జీవుడని వ్యవహారమే కుదరదు. ఉపాధి నశించినతరువాత మహాకాశమునుంచి ఘటాకాశము

నకుగాని, పూర్ణచైతన్యమునుంచి జీవచైతన్యమునకుగాని భేదము గ్రహింపశక్యము గాదు. అట్టిభేద మప్పుడుగూడ నుండుచో, ప్రవేశానంతరముకూడ నా భేదముండితీర వలయును. దాని నంగీకరింప వీలులేదు. ఘటము నశించినతరువాత మహాకాశములో జేరిన ఘటాకాశము కనిపించుటలేదు. కావున నుపాధియున్నప్పుడే ఘటాకాశము మహాకాశము అను భేదవ్యవహారము. ఉపాధినాశానంతర మీ వ్యవహారముండదు. కాన ఘటాకాశ మహాకాశములకువలె జీవేశ్వరచైతన్యములకు ద్వైతము సిద్ధించి నందున జీవు డీశ్వరునిలో ప్రవేశించునను ముచ్చటయే లేదు. ౫౫

శ్లో॥ సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః,
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్॥ ౫౬

అ॥ స్వకర్మానుష్ఠానముచే భగవంతుని పూజించుటయే భక్తియోగము. దీనికి జ్ఞాననిష్ఠయందు యోగ్యత కలుగుటయే ఫలము. కావున జ్ఞాననిష్ఠకు నిమిత్త మయిన భక్తియోగము సర్వశాస్త్రార్థోపసంహారప్రకరణమున స్తుతింపబడుచున్నది.

అర్జునా ? ఎల్లప్పుడు నిషిద్ధకర్మలనుగూడ ననుష్ఠించువా డయినను భగవం తునియందు సర్వాత్మభావము నుంచినచో వాడు భగవదనుగ్రహమున శాశ్వతమగు స్థానము నొందగలడు. ఇచట సర్వాత్మభావమనగా, "భగవంతుడే సర్వాత్మ" అను భావమని యొక అర్థము.

సమస్తదేహేంద్రియాది వ్యాపారములు ఈశ్వరార్థములుకాని, మదర్థములు (నాకొరకు) కావను భావమని మరియొకయర్థము. "సమస్తమయిన మనోభావన" అని యింకొక యర్థము. ఎటులయినను సర్వాత్మనా భగవంతుని ఆశ్రయించిన వాడనిభావము.

ఈశ్వరానుగ్రహమువలన భక్తియోగము ననుష్ఠించువాడుకూడ పరమ పదమును బొందును. జ్ఞానము నొసంగుటయే యీశ్వరానుగ్రహము. "ఈశ్వరాను గ్రహాదేవ పుంసా మద్వైతవాసనా" అని చెప్పబడియున్నది.

లేక "నాయనుగ్రహమువలన శాశ్వతం పదం" ప్రత్యగభిన్నమగు బ్రహ్మను "అవాప్నోతి జానాతి" తెలిసికొనుచున్నాడు. అని చెప్పవచ్చును. ఈశ్వరాను గ్రహమువలన సాధకునకు సమ్యగ్జ్ఞానోదయము కలుగునని భావము. ౫౬

శ్లో॥ చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ॥ ౫౭

అ॥ కావున నోయి యర్జునా ? సమస్తకర్మలను వివేకబుద్ధితో నాయందు సన్న్యసించి వాసుదేవుడ నగు నేనే పరదేవత నను భావము నాయందుంచి బుద్ధియో గము నవలంబించి యనన్యశరణుడవై సదా నీదుచిత్తము నాయం దుంచుము. ఇచట

సన్న్యాసమన సమస్తకర్మలను యీశ్వరార్పణ మొనర్చుటకాని, ముఖ్యసన్న్యాసము కాదు. అనన్యశరణత్వమన బుద్ధియోగమే మోక్షము నొందుటకు శరణ్యమని నమ్మియుండుట.

శ్లో॥ మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి
అథచే త్త్వ మహంకారా న్నశ్రోష్యసి వినంక్ష్యసి॥ ౫౮

అ॥ అర్జునా? నీవట్లు సదా నీదుచిత్తమును నాయందుంచినచో దుస్తరములయిన సంసారనిమిత్తములను దాటగలవు. అట్లు కాక అహంకారము నవలంబించి, నామాటను వినక నీయిచ్చవచ్చిన ట్లాచరించుచో నశించెదవు. కావున నేను చెప్పినట్లు విని మదారాధనరూపమగు స్వధర్మమయిన యుద్ధమును జేయుము. ౫౮

శ్లో॥ యద్యహంకార మాశ్రిత్య నయోత్స్య ఇతిమన్యసే
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి॥ ౫౯

అ॥ నీవు అహంకారముచే "నేను యుద్ధమును జేయను" అని నిశ్చయించుకొన్నను ఆ నిశ్చయము వ్యర్థమే యగును. నీదు క్షత్రియస్వభావమే నిన్ను యుద్ధమునందు దింపగలదు.

శ్లో॥ స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేనకర్మణా
కర్తుం నేచ్ఛసి యన్మోహా త్కరిష్య స్యవశోఽపి తత్॥ ౬౦

అ॥ ఓయి కుంతీపుత్రుడా? నీవు క్షత్రియస్వభావమువలన నేర్పడిన పరాక్రమాది గుణములతో గట్టువడితివి. ఇట్టి నీవు అజ్ఞానవశమున నేపనిని చేయదలచవో ఆ పనిని ప్రకృతిపరతంత్రుడవై తప్పక జేతువు. నీ నిర్ణయ మంతయు వ్యర్థమగును. కావున నే నుపదేశించకపూర్వ మొకానొక నిశ్చయములో నీవున్నను దానిని మార్చుకొని యిప్పటికయినను యుద్ధమును జేయ నిశ్చయించుకొనుము. ౬౦

శ్లో॥ ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥ ౬౧

ఓయి అర్జునా? నీవు కేవలము ప్రకృతిపరతంత్రుడవుమాత్రమే కాదు. ఈశ్వరపరతంత్రుడవుకూడ నగుచున్నావు. ఈశ్వరుడు సకలభూతముల హృదయప్రదేశమునుండి కొయ్యబొమ్మలను బొమ్మలాటకాడు త్రిప్పినట్లు నిఖిలభూతములను త్రిప్పుచున్నాడు.

ఇచట "అర్జునా? అని శ్రీకృష్ణుడు సంబోధించుటలో పరిశుద్ధాంతఃకరణముగల నీకు శాస్త్రనిషిద్ధమయినమార్గమునందు ప్రవృత్తి తగదని సూచిత మగుచున్నది.

అర్జున శబ్దమునకు పరిశుద్ధమను నర్థమును చెప్పుటలో "అహశ్చ కృష్ణ మహ మర్జునంచ" అను వచనము ప్రమాణము.

దీనియర్థము "కృష్ణం అహః" మేఘాచ్ఛాదనచే అపరిశుద్ధమయిన పగలు. "అర్జునం అహః" మేఘాచ్ఛాదనలేకుండుటచే పరిశుద్ధమయిన పగలు అని.

బ్రహ్మాది స్తంబపర్యంతమయిన చరాచర ప్రపంచమును నిర్మించి, హృదయప్రదేశమునందుండి, వారివారి నాయాపనులయందు ప్రవేశపెట్టి యీశ్వరున కందరు పరతంత్రులయియుండ, అర్జునా? నీవుమాత్ర మెట్లు స్వతంత్రించి ప్రవర్తించగలవు?

ఓయి, అపరిచ్ఛిన్నుడు, పరిపూర్ణుడు, మహత్పరిమాణముగల పరమేశ్వరుడు పరిమితమయిన భూతములయొక్క హృత్ప్రదేశమునం దెట్లుండును? అపరిమితమయిన పదార్థము పరిమితప్రదేశమున నుండనేరదుకదా? నిజమే, ఇది దోషముకాదు. "హృత్పుండరీకే విమలే ప్రవిష్టశ్శాస్తా జనానాగ్మ్" "అంగుష్ఠమాత్రఃపురుషో మధ్యే ఆత్మని తిష్ఠతి" అనుశ్రుతి యీశ్వరుడు హృదయప్రదేశమునం దుండుననియు, అంగుష్ఠ పరిమితమగు దేహము కలవాడనియును శ్రుతి చెప్పుచున్నది. దీనినిబట్టి యీశ్వరునకు మాయావశమున నేడడుగుల పరిమితమయిన రామ కృష్ణాది శరీరము లేర్పడినట్లు, అంగుష్ఠపరిమితమగు శరీరముకూడ నీశ్వరునకు మాయచే నేర్పడవచ్చును. ఆశరీరముతో హృత్పుండరీకమునం దుండుట యీశ్వరునకు జెల్లును.

అయితే, సాకారుడై అంగుష్ఠమాత్రపరిమాణముగల ఈశ్వరుడు హృదయపుండరీకమున నుండుచో ఏల గనిపించడు. నిజమే, బాహ్యేంద్రియమగు కన్ను (చక్షుస్సు) బాహ్యవస్తువును జూచునుకాని, లోపలివస్తువుయొక్క స్వరూపమును గ్రహింపజాలదు. చక్షురింద్రియము వెలుపలనున్న ఘటపటాదులను జూచుచున్నాడు కాని, లోపలి మాంసాదుల నెవ్వడును జూచుటలేదు.

అయితే మృతశరీరమునందు యీశ్వరుడు కలడా? లేడా? ఉన్నచో మృతశరీరమును దహింపజేసినచో ప్రాణవిశిష్టమయిన నీశ్వరునికూడ దహింపజేసినట్లె? ఈయది యీశ్వరునకు గొప్పకష్టముకదా? ఇక లేదన్నచో, నెందువలన లేదు?

1. మృతశరీరమునుంచి లేచి బయటికి వెళ్ళినందున లేడా?

2. బయటికి వెళ్ళువాడు యేల కంటికి కగపడడు?

3. మృతశరీరమునుంచిలేచి బయటికివెళ్లు అంగుష్ఠమాత్రపురుషుని ప్రక్కనున్నవా డెవ్వడైన జూచుచున్నాడా?

4. కాక సన్నిపాతదోషముచే పలువరుసలు రెండును గట్టిగా కఱచుకొని పోవ, నోటినుంచి దారియే లేనపుడు ఆపురుషు డేమార్గమున బయటికి వెళ్లెను ?

5. ఒక అంగుళము పరిమాణముగలవాడు కంటినుంచికాని, చెవినుంచికాని ముక్కులనుంచికాని వెడలుట సంభవము కాదుకదా ?

6. గుదద్వారమున బయల్వెడలెనని కల్పించుట, యీశ్వరు డంతటివానికి నయ్యది నీచాతినీచముకదా ?

7. మరియు, అద్దముతో తయారుచేసిన సందులేనిపెట్టెలో చావు సిద్ధమయినవానిని పడవేయగా, వా డందు మరణించుచున్నాడు. అట్టివానినుంచి యంగుష్ఠపరిమితిగల యీశ్వరు డెట్లులేచిపోవును ? దర్పణమయమయిన ఆపెట్టెకు ఏమూలను దారిలేదుకదా ?

8. మరియు అతిసూక్ష్మమయిన పురుగుల శరీరములోని హృదయప్రదేశము అత్యల్పము. అందు అంగుష్ఠపరిమితు డెట్లుండును ?

కావున హృదయప్రదేశమున నున్నపురుషుడు అంగుష్ఠమాత్రు డనుటకు వీలులేదు.

అయితే పైశ్రుతికి గతి యేమందురేమో ? మనుష్యహృద్దేశము అంగుష్ఠపరిమితముకాన, అందుండు యీశ్వరుడుకూడ అంగుష్ఠపరిమితుడే యని ఉపాసనకొఱకు గల్పింపబడి.ది. ఇంతేకాని యిది నిజముకాదు.

ఓయి ? ఇట్లైనచో మాయావచ్ఛిన్న చైతన్యరూపుడును సత్త్వరజస్తమోగుణభేదముచే విష్ణుబ్రహ్మరుద్రరూపుడు నగు ఈశ్వరుడు భూతముల హృద్దేశమున నుండునని చెప్పెదము. అనినచో నదియును ఉచితము కాదు. హృదయప్రదేశమున విష్ణ్వాది మూర్తిత్రయమున్నదా ? లేక ఒకేమూర్తి యున్నదా ? ఈరెంటిలో నేపక్ష మవలంబించినను శంఖ, చక్ర, కమండలు, త్రిశూలాదిధరులును, గరుడ, హంస, వృషభధ్వజులును, లక్ష్మీ, సరస్వతీ, పార్వతీసహితులును అగు మహత్తరమయిన దేవదేవోత్తములు అతిస్వల్పమయిన హృత్పుండరీకమున నుండుట పొసగదు.

మరియు భూతములు కోట్లకొలది కలరు. వీరందరిలోను యీముప్పురు కలరన్నచో అనేకమంది విష్ణువులను, అనేకమంది బ్రహ్మలను, అనేకమంది శివులను గల్పించవలసివచ్చును. ఇయ్యది ప్రమాణవిరుద్ధము. మరియు యాగములో విశసనము చేయబడుచున్న పశ్వాదుల హృదయములో నీముప్పురిలో నే యొకమూర్తియు గనిపించుట లేదు. కాన సత్వగుణావచ్ఛిన్నమయిన చైతన్యము విష్ణువనియు, రజోగుణావచ్ఛిన్నమగు ( కూడిన ) చైతన్యము బ్రహ్మయనియు, తమో

గుణావచ్ఛిన్నమగు చైతన్యము రుద్రుడనియు, పేరుపెట్టిరి కాని, చైతన్యమున కాకారములేదు. కనుకనే విష్ణ్వాది శరీరములు మనబోంట్లశరీరములవలెను, దేవాదుల శరీరములవలెను దృశ్యములు, జడములు, పరిచ్ఛిన్నములు నగుచున్నవి. అందు వలన నవి యీశ్వరరూపములు కావు. మాయావచ్ఛినచైతన్య మొక్కటియే అపరిచ్ఛిన్నమయినందున నీశ్వరరూపము. ఓయి ఇట్లైనచో పరిపూర్ణుడు అపరిచ్ఛిన్నుడు మాయావచ్ఛిన్నచైతన్యరూపుడు నయిన ఈశ్వరుడు హృదయదేశమున నెట్లుండును? వినుము. సర్వము మాయాపరిణామము. ఘటాకారముగ పరిణమించిన మృత్తునందు గంధమున్నట్లు హృదాకారముగ పరిణమించిన మాయయందు ఈశ్వరుడు గలడు. అని చెప్పవచ్చును.

అయితే హృదయప్రదేశమున నున్నాడని విశేషముగా జెప్పనేల? సమస్త భూతములయొక్క కరచరణ నఖలోమాదులన్నియు మాయాపరిణామములే. మీరు చూపినట్లు వీటన్నిటియందును యీశ్వరు డుండవచ్చునుగదా! మరియు నీవిధమున అంతఃకరణముకూడ మాయాపరిణామ మయినందున అచ్చటగూడ నీశ్వరచైతన్య ముండుట తటస్థించుచుండ అంతఃకరణావచ్ఛిన్నమగు చైతన్యము జీవుడను వేదాంత సిద్ధాంతము విరోధించును. కావున ఈశ్వరుడు సర్వభూతముల హృద్దేశమున నుండు ననుట యెవ్విధముగను గుదరదు అని పూర్వపక్షము.

సిద్ధాంతము: 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' అను శ్రుతిప్రోక్తమయిన సత్యజ్ఞానానందలక్షణ పరిపూర్ణ సర్వవ్యాపక పరమాత్మయే సర్వభూతములయొక్క హృద్దేశమున ప్రత్యగ్రూపముతో నున్నాడని సిద్ధాంతము. అంతఃకరణావచ్ఛిన్నమగు చైతన్యము ప్రత్యగని చెప్పబడుచున్నది. నిరుపాధికమగు పరిపూర్ణచైతన్యము అంతటను గలదు. అయినను నదే చైతన్యము అంతఃకరణావచ్ఛిన్నమగుచు భూతములయొక్క హృదయమున నుండునుగాన నిందు దోషములేదు. సర్వాంతరమగు (అన్నిటిలోపలనుండు) ప్రత్యక్చైతన్యము శరీరమునందలి యవయవము లన్నిటి యందు వ్యాపించియుండ హృదయదేశమునందుమాత్రమే యుండునని చెప్పుట యెట్లని యాక్షేపింపదగదు. అంతఃకరణము హృత్పుండరీకమున నుండుటచే దానితోగూడిన చైతన్య మచ్చటనే (హృత్పుండరీకముననే) కనపడుచుండుటవలన నీశ్వరుడు హృద్దేశమం దుండునని చెప్పితిమి.

లేక మాయోపాధికుడగు మహేశ్వరుడే హృద్దేశమున జీవరూపముతో నున్నాడందుము. మాయోపాధికుడు అంతఃకరణోపాధికు డెట్లగునను నాశంక మీకు వలదు. గుడ్డతోజుట్టిన కత్తి గుడ్డచే నావరింపబడినదైనను నాకత్తిని బెట్టెలో బెట్టగా నయ్యది పెట్టెచేగూడ నావరింపబడిన దగుచున్నది. అట్లే యంతఃకరణోపాధిక చైతన్యముగూడ మాయోపాధికమగును. అవిద్యావచ్ఛిన్నమగు చైతన్యమే

మఱియు అంతఃకరణావచ్ఛిన్నముగూడ నగుచున్నదని వేదాంతశాస్త్రమునం దచ్చ టచ్చట గనుపించుచున్నది. అంతఃకరణావచ్ఛిన్నమగు జీవుడుకూడ ఇంద్రియావ చ్ఛిన్నుడగుట, దేహావచ్ఛిన్నుడగుటయు 'పశ్యామి అహం' (నేను జూచు చున్నాను) 'మనుష్యో అహం' (నేను మనుష్యుడను) అను వ్యవహారములబట్టి మనము జూచుచున్నాము.

ఈశ్వరుఁడే జీవు డెట్లగునను నేవగింపు మీకు బనికిరాదు. నిర్విశేషమగు బ్రహ్మము ఈశ్వరుడైనట్లు ఈశ్వరుడుగూడ జీవుడగును. ఇయ్యది శాస్త్రైకప్రమాణ వాదుల మగు మన మంగీకరింపకతప్పదు. చూడుడు శాస్త్రమెట్లున్నదో! "తచ్ఛృష్ట్వా తదేవానుప్రావిశత్" దానిని సృజించి దానిలో బ్రవేశించెను. "అనేన జీవేన ఆత్మనా అనుప్రవిశ్య" ఈ జీవస్వరూపముతో నందు బ్రవేశించి యిత్యాది శ్రుతులును 'మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః' "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత" "ఈశ్వరో జీవకళయాప్రవిష్టో భగవానితి" ఇత్యాది స్మృతులును "భగవాన్ ఏక ఏవేషః సర్వక్షేత్రే ష్వవస్థితః" అను పురాణమును నీశ్వరుడే జీవరూపమున హృదయమునందు బ్రవేశించి యుండెనని ఋజువు చేయుచున్నవి.

శాస్త్రమన్నంతమాత్రమున నీశ్వరుడు అనీశ్వరుడగు (అస్వతంత్రుడగు) జీవు డెట్లగునని యనరాదు. అవిద్యావశమున త్రాడు సర్పమైనట్లు, స్థాణువు చోరు డైనట్లు, ఆకసము నల్లనైనట్లు, తలగలవాడు కలలోఁ దలతెగినవాడైనట్లును, స్థిరమైన సూర్యుడు నీటిలో చలించు సూర్యుడైనట్లును, నీశ్వరుడుగూడ ననీశ్వరు డగు జీవుఁడగును. అనుభవసిద్ధమగు జీవునియందలి యనీశ్వరత్వమునుగాని, యీశ్వ రునియందలి శాస్త్రసిద్ధమగు నీశ్వరత్వమునుగాని మనము నిరాకరించజాలము. ఏయాస్తికుడును నిరాకరింపజాలడు.

అయితే జీవునియం దిపుడు ఈశ్వరత్వమున్నటులనా? అనీశ్వరత్వమున్నటు లనా? ఎటులను నిర్ణయింప వీలుగానందున నీరెండును లేనటులేకదా? యని యన రాదు. శాస్త్రమువలనను విద్వాంసుల యనుభవమునుబట్టియు సుషుప్త్యాది దృష్టాంతముల ననుసరించియు జీవునియందు ఈశ్వరత్వము నిర్ణయింప వీలుకలుగు చున్నది. లోకమునుబట్టియు, నవిద్వాంసుల యనుభవమును నాధారపరచుకొనియు జాగ్రదవస్థాదృష్టాంతమును బురస్కరించుకొనియు, జీవునియం దనీశ్వరత్వముగూడ నిర్ణయింపవీలగును. ఒకేనటుఁడు అవస్థాభేదమున స్త్రీపురుషాకారముల రెండిటిని స్వీకరించినటుల నొకేజీవుడు విద్యావిద్యాదశాభేదములచే ఈశ్వరత్వానీశ్వరత్వ ముల నొందును. కావున 'తత్త్వమస్యాది మహావాక్యోపదిష్టమగు జీవేశ్వరా ద్వైతము అన్నివిధముల నుపపన్నమగుచున్నది.

మహావాక్యార్థమును వివరింతును. 'తత్' శబ్దమునకు నీశ్వరుడని యర్థము. 'త్వం' శబ్దమునకు జీవుఁడని యర్థము. 'అసి' యను పదమునకు నాయిరువుర కభేద మని యర్థము. మాయావచ్ఛిన్నచైతన్యమగు నీశ్వరుడే యంతఃకరణావచ్ఛిన్ను డగుటవలన జీవేశ్వరాభేదము స్థిరమగుచున్నది. అట్లే అజ్ఞానావస్థలో సంసారియగు జీవుడు విద్యావస్థలో నసంసారియగు నీశ్వరుడగుచున్నాడు. ఘటాకాశము మహా కాశముయొక్క యంశమనినటుల జీవుడు ఈశ్వరునియొక్క యంశముగాన నంశాంశు లగు జీవేశ్వరులకు ఘటాకాశ మహాకాశములకువలె అభేదము సుస్పష్టము. బింబ భూతమైన ముఖ మద్దమునందు ప్రతిబింబరూపముతో నున్నటుల బింబభూతుఁడగు నీశ్వరు డంతఃకరణమునందు ప్రతిబింబమైన జీవరూపముతో నున్నాడు. ఆయంతః కరణము హృద్దేశమున గలదు. కాన నీశ్వరుఁడే జీవరూపముతో భూతములయొక్క హృదయఫలకమున నుండుటవలన బింబప్రతిబింబములగు ముఖ ప్రతిముఖములకువలె జీవేశ్వరుల కభేదము నిరాఘాటము. ఈశ్వరుడు బాహ్యచైతన్యము. జీవుడు లోపలి చైతన్యము. కాన బాహ్యాకాశ దహరాకాశములకువలె జీవేశ్వరుల కభేదము. జీవుడు సోపాధికచైతన్యము. ఈశ్వరుఁడు నిరుపాధిక చైతన్యము. కావున సోపాధిక నిరుపాధికములగు ఘటాకాశ మహాకాశములకువలె జీవేశ్వరుల కభేదము. భోగ్య మగు బాహ్యవాయువు భోక్తయగు ప్రాణరూపముతో లోపల నున్నటుల జ్ఞేయ మగు బాహ్యబ్రహ్మము జ్ఞాతయగు జీవరూపముతో శరీరములోపల హృదయము నందు గలడు. కావున బాహ్యవాయు ప్రాణవాయువుల కెట్లభేదమో యట్లే జీవేశ్వరులకుగూడ నభేదము. బాహ్యవాయువు భోగ్య మెట్లగునని శంకింపఁదగదు. సర్పములు వాతాహారములు అనగా, గాలిని భక్షించి యుండునవి అట్లే ఋషులుగూడ గాలిని భక్షించి బ్రతుకుదురు. వీరిప్రాణము బాహ్యవాయువు కాహారముగా దీసికొనుచున్నది. కావున బాహ్యవాయువు భోగ్యమనియు ఆంతర మగు ప్రాణవాయువు భోక్తయనియు ననుటలో దోషములేదు.

ఇక లక్షణాపక్షమున అంతఃకరణావచ్ఛిన్నత్వము, మాయావచ్ఛిన్నత్వము, బింబత్వము, ప్రతిబింబత్వము, జ్ఞాతృత్వము, జ్ఞేయత్వము, సర్వజ్ఞత్వము, కించి జ్ఞత్వము, ఈశ్వరత్వము, అనీశ్వరత్వము, సంసారిత్వము, అసంసారిత్వము, సోపాధి కత్వము, నిరుపాధికత్వము, మున్నగు విశేషణాంశములను పరిత్యజించినచో, శుద్ధ చైతన్య మొక్కటేకావున అద్వితీయబ్రహ్మము 'తత్త్వమసి' యన్న వాక్యముచే లక్షణచేఁ జెప్పబడుచున్నాడని తెలియవలయును.

ఓయీ, ఇట్లీశ్వరుఁడు జీవరూపముతో భూతములయొక్క హృదయమున నుండుచో నియామ్య నియామకభావ మెట్లు కుదురును? జీవుడు నీశ్వరుడు నను నిద్దరు లేరుకదా! ఒకడు నియామకుడు, మఱియొకడు నియామ్యుడును గావలెనుకదా!

అనినచో నట్లుకాదు. ఈశ్వరునిచే జీవుడెన్నటికిని నియమింపఁబడఁడు. ఈశ్వరుఁడే జీవుఁడు. ఇందు సందియము లేదు. కాని జీవరూపముతోనున్న యీశ్వరునిచే దేహేంద్రియసంఘాతము నియమింపఁబడుచున్నది. జీవు డీదేహమున నున్నపుడే కార్యకరణసంఘాతమగు దేహమునకుఁ బ్రవృత్తి కలుగును. దేహమునుండి జీవుడు లేచినచో దేహమునకుఁ బ్రవృత్తియే లేదు. కావున జీవరూపముతో నున్న ఈశ్వరుడే దేహమును నియమించును. లౌకికులును శాస్త్రప్రవర్తకులు నగు తార్కికాదులును జీవస్వరూపమును గుర్తించక బ్రహ్మాదిస్తంబపర్యంతమగు చరాచరాత్మక కార్యకరణసంఘాతమునే చేతనావిశిష్టముగ నున్నందున జీవుడని యభిప్రాయపడి జీవులు ఈశ్వరునిచే నియమింపబడుదురని యనుచున్నారు. ఈ కార్యకరణసంఘాతమగు దేహమునందు నేనను అభిమానమువలననే మనమందఱమును నెవరిచేతనో నియమింపబడినవారమువలె పరాధీనులమగుచు బ్రవర్తించుచున్నటులఁ దలచుచున్నాము. "కేనాపి దేవేన హృదిస్థితేన యథా నియుక్తోస్మి తథా కరోమి" అను స్మృతికూడ నీయర్థమునే బుజువు చేయుచున్నది. ఆదేభావముతో మానవులెల్లరును జననమరణ సుఖదుఃఖాది లక్షణమగు సంసారము ననుభవించుచున్నారు.

నిజస్థితిలో నిర్వికారుఁడగు జీవునకు బ్రవృత్తియే లేదు. కార్యకరణసంఘాతము (దేహము) భిన్నమగుటవలననే దానియందు నేనను అభిమానమువలన జీవులుకూడ అనేకులని తార్కికాదు లనుచున్నారు. ఇయ్యది భ్రాంతి. నిజమున జీవుడొక్కఁడే. 'ఏకోదేవ స్సర్వభూతేషు గూఢః' అను మంత్రవర్ణమట్లు చెప్పుచున్నది. ఈశ్వరుడొక్కఁడేయని తార్కికాదులుకూడ నంగీకరించిరి. ఆ ఈశ్వరుడే జీవుడు. ఇట్టితఱి జీవులనేకు లెట్లగుదురు? కావున కార్యకరణసంఘాతాత్మకులగు ప్రాణులే ప్రత్యగాత్మరూపముతోనున్న యీశ్వరునిచే నియమింపబడుచున్నారు. సర్వాంతరాత్మయగు ప్రత్యక్పురుషుడుమాత్రము ఈశ్వరునిచే నియమింపబడుట లేదు.

ఓయీ ఇట్లైనచోఁ బ్రకృతమున నీశ్వరుడు సర్వభూతములను ద్రిప్పుచున్నాడనుదాని కర్థమేమి? ఈశ్వరుడు జీవులను ద్రిప్పుచున్నాడని యర్థమా? లేక ప్రత్యగాత్మ కార్యకరణసంఘాతజాతమును ద్రిప్పుచున్నాడని యర్థమా? అనినచో నెటులైనను నభిప్రాయ మొకటియే యైనది. అజ్ఞానులదృష్టిలో నీశ్వరుడు జీవుల నియమించుచున్నా డన్నచో జ్ఞానులదృష్టిలోఁ బ్రత్యగాత్మ కార్యకరణ సంఘాతజాతమును నియమించుచున్నా డనియే తేలును. విద్వద్దృష్టిలో ప్రత్యగాత్మ కార్యకరణసంఘాతజాతమును నియమించుచున్నా డన్నను అవిద్వాంసులదృష్టిలో నీశ్వరుడు జీవులను నియమించుచున్నాడనియే పర్యవసించును. విద్వాంసుడు ఈశ్వరుఁడే యాత్మయని యనుకొనును. అవిద్వాంసుఁడు కార్యకరణసంఘాత మాత్మ యనుకొనును. అయితే యొకే ఆత్మ యద్వితీయుఁడగు నీశ్వరునిగాను భిన్నభిన్నమైన

సంఘాతరూపముగను గ్రహించుటెట్లు? అని యనరాదు. ఒకే చంద్రుఁడు తిమిర దోషముగలవానిచే భిన్నముగాను దోషరహితమైన నేత్రముగలవానిచే నొక్కఁడు గాను గ్రహింపబడుచున్నాఁడు. అట్లే యొకేసూర్యుని మనము ప్రకాశరూపునిగ గ్రహించుచున్నాము. ఉలూకములు (గుడ్లగూబలు) వానినే అంధకారరూపమున గ్రహించుచున్నవి. కావున జ్ఞానముచే ఒకే ఆత్మను యీశ్వరునిగాను అజ్ఞానముచే నానారూపుడైన జీవునిగను గ్రహించుట కుదురును.

ఓయి! ఇట్లు గ్రహించువాఁ డెవడు? వినుము. ప్రమాత. వాడుకూడ నిజముగ నాత్మయైనను అంతఃకరణ తాదాత్మ్యాధ్యాసవలన ప్రమాత యగుచున్నాఁడు. ఈ ప్రమాతలే కార్యకరణసంఘాతమునందలి నేనను నభిమానమువలన జీవులని వ్యవహరింపబడుచున్నారు. ఇయ్యది యవిద్యవలన జరిగెడిపని. విద్యచే వీరందఱు ఈశ్వరస్వరూపులే. అందఱును చిద్రూపులే. కాన జీవేశ్వరాద్వైతమునకు ముప్పు లేదు. భగవంతుడగు శ్రీకృష్ణు డీశ్లోకమును అవిద్యాదశను బుచ్చుకొని చెప్పెను గాని విద్యాదశయందు చెప్పలేదు. విద్యావస్థలో సర్వభూతము లనునదియే లేదు. అంతయు నొక్కఁడే. కావున నజ్ఞానావస్థలో బ్రహ్మాది స్తంబపర్యంతములైన యే చరాచరభూతములు కనిపించుచున్నవో ఆభూతములయొక్క హృదయపుండరీకమున ప్రత్యగ్రూపముతోనున్న యీశ్వరుఁడు ఆభూతముల నియమించుచున్నాఁడని శ్లోకార్థము పర్యవసన్నమగుచున్నది.

రామానుజమతము.

ఇచట రామానుజులు 'ఈశ్వరుఁడు అంతర్యామిరూపముతో హృద్దేశమున నుండి జీవులను ద్రిప్పుచున్నాడు' (ప్రవర్తింపఁ జేయుచున్నాఁడు) అని వ్యాఖ్యానించిరి. ఇది యుక్తముకాదు. అంతర్యామిరూప మొకటి ప్రసిద్ధమగుచో నపుడు ఈశ్వరు డంతర్యామిరూపముతో నున్నాఁడనుట యుచితమగును. అట్టిరూపమే ప్రసిద్ధముకాదు. అంతర్యామి యెవరికిని ప్రత్యక్షము కాడు. జీవపారతంత్ర్యమను హేతువుచే నూహింపఁదగినవాఁడే యగును. కాన మొదట ఆయంతర్యామియగు నీశ్వరునియొక్క రూపమెట్టిదియో చెప్పవలెను. 'రుక్మవర్ణః అంగుష్ఠమాత్రః పురుషోఽంతర్యామీ' అను శ్రుతి యంతర్యామియొక్క రూపమును జెప్పుచున్నదనరాదు. "అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం" ఈశ్వరునకు రూపములేదని నిషేధించెడి యీశ్రుతిచే పై వాదము నిరాకరింపఁబడుచున్నది. జీవునకే రూపము లేకపోగా నీశ్వరునకు రూపము లేదని వేఱుగఁ జెప్పనేల? జీవుడు కృష్ణవర్ణుడనియు నీశ్వరుఁడు శుక్లవర్ణుఁడనియు ననరాదు. అచట కృష్ణ శుక్ల పదములు సపాప నిష్పాప పరములు. పాపమునందు కృష్ణపదము పుణ్యమునందు శుక్లపదము వాడబడినది. దేహమునుండి వెడలు జీవుఁ డెవడును నల్లనివాడుగఁ గనిపించుటలేదు. దేహము

నందున్న ఈశ్వరుడును దెల్లగా గనపడుటలేదు. కాన అంతర్యామి ఈశ్వరుడన సత్యజ్ఞానానందరూపుడనియే అంగీకరింపవలయును. అట్లంగీకరించుచో ఆసత్యజ్ఞానానందములే జీవునకుగూడ స్వరూపముగాన ప్రత్యగాత్మకే అంతర్యామీశ్వరత్వము సంభవించుచున్నందున ప్రత్యగాత్మకంటె వేఱుగ నంతర్యామిని కల్పించుట అప్రమాణము – అనుభవవిరుద్ధము – అనుపపన్నము నగును. ఇట్లు గల్పించుటలో నంతర్యామిబ్రాహ్మణము ప్రమాణమని మీరు భ్రమింపఁదగదు. అది కూడ ప్రత్యగాత్మనే చెప్పుచున్నది. మఱియు మన కనుభవములోనున్న జీవపారతంత్ర్యము అంతర్యామీశ్వరుని కల్పించుటలో ప్రమాణమనుటయు చెల్లదు. పారతంత్ర్యము కార్యకరణసంఘాతమునం దున్నదికాని ప్రత్యగాత్మయందు లేదు. కాన ప్రత్యగాత్మయే అంతర్యామి.

ఈశ్లోకమున విద్యారణ్యస్వామి పంచదశియం దీక్రిందివిధముగ నన్వయించిరి. 'యంత్రారూఢములగు సర్వభూతములను మాయచే భ్రమింపజేయుచున్నవాడగుచు ఈశ్వరుడు సర్వభూతములయొక్క హృద్దేశమునం దున్నాడు' అని. ఇచట దేహాదిపంజరము యంత్రమనియు, దానియందు నేనను నభిమానమారోహమనియు, కావున కార్యకరణసంఘాతమునందు 'అహం మమ' అభిమానముగల సర్వజీవులను త్రిగుణాత్మకయగు మాయచే భ్రమింపఁజేయుచున్నాఁడు' అని 'దేహాదిపంజరం యంత్రం తదారోహోఽభిమానితా' అను పంచదశియందలి గ్రంథసందర్భముచే వర్ణించిరి. రామానుజులుగూడ నీయర్థమునే యంగీకరించిరి. ఈయర్థమునందును కార్యకరణసంఘాతాభిమానముగల సకలజీవులకు స్థానమగు హృత్పుండరీకమునందు ప్రత్యగాత్మరూపముతో నీశ్వరుడుండి కార్యకరణసంఘాతమును ప్రవర్తింపఁజేయుచున్నాఁడనియు, అట్లు ప్రవర్తింపఁజేయబడిన సంఘాతమునందు 'నేను' అను అభిమానముండుటవలన జీవులు స్వయముగా నీశ్వరునిచే తాము ప్రవర్తింపఁజేయబడినటుల తలంచుచున్నారనియు దాత్పర్యము మును గ్రహింపవలెను.

ఈవిద్యారణ్యాన్వయమున నీశ్వరుఁడు ఏసాధనముచే భూతముల ద్రిప్పుచున్నాఁడు ? అను నాకాంక్ష కలుగగా 'మాయచే' అను సమాధానము దొరుకుచున్నది. ఎట్లు త్రిప్పుచున్నాఁడు ? అను నాశంకకు మాత్రము సమాధానము దొరుకుటలేదు. శంకరభగవత్పాదులుచెప్పిన యన్వయమునందు 'ఎట్లు' అను నాశంకకు సమాధానము కలదు. 'యంత్రారూఢములైన బొమ్మలను మాయచే త్రిప్పునట్లువలె' అని. అయితే భాష్యకారుల యన్వయమునందుగూడ 'దేనిచే' ననుకరణాకాంక్ష పూర్తికాకుండుట కొఱతయేకదా అని యనరాదు. మాయ యీశ్వరునిశక్తి. ఈశ్వరుడు భూతములను ద్రిప్పుచున్నాఁడని యనినందుననే, అగ్ని కట్టెలనుఁ దగులబెట్టుచున్నది అని యనగా నగ్ని తనయందలి దహనశక్తిచేఁ దగుల

పెట్టుచున్నదను యర్థము లభించునట్లు ఈశ్వరుడు తనయందలి మాయాశక్తిచే త్రిప్పుచున్నాడను నర్థ మనివార్యముగ లభించును.

అయితే 'యంత్రారూఢాని' అనుపదమును 'సర్వభూతాని' అనుపదమునకు విశేషణ మొనర్చినచో నీభూతములు దేహాదిపంజరమునం దభిమానముగలవా రనునర్థము లభించదుకదా! అని మీకు సందేహము కలుగవచ్చును. అయ్యది సరికాదు. చేతనావిశిష్టములైన కార్యకరణసంఘాతములనే ప్రవర్తిపజేయుట కుదురునుగాని, నిశ్చేతనములైన దేహేంద్రియాదులను ప్రవర్తింపఁజేయుట ఈశ్వరునకు గూడ సాధ్యముకాదు. 'భ్రామయన్' అను పదముచేతనే దేహాది పంజరమునందు 'అహంమమ' అభిమానముగల భూతములను అను నర్థము లభించును. అట్టి యభిమానములేని బ్రహ్మవేత్తలనుగాని, మృతభూతములనుగాని, యీశ్వరుడు ప్రవర్తింపఁజేయఁజాలడు. కాన 'యంత్రారూఢాని' అను విశేషణము లేకున్నను 'సర్వభూతాని' అనుశబ్దముచే సచేతనములైన కార్యకరణసంఘాతమునే గ్రహింపవలెను. కావున సచేతనములైన సర్వభూతములనగా ప్రమాతలచే (జీవులచే) నేనని యభిమానింపబడు కార్యకరణ సంఘాతములే. గాన కార్యకరణసంఘాతాభిమానముగల ప్రమాతలే 'సర్వభూతాని' అను శబ్దమున కర్థమని సిద్ధించినది. కనుక యింక 'యంత్రారూఢాని' అను విశేషణము 'సర్వభూతాని' అనుపదమునకు వ్యర్థమే యగును.

మఱియు ప్రమాత అజుడు, నిత్యుడు, శాశ్వతుఁడు 'భవన్తీతిభూతాని' అను వ్యుత్పత్తిచే 'భూత' శబ్దము కార్యవాచికాని 'ప్రమాతృ' వాచి కాదు. కావున జన్మలేని ప్రమాతలను భూతశబ్దము చెప్పఁజాలదు. ఇట్లుండ దేహాదిపంజరమగు యంత్రమునెక్కిన యాభూతము లెవ్వి? అని యడుగగా విద్యారణ్యస్వాముల సమాధానమేమి? వారందుకు సమాధానమేమియుఁ జెప్పఁజాలరు. కావున 'సర్వభూతాని' యనుపదమునకు సచేతములైన కార్యకరణసంఘాతములు అను నర్థమే న్యాయము. కనుకనే భగవత్పాదులు 'ప్రాణినః' అని చెప్పిరి. ఇట్లు కార్యకరణ సంఘాతములకే భ్రామణమును (త్రిప్పుటను) చెప్పుటచే జీవునకు నిజముగ నది లేదని తోచుచున్నది. ఇయ్యది జీవులకు గొప్పగుణము. కావున శాంకరభాష్యమే శంకరము (సుఖకరము).

నిజస్థితిలో 'నొకానొకనేర్పరి యంత్రారూఢములైన బొమ్మలను మాయచేవలె 'నీశ్వరుడు సర్వభూతములను మాయచే భ్రమింపజేయుచు సర్వభూతములయొక్క హృద్దేశమున గలడు' అని 'మాయయా' అను పదమును మఱొకమారు ఆవృత్తి పరచి అన్వయింపవలెను. అట్లన్వయించుచో కథమాకాంక్షవలె కరణాకాంక్షకూడ పూర్తియగును.

అయితే యిట్టియన్వయము సంగీకరించినచో 'ఇవ' శబ్దాధ్యాహారము 'కుశల' శబ్దాధ్యాహారమును 'మాయయా' అనుపదమునకు నావృత్తియు దోషము కదా యని యనరాదు. గుణమున్నపుడు పదాధ్యాహారముకాని పదావృత్తికాని దోషముకాదు. ఇట్లన్వయించక ఏకవాక్యమును జేసినచో 'యంత్రారూఢాని' యనుపదము వ్యర్థమగును. అని సంక్షేపము. ౬౧.

శ్లో॥ తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత
తత్ప్రసాదా త్పరాంశాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్॥ ౬౨

అ॥ ఓయి అర్జునా? ప్రకృతీశ్వరులకు పరతంత్రుడవగు నీకు వేరుగతి లేదు. మనోవాక్కాయకర్మలచే నాసర్వేశ్వరుని శరణుబొందుము. వానియనుగ్రహమున నీవు సంసారబాధను తొలగించుకొని శాశ్వతమగు మోక్షస్థానమును బొందగలవు. కావున నీవు "నేను క్షత్రియుడను యువకుడను" అను నభిమానమును వదలి ప్రత్యగభిన్నపరమాత్మ నాశ్రయించుము. "అహంబ్రహ్మాస్మి" అనుభావముతో పరమాత్మ నాశ్రయించినవానికి సంసారనివృత్తి పూర్వకముగ బ్రహ్మాత్మసాక్షాత్కారము కలుగగలదు.

ఓయి "శ్రీకృష్ణుడు నిన్ను ప్రకృతి నియోగించగలదు" "ఈశ్వరుడు నిన్ను ప్రేరణచేయుచున్నాడు" "నేను చెప్పినదానిని వినకున్న నీవు నశింతువు" కాన యుద్ధమును జేయుము" అని పూర్వముచెప్పి యిప్పుడు పరమేశ్వరునాశ్రయించమనుచున్నా డదియేల? ఈయది జ్ఞాననిష్ఠకదా? ఇట్టి జ్ఞాననిష్ఠ కర్మనిష్ఠకు విరోధికదా? అని యనరాదు. నేను జెప్పినట్లీశ్వరారాధనబుద్ధితో యుద్ధము జేసి పిదప సంసారనాశముకొఱకు నీశ్వరుని శరణుబొందమని శ్రీకృష్ణునియాశయము. కర్మనిష్ఠవలన జ్ఞాననిష్ఠ కలుగును. కర్మనిష్ఠ జ్ఞాననిష్ఠకు సాధనము. అయినను ఈ రెంటికి విరోధము గలదు. రెండుకట్టెలను మధించినందున బుట్టిన అగ్ని యాకట్టెల రెంటిని తగులపెట్టును. అట్లే కర్మలవలనబుట్టు జ్ఞాననిష్ఠకూడ కర్మలను నిర్మూలము చేయును.

లేక ఈశ్వర ప్రకృతులకు నీవు పరతంత్రుడ వయినందున యుద్ధమునందు బ్రవర్తించినను త్రికరణశుద్ధిగ నీశ్వరునే శరణుబొందుము. ఈశ్వరుడు "క్షత్రియస్య విజితమ్" (క్షత్రియునకు జయము) అని శాసించియుండెను. కాన నేను యీశ్వరారాధనార్థమై యుద్ధమును జేతును. "పృథివిని జయించుటకుగాని, స్వర్గమును జయించుటకుగాని, ఐహికఫలముల నభిలషించి యుద్ధమును జేయను." అని వాక్కుతోను, మనస్సుతోను, బుద్ధితోను నిర్ణయించుకొనుము. అట్లు నిర్ణయించుకొని యీశ్వరు నాశ్రయించి యీశ్వరారాధనార్థమయిన యుద్ధకర్మయందు నీవు ప్రవర్తింప, నీయందు దాయీశ్వరునకు గొప్ప యనుగ్రహము కలుగగలదు. దాన

చిత్తశుద్ధిని సమ్యగ్జ్ఞానమును బొంది సంసారోపరతిరూపమగు మోక్షము నొందగలవు' అని యిట్లు యీశ్లోకము కర్మమార్గప్రతిపాదనపరమనియే చెప్పవచ్చును.

దీనిచే నర్జునునకు నిప్పుడే జ్ఞాననిష్ఠ నొందఁదగిన యోగ్యత లేదనియు 'నీ విపుడు జ్ఞాననిష్ఠలో ప్రవేశింపక నేను జెప్పినవిధమున యుద్ధము నాచరించి దానిచే జ్ఞాననిష్ఠను బొందుట కర్హుడవై ఆవల జ్ఞాననిష్ఠలో ప్రవేశింపుము' అని పార్థునకు శ్రీకృష్ణు డుపదేశించినట్లు సూచిత మగుచున్నది. కనుకనే కృష్ణుడు "నియతం కురు కర్మత్వం తస్మాద్యుద్ధ్యస్వ భారత" ఇత్యాది వాక్యములను గతాధ్యాయములందు జెప్పెను.

అథవా యర్జునునకు జ్ఞాననిష్ఠాప్రాప్తియోగ్యత యిపుడే యుండునుగాక. అతనికి స్వకర్మమగు యుద్ధము ననుష్ఠించుటతో నీశ్వరాంశుడగుటచే పని లేకుండును గాక. అయినను లోకసంగ్రహార్థ మర్జునునిచే జ్ఞానహేతువగు కర్మయే మొదట నాచరింపతగిన దను నభిప్రాయముతో శ్రీకృష్ణు డిట్లుచెప్పెను. కాన యర్జునుని యందు జ్ఞాననిష్ఠార్హత కలదా ? లేదా ? యను శంకతో మనకు బనిలేదు.

రామానుజీయము :- రామానుజులు "విష్ణోః పరంస్థానం వైకుంఠాఖ్యం ప్రాప్స్యసి" మూలమునందలి స్థానమను పదము నాధారముగా జేసికొని విష్ణుమూర్తియొక్క వైకుంఠమను స్థానము నందగలవు. అని వ్యాఖ్యానించిరి. ఇందు కాధారముగా "తద్విష్ణోః పరమం పదం, సదా పశ్యంతి సూరయః" 'తేహనాకం మహిమానస్సచంతే యత్రపూర్వే సాధ్యాస్సంతిదేవాః' 'యత్రఋషయః ప్రథమజాయే పురాణః' ఇత్యాది శ్రుతుల నుదాహరించిరి. . కాని యియ్యది యయుక్తము. వైకుంఠలోకప్రాప్తి సగుణబ్రహ్మవిద్యకు ఫలముగాని నిర్గుణబ్రహ్మ విద్యకు ఫలముగాదు.

వైకుంఠలోకము రెండువిధములు. ఒకటి మేరుపర్వతముయొక్క శిఖరము నందు గలదు. అయ్యది శుభ్రునిభార్యయగు వికుంఠయందు బుట్టిన భగవంతుడగు విష్ణుమూర్తిచే లక్ష్మీదేవియొక్క ప్రీతికొఱకు నిర్మింపఁబడినది.

రెండవది బ్రహ్మాండమున కావల సత్యలోకమున గలదు. ఇందు సాల్రగామార్చనాదులచే మేరుశిఖరమునందలి వైకుంఠలోకము ప్రాప్తించును. సగుణ బ్రహ్మోపాసనచే సత్యలోకమునందలి వైకుంఠము ప్రాప్తించును.

ఈ సత్యలోకము సత్యలోకమనియు, వైకుంఠలోకమనియు, కైలాసలోకమనియును మూడువిధముల భిన్నమైనది. అందు హిరణ్యగర్భుఁడు సత్యలోకమునకు ప్రభువు. విష్ణువు వైకుంఠలోకమునకును, శివుడు కైలాసలోకమునకును ప్రభువులు. వీరు ముఫ్వురు దేహధారులగుటచే జీవులనబడుచున్నారు. కాని సర్వజ్ఞులు రజ

స్సత్త్వతమోగుణములవలన సృష్టిస్థితిలయములకు గారణభూతులు. ఈశ్వరులని పూజింపఁదగినవారు మొదటపుట్టినవారు త్రిమూర్తులని చెప్పఁదగిన దేవతలు. ఈ ముగ్వురియొక్క స్థానములే సగుణముక్తిక్షేత్రములు అని కొందరందురు.

"హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే భూతస్యజాతః పతిరేక ఆసీత్" అను శ్రుతివలన హిరణ్యగర్భుఁ డొక్కఁడే మొదటపుట్టినవాఁడనియు వాఁడే సత్యలోకమునకు బ్రభువనియు వానిస్థానమే సగుణముక్తిక్షేత్రమనియు సగుణముక్తిక్షేత్రము లనేకములున్నట్లు ప్రమాణములేదనియు మరికొందరందురు.

ఏదియెట్లైనను సగుణముక్తిక్షేత్రము అవిద్యావస్థయందేకాని విద్యావస్థయందు లేదు. అవిద్యావిషయమగు సగుణముక్తిక్షేత్రమును తత్త్వవేత్త పొందఁడు. తత్త్వవేత్తలదృష్టిలో నాక్షేత్రమే లేదు. కనుకనే సగుణముక్తిక్షేత్రము శాశ్వతము కానేరదు. బ్రహ్మాతిరిక్తమంతయు నశాశ్వతము. పరమాత్మయొక్కఁడే శాశ్వతుఁడు. కావున శాశ్వతమగు స్థానము పరమాత్మయేకాని వైకుంఠాదిలోకములు కావు.

అయితే ఆధారవాచియగు మూలమునందలి స్థానశబ్దమునకు పరమాత్మస్వరూపమను నర్థమెట్లని మీరడుగవచ్చును. కాని సమస్తప్రపంచకల్పనకు పరమాత్మ యధిష్ఠానమగుటచే సర్వాధారమగు బ్రహ్మస్వరూపము స్థానశబ్దమున కర్థమగుట వింతకాదు. 'తిష్ఠత్యస్మిన్ సర్వంజగత్' వీనియందు సర్వప్రపంచము కలదు. అను వ్యుత్పత్తివలన స్థానశబ్ద మేర్పడినది. ఈ వ్యుత్పత్తినిబట్టి స్థానశబ్దము నిఖిలప్రపంచాధారమగు బ్రహ్మస్వరూపమనియే చెప్పిరి. వైకుంఠాదిలోకములను జెప్పదు. కాన శాశ్వతస్థానము బ్రహ్మయేకాని వైకుంఠాదికము కాదు. ఈబ్రహ్మమే 'తద్విష్ణోః పరమంపదం సదాపశ్యంతి సూరయః' ఇత్యాది వాక్యములవలనఁ జెప్పబడుచున్నది. ఎల్లప్పుడు విద్వాంసులు చూచునట్టి పరమపదము బ్రహ్మస్వరూపమేకాని విష్ణులోకము కాదు. చక్షుర్గోచరముకాని వైకుంఠలోకమును భూలోకమునందున్న విద్వాంసు లెన్నటికిఁ జూడఁజాలరు. విద్వాంసులు బ్రహ్మస్వరూపము నెల్లప్పు డనుభవించుచున్నారు. 'యత్రపూర్వే సాధ్యాస్సంతి దేవాః' ఇత్యాది శ్రుతులుమాత్రము సగుణముక్తిక్షేత్రమును బ్రతిపాదించునట్టివియే. ఇంక యనంతగరుడాది నిత్యశూరులు వైకుంఠలోకము నెల్లపుడు చూచుచున్నారని పై శ్రుతికర్థమును వర్ణించినను అంతమాత్రముచే నిర్గుణముక్తిక్షేత్రము లేకపోదు. సగుణముక్తిక్షేత్రము శాశ్వతమును గాదు.

శ్లో॥ ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా
విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు॥ 63

భా. అ. అర్జునా, నీకు నేను రహస్యములకంటె నతిరహస్యమైన జ్ఞానము నుపదేశించితిని. దీనినంతయు విమర్శించుకొని నీకు దోచినట్లుచేయుము. 'ఆయుర్విత్తం

గృహచ్ఛిద్రం మంత్రౌషధసమాగమాః దానం మానావమానంచ నవగోప్యా మనీషిభిః' అని చెప్పుటచే నీతోమిక్కిదియు రహస్యములు. అధ్యాత్మజ్ఞాన మంత కంటెంగూడ రహస్యమని భావము. నీకిచ్ఛవచ్చినటులఁ జేయుమని శ్రీకృష్ణు డభ్యనుజ్ఞ యిచ్చినంతమాత్రమున యుద్ధమునుండి యుపరమింపుమని కృష్ణుని యాశయము కాదు. శాస్త్రము నవలోడనగావించి శాస్త్రముచెప్పినట్లు చేయు మనియే శ్రీకృష్ణుని యాశయము. కనుకనే 'విమృశ్య' 'కురు' అని శ్రీకృష్ణుడు చెప్పెను. శాస్త్రము విమర్శించినచో యుద్ధము చేయుతలంపే యర్జునునకుఁ గలు గునుగాని మానుకొందమను తలంపు గలుగదు. శాస్త్రమునం దనేకమారులు స్వధర్మ మనుష్ఠింపుమని ఘోషింపబడియున్నది. కాన యథేచ్ఛమనగా 'యథాశాస్త్రం యథేచ్ఛమ్' శాస్త్రము నతిక్రమింపకుండగా నీయిచ్ఛవచ్చినటులఁ జేయుమని తాత్పర్యము. ౬౩

శ్లో॥ సర్వగుహ్యతమం భూయః శ్రుణు మే పరమంవచః
ఇష్టోసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితం॥ ౬౪

అ॥ కాని అర్జునా, నీకింకను బరమరహస్యమైన మాటను జెప్పెదను. నీవు నాకు మిక్కిలి యిష్టుడ వను భావము కలదు. అందువలన నీహితమును గోరి నే నిట్లు చెప్పుచున్నాను. ఈ నేను జెప్పెడిమాట నీకు హితమైనవాని యన్నిటికంటెను జ్ఞాన ప్రాప్తికి సాధనమగుటచే మిక్కిలి హితమైనది. ౬౪

శ్లో॥ మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోసి మే॥ ౬౫

అ॥ నాయందు నీమనస్సు నుంచుము. అనగా నన్నే ధ్యానించుము. నన్నే భజించుము. నన్ను పూజింపుము. నన్ను నమస్కరింపుము. ఇట్లు సర్వవిధముల సాధ్యసాధనప్రయోజనములను నాయందు సమర్పించియున్నచో నీవు నన్నే పొంద గలవు. నీవు నాకిష్టుడవని నే నొట్టుపెట్టి చెప్పుచున్నాను. నేను సత్యప్రతిజ్ఞుడను కాన నేను జెప్పినది వ్యర్థముకాదు. నీ కవిశ్వాసము వలదు. కాన చేయఁదగిన కర్మయంతయు నీశ్వరారాధనబుద్ధితోఁ జేయవలెనని నమ్మి యుద్ధమను స్వధర్మ మనుష్ఠింపుము. గాన నీకు క్రమముగఁ బరమపదప్రాప్తి కలుగఁగలదు.

ఈ గీతాశాస్త్రమునఁ గర్మయోగము జ్ఞానయోగము నని రెండుమార్గములు పరినిష్ఠితములై యున్నవి. 'జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం' అని ప్రారంభించి, నడుమ నచ్చటచ్చట నీమార్గద్వయము ముచ్చటింపబడినది. ఆ మార్గద్వయమే తుద కిచ్చట నుపసంహరింపఁ జేయదగియున్నది. భక్తిధ్యాన యోగాదులన్నియు నీ రెండుమార్గములందే చేరిపోవును. అందు నీయది కర్మ

యోగమునకు నుపసంహారపరమగు శ్లోకము. ముందు జెప్పఁబోవు శ్లోకము జ్ఞాన యోగోపసంహారపరము ' అని విభాగమును గ్రహింపవలెను. ౬౫

అవతారిక :- కర్మయోగనిష్ఠకు పరమరహస్యమగు భగవచ్ఛరణత్వము నుపసంహరించి ఇపుడు కర్మయోగనిష్ఠకు ఫలమైనట్టియు సర్వవేదాంతములయందును సారముగా విధింపబడినట్టియు సమ్యగ్దర్శనమును నుపసంహరింపవలెనని చెప్పు చున్నారు.

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥ ౬౬

అను :- ఇయ్యది సకలగీతాశాస్త్రమునకు చరమశ్లోకము. ' అశోచ్యానన్వ శోచత్వం ' అనునది మొదటిశ్లోకము.

' నీవు సర్వధర్మములను బరిత్యజించి నన్నొక్కనినే శరణుపొందుము. నేను నిన్ను పాపము లన్నిటినుండి విముక్తునిఁ జేయుదును. నీవు దుఃఖింపవలదు ' అని శ్లోకార్థము.

ఓయీ, జ్ఞానయోగ కర్మయోగములు రెండును ఒకేమారు నొకేపురుషు డనుష్ఠింప వీలుకలుగదు కదా ! శ్రీకృష్ణుఁ డర్జునునిగూర్చి రెండుయోగముల నెం దుకు జెప్పెను ? ఇది యొక దోషముకాదు. శ్రీకృష్ణుడు అర్జునుని నిమిత్తముగాఁ బెట్టుకొని ముల్లోకముల యుపకారము కొఱకు గీతాశాస్త్రము నుపదేశించెను.

' సారథ్య మర్జున స్యాజౌ కుర్వన్ గీతామృతం దదౌ,
లోకత్రయోపకారాయ తస్మై కృష్ణాత్మనే నమః ' అని పెద్ద లనుచున్నారు.

కాన కర్మనిష్ఠాయోగ్యులకుఁ గర్మనిష్ఠ, జ్ఞాననిష్ఠాయోగ్యులకు జ్ఞాననిష్ఠయు శ్రీకృష్ణుఁడు చెప్పెను గాన నిందు తప్పు లేదు.

లేక ఒక్కనిచే నొకేమారు రెండుయోగములు ననుష్ఠింప వీలుగాకున్నను కర్మయోగానంతరము జ్ఞానయోగ మనుష్ఠింప వీలగును గాన నర్జునునికొఱకుగూడ మార్గద్వయ ముపదేశింపవచ్చును. మొదట కర్మయోగ మనుష్ఠింపుము. చిత్తము శుద్ధమైనపిదప జ్ఞానయోగ మనుష్ఠింపు ' మని. ఇందు విరోధమేమి ?

కార్యము నియోగము, అపూర్వము, నని మూరుపేరులు కలిగినట్టియు యజ్ఞా దులవలన కలిగెడి పుణ్యరూపమగు సంస్కారము ధర్మ మనబడును. అందుకు కార ణము లగుటచే యజ్ఞాదికర్మలుగూడ ధర్మములే యగుచున్నవి. విధింపబడని కర్మల వలన కలుగు దుష్కృతము అధర్మము. తన్నిమిత్తములైన దుష్టకర్మలు గూడ అధర్మములే.

ఇచట మూలమున సర్వధర్మములను పరిత్యజింపుమని కృష్ణుడు చెప్పగా సర్వధర్మములను జేయుమని ప్రాప్తించును. అధర్మానుష్ఠానము నరకహేతువగుటచే దుష్టము. మోక్షశాస్త్రమునం దట్టి విపరీతార్థమును జెప్పుట తగదు. కాన శ్లోకము నందలి ధర్మపద మధర్మమునకుగూడ నుపలక్షకము. ఆస్తికుడైన ముముక్షువునకు ధర్మములే పరిత్యాజ్యములని చెప్ప నధర్మము పరిత్యాజ్యమని వేఱుగఁ జెప్పనేల? కాన నర్థాపత్తిప్రమాణమువలననే సర్వాధర్మపరిత్యాగము లభ్యము.

1. ఇచట ధర్మశబ్దము లక్షణచే కర్మమాత్రమును బోధించును. కర్మలువిహితములు నిషిద్ధములుఅని రెండురూపములు కావున నా రెండును ధర్మశబ్దార్థములు కాగలవు.

2. లేక ధర్మశబ్దము అభిదావ్యాపారముచే విహితకర్మను బోధించుచు లక్షణచే తనకు విరుద్ధమైన అధర్మమునుగూడ బోధించును.

3. లేక 'ధర్మాన్' అను బహువచనముచేతనే అన్నిధర్మములు నను నర్థము లభించుచుండ సర్వశబ్దము వ్యర్థమగును గాన నట్టి సర్వశబ్దము యొక్క బలముచే నధర్మము లను నర్థము సిద్ధింపగలదు. ఎట్లైనను అధర్మపరిత్యాగము కూడ నిచట శ్రీకృష్ణునకు వివక్షితము.

వస్తుతః ఆస్తికునకు అధర్మపరిత్యాగము, ధర్మస్వీకారము పూర్వతంత్రమే విధించినది. ముముక్షువయి, శమదమాదిసాధన సంపత్తిగల బ్రహ్మవిచారాధికారికి పూర్వతంత్రము విధించిన సర్వధర్మములను పరిత్యజించమనియే ఉత్తరతంత్రము విధింపవలెను. అధర్మపరిత్యాగమును విధించుటతో దీనికి పనిలేదు. కనుకనే బాదరాయణులు "సర్వధర్మాన్ పరిత్యజ్య" అని చెప్పిరి. లేకున్నచో "ధర్మాధర్మాన్పరిత్యజ్య మామేకం శరణంవ్రజ" అని చెప్పియుండెడివారు.

"సర్వధర్మాన్ పరిత్యజ్య" అని చెప్పగా మందబుద్ధులకు అధర్మానుష్ఠానము శ్రీకృష్ణున కిష్టమనుబుద్ధి కలుగునేమోయని తలచి, దానిని నివారింప భాష్యకారులు ధర్మశబ్దముచే అధర్మముకూడ గ్రహింపబడునని చెప్పిరి.

సర్వధర్మములన నిత్యనైమిత్తిక కామ్యకర్మలు, హింసాదికృత్యము లధర్మములు. వ్యాసులు కంఠతః సర్వధర్మపరిత్యాగమాత్రమునుజెప్ప అధర్మమునుగూడ విడువుమని మీరెట్లందురు? నిజమే వ్యాసుల కిచట సర్వకర్మసంన్యాసపూర్వకమగు నైష్కర్మ్యము వివక్షితము. ధర్మములను విడచి, అధర్మము నాచరించినచో, నిష్కర్మకానేరడు. వ్యాసులకిట్టి యభిప్రాయము కలదని "నావిరతో దుశ్చరితాన్నాశాంతో నాసమాహితః" అను శ్రుతివలనను "త్యజ ధర్మ మధర్మంచ ఉభే సత్యానృతేత్యజ" అనుస్మృతివలనను తెలియుచున్నది. పై శ్రుతిస్మృతులయందు అధర్మమును విడువుమని విధింపబడియున్నది. శ్రుతిస్మృతులకు విరుద్ధమయిన యర్థమును వ్యాసు లెన్నటికిని జెప్పరని భావము.

దీనివలన సర్వకర్మసన్న్యాసముచే భగవచ్ఛరణాగతిరూపమగు జ్ఞాననిష్ఠను సంపాదింపవలెనని తేలినది. సర్వకర్మసన్న్యాసము జ్ఞాననిష్ఠ కంతరంగసాధన మను నది స్పష్టము. కనుకనే శ్రీకృష్ణుడు, "లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ। జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్" అని మొదటనే చెప్పిరి. సాంఖ్యులనగా సర్వకర్మసన్న్యాసులకు విద్వాంసులని యర్థము. కావున ధర్మాధర్మముల నన్నిటిని వదలి నన్నొకనినే శరణుఁబొందుమని పూర్వార్ధమున కర్థము.

మూర్తామూర్తమగు నిఖిలప్రపంచమునకు ఆత్మయగు నీశ్వరు డొక్కడేకాని భిన్నుడు కాడు. ఈత డొక్కడే బ్రహ్మవిష్ణురుద్రాది ప్రాణులయందును చేతనా చేతనాత్మకములగు కార్యములయందును గలడు. కార్యములయందు కారణ పదార్థముండుట మృదాది దృష్టాంతములయందు ప్రత్యక్షము. కాన పరమకారణ మగు బరమాత్మ సర్వభూతములయం దుండుటయు, సర్వభూతముల కాత్మయగు టయు నుచితము. "యతోవా ఇమాని భూతాని జాయంతే" అను శ్రుతి నిఖిల ప్రపంచమున కీశ్వరుడు కారణమని చెప్పుచున్నది. "నచాస్య కశ్చిజ్జనితా" అను శ్రుతి యీశ్వరుడు కార్యము కాదని చెప్పుచున్నది. కావున నీశ్వరుడు పరమ కారణుడు. కాన ఘటాది నిఖిల మృత్పదార్థములకు మృత్తి కెట్లు ఆత్మ (స్వరూప) భూతమో, అట్లే స్వకార్యములయిన సర్వభూతములకు ఈశ్వరుఁ డట్లాత్మ. ఘటా దులయందు మట్టి యెట్లుకలదో, సర్వభూతములయందు ఆత్మ యట్లు కలదు. కాన నీశ్వరుడు సర్వాత్మయనియు, సర్వభూతస్థుడనియు జెప్పబడినది.

ఓయి! మృద్ఘటములు రెండు నొకేవిధమగు లక్షణము కలవి. మృత్తు జడము. ఘటముకూడ జడము. అందువలన ఘటములకు మృత్తిక యాత్మ (స్వరూపము) కావచ్చును. ఇట్లు ఈశ్వర జగత్తులకు సాలక్షణ్యము (సమాన స్వరూపము) లేదు. ఈశ్వరుడు సత్యజ్ఞానానందరూపుడు. జగత్తు అనృతజడదుఃఖ రూపము. కాన నీశ్వరుడు జగత్తున కాత్మ కానేరడు. అందువలననే యీరెంటికి కార్యకారణ భావముకూడ కుదరదు. కార్యకారణభావము లేనందున సర్వభూత స్థత్వము (సర్వభూతములయం దుండుట) కూడ గుదరదు. అనినచో నది సరికాదు.

"యతోవా" ఇత్యాది శ్రుతిప్రామాణ్యమునుబట్టియు, రజ్జుసర్పాది దృష్టాంతములబట్టియు, స్వప్నమునందుగూడ రథగజాదులను జూచుటనుబట్టియు, ప్రపంచోత్పత్తియందు వివర్తవాదము నాశ్రయింతుము. ఈశ్వరవివర్తమగు ప్రపంచము యీశ్వరాత్మకమగుట కడ్డులేదు. "జగదస్తి, భాతి, ప్రియం" (ప్రపంచము కలదు. ప్రపంచము కనిపించుచున్నది. ప్రపంచము యిష్టమయినది.) అను ప్రతీతినిబట్టి యీశ్వరధర్మములగు సచ్చిదానందములు ప్రపంచమునం దను గతములని నమ్మదగియున్నది. కాన త్రాడు సర్పముయొక్క స్వరూపమయినట్లు

సచ్చిదానందరూపుడగు నీశ్వరుడు జగద్రూపు డగును. త్రాటియందు పామువలె నీశ్వరునియందు మాయచే ప్రపంచము కల్పితము. కనుకనే రజ్జుయాథాత్మ్యము తెలిసినవానికి సర్పము గోచరించదు. బ్రహ్మవేత్తలకు ప్రపంచమును గోచరించదు. అవిద్య యుండునంతవరకు ప్రపంచము గోచరించుచున్నందున వ్యవహారమునకు లోపముండదు. బ్రహ్మకంటె వేరుగ జగత్పదార్థముకూడ విద్వాంసులకు గోచరించదు. ఇదియంతయు గడచిన గ్రంథమున విస్తరించి చెప్పబడినందున మరల యచట జెప్పబనిలేదు.

ఇచట నీశ్వరుని శరణమొందుట యన 'ఈశ్వరుడే నేను. నాకంటె వేరు వస్తువులేదు' అను నిశ్చయముతో నుండుట. 'తత్సత్యం, సఆత్మా, తత్త్వమని' 'అతో అన్యదార్తం' ఇత్యాది శ్రుతులు ఆత్మ అద్వితీయమనియు, ఆత్మకంటె వేరువస్తువు లేదనియును జెప్పుచున్నవి. అట్లే

'క్షేత్రజ్ఞంచాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత'

'అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః'

'న వాసుదేవాత్పరమస్తి కించిత్'

'తస్మా న్నవిజ్ఞాన మృతేఽస్తి కించిత్'

ఇత్యాది స్మృతిపురాణాదులును కారణభూతుడగు నాత్మకంటె వేరుగ కార్యమగు వస్తువులేదని చెప్పుచున్నవి.

ఇట్లు పరమకారణుడగు నీశ్వరునికంటె వేరుగ కార్యప్రపంచము లేదు. ఈశ్వరునందు కనపడు నామాకారములు మిథ్యాభూతములు. సుషుప్త్యాద్యవస్థలయందు ద్వితీయవస్తువు లేకుండుట యెల్లర కనుభవసిద్ధము. అనుభవించువాడు లేనిదే అనుభవము కుదురనందున అనుభవించునట్టి యాత్మ యొకడు కలడని యంగీకరింపకతప్పదు.

ఇక సర్వధర్మపరిత్యాగపూర్వకముగ భగవచ్ఛరణాగతికి ఫలము ఉత్తరార్థమునఁ జెప్పుచున్నాడు. 'అర్జునా, ప్రత్యగభిన్నపరమాత్మనగు నేను 'బ్రహ్మైవాహమస్మి' అను నిశ్చితబుద్ధితోనున్న నిన్ను బంధనరూపములగు పుణ్యాపాపములన్నిటినుండియు విడిపింతును. ముముక్షువునకు పాపము సంసారబంధకమగునటుల పుణ్యముకూడ నట్టిదియే యగును. రెంటినుండి విముక్తుడగువాడుగాని ముక్తుడు కాజాలడు. ఈశ్వరశరణాగతిరూపమగు జ్ఞాననిష్ఠయం దధికారికి విహితకర్మలఁ జేయనందున దోషములేదు కావున వాడు యథావిధి సర్వకర్మలను సన్న్యసించి జ్ఞాననిష్ఠయం దధికృతుఁ డగును. కావున సర్వధర్మపరిత్యాగ ఈశ్వరశరణాగతులచే సర్వపుణ్యపాపరూపమగు బంధవిముక్తి ముముక్షువునకు సులభమని భావము. ఈ ముముక్షుఫలము స్వర్గాదులవలె మరణానంతర మనుభవింపఁదగినది కాదు. ఇప్పుడే యనుభవగోచర మగును. అట్లు నీ కాత్మసాక్షాత్కారము కలుగునటుల నీబుద్ధిని

నిర్మలపరచి దానియందు చక్కగ జ్ఞానదీపమును ప్రకాశింపఁజేతును. దీనివలన సర్వధర్మపరిత్యాగపూర్వకమగు ఈశ్వరశరణాగతికి జ్ఞానోదయమును కలుగఁజేయుట యను నీశ్వరానుగ్రహము ఫలమనియు మోక్షము నిత్యసిద్ధమగుటచే నది ఫలము కాదనియు తేలినది. కావున 'నే నీసంసారము నెట్లు తరింతు'నని నీవు పరితపింపఁ బనిలేదు. నీవు నిజముగ నసంసారియగు నీశ్వరరూపుఁడవు. ఆత్మజ్ఞాననిష్ఠవలన నీకు నీదురూపము సాక్షాత్కారమగుటతోడనే సంసారము దానంతట నది యుపరమించును. రజ్జుస్వరూపము సాక్షాత్కారమైనతరువాత లోగడ కలిగిన సర్పాభాసము నివర్తింపకమానదు. నిద్రాసమయమున నొకానొకడు తాను మహారాజునని భ్రమించె ననుకొనుడు. మెలకువ కలిగినతోడనే తాను దరిద్రుడనని తనకుఁ దెలిసియుండ లోగటి మహారాజభ్రాంతి నిలిచియుండునా? కావున అసంసారియగు నీశ్వరుని యొక్క స్వరూపసాక్షాత్కారమువలన సంసారనివృత్తి తప్పదు. ఇయ్యది 'తరతి శోకమాత్మవిత్' ఇత్యాది శ్రుతిసిద్ధము. కావున నీశ్వరుడే యాత్మయగును. జ్ఞానమువలననే మోక్షమని అద్వైతము సిద్ధించినది.

'ఓయీ, జ్ఞానమువలననే మోక్షమగు నంశము అద్వైతుల కభిమతమైనను అయ్యది కుదరదు. ప్రకృతగీతాశాస్త్రమున భగవంతు డావిషయమును నిష్కర్షగాఁ జెప్పలేదు.' అను శంక రాగా నాయంశమును స్థాపించుటకు విచార మారంభింపఁ బడుచున్నది.

'ఓయీ, యీగీతాశాస్త్రమున మోక్షసాధనముగా నిశ్చయింపఁబడినది జ్ఞానమా, కర్మయా లేక యుభయమా? కొన్నివాక్యములు జ్ఞానమువలన మోక్షమని చెప్పుటచేతను, మఱికొన్ని వాక్యములు కర్మ లవశ్యకర్తవ్యములనియు కర్మల చేతనే సంసిద్ధి (మోక్షము) అనియును చెప్పుటచే నీ సంశయ మేర్పడుచున్నది. ఇట్లే జ్ఞానకర్మలు రెండు కర్తవ్యములని చెప్పుటచే నుభయము మోక్షసాధనమనిగూడ సంశయము కలుగును. కనుక యీ విచార మవసరము. దీనివలన నేదియో యొకటి నిశ్శ్రేయస సాధనమని తేలగలదు. ఇదియే యీ విచారమునకు ఫలము. ఇట్లు విచారించి నిర్ధారణచేసిననేకాని ముముక్షువు ఏదియో యొకదానియందు ప్రవర్తింప వీలులేదు. దీని నిట్లు సందేహముగ విడిచినచో మోక్షార్థియగు పురుషు డెందును ప్రవర్తింపనేరడు. పురుషార్థమునుండి భ్రష్టుఁడగును. కావున మోక్షసాధనమును నిర్ణయించుటకొఱ కీవిచార మావశ్యకము. మథనములేనిదే యమృతము పుట్టనట్లు విచారములేనిదే నిశ్చయార్థము లభింపదు. కావున తప్పక విచారించుట యవసరము.

**సిద్ధాంతము :–** కేవల మాత్మజ్ఞానమే నిశ్శ్రేయసహేతువు. ఆత్మయందు క్రియాకారక ఫలభేదబుద్ధి యవిద్యవలన ననాదికాలమునుండియు నారంభించి విస్తరించియున్నది. అట్టి భేదబుద్ధిని ఆత్మజ్ఞానమే పోగొట్టును. మోక్షము నవశ్యముగా నిచ్చితీరును.

'నాకీపని. నే నీపనికి కర్తను. నేను దీనిఫల మనుభవింతును' అను నవిద్య యాత్మకు అనాదికాలమునుండియు వచ్చినది. ఇట్టి యవిద్యకు 'నేను కేవల యాత్మ రూపుడను, అకర్తను, అప్రియుడను, అఫలుడను. నాకంటె వేఱుగ మఱియొకటి లేదు'- అను నాత్మజ్ఞానమే నివర్తకము. దీనివలనఁ గేవల కర్మలుగాని జ్ఞానసముచ్చిత కర్మలుగాని మోక్షప్రదము లను పక్షద్వయము నివృత్తమగుచున్నది.

'ఓయీ, అవిద్యవలన భేదబుద్ధి యాత్మయందు బుట్టుచో నవిద్యకుబూర్వ కాలమున నాభేదబుద్ధి యాత్మయం దుండ వీలులేదు. అవిద్యకుబూర్వము ఆత్మ కేవలుడే. అవిద్యపుట్టినపిదప భేదబుద్ధియు దానివలన సంసారమును ఆత్మ కేర్పడినది. ఇట్లైనచో విద్యవలన ముక్తుడైన ఆత్మకుగూడ మఱల సంసారమేల యేర్పడకూడదు?

మొదటలేని యవిద్య యాత్మయందు జేరినట్లు విద్యవలన నశించిన యవిద్య మాత్రము మఱల ఆత్మయం దేలచేరదు? పుట్టుటకు బూర్వమువలె నశించినతరువాత గూడ వస్తువునకు లేకపోవుట యనునది సమానమేకదా? లేని వస్తువు పుట్టునని యంగీకరింపగా నశించిన వస్తువుమాత్రము మఱలఁబుట్టునని యేల యంగీకరింపరు? ఇట్లుండ స్వర్గమును బొందినవానికివలె ముక్తిని బొందినవానికిగూడ పునరావృత్తి ప్రసక్తించును. కావున ఆత్మయందు క్రియాకారకఫలభేదబుద్ధి అవిద్యవలన నేర్పడ లేదు. స్వతస్సిద్ధముగానే కలదు అని ఆశంక.

సమాధానము :- అవిద్య యనాదికాలమునుండి వచ్చియున్నది. అది యిక్కాలమున బుట్టినదని చెప్పవీలులేదు. కాన అవిద్య పుట్టకపూర్వమనుమాటయే కుదరదు. ఇంతమాత్రమున నశించిన అవిద్యకూడ మరలివచ్చుననుట తగదు. నశించిన ఘటముకాని నశించిన దీపముగాని మరల పుట్టుటలేదు. ఆత్మయందు క్రియాదికము స్వతస్సిద్ధముగా కలదనుటయు పొసగదు. అట్లన్నచో 'నిష్కలం నిష్క్రియం శాంతం' అనునట్టి శ్రుతులు విరోధించును. కావున నాత్మయందు క్రియాకారక ఫలభేదబుద్ధి అనాదిసిద్ధమైన యవిద్యవలన నేర్పడినదేకాని స్వభావసిద్ధమైనది కాదు. ఇట్టి యవిద్యను పైనజెప్పిన యాత్మజ్ఞానము నశింపఁజేయును. అవిద్య నశించినచో భేదబుద్ధి నశించును. భేదబుద్ధి నశించిన ఆత్మకు సంసారములేదు. ఆత్మ ముక్తుడగును. ఇట్టిమోక్షమునకు కర్మ సాధనము కానేరదు. కర్మసాధ్యమైనది కార్యమగును. మోక్షము కార్యముకాదు. కాన దానికి కర్మసాధనమగుట పొసగదు. సాధ్యమగు వస్తువునకు నేదియో యొకటి సాధనమగునుగాని యసాధ్యమున కేదియు సాధనము గాజాలదు. కాన యసాధ్యమగు (అకార్యమగు) మోక్షమునకు కర్మ సాధనమగుట కుదరదు. నిత్యమైన వస్తువు కర్మచేగాని జ్ఞానముచేగాని చేయబడనేరదు. చేయబడునది అనిత్యమగును. అందుకు ఉదాహరణము ఘటము. మోక్షము నిత్యమని యన్నిమతములవా రంగీకరించిరి. కాన నిత్యమగు మోక్షము కార్యముకాదు. ఇంక దానికి కర్మ సాధన మగు టెట్లు?

ఓయీ, కర్మచేగాని జ్ఞానముచేగాని మోక్షముచేయబడనిచే కర్మవలె జ్ఞానముకూడ మోక్షసాధనము కానేరదుకదా! అపుడు జ్ఞానముకూడ యేల వ్యర్థము కాదు? అనినచో నట్లుకాదు. మేము జ్ఞానముచే మోక్షము సాధింపబడునని యనము. జ్ఞానముచే అవిద్య నివర్తించునని యందుము. అవిద్యామూలము సంసారము. సంసారమూలమైన యవిద్య నశింపగా జ్ఞాని కేవల ఆత్మస్వరూపముతో నుండును. ఇదియే యాత్మకు ముక్తి. కావున జ్ఞానము అవిద్యను నివర్తింపజేయుచు తద్ద్వారా మోక్షఫలమునందు పర్యవసించుటచే జ్ఞానము మోక్షసాధనమని యంగీకరింపఁబడినది. జ్ఞానముచే చేయబడుపని యవిద్యానివృత్తియే కైవల్యరూపమగు మోక్షము నిత్యసిద్ధము. ఇయ్యది నిత్యసిద్ధమైనను నవిద్య నివర్తించనిదే సిద్ధించినట్లు తోచనందున అవిద్యను పోగొట్టునట్టిజ్ఞానము మోక్షసాధనమని చెప్పవలసివచ్చినది. తన యింటిలోనున్న హిరణ్యనిధిని తాను గుర్తింపజాలక యంజనాదులచే దాను నూతనముగా సాధించికొన్నట్లు విద్వాంసుడుకూడ అవిద్యావశమున సిద్ధించనట్లున్న నిత్యసిద్ధమగు మోక్షమును జ్ఞానముచే సాధించుకొనుచున్నాడు. ఇంతమాత్రముచే నిత్యసిద్ధమగు మోక్షమునకు జ్ఞానముచే కలుగుట యనునది సిద్ధింపదు. మోక్షమనగా బ్రహ్మ, బ్రహ్మ నిత్యాపరోక్షము. ఇయ్యది కార్యము కాదు. కావున మోక్షస్వరూపము నావరించిన యవిద్యను బోగొట్టుచున్నందున జ్ఞానము మోక్షసాధనమని చెప్పఁబడినది. ఇంతియేకాని మోక్షము జ్ఞానకార్య మెన్నడుకాదు.

అవిద్యాలక్షణమగు అజ్ఞానాంధకారమును జ్ఞానదీపము రూపుమాపి కైవల్యఫలము నందింపజేయును. లోకములోగూడ దీపముయొక్క వెలుతురు (ప్రదీపప్రకాశము) రజ్జుశుక్తికాదుల నావరించి సర్పరజతాది అధ్యాసలకు గారణమగు నంధకారమును రూపుమాపి రజ్జుశుక్తికాదులను స్వస్వరూపముతో నిలబెట్టుచున్నది, అట్లే జ్ఞానముకూడ ఆత్మస్వరూపము నావరించియున్న దేహేంద్రియాద్యధ్యాసలకు గారణమగు అజ్ఞానమును మరల్పి ఆత్మను స్వరూపముతో నిలబెట్టును. ఇయ్యది విద్వదనుభవసిద్ధము.

ఇట్లయినచో కర్మమాత్ర మవిద్యానివర్తక మగుచు మోక్షసాధనమేల కాగూడదు అని యనరాదు. క్రియాకారకాది భేదబుద్ధులతోగూడిన కర్మ అవిద్యామూలకమగుటచే అవిద్యను బోగొట్టఁజాలదు. చీకటి చీకటిని బోగొట్టుట యసంభవము. పైపెచ్చు భేదబుద్ధివిశిష్టములైన కర్మలు అవిద్యను బలపరచును. కనుకనే కర్మసముచ్చితజ్ఞానముకూడ మోక్షసాధనము కాదు. కావున అవిద్యానివృత్తి రూపమగు మోక్షముకూడ కర్మకార్యము కాదనియు జ్ఞానకార్యమే యగుననియు సిద్ధించినది.

ఇట్లు కర్మ మోక్షస్సాధనమగు పక్షమును నిరసించి దానిచేతనే సముచ్చయము కూడ మోక్షసాధనముకాదని తేలినను జ్ఞానకర్మలకు సముచ్చయమే కుదరదని

యనుపపత్తిని జూపుచున్నాడు. దృష్టఫలముగల ఛేదనక్రియయందును అగ్నిమథన క్రియయందును ప్రవర్తించిన కర్త్రాధికారములు తద్భిన్నఫలము నిచ్చెడిపని యందు ప్రవర్తించవు. అనగా కట్టెను జీల్చుటకు యత్నించువాడు చీల్చెడిపనినే చేయును. అగ్నిని మథించుటకు ప్రయత్నించువాడు అగ్నిపుట్టు పనినే చేయును. ఇతరపనిని జేయడు. అట్లే దృష్టఫలమగు కైవల్యముకొఱకు ( మోక్షముకొఱకు ) ప్రయత్నించువాడు కైవల్యము సిద్ధించెడి జ్ఞాననిష్ఠయందే ప్రవర్తించునుగాని కైవల్యమునకు విరుద్ధఫలము నిచ్చెడి యితరకర్మయందు ప్రవర్తించడు. 'అహం బ్రహ్మాస్మి' అను బుద్ధివృత్తిరూపమగు జ్ఞాననిష్ఠయందుండు విద్వాంసుడు ' నేను కర్తను – భోక్తను ' అను జ్ఞానపూర్వకముగ నెరవేర్పఁదగిన అగ్నిహోత్రాదికర్మలయందు ప్రవర్తింపడు. అకర్త్రు అభోక్త్రు బ్రహ్మాత్మజ్ఞానమునకును నేను కర్తను భోక్తను అను జ్ఞానమునకును జాల విరోధము. మనస్సు మున్నగు ఇంద్రియములు బాహ్యావిషయములందు వ్యాపించియుండ ' అహం బ్రహ్మాస్మి ' అను బుద్ధివృత్తి పుట్టదు. సమాధినిష్ఠునకే నేను బ్రహ్మనెడి బుద్ధి పుట్టును. కావున కర్మజ్ఞాననిష్ఠలకు సముచ్చయమే అసంభవము.

ఓయీ ! జ్ఞానకర్మల కొకేమాఱు సముచ్చయము కుదరకున్నను క్రమముగ నా రెంటికి సముచ్చయమేల సంభవింపరాదు. వినుము. కర్మనిష్ఠయనంతరము జ్ఞాననిష్ఠ కలుగుననియా నీయభిప్రాయము. జ్ఞాననిష్ఠయనంతరము కర్మనిష్ఠ కలుగుననియా? కర్మనిష్ఠ జ్ఞాననిష్ఠకుఁ గారణమగుటచే నిందు మొదటిపక్షము మాకిష్టమే. అంతమాత్రమున జ్ఞానకర్మలకు సముచ్చయమున్నట్లు కాదు. జ్ఞాననిష్ఠానంతరము ముముక్షువు కర్మనిష్ఠను విడచుచున్నాడు. ఒకానొకడు కర్మనిష్ఠను వదలియే జ్ఞాననిష్ఠయందు ప్రవర్తించుచున్నాడు. ఇక జ్ఞాననిష్ఠానంతరము కర్మనిష్ఠ యను రెండవపక్ష మసంభవము. జ్ఞాననిష్ఠకు ఫలము కైవల్యము. దానిని గోరిన విద్వాంసుడు జ్ఞాననిష్ఠను వదలి మరల కర్మనిష్ఠయందు ప్రవర్తించుటలో గారణ ముండదు. విద్వాంసుడు నిరర్థకముగఁ గర్మ నాచరింపడు. కైవల్యార్థియగు పురుషుడు మొదట యజ్ఞానాదులచేఁ గర్మనిష్ఠయందు ప్రవర్తించినను, దాన తనకు గృతార్థతలేదని తలంచి జ్ఞాననిష్ఠను స్వీకరించును. దానియందు గైవల్యఫల మనుభవించి కృతార్థుడగును. ఇట్లు కృతార్థుడైన విద్వాంసుడు మఱల కర్మనిష్ఠ నవలంబింప పనియేమి? కృతకృత్యుడైన తత్త్వవేత్తకు గర్తవ్యశేష మేముండును? అది యున్నప్పుడుగదా కర్మలయందు ప్రవర్తింపవలెను? శ్రీకృష్ణుడు (ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ కృతకృత్యశ్చ భారత) అనికదా చెప్పినది. కావున జ్ఞాననిష్ఠయందు ప్రవర్తించువాడు మఱల కర్మలయందు ప్రవర్తింపనేరడు. దృష్టఫలమును గోరుపురుషుఁడు దృష్టఫల మందుబాటులోనుండ తత్సాధనమును విడచి యదృష్టఫలార్థమైన యితరసాధనములయందు ప్రవర్తింపడు. ఇయ్యది లోకసిద్ధము. కర్మ

నిష్ఠవలె జ్ఞాననిష్ఠగూడ కైవల్యఫలము నిచ్చునదిగానిచో నపుడు పొరపాటున జ్ఞాననిష్ఠనువిడచి కర్మనిష్ఠయందు ప్రవర్తింపవచ్చును. అట్లు లేదు. కావున కైవల్యమును గోరుపురుషుడు అజ్ఞానమువలనఁగాని, యనధికారమువలనఁగాని మొదట కర్మనిష్ఠయందు ప్రవర్తించినను నందు దానుగోరినఫలము దొరకక వివేకాది సాధనసంపత్తిని జేకూర్చుకొని జ్ఞాననిష్ఠయందు ప్రవేశించి యందు దానుగోరిన కైవల్యఫల మనుభవించుచు మఱల కర్మనిష్ఠ కేలవచ్చును? ఎట్లును రాదు. కాన జ్ఞాననిష్ఠుడగు విద్వాంసునకు జ్ఞాననిష్ఠాసమయకాలమందుగాని యన్యకాలమందు గాని కర్మనిష్ఠ సంభవింపదు. కుదరనుగూడ కుదరదు.

ఓయీ! ఒకపురుషునియం దొకఫలముకొఱకు రెండుక్రియలు కుదరకున్నను రెండుఫలముల నుద్దేశించి రెండుపనుల ననుష్ఠించుట సంభవింపవచ్చును. ఎట్లన నాకలిదీరుట, స్వర్గమునందుట యీరెండుఫలముల నుద్దేశించి యొకేపురుషుని యందు భుజించుట, అగ్నిహోత్రము నాచరించుట- యీరెండుపనులుకలవు. అట్లే యొకేపురుషునియందు కైవల్యఫలముకొఱకు జ్ఞాననిష్ఠయు స్వర్గముకొఱకు కర్మనిష్ఠయు నుపపన్నమగుదు. కావున జ్ఞానకర్మలకు యుగపత్సముచ్చయము (సమకాలమునఁ గూడియుండుట) లేకున్నను భిన్నకాలసముచ్చయము సంభవింపవచ్చును. అనినచో నిజమే. కైవల్యఫలమగు జ్ఞానము సంప్రాప్తమైనపిదప క్రియాఫలమైన స్వర్గమునందు కోరికయుండుచో మీరుచెప్పినట్లు సముచ్చయము కుదరవచ్చును. అట్టికోరిక యుండుటయే యసంభవము. మహాప్రవాహస్థానీయమైన ఫలము సంప్రాప్తమైనపిదప తటాకాదిస్థానీయములైన క్షుద్రక్రియాఫలముల నెవడు కోరును? కావున కైవల్యఫలార్థియగు పురుషునకు స్వర్గఫలమునందలి కోరిక యసంభవ మగుటచే జ్ఞాననిష్ఠయందు ప్రవర్తించిన విద్వాంసునకు గర్మానుష్ఠానము ప్రసక్తించునని మీరు కలలోగూడ నూహింపవీలులేదు. కాన జ్ఞాననిష్ఠకు కర్మసాహిత్య మసంభవము. రాజ్యమును బొందుటయే ఫలముగాగల యుద్ధాదులయందు ప్రవర్తించిన క్షత్రియునకు రెండెకరములనేలను సంపాదించునట్టి యాచ్ఞాదులయందు ప్రవృత్తి యెట్లుండదో అట్లే జ్ఞానమునందు ప్రవర్తించు విద్వాంసునకు గర్మలయందు ప్రవృత్తి కలుగదు. కర్మఫలములన్నియు జ్ఞానఫలమునం దంతర్భావము చెందును. 'సర్వం కర్మాఖిలం పార్థ, జ్ఞానే పరిసమాప్యతే' అని శ్రీకృష్ణుడే చెప్పియుండెను.

ఓయీ! క్షేత్రపురగ్రామాదులు రాజ్యాంగములు. అంగియగు రాజ్యము సంప్రాప్తముకాగా తదంగములగు క్షేత్రాదు లనివార్యముగఁ బ్రాప్తించును. కావున రాజ్యమునుగోరిన క్షత్రియులకు క్షేత్రాదులయం దాసలేకపోవుగాక. అట్లు కైవల్యమునకు స్వర్గాదు లంగములు కావుగదా! కైవల్యము నందినంత మాత్రమున స్వర్గమునందలేరుకదా! కావున కైవల్యార్థికి స్వర్గాదులయం దాస యేల

యుండదు? ఇది యొక దోషము కాదు. కైవల్యము నందినవానికి స్వర్గాదికము గూడ ప్రాప్తించినట్లే. కైవల్యమన నాత్మస్వరూపము. ఆత్మ పరిపూర్ణుడగుటచే సర్వవ్యాపి. స్వర్గాదులనుగూడ ఆత్మ వ్యాపించియే యున్నాడు. ఇంక యాత్మ స్వరూపమందినవాడు స్వర్గాదులఁ బొందకుండు టెట్లు? అథవా కైవల్యమన నాత్మ. ఆత్మ యీశ్వరుడు. ఈశ్వరు డవాప్త సర్వకాముడు. కావున నెవ డాత్మను బొంది యున్నాడో వాడన్నికోరికలు తీరియే యున్నాడు. ఇంక వేరుగా వానికి స్వర్గము నందలి కోరిక యెట్లు?

లేక, కైవల్య మాత్మస్వరూపము. ఆత్మయన బ్రహ్మ. బ్రహ్మ స్వర్గాదిసర్వప్రపంచమున కాధారము. కావునను ఆత్మను బొందినవాడు స్వర్గాదికమును బొందినట్లే. లేక కైవల్యము బ్రహ్మస్వరూపము. బ్రహ్మ సర్వాత్మ. కనుక బ్రహ్మనందినవాడు స్వర్గాదికమును బొందినట్లే. కనుకనే ఏకవిజ్ఞానముచే సర్వవిజ్ఞానప్రతిజ్ఞ కుదురుచున్నది. సర్వము బ్రహ్మస్వరూపమగుటయే యిందుకు గారణము. కాన బ్రహ్మప్రాప్తి కలుగగా సర్వప్రాప్తి సంసిద్ధము. కాన దృష్టాంత దార్ష్టాంతికములకు సాధర్మ్యము లేదని శంకింపవలదు. కనుక జ్ఞానకర్మలకు సముచ్చయ మసంభవము. కర్మ నిశ్శ్రేయససాధనము కాదు. కర్మసముచ్చయముకూడ నిశ్శ్రేయస సాధనము కానేరదు. జ్ఞానము కైవల్యము నిచ్చుటలో కర్మయొక్క సాహాయ్య మిసుమంతయు కుదరదు. కర్మ యవిద్యామూలకము. జ్ఞాన మవిద్యానాశకము. కనుక నీ రెంటికి విరోధము. జ్ఞానము తనవిరోధిని సహాయపరచుకొనుట యసంభవము. జ్ఞానము అవిద్యకే విరోధికాని కర్మకు విరోధికాదని యనరాదు. కర్మ భేదజ్ఞానమూలకము. భేదజ్ఞాన మవిద్యామూలకము. అద్వైతజ్ఞానముచే భేదజ్ఞానము దానికిఁ గారణమగు నజ్ఞానము నివర్తింప నింక కర్మ యెట్లు తలయెత్తును. కాన అద్వైతజ్ఞానము కర్మ విరోధియగుటచే కర్మసాయము నపేక్షింపదు.

చీకటి చీకటిని బోగొట్టుచో కర్మ యజ్ఞానమును బోగొట్టును. సూర్యుడు లేనందువలనఁ గలిగెడి యంధకారమును దీపము లేనందువలనఁ గలిగెడి యంధకారము నివర్తింపఁ జేయలేదు. అంధకారమూలమైన పిశాచాది భ్రాంతి అంధకారమును బోగొట్టలేదు. ఇట్లే అజ్ఞానమూలకమగు కర్మకూడ అజ్ఞానమును బోగొట్ట జాలదు.

రామానుజులు జ్ఞానపూర్వకమగు కర్మ యజ్ఞానమును బోగొట్టు ననిరి. కాని వా రట్లనుటయే పొరబాటు. కర్మ జ్ఞానపూర్వకము కానేరదు. నిష్క్రియాత్మ స్వరూపజ్ఞానము కర్మలయందు ప్రవృత్తిని భంగపరచును. ఆత్మజ్ఞానపూర్వకముగ కర్మయనునది అసంభవము. 'నేను కర్తను' అను ఆత్మజ్ఞానము భ్రమకాని ప్రమ కాదు. అట్టిజ్ఞాన మజ్ఞానమూలక మగుటచే అజ్ఞానమును బోగొట్టనేరదు. కావున

కర్మ మోక్షసాధనము కానందునను కర్మసముచ్చయము జ్ఞానమున కుపపన్నము కానందునను కేవలకర్మవలన మోక్షమనికాని కర్మసముచ్చితజ్ఞానమున మోక్షమని కాని యీ రెండు పక్షములు చెల్లకపోవుచుండ కేవలజ్ఞానమే మోక్షసాధన మను సిద్ధాంతము స్థిరపడుచున్నది.

మీమాంసకమతము :-

ఓయి, కేవలజ్ఞానమువలన మోక్షమనునది యుక్తముకాదు. కైవల్యము నిత్యము. నిత్యమయినది జ్ఞానమువలనగూడ బొందబడదు. జ్ఞానముచే బొందదగిన కైవల్య మనిత్యమే యగును. పైగా జ్ఞానముకొరకు సర్వకర్మసన్న్యాసమును జేసి నచో, నిత్యకర్మానుష్ఠానములేని దోషమున నరకపాతముగూడ గలుగును. కావున సర్వకర్మసన్న్యాసపూర్వక కేవలజ్ఞానమువలన మోక్షమని యద్వైతులు చెప్పినది సమంజసముకాదు.

అయితే నిత్యకర్మలు చేయనిచో ప్రత్యవాయము చేసినచో ప్రాజాపత్యాది లోకములు బొందుట యనుబంధము. ఎటులయినను అనర్థమే కాన కర్మలవలన మోక్షములేదు. జ్ఞానమువలన మోక్షమనెడి మతమును దూషించితిరి. కాన పురుషునకు మోక్షము లేనట్లేకదా ?

కాదు. నిత్యమయిన మోక్షము కర్మలవలన, జ్ఞానమువలనగాని కలుగదు. అట్లు కలుగుచో మోక్ష మనిత్యమేయగును.

ఇక మోక్షమెట్లు సిద్ధించుననన్నచో నిత్యకర్మానుష్ఠానమువలన ప్రత్యవాయము తొలగును. నిషిద్ధకర్మలను నాచరించనందువలన యాతనాశరీరముగాని పశ్వాది శరీరములుకాని సంభవించవు. కామ్యకర్మలను మానినందున దేవాదిశరీరములు కలుగవు. ఫలానుభవముచే ప్రారబ్ధకర్మ క్షీణించును. ఆమీద వర్తమానదేహము పతనముజెందినతోడనే శరీరారంభకములగు ధర్మాధర్మములు లేనందున పురుషునకు స్వరూపావస్థానమను మోక్షము అప్రయత్నముగా సిద్ధించును. కావున ముముక్షువు మోక్షసిద్ధికొరకు రాగద్వేషాదులవిడచి నిత్యకర్మ ననుష్ఠింపవలెను. అని మీమాంసకుల యాశయము.

ఈయది యుక్తముకాదు. గడచిన యనేకజన్మలయం దాచరించిన స్వర్గ, నరకాదిఫలముగల పుణ్యాపాపరూపమగు సంచితకర్మలు ఫలము నారంభించక మిగిలి యున్నవి. వాటి కీజన్మలో ఫలానుభవములేదు. అనుభవించకుండగనే కర్మయు నశించదు. ప్రారబ్ధకర్మను అనుభవించి పోగొట్టుకొనినట్లు సంచితకర్మనుగూడ ననుభవించియే పోగొట్టుకొనవలయును. కాన వాని ( సంచితకర్మల ) ఫల మనుభ వించుటకు శరీరాంతరములను పరిగ్రహించుట యవసరము. నిత్యకర్మ ప్రత్యవాయ మును బోగొట్టినను సంచితకర్మలను నశింపజేయనేరవు. జ్ఞానముమాత్రము ప్రారబ్ధ

మును మినహా మిగిలిన కర్మజాతమునంతయును రూపుమాపును. కావున శరీరాంతర పరిగ్రహము అనివార్యమయినందున నిత్యకర్మానుష్ఠాతకు మోక్షము అప్రయత్న సిద్ధ మనుటకు వీలులేదు.

ఓయి ! ఈజన్మమునందు ప్రమాదవశమున జేసెడి పాపములు ఫలానుభవ మవసరములేకయే తత్ప్రకృచ్ఛ్రప్రాయశ్చిత్తాదులచే నెట్లు నశించుచున్నవో, అట్లే సంచితకర్మలుకూడ నుత్తరజన్మయందు ఫలమనుభవింప బనిలేకుండగనే కేవల నిత్యకర్మానుష్ఠానమువలననే నశించును. అనగా నిత్యకర్మాచరణమున కలిగెడి యాయాసదుఃఖమే సంచితకర్మలకు ఫలము. కనుకనే కర్మలు ఉపాత్త దురితక్షయార్థం అని సంకల్పించుచున్నారు. నిత్యకర్మలు ప్రాయశ్చిత్తతుల్యములు. కాని, నిత్య ములకు, ప్రాయశ్చిత్తములకును గొంచెము భేదము గలదు. ఈజన్మయందలి పాప మును బోగొట్టునవి ప్రాయశ్చిత్తములు. జన్మాంతరపాపములను బోగొట్టునవి నిత్య కర్మలు. కావున ఆరబ్ధకర్మలు ఫలానుభవముతోను, సంచితములు నిత్యకర్మాను ష్ఠానముతోను క్షీణించగా, ఆగాములగు కామ్యప్రతిషిద్ధములను ఆచరించుట మానగా కైవల్యము పురుషునకు అయత్నసిద్ధమే యగును.

సిద్ధాంతము :

"తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి" "నాన్యఃపంథా విద్యతేఽయనాయ"

అ॥ యదా చర్మవదాకాశం వేష్టయిష్యంతి మానవాః । తదా దేవ మవి జ్ఞాయ దుఃఖస్యాంతో భవిష్యతి" అను శ్రుతులు జ్ఞానమువలననే మోక్షమని చెప్పుచున్నవి. (ఈశ్రుతుల కర్థము లోగడ వ్రాయబడినది).

నిత్యకర్మానుష్ఠానమున సంచితకర్మలన్నియు నశించవు. నిత్యకర్మానుష్ఠానము నందలి ప్రయాసదుఃఖము సంచితములకు ఫలమని యంగీకరించినను దురిత (పాప) సంచితములకు ఫలమగునుగాని పుణ్యసంచితములకు ఫలముకాదు. మరియొక శరీర మును పరిగ్రహించి వానిఫలమును దప్పక యనుష్ఠింపవలయును. సంచితములలో పుణ్యసంచితము లుండవనుటకు వీలులేదు.

మరియు ధర్మాధర్మములకు గారణములయిన రాగద్వేషమోహములు ఆత్మ జ్ఞానములేనిదే నశించవు. రాగద్వేషాదులు నశించనిదే తత్కార్యములయిన ధర్మాధర్మములు నశించవు. ధర్మాధర్మములుండగా వాటిఫలము ననుభవించుటకు శరీరాంతరపరిగ్రహము ఆవశ్యకము. కాన మోక్షము కుదరదు.

మరియు నిత్యకర్మానుష్ఠానమునకు ప్రత్యవాయనివృత్తియే ఫలముకాదు. పుణ్యఫలముకూడ కలదని శ్రుతిస్మృతులయందు వినబడుచున్నది. కాన శ్రుతి స్మృతిసిద్ధమయిన నిత్యకర్మానుష్ఠానముయొక్క పుణ్యఫలమును అనుభవించుటకు శరీరపరిగ్రహము అనివార్యము కాన మోక్ష మయత్నసిద్ధముకాదు.

మరియు నిత్యకర్మానుష్ఠానము జన్మాంతర దురితమునకు ఫలమని కాని, జీవనార్థము విధింపబడిన నిత్యకర్మలకు జీవననుకంటె వేరుఫలము లేదనికాని యనుట సముచితముకాదు. నిత్యకర్మలు ప్రారబ్ధకర్మకు ఫలభూతములా ? ఇందు మొదటి పక్ష మవలంబించినచో మీకొక్కటికి తీరదు. మీరు నిత్యకర్మానుష్ఠానాయాసము సంచితకర్మలకు ఫలమని యనుచున్నారు. అప్రవృత్తఫలములయిన సంచితములకు నిత్యకర్మలు ఫలము కానేరవు. సంచితములు ఫలమిచ్చుటకే ప్రవర్తించునపుడు వాటి ఫలములు నిత్యకర్మలని మీరనుట యాశ్చర్యము. ఈజన్మయందు ఫలమిచ్చునవి ప్రారబ్ధకర్మలనియు, అట్లు ఫలమీయనివి సంచితములనియు నీరెంటికిని భేదము. ఇట్టిపరిస్థితిలో నిత్యకర్మానుష్ఠానదుఃఖము సంచితఫలమనుట యెట్లు ? ఏకర్మచే నేజన్మ యారబ్ధమయినదో ఆజన్మయందు ఆకర్మయొక్క ఫలమునే యనుభవింపవలయును. అట్టినియమము లేనిచో దేవాదిజన్మలయందుగూడ నారకఫలమును అనుభవింపవలసివచ్చును. అట్లనుభవించుట లేదు.

మరియు నిత్యకర్మానుష్ఠానమువలన కలుగు దుఃఖము, పూర్వముచేసిన సంచితదురితము లన్నిటికి ఫలమా ? కొన్నిటికిమాత్రమే ఫలమా ? మొదటిపక్షముచితముకాదు. బ్రహ్మహత్యా సువర్ణస్తేయ పరదారాగమనాది పాపములన్నిటికి నిత్యకర్మానుష్ఠానమునందలి ఆయాసము ఫలమని కల్పించుట ప్రమాణవిరుద్ధము. అనుచితమును ఇంక రెండవపక్షమున ఏదురితమున కీదుఃఖము ఫలమో విశేషించి నిర్ణయింపవీలులేదు. అట్లు నిర్ణయించియున్న శాస్త్రాదులును లేవు. గడచినజన్మలయందు భిన్నభిన్నములయిన దురితములుచేసి యుండ వాటికన్నిటికిని నిత్యకర్మానుష్ఠానాయాసదుఃఖమే ఫలమని కల్పించుట హాస్యాస్పదము.

మరియు కర్మానుష్ఠానాయాసము సంచితకర్మకు ఫలమయినచో తలమీద నెక్కువ బరువు మోయుటవలన గలుగు దుఃఖముమాత్రము సంచితకర్మకు ఫలమేల కాదు ? కాన భిన్నభిన్నపాతములకు ఫలముగూడ భిన్నభిన్నముగనే యుండునని యనవలయును.

మరియు మీరు ఫలమీయకుండగ వెనుక జేసిన పాపపుణ్యములు నశించవని యనిరి. అట్టి మీరు ("ప్రసూతఫలస్య") ఫలమునీయ సిద్ధముగానున్న పూర్వదురితమునకు నిత్యానుష్ఠానదుఃఖము ఫలమనిరి ఫలమునీయ సంసిద్ధముకాని పాపమునకీయది ఫలమని మీ రనుటలేదు. అప్పటికి అప్రసూతఫలమయిన దురితకర్మ మిగిలి యున్నట్లేకదా ? దానికొఱకు శరీరపరిగ్రహ మావశ్యకమేకదా? "అప్రసూతఫలస్య" ఫలమునీయని కర్మల కియ్యది ఫలమనుటయు లోకవిరుద్ధము. ఇంక వెనుక జేసిన పాపమంతయు ప్రసూతఫలమేకాని (ప్రారబ్ధమేకాని) అప్రసూతఫలమగు (సంచితమగు) కర్మ యుండదనియు నన్నచో, నపుడు నిత్యకర్మానుష్ఠానాయాసదుఃఖమే పూర్వకృత దురితములకు ఫలమని విశేషించి చెప్పబనిలేదు. ద్వంద్వరోగాదులవలన

గలుగు దుఃఖముకూడ పూర్వకృత దురితమునకు ఫలమగును. అయ్యది కాదన వీలులేదు.

మరియు నిత్యకర్మలను జేయుమని చెప్పెడి "అహరహస్సంధ్యా ముపాసీత" అను మొదలగు విధులు వ్యర్థములగును. ఈ విధులు లేకున్నను సంచితఫలమగు నిత్యకర్మానుష్ఠానాయాసదుఃఖ మనివార్యముగ ననుభవించదగియుండుటచే, దాని బలముననే నిత్యకర్మలయందు ప్రవృత్తి కలుగును. ఇంక నీ విధులతో పనియేమి? నిత్యకర్మానుష్ఠానమునకు ప్రత్యవాయనివృత్తియె ఫలమను మీరు నిత్యకర్మాను ష్ఠానమువలన దుఃఖము ఫలమనుట యెట్లు తగును? నిత్యకర్మలకు ప్రాజాపత్యాది లోక ప్రాప్తియను నదృష్టఫలము శ్రుతిస్మృతులయందు గనబడుచున్నది. ఫలములేని వ్యాయామాదులకు దృష్టఫలము గల్పించినట్లు నిత్యకర్మలకుగూడ నట్లే దృష్ట ఫలమును గల్పించుట పాడిగాదు. వ్యాయామమువలన కలుగుదుఃఖము పూర్వ దురితమునకు ఫలితముకాదు. అట్లే నిత్యానుష్ఠాన దుఃఖముకూడ పూర్వదురితమునకు ఫలము కానేరదు. వ్యాయామజన్యమగు దుఃఖము వ్యాయామఫలమే. నిత్యానుష్ఠానా యాసముకూడ నిత్యకర్మఫలమే, పూర్వదురితమునకు ఫలముకాదు.

మరియు పాపమును నిమిత్తముగ జేసికొని ప్రాయశ్చిత్తమును విధింప నా ప్రాయశ్చిత్తము ననుష్ఠించునపుడు కలుగుదుఃఖము ఆపాపమునకే ఫలమగును. అట్లే జీవనాదులనిమిత్తముగ జేసికొని విధించబడిన నిత్యకర్మల ననుష్ఠించునపుడు గలుగు దుఃఖముకూడ జీవనాదినిమిత్తములకే ఫలమగునుగాని పూర్వదురితమునకు ఫలముకానేరదు. ఇచట ప్రాయశ్చిత్తకర్మలకు నిత్యకర్మలకు సామ్యములేదని శంకింపరాదు. పాపమును నిమిత్తముగ జేసికొని ప్రాయశ్చిత్తము విధింపబడినది. జీవనాదుల నిమిత్తముగ జేసికొని నిత్యకర్మలు విధింపబడినవి. కాన రెండును నైమిత్తికములే. ఈరెంటికిని అంశాంతరమున భేదమున్నను ఈయంశమునందు మాత్రము సామ్యమున్నందున నీరెండు నైమిత్తికము లనదగును. కాని నిజస్థితిలో నీరెంటికి సామ్యమున్నను, నిత్యకర్మలు పూర్వముచేసిన దురితక్షయార్థములని పూర్వమీమాంసకులు చెప్పినదిమాత్రము కుదరదు. దురితక్షయార్థములు ప్రాయ శ్చిత్తములు. జీవనాద్యర్థములు నిత్యకర్మలు.

ఓయి! నిత్యకర్మలలో గొన్ని దురితక్షయార్థములు, కొన్ని జీవనాద్యర్థ ములు. బ్రాహ్మణునకు యజన, అధ్యయన, దానములు దురితక్షయార్థములు. యాజన, అధ్యాపన, ప్రతిగ్రహములు జీవనార్థములు. అనినచో నట్లుకాదు. యజనాదులు దురితక్షయార్థములని యొప్పినచో ప్రాయశ్చిత్తములగునుగాని నిత్య ములు కానేరవు. కాక బ్రాహ్మణవర్ణమునకు ధర్మములయిన యజనాదులు దురిత క్షయార్థములని కల్పించుట అన్యాయము.

చేయకపోతే ప్రత్యవాయము నిచ్చెడివి నిత్యములనియు, ప్రాయశ్చిత్తము లట్టివి కానందున నీరెంటికి భేదమనియు వర్ణధర్మములుమాత్రము దురితక్షయార్థములే యనియు ననరాదు. ప్రాయశ్చిత్తముకూడ చేయకపోయినచో నరకపాతమను ప్రత్యవాయము కలుగును. అట్లుకానిచో ప్రాయశ్చిత్తముల నాచరించువాడే యుండడు. వర్ణధర్మములవలననే దురితక్షయము కలిగినచో ప్రాయశ్చిత్తవిధులే వ్యర్థములగును.

ఓయి ! ఈజన్మయందు జేసిన దురితమును బోగొట్టునవి ప్రాయశ్చిత్త కర్మలు. వాటిని ఆచరించనిచో దురితఫలమును జన్మాంతరమున అనుభవించ వలయును. ఇంతియేకాని ప్రాయశ్చిత్తమును ఆచరించనందున క్రొత్తగా నొక యపూర్వమగు దురితము పుట్టదు. నిత్యకర్మలు జన్మాంతరీయ దురితక్షయార్థములు. వాటిని చేయనిచో క్రొత్తగా నొకదురితము పుట్టును. కాన నిత్య ప్రాయశ్చిత్తములకు భేదము కలదన్నచో - నిజమే భేదముండుగాక ! ప్రాయశ్చిత్తముచే నివర్తింపదగిన దురితమువలె నిత్యకర్మచే నివర్తింపదగిన దురితము ఫలమిచ్చుటకొరకు నారంభించబడినదా ? లేదా ? ఇందు మొదటిమతమున నిత్యకర్మలకు ప్రాయశ్చిత్తములకును దృష్టాంతదార్ష్టాంతికభావము కుదరదు. ప్రాయశ్చిత్తముచే బోగొట్టదగిన హింసారూపమయిన దురితము ఫలమునిచ్చుట కీజన్మయం దారంభించలేదు. నేను జేసిన పాపము నాకు ఫలము నీయకుండుగాక అను భావముతో పాపి ప్రాయశ్చిత్తము నాచరించుచున్నాడు.

మరియు ఫలమిచ్చుటకు సంసిద్ధమయిన దురితము ఫలానుభవముతోనే క్షీణించునను శాస్త్రముండుటచే దురితక్షయముకొరకు నిత్యానుష్ఠానముకాని తద్విధికాని వ్యర్థమే యగును. లోకములో వ్యాయామాదులయందు గలుగు శ్రమ పూర్వదురితములకు ఫలముకానపుడు నిత్యకర్మానుష్ఠానమునందలి శ్రమమాత్రము పూర్వదురితములకు ఫలమని చెప్ప నెట్లు పొసగును ? ఈయాపత్తి నివారించుకొను టకు దుఃఖమంతయు పూర్వదురితమునకు ఫలమేయని అంగీకరించుచో నట్టితరి నిత్యకర్మల నాచరించి యందలి దుఃఖమువలననే పూర్వదురితమును బోగొట్టుకొన వలెనని చెప్పనేల ? బరువుమోసి దుఃఖపడి దురితమును పోగొట్టుకొనకూడదా ? వ్యాయామముచేసి శ్రమపడి పూర్వదురితమును దీర్చుకొనగూడదా ? కామ్యకర్మ లాచరించి అందలి దుఃఖమువలన దురితమును బాపుకొనగూడదా ?

మఱియు గామ్యకర్మానుష్ఠానమందలి దుఃఖముకూడ వెనుకటి పాపమునకు ఫలమగుచో నిత్యకర్మలకు నర్థాపత్తి ప్రమాణమువలనఁ గల్పింపఁబడిన పూర్వకృత దురితఫలత్వము ( వెనుకఁజేసినపాపములకు ఫలమగుట ) యెట్లు పొసఁగును ? సఫలములైన కామ్యకర్మలను అనుష్ఠించుటయందు గలిగెడి దుఃఖముగూడ పూర్వదురిత

ములకు ఫలమగుచుండ నిష్ఫల నిత్యకర్మానుష్ఠానమందలి దుఃఖమే పూర్వదురిత ములకు ఫలమని చెప్పుటకు శక్యముగాదు. కావున నిత్యకర్మలయందు ఫలమును గల్పించుటకు అర్థాపత్తిప్రమాణము నవలంబించుట యనుపపన్నమగును. కాక నిత్యకర్మానుష్ఠానమునకు ప్రారబ్ధములైన దురితములవలనఁ జేసెడి నిత్యకర్మల యందలి ప్రయాస దుఃఖమే ఫలమగుచో నట్టిఫలము ప్రారబ్ధవశమువలననే యనుభ వమునకు వచ్చుచుండ నింక నిత్యకర్మలను విధించు టెందులకు? కాన నిత్యకర్మ విధానము వేరువిధమున కుదరకుండుటయే నిత్యములకు దుఃఖాతిరిక్తఫలము కలదని తేల్చుచున్నది. మఱియు మీమాంసకుల మతమునందు రెండు మూడు విరోధములు సంప్రాప్తము లగుచున్నవి. నిత్యకర్మ లాచరింపఁబడుచుండగా నితరములైన దురిత కర్మలయొక్క ఫల మనుభవింపఁబడునని యంగీకరించు టొక విరోధము. అట్లంగీక రించియు నా నిత్యకర్మానుష్ఠానాయాసమువలనఁ గలుగు దుఃఖానుభవము నిత్య కర్మకు ఫలమని చెప్పుట మరియొక విరోధము. ఇట్లు నిత్యకర్మలకు దుఃఖము ఫలమని యంగీకరించియు నిత్యకర్మలకు ఫలము లేదనుట మూడవ విరోధము. కావున మీమాంసకమత మిట్లు విరోధజాలముతో నిండియున్నది. కనుక నిత్య కర్మలకు ఫలము వినపడనందున వాని నాచరించునపుడు కలుగు దుఃఖము పూర్వ కృతదురితములకు ఫలమనుట సముచితముగాదు.

మఱియు నగ్నిహోత్రాదికర్మలు నిత్యములనియు కామ్యములనియుఁ జెప్పు టలో స్వరూపభేద మేమియు లేదు. ‘వసంతే వసంతే జ్యోతిషా యజేత’ అను వాక్యముచే విధింపఁబడిన నిత్యమగు జ్యోతిష్టోమమే స్వర్గకామునిచే ననుష్ఠింపబడిన దగుచో కామ్యమగుచున్నది. కావున నిత్యకర్మకంటె కామ్యకర్మలకు కామమను నంశ మొక్కటియే యధికము. మిగిలినదంతయు సమానము. కావున కామ్యకర్మకు గూడ నిత్యకర్మకువలె ననుష్ఠానాయాసదుఃఖము ఫలముకాన నిత్యానుష్ఠానదుఃఖము చేతనే కామ్యకర్మయొక్క ఫలముగూడ ముగియవలయును. అనగా నిత్యానుష్ఠాన ఆయాసదుఃఖానుభవముద్వారా నిత్యకర్మ యెట్లు క్షయము చెందునో అట్లే కామ్యానుష్ఠానాయాసదుఃఖానుభవద్వారా కామ్యకర్మముకూడ క్షీణించును. కాన కామ్యకర్మలకు స్వర్గాదిలక్షణమగు ఫలము వేరుగ కలదని చెప్పుటకు సాధ్యముకాదు.

ఇక మీరు నిత్యములకే ఆయాసదుఃఖము ఫలముకాని కామ్యములకు నాయాస దుఃఖము ఫలము కాదనియు వాటికి వేఱుగ స్వర్గాదిఫలము కలదనియు నంగీకరించుచో నపుడు ఆకామ్యకర్మల ననుష్ఠించునప్పుడు కలిగెడు నాయాసదుఃఖముగూడ వానికి భిన్నఫలమని ప్రసక్తించును. అట్లు లోకమునఁ గనిపించదు. అనగా నిత్యకామ్యా గ్నిహోత్రములకు స్వరూపభేదము లేనపుడు అనుష్ఠానాయాసదుఃఖరూపమైన ఫల భేదముగూడ నుండదు. అపుడు అనుష్ఠానాయాసదుఃఖముచే నిత్యము క్షయించినట్లు కామ్యకర్మమమాత్ర మేల క్షయింపదు? దుఃఖానుభవమున కామ్యము నశించనిచో

నపుడు కామ్యకర్మములకు స్వర్గాధిఫలము కలదని యంగీకరింతురు. అట్టి క్షయా భావమే యింతవఱకు కుదఱలేదు. చేసినకర్మయంతయు ఫలానుభవముచే నశించునని యంగీకరించిరి. అనుష్ఠించునపుడు కలిగెడు దుఃఖము కర్మఫల మనిరి. ఇట్లు అనుష్ఠానమునందలి దుఃఖానుభవముచేతనే బాకీతీరిన కామ్యమునకు స్వర్గాదిఫలము నిచ్చెడిశక్తి యేది? మొలకను బుట్టించి క్షీణించిన విత్తనము యింకొక మొలక బుట్టించదుకదా! కాన కామ్యాగ్నిహోత్రాదులకు స్వర్గాదిరూపమగు ఫలము వేరుగ కలదని చెప్పజాలము.

ఇంక కామ్యకర్మలకు స్వర్గఫలము వేఱుగ కలదని సాధింపనెంచి నిత్యాగ్నిహోత్రము ననుష్ఠించునపుడు కలిగెడి దుఃఖమే కర్మఫలమగునుగాని కామ్యాగ్నిహోత్రము ననుష్ఠించునపుడు కలిగెడి దుఃఖము కర్మఫలముకాదని కల్పించుచో నపుడు నిత్యదుఃఖమునకు గామ్యదుఃఖమునకు భేదమా? అభేదమా? యను వికల్పము పుట్టును. ఇందు మొదటిపక్షమునఁ బ్రత్యక్షవిరోధము. రెండవపక్షమునఁ గామ్యదుఃఖముగూడ కామ్యకర్మలకు ఫలమే యగును. కావున కామ్యాగ్నిహోత్రములకు గూడ నిత్యాగ్నిహోత్రములకువలె ననుష్ఠానాయాసదుఃఖమే ఫలముకాని స్వర్గాదికము ఫలముకాదు. కావున కామ్యకర్మలు ఫలము కలవనియు నిత్యములు ఫలము లేనివనియు నీమతమున సిద్ధాంతపరచుట పొసగనేరదు.

మరియు శాస్త్రవిహితములు, శాస్త్రనిషిద్ధములుకాని వ్యాయామము మున్నగు లౌకికకర్మలకుమాత్రమే దృష్టప్రత్యక్షఫలముండును. శాస్త్రవిహిత నిషిద్ధ కర్మలకుమాత్రము కర్మ సమకాలమున ఫలముండదు. (పత్యక్షఫలముండదు) కనుకనే

> "ప్రత్యక్షేణాను మిత్యావాయస్తూపాయో న విద్యతే ।
> ఏనం విదంతి వేదేన తస్మాద్వేదస్య వేదతా."

ప్రత్యక్షానుమితిప్రమాణములచే దెలియబడని యుపాయమును బోధించుట వలన వేదము సార్థకనామము కలదగుచున్నదని వేదమునకు లక్షణమును జెప్పిరి. దృష్టఫలసాధనము ప్రత్యక్షానుమితుల కవిషయము కానేరదు. అదృష్టఫలసాధనమే ప్రత్యక్షాద్యవిషయ మగును.

కాన గనిపించనిఫలమునకు సాధనమును బోధించియే శాస్త్రము సార్థకమగుచున్నది. "ఋతౌ భార్యా ముపేయాత్" "న కలంజం భక్షయేత్" "నసురాం పిబేత్" ఇత్యాది విధినిషేధవాక్యములకు దృష్టఫల మేమియు లేదు. భార్యనుబొందినందున కలిగెడిసుఖము యీ విధికి ఫలముకాదు. ఈ విధిలేకున్నను అనృతుకాలమందుగూడ భార్యను బొందినచో నీ సుఖముండును. కాన శాస్త్ర విహితములకును శాస్త్రనిషిద్ధములకును ప్రత్యక్షఫలము ఫలముగాదు. అట్లగుచో

అదృష్టఫలములగు స్వర్గాదులయందు శాస్త్రము ; శాసింప బ్రయత్నించుట వ్యర్థమగును. కావున నిత్యములగాని, కామ్యములగాని యనుష్ఠించునపుడు కలిగెడి దుఃఖము వాటికి ఫలముకాదు. శాస్త్రము దుఃఖముకొరకు కర్మలను విధింపలేదు. పూర్వకృతదురితములు సామాన్యదుఃఖానుభవముచే క్షీణించునా ? విశేషదుఃఖానుభవముచే క్షీణించునా ? ఇందు మొదటిపక్షమున నెత్తిమీద శక్తికి మించినబరువు మోసి బాధపడికూడ దురితమును బోగొట్టుకొనవచ్చును. రెండవపక్షమున కర్మానుష్ఠానాయాసదుఃఖముకంటె వేరుగ పురుషునకు ద్వంద్వరోగాది దుఃఖములు లేకపోవలసివచ్చును.

అట్టిదుఃఖము లుండుచో, నాదుఃఖములను అనుభవించుటచేతనే దురితక్షయము కలుగునుగాన నింక దురితక్షయముకొరకు నిత్యకర్మల విధించుట వ్యర్థమగును.

ఓయి, "నిత్యకర్మానుష్ఠానాయాస దుఃఖముచే బోగొట్టుకొనదగిన దురితము వేరు. ద్వంద్వరోగాది దుఃఖానుభవముచే బోగొట్టుకొనదగిన దురితము వేరు. ముసలితనమున వచ్చెడి రోగదుఃఖములచే క్షీణించుదురితము వేరు. తలమీద రాళ్లుమోసిన దుఃఖముచే క్షీణించు దురితమువేరు. కనుకనే "న శూద్రే పాతకం కించి న్నచ సంస్కార మర్హతి" అను స్మృతి యుపపన్నమగును. అగ్నిహోత్రాదికర్మానుష్ఠానముచే బోగొట్టుకొనదగిన దురితము శూద్రునకు లేనందున వానికి నుపనయనాదిసంస్కారము లేదు. సంస్కారము కర్మకొరకు బుట్టినది. బ్రాహ్మణాదులయం దట్టి పాతకముండుటచే బ్రాహ్మణుల కాసంస్కారములు విధింపబడినవి" అని యనరాదు.

విధింపబడిన అగ్నిహోత్రాదులు ద్వంద్వరోగాది తుల్యములనియు, సపాపులగు ద్విజులకంటె నిష్పాపియగు శూద్రుడు గొప్పవాడనియును, గల్పించెడి మీ సాహసము చెప్పనలవి కాదు. సత్వస్వభావుడగు బ్రాహ్మణుడు సపాపుడగుట, తమస్స్వభావుడగు శూద్రుడు నిష్పాపుడగుట యతివిచిత్రము. ఇట్లైనచో సంస్కారమునకు యోగ్యముకాని చండాల పశుపక్షి స్థావరాదులన్నియు తమ స్వభావము కలవయినను నిష్పాపములు కావలయును. అందుకు మీ రిష్టపడినచో "వాచికైః పక్షిమృగతాం మానసైరంత్య జాతితాం, శరీరజైః కర్మదోషైర్యాతి స్థావరతాం నరః" అను స్మృతి విరోధించును. శూద్రులు పాపస్వభావులగుటవలననే వారలకు కర్మాధికారము లేదు. బ్రాహ్మణులు పుణ్యస్వభావు లగుటవలననే కర్మాధికారులు, వేదాధికారులు నగుచున్నారు. భగవంతుడే "బ్రాహ్మణో మమదైవతమ్" అని చెప్పెను. "స్త్రీలకు. శూద్రులకు, బ్రాహ్మణబ్రువులకును వేదమును వినెడి యధికారములేదు. నిష్పాపులగుటవలన శూద్రులు సంస్కారానర్హులనియు, పాపులగుటవలన బ్రాహ్మణులు సంస్కారార్హులనియు ననుట చాల యసంగతము. బ్రాహ్మణులకుగల యజ్ఞార్హత పాపఫల మనదగదు. అట్లన్నచో

నడచుటమున్నగు కర్మలయం దర్హాత చరభూతములకు పాపమనియు, స్థావరములే పుణ్యాతమములనియు ననవలెను. కావున శూద్రులు పాపులగుటవలననే వారికి నుపనయనాది సంస్కారార్హత వారికి లేదు. నిష్పాపులగుటవలన గాదు. నూరు మారు లుపదేశించినను శూద్రుడు వేదాక్షర ముచ్చరింప సర్హుడుకాడు. ఈయది పుణ్యఫలముకాదు. అట్లయినచో మూగివానికి మాటాడలేకపోవుటకూడ పుణ్యఫలము కావలయును.

అయితే "నశూద్రే పాతకం కించిత్" అను వాక్యమునకు "దేవర్షి పితృఋణాత్మకమగు పాతకమేమియు లేదనియు, బ్రాహ్మణుడు జన్మతోడనే మూడు ఋణములు కలవాడనియు, శూద్రుడు తమస్స్వభావుడయి అతిపాపి యగుటచే సంస్కారార్హుడు కాడనియును" అర్థము. ఇట్లు సత్త్వస్వభావుడగు బ్రాహ్మణునకు విధింపబడిన యజ్ఞాది నిత్యకర్మలు పాపఫలమెట్లగును ? యజ్ఞాదిరూపమగు నిత్యకర్మ పాపఫలమగుచో, పాపియగు శూద్రునకుగాని, చండాలునకుగాని యది విధింపబడియుండెడిది. కావున మహాఫలము కలవని చెప్పబడు నిత్యకర్మలు పూర్వకృత దురితఫలములనుట యుచితముకాదు. పూర్వోపచిత దురితఫలములయిన ద్వంద్వరోగాదులకు మహాఫలము శ్రుతియందెచ్చటను వినబడుటలేదు. కావున నిత్యకర్మలు దురితఫలములనుట సముచితము కాదు.

మరియు నిత్యములకు, కామ్యములకు, కర్మస్వరూపమునందు భేదములేకున్నను, నిత్యములుమాత్ర మనుష్ఠానాయాసదుఃఖముచే నశించుననియు, అంగేతికర్తవ్యతాదులయందు మార్పు ( ఆధిక్యము ) లేకున్నను, కేవల ఫలకామనామాత్రముచేఁ గామ్యకర్మలకుమాత్రము స్వర్గాది మహాఫలము కలదనియును జెప్పనలవికాదు. వివాహోపనయనములకు పరస్పరము స్వరూపభేదము కలదు. నిత్యకామ్యముల కట్లు స్వరూపభేదము లేదు. అంగేతికర్తవ్యతాభేదము లేదు. కారకాదిభేదమున్ను లేదు. ఇట్టిస్థితిలో నీరెంటిలో నొకటి ఆయాసదుఃఖముచే నశించుననియు, మరియొకటి నశించదనియు ననుటలో యుక్తిలేదు. కాన నట్లనుట అయుక్తము. ఫలకామనామాత్రముచే కామ్యకర్మకు గొప్పతన మీయ వీలులేదు. పురుషనిష్ఠమయిన ఫలకామన, కర్మకు స్వాభావికశక్తికంటె మించినశక్తిని పుట్టించజాలదు. దుఃఖమాత్రమును గలిగించు నగ్నిహోత్రాదికర్మ పురుషునియందలి కోరికమాత్రముచే స్వర్గమను మహాఫలమును బుట్టింపలేదు. దుఃఖఫలముగల యగ్నిహోత్రముచే స్వర్గమెక్కుద మను గోరిక గుర్రమునెక్కి యాకసముమీద విహరింతమను గోరిక వంటి దగును. కాన "తురగే గగనవిహారకామ స్సంచరేత్" అను విధివలె. "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" అను విధికూడ వ్యర్థమగును. కాన శాస్త్రవిహితమయిన నిత్యాగ్నిహోత్రమునకు దుఃఖమే ఫలమనియు కామ్యాగ్నిహోత్రమునకు స్వర్గము ఫలమనియు ననుట యనుచితము.

కామ్యములకు స్వర్గాదిఫలమున్నదనుట నిర్వివాదము. అట్లే నిత్యములకుగూడ నదృష్ట ఫలముండితీరును. లేదనుట చెల్లదు. అట్టి యదృష్టఫలముచే బంధము కలుగును. ఇంక నిత్యానుష్ఠానమున మోక్షమెక్కడిది ?

ఓయి ! నిత్యకర్మలకు అదృష్టమగు (అప్రత్యక్షమగు) ఫలము కలదు. అయ్యది చేసినపాపములను బోగొట్టుటయే. కనుకనే ప్రాజ్ఞులు ("ఉపాత్తదురిత క్షయార్థమ్") చేసినపాపముల బోగొట్టుటకు, అని సంకల్పించుచున్నారు. ఆ దురితము (ఆ పాపము) ఈ జన్మమునందు జేసినదికాని, జన్మాంతరమందు జేసినదికాని, రెండువిధములగు దురితము నిత్యకర్మలచే క్షీణించును. ప్రారబ్ధదురితముమాత్ర మనుభవించియే తీరవలయును. అయ్యది ద్వంద్వాది రోగానుభవరూపము. ఇట్లుండ యాతనాశరీరమును పశుపక్ష్యాది జన్మలను యిచ్చు దురితమును రూపుమాపునట్టి నిత్యకర్మ సంసారనాశమగునుగాని బంధహేతువుకాదు. కావున నిత్యకర్మలవలన మోక్షము సిద్ధించునన్నచో,

అట్లుకాదు. అవిద్యాపూర్వకమగు శుభాశుభకర్మకు విద్యయే నాశకారణ మగునుగాని యవిద్యాపూర్వకమగు నిత్యకర్మానుష్ఠానము నాశకారణము కాదు. తమోమూలకమగు సర్పాదిభయమునకు తమోమూలకమగు పిశాచాదిభయము నివర్తకము కాదు, అని మీమాంసకుల కొకవిధమయిన సమాధానము.

వస్తుతః నిత్యకర్మలచే దురితము పోవునని యంగీకరించినను, వెనుక జేసిన సుకృతము నశించదు. అట్లే దురితమూలమయిన అజ్ఞానముకూడ నశించదు. అట్టి తఱి దురితమూలమయిన అజ్ఞానము, సుకృతకర్మసముదాయము నుండ పురుషునకు నిత్యానుష్ఠానమాత్రముచే మోక్షమెక్కడిది ? కాన నిత్యములు దురితక్షయార్థములని యంగీకరించినను నిత్యానుష్ఠానమువలన ముక్తిలేదని తెలియవలయును.

ఓయి, అవిద్యామూలకమగు నిత్యకర్మ అవిద్యామూలకమగు పాపకర్మకు నాశము కాదను నియమ మంగీకరింపక వీలులేదు. అవిద్యామూలకమయిన అభక్ష్య భక్షణరూపమగు (తినరానివస్తువులను దినుటరూపమగు) పాపకర్మకు అవిద్యామూల మయిన చాంద్రాయణాదిప్రాయశ్చిత్తకర్మ నాశకమగుచున్నది. అట్లుకానిచో, ధర్మశాస్త్రములోనున్న ప్రాయశ్చిత్తకాండ యంతయు యర్థమగును. అనినచో,

నిజమే. అవిద్యామూలకమగు కర్మ అవిద్యామూలమయిన కర్మను నశింప జేయదని మేమనము. మరేమనిన అవిద్యామూలమయిన కర్మ అవిద్యామూలమయిన కర్మను నిశ్శేషముగా నశింపజేయదని మేమందుము. అజ్ఞానమను మూలము శేష ముండుటచే మానియమమునకు భంగములేదు. ప్రాయశ్చిత్తకాండకు వైయర్థ్యము లేదు. అజ్ఞానమను మూలము కర్మవలన బోనేరదు. మృణ్మయమగు ఘటము మృత్తును నాశ మొనర్పదు.

అయితే జ్ఞానపూర్వకమయిన చాంద్రాయణాది ప్రాయశ్చిత్తమే అభోజ్యభోజనదురితమును బోగొట్టుననియు, నట్లే జ్ఞానపూర్వకమగు నిత్యకర్మయే అజ్ఞానపూర్వకమగు దురితమును బోగొట్టుననియు మీరందురేమో ? అట్లనరాదు. కర్మయంతయు అవిద్యాకామములు బీజముగా గలదికాని, జ్ఞానము బీజముగ గలది కాదు. జ్ఞానపూర్వకమగు కర్మయే అసంభవము. భగవంతుడగు శ్రీకృష్ణుడు అవిద్యద్విషయము కర్మయనియు, విద్వద్విషయము కర్మసంన్యాసమనియును నుపపాదించి యున్నాడు.

" య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతం ।
ఉభౌ తౌ నవిజానీతః నాయం హంతి నహన్యతే॥ "

" వేదావినాశినం నిత్యం యఏన మజమవ్యయం ।
కథం సపురుషః పార్థ, కం ఘాతయతి హంతికం॥ " అను నీ శ్లోకములు రెండును జ్ఞానికి సర్వకర్మాభావమును జెప్పుచున్నది.

" జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం " అను శ్లోకము జ్ఞానులకును, అజ్ఞానులకును జ్ఞానకర్మలను విభజించి చూపుచున్నది.

" అజ్ఞానాం కర్మసంగినామ్ "

" తత్త్వవిత్తు మహాబాహో " అను నీవాక్యములు రెండును విద్వాంసునకు సర్వకర్మసంన్యాసమును జెప్పుచున్నది.

" ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।
అహంకార విమూఢాత్మా కర్తాఽహ మితిమన్యతే " అను శ్లోకము అజ్ఞానికి కర్తృత్వమును సూచించుచున్నది.

" ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణముచ్యతే
యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే " అను శ్లోకము ఆరురుక్షువగు నజ్ఞానికి కర్మసాధనమనియు, ఆరూఢుడగు జ్ఞానికి సర్వకర్మసంన్యాసమనియును జెప్పుచున్నది.

' ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ '

' ఉదారా స్సర్వఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ '

అను శ్లోకములచే నార్తాదులు మువ్వురు నజ్ఞానులు గొప్పవారనియు, జ్ఞాని యొక్కడే యుత్తమోత్తముడనియు భగవంతుడగు శ్రీకృష్ణుడు జ్ఞానినే యుత్తమునిగా స్తుతించెను. అందువలన జ్ఞానికి అకర్తృత్వము నజ్ఞానులగు పై మువ్వురకు కర్తృత్వమును సిద్ధించుచున్నది.

'త్రైవిద్యా మాం సోమపాః పూతపాపాః । యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే
తే పుణ్యమాసాద్య సురేంద్రలోకం । అశ్నంతి దివ్యాన్ దివిదేవభోగాన్॥'
'తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం । క్షీణేపుణ్యే మర్త్యలోకం విశన్తి
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నాః । గతాగతం కామకామాః లభన్తే॥'

అను వచనములుగూడ నజ్ఞానికి కర్తృత్వమును సూచింపుచున్నవి. ఇట్లే అజ్ఞానికిఁ గర్మలను, జ్ఞానికి కర్మాభావమును సూచించు ప్రమాణము లనేకములు కలవు. వాటినిగూడ నిట ననుసంధానము చేసికొనవలయును.

కావున భగవంతుఁడు విధించిన నిత్యకర్మను భగవదారాధనబుద్ధితోఁ జేయువారు భగవత్కర్మకారులనియు వారు సమాహితచిత్తులైనను గర్మాధికారులే యనియు వారు పైపైని ఫలములకంటె హీనమగు దిగువఫలమును విడిచిపెట్టుచు గృతార్థతఁ జెందవలసినవారనియును శ్రీకృష్ణభగవానుఁడు,

'అథ చిత్తం సమాధాతుం నశక్నోషి మయి స్థిరం
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ
అభ్యాసే ప్యసమర్థోసి మత్కర్మపరమోభవ
అథైతద ప్యశక్తోసి కర్తుం మద్యోగమాశ్రితః
సర్వకర్మఫలత్యాగం తతఃకురు యతాత్మవాన్।'

అని చిత్తసమాధానాదులయందు శక్తిచాలని యజ్ఞానికి ఫలత్యాగమును విధించి వీరందరు నజ్ఞానులనియుఁ గర్మాధికారులనియు నిరూపించెను.

ఇక అనిర్దేశ్యమగు నక్షరాత్మతత్త్వము నుపాసించువారలకు 'అద్వేష్టా సర్వభూతానాం' అను శ్లోకము నారంభించి ద్వాదశాధ్యాయపరిసమాప్తి పర్యంతము సర్వభూతములయందు ద్వేషములేకుండుట, మైత్రి, కరుణ, నిర్మమత్వము, నిరహంకారత్వము, సుఖదుఃఖములయందు సామ్యము, సంతోషము మున్నగు సాధనములను 13 వ అధ్యాయమందు 'అమానిత్వ మదంభిత్వం' ఇత్యాది శ్లోకములచే మఱి కొన్ని జ్ఞానసాధనములను శ్రీకృష్ణు డుపదేశించుటచే జ్ఞానులకుఁ గర్మాభావము స్పష్టపడుచున్నది. ఇట్లు జ్ఞానులకు గర్మాధికారము లేకుండుటవలననే అధిష్ఠానాది పంచకము కారణముగాగల నిత్యకామ్య నిషిద్ధాదికర్మలను విడచినట్టియు ఆత్మా భేదమును గుర్తించినట్టియు జ్ఞాననిష్ఠయం దుండు పరమహంస పరివ్రాజకులకే

'అనిష్టమిష్టం మిశ్రంచ త్రివిధం కర్మణఃఫలమ్
భవత్య త్యాగినాం ప్రేత్య నతు సన్న్యాసినాం క్వచిత్'

అను శ్లోకముచే ననిష్టాదికర్మఫలత్రయము లేదని చెప్పెను. మిగిలిన యజ్ఞానులును

అసన్న్యాసులు కర్మలు నగువారికి ననిష్టాది కర్మఫలత్రయము తప్పదు. ఈ ప్రమాణములంబట్టి కర్మలకు గర్మచే బంధమనియు జ్ఞానులకు జ్ఞానముచే మోక్షమనియు జ్ఞానమువలననే మోక్షమనియు గర్మవలన మోక్షములేదనియు నిర్ణయమగుచున్నది. గీతాశాస్త్రము ముముక్షువునకు జ్ఞాననిష్ఠయే శరణ్యమని విభజించి చూపినది. కాన అజ్ఞునకు చిత్తశుద్ధ్యర్థము కర్మయోగ మావశ్యకము. జ్ఞానికి మోక్షార్థము జ్ఞాననిష్ఠ కర్తవ్యము. అజ్ఞానకృతములైన బంధములు అజ్ఞానమయమైన కర్మచే నివర్తింపవని యింతకుముం దెన్నియో మాఱులు చెప్పఁబడియున్నది. జ్ఞానాజ్ఞానములకు విరోధముకాని అజ్ఞానమునకు గర్మకును విరోధము లేదని యుక్తప్రాయమే.

నిత్యకర్మ జ్ఞానపూర్వకమేకాని యజ్ఞానపూర్వకము గాదని మీ రనరాదు. జ్ఞానమన నేదియో యింతవఱకు మీకు బోధపడలేదు. నేనుజేసిన యీపాపమును నీకర్మ రూపుమాపు ననునది జ్ఞానమని మీరు పొరబడుచున్నారు. అది యజ్ఞానమే కాని జ్ఞానముకాదు. నేను అకర్తను, అభోక్తను చిన్మాత్రుఁడను, నను నాత్మజ్ఞానమే జ్ఞానమని మేము చెప్పుచున్నాము. ఇయ్యది కర్మకు మూలముగాదు. పైపెచ్చు నాశకము. కావున నిత్యకర్మకాని ప్రాయశ్చిత్తకర్మగాని కామ్యకర్మగాని ప్రతిషిద్ధకర్మగాని వ్యాయామమున్నగు లౌకికకర్మలుగాని యివన్నియు నజ్ఞానమూలకములే కాని జ్ఞానమూలకములు కావు. అజ్ఞానమూలకమగు కర్మ జ్ఞానముచేతనే నివర్తించును. తమోమూలకమగు రజ్జుసర్పభ్రాంతి తమోనివర్తకమగు ప్రకాశముచేతనే తొలగును. ఇట్లు కర్మలచే నివృత్తిచెందని యజ్ఞానము తత్కార్యములైన సుకృతకర్మలు నుండగా కర్త్రాజ్ఞానములను నివర్తింపఁజేయునట్టి సర్వకర్మసన్న్యాసపూర్వకమగు జ్ఞానము లేకపోవుచుండగా బురుషునకు మోక్ష మెక్కడిది? అజ్ఞానము తత్ప్రయుక్తకర్మలు పురుషునకు కంఠపాశములేకదా! వానిని ఛేదించుటకు జ్ఞానమను గొడ్డలిని సంపాదింపవలెఁగాని నిత్యకర్మయను మఱియొక త్రాడును మెడకుఁ జుట్టుకొందురా?

ఓయీ, శాస్త్రము విద్యాత్మకముగాని యవిద్యగాదు. అట్టి గీతాశాస్త్రమే యజ్ఞానికిఁ గర్మచేయుమని చెప్పుచున్నది. విద్యారూపమైన శాస్త్రముచేఁ జెప్పఁబడినకర్మ యవిద్యాపూర్వక మెట్లగును? అన్నచో ఓహో, ఇదియా మీయాశయము. శాస్త్రముచెప్పినంతమాత్రమున నిత్యనైమిత్తికాది కర్మలన్నియు విద్యాపూర్వకములని మీరన్నచో ననర్థకారణములైన బ్రహ్మహత్యాదులు పనికిరావని మాత్రము చెప్పినది శాస్త్రముకాదా? శాస్త్రములేనిదే యట్టివి యనర్థకారణములని మీకెట్లు తెలిసినది? అర్థానర్థవిభాగము శాస్త్రాధీనముకాని పురుషబుద్ధ్యధీనము కాదుకదా? అనర్థములను నిర్ణయించినభాగమును నిషేధశాస్త్రమందురు. విధిశాస్త్రావగతములైనవి విద్యాపూర్వకము లగుచో నిషేధశాస్త్రావగతములైన

బ్రహ్మహత్యాది మహాపాతకములుగూడ విద్యాపూర్వకములే కావలయును. అట్లు మీరంగీకరించుటకు వీలులేదు. నిత్యకర్మల ననుష్ఠించినచో చిత్తశుద్ధిద్వారా క్రమముగ మోక్షము వచ్చును. బ్రహ్మహత్యాదుల ననుష్ఠించినగూడ మోక్షము వచ్చునని యంగీకరింతురా ? విద్యాపూర్వకములైన కర్మల ననుష్ఠించిన మోక్షమని కదా మీమతము! మీరుచెప్పిన యుక్తివలని బ్రహ్మహత్యాదులుకూడ విద్యాపూర్వకములే యైనవికదా ? ఇంక వాని ననుష్ఠించినచో మోక్ష మేలరాదు ? అను ప్రశ్నకు మీరేమి సమాధానమిత్తురు? ఏమియు నీయఁజాలరు. నోరెత్త వీలుండదు. కాన శాస్త్రార్థమైనను గర్మమాత్రము విద్యావిషయ మెన్నటికిఁగాదు. కర్మసన్న్యాసపూర్వక జ్ఞానమొక్కటియే విద్యావిషయమగును. కావున నజ్ఞానవిషయమైన కర్మానుష్ఠానమువలన మోక్షములేదు.

ఈ నియమ మంగీకరించనిచో బాధయేమి ? అని యందురేమో ! అజ్ఞానము లేనిదే యేకర్మయందును బురుషునకుఁ బ్రవృత్తియే కుదరదు. మానవునకు గర్మల యందలి ప్రవృత్తినిబట్టి వాని కవిద్యయున్నటుల నిర్ణయింపవలసినదే కాన మీరు చెప్పిన నిత్యకర్మ లవిద్యామూలకము లనుటలో సంశయములేదు. వానివలన మోక్షము రాఁజాలదు.

అవిద్యాపూర్వకమగు పుణ్యపాపకర్మ విద్యచేతనే నశించునని సిద్ధాంతి చెప్పఁగా దానిని సహింపలేక పూర్వవాదియగు మీమాంసకుడు శాస్త్రప్రతిపాదితమైనందునఁ గర్మయంతయు విద్యాపూర్వకమేయని వాదించెను. ఆవాదమునుగూడ సిద్ధాంతి నిరాకరించెను. ఇప్పుడు మఱల పూర్వవాది ప్రకారాంతముచే గర్మలు విద్యాపూర్వకములని సాధింప యత్నించుచున్నాడు. అదెట్లన 'ఓయీ, దేహవ్యతిరిక్తమైన యాత్మ తెలియనిచో దేహాంతరముచే ననుభవింపఁదగిన ప్రాజాపత్య స్వర్గాదిఫలములం దేమానవునకును నాశ కలుగదుకదా ! అట్టియాశలేనిదే నిత్యకామ్యకర్మలందు ప్రవృత్తి కుదరదుకదా! కాన దేహాతిరిక్త ఆత్మజ్ఞానపూర్వకముగఁ జేసెడి నిత్యకామ్యకర్మలు జ్ఞానపూర్వకములే యగునుగాని యజ్ఞానపూర్వకము లెట్లగును ? ' అని

ఇందులకు సమాధానము : కర్మ చలనాత్మకము. ఇది యనాత్మకర్తృకము గాని యాత్మకర్తృకము గాదు. ప్రతిమానవుడును 'అహంకరోమి' 'నేను చేయుచున్నాను' అని ప్రవర్తించుచున్నాడు. ఈప్రవృత్తి (చలనము) దేహాదులయందే కనిపించుచున్నది. కాన దీనికి దేహాదులే కర్తలు. నిత్యనైమిత్తికమగు వైదికకర్మ గాని వ్యాయామరూపమగు లౌకికకర్మగాని యంతయు చలనరూపమే. "ఇదియంతయు ననాత్మయగు దేహమువలన నెరవేఱునదే" అనాత్మలయిన దేహేంద్రియాదులు వ్యాపించినపుడే కర్మ నెఱవేరుచున్నది. అయితే గమనాదిక్రియలయందీ న్యాయము సరిపోయినను నింద్రియాంతఃకరణములకుఁ జలనము లేకున్నను, దర్శన

సంకల్పాదిక్రియలు కలుగుచున్నవికదా' అని మీ రభిప్రాయపడవచ్చును. అది యును మీకుఁ బొరపాటే. 'చంచలంహి మనఃకృష్ణ' అనుశాస్త్రమునుబట్టియు లోకానుభవమునుబట్టియు నొకచోట నిలకడగా నుండకపోవుటయను చాంచల్యము మనఆదియింద్రియములకుగూడఁ గలదు. మనసునకుగాని యింద్రియములకుగాని వృత్తివలన చలనమే లేనిచో శబ్దాదివిషయములను గ్రహింపలేవు. చక్షుశ్శ్రోత్రములు వృత్తిరూపమున విషయప్రదేశమునకు వెడలి విషయములను గ్రహించుచున్నవని వేదాంతశాస్త్రము చెప్పుచున్నది. వాయువేగముకంటె మనోవేగము గొప్పదని లోకప్రతీతి కలదు. శరీరము రామేశ్వరములోనుండ మనస్సు కాశికేగును. ఈ దేహేంద్రియమనస్సులకు చలనములేనందువలననే సుషుప్త్యాదులయందు నిర్వ్యాపారత్వము కలుగుచున్నది. కాన కర్మయంతయు దేహేంద్రియమనస్సుల నాశ్రయించి యున్నదిగాని యాత్మనాశ్రయించిలేదు. ఆత్మ యచలుఁడు. "అచలోఽయం సనాతనః" అని గీతలలోనే కలదు. పరిపూర్ణచైతన్యరూపుడగుటవలన నాత్మ యచలుడగుచున్నాడు. ఇట్లు చలుడగు నాత్మకు చలనాత్మక కర్మాశ్రయత్వ మెట్లు? చలనరూపమగుకర్మ యాత్మకర్తృక మగుటకాని యెట్లు?

ఆత్మ బుద్ధిపరిచ్ఛిన్నుడనియు, ఆతనికి ఉత్క్రాంతి (లేచిపోవుట) గతి (వెళ్లుట) మున్నగు కర్మలు కలవనియు ననరాదు.

"ధ్యాయతీవ లేలాయతీవ" అనుశ్రుతినిబట్టి బుద్ధి చలించుచుండ నాత్మ చలించిన ట్లగపడును. ఇంతియేకాని చలనాదిక మాత్మది కాదు. బుద్ధియను నుపాధి యొక్క ధర్మము నధ్యాసచేయుటచే, ఉత్క్రాంత్యాదులు ఆత్మకు గలుగుచున్నవి కాని, నిజముగ ఆత్మవికావు. స్వభావతః ఆత్మ యచలుడు, అపరిచ్ఛిన్నుడు. "అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణః" అని శ్రుతిప్రమాణము. కాన అచలుడగు ఆత్మకు దేహాద్యనాత్మాశ్రయమగు కర్మయందు "అహం కరోమి" యను ప్రవృత్తి కుదరదు. అయినను లోకము గర్మలయందు బ్రవర్తించుచునేయున్నది. అందు కాత్మానాత్మల కధ్యాసయే కారణమని యెల్ల రంగీకరించవలయును. ఇట్లంగీకరించుచో, నిత్యనైమిత్తికాది కర్మలయందు బ్రవర్తించుటకు, ఆత్మ దేహవ్యతిరిక్తుడను జ్ఞానము కారణముకాదు. దేహేంద్రియాంతఃకరణ తాదాత్మ్యాధ్యాసవలన నేర్పడిన "నేను కర్తను" "నేను భోక్తను" అను మిథ్యాజ్ఞానము కారణము. కాక నిజముగా వీరలకు "నేను దేహవ్యతిరిక్తుడను" అను ఆత్మజ్ఞానమున్నచో, శరీరము స్నానము చేయునపుడుకాని, దానియవయవములగు చేతులు హోమముచేయునప్పుడుకాని, "శరీరము స్నానమాడుచున్నది. చేయి హోమముచేయుచున్నది" అని యనవలయును. అట్లెవ్వరు ననుటలేదు. పైగా నేను స్నానము చేయుచున్నాను. నేను హోమము చేయుచున్నాను. అని యనుచున్నారు. కాని దేహవ్యతిరిక్తాత్మజ్ఞానము కూడ వీరికి దృఢముగ లేదు. వీరు మిథ్యాజ్ఞానులే. మిథ్యాజ్ఞానమువలననే వీరికి

నిత్యకామ్యాదికర్మలయందు ప్రవృత్తి. దేహవ్యతిరిక్త అకర్తృభోక్త్రాత్మజ్ఞానము వలనగాదు. దేహవ్యతిరిక్తమయిన ఆత్మ కర్తకాని భోక్తకాని కానేరదు.

అయితే వీరలకు దేహాదులయందు అహమను అనాత్మతాదాత్మ్యాధ్యాస గౌణజ్ఞానముకాని మిథ్యాజ్ఞానముకాదు. "ఆత్మావై పుత్రానామాసి" అను శ్రుతి ననుసరించి, తనపుత్రునియందు తానను బుద్ధివలె, తన దేహమునందుగూడ తానను బుద్ధి గౌణము. తనకు ప్రేమాస్పదమయిన గోవునందు "నా ప్రాణమిది" అను బుద్ధివలె, దేహాదులయందు తానను బుద్ధికూడ నట్లే గౌణము. అని మీరు శంకించ వచ్చును.

ఈయది యుక్తముకాదు. గౌణ మిథ్యాజ్ఞానములకు భేదము కలదు. పరస్పర భేదము తెలియనివాటియందు మిథ్యాజ్ఞానము కలుగును. భేదము తెలిసినవాటి యందు గౌణజ్ఞాన మేర్పడును. చీకటిలో స్థాణువును జూచి; అది స్థాణువయినది, పురుషుడయినది, భేదము తెలియనప్పుడే పురుషుడను భ్రాంతి పుట్టును. ఇట్లె శుక్తి రజతస్థలమందుగూడ; గౌణస్థలమున తాను వేరు, తనపుత్రుడు వేరు, అను భేదజ్ఞాన ముండియే శ్రుతి నాధారముగ జేసికొని, తానను జ్ఞానము గలుగుచున్నది. అట్లె తాను వేరు, తనగోవు వేరు, అని తెలిసియుండియే తనకు గోవునందుగల ప్రేమనుబట్టి గోవునందు తానను జ్ఞానము బుట్టుచున్నది. ఇట్లు గౌణ మిథ్యాజ్ఞానములకు భేదము ప్రసిద్ధము.

మరియు అజ్ఞానమువలన అది కానిదానియందు అది యనుబుద్ధి మిథ్యాజ్ఞానము. వివేకమువలన అదికానిదానియందు అది యను బుద్ధి గౌణము. మిథ్యాజ్ఞానము భ్రమ, గౌణజ్ఞానము ప్రమ. ఇట్లీరెంటికి భేదవ్యవహారము లోకసిద్ధము.

మరియు దేహాదులయం దహ మనుజ్ఞానము గౌణమగుచో, దేహాదులకార్యములుకూడ గౌణములు కావలయును. గౌణాత్మచేసిన పనులు ముఖ్యములు కాకూడదు. గౌణాత్మయగు పుత్రుడు భుజించ ముఖ్యాత్మయగు తండ్రి భుజించినట్లు కాదు. కాని ప్రకృతమున దేహాదిసంఘాతము చేసినపనిని ముఖ్యమనియే యాత్మ తలంచుచున్నాడు. "నేను వెళ్ళితిని, నేను తింటిని, నేను స్నానమాడితిని" అని లోకవ్యవహారము కలదు. కావున సంఘాతముయొక్క కార్యములందు ముఖ్యకార్యము లను జ్ఞానముండుటవలనను, గౌణకార్యము లను జ్ఞానములేకపోవుటవలను, సంఘాతమునందు నే ననుజ్ఞానము గౌణము కాదు. మిథ్యయే యగును.

గౌణజ్ఞానము అధికరణమును స్తుతించునుగాని, ముఖ్యకార్యమును సాధింపదు. "సింహో మాణవకః" అనుచోట సింహశబ్దము ఉపమావాచకము లోపించినశబ్దము. సింహఇవ, అగ్నిరివ, అని యర్థము. ఇచట సింహశబ్దము ఏనుగుయొక్క కుంభస్థలమును భేదించుటరూపమయిన సింహకార్యమును సాధించదు. అగ్నిశబ్ద

మున్ను; దాహాదిరూపమయిన అగ్నికార్యమును సాధించదు. (దేవదత్త మాణవకులకు) మరేమనిన, సింహమునందలి క్రౌర్యగుణమును దీసికొని దేవదత్తుడు క్రూరుడనియు, అగ్నియందలి పైంగల్యగుణమునుబట్టి మాణవకుడు పింగళుడనియును, దేవదత్త మాణవకులను స్తుతించుటని భావము.

ఇందు తత్త్వమిది. దేహాది సంఘాతములయొక్క కార్యములుకూడ ముఖ్యములు కావు. అనాత్మలయిన దేహాదిసంఘాతముల నెట్లు ఆత్మగా దలచుచున్నాడో అట్లే వాటికార్యములనుగూడ ఆత్మకార్యములుగ దలంచుచున్నాడు. కాన సంఘాతకార్యములు మిథ్యాకార్యములేకాని ముఖ్యాత్మకార్యములు కావు. వాటియందు ముఖ్యకార్యములను జ్ఞానము మిథ్యయే. ఈ మిథ్యాజ్ఞానమువలననే అజ్ఞానికి సంసారబంధ మేర్పడుచున్నది. కాన దేహాదిసంఘాతము గౌణాత్మయు కాదు. ముఖ్యాత్మయుకాదు. మిథ్యాత్మయే. వానికార్యములుకూడ గౌణ ముఖ్యములుకావు. మిథ్యాభూతములే.

మరియు గౌణవాక్యమును ప్రయోగించువాడు దేవదత్తుడు సింహముకాదనియు అగ్ని మాణవకుడు కాదనియు తెలియుచున్నాడు. అట్లు భ్రాంతుడు మిథ్యాప్రత్యయగోచరమగు స్థాణుపురుషాదికమును తెలియుటలేదు. వీడు పురుషుడు కాడు, ఇది రజతముకాదు, ఇది సర్పముకాదు. అను జ్ఞానముగలవాడు స్థాణు, శుక్తి, రజ్జువుల జూచి పురుష, రజత, సర్పము లను భ్రాంతిని పడడు. దేహాదిసంఘాతము గౌణప్రత్యయ విషయమే యగుచో లోకము యీ సంఘాతము ఆత్మకాదని తెలిసికొనును. అట్లు లోకము గుర్తించుటలేదు. నేను మనుష్యుడను అని తెలిసికొనుచున్నాడు. దేహాదిసంఘాతము అనాత్మయని గ్రహించు విద్వాంసుడుమాత్రము సంఘాతమును ఆత్మగా గ్రహించుటలేదు. కావున సంఘాతమునందు అహంప్రత్యయము అజ్ఞానులకు మిథ్యయే.

గౌణసింహాగ్ను లగు దేవదత్తమాణవకులచే ముఖ్యసింహాగ్నులకార్యము నెరవేర్చబడదు. దేవదత్తమాణవకులయం దాశబ్దములు, క్రౌర్య పైంగల్యగుణములను నిమిత్తముగా జేసికొని స్తుతికొరకు ప్రయోగింపబడినవి. ఇట్లు స్తుతింపబడు దేవదత్తమాణవకులు "నేను సింహమును గాను, నేను అగ్నినికాను" అని తెలిసికొనుచున్నారు. 'సింహముయొక్క పని నాదికాదు. అగ్నిపని నాదికాదు' అనియు గుర్తించుచున్నారు. అట్లు 'దేహాదిసంఘాతము నేను కాను, దేహాదిసంఘాతముయొక్క పని నాదికాదు' అని లోకము గుర్తించుటలేదు. పైగా దేహాది సంఘాతమునందు నే నను జ్ఞానము, సంఘాతకార్యములందు నాపని యనుజ్ఞానమున్ను లోకములో నగపడుచున్నది. కావున సంఘాతమునందలి అహంప్రత్యయము (నే ననుజ్ఞానము) గౌణముకాదు. మిథ్యయే. కూటస్థుడు, ముఖ్యాత్మసంఘాతము మిథ్యాత్మ, పుత్రాదులు గౌణాత్మలు— అని భేదమును గ్రహింపవలెను.

దేహాదిసంఘాతము జడమనియు నందువలన దానికి కర్తృత్వ ముపపన్నము గాదనియు నాత్మయందు స్మృతి యిచ్ఛాప్రయత్నములు కలవనియు వానిచే నాత్మయే కర్మ చేయుననియును దార్కికాదు లందురు. ఇయ్యది సరికాదు. ఆత్మ యందలి స్మృతి యిచ్ఛాప్రయత్నాదులు మిథ్యాజ్ఞానమును నిమిత్తముగాగల యిష్టానిష్టవస్త్వనుభవమువలనఁబుట్టిన సంస్కారమువలన నేర్పడును. అనగా ననాత్మ యందు నేనను మిథ్యాప్రత్యయము కలుగగా నా సంఘాతముయొక్క పనులయందు 'మమేతి' (నాది యను) మిథ్యాప్రత్యయము కలుగును. పిదప తత్ఫలములైన యిష్టానిష్టములయందు నాచే నిది యనుభవింపఁ బడుచున్నది. 'నాకిది ఫలము' అను మిథ్యాజ్ఞాన ముదయించును. ఇట్టి మిథ్యాజ్ఞానపూర్వకమగు ఫలానుభవము వలన సంస్కారము పుట్టును. ఆ సంస్కారమువలన స్మృతి యుదయించును. తరువాత స్మృతమైన వస్తువునం దిచ్ఛ పుట్టును. పిదప దానినిఁ బొందుటకొరకుఁ బ్రయత్నించును. ఇట్లు స్మృతీచ్ఛాప్రయత్నములు మిథ్యాజ్ఞానపూర్వకము లగు చున్నవి. ఈ జన్మయందుగాని జన్మాంతరమునందుగాని యనుభవింపఁబడని పదార్థము స్మృతిగోచరముకాదు. ఈ జన్మయందు బురుషునకు దేహాదిసంఘాతము నందు 'అహమ్మమ' అభిమానములు, వానివలన రాగద్వేషాదులు, వానివలన ధర్మాధర్మములు, ఆ పిదప ధర్మాధర్మఫలమైన సుఖదుఃఖానుభవము నెట్లు కలుగుచున్నదో యట్లే గడచిన జన్మలయందుగూడ. కావున సుఖదుఃఖానుభవ రూపమగు నీ యతీతానాగత సంసారజాతమంతయు నజ్ఞానకృతమనియు, ననాది యనియు నూహింపవలెను. ఇట్టి సంసారానుభవము మిథ్యాప్రత్యయపూర్వకము గాని యాత్మకు స్వాభావికముకాదు. ఈజన్మయందలి మిథ్యాప్రత్యయమునకు జన్మాంతరమునందలి మిథ్యాప్రత్యయము కారణము. పూర్వపూర్వాధ్యాస ఉత్త రోత్తరాధ్యాసముగూర్చి కారణమగును. ఇట్లు మిథ్యాప్రత్యయపూర్వకమగు నీ సంసార మనాదిగా చక్రమువలెఁ బరిభ్రమించుచున్నది. ఇట్లు అజ్ఞానము కారణ ముగా గలదగుటవలననే సంఘాతమునందు 'అహం' ప్రత్యయము మిథ్యాప్రత్య యముగాని గౌణముకాదు. కాన సంసారమంతయు నవిద్యాకృత మగుటవలన సర్వకర్మసన్న్యాసపూర్వకజ్ఞాననిష్ఠచేతనే నిశ్శేషసంసారోపరమము సంభవించును. విద్యావిద్యలకే విరోధము. అవిద్యాపూర్వకమగు కర్మచే సంసారమునకు సమూల ముగ నుచ్ఛేదము లేదు. కాన జ్ఞానమువలననే మోక్షమని సిద్ధించినది.

ఎట్లన దేహాదిసంఘాతమునందలి 'అహం' ప్రత్యయమను దేహాభిమాన మవిద్యాకృతమగుటచే విద్యవలన నవిద్య నివర్తించగా దేహాభిమాన మిక నుండదు. కాన సంసారము లేదు. దేహాభిమానమున్నంతవఱకే సంసారము. అజ్ఞా నులు దేహాభిమానముతోడనే సంసారము ననుభవించుచున్నారు. ఆత్మానాత్మ లను వివేకపఱచి తెలిసికొనువాడు దేహాదిసంఘాతమునం దాత్మబుద్ధిని యుంచడు.

స్థాణువును దెలిసికొనిన పురుషుడు స్థాణువునం దిది పురుషుడను జ్ఞానమును పొందడు.

'ఓయీ! యిచట స్థాణుపురుషదృష్టాంత మనాత్మయం దాత్మభ్రాంతికి ననుకూలపడదు. ఉన్నస్థాణువునందు అచట లేనిపురుషునిగూర్చి భ్రాంతి చెందు చున్నాడు. ఆత్మానాత్మస్థలమున విద్యమానమగు దేహాదిసంఘాతమునందే విద్య మానమగు నాత్మను భ్రాంతిపడుచున్నాడు. కనుక స్థాణుపురుషదృష్టాంతమున "అవిద్యమానపురుషభ్రమయు, దార్ష్టాంతికమున విద్యమాన ఆత్మభ్రమయు నని యీరెంటికి భేదము అస్పష్టము. అనినచో నట్లుకాదు. స్థాణువునందు పురుషుడను బుద్ధివలె యనాత్మయందు ఆత్మయను బుద్ధి భ్రమయను సంశమమాత్రమే యిచట దృష్టాంతదార్ష్టాంతికములకు సాధర్మ్యముగ వివక్షితమైనది.

'ఓయి! ఎవడు స్థాణుపురుషుల నుభయమును దెలిసికొనుచున్నాడో వానికి స్థాణువునందు పురుషభ్రమ కలుగుచున్నది. అంతేకాని యీరెంటిలో నొకదానిని తెలియనివానికిగాని యీరెంటిని తెలియనివానికిగాని యీభ్రాంతి పుట్టుటలేదు. అట్లే యీత్మానాత్మలను తెలిసినవానికి సంఘాతమునందు ఆత్మభ్రాంతిపుట్టుచు న్నదా? లేక యీరెంటిలో నొకదానిని తెలియనివానికా? లేక యీరెంటిని తెలియనివానికా? ఇం దేపక్షము మీకు సమ్మతము? అన్నిట దోషము కలదు. మొదటిపక్షము కుదరదు. మొదటిపక్ష మవలంబించినచో నాత్మాఽనాత్మవేత్త యగు సమ్యగ్జ్ఞానికే సంఘాతమునం దాత్మభ్రాంతి కలుగవలసివచ్చును. రెండవ పక్షముకూడ కుదరదు. ఇందు ఆత్మను తెలియనివాని కాత్మభ్రాంతియా? అనా త్మను తెలియనివానికా? మొదటిది కుదరదు. పురుషుని తెలియనివానికి స్థాణువు నందు బురుషభ్రమ యెట్లసంభవమో యాత్మను తెలియనివారికిఁగూడ సంఘా తమునం దాత్మభ్రమ యట్లసంభవము. ఇక రెండవపక్షమును కుదరదు. ఏలయన అనాత్మను తెలియనివాడే లోకమునం దుండడు. ఇట్లే మూడవపక్షమును గుదరదు. ఆత్మానాత్మలను ఉభయమును దెలియని సుషుప్తి మృత్యాదులయం దేరికిని భ్రమ సంభవించుటలేదు. అని యొక యాశంక–

సమాధానము :– ఆత్మనుగాని యనాత్మనుగాని యెవరు బాగుగా తెలిసి కొనుచున్నారో వారికి సంఘాతమునం దాత్మభ్రాంతిలేదు. స్థాణువునుగాని పురుషుని గాని బాగుగా తెలిసికొన్నవానికి స్థాణువునందుకూడ పురుషభ్రమ యుండదు. కావున నెవడు ఆత్మను బాగుగా తెలిసికొనలేడో వానికే యనాత్మయం దాత్మ భ్రమ. ఆత్మ బాగుగ విదితమైనచో సంఘాతమునం దాత్మభ్రాంతియే సంభవిం చదు. ఆత్మను బొత్తుగా దెలియనివానికికూడ సంఘాతమునం దాత్మభ్రాంతి పుట్టదు. మరేమనిన ఆత్మ కర్తయనియు భోక్తయనియుఁ బుట్టినవాడనియు మృతు డనియును విపరీతముగ నాత్మ నెవ్వడు తెలిసికొనుచున్నాడో, వానికే సంఘాత

మునం దాత్మభ్రమ. అయితే భ్రమకు బూర్వము విపరీతాత్మజ్ఞాన మెట్లని మీరు సందేహపడవచ్చును.

కాని బీజాంకురన్యాయముచే భ్రమకంటె పూర్వము విపరీతాऽత్మజ్ఞానము, దానికంటెపూర్వము భ్రమ, లేక యజ్ఞానమువలన నాత్మయందు విపరీతజ్ఞానము భ్రమయు నీరెండు నొకేసారి కలుగును

వస్తుతః 'అహమ్మను ననుభవసిద్ధమైన యాత్మయనుపదార్థ మొకటి కలదని సామాన్యాకారముగ నందఱు ఆత్మను దెలిసికొనుచున్నారు. అజ్ఞానులయితే ఆ యాత్మనే దేహాది సంఘాతరూపముగ గుర్తించుచున్నారు. కాన సంఘాతమునం దాత్మభ్రమ యజ్ఞానులకు తగును. అనుభవసిద్ధమై కాదనుటకు వీలులేని యీసంఘాతాత్మభ్రమ అవిద్యాపూర్వకమగుచు, ననిర్వాచ్యమగుచుండ దీనివిషయమై ఎక్కువ ప్రశ్నోత్తరము లనావశ్యకములు. మాయామయమగు వస్తువు నెంతవిమర్శించినను దానిస్వరూపము తేలదు. ఈ సంఘాతము మాయామయము. దానియం దాత్మభ్రమయు మాయామయమే. కాన నీరెండును మిథ్యయే. కనుకనే సంఘాతమునందు నేనను జ్ఞానము మిథ్యాజ్ఞానమని మేమంటిమి.

ఓయీ, 'ఆత్మావై పుత్త్రనామాసి' యను శ్రుతిని ప్రమాణముగ దీసికొని పుత్రునియందు నేనను జ్ఞానమెట్లు గౌణమో యట్లే తన సంఘాతమునందు నేనను జ్ఞానముగూడ గౌణమే. మిథ్యయననేల? వినుము. పుత్త్రుడు గౌణాత్మ కావచ్చును. సంఘాతముమాత్రము గౌణాత్మకాదు. తండ్రికుమారులకు జన్యజనక భావరూప సంబంధ మొకటి కలదు. దానిని నిమిత్తముగఁ జేసికొని పుత్త్రునియందు నేనను జ్ఞానము గౌణమగుచున్నది. ఆత్మకును దేహేంద్రియసంఘాతమునకును నట్టి జన్యజనకభావసంబంధము లేదు. దేహేంద్రియాద్యవచ్ఛిన్న చైతన్యరూపుడగు నాత్మ దేహేంద్రియాదులకు జనకుడగుట యసంభవము. అయితే 'ఆత్మన ఆకాశ స్సంభూతః' అనెడి శ్రుతికి గతియేమి? అచట ఆత్మపదము దేహేంద్రియాద్యన వచ్ఛిన్నాత్మను బోధించును. అచట నాకాశాదులయం దాత్మభ్రాంతి లేదు. కావున నిందు విరోధము లేదు. కాన సంఘాతమునం దహంప్రత్యయము గౌణ మెన్నటికిని కాదు. తప్పక మిథ్యయే. గౌణాత్మ నిజమైన యాత్మయొక్క పనినిఁ జేయలేదు. గౌణాత్మయగు పుత్త్రుడు ముఖ్యాత్మయగు తండ్రియొక్క భోజనము నాచరించలేదు తండ్రిగ్రహించిన యన్నపానములచేతనే తండ్రిదేహము వృద్ధిచెందునుగాని పుత్త్రుడు భుజించిన యన్నపానములచే తండ్రిశరీరము వృద్ధిచెందదు. కాని దేహాదిసంఘాతముచేసిన యజ్ఞాదికర్మలచే నాత్మ స్వర్గాదులఁ బొందుచున్నాడు. కొడుకుచేసిన యజ్ఞమువలన దండ్రి స్వర్గమున కేగుటలేదు. కాన దేహాది సంఘాతము గౌణాత్మ కానేరదు. మిథ్యాత్మయే. దేహాదిసంఘాతము గౌణాత్మయగుచో ముఖ్యాత్మయొక్క పనిని నెరవేర్చలేదు. గౌణసింహమగు దేవదత్తుడు ఏనుగుకుంభ

స్థలమును జీల్చఁజాలదు. గౌణాగ్నియగు మాణవకుడును గట్టెల మంటపెట్టఁజాలదు. ఇచట మిథ్యాత్మయగు దేహాదిసంఘాతము పుణ్యాపాపము లొనర్చి ముఖ్యాత్మను ఊర్ధ్వాధోలోకముల కంపుచున్నది. కావున మిథ్యాప్రత్యయమునకును గౌణ ప్రత్యయమునకును భేదము కలదు. దేహాదిసంఘాతమునం దాత్మజ్ఞానము మిథ్యగాని గౌణముకాదు. 'జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత' అను విధి ననుసరించి చేసెడి యజ్ఞాదిక్రతువులు మిథ్యాత్మలగు దేహాదులచేఁ జేయబడుచున్నవిగాని గౌణాత్మలచేఁ జేయబడుచుండుటలేదు. మిథ్యాజ్ఞానముచేతనే దేహాదుల కాత్మత్వ ముపపన్నమైనది. అన్వయవ్యతిరేక ప్రమాణములవలన మిథ్యాజ్ఞాన మున్నంత వఱకే దేహాదుల కాత్మత్వము – అదిలేనపు డనాత్మత్వమే. కనుకనే యవివేకులగు పిల్లలకు నజ్ఞానకాలమున దేహాది సంఘాతమునందు 'నేను పొడవైనవాడను – గౌరవర్ణముకలవాడను' అను జ్ఞానము కనిపించుచున్నది. దేహాది సంఘాతముకంటె నేను వేఱని తెలిసిన వివేకులకు నాజ్ఞానకాలమున దేహాది సంఘాతమునందు 'అహం' ప్రత్యయము పుట్టుటలేదు. అవివేకులకుగూడ కాలాంతరమునందు వివేకము గలిగి నచో నట్టిమిథ్యా ప్రత్యయము బుట్టదు. వివేకవంతులకుఁగూడ నొకానొకసమయ మున ఘోరదుఃఖము ననుభవించునప్పు డా వివేకము చెడి యవివేకులవలె సంఘా తమునం దాత్మప్రత్యయము పుట్టవచ్చును. కాన సంఘాతాత్మజ్ఞానము మిథ్యా జ్ఞానపూర్వకముగాని గౌణముమాత్రము కాదు. గౌణస్థలమున సామాన్యవిశేష ములయొక్క భేదము తెలియఁబడును. మిథ్యాప్రత్యయమునందు సామాన్యవిశేష ములగు సంఘాతాత్మలకు భేదము తెలియఁబడదు. అనగా 'సింహో దేవదత్తః' అనుచోట సింహమును దేవదత్తుని సామాన్యాకారముగను విశేషాకారముగను వేరుగఁ దెలిసికొనియే మానవుఁడు 'సింహో దేవదత్త' అని యనుచున్నాడు. అట్లే యాత్మను దేహాదిసంఘాతమునున్నూ సామాన్యాకారముగను విశేషాకారముగను వేరుగఁ దెలిసికొని పురుషుడు సంఘాతమును నేనని తెలిసికొనుచో నపుడు సంఘా తమునం దహంప్రత్యయము గౌణమయ్యెడిది. అట్లు విద్వాంసు డనుకొనుటలేదు. విద్య సంఘాతమునం దాత్మభ్రాంతిని బోగొట్టును. సంఘాతభిన్నమగు సచ్చిదానం దాత్మ స్వరూపమును సాక్షాత్కరపరచును. ఇట్టియెడ సంఘాతభిన్నమగు సచ్చిదా నందాత్మను సామాన్యముగను విశేషముగను దెలిసికొన్న పురుషుడు మరల సంఘాతము నేనని యెట్లనుకొనును? ఎవడు నేను మనుష్యుడ నని తలంచునో వాడు 'అనాత్మ – ఆత్మ' యను పదార్థద్వయము కలదని సామాన్యాకారముగనే తెలిసి కొనుటలేదు. ఇంక సచ్చిదానందరూపుఁ డాత్మయనియు ననృతజడదుఃఖరూప మనాత్మయనియు నను విశేషజ్ఞానము వాని కెట్లుండును? కనుకనే వానికి ననా త్మయం దాత్మప్రత్యయము స్థాణువునందు బురుషప్రత్యయమువలె భ్రాంతియే. సింహ దేవదత్తులను వేఱుగ జూచు పురుషుడు 'సింహో దేవదత్తః' అని యను

కొనినట్లు స్థాణుపురుషు లిద్దఱను జూచువాడు ‘ అయంపురుషః ’ అని యనుకొనఁడు. ఒక్క-స్థాణువును జూచినవాడే పురుషుడని భ్రాంతిని జెందును. అట్లే ఆత్మానాత్మలను వేఱువేఱుగఁ దెలిసికొనినవాడు సంఘాత మాత్మయని యనుకొనఁడు. అనాత్మనొక్క-దానినే గుర్తించువాడు దాని నాత్మయని యనుకొనును. కావున సంఘాతమునందు ‘ అహం ’ ప్రత్యయము గౌణముకాదు.

‘ ఓయీ ! దేహేంద్రియాదులు మిథ్యాత్మలగుచో నవిచేసెడి యజ్ఞాది కర్మలుగూడ మిథ్యలే యగును. ఇట్టితెరి మిథ్యయైన యజ్ఞాదికర్మలను చేయుమని ముఖ్యాత్మయగు జీవునిగూర్చి శ్రుతిచెప్పుట పొసఁగదు. కాన శ్రుతి యదృష్ట విషయములయందు ముఖ్యాత్మయగు జీవుని ప్రేరేపించుటవలన ముఖ్యాత్మచే చేయఁదగినపని గౌణములగు దేహేంద్రియాదులచే నెరవేర్చబడుచున్నదని తప్పక యంగీకరింపవలెను. వేద మన్నిప్రమాణములకంటెఁ గొప్పది. వేదప్రామాణ్యమును యుక్తులచే సడలింప యత్నించుట తగదు. “ ప్రత్యక్షేణానుమిత్యావా, యస్తూపాంయో నబుధ్యతే, ఏనం విదన్తివేదేన ” అను వచనము ప్రత్యక్షానుమితి ప్రమాణములకు విషయముగాని యదృష్టార్థమును బోధించుటచే వేదము ప్రమాణమని చెప్పుచున్నది. కావున నగ్నిహోత్రాది కర్మలకు తత్సాధ్యమైన స్వర్గాదిఫలములకు గల సాధ్యసాధన భావరూపసంబంధమును బోధించుటయందే శ్రుతి ప్రమాణమగును. ప్రత్యక్షాది ప్రమాణగోచరమగు విషయమునం దయ్యది ప్రమాణము కాదు. ప్రమాణములన్నియు నజ్ఞాతార్థమును ( తెలియని విషయమును) బోధించుటవలననే ప్రమాణము లగుచున్నవి. ప్రమాణమనగా ప్రమాకరణము. ప్రమయన అనధిగత, అబాధిత, అర్థవిషయకజ్ఞానము.

అందు ప్రత్యక్షప్రమాకరణము ప్రత్యక్షప్రమాణము. అయ్యది చక్షురాదికము. అందు చక్షుర్వ్యాపారముకంటె బూర్వము తెలియని ఘటమును నిది ఘటమని పురుషునకు బోధించి అయ్యది ప్రమాణ మగుచున్నది. ఇట్లే తనవ్యాపారమునకు బూర్వము తెలియఁబడని శబ్దమును బోధించి శ్రోత్రము ప్రమాణమగుచున్నది. ఇట్లే మిగిలిన యింద్రియములును.

అనుమితిజ్ఞానమునకు కరణమగునది యనుమానప్రమాణము. అయ్యది మనస్సు. ఇది పర్వతమునందు గనిపించని యగ్నిని ‘ వహ్నివ్యాప్యో ధూమః ’ అను హేతువుచేఁ బురుషునకు బోధించి ప్రమాణమగుచున్నది. సాదృశ్యజ్ఞానమునకుఁ గరణమగునది యుపమానము. అదియును దెలియబడని గోగవయమృగములయొక్క- సాదృశ్యమును దెలిపియే ప్రమాణ మగుచున్నది. అట్లే ‘ పీనో దేవదత్తో - దివా నభుంక్తే ’ ‘ బలిసిన దేవదత్తుఁడు పగలు భుజింపడు ’ అను నర్థాపత్తియు దెలియఁబడని బలిసిన దేవదత్తుఁడొనరించిన రాత్రిభోజనమును దెలిపియే

ప్రమాణమగుచున్నది. ఇట్లే యనుపలబ్ధిగూడ నజ్ఞాతమగు ఘటాభావమును బోధించుచున్నది. అట్లే శబ్దముగూడ అజ్ఞాతమును జ్ఞాపకపరచియే ప్రమాణమగును. ఆప్తవాక్యము శబ్దము ఘటమును దెలియని బాలుడు ఘటమునుజూచి "ఇదియేమి" యని తల్లినడిగి 'ఇది ఘటము' అను తల్లిమాటవలన ఘటమును దెలిసికొనుచున్నాడు.

వేదముగూడ పరమాత్ముడగు భగవంతునియొక్క వాక్యము. కాన పరమ ప్రమాణము. అట్టివేదము అజ్ఞాతమగు స్వర్గాగ్నిహోత్రాదులను దెలియఁపఱచుచున్నది. దృష్టార్థమునందు వేదము ప్రమాణముగా నుండుటచే దృష్టమగు మిథ్యాజ్ఞానము కారణముగాగల దేహాదిసంఘాతమునందలి 'అహం' ప్రత్యయము గౌణమని కల్పింప శక్యముకాదు. అగ్ని యుష్ణమనియు, జలము శీతమనియు ననుభవసిద్ధమై యుండ వేదవాక్యము లెన్నిచేరినను అగ్ని శీతమని జల ముష్ణమనియును జెప్పుచు ప్రమాణములు గానేరవు. అట్లే దేహాదిసంఘాతమునందు 'అహం' ప్రత్యయము మిథ్యయని విద్వదనుభవసిద్ధమై యుండ దేహేంద్రియాదులు గౌణములని చెప్పుచు వేదముకూడ ప్రమాణము గానేరదు. కాన యనుభవమునకు విరుద్ధము కాని యర్థమునందే వేదము ప్రమాణము.

ఒకవేళ వేదము 'శీతో అగ్నిః, అప్రకాశశ్చ' 'అగ్ని చల్లనిది. ప్రకాశము లేనిది' అనిచెప్పినను నపు డావాక్యమునకు నర్థాంతరమును గల్పింపవలెఁగాని యనుభవవిరుద్ధమగు నర్థమునందు వేదమునకు ప్రామాణ్యము నీయఁదగదు. ( అగ్నిః = నిప్పు, శీతః - నష్టః = చల్లారినది. కనుకనే 'అప్రకాశః = వెలుతురు లేనిది ) దీనిచే "యజేత" అని మొదలగు నదృష్టవిషయములందలి విధివాక్యప్రామాణ్యము ననుసరించి దేహాది సంఘాతము గౌణాత్మయని కల్పించుచో నపుడు సర్వవేదాంతములకు విరోధము వాటిల్లును. వేదాంతములు వేదాంతర్గతములే కాన యయ్యది స్వవచనవిరోధమే యగును. వేదాంతములయందు సమస్తప్రపంచము మాయచే ఆత్మయందు గల్పితమనియు నవిద్యచే దేహేంద్రియాదికమును నాత్మగాఁ జూచుచున్నాడనియును ఘంటాఘోషముగఁ జెప్పబడుచున్నది. పైగా విద్వాంసులకు దేహాది సంఘాతమునందు అహంప్రత్యయము లేదు. నిజముగ నది గౌణమగుచో విద్వాంసుల కేలయుండదు? విద్వాంసుడగు తండ్రి 'ఆత్మావై పుత్రనామాసి' యను శ్రుతి ననుసరించి పుత్త్రుని గౌణాత్మగా దలచుటలేదా? పైపెచ్చు విద్వాంసుడే యట్లు తలచుచున్నాడు. శ్రుత్యర్థమును గుర్తెఱుంగని యవిద్వాంసుడు పుత్త్రుని గౌణాత్మనుగ దలచుటలేదు.

మఱియు గౌణస్థలమున గౌణముఖ్యసింహములు రెండును వేఱువేఱుగ గనిపించుచున్నవి. గౌణముఖ్యాత్మలు అట్లు వేఱుగఁ గనిపించుటలేదు, కావున

సంఘాతము మిథ్యాత్మయే. గౌణాత్మ కాదు. 'యజేత' ఇత్యాది శ్రుతులు అవిద్వద్విషయములగుచు ప్రమాణము లగుచున్నవి. ఎవడు కర్తృత్వముగల సంఘాతమును నాత్మనుగ దెలిసికొనుచున్నాడో వాడు యజ్ఞాదికము నాచరించు చున్నాడు. దానిఫలము ననుభవించుచున్నాడు. కావున విధివాక్యము లజ్ఞాని విషయములని కల్పించి వానికి ప్రామాణ్యమీయవలయునని భావము.

ఓయీ! ఇట్లగుచో విధివాక్యములకు ముఖ్యమైన కర్త లేనందున శ్రుతి యప్రమాణముకదా! అనగా దేహాదిసంఘాతాత్మ నుద్దేశించి 'యజేత' ఇత్యాది విధి పొసగదు. స్థాణుపురుషునిగూర్చి యున్మత్తుడు కానివాడెవడును 'నీవిధి చేయు' మని నియమించదు. ముఖ్యాత్మ కర్తయేకాడు. ఇక శ్రుతి యప్రమాణమేకదా! యనిభావము.

కాదు. వేదము కర్మకాండ, జ్ఞానకాండ యని రెండుభాగములు. అందు కర్మకాండ యప్రమాణమైనను జ్ఞానకాండ ప్రమాణమే. జ్ఞాననిష్ఠాకర్తయగు విద్వాంసులు కలరు. జ్ఞానియగు ముఖ్యాత్మయును గలఁడు. కాన జ్ఞానకాండ సార్థకమగును.

ఓయీ! కర్మకాండ యజ్ఞానివిషయమగుచు విద్వాంసుల కెట్లు ప్రమాణము కాదో, యట్లే జ్ఞానకాండకూడ విద్వద్విషయమగుచు నవిద్వాంసులయెడ నప్రమాణమేకదా? కాన కర్మ జ్ఞానకాండలకు అప్రామాణ్యము సమానమైనది. అవిద్వాంసులు జ్ఞానకాండలో ప్రవర్తించరు. 'వారికది వ్యర్థము, వీరి కిది వ్యర్థము' అనినచో నట్లుకాదు. బ్రహ్మసాక్షాత్కారమైనతోడనే దేహాదిసంఘాతమునందలి 'అహం' ప్రత్యయ మెట్లు బాధింపఁబడుచున్నదో, యట్లు ఆత్మసాక్షాత్కార మెప్పుడును దేనిచేతను బాధింపఁబడుటలేదు. కాన బ్రహ్మవిద్యకు వైయర్థ్యము నాపాదింపశక్యముకాదు. 'అగ్నిరుష్ణః ప్రకాశశ్చ' అను ప్రత్యయమున కెట్లు బాధలేదో యట్లే 'అహంబ్రహ్మ'యను ప్రత్యయమునకుగూడ బాధలేదని భావము.

ఇచట నీయంశమును గ్రహింపవలయును.

అవిద్వాంసులకు జ్ఞానకాండయందు బ్రవృత్తిలేకపోవుట, బ్రహ్మవిద్య పనికి రాదని బాధింపబడుటవలననా? లేక వారికం దధికారములేనందుననా? (౧) బ్రహ్మవిద్య యేవిద్యచేతను బాధింపబడుటలేదు. "అగ్నియుష్ణము" అను ప్రత్యయము దేనిచేతను బాధింపబడదు. అట్లే "అహంబ్రహ్మ" (నేను బ్రహ్మను) "సచ్చిదానందంబ్రహ్మ" (బ్రహ్మ సచ్చిదానందరూపము) అను జ్ఞానముకూడ బాధింపబడుటలేదు. ఈయది "నాఽహంబ్రహ్మ" (నేను బ్రహ్మనుకాను) అను జ్ఞానముచేతనే బాధింపబడును. "నేను బ్రహ్మను" అను జ్ఞానముకలవానికి "నేను బ్రహ్మనుగాను" అనుజ్ఞానమే యుండదు. ఇంక దీనికి బాధప్రసక్తియేది? నేను

బ్రహ్మనను జ్ఞానముగలవానికి నేను బ్రహ్మను గానను జ్ఞాన మంకురింపదు. కనుకనే యిది యబాధితార్థవిషయకమగుచు ప్రమ యగుచున్నది. బాధింపబడుచో భ్రమ యయ్యెడిది. భ్రమజ్ఞానమునకు ప్రమాజ్ఞానము బాధకము. ప్రమకు బాధకముండదు. దేహాదిసంఘాతము అనాత్మయగుటవలన నది యాత్మయనుజ్ఞానము బ్రహ్మజ్ఞానముచే బాధింపబడును. బాధింపబడినందున సంఘాతాత్మజ్ఞానము భ్రమ. బ్రహ్మాత్మజ్ఞానము భ్రమకాదు. బ్రహ్మ సద్రూపము. సత్తుయనగా నిత్యము. రజ్జువు వ్యావహారికసత్యము. రజ్జు సర్ప మరీచ్యుదకాదులు ప్రాతిభాసికములు. ఈ ప్రాతిభాసిక పదార్థజ్ఞానము వ్యావహారికజ్ఞానములచే బాధింపబడును. అట్లే వ్యావహారికమగు సంఘాతాత్మజ్ఞానముగూడ పారమార్థికమగు బ్రహ్మజ్ఞానముచే బాధింపబడును. కావున "సత్యం జ్ఞాన మనంతంబ్రహ్మ" "అజో నిత్యశ్శాశ్వతః"అను శాస్త్రము ననుసరించి యబాధితమగు నిత్యసద్రూపబ్రహ్మవిషయకజ్ఞానము ప్రమయే. "నేహ నానా_స్తి కించన" అనుశ్రుతినిపట్టి సంఘాతాత్మజ్ఞానము భ్రమయే. సంఘాతము, సంఘాతజ్ఞానము నీరెండును భ్రమయే. సర్వము బ్రహ్మయందు గల్పితమని శ్రుతి చెప్పుచున్నది. బ్రహ్మయొక్కడే అబాధితపదార్థమయినందున బ్రహ్మజ్ఞానము మాత్రమే ప్రమయగుచున్నది. బాధితపదార్థజ్ఞానము భ్రమయనియు, అబాధిత పదార్థజ్ఞానము ప్రమయనియును సిద్ధాంతము.

బ్రహ్మము సచ్చిదానందమను వేదవాక్యజన్యమగు బ్రహ్మాత్మజ్ఞానము దేని చేతను బాధింపబడదు. ఇతరజ్ఞానముల నన్నిటిని బాధించి యిది పుట్టును. ఇట్టి బ్రహ్మాత్మజ్ఞానముకొరకే బ్రహ్మవిచారాత్మకమయిన వేదాంతమీమాంసాశాస్త్రమును వ్యాసులు రచించిరి. బ్రహ్మాత్మజ్ఞానము సమ్యగ్విచారమువలన బుట్టును. సంఘాతాత్మజ్ఞానము విచారములేకుండగనే పుట్టుకతో బుట్టును. కనుకనే యీయది అవివేకపూర్వకము. కనుకనే వివేకపూర్వకమగు బ్రహ్మజ్ఞానముచే బాధితమగుచున్నది.

మఱియు ప్రకాశతుల్యమయినది బ్రహ్మవిద్య. అంధకారతుల్యమయినది యవిద్య. ప్రకాశముచే నంధకారము నశించును. అంధకారముచే ప్రకాశము నశించదు. అట్లై బ్రహ్మవిద్యచే అవిద్యామూలకమయిన సంఘాతాత్మజ్ఞానము నశించునుగాని, సంఘాతాత్మజ్ఞానముచే బ్రహ్మాత్మజ్ఞానము నశించదు. కావున "బ్రహ్మవిద్య బాధింపబడినందున జ్ఞానకాండలో నజ్ఞానులకు బ్రవృత్తి కలుగుటలే" దను మొదటిపక్షము కుదరదు.

ఇక రెండవపక్షము మిగిలినది. అవిద్యారాగాదిదోషములచే దూషితులయి, దేహాదిసంఘాతమే యాత్మయను నిశ్చయము గలిగి నేను కర్తను, నేను భోక్తను అని తలంచుచు, జన్మాంతర పుణ్యపాపవశమున విహిత నిషిద్ధములయందు బ్రవర్తించుచున్న యజ్ఞానులకు బ్రహ్మవిద్యయం దధికారములేదు.

"అథాతో ధర్మజిజ్ఞాసా" అను సూత్రముచే శమదమాది సాధనసంపన్ను లయిన ప్రాజ్ఞులకే బ్రహ్మవిద్యయం దధికార మీయబడినది. ఇచటకూడ "జ్ఞాన యోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం" అని జ్ఞానులకే బ్రహ్మ విద్యయం దధికారము చూపబడినది. (ఇచట జ్ఞానులనగా ఆపాతతః బ్రహ్మాత్మ భావమును దెలిసినవారని యర్థము)

ఇట్లే విద్వాంసులకు కర్మకాండయందు బ్రవృత్తిలేకపోవుట, కర్మవిద్య బాధింపబడుటవలననా? వారికం దధికారము లేకుండుటవలననా? ఇందు రెండవ పక్షము కుదరదు. బ్రహ్మవేత్తలయిన బ్రాహ్మణులకు స్త్రీశూద్రాదులకువలె కర్మాధికారము లేదనుట పాడిగాదు. బ్రహ్మజ్ఞానమునకు బూర్వమే కర్మాధికారము గల బ్రహ్మవేత్తలకు బ్రహ్మజ్ఞానము కలిగినతోడనే కర్మాధికారము నశించుచో, వారల కయ్యది (బ్రహ్మజ్ఞానము) దోషమే యగును. దానికి మీ రిష్టపడకూడదు. బ్రహ్మహత్యను బోధించువానివలె బ్రహ్మజ్ఞానమును బోధించు నీశ్వరుడుకూడ అనాప్తుడగును. బ్రహ్మహత్యచేసినవానివలె బ్రహ్మజ్ఞాననిష్ఠుడుకూడ రాజాదులచే దండ్యుడగును. కావున కర్మవిద్య బ్రహ్మవిద్యచే బాధింపబడినందుననే విద్వాంసు లకు కర్మలయందు బ్రవృత్తి కలుగుటలేదు.

"నేహ నానాస్తి కించన" "ఆత్మైవేదం సర్వం" "నిష్కలం నిష్క్రియం శాంతం" "అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం" "యోవై భూమా తదమృతం" "అతోఽన్యదార్తం" ఇత్యాది శ్రుతులచే అకర్త్ర భోక్తృ సచ్చిదానందలక్షణమయిన అద్వితీయ బ్రహ్మాత్మజ్ఞానము కలుగగా, నేను కర్తను, నేను భోక్తను, ఇది నాపని" అను మిథ్యాజ్ఞానము బాధింపబడకుండ నెట్లుండును? వెలుతురువచ్చిన చీకటి యుండునా? కాన బ్రహ్మవిద్యకు దేనిచేతను బాధ లేదు.

అయితే శాస్త్రజన్యమగు "అహంబ్రహ్మ" యను జ్ఞానము "నాహంబ్రహ్మ" అను ననుభవముచే బాధింపబడకూడదా? యని మీరు సందేహింపవచ్చును. అది యవిద్వదనుభవమా? లేక విద్వదనుభవమా? రెండవపక్షము కుదరదు. బ్రహ్మ జ్ఞానముగల విద్వాంసులకు "నాహంబ్రహ్మ" నేను బ్రహ్మనుగాను" అను ననుభవ ముండదు. మొదటిపక్షమును గుదరదు. అవిద్వాంసుల యనుభవముచే విద్వాం సులజ్ఞానము బాధితమగుట యసంభవము. సమానాధికరణము సమానవిషయము నగు జ్ఞానాజ్ఞానములకే బాధ్యబాధక భావము. అట్లుకానిచో దేవదత్తునియందలి వ్యాకరణశాస్త్రాధ్యయనముచే వానియందలి తర్కశాస్త్రజ్ఞానము పోవలసివచ్చును. అట్లే దేవదత్తునియందలి వ్యాకరణశాస్త్రజ్ఞానముచే యజ్ఞదత్తునియందలి వ్యాకరణ శాస్త్రజ్ఞానమును పోవలయును. 'నాహంబ్రహ్మ' అను జ్ఞానము అజ్ఞానమగుగాక, లేక జ్ఞానరూపమగుగాక! ఎటులయినను "అహంబ్రహ్మ" అను జ్ఞానమునకు

విరుద్ధము. బ్రహ్మబ్రహ్మలకు విరోధముకాన, వానిజ్ఞానములకుగూడ విరోధ మావశ్య
కము. కాన అహంబ్రహ్మ అనుజ్ఞానమునకు దేనితోను బాధలేదు.

ఓయి? అనేకమారులు వేదాంతశాస్త్రమును జదివి, వేదాంతాచార్యు లనిపించు
కొని, బ్రహ్మవిద్య నుపదేశించువారలకుగూడ "నేను బ్రహ్మనుగాను" అను ననుభవము
కలదు. వారియొద్ద సంసారదుఃఖానుభవము గనిపించుచున్నదిక్కదా? అనియనరాదు.

యథార్థముగ బ్రహ్మాత్మజ్ఞాన మబ్బనివారలకే సంసారదుఃఖ మనుభవములో
నుండును. సమ్యగ్జ్ఞానుల కుండదు. బ్రహ్మాత్మసాక్షాత్కారము కడుదుర్లభము.
ప్రతిబంధము లనేకములుండును. మామిడిపండు అతితీపిగనుండునని యెన్నిసారులు
తిన్నను, చవిచూడనివాని బుద్ధికెక్కదు. అట్లే యెన్నిసారులు బ్రహ్మనుగూర్చి
విన్నను సాక్షాత్కారముకలుగనిదే బుద్ధికెక్కదు. కాన మీరు చెప్పినవారు
బ్రహ్మాత్మసాక్షాత్కారము లేనివారే. పరోక్షజ్ఞానమున్నంత మాత్రమునగూడ
శిష్యుల కుపదేశించవచ్చును. అపరోక్షజ్ఞానమువలననే అజ్ఞానము నివర్తించును.
అజ్ఞానము నివర్తించినప్పుడే సంసారదుఃఖ మనుభవములో నుండదు. అంతవర
కుండును. ఘటాకారపరిణత బుద్ధివృత్తియను అపరోక్షజ్ఞానమువలన ఘటాజ్ఞానము
నశించినట్లు బ్రహ్మాకారముగ పరిణమించిన బుద్ధివృత్తియను, నపరోక్షజ్ఞానమువలననే
బ్రహ్మాజ్ఞానము నశించును. ఇట్టి యపరోక్షజ్ఞానమును బుట్టించబట్టియే బ్రహ్మవిద్య
ప్రమాణమగుచున్నది.

ఓయి? శాస్త్రము అజ్ఞాతార్థమును జ్ఞాపకముచేయుచు ప్రమాణమని చెప్పి
తిరి. వేదాంతశాస్త్రము జ్ఞాతమగు బ్రహ్మను బోధించుటచే ప్రమాణము కానేరదు.
అనినచో, నట్లుకాదు. బ్రహ్మను దెలిసికొనగోరినవానికి బ్రహ్మ జ్ఞాతముకాదు.
వానికి బ్రహ్మ తెలిసినచో, తెలిసికొనవలెనని కోరికయే యుండదు. కాన బ్రహ్మ
అజ్ఞాతమే. అయితే బ్రహ్మ తెలియబడనిచో నప్పుడును జిజ్ఞాసపుట్టదుకదా? నిజమే
బ్రహ్మ యాపాతముగ తెలియుట. ఆస్తికులందరును జగత్కారణమయిన యొకా
నొక యీశ్వరుడు కలడని యెఱుంగుదురు. ఇట్టివాడని మాత్రము తెలియనేరరు.
ఆపాతతః తెలిసినను పూర్తిగ దెలియనందున దెలియనట్లే? "యత్సాక్షాదపరోక్షాత్
బ్రహ్మ" అనునది విద్వాంసులవిషయము. విద్వాంసులకు నిత్యము బ్రహ్మ మప
రోక్షమగును. అవిద్వాంసులకు గాదు. పరోక్షమునగూడ నవిద్వాంసులకు బ్రహ్మ
తెలియనిచో నింక వానికి బ్రహ్మసాక్షాత్కారప్రసక్తి యేది?

ఎవడు బ్రహ్మను దెలిసికొనగోరెనో, వానియాత్మయే బ్రహ్మకావున, వానికి
బ్రహ్మ తెలిసినట్లే? బ్రహ్మ అజ్ఞాతముకాదు అని యనుటకూడ చెల్లదు.

ఎవడు బ్రహ్మను తెలిసికొనగోరెనో వానియాత్మ బ్రహ్మయని వానికి
తెలుసునందురా? లేక విద్వాంసునకు దెలుసునందురా? ౧. కుదరదు. తెలిసినచో

జిజ్ఞాస యసంభవము. అను గుదరదు. విద్వాంసులకు బ్రహ్మదెలిసినచో నవిద్వాంసులకు తెలిసినట్లుకాదు. అవిద్యావిలాసముచే దేహాదిసంఘాతమునం దాత్మప్రత్యయముండుటంబట్టి సచ్చిదానందలక్షణమయిన యాత్మ అజ్ఞాతు డగుట యొప్పును. నిద్రలో ఆత్మ తెలియకుండుట యెల్లర కనుభవసిద్ధము. కావున "నన్ను నేను దెలియకున్నాను" "నేను మనుష్యుడను" "నేను బ్రహ్మను గాను" "నేను సంసారిని" అను ననుభవమునుబట్టి ఆత్మ సిద్ధమయియున్నను అజ్ఞాతు డగుచున్నాడు. ఈయది కేవలయుక్తిచే నిషేధింప వీలులేదు. కావున ఆత్మ స్వరూపుడయి యున్నను మాయయొక్క మహిమచే సచ్చిదానందబ్రహ్మభిన్నుడుగ దెలియబడుటలేదు. అందువలన అజ్ఞాతమగు బ్రహ్మాత్మార్థమును దెలుపుచున్నందున బ్రహ్మవిద్య ప్రమాణమగును.

అయితే తర్క-వ్యాకరణాదులవలనగూడ బ్రహ్మ తెలియబడునుగదా? వేదాంతశాస్త్ర మెందులకు? ఇది వ్యర్థముకదా? అని యనరాదు. తర్క-వ్యాకరణాది శాస్త్రములు ఆత్మభిన్నమగు బ్రహ్మమును బోధించును. ఆత్మాభిన్నమయిన బ్రహ్మను బోధించవు. ఆత్మాభిన్నబ్రహ్మను బోధించుటకు వేదాంతశాస్త్ర మవసరము.

దీనివలన భేదవాదులగు ద్వైత విశిష్టాద్వైతులమతమున వేదాంతశాస్త్రము యొక్క ప్రామాణ్యము గుదర్చసాధ్యముకాదని తేలుచున్నది.

ఓయి! అనధిగత అబాధిత బ్రహ్మాత్మజ్ఞానమును బోధించుటచే వేదాంతశాస్త్రమొక్కటే ప్రమాణమగును. అనధిగతమయినను కర్మరూపమగు నర్థము బ్రహ్మజ్ఞానముచే సాధింపబడుచున్నందున దానిని బోధించు వేదభాగము ప్రమాణముకాదు. ఇంక తర్కాది శాస్త్రములు, చక్షురాది ప్రమాణములును అప్రమాణములని వేఱుగ జెప్పనేల? ఇట్టితఱి వేదమంతయు అప్రమాణమని చెప్పెడి నాస్తికులగు బౌద్ధులకంటెు వేదము సగభాగము అప్రమాణమని చెప్పు మీరు కొంచెము మెరుగు. అనినచో నట్లుకాదు. మేము బౌద్ధులవలె వ్యవహారదశలో గూడ కర్మకాండ బాధిత మనము. అట్లన్నచో అర్థబౌద్ధులమో, ప్రచ్ఛన్నబౌద్ధులమో? అయ్యెడివారము. మరియు కర్మకాండ జ్ఞానమున కుపకరించును. అందు నయ్యది ప్రమాణమే. ఈవిషయము యిచ్చటనే "ఆరురుక్షోర్మునే ర్యోగం కర్మకారణముచ్యతే" అని చెప్పబడినది. కర్మకాండ వెనుకటి వైశ్వదేవ, అగ్నిహోత్రాగ్నిష్టోమాదులయందు బ్రవృత్తిని నిరోధించుచు ముందుముందు చయన పౌండరీకాది కర్మలయందు ప్రవృత్తిని పుట్టించుట బ్రహ్మవిద్యయందు బ్రవృత్తిని పుట్టించుటకే.

అనగా ఉపనీతునకు వివాహము, వివాహితునకు వైశ్వదేవము, వైశ్వదేవము చేసినవానికి నాధానము, ఆధాన మొనర్చినవానికి నగ్నిష్టోమము, అగ్నిష్టోమము

చేసినవానికి చయనము, అని యిట్లు వెనుకటికర్మలను జేసినవానికి ముందుముందు కర్మలను కర్మకాండ విధించుచున్నది. చేసినదానినే మరలచేయుమని విధించుట లేదు. దీని యభిప్రాయ మేమన ? పురుషుడు క్రమముగా నీకర్మల నాచరించుచు చిత్తశుద్ధిని పొంది బ్రహ్మవిద్యయందు ప్రవేశించుగాక ! అని దీని యభిప్రాయము. "తమేతం బ్రాహ్మణా వివిదిషంతి" అను శ్రుతిచే కర్మఠునకు బ్రహ్మవిద్యయందు ప్రవృత్తి కలుగునని తెలియబడుచున్నది. "స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః" అనువచనముకూడ నిందు బ్రమాణము. ఈశ్వరార్పణబుద్ధిచే గర్మల నాచరించువానికి బాహ్యవిషయములయందు రాగము వదలి, చిత్తశుద్ధిని పొంది, యీశ్వరుడెవరు ? ఆత్మయెవరు ? అను జిజ్ఞాసకు గడంగును. పిదప బ్రహ్మవిద్య యందు బ్రవర్తించును. కావున కర్మలు ఆత్మజ్ఞానార్థమయిన బ్రహ్మవిచారమునకు హేతువగు శమదమాది సాధనసంపత్తిని సంపాదించుచున్నందున కర్మకాండ జ్ఞాన కాండకు నుపకరించును. కనుక కర్మకాండకుగూడ ప్రామాణ్యము గలదు.

ఉపాయము మిథ్యయయినను తద్వారా పొందదగిన (ఉపేయమగు) బ్రహ్మము సత్యమయినందున, యుపాయముకూడ సత్యమగును. దీనిచే కర్మకాండవలె బ్రహ్మ కాండకూడ వ్యావహారికమగుచు, పారమార్థికము కానందున బ్రహ్మవిద్యావిధిశ్రుతి యెట్లు ప్రమాణమను శంకకూడ నిరాకరింపబడినది.

అపూర్వమగు యజ్ఞాదులను బ్రతిపాదించుటచే విధివాక్యములు సార్థకము లగుచు, తదంగము లగుటచే అర్థవాదలుకూడ నెట్లు స్తుతిరూపముగ సార్థకములగు చున్నవో అట్లే సార్థకమయిన బ్రహ్మవిద్యాశ్రుతుల కంగములగుటచే కర్మవిధులు కూడ ప్రమాణములగుట చెల్లును.

"యవాగూం పిబ శిఖా తే వర్థిష్యతే" (గంజిత్రాగుము, వెంట్రుకలు పెరుగ గలవు) అను లౌకికవచనము. వెంట్రుకలు పెరుగునను అంశమునందు ప్రమా ణము కాకున్నను, తాపమును జల్లార్చుటయందు సార్థకమగుచు నెట్లు ప్రమాణమో అట్లే "అక్షయ్యం హవై చాతుర్మాస్యయాజిన స్సుకృతం భవతి" అను వచనము కూడ. చాతుర్మాస్యయాగము తరుగని పుణ్యము నిచ్చునను నంశమునం దప్రమాణ మయినను, బ్రహ్మవిద్యకు హేతువయిన చిత్తశుద్ధికొఱకు విధింపబడుటచే, నాయం శమునందు బ్రమాణమగును. కాన నిట్టి లోకన్యాయము ననుసరించికూడ కర్మ విధులు వ్యవహారదశలో ప్రమాణములే యగును.

లేక ఆత్మజ్ఞానము పుట్టకపూర్వమున్న కర్మవిధులు అజ్ఞాతమయిన స్వర్గాగ్ని హోత్రాదుల సంబంధమును బోధించుటచే సాక్షాత్తుగానే ప్రమాణము లగును. ఆత్మ జ్ఞానము కలుగకపూర్వము దేహాభిమానమును నిమిత్తముగ జేసికొని ప్రవర్తించిన ప్రత్యక్షాది ప్రమాణములయినట్లు.

కావున వ్యవహారముండునంతవరకు మనకు కర్మవిధి శ్రుతిప్రమాణమే. పర మార్థదశలో వ్యవహారమంతయు నప్రమాణమే.

ఇట్లు బ్రహ్మవిద్య ప్రమాణమగుటచే ఆత్మ యకర్తయే. అయితే కర్మవిద్యా ప్రామాణ్యమునుబట్టి యాత్మ కర్త యేల గాకూడదు- అని యనరాదు. కర్మవిద్య బ్రహ్మవిద్యచే బాధింపబడుచున్నది. కాన నాయంశమునం దది ప్రమాణముకాదు.

ఓయి ! వేదమంతయు ప్రమాణమని యంగీకరించువారికి కర్మబ్రహ్మవిద్యలు రెంటిలో నొక్కటియే ప్రమాణమని యంగీకరించుట చెల్లదు. రెండును వేదముచే బోధింపబడుచున్నవి. కాన వారు (వైదికులు) రెండు ప్రమాణమని యంగీకరించ వలసినదే. అయితే ఆత్మకు స్వయముగ కర్తృత్వము లేకున్నను, దేహేంద్రియాది సంఘాతముయొక్క సాన్నిధ్యముచే కర్తృత్వ మేర్పడును. యోధులు యుద్ధము చేయుచుండ, రాజు యుద్ధము చేయుచున్నాడని యుద్ధకర్తృత్వము రాజున కేర్పడు చున్నది. జయపరాజయరూపమగు యుద్ధఫలముకూడ రాజునకు వాఙ్మాత్రమున నియమించు సేనాపతికిని చెందుచున్నది.

అట్లే ఋత్విగ్గణము హోమాదికర్మలయందు వ్యాపృతలయియుండ యజమానుడు వానియందు వ్యాపృతుడు గాకున్నను, యజమానుడు యజ్ఞము చేయుచున్నాడని యజ్ఞకర్తృత్వము,తత్ఫలసంబంధమున్ను యజమానునకు జెందుచున్నది.

అట్లే దేహాదిసంఘాతము కర్మల జేయకున్నను, కర్మకర్తృత్వము, తత్ఫల సంబంధమున్ను ఆత్మను బొందును.

రాజు యుద్ధమును, యజమానుడు యజ్ఞమును స్వయముగ జేయకున్నను యుద్ధమును జూచుట, సైన్యమును ప్రేరేపించుట రాజు చేయుచున్నాడు. యజ్ఞమును దిలకించుట, ఋత్విక్కులను ప్రేరేపించుట యజమానుడు చేయుచున్నాడు. ఇట్టి వ్యాపారముకూడ ఆత్మకు లేనపుడు దేహాదిసంఘాతముయొక్క కర్తృత్వమును ఆత్మ కంటపెట్టు టెట్లని శంకించి అయస్కాంతదృష్టాంతమును జూపుచున్నారు. అయస్కాంతశిల తాను నిర్వ్యాపారముగనుండి లోహము నెట్లుత్రిప్పుచున్నదో అట్లే ఆత్మ నిర్వ్యాపారుడుగ నున్నను, దేహేంద్రియాదులక్రియలకు ముఖ్యకర్త కావచ్చును. అని పూర్వపక్షము.

ఇది యుక్తముకాదు. అట్టితఱి అకర్తయగు ఆత్మయందు కారకత్వ మను నది ప్రసక్తించును. కర్తయందే కారకత్వ ముండును. మనుష్యునియందు మనుష్యత్వము, గోవుయందు గోత్వము యుండును. గోత్వము మనుష్యునియందుగాని, మనుష్యత్వము గోవుయందుగాని యుండదు. అట్లె అవిక్రియునియందు కారకత్వ ముండుట విరుద్ధము. మీామతమున నీవిరోధము ప్రసక్తించును. కాన ఆత్మకు కర్తృత్వము చెప్పదగదు.

ఓయీ ! పనినిచేయనివానికిగూడ కారకత్వము (కర్తృత్వము) కలదు. కారకత్వ మనేకవిధములుగ నుండును. స్వయముగ పనినిచేయువాడు ముఖ్యకారక మగును. ఉ:- భటులు, ఋత్విజులు మున్నగువారు భోజనకర్మయందు దేవదత్త

యజ్ఞదత్తాదులును– ఇఁక తాను స్వయముగఁ బనినిఁ జేయకున్నను ఇతరులచేఁ జేయించువాఁడు గౌణకారకుఁడగును. ఉ :– రాజు, యజమానుఁడు మున్నగువారు. ఇట్లు కారక మనేకవిధములుగ నుండుటచే పనినిచేయని ఆత్మకు గూడ గౌణకారకత్వము ప్రసక్తించుటలోఁ దప్పులేదు ' అనినచో నట్లుకాదు. మీరుజెప్పిన రాజ, సేనాపతి, యజమానులకుగల కారకత్వము ముఖ్యమేకాని గౌణముకాదు. ఎట్లన ఒకానొకపుడు రాజుగూడఁ దాను స్వయముగ యుద్ధముచేయును. శ్రీరామ ధర్మజాదులు తాము రాజులైనను తాము స్వయముగ యుద్ధమును జేసినటుల గనుపించుచున్నది. యోధులచే రాజు యుద్ధమును జేయించును. వారికి ధనమిచ్చును. అందుఁగూడ రాజునకు ముఖ్యకర్తృత్వమే కలదు. ఇట్లే దృష్టద్యుమ్నాది సేనాపతులు వెనుకఁ దాము స్వయముగఁ యుద్ధమును జేసిరి. ఇప్పటి సేనాపతులు గూడ యుద్ధముచేయుట కలదు. ఇట్లే రాజునకు యుద్ధఫలమందుగూడ ముఖ్యకర్తృత్వ మున్నది. రాజు పరరాజును జయించినచో నా రాజ్యమునందలి ధనమును దాను బొందును. దాన తాను సుఖించును. తాను పరాజితుఁడగుచో తనరాజ్యమందలి ధనమునుఁ దాను గోల్పోవును. దాన తాను దుఃఖించును. ఇట్లు జయపరాజయములలో సుఖదుఃఖముల ననుభవించుటయందు రాజునకు ముఖ్యకర్తృత్వమే యున్నది. అట్లే యజమానునకుగూడ ప్రధానహోమమునందు బ్రాహ్మణులకు ధనదానమునందు, ఋత్విజులకు దక్షిణాదానములందును ముఖ్యకర్తృత్వమే కలదు. కాన నితరులచేఁ జేయించువాఁడు గౌణకారకమని మఱి మీరు చెప్పిన లక్షణము దూషితమగుచున్నది. ఇతరులచే జేయించువానికి ఆచేయించుటయను నంశమునందలి కర్తృత్వము వానికి ముఖ్యమేకదా ! కారయితగూడ ముఖ్యకారకుడగును. కనుక కర్తృత్వరూపమైన కారకత్వముగాని కారయితృత్వరూపమైన కారకత్వముగాని పనియందు వ్యాపించినవానికే సంభవించునుగాని వ్యాపించనివానికి సంభవించదు. అందువలన పనిచేయని యాత్మకు మీరు కారకత్వమును ప్రసక్తింప జేయుట మిక్కిలితప్పు.

ఓయీ ! తా నేపనినిఁ జేయకయు, ఇతరులచే జేయించకయు, దా నేమాత్రము వ్యాపృతముకాకయు త్రిప్పునట్టి అయస్కాంతమునకు లోహమును జలింపఁ జేయుటయందు ముఖ్యకర్తృత్వము కనిపించుచున్నది. కనుక అవ్యాపృతుఁడగు ఆత్మకుగూడ సాన్నిధ్యమాత్రముచే ముఖ్యకర్తృత్వము సంభవించుగాక. రాజాదులకును అట్లే సాన్నిధ్యమాత్రమున ముఖ్యకర్తృత్వము సంభవించుచుండ యోధులచేఁ జేయించుటయందు ముఖ్యకర్తృత్వము కలదని క్లిష్టకల్పనము చేయుటేల ? అనినచో నిజమే. రాజయజమానప్రభృతులకుఁ దాము స్వయముగ నొకానొక వ్యాపారమునందు ప్రవర్తించుటయను ముఖ్యకర్తృత్వము కనిపించనిచో నపుడు సన్నిధిమాత్రముచేనైనను ముఖ్యకర్తృత్వము కల్పింపబడెడిది. ప్రసిద్ధము సంభవించుచుండ నప్రసిద్ధమును గల్పించుట న్యాయ్యముకాదు. లోహమును జలింపఁ

జేయు నయస్కాంతమునకు సాన్నిధ్యమాత్రముచేతనే ముఖ్యకర్తృత్వము కనిపించుచున్నది. అయస్కాంతమునందు అంతకంటె వేరువ్యాపారము గనిపించుటలేదు. అట్లు రాజయజమానాదులయందు స్వవ్యాపారము కనిపించకపోవుటలేదు. అనుభవములో వారివారి స్వవ్యాపారము ప్రత్యక్షమగుచున్నది. కాన సన్నిధిమాత్రము వలనఁ గల్పించెడి కర్తృత్వము రాజాదులకు గౌణమే యగును.

ఓయీ ! సాన్నిధ్యమాత్రప్రయుక్తమైన కర్తృత్వము రాజాదులకు గౌణమగుఁగాక. వారికి వేఱే ముఖ్యకర్తృత్వ మున్నదికనుక ఆత్మకయితే అయస్కాంతమునకువలె వేఱు స్వవ్యాపారము లేనందున సాన్నిధ్యమాత్రముచేతనే ముఖ్యకర్తృత్వ మున్నదనవలయును. ఇంక నిపుడు చేయనివానికిఁ గారకత్వప్రసంగము దోషమని మీరెట్లందురు ?

వినుము. అవ్యాపృతుఁడగు నాత్మగూడ తనయం దధ్యస్తములైన దేహాదులయొక్క వ్యాపారములచే వ్యాపృతుడువలె భాసించును. కావున నాత్మకు సాన్నిధ్యమాత్రముచేత ముఖ్యకర్తృత్వము సంభవించదు. అయ్యది గౌణమే యగును. అయస్కాంతము తా నవ్యాపృతమైనను వ్యాపృతమైనట్లు కనిపించదు. గాన దానికి సాన్నిధ్యమాత్రముచే ముఖ్యకర్తృత్వ ముండవచ్చును. కావున చేయని యాత్మకు ముఖ్యకారకత్వ మయుక్తమే.

ఇట్లయినచోఁ జేయని యాత్మకు దేహేంద్రియాది సాన్నిధ్యమాత్రముచే కలిగెడి కర్తృత్వారోపణము గౌణమే యగుగాక ? ఇదియును పొసగదు. అట్టితరి గౌణకారకత్వమువలన గలిగెడి కర్మఫలసంబంధము కూడ ఆత్మయందుఁ గల్పితమే యగునుగాని ముఖ్యము కానేరదు. పోనిండు, అదికూడ నట్లే కానిండు' అన్నచో నదియేమి సమంజసము ? గౌణకర్తచే ముఖ్యకార్యము నెరవేఱదుకదా ! ముఖ్యకార్యమును ముఖ్యకర్తయే చేయవలెను. కాన కర్మల నెరవేర్చునట్టి దేహేంద్రియాది సంఘాతము ముఖ్యకర్తగా నుండ కర్మలు నెరవేర్పని యాత్మయందు కర్తృత్వము నారోపించు టెందులకు ? కర్మతత్ఫలములతో సంబంధ మిసుమంతయులేని యాత్మయందు కర్తృత్వము సన్నిధిమాత్రముచే నారోపింపఁబడుచో నపుడు ఘటాదులయందుమాత్ర మేల నారోపింపకూడదు ? కాన కార్యనిర్వర్తకుడు కానట్టియు, ఫలభోక్త కానట్టియు, నాత్మకు ముఖ్యకర్తృత్వ మారోపించుట తగదు.

ఓయీ ! ఇట్లయినచో నేను కర్తను, భోక్తను, సుఖిని, దుఃఖిని అను వ్యవహార మెట్లు కుదురును ? ఆహా, దీని కేమి ? భ్రాంతిచే నంతయు కుదురును. మాయయందు సంభవింపని దేదియులేదు. త్రాటియందు సర్పము, మరుమరీచికలయం దుదకము, ఆకసమునందు నైల్యము వలె భ్రాంతిచే నాత్మయందుగూడ సంసారము దోచవచ్చును. మనయూహకు నందనివాని కన్నిటికిని భ్రాంతియే శరణము. అయ్యది యజ్ఞానమూలకము. స్వప్నమునందు పడకమీద తనదేహ

ములో నిదురించుచున్నను తాను బజారునఁ దిరుగుచున్నటుల కనపడును. మఱియు హృత్పుండరీకాంతర్గతుఁడగు కేవల యాత్మయందు నిద్రాదోషమువలన రథగజ పత్తనాదులు కన్పించును. అట్లే యాత్మలయందుగూడ సంసారము కనిపించ వచ్చును. ఇట్లు భ్రాంతియున్నచో సంసారముండుట యను అన్వయవ్యాప్తిని భ్రాంతిలేనిచో సంసారముండదు, అను వ్యతిరేకవ్యాప్తిచే గట్టిపఱచుకొనవలెను. దేహాద్యనాత్మలయందు ఆత్మయను ప్రత్యయము భ్రాంతి, భ్రమ, జ్ఞానము ఇట్టి భ్రాంతిలేని సుషుప్తి సమాధ్యాద్యవస్థలయందు కర్తృత్వ భోక్తృత్వా ద్యనర్థము ఆత్మచే జూడబడుటలేదు. అనుభవింపఁబడుటయు లేదు. కావున యీసంసార భ్రమమంతయు భ్రాంతిమూలకమేకాని పరమార్థము కాదు. కనుకనే సమ్యగ్దర్శనమువలన

శ్లో॥ నాహం దేహో నేంద్రియాణ్యాంతరంగో
నాఽహంకారః ప్రాణవర్గో నబుద్ధిః
దారాపత్య క్షేత్రవిత్తాదిదూరః
సాక్షీ నిత్యః ప్రత్యగాత్మా శివోహం॥

అను యథార్థజ్ఞానమువలన సంసారమునకు మూలోచ్ఛేదము కలుగును. జ్ఞానాజ్ఞానములకు విరోధముండుటచే భ్రాంతికి నిమిత్తమగు నజ్ఞానముకూడ జ్ఞానముచే నివర్తించును. కాన జ్ఞానమువలననే మోక్షము. కర్మభ్రాంతి జ్ఞానపూర్వకమగుటచే దానిచే భ్రాంతిజ్ఞానము నివర్తించదు. కనుకనే అజ్ఞానముకూడ నివర్తించదు. కాన కర్మచే మోక్షములేదు. 'నాస్త్యకృతః కృతేన' అను శ్రుతి యిందుకు ప్రమాణము. కృతేన=కర్మచే; అకృతః=మోక్షము; నాస్తి=లేదని దీనియర్థము. కర్మజ్ఞానములకు బరస్పరవిరోధ ముండుటచే వానికి సముచ్చయముగూడ సిద్ధింపదు. కావున సముచ్చయమువలనను మోక్షములేదు. కనుకనే శ్రీకృష్ణుడు –

'సర్వధర్మాన్ పరిత్యజ్య' అను నీ శ్లోకమున సర్వకర్మసన్న్యాసపూర్వకమగు జ్ఞాననిష్ఠ యవలంబింపఁదగి దగు నభిప్రాయముతో నుత్తరార్థముచే జ్ఞాననిష్ఠయొక్క ఫలమును స్వయముగఁ దానే చెప్పెను. 'పుణ్యాపాపాత్మకమగు సర్వబంధవినిర్మోక్షమే మోక్షము' 'తరతి శోకమాత్మవిత్' 'బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి' అను శ్రుతులుగూడ నీయర్థమునే వివరించుచున్నవి. సంసారమును దాటినచో ఆత్మ తనంతటతానే సచ్చిదానందబ్రహ్మస్వరూపముతో నుండును. బ్రహ్మస్వరూపముతో నుండుటకు వేఱుయత్న మవసరము లేదు. సంసారోచ్ఛిత్తికొఱకే ప్రయత్నింపవలెను. అది జ్ఞానసాధ్యమే. కాన జ్ఞానమే మోక్షసాధనమని యుపనిషత్సారమైన గీతాశాస్త్రమునకు నిశ్చితార్థము. ఉపనిషదర్థమును నిదియే.

'ఓయీ, జ్ఞానమువలన మోక్ష మనునది మే మంగీకరింతుము. కాని అద్వైత జ్ఞానమువలన మోక్షమని గీతాశాస్త్రముయొక్క తాత్పర్యముకాదు. మఱేమనిన

ద్వైతజ్ఞానమువలననే మోక్షమని గీతాశాస్త్ర తాత్పర్యము. అదెట్లనిన ప్రారంభమున "న త్వేవాహం జాతునాసం నత్వం నేమే జనాధిపాః" అని జీవేశ్వరులకు భేదము చెప్పఁబడినది. ఉపసంహారమునఁగూడ "మామ్ త్వం శరణంవ్రజ" "అహం త్వాం మోక్షయిష్యామి" అని కృష్ణార్జునులను ఈశ్వరజీవులకు ద్వైతమే చెప్పఁబడినది. మధ్యగూడ నచ్చటచ్చట

"యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం"

"మామేతి సోర్జున"

"తస్యాహం న ప్రణస్యామి సచ మే న ప్రణశ్యతి"

"శ్రద్ధావాన్ భజతే యో మాం సమే యుక్తతమో మతః"

"కశ్చిన్మాం వేత్తి తత్త్వతః"

"మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే"

"ప్రియోహి జ్ఞానినోఽత్యర్థం అహం సచ మమ ప్రియః"

"మాం నిత్యయుక్తా ఉపాసతే"

"భజంతే మాం బుధాభావసమన్వితాః"

"తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్"

"యో మామేన మసమ్మూఢో జానాతి పురుషోత్తమం"

ఇత్యాది వాక్యములయందు జీవేశ్వరభేదమే పలుమారు విస్తరింపబడినది. ఇట్లు జీవేశ్వరభేదము యథార్థమగుచుండ 'అహం బ్రహ్మ' యను నద్వైతజ్ఞానము అయథార్థమే యగును. భటుఁడు నేనే రాజునన్నట్లు అట్లను భటుడు దురహంకారుఁడని తలంచి రాజుచే శిక్షింపఁబడునటుల నేనే బ్రహ్మనను అద్వైతికూడ నీశ్వరునిచే దండింపఁబడును. కావున నద్వైతజ్ఞానమువలన నరకపాతమే కలుగును.' అనినచో

మీ రట్లనకుడు. జీవేశ్వరభేదజ్ఞాన మెల్లరకు లోకసిద్ధము. తర్క-సాంఖ్యాది శాస్త్రసిద్ధము. అనుమానసిద్ధమును. ఇట్టిదానిని గీతాశాస్త్రము ప్రతిపాదించుట వ్యర్థము. అట్టి జ్ఞానమువలన మోక్షమును సిద్ధించదు. ద్వైతజ్ఞానమువలన మోక్షము సిద్ధించుచో ఆస్తికులందఱు గీతాశాస్త్రాధ్యయనము లేకుండగనే కడతేరెడివారు.

అయితే జీవేశ్వరభేదము లోకసిద్ధమైనను ఈశ్వరునికంటె వేఱగు జీవుడు దేహేంద్రియాది విలక్షణ చిన్మాత్రుడను విషయము లోకసిద్ధము కానందున నందుల కొఱకు శాస్త్రాధ్యయన మావశ్యకమనియు నట్టిజ్ఞానమువలన మోక్షము కలుగునదనియు నందురేమో; అదియును పొసఁగదు. జీవుడు శుద్ధచిన్మాత్రుడని యంగీకరించుచో నీశ్వరభిన్నుడగుట (ఈశ్వరునికంటె వేరగుట) యసంభవము.

మీరు జీవుడు శుద్ధచిన్మాత్రుడంటిరి. ఈశ్వరుడును శుద్ధచిన్మాత్రుడే. ఇద్దరు శుద్ధచిన్మాత్రులయినపు డొకరికంటె నొకరు వేరగుట సంభవముగాదు. శుద్ధచిన్మాత్రు

డయినను యీశ్వరుడు విభువనియు జీవుడు అణువనియు ననరాదు. నిరవయవ చైతన్యుడగు జీవు డణువగుట యసంభవము. అవయవసహితమయిన వస్తువు పరిమాణముగలదగునుగాని నిరవయవవస్తువు పరిమాణము గలదికాదు.

అట్లే ఈశ్వరుడు సర్వజ్ఞుడు, జీవుడు, కించిత్ జ్ఞుడు ననుటయు జెల్లదు. ముక్తిదశలో జీవచైతన్యమునకు సర్వజ్ఞత్వమును మీ రంగీకరించితిరి. ముక్తిదశలోని జీవచైతన్యమే బంధదశతోగూడ గలదు. అట్లు దశాభేదము ననుసరించి చైతన్యము వికారమును జెందుచో "అవికార్యోఽయ ముచ్యతే" అను శాస్త్రమునకు విరోధము. అనిత్యత్వమును ప్రసక్తించును.

మరియు నీశ్వరుడు సకల కళ్యాణగుణ పరిపూర్ణుడనియు, జీవు డట్టివాడు గాదనియు ననరాదు. "సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" అను శ్రుతి విరోధించును. ఈ శ్రుతి యాత్మయందే గుణములు యుండవని చెప్పుచున్నది. నియమ్య నియామక భావము భూతములకు నీశ్వరునకుగాని, యాత్మేశ్వరులకు గాదు. భూతములే యాత్మ అని యనరాదు. భూతములు వేరు, ఆత్మ వేరు. భూతములు సాంతములు. ఆత్మ యనంతుడు.

మరియు సంసారియగు జీవునకు అసంసారియగు నీశ్వరునితో నభేద మెట్లని యనరాదు. జీవునకుగూడ నిజమున సంసారము లేదు. అనుభూయమానమగు సుఖదుఃఖ జన్మమరణరూపసంసారము అనాత్మధర్మము. దేహమునకు జన్మమరణవృద్ధిక్షయాదు లుండుట ప్రత్యక్షము. మనస్సుకు సుఖదుఃఖాదులుండుటకూడ ననుభవసిద్ధమే. సుషుప్తిలో మనస్సు లేకపోతే సుఖదుఃఖానుభవము లేదు.

సంసారము దేహాదులయందు గలుగుచున్నను, జీవునిచే ననుభవింపబడుటచే జీవధర్మమే యని యనరాదు. అట్లైన ప్రపంచములోని సంసారమంతయు నీశ్వరునిచే ననుభవింపబడుచున్నందున యీశ్వరునకుగూడ సంసారిత్వము ప్రసక్తించును. అయితే అనుభవమనగా జ్ఞానమాత్రము గాదనియు, ఉపభోగరూపమనియు నన్నచో అట్టి యుపభోగ మాత్మకుగూడ లేదు. "మమాయం సంసారః" అను ప్రతీతి భ్రాంతిమూలకముగాని యథార్థసిద్ధము కాదు. భ్రాంతిసిద్ధమగు ధర్మము వస్తువునకు సహజధర్మము కానేరదు. ఆకసమునందు బాలులకు భ్రాంతిసిద్ధమయిన నైల్యము వస్తుతః గగనధర్మము కానేరదు. మరుమరీచికలయందు భ్రాంతిసిద్ధమయిన యుదకము మరుమరీచికలకు సహజధర్మము కాదు.

ఇక సంసారము భ్రాంతికాదనియు, నిజమే యనియు ననరాదు. అట్లన్నచో సత్యమయిన సంసారమునకు నివృత్తి లేనందున మోక్షశాస్త్రమంతయు వ్యర్థమగును. ప్రాయశ్చిత్తముచే నివర్తించు పాపముగూడ సత్యమయినదికాదు. బ్రహ్మాభిన్నమంతయు నసత్యమే.

సంసార మసత్యమగుచో గనిపించు టెట్లు పొసగును? అసత్యమయిన శశశృంగాదికము గనిపించుచున్నదా? అనినచో నట్లుకాదు. అసత్యమగు స్వాప్నిక పదార్థములు కనిపించుచున్నవి. అసత్యమగుచు దెలియబడుచున్నందుననే సంసారము మిథ్య యనవలసి వచ్చినది స్వప్నమునందు గోచరించు రథగజతురగాదికము సత్యము కాదు. అది యనిత్యమగుటచే దానికి సత్యత్వము నశించినది. సత్యమగు వస్తువు అనిత్యము కానేరదు. పరాశరులుకూడ "జ్ఞానం యథా సత్యమసత్యమన్యత్" అనుదానిచే జ్ఞానభిన్నమంతయు నసత్యమనిరి. అయితే జ్ఞానమనగా నీశ్వరుడుకాన నీశ్వరుడొక్కడే సత్యమని యనరాదు. జీవుడుకూడ జ్ఞానైకాకారుడని మీరంగీకరించితిరి. కాన జీవునకు సంసారము భ్రాంతిసిద్ధమని తేలినది. శ్రుతిసిద్ధమగు నీశ్వరాభేదమున్ను జీవునకు సిద్ధించినది.

అనేకజీవవాదము ప్రమాణముకాదు. "నత్వేవాహం జాతునాసమ్" ఇత్యాది వాక్యములు జీవభేదమునందు ప్రమాణములు కావు. మీరుచూపిన వెనుకటి ప్రమాణములన్నియు ప్రమాత లనేకులని చెప్పుటలో దాత్పర్యముగలవికాని, జీవు లనేకులని చెప్పుటలో ప్రమాణముగలవి కావు. ఆత్మయొక్కడే యనువాదమున ప్రకృతగీతాశాస్త్రమే ప్రమాణము.

చూడుడు:- "అవినాశితు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్
వినాశ మవ్యయస్యాస్య నకశ్చి త్కర్తుమర్హతి"
"అంతవంత ఇమేదేహాః నిత్యస్యోక్తా శ్శరీరిణః
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత।
"యఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతం
ఉభౌ తౌ నవిజానీతః నాయం హంతి నహన్యతే
"నజాయతే మ్రియతేవా కదాచిన్నాయం భూత్వా భవితావానభూయః
అజోనిత్యశ్శాశ్వతోఽయం పురాణో నహన్యతే నహన్యమానే శరీరే॥
"వేదావినాశినం నిత్యం యఏన మజ మవ్యయం"
"నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః"
"అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయం అక్లేద్యోఽశోష్య ఏవచ"
"నిత్య స్సర్వగతస్థాణు రచలోఽయం సనాతనః"
"అవ్యక్తోఽయ మచింత్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే
"ఆశ్చర్యవ త్పశ్యతి నకశ్చిదేనమ్"
"దేహీ నిత్య మవధ్యోయం దేహే సర్వస్య భారత"

"పర స్తస్మాత్తు భావోఽన్యో వ్యక్తోఽవ్యక్తా త్సనాతనః"
"యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు నవినశ్యతి"
"అవ్యక్తోఽక్షర ఇత్యుక్తః
"అహమాత్మా గుడాకేశ ! సర్వభూతాశయస్థితః
"యే త్వక్షర మనిర్దేశ్యం అవ్యక్తం పర్యుపాసతే
"సర్వత్రగమచింత్యంచ కూటస్థ మచలం ధ్రువం
"ఏత ద్యోవేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః
"క్షేత్రజ్ఞంచాపి మాంవిద్ధి సర్వక్షేత్రేషు భారత"
"అనాది మత్పరంబ్రహ్మ నసత్త న్నాసదుచ్యతే"
"సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షి శిరోముఖం
"సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి"
"సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్
"అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ"
"బహిరంతశ్చ భూతానాం చరంచాచరమేవచ
"సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం దూరస్థం చాంతికేచ తత్
"అవిభక్తంచ భూతేషు విభక్తమివ చ స్థితం"
"భూతభర్తృచ తద్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణుచ"
"జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పరముచ్యతే"
"జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్యవిష్ఠితం
"ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి"
"పురుషః ప్రకృతిస్థోహి
"పురుష స్సుఖదుఃఖానాం భోక్తాచ ప్రభురవ్యయః
"ఉపద్రష్టానుమంతాచ భర్తా భోక్తా మహేశ్వరః
"పరమాత్మేఽతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషఃపరం
"యఏవం వేత్తి పురుషం
"సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరం
వినశ్య త్స్వవినశ్యంతం యఃపశ్యతి సపశ్యతి"
"సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థిత మీశ్వరం
నహి నస్త్యాత్మ నాత్మానం తతో యాతి పరాంగతిం"
"యఃపశ్యతి తదాత్మానం అకర్తారం సపశ్యతి"

"అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మాఽయమవ్యయః
"శరీరస్థోఽపి కౌంతేయ నకరోతి నలిప్యతే
"యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే
"సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే
"యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత
"మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః
"ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః"

ఇత్యాది వాక్యములును. ఇవన్నియు ఆత్మాభేదమును నిర్వచించుచున్నవి.

ఈవాక్యములు జాత్యేకవచనాంతములని యనరాదు.

శుద్ధచిన్మాత్రుడగు నాత్మయందు జాత్యాదులుండవు. ఆత్మలకు వ్యక్తిభేదమే యుండుచో వ్యక్తుడే యగును, "అవ్యక్తోఽయ మచింత్యోఽయమ్" అని చెప్పి యుండడు. ఉపాధివలన ఆత్మలకు వ్యక్తిభేదముండుననన్న నయ్యది వాస్తవముగ ఆత్మభేదమును స్థాపింపనేరదు. ఔపాధికమగు ఘటాకాశాదిభేదము మహాకాశము నకు భేదమును బుట్టింపజాలదు. మనస్సుమున్నగు నుపాధులచే సుఖదుఃఖాదుల ననుభవించుట గలుగుచుండ, ఆత్మ యొక్కడన్నను ఈ యనుభవమునకు సాంకర్యముండదు. ఆత్మ యొక్కడయినను పరమాత్మకంటె వేరని యనరాదు. "పరమాత్మేతి చాప్యుక్తః" అను ప్రమాణము జీవాత్మయే పరమాత్మయని చెప్పు చున్నది. శ్రీకృష్ణుడు జీవేశ్వరాభేదమును కంఠతః యెచ్చటను జెప్పలేదని సందే హింప బనిలేదు. "క్షేత్రజ్ఞంచాపి మాంవిద్ధి" అను శ్లోకముచే జీవేశ్వరాభేదమును శ్రీకృష్ణులు కంఠతః చెప్పియేయున్నారు. ఇచట "మామ్" అను పదమునకు "మదాత్మకం" అని వ్యాఖ్యానించుట సమంజసము గాదు. ఈ వాదమును యింతకుమున్ను విపులముగా చర్చించి ఖండించియున్నాము. నిశితముగా విమ ర్శించినచో "మదాత్మక" మన్నను, యీశ్వరాభిన్నమ్ (నాస్వరూపుడన్నను, నాతో నభిన్నుడు) అనియే యర్థము. కావున నిర్విశేష శుద్ధచిన్మాత్రుడగు ప్రత్య గభిన్న బ్రహ్మయందు జీవేశ్వరభేదవ్యవహారాదు లన్నియు అజ్ఞానమూలములు.

పరిపూర్ణచైతన్యుడగు నీశ్వరుడు ప్రత్యగ్రూపముతో నుండు టెట్లని సందే హింపవలదు. "ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి" "సర్వస్య చాఽహం హృదిసన్నివిష్టో" "అహమాత్మా గుడాకేశ! సర్వభూతాశయస్థితః" అను వాక్యములు యీశ్వరుడు ప్రత్యగ్రూపముతో నున్నటుల నిర్వచింపుచున్నవి. లోపల వెలుపల నిండియున్న పరిపూర్ణచైతన్యము, లోపలనున్న ప్రత్యగాత్మ

చైతన్యరూపముతో నుండుట యుక్తమే యగును. అట్లుకాక ఈశ్వరునకు లోపల వ్యాప్తి లేకపోతే పరిపూర్ణత్వమునకు భంగము వాటిల్లును. కాన జీవేశ్వరా ద్వైతము సుసిద్ధము. ఇట్టి యద్వైతజ్ఞానమువలననే మోక్షమని గీతాశాస్త్రము చెప్పుచున్నది. చూడుడు ప్రమాణములను.

శ్లో॥ "సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వ మాస్థితః।
సర్వథా వర్తమానోఽపి సయోగీ మయి వర్తతే"
"జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి"
"యో మామేవ సంమూఢో జానాతి పురుషోత్తమమ్.
స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత"
"ఏవం మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదంతరమ్" అని
"య ఉదరమంతరం కురుతే అధ తస్యభయం భవతి" అను శ్రుతి

ద్వైతజ్ఞానమువలన సంసారభయమున్నదని చెప్పుచున్నది.

ఇంక మీరు, అద్వైతబ్రహ్మజ్ఞాని, నేను రాజు నను భటునివలెను "నేను బ్రహ్మను" అను భటునివలెను దండింపదగునని యనిరి. అయ్యది యిసుమంత విచారింతము. జ్ఞాని యీశ్వరున కాత్మరూపుడు. ఆత్మ అన్నిటికంటె ప్రియమయిన వస్తువు. కాన జ్ఞాని యీశ్వరున కత్యంతప్రియుడు. ఈమాట తాను స్వయముగనే

"ప్రియోహి జ్ఞానినోఽత్యర్థం అహం సచ మమప్రియః"

"జ్ఞానీత్వాత్మైవ మే మతమ్" అని చెప్పియుండెను. భటుడుమాత్రము సంఘాతాభిమానముగల రాజున కాత్మ కానందున దండ్యుడగును. అయితే జ్ఞానియే యీశ్వరుడగుచో "జ్ఞానికి నేను యిష్టుడను" అని యీశ్వరు డెట్లు చెప్పెను? ఇందు దప్పులేదు. "మమాత్మా ప్రియః" "నా కాత్మ ప్రియుడు" అను వాడుకలు లోకములో గలవు. అట్లే యిదికూడ పొసగును.

అయితే జీవేశ్వరుల కభేదమే యథార్థమగుచో "త్వాం మాం శరణంవ్రజ" (నీవు నన్ను శరణుపొందుము) అని భేదభావముచే నెట్లు చెప్పెను? అట్లనా? వినుము. ప్రమాత తన యాత్మయగు బ్రహ్మను శరణు బొందుమని దానియర్థము. ప్రమాతయే జీవుడుకాని, ఆత్మ జీవుడు గాడనియు, ఆత్మ యీశ్వరుడే ననియు ననరాదు. ప్రమాతయే ఆత్మస్వరూపుడు. త్రాటియందు సర్పమువలె ఆత్మయందు బ్రమాత గల్పింపబడెను. కల్పింపబడిన పామునకు రజ్జు వెట్లు స్వరూపమో అట్లే ప్రమాతకు ఆత్మయే స్వరూపము.

అయితే ప్రమాత మిథ్యయయినపుడు శాస్త్రాధికారియే లేడుకాన గీతా శాస్త్రము వ్యర్థమేకదా? కాదు. అంతఃకరణావచ్ఛిన్నచైతన్యము ప్రమాత.

ప్రమాతయందలి విశేషణాంశమగు అంతఃకరణావచ్ఛిన్నత్వము మిథ్యయయినను, విశేష్యమగు చైతన్యాంశము సత్యమే యగును.

ఓయి! మోక్ష మతికష్టముచే సిద్ధించినను దాని ననుభవించుటకు ముక్తునకు తగిన సాధనములు (అవయవములు) లేనందున వ్యర్థమేకదా? కాదు. "అపాణిపాదో జవనోగ్రహీతా" అనుశ్రుతి ఆత్మ యింద్రియముల కధీనముకాని జ్ఞానరూపుడని చెప్పుచున్నది. కావున ముక్తుడు స్వరూపచైతన్యముచేతనే మోక్షానందము ననుభవించును. కాన అద్వితీయబ్రహ్మజ్ఞానమువలననే మోక్షము.

రామానుజమతము.

ఇచట రామానుజులు "కర్మయోగ, జ్ఞానయోగ భక్తియోగరూపాన్ సర్వాన్ ధర్మాన్ కుర్వాణఏవ ఫలకర్మకర్తృత్వాది త్యాగేన పరిత్యజ్య మామేక మేవ కర్తార మారాధ్యం ప్రాప్య ముపాయంచ అనుసంధత్స్వ" దీనిభావము. అర్జునా? నీవు కర్మయోగ జ్ఞానయోగ భక్తియోగరూపమయిన సర్వధర్మములను జేయుచునే కర్మఫలమునందు కర్తృత్వబుద్ధిని విడచి (ఫలకర్మలయందు కర్తృత్వము వదలి) నేనొక్కడనే యారాధింపదగినవాడ ననియు, బొందదగిన వాడ ననియు, నమ్మి దాని కుపాయము నాలోచించుము" అని

ఇ దెంతన్యాయమో విచారించుడు.

మూలమున "సర్వధర్మాన్ పరిత్యజ్య" అని శ్రీకృష్ణుడు చెప్పినట్లుండ దానికి యథాశ్రుతమయిన యర్థమును బరిత్యజించి" అన్నిధర్మముల నాచరింపుచు, అను నితరార్థమును లక్షణచే గల్పించు టేమిన్యాయము? "సర్వధర్మా నపరిత్యజ్య" "సర్వఫలాభిసంధ్యాదికం పరిత్యజ్య ఇతివా" అన్నిధర్మములను విడువక, సర్వకర్మ ఫలాభిసంధిని వదలి అనికాని మూలమునం దెచ్చటను గనిపించదు. మరేమనిన "సర్వధర్మా న్పరిత్యజ్య" అన్నిధర్మములను విడచి అనియే కనిపించుచున్నది.

అయితే "ఇచట యథాశ్రుతార్థమును (పదములవలన నొచ్చెడియర్థమును) అంగీకరింప వీలులేదు. "నియతస్యతు సన్న్యాసః కర్మణో నోపపద్యతే. మోహాత్తస్య పరిత్యాగః తామసః పరికీర్తితః" అని సర్వధర్మపరిత్యాగము తామసత్యాగమని నిందింపబడినది. యథాశ్రుతార్థము నంగీకరించినదానికి విరోధము వాటిల్లును. కావున "సర్వధర్మాన్" అను బదమునకు లక్షణచే "సర్వధర్మఫలాదులను" అనియె యర్థము చెప్పవలయును. అపుడు పూర్వాపరవిరోధ ముండదు. పూర్వము

"ఏతాన్యపితు కర్మాణి సంగంత్యక్త్వా ఫలానిచ
కర్తవ్యానీతి మే పార్థ! నిశ్చితం మతముత్తమమ్"
కార్యమిత్యేవ యత్కర్మనియతం క్రియతేఽర్జున
సంగంత్యక్త్వా ఫలంచైవ స త్యాగ స్సాత్త్వికోమతః" అని ఫలాసంగమును

వదలి యన్నికర్మలను జేయమని చెప్పబడినది. కావున సాత్త్వికపరిత్యాగమే యీశ్లోకమునగూడ గ్రహింపవలయును" అని యందురేమో? అది పొసగదు.

అచ్చటజెప్పిన సాత్త్వికపరిత్యాగము కర్మాధికారియగు నజ్ఞానికి. ఇచట జెప్పిన సర్వధర్మపరిత్యాగము సర్వకర్మసన్న్యాసికి యగు జ్ఞానికి. ఈరెంటికి సంబంధములేదు. ఇచ్చట జ్ఞాననిష్ఠ ముగింపబడుచున్నది. కర్మనిష్ఠను యింతకుమున్నే ముగించిరి.

సర్వకర్మసన్న్యాసమే శ్రీకృష్ణున కనభిమతమని యనరాదు.

"సర్వకర్మాణి సన్న్యస్య" "సర్వారంభపరిత్యాగీ" అని శ్రీకృష్ణుడు కంఠతః సర్వకర్మసన్న్యాసమును జెప్పెను. "బ్రాహ్మణో నిర్వేదమాయా న్నాస్త్యకృతః కృతేన" "యదహరేవ విరజే త్తదహరేవ ప్రవ్రజేత్" ఇత్యాది శ్రుతిసిద్ధమయిన సన్న్యాసమును శ్రీకృష్ణుడు నిరోధించడు.

తామసత్యాగము విద్వాంసునకే పనికిరాదని నిందింపబడిన దనరాదు. ఆశ్లోకమున "మోహాత్" అని యున్నది. విద్వాంసునకు మోహముండదు.

ఓయి! భక్తియోగమును గూడ విడచినచో జ్ఞానికి మాత్రము మోక్షమెట్లు లభించును?

"మద్భక్తాయాంతి మామపి" "భజంతే మాం దృఢవ్రతాః"
"జరామరణమోక్షాయ"
"మయ్యర్పిత మనోబుద్ధి ర్మామేవైష్యస్యసంశయః"
"అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః"
"తస్యాఽహం సులభఃపార్థ" "భక్త్యాలభ్యస్త్వనన్యయా"
"మన్మనాభవ మద్భక్తః"
"భక్త్యా త్వనన్యయాశక్య అహమేవం విధోఽర్జున"
"జ్ఞాతుంద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప"
"......... మద్భక్తో య స్సమామేతి పాండవ"

అను నీవాక్యములన్నియు భక్తియోగమువలననే మోక్షమని నిరూపించుచున్నవికదా? ఇట్లే శ్రీకృష్ణుడు,

"యో మే భక్త స్సమేప్రియః"
"భక్తిమాన్మే ప్రియో నరః"

"భక్తాస్తేఽతీవ మే ప్రియాః" అను వాక్యములచే భక్తుడే తన కిష్టుడని చెప్పెను. కాన భక్తియోగమువలననే పరబ్రహ్మప్రాప్తిలక్షణమయిన మోక్షము జ్ఞానయోగమున కేవలాత్మప్రాప్తియే అని యనరాదు.

భక్తియోగము "జ్ఞాననిష్ఠారూపము, కర్మనిష్ఠారూపము" అని రెండు విధములు. భక్తియనగా నీశ్వరుని సేవింపుట. అయ్యది జ్ఞాననిష్ఠచేగాని, కర్మనిష్ఠచే గాని చేయవీలగును. కనుకనే

"లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ,
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్"

అనిచెప్పెను. ఇంతేకాని భక్తియోగమను మరియొక నిష్ఠ కలదని చెప్ప లేదు. ఇందు జ్ఞాననిష్ఠాలక్షణమగు భక్తియోగము మోక్షమునకు సాక్షాత్సాధ నము. కర్మనిష్ఠాలక్షణభక్తియోగముచే పరంపరయోగసాధనము. కావున జ్ఞాన యోగముకంటె వేరని రామానుజులు చెప్పెడి భక్తియోగము కర్మయోగాంత ర్గతమే. దానిని విడచి జ్ఞాననిష్ఠాప్రాప్తిచేతనే బ్రహ్మప్రాప్తి కలుగును.

మీరుచూపిన శ్లోకములయందు గొన్నిశ్లోకములు, కర్మయోగాత్మకమగు భక్తియోగమును, కొన్నిశ్లోకములు జ్ఞాననిష్ఠారూపమయిన భక్తియోగమును, జెప్పుచున్నవనియు, నిందు మొదటిదానివలన పరంపరామోక్షము కలుగుననియు, రెండవదానివలన సాక్షాత్ మోక్షము కలుగుననియును గ్రహింపవలెను.

ఇట్లంగీకరించుచో "జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి" ఇత్యాది వచన ములు విరోధించవు. లేనిచో జ్ఞానమువలన బ్రహ్మప్రాప్తిని ప్రతిపాదించెడి వాక్య ములన్నియు విరోధించును.

ఇక జ్ఞానమువలన ఆత్మప్రాప్తియేకాని పరమాత్మప్రాప్తిలేదను వాదము, జీవాత్మపరమాత్మలకు భేదములే దనువాదమును రూపుమాపుటతో రూపడంగినది.

"మామేకం శరణంవ్రజ" అను వాక్యమునకుగూడ రామానుజులు చూపిన యర్థము పొసగదు. అకర్తయగు నీశ్వరునికాని, ఆత్మనుగాని, కర్తయని తలంచుట విపరీతజ్ఞానము. ఇది మోక్షమున కుపయోగపడదు. "వాసుదేవ స్సర్వమ్" అను ప్రమాణమునుబట్టి సర్వము వాసుదేవుడేకాన, కర్తకూడ వాసుదేవు డగును. కాన నియ్యది విపరీతజ్ఞానము కాదనరాదు. కర్తృభోక్త్రాది సర్వప్రపంచము బంధింప బడగా వాసుదేవు డొక్కడే మిగులునని దానియర్థము. లేక బ్రహ్మయందు గల్పింపబడినదాని కంతకును బ్రహ్మయే స్వరూపమనియును జెప్పవచ్చును. ఇట్లు కాక మీరుచెప్పినవిధ మంగీకరించినచో కర్తయగు జీవుని పరమాత్మనుగా దలంపు మనుటచే జీవబ్రహ్మభేదవాదమే మీకు గూడ ప్రసక్తించును.

మరియు రామానుజులు "సర్వాన్ ధర్మాన్ కృచ్ఛ్రచాంద్రాయణాదీన్ ప్రాయశ్చిత్తరూపాన్ సర్వాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ. నచ తే పాపేభ్యో భీతిః. అస్మచ్ఛరణాగతిమాత్రేణైవ సర్వపాపక్షయా త్తవ." అని వారిభాష్యమున

వివరించిరి. అర్జునా ! కృచ్ఛ్రచాంద్రాయణాది ధర్మములను ప్రాయశ్చిత్తాది ధర్మములను విడచి నన్నొక్కనినే శరణుబొందుము. నీకు పాపములవలన భీతివలదు. నన్ను శరణుబొందినందున నీ కన్నిపాపములు నశించును. అని దీనియర్థము. ఇదియు నుచితము కాదు. వారి వివరణమునుబట్టి నిత్యనైమిత్తిక, కామ్యరూపధర్మములను విడువవలదని తేలుచున్నది. భగవచ్ఛరణాగతిమాత్రముచేతనే అన్నిపాపములు పోయి మోక్షము కలుగుచో నిత్యకర్మాద్యనుష్ఠానముకూడ వ్యర్థము కావలసివచ్చును. కాన ప్రాయశ్చిత్తాదులవలె నిత్యనైమిత్తికాదులనుగూడ విడువవలెను. కనుకనే వ్యాసులు సర్వధర్మా న్పరిత్యజ్య " అని చెప్పిరి. లేనిచో " ప్రాయశ్చిత్తాని సంత్యజ్య " అనియే చెప్పెడివారు. నిత్యకర్మల ననుష్ఠించుచున్నను, భగవదేకపరాయణుడగు నన్నచో, నపుడు ప్రాయశ్చిత్తముల ననుష్ఠించువాడుకూడ భగవదేకపరాయణుడగును. వాటినిమాత్రము విడువనేల ?

మరియు శ్లో॥ సంధ్యావందన భద్రమస్తు భవతే భో స్నానతుభ్యం నమః
భోదేవాః పితరశ్చ తర్పణవిధౌ నాఽహం క్షమః క్షమ్యతాం
యత్రక్వాపి నిషద్య యాదవకులో త్తంసస్య కంసద్విషః
స్మారంస్మార మఘం హరామి త దలం మన్యే కిమన్యేన మే॥ అను

శుకవచనమునుబట్టి నిత్యకర్మానుష్ఠానముకూడ భగవదేకపరాయణత్వమునకు విరోధమగును. హృత్పుండరీకమున పరమాత్మయందు మనసును ప్రవేశపెట్టుట, అందు చిరకాలముంచుటకదా ? భగవదేకపరాయణత్వము. ఈయది యంతర్ముఖుడు కానివాని కెట్లుసంభవించును ? అంతర్ముఖునకు ననేకపరికరములతో సాధింపదగిన బాహ్యమగు కర్మమార్గమునం దెట్లు ప్రవృత్తి కలుగును? కావున సర్వకర్మసన్న్యాసపూర్వకమే భగవదేకశరణాగతిరూపమగు జ్ఞాననిష్ఠ అని స్పష్టము.

భగవత్ప్రీతికొఱకు భగవంతుని కర్మల నాచరించుటయే భగవచ్ఛరణాగతి యని మీరన్నచో నట్టి కర్మయోగము దీనివెనుకటిశ్లోకమునందే యుపసంహరింపఁబడినది. కాక మీరిట్టి నిర్వచనచేసిన-చో భగవద్ధ్యానయోగము భగవచ్ఛరణాగతి రూపము కాదను విరోధముకూడ వాటిల్లును. భగవద్ధ్యానమున మనస్సునందుఁ గల్పింపఁబడిన భగవంతుని విగ్రహము నర్చించుటయేకాన నది కర్మయోగమే యని యందురేమో ! నిత్యసిద్ధప్రత్యగభిన్న భగవత్స్వరూపమును అనుసంధానము చేయుటకును భగవద్ధ్యానము కర్మయోగము కానేరదు. భగవంతునకు రూపము గల్పింపకుండ భగవంతుని ధ్యానింపగూడదనియు రూపమును గల్పించియే భగవంతుని ధ్యానింపవలెననియును, రాజాజ్ఞ యెచ్చటను లేదు. పైగా కల్పితము కంటె అకల్పితమే యుక్తమని ప్రసిద్ధము. అకల్పితమగు ఈశ్వరస్వరూపమును ధ్యానించుట దుష్కరమని మీరనవచ్చును. ఏరి కయ్యది దుష్కరమగునో వారి

కొఱకు కర్మయోగము విధింపఁబడియే యున్నది. ఎవరికది సుకరమో వారికొఱకు జ్ఞానయోగము విధింపఁబడినది. హృదయమునందు గల్పింపఁబడిన యీశ్వరాకారము నర్చించుటయే జ్ఞానయోగమని యనకుడు. ఉన్నవస్తువు నున్నట్లు చింతిఁచుటయే జ్ఞానయోగము. లోకమునందుఁగూడ నున్న ఘటపటాదులను నున్నట్లు తెలిసికొనుటయే జ్ఞానమని యందురు. ఇంతియేకాని కల్పింపఁబడిన సర్పాభాసాదులను గుర్తెఱుంగుట జ్ఞానమనరు. దాని నుపాసనయనియు ననరు. కాన ఇత్యాది కర్మానుష్ఠానము, హృదయమునందుగాని ప్రతిమాదులయందుగాని, కల్పింపఁబడిన భగవద్విగ్రహార్చనాదికము, ఇది యంతయును కర్మయోగమే. ఇయ్యది అజ్ఞాని విషయము.

"యో మాం సర్వేషు భూతేషు సంతమాత్మాన మీశ్వరం, అర్చాయాం భజతే మాఢ్యాత్" అని భాగవతప్రమాణము. ఈ గీతాశాస్త్రమునఁగూడ కర్మయోగ మజ్ఞానివిషయమనియే చెప్పఁబడినది. నేను బ్రహ్మను అను ప్రత్యగభిన్నబ్రహ్మ స్వరూపచింతనము జ్ఞానయోగము. ఇది ప్రాజ్ఞవిషయము. దీనిని సర్వకర్మసన్న్యాస పూర్వకముగ నలవఱచుకొనవలయును. ఇదియే యుక్తముగూడ నగును. జ్ఞానకర్మ నిష్ఠాద్వయమునే పూర్వము ప్రారంభించియున్న శ్రీకృష్ణునకు నా రెండుయోగములే ముగింపఁదగియున్నవి. కాన నీ శ్లోకము జ్ఞాననిష్ఠాపరమేకాని భక్తినిష్ఠా పరముగాదు. ఇదే శ్లోకమును నేను నాచే రచింపఁబడిన 'అద్వైతామృత' మను గ్రంథమునందు భంగ్యంతరమునఁ జెప్పితిని.

శ్లో॥ ధర్మాన్విహాయ వివిధాన్ శరణం భజేహం
మామేవ యేన వినివర్తితఏవ మాయా" అని

కావున ప్రత్యగభిన్నబ్రహ్మాత్మజ్ఞానమువలననే మాయాతత్కార్యనివృత్తి రూపమగు మోక్షము సంభవించును.

ఇఁక వేదాంతదేశికు లీశ్లోకభాష్యమును వ్యాఖ్యానించుటలో 'మామేక మిత్యత్ర నిర్విశేషచిన్మాత్రై(క్యాది వివక్షాం శృణ్వన్తో బాలాఅపి పరిహాసేయుః' అని వ్రాసిరి. దీనియర్థము 'మామేకం' అనుచోట నిర్విశేష చిన్మాత్రాభేదమును విన్నచో బిల్లలుగూడఁ బరిహాసింతురు' అని.

ఇదినిజమే. బాలురనగా అజ్ఞానులు. 'అపి' శబ్దమువలన విపరీతజ్ఞానులును జేరుదురు. వీరుభయులు అద్వైతమును బరిహాసించెడి మాట నిజమే. ఇం దబద్ధము లేదు. కాని సమ్యక్ జ్ఞానులు మాత్రము పరిహాసింపరు.

ఇంక 'మాం కర్తార మారాధ్యం ఉపాయ ముపేయంచ అనుసంధత్స్వ', కర్తయైనట్టియు నారాధింపతగినట్టియు నన్ను అనుసంధాన మొనర్పుము' అని యన్వయించిన వేదాంతదేశికుల యన్వయక్రమమును వినిన వివేకులే పరిహాసింతురు. బాలాదులు పరిహాసింపరు. వారిదృష్టిలో వీరి యన్వయ ముచితముగనే

తోఁచును. అదెట్లన గాడిదయఱపు పిశాచములకు, నక్కకూత దున్నపోతులకు
శ్రవణానందకరమగునట్లు వేదాంతదేశికుల యన్వయక్రమము అజ్ఞానులకు, విపరీత
జ్ఞానులకును మిక్కిలి యింపుగ నుండును. 'మాం' అనుపదమునకు గీతాతత్త్వ
మును జెప్పునట్టి పార్థసారథియగు వాసుదేవునియందు శక్తియున్నచో వారి
పాదారవిందములను గట్టిగఁ బట్టుకొనుటయే శరణాగతి యగును. అయ్యది పార్థునకు
సులభమైనను నంతకుముందటివారగు ప్రహ్లాదాదులకును, తరువాతివారగు పరీక్షి
దాదులకును దుర్లభమే యగును. కానిండు, మనమేమి చేతుము? అని యిష్టాపత్తిని
జూపుదురేమో! లోకత్రయోపకారముకొఱకుకదా శ్రీకృష్ణుఁడు గీతాశాస్త్రమును
భగవంతుడు ప్రారంభించినది. ఇట్టితరి కొందరియెడ నుపేక్షాభావము నెట్లు
వహించును. ఇక 'మాం' అనుపదమునకు సర్వజ్ఞుడు, సర్వవ్యాపకుడు నగు పరమాత్మ
యందు లక్షణయని మీరంగీకరించుచో నపుడు నిర్విశేష చిన్మాత్రాభేదము సిద్ధించి
నట్లే. నిర్విశేషచైతన్యమే సర్వవ్యాపక మగును. సవిశేషము సర్వవ్యాపకము కాదు.

మఱియు తమవ్యాఖ్యానమున వేదాంతదేశికు లిట్లనిరి. 'గీతాశాస్త్రస్య
సారార్థోఽయం, భగవానేవ పరతత్త్వం యథాధికారం తదాశ్రయణమేవ పరమ
ధర్మః' అని దీనియర్థము. గీతాశాస్త్రమునకు సారభూతమగు నర్థమిదియే. భగ
వంతుడగు శ్రీకృష్ణుఁడే పరతత్త్వము తమయధికారము ననుసరించి వాని నాశ్రయిం
చుటయే పరమధర్మము, అని. ఇదికూడ వారితాత్పర్యము ననుసరించి సిద్ధించదు.
వారియభిప్రాయమున శ్రీకృష్ణుఁ డొక్కడే పరతత్త్వమనియు బ్రహ్మరుద్రాదులు పర
తత్త్వము కాదనియు వారు జీవులేయనియు గదా వారియాశయము. అట్టియర్థము
గీతాశాస్త్రమువలన సిద్ధింపదు. మఱేమనిన శ్రీకృష్ణ శ్రీనివాస రుద్ర బ్రహ్మేంద్ర
బృహస్పతి వాయు సూర్యేందు లక్ష్మి సరస్వతీ పార్వతీ గణపతి కుమార వినాయక
దేవగరుడ గంధర్వ పిశాచోరగ కిన్నర కింపురుష సిద్ధ సాధ్య పితృ మాతృ
భూతప్రేత గ్రహతారానక్షత్ర మనుష్య పక్షి పశు మత్స్య కమఠ కీట సరీసృప
తరు గుల్మ లతాది చరాచరమగు సర్వభూతములయొక్క హృదయమం దున్న
ట్టియు, మృత్పాషాణాది సర్వాచేతనములను వ్యాపించినట్టియుఁ బరిపూర్ణము,
నిర్విశేషము సత్యము ననంతము చైతన్యరూపము నగు నద్వితీయ పరబ్రహ్మ
మొక్కటియే పరతత్త్వమనియు, నట్టిబ్రహ్మానుసంధానాత్మక మను జ్ఞాననిష్ఠయే
పరమధర్మమనియు దానికుపాయము కర్మనిష్ఠయనియు గీతాశాస్త్రముయొక్క
సారము. కనుకనే అద్వైతామృతవర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీం' అని
పెద్దలందురు. సర్వకర్మసంన్యాసమును వేదాంతదేశికులుకూడ నంగీకరించిరి.
జితేంద్రియుడగు నెవ్వనికి యోగముచేత కర్మకాలమంతయు వ్యాప్తమగునో
వానికిఁ గర్మపరిత్యాగము యుక్తమగును. ఇతరున కట్లు యుక్తముకాదు. ఇదియే
తృతీయ చతుర్థపంచమములయందు భగవంతుడు ప్రతిపాదించెను.

తృతీయాధ్యాయమున "యస్త్వాత్మరతిరేవ స్యాత్" అనుచోట, చతుర్థమున "యోగసంన్యస్త కర్మాణం" అనుచోట; పంచమమున "సర్వకర్మాణి మనసా సంన్యస్యాస్తే" యనుచోటను ఈవిషయ ముపపాదింపఁబడినది. దీనిచే ఆత్మరతులు, జితేంద్రియులు, యోగారూఢులగు వారికే కర్మసంన్యాసము యుక్తమనియు, జ్ఞానికి సంన్యాసము యుక్తము కాదనియు, సమాధినిష్ఠునకే యుక్తమనుభావము దుష్టమని తేలినది. ఏ అజ్ఞానికి తనచిత్తము బహిర్ముఖమనియు, నందుచే దాను సంసార మనుభవించుచుంటి ననియును భ్రాంతియుండునో వాడు సమాధి నభ్యసించునుగాక. ఏప్రాజ్ఞునకు 'నేనే బ్రహ్మము' నను నిశ్చయముండునో వానికి సమాధి యెందులకు ? సమాధిసాధ్యమగు బ్రహ్మసాక్షాత్కారము జ్ఞానికి స్వయముగనే కలుగునుగదా ! కాన జ్ఞానయోగము సమాధినిరపేక్షము.

ఎవనికి ప్రతిబంధవశమున ననేకమాఱులు వేదాంతముల విన్నను బ్రహ్మసాక్షాత్కారము కలుగదో వానికి సమాధి విహితము. అంతమాత్రమున సమాధినిష్ఠునకే సంన్యాసము యుక్తమనియు జ్ఞానికి తగదనియు నియమింప వీలులేదు. ఆత్మసాక్షాత్కారము నొందిన జ్ఞానికి సంన్యాసము యుక్తము కాదనియు ఆత్మసాక్షాత్కారమునుగూర్చి ప్రయత్నించు యోగికి సంన్యాసము తగుననియు గల్పించుటేమి యుచితము ? ఆత్మసాక్షాత్కారమునగదా పురుషుడు కృతకృత్యుఁ డగును ?

"ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ కృతకృత్యశ్చ భారత" అనికదా శ్రీకృష్ణుడు చెప్పెను. కృతకృత్యునకుఁ జేయఁదగిన కృత్య మేముండును ? అట్లున్నపుడుగదా కర్మసంన్యాసము తగదనుట ! సమాధిహితునకే ఆత్మరతి యుండును గాని జ్ఞాని కాత్మరతియుండ దనుట పాడికాదు. అజ్ఞానికిగూడ ఆత్మగానభిమానించిన దేహమునందే ఆత్మరతియుండ ప్రాజ్ఞునకు సచ్చిదానందాత్మయందు ఆత్మరతి యుండుట యబ్బురమా ! కావున ఆత్మసాక్షాత్కారము కలవిద్వాంసునకు కర్మసంన్యాసము యుక్తమే. అట్లే ఆత్మసాక్షాత్కారముకొఱకు ప్రయత్నించి జ్ఞాననిష్ఠయందు ప్రవేశించినవానికిని కర్మసంన్యాసము యుక్తమగును.

మరియు, ఆత్మరతియగు జితేంద్రియుడుగూడ లోకసంగ్రహముకొఱకు కర్మల జేయవలసినదే - యని వేదాంతదేశికులనిరి. అదియును కుదరదు. వారికి కర్తవ్యమగు కర్మలేదనియే సమాధానము. కాని కొందఱు విద్వాంసులు స్వేచ్ఛగా శ్రీకృష్ణునివలె కర్మయోగాదుల దిరుగుచున్నారు. "కృష్ణో భోగీ శుకస్త్యాగీ నృపౌ జనకరాఘవౌ, వసిష్ఠః కర్మనిరతః పంచైతే జ్ఞానినః స్మృతాః" అని చెప్పబడినది. అందుకు కారణము ప్రారబ్ధకర్మయే. కనుకనే శ్రీకృష్ణుడు తాను ధర్మసంస్థాపనకొఱకు నవతరించినను, ఆయాసంకల్పముల కనుగుణముగ కర్మలయందు బ్రవర్తించెను. "వర్తఏవచ కర్మణి" అని స్వయముగ జెప్పెను. ఈకృష్ణుడే ఋషభావ

తారమున నవధూతయగుచు లోకమునకు పరమహంసపరివ్రాజకుల నడవడిని ఆపుటకు సంచరించెను. కాన విద్వాంసునకు కర్మయోగమే తగినదను నియమము లేదు. జనకరాఘువాదులు రాజులగుటచే వారి ప్రారబ్ధము ననుసరించి ప్రజాపాలనమున ప్రవర్తించిరి. కనుకనే అర్జునునకుగూడ ప్రారబ్ధము ననుసరించి యుద్ధమునందు పవృత్తియే మంచిదని తలంచి యుద్ధమును జేయుమనెను. అంతమాత్రమున కర్మయోగమే యుక్తమని భ్రమింపదగదు. శుకుడుమున్నగు విద్వాంసు లట్లు కర్మమార్గమున ప్రవర్తింపలేదు. శుకదృష్టాంతమునుబట్టి సమాధినిష్ఠునకే కర్మసన్న్యాసము యుక్తమనువిషయము నిరాకరింపబడుచున్నది. శుకుడు సన్న్యాసియై యెల్లపుడు సమాధినిష్ఠుడగుచో భాగవతసంప్రదాయమే మునిగిపోయెడిది. కాన విద్వాంసునకు, వివిదుషునకును కర్మసన్న్యాసము యుక్తము. కనుకనే శాస్త్రములో విద్వత్సంన్యాసము, వివిదిషాసంన్యాసము అని రెండువిధముల విభజింపబడినవి. కావున ముముక్షువునకు సర్వకర్మసంన్యాసపూర్వకమయిన బ్రహ్మాత్మజ్ఞాననిష్ఠయే కర్తవ్యమని గీతాశాస్త్రసారము. అం దనధికారికి కర్మనిష్ఠయే శరణ్యము.

ఓయి ! ఇట్లైనచో సర్వకర్మపరిత్యాగము జేయని జనకాదులకు మోక్షము సున్నయేకదా ? కాదు, ముముక్షువునకు కర్మసన్న్యాసము లేనిచో మోక్షముండదు. ముక్తున కట్లు కాదు. జనకాదులు జీవన్ముక్తులు. ఆత్మసాక్షాత్కారము గలవారు వారలకింక మోక్షేచ్ఛ లేదు. మోక్షేచ్ఛయున్నపుడుకదా సన్న్యాసముయొక్క యావశ్యకత ? కనుకనే బ్రహ్మవిద్యాధికారములలో శమాదిసంపత్తి, నిత్యానిత్యవస్తువివేకము, ఇహాముత్రఫలభోగవిరాగము, ముముక్షుత్వము, అని ముముక్షుత్వముగూడ జేర్చబడినది.

అయితే ముముక్షువునకే సన్న్యాసాధికారముకాని విద్వాంసుడగు ముక్తునకు లేదనికదా ? మాయాశయము. అపుడు విద్వాంసునకు సర్వకర్మసన్న్యాసా నర్హత సిద్ధించినట్లే ? కాదు. విద్వాంసుడు కృతకృత్యు డయినందున, వానికి కర్మసన్న్యాసము కార్యము ( ఆచరణీయము ) కాదని మేమంటిమి. అందువలన వానికి కర్మసన్న్యాసము కుదరదని యనరాదు. కర్మానుష్ఠానహేతువగు అజ్ఞానము లేనందుననే విద్వాంసునకు సన్న్యాసము సిద్ధమయినది. కాన విద్వాంసునకు గర్మయోగమే యుపపన్నము కాదు.

విద్వాంసుడు కృతకృత్యుడయితే వానికి కర్మసన్న్యాసపూర్వక జ్ఞాననిష్ఠ కార్యమని యెట్లు చెప్పిరి ? ఇందు దప్పులేదు. ఆత్మజ్ఞానము పరోక్షము, అపరోక్షము అని రెండువిధములు. పరోక్షజ్ఞానికి జ్ఞాననిష్ఠ విధింపబడినది. అపరోక్షజ్ఞానికయ్యది విధింపబడలేదు. అపరోక్షజ్ఞాని కృతకృత్యుడు.

అయితే యీ పరోక్షాపరోక్షజ్ఞానము లను గుర్తించుటెట్లు ? ఎవనిమనసులో సంసారదుఃఖము, మోక్షేచ్ఛ, విషయానురాగము లేదో "అహం బ్రహ్మాఽస్మి" అను నిశ్చయముండునో నేను కృతకృత్యుడ నను సంతోషముండునో "చచ్చిన తరువాత నాగతేమి ?" అను దిగులుండదో ఈశ్వరునినుంచికాని, మృత్యువునుంచి కాని భయముండదో వాడు విద్వాంసుడు. వా డపరోక్షాత్మజ్ఞాని. ఇక నెవడు కేవల శాస్త్రమువలన ఆత్మయే బ్రహ్మయని మాత్రము తెలిసికొనునో అనుభవముండదో వాడు పరోక్షజ్ఞాని.

కాన విద్వాంసుడు తనబుద్ధిచే దాను పరోక్షజ్ఞాను డయినది, యపరోక్షజ్ఞాను డయినది తెలిసికొని పరోక్షజ్ఞాను డయినచో శమాదిసంపత్తి నాలోచించుకొని అదియున్నయెడల శిఖాయజ్ఞోపవీతాదుల బరిత్యజించి, సన్న్యసించి, జ్ఞానయోగ మవలంబింపవలెను. శమాదిసంపత్తి లేనిచో కర్మయోగమునందే యుండవలెను. ఇట్లనేకజన్మలయందు గర్మయోగ మనుష్ఠింప, పుణ్యావిశేషమున చిత్తశుద్ధి కలిగి నచో జ్ఞానయోగమున కధికారియగును. కనుకనే,

"బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే,

అనేకజన్మ సంసిద్ధ స్తతో యాతి పరాంగతిమ్"

"స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః" అని చెప్పియుండెను.

ఇంక నపరోక్ష జ్ఞానముండుచో వా డిచ్ఛవచ్చినటుల విహరించవచ్చును." కనుకనే "నిస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః కో నిషేధః" అని చెప్పబడినది.

ఇక పరోక్షాత్మజ్ఞానముకూడ లేనివానికి కర్మయోగమునందే యధికారము. అయ్యది, "నాకు వర్ణాశ్రమముల ననుసరించి యీ కర్మలు విధింపబడినవి. నేను ఫలత్యాగమునుజేసి యీశ్వరారాధన బుద్ధితో వీనిని జేయవలయును" అని, నిత్య నైమిత్తిక కర్మల ననుష్ఠించుట. ఇంతేకాని, స్నానసంధ్యలనుమాని, దేవాలయాదు లందు పులిహోర దధ్యోదనాదుల భుజించుట కర్మయోగము కాదు.

జ్ఞానయోగమ్మనగా, వేదాంత శ్రవణాది పూర్వకముగ "నేనే బ్రహ్మను" అని యనుసంధానముచేయుట. ఇంతేకాని, ద్రావిడ వేదమును పారాయణచేయుట, శంఖచక్రాంకనాద్యుల జేసికొనుటకాదు.

కావున అజ్ఞానియగు నధికారికి కర్మయోగము కర్తవ్యము. అపరోక్షజ్ఞానము గల్గు విద్వాంసునకు జ్ఞానయోగము కర్తవ్యము. గీతాశాస్త్ర మంతకును యీ రెండే యంశములు

ఈ యంశద్వయమును, "మన్మనా భవ మద్భక్తః" "సర్వధర్మాన్పరిత్యజ్య" అను రెండు శ్లోకములచే భగవంతుడు సూచించెను.

"ముముక్షుణా కర్మయోగః కార్యోఽజ్ఞేన ద్విజన్మవా,
పరోక్షజ్ఞేన విదుషా జ్ఞానయోగ ఇతి స్థితిః" అని సిద్ధాంతము.

ఆ జ్ఞానయోగము సంన్యాసపూర్వకము. అట్టి సంన్యాసము రెండు విధములు. వైదిక సన్యాసము, లౌకికసన్యాసము అని. మంత్రపూర్వకముగ సంన్యాసాశ్రమ స్వీకారము వైదికము. గృహ ధన దారాపత్యాదికమును విడచి, యెచ్చటకో లేచిపోవుట లౌకికసంన్యాసము. వైదికసన్యాసమునందు వైదికునకే యధికారము. లౌకిక సన్యాసమునందు స్త్రీ శూద్రాదుల కందఱకును అధికారము. కనుకనే శ్రీశంకరులు, ఉపనిషద్భాష్యమున "జ్ఞానమార్గమం దెల్లటి కధికార మనిరి. కర్మయోగమునందు ద్విజునకే యధికారము కలదు. కావున,

శ్లో॥ యథావిధి పరిత్యజ్య జ్ఞానయోగం ద్విజేఽభ్యసేత్,
గృహాదికం పరిత్యజ్య తదన్యస్తు త మభ్యసేత్. ౧

కామక్రోధాతిరహిత చిత్తస్సంన్యాస మాశ్రయేత్,
దంభాద్యర్థంతు సంన్యస్య పతేదేవ నరోఽశుచౌ॥ ౨

ఈశ్వరారాధనార్థం స్వం కర్మ కుర్యా న్మలాశయః,
దంభాద్యర్థంతు తత్కృత్వా పతేదేవ నరోఽశుచౌ॥ 3

యథాక్రమంబుగ నర్థము.

(౧) ద్విజుడు శాస్త్రప్రకారము సన్యసించి జ్ఞానయోగ మభ్యసింపవలెను. ఇతరుడు గృహాదికమును వీడి జ్ఞానయోగము నభ్యసింపవలెను. ౧

(౨) చిత్తమునందు కామక్రోధాదులు లేనివాడే సంన్యసింపవలెను. డాంబికముగ సంన్యసించువాడు సంసారమున గూలును. ౨

(3) మలినాంతఃకరణుడు యీశ్వరారాధనకొరకే కర్మచేయువలెను. దంభాదులకొరకు గర్మలజేయు నరుడు సంసారమున బడును. 3

శ్లో॥ స్వకర్మోత్సృజ్య పురుషః పరకర్మ నచాచరేత్,
అన్యథా యదివర్తేత పతేదేవ నరోఽశుచౌ॥

అ॥ మానవుడు తనకు విహితమగు కర్మను విడచి పరకర్మ నాచరించ కూడదు. అట్లాచరించువాడు పాపభూయిష్ఠమయిన సంసారము నొందును,

శ్లో॥ యస్తు జ్ఞానావలేపేన విహితం న సమాచరేత్.
ప్రతిషిద్ధం చాచరేత్సపతేదేవ నరోఽశుచౌ॥

అ॥ ఎవడు తాను జ్ఞానినను గర్వముచే విహితకర్మ నాచరింపడో నిందిత కర్మ నాచరించునో, వాడు సంసారకూపమున గూలును.

శ్లో॥ శాస్త్రదీపేన కర్తవ్య మర్థం దృష్ట్వా సమాచరేత్
స్వేచ్ఛయా యదివర్తేత పతేదేవ నరోఽశుచౌ॥

అ॥ శాస్త్రమను దీపముచేఁ జేయదగినపనిని యాలోచించుకొని యాచరించవలెను. స్వేచ్ఛగా నడచిన నరకము నొందును.

శ్లో॥ శాస్త్రాణాముత్తమం శాస్త్రం గీతాశాస్త్ర మితిస్మృతం.
కృష్ణధీ మథితామ్నాయపారాబ్ధిజ మివామృతమ్॥

అ॥ శాస్త్రములలోకెల్ల గీతాశాస్త్రము గొప్పది. కృష్ణుడనువానిచే మథింపబడిన వేదాంతము లనెడి సముద్రమున బుట్టిన యమృతమువంటిది.

శ్లో॥ అశోచ్యా నన్వశోచస్త్వ మిత్యుపక్రమ్య శోచనం,
అంతే మాశుచ ఇత్యుక్త్వా శ్లోకాభావోఽత్ర శౌరిణా॥

అ॥ "అశోచ్యానన్వశోచః" అను శ్లోకములోని యర్జునుని విషాదమును (దుఃఖమును) ఆరంభించి తుదిశ్లోకమున దుఃఖింపవలదని శోకాభావమును శ్రీకృష్ణుడు ప్రతిపాదించెను.

శ్లో॥ అశేష శోక ప్రశమోపాయ భూతమిదం తతః
శోకా న్ముముక్షుణా నిత్య మధ్యేయ మధికారిణా॥

అ॥ కాన సమస్తదుఃఖములను బోగొట్టుకొనుట కియ్యది యుపాయము శోకమోక్షమును గోరువాడు నిత్యమును బఠింపవలెను.

శ్లో॥ మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినేదినే
సకృద్గీతాంభసి స్నానం సంసారమలమోచనం॥

అ॥ మానవులు ప్రతిరోజున నీటితో యాచరించెడి స్నానము శరీరమాలిన్యమును బోగొట్టును. ఒక్కమారు గీతోదకమునందు స్నానమాడిన సంసారమల మడుగంటును.

శ్లో॥ భగవద్గీతా కించి దధీతా గంగాజల లవకణికాపీతా
సకృదపి యేన మురారిసమర్చా క్రియతే తస్య యమోఽపి నచర్చామ్॥

అ॥ భగవద్గీతను కొంచెమైన యధ్యయనము చేసినను, గంగోదకకణమును త్రాగినను, ఒక్కమారయినను విష్ణుపూజచేసినను, వానినిగూర్చి యముడుకూడ నుపేక్షించును.

శ్లో॥ గంగాస్నానాదివా దృష్టం గీతాపారాయణాత్ఫలం
గీతార్థ బ్రహ్మవిజ్ఞానం బహ్మానందప్రదం పునః॥

అ॥ గంగాస్నానమునుంచివలె గీతాపారాయణమువలన గలుగు ఫలము అదృష్టము ( అపూర్వము - పుణ్యము ). గీతార్థమగు బ్రహ్మవిజ్ఞానము మాటి మాటికి బ్రహ్మానందము నిచ్చును.

ఇట్లు గీతాశాస్త్రము దానివ్యాఖ్యయగు భాష్యార్కప్రకాశయు ముగిసినది.

ఇచట శ్రీరామరాయకవీంద్రులు స్వయముగ నొక శ్లోకమును రచించిరి. దాని నుదాహరింతుము.

శ్లో॥ ప్రకాశమేనం పరిలక్ష్య కౌస్తుభప్రకాశమప్యాత్మని సంశయాకులం,
నిరీక్ష్యలక్ష్మ్యా తురగేంద్రకంధరం కృతం స్మితం హన్తు తమో దదాతు శమ్॥

భావము: రామరాయకవీంద్రులు "గీతాభాష్యార్కప్రకాశ"మను గ్రంథమును రచించి హయగ్రీవున కర్పించిరి. అంతకుముందు శ్రీహయగ్రీవునిహృదయమున కౌస్తుభమణిప్రకాశము కలదు. ఈ రెండు ప్రకాశలను శ్రీ హయగ్రీవుడు చూచి "అపూర్వమగు నీ ప్రకాశ కౌస్తుభమణిదేనా? నా హృద్గతమగు గీతాప్రకాశ యిట్లు బయటి కెట్లొచ్చెను? ఈరెండుప్రకాశలలో నేదిగొప్పది? ఈప్రకాశనుజూచి లక్ష్మి యేమని తలంచునోకదా? ఈ రెండుప్రకాశములతో నిండియున్న నాహృదయమున లక్ష్మిని యుంచుట కవకాశముండునో లేదోకదా? ఈగీతాప్రకాశను జూచి లక్ష్మీదేవికూడ జ్ఞాననిష్ఠనొంది నాయెడల వైరాగ్యమును జెందునేమో కదా! అని సంశయించుచుండ, లక్ష్మీదేవి హయగ్రీవునిజూచి నవ్వినదనియు, ఆ నవ్వు చీకటిని పోగొట్టుగాక యనియు, సుఖమునిచ్చుగాక యనియును దీనిభావము.

( చిరునగవు చంద్రికతో సమానముగాన చీకటిని పోగొట్టనగును )

ఈ గీతాగ్రంథము, "అశోచ్యానన్వశోచ స్త్వం" అను శ్లోకము మొదలుకొని, "మాశుచః" అను శ్లోకమువరకు ( 631 ) నాలుగువందల ముప్పదియొక్క శ్లోకములు.

"ధర్మక్షేత్రే" అను శ్లోకము మొదలుకొని "ధ్రువానీతి ర్మతిర్మమ" అను శ్లోకపర్యంతము నేడువందల శ్లోకములు. కనుకనే భాష్యకారులగు శ్రీశంకరులు, తమ భాష్యారంభమున "నేడువందల శ్లోకములతో గూర్చెను" అని వ్రాసిరి.

“ప్రకృతిం పురుషంచైవ”అను శ్లోకము ప్రక్షిప్తముకాన, దీనిని లెక్కింపదగదు. ౬౬

అవ॥ శ్రీకృష్ణుడు గీతాశాస్త్రార్థమునంతయు నీ యధ్యాయమున నుపసంహరించి, యిపుడు శాస్త్రసంప్రదాయవిధిని చెప్పబోవుచున్నారు.

శ్లో॥ ఇదం తే నాఽతపస్కాయ నాభక్తాయ కదాచన
నచాశుశ్రూషవే వాచ్యం నచ మాం యోఽభ్యసూయతి॥ ౬౭

అ॥ ఓయి అర్జునా! ఈ గీతాశాస్త్రమును నీవు తపోరహితున కుపదేశింపకుము. తపస్వియయినను, నాయందు భక్తిలేనివాని కుపదేశింపకుము. తపోభక్తులు రెండున్నను, వినవిచ్ఛలేనివాని కుపదేశింపకుము. ఈ మూడు నున్నను, నన్ను గురించి సహించలేక యసూయజెందువాని కుపదేశింపకుము. భగవంతునియం దసూయలేని తపస్వికిని, శుశ్రూషునకు, భక్తునకును యుపదేశింపుమని యర్థసామర్థ్యమువలన సిద్ధించుచున్నది.

ఇచట మూలమున జెప్పకున్నను, మేధావినికూడ గ్రహింపనగును. మేధాతపస్సులు రెండును సమప్రధానములు కనుక నీ రెంటికి సామానాధికరణ్యముండదు. మేధ యన శాస్త్రార్థపరిజ్ఞానము. తపస్సుయన చిత్తైకాగ్ర్యము. ఇందు మేధావియుత్తమాధికారి. తపస్వి మధ్యమాధికారి. శుశ్రూషాభక్తులీ యిద్దరకు ప్రధానములే. కాన శుశ్రూషా, భక్తి లేని తపస్వికి జెప్పకుము. అట్టి మేధావికిని జెప్పకుము.

ఇంక శుశ్రూషా (వినగోరిక) భక్తులుండి, మేధావి యయినను, తపస్వియయినను, భగవంతునియం దసూయయుండుచో వానికిగూడ జెప్పకుము. దీనివలన నెన్నిగుణములున్నను భగవంతునియం దసూయగలవానికి శాస్త్రము చెప్పకూడ దని తెలుచున్నది. కాన భగవంతునియం దసూయ ప్రబలదోష మని దీని తాత్పర్యము.

ఇం దొకటి రెండు గుణములు లేకున్నను, అసూయ యను ప్రబలదోషము లేనిచో శాస్త్ర ముపదేశింపవచ్చునని తెలుచున్నది. కావున తపస్వి కాకున్నను, మేధావి కాకున్నను, గురువునకు పరిచర్య చేయువానికిని, గురువునందును దేవుని యందును భక్తిగలవానికిని శాస్త్రము చెప్పవచ్చునని భావము.

మూలమునందలి “శుశ్రూషా” పదమునకు, ‘వినకోరిక, పరిచర్య’ అను రెండర్థములను గ్రహింపనగును.

కనుకనే శ్రీశంకరులు, తమయందు శుశ్రూషాభక్తులు గలిగియున్న మంద మతి, తపోరహితుడు నగు, ఆనందగిరి శిష్యులకు శాస్త్రోపదేశమును గావించితి



ఈయది శాస్త్రోపదేశ సంప్రదాయము. సంప్రదాయమన (సమ్యక్ ప్రదీయతే) అను వ్యుత్పత్తిచే బాగుగ విచారించి యిచ్చుట అని యర్థము. అనగా నుపదేశించుట. దానివిధాన మిచట ప్రతిపాదింపబడినది. ౬౭

శ్లో॥ య ఇదం పరమంగుహ్యం మద్భక్తే ష్వభిధాస్యతి,
భక్తిం మయి పరాం కృత్వా మామేవై ష్యత్యసంశయః. ౬౮

అ॥ లోకములో నెవ డీ పరమపురుషార్థసాధనము, అతిరహస్యము నగు నీగ్రంథమును, నాయందు పరాభక్తినుంచి యుపదేశింపగలడో, వాడు తప్పక నన్నుఁ బొందగలడు. ఇందు సంశయము లేదు. ౬౮

శ్లో॥ నచ తస్మా న్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః,
భవితా నచ మే తస్మా దన్యః ప్రియతరో భువి. ౬౯

అ॥ కావున నాకు మనుష్యులలో, గీతాసంప్రదాయమును ప్రవర్తింపజేసిన వానికంటె నన్యుఁడెవ్వడును యిష్టుడు లేడు. భూలోకమున నికముందుగూడ వానికంటె నాకిష్టు డింకొక డుండబోడు. ఎవడు జ్ఞానియగుచు గీతాసంప్రదాయమును సత్పాత్రయందు దుంచునో వాడు శ్రీకృష్ణపరమాత్మ కత్యంతప్రియుడని భావము. నేను జ్ఞానినికదా ? నాకు శిష్యోపదేశముతో బనియేమి ? అని యూరకుండగూడదు. అట్లయిన గీతాశాస్త్రసంప్రదాయము లోకములో లోపించును. కాన శిష్యోపదేశముద్వారా సాంప్రదాయమున ప్రవర్తింపజేయుట యావశ్యకము. ౬౯

శ్లో॥ అధ్యేష్యతేచ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః,
జ్ఞానయజ్ఞేన తేనాఽహ మిష్టస్స్యా మితి మే మతిః. ౭౦

అ॥ లోకములో నెవడు ధర్మయుక్తమయి కృష్ణార్జునసంవాద రూపమగు గ్రంథమును పఠించునో, వానికి నాజ్ఞానయజ్ఞముచే నేను మిక్కిలి యిష్టుడ నగుదునని నా యభిప్రాయము.

యజ్ఞములన్నిటిలోను జపయజ్ఞము గొప్పది. అది మూడువిధములు. విధిజపము, ఉపాంశుజపము, మానసజపము, అని. ఇందు విధిజపమనగా, వాక్కుతో స్పష్టముగా బయటికి మంత్రముచ్చరించుట. (2) శబ్దములేకుండ జిహ్వోష్ఠలను దల్చుచు మంత్రముల నుచ్చరించుట ఉపాంశుయజ్ఞము. (3) జిహ్వోష్ఠచలనములు గూడ లేకుండ మనస్సునందుమాత్రమే మంత్రోచ్చారణచేయుట మానసజపము. మూటిలో మానసజపము గొప్పది. అట్టిమానసజపమే యిచట జ్ఞానయజ్ఞ శబ్దముచే జెప్పబడినది. కాన గీతాశాస్త్రాధ్యయనము జ్ఞానయజ్ఞతుల్యమని సిద్ధాంతము. ౭౦

శ్లో॥ శ్రద్ధావా ననసూయశ్చ శృణుయాదపి యో నరః,
సోఽపిముక్త శ్శుభా న్లోకా న్ప్రాప్నుయా త్పుణ్యకర్మణామ్. ౭౧

మూ॥ ఏ మానవుడు శ్రద్ధగలిగి అసూయలేక ఈ సంవాదరూపమగు గ్రంథమును వినునో వాడుగూడ పాపవిముక్తుడగుచు పుణ్యలోకముల నొందును. ౭౧

శ్లో॥ కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా
కచ్చి దజ్ఞానసంమోహః ప్రణష్ట స్తే ధనంజయ !

అ॥ ఓయి అర్జునా? ఏకాగ్రచిత్తముతో నీ విది వింటివా? ఓయి ధనంజయా? నీకు అజ్ఞాననిమిత్తకమయిన అవివేకము తొలగినదా ? అజ్ఞాననిమిత్తకమయిన సంమోహము ( అవివేకము ) కార్యాకార్య విషయమని, ఆత్మానాత్మవిషయమనియు రెండువిధములు. ఈరెండువిధములయిన యవివేకమును పార్థుడు తనకున్నటుల మొదట జూపెను. అందువలన శ్రీకృష్ణుడు ఈ యుపదేశమున నాయుభయవిధమగు నవివేకము నశించినదా ? అని యడిగెను. ౭౨

అర్జునుడు చెప్పుచున్నాడు.-

శ్లో॥ నష్టోమోహ స్స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాచ్యుత !
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ॥ ౭౩

అ॥ ఓయికృష్ణా ! నీయనుగ్రహమున నా కవివేకము నశించినది. ఆత్మతత్త్వము స్మృతికి వచ్చినది. ఇక నీయాజ్ఞయందుండి సంశయము తొలగినవాడనై నీవు చెప్పినట్లు చేతును. ఇచట యర్జునుడు ఆత్మతత్త్వము స్మృతికివచ్చినదని చెప్పుటచే, కృష్ణోపదేశమునకు బూర్వమే పార్థునకు పరోక్షముగ ఆత్మతత్త్వజ్ఞానము కలదని సూచిత మగుచున్నది. లేక యిచట స్మృతిశబ్దమునకు జ్ఞాన మర్థమని గ్రహింపవలయును. లేక నీవుచెప్పిన యాత్మతత్త్వము స్మరింపబడుచున్నదనియు జెప్పవచ్చును.

ఓయి, పరమేశ్వరుడగు శ్రీకృష్ణుని యుపదేశమున పార్థుడు కృతకృత్యుడయ్యెనా ? లేదా ? మొదటిపక్షమున నీవుచెప్పిన యుద్ధమును జేతుననుట యనుచితము. రెండవపక్షమున శ్రీకృష్ణుడు నేరుగా గీతాశాస్త్రమంతయు నుపదేశింప అర్జునుడంతటివాడే కృతకృత్యుడు కానిచో, నిప్పటిగురువులచే నుపదేశమునొందిన శిష్యులెట్లు కృతకృత్యు లగుదురు ? వినుము. శ్రీకృష్ణానుగ్రహమున పార్థుడు కృతకృత్యుడాయెను. అందు సందియములేదు. కాని శ్రీకృష్ణునివలె నర్జునుడుకూడ భూభారహరణముకొఱ కవతరించినవాడుకాన, శ్రీకృష్ణుడు పరిపాలనాదికర్మ విలాసమాత్రముచే జేసినట్లు తానుకూడ విలాసచే క్షత్రియస్వభావసిద్ధమయి యుద్ధకర్మను జేతునని పార్థుడు చెప్పెను. ఇదియే "కరిష్యే వచనం తవ" అ

చెప్పిన పార్థుని యాశయము. పార్థుడు కృతకృత్యు డయ్యెనని నిర్ణయించుటకు "నష్టోమోహః" అని చెప్పుటయే ప్రమాణము. ఇంతతో శాస్త్రార్థము ముగిసినది. ౭౩

అవ॥ ఇకముందు కథాసంబంధమును గలుపుచున్నాడు.

సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పుచున్నాడు.

శ్లో॥ ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః,
సంవాద మిమ మశ్రౌషం అద్భుతం రోమహర్షణమ్॥

అ॥ ఇట్లు నేను శరీరమునకు గగుర్పాటు కలుగున ట్లాశ్చర్యజనకమయిన శ్రీకృష్ణార్జునుల సంవాదమును వింటిని. ౭౪

శ్లో॥ వ్యాసప్రసాదాచ్ఛ్రుతవా నిమం గుహ్యతమం పరమ్,
యోగం యోగేశ్వరా త్కృష్ణాత్ సాక్షాత్కథయత స్స్వయమ్॥ ౭౫

అ॥ నేను వ్యాసానుగ్రహమువలన దివ్యచక్షుస్సును బొంది, యోగేశ్వరుడగు శ్రీకృష్ణుడు స్వయముగ జెప్పుచుండ, నీ కృష్ణార్జునసంవాదరూపమగు పరమ రహస్యగ్రంథమును వింటిని.

ఎంతదూరమున నున్నవస్తువునుగూడ జూచుటకు శక్తిగల చక్షుస్సును దివ్యచక్షుస్సు అందురు. ఈయది యోగులకు స్వాభావికము. కనుకనే యోగులు ఇంద్రియాతీతమయిన వస్తువుల దెలిసికొనిరి. సంజయుడుకూడ వ్యాసుని యనుగ్రహముచే నట్టి నేత్రమును బొంది, గీతాగ్రంథమును వినెను.

కర్మ, జ్ఞాన, భక్త్యాదియోగము లిందు జెప్పబడుటచే నీగ్రంథముకూడ యోగమనబడును. సంజయుడు దీనిని పరంపరా వినక స్వయముగ జెప్పిన శ్రీకృష్ణునినుంచి తాను స్వయముగ వినియుండుటచే నిందు కొంతగ్రంథము లోపించినదనికాని, కొంతగ్రంథము పెరిగినదనికాని శంకింపవలదు. ౭౫

శ్లో॥ రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాద మిమ మద్భుతం,
కేశవార్జునయోః పుణ్యం హృష్యామిచ ముహుర్ముహుః॥ ౭౬

అ॥ ఓయి ధృతరాష్ట్రమహారాజా ? పరమపవిత్ర మయినట్టియు, అత్యాశ్చర్యకరమైన ఈ సంవాదమును, నేను మాటిమాటికి తలచుకొని సంతసించుచున్నాను.

శ్లో॥ తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూప మత్యద్భుతం హరేః,
విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామిచ పునః పునః॥ ౭౭

అ॥ ఓయి మహారాజా ? ఆ శ్రీకృష్ణపరమాత్మయొక్క అతివిచిత్రమయిన విశ్వరూపమును మాటికిమాటికి తలచుకొనగా నా కాశ్చర్యము గలుగుచున్నది. అందువలనగూడ నాకు మహానందము కలుగుచున్నది.

అవ॥ నీకు నేను ఎక్కువగా జెప్పనేల ?

శ్లో॥ యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః,
తత్ర శ్రీర్విజయో భూతిః ధ్రువానీతి ర్మతిర్మమ॥ ౭౮

అ॥ ఇట్లు సంజయుడు చెప్పినదాని నంతయు వినిగూడ నింకను దుర్యోధనునకే జయము నాసించుచున్న ధృతరాష్ట్రుని చూచి సంజయు డనుచున్నాడు.

ఓయి రాజా ! ఏపక్షమున యోగేశ్వరుడగు శ్రీకృష్ణుడుండునో, ఏపక్షమున గాండీవమును చేతబూనిన పార్థుడుండునో, ఆ పక్షమున ( అనగా పాండవపక్షమున) సంపద నిజము. జయము నిజము. సంపద్విస్తారము (విస్తృతమయిన సంపద) నిజము. నీతి నిజము. ఇచట ధ్రువశబ్దమునకు శాశ్వతమనికూడ అర్థము చెప్పవచ్చును.

ఇచట "యోగేశ్వరః" అనుపదమునకు పలురకముల యర్థమును జెప్పవచ్చును.

౧. సమస్తయోగములకు గారణమగు గీతాశాస్త్రమునకు శ్రీకృష్ణుడు కారణమగుటచే కృష్ణుడు యోగేశ్వరుడు.

౨. యోగలక్షణమయినబీజమున కాయన కారణమగుటచే యోగేశ్వరుడు.

3. సకలయోగులకున్న యోగబీజమునకు గారణము.

౪. యోగబీజమగు సత్త్వగుణమునకు గారణము.

౫. యోగరూపమయిన బీజము శ్రీకృష్ణునినుంచి పుట్టి వృద్ధినొందునుగాన నతడు యోగేశ్వరుడు.

౬. సర్వయోగములయొక్క ఫలములకు ఆయన కారణమగుటచే యోగేశ్వరుడు అని.

ఇట్లు శ్రీమద్భగవద్గీతాభాష్యార్క-ప్రకాశికానువాదమున
మోక్షసంన్యాసయోగ మను బదునెనిమిదవ
అధ్యాయము ముగిసినది.

మోక్షప్రదమయిన కర్మసన్యాసవిధానము యిందు ప్రతిపాదింపబడుటచే నియ్యది మోక్షసన్యాసయోగ మనబడుచున్నది.

ఇట్లు గీతాశాస్త్రము సంపూర్ణము.

హరిః ఓమ్ తత్సత్



